http://teluguthesis.com/




మూడవ సంపుటము

# తెలుగు సంస్కృతి—౧



తెలుగు భాషా సమితి

హైదరాబాదు : : మద్రాసు : : వాల్తేరు

http://sanskritcentral.com/

http://teluguthesis.com/

# విజ్ఞాన సర్వస్వము

మూడవ సంపుటము

## తెలుగు సంస్కృతి

సంపాదక సమితి

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ
శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య
డాక్టరు నేలటూరి వెంకటరమణయ్య
పద్మశ్రీ మోటూరి సత్యనారాయణ

1959

http://sanskritcentral.com/

http://teluguthesis.com/

# ప్రకాశకుల విజ్ఞప్తి

సుమారు రెండుశతాబ్దములపాటు మనదేశము పరాధీనమై యుండుటవలన కలిగిన దుష్ఫలితములలో ముఖ్యమైనది మన దేశభాషల అభివృద్ధికి నిరోధకమయిన ఆంగ్లభాషాప్రాభవము. దానితో పాటు విదేశ సంస్కారములు, విజ్ఞానము, సారస్వతము, నాగరికత మన మలవరచుకోవలసిన ఆవశ్యకత అనివార్యముగా వచ్చిపడినది. ఈ దుస్థితిని గుర్తించిన మన నాయకులు దీనిని కొంతవరకైనను నిరోధించి యుండకపోతే మనదేశ మీపాటికి ఇంగ్లండ్ దేశమునకు చెల్లెలుగానో బిడ్డగానో తయారై ఉండేది. ప్రత్యక్షగోచరములైనవేకాక మనకు తెలియకుండానే మన మనోదృష్టి, వాంఛలు, ఆశయములు కూడా చాలవరకు విదేశీయములు, విజాతీయములుగా మారినవి; ఇంకను మారియుండేవి. కాని, మన దేశీయులకు చైతన్యము కలిగినది. ఈ దుష్ఫలితాలను అరికట్టుటకు చేసిన ప్రయత్నాలలో ముఖ్యమైనవి, నిర్మాణాత్మకములయినవి — స్వదేశీప్రచారము, స్వభాషాప్రబోధము, స్వాతంత్ర్యోద్యమము. రాజకీయరంగములో జరిగిన పోరాటము ఫలితముగా స్వరాజ్యము లభించినది. దీనిని నిలుపుకోవలెనంటే దేశములో కలిగిన ప్రజాచైతన్యాన్ని నిర్మాణాత్మకముగా మనము ఉపయోగించుకొనవలెను. ప్రజలకు విద్యాప్రబోధము వారి మాతృభాషలో కలుగజేయవలెను. మన తెలుగువారు సమర్థత గల పౌరులుగాను, విజ్ఞానవంతులుగాను తయారు కావలెనంటే మన చదువులు, ప్రభుత్వ కార్యకలాపాలు, మన న్యాయస్థాన వ్యవహారాలు, సారస్వతము, విజ్ఞానము అంతా మన భాషలో ఉండి తీరవలెను.

పూర్వకాలములో భారతీయ విజ్ఞానమంతా సంస్కృతభాషమూలంగాను, ప్రాకృతభాషల ద్వారాను భారతదేశమందేకాక ఇతర దేశములందుకూడా వెల్లువలై ప్రవహించినది. రానురాను మన దేశము పారతంత్ర్యముపాలయినందున ఈ జ్ఞాన విజ్ఞానసర్వస్వ మంతా అడుగంటినది. దానిస్థానే పరుల విజ్ఞానము, సంస్కృతి ఎక్కువగ వ్యాపించినవి. దీనివలన నష్టము కలిగినా, ఒక మేలుకూడా కలుగకపోలేదు. ఆధ్యాత్మికవిద్యల విషయము నిత్యమైనదే అయినా ప్రాపంచిక విజ్ఞానము కాలానుగుణముగా మారేది కనుక మన ప్రాచీన విద్యలకు ఆధునిక విద్యలందుగల మంచిని జోడించి నూతనముగా ఒక విశిష్టమైన వికాసముతో విజ్ఞానాన్ని రూపొందించుటకు అవకాశమేర్పడినది.

మన భారతదేశములోని పలుభాషలు విదేశాలనుండి వెల్లువలుగా ప్రవహించి వచ్చిన విజ్ఞానాన్ని ఆధారంగా చేసికొని ప్రస్తుతము ఎంతో అభివృద్ధిలోనికి వచ్చినవి. బెంగాలీ, హిందీ, మరాఠీ భాషల ప్రాభవం ఏ విదేశభాషల ప్రాభవమునకును తీసిపోదు. ప్రతిదినము ఇతోఽధికంగా ఈ భాషలు అభివృద్ధిపొందుతున్నవి. మన భాషలను ప్రజానీకంయొక్క విజ్ఞానంకొరకు, దాని అభివృద్ధికొరకు ఉపయోగించవలెనంటే ఆధారగ్రంథాలను మొట్టమొదట మనం తయారు చేసికొనడం అవసరం. అందువల్లనే మన పూర్వులు ధర్మశాస్త్రాలకు ఆధారగ్రంథం వేదంగాను, పదజాలమునకు ఆధారగ్రంథం నిఘంటువుగాను, భాషాసూత్రాలకు ఆధారాలు వ్యాకరణాలుగాను, అర్థ, న్యాయ శాస్త్రాలకు ఆధారాలు స్మృతులుగాను నిర్మించి, ప్రజానీకానికి మన విజ్ఞానాన్ని అందించి వారిని తదనుసారంగా నడిపించారు. నేడు మన విజ్ఞానపేటికలో భారతీయ విజ్ఞానమే కాదు — ప్రపంచమంతటిలోను లభ్యమయ్యే సర్వవిధ విజ్ఞానము అమర్చుకొంటేనే కాని మనము వివిధ విజ్ఞాన మంజూషను తయారు

http://sanskritcentral.com/

http://teluguthesis.com/


చేయలేము. ఇట్టి మంజూషలు విశాలవంతములయిన అన్ని భాషలలోను ఏర్పడియున్నవి. వీటికి 'ఎన్‌సైక్లోపీడియా' (విజ్ఞాన సర్వస్వము)లు అని పేరు. 'ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా' ఇంగ్లీషులో ఎంత విశాలమైనదో చూస్తే అచ్చెరువవుతుంది. ఇంగ్లీషుభాషయొక్క, జాతియొక్క భవిష్యత్తును నిర్మించే సామగ్రి అంతా అందులో ఇమిడియున్నది.

మూడుకోట్లమంది జనులకు మాతృభాషయై అతిప్రాచీనమైన మన తెలుగుభాషకు ఇట్టి విజ్ఞాన మంజూష లేకపోవడం లోపముకాదని ఎవరును చెప్పజాలరు. ఈ విజ్ఞాన మంజూష తయారుచేయడం కోసం కాంగ్రెసు గవర్నమెంటు ఏర్పడిన తరువాత మనకు విద్యామంత్రులైన శ్రీ అవినాశలింగం చెట్టియారు ద్రావిడభాషలలో విజ్ఞానసర్వస్వం తయారుచేయించడం కోసం ఒక ఉద్యమాన్ని మొలకెత్తించారు; తమిళ వళర్చిక్కళగం (తమిళభాషాభివర్ధకసమితి) అనే పేరుతో ఒక సంఘాన్ని స్థాపించి తద్వారా తమిళభాషాసేవ చేయవలెనని కూడా సంకల్పించివారు. విద్యామంత్రి ప్రారంభించిన ఈ కార్యానికి ప్రభుత్వసహాయం కూడా సులభసాధ్యమయినది. తెలుగుభాషాభివృద్ధికి కూడా ఇట్టి ప్రయత్నం చాల అవసరమనీ, తెలుగు రచయితలను, భాషా సేవకులను ప్రోత్సహించడం కూడా అవసరమనీ తలచి మదరాసులోని తెలుగుభాషాభిమానులు కొందరు 15-10-1947 వ తేదీని విద్యాశాఖామంత్రిగారి ఆహ్వానంమీద సమావేశమయ్యారు. ఈ కార్యాన్ని జయప్రదంగా నెరవేర్పడం కోసం 'తెలుగు భాషా సమితి' అనే పేరుతో ఒక సమితిని ఏర్పాటు చేయడానికి నిశ్చయించడమయినది. ఆ వెంటనే యథాక్రమముగా దానిని స్థాపించడముకూడ అయినది. సమితి సంకల్పించిన ఉద్దేశములలో 1. తెలుగు భాషలో ఒక విజ్ఞానసర్వస్వమును, విజ్ఞానవ్యాప్తికి తోడ్పడు ఇతర ప్రచురణలను గావించుట, 2. తెలుగు భాషలో వివిధవిషయములకు సంబంధించిన రచనలను చేయించుటకై ఉత్తమ గ్రంథములకు బహుమతులిచ్చుట, 3. తెలుగుభాష, తెలుగువాఙ్మయము - వీటి అభివృద్ధికి తోడ్పడగల కార్యకలాపాలను నిర్వహించుట, 4. వైజ్ఞానిక విషయములనుగూర్చి చర్చలు, ప్రసంగములు, ఉపన్యాసములు జరిపించుటకు కావలసిన సభలు, సమావేశములు, ప్రదర్శనములు ఏర్పరచుట మొదలగునవి ముఖ్యములు.

సమితి కార్యస్థానముగా ఉపయోగించుకొనుటకు మద్రాసు విశ్వవిద్యాలమువారు ఉచితముగా ఇచ్చిన విశ్వవిద్యాలయ భవనమందలి ఒక గదిలో సమితి ప్రారంభోత్సవము 9-8-1948 వ తేదీని జరిగినది. ఈ ఉత్సవమునకు వచ్చిన పెద్దలు సమితి సంకల్పించిన తెలుగు విజ్ఞాన సర్వస్వ రచనా విధానమునుగూర్చి తమ ఆశయములను, అభిప్రాయములను తెలియజేసినారు. ఈ తెలుగు విజ్ఞాన సర్వస్వరచనా విధానమును గూర్చి సలహా నిచ్చుటకు ఒక ప్లానింగు కమిటీ ఏర్పడినది. ఈ కమిటీ సలహాల ననుసరించి సకలకళలను, శాస్త్రములను సాజాత్యమును బట్టి కొన్నివర్గముల క్రింద విభజించి ఒక్కొక్క సంపుటమందు ఒక్కొక్కవర్గములోగల విషయములను, అవకాశమునుబట్టి రెండేసి, మూడేసి వర్గములలోని విషయములను చేర్చి 12 సంపుటములలో ప్రకటించుటకు సమితి నిశ్చయించినది. ఒక్కొక్క సంపుటములో ఉండవలసిన విషయము లన్నింటి వివరణములు, ఆయా విషయములకు కావలసిన పుటలసంఖ్య, రచయితల పేర్లు మొదలయిన అంశములను వివరించి తెలియజేయుటకు ఒక్కొక్కవర్గమునకు ఒక్కొక్క ఉపసంఘము ఏర్పడినది. ఉపసంఘముల సమావేశములను జరిపి కావలసిన పని కొనసాగించుటకు ఒక్కొక్క ఉపసంఘమునకు ఒక్కొక్క సమావేశకర్త (కన్వీనరు)ను నియమించడమయినది.

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఈసమావేశ కర్తలతోను, ఇతరసభ్యులతోను సంప్రతించి, ఉపసంఘముల నివేదికలను తెప్పించి కావలసిన వస్తుసామగ్రిని సేకరించుటకును, సేకరించిన సామగ్రిని పరిశీలించి అమర్చిపెట్టుటకును కావలసిన సంగ్రాహకులను నియమించుటకు నిశ్చయించి, సమితి కార్య నిర్వాహక వర్గము మొట్టమొదట డాక్టరు గిడుగు వెంకట సీతాపతిగారిని ప్రధానసంగ్రాహకునిగా నియమించినది. వీరు 10-5-1948 వ తేదీని పని ప్రారంభించిరి. మరి కొలది కాలములోనే శ్రీ వసంతరావు వెంకటరావు గారిని శాస్త్రసంబంధము గల సంపుటముల విషయములను సేకరించుటకు సంగ్రాహకునిగా నియమించినది. వీరు 2-4-1949 వ తేదీని పని ప్రారంభించిరి.

తెలుగు భాషకు, వాఙ్మయమునకు, తెలుగువారి చరిత్రకు, సంస్కృతికి సంబంధించిన ప్రత్యేక సంపుటము నొకదానిని ప్రచురించుట సమితి ఉద్దేశము. దాని ప్రకారము కొమర్రాజు వెంకటలక్ష్మణ రావు పంతులుగారికి కుడిభుజముగను, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారికి సర్వాంగీణముగను విజ్ఞానసర్వస్వ నిర్వహణ భారమును వహించి చక్కని అనుభవమును, నిరతిశయ సామర్థ్యమును సముపార్జించిన ఆంధ్రదేశ చరిత్ర పరిశోధక నిపుణులు, అద్వితీయాంధ్రాభిమానులునైన శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఈ 'తెలుగు సంస్కృతి' సంపుటముయొక్క ప్రకటన కార్యమును నిర్వహించుటకై సంగ్రాహకులుగా 1950 లో నియమింపబడిరి.

ఈ సంగ్రాహకుల కృషి ఫలితముగ (1) 'చరిత్ర - రాజనీతి', (2) 'భౌతిక - రసాయన శాస్త్రముల' సంపుటములు 1954, 1955 సంవత్సరములలో ప్రకటితమైనవి. ఈ "తెలుగు సంస్కృతి" సంపుటము మూడవది. దీని ప్రచురణలో కొంతవరకు కాలవిలంబమైనను దీని నీరూపములో ప్రచురింపగలిగినందుల కెంతయు సంతోషమగుచున్నది. ఈ సంపుటము పని మిగతవాని కంటె కష్టతరము. ఈ పనిని సమర్థతతో నిర్వహించిన సంపాదక సమితివారికి అనన్య ధన్యవాదములు. నాలుగవదైన 'ఆర్థిక, వాణిజ్య, భూగోళ శాస్త్రముల' సంపుటమును, మిగత ఎనిమిది సంపుటములను ఒకటితర్వాత నొకటిగా ప్రకటితములు కాగలవు.

ఇక్కడ తెలుగు భాషలో విజ్ఞాన సర్వస్వము రచించవలసిన ఆవశ్యకతను గూర్చియు, తద్రచనావిధానమునుగూర్చియు సమితివారికి గల అభిప్రాయములను తెలియచేయవలసి యున్నది. మన తెలుగు భాషలో ముప్పది నాలుగు సంవత్సరముల క్రిందట కీ. శే. కొమర్రాజు లక్ష్మణ రావుగారు 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము'ను రచించుటకు మొదలుపెట్టిరి. కాని, వారి కృషి 1923 లో వారి నిర్యాణమువలన ఆగిపోయినది. పిమ్మట దేశోద్ధారకులును, విశ్వదాతలును అయిన శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు లక్ష్మణరావుగారి కృషిని పునరుద్ధరించి కొనసాగింప ప్రయత్నించిరి. కాని 1938 లో వారి నిర్యాణమువలన ఈ మహత్తర కార్యము అకారాదిపదాంతముతో ఆగిపోయినది. ఇట్టి ఘనకార్యము కేవలము వ్యక్తులమీదనే ఆధారపడినయెడల ఆ వ్యక్తుల నిర్యాణముతో ఆగిపోవుట సంభవించును. కనుక, దీనిని నిర్వహించుటకు శ్రీమంతుల తోడ్పాటు, ప్రభుత్వ సాహాయ్యము గల సంస్థ యేర్పడవలెనన్న ఉద్దేశముతో ఈ తెలుగు భాషా సమితిని స్థాపించుట జరిగినది.

లోగడ తలపెట్టిన ఆంధ్ర విజ్ఞానసర్వస్వ రచనావిధానము అకారాది పదక్రమమును అనుసరించినది; అనగా సకల శాస్త్రములకును, సకల కళలకును సంబంధించిన విషయము లన్నిటిని చేర్చి, అందు

http://sanskritcentral.com/

http://teluguthesis.com/


గల అంశములను అన్నిటిని అకారాదిక్రమమున వివరించినది. ఇది సంప్రదాయసిద్ధమైన రచనా విధానమే అయినా, దీని ననుసరించి పని సాగించినయెడల విషయసంగ్రహణమంతాపూర్తి అయితేనేకాని ఏ యొక్క అక్షరసంపుటమైనా ప్రకటించుట సాధ్యముగాదు.

స్వరాజ్యముతోపాటు స్వతంత్ర రాష్ట్రముకూడా అవతరించిన తరువాత ఆర్థిక, సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక వ్యవహారమంతా తెలుగుభాషలోనే సాగవలసి యున్నది. అందుకు తోడ్పడగల వివిధ రచనలతోపాటు తెలుగులో విజ్ఞాన సర్వస్వమును తెలుగువారికి సాధ్యమయినంత వేగముగా అందచేయవలసియున్నది. అందుచేత విషయప్రధానముగ విజ్ఞానసర్వస్వ రచన సాగించి, ఒకటి తర్వాత ఒకటిగా పంద్రెండు సంపుటములలో విజ్ఞానవిషయమంతా ఇమిడ్చి ప్రకటించుటకు ఈ సమితి పూనుకొనినది. అయితే అట్టి రచనావిధానము 'బుక్ ఆఫ్ నాలెడ్జ్' అనే గ్రంథములందలి రచనావిధానమువంటిదే అయి, ఈ విజ్ఞానసర్వస్వ సంపుటములు ఆ యా విషయములకు సంబంధించిన గ్రంథములవలె పరిణమించవలసి ఉంటుంది. ఏదైనా ఒక పదమునకు గల అర్థవిశేషములు తెలుసుకొనవలెనంటే నిఘంటువు చూచుకొనవలెను. ఆ నిఘంటువులో గల పదములు అకారాది వరుసను ఉండును గనుకనే ఉద్దిష్టపద మెక్కడున్నదో సులువుగా శీఘ్రకాలములో తెలిసికొగలము. ఆవిధముగనే ఒక అంశమునుగూర్చి వ్రాసిన వివరణములు విజ్ఞానసర్వస్వము చూచి తెలుసుకోగోరినవారికి ఆ అంశ వివరణము ఎక్క డున్నదో సులువుగా శీఘ్రకాలములో చూచుకొనుటకు ఆ అంశములు అకారాదివరుసను ఉండవలెను. 'బుక్ ఆఫ్ నాలెడ్జ్' రచనా విధానమువలన ఈ సౌకర్యము కలుగనేరదు. అందుచేత ఈ సంపుటముల ప్రకటనలో ఆ రెండువిధములయిన రచనా విధానముల ఫలమును పాఠకుల కందింపగోరి ఆ రెండు విధానముల కలయికతో ఏర్పడిన ఒక నూతన విధానము అనుసరింపబడినది.

ప్రతి సంపుటమందును మొదటి విభాగమున ఆ సంపుటమునకు చెందిన విషయములన్నియు ఆమూలాగ్రము సంక్షిప్తముగా 'బుక్ ఆఫ్ నాలెడ్జ్'లో వలెను, రెండవ విభాగమున ఆయా విషయములకు సంబంధించిన వివిధాంశములు సంప్రదాయ సిద్ధమైన విజ్ఞాన సర్వస్వ రచనా విధానమును అనుసరించి నిఘంటువులోని పదములవలె అకారాది క్రమమునను పొందుపరుపబడినవి. అందుచేత, ఒక్కొక్క సంపుటి ఒక్కొక్క పెద్ద విషయమునకు, లేక కొన్ని సాజాత్య విషయములకు సంబంధించిన విజ్ఞాన సర్వస్వముగా తయారగుచున్నది. ఈ విధానమువలన ఎవరి కే విషయమందు అభిరుచి యుండునో వా రా విషయమునకు సంబంధించిన సంపుటమును చదువుకొనుటకు సౌకర్యమేర్పడగలదు. ప్రతి సంపుటమందును గల సంక్షేపకథనము అందలి విషయముతో పరిచయము లేనివారికి జ్ఞానదాయకముగా ఉపకరించి, అకారాది వివరణములను అర్థము చేసికొనుటకు తోడ్పడగలదు. ఈ విధానమును ఇదివర కెవరును అనుసరించియుండలేదు. కనుక, ఇది అపూర్వమైనది. ఈ నూతన విధానమును అనుసరించి పనిచేయుటతో ప్రారంభమున కొంత తొట్రుపాటు అనివార్యము.

ఈ విజ్ఞానసర్వస్వ కార్యకలాపమంతా సాధించడానికి కనీసము 15 లక్షల రూపాయలు కావలసి ఉండునని అంచనా వేయడమైనది. అభిమానులు, ఉదారులు అయిన ధనవంతులవద్ద ధన సంగ్రహణము చేయడానికి సమితి నిశ్చయించుకొన్నది. విజయనగరము మహారాజాగారు, తిరుపతి దేవస్థానము కమిటీ, సింహాచలము దేవస్థానం కమిటీ, పిఠాపురము మహారాజాగారు, శ్రీ వి. రామకృష్ణ, ఉయ్యూరు

http://sanskritcentral.com/

http://teluguthesis.com/


షుగర్ ఫ్యాక్టరీవారు, శ్రీ గోగినేని వెంకటసుబ్బయ్య మొదలగువారు ప్రశంసనీయమైన ఔదార్యముతో విరాళము లొసగియున్నారు. దాతలనుండి చేకూరిన మొత్తము సుమారు రు. 2,28,876 లు. ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర మేర్పడకమునుపు ఉమ్మడి మద్రాసు ప్రభుత్వమువారు సంవత్సరమునకు లక్షరూపాయల చొప్పున ఐదు సంవత్సరములకు ఐదు లక్షలు ఇచ్చుటకు వాగ్దానముచేసిన విరాళములో 1958 సంవత్సరాంతమునకు మదరాసు, ఆంధ్ర రాష్ట్రములు ప్రసాదించిన మొత్తము రూ. 4,82,964-14-0. వీరందరికిని, మద్రాసు విశ్వవిద్యాలయ భవనములందు ఈ భాషాసమితి కార్యస్థానము నెలకొల్పుకొనుటకు అనుజ్ఞ యిచ్చి అనేకవిధముల సౌకర్యములు కలుగజేసిన వైస్ ఛాన్సలర్ డాక్టరు సర్. ఆర్కాటు లక్ష్మణస్వామి మొదలియారుగారికిని, వాల్తేరు శాఖా కార్యాలయము నెలకొల్పుటకు ఆంధ్ర విశ్వవిద్యాలయ భవనములలో ఉచితముగా స్థలము నిచ్చి సకలవిధముల తోడ్పడుచున్న వైస్ ఛాన్సలర్ డాక్టరు వి. ఎస్. కృష్ణగారికిని, తమ యధీనమునందు గల చిత్రములను పునర్ముద్రించుకొనుటకు అనుమతి నొసగిన సంస్థలవారికిని కృతజ్ఞతాభివందనములు.

ఈ సంపుటమును సాధ్యమయినంత నిర్దుష్టముగాను, అందముగాను, ఆకర్షకముగాను ముద్రించిన హిందీ ప్రచార ముద్రణాలయ కార్యకర్తలకు ధన్యవాదములు.

తెలుగువారికి సకల విద్యలనుగూర్చి జిజ్ఞాస కలిగించి, వారి బుద్ధి వికాసమునకును, సంస్కృతి సంపదకును తోడ్పడగల విజ్ఞాన మందజేసి, ఇతోఽధికముగా విజ్ఞానసంపన్నులు కాగోరువారికి మార్గము చూపించుటే తెలుగు భాషా సమితి సంకల్పము. ఈ సంకల్పము ఏ మాత్రము నెరవేరినను సమితి కృషి సఫలమైనట్లు సంతోషింపవచ్చును.

వికారి - ఉగాది,
గురువారము, 9-4-1959
చెన్నపురి.
మకాం: న్యూ ఢిల్లీ.

బెజవాడ గోపాలరెడ్డి
అధ్యక్షుడు
తెలుగు భాషా సమితి

http://sanskritcentral.com/

http://teluguthesis.com/

## తెలుగు భాషా సమితి

### కార్య నిర్వాహక వర్గము

అధ్యక్షులు : డాక్టరు బెజవాడ గోపాలరెడ్డి

ఉపాధ్యక్షులు : శ్రీ రాజా బొప్పరాజు రామకృష్ణరాజు

శ్రీ ఎస్. బి. పి. పట్టాభిరామారావు

కోశాధ్యక్షులు : శ్రీ పర్వతనేని బ్రహ్మయ్య

సభ్యులు : శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు

డాక్టరు ఎం. చెన్నారెడ్డి

శ్రీ ఉప్పుటూరి ఎంబెరుమానారు

శ్రీ మాగంటి బాపినీడు

శ్రీ ఎం. ఆర్. అప్పారావు

శ్రీ వందిరి మల్లికార్జునరావు

కార్యదర్శులు : పద్మశ్రీ మోటూరి సత్యనారాయణ

డాక్టరు డి. వి. సుబ్బారెడ్డి

### సర్వస్వ విధాన నిర్ణయసమితి

1. డాక్టరు సర్ ఆర్కాటు లక్ష్మణస్వామి మొదలియార్, ఎం.డి., ఎల్ఎల్.డి., డి.ఎస్‌సి., డి.సి.ఎల్. (ఆక్సన్), ఎఫ్.ఆర్.సి., ఒ.బి., ఎఫ్.ఎ
2. శ్రీ టి. ఎస్. అవినాశలింగం చెట్టియార్, బి ఏ., బి. ఎల్.,
3. శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య, ఎం. ఏ.,
4. శ్రీ విస్సా అప్పారావు, ఎం. ఏ., ఎల్. టి.,
5. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ,
6. డాక్టరు గిడుగు వెంకట సీతాపతి, బి. ఏ., ఎల్. టి., డి. లిట్.,
7. శ్రీ మాగంటి బాపినీడు, బి. ఎస్‌సి. (కార్నెల్); ఎం. ఎస్‌సి. (కాలిఫోర్నియా),
8. శ్రీ వసంతరావు వెంకటరావు, ఎం. ఎస్‌సి.

http://sanskritcentral.com/

http://teluguthesis.com/

# సంపాదకీయ భూమిక

'తెలుగు విజ్ఞాన సర్వస్వ' ప్రకటనమునకు పూనుకొన్నపిదప తెలుగు దేశమునకు సంబంధించిన సమస్త విషయములను దెలుపు 'ఆంధ్ర' సంపుటము నొకదానిని ప్రకటింపవలెనని తెలుగు భాషా సమితి నిశ్చయించినది ; ఈ ప్రత్యేక సంపుట ప్రకటన కార్యము నిర్వహించుటకు శ్రీ లక్ష్మణరావుగారి వద్దను, శ్రీ నాగేశ్వరరావుగారి వద్దను పనిచేసిన శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి నభ్యర్థించినది. వారు సమితి యభ్యర్థనము నంగీకరించి సంగ్రాహక పదవిని స్వీకరించి ఆంధ్ర సంపుటమునకు ఒక ప్రణాళిక తయారుచేసిరి. దానినిగురించి చర్చించుటకు సమితివారు 1950 సెప్టెంబరు మాసాంతమున కార్యాలయమున ఒక ప్రత్యేక సమావేశ మేర్పాటుచేసిరి. దానికి శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగారు అధ్యక్షత వహించిరి. ప్రణాళిక ఇంచుమించుగా ఉన్న దున్నయట్లు అంగీకరింపబడినది. జీవించియున్న ఆంధ్ర ప్రముఖుల జీవిత సంగ్రహములు సంపుటమున ప్రకటింపకూడదని అందు తీర్మానింపబడినది.

ఆంధ్రదేశమునకు సంబంధించిన సమస్త విషయములు వచ్చుట కనువుగ 'ఆంధ్ర' సంపుటము ప్రణాళిక ఇంచుమించుగా 'ప్రావిన్షియల్ గెజెటీరు' పద్ధతిని సంసిద్ధము చేయబడినది. ఇందు నదులు, పర్వతములు, పీఠభూములు, శీతోష్ణస్థితి మొదలైన తెలుగుదేశపు భూగోళ విషయములు, అందలి జంతుజాలము, వనౌషధి వర్గము, భూగర్భస్థ ఖనిజవర్గము, జిల్లా భూగోళ విషయాదికములు, నీటి వనరులు, వ్యవసాయము, పశు సంపద, వ్యవసాయ పరిశోధక క్షేత్రములు, వర్తక వ్యాపారములు, పరిశ్రమలు, జనాభా, ఆర్థిక పరిస్థితి మొదలైన విషయములనేకాక, సంస్కృతికి సంబంధించిన విషయములను గూడ సంపూర్తిగ వివరించుటకు అవకాశము కల్పింపబడినది.

భారతదేశమునందలి ఆంధ్రేతర రాష్ట్రములకు వేరువేరు కారణములచేత పూర్వము వలసవెళ్లి అచ్చట స్థిర నివాసములు కుదుర్చుకొని క్రమముగా తత్తద్రాష్ట్ర పౌరులై అచటి భాషకో, నగరములకో, ప్రజలకో అనుపమాన సేవచేసి విఖ్యాతములైన రాష్ట్రేతరాంధ్ర కుటుంబములను గురించియు, సముద్రాంతరస్థ ద్వీపములకు, ఖండాంతర దేశములకు వలసవెళ్ళి పందొమ్మిదవ శతాబ్దిలో అచటనే నివసించుచు వచ్చిన తెలుగువారిని గురించియు, వారి ఆర్థిక, విద్యా, సాంఘిక పరిస్థితులను గురించియు విషయములను సేకరించి ఈ సంపుటమునందు ప్రకటించుటకుకూడ ఉద్దేశింపబడినది. కాని ఆశించినందుకు తగినంతటి ప్రయోజనము కలుగలేదు. ఏ యొకరిద్దరో తమకు తెలిసినంతవరకు వ్రాసి పంపిన విషయములు కొద్దివైనను ముందుముందు ఈ యాశయము ఇంతకంటె ఎక్కువగ ఫలకారి యగుటకు తోడ్పడగలవని ఇందు ప్రకటింపబడినవి.

విషయ బాహుళ్యము ననుసరించియు, తెలుగుదేశమునకు సంబంధించిన విషయము లన్నియు సాధ్యమైనంతవరకు సమగ్రముగ సేకరించియు ప్రకటించుట కిదియే ప్రథమ ప్రయత్న మగుటవలన ఒక్క సంపుటము చాలదని రెండు సంపుటములుగకూడ ప్రకటించుటకు మొదట సంకల్పించబడినది. ఆ దృష్టితోనే ఆయా వ్యాసములకు ఇన్నిన్ని పుటలను పరిమితియు నిర్దేశింపబడినది. వీలైనంతవరకు ఎవరి కేది యభిమాన విషయమో, ఎవరు ఏ విషయమున ప్రత్యేక కృషి చేసిరో చేయుచున్నారో, ఏ విషయమున ఎవరు ప్రవీణులో తెలిసికొని ఆయా విషయములను గురించియే వారిని వ్యాసములు వ్రాసి నిర్ణీతకాలములో పంపవలసినదిగ వేడుకొనుచు లేఖలు వ్రాయబడినవి. సిద్ధాంత, భావప్రకటనమున వ్యాసకర్తలకు సంపూర్ణ స్వాతంత్ర్య మొసగబడినది.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చాలవరకు రచన లన్నియు వచ్చినపిదవ, సంపాదక సమితి 1955 లో ఏర్పడినది. దాని పరిశీలన పరిష్కారములు ముగిసి వ్యాసములు ముద్రణమునకు సంసిద్ధములైన పిదప తెలుగు సంస్కృతికి సంబంధించినవి, సంబంధించనివి కలగాపులగముగ గుదిగుచ్చుటకంటె సంస్కృతికి సంబంధించిన రచన లన్నిటిని విడదీసి, ఈ సంపుటమును తెలుగు సంస్కృతి సంపుటముగ రూపొందించుట లెస్సయని 1955 చివరలో ఒక సూచన వచ్చుటచేత దానిని సంపాదకసమితి సమావేశమై చర్చించి తుద కా సూచనప్రకారమే దీనిని 'తెలుగు సంస్కృతి' సంపుటముగ రూపొందించి ప్రచురించుటకు నిశ్చయించి నది. ఈ యేర్పాటువలన అనేక ముఖ్య వ్యాసములు ప్రముఖులైన విద్యాధికులు రచించినవి మిగిలి పోవుటచేత ఇవికూడ అవశ్యము ప్రకటింపవలసినవని సంపాదకసమితి భావించి వానిని తెలుగు సంస్కృతి రెండవ భాగముగ ప్రకటించుటకు తీర్మానించి ఈ విషయమును కార్య నిర్వాహక వర్గమువారికి నివేదించినది. వారు 1957 లో జరిగిన సమావేశమున సంపాదక సమితివారి తీర్మానము నంగీకరించిరి. ఆ నిర్ణయము ననుసరించి ఈ సంపుటము 'తెలుగు సంస్కృతి-౧' సంపుటముగ ప్రకటింప బడినది. ఇది ప్రథమ ప్రయత్నము. ప్రాముఖ్యము ననుసరించి ఒక్కొక్క విషయమునకు ఇయ్యవలసిన స్థలమును ఎంత జాగ్రత్తగ నిర్ణయించి, ఈ నియమమును ఎంత గట్టిగ పాటింప బ్రయత్నించినను అనివార్యములైన కారణములవలన అది సాధ్యము కాకపోయినది. తెలుగుదేశమునకు సంబంధించిన ఇతర రచనము లన్నియు నాలుగవ సంపుటమున ప్రకటింపబడగలవు. ఈ రీతిగ వాటిని విడదీయవలసి వచ్చినందుకు మన్నింప ఆ యా రచయితలకు వేడికోలు.

తెలుగు సంపుటమునకు మొత్తముమీద ముద్రణమున దాదాపు రెండువేల పుటల విషయము పైగా వచ్చినది. సంస్కృతికి సంబంధించిన విషయమే పదునైదువందల పుటలకు పైనున్నది. సమితి కార్యదర్శిగారు ఈ 'తెలుగు సంస్కృతి' సంపుటముకూడ తెలుగు విజ్ఞాన సర్వస్వమునందలి ఇతర సంపుటములతో సరిసమానముగ నుండవలెనని యభిప్రాయపడినందువలన కొన్ని వ్యాసములు ప్రధాన విషయములు పోకుండ ఇంచుక సంగ్రహింపబడినవి.

అఖిలాంధ్రదేశప్రశస్తి వహించిన మహనీయులు ఈ సంపుటమున కెక్కనివారు ఇంకను ఉండిన నుండవచ్చును. వారినిగురించి తెలియరాకపోవుటయే యందుకు కారణము. ఈ 'తెలుగు సంస్కృతి' సంపుటమున - గ్రాంథికమా, వ్యావహారికమా - ఏభాష యుండవలెనని ప్రారంభమునందే చర్చ వచ్చినది. ఏదో యొక విధమైనదే యుండుట మంచిదని యుద్దేశింపబడినది. కాని రచయితలలో ఉభయ భాషల నభిమానించినవా రుండుటచేత ఉభయ భాషలు వాడుట కంగీకరింపక తప్పినదికాదు.

తెలంగాణమునందును, ఆంధ్రదేశమందును అననేల, ఆంధ్ర ప్రదేశ్‌లోని ప్రముఖ కవులు, విఖ్యాత పండితులు, విఖ్యాత సంగీత సాహిత్యాభిమానులు, ప్రముఖులైన విద్యా విశారదులు - వీరు వారనక ఎల్లరు - ఈ ఉద్యమమునకు ఆదరాభిమానములతో తోడ్పడినందువలననే ఈ సంపుటము నీ రీతిని ఆంధ్ర లోకమున కందింపనైనది. ఈవిధముగ సహకరించిన సహృదయు లందరికి కృతజ్ఞతా పూర్వకాభివందనములు.

చెన్నపురి,
వికారి ఉగాది, గురువారము, 9-4-1959.

సంపాదక సమితి

http://sanskritcentral.com/

http://teluguthesis.com/

# కృతజ్ఞత

ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ ప్రకటనమునకు పూనుకొనినప్పటినుండి 'ఆంధ్ర సంపుట'మను పేరుతో ఆంధ్రదేశమునకు సంబంధించిన సమస్త విషయములను దెలుపు సంపుటము నొకదానిని ప్రకటింప వలెనని పూజ్యులైన శ్రీ కొమర్రాజు వెంకట లక్ష్మణరావుగారికి గాఢమైన కోరిక యుండెడిది. వారు ప్రకటించిన విజ్ఞాన సర్వస్వమున 'అ'కారాది పదములు మూడు సంపుటములలో ప్రకటితమైన వెనుక 'ఆంధ్ర' పదమున కొక ప్రత్యేక సంపుటము ప్రకటింపవలయునను తలంపుతో వారందుకు వలయు విషయములను సేకరింపపూనుకొనిరి. కాని ఆంధ్రుల దురదృష్టవశమున వా రకాల మృత్యువు పాలయిరి. అంతట 'ఆంధ్ర సంపుటము' పని నిలిచిపోయినది. ఇది ఇప్పటికి ముప్పదియైదు సంవత్సరముల నాటిమాట.

అటుతరువాత ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ ప్రకటన భారమును పూజ్యులును, దేశోద్ధారక బిరుదాంకితులును అయిన శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ఉత్సాహముతో వహించిరి. వారిదివరకు ప్రకటితములయిన సంపుటములను పరిమాణము మార్చి అందలి వ్యాసములను కొన్నిటి నున్నవి యున్నట్లుంచి, మరికొన్నిటిని నూతనాంశములను జేర్చి విపులీకరించి, వేరొక కొన్నిటిని క్రొత్తగ దెలిసిన విషయముల దృష్టితో సంస్కరించి అనేకములైన చక్కని దేశపటములతో, సామాన్య చిత్రములతో, వర్ణచిత్రములతో ఆంధ్రదేశము గర్వింపదగిన రీతిని 'డబుల్ డెమీ' పరిమాణమున రెండు సంపుటములను ప్రకటించిరి. సుందరములు, చిత్రబహుళములు, విషయవిస్తృత వ్యాసరాజములు కలిగి 'ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా' సంపుటములకు దీటువచ్చు ఆ సంపుటములవంటివి అప్పటికి ఏ భారతదేశ భాషలోను రాలేదన్న నది అతిశయోక్తి కాదు. మూడవ సంపుటమున శేషించిన 'అ'కారాది పదములకు సంబంధించిన వ్యాసములనుగూడ ముద్రించి, 'ఆంధ్ర'ను గూర్చిన సమస్త విషయములను సేకరించి ప్రకటింపవలయునని పంతులుగారు సంకల్పించిరి. మూడవ సంపుటమున అకారాది పదశేషమే కాక 'ఆంధ్ర' పదమునగూడ కొంత అచ్చుయి పని చురుకుగా సాగుచుండిన కాలమున ఆంధ్రదేశ దౌర్భాగ్యవశమున శ్రీ నాగేశ్వరరావు పంతులుగారుకూడ క్రీ. శ. 1938 లో శివసాయుజ్యము నందిరి. అంతటితో ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ ప్రకటన కార్యము నిలిచిపోయినది.

తెలుగు విజ్ఞాన సర్వస్వ ప్రకటనమునకు పూనుకొన్న తెలుగు భాషా సమితివారు 'ఆంధ్ర' సంపుటము నొకదానిని ప్రకటింప నిశ్చయించిన వెనుక ఈ సంపుట ప్రకటన కార్యమును నిర్వహింపవలసినదని సమితి కార్యదర్శి పద్మశ్రీ శ్రీ మోటూరి సత్యనారాయణగారు నన్ను కోరిరి. శ్రీ లక్ష్మణరావు, శ్రీ నాగేశ్వరరావు పంతులుగార్ల సంకల్పము సఫలము చేయుట కవకాశము లభించినదని అమితానందముతో వారి కోరిక నంగీకరించి ఆంధ్ర సంపుట కార్యమున ప్రవృత్తుడనై ఒక ప్రణాళికను తయారుచేసి అభిప్రాయార్థము ఆంధ్రదేశములోని పలువురు విద్యాధికులకు పంపితిని. కొందరు ప్రణాళిక బాగున్నదని అంగీకరించి అచ్చటచ్చట కొద్దిపాటి సూచనలు చేసిరి. అయినను ప్రణాళికను గురించి చర్చించుటకు నురల కొద్దిమంది ప్రముఖుల నాహ్వానించి సమితివారు 1950 సెప్టెంబరు మాసాంతమున కార్యాలయముననే ఒక ప్రత్యేక సమావేశ మేర్పాటుచేసిరి. సమావేశానంతరము పని ప్రారంభింపబడినది.

ప్రముఖ రాష్ట్రేతరాంధ్ర కుటుంబములనుగురించియు, సముద్రాంతరస్థ ద్వీపములకు, ఖండాంతర దేశములకు వలసవెళ్ళిన తెలుగువారినిగురించియు ఈ సంపుటమున ప్రకటించు నుద్దేశముతో తెలిసిన

http://sanskritcentral.com/

http://teluguthesis.com/


వారు విషయమును సేకరించి పంపవలసినదిగ కోరుచు ఉత్తర దక్షిణభారతదేశ దైనిక పత్రికలలో లేఖలు ప్రకటింపబడినవి. ఇతర ఖండాంతర దేశముల, ద్వీపములలోని భారతీయ సంఘములతో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపబడినవి. కాని చేసిన ప్రయత్నమునకు తగినంతటి ప్రయోజనము కలుగలేదు.

తెలుగు దేశమునకు సంబంధించిన విషయము ఏదియును ఒక్కచోట వ్రాసిపెట్టి యుండలేదు. ఖండఖండములుగ, తునుకలు తునుకలుగ అందందు ఉన్న విషయమైనను క్రీస్తుశకము రమారమి పందొమ్మిదవ శతాబ్ది చివరివరకుమాత్రమే తెలియుచున్నవి. అదియునుగాక మొన్నమొన్నటివరకు, అనగా 1956 నవంబరు 1వ తేదీవరకు ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ అను తెలుగుదేశము మద్రాసు రాష్ట్రములో కొంత, పూర్వపు హైదరాబాదు సంస్థానములో కొంత చేరియుండెను. మద్రాసు రాష్ట్రములోని ఆంధ్రదేశమునుగురించి కొంతవరకైన తెలిసికొనుట కవకాశముండెను. కాని హైదరాబాదు సంస్థానమునందలి తెలంగాణమునకు సంబంధించిన ప్రతి విషయమును అజ్ఞాతముగనే యుండిపోయినది. ఇవి యన్నియు ఒకయెత్తు, ప్రాచీనకాలమునుండి తెలుగుదేశమునకు సంబంధించిన మత, సాంఘిక, కళా చరిత్రాది విషయములను గురించి, అనగా తెలుగు సంస్కృతిని గురించి సేకరించుట ఒకయెత్తు అయినది. కష్టించి ఆధారములను సేకరించి వివిధ విషయముల పరిణామ వికాసములు క్రీస్తుకు పూర్వమునుండి బ్రిటిషు యుగమువరకైనను సమగ్రముమీద దృష్టి ఉంచి ధారావాహికగా ఒక రూపములో ప్రకటించుటకు ప్రయత్నించుట బహు ప్రయాససాధ్యమైన పనియైనది.

ఇట్టి పరిస్థితిలో పయితము కొందరు ఉదారహృదయులైన విలేఖకులు వారి కొసగిన కాల పరిమితిలోనే వ్యాసములను పంపి మా కుత్సాహము నొసగియున్నారు. వేరొకకొందరు కార్యాంతర వ్యాపృతులగుటవలనను, వలసిన విషయమునకు సంబంధించిన సాధనసామగ్రి సేకరించుటలో కష్టముండి కాలవిలంబము జరుగుటవలనను వారి వ్యాసములు నిర్ణీత కాలపరిమితిలో కాదు, దానికి వలురెట్లు వ్యవధి ఇచ్చిననుకూడ రాకపోవుట సంభవించినది. కాని కాలవిలంబమెంతయైనను కొందరు శ్రమతీసికొని వారికొసగిన విషయములను గూర్చి వ్యాసములు వ్రాసి పంపిరి. ఈ రీతిని నా ప్రార్థన నంగీకరించి అమూల్య వ్యాసములను వ్రాసి పంపి ఈ మహాకార్యమున నాతో సహకరించిన అఖిలాంధ్ర, ఆంధ్రేతర ప్రముఖులెల్లరకు నా వినయాంజలి.

పూర్వకాలపువిద్యలలో చాలవరకు ఆదరణలేక అంతరించిపోయినవి. తెలుగుదేశములో ఒకప్పుడుండిన బొమ్మలాట ఇప్పుడు కానరాదు. తోలుబొమ్మలుమాత్ర మిటీవలివరకు ఎట్లో ప్రాణముపోసికొని బ్రతికినవి. పురాణకథన మొక కళగ పెంపొందించిన పూర్వకాలపు పౌరాణికులను గురించి వినవచ్చు కథలేగాని అట్టివారు సాధారణముగ కనరారు. భామకలాప, గొల్ల వేషములు అనాగరకములయినవి. కూచిపూడివారి భాగవత నాటకములు ఇటీవలివరకు అనాదృతములైనవి. ఇవి యన్నియు అక్షరాస్యులు కానివారికికూడ పైస ఖర్చులేకుండ ధర్మరహస్య, విజ్ఞానవిషయములను బోధించి వారిలో సభ్యతా సంస్కారములను కలిగించుటకు తోడ్పడినవే. పగటివేషములు వేయుటలో సుప్రసిద్ధులైన నిపుణులు అరుదైవారు. గొప్ప విద్యావంతులు ఆశ్రయాదరణములు లేక దైన్యము ననుభవింపవలసివచ్చినది. అంధకారయుగ మనదగిన క్రీస్తుశకము పదునెనిమిదవ శతాబ్దినుండి పేదరిక మనుభవించుచునే ఆయా విద్యలను, నాట్య సంగీతములను వృత్తిగా నవలంబించి అవి సమసిపోకుండ కాపాడి తద్విద్యా, కళాబీజములను పరిరక్షించి పోషించిన మహనీయుల నామాక్షరములైనను మనకు వినబడుటలేదు; కలంకారీ అద్దకపు పరిశ్రమ గాంధిమహాత్ముని ధర్మమా అని మరల జీవము పోసికొని ఇప్పుడు

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పరిపుష్టి చెందుచున్నది. ఆంధ్రప్రదేశ్‌లో ఎచ్చటెచట ఏయే కుటీరపరిశ్రమలు పూర్వ ముండెడివో, వానిలోని తెలుగు పనితనపు నిగ్గు, సౌందర్యము, నైపుణ్యము, ప్రజ్ఞ ఎటువంటివో ఆధునిక ఆంధ్ర ప్రజానీకమునకు తెలియదు. సంస్కృత విద్యలు - వేదశాస్త్రాదికములు - ఉప్పుగల్లునకు కొరగాకుండ పోయినవి. కడచిన రెండు శతాబ్దములలో కాశీ, నవద్వీపాదుల కరిగి తర్క వ్యాకరణాది బహు శాస్త్రములలో అద్వితీయ ప్రజ్ఞాపాండిత్యములు సంపాదించి భారతదేశమునందలి బహుసంస్థానములలో తమ పాండితీవైశిష్ట్యము ప్రదర్శించి జయపత్రములను, సమ్మానములను బడసి ఆంధ్రదేశమును తమ విజ్ఞానతేజముతో ప్రకాశింపజేసిన అశేష శేముషీధురంధరులు, ఆంధ్రయశఃపతాకలు అయిన ఆంధ్ర విద్వద్వరేణ్యు లెవ్వ రుండిరో, వారి పేరు లెవ్వియో తెలియరావు. పూర్వోక్త వివిధవిద్యావిశారదు లందరు - స్త్రీలయిననేమి, పురుషులైననేమి - తెలుగుదేశపు సంస్కృతికి ఆలంబములై నిలిచి వేరువేరు రంగములందు తెలుగు సంస్కృతి బీజములు పూర్తిగ అంతరింపకుండ పరిరక్షించిన పుణ్యమూర్తులు. చెల్లాచెదరుగ చెదిరిపోయియున్న మన పూర్వపు తెలుగు సంస్కృతి విషయములను జాతిభావ్యభ్యుదయ వికాసముల నిమిత్తము ఏరి వెదకిపట్టి ఉన్నంతవరకు, తెలియవచ్చినంతవరకు సేకరించి పదిలపరచు కొనుటకు చేసిన ప్రయత్నఫలలేశమే ఈ 'తెలుగు సంస్కృతి' సంపుటము.

వేరువేరు రంగములందు తెలుగు దేశమునకు కీర్తి ధనము నార్జించిపోయిన విద్వన్మణుల జీవిత సంగ్రహములను వ్రాసియు, వారి ఛాయాచిత్రములను సేకరించియు అందజేసిన సహృదయాంధ్ర, ఆంధ్రేతర ప్రముఖులకు హృదయపూర్వకాంజలులు. ఈ సంస్కృతి సంపుటమునకు తమ రచనములు పంపుటయేకాక దానిమీద విశేషాదరాభిమానములతో అదివరకు తాము వ్రాసిన చిత్రములను, చిత్రపటములను వాడుకొనుట కనుమతి నిచ్చి ఉదారహృదయముతో తోడ్పడిన సుహృద్వరులు శ్రీ. సి. శివరామమూర్తిగారికిని, పెక్కు విధముల సహకరించిన చిత్రకళా నిపుణులు శ్రీ హెచ్. వి. రామగోపాల్ గారికిని, డాక్టర్ ఆర్. సుబ్రహ్మణ్యము గారికిని వినతులు.

ఈ సంపుటము కార్యనిర్వహణమునకు నన్నాహ్వానించి నాచేత దీనిని పూర్తి చేయించిన కార్యసాధక బాధక వివేచనాదక్షులును, విశేషానుభవజ్ఞులును అయిన పద్మశ్రీ శ్రీ మోటూరి సత్యనారాయణ సుహృదులకు కృతజ్ఞతాపూర్వక వందనములు, సంపాదకీయ కార్యకలాపములలో నాతో హృదయపూర్వకముగ సహకరించిన ఆచార్య శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్యగారికిని, డా॥ నేలటూరి వెంకటరమణయ్యగారికిని నా హృదయపూర్వక వందనములు.

నాకు ఈ కార్యనిర్వహణమున అండగనుండి బహువిధముల తోడ్పడిన సహృదయులు శ్రీ గన్నవరపు సుబ్బరామయ్యగారికిని, ఆర్ట్ సూపరింటెండెంటు శ్రీ మంత్రవాదిగారికిని, కుడిభుజము వలె ఆదుకొని ఈ సంపుటముమీది విశేషాభిమానముతో ముద్రణాది సర్వవిధకార్యములను అతి సమర్థతతో నిర్వహించిన నిపుణమతి శ్రీ ఈరంకి రాయన్నగారికిని, సమితి మేనేజరుగారగు శ్రీ ఓరుగంటి నరసింహామూర్తిగారికిని నా అభివాదనములు.

హిందీప్రచార ముద్రణాలయమువారును, తద్వ్యవహర్తలు శ్రీ అవస్తీగారును ఉదార హృదయులై ముద్రణావసరమున అనేకవిధముల సహకరించి ఈ సంపుటమును సర్వాంగ సుందరముగ ముద్రించినందుకు వారికి ప్రత్యేకాభివందనములు.

మద్రాసు,
శా. శ. 1881, వికారి, మాఘము.

మల్లంపల్లి సోమశేఖర శర్మ

http://sanskritcentral.com/

http://teluguthesis.com/

# రచయితలు

**అ. మ. సి.** — జనాబ్ అబ్దుల్ మజీద్ సిద్దీక్, ఎం. ఏ., ఎల్ ఎల్. బి.,
ప్రొఫెసర్, హెడ్ ఆఫ్ ది డిపార్టుమెంట్ ఆఫ్ పొలిటికల్ సైన్స్ (రిటైర్డ్),
ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్.
గోలకొండ కుతుబ్‌శాహీ వంశము ; కుతుబ్‌శాహీ పరిపాలన విధానము.

**ఎం. వెం. ర.** — శ్రీ ఎండమూరి వెంకట రమణ, ఎం.ఏ., బి.ఇడి., ఎ.ఇ.ఎస్.,
చరిత్ర శాఖాధ్యక్షుడు, పిఠాపురంరాజా ప్రభుత్వకళాశాల, కాకినాడ.
మత సంప్రదాయములు – బ్రాహ్మ ధర్మము.

**ఓ. రా.** — డాక్టరు ఓరుగంటి రామచంద్రయ్య, ఎం.ఏ., పి హెచ్.డి.,
'చరిత్ర - రాజనీతి' శాఖాధ్యక్షులు, ఆంధ్ర విశ్వవిద్యాలయము, వాల్తేరు.
విజయనగర సామ్రాజ్యము–అరవీటి వంశము.

**కుం. ఈ. ద.** — శ్రీ కుందూరి ఈశ్వరదత్తు, బి.ఏ.,
డిస్ట్రిక్టు ఇన్‌స్పెక్టర్ ఆఫ్ అకౌంట్స్ (రిటైర్డ్),
రావలివారివీధి, గాంధీ నగరము, కాకినాడ.
విజయనగర సామ్రాజ్యము – సంగమవంశము.

**కో. మ. శా.** — శ్రీ కోరాడ మహాదేవశాస్త్రి, ఎం.ఏ.,
లెక్చరర్, అన్నామలై విశ్వవిద్యాలయము, అన్నామలైనగర్.
తెలుగు – ప్రాకృతము

**కో. రా.** — శ్రీ కోరాడ రామకృష్ణయ్య, ఎం.ఏ.,
రీడర్ (రిటైర్డు), మద్రాసు విశ్వవిద్యాలయము, 88, సింగరాచారి వీథి, మద్రాసు.
తెలుగుభాష – పరిణామము.

**కో. సుం. శ.** — శ్రీ కోట సుందరరామ శర్మ, ఎం.ఏ., ఎం.ఓ.ఎల్., ఎం.ఎడ్., ద్వాదశ భాషా విశారద,
అసిస్టెంట్ ఎడ్యుకేషనల్ ఆఫీసర్, మినిస్ట్రీ ఆఫ్ ఎడ్యుకేషన్, న్యూ ఢిల్లీ.
ఆంధ్ర ప్రాకృతముల జన్యజనక సంబంధ మీమాంస.

**ఖం. ల.** — శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం, ఎం.ఏ.,
తెలుగు శాఖాధ్యక్షులు, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు.
ఆధునిక యుగము (తెలుగు వాఙ్మయము)

**గం. జో. సో.** — శ్రీ గంటి జోగి సోమయాజులు, ఎం.ఏ., ఎల్.టి.,
తెలుగు శాఖాధ్యక్షులు, ఆంధ్ర విశ్వవిద్యాలయము, వాల్తేరు.
తెలుగునకు ఇతర ద్రావిడ భాషలతోడి సంబంధము ; ఆంగ్లభాషవలన తెలుగులో కలిగిన మార్పులు ; ఆంగ్లవాఙ్మయ ప్రభావము.

**గి. వెం. సీ.** — డాక్టరు గిడుగు వెంకట సీతాపతి, బి.ఏ., ఎల్.టి., డి.లిట్.,
ప్రధాన సంగ్రాహకుడు (రిటైర్డు), తెలుగు భాషా సమితి, హైదరాబాదు
వ్యావహారిక భాషా పునఃప్రతిష్ఠాపనము.

http://sanskritcentral.com/

http://teluguthesis.com/


గు. వెం. రా. — శ్రీ గుర్తి వెంకటరావు, ఎం.ఏ., ఎల్ ఎల్. బి.,
ప్రొఫెసర్ (రిటైర్డు), హిస్టరీ డిపార్టుమెంటు, ఆంధ్ర విశ్వవిద్యాలయము,
మహారాణిపేట, విశాఖపట్టణము.
శాతవాహనులు.

చా. గో. కృ. — శ్రీ చాగంటి గోపాలకృష్ణమూర్తి, ఎం.ఏ.,
తెలుగు లెక్చరర్, గవర్నమెంటు ఆర్ట్సుకాలేజి, శ్రీకాకుళము.
ప్రాఙ్నన్నయయుగము; ఆంధ్రులు: సంస్కృతవాఙ్మయము.

చీ. శే. రా. — శ్రీ చీమకుర్తి శేషగిరిరావు,
సహాయ సంగ్రాహకులు, తెలుగు భాషా సమితి శాఖాకార్యాలయము,
హైదరాబాదు.
క్రైస్తవము (మత సంప్రదాయములు).

తె. వెం. ర. — శ్రీ తెలికిచెర్ల వెంకటరత్నం, ఎం.ఏ., ఎల్.టి.,
బ్రాడీపేట, గుంటూరు.
వచనరచనాపరిణామము (తెలుగు వాఙ్మయము).

ని. వెం. రా. — శ్రీ నిడుదవోలు వెంకటరావు, ఎం.ఏ.,
తెలుగుశాఖాధ్యక్షులు, మదరాసు విశ్వవిద్యాలయము, మద్రాసు.
తెలుగు కన్నడముల పరస్పర సంబంధము (తెలుగు వాఙ్మయము)

నే. వెం. ర. — డాక్టరు నేలటూరి వెంకటరమణయ్య, ఎం.ఏ., పిహెచ్. డి.,
రిసెర్చి ఆఫీసర్, హిస్టరీ ఆఫ్ ఫ్రీడమ్ స్ట్రగుల్ ఇన్ ఆంధ్రప్రదేశ్.
౯, రామస్వామి వీధి, త్యాగరాయనగర్, మద్రాసు.
తెలుగుదేశ చరిత్ర – ఆధారములు (వాఙ్మయము); పల్లవులు; బాదామి చాళుక్యులు; రాష్ట్రకూటులు; పూర్వ చాళుక్యులు; బహ్మనీరాజ్యము; విజయనగర సామ్రాజ్యము–సాళువవంశము, తుళువవంశము; బహ్మనీరాజ్య పరిపాలనవిధానము.

పిం. ల. — శ్రీ పింగళి లక్ష్మీకాంతం, ఎం.ఏ.,
ప్రొడ్యూసర్, స్పోకెన్ వర్డ్, 'ఆకాశవాణి' విజయవాడ.
రీడరు (రిటైర్డు), తెలుగు డిపార్టుమెంటు, ఆంధ్ర విశ్వవిద్యాలయము, వాల్తేరు.
తెలుగు వాఙ్మయము – ప్రబంధపూర్వయుగము; ప్రబంధయుగము.

పు. నా. — శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు, సరస్వతీపుత్ర, మహాకవి,
రామకృష్ణ హైస్కూలు, కడప.
తెలుగు వాఙ్మయము – మహారాష్ట్ర వాఙ్మయ ప్రభావము.

ఫ. ఖా. ఖా. — జనాబ్ సయ్యద్ ఫకీర్ ఖాషా ఖాద్రి, ఎం.ఏ.,
ఉర్దూ ఉపన్యాసకులు, ఉస్మానియా కళాశాల, కర్నూలు.
ఇస్లాము (మతసంప్రదాయములు).

బెం. సు. రా. — డాక్టరు బెండపూడి సుబ్బారావు, ఎం.ఏ., ఎల్.ఎల్.బి.(ఆనర్సు),పిహెచ్.డి.(బొంబాయి),
ప్రొఫెసర్, హెడ్ ఆఫ్ ది డిపార్టుమెంటు ఆఫ్ ఆర్కియాలజీ,
ది మహారాజా శాయాజీరావు యూనివర్సిటీ, బరోడా.
చరిత్రపూర్వయుగము.

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



'భార్గవ' — శ్రీ భాస్కరభట్ల కృష్ణరావు, బి.ఎస్‌సి., ఎల్.ఎల్.బి.,
ప్రోగ్రామ్ ఎగ్జిక్యూటివ్, 'ఆకాశవాణి', హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్.
తెలంగాణా ఆంధ్రోద్యమము.

భూ. ల. — శ్రీ భూపతి లక్ష్మీనారాయణరావు, ఎం.ఏ., బి.ఇడి.,
రీడర్, హెడ్ ఆఫ్ ది డిపార్టుమెంట్ ఆఫ్ తెలుగు,
శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీ, తిరుపతి
తెలుగు వాఙ్మయము – కవిత్రయ యుగము.

మ. సూ. ప్ర. — శ్రీ మ. సూర్యప్రకాశరావు, ఎం.ఏ., బి.ఇడి.,
లెక్చరర్ ఇన్ ఎకనమిక్స్, శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీ, మారుతీనగర్, తిరుపతి.
ఆంధ్ర శిల్పకళా పరిణామము ; ఆంధ్ర చిత్రకళ.

మ. సో. శ. — శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ,
సంగ్రాహకులు 'తెలుగు సంస్కృతి' సంపుటము, లెక్చరర్ ఇన్ ఎపిగ్రఫీ అండ్ న్యూమిస్‌మాటిక్స్, ఆంధ్ర యూనివర్సిటీ, స్టాఫ్ క్వార్టర్స్, వాల్తేరు.
ఆంధ్ర – తెలుగు ; ముఖ్య మతవర్గములు ; జీవన విధానము – కుటుంబజీవనము; ఆటలు, వేడుకలు, వినోదములు ; తెలుగుదేశ చరిత్ర – ఆధారములు (శాసనములు, నాణెములు); తెలుగుదేశ చరిత్ర–యుగవిభాగము; ప్రాచీన కళింగదేశ చరిత్ర; ఇక్ష్వాకులు; బృహత్ఫలాయనులు ; శాలంకాయనులు ; ఆనందగోత్రులు ; విష్ణుకుండివంశజులు ; పూర్వగాంగులు; చాళుక్యచోళులు ; అర్వాచీన గాంగవంశము ; ముసునూరి వంశపాలనము ; రాచకొండ, దేవరకొండ రాజ్యములు ; కొండవీటి రెడ్డిరాజ్యము ; రాజ్యపరిపాలనవిధానము –హిందూ ప్రభుత్వము ; వర్తక వ్యాపారములు ; మత సంప్రదాయములు – బౌద్ధము, జైనమతము, శైవము, వైష్ణవము, ఆధునికమత పరిస్థితి.

మా. రా. — డాక్టరు మారేమండ రామారావు, ఎం.ఏ., పి.హెచ్.డి.,
చరిత్రశాఖ, శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీ, తిరుపతి, ఆంధ్రప్రదేశ్.
కాకతీయులు.

మా. వెం. రం. — శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య, ఎం.ఏ.,
ప్రొఫెసర్ (రిటైర్డు), ఆంధ్ర - బొంబాయి విశ్వవిద్యాలయములు,
61, ఫర్డ్ మెయిన్‌రోడ్, కస్తూరిబానగర్, మద్రాసు.
తెలుగుదేశ చరిత్ర – బ్రిటిష్ ప్రభుత్వము ; బ్రిటిష్ పరిపాలన ఫలితములు ; స్వాతంత్ర్యోద్యమము ; ఆంధ్రోద్యమము ; ఆంధ్రప్రదేశావతరణము ; రాజ్యపరిపాలన విధానము, బ్రిటిష్‌ప్రభుత్వము ; ఆర్థిక చరిత్ర.

రా. అ. కృ. శ. — శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ,
152, గోవిందరాజస్వామి సన్నిధివీథి, తిరుపతి, చిత్తూరుజిల్లా.
సంగీతము.

రా. సు. — డాక్టరు రాయప్రోలు సుబ్రహ్మణ్యం, ఎం.ఏ., పి.హెచ్.డి.,
సూపరింటెండెంటు, డిపార్ట్‌మెంట్ ఆఫ్ ఆర్కియాలజీ, నాగార్జునకొండ ఎక్స్‌కవేషన్ ప్రాజెక్టు, గుంటూరు, ఆంధ్రప్రదేశ్.
తెలుగుదేశ చరిత్ర–ఆధారములు (పురాతనవస్తు ఖననపరిశోధన), ఓఢ్రగజపతులు.

రి. సూ. మూ. — శ్రీ రిబ్బాప్రగడ సూర్యనారాయణమూర్తి, ఎం.ఏ., ఎల్.టి., డిప్లొమా ఇన్ జాగ్రఫీ,
భూగోళశాస్త్రోపన్యాసకులు, గవర్నమెంటు ఆర్ట్సు కాలేజి, రాజమహేంద్రవరము.
తెలుగుదేశము – భూగోళ ప్రభావము.

http://sanskritcentral.com/

http://teluguthesis.com/


వి. రా. — డాక్టరు వి. రాఘవన్, ఎం.ఏ., పిహెచ్.డి., కవికోకిల,
సంస్కృత శాఖాధ్యక్షులు, మద్రాసు విశ్వవిద్యాలయము, మద్రాసు.
నాట్యకళ.

వే. వెం. శా. — శ్రీ వేదం వెంకటరాయశాస్త్రి, ఎం.ఏ.,
4, మల్లికేశ్వర సందు, లింగిచెట్టివీధి, మద్రాసు.
కళ్యాణి చాళుక్యులు.

సి. జె. జ. — శ్రీ జె. జయదేవ్, ఎం.ఏ.,
క్యూరేటరు, ఆంత్రపాలజీ, గవర్నమెంటు మ్యూజియమ్, మద్రాసు.
తెలుగుదేశము-జాతులు.

సి. శి. — శ్రీ సి. శివరామమూర్తి, ఎం.ఏ.,
కీపర్, నేషనల్ మ్యూజియం ఆఫ్ ఇండియా, రాష్ట్రపతి భవన్, న్యూఢిల్లీ.
ఆంధ్ర దేవాలయ వాస్తుకళా పరిణామము; ఆంధ్ర శిల్పకళా పరిణామము.

సి. హ. రా. — శ్రీ సిరుగూరి హనుమంతరావు, ఎం.ఏ., ఎల్.టి.,
ప్రొఫెసర్ (రిటైర్డు), నైజామ్ కళాశాల,
హార్డికర్ బాగ్, హిమాయత్‌నగర్, హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్.
అసఫ్‌జాహి నిజాం రాజ్యము; అసఫ్‌జాహి పరిపాలనవిధానము.

కళాపర్యవేక్షకుడు:
శ్రీ మంత్రవాది వెంకటరత్నము

http://sanskritcentral.com/

http://teluguthesis.com/

# విషయానుక్రమణిక

## సమీక్ష


| | | | పేజీ |
|---|---|---|---|
| **1. తెలుగు దేశము :** | | | |
| ఆంధ్ర - తెలుగు | ... | ... | 1 |
| భూగోళ ప్రభావము | ... | ... | 8 |
| **2. తెలుగు ప్రజలు :** | | | |
| జాతులు | ... | ... | 9 |
| ముఖ్య మతవర్గములు | ... | ... | 11 |
| జీవనవిధానము - కుటుంబ జీవనము | ... | ... | 17 |
| ఆటలు, వేడుకలు, వినోదములు | ... | ... | 21 |
| **3. తెలుగు భాష :** | | | |
| పరిణామము | ... | ... | 28 |
| ఆంధ్ర ప్రాకృతముల జన్య జనక సంబంధ మీమాంస | ... | ... | 36 |
| తెనుగు : ప్రాకృతము | ... | ... | 42 |
| తెనుగునకు ఇతర ద్రావిడ భాషలతోడి సంబంధము | ... | ... | 48 |
| ఆంగ్లభాషవలన తెనుగులో కలిగిన మార్పులు | ... | ... | 52 |
| వ్యావహారిక భాషా పునఃప్రతిష్ఠాపనము | ... | ... | 54 |
| **4. తెలుగుదేశ చరిత్ర :** | | | |
| ఆధారములు : | | | |
| శాసనములు | ... | ... | 58 |
| నాణెములు | ... | ... | 60 |
| వాఙ్మయము | ... | ... | 61 |
| పురాతనస్థల ఖనన పరిశోధన | ... | ... | 67 |
| తెలుగుదేశ చరిత్ర - యుగవిభాగము | ... | ... | 79 |
| చరిత్ర పూర్వయుగము | ... | ... | 79 |
| పూర్వయుగము : | | | |
| శాతవాహనులు | ... | ... | 86 |
| ప్రాచీన కళింగదేశ చరిత్ర | ... | ... | 98 |
| ఇక్ష్వాకులు | ... | ... | 105 |
| బృహత్ఫలాయనులు | ... | ... | 109 |
| శాలంకాయనులు | ... | ... | 110 |


http://sanskritcentral.com/

http://sanskritcentral.com/



శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు



శ్రీ కొమర్రాజు వెంకటలక్ష్మణరావు



శ్రీ నాయని వెంకటరంగారావు

ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ సంకలనమును

ఉపక్రమించిన మహాపురుషులు

http://teluguthesis.com/

http://teluguthesis.com/




| | | | పేజీ |
|---|---|---|---|
| ఆనందగోత్రులు | ... | ... | 113 |
| విష్ణుకుండి వంశజులు | ... | ... | 115 |
| పల్లవులు | ... | ... | 121 |
| బాదామి చాళుక్యులు | ... | ... | 133 |
| రాష్ట్రకూటులు | ... | ... | 136 |
| పూర్వ చాళుక్యులు | ... | ... | 142 |
| పూర్వ గాంగులు | ... | ... | 173 |
| **పూర్వ మధ్యయుగము :** | | | |
| కల్యాణి చాళుక్యులు | ... | ... | 182 |
| చాళుక్య చోళులు | ... | ... | 191 |
| కాకతీయులు | ... | ... | 224 |
| అర్వాచీన గాంగవంశము | ... | ... | 234 |
| **ఉత్తర మధ్యయుగము :** | | | |
| అర్వాచీన గాంగవంశము (పరిశేషము) | ... | ... | 265 |
| ఓఢ్రగజపతులు | ... | ... | 273 |
| ముసునూరి వంశపాలనము | ... | ... | 279 |
| రాచకొండ, దేవరకొండ రాజ్యములు | ... | ... | 293 |
| కొండవీటి రెడ్డిరాజ్యము | ... | ... | 306 |
| బహ్మనీరాజ్యము | ... | ... | 333 |
| విజయనగర సామ్రాజ్యము : | | | |
| సంగమ వంశము | ... | ... | 369 |
| సాళువ వంశము | ... | ... | 373 |
| తుళువ వంశము | ... | ... | 387 |
| ఆరవీటి వంశము | ... | ... | 409 |
| గోలకొండ కుత్బ్‌శాహి వంశము | ... | ... | 427 |
| **ఆధునిక యుగము :** | | | |
| అసఫ్‌జాహి నిజాం రాజ్యము | ... | ... | 432 |
| బ్రిటిష్ ప్రభుత్వము | ... | ... | 440 |
| స్వాతంత్ర్యోద్యమము | ... | ... | 460 |
| ఆంధ్రోద్యమము | ... | ... | 467 |
| ఆంధ్రప్రదేశావతరణము | ... | ... | 482 |
| **5. రాజ్యపరిపాలన విధానము** | ... | ... | 484 |
| **6. ఆర్థిక చరిత్ర** | ... | ... | 519 |
| **7. వర్తక వ్యాపారములు** | ... | ... | 523 |


http://sanskritcentral.com/

http://teluguthesis.com/




| | | | పేజి |
|---|---|---|---|
| 8. మతసంప్రదాయములు : | ... | ... | 534 |
| బౌద్ధము | ... | ... | 535 |
| జైనమతము | ... | ... | 544 |
| శైవము | ... | ... | 553 |
| వైష్ణవము | ... | ... | 560 |
| ఇస్లాము | ... | ... | 566 |
| క్రైస్తవము | ... | ... | 570 |
| బ్రాహ్మ ధర్మము | ... | ... | 574 |
| ఆధునిక మత పరిస్థితి | ... | ... | 576 |
| 9. తెలుగు వాఙ్మయము : | | | |
| ప్రాఙ్నన్నయ యుగము | ... | ... | 578 |
| కవిత్రయ యుగము | ... | ... | 580 |
| ప్రబంధపూర్వ యుగము | ... | ... | 594 |
| ప్రబంధ యుగము | ... | ... | 606 |
| ఆధునిక యుగము | ... | ... | 620 |
| వచన రచనా పరిణామము | ... | ... | 629 |
| తెలుగుకన్నడముల పరస్పర సంబంధము | ... | ... | 635 |
| మహారాష్ట్ర వాఙ్మయ ప్రభావము | ... | ... | 638 |
| ఆంగ్ల వాఙ్మయ ప్రభావము | ... | ... | 640 |
| 10. ఆంధ్రులు : సంస్కృత వాఙ్మయము | ... | ... | 644 |
| 11. ఆంధ్ర దేవాలయ వాస్తుకళా పరిణామము | ... | ... | 647 |
| 12. ఆంధ్ర శిల్పకళా పరిణామము | ... | ... | 660 |
| 13. ఆంధ్ర చిత్రకళ | ... | ... | 673 |
| 14. సంగీతము | ... | ... | 683 |
| 15. నాట్యకళ | ... | ... | 694 |
| 16. సూచి | ... | ... | [1] |
| 17. Acknowledgements | ... | ... | [11] |
| 18. Bibliography | ... | ... | [12] |


http://sanskritcentral.com/

http://teluguthesis.com/

# ప్రముఖ చిత్రములు


| | | | | పేజీ |
|---|---|---|---|---|
| ఫలకము | 1. | బౌద్ధ గుహాలయములు, అజంటా కొండ | .... | 4 |
| ఫలకము | 2. | 1. గండికోట వద్ద పెన్నానది | .... | ర |
| | | 2. శ్రీశైలమువద్ద కృష్ణానది | .... | 5 |
| ఫలకము | 3. | తెలుగుదేశ చరిత్ర : ఆధారములు | .... | 60 |
| ఫలకము | 4. | 1. అశోక శాసనశిలమీది గజశిలాప్రతిమ, ధౌళి | .... | 61 |
| | | 2. అశోక శాసనములు : జొన్నగిరి | .... | 61 |
| ఫలకము | 5. | 1. వర్తుల శిలాఫలకము, అమరావతి; 2. పూర్ణఘటము, అమరావతి | .... | 66 |
| ఫలకము | 6. | 1. వెండినాణెములరాశి (క్రీ. శ. ఆరంభశతాబ్దములు), అమరావతి | .... | 67 |
| | | 2. క్రొత్తగా బయలుపడిన శిలావిగ్రహములు, అమరావతి | .... | 67 |
| ఫలకము | 7. | 1. చైత్యగుహాలయ ముఖభాగము, నాసిక | .... | 88 |
| | | 2. శాతకర్ణివిహారము (ముందుభాగము), నాసిక | .... | 88 |
| ఫలకము | 8. | మహాస్తూపము, తూర్పువైపు తోరణము, సాంచి | .... | 69 |
| ఫలకము | 9. | రాణి గుంఫ, ఖండగిరి | .... | 100 |
| ఫలకము | 10. | అనంత గుంఫ, ఖండగిరి | .... | 101 |
| ఫలకము | 11. | 1. పంచపాండవ రథములు, మహాబలిపురము | .... | 128 |
| | | 2. గుహాలయములు, భైరవుని కోన | .... | 128 |
| ఫలకము | 12. | అర్జునుని తపస్సు, మహాబలిపురము | .... | 129 |
| ఫలకము | 13. | రామప్ప దేవాలయము, పాలంపేట | .... | 282 |
| ఫలకము | 14. | రామప్ప దేవాలయ అంతర్భాగదృశ్యము, పాలంపేట | .... | 288 |
| ఫలకము | 15. | జగన్నాథాలయము, పూరి | .... | 246 |
| ఫలకము | 16. | లింగరాజాలయము, భువనేశ్వరము | .... | 247 |
| ఫలకము | 17. | జగమోహన సూర్యాలయము, కోణార్కము, పూరిజిల్లా | .... | 256 |
| ఫలకము | 18. | జగమోహనసూర్యాలయములోని చక్రము, కోణార్కము | .... | 257 |
| ఫలకము | 19. | 1 పంపావిరూపాక్షాలయ గోపురము, హంపి | .... | 870 |
| | | 2. అమ్మవారిదేవళములోని శిల్పము, హజారరామాలయము, హంపి | .... | 870 |
| ఫలకము | 20. | పంపావిరూపాక్షాలయ కల్యాణమంటపమునందలి లోకప్పుమీది పౌరాణిక, స్థానిక చారిత్రక గాథలు తెలుపు వర్ణచిత్రములు, హంపి | .... | 871 |
| ఫలకము | 21. | విజయనగర రాజ్యారంభ కాలమునాటి వేషభూషాలంకరణాదులను తెలుపు వర్ణచిత్రములకు ప్రతికృతులు | .... | 876 |
| ఫలకము | 22. | పంపావిరూపాక్షాలయ వర్ణచిత్రములలోని దిగువవరుస—శ్రీ విద్యారణ్యులవారు పల్లకిలో ఉత్సవముతో ఆలయమునకు పోవుచున్న దృశ్యము | .... | 877 |
| ఫలకము | 23. | 1. విఠ్ఠలరాయాలయము, ముందరి మంటప భాగము | .... | 894 |
| | | 2. అచ్యుతరాయాలయము, రెండవ అంగణ ద్వారగోపురము, హంపి | .... | 894 |


http://sanskritcentral.com/

http://teluguthesis.com/


| | | | పేజీ |
|---|---|---|---|
| ఫలకము 24. | 1. జైనదేవాలయములు, హంపి | .... | 395 |
| | 2. విఠ్ఠలరాయాలయము, (సాధారణ దృశ్యము), హంపి | .... | 395 |
| ఫలకము 25. | 1. సుల్తాను కులీ కుతుబ్ షా | .... | 428 |
| | 2. గోలకొండకోట. | .... | 428 |
| ఫలకము 26. | 1. జంషీద్ కుతుబ్ షా, 2. ఇబ్రాహీం కుతుబ్ షా, 3. కులీ కుతుబ్ షా, 4. మహమ్మద్ కుతుబ్ షా, 5. అబ్దుల్లా కుతుబ్ షా, 6. అబుల్ హసన్ తానా షా | .... | 429 |
| ఫలకము 27. | 1. మొదటి ఆసఫ్ జా నిజాముల్ ముల్కు, 2. నిజాం అలీఖాన్, 3. నవాబ్ మీర్, ఉస్మాన్ అలీ ఖాన్, 4. దివాన్ చందూలాల్, 5. దివాన్ సర్ సాలార్ జంగ్ | .... | 434 |
| ఫలకము 28. | చార్మినారు, హైదరాబాదు | .... | 435 |
| ఫలకము 29. | 1. ఓడ యెక్కుట (కుంపిణీకాలము - 1837), మదరాసు | .... | 450 |
| | 2. ఓడ దిగుట (కుంపిణీకాలము - 1837), మదరాసు | .... | 450 |
| ఫలకము 30. | మచిలీపట్టణము రేవు (కుంపిణీకాలము. 18 శతాబ్ది) | .... | 451 |
| ఫలకము 31. | 1. స్తూపప్రాకారము (వెలుపలివైపు), అమరావతి | .... | 646 |
| | 2. స్తూపప్రాకారము (లోపలివైపు), అమరావతి | .... | 646 |
| ఫలకము 32. | 1. 'పాండులేణ' (గుహ), ముఖభాగము, నాసిక | .... | 647 |
| | 2. కొండలో దొలిచిన విహారము, గుంటుపల్లి | .... | 647 |
| | 3. నాలుగంతస్తుల గుహాలయము, ఉండవల్లి | .... | 647 |
| | 4. కపోతేశ్వరాలయము, చేజెర్ల | .... | 647 |
| ఫలకము 33. | 1. గుహాలయ ముఖభాగము, గుంటుపల్లి | .... | 656 |
| | 2. గుహాలయ ముఖభాగము, మొగల్రాజపురము | .... | 656 |
| | 3. నరసింహమూర్తి, ఉండవల్లి | .... | 656 |
| | 4. త్రివిక్రమావతారము, ఉండవల్లి | .... | 656 |
| | 5. గోవర్ధనధారి - కృష్ణుడు, ఉండవల్లి | .... | 656 |
| ఫలకము 34. | 1. స్తూపశిలాఫలకము, అమరావతి | .... | 657 |
| | 2. యక్షవిగ్రహము, అమరావతి | .... | 657 |
| | 3. మాయాదేవిని శుద్ధోదనుడు సందర్శింపవచ్చుట, అమరావతి | .... | 657 |
| | 4. వృత్తచైత్యము చుట్టునున్న విహారము, అమరావతి | .... | 657 |
| | 5. తూర్పుచాళుక్య దేవాలయము (పొలములోనిది), బిక్కవోలు | .... | 657 |
| | 6. దేవాలయద్వారము, బిక్కవోలు | .... | 657 |
| | 7. నటరాజమూర్తి, కోష్ఠపంజరము, బిక్కవోలు | .... | 657 |
| | 8. గోలింగేశ్వరాలయము, బిక్కవోలు | .... | 657 |
| ఫలకము 35. | బ్రహ్మేశ్వరాలయము, అలంపురము | .... | 658 |
| ఫలకము 36. | 1. సహస్రస్తంభ దేవాలయము, హనుమకొండ | .... | 659 |
| | 2. పద్మప్రాసాదము (లోటస్ మహల్), హంపి | .... | 659 |
| | 3. శిలారథము, హంపి | .... | 659 |
| | 4. శిలారథము, చింతలరాయాలయము, తాడిపత్రి | .... | 659 |

http://sanskritcentral.com/

http://teluguthesis.com/




| | | | |
|---|---|---|---|
| | | | పేజీ |
| ఫలకము 37. | 1. మాంధాత జాతకము, జగ్గయ్యపేట | .... | 662 |
| | 2. ఉదయనకథ, అమరావతి | .... | 662 |
| | 3. అమరావతి స్తూపశిల్పము, జాతీయకళాశాల, బందరు | .... | 662 |
| | 4. ఈహామృగారోహ, స్తూపశిల్పము, అమరావతి | .... | 662 |
| | 5. చంద్రముఖ - యక్షుడు, స్తూపశిల్పము, అమరావతి. | .... | 662 |
| ఫలకము 38. | 1. బుద్ధ, రాహుల సమాగమము, గోలి | .... | 663 |
| | 2. నలగిరి దమనము, అమరావతి | .... | 663 |
| | 3. బుద్ధుని కంచు విగ్రహములు, అమరావతి | .... | 663 |
| | 4. బుద్ధ దర్శనమునకు అజాతశత్రునిరాక, నాగార్జునకొండ | .... | 663 |
| ఫలకము 39. | 1. శివమూర్తి, బిక్కవోలు. 2. కౌమారి, బిక్కవోలు, 3. గణాధిపతి, బిక్కవోలు, 4. గరుడవాహనారూఢ విష్ణుమూర్తి, సామర్లకోట | .... | 666 |
| ఫలకము 40. | 1. కుబేరమూర్తి (మ్యూజియము), విజయవాడ | .... | 667 |
| | 2. పరశుధారి శివమూర్తి (మ్యూజియము), విజయవాడ | .... | 667 |
| | 3. శివాలయ (దక్షిణపుగోడ) శిల్పచిత్రములు, పెనుగొండ (అనంతపురం జిల్లా) | .... | 667 |
| ఫలకము 41. | శిల్పచిత్రములు, శ్రీశైలము | .... | 668 |
| ఫలకము 42. | చిత్రములు 1, 4 సాలభంజికలు (నాసికా స్తంభ ప్రతిమలు), రామప్పగుళ్ళు, పాలంపేట. | .... | 669 |
| | చిత్రములు 2, 3 వితానశిల్ప శిలాఫలకములు, ఓరుగల్లు | .... | 669 |
| ఫలకము 43. | 1. శిల్పచిత్రాలంకృతమైన ద్వారబంధపు రాతికమ్మి, ఓరుగల్లు | .... | 670 |
| | 2. శిల్పచిత్రఫలకము, పెద్దముడియము | .... | 670 |
| | 3. మహిషాసురమర్దని, త్రిపురాంతకము | .... | 670 |
| | 4. నరసింహమూర్తి, హంపి | .... | 670 |
| ఫలకము 44. | 1. శిల్పచిత్రములు, పెనుగొండ, (అనంతపురం జిల్లా) | .... | 671 |
| | 2. చక్రపురుషమూర్తి, తిరుపతి | .... | 671 |
| | 3. శివాలయము ముందరి కల్యాణమండపము, రాయవేలూరు | .... | 671 |
| | 4. మకరాధిష్ఠిత గంగావిగ్రహము, రామాలయ గోపురద్వారము, తాడిపత్రి | .... | 671 |
| ఫలకము 45. | 'షడ్దంత' జాతకము, అజంటా, పదవగుహ - మృగయులు 'షడ్దంతు'ని (బోధిసత్త్వుని), అతని యూథమును పొంచిచూచుట | .... | 676 |
| ఫలకము 46. | 1. మృగయులు 'షడ్దంతు'ని (బోధిసత్త్వుని) పట్టుకొనబూనుట, అజంటా, పదవగుహ | .... | 676 |
| | 2. దంతములనుచూచి రాణి మూర్ఛిల్లుట, అజంటా, పదవగుహ | .... | 676 |
| ఫలకము 47. | 1. మార్దంగికురాలు, కోణార్కము, 2. చిటితాళములు, 3. డమరువు, 4-5. తాళములు. 6. డోలు, 7. ఢంకా, 8. ఖంజరి, 9. మృదంగము, 10. 'తాళకత్తె' కోణార్కము. | .... | 684 |
| ఫలకము 48. | జంత్రవాద్యములు (1 – 18) | .... | 685 |
| ఫలకము 49. | నాట్యచిత్రములు – చాళుక్య శిల్పము, విజయవాడ | .... | 694 |


http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఫలకము 50. 1. నృత్యభంగిమ - శిల్పము, విజయవాడ ....
2. నాట్యభంగిమలు, చాళుక్య శిల్పము, విజయవాడ ....
3. నాట్యచిత్రములు, మల్లికార్జునస్వామి ఆలయము, శ్రీశైలము ....
4. నాట్యభేదములు, విజయనగర శిల్పము, హంపి ....

ఫలకము 51. 1. నాట్యభంగిమలు, విజయనగర శిల్పము, హంపి ....
2-3. కోలాటపు భంగిమలు, విజయనగర శిల్పము, హంపి ....

ఫలకము 52. ద్వాదశహస్త నటరాజమూర్తి, ముఖలింగము ....

## దేశపటములు

1. ఆంధ్రప్రదేశ్ - రాజకీయ విభాగములు (త్రివర్ణ పటము) ....
2. తెలుగుదేశము - పురావస్తు స్థలములు ....
3. చరిత్ర పూర్వయుగపు ఆంధ్ర దేశము ....
4. శాతవాహన సామ్రాజ్యము : గౌతమీపుత్ర శాతకర్ణి కాలము ....
5. ఖారవేలుని దండయాత్రలు ....
6. తెలుగుదేశము : ఆరవశతాబ్ది మొదటి పాదము ....
7. రాష్ట్రకూట సామ్రాజ్యము ....
8. దక్షిణ హిందూదేశము : గుణగ విజయాదిత్యుని కాలము ....
9. వీరరాజేంద్ర దండయాత్రా మార్గములు ....
10. కాకతీయ సామ్రాజ్యము : గణపతి చక్రవర్తి కాలము ....
11. తెలుగుదేశము (క్రీ. శ. 1340) : స్వతంత్ర రాజ్యములు ....
12. కొండవీటి రెడ్డిరాజ్యము : కుమారగిరి రెడ్డి కాలము ....
13. దక్కను ముస్లిము రాజ్యములు ....
14. విజయనగర సామ్రాజ్యము : రెండవ దేవరాయల కాలము ....
15. విజయనగర సామ్రాజ్యము : రాయల దండయాత్రా మార్గములు ....
16. రాక్షసి - తంగడి యుద్ధము - వ్యూహరచన ....
17. తెలుగుదేశము (18వ శతాబ్దము) : నిజాము బ్రిటిషువారి కిచ్చిన జిల్లాలు ....
18. తెలుగుదేశము : రాజ్య విభాగములు (1884 - 85) ....
19. తెలుగుదేశము : రెవిన్యూ పరిపాలన విభాగములు (1884 - 85) ....
20. తెలుగుదేశము : యూరోపియనుల అధివాసములు, రేవులు (17, 18 - శతాబ్దములు) ....

## త్రివర్ణ చిత్రములు

1. బందరు కలంకారీ అద్దకము
2. సిద్ధార్థుని రాగోదయము

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



# తెలుగు దేశము

## ఆంధ్ర - తెలుగు

ఆంధ్రపదము ఆంధ్రదేశమునకును, జాతికిని భాషకును వర్తించును. అంధ్ర యన్నదే ప్రాచీనరూపమని, ఆంధ్ర యన్నది అర్వాచీనరూపమని ప్రాచీనతామ్రశిలాశాసనములను, వాఙ్మయమును పరిశీలించినచో తెలియగలదు. బౌద్ధపాళీవాఙ్మయమున ఆంధ్రులు 'అంధకు'లని వ్యవహృతులయినారు. అచ్చయిన సంస్కృత పురాణేతిహాసములలో అంధ్ర, ఆంధ్రరూపములు రెండును కానవచ్చును. 'ఆంధ్ర' అను రూపము వానిలో నెప్పుడు ప్రవేశించెనో నిర్ణయించుటకు వీలులేదు. ప్రాచీనములైన తెలుగు తాళపత్ర గ్రంథములను చూచినను వానిలోను అంధ్రపదమే కనబడును. ఆంధ్రపదము క్రీస్తు శకము పదునాలుగవ శతాబ్దము కడపటి భాగమునను, పదునైదవ శతాబ్దిలోను వాడుకలోనికి వచ్చినదని శాసన పరిశీలనము వలన తెలియుచున్నది.

అంధ్రపదము ఐతరేయమను ఋగ్వేదబ్రాహ్మణము నందే మొదటిమారు కానవచ్చును. బౌద్ధవాఙ్మయములో 'అంధకు'లను గురించిన ప్రస్తావము కలదు. 'సమంత పాసాదిక' అను బౌద్ధగ్రంథములో 'దమిళు'లతోపాటు 'అంధు'లుకూడ మ్లేచ్ఛులుగా పేర్కొనబడిరి. 'అంధులు' 'అంధకులు' ఒక్కరే కావచ్చును. బౌద్ధగ్రంథములవలన గోదావరీతీరమున 'అంధకరట్ఠ' (అంధ్రరాష్ట్ర) మొకటి కలదని, 'అస్స'కులు, 'అళ'కులు (ముళకులు) అంధ్ర రాజులని తెలియుచున్నది. బుద్ధునికాలమునాటికే గోదావరీతీరమున అంధ్రజనపదము లుండినట్లు విశదమగుచున్నది. తరువాత క్రీస్తు పూర్వము నాలుగవ శతాబ్దములో మగధను పాలించిన చంద్రగుప్తమౌర్యుని యాస్థానమున నుండిన గ్రీకు రాయబారి యాంధ్రులనుగూర్చి ప్రస్తావించియున్నాడు. అశోక చక్రవర్తి శాసనములలో జాతిపరముగ అంధ్ర శబ్దము కానవచ్చును. అటుపిదప క్రీస్తుశకము నాలుగవ శతాబ్దారంభమునాటి పల్లవరాజుల ప్రాకృత శాసనములలో 'అంధాపథ'మను పేరుతో అంధ్రదేశము పేర్కొనబడినది. పథము, ఆపథము, మార్గము అను పదములు పూర్వము దేశవాచకములుగ ప్రయుక్తములైనవి (చూడు: ప్రాచీన దేశ విభాగములు). క్రీస్తుశక మారవశతాబ్దములో అంధ్ర పదము జనులపరముగా మౌఖరివంశజుల శాసనములలో వాడబడినది. అంధ్రపదము జాతిపరముగ వాడినట్లు తెలుపు శాసనములు చాల కలవు. వీని నన్నిటినిబట్టి చూడగా అంధ్రము మొదట జాతివాచకమని, అంధ్రులు నివసించు దేశము అంధ్రరాష్ట్రమని, అంధ్రాపథమని స్పష్టమగుచున్నది. అంధ్రులకు దక్షిణమున ఉండిన తమిళులు వారిని 'వడుగ' —ఉత్తరాదివారు - అని వాడుటచేత తమిళ శాసనములలో అంధ్రాపథమునకు 'వడుగవఴి' అని ప్రయుక్తమయినది. వఴి (வழி) అనగా మార్గము. అంధ్రాపథమునకు పడమటనున్న కొంత ప్రదేశమును పాలించిన ఒక బాణరాజు తాను అంధ్రమండలములోని ద్వాదశ సహస్ర గ్రామముల కధిపతినని, అంధ్రాపథ పశ్చిమదేశము ('వడుగ వఴి మేఱ్కు')ను పాలించితినని చెప్పుకొనెను. అతడేలినది అంధ్రాపథములోని పండ్రెండువేల గ్రామముల దేశము. పూర్వము దేశవిస్తృతిని తెల్పుటకు గ్రామముల లెక్కను ఇచ్చువారు (చూడు: ప్రాచీన దేశ విభాగములు). బాణు డేలిన రాజ్యము అంధ్రమండలములో ద్వాదశ సహస్ర గ్రామ పరిమితమయినదని దాని యర్థము. సముద్రతీర స్థాంధ్ర దేశమును పరిపాలించిన వెలనాటి దుర్జయులు పండ్రెండవ శతాబ్దమునాటి తమ శాసనమొకదానిలో

"పూర్వాంభోనిధి కాలహస్తిశిఖరి
శ్రీమన్మహేంద్రాచల
శ్రీశైలై ర్వలయీకృతాంధ్రవిషయ" మ్మని

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తాము పాలించిన ఆంధ్రదేశవిభాగమునకు పరిహద్దులు తెలిపినారు. ఈరీతిని పూర్వ మాంధ్రదేశమున ఏ కొంత భాగముననో పరిపాలనము నెరపిన రాజులు తాము పాలించిన దేశము విస్తీర్ణము, హద్దులు తెలుపుచు వచ్చినారు; కాని, మొత్త మంధ్రదేశపు విస్తీర్ణముకాని హద్దులుకాని తెలియవు. అందువలన పూర్వము ఆంధ్రదేశము మొత్తము పరిమితిని కాని, దాని ఎల్లలు కాని తెలిసికొన వీలులేక పోవుచున్నది.

తెలుగు అన్నమాట నిపుడు ఆంధ్రమునకు పర్యాయ పదముగా వాడుచున్నాము. ఆంధ్రపదముతో ఏమాత్రము సాజాత్యములేని తెలుగు దానికి ఎట్లు ఎప్పటినుంచి పర్యాయపదమయ్యెనో తెలియదు. క్రీస్తుశకము పదివందలకు పూర్వపు శాసనములలో కాని, వాఙ్మయములో కాని తెలుగు అనుపదమే కానరాదు. తమిళ కన్నడ శాసనములలోను, ఆంధ్ర కర్ణాట వాఙ్మయములలోను తెలుగు పదము క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దము ఆరంభము నుండియే కనబడును. శాసనములలో 'తెలుంగు భూపాలు'రు, 'తెల్గరమారి', 'తెలింగకులకాల', 'తెలుంగ', 'తెలుంగదమల్ల' మొదలైన పదములు కానవచ్చును. ఈ శాసనములలోకూడ 'తెలుంగ', 'తెలింగ' పదము జనవాచకము లేదా జాతివాచకముగనే కనబడును. ఒక్క శాసనములో మాత్రము 'తెలుంగ నాడొళగణ మాధవియకెఱెయ' అని తెలుగుదేశములోని 'మాధవియకెఱె' అను గ్రామము పేర్కొనబడినది. ఇందు తెలుగునాడు అని తెలుగుదేశ ముదాహృతమైనది. ఆనాటికే ఆంధ్ర తిలింగ లేక తెలింగపదములు ఒకటే జాతిని దేశమును తెలుపుటకు అభేదముగ వాడబడినవి. తెలుగును దేశపరముగాను, జాతిపరముగాను వాడిన శాసనము లింకను ఉండవచ్చును. కాని అవి యన్నియు క్రీ. శ. పదవ శతాబ్దమునకు తరువాతివే కాని అంతకు పూర్వపువికావు. పూర్వోక్తోదాహరణముల ననుసరించి చూడగా తెలుగు రూపమే - అది తెలుంగు కానీ, తెలింగ కానీ - మొదటిది. పదునొకండవ శతాబ్ద మధ్యకాలమున పూర్వ చాళుక్య రాజరాజ నరేంద్రుని ఆస్థానమున నుండిన నన్నయభట్టారకుని నాటికి తెలుగు రూపాంతరముగా తెనుగు వచ్చినది. పదునాలుగవ శతాబ్దమునకు పూర్వమం దుండిన నన్నయ నన్నెచోడులు తెనుగును భాషాపరముగా వాడియున్నారు. పదుమూడవ శతాబ్దములోని మహమ్మదీయ చరిత్రకారులు ఈ దేశమును తిలింగ్ (తిలింగ) అని వ్యవహరించిరి. ఈ విధమున తిలింగ, తెలుంగు, తెలింగ పదములు దేశమును భాషను జాతిని సూచించు ఆంధ్రమునకు పర్యాయపదము లైనవి.

తెలుగు, తెనుగు పదముల వ్యుత్పత్తి ఎట్టిది, అవి ఎందుండి పుట్టినవి అను విషయము గొప్ప వాదోపవాదములకు కారణమైనది. క్రీస్తుశకము పదునాలుగవ శతాబ్దము మొదటి పాదములో ఓరుగంటి కాకతి ప్రతాపరుద్రుని ఆస్థానమునం దుండిన విద్యానాథకవి తన ప్రతాపరుద్రీయములో ఈదేశమును తిలింగ, తెలుంగ, తెలింగ అని కాక 'త్రిలింగ'మని వ్యవహరించి, శ్రీశైల, కాళేశ్వర, దాక్షారామములలోని మూడు శివలింగములవలన ఈదేశమునకు ఆ పేరు కలిగినట్లు

"యైర్దేశ స్త్రిభి రేష యాతి మహతీం ఖ్యాతిం త్రిలింగాఖ్యయా
యేషాం కాకతిరాజకీర్తివిభవైః కైలాస శైలః కృతః
తే దేవాః ప్రసరత్ప్రసాదమధురాః శ్రీశైల కాళేశ్వర
ద్రాక్షారామనివాసినః ప్రతిదినం త్వచ్ఛ్రేయసే జాగ్రతు ॥"

అను శ్లోకములో సూచించియున్నాడు. ఈ శ్లోకము శైవ మతావలంబకుడయిన ప్రతాపరుద్ర చక్రవర్తినిగురించి చెప్పినది. కళింగము మినహాగా ఇప్పటి యాంధ్రదేశమున కంతకు కాకతి ప్రతాపరుద్ర చక్రవర్తి ప్రభువగుటచేత శివక్షేత్రములైన శ్రీశైల కాళేశ్వర దాక్షారామములను ఉజ్జాయింపుగా ఎల్లలుగా చెప్పి ఆ క్షేత్రములలోని శివలింగములవలననే ఈ దేశమునకు త్రిలింగమను పేరు కలిగినట్లు కవి చమత్కరించినాడు. అంతియేకాని అంతకు పూర్వ మీదేశమునకు త్రిలింగమనుపేరు ఉండినట్లు వాఙ్మయములో కాని, శాసనములలో కాని ఎందును కానరాదు. కాకతి రాజన్యులు శైవులని, వారు పాలించిన కాలములో ఆంధ్రదేశములోని ప్రధాన మతము శైవమేయని మన మీ సందర్భమున జ్ఞాపకముంచుకొనవలసియున్నది. దీనిని బట్టి ఆంధ్ర దేశమునకు త్రిలింగ మనుపేరు శైవము ముమ్మరముగా వ్యాపించిన కాలమునందే వచ్చిన దనుట స్పష్టము. కాకతిప్రతాపరుద్ర రాజ్యవిస్తృతిని చమత్కారముగ నిరూపించి 'తెలుగు'కు సార్థక్యము కల్పించుటకే త్రిలింగ పదము వాడబడినది. కాని, కొంద రనుకొనునట్లు త్రిలింగ పదము ప్రాచీనమును కాదు; తెలుగు త్రిలింగ, త్రికళింగ పదములనుండి కాని, తెనుగు త్రినగమునుండి కాని రాను లేదు. త్రిలింగమని ఒకమారు వ్యవహారములోనికి వచ్చిన పిదప అది ఉచ్చరించుటకు గంభీరముగను, 'తెలుగు' వ్యుత్పత్తికి అనుకూలముగను ఉండుటచేత భాషలో నిలిచి పోయినది. 'తెలుగు'కు వ్యుత్పత్తి చెప్పుటలో విద్యానాథుడు

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చెప్పిన విషయమునే అతనికి తరువాతికాలపు తెలుగు లక్షణవేత్తలు ఉటంకించినారు. వీరిలో ప్రథముడు పదునైదవ శతాబ్దము పూర్వార్ధమునం దుండిన విన్నకోట పెద్దన. ఇతడు తన కావ్యాలంకార చూడామణిలో

ధర శ్రీ పర్వత కాళే
శ్వర దాక్షారామ సంజ్ఞ వఱలు త్రిలింగా
కర మగుట నంధ్రదేశం
బరుదారఁ ద్రిలింగదేశ మనఁ జనుఁ గృతులన్.
'తత్త్రిలింగపదము తద్భవం బగుటచేఁ
దెలుఁగుదేశ మనఁగఁ దేటపడియె
వెనుకఁ దెనుఁగుదేశమును నంధ్రు కొంద'

రని చెప్పినాడు. దీనినే క్రీస్తు శకము 17వ శతాబ్దములో ఉండిన అప్పకవి అనువదించినాడు. పాల్కురికి సోమనాథుడు ఈ దేశమును 'సవలక్ష తెలుంగు', అనగా సవలక్ష గ్రామపరిమితమైన తెలుగుదేశము అని తన పండితారాధ్య చరిత్రలో నుడివియున్నాడు. అప్పటి మహమ్మదీయ చరిత్రకారులైన ఈసామీకూడ 'సౌలక్ తిలింగ్' అని చెప్పినాడు. పదునాలుగవ శతాబ్దము పూర్వార్ధమునాటి శాసనములలో ఇది 'తిలింగ' దేశమని, 'తైలింగ ధరణితల' మని వ్యవహరింపబడినది. పైని చెప్పిన శతాబ్దమునాటి ఒక శాసనము త్రిలింగదేశము నీ విధమున నిరూపించుచున్నది.

"పశ్చా త్పురస్తా దపి యస్య దేశా
ఖ్యాతౌ మహారాష్ట్రకలింగ సంజ్ఞౌ;
అవా గుదక్ పాండ్యక కాన్యకుబ్జౌ
దేశ స్స తత్రాస్తి త్రిలింగనామా."

ఈ రీతిని తెలుగు దేశమున కంతకును ఒకరీతిగా ఎల్లలు తెలుపబడినవి.

తెలుగు ఆంధ్రమునకు పర్యాయపదమైనది. తెలుగునకు వ్యుత్పత్తి కాని, ఆపదము తొలుదొల్త జాతివాచకమో, భాషావాచకమో కాని తెలియదు. జాతివాచకము కాని భాషావాచకము కాని అగుచో ఆదిమకాలములో ఆంధ్రులు తెలుగువారు ఒక్క రగుదో కాదో, ఈ రెండు పదములు ఎట్లు పర్యాయపదములయినవో ఇవి భావిపరిశోధనవలన తేలవలసిన విషయములు. వీనినిగురించి ఎట్టి చర్చలు చేసినను అవి ఊహాజనితములే కాని నిరూఢప్రమాణ నిబద్ధములు కావు. నన్నయ భట్టారకుని నాటినుండి తెలుగు ఆంధ్రములు ఒకదాని కొకటి పర్యాయపదములయినవి. నేడు తెలుగువా రన్నను ఆంధ్రు లన్నను, తెలుగుభాష యన్నను ఆంధ్రభాష యన్నను ఒకటే; ఆంధ్రదేశమే ఆంధ్రదేశము. అదియే తెలుగుదేశము. మ. సో. శ.

# భూగోళ ప్రభావము

దేశచరిత్ర చాలవరకు దేశముయొక్క నైసర్గిక స్వరూపమును అనుసరించి యుండును. ప్రకృతి శక్తులను వశపరచుకొని మానవుడు తన జీవితమును చాలవరకు దానికి అనుగుణముగా పరిదిద్దుకొనును. మనుష్యులు నివసించు గృహములును, తిను నాహారమును, కట్టు బట్టలును, తత్సంపాదనార్థము వారు చేయు పనులును వారి యధివాస స్థానముల నైసర్గికస్వరూపమువలన నిర్ణీతమగుచున్నవి. కావున ఏ జనపద చరిత్రనుగాని, ఆ జనపదమునం దభివృద్ధినందు సంస్కృతి విశేషములనుగాని చక్కగ గ్రహింపవలయు నన్న ఆ జనపదముయొక్క భూగోళస్థితి గతులను తెలిసికొనుట యావశ్యకము. ఆంధ్రదేశ చరిత్ర మీదను, అందలి జనులు పెంపొందించిన సంస్కృతిమీదను భూగోళ ప్రభావ మెంతేనియు కలదు. కావున మొదట మనదేశ భూగోళమునుగూర్చి కొంత చెప్పవలసియున్నది.

**తెలుగు దేశము**: ఇది ఉత్తర అక్షాంశము సుమారు $12^{\circ}-41'$ మొదలు $20^{\circ}$ వరకును, తూర్పు రేఖాంశము $77^{\circ}$ మొదలు $84^{\circ}-50'$ వరకును వ్యాపించియున్నది. ఈ దేశము తీరరేఖ మద్రాసునుండి గోపాలపురమువరకును 600 మైళ్ల పొడవున్నది. ఇది దక్కను ద్వీపకల్పపు ఈశాన్య భాగమున నాల్గవవంతు భూభాగము నాక్రమించి సుమారు 1,05,182 చదరపుమైళ్ల వైశాల్యమునకు మించియున్నది. ఉత్తరప్రదేశ్, బొంబాయి, మధ్యప్రదేశ్, రాజస్థాన్ రాష్ట్రములను మినహాయించినచో తెలంగాణా, ఆంధ్ర రాష్ట్రములు కలసిన తెలుగుదేశమే హిందుదేశములోని కెల్ల పెద్ద రాష్ట్రము. ఇందలి తీరపు పల్లపు భూములు మినహాగా మిగిలిన భాగము దక్కను పీఠభూమిలో చేరియున్నది. ఈ పీఠభూమి అంచు అయిన తూర్పుకనుమలు సముద్ర తీరమునకు ఏబదిమొదలు నూరుమైళ్ల దూరములో వ్యాపించియున్నవి. ఈ భూభాగమునకు ఈశాన్యమున ఒరిస్సాయును, ఉత్తరమున మధ్యప్రదేశ్ రాష్ట్రమును, పశ్చిమమున హైదరాబాదు రాష్ట్రమందలి మరాటవాడయును, దక్షిణమున మైసూరు, తమిళ రాష్ట్రములును, తూర్పున బంగాళాఖాతమును సరిహద్దులు. ఈ దేశమునకు ఈశాన్యోత్తర భాగములందు ఓఢ్రభాష, హిందీ, మహా



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



రాష్ట్రములును, పడమట మహారాష్ట్ర, కన్నడ భాషలును, దక్షిణమున కన్నడ, తమిళ భాషలను మాటాడు జనులు కలరు. సరిహద్దు ప్రాంతములలోని తెలుగువారు తెలుగునే కాక సరిహద్దుప్రాంతపు భాషనుకూడ మాటలాడుదురు.

తెలుగుదేశములోని శ్రీకాకుళము విశాఖపట్టణములు, తూర్పు పడమటి గోదావరులు, కృష్ణ గుంటూరు నెల్లూరులు సముద్ర తీరము నానుకొనియున్న జిల్లాలు. వీనిలో నెల్లూరు తక్క మిగిలిన జిల్లాలకు పూర్వము ఉత్తర సర్కారు లని పేరు. తెలుగుదేశములో మూడు ప్రధాన విభాగములు కలవు: (1) సర్కారులు, నెల్లూరుజిల్లా కలిసిన ప్రాంతము; (2) కడప, కర్నూలు, అనంతపురము, చిత్తూరులు కలిసిన రాయలసీమ ప్రాంతము; (3) ఆదిలాబాదు, వరంగల్లు, కరీంనగరు, నిజామాబాదు, మెదకు, హైదరాబాదు, నల గొండ, మహబూబునగరు అను హైదరాబాదులోని ఎనిమిది జిల్లాలు కలిసిన తెలంగాణా ప్రాంతము. హైదరాబాదురాష్ట్రమునందలి రాయచూరు జిల్లాలోని అలంపురము, గద్వాల తాలూకాలును తెలుగు ప్రాంతమే. ఇవి కాక ఒరిస్సా, మధ్యప్రదేశ్, హైదరాబాదు మరాటవాడ, మైసూరు, మదరాసు రాష్ట్రములలోని కొన్ని సరిహద్దు జిల్లాలలో తెలుగు మాతృభాషగా గలవారు నూటికి పదిని మించి యున్నారు.

1953 సంవత్సరము అక్టోబరు మొదటి తేదీని శ్రీకాకుళము, విశాఖపట్టణము, తూర్పుగోదావరి, పడమటి గోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు, కడప, కర్నూలు, చిత్తూరు, అనంతపురము అను పదునొకండు జిల్లాలను మద్రాసు రాజధానినుండి విడదీసి ప్రత్యేకముగ ఆంధ్ర రాష్ట్రము నేర్పాటుచేసిరి. ఇట్లేర్పాటు చేయుటలో బళ్లారి జిల్లాలోని తూర్పు తాలూకాలయిన ఆలూరు ఆదోని రాయదుర్గములలోని మొదటి రెండును కర్నూలు జిల్లాలోను, మూడవది అనంతపురము జిల్లాలోను చేర్చబడినవి.

ఆంధ్రరాష్ట్రము మొత్తము వైశాల్యము 63,608 చదరపుమైళ్లు. అందలి మొత్తము జనసంఖ్య 2,05,07,801 (1951). హైదరాబాదు రాష్ట్రములోని తెలంగాణా జిల్లాల మొత్తము వైశాల్యము రాయచూరు జిల్లాలోని అలంపురము, గద్వాల తాలూకాలతో కూడ 41,524 చదరపు మైళ్లు; అందలి మొత్తము జనసంఖ్య 1,08,03,120.

**పర్వతములు, పీఠభూములు:** తెలుగుదేశము నందలి ముఖ్య పర్వతపంక్తి తూర్పు కనుమలు. ఇవి పడమటి కనుమలంత ఎత్తయినవి కావు. ఇది అంత అఖండమైన శ్రేణియును కాదు. ఈ కనుమలు ఒరిస్సా రాష్ట్రపు సరిహద్దున మొదలిడి తీరమునకు సమాంతరముగ సుమారు 50 మైళ్ల దూరములో నైరృతి దిక్కుగా కృష్ణానది సమీపమువరకు వ్యాపించి, పిమ్మట మరల దక్షిణ దిక్కుగా తిరిగి మైసూరు పీఠభూమి, చిత్తూరు జిల్లా సరిహద్దులవరకు వ్యాపించి అటనుండి నైరృతి దిక్కునకు మరలి నీలగిరి పర్వతములలో కలియుచున్నవి. వీనికి వేరువేరు జిల్లాలలో వేరువేరు పేర్లు కలవు. ఇందలి ఉత్తరభాగము ఎత్తైన శిఖరములు, నదులుపారు లోయలు దట్టమైన అరణ్యములు, విశాలమైన పీఠభూములు - వీనితో గూడి, ఆదిమవాసుల కునికిపట్టయి, ఛోటా నాగపూరు పీఠభూమితో పోల్చదగియున్నది. ఇది సుమారు 3,000 ల అడుగుల ఎత్తైన పీఠభూమి. మందసాకు సమీపమున మహేంద్రగిరి యున్నది. దీని ఎత్తు 4,919 అడుగులు. గాలికొండలు మిక్కిలి ఎత్తైనవి. వీనిలో నొక శిఖరము 5,996 అడుగుల ఎత్తుగలది. విశాఖపట్టణము జిల్లాలో ముఖ్యమైనవి పాలకొండలు, నిమగిరి కొండలు, అనంతగిరి కొండలు మొదలగునవి. అరకు లోయ సమీపమున ప్రకృతి దృశ్యము బహు రమణీయము. తూర్పు కనుమలను భేదించుకొనియే గోదావరి, కృష్ణ, పెన్నానదులు తమ లోయలను నిర్మించుకొన్నవి. తూర్పు, పడమటి జిల్లాల మధ్యను ప్రవహించు గోదావరినదికి ఇరుప్రక్కల కొంత మేర పాపికొండలు కలవు. కోటగోడలవలె నుండు పాపికొండల మధ్య ప్రవహించు గోదావరి పరిసర ప్రకృతి దృశ్యము అత్యద్భుతముగ నుండును. ఈ పాపికొండలలో దుంకొండ 4,214 అడుగుల ఎత్తు. దట్టమైన అడవులతోకూడిన ఈపర్వత ప్రాంతమును మన్యపుప్రాంతమని, ఏజెన్సీ భూములని అందురు. బెజవాడకు సమీపమున కనకదుర్గ, సీతానగరము కొండలు కలవు. కృష్ణకు దక్షిణముగా నల్లమల పంక్తులు వ్యాపించినవి. ఇవి 2,000 అడుగులు మొదలు 3,000 అడుగులవరకు ఎత్తుగలవి. ఈకొండలమీద మిక్కిలి సుందరమైనవని పేరుపొందిన అరణ్యములు కలవు. ఈ కొండలలో ప్రసిద్ధ పుణ్యక్షేత్రములు - శ్రీశైలము, అహోబలము - కలవు. మంత్రాలకనుమ, నంది కనుమలు ఈ కొండలలోని ముఖ్యమైన త్రోవలు. కొండలగుండ పోవు త్రోవలకు కనుమలని పేరు. బెజవాడనుండి గుంతకల్లుకు పోవు రైలుమార్గము నందికనుమగుండ వేయబడినది. గుంటూరుజిల్లా పల్నాడు తాలూకా కొండలమయము. ఈజిల్లాయందు గనికొండ, నాగార్జునునికొండ, బెల్లంకొండ, కొండవీడు, ఉండవల్లి, కోటప్పకొండ, మంగళగిరి, వినుకొండ, చీమకుర్తి కొండలు కలవు. నల్లమలలకు పశ్చిమమున ఎర్రమలలు కలవు. ఈ రెండుశ్రేణులమధ్య నిడుదయైన లోయ యేర్పడినది. దీనిని నంద్యాలలోయ

http://sanskritcentral.com/

http://teluguthesis.com/





చిత్రము 1 గండికోటవద్ద పెన్నానది



చిత్రము 2 శ్రీశైలమువద్ద కృష్ణానది

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



యందురు. తుంగభద్ర, పెన్న నదులను కలుపు కర్నూలు-కడపకాలువ ఈ లోయగుండా త్రవ్వబడినది. నల్లమలలకు తూర్పున సమాంతరముగ వెలిగొండలు కలవు. చిత్తూరుజిల్లాలో నగరికొండలు కలవు. కర్నూలుకు పడమటను, కడపకు దక్షిణమునను వ్యాప్తమైన పీఠభూమియొక్క యెత్తు పోను పోను క్రమముగా హెచ్చుచుండును. దీనినే మైసూరు పీఠభూమి యందురు. కడప జిల్లాలోని పాలకొండల, వెలిగొండల మధ్యగా మద్రాసు నుండి బొంబాయికి పోవు రైలుమార్గము వేయబడినది. చిత్తూరు జిల్లాలో తూర్పుననున్న పుణ్యక్షేత్రమగు తిరుపతి శేషాచలముకొండలపై నున్నది. అనంతపురముజిల్లా యందలి గుత్తి పర్వతదుర్గము. ఈ జిల్లాయందలి లేపాక్షి పెనుగొండలుకూడ చారిత్రక ప్రసిద్ధికల స్థలములు. పెనుగొండ తాలూకాయందలి మిక్కిలి ఎత్తైన స్థలము బెంగుళూరువలె మూడువేల అడుగుల ఎత్తుకు పైగా ఉన్నది. బళ్లారి జిల్లాలోని కంపిలికొండలు చారిత్రాత్మకమైన హంపి విజయనగరమునకు కోటగోడవలె పర్వడి అర్ధచంద్రాకారముగ వ్యాపించియున్నవి. తెలంగాణాలో సాత్మల అను నామాంతరముగల సహ్యాద్రి పర్వతపంక్తి తూర్పుతెలంగాణాలో నారంభమై మరాటవాడలోని పర్భని జిల్లాగుండా వ్యాపించి అజంటావరకు పోవును. తెలంగాణాలోని వరంగల్లు జిల్లానుండి వాయవ్యదిశగ ఆదిలాబాదు జిల్లాగుండ వ్యాపించు చిన్న గుట్టలు కలవు. వీనికి కందికల్లు గుట్టలని పేరు. దక్కను పీఠభూమి నడిమధ్యమున బాలాఘాటు పర్వతపంక్తి కొనను హైదరాబాదు నగరము నిర్మితమైనది. అది సముద్రపు మట్టమునకు 1,690 అడుగుల యెత్తుననుండి సమశీతలమును, ఆరోగ్యప్రదమునైన వాతావరణములో నొప్పుచున్నది. హైదరాబాదునకు సమీపముననే చారిత్రాత్మకమైన గోలకొండ కోట శిథిలములు కలవు. తెలంగాణా వరంగల్లు జిల్లాలోని వరంగల్లు నగరమును, దానికి సమీపముననే దేవాలయ వాస్తుకళకు ప్రసిద్ధికెక్కిన హనుమకొండయును సముద్రపు మట్టమునకు 871 అడుగుల ఎత్తున ఉన్నవి. గోదావరినదికి ఉత్తరముగానున్న ప్రాణహిత లోయ తక్క మిగిలిన ఆంధ్ర భూభాగమును బస్తరు పీఠభూమి యందురు. ఈ పీఠభూమి పర్వతములు, నదుల లోయలు, దట్టమైన అరణ్యములు గలిగి, ఆదిమనివాసులగు మరియా గోండులకును నాగరికతా సంపర్కములేని జన సముదాయమునకును స్థావరమై యొక భూగోళ ప్రదర్శనశాలగా చెన్నబడుచున్నది. బస్తరులోని జగదళపురము సముద్రపు మట్టమునకు 1,850 అడుగుల ఎత్తున నున్నది.

**పల్లపు ప్రదేశములు (మైదానములు)** : సముద్రపు మట్టమునకు 500 అడుగుల ఎత్తుకు మించని భూములను పల్లపు మైదానము లందురు. ఇవి ముఖ్యముగా తీరము పొడుగున 50 మొదలు 100 మైళ్ల వెడల్పున వ్యాపించియున్నవి. గోదావరీ కృష్ణా పెన్నానదుల ముఖద్వారముల వద్ద నేల ఎత్తుపల్లములు లేని విశాలమైన సమతల ప్రదేశము. ఇది నదీ ప్రవాహమున కొట్టుకొని వచ్చు వండలి మట్టిచేత నేర్పడుట వలన చాల సారవంతమైనది. దీనిని డెల్టాభూమి యందురు. ముఖద్వారములవద్ద ప్రవాహవేగము మందగించుటచేత ఈ నదులు ఏకోన్ముఖములుగాక పాయలుగా చీలి డెల్టాభూమిని భేదించుకొని వేర్వేరుస్థలములందు సాగరమును సంగమించుచున్నవి. కృష్ణా గోదావరీ నదీ మధ్యములందు అచ్చటచ్చటను, ముఖద్వారములందును లంక లేర్పడి పూర్వము వర్తకస్థానములుగను, జలదుర్గములుగను ప్రసిద్ధికెక్కినవి. పెన్ననది డెల్టాకూడ సారవంతమై చిరకాలము నుండియు వరిపంటకు వాసికెక్కినది. గోదావరియు, దాని యుపనదులయిన ప్రాణహిత, పైన్‌గంగ, వైన్‌గంగ, వరదల మధ్య పళ్లెరమువలె నుండు పల్లపు నల్లరేగడనేల సారవంతమై ప్రత్తి పంట కనుకూలమై యున్నది.

**నదులు** : ఆంధ్రదేశపు నైసర్గిక సంపదలలో నదులు ప్రధానస్థానము నాక్రమించుచున్నవి. అందుచేతనే ఆంధ్రరాష్ట్రమునకు 'నదీరాష్ట్ర' మన్న పేరు తగియున్నది. మొత్తముమీద ఇందు గోదావరి, కృష్ణయను రెండు గొప్ప నదులు, పెన్న, తుంగభద్ర, లాంగుల్య, వంశధార యను నాలుగు మధ్యతరగతి నదులు, బాహుద, శారద, గుండ్లకమ్మ, పాలేరు, మన్నేరు, స్వర్ణముఖ మొదలైనవి సుమారు ముప్పది చిన్ననదులు ప్రవహించుచున్నవి. వీని అన్నిటి మొత్తపు పొడవు 4,000 మైళ్లు. సుమారు 2,80,000 చదరపు మైళ్ల భూభాగములో కురియు వర్షపునీరు వీనిలో పడుచున్నది. ఈ నదులలో సంవత్సరము పొడవున ప్రవహించు నీటి మొత్తము 15 కోట్ల ఎకరపు టడుగులని అంచనా వేయబడినది. మనదేశమున బంగాళా ఖాతములో కలియు నదీ జలముల మొత్తములో ఇది పదునైదు శాతములు. తమిళ రాష్ట్రములో ప్రవహించు నదులజలము మొత్తము రెండుకోట్ల ఎకరపుటడుగులు మాత్రమే. దీనిని బట్టి జలసంపదలో ఆంధ్రరాష్ట్ర మెట్టి యున్నత స్థానమందుండునది స్పష్టమగుచున్నది. ఈ పదునైదుకోట్ల ఎకరపుటడుగుల మొత్తములో బొంబాయి మైసూరు రాష్ట్రములలో నుపయోగించుకొనగల భాగమును మినహాయించిన యెడల సుమారు 11, 12 కోట్ల ఎకరపుటడుగుల జలము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఆంధ్రదేశమందు వినియోగించుకొనుటకు వీలగుచున్నది. ప్రస్తుతము రెండుకోట్ల ఎకరపు టడుగుల జలము మాత్రమే వ్యవసాయమునకై వినియోగింపబడుచున్నది. దీనివలన సాగగుచుండు భూమియొక్క విస్తీర్ణము 28 లక్షల ఎకరములు. తక్కిన జలముమును కూడ వినియోగములోనికి తెచ్చుకొనిన యెడల మరియొకకోటి యెకరములకు నీటి సదుపాయము లభించును; దీనితోపాటు 5 లక్షల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తికూడ సాధ్యము కాగలదు. ఇరువది సంవత్సరములమీద రెండువందలకోట్ల రూపాయల మూలధనమును ఖర్చు పెట్టినయెడల ఇట్టి వినియోగము జరుగగలదు.

ప్రధానములైన నదులలో గోదావరి బొంబాయికి సమీపమున నుండు త్ర్యంబకము (నాసిక) అనుచోట పడమటి కనుమలలో పుట్టి దక్కను కడ్డముగ పూర్వముఖమై ప్రవహించి భద్రాచలమును దాటిన తరువాత తూర్పు కనుమలను భేదించుకొని యచటినుండి యాగ్నేయముగా వచ్చి ధవళేశ్వరమునొద్ద పాయలుగా చీలి బంగాళాఖాతమున కలియుచున్నది. నది పొడుగునను అచ్చటచ్చట పెక్కు ఉపనదులు దీనిలో కలియుచున్నవి. వీనిలో మంజీర, ప్రాణహిత, వర్ధ (వరద), ఇంద్రావతి, శబరి అనునవి ముఖ్యమైనవి. ఈ నదీ మార్గములలో విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి అనుకూలమైన జలపాతములు కొద్దిగా కలవు. తూర్పు కనుమల కెగువను గోదావరి నదీ తీరమున నున్న భద్రాచలము తెలుగుదేశములోని ముఖ్య పుణ్యక్షేత్రములలో ఒకటి. పోలవరము సమీపమున తూర్పు కనుమలను దాటిన పిమ్మట గోదావరీనదీ ప్రవాహము మందగించును. నది వెడల్పు అధికమగును; కొండలలో నది లోతు చాల ఎక్కువ; పోలవరమునకును, దిగువనున్న కొవ్వూరు రాజమహేంద్రవరములకును మధ్య నది నావలు, ఆవిరితో నడుపబడు చిన్నపడవలు మొదలగునవి పోవుట కనుకూలముగ నున్నది; నదీగర్భమందు పెక్కు లంకలు ఏర్పడినవి. ఈ నది పొడుగు సుమారు 900 మైళ్లు.

ఆంధ్రదేశముగుండ ప్రవహించు పెద్ద నదులలో కృష్ణానది రెండవది. పడమటి కనుమలలోని మహాబలేశ్వరము చెంత ఉద్భవించి, బొంబాయి రాష్ట్రములోని సతారా విజాపురపు జిల్లాలగుండ, హైదరాబాదులోని రాయచూరు జిల్లాలోనికి వచ్చి సంగమేశ్వర ప్రాంతమున తెలుగుదేశమున ప్రవేశించి దానిగుండ 280 మైళ్ల దూరము ప్రవహించి సముద్రములో కలియుచున్నది. దీనిలో కలియు ఉపనదులలో భీమ (భీమరథి), తుంగభద్రలు ముఖ్యమైనవి. కృష్ణానది పొడుగు సుమారు 800 మైళ్లు.

పెన్న (పినాకినీ) నది మైసూరు పీఠభూమియందుండు నంది దుర్గమను పర్వతమున పుట్టి కొంతదూరము ఉత్తరముగ వచ్చి అనంతపుర మండలమున ప్రవేశించి తూర్పుముఖమై కడప నెల్లూరు జిల్లాలగుండ ప్రవహించి బంగాళాఖాతములో కలియుచున్నది. చిత్రావతి, పాపఘ్ని, బాహుద అను నదులు పెన్నలో గలియు ఉపనదులలో ముఖ్యమైనవి. ఈ నది పొడుగు సుమారు 400 మైళ్లు.

దేశమునందు నదులు ప్రవహించినంత మాత్రము చేత ప్రజలు సిరిసంపదలతో తులతూగుచుండ జాలరు. ఇట్టిది నదీజలములను వ్యవసాయాదులకు ఉపయోగించుకొనగల నేర్పును వారు సంపాదించినప్పుడే జరుగ గలదు. ఇట్టి నేర్పు ప్రాచీనకాలమునుండి కొంతవరకు మనవారి కుండినట్లు నిదర్శనములు ఉన్నవి. నదులనుండి కాలువలను త్రవ్వి, వాని సహాయమున అచ్చటచ్చట పంటలు పండించుచుండిరి. కాని మొత్తముమీద బావులు, చెరువులు మొదలైన జలాధారముల కుండినంతటి ప్రాధాన్యము వీనికి ఉండినట్లు కనిపించుటలేదు. నదీజలములను వ్యవసాయమునకై ఎక్కువగ నుపయోగించు పద్ధతి ఇటీవలి కాలములో వాడుకలోనికి వచ్చెను. దీనికి 1847-51లో గోదావరినదిపై ధవళేశ్వరమువద్దను, 1852-55లో కృష్ణానదిపై బెజవాడవద్దను, 1854-88లోను 882-88లోను పెన్నానదిపై రెండు ప్రదేశములలోను ఆనకట్టలు కట్టుటతో ఈపద్ధతికి ఎక్కువ ప్రాధాన్యము కలిగెను. కడచిన ఏబది సంవత్సరముల మధ్యను ఇట్టి ప్రాజెక్టులు అనేకము నిర్మింపబడినవి. గోదావరి కాలువలవలన అందలి డెల్టాలో సుమారు పదిలక్షల ఎకరములు, కృష్ణ కాలువలవలన అందలి డెల్టాలో సుమారు తొమ్మిది లక్షల ఎకరముల భూమి సాగుబడియగుచున్నది. ఈ కాలువలు రాకపోకలకుకూడ విరివిగా ఉపయోగపడుచున్నవి. కోస్తా ప్రాంతములో జనసమృద్ధి మెక్కువగ నుండుటకును, పంటలవల్లను వర్తక వ్యాపారములవల్లను ప్రజల ఆదాయము అధికముగ నుండుటకును, ఆంధ్రదేశమందలి కాకినాడ, రాజమహేంద్రవరము, ఏలూరు, విజయవాడ, గుంటూరు, నెల్లూరు మొదలైన గొప్ప పట్టణము లనేకము ఆప్రాంతమందుండుటకును ఈ యానకట్టల నిర్మాణమే ప్రధానకారణము. ప్రాచీనకాలమునందు అనేక ప్రఖ్యాత రాజ్యములు ఈ ప్రాంతమందు వర్ధిల్లుటకుకూడ కొంతవరకు నదులే కారణమని చెప్పవచ్చును. ఈ విధముగా నదులు ప్రవహించు లోయలును, వాని ప్రవాహమూలమున ఏర్పడిన డెల్టాలును సారవంతములై జలసమృద్ధి గలిగి వరి, చెరకు మొదలైన పంటలకును, వివిధ ఫలజాతులకును ఆకరము

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మైనవి కనుక చారిత్రయుగమం దంతటను ఆంధ్రదేశము యొక్క సిరిసంపదలు నదులమీద ఆధారపడి యుండె ననుట అతిశయోక్తి కాదు.

**సరస్సులు:** ఆంధ్రదేశమునందు సహజముగ నేర్పడిన సరస్సులు ముఖ్యమైనవి మూడు కలవు. పులికాటు సరస్సు తీరాంధ్రదేశపు దక్షిణపు కొనను, చిలుక సరస్సు ఉత్తరపు కొనను గలవు. మధ్యభాగమున కృష్ణా గోదావరుల డెల్టాలో వేంగిదేశమున కొల్లేరు అను మంచి నీటి సరస్సు కలదు. కృష్ణా గోదావరుల డెల్టాల మధ్యను పళ్లెరమువలె ఏర్పడిన పల్లపు స్థలములోనికి చాల వాగులనీరు ప్రవహించుటచేత కొల్లేరను ఈ పెద్ద మంచినీటి సరస్సు ఏర్పడినది. ఇది చారిత్రకముగ ప్రసిద్ధి కెక్కినది.

**సముద్రతీరరేఖ:** తెలుగుదేశపు సముద్రతీరరేఖ మద్రాసునుండి కృష్ణా ముఖద్వారము వఱకు ఉత్తరముగాను, పిదప గోపాలపురము వఱకు ఈశాన్యముగాను వంపు తిరిగి దాదాపు 600 మైళ్ల నిడువు గలిగి యున్నది. ఈ తీరరేఖ యొక తిన్నని గీతవలె నుండుటచేత ప్రకృతిసిద్ధములైన నౌకాశ్రయము లేర్పడుట కవకాశము లేకపోయినది. పెద్దపెద్ద పొగయోడల రాకపోకల కలవడిన ఈయాధునిక యుగమునందు అట్టి యోడలు వచ్చి చేరుట కనువైన రేవులు లేవు; కాని చిన్న యోడలు వచ్చి నిలుచుట కనుకూలమైన రేవులు లేకపోలేదు. మొన్న మొన్నటి వఱకును ఇవి మన దేశీయ వాణిజ్యమునకు వెలపులయి సిరిసంపదల కాటపట్టులై యుండినవి. విశాఖపట్టణమువద్ద 'డాల్ఫిన్స్ నోస్' అను కొండ సముద్రములోనికి చొచ్చుకొని యుండుటచేత ఏర్పడిన ప్రకృతిసిద్ధమైన నౌకాశ్రయము ఆధారముగా ఆ రేవుపట్టణము ప్రాముఖ్యమునకు వచ్చి ఆధునిక కాలమున విదేశవాణిజ్య కేంద్రముగా అభివృద్ధినొందుచున్నది.

ఇంతవఱకును ఆంధ్రదేశముయొక్క నైసర్గిక స్వరూపమును భూగోళస్థితులును సంగ్రహముగ వర్ణింపబడినవి. ఇక వాని ప్రభావ మాంధ్రదేశచరిత్రపై ఎట్లు ప్రతిఫలించెనో వివరింపవలసి యున్నది. మొట్టమొదట ఎన్నదగినది ప్రజావ్యాపనము. ఆంధ్రదేశమున ఎప్పుడును జనసాంద్రత ఎల్లభాగములందును ఒక్కతీరున నుండియుండలేదు. అంతర్భాగమునకంటె తీరభూములందే జనసంఖ్య యధికము. దీనికి ప్రధానకారణము భూగోళస్థితి. దేశాంతర్భాగము పీఠభూమి; చాలవరకు కొండలమయము; వర్షపాతము తక్కువ; నేల అంత సారవంతమైనదికాదు, నదుల లోయలందు తప్ప తక్కిన స్థలములు నీటి వసతి చాలక వ్యవసాయమున కనుకూలపడవు. సముద్ర తీరభూములు నదీప్రవాహములందు కొట్టుకొనివచ్చు సారవంతమైన వండలి మట్టిచేత ఏర్పడుటవలనను, జల సమృద్ధి గలుగుటవలనను వ్యవసాయము సాగించుటకు యోగ్యతరములై, అధిక ఫలదాయకములై యున్నవి. కావున ఆదిమ కాలమునుండియు తీరదేశము అధిక జనాకలితమై సిరిసంపదల కిరవై యుండినది. ఈ కారణమువలననే ఆదిమకాలమున ఉత్తరదేశమునుండి వచ్చిన ఆర్యజాతులవారు తీరదేశమునను, సారవంతములైన నదీతీరప్రాంతములందును తమ నిలయముల నేర్పరచుకొనిరి. వారి యొత్తిడికి తాళజాలక తత్పూర్వ మాప్రాంతముల నివసించుచుండిన ద్రావిడాది అనార్య జాతులవారు ఆత్మ సంరక్షణకు వలనైన కొండభూములకు వలస పోయిరి. కావున తీరదేశము ఆర్య సంస్కృతికిని నాగరికతకును ఇరవై వాసికెక్కినది.

మరియు భూమి పడమటినుండి తూర్పునకు పటవాలుగా నుండుటవలన పడమటి కొండలలో పుట్టు నదు లన్నియు పూర్వదిశకు ప్రవహించి, తీరము పొడుగునను పెట్టని గోడవలెనుండు తూరుపు కనుమలను భేదించి మార్గముచేసికొని కోస్తాప్రాంతముగుండ పోయి సముద్రమును సంగమించుచున్నవి. ఈ నదులవెంబడి రాకపోకల కనుకూలములైన మార్గము లేర్పడి వర్తకపు సరకుల రవాణాకు తగిన సౌకర్యము కల్గినది. దేశాంతర్భాగమున ఉత్పత్తియగు పదార్థము లన్నియు సహజముగ తీరదేశమునందలి రేవు పట్టణములకు వచ్చుటచేత అచ్చట వ్యాపారము పెంపొంది సంపదభివృద్ధికి కారణభూతమైనది. ముఖ్యముగా కృష్ణా గోదావరి నదీ ముఖద్వార ప్రాంతములందు ప్రాచీనకాలమున వాణిజ్యసంఘము లేర్పడి నౌకావర్తక వ్యాపారము చేయుచుండినట్లు నిదర్శనము లున్నవి. కావున ఈతీర ప్రాంతములందు ఇతర ప్రాంతములకంటె నాగరికత వర్ధిల్లుట కవకాశము కల్గినది; భారతీయ సంస్కృతి విశిష్టతను పొంది ఆంధ్ర సంస్కృతిగ పరిణామ మొందినది.

సముద్రతటము వంకర టింకరలు లేక కొంచెమించుమించుగ నొక ఋజురేఖవలె నుండినను పూర్వకాలమున అప్పటి యోడలు వచ్చి నిలుచుట కనుకూలములైన రేవులు తీరముపొడుగునను అనేక ముండెడి వని ఇంతకుముందు చెప్పబడినది. ఈ రేవులను పరివేష్టించుకొని పెక్కు రేవుపట్టణము లేర్పడినవి. ఆంధ్రదేశపు రేవు పట్టణములలో ప్రాచీనతమమైనది కృష్ణామండలములోని గూడూరు ('కొడ్డూర'). సాతవాహన యుగమునను, అటు తరువాత కొంతకాలము వఱకును ఇది ఆంధ్రదేశ నౌకావర్తకమునకు ముఖ్యకేంద్రమై యుండెను. కాలక్రమమున కోస్తా పొడుగునను ఇట్టి రేవు పట్టణము లనే



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కము ఏర్పడినవి. గోపాలపురము, కళింగ పట్టణము, భీముని పట్టణము, విశాఖపట్టణము, కోరంగి, కాకినాడ, మచిలీపట్టణము, మోటుపల్లి, క్రొత్తపట్టణము, కృష్ణా పట్టణము, దుగరాజుపట్టణము, పులికాటు వీనిలో ముఖ్య మైనవి. ఇచట పూర్వ ద్వీప దేశములతో ఎగుమతి దిగుమతి వ్యాపారము సాగుచువచ్చినది. విదేశములనుండి వర్త కులు తమ తమ సరకులతోపాటు అచ్చటి విజ్ఞాన సంపదను గూడ తెచ్చువారు. కావున తన్మూలమున తీరదేశవాసు లకు దేశాంతర సంస్కృతులతో సంపర్కము కలిగి వారి పురోభివృద్ధికి హేతువైనది. మరియు ఈ రేవుపట్టణముల నుండియు, తత్పరిసర ప్రదేశములనుండియు ఆంధ్రులు వ్యాపారార్థమును, పరభూములను చూచు కుతూహలము తోను బయలుదేరి సువర్ణ, రమణక, యవద్వీపాదులకు పోయి, అచట వలస లేర్పరచుకొని భారతీయధర్మ సంప్రదాయములను, సంస్కృతిని నెలకొల్పిరి.

భూగోళప్రభావము ఆర్థిక సంస్కృతి పరిస్థితుల మీదనే కాక రాజకీయ చరిత్రమీదను విస్పష్టమై కానవచ్చు చున్నది. ధనధాన్యాది సర్వసంపదలకును ఇరవై సార వంతమైన తీరప్రదేశము సారహీనమైన పర్వత భూయిష్ఠ అంతర్దేశవాసులను, పరిసర రాజ్యప్రజలను ఆకర్షింపగలిగి నది. ఈ కారణమువల్లనే వాకాటకులు, విష్ణుకుండులు, చాళుక్యులు, రాష్ట్రకూటులు, ఉత్కళులు, కాకతీయులు, విజయనగర పాలకులు, బహమనీలు, కుతుబుశాహీలు, మొగలాయీలు మున్నగువారు తీరదేశమునకు ఒకరి వెనుక ఒకరు ఎత్తి వచ్చి దాని నాక్రమించుకొనుచు వచ్చిరి. స్వభావసిద్ధమైన నైసర్గిక సంరక్షణ చాలినంత లేకపోవుట వలన వెలుపలినుండి ఆగంతుకుల రాక నిరాఘాట ముగ సాగుచు వచ్చెను. పడమటి కనుమలవలె తూరుపు కనుమలు అఖండపర్వతశ్రేణియుకాదు; వానిని దాటుట అంత దుష్కరమును కాదు. నదులు ప్రవహించు లోయ లును, కొండకనుమలును వర్తకులకును, దాడిచేయువారికిని మార్గములైనవి. ఇక దక్షిణోత్తర దిశలయందు అట్టి యాటంకములుకూడ లేవు. కావున పల్లమునకు నీరు సహజముగ ప్రవహించునట్లు పరిసర ప్రదేశములనుండి జనులు తీరాంధ్రమున ప్రవేశింప నవకాశము కల్గెను. భిన్న దేశములనుండి వేర్వేరు జాతులవారు తీరాంధ్రమునకు వచ్చి స్థిరముగ నెలకొనుటవలన ఇచటి జనుల సంస్కృతి పలుజాతుల సంస్కృతుల సమ్మేళనమువలన రూపొందినది. తీరాంధ్రమేకాదు, ఆంధ్రదేశ మంతర్భాగముగా గల దక్కను దేశమే ఉత్తర, దక్షిణ సంస్కృతులకు కూడలి.

తూర్పు కనుమల ప్రాంత మంతయు కొండల మయ మగుటచేత రాకపోకలు సులభము కాకపోవుటయేకాక అది ఖండఖండములుగ వేర్పడి స్వాతంత్ర్యాభిమాన పూరితులైన స్థానికనాయకులకు తావలమై ఏక రాజ్య స్థాపనమునకు ప్రతిబంధకమైనది. కావున సుదీర్ఘమైన చారిత్రక కాలమున దేశ మంతయు ఒక్క యేలుబడి క్రిందికి వచ్చినది కాదాచిత్కముగనే. చాల మట్టుకు మన చరిత్ర చిన్నచిన్న రాజ్యముల చరిత్ర యనియే చెప్పవలసి యున్నది. ఒక్కొక కొండ కొమ్మున ఒక చిన్న దొర యొక దుర్గమును నిర్మించుకొని తత్పరిసర ప్రాంతము నేలువాడు. రాజ్యనిర్మాత లందరును ఈ దుర్గాధిపతులను జయించియే తమ యభీష్టమును నెరవేర్చుకొన వలసి యుండిరి. మన దేశమునందలి ప్రఖ్యాత రాజ్యము లన్నియు నిట్టి గిరి దుర్గముల ఆశ్రయ బలమువలన వర్ధిల్లినవే. హనుమకొండ, విజయనగరము, కొండవీడు, రాచకొండ మున్నగు రాజ్యముల చరిత్ర దీనికి తార్కా ణము. మరియు దేశమున శాంతి నిలుకడగా నెలకొనని దినములలో జనుల మాన ప్రాణాదుల సంరక్షణకు గిరి దుర్గములు ప్రాపులగుటవలన వాని చుట్టును పట్టణము లేర్పడినవి. హనుమకొండ, రాచకొండ, కొండవీడు, గుత్తి, చంద్రగిరి, పెనుగొండ, విజయనగరము, ఆనెగొంది, రాయచూరు, గండికోట, ఉదయగిరి మున్నగు పట్టణము లన్నియు నిట్లు ఏర్పడినవే. కొండలు ఇట్లు స్థానిక స్వాతం త్ర్యమునకు దోహద ప్రాయములై ఏకరాజ్యస్థాపన మునకు ప్రతిబంధకములైనను, సాంస్కృతిక దృష్టితో చూచినచో అవి జాత్యైక్యమును పెంపొందించెనని నిరాక్షేపముగా చెప్పవచ్చును. గిరిశృంగనివాసము మన దేవతలకు కరము ప్రియమైనది. ఈ కారణమువలన మన దేశములోని తిరుమల, శ్రీశైలము, కుమారగిరి, అహో బలము, వేదాద్రి, సింహాచలము, యాదగిరి, శ్రీకూర్మము మొదలయిన సుప్రసిద్ధ దేవాలయములును, పుణ్యక్షేత్రము లును అనేకము కొండకొమ్ముల మీదనే కానవచ్చు చున్నవి. ఇవి యాత్రాస్థలములు. ఆంధ్రదేశములోని అష్టాదశజాతుల ప్రజలును ఈ క్షేత్రములను సందర్శించి అచ్చటి దేవతలను సేవింతురు. ఆంధ్రుల జాతీయజీవన ముపై ఈ క్షేత్రాధి దేవతల యొక్కయు, వా రధివసించిన పర్వతముల యొక్కయు ప్రభావము ఎంతయు కలదు. తెలుగునేల నాలుగు చెరగులనుండియు ఈ దేవతలు జనులను తమ యావాసములకు ఆకర్షించి ఆధిభౌతికముగ వారి యందు ఐక్యమును పాదుకొల్పుచున్నారు. రె. సూ. మూ.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/

# తెలుగు ప్రజలు

## జాతులు

మానవకోటిని భాషనుబట్టి, మతమునుబట్టి, సంస్కృతిని బట్టి అనేక వర్గములుగ విభజించుట జరుగుచున్నది. దీనికి భిన్నముగ, శరీరముయొక్క బాహ్య లక్షణములను ఆధారముగ చేసికొని మరియొక విభాగము చేయుట కలదు.

ఆ విధముగ నేర్పడిన విభాగమునకు 'జాతి' అని పేరు. ఒకేవిధమైన బాహ్యలక్షణములుగలవా రందరు ఒకజాతికి చెందినవారు. ఈ లక్షణములలో ప్రధానము లైనవి దేహముయొక్క ఒడ్డు, పొడుగు, దేహచ్ఛాయ, కండ్ల రంగు, వెంట్రుకల స్వభావము, ముక్కుయొక్క ఆకారము, తల యొక్క రూపము - ఇవి కొంతవరకు స్థిరత్వముగలవై, జన్మతః ఒక తరమునుండి ఇంకొక తరమునకు సంక్రమించు లక్షణములని భావింపబడు చున్నవి. వీనినిబట్టి ప్రపంచములో (1) కాకసాయిడ్ లేక శ్వేతజాతి, (2) నీగ్రాయిడ్ లేక నల్లజాతి, (3) మంగోలాయిడ్ లేక పసుపుజాతి అను మూడు జాతు లున్నట్లు శాస్త్రవేత్తలు నిర్ధారణచేసి యున్నారు. వీనిలో కాకసాయిడ జాతివారు ఐరోపా ఆసియా ఖండములలోను, నీగ్రాయిడ్ జాతివారు ఆఫ్రికా ఓషియానియాలలోను, మంగోలాయిడ్ జాతివారు ఆసియా అమెరికాలలోను ఉన్నట్లు చెప్పవచ్చును. పై లక్షణములలో కనిపించు కొన్ని తరతమ భేదములనుబట్టి ఒక్కొక జాతిని ఉపజాతులుగ కూడ విభాగము చేసి యున్నారు.



చిత్రము 1. లంబాడి

భరత ఖండములోని ప్రజలలో చాలభాగము కాకసాయిడ్ జాతికిని, దానికి సంబంధించిన మూడు ఉపజాతులకును చెందినవారు. ఉత్తరభాగములోనివారు నార్డిక్ ఉపజాతికి చెందినవారని చెప్పవచ్చును. వీరు పొడగరులుగను, పొడుగు తలలు, సుస్పష్టముగ కనిపించు పోగ ముక్కు, నల్లనై లేక కొద్దిపాటి గోధుమవర్ణపు వంకరలేని వెంట్రుకలు, ఉజ్జ్వల నేత్రములు, కొంచెము తెల్లని దేహచ్ఛాయ కలవారుగను ఉన్నారు. వీరిలో కొందరు ఉత్తరమునుండి దక్షిణ భాగమునకు వచ్చిరి. తెలంగాణాలోను రాయలసీమయందును ప్రస్తుత ముండు లంబాడీలు ఇట్లు వచ్చినవారి సంతతివారే. కాకసాయిడ్ జాతిలోని రెండవ ఉపజాతి ఆల్పైన్ లేక ఆర్మెనాయిడ్ ఉపజాతి. బంగాళా రాష్ట్రము, మహారాష్ట్రము, గుజరాతు, కర్ణాటక ప్రాంతములలో నివసించు ప్రజలు చాలవరకు ఈ ఉపజాతికి చెందిన వారు. ఆంధ్రదేశములో దీనికి చెందినవారి సంఖ్య చాల తక్కువ. ఎత్తయి, గుండ్రముగ నుండు తలలు, పొట్టిగను వెడల్పుగను ఉండు ముఖము, పొడవై కమాను ఆకారము గలిగి ఉబ్బెత్తుగా నుండు ముక్కులు, వంకరలేని వెంట్రుకలు, కొంత పసిమి తేలిన దేహచ్ఛాయ - వీరిలో కనిపించు లక్షణములు. కాకసాయిడ్ ఉపజాతులలో ప్రధానమైనది మధ్యధరా (మెడిటరేనియన్) ఉపజాతి. దీనికి చెందినవారే ఆంధ్రదేశమందు, అందులో ముఖ్యముగ అభివృద్ధిగాంచిన మైదానపు ప్రాంతములందు ఎక్కువగ నున్నారు. పది వేల సంవత్సరములకు పూర్వమే ఈ యుపజాతివారే భరత ఖండమందంతట ఉండిరి. వీరు పొట్టిగనో లేక మధ్యస్థముగనుండు దేహముకలవారుగనో, ఎత్తయి పొడవైనట్టి కాని లేక మధ్యరకమైనట్టి కాని తలలు, సామాన్యమైన కనుబొమ్మలు, వెడల్పయి, పొట్టిగనుండు ముఖములు, సుస్పష్టముగ కనిపించు మధ్యరకపు ముక్కులు, నల్లనై వంకరలు లేనట్టికాని, లేక, కొద్దిగ తరంగములవలె నుండునట్టికాని వెంట్రుకలు, గోధుమరంగుగల దేహము కలవారుగ నున్నారు. ఆంధ్రదేశములోని బ్రాహ్మణులలోను, విశాఖపట్టణ మండలములోని కాపులలోను ఈలక్షణము లెక్కువగ కనిపించుచున్నవి.

ఆంధ్రదేశములోని తక్కిన ప్రజల జాతి లక్షణములను వివరించు నపుడు దేశమును రెండు ప్రధాన ప్రాంతములుగ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/

విభజింపవచ్చును. ఈ ప్రాంతములలో మొదటిది అడవుల తోను, కొండలతోను కూడిన దక్కను పీఠభూమి; రెండవది గోదావరి కృష్ణా మండలములలోని మన్నెపు (ఏజెన్సీ) ప్రాంతములు. దక్కను పీఠభూమిలోని అరణ్యవాసులు ప్రధానముగ ఆస్ట్రలాయిడ్ ఉపజాతికి సంబంధించినవారు. నల్లమలలోని చెంచువారు వీరిలో ముఖ్యముగ గుర్తించదగియున్నారు. ఈ యుపజాతివారు పొట్టిగ నుండి, ఎత్తయి పొడవైన తలలు, సుస్పష్టమైన కనుబొమలు, వెడల్పయి పొట్టిగ నుండు ముఖములు, కొంచెము ముందుకు వచ్చిన నోరు, చప్పిడిగను వెడల్పుగను ఉండు ముక్కు, గోధుమరంగు దేహచ్ఛాయ, నల్లగను తరంగముల వలె నుండు వెండ్రుకలు గలవారు. మొత్తముమీద, దక్షిణ భారతము లోని ఆదిమనివాసులలో చాల భాగము ఈ యుపజాతికి చెందిన వారే. సముద్ర తీరప్రదేశము లందు మాత్రము మంగోలాయిడ్ జాతికి చెందినవారు కొందరు వీరితో కలిసియున్నారు. ఈ యుపజాతివారందరు క్రమక్రమముగ మధ్యధరా ఉపజాతి వారితో కలిసి పోవుట జరుగుచున్నది. ముఖ్యముగ ఇది దక్షిణ ఆంధ్రములోని సముద్రతీర ప్రాంతములలో నివసించు ఏనాదులలోను, ఎరుకులవారిలోను స్పష్టముగ కనిపించుచున్నది.



చిత్రము 2. కోయ



చిత్రము 3. చెంచు



చిత్రము 4. సవర

మన్నెపు ప్రాంతములందును, ఒరిస్సా, మధ్యప్రదేశ్ రాష్ట్రముల సరిహద్దు ప్రాంతములందును మంగోలాయిడ్ జాతి లక్షణములుగల - (వీరు కొంతవరకు నలుపు జాతి వారితో కలిసిపోయినను) - గదబలు, సవరలు నివసించుచున్నారు. కోయవారు (మధ్యప్రదేశ్‌లోని గోండులవలె) అడవులలోని ఆస్ట్రలాయిడ్ ఉపజాతికిని, మైదానములోని మధ్యధరా ఉపజాతికిని మధ్య(రెండు ఉపజాతుల లక్షణములు కలసిపోయినట్టి)వారని చెప్పవచ్చును.

జాతి విభాగము ఒక విధమైన స్థూలవిభాగమే కాని, పూర్తిగ నిర్దుష్టమైనది కాదు. ఇదికాక, వేలకొలది సంవత్సరములనుండి వివిధ జాతుల వారు ప్రపంచమునందొక ప్రాంతమునుండి తక్కిన ప్రాంతములకు వెళ్లుచు, ఒకరితో నొకరు కలిసిపోవుట సంభవించుచునే యుండెను. ఇందుచేత ఏదేశమందునుకూడ శుద్ధమైన జాతి ఒక్కటికూడ లేదనియే చెప్పవలసియున్నది. జాతిసంకరము దేశములన్నిటియందును జరుగుచు వచ్చెను. అందుచేత ప్రస్తుతము ఆంధ్రదేశములో నుండు ప్రజలుకూడ అనేక జాతుల కలయికచేత ఏర్పడినవారని చెప్పుట యుక్తము. ఈ కలయిక వేలకొలది సంవత్సరముల క్రిందట ప్రారంభమై ఇప్పటివరకు సాగుచునే యున్నది. దీనిమూలమున ఇతర దేశములలోని ప్రజల లక్షణములు కొన్ని భరతఖండములోని ప్రజలలో కనిపించుచున్నవి.

ఒక విధముగ ఆలోచించినయెడల ప్రస్తుతము దేశమందుండు ప్రజలు జాతినిబట్టి మహెంజోదరో, అదిచనల్లూరు సంస్కృతికి చెందిన బహు ప్రాచీనకాలపు జాతికి సంబంధించినవారని యూహింపవచ్చును. సంస్కృతియొక్క పురోభివృద్ధికి వివిధజాతుల కలయికయే ప్రధానహేతువు. ఇతర జాతులతో సంబంధములేనివారు వెనుకబడిపోవుట సంభ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/

పించుచున్నది. మన్నెపు ప్రాంతములందు నివసించువారు వెనుకబడియుండుటకు వారికి ఇతరులతో సంపర్కము లేక పోవుటయే కారణము. కొన్ని జాతులు ఉత్కృష్టము లైనవనియు, కొన్ని నికృష్టములైనవనియు భావించుట పొరపాటు. ఇది పాతబడిపోయిన భావము. సంస్కృతుల యొక్కయు, నాగరికతలయొక్కయు వృద్ధి క్షయములకు జాతిలక్షణములు కారణములు కావు. జాతుల కలయిక యుద్ధముల మూలముననుు, వర్తక వ్యాపారముల మూల మునను జరిగినది. ప్రతి ప్రాచీన నాగరికతలో వివిధ ప్రాంతములలోని నాగరికతల ప్రభావము కనిపించుచున్నది. మిశ్రజాతులు ఏర్పడుట సంస్కృతిక్షయమునకు కారణ మన్న భావమునకు ఎట్టి ఆధారమును లేదు. మానవుల నైతికాభ్యున్నతికి జాతి నిమిత్తము కానేరదు. విద్య, శిక్షణ, సంప్రదాయములు మొదలయినవే దానికి ప్రధాన హేతువులు.

ఆంధ్రదేశములోని ప్రజలు ప్రధానముగ మధ్యధరా ఉపజాతికి సంబంధించినవారు. కాలక్రమమున తక్కిన జాతులవారుకూడ వీరితో కలిసిపోయిరి. ప్రస్తుతము ఆంధ్ర దేశమం దుండువా రాకారణమున మిశ్రజాతివారని చెప్ప దగియున్నారు. సి. జే. జ.

# ముఖ్య మతవర్గములు

తెలుగుదేశములో హిందువులు, ముసల్మానులు, క్రైస్త వులు మొదలైనవారు కలరు. రాజ్యకాంక్షతోనో, ఉదర పోషణనిమిత్తమో, మతప్రచారార్థమో పరదేశముల నుండి వచ్చినమహమ్మదీయులు ఇక్కడ స్థిరనివాస మేర్ప రచుకొని ఆంధ్రదేశీయులైరి. వారు భయనయములను చూపి హిందువు లనేకులను తమ మతములో కలుపుకొనిరి.

కాలక్రమమున దేశాంతరములనుండి వచ్చినవారును, వారి మతములను స్వీకరించిన తెలుగు హిందువులును ఏకమై సమ్మేళనము నొందుటవలన ఆంధ్రదేశములో ఇప్పుడు వర్ధిల్లు మహమ్మదీయ సంఘము ఏర్పడినది.

ముస్లిములు తెలంగాణా ఆంధ్రరాష్ట్రములు కలసిన విశాలాంధ్ర భూభాగములో ఇరువది యెనిమిది లక్షలకు పైబడి ఉన్నారు. శ్రీకాకుళము, హైదరాబాదు జిల్లాల లోనే ఒక్కొక్క జిల్లాలో అయిదేసి లక్షలకు పైగా నున్నారు. తరువాత గుంటూరు, నెల్లూరు, రాయలసీమ జిల్లాలలో వీరిసంఖ్య ఎక్కువ. కడప, కర్నూలు నగర ములు పఠాను నవాబుల ముఖ్యపట్టణము లగుటచేతను, ఈ పఠాను వంశములవారి రాజ్యము రాయలసీమలో చాల భాగ మాక్రమించుటచేతను, రాయలసీమలో ముస్లిము జనసంఖ్య అధికముగ నున్నది. ఈ విధముగానే శ్రీకాకుళము, గుంటూరులు ఆ పేరులుగల సర్కారులకు ముఖ్యనగరము లగుటచేతను, నెల్లూరు తూర్పు ఇండియా వర్తక సంఘమువారి (కుంఫిణీ)పరిపాలనక్రిందికి వచ్చువరకు ముస్లిము గవర్నరు క్రిందనే ఉండుటచేతను ఆ జిల్లాలలో మహమ్మదీయుల సంఖ్య ఎక్కువగా ఉన్నది. విశాఖపట్ట ణము, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణజిల్లాలు, విజయనగరము, పెద్దాపురము, పిఠాపురము, మొగలి తుర్రు, నూజవీడులు, జమీన్‌దారుల వశమునం దుండుట చేత పైనుడివిన జిల్లాలలో ముస్లిముల సంఖ్య చాల తక్కువ. హైదరాబాదు నగరము, గోలకొండ కుతుబు శాహివంశజుల కాలమునుండి, అనగా ఇప్పటికి సుమారు నాలుగువందల సంవత్సరములకుపైగా ముస్లిం ప్రభుత్వ మునకు రాజధానిగా ఉండుటచేత హైదరాబాదు జిల్లాలో ముస్లిములసంఖ్య చాల ఎక్కువ. పదునేడవశతాబ్దము మొదటిదశకము నుండి 1800 ల వరకు ఉత్తరహిందూస్తాన మునకు పశ్చిమమునందున్న అరాబియా, అఫ్‌గానిస్తానము, పారసీకము, ఇరాక్, తుర్కీ మొదలైన దేశములనుండి యెందరో ముస్లిములు వచ్చిరి. వీరిలో అనేకులు వ్యాపార మునకో, ఉద్యోగముల నిమిత్తమో, సైన్యమున చేరు నిమిత్తమో, ఏదో యొక కారణమున కాలక్రమమున దక్కనుదేశమునకు వచ్చి బహమనీ, గోలకొండ, విజా పురము మొదలైన ముస్లిము రాజ్యములలో స్థిరనివాసము లేర్పరచుకొనిరి. వీరికి తోడుగా యుద్ధములలో విజితు లైన వారును, ఇతరులును బలవంతముగాకాని, తమంతట తాముకాని, ఇస్లాము మతమును తీసికొన్న దేశీయులును అనేకు లున్నారు. ముస్లిములు తెలుగుదేశమును జయిం చిన క్రొత్తలో దేశీయు లనేకులను కత్తి చూపి తమ మతములోనికి త్రిప్పుకొనిరి. మొదటి తరగతివారికి విదేశీ ముస్లిములని, రెండవ తరగతివారికి దక్కనీలని పేరు. (చూడు: దక్కనీలు, విదేశీముస్లిములు). దక్కనులో ముస్లిము రాజ్యము స్థాపితమైనప్పటినుండి హిందువులను ఇస్లాముమతములో కలుపుకొనుటకు తీవ్ర ప్రయత్నము జరుగుచునే వచ్చినది. హిందువులలో చాలమంది తమ ఆర్థికపరిస్థితి బాగుపడు ననియో, గొప్ప పదవులు లభించు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వనిరేమో, ఏదో ఒక ఆశతో, ఏదో ఒకవిధమైన లాభమున కాశించి ఇస్లాము మతమును పుచ్చుకొన్నవారు నున్నారు ; ప్రాణాలు కాపాడుకొనుటకు ఇక గత్యంతరము లేక ఇస్లాము మతమును స్వీకరించినవారును ఉన్నారు. మొత్తముమీద ముస్లిము జనసంఖ్యలో ఇస్లాము మతము పుచ్చుకొన్న హిందువులే ఎక్కువ. దూదేకుల సాయబులని వ్యవహరింపబడువారు ఇట్టివారే (చూడు: దూదేకుల సాయబులు). ఇస్లాం మతమును పుచ్చుకొన్న వారిలో ఉన్నత పదవు లలంకరించినవారును ఉన్నారు. కాని అట్టి వారు తెలుగుదేశములో చాల అరుదు (చూడు : కన్ను).

తెలుగుదేశములో మొదటి తడవ ముస్లిము పరిపాలన మంతరించి హిందూరాజ్యము ప్రతిష్ఠితమైన వెనుక ఈ దేశములో స్థిరముగ నిలిచిపోయిన ముస్లిములును, ఇస్లాము మతము పుచ్చుకొన్నవారును పరిస్థితులు మారుటవలన కాలక్రమమున హిందువులతో స్నేహభావముతో వర్తించుటకును, హిందూ రాజన్యుల అధికారమునకు లోబడియుండుటకును నేర్చుకొనిరి. వారి ప్రవర్తనలో కలిగిన మార్పును గమనించి హిందూరాజన్యులు వారిని తమ కొలువులోనికి తీసికొని రాజకార్యములలో నియోగించుచు వచ్చిరి. ఇది విజయనగరము నేలిన మొదటి దేవరాయల కాలమునుండి జరిగినది. విజయనగరాధీశ్వరులు - మొదటి దేవరాయలును, రెండవ దేవరాయలును సాబదిఖాను, భానభాన ఒడయరులను తమకొలువులోనికి తీసికొని జాగీరు లిచ్చి ఆదరించిరి. విజయనగరాధీశ్వరుడైన సదాశివరాయల ప్రధానియు, కార్యకర్తయు అయిన అళియరామరాయలు విజాపురపు సుల్తాను ఇబ్రాహీం ఆదిల్‌షాహ షియా, సున్ని విభేదములవల్ల తనసైన్యమునుండి తొలగించిన షియా సైనికులకు ఆశ్రయమిచ్చి ఆదరించెను ; అంతే కాదు ; వారినిమిత్తము విజయనగరములో నివసించుటకు వారి కొకవాడను ప్రత్యేకించి, అక్కడ వారినిమిత్త మొక మసీదుకూడ కట్టించి ఇచ్చెను. ఇట్లే బహమనీ సుల్తానులు కూడ తెలంగాణాలో తమ రాజ్యము సుప్రతిష్ఠితమైన తరువాత హిందువులను తమ కొలువులోనికి తీసికొని సమర్థులైనవారికి చిన్న యుద్యోగము లిచ్చుచు వచ్చిరి. క్రీస్తుశకము పదునాలుగవ శతాబ్దిమంతమగునాటికి మత విభేదములను పాటింపక హిందువులును, ముస్లిములును కూడ సైనిక ప్రయోజనముల నిమిత్తము ఒకరిసాహాయ్య మొకరు పొందుచువచ్చిరి. ఈ రీతిని శతాబ్దములు గడచినకొలది హిందూ రాజ్యములలోని హిందువులకును ముస్లిములకును, ముస్లిము రాజ్యములలోని ముస్లిములకును హిందువులకును పరస్పరము మైత్రి హెచ్చినది. హిందువులు అరబ్బీ, పారసీ భాషలను, ముస్లిములు తెలుగు, సంస్కృతములను నేర్చుకొనుచుండిరి. ఇంతకంటెను హిందూ ముస్లిము మైత్రి బాగుగా వర్ధిల్లినది కుతుబుశాహి సుల్తానుల కాలములో. గోలకొండ కుతుబుశాహి సుల్తానులు తాము తెలుగుదేశమువార మనియే భావించిరి ; హిందువులకు ప్రధానోద్యోగములను, ఉన్నత పదవులను ఇచ్చిరి ; హిందూశాస్త్ర పండితులను, తెలుగు కవులను ఆదరించి సత్కరించిరి.

హిందూ ముస్లిము మైత్రి ఇంకను దృఢతరమైనది బ్రిటిషు యుగారంభకాలములో. బ్రిటిషువారి అధికారమునకు లోబడి హిందువులును, ముస్లిములును సోదరప్రాయులైరి. ఇరువదియవ శతాబ్దములో ఇటీవల వచ్చిన ఖిలాఫతు పాకిస్తాను ఉద్యమములు ముస్లిములలో కొంచెము మందగించిన మతాభిమానమును కొంతవరకు ఉద్దీప్తము కావించినవి. అయినను అవి హిందూ, ముస్లిము సోదరభావమునకును, స్నేహబంధమునకును అంతగా భంగము కలిగించలేదు. నేటికిని తెలుగుదేశపు గ్రామములలో ఉభయ మతములవారును చాల కలిసి మెలసి వర్తించుచున్నారు.

సంఖ్యనుబట్టి ముస్లిముల తరువాత చెప్పవలసినవారు క్రైస్తవులు. క్రీస్తుశకము పదునారవ శతాబ్దములో 'జెసూయిట్ ఫాదరులు' క్రైస్తవ మతమును వ్యాపింపజేయుటకు దక్షిణ హిందూదేశమునకు వచ్చి తమిళనాడులోని మధురను ప్రధానకేంద్రముగ చేసికొనిరి. క్రైస్తవ మతప్రచారము నిమిత్తమును, వ్యాపనము నిమిత్తమును వచ్చిన మతబోధకులకు మిషనరీలని పేరు. క్రైస్తవ మిషనరీలు కాలక్రమమున ఆంధ్రదేశములో కూడ ప్రచారము కావించిరి. మొదట వచ్చిన క్రైస్తవులు 'జెసూయిట్ ఫాదరులు' గనుక 'క్రిస్టియన్ చర్చి'కి (దేవాలయమునకు) తెలుగులో 'పాదరిగుడి' అని పేరు కలిగినది. 1765 నుండి తెలుగుదేశములో కొంత భాగము కుంఫిణీవారి వశమయినప్పటినుంచి క్రైస్తవమత ప్రచారమధికమయినది. క్రైస్తవ మిషనరీలు మొదట అగ్రవర్ణములవారిని, ముఖ్యముగా బ్రాహ్మణులను, తమ మతమున కలుపుకొనుటకు ప్రయత్నించిరి, కాని అట్టి ప్రయత్నముల వలన ఎక్కువ ఫలితము లేకపోయినది. అటుతరువాత వారు కడజాతుల(మాల మాదిగ)వారిలోను, అనాగరికులైన ఆదివాసులలోను మతప్రచారము కావించి, వారిలో అనేకులను తమ మతమున కలుపుకొనిరి. ఇట్లు క్రైస్తవ మత ప్రవిష్టులైనవారి నిమిత్తము వారు పాఠశాలలు స్థాపించి, ఉచితముగ వారికి చదువు చెప్పించిరి. వారిలో



http://sanskritcentral.com/

http://teluguthesis.com/

వ్యాధిపీడితులైన వారికి ఉచితముగ మందు లిప్పించి వైద్య సాహాయ్యము చేసిరి; చదివి పరీక్షలలో ఉత్తీర్ణులైనవారిని తమ మిషను పక్షమున మతప్రచారకులుగ నియోగించియు, తమ పలుకుబడిని వినియోగించి ప్రభుత్వోద్యోగముల నిప్పించియు వారి అభివృద్ధి కెంతయో పాటుపడిరి. మొట్టమొదట మత ప్రచారము నిమిత్తము బైబిలును తెనిగించి తెలుగువారిలో బైబిలు వాఙ్మయమును వెద చల్లుటకు అచ్చును మనదేశమునకు తీసికొనివచ్చి ముద్రణ యంత్రములను స్థాపించినవారును క్రైస్తవ మిషనరీలే (చూడు: ముద్రణము). దేశములో ఉదారాశయముతో నైననేమి, స్వప్రయోజనము నిమిత్తమయిననేమి, కుంఫిణీ పరిపాలనారంభ కాలమున విద్యావ్యాప్తికి ఎక్కువగా పాటుపడినవారును, మొన్నటి వరకును - పూర్వమంత ఎక్కువగా కాక పోయినను - పాటుపడుచున్నవారును క్రైస్తవ మిషనరీలే. కడజాతులవారిని ఉన్నతస్థితికి తీసికొనివచ్చుటకు క్రైస్తవ మిషనరీలు చాల కృషి కావించిరి. వీరి ప్రయత్నములు తరుచుగా కరవు కాటకములకు గురియైన రాయలసీమలో ఎక్కువగ ఫలించుచు వచ్చినవి. ఈ ప్రయత్నములవల్ల చాలమంది కడజాతులవారు హిందూ మతమును విడిచిపెట్టి క్రైస్తవ మతమును అవలంబించిరి.

క్రైస్తవము పందొమ్మిదవ శతాబ్దము పూర్వార్ధములో ఎక్కువగా వ్యాపింపలేదు; కాని క్రీ. శ. 1850 తరువాతనుండి క్రైస్తవ మతములోని వేరు వేరు సంప్రదాయములకు చెందిన మిషనులు, మిషనరీలు ధనవ్యయమును కాని, కష్టనష్టములను కాని లెక్కచేయక పట్టుదలతో చేసిన మత ప్రచార ప్రయత్నములవలన మతవ్యాపనము క్రమముగా వృద్ధియైనది. క్రైస్తవము పుచ్చుకొన్న దేశీయుల సంఖ్య అత్యధికముగా పెరిగిపోయినది. ఈ విషయము 1871, 1951 సంవత్సరముల జనాభా లెక్కలను పరిశీలించినచో తేటపడగలదు. 1871 సంవత్సరపు జనాభా లెక్కలనుబట్టి అప్పటి గంజాము, విశాఖపట్టణము, గోదావరి, కృష్ణ, నెల్లూరు, కడప, కర్నూలు జిల్లాలలోని మొత్తము క్రైస్తవుల సంఖ్య 29,766. (అప్పటికి కృష్ణజిల్లా కృష్ణ, గుంటూరు జిల్లాలుగను, గోదావరి తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి జిల్లాలుగను విడిపోలేదు). ఈ సందర్భమున బళ్ళారి, గంజాము జిల్లాలు అప్పటివలె ఇప్పుడు పూర్తిగా తెలుగు దేశములో లేవనియు, చిత్తూరు జిల్లా ఆనాటికి ప్రత్యేకముగ ఏర్పడలేదనియు, దానిలో కొంతభాగము అప్పుడు ఉత్తరార్కాడు జిల్లాలో కలసియుండెననియు మనము జ్ఞాపకముంచుకొనవలెను. అందువలన తెలంగాణా మినహాగా 1871 నాటి తెలుగుదేశపు క్రైస్తవ జనాభా సరిగా తేలవలెనన్న బళ్ళారి, గంజాము జిల్లాలలోని క్రైస్తవ జనసంఖ్య చాల తీసివేసి ఉత్తరార్కాడులోనిది కొద్దిగా కలుపవలసియుండును. అందువలన తెలంగాణా మినహాగా తెలుగు దేశములోని క్రైస్తవ జనాభా 1871లో మొత్తము మీద 29,766 కు చాల తక్కువగా ఉండియుండును. అట్టిది 1951 సంవత్సరపు జనాభా లెక్కలనుబట్టి చూచినచో అది నేటి ఆంధ్రరాష్ట్రములో 9,88,872 వరకు పెరిగినది. తెలంగాణాలోని కేవలము ఎనిమిది (ఇప్పుడు తొమ్మిదయినవి) తెలుగు జిల్లాలలోనుగల క్రైస్తవుల జనసంఖ్య 2,17,078. నేడు మొత్తము తెలుగు దేశ మంతటిలోను కలసి 12,05,945 గురు క్రైస్తవు లున్నారు. వీరిలో కొద్దిమందియో అయిరోపియనులును, అమెరికనులును ఉండవచ్చును. అట్టివారి సంఖ్య చాల తక్కువ. మొత్తముమీద క్రైస్తవు లనబడువారిలో ఇంచుమించుగ అందరును పూర్వము క్రైస్తవ మతము పుచ్చుకొన్నవారి సంతతి వారును, ఇటీవల క్రైస్తవమతము పుచ్చుకొన్నవారును.

తెలుగు దేశములో ముస్లిములకంటెను, క్రైస్తవుల కంటెను అధిక సంఖ్యాకులు హిందువులు. వీరిలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులని నాలుగు వర్ణములు కలవు. ఈ నాలుగు వర్ణములలోను చేరని మరియొక కులము ఉన్నది. ఈ కులమువారికి పంచములని, అస్పృశ్యులని, అంటరానివారని, చండాలురని వ్యవహారము. వీరిలో మాలలు, మాదిగలు అని రెండు వర్గములు కలవు. గాంధీమహాత్ముని హరిజనోద్యమము వచ్చిన వెనుక ఈ అస్పృశ్యులకు హరిజనులని పేరు కలిగినది. గాంధీమహాత్ముడు రాజకీయరంగములోనికి దిగిననాటినుండి దేశీయులును, ప్రభుత్వమువారును గూడ అస్పృశ్యతను తొలగించుటకును, హరిజనులకు విద్య చెప్పించి ఆర్థికముగ వారిస్థితిని బాగుపరచి వారి నుద్ధరించుటకును చేయగలిగినదెల్లను చేయుచున్నారు (చూడు: తెలుగుదేశము: హరిజనోద్యమము). వీరు కాక, తెలుగుదేశపు జనులలో కోయలు, చెంచులు, ఏనాదులు, ఎరుకలు మొదలైన ఆటవికులును, ఆదివాసులును కలరు (చూడు: ఆదివాసులు).

బ్రాహ్మణులు వేదములనుబట్టి ఋగ్వేదులు, యజుర్వేదులు, సామవేదులు, అథర్వవేదులు అని నాలుగు తెరగులు. బ్రాహ్మణులలోని ప్రధాన విభాగము లివే. యజుర్వేదులు కృష్ణ యజుర్వేదులని, శుక్ల యజుర్వేదులని రెండు తెరగులు. ప్రథమశాఖ అనబడువారు శుక్ల యజుర్వేదులు. వేదములనుబట్టి ఈ విభాగములు కలిగినను బ్రాహ్మణు లందరును ఒక్కటే. ఋషులనుబట్టి వారికి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



గోత్రములు కలిగినవి. ఒకటే గోత్రముకలవారు నాలుగు వేద విభాగములలోను ఉండవచ్చును. ద్వైత, విశిష్టాద్వైత, అద్వైతాది సిద్ధాంతములను ప్రతిపాదించు మతములవలన మరల బ్రాహ్మణులలో మాధ్వులని, వైష్ణవులని, శైవులని, స్మార్తులని వేరు విభాగములు కలిగినవి. వైష్ణవులలో తెంగల, వడగల అని రెండు విభాగములు కలవు. తెలుగుదేశమునందు తెంగల శాఖవారే అధిక సంఖ్యాకులుగా ఉన్నారు. బ్రాహ్మణులలో శైవమును వ్యాపింపజేసినవారు శ్రీపతి పండితుడు, శివలెంక మంచన పండితుడు, మల్లికార్జున పండితుడు అని ముగ్గురు పండితులు (చూడు: పండిత త్రయము). శైవులైన తెలుగుదేశపు బ్రాహ్మణులలో వాడుకలో నున్నది పండితాచారము. తెలుగు దేశములోని శైవ బ్రాహ్మణాచార్యులకు ఆరాధ్యులని పేరు. శైవులు, వైష్ణవులు, మాధ్వులు కాని వేదవిహిత కర్మాచరణపరాయణులైన తెలుగు బ్రాహ్మణులను స్మార్తు లందురు. స్మృతుల ననుసరించువారు స్మార్తులు. పూర్వకాలమునుండి కేవలము అధ్యయన అధ్యాపనాది షట్కర్మనిరతులైనవారికి వైదికులనియు, రాజకీయోద్యోగములందు నియుక్తులయిన వారికి నియోగు లనియు బ్రాహ్మణులలో మరల రెండు శాఖ లేర్పడినవి. ఈ నియోగి, వైదిక భేదము క్రీస్తుశకము పదుమూడవ శతాబ్దమునుండి ఆరంభమై క్రమముగా దృఢపడినది. ఆరంభములో ఈ రెండు శాఖలవారికిని అంతగా విభేదము పాటింపబడలేదు. కాని, రాను రాను, వైదికులు వైదిక కర్మపరాయణులును, నియోగులు రాజకార్య ప్రవృత్తులును అయినకొలది ఈ శాఖలకు ఎడ మెక్కువయైనది. క్రమముగా నియోగులు కళాపరిపోషకులును, వైదికులు వైదికధర్మ పరిరక్షకులును అయిరి. నియోగులలో వైష్ణవమతానుయాయులును, శైవమతానుయాయులును గూడ ఉన్నారు. పూర్వోక్తములైన విభేదములే కాక దేశ విభాగములవలన కలిగిన మరొకవిధమైన శాఖాభేదములును ఉన్నవి. పూర్వము మనదేశము వేగినాడు, వెలనాడు, పాకనాడు, ములికినాడు మొదలైన నాడులక్రింద విభక్తమయినది (చూడు: దేశవిభాగములు). ఒక్కొక్క నాడులో నివసించు బ్రాహ్మణులు ఆ నాడుపేర వేగినాటివారని, వెలనాటివారని వ్యవహరింపబడుచు వచ్చిరి. తెలుగుదేశములో పూర్వము వందలకొలది నాడు లుండగా నాడు, వెలనాడు, కమ్మనాడు, ములికినాడు, కాసలనాడులవంటి చాల కొద్దినాడులే ఈ శాఖాభేదములకు ఎట్లు కారణము లయ్యెనో, మిగిలిన బహు సంఖ్యాకములైన నాడులవల్ల వివిధశాఖ లేల ఏర్పడలేదో తెలియవచ్చుట లేదు. ఈవిధమైన శాఖాభేదములు ముఖ్యముగా వైదికులలో కానవచ్చును. ఇట్లని పాకనాటి నియోగులు, వెలనాటికి సంబంధించినవారిలో ఆరువేలవారు (షట్సహస్రీయులు) లేకపోలేదు. ఇక్లే తెలింగాణెములోని బ్రాహ్మణులు తెలగాణ్యులు. దేశవిభాగములవలన కలిగిన ఈవిధమైన శాఖాభేదములు చాల పూర్వకాలములో కొన్ని ఇతర కులములలోగూడ ఉండె ననుటకు అవకాశము కలదు. కోమట్లలో కమ్మ కోమట్లని (కమ్మనాటిశాఖ కోమట్లు), విశ్వకర్మకులజులలో కమ్మలని (కమ్మనాటిలోనివారు) ఉండినట్లు శాసనములవలన తెలియుచున్నది. రెడ్లలోకూడ ఇట్టి శాఖా విభేదము కలదు. పంట, పాకనాటి, వెలనాటి, మోటాటి, కర్ణాటి మొదలైన శాఖాభేదములు దేశవిభాగములనుండి పొడమినవే. ఒక్క బ్రాహ్మణులలోను, రెడ్లలోను తక్క దేశవిభాగములవలన కలిగిన ఈ విధమైన శాఖాభేదములు రాను రాను ఇతర కులములలో అంతరించిపోయినవి. బ్రాహ్మణులలో నందవరీకులని మరియొక తెగవారు ఉన్నారు. వీరు ఉత్తుంగ భుజసూనుడయిన నందనచక్రవర్తి ఇచ్చిన నందవరాగ్రహారమును ప్రతిగ్రహించిన బ్రాహ్మణుల సంతతివారు (చూడు: నందన చక్రవర్తి). వీరిలో నియోగులును, వైదికులును కూడ ఉన్నారు.

వీరుకాక తెలుగుదేశములోని బ్రాహ్మణులలో ద్రావిడులని మరియొక తెగవారు ఉన్నారు. వీరందరు ద్రావిడదేశము (తమిళనాడు)నుండి కొన్ని వందల సంవత్సరముల క్రిందట తెలుగుదేశమునకు వచ్చినవారు. ద్రావిడ బ్రాహ్మణులలో బృహచ్చరణము, వడమ మొదలైన శాఖలున్నవి. మరల బృహచ్చరణము వారిలో కండ్రమాణిక్యం, సత్యమంగలం, పళమానేరి, మళైనాడు మొదలైన పెక్కుశాఖలు గలవు. తెలుగుదేశమునకు వచ్చి ద్రావిడులు పూర్వము వేరు వేరు స్థలములలో స్థిరనివాసములు ఏర్పరచుకొన్న కారణమున ఆయాస్థలముల ననుసరించి వారిలో ఆరామ ద్రావిడులని, పేరూరు ద్రావిడులని, ర్యాలి ద్రావిడులని, దిమిలి ద్రావిడులని, పుదూరు ద్రావిడులని, తుమ్మగుంట ద్రావిడులని శాఖా భేదములు కలిగినవి. వీరిలో పుదూరు ద్రావిడులు కండ్రమాణిక్యము వారని, పేరూరు ద్రావిడులు వడమలని, తుమ్మగుంట ద్రావిడులు మళైనాటి వారని చెప్పుదురు. ద్రావిడు లందరిలోను తెలుగుదేశమునకు మొట్టమొదట వచ్చినవారు ఆరామద్రావిడులు. వీరు తెలుగుదేశమునకు వచ్చి రమారమి వేయిసంవత్సరము లయినది. తెలుగుదేశములోని పంచారామములలో మొదట వలస లేర్పరచుకొనుట



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చేత వీరికి ఆరామద్రావిడులను పేరు కలిగినట్లు చెప్పుదురు. వీరు తెలుగుదేశమునకు వచ్చి దశ శతాబ్దములు గడచినందున తమ స్వభాషయగు తమిళమును మరచి ఆంధ్రదేశీయులై తెలుగువారి యాచారములను అవలంబించి తెలుగువారే అయి తెలుగుభాషను పెంపొందించినారు. చిలకమర్తి లక్ష్మీనరసింహకవి, చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి మొదలైన ప్రఖ్యాతాంధ్రకవులు ఆరామద్రావిడులు. అట్లే పుదూరు ద్రావిడులుకూడ తెలుగుభాషకు చాల సేవ చేసి అఖండవిఖ్యాతిని ఆర్జించిరి. వేదము వెంకటరాయశాస్త్రి, వావిళ్ల రామస్వామిశాస్త్రి మొదలైన పండితులు, కవులు పుదూరుద్రావిడులే. ద్రావిడులు తెలుగుదేశమున కొనర్చిన మేలు అపారమయినది.

తెలుగుదేశపు క్షత్రియులలో ఈ విధమైన శాఖాభేదములు కానరావు. తెలుగుదేశములోని క్షత్రియులకు రాచకొలమువారని, రాజులని వ్యవహారము. వీరు వసిష్ఠ, కౌండిన్య, ధనంజయ, కాశ్యప అను నాలుగు గోత్రములకు చెందినవారు. విశాఖపట్టణము, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణాజిల్లాలలో వీరిసంఖ్య యెక్కువ. వీరందరు తాము వరుసగా పరిచ్ఛేది, వర్ణాటక, కోట, కాకతిరాజన్యుల సంతతివారమని చెప్పుకొందురు. వీరిలో కాకతీయులు, కోటవారు, పరిచ్ఛేదులు పూర్వము తెలుగుదేశమున రాజ్యముచేసిన రాజవంశీయులే. కాని, వర్ణాటకులెవ్వరైనది తెలియవచ్చుట లేదు. వీరు వరాట (బరారు) ప్రాంతమునుండి వచ్చిన కార్తవీర్యార్జునుని సంతతివారగు హైహయక్షత్రియులేమో యని తోచును. మాధవవర్మ యను క్షత్రియవీరుని నాయకత్వమున శకవర్షము 614 లో వసిష్ఠ, ధనంజయ, కాశ్యప, కౌండిన్య గోత్రులయిన రాచవారు తెలుగుదేశమునకు వచ్చినట్లు తెలుగుదేశపు క్షత్రియులలో పరంపరంగా వచ్చుచున్న ఒకగాథ కలదు. ఇది ఎంతవరకు సత్యమైనదో విచారించవలసియున్నది. (పూర్వోక్త)మాధవవర్మ విశాఖపట్టణము జిల్లాలోని విజయనగరము రాజధానిగా పాలించిన పూసపాటి వంశజులకు మూలపురుషుడని చెప్పుదురు.

హిందువులలో మూడవవర్ణము వారైన వైశ్యులకు కోమట్లనియు, ఆర్యవైశ్యు లనియు వ్యవహారము కలదు. వైశ్యులలో కళింగకోమట్లని, గౌర (గవర)కోమట్లని, బేరిసెట్లని విభేదములు ఉన్నవి. కళింగదేశము కాణాచిగా కలవారగుటచేత తెలుగుదేశపు వైశ్యులలో కొందరికి కళింగ కోమట్లని పేరు కలిగినది. ప్రస్తుతము వీరు విశాఖపట్టణము జిల్లాలోని చీపురుపల్లి మొదలుకొని ఉత్తరముగ విశాఖపట్టణము, శ్రీకాకుళము జిల్లాలలో ఎక్కువగా ఉన్నారు. ఈ రెండు జిల్లాలలోను ఇటీవల వ్యాపారము నిమిత్తము వెళ్లిన గవరకోమట్లుకూడ కొద్దిమంది గలరు. 1794 సంవత్సరములో గవరకోమట్లకు కళింగకోమట్లకు విశాఖ పట్టణము జిల్లాలోని పద్మనాభ క్షేత్రమువద్ద వివాదము జరిగిన దనియు, అది మొదలుకొని కళింగ కోమట్లు పద్మనాభముకొండ కనబడునంత సమీపమున ఉండరాదని ఒకనియమ మేర్పడిన దనియు చెప్పు ఒక గాథ ఉన్నది. మొత్తముమీద వీరు విశాఖపట్టణము, శ్రీకాకుళము, గంజాము (ఓఢ్రదేశము) జిల్లాలలోనేకాని వీనికి పశ్చిమ దక్షిణములందు ఎక్కువగా కనబడరు. తెలుగుదేశములోని మిగిలిన ప్రాంతములలో గవరకోమట్లు ఎక్కువ. కోమటి యన్న పేరు తెలుగుదేశపు వైశ్యులకే కాని, మరేదేశములోని వైశ్యులకును లేదు. అందువలన దక్షిణహిందూదేశములోకాని, ఉత్తరహిందూదేశములో కాని కోమట్లమని చెప్పుకొనువారు ఎక్కడ నున్నను తెలుగుదేశమునుండి వెళ్లినవా రనియే చెప్పవచ్చును.

ఇక నాలుగవవర్ణమువారిలో అనేకకులములు కలవు. వీనిలో అనేకములు వృత్తులనుబట్టి ఏర్పడినవే. వేరొక కొన్ని మతమునుబట్టి ఏర్పడినవి. కులమునకు గోత్రమని, పేరు. ఈ గోత్రములలో అంతర్గోత్రవివాహములు జరుపునవి కొన్ని ; గోత్రాంతర వివాహములు జరుపునవి కొన్ని. మొత్తము మీద హిందూసంఘములోని వా రందరు వేదవిహితములును, పురాణోక్తములును అయిన కర్మలను జరుపువారే.

హిందూసంఘములోని కులము లన్నియు కలిసి పదునెనిమిది - అష్టాదశ - వర్ణములని ప్రతీతి. ఈ యష్టాదశవర్ణములు ఏవను విషయమున పండితులలో అభిప్రాయభేదము కలదు. ఉన్నతకులమువారు క్రిందికులములలోని కన్యలను వివాహమాడి సంతానము కన్నచో అట్టి సంతానమునకు అనులోమజాతులవారని, క్రిందిజాతులవారు ఉన్నతకులములలోని కన్యలను వివాహము చేసికొని సంతానము కన్నచో అట్టిసంతానమునకు విలోమజాతులవారని ధర్మశాస్త్రవిదులు పేరిడియున్నారు. అట్టి అనులోమజాతులు ఆరు, విలోమజాతులు ఆరు, బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రవర్ణములు నాలుగు, మాల, మాదిగ కులములు రెండు - ఇవన్నియు కలిసి అష్టాదశవర్ణములని కొందరు అందురు. మరికొందరు వేరొకరీతిని చెప్పుదురు. అష్టాదశ వర్ణములనుగూర్చిన జాబితాలు నాలుగైదువరకు కలవు. కాని అవి ఒకదానితో ఒకటి సరిపడవు. వీనిలో ఏది సరియైనదో చెప్పలేము ; కాని హిందూసంఘము అష్టాదశవర్ణసమన్వితమని ప్రసిద్ధము. ప్రతిగ్రామములోను, ప్రతిపురము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



లోను అష్టాదశవర్ణములు ఉన్నను లేకపోయినను వ్యవహారమునకు అవి యన్నియు ఉన్నట్టే లెక్క.

ఇది యిట్లుండగా దక్షిణహిందూ సంఘమువారు కుడిచేతికులమువారని, ఎడమచేతికులమువారని రెండు తెరగులు. కుడిచేతికులములు, ఎడమచేతికులములు అను విభేదము ఈనాటిది కాదు; ఇప్పటికి రమారమి వేయి సంవత్సరముల క్రిందటి నుండి వచ్చుచున్నట్లు శాసనముల వల్ల తెలియవచ్చుచున్నది. కుడిచేతి, ఎడమచేతి కులము లను విభేదము హిందూసంఘమువారిలో ఒక్క దక్షిణ హిందూ దేశమునందే కాని, ఉత్తరహిందూస్తానమున కానరాదు. దక్షిణహిందూ దేశమునందయినను తమిళ, కన్నడ, ఆంధ్ర దేశములలోనే కాని మలయాళ దేశమున లేదు. కుడిచేతి, ఎడమచేతి జాతులకు వలంగై, ఇడంగై జాతులని తమిళములో వ్యవహారము. ఈ కుడి, ఎడమచేతి విభేదములు ఎప్పటినుండి మొదలో, ఎట్లు ఎందులకు వచ్చినవో తెలిసికొనుటకు ఆధారములు లేవు. హిందూసంఘములో ఎడమచేతికులములవారికంటె కుడిచేతికులములవారికి గౌరవమర్యాదలు, పరువు ప్రతిష్ఠలు, హోదా ఎక్కువ. ఈ కుడి ఎడమచేతి విభేదము ముఖ్యముగా వ్యావసాయిక జాతులవారికిని శిల్పులకును, అనగా విశ్వబ్రాహ్మణులకును కలిగినదిగా కన్పట్టును. ఎడమచేతికులములవారికి పంచాణము వారు (పంచాననమువారు - విశ్వబ్రాహ్మణులు) నాయకులు. కుడికులములవారిని ‘ మహానాటివా ’రని, ‘ మానాటివా ’రని అందురు. కుడికులములవారు ప్రధానముగ వ్యావసాయకులు. పెండ్లిండ్లు మొదలైన శుభకార్యావసరములలోను, అశుభకార్యముల సమయముననను తమకు పరంపరగా కాని, రివాజులేని కులమర్యాదలను, సాంఘిక గౌరవ బిరుదములను, వాహనాదికములను ఈ యుభయ కులములలో ఏకులమువారు వాడుక చేసినను, రెండవ కులమువారు అడ్డుపెట్టుచుండిరి. ఈ సందర్భముననే కుడి, యెడమకులములకు తరచుగా కలహములు సంభవించుచుండెడివి. ఇట్టికలహములు హిందూరాజన్యుల పరిపాలనమున చాల తక్కువ. హిందూ ప్రభుత్వము లున్నంత కాలము ‘ మంత్రి మహానాటివారు ’ ఎడమ కులముల వారిని అదుపులో ఉంచుచువచ్చిరి. హిందూప్రభుత్వము అంతరించిన వెనుక ఇట్టి కలహములు అధికమైనవి. ఇటువంటి కలహములు 1786, 1790 సంవత్సరముల నడుమ మద్రాసులోను, తెలుగుదేశములో కుంఫిణీప్రభుత్వ మారంభమయిన క్రొత్తలోను అధికమైనవి. ఇట్టికలహములు సంభవించుటకుగల కారణములు 1842 సంవత్సరము నవంబరు 8 వ తేదీన గుంటూరుజిల్లా మేజస్ట్రీటుకు దాచేపల్లి ఠాణా పోలీసు హెడ్డు వ్రాసిన అర్జీలోని ఈక్రింది వాక్యములవలన మరింత సుబోధమగును.

“ కుడి అనగా మహానాటివారు అనిన్ని ఎడమ అనగ మత్తులో చేరిన కంసాలులు, గొల్లలు, ముతరాచలు, మాదిగలు వగయిరాలు అనిన్ని తెలియవస్తూఉన్నది. ఈ రెండు విధాలవారిలో పెండ్లిండ్లు మొదలైనవాటిలో ఏమేమి కలతలు వుంటూవున్నవోనని విచారించినంతలో మహానాటి కులస్తులలో మాలకులస్తులు గుర్రాన్ని యెక్కి ఊరేగడమునకుమాత్రం కొన్ని గ్రామాదులలో కలతలు ఉన్నట్లున్ను, తతిమ్మాకులాలలో వారి వారి కులాచారం తారతమ్య ప్రకారం గుర్రాలు, పాలకీలు మొదలైనవి ఎక్కి భజంత్రీలు వగయిరా మేళాలతో కూడా పెండ్లిండ్లలో వూరేగడం మొదలయినవి జరిగించుకునేయెడల ఎడమకులస్తులవల్ల ఆటంకమయి ఉన్నట్టున్ను తెలియలేదు. మాలవాండ్లు గుర్రాన్ని యెక్కి ఊరేగినయెడల కొన్నిగ్రామాదులలో హార్షించి ఉన్నట్టున్ను, కొన్నిగ్రామాదులలో ఎడమకులస్తులు మొదలయినవాండ్లు కలతచేస్తూవున్నట్టున్ను తెలుస్తున్నది. ఎడమకులస్తులలో కంసాలులు మొదలైన పంచదాయీలవాండ్లు పెండ్లిండ్లు చేసుకొనేయెడల గుర్రాన్నిఎక్కి వూరేగడమునకు వచ్చిన మేళం బొంద్రాయి, అనగా గ్రామం కట్టేటప్పుడు స్తంభప్రతిష్ఠకాలమప్పుడు పాతబడ్డ రాయిస్తంభందగ్గర నాదార్పకపోయినా మహానాటివారు ఆటంకం చేసి కలత జరిగిస్తూవున్నట్టు తెలియబడుతూవున్నది. గొల్లవాండ్లున్ను గుర్రాన్ని యెక్కి వూరేగేపక్షముకు కలత సంభవిస్తూవున్నట్లు తెలియవస్తూఉన్నది. ఈ యెడమ కులాల్లో చేరిన మాదిగవాండ్లు నాలుగుతట్టులా పట్టుకునే ఉల్లెడ, తెల్లకత్తి, కాలికి గజ్జె కట్టుకుని గ్రామంలోకి వచ్చే పక్షముకు మహానాటివారు ఆటంకము చేయడమున్నూ వుభయులకు కలత జరుగుతూవున్నట్టున్ను తెలుస్తున్నది ” (గద్యచింతామణి, పుటలు 149-151).

తెలుగుదేశములో కుడి, ఎడమ విభేదములు కులమర్యాదల విషయమున ఉభయులకు కలహములు కొంత కాలము క్రిందటివరకు ఉండెడి వనుటకు ఇంకను ఉదాహరణము తీయవచ్చును కాని యది అనవసరము.

మహమ్మదీయ పరిపాలనకాలమున ‘ మంత్రిమహానాటివారు ’ ఎంత జాగ్రత్తగా అయాకులములను హద్దులో ఉంచి కులగౌరవమర్యాదాతిక్రమణము జరుగకుండ కాపాడుటకు ప్రయత్నించినను క్రమక్రమముగా అవి తగ్గుచు వచ్చినవి. బ్రిటీషు ప్రభుత్వము మనదేశములో వేరు తన్ని వర్ధిల్లి అన్నికులములవారిని, అన్నిమతముల వారిని సరిసమానముగ ఆదరించి ప్రభుత్వోద్యోగములు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఇచ్చినకొలదియు, ఇంగ్లీషు విద్య, పాశ్చాత్య నాగరికత మనదేశములో బాగుగా వ్యాపించి దృఢపడిన కొలదియు సాంఘికులలో కులగౌరవమర్యాదల విషయమున పట్టుదలలు, అభిమానములు క్రమముగా నమసిపోయి అన్ని కులములవారు, అన్ని వర్ణములవారు ఒకచేమట్టమునకు వచ్చిరి. సాంఘికముగ కులములకు, కులములకు ఉండిన న్యూనతాధిక్యములును, వర్ణమునకు వర్ణమునకు ఉండిన సాంఘికాచార మతవిభేదములును చాలవరకు అంతరించినవి. నేడు ఇండియన్ యూనియన్ ప్రభుత్వము వారి లక్ష్యము కులరహిత సంఘనిర్మాణ మగుటచేతను, ఈలక్ష్యమునకు అనుగుణముగ శాసనములు చేయబడు చుండుట చేతను ఈవిభేదములు సాధ్యమైనంత శీఘ్రకాలములో అంతరించిపోవుటకు అనువయిన మార్గములు చక్కనగు చున్నవి. మ. సో. శ.

# జీవనవిధానము - కుటుంబ జీవనము

మానవుడు సహజముగ సంఘజీవి. తోడిజనులందరితో కలిసి జీవించుటకు అలవాటు పడినవాడు. సంఘజీవనమునకు కుటుంబము ప్రాతిపదిక. పాశ్చాత్యదేశములలోని కుటుంబ విధానమునకును, ప్రాచ్యదేశములలోని కుటుంబ విధానమునకును - అందు ముఖ్యముగా భారతదేశములోని కుటుంబవిధానమునకును - చాల వ్యత్యాసము కలదు. సమష్టి కుటుంబపద్ధతి భారతదేశమున వాడుకలోనున్న కుటుంబవిధానపు విశిష్టత. భారతీయ సాంఘికజీవన ముఖ్యలక్షణములలో సమష్టి కుటుంబపద్ధతి ఒకటి. ఈ పద్ధతియే భరతఖండములోని అన్ని దేశములలోను వాడుకలో ఉన్నది. ఇది హిందూనాగరికత ప్రారంభమైనప్పటి నుండియు ఇక్కడి పరిస్థితులనుబట్టి వాడుకలోనికి వచ్చినట్లు కాన్పించును. ఒకటే గర్భమున పుట్టిన సోదరు లందరు పెరిగి పెద్దవారై వివాహములు చేసికొన్న పిదప కూడ, పైతృకమైన తమ ఆస్తిని పంచుకొని విడిపోయి విడివిడిగా కాపురములు పెట్టక అందరు కలిసి ఒక్క యింటనే కాపురముండి, ఏకపాకమునే భుజించి, పైతృకమైన తమ ఆస్తిని కలిసి నిర్వాహకము చేసికొనుచు జ్యేష్ఠసోదరునిపై పెత్తనముంచి జీవనము గడపు పద్ధతినే 'సమష్టి కుటుంబ పద్ధతి' యందురు. తండ్రి జీవించియున్నంత కాలము తండ్రిదే పెత్తనము. తల్లిదండ్రులకు ఈ పద్ధతిలో అమిత గౌరవాధికారము లుండును. ఒకయింటి యాడుబిడ్డలు వివాహమయిన పిదప అత్తవారింటికి పోయి, భర్తకు చెందిన సమష్టి కుటుంబములో భాగస్వామిను లగుచుందురు. కుటుంబ వ్యవహారములను సరిదిద్దు జ్యేష్ఠసోదరుడే కుటుంబములోని వారి కందరికి నగల విషయమున కాని, పెండ్లి పేరంటముల విషయమునకాని, బట్టల విషయమున కాని ఏకొదవయు కలుగకుండ చూచు యజమాని. ఇల్లే జ్యేష్ఠసోదరుని భార్య గృహయజమానురాలు. ఇటువంటి సమష్టి కుటుంబము అందలి జనసంఖ్యనుబట్టి చిన్నది కావచ్చును; చాల పెద్దదిగను ఉండవచ్చును. ఒక్కొక్క కుటుంబములో మనుమలే కాక మునిమనుమలును ఉండవచ్చును. సమష్టి కుటుంబములో అప్పుడు జన్మించిన మగ పిల్లవాడైనను ఆస్తిలో భాగస్వామి యగును. సమష్టి కుటుంబపద్ధతి కుటుంబమువారిలో ప్రేమాదిగుణములు పెంపొందించి వారికి ఆయావిషయములలో మంచి శిక్షణ మొసగుటకు తోడ్పడెడిది. కాని, బ్రిటిషు యుగములో పాశ్చాత్యనాగరికతాప్రభావమువలనను ఆంగ్ల విద్యావ్యాసంగమున కలిగిన స్వేచ్ఛా స్వాతంత్ర్యాది భావముల వలనను, ఆధునిక పరిస్థితుల ప్రభావమునను సమష్టి కుటుంబ పద్ధతి క్రమముగా శిథిలత నొందినది. నేడు తెలుగుదేశములో సమష్టి కుటుంబములు సన్నగిలి అరుదయినవి. సోదరులు ఎవరికి వారు విడిపోయి విడివిడిగా జీవించుట ఇతర భారతరాష్ట్రములలో వలెనే, తెలుగు దేశములోను ఆచారమయినది. ఇందువలన బంధు ప్రేమాభిమానములు పూర్వముకంటె తగ్గిపోయినవి. సమష్టి కుటుంబములు వ్యష్టి కుటుంబములుగ మారుటవలన భూసంబంధమైన ఆస్తి క్రమక్రమముగా తునకలై చిన్న పట్టాదారుల సంఖ్య హెచ్చినది.

పురుషుడును, స్త్రీయును వివాహబంధమున భార్యాభర్తలుగ కలిసి పరస్పర శ్రేయస్సునకును, సంఘక్షేమమునకును పాటుపడుచుండిరి. తెలుగువారి వివాహములలో వాడుకలోనున్న విశిష్ట సంప్రదాయము మేనరికము - అనగా సోదరి కుమారునికి సోదరుని కూతురు నిచ్చి పెండ్లి చేయుట. ఈ యాచారమును ఆపస్తంబ బోధాయనులు అంగీకరించిరి; . కాని, ఇతర స్మృతికర్త లంగీకరింపలేదు. తెలుగు దేశములోని బ్రాహ్మణులలో ఇంచుమించుగ అందరును ఆపస్తంబసూత్రులే యగుటచేత మేనరికము విధివిహితమైన ఆచారమే యైనది. సోదరుని కుమారునికి సోదరి కూతురు నిచ్చి పెండ్లిచేయుటను ధర్మశాస్త్రజ్ఞులు అంగీకరింపరు. దీనికి ఎదురు మేనరికమని పేరు. అయినను



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తెలుగుదేశములో ఆధునిక కాలములో ఇట్టి వివాహములును జరుగుచున్నవి కాని అట్టివి అరుదు. చతుర్థ వర్ణములోని కొన్ని గోత్రములవారు తమ తమ గోత్రస్థులతోనే వివాహములు చేసికొందురు; కాని, అన్యగోత్రముల వారితో వివాహములు చేయరు; మరికొందరు అన్యగోత్రములవారితోనేకాని వివాహసంబంధములను చేయరు.

సాధారణముగా ఒక్క కన్యను పెండ్లియాడుటే తెలుగు దేశములో సామాన్యులలో వాడుకలో నుండిన ఆచారము; అట్లని బహుభార్యాత్వము నిషిద్ధము కాదు. పూర్వము ధనవంతులు పెక్కండ్రు స్త్రీలను వివాహమాడువారు. అది మనదేశములో చాల పూర్వకాలమునుండి వాడుకలో నుండిన యాచారము. వివాహము ప్రజాతంతువును కొనసాగించుటకును, అన్వయాభివృద్ధి నిమిత్తమును ఏర్పడినది. కనుక, భార్యకు పురుష సంతానము లేనిచో ఒకటికంటె ఎక్కువమంది భార్యలను కట్టుకొనవచ్చునని స్మృతికర్తలు అంగీకరించి యున్నారు. ఈ విధముగా పూర్వకాలమునుండి బహుభార్యాత్వము అంగీకృతమైనది; కాని, బహుపతిత్వము అంగీకృతము కాలేదు. పురుష సంతానము లేనివారికి మాత్రమే ధర్మశాస్త్రకర్తలు బహుభార్యాత్వమును అంగీకరించినను, వాడుకలో పురుషసంతానము కలవారుకూడ ధనసంపన్నులు, దొరలు, సంస్థానాధిపతులు, మహారాజులు మున్నగువారు పలువురు భార్యలను పెండ్లియాడుట ఆచారమయినది. ఇది హిందూసంఘములోని మొదటి మూడువర్ణములలోను - అందు ముఖ్యముగా బ్రాహ్మణులలోను, క్షత్రియులలోను - ఎక్కువగా నుండెను. పూర్వము రాజ్యమేలిన రాజన్యులలో ఇది మరియు ఎక్కువ. ఉన్నతవర్ణముల వారిని చూచి శూద్రులును ఈ యాచారమును అవలంబించిరి. మహమ్మదీయులలో కూడ ఈ విధమైన ఆచారమున్నది. హిందూరాజన్యులును, నవాబులునుకూడ వివాహమను పేరు పెట్టియో పెట్టకయో వందలకొలది స్త్రీలను చేపట్టి తెచ్చి కేవలము భోగవిలాసము నిమిత్తము తమ యంతఃపురములలో నుంచుకొనుచు వచ్చిరి. బ్రాహ్మణులలో సగోత్ర వివాహములును, సపిండ వివాహములును ధర్మశాస్త్రముల ప్రకారము నిషిద్ధములు; కాని ధర్మశాస్త్రకర్తలు ఉన్నత వర్ణములలోని పురుషుడు తన క్రింది వర్ణములలోని కన్యలను వివాహమాడుట ఒకప్పుడు ఉండినట్లు ఆధారము లున్నను ఏవర్ణములోని పురుషు డా వర్ణములోని కన్యలనే వివాహమాడుట సదాచారముగ భావింతురు. ఉన్నత వర్ణములోని పురుషుడు తన క్రింది వర్ణములోని కన్యను వివాహమాడినచో. దానిని అనులోమ వివాహ మందురు (బ్రాహ్మణుడు : క్షత్రియస్త్రీ; బ్రాహ్మణుడు : వైశ్యస్త్రీ; బ్రాహ్మణుడు : శూద్రస్త్రీ). ఇట్లే క్రిందివర్ణమునకు చెందినపురుషుడు పై వర్ణమునకు చెందిన స్త్రీని వివాహ మాడినచో దానిని ప్రతిలోమ వివాహ మందురు(శూద్రుడు : బ్రాహ్మణస్త్రీ; శూద్రుడు : క్షత్రియస్త్రీ; శూద్రుడు . వైశ్యస్త్రీ). అనులోమ వివాహముల వలన పుట్టిన సంతానమునకు అనులోమ జాతులవారని, ప్రతిలోమ వివాహములవలన పుట్టినవారికి ప్రతిలోమ జాతుల వారని ధర్మశాస్త్రకర్తలు పేరిడిరి. ఇట్టి అనులోమ జాతు లారు, ప్రతిలోమ జాతు లారు - మొత్తము పండ్రెండు. యుద్ధములలో ఓడిపోయిన నృపతులు తమ కూతుండ్రను విజేతల కిచ్చి వారితో సంధి చేసికొనుట కూడ పూర్వపు ఆచారములలో ఒకటి. ఇందుకు దృష్టాంతములు మన చరిత్రలోనే కానవచ్చును.

త్రైవర్ణికులలో బాలికకుకాని బాలునికికాని వివాహము చేయదగిన వయస్సు విషయమున ధర్మశాస్త్రకర్తలలో భిన్నాభిప్రాయము కలదు. మనువు ప్రకారము ముప్పదేండ్ల వయసుగల పురుషుడు పండ్రెండేండ్ల బాలికను పెండ్లాడవలెను. ఇరువదినాలుగేండ్ల వయస్సుకలవాడు ఎనిమిదేండ్ల బాలికను వివాహమాడవలెను. బృహస్పతి స్మృతిప్రకారము ఇరువదియొక్క సంవత్సరముల వయసు గలవాడు ఏడేండ్ల బాలికను వివాహము చేసికొనవలెను. ఇట్లే స్మృతికర్తలలో వివాహోచిత వయస్సు విషయములో మతభేదములు కలవు. కాని, పూర్వము మన దేశములో ఏ స్మృతి అనుసరింపబడుచుండెనో తెలిసికొనుటకు ఆధారములు లేవు. కాని, యాజ్ఞవల్క్య స్మృతిమీద ప్రసిద్ధ వ్యాఖ్యానమయిన విజ్ఞానేశ్వరుని 'మితాక్షర'ను కేతన కవి పద్యరూపమున తెనిగించుటవలన ఆ స్మృతియే తెలుగు దేశములో వాడుకలో ఉండి యుండవలెనని తోచుచున్నది. స్థానికచరిత్రలలో - అరుదుగానే అయినను - యాజ్ఞవల్క్య స్మృతి ప్రస్తావము పై అభిప్రాయమును బలపరుచుచున్నది. యాజ్ఞవల్క్య స్మృతియైనను, మను బృహస్పతి స్మృతుల వలె బాలికల వివాహమునకు యుక్తమయిన వయస్సును ఇదమిత్థమని నిర్ణయించి యుండలేదు. మొత్తముమీద పూర్వకాలములో బాల్యవివాహములే వాడుకలో నుండెననియు, బాలికలకు ఏడు, పదిసంవత్సరముల మధ్యవయసునసే వివాహములు జరుగుచుండెననియు, వధువునకు వరునికి వయస్సులో ఉండు అంతరము ఇప్పుడు జరుగుచున్న వివాహములలో నున్నదానికంటె ఎక్కువగ ఉండెననియు చెప్పవచ్చును. పూర్వకాలములో వధువు పక్షమువారికి వరుని పక్షమువారు ఉంకువ (కన్యాశుల్కము) చెల్లించుట ఆచారముగా నుండెను. ఇటీవలనే బ్రిటిషు యుగమున



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఇంగ్లీషువిద్య వ్యాపించినకొద్దీ, ఆంగ్ల విద్యాధికులకు ప్రభుత్వోద్యోగములు లభించినకొద్దీ, ఉన్నత విద్యలోను, కళాశాల విద్యలోను విద్యార్థులు ఉత్తీర్ణులైనకొద్దియు కన్యాశుల్కాచారము క్రమముగ క్షీణించి వరశుల్కము ఇచ్చుట ప్రబలి దాని పరిమితియు పెంపొందుచు వచ్చినది. భూసంబంధమైన ఆస్తికిని, ధనమునకును ఆశించి తలిదండ్రులు తమ బాలికలను రెండవమారు, మూడవమారు పెండ్లి చేసికొను వృద్ధులకును కట్టబెట్టుట కూడ ఉండెడిది. కాని, క్రమముగా ఇంగ్లీషువిద్య స్త్రీలలోను, పురుషులలోను వ్యాపించినకొలదియు భారతదేశములోనే బాల్య వివాహములు కూడ వనియు, ఈడు వచ్చిన తరువాత కాని బాలికలకు వివాహమొనరించుట కూడదనియు ఆందోళన బయలుదేరినది. ప్రభుత్వవు చట్టముద్వారా బాలికల వివాహోచిత వయః పరిమితిని హెచ్చించుటకు ప్రయత్నములు జరిగినవి. ఈ విధమైన సాంఘిక సంస్కరణములకు పాటుపడినవారు శ్రీ కందుకూరి వీరేశలింగముగారు. వారు ప్రహసనములు, చిన్నచిన్న హాస్య సంవాదరూపకములు, చిన్న నాటికలు వ్రాసి, ఉపన్యాసము లిచ్చి తెలుగుదేశములో గొప్ప సంఘసంస్కరణోద్యమమును లేవదీసిరి. వీరికి విద్యార్థులు అండగా నుండి ఈ యుద్యమము జయప్రదమొనరించుటకు చాల తోడ్పడిరి (చూడు : వీరేశలింగము, కందుకూరి). భారతదేశము మొత్తముమీద జరిగిన ఈ యాందోళనమునకు ఫలితముగా వివాహపు చట్టములలో చాల మార్పులు వచ్చినవి. చట్టము ప్రకారము ఇప్పుడు ఏతంతు వివాహములు మాత్రమే కాక, వర్ణాంతర వివాహములును సమ్మతములైనవి. బాలికలకు వివాహోచితమైన వయస్సు ఇప్పుడు పదునారేండ్లును, బాలురకు ఇరువది యొక్క సంవత్సరములును నిర్ణీతమైనది. భార్య ఉండగా ఇంకను ఇతర కన్యలను పెండ్లియాడుట చట్టము ననుసరించి శిక్షార్హమైనది.

సాధారణముగా పూర్వము వివాహములు అయిదు దినములు మహావైభవముతో జరుగుచుండెడివి. బ్రాహ్మణులలో - అందునను నియోగులలో - ఎంతలేనివాడయినను భోగము మేళములతో అయిదు దినములు వివాహము జరుపనివానికి సంఘమున గౌరవ ప్రపత్తులు తక్కువగ నుండెడివి. తమ శక్తికి మించి దుర్వ్యయమను భావన లేక ఆడంబరముగ వివాహము నైదుదినములు జరుపుట వలనను, వరశుల్కము క్రమక్రమముగ పెరిగిపోవుటవలనను అనేక బ్రాహ్మణ కుటుంబములు, ఒకప్పుడు పచ్చగ నుండినవి, చితికిపోయినవి. సాధారణముగ అన్నియాచారాభ్యాసముల విషయమునందును క్రింది వర్ణములవారు ఉన్నత వర్ణములవారిని అనుకరించుట పరిపాటి యగుటచేత వరశుల్కాచారము క్రింది వర్ణములలోనికిని ప్రాకినది. వివాహాడంబరమును అతిశయించినది. శ్రీ వీరేశలింగోపజ్ఞమైన సంస్కరణోద్యమము వివాహములలో జరుగు దుర్వ్యయమును తగ్గించుటకును, వివాహములలో భోగము మేళములు లేకుండ చేయుటకును వేశ్యాదర్శన నిషేధమునుకూడ తలపెట్టినది. నాటినుండి సంస్కరణోద్యమ ఫలితముగను, ఇతర ఆర్థిక పరిస్థితుల ఫలితముగను క్రమముగా దేశములో వచ్చిన మార్పువలన ఇటీవల వివాహపుతంతు అంతయు ఎక్కడనో ధనికుల, ఆస్తిపరుల యిండ్లలో తక్క ఒక్క దినములోనే పూర్తియగుచు వచ్చుచున్నది. ఇటీవల రిజిస్టర్డ్ వివాహములు, రజస్వలానంతర వివాహములు వచ్చిన తరువాత వివాహోత్సవములలో శోభాడంబరముల నిమిత్తము ఒడ లెరుగక మితిమీరి వ్యయముచేయుట అనుచితమును, అనర్థకమును అను వివేకము సాంఘికులలో కలిగినప్పటినుండి, ఏకదిన వివాహములు తరచైనవి.

వివాహము కాకపూర్వమును వివాహమైన తరువాతను బాలికలచేత నోములు నోమించుట, వ్రతములు చేయించుట తెలుగుదేశములో ఆచారము. ఇట్టి నోములు, వ్రతములు చాల కలవు. సాధారణముగా బాల్యవివాహములే పూర్వము జరుగుచుండుటచేత తెలుగు కన్నెలు నోచు నోములు, వ్రతములు వివాహము అయినప్పటినుండియే ప్రారంభమగుచుండును. వీనిని కన్యకలు ఐదువతనము నిమిత్తమును, ఐశ్వర్యము నిమిత్తమును, సవతిపోరు లేకుండు నిమిత్తమును ముఖ్యముగా నోచుకొనుచు వచ్చినను వీని యాచరణవలన సదభ్యాసములు, ఆస్తికభావములు, దైవభక్తి, పాపభీతి, ధర్మానురక్తి కలిగి బాలికలకు చక్కని శిక్షణము ఏర్పడెడిది. వీనిలో కొన్ని స్త్రీలనేకులు కలిసి నోచుకొనునవి, ఆచరించునవి అగుటచేత ముందు ముందు సమష్టి కుటుంబములో భాగస్వామినియగు బాలికకు పరస్పర సహకారము, ప్రేమ, మైత్రి మొదలగు గుణములకు బీజములను నాటి ఆమెలో ఉత్సాహమును పెంపొందించుచు వచ్చినవి. ఈ నోములలో చాల వానికి పాటలు కలవు. జీవన మంతయు ఆటలతోను, పాటలతోను, నోములతోను, వ్రతములతోను గడచుట వలన స్త్రీలకు ఉల్లాసకరమైన వ్యావృత్తి యేర్పడి జీవనభారము కాని, అత్తింటి కాపురపు క్రొత్తదనము కాని అంతగ కనిపించెడిదికాదు. పాశ్చాత్యనాగరికత దేశములో వ్యాపించిన పిదప, బాలికలు ఉన్నత పాఠశాలలలోను, ప్రభుత్వ కళాశాలలలోను చేరి ఆంగ్ల విద్య నభ్యసించిన పిదప, ఆయా పరీక్షలయం దుత్తీర్ణలయి ప్రభుత్వ కార్యాలయములలో



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కార్యాలయములలోను, కళాశాలలలోను ఉద్యోగములందు నియుక్తులగుచు వచ్చిన తరువాత, మారిపోయిన ఆర్థిక పరిస్థితులవల్లను మగవారిలోవలెనే స్త్రీలలోను సాధారణముగ భగవద్భక్తియు, ఆస్తికతయు సన్నగిలుచు వచ్చుటతో పూర్వపు నోములు వ్రతములు కూడ చాలవరకు కథావశేషములయినవి. ఇంకను వీనిని నోచుకొను స్త్రీలు, అంతగా ఆంగ్లవిద్యాగంధము లేనివారు, ఏ స్వల్పసంఖ్యాకులైనను గ్రామములలో కలరేమో కాని పురములలోను, పెద్ద నగరములలోను కానవచ్చుట అరుదు. ఇప్పటికి ముప్పది నలుబది సంవత్సరముల క్రిందటివరకు శ్రావణమాసములో మంగళవారముల సాయంతనములందు చక్కని రంగురంగుల చీరలు కట్టి, ఒయ్యార మొలికించు నడకలతో గుములు కట్టి పేరంటమునకు పోయి సెనగల వాయనము లందుకొను పేరటాండ్ర దృశ్యములు ఇప్పుడు అరుదుగ కానవచ్చును. తెలుగు సంఘములో అత్యంత శీఘ్రగతిని సంభవించుచున్న మార్పులో నోములు నోచుట, వ్రతములు ఆచరించుట అనునవి, ఇతర ప్రాచీనాచారముల వలెనే ఇక కొంతకాలమునకు, ముచ్చటకు ఉబుసుపోకకు చెప్పికొను గతకాల విశేషములుగ పరిణమింప వచ్చును.

భారతదేశములోని ఇతరప్రాంతములలో వలెనే తెలుగు దేశములోకూడ భార్య గతించిన పిదప భర్త మరల పెండ్లి చేసికొను నాచారము ఉన్నది. కాని భర్తగతించిన పిదప కాపురమునకు వెళ్లనిబాలికయయినను మరల వివాహము చేసికొనుట పూర్వ మాచారవిరుద్ధము. భర్తతో సహగమనము చేయుటయే పూర్వము సదాచారము. ఈసహగమనాచారము తెలుగుదేశమున ఎప్పటినుండి వచ్చినదో తెలియదు. కాని, పదునాల్గవ శతాబ్దమునుండి వచ్చిన తెలుగుప్రబంధములలో కథాసందర్భమునకు ప్రసక్తమయినను కాకున్నను సహగమనవిధివలన సతికి పుణ్యలోకములు కలుగునని దానిప్రసక్తి యుగ్గడింపబడినది. శ్రీనాథవిరచితమైన కాశీఖండములో సహగమనప్రశంస కలదు. సంస్కృత కాశీఖండములో పతివ్రతనుగూర్చిన ప్రశంస యున్నది కాని సహగమన ప్రసక్తి లేదు. అయిన నొక్కటి మాత్రము నిజము. పదునాలుగవ శతాబ్దములో హిందూరాజ్య సముద్ధరణ కాలమునుండి, తెలుగుకవులు ధర్మోపదేశమునకు అవకాశము కలిగినప్పుడును, తమకు ఉచితమని తోచిన చోటను ప్రబంధములలో ఈ యాచారప్రశస్తి నగ్గించి, దాని వలన కలుగు పుణ్యవిశేషమును పెద్దగ వర్ణించుచునే వచ్చిరి. ప్రౌఢకవి మల్లన రుక్మాంగద చరిత్రములో ఈ యాచారము నభినుతించియున్నాడు. పదునాలుగవ శతాబ్దమునకు పూర్వము దక్షిణహిందూదేశమునకు వచ్చిన మార్కో పోలోవంటి విదేశయాత్రికు లీయాచారమును గురించి వ్రాసినట్లు కాన్పింపదు; కాని, పదునాలుగవ శతాబ్దము పూర్వార్ధములో వచ్చిన ఫ్రయర్ ఓడోరిక్, ఫ్రయర్ జోర్డానస్ అను వారును, వారితరువాత వచ్చిన విదేశ యాత్రికులును తాము దర్శించిన సతీసహగమన దృశ్యములను విపులముగా అభివర్ణించి యున్నారు. [illegible] రించి చూడగా మహమ్మదీయదండయాత్రల [illegible] నుండియే ఈయాచారమునకు తెలుగుదేశములో ఎక్కువ ప్రచారము కలిగినట్లును, ఎక్కువగ ఆచరణలోనికి వచ్చినట్లును కనిపించు చున్నది. ఈ విధముగా భర్తతో సహగమనముచేసిన సతులకు, అరుదుగానైననేమి, పేరంటాల గుళ్లను పేర గుళ్లునిర్మితమై ఏటేట పూజాపురస్కారములు, తిరునాళ్లు జరుగుటకూడ కలదు. ఈయాచారము తెలుగు దేశములో వ్యాప్తిలో నుండినను ఏయేవర్ణములవారు దీనిని అవలంబించుచుండిరో, ఏవర్ణములవా రవలంబించినను వారిలో విగత భర్తృక లందరు దీని నవలంబించుచుండిరో లేదో తెలిసికొనుటకు ఆధారములు లేవు. ఇండియాకు గవర్నరుజనరలైన విలియం బెంటింకు ప్రభువు 1880లో క్రూరమును, అమానుషమును అయిన ఈప్రాచీనాచారమును చట్టముద్వారా నిషేధించువరకు మద్రాసు రాజధానిలో ఇది సాగుచునేయుండెను. అటుతరువాత బంగాళ దేశములో ఈశ్వరచంద్ర విద్యాసాగరను గొప్పసంస్కృత విద్వాంసుడు వితంతువివాహసంస్కరణమును ఆరంభించిన పిదప మనదేశములో శ్రీవీరేశలింగముగారు వితంతువివాహములు ధర్మశాస్త్రసమ్మతము లనియు, బాలవితంతువుల స్థితి దుఃఖహేతువై సంఘములో అనేకానర్థములకు కారణమగుచున్న దనియు చెప్పి, బాలవితంతువులకు వివాహములు చేయుటకు అసాధారణకృషి చేసి సఫలీకృత మనోరథుడయ్యెను. ఆయన సంస్కరణోద్యమమును ప్రజలలోని మూఢవిశ్వాసములు దురాచారములు మొదలైనవి నిర్మూలించి సంఘమును సంస్కరించుటకే తలపెట్టినను దాని ప్రధానలక్ష్యము వితంతువివాహాచరణమే. వీరేశలింగము గారి అసాధారణకృషివల్లను, వాగ్వాద ఉపన్యాసనైపుణి వల్లను, రచనలవల్లను వితంతువివాహ సంస్కరణము దేశములో వేరు తన్ని క్రమముగా వర్ధిల్లినది. నేటికికూడ ఈసంస్కరణమున కభిముఖులు కానివారు స్వల్పసంఖ్యాకులు పూర్వాచారపరాయణులలో ఉన్నను దేశము మొత్తముమీద దానిని ఆదరించి అంగీకరించినది. నేడు వితంతు వివాహము లనేకము జరుగుచున్నవి.

గృహస్థులు ఆచరింపవలసిన శరీరసంస్కారములు చాల ఉన్నవి. వానిలో ముఖ్యములయినవి గర్భాధానము,



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పుంసవనము, సీమంతము, జాతకర్మము, నామకరణము, అన్నప్రాశనము, చౌలము, ఉపనయనము, వివాహము, అంత్య కర్మము అనునవి. సాధారణముగా త్రైవర్ణికు లందరు ఆచరించు సంస్కారము లివి.

గృహస్థాశ్రమమును స్వీకరించినవారు చేయవలసిన వ్రతములు, దానములు, ధర్మములు, తీర్థయాత్రా సంసేవనము మొదలైనవి అనేకము. పుణ్యక్షేత్రములను దర్శించుట, పుణ్యతీర్థములలో మునుకలిడి పితృతర్పణాదులు చేయుట, చాల ప్రాచీనకాలమునుండి వచ్చుచుండిన ఆచారములు. భారతదేశములోని పుణ్యక్షేత్రము లన్నిటిని దర్శింపగలిగినను లేకపోయినను ఉత్తరాపథమున గంగాతీరమునందలి కాశిని, దక్షిణదేశమున సముద్రతీరస్థమయిన రామేశ్వరమును సందర్శించుటకైనను పూర్వము గృహస్థు లువ్విళ్లూరుచుండెడివారు. పూర్వము రైళ్లు లేకపోవుట వలన ప్రతియాత్ర కాలినడకనే మజిలీలు చేసికొనుచు, కతిపయప్రయాణములు చేయవలసియుండుటచే కష్టసాధ్యముగ ఉండెడిది. ఈ కారణముననే 'కాశికిపోయినవాడును కాటికి పోయినవాడును సమాన' మను నానుడి కలిగినది. కాశీయాత్ర చాలించి జీవముతో యాత్రికుడు తిరిగి వచ్చునో రాడో యను అనుమానము ఉండెడిది. కాశీకావడితో కాశినుండి తిరిగివచ్చిన యాత్రికుని, ఊరిలోని విద్వజ్జనము ఊరిపొలిమేరవరకు పోయి మేళతాళములతో వేదపారాయణముచేయుచు గృహమునకు తీసికొని వచ్చువారు. తరువాత జరుగునది కాశీ సంతర్పణ. కాశినుండి తీసికొనివచ్చిన గంగను రామేశ్వరమువొద్ద సముద్రములో కలుపుట ఆచారము. అట్లుచేసిన నది పూర్ణయాత్ర. కాశీయాత్ర చేయలేనివారు కంచియాత్ర చేయువారు. కాంచీయాత్రికులుకూడ కంచికి వెళ్ళి దివ్యస్థలమును సేవించి కంచికావడి తీసికొనివచ్చువారు. ఇవి గాక తెలుగుదేశములో శ్రీశైలము, అహోబలము, తిరుమల-తిరుపతి, పంచారామములు మొదలైన పుణ్యక్షేత్రములు చాల కలవు. వీనిలో శ్రీశైల, పంచారామములు శైవక్షేత్రములు; అహోబలము, తిరుపతి వైష్ణవ క్షేత్రములు. నేటికిని వీనిని సందర్శించు యాత్రికులు వేనవేలు. గృహస్థులు చేయవలసిన దాన ధర్మములును, వ్రతములును అనేకము. ఇట్టిదానములను వ్రతములను దేవగిరి యాదవభూపతుల ఆస్థానమున శ్రీకరణాధిపుడుగ నుండిన హేమాద్రిపండితుడు తన చతుర్వర్గచింతామణిలోని దానఖండ వ్రతఖండములలో విశదముగ వర్ణించియున్నాడు. ఇతడు క్రీస్తుశకము పదమూడవ శతాబ్దము ఉత్తరార్ధములో నుండెను. ఇతని గ్రంథము క్రీస్తుశకము పదునాలుగవ శతాబ్దముపూర్వార్ధము నాటికే తెలుగుదేశములో బహుప్రఖ్యాతమై, అందు చెప్పిన దానములు, ధర్మములు, వ్రతములు అనేకము ఆచరణలోనికి వచ్చినవి. దానము లసంఖ్యాకములుగ నున్నను వానిలో ముఖ్యమైనవి మహారాజులు, ధనాఢ్యులు ఆచరింపదగినవి పదునారు. తెలుగుదేశములో పూర్వ మత్యంతప్రసిద్ధినిగన్న దానము అన్నదానము. నిరతాన్నప్రదాతలై తెలుగుదేశములో పూర్వము పేరు గడించిన గృహస్థు లెందరో యుండిరి. ద్వాదశీవ్రత సమాచరణమున కొన్ని కుటుంబములవారికి ద్వాదశివారనికూడ పేరు కలిగినది. తెలుగుదేశములో పూర్వమునుండి ఎక్కువగా వాడుకలో నుండినవి ఏకాదశీ ద్వాదశీ వ్రతాదులు. ఈ వ్రతాదులను ఆచరించు సందర్భమున ఎక్కువగ సంతర్పణలు, సమారాధనలు జరుగుచుండెను. ఇటువంటి వ్రతాదుల ఉత్కృష్టతను వానిని ఆచరించినందువలన గలుగుఫలమును వివరించు నిమిత్తము రుక్మాంగద చరిత్రము, శివరాత్రి మాహాత్మ్యము, సోమవారవ్రతమాహాత్మ్యము మొదలైన కావ్యములు తెలుగులో వచ్చినవి. ఈ వ్రతాదులలో ప్రత్యేకము శైవు లాచరించునవియు, ప్రత్యేకము వైష్ణవు లాచరించునవియు కలవు. స్మార్తు లీరెండురకముల వ్రతములను ఆచరించుట కలదు. శైవులకును, వైష్ణవులకును, తదితరులకును ఆచారములలో చాల వ్యత్యాసము లుండుటయే కాక చిత్రములైన ప్రత్యేకాచారములును కలవు.

మ. సో. శ.

# ఆటలు, వేడుకలు, వినోదములు

ఆంగ్లేయులకు క్రికెట్టు మొదలైన వున్నట్లు తెలుగువారికి ప్రసిద్ధములైన జాతీయ క్రీడలు తక్కువ; లేవన్నను అది సత్యదూరము కాదు. వయసు వచ్చిన యువజను లాడునట్టి ఆట లరుదు. అట్లని ఆటలు మొదలే లేవని కాదు. మన ప్రబంధములలో బాల బాలిక లాడు క్రీడ లనేకము వర్ణితములైనవి. అట్టి వానిలో ఇప్పటికిని చాల క్రీడలు వాడుకలో నున్నవి. సాధారణముగా పూర్వము ఏడెనిమిదేండ్లు పదేండ్లు వచ్చువరకు మనదేశములో బాలురును బాలికలును కలిసియే ఆడుకొనువారు. ఇటీవల బ్రిటిషు యుగములో ఇంగ్లీషువిద్య వ్యాప్తమయిన కొలది, బాల



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



బాలికలు వేరువేరు పాఠశాలలకు పోయి చదువుకొన్న కొద్దీ, పూర్వపు ఆటలమీదను, ఆచారములమీదను అభిరుచి క్రమముగా సన్నగిల్లినది. ఆయాటలు కూడ చాలవరకు ఆట లనిపించక మూలబడినవి. ఇందువలన ప్రబంధములలో వర్ణితములై ఒక శతాబ్దము క్రిందటివరకు వాడుకలో నుండిన ఆటలలో అనేకము ఎట్లాడుదురో ఎవరికిని తెలియదు. మన తెలుగు నిఘంటువులలో ఇట్టివానికి అర్థము వ్రాయవలసి వచ్చినపుడు అట్టి ఒక్కొక యాటకు క్రీడావిశేషమనో, బాలక్రీడా విశేషమనో వ్రాయుటయే పరిపాటి; కాని దానిని వర్ణించుట ఉండదు. ఇట్టి యాటలను అయ్యలరాజు నారాయణామాత్యుడు తన హంసవింశతి కావ్యములో విడివిడిగ అక్కడక్కడ ఉటంకించుటయే కాక ప్రత్యేక మొక కథలో సీసమాలికలో ఒక జాబితా నిచ్చి యున్నాడు. ఇందువలన మన కాయాటల పేర్లు మాత్రమే తెలియును; కాని వాని నాడుకొను విధము తెలియుట లేదు. వీనిలో కొన్ని ఇంటిలో ఆడుకొనునవి; మరికొన్ని ఇంటి వెలుపల ఆరబయట ఆడుకొనునవి. బాలబాలికలు కలిసి ఆడుకొనుచుండినను ప్రత్యేకము బాలికలు మాత్రమే ఆడునట్టివియు, ప్రత్యేకము బాలు రాడునట్టివియు లేకపోలేదు. అచ్చనగండ్లు సాధారణముగా బాలిక లాడునాటయే; కోతికొమ్మంచులు కేవలము బాలకు లాడు ఆట. కుందికట్టు, కంబాలాట, పుల్లచెండ్లు, దాగిలిమూతలు మొదలైనవి బాలబాలికలు ఉభయులును ఆడుదురు. ఈ యాటలలో చాలవానికి పాటలుకూడ నుండును. పాటలు పాడుచు, ఆటలాడుట పూర్వపు పద్ధతి. పూర్వపు ఆటలతోపాటు చాల పాటలును అంతరించినవి. ఒకటే యాట కొక ప్రాంతమున ఒకపేరును, మరొక ప్రాంతమున ఇంచుక వ్యత్యాసముతో మరొకపేరును ఉండుటకూడ కలదు. కోతి కొమ్మంచికి కోలక్రోతులని, కుందికట్టుకు కుందిబాళ్లు, కుంటెనగిరి, కుంటెన గుడి అని, ఇట్లే, కొన్ని కొన్ని ఆట లకు నామాంతరములు కలవు.

తెలుగువారికి జాతీయమైన ప్రసిద్ధ క్రీడలు లేకపోయి నను వ్యాయామకృషి లేకపోలేదు. ప్రతినగరములోను, పురములోను, తుదకు పెద్ద గ్రామములోకూడ సాము గరిడీశాల లుండెడివి. ముఖ్యములైన పురములలోను, గ్రామములలోను ఎక్కట్లు ఉండుటచేత గరిడీశాల లుండుట తప్పని సరియైనది. ఎక్కటీడు అనుపదము వాడుకలో ఎక్కటియైనది. ఈ యెక్కట్లందరు ఏకాంగవీరులు. వీరికి తరువాత ఒంటరులు (వంటర్లు) అనిపేరు కలిగినది. వీరు చతుర్థవర్ణములో ఒక కులముగ ఏర్పడినారు. గరిడి కూట ములలో మల్లవిద్య, కత్తిసాము, బాణావిద్య, లోడీలు త్రిప్పుట, దండెములు తీయుట మొదలైనవి సాధనచేయు వారు. సాధారణముగా మల్లవిద్యలో అత్యంత ప్రావీణ్యము సంపాదించిన ప్రథమశ్రేణి విద్యావంతులకు జ్యేష్ఠికు లనిపేరు. వీరికి జెట్టి మల్లులని వ్యవహారము. జ్యేష్ఠికశబ్ద భవము జెట్టి. తిక్కన భారతము విరాటపర్వములో 'జెట్టి మల్లు' లనియే ప్రయోగించెను. తుదకు, ఉత్తమ, మధ్యమ, అధమ విభేదము లేక జెట్టి పదమే 'మల్ల' పర్యాయపద మైనది. చిన్నదైనను పెద్దదైనను ప్రతిరాజస్థానమును ఇటువంటి మల్లులను కొందరిని పోషించుచుండెడిది. మల్ల యుద్ధము విజయనగర సామ్రాజ్యము కూలిపోవువరకు దక్షిణ హిందూదేశమందంతట విరివిగా ప్రచారములో నుండిన క్రీడ. మార్కో పోలో, డ్వార్తె బర్బోసా, న్యూనిజ్, కేస్టెన్ హెూడా మొదలైన అయిరోపియను విదేశ యాత్రికులు - హిందూదేశమునకు వచ్చినవారు - మల్లయుద్ధమును తమ వృత్తాంతములలో ప్రస్తావించి, అభివర్ణించి యున్నారు.

ధనుర్విద్య, కత్తిసాము, బాణావిద్య, గుర్రపుస్వారి— వీనిని సర్వసామాన్యముగా అందరును, అందు ముఖ్యముగ క్షత్రియులును, శూద్రులును అభ్యసించువారు. క్షత్రియు లైనను క్షత్రియేతరులైనను పరిపాలక వంశములోని వారును, ఆయుధోపజీవులును విలువిద్య, కుంతాయుధ ప్రయోగము, కత్తిసాము, గుర్రపుస్వారి మొదలైనవానిని నేర్చుకొనుచుండిరి. చతుర్థకులజులే కాక బ్రాహ్మణులు, విశ్వబ్రాహ్మణులు, వైశ్యులుకూడ గజాశ్వ విద్యలలోను, సమర తంత్రములోను ప్రజ్ఞ సంపాదించి ఆయాదేశాధి పతులయొద్ద దండనాథులుగ నుండినట్లు శాసనములవలన తెలియుచున్నది. పూర్వోక్త విద్యలను స్త్రీలుకూడ అభ్య సించుచుండిరనుటకు ఆధారములు కలవు. కాకతి రుద్రమ దేవి, కోట గణపమదేవి రాజ్యపాలన మొనరించిన రాణులు. వీరు అశ్వ, గజ శిక్షలయందును, సమరతంత్రము నందును నిపుణలు. విజయనగరాధీశ్వరుడైన శ్రీకృష్ణ దేవరాయల రాజ్యకాలములో విజయనగరమునకు వచ్చిన పేయస్ అను విదేశయాత్రికుడు రాయల అంతఃపురమున మల్లవిద్యలోను, కత్తిసాములోను, డాలును వాడుటలోను నేర్పరులైన స్త్రీలు పన్నెండువేలమంది ఉండినట్లు వ్రాసి యున్నాడు. అట్టిచో ఇక పురుషులమాట వేర చెప్ప వలెనా ? గుర్రపుస్వారిలో అందెవేసిన రౌతులు అనేకులు. రాజమహేంద్రవర రాజ్యమును పరిపాలించిన వీరభద్రా రెడ్డి సోదరుడు దొడ్డారెడ్డి గుర్రపుస్వారిలో ఉద్దండుడట. అత డొకమారు పురోపకంఠమున వాహ్యాళి ప్రదేశము నందు తన గుర్రమును ఇరువైనాలుగు మూళ్ల మేర



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



దాటించెనట. కత్తిసాములో గొప్ప ప్రజ్ఞ సంపాదించిన వారు ప్రేటుకు ఆరు తునకలుగా నరకగల సమర్థులు. అశ్వికులకు రౌతులని, రావుతులని పేరు. కళింగదేశ రాజకుమారులు గొప్ప రౌతురాయలు; గజ సాధనికులు. శస్త్రవిద్య, ధనుర్విద్య నేర్పువారు పూర్వము నుండియు బ్రాహ్మణులుగా తెలియవచ్చుచున్నారు. పూర్వ చాళుక్య శాసనములవల్ల ద్రోణునివంటి ధనుర్వేద పారంగతులైన రాజగురువులు తెలియవత్తురు. వీరు రాజకుమారులకు ఇతర విద్యలు కాక సంగ్రామ తంత్రమును, నీతిశాస్త్రమును గూడ కరపుచుండిరి. పూర్వము ప్రసిద్ధులైన సేనానులు, భూధవులు, రాజకుమారులు, మంత్రులు అందరును పూర్వపు గరిడీశాలలలో తయారైనవారే. వేకువజామ ననే లేచి సాధకులు సాధన చేయువారు. ఇట్టి సాముకూటములు దేశీయ ప్రభువుల పరిపాలనము సాగినంతకాలము వర్ధిల్లినవి. బ్రిటీషు ప్రభుత్వ కాలములో, ముఖ్యముగా ఆ ప్రభుత్వమువారు ఆయుధశాసనమును అమలులో పెట్టినప్పటినుండి, అవి క్రమముగా క్షీణించినవి. అయినను ఇప్పటికిని తెలుగుదేశములో అక్కడక్కడ మల్లవిద్య నేర్పు కూటములు లేకపోలేదు; కాని, చాల అరుదు.

ఒకవేళ ఇప్పుడు జాతీయక్రీడలని చెప్పవలెనన్న చిడుగుడు, ఉప్పనబట్లు మాత్రమే చెప్పుకొనవలెను. ఇటీవలనే దేశీయములైన ఈ యాటలకు జాతీయతా ముద్ర వేసి వీనికి ఆటలపందెములు ఏర్పాటుచేసి వీనిని పాశ్చాత్య జాతీయ క్రీడలతో సాటిగ చేయుటకు ప్రయత్నము జరుగుచున్నది. ఉప్పన బట్టెలు (ఉప్పట్లు), చిడుగుడాట, బొంగరాలయాట, గాలిపటము ఎగురవేయుట, అచ్చనగండ్లయాట, ఓమన గుంటలు, జూదము, పులిజూదము, చదరంగము (చతురంగము) మొదలైనవి ఆరేడువందల సంవత్సరములకు పూర్వమునుండి ఉన్నయాటలు. వీనిలో కొన్ని ఇంటి వెలుపల ఆరబయట ఆడునాటలు; మరికొన్ని ఇంటిలోపల ఆడుకొను ఆటలు; ఇక కొన్ని ఇంటిలోపలను వెలుపలను ఆడునట్టివి. పూర్వోక్త క్రీడలలో జూదమును, మల్లవిద్యను, విలువిద్యను, గజాశ్వశిక్షణ విద్యలను పూర్వులు కొందరు చతుష్షష్టి విద్యలలో చేర్చియున్నారు.

పైనిచెప్పిన ఆటలలో చదరంగము నిజముగా జాతీయ క్రీడయని చెప్పుకొనదగినది. మానవజాతికి చదరంగము అను ఆటను ప్రసాదించినది భారతదేశము. ఈ యాట నాడు పలకకు అష్టాపదమని పేరు. ఈయాట హిందూదేశము నుండి పడమట పెర్షియా, అరాబియా దేశములకును, తూర్పున చీనాదేశమునకును వెళ్లినది. దీనిని అరబ్బులు ప్రాయికముగా పదవ శతాబ్దము చివర అయిరోపాలోని స్పెయిను దేశమునకు తీసికొని వెళ్లిరి. పదునొకండవ శతాబ్దాంతమునకు అది అయిరోపాలో ఎల్లరకు సుపరిచితమైన ఆటయైనది. మనదేశములో ఈయాటను పూర్వము ఉన్నత కులములవారు - అందు ముఖ్యముగా భూమికులు - ఎక్కువగ ఆడుచుండిరి. విజయనగరాధీశ్వరు డయిన కృష్ణదేవరాయలకు చతురంగక్రీడ యన్న అమితప్రీతి. రాయలవారు తరచుగా నందవరవంశ్యుడును, కౌశిక గోత్రుడును, కవీశ్వరుడును అయిన కొప్పోలు గ్రామ కరణము బొడ్డుచర్ల తిమ్మనతో చదరంగ మాడువారట. రాయలపక్షమున నెంద రాలోచించి ఎత్తులు వేయుచుండినను తిమ్మన ఒక్కడే ఎవరి ఆలోచనయు, ఎవరి సాయమును లేక ఎదురెత్తు వేసి ఆట గెల్చుకొని 'వేయార్లు' పందెము కొనుచుండువాడట. తిమ్మన ఆటనైపుణికి మెచ్చుకొని రాయలవారు కొప్పోలు గ్రామమునకు కృష్ణరాయపురమని పేరు పెట్టి సర్వాగ్రహారముగా ధారవోసిరని ఐతిహ్యము. పూర్వపురాజులు యుద్ధమునకు పోక పూర్వము ఈ యాటను ఆడి 'ఎత్తు పై ఎత్తులు' ఆలోచించుకొనుచుండిరని చెప్పుదురు. పూర్వపు సంస్థానాధీశులకు ఈ యాటలోగల అభినివేశమును గురించి, ఆట యాడుటలోని నైపుణిని గురించి పూర్వపు తరములవారు చెప్పుకొను చుండిన కథలు గాథలు చాల అంతరించి పోయినవి. ఇటీవల ఈ చదరంగము జాతీయములైన పందెపుటాటలలో ఒక్కటయినది. ఇప్పటికిని ముందు చెప్పి ఆట కట్టించగల ప్రజ్ఞావంతులు తెలుగుదేశములో అనేకు లున్నారు.

పూర్వపు టాటలలో జూద మొకటి. దీనిని సాధారణముగా శ్రీమంతులును భూపతులును ఆడుచుండిరి. వేశ్యలు కూడ ఈ యాటలో ప్రజ్ఞ సంపాదించి నేత్రములతో ఆడి పందెములు గెలిచి వారి ధనమును దోచుకొనుచుండినట్లు గ్రంథములవలన తెలియుచున్నది. రాణివాసపు స్త్రీలు కూడ ఈ యాటను ఆడుచుండువారు.

పూర్వకాలములో వేడుకలు, వినోదములు ఎట్లు ఉండెడివో, పండుగ పబ్బములలో ప్రజలు ఎట్లు కాలము గడపుచు వచ్చిరో తెలిసికొనుటకు ఆధారములు లేవు. అయినను మన ప్రాచీన ప్రబంధముల ననుసరించి కొంత తెలిసికొనుటకు అవకాశము కలదు. ప్రాచీనకాలములో వసంతోత్సవ, శరదుత్సవ దినములు గొప్ప వేడుక దినములు. వసంతోత్సవము మనదేశములో ఇప్పటికి వేయిసంవత్సరములకు పూర్వమునుండి జరుగుచువచ్చినను కొండవీటిని పరిపాలించిన రెడ్డిరాజుల కాలమునుండి దానికి క్రొత్త యందమును, అపూర్వశోభయు వచ్చినది (చూడు: వసంతోత్సవము). వసంతోత్సవమునకు పిదప చెప్పదగిన ఉత్సవము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



శరదుత్సవము. శరదృతువులో జరుగు ఈయుత్సవములకు మహాలక్ష్మి పండుగలని, దేవీ నవరాత్రములని పేరు (చూడు: మహాలక్ష్మి పండుగలు). ఇంచుమించుగ మన పండుగలును, పర్వములును అన్నియు ఏదో ఒకరీతిని మతమునకు సంబంధించినవే. ఈ పండుగ దినములలో జనులు తమ తమ మతవిధులు నిర్వర్తించి, ఉన్నంతలో మంచి బట్టలు కట్టుకొని, అలంకరించుకొని వేడుకలు వినోదములతో కాలము గడపుదురు. గ్రామములలో నివసించు ప్రజలకు ఆ గ్రామములోని దేవుని కళ్యాణోత్సవమును, గ్రామదేవత జాతరయు కూడ ఉత్సాహముతో పాల్గొనుటకు అవకాశమిచ్చు పండుగల వంటివే. సాధారణముగా ఈ పండుగ దినములలోను, ముఖ్యముగా స్వామి కళ్యాణోత్సవ దినములలోను, వీధినాటకము లాడెడు భాగవతులు, తోలుబొమ్మలవాండ్రు, దొమ్మరవాండ్రు మొదలైనవారు వచ్చి ఆటల నాడి ప్రజలను ఆనందింపజేసి పోవుట ఆచారము. పూర్వము ప్రతిగ్రామమునందును 'గ్రామ సమూహి మాన్యము' అని యొక మాన్య ముండెడిది. ఆ మాన్యము గ్రామములోని ఏ యొక్కరిదియు కాదు, అది గ్రామస్థు లందరికి చెందిన ఉమ్మడి మాన్యము. దానిమీద వచ్చు రాబడిని - ధాన్యరూపమయినదైననేమి, రొక్కము రూపమయినదైననేమి - మొత్తముమీద గ్రామోపయోగకర కార్యములనిమిత్తమును, గ్రామస్థులకు పైనిచెప్పిన యట్టి ప్రదర్శనములను ఇచ్చి ఆనందింపజేయు ఆటపాటలవాండ్ర నిమిత్తమును వినియోగించుచుండువారు. భాగవత మేళమునకు ఇంత, తోలుబొమ్మలవారి కింత అని యీవిధమున వేడుకలు వినోదములు జరపువారికి వార్షికముగా నిచ్చు వర్తనలుండెడివి. వర్తన పదమే వాడుకలో 'వతన' అయినది. వేర్వేరు వృత్తులవారికి ఇచ్చునది వర్తన. విద్యావంతులు ఆటపాటలవారు మొదలయిన కళానిపుణులు ప్రతిసంవత్సరము గ్రామమునకు వచ్చి తమ ప్రదర్శనముల నిచ్చి వర్తనలను తీసికొని పోవుచుండిరి. ఈ ప్రదర్శనము లన్నియు గ్రామీణు లందరికి ఉచితమే. ఎవ్వరును ఏమియు చెల్లింప నక్కర లేదు. దీనివలన గ్రామస్థు లెవ్వరికిని ఏవిధమయిన నొప్పి కలుగకపోవుటవలన గ్రామములకు వచ్చు విద్యావంతులును గ్రామీణులును ఎంతయో అన్యోన్యము కలిగి, ఇంచుమించుగ ఆప్తమిత్రులవలె వ్యవహరించువారు. ఈ విద్యావంతుల కుటుంబములు వృద్ధి చెంది సంతానాభివృద్ధి కలిగినపుడు ఒక కుటుంబములోని అన్నదమ్ములు భూమిని పంచుకొన్నట్లే వారు గ్రామములను పంచుకొనువారు. ఈ కారణమున గ్రామములోని వారికిని, ఏటేట ఆయూరికి వచ్చుచుండు విద్యావంతుల కుటుంబముల వారికిని తరతరములనుండి అన్యోన్యము ఏర్పడి వారి వరుసలు పెట్టుకొని బంధునరీతిని అప్యాయముగ కలసి మెలసి వ్యవహరించుచుండువారు. భిక్షాటనమున జీవించు కొన్ని కొన్ని కులముల విషయమునను ఒకమాదిరిగ ఇటువంటి ఏర్పాటులే యుండెడివి. నేడు బిచ్చగాండ్రది ఒకసమస్యయైనది; కాని, పూర్వపు సాంఘికవ్యవస్థ అప్పటికి తగినట్లు దాని నొకరీతిగ పైవిధమున పరిష్కరించుకొన్నది.

వసంతోత్సవములు, శరదుత్సవములు స్వామికల్యాణోత్సవము మొదలగు వానివలెనే మకరసంక్రమణము (సంక్రాంతి) కూడ గొప్ప పండుగ. దీనికి పెద్దపండుగ అనిపేరు. అప్పటికి వరి కోతలై ధాన్యలక్ష్మి ఇంటికి వచ్చు శుభదినములలో వచ్చు పండుగ ఇది. గ్రామములోని ప్రతి గృహమును పసుపు కుంకుమలతో, సున్నపుపూతలతో, రకరకములైన ముగ్గులతో కలకలలాడుచు నేత్రపర్వము కావించు పండుగ దినము లవి — భోగి, పెద్దపండుగ, కనుము అను మూడు దినములును. తెలుగుదేశము వ్యవసాయప్రధానమైన దగుటవలన ప్రజలజీవన మంతయు పాడిపంటలమీదను, పశుసంపద మీదను ఆధారపడియుండెను. వ్యవసాయమునకు బలిష్ఠమైన మంచివృషభజాతి ఆవశ్యకము. మేలుజాతి ఎద్దులను తయారుచేయుటకు తెలుగుదేశమున పూర్వము కొన్ని గ్రామాలలో గ్రామస్థులు ఒకమాన్యమును ఏర్పాటు చేసికొనినట్లు స్థానిక చరిత్రలవలన తెలియుచున్నది. ఈమాన్యమునకు 'గెలుపెద్దుల మాన్య' మని పేరు. కనుప పండుగనాడు పశుప్రదర్శనమును, ఎద్దుల పందెములును జరుగును. పరుగు పందెమునకు ఇప్పటి గుర్రపుపందెములలో వలెనే ఒకకొంత దూరము నిర్ణీతమగును. ఈ పరుగుపందెములో ఎవనియెద్దు గెలుచునో 'గెలుపెద్దులమాన్య' మాయేటికి ఆ గెలుపెద్దుగల యజమానిది. మరుసటి సంవత్సరము మరొకరియెద్దు గెలిచినచో ఈమాన్యము ఆ యాసామికి పోవును. ఆ మాన్యము ఇప్పటి పందెములలోని 'రోలింగ్ కప్' వంటిది. 'గెలుపెద్దులమాన్యములు', ప్రతి గ్రామమునందు లేకపోయినను పశువుల నలంకరించి తెచ్చుట, కనుము నాడు వేడుకలు జరుపుకొనుటమాత్రము ఉండెడిది.

సంక్రాంతి పండుగలలో జరుపుకొను వేడుకలలో కోడిపందెముల ఆట యొకటి. గరువు ప్రదేశమున ఆ యాటలు జరుగుటచే కొన్నిగ్రామముల దగ్గర ఇప్పు డీయాటలు లేకపోయినను 'కోడిపందేల గరువు' అనుపేర కొన్నిగ్రామములలో స్థలవ్యవహార మున్నది. 'కోడిపందెములు' మన దేశములో ఇప్పటికి వేయిసంవత్సరములకు పూర్వము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పూర్వమునుండి వాడుకలో నుండినయాట. దీనిని పదు నైదవశతాబ్దములో ప్రాగ్దేశములను దర్శింపవచ్చిన విదేశ యాత్రికులుకూడ వర్ణించియున్నారు. ఇది దక్షిణహిందూ దేశములోనే కాక జావా, సుమత్ర మొదలైన ప్రాగ్ద్వీప ములలో సయితము వాడుకలో ఉండినట్లు వారి వృత్తాంత ములవల్ల తెలియుచున్నది. కోడిపోరు పూర్వపు సంస్థానా ధీశులకు చాలప్రియమైన వేడుకలలో ఒకటి యని పెద్దా పురపు 'కోడిపుంజులకథ' మొదలైన జానపదగేయముల వలన తెలియుచున్నది. కోడిపందెములు గొప్ప యుద్ధము లకును కారణములయినవి. పలనాటి వీరయుద్ధమునకు గల కారణములలో కోడిపందెముల ఆట ఒకటి.

పూర్వము జనులు వినోదించు వేడుకలు, కోడిపోరు వంటివి, ఇంకను పెక్కు లున్నవి. ఇవి క్రీడాభిరామము, భోజరాజీయము మొదలైన గ్రంథములలో పేర్కొన బడినవి. వృషభములపోరు, మేషయుద్ధము, దున్నపోతుల పోరు, గజయుద్ధము, పొట్టేళ్లపోరు మొదలైనవి ఇట్టి వానిలో కొన్ని. ఇవి మధ్యయుగములో, అనగా ఇప్పటికి తొమ్మిదివందల సంవత్సరములకు పూర్వము ప్రజలకు చాల ప్రీతిగల వినోదము లేమో. కుంతలదేశాధీశ్వరుడైన భూలోకమల్ల సోమేశ్వరభూపతి తాను రచించిన 'అభిల షితార్థ చింతామణి' అను నామాంతరముగల 'మానసో ల్లాస'మను విజ్ఞానకోశమున ఈ వినోదముల వర్ణనమునకు పూర్తిగా ఒకప్రకరణమునే తీసికొనెను. ఆ ప్రకరణమున ఏకాంగవీరుల మల్లయుద్ధములను గురించియేకాక, గజ యుద్ధములు, అశ్వయుద్ధములు, అబోతుల దున్నపోతుల పోరాటములు, పొట్టేళ్ల పోట్లాటలు, కోళ్లపోట్లాటలు మొదలైన వానిని అభివర్ణించియున్నారు. ఈ యొక్కొక్క పోరాటమునకు ఉండవలసిన రంగస్థలము, దానిని తయారు చేయు పద్ధతి, పోరాటమునకు సంబంధించిన ఇతర విషయ ములు అన్నియు ఆ ప్రకరణములో చెప్పబడినవి. కొండవీటి రెడ్డిరాజుల కాలమునాటికి ఏనుగుల పోరాటములు, గుఱ్ఱముల పోరాటములు మోటయి ప్రాతబడి వాడుకలో లేనట్లు తోచును. పొట్టేళ్ల పోట్లాట, కోడిపందెములు మొద లైనవి నేటికిని. తెలుగుదేశములోని కొన్ని కొన్నిచోట్ల కానవచ్చును. భూనాథులకు ప్రియమై పూర్వము వాడు కలో నుండిన మరియొకక్రీడ వేట. ఈ వేటలో పాదివేట, విడివేట, తెరవేట, దామెనవేట అని పలురకములు కలవు. ప్రబంధములోని అష్టాదశ వర్ణనలలో వేట యొకటి.

పైని చెప్పినవే పూర్వము తెలుగుదేశములో ముఖ్య ముగా వాడుకలో నుండిన వేడుకలు, వినోదములును. దేశ పరిస్థితి, కాలము మారుటతో పూర్వము వాడుకలోనుండిన వేడుకలు, వినోదములు చాల అంతరించినవి. మ. సో. శ.





http://sanskritcentral.com/

http://teluguthesis.com/

# తెలుగు భాష

## పరిణామము

ఒక భాషకు రెండుపేళ్లు కలుగుట అస్వాభావికమే యైనను ఆంధ్రము, తెలుగు అనునవి చిరకాలమునుండియు ఏకైకభాషనే సూచించుమాటలుగా వ్యవహారములో ఉన్నవి. కావున అవి అట్లగుటకు గల కారణములను మనము కనుగొనవలసి యున్నది.

ఆంధ్రదేశము, ఆంధ్రభాష అనుపేళ్లు జాతివాచకమైన ఆంధ్రశబ్దమునుబట్టి ఏర్పడినవి. ఆంధ్రులు ఆర్యజాతికి చెందినవారు; ఉత్తర దేశీయులు. ఐతరేయబ్రాహ్మణకాలమునకు పూర్వమే, విశ్వామిత్ర శాపహతులై ఆ యుత్తర దేశమందలి జనులతో వీరికి కలిగిన విభేదములు కారణముగా వీరు అచ్చటి జనసంఘమునుండి చీలిపోయి, అనార్యజన సంపర్కముచే కాబోలు, వింధ్యకు దక్షిణభాగమున అనార్యజనులతో చేరి వసించుచుండినట్లు తెలియుచున్నది. మరికొంతకాలమునకు వీరు దక్షిణాభిముఖులై వచ్చి కృష్ణా గోదావరుల నడిమి ప్రదేశమును ఆక్రమించి కాలక్రమమున అచ్చటి జనులతో కలిసిపోయి కృష్ణాతీరభూములందు ఒక రాజ్యమును స్థాపించుకొనగలిగిరి. అప్పటికి ఆ దేశమున నెలకొనియుండినవారు తెలంగులు (తెలుంగులు); వారి భాష తెలుంగు భాష. అది ఇప్పుడు దక్షిణదేశీయమని చెప్పబడుచు దాదాపు క్రీస్తుశకారంభకాలమునుండియు సంస్కృత పండితుల చేతను, విదేశీయుల చేతను 'ద్రావిడ' మని పేర్కొనబడుచు ఉండిన అనార్యమగు నొక ప్రాచీనభాషనుండి ఏర్పడిన భాష. ఇది దక్షిణ దేశీయములగు తమిళ కన్నడ మలయాళాది భాషలతో సజాతీయమయినదని చెప్పవచ్చును. ఆంధ్రులు ఉత్తరదేశమున ఉండినప్పుడు వారు ఆదేశమున వ్యవహారమందుండిన ఆర్యభాషాసంబంధియగు ఏ ప్రాకృతభాషనో వ్యవహరించియుందురు. కాని, వారు ఈ దక్షిణదేశమున కృష్ణా గోదావరీ మధ్యప్రాంతమున నెలకొని అచ్చటి జనులతో కలిసిపోయి వారిభాషను చేపట్టినపిదప అచ్చటి వారి తెలుగుభాషనే వ్యవహరించి యుందురు. లేకపోయినచో ఆంధ్రులు తొలుత వ్యవహరించిన ఆర్యభాషయగు ప్రాకృతము తరువాత కూడ దేశభాషగ నెలకొనియుండవలసి వచ్చెకదా! అట్లుకాక, ప్రాకృతము అంతరించి ద్రావిడ కుటుంబమునకు సంబంధించిన తెలుగు భాషయే దేశభాషగా స్థిరపడిపోయినట్లు మనము ఎరుగుదుము. ఆంధ్రులు సామ్రాజ్యస్థాపకులయి వెలుగొంది యుండుటచే వారి ప్రాబల్యప్రభావములవలన ఈ తెలంగులు నివసించు దేశమునకును, వారి భాషకును కూడ ఆంధ్రము అను నామము అబ్బినది. ఈరీతిగా తెలుగునకు ఆంధ్రమని, తెలంగులకు ఆంధ్రులని, తెలుగుదేశమునకు ఆంధ్రదేశమని ఏర్పడుట తటస్థించినదే కాని, తెలుగువలెనే ఆంధ్రము ఒక భిన్న భాషగా ఉండెనని తలచుటకు అవకాశము లేదు. దీనినిబట్టి ఆంధ్రులు తెలంగులు కలసి ఆంధ్రులు కాగా తెలంగ దేశమునకు, తెలంగు భాషకు ఆంధ్రము అనునామము ఆంధ్రులప్రాబల్యముననే కలిగినదని స్పష్టమగుచున్నది.

ఇక, ఈ భాషాపరిణామాన్వేషణ సందర్భమున 'ఆంధ్రము'ను గూర్చి మనము పరిశీలింపవలసినది లేకుండుటచే దేశీయమగు 'తెలుగు' శబ్దనిష్పత్తిని గూర్చి ఇంచుక విచారింతము. ఈ తెలుగు శబ్దము దేశీయమే అయినపుడు తక్కిన దేశీయభాషా నామములవలెనే తత్తద్దేశీయుల నామమును బట్టియో, దేశనామమును బట్టియో ఏర్పడి యుండునని తలపవలసినదే కాని, సంస్కృత ప్రాకృత భాషారూపములనుండియో, ఏవిదేశీయ శబ్దములనుండియో నిష్పత్తిని కల్పింప యత్నించుట యుక్తము కాదు. ఈ కారణముచే 'త్రిలింగ', 'త్రికళింగ' 'త్రిణగ' మున్నగు సంస్కృత శబ్దములనుండి పుట్టినది అనుటకు వలను పడదు కదా! 'తెలుంగు' భాష 'తెలంగు' జాతివారి మాతృభాష. తెలంగులు - ఆంధ్రులతో కలిసిన పిదప, ఆంధ్రులకు దేశమునగల ప్రసిద్ధినిబట్టి జాతిపరముగాను, భాషాపరముగాను కూడ ఆంధ్రనామమునకే ప్రసిద్ధి కలుగుటచే 'తెలుగు' జాతినామముగా వెనుకబడినను దేశమునందలి 'తెలగాణ్యులు', 'తెలగాలు' మొదలగు వారిలోను, బర్మాకు వలసపోయిన తెలైంగులలోను నిలిచియున్న దనవచ్చును. భాషాపరముగా ఆంధ్రశబ్దము తెలుగుభాషనే సూచించును కాని వేరు కాదు. ఇట్లు దేశీయమగు ఈ తెలుగు భాష యొక్క ప్రాచీన స్వరూప లక్షణములను, దాని పరిణామ క్రమమును తెలిసికొనవలెనన్న దూరముగనున్న ఉత్తర హిందూదేశ భాషలకంటె సన్నిహితములు, దేశీయములు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అగు దక్షిణ దేశభాషలతో దానిని పోల్చి పరిశీలించుటయే ఎక్కువ లాభకారి యగును.

ఈ దక్షిణ దేశభాష లన్నియు సజాతీయములని, సన్నిహిత సంబంధము కలవని నిర్ణయించి, వీనికి 'ద్రావిడ భాషా వర్గ'మని ఇటీవలి భాషాశాస్త్రవేత్తలు నామకరణము చేసినారు. వీనితో సన్నిహిత సంబంధము గలవని నిర్ణయింపబడిన కొన్ని యుత్తర దేశమందలి ఆటవిక - అనాగరక - భాషలు కూడ ఈ వర్గమున చేర్పబడినవి. ఇవన్నియు ఒక్క ప్రాచీన ద్రావిడభాష నుండి ఏర్పడిన సోదరభాష లనియు, ఈ ద్రావిడభాషా కుటుంబము ఒక ప్రత్యేక భాషా కుటుంబ మనియు ఆధునిక భాషా తత్త్వజ్ఞులు సిద్ధాంతము చేసిరి. ఈ ద్రావిడభాషా కుటుంబములోని ముఖ్యభాషలలో మన తెలుగుభాష ఒకటి.

ఈ ద్రావిడభాషలు ఒక కుటుంబమునకు చెందినవి అనుటవలన కల విశేషము ఏమనగా ఈ భాషలలోని శబ్దములు, భాషారూపములు, వాక్య నిర్మాణ రీతులు మొదలగునవి కొంతవరకు పరస్పర సంబంధము కలవగుటయే కాక, వీని కన్నిటికి మూలమని చెప్పదగిన ఒక మాతృభాషనుండి కాలక్రమమున భిన్నశాఖలుగా ఏర్పడి వ్యవహారభేదము మూలముగా భిన్నరూపములు కలవైనను సహజసంబంధము కలవే అనుటయే. ఒక మూలభాషనుండి విడివడి స్వతంత్రములైన ఈ భాషలలో ఏవి ఏకాలమున విడివడినవో, సహజ కుటుంబ లక్షణములు ఏయేభాషలలో ఎంతవరకు నిలిచియున్నవో, ఆయాభాషలు మారురూపు చెంది ప్రత్యేక భాషలుగా ఏర్పడుటకు కల విశేషకారణములు ఏవో పరిశీలించి ఒక్కొక్క భాషయందు ఏయే కాలములందు ఎట్టి మార్పు కలుగుచు వచ్చినదో గుర్తించి సహేతుకముగ సమన్వయింప దొరకొనినచో ఆ భాషయొక్క చరిత్రను, పరిణామక్రమమును నిరూపించినట్లు కాగలదు.

**పూర్వయుగము :** ఇట్లు తెలుగుభాష చరిత్రను, దాని పుట్టుపూర్వోత్తరములను తెలిసికొనవలెనన్నచో 'ఆంధ్రభాషా వాగను శాసనుడు' అను బిరుదు వహించిన నన్నయతోడను అతడు రచించిన భారత సంహితతోడను మన పరిశీలనము ప్రారంభించిన ప్రయోజనము లేదు. కాని, నన్నయ భారతము వాస్తవముగా తెలుగుభాషయొక్క పూర్వోత్తర చరిత్రాన్వేషణము సందర్భమున ఒక నడిమి గడ్డవలె మనకు ఉపకరింపక పోదు. నన్నయకు పూర్వపు శాసనములు ఇప్పుడు ప్రకటితము లగుటచే, తెలుగు భాషయొక్క చరిత్రము నన్నయకు పూర్వము నాలుగయిదు శతాబ్దముల వరకు అన్వేషింప వీలగుచున్నది. ఈ కారణముచే ఆంధ్రభాషా చరిత్రమును మూడు ప్రధాన యుగములుగా విభజించి పరిశీలింపవలసి వచ్చును — నన్నయకు పూర్వయుగము, నన్నయయుగము, ఆధునికభాషా యుగము అని. నన్నయకు పూర్వయుగమునందలి తెలుగు చోళ, చాళుక్య రాజాదుల శాసనములు క్రీ.శ. 7వ శతాబ్దమునుండియే ఆభాషాస్వరూపమును మనకు తెలుపగలుగుచున్నవి. కాని, క్రీస్తు శకారంభకాలము నందలి తొలి అయిదారు శతాబ్దములలోను తెలుగుదేశమున బయలుపడిన ప్రాకృత సంస్కృత శాసనములలో ఉదాహరింపబడిన తెలుగు దేశపు గ్రామనామములను, వాని పరిసరగ్రామముల పేళ్లను అనుసరించి ఆకాలపు తెలుగుభాష అస్తిత్వమును, దాని స్వరూప లక్షణములను కొంతవరకు ఊహింపవచ్చును. అవి ఎట్టివో యించుక పరిశీలింతము.

1. ఈ కాలమునందలి శాసనములనుండి మనము గ్రహింపదగిన తెలుగు దేశపు గ్రామనామములు - ఊరు, పట్టు, కొన్ఱ (కొండ), కోడు, చెఱువు, రేవు, పాక, పల్లి, వాడ, చేడు మొదలగు తెలుగు పదములు తుదిని గలవిగా ఉన్నవి.

ఉదా : ఆంతుకూరు, పెణుకపఱ్ఱు, తాన్ఱికొన్ఱ, చెంచెఱువు, రావిరేవు, ఉరువుపల్లి, ఒంగోడు, కురవాడ, చూయిపాక, నరాచేడు.

2. ఈ కాలమునందలి తెలుగుభాషలో వింతద్రావిడ భాషావర్ణ మనదగిన 'ఱ' కారము వ్యవహారమున ఉండుటేకాక తెలుగుపదముల తొలి వర్ణముగా కూడ నిలిచియుండినట్లు అగపడుచున్నది. ఉదా : ఱెందులూర, ఱగుంబఱు.

3. శకటరేఫమే కాక, దాని కూతగా గ్రహింపబడిన 'న' కారముతో గూడిన 'న్ఱ' అను సంయుక్తాక్షరమొకటి ఆకాలమున తెలుగుభాషలో వాడుకలో నుండినది. ఉదా : ఱేగొన్ఱమ్, తాన్ఱికొన్ఱ.

4. ప్రాచీన భాషలోని 'ళ' కారము ఇంకను తరువాతి భాషలోవలె 'ల' కారముగ మార్పునొందక 'ళ' కారముగనే నిలిచియున్నది. ఉదా: ఏళూరే; విజయరాజ్యసంవత్సరంబుళ్.

5. ఈ కాలపు భాషలోని విభక్తి ప్రత్యయమును తెలుపగల చిహ్నమొక్కటే. 'విజయరాజ్య సంవత్సరంబుళ్' అను శబ్దములోని బహువచన ప్రత్యయమగు 'ళ్' అనునదిగా కనబడుచున్నది. ఇది ప్రాచీనభాషలోని 'కళ్' అనుదాని యవశిష్టరూపము అయియుండును.

6. ప్రాచీనభాషలోని 'కెం', 'కెఱ' వంటి శబ్దముల లోని పదాది క కారము తాలవ్యాచ్ఛరక మైనపుడు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తాలవ్యముగా ఇంతకు పూర్వమే యీ భాషయందు మారి పోయినట్లు - ఈ శాసనములలోని 'చెంచెఱువు' 'కంబురాం చెఱువు' మొదలగు గ్రామనామములను బట్టి తెలియ వచ్చుచున్నది.

7. సంస్కృత పుంలింగ శబ్దములు ఈ తెలుగుభాషలో చేరి తత్సమములయినపుడు అవి తిర్యగ్జడ వాచకము లైనచో ఈ భాషలోని సంప్రదాయమును బట్టి అమహత్తు లయి వు, బు, ంబు ప్రత్యయములను గ్రహించు వాడుక ఈ కాలముననే ఈ భాషలో వచ్చినదని 'సంవత్సరంబు' 'నాగంబు' మొదలగు శబ్దములను బట్టి తెలియుచున్నది. ఈ 'ంబు' అనునదే తరువాత 'మ్బు'—'ము'లుగ మారినది.

8. ఈకాలమున తెనుగు సమాసములు ఏర్పడుచున్న విధమును ఈ క్రింది పదములు సూచింపగలవు. ఉదా: ఒన్ + కోడు = ఒంగోడు; చెన్ (చెన్ను) + చెఱువు = చెంచెఱువు, మూడు + ఎల్ల + కూటువ = ముయ్యేల కూటువ.

దీనినిబట్టి క్రీస్తుశకము తొలిదశశతాబ్ది పూర్వార్ధభాగ మున తెలుగుదేశమున తెలుగుభాషకు అస్తిత్వమే కాక, దాని పరిణామక్రమముకూడ వ్యక్తమగుచునే యున్నది.

ఇక, క్రీ. శ. 7వ శతాబ్దినుండి తెలుగు చోళ, చాళుక్య రాజుల ఏలుబడిలో పుట్టిన తెలుగు శాసనములే కలవు. వీనిలో క్రీ. శ. 9వ శతాబ్దినుండి గద్యపద్యాత్మకములగు శాసనములు కనబడుచున్నవి. అంతకు పూర్వపుశాసనములు అన్నియు గద్యాత్మకములే. వీనిలోని తెలుగుభాషకూడ పద్యశాసనములలోని దానికంటె ఎక్కుడుగ ప్రాచీనతా లక్షణములు కలదిగనే అగపడుచున్నది. పద్యశాసనముల యుగమునందలి తెలుగుభాష నన్నయభాషకు దగ్గరగా ఉన్నట్లు అగపడును. కొన్ని ప్రాచీన ధ్వనులలోను, రూప ములలోను మార్పు కనబడును. మన తెలుగుభాషలో శాసనలిఖితమై మనకు లభించిన మొట్టమొదటి పద్యము ఒక తరువోజ. ఇది చాళుక్య గుణగ విజయాదిత్యుని సేనా నాయకుడగు పాండురంగని అద్దంకి శాసనములో కాన వచ్చుచున్నది. ఉపలబ్ధములయిన నన్నయకు పూర్వపు తెలుగుశాసన పద్యములలో ఒక్కటియు సంస్కృత ఛంద స్సును అనుసరించి వృత్తరూపమున రచింపబడినదిగా లేదు. అన్నియు దేశీయ ఛ్ఛందమును అనుసరించి రచింపబడి నవియే.

ఈ శాసనములను బట్టి మనము గ్రహింపదగిన ఆ కాలపు తెలుగుభాషా లక్షణములను, దాని పరిణామరీతిని పరిశీలింతము :

1. వెనుకటి యుగమందు వలెనే ఈ యుగమందును 'ఱ' కారమును, శకటరేఫమును భాషలో నిలిచియే యున్నవి.

2. 'న్ఱు' అను పదాంతనకార శకటరేఫ సంయోగము వెనుకటి యుగములోని రేగొన్ఱం, కాన్ఱికొన్ఱ శబ్దము లలో వలెనే వాన్ఱు, పాతకున్ఱు, గోత్రున్ఱు మొదలగు శబ్ద ములలో కనబడుచున్నది. క్రీ.శ. 8, 9 శతాబ్దముల ప్రాంత మున క్రమముగా ఇవి వాణ్డు, పాతకుణ్డు, గోత్రుణ్డు అను రూపములను పొందగా తరువాతి కాలమున వాని లోని తుది 'ండు' అనునది ప్రథమావిభక్తి ప్రత్యయముగా గ్రహింపబడుట తటస్థించినది. అట్లే, తిర్యగ్జడవాచక శబ్ద ములలో కొన్నిటిపై కానవచ్చు 'ంబు', 'బు' వర్ణములు 'ము' వర్ణముగా మారుటనుబట్టి, అమ్మంత నపుంసకలింగ తత్సమ శబ్దముల తుద మకారము ఉకారముతో కూడగా జ్ఞానము, వనము వంటి శబ్దముల తుదిని ఏర్పడిన 'ము' వర్ణము కూడ మరియొక ప్రథమావిభక్తి ప్రత్యయముగా గ్రహింపబడినది. మరియు, ఉకారోకారాంత తత్సమశబ్ద ములవయి వచ్చిన 'వు' వర్ణము కూడ తెలుగులో ప్రథమా ప్రత్యయమైనది. ఇట్లు తెలుగుభాషలో నన్నయకాలముననే డు, ము, వు, లు ప్రథమా విభక్తి ప్రత్యయములు ఏర్ప డినవి; తరువాత వైయాకరణులచే వ్యాకరింపబడినవి. ఇవి తెలుగుభాషలోని తత్సమ పదబాహుళ్యము ననుసరించి వచ్చినవే కాని, వాస్తవముగా తెలుగుభాషా సంప్రదాయ మునకు సంబంధించినవి కావు. బహువచన ప్రత్యయము ఈ గద్యశాసనముల కాలములో 'ఌ' కారముగానే ఉన్నది. అయినను అచ్చటచ్చట 'ల' కారముగ మారి ఉండుటయు కాననగును.

దేశ్యశబ్దములగు పాఱ, ఱే అను వానిపై 'డు' ప్రత్యయము ఆకాలమున కింకను చేరినట్లు లేదు. 'పాఱను చంపిన పాపంబు', 'పాలఱేం గారికి'. వే, ఆ శబ్దములు వేయి, ఆవు - అనురూపములను పొందినట్లు లేదు. వేసెఱు వులు, వేగుఱ్ఱు. ఆ (ఏక) ఆఌ (బహు) ఆలు; పణి, గణి - వీనిలోని 'ణ' కారములు 'న' కారములు కాలేదు. పణ్, కాణ్‌లు మూలధాతువులు. పణ్‌నుండి నామవాచక రూపము 'పణి' అయి తరువాతి భాషలో 'పని' అయినది. కాణ్ - ధాతువు తెలుగులో 'కను' అనురూపమును పొందినది. 'కణి' ప్రాచీన క్త్వార్థకరూపము.

3. విభక్తులు :

ద్వితీయ : ని - ను; పాఱను, గండత్రినేత్రని. ద్వితీయకు ప్రథమ : సేఱ యిచ్చిరి, వింక ముడిచె.

తృతీయ : తోటి - తో; వొటంబి తోటి కయ్యము, పాముంత పడువతో.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చతుర్థి : కై ; సముద్రర కై నాకు బణిసేసిన.

పంచమి : వలన, ఉణ్డి, గద్యంబుల వలన, చేం ద్రోలమణ్డి.

షష్ఠి : కు - కి ; చిమ్మనకు, నాకు, ఇళరేనికిన్, తేనికిన్.

సప్తమి : నన్, న, అందు, మిన్ద ; ముత్తుకూరిన్, పులొంబున, మహిమిన్ద, ఊర్లందు.

**4. విశేషణత్వము :**

1. ప్రథమకు యొక్క షష్ఠి ; భటరళ నిల్పిన దత్తి, నీ చేసిన యపకారంబు.

2. ముపర్ణమునకు పు, ంపులు ; కట్టెపు దుర్గము.

3. ఉదంత తద్ధర్మార్థక విశేషణమునకు నగాగమ ; అగునేటి, పదియేఁటగునేణ్ట.

4. అ ; విక్రమాదిత్యుల కొడుకుళ్.
   ఇ ; చిఱుంబూరి ఉత్తర దిశ.
   తి ; విత్పత్తి ఉత్తరంబు.
   టి ; మూటికి, పదియేఁటగునేణ్ట.

**5. సంధి :**

గద్యశాసనములలో ఐచ్ఛికముగా కనబడుచున్నది : దేనికి అహితంబు, పన్నాస ఇచ్చినవారు. (కొన్నిచోటుల) విషయంబు యేళేవారు.

సరళాదేశము : నాకు బణిసేసిన, ఆజిలోం జూచె, కొట్టము ల్పొడిచి. (కొన్నిచోటుల) మహారాజులాకున్ ప్రవర్ధమాన.

గసడదవాదేశము : అర్ధపట్టు సేను, మూన్టువుట్లు.

త్రికసంధి : ఇన్నెలవ.

**6. సంఖ్యావాచకములు :**

ఒణ్డు, ఒక, ఒకటి.
ఇరు, రెణ్డు, ఇరుభది.
మూన్టు, మూణ్డు, మూడు, మూటికి.
నల్వురు, నల్వరు, నళ్వాద్యది, నల్వది.
ఏను, పదేన్డుంబు, ఏవది.
(అఱు) : అరు(భది)
(ఏఱు) : ఏఱు, ఏఱువేల, పదియేఁటగు.
(ఎన్) : ఎఱుంబొది, ఎఱుబొన్ట
(తొంబ) : తొంబనూటా నల్వది.
పది (పన్) : ఇరుభది, ఏభది, అరువది, నల్వది.
పన్దుబు, పన్ణెండు
నూఱు : నూట్ట ఎనుబొన్ద, తొంబనూటానల్వది.
వే : వేయి, ఏఱువేల, వేన్రు.
కోటి : గోళకోటి.

**7. సమాసములు :** ఇమ్పుటోలు, మొగమాడువు, పొలగరుసు.

**విశేషకార్యములు - ఆగమాదులు :** నొ ఱంబితో టి కయ్యము, అశ్వమేధంబున ఫలంబు, ప్రథమంబు నేణ్డు.

**8. క్రియారూపములు :** తద్ధర్మార్థక రూపములే ఎక్కువగా వాడుకలో ఉండినట్లు అగపడుచున్నవి : అఖున్, అగున్, ఏళేవారు, కుడుచువారు, ఉండువారు. వర్తమాన కాలిక రూపముకాని, భవిష్యదర్థక రూపము కాని ఏర్పడినట్లు లేదు. 'రాజ్యంబు సేయుచున్న' అను వర్తమానార్థక క్రియావిశేషణ మొకటి కలదు. భూతకాలిక రూపములు వాడుకలో ఉండినవి : ఇచ్చి, ఇచ్చిరి, ఇచ్చిన, పణికేసిరి, పోయె, సొన్పె మొదలయినవి.

**తత్సమధాతువులు :** 8వ శతాబ్ది(పద్యమయ శాసనముల కాలము)నుండి హెచ్చుగా కనబడుచున్నవి. ప్రవర్తిఁల, రక్షింపమన్న, సంప్రాప్తంబైన.

**అన్నంతరూపములు :** ఒప్పగ, ఎఱుంగన్, పన్నివన్.

**ప్రేరణార్థకములు :** రావించి, కట్టించె, కావిళ్చె మొదలయినవి.

**అవ్యయములు :** ఇట్లుకాను, చూవె, పోలె, కడు, ఎల్ల మొదలయినవి.

**సముచ్చయార్థకము :** ఉం, ము, వు, యుం - కళా కందుగుమ్ ఇచ్చి, వేగవిళాకు వేగుణ్డుము, మహారాజులయు, నొఱంబియు.

**9. వాక్య నిర్మాణ పద్ధతి :** గద్యశాసనములలో వాక్యము చాలవఱకు క్రియాపదరహితమై ప్రథమాంతాన్వయముగలదయి ఉండెను : ఊరిస్వాముళ్ ఇచ్చిన స్త్రితి, వక్రంబు వచ్చువన్టు, పాతకళ్సేసినవారి లోకంబు నుప్టువాన్టు.

సంపూర్ణ క్రియాప్రయోగము భూతకాలిక తద్ధర్మార్థకములందే కనబడుచుండును : పడువారంబు ఇచ్చిరి, పాపంబు గొన్టు, అశ్వమేధంబున ఫలంబు అగు మొదలయినవి.

**10. ధాతువులు :** చాలవరకు ధాతురూపములు అన్నియు మూలధాతువులనుండి మారినవి, అనగా ఇతర దక్షిణభాషలలోని ధాతురూపములకంటె భిన్నరూపములను చెంది తరువాతి భాషలో స్థిరపడిన రూపముల తోడనే కానవచ్చుచున్నవి. ప్రాచీనములగు మూలరూపములను తలపించునవి మాత్రము కొన్ని లేకపోలేదు.

'అ' ధాతువునుండి ఏర్పడిన 'అకున్' అను తద్ధర్మార్థక రూపము ఒకటి తెలుగున 'అగు' ధాతువుగా గ్రహింపబడినది. అక్కు, అకు అనునవి ప్రాచీనరూపము లనుటకు ఈ అకు రూపము ద్యోతకము. కన్నడమున కూడ 'అకున్' అను రూపము కలదు 'అకు' అను రూపము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఉండిన కాని అకు + అన్ = అకన్ > కాన్ అను రూపమే తెలుగున ఏర్పడుటకు అవకాశము లేదు. అజ్మధ్యస్థమగు 'క' కారము సరళ గకారమగుటచేత 'అగు' ధాతువైనది.

'అను' - ఇది తమిళమున 'ఎన్' అను రూపమున గలదు. ఎకారము - 'అ'గా తెనుగున మారినది.

'ఈ' - ధాతువు ఇచ్చు అను రూపమున స్థిరపడినది.

'ఎఱగు' - ఇది తమిళ కన్నడములలో 'అఱి' అను రూపమున ఉన్నది. పదాది అకారము ఇంతకు పూర్వమే 'ఎ' గా మారి తెలుగులో స్థిరపడినది.

'ఏళు' - ఇది ఈ రూపములోనే పెక్కు శాసనములలో కానవచ్చినది. ఇందలి 'ళ' కారము తరువాతి కాలమున 'ల' కారమై 'ఏలు' ధాతువైనది. కాని, దీని మూల రూపము 'ఆళ్' అనునదేమో యని తోచును. తమిళ కన్నడములలో 'ఆళ్' అనియే కలదు. తెలుగులో అఱి > ఎఱగు అయినట్లే ఆళ్ > ఏలు అయినది.

'కేసిరి' - కెయ్, గెయ్ అనునది కన్నడమున ప్రాచీన ధాతువు. దీనినుండి తరువాతి 'చేయు' ధాతువు కకారతాలవ్యీకరణము మూలముగా ఏర్పడినది. ప్రాచీన శాసన కాలపు తెలుగులో 'కేసిరి' అను కకారముతో కూడిన రూపమే ఇంకను నిలిచి యున్నది, దాని సమకాలముననే 'చేసి, చేసినది, చేసిన, చేయుడు, మొదలగు రూపములు కూడ కనబడుచున్నవి. 'చేయు' అప్పటికే ప్రాచుర్యము వహించినది.

**11. శబ్దజాలము :** దేశ్యపదజాలమే హెచ్చుగా ఉన్నది. ఈ భాషలో చేరిన సంస్కృత శబ్దములకు తత్సమ రూపములు క్రమముగా ఏర్పడుచు వచ్చి పద్యశాసనముల నాటికి స్థిరరూపమును పొందినవి. ఈకాలములో సంస్కృత భవముల కంటె ప్రాకృతభవములే హెచ్చుగా కనబడును. దేశ్య శబ్దములలో కూడ ప్రాతరూపములు - మన కిప్పుడు వాడుకలో లేనివి - కొన్ని కనబడుచున్నవి. ఉదా : పుటోలు, పాఱ, వ్రక్రంబు వచ్చు, ఱచ్చు, క్టొచ్చు, కేసిరి, ఎఱుంబోది, పడువారంబు మొదలయినవి.

ఈ విధముగా క్రీ. శ. 7 వ శతాబ్దినుండి కానవచ్చెడి తెలుగు చోళరాజాదుల కాలమునాటి శాసనములలోని భాషను బట్టి చూడగా, తెలుగుభాష సోదరభాషలగు తమిళ కన్నడములనుండి క్రీస్తుశకమునకు చాల పూర్వమే విడివడి స్వతంత్రభాషగా తెలుగుదేశమున వ్యవహరింపబడుచుండినను, మూల భాషా సంప్రదాయములను, ధ్వనులను కొంతవరకు నిలుపుకొనుచునే భిన్నరీతులగు మార్పులకు లోనగుచు, సంస్కృత ప్రాకృత శబ్దజాలమును కొంత గ్రహించి వృద్ధినందుచున్నను, తద్భాషాలక్షణములకు లొంగిపోలేదని వ్యక్తమగుచున్నది.

**మధ్య (నన్నయ) యుగము :** నన్నపార్యుని భారత రచనతో ఆంధ్రభాషా చరిత్రమున రెండవయుగము ప్రారంభమైనదని చెప్పవచ్చును. అంతకు పూర్వము భాషలో సామాన్య జనోపయుక్తములగు పదములు, పాటలు మొదలగునవి రచింపబడు చుండినను శిష్టపండితామోదమును పడసిన యుద్గ్రంథములు బయలుదేరి యుండక పోవుటచేత భాషకు లక్షణము, ప్రామాణికత్వము కుదిరియుండలేదు. తరువాతి కవులు నన్నయ ప్రారంభించి రచించిన భారత రచనా ఫక్కినే ఆధారముగా చేసికొని అందలి భాషా ప్రయోగ విశేషములనే ఆరసి తమకు లక్ష్యముగా చేసికొనుచు తమ తమ ప్రాంతీయ సంప్రదాయములకు అనుగుణముగా మార్పుల నొనర్చుకొనుచు తమ రచనలను సాగించుచు వచ్చిరి. భాషాప్రయోగ విషయమున యత్కించిద్భేదము ఉన్నను మొత్తముమీద నన్నయ రచనావిధానము, భాషాలక్షణము శిష్టలోకానుమతిని పొంది, 'నన్నయ మొదలు చిన్నయ'వరకు ఒక్కరీతిగా ప్రామాణికత్వమును వహించి తొమ్మిదివందలయేండ్ల యాంధ్రసాహిత్యోద్యోగమును కొనసాగించినది. ఇంతటి కాలములోను తెలుగు భాష వ్యవహారమున మార్పులేకుండ ఒక్కతీరుననే ఉండెననుటకు ఏమాత్రము అవకాశము లేదు. కాలక్రమమున అదియు మార్పుల నందుచుండినను ఆ మార్పులు లోకుల నిత్యవ్యవహారమునను, జనసామాన్యమున వ్యాప్తిలో నుండిన కొన్ని దేశిరచనలలోను నిలిచియుండెనే కాని, ఆంధ్రసాహిత్య ప్రపంచమున కంతగా ఎక్కలేక పోయినవి. దీనికి నన్నయాదుల భాషాప్రామాణికత్వమును చెక్కు చెదరకుండ నిలుపజూచిన లాక్షణికుల పట్టుదలయే ముఖ్య కారణమని చెప్పవచ్చును. వారు వ్యావహారిక రూపములను కొన్నిటిని, కవిప్రయుక్తములైన వానిని గూడ, గ్రామ్యములని నిషేధింప జొచ్చిరి. ఈ రీతిగా ఏవో కొన్ని స్వల్పములైన మార్పులకు లోనైనప్పటికిని, నన్నయాదుల శిష్టభాషా ఫక్కియే మొన్న మొన్నటి వరకు - అనగా సుమారు 10-15 ఏండ్లకు పూర్వమువరకు శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు మనదేశములో వ్యావహారిక భాషా వాదమును లేవదీసి, దాని తత్త్వమును విద్యాధికులచే అంగీకరింపజేసి కృతార్థు లగునంత వరకు - ఆంధ్రసాహిత్య లోకమున ఆంధ్రభాషా రచయితల కందరకు మార్గదర్శకమై ప్రమాణమై నిలిచియున్నది. సుమారు 1940 ప్రాంతమున శ్రీ రామమూర్తి పంతులుగారి మహోద్యోగమునకు లోనై కొందరు వార్తాపత్రికలవారు సాహితీపరులు తమ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



రచనలను వ్యావహారిక భాషాగ్రథితములుగా చేయుటకు విరివిగా అవలంబించుటచేత ఆంధ్రభాషాచరిత్రలో 1940 ప్రాంతమున ఒక నూతనయుగము ప్రారంభమైనదని చెప్ప వలసియున్నది. ఈ కారణముచేత నన్నయకు పూర్వము క్రీ. శ. 1040 వరకు పూర్వయుగము - నన్నయకు పూర్వ యుగము - అనియు, నన్నయ తరువాత 1040 మొదలు 1940 వరకు మధ్యయుగము - నన్నయ యుగము - అనియు, క్రీ. శ. 1940 మొదలు ఆధునికయుగ మనియు ఈ భాషా చరిత్రము మూడు యుగములకు సంబంధించి నదిగ స్థూలదృష్టిని విభజింపబడదగినది అగుచున్నది. ప్రస్తుతము నన్నయయుగము నందలి భాషాలక్షణము లెట్టివో, వానికి నన్నయ ఎంతవరకు కారణమయ్యెవో పరికింతము.

నన్నపార్యుడు పావన గోదావరీతీరమునందలి రాజ మహేంద్రపురవరము రాజధానిగా వేంగిదేశమును ఏలు చుండిన రాజరాజనరేంద్రుని ఆస్థానమున నుండినవాడు. ఆ చాళుక్యప్రభువు ఆజ్ఞచే

'సారమతిం గవీంద్రులు ప్రసన్నకథా కలితార్థయుక్తి లో
నారసి మేలు నా నితరు లక్షర రమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితారచన బంధురుడు'

అయ్యెను. నన్నయకు పూర్వము ఈ భాషలో జనసామాన్య మున విశేషవ్యాప్తి గాంచి పాటల రూపమున కంఠస్థములు అయియుండిన ద్విపదరచనలు, షట్పది, అక్కర, గీతిక, సీసము మొదలగు దేశియచ్ఛందోరీతులలో చేయబడిన రచనలు దేశమున విశేషవ్యాప్తి కాంచియుండును. ఈ దేశియచ్ఛందోరీతులు సమకాలమున కన్నడ భాషలో ఉండుటను బట్టియు, తరువాత సోమనాథాదులచే పేర్కొన బడి యుండుటను బట్టియు ఇవి ప్రాచీనకాలమునుండియు వచ్చుచుండినవని తలంపవచ్చును. అప్పటి తెలుగుభాష, ఆ దేశియచ్ఛందస్సు ఆకాలపు పరిస్థితులకు అనువైయుండును. కాని నన్నయ భారతమువంటి యుద్గ్రంథమును తెనుగున రచియింపవలసి వచ్చునప్పుడు అతడు ఈభాషను ఆ మహా కార్యమునకు తగిన దానినిగా చేయవలసిన ఆవశ్యకత కలిగినది. కావున, అంతకు పూర్వమున గల తెలుగుభాష యొక్క స్థితిని కొంతవరకు సంస్కరించినాడు; సంస్కృత భాషా సంప్రదాయానుసారము కొంత నూతన సంస్కార మును కల్పించినాడు. అట్లు చేసిన గాని, ఈ భాష అతని రచనకు ఒదవలేదు. అతడు చేసిన ఈ సంస్కారము మూల మునసే ఈభాషకు ప్రాచీనరూపము మారి సంస్కృతభాషా సన్నిహితమని చెప్పదగిన రూపము సిద్ధించినట్లయినది. అతడు 'ఆంధ్రభాషావాగను శాసనుడు' అన్న బిరుదు నకు కూడ తగినవాడు అయినాడు. ఈత డొనర్చిన సంస్కారములలో ముఖ్యమయినవి క్రింద తెలుపబడినవి. వీనిలో కొన్ని ఆకాలమున శిష్ట వ్యవహారసిద్ధమై యుండ ఈతడు వాఙ్మయమున ప్రవేశపెట్టి వానికి స్థిరత్వము కల్పించినాడు.

1. ఱ కారమును జారవిడుచుట: ఱ కారముతో కూడిన శబ్దములు అతని కాలమున ఆ 'ఱ' కారము పోయి 'డ' కారముతోనో, 'శ' కారము తోనో కూడి వ్యవహారములోనికి వచ్చియుండును. ఈతడు 'డ' కారముతో కూడిన రూపమునే గ్రహించి వాడుకలోనికి తెచ్చినాడు.

2. 'న్ఱ' అను ధ్వనికూడ నన్నయ కాలమునకు అంత రించినది. అతడు దానిని అంగీకరింపను లేదు. యుద్ధ మల్లుని బెజవాడ శాసనకాలముననే 'న్ఱ' అనునది 'ణ్డ' రూపమును పొందినది. మల్లుణ్డు, త్రిభువనాభరణుణ్డు మొదలగువానిలో అది ణకార డకారములతో అగపడు చున్నది. నన్నయ వానినే గ్రహించి వలసిన చోటుల అను నాసికమును తేల్చి పలుకుట, లేదా జారవిడుచుట ప్రారం భించెనని ఊహింపవచ్చును.

3. ప్రాచీన బహువచన ప్రత్యయమగు 'శ్' అనునది తరువాతి కాలమున 'లు'గా మారినను, కొన్ని శాసన ములలో 10వ శతాబ్ది చివరివరకు 'సంవత్సరంబుళ్' అని 'శ' కారముతో కూడి కానవచ్చుచునే ఉన్నది. కాని నన్నయ 'లు' వర్ణమునకు స్థిరత్వము కల్పించినాడు.

4. శకటరేఫ మొకటి ప్రాచీన ద్రావిడభాషా ధ్వను లలో విలక్షణమైనది యీ భాషలో నన్నయ తరువాత కూడ అట్లే నిలి-యున్నది. రేఫ శకటరేఫమైత్రి నన్నయ యతిప్రాసలలో పాటించలేదు. కావున అతని సంప్ర దాయమును అవలంబించిన తరువాతి పెక్కు కవులు కూడ ఈ భేదమును పాటించుచునే వచ్చిరి.

5. భారతము వంటి ఉద్గ్రంథమును సంస్కృతభాష నుండి తెనుగున అనువదించి రచించు సందర్భమున నన్నయ ఆభాషలో తెలుపబడిన భావములను ఈ భాషలో వ్యక్తము చేయుటకుగాను ఆభాషా సంప్రదాయములకు అనుకూల ముగా ఈభాషా సామగ్రిని పెంపొందింప కొనవలసిన అవశ్యకము ఏర్పడినది. కావున తత్సమభాషను తెలుగులో విరివిగా కల్పించుకొన్నాడు. సంస్కృత దీర్ఘ సమాసాదు లను, ఇవి కాక కన్నడ కవులు చూపిన మార్గముననే సంస్కృత వృత్తములను కూడ తెలుగు కవిత్వమున ప్రవేశ పెట్టినాడు. తెలుగు కవితా సంప్రదాయానుసారముగా



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ప్రాసవళ్లను రెంటిని ఈతడు సంస్కృత వృత్తములలోను నియతముగా పాటించినాడు. సమాసములను, శబ్దజాలమును సంస్కృతమునుండి విశేషముగా తెనుగులోనికి ప్రవేశపెట్టుటయే కాక, ఇందలి పలుకుబడికి అనుకూలముగా అచ్చట కారకాది విశేషములకు తగినట్లు తెలుగు పలుకుబడిని పెంపొందించుకొన్నాడు. డు, ము, వు లను చేర్చి తత్సమ శబ్దజాలమును, 'ఇంచు' - ఆగమముచే సంస్కృతధాతువులనే కాక అర్థభేదములను వ్యక్తము చేయుటకు విభక్తి ప్రత్యయములను కల్పించినాడు. చేసి, మెయి, పొంటె, ఉపయోగార్థమున ఆఖ్యాతకు తోడ వర్ణకము మొదలగు వానిని ప్రత్యేకము కల్పించినాడు. ఈ విభక్తు లనవి, విభక్త్యర్థములు సంస్కృతభాషా సంప్రదాయములను బట్టి ఏర్పడినవే కాని ద్రావిడభాషలకు సహజములు కాక పోవుటచే, ప్రత్యయములుగా గ్రహింపబడు ఈ విభక్త్యర్థక శబ్దములను ఇంకను అనేక విధములయిన అర్థములలో ప్రయోగించి తెలుగుభాషయొక్క స్ఫోరకశక్తిని బ్రహ్మాండముగ పెంపొందించినాడు. ద్రావిడభాషా సంప్రదాయమున లేని కర్మణ్యర్థమును 'పడు' ధాతుసహాయమున కల్పించి విరివిగా ప్రయోగించినాడు.

నన్నయ తత్సమపద ప్రయోగవైఖరిచే ఆంధ్రభాషా శక్తిని పెంపొందించినట్లే, తిక్కన అతత్సమ భాషతో చేర్చిన దేశి తెనుగు మెరుగుల కూర్పు నేర్పుచే తెనుగు భాషయొక్క అనంత తేజోమహత్త్వమును వెల్లడిచేసినాడు. ఇట్లు నన్నయ తిక్కనలు ఆంధ్రభాష మహత్త్వమును పెంపొందించుటలో ఒకరి కొకరు సహాయభూతులైరి. తత్సమ రూపములగు భాషను చక్కని పాళ్లలో సమ్మేళనము నొందించి తెలుగుభాషను తీర్చి దిద్దినారు. ఈ పద్ధతియే తరువాతి కవులకు మార్గదర్శకమైనది; లాక్షణికులకు లక్ష్యమైనది. కాని, భాషలో సహజముగ కలుగు మార్పులు కలుగక పోలేదు. లాక్షణికుల లక్షణ బలముచే అవి ఆభాషయొక్క ప్రామాణికతను అంతగా చెరపలేక పోయినవి.

నన్నయ తరువాత భాషలో - ప్రామాణిక భాషలో - కలిగిన మార్పు చాల స్వల్పమే అనక తప్పదు. అట్టి వానిలో కొన్ని :

1. అకారేకార సంధులు
2. వర్ణలోపమున గలుగు దీర్ఘములు : ముత్యములు - ముత్యాలు, చాలా, ఇంకా మొదలగునవి, చేసికొని - చేసుక.
3. చేతురు, కోతురు వంటి రూపములు.
4. వంతుకు, బాలకి, కమలనేత్రివంటి కొన్ని రూపములు.

ఇట్టివి కొన్నిలక్షణ విరుద్ధములని కొందరు లాక్షణికులు ఎత్తిచూపుచు తప్పు పట్టుచునే ఉన్నను, తరువాతి కవులు కొందరు ప్రయోగించుటచే అర్వాచీన భాషలో వాడుకలోనికి వచ్చినవి. కాని వ్యావహారిక భాషలోని అనేక రూపములు శిష్ట వ్యవహార ప్రచురములే అయియుండినను, లాక్షణికులు వానిని పరిహరించుటచే కావ్యభాషలోనికెక్కి ఇంతకాలమునుండి ప్రామాణికత్వమును పడయలేదు. కావుననే ప్రామాణిక కావ్యభాష చాలవరకు నన్నయ కాలమునుండి చిన్నయవరకు ఒకేరీతి నుండినదని చెప్పదగినది అగుచున్నది.

ఈ యుగమునందలి భాషలోని మరికొన్ని విశేషములను మనము గమనింపవలసి యున్నది.

నన్నయకాలమునకు స్థిరపడిన తత్సమ బహుళమగు శైలి సర్వసామాన్యము కాకపోవుటచే దానికి ప్రతిఘటనముగా జానుతెనుగు ఉద్యమము ఒకటి బయలుదేరినది. ఇది కాలక్రమమున అచ్చతెనుగు ఉద్యమముగా పరిణమించినది.

మొదట కేతన అచ్చతెనుగు అనగా తల, నెల, గుడి, మడుగు అని అందరికి సులభముగా తెలియునట్టి పలుకు అని లక్షణము చెప్పినాడు. కాని, పాల్కురికి సోమనాథుని కాలమునకే తలయెత్తిన జాను తెనుగు రచనా పద్ధతిలో కాలక్రమమున జాణతనము ఎక్కువయినది. దీర్ఘ సంస్కృత సమాసములందు ఏవగింపు కలిగిన కవులు కొందరు అచ్చతెనుగు రచన అనుపేరుతో తత్సమములను పరిహరించి తేట తెనుగు రచనలను చేసిరి. కాని మరికొందరు సంస్కృత సమాసములవంటి తెనుగు సమాసములను కూర్పదొడగుటచే ఈ యచ్చతెనుగు రచన క్లిష్టతరము అగుట తటస్థించినది. కోతి అనుటకు కోనదిమ్మరిరాయడు అని, నారదుడు అనుటకు అరివేరంపు తలిసి అని, రుద్రాక్షలు అనుటకు ముక్కంటిపేరిటి కన్నులు అని - ఈ రీతిని కృత్రిమపు తెనుగు సమాసములు కల్పింపబడుటచే తెనుగునకు కల ప్రసన్నత, సారళ్యము నశించినవి. కాని, ఇట్టి భాషలో కావ్యములు కొన్ని మధ్యయుగమున బయలుదేరినను ఈ భాష సర్వజనానుమోదమును పడసినట్లు లేదు. కొద్దికాలమున అంతరించియే పోయినది.

**శబ్దజాలము :** దేశి శబ్దజాలమంతయు చాలవరకు తక్కిన దేశభాషా రూపములతో సజాతీయ మయినదిగనే కనబడును. క్రీస్తుశకాదిని ప్రాకృత భాషా ప్రాబల్యము కల కాలములో ప్రాకృత భవములు ఈ భాషలో విశేషముగా చేరినవి. గౌరవార్థము మనము ప్రయోగించునదియు, పురుషుల పేళ్ల చివర అవసరకము కనబడు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



నదియు అగు 'అయ్య' శబ్దము ఆకాలమున 'ఆర్య' శబ్దమునుండి ఏర్పడినదే. ఆర్య - అజ్జ - అయ్య: అగ్న్యార్య - అగ్గిజ్జ - అగ్గియ్య మొదలయినవి. నన్నపార్యుడే తత్సమపద జాలమును ఈ భాషలోనికి ప్రవేశపెట్టి యుండునని ఇది వరకే సూచింపబడినది. నన్నయ తరువాత నన్నెచోడాదులు తమిళ కన్నడ భాషా సంపర్కముచే కొన్ని తమిళ కన్నడ పదములను భాషలోనికి తెచ్చిరి - కలువడములు, తెంచలు, సూయాణము, సాయి, బిజమాడు మొదలగునవి. కాని, ఇవి భాషలో కలిసి నిలువలేదు. తరువాతి కవులు వీనిని పరిహరించిరి.

పదునాల్గవ శతాబ్దిని మహమ్మదీయుల సంబంధము కలిగినప్పుడు అనేకమగు పారసీ, అరబీ పదములు ఈ భాషలో చేరుట తటస్థించినది. ఇవి చాలవఱకు సామాన్య జన వ్యవహారములో ఉండినవే కాని కావ్యభాషలోనికి విశేషముగా ఎక్కలేదు. పెద్దనాదులు కొన్ని మచ్చులను చూపిరి. తెలుగుదేశము మొగలులు, ముస్లిముల అధికారము క్రిందికి వచ్చిన పిదప అరబీ, పారసీ, ఉర్దూ పదములు అనేకము తెలుగు భాషలో చేరినవి - నవాబు, దర్బారు, హుకుము, కూలి, చాకు, తుపాకి, రయితు, తగాదా, హుషారు, బాకీ, ఖజానా, పితూరీ, ఇనాము (వరాహపురాణము), నకీబులు (మనుచరిత్ర) మొదలైనవి. ఇవి అన్యదేశ్యములు అను భావముకూడ పోవుచున్నది.

అట్లే ఇంగ్లీషువారితోను, ఇతర పాశ్చాత్యజాతుల వారగు ఫ్రెంచి, డచ్చి, పోర్చుగీసు మొదలగు వారితోను గలిగిన సంబంధమును బట్టి ఆయాకాలములలో ఆయా భాషా పదములు కొన్ని తెలుగుభాషలో చేరినవి.

ఇంగ్లీషు: గవర్నరు, మెంబరు, రైలుస్టేషను, కేసు, స్టాంపు, డిక్రీ, క్లాసు, రిజిస్టరు, కోటు, టెలిఫోను, టైము, నవల, లాటరీ మొదలయినవి.

పోర్చుగీసు పదములు; అనాస, అలమారు, కప్తాను, బొప్పాయి, ఇస్త్రీ, బొత్తాము, బిస్కోతు, కమీజు, కాజా, మేజా, పేనా, తువ్వాలు.

ఇట్లే రెండవయుగమున భాషా రూపములలోను, శబ్దజాలమునను కూడ తెనుగుభాష విశేషముగ పెంపొందినది. వాఙ్మయము విస్తరించినది.

**ఆధునిక యుగము:** ఆంధ్రభాషా పరిణామ చరిత్రలో ఈ మూడవ యుగమును ఆధునిక యుగము అని అంటిమి. ఈ యుగమునే వ్యావహారిక భాషా యుగమని కూడ చెప్పవచ్చును. నన్నయాది కవుల శిష్ట కవితా మూలముగా ఏర్పడి ప్రామాణికత్వమును పొంది స్థిరపడిన తెలుగు భాషయే నన్నయ మొదలు చిన్నయ (సూరి) వరకు సుమారు ఎనిమిదిన్నర శతాబ్దములు ఆంధ్ర కవి పండిత శిష్ట కవితాలోకమున ఏకచ్ఛత్రాధిపత్యమును నెరపినది. క్రీ. శ. ఇరువదవ శతాబ్దిని పాశ్చాత్యవిద్యా సంప్రదాయముల ప్రభావము, శాస్త్రవిజ్ఞానము, హేతువాదము దేశమున ప్రబలిన కాలదిని, ప్రాచీన మత సంఘ సంప్రదాయముల యెడల గౌరవము తగ్గుచు శిష్టుల శిష్టత్వము శంకింపబడుచు వచ్చినట్లే భాషాసాహిత్య సంప్రదాయముల విషయమున గూడ వెనుకటివలె శిష్టత్వము శంకింపబడజొచ్చినది. సాంఘిక రాజకీయ వ్యవస్థలందు వలెనే భాషా సాహిత్యరీతుల యందును ప్రజాస్వామ్యత్వ వ్యక్తి స్వాతంత్ర్య భావములు ప్రబలములు కాజొచ్చినవి. ఈ సమయమునవే - అనగా 20వ శతాబ్ది ప్రారంభకాలమునవే - ఆధునిక ఆంధ్రోద్యమమునకు వేగుచుక్క, ప్రాత తెనుగు కవితాపద్ధతికి తోకచుక్క అనునట్లు గురజాడ అప్పారాయ కవి భాషా సాహితీ రీతులలో క్రొత్తదారులను తీయగా, గిడుగు రామమూర్తి పండితుడు వ్యావహారిక భాషాధ్వజమును లేవనెత్తినాడు. మొదట శిష్టవర్గము వలన కొంత ప్రతిఘటన కలిగినను, దేశకాల పరిస్థితులు అనుకూలించుటచే ఈ వ్యావహారిక భాషా వాదమునకు క్రమముగ మంచి బలమే చేకూరినది.

వెనుకటి శతాబ్దముననే యూరపు దేశమున విశేషాభివృద్ధి కాంచిన భాషా తత్త్వశాస్త్ర పద్ధతులు విద్యాధికులలో కొంత వ్యాప్తి కాంచినవి. ఆధునిక భాషాపరిణామ పద్ధతులు పండితుల పరిశీలనకు గురి కాజొచ్చినవి. ఇట్టి సమయముననే శ్రీయుతులు గిడుగు రామమూర్తి పంతులు గారు భాషాపరిణామ మనునది ఏదో ఒక్క కాలమున మాత్రమే జరుగునది కాక, నిత్యవ్యవహారమున అనవరతము జరుగుచునే ఉండు ననియు, నన్నయ కాలమున అతడు కావ్యభాషగా గ్రహించిన శిష్టవ్యావహారికము కాలక్రమమున అనేకవిధముల మార్పునొందిన దగుటచే, ఈ కాలమువారు దానినే అనుసరింపజూచుట యుక్తమును కాదు; అట్లు అనుసరింపను లేరు. కావున, ఈ కాలపు శిష్ట వ్యావహారికమునందే పండితులు, కవులు వివిధ రచనలు సాగించుట శ్రేయస్కర మనియు, ఇదియే దేశమున భాషా సాహిత్యముల అభ్యుదయమునకు తోడ్పడి, కాలానుసారముగ సామాన్య జనులలో కావలసిన విద్యా వ్యాప్తికి దోహద మొనర్చు ననియు వాదించుచు తమ భావములకు ప్రచారము కల్పింప యత్నించిరి. గ్రాంథిక వ్యావహారికములు అనునవి భాషకు భిన్నరూపములే అని, ఒకప్పుడు కేవలము వ్యావహారికమై ఉన్న భాషయే మరొకప్పుడు శిష్టామోదమును పడసి కావ్యభాషయై ప్రామాణికత్వము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పొందును అనెడి భావము అంగీకరింపబడినప్పటికిని, ఆధునిక వ్యావహారికము భిన్నప్రదేశముల భిన్నరూపములు కలదై ఉండుటచేతను, ఈ భాషలో ప్రామాణికత్వమును పడయగలిగిన ఉద్గ్రంథములు కాని, కవితా రచనలు కాని బయలుదేరియుండక పోవుటచేతను, దీనికి ప్రామాణికత్వ మింకను సిద్ధింపలేదని పలువురు తలప దొచ్చిరి. పాఠశాలలలోను, కళాశాలలలోను దానిని అస్థితిలోనే ప్రవేశపెట్ట వలయును అనుటవలన అవ్యవస్థ ఏర్పడి చిక్కులకు కారణమగునను భయ మేర్పడినది. ఈ కారణములచే కొంతకాలము ఈ యుద్యమమునకు మందగతి కల్గినది. కాని దేశకాల పరిస్థితులలో కలిగిన మార్పు వలనను, ప్రజాస్వామ్యభావము, జనసామాన్యమున విద్యావ్యాప్తి, అభ్యుదయోద్యమములు ప్రబలుటచేతను జనసామాన్యమునకు అందుపాటులో నుండు భాషారచనల ఆవశ్యకము మెండయినది. స్వాతంత్ర్యోద్యమము, ప్రపంచ యుద్ధము మొదలగు వాని మూలమున పత్రికాప్రచారము హెచ్చి సామాన్యజనుల అభిరుచులను పాటింపవలసినది అయ్యెను. ప్రజలకు వోటింగు హక్కు కలుగుటచే సామాన్యజనులను ప్రబోధించు నుపన్యాస పద్ధతి ప్రబలినది. క్రమముగా రేడియో ప్రసంగములు వచ్చినవి. ఇన్ని కారణముల మూలముగా వ్యావహారిక భాషా ప్రయోగమునకు ప్రాబల్యము, ప్రాచుర్యము కలిగినది. ఇట్లు క్రమముగా వ్యావహారిక భాషా ప్రయోగము గ్రంథ రచనయందు, వ్యాసరచనయందు, వార్తా పత్రికలలోను ప్రసంగములయందు విశేషముగ విద్యాధికుల చేతను అనుసరింపబడుచునే యున్నది. కాని, దీనికి ప్రామాణికత్వము సిద్ధించినదా అను విషయమున మాత్రము ఇంకను సందేహము పోలేదు; ఏలనగా, విద్యాధికుల శిష్టవ్యవహారమే భాషా ప్రామాణికత్వమునకు లక్షణముగా గ్రహింపదగి యున్నను, ముఖ్యముగా ఈ ప్రజాస్వామిక యుగములో భాషావ్యవహారము యొక్క శిష్టత్వమును నిర్ణయించుట సులభసాధ్యమైన పని కాదు. ఇది సిద్ధింపవలయుననిన అనేక విషయములను కూడదీసికొని రావలసిన యావశ్యకము ఉండునట్లు అగపడుచున్నది.

నన్నయకు పూర్వము సుమారు రెండువందల సంవత్సరములనుండి కానవచ్చుచున్న శాసనములలోని పద్యములను బట్టి ఈభాషకు అప్పటికి గ్రాంథికావస్థ యేర్పడినట్లు తెలియుచున్నది. నన్నయ భారతమువంటి ఉద్గ్రంథమును రచించిన పిదప దీనికి ప్రామాణికత్వము వచ్చి ఇది శిష్ట కావ్యభాషగ ఏర్పడినది. ఇది పద్యరచనా పద్ధతితో ప్రారంభము అయియుండును. కన్నడభాషలో అంతకు పూర్వమే, తత్సమ భూయిష్ఠమగు గ్రాంథిక భాష ఏర్పడి క్రీ. శ. 700ల నాటికే స్రగ్ధరాది సంస్కృత వృత్తరచన ప్రారంభమైనది. దానిని బట్టియే తెలుగు దేశమునను గ్రాంథిక భాషారచన వాడుకలోనికి వచ్చుట ప్రారంభమై యుండును. క్రీ. శ. 850 ప్రాంతము నందలి అద్దంకి శాసనములోని తరువోజ పద్యరచన నన్నయ కాలపు ప్రామాణిక రచనా రీతినే పోలియుండుట గమనింపదగిన విషయమే. అయితే నన్నయకు పూర్వము ఈ శిష్టరచన సంస్కృత వృత్తములలోనికి మాత్రము దిగకపోవుట ఒక విశేషము. తరువాతి చాళుక్య భీముని కొఱవి శాసనము నందలి గద్యరచనబట్టి, గద్యరచనా విషయమున కూడ తెలుగునకు ప్రామాణిక స్థితి యేర్పడిన దనుటకు సందేహము లేదు. కాని అన్ని శాసనములలోని రచనలు కాని, ఈ భాషలో రచింపబడిన దేశిరచనలు కాని ఆకాలమునకూడ ఇట్లే ఉండెనని తలంప వీలులేదు. వ్యావహారిక భాషా ప్రవాహము అప్పటినుండియు ఇప్పటివరకు ఒక్కరీతిని ప్రవహించి వచ్చుచునే యున్నది. దీనికి నియమము లేదు. ఇష్టము వచ్చినట్లు ప్రవహించినది. అందుకనే 'అనియమాత్ గ్రామ్యం హి యత్త్వపభ్రంశః' అన్నారు లాక్షణికులు. నన్నయకు పూర్వపు శాసనములలోని వ్యావహారిక రూపముల నియమాభావత్వమును గూర్చి చెప్పవలసినదే లేదు; చూడుడు :

విజయరాజ్య సంవత్సరంబుళ్, యేనగు, ప్రసాదం చేసిరి, పలువారు, పశేవారు, విషయంబు యేశేవారు, పలేమువరు, ఈల్లు (వీరలు), ఈస్వరునకు, భారణోసి, ఇరుభది, అరుభది, ఎణుంబోది, ధమ్మార్ణవురఘ్మున, ఊరు దాయ చేసిరి, శక్యాదితుష్టు, అయ్న, స్త్రీవద్య మొదలగునవి. 'కౌండిల్యగోత్రస్య, పెన్బాఱ రేవక శర్మణ పుత్రస్య, అగ్నిశర్మ్మణరికి ఇచ్చిన దతి', 'అసి వైరువు లికితం'- ఇట్లు తెలుగు సంస్కృత విభక్తుల కలగలుపు - ఇవన్నియు వాడుకలో ఉన్నవి. ఇట్టి రూపములు అన్నిటిని కేతన పెద్దనలు ఇద్దరు గ్రామ్యములని పరిహరించియే యున్నారు. కేతన 'వృషేణ దణాయ పక్షిభిః పుత్రస్య' వంటి సంస్కృత విభక్త్యంతరూపములు, ఇంకను 'అస్తి, ప్రయాతి' వంటి సంస్కృతమందలి క్రియారూపములు, క్త్వాంత ల్యబంతములు, తుమున్నంతములు, 'అపి, చ, తు, హి' వంటి అవ్యయములు ఆంధ్ర కవితయందు చొఱవు అని పరిహరించి మణిప్రవాళ పద్ధతి రచన తెనుగున పనికిరాదని వ్యక్తము చేసినాడు; పిదప దీర్ఘములతో కూడిన పంచాకుమయ్యా, తోపించాకుమయ్యా వంటివి, యేదాలు, వోదాలు, యినుతిచేసె, మోసేటివారు, పంపేరు, తెంపేరు,



http://sanskritcentral.com/

http://teluguthesis.com/

ఇస్తి, అషువలె, ఇషువలె, వేయకుండాడు, శామ్మడు ఇత్యాదులు గ్రామ్యములని చెప్పినాడు. తరువాతి లక్షణ కర్త పెద్దన. ఈతడును 'గాసర బీసరలైనట్టి కట్టడి పలుకులే గ్రామ్యము' అని లక్షణము చెప్పి వానికి ఉదాహరణముగా గొంచారమ్మ, గొంటూబోకు, వేసాలు, దోసాలు, కానేము, బొందలు, బొక్కలు, గుండలు మొదలైన వానిని ఉదాహరణముగ ఇచ్చినాడు. ఇవి కట్టడి పలుకులు ఎట్లు అయినవని అతని యుద్దేశమో తెలియదు కాని, వీనిలో పెక్కు వ్యవహారమునందు అగునట్టి ఉచ్చారణ వేగములో, కలిగిన వర్ణలోపాదులచే మారురూపు పొందిన వనుటకు మాత్రము సందేహము లేదు. అషువలె, ఇషువలె అనునవి ఛాందసుల వ్యవహారములోనివి. అస్లే యుండాము, పోదాలు, యినుతి, ఉండాడు, శామ్మడు మొదలగునవి సామాన్య పామరజన వ్యవహారము లోనివి కావచ్చును. పదాదిని, ఇ ఈ, ఎ ఏ, ఉ ఊ, ఒ ఓ అను యకార వకారములతో గూర్చి పలుకుట పదమూడవ శతాబ్దమునుండి కానవచ్చు చున్నది. ఈ రూపము లిప్పటికిని శిష్టసమ్మతములు కాలేదు. కాని వేసాలు, దోసాలు అనునవి వేషములు, దోషములు అను శబ్దములలోని మువర్ణలోపము కలిగి, పూర్వాచ్చునకు దీర్ఘము వచ్చి ఏర్పడినవే. ఇటివల 'ముత్యములు - ముత్యాలు' వంటి యిట్టి రూపములకు లక్షణము ఏర్పడి అవి శిష్టరూపములుగనే గ్రహింపబడ జొచ్చినవి. పాడేము, చూచేము, పంపేరు మొదలైనవి పాడెదము, చూచెదము, పంపెదరు మొదలగువానిలోని 'ద' వర్ణలోపము, పూర్వాచ్చునకు దీర్ఘము కలుగగా ఏర్పడినవే. వాటీ, మేమూ, నీవూ - ఇవి సముచ్చయార్థకమగు తుది 'ను' వర్ణము లోపించి దాని ఊతకు బదులుగా వచ్చిన దీర్ఘముతో కూడిన రూపములు. అవీ, ఇవీ, నీవూ, నేమా, వారూ మొదలైనవి ఇప్పటి శిష్టవ్యవహారములో అనేకము కలవు. తరువాత, అప్పకవి గ్రామ్యమునకు లక్షణము చెప్పుచు 'అక్షరవిలోపమై యుండునట్టి పలుకు గ్రామ్య' మని, అదే 'అపభ్రంశకంబు ననగబడును' అని, దానికి ఉదాహరణముగా ఆడ (<అకడ) అను దానిని పేర్కొన్నాడు. ఇంకను వస్తాడా, తెస్తాడా వంటివి గ్రామ్యోక్తు లన్నాడు. ఇవి వచ్చుతాడు, తెచ్చుతాడు రూపములనుండి ఏర్పడి ఉండవలెను. కాని, ఇట్టివి వ్యవహారములో ఏకాలములోను ఉన్న జాడ లేదు. వచ్చును, వత్తును, వత్తువు రూపములే ప్రసిద్ధములు. కాని, ప్రథమ పురుషములో లింగభేదమును చూపుటకు చేసిన వాడు>చేసినాడు, చేసినయది>చేసినది అను రూపములు కాలక్రమమున బయలు దేరినవి. వీని సాదృశ్యముననే, 'చేసుతాడు, చేసుతాను, చేసుతావు' అను రూపములు కల్పింపబడుటచే చేస్తాడు, చేస్తాను, చేస్తావు అనునవి పదమధ్యోకార లోపముచే కలిగి యుండును. 'గొల్లడు' శబ్దము కూడ గ్రామ్య మనియే అప్పకవి చెప్పినాడు. కాని ఇదియు 'గొల్లవాడు'లోని 'వా' లోపముచే గలిగినదే. చేయగలవాడు>చేయగలడు - కలరు, కలడు రూపములు భారత కవుల నాటినుండి ప్రసిద్ధములే అగుచుండగా 'గొల్లడు' శబ్దము గ్రామ్య మనుట ఎట్లో తెలియదు. వ్యావహారికములో కలిగిన మార్పులకు చాలవరకు వ్యవహారవేగమున కలిగిన లోపములు, ఒకప్పుడు దానిని పూరించుటకు కలిగిన దీర్ఘములు, లేదా, కూడబడిన హల్లుల సమీకరణము మొదలైనవి ముఖ్యకారణములు.

నన్నయకు తరువాత రెండు మూడు వందల సంవత్సరముల వరకు తెనుగునకు లక్షణమే లేదు. కేతన చేసిన లక్షణము కూడ ప్రత్యేకము నన్నయ భాషను ఉద్దేశించి చేసినది కాదు. ఆంధ్రభాషకు బహుపథంబు. లనుచు ఉండగా అతడు ఒక త్రోవ మాత్రము చూపితిని అన్నాడు. ఎట్లు? గంగకు త్రోవ చూపుచు 'కంచి, వెల్లూరు మరియోరుగల్లయోధ్యయను పురంబులపై గంగ కరుగు' మని ఏదో ఒక రీతిని చెప్పినట్లుగా చెప్పితి నన్నాడు. కావున నన్నయ రచనను అరసికొని తిక్కన, వీ రిద్దరిని అనుసరించి ఎఱ్ఱాప్రెగడ, ఈ కవిత్రయము వారి రచనలను అనుసరించి తరువాతి కవులు శిష్టభాషను, శిష్టకవితా మార్గమును ఏర్పరుచుకొనినను ఆంధ్రకవితకు ఆంధ్రభాషకు అది ఒకటే పథము కాదు. తరువాతి వైదికమార్గ వర్తనులు అందరు ఈ మార్గముననే నడచుటచేత ఇదియే రాచబాటయై తక్కినవి కప్పవడి పోయినవి.

కేతన పెద్దనలు శిష్టభాషకు ఏదో ఒక లక్షణము సమకూర్చుటకు పూర్వమే, ఆంధ్ర భాషకు అప్పటికున్న 'బహుపథము'లలో నన్నయ అవలంబించినదానికంటె భిన్నమగు మరియొక పథమును మనకు చూపినవారు నన్నెచోడ, సోమనాథ కవులు. వారు కేవల శబ్దరూపములలోనే కాక భాషాలక్షణములో కూడ భిన్నపథమును అవలంబించినారు; అనగా లాక్షణికుల నిబంధనలకు లోనుకాని ఆకాలపు తెలుగుభాష ఎట్లున్నదో వీరి రచనలు మనకు తెలుపుచున్న సన్నమాట. తరువాతి లాక్షణికుల దృష్టిలో ఇవి అలాక్షణికములు కావచ్చును. కాని, ఆకాలపు పరిస్థితిని బట్టి చూచినచో ఆంధ్రభాషకు ఆకాలమున ప్రచారములో ఉన్న బహుపథములలో ఇదియు ఒక శిష్టమార్గమే అని మనము తలంపక వీలులేదు. అప్పటికి ఇంకను భాషకు కవుల శిష్టకవితా సంప్రదాయ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



నిబంధనమే కాని లాక్షణికుల విధినిషేధరూప నిబంధనములు ఏవియు ప్రచారములోనికి వచ్చినట్లు అగుపడదు. తరువాతి కవులలో పెక్కురు కవిత్రయమువారి భాషా సంప్రదాయమును నిలువబెట్టుటకే ప్రయత్నించిరి. కాని, 'నిరంకుశాః కవయః' అను ఆర్యోక్తిని బట్టి వారిలో ప్రౌఢులు, స్వతంత్రులు అగువారు కొందరు, సమకాలిక వ్యవహార ప్రాబల్యమునకు లోనగుటచే కాబోలు, లాక్షణికులు పెట్టిన హద్దును మీరుచునే యుండిరి. అట్టివానిని తరువాతి లాక్షణికులు ఖండించుచు ఆకవి యలాక్షణికుడని నిరసించుటో, లేదా, వానిని కూడ మహాకవి ప్రయోగములని అంగీకరించుటో, లేక, వేరువిధముగ సమర్థింప జూచుటో, కాక, వీలైనచోటుల తమ లక్షణములకు అనుకూలముగ పాఠాంతరములను కల్పించి మూలపాఠములను దిద్దివేయుటో చేయుచు వచ్చుచుండిరి. ఈ రీతిగా కవిత్రయము వారి కాలమునుండి ఒక ప్రక్కన శిష్ట సంప్రదాయసిద్ధమగు ప్రామాణిక భాషాప్రవాహము ఒకటి నడచుచుండ, దాని ప్రక్కనే నన్నయకు పూర్వమునుండి వచ్చుచున్న వ్యావహారిక భాషాప్రవాహము కూడ నడచుచునే యున్నది. అది కావ్యప్రబంధ లక్షణ గ్రంథములు అను ఒడ్డులమధ్య ప్రవహించుచుండ, ఈ వ్యావహారిక భాషా ప్రవాహము శాసన రచనలలోను, కొందరు శైవ కవుల రచనలలోను, తరువాతి కవుల నిరంకుశ ప్రయోగములలోను శిష్టజనుల నిత్యవ్యవహారము, తద్రచిత వ్యాఖ్యానములు, లేఖలు, కైఫీయతులు మొదలగువానిలోను, స్త్రీలపాటలు, సామాన్యజనుల పదములు, భక్తజనుల సంగీత సంకీర్తనాది రచనలు మొదలగువానిలోను, వీధి భాగవతములు, యక్షగానములు, ద్విపదలు, గీతములు మొదలగువానిలోను పొడసూపుచు లాక్షణికమర్యాదలను గట్టులపై పొంగి పొరలి ప్రవహించి, ప్రవహించి నేటికాలము అనుకూలించుటచే ప్రజా ప్రభుత్వము, విద్యావ్యాప్తి, వార్తాపత్రికలు, రేడియో ప్రసంగములు, నవలలు, కథానికలు, హాస్యరచనలు, బహిరంగోపన్యాసములు మొదలగువాని మూలముగా శిష్ట మర్యాదలను ప్రామాణికత్వపు ఒడ్డులను కూడ ముంచివేయుచు అతివేగముగ నడచు మహా ప్రవాహమై వెలసినది. ఇట్టి ప్రవాహమును ఆపదలచుట వెఱ్ఱివాని పనియే. దీనిని సాధ్యమైనంత వరకు లాక్షణిక మర్యాదలు అను గట్టులను దాటకుండ దేశకాలానుగుణముగా, ప్రాచీనాధునిక శిష్టకవిప్రయోగములను కూడదీసికొనుచు, పెంపు చేసికొనుచు వచ్చి, క్రొత్త కాలువలు త్రవ్వుకొని, వాని మూలమున అధునాతన సాహితీక్షేత్రములందు ఆంధ్రకవి కుమారులు క్రొత్త పంట లను పండించుటకు అనువు పడునట్లు చేయవలసి యున్నది. పూర్వకవి సమ్మతములైనవియు, ఆధునిక శిష్టవ్యవహార ప్రసిద్ధములైనవియు అగు భాషా రూపములను, భాషా పరిణామ పద్ధతిని సమర్థించి, సమన్వయించి వానికి లక్షణము కల్పింప గలిగినచో ఆధునికాంధ్రభాషాసాహిత్యములకు శ్రేయోదాయక మగును. ఈ విధానమును అనుసరించియే ఆధునిక ఆంధ్రభాషా లక్షణమును కల్పించుకొనవలసి యున్నది. ఈ యాధునికాంధ్రభాష కేవలము కవితా రచనలకే కాక ఈ కాలమున సామాన్యజనములో విద్యావ్యాప్తికి తోడ్పడవలసి యుండుటచే కాలానుగుణముగా దీని వ్యాప్తిని నిర్ణయించుటకు ఆంధ్ర శిష్టలోకమే ఏదో ఒక విధమున పూనుకొని దానికి విశేషప్రచారము కలుగునట్లు చేయవలసి యున్నది.

కో. రా.

# ఆంధ్ర ప్రాకృతముల జన్య జనక సంబంధ మీమాంస

తెలుగునకు ప్రాకృతభాషలకు సంబంధ మున్నదను విషయము నన్నయ భట్టారక రచితమని ప్రసిద్ధికల 'ఆంధ్ర శబ్ద చింతామణి'లో మొట్టమొదట మనకు తారసిల్లును.

'ఆద్యప్రకృతిః ప్రకృతి శ్చాద్యే;
ఏషా తయో ర్భవేత్ వికృతిః.'

అని నన్నయభట్టారకుని కారిక; అనగా మొదటి ప్రకృతి అయిన సంస్కృతము, రెండవ ప్రకృతి అయిన ప్రాకృతము - ఈ రెండు మొదటివి (పూర్వము ఉండెడివి). ఆంధ్ర భాష వానికి వికృతి.

ఈ కారికను వ్యాకరించిన అహోబల పండితుని అనుసరించి వఝల చిన సీతారామస్వామి శాస్త్రిగారు తమ చింతామణీ విషయ పరిశోధనలో ప్రకటించిన అభిప్రాయము ఇది. సంస్కృత ప్రాకృతములకు ఆంధ్ర భాష వికృతి అనుటలో, శబ్దనిష్పత్తికి ఆంధ్రభాష ఉపయోగించు వ్యాకరణ ప్రక్రియలు మొదటి రెండు భాషలలో ఆ పనికే వాడుకలో ఉన్న వ్యాకరణ ప్రక్రియలను అనుసరించును అని తెలియజేయుటకే కాని మొదటి భాషలనుండి ఆంధ్రము జనించిన దని సూచించుటకు కాదు.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



బాలసరస్వతి మతముతో సంస్కృతమును తత్సమ తద్భవములచేతను, ప్రాకృతమును కూడ అట్లే తత్సమ, తద్భవములచేతను ఆంధ్రభాష అనుసరించుచున్నది అను అర్థములో పై నన్నయకారికను అవగాహనము చేసికొన వలెను.

ఇది ఇట్లుండ, కాల్డ్ వెల్ అను పాదిరియును, ఆయన పక్షమును ప్రమాణముగా అంగీకరించినవారును ఆర్య భాషలకును - ముఖ్యముగా సంస్కృతమునకును, ఆంధ్రము వంటి ద్రావిడ భాషలకును సంబంధము ఏమియు లేదు అను నిష్కర్షకు వచ్చినారు.

ఆంధ్రభాషా చరిత్రకారులగు కీ. శే. డాక్టరు చిలుకూరి నారాయణరావుగారికి కాల్డ్ వెల్ దొరగారి నిష్కర్ష పూర్తిగా నచ్చలేదు.

ఆంధ్రభాషా శరీరమందు తత్సమ, తద్భవ, దేశ్యవర్గములు అను మూడు జాతుల పదములు ఇమిడియున్నవి. తత్సమ తద్భవముల విషయమై, ఆ పదముల వ్యుత్పత్తిని బట్టి విచారించినయెడల వివాదమే లేదు. ఎటు చూచినను దేశ్యపదముల విషయములోనే భాషా చరిత్రకారులు పై చెప్పిన విరుద్ధ పక్షములు స్వీకరించియున్నారు.

ఆంధ్రమునకును, ప్రాకృతమునకును జన్య జనక సంబంధము ఉన్నదనుటలో, ఆంధ్రమందలి దేశ్యశబ్దములు అన్నిటికిని ప్రాకృతభాషయందు ప్రకృతి రూపములు గోచరించునని అభిప్రాయము.

ప్రాకృతభాషలు సంస్కృతమునుండి ఉత్పన్నమైనవని భావించి (ఈ భావన నవీనభాషా పరిణామచరిత్ర దృష్టిలో సరికాదు) అట్టి ప్రాకృతమునుండి ఆంధ్రభాషయందలి దేశ్యము లుద్భవించినవని సంబంధాస్తిత్వవాదుల మతము.

నన్నయ చెప్పిన ఆద్యప్రకృతి యగు సంస్కృతమునకును, ద్రావిడ భాషలకును ఎట్టి సంబంధము లేదని నిరూపించుపక్షమున, సంస్కృత జన్యమగు ప్రాకృతమునకును, ఆంధ్రభాషకును సంబంధము లేదని వేరుగ చెప్ప నక్కరలేదు.

ఈ సందర్భముననే శ్రీ గంటి జోగి సోమయాజులుగారు తమ 'ఆంధ్రభాషా వికాసము' అను గ్రంథమందు కాల్డ్వెల్ సిద్ధాంతము ననుసరించి నిరూపించిన ఈ క్రింది ఉపపత్తులు అర్థవంతములు. ఈ యుపపత్తులు స్వపక్షస్థాపనయందు అసమర్థములని నిరూపించుచు, కీ. శే. డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు ప్రాకృతభాషకును, తెలుగు భాషకును సంబంధము ఉన్నదని రుజువుచేయునట్టి సమాధానములు కూడ ఈ యుపపత్తులతోపాటు జోడించి చూపబడినవి.

## ఉపపత్తులు : వానికి సమాధానములు

**1. ఉపపత్తి :** ద్రావిడ భాషలలోని శబ్దజాలమందు సంస్కృతము కానిభాగము సంస్కృత భాగముకంటె ఎక్కువగా ఉన్నది.

**సమాధానము :** కాల్డ్ వెల్ సంస్కృతము కాని భాగము అనుకొన్నది నిజముగ ప్రాకృతభాగము. కేవల దేశ్యము అని తలంపబడు ద్రావిడ భాషా శబ్దజాల మంతయు ప్రాకృతమార్గమున ఎక్కువగ వికారము పొందినది అయియున్నది. వాస్తవికముగ దేశ్యమయిన భాగము కొలదిగనే ఉన్నదని పరిశోధనమువలన తేలగలదు. ఈ విషయమును పరిశీలించిన శ్రీ వఝల చిన సీతారామస్వామి శాస్త్రిగారు ప్రాకృతమునకును తెనుగునకును కల సంబంధము స్వాభావికమని తెల్పియుండిరి. పరిశోధనలు ఈ యూహను పూర్తిగ నిలువబెట్టజాలవు. నిఘంటువులలోనికి ఎక్కని పదములలోను, నిఘంటువులలోనికి ఎక్కిన దేశ్యములని పేర్కొనబడినవానిలోను ఎన్నో ప్రాకృత భవములు కనిపించుచున్నవి. ప్రాకృతములను, వానినుండి ఉత్పన్నములైన యపభ్రంశములను వెదకినచో ఎన్ని ప్రాకృత భవములు లభించునో ఇప్పాటున చెప్పజాలము. ప్రాకృతమను పదమునకు విశాలార్థము ఇక్కడ గ్రహింపవలయును. పాళీభాష మొదటి ప్రాకృతమని పండితు లంగీకరించిన విషయము. షడ్విధప్రాకృత భాషలను, వాని అపభ్రంశములను వెదుకవలయును. ఇట్లు కూలంకషమయిన అన్వేషణము కావించినచో దేశ్యశబ్ద ప్రపంచమంతయు ప్రాకృత భవమే యని తేలుటకు ఎంతయు సంభావ్యత కలదు.

. పై సంభావ్యతకు అవకాశము ఇచ్చునవిగా వెదకినంత మట్టుకు ఈ క్రింది యుదాహరణములు కాననగును.

| పాళీ | తెలుగు |
|---|---|
| బొంతిన | బొంది |
| ఒడ్డిత్వా | ఒడ్డు |

ఇట్లే 'పస్తాయించు', 'ఓర' (ప్రక్క) అను పదములు కూడ పాలియందు కలవు.

కాగా, శాతవాహన మహారాజ సంకలితమైన 'గాథా సప్తశతి'లోని తెలుగు పదాలు రెండువేల యేండ్ల క్రిందట ప్రాకృత సాహిత్యములో చేరిపోయినట్లు కొందరి అభిప్రాయము. దీనినిబట్టి చూడగా ప్రాకృత శబ్దాలే (వానికి సంస్కృతమూలము కనబడక పోవచ్చుగాక) తెలుగు శబ్దాలకు మాతృక కాకూడదా అని తోచుచున్నది.

గ్రామీణ శబ్దాలను కూడ ఆదరించి 'వర్ద' శబ్దమునుండి 'ఎద్దు', 'త్యక్త' నుండి 'చెత్త', 'త్వక్' నుండి 'తొక్క'



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పుట్టినదని ఇం కొక యభిప్రాయము. ఇంకను ఉదాహరణ ములు: 'కణ్ణేరో' (సం. కర్ణికారము)నుండి 'గన్నేరు', [ప]యండ, (సం. ప్రచండ)నుండి 'ఎండ' వచ్చిన ట్లున్నవి. 'చండ' నుండి 'ఎండ' వచ్చిన దనుట (ఉపసర్గ భ్రంశము ద్వారమున) కొందరికి వింతగా కనబడవచ్చును. ఇట్టివి అనేకము లున్నవి. 'మృషా' శబ్దమునుండి 'మోసము' పుట్టినది. హేమచంద్రాచార్యుడు ఒక్కచే ప్రాకృతమున కొన్ని యెడల ఈ 'ఋ' కారమునకు 'ఓ' సిద్ధించునని తన శబ్దానుశాసనమున నిరూపించినాడు (I—186, సూ. సిద్ధ హేమ శబ్దానుశాసనము).

హేమచంద్రాచార్యుడు ధాత్వాదేశము లనుపేర కొన్నింటి నొసగియున్నాడు:

భక్ష్ ధాతువునుండి 'బొక్కు'
అర్ప్ ,, 'ఒప్పగించు'
కూజ్ ,, 'కూయు'

వీనిని తద్భవములుగా అంగీకరించవచ్చును. ఇక ఆదేశ ములను పరిశీలించిన నిప్వెఱ(పోవు), వాడు (మ్లా), రంఖోల (డోల)-ఇది 'రంకులరాట' రూపమున తెన్గున గలదు, 'వ్రజ్' ధాతువునుండి - వర్ (ద్రావిడ), - 'వచ్చు' (తెనుగు), 'గమ' ధాతువునుండి 'పద'యును, 'తక్ష' అను శబ్దమునకు 'రంప' యును ఆదేశములుగ వచ్చినట్లు గ్రహించవచ్చును.

ఈపై చర్చ పర్యవసానమును ఈక్రింది విధమున తెలుప వచ్చును: తెలుగున 'దేశ్యము' అను శబ్దజాలము సంస్కృత భవమువలె ప్రాకృతభవమును అనియు పరిశోధనవలన తేల్చుకోవలసిన విషయము అని. ఈవిషయమై ప్రాకృత భాషా పరిశోధనను భాషా శాస్త్రజ్ఞులు ఎక్కువగా చేయ వలసియున్నది.

**2. ఉపపత్తి :** ద్రావిడభాషలలోని సర్వనామ సంఖ్యా వాచక శబ్దములును, సుప్తిఙ్ ప్రత్యయములును, వాక్య నిర్మాణమును-అనగా భాషకు జీవ మనదగిన దంతయు-మొదటినుండియు సంస్కృతమునకును ద్రావిడ భాషల కును వేర్వేరుగ నున్నది.

**సమాధానము :** సర్వనామములు సంస్కృతమునకును ప్రాకృతములకును సమానమూలమగు ఇండో - ఐరేనియను భాషలనుండి వేర్వేరు మార్గముల పరిణామమునొంది వచ్చి యుండుటచే భేదము కలిగినది.

ఇక సంఖ్యావాచకపదముల విషయమునందు ఇండో యూరోపియను భాషలయందును, ఈనాటి యార్య భాషలయందును అనేకములగుపోలికలు చూపుటకు అవ కాశము ఉన్నది.

సుప్తిఙ్ ప్రత్యయములు ప్రాకృత భాషలలోనే లోపించి నవి. విభక్తి రూపము లన్నియు సామాన్యముగ ఏకరూప మును తాల్చుటచేత ఆ విభక్తి సంబంధమును తెలుపుటకు క్రొత్తమాటలు చేర్పబడుచు వచ్చినవి. ఈమార్పు ద్రావిడ భాషలయందువలె తక్కిన నేటి యార్యభాష లన్నిటి యందును కానవగుచున్నది. వాక్యనిర్మాణ విషయమున సంస్కృతమునందు పద ప్రత్యయ సంయోజనము సంపూర్ణ ముగ ఉండుటచే వాక్యములోని శబ్దముల స్థానము విషయ మున ఒక నియతి లేకుండెను. కాని, ప్రాకృత భాషల యందును ప్రత్యయములు లోపించుటచే వాక్యములోని శబ్దముల స్థానము విషయమున ఒక నిర్ణయము ఏర్పడ వలసి వచ్చినది.

సర్వనామముల చరిత్రమును ప్రాకృతావస్థకంటె ఇంకను పూర్వకాలమునకు, అనగా ఇండో-ఐరేనియను భాషల కాలమునకు తీసికొనిపోయిన యెడల తెలుగున కును ప్రాకృతములకును జన్య జనక సంబంధము ఉన్నట్లే రూఢియగును.

ముందు నిర్దేశార్థక సర్వనామముల విషయము పరిశీ లింతము. 'అద్', 'ఇద్' ఏకవచనమున క్రమముగా దూరము, సమీపము అను అర్థములందును, 'అవ్', 'ఇమ్' అట్లే బహువచనమందునే ఐరేనియను అవెస్తా భాషలో ఉన్నవి. ఈవిధముగానే అద్, అన్; ఇద్, అమ్; అవ్, అమ్, ఇమ్ అనునవి ఇండో-ఆర్యభాషలలో ప్రాచీన తమమగు వైదికభాషలందు ఉన్నవని భాషాపరిణామకో విదులు తెల్పుచున్నారు. నేడు మనకుగూడ పాలి మొద లగు ఆదిమ ప్రాకృతభాషలలో 'అదుం,' 'అముం' అను నపుంసకలింగైక వచన రూపములు దూరమం దున్నవానిని నిర్దేశించుటకును, 'ఇదం', 'ఇమం' అనునవి సంస్కృతమున వలెనే సామీప్యార్థమునను గోచరించుచున్నవి. ఇంతేకాక, ఇతర ద్రావిడభాషలలో లేనట్టియు, తెలుగున ఉన్నట్టియు 'ఇతడు, అతడు' అను రూపములకు 'ఏత' ప్రాతి పదికము పాలిభాషయందు కానవచ్చుచున్నది. దీని తాత్పర్యము ఏమనగా, అ, ఇ అను దూర, సామీప్యార్థ మూలములును, వానినుండి ఏర్పడు 'అద్, ఇద్, అవ్, ఇవ్' అను సర్వనామ ప్రాతిపదికలును ఒక్క ద్రావిడ భాషల సొమ్మే కాదని.

ఇక సంఖ్యావాచకములను గురించిన సమాధానము: ద్రావిడభాషలకు ప్రాకృత భాషలయందు కాని, నేటి ద్రావిడేతర ఆర్యభాషలందుకాని సంఖ్యావాచక పదముల విషయమున ఎక్కువ పోలికలు కనబడవు. యూరోపి యను భాషలందును, ఐరేనియను భాషలందును కూడ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వీనికి ఎక్కువ సామ్యము కాన్పింపకున్నది. సంఖ్యావాచక పదములు ద్రావిడభాషలందు ప్రత్యేకముగ పుట్టినవో, లేదా, వేరు ప్రచారమునుండి తొలగిన ఏపైశాచ్యాది భాషలమండియైన వానియందు చేరినవో నిర్ణయించుట కష్టము. అయినను ఐరేనియను భాషలయందలి స్వరపరిణామమును బట్టియు, వేటి కొన్ని కొన్ని పైశాచీ భాషల యందలి కొన్ని రూపములమబట్టియు ఆలోచించి పరిశోధన చేసినయెడల ద్రావిడ సంఖ్యావాచక పదముల స్వరూప నిర్ణయమున ఒక సూత్రము చిక్కునేమో వెదకవలసి యున్నది.

ఏక > ఒక

ఇచ్చటి అచ్చు మార్పు, 'స్తేన' - 'థూణ'యందువలె జరిగినది.

కాల్డ్ వెల్ కూడ ఇది అసంభవము కాదని అంగీకరించినాడు.

ఇచట ఆంధ్రభాషా వికాసకారులు 'ఒక'⟷'ఒరు' (అరవము) కుటుంబమునకు చేరిన దనుచు, 'ఏక' శబ్దభవ మగు 'ఎక్క' నుండి 'ఒక, ఒక్క'లు పుట్టిన వనుట యుక్తి దూరమని తెల్పుచున్నారు. అట్లే, 'ద్వంద్వ' శబ్దమునుండి 'దొందు' ద్వారమున 'రెండు'ను పుట్టింప జూచిన డా. నారాయణరావుగారి యత్నము క్లిష్ట మనియే తోచుచున్నది. ఈ సందర్భమున పదాది దకారము రేఫముగ మారుటకు దౌవారిక > రవ్వారి మొదలగు ఉదాహరణములను వారు చూపియున్నారు. సోమయాజిగారు 'ఇర్' ధాతువునుండియే, కాల్డ్ వెల్ చెప్పినట్లు, 'రెండును' ద్రావిడ రూపముగ సమర్థించుచున్నారు. మూడునకు 'మూన్' మూలరూపమని నారాయణరావు గారు అంగీకరించి ద్రావిడేతర భాషలయందు ఎందును దీనిని బోలిన త్ర్యర్థ వాచకపదము కానరాలేదని స్పష్టముగ తెల్పియున్నారు.

'నాలుగు' విషయమునను, 'మూడు' విషయమునను అట్లే తెల్పి 'చతుర్ శ్వః' (అటావతెల్లుండి) అను సంస్కృత రూపమునుండి 'వర్సా' అను ఉత్తర హిందూస్థాన భాషలలోగల రూపమునందలి 'వర్'కును 'నల్' అను 'నాలుగు'నందలి మూలమునకును సంబంధము ఉండియుండవలెనని డా. నారాయణరావుగారు ఒక క్లిష్ట ప్రక్రియను సూచించి యున్నారు. ఇట్టివి భాషా పరిశోధకులకు చక్కని సమస్యలు.

'అయిదు'- పంచశబ్దమందలి తొలి పకారము హకారమై క్రమముగ అకారముగ మారిన దనియు, పదిహేను, పదహైదు అను వాడుకరూపములందలి హకారము చారిత్రక పునరుజ్జీవన మనియు డా. నారాయణరావుగారి యభిప్రాయము. 'వికాస'కారులు 'ఏన్' ప్రాచీనరూపమని నిరూపించి ఇది కేవల ద్రావిడపదమని తెల్పుచున్నారు. 'ఆఱు' - 'దశ' 'దహ'గా మారినట్లు షష్ (శశ్) హార్ (హోర్)లుగా మారి ఆఱైనదని డా. నారాయణరావు గారి యభిప్రాయము. ఇది అగమ్యగోచరముగా ఉన్నది. పైయట్లే సప్త - హస్తగను (ఈరానియను భాషయందు) హత్థగను కూడ మారుచు హేడు, ఏడు అవతరించినవని డా. నారాయణరావుగారి వాదము.

'అష్ట' 'అర్ధ'గను, అరవమందలి 'ఎట్టు' గను మారిన దనియు, 'అ' 'ఎ'గా మారుట ప్రాకృతధ్వని పరిణామనియమానుసార మనియు తెల్పుచు డా. నారాయణరావుగారు తెలుగునందలి 'ఎనిమిది'కి పదికి రెండు తక్కువ అని వ్యుత్పత్తిని కల్పించిన కాల్డ్ వెల్ వాదమును నిరాకరించుచున్నారు. పైగా ఒక్క తెలుగున మాత్రము ఎనిమిదికి ప్రత్యేకముగా అంకె లేకుండునా అనిరి. ఎనిమిది తొమ్మిది సామ్యమున ఏర్పడిన దనియు, 'ఎన్' అష్టన్ శబ్దభవ మనియు, పది యనుపదమునం దనునాసికధ్వని వినబడకున్నను 'పంద్రెండు' మొదలయిన సమాసము లందు అది గోచరమగుచున్న దనియు డా. నారాయణరావుగారు సయుక్తికముగ నిరూపించియున్నారు. అట్టి 'పది'కి 'పిది' కోర్వీ భాషయందును, 'మిది' తెనుగునను రూపాంతరము లనియు వారి యభిప్రాయము. 'తొన్' 'ఒన్'లు తోడు, ఓడులకువలె తెనుగునకును ద్రావిడ భాషలకును గల సంబంధమును సూచించుచున్న వనియు, 'ఊన' 'ఏకోన' యను నర్థమున 'ఒన్' గా మారిన దనియు డాక్టరుగారి యభిప్రాయము.

తదుపరి తెనుగునందలి 'వంద' విలక్షణమైనది; ఇతర ద్రావిడ భాషలందు లేదు. భారతకవులు వాడలేదట. సమూహార్థకమగు బృంద (వృంద) వంద యైనదని జైన గ్రంథ ప్రమాణమును చూపుచు నారాయణరావుగారు వ్యుత్పత్తిని తెల్పిరి. కాల్డ్ వెల్ ఈ విషయమై పట్టించుకొనలేదు. కాల్డ్ వెల్ 'నూఱు'కు 'పొడిచేయు' అను అర్థముద్వారా బహురేణుకమను అర్థమును, శతార్థమును కల్పించినాడు. ఇది ద్రావిడ ప్రాణాయామము చేసినట్లు ఉన్నదని నారాయణరావుగా రందురు.

ఇక 'వేయి'కి 'ఆవిర' అను 'ఆయిర' సజాతీయము, నష్టమైనది అగు పూర్వరూప మనియు, అది సహస్రశబ్దభవ మనియు నారాయణరావుగారు వ్యుత్పత్తిని కల్పింప జూచిరి.

పై వాదములలో కొన్ని సందేహాస్పదములుగా నున్న వనక తప్పదు. తెలుగున సంఖ్యావాచకములు కేవలము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఆర్యములో, కేవల ద్రావిడములో, లేదా, మిశ్రములో నిర్ణీతముగా తెలియుటలేదు. ఎట్లున్నను, తెలుగుపై ప్రాకృతాంశ ప్రభావ మీ విషయమున కొంత కలదని అంగీకరింపక తప్పదు. పరిశోధన లింకను పూర్ణముగా సాగవలెను.

సుప్తిఙ్ ప్రత్యయముల విషయమును గూర్చి వ్రాయుచు ఇవి ప్రాకృత భాషలలోనే లోపించినవని డా. నారాయణరావుగా రనుచున్నారు. కాని ప్రాకృత వాఙ్మయ మందుకు విపరీతముగ సాక్ష్య మిచ్చుచున్నది. సుప్తిఙ్ ప్రత్యయములు క్రమముగ రూపము నందును, సంఖ్యయందును అరగఁబొచ్చిన వనుట మాత్రము స్పష్టము.

వాక్యనిర్మాణ విషయమున నారాయణరావుగారు ఇట్లనుచున్నారు: సంస్కృతమునందు పద ప్రత్యయ సంయోజనము సంపూర్ణముగ ఉండుటచే వాక్యమందలి శబ్దముల స్థానము విషయమున ఒక నియతి లేకుండెను. కాని, ప్రాకృత భాషలయందును, వాని పరిణామరూపములు అగు నేటి భారతీయ భాషలందును ప్రత్యయములు లోపించుటచే వాక్యములలోని స్థానము విషయమున ఒక నిర్ణయము ఏర్పడవలసి వచ్చెను. కాని, ఈ వాదము తృప్తి జనకముగ లేదని చెప్పవలయును.

**మూడవ ఉపపత్తి:** ద్రావిడభాషా నిఘంటువులలో సంస్కృత పదజాలము ఎక్కుడుగ ఉన్నదని ద్రావిడ భాషలు సంస్కృతభాషా జన్యములు అని తలపగూడదు. ఆ నిఘంటువులలో దేశభాషా పండితులు దేశ్యములను ప్రత్యేకించియే యున్నారు.

సమాధానము : ప్రాకృతభాషల శబ్దములతోడి పోలికలు గుర్తింపరాని శబ్దములనే, అనగా వైకృతములనే నిఘంటుకారులు దేశ్యము లనిరి. ఆర్యప్రాకృత భాషలందువలె ద్రావిడభాషల విషయమున ఇట్టి పరిశోధనము ఇంకను జరిగియుండలేదు. కాల్డ్‌వెల్ ఇచ్చిన పట్టికయందలి 'అప్ప'కు 'అంబ', 'తాయి'కి 'ధాత్రి', 'వాయ్'కి 'వాక్' (వక్త్ర) మొదలగు శబ్దములను డా. నారాయణరావుగారు మూలాన్వేషణము చేసియున్నారు.

**నాలుగవ ఉపపత్తి:** ద్రావిడ భాషలలో గ్రంథస్థములు కాని పదములు అనేకము లున్నవి. వీనిలో సంస్కృత పదములు లేనేలేవని చెప్పవచ్చును. సంస్కృత పదములను ఉపయోగించు కొన్ని భాషలలో అవి యంత యావశ్యకములు కావు. వానిని విడనాడినను ఆ భాషలకు లోపము లేదు.

**సమాధానము :** పై వాదమునకు కారణము తరువాతి కాలపు ఆర్యవిజ్ఞానము వీనియందు చేరకుండుటయే. సంస్కృత ప్రాకృత భవములైన శబ్దములను ద్రావిడ భాషలు విడనాడగల వనుట సరికాదు. గంజి, నీరు, అంబలి, కూడు, గరిసె, తెడ్డు, గిన్నె, కట్టెలు, విసనకఱ్ఱ, మంచము, చాప, గొడ్డలి, కత్తి, ఇల్లు, కొట్టు, అంగడి, అటక, మేక, గొఱ్ఱె, గుఱ్ఱము, గాడిద, అవ్వ, మామ, అత్త, బావ, అక్క - ఇట్టి వందలకొలది సంస్కృతప్రాకృత భవములను తెనుగువారు విడనాడజాలరు.

**ఐదవ ఉపపత్తి:** (క) సంస్కృతమున శబ్దముల యంతమును బట్టి లింగ నిర్ణయము జరుగును; ద్రావిడమున శబ్దమునుబట్టియే తెలియును.

(చ) విభక్తి ప్రతిరూపకములగు అవ్యయములే కాని సంస్కృతమునందువలె విభక్తి ప్రత్యయములు ద్రావిడ భాషలలో లేవు.

**సమాధానము :** సంస్కృతమునకూడ లింగము కొంత అనియతమే యనియు, ప్రాకృతమున ఇంకను చెడినదనియు, అందుచే ద్రావిడభాషలలో వేరుగా ఉన్నట్లు కనపట్టు ననియు డా. నారాయణరావుగారు అందురు. ఇక విభక్తి ప్రత్యయముల విషయమున ఆధునిక ఆర్యభాషలలోవలె ద్రావిడభాషలయందును ప్రాచీన విభక్తి ప్రత్యయములు అంతరించి, నూతన ప్రత్యయములు ఏర్పడినవని డా. నారాయణరావుగారి సమర్థనము.

**ఆరవ ఉపపత్తి:** సంస్కృతమునగల (ధాతువుల) ఉపసర్గలు ద్రావిడభాషలందు లేకుండుట ద్రావిడభాషల ప్రత్యేకతను సూచించుచున్నది. దీనికి డా. నారాయణరావుగారు ఇచ్చు సమాధానము తృప్తికరముగా లేదు.

**ఏడవ ఉపపత్తి:** విశేష్య విశేషణములకు లింగ వచన విభక్తుల అనురూపత సంస్కృతమునందే కాని ద్రావిడభాషలలో కాదు.

**సమాధానము :** దీర్ఘములు (సాధారణముగా స్త్రీ లింగ శబ్దాంతములు) హ్రస్వము లగుటచే ఇట్టివి గోచరమగుట మానినవి.

**ఎనిమిదవ ఉపపత్తి:** ద్రావిడభాషలలో క్రియాజన్య విశేష్యములను ఎక్కువగ వాడుదురు. సాధారణ విశేష్యముల వాడుక తక్కువ.

**సమాధానము :** పశ్చిమ దక్షిణ గౌడభాషలలో ఇట్లే ఉన్నది.

**తొమ్మిదవ ఉపపత్తి:** ఉత్తమపురుష బహువచనమున 'మేము', 'మనము' అను అర్థములతో రెండురూపములు ద్రావిడభాషలయందే కలవు. కాని, ఆర్యభాషలందు లేవు.

**సమాధానము :** ఇది అన్ని ద్రావిడ భాషలకును సామాన్యలక్షణము కాదు. ఉదాహరణమునకు కన్నడ

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



భాషయందు ఇట్టిది లేదు. ఇట్టి లక్షణము ముండాభాషల సంపర్కమున కలిగియుండును.

**పదవ ఉపపత్తి :** కర్మణి ప్రయోగము ద్రావిడభాషలకు క్రొత్త ; భాషాతత్త్వమునకు ఇది సరిపడదు.

**సమాధానము :** గౌడీయభాషలందును ఈ కర్మణి ప్రయోగము తక్కువయే (ఈ సమాధాన మంత తృప్తి జనకముగ లేదు.)

**పదునొకండవ ఉపపత్తి :** నఞర్థ క్రియలు క్రియా రూపమునందే 'అ' కారమును చేర్చుటవలన (ధాతువునకును ప్రత్యయమునకును నడుమ) ద్రావిడభాషలందు ఏర్పడును. ఆర్యభాషలం దన్ననో నఞర్థసూచకమగు ప్రత్యేకావ్యయమును చేర్చుదురు.

**సమాధానము :** తృప్తిజనకముగ లేదు.

**పండ్రెండవ ఉపపత్తి :** సంబంధార్థక సర్వనామము ద్రావిడభాషలలో ప్రత్యేకముగా లేదు (సంస్కృతభాషయందలి 'యః'కు అనురూపమయినది). ఇక ప్రశ్నార్థక సర్వనామమగు 'ఏ', 'ఎవడు' మొదలగునవియే సంబంధార్థకవాక్యమున ఉపయోగపడును.

**సమాధానము :** సంబంధార్థక సర్వనామమే ద్రావిడభాషలలో ఉన్నది. ప్రశ్నార్థక సర్వనామము లేదు. ప్రశ్నలందును 'య' శబ్దభవములగు 'ఏ' యును, దానినుండి వచ్చిన ఇతరశబ్దములును ఉపయోగపడుచున్నవి (అగుచో సంస్కృతమందలి 'కిం' శబ్దమునకు అనురూపమగు పదము ద్రావిడభాషలలో ఏల లే దని ఎదురుప్రశ్న. లోపించి యుండవచ్చును. 'ఎన్నెన్ని లోపింపలేదు' అని సమాధానము).

**పదమూడవ ఉపపత్తి :** వాక్యనిర్మాణపద్ధతి ద్రావిడభాషలందు వేరు ; ఆర్యభాషలందు వేరు.

**సమాధానము :** (విభక్తిప్రత్యయముల విషయమును చూడనగును).

ఈ సందర్భమున 'గ్రియర్సను' మహాశయుడు చెప్పిన వాక్యము గమనింపదగినది : ద్రావిడభాష లన్నిటియందు తెలుగు స్వతంత్రమగుస్థానమును ఆక్రమించినది. ఆర్యభాషలో మాటలాడు ప్రదేశమునకు దగ్గరగా ఉండుటయే యొక ముఖ్యకారణము.

**పదునాల్గవ ఉపపత్తి :** లింగవచనముల విషయమున ద్రావిడభాషలపద్ధతి ఆర్యభాషలపద్ధతికన్న విలక్షణమైనది.

**సమాధానము :** సంస్కృతమందే లింగము అనియతము. ప్రాకృతమందును, ఇతర ఆర్యభాషలయందును ఇంకను చెడినది. వ్యాకరణలింగము లోపించుటకు ద్రావిడభాషల సంపర్కమే కారణమని డా. సునీతికుమారచట్టోపాధ్యాయగా రందురు కాని, ఆనాటి ద్రావిడభాషల స్వరూపము తెలియరాదు ; కనుక, అది కేవలము ఊహయే. లింగ మందలి వ్యత్యాసము ఉత్తరార్యభాషలయందును, దక్షిణదేశభాషలయందును ఒక్కతీరుననే కలిగినది. దేవకులము, రాజకుమారుడు మొదలగునవి వానినుండి వచ్చినవి - ప్రాకృతమున క్రమముగ దేఉలం, రాఅఉమర ; సుంక (శుల్క), చెచ్చెర ('చర చర'—త్వరగతిసూచకము), గిచ్చు (కృత్తి, ప్రా—కిచ్చి), ఉబ్బు (ఊర్ధ్వ), 'శుక్తి' నుండి 'చిప్ప', కృత్వా నుండి 'కాఊణ' ద్వారమున 'కావున' (మహారాష్ట్రభాషా సంప్రదాయమున కూడ). హిందీ 'కర్ కే' 'కాబట్టి' అను అర్థమున వాడబడుచున్నది.

'కనుబొమలు' అని తెనుగున వాడుపదము ద్విరుక్తము. 'భ్రూ' శబ్దమునకు 'భౌమ' ప్రాకృతము. 'భ్రూ' కన్నులకేకదా ఉండునది. భాషాదేశముల విషయము ఈవలనే సూచింపబడినది.

**పాలీభాషయందు :** మయం (వయం శబ్దమునకు) వచ్చును. 'మేము'నకు దీనితో సంబంధము కలదేమో. 'ధనవతి' యను సంస్కృతమునకు 'ధనవంతీ' అని పాలీ రూపము. 'కళావంతీ' ఇట్లేర్పడినదే. 'కళావంతు' లనియు అట్లే ఏర్పడినది. 'కళావతులు' లేరుకదా ! 'అః కష్టం' అను నుడికారమునుండి 'అఃకట్టం', 'అక్కటా', 'అకటా', 'కట్టా', 'కటా'లు క్రమముగా ఏర్పడినవి. 'మంచి' 'మంజు' శబ్దభవము ; 'బట్ట', 'వస్త్ర'భవమైన గుడ్డయేమో ?

పాలీ వ్యాకరణాచార్యుడగు మొగ్గల్లానుని ధాతు పాఠమునుండి తెలుగుధాతువులు ఎన్నో లభించుచున్నవి.

| | |
|---|---|
| అంగ, ఇంగ | ఏగు ; |
| ఇధ | ఎదు(గు) |
| కుట | కొట్టు |
| కుణ | గొణు(గు) |
| కుస | గుసగుస(లాడు) |
| గిల | ఎం(గిలి) |
| గుజ | గుజ గుజ(లు) పోవు |
| గస | కసవు |
| దుల | తొల(చు) |
| పత | పద (గమనార్థము) |
| భక్ష | బొక్కు |
| భజ్జ | బజ్జి (సంజ్ఞ) |
| భా | బా(గు) సంజ్ఞ (ప్రకాశించునది) |

ఇవి కొన్నిమాత్రమే.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఈవిధముగా పాలి, ప్రాకృతభాషలనుండి మన మింత వరకు అనుకోనంత శబ్దజాలము తెన్గులోనికి దిగినది. పరిశోధన జరిపి నిఘంటువులు సరిదిద్దింపవలయును; వ్యాకరణాంశముల విషయమునకూడ ఎంత సామగ్రి లభించునో చూడవలయును.

**వచనము విషయము :** బహువచన ప్రత్యయములు ప్రాకృతభాషలలోనే లోపించినవి. ద్రావిడభాషల ప్రభావము వలన లోపించిన వనరాదు. ప్రాయికముగా పాశ్చాత్య భాషలందు ద్వివచన లోపము సహజమని ఒప్పుకొన్నారుకదా. ఇదియు ప్రాకృత సంప్రదాయమే అనవలయును.

'గళ్' ప్రత్యయము ద్రావిడభాషలకు మాత్రమే ప్రత్యేకమయినదని కొందరు అందురు. కాని అది అట్టిదని చెప్పుటకు అవకాశము లేదు. 'అర్' అనునది ద్రావిడ భాషలందు వలెనే ఆర్యభాషలందును కలదు. 'గళ్', 'అర్' మొదలగు ప్రత్యయములు 'సకల' శబ్ద భవములు.

ఇంతవరకు కీ. శే. డాక్టరు చిలుకూరి నారాయణరావు గారు కేవల ద్రావిడసిద్ధాంత 'పోషకములగు' వాదములకు ఇచ్చిన సమాధానములను చూచితిమి. అవి అన్నియు నచ్చకపోవచ్చును. ఆ నచ్చకపోవుట పరిశోధనల అసంపూర్తి యనికూడ వారు అన్నారు. భావిపరిశోధనలు నారాయణరావుగారి వాదమును సర్వథా సమర్థించగలవేమో.

ఇంతదనుక జరిగిన పరిశోధనలు ద్రావిడ భాషావాదమునే అధికముగ సమర్థించుచున్నవి. సమస్యలు సమస్యలుగనే ఉండిపోయినవి. ప్రాకృతభాషల అధ్యయనము ఆంధ్రదేశమున జరుగుటయే లేదు. అది కూలంకషముగా జరిగి, ఆపై పరిశోధనలు సాగిన గాని ఈవిషయమై తుది నిర్ణయము తేలదేమో.

కో. నం. శ.

# తెనుగు: ప్రాకృతము

తెనుగునకు, ప్రాకృతమునకు కల సంబంధమును వివరించుటకు ముందు ఆ భాషల ప్రాచీన చరిత్ర స్వరూపములను కొంతవరకు తెలిసికొనుట యుక్తము.

ఆర్యావర్తమున క్రీ. పూ. 500 నుండి క్రీ. శ. 1000 వరకు హిందార్యులు మాటాడినభాషకు ప్రాకృతభాష అని పేరు. ఇది ఒకరూపమున కాక భిన్నప్రదేశములందు మాండలికభేదములతో కానవచ్చుచున్నది. కావున ప్రాకృత మాండలికములకు ఆయా ప్రాంతముల నామములనుబట్టి మహారాష్ట్రి, శౌరసేని, మాగధి మొదలగు పేళ్లు కలిగినవి. ప్రాకృతభాషయం దీ రూపభేదములను చెప్పునప్పుడు ప్రాకృతములు అని బహువచనము వాడుదురు. మాండలిక భేదములను విస్మరించి ప్రాచీనార్య భాషనుండి పరిణతినొంది, దానికంటె రూపుమారిన ప్రాకృత భాషాస్వరూపమును మాత్రమే దృష్టియం దుంచుకొనినపుడు ఈభాషను ప్రాకృతమని వ్యవహరింతురు. ప్రాకృత భాష తొలుతటి దశలో మాండలికభేదములు స్వల్పముగ నుండెడివి. అయినను వ్యాకరణాంశములకంటె విశేషముగ ధ్వనులకు సంబంధించినవి. కాని కాలక్రమమున ధ్వనుల లోను వ్యాకరణ విషయములలోను కూడ మార్పులు మిక్కుటమైనవి. ఈ కారణముచే ప్రాకృతమాండలికములలో ఒండొంటికి కల యంతరము ఎక్కువై వాని స్వరూపమునే అవి మార్చివేయగా క్రీ.శ. 1000 క్రీ.శ. 1200 మధ్య ప్రాంతముల అధునిక హిందార్య భాషలు ఉద్భవించినవి.

ఇట్లు వైదిక సంస్కృతము, లౌకిక సంస్కృతము, ప్రాకృతము, ఆధునికార్యభాషలు - ఇవి ఒకే భాషా ప్రవాహమున భిన్నకాలావస్థలు సూచించునవని గ్రహింపవలెను. హిందార్య భాష యనునది ఇండో యూరోపియను భాషాకుటుంబములో ఒక శాఖాభేదము.

ప్రాచీనార్యభాషావస్థలో ఋగ్వేద భాషతోపాటు, దానికి సంబంధించిన మరికొన్ని మాండలికభాషలు వాడుకలో ఉండినవి. వానిని ప్రాథమిక ప్రాకృతము లనియు, వానినుండి తరువాత ఏర్పడిన ప్రాకృతములకు ద్వితీయ ప్రాకృతము లనియు, మరల వానినుండి పరిణమించిన నేటి ఆర్యభాషలకు తృతీయ ప్రాకృతము లనియు సంజ్ఞలను పరిశోధకులు ఇచ్చియున్నారు.

ప్రాథమిక ప్రాకృతములనుండి ఉత్పన్నమైనవానిలో మన కిప్పుడు ఒక్క వైదిక, లౌకిక సంస్కృతములే గ్రంథస్థములై నిలిచియున్నవి. వీనిలో వైదికముకన్న లౌకికము అర్వాచీనము; ద్వితీయ ప్రాకృతములకు సన్నిహితమును. ద్వితీయ, తృతీయ ప్రాకృత భాషారూపములను సంస్కృతమునకు ముడిపెట్టి రూపనిష్పత్తి కల్పించుచుండుట సౌలభ్యముకొరకు చేయునదే. కాని, అంత మాత్రముచే ఈ భాష లన్నియు సంస్కృతమునుండి పుట్టినవని అర్థముకాదు. సంస్కృత భాషాసాహాయ్యమున సాధింపరాని రూపములు ఈ భాషలలో తరచు కనబడుచున్నవి.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఉదా : 1. బెంగాలీభాషలో ఆఛ్ (= ఉందు) అను సహాయక్రియ ఛ (వికరణము)తో కూడిన అస్ ధాతువు నుండి ఏర్పడినది. *అస్ + ఛ + తి > * అచ్ఛతి. (పోల్చి చూడు : గమ్ + ఛ + తి > గచ్ఛతి. ఇట 'గమ్' ధాతువునకు 'గచ్ఛ' ఆదేశమగునని సంస్కృతవైయాకరణులు చెప్పుదురు. కాని భాషాశాస్త్రవేత్తల మతమున 'ఛ' కూడ ఒక వికరణ ప్రత్యయము. గ్రీకు లాటిన్ భాషా రూపములతో పోల్చి చూచినచో ఈ విషయము సువ్యక్తమగును). ప్రాథమిక ప్రాకృతము *అచ్ఛతి >, ద్వితీయ ప్రాకృతము అచ్ఛఇ >, తృతీయ ప్రాకృతము - బెంగాలీ : ఆఛే ఆఛ్. సంస్కృతములో 'అస్తి' అనియే కాని 'అచ్ఛతి' రూపము లేదు. అస్‌ధాతువు అదాదులలో చేరును.

ఉదా : 2. వైదిక లౌకిక సంస్కృత భాషలకు సంబంధించిన ఒక ప్రాచీన ప్రాకృతములో పూరుష, పురుష అను రూపములు ఉండెను. మఱియొక ప్రాచీన ప్రాకృతములో *పూర్ష (< పు + వృష) అను రూపము ఉండవలెను. దీనినుండియే పాలీలోని పురిస, పోరిస, పోస రూపములు ఏర్పడియుండును. పూర్వరూపము సంయుక్తాక్షరముతో కూడినప్పుడుగాని పురిస, పోరిస అనునవి సిద్ధింపవు (పోల్చి చూడు : వారిస < వార్ష). మరియు ఇవి సంస్కృత పురుష శబ్దమునుండి వచ్చుటకు అవకాశము లేదు.

ఉదా : 3. ఒక ప్రాథమిక ప్రాకృతములో దత్త (= ఇవ్వబడినది) అను రూపము ఉండగా మఱియొక దానిలో *'దిత' అను రూపము ఉండవలెను. ఆధునికార్యభాషలలో ఈ 'దిత'నుండి వచ్చిన రూపములే ప్రాచుర్యము వహించియున్నవి. *దిత > హిందీ : దీఅ. బెంగాలీ : దిల.

ద్వితీయ ప్రాకృత భాషాకాలమును మరల మూడు యుగములుగ విభజింపవచ్చును. అశోకుని శిలాశాసనముల లోని భాష, పాలి మొదటి యుగము నాటివి. క్రీ. శ. 200 నుండి క్రీ. శ. 600 వరకు గల కాలములో ఈ ప్రాకృత భాషలు, అనగా జైనమత వాఙ్మయములోను, ఈ కాలపు లౌకిక వాఙ్మయములోను - అందును ముఖ్యముగ నాటకములోను - వాడబడిన ప్రాకృతములు రెండవ యుగమునకు చెందినవి. సంస్కృతము వైయాకరణుల మూలమున స్థిరపడినట్లు ఈ రెండవ యుగములోని భాషలు లక్షణ నిబద్ధములై స్థిరత్వము పొందెను. కాని, వ్యావహారిక ప్రాకృతములు మార్పు పొందుచునే ఉండెను. ఇవి మూడవ యుగములో అపభ్రంశ భాషలుగ మారినవి. ఒక్కొక్క ప్రాకృత మాండలికమునకును దానినుండి మారిన అపభ్రంశము ఉండియుండవలెను. అపభ్రంశ భాషలలో కొన్ని గ్రంథస్థములు, లక్షణ యుక్తములునై స్థిరత్వము చెందినవి. వ్యావహారికాపభ్రంశములు మాత్రము తమకు సహజమగు పరిణామమును పొందుచు ఆధునికార్య భాషలుగ మారినవి.

* ఈ గుర్తు కల్పితరూపమును సూచించును.

హింద్వార్యభాషా పరిణామమున ప్రాకృతభాషా దశలో, ప్రాచీ నార్య వ్యాకరణ విధానముయొక్క విచ్ఛేదమును, ఆధుని కార్యభాషలలో కనబడు నూతన వ్యాకరణముయొక్క నిర్మాణవిధానమును గోచరించుచున్నది. ప్రాచీన ఆర్యభాషా వ్యాకరణమునందలి క్లిష్టత్వము క్రమముగా సమసిపోయి ఆధుని కార్యభాషలలో ఒక నూతన సౌలభ్యము సంపాదింపబడినది. మరియు ఈ సౌలభ్యరీతి ద్రావిడభాషా వ్యాకరణమును అనుసరించి ఏర్పడిన దగుటచేత ఆర్యభాషపై ద్రావిడ భాషా ప్రభావము కలదని భాషావేత్తల సిద్ధాంతము.

ఇండో - యూరోపియను భాషాకుటుంబమునకు చెందిన ఆర్యభాషను ఆర్యజనులు ఈ దేశమునకు క్రీ. పూ. 1500 ప్రాంతమున కొనివచ్చిరని ఆధునిక పరిశోధకులు పలువురు తలచుచున్నారు. ఆర్యులు ఈ దేశమునకు వచ్చునప్పటికి ఇక్కడ మూడు, నాలుగు జాతుల జనసంఘములు తమకు ప్రత్యేకమగు భాషాసంస్కృతులు కలిగి వర్ధిల్లుచుండినవి. వీనిలో కొన్ని ఇప్పుడు దేశమున నశించిపోయినవి. అనార్యజనులు నిషాదులు, దాసులు (దస్యులు), కిరాతులు అనుపేర ఆర్యులకు పరిచితులు. నిషాదులు ఆస్ట్రిక్ జాతివా రనియు, దాసులు (దస్యులు) ద్రావిడు లనియు, కిరాతులు మంగోలాయిడ్ జాతివా రనియు పరిశోధకులు తలచుచున్నారు. ద్రావిడులు హిందూదేశమున పశ్చిమ దక్షిణభాగములలోను, నిషాదులు గంగాతీరమునను, మధ్య తూర్పు దేశమునను, కిరాతులు హిమాలయప్రాంతమునను, తూర్పు మునను నెలకొనియుండిరి. కాని ద్రావిడులు వీరిలో బలవంతులై ఉత్తరహిందూస్థానమంతయు అస్సాము వరకు వ్యాపించిరి. ఆర్యులనాగరికతా ప్రభావమే వీరి భాష దేశమునందు అనార్యజనులలో వ్యాపించుటకు కారణమైనది. క్రమముగా బుద్ధునికాలము నాటికి ఆర్యభాష అఫ్‌గానిస్తానమునుండి బీహారు ప్రాంతము వరకు వ్యాపించినది. మధ్యమధ్య అనార్యభాషాజనుల స్థావరములు కొన్ని ఉండినప్పటికిని అధికసంఖ్యాకులు తమ భాషను వదలి ఆర్యభాషను స్వీకరించిరి.

ఆర్యభాష బీహారు పర్యంతము వ్యాపించుపరికి ఆర్యులు ఈ దేశమునకు వచ్చి సుమారు వెయ్యి సంవత్సరములు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



గడచినవి. భాష అనవరతము మారుచుండునట్టిది. కాన, ఈ పది శతాబ్దులలో ఆర్యభాష వ్యవహారములో విశేషమగు మార్పులకు లోనైనది. ఈ మార్పు లన్నియు సహజముగ ఆ భాషలో కల్గినవే కాక అన్యభాషాజనులు దీనిని స్వీయ భాషగ వ్యవహరించుటవలన కూడ కలిగినవి. ఇవి ధ్వనులు, పదజాలము, వాక్యనిర్మాణము, వ్యాకరణాంశములు అను అన్నిటికిని సంబంధించియున్నవి. ప్రాకృత భాషలోని విజాతీయలక్షణములు విశేషించి ద్రావిడభాషా సంప్రదాయానుసారములై కనబడుచున్నవి. ప్రస్తుతము మనము ప్రాకృతభాషలో ప్రాచీనార్యభాషలో లేని కొన్ని క్రొత్తలక్షణ సంప్రదాయములను పేర్కొని అవి ఎట్లు ద్రావిడభాషకు సహజలక్షణములు అగుచున్నవో తెలిసికొందము.

ప్రాకృతభాషా వ్యవహారములో ఉద్వృత్తాచ్చుల మధ్య యకార వకారములు, క్వాచిత్కముగా నకారము సంధ్యక్షరములుగా బయలుదేరినవి. ఒక్కటైన అర్ధమాగధీ భాషలో తప్ప యితర ప్రాకృతములలో ఈ సంధ్యక్షరములు వ్రాతలో సూచింపబడకపోయినను వ్యవహారమున ప్రకృతిభావ నివారణ మారీతిని జరిగియుండవలెను.

ఉదా: సంస్కృతము గత > ప్రాకృతము గఅ, ఉచ్చారణములో గయ; సం. స అగచ్ఛత్ > ప్రా. సోగదో > అపభ్రంశము సుగఉ, ఉచ్చారణములో సుగవు. ప్రాకృతములో ఋ, ౠ, ఐ, ఔలు జారిపోయినవి. ఉదా: సం. మృగ-ప్రా. మగ-, మిగ-, మ్రిగ-, మ్రుగ-; వృద్ధ > వుడ్ఢ; భైరవ > భేరవ; యౌవ్వన- > జొవ్వన, ఔషధ- > ఔసధ; శ, ష, స, లలో ఒకటే నిలిచినది. ఉదా: పశు > పసు; మాగధి - పశు, శుశ్రూషా > సుస్సూస; శుకః > సుక. సంయుక్తాక్షరములు ద్విత్వాక్షరములుగా మారినవి: ఉదా: భక్త- > భత్త, శక్య- > సక్క, పక్వ- > పక్క, మత్స్య > మచ్ఛ, తస్కర > తక్కర, సత్య- > సచ్చ; లేక స్వరభక్తిచే విడగొట్టబడినవి. ఉదా: దర్శన- > దరిసవ; క్లేశ- > కిలేస, రత్న- > రదన, లదన, బ్రాహ్మణ > బరామ్హణ. ఉపసర్గలు క్రమముగ లోపించి పరసర్గల వాడుక హెచ్చినది. ఉదా ప్రా. బప్పకేలక (= బప్పస్య) తండ్రియొక్క. అధుని కార్యభాషలలో బహువచన ప్రత్యయములుగా గుణ, గుట, సబ్, లోగ్ మొ., విభక్త్యర్థ సూచకములుగ మే (< మధ్య), కో (> కక్ష), పాస్ (< పార్శ్వ) మొ., సంపూర్ణ క్రియలకు బదులు క్రియాజన్య విశేషణరూపముల వాడుక సర్వసాధారణమైనది. ఉదా: సం. స అగచ్ఛత్ అనుటకు ప్రాకృతములో స గతః అనుదాని రూపాంతరమైన సోగదో అను రూపమును వాడుదురు. వాక్యనిర్మాణమున ద్రావిడ భాషా పద్ధతితో సన్నిహితత్వ మేర్పడినది.

వరుసగా ఈ క్రింది ద్రావిడభాషా లక్షణములను పరికింపుడు: ద్రావిడభాషలో అచ్చులమధ్య ప్రకృతిభావము పనికిరాదు. ఉదా: * చేసి + అ > చేసిన, మా + ఊరు > మాయూరు, మావూరు, మా + ఇల్లు > మాయిల్లు, సం. సహస్రం, తమిళము *సహసిరం > *అఅఇరం > ఆయిరం. రేఫ లకారములు అచ్చులుగా వాడుకలో లేవు. ఋ రి గానో, రు గానో తెలుగులో మారుచున్నది. ప్రాచీన కాలమున 'ఋ' 'రి'గా ఉచ్చరింపబడు చుండెను. ఈ ఉచ్చారణమునుబట్టియే ప్రాచీనులగు తెలుగు కవులు ఋకారమునకు యతిస్థానమున రి వర్ణమును వాడుకొనిరి. నన్నయ్య—'ఋత్విజుండని విచారించి పూజించితే....'. తరువాతి కాలమున ఈ భాషలో దీనికి రువర్ణోచ్చారణము పరిపాటియైనది.

వక్రతమములు లేవు. సంస్కృతమునందలి ఐ, ఔలు ఇందుచేతనే తెలుగులో అయి అవులుగా మారుచుండుట. శ ష స లు ప్రాచీనద్రావిడభాషలో లేవు (పోల్చి చూడు: సంస్కృతము: సీస > తమి, ఈయమ్, సం. శ్రేష్ఠిన్ > తమి. చెట్టి. సం. ఆషాఢ > తమి. ఆడి, సం. విషమ్ > తమి. విడమ్. ద్విత్వాక్షరములే కాని సంయుక్తాక్షరములు దేశ్య శబ్దములలో ఇంచుమించు లేవనియేచెప్పవచ్చును. సంయుక్తాక్షరములతో కూడిన శబ్దములు ఇతరభాషలనుండి గ్రహింపబడినప్పుడు అవి వర్ణసమీకరణమునకో, స్వరభక్తికో లోనగుచుండును: ఉదా: సం. పుణ్యము, > పున్నెము, సం. వర్తికా > వత్తి, సం. బ్రాహ్మణ > తమి. పిరమిణ, సం. స్నేహ > తమి - సినేగమ్, కృష్ణ > తమి. కిరుట్టినన్. ధాతువులలో అర్థభేదమును వ్యక్తపరచుటకు వాక్యగత శబ్దముల పరస్పర సంబంధమును సూచించుటకు ధాతువునకు ధాతువును లేదా పదమును చేర్చుచుందురు. దీని కుదాహరణములు: 1. శబ్దపల్లవములు (మేలు + కొను > మేలుకొను; కొని + ఆడు > కొనియాడు మొ.); 2. నామ విభక్తులు (చేత < √చేయు, లో < √ఉళ్, వలన > √వలను, కొఱకు < √కొఱ, తోడ < √తోడు, తొడు) 3. క్రియావిభక్తులు. (సర్వనామముల సంక్షిప్తరూపములు). క్రియాపదనిర్మాణ మతిసులభము. ధాతువునకు కాలసూచక ప్రత్యయము, దానిపై సర్వనామప్రత్యయ రూపములు చేర్చుటచే క్రియారూపములు ఏర్పడుచున్నవి. విశేషణ విశేష్యభావ సంబంధముగల వాక్యరచన యిందు కలదు. పైని చూపబడిన సమానలక్షణములనుబట్టి ఆర్యానార్య

√ ఈ గుర్తు ధాతురూపమును సూచించును.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



(ద్రావిడ) భాషాసమ్మేళనమువలన ప్రాకృతభాషలు రూపొందినవని మనము నిశ్చయింప వచ్చును.

ద్రావిడభాషా సహజములని పైని చెప్పబడిన లక్షణము లన్నియు ప్రాకృతభాషలలో సహజపరిణామమున కలిగిన వనియు, ద్రావిడభాషలు ఆధునిక ఆర్యభాషలతోపాటు ప్రాకృతభవము లనియు చెప్పువారు కొందరు కలరు. కాని, వ్యాకరణాంశములు, పదజాలములో సంస్కృత ప్రాకృతములకు దక్షిణదేశ భాషలకు వారు చూపు పోలికలు స్వరసూత్రములకు కట్టుబడని వగుటచేత ఈవాదము నిలువదు. చారిత్రాత్మకముగను, ఈవాదము సమర్థనీయముగ కానరాదు. కారణము ఏమన, ద్రావిడవర్గమునకు చెందిన తమిళభాషలో క్రీస్తుశకము తొలిశతాబ్దులనాటికే శిష్టవాఙ్మయము, లక్షణ గ్రంథములుకూడ బయలుదేరినవి. అప్పటి కప్పుడే ద్రావిడభాషలు ప్రాకృతమునుండి పరిణామము నొందిన వని చెప్పుటకు ప్రాకృత మింకను ప్రాథమికావస్థయందే యుండెను. కాబట్టి, ప్రాచీనకాలమున ద్రావిడభాషాప్రభావము ఆర్యభాషపై పడినదని, ఆర్యులు దక్షిణమునకు వ్యాపించినతర్వాత ప్రాకృతభాషాప్రభావము ద్రావిడభాషలపై ప్రసరించినదని ఇప్పటికి తేలిన సిద్ధాంతము.

ప్రాకృతభాషలలో మిక్కిలి ప్రాచీనమైనది పాళీభాష. బౌద్ధమతవాఙ్మయము చాలవరకు ఈభాషలో ఉన్నది. అశోకుని కాలమునుండి గుప్తుల కాలమువరకు దేశము మొత్తముమీద శాసనములు అన్నియు ప్రాకృతభాషలో వ్రాయబడియున్నవి. ఇవి ఆయా ప్రాంతములలోని మాండలిక భాషాలక్షణములను కొంతవరకు సూచించుచున్నవి. శాసనస్థ ప్రాకృతములకంటె నాటకీయ ప్రాకృతములు అర్వాచీనములు. నాటకీయ ప్రాకృతములు అనగా సంస్కృత నాటకములలో స్త్రీలకు, నీచపాత్రలకు విహితమైన భాషలు - శౌరసేని, మహారాష్ట్రి, మాగధి మొదలగునవి. వీనికి వరరుచి మొదలగువారు తరువాత లక్షణమేర్పరచిరి. లౌకిక వాఙ్మయముకూడ కొంత ప్రాకృతములలో - ముఖ్యముగా పైశాచి, మహారాష్ట్ర, అపభ్రంశ భాషలలో వ్రాయబడియున్నది. ఇక తెలుగునకు ఈ ప్రాకృతభాషలతో ఎట్టి సంబంధము కలదో విచారింపవలసి యున్నది.

ఆర్యులీదేశమునకు వచ్చునప్పటికి ప్రాచీన ద్రావిడ భాషయే వ్యవహారములో ఉండినదని తలచుటకు అవకాశము కలదు. మూలభాషనుండి నేటి భిన్న ద్రావిడభాషలు ఎప్పుడు విడివడినవో నిష్కర్షగా చెప్పుటకు ఆధారములు చాలవు; కాని, వీనిలోని వ్యాకరణ విశేషములనుబట్టి తెనుగు క్రీస్తుపూర్వము ప్రథమ దశశతాబ్ది మధ్యభాగములో ప్రత్యేకభాషగా ఏర్పడి యుండునని ఊహింప వచ్చును; అనగా, ప్రాచీనార్యభాషనుండి ప్రాకృత మేర్పడిన కాలమున ఇంచుమించుగా తెలుగుభాష మూల ద్రావిడమునుండి విడివడినది. మరియు ఈకాలమునకు తెనుగువారు, ఇతర దక్షిణదేశ భాషాజనులు వారివారి ఇప్పటి దేశభాగములను ఆక్రమించుకొని ఉండి రనుట సంభావ్యము. తమిళదేశము మొట్టమొదటినుండియు దేశీయరాజుల పాలనములో ఉండగా తెలుగు - కన్నడ ప్రాంతము క్రీ. పూ. 3, 4 శతాబ్దులనాటికే ప్రాకృతభాషను వ్యవహరించిన ఆంధ్రరాజుల ప్రాబల్యమునకు లోనైనది. ఇట్లు తెనుగు ప్రత్యేకభాషగా ఏర్పడిన తర్వాత కొద్దికాలమునకే ప్రాకృతముతో సంపర్కము కలిగినది.

సాతవాహనులకు, ఇక్ష్వాకులకు పిమ్మట ఈ దేశమును ఏలిన శాలంకాయన, విష్ణుకుండి రాజవంశముల కాలములో ప్రాకృతభాష క్రమముగా వెనుకబడి సంస్కృతమునకు ఆదరము హెచ్చినది. ప్రాకృతమునకు పట్టుగొమ్మయైన బౌద్ధమతమునకు రాజావలంబనము తగ్గినది. జైనమునకు మొదటినుండియు విశేషప్రచారము లేదు. తెలుగు దేశమున ప్రాకృతభాషా శాసనములు క్రీస్తుశకము నాల్గవ శతాబ్దివరకు కనిపించుచున్నవి. కావున ప్రాకృతము రాజభాషగాను, బౌద్ధమత భాషగాను తెలుగుదేశమున విస్తరించి, తెలుగుభాషను ఆరుశతాబ్దములపాటు, అనగా క్రీ. పూ. మూడవశతాబ్ది మధ్యభాగమునుండి క్రీ. శ. నాలుగవ శతాబ్ది మధ్యభాగము వరకు తన ప్రభావమునకు లోను చేసినది. తరువాతి కాలమున ప్రాకృతము పండితలోకముననే కాని జనసామాన్యమున ప్రచారములో లేకుండుటచే దాని ప్రభావము తెలుగుపై విశేషముగ పడలేదు. ప్రాచీనకాలములోనైనను ప్రాకృతభాషా ప్రభావము శబ్దజాలములోనే కాని వ్యాకరణాంశములలో అంతగా కానరాదు. ఇంచుమించుగ లేదనియే చెప్పవచ్చును. ప్రాకృతములోకూడ ఇతరదేశభాషలనుండివలె తెనుగు నుండియు కొన్ని శబ్దములు చేరియుండు ననుటకు సందేహము లేదు. ఇందుకు నిదర్శనముగా హేమచంద్రాదులు రచించిన ప్రాకృత వ్యాకరణములలోని 'దేశీనామమాల' వంటి పట్టికలలో తెలుగు పదములు కనబడుచున్నవి. ఉదాహరణముగా దేశీనామమాలనుండి కొన్ని ప్రాకృత పదములు తీసికొని వానికి సరియైన తెనుగు పదములు చూపబడినవి.

| ప్రాకృతము | తెలుగు |
|---|---|
| కురుల | కురులు |
| చిచ్చి | చిచ్చు |



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



| ప్రాకృతము | తెలుగు |
|---|---|
| వడ్డి | ఆవు (వడ్డ) |
| మడో | మెడ |

మొగ్గర, మొగ్గ < మొగడ, (పోల్చి చూడు: మొగడించు)

| | |
|---|---|
| ముద్దీ | ముద్దు |
| వసిండీ | వసిండి |

ప్రాకృతము వ్యవహారములో ఉన్న కాలమున ప్రాకృత భాషా పదములు వాడుకలోనికి వచ్చి తెలుగున కలిసి పోయినవి; కాని, ఆపదజాల మంతయు మన కిప్పుడు నిలువలేదు. అర్వాచీన సంస్కృతభాషా ప్రభావముచేత ప్రాకృత పదములు కొన్ని వ్యవహారమునుండి భ్రష్టమై పోయినవి. ప్రాఙ్నన్నయకాలపు తెలుగు శాసనములలో ప్రాకృతపదములు అనేకము అగపడుచున్నవి: అచ్చెర్వు, అణపోతులు, అమ్మపుణ్ణమ, అయోధ్య సింఘాసనుండు, అస్వమేదంబు, ఇశరయ, కొట్టంబు, కన్నరాఘూపతి, కమ్మరి, కొమర, కోసియపాఅ, జయసింఘ వల్లభ, జాత్ర, ధన్యవెసను, దయావెసను, కల్యాణదసనులు, దమ్మపురంబు, దమ్ముపులు, ద్రమ్మలు, దోసంబు, దుగరాజు, నివబు, పన్నస, బెజఇత్తభటార, బెజవాడ, బెతెయరాజు, బిదియ, బోయ, రట్టగుళ్ళు, సర్వపరియారువు మొదలగునవి. ప్రాచీన ప్రాకృత శాసనములలో ఈ క్రింది గ్రామనామములు తరువాతి కాలమున తమ ప్రాకృత స్వరూపమును విడనాడుట గమనార్హము; ణడతూర (= నడతూరు పదాదిని మూర్ధన్యణకారము ప్రాకృత భాషా ప్రభావమును సూచించుచున్నది), ధన్నకడ, ధఞకడ (= ధాన్యకటక), పలక్కడ (= పల్లవకటక), కోహెతూర ?, విరిపర (.= విత్పట్టు, విప్పట్టు). మనుష్యనామములు: భద్దజ్జ, నందిజ్జ, ఖందజ్జ, అగ్గిజ్జ. వీనిలో అజ్జ ఆర్యశబ్దభవము. తరువాతిభాషలో ఇది కేవలము లోపించి పాలీరూపమగు అయ్య ప్రాచుర్యము వహించినది.

క్రీస్తుశకము నాల్గవశతాబ్దము తరువాత ప్రాకృతము వెనుకబడి సంస్కృతమునకు ప్రచారము కలిగినదని పైని చెప్పబడినది. నన్నయకాలమునకు సంస్కృతభాషా రూపములు తెనుగు నంతయు నింపివేసి తెలుగు సంస్కృత జన్యము అను భావమునుకూడ కలిగింపజొచ్చినవి. ప్రాచీన లక్షణకర్తలగు కేతన, పెద్దనలు తెలుగు సంస్కృతమునుండి పుట్టినదని తలంచి సంస్కృతపదములు ఈ భాషలోనికి వచ్చునప్పుడు ఎట్లు మారుచున్నవో సూచించిరేకాని ప్రాకృతములనుండి ఏర్పడిన శబ్దములను గురించి కాని, ప్రాకృతభాషా ప్రభావమును గురించికాని వారు ఎత్తుకొనలేదు. తెలుగు సంస్కృత ప్రాకృతములు రెండింటినుండియు పుట్టిన దనుభావము మొట్టమొదట ప్రవేశపెట్టినది ఆంధ్రశబ్దచింతామణి. తత్సంప్రదాయమునకు చేరిన అప్పకవ్యాదులు. 'ప్రకృతి ద్వయజా తజ్జా....' అనిన ఆంధ్రశబ్దచింతామణిని అనుసరించి వారు తత్సమములలో సంస్కృతసమములు, ప్రాకృతసమములు ఉన్నవనియు, తద్భవములలో సంస్కృతభవములు, ప్రాకృతభవములు ఉన్న వనియు తెల్పిరి. ప్రాకృత సమములు అనగా తెలుగుభాషా సంప్రదాయములకు అనుకూలమగు ధ్వనులు కలిగిన ప్రాకృత పదములు. ఇవి స్వల్పమగు పదాంతకార్య మొక్కటి తక్క మార్పు లేక తెనుగున ప్రవేశించినవి: ఉదా: సం. అగ్నిః > ప్రా. అగ్గీ > తె. అగ్గి; సం. రాజ్ఞో > ప్రా. రాణీ > తె. రాణి; సం. క్షారః > ప్రా. కారో > తె. కారము. ప్రాకృతభవములు అనగా తెనుగు భాషా సంప్రదాయములకు విరుద్ధములగు ధ్వనులు కలిగిన ప్రాకృత పదములు. ఇట్టివి ఉచితములగు మార్పులతో తెనుగున గ్రహింపబడినవి. ఒత్తక్షరములలో హకారము జారవిడుచుట - ఉదా: అచ్ఛరా (= అప్సరా) > అచ్చర; పుఢవీ (= పృథివీ) > పుడమి; సంయుక్తాక్షరములను సమీకరించి ద్విత్వములుగా చేయుట - ఉదా: వెణ్హూ (= విష్ణు) > వెన్నుడు; హకారమును జారవిడుచుట - ఉదా: పరిహారో (= పరిహారః) > పరియారువు. అనాంధ్ర ధ్వనులు లేకపోయినను ప్రాకృతపదస్వరూపములో ఏవైన మార్పులు కలిగినచో అదియు ప్రాకృతభవ మగును; ఉదా: ఇంగాలో (= అంగారః) > ఇంగలము; పణ్ణాసా (= పంచాశత్) > పన్నస; పవాళో (= ప్రవాళః) > పవడము. మొత్తముమీద ప్రాకృతసమములు, ప్రాకృతభవములుకూడ మూల సంస్కృతరూపములనుండి మారి వచ్చినవేకదా. సంస్కృత భవములును ఇట్టివే. తెలుగు నోళ్ళలో సంస్కృతపదములు నలిగినప్పుడు ఏర్పడిన రూపాంతరము లివి. సహజముగా ఏర్పడిన యీ తద్భవములతోపాటు పండితులును కొన్ని శబ్దములు, సమాసములు కల్పించి రనుటకు అచ్చతెనుగు కావ్యములే సాక్షి. నిఘంటుకారు లీ మూడు రకముల పదములను వేర్వేరుగా చూపింపక వైకృతములు అనుపేర ఒకటిగా గుచ్చెత్తిరి. నిజమునకు ఈవర్గములను విడదీయుట కష్టసాధ్య మగుపని. ప్రాకృతసమము అని చెప్పబడు ఒకానొకపదము సంస్కృతభవము కావచ్చును. అగ్గి, సిరి, సింగారము - అను పదములు ప్రాకృతసమము లని బాలవ్యాకరణకారుడు పేర్కొన్నాడు. ఇవి అగ్గీ, సిరీ, సింగారో అను రూపములనుండియే వచ్చియుండ నక్కరలేదు. సంస్కృత అగ్నిః, శ్రీః, శృంగారః అను రూపములు తద్భవములు అగునప్పుడును



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పైరూపములే సిద్ధించును. కాని, జంత్రము, జన్నము, జక్కులు అనునవి ప్రాకృతము ద్వారానో, ప్రాకృతభాషా ప్రభావముననో ఏర్పడియుండవలెను. ఏలయన, యకారము జకారముగా మారుట తెలుగుభాషయొక్క సంప్రదాయము కాదు; ద్రావిడభాషా సంప్రదాయమును కాదు. ఈ క్రిందివానిని తెలుగులో ప్రాకృతరూపములను పోల్చుకొనుటకు కొండగుర్తులవలె ఉపయోగించుకొనవచ్చును :

(1) సంస్కృతమునందలి ఐ, అయి ; ఔ, అవులు ; తెలుగులో ఏ (ఎ) ఓ (ఒ)లుగా కనబడినప్పుడు : సం. వైశాఖ—తె. వేసంగి, సం. ఉపాధ్యాయ > *ఉవజ్ఝాఅ > తె — ఒజ్జ.

(2) సంస్కృతములో రేఫ ఋవర్ణ సాహచర్యముగల త దలు తెలుగులో ట డ లుగ కనబడినప్పుడు : వైదిక సంస్కృతము శృథిర, శృథిల—తె. సడలు ; సం. పృథివి—తె. పుడమి ; సం. వృద్ధి—తె. వడ్డి.

(3) సంస్కృతములో య, య్య ; ద్య, ధ్య ; త్య, థ్య లు తెలుగులో జ, జ్జ, చ్చలుగా గనబడినవుడు సం. యజ్ఞము—తె. జన్నము ; సం. సంధ్యా, తె. సంజ ; సం. శయ్యా, తె. సెజ్జ ; సం. నిత్య, తె. నిచ్చలు, సం. రథ్య, తె. రచ్చ. ఈ పై సందర్భములలో ప్రాకృతభాషా ప్రభావమును ఊహింపవచ్చును. ఇట్లు ప్రాకృతభాషకు సహజములై తెలుగు భాషలో లేని స్వరసంప్రదాయములను బట్టి తెలుగులో ప్రాకృతముల మూలమున చేరిన పదజాలమును మనము గుర్తింపవచ్చును.

ఆంధ్రరాజుల కాలమున తెలుగుదేశములో బౌద్ధమతమునకు, తద్ద్వారా పాలీభాషకు వ్యాప్తి కలిగినది. ఆ దినములలో పాలి ఒకవిధమగు గ్రాంథికభాషగ స్థిరపడి అన్ని ప్రాంతములందును జాతీయభాషవలె వ్యవహరింపబడుచుండెను. కావున పాలినుండి కొన్ని పదములు తెలుగులోనికి వచ్చియుండును. ఇక ఆంధ్రరాజుల శాసనములలోని భాషమాత్రము పాలి అని చెప్పజాలము. ఇది మన మెరిగిన ఏనాటకీయ ప్రాకృత భాషాలక్షణములకును సరిపోక అవ్యవస్థముగా ఉన్నది. క్వాచిత్కముగా పైశాచీ లక్షణములు, ప్రతీచీమాండలికభాషా లక్షణములు ఇందు కనబడుచున్నవి. కావున దీనిని మధ్యదేశప్రాకృత మనుటయే సమంజసము. మధ్యదేశ ప్రాకృతమునే తరువాతి వైయాకరణులు శౌరసేని అనుపేర వర్ణించిరి. పాలి సహజముగ మగధదేశ ప్రాకృతమైనను మధ్యదేశ శౌరసేనీ ప్రాకృతముల అధికప్రభావమునకు లోనగుటచేత దానికిని, ఆంధ్రదేశస్థ శాసనముల ప్రాకృతమునకును చాల పోలికలు కల్పించును. తెలుగులోని ప్రాకృతపదజాలము చాలవరకు శౌరసేనీ ప్రాకృతభాషా లక్షణములకు (రేఫయుతరూపములు, య జ గా మారుట, ఓకారాంత ప్రథమారూపములు మొదలగునవి) సరిపోవుచుండుటచే అది ఆ భాషనుండి, ఎక్కువగా వచ్చినదని తలపవచ్చును. ఇతర ప్రాకృతమాండలిక భాషల రూపములును తెలుగులో లేకపోలేదు. లాక్షణికులు కొందరు వీనిని ఉదాహరించిరి. అప్పకవి ఇచ్చిన రూపములు : జక్కులు — మాగధి ; సాన - పైశాచి ; రాచకొలము - చూళికాపైశాచి ; మూఁగు - అపభ్రంశము (= మూఁగు దేశ్య శబ్దము కాని ప్రాకృత శబ్దము కాదు) ; జూదము - శౌరసేని.

ప్రాకృతభాష ఇంకను ప్రాథమికావస్థను దాటకమునుపే చాలవరకు ప్రాకృతపదములు తెలుగులో చేరియుండును - ఉదా : ప్రాకృత. ద్రమ్మ (< గ్రీకు. ద్రాఖ్మే) శబ్దము, ద్రమ్మముగాను, శిథిలశబ్దము సడలుగాను ఈ భాషలో గ్రహింపబడినవి. ఈపై ప్రాకృత శబ్దములు తరువాత హింద్వార్యభాషలలో గలిగిన స్వరపరిణామమును బట్టి అపభ్రంశములో దమ్మ, ఢిల్ల అనురూపములను పొందినవి. దమ్మ > ప్రాచీనహిందీ - దామ, ఆధునిక హిందీ - దామ్ (ఖరీదు) ; ఢిల్ల > హిందీ - ఢీలా.

ఒక్కొక్కప్పుడు తెలుగులో ప్రాకృత పదములకు ఏర్పడిన రూపమునకు కారణము 'లోకనిరుక్తి (ఫోక్ ఎటిమాలజి) అనవచ్చును ; అనగా, లేని వ్యుత్పత్త్యర్థమును ఒకపదమునకు కల్పించి దానికి అనుగుణముగ పదస్వరూపమును మార్చుట. ఉదా : శూర్పణఖ శబ్దము నుండి వచ్చిన చుప్పనాకలో నాక స్త్రీలింగ ప్రత్యయము అను వ్యుత్పత్తి ప్రజలభావములో కలుగుటచేత, చుప్పనాతి యని నాతి - స్త్రీ అను అర్థమును ఇచ్చు రూపమును కూడ కల్పించిరి. ప్రా — చందిమా (= సం. చంద్రమా) తెలుగులో చందమామ అయినది. ఆప్యాయముగా మామ వరుసతో చంద్రుని పిలుచుచున్నట్లు తోచుకతన శబ్దస్వరూపము మారినది.

ప్రాచీన ద్రావిడభాషలో ఊష్మధ్వనులు, అనగా శ ష స హలు లేవు. కొన్ని అనాగరిక ద్రావిడభాషల సాక్ష్యమునుబట్టి ఇటీవలి కొందరు పండితులు ప్రాచీన ద్రావిడ భాషలోకూడ సకారము ఉండెనని తలంచిరి కాని, ఆ వాదము సర్వసమ్మతము కాలేదు. తొల్కాప్పియరు కాలమునుండి తమిళమున ఈ ధ్వని లేదు. అందుచేతనే సకారము తద్భవములో లోపించినది. ఉదా : సీసం > ఈయం, సహస్రం > ఆయిరం, శ్రీ > శిరి > తిరు తెలుగుభాషా ధ్వనులలోకూడ మొట్టమొదట సకారము లేకుండినచో అది యీ భాషలోనికి వచ్చి ఇంతగా



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



స్థిరపడుటకు కారణము ప్రాకృతభాషా ప్రభావమని చెప్ప వలసియుండును.

తెనుగుభాషలో వచ్చి చేరిన ప్రాకృత పదములు కొన్ని క్రింద పొందుపరుపబడినవి :

(పా = పాలి, ప్రా = ప్రాకృతము)

| తెనుగు | ప్రాకృతము | సంస్కృతము |
| --- | --- | --- |
| అక్కరము | పా. ప్రా. అక్ఖర | అక్షర |
| అన | పా. ప్రా. అణ | ఆజ్ఞ |
| ఒంటె (తమిళము ఒట్టై, మలయాళము ఒట్టై) | పా. ఒట్ఠ ఉష్ట్ర. | |
| కత్తి | *కత్తీ | కర్త్రీ |
| కత్తిరి | పా. ప్రా. కత్తరీ | కర్తరీ |
| కన్నె | ప్రా. కన్నిఆ | కన్యా |
| కప్పము | పా. ప్రా. కప్ప | |
| కమ్మర | ప్రా. కమ్మార | కర్మకార |
| కల్లు | ప్రా. కల్లా | కల్యా |
| కంబము | ప్రా. కంభ | వైదికసం. స్కంభ |
| కుప్పసము | ప్రా. కుప్పాస | కూర్పాస |
| గాయము | ప్రా. ఘాయ | ఘాత |
| గుడారము | ప్రా. గుడాఆర, కూడాగార | |
| గుత్త | ప్రా. కుత్త | |
| చక్కర | పా. సఖరా. ప్రా. సక్కరా | శర్కరా |
| చెక్క | పా. ప్రా. చక్క | చక్ర - |
| చామ (చామనచాయ) | పా. సామ | శ్యామ |
| చొక్కము | పా. ప్రా. చొక్ఖ | చౌక్ష |
| జాము | ప్రా. జామ | యామ |
| డంబము | ప్రా. డంభ | దంభ |
| తిక్క | పా. ప్రా. తిక్ఖ | తీక్ష్ణ |
| దెయ్యము, దయ్యము | ప్రా. దెయ్య (మలయాళము - తెయ్యం ; కన్నడము = దెవ్వ) | దైవ |
| దోనె | పా ప్రా. దోణీ | ద్రోణి |
| నట్టువ | ప్రా. నట్ట | నాట్య |
| నాణ్యము | ప్రా. ణాణయ. | నాణక |
| పక్కి | పా. పక్ఖిన్ ; ప్రా. పక్ఖి | పక్షి |
| పట్టణము | ప్రా. పట్టణము | పత్తన |
| పల్లకి | పా. ప్రా. పల్లకి | పల్యంక |
| బంజెరు (కన్నడము, బంజె) | పా. ప్రా. వంఝ - | వంధ్య |
| బండారము | ప్రా. భండార | భండాగార |
| బంతి | పా. ప్రా. పంతి | పఙ్క్తి |
| బొట్టు | ప్రా. వట్ట | |
| మద్దె | ప్రా. మద్దల | మర్దల |
| మసి | పా. ప్రా. మసి | మషి |
| రచ్చ | పా. రచ్ఛా | రథ్య |
| రెడ్డి | ప్రా. రఠ్ఠిఅ | రాష్ట్రిక |
| లద్దె | ప్రా. లద్దీ | |
| రొట్టె | ప్రా. రొట్ట | |
| లప్పము | ప్రా. లెప్ప | లేప్య |
| లొట్ట | ప్రా. లొట్ట | |
| వంకి | పా. ప్రా. వఙ్క | వక్ర |
| వట్ట (అలవట్టము) | పా. ప్రా. వట్ట | వృత్త |
| వడ్డి | ప్రా. వడ్ఢి | వృద్ధి |
| వెట్టి (వెట్టిచాకిరి) | ప్రా. విఠ్ఠి, వెఠ్ఠి | విష్టి |
| | ప్రా. సరిస | సదృశ |
| సింగము | ప్రా. సింఘ | సింహ |
| సింగారము | పా. ప్రా. సిఙ్గార | శృంగార |
| సున్న | ప్రా. సున్న | శూన్య |
| సున్నము | పా. ప్రా. చుణ్ణ | చూర్ణ |
| సెజ్జ | ప్రా. సెజ్జ | శయ్యా |

కో. మ. శా.

# తెనుగునకు ఇతర ద్రావిడ భాషలతోడి సంబంధము

తెనుగు ద్రావిడభాషా కుటుంబమునకు చెందినది. తమిళము, కన్నడము, తెనుగు, మలయాళము మొదలైనవి ద్రావిడభాషలు. ఈ భాషలకు గల సంబంధము సోదరభావమున నున్నది.

అత్యంత ప్రాచీనకాలమున తెలుగు, అరవము, కన్నడము, మలయాళము అను పేళ్ళుగల వేర్వేరు భాషలు లేకుండినవి. వింధ్యకు దక్షిణప్రాంతమునందు అంతటను, ఉత్తరహిందూస్థానమున కొన్ని తావులను అత్యల్పములగు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



భేదములు కలిగి చాల సంకీర్ణరూపమున నుండిన ఒక్క భాషయే జనులు తమ దైనిక వ్యవహారమున మాటాడు చుండిరి. దాని పేరే ప్రాచీన ద్రావిడభాష. ఆ ప్రాచీన ద్రావిడభాషకు కొన్ని స్వాభావికములయిన లక్షణములు ఉండి అద్దానిని ఆనాటి ఇతరభాషలమండియు, నేటి జన్య భాషలమండియు వేరుగా భావించుటకు హేతువులగు చుండినవి. ఆభాష నేడు వినబడదు. అందు గ్రంథరచనయే జరుగలేదు. కావున, ఇక అట్టి గ్రంథములు లభించుటకూడ దుర్లభమే. అట్టిభాషను మనము ప్రత్యక్షముగా కనక, వినక పోయినను అది ఉండినట్లు ఊహించి అనుమాన ప్రమాణము వలన సిద్ధాంతపరచుటకు అనేకములయిన ఆధారములు కలవు. అట్లు సిద్ధాంతపరచిన ఈ మూల ద్రావిడభాష (ప్రాచీన ద్రావిడభాష) కాలక్రమమున రూపాంతరము లను పొంది విచ్ఛిన్నమై వేరు వేరు భాషలుగా ఏర్పడినది. అవియే నేటి ద్రావిడభాషలు. వానిలో తెనుగు ఒకటి. ఒకేభాష ఈరీతిని మారుపడుట శాస్త్రజ్ఞులు అనేకులు అంగీకరించినదే కాక, మనకును సాధారణముగా గోచరించు నదియే. భాష సాంగమయిన జీవపదార్థమువంటిది. కావున, జీవపదార్థములు ఎట్లు కాలక్రమమున పెరిగి బాల్య యౌవన వార్ధకాద్యవస్థలకు పాల్పడి నాశమును పొందుచుండునో, వానినుండి క్రొత్తజీవములు ఎట్లు పుట్టుచుండునో అట్లే భాషలును మారుచు ఉండునని మనము తలపవచ్చును.

భాష అభిప్రాయములను తెల్పు పదముల కూడిక అగు చుండుటవలనను, ఆపదములు వ్యక్తుల నోటినుండి వెడలు నప్పుడు కాలక్రమమున అర్థమునను, రూపమునను కూడ కొంత వైరూప్యము నొందుచు ఆ నోటినుండి మరియొక నోటికి ప్రాకుచుండును. వినువారు సరిగా వినకయు, ఉచ్చ రించువారు సరిగా ఉచ్చరింపకయు, ఉచ్చరింపజాలకయు, తప్పుపదములను భాషలో ప్రవేశింపజేయుదురు. వానినే తల్లిదండ్రులు తమ పిల్లలకు చెప్పుచుండుటను, వానినే వారును తమ పిల్లలకును, తమకు శిష్యులగువారికిని తెల్పుచుండుటను అయ్యవియే ప్రమాణము లగుచుండును. ఇట్టి మార్పులవలన మాత్రమే కాక, ఒక ప్రదేశమున ఉండినవారు కొన్ని కారణములచే ముందంజవేసి విద్య యందు అభివృద్ధిని నాగరికతను కాంచుటచేతను అచ్చటి భాష ఇతర ప్రదేశముల నుండి ఆభాషనే మాటాడువారి భాష కంటె భిన్నరూపమును పొందుచుండును. అట్టి అవస్థయే ప్రాచీన ద్రావిడమునకు పట్టుటచే అది ఖండ ములయిపోయినది. ఇంచుమించుగా బరంపురమునుండి మదరాసువరకును, బందరునుండి బళ్ళారివరకును మాటాడు భాష తెనుగుగాను, దక్షిణమున మదరాసు నుండి కన్యాకుమారి వరకును అరవముగాను, పశ్చిమమున కన్నడ, మలయాళములుగాను ఏర్పడుట సంభవించినది. వాఙ్మయము బయలుదేరి వృద్ధికి వచ్చుటలో ఈభాషలు ముందువెనుక లయినవి.

అరవమున చాల ప్రాచీనకాలముననే, క్రీస్తు జన్మింపక ముందే, సుమారు రెండువేల సంవత్సరములకు పూర్వము ననే వాఙ్మయము బయలుదేరినది. కర్ణాట భాషలో లభిం చిన ఆదిమ గ్రంథము క్రీస్తువెనుక 9 శతాబ్దిలోనిది. అట్లే తెనుగున రచియించిన భారతము 11 శతాబ్దిలోనిది. ఇట్లు భిన్నకాలములయందు వాఙ్మయస్థితికి వచ్చి రూపొందిన ఈ భిన్న ద్రావిడభాషలలో తెనుగు ఇతర ద్రావిడభాషల నుండి సాయముగాని, మార్పుగాని పొందినరీతిని నిర్ణయింప వలెను.

మొట్టమొదట ఉండిన మూలద్రావిడము అంతయును ఇంచుమించుగా ఏకరూపముననే ఉండుటచేత తెనుగు నందలి పదజాలమును, వాక్యములును, రచనావిధానమును ఇతర ద్రావిడభాషలలోని వానివలెనే ఉండును. పదముల అంతములయందును, ప్రత్యయముల రూపములందును, కొన్ని పదములలోని అక్షరముల క్రమమునందును మాత్రమే భేదము కనుపట్టుచుండును. కాబట్టి ఇతర ద్రావిడభాషల పోలికలు తెనుగులో అనేకము ఉండును. ఆ పోలికలును, భేదములును కొన్ని ఈక్రింద ఉదాహరింప బడుచున్నవి :

1. తెనుగు పదముల తుదిని 'అ' కారము ఉన్నచో ఇతర ద్రావిడ భాషలయందు 'ఎ', 'ఐ' కారములలో ఏదేని ఒక్కటి కలుగుటయు, తెనుగుపదములు అజంతము లయినచోట ఇతరములు హలంతములుగా ఉండుటయు సంభవించుచుండును.

| తెనుగు | అరవము | కన్నడము | మలయాళము |
|---|---|---|---|
| ఎర | ఇరై | ఎరె | ఇర |
| తల | తలై | తలె | తల |
| పిల్ల | పిళ్ళై | పిళ్ళె | పిళ్ళ |
| ఎడ | ఇడై | ఎడె | ఇడ |
| తెర | తిరై | తెరె | తిర |
| పాలు | పాల్ | హాలు | పాల్ |
| నేను | నాన్ | నాను | ఞాన్ |
| మొదలు | ముదల్ | మొదల్ | ముదల్ |

పై శబ్దములను పరిశీలించినచో ఒక్క మూలరూపము నుండియే అవి ఏర్పడినట్లును ఆద్యంతములందు మాత్రము స్వల్పభేదములున్నట్లును స్పష్టపడును. ఒక్కొక్క లక్ష ణము రెండేసి భాషలయందు కనుపట్టుచుండును.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



2. ఇట్లే పదాదిని తెనుగున ఒక యచ్చు ఉన్నప్పుడు ఇతర భాషలలో వేరొక యచ్చు ఉండును.

| తెనుగు | అరవము | కన్నడము | మలయాళము |
|---|---|---|---|
| ఎల | ఇళ | ఎళ | ఇళ |
| ఏనుగు | యానై | ఆనె | ఆన |
| ఒదవు | ఉదవు | ఒదవు | ఉతకు |
| కొరలు | కురల్ | కొరల్ | కురల్ |
| పొద | పుదై | పొదె | పుద |

3. ఒక భాషలో హ్రస్వ మున్నచో ఇంకొక భాషలో దీర్ఘ ముండును.

| తెనుగు | అరవము | కన్నడము | మలయాళము |
|---|---|---|---|
| ముప్పు | మూప్పు | ముప్పు | మూప్పు |
| అరయమి | అఱియామై | అఱియమె | అఱియాయ్మ |
| తప్పక | తప్పాదె | తప్పదె | తప |

4. ఒక భాషలో ఒక హల్లు ఉన్నచో, దానికి సంబంధించిన సజాతీయమైన హల్లు ఇంకొక భాషలో ఉండును.

| తెనుగు | అరవము | కన్నడము | మలయాళము |
|---|---|---|---|
| గట్టు | కట్టు | గట్టు | కెట్టు |
| చుండు | చొండు | జొండు | చుండు |
| దాటు | తాండు | దాండు | తాండు |
| పచ్చ | వచ్చ | బచ్చ | పచ్చ |

పై ఉదాహరణములలో ఒకదానియందు వర్గప్రథమాక్షర మున్నచో ఇంకొకదానియందు వర్గ తృతీయాక్షరము కనుపట్టుచున్నది.

5. 'క, చ, స'లు, 'య, స'లు, 'ల, ఱ, ళ, డ, ర'లు, 'వ, బ'లు భిన్న భాషలలో తార్మారు అగుచుండును.

| తెనుగు | అరవము | కన్నడము | మలయాళము |
|---|---|---|---|
| చెఱు | సిఱు | కిఱు | చెఱు |
| ఉసురు | ఉయిర్ | ఉసిర్ | ఉయిర్ |
| పేరు | పెయర్ | పెసరు | పేరు |
| కొలను | కుళం | కొళం | కుళం |
| అడలు | అழల్ | అఱలు | అழల్ |
| ప్రొద్దు | పొழுతు | పొత్తు | పొழுతు |
| వాయి | వాయ్ | బాయి | వాయ్ |

ఇట్లే ఒక భాషలో ద్విత్వము ఉన్నచోట ఇంకొక భాషలో ఆ యక్షరమున ద్విత్వము లేకుండుటయు, ఒక భాషలో అనుస్వార మున్నయెడల ఇంకొకభాషలో అనుస్వారము లేకుండుటయు, ఒక భాషలో 'న, ల' లున్నచో మరియొక దానియందు 'ణ, ళ' లుండుటయు కనుపట్టుచునే ఉండును.

సామాన్యముగా ఏకగర్భ జనితులయిన ఒక తండ్రి పుత్రులయందు అవయవములలో పోలికలు కనిపించునట్లే సయి భాషలయందు అవయవములయిన పదములలో నిశ్చితములయిన పోలికలు కనుపట్టుచునే యుండును. సయి పోలికలు బహిరంగమయిన శబ్దరూపమునందు మాత్రమే ఉదాహరింపబడినవి. ఇంతియకాక, సోదరుల నడక, మాటతీరు, ఆచార వ్యవహారములు, శౌర్యాది గుణములు - వీనిలో పోలికలు ఉండునట్లే భాషలలోని వాక్యాదిరచన యందును, ప్రత్యయ సంయోజనమునందును, ఇతరము లయిన వ్యాకరణ విషయములందును పోలికలు తప్పక విశేషముగా గోచరించుచునే యుండును.

అట్లే పుట్టుకలో ఉండిన కొన్ని గుణములు కాలక్రమమున కొందరు సోదరులయందు అభివృద్ధి నందుటయు, ఇంకొక కొందరియందు క్షీణించుటయు జరుగుచుండునట్లు మూలభాషలో ఉండిన లక్షణములు కొన్నిటిలో అభివృద్ధి పొందుటయు, మరికొన్నిటియందు చాలవరకు నశించిపోవుటయు ఉండునని ఈక్రింద నిరూపింపబడును.

1. ప్రాచీనకాలమున ద్రావిడ భాషలు ఏకముగా ఉండినపుడు పదముల తుదిని హల్లు ఉండుట సాధారణముగా ఉండెడిది. అట్టిలక్షణము నేటి అరవమునను, మలయాళమునను అధికముగా కనుపట్టుచున్నది. హళగన్నడమున (అనగా ప్రాతకన్నడమున) ఈ హలంతత అధికము. హొస గన్నడమున (అనగా నేటి కన్నడమున) పదములు చాలవరకు అజంతములుగా మారిపోయినవి. తెనుగు పదములు అన్నియు అజంతములే. తుదిని ఉన్న ఉకారము పోవుటచేత హలంతములు ఏర్పడుచున్నవని, అనగా ఉకారాంత రూపములే మనకు సాధారణముగా వినబడుచుండుటవలన హలంతములయిన 'వనముల్', 'పాలుర్' మొదలయిన శబ్దములలో చివర 'లు' 'రు' వర్ణములే ఉండిన వనియు, అవియే ప్రాచీనము లనియు, వానియందలి 'ఉ' కారము లోపించిన దనియు మనము తలచుచున్నాము. కాని, చరిత్రాత్మకముగా ఇది సత్యము కాదు.

2. సంస్కృత భాషలో లేనట్టి ఎ, ఒ, ఴ (ழ) అను వర్ణములు ప్రాచీన ద్రావిడ భాషలో స్వతస్సిద్ధముగా నుండినవి. అట్లు మూలరూపములలో ఉండిన ఈ యక్షరములలో కొన్ని ఆయా భాషలలో నేడు నశించిపోయినవి. 'ఴ' కారము నేటి అరవము, మలయాళము - రెండింటియందును ఉన్నది హళగన్నడమున చాలచోట్ల ఱకారము ఉండినది; హొసగన్నడమున నశించినది. అట్లే ప్రాత తెనుగులో చాల స్వల్పముగ కనుపట్టుచుండిన ఈ ఱకారము నేటి తెనుగునుండి పరిపూర్ణముగా భ్రష్టమయినది.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అట్లు మూలరూపములలో ఉండిన ఈ ఴ కారము 'ల', 'డ', 'ర', 'స', 'య' అను అక్షరములలో ఏదో ఒక్కటిగా తెనుగున మారిపోయినది.

| తెనుగు | హళెగన్నడము | అరవము | మలయాళము |
|---|---|---|---|
| కోడి | కోళి | కోఴి | కోఴి |
| ప్రోలు | పొళలు | పొఴిల్ | పొఴిల్ |
| గొయ్యి | కుళి | కుఴి | కుఴి |

ఇంతియకాక తెనుగున దంత్య చ జ లు తక్కిన సోదర భాషలలో లేనివి క్రొత్తగా కల్గినవి.

3. మూలద్రావిడములో ఒత్తక్షరములును, 'శ', 'ష'. లును ఉండియుండలేదు. కాని, సంస్కృత సాహచర్యము వలన ఈ యక్షరములు నేటి జన్యభాషలు అన్నింటిలోనికి పోయినవి. సంస్కృత భాషలోని పదములను వాడుక భాషలోనికి తెచ్చుకొనుచుండినపుడు వానియందలి అక్షరములను కూడ తెచ్చుకొనుట కొన్నియెడల నయినను తప్పదు. కావున ఆ యక్షరములను అన్నిటిని మలయాళము, తెనుగు, కన్నడము అను భాషలు గ్రహించి వానికి తమ వర్ణమాలలో గుర్తులను గూర్చుకొనినవి. అరవము మాత్రమే సంస్కృత పదములను తనయందు చేర్చుకొనుటలో కొంత అనిష్టమును సూచించుచు ఉండినది. సంస్కృత పదములను చేర్చుకొనవలసినపుడు, అనగా తన (అరవము) లోని ఉచ్చారణతో సమముగా నుండునట్లు మార్చిన వికృత రూపములనే చేర్చుకొనుచుండినది. అరవములోని సామాన్య వర్ణమాలలో నేటికిని ఒత్తక్షరములకును, వర్గ తృతీయాక్షరములకును, శ, ష, స, హ లకును గుర్తులు లేవు. క, జ, యని ప్రతివర్గమునను మొదటిదానికిని, తుదిదానికిని మాత్రమే గుర్తులు కలవు. ఇది అరవభాషలో ఉన్న విశేష గుణము.

4. ఈ భాషలు అన్నిటిలో 'సమస్వరత' అను ఒకానొకగుణము ఉన్నది. అవ్యవహితములుగా ఉన్న స్వరము లన్నియు భిన్నములుకాక పూర్వ స్వరములే అగుట దీని లక్షణము. కత్తి + కు అన్నచోట 'కు' వర్ణములోని 'ఉ' వర్ణము 'ఇ' వర్ణముగా మారి 'కి' అను రూపము పొందుటచే 'కత్తికి' అను రూపము ఏర్పడుచున్నది. అట్లే 'కత్తి + లు' కలసి 'కత్తులు' అను రూపము కలుగుచున్నది. ఈ లక్షణము అన్ని ద్రావిడ భాషలయందును కొంచెమో గొప్పయో ఉన్నను, తెనుగునందు మాత్రము సంపూర్ణముగా స్థిరపడియున్నది.

5. ఈ భాషలయందలి వాక్యరచనయు, 'చేయుచున్నాడు' మొదలగు సమాపక క్రియారూపములవంటి రూపములు అన్నియు ఒక్కరీతినే ఏర్పడుచున్నవి.

6. ఇందలి సర్వనామములును, సంఖ్యావాచకములును, క్రియార్థకము లయినధాతువులును మిక్కిలి సమీపము లయినరూపములతోడనే ఉండును.

ఇయివిధముగ అనేకలక్షణములలో సమానములయిన ఈ భాషలు అన్నియు కాలక్రమమున వేరయి భిన్నభాషలయినవి. వీనిలో తెనుగును, హళెగన్నడమును మిక్కిలి దగ్గరగను, అరవమును, మలయాళమును చాల సన్నిహితముగను ఉన్నట్లు కనుపట్టుచున్నవి.

సోదరులు పెద్దవారయి తమకుటుంబములను ప్రత్యేకముగా ఏర్పరుచుకొని వేరువేరు గృహములలో నివసించుచుండియు ఒకరి కొకరు సంబంధమును అనేకవిధముల కల్పించుకొనుచుందురు. ఒకరి కొకరు ధనాదికమును ఇచ్చుకొనుచు, సాహాయ్యము చేసికొనుచు ఉండుటయు, లేక విరోధములు కల్పించుకొని వాదులాడుకొనుచుండుటయు సంభవించు చుండునుకదా!

ఈ భాషలవిషయమున 'వేరుపడుట' అనగా ఒకభాష మాటాడువారికి సులభముగా ఇంకొకభాష తెలియకుండునట్లు అవి మారుటయే. అట్లు మారిన భాషలు ఒకప్రధాన భాషనుండి జనించినవి మాత్రమే కాక స్వతంత్రములైన సోదరభాషలును అగుచున్నవి. వానిలో వేర్వేరుగా వాఙ్మయము, కోశములు మొదలయినవి బయలుదేరినచో వాని భిన్నభాషాస్థితి పరిపూర్ణ మనక తప్పదు.

ఆక ద్రావిడభాషలలో మిక్కిలి ప్రాచీనకాలముననే తమిళము వాఙ్మయస్థితికి వచ్చుటచేత అది ద్రావిడభాషలకు పెద్దక్క యగును. కావున ఆభాషయందలి ఆనాటి పదముల రూపములు ఆనాటిగ్రంథములలో లిఖింపబడియుండును. అవి మరి వానిలో మారవు. అయినను, ఆపదములు ఉచ్చారణలో కొంతమారుచనే యుండును. కాని, జనులు వ్రాతను ప్రమాణముగా గ్రహించి, వాడుకను ఆప్రమాణమునుబట్టి దిద్దుకొనుచు ఉండుటవలన ఆవాడుకలోని పదములుకూడ మిక్కిలి వేగముగా మారవు. లిఖితమగు వాఙ్మయములేని భాష మిక్కిలి వేగముగా మారుచనే ఉండును. దీనికి కారణము జను లనుసరించుటకు అంగీకరింపబడిన ప్రమాణము లేకుండుటయే. ఇట్లు తెనుగు ప్రామాణికస్థితికి వచ్చుట క్రీ.శ. 11 శతాబ్దిలో నన్నయవ్రాసిన భారతముతోనే.

ద్రావిడభాషలవలన తెనుగు సారస్వతమున ప్రవేశించిన వాఙ్మయప్రక్రియలు మాత్రమేకాక అనేకమయిన అరవ కన్నడపదములును చేరినవి. ఈ పదములలో కొన్ని మొట్టమొదట అన్ని ద్రావిడభాషలలోను సమానరూపములతోనే ఉండియు, కాలక్రమమున ఆయాభాషలలో



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



రూపాంతరములను పొంది వేరువేరు పదములవలె భాసించు చుండినవి. వానిలో కొన్ని తెలుగులో నశించియున్నవి. అట్టివి మరల తెలుగులో అరవము, కన్నడిగల సంపర్కమున చేరినవి.

అరవదేశమందలి వైష్ణవసంప్రదాయమువలన అరవ పదములు అనేకము తెనుగున ప్రవేశించినవి. శ్రీశబ్దభవమైన 'తిరు' అను అరవపదమును పూజ్యార్థమున పూర్వపదముగా అరవములో వాడుట కలదు: తిరువారాధనము, తిరుచూర్ణము, తిరువాయ్‌మొళ్ళి, తిరుమాళిగ, తిరుమణి, తిరునాళ్ళు, తిరువీథులు, తిరుకట్టి, తిరుకణ్ణముదు, తిరుకాప్పు, తిరుక్కోళము, తిరునామము, తిరుమంజనము మొదలగునవి; తిరుపతి, తిరుమల, తిరుత్తణి, తిరుక్కాళత్తి, అను గ్రామముల పేరులును ఇట్లు ఏర్పడినవియే. ఇందు కొన్ని శబ్దములు సంస్కృతమునుండి అరవమునకు వచ్చినవి. ఆ యరవములోని వైకృతులు తెనుగున ప్రవేశించినవి. కాని, స్వతంత్రముగా సంస్కృతమునుండి తెనుగునకు రాలేదు. ఆళ్వారు, నైనారు, చిరుతొండ, రాజనారాయణ విణ్ణగరాళ్వారు, పేయాళ్వారు, గరుడాళ్వారు, అలమేలుమంగ, మన్నారు, నాంచారి, అళగసింగరి అనునవి దేవతలును, వారిభక్తులును అగువారి పేరులుగా వచ్చినవి. పసావడు, సాదము, సాంబారు, వడ, తళిగ, కట్టడి, దోసె, ఇడ్లీ, తైరు, పాపాటు, అముదుతళి మొదలగునవి భోజన పరిభాషగా వచ్చినపదములు: అయ్యారు, నంబి, తంబి మొదలగునవి మతసంప్రదాయమునుబట్టి వచ్చినవి. మొదలియారు, పిళ్ల, కణక్కుపిళ్ళ, అణ్ణగళు మొదలయినవి ఉద్యోగధర్మమునుబట్టి వచ్చిన పదములు. ఇంతేకాక మణ్ణాస, పెణ్ణాస, నంజు, పుంజు, నంగి, పడి, మరక్కాలు మొదలయిన పదములు ఎన్నియో తెనుగున అరవమునుండియే ప్రవేశించెను.

ఇట్లే కన్నడమునుండియు అనేకములయిన పదములును వీరశైవ మధ్వ సంప్రదాయముల ననుసరించియు, ఆంధ్ర, కర్ణాటకదేశముల కూడలి పట్టు అయిన విజయనగరమునుండియు, శ్రీశైలాది శైవక్షేత్రముల సంబంధమువలనను తెనుగున ప్రవేశించినవి. అరసు, కెలసము, గండపెండియరము, హెగ్గడి, హొన్ను, దేవర, బేడలు, ఇల్ల, సాకు, రాయరు, బిడారు, బేకు మొదలయినవి ఇట్టివి.

అరవ కన్నడములు తెనుగునకు సోదరభాషలును, పరిహద్దుభాషలును అగుటవలన ఈ రెండు భాషలకును ఇతర ద్రావిడభాషలగు మలయాళాదులకంటె ఎక్కువ సంబంధము కలుగుచునే యుండినది.

గం. జో. సో.

# ఆంగ్లభాష వలన తెనుగులో కలిగిన మార్పులు

ఏభాషయందయినను రెండువిధములయిన అంశములు ఉండును. మొదటిది: పదములు; రెండవది: ఆపదములను కూర్చి వాక్యములను రచించు విధానము. స్వతంత్రము లయినభాషలలో ఈ రెండును స్వతంత్రములుగనే ఉండును. స్వతంత్రముకాని-అనగా ఇంకొకభాషనుండి పుట్టిన-భాషలో పై రెండును జనకభాషలోని అంశములనే పోలియుండును. భాష అనునది వాక్యముల సమూహము. వాక్యమునందలి రచనాపద్ధతి ఆయాభాషల యొక్క స్వభావమును నిరూపించుటలో ముఖ్యముగా ఉపయోగించును.

ఒకభాషను మాటాడువారు ఇంకొకభాషను మాటాడు వారితో కలిసి మెలసి చాలకాలము సన్నిహితమయిన సంబంధము కలిగి యుండునపుడు ఒక భాష యొక్క స్వభావము రెండవదానిలోనికి ప్రాకుచుండును. ఆంగ్లభాష పాలకభాష అగుటచే చాలకాలమునుండి వ్యవహారమున ఉన్నది. అది పదజాలము అధికముగ విస్తరిల్లినభాష; అంతేకాక, మనభాషకంటె భిన్నలక్షణములు కలది; దాని రచనావిధానమును విభిన్నము. కాలక్రమమున అందలి పదములు, దాని రచనావిధానము మన తెనుగులో ప్రవేశించినవి.

తెనుగులోనికి ఆంగ్లపదములు రెండు విధములుగా చేరినవి. మార్పులేకయే-ఆ భాషలోని రూపములతో-వచ్చి చేరినవి కొన్ని: వానిని తత్సమములు అనవచ్చును. కంపెనీ, లాయరు, పోస్టు, నోటుబుక్కు మొదలయినవి ఇట్టివి. మనవారి ఉచ్చారణలో మార్పుచెంది విరూపములు అయినవి కొన్ని. వానిని తద్భవములు అనవచ్చును. కలకటేరు, టేశను, వోటలు, కనిష్టీపు మొదలయినవి ఇట్టివి. కలెక్టరు, స్టేషను, హోటలు, కానిస్టేబిల్ అనునవి ఈ పదముల మూలరూపములు.

ఈ తత్సమ తద్భవరూపములతో ఆంగ్లపదములు మన తెనుగుభాషలో ఎట్లు ప్రవేశించినవి? మనభాషలో తెలుపుటకు వలనుపడని అర్థముగల ఆంగ్లపదములను ఆంగ్లేయులు వ్యవహరించుచుండగా విని వానిని మనము అనుకరింతుము. అట్లు అనుకరించిన పదములు మార్పులేకయు, మార్పు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



రెండియు మనభాషలోనికి వచ్చి చేరుచుండును. ఇట్లు అనుకరించుటలో మనభాషలో లేనిపదములనే కాక, మన భాషలో వాడుకయందు ఉన్నపదములను విడిచికూడ పరభాషలోని పదములను తెచ్చుకొనుచుందుము. Court summons అను దానిని 'కోర్టుసమను' అని వాడు చుందుము. దానిని తెనిగింపము; అట్లు తెనిగించవలసిన అవశ్యకమును లేదు. (మా సోదరుడు అనుటకు 'మా బ్రదరు' అను వ్యవహారము కలదు). అన్యభాషాపదములు మనకు మిక్కిలి పరిచితములుగా ఉండుటయు, మనవారి వ్యవహారములో ఉండుటయు ఇట్టివాడుకకు కారణములు. పయితీరున తెనుగులోనికి వచ్చిన ఆంగ్ల పదములు వేనకు వేలు కలవు. తెనుగులోని పదములను పూర్వకాలమున మనము సంస్కృతమునుండి తెచ్చుకొనుచుంటిమి; ఇప్పుడు ఆంగ్లమునుండి తెచ్చుకొనుచున్నాము. మనము చదువు చున్న విజ్ఞానశాస్త్రములలోని ఆంగ్లపారిభాషికపదములు అన్నియు మనకు గ్రహణయోగ్యములగుచున్నవి.

అన్యభాషా పదములు వచ్చి చేరునపుడు వాని ఉచ్చారణకు అనుకూలమయిన అనాంధ్రవర్ణములును వచ్చి చేరు చుండును. తెనుగున మొదట ఒత్తక్షరములయిన 'ఖ ఛ ఠ థ ఫ'లును, 'శ ష క్ష ఱ ఋ'లును ఉండినవి కావు. అవి అన్నియు సంస్కృతపదముల చేరికవలన వచ్చి చేరినవి; కాని, నేడు ఆంగ్లపదములు చేరినను వాని సరియయిన ఉచ్చారణమును తెలుపునట్టి అక్షరములు తెనుగులో లేవు. కావున Coffee, father, office మొదలయిన పదములను 'f' అను అక్షరముయొక్క ఉచ్చారణ తెలుపు అక్షరము తెనుగున లేకపోవుటచే, కాఫీ, ఫాదరు, ఆఫీసు అనియే వ్రాయుచున్నాము. వాని యుచ్చారణమును మాత్రము చాలవరకు ఆంగ్లమునందు వలెనే చేయుచున్నాము. ఇట్లే act, average, advocate, bank మొదలగు పదములలోని తొలి 'a' వర్ణముయొక్క ఉచ్చారణమును సరిగా తెలుపు నట్టి వర్ణము తెనుగులో లేదు. ఆంగ్లము తెలియనివారు ఈ పదములను పలువిధములుగా ఉచ్చరించుచుందురు.

వాక్యరచనయందును మన తెనుగువారు - ముఖ్యముగా ఆంగ్లము చదివినవారు - తెనుగునను ఆంగ్ల వాక్యరచన పద్ధతినే అనుకరించుచున్నారు. 'నాకు నాలుగు పుస్తకము లున్నవి' అనుట తెనుగు పద్ధతి. ఆంగ్లములోని I have four books అను ఆంగ్ల వాక్యమునకు ఇది తెనుగు. పై ఆంగ్ల వాక్యమును అనుకరించి 'నేను నాలుగు పుస్తకములు కలిగి యున్నాను' అని వ్రాయుదురు. This is a book అను వాక్యమునకు 'ఇది పుస్తకము' అనుట తెనుగు పద్ధతి. కాని, 'ఇది ఒక పుస్తకము అయి ఉన్నది' అనుట ఆంగ్లానుకరణము. This is called a goat - దీనికి 'ఇది మేక', 'దీనిపేరు మేక', 'ఇది మేక అనబడును' అనుట తెనుగునకు సహజములు. 'ఇది మేక అని పిలువ బడుచున్నది' అనివ్రాయుట ఆంగ్లానుకరణము. 'పిలుచు' అను ధాతువు పిలువగా పలుకు వ్యక్తులకు ఉపయోగించు టయే - 'ఆహ్వానము' అను అర్థమున వాడుటయే - తెనుగున సిద్ధము. నామ నిర్దేశమునకు 'అను' ధాతువును వాడుట జాతీయము. He is angry with me అను వాక్యము నకు 'అతనికి నాపై కోపము' అనుట తెనుగు నుడి కారము. 'అతడు నాతో కోపమున ఉన్నాడు' అనుట ఆంగ్లమును అనుకరించిన తెనుగు. This man and that man came - దీనికి 'ఈ మనుష్యుడును మరియు ఆ మను ష్యుడును వచ్చిరి' అనుట ఆంగ్లానుకరణము. 'అతడును ఇతడును వచ్చిరి' అనుట తెనుగు నుడికారము. And అను పదమునకు తెనుగున 'ను' వర్ణము కలదు. 'మరియు' అనునది వాడుట ఆంగ్లానుకరణము. I give him encouragement అనుదానికి 'అతనిని ప్రోత్సహించుచున్నాను' అని కాని, 'అతనిని ప్రోత్సాహము చేయుచున్నాను' అని కాని వ్రాయుట తెనుగు పద్ధతి. 'ప్రోత్సాహము ఇచ్చుట' అనునది ఆంగ్లపద్ధతి. ఇట్లే 'దోహదము చేయుట' తెనుగు తీరు. 'దోహదము ఇచ్చుట' అనునది ఆంగ్లము తీరు. దోహదము ఒక పని. దానిని చేయుట అనునది తెనుగు వాడుక. వాక్య రచనా విధానమునకు పయిని చూపిన ఉదాహరణములు దిఙ్మాత్రములు.

తెనుగు విభక్తులు తారుమారగుట, క్రొత్త సముచ్చయ ములను కల్పించుట, ప్రాత క్రియలను నూతనార్థములలో వాడుట మొదలయినవి నేటి తెనుగున పర్వడుచున్నవి. ఇందుకు కారణము అధికారుల ఆజ్ఞాపత్రములు, ప్రకట నలు, పత్రికలకు ప్రకటనార్థము చేరు వార్తలు, రేడియో లకు అందునట్టి వ్యాసములు, నిత్యోపయోగకరములగు విజ్ఞాన విషయములు మొదలగునవి ఇంచుమించుగ ఆంగ్ల ములో ఉండుటచే, వాని భాషాంతరీకరణమున భాషాంతరీ కర్త ఎప్పటి కప్పుడు ఆంగ్ల రచనములోని భావమును కరగి తెనుగున అచ్చుపోయవలసి వచ్చుచుండుటయే. ఇట్లు చేయు టలో ఇట్టివే ఇతరము లనేకము తెనుగున ప్రవేశించు చున్నవి. ఒక ఉపన్యాసములో The scheme is being given its final shape అని ఇంగ్లీషున ఉండగా 'ఈ ప్రణాళికకు తుది రూపము ఈయబడుచున్నది' అని తెనిగింపబడినది. 'ఈ ప్రణాళిక సిద్ధమగుచున్నది' అని కాని, 'సిద్ధము చేయబడుచున్నది' అని కాని చెప్పుట తెనుగురీతి.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తెనుగు వ్యాకరణము కూడ ఆంగ్ల వ్యాకరణమువలన చాలవరకు మారిపోయినది. తెనుగు వ్యాకరణమున పూర్వ కాలమున లేని నూతన విషయములు, సంప్రదాయములు మిక్కిలిగా ఆంగ్ల భాషా సంప్రదాయముల ననుసరించి ప్రవేశించినవి. ప్రాచీనాంధ్ర గ్రంథములలో లేని వాక్య విరామ చిహ్నములు (, ; : . ? !) మొదలగునవి ఆంగ్ల భాషను అనుసరించి తెనుగున ప్రవేశించినవి. పూర్వులు చెప్పిన భాషాభాగములు మాత్రమే కాక నేటి తెనుగు వ్యాకరణములో సముచ్చయములు, ఆశ్చర్యార్థకములు మొదలయినవి ప్రవేశించినవి. వాక్య విభజనములో ప్రాచీనులు చెప్పని 'సంశ్లిష్ట వాక్యము, ద్వంద్వ వాక్యము, సరళ వాక్యము' అనునవి ప్రవేశించినవి. ఇవి Compound, Complex, simple-sentences అను ఆంగ్ల పదములకు తెనుగుగా తెనుగు వ్యాకరణములోనికి ఎక్కినవి. ఇట్లే కొన్ని ప్రాచీన వ్యాకరణ సిద్ధాంతములును మారిపోవు చున్నవి.

నేటి విద్యా విధానమున వ్యావహారిక భాషావాదమునకు ప్రాముఖ్యము ఏర్పడుటకు కూడ కొంతవరకు ఆంగ్ల భాషా సాహచర్యము ఉపకరించుచున్నది. ఆంగ్లమునందలి భాషా చరిత్ర గ్రంథములు చదివి భాష నిరంతరము మారుచుండును అని గ్రహించుట, శిష్టులదైనిక వ్యవహారమునకును, గ్రంథ వ్యవహారమునకును విశేషము భేదము ఉండరాదనుట, ప్రాచీనమయిన భాషను వ్రాయ రాదనుట మొదలయిన అభిప్రాయములు ఆంగ్లభాషా సాహచర్యమున బలపడి తెనుగు భాషయొక్క రూపమును మార్చివేయుచున్నవి.

మన వేషభాషలు, మన యాచారములు, మన ధర్మములు మొదలయినవి అన్యజాతి సంపర్కమువలన మారుచున్నట్లే మన భాషయు అన్యభాషా సంపర్కమువలన మారుచున్నది. ఇట్లు మారుట సహజము. మారగూడదని కాని, మారినదానిని గ్రహింపమని కాని, ప్రాతపద్ధతినే పట్టుకొని వ్రేలాడుట కానిపని. అయినను, భాష మారుచున్నది కదా అని దానిని వికృతముచేసి, దాని రూపమును ప్రయత్నపూర్వకముగా చెరచుటయు యుక్తము కాదు. భాషా పరిణామము సహజము. అది మందముగా జరుగును. ఆ వేగమును మనము హెచ్చింపనురాదు; తగ్గింపనురాదు.

గం. జో. సో.

# వ్యావహారిక భాషా పునః ప్రతిష్ఠాపనము

ఈ శతాబ్దారంభములో భారతదేశమందు ఇతర ప్రాంతాలలో వలె తెలుగుదేశములోకూడ నూతన భావోదయమయినది; స్వతంత్రతాభావము పొడచూపినది. సమస్త విషయములూ పరిశీలనచేసి, పరిశోధించి సత్యము తెలుసుకోవలెననే ఆసక్తి ఆరంభమయినది. సాహిత్యములోనూ, ఇతర లలితకళలలోనూ సృజనాప్రవృత్తి వ్యక్తము కాజొచ్చినది. తొలిప్రపంచ మహాసంగ్రామము అంతమయేసరికి ఈ నూతన సంచలనము స్పష్టరూపము ధరించినది. తెలుగుభాషావిద్య సాహిత్యరంగాలలో ఏర్పడ్డపరిస్థితులు, సంభవించిన పరిణామాలు ప్రస్తుతవిషయము.

గురజాడ వెంకటప్పారావుగారి కన్యాశుల్కము, కందుకూరి వీరేశలింగం పంతులుగారి ప్రహసనాలు, వేదం వెంకటరాయశాస్త్రిగారి ప్రతాపరుద్రీయము తెలుగు జీవద్భాషకుగల శక్తినీ, మాధుర్యాన్నీ ప్రదర్శించి రుచి గొల్పినవి. ఆభాషకూ, నాటి ఇతర వచన గ్రంథాలలోనిభాషకూ ఉన్న భేదము గమనించిన విద్యాధికులలో కొందరికి, పాశ్చాత్యదేశాలలోని ప్రముఖభాష స్థితిగతులు గమనించినవారికి, ప్రజల కెంతో అక్కరకు వచ్చే యీ వాడుకభాషలోకాక, ప్రాచీనకావ్య భాషలో విద్యాబోధనమూ, వచనగ్రంథాలు వ్రాయడము యుక్తము కాదనీ, ప్రయోజనకారి కాదనీ తోచినది. ఇంగ్లండులో ఇంగ్లీషు, ఫ్రాన్సులో ఫ్రెంచి ఎట్లు గ్రంథరచన కుపయుక్తములవుతున్నవో అట్లే తెలుగుదేశములోగల పెద్దలు నోటను పలికే తెలుగుభాషలో గ్రంథరచన సాగించి నోటి మాటా, చేతి వ్రాతా ఒకదాని కొకటి పోషకముగాచేసి రెంటికీ సముగా ప్రవృత్తి కలిగించి, వ్రాసేదే కాక, మాటలాడేది కూడా సభ్యభాషే అన్న గౌరవము తెలుగుకు నిలబెట్టవలెననే సంకల్పము వ్యావహారిక భాషావాదులకు కలిగింది. వ్యవహారసిద్ధమయిన భాషలో విద్య బోధించక పోవుటవల్లనే సరసమయిన స్వతంత్ర రచనలు వెలువడకుండా ఉన్నవనీ, విశ్వకళాపరిషద్విద్యలో ఉత్తీర్ణులై ఎంతో విజ్ఞానము గడించినవారుకూడా తాము నేర్చిన విషయము ప్రజలకు వారిభాషలో అందించలేక పోతున్నారనీ విద్యాశాఖవారికి స్పష్టమయినది.

సరిగా అదేకాలములో, అనగా 1910,11 సంవత్సరములలో విద్యావిధానములో కొన్ని మార్పులు వచ్చినవి. మెట్రిక్యులేషనుకు బదులు స్కూలుఫైనలున్నూ, ఎఫ్.ఎకు బదులు ఇంటర్మీడియేటున్నూ ప్రవేశపెట్టి వాటి పాఠ్య



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ప్రణాళికలో తెనుగులో వ్యాసరచనకు తావు కల్పించినారు. వ్యాసరచనకు మార్గదర్శకముగా ఉపకరించవలెనని వచన గ్రంథములు పాఠ్యములుగా పెట్టుటకు సంకల్పించినారు. స్కూలుఫైనలు పరీక్షలో విద్యార్థులు తమవ్యాసములు గ్రాంథికభాషలో అయినా, వ్యావహారిక భాషలో అయినా వ్రాయవచ్చునని ప్రకటించి వ్యావహారికభాషా రచనకు మార్గదర్శకముగా చెట్టి లక్ష్మీనరసింహంగారు వ్రాసిన 'గ్రీకు మిత్తులు' అనే గ్రంథము పాఠ్యభాగముగా నిర్ణయించినారు. ఈ నిర్ణయముపట్ల దేశములో తీవ్రమయిన ప్రతిఘటన బయలుదేరినది. అది చూచి ఇంటర్మీడియేటులో వ్యాసరచన ఎట్టి భాషలో చేయదగునో పర్యాలోచనచేసి సలహా చెప్పుటకు మద్రాసు విశ్వవిద్యాలయము సిండికేటు వారు 'ఇంటర్మీడియేటు కాంపోజిషను కమిటీ' అనే ఉపసంఘమును, నలుగురు వ్యావహారికభాషా వాదులు, నలుగురు గ్రాంథికభాషావాదులు, ఇద్దరు మధ్యవర్తులు మొత్తము పది మంది సభ్యులతో ఏర్పాటుచేసినారు.

వ్యావహారికభాషా వాదమును పడగొట్టుటకే 1912లో ఆంధ్రసాహిత్య పరిషత్తు అనే సంస్థ ఏర్పడ్డది. మహారాజుల ప్రధానపోషకత్వముతో, జమీందారుల అండతో, ప్రభుత్వములో పలుకుబడిగల కార్యసాధన చతురులతో నిర్మించిన పరిషత్తు వ్యావహారిక భాషనూ, దాని ప్రవర్తకులనూ, గ్రామ్యమనీ, గ్రామ్యవాదులనీ పేరు పెట్టి నిరసించి ఆంధ్ర సాహిత్యపరిష త్పత్రికాముఖమున ప్రబలప్రచారము చేయుటేకాక సభలలో తీర్మానములు చేసీ, వేలకొలది సంతకములతో మహజరు లందజేసీ ప్రభుత్వముపైన చాలా ఒత్తిడి కలిగించినది.

'కాంపోజిషను కమిటీ' లో కూడా కొంత తంత్రాంగము జరిగినది. నలుగురు కొత్త సభ్యులను చేర్పించి గ్రాంథిక భాషావాదులు తమ పక్షమునకు అధికసంఖ్యాబలము సమకూర్చుకొని, అంతకు ముందు ఆ కమిటీవా రంగీకరించిన 'గ్రాంథికభాషలోను, వ్యావహారికభాషలోను గల శబ్దరూపములను విద్యార్థులు తమ వ్యాసరచనలో ప్రయోగించవచ్చును' అనే తీర్మానమునకు 'గ్రాంథిక వ్యావహారికముల రెంటను సమముగా నుండే రూపములను' అనే విపరీతార్థము కల్పించి తొలుతటి తీర్మానమును నిరర్థకము చేసినారు. అల్పసంఖ్యాకులయిన వ్యావహారిక భాషావాదుల మాట సాగుటకు అవకాశమే లేకపోయినది. 1914లో మద్రాసు యూనివర్సిటీ సిండికేటు వారు వ్యావహారిక 'భాషావాదమును ప్రస్తుత పరిస్థితులలో అంగీకరింపజాలము' అని తీర్మానించుటతోనూ, ప్రభుత్వ విద్యాశాఖవారు స్కూలుఫైనలు పరీక్ష విషయములో 'వ్యావహారిక భాషలో వ్యాసరచన సాగించవచ్చు' నని తొలుత యిచ్చిన అనుమతిని రద్దు చేయుటతోనూ వ్యావహారిక భాషావాదము అప్పుడు అపజయము పొందినది.

అందువల్ల వ్యావహారిక భాషావాదులకు ఒక విధమైన నైరాశ్యము కలుగగా గిడుగు వెంకట రామమూర్తి పంతులుగారు సహజమైన కార్యదీక్షతోనూ దక్షతతోనూ తమ వాదమును బలపరచుకొనుటకు సమస్త సాక్ష్య సమాచారములూ, ఆధారములూ సమకూర్చుకొని తమవాదము దేశాభ్యుదయ సాధక మనే సంపూర్ణ విశ్వాసముతో జైత్రయాత్రకు బయలుదేరినట్లు, తెలుగుదేశములో నాడున్న కళాశాల లన్నిటికీ పోయి కళాశాలాధికారుల తోడ్పాటుతో అధ్యాపక వర్గములను సమావేశపరచి వారి సమక్షాన వ్యావహారిక భాషావాద స్వరూపమును సోపపత్తికముగా. సనిదర్శనముగా తెలియజెప్పి సాక్ష్యపత్రములూ, అభిప్రాయములూ సేకరించినారు; అంతేకాక, దేశము నలుమూలలా సంచారముచేసి ప్రసిద్ధ పండితులతో వాదోపవాదములు చేసి వారిని సుముఖులను చేసుకొన్నారు; సభలలో ప్రజలకు తమ వాదము నచ్చజెప్పి సానుభూతి సంపాదించుకొన్నారు.

ఈ వాదము వెల్లడి అయినకొద్దీ అనుయాయుల సంఖ్య క్రమక్రమముగా పెరుగుతూ వచ్చినది. 1916లో కొవ్వూరిలో జరిగిన ఆంధ్ర సారస్వత వార్షికోత్సవ సభలో రామమూర్తి పంతులుగారు తమ వాదమునుగూర్చి మహోపన్యాసము చేసి పండితామోదము గడించినారు. ఆ సందర్భములోనే వీరేశలింగం పంతులుగారి ప్రశంసకు పాత్రులగుటా, దానిని పురస్కరించుకొని వారి కీవాదములో ప్రోత్సాహము కలిగించుటా, వారే అధ్యక్షులుగా 1919 లో వర్తమానాంధ్ర భాషాప్రవర్తక సమాజము నెలకొల్పుటా జరిగినవి. ఆ సమాజోద్దేశములు ఇవి :

(1) వ్యావహారిక భాషకున్నూ, గ్రాంథిక భాషకున్నూ ఇప్పు డున్న వ్యత్యాసము సాధ్యమైనంతవరకు తగ్గించి, భాష సులభముచేయుట.

(2) జ్ఞానాభివృద్ధికై వ్రాయు గ్రంథములలో సాధ్యమైనంతవరకు వ్యవహారములో ఉన్న రూపములే ఉపయోగించి వ్యవహారములో లేనివి విడిచిపెట్టుట.

(3) వ్యవహారములో అవశ్యకములు కాకుండ ఉపయోగించుచున్న అన్యదేశ్యములను విడిచి అవశ్యకములైన పదములనే చేర్చుకొనుట.

(4) పై ఉద్దేశములను అనుసరించి గ్రంథములు వ్రాయుట.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఈ సమాజము ఏర్పడిన మరిమూడు మాసములకే (27-5-1919 తేదిని) వీరేశలింగం పంతులుగారు కాలధర్మ మొందినారు. వారింకా కొంతకాలము జీవించియుంటే తెలుగుభాషకు ఎంత మేలు కలిగేదో వారు తమ స్వీయ చరిత్రలో వ్రాసిన ఈ క్రింది వాక్యములు స్పష్టము చేస్తున్నవి:

'పూర్వ వ్యాకరణము లన్నియు పద్యకావ్య రచన కొఱకే, వచన కావ్యములు లేని కాలములో పుట్టినవగుటచేత అందలి లక్షణము లనేకము వచన కావ్యాభివృద్ధికి తగని వనియు, ఇప్పటి కాలమునకు తగినట్టుగా వ్యాకరణము మార్చుకోవలయు ననియు నే ననుకొని ఈ కాలమునకును, వచన రచనాభివృద్ధికిని తగినట్టుగా ఒక నూతన వ్యాకరణమును వ్రాసి దానికి లక్ష్యముగా ఒక వచన కావ్యమును చేయవలెనని పలుమాఱు తలపోసితిని. అయినను వృద్ధుడను, దుర్బల శరీరుడను నగుటచేత అట్టిపని నాకు ఇప్పుడు సాధ్యము కాదేమో! కాదననేల? ఈశ్వరానుగ్రహము ఉన్న యెడల సాధ్యము కావచ్చును.'

వారి నిర్యాణమువల్ల తీవ్రమయిన లోపము కలిగినది. ఈ కాలములోనే సాహితీ సమితి నెలకొని అత్యుత్తమములైన నవలలు, కథలు, వ్యాసములు, పద్యకావ్యములు, గేయములు 'సాహితి' పత్రికలోనూ, విడి గ్రంథములుగాను ప్రకటించి వ్యావహారిక భాషాభిరుచి, నవ్యసాహిత్యాభిరుచి పెంపొందించినది. శారద, భారతి మొదలయిన ఉత్తమ సాహిత్య పత్రికలున్ను గ్రాంథిక భాషతో పాటు వ్యావహారిక భాషకు ఆదరము చూపినవి. గుంటూరు పత్రిక, స్వతంత్ర, సుజనరంజని మొదలయిన పత్రికలు, మాలపల్లి మొదలయిన నవలలు ప్రజలను అత్యంతముగా ఆకర్షించి వ్యావహారిక భాషా ప్రయోజనమును నిరూపించినవి. అసహాయోద్యమము వ్యావహారిక భాషను అవలంబనము చేసుకొని తనతోపాటు దానినీ లేవనెత్తినది. ఈ వాదము ఇట్లు దేశములో వ్యాపించి అనేకులకు ఆకర్షకమయినది. అదివరకు తీవ్రముగా ప్రతిఘటించిన పండితులు కొందరు ఈ వాదము చేపట్టి తోడైనారు. వ్యావహారిక భాషాభివృద్ధికి, నవ్యసాహిత్య సృష్టికి నవ్యసాహిత్య పరిషత్తు అవతరించినది.

1933 సంవత్సరము నవంబరులో రాజమహేంద్రవరమున గిడుగు వెంకట రామమూర్తి పంతులుగారి సప్తతితమ జన్మదినోత్సవము జరిగినపుడు నవ్యసాహిత్య పరిషత్తువారు వ్యావహారిక భాషా పునఃప్రతిష్ఠాపనోద్యమములో పంతులుగారు చేసిన అపారకృషికి గౌరవ సూచకముగా 'వ్యాస సంగ్రహము' అనే సమ్మాన సంపుటము సమర్పించారు.

వారి రచనలను వ్యాసావళి, గద్యచింతామణి, ఆంధ్ర పండిత భిషక్కుల భాషా భేషజము, బాలకవిశరణ్యము అను నాలుగు గ్రంథములుగా ప్రకటించినారు. ఈ నాలుగున్ను వ్యావహారిక భాషావాదమును వివరించుటకు ఉద్దేశించినవే అయినా ఒకొక్కదానిలో ఒకొక్క ప్రత్యేకమార్గ మవలంబించుట జరిగినది.

'వ్యాసావళి'లో తిక్కన శివదేవులవలెనే తెలుగుకూడా నానాటికి మారుతూవచ్చినదనీ, కవులు తాము అలవర్చుకొన్న కావ్యభాషతోపాటు తమకాలములో శిష్టవ్యవహారసిద్ధమయిన భాషకూడా గ్రహిస్తూవచ్చినారనీ, నేటి రచయితలుకూడా నాటి శిష్టాచారమే పాటించి నేటి వ్యావహారికభాషలో గ్రంథములు వ్రాస్తే భాషాప్రయోజనము చక్కగా నెరవేరగల దనిన్ని నిరూపించినారు.

'గద్యచింతామణి'లో పూర్వులు వ్రాసిన పురాణ వచన గ్రంథములు, లక్షణగ్రంథములు, వ్యాఖ్యానములు, టీకలు, వివిధశాస్త్ర గ్రంథములు, దేశచరిత్రలు, జానపద వృత్తాంతములు, వార్తాపత్రికలు, శాసనములు, కథలు, బడిపుస్తకములు మొదలగు సకలవిధ వచన రచనములును వ్యావహారికభాషలోనే ఉన్నవని ఆయాగ్రంథములలోని భాగములు నిదర్శనముగా చూపి సిద్ధాంతీకరించి చిన్నయసూరివరకున్ను ఇదే వచన రచనా సంప్రదాయమని నిరూపించినారు.

'ఆంధ్రపండిత భిషక్కుల భాషాభేషజము'లో 'గ్రాంథిక భాష' అని పేరుపెట్టి పండితులు కొనియాడే భాషయొక్క స్వరూపము ఇదమిత్థమని నిర్ణయించుటకు వీలులేనిదిగా ఉన్నదనిన్ని, వ్యాకరణములు పరస్పరవిరుద్ధములుగాను, అసమగ్రములుగాను ఉండుటవల్ల ఏది తప్పో ఏది ఒప్పో నిర్ధారణచేయుట దుష్కర మనిన్ని, పేరు ప్రతిష్ఠలు సంపాదించుకొన్న పెద్దపెద్ద పండితులే ఒకరిగ్రంథములో ఒకరు వేనవేలు తప్పులు చూపి, ఒకరిభాష ఒకరు దోషభూయిష్ఠమని నిందించుటవల్ల అట్టివారికే సాధ్యముకానిభాష సామాన్యుల కలవడజాలదనీ, అందులో స్వతంత్రరచన సాగుట సాధ్యము కాదనీ, నేటికాలములో గ్రాంథిక భాషలో నిర్దుష్టముగా వ్రాసిన గ్రంథము ఒక్కటయినా కనబడుట లేదనిన్ని నిరూపించినారు.

'బాలకవిశరణ్యము'లో ప్రాచీన కవి ప్రయోగములు లెస్సగా పరిశీలింపక, కేవలము అసమగ్రములుగా ఉన్న పూర్వ వ్యాకరణములు మాత్రమే చదివి, పండితులు ఏయే శబ్దరూపములను లక్షణవిరుద్ధములుగాను, గ్రామ్యములుగాను ఎంచి నిందించినారో ఆయాశబ్దరూపములు కవుల కావ్యములలో వందలకొలదిగా ప్రయుక్తములయిన

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వనిన్నీ, వ్యాకరణము ప్రయోగమూలము కనుక కవి ప్రయోగము లక్షణము కంటెను బలవత్తరమైన దనిన్నీ, లక్షణములో చెప్పకపోయిన యెడల లక్షణమే అసమగ్రమూ, దుష్టమూ అవవలెనుగాని కవిప్రయోగములు నింద్యములు కా వనిన్నీ నిరూపించి, అట్టి రూపములను భాషాతత్త్వప్రదర్శన పూర్వకముగా సాధించి ప్రతిపక్షులు ప్రతిఘటించుటకు వీలుపడనట్లుగా కావ్యములనుండి వందల కొలదిగా ప్రయోగములు చూపి వాటి నిర్దుష్టత్వము నిలబెట్టినారు.

ఈ గ్రంథముల మూలముగా వ్యావహారిక భాషా విషయమున గొప్ప కనువిప్పు కలిగినది. 1940 సంవత్సరము నాటికి వ్యావహారికభాష తెలుగుదేశములో బహుజన సమ్మతమై అన్ని రంగములలోనూ బహుళవ్యాప్తి పొందినది. దిన పత్రికలు, వార పత్రికలున్ను సంపాదకీయములతో సహా సంపూర్ణముగా వ్యావహారిక భాషనే ఆశ్రయించినవి. బడులలో పాఠ్యగ్రంథములుగా పెట్టుట కుద్దేశించి రచించిన గ్రంథములు తప్ప తక్కిన వచన సాహిత్యము - నవలలు, నవలికలు, కథలు, కథానికలు, నాటకములు, నాటికలు, ఏకాంకికలు, విమర్శలు, చరిత్రశాస్త్రాది గ్రంథములు - వ్యావహారిక భాషలో వ్రాయుటే పరిపాటి అయినది. విద్యాప్రచార సాధనములుగా ప్రతిష్ఠ గడించుకొంటున్న సినిమా, రేడియోలు వ్యావహారిక భాషనే సాధనముగా ఎంచుకొన్నవి.

1940 సంవత్సరము జనవరి 15వ తేదిని మద్రాసులో పత్రికా రచయితల సమావేశములో రామమూర్తి పంతులుగారు రోగపీడితులై ఉండిన్ని తమ 'తుది విన్నపము' పలికి 22వ తేదిని దివంగతులైనారు. వ్యావహారికభాష పత్రికా ప్రపంచములోనూ, జనసామాన్యములోనూ అంగీకృతమై వ్యాప్తి పొందినందుకు తమ సంతోషము తెలియజేసి 'విశ్వవిద్యాలయముల వారున్ను, విద్యాశాఖవారున్ను ఇంకా వ్యావహారికభాష గ్రహించలేదు. కాని నా వాదము సరియైన దన్న విశ్వాసము నాకు పూర్తిగా ఉండుటవల్ల ఎప్పటికయినా వారున్ను నా వాదము పూర్తిగా అంగీకరించక పోరన్న నమ్మకం నాకు కలదు' అని తమ ప్రసంగము ముగించారు.

నాటికి నేటికి పరిస్థితులు మారినవి. ప్రఖ్యాతాంధ్రకవులై యుండిన చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు సరసమైన నేటి వ్యావహారికభాషలోనే వచన రచన విరివిగా సాగించినారు. వారివలెనే నేడు ఆంధ్రదేశములో గొప్ప కవులు, పండితులు అని ప్రఖ్యాతి పొందినవారు చాలామంది తమ పద్య రచనలూ, వచన రచనలూ సరసమైన నేటి వాడుక భాషలోనే సాగిస్తున్నారు. ఈవిధముగా దేశములో వ్యాపించియున్న వ్యావహారిక భాషను విశ్వవిద్యాలయములుకూడా చేపట్టుట సముచితము.

వాడుక భాషలో ఒకే పదమునకు పెక్కు రూపములున్నప్పటికి వాటిలో ఏదిన్ని అగ్రాహ్యము కాదు. ప్రతి రూపమునకును రచనలో స్థాన మున్నది. ఆ స్థానమును ప్రకరణమే నిర్ణయించగలదు. నాటకములు, కథలు మొదలయిన రచనలలో పాత్రోచిత భాష రసవంతమయినది. పాత్రోచితమైన పదము ఎట్టి రూపముగలదయినా వాడుక చేయవచ్చును. సాహిత్యవేత్త వాడుకలో ఉన్న రూపములలో సంప్రదాయసిద్ధమైన రూపమునకు చేరువగా ఉన్న దానిని తన రచనములో ప్రయోగించుట మేలు. దానివలననూ, విశ్వవిద్యాలయములు చేపట్టుటవలననూ నేటి వాడుకభాష నేటి గ్రాంథిక భాషగా రూపొంది గౌరవార్హత పొందగలదు.

గి. వెం. సీ.





http://sanskritcentral.com/

http://teluguthesis.com/

# తెలుగుదేశ చరిత్ర

## ఆధారములు

ప్రాచీన దక్షిణహిందూదేశ చరిత్ర వలెనే ప్రాచీన ఆంధ్రదేశ చరిత్రకూడ ఇంకను నిర్మాణదశలోనే ఉన్నది. చరిత్రరచనకుగల సాధనసామగ్రి అధికముగనే ఉన్నది; కాని దానిని ఉపయోగించుకొని చారిత్రక విషయములను సమన్వయము చేయుటలోను, తగిన రీతిని మనదేశచరిత్ర రచించుటలోను ఇంకను తగినంత కృషి జరుగలేదు. చరిత్ర నిర్మాణములో కృషిచేయువారు చాల తక్కువ; ప్రత్యేక కృషి చేసి విషయమును గ్రహింపవలసిన చరిత్ర సాధనములు ఎక్కువ. అయినను గడచిన ముప్పది నలువది సంవత్సరములలో జరిగిన కృషి సాధారణమైనది కాదు. ఇందువల్ల మనదేశచరిత్రను గురించిన విషయము నలువదేండ్ల క్రిందటికంటె మనకు ఇప్పుడు ఎక్కువగా తెలియుచున్నది. ఇంకను మనదేశచరిత్రమును గురించి ఎక్కువ పని జరుగవలసియున్నది.

### శాసనములు

మనదేశచరిత్ర నిర్మాణమునకు గల ఆధారములు అన్నిటిలోనికి ముఖ్యములయినవి, ప్రామాణికములయినవి శాసనములు. మనదేశములో దొరకిన అత్యంత పురాతన శాసనములు మౌర్యవంశజుడయిన అశోక చక్రవర్తివి. ఇవి హైదరాబాదులోని మాస్కిలోను, కర్నూలు జిల్లాలోని యెర్రగుడి, రాజులమందగిరులలోను, కళింగములోని జౌగడ, ధౌలిలలోను కానవచ్చినవి. అశోక చక్రవర్తి క్రీస్తుకు పూర్వము మూడవ శతాబ్దమునాటివాడగుటచేత ఈ శాసనములును ఆనాటివే; రెండువేల సంవత్సరములకు పూర్వపువి. ఈ యశోకచక్రవర్తి శాసనములవల్ల అతని సామ్రాజ్యము దక్షిణదిశకు ఎంత మేర వ్యాపించినదో తెలియుచున్నది. అశోకుని శాసనములు మన తెలుగుదేశములో కాన్పించినను, అవి మొత్తము మీద హిందూదేశ చరిత్రమునకు సంబంధించినవి కాని తెలుగుదేశచరిత్రకు ఉపకరించునవి కావు.

అశోకుని శిలాశాసనములకు తరువాత ఇంచుమించుగా అంతప్రాచీనమైనవి భట్టిప్రోలువద్ద దొరకిన ధాతుకరండము మీది శాసనములు. ఇవి క్రీస్తుపూర్వపు తుది శతాబ్దముల నాటివి. వీనివల్ల ఆనాటికే తెలుగుదేశములో బౌద్ధము పరివ్యాప్తమయినట్లు స్పష్టమగుచున్నది. తెలుగుదేశమునకు సంబంధించినవైనను శాతవాహన నృపతుల తొలి శాసనములు పడమటి దక్కనులోని కార్లె, నాసిక, కన్హేరిల వద్దనున్న గుహాలయములలో కానవచ్చినవి. అమరావతి స్తూపమున కానవచ్చిన శిలాశాసనము లన్నియు వేరు వేరు వ్యక్తులు బుద్ధునిమీది భక్తి పెంపున బౌద్ధస్తూపమునకును, బౌద్ధసంఘమునకును చేసిన దానములను తెలుపును. ఆ కాలములో తెలుగుదేశమున వ్యాపించిన బౌద్ధ ధర్మ సంప్రదాయమునకు చెందిన విషయములును, కొంతవరకు ఆనాటి జనుల యాచార వ్యవహారములును పైనుడివిన శాసనములవలన తెలియవచ్చును.

ఇక్ష్వాకునృపతుల కాలపు శాసనములవలె అందమయిన శాసనములు తెలుగుదేశములో అంతకు పూర్వము కాని, తరువాతను గాని కానరావు. ఇక్ష్వాకులకు పిదప తెలుగుదేశమును పల్లవులు, బృహత్ఫలాయనులు, శాలంకాయనులు, ఆనందగోత్రులు పరిపాలించిరి. అశోకునికాలము నుండి ఇక్ష్వాకులకాలము చివరివరకు - అనగా క్రీస్తుకు పూర్వము మూడవశతాబ్దమునుండి క్రీస్తుశకము మూడవ శతాబ్దాంతమువరకు - మాత్రమే కాక తరువాత మరికొంత కాలమువరకు కూడ తెలుగుదేశములో కానవచ్చు శాసన భాష ప్రాకృతము. ఆనాటి ప్రజల భాషలకు ప్రాకృతమన్నది సామాన్యనామము. క్రీస్తుశకము నాలుగవ శతాబ్దములో రాజ్యముచేసిన మొదటి పల్లవ, మొదటి శాలంకాయన, మొదటి ఆనందగోత్ర, బృహత్ఫలాయనుల తామ్రశాసనములలో సైతము ప్రాకృతమే కానవచ్చును.

ఇక్ష్వాకుల కాలమునకు తరువాతి నుండి కానవచ్చినవి తామ్రశాసనములు. తామ్రశాసనములు అనగా రాగి రేకుల మీద వ్రాసిన శాసనములు. శాసనములను శిలల మీదను, రాగి రేకుల మీదను మాత్రమే కాక బంగారు రేకుల మీదను, వెండిరేకులమీదను, తుదకు ఇత్తడి, ఇనుప రేకులమీదను, కంచురేకులమీదను వ్రాయువారు. మన దేశములో బంగారు రేకులమీదను, ఇనుపరేకులమీదను, వ్రాసినవి దొరకలేదు. దేవాలయములలో స్వామికి అభిషేకము చేయు కంచు ధారాపాత్రలమీదను, కంచు విగ్రహముల పీఠములమీదను చెక్కిన శాసనములు కలవు. విజయనగరాధీశ్వరుడయిన శ్రీరంగరాయల శాసనము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఒక్కటే వెండిరేకులమీద లిఖించినది తెలుగుదేశములో దొరకినది. ప్రాకృతభాషా శిలాశాసనములకు తరువాత తెలుగుదేశములో విరివిగా కానవచ్చినవి తామ్ర శాసనములు.

పౌరాణిక హిందూమతముతోను, వైదిక సంస్కృతి పునరుద్ధరణముతోను తామ్రశాసనములు వాడుకలోనికి వచ్చినవి. వైదికసంస్కృతి పునరుద్ధరణముతో సంస్కృతమునకును, వేదవిదుడయిన బ్రాహ్మణునికిని ప్రాముఖ్యము కలిగినది. తామ్రశాసనభాష సంస్కృతమయినది. సాధారణముగా ప్రతితామ్రశాసనమును బ్రాహ్మణులకు చేసిన భూదాన, అగ్రహారదానములను తెలుపును. ఒకరాజు భూమిని బ్రాహ్మణునికి దాన మిచ్చునపుడు దానపత్రమును ప్రధానముగా రాగిరేకులమీద వ్రాసియియ్యవలెనని, అట్లిచ్చునపుడు దాతల, ప్రతిగ్రహీతలతోపాటు వారి తండ్రి తాతల నామములను, దాన కారణమును, దానకాలమును అందు వ్రాయవలెనని ప్రాచీనధర్మశాస్త్ర గ్రంథములు పేర్కొనుచున్నవి. అటుపిదప, దాన మిచ్చిన ప్రదేశమును, దాని పరిహద్దులును, తరువాత దానమును కాపాడినందువలన వచ్చుఫలమును, హరించినందువలనను చెరచినందువలనను వచ్చుపాపమును తెలుపు వ్యాసప్రోక్త శ్లోకములును ఉదాహరింపవలయును. అంతటితో శాసనము పూర్తియగును. తామ్రశాసన మనగా పూర్వకాలపు దానపత్రము. తామ్రశాసనములు ఆరంభకాలమున దాతవంశమున మూడు తరములవారినే చెప్పుచు వచ్చినను కాలక్రమమున పౌరాణిక వంశానుక్రమముతో పాటు దాతసంపూర్ణ వంశవృత్తమును, ఆయాయి రాజుల పరాక్రమ కృత్యములనుకూడ వర్ణించుచు వచ్చినవి. కాలము గడచినకొలది శాసనములలో భార్హస్పత్య మానాబ్దములును, శక సంవత్సరములును సూచించుట పరిపాటియైనది. మొదట శకరాజ సంవత్సరములు, శకరాజ్యాభిషేక సంవత్సరములు అను పేరుతో ఆరంభమైన సంవత్సరములు క్రీస్తుశకము పదమూడవ, పదునాలుగవ శతాబ్దములనుండి శాలివాహన శతాబ్దములుగా మారినవి. పూర్వచాళుక్యనృపతుల కాలమునుండి దత్త గ్రామసీమావధులు తెలుగులో వర్ణితము లగుటవలన తామ్రశాసనములు ద్విభాషాశాసనము లైనవి. అంతకు పూర్వము గ్రామనామములు మాత్రమే తెలుగులో ఉండెడివి.

కళింగ - ఆంధ్ర సముద్రతీరములనుండి ప్రాచ్యదేశములకును, సుమత్ర, జావా మొదలైన ద్వీపములకును వలస వెళ్ళిన హిందూ, బౌద్ధ ఆంధ్ర, కాళింగులు తమతోపాటు తమ లిపిని కూడ అక్కడ ప్రవేశపెట్టిరి. ఈ కారణముచేత సుమత్ర, జావా, బోర్నియో, ఇండో చైనాలలో కానవచ్చు మొదటి శాసనములు శాతవాహనులనాటి బ్రాహ్మీ లిపిలోను, వేంగి లిపిలోను ఉన్నవి. ఆ శాసనముల భాష సంస్కృతము.

ప్రాకృత భాషలో నున్న శిలాశాసనములకు తరువాత క్రీస్తుశకము నాలుగవ శతాబ్దమునుండి పదునొకండవ శతాబ్దము వరకును శిలాశాసనము లరుదుగను, తామ్ర శాసనము లధికముగను కానవచ్చును. క్రీస్తుశకము ఆరవ శతాబ్దమునుండి తెలుగు దేశములోని శిలాశాసనములు తెలుగుభాషలో ఉన్నవి. శిలాశాసనములలో తెలుగు పద్యములు కనిపించుట క్రీస్తుశకము తొమ్మిదవ శతాబ్దమునుండియే. క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దమునుండి తామ్ర శాసనములకు తోడు శిలాశాసనములును అధికమైనవి. అప్పటినుండియు శిలాశాసనములు తెలుగులోనే కాక సంస్కృతములో వ్రాయుట కూడ ఆచారమయినది. శాసనములలో సంస్కృతమును, తెమగును కలిపి వ్రాయుటయు అలవాటు అయినది. సాధారణముగా శిలాశాసనము లన్నియు దేవాలయములకు చేసిన దానధర్మములను తెలుపును. వేరువేరు వృత్తుల వారు, వర్తక సంఘములవారు తమతమ వృత్తులకు, సంఘములకు సంబంధించిన వ్యవహార విషయములను, నియమ నిబంధనలను శిలలమీద చెక్కించుచు వచ్చిరి; కాని ఇట్టివి చాల అరుదు.

కళింగదేశ తామ్రశాసనములలోని లిపి మొదట వేంగి లిపి, అనగా తెలుగు - కన్నడ లిపియే; కాని కళింగ దేశమునకు ఇరుగు పొరుగుల నున్న ఉత్తర దేశములతో సంబంధము ఎక్కువగుటవలన కళింగ తామ్రశాసన లిపి కుటిలలిపిగా మారి క్రమక్రమముగా పదవ శతాబ్దమునాటికి నాగరియై అటుతరువాతకూడ, అదియే వాడుకలో ఉండెను. ఇట్లే కళింగదేశములోని శిలాశాసనములు మొదటినుండి తెలుగులోనే తెలుగు - కన్నడ లిపిలో ఉండినను క్రీస్తుశకము పదునొకండు, పండ్రెండు శతాబ్దములనుండి సంస్కృతములో నాగరిలిపిలోకూడ కానవచ్చుచున్నవి.

నాగరిలిపి శాసనములు ఒక కళింగములోనే కాక తెలంగాణాలోను కానవచ్చును. కాకతీయుల శిలాశాసనములును, తామ్రశాసనములును కొన్ని పశ్చిమోత్తర లిపుల ప్రభావమున నాగరిలిపిలో ఉన్నవి. కాని కళింగ గాంగ శాసన నాగరి లిపికిని, కాకతీయ శాసన నాగరి లిపికిని ఆశాసనములు కానవచ్చిన ప్రదేశమును బట్టి కొంచెము భేదము ఉన్నది. క్రీస్తుశకము పదునాలుగవ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



శతాబ్దమునుండి వచ్చిన విజయనగర శాసనము లన్నియు నాగరి లిపిలోనే ఉన్నవి. ఈ నాగరిని నంది నాగరి అందురు.

శాతవాహన, ఇక్ష్వాకు రాజన్యుల చరిత్రమును, బృహత్పలాయన, ఆనందగోత్ర, శాలంకాయన, విష్ణుకుండి, పూర్వ చాళుక్య, పూర్వగాంగాది రాజవంశములను గురించిన చరిత్రము కేవలము శాసనములవల్లనే తెలియవచ్చినది. క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దమునకు పూర్వపు దేశచరిత్ర తెలియుటకు శాసనములే మనకు పరమాధారము లైనవి.

## నాణెములు

దేశచరిత్ర నిర్మాణములో శాసనముల యంత ఎక్కువగా కాకపోయినను కొంతవరకు ఉపకరించునవి నాణెములు. మనము ఇప్పుడు రూపాయలు మొదలైనవి వాడుక చేయుచున్నట్లే మన పూర్వులుకూడ రకరకము లైన నాణెములను వాడుచుండిరి. వానిలో బంగారపువి, వెండివి, రాగివి మాత్రమేకాక సీసపు నాణెములు, మిశ్రలోహపు నాణెములు కూడ ఉండెను. వీనిలో బంగారపువి, వెండివి చాల తక్కువగా దొరకినవి. మిగిలినవే అధికము. నిర్ణీతమయిన పాళ్ళలో సీసము, రాగి, తుత్తునాగము కలిసిన మిశ్రమునకే మిశ్రలోహము అని పేరు. ఈలోహముతో చేసిన నాణెములకు నాణక శాస్త్రజ్ఞులు పోటిన్ నాణెములు అని పేరు పెట్టిరి. ఇవి సాతవాహనులకు తరువాత వాడుకలో నుండినట్లు కనిపించదు. సాధారణముగా సువర్ణములు, నిష్కములు, పురాణములు శతధరణములు అనునవి చాల పురాతనమైనవి. మనపూర్వపు నాణెము లన్నియు మనుధర్మశాస్త్రములో ఇచ్చిన తూకములను అనుసరించి పుట్టినవి. గురివెందగింజ కాని, రతి కాని తూకమునకు ప్రాతిపదిక. ముప్పది రతుల తూకము గల నాణెము సువర్ణము, కాని అట్టి నాణెములు ఇంత వరకు లభింపలేదు. శాతవాహన, ఇక్ష్వాకు రాజుల కాలము నాటి శాసనములవల్ల ఆకాలములో వెండి పురాణములు, కార్షాపణములు వాడుకలో ఉండినట్లు తెలియుచున్నది. కార్షాపణములు వెండివేకాక రాగివి కూడ ఉండెను. శాతవాహన రాజయిన గౌతమీపుత్ర శాతకర్ణికి పూర్వపు సాతవాహనుల నాణెములు అరుదుగా దొరికినవి. పులోమావి కాలమునుండి దొరకిన నాణెము లసంఖ్యములు; వీనిలో పోటిన్ నాణెములు, సీసపు నాణెములు ఎక్కువ. సాతవాహనుల నాణెములమీద ఒకవైపున గుర్రము, ఏనుగు, సింహము, ఒంటె మొదలైన జంతువుల యొక్కయు, రెండు తెరచాపకొయ్య లున్నట్టి కాని, ఒకటి కాని పడవల యొక్కయు బొమ్మలును, వానిపై నాణెముల అంచున ఆ నాణెములను ముద్రకొట్టించిన రాజుల పేర్లును ఉండును. రెండవవైపున ఉజ్జయినీ చిహ్నముండును. సంకలనపు గుర్తుకొమ్ములకు (+) చివరలను అంటి నాలుగువైపుల నాలుగు సున్న లుండు దానికే ఉజ్జయినీచిహ్నమని పేరు. నావ చిహ్నముగాగల నాణెములు సాతవాహనుల సముద్రాధిపత్యమునకును, నౌకావర్తక వ్యాపారాధిక్యమునకును నిదర్శనములు. హిందూదేశ మంతటిలోను మొదట సముద్రాధిపత్యము వహించినవారు సాతవాహనులు. సాతవాహనులకాలములో తెలుగుదేశమునకును, రోము నగరమునకును వర్తకవ్యాపారము బాగుగా సాగుచుండుటచేత రోమకచక్రవర్తుల బంగారు నాణెములు ఇచ్చి వర్తకులు ఇచ్చటి మల్లు సెల్లాలు క్రయము చేసి కొని పోవుచుండిరి. ఈ కారణమున తెలుగుదేశములో ప్రతి పైరగు ప్రాంతము లందు-రోమకచక్రవర్తుల నాణెములు దొరకినవి. నాగార్జునకొండ శాసనములలో దీనారి మాషకము లనబడు నాణెములుకూడ ఉదాహృతము లైనవి. దీనార మన్నది విదేశీయ నాణకము.

అటుతరువాత వాడుకలోనికి వచ్చిన బంగారు నాణెముల మీద వరాహముద్ర ఉండుటచేత వీనికి వరాహము అని పేరు కలిగినది. ఇదియే ప్రజల వాడుకలో కాలక్రమమున వరహా యైనది. వీనికే గద్యాణము లనియు పేరు. వరాహము చాళుక్యరాజ లాంఛనము. అందువలన ఈ నాణెములను వాడుకలోనికి తెచ్చినవారు చాళుక్యులని భావింపబడుచున్నది. పూర్వ చాళుక్యుల రాగి నాణెములును దొరకినవి. వీరికి పూర్వులయిన శాలంకాయన, విష్ణుకుండి వంశజుల నాణెము లింతవరకు దొరకినవి చాల కొద్ది. చాళుక్య చంద్ర బిరుదముగల పూర్వ చాళుక్య ప్రథమ శక్తివర్మ యొక్కయు, రాజరాజనరేంద్రుని యొక్కయు బంగారు నాణెములు బర్మా అరకాన్ ప్రాంతముల దొరకినవి.

దక్షిణ హిందూదేశపు నాణెములమీద పూర్వపు రాజులు తమ పేర్లనో బిరుదములనో ముద్రకొట్టించువారు. ఇటువంటి నాణెములు ఇంతవరకు చాల దొరకినవి; కాని వానిమీది బిరుదములను బట్టి అవి చలామణిలోనికి తెచ్చిన రాజును, రాజవంశమును గుర్తింప గుదిరినవి చాల తక్కువ.

శాసనములలో ఉదాహృతములైన గండగోపాల మాడలు ఇట్టివే. గండగోపాల బిరుదము తెలుగు చోళులకు ఉండుటవలన ఈ మాడలు వారివే కావచ్చును. మాడలు, వెండి టంకములు, పణములు, బిరుదుమాడలు, పద్మటంకములు మొదలైనవి, వేరు వేరు రకముల నాణెములు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/











తెలుగుదేశ చరిత్ర: ఆధారములు

1. పురాతత్వ ఖనన పరిశోధన, 2. తామ్రశాసనము, 3. తాళపత్రములు, 4. పురాతన నాణెములు, 5. శిలాశాసనములు.

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఇవి కాక చరిత్రకు ఉపయుక్తములగు విషయములను తెల్పు మరియొక తరగతి గ్రంథములు కలవు. ఇవి చరిత్రాత్మక వ్యక్తులకు కాని, వంశములకు కాని సంబంధించినవి కావు. రాజకీయవిశేషములు కాని, పరాక్రమ ప్రశంసలు కాని వానియందు కన్పట్టవు. వానియందు ప్రాయికముగ పట్టణవాసుల జీవనవిశేషములు వర్ణింపబడియుండును. ఈ తరగతి గ్రంథములలో మొదట పేర్కొనదగినది విజయనగరాధీశ్వరులైన రెండవ హరిహర రాయల యొక్క కొలువులో ఉండిన వినుకొండ వల్లభ రాయలు రచించిన 'క్రీడాభిరామము'. ఇది రావిపాటి త్రిపురాంతక కృతమైన 'ప్రేమాభిరామము' అను సంస్కృత వీథినాటకమునకు తెలుగుసేత. నేటివరకు 'ప్రేమాభిరామము' లభ్యపడలేదు. క్రీడాభిరామములో కాకతీయ ప్రతాపరుద్రుని కాలములో ఓరుగంటిపట్టనము యొక్క వైభవమును, తద్వాస్తవ్యుల స్థితిగతులును వర్ణింపబడియున్నవి. అట్లే, వామన భట్టబాణకృత 'శృంగారమంజరీ భాణమును', డిండిమకృత 'సోమవల్లి యోగానంద ప్రహసనము'ను క్రీస్తు శకము 18, 14 శతాబ్దములనాటి విజయనగరపట్టణ చరిత్ర విశేషములను తెలియజేయును. ఇట్టి గ్రంథముల సంఖ్య యల్పము.

మన సారస్వతములో చరిత్రాధారములుగ ఉపయుక్తములగు మరియొక తరగతి గ్రంథములు కలవు. ఇవి అభ్యుదయ కావ్యములు. ఇందు మహాపురుషుల ఘన కార్యములు వర్ణింపబడును. బిల్హణుని 'విక్రమాంకదేవ చరిత్ర', గంగాదేవి రచించిన 'కంపరాయచరిత్ర', డిండిముని 'సాళువాభ్యుదయ, అచ్యుతరా యాభ్యుదయములు', రామభద్రాంబ రచించిన 'రఘునాథాభ్యుదయము' మున్నగునవి ఈ తరగతిలోని ముఖ్యగ్రంథములు.

అభ్యుదయ కావ్యములు కాక పోయినను, ఆ జాతిలో చేర్పదగినవి మరికొన్ని గ్రంథములు కలవు. కాసె సర్వప్ప అను నతడు సిద్ధేశ్వర చరిత్రము అను నామాంతరము గల 'ప్రతాపచరిత్ర'ను ద్విపదకావ్యముగ రచించెను. కూచిమంచి జగ్గకవికృత 'సోమదేవరాజీయము' అను పద్యకావ్యమును, అజ్ఞాతకర్తృకమైన 'ప్రతాపచరిత్ర' అను వచన రచనయు దీని ననుసరించి విరచింపబడినవే. వీనినే కాక కొటికము విశ్వనాథనాయని స్థానాపతి రచించిన 'రాయవాచకము'నుకూడ ఇచట స్మరింపవలసి యున్నది. దీనినే కుమారధూర్జటి 'కృష్ణరాయ విజయము' అనుపేర పద్యకావ్యము చేసెను. ఇందు మొదటి మూడును కాకతీయుల చరిత్రకు సంబంధించినవి. తరువాతి రెండును కృష్ణదేవరాయల విజయములను, రాజ్యపరిపాలనను వర్ణించును. ఇటువంటిదే దిట్టకవి నారాయణకవి విరచిత రంగరాయచరిత్ర. ఇందు క్రీ. శ. 1757లో విజయరామ రాజునకును రంగారాయనికిని జరిగిన బొబ్బిలియుద్ధ మభివర్ణితమైనది.

**వంశచరిత్రలు: గేయకథాదులు:** తెనుగున కొన్ని వంశావళులు గలవు. వీనిలో ప్రథమమున పేర్కొనదగినది ఆరవీటి వంశశాఖలలో నొక్కటియగు అవుకు రాజుల వంశావళి. ఇది యొక స్వతంత్ర గ్రంథము కాదు; దోనేరు కోనేరు నాథకవి రచించిన 'ద్విపద బాలభాగవతము'నకు అనుబంధముగ తత్కృతిపతియైన అవుకు తిమ్మరాజుపూర్వికులచరిత్ర ఇందు అభివర్ణింపబడినది. అరవీటి వంశచరిత్రను వర్ణించు పద్యకావ్యము ఒకటి కలదు. ఇది అందుగుల వెంకయ్యచేత రచియింపబడిన 'రామరాజీయము'. దీనికే 'నరపతి విజయ'మని నామాంతరము. వంశావళులలో సుప్రసిద్ధమైనది 'వెలుగోటివారి వంశావళి'. ఇది కాలక్రమమున పెరిగినది. కాకతీయ గణపతిదేవుని కాలమునుండియు విజయనగర సామ్రాజ్యాధిపతులలో కడపటివారైన ముమ్మడి శ్రీరంగరాయల కాలమువరకు వర్ధిల్లిన రేచర్లగోత్రజులైన వెలమనాయకుల ప్రతాపాదికములు ఇందు ప్రశంసింపబడి యున్నవి. ఇట్టి వంశావళి గ్రంథములు కన్నడమునను కలవు. 'చిక్కదేవరాయవంశావళి', 'కెళదినృప విజయము'లు వీనిలో ప్రధానమైనవి. రెంటియందును విజయనగరసామ్రాజ్యమునకు సంబంధించిన చరిత్రాంశము లనేకము వర్ణింపబడి యున్నవి.

వంశావళులవలె ప్రత్యేక చరిత్రాంశములను వర్ణించు గేయ ప్రబంధములును, సీసమాలికలును అనేకములు ప్రచారములో నున్నవి. పల్నాటి వీరచరిత్ర, బొబ్బిలి కథ, కుమారరాముని కథ, గనితిమ్మానాయని సీసమాలిక, కస్తూరి రంగప్పనాయని సీసమాలిక, పచమనాయని సీసమాలిక, దేసూరిరెడ్ల సీసమాలిక మున్నగునవి ఇట్టివి.

**స్థానిక చరిత్రలు:** ఆంధ్రదేశ చరిత్రాధారములను పేర్కొనునపుడు స్థానిక చరిత్రములును స్మరింపవలసి యున్నది. వీనికి గ్రామ కైఫీయతులని పేరు. గ్రామకైఫియతు లనగా గ్రామ చరిత్రలు. పూర్వకాలములో ప్రతి గ్రామకరణమును తన గ్రామముయొక్క పుట్టు పూర్వోత్తరములను, ఆస్తి పాస్తులను, పన్ను పర్యాయములను వివరించుచు గుడికట్టు లెక్కలు వ్రాసిపెట్టుట ఆచారమై యుండెను. వానిలో గ్రామములోని భూమిపై ఎవ్వరెవ్వరికి ఎట్టి స్వామ్యపు హక్కులు కల్గినది వ్రాసిపెట్టువారు. కాలక్రమమున రాజకీయములందు కలుగుచు వచ్చిన



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మార్పులును, తత్ప్రభావమువలన గ్రామజీవనమున కల్గిన మార్పులును అందు సూచించువారు. కావున ఇతర చరిత్రాధారములలో కానరానివి, జనానీకముయొక్క రాజకీయార్థిక సాంఘిక విషయములకు సంబంధించిన ముఖ్యాంశములు అనేకము ఈ కైఫియతులలో కానవచ్చును. తత్కారణమున ఈ గ్రామ కైఫియతులు చరిత్ర పరిశోధకులకు మిక్కిలి ఉపయోగించుచున్నవి.

క్రీ. శ. 1799, 1800 ప్రాంతమున కర్నల్ కాలిన్ మెకంజీ యను కుంఫిణీ యుద్యోగి కావలి వెంకటబొర్రయ్య మొదలైనవారిని కొందరిని నియోగించి ఈ గ్రామ చరిత్రలకు నకళ్లు వ్రాయించెను. వీనికి మెకంజీ రికార్డులని పేరు. సి. పి. బ్రౌన్ దొర వీటికి ప్రతులు వ్రాయించెను. వీనిని స్థానిక చరిత్ర లందురు. ఈచరిత్రలు అరవములోను, కన్నడములోను, తెలుగులోనుకూడ ఉన్నవి. తెలుగులో ఉన్నవి అధికము. ఈ చరిత్రలలో రాయలసీమకు చెందినవి అమూల్య మయినవి. వానివల్ల ఇతరములయిన ఏ యాధారములవల్లను తెలియని చారిత్రక విషయములనేకము తెలియవచ్చును. ఇవి ముఖ్యముగా విజయనగర యుగమునుండి బ్రిటీషు యుగమువరకు గల మనదేశ చరిత్రమును రచించుకొనుటకు అధికముగా ఉపకరించును.

ఇంతవరకు దేశభాషలలోని యాధారములు వివరింపబడినవి; కాని యవి యన్నియు చరిత్ర రచన కుపకరించు సాధనములే కాని చరిత్రలు కావు. మనపూర్వులకు చరిత్ర దృష్టి లేదు; కావున వారు చరిత్రలను వ్రాయుటకు పూనుకొనలేదు. కల్హణుని రాజతరంగిణి ఒక్కటి తక్క సంస్కృతమునందు కాని, ఇతర దేశ భాషలందు కాని చరిత్ర గ్రంథములు లేవు. సంస్కృత భాషలో ఉన్న పురాణములవల్ల కొంత ఇతిహాసము తెలియవచ్చును. కాని, అది యంతయు చారిత్రకాకరములు దొరకని చరిత్ర పూర్వయుగమునకు సంబంధించినది. ప్రత్యేకముగా చరిత్రకారునికి ఉపయుక్తమయినది పురాణములలోని భవిష్యద్రాజేతిహాసము. దీనివల్లనే మనదేశమును ఆదిమ కాలములో పరిపాలించిన ఆంధ్రరాజులను గురించి తెలియ నగుచున్నది.

**ముస్లిము చరిత్రలు:** హిందూదేశమునందు చరిత్ర రచన మహమ్మదీయుల ఆగమనముతో ప్రారంభమయినది. మహమ్మదీయులకు చరిత్రాభిమానము మెండు; కావున వారు మొదటినుండియు చరిత్రరచనకు పూనుకొని పెక్కు చరిత్ర గ్రంథములను రచించిరి; కాని అవి దేశ చరిత్రలు కావు: అవి యన్నియు మహమ్మదీయ రాజ్యముల యొక్కయు, మహమ్మదీయ రాజవంశముల యొక్కయు చరిత్రములు. కావున వానియందు ఆ రాజ్యములకును రాజవంశములకును సంబంధించిన విషయములు మాత్రమే వర్ణింపబడినవి. వానిలో దేశ ప్రజలనుగూర్చికాని, హిందూ రాజ్యములను గూర్చికాని ప్రస్తావము ఉండదు. మరియు మతాభిమానము పెంపున మహమ్మదీయ చరిత్రకారులు హిందువులనుగూర్చి కాని, హిందూ రాజ్యములనుగూర్చి కాని విధిలేక చెప్పవలసివచ్చినపుడు ఉన్నది ఉన్నట్లు చెప్పక సత్యమును కప్పిపుచ్చి, తమ యాధిక్యమును స్థాపించుకొనుటకు విషయమును తారుమారు చేసి చెప్పుదురు; కావున ఆధునిక దృష్టితో దేశ చరిత్రము రచియించునప్పుడు వానియందలి విషయములను చక్కగ పరిశీలించి కైకొనుట యుక్తము. క్రీ. శ. 14 శతాబ్ది ప్రారంభమునుండియు దక్షిణ భారతమున మహమ్మదీయుల ప్రాబల్యము అధికము కాజొచ్చినది. అప్పటినుండియే మహమ్మదీయ చరిత్రలలో దక్షిణ హిందూ రాజ్యముల ప్రస్తావము కానవచ్చును. ఈచరిత్రలలో సమకాలిక రచనములును, అర్వాచీన రచనములును కలవు.

మహమ్మదీయ చరిత్రకారులలో ప్రప్రథమున పేర్కొనదగినవాడు అమీరు ఖుస్రూ. ఇతడు బహు మేధావి; మహాకవి, సంగీత విద్వాంసుడు. ఇతడు అల్లా ఉద్దీన్ ఖిల్జీ కాలమునుండి ఘయ్యాజుద్దీన్ తుఘ్లుకు కాలము పర్యంతము ఢిల్లీ సుల్తానుల యాశ్రయమున వర్ధిల్లి పారశీక భాషలో పెక్కు కావ్యములను రచించుటయే కాక 'తారీఖ్ - ఇ - అలై' యను నామాంతరముగల 'ఖజైన్ - ఉల్ - ఫుతూహ్', 'తుఘ్లుక్ నామా' యను చరిత్రలను వ్రాసెను. ఇందు మొదటిది వచన రచన. అందే అల్లా ఉద్దీన్ ఖిల్జీయొక్క యాంధ్రదేశ దండయాత్రలును, తక్కిన దక్షిణ దిగ్విజయములును వర్ణింపబడినవి. ఈ చరిత్ర గ్రంథమునందే కాక అతనిచే విరచితమైన 'ఖిజ్ర్ ఖాన్ వ దవల్ రాణీ', 'నూ సిపిహ్ర్' అను కావ్యములలోను ఖిల్జీసుల్తానుల దక్షిణ దిగ్విజయములు అందందు సందర్భానుసారముగ వర్ణింపబడినవి.

ఇతని తరువాత చెప్పదగినవాడు ఈసామీ. ఇతడు బాల్యమున ముహమ్మద్ బిన్ తుఘ్లుకు ఢిల్లీనుండి రాజధానిని దౌలతాబాదుకు మార్చినపుడు దక్కనుకు వచ్చి యచ్చటనే స్థిరముగ నిలిచిపోయెను. ముహమ్మదు బిన్ తుఘ్లుకుపై దక్షిణదేశములవారు తిరుగుబాటు కావించి స్వతంత్రరాజ్యములు స్థాపించుకొనినపుడు ఇతడు దక్కనునందే యుండి, అచట అపుడు నడచిన చరిత్రాంశములను ప్రత్యక్షముగ చూచెను. క్రీ. శ. 1347 లో స్వతంత్రుడై గుల్బరగ రాజధానిగ బహమనీరాజ్యమును స్థాపించిన



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అల్లా ఉద్దీన్ హసన్ గంగూ బహ్మన్‌షాను ఆశ్రయించి అతని యాదర గౌరవములకు పాత్రుడై క్రీ. శ. 1349 వ సంవత్సరమున, 'ఫుతూహ్-ఉస్-సలాతీ' నను ఉత్తమోత్తమ పద్యచరిత్ర గ్రంథమును రచించి అతనికి అంకితమొసగెను. ఇతని చరిత్రలో ఒక యాంధ్రదేశమునందే కాక దక్షిణ భారతమున నడచిన చరిత్రాంశములు విపులముగ వర్ణితములైనవి. ఇతడు మహమ్మదీయ చరిత్రకారు లందరిలో గరిష్ఠుడు. ఇతడు గాఢ మతాభిమానము గలవాడైనను సత్యముమీదనే దృష్టి అధికముగ కలవాడు. కావున ఇతడు రచించిన చరిత్ర అత్యంతము విశ్వాసపాత్రమైనది.

ఈసామీకి సమకాలికుడు జియా ఉద్దీన్ బరనీ అను మహమ్మదీయ చరిత్రకారుడు మరియొకడుండెను. ఇతడు మహమ్మదు బిన్ తుఘ్లకు ఆస్థానమున ఉండెను. మొట్ట మొదటినుండి మహమ్మదు బిన్ తుఘ్లకు పర్యంతము ఢిల్లీని పాలించిన మహమ్మదీయరాజుల చరిత్రను ఇతడు 'తారీఖ్ - ఇ - ఫిరోజ్‌షాహి' అను గ్రంథమున వివరించెను. బరనీకి మతాభిమానముతోపాటు జాత్యభిమానముగూడ గాఢమైనందువలన ఇతడు రచించిన చరిత్ర ఈసామీ గ్రంథమువలె పక్షపాతరహితమైనది కాదు. హిందువుల యెడలను, మహమ్మదీయమతము నవలంబించిన భారతీయుల యెడలను ఇతడు ద్వేషముకలవాడై సందర్భము చిక్కినపుడెల్ల వారిని దూరుచుండును. కావున ఇతని యభిప్రాయములను పరిశీలించి చూచి కైకొనుట యుక్తము.

బరనీ వలెనే 'తారీఖ్ - ఇ - ఫిరోజ్‌షాహి' అను పేరుగల చరిత్రను వ్రాసిన చరిత్రకారుడు మరియొకడు కలడు. ఇతనిపేరు షమ్స్ - ఇ - సిరాజ్ అఫీఫ్. ఇతని చరిత్ర బరనీ గ్రంథమంత ఉపయుక్తమైనది కాదు; కాని ఇందు మరియెచ్చటను కానరాని చరిత్రాంశములు కొన్ని కలవు.

ఇతని తరువాత పేర్కొనదగినవాడు నిజామ్ ఉద్దీన్ అహమద్ బక్షి. ఇతడు ఢిల్లీయందు అక్బరుపాదుషా యాస్థానమునం దుండెను. ఇతడు చరిత్ర రచనయం దొక క్రొత్తదారిని త్రొక్కెను. పూర్వులగు భారతీయ మహమ్మదీయ చరిత్రకారులవలె ఢిల్లీ సుల్తానుల చరిత్రతో తృప్తి నొందక బంగాళ, మాళవ, గుజరాతు, దక్కను ప్రాంతములలో స్వతంత్రరాజ్యములను స్థాపించి పరిపాలించిన మహమ్మదీయ రాజవృత్తాంతములను కూడ వర్ణించి యున్నాడు. నేటివరకు లభ్యమైన బహ్మనీ మొదలగు దక్కను మహమ్మదీయ రాజవంశ చరిత్రలలో నెల్ల నిజాముద్దీన్ అహమదుచే విరచితమైన 'తబకాత్ - ఇ - అక్బరీ' లోని గ్రంథభాగమే ప్రాచీనతమ మైనది. అర్వాచీన మహమ్మదీయ చరిత్రకారులలో పెక్కండ్రు నిజామ్ ఉద్దీన్ అహమదు మార్గమును అవలంబించి విపులమైన చరిత్రలను రచించిరి. కాని మహమ్మదీయ చరిత్రలలో నిజామ్ ఉద్దీన్ రచనకు కొంత ప్రత్యేకత కలదు.

నిజామ్ ఉద్దీన్ యొక్క పద్ధతి ననుసరించి చరిత్రను వ్రాసిన రచయితలలో నెల్ల మహమ్మదు కాసిం హిందూషా ఫెరిస్తా సుప్రసిద్ధుడు. ఇతడు హిందూదేశమునందు మహమ్మదీయుల అభ్యుదయమును వర్ణించుచు ఒకగొప్ప చరిత్ర గ్రంథమును వ్రాసెను. ఇది 'తారీఖ్ - ఇ - ఫెరిస్తా' అనుపేర వాసికెక్కినది. ఫెరిస్తా దక్కను వాస్తవ్యుడు; మొదట నిజాంశాహి సంస్థానమును ఆశ్రయించి కొంత కాలము అతడు అహమదునగరమున నివసించి యుండెను. తరువాత అతడు బిజాపురమునకు వచ్చి అచట ఆదిల్ శాహి ప్రభువులను ఆశ్రయించి వారి యనుగ్రహమునకు పాత్రుడై చరిత్రరచన సాగించెను. భరతఖండమునందు ప్రభుత్వము నల్పిన మహమ్మదీయ రాజవంశము లన్నింటి వృత్తాంతమును ఫెరిస్తా తాను రచించిన చరిత్రమున వర్ణించి యున్నను దక్కను రాజవంశములను, అందును ముఖ్యముగ బహ్మనీ, ఆదిల్‌శాహి, నిజామ్‌శాహిలను గూర్చి విస్తరించి చెప్పుట వలన అది దక్కను మహమ్మదీయ రాజ్యముల చరిత్రగనే ప్రసిద్ధిచెందినది; కాని ఫెరిస్తాకు స్వమతాభిమానముతో కూడ తనకు ఆశ్రయ మొసగిన ఆదిల్‌శాహిలపై ఆదర మధికమగుటవలన అతడు తరచుగా చరిత్రాంశములను విడిచిపెట్టియు, తారుమారు చేసియు సత్యమును కప్పిపుచ్చి యున్నాడు: కావున అతని చరిత్ర విశ్వాసపాత్రమైనది కాదు. అతని వ్రాతలలోని విషయములు ఇతర చరిత్రాధారములవల్ల రుజువైన కాని అంగీకార్యములు కావు.

ఫెరిస్తా అనంతరము వెలసిన మహమ్మదీయ చరిత్రకారులలో నెల్ల ఖాఫీఖాను ముఖ్యుడు. ఖాఫీ యనునది అతని వాస్తవ నామము కాదు. అతడు మొగలాయి చక్రవర్తియగు ఔరంగజేబు కొలువులోని యుద్యోగి. ఆ చక్రవర్తి తన చరిత్ర ఎవ్వరును వ్రాయగూడదని శాసింపగా ఇతడు తాను రచించిన చరిత్రను గుప్తముగ దాచియుంచెను. తత్కారణమున ఇతనికి (ఖాఫీ) దాచి పెట్టిన ఖానుడని పేరు కల్గెనని చెప్పుదురు. ఇతడు తనకు ముందు నడచిన చరిత్రను పూర్వచరిత్రలను ఆధారపరచుకొని వ్రాసెను. దక్కను విషయమున ఇతడు ఫెరిస్తా చరిత్రను అనుసరించినను అందందు ఫెరిస్తా వ్రాతకు విరుద్ధమైన అన్యగ్రంథములలోని చరిత్రాంశములను ఉదాహరించి యున్నాడు. తన కాలమున జరిగిన చరిత్రను మతాభి



http://www.sanskritcentral.com/

http://teluguthesis.com/



మానవదృష్టితో కాక యథాతథముగ వర్ణించి సత్యమును తెలిపియున్నాడు. కావున ఇతని రచన అత్యంతము విశ్వాస పాత్రమని ఆధునికచరిత్ర పరిశోధకుల యభిప్రాయము.

పైన చెప్పిన కారివలె హిందూస్థాన చరిత్రలను వ్రాయక మరికొందరు మహమ్మదీయ చరిత్రకారులు ప్రాంతీయ మహమ్మదీయ రాజ్యములనుగూర్చి గ్రంథములను వ్రాసిరి. వారిలో ముఖ్యుడు సయ్యద్ అలీ తబాతబా అను నతడు. ఇతడు నిజామ్‌శాహి సంస్థానమును ఆశ్రయించుకొని రెండవ బుర్హాన నిజామ్‌శాహ కాలములో అహమదు నగరమునందు నివసించుచు బహ్మనీ సుల్తానులను గూర్చియు, నిజాంశాహి వంశజులను గూర్చియు 'బుర్హాన - ఇ - మ అసీ'రను చరిత్రగ్రంథమును వ్రాసి ప్రకటించెను. సయ్యద్ అలీ తబాతబా ఫెరిస్తాకు సమకాలికుడు. హిందువులపై ద్వేషమునందు ఇతడు ఫెరిస్తాకు పై మెట్టు; కాని ఫెరిస్తా గ్రంథముకంటె ఇతనిదే విశ్వాసపాత్రమని చరిత్రపరిశోధకుల యభిప్రాయము.

ఇట్లే అదిల్‌శాహి, కుతుబ్‌శాహి వంశ చరిత్రలను వర్ణించిన రచయితలును కలరు. ఇబ్రాహిం జబీరి యను నతడు 'బుసాతీన్-ఉస్-సలాతీన్' అను గ్రంథమునను జహూర్ జహూరి యను నతడు 'ముహమ్మద్ నామా' యందును విజాపుర సుల్తానుల చరిత్రమును వర్ణించి యున్నారు. అజ్ఞాతనామధేయుడగు చరిత్రకారు డొకడు 'తారీఖ్ - ఇ - ముహమ్మద్ కుల్లీ కుతుబ్‌శాహ' అను గ్రంథమున కుతుబ్‌శాహీల చరిత్రమును వర్ణించి యున్నాడు. మరియొకడు 'హదీకత్ - ఉల్ - ఆలమ్' అను గ్రంథమున ఈ వంశజుల చరిత్రమును కడపటి కుతుబ్‌శాహ సుల్తానగు తానాశాహ పతనమువరకును వివరించియున్నాడు. ఈ మహమ్మదీయ చరిత్రలయం దాయారాజ్యములను ఏలిన సుల్తానులచరిత్రలే కాక ఇరుగు పొరుగుల తెలుగు రాజ్యములకు సంబంధించిన విషయములును ప్రస్తావవశమున వర్ణింపబడి యుండుటవలన ఇవి తెలుగుదేశ ప్రాచీనచరిత్ర రచనకు మిక్కిలి ఉపయుక్తము లగుచున్నవి.

**విదేశీయము :** చిరకాలమునుండియు భారతదేశమునకు ఖండాంతర పూర్వ పాశ్చాత్యదేశములతో సంబంధము కలదు. మతప్రచారమునకై కొందరును, పుణ్యతీర్థదర్శనార్థము కొందరును, వ్యాపారార్థము కొందరును, దేశాటనాపేక్షచే కొందరును దేశాంతరములనుండి వచ్చువారు. అట్లు వచ్చినవారిలో పెక్కండ్రు తాము భరత ఖండమునందు అనేక స్థలములలో కన్న విన్న విషయములను తమ పర్యటన గ్రంథములలో వ్రాసియుంచిరి.

బౌద్ధమతము భరత ఖండమునందు ప్రబలియుండిన కాలమున చీనా మొదలయిన తూర్పు దేశములనుండి యాత్రికు లనేకులు పుణ్యక్షేత్రములను సందర్శించుటకును, బౌద్ధమత గ్రంథములను సంగ్రహించుకొని పోవుటకును వచ్చెడివారు. వారిలో ఫాహియాను, యుహాన్ చ్వాంగు లను వారు ముఖ్యులు. ఫాహియాను దక్షిణదేశమునకు రాలేదు; కాని అతడు దక్షిణ హిందూస్థానమునుగూర్చి, ముఖ్యముగ పారావత విహారమును గూర్చి, తాను విన్న విషయములను తన పర్యటన గ్రంథమున వివరించి యున్నాడు. ఫాహియానువలెగాక యువాన్ చ్వాంగు దక్షిణ భారతమునకు వచ్చి పలుతావులను సంచరించి తాను చూచిన, విన్న విషయములను గ్రంథస్థము చేసి యున్నాడు. ఇతడు తీరాంధ్రమున పెక్కు దేశములు తిరిగి అచటి మతాచారాదికములను, ప్రజల స్థితిగతులను చక్కగ విచారించి తన యనుభవములను, అభిప్రాయములను ఉల్లేఖించి యున్నాడు. క్రీ. శ. 7 శతాబ్ది పూర్వార్ధమునాటి ఆంధ్రదేశ పరిస్థితులను తెలిసికొనుటకు ఇతని పర్యటన చరిత్రము మిక్కిలి ఉపయోగకరమైనది.

యువాన్ చ్వాంగు వెనుక ఆంధ్రదేశమునకు వచ్చిన ప్రయాణికులలో మార్కో పోలో అను ఇటలీ దేశీయుడు ప్రసిద్ధుడు. ఇతడు వచ్చినపుడు కాకతీయ రుద్రాంబ ఆంధ్రదేశమును పాలించుచుండెను. అప్పటి దేశస్థితిని గూర్చి ఇతడు వ్రాసిన వృత్తాంతము చరిత్రకారులకు అత్యంతోపయుక్తమై యున్నది.

ఇతనికంటె ప్రఖ్యాతుడు ఇబన్ బతూతా అను అరబీ ప్రయాణికుడు; ఇతని జన్మస్థానము ఆఫ్రికా ఖండమున మధ్యధరా సముద్ర తీరమున నుండు మొరాకో దేశము. మహమ్మదీయ ప్రపంచము నంతను త్రొక్కి చూడవలెనను ఉద్దేశముతో స్వదేశమునుండి బయలుదేరి పశ్చిమ మధ్యమ ఆసియా దేశములలో సంచరించి, క్రీ. శ. 1333 లో ఇతడు హిందూస్థానమునకు విచ్చేసెను. అప్పుడు ఆ సేతు శీతాచల పరివ్యాప్త భరతఖండము సమస్తమును తుఘ్లుకు వంశజుడైన ముహమ్మదు బిన్ తుఘ్లుకు ఏకచ్ఛత్రాధిపతియై పరిపాలించుచుండెను. అతడు ఇబన్ బతూతాను చేరదీసి సత్కరించి ఢిల్లీమహానగరమునకు న్యాయాధిపతిగ నియమించెను. బతూతా హిందూదేశమున పదియేండ్లకాలము ఉద్యోగము చేసిన పిమ్మట సుల్తాను ఆదేశము చొప్పున చీనాకు రాయబారము పోవుచు దక్షిణ హిందూస్థానమున పెక్కు స్థలములను దర్శించి, అందలి రాజకీయార్థిక మత సాంఘికాది విషయములను విచారించి తాను రచించిన 'రిహ్లా' యను అరబీ పర్యటన చరిత్రమునందు వివరించి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



యున్నాడు. ఇతని 'రిహ్లా' చరిత్రపరిశోధకు పాలిటి పెన్నిధానము. అప్పటి భరతఖండ స్థితిగతులు ఇందు చక్కగ ప్రతిబింబించు చున్నవి.

ఇబన్ బతూతా తరువాత పెక్కండ్రు పాశ్చాత్యులు రాజకీయ కార్యములమీదను, వర్తకము కొరకును దక్షిణ భారతమునకు వచ్చి విజయనగర సామ్రాజ్యమున సంచరించి తమ యనుభవములను వర్ణించుచు గ్రంథములను రచించిరి. వీరిలో మొదట పేర్కొనదగినవాడు అబ్దుల్ రజాక్ అను పారశీకుడు; ఇతడు షా రూఖ్ అను పారశీక రాజు పక్షమున విజయనగర చక్రవర్తియైన రెండవ దేవరాయల యాస్థానమునకు క్రీ. శ. 1444 లో రాయబారము వచ్చి, కొన్ని నెలలకాలము విజయనగరమున నివసించెను. ఇతడు విజయనగర రాజధానిని, అందలి ప్రజల జీవనమును, దేవరాయల యాస్థానపు మర్యాదలను, పండుగ పబ్బములను, వేడుకలు వింతలను విపులముగ వర్ణించుచు 'మత్ల ఉస్ స ఆదీన' అను పుస్తకమును వ్రాసెను.

ఇతని తరువాత నికోలో కాంటి, వర్థేమా అను పాశ్చాత్య ప్రయాణికులు ఒకరి వెనుక నొకరు విజయనగర సామ్రాజ్యమున పర్యటనముచేసి అనేక విషయములను వర్ణించి యున్నారు.

క్రీ. శ. 15 వ శాబ్దపు కడపటి దశకమున పోర్చుగీసువారు దక్షిణహిందూస్థాన పశ్చిమ సముద్రతీర ప్రాంతములకు వచ్చిరి. అప్పటినుండియు దక్షిణ హిందూస్థానమునకును, ఐరోపీయ పాశ్చాత్యదేశములకును రాకపోకలు క్రమముగ హెచ్చి, చిట్టచివర ఆంగ్లేయ సామ్రాజ్యస్థాపనకు దారితీసినవి. పోర్చుగీసువారు వచ్చినప్పటినుండియు వారికి విజయనగర రాయలతో స్నేహము కుదిరినది; తత్కారణమున పోర్చుగీసు రాజకీయోద్యోగులు, మత ప్రచారకులు, వర్తకులు మున్నగువారు తరచుగ విజయనగరమునకు వచ్చువారు. వా రందరును విజయనగర రాజకీయములను గూర్చియు, దక్కను మహమ్మదీయ ప్రభువులకును రాయలకును గల పరస్పర రాజకీయ సంబంధములనుగూర్చియు, సామ్రాజ్యప్రజల స్థితిగతులనుగూర్చియు తమచే విరచింపబడిన గ్రంథములలోను, నివేదికలలోను ఉత్తర, ప్రత్యుత్తరములలోను వ్రాసియున్నారు. ఇట్లు విజయనగర సామ్రాజ్యమునకు వచ్చి అచట తమకు కలిగిన గౌరవాదులను తెలుపుచు వ్రాసినవారు పోర్చుగీసువా రొక్కరే కారు; వారి మార్గమును అనుసరించి వచ్చిన డచ్చి, ఫ్రెంచి, ఇంగ్లీషువారును, ఐరోపీయ లితరులును తమ రచనలలోను, ఫ్యాక్టరీ లెక్కలలోను దేశములోని రాజకీయ విశేషములను, అపుడు సంభవించిన చరిత్రాంశములను వర్ణించి యున్నారు. ఈ సందర్భమున పేర్కొనదగినవారిలో ప్రముఖులు దురాతే బర్బోసా, న్యూనిజ్, పేయసులను పోర్చుగీసు యాత్రికులు. బర్బోసా వీరనరసింహ రాయల కాలమునసో కృష్ణరాయల రాజ్యారంభ దశయందో రాయసామ్రాజ్యమున సంచారము చేసినట్లు ఉన్నది. న్యూనిజ్, పేయసులు కృష్ణదేవరాయల కాలమున వచ్చిరి. బర్బోసా రాయరాజ్యప్రజల జీవన విధానమును తెలియజేయు విషయము లనేకము వివరించి యున్నాడు; పేయసు విజయనగర పట్టణమును, రాయల నగళ్లను, దేవాలయములను, అందలి జన విస్తారమును, వర్తక బాహుళ్యమును వర్ణించి యున్నాడు. న్యూనిజు ఆనెగొంది కంపిలిరాయల కాలమునుండి అచ్యుతరాయల పరిపాలనము వరకును విజయనగర చరిత్రను వ్రాసియున్నాడు. న్యూనిజ్ రచనయే విజయనగర చరిత్రలలో మొదటిది. తాను విన్న పూర్వరాజ వృత్తాంతమును, కనులార గాంచిన కృష్ణ, అచ్యుత దేవరాయల చెయిదములను ఆధారపరచుకొని న్యూనిజ్ గ్రంథ రచనను సాగించెను. న్యూనిజ్ రచన నేటికిని విజయనగర చరిత్ర రచనకు కల మూలాధారములలో ప్రథమస్థానమును ఆక్రమించుచున్నది.

వీరి సంగతిని చేర్పదగినవాడు మాన్యుయల్ బర్రాడాసు. ఇతఁడు క్రీ. శ. 1616 ప్రాంతమున దక్షిణ హిందూదేశమునకు వచ్చియుండి, అప్పుడు విజయనగర సామ్రాజ్యమున వడచిన విశేష చరిత్రాంశములను కొన్నింటిని అభివర్ణించియున్నాడు. క్రీ. శ. 1614 లో వీర వెంకటపతి రాయలు కాలగతిని చెందినపిమ్మట గొబ్బూరి జగ్గరాజకృత దుష్కృత్యములను వెలుగోటి యేచమ నాయని యద్వితీయ ప్రతాపమును, తత్ఫలితముగ చొప్పడిన జగ్గరాజాది రాజద్రోహుల నిర్మూలమును, రాయరాజ్య పునఃప్రతిష్ఠను చక్కగ వివరించి యున్నాడు. అప్పటి రాజకీయ చరిత్ర పునర్నిర్మాణమున కనుకూలమగు సాధనములలో బర్రాడాసు లేఖ ప్రధానమైనది.

ఈపై. నుడివినవారు కాక క్రీస్తుశకము పదునేడవ శతాబ్దములో హిందూదేశమునకు వచ్చిన టవెర్నియరు, బెర్నియరు, విజయనగరాధీశ్వరుడయిన రెండవ వేంకటపతి దేవరాయల కాలమున దక్షిణ హిందూదేశమునకు వచ్చిన జెసూయిట్ ఫాదరులు రూబినో మొదలైనవారును వ్రాసిన యాత్రా వృత్తాంతములు ఇంకను చాల ఉన్నవి. ఇవి కాక, డచ్చివారి 'డాగ్ రిజిష్టరు', తూర్పు ఇండియా కంపెనీవారి రికార్డులు అనేకము మన దేశచరిత్ర రచనకుపకరించునవి కలవు. వీని అన్నిటి యాధారమున మన దేశచరిత్ర రచింపబడుచున్నది. నే. వెం. ర.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/





చిత్రము 1. వెండి నాణెములరాశి (క్రీ. శ. ఆరంభ శతాబ్దములు), అమరావతి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



# పురాతనస్థల ఖననే పరిశోధన

శాసనశాస్త్రములును, నాణకశాస్త్రములును పురాతత్త్వ శాస్త్రములోని విభాగములు. ఇవి మాత్రమేకాక ఆ శాస్త్రమునకు సంబంధించిన మరియొక ముఖ్య విషయము పురాతనస్థల ఖనన పరిశోధన. మతవిషయకముగా కాని, చారిత్రకముగా గాని ఒకప్పుడు ప్రసిద్ధి వహించి ఇప్పుడు దిబ్బలయి పోయిన ప్రాచీన క్షేత్రములను, నగరములను త్రవ్వి పరిశోధించి, అట్టి పరిశోధనలో బయలుపడిన పురాతన నిర్మాణ శిథిలములనుబట్టియు, వస్తుసామగ్రిని బట్టియు వాని కాలమును నిర్ణయించి, ఆ కాలమునాటి జనుల ఆచార వ్యవహారాదికములను, జీవన విధానమును - ఆనాటి నాగరికతను తెలిసికొనుటకును, ఆనాటి చరిత్రను పునర్నిర్మించుటకును పురాతత్త్వ శాస్త్రజ్ఞులు ప్రయత్నించుచున్నారు. ఈ విధముగ చేసిన పురాతనస్థల ఖనన పరిశోధనను అనుసరించియే మన నాగరికత, సంస్థలు, కళలు మొదలైనవాని ప్రారంభమును, వాని ప్రాథమిక దశను తెలిసికొనుటకు వీలగుచున్నది.

తెలుగు దేశమునకు క్రీస్తు పూర్వము మూడవ శతాబ్దమునుండియే ప్రారంభమయి క్రీ. శ. పదునేడవ శతాబ్దము వరకు సాగిన సుదీర్ఘమగు స్వతంత్ర చరిత్రము కలదు. ఈ రెండువేల సంవత్సరములలో తెలుగు దేశమున వేరువేరు ప్రాంతములందు రాజ్యములు నిర్మించుకొని పరిపాలనము చేసిన రాజవంశము లనేకము కలవు. తెలుగు దేశమును సంపూర్ణముగ కాకపోయినను, విశేష భాగమును ఒకచే వశాక్రిందికి తీసికొనివచ్చి పరిపాలనము చేసిన మహారాజాధిరాజులును, చక్రవర్తులును కలరు. తెలుగు దేశమును పరిపాలించిన రాజవంశజులు వైదిక ధర్మావలంబకులును, యజ్ఞయాగాది కర్మనిరతులును అయినను పరమత సహిష్ణులై బౌద్ధ, జైనములనుకూడ ఆదరించిరి. ఈ రెండువేల సంవత్సరముల కాలములో పూర్వము ప్రసిద్ధి వహించిన పట్టణములు చాల పాడుపడినవి; కొన్ని పల్లె లయినవి. బౌద్ధ జైనములు మన దేశమున క్షీణించిన వెనుక అనాదృతిపాలై బౌద్ధ సంఘారామములును, జైనవసదులును భూగర్భగతము లైనవి. చరిత్ర ప్రసిద్ధి వహించిన పురాతన స్థలములయొద్ద పెద్ద దిబ్బ లిప్పటికిని కానవచ్చును. ఇటువంటి దిబ్బలలో కొన్నిటిని పురాతత్త్వ శాఖవారు త్రవ్వించి పరిశోధనలు జరిపినారు; ఇంకను జరుపుచున్నారు. ఇటువంటి దిబ్బలను త్రవ్వించి పరిశోధించుటవలనను, దేశములో కానవచ్చు శాసనములను పరిశోధించుటవలననే మన దేశముయొక్క పూర్వ చరిత్ర క్రమముగా బయటపడుచున్నది.

తెలుగు దేశములో పురాతత్త్వశాఖవారు కొన్ని కొన్ని దిబ్బలను, స్థలములను త్రవ్వించి జరిపిన పరిశోధనలవలన బౌద్ధావశేషములకు, జైనావశేషములకు నెలవైన చరిత్ర ప్రసిద్ధములగు ప్రదేశము లనేకము బయలుపడి మన దేశములోని బౌద్ధ, జైన మతచరిత్రములు పూర్వముకంటె ఎక్కువగా తెలిసికొనుటకు వీలయినది. ఈ ప్రదేశములలో అమరావతి, నాగార్జునని కొండ, భట్టిప్రోలు, గంటసాల, జగ్గయ్యపేట, గుమ్మడిదుర్రు, సంకారము, రామతీర్థము, శాలిహుండము ముఖ్య బౌద్ధస్థలములు. తెలుగుదేశమున బౌద్ధము జనాదరణము చూరగొని క్రీ. పూ. 3వ శతాబ్దము మొదలు క్రీ. శ. 7వ శతాబ్దము వరకు వాస్తు, శిల్ప, చిత్రలేఖనములకు తీర్పులు దిద్దినది. బౌద్ధసంఘములు వేరువేరు కులములకు తెగలకు ఉన్నతాదర్శమును చూపి నైతికముగా జనుల నిత్యజీవితములందు మార్పులు తెచ్చినవి. భౌతికములైన సీమావధులను దాటి మతమును వ్యాపింపజేయుటకయి ఆ కాలమునందలి బౌద్ధభిక్షువులు అపారమయిన కృషిని కావించిరి. వారు ఆనాడు అట్లు కావించిన కృషి ఆంధ్రనాగరికతకు అభ్యున్నతిని, శోభను సమకూర్చినది.

బౌద్ధుల పవిత్రవాస్తు నిర్మాణమును గూర్చిన పరిశోధన భారతీయ పురాతత్త్వ శాస్త్రమందు ప్రధానమైన స్థానమును ఆక్రమించినది. బౌద్ధులకు పవిత్రములైన కట్టడములలో సంఘారామము, స్తూపము అనునవి ప్రముఖములు. విహారమను శబ్దము బౌద్ధభిక్షువులు నివసించు మఠములకే కాక, బౌద్ధాలయములకు కూడ వాడబడుచుండినట్లు యువాన్ చ్వాంగ్ వ్రాతలవలనను, సింహళద్వీపమున ప్రార్థన మండపములకు నేటికిని ఈనామము చెల్లుచుండుట వలనను తెలియుచున్నది.

బౌద్ధ సంఘారామము సాధారణముగా చతురస్రమయి, అంతర్భాగమున మండువావిధమున ఖాళీస్థలమును, దీని నావరించుకొని చతుశ్శాలయు, అందు మూడు ప్రక్కల 'భిక్షు'ల నివాసములకై కట్టిన గదులును గల నిర్మాణము. స్తూపమను పదము బౌద్ధ వాస్తువున ఇటికతో కాని, రాతితో కాని, మట్టితో కాని, అర్ధగోళాకృతిగా నిర్మించిన సమాధి వంటి నిర్మాణములకు మాత్రమే వాడబడినది. స్తూపమునే బౌద్ధులు చైత్యమనియు వ్యవహరించుచుండిరి. బుద్ధులు, ప్రత్యేక బుద్ధులు, అర్హతులు, చక్రవర్తులు - వీరికి మాత్రమే స్తూపము నిర్మింప వచ్చును అని బుద్ధుడే శాసించినట్లు 'మహా పరి నిర్వాణ సూత్ర' మున తెలుపబడి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



యున్నది. కాని కాలక్రమమున విఖ్యాతులైన బౌద్ధాచార్యులకు గూడ బౌద్ధులు ఈ గౌరవము ఇచ్చినట్లు పురాతత్వ శాఖవారి ఖనన పరిశోధనలవలన ఋజువగుచున్నది.

స్తూపములు త్రివిధములు. అవశేషధాతువులపై కట్టిన స్తూపములకు ధాతుగర్భములు, లేదా, శారీరకస్తూపములు అనియు, బుద్ధుడు సంచరించిన పవిత్ర క్షేత్రములందు ధాతు రహితముగా కేవలము స్మారక చిహ్నములుగా కట్టినవానికి ఉద్దేశిక స్తూపములు అనియు, ఆచార్యపాదులు ఉపయోగించిన భిక్షాపాత్ర, పాదుకలు మొదలగు పారిభోగిక వస్తువులను పదిలపరచి, ఆ ప్రదేశములపై కట్టిన స్తూపములకు 'పారిభోగిక' స్తూపములు అనియు పేర్లు. భక్తులైన బౌద్ధ శిల్పుల సిద్ధహస్తములలో స్తూప నిర్మాణము ఒక కళయై క్రమపరిణామము పొంది వాసి కనినది.




చిత్రము 5. బౌద్ధ విహారము : అందలి భాగములు

1. స్తూప చైత్యము, 2 బుద్ధ చైత్యము, 3. బౌద్ధ భిక్షుల మందిరములు, 4. భోజనశాల, 5. పాకశాల, 6. మండపము.

**అమరావతి :** తెలుగు దేశము నేడు బౌద్ధావశేషములకు నిలయము. ఇట్టి వానిలో ప్రపంచ ఖ్యాతి పొందినది ధనకటక మహాచైత్యము. దీనిని ఇప్పుడు అమరావతి స్తూపము అందురు. అమరావతి గుంటూరు మండలమున కృష్ణానదీ తీరమున గుంటూరికి ఇరువదిరెండు మైళ్ల దూరమున కలదు. ఆంధ్ర శాతవాహనులకు రాజధానియై విఖ్యాతి వహించిన ధన కటకము అమరావతికి శివారు గ్రామమై దానికి మైలు దూరముననే నేడు ధరణికోట అను పేర వరగుచున్నది. దీనికి ధాన్యకటకమని కూడ నామాంతరము కలదు.

మొట్టమొదట క్రీస్తు శకము 1797 కర్నల్ కాలిన్ మెకంజీ అమరావతికి వచ్చి ఇచ్చట స్తూప శిల్పములను చూచి వాని విలువను గుర్తించి పత్రికలకు వ్రాసెను.

అతడు అమరావతికి వచ్చుటకు కొద్ది సంవత్సరములకు పూర్వము శ్రీ రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు అను జమీన్‌దారుడు తన రాజధానిని చింతపల్లినుండి అమరావతికి మార్చి ఇక్కడ ఒక పట్టణమును, తాను నివసించుటకు గొప్ప భవనమును నిర్మించుకొనుటకు నిశ్చయించుకొనెను. అప్పుడు కావలసిన రాతికొరకు అమరావతికి పడమరగా చేరువనున్న పురాతన నగరమయిన ధరణికోట యొక్క గోడలను, అందలి దిబ్బలను త్రవ్వించెను. అట్లు త్రవ్వించిన దిబ్బలలో దీపాల దిన్నె ఒకటి. దీనిలోనే పూర్వపు బౌద్ధ స్తూపము ఉండెను. అతని జనము ఈ స్తూపమునుండి పెద్ద పెద్ద ఇటికలను, పాలరాళ్లను త్రవ్వించి తీసికొని పోయిరి. అత్యంత రమణీయముగా నున్న శిల్పఫలకములను గూడ కాల్చి సున్నము చేసిరి.

తరువాత మెకంజీ 1816లో మరల అమరావతికి వచ్చి స్తూప శిల్పములను చూచి, వానికి నమూనాలు వ్రాసి ప్రాచుర్యము కలిగించెను. కొన్ని శిల్ప శిలాఫలకములను సరి 1819లో అతడు కలకత్తాకు పంపెను. అటుతరువాత, ఒక భవనమును కట్టి దానిలో భద్రపరచు తలపుతో అమరావతినుండి మరికొన్ని రాళ్లు మచిలీపట్టణమునకు కొనిపోబడినవి. అవి పదునెన్మిదేండ్ల వరకు అక్కడనే ఉండెను. గుంటూరు కమీషనర్‌గా నియమింపబడిన సర్ వాల్టర్ ఇలియట్ 1845లో అమరావతికి వచ్చి మరల స్తూపమువద్ద త్రవ్వింపగా అంతకు పూర్వము [illegible] కొంత భాగము బయటపడినది. కాని ఈ భాగమునకు సంబంధించిన రాళ్లు అప్పటికే అవి ఉండవలసిన స్థలములో లేవు. ఇలియట్ ఈ శిల్పపురాళ్లలో చాలభాగమును మద్రాసునకు పంపెను. అక్కడ చాల సంవత్సరములు అవి వానకు తడిసి, ఎండకు ఎండిన మీదట ఇంగ్లండునకు పంపబడినవి.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/




చిత్రము 6.

అమరావతీ స్తూపాకృతి

ఊర్ధ్వపటము (ని..వు స్తంభము). 2. సూచి (అడ్డుకమ్మి). 3. చైత్యశిలాఫలకము. 4. ఆర్యక స్తంభవేదిక. 5. ప్రదక్షిణ పథ(వీథి)
6. ఆర్యక స్తంభము (ఆయకకరణము). 7. అండము. 8. హర్మిక. 9. ఛత్రము.

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



1858 లో అవి లండను చేరినవి. అవి లండనులో సామాను వేసికొను గిడ్డంగి వంటి గృహములో ఉండగా 1867లో సుప్రసిద్ధ ఆంగ్లేయ కళాతత్వవేత్తయు, విమర్శకుడును అయిన ఫెర్గుసన్ వానిని చూచి, వాని సౌందర్యమునకు అచ్చెరువంది వానినిగూర్చి ఒక ఉద్గ్రంథమును ప్రకటించెను. ఫెర్గుసన్ పుస్తకముతో అమరావతి శిల్పములకు అమిత ఖ్యాతి వచ్చినది. ఇంగ్లండుకు పంపబడిన ఈ శిల్పపురాలను నేటికిని బ్రిటిష్ మ్యూజియములో చూడవచ్చును. ఇంగ్లండుకు పంపినవి కాక మద్రాసు కేంద్ర వస్తు ప్రదర్శనశాలకు పంపినవి కొన్నింటిని నేటికిని మద్రాసు వస్తు ప్రదర్శనశాలలో చూడవచ్చును. రాబర్ట్ సువెల్ 1877 లో ఈ స్తూప ప్రదేశమువద్ద త్రవ్వించి మరికొన్ని శిల్పపురాళ్లను బయటికి తీసెను. వీనినిగురించి అతడు ఒక పుస్తకమును గూడ ప్రచురించెను. 1881లో జేమ్సు బర్జెస్ను పురాతత్వ శాఖవారు ఖనన పరిశోధన నిమిత్తము అమరావతికి పంపిరి. కాని అప్పటికే స్తూపము నాశనమైనది. బర్జెస్ అక్కడి శిలా ఫలకములను సురక్షితముగా మద్రాసుకు చేర్చెను. క్రీ. శ. 1905-06, 1908-09 లో అలెగ్జాండర్ రే దొర కావించిన ఖనన పరిశోధనలకు ఫలితముగా మరి కొన్ని శిలాఫలకములు బయల్పడినవి. అమరావతీ స్తూపమునకు చెందిన శిలాఫలకములు పెక్కులు లండనులోని బ్రిటిష్ మ్యూజియమునందును, మద్రాసు మ్యూజియమునందును, కొన్ని కలకత్తాలోని ఇండియన్ మ్యూజియమునందును, మిగిలిన శిథిలములు అమరావతి యందును పదిలపరుపబడి యున్నవి.

అమరావతీ స్తూపముయొక్క నిర్మాణకాలమును సరిగా నిర్ణయించుటకు అందు దొరకిన శాసనములే ముఖ్యాధారములు. మౌర్య లిపిలోను, సాతవాహనుల, ఇక్ష్వాకులనాటి లిపులలోను ఉన్న శాసనముల వలన ఈ స్తూపము మౌర్యుల కాలము నుండియు విఖ్యాతిలో ఉండి దక్షిణాపథపతులైన సాతవాహనుల కాలమునను, అటు తర్వాతను అభివృద్ధి పొంది ప్రజల గౌరవాదరములను పొందుచు వచ్చినట్లు ఊహింపవచ్చును. కాలక్రమమున ధాన్యకటకమునకు దశ తొలగి పోయినది. క్రీ. శ. నాలుగవ శతాబ్దము నాటికే ఈ మహాచైత్యము ప్రభ క్షీణించుటకు ఆరంభించినది. చీనా యాత్రికుడైన యువాన్ చ్వాంగ్ ఏడవ శతాబ్దములో ఆంధ్ర దేశమునకు అరుదెంచునప్పటికే ధాన్య కటకమున నుండిన సంఘారామములు అనేకము సంఘ పరిత్యక్తములై పాడుపడిపోయినవి. బౌద్ధమతమున తాంత్రిక సంప్రదాయము ప్రబలుటతో ఆ మతము తన విశిష్టతను కోల్పోవుటయేకాక, ఆ పద్ధతిని ఆదరించిన వజ్రయాన బౌద్ధాచార్యులు చీదపురుగులుగా భావింపబడిరి; బౌద్ధారామములు అన్నియు లంజ దిబ్బ లనుపేర కళంకితములుగా నిలిచిపోయినవి.

నేడు అమరావతీ స్తూపము అందలి శిల్ప చిత్రముల యోగ్యతవలననే విశ్వవిఖ్యాతి గాంచినది. ఈ స్తూపమునందలి చెక్కడపు పనులు నాటి ఆంధ్ర శిల్పుల పవిత్ర మతాభినివేశమునే కాక, వారి కళా కోవిదత్వమును కూడ చాటజాలియున్నవి. ఇంత అద్భుత సృష్టిచేసిన శిల్పులు స్వోత్కర్ష ప్రకటనయందు ఆసక్తి లేనివారు కనుకనే వారు తమ నామములను కూడ ఎక్కడను చెక్కుకొనలేదు.

ఖనన పరిశోధనలందు లభించిన స్తూప ప్రతిబింబముల సాయమునను, చరిత్ర దృష్టితో కూడిన భావనా బలము వలనను కర్నల్ కాలిన్ మెకంజీ మున్ను ఎన్నడో కాల విపర్యయమున శిథిలమై భూగర్భస్థమైన మహా చైత్యము యొక్క ఆకృతిని పునర్నిర్మింప గలిగెను. నేడు గుండ్రముగా కన్పట్టు గుంటయందే పూర్వము ఒకప్పుడు 138 అడుగుల వ్యాసము, 100 అడుగుల ఎత్తు కలిగి శిల్పాలంకార శోభితములైన పాలరాలతో ఈ స్తూపము విరాజిల్లుచుండెడిది. ఈ నిర్మాణములోని రాళ్లను బట్టి ఈ స్తూపము వృత్తాకారము గల వేదిక, దానిపైన అర్ధ గోళాకృతితో ఉండిన అండము, దానిమీద హర్మిక, దానిపై కేతన విరాజితమైన దండాంచిత ఛత్రము అనెడి అంగములతో కూడి ఉండెడిదని తెలియుచున్నది. వేదికమీది అండమునకు నాల్గువైపుల 'ఆయక' వేదికలు, వానిపై 'ఆయక' స్తంభములు అను పేరు గల ఐదేసి స్తంభములు కూడ కలవు. 'ఆయక' స్తంభ ప్రతిష్ఠాపనము ఆంధ్ర దేశమందలి బౌద్ధ స్తూపముల విశిష్టత. వేదిక చుట్టును 'ప్రదక్షిణ పథము'ను, దానిని ఆవరించి ప్రాకారమును ఉండెడివి. ఈ ప్రాకారము నిలువు రాతికంబములకు ఎడ నెడ, అడ్డముగా దొనిపిన రాతి కమ్ములతోను, స్తంభోపరిభాగమున ముడియుగా ఉండు రాతి దూలములతోను నిర్మితమై ఉండినది. అడ్డు కమ్మికి 'సూచి' అనియు, మదురు రాతికి 'ఉష్ణీష' మనియు పేర్లు. సూచీ స్తంభోష్ణీషములు అతి మనోహరములైన దివ్య ప్రతిమా సంపదతో ఒప్పారుచుండినవి. ఈ ప్రాకార రేఖకు నాల్గు వైపుల నాల్గు సింహద్వారములు ఉండెడివి.

బౌద్ధము ఆంధ్ర దేశమునందు ప్రబలిన క్రీ. శ. ఆరంభ శతాబ్దముల నాటి ఆంధ్రుల ఆచారవ్యవహారములను, వస్త్రాభరణములు, [illegible] మొదలగునవియు సవిస్తరముగా తెలిసికొనుటకు ఈ స్తూపపురాళ్ల మీది చిత్రములే ఆధారములు (చూడు : అమరావతి).



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



**భట్టిప్రోలు :** ఇది గుంటూరు మండలమందు రేపల్లె తాలూకాలో ఉన్న చిన్న గ్రామము. ఈ గ్రామమునకు దక్షిణమున లంజదిబ్బ అని వ్యవహరింపబడు దిబ్బ బౌద్ధ స్తూపము. ఇది క్రీ. శ. 1870 లో ప్రథమమున బాస్వెల్ చే కనుగొనబడినది. అటు తర్వాత క్రీ. శ. 1871లో ఇలియట్ దీనిని గూర్చి ప్రభుత్వమునకు వ్రాసెను. ఈ స్తూపములోని ఇటికలుకూడ పరిమాణమునందును, మన్నికయందును, అమరావతి స్తూపములోని వానివంటివి అగుటచే రస్తాల మైన శిలా పేటికలు మూడు దొరకినవి. ఈ పేటికలలో స్వర్ణపుష్పములు, నాణెములు, రత్నములు మొదలగునవి కానవచ్చినవి. వానిని మద్రాసు మ్యూజియమునందు కాననగును. ఈ పేటికలపై నున్న శాసనములను బట్టి ఈ స్తూపముల నిర్మాణ కాలమును సరిగా నిర్ణయించుటకు వీలగుచున్నది. ఇవి దక్షిణ మౌర్య లిపియందు లిఖింపబడియుండుటచే బూలర్ దొర ఇవి క్రీ. పూ. రెండువదల సంవత్సరములనాటివి అయియుండవచ్చునని ఊహించెను. స్తూపా



చిత్రము 7. మహా చైత్యముండిన స్థలము : అమరావతి

నిర్మాణమునకును, కృష్ణానది కాలువలను కట్టుటకును విరివిగా ఉపయోగింపబడినవి. అటు తర్వాత రాబర్ట్ సుయెల్ దీనిని దర్శించి స్తూపము ప్రాముఖ్యమును, దాని శిథిలావస్థను గూర్చి ప్రభుత్వమునకు తెలియజేయగా పురాతత్త్వశాఖ సూపరింటెండెంటుగా మున్న అలెగ్జాండర్ రే 1882 లో ఈ స్తూప స్థలమునందు త్రవ్వటపు పరిశోధనలు చేయించిరి. ఆ ఖనన పరిశోధనలకు ఫలితముగా శిథిలము కాగా మిగిలిన స్తూపాకారము బయలు పడినది. స్తూపము మధ్య భాగమునందలి ఇటికలు తీయగా లోపల నిక్షిప్త లంకరణములకయిన చెక్కడపు రాళ్ళు అన్నియు కాలువ తూముల నిర్మాణమునందు ఉపయోగించుటచే నేడు మనకు ఏవియు లభ్యమగుటలేదు.

**గంటసాల :** ఇది కృష్ణజిల్లా దివితాలూకాలో మచిలీపట్టణమునకు పశ్చిమముగా 18 మైళ్ళ దూరమున కలదు. 'కంటకసేల' అను నామముతో క్రీస్తు శకము తొలి శతాబ్దములందు సుప్రసిద్ధమైన రేవుపట్టణముగా విలసిల్లిన ఈ గ్రామము నేడు, సముద్రమునకు దూరమై పేరు ప్రతిష్ఠలు లేని పల్లెటూరైనది. ఇందు పూర్వకాలమునాటి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వర్తకవాణిజ్యములకు సాక్షీభూతముగ యవన, రోమక, నాణెములు ఇప్పటికిని దొరకుచున్నవి. ఈ గ్రామమునకు ఈశాన్యభాగమున లంజదిబ్బలు అను పేరుగల దిబ్బలు బౌద్ధస్తూపములు. వీనినిగూడ బాస్వెల్ 1870 లో గుర్తించి వీనికి ప్రాచుర్యమును కలిగించెను. 192 అడుగుల వ్యాపముతో 23 అడుగుల ఎత్తున చక్రాకృతి నున్న ఈ దిబ్బ 1892 లో పరిశోధింపబడినది. ఇందు ఖనన పరిశోధనలు చేసి స్తూపముయొక్క వేదిక పునాదులను, సౌష్ఠవము చెడకుండ బయల్పరచి, అలెగ్జాండర్ రే ఈ స్తూపము అమరావతీ స్తూపముకంటె కొంచెము అర్వాచీనమైన దనియు, నమూనానుబట్టి ఇది సింహళద్వీపములోని స్తూపములను బోలి యున్న దనియు వ్రాసిరి. ఇందుకూడ స్వర్ణపుష్పములు, సమౌక్తికములు, వజ్రములుగల శిలాపేటిక లభించినది. స్తూపాలంకరణ శిల్పము లన్నియు, గృహనిర్మాణములకై తీసికొనిపోయినవి పోగా, మిగిలినవి ప్రక్క గ్రామములకు తరలింపబడినవి.

**గుడివాడ :** కృష్ణామండలమున ఈ గ్రామము మచిలీపట్టణమునకు వాయవ్యముగ ఇరువది మైళ్ళ దూరమున కలదు. ఇది చారిత్రకప్రశస్తి గాంచిన పట్టణము. ఈ గ్రామములో 'కోట' యను ప్రదేశమున ఆంధ్రశాతవాహనరాజుల నాటి నాణెములు పెక్కు లభించినవి. ఇచ్చటి స్తూపమునుగూడ బాస్వెల్ తొలుదొల్త గుర్తించెను. తర్వాత ఈ స్తూపమును పరిశీలించిన రాబర్ట్ సుయెల్ ఈ స్తూపము ఆకారమున 'సాంచీ' స్తూపమును పోలి యుండు ననియు, ఈ స్తూపముకూడ బెజవాడనుండి బందరుకు రస్తా వేయుసమయమున ధ్వంసము చేయబడిన దనియు, ఆ త్రవ్వటములో కొన్ని శిలాపేటికలు గూడ లభించిన వనియు వ్రాసెను. క్రీ.శ. 1882 లో అలెగ్జాండర్ రే శాస్త్రోక్త పద్ధతిని సుమారు 142 అడుగుల చదరము కలిగి సంపూర్ణముగ కన్పట్టు దిబ్బను త్రవ్వి స్తూపాకృతిని బయలుపరపజూచిరి. కాని స్తూప ప్రదేశమునను, దానికి చెందిన విహారస్థలములందును గృహములు నిర్మించియుండుటచే అట్లు చేయ వలనుపడలేదు. ఆయన స్తూపము పునాదులను మాత్రము బయలు పరచిరి.

**జగ్గయ్యపేట :** ఇది కృష్ణజిల్లా నందిగామ తాలూకాయందు బెజవాడకు సుమారు 60 మైళ్ల దూరమున ఉన్నది. ఇచ్చటి బౌద్ధావశేషములు అన్నియును ఈ గ్రామమునకు చెంతనే ఉన్న కొండమీద కలవు. ఇందు పెక్కు ఉద్దేశిక స్తూపములు, చైత్యములు, సంఘారామములు బర్జెస్ దొరచే క్రీ. శ. 1882 లో బహిర్గతము చేయబడినవి. 'ఇందలి మహాచైత్యము వ్యాసము 31½ అడుగులు. దీని చుట్టు 11½ అడుగుల వెడల్పుగల ప్రదక్షిణపథము కలదు. దీని వేదికయెత్తు 3½ అడుగులు. వేదికచుట్టు ఫలకములతో అలంకృతమై యున్న' దని బర్జెస్ చెప్పినాడు. రీతిలో ఇందలి శిల్పములు అమరావతీ స్తూప శిల్పములకంటె భిన్నములై అజంటాగుహలలోని కుడ్యచిత్రములకు సన్నిహితములుగ ఉన్నవి. ఇందలి శిల్పములు అన్నిటిలో శ్రీ పాదములకై చెక్కిన 'పుణ్యశాల' కడు రమ్యమైనది. స్తూపపురాలమీద చెక్కినశాసనములనుబట్టి ఈ స్తూపము కూడ అమరావతి, భట్టిప్రోలులందలి స్తూపములవలె మౌర్యుల కాలమునాటిదని ఊహింపబడినది. అమరావతీ స్తూపమువలెనే ఈ స్తూపముకూడ తర్వాతికాలమందు, ముఖ్యముగా ఇక్ష్వాకులపరిపాలనలో పెంపొందింపబడినట్లు శాసనములవలన తెలియుచున్నది. ఇచ్చట ఖనన పరిశోధన లందు లభించిన శిలాఫలకములుకూడ మద్రాసు మ్యూజియమునందు భద్రపరుపబడినవి.

**గుంటుపల్లి :** అతి ప్రాచీనములైన బౌద్ధ గుహావిహారములలో గుంటుపల్లి బౌద్ధారామము ఒకటి. గుంటుపల్లి పశ్చిమగోదావరి జిల్లా ఏలూరు తాలూకాలో కామవరపు కోటకు ఆరు మైళ్ళ దూరమున ఉన్న జమీందారీ గ్రామము. ఈ గ్రామమునకు ఉత్తరమున ఉన్న కొండ కొనయందు, కొండలలో మలిచిన చైత్యాలయములను, విహారములను, ఇటికలతో కట్టిన స్తూపములను, చైత్యవములను పెక్కింటిని క్రీ. శ. 1889 లో అలెగ్జాండర్ రే త్రవ్వి బయల్పరచెను. ఈ యన్నింటియందును కొండలలో రాతిలో మలచిన స్తూపచైత్యము ముఖ్యమైనది. ఈ గుహాలయమున 18 అడుగుల వ్యాసముగల వృత్తాకారవేదికపై 18 అడుగుల వ్యాసము, 14 అడుగుల ఎత్తు గల శిలానిర్మితమైన స్తూపమును, దాని చుట్టును మూడడుగుల వెడల్పున 'శ్రీవీథి' యు గలదు. హార్మికోపరితలమున నిర్మించిన దండాంచితఛత్రము మాత్రము శిథిలమైనది. ఈ గుహాలయముయొక్క పైకప్పు భాగము అన్నిటికంటె చిత్రమైనది. ఇది దారుమయ నిర్మాణపద్ధతిని అనుకరించుచు అర్ధగోళాకృతిని నిర్మింపబడినది. ఛత్రమునకు వలె దీనియందును రాతిలో ఊచలు మలచబడినవి. అశోకుని కాలమున బుద్ధగయ వద్ద బరాబరు కొండలలో మలచబడిన 'లోమకఋషి' గుహాలయము రీతినే ఇదికూడ నిర్మింపబడుటచేతను, క్రీస్తుపూర్వము రెండవ శతాబ్దమునాటి లిపిలో ఉన్న ఒక శాసనము లభించుటచేతను ఇది ఆ కాలము నాటిదని రూఢిగా చెప్పవచ్చును. ఈ బౌద్ధ సంఘారామము కూడ తరువాతి కాలమునందు అభివృద్ధి చేయబడినది. ఇందు దొరకిన శిలా విగ్రహములు, రాతి బరిణెలు,



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చిత్రము 8. మ్రొక్కుబడి స్తూపములు: శాలిహుండము



చిత్రము 9. మహాచైత్యము, శాలిహుండము



చిత్రము 10. శిలావచ్చిన్న గుహాలయములు, శంకారము (బొజ్జన్న కొండ)



చిత్రము 11. సంఘారామావశేషములు, రామతీర్థము

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



బంగారపు భిక్షాపాత్ర, పూసలు మొదలైన వన్నియు నేడు మద్రాసు మ్యూజియమునందు చూడనగును.

**రామతీర్థము** : ఇది విశాఖపట్టణము జిల్లాలో విజయనగరమునకు ఈశాన్యమున 8 మైళ్ల దూరమున గలదు. క్రీ. శ. 1908-09 లో అలెగ్జాండర్ రే పరిశోధనల ఫలితముగ గురుభక్తుల కొండ, దుర్గ కొండ అను నామములతో వ్యవహరింపబడు కొండయొక్క కొనలందు ప్రాచీన బౌద్ధ సంఘారామమునకు సంబంధించిన అవశేషములు - స్తూపములు, చైత్య గృహములు, 'భిక్షు'ల ఆవాసగృహములు, వారు ఏర్పరచుకొన్న నీటి వసతులు మొదలగునవి - బయలుపడినవి. ఇచట త్రవ్వినపుడు లభించిన వానిలో పూజలుకల కుండలు, నాణెములు, బంకమట్టితో చేసిన ముద్రికలు ప్రధానములు. ఇందు లభించిన సీసపు నాణెముల మీదను, మట్టిముద్రికల మీదను 'సిరి సివమక విజయ రాజ సేల సంఘస' అని శాసనము కలదు. దీనికి 'సిరి సివమక విజయ' రాజు చేత పోషింపబడిన 'శైల సంఘ' మని అర్థము చెప్పవచ్చునేమో! అమరావతి శాసనము లందు ఒక దానిలో 'రాఞో సివమక సద' అను రాజు పేర్కొనబడియున్నాడు. సాధారణముగా నాణెముల మీదనైతము కానవచ్చు 'రాఞో' పదము ఇక్కడ దొరకిన మట్టి ముద్రికల మీద కానరాదు. అయినను విజయరాజ పదమును బట్టి అతడు రాజనియే ఊహింపవచ్చును. అట్లయినచో, ఇతడు ఆంధ్ర శాతవాహన రాజయి ఉండవచ్చును. దీనిని అనుసరించి ఇచ్చటి బౌద్ధ సంఘారామము ఆంధ్ర శాతవాహనుల నాటిదై ఉండునని తలచుచున్నారు. 8, 9 శతాబ్దముల నాటివని నిశ్చయింపబడిన విగ్రహము లనుబట్టి 9వ శతాబ్దమువరకు గూడ ఈ సంఘారామము ఉచ్చస్థితిలో ఉండినట్లు తెలియుచున్నది.

**శాలిహుండము** : శ్రీకాకుళము జిల్లాలో వంశధార ఒడ్డున ఉన్నది ఈ గ్రామము. దీని దగ్గర కొండపై ఉన్న బౌద్ధావశేషములు కూడ త్రవ్వి బయల్పరుప బడినవి. ఉన్నతమైన ప్రదేశమందు నిర్మింపబడిన ఈ స్తూపరాజము చూపరులకు వింత గొల్పుచు, కళింగపట్టణపు రేవునకు వచ్చిన వణిక్ ప్రభువుల నందరిని ఆకర్షించుచుండెడిదట. ఇచ్చట స్తూపమందు నిక్షిప్తమైన ధాతుపేటికలు స్ఫటికముతో చేయబడినవి. స్తూపాకృతినున్న ఈ పేటికలందు స్వర్ణ పుష్పములుగూడ లభించినవి. ఇవి నేడు విశాఖపట్టణమందలి పురాతత్వశాఖవారి కార్యాలయములో భద్రపరుపబడి యున్నవి (చూడు : శాలిహుండము).

**సంకారము** : బొజ్జన్న కొండ అను నామాంతరము కల ప్రాచీన బౌద్ధస్థలము విశాఖ పట్టణము జిల్లాలో అనకాపల్లి రైలుస్టేషనుకు రెండుమైళ్ల దూరమున కలదు. గుంటుపల్లి బౌద్ధారామమువలెనే ఇది కూడ ప్రాచీన బౌద్ధుల గుహాలయములలో ఒకటి. శిల్పములతో విరాజిల్లు ఈ గుహాలయము రెండంతస్తులు కలది. చైత్యాలయ ద్వారోపరి భాగమున ధ్యానసమాధిలో ఉన్న పురుష ప్రమాణము గల బుద్ధ విగ్రహము కలదు. 30 అడుగుల పొడవు, 30 అడుగుల వెడల్పు, 8 అడుగుల ఎత్తు గల ఈ గుహాలయము 2 అడుగుల చదరము గల 16 స్తంభము లాధారముగా నిల్చియున్న రాతిలో మలచబడినది. నాలుగడుగుల ఎత్తుగల ఏకశిలా నిర్మితమైన స్తూపము ఒకటి ఆలయ మధ్యభాగమున కలదు. ఈ గుహాలయములకు పైగా కొండమీద ఇటికలతో నిర్మితమైన స్తూపములు, చైత్యములు, 'భిక్షు' నివాసయోగ్యములైన గదులు కూడ బయల్పరుపబడినవి. ఖనన పరిశోధనలందు ఇచట పెక్కు నాణెములు, బంకమట్టితో చేసిన ముద్రలు లభించినవి. ఇచట దొరకిన నాణెములలో గుప్త చక్రవర్తియైన సముద్ర గుప్తుని బంగారు నాణెము ముఖ్యమైనది.

**అల్లూరు** : ఇది కృష్ణజిల్లా నందిగామ తాలూకాలో ఎర్రుపాలెం రైలుస్టేషనుకు నాలుగుమైళ్ల దూరమున కలదు. ఈ గ్రామమునకు వాయవ్యముగా అరమైలు దూరమున ప్రాచీన స్తూపావశేషములను గుర్తించి, 'మహమ్మద్ ఖురైషీ' గారు 1928 లో దీనిని త్రవ్వి శోధించిరి. ఈ స్తూపము పునాది చక్రమునకు వలె ఆకులు కలిగి, గుండ్రమైన ఆకృతిలో ఉన్నది. మధ్యభాగము మాత్రము 32' 8" వ్యాసము గల ఘన నిర్మాణము. ఈ నిర్మాణమున ఉపయోగించిన ఇటికలు కూడ అమరావతీ స్తూపములోని వానివలె 22" పొడవు గలవి. స్తూపవేదిక నాల్గు దిక్కులందు ముందునకు పొడుచుకొని వచ్చినట్లు కట్టిన 'ఆయక' వేదికలు గలవు. స్తూపముచుట్టును చప్టా చేయబడిన 10½ అడుగుల వెడల్పుగల 'శ్రీవీథి' కలదు. ఇందు శిథిలములైన పాలరాతి శిల్పఫలకములు, బ్రాహ్మీలిపిలో ఉన్న శాసనములు గల శిలా స్తంభములు మొదలగునవి దొరకినవి. శాసనముల ఆధారమున ఈ స్తూపము క్రీ. శ. రెండవ శతాబ్దము నాటిది అని పురాతత్త్వ విదులు నిర్ణయించిరి.

**గుమ్మడిదుర్రు** : ఈ గ్రామము నైజాము సంస్థానమున మధిర రైలు స్టేషనుకు ఆరుమైళ్ల దూరమున ఉన్నది. గ్రామమునకు [illegible] అడుగుల ఎత్తున సమతలముగా నున్న [illegible] బౌద్ధావశేషములు ఉన్నట్లు గుర్తించి పురాతత్వశాఖ [illegible] 1926 లో దానిని త్రవ్వి బయల్పరచిరి. ఈ దిబ్బ మూడు భాగములుగ

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



విభజింపబడినది. అన్నిటికంటె ఎత్తయిన ప్రదేశమందు మహాస్తూపమును, దానికి దక్షిణముగా పెక్కు ఉపస్తూపములును, వీనికి పశ్చిమముగా నాల్గడుగల దూరమున 'భిక్షు'ల ఆవాసములును నిర్మింపబడి ఉన్నవి. మహాస్తూపము అమరావతీ స్తూపమువలె శిల్ప ఫలకములతో అలంకరింపబడినది. శిల్పము లన్నియు పాలరాతితో చెక్కబడినవే. స్తూప ప్రతిమలు, బుద్ధుని జాతక కథలు చెక్కిన



చిత్రము 12. బుద్ధవిగ్రహ పాదములు: గుమ్మడిదుర్రు

శిల్ప ఫలకము లెన్నియో ఇందు లభించినవి. ఆంధ్రరాజుల నాటి శాసనములు, సీసపు నాణెములు, రాతి పూసలు, మధ్యయుగము నాటి ముద్రలు, బంగారు హారము, రజత పేటికలు కూడ లభించినవి. నిర్మాణ రీతినిబట్టియు, శాసన లిపిని బట్టియు ఈ స్తూపము క్రీ. శ. 2, 3 శతాబ్దములనాటి దని నిర్ణయించిరి.

**నాగార్జునుని కొండ:** అమరావతి తరువాత ప్రాచీనాంధ్ర బౌద్ధక్షేత్రములలో సుప్రసిద్ధమైనది నాగార్జునుని కొండ. ఇది గుంటూరు జిల్లా పల్నాడు తాలూకాలో మాచెర్ల స్టేషనుకు 14 మైళ్ల దూరమున ఉన్నది. ఇచ్చట బౌద్ధావశేషము లన్నియు విశాల మగు లోయయందు ఉన్నవి. ఈ ప్రదేశమును తొలుదొల్త 1925 లో శాసన పరిశోధన శాఖకు చెందిన ఏ. రంగస్వామి సరస్వతిగారు శిథిలమైన బౌద్ధస్తూపపు దిబ్బయొద్ద ప్రాచీన బ్రాహ్మీ శాసనములు గల స్తంభమును గుర్తించి స్థల ప్రాశస్త్యమును గూర్చి ప్రభుత్వమునకు తెలియజేసిరి. తదుపరి, ఇచట మహమ్మదు ఖురైషీగారు చేసిన ఖనన పరిశోధనకు ఫలితముగ 18 ప్రాచీన శాసనములును, రెండు శిథిలాలయములును, అనేకమగు అమూల్య శిల్పఫలకములును బయల్పడినవి. అటుతర్వాత 1927 నుండి 1931 వరకు లాంగ్‌హర్‌స్టు దొర, టి. యన్. రామచంద్రన్‌గారు ఈ ప్రాంతమున జరిపించిన త్రవ్వటము మూలమున ఇటికలతో నిర్మింపబడిన స్తూపములు, సంఘారామములు, చైత్య గృహములు, శిలా స్తంభయుతము లయిన మండపములు, పెక్కు బహిర్గతము లైనవి. ఇచ్చట దొరకిన శిల్ప సంపద యంతయు, ఇందు ప్రత్యేకముగా నిర్మింపబడిన వస్తుప్రదర్శన శాల యందుపరిరక్షింపబడి ఉన్నది.

అమరావతి స్తూపమువలెనే ఇది కూడ కొంచ మించుమించుగ ఆ కాలముననే నిర్మింపబడి తర్వాత ఇక్ష్వాకు



చిత్రము 13. బుద్ధధాతుకరండములోని వస్తువులు: నాగార్జునుని కొండ

రాజుల ఆదరణమున క్రీ. శ. మూడు నాలుగు శతాబ్దములందు పెంపొందింపబడినది. ఇక్ష్వాకువంశజుడగు 'చాంతమూలు'ని సోదరి 'శాంతిశ్రీ' ఈ మహాస్తూపోద్ధరణ చేయుటయే కాక దాని కెదురుగ ఒక విహారమును 'అపర మహావినసేలి'యుల ఉపయోగార్థము కట్టించెను. ఈ స్తూపములు త్రవ్వుచుండగా అండము యొక్క మధ్యభాగమున నొక మట్టి పాత్రలో రజత కరండమున నిక్షిప్తమైయున్న బుద్ధధాతువు దొరికినది. ఇది బటాణీ గింజంత పరిమాణము గల ఎముక ముక్క. దీనిని ¾" వ్యాసము గల బంగారు బరిణెలో మౌక్తిక స్వర్ణపుష్పములతో కూడ పెట్టి,



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



దానిని మరల స్తూపాకృతినున్న రజతకరండమున పదిల పరచినారు. ఈ బౌద్ధధాతువు నేడు 'సార్నాథ్' లోని 'మూల గంధకుటీ విహారము'న పూజింపబడుచున్నది.

నాగార్జునుని కొండ ప్రదేశము నేడు పాడుపడి బీడుపారి పోయినది. శంకరాచార్యులవారు సపరివార ముగ ఇచటికి విచ్చేసి బౌద్ధుల నందరిని తరిమివేసిరని ప్రతీతి. ఇది ఎంతవరకు సత్యమో తెలియదు.

ఖనన పరిశోధనల ఫలితముగ సుమారు 600 పెద్ద శిల్ప ఫలకములును, 400 శిథిలములైనవియును లభ్యమైనవి. ఇవి అన్నియు నేడు వస్తు ప్రదర్శనశాలలో చక్కగ అమర్చ బడి యున్నవి.

ఇంకను నాగార్జునుని కొండలో త్రవ్వించవలసిన దిబ్బలు, ప్రదేశములు చాల ఉన్నవి. నాగార్జున సాగరమును కట్టినచో బౌద్ధ విహారములు, శిథిలములు మున్నగునవి పూర్తిగ మునిగిపోగలవు. కావున అక్కడ ఇంకను పరీ క్షింపవలసిన ప్రదేశములను ప్రభుత్వ పురాతత్త్వ శాఖ వారు త్రవ్వించుచున్నారు. ఈ త్రవ్వకమునకు ఫలితముగ ఇదివరకు బయలు పడినవి కాక ఇంకను క్రొత్త శిథిల నిర్మాణములు మొదలైనవి బయలు పడుచున్నవి (చూడు. నాగార్జునుని కొండ).

పై ప్రదేశములందే కాక పురాతత్వ శాఖవారు కాప వరము, కొడవలి, ఆరుగోలను, చేజెర్ల, కనుపర్తి, ఈపూరు మొదలగు గ్రామములందు కూడ బౌద్ధావశేషములను గుర్తించి ప్రాచుర్యమును కలిగించిరి.

**దానవులపాడు:** బౌద్ధము వలెనే జైనమతము కూడ తెలుగు దేశమున జనాదరణము పొంది ఎక్కువగా వ్యాపించినట్లు నేడు తెలుగు దేశమున శిథిలములై, నామ మాత్రావశిష్టములైన జైనవసదుల వలన తెలియు చున్నది. బౌద్ధులవలెనే జైనులు కూడ స్తూపాది నిర్మాణ ములు చేసినట్లు తార్కాణములు కలవు. కాని, తెలుగు దేశమున జైనమతమునకు సంబంధించిన స్థలములు పురా తత్వశాఖ వారిచే గుర్తింపబడి, శోధింపబడిన వానిలో దానవులపాటి జైనాలయములు ప్రసిద్ధములు. దానవుల పాడు కడపజిల్లా, జమ్మలమడుగు తాలూకాయందు పెన్ననది ఒడ్డుననున్న కుగ్రామము. పెన్ననది వరద వలననో, మరే కారణముననో, ఎన్నడో ఇసుకలో కప్పబడి పోయి యున్న అక్కడి జినాలయములు ప్రప్రథమమున క్రీ. శ. 1903 లో శ్రీ జయంతి రామయ్య పంతులుగారిచే గుర్తింపబడినవి. వారు వీనిని గురించి ప్రభుత్వమునకు తెలియజేయగా పురాతత్త్వశాఖ వారు ఆ స్థలముయొక్క పరిశోధనకు పూనుకొనిరి. ఇచ్చట కావించిన ఖనన పరిశోధనలకు ఫలితముగా పాలరాతితో చెక్కిన జిననాథుని విగ్రహము, 12 అడుగుల చదరముగల గర్భాలయము, ముఖమండపము బయల్పడినవి. వానిలో చాళుక్య లిపి యందు ఉన్న శాసనములు, నాణెములు, పాలరాతిలో చెక్కబడిన చక్కని శిల్పములు కూడ లభించినవి.

**చంద్రవల్లి:** మైసూరు సంస్థానమందలి చిత్రదుర్గము నకు 1½ మైలు దూరమున ఉన్న ఈ గ్రామమున దొరకిన నాణెములనుబట్టి ఇది క్రీస్తు శకము ప్రాథమికశతాబ్దముల నాటి ఆంధ్రశాతవాహనుల ముఖ్యస్థానములలో ఒకటని మైసూరు సంస్థాన పురాతత్వ శాఖాధికారులైన కె. యం. హెచ్. కృష్ణగారు 1940 లో ఇచ్చటను, ఈ జిల్లాలోనే ఉత్తరముగా బళ్లారికి 30 మైళ్ళ దూరమున ఉన్న బ్రహ్మగిరి వద్దను ఖనన పరిశోధనలు జరిపిరి. బ్రహ్మగిరి ప్రాంతమున ఉన్న అశోకుని శాసనాధారమును బట్టియు, తనకు పరి శోధనలందు లభించిన సామగ్రిని బట్టియు నేడు బ్రహ్మగిరి అను పేర బరగు గ్రామమే అశోకునినాటి 'ఇసిల' అని ఆయన రూఢిగా వక్కాణించెను. బ్రహ్మగిరి కొండలకు ఆగ్నేయముగ ఒక ఫర్లాంగు దూరమున 1942 లో త్రవ్వగా బౌద్ధయుగమునాటి చైత్యగృహము ఒకటికూడ బయల్పడి నది. 1947 లో ఇండియా గవర్నమెంటు పురాతత్వశాఖ వారు మైసూరు పురాతత్వశాఖవారి సౌహార్దముతో ఈ ప్రదేశములందు పరిశోధనలు సాగించి బయల్పరచిన పెద్ద రాతి సమాధులు, అందు లభించిన నాణెములు, ప్రాచీన నాగరికతావశేషములు దక్షిణదేశమున పురాతత్వ చరిత్రలో ఒక నూతనాధ్యాయమును మరల ప్రారంభించి నవి. చరిత్ర రచనకు ఆవశ్యకమైన కాలక్రమమును కొంత వరకు నిర్ణయించుటకు వలసిన సామగ్రి అంతయు ఇందు లభించినది.

**కొండాపురము:** తెలుగుదేశములోని కొండా పురము శాతవాహన రాజుల కాలమునాటి మహానగర ములలో ఒకటి. అక్కడను, గోదావరీ తీరమునందలి 'పైఠాను' (ప్రతిష్ఠానము - మరాటవాడ)లోను, హైదరా బాదు పురాతత్వశాఖవారు ఖనన పరిశోధనలు కావించి యున్నారు (చూడు: కొండాపురము, పైఠాను).

**హంపి - విజయనగరము:** నేడు హంపి అనుపేర వ్యవహరింపబడుచున్న కుగ్రామమే పంపాతీర్థమని పురాణ ప్రసిద్ధి కలిగి, సుమారు రెండువందల సంవత్సరములు చంద్ర ధ్వజమునకు ఎదురొడ్డి నిల్చి, దక్షిణ భారతమున హైందవ స్వాతంత్ర్యమును నిలబెట్టి, హిందూ మతమును ఉద్ధరించిన విజయనగర రాజన్యుల రాజధానీ నగరము. క్రీ. శ. 1336 ప్రాంతమున సంగమ వంశజులైన హరిహరరాయలు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



నిర్మించిన ఈ నగరరాజము క్రమాభివృద్ధి నొంది తుళువ కృష్ణరాయల నాటికి (1509-30) మహోజ్జ్వల చారిత్రక ప్రసిద్ధిగల నగరములలోని కెల్ల మణిపూసయై విరాజిల్లినది. సప్త ప్రాకార సమన్వితమై ఉన్నతములగు ప్రాసాదముల తోను దేవాలయములతోను, అత్యంత రమణీయముగ ఉండిన ఈ నగర రాజమును రక్షస తంగడి యుద్ధమున (1565) జయమొందిన తురుష్కులు పూర్తిగా ధ్వంసము చేసిరి. అట్లు నాశనమైన ఈ మహాపట్టణపు శిథిలములు నేడు హంపి, కమలాపురము, కంపిలి గ్రామముల మధ్య పెక్కు చదరపు మైళ్ల వైశాల్యమున ప్రకృతి పర్చరచిన ప్రదర్శన శాలవలె నుండి చూపరులకు తమ ప్రాచీనౌన్న త్యమును జ్ఞప్తికి తెచ్చుచున్నవి.

ఈ నడుమ మద్రాసు గవర్నమెంటు వారికి తుంగ భద్రా నదికి ఆనకట్ట కట్టి అచ్చట విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి వలయు ఏర్పాట్లు కావించుటకై హంపీ శిథిల ప్రాంతమున ఒక పెద్ద జలాశయము నిర్మింపవలసిన ఆవశ్యకము కలిగినది. ఈ జలాశయ నిర్మాణమువలన కమలాపుర గ్రామ ప్రాంతమున ఉన్న విజయనగర రాజధాని శిథిలావ శేషములు గల భూ భాగము జలమయ మగుచుండుటచేత వీలయినంతవరకు ప్రాచీనావశేషములను ఉద్ధరించు సంక ల్పముతో 1950 లో ఇచ్చట ఖనన పరిశోధనలు జరుప బడినవి. తత్ఫలితముగా హరిహరరాయలనాటి బంగారు నాణెములు, గృహములు, నీటితొట్లు, బావులు బయల్పడి నవి (చూడు : హంపీ శిథిలములు).

ఇంకను తెలుగు దేశములో పురాతత్వ శాఖవారు పడమటి గోదావరి, గుంటూరు, కర్నూలు మొదలైన మండలములలో త్రవ్వింపవలసిన పురాతన స్థలములు, దిబ్బలు చాల ఉన్నవి. అవి యన్నియు త్రవ్వినచో మనకు, మన ప్రాచీనచరిత్రకు, కళలకు సంబంధించిన విశేషము లెన్ని బయటపడునో తెలియదు. రా. సు.



చిత్రము 14. పంపాపతి ఆలయము, తూర్పు ప్రైపు, ఆనాటి బజారు : హంపి

http://sanskritcentral.com/

http://teluguthesis.com/

# తెలుగు దేశ చరిత్ర యుగవిభాగము

తెలుగుదేశ చరిత్ర (1) చరిత్ర పూర్వ యుగము, (2) చారిత్రక యుగము అని రెండు యుగములుగా విభజింపబడినది. వీనిలో (1) చరిత్ర పూర్వయుగము చరిత్రను తెలుపుటకు లిఖితాధారములు లేని కాలము. ఇది క్రీస్తుకు పూర్వము మూడవ శతాబ్దమువరకు గల కాలము; (2) చారిత్రక యుగము క్రీస్తుపూర్వము మూడవ శతాబ్దము మొదలుకొని ఇరువదవ శతాబ్దము వరకు గల కాలము. ఈ చారిత్రక యుగము (1) పూర్వయుగము, (2) మధ్య యుగము, (3) ఆధునిక యుగము అని మరల మూడు యుగములుగా విభజింపబడినది. వీనిలో పూర్వయుగము క్రీస్తు పూర్వము మూడవ శతాబ్దమునుండి క్రీస్తు శకము పదునొకండవ శతాబ్దమువరకు గల కాలము; మధ్య యుగము క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దమునుండి పదునేడవ శతాబ్దము వరకు గల కాలము; ఆధునిక యుగము ఆ తరువాతినుండి నేటి యిరువదవ శతాబ్దమువరకు గల కాలము. ఈ చారిత్రకయుగ విభాగములు మూడింటిలో మధ్యయుగము మరల పూర్వ మధ్యయుగ మని, ఉత్తర మధ్యయుగ మని రెండుగా విభజింపబడినది. పదునొకండవ శతాబ్దము మొదలుకొని పదునాల్గవ శతాబ్దమువరకు గల కాలము పూర్వ మధ్యయుగము. ఈ యుగము క్రీ. శ. పదునాల్గవ శతాబ్దములో కాకతీయ త్రైలింగ్య సామ్రాజ్య పతనముతో అంతమగుచున్నది. అప్పటినుండి ఉత్తర మధ్య యుగము ప్రారంభమయి క్రీస్తు శకము పదునేడవ శతాబ్దముతో అంతమొందును. ఈయుగములు ఆయా శతాబ్దములు ఆరంభమగుకాలమునుండి అంతమగు కాలములో ఎప్పుడో ఒకప్పుడు ఆరంభమై అంతమొందునని గ్రహింపదగును.

దేశచరిత్రలో యుగ విభాగ కాలనిర్ణయము విషయమున ఇప్పటికిని చరిత్రకారులలో అభిప్రాయ భేదములు కలవు. హిందూదేశ చరిత్రలో యుగనిర్ణయ విషయమున ఇంకను చర్చలు సాగుచునే యున్నవి. కొందరి అభిప్రాయ ప్రకారము పూర్వయుగము క్రీస్తుశకము పదవ శతాబ్దములో అంతమొందును. అట్లే పదునేడవ శతాబ్దములో మధ్యయుగము అంతమగుచున్నది. ఇక అప్పటినుండి ఆధునిక యుగము. మరికొందరు వేరొక తీరున నిర్ణయింతురు. ఇట్లు ఈ యుగ నిర్ణయము బహువిధముగ నున్నది. కావున మనదేశ చరిత్రలోని ప్రసిద్ధ చారిత్రక సంఘటలను పురస్కరించుకొని తెలుగుదేశ చరిత్రమునందు పైని పేర్కొనబడిన విధము ననుసరించి యుగ విభాగము చేయబడినది.

మ. సో. శ.

# చరిత్ర పూర్వయుగము

మానవ చరిత్ర అతి పురాతనమైనది; సుమారు ఆరు లక్షల సంవత్సరముల పరిమితి కలది. వలన, మానవుడు వానరాకృతినుండి నరాకృతివరకు పరిణామము పొంది ప్రకృతికి లోనయి, సహజ సంపదను ప్రకృతి కుతంత్రములను బోధపరచుకొని తన జీవిత సౌకర్యములను నిర్మించుకొనుటకు సుమారు కొన్నిలక్షల సంవత్సరములు పట్టెనని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. మానవుడు లిపి పరిజ్ఞానము కలిగినప్పటినుండియే తన సాంఘికాచారములను వంశ పరంపరగ తన బిడ్డలకును, తన నాగరికతను తోడిమానవులకును సంక్రమింప జేయగలిగినాడు. మానవునికి వ్రాతపరిజ్ఞానము ప్రపంచమునందు వేర్వేరు దేశములలో వేర్వేరు కాలములలో ప్రారంభమైనది. ఈ వ్రాతపరిజ్ఞానము యొక్క ప్రాముఖ్యమునుబట్టి చరిత్రకారులు మానవ చరిత్రలోని ఈ యుగమును 'ఇతిహాసిక యుగ' మని, 'చరిత్రయుగ' మని అందురు. దీనికి పూర్వపు యుగమునకు 'ప్రాగైతిహాసిక యుగ' మనియు, 'చరిత్ర పూర్వ యుగ' మనియు పేర్లు.

ఆంధ్రదేశమున మానవుడు ఎప్పటినుండి నివసించెను? అతడు ఉపయోగించిన పరికరములను, ఆయుధములను బట్టి చూడగా, సుమారు మూడులక్షల సంవత్సరముల నుండి గోదావరి, కృష్ణ, వాని ఉపనదుల తీరములందు మానవుడు నివసించెనని తెలియుచున్నది. కాని, ఆంధ్ర దేశమునందే కాక భారతదేశమందుకూడ ఈ విషయమున తగినంత శాస్త్రపద్ధతిని పరిశోధన జరుగలేదు. అందుచేత నికరముగా కాలనిర్ణయము చేయుటకు వీలులేదు. కాని, సుమారుగా అతడు భూమి వయస్సు నాల్గవ విభాగమైన 'ప్లైయిస్టోసీను' యుగమధ్యమున నివసించెనని దృఢముగా చెప్పవచ్చును.

ఆనాటి మనదేశ శీతోష్ణస్థితి ఎట్లుండెను? ఈ 'ప్లైయిస్టోసీను' యుగమందు శీతోష్ణస్థితి మధ్యమధ్య మారి, అతిశీత



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కాలము, అత్యుష్ణకాలము ఒకదానివెనుక నొకటిగ వచ్చినవి. అతి శీతకాలములో ముప్పదవ అక్షాంశరేఖకు దక్షిణమున 'అతి వర్ష కాలము' (ప్లూవియట్స్) పర్పడెను [ఏర్పడెను]. అట్లే ఉష్ణకాలములును మామూలుగా ఉండెడివి. ఆంధ్రదేశమునందుకూడ ఈ శీతోష్ణస్థితి మార్పుల చిహ్నములు కనబడుచున్నవి. మనదేశములో కొండలపైని కానవచ్చు బోంత [దొంత] రాయి (లేటరైట్) ఇటువంటి మొదటి 'అతివర్ష కాలము' నందు పర్పడినది [ఏర్పడినది]. దీని తరువాత ఉష్ణకాలమునుండి ఆంధ్రదేశములో మానవుని పరికరములు కనబడుచున్నవి.

హిందూ దేశములోని కాశ్మీరు, పంజాబు, గుజరాతు దేశములలో తప్ప మిగిలిన దేశము లన్నిటిలోకన్న ఆంధ్ర దేశములో పరిశోధన శాస్త్రీయముగా జరుపబడినది. మొట్టమొదట, 19వ శతాబ్దాంతమున రాబర్టు బ్రూస్ ఫుట్ దొర భూగర్భశాస్త్ర పరిశోధనతో పాటు, చరిత్ర పూర్వయుగపు పరిశోధనకూడ జరిపెను. వారి పరిశోధన వలన ఇంచుమించుగా ఆంధ్రదేశమందలి జిల్లా లన్నిటిలోను పూర్వము మానవుడు నివసించుచుండెనని తెలియవచ్చినది. వారికి దొరకిన పరికరములు, ఆయుధములు, సమాధులలో దొరకిన



చిత్రము 15. ప్రాచీన శిలాయుగ పరికరములు

సామగ్రి ఇప్పుడు మద్రాసు పురాతన వస్తు ప్రదర్శనశాలలో నున్నవి. తరువాత ఆంధ్రదేశమునందు కలెక్టరుగా పని చేసిన కమియాడే దొర చాల శాస్త్రీయమైన పరిశోధన చేసి కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయ నిపుణుల సాహాయ్యముతో మన దేశమందలి 'ప్లైయిస్టోసీను' కాలమునాటి శీతోష్ణస్థితులను గురించి, ఆనాటి మానవుని చరిత్రను గురించి వ్యాసములు వ్రాసి ప్రకటించెను. ఈయనకు తోడుగా తరువాత మరి కొంతమందికూడ ఇట్టి పరిశోధనలు జరిపినారు. పూనా దక్కను కళాశాల పక్షమున ఈవ్యాస కర్తయు నూతన శిలా యుగమునుగురించి బళ్ళారి జిల్లాలో పరిశోధనలు జరిపెను.

చరిత్ర పూర్వయుగము ప్రారంభములో మానవుడు ఇతర జంతువులవలె ప్రకృతిపై ఆధారపడి, దొరకిన కాయలను, దుంపలను, ఫలములను, జంతువులను తిని బ్రతికెడివాడు: తన్ను రక్షించుకొనుటకు, జంతువులను వేటాడుటకు ఆయుధములు రాతితోనే తయారుచేయుచుండెడివాడు. లోహముల పరిజ్ఞానము కలిగిన తరువాత అనగా ఆయుధములను లోహముతో తయారుచేయు చుండెడివాడు. అందుచేత మానవుడు వాడిన ఈ ముడి వస్తువులను బట్టి ఈ చరిత్ర పూర్వయుగమును చరిత్రకారులు 'శిలా (రాతి)యుగము', 'తామ్ర (రాగి) లేక కాంస్య (కంచు) యుగము', 'ఇనుప యుగము' అని మూడు విభాగములు చేయుదురు.

**శిలాయుగము:** ఈ యుగమునాటి మానవుడు తోడి జంతువులవలె నదీతీరములోను, కొండ గుహలలోను నివసించుచు నదీతీరమునందు దొరకెడి నున్నని రాళ్లను చీల్చి, చెక్కి ఆయుధములు, పరికరములు తయారుచేయుచుండెడివాడు. ఇట్లు చేసిన రాతి గొడ్డళ్లు, బొరిగెలు మొదలైన ఆయుధములు తూర్పు గోదావరి మన్యపు ప్రాంతములలోను, పడమటి గోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు, కర్నూలు, కడప, అనంతపురము, బళ్లారి జిల్లాలలోను, హైదరాబాదు రాష్ట్రములోని రాయచూరు, తెలంగానాలోని వరంగల్లు, నలగొండ, కరీంనగరు జిల్లాలలోను చాల దొరకినవి.

ఇంతకు పూర్వము చెప్పబడినట్లు కర్నూలు జిల్లాలో చాల పరిశోధనలు జరిగినవి.

కమియాడే పరిశోధనల ప్రకారము, ఆంధ్ర దేశమునందు శీతోష్ణస్థితులు మారియుండుటచేత మూడు 'అతివర్ష కాలము'లు ('ప్లూవియట్స్'), వాని మధ్య రెండు 'సమవర్ష కాలము'లు ('ఇంటర్ ప్లూవియట్స్') వచ్చియుండెనని



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తెలియుచున్నది. ఆంధ్ర దేశమునందు తొలి మానవుడు మొదటి సమవర్షకాలము మొదలుకొని నివసించుచు, ఈ పైని చెప్పిన మార్పులకు ప్రత్యక్షసాక్షి యయ్యెనని తెలియుచున్నది. ముఖ్యముగా, కూర్పు కనుమల శాఖలలో ఉన్న దోర్నకల్లు - ఆత్మకూరు కనుమ దగ్గర, గిద్దలూరు గ్రామము వద్ద ఈకాలపు మానవుని శిలాపరికర పరిశ్రమ బాగుగా సాగినట్లు విశద మగుచున్నది. మొట్ట మొదట మానవులు ప్రకృతిలో దొరకిన రాతిముక్కలను తీసి, తమకు ఇష్టమైన ఆకృతి కలుగునట్లు వానిని మలచి, అత్యంతోపయోగకరమైన ఆయుధములు, పరికరములు చేయుచుండెడివారు. రాను రాను, పరికరములు చిన్న వైనవి. వారు తరువాత అతి రమ్యమైన రంగురాళ్లతో చాల సున్నితమైన కత్తులు మొదలైనవి తయారు చేయుచుండిరి.

ఇది కాక బేతంచెర్లకు దగ్గరగా ఉన్న బిల్లసర్గం అను కొండ గుహలలో చాల పురాతనమైనవి, వింత అయినవి 'ప్లైయిస్టొసీన్' కాలపు జంతువుల అస్థిపంజరములు దొరకినవి. ఆ గుహల పరిసరములలో చాల రాతి ఆయుధములు కూడ దొరకినవి. కాని, ఆ గుహలలో ఈ నాటికిని తగినంత పరిశోధన జరుగలేదు. శిలాయుగ సంస్కృతిదృష్టిని అనుసరించి ఈ గుహలు అఖిల భారత దేశమున ముఖ్యమైనవి. వీనినిగూర్చి ఎప్పుడు పరిశోధన జరుగునో ?

చరిత్ర పూర్వయుగపు నాగరికతను ఆనాటి మానవుని శిలా పరికరములు కొంతవరకు సూచించుచున్నవి. కాని, ఆ నాటి మానవుని పరిసరము లెట్టివో గమనించిన యెడల ఈ పరికరములను, ఆయుధములను ఉత్పత్తి చేసికొనుటయే ప్రకృతితో అతడు సలిపిన స్వాతంత్ర్య సమరములో అతని మొదటి విజయ మని చెప్పవచ్చును.

ఇంతకన్న ముఖ్యమైనది అతని ఆహారసమస్య. ఆ కాలమునాటి మానవునకు విత్తులు చల్లి తనకు కావలసిన ఆహారవస్తువులను పండించుకొనుటకు తెలియదు. అందుచేత చరిత్రకారులు దీనిని 'ఆహారాన్వేషణయుగ' మందురు. మానవుడు ఏనాడు తన ఆహారమును ఉత్పత్తి చేసికొన గలిగినాడో, ఆ నాటి నుంచి తాను ప్రకృతి బంధమునుండి తప్పించుకొని తన కిష్టమయిన స్థలములో స్థిరనివాసము లేర్పరుచుకొని (ఆహారమును ఉత్పత్తిచేసి) నాగరికతలో మరియొక యడుగు ముందుకు వేసినాడు. ఈ కాలమును 'నూతన శిలాయుగము' లేక 'ఆహారోత్పత్తి యుగము' అందురు.

**నూతన శిలాయుగము :** నూతన శిలాయుగమునందు మానవుడు తన ఆహారమును తాను పండించుకొనుటచే అతనికి భూమిమీద వ్యామోహము కలుగుటవలన అతని దేశద్రిమ్మరితనము తగ్గినది. అందుచేత నివసించుటకు అనుకూలములైన కొండల పైన, కొండల దిగువ భాగములందును ఈ కాలపు మానవుని నివాస స్థానములు మనకు కనిపించుచున్నవి. ఆంధ్రదేశమునందలి బళ్లారి, కర్నూలు, కడప, అనంతపురము జిల్లాలలోను, హైదరాబాదు రాష్ట్రములోని రాయచూరులోను, తెలంగాణాలోని వరంగల్లు, నలగొండ జిల్లాలలోను నూతన శిలాయుగమునకు చెందిన ఆయుధములు, పరికరములు చాల దొరకినవి. ఇచ్చటనే కాక, చాల స్థలములందు నూతన శిలాయుగ మానవుని చిహ్నములు కాన వచ్చినవి. బళ్లారి జిల్లాలో ఈ నూతన శిలాయుగమును గురించి విశేషముగా పరిశోధన జరగినది. దానినిబట్టి చూచినచో ఈ నూతన శిలాయుగ సంస్కృతికి రాయలసీమ, తెలంగాణా ఆగ్నేయ ప్రదేశము కేంద్రస్థానములని తెలియుచున్నది.





చిత్రము 16. నవీన శిలాయుగ పరికరములు చిత్రము 17.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఈ కాలపు మానవుడు తనకు వలసిన పరికరములను నిర్మించుకొనుటలో చాల నిపుణత చూపినాడు; తన ఆయుధములకు, పరికరములకు తగిన రాతికొరకు అన్వేషించి వానిని తయారు చేయుచుండెడివాడు. నల్లశాణపు రాతి కొండలు ఇతనికి బహుప్రియమయినట్లు కనబడు చున్నది; వలన అతడు నివసించుటకు యోగ్యమైన ఈ కొండలలోని గుహలలోను, రాతి బిలములలోను ఉండి కొండ చుట్టునున్న భూములను పండించుచుండువాడు.

ఈ కాలపు మానవులు పలువిధములైన పరికరములు తయారు చేయుచుండెడివారు. ఇవి సుమారు నలుబది రకములు కలవు. ఇట్టివానిలో త్రవ్వుటకు ఉపయుక్తము లైన, రాతి పనికి తగిన చేతిగొడ్డళ్లు, ఉలులు ముఖ్యమైనవి. వారు సిసలుగొట్టి ములుపెను పరికరములను చిన్నగా అరగదీసి వానిని అతి సుందరముగా తయారు చేయుచుండెడివారు. ఇట్టివానిలో ముఖ్యమైనది వారి నాగటి కర్రు. కాని వారు లోహము తెలియరానందున వారు కర్రకు చివర సన్నని రాతిని కట్టి మెల్లగా దున్నుచుండిరి. కర్రకు కట్టుటకు సులువుగా ఈ రాతిని తయారు చేయుచుండెడివారు. ఇటువంటి రాళ్ళు బళ్ళారి జిల్లాలో దొరికినవి.

ఈ నూతన శిలాయుగ సంస్కృతి ఎప్పటిదో నిశ్చయముగా తెలియదు కాని అందాజుగా సుమారు క్రీస్తుకు పూర్వము వెయ్యి సంవత్సరములకు పూర్వపుదని చెప్పవచ్చును. తెలియును, అప్పటి మానవుడు ఉత్తరాదినుండి రాగి, కంచు సంపర్కము కలిగి, చక్కగా కరగబోసిన సామానులు వాడ మొదలిడినాడు.

**రాగి, కంచుయుగములు :** సుమారు పది సంవత్సరములకు పూర్వమువరకు శాస్త్రజ్ఞులు దక్షిణభారత దేశమునందు తామ్ర, కాంస్యయుగ సంస్కృతులు లేవని చెప్పుచుండిరి. కాని ఈమధ్య చిత్రదుర్గము జిల్లాలోని బ్రహ్మగిరి వద్ద జరగిన పరిశోధనల వలన క్రమముగా నూతన శిలాయుగము మానవులు రాతితోపాటు కంచును, రాగిని కూడ వాడుచుండిరని తెలియుచున్నది. రాయచూరు జిల్లాలోని కల్లూరు గ్రామమువద్ద మూడు చాల వింతయైన కత్తులు దొరకినవి. ఇటువంటివి ఉత్తర ప్రదేశములోకూడ దొరకుటచే ఆ సంస్కృతితో సంపర్క మున్నట్టు తోచుచున్నది.

**ఇనుపయుగము :** ఆంధ్రదేశమునందు మొదటి ఇనుప పనిముట్లు, ఆయుధములు పెక్కులి వింతయైన సమాధులలో దొరకుచున్నవి. ఈ సమాధులను మనవారు 'రాక్షసిగుళ్లు' అందురు. దీనికి శాస్త్రజ్ఞులు 'మెగాలిత్స్' అని పేరిడిరి. ఇటువంటి సమాధులు దాదాపుగా యూరేషియాయందు అంతటను కనబడుచున్నవి. కాని మన దేశమునందు కనబడు ఈ సమాధులు అంత పురాతనమైనవిగా తోచుటలేదు. ఇప్పటి పరిశోధనలనుబట్టి చూడగా రాయలసీమలోనివి క్రీస్తుపూర్వము సుమారు నాలుగువందల సంవత్సరముల నాటివని తోచుచున్నది.

ఈ సమాధులలో చాల రకములు కలవు. తెలుగుదేశములో సుమారు పండ్రెండు రకములు కానవచ్చుచున్నవి. వీనిలో మొదటిరకము సమాధి వట్టి శిలాస్తంభము (మెన్‌హిర్). సృష్టిలో దొరకునట్టి పొడుగుపాటి రాయి మృతిచెందినవారి స్మృతినిమిత్తము నిలబెట్టుట ఆచారము. ఇట్టి రాతికంబములు కాక చాలరాళ్ళను, రాతిపలకలను సమకూర్చి అనేకవిధములైన సమాధికట్టడములను నిర్మించుచుండెడివారు.

పెద్దరాతి పలకలు తీసి, పెట్టెవలెనే నాలుగువైపుల నాలుగు పాతి, వానిమీద ఒక పలక కప్పు పెట్టెవలె ఒక పెట్టెవలెను నేలమీద కట్టుచుండిరి. తూర్పువైపున ఉన్న పలకలకు సుమారు అడుగున్నర వ్యాసపరిమితిగల గుండ్రని కన్నము ఉండును. ఇటువంటి నిర్మాణములలో భూమిపై నున్న వానిని 'డాల్మెను'లు అందురు. ఇట్టివి గోదావరి, కృష్ణ, చిత్తూరు, బళ్ళారి జిల్లాలలో కానవచ్చుచున్నవి.

ఇటువలెనే పెట్టె ఆకారముతో భూమిలోపలనే కట్టి చుట్టు పైని, పెద్ద గుండ్రాళ్ళను గుండ్రముగా పేర్చుచుండిరి (సిస్టు). ఇట్టివానిలోకూడ తూర్పువైపున కన్నము ఉండును. మన ఆంధ్రదేశములో ఇట్టివి పలు జిల్లాలలో కనబడుచున్నవి. వీనిని నిర్మించు విధానము ఇటీవల చిత్ర దుర్గపు జిల్లాలోని బ్రహ్మగిరిలో వీలర్ దొర చేసిన పరిశోధన వలన విశదమగుచున్నది. ఆంధ్రదేశములో విశాఖపట్టణము జిల్లాలో తప్ప ప్రతిజిల్లాలోను ఇట్టివి కానవచ్చుచున్నవి.

మట్టితో పెద్ద శవపుపెట్టె (టెర్రా కోట సార్కొఫేగస్) చేసి, దానిలో మానవుని అస్థికలు, సామానులుపెట్టి దానిని భూమిలో పాతి పెట్టుట కొన్ని జిల్లాలలో కానవచ్చును. ఎక్కువగా చిత్తూరు, అనంతపురము, కర్నూలు, జిల్లాలలో ఇటువంటివి చాల కనబడును. ఇవి చూచుటకు ఇంచుమించు మట్టితో చేసిన పెద్ద తొట్టెలవలె ఉండును. ఈ శవపేటికలకు ఆరు కాని, ఎనిమిది కాని, కాళ్లు ఉండెడివి. వీనిని పాతిపెట్టిన గోతిచుట్టును, రాళ్ళు గుండ్రముగా పేర్చుచుండిరి. భారత దేశ మంతటిలోను అద్వితీయమును, అసమానమును అయిన శవపేటిక కడపజిల్లాలోని శంకవరం గ్రామమునందు దొరకినది. ఇది గొర్రె ఆకారము కలిగిన ఆరుకాళ్ళ పెట్టె. దాని గర్భములో అస్థిక లున్నవి.

చరిత్ర పూర్వయుగమునకు సంబంధించిన మృతజన స్మారకచిహ్నములు పైని చెప్పినట్టివి అనేకవిధములైనవి

http://sanskritcentral.com/

http://teluguthesis.com/




చిత్రము 18. చరిత్ర-పూర్వయుగ సమాధులు

1, 2, 3. 'మెన్‌హిర్లు', 'డాల్మెనులు' (రేవరాల, కృష్ణజిల్లా), 4, 5. 'డాల్మెన్' (రాక్షసి గుడి), కోసగి (బళ్ళారిజిల్లా), 6. శంకవరము (కడపజిల్లా)లో దొరకిన శవపేటిక, 7. మట్టి శవపేటిక, పల్లావరము (చెంగల్పట్టుజిల్లా), 8. మట్టిశవపేటిక, పాండువరమ్ దేవల్ (చిత్తూరు జిల్లా), 9. ('సిస్ట్' లేని) శిలావలయము, బ్రహ్మగిరి, 10. శిలామయమైన 'సిస్ట్' ప్లాను, మధ్యచ్ఛేదము, బ్రహ్మగిరి 11. 'డాల్మెన్' ప్లాను, ఇర్రలబండ (చిత్తూరు జిల్లా).

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కనబడినవి. వానితోపాటు ఒకటే మాదిరి కుండలు, ఇనుప పరికరములు దొరకుచున్నవి. ఇవన్నియు, సుమారు శవపేటికల కాలమునకు చెందినవని తెలియుచున్నది. ఇప్పటి పరిశోధనల ప్రకారము ఇవి సుమారు క్రీస్తు పూర్వము మూడు శతాబ్దములనాటివని చెప్పవచ్చును. ఇటీవల జరిగిన పరిశోధనలనుబట్టి ఈ మృతజన స్మృతి చిహ్నములలో వాడిన కుండలు ఉత్తరదేశమునుండి వచ్చెనని తోచుచున్నది. 19 వ శతాబ్దములో ఉత్తర హిందూస్థానములో జరపిన పరిశోధనలను బట్టి ఇటువంటి చిహ్నములు అక్కడకూడ ఉండునని తోచుచున్నది. ఇదిచూడ, మరికొంత పరిశోధనతో ఇటువంటి సంస్కృతి మనదేశమునకు ఎపుడు, ఎట్లు వచ్చెనో విశదము కాగలదు.

తెలుగు దేశమం దంతటను, ఈ శిలాయుగ సంస్కృతి తరువాతనే చరిత్రపరిశోధనకు శాసనములు, నాణెములు మొదలైన పరికరములు దొరకుచుండుటచేత, అంతటితో చరిత్ర పూర్వయుగము అంతమైనదని చెప్పవచ్చును.

వేలకొలది సంవత్సరములకు పూర్వము ఈ భూమిమీద నివసించు జనులు ధాతువులను ఎరుగరు. వారి ఆయుధములు, పరికరములు అన్నియు రాతితోను, కర్రతోను, ఎముకలతోను, కొమ్ముతోను చేయబడినవి. వారు వన్య ఫలములను పోగుచేసికొనియో, కోసికొనియో, కందమూలములను త్రవ్వియో, చేపలను పట్టుకొనియో, అడవి జంతువులను వేటాడియో తమ యాహారమునకు ప్రకృతిమీద ఆధారపడి జీవించుచు వచ్చిరి. అనుక్షణము అడవి జంతువులకు భయపడుచు కాలము గడపు దేశద్రిమ్మరులు వారు. వారు సహజముగ ఏర్పడిన కొండ గుహలలోను, శిలాశ్రయములలోను, నదీతటములందును నివసించు చుండిరి.

పైని చెప్పిన ప్రాచీన శిలాయుగమునాటి స్థితిగతులు నవీనశిలాయుగమునాటికి చాల మారిపోయినవి. నవీన శిలాయుగముతో నాగరికత ప్రారంభమైన దని చెప్పవచ్చును. ప్రాచీన శిలాయుగములో కంటె నవీనశిలాయుగములో గొప్ప మార్పు కలుగుటకు కారణములు ఇవి: (1) మొక్కలను పెంచి వ్యవసాయము చేయుట; (2) జంతువులను మచ్చికచేసికొని పెంచుట; ఈ రెండు విధములైన కృషులవలన నవీన శిలాయుగమునాటి మనుష్యుడు తన యాహారమును అభివృద్ధి పరుచుకొనుటకు ప్రకృతిని ఉపయోగించుకొని దానితో సహకరించెను. (3) ఏదో యొక విధముగ చేతితో కుండలు తయారు చేయుట. ఇందు నిమిత్తము నవీనశిలాయుగమునాటి జనులు మంటిని చాల శ్రమతో పదనుచేయుట, చేతితో నెమ్మదిగా పాత్రలు చేయుట, వానిని ఎండబెట్టి కాల్చుట నేర్చుకొనిరి. (4) అరగదీసి నునుపుచేసి పరికరములను అందముగను, వాడిగను చేయుట. మొదటి రెండిటివల్ల మానవునికి దినము గడచునో లేదో, బ్రతుకగలనో లేదో యనుభయము పోయినది. వ్యవసాయము నేర్చినందువలన పంటలు పండించువారు కొందరు ఏర్పడి వ్యవసాయము చేయు ప్రదేశములందు వారు గుంపులు కూడి నివసించుచువచ్చిరి. మానవుడు ఈ నవీనశిలాయుగమున వ్యవసాయమును నేర్చి తన జీవనమునకు అవసరమైనంతవరకే కాక ఇంకను ఎక్కువగ కూడ పండింపసాగెను. వడికి నేయుట కూడ అతనికి ఈ యుగములో అభ్యస్తమయిన విద్యయే. చేతితో కుండలు చేసి వానికి చిన్నెలు వన్నెలు దిద్ది అలంకారముచేయుటతో కళ ఆరంభమయినది. పరికరములను అరగదీసి నునుపు చేయుటతో వానికి వాడిమి, పదును వచ్చి అవి పూర్వముకంటె అధిక ప్రయోజనముల కుపకరించినవి. వ్యవసాయమునకు ఉపకరించు మోట పనిముట్లు అన్నియు ఈ నవీన శిలాయుగమున వచ్చినవే. నవీన శిలాయుగమునాటి జనులు కుండలు చేయుటను నేర్చుకొనుటతో ఆహారమును నిలువచేసి కొనుటకును, ఆహారము చాలినంత ఉత్పత్తియైన కాలమున తాము ఉపయోగింపగా మిగిలిన దానిని ఇతరులకు ఇచ్చి వారియొద్దనుండి తమ దగ్గర లేని వస్తువులను తీసికొనుటకును ప్రారంభించిరి. ఈరీతిని వర్తక వ్యాపారము ఆరంభమైనది.

నవీన శిలాయుగమునాటి జనులు తాము వ్యవసాయము చేయు పొలములను కనిపెట్టికొని యుండుటకు నల్ల శాణపురాతి కొండలమీదనో, కొండలక్రిందనో తమ నివాసము లేర్పరచుకొనువారు. వారు సహజములైన శిలాశ్రయములను, చెట్టుకొమ్మలతో ఏర్పాటుచేసికొన్న గృహములను కూడ ఉపయోగించు కొనుచుండినట్లు తెలియుచున్నది. వారు మేకలు, గొర్రెలు మొదలైన వాని మందలను పెంచు వృత్తిని అవలంబించుచుండినట్లు కూడ రాతిమీద గీసిన దీర్ఘశృంగ పశుచిత్రములవలన తోచుచున్నది.

బళ్లారివద్ద (సంగనకల్లు) నవీనశిలాయుగపు పరికరములను తయారుచేయు ఆనాటిజనుల వలస ఒకటి కనిపించినది. రాయచూరు, బళ్లారి జిల్లాలలో జరిగిన అన్వేషణము వలన వారు తమ పనిముట్లు తయారుచేసికొనుటకు బసాల్ట్, డొలెరైటు రాతి ప్రదేశములను ప్రత్యేకము వెదకి కొనుచుండినట్లు కాన్పించును.

మరికొంత కాలమునకు రాగి, ఇనుము లోహములు కనిపెట్టబడినవి. క్రీస్తుకు వేయిసంవత్సరములకు పూర్వమే ఉత్తర దిశనుండి లోహముల నుపయోగించువారు ఆంధ్రదేశములోనికి వచ్చినట్లు కాన్పించును. **బెం. సు. రా.**



http://sanskritcentral.com/

http://teluguthesis.com/

# పూర్వయుగము

## సాతవాహనులు

సాతవాహనుల చరిత్రను పునర్నిర్మించి రచించుటకు ఉపయోగపడు సాధనసామగ్రి ఎంతయో మనకు లభ్య మగుచున్నది. ఆ కాలపు శాసనములును, పురాణములును అందు అతిముఖ్యములు. పురాణములందును మత్స్య, వాయు, విష్ణు, బ్రహ్మాండ, భాగవత పురాణములు ఎక్కువగ సహాయకారులు. నాణక, పురాతన వాస్తు నిర్మాణ, శాసనాది చరిత్రాధారములవలన కలిగిన జ్ఞానము జైన, బౌద్ధ, యవన గ్రంథములలో ప్రస్తావవశమున కథితములయిన చరిత్రాంశముల వలన వైపుల్యము నందుచున్నది. కాని ఈ సాధన సామగ్రియందు సహజముగ గల లోపములు కొన్ని దీని విలువను కొంతవరకు తగ్గించుచున్నవి.

పురాణముల కాలమువలెనే జైనగ్రంథముల కాలము ఇది యని గట్టిగా చెప్ప వలనుకాదు. మరియు, వానిలోని చరిత్రాంశములును సువ్యక్తములు కావు. కావున, వానిని సమన్వయపరిచి చరిత్రరచన సాగించుట సాధ్యముకాదు. అట్లే నాణెములును చరిత్ర రచనకు కొంత ఉపయుక్తము లయినను వానివలన తెలియగల చరిత్ర అల్పము. శాతవాహన వంశజులలో కొందరి నాణెములు దొరకినవి. వానివలన వానిని ముద్రించిన రాజుల పేర్లును, కాదాచిత్కముగ వారికాలమును, మరికొన్ని అంశములును తెలియవచ్చినను వానివలన వారి సంపూర్ణచరిత్ర లభింపదు.

సాతవాహనుల ఏలుబడి క్రింది రాష్ట్రవైశాల్యమును, వారి ప్రభుత్వము సాగిన కాల దైర్ఘ్యమును దృష్టియందుంచుకొని చూచితిమేని వారి శాసనములు అల్పసంఖ్యాకము లనియు, కాదాచిత్కము లనియు తోచును.

వీరి శాసనములలో అనేకములు దక్కను పడమటి భాగమున కాన వచ్చుచున్నవి. వానియందు శాసన కాలము కాని, వానిని వ్రాయించిన రాజుల కాలము కాని ఉదాహరింపబడి యుండలేదు. వాని మూలమున ఆ రాజుల వంశావళిని నిర్ణయించుటకు సాధ్యము కాదు. అదృష్టవశమున ఆ శాసనములలోని పేరులలో కొన్ని పురాణములలోని ఆంధ్రరాజుల పట్టికలలో కానవచ్చుచున్నవి. శాసనములలోను, పురాణములలోను పేరులు ఒకేవిధముగ కనబడుట చేత శాసనములలో సాతవాహనులని పేర్కొనబడిన వారును, పురాణములలో ఆంధ్రులని పేర్కొనబడిన వారును ఒకరేయని విశ్వసించుట సమంజసమగును. ఇట్లు పురాణములందును, శాసనములందును కానవచ్చు ఆంధ్ర శాతవాహన నృపాలుర నామసామ్యమును ఆధారపరచుకొని అందు చెప్పబడియుండు విషయములను క్రోడీకరించి వారిచరిత్రను రచింప వలసు కావచ్చునను తలంపు కలుగ వచ్చును; కాని ఆంధ్రరాజుల సంఖ్యను గూర్చియు, వారి రాజ్యపాలనను గూర్చియు పురాణముల సాక్ష్యము ఒక్క తీరున నుండక వివిధమైయుండుట వలన అది సుకరము కాదు.

అదియును గాక, కాలక్రమమున ఒకరి వెనుక నొకరుగ మగధ సామ్రాజ్యమును పరిపాలించిన రాజవంశములలో ఆంధ్రరాజవంశముకూడ ఒక్కటియని పురాణములయందు చెప్పబడియున్నది. పాఠకులు సులభముగ పోల్చి చూచుకొనుటకు అనువగునట్లు మత్స్య, వాయు పురాణములలో కానవచ్చు రాజవంశానుక్రమణికలు ఆయావంశ ప్రభువుల సంఖ్యతోడను, వారియొక్క పరిపాలనకాల పరిమాణములతోడను ఈ దిగువ పట్టికలలో చూపబడినవి.

### మత్స్య, వాయు పురాణములలోని రాజవంశానుక్రమణిక

| వరుస సంఖ్య | వంశము | మత్స్య పురాణము | | వాయు పురాణము | |
|---|---|---|---|---|---|
| | | పరిపాలించిన రాజుల సంఖ్య | మొత్తము పరిపాలన కాలము | పరిపాలించిన రాజుల సంఖ్య | మొత్తము పరిపాలన కాలము |
| 1 | మౌర్య | 10 | 137 సంవత్సరములు | 9 | 137 సంవత్సరములు |
| 2 | శుంగ | 10 | 112 ,, | 10 | 112 ,, |
| 3 | కాణ్వ | 4 | — — | 4 | 45 ,, |
| 4 | ఆంధ్ర | 29 | 460 ,, | 30 | 411 ,, |

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



## మత్స్య, వాయు పురాణములలోని ఆంధ్రరాజవంశాను క్రమణిక

| వరుస సంఖ్య. | మత్స్య పురాణము — రాజనామము | పరిపాలన కాలము | వరుస సంఖ్య. | వాయు పురాణము — రాజనామము | పరిపాలన కాలము |
|---|---|---|---|---|---|
| 1 | శిశుక (శాసనములో 'సిముక') | 23 | 1 | సింధుక | 23 |
| 2 | కృష్ణ (శాసనములో 'కన్హ') | 18 | 2 | కృష్ణ (ఇతర పురాణములలోని శ్రీశాతకర్ణి ఇతడు) | 10 |
| 3 | శ్రీమల్లకర్ణి (బ్రహ్మాండ, విష్ణు, భాగవత పురాణములలో శ్రీశాతకర్ణి) | 10 | | | |
| 4 | పూర్ణోత్సంగ | 18 | 3 | శాతకర్ణి | 56 |
| 5 | స్కంధస్తంభి | 18 | 4 | ఆపీలవ | 12 |
| 6 | శాతకర్ణి (శాసనములలోని రెండవ సాతకర్ణి) | 56 | 5 | పటుమావి | 24 |
| 7 | లంబోదర | 18 | 6 | నేమికృష్ణ | 25 |
| 8 | ఆపీలక (నాణెము) | 12 | 7 | హాల | 1 |
| 9 | మేఘస్వాతి | 18 | 8 | మంతలక | 5 |
| 10 | స్వాతి | 18 | 9 | పురికసేన | 21 |
| 11 | స్కందస్వాతి | 7 | 10 | శాతకర్ణి | 1 |
| 12 | మృగేంద్రస్వాతికర్ణ | 3 | 11 | చకోరశాతకర్ణి | ½ |
| 13 | కుంతల స్వాతికర్ణ | [illegible] | 12 | శివస్వాతి | 28 |
| 14 | స్వాతికర్ణ | 1 | 13 | గౌతమీపుత్ర | 21 |
| 15 | పులోమావి | 36 | 14 | యజ్ఞశ్రీ | 29 |
| 16 | గౌరకృష్ణ (లేక) అరిష్టవర్ణ | 25 | 15 | విజయ | 6 |
| 17 | హాల (వాఙ్మయము) | 5 | 16 | దండశ్రీ శాతకర్ణి | 3 |
| 18 | మంతలక | 5 | 17 | పులోమావి | 7 |
| 19 | పురీంద్రసేన | 5 | | | |
| 20 | సుందరశాతకర్ణి | 1 | | | |
| 21 | చకోరశాతకర్ణి | ½ | | | |
| 22 | శివస్వాతి | 28 | | | |
| 23 | గౌతమీపుత్ర (శాసనములు, నాణెములు) | 21 | | | |
| 24 | పులోమా అనగా, రెండవ పులోమావి (శాసనములు, నాణెములు) | 28 | | | |
| 25 | శివశ్రీ (మూడవ పులోమావి) (పర్గిటర్) | 7 | | | |
| 26 | శివస్కంధ | 7 | | | |
| 27 | యజ్ఞశ్రీ శాతకర్ణి (శాసనములు, నాణెములు) | 29 | | | |
| 28 | విజయ | 6 | | | |
| 29 | చండశ్రీ శాతకర్ణి | 10 | | | |
| 30 | పులోమా (నాలుగవ పులోమావి) | 7 | | | |
| | | 448½ | | | 272½ |

శాసనములలోని సాతకర్ణి పదము పురాణములలో శాతకర్ణియని ఉన్నది. సాతకర్ణి, శాతకర్ణియను రెండు రూపములును చరిత్రలో వాడబడినవి.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మత్స్య పురాణములోని పట్టిక సమగ్రమైనది. ఆంధ్ర రాజులు ముప్పదిమంది పాలించిరని వాయుపురాణమున సంగ్రహముగ చెప్పిన దానితో ఇది సరిపోవుచున్నది.

కాణ్వవంశ్యుఁడగు సుశర్మను వధించి, అప్పటి కుండిన శుంగవంశజులను నిర్మూలను కావించిన ఆంధ్రజాతీయుడగు సింధుకుడు (సిముకుడు) మగధ రాజ్యము నాక్రమించెను. అంతటితో ఆంధ్రపరిపాలనము ఆరంభమయ్యెనని పురాణము లన్నియు ఏకగ్రీవముగ పలుకుచున్నవి.

దక్కనునందంతటను, అచట నచట ఉత్తరమున కొన్ని ప్రదేశములందును, సాతవాహనుల నాణెములును, వాస్తు నిర్మాణములును కనబడుచున్నవి. ఈ నాణెములు మూడు విధములు: (1) సీసపువి. వీనిసంఖ్య ఎక్కువ; (2) పోటిన్ అను మిశ్రలోహముతో చేసినవి; (3) వెండి నాణెములు; ఇవి చాల అరుదుగ కనబడుచున్నవి. ఈ నాణెములమీద సుప్రసిద్ధమగు ఉజ్జయినీ చిహ్నమును, సింహ, గ, జాశ్వ, చైత్య, నౌకా ప్రతిమలలో ఒకటియు ముద్రితములై ఉన్నవి. ముద్రణము స్పష్టముగ లేనందున వానిమీది రాజుల పేరులను చదువుట కాని, ఆరాజులను గుర్తించుట కాని సులభసాధ్యము కాకున్నది.

ఆ యుగమునాటి వాస్తునిర్మాణములలో గుహలు, చైత్యములు, తోరణములు ముఖ్యమైనవి. వాని నిర్మాతల పేర్లను గురించిన ప్రస్తావము వానియందు ఎచటను కానరాదు. పురాతనవస్తు, అర్థపరిశిష్టములు మూకసాక్షులు. మిక్కిలి నేర్పుతో వానినుండి సత్యమును గ్రహింప వలసి యున్నది. ఉపలబ్ధమగు సాధనసామగ్రి పుష్కలమైనను, అది నానావిధముగను, సందిగ్ధముగను, అస్పష్టముగను ఉండుటవలన శాతవాహన చరిత్రకు సంబంధించిన ప్రతివిషయమునందును చరిత్ర పరిశోధకులలో భిన్నాభిప్రాయములు కలుగుటకు అవకాశము కలుగుచున్నది.

సాతవాహనులు ఆంధ్రులే యనియు, వారి యాదిమ నివాస స్థానము ఆంధ్రదేశమే యనియు, వారు నాలుగు వందల యేబదియేండ్ల కాలము రాజ్యమేలి రనియును కొందరు చెప్పగా, సాతవాహనులు ఆంధ్రులు కా రనియు, వారు వేర్వేరు జాతులవా రనియు, ఆంధ్రుల యాదిమ నివాసస్థానము మహారాష్ట్ర మనియు మరికొందరు వాదించుచు, వారు మున్నూరేండ్ల కాలము భూ పరిపాలనము చేసియుండురని ఊహించుచున్నారు. 'ఆంధ్రు లెవరు' అను విషయమును గురించియు, వారి యభ్యుదయ పతనములను గూర్చియు నిర్వివాదముగ నిశ్చయించి చెప్పుట దుస్సాధ్యము. కావున ఈ పరిస్థితులలో శాతవాహనచరిత్ర రచించుట యన, పై వాద ప్రతివాదముల ప్రామాణ్యమును పరిశీలించి వాని విలువను నిర్ణయించుట అగుచున్నది.

దక్షిణాపథమును కొంతకాలము పరిపాలించిన రాజు సాతవాహనుడను పేరుగలవాడు ఒకడు ఉండెనని కొన్ని సాహిత్య గ్రంథములవలన తెలియుచున్నది. 'గాథా సప్తశతి' యందు శాలివాహన, సాతవాహన నామములు పర్యాయపదములుగ వాడబడినవి. ఈ గ్రంథముయొక్క ఒకానొక ప్రతియందు 'సాతవాహన' కు బదులు 'సాతకర్ణి' అను పేరు వాడబడినది. కొన్ని నాణెములమీద 'సాత' అను పదము కలదు. ఇది 'సాతవాహన', 'సాతకర్ణి' పదముల సంక్షిప్త రూపమే కావచ్చును. ఈ నామముల యర్థమును గురించి పలువురు పండితులు వివిధముగ వ్యాఖ్యానించి యున్నారు. సాతవాహను డనురాజు ఒక డుండెననియు, అతని వంశజు లందరును ప్రాయశః అతని పేరే తమ వంశనామముగ స్వీకరించియుందు రనియు తలచుట యుక్తము.

నానాఘాటు శాసనమున, 'రాయ సిముక సాతవాహనో' అను రాజనామము కనబడుచున్నది. సాహిత్య గ్రంథములలోను, అనేక గాథలలోను ప్రశస్తి గాంచిన సాతవాహనుడు ఇతడే కావచ్చును. ఇతనిపేర ఇతని సంతతివారు తాము సాతవాహన వంశజులమని గొప్పగ ప్రకటించుకొనెడివారు. ఆంధ్ర జాతీయుడైన 'శిశుకుడు' ('శిముకుడు') కాణ్వ సార్వభౌము వంశమును నిర్మూలించెనని పురాణములు ఉద్ఘోషించుచున్నట్లు వెనుక చెప్పబడినది. నానాఘాటు శాసనమునందు పేర్కొనబడిన 'సిముక' సాతవాహనుడు ఇతడే.

'సిముక' సాతవాహనుడు, సాతవాహన కులజుడైన కృష్ణుడు, ప్రథమ శాతకర్ణి, ద్వితీయ శాతకర్ణి, ఆపీలకుడు, గౌతమీపుత్ర శాతకర్ణి, రెండవ పులోమావి మొదలుగా గల రాజులు శాతవాహన వంశజులుగ వారి నాణెముల వలన తెలియుచున్నది. ఈ పేరులే ఇవరకు మార్పులు లేకుండ ఇంక కొన్ని పేర్లతోపాటు వివిధపురాణములలో ఆంధ్రరాజుల పేరులుగ ఈయబడినవి. ఏకవిధమగు పేరులు కలవారు ఇంతమంది, రెండు వేర్వేరు రాజ వంశములందు, వరుసగ నుండుట అసంభవము. యజ్ఞశ్రీ శాతకర్ణి కాలమున సంగ్రథితమయినదని చెప్పబడు మత్స్యపురాణమందు ఆరాజవంశము పేరే తప్పుగ ఈయబడుట అనూహ్యము.

సాతవాహనులు ఆంధ్రవంశ్యులుగ శాసనములందు ఎచ్చటను చెప్పబడలే దనుమాట నిజమేయైనను, దానిని ఒక యభ్యంతరముగ భావించుట తగదు. శాలంకాయన, బృహత్ఫలాయన, విష్ణుకుండి, పల్లవరాజుల శాసనము

http://sanskritcentral.com/

http://teluguthesis.com/





చిత్రము 1 చైత్యగుహాలయ ముఖభాగము, నాసిక



చిత్రము 2 శాతకర్ణి విహారము (ముందు భాగము), నాసిక

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



లందు నైతము వారి శాసనములలో నిజవంశ నామము లను పేర్కొనిరే కాని తమది ఆంధ్రజాతియని చెప్పి యుండలేదు. కావున, పురాణములందు ఆంధ్రులుగా ఉదాహృతులైనవారే శాసనములందు సాతవాహనులుగ పేర్కొనబడి రనుటలో వైరుధ్యము ఏమియు లేదు. 'ఆంధ్ర' అనునది జాతినామ మనియు, 'సాతవాహన' అనునది వంశ నామ మనియు అంగీకరించుట సహేతుక మును; సక్రమమును.

ఆంధ్రులు, సాతవాహనులు ఒకరేయని నిర్ణయించిన వెనుక వీరి నివాసభూమి నిర్ణయమునకు అంతగ శ్రమ పడవలసిన పనిలేదు. ఆంధ్రు లగుటచేత, ఆంధ్రభూమి నుండియే వీరు తమ రాజ్య మును విస్తరింపజేసికొని యుందురు. ఆ నాటి రాజ కీయ పరిస్థితులలో విదేశీ యుల దండయాత్రలవలన సరిహద్దులకు కలుగు ప్రమా దములను నివారించుటకై పడమటి దక్కనునందు ఎక్కువ కాలము వారు ఉండవలసి వచ్చుటచే వారి శాసనములు ఆ ప్రాంతమున బహుళముగ ఉండుటకు అవకాశము ఏర్పడియుం డును. ఇక శాసనభాష ప్రాకృతము కావున 'వీరు ఆంధ్రులు కారు' అను వాదము నిలువనేరదు. మౌర్య సామ్రాజ్య పతనా నంతరము, కొన్ని వందల సంవత్సరముల వరకు దక్షిణాపథ పరిపాలకులు తమ శాసనములందు ప్రాకృతమునే వాడుచువచ్చిరి.



చిత్రము 19. తండ్రి కొమారులు, అమరావతి

ఆంధ్రజాతి ప్రాచీనమైనది. వీరి ప్రశంస వైదిక, పౌరాణిక, బౌద్ధ, యవన వాఙ్మయములందుగూడ అచ్చ టచ్చట కన్పట్టుచున్నది. పౌండ్ర, పుళింద, శబర, మూతిబ జాతుల 'శ్రేణిల' వీరు ఒకరుగ ఐతరేయ బ్రాహ్మణమున వ్రాయబడి యున్నది. వింధ్యమునకు ఆగ్నేయభాగమున నివసించు ఈ జాతులు ఆర్యజాతినుండి వేరుపడిన తరువాత, ఆంధ్రులు ఆ ప్రాంతముననే తమజాతియొక్క తొలిస్థావ రమును ఏర్పచుకొని యుందురు. మహానదికి ఉపనదియగు తెలివాహకు దక్షిణమున ఆంధ్రభూమి కలదని ప్రప్రథమ బౌద్ధగ్రంథములలో చెప్పబడియున్నది. తరువాత 'సుత్తని పాత' మను బౌద్ధగ్రంథమునుబట్టి 'అంధకరట్ఠ'ము గోదా వరియొడ్డున కలదని తెలియుచున్నది. ఆంధ్రులు దక్షిణా పథవాసులని పురాణములందును కలదుకదా. ఆంధ్రులలో బహుశాఖలు ('ఆంధ్రాశ్చ బహవః') కలవని మహాభారత మున కలదు. ఈ శాఖలలో శాతవాహనశాఖ ఒకటి కావచ్చును.

మౌర్య చంద్రగుప్తుని ఆస్థానమున కొంతకాల ముండిన మెగస్తనీస్, ఆగ్నేయ - దక్కనునందు గల ఆంధ్రుల రాజ్యము బల వత్తరమైనదని ప్రశంసించి యున్నాడు. ఆంధ్రులకు లక్ష కాల్బలమును, ఇరువది వేల అశ్వికదళమును, వేయి గజములును కలవనియును, వారి యేలుబడి క్రింద ముప్పది దుర్గములును, అనేక గ్రామములును ఉండె వనియును ఆ యవన రాయ బారి వ్రాసియున్నాడు. మౌర్యసామ్రాజ్యస్థాపన కాలముననే దక్షిణమున కళింగ, ఆంధ్ర, రఠిక, భోజ రాజ్యములు ఏర్పడియుం డెను. కడపటి రెండును పడ మటి దక్కనులో ఉన్నవి కావున మొదటి రెండును గోదావరి సరిహద్దుగ తూర్పు దక్కనును ఆవరించి యుండును. ఈ 'జాతి - రాజ్య ములు' తమ సహజ వ్యవస్థా దౌర్బల్యముచే, మౌర్య సామ్రాజ్యపు ధాటికు ఎక్కువ కాలము నిలువలేక పోయి నవి. చంద్రగుప్తుడు మహారాష్ట్రమును జయించినట్లు కాన వచ్చుచున్నది. బిందుసారుడు ఆంధ్రమును సాధించె ననుటకు అవకాశము కలదు. అశోకుడు కళింగముపై దండువెడలి అచటి ప్రజలతో పోరాడి వారిదేశమును తన సామ్రాజ్య మున కలుపుకొనెను. టిబెట్ చరిత్రకారుడు తారా నాథుడు 'బిందుసారుడు పదునారు రాజధానుల రాజులను,



http://sanskritcentral.com/

http://teluguthesis.com/




చిత్రము 20. శాతవాహన శిల్పమునకు, తత్పూర్వాపర శిల్పములకు గల తారతమ్యము: 1, 3 వరుసలలోని 3 వ, 4, 5, 6 వరుసలలోని 2 వ చిత్రములును, 3 వ వరుసలోని 1 వ చిత్రమును అమరావతిలోనివి; మిగిలిన చిత్రములు మథుర, సాంచి, కార్లె, అజంటా, మహాబలిపురము, పాలొవారువల లోనివి.

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మంత్రులను హతమార్చి తన సామ్రాజ్యమును సముద్రము నుండి సముద్రము వరకును విస్తరింప జేసెను' అని వ్రాసి యున్నాడు. ఈ పదుమూరు రాజధానులును ఆంధ్రుల సాలపరివృత దుర్గములు ముప్పదింటిలోనివే కావచ్చును. అశోకుని 18వ శిలాశాసనమున ఆంధ్రులు రఠిక, భోజుల తోగూడ అతని రాజ్యములోని ప్రజలుగ పేర్కొనబడి యున్నారు.

మౌర్య సామ్రాజ్య పతనానంతరము దక్షిణాపథమున అరాజకమేర్పడి పారతంత్ర్యమునం దున్న వివిధ జాతుల వారు స్వతంత్రులైరి. వారిలో 'చేది' వంశజుల నాయకత్వముక్రింద కాళింగులును, శాతవాహన నాయకత్వము క్రింద ఆంధ్రులును ప్రముఖులుగ ఉండిరి.

కాణ్వవంశమును నిర్మూలించి, ఆంధ్రుడగు 'శిము'కుడు రాజ్యమును స్థాపించెనను పౌరాణికోదంతమును దృష్టి యందు ఉంచుకొని చూచినచో ఈ కాలనిర్ణయము కడు విపరీతముగ కన్పట్టకపోదు. కాని ఆ పురాణములే ఆంధ్ర రాజ్యము నాలుగు వందల యేబది సంవత్సరములకాలము నిలిచియుండెనని చెప్పుచున్నవి. పురాణములు చెప్పునట్లే ఈ రెండు విషయములును యథార్థములు అగుసెడల - యథార్థములు కాజాలవు; అగునని అంగీకరించినచో - శాసనసాక్ష్యమువలన తరువాతి కాలమున ఆంధ్రదేశమున పాలించుచుండినట్లు తెలియవచ్చు అన్యవంశ నరపాలురును ఈ శాతవాహనప్రభువులకు సమకాలికులని ఎంచ వలసివచ్చును. ఈ యస్తవ్యస్తస్థితినుండి తప్పించుకొనుటకై చరిత్రకారులు పురాణోక్తములైన ఈ యుదంతములు రెంటిలో ఒకదానిని త్రోసివేసి, మరియొక దానిని గ్రహించి, 'శిము'కుని ఆంధ్రరాజ్య స్థాపనకాలమును ఒక్కొక్కరు ఒక్కొక్కరీతిగ నిర్ధారించిరి. ఆంధ్ర స్వతంత్ర రాజ్యస్థాపనము, సామ్రాజ్యపద ప్రాప్తి అను నీ రెండు సంఘటనలను ఒక్కటిగ భావించి తబ్బిబ్బుపడి పురాణ రచయితలు 'శిము'కునే రెంటికిని కారకునిగ చేసి పొరబడి రనుట సుస్పష్టము.

ఈ సందర్భమున పరికింపదగిన చరిత్రాంశము ఖారవేల, సాతకర్ణుల సమకాలీనత. హాథీ గుంఫ శాసనమున ఖారవేలుడు తన రెండవ రాజ్యవర్షమున తన సేనను రెండవ సాతకర్ణిమీదికి పంపినట్లును, ఎనిమిదవ యేట యవన రాజగు డిమితుని (డెమిట్రియస్) ఓడించినట్లును చెప్పబడి యున్నది. డెమిట్రియస్ క్రీ. పూ. 175 సంవత్సరమున హిందూస్థానము నుండి మరలిపోయెను. అందువలన సాతకర్ణి క్రీ. పూ. 181 సంవత్సరమున ఆంధ్రరాజుగ ఉన్నట్లు స్పష్టమగుచున్నది. నానాఘాటు శాసనమున 'నాగనికపతి యగు సాతకర్ణి'యని పేర్కొనబడిన రాజు ఇతడే.

మత్స్యపురాణమునందు ఉదాహరింపబడిన ఆంధ్ర రాజుల పరిపాలన కాలములను అనుసరించి క్రీ. పూ. 181 నుండి వెనుకకు లెక్కించి చూచినచో ఇతనికి అయిదు తరముల పూర్వుడగు 'శిము'కుడు క్రీ.పూ. 288 సంవత్సర ప్రాంతమున, అనగా మౌర్యవంశజుడయిన అశోకుని పట్టాభిషేక కాలమున, ఉండినట్లు తేలుచున్నది. ఖారవేలుడు దండెత్తివచ్చుటకు రెండు మూడేండ్లు పూర్వమే సాతకర్ణి పట్టాభిషిక్తుడు అయి యుండుసేని 'శిము'కుని రాజ్యస్థాపనకాలము క్రీ. పూ. 270 కాని, క్రీ. పూ. 271 కాని యై యుండును. భూగోళశాస్త్రవేత్తయగు టాలెమీ చప్టన, ద్వితీయ పులోమావులు సమకాలికులని వ్రాసిన విషయముకూడ పైనిర్ణయమును దృఢపరచుచున్నది. కాణ్వరాజ్యము క్రీ. పూ. 28లో అంతరించిపోయెను. అప్పుడు సుశర్మను వధించిన ఆంధ్రరాజు అనాడు, అనగా 'శిము'కుని తర్వాత 240 సంవత్సరములకు పరిపాలించుచుండిన ఆంధ్రరాజుగుట నిశ్చయము. మత్స్యపురాణోక్త రాజ కాల పరిమాణమును అనుసరించి 'శిము'కుని నుండి ముందుకు లెక్కవేసినచో అప్పటి ఆంధ్రరాజు మొదటి పులోమావి అగుచున్నాడు. వాయుపురాణమున ఇతడే 'పటుమావి' అని పేర్కొన బడినాడు.

ఆంధ్ర రాజులలో ప్రథముడుగ పురాణములలో పేర్కొనబడి, నానాఘాటు శాసనమున అట్లే ఉదాహరింపబడిన 'శిము'కుడు సర్వస్వతంత్రుడగు పట్టపు రాజయి ఉండజాలడు. ఆంధ్రులలో ప్రముఖుడై మౌర్యుల యాధిపత్యమును అంగీకరించి అతడు తన రాజకీయ జీవితమును ఆరంభించి యుండును. ఈ వంశజులు 'ఆంధ్రభృత్యులు' అని పేర్కొనబడుటకు గల విశేష మిదియే అయి యుండును. అశోకుడు తన పదుమూడవ శిలాశాసనమున ఆంధ్రులను నిజసామంత జాతులలో ఒకరుగ పేర్కొని యున్నాడు. 'శిము'కుడు ఈ సామంతులకు పెద్దయై ఉండవచ్చును. తరువాత వచ్చిన అతని వంశజులు స్వతంత్రులైనవెనుక, 'శిముక' నామమునకు 'రాయ' లేక 'రాజు' అను బిరుదమును చేర్చియుండురు. సురాష్ట్రమున తుషాస్పునివలె ఆంధ్రమునందు 'శిము'కుడును అశోకుని ఏలుబడియందు అభ్యుదయ మంది ప్రాముఖ్యము వహించి యుండును.

మత్స్య, వాయు పురాణముల ప్రకారము ఆంధ్రశాతవాహనరాజులు 29 లేక 30 మంది నాలుగువందల ఏబది వత్సరములు దక్కనును పరిపాలించినట్లు తెలియుచున్నది.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అనుకూలమగు సమయము లభించినపుడు మహారాష్ట్ర, మధ్యప్రదేశ, కళింగ దేశములలోనికి వ్యాపించుటకు వారు వెనుదీయలేదు. ఆయాకాలముల రాజకీయావసరములను అనుసరించి వారు తమ రాజధానిని ధాన్యకటక, ప్రతిష్ఠాన, పాటలీపుత్రములకు మార్చుకొనుచు వచ్చిరి. విదేశీయులగు శకులు, క్షాత్రియనులు, యవనులు మొదలైన వారి దండయాత్రల యాగమనమే ఆంధ్రరాజ్యము పెరుగుటకు, విరుగుటకు కారణభూతమైనది.

పైని చెప్పిన ముప్పదిమంది ఆంధ్రవంశపు రాజులలో పయారుగురిని గురించిమాత్రమే కొలదిగనో, గొప్పగనో చారిత్రకవిషయములు తెలియుచున్నవి. మత్స్యపురాణములో పేర్కొనబడుట తప్ప, తక్కినవారిని గురించి మనకు ఇంక ఏమియు తెలియదు.

నానాఘాటు గుహాయందు, శ్రీసాతకర్ణి పట్టమహిషి యగు నాగనికాదేవి చెక్కించిన శాసన మొకటి దీర్ఘమైనది కలదు. అచ్చట ఉబ్బెత్తుగ చెక్కిన శిలాప్రతిమలు ఆరును, వానిక్రింద ఆరు పేరులును కన్పించుచున్నవి. అవి ఆ దీర్ఘ శాసనమునందు పేర్కొనబడిన రాజుల ప్రతిబింబములే అని పరిశోధకుల ఊహ. ప్రతిమలలో ఒకదానిక్రింద చెక్కియుండిన పేరునుబట్టి అది 'శిము'కుని రూపమని తెలియుచున్నది. ఈ శాసనమును, చిత్రములను పరిశీలించి చూచిన పండితులు ఎల్లరు 'శిము'కుడు సాతకర్ణికి జనకు డనియు, ఆ సాతకర్ణి మొదటి సాతకర్ణి యనియు నిర్ణయించిరి. కాని ఈ పితాపుత్ర సంబంధమును సూచించు ఆధారమ ఏదియు ఈ శాసనమున కాని, ప్రతిమలందు కాని కాన రాదు. ఈ చిత్రములు సాతకర్ణి కుటుంబమునకు సంబంధించిన వనియు, వంశమునకు మూలపురుషుడు అగుటచే 'శిము'కునికి అందు స్థానము ఒసగ బడియుండు ననియు ఊహించుటకు వీలు కలదు. ఈ శాసనములోని సాతకర్ణి యంకమాలిక అవిచ్ఛిన్నముగ ఏబదియారేండ్లు రాజ్యాధిపత్యము వహించిన ద్వితీయ శాతకర్ణికి చెల్లునేకాని, పదేండ్లు మాత్రమే రాజ్యమేలిన మొదటి సాతకర్ణికి వర్తింపదు. మత్స్యపురాణమును అనుసరించి శిశుకుని (శిముకుని) వెనుక ఆరవ తరమువాడు ద్వితీయశాతకర్ణి.

'శిము'కుడు ఇరువది మూడేండ్లు రాజ్య మేలెను. ఈతని తరువాత ఇతని సోదరుడు, నాసిక శాసనములో పేర్కొనబడిన 'కణ్హుడు' (పురాణములలోని కృష్ణుడు) క్రీ. పూ. 240 ప్రాంతమున రాజ్యమునకు వచ్చెను. ఈ నాసికశాసనము ఒకానొక మహామాత్రునిచే నిర్మింపబడిన గుహాలయమును గురించి తెల్పును. ఈ గుహాలయము అశోకుని పద్ధతివలన ప్రేరితులై సాతవాహనులు నిర్మించిన నిర్మాణము. అశోకుని మరణానంతరము మౌర్యుల యాధిపత్యమును తొలగద్రోయుటకు 'కణ్హు'నకు అవకాశము లభించెను. అశోకుని తరువాత ఆరేండ్లకు, అనగా క్రీ. పూ. 230 లో, ఇతడు స్వర్గస్థు డయ్యెను.

అనంతరము ఇతని కుమారుడు మొదటి సాతకర్ణి (మత్స్య పురాణములోని మల్లకర్ణి) పదేండ్లు రాజ్యమును పాలించెను. అతనికి పిదప క్రమముగ పూర్ణోత్సంగుడు, స్కంధస్తంభి అనువారు ఒక్కొక్కరు పదునెనిమిదేండ్లు పరిపాలించిరి.

ఈ యయిదుగురు రాజుల ప్రతిభా శౌర్యములచే, తొలుత సామంత రాజ్యమగు శాతవాహన రాజ్యము క్రమముగ స్వతంత్రమై విస్తరించి మహారాష్ట్ర భూమిని సైతము ఆక్రమించెను.

అటుతరువాత రాజ్యమేలినవాడు రెండవ సాతకర్ణి. తొలుతటి సాతవాహనులలో ఇతడు పేరుగన్నవాడు. క్రీ. పూ. 184 ప్రాంతమున ఇతడు సింహాసన మధిరోహించెను. వీరాధి వీరులగు పుష్యమిత్ర, శుంగ, ఖారవేల, డెమిట్రియసులు భారత సామ్రాజ్యాధిపత్యమునకై ఒకరితో ఒకరు పెనగులాడుచున్న కాల మది. ఇట్టి పరిస్థితులలో తన స్థానమును బలపరచుకొనుటకై ద్వితీయశాతకర్ణి మహారాష్ట్ర నాయకుడగు 'త్రణకయిరో' కొమార్తె అగు నాగనికను పెండ్లియాడెను. తొలి దినములలో పుష్యమిత్ర, ఖారవేలులు ఈతనిని ఓడించిరి. పుష్యమిత్రుడు విదర్భదేశమును ఆక్రమించెను. ఖారవేలుడు మూషిక (ముసిక) నగరముపై దండెత్తెను; 'పిథుండ' నగరమును ధ్వంసము చేసెను. ఈ పిథుండ నగరము ఇపుడు ఏది అగునో సరిగా తెలియలేదు.

కాని క్రీ. పూ. 175 వ. సంవత్సరమున డెమిట్రియస్ భారతదేశమునుండి మరలిపోయెను. ఆ సమయముననే తక్కిన ప్రతిపక్షు లిద్దరును మరణించిరి. ఈ యవకాశమును ఉపయోగించుకొని సాతకర్ణి ప్రాక్పశ్చిమ మాళవములను ఆక్రమించుటయే కాక కళింగమును సైతము జయించెను. కళింగ విజయమును గురించి శ్రీ ఆర్. డి. బెనర్జీ ఈవిధముగ వ్రాసియున్నాడు: 'క్రీ. పూ. మొదటి శతాబ్దములో మగధదేశమును ఆక్రమించుటకు పూర్వమే సాతవాహనులు ఈ కళింగదేశమును జయించి యుందురు. ఈ దిగ్విజయ చిహ్నముగ ఈ ద్వితీయ శాతకర్ణి ఒక రాజసూయమును రెండశ్వమేధయాగములను చేసెను. నానాఘాటు శాసనమున ఈతని భార్య నాగనిక ఇతని శౌర్య త్యాగములను అనేకరీతుల ప్రశంసించి, ఇతనిని 'దక్షిణా పథపతి' యని పేర్కొన్నది. ఏబది యారేండ్లు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చిత్రము 22. శాతవాహనులనాటి ఆయుధములు మొదలైన యుద్ధ పరికరములు, బండ్లు మొదలైనవి: అమరావతీ శిల్పము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



రాజ్యమేలి క్రీ. పూ. 128 ప్ర ... న ఈతడు పరలోకగతుడయ్యెను.

రెండవ సాతకర్ణి తరువాత క్రమముగ పరిపాలించిన యెనిమిదిమంది రాజులలో ఎవరును చెప్పదగిన ఘనకార్యమును దేనిని నిర్వహించినట్లు కనబడదు. పేరుప్రఖ్యాతులు లేనివారగుటచేతనే కాబోలు, వీరిలో ఒక అపీలవుని (ఆపీలక) పేరు తప్ప తక్కినవారి పేర్లను సైతము వాయుపురాణము ఎత్తలేదు. ఈయాపీలకుని నాణెమొకటి మధ్యప్రదేశ్‌లోని చత్తీస్‌గడ్ జిల్లాలో దొరకుటచేత ఆంధ్రరాజ్యము అచ్చటికి గూడ విస్తరించెనని రుజువగుచున్నది.

ఆంధ్ర సాతవాహనుల కీర్తి ప్రతిష్ఠలకు పునరౌన్నత్యమును తెచ్చినవాడు మొదటి పులోమావి. ఈతనికాలమున ఆంధ్రులు సామ్రాజ్యాధిపతులైరి. ఈతని సింహాసనాధిరోహణముతో ఆంధ్రరాజ్య చరిత్రలో నూతన యుగము ప్రారంభమయినది. ఈ విషయమును గుర్తించియే కాబోలు ఇతని పూర్వులలో అనేకులను సంస్మరింపక వదలిన వాయుపురాణము ఇతనిని మొదలు చేసికొని, మరల ఇంతటివాడే అగు గౌతమీపుత్ర శాతకర్ణి వరకు రాజ్యమేలిన ఆంధ్రరాజుల పట్టికను సమగ్రముగ నొసగినది. ఆంధ్ర రాజుల పేర్లలో 'శాతకర్ణి' తరువాత అధికముగ మన దృష్టిని ఆకర్షించునది ఈ పులోమావి పేరే అను విషయముకూడ ఈ సందర్భమున చెప్పవచ్చును. మత్స్య పురాణ మిచ్చిన ఆంధ్రరాజుల పట్టికలో పులోమావి అను పేరు వహించినవారు నలుగురు కలరు. ఆ పురాణముయొక్క ఒకానొక ప్రతియందు 'ఆంధ్రులు పులోములు', అనగా పులోమావి వంశీయులని వ్రాయబడి యుండుట ఈ ప్రథమ పులోమావి యొక్క ఉన్నతస్థానమును స్పష్టముగ సూచించుచున్నది.

మొదటి పులోమావి క్రీ. పూ. 43 వ సంవత్సరమున రాజ్యాభిషిక్తుడు అగునాటికి భారత దేశమున వివిధరాజ్యముల వ్యవస్థ రెండవ సాతకర్ణి కాలమున నున్నట్లే యుండెను. కాని ఒక భేదము మాత్రము కన్పించును. రెండవ సాతకర్ణి కాలమున ఉత్తర వాయవ్యదేశములు బాక్ట్రియనుల అధీనమున నుండెను. మొదటి పులోమావి కాలమున అవి శక, పహ్లవుల అధికారముక్రింద ఉండెను. ఆచార్య టారన్ చెప్పినట్లు 'పూర్వము ఒకప్పుడు గ్రీకులు పరిపాలించిన యూఫ్రెటిస్, యమునానదీ మధ్యస్థములగు ఆసియా దేశము లన్నియు ఉత్తర శ్యామికా భూముల (స్టెప్పీస్) నుండి వచ్చిన జనుల యేలుబడిలో నుండెను.' ఈ విదేశీయులను దండయాత్రలలో ఎదుర్కొని వారిని పారదోలు శక్తి కాణ్వ సామ్రాజ్యాధిపతులకు లేకపోయినది. తరువాతి కాలపు తుర్కీ రాజవంశము కడపటి దినములలో పాలించిన సయ్యదులవలె కాణ్వరాజులు దుర్బలులు, నిస్తేజులునై యుండిరి. ఇట్టి బలహీనుల పరిపాలనలో మగధసామ్రాజ్య వినాశము తప్పదని తెల్లమయినది. కాని వీరి స్థానము నాక్రమించువా రెవరు అనునదియే ఆనాటి ప్రశ్న. విదేశీయులు మాత్ర మాస్థానమును ఆక్రమించుకొనకుండ చూచుటకు పులోమావి నిశ్చయించుకొనెను. ఈ కర్తవ్య నిర్వహణమునకై అతడు సుశర్మను వధింపగా మిగులముగ్గిన పండువలె మగధ సామ్రాజ్యము ఆతని యొడిలో బడెను. ఈ విధముగ ఆంధ్రసాతవాహన రాజ్యము నంద, మౌర్య, శుంగ, కాణ్వ వంశములు గతించిన తరువాత అఖిల భారత సామ్రాజ్యముగ పరిణామమందెను. ఉత్తర హిందూస్థానమున పులోమావికి లభించిన ఈ విజయమును గురించి కుమ్రాహార్ (ప్రాచీన పాటలీపుత్రము), భీటా (అలహాబాదు సమీపస్థము)ల త్రవ్వకములలో లభించిన సాతవాహనుల నాణెములు సాక్ష్య మొసగుచున్నవి.

సాతవాహనుల ఈ యౌన్నత్యమునకు ఓర్వక శక, పహ్లవులు వీరి సామ్రాజ్యమును నిర్మూలించుటకై కృషి చేసిరి. ఆక్రమించుకొన్న రాజ్యమందు సరియగు వ్యవస్థ ఏర్పరచుటకు పూర్వమే, క్రీ. పూ. 19 లో పులోమావి కీర్తిశేషుడయ్యెను. తరువాత అయిదు సంవత్సరములకు నహపానుడు నేటి దక్షిణ రాజస్థాన, మాళవ, దక్షిణ గుజరాత, ఉత్తర కొంకణ, నాసిక, పూనాతో గూడిన జిల్లాల విశాలరాజ్యము ఏలినట్లు తెలియవచ్చుచున్నది. 41 వ సంవత్సరమున,* అనగా క్రీ. పూ. 17 లో ఇతడు ఊరక క్షత్రపు డనియు, 46 వ సంవత్సరమున మహాక్షత్రపు డనియు వ్యవహరింప బడెను.

పులోమావి అనంతరము రాజ్యమేలిన గౌరకృష్ణుడు ఆంధ్రరాజ్యమునకు పట్టిన ఈ దుర్గతిని వారింపజాలక, నిస్సహాయుడై చూచుచు ఊరకుండెను. సాతవాహనులకు చెందిన 'కల్యాణి', 'సోపార' అను ఓడరేవులకు వారి వర్తకసామగ్రులను రానీయక నహపాన వంశ్యులు అడ్డగించిరి. అందువలన వ్యాపార మంతయు పశ్చిమ క్షత్రపుల రేవు అగు భరుకచ్ఛమునకు (ఇప్పటి బ్రోచ్) మరలెను.

---

* నహపానుని శాసనములందు 41 నుండి 46 వరకు సంవత్సర సంఖ్య లీయబడినవి. జె. కన్నింగ్‌హామ్, ప్రొఫెసర్ నీలకంఠశాస్త్రి, శ్రీ బకతీల అభిప్రాయమున ఇవి విక్రమ శక సంవత్సరములు; అటులైన 46 అనునది క్రీ. పూ. 12కు సమానము. ఇతర పండితులు కొందరు ఇవి శాలివాహన శకవర్షము లందురు. కాని ఇది చాల దుర్బల వాదము. శ్రీ ఆర్. డి. బెనర్జీ వీనిని నహపానుని పరిపాలన కాలపు సంవత్సరము లనెను; కాని, ఇదియు నిరాధారమే.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/






http://sanskritcentral.com/

http://teluguthesis.com/



గౌరకృష్ణుని తరువాత వచ్చిన ఆంధ్రరాజులు మహారాష్ట్రమునుండి తరుమగొట్ట బడిరి. అంతటితో వారు తమ మాతృదేశమగు ఆంధ్రభూమిని చేరుకొనిరి.

ఈ అంధకార యుగమున మనకు కన్పట్టు ఏకైక తేజః కిరణము హాలుని యాశ్రయమున వర్ధిల్లిన సారస్వత సంపద. ఆంధ్రరాజులలో పదునేడవవాడు ఈ హాలుడు. ఉత్తమములైన వివిధ శృంగార గాథలను సేకరించి వానిని 'సత్తసై' - గాథా సప్తశతి - అను పేర ఇతడు సంపుటీకరించెను.

క్రీ. శ. 62 ప్రాంతమున 23 వ రాజగు గౌతమీపుత్ర శాతకర్ణి రాజ్యాభిషిక్తుడు అగుటతో ఆంధ్రులకు మరల భాగ్యదేవతాప్రసన్నత కలిగెను. ఈతని భాగ్యవశమున కుషాణు లనుమధ్య ఆసియా మూక ఒకటి వాయవ్యదిశ నుండి వచ్చి శక పహ్లావులను వేధింపసాగెను. ఈ యదను చూచుకొని ఇతడు పశ్చిమ క్షత్రపులను ఓడించి వెనుకటి తమ రాజ్యమును మరల సాధించి విజయచిహ్నముగ వెనుకటి నహపానుని నాణెములపై తిరుగ తన ముద్రను వేయించెను. ఈతని తల్లి, గౌతమీ బాలశ్రీ వేయించిన నాసికశాసనమున గౌతమీపుత్ర శాతకర్ణి శాతవాహన కీర్తి, వైభవ పునరుద్ధారకు డనియు, క్షత్రియగర్వాపహారియగు అసమాన బ్రాహ్మణు డనియు కీర్తింపబడియున్నాడు. ఈ శాసనము మూలముననే ఇతని సామ్రాజ్యము అసిక, అశ్మక, ముళక, సౌరాష్ట్ర, కుకుర, అపరాంత, అనూప, విదర్భ, ఆకర, అవంతి దేశములను ఆవరించె ననియు, అందు వింధ్య, 'అఛవత', పారియాత్ర, సహ్యా, 'కణ్హగిరి', 'సిరిటన' (శ్రీస్థాన), మలయ, మహేంద్ర, 'సేత' చకోర పర్వతములు కల వనియు, ఆ రాజ్యము పూర్వాపర సముద్రముల పర్యంతము విస్తరించె ననియు తెలియవచ్చుచున్నది. దీనివలన ఈతడు దక్కను నంతటినే కాక, మాళవ సౌరాష్ట్రములను, రాజస్థానమున కొంత భాగమును పాలించెనని స్పష్టమగుచున్నది. ఈతడు 24 సంవత్సరములు పరిపాలించి* క్రీ. శ. 86 లో గతించెను. అంతట ఇతని కుమారుడగు రెండవ పులోమావి 'దక్షిణాపథేశ్వర' బిరుదము వహించి సింహాసన మెక్కెను.

పితృార్జితమగు విశాలరాజ్యమును పాలించుచు రెండవ పులోమావి ఇరువది సంవత్సరములు నిర్బాధముగ రాజ్యమును ఏలెను. కాని, చరమ వర్షములలో మరల విదేశీయుల దండయాత్రా ప్రమాదము ఎక్కువయినది. క్రీ. శ. 89 నాటికి కనిష్కభూపతి సింధునది దిగువ దేశమును జయించెనని సుయివిహార శాసనమువలన తెలియుచున్నది. కనిష్కవంశజుల శాసనములవలన పేషావరు, మధుర, ఉజ్జయిని నగరములు వారికి స్వాధీనమయినట్లు కనబడుచున్నది. ఉజ్జయినీ ప్రాంతమాళవము క్షత్రపుడైన చష్టనుని వశమునందు ఉండుటచేత ఆంధ్రరాజ్య ప్రతిపత్తికి ప్రమాదము ఎక్కువయినది. భూగోళ ఐగుప్తశాస్త్రజ్ఞుడు టాలెమీ వృత్తాంతము ప్రకారము ఉజ్జయినిని చష్టను డేలుకాలమున పైఠానులో (ప్రతిష్ఠానమున) పులోమావి ప్రభుత్వము చేయుచుండినట్లు తెలియుచున్నది. కావున ఆంధ్రరాజులు ఆ నాటికి మాళవమును పోగొట్టుకొనిరని ఇందువలన స్పష్టమగుచున్నది. రెండవ పులోమావి తరువాతివారగు శివశ్రీ, శివస్కందుల కాలమున ఈ విస్తృత రాజ్యము ఇంకను ముక్కలు కాజొచ్చెను. గుజరాతు, మాళవ దేశములందు చష్టనుని నాణెములు కనబడుచున్నవి. శకవర్షములు 52 (క్రీ. శ. 130) నాటి 'అంధౌ' శాసనమున చష్టనుడు, అతని పౌత్రుడగు రుద్రదాముడు అను వారి పేరులు ఉండుటచేత ఈ రాజ్యమునందు ఆంధ్రుల పరిపాలన అప్పటికి అంతరించెనని దృఢపడుచున్నది.

గౌతమీపుత్ర యజ్ఞశ్రీ శాతకర్ణి క్రీ. శ. 128 లో శాతవాహన సింహాసనము నధిష్ఠించునప్పటికి పరిస్థితి ఇంకను విషమించినది. శివశ్రీ సోదరుడగు వాసిష్ఠీపుత్ర శాతకర్ణి స్వామ్యమును కాదని యజ్ఞశ్రీ సింహాసనము ఆక్రమించినట్లు కన్పట్టుచున్నది. ఈ కుటుంబ కలహమును అవకాశము చేసికొని శాతవాహన రాజ్యమును ఇంకను కూలద్రోయుటకు క్షత్రప రుద్రదాముడు ప్రయత్నించెను. తన పుత్రికను వాసిష్ఠీపుత్ర శాతకర్ణికి ఇచ్చి పెండ్లి చేసి, అతనిని లోబరచుకొనెను. కన్హేరిశాసనమున ఈ వివాహమును గురించిన ప్రస్తావము కలదు. సాహసించి యజ్ఞశ్రీ రుద్రదామునితో పోరాడెను. కాని కడకు ఓడిపోయెను. దక్షిణాపథ పాలకుడగు సాతకర్ణిని తాను రెండు పర్యాయములు ధర్మయుద్ధములందు ఓడించి, సమీపబంధు వగుటచే అతనికి ఏ కీడును చేయక వదలితినని రుద్రదాముడు చెప్పుకొన్నాడు.



చిత్రము 28. గౌతమీపుత్ర యజ్ఞశ్రీ

* ఇతడు పరిపాలించినది పురాణముల ప్రకారము 21 సంవత్సరములు మాత్రమే; కాని శాసనముల వలన 24 అని తేలుచున్నది.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పడమటి దక్కనునందు సాతవాహనుల పరిపాలనము అంతతో అంతరించెను. మిగిలిన దక్కన పూర్వభాగమును (ఆంధ్ర దేశమును) యజ్ఞశ్రీ క్రీ. శ. 167 వరకు పరిపాలించెను. ఇతని 27 వ పరిపాలనవత్సరము ఉదాహరింపబడిన ఈతని శాసన మొకటి గుంటూరుజిల్లా చినగంజామునందు కనబడినది. నౌకా ముద్రగల ఈతని నాణెములు ఇతని కాలమున జరిగిన విదేశ నౌకావ్యాపారాభివృద్ధిని తెలియజేయు చున్నవి. ఇరువది తొమ్మిది సంవత్సరములు పరిపాలించిన తరువాత క్రీ. శ. 167 లో ఇతడు గతించెను. ఈతనితోనే శాతవాహన మహాయుగము అంతరించినది.

గౌతమీపుత్ర యజ్ఞశ్రీ తరువాత మొత్తముమీద పదునేడు సంవత్సరములు క్రమముగ పరిపాలించిన విజయుడు, చండశ్రీ, నాల్గవ పులోమావి అనువారలను గురించి చెప్పదగిన యంశములు ఏవియు లేవు. ఉజ్జయినీ క్షత్రపుల విజయ పరంపరయు, శాతవాహన సామంతులగు చుటు, చుటు సామంత, ఆభీర, ఇక్ష్వాకు వంశములవారి తిరుగబాటును శాతవాహన సామ్రాజ్య సర్వనాశమునకు కారణభూతము లయినవి. క్రీ. శ. రెండవ శతాబ్దము చివరి పాదమునాటికి ఆంధ్ర సామ్రాజ్యము, శిథిలమై నామమాత్రావశేషమైనది.

దక్షిణాపథమున ఆంధ్రశాతవాహన రాజ్యాధిపత్యము ఫలరహితమని చెప్పుట తగదు. ఈ వంశము విదేశీయుల దండయాత్రలకు మారొడ్డి దక్కను ప్రజలను, వారి సంస్కృతిని రక్షించు భారమును వహించినది. వింధ్య దక్షిణ భూమిని క్షాత్రియసు, శక, పహ్లవ దండయాత్రల ప్రవాహములో మునుగనీయక ఈ ఆంధ్ర సామ్రాజ్యము అడ్డుకట్టవలె కొంతకాలము ఆపగలిగినది. ఉత్తర భారతమున రాజ్యములు పదింబదిగ చేతులు మారుచుండగ, దక్షిణాపథమున ఆంధ్రరాజ్యము దక్కను ఉత్తరపు సరిహద్దున మేరువువలె నిలిచి, మూడువందల సంవత్సరముల కాలము దేశము విదేశీయుల పాలబడకుండ కాపాడినది. దేశశాంతిని కాపాడుటచే వృత్తులకు, కళలకు ప్రోత్సాహము లభించెను. భూ, సముద్ర వ్యాపారములకు దక్కను ఆనాడెట్టి ప్రసిద్ధి గాంచినదో 'పెరిప్లస్ ఆఫ్ ది ఎరిత్రియన్ సి' అను గ్రంథము తెలియజేయుచున్నది. గుంటుపల్లి, నాసిక, కార్లె, కన్హేరిలయందలి గుహాశిల్పములు, సాంచి తూర్పు తోరణము, భట్టిప్రోలు, అమరావతీ నగరముల మహాచైత్యములు ఆనాటి శిల్పుల అద్భుత కౌశలమును వేనోళ్ల కీర్తించుచున్నవి. జాతక కథలను, బుద్ధుని జీవిత విశేషములను తెలుపు అజంటా చిత్తరువులను, అమరావతి చెక్కడపు శిల్పములును ఆనాటి కళాకారులకును, శిల్పులకును గల బౌద్ధ మతాభిరతిని తెలియజేయుచున్నవి. సారస్వతమున సయితము ఇట్టి అభివృద్ధియే కనబడుచున్నది. గుణాఢ్యుని 'బృహత్కథ', హాలుని 'సప్తశతి', నాగార్జునాచార్యుని 'సుహృల్లేఖ' అను గ్రంథములు ఆనాటి కవుల కల్పనాశక్తికి, రచయితల కవితా నైపుణ్యమునకు, రసికతకు, అభిరుచికి తార్కాణములు. గు. వెం. రా.

## ప్రాచీన కళింగదేశ చరిత్ర

కళింగదేశము తెలుగుదేశములోని భాగమే యనప్పటికి మొదటినుండియు అది రాజకీయముగ విభిన్నముగనే ఉండెను. ఉత్తరహిందూస్థానమునకును, దక్షిణ హిందూదేశమునకును మధ్యనున్న దక్కను స్థానము ఎటువంటిదో తూర్పు సముద్ర తీరస్థ ప్రదేశమున కళింగము స్థానము అట్టువంటిది. దాని లిపి ఆదిమ కాలములో వేంగీ లిపిని పోలియుండినను, కాలక్రమమున దానికి ఉత్తరదేశముతో సంబంధము ఎక్కువగుటచేత నాగరిగా మారినది. ఉత్తరదేశ ప్రభావమువలన కళింగదేశ పరిపాలనము ఉత్తరహిందూదేశ పద్ధతిని పోలియుండెను. ఆదిమకాలములో కళింగము ఉత్తర దిశను గంగాతీరము వరకు వ్యాపించియుండె ననియు, బంగాళదేశములోని ఇప్పటి మిడ్నపూరు, హౌరా జిల్లాలుకూడ దానిలో చేరినవే అనియు, ఇప్పటి ఓఢ్రదేశమును పూర్వము కళింగములోని భాగమే అనియు కొందరు చరిత్రకారుల అభిప్రాయము. ఇది సరియైనను, కాకపోయినను మహానదికి దక్షిణమున గల దేశము కళింగ మనుట నిశ్చయము. ఓఢ్ర దేశమునకు ఉత్కలము అను నామాంతరము కలదు. ఉత్తర కళింగమే ఉత్కల మయ్యెనని కొందరి ఊహ.

ఆర్. డి. బెనర్జీగారి అభిప్రాయప్రకారము ప్రాచీన కళింగదేశమున మూడు విభాగములు కలవు; మిడ్నపూరుకు వైతరిణీనదికి మధ్యనున్న విభాగము ఉత్కలము; కటకము పూరీజిల్లాలు, గంజాము జిల్లాలోని ఉత్తర భాగము, మహానదీ తీరమునందలి కొన్ని సంస్థానములు కలిసిన విభాగము తోసలము. తోసలములోని దక్షిణ భాగములో చిలుక సరస్సుకు మహేంద్రగిరికి మధ్యనున్న ప్రదేశమునకు కొంగద మండలము అని పేరు. కొంగద మండలమునకు దక్షిణమున ఉన్న విభాగము కళింగము.

ఒకప్పుడు కళింగము దక్షిణముగ గోదావరి నదివరకు వ్యాపించినట్లు చెప్పుదురు. పిష్టపుర మనబడు పిఠాపురము ఒకప్పుడు కళింగదేశములోని దనుటకు ఆధారములు కలవు. విశాఖపట్టణము జిల్లాలోని ఎలమంచిలి కళింగ దేశములోని దని ప్రాచీన శాసనములవలన తెలియు

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చున్నది. ప్రాచీన శాసనములు ఎలమంచి-కళింగమును పేర్కొనుచున్నవి. ఈవిధమున కళింగము నైరృతిదిశను గోదావరి నదివరకు ఒకప్పుడు వ్యాపించినను నడుమ నడుమ దాని విస్తృతి తగ్గుచు వచ్చినది. ఎంత తగ్గినను కళింగమునకు దక్షిణపు ఎల్ల సింహాచలము.

మహాభారతములోను, పురాణములలోను, పాళీజాతక కథలలోనుగూడ కళింగము ఒక ప్రత్యేక రాజ్యముగ చెప్పబడినది. కౌటిల్యుని అర్థశాస్త్రము కళింగ, అంగదేశములు శ్రేష్ఠములైన ఏనుగులకు ప్రసిద్ధి చెందినట్లు తెలుపుచున్నది. కళింగము ఏనుగులకు ప్రసిద్ధి కనుకనే కళింగాధిపతులకు గజబలము ఎక్కువ. తత్కారణమున వారికి 'గజపతులు' అను బిరుదనామము కలిగినది.

మహాభారత కాలమున కళింగదేశమునకు రాజపురము రాజధాని. చిత్రాంగదుడు కళింగాధిపతి. ఇతడు దుర్యోధనుని మేనమామ. కళింగాధిపతులు భారతయుద్ధమున కౌరవుల పక్షము వహించి పాండవులతో పోరాడిరి. మహాభారత యుద్ధానంతరము కళింగముకూడ పాండవుల అధికారము క్రిందికి వచ్చియుండవలెను.

అటుపిమ్మట కొన్ని శతాబ్దముల కాలము కళింగదేశ చరిత్రను తెలిసికొనుటకు తగినన్ని యాధారములు దొరకలేదు. కళింగమున రాజ్యమేలిన కొందరు కొందరు రాజుల శాసనములు మాత్రము దొరకినవి. ఈ కారణమున క్రీస్తుపూర్వమునుండి క్రీస్తుశకము అయిదవ, ఆరవ శతాబ్దముల వరకు, అనగా చంద్రవంశ క్షత్రియులును, ఆత్రేయ గోత్రులును అయిన పూర్వగాంగ వంశజులు కళింగములో తమ రాజ్యము స్థాపించువరకు పరంపరాగతమును, అనుస్యూతమును అయిన కళింగదేశ చరిత్ర తెలియరాకున్నది.

చారిత్రక యుగమున కళింగదేశమును గురించి తెలుపు మొదటి శిలాశాసనములు అశోకచక్రవర్తివి; తరువాతివి ఓఢ్రదేశములో కటకమునకు సమీపమున నున్న ఉదయగిరి యందలి జైనగుహలలో ఉన్నవి. వీనిలో హాథీ గుంఫ (ఏనుగు గుహ) యనుదానిలో చెక్కబడియున్న ఖారవేల రాజు శాసనము చాల ముఖ్యమయినది. ఈ శాసనమువల్ల మగధరాజ్యమును పరిపాలించిన నందవంశజుడగు మహాపద్మనందుడు ఖారవేలునికి చాలకాలము పూర్వము కళింగముపై దండెత్తి వచ్చి దానిని జయించి అచ్చటినుండి కాళింగజిన ప్రతిమను మగధకు కొనిపోయినట్లు తెలియుచున్నది.

నందరాజ్య పతనానంతరము కళింగము మరల స్వతంత్రరాజ్యము అయ్యెనని ఊహింప వీలున్నది. కాని దాని స్వాతంత్ర్యము చాలకాలము నిలువలేదు. నందులను నిర్మూలించి మగధరాజ్య సింహాసనము అధిష్ఠించిన మౌర్యవంశజులలో చంద్రగుప్త చక్రవర్తి మనుమడయిన అశోక చక్రవర్తి మగధకు పట్టాభిషిక్తుడయిన తరువాత తొమ్మిదవ సంవత్సరమున (క్రీ. పూ. 262-61 ప్రాంతము) కళింగముమీదికి దండెత్తివచ్చి మహాసంగ్రామమున దానిని జయించి మగధసామ్రాజ్యములో కలుపు కొనెను. ఈ కళింగయుద్ధమున లక్షమంది నిహతులైరి; యుద్ధభయమున మరియొక లక్ష యేబది వేల జనులు కళింగమును విడిచి దేశాంతరములకు వలసపోయిరి. యుద్ధకారణముగ సంక్రమించిన అధివ్యాధుల వలనను, ఇతర బాధల వలనను ఇంకను వందలకొలది జనులు చనిపోయిరి. అశోకుని దండయాత్ర నాటికి కళింగము ఎంత బహుజనాకీర్ణమయి, ఎంత సంపత్సమృద్ధమయి ఉండెనో తెలిసికొనుటకు పైనిచ్చిన సంఖ్యలు చాలును. ఈ సంఖ్యలు అశోకుని శిలాశాసనముల వల్లనే తెలియవచ్చినవి. యుద్ధము మూలమున కలిగిన ఈ జనవినాశనము వలనను, ఇతరబాధల వలనను అశోకుని హృదయము దయార్ద్రమైనది. జరిగిన వినాశనమునకు బీభత్సమునకు అతడు పలవించి పలవించి పశ్చాత్తాపమునొంది శాశ్వతముగా ఖడ్గమును ఒరయందు ఉంచివేసి, 'ధర్మవిజయమే విజయ' మని చాటి, ఆలక్ష్యమునకు అనుగుణముగా తనరాజ్య తంత్రమును సరిదిద్దుకొనెను. ధర్మప్రచారమునకయి ధర్మమహామాత్రులను నియమించెను. కళింగమును రెండు విభాగములు చేసి, ఒక విభాగమునకు తోసలిని, రెండవ విభాగమునకు సమాప నగరమును రాజధానులుగ ఏర్పరచి విజితులైన కాళింగులను ప్రత్యేక శ్రద్ధతో పాలించుటకు రాజపుత్రులను తనకు ప్రతినిధులుగ నియమించెను. సమాపనగరము జౌగడకు సమీపమునందు ఉన్నది. కళింగవాసులకును, ఆ ప్రాంత మందలి యాటవికులకును ధర్మమును బోధించుట, సుఖమును కూర్చుట మహామాత్రుల విధి అని నియమించుచు అశోకచక్రవర్తి గంజాము జిల్లాలలోని జౌగడగ్రామములోను, పూరీ జిల్లాలోని భువనేశ్వరమునకు సమీపమునందు ఉన్న ధౌలీ గ్రామములోను రెండు శాసనములను చెక్కించెను. వీనికి 'కళింగశిలా శాసనములు' అని పేరు. 'మనుష్యు లందరు నా సంతానము. నా సంతానము విషయమున ఐహిక, పారలౌకిక సౌఖ్యమును ఎట్లు కోరుదునో సర్వజనుల విషయమునను అట్లే కోరుచున్నాను. ఈ కోరిక నాకు ఎంత గాఢముగ ఉన్నదో మీకు తెలియదు' అని కళింగశాసనములలో అతడు వ్రాయించిన దానినిబట్టి అతని ఆవేదన ఎంతటిదో, అతని హృదయము కళింగ యుద్ధానంతరము ఎట్లు ఎంత మారినదో తెలియగలదు.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అతని శిలాశాసనముల వలననే, అతని కళింగశాసనముల వలననే అశోకచక్రవర్తి కళింగ విజయమును గురించియు, విజయానంతర కళింగ పరిపాలనమును గురించియు మనకు తెలియవచ్చినది.

క్రీస్తు పూర్వము రెండవ శతాబ్దములో, అశోక చక్రవర్తి అనంతరము మౌర్య సామ్రాజ్యము క్షీణదశకు వచ్చిన కాలములో మరల కళింగదేశము మగధాధిపతుల అధికారమును ధిక్కరించి స్వతంత్రము అయ్యెను. ఈ తడవ కళింగమును హిందూ దేశములోని బలిష్ఠ రాజ్యములలో ఒకటిగ తీర్చి దిద్దిన వారు 'చేతి'వంశజులు. వీరు మౌర్యాధికార దాస్యమును ఎప్పుడు తొలగద్రోసికొనిరో, ఎప్పుడు కళింగమున స్వతంత్ర రాజ్యము స్థాపించిరో తెలియదు. కాని, క్రీస్తుపూర్వము రెండవ శతాబ్దమున హిందూ దేశములోని గొప్ప రాజ్యములలో కళింగము ఒకటిగ ఉండెనని ఖారవేలుని హాథీ గుంఫ శాసనము వలన తెలియుచున్నది. క్రీస్తుపూర్వము కళింగములో స్వతంత్రరాజ్యము స్థాపించిన 'చేతి' వంశజులను గురించిన విషయములు అన్నియు ప్రాకృత భాషలోను, బ్రాహ్మీలిపిలోను ఉన్న ఈ హాథీగుంఫ శాసనమువల్లనే తెలియుచున్నవి.



ఖారవేలుని దండయాత్రలు

హాథీగుంఫ శాసనమును ఖారవేలరాజు తన పదువాలుగవ రాజ్యపాలన వర్షమున చెక్కించెను. అంతవరకు అతడు చేసిన ఘనకార్యములు, సాధించిన విజయములు అతని రాజ్యమున జరిగిన ఇతర విషయములు ఇందు వ్రాయబడినవి. ఇంత విషయమును శాసనమున పదువారు పంక్తులలో ఉన్నది. ఇందులోని మొదటి నాలుగుపంక్తులు మాత్రమే సుస్పష్టముగ ఉన్నవి. మిగిలిన శాసన భాగము పన్రెండు పంక్తులు రాయి అరిగిపోవుటచేతను, శిథిలమై చెడిపోవుటచేతను అస్పష్టముగ ఉండి సరిగా తెలియరాక అనేక వాదోపవాదములకు, అభిప్రాయ భేదములకు కారణమైనది. దీనిలో మౌర్యకాలములో తేది యియ్యబడినదని కొందరును, లేదని కొందరును వాదించియున్నారు. ఇప్పటికిని ఈ వాదములు సమసిపోలేదు. కాని, కె. పి. జయస్వాల్ గారు, ఆర్. డి. బెనర్జి గారు ప్రకటించిన శాసనమే ప్రామాణికముగా చాలమంది గ్రహించుచుండుటచేత ఖారవేలునికి సంబంధించిన ఈ క్రింది విషయములన్నియు వారి పాఠమును అనుసరించియే తెలుపబడినవి. ఈ శాసనములో దానిని చెక్కించిన కాలము తెలుపలేదు, అందువలన శాసనములో ఉదాహృతములైన సమకాలీన విషయములను అనుసరించియు, వ్యక్తులను అనుసరించియు దీని కాలము నిర్ధరింపవలసియుండును. వీనిని అన్నిటిని విచారించి, ఏతత్ శాసన పరిష్కర్తలు ఇది క్రీ. పూ. రెండవ శతాబ్దము పూర్వార్ధములోనిదని నిర్ధారణ చేసినారు. అందువలన ఖారవేల మహీపతి క్రీస్తుపూర్వము రెండవ శతాబ్దము పూర్వార్ధములోని వాడని నిశ్చయమైనది. కాని, ఇందుకు భిన్నముగా అతడు క్రీ. పూ. మొదటి శతాబ్దములోనివాడు అనువారును ఇప్పటికి ఉన్నారు. అయినను, ఈ హాథీ గుంఫ శాసన పరిష్కర్తల నిర్ణయమే ఇందు గైకొనబడినది.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/





అనంత గుంఫ, ఖండగిరి

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఖారవేలుడు ఐళుడు; మహామేఘవాహన వంశజుడు; చేతి(ది) రాజవంశవర్ధనుడు; కళింగాధిపతి. హాథీ గుంఫ శాసన మంతయు ఈతని విజయప్రశస్తి. దీనిని అనుసరించి చూచినయెడల, ఇతడు పరాక్రమవంతులైన భారతీయ మహారాజులలో ఒకడని, చరిత్ర ప్రసిద్ధిగలవాడని నిశ్చయింపవచ్చును. ఇతడు తన మొదటి పదునైదు సంవత్సరములను రాజకుమారోచిత క్రీడలలోను, లేఖనము, రూప్యములు, గణితము, వ్యవహారము, విధి మొదలైన విద్యలలో విశారదత్వము గడించుటలోను గడపెను; పదునారవ సంవత్సరమున యువరాజు అయ్యెను; ఇరువది నాలుగేండ్లు పూర్తియైన పిదప కళింగమహారాజ పదవికి అభిషిక్తుడై 'కళింగాధిపతి' అని, 'కళింగ చక్రవర్తి' అని బిరుదములు వహించెను; రాజ్యాభిషిక్తుడయిన పిదప దిగ్విజయమునకు పూనుకొనెను. ఈతడు తన రెండవ సంవత్సరములో (శాతవాహన కులజుడైన) సాతకర్ణి ఉన్నాడన్న చింతయైనను లేక తన హయ, గజ, నర, రథ బహుళమైన సేనను పడమటి దిశ కంపెను; ఈ సేన కృష్ణవేణ్ణా నది చేరినవెంటనే మూషిక నగరమునకు భీతి గొల్పెను; నాలుగవ సంవత్సరములో మహారాష్ట్ర దేశపు రట్టికులను, విదర్భదేశపు భోజకులను వశపరచుకొనెను; నందరాజుల 108వ సంవత్సరమున త్రవ్వించిన కాలువను 'తనసులి వాట'మునుండి నగరము(కళింగ నగరము)లోనికి కొని వచ్చెను; ఎనిమిదవయేట అతడు గోరథగిరిని (రాజగృహ పాటలీపుత్రములకు మధ్యనున్న గిరిదుర్గము) భగ్నము కావించి రాజగృహముపై దండెత్తి వెళ్ళెను. ఖారవేలుని పరాక్రమ కృత్యములను విని భీతచిత్తుడై డిమిత (డిమిత్రియస్) అను యవనరాజు రాజగృహమును వదలి మధురా నగరమునకు పారిపోయెను; తరువాత అతడు పిథుండ నగరమును నాశనము కావించెను; కళింగ జనపదమునకు నూటపదుమూడు సంవత్సరములనుండి అపాయకరముగ ఉండిన తమిర (తమిళ) దేశ సంఘాతమును భేదించెను; అతడు తనపండ్రెండవ రాజ్యవర్షమున ఉత్తరాపథరాజన్యులకు భయము గొల్పెను; మగధపై దండెత్తి మాగధులను, వారి అధిపతియైన బహసతి (బృహస్పతి) మిత్రుని జయించి వారు తన పాదములకు ప్రణమిల్లునట్లు చేసెను; మగధను జయించి నందరాజు కొనిపోయిన కాళింగజిన (విగ్రహ)మును అంగ, మాగధుల ధనముతోకూడ కళింగమునకు తిరిగి తీసికొనివచ్చెను; అ సంవత్సరముననే పాండ్య దేశముపై దండెత్తి పాండ్యరాజును జయించి అతడు కళింగమునకు హయ, గజ, రత్న, మాణిక్య, ముక్తామణులను కొనితెచ్చి కానుక లర్పించునట్లు చేసెను.

కళింగాధిపతియైన ఖారవేల భూపతి పూజారతుడైన జినోపాసకుడు; జిన ధర్మావలంబకుడు. ఇతడు ఉత్తర, పశ్చిమ, దక్షిణ దిగ్విజయములు కావించి, తన రాజ్యవర్షము పదుమూడవయేట జినుడు తన ధర్మమును బోధించిన కుమారీ పర్వతముమీద ఉన్న జైనయతులకు, అర్హతులకు చీన వస్త్రములు (పట్టుబట్టలు), శ్వేతాంబరములు మొదలైనవి సమర్పించి వారిని సేవించుకొనెను. ఇంకను ఎన్నియో ధర్మకార్యములు ఆచరించెను. ఖారవేలునికి పూర్వము జైనుల వేదగ్రంథములగు అంగములను సంకలితము చేయుటకును, పాఠపరిష్కారమునకును కొంత ప్రయత్నము జరిగినను అది ఫలింపలేదు. ఖారవేలుడు తన పదుమూడవ రాజ్యవర్షమున జైనాచార్యులను సమావేశపరచి సరియైన పాఠములను సంకలితము చేయించెను. జిన ధర్మోద్ధరణము విషయమున కళింగాధిపతి ఖారవేలుడు మౌర్య చంద్రగుప్త, అశోకచక్రవర్తులను ఆదర్శముగా పెట్టుకొని పాటుపడినట్లు కనబడును. ఉదయగిరి, ఖండగిరులే కుమారీ, కుమారపర్వతములు.

ఖారవేలుని మరణానంతరము కళింగమును గురించి మనకు ఏమియు తెలియదు. కాని అనతికాలముననే అది శాతవాహన వంశజుల అధికారము క్రిందికి వచ్చినట్లు గర్గసంహితలోని యుగపురాణము వలన తెలియుచున్నది. కాని దీనిని వశపరచుకొన్న శాతవాహన వంశజుడు ఎవ్వడో తెలియదు. కళింగదేశము శాతవాహన వంశజుల క్రింద ఉండిన కాలములోనే శకులు తమ యధిపతి నాయకత్వమున తండోపతండములుగా కళింగదేశముపై దండెత్తి వచ్చిరి. శాతవాహన వంశజునికి సామంతుడుగ ఉండిన కళింగపరిపాలకుని పేరు యుగపురాణము తెలుపుట లేదు. కాని, అతడు భయంకర సంగ్రామమున శకనాయకుని వధించి తన బాణవర్షపాతమున శకతండములను నాశనము చేసినట్లు చెప్పుచున్నది. ఈ సంఘటనమునకు తరువాత శాతవాహన వంశావతంసమైన మహీపరుడు తన సైన్యములతో మగధపై దండెత్తి వెళ్లి దానిని జయించి, పదిసంవత్సరములు రాజ్యము పరిపాలించి కాలధర్మము పొందినట్లును యుగపురాణమే తెలియజేయుచున్నది.

క్రీస్తుశకము మొదటి రెండు శతాబ్దములలో హిందూ దేశ వాయవ్యదిశను రాజ్యము పాలించిన కుషాణవంశజుల యొక్క నాణెముల వంటివి ఓంఢ్రదేశములోని సింగభూమి, గంజాము జిల్లాలమధ్య అనేక ప్రదేశములలో దొరకుటచేత ఓఢ్రదేశ చరిత్రకారులగు అర్. డి. బెనర్జీ గారు కుషాణరాజులు మగధదేశమునే కాక ఓఢ్రదేశమును,



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఋషికుల్యానది మొదలు లాంగుల్యానదివరకు గల ప్రాక్సముద్ర తీరస్థ దేశమునుకూడ జయించి ఉండవచ్చునని అభిప్రాయపడుచున్నారు. కాని, ఇది సరియైన ఊహగా కన్పట్టదు. కుషాణులు మగధను జయించినను, వారి యధికారము ఋషికుల్యా లాంగుల్యానదులవరకు కాదు, ఓఢ్రదేశముమీద కూడ వ్యాపించినది అనుటకు వేరు ప్రమాణములు లేవు. కుషాణరాజుల నాణెములు సింగభూమి, గంజాము జిల్లాలమధ్య దొరకుటకు వర్తకవ్యాపారములు కారణము కావచ్చును. పురాతన కాలము నుండియు కళింగదేశము కళింగకములు అను పేరు గల సన్నని మల్లు సెల్లాలకును, శ్రేష్ఠజాతి యేనుగులకును, దంతములకును పేరొందినట్లు తమిళ, సంస్కృత వాఙ్మయములవల్ల తెలియుచున్నది. కుషాణరాజ్య వర్తకులు కళింగముతో జరపుచుండిన వర్తకవ్యాపారము కారణముగా ఆ నాణెములు ఇక్కడ దొరకియుండునని ఊహించుట అసమంజసము కాదు. అందువలన ఈ నాణెములను బట్టి కుషాణరాజులు కళింగములో కొంతభాగమునయినను జయించి రనుట యంగీకరింపదగినదికాదు. కళింగము క్రీస్తుశకము మొదటి రెండు శతాబ్దములలో ఎట్లుండెనో మనకు ఏమియు తెలియదు. దానిని గురించి తెలియవచ్చునది ఇక క్రీస్తుశకము నాలుగవ శతాబ్దము నాటి సముద్రగుప్త చక్రవర్తి విజయములను అభివర్ణించు అలహాబాదు స్తంభశాసనము వల్లనే.

క్రీస్తుశకము నాలుగవ శతాబ్దములో సింహాసన మెక్కి తన విజయములచేత గుప్తరాజ్యమును సామ్రాజ్యముగ విస్తరింపజేసిన సముద్రగుప్త చక్రవర్తి ఉత్తర హిందూస్తానములోని రాజ్యములను మాత్రమేకాక దక్షిణమున దక్కనుదేశముపై దండెత్తి వచ్చి ఇక్కడి రాజులనుకూడ జయించి లోబరచుకొని మరల వారి రాజ్యములను వారికి ఇచ్చివేసెను. సముద్రగుప్తునిచే ఓడింపబడినవారు అందరును అతని అలహాబాదు స్తంభ శాసనములో ఉదాహృతులైరి. ఆ శాసనమును అనుసరించి చూడ అతడు దండెత్తి వచ్చునాటికి కళింగదేశమున వేరు వేరు ప్రాంతములందు వేరు వేరు సామంతులు చిన్నరాజ్యములను నిర్మించుకొని స్వతంత్రముగా పాలించుచుండినట్లు తెలియుచున్నది. కోసల (దక్షిణ కోసల) దేశపు మహేంద్రుడు, మహాకాంతారపు వ్యాఘ్రరాజు, గిరి కొత్తూర స్వామిదత్తుడు, ఏరండపల్లి దమనుడు, దేవరాష్ట్రపు కుబేరుడు, పిష్ఠపురపు మహేంద్రుడు, కౌరాళపు మంటరాజు, వేంగి హస్తివర్మ, కుస్థలపుర ధనంజయుడు, పాలక్క(డ?) ఉగ్రసేనుడు, కాంచీపురపు విష్ణుగోపుడు - వీ రెల్లరును సముద్రగుప్త చక్రవర్తిచేత జయింపబడిన దక్షిణదేశపు రాజులు. అందరును సముద్రగుప్తుని దండయాత్రనాటికి తూర్పు సముద్రతీర ప్రదేశమున పరిపాలించుచుండినవారు. వీరిలో గిరికొత్తూర స్వామిదత్తుడు, ఏరండపల్లి దమనుడు, దేవరాష్ట్రపు కుబేరుడు, పిష్ఠపురపు మహేంద్రుడు కళింగములోనివారు. గిరికొత్తూరు గంజాము జిల్లాలోని మహేంద్రగిరికి ఆగ్నేయదిశను వండ్రెండుమైళ్ళ దూరమున ఉన్నది. ఏరండపల్లి శ్రీకాకుళము జిల్లాలోని ఆముదాలవలస అని కొందరి అభిప్రాయము. దేవరాష్ట్రము విశాఖపట్టణము జిల్లాలోని ప్రాచీనరాష్ట్రములలో ఒకటి. పిష్ఠపురము తూర్పుగోదావరి జిల్లాలోని ఇప్పటి పిఠాపురము. పై నుడివినవారుతక్క మిగిలినవారందరును గోదావరినదికి దక్షిణమున ఉండినవారు. మొత్తముమీద, ఇట్టి చిన్న రాజ్యములను నిర్మించుకొనియున్న కళింగరాజులను అందరిని జయించియు సముద్రగుప్త చక్రవర్తి వారి రాజ్యములను వారికి ఇచ్చివేయుట అతని రాజనీతి అనియైన చెప్పవలసియుండును; లేదా, ఈ కళింగ భూవరులు మిగిలినవారితో కలసి సముద్రగుప్తుని ఎదిరించి ఓడించి, అతనిని వెనుకకు మరలగొట్టి యథాప్రకారముగా స్వతంత్రులై తమ రాజ్యములు ఏలుకొనుచు ఉండిరనియైన చెప్పవలెను. మొత్తముమీద, కళింగముపై సముద్రగుప్తుడు దండెత్తి వచ్చెననియు, కళింగములోని కొంత భాగమైనను గుప్త సామ్రాజ్యపు రాజకీయ, సాంస్కృతిక ప్రభావమునకు లోనై ఉండెననియు నిస్సంశయముగ చెప్పవచ్చును. కళింగ దేశమున ఉత్తర భాగమున గుప్తశకము వాడుకలో ఉండెను. విశాఖపట్టణముజిల్లాలోని బౌద్ధస్థలమగు సంకారములో సముద్రగుప్తుని బంగారు నాణెము దొరకినది. దక్షిణదేశమున దొరకిన సముద్రగుప్తుని నాణె మిదియొక్కటియే. అయినను ఇది విశాఖపట్టణ మండలమున దొరకుట గమనింప దగిన విషయము.

సముద్రగుప్తుని దండయాత్ర సముద్రపుపోటువలె వచ్చి కళింగరాజులను అందరిని అవనతులను కావించి పాటువలె వెనుకకు మరలెను. దీని తరువాత దండయాత్రనాటికి ఉన్న రాజులనుగురించికాని, రాజ్యములను గురించికాని తెలియరాదుకాని, వేరువేరు ప్రాంతములందు చిన్న రాజ్యములు కొన్ని వెలసినవి. కళింగము పర్వతారణ్య బహుళము అగుటచేత మొదటినుండియు స్వతంత్రములైన ఇట్టి చిన్న రాజ్యములు వర్ధిల్లుటకు అవకాశము కలిగినది. నాలుగవ శతాబ్దము కడపట వర్ధిల్లిన ఇట్టి రాజ్యములలో ప్రధానమైనవి సింహపుర, దేవపుర, పిష్ఠపుర రాజ్యములు.

సింహపురము అనునది శ్రీకాకుళమువద్ద ఉన్న ఇప్పటి సింగుపురము. శాసనములలో ఇది విజయసింహ.పురము,



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



విజయసింహపురము అని పేర్కొనబడినది. సింహపురము రాజధానిగ పాలించిన రాజులు ఇద్దరు ఉమవర్మ, చండ వర్మ అనువారు తెలియవచ్చినారు. వీరిలో ఉమవర్మ శాసనములు మూడు దొరకినవి; ఒకటి వర్ధమానపురము నుండియు, మరియొకటి సునగరము నుండియు, ఇంకొకటి సింహపురము నుండియు ఈయబడినవి. సింహపురము నుండి దానశాసనము ఇచ్చిన ఉమవర్మకే కళింగాధిపతి అని బిరుదము కలదు; మిగిలినవారికి లేదు. వర్ధమాన పుర ఉమవర్మ శాసనముద్రికమీద 'పితృభక్తః' అను మాటలు ఉన్నవి. కళింగాధిపతియైన సింహపుర ఉమవర్మ శాసనముద్రికమీద నాలుగు పంక్తుల వ్రాత కలదు. కాని, చివరి పంక్తిలోని 'రాజ్ఞోమవర్మస్య' అన్నది మాత్రమే కానవచ్చు చున్నది. ఇది అటుండ, వర్ధమానపుర ఉమవర్మ దానశాసనమును తన తొమ్మిదవ రాజ్యవర్షముగ ఈయగా కళింగాధిపతి సింహపుర ఉమవర్మ తన ముప్పదవ రాజ్య వర్షమున ఇచ్చెను. ఇక సునగర ఉమవర్మ శాసనము అసంపూర్ణముగ ఉండుటచేత ఆ శాసనము ఇచ్చిన సంవత్స రము తెలియరాదు. శాసనముద్రిక అరిగిపోవుటచేత దాని మీది మాటలును తెలియవచ్చుట లేదు. ఈ కారణముల వలన శాసనదాతలైన ఉమవర్మలు ముగ్గురు ఒక్కరో, భిన్నులో ఊహించుట కష్టము. ఒక్కరే ఐనచో ఉమవర్మ మొదట వర్ధమానపురము రాజధానిగ చేసికొని, తరువాత కళింగములోని కొంతభాగమును జయించి, కళింగాధిపతి బిరుదము వహించి, సింహపురమునకు రాజధానిని మార్చు కొని ఉండును అని తోచుచున్నది. ఉమవర్మ శాసనములు అన్నిటిలోను, లిపి - అందును ముఖ్యముగ సింహపుర, సునగరముల నుండి ఇచ్చిన వానిలోనిది - ఒకటే విధమున ఉండుట ఇట్టి ఊహకు బలకరముగ ఉన్నది. ఈ దృష్టితో చూచినచో సునగరముకూడ సింహపురము అగునేమో యని తోచుచున్నది.

ఉమవర్మ తరువాత సింహపురమునుండి రాజ్యమేలిన వాడు చండవర్మ. ఈ విషయము సింహపుర ఉమవర్మ శాసనలేఖకుడు దేశాక్షపటలాధికృతుడైన మాతృవరుని కుమారుడు రుద్రదత్తుడే సింహపురాధిపతి చండవర్మ తొలి శాసనమునకును లేఖకుడు అగుటచేత నిశ్చయమగు చున్నది. ఇతని శాసనములు రెండు దొరకినవి. ఈ శాసన ముద్రికలమీద కూడ వర్ధమానపుర ఉమవర్మ శాసన ముద్రికమీద వలెనే 'పితృభక్తః' అని చెక్కబడినది. ఇట్లే 'పితృభక్త' పదమును శాసనముద్రికమీద చెక్కించిన రాజు నంద ప్రభంజనవర్మ మరియొకడు కలడు, ఇతడు తన దానశాసనమును శారపల్లి వానకమునుండి ఇచ్చెను. ఈతని పేరులోని నందపదమును బట్టి ఇతడు నందవంశ ముతో సంబంధము కలవాడనియు, ఇతని తల్లి నందవంశ మునకు చెందినది కావచ్చు ననియు కొందరు ఊహించు చున్నారు. కాని, ఇది కేవలము అత్యూహామాత్రమే. నందప్రభంజనవర్మ అను పదమునుబట్టి ఇతడు ఒకవేళ నందవర్మ కుమారుడని ఊహింపవచ్చును. ఇతనికి వట్టి కళింగాధిపతి బిరుదము కాక సకలకళింగాధిపతి బిరుదము ఉండుటవల్ల సకల కళింగమునకు అధిపతియై ఉండునని ఊహింప వచ్చును. పూర్వోక్త కళింగభూవరులకు పరస్ప రముగల సంబంధము ఎట్టిదో, వారు ఒక్కవంశమువారు అగుదురో కారో, ఎప్పటివారో తెలియదు. వీరు తమ శాసనములలో తమ రాజ్యవర్షములను ఇచ్చిరి. ఏ సంవత్సర మును లేనివియు కొన్ని కలవు. మొత్తముమీద లిపినిబట్టి చూడ, వీరు క్రీ. శ. నాలుగవ శతాబ్దము చివరను, అయి దవ శతాబ్దము పూర్వార్ధమునందును రాజ్యము ఏలినట్లు కనబడును. శాసనముద్రికలమీద 'పితృభక్త' పదము ఉన్నవారు అందరును ప్రాయికముగ ఒక్క వంశమునకు చెందినవారని కొందరి యూహ. ఇది నిజమయినచో నంద ప్రభంజనవర్మ వీరిలో ఇప్పటికి కడపటివాడని ఎంచవచ్చును.

కళింగములోని రెండవ రాజ్యము దేవపురరాజ్యము అనగా దేవపురము రాజధానిగాగల రాజ్యము. ఈ దేవ పురము విశాఖపట్టణము జిల్లా శృంగవరపుకోట తాలూకా లోని దేవాదయని ఊహింపబడుచున్నది. ఈ రాజ్యమును క్రీ. శ. నాలుగవ శతాబ్దము చివరనో, అయిదవ శతాబ్ద ములోనో వాసిష్ఠకులజు లను భూవరులు పరిపాలించిరి. ఈ రాజ్యము సింహపుర రాజ్యమునకు నైరృతిదిశయందు ఉన్నది. ఈ రాజ్యమును ఏలిన మహీపతుల శాసనములు ఇంతవరకు నాలుగు దొరకినవి; వీనిలో రెండు ప్రకటిత ములైనవి, మరిరెండు అప్రకటితములు. ప్రకటితములు అయినవానిలో ఒకటి దేవపురము నుండియు, వేరొకటి పిష్టపురము నుండియు ఈయబడినవి. ప్రకటితములు కాని, రెండు శాసనములును దేవపురమునుండి ఒసగబడినవే. ఈ నాలుగుశాసనములలోను ఒక్కొక్కదానిలో మూడేసి తరములరాజులు వర్ణితులైనారు. మొత్తముమీద ఈ నాలుగు శాసములును లెక్కలోనికి తీసికొని చూచినచో దేవపురాధీశ్వరులు అనంతవర్మ, గుణవర్మ, ప్రభంజనవర్మ, అనంతవర్మ అని తండ్రికొడుకుల వరుసను నాలుగు తర ములవారు తెలియవచ్చెదరు. ఈ నాలుగు శాసనములలో ప్రకటితము కాకుండ ఉన్న రెండు దానశాసనములును గుణవర్మ కుమారుడైన ప్రభంజనవర్మ యువరాజుగా ఉండగా ఒకటి ఏబదవ సంవత్సరమునను, మరియొకటి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఏబది ఏడవ సంవత్సరమునను దేవపురమునుండి ఇచ్చినవి. యువరాజు గనుక ఈ సంవత్సరములు ప్రభంజనవర్మ రాజ్యసంవత్సరములు కాకపోవుట నిశ్చయము. అవి ప్రభంజనవర్మ తాతగారైన అనంతవర్మ నాటినుండి వాసిష్ఠ కులజులు రాజ్యమేలిన సంవత్సరములైనను కావలెను; ప్రభంజనవర్మ తండ్రి గుణవర్మ రాజ్యవర్షములైనను కావలెను; లేదా గుప్తశకవర్షములైనను కావలెను. కళింగముమీద గుప్తవంశజుల అధికారము అంతరించినను వారి ప్రభావము పోలేదనుటకు అవకాశము ఉన్నది; ఏలయన, ప్రభంజనవర్మ కుమారుడైన అనంతవర్మ దేవపురమునుండి ఇచ్చిన శాసనము మహాశ్వయుజ సంవత్సరమున మాఘ శు. 15 నాటిది. ఈ విధమున చాంద్రమాన మాసములను పండ్రెండు బార్హస్పత్య సంవత్సరములుగా గణించుపద్ధతి ఆదిమగుప్తరాజుల కాలములో వాడుకలో ఉండెను. ఈ విధమైన పరిగణనమునకు బార్హస్పత్య ద్వాదశ వత్సరమానమని పేరు. బృహస్పతి - అనగా గురుడు - ఏ నక్షత్రముతో ఉదయమైన ఆనక్షత్రము పేరుతో కలిసిన మాసముపేరు ఆ గురు సంవత్సరముగ చెల్లుచుండును. ఈ విధమున పండ్రెండు చాంద్రమానమాసముల పేర్లును గురునివి పండ్రెండు సంవత్సరములు అగుచున్నవి. బార్హస్పత్యద్వాదశ వత్సరమానమున శాసనదానకాలమును తెలుపుట హిందూదేశములో చాల అరుదు. గుప్తుల కాలములోనే ఇది వాడుకలో ఉండెను. వాసిష్ఠకులజుడైన గుణవర్మ తన దానశాసనకాలమును మహాశ్వయుజ సంవత్సరమున ఇచ్చుటకు గుప్తప్రభావమే కారణము (అశ్వినితో ఆరంభమగు మాసము ఆశ్వయుజము; అశ్వినితో ఉదయించిన గురుని సంవత్సరము మహాశ్వయుజము). ఇందువలననే ప్రకటితముకాని ప్రభంజనవర్మ శాసనముల లోని ఏబది, ఏబదియేడు సంవత్సరములు గుప్తశకవర్షములు అగునేమో అని సంశయించుటకు కారణము. అట్లయినచో ప్రభంజనవర్మ క్రీ. శ. 377 వరకు యువరాజుగ ఉండెనని, తరువాతనే అతడు పట్టాభిషిక్తుడై పరిపాలనము చేసియుండునని తలపవలెను. ఇతడు పట్టాభిషిక్తుడైన వెనుక పాతికేండ్లపాటు రాజ్యము చేసెననిన ఇతని కుమారుడు అనంతవర్మ క్రీ. శ. అయిదవశతాబ్దము నందలి పూర్వార్ధమున రాజ్యము పాలించియుండవలెను. ఈ విధముగా కాలమును తెలుపుట క్రీ. శ. అయిదవ - ఆరవ శతాబ్దములలో పరిమిత ప్రదేశముననే వాడుకలో ఉండినట్లు పరిశోధకులు చెప్పుదానికి పైనిచేసిన నిర్ణయము సరిపోవుచున్నది. 'గురుని మహాశ్వయుజ సంవత్సరము క్రీ. శ. 504, 516, 528 లలో వచ్చినట్లు జ్యోతిర్గణితము వల్ల తెలియుచున్నది. గుణవర్మ కుమారుడైన ప్రభంజనవర్మయో, అతని తనయుడు అనంతవర్మయో ఇరుగు పొరుగు దేశములను జయించి దేవపురరాజ్యమును విస్తరింపజేసెను. వాసిష్ఠకులజులలో అనంతవర్మకు మాత్రమే 'కళింగాధిపతి'యను బిరుదము కలదు. ఈ యనంతవర్మ తన దానశాసనమును ఒకదానిని పిష్ఠపురము నుండి ఇచ్చుట వలననే అతని రాజ్యము అంతవరకు వ్యాపించినట్లు స్పష్టమగుచున్నది; పిష్ఠపురమునుండి ఇచ్చిన శాసనమున అతడు దేవరాష్ట్రాధిపతియని చెప్పబడెను. ఎలమంచి - కళింగదేశము, అనగా కళింగదేశము నందలి ఎలమంచిలి ప్రాంతము (విశాఖపట్టణము జిల్లాలోనిది), అంతయు దేవరాష్ట్రములోనిదని విశాఖపట్టణము జిల్లాలో దొరకిన యొక పూర్వచాళుక్య శాసనమువలన తెలియుచున్నది. ఈ కారణమున నేటి సర్వసిద్ధి తాలూకాలోని కొంతభాగమైనను దేవరాష్ట్రములోనిది అనుటకు సంశయింప పనిలేదు. సముద్రగుప్తుని దండయాత్ర కాలమున దేవరాష్ట్రమును, పిష్ఠపురమును వేరువేరు రాజ్యములుగ ఉండి వేరువేరు రాజులచేత పాలింపబడుచుండెనని మనకు తెలియును. ఇప్పుడు వాసిష్ఠకులజులైన ప్రభంజన, అనంతవర్మలలో ఎవరో యొకరు - ప్రాయికముగ అనంతవర్మయేమో - దేవరాష్ట్ర, పిష్ఠపురములను జయించి తూర్పున ఇంచుమించుగా శ్రీకాకుళము నుండి పశ్చిమమున పిఠాపురము వరకు తనరాజ్యమును విస్తరింపజేసి కళింగాధిపతి బిరుదము తాల్చెను. వీరిని గురించి మనకు ఇంతకంటె ఎక్కువ తెలియదు.

ఇక కళింగదేశమున సముద్రగుప్త దండయాత్రానంతరము వర్ధిల్లిన మూడవ రాజ్యము మాఠరకులజులది. వీరి శాసనములు ఇంతవరకు నాలుగు దొరకినవి. వీనిలో మూడు శాసనములు ప్రకటితములైనవి; ఒకటి అప్రకటితము. ప్రకటితములైనవి ఒకటి విజయపురమునుండి, మరొకటి సింహపురమునుండి, ఇంకొకటి పిష్ఠపురమునుండి ఒసగబడినవి. విజయపుర, సింహపురములనుండి దానశాసనములు ఇచ్చిన మాఠరకులజుడు అనంతశక్తివర్మ; పిష్ఠపురమునుండి ఇచ్చినవాడు శక్తివర్మ. ఈ శాసనములలో దాతల పేర్లు తప్ప వారి తండ్రితాతలనుగురించి తెలుపబడలేదు. అందువలన ఈ శాసనదాత లెవరు ముందో, ఎవరు వెనుకో, వారికి గల పరస్పర సంబంధము ఎట్టిదో తెలియదు. పిష్ఠపురమునుండి ఇచ్చిన శాసనము శక్తివర్మ పదుమూడవ రాజ్య సంవత్సరమునాటిది. అనంతశక్తివర్మ విజయపురమునుండి ఇచ్చిన శాసనము 14 వ రాజ్యవర్షము నాటిది. ఇతని రెండవ శాసనము 28 వ రాజ్యవర్షము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



నాటిది. ఈ కారణముచేత ఈరాజుల పూర్వాపరక్రమ నిర్ణయమునకు తేదులు ఉపకరించుట లేదు. శక్తివర్మ పిష్టపుర శాసనమును, అనంతశక్తివర్మ సింహపురశాసనమును వ్రాసిన లేఖకుడు ఒక్కడే - అర్జునదత్తుడు; కాని ఇతడు అమాత్య అర్జునదత్తుడు అని శక్తివర్మ శాసనములోను, దేశాక్షపటలాధికృత తలవర అర్జునదత్తుడు అని అనంతశక్తివర్మ శాసనములోను చెప్పబడెను. ఇద్దరు ఒక్కరే అని చెప్పువారు ఉన్నారు; కాని, ఇది సరియైన అభిప్రాయము కాదేమో అని అనుమానము. దేశాక్షపటలాధికృత పదవి కంటెను అమాత్య పదవి గొప్పది అనుకొన్నచో అర్జునదత్తుడని పేరు ఒకటే ఉన్నను వ్యక్తులు వేరని భావింపవలసి యుండును. ఒకవేళ వీరు తాతమనుమలయిన కావచ్చును. విజయపుర, సింహపురముల నుండి శాసనములు ఇచ్చిన అనంతశక్తివర్మ నామధేయులు ఒక్కరో, భిన్నవ్యక్తులో తెలియదు. కాని, విజయపురము నుండి ఇచ్చిన శాసనము సింహపురమునుండి యిచ్చిన దానికి తరువాతిదే. మరియొక విషయముకూడ ఇచట గమనింపవలసియున్నది. మాఠరకులజుడు విజయపుర అనంతశక్తివర్మ శాసనలేఖకుడు దేశాక్ష పటలాధికృత దండనాయక మాతృవరుడు. ఉమవర్మ సింహపురమునుండి 30 వ సంవత్సరమున ఇచ్చిన శాసనమునకును లేఖకుడు హరిదత్త కుమారుడు దేశాక్ష పటలాధికృత మాతృవరుడే. మాతృవర నామధేయులు ఇరువురును ఒక్కరే. ఉమవర్మ శాసనము అతని తండ్రిపేరుకూడ చెప్పినది. ఇక ఉమవర్మకు పిదప సింహపురమునుండి పాలించిన చండవర్మ నాల్గవ సంవత్సరపు దానశాసన లేఖకుడు మాతృవరుని కుమారుడు దేశాక్ష పటలాధికృత రుద్రదత్తుడు. పై విషయములను అనుసరించి చూచినచో మాఠర కులజులకు తరువాతనే వర్ధమాన పురాధీశ్వరులును, పితృభక్త బిరుదమును తమ ముద్రికలమీద చెక్కించినవారును అగు ఉమవర్మ, చండవర్మలు సింహపుర రాజ్యమును ఆక్రమించుకొనినట్లు తేలుచున్నది. తరువాత, మరల మాఠరకులజుడు అనంతవర్మ సింహపురమును వశపరుచుకొనెను. ఈ కారణముననేమో 'పితృభక్త' నంద ప్రభంజన వర్మకు రాజధాని సింహపురము కాకపోయినది. కాని, ఇతడు మాఠర, వాసిష్ఠకులజులకంటెను తరువాతివాడని, 'పితృభక్త' లాంఛను అందరిలోను కడపటివాడని తోచును. ఇక, వాసిష్ఠ, మాఠరకులజులలో పిష్టపురము ముందు ఎవరికి రాజధానియో, ఎవరు ఎవరిని జయించి ఈ పిష్టపురరాజ్యమును వశపరచుకొనిరో చెప్పుట కష్టము. మొత్తముమీద ఈ మూడు వంశములును సముద్రగుప్తుని దండయాత్రకు తరువాత క్రీస్తుశకము నాలుగవ శతాబ్దమునందలి ఉత్తరార్ధమునుండి క్రీస్తుశకము అయిదవ శతాబ్దము చివర పూర్వగాంగ వంశజుల పరిపాలనారంభకాలము వరకు గంజాముజిల్లానుండి దక్షిణముగా సముద్రతీరమున వ్యాపించియున్న కళింగదేశమును పరిపాలించెను.

పై నుడివిన వంశములలో దేనికి చెందినవాడో తెలియని ఒక రాజు కలడు. అతని పేరు విశాఖవర్మ. ఇతడు కూడ కళింగములోని రాజే. విజయశ్రీ పురమునుండి ఇతడిచ్చిన తామ్రశాసనము ఒకటే దొరకినది. ఈతడు ఈశాసనమును తన రాజ్యసంవత్సరము ఏడవయేట హేమంతర్తువులోని ఏడవ పక్షమున ఇరువదవ దినమున ఇచ్చెను. ఇతడు పితృభక్తులలోని వాడేమో అని సందేహము. ఈ విషయము నిర్ధారణగా చెప్పుటకు వీలులేదు; కాని మాఠరకులజుడైన శక్తివర్మకంటె ముందుండిన వాడని ఈతని శాసన లిపిని బట్టి తోచుచున్నది.

కళింగాధిపతి బిరుదమును కళింగదేశమునంతను పరిపాలించినందువల్ల ధరించిరో లేక, కళింగములోని కొంత భాగమును పరిపాలించినవారుకూడ ఆ బిరుదమును ధరించిరో తెలియదు. కళింగములోని వేరువేరు భాగములను పాలించినవారు కూడ కళింగాధిపతి బిరుదమును ధరించుటవల్లనే 'సకల కళింగాధిపతి' అను బిరుదము కలుగుటకు కారణమని తోచును. మొత్తముమీద కళింగములోని పరిమిత ప్రాంతమును ఏలిన రాజునకైనను లక్ష్యము సర్వకళింగాధిపత్యముమీదనే ఉండెడిది. ఈ దృష్టితో చూచిన నంద ప్రభంజనవర్మ సకల కళింగాధిపతి బిరుదమునకు కొంత విశిష్టత ఉండవచ్చునని తోచుచున్నది. ఈ విషయము ఇంకను భావిపరిశోధనవల్ల కాని రూఢికాదు. మ. సో. శ.

## ఇక్ష్వాకులు

శాతవాహన సామ్రాజ్యము భగ్నమయిన తరువాత, అంతవరకు వారికి సామంతులుగనో, దండనాయకులుగనో ఉండినవారో, వారి కొలువులో పనిచేసినవారో వేరు వేరు ప్రాంతములను వశపరచుకొని తెలుగుదేశమున క్రొత్త రాజ్యములను స్థాపించిరి. ఇట్టివారిలో కృష్ణాప్రాంతపు ప్రాగాంధ్ర దేశమును పరిపాలించిన ఇక్ష్వాకు వంశజులు ఒకరు. వీరినే పురాణములు శ్రీపర్వతీయాంధ్రులని, ఆంధ్రభృత్యులు (ఆంధ్ర శాతవాహన భృత్యులు) అని పేర్కొనుచున్నవి. నాగార్జునుని కొండలో దొరకిన ప్రాకృత శాసనముల వలన నాగార్జునుని కొండకు క్రీస్తు శకారంభ శతాబ్దములలో శ్రీపర్వతమను పేరు ఉండినట్లు తెలియుచున్నది. శ్రీ పర్వతము అనునది నాగార్జునుని కొండకు మాత్రమే



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పేరు కాదనియు, అచ్చటినుండి కృష్ణానదీ తీరమువనే కర్నూలు జిల్లాలోనికి వ్యాపించిన నల్లమల కొండల చాలు కంతకు ఆపేరు చెల్లు ననియు కొందరు చెప్పుదురు. పురాణములలో చెప్పిన ఈ రాజుల సంఖ్యయు, వారి మొత్తపు రాజ్యకాల పరిమితియు సందిగ్ధముగ నుండుటచేత పురాణోక్తవిషయము వేరు వేరు విధముల అర్థము చేసికొనుటకు అవకాశమిచ్చినది. మొత్తముమీద పురాణములలో ఇచ్చిన ఇక్ష్వాకు రాజ్యకాల పరిమితి వంద సంవత్సరము లైనను, వారు చాలకాలము రాజ్యము చేయలేదు అనునది యథార్థము.

ఈ యిక్ష్వాకు రాజులకు, ఉత్తరమున అయోధ్యను పరిపాలించిన ఇక్ష్వాకు రాజన్యులకు ఏదయినను సంబంధము కలదా అన్నది విచారణీయము. వీరు ఉత్తర హిందూ దేశములోని ఇక్ష్వాకుల సంతతివారే అని ప్రాచ్య పరిశోధక పండితులైన బూలరు, రాప్సనులు అభిప్రాయపడినారు. వాయు పురాణము ప్రకారము సూర్యవంశమునకు వంశకర్తయైన ఇక్ష్వాకువు మనువు తొమ్మండ్రు కుమారులలోను జ్యేష్ఠుడు. ఇతడు అయోధ్య రాజధానిగ పరిపాలించెను. ఇతనికి నూరుగురు కుమారులు. వీరిలో వికుక్షి అగ్రసుతుడు. ఇతడు అయోధ్యనుండి తండ్రి అనంతరము రాజ్యమునకు వచ్చెను. మిగిలిన వారిలో ఏబది మంది ఉత్తర హిందూ దేశములోనే చిన్న రాజ్యములకు అధిపతులైరి; మరి నలువది యెనమండ్రు దక్షిణమునకు వచ్చి రాజ్యాధిపతులయిరి. విష్ణుపురాణమును అనుసరించి దక్షిణ కోసలమును స్థాపించినవాడు కుకుదు. ఈతని రాజధాని కుశస్థలి. ఈ విధమున ఉత్తర హిందూదేశము నుండి దక్షిణ దేశమునకు వచ్చిన రాజవంశములు మత్స్య పాండ్య, కేకయాదులు ఎన్నియో కలవు. ఈ యిక్ష్వాకులు కూడ ఉత్తర హిందూదేశపు ఇక్ష్వాకు సంతతి రాజపుత్రులు అయినను కావచ్చును. బౌద్ధవాఙ్మయమువలన గోదావరీనది ఎగువ భాగమున అశ్మక, ముళక జనపదములను స్థాపించినవారు ఇక్ష్వాకు కులజులే. ఉత్తర దేశమునుండి ఏనాడో ఈ యిక్ష్వాకు కులజులు దక్షిణాపథమునకు వచ్చి ఆంధ్రదేశ ప్రజలలో కలసిపోయిరి. జైన తీర్థంకరులలో పండ్రెండవవాడయిన వాసు పూజ్యుని యొక్క కాలములో ఇక్ష్వాకు వంశజుడయిన యశోధరుడు అంగదేశమునుండి వేంగి దేశమునకు వచ్చి ఆ దేశపు రామణీయకతకు అచ్చెరువొంది అచ్చట ప్రతిపాలపురమును నిర్మించి అచ్చటనే నిలిచిపోయెనని క్రీస్తుశకము పండ్రెండవ శతాబ్దమునాటి 'ధర్మామృతము' అను జైన కన్నడ కావ్యము తెలుపుచున్నది. ప్రతిపాలపురము ఇప్పటికి భట్టిప్రోలని కొందరి యభిప్రాయము. మొత్తము మీద, ఇక్ష్వాకు వంశజులు తెలుగుదేశమునకు ఇరువది శతాబ్దములకు చాల పూర్వకాలముననే వచ్చియుండవలెను.

తెలుగు దేశములో కృష్ణానదీతీరమున వర్ధిల్లిన ఇక్ష్వాకు కులజుల చరిత్రమునకు నాగార్జునుని కొండలోను, జగ్గయ్యపేటలోను దొరకిన బ్రాహ్మీలిపి ప్రాకృతభాషా శాసనములే ఆధారము. ఇక్ష్వాకులు సాతవాహన రాజ్యము భగ్నమైన వెంటనే ధాన్యకటక ప్రాంతదేశమును ఆక్రమించుకొని క్రీస్తుశకము రెండవ శతాబ్ద ద్వితీయపాద ప్రాంతమునుండి పరిపాలించిరి. పూర్వోక్త శాసనములవలన తెలియవచ్చు ఇక్ష్వాకురాజులు మువ్వురు: (1) 'చాంతమూల', (2) 'వీరపురిసదత' (వీరపురుషదత్త), (3) 'ఎహువుల చాంతమూల' నామధేయులు. 'చాంతమూల' అను ప్రాకృత రూపమునకు సరియైన సంస్కృత రూపము 'శాంతమూల' అని కొందరును, 'క్షాంతమూల' అని కొందరును చెప్పుదురు. 'శాంతమూల' రూపమే ఇందు వాడబడినది. ఈ యిక్ష్వాకు రాజుల రాజధాని విజయపురి. ఇదికూడ నాగార్జునుని కొండలోయలోనే కలదు. క్రీస్తుశకారంభ శతాబ్దములలో క్రొత్తగా రాజ్యమును నిర్మించి స్వతంత్రులై పరిపాలించినందుకు గుర్తుగా రాజులు అశ్వమేధయాగమును కావించుచు వచ్చినట్లు కన్పట్టును. సాతవాహనులు అశ్వమేధమును చేసినవారే; ఇక్ష్వాకులును అశ్వమేధము చేసినవారే. వీరి తరువాత ప్రాగాంధ్రదేశమును పాలించిన రాజన్యులుకూడ తమ స్వతంత్రాధికారమును ప్రకటించుకొనుటకు అశ్వమేధయాగము చేయుచు వచ్చిరి. ఈయంశమును బట్టి చూడగా, శాంతమూలుడే ఇక్ష్వాకు రాజ్యమును స్థాపించి స్వతంత్రుడై పరిపాలించిన రాజని చెప్పవచ్చును.

ఇక్ష్వాకు రాజ్యస్థాపకుడైన శాంతమూలుడు శాసనములలో 'వాసిఠీపుత సిరి చాంతమూల', అనగా 'వాసిష్ఠీపుత్ర శ్రీ శాంతమూలుడు' అని పేర్కొనబడెను. సాతవాహనుల కాలమునుండియు సంఘములో స్త్రీలకు ఎక్కువ గౌరవము ఉండుటవలన నేమో పురుషులు తమ తల్లుల పేర్లతో కలిపి తమ పేర్లను చెప్పుకొనుచు వచ్చిరి. ఈపద్ధతి శాతవాహన కాలము మొదలుకొని ఉండినట్లు గౌతమీపుత్ర సాతకర్ణి, వాసిష్ఠీపుత్ర శ్రీ పులోమావి, మాఢరీపుత్ర శకసేన శాతకర్ణి వంటి ఉదాహరణములవలన చెప్పవచ్చును. వారి తరువాత, రాజ్యముచేసిన ఇక్ష్వాకులుకూడ వారి పద్ధతినే అనుకరించిరి. ఇక్ష్వాకు రాజ్యస్థాపకుడైన శాంతమూలుడు వాసిష్ఠీ పుత్రుడు. ఇతడు వైదిక మతావలంబి,



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఇతడు అశ్వమేధయాగమునే కాక అగ్నిష్టోమ, అగ్నిహోత్ర, వాజపేయ యాగములను చేసినట్లు చెప్పబడినది. వాజపేయాశ్వమేధములు పరాక్రమవంతులైన రాజులు చేయు క్రతువులు. వాజపేయ యాగము చేసినరాజు సమ్రాట్టగునని శతపథ బ్రాహ్మణమున చెప్పబడినది. సమ్రాట్టయినను కాకపోయినను శాంతమూలుడు బాహుబల పరాక్రమములు కలిగి చుట్టుప్రక్కల రాజులను జయించి ఇక్ష్వాకు రాజ్యమును స్థాపించిన మహారాజు. ఇతని ఇష్టదైవము మహాసేనుడు (స్కందుడు - కార్తికేయుడు). ఇతని తండ్రిపేరైనను మనకు తెలియదు. శాంతమూలుడు అనేక కోట్ల బంగారు నాణెములను, లక్షలకొలది గోవులను, లక్షలకొలది నాగళ్లను దానముచేసిన మహాదానపతి. శతసహస్ర హలము అనగా కొందరు లక్షలకొలది నాగళ్ళ భూమి యని అభిప్రాయపడినారు. పూర్వకాలములో ఇన్ని నాగళ్ళ భూమి అని చెప్పి దానమిచ్చుట పరిపాటి. ఎట్లయినను ఈ మహాదానములు చేసి శాంతమూల మహారాజు విస్తారము భూమిని సేద్యములోనికి తీసికొనివచ్చి వ్యవసాయమునకు గొప్ప ప్రోత్సాహము కలిగించెను.

శాంతమూలునికి ఇద్దరు చెల్లెండ్రు - 'హమ్మసిరినిక', 'చాంతసిరి' అని. వీరిలో 'చాంతిసిరి' (శాంతిశ్రీ) పూగియకులజుడయిన 'వాసిఠిపుత ఖందసిరి' (వాసిష్ఠీపుత్ర స్కందశ్రీ) భార్య; ఈ స్కందశ్రీ మహాసేనాపతి; మహాతలవరుడు. శాంతిశ్రీకికూడ మహాతలవరి, మహాదానపత్ని అని బిరుదములు కలవు. మహాతలవరుడు అనగా మహాసామంతుడు అని యర్థము. శాంతిశ్రీకి 'ఖందసాగరంణక' (స్కంధసాగరుడు) అని ఒక కుమారుడును, వేరొక కొమార్తెయు కలరు. కొమార్తెపేరు తెలియదు. శాంతిశ్రీ తనకొమార్తెను శాంతమూలుని కొమారుడును, తన మేనల్లుడును అయిన శ్రీవీరపురుషదత్తునికి ఇచ్చి వివాహము చేసెను: ఇక శాంతమూలుని రెండవసోదరి 'హమ్మసిరి' (హర్మ్యశ్రీ)కి ఇరువురు కొమార్తెలు. ఒకతె పేరు 'బాపిసిరినిక' (వాపిశ్రీ). రెండవ కూతురి పేరు 'చఠిసిరి' (షష్ఠిశ్రీ). వీరి నిద్దరిని వీరపురుషదత్తునికే ఇచ్చి పెండ్లి చేసిరి.

శాంతమూలునికి 'మాఢరి' యందు వీరపురుషదత్తుడు జనించెను. అందువలన ఇతనికి మాఢరిపుత్ర శ్రీవీరపురుషదత్తుడు అని పేరు కలిగినది. వీరపురుషదత్తునికి ఒక సోదరి కలదు. ఆమెపేరు అటవిశాంతిశ్రీ. ఈమె ధనకకులజుడైన మహాసేనాపతి, మహాదండనాయక 'ఖందవిసాఖంణక', అనగా స్కందవిశాఖుని భార్య.

ఇక్ష్వాకులు పరిపాలించిన కాలము నాటికి తెలుగు దేశములో పూర్వకాలమునుండి ఉండిన కులములును, తెగలును తమ ప్రత్యేకతను వీడి ఒండొరులతో కలిసిపోయి మహాజన సంఘముగా ఏర్పడలేదు. ఇక్ష్వాకు శాసనముల వలన పూగియులు, ధనకులు, హిరణ్యకులు, కులహకులు అను తెగలవారు తెలియవచ్చుచున్నారు. ఆకాలములోని వీరి వలన ప్రదేశములు వీరిపేరనే తరువాతి కాలమున వ్యవహరింపబడుచు వచ్చినవి. ఎట్లన: పూగియుల వలన ప్రదేశము పూగియరాష్ట్రము; ఇదియే తరువాతి పూంగి రాష్ట్రమని, పాకనాడని వ్యవహరింపబడుచు వచ్చినదని కొందరు చరిత్రకారుల అభిప్రాయము. హిరణ్యకుల వలన ప్రదేశము హిరణ్యరాష్ట్ర మయినది.

ఇక్ష్వాకు రాజ్యసంస్థాపకుడయిన శాంతమూలుని శాసనము లేవియు ఇంతవరకు కానరాలేదు. ఇతనిని గురించి మనకు తెలియవచ్చిన దంతయు ఇతని తరువాత రాజ్యమునకు వచ్చిన ఇతని కుమారుడు వీరపురుషదత్తుని శాసనములవలననే.

శాంతమూలుని తరువాత రాజ్యమునకు వచ్చినవాడు అతని కుమారుడు వీరపురుషదత్తుడు. నాగార్జునుని కొండలోను, జగ్గయ్యపేటలోను కానవచ్చిన ఇతని పరిపాలన కాలమునాటి శాసనములలోని కడపటి రాజ్యసంవత్సర సంఖ్య 20. ఈతడు ఇరువదేండ్లకు పైగనే రాజ్యము చేసెనేమో చెప్పలేము కాని అంతకు తక్కువకాలము రాజ్యము చేయలేదు అనుట నిశ్చయము. మేనరికము తెలుగుదేశములో ఇప్పటికి దాదాపు 1800 ల సంవత్సర క్రిందటినుండి వచ్చుచుండిన ఆచార మనుటకు ఈతని వివాహమే తార్కాణము. వీరపురుషదత్తుని రాణులలో ముగ్గురు అతని మేనత్త కూతుండ్రే. ఇతడు తన రాజ్యమునకు చుట్టుప్రక్కలనున్న రాజ్యాధిపతులతోకూడ సంబంధ బాంధవ్యములు కలిపి రాజకీయముగ తనస్థితిని మరింత కట్టుదిట్టము చేసికొనెను. ఇటువంటి వానిలో ఉజ్జయినీ భూపతులతోడి సంబంధము ఒకటి. క్రి. శ. 180 ప్రాంతమున ఉండిన టాలెమీ యను భూగోళశాస్త్రవేత్త తనకాలమున ఉజ్జయినీ నగరము చష్టనుడు పరిపాలించుచుండినట్లు చెప్పియున్నాడు. ఇతడు శకజాతీయుడు. ఇక్ష్వాకులు కృష్ణాతీర ప్రాంతమును పాలించుచుండిన కాలమున చష్టన సంతతివారయిన శకక్షత్రపులే ఉజయిని రాజధానిగా పశ్చిమహిందూదేశమును పాలించుచుండిరి. వీరపురుషదత్తుని రాణులలో ఉజ్జయినీ మహారాజ బాలిక ('ఉజెనిక మహారాజ బాలిక) మహాదేవి రుద్రధరభట్టారిక ఒకతె. శకులలో రుద్రతో ఆరంభమగు రుద్రసేన, రుద్రసింహవంటి పేరులు వచ్చును. పేర్లలోగల



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పోలికను బట్టియు, మహారాజ కాలిక యనబడుటను బట్టియు రుద్రధర భట్టారిక వీరిలో ఎవరో యొకరి - ప్రాయికముగా రెండవ రుద్రసేనుని (క్రీ. శ. 255 - 277) సంబంధి కావచ్చునని చరిత్రకారులు ఊహించుచున్నారు.

వీరపురుషదత్తునికి 'ఎహువుల శాంతమూలు' ('ఎహువులచాంతమూల')డను కుమారుడును, 'కొడబలిసిరి' అను కూతురును కలిగిరి. 'కొడబలిసిరి' వనవాస మహారాజు మహాదేవి. వనవాస, లేదా వనవాస యన్నది ఇప్పటి కెనరాదేశమునకు ప్రాచీననామము. వనవాసి యన్నది వైజంతి (ప్రాకృతరూపము - వేజయంతి)కి నామాంతరము. శాతవాహన సామ్రాజ్యము భగ్నమైన పిదప చుటుకుల జులు తెలుగుదేశమునకు నైరృతిభాగముననున్న దేశమును ఆక్రమించుకొని వైజయంతి రాజధానిగా కుంతల దేశమును పాలించుచుండిరి. 'కొడబలిసిరి' రాజకన్యకను ఇచ్చి ఇక్ష్వాకునృపులు చుటుకులజులతో సంబంధము కలుపుకొని తమరాజ్యమును దృఢతమము చేసికొనిరి.

వీరపురుషదత్తుని అనంతరము అతని కొమారుడు 'ఎహువుల' శాంతమూలుడు రాజ్యమునకు వచ్చెను. ఇతని పదునొకండవ రాజ్యసంవత్సరములో ఇతని చెల్లెలు 'కొడబలిసిరి' నాగార్జునుని కొండలో ఒక విహారమును కట్టించెను. దీనినిబట్టి అతడు పదునొకండేండ్లు రాజ్యపాలనము చేసినట్లు రూఢి అగుచున్నది.

ఇటీవల గుంటూరుజిల్లా, గురజాలలో మరొకశాసనము దొరకినది. అది మహారాజు 'రుటుపురిసద'తుని శాసనము. పురుషదత్తనామమును బట్టియు, శాసన లిపిని ఒట్టియు చూడగా ఈ మహారాజుకూడ ఇక్ష్వాకురాజ వంశజుడై ఉండునని చరిత్రకారుల అభిప్రాయము. ఈ యభిప్రాయము ఇటీవల దొరకిన మరియొక ఇక్ష్వాకు శాసనమువలన ధ్రువపడినది. ఈ శాసనమున ఇతడు రుద్ర పురుషదత్తుడు ('రుదపురిసదత') అని పేర్కొనబడెను. ఇతడు 'ఎహువుల' శాంతమూలుని కుమారుడని ఈ శాసనమువలన విదితమగుచున్నది. ఈ మహారాజు నాలుగవ (విజయరాజ్య) సంవత్సరము నందు 'నొదుకసిరి' భగవంతుడైన హాలంపూర స్వామికి కొంత క్షేత్రమును సమర్పించెను. హాలంపూరు అన్నది హైదరాబాదు రాజ్యములోని రాయచూరుజిల్లా అలంపురమని కొందరందురు. కాని ఇది సందియము. హాలంపూరస్వామి భగవంతుడైన బుద్ధుడే. నాగార్జునునికొండ బౌద్ధక్షేత్రములోనే ఇది ఉండవలయును. ఇది ఇప్పటి నాగులవరము కావచ్చును. హల మనగా నాగలి. ఇక్ష్వాకు నృపుడయిన శాంతమూలుడు అనేక శతసహస్రహలములను దానము చేసిన విషయము మనకు తెలిసినదే. ఆ దానము చేసిన చోట ఊరు వెలయగా దానికి హాలంపురమని పేరు కలిగి యుండును. హాలంపురమే నాగలి వరము. ఇదియే జన వ్యవహారమున నాగులవరమని మారియుండును అని యూహ. ఇది ఇంకను విచారింపవలసిన విషయము. రుద్ర పురుషదత్తుడు నాలుగేండ్లు పరిపాలనము చేసినట్లు పూర్వోక్త గురజాల శాసనమువలన తెలియుచున్నది. ఇతడే ఇంతవరకు తెలియవచ్చిన కడపటి ఇక్ష్వాకు రాజు.

మొత్తముమీద ఇక్ష్వాకు రాజుల స్వతంత్ర పరిపాలనము క్రీస్తుశకము మూడవ శతాబ్దములోనో నాలుగవ శతాబ్దము మొదటి పాదములోనో అంతమైనట్లు కనబడు చున్నది. ఇక్ష్వాకు రాజ్యము అంతరించుటకు పల్లవ రాజ విజృంభణమే కారణము కావచ్చును. పల్లవసింహ వర్మ శాసనము ఒకటి గుంటూరు జిల్లా, పల్నాడు తాలూకాలో కనబడినది. ఈ శాసనము ప్రాకృతభాషలో ఉండుటయే కాక, దీని లిపి ఇక్ష్వాకు శాసనలిపిని పోలి ఉన్నది. ఈ కారణముచేత ఈ పల్లవసింహవర్మ ఇక్ష్వాకు రాజుల కాలమునకు చాల దగ్గర కాలము వాడని చెప్ప వచ్చును. ఇప్పటికి దొరకిన పల్లవశాసనములు అన్నిటిలో ఇదియే కడు ప్రాచీనమైనదిగ భావించవచ్చును. పల్లవులు అందరివలెనే ఇతడును భారద్వాజ గోత్రుడు. ఈ కారణముచేతనే ఇక్ష్వాకురాజ్యము పల్లవుల విజృంభణమువలన అంతరించి ఉండవచ్చును అనుట. సింహవర్మ తరువాత తెలియవచ్చిన పల్లవరాజు యువమహారాజ స్కందవర్మ. ఇతని మైదవోలు శాసనమునుబట్టి, ఈతని నాటికే పల్లవులకు కాంచీపురము రాజధాని అయ్యె ననియు, కృష్ణానదికి దక్షిణ తీరమున గుంటూరుజిల్లాలో ఇక్ష్వాకులు ఏలిన దేశ మంతయు వారి యధికారము క్రిందికి వచ్చె ననియు, వారి వ్యాపృతుడు (ప్రతినిధిపాలకుడు) ఒకడు ధనకటకము లో ఉండె ననియు తెలియవచ్చు చున్నది.

ఇక్ష్వాకు రాజులకాలమునాటి శాసనములు అన్నియు బౌద్ధవిహారస్తూప నిర్మాణమును గూర్చియు, బౌద్ధస్తూపములకు చేసిన దానములను గూర్చియు తెలుపును. ఈ బౌద్ధస్తూప విహారాది నిర్మాతలు, దానములు చేసిన వారు అందరును ఇక్ష్వాకు రాజకుటుంబమునకు చెందిన అంతఃపురజనము. తండ్రియైన శాంతమూలుడు వైదికక్రతువులు చేసినను అతని కుమారుడు అట్టి యాగములను చేసినట్లు చెప్పబడలేదు. ఇది యట్లుండ అతడు కాని, అతని కుమారుడు కాని బౌద్ధవిహారస్తూపములనుకాని నిర్మించనులేదు; వానికి దాన ధర్మములను చేయను లేదు. అందువలన వీరపురుషదత్తాదులు బౌద్ధులని గట్టిగ చెప్పలేము.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఇక్ష్వాకురాజుల అవరోధమువారు బౌద్ధమతావలంబులు, బౌద్ధమతాభిమానులు అయి బౌద్ధమతమును ఆదరించిరి. అందువల్ల ఇక్ష్వాకురాజ్య కాలములో బౌద్ధము తెలుగు దేశములో ముమ్మరముగా వ్యాపించినది (చూడుడు: నాగార్జుననికొండ).

ఇక్ష్వాకులకాలము తెలుగుదేశములో బౌద్ధమతమునకు ఉచ్ఛదశయని చెప్పవచ్చును. ఇక్ష్వాకురాజవంశ స్త్రీల ఆదరణ ప్రోత్సాహములవల్ల నాగార్జుని కొండలో బౌద్ధ స్తూపములును, ఇతర నిర్మాణములును అనేకము నిర్మితము లయినవి. ఈ బౌద్ధనిర్మాణకృషి వలన శిల్పకళ ఎక్కువగా వృద్ధిపొందినది. నాగార్జుని కొండలోని బౌద్ధశిల్ప మంతయు అమరావతీ శిల్పకళా సంప్రదాయము ననుసరించినదే.

ఇక్ష్వాకురాజుల కాలములో నాగార్జుననికొండ ఒక్క తెలుగుదేశములోని, హిందూదేశములోని బౌద్ధులకు మాత్రమేకాక, ఆసియాఖండములోని బౌద్ధు లందరికి గొప్ప యాత్రాస్థలము అయినది. ఆ కాలములో అది ఆసియా ఖండమునకు అంతకును బౌద్ధవిజ్ఞానమును పంచిపెట్టి విజ్ఞాన దీపమును వెలిగించిన గొప్ప బౌద్ధ విద్యాపీఠము. శాతవాహనుల కాలములో ధనకటకము ఎంత గొప్ప బౌద్ధ విద్యాపీఠముగ ఉండెనో, ఇక్ష్వాకులకాలమున నాగార్జుననికొండ అంతకంటెను గొప్పబౌద్ధ విజ్ఞాన మహాక్షేత్రముగ ప్రఖ్యాతమైనది. చీన, సింహళము, కాశ్మీరము, వనవాసి, గాంధారము, వంగము, తోసలి, అపరాంతము, యవనము, ద్రమిళము మొదలైన దేశములకు ఇక్కడ నుండి వెళ్లుటయే కాక అక్కడనుండి ఇక్కడికికూడ బౌద్ధ విద్యార్థులు బౌద్ధవిద్యాపారంగతులు అగుటకు వచ్చు చుండెడివారు. ఇక్ష్వాకుల కాలములోని నాగార్జుని కొండ బౌద్ధాంధ్ర కళాకీర్తి కేతనము.

## బృహత్ఫలాయనులు

ఇక్ష్వాకు రాజ్యము అంతరించిన తరువాత క్రీస్తు శకము నాల్గవ శతాబ్దము ప్రథమ పాదములో కృష్ణానది ఉత్తర తట ప్రదేశమును పరిపాలించినవారు బృహత్ఫలాయన సగోత్రులు. ఇక్ష్వాకుల తరువాతినుండి ప్రాగాంధ్ర దేశ మును పరిపాలించిన రాజవంశజులు కొందరు తమ గోత్ర ములనే కాని తమ కులమును చెప్పుకొని యుండలేదు. కళింగములో వాసిష్ఠసగోత్రులు, కృష్ణా గోదావరీతీర మధ్యప్రదేశమున శాలంకాయన సగోత్రులు, కృష్ణానది దక్షిణ ప్రదేశమున ఆనంద సగోత్రులు మొదలైనవారు పరిపాలించినట్లు వారి వారి శాసనములవలన తెలియు చున్నది. ఇట్టివారిలో బృహత్ఫలాయన సగోత్రు లొకరు. ఇంతవరకు వీరి శాసనము ఒక్కటియే దొరకినది. అది కొండముది శాసనము; జయవర్మ మహారాజుది. జయవర్మ కూదూరు రాజధానిగా కృష్ణానది ఉత్తరతట ప్రదేశమును పరిపాలించెను. ఇతడు మహేశ్వర పాద పరిగ్రహీతుడు, శివభక్తుడు. ఇతడు తన పదవ విజయరాజ్య సంవత్సరమున ఎనమండ్రు బ్రాహ్మణులకు కూదూర హారములోని పాంటూరను గ్రామమును బ్రహ్మదేయము చేసి హేమంత ఋతువు మొదటి పక్షము మొదటి దినమున దానముచేసెను. ఈ విషయమును తెలుపుటకే ఈ కొండముది శాసనము పుట్టినది. ఈ శాసనభాష ప్రాకృతము. శాసన ముద్రికమీద మాత్రము 'మహారాజ జయవర్మది' అని సంస్కృత ములో ఉన్నది. జయవర్మ మహాసైన్యాధిపతి 'భావహాన వమ్మ' (భావహానవర్మ). ఇతడు 'మహాతగివరు'డనియు, 'మహాదండనాయకు' డనియు చెప్పబడినాడు. 'మహా తలవర' అనుటకు 'మహాతగివర' అని తప్పుగా వ్రాయ బడినది. ఇక్ష్వాకు సామంతులైన పూగియులకును, హిరణ్య కులకును కూడ మహాతలవర, మహాదండనాయక బిరుద ములు కలవు. దీనినిబట్టి చూడగా బృహత్ఫలాయన జయ వర్మ ఇక్ష్వాకులకు సమీప కాలమువాడని తెలుచున్నది. ఇది యటుండ, ఈ కొండముది శాసనములోని పరిహార ములు మొదలైనవాని పదజాలము పల్లవ యువమహారాజ స్కందవర్మ శాసనములో వలెనే ఉన్నది. ఈ శాసనమును ప్రకటించిన హుల్ష్ పండితుడు శాసనములోని భాషయు, పదజాలమును గౌతమీపుత్ర సాతకర్ణి, వాసిష్ఠీపుత్ర పుల మాయిల నాసిక శాసనములలోని వానివలెనే ఉన్నదని చెప్పియున్నాడు. అదియును కాక, శాసన కాలమును తెలుపు పద్ధతికూడ శాతవాహన, ఇక్ష్వాకురాజుల శాసనము లలో ఇచ్చిన పద్ధతినే పోలి ఉన్నది. ఇందువలన, చిట్టచివరి శాతవాహన నృపతులకును, ఇక్ష్వాకు రాజులకును ఇతడు దూరస్థుడు మాత్రము కా డనియు, క్రీస్తు శకము నాలుగవ శతాబ్దము ప్రథమ పాదములోనివాడు అయి యుండు ననియు చెప్పుటకు వీలగుచున్నది.

జయవర్మ రాజధానియైన కూదూరు కృష్ణజిల్లా బందరు తాలూకాలోని గూడూరని కొందరు చరిత్రకారులు అభిప్రాయపడుచున్నారు. కూదూరహారము అనునది కూదూరు ముఖ్యపట్టణముగా గల తత్ప్రాంత దేశము. పూర్వకాలములో దేశ విభాగమునకు హారమని, ఆహార మని, విషయమని, నాడని పేర్లు. కూదూర హారమే కాల క్రమమున కూదూరహారమని, కుద్రాహారమని, గుద్రా హారమని, గుద్రవారమని వ్యవహరింపబడినట్లు చరిత్ర పరిశోధకులు చెప్పుదురు.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



జయవర్మ తరువాత, బృహత్ఫలాయన సగోత్రులు ఇం కెవరయినను రాజ్యము చేసిరో లేదో మనకు తెలియదు. వీరి రాజ్యము ప్రాయికముగా శాలంకాయన గోత్రుల విజృంభణమువలన అంతరించి యుండవచ్చును.

## శాలంకాయనులు

వేంగీపురము రాజధానిగా తత్ప్రాంతమును పరిపాలించిన భూపతుల ప్రస్తావము మొదటిమారు గుప్తచక్రవర్తి సముద్రగుప్తుని అలహాబాదు స్తంభ శాసనములో దక్షిణ దిగ్విజయ సందర్భమున వచ్చును. ఆ శాసనములో సముద్రగుప్తుడు జయించినట్లు తెలుపబడిన దక్షిణదేశ రాజన్యులలో వేంగి హస్తివర్మ ఒకడు. ఈతడు సముద్రగుప్తునికి సమకాలికుడు; కావున క్రీ. శ. 350 ప్రాంతమున ఉండినట్లు భావింపవలసి యున్నది. పూర్వోక్త స్తంభ శాసనములో 'వేంగి హస్తివర్మ' అనియే పేర్కొనబడెను; కాని, అతని వంశము పేరు చెప్పబడలేదు. వేంగీపురము రాజధానిగా పరిపాలించిన భూమీశుల శాసనములు ఇంతవరకు ఎనిమిది దొరకినవి. వీ రందరును తాము శాలంకాయన సగోత్రులమని, విజయ వేంగీపురము రాజధానిగ పరిపాలించితిమని చెప్పుకొనినవారే. వీరి శాసనము లన్నియు విజయవేంగీపురమునుండి ఇయ్యబడినవి; కాన, అదియే వీరి రాజధాని అని చెప్పవచ్చును. చరిత్రకారులు ఈ వేంగీపురమును పడమటి గోదావరిజిల్లా, ఏలూరు తాలూకా, ఏలూరికి సమీపమునందున్న ఇప్పటి పెదవేగిగా గుర్తించియున్నారు.

శాలంకాయనుడు ఒక వైదిక ఋషి. ప్రవరకాండలో శాలంకాయన గోత్రములు రెండు చెప్పబడినవి. ఒకటి అంగిరస గణములోనిది; మరియొకటి విశ్వామిత్ర గణములోనిది. వేంగీ భూపాలకులది ఏగణమునకు చెందిన గోత్రమో తెలియరాదు. 'శాలంకాయన' అను గోత్రమునకు చెందినవా రగుటచేత వీరిని శాలంకాయన గోత్రులని, శాలంకాయన వంశజులని, వేంగీపురము రాజధానిగా పరిపాలించిన వారగుటచేత వైంగేయకులని వ్యవహరింతురు. పాణినీయ గణపాఠములో నడాదియందును (4-1-99), రాజన్యాది యందును (4-2-51) శాలంకాయన శబ్దము కనబడుచున్నది. క్రీస్తు శకము రెండవ శతాబ్దమునాటి టాలెమీ అను భూగోళ శాస్త్రజ్ఞుడు 'సలకేనాయ్' అను తెగవారు మైసోలియా ఉత్తరమున ఉండిరని, వారి ముఖ్యపురము బెనగోరన్ అని చెప్పి యున్నాడు. దీనిని పురస్కరించుకొని కొందరు చరిత్రకారులు మైసోలియా అన్నది మచిలీపట్టణ ప్రాంతమని, బెనగోరన్ అన్నది వేంగీపురమునకు తప్పు రూపమని, 'సలకేనాయ్' అను వారు శాలంకాయనులే అని వ్రాసి యున్నారు. ఇవి అన్నియు కేవలము అత్యూహలు. మైసోలియా మచిలీపట్టణ ప్రాంతము కాదు; బెనగోరన్ వేంగీపురమును కాదు. 'సలకేనాయ్' అను తెగకు ఈ వేంగీ శాలంకాయనులకు ఏదయిన సంబంధము కలదో లేదో చెప్పుట కష్టము. వారే వీరు అని నిర్ధారించుటకు నిరూఢమయిన ఆధారములు లేవు. పాణినీయ గణపాఠమున శాలంకాయన పదము వచ్చుటవలన శాలంకాయను లనువారు ఒక రుండినట్లు పాణినికి తెలిసిన తెలిసియుండవచ్చును. ఆయాచార్యునికి తెలిసిన శాలంకాయనులు వీరు కావచ్చును; మరొకరయినను కావచ్చును. ఏలన కాశికా వృత్తినిబట్టి శాలంకాయనులు వాహీక దేశములోని వారని, వారు మూడు గణముల వారని ('త్రికాః శాలఙ్కాయనాః' - కాశికా, పుట 456) అని తెలియవచ్చుచున్నది. ఈ కారణముచేత శాలంకాయన పదము ఏయే గ్రంథములలో వచ్చినను అది ఈ వేంగీ శాలంకాయనులకు వర్తించునదే అని కాని, వీరిని సూచించునదే అనికాని యూహించుట పొరపాటు. శాలంకాయన శాసన ముద్రికలమీద నంది విగ్రహము ఉండుటచేతను, మేదిని అను సంస్కృత కోశమునందు శాలంకాయన శబ్దమునకు నంది యను నర్థము చెప్పబడుటచేతను వీరు నంది వంశజులమని చెప్పుకొనుచుండిరేమో అని కొందరు సంశయముగ సూచించిరి. కాని ఈ యూహకు కూడ తగిన ఆధారము కానరాదు; బలము లేదు. శబ్దార్థమును బట్టి వంశ నిర్ణయము చేయలేము. అందువలన, దొరకిన ఆధారములను అనుసరించి ప్రకృతము వేంగీపురము రాజధానిగా పరిపాలించినవారు ఆనందగోత్రులవలెను, బృహత్ఫలాయన గోత్రులవలెను శాలంకాయన గోత్రులని, శాలంకాయన వంశమువారని, వీరి శాసన ముద్రిక మీది నంది విగ్రహము వీరు శైవులని మాత్రమే తెలుపునని చెప్పగలము. వారు ఎంత కాలమునుండి పెదవేగి ప్రాంతమున నుండిరో తెలియరాదు. ఇక్ష్వాకు వంశపురాజుల రాజ్యము కూలిపోయిన తరువాత క్రీస్తు శకము మూడవ శతాబ్దపు చివరనో, నాలుగవ శతాబ్దము ప్రారంభముననో ఈ శాలంకాయనులు వేంగీపుర ప్రాంతమున తమరాజ్యమును స్థాపించిరి. క్రీస్తు శకారంభ శతాబ్దములందు దక్కనులో సాతవాహనులు మొదలుకొని రాజ్యములు వెలయించిన రాజవంశములవారు సాతవాహనుల వలెనే స్వతంత్ర రాజ్యస్థాపనమునకు సూచకముగ అశ్వమేధయాగము చేయుట ఆచార మయ్యెనని అంగీకరించుచో శాలంకాయనులును అశ్వమేధము చేసినవారే.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/

కాలంకాయనులు తాము భగవంతుడైన చిత్రరథస్వామి పాదానుధ్యాతుల మనియు, బప్ప భట్టారక పాదభక్తుల మనియు చెప్పుకొన్నారు. సంస్కృత కోశములలో చిత్ర రథ శబ్దము సూర్య పర్యాయముగ కనబడుటవలన సూర్యుడే కాలంకాయనుల కులదైవమని చెప్పవచ్చును. వీరు సూర్యారాధకులు. సూర్యోపాసనము తెలుగు దేశములో పూర్వము చాల వాడుకలో ఉండె ననియు, సూర్యునికి తెలుగుదేశములో దేవాలయము లుండె ననియు చెప్పుటకు ఆధారములు కలవు. ఇప్పటికిని శ్రీకాకుళము జిల్లాలోని అరసవల్లి సూర్యక్షేత్రము. కాలంకాయనుల రాజ్యకాలములో వేంగీపురమున చిత్రరథస్వామి దేవాలయము ఉండి యుండవలెను. నేటికిని పెదవేగిలో చిత్రరథస్వామి దేవాలయమని అచ్చటివారు ఒక పురాతన దేవాలయమును చూపుదురు. బప్ప పదమునకు తండ్రి యని అర్థ మనియు, బప్ప భట్టారక పాదభక్తులు, అనగా వీరు తమ తండ్రులయెడ వినయ విధేయతలు చూపి వారిని దైవముగా భావించుచుండి రనియు చరిత్రకారులు అర్థము చెప్పియున్నారు. వీరు స్వతంత్ర రాజ్యస్థాపనమునకు పూర్వము ఒకవేళ ఇక్ష్వాకులకు సామంతులుగ ఉండిరేమో మనకు తెలియదు.

ఇదివరలో నుడివినట్లు కాలంకాయన శాసనములు ఇంతవరకు ఎనిమిది దొరకినవి. వీనిలో మూడు ప్రాకృత భాషలో ఉన్న శాసనములు; మిగిలినవి సంస్కృతభాషలో ఉన్నవి. ప్రాకృత శాసనములలో యువ మహారాజు శ్రీ చండవర్మ శాసనము ఇంతవరకు ప్రకటితము కాలేదు. మిగిలిన రెండు ప్రాకృత శాసనములు దేవవర్మ - ఏలూరు శాసనమును, మహారాజు శ్రీ నందివర్మ శాసనమును - ప్రకటితము లయినవి. ఇక సంస్కృత శాసనములలో ఈకాలంకాయన రాజుల పౌర్వాపర్యములను, వారి వంశానుక్రమ నిర్ణయమును తెలిసికొనుటకు ఉపకరించునవి మూడు శాసనములు: (1) చండవర్మ జ్యేష్ఠ పుత్రుడయిన నందివర్మ తన యేడవ విజయరాజ్య సంవత్సరమున పుష్య బహుళ అష్టమి నాడు 157 గురు బ్రాహ్మణులకు కుదుహార విషయములోని 'విదెనూరపల్లిక' అను గ్రామమును అగ్రహారము చేసి దాన మిచ్చి దానపట్టా ఇచ్చెను; (2) నందివర్మ పెదవేగి శాసనము. హస్తివర్మ ప్రపౌత్రుడును, నందివర్మ పౌత్రుడును, చండవర్మ జ్యేష్ఠ పుత్రుడును అగు రెండవ నందివర్మ త్రిలోకనాథుడయిన విష్ణుగృహస్వామికి (అనగా విష్ణ్వాలయమునకు) వేర్వేరు గ్రామములలో కొంత కొంత భూమిని దేవహలము, అనగా దేవభోగము చేసి తన పదవ విజయరాజ్య సంవత్సరమున దానముచేసి శ్రావణ శుద్ధ పాడ్యమినాడు దానశాసనము ఇచ్చెను; (3) స్కందవర్మ శాసనము: ఇతడు హస్తివర్మ ప్రపౌత్రుడు, నందివర్మ పౌత్రుడు, హస్తివర్మ పుత్రుడు. ఇతడు కుద్రహార విషయములోని కొమ్మర గ్రామమును చాతుర్వైద్యుడైన (చతుర్వేద విదుడైన) రథకారునికి సర్వపరిహారములతో బ్రహ్మదేయముచేసి తన మొదటి పరిపాలన సంవత్సరమున దానము చేసి కార్తిక శుద్ధ పాడ్యమినాడు దానశాసనము ఇచ్చెను. ప్రతిగ్రహీతయైన రథకారుని పేరు ఇందు చెప్పబడలేదు. ఈ మూడు శాసనములవల్లను కాలంకాయన వంశానుక్రమము ఇట్లు తెలియవచ్చుచున్నది. మొదటి హస్తివర్మ కుమారుడు మొదటి నందివర్మ. ఇతనికి చండవర్మ, (రెండవ) హస్తివర్మ అని ఇరువురు కుమారులు. వీరిలో చండవర్మ జ్యేష్ఠ పుత్రుడు (రెండవ) నందివర్మ. (రెండవ) హస్తివర్మ కుమారుడు స్కందవర్మ. దేవవర్మ, యువ మహారాజ చండవర్మల ప్రాకృత శాసనములలో వారి తండ్రుల పేరులు తెలుపబడలేదు. ఈ విధముగానే స్కందవర్మ కంతేరు శాసనమునను, నందివర్మ కంతేరు శాసనమునను వీరి తండ్రుల పేర్లు లేవు. ఈ స్కందవర్మ, నందివర్మలవి సంస్కృత శాసనములు. ఈ నందివర్మయు, రెండవ నందివర్మయు ఒక్కడే కావచ్చును. ఇట్లయిన నీతని శాసనములు మూడు కానవచ్చిన వనవచ్చును. ఒకటి ఏడవ విజయ రాజ్య సంవత్సరమునాటిది; రెండవది పదవ విజయరాజ్య సంవత్సరమునాటిది; మూడవది సంవత్సర మేదియు తెలుపబడని కంతేరు శాసనము. ఈ మూడు శాసనములలోని నందివర్మ పరమభాగవతుడు. కంతేరు శాసనమే ఈతడు తన పరిపాలనమున మొదట ఇచ్చినదేమో. తరువాత వానిలో క్రమముగా శాసన గ్రంథము పెరిగినది. ఇక కంతేరు శాసనపు స్కందవర్మ తండ్రిపేరు తెలియక పోయినను ఇతడును, రథకారునికి దానము చేసిన (రెండవ) స్కందవర్మయు ఒక్కడే అగుదురేమో విచారింపవలసి యున్నది. ఇరువురును తాము చిత్రరథస్వామి పాదానుధ్యాతుల మనియే చెప్పుకొనిరి; కాని, పరమమాహేశ్వరుల మని కాని, పరమ భాగవతులమని కాని చెప్పుకొనలేదు. పూర్వోక్త దాన శాసనములు రెండును ఇతడు తన పరిపాలన కాలము మొదటి సంవత్సరముననే ఇచ్చెను. ప్రాకృత శాసనపుదాత యువమహారాజ చండవర్మ ప్రాయికముగా మొదటి నందివర్మకుమారుడును, రెండవ నందివర్మ తండ్రియు అయిన చండవర్మ అగునేమో. యువమహారాజ చండవర్మ భవస్కంద శర్మార్య, భట్టిశర్మార్యులను కాశ్యపసగోత్రులైన ఇరువురు బ్రాహ్మణ సోదరులకు ఒక గ్రామము అగ్రహారము చేసి ముప్పదియైదవ సంవత్సరమున



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వర్షర్తువు పదవ పక్షము రెండవ దినమున దానమిచ్చెను. ఈ ముప్పదిమూడవ సంవత్సరము తండ్రియైన నందివర్మ మహారాజు పరిపాలన సంవత్సరము కావలెను.

ఇక మిగిలినవి రెండు ప్రాకృత శాసనములు; (1) దేవవర్మది ; (2) నందివర్మది. దేవవర్మ తాను అశ్వమేధ యాగమును చేసినట్లు చెప్పికొనెను. ఇతడు బ్రాహ్మణులకు ఏలూరులో కొంతభూమిని తన పదుమూడవ విజయరాజ్య సంవత్సరమున పుష్య బహుళ దశమినాడు దానము చేసెను. రెండవదియైన నందివర్మ శాసనము ఆ మహారాజు పదునాలుగవ సంవత్సరమునాటిది. అతడు శాపానుగ్రహ సమర్థులును, 'నానాగోత్రచరణ తపస్స్వాధ్యాయ నిరతు'లును, 'చాతుర్వైద్యు'లును (చతుర్వేద విదులును) అయిన రథకారులకు 'రథకార విధాన'మున అగ్రహారముచేసి వర్షర్తువు రెండవపక్షము మొదటి దినమున 'పిడిహ' గ్రామమును దానముచేసెను. ఈ దానము శాలక మహారాజకుమారుడు స్కందపౌత్రుని శక్తిసత్త్వాదుల నిమిత్త మిచ్చినది. దీనికి ఆజ్ఞప్తి మహారాజ పుత్రుడు. ఇతడు కాక ఈ శాసనములో 'హత్థిసామి' యొకడు పేర్కొనబడెను. ఇతనికిని నందివర్మ మహారాజునకును గల సంబంధము తెలుపబడలేదు. 'శాలకమహారాజ కుమార ఖంద పొత్తప్ప' అనుదానికి 'శాలకమహారాజ కుమార స్కందపౌత్రునియొక్క' అని యర్థము. ఇతడు స్కందుడను పేరుగల పౌత్రుడా, స్కందుని పౌత్రుడా అని సంశయము. స్కందుడు నందివర్మ మహారాజ పౌత్రుడా, లేక అతని కుమారుడా అన్నదియు, శాలకు డన్న పదము మహారాజునకు వర్తించునా, స్కందునకు వర్తించునా అన్నదియు విచారణీయము. 'హత్థిసామి' అన్నది 'హస్తిస్వామి' అనుదాని ప్రాకృతరూపము. శాసనములలో సాధారణముగా ఆజ్ఞప్తిని పేర్కొనుట ఆచారము. ఇందు ఆజ్ఞప్తికి ముందు 'హత్థిసామి' ఒకడు ఉదాహృతుడు అయినాడు. ఈ హస్తిస్వామి ఎవరు ? ఇతనికిని, నందివర్మ మహారాజునకును, స్కందపౌత్రునికిని గల సంబంధము ఎట్టిది ? ఇవి ఇంతవరకు సంతృప్తికరముగా కాదు, ఒక విధముగానైన పరిష్కరింపబడని విషయములు. ఈ పై విషయములను ఈ క్రింద నుడివిన రీతిని సమన్వయించి పరిష్కరించుట సమంజసమేమోయని తోచుచున్నది.

హస్తిస్వామి హస్తివర్మ. ఈ శాసనకాలము నాటికి అతడు జీవించియుండినను నిజముగా రాజ్యమేలుచుండిన వాడు అతని కొమారుడు నందివర్మ మహారాజు. కొమారునికి పట్టము కట్టి హస్తివర్మ రాజ్యవ్యవహారములను అతనికి వదలివేసి యుండును. నందివర్మ మహారాజు పుత్రుడే శాలకుడయిన స్కందవర్మ. ఇతడు హస్తివర్మ పౌత్రుడు. పదునాలుగవ విజయరాజ్య సంవత్సరము ప్రాయికముగ హస్తివర్మది. నందివర్మమహారాజు తన పుత్రుని శక్తి సత్త్వాదుల నిమిత్తము ఇచ్చిన దానము ఇది. కొందరు చరిత్రకారులు స్కందపౌత్ర, హస్తిస్వాములను గురించి ఆలోచింపనే లేదు. ఈ శాసనము నందివర్మ మహారాజు దనియు, దీనిని అతడు తన పదునాలుగవ రాజ్యపరిపాలన సంవత్సరమున ఇచ్చె ననియు కొందరు చరిత్రపరిశోధకులు అందురు. ఈ విషయములు ఇంకను విచారింపవలసి యున్నవి. ఈ నందివర్మ పైని చెప్పిన శాలంకాయన వంశావతార క్రమములోని మొదటి నందివర్మయే కావచ్చును. మొత్తముమీద ఒక్క దేవవర్మ తక్క మిగిలిన అందరు ఏదో యొకవిధమున పై వంశావతార క్రమములో ఇమిడినారు. కాని, దేవవర్మ స్థానము ఏది, అతడు ఎప్పటివాడు అన్నది ప్రశ్న. సాధారణముగా ఇదివరలో నుడివినట్లు స్వతంత్ర రాజ్యమును స్థాపించి అశ్వమేధయాగము చేయుట క్రీస్తుశకారంభ శతాబ్దములోని ఆచారమగుటచేతను, శాలంకాయనులలో దేవవర్మయే తాను అశ్వమేధయాగము చేసినట్లు చెప్పుకొనుటచేతను ఇతడే శాలంకాయన రాజ్యమును స్థాపించినవా డనియు, సముద్రగుప్త చక్రవర్తి దండయాత్ర కాలమునకు ఉన్నవాడు హస్తివర్మ అగుటచేత ఇతనికి దేవవర్మ పూర్వు డనియు, క్రీ. శ. 350 కి పూర్వము ఉండె ననియు కొందరు చరిత్రకారులు వ్రాసియున్నారు; కాని ఇంకను విచారింపవలసిన, భావి పరిశోధనవలన తేలవలసిన విషయ మిది. ఏలన, దేవవర్మ శాసనకాలమును తెలుపు పద్ధతికిని, మిగిలిన రెండు ప్రాకృత శాసనములలో కాలమును తెలుపుపద్ధతికిని వ్యత్యాసము కలదు. దేవవర్మ శాసనకాలపద్ధతి కంటె మిగిలిన రెండింటిలోని పద్ధతియు శాతవాహన, ఇక్ష్వాకు శాసనకాల పద్ధతికి చాల చేరికగ ఉన్నది. ఈ పద్ధతిలో సంవత్సరమునకు ఋతువులు మూడే; అవి గ్రీష్మము, వర్షకాలము, హేమంతము. వీనిలో ఒక్కొక్క ఋతువునకు ఎనిమిది పక్షములు, నాలుగు మాసములు. నందివర్మయొక్కయు, యువమహారాజు చండవర్మయొక్కయు దానకాల మీపద్ధతినే తెలుప బడినది. ఇదియే చాల ప్రాచీన పద్ధతి. శాతవాహనుల, ఇక్ష్వాకుల రాజ్యకాలమునకు చాల తరువాత కాని దాన కాలము లేదా, దానశాసనము ఇచ్చుకాలము మాసముల లోను, తిథులలోను తెలుపబడలేదు. దేవవర్మ ప్రాకృత శాసనములో దానకాలము ఈ పద్ధతిని పుష్య బహుళ దశమి యని చెప్పబడినది; అనగా ఈ శాసనము క్రొత్త



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పద్ధతిని దానకాలమును పేర్కొను ఆచారము వాడుక లోనికి వచ్చుచుండిన కాలమునాటిది. ఇందువలన, దేవవర్మ శాలంకాయన రాజన్యులలో ప్రథముడు అగునాయని సంశయింపవలసి వచ్చుచున్నది. చరిత్రకారుల యభిప్రాయములో ప్రాకృత భాషాశాసనములకు స్థూలముగా సముద్రగుప్త దండయాత్రాకాలము, అనగా క్రీస్తుశకము 350 కడపటి హద్దు. అటు తరువాతినుండి శాసనములలో క్రమముగా సంస్కృతము వాడుకలోనికి వచ్చినది.సముద్రగుప్తుని సమకాలికుడు వేంగి హస్తివర్మ. శాలంకాయన గోత్రులలో హస్తివర్మ పేరుగలవారు తాత మనుమలు ఇరువురు కనిపించుచున్నారు. వీరిలో సముద్రగుప్తునికి సమకాలికుడు మొదటి హస్తివర్మా, రెండవ హస్తివర్మా అన్నది ప్రశ్న. మొదటి హస్తివర్మయే అన్నచో అటు తరువాత నందివర్మ. యువమహారాజ చండవర్మ లిచ్చిన ప్రాకృతశాసనములు కనబడుచున్నవి. ఇది సముద్రగుప్తుని కాలము ప్రాకృత భాషాశాసనములకు కడపటి హద్దు అనుటకు విరుద్ధము. ఇట్లయినచో సముద్రగుప్తుని సమకాలికుడు రెండవ హస్తివర్మయే యగునేమో. ఈ రెండవ హస్తివర్మ శాసనము ఇంతవరకు ఒక్కటియు దొరకలేదు. దేవవర్మ రెండవ హస్తివర్మకు ఇంచుక పూర్వుడో, లేక, ఇంచుక తరువాతి వాడో అగునేమో. ఇట్లయిన పూర్వపు రాజులు స్వతంత్ర రాజ్యమును స్థాపించి అశ్వమేధయాగమును చేయుచు వచ్చి రను సిద్ధాంతమునకు ఈ సందర్భమున సమన్వయము ఎట్లన్నది ఇంకొక ప్రశ్న. ఇవి అన్నియు భావి పరిశోధన వలన తేలవలసిన విషయములు.

శాలంకాయనులలోని మొదటి రాజులు ఇక్ష్వాకుల అనంతరము వేంగిలో స్వతంత్రరాజ్యమును స్థాపించి వేంగి పురము రాజధానిగా తత్ప్రాంతదేశమును పరిపాలించిరి. వేంగికి చుట్టుపట్ల కల ప్రాంతమునకు వేంగీ విషయమని, వేగినాడని పేరు. ఆదిమకాలములో ఈ నాడులోని బ్రాహ్మణులకు వేగినాటివారని పేరు. శాలంకాయనులలో మొదటిరాజులు దక్షిణ దిక్కునకు విజృంభించి బృహత్ఫలాయనుల రాజ్యమును ఆక్రమించుకొనిరి. వీరు దానము శాసించిన గ్రామములు కొన్ని బృహత్ఫలాయనుల కూదూరహారము (కుద్రాహారము)లోనివే. వీరి రాజ్యము కృష్ణానదికి దక్షిణమున వ్యాపించిన దనుటకు ఆధారము లేదు.

శాలంకాయనుల కాలమునుండి దేశవిభాగమునకు విషయ మనియే రూఢమయ్యెను. శాలంకాయనులు శైవమును, వైష్ణవమును కూడ సమానముగ ఆదరించిరి. వీరిలో పరమ మాహేశ్వరులును (శైవులును) ఉన్నారు; పరమభాగవతులును (వైష్ణవులును) ఉన్నారు. పరమ భాగవతుడైన రెండవ నందివర్మ పెదవేగి శాసనము త్రిలోకనాథుడైన విష్ణుగృహస్వామికి (విష్ణువునకు) చేసిన భూదానమునే తెలుపును. తెలుగుదేశములో విష్ణ్వాలయము లుండినట్లు తెలుపు మొదటిశాసనము ఇదే. మ. సో. శ.

## ఆనంద గోత్రులు

ఆనంద గోత్రులమని చెప్పుకొన్న కొందరు రాజులు క్రీస్తుశకారంభ శతాబ్దులలో ఇప్పటి గుంటూరు జిల్లాలోని కొంతభాగమును పరిపాలించి యున్నారు. రెండు తామ్ర శాసనములును, ఒక శిలాశాసనమును వీరి చరిత్రకు ఆధారములు. ఈ శాసనములలో మొదటిది దామోదర వర్మ మట్టిపాడు తామ్రశాసనము; రెండవది: అత్తివర్మ గోరంట్ల తామ్రశాసనము; మూడవది: చేజెర్ల శిలా శాసనము. ఈ శిలాశాసనము మొదటి రెంటి కంటె తరువాతిది. అయినను పూర్వోక్త శాసనముల వలన తెలియని విశేషములు దీనివలన తెలియుచున్నవి. కాని, ఈ శాసనము చివరిభాగ మంతయు, అరిగిపోయి పాడగుట చేత ఇది ఎవరిదో తెలియరాదు. ఈ శాసనము వలన తెలియవచ్చు విషయములు ఇవి: ఆనంద మహర్షి మహాగోత్రమునకు కందరరాజు చంద్రునివంటివాడు. ఇతడు శత్రువుల ఏనుగుల గుంపులచేత సంకులమైన ధాన్యకటక యుద్ధములో శత్రురాజులను జయించి కృష్ణవేణ్ణానాథుడును, త్రికూటపతియు అయ్యెను; అనగా ఈ యుద్ధములో పొందిన విజయము వలన ఇతని రాజ్యము కృష్ణానది దక్షిణతీరము మొదలుకొని త్రికూటపర్వతము వరకు వ్యాపించెను. త్రికూటపర్వతము గుంటూరుజిల్లా, నరసరావుపేట తాలూకాలో కావూరువద్ద నున్న కోటప్పకొండయే అని చరిత్రకారుల అభిప్రాయము. ఇతడు తనపేర నిర్మించిన పుర మగుటచేతనేమో కందరపురము ఇతనికి రాజధాని అయినది. ఈ కందరపురమునకు అణకువయై ఇతని రాజ్యములో రెండు జనపదము లుండెను. ఈ కారణముచేతనే ఇతడు కందరపురవర జనపద ద్వితయమునకు అధిపతియని చేజెర్ల శాసనము చెప్పుచున్నది. ఈ రెండు కందరపుర జనపదములును తరువాతి పూర్వ చాళుక్య శాసనములలో వచ్చు ఉత్తరకండెరువాటి, గుడ్ల కండెరువాటి విషయములును, కందరపురము కండెరును (గుంటూరు తాలూకాలోని ఇప్పటి గండేరు) కావచ్చునని కొందరు చరిత్రకారులు అభిప్రాయ పడుచున్నారు. ఇది ఇంకను పరిశీలింప వలసిన విషయము. కందర భూపతిది గృధ్రాధ్యాసిత కేతనము. ఇతని కుమార్తె అవని-



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సంగంతవతి; ఈమె కుమారుడు సత్సభామల్లుడు. ఇటు తరువాతినుండి ఈ శాసనము అరిగిపోయి శిథిలమైనది. అందువలన ఇతర విషయము లేవియు తెలియరాలేదు. శాసన మంతయు సంస్కృత భాషలో ఉన్నది. ఇది ప్రాయికముగ ఐదవ శతాబ్దము చివరిది కావచ్చును.

దామోదరవర్మ, అత్తివర్మలు తాము ఆనందసగోత్రులమని, ఆనందమహర్షి వంశసంభవులమని చెప్పుకొన్నారు. అందువలన వీ రిరువురును కూడ కందరరాజ కులమునకు సంబంధించినవారే. అత్తివర్మ కందరరాజ కులసంజాతుడు. దామోదరవర్మ తన శాసనమును కందరపురము నుండియే ఇచ్చెను. వీని నన్నిటినిబట్టి చూడగా ఈ ఆనందసగోత్రులలో కందరరాజే మొదటి వాడనియు, అతడు నిర్మించిన కందరపురమే వీరి రాజధాని అనియు మనము నిశ్చయింపవచ్చును. వీ రందరిలోను కందరనృపతి శాసనములు ఎవ్వియు కానరాలేదు. ఈ వంశములో మిగిలిన ఇరువురిలో దామోదరవర్మయే మొదటివాడు.

ఇతని మట్టెపాడు శాసనము ప్రాకృతము క్రమముగా క్షీణించి సంస్కృతము దానిస్థానమును ఆక్రమించుకొనుచుండినకాలములో పుట్టినది. అందువలన ఈ శాసనభాష ప్రాకృతపద మిశ్రితమైన సంస్కృతము. సాధారణముగా సముద్రగుప్తుని దండయాత్ర కాలము ప్రాకృతభాషా శాసనములకు కడపటి హద్దనియు, అప్పటినుండి శాసనములలో సంస్కృతభాష కానవచ్చు ననియు చరిత్ర పరిశోధకులు స్థూలముగ నిర్ణయించి యున్నారు. ఈ నిర్ణయము ననుసరించి దామోదరవర్మ క్రీస్తుశకము నాలుగవ శతాబ్దము ఉత్తరార్ధారంభ కాలములో ఉండె ననుట అసమంజసము కాదు. మట్టెపాడు శాసనలిపి కూడ ఈ నిర్ణయమునే బలపరచును. కృష్ణానదీ తీరమున వైదిక మతము మరల పురికొనుచుండినను అప్పటికి బౌద్ధమతము ఇంకను క్షీణదశకు రాలేదు. దామోదరవర్మ బుద్ధ పాదానుధ్యాతుడు; అయినను వైదికమతాభిమానియై గోసహస్ర, హిరణ్యగర్భ మహాదానములను చేసెను. ఇతడు తన రెండవ విజయరాజ్య సంవత్సరమున కార్తిక శుద్ధ త్రయోదశినాడు నానాగోత్ర చరణ తపస్స్వాధ్యాయ నిరతులైన బ్రాహ్మణులకు సర్వపరిహారములతో కంగూర గ్రామమును దానము చేసెను. ఈ విషయమును తెలుపుటకే మట్టెపాడు శాసనము పుట్టినది. కంగూరు ప్రాయికముగా గుంటూరు జిల్లా, నరసరావుపేట తాలూకాలోని ఇప్పటి కానూరు అగునేమో. దామోదరవర్మ తరువాతివాడు అత్తివర్మ. అత్తివర్మ యన్నది హస్తివర్మ పదభవము. ఇతడును హిరణ్యగర్భ మహాదాన ప్రదాత. ఇతడు ఆపస్తంబ సూత్రుడును, యమ నియమ వంతుడును, ఋగ్యజుస్సామ విదుడును, కాశ్యప సగోత్రుడును అయిన కొట్టిశర్మకు కృష్ణానదీ దక్షిణ తీరమున ఉన్న తాండికొండ (తాడికొండ) గ్రామములో కొంతభూమిని, అతుకూరు గ్రామమును దానము చేసెను. దానము ఎప్పుడు చేసినదో, ఈ శాసనము ఎచ్చటినుండి ఇచ్చినదో ఈ విషయములు సరియగు తెలియవు: అతుకూరుగ్రామము కృష్ణానది ఉత్తర తటమున నున్న గని అతుకూరే యని చరిత్రకారుల యభిప్రాయము. ఇదియే నిజమైనచో ఆనందగోత్రుల రాజ్యము అత్తివర్మ కాలమునాటికి కృష్ణ ఉభయ తటము లందును వ్యాపించి యుండినదని చెప్పవచ్చును. శాసన మంతయు సంస్కృత భాషలో ఉండుటవల్లను, ఈ శాసనలిపి పల్లవుల పీకిర, మాంగడూరు శాసనలిపిని పోలి యుండుట చేతను అత్తివర్మయు ఆ శాసన కాలమువాడే; క్రీస్తుశకము అయిదవ శతాబ్దాంతమునుండి యుండును. ఇతడును శివభక్తుడే.

చేజెర్ల శాసనములోని కందరనృపతి ఆనందసగోత్రులలో ప్రథముడు కాదని, అత్తివర్మ దామోదరవర్మకు చాల తరువాతివాడని, చేజెర్ల శాసనములో ఉదాహృతుడయిన కందరనృపతి అత్తివర్మకు చాల తరువాతివాడని వాదించువారు గలరు. ఎట్లయినను గుంటూరిలో వీరి పరిపాలనము క్రీస్తుశకము ఏడవ శతాబ్దమునకు చాల పూర్వమే అంతరించి ఉండవలెను. ఏలన, ఈ ప్రాంతము అప్పటికే పల్లవ మహేంద్రవర్మవశమునందు ఉండెను. గుంటూరిలో శాలంకాయనుల రాజ్యము వ్యాపించుటకు పూర్వమే, అనగా క్రీస్తుశకము అయిదవ శతాబ్దములో వీరు ఇచట రాజ్యము చేయుచుండవలెను. ఇప్పటికి దొరకిన ఆధారముల వలన వీరిని గురించి ఇప్పటికి చెప్పదగిన దింతియే. ఈ యానందస గోత్రులు ఇక్ష్వాకురాజన్యుల అనంతరము కృష్ణానదీ దక్షిణ తీరమున పరిపాలించుచుండిన పల్లవ వంశజులను దక్షిణమునకు తరిమివైచి గుంటూరు ప్రాంతమును ఆక్రమించుకొని యుందురు. తరువాత క్రీస్తుశకము అయిదవ శతాబ్దాంతమున శాలంకాయన రాజ్య విజృంభణము వలన వీరి రాజ్యము అంతరించి యుండును.

చేజెర్ల కపోతేశ్వరాలయము మొదట బౌద్ధ చైత్యగృహమని దాని ఆకారమును బట్టి నిర్ణయించి యున్నారు. తరువాత అది హిందూ దేవాలయముగ మార్పు చెందినది. ఈ యాలయము క్రీస్తుశకము నాలుగవ శతాబ్దమున కట్టినట్లు చెప్పుదురు. అట్లయిన ఇది ఆనందసగోత్రుల నాటిదే కావచ్చును. సమ్యక్సంబుద్ధ పాదానుధ్యాతులైన దామోదరవర్మయే దీని నిర్మాతయేమో. మ. సో. శ.

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



## విష్ణుకుండి వంశజులు

శాలంకాయనులకు తరువాత వేంగీదేశమును పరిపాలించినవారు విష్ణుకుండి వంశజులు. వీరివి ఇంతవరకు పదు శాసనములు దొరకినవి. వీనిలో ఆరు తామ్రశాసనములు; ఒకటి శిలాశాసనము - గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకా వేల్పూరులోనిది; చాల చెడిపోయినది. ఇది విష్ణుకుండి మాధవవర్మది. రాజు పేరు మాత్రము తెలియవచ్చుచున్నది. తామ్రశాసనము లారింటిలో అయిదు ప్రకటితములు; ఒకటి ఇంకను ప్రకటితము కాలేదు. ప్రకటితములైన అయిదింటిలో మూడు మాధవవర్మవి. ఒకటి ఇంద్ర భట్టారక వర్మది. ఒకటి విక్రమేంద్ర వర్మది. ఈతని శాసనమే ఇంతవరకు అప్రకటితముగా ఉన్నది. ఇన్ని శాసనములు దొరకినను ఈ విష్ణుకుండి వంశజుల వంశానుక్రమమును నిర్ణయించుట చరిత్రకారులకు కష్టముగనే ఉన్నది. ఈ తామ్ర శాసనములలో ఒకదానిలో రెండు తరములును, మూడింటిలో మూడు తరములును, ఒకదానిలో నాలుగు తరములును ఈయబడినను రాజులపేర్లు వచ్చినవే వచ్చుచుండుటయు, శాసనములలో రాజ్యపరిపాలన సంవత్సరమే కాని శకవర్షము కాని, బార్హస్పత్యమానాబ్దము కాని లేకపోవుటయు వీరి యన్వయ క్రమమును నిర్ణయించుటలోని కష్టమునకు కారణము.

మాధవవర్మ అను పేరుగల రాజుల శాసనములు మూడు దొరకినను ముగ్గురును ఒక్కరే అనుటకు వీలులేదు. ఈపూరు గ్రామములో మాధవవర్మ శాసనములు రెండు దొరకినవి. ఒక శాసనము (దీనిని మొదటి శాసన మందము) మహారాజ శ్రీ గోవిందవర్మ కుమారుడు మహారాజ శ్రీ మాధవవర్మ గుద్దవాది విషయములోని విలంబలి గ్రామమును తన ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరము 37 లో, గ్రీష్మర్తువు, ఏడవపక్షము పదిహేనవ దినమున దానము చేసినట్లు తెలుపును. దీని ఆజ్ఞప్తి మాధవవర్మ ప్రియపుత్రుడైన మంచణ్ణ భట్టారకుడు.

రెండవది (దీనిని రెండవ శాసన మందము) మహారాజ శ్రీ మాధవవర్మ పౌత్రుడును, శ్రీ దేవవర్మ కుమారుడును అయిన రెండవ మాధవవర్మ అమరపురమునుండి తన విజయరాజ్య సంవత్సరము 47 లో, వర్షర్తువు ఏడవ పక్షము, ఏడవ దినమున నిచ్చిన దానశాసనము. ఇది చెడిపోవుటచే దాన మిచ్చిన గ్రామ మేదియో తెలియరాలేదు. మూడవది మాధవవర్మ ఆంధ్ర సాహిత్య పరిషచ్ఛాసనము. దీనిలో దాతయైన మాధవవర్మ శ్రీ విక్రమహేంద్రవర్మ పౌత్రుడు, శ్రీ గోవిందవర్మ పుత్రుడు. ఇతడు తన విజయరాజ్య సంవత్సరము 48 లో ఫాల్గున పూర్ణిమ చంద్ర గ్రహణమునాడు యజుర్వేద తైత్తిరీయ శాఖకు చెందిన గౌతమ సగోత్రుడు, రుద్రశర్మ పౌత్రుడు, దామశర్మ పుత్రుడు అగు శివశర్మకు గుద్దవాది విషయములోని పులోంబూరు (ఇప్పటి పొలమూరు) గ్రామమును దానము చేసెను. మిగిలిన రెండు తామ్రశాసనములలో ఇంద్రవర్మ రాజు పుర నిసంగమవాసకమునుండి తనరాజ్యకాల వర్షములు 27 లో జ్యేష్ఠశుద్ధ సప్తమినాడు ప్లకి రాష్ట్రములోని పేరువాడక గ్రామమును దానమిచ్చినట్లు తెలుపు రామతీర్థము శాసనము ఒకటి. ఈ ఇంద్రవర్మ మహారాజ శ్రీ మాధవవర్మ పౌత్రుడు. విక్రమేంద్రాఖ్యరాజు తనయుడు. రెండవది మహారాజ శ్రీ విక్రమేంద్రవర్మ చిక్కుళ్ళ శాసనము. మహారాజ శ్రీ మాధవవర్మ ప్రపౌత్రుడును, శ్రీ విక్రమేంద్రవర్మ పౌత్రుడును, మహారాజ శ్రీ ఇంద్రభట్టారక వర్మ పుత్రుడును అయిన మహారాజ శ్రీ (రెండవ) విక్రమేంద్రవర్మ డెందులూరు వాసకమునుండి తన పదవ విజయరాజ్య సంవత్సరమున నతవాటి విషయములోని రేగొన్ల గ్రామమును భగవంతుడును, త్ర్యంబకుడును అయిన సోమగిరీశ్వరనాథునికి దానము చేసినట్లు తెలుపు శాసన మిది. ఇంతవరకు ప్రకటితము కాని ఈతని మరియొక శాసనములోని విషయములు తెలియవు.

ఈ పై నిచ్చిన విషయములను బట్టి ఈ శాసనములలోని మాధవవర్మలను అన్వయక్రమమున ఎట్లు కలుపవలెను అన్నదే సమస్య. ఈ కారణమున విష్ణుకుండి వంశమును గురించి వ్రాసినవా రందరు ఆ వంశానుక్రమమును తలకొక రీతిని ఏర్పాటు చేసినారు. వానిలో ముఖ్యములయినవి రెండు. మొదటిది శ్రీకొమర్రాజు వెంకట లక్ష్మణరావు గారు ఇచ్చినది. ఇది పెద్దది. వారు ఈపూరు మొదటి శాసనములోని రెండవ మాధవవర్మ రామతీర్థము శాసనములోని మొదటి విక్రమేంద్రవర్మ తండ్రి యనియు, ఈ విక్రమేంద్రవర్మయే ఆంధ్ర సాహిత్య పరిషచ్ఛాసనములోని గోవిందవర్మ తండ్రియైన విక్రమహేంద్రవర్మ యనియు నిర్ణయించి, ఆ రీతిని విష్ణుకుండి వంశానుక్రమమును ఇచ్చియున్నారు.

రెండవది డాక్టరు డి. సి. సర్కారు ఇచ్చినది. ఇది చిన్నది. ఈయన ఆంధ్ర సాహిత్య పరిషచ్ఛాసనములోని రాజులను విష్ణుకుండి వంశమునందలి మొదటి రాజులుగా గ్రహించి ఈ శాసనములోని మాధవ వర్మయు, చిక్కుళ్ళ, (రెండవ) ఈపూరు శాసనములలోని మొదటి మాధవ వర్మయు ఒక్కడేయని నిర్ధారించి ఆ ప్రకారము విష్ణుకుండి వంశానుక్రమమును స్థిరపరచి యున్నారు. ఈయన



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఇచ్చిన వంశానుక్రమణికను బట్టి మొదటి మాధవవర్మ విక్రమహేంద్రుని పౌత్రుడు, గోవిందవర్మ పుత్రుడు. మొదటి మాధవవర్మకు దేవవర్మ, 'రా'జయిన (రెండవ) విక్రమేంద్రవర్మ, మంచన్న భట్టారకుడు అని ముగ్గురు కుమారులు. దేవవర్మ కుమారుడు (రెండవ) మాధవవర్మ. ఈపూరు రెండవ శాసనము ఇతనిదే. రెండవ విక్రమేంద్ర వర్మ కుమారుడు ఇంద్రవర్మయను ఇంద్రభట్టారక వర్మ పౌత్రుడు మహారాజ శ్రీ (మూడవ) విక్రమేంద్రవర్మ. ఈ విధముగా సర్కారుగారు ఈ విష్ణుకుండి వంశ వృక్షమును ఎట్లు ఎందుకు కుదించినారో తెలిసికొనవలసి యున్నది. ఇందుకు విష్ణుకుండి శాసనములు ఆయా రాజులను గురించి తెలిపిన విషయములను పరిశీలించవలెను.

ఈపూరు మొదటి శాసన దాతయైన మాధవవర్మ పదునొకండు అశ్వమేధయాగములు చేసి అవభృథస్నానము ఆచరించుటచేత పోగొట్టబడిన జగత్కల్మషము కలవాడు ('ఏకాదశాశ్వమేధావభృథ స్నానధూత జగత్కల్మషః'); త్రివర నగరమునందలి రాజభవనములలో ఉండిన యువతుల హృదయములకు ఆనందము గొల్పినవాడు ('త్రివర నగర భవనగత యువతి హృదయ నందనః'); వేయి అగ్నిష్టోమయాగములను చేసినవాడు ('అగ్నిష్టోమ సహస్ర యాజీ'); హిరణ్యగర్భ ప్రసూతుడు.

ఈపూరు రెండవ శాసనములో 'ఏకాదశాశ్వమేధ యాగ'ములను చేసినట్లును, 'అగ్నిష్టోమ సహస్రయాగ' ములను చేసినట్లును చెప్పబడినవాడు దాతయైన రెండవ మాధవవర్మ పితామహుడు మొదటి మాధవవర్మ. రెండవ మాధవవర్మ త్రికూటమలయాధిపతి యని చెప్ప బడినాడు.

ఆంధ్ర సాహిత్య పరిషచ్ఛాసనములోకూడ దాతయైన మాధవవర్మ 'త్రివర నగర భవనగత పరమయువతీజన విహరణరతిః' అనియు, 'క్రతు సహస్రయాజీ' అనియు, 'హిరణ్యగర్భ ప్రసూతః' అనియు, 'ఏకాదశాశ్వమేధావ భృథస్నాన విగత జగదేనస్కః' అనియు వర్ణింపబడెను.

ఇంద్రవర్మ రామతీర్థము శాసనములో ఏకాదశాశ్వ మేధయాగములు, క్రతు సహస్రములు చేసినట్లు చెప్పబడిన వాడు దాతయైన ఇంద్రవర్మ తండ్రియగు విక్రమేంద్రవర్మ. ఇతని తండ్రియైన మాధవవర్మకు ఇట్టి విశేషణములు లేవు. ఈ విక్రమేంద్రవర్మ ఉభయ వంశాలంకారభూతు డట. ఈ యుభయ వంశములలో మొదటిది విష్ణుకుండి వంశ మగుట నిశ్చయము. రెండవది రెండవ విక్రమేంద్ర వర్మ చిక్కుళ్ల శాసనమువలన తెలియుచున్నది. ఇంద్ర వర్మకు 'అనేక చతుర్దంత సమర శత సహస్ర సంఘట్ట విజయ' బిరుదము గలదు. ఇంద్రుని ఐరావతము తూర్పుదిశను ఉన్న గజరాజము. దీనికి నాలుగు దంత ములు కలవని ప్రసిద్ధి. 'అనేక చతుర్దంత సమరశత సహస్ర' మనుటవలన ఈ దాత యయిన ఇంద్రవర్మ తూర్పు దిశను ఉండిన రాజులతో, అనగా కళింగాధిపతు లతో, అనేక యుద్ధములు చేసి విజయము పొందినవాడని తెలియుచున్నది.

రెండవ విక్రమేంద్రవర్మ చిక్కుళ్ల శాసనమున మొదటి విక్రమేంద్రవర్మ తండ్రియైన మాధవవర్మ ఇట్లు వర్ణితు డయినాడు: 'ఏకాదశాశ్వ మేధావభృథ స్నానధూత జగత్కల్మషః', 'క్రతు సహస్రయాజీ', 'సర్వ మేధావాప్త సర్వభూత స్వారాజ్యః', 'బహు సువర్ణ పౌండరీక పురుష మేధ వాజపేయ యూధ్య షోడశి రాజసూయ ప్రాధిరాజ్య ప్రాజాపత్యాద్యనేక వివిధ పృథు గురువర శతసహస్ర యాజీ'. ఇతని కుమారుడు మొదటి విక్రమేంద్రవర్మ. ఈత డిందులో రామతీర్థము శాసనములోవలె ఏకాదశాశ్వ మేధములు, క్రతు సహస్రములు చేసినట్లు చెప్పబడలేదు. ఇతడు 'విష్ణుకుండి వాకాటవంశ ద్వయాలంకృతజన్ముడు. దీనివలన రామతీర్థము శాసనములో చెప్పిన ఉభయ వంశములలో రెండవది వాకాట వంశమని తేలుచున్నది. మొదటి విక్రమేంద్రవర్మ కుమారుడైన ఈ ఇంద్రభట్టారక వర్మ రామతీర్థము శాసనములోవలెనే ఇందుకూడ 'అనేక చతుర్దంత సమర సంఘట్ట ద్విరదగణ విపులవిజయి' అని కీర్తింపబడినాడు. ఇతడు యథావిధిగా 'ఘటిక'ను స్థాపించినందువలన పొందిన పుణ్య సంచయము కలవాడు ('యథావిధి నిర్వాపిత ఘటికావాప్త పుణ్య సంచయః).' ఇంద్రభట్టారకవర్మ జ్యేష్ఠపుత్రుడు రెండవ విక్రమేంద్ర వర్మ. ఇతడే చిక్కుళ్ల శాసనదాత.

విష్ణుకుండి వంశజుల సంక్షిప్త వంశవృక్షము వచ్చుటకు సహకారిరైనవి పదునొకండు అశ్వమేధములు, అనేక సహస్ర యాగములును. ఈ విధముగా కాక మరొక విధ ముగా వంశవృక్షము ఏర్పాటుచేసినచో మాధవవర్మ నామధేయులు ఇక్కరు పదునొకండు అశ్వమేధములను, క్రతుసహస్రములను చేసినవారు అగుదురు. నిజ మారసినచో ఇన్ని యాగములను ఒకడే మాధవవర్మ చేసియుండును కాని ఆ పేరుగల వారు అందరు చేసియుండరు అను ఊహ ఆధారముగా ఈ విష్ణుకుండి వంశజుల సంగ్రహ వంశాను క్రమము ఏర్పాటయినది. కాని, చిక్కుళ్ల శాసనములో వలె రామతీర్థము శాసనములో, మొదటి విక్రమేంద్రవర్మ తండ్రియైన మాధవవర్మ ఏకాదశాశ్వమేధములను, క్రతు సహస్రములను చేసినట్లు ఏదువలన చెప్పబడలేదో, వీనిని



http://sanskritcentral.com/

http://teluguthesis.com/

మొదటి విక్రమేంద్రవర్మ చేసినట్లు ఎందుచేతను చెప్పబడెనో తెలియవచ్చుటలేదు.

ఈ వంశానుక్రమమును ఏర్పాటుచేసిన తక్కినవారిలో ఒకరగు ఆచార్య కే. ఏ. నీలకంఠశాస్త్రిగారు లిపిని ఆధారముచేసికొని విష్ణుకుండి వంశానుక్రమమును వేరొక రీతిని నిర్ణయించియున్నారు. రెండవ మాధవవర్మ ఈపూరు శాసనలిపి విష్ణుకుండి వంశజుల ఇతరశాసనముల లోని లిపులకంటె ప్రాచీనముగ కనబడుచున్నదని లిపి శాస్త్రజ్ఞుల అభిప్రాయము. అది యటుండ ఆంధ్రసాహిత్య పరిషత్పానమునందలి ప్రతిగ్రహీతయైన శివశర్మ పుత్రుడు రుద్రశర్మకే అతడు నష్టమైపోయిన పైతృక గ్రామము పులోంబూరు(పొలమూరు)ను పూర్వ చాళుక్యవంశజుడును, రెండవపులకేశి సత్యాశ్రయసోదరుడైన కుబ్జవిష్ణువర్ధనుని కుమారుడును అగు మొదటి జయసింహ వల్లభ మహారాజు సంపాదించి మరల దాన మిచ్చెను. ఈ యంశమును పురస్కరించుకొని నీలకంఠశాస్త్రిగారు రెండవ ఈపూరు శాసనమునందలి మొదటి మాధవవర్మను కూటస్థునిగా చేసి ఇతడును, రామతీర్థము చిక్కుళ్ల శాసనములలోని మాధవవర్మయు ఒక్కడే అని నిర్ణయించినారు. ఇందువలన మొదటి మాధవవర్మకు దేవవర్మ, విక్రమేంద్ర వర్మ అని ఇరువురు కుమారులు ఉండినట్లు తేలుచున్నది. శాస్త్రిగారి యభిప్రాయమును అనుసరించి రెండవ విక్రమేంద్రవర్మయే ఆంధ్రసాహిత్య పరిషత్పానములోని విక్రమహేంద్ర(విక్రమేంద్ర)వర్మ. వీరి వంశానుక్రమము ప్రకారము మాధవవర్మలు మువ్వురు అగుచున్నారు. మూడవ మాధవవర్మయే ఆంధ్రసాహిత్య పరిషత్పానన దాత (శ్రీశాస్త్రిగారి వంశక్రమమును అనుసరించి మొదటి మాధవవర్మయు, ఇతని కుమారుడు మొదటి విక్రమేంద్ర వర్మయు, గోవిందవర్మ కుమారుడయిన మూడవ మాధవ వర్మయు ఏకాదశాశ్వమేధములును, క్రతుసహస్రములును చేసినవారు అగుదురు. మూడవ మాధవవర్మ ఏకాదశాశ్వ మేధములను, క్రతుసహస్రములను చేయుట అంత సులువుగా అంగీకరింప దగదని వారు అనినను ఇది వంశపారంపర్యముగ ఈ రాజులు తమ గొప్పకొరకే చెప్పుకొనుచుండినది అయినచో ఇతరుల విషయమున ఎందుకు చెప్పబడలేదో దురూహము. కాని, పూర్వ చాళుక్యరాజయిన మొదటి జయసింహ వల్లభునికి సమీపస్థుడుగ చూపుటకు శాస్త్రిగారి వంశాను క్రమము సరిపోవుచున్నది.

ఇక వంశానుక్రమ నిర్ణయమునందు వలెనే విష్ణుకుండి రాజ్యకాల నిర్ణయము విషయమునకూడ చరిత్రకారులలో భేదాభిప్రాయము కలదు. ఇంద్రభట్టారకుని రాజధానియైన దెందులూరు శాలంకాయన రాజధానియైన విజయవేంగీపురము(పెదవేగి)నకు సమీపమునందు ఉండుటచేత శాలంకాయనులకు తరువాతనే ఈ విష్ణుకుండి నృపతులు వేంగీ దేశమును ప్రాయికముగా క్రీస్తు శకము అయిదవ శతాబ్దోత్తరార్ధమునుండి ఇంచుమించుగా క్రీ. శ. ఏడవ శతాబ్దము పూర్వార్ధమువరకు, అనగా పూర్వ చాళుక్య నృపుడయిన మొదటి జయసింహ వల్లభుని కాలమువరకు పరిపాలించినట్లు చెప్పవచ్చును. వీరిలో పూర్వ చాళుక్యుల చేత నిర్జింపబడినవాడు మూడవ మాధవవర్మయో, అతని కుమారుడు మంచన్న భట్టారకుడో కావలెను. మొత్తము మీద విష్ణుకుండి వంశానుక్రమమును గురించికాని, ఈ రాజుల రాజ్యకాల నిర్ణయమును గురించికాని ఇదమిత్థమని సరిగా నిర్ణయించుటకు తగిన యాధారములు ఇంత వరకు దొరకలేదు.

మౌఖరి వంశజుడైన ఈశానవర్మ ఆంధ్రాధిపతిని జయించినట్లు అతని కుమారుడు సూర్యవర్మ క్రీ. శ. 554 నాటి తన హరహ శాసనమున తెల్పుటచేత ఈ సంఘటనయు, వాతాపి చాళుక్య వంశజుడయిన రెండవ పులకేశి సత్యాశ్రయుని పూర్వదేశ దిగ్విజయమును ఈ విష్ణుకుండి వంశజుల కాలమునందే జరగియుండవలెను. ఈ పూర్వదేశ దిగ్విజయమునందు విష్ణుకుండి భూవరులను జయించియే సత్యాశ్రయుని సోదరుడయిన కుబ్జవిష్ణువర్ధనుడు దక్షిణ కళింగమును వశపరచుకొని పిదప వేంగిదేశమును స్వాధీన పరచుకొని ఉండవలెను.

ఈ సందర్భమున పృథ్వీమహారాజు పిష్ఠపురమునుండి ఇచ్చిన తాండివాడ దానశాసనమును గణనలోనికి తీసికొన వలసియున్నది. ఈ పృథ్వీ మహారాజు రామకాశ్యపస గోత్రుడు; మహారాజయిన రణదుర్జయుని పౌత్రుడు: విక్రమేంద్ర నృపతి పుత్రుడు. ఇతడు తన 46 వ రాజ్య పాలన వత్సరమున పాగుణార విషయములోని తాండివాడ గ్రామమును కామకాయన గోత్రుడును, ఛందోగ సూత్రుడును అయిన భవశర్మకు దాన మిచ్చెను. ఈ రాజులు విష్ణుకుండి నృపులకు సామంతులుగా పరిపాలనము నెరపి యుండవచ్చును. రణదుర్జయ మహారాజు విక్రమేంద్రవర్మ సామంతుడై అతని ప్రతినిధిగా పిష్ఠపురమునుండి పాలించి యుండవచ్చును. అందులకు తన ప్రభువునెడల కృతజ్ఞత కలవాడయి తన కుమారునికి విక్రమేంద్రుడని అతని పేరే పెట్టి యుండును. రెండవ పులకేశియు, అతని సోదరుడు కుబ్జవిష్ణువర్ధనుడును పిష్ఠపురమును ఈపృథివీ మహారాజును ఓడించియే కైకొని యుండవచ్చును. రెండవ పులకేశికిని, అతని సోదరుడు కుబ్జవిష్ణువర్ధనునికిని మొట్టమొదట వశ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మైనది గోదావరి వరకు గల దక్షిణ కళింగము. తరువాత వారు వేంగిని జయించిరి. కుబ్జవిష్ణువర్ధనుని కుమారుడైన మొదటి జయసింహవల్లభుని నాటికి కాని వేంగిదేశము స్థిరముగా చాళుక్యుల అధీనములోనికి రాలేదు. విష్ణుకుండి వంశజులకు పిదప వేంగిదేశమును పరిపాలించిన వారు కుబ్జవిష్ణువర్ధనుని సంతతి వారయిన పూర్వ చాళుక్యులు.

విష్ణుకుండి వంశజులలో ఏకాదశాశ్వ మేధములను, క్రతు సహస్రములను, ఇతర యాగములను ఎన్నిటినో ఆచరించిన మొదటి మాధవవర్మ చాల గొప్పవాడు. ఇతడు వాకాట వంశజులతో సంబంధ బాంధవ్యములు నెరపి తన రాజ్యపదమును దృఢ మొనర్చుకొనెను. ఇతనికిని, వాకాటరాజ తనయకును జనించినవాడు మొదటి విక్రమేంద్రవర్మ. ఇంద్రభట్టారకుని తండ్రి మాధవవర్మ త్రివర నగర భవనములందలి యువతుల హృదయములను ఆనందింపజేసినవాడని శాసనములందు చెప్పబడుట వలన ఇతడు ఆ నగరమును జయించినట్లు చెప్పవచ్చును. త్రివరనగరమును కొందరు చరిత్రకారులు కళచురి రాజుల రాజధానియైన త్రిపురిగా గుర్తించిరి. వేరొక కొందరు




చిత్రము 24. వెలగలేరు-జయపురము గుహాలయము

మహాకోసలమును పరిపాలించుచుండిన పాండువంశజుడగు తీవరదేవుని రాజధానియైన శ్రీపురమే తీవరనగరము, త్రివర నగరమని చెప్పుదురు. ఇందేది నిజమైనను మాధవవర్మ ఉత్తర ప్రాగ్దేశములపై దండెత్తి వెళ్ళి మహాకోసలాధిపతులనో, కళచురివంశజులనో జయించి వారి యాడుబిడ్డను పరిణయ మాడినట్లు ఊహింపవచ్చును.

ఇంద్రవర్మ పూర్వదేశాధిపతులతో పెక్కు యుద్ధములు చేసి దక్షిణ కళింగమును నిలుపుకొనెను. ఈ పూర్వదేశాధిపతులు కళింగమును పాలించుచుండిన పూర్వగాంగ వరరులే. వారిలోని ఇంద్రాధిరాజు మరికొందరు రాజులతో కలిసి నైరృతి దిశను పాలించుచుండిన ఇంద్రభట్టారకుని ఓడించినట్లు పృథివీమూలుని గోదావరి శాసనమువలన తెలియుచుండుటచేత ఈ యింద్రవర్మ తన రాజ్యకాలము చివర పూర్వగాంగ భూపతులచేత ఓడింపబడినట్లు ఊహింపవలసియున్నది. ఇంద్రాధిరాజు అనువతడు కళింగ పూర్వగాంగ వంశజులలోని ఇంద్రవర్మలలో ఎవరో ఒకడు కావలెను.

దేవవర్మకుమారుడయిన రెండవమాధవవర్మ త్రికూటమలయాధిపతి. త్రికూటమలయ మనునది గుంటూరు జిల్లా నరసరావుపేట తాలూకా కావూరు దగ్గరి ఇప్పటి కోటప్పకొండ అని చరిత్రకారులు భావించుచున్నారు.

ఈ విష్ణుకుండి రాజుల రాజ్యము చరమదశలో నుండి నప్పుడు తూర్పున విశాఖపట్టణము మొదలు పడమట గుంటూరు వరకు వ్యాపించియుండెను. విష్ణుకుండి వంశజులలో కడపటి రాజును ఓడించి పల్లవ వంశజుడయిన మంహేంద్రవర్మ కృష్ణా దక్షిణ తీరప్రదేశమును వశపరచు కొనినట్లు కనప్పట్టు చున్నది.

విష్ణుకుండి నృపులు శ్రీపర్వతస్వామి పాదానుధ్యాతులు. వీరు బహువిధములైన క్రతువులను ఆచరించిరి. అందులో మొదటి మహేంద్రవర్మ తండ్రియు, విష్ణుకుండి రాజ్యమును పెంపొందించినవాడును అయిన మాధవవర్మ క్రతుకర్మ పరాయణుడు. ఇతడు పదునొకండశ్వమేధములను, సహస్ర క్రతువులను, సర్వమేధమునే కాక బహుసువర్ణ, పౌండరీక, పురుషమేధ, వాజపేయ, యూధ్య, షోడశి, రాజసూయ, ప్రాధిరాజ్య, ప్రాజాపత్యాది అనేక వివిధ శతసహస్రయాగములను చేసినట్లు ఇతని ప్రపౌత్రుడయిన రెండవ విక్రమేంద్రవర్మ తెలుపుచున్నాడు. ఇతని



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వైదిక క్రతుకర్మాభిరతి ఎట్టిదో ఈ క్రతుసహస్రాచరణము వలననే తెలియగలదు. విష్ణుకుండిరాజులు సంస్కృతభాషను ఆదరించిరి; వైదిక సంస్కృతికి పట్టుగొమ్మలై నిలిచి వేద విద్యలను పోషించిరి. వీరిలో ఇంద్రభట్టారకవర్మ యథా విధిగా 'ఘటిక'ను స్థాపించి పుణ్యము నార్జించినవాడు. ఘటిక అనగా విద్యాస్థానము. ఘటిక ఎట్లు స్థాపింపవలెనో ఓదంకుడు సామవేదములో తెలిపియున్నట్లు ఒక శాసనమువలన తెలియుచున్నది. తెలుగుదేశములో ఘటికా స్థానములు ఉండినట్లు మొట్టమొదటిమారు తెలియవచ్చుట విష్ణుకుండి వంశజుల కాలములోనే. వీ రందరును శైవులు. అందు ముఖ్యముగా ఇంద్రభట్టారకవర్మయు, ఇతని తనయుడు రెండవ విక్రమేంద్రవర్మయు పరమమాహేశ్వరులు. వీరిలో రెండవ విక్రమేంద్రవర్మ భగవంతుడును, త్ర్యంబకుడును అయిన సోమగిరీశ్వర నాథునికి నతవాటి విషయములో రేగొన్న గ్రామమును దానము చేసెను. తెలుగు దేశపు శాసనములలో శివాలయమునకు కానవచ్చు మొట్టమొదటి సూచన ఇదియే.



చిత్రము 25. అర్ధనారీశ్వరమూర్తి, మొగల్రాజపురము

'జనాశ్రయీచ్ఛందో విచ్ఛితి' అని ఒక చాల పురాతన సంస్కృతచ్ఛందో గ్రంథము కలదు. మొదటి విక్రమేంద్రవర్మ పౌత్రుడును, విక్రమాశ్రయ బిరుదాంచితుడయిన గోవిందవర్మ పుత్రుడును అగుమాధవవర్మకు జనాశ్రయ బిరుదము కలదు. దక్షిణ హిందూదేశములో క్రీస్తుశకము ఏడవ శతాబ్దమునకు పూర్వము పరిపాలించిన రాజులలో విష్ణుకుండి మాధవవర్మకు తక్క మరియొకనికి ఈ బిరుదము ఉండినట్లు ఇంతవరకు తెలియరాలేదు. అందువలన జనాశ్రయుడయిన ఈ మాధవవర్మ ఆశ్రయముననే ఈ గ్రంథము రచింపబడి ఉండునని చరిత్రకారులు విశ్వసించుచున్నారు. ఈ గ్రంథము చివర దీనికి భాష్యము రచించి చేర్చిన గణస్వామియే ఈ కృతికి కర్త కావచ్చునని యూహ. ఈతడే తన కాశ్రయ మిచ్చిన జనాశ్రయుని పేర ఈ గ్రంథమునకు 'జనాశ్రయీచ్ఛందో విచ్ఛితి' అని పేరు పెట్టి యుండునని చరిత్రకారుల తలంపు. ఈ ఛందో గ్రంథమున ఆరు ప్రకరణములు ఉన్నవి. మొదటిది పరిభాషా వివరణమును తెలుపును. రెండవ ప్రకరణము విషమవృత్తములను గురించియు, మూడవది అర్ధసమ వృత్తములను గురించియు, నాలుగవది సమవృత్తములను గురించియు, అయిదవది వైతాళీయములతో కూడ జాతులను గురించియు, ఆరవది ఛందః ప్రస్తారమును గురించియు తెలుపును. వైతాళీయములలో ధ్రువ, గీతిక, గలితము, నర్కుటము, శీర్షకము, ద్విపది, రాసకము అనుగీతికలు కూడ కలవు.

విష్ణుకుండి వంశజులు కేవలము సాహిత్య పోషకులే కాక కళాపోషకులు కూడను. వీరు హిందూ గుహాలయములను నిర్మించి గుహాలయవాస్తువునకు ప్రోత్సాహము ఇచ్చిరి. బెజవాడదగ్గరి మొగల్రాజపురములోని గుహాలయములను, ఉండవల్లి గుహాలయమును వీరు నిర్మించినట్లు కళాభిజ్ఞులు నిర్ణయించి యున్నారు. వీరి గుహాలయస్తంభములమీద పంజా యెత్తి పెట్టిన సింహప్రతిమ ఉండుటచేత వీరు సింహలాంఛనులని పరిశోధక పండితుల అభిప్రాయము.

మొగల్రాజపురము కొండలలోని ఒక గుహాయందలి గర్భగుడిలో ఉత్తరపు గోడమీద మలచిన ఒక శిథిల విగ్రహము కలదు. అది దుర్గావిగ్రహమని కొంద రనిరి. అది అట్లు కనబడదు. దానికి కుడివైపున రెండు చేతులును, ఎడమ వైపున ఒక చేయియు కలవు. పద్మపీఠముపై వంచిన కుడికాలిని, తొడపై కుడిచేతిని ఆని, రెండవ కుడిచేతితో సర్పావృతదండాంచిత పరశువును పట్టుకొని, ఏదియో



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



గుండ్రని వస్తువును పట్టి ఎడమచేతిని నడుముపై అని ఎడమకాలిని నిటారుగా ఉంచి నిలిచియున్నట్లు చెక్కిన విగ్రహ మిది. దానివెనుక సింహప్రతిమ ఉన్నది. పరిశీలింప, అది అర్ధనారీశ్వరమూర్తి అని తోచుచున్నది. ఈ యూహ సరియైన దగుచో దక్షిణ హిందూదేశమున కాన వచ్చిన మొదటి అర్ధనారీశ్వరమూర్తి ఇదియే.

గుప్తవాకాటక నృపతులతోడి సంబంధము మూలముగనే విష్ణుకుండి వంశజులు పైకి వచ్చిరి. వీరు ఆంధ్రదేశీయులే అనియు, గుంటూరు మండలములోని వినుకొండ ప్రాంతము వీరి నివాసభూమి అనియు, విష్ణుకుండిపదమును అనుసరించియే వినుకొండకు ఆ పేరు వచ్చిన దనియు కొందరు చెప్పుదురు. కాని మరికొందరు వీరు అన్యదేశీయులనియు, శాలంకాయనుల పరిపాలన కాలము చివర తెలుగుదేశమునకు వచ్చి అచట రాజ్యమును స్థాపించిరనియు చెప్పుదురు.

ఇది సత్యమై ఉండు ననుటకు తెలుగుదేశములో వాడుకలో ఉన్న గాథలే ప్రమాణము. విశాఖపట్టణము జిల్లాలోని విజయనగర రాజ్యాధిపతులైన పూసపాటివారును, రాచవారిలో చాలమందియు తమ మూలపురుషుడు మాధవవర్మ అని చెప్పుకొందురు. క్రీస్తుశకము 1540 నాటిదనబడు శ్రీకృష్ణ విజయము అను తెలుగు కావ్యములో శాలివాహన శకము 514 కు సరియైన క్రీ. శ. 592 లో మాధవవర్మ నాయకత్వమున వసిష్ఠ, ధనంజయ, కౌండిన్య, కాశ్యప గోత్రముల రాచవారు తెలంగాణాకు వలస వచ్చినట్లు చెప్పబడి యున్నది. ఉత్తర సర్కారులలోని రాచ వా రందురు మాధవవర్మ వంశ్యుడయిన విజయనగరము మహారాజునే తమ నాయకునిగ పరిగణింతురు. వలస వచ్చిన రాజపుత్రులు కృష్ణానదీ తీరమున బెజవాడలో స్థిరనివాసము కుదుర్చుకొని కాలక్రమమున రాజ్యమును స్థాపించిరి. శకవర్షము 514 సరియైనదే యని అంతకు వేయి సంవత్సరముల తరువాత రచింపబడిన కావ్యమును అనుసరించి చెప్పలేము. కాని, డాక్టరు డి. సి. సర్కారుగారి కాలనిర్ణయమును అనుసరించి అది యించుమించుగా విష్ణుకుండి మొదటి మాధవవర్మ కాలమునకు (క్రీ. శ. 585 - క్రీ. శ. 585) సరిపోవుచున్నది.

బెజవాడ మల్లేశ్వరస్వామి ఆలయములోని క్రీస్తుశకము పన్నెండవ శతాబ్దమునాటి ఒక శాసనమున మాధవవర్మను గురించిన ఈ గాథ కలదు. కలియుగములో కృష్ణావిభూషణమైన విజయవాడ పురమున శకాబ్దము 514 లో విఖ్యాతుడైన మాధవవర్మ అను [illegible]డు ఉం[illegible] అతని పుత్రునిచేత చింతకాయలు అమ్ముకొని జీవనము గడపుకొను స్త్రీ ('తింత్రిణీ జీవిని') శిశువు హతుడు కాగా ధర్మ సంరక్షణార్థము ఆ రాజు స్వపుత్రుని వధించెను. అప్పుడు మల్లేశ్వరస్వామి ప్రీతుడై స్వర్ణవృష్టిని కురియించి తింత్రిణీ జీవిని శిశువును, రాజకుమారుని పునర్జీవింపజేసెను. శాసనములో చెప్పబడిన సంవత్సరమును సరిగా శకము 514 ('శ్రీమచ్ఛాకాబ్దేబ్ధిశశిసాయకసమ్మితే'). ఈ విషయమే తెలుగు దేశములో శతాబ్దములతరబడి పరంపరగా వచ్చుచుండిన చాటు పద్యములో సరిగా ఈ శకవర్షముతోనే తెలుపబడినది. దీనిని అనుసరించి చూడగా శకవర్షము 514 లో మాధవవర్మ అనురాజు విజయవాడలో పరిపాలనము నెరపినట్లును, ప్రాయికముగ అతడు కొందరు రాచవారితో తెలుగు దేశమునకు వచ్చియుండవచ్చు ననియు, ఈ మాధవవర్మ ఏకాదశాశ్వమేధావభృథ స్నానములను చేసిన విష్ణుకుండి మాధవవర్మ కావచ్చు ననియు తోచుచున్నది. పూర్వోక్త కథ తెలుగు వాఙ్మయమునకూడ ఉన్నది. శ్రీనాథ మహాకవి మరదియైన దగ్గుపల్లి దుగ్గయ్య తన నాచికేతోపాఖ్యానమున

> చతురంగబలములు జయవాడ దుర్గాంబ
> వరమునం బడసి దుర్వార లీల
> జగతీస్థలం బెల్ల సాధించి జయశాస
> నములు దిగ్దంతి దంతముల నిలిపి
> పేదబాలునకుగాఁ బ్రియసుతు మోహంబు
> పట్టక బెజవాడఁ బాడి నిలిపి
> కలయంగఁ బురమునఁ గాంచన వర్షంబుఁ
> గురియించి దేవతాకోటి పొగడ
> వసుధ నెగడిన మాధవవర్మ

యని యతనిని కీర్తించియున్నాడు.

మాధవవర్మ ఎనిమిదివేల యేనుగులకును, పదికోట్ల గుర్రములకును, అనంతమగు కాల్బలమునకును అధిపతి అని అనుమకొండలోని పదునొకండవ శతాబ్దమునాటి యొక శాసనము తెలుపుచున్నది. కాకతీయులు తాము మాధవవర్మ వంశ్యులమని చెప్పుకొన్నారు. ఇన్నివిధముల పరికీర్తితుడయిన మాధవవర్మ విష్ణుకుండి మాధవవర్మయే యగునేమో.

విష్ణుకుండిరాజులకు అమరపురము, పురనిసంగమము, దెందులూరులు రాజధానులుగా ఉండెను. అమరపురమన్నది కృష్ణానదీ తీరమందలి ఇప్పటి అమరావతియే కావచ్చును. దెందులూరు పెదవేగికి సమీపమున ఉన్న ఇప్పటి దెందులూరు. పురనిసంగమము ఎచ్చటిదో తెలియదు. వీరికి బెజవాడకూడ కొంతకాలము రాజధానిగా ఉండెనని పై గాథవలన ఊహింపవచ్చును.

మ. సో. శ.

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



# పల్లవులు

పల్లవులు ఆద్యము నుండియు, భారతీయులా, లేక పరదేశముల నుండి హిందూదేశమునకు వలస వచ్చి అచ్చటనే స్థిరనివాసములు ఏర్పరచుకొని నెలకొన్న విజాతీయులా అను విషయము చరిత్రకారుల వాదప్రతివాదములకు కారణమైనది. కొందరు వీరు పారశీకమునుండి హిందూస్థానమునకు వలస వచ్చిన విజాతీయులు అనిరి. పురాణములలో శక యవనులతో కూడ పహ్లవులపేరు జోడింప బడుటయే దీనికి ముఖ్యకారణము. పురాణోక్త పహ్లవులే చరిత్రయందు కానవచ్చు పల్లవులని వీరి సిద్ధాంతము. వల్లవులు ఆద్యమునుండియు హిందూదేశమున నివసించుచుండిన భారతీయులే కాని అన్యదేశములనుండి వలస వచ్చిన విజాతీయులు కారు. పురాణములలో పహ్లవులకును, పల్లవులకును నామ సాదృశ్యము ఒకటి తప్ప మరి ఎట్టి సంబంధమును లేదు. పహ్లవులు శక, యవనాదుల వలె విదేశీయులే. కాని, పల్లవులు విదేశీయులు అనుటకు ఎట్టి సాక్ష్యమునులేదు. పురాణములు మొదలయిన చరిత్ర సాధనలనుబట్టి చూడగా పల్లవులు భారతీయు లనుట సమంజసముగ ఉన్నదని మరికొందరు అందురు.

పల్లవుల ఉత్పత్తి ఎట్టిదైనను వారు ఆంధ్రులతో కూడ దక్షిణాపథమునకు వచ్చినవారే కాని పెక్కుమంది తలచునట్లు దాక్షిణాత్య ద్రావిడదేశ వాస్తవ్యులు కారు. ఈ సందర్భమున జ్ఞప్తి ఉంచుకోదగిన విషయములు నాలుగు కలవు: (1) పురాణములలో పల్లవులు ఆంధ్రులతో జోడింపబడుట; (2) వారి చరిత్ర యొక్క ప్రథమదశలో వారు ఆంధ్రదేశమునందు రాజ్యము చేయుచుండుట; (3) వారి వంశమునకు చెందిన నాలుగు కోవలవారును ఆంధ్రదేశమునందే ఉత్పత్తి యగుట; (4) ప్రాచీన తమిళ గ్రంథములు వారిని అరవలకంటె భిన్నులైన విజాతీయులు అని పరిగణించుట. ఈ కారణముల వలన పల్లవులు ద్రావిడ దేశమున రాజ్యమును సంపాదించి కాలక్రమమున అరవవారిలో కలసి పోయిన ఆంధ్రదేశజులని ఎంచదగియున్నది.

పల్లవులు ఆంధ్రదేశమున గాని, ద్రావిడ భూమియందు గాని రాజ్యమును జయించి సంపాదించినవారు కారు. వారి వంశమునకు మూలపురుషుడైన వీరకూర్చవర్మ ఒకానొక నాగరాజు కుమార్తెను ఉద్వాహము చేసికొని ఆమె పాణిగ్రహణముతోకూడ రాజ్యలక్ష్మిని పొందెనని శాసనములందు చెప్పబడినది. ఈ నాగరాజు శాతవాహన చక్రవర్తులలో కడపటివాడైన నాల్గవ పులోమావి యొక్క సేనాధిపతియైన స్కందనాగుడే అని చరిత్రకారులు గుర్తించినారు. శాతవాహన సామ్రాజ్యము దక్షిణమున ద్రావిడ దేశములోని కొల్లడము వరకును వ్యాపించియుండెను. నాల్గవ పులోమావి కాలమున అతని పక్షమున దక్షిణాంధ్రదేశమును, దాని పొరుగుననుండు ద్రావిడదేశమును అతని సేనాపతియగు స్కందనాగుడు పాలించుచుండెను. ఈ రాజ్యమునకు ముఖ్య నగరము కాంచీపురము. శాతవాహన సామ్రాజ్యము ఉత్సన్నమై పోయిన పిదప స్కందనాగుడు స్వతంత్రుడాయె ననియు, అతని యనంతరము అతని పుత్రికా భర్త యైన పల్లవ వీరకూర్చవర్మ అతని రాజ్యమునకు అధిపతి అయ్యె ననియు చరిత్రకారులు అభిప్రాయపడుచున్నారు.

స్కందనాగుని కడనుండి పల్లవ వీరకూర్చవర్మకు సంక్రమించిన రాజ్యము బహువిస్తారమైనది. తూర్పు పశ్చిమ సముద్రముల మధ్య మహారాష్ట్రమునుండి ద్రావిడదేశమందలి కొల్లడము వరకు ఉత్తర దక్షిణములుగ వ్యాపించియుండిన రాష్ట్ర మంతయు అతని పలుబడి క్రిందికి వచ్చెను; కాని ఇంత విస్తారమైన రాజ్యము కడపటి వరకును పల్లవుల పరిపాలన క్రింద ఉండలేదు. వారి పలుబడిలోని దేశమునందు కాలక్రమమున నూతన రాజవంశములు తలయెత్తి వారి అధికారమును ధిక్కరించి స్వతంత్ర రాజ్యములను ఏర్పరచు కొనెను. ఈ కారణము వలన వారి సామ్రాజ్య విస్తృతి క్రమక్రమముగ తగ్గుచు వచ్చినది. మొదట కర్ణాటకమును, తరువాత దక్షిణాంధ్రమును వేరుపడినవి. చరమదశయందు ద్రావిడ దేశము ఒక్కటియే వారి అధికారమునకు లోబడి యుండినది. రాజధానియగు కాంచీనగరము ద్రావిడదేశమున ఉండుటవల్లను, కర్ణాటాంధ్రములతో సంబంధము క్రమక్రమముగ సన్నగిల్లుట వల్లను, ద్రావిడుల సంపర్కము రాను రాను అతిశయించుట వల్లను పల్లవులు తుట్టతుదకు ద్రావిడులలో కలసిపోయిరి.

వర్ణమునందు పల్లవులు బ్రాహ్మణులు. వీరు కురుపాండవుల గురువయిన ద్రోణాచార్యుని కుమారుడగు అశ్వత్థామకు నాగకన్యకకు ఉద్భవించిన పల్లవుని సంతతి వారని వారి శాసనములందు కలదు. దీనికి అనుగుణముగ అర్వాచీన పల్లవరాజులు తాము బ్రహ్మక్షత్రియులమని చెప్పుకొనియున్నారు. బ్రహ్మక్షత్రియులు అనగా క్షత్రియధర్మమును అవలంబించిన బ్రాహ్మణులని యర్థము. క్రీ. శ. 5 వ శతాబ్దమప్పటికే వీరలు క్షత్రియులుగ పరిగణింప బడుచు వచ్చినట్లు అప్పటి కదంబశాసనముల వలన తెలియవచ్చుచున్నది. పల్లవరాజులు ద్రోణాశ్వత్థామల వలె భారద్వాజ గోత్రులు; వైదికధర్మ నిరతులు. వీరిలో



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పెక్కండ్రు అగ్నిష్టోమాశ్వమేధాదిక్రతు నిష్పన్నులు; కొందరు తాము కలియుగ దోషావసన్న ధర్మోద్ధరణులమని చెప్పుకొనిరి. అనగా అప్పుడు దేశమున ప్రబలి యుండిన బౌద్ధ, జైన మతములను ప్రతిఘటించి సనాతన వైదిక ధర్మమును వీరు సంరక్షించినట్లు ఊహింపవలసి యున్నది.

పరిపాలనము నెరపిన రాజవంశము ఒక్కటియె; ఐనను చరిత్రకారులచే అది నాలుగు వర్గములుగ విభజింపబడినది: ఎట్లన, (1) ప్రాకృత శాసనముల పల్లవులు; (2) సంస్కృత శాసనముల పల్లవులు, (3) మహాపల్లవులు, (4) కడపటి పల్లవులు. ఈ నాల్గు వర్గముల రాజులకును పరస్పర సంబంధము కలదు. కాని, మొదటి రెండువర్గములకునుగల సంబంధము ఇట్టిదని నిశ్చయించుటకు వీలుపడకున్నది. కడపటి రెండు వర్గములు ఒక్కమూల పురుషుని సంతతియే ఐనను, వారి బంధుత్వము సుదూరమైనది. కావున వారిని ఒక్కవర్గము క్రింద చేర్చుటకన్నను ప్రత్యేకముగ వర్ణించుటయే యుక్తము.

ఆరంభము నుండియు కడపటి వరకును అవిచ్ఛిన్నముగ పల్లవరాజవంశమును వర్ణించుటకు వీలుకాదు. అర్వాచీన పల్లవ శాసనములలో కొన్నిటియందు రాజుల పట్టిక లుండినను అందు ఆ రాజుల అన్యోన్య సంబంధ బాంధవ్యములు వివరింపబడక పోవుటవలన వాని మూలమున వంశానుక్రమణికను తెలిసికొనుటకు సాధ్యపడదు. అట్టి సంబంధ బాంధవ్యములను తెలుపు శాసనములు ఒక కొన్ని ఉన్నను వానిలో పదియు నాలుగు తరములకంటె అధికముగ పేర్కొనదు. ప్రతిదానశాసనము నందును దాత యొక్కయు, అతని పితృపితామహుల యొక్కయు పేర్లుమాత్రము పేర్కొనబడియుండును. కాని తత్పూర్వుల ప్రస్తావము ఏమియు ఉండదు. మరియు తాత పేరు మనుమనికి పెట్టు ఆచారమువలన ఒకశాసనములో కానవచ్చు పేరులే - కనీసము రెండుతరములవి అయినను - మరికొన్నిటి యందును కానవచ్చుటవల్లను, కాని కాలమును నిర్ణయించుటకు తగిన శకము ఎద్దియు ఉదాహరింపబడక పోవుటవల్లను వాని పౌర్వాపర్యములను నిర్ణయించుటయు, తన్మూలమున సరియైన వంశ, కాలానుక్రమణికలను ఏర్పరచుటయు సులభ సాధ్యములు కావు. అయినను, లిపి పరిణామమును ఆధారపరచుకొని లిపి శాస్త్రవిశారదులు పైని పేర్కొనిన శాసనముల కాలమును స్థూలముగ ఉజ్జాయించి యున్నారు. వారి సిద్ధాంతములను పునాదులుగ చేసికొని చరిత్రకారులు పల్లవరాజ వంశావళిని, అందలి రాజుల కాలక్రమమును నిర్ణయించుటకు తలపెట్టిరి. కాని వీరిలో అభిప్రాయభేదములు కలవు. తత్కారణముచే వీరు దిద్దితీర్చిన వంశావళులు ఒక్క తెరగున ఉండక వేర్వేరు మార్గముల నడచినవి. ఇట్లు తీర్చిన వంశావళులలో నెల్ల సుప్రసిద్ధ చరిత్రకారుడగు జి. జె. దూబ్రేపండితునిచే విరచింపబడినది కడు సమంజసముగ కన్పట్టుచున్నది. దానిని అనుసరించియే పల్లవ చరిత్రము ఇచ్చట వర్ణితమైనది.

## ప్రాకృత, సంస్కృత శాసనముల పల్లవులు

**వీరకూర్చవర్మ** (క్రీ. శ. 285—క్రీ. శ. 310): ఇతడు పల్లవ రాజులలో మొదటివాడు. ఇతని శాసనములు ఏవియు కానరావు. క్రీ. శ. 9వ శతాబ్దము మధ్యమున రాజ్యము చేసిన మూడవ నందివర్మ వేలూరుపాళెము తామ్రశాసనమునందే ఇతని ప్రస్తావము కలదు. ఇతడు నాగరాజ పుత్రికను పెండ్లాడి తన్మూలమున రాజ్యమును పొందిన విషయము ఇంతకుముందే వివరింపబడినది. ఇతనికి స్కంద శిష్యుడు అను కుమారుడు ఉండెను. ఈ స్కంద శిష్యుడును, హిరహడగల్లి ప్రాకృత దానశాసన దాత శివస్కందవర్మయును, మయిదవోలు ప్రాకృత దానశాసన దాత విజయస్కంద వర్మయును ఒక్కడే అని శాసన పరిశోధకులును, చరిత్రకారులును ఏకగ్రీవముగ నిశ్చయించినారు. అగునేని, హిరహడగల్లి శాసనములో శివస్కందవర్మకు తండ్రి అని పేర్కొనబడిన బప్ప మహారాజే వీరకూర్చవర్మ అని ఎంచవలసియున్నది.

వీరకూర్చవర్మ పాలించిన రాజ్యము బహు విస్తారమైనది. దక్షిణాంధ్ర, ద్రావిడ, కొంగు, కర్ణాట, కుంతల దేశములు అందు ఇమిడియుండినవి. ఇంతటితో తృప్తిచెందక తూర్పున కృష్ణానదీతీర దేశమును విజయపురము రాజధానిగ ప్రభుత్వము చేయుచుండిన ఇక్ష్వాకు వంశజుల రాజ్యమును జయించి స్వాధీనము చేసికొనెను. రాజ్యపాలనమునందు ఇతనికి ఇతని కుమారుడైన యువమహారాజ విజయస్కందవర్మ సహాయుడయి యుండెను. ధాన్యకటకము ముఖ్యస్థానముగ గల ఆంధ్రాపథము ఇతని ఏలుబడి క్రింద ఉండెను.

**విజయస్కందవర్మ** (క్రీ.శ. 310—క్రీ.శ. 335): తండ్రి అనంతరము విజయస్కందవర్మ అను శివస్కందవర్మ రాజ్యాధిపత్యము వహించెను. ఇతడు అగ్నిష్టోమ వాజపేయాశ్వమేధయాజి; ధర్మ మహారాజాధిరాజు. ఇందువలన శివస్కందవర్మ వైదిక ధర్మ నిరతుడని తెలియుచున్నది. ధర్మమహారాజాధిరాజు అను బిరుదు వహించిన వారిలో ఇతడే ప్రథముడు; కావున వైదిక ధర్మమును ఉద్ధరించుటకు ఇతడు కంకణము కట్టుకొనె ననియు, దానిని ప్రకటించుటకొరకే పై బిరుదును ధరించె ననియు తోచుచున్నది. దిగ్విజేతలును; సామ్రాజ్య పట్టభద్రులును



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చేయదగిన అశ్వమేధయాగము నొనర్చుటవలన అతడు మహాశూరుడై పెక్కు రాజ్యములను గెల్చెనని అనుకొన వలసి యున్నది; కాని, అతడు జయించిన రాజ్యములు ఎవ్వియో, రాజులు ఎవ్వరో తెలియదు; కాని, ఒకానొక శాసనమున ఇతడు సత్యసేనుడను వానికడనుండి ద్విజుల ఘటికను గైకొనెనని చెప్పియున్నది. ఘటిక యనగా విద్యా సంస్థ. ఈ సత్యసేనుడు ఎవ్వడో, వానికడనుండి శివస్కంద వర్మ ద్విజుల ఘటికను ఏల కైకొనవలసివచ్చెనో తెలియదు.

**విష్ణుగోపుడు** (క్రీ. శ. 885—క్రీ. శ. ?): శివస్కంద వర్మ అనంతరము రాజ్యాధిపత్యము వహించినది ఎవ్వ రైనదియు నిశ్చయించి చెప్పుటకు వలను పడదు. అతనికి బుద్ధవర్మ అను కుమారుడు ఒక డుండెను. ఈ బుద్ధవర్మ తండ్రికాలమున యువరాజై ధాన్యకటకప్రాంత దేశమును పాలించుచుండెను: కాని, అతడు సింహాసనము నధిష్ఠించి నట్లు అగపడదు. ఏలన, క్రీ. శ. 845 - 850 మధ్య గుప్త చక్రవర్తియైన సముద్రగుప్తుడు దక్షిణాపథముపై దండెత్తి వచ్చినప్పుడు కాంచీపురమున విష్ణుగోపుడను రాజు రాజ్యము చేయుచుండినట్లు అలహాబాదు శిలాస్తంభశాసన మున చెప్పియున్నది. కాని, విష్ణుగోపునకును తత్పూ ర్వము రాజ్యాధిపత్యము వహించి యుండిన శివస్కంద వర్మకును గల సంబంధము ఎట్టిదో నిశ్చయించి చెప్పుటకు వీలుపడదు. సముద్రగుప్తుని దండయాత్ర ఒక్కటి తక్క ఇతని కాలమున నడచిన చరిత్రాంశములు ఏవియు తెలి యవు. విష్ణుగోపుడు దాక్షిణాత్య ప్రభువుల నెల్ల ఏకము చేసి సముద్రగుప్తుని కృష్ణానదిని దాటి రానీక అడ్డగించి యుద్ధమున పరాభూతుని కావించి వెనుకకు మరల్చెనని కొందరు చరిత్రకారులు చెప్పుదురు; కాని, వారి యభి ప్రాయ మంగీకరింపదగినది కాదు. అలహాబాదు శాసన మును బట్టి చూడ సముద్రగుప్తుడు కృష్ణానదిని దాటినట్లే ఉన్నది. కంచి రాజగు విష్ణుగోపుని మాత్రమేకాక సముద్ర గుప్తుడు పాలకరాజగు ఉగ్రసేనుని గూడ జయించినట్లు ఉన్నది. పాలక యనునది పల్లవ శాసనములలో పేర్కొన బడియుండు పలక్కడయే. ఇది కృష్ణానదికి దక్షిణమున ఉండిన పల్లవ ముఖ్యపట్టణములలో ఒకటి. ఇది ఇప్పటి పులికాటని కొందరు పరిశోధకులు చెప్పుదురు. కావచ్చును. పాలక ఉగ్రసేనుని, కంచి విష్ణుగోపుని విడివిడిగా చెప్పుటచే సముద్రగుప్తుడు వారితో వేర్వేరుగ యుద్ధముచేసి యుండు నని తోచుచున్నది. పాలకరాజును అతని రాజధానికడనే సముద్రగుప్తుడు ఓడించి ఉండును.

సముద్రగుప్తుని దండయాత్రవలన పల్లవ రాజ్యమున గొప్ప సంక్షోభము కలిగినది. పల్లవరాజుల బలమును, పేరు ప్రతిష్ఠలును కొంతవరకు డిందుపడెను. శత్రువులు పలుచోటుల తల చూపిరి. పల్లవ ప్రభుత్వమే లయమై పోవునట్లు కానవచ్చెను. ఈ శత్రువులలో నెల్ల ప్రముఖుడు కదంబరాజ్య స్థాపకుడైన మయూరశర్మ. ఈ మయూర శర్మ పూర్వీకులు తరతరములుగ కదంబ వృక్షమును పూజించుచు వచ్చుటచేత ఇతడును, ఇతని సంతతివారలును కదంబవంశజులని వాసికెక్కిరి. మయూరశర్మ పుట్టుకచేత బ్రాహ్మణుడు. ఇతడు ప్రవచనమును సర్వమును చదువ గోరి తన యుపాధ్యాయుడగు వీరశర్మతో కూడ పల్ల వేంద్రుని పురియైన కాంచీనగరమును చేరి అచ్చటి ఘటి కలో 'తర్కుకుడై ప్రవేశించెను'. పల్ల వాశ్వసంస్థయందు కలిగిన తీవ్రకలహముచే కుపితుడై విద్యాభ్యాసమును విసర్జించి కత్తిని దూసి పల్లవేంద్రుని అంతపాలకులను నిర్జించి, శ్రీపర్వత ద్వారమువరకును వ్యాపించి ఉండిన అరణ్య ప్రదేశమును స్వాధీనపరచుకొనుటయే కాక బృహ ద్బాణులు మొదలయిన పల్లవ సామంతులను అదిమి కప్పము గొనుటకు ఆరంభించెను. పల్లవరాజు కుపితుడై అతనిపై దండెత్తెను కాని, పెక్కు రణరంగములలో పరా జయమును పొందెను. అతడు మయూరశర్మతో పోరి గెల్చుట సాధ్యము కాదని ఎంచి పశ్చిమ సముద్రతీరము నుండి ప్రేహారము వరకు కల రాజ్యమును అతని కిచ్చి పట్టబద్ధుని కావించి, సంధి చేసికొనెను. అప్పటినుండియు కుంతలదేశము పల్లవులక్రింద సామంత రాజ్యముగ ఏర్ప డెను. తరువాత, మయూరశర్మ సంతతివారు తమ సామంత పదవితో తృప్తి చెంది ఉండక స్వతంత్రు లగుటకు అడుగడుగునకు ప్రయత్నము చేయుచుండిరి.

**త్రిలోచనపల్లవుడు** ; (క్రీ.శ. 850 - క్రీ.శ. ?) కొంచెము ఇంచుమించుగ ఈ సమయముననే దక్షిణమునుండి చోళులు దండెత్తివచ్చి పల్లవ రాజును ఓడించి అతని రాజధానియైన కాంచీపురమును ఆక్రమించుకొనిరి. ఈ దండయాత్ర ప్రస్తావము పల్లవుల శాసనములలో ఎచ్చటను కానరాదు; కాని, ప్రాచీన తమిళ వాఙ్మయమునందు చోళరాజైన కరికాల నృపతి తొండమండలముపై ఎత్తివచ్చి, అచ్చట రాజ్యము చేయుచుండిన ముక్కంటి కాడువెట్టి అను రాజును జయించి కంచిని ఆక్రమించుకొనెనని తెల్పు ఐతిహ్యము ఒక్కటి కలదు. ఈ ముక్కంటి కాడువెట్టి వృత్తాంతము క్రీ. శ. 10 - 11 శతాబ్దములనాటి తెలుగు చోళుల శాసనములందును, తిక్కనకృత నిర్వచనోత్తర రామాయణమునందును వర్ణింపబడి యున్నది. ముక్కంటి కాడువెట్టికి ముక్కంటి పల్లవు డనియు, త్రిలోచనపల్లవు డనియు నామాంతరము లున్నట్లు శాసనములవల్ల తెలియు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చున్నది. కాడువెట్టి అనునది అరవమాట. అడవులను నరికించి దేశమును వానయోగ్యము కావించి వ్యవసాయమును అభివృద్ధి నొందించుట వలన ఇతని కది బిరుదనామ మయినది. ఇతని సంతతివా రందరు ఈ బిరుదనామమును వహించుటవలన కాలక్రమమున పల్లవ శబ్దమునకు ఇది ప్రతియై రూఢికెక్కినది. త్రిలోచన పల్లవుడు అనునది ముక్కంటి కాడువెట్టికి సంస్కృతీకరణము.

త్రిలోచన పల్లవుని వృత్తాంతము అర్వాచీన శాసనములందే కానవచ్చుటవల్లను, త్రిలోచనునికి మూడు కన్నులుండెనని గాథ ఒకటి ఆవిర్భవించుటవల్లను అతడు చరిత్రాత్మక పురుషుడు కా డనియు, కల్పిత వ్యక్తి యనియు కొందరు చరిత్రకారులు వాదింతురు. అర్వాచీన శాసనములలో కానవచ్చినంత మాత్రమున అతని వృత్తాంతమును అసత్యమని త్రోసివేయుట సరికాదు. అతనికి మూడు కన్నులుండెనను కథ అసత్యమైనను అతడు మిథ్యాపురుషుడను వాదము అంగీకరింప దగినది కాదు. అట్టి పేరు అప్పటివారికి మరికొందరికి ఉండినట్లు శాసనములు తెల్పుచున్నవి. వా రందరును చరిత్రాత్మక పురుషులైనచో ఇతడు ఏల కారాదు? కరికాలుని గూర్చిన అత్యద్భుత గాథలు ఎన్నో కలవు. తత్కారణమున అతడు మిథ్యాపురుషుడు కాడేని త్రిలోచన పల్లవుడు మాత్రము ఏల కావలయును? కాబట్టి ముక్కంటి కాడువెట్టి వృత్తాంతము సత్యాత్మకమని ఒప్పుకొనుట యుక్తము.

పల్లవ వంశావళిలో త్రిలోచన పల్లవుని స్థాన మెద్దియో నిర్ధారణచేసి చెప్పుటకు వీలులేదు. అనంతపురము, బళ్లారి, కోలారు మండలములలో ప్రాచీన కాలమున రాజ్యము చేసిన నొలంబ పల్లవ వంశజులు తాము త్రిలోచన పల్లవుని సంతతివారమని చెప్పుకొనియున్నారు. త్రిలోచన పల్లవునికి ఆంధ్రదేశ చరిత్రతో గాఢమైన సంబంధము కలదు. శ్రీశైల పర్వతమునకు ఆగ్నేయమున బలిసి యుండిన అడవిని కొట్టించి దేశమును ఆబాదు కావించెను. ఆర్య సంస్కృతిని ఆంధ్రదేశమున వ్యాప్తి నందించుటకు అతడు ఘనప్రయత్నములను ఒనర్చెను. అరణ్యమును ఛేదించి ఆబాదు కావించిన శ్రీశైలమునకు తూర్పు దిశను అతడు బ్రాహ్మణాగ్రహారములను నెలకొల్పెను. ఒక్కొక్క అగ్రహారమును వైదిక విద్యకు నిలయ మగుటవలన ఇతని కాలమున ఆర్యసంస్కృతి ఎట్లు అభివృద్ధినందెనో ఊహింపవచ్చును. ఇందువల్లనే త్రినయన పల్లవుని కీర్తి ఆంధ్రదేశమున స్థిరముగా నిలిచి పోయినది.

త్రిలోచనుని రాజ్యకాలమున వచ్చిన చోళ దండయాత్ర కడు ముఖ్యమైనది; దానికి ఫలితముగ తెలుగు దేశమున చోళరాజ్యము ఏర్పడినది. కరికాలుని సంతతివారు కడప మండలమునందలి రేనాడులో ఒక చిన్న రాజ్యమును ఏర్పరచుకొని అచ్చటనే స్థిరముగ నిలిచిపోయిరి. తరువాతి కాలమున వీరి సంతతివారు తామరతంపరగ అభివృద్ధిచెంది ఆంధ్రదేశమున మూలమూలలకును ప్రాకి చిన్న చిన్న రాజ్యములను నిర్మించుకొనిరి. వీరు జాతిచే అరవలైనను తెలుగు చోడులనియే రూఢి కెక్కిరి. క్రీ. శ. 7 వ శతాబ్దమునాటికి వీరు తమ స్వభాషయైన తమిళమును విస్మరించి తెలుగునే మాతృభాషగా స్వీకరించినట్లు ఉన్నది.

**మొదటి కుమార విష్ణువు :** (క్రీ. శ. 380 - క్రీ. శ. 385) : ఇతడు త్రిలోచన పల్లవుని యనంతరము రాజ్యమునకు వచ్చెను; ఇతడు యుద్ధరంగమున జిష్ణునివంటివాడనియు, కాంచీ నగరమును శత్రుల కడనుండి మరల గ్రహించె ననియు తెలియవచ్చుచున్నది.

**బుద్ధవర్మ** (క్రీ. శ. 385—క్రీ. శ. 410) : కుమారవిష్ణువు తరువాత ఇతని పుత్రుడైన బుద్ధవర్మ రాజ్యాధిపత్యము వహించి చోళ సైన్యార్ణవమునకు బడబాగ్ని అయ్యెనట. ఇతడు తన తండ్రియైన కుమారవిష్ణువు కాంచీనగరము కొరకు చోళులతో ఆరంభించిన పోరాటమును కొనసాగించి విజయమును పొంది పల్లవుల యధికారమును మరల ద్రావిడ దేశమున సుప్రతిష్ఠితము కావించినట్లు తోచుచున్నది.

తరువాత బుద్ధవర్మ కుమారుడు రెండవ కుమార విష్ణువు రాజై క్రీ. శ. 410 మొదలు 436 వరకు రాజ్యము చేసెను.

**ప్రథమ సింహవర్మ** (క్రీ. శ. 436—క్రీ. శ. 460) : బుద్ధవర్మ అనంతరము పల్లవ సింహాసనము నధిష్ఠించిన రాజులలో ప్రథమసింహవర్మ అగ్రగణ్యుడు. ఇతనికి విష్ణుగోపుడు అను తమ్ము డుండెను. విష్ణుగోపుడు యౌవరాజ్య పదమునకు అభిషిక్తుడై తన యన్న పక్షమున కృష్ణానదికి దక్షిణమున నుండు తీరాంధ్రదేశమును పరిపాలించుచుండెను. ఇందువలన ఇతడు యువమహారాజ విష్ణుగోపుడని ప్రసిద్ధినందెను. సింహవర్మను గూర్చి స్మరణయం దుంచుకొనదగిన యంశములు రెండు కలవు. ఇందు మొదటిది ఇతని రాజ్యకాలమునకు సంబంధించినది. ఇతని రాజ్యాభిషేకకాలము తత్పూర్వుల కాలమువలె ఊహామాత్ర సాధ్యము కాక నిశ్చయముగ తెలియుచున్నది. సింహనంది యను దిగంబర జైన సమయాచార్యుడు స్వవిరచితమైన లోకవిభాగమను భూగోళవిషయ గ్రంథమును కాంచీపురాధీశ్వర సింహవర్మయొక్క 22 వ రాజ్యవర్షమునకు సరియగు శకాబ్దము 380 లో వ్రాసి ముగించితినని చెప్పి

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



యున్నాడు. శకాబ్దము 358 (380 - 22) లో - అనగా క్రీ.శ. 436 లో సింహవర్మరాజ్యమారంభమయ్యెనని తేలుచున్నది. కావున ఇతడు క్రీ. శ. 436 మొదలు 458 వరకు రాజ్యపాలనము చేసెనని దృఢముగ చెప్పవచ్చును; అటుతర్వాత, ఎంతకాలము పాలించెనో నిశ్చయించి చెప్పుటకు వీలుకాదు. తరమునకు 25 యేండ్లను పరిశోధకులచే నిర్ణీతమైన సమయమును అనుసరించి సింహవర్మ క్రీ. శ. 436 మొదలుకొని క్రీ. శ. 460 వరకును ప్రజాపాలన మొనర్చియుండునని చరిత్ర పరిశోధకులు అభిప్రాయపడుచున్నారు.

రెండవది కదంబులతోడి యుద్ధము. శివస్కందవర్మ యనంతరము మయూరశర్మయను బ్రాహ్మణ కుమారుడు పల్లవేంద్రునిపై తిరుగబాటు చేసి అతనితో పోరి యతనినుండి పశ్చిమసముద్ర, ప్రేహారముల మధ్య ప్రదేశమును సామంతరాజ్యముగ పడసెనని ఇంతకుముందు వివరింపబడి యున్నది. సామంతుడైన మయూరశర్మ సంతతివారు నాలుగు తరములదాక పల్లవులను ఆశ్రయించుకొని వారికి సేనాధిపతులై ఉండిరి; కాని, క్రమ క్రమముగా ప్రబలి వారు స్వతంత్రులగుటకు ప్రయత్నము చేయగడగిరి. మయూరశర్మ మునిమనుమడైన కకుత్స్థవర్మ గుప్తచక్రవర్తులతో వియ్యమంది వారి ప్రాపు పొందెను. కకుత్స్థవర్మయొక్క పుత్రుడైన ప్రథమ కృష్ణవర్మ పల్లవుల ఆధిపత్యమును అంగీకరింపక, స్వాతంత్ర్యమును ప్రకటించెను. పల్లవులవలె ఇతడు 'ధర్మరాజ', 'ధర్మమహారాజ' బిరుదులను వహించుటయే కాక, పట్టభద్రులైన రాజాధిరాజులు చేయదగిన అశ్వమేధ యాగమును కావించి తాను పల్లవరాజునకు సమానస్కంధుడనని బాహాటముగ చాటెను. తత్కారణమువలన సింహవర్మ కదంబుల యాటోపమును అణగగొట్టి, కుంతల కర్ణాటకములపై నిజాధిపత్యమును మరల నెలకొల్పుటకు దండెత్తవలసి వచ్చెను. పల్లవసైన్యము నాణక్కాసి పల్లవరాజు నాయకత్వముక్రింద యుద్ధమునకు నడచెను. కదంబ కృష్ణవర్మ సైన్యము సోమవంశోద్భవుడైన శివనందివర్మ ఆధిపత్యముక్రింద పల్లవ సైన్యమును ఎదిర్చెను. తుములయుద్ధము సంప్రాప్తమైనది. యుద్ధమున కదంబులు పరాజయము పొందిరి. తత్ఫలితముగ కృష్ణవర్మ పలుచుండిన దేశము పాడు కావింపబడెను. ఈ పరాభవమును సహింపలేక రాచబిడ్డ శివనందివర్మ కృతదర్భశయనుడై ప్రాయోపవేశముచేసి దేహమును చాలించెను.

కృష్ణవర్మయొక్క తరువాతి వృత్తాంతము తెలియరాదు. అతని యనంతరము అతని సోదరుడైన శాంతివర్మ రాజ్యాధిపత్యము వహించి కొంతకాలము ప్రజాపరిపాలనము చేసెను. అతడు గతించినపిమ్మట అతని పుత్రుడైన మృగేశవర్మకును, మొదటి కృష్ణవర్మకుమారుడైన విష్ణువర్మకును రాజ్యాధిపత్యమునకై పోరాటము కలిగెను. వీరిలో విష్ణువర్మ అధిరాజైన పల్లవ సింహవర్మను తనకు సాయము రమ్మని వేడుకొనెను. ఆ పిలుపు సింహవర్మకు ముదము కలిగించినది. కదంబులపై తన యధికారము మరింత దృఢముగ నెలకొలుపుటకు అందువలన అవకాశము కల్గినది. కావున అతడు పల్లవ శాంతవర్మకు ఒకగొప్ప సైన్యమును ఇచ్చి అతనిని కుంతలమునకు పోయి విష్ణువర్మను అతని పిత్ర్యమైన రాజ్యమున పునః ప్రతిష్ఠితుని కావింపుమని నియోగించెను. శాంతవర్మయు సైన్యముతో బయలు వెడలిపోయి మృగేశుని యుద్ధమున నోడించి విష్ణువర్మను రాజ్యాభిషిక్తుని కావించెను.

ఇట్లు అడుగడుగునకును స్వామిద్రోహమును తలపెట్టుచు స్వతంత్రులగుటకు ప్రయత్నములు చేయుచుండిన కదంబుల ఉద్యమమును కొనసాగనీయక అడ్డుపెట్టదలచి సింహవర్మ ఒక యెత్తుగడ వేసెను. రాజ్య కేంద్రస్థానమైన కాంచీపురమునకు కదంబుల రాష్ట్రము సుదూరమున ఉండుటచేత, వారు ఆడినది ఆటయు పాడినది పాటయు అయినది. వారు తిరుగబాటు చేసినప్పుడెల్ల కేంద్రస్థానమునుండి సైన్యము పోయి వారిని అణగగొట్టుట దుష్కరమగుచుండెను. కావున, వారికి ప్రతిస్పర్ధులుగ కర్ణాటముననే మరియొకసామంతరాజవంశము వారిని స్థాపించుట యుక్తమని సింహవర్మకు తోచెను. కావున అతడు పాశ్చాత్యగాంగ వంశజుడైన ఆర్య లేక అయ్యవర్మకు గంగవాడిపై సామంతాధిపత్యము నిచ్చి ఆతనిని కావేరీ తీరమందు ఉండు తలకాడు పురమున స్థాపించెను. అది మొదలు ఈ గంగవంశజులు మూడు నాల్గు తరములదాక పల్లవులయెడ విశ్వాసము కలిగి పల్లవుల పక్షము వహించి కదంబులతో పోరాడుచు వచ్చిరి.

యువమహారాజ విష్ణుగోపవర్మ అనంతరము అతని పుత్రుడైన రెండవ సింహవర్మయు, పౌత్రుడయిన రెండవ విష్ణుగోపవర్మయు దక్షిణాంధ్ర తీరదేశమును పాలించిరి. కాని, వీరికి కంచిని పాలించిన మొదటి సింహవర్మ వంశజులతో గల రాజకీయ సంబంధము ఎట్టిదియో నిశ్చయించి చెప్పుటకు వీలులేదు. వీరు కొంచెము ఇంచుమించుగ స్వతంత్రులై, తమ యేలుబడిక్రింది దేశమును పరిపాలించినను కంచి రాజ్యాధిపతులకు వీరు ఆశ్రితులై యుండిరని ఎంచుట యుక్తము.

స్కందవర్మ (క్రీ. శ. 460—క్రీ. శ. 485): మొదటి సింహవర్మ గతించిన పిమ్మట, అతని కుమారుడైన స్కంద



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వర్మ రాజ్యమునకు అధిపతి యాయెను. ఇతని కాలమున సంభవించిన చరిత్రాంశములు ఏవియు తెలియరావు. కాని, ఇతడు కదంబ సామంతుల విషయమున తన తండ్రి మార్గమును అనుసరించి పశ్చిమ గాంగులను ఆంధ్ర కర్ణాట కుంతల దేశముల సరిహద్దు స్థానమున స్థిరపరచెను; అర్యవర్మ కుమారుడయిన మాధవవర్మను గాంగరాజ్యమునకు అభిషిక్తుని కావించెను.

**మొదటి నందివర్మ** (క్రీ. శ. 485 - క్రీ. శ. 510): మొదటి నందివర్మ కాంచీపుర పల్లవ సామ్రాజ్యమునకు అధిపతి యాయెను. ఇతని రాజ్యకాలమున సంభవించిన చరిత్రాంశము ఒక్కటి మాత్రమే పల్లవ శాసనములందు పేర్కొనబడి యున్నది. పినాకపాణియైన శివుని అనుగ్రహమువలన ఇతడు దృష్టివిషు డను ఫణీంద్రుని ఆడించెనట. ఈ దృష్టివిషుడు సిందవాడి (అనగా ఇప్పటి అనంతపురము, రాయచూరు మండలములలో చాలభాగము)పై పూర్వకాలమున ప్రభుత్వము చేసిన సిందవంశమునకు మూలపురుషుడు. మొదటి నందివర్మ ఇతనిని ఆడించెననగా, ఇతనిని ఓడించి వశ్యుని కావించుకొనెనని చెప్పవలసి యున్నది. కాని, నందివర్మకు దృష్టివిషునితో ఏల ఘర్షణ కలిగెనో, అతడు ఇతనిని ఎట్లు ఓడింపగల్గెనో తెలియదు. సిందవాడి కుంతల దేశాంతర్గతమైన రాష్ట్రము. కదంబులు, కుంతలాధిపతులు. కావున నందివర్మకు ఒకవేళ తన పూర్వికులవలె కదంబులతో పోరాటము కలుగగా కుంతలదేశముపై ఎత్తిపోవలసివచ్చెనేమో? ఆ దండయాత్రయందు అతడు దృష్టివిషుని జయించెనేమో. అట్లు జరిగియుండునని ఊహించుటకు అవకాశము కలదు. కదంబ మృగేశవర్మకు రవివర్మ అను పుత్రు డుండెను. ఇతడు తనపెద్ద తాత కుమారుడయిన విష్ణువర్మయొక్క అధిపత్యమును అంగీకరింపక అతనిపై తిరుగబాటు చేసెను. విష్ణువర్మ తనకు అధిపతియైన పల్లవేశ్వరుడగు చండదండుని సహాయమును అర్థించెను. చండదండుడు సైన్యముతో బయలుదేరి పశ్చిమ గాంగులు తోడు నడవగా కుంతలముపై దండయాత్ర సాగించెను. ఈ దండయాత్రచరిత్ర చక్కగ తెలియదు; కాని, కదంబ రవివర్మ 'విష్ణువర్మను వధించె' ననియు, 'కాంచీపురీశ్వరుడయిన చండదండుని పెకలించివైచితి' ననియు తన శాసనములలో చెప్పుకొని యున్నాడు. చండదండుడు అనునది నందివర్మ బిరుదై ఉండవలెను. అగునేని కుంతల దండయాత్ర యందు అతడు ఆద్యమున కొన్ని విజయములు గావించినను తుదకు పరాజితుడై వెనుకకు మరలెనని తోచుచున్నది.

**కళభ్ర దండయాత్ర**: సంస్కృత శాసనములలోని రాజులలో మొదటి నందివర్మ కడపటివాడు. ఇతని రాజ్యకాలము కడపటనో, ఇంచుక తరువాతనో కళభ్రులు దక్షిణదేశముపై నెత్తివచ్చి, పల్లవులనుమాత్రమే కాక మరి పెక్కు దాక్షిణాత్య రాజవంశములను కూడ కూలద్రోసి తమ అధికారమును స్థాపించిరి. ఈ కళభ్రులు ఎవ్వరో ఎచటినుండి వచ్చిరో తెలియదు; కాని, వారు కర్ణాటదేశ వాస్తవ్యులని దాక్షిణాత్య చరిత్ర పరిశోధకులు కొందరు అభిప్రాయపడుచున్నారు. మరికొందరు వారు కదంబులని చెప్పుదురు. కదంబు లగుట వాస్తవమగునేని, వీరు పల్లవులతో తరతరములనుండి నిజస్వాతంత్ర్య స్థాపనకై పోరాడుచు వచ్చి చిట్టచివరకు కంచిపై నెత్తివచ్చి పల్లవ సామ్రాజ్యమును కూలద్రోసి యంతటితో తృప్తిపడక చోళ, పాండ్య దేశములను ప్రవేశించి యచటి రాజవంశములను జయించి దేశ మంతటిని తమ యేలుబడి క్రిందికి తెచ్చుకొనిరని తలపవలసి యుండును.

## మహాపల్లవులు

మొదటి నందివర్మ తరువాత అరువది డెబ్బదేండ్ల వరకును పల్లవుల చరిత్రనుగూర్చి ఏమియు తెలియరాదు. అటుతరువాత క్రీ. శ. 6 వ శతాబ్దము కడపటి పాదమున సింహవిష్ణువను పల్లవరాజు ఒకడు కాంచీపురమున మరల రాజ్యము చేయగడగెను. ఇతని పూర్వ వృత్తాంతము తెలియదు. ఇతడు ఎచ్చటివాడో, కాంచీపుర రాజ్యమందు ఎట్లు నెలకొనగల్గెనో తెలుపగల సాధనములు ఎవ్వియు లభ్యము కాలేదు. ఇతని వంశజుల శాసనములందు కనిపించు కొన్ని సూచనలనుబట్టి ఆధునిక చరిత్ర పరిశోధకులు ఇతని ఆదిమ నివాసస్థానము దక్షిణతీరాంధ్రదేశమని ఊహించినారు. ఇతడును, ఇతని సంతతివారును హిందూ సంస్కృతికి కావించిన అమోఘ సేవను తలపోసి చరిత్రకారులు వీరికి మహాపల్లవులని నామకరణము చేసిరి.

**సింహ విష్ణువు** (క్రీ. శ. 575.—క్రీ. శ. 600): సింహవిష్ణువు గొప్ప విజేత. ఇతడు కదనకర్మ వ్యాపృతు డనియు, మలయమథను డనియు, నిజ బలముచే కళభ్ర మాళవ చోళ పాండ్యులమీదను, సింహళ కేరళులమీదను దర్పము చూపినవా డనియు శాసనములలో కీర్తింపబడినాడు. అవనిసింహుడని ఇతని బిరుదు. పైని పేర్కొన్న శత్రువులలో మాళవులు తప్ప తక్కినవా రందరును దాక్షిణాత్యులే. కళభ్రులను ఇత డెచ్చట జయించెనో నిశ్చయించి చెప్పుటకు వీలులేదు. క్రీ. శ. 6-7 శతాబ్దులలో వీరు చోళ పాండ్య మండలములందు రాజ్యములు ఏర్పరచుకొని యుండినట్లు అప్పటి శాసనములవలనను, వాఙ్మయమువలనను తెలియ

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వచ్చుచున్నది. సింహవిష్ణువు ప్రాంయుశః ద్రావిడ దేశము నుండి వారిని ఓడించి పారదోలి కంచియందు పల్లవరాజ్యము పునఃప్రతిష్ఠ కావించి ఉండును. అటువెనుక, దక్షిణ దిగ్విజయయాత్ర వెడలి, చోళ పాండ్య కేరళ సింహళాదులను వశము కావించుకొని యుండవచ్చును. సింహావిష్ణువు యొక్క దక్షిణ దిగ్విజయయాత్రయందు అతనికి సామంతుడయిన రేనాటి తెలుగు చోళ నందివర్మ మనుమడును, సింహావిష్ణు, సుందరనందుల యనుజుడును నైన ధనంజయవర్మతోడ్పడిన ట్లున్నది. ఇతడు తాను 'పాండ్య, చోళ కేరళులకు అధిపతిని' అనియు, 'చోళ మహారాజ బిరుద పరిప్రాప్తుడను' అనియు చెప్పుకొనియున్నాడు. సింహా విష్ణువు కేవలము శూరమాత్రుడు కాడు; అతడు గొప్ప గీర్వాణ భాషాపోషకుడు. దండి మహాకవి పూర్వికుడైన దామోదరుని కవితా ప్రతిభకు మెచ్చి అతనిని తన ఆస్థానమునకు రప్పించి ఆశ్రయమొసగి పోషించెను. ఈ దామోదరుడు భారవి కవికి మిత్రుడు; అచలపుర ప్రభువైన విష్ణువర్ధనునికి ఆశ్రితుడు. ఇతని సంతతివా రందరు పండితులును, కవులును అయి కాంచీపుర పల్లవాస్థానమునందు వర్ధిల్లిరి.



చిత్రము 28. మహేంద్రవర్మ అతని రాణులు, మహాబలిపురము

**మొదటి మహేంద్రవర్మ (క్రీ. శ. 600—క్రీ. శ. 630):** సింహావిష్ణుని మరణానంతరము అతని పుత్రుడు మొదటి మహేంద్రవర్మ కాంచీపుర పల్లవరాజ్యమునకు అధిపతి ఆయెను. ఇతడు పల్లవవంశ నరపాలకులలో సుప్రసిద్ధుడు. ఇతడు పరాక్రమశాలి; కళాకుశలుడు; శిల్పవిద్యా విశారదుడు; గ్రంథకర్త; సంగీతవిద్యా విచక్షణుడు; వాస్తు విశ్వాత, ఇతనికి 'గుణభరు' డనియు, 'విచిత్రచిత్తు' డనియు, 'చిత్రకారపులి' యనియు, 'అవనీభాజను' డనియు బిరుదనామములు కలవు. కృష్ణా కావేరీనదుల నున్న తీరదేశముపై ఇతని యధికారము చెల్లుచుండినది. ఇతని విజయములు రెండు శాసనములందు పేర్కొనబడి యున్నవి. ఇతడు చోళులను ఓడించి వారి దేశమును జయించెను. కాని ఆ విజయము ఎప్పుడు చేకూరెనో తెలియదు. ఇతని తండ్రికూడ చోళులను జయించినట్లు చెప్పియున్నదికదా! మహేంద్రుడు తండ్రి పక్షమున దండయాత్రను సాగించి ఉండునా? లేక తాను రాజ్యాధిపత్యమును వహించినపిమ్మట చోళులు తిరుగుబాటు చేసి స్వతంత్రు లగుటకు ప్రయత్నింపగా వారిని అణగద్రొక్కి వారి యేలుబడిలోని దేశమును తన రాజ్యమున కలుపుకొనెనా అనునది విచారింపదగిన విషయము. మరియు పుల్లలూరను గ్రామముకడ ఇతడు యుద్ధమున విజయము నొందెను. పుల్లలూరు కాంచీపుర సమీపమున నున్నది. కాని అతనిచే అచట ఓటువడిన శత్రువులు ఎవ్వరో, వారు అచటికి ఏల వచ్చిరో తెలియదు.

మహేంద్రవర్మ శూరుడే అయినను అతనికి పరాక్రమాతిశయమువలనను, శత్రునిషూదనమువలనను ఖ్యాతి కలుగలేదు. దక్షిణ భారతావనికి అతడు చేసిన సాంస్కృతిక సేవవలననే అతనికీర్తి ఆచంద్రతారార్క స్థాయియై నిలిచినది. ఇచట స్మరింపదగిన విషయము ఒక్కటి కలదు. అప్పుడు పల్లవరాజ్యము కృష్ణాతటమువరకును వ్యాప్తమై యుండెను. కంచికి రాకమునుపు సింహావిష్ణువును, అతని పూర్వికులును దక్షిణాంధ్ర తీరరాష్ట్రమును పాలించుచుండిరి. వారు కంచికిపోయి అచట నెలకొనినపుడు వారు దక్షిణాంధ్ర తీరమున వర్ధిలుచుండిన కళలను, ముఖ్యముగ వాస్తు శిల్ప చిత్రలేఖనాది విద్యలను తమవెంట కొనిపోయి అచట ప్రవేశపెట్టి యభివృద్ధి పొందించిరి. వారి రాకవలన



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ద్రావిడ దేశమున ఒక నూతన ప్రబోధము కలిగినది. ఈ ప్రబోధమునకు మహేంద్రవర్మ వేగుచుక్కవంటివాడు. ఆతని యాజమాన్యముక్రింద ద్రావిడదేశ చరిత్రయందు ఒక నూతనయుగము ప్రారంభమయినది. ఆకాలమున కృష్ణాతటమున దేవతావాసమునకై గుహాలయ నిర్మాణము విరివిగ సాగుచుండినది. గుహాలయము అనగా కొండ గర్భమును తొలిచి తీర్చిన దేవాలయము. ఇందు దేవాలయముయొక్క యంతర్భాగమే దృగ్గోచరము అగును. వెలుపటి భాగము అగపడదు. ఇట్టివి కృష్ణాతీరమందలి ఉండవల్లి, మొగల్రాజపురములందు కానవచ్చును. ఇవి వేంగీరాజ్యమును పాలించిన విష్ణుకుండి రాజుల నిర్మాణము లని చెప్పుదురు. ఇట్టి గుహాలయముల యెడల మహేంద్రవర్మకు అత్యంతాభిమానము. విష్ణుకుండి రాజులవలె తానును తన రాజ్యమున గుహాలయములు నిర్మింప నిశ్చయించి మహాబలిపురము, మామండూరు, దళవానూరు, తిరుచినాపల్లి మున్నగు స్థలములలో కొండ సానువులను తొలిపించి ఆలయములను ఏర్పరచెను. వాస్తు నిర్మాణముతో అవినాభావము కలది శిల్పము. వాస్తు నిర్మాణమునకువలె శిల్పమునకు మహేంద్రవర్మ మేలుబంతి వ్రాసెను. పల్లవ శిల్పము భారతీయ లలితకళా చరిత్రమున వినుతికెక్కినది. దానికి ఉండవల్లి శిల్పముతో సన్నిహిత బాంధవ్యము కలదు. దాని ముఖ్యలక్షణము చైతన్యము. శిల్పముతోకూడ పేర్కొన దగినది చిత్రలేఖనము. పల్లవ చిత్రలేఖన పరిశిష్టములు అందందు కానవచ్చుచున్నవి. వీనిలో ముఖ్యముగ పేర్కొనదగినవి మహేంద్రవర్మనాటి సిత్తనవాసల్ చిత్రములు: వీనియందు అజంటా అమరావతుల పోలికలు స్పష్టముగ కానవచ్చుచున్నవని చిత్రకళాభిజ్ఞులు వచింతురు.

మహేంద్రవర్మకు గాంధర్వ విద్యయందు అభినివేశము కలదు. 'సంకీర్ణజాతి' అను బిరుదుచే ఇతడు విఖ్యాతి నొందెను. 'రుద్రాచార్యుడు' అను విఖ్యాత సంగీతవిద్వాంసునికి ఇతడు శిష్యుడు. గురువుకడ అభ్యసించిన విద్య వృథ కాకుండ ఒక సంగీత గ్రంథమును విరచించి కుడిమియామలై అను చోట శిలాక్షరములను చెక్కించెను. సంగీతమునందువలె సాహిత్యమందును ఇతనికి చొరవ కలదు. ఇతనిచే విరచింపబడిన మత్తవిలాస, భగవదజ్జుకములను ప్రహసనములు ఇతని కవితా కౌశల్యమును, ప్రతిభావిశేషమును వేనోళ్ళ చాటుచున్నవి.

మహేంద్రవర్మ మొట్టమొదట జైనమతావలంబియై జైన సమయమును ఆదరించుచుండె ననియు, తరువాత అప్పర్ అను నామాంతరము గల తిరునావుక్కరసు అను శైవాచార్యుని బోధవలన జైన మతమును త్యజించి శైవమును స్వీకరించుటయే కాక జైనులను పలువిధముల హింసించె ననియు చెప్పుదురు. కాని ఇందు ఎంత సత్యము కలదో నిర్ధారించుటకు వీలులేదు. ఇతనిచే విరచింప బడిన మత్తవిలాసాది రచనములను పరిశీలించి చూడగా ఇతడు హిందూధర్మానురక్తు డనియు, బౌద్ధ, జైన, పాశుపత, కాపాలికాది సమయముల యెడల నిరసనభావము కలవా డనియు తెల్లమగుచున్నది.

**మొదటి నరసింహవర్మ : (క్రీ. శ. 630—క్రీ.శ. 668) :** మొదటి మహేంద్రవర్మ పిమ్మట అతని పుత్రుడు మొదటి నరసింహవర్మ రాజయ్యెను. ఇతనికి నరసింహ విష్ణువు అని నామాంతరము. మహామల్లుడని ఇతని బిరుదు. ఇతడు పల్లవరాజులలో పరాక్రమాధికుడు; కాని సింహాసనమును అధిష్ఠించిన క్రొత్తలో శత్రువుల వలని యుపద్రవము అధికమై ఇతనికి పరాజయమును, రాజ్యనష్టమును కలిగెను. చాళుక్యులు రెండవ పులకేశి యాధిపత్యము క్రింద విజృంభించి ఉప్పెనవలె పొరలివచ్చి ఇతని రాజ్యమును ముంచివేసిరి. క్రీ. శ. 609-10 వ సంవత్సరములో ఇమ్మడి పులకేశి వాతాపి (బాదామి) చాళుక్య సింహాసనమును అధిష్ఠించెను. క్రీ.శ. 624 లో పూర్వ దిగ్విజయయాత్ర వెడలి కోసల కళింగములను జయించి స్వాధీనపరచుకొనెను; వేంగిని పాలించుచుండిన దుర్జయ వంశజులను ఓడించి ఆ దేశమునుకూడ తనరాజ్యమునందు కలుపుకొనెను. మొదటి మహేంద్రవర్మ అస్తంగతుడు కాగా సమయము అనుకూలమని ఎంచి క్రీ.శ. 631 లో కృష్ణను దాటి పల్లవరాజ్యమున ప్రవేశించి కర్మరాష్ట్రమును, తత్పరిసర దేశమును జయించి వశపరచుకొనెను. తరువాత సైన్యమును తరల్చుకొని ద్రావిడదేశము మీదికి దండయాత్ర నడచెను. నరసింహవర్మ అతనిని ఎదుర్కొని యుద్ధముచేయజాలక నిజరాజధాని అయిన కాంచీపుర దుర్గమున డాగెను. అంతట పులకేశి జయభేరి మ్రోయించుచు కావేరీ పర్యంతము దండయాత్ర సాగించి మరలి తన రాజధానియైన వాతాపికి పోయి చేరెను. ఈ విజయముతో తృప్తి చెందియుండక పులకేశి క్రీ. శ. 634 తరువాత పల్లవరాజ్యముపై మరల దండెత్తి వచ్చెను; అప్పటికి స్థితిగతులు మారిపోయినవి. మొదటి నరసింహవర్మ రాజ్యమున కుదురుకొని సైన్యమును బలపరచుకొని యుండెను. తనరాజధాని యందు ప్రవాసము వచ్చియుండిన సింహళరాజగు 'మానవర్మ'ను, కాడువెట్టి ప్రముఖసామంత మండలాధిపతులను కూర్చుకొని వచ్చిన దండయాత్రికులను ఎదిర్చెను. పులకేశి నేర్పరియైన దొడ్డదళనాయకుడే; కాని, విజయలక్ష్మి

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చంచలకదా! అతనిని త్యజించి నరసింహవర్మను చేపట్టినది. కావున పులకేశి పరియాళ, మణిమంగళ, సురమర రణ రంగములందు పరాజితుడై స్వదేశమునకు తిరిగి పోవలసి వచ్చెను. నరసింహవర్మ అతనిని వదలి పెట్టక వెన్నంటి తరుముచు పోయి వాతాపినగరమును ముట్టడించి ధ్వంస నము కావించుకొని అచట జయస్తంభమును నెలకొల్పెను. ఈ ముట్టడియందు పులకేశి నిహతుడయ్యెను. వాతాపి చాళుక్య రాజ్యమున చాల భాగము పల్లవులకు వశపడెను.

వాతాపి దండయాత్రయందు విజయలక్ష్మిని వరించిన పిమ్మట నరసింహవర్మ మిత్రుడైన 'మాణవమ్మ'కు సహాయముగ తన నావికాదళమును పంపి అతనిని నిజ రాజ్యమున పునఃప్రతిష్ఠితుని కావించెను. ఈ విజయముల వలన అతని యశము దేశదేశములకు ప్రాకెను; పరాక్రమ మున ఇతడు రావణ సముడను పేరు వచ్చెను; కాని చరమదశయందు చాళుక్యులు మరల తలయెత్తిరి; పులకేశి కుమారుడైన ప్రథమ విక్రమాదిత్యుడు బలములను సమ కూర్చుకొని నరసింహవర్మ అధీనమందుండిన చాళుక్య రాష్ట్రమును మరల వశము చేసికొనెను.

నరసింహవర్మ తన రాజ్యకాలమున చాలభాగము యుద్ధకార్యములందు గడపుచు వచ్చినను, ప్రజాక్షేమ మును విస్మరింపక రాజ్యపాలనము సాగించెను. తండ్రివలె ఇతనికిని వాస్తునిర్మాణమునందు ఆసక్తిమెండు. ఇతడును గుహాలయములను కొన్నింటిని తొలిపించెను. అందొకటి నెల్లూరు మండలములోని భైరవుని కొండయందు కలదు. ఇతనిచే నిర్మితములైన గుహాలయములో ఒక నూతన లక్షణము కాన్పించుచున్నది. గుహాలయ స్తంభములు తత్పూర్వము వలె సాదా పాతుపీఠములపై కాక సింహ ప్రతిమల శిరములపై అని ఉన్నవి. ఈ స్తంభరచనా విధాన మునకు 'నరసింహవర్మ శైలి' అని అధునిక విమర్శకులు పేరుపెట్టిరి.

**మొదటి నరసింహవర్మ తరువాతివారు:** (క్రీ. శ. 668 - క్రీ. శ. 788) : మొదటి నరసింహవర్మ తరువాత అతని కుమారుడు రెండవ మహేంద్రవర్మ సింహాసనమును అధి ష్ఠించి రెండేండ్లకాలము రాజ్యము చేసెను. ఇతడు సత్వ హీనుడు. ఇతని రాజ్యకాలమున చాళుక్యులు మరల విజృంభించిరి. మొదటి విక్రమాదిత్యుడు దండెత్తివచ్చి రాజ్యమున గొప్ప సంక్షోభము కలుగజేసెను; పల్లవుల ఏలుబడి క్రింద ఉండిన తీర, పశ్చిమాంధ్రములలో చాల భాగమును ఆక్రమించుకొనెను. అంతకు ముందు పల్లవులకు సామంతులై ఉండిన రేనాటి తెలుగు చోళ, బాణ వంశ జులు చాళుక్యుల అధిపత్యమును అంగీకరించిరి.

రెండవ మహేంద్రవర్మ గతించిన వెనుక అతని పుత్రుడు మొదటి పరమేశ్వరవర్మ రాజ్యాభిషిక్తుడై క్రీ. శ. 670 మొదలు క్రీ.శ. 685 పర్యంతము ప్రజాపాలనము నొనర్చెను. ప్రారంభదశయందు ఇతడు అష్టకష్టములు పడెను. దేశము నందు విచ్చలవిడిగ తిరుగుచున్న చాళుక్య బలములను పారద్రోలుటకు ఇతడు భగీరథప్రయత్నము చేయవలసి వచ్చెను; ఎల్లెడ్లలో భగ్నమై యుండిన సైన్యములను మరల సమకూర్చుకొని ఓటమిచే నిరుత్సాహులై యుండిన ప్రజల హృదయమందు ధైర్యమును పాదుకొల్పి రణోన్ముఖులను చేయవలసి వచ్చెను; ఇతడు పట్టుదలతో రణోద్యోగమును జయప్రదముగ కొనసాగించి, తన రాచరికమును పున రుద్ధరించి పూనికను నెరవేర్చుకొనెను; చాళుక్య విక్రమా దిత్యుని రణరంగమున ఓడించి వెడలగొట్టుటయే కాక, వెనువెంట తగిలి అతనిని నిజరాజధానియగు వాతాపి వరకు తరుముకొనుచు పోయి ఆ పట్టణమును ముట్టడించి ధ్వంసము కావించెను. ఈ కారణమున ఇతనికి తన పితా మహుడైన మొదటి నరసింహవర్మవలె 'వాతాపి కొండాన్' అను పేరు కలిగినది. 'ఉగ్రదండుడు' అని ఇతనికి బిరుదు.

మొదటి పరమేశ్వరవర్మ వెనుక అతని పుత్రుడు రెండవ నరసింహవర్మ సింహాసనమును అధిష్ఠించి క్రీ. శ. 685 మొదలు క్రీ. శ. 780 వరకును భూమిని ఏలెను. ఇతడును కడుప్రఖ్యాతుడే. ఇతనికి 'రాజసింహుడు' అను నామాం తరమును గలదు. తన పూర్వికులవలె ఈతడును చాళుక్యు లతో యుద్ధము చేయవలసివచ్చెను. బాదామి చాళుక్య ప్రభువులైన వినయాదిత్య, విజయాదిత్యులు దక్షిణ దిగ్వి జయయాత్రలు చేసినట్లు చెప్పుకొనియున్నారు. కాని, అందు వలన వారు లాభమును పొందినట్లు అగపడదు. ఇమ్మడి నర సింహవర్మ ప్రభుత్వము పల్లవ సామ్రాజ్యమునందు అంత టను నిర్వక్రముగ సాగినది. చోళ పాండ్య కేరళాదులు ఇతనికి అరిగాపులై యుండిరి. ద్వీపాంతర అధిపతులుకూడ ఇతని సఖ్యమును కోరి కానుకలను అంపువారు. ప్రబల మైన పల్లవ నౌకాదళము నరసింహవర్మ ఆజ్ఞను పూర్వ సముద్రపు నాలుగు మూలలను నెరవేర్చుచుండినది. ఇతని కాలమున లలితకళలు అభివృద్ధి చెందినవి. దాక్షిణాత్య దేవాలయ వాస్తు చరిత్రమున ఇతనికి ఒక ముఖ్యస్థానము కలదు. మొదటి నరసింహవర్మ అనంతరము గుహాలయ నిర్మాణము ఆగిపోయినది. దేవాలయములు రాలతోను, ఇటికలతోను కట్టు పద్ధతి మొదటి పరమేశ్వరవర్మనాడు ఆరంభమైనట్లున్నది. రెండవ నరసింహవర్మ పెక్కు శివా లయములను కట్టించెను. అందు కాంచీపురములోని కైలాస



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



నాథుని ఆలయమును - దీనికి రాజసింహేశ్వరము అని నామాంతరము, - మహాబలిపురమందలి సముద్రతీర దేవాలయమును ముఖ్యమైనవి. సముద్రతీర దేవాలయము పల్లవ వాస్తువునకు శిరోభూషణమని చెప్పవచ్చును. ఇతని దేవాలయ నిర్మాణ విధానమున కొంత ప్రత్యేకత కానవచ్చుచున్నది. తత్కారణమున దానికి 'రాజసింహపద్ధతి' యని పేరు కల్గినది. కైలాసనాథాలయమున సుందర భిత్తిచిత్రములు కలవు. అజంటా చిత్రముల పోలికలు ఇందు కన్పట్టుచున్నవని చిత్ర విమర్శకులు చెప్పుదురు. ఇమ్మడి నరసింహవర్మ కాలమున పల్లవ సంస్థానమున సంస్కృత సాహిత్యము పెంపొందెను. పెక్కురు గ్రంథకర్తలు అతని ప్రోత్సాహమువలన గ్రంథ రచనకు కడగిరి. వారిలో కావ్యాదర్శ, అవంతి సుందరీ కథాది గ్రంథకర్త దండ్యాచార్యుడు ప్రముఖుడు.

రెండవ నరసింహవర్మ పరలోకగతుడైన వెనుక, అతని కుమారుడు రెండవ పరమేశ్వరవర్మ పట్టాభిషిక్తుడాయెను. ఇతడు నిస్సహాయుడు. కావున శత్రువులు ప్రబ్బుకొని రాగడగిరి. ఇతడు రాజ్యమునకు వచ్చిన మూడవ యేట బాదామి చాళుక్య విజయాదిత్యుని కుమారుడు యువరాజ విక్రమాదిత్యుడును, పశ్చిమ గాంగరాజు శ్రీపురుష ముత్తరసుడును ఏకమై కంచిపై నెత్తివచ్చిరి. పరమేశ్వరవర్మ ధైర్యముతో వారిని ఎదిర్చినను యుద్ధమున పరాజయము పొందెను. విక్రమాదిత్యుడు అంతట కాంచీపురమును ప్రవేశించి రాజసింహేశ్వరాలయమున తన విజయాంకమాలికను శిలాక్షరముల జెక్కించి పరమేశ్వరవర్మ కడ కప్పము గొని మరలిపోయెను. ఈ సంఘటన క్రీ. శ. 731 వ సంవత్సరమున జరిగెను. తరువాత పరమేశ్వరవర్మ శ్రీపురుష ముత్తరసుని శిక్షించుటకు దండువెడలెను. పశ్చిమ గాంగ వంశజులు మొదటి సింహవర్మ కాలము నుండియు పల్లవులకు సామంతులై యుండిరి. బాదామి చాళుక్యులు అభ్యున్నతి నందినప్పటినుండియు వారితో సఖ్యము కావించి పల్లవులను నిరాకరించి స్వతంత్రులగుటకు ప్రయత్నము చేయగడగిరి. రెండవ పులకేశి, మొదటి విక్రమాదిత్యుల దక్షిణ దండయాత్రలు వారి యుద్యమమునకు దోహదప్రాయములైనను తమ పథకమును వారు సంపూర్ణముగ నెరవేర్చుకొనలేకపోయిరి. స్వాతంత్ర్యమును అపేక్షించియే శ్రీపురుషుడు విక్రమాదిత్యునితో కూడివచ్చినది కావున, పరమేశ్వరవర్మ అతనిని శిక్షింప దలపెట్టుట సహజమే. కాని, ఈ దండయాత్ర అతని నాశనమునకు హేతుభూతమయ్యెను. విళందకడ పల్లవ గాంగ సైన్యములు ఒండొంటిని తారసిల్లినవి; ఘోరరణము జరిగినది. యుద్ధమున పరమేశ్వరవర్మ నిహతుడాయెను. అతని సితచ్ఛత్రమును, పెర్మానడి బిరుదమును గంగవిజయ సూచకముగ శ్రీపురుషుడు గ్రహించెను. పరమేశ్వరవర్మ మరణముతో మహాపల్లవ వంశము సమాప్తమయ్యెను.



చిత్రము 27. సముద్రతీర దేవాలయము, మహాబలిపురము

## కడపటి పల్లవులు

### ఇమ్మడి నందివర్మ

(క్రీ. శ. 733-క్రీ. శ. 794) : విళంది రణరంగమున రెండవ పరమేశ్వరవర్మ నిహతుడగుటవలన పల్లవ రాజ్యమున గొప్ప విప్లవము సంభవించినది. యుద్ధమువలన దేశమున పెక్కు అవస్థలు జనించెను. పరమేశ్వరవర్మకు సంతతి లేదు. దాయాదులు చెప్పరాని విపత్తులను రాజ్యాధిపత్యము సహింపలేక తమ వారసత్వపు హక్కులను వీడుకొనిరి. అప్పుడు మంత్రులును, రాజ్యములోని పెద్దలును పోయి సింహవిష్ణుని సహోదరుడగు భీమవర్మ సంతతివాడైన హిరణ్యవర్మ పుత్రులలో నొక్కడయిన పరమేశ్వరవర్మను రాజ్యాధిపతిగ నెన్నుకొనిరి. పట్టాభిషేక సమయమున అతడు నందివర్మ యను నూతన నామమును స్వీకరించెను. అప్పుడు అతడు పండ్రెండేండ్ల ప్రాయమువాడు. కడపటి పల్లవులలో అతడు విఖ్యాత చరిత్రుడు; అరువదియైదేండ్లు రాజ్యమును మహావైభవముతో పాలించెను. పల్లవమల్లుడు అన్నది అతని బిరుదు.

పల్లవ మల్లుడు సింహాసనము నెక్కినది మొదలు తన యధికారమును నిలబెట్టుకొనుటకై పెక్కండ్రు శత్రువులతో పోరాడవలసి వచ్చెను. మొట్టమొదట పేర్కొనదగినవాడు చిత్రమాయ పల్లవుడు. ఇతనికి పాండ్యదేశాధి

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



లితియైన మొదటి మారవర్మ రాజసింహుడు శాసకుడై నిల్చి పెన్న యుద్ధములందు పల్లవమల్లుని ఓడించి కాంచీపుర సమీపమందలి నందిగ్రామమున అతడు తలదాచు కొనగా ముట్టడించెను; కాని, అతని సేనాధిపతియైన ఉదయచంద్రుడు చిత్రమాయపల్లవు నెదుర్కొని అతనిని వధించుటయే కాక, అతని మిత్రుడైన పాండ్యరాజు మారవర్మ రాజసింహుని పలుమారులు ఓడించి దిశావట్టుని కావించెను. అంతట నందివర్మ అధికారము స్థిరపడెను. తరువాత నందివర్మ ఒక యశ్వమేధయాగము చేయ సమ కట్టుములు గొవెను. ఈ తైత్రయాత్రవలన వేంగిరాజ్యమునకు దక్షిణమందలి శ్రీరాంధ్ర రాష్ట్రము మరల పల్లవుల యేలుబడిలోనికి వచ్చెను. ఈ దండయాత్రవలన కొంత రాజ్యలాభము కలిగినను, అది క్రొత్త దండయాత్రలకు దారి చూపినది. ఉదయచంద్రునిచే వాతాపి చాళుక్య విజయాదిత్యుడు పొందిన ఓటమి వలన కలిగిన పరాభవమును సహింపక, అతని పుత్రుడైన రెండవ విక్రమాదిత్యుడును, మనుమడైన రెండవ కీర్తివర్మయు నందివర్మపై పలుమారు దండెత్తి వచ్చి దేశసంక్షోభమును కావించిరి



చిత్రము 28. భైరవుని కొండ, గుహ గుడి, నెల్లూరు

కట్టినట్లున్నది. ఈ యాగాశ్వమునకు అంగరక్షగా ఉదయచంద్రుడు బయలు వెడలెను. ఆ యశ్వము అటనట సంచరించి తుదకు నెల్లూరు మండలములోని బోయకొట్టములను ప్రవేశించెను. ఆ ప్రాంతమును పలుచుండిన పృథ్వీవ్యాఘ్రుడను నిషాదరాజు ఆ గుర్రమును పట్టి బంధించెను. ఉదయచంద్రుడు ఆ నిషాదాధిపతి నోడించి ఆ గుర్రమును విడిపించుటయే కాక వానిని తరుముకొనుచు పోయి వాని మిత్రుడైన పూర్వ చాళుక్యభూపతి విష్ణువర్ధనుని రాజ్యమును ప్రవేశించి అతనిని, అతనికి తోడుగా వచ్చిన వాతాపి చాళుక్య విజయాదిత్యుని పరాభూతులను కావించి రెండవ విక్రమాదిత్యుడు కాంచీపురమును మూడుమార్లు ప్రవేశించెనని అతని శాసనములందు చెప్పియున్నది. కాంచి యందు రాజసింహేశ్వరుని యాలయములో అతడు వ్రాయించిన శిలాశాసనము ఇది వాస్తవమని రుజువు చేయుచున్నది. అతడు ఎప్పుడు ఏ సందర్భమున కంచిని ప్రవేశించెనో, అప్పుడు సంభవించిన విశేషచారిత్రాంశములు ఎవ్వియో నిశ్చయముగ తెలియదు. మొదటి తేప అతడు కాంచీపురమును ప్రవేశించినది రెండవ పరమేశ్వరవర్మ కాలమున నయియుండవచ్చును. అగుచేని, ఆ విషయము ఇంతకుపూర్వమే వివరింపబడి యున్నది. ఇతని



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ప్రభుత్వపు చరమదశయందు ఇతని కుమారుడైన యువ రాజు కీర్తివర్మ నందివర్మపై దండెత్తివచ్చెను. ఆ నంది వర్మ పెక్కుయుద్ధములలో పరాజితుడై అతనిని ఎదుర్కొనుటకును, ప్రకాశయుద్ధము చేయుటకును సామర్థ్యములేక పోవుటవలన దుర్గమును ప్రవేశించెను. అంతట అతడు ఆ పల్లవరాజు యొక్క మత్తమతంగజములను, సువర్ణ మాణిక్య కోటీరములను హరించి కొనిపోయి తండ్రికి ఒసగెను. కాని, ఈ దండయాత్రలో విక్రమాదిత్యుడు పాల్గొనలేదు. మరియు, కీర్తివర్మయైనను తాను కంచి కడ కేగినట్లు చెప్పలేదు. కావున విక్రమాదిత్యుడు కంచిని కడపటి రెండు మారులు ఎప్పుడు ప్రవేశించెనో తెలియదు. ఇది ఎట్లున్నను చాళుక్యుల అధికారము అవల అత్యల్ప కాలముననే తుదముట్టుటవలన నందివర్మకు వారి వలన బాధ లేకపోయెను.

చాళుక్య సామ్రాజ్య పతనమునకు హేతువు రాష్ట్రకూటుల అభ్యుదయము. ఎల్లోరా ప్రాంత దేశమును పాలించుచుండిన దంతిదుర్గు డను రాష్ట్రకూట సామంతుడు తన అధిపతియైన కీర్తివర్మపై క్రీ. శ. 758 ప్రాంతమున తిరుగబాటు చేసి యుద్ధమున అతనిని ఓడించి అతని సర్వ స్వమును నాచికొనెను. సామ్రాజ్య పదమును ఆక్రమించిన తర్వాత దంతిదుర్గుడు దిగ్విజయయాత్ర బయలు వెడలి పెక్కు దేశములను జయించి ఆ దేశములను పలిన ప్రభువులచే కప్పము గొనెను. కంచిపై దండెత్తిపోయి నందివర్మ పల్లవమల్లుని ఓడించెను; కాని, అతనికి తన కొమరితను రేవాదేవిని ఇచ్చి పెండ్లి కావించి సంధి చేసికొనెను.

రాష్ట్రకూట భూవరునితో వివాహసంబంధము నందివర్మ పల్లవమల్లునికి కడులాభకారి అయినది. మొట్టమొదట శత్రుభయము తప్పినది; ఉత్తరమునుండి మాటి మాటికి వచ్చి దేశసంక్షోభమును, జనక్షయమును కావించుచుండిన దండయాత్రలు ఆగిపోయినవి. అంతట నిశ్చింతగ తన పూర్వికుల కాలమున సామంతులై యుండి అవల స్వతంత్రులై తనకు ఉపద్రవము చేయుచుండు ఇరుగు పొరుగు సంస్థానములవారిని తగు రీతిని శిక్షించుటకు అవకాశము కలిగెను. వీరిలో మొదట ఎన్నదగినవాడు పశ్చిమగాంగ రాజు శ్రీపురుష ముత్తరసుడు. ఇతడు పల్లవులకు చేసిన కీడు ఎంతయేనియు గలదు. అతనిపై సూడు తీర్చుకొన వలసిన ఆవశ్యకము అతనిని వేగిర పెట్టుచుండినది. కావున అతడు పశ్చిమాంధ్రమున రాజ్యము చేయుచుండిన బాణ వంశజులతో సఖ్యము కావించుకొని క్రీ. శ. 788 ప్రాంతమున గంగవాడి(గంగరాజ్యము)పై దండెత్తిపోయి తన్ను ఎదిరింప వచ్చిన శ్రీపురుష ముత్తరసుని పరాభూతుని కావించి, అతనికడనుండి పూర్వము అతడు రెండవ పరమేశ్వరవర్మను వధించి హరించిన ఛత్రాదిరాజ చిహ్నములను, ఉగ్రోదయాది భూషణములను మరల గైకొనెను. దక్షిణమున పాండ్యుల ఆటోపము అతిశయించుచుండుట వలన వారిని నిగ్రహించుటకు ప్రయత్న పడవలసి వచ్చెను. చిత్రమాయ పల్లవునికి తోడై పల్లవ రాజ్యముపై ఎత్తి వచ్చి, ఉదయచంద్రునిచే పరాభూతుడైపోయిన మారవర్మ రాజసింహుడు గతించెను. అతని కుమారుడైన మొదటి వరగుణ మహారాజు క్రీ. శ. 775 ప్రాంతమున కావేరీ తీరమున పల్లవ సైన్యములను ఒకమారు ఓడించియుండెను. కావున నందివర్మ కేరళ, కొంగు దేశాధీశ్వరులతోడను, తగడూరు ప్రభువైన అదిగమానుని తోడను, సఖ్యముచేసి వారితో ఏకీభవించి వరగుణునితో యుద్ధముచేయగడగెను. కాని వరగుణుడు వీరి నందరిని నిర్జించుటవలన అతని పూనిక నెరవేరదాయెను. ఇట్లు పాండ్యయుద్ధమున సంకల్పసిద్ధి కాకపోయినను, నందివర్మ క్రీ. శ. 798 దాక నిర్బాధకముగ రాజ్యము చేయగల్గెను. ఇతని చరమదశయందు గంగవాడిలో ఒక గొప్ప సంఘటన జరగినది. రాష్ట్రకూట చక్రవర్తి గాంగ రాజ్యమును జయించి స్వాధీనము చేసికొనెను. శ్రీపురుష ముత్తరసు కుమారుడు మొదటి శివమారుడు రాష్ట్రకూటులపై తిరుగబాటు చేయగా కలివల్లభ ధ్రువ మహారాజు అతనిని పట్టుకొని కారాగారమున బంధించెను. ధ్రువ మహారాజ పుత్రుడైన ముమ్మడి గోవిందభూపతి అతనిపై కరుణించి బంధనము బాపెను. శివమారుని బంధవిముక్తితో నందివర్మకు కొంత సంబంధ మున్నట్లు తోచుచున్నది; ఏలనగా అతడు ముమ్మడి గోవింద మహీపతితో కూడ శివమారునికి రాజ్యాభిషేకము కావించి అతని శిరముపై మకుటమును తమ చేతులతో ఎత్తి పెట్టిరని గాంగశాసనములందు కలదు. అటుతర్వాత నందివర్మ చిరకాలము జీవింపలేదు; క్రీ. శ. 798 లో వార్ధక్యమున దేహము చాలించెను. నందివర్మ విష్ణుభక్తుడు. తనకు పూర్వము రాజ్య పాలనము నొనర్చిన పల్లవ మహారాజులవలె ఇతడును దేవాలయ నిర్మాణమున శ్రద్ధ వహించెను. ఇతని నిర్మాణములలో నెల్ల కాంచీపురములోని వైకుంఠపెరుమాళ్ల కోవెల ముఖ్యమైనది.

నందివర్మ మరణానంతరము అతని కుమారుడు దంతివర్మ రాజ్యాభిషిక్తుడై ఏబదియేండ్ల కాలము ప్రజాపాలనము చేసెను. ఇతనికి ఏ కారణముచేతనో రాష్ట్రకూటులతో వైరము పొసగినది. ఉత్తర దిగ్విజయమును పూర్తిచేసికొని వచ్చిన పిమ్మట ముమ్మడి గోవింద చక్రవర్తి పల్లవ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



రాజ్యముపై దండెత్తిపోయి దంతివర్మను ఓడించి అతని కడ కప్పము కొన్నట్లు రాష్ట్రకూట శాసనములలో కలదు. ఇతని వెనుక ఇతని కుమారుడు ముమ్మడి నంది వర్మయు, మనుమడు నృపతుంగవర్మయు రాజ్యమును పాలించిరి. తరువాత అపరాజితుడు రాజయ్యెను. క్రీ. శ. 888 ప్రాంతమున ఈ యపరాజితుని యుద్ధమున చంపి తంజావూరి చోళవంశజుడైన ఆదిత్యుడు పల్లవ రాజ్యమును వశపరచుకొని చోళవంశమును స్థాపించెను.

తెలుగు దేశమునందు ప్రభుత్వము చేసిన పల్లవ రాజులలో దంతివర్మ కడపటి వాడని చెప్పవచ్చును. తరువాత వారి అధికారము తెలుగుదేశమున క్రమక్రమముగ సన్నగిలుచు వచ్చినది. వారు కేవలము ద్రావిడదేశ పాలకులు అయిపోయిరి. నే. వేం. ర.

## బాదామి చాళుక్యులు

దక్షిణ హిందూస్థానమునందు పూర్వకాలమున ప్రజా పరిపాలనము చేసిన రాజవంశములలో చాళుక్య వంశము అతి ప్రఖ్యాతమైనది. ఈ వంశజులు శాఖోపశాఖలై తామరతంపరగ అభివృద్ధిచెంది పెక్కు దేశములను ఏలిరి. అందు ఈ క్రింది శాఖలవారు పేర్కొనదగియున్నారు.

**1. బాదామి (వాతాపి) చాళుక్యులు :** ఉత్తర కర్ణాటకములోని విజాపుర మండలాంతర్గతమైన బాదామి నగరము ప్రధాన పట్టణముగ రాజ్యము చేయుటవలన వీరికి బాదామి చాళుక్యులని చరిత్రకారులు నామకరణము కావించియున్నారు. తూర్పుతీర దేశమును పాలించిన చాళుక్య వంశజుల రాజ్యములకు పశ్చిమ దిక్కున ఉండు రాష్ట్రములను ఏలుటవలన వీరిని పశ్చిమ చాళుక్యు లనియు చెప్పుట కలదు. బాదామి పూర్వపుపేరు వాతాపి.

**2. పూర్వ చాళుక్యులు :** బాదామి చాళుక్యుల రాజ్యమునకు తూర్పున నుండు సముద్ర తీర దేశమును పాలించుటవలన వీరికి ఆపేరు వచ్చినది. కృష్ణా గోదావరీ మధ్యగతమైన వేంగీ దేశము వీరికి ప్రధానస్థాన మగుటచేత వీరికి వేంగీ చాళుక్యు లనియు పేరు కలిగినది. క్రీ. శ. 6 వ శతాబ్దము మధ్యమున బాదామిని పాలించుచుండిన ప్రథమ కీర్తివర్మ తనయులలో ఒక్కడైన కుబ్జవిష్ణువర్ధనుడు ఈ వంశమునకు మూలపురుషుడు.

**3. కళ్యాణి చాళుక్యులు :** హైదరాబాదు రాజ్య మందలి కళ్యాణి నగరము రాజధానిగ ప్రభుత్వము చేయుటవలన వీరికి ఈపేరు గలిగినది. వీరిని అర్వాచీన పశ్చిమ చాళుక్యు లనియు, కుంతల చాళుక్యు లనియు, కర్ణాట చాళుక్యు లనియు చరిత్రకారులు పేర్కొని యున్నారు.

**4. లేములవాడ చాళుక్యులు :** వీరు తెలంగాణాలోని కరీంనగర మండలమునకు చెందిన లే(వే)ములవాడ రాజధానిగ తత్పరిసర ప్రాంతములను ఏలిరి (చూడు : లేములవాడ చాళుక్యులు).

**5. ముదిగొండ చాళుక్యులు :** వీరు తెలంగాణాకు తూర్పుభాగమున ఉండు మంచికొండసీమపై ప్రభుత్వము నొనరించిరి.

వీరివే కాక లాట చాళుక్యులను, గుజరాతు చాళుక్యులనుగూడ పేర్కొనుట యుక్తము. కాని, వారికి ఆంధ్ర దేశ చరిత్రముతో ఎట్టి సంబంధమును లేదు. పై చెప్పిన చాళుక్య వంశములు అన్నియు బాదామి (వాతాపి) వంశముయొక్క శాఖలే.

చాళుక్య చరిత్ర రచయితలు అందరును ప్రథమమున నిశ్చయింప దలపెట్టు సమస్య వారి యుత్పత్తికి సంబంధించినది. చాళుక్యు లెవ్వరు అను ప్రశ్నకు సమాధానము వెదుకని చరిత్రకారుడు కాని, పరిశోధకుడు కాని లేడు. కాని తృప్తికరమైన సమాధానము చెప్పినవాడును కానరాడు. తాము ఉత్తరాపథమునందు అయోధ్యనుండి వలస వచ్చిన చంద్రవంశ క్షత్రియులమని తమ శాసనములలో వారు ప్రకటించుకొనియున్నను ఆధునిక చరిత్రకారులలో పెక్కురు వారి మాటను పాటింపరు. చాళుక్యులు భారతీయులు కారు ; పారశీకాది పశ్చిమాసియా దేశములనుండి హిందూదేశమునకు వలస వచ్చిన జాతివారని కొందరు వాదింతురు. మరికొందరు వీరు దక్షిణ భారతీయులేకాని యుత్తరదేశములనుండి వలసవచ్చినవారు కా రనియు, జాతియందు మొదట శూద్రులైనను, రాచరికము అబ్బిన పిమ్మట క్షత్రియత్వమును ఆరోపించుకొని, దానికి అనుగుణముగ వంశవృక్షమును నిర్మించుకొని రనియు చెప్పుదురు. కాని, చాళుక్యుల జన్మదేశము ఏదియో నిర్ధారించుటకు తగిన యాధారము ఏదియు లభింపలేదు. వారి ఆచూకి మొట్టమొదట ఆంధ్రదేశమున కానవచ్చుచున్నది. ఇక్ష్వాకు వంశజుల ఏలుబడిక్రింద హిరణ్య రాష్ట్రమునందు, అనగా ఇప్పటి కడప మండలములోని జమ్మలమడుగు ప్రాంతమునందు, వారు నివసించుచుండినట్లు సూచనలు కలవు. తరువాతవారు కుంతల భూమికి వలసపోయి అచట రాజ్యమును స్థాపించి ప్రసిద్ధికెక్కిరి. జాతిచే వారు ఆదియందు శూద్రు లనుట సరికాదు. వారు క్షత్రియత్వమును ఆరోపించుకొనలేదు. చాళుక్యులు పుట్టు క్షత్రియులేకాని పెట్టు క్షత్రియులు కారు.

**బాదామి చాళుక్యులు :** చాళుక్యుల కెల్ల మూలకంద ప్రాయమైనది బాదామి శాఖావంశము. దానినుండి తెలు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వడిన శాఖలే తక్కిన చాళుక్య వంశములు అన్నియును. జయసింహావల్లభుని కాలమునుండి రెండవ కీర్తివర్మ వరకును ఈ వంశపు రాజులు పదునొక్కరు రాజ్యపాలన మొనర్చిరి. క్రీ. శ. 6 వ శతాబ్ది మధ్యమున మొదటి సత్యాశ్రయ పులకేశి వల్లభుడు బాదామి దుర్గమును జయించి కైవసము చేసికొని నెలవీడు కావించుకొనెను. అదిమొదలు ఈ వంశజులకు అదియే రాజధాని అయినది. మొదటి పులకేశి అశ్వమేధయాగమును కావించి తన స్వాతంత్ర్యమును ప్రకటించెను. ఇతని వెనుక ఇతని కుమారులు - మొదటి కీర్తివర్మ, మంగళేశ్వరుడు - ఇరువురును ఒకరి అనంతరము ఒకరు యుక్తము. ఇందు ప్రథమమున ప్రశంసింపదగినది శ్రీ హర్ష చక్రవర్తిపై ఇతనికి ఉపలబ్ధమైన విజయము. ఆకాలమున కాన్యకుబ్జాధిపతియైన శ్రీ హర్షవర్ధనుడు ఉత్తరాపథము నంతను జయించి తన యధికారము క్రిందికి తెచ్చుకొని, అంతటితో తృప్తి చెందక దక్షిణభారత భూమిపై దండు వెడలెను. అప్పటికే దక్షిణదేశమున భాల భాగమును జయించి వశవరచుకొనిన ఇమ్మడి పులకేశివల్లభుడు అతని యాటోపమును సహింపక వింధ్యప్రాంత సీమల అతని మార్గమును అరికట్టెను. నర్మదానదీ తటమున ఉభయులకును గొప్ప యుద్ధము సంప్రాప్తమైనది. పులకేశివల్లభునికే




రాజ్యాధిపత్యమును వహించిరి. వీరి కాలమున చాళుక్య రాజ్యము బహుముఖముగ విస్తరిల్లినది. నల, మౌర్య, కదంబ, కటచ్చురి వంశ నరపాలురు వీరిచే విజితులై తమ రాజ్యములను కోల్పోయిరి. మొదటి కీర్తివర్మ జ్యేష్ఠపుత్రుడైన ఇమ్మడి సత్యాశ్రయ పులకేశివల్లభుడు పినతండ్రియైన మంగళేశ్వరుని చంపి రాజ్యమును నాచికొని క్రీ. శ. 609-10 లో పట్టాభిషేకము చేసికొనెను. ఇతడు గొప్ప జేత. పెక్కు జనపదములను జయించి దక్షిణాపథమునకు అంతటికిని చక్రవర్తి అయ్యెను. ఇతనికాలమున సంభవించిన ముఖ్య చరిత్రాంశములను ఇచట ఇంచుక వివరించుట విజయము చేకూడెను; సకల దక్షిణాపథాధిపత్యమును లభించెను. అతని 'పరమేశ్వర, పరమభట్టార'కాది బిరుదులు సార్థకము లయ్యెను. తరువాత ఎన్నదగినది వేంగీ విజయము. అంతకు పూర్వము వేంగీదేశమును ఏలుచుండిన విష్ణుకుండి వంశజుల అధికారము శిథిలమైపోయినది. దుర్జయులు దేశమును ఆక్రమించుకొని ప్రభుత్వము చేయుచుండిరి. పులకేశివల్లభుడు క్రీ. శ. 624 వ సంవత్సరమున పూర్వ దిగ్జైత్రయాత్ర వెడలివచ్చి వేంగీ, కళింగములను జయించి స్వాధీనము చేసికొని తన తమ్ముడైన కుబ్జవిష్ణువర్ధనుని ఆదేశములకు రాజుగ పట్టాభిషేకము కావించెను.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అదిమొదలు అతడును, అతని సంతతివారును చిరకాలము ఆ దేశమును పాలించుచు వచ్చిరి. కుబ్జవిష్ణు వంశజులు పూర్వ చాళుక్యులు అనబడిరి. వారు పాలించిన వేంగీ రాజ్యమునకు పూర్వచాళుక్య రాజ్యము అని పేరు వచ్చెను. పులకేశి వల్లభుని వేంగీవిజయము కాంచీపుర పల్లవ రాజ్యముపై జైత్రప్రస్థానమునకు దారి చూపినది. ఆ కాలమున పల్లవరాజ్యము కృష్ణానదీ పర్యంతము వ్యాప్తమైయుండినది. కృష్ణా మన్నేరుల నడిమి ప్రదేశము కాంచీ, వేంగీ రాజ్యముల రెంటి మధ్యను దొర్లుడు పుచ్చకాయయై యొకప్పుడు ఒక రాజ్యమునకును, మరియొకప్పుడు ఇంకొక దానికిని చెల్లుచువచ్చినది. మొదట ఇది ఇక్ష్వాకు రాజుల యేలుబడిక్రింద ఉండినది. వారిని జయించి దీనిని పల్లవులు ఆక్రమించుకొనిరి. పల్లవులను తరిమి విష్ణుకుండులు స్వాధీనపరచుకొనిరి. విష్ణుకుండుల అనంతరము మరల పల్లవులు కమ్మనాటిని తమ యేలుబడిక్రిందకు తెచ్చుకొనిరి. విష్ణుకుండుల కాలమున వేంగీరాజ్యమునకు చెల్లుచుండివదగుటచే పులకేశి ఆ రాజ్యమును సాధించిన పిమ్మట గుంటూరు మండలములోని కమ్మనాటిమీద క్రీ. శ. 630 వ సంవత్సరమున దండెత్తి వెళ్లెను.



చిత్రము 29. బ్రహ్మేశ్వర దేవాలయము, అలంపురము

కంచిని ఏలుచుండిన పెద మహేంద్రవర్మ అప్పుడే స్వర్గస్థుడయ్యెను. అతని పుత్రుడైన మొదటి నరసింహవర్మ పట్టాభిషిక్తుడు కాకమునుపే పులకేశివల్లభుడు రణభేరి మ్రోగించి యుద్ధమునకు బయలువెడలుట వలన కమ్మనాడు అతనికి సుళువుగ స్వాధీనపడినది. తరువాత దక్షిణ దేశముపై తన యాధిపత్యము నెలకొల్పుటకు ఉద్దేశించి తూర్పు సముద్రతీరమున పాండ్య మండల పర్యంతము జయవంతముగ దండయాత్రను సాగించి అతడు వెనుదిరిగి నిజ రాజధానికి పోయి చేరెను. ఈ దండయాత్ర వలన చాళుక్యులకు పల్లవులతో ఎడతెగని వైరము కల్గినది. పులకేశి వల్లభుడు మరల క్రీ. శ. 640 ప్రాంతమున కంచి పైని ఎత్తిరాగా మొదట నరసింహవర్మ బలము సమకూర్చుకొని అతనిని వెన్నంటి యతని రాజధానియగు బాదామి వరకును తరుముకొనుచు పోయెను; కోటను ముట్టడించి పులకేశివల్లభుని మట్టుపెట్టి బాదామి పట్టణమును పాడుచేసి అచట జయస్తంభమును ప్రతిష్ఠించెను.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పులకేశివల్లభుడు అస్తంగతుడైన పిమ్మట చాళుక్య రాజ్యము అనాయకమై పదుమూడేండ్ల కాలము అరాజకమునకు తావలమై యుండెను. ఆవల పులకేశివల్లభుని పుత్రులలో ఒకడైన మొదటి విక్రమాదిత్యుడు ప్రబలి క్రీ. శ. 655 లో సింహాసనము అధిష్ఠించి పల్లవులను ఓడించి వారి నుండి చాళుక్య రాష్ట్రమును స్వాధీనపరచుకొని, పితృపైతామహమైన రాజ్యమును పునఃప్రతిష్ఠ కావించెను. మరియు, పల్లవరాజులపైగల కసి తీర్చుకొనుటకై ద్రావిడదేశము మీదికి దండయాత్రలు వెడలి చోళ, తుండీరమండలములను చూరగొని ప్రజా సంక్షోభమును కల్గించెను. ఆ సమయమునందే తన కుమారుడైన వినయాదిత్యునికి మనుమడైన విజయాదిత్యుని ప్రాపుగ నొనర్చి దిగ్విజయార్థము ఉత్తరాపథమునకు పంపెను. వీరు సకలోత్తరాపథాధినాథుని జయించి చాళుక్యరాజ్యమును ఉత్తర దేశములకు వ్యాపింపజేసిరి. ఇంకను వీరు ఉత్తరాపథ యుద్ధములలో నిమగ్నులై ఉండగనే దక్షిణమున పల్లవరాజు మొదటి పరమేశ్వరవర్మ విజృంభించి విక్రమాదిత్యుని ఓడించి వెనుదగిలి తరుముచు పోయి చాళుక్య రాజధానియైన బాదామిని ముట్టడించి కైవసము కావించుకొనెను. ఇమ్మడి పులకేశివల్లభుని మరణానంతరమునవలె చాళుక్య రాజ్యము మరల ఛిన్న భిన్నమగునట్లు తోచినది; కాని, ఇంతలోపలనే వినయాదిత్య, విజయాదిత్యులు ఉత్తరాపథ దిగ్విజయమును విజయవంతముగ కొనసాగించి మరలివచ్చి పరమేశ్వరవర్మను పారద్రోలి రాజ్యమును చెడనీయక కాపాడిరి. క్రీ.శ. 681-82 పర్యంతము ఇరువదియారేండ్ల కాలము ప్రజాపరిపాలనము చేసి మొదటి విక్రమాదిత్యుడు దేహమును చాలించెను. తరువాత వినయాదిత్య, విజయాదిత్యులు ఒకరి వెనుక ఒకరు క్రీ. శ. 788 వరకును రాజ్యపాలనము చేసిరి. వీరును పల్లవులతో యుద్ధములు సాగించుచు వచ్చిరి. ఇందు ముఖ్యమైనది విజయాదిత్యుని కడపటి దినములలో నడచినది. విజయాదిత్యుని కుమారుడైన యువరాజ విక్రమాదిత్యుడు పాశ్చాత్య గంగరాజైన శ్రీపురుష ముత్తరసుని కూడి కంచిపై ఎత్తివచ్చి ముట్టడివేసెను. అప్పుడు పల్లవరాజైన రెండవ పరమేశ్వరవర్మ వారి కెదుర్పజాలక ధనకనక వస్తువాహనాదులను ఇచ్చి సంధి చేసికొనెను. క్రీ. శ. 788 వ సంవత్సరమున విజయాదిత్యుడు స్వర్గస్థుడు కాగా అతని కొడుకు విక్రమాదిత్యుడు సింహాసనమును అధిష్ఠించెను. బాదామి చాళుక్య రాజులందు విక్రమాదిత్య నామాంకితులలో ఇతడు ద్వితీయుడు అగుటవలన చరిత్రకారులు ఇతనిని ఇమ్మడి విక్రమాదిత్యుడు అందురు. ఇతడు మధ్యప్రదేశ ప్రాంతమును పాలించుచుండిన చేదిరాజుకన్యలను ఇరువురను పెండ్లాడెను; కంచిపై ముమ్మారు దండువెడలెను; అం..ఒక దండయాత్రలో నితని పుత్రుడు పాల్గొనెను. పల్లవరాజైన నందివర్మ పల్లవమల్లుడు ఇతని ధాటికి ఆగజాలక పారిపోయెను. కంచి చాళుక్యులకు పట్టుబడినది. ఈ విజయమును ప్రకటించుచు విక్రమాదిత్యుడు అచట ఒక శాసనమును వ్రాయించెను. మహావైభవముతో రాజ్యమొనర్చి ఇమ్మడి విక్రమాదిత్యుడు క్రీ. శ. 748-44 లో దివంగతుడయ్యెను. అటుపిమ్మట అతని పుత్రుడు ఇమ్మడి కీర్తివర్మ రాజ్యాధిపతియై క్రీ. శ. 755 వరకు దేశమును పాలించెను. ఇతడు అంతటి సత్త్వసంపన్నుడు కాడు. చాళుక్య రాజులకు పారంపర్యముగ సామంతులై ఉండిన రాష్ట్రకూటులు ఇతని కడపటి రోజులలో విజృంభించిరి. వారి ప్రభువైన దంతిదుర్గుడు పరాక్రమశాలి, స్వాతంత్ర్యప్రియుడు. అతడు కీర్తివర్మయొక్క సత్త్వహీనతను గ్రహించి తిరుగబాటు చేసి, చాళుక్యుల యధికారమును కూలద్రోసి వారి రాజ్య సంపదల నాచికొని రాష్ట్రకూట సామ్రాజ్యమునకు పునాది వేసెను. నే. వెం. ర.

## రాష్ట్రకూటులు

రాష్ట్రకూట వంశము కడు ప్రాచీనమైనది. క్రీ. శ. 6 వ శతాబ్దమునుండియు నీవంశపు రాజులు దక్షిణ హిందూస్థానమున పెక్కుచోట్ల చిన్న చిన్న సంస్థానములను స్థాపించి ప్రభుత్వము చేయుచు వచ్చిరి. బాదామి చాళుక్యుల పలుబడి క్రింద వీరు సామంతులై వారికి రాజ్యపాలనయందు తోడ్పడుచుండి చాళుక్యులకు అరిగాపులై ఉండిన రాష్ట్రకూట సామంత కుటుంబములలో నెల్ల ఇప్పటి హైదరాబాదు రాజ్యాంతర్గతమైన ఎల్లోరాప్రాంత దేశమును పాలించుచుండిన వంశము ప్రధానమైనది. ఈ వంశము వారు చాళుక్య రాజకుటుంబముతో సంబంధ బాంధవ్యములు నెరపుచు ప్రబలి తుదకు పై నుడివినట్లు దంతిదుర్గుని ఆధిపత్యముక్రింద బాదామి చాళుక్య రాజులలో కడపటివాడైన రెండవ కీర్తివర్మను కూలద్రోసి, అతని రాజ్యలక్ష్మిని చేపట్టిరి. ఈ దంతిదుర్గుడు ఇంద్రరాజు కుమారుడు; కక్కరాజు మనుమడు. ఇతనిని దంతివర్మ యనియు పేర్కొనుట కలదు. 'ఖడ్గావలోక, వైరమేఘ' యనునవి ఇతని బిరుదములు. కీర్తివర్మను తొలగద్రోసి బాదామి రాజ్యమును ఆక్రమించుకొనిన పిమ్మట ఇతడు ప్రభుత్వము చేసిన కాలము అల్పమే. క్రీ. శ. 758 వ సంవత్సరమునందు ఇతడు రణనిహతుడయినట్లు తెలియుచున్నది. కాని, ఇతడు అద్వితీయ బల పరాక్రమ సంపన్నుడగుటవలన ఈ రెండు మూడేండ్ల లోపలనే కాంచీ, కళింగ, కోసల,



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



శ్రీశైల, మాళవ, లాట, టంక, సింధుదేశములను జయించి కీర్తి గడించెను. ఇతనికి దిగ్విజయ యాత్రలందు లే(వే)ములవాడ చాళుక్య వంశమునకు మూలపురుషుడైన వినయాదిత్య యుద్ధమల్లుడు తోడ్పడినట్లు తోచుచున్నది.

దంతిదుర్గుని మరణానంతరము అతని పినతండ్రియైన మొదటి కృష్ణభూపాలుడు రాజ్యాధిపత్యమును వహించెను. 'అకాలవర్షుడు' అని ఇతని బిరుదనామము. ఇతని యనంతరము ప్రభుత్వము చేసిన కృష్ణనామధారులైన ఇతని సంతతి రాజులెల్ల ఈ బిరుదును ధరించుటవలన ఇతనిని మొదటి యకాలవర్షు డనియు చెప్పుట కలదు. ఇతడు క్రీ.శ. 758 మొదలు క్రీ.శ. 772 వరకు పదునాలుగేండ్లు రాజ్యపాలనము చేసెను. ఇతని కాలమున జరిగిన చరిత్రాంశములు ముఖ్యమైనవి మూడు కలవు: (1) విప్లవకారులతో పోరాటము. దంతిదుర్గుని మరణానంతరము చాళుక్య వంశజుడైన రాహప్ప అను నతడు 'పృథివీవల్లభ, రాజాధిరాజ, పరమేశ్వర, పరమభట్టారక' ఇత్యాది నిజకులక్రమాగత బిరుదులను వహించి సమ్రాట్పద చిహ్నమైన పాలిధ్వజమును నెలకొల్పి దేశమున చాలభాగమును ఆక్రమించుకొని స్వతంత్రుడై రాజ్యము చేయగడగెను. ఎనిమిదేండ్ల కాలము అతనితో కృష్ణరాజు హోరాహోరిగా పోరి అంతరింప సిద్ధమైన రాష్ట్రకూటుల రాచరికమును పునరుద్ధరించెను; (2) క్రీ. శ. 768 లో గంగవాడిని జయించి వశపరచుకొనెను. పాశ్చాత్య గాంగవంశజుడైన శ్రీపురుషుడు ఓడి రాష్ట్రకూటులకు అరిగాపు అయ్యెను; (3) వేంగీదండయాత్ర: ఈ దండయాత్ర క్రీ. శ. 769 వ సంవత్సరమునకు ముందు నడచినది. పూర్వ చాళుక్య రాజైన మొదటి విజయాదిత్యుడు రాహప్పకు తోడ్పడి యుండవచ్చును; తత్కారణమున కృష్ణరాజు వేంగీదేశముపై దండయాత్రను పంపియుండవచ్చును అని కొందరు అభిప్రాయపడుచున్నారు. వాస్తవమే కావచ్చును. యువరాజు ఇమ్మడి గోవిందవల్లభుని నాయకత్వముక్రింద దండయాత్ర విజయవంతమై కొనసాగినది. తూర్పు చాళుక్యరాజు తన కోశ, బల, రాష్ట్రములను సమర్పించి సంధి చేసికొనెనట.

మొదటి అకాలవర్ష కృష్ణరాజు మృతి నొందినపిమ్మట అతని పుత్రుడు రెండవ ప్రభూతవర్ష లేక సువర్ణ వర్ష గోవిందరాజు సింహాసనమును అధిష్ఠించి ఎనిమిదేండ్ల కాలము ప్రభుత్వము చేసెను. కాని ఇతని తమ్ముడైన ధ్రువరాజు క్రీ. శ. 780 ప్రాంతమున ఇతనిని తొలగద్రోసి రాజ్యమును ఆక్రమించుకొనెను. ధ్రువుడు పటుబల పరాక్రమశాలి అగుటవలన దక్షిణ హిందూస్థానమునే కాక, ఉత్తరదేశమును సయితము జయించి ఆ దేశ పాలకులను తనకు అరిగాపులుగ చేసికొనెను. ముఖ్యముగ ఇతని వేంగీదేశ విజయము పేర్కొనదగినది. వేంగీ కళింగములను ఏలుచుండిన పూర్వ చాళుక్య నాల్గడి విష్ణువర్ధన భూపాలుడు విజిగీషులను ఎదిర్చి సరి పోరజాలక తన కుమార్తెయైన శీలమహాదేవిని ధ్రువరాజునకు ఇచ్చి ఉద్వాహము కావించి సంధిచేసికొనెను. ధ్రువరాజు నిరుపమ, కలివల్లభ, శ్రీవల్లభ, ధారావర్ష ఇత్యాది బిరుదులను వహించి క్రీ. శ. 792 పర్యంతము పండ్రెండేండ్లు మహోదర్పముతో సామ్రాజ్యమును పరిపాలించి దివంగతుడయ్యెను. ధ్రువుని అనంతరము అతని పుత్రులలో ఒక్కడైన తృతీయ గోవిందరాజు సామ్రాజ్యాధిపత్యము వహించి, క్రీ. శ. 814 వరకు ప్రజాపాలనము చేసెను. ఇతనికి ప్రభూతవర్ష, జగత్తుంగ, శ్రీవల్లభ, జనవల్లభ, కీర్తి నారాయణ, త్రిభువన ధవళ ఇత్యాది బిరుదనామములు కలవు. ఇతడు యుద్ధలాలసుడు. ఇతని రాజ్యకాల మంతయు యుద్ధములతో సరిపోయినది. పల్లవ, పాశ్చాత్య గాంగ, పూర్వ చాళుక్యాది దాక్షిణాత్య భూపాలురనే కాక గూర్జర ప్రతీహార పాలాది ఔత్తరాహ నరపాలురను సయితము పరాభూతులను కావించి ఆజ్ఞాబద్ధులను చేసికొనెను. ఇతని శత్రువులలో నెల్ల పూర్వ చాళుక్యులు అగ్రగణులు. సుదీర్ఘ కాలము యుద్ధము నడపి వారి దేశమున చాల భాగమును ఆక్రమించుకొన్నను, వారి యధిపుడైన నరేంద్ర మృగరాజ విజయాదిత్యుడు రాష్ట్రకూటులకు తలయొగ్గి లేదు. కాని, అతని తమ్ముడైన భీమసలికి స్వార్థపరుడై అతనిని ఆశ్రయింపగా గోవిందరాజు వేంగీరాజ్యమును అతనికి ఇచ్చి అతనిని పట్టాభిషిక్తుని కావించెను.

ముమ్మడి గోవిందరాజు మరణానంతరము తరుణ వయస్కుడగు అతని పుత్రుడు మొదటి అమోఘవర్షుడు చక్రవర్తి అయ్యెను. ఇది అతని బిరుదమే కాని పేరు కాదు. శర్వు డనునది అతని పేరు కావచ్చును. నృపతుంగ, షండ, అతిశయధవళ, వీరనారాయణ అను బిరుదులు మరికొన్ని శాసనములందును, వాఙ్మయమందును కానవచ్చుచున్నవి. క్రీ. శ. 880 దాక అరువదియారేండ్ల కాలము ఇతడు రాజ్యము చేసెను. సుదీర్ఘకాలము ప్రజాపాలనము చేసిన భారతీయనృపులలో ఇత డొక్కడు. పసితనమునందే అమోఘవర్షుడు రాజ్యమునకు అభిషిక్తుడగుట వలన, రాష్ట్ర పాలనము స్వయముగ చేయుశక్తి లేకపోవుట వలన ఇతని పినతండ్రి ఇంద్రుని కుమారుడైన కరకసువర్ణవర్షుడు ఇతని పక్షమున రాజ్యకార్యమును నిర్వహించెను. కావున కేంద్రప్రభుత్వమునకు పాలన పాటవము ఇంచుక సడలుట వలన సామంతులు స్వతంత్రులగుటకు ప్రయత్నించి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/




http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తిరుగబాటు చేసిరి. ఈ కారణము వలన రాష్ట్రకూట సామ్రాజ్యమున సంక్షోభము కలిగి యుద్ధము సర్వత్ర సామాన్యమయ్యెను. అమోఘవర్షుని ధిక్కరించి స్వతంత్రులగుటకు తలపెట్టిన వారిలో అగ్రగణ్యులు పూర్వచాళుక్యులు. ఇతని రాజ్య కాలమున వేంగీ దేశమును మూడు తరముల రాజులు ఏలిరి. వీరిలో మొదటివాడు నరేంద్రమృగరాజ బిరుదాంకితుడైన ఇమ్మడి విజయాదిత్యుడు. ముమ్మడి గోవిందరాజు మరణానంతరము ఇతడు విజృంభించి భీమసలికిని పారద్రోలి వేంగీ దేశమును సంపూర్ణముగ తన యేలుబడిలోనికి తెచ్చుకొనెను. రాష్ట్రకూట రాజ్య సంరక్షకుడైన కరకసువర్ణవర్షుడు తన సోదరియగు శీలమహాదేవిని నరేంద్రమృగరాజ పుత్రుడైన పంచమ విష్ణువర్ధనునకు ఇచ్చి ఉద్వాహము గావించి సంధి చేసికొనెను. తరువాత, క్రీ. శ. 848 లో పంచమ విష్ణువర్ధనుని రాజ్యాంతమువరకు ఉభయ రాజ్యముల మధ్య శాంతి వర్ధిల్లినది. అటుపిమ్మట పూర్వచాళుక్య సింహాసనమును అధిష్ఠించిన పంచమ విష్ణువర్ధన, శీలమహాదేవుల తనయుడగు గుణగాంక ముమ్మడి విజయాదిత్యుడు రాష్ట్రకూటులపై కత్తి దూసి, వారి రాష్ట్రమున కొంత భాగము ఆక్రమించు కొనెను. కావున అమోఘవర్షుడు పూర్వచాళుక్యులపై యుద్ధము ప్రకటించి దండెత్తి పోవలసి వచ్చెను. ఈ యుద్ధమున గుణగాంక విజయాదిత్యుడు పరాజయము పొందుటవలన అమోఘవర్షునికి లోబడి అతనికి అరిగాపు అగుటకు సమ్మతించెను. అది మొదలు అమోఘ వర్షుని యంత్యకాలము వరకు వారి పరస్పర సంబంధముల యందు మార్పు లేక శాంతముగ నడచెను. మరియు, గుణగవిజయాదిత్యుడు అమోఘవర్షునికి యుద్ధములందు తోడ్పడుచు అతనికి విధేయుడై వర్తించుచుండెను. ఒకప్పుడు గంగవాడి ప్రభువైన ఎరయసీతి మార్గుడు రాష్ట్రకూటులను ధిక్కరించి స్వతంత్రుడు అగుటకు ప్రయత్నము చేసెను. పరిసర దేశములను ఏలుచుండిన సామంతరాజులు అనేకులు అతనితో ఏకీభవించిరి. వారిని అణగగొట్టి వారిపై మరల తన యధికారమును నెలకొల్పుటకు అమోఘవర్షుడు బంకెయ నల్లకేతనుడను సేనాధిపతిని ప్రచండసైన్యముతో గంగవాడి మీదకు దండయాత్ర నంపెను. బంకెయ శత్రువులను అనేక స్థలములయందు పరాభూతులను కావించెను. శత్రులకు తలప్రాణము తోకకు వచ్చినది. కాని, అంతలోపల రాజధాని పరిసర ప్రాంతములందు గొప్ప హావళి రేగుటవలన అమోఘవర్షుడు బంకెయను 'సైన్యముమ మరల్చుకొని రమ్మ'ని ఆజ్ఞాపత్రము నంపెను. బంకెయ మరలి వచ్చుట వలన నతని సామంతభూపతులకు ఎట్టి మేలును చేకూరదయ్యెను. ఏలయన, అమోఘవర్షుడు బంకెయ స్థానమున గుణగవిజయాదిత్యుని నియమించి గంగవాడిపై దండయాత్రను సాగించెను. చక్రవర్తి ఆజ్ఞానుసారము గుణగవిజయాదిత్యుడు ఎత్తివచ్చు చున్నాడని విని యతని సామంతులలో ఒక్కడైన నోలంబవాడి ప్రభువు నోలంబాధిరాజ బిరుదాంకితుడైన మంగిరాజు అతని మార్గము నరికట్టెను. అప్పుడు ఉభయపక్షములమధ్య జరగిన ఘోరయుద్ధమున మంగి నిహతుడయ్యెను. అంతట మార్గము నిర్నిబంధము కాగా గుణగవిజయాదిత్యుడు సైన్యములను నడపుకొని గంగవాడిని ప్రవేశించి గంగకూటమును ఆశ్రయించి యుండిన గంగనృపాలుని పంగరాంగణమున నిర్జించి అతనిని చక్రవర్తితో సంధికి ఒడబరచెను. అమోఘవర్షుడు దూరదృష్టిగల రాజ్యతంత్రమర్మజ్ఞుడు. కావున అతడు నీతిమార్గుని రాజ్యమును మరల అతనికి ఇచ్చి వేయుటయే కాక అతని కుమారుడైన ప్రథమ బూతుగనికి తన కూతురగు అబ్బలబ్బెను ఇచ్చి ఉద్వాహమొనర్చి పాశ్చాత్య గాంగ, రాష్ట్రకూట వంశములకు సంబంధ బాంధవ్యములను ఏర్పరచి వారిమైత్రిని చిరస్థాయి కావించెను. అది మొదలు ఆ రెండు వంశముల వారును చివరివరకు సౌహార్దముతో కూడిమాడి యుండిరి.

గుణగవిజయాదిత్యుడు గంగవాడియందు పనివడి యుండగా బంకెయ నల్లకేతనుడు దండుతో లాటదేశమునకు కూచిచేసి పోయి, అచ్చట స్వతంత్రులవలె దొరతనము చేయదొడగిన కరక సువర్ణవర్షుని సంతతి వారైన దాయాదులను తన ప్రతాపాగ్నియందు పూర్ణాహుతి చేసెను. అదియే తరుణమని ఎంచి రాష్ట్రకూటసామ్రాజ్యమునకు చెల్లుచుండిన లాట, మాళవ దేశములను జయించు ఉద్దేశముతో దండు వెడలి వచ్చిన కాన్యకుబ్జ (కన్నోజ) అధిపతిని ప్రతీహార మిహిరభోజుని దిశాపట్టుని కావించెను.

అమోఘవర్షుని రాజ్యకాల మంతయు తిరుగబాట్ల తోడను, యుద్ధములతోడను గడచిపోయినను, రాష్ట్రకూట సామ్రాజ్య విస్తీర్ణ మెచ్చుటను తరిగిపోలేదు. కాని, తండ్రి తాతలవలె అతడును ఉత్తర దిగ్విజయమునకు వెడలక పోవుట వలన ఉత్తర దేశమునందు వారి ప్రతిష్ఠ ఇంచుక డిందుపడినది. నిరంతరము యుద్ధకార్యములలో నిమగ్నుడు కావలసి వచ్చినను అమోఘవర్షుడు యుద్ధలాలసుడు కాడు; శాంతస్వభావుడు; జైనమతాభిమాని; సమయము చిక్కినపుడెల్ల రాజ్యకార్యములకు స్వస్తి చెప్పి జైన సమయాచార్యుల గోష్ఠిలో మతవిచారమున కాలము కడవువాడు. అమోఘవర్షునికి కర్ణాటకభాషపై అభిమానము మెండు. స్వయము కవియు, గ్రంథకర్తయు అయి కవిరాజ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మార్గాది ఉద్గ్రంథములను రచించుటయే కాక కవిజనకల్పవృక్షమనబరగి పెక్కు కన్నడ కవులకు ఆశ్రయమొసగి భాషోద్ధారకుడయ్యెను. ఇతని కాలమున జైనమతమును, కర్ణాటక వాఙ్మయమును చక్కగ వర్ధిల్లినవి.

అమోఘవర్షుని మరణానంతరము అతని పుత్రుడు ద్వితీయ కృష్ణుడు సింహాసనమును అధిష్ఠించెను. ఇతనికి 'అకాలవర్షుడు' అను బిరుదనామము గలదు. క్రీ. శ. 880 మొదలు క్రీ. శ. 918 వరకు ఇతడు ముప్పది మూడేండ్ల కాలము రాజ్యము చేసెను. ద్వితీయ కృష్ణుని కాలమున జరగిన చరిత్రాంశములలో ముఖ్యమైనది పూర్వచాళుక్యులతోడి సంగ్రామము. ఇతని కాలమున వేంగీదేశమును పాలించిన చాళుక్య రాజులు ఇర్వురు. మొదటివాడు 'గుణక్కెనల్లాత' బిరుదాంకితుడైన ముమ్మడి విజయాదిత్యుడు. రెండవవాడు ఇతని తమ్ముడైన యువరాజ విక్రమాదిత్యుని కుమారుడగు ప్రథమ చాళుక్య భీముడు. కృష్ణరాజునకు వీ రిరువురి తోడను పోరు పొసగినది. అమోఘవర్షుడు మృతి చెందిన పిమ్మట గుణగ విజయాదిత్యుడు రాష్ట్రకూటుల ఆధిపత్యమును ఒప్పుకొనక నిజ స్వాతంత్ర్యమును ప్రకటించుటయే తొలి యుద్ధమునకు కారణమని చరిత్రకారులు ఊహింతురు. కారణము ఎద్దియైనను కృష్ణరాజు వేంగిపై ఎత్తివచ్చి ఘన పరాభవము పొందెను. తరువాత పూర్వచాళుక్య సైన్యము రాష్ట్రకూట సామ్రాజ్యమున ప్రవేశించి పైకొని రాగా కృష్ణరాజు నిజరాజ్యమున నిలువజాలక డాహల దేశమునకు పారిపోయి తన మరదియైన సంకిలుడను ఆ దేశాధిపతిని ఆశ్రయించెను. అంతట గుణగ విజయాదిత్యుని సేనాధిపతియగు పాండురంగడు డాహల దేశముపై దండువెడలి పోయి చేదిరాజు సైన్యములను పలుమారు ఓడించి దేశమును చూరగొని గ్రామములను, పట్టణములను పరశురామప్రీతి కావించి, కృష్ణరాజును సంధికి ఈయకొల్పెను. గుణగ విజయాదిత్యుని ధాటికి ఓర్వజాలక కృష్ణరాజు తన 'వల్లభ' బిరుదమును, గంగా యమునా పాలీధ్వజాది సామ్రాజ్య చిహ్నములను, సకలింగ సర్వ దక్షిణాపథాధిపత్యమును సమర్పించి సంధి చేసికొనెను. గుణగ విజయాదిత్యుడు జీవించియున్నంత కాలమును కృష్ణరాజు మరల వేంగివైపు ముఖము త్రిప్ప లేదు. కాని, క్రీ. శ. 892 లో గుణగ విజయాదిత్యుడు దివంగతుడు కాగా అతని తమ్ముని కుమారుడు మొదటి చాళుక్య భీమరాజు పూర్వ చాళుక్య రాజ్యమునకు పట్టాభిషిక్తుడయ్యెను. అతడు పసివాడు. దాయాదులు అతనిని పదభ్రష్టుని చేయ కుట్రలు పన్నుటకు ఆరంభించిరి. గుణగ విజయాదిత్యుని సోదరులలో ఒక్కడైన యుద్ధమల్లుడు రాజ్యమును ఆక్రమింప ప్రయత్నము చేయుచుండెను. పూర్వచాళుక్యుల వేపు మాపుటకు అదియే మంచి సమయమని తలచి కృష్ణరాజు వేంగిమీదికి దండెత్తివచ్చి దేశమున కొంత భాగమును ఆక్రమించెను. ముదిగొండ చాళుక్య కుసుమాయుధుని సాహాయ్యమున భీము డాతనిని, యుద్ధమల్లుని ఓడించి పారద్రోలి దేశ మంతటను తన యధికారమును నెలకొల్పెను. అంతటితో పోక కృష్ణరాజు వేంగిని జయించుటకు మరల ఒక తీవ్ర ప్రయత్నము చేసెను. ఈమారు వేంగీపుర పరిసర ప్రదేశములదాక రాష్ట్రకూట సైన్యములు చొచ్చుకొని వచ్చినవి. యుద్ధము కడు భీకరముగ సాగినది. కాని, కృష్ణరాజు మరల పరాభూతుడై సైన్యమును మరల్చుకొని నిజరాజ్యమునకు పోవలసి వచ్చినది.

వేంగియందు ఇట్లు మాటిమాటికి అపజయము నొందుచు వచ్చినను కృష్ణరాజు సత్వహీనుడని ఎంచరాదు. దక్షిణమున అతని సైన్యములు కన్యాకుమారి పర్యంతము వ్యాపించిన దేశమును త్రొక్కి చూచినవి. ఉత్తరమున మిహిరభోజుని దిశాపట్టుని కావించినవి. మిహిరభోజుని మనుమడైన ద్వితీయభోజునకును, మహీపాలునకును రాజ్యాధిపత్య విషయమై కలహ ముప్పతిల్లగా కృష్ణరాజు సైన్యముతో కూడ గంగా యమునల అంతర్వేదికి కూచిచేసి పోయి భోజుని రాజ్యాధిపతిని కావించి అతనికి అండయై నిలిచెను. కాని మహీపాలుడు విజృంభించి అతనిని తరుమగొట్టి కాన్యకుబ్జ రాజ్యమును ఆక్రమించుకొనుటయే కాక రాష్ట్రకూట సామ్రాజ్యముపై ఎత్తివచ్చి పెక్కు దేశములను వశ పరచుకొనెను. ఈ దండయాత్ర యింకను సాగుచుండగనే క్రీ. శ. 918 సంవత్సరమున కృష్ణరాజు స్వర్గస్థుడయ్యెను.

కృష్ణరాజు మృతుడైన పిమ్మట అతని మనుమడైన నిత్యవర్ష ముమ్మడి ఇంద్రరాజు సామ్రాజ్యాధిపతియై క్రీ.శ. 918 నుండి క్రీ. శ. 929 వరకు పదునారేండ్లు ప్రజలను పాలించెను. ఇతడు పరాక్రమవంతుడు; కాన్యకుబ్జాధిపతిని, మహీపాలుని రాష్ట్రకూట రాష్ట్రములనుండి వెడల నడచెను. మరియు వతని వెనువెంట దగిలి తరుముచు గంగానదీ పర్యంతము పోయి కాన్యకుబ్జ (కనోజు) నగరమును ధ్వంసము కావించెను. ఇతని యనంతరము ఇతని పుత్రుడైన నాల్మడి ప్రభూతవర్ష గోవిందరాజు సింహాసనమును అధిష్ఠించెను. నాల్గవ గోవిందరాజునకు సువర్ణవర్షుడు అను మరియొక బిరుదనామము కూడ కలదు. ఇతడు క్రీ. శ. 929 మొదలు క్రీ. శ. 935 వరకును ఏడేండ్లు ప్రభుత్వము చేసెను.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఈ యేడేండ్ల లోపల సంభవించిన చరిత్రాంశములు గణుతింప దగినవి రెండు కలవు. మొదటిది వేంగీ విజయము: గుణగ విజయాదిత్యుని తమ్ముడగు యుద్ధమల్లుడును, అతని సంతతివారును పరాజయము నొందినను నిరాశపడి ఊరకుండలేదు. తమ యుద్యమమును నెరవేర్చుకొనుటకు రాష్ట్రకూట చక్రవర్తిని ఆశ్రయించి సమయము వేచి యుండిరి. మొదటి అమ్మరాజ విష్ణువర్ధనుడు మృతి చెందగా అతని పుత్రుడు కంఠిక విజయాదిత్యుడు అను బాలుడు క్రీ. శ. 929 లో వేంగిరాజ్యమునకు అధిపతి యయ్యెను. అతడు పట్టుమని పదియేను దినములు సింహాసనముపై కూర్చుండెనో లేదో, ఇంతలోపుననే యుద్ధమల్లుని కుమారుడైన మొదటి తాళరాజు అతనిని తరుమగొట్టి రాజ్యమును ఆక్రమించుకొని ఒక నెల దినములు రాజ్యమొనర్చెను. ఇమ్మడి విక్రమాదిత్యుడు అతనిని వధించి సింహాసనము నెక్కెను. అటు పిమ్మట మొదటి తాళరాజు కుమారుడైన రెండవ యుద్ధమల్లుడు రాష్ట్రకూట చక్రవర్తి గోవిందరాజు సాయముతో వేంగిని జయించి అతని సామంతుడై యేడేండ్లకాలము దానిని పాలించెను. ఇట్లు వేంగి దేశము రాష్ట్రకూటచక్రవర్తికి కైవసమైనది. రెండవ యంశము సామంతుల తిరుగబాటు, తన్మూలమున గోవిందరాజ పదచ్యుతి. నాల్మడి గోవిందరాజునకు బద్దెగ డనుపినతండ్రి కలడు. అతని కుమారుడు కృష్ణరాజు. వీ రిద్దరును సింహాసనముపై దృష్టి సారించి రాజద్రోహమును తలపెట్టి సామంతులతో కుట్రలు చేయదొడగిరి. గోవిందరాజు వారిని దేశమునుండి వెడలగొట్టగా వారు డాహాల దేశమునకు పోయి అచ్చట తమ బంధుగుడైన చేదీశ్వరుని ఆస్థానమున దాగుకొనిరి. రాష్ట్రకూట సామ్రాజ్య పూర్వ ప్రాంతములను పాలించు చుండిన చాళుక్యసామంతు లెల్లరును ఒక్కుమ్మడి గోవిందరాజుపై తిరుగుబాటు చేసిరి. ద్వితీయచాళుక్య భీముడు రాజ్యమునకై పోరాడుచుండిన దాయాదులను నిర్జించి రెండవ యుద్ధమల్లునికిని, అతని రాచరికమునకును ప్రాపయియుండిన రాష్ట్రకూట దండనాయకులను పారద్రోలి క్రీ. శ. 934 సంవత్సరమున వేంగియందు పూర్వ చాళుక్య స్వాతంత్ర్యమును పునరుద్ధరించెను. ఆసమయమందే ముదిగొండ శాఖకు అధిపతియైన చాళుక్య బిజ్జ లేక విజయాదిత్యుడు అను నాతడు గోవిందరాజునకు అనతుడై ధిక్కరింపగా అతనిని శిక్షించుటకొరకు గోవిందరాజు అతని మీద దండు వెడలెను.



చిత్రము 30. రాజేశ్వరాలయము, లే(వే)ములవాడ

వచ్చిన దండును ఎదుర్చజాలక విజయాదిత్యుడు నిజ రాష్ట్రమును త్యజించి వేములవాడకు పారిపోయి ఆ పట్టణమును పాలించుచుండిన ఇమ్మడి అరికేసరి చాళుక్యుని శరణు చొచ్చెను. ఇమ్మడి అరికేసరి అతనికి ఆశ్రయ మిచ్చి అతని పక్షమున చక్రవర్తి సైన్యమును ఓడించి పారద్రోలెను. అతడు తనమీదికి మరల యుద్ధమునకు రావచ్చునను భయముచే తన పక్షమును బలపరచుకొనదలచి డాహాల దేశమున ప్రవాసమందున్న బద్దెగని రావించి అతనిని సామ్రాజ్యమునకు అభిషిక్తుని కావించెను. ఉభయ పక్షములకును యుద్ధము పొసగినది. గోవిందరాజు పరాజితుడై రాజ్యమున నిలువజాలక చోళదేశమునకు పారిపోయెను. అంతట బద్దెగడు క్రీ. శ. 936 లో సింహాసనమును అధిష్ఠించి, అమోఘవర్షుడు అను 'బిరుదు' వహించి క్రీ. శ. 939 వరకు నాలుగేండ్లపాటు రాజ్యాధిపత్యము నెరపెను. కాని, అమోఘవర్షుడు పేరునకు మాత్రము సింహాసనాధిపతి; రాజ్యపాలన కార్యక్రమమంతయు అతని పుత్రుడైన యువరాజ కృష్ణుడు నడపుచుండెను. క్రీ. శ. 939 లో అమోఘవర్షుడు లోకాంతరగతుడు కాగా కృష్ణుడు పట్టభద్రుడయ్యెను. చక్రవర్తి పట్టము కట్టుకొనిన కృష్ణనామాంకితులైన రాజులలో ఇతడు మూడవవాడు అగుటవలన ఇతనిని చరిత్రకారులు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ముమ్మడి కృష్ణుడని అందురు. ఇతనికి కన్నర దేవు డనియు, కృష్ణకంధారు డనియు నామాంతరములును, అకాలవర్ష, శ్రీవల్లభ, అంకత్రినేత్ర, యానెయ వెడంగ, వనగజ లేక మదగజమల్ల, ఛలకె వల్లాత అను పెక్కు బిరుదములును గలవు. ఇతడు రాష్ట్రకూట చక్రవర్తులలో నెల్ల కడుదొడ్డ వాడు. ఇతని కాలమున రాష్ట్రకూటసైన్యములు అప్రతిహత పరాక్రమమున చెలరేగి హిందూస్థానమందలి రాజన్యులను అందరిని అదిమి అరిగాపులు కావించినవి. ఇతనిచే పరాభూతులయిన ఉదీచ్యులలో చేది, మాళవ, గూర్జర నృపాలురు ముఖ్యులు. దక్షిణమున చోళరాజయిన పరాంతకుని నిర్జించి చోళసామ్రాజ్యమును ధ్వంసము కావించి ఇతడు ద్రావిడ మండలమును ఆక్రమించుకొనెను. పూర్వ దిగ్భాగమున వేంగీ మండలముపై ఎత్తి రాగా ఆ దేశాధిపతియైన ఇమ్మడి అమ్మరాజ విజయాదిత్యుడు కృష్ణరాజు కోపమును సహింపనోపక కళింగమునకు పారిపోయెను; అతని యన్నయగు దానార్ణవుని వేంగీ రాజ్యముపై తన ప్రతినిధిగ నియమించి నిజరాజ్యమును చేరెను. ఇట్లు ముమ్మడి కృష్ణరాజు ముప్పది యేండ్లకాలము మహా వైభవముతో సామ్రాజ్య పాలనము చేసి క్రీ. శ. 969 లో లోకాంతరగతుడయ్యెను. 'అత్యుచ్ఛ్రయః పతన హేతు' వను ఆర్యోక్తి రాష్ట్రకూట సామ్రాజ్యము పట్టున అన్వర్థమైనది. ముమ్మడి కృష్ణరాజు మరణానంతరము ఆరేండ్లలోపల అది నామమాత్రావశిష్టమై పోయినది. అతని తర్వాత గద్దె నెక్కిన వారు అల్పసత్వులగుటచే సామంతుల దౌర్జన్యమును అణగగొట్టి తమ యధికారమును నిలుపుకొన జాలరైరి. కృష్ణరాజు మరణానంతరము అతని తమ్ముడు ఖొట్టిగడు సామ్రాజ్యాధిపత్యము వహించెను. ఇతని కాలములో రాష్ట్రకూటుల అధికారము సత్వరముగ క్షీణింపగడగినది. క్రీ.శ. 973-4 లో మాళవ దేశాధిపతి పరమారవంశజుడైన సీయక హర్షుడు దండెత్తివచ్చి మాన్యఖేట నగరమును వైవశము కావించుకొని కొల్లగొట్టెను. ఈ దండయాత్ర యందే ఖొట్టిగ భూపతి నిహతుడాయెను. తరువాత ఇమ్మడి కరకరాజు సామ్రాజ్యాధిపత్యము వహించెను. చివరకు చాళుక్యవంశ సంభూతుడును, ఆహవమల్ల బిరుదాంకితుడునునైన రెండవ తైలపదేవుడు ఇమ్మడి కరక చక్రవర్తిని చంపి సామంతులను చదియగొట్టి క్రీ. శ. 973 లో చాళుక్య సామ్రాజ్యమును మరల స్థాపించెను. ఇతని సంతతివారిని చరిత్రకారులు పశ్చిమ చాళుక్యులనియు, కుంతల చాళుక్యు లనియు, కల్యాణి చాళుక్యులనియు వ్యవహరించుచున్నారు. నే. వెం. ర.

# పూర్వ చాళుక్యులు

పూర్వ (తూర్పు) చాళుక్యులు బాదామి పశ్చిమ చాళుక్య వంశమునుండి చీలిన యొక శాఖకు చెందినవారు. వీరికి మూలపురుషుడు పశ్చిమ చాళుక్య రాజులలో సుప్రసిద్ధుడయిన ఇమ్మడి సత్యాశ్రయ పులకేశి వల్లభుని పెద్ద తమ్ముడైన కుబ్జవిష్ణువర్ధనుడు. ఇమ్మడి పులకేశి వల్లభుడు క్రీ. శ. 624 వ సంవత్సరమున పూర్వ దిగ్విజయయాత్ర వెడలి వేంగీ, కళింగదేశములను జయించి స్వాధీనము చేసికొని వానిపై తన తమ్ముని కుబ్జవిష్ణువర్ధనుని పాలకునిగ నియమించెనని పూర్వము చెప్పబడినది.

పులకేశి వల్లభుడు తూర్పు దేశములపై దండయాత్ర వెడలి వచ్చినప్పుడు వేంగీదేశమున విష్ణుకుండులు రాజ్యము చేయుచుండి రనియు, వారి అధికారమును తుదముట్టించి అతడు దేశమును స్వాధీనపరచుకొనె ననియు చెప్పుదురు. కాని, గుణగ విజయాదిత్యుని కాలమునుండియు (క్రీ. శ. 848-892) పూర్వ చాళుక్య శాసనములలో కానవచ్చు వారి చరిత్ర కథనమునందు కుబ్జవిష్ణువర్ధనుడు దుర్జయులను జయించి వేంగిని వశపరచుకొనెనని చెప్పియున్నది. క్రీ. శ. 630 ప్రాంతమునకు చెందినదని శాసన పరిశోధకులు నిశ్చయించిన రణదుర్జయ వంశజుడైన పృథ్వీమహారాజు యొక్క తాండివాడ శాసనము దీనికి దోహదప్రాయముగ నున్నది.

**కుబ్జవిష్ణువర్ధనుడు :** (క్రీ. శ. 624 - క్రీ. శ. 641) : కుబ్జ విష్ణువర్ధనుడు వేంగీదేశమును పదునెనిమిదేండ్ల కాలము పాలించినట్లు తూర్పు చాళుక్య శాసనములు ఏకకంఠముగ పలుకుచున్నవి. ఈ పదునెనిమిదేండ్ల కాలమును రెండు ఘట్టములుగ విభజింపవచ్చును. క్రీ. శ. 624 మొదలు 631 వరకు గల ఏడేండ్లను ప్రథమ ఘట్టమని చెప్పవచ్చును. ఈ కాలమున అతడు తన యన్నయగు పులకేశి వల్లభునికి ప్రతినిధియై రాష్ట్రపాలనము చేసెనని తోచుచున్నది. అర్వాచీన పూర్వచాళుక్య శాసనములలో పేర్కొనబడియుండు దద్దరాది శత్రువులను అత డిప్పుడే జయించినట్లు ఉన్నది. క్రీ. శ. 631 లో అతని రాజ్యకాలమునందు ద్వితీయ ఘట్టము ప్రారంభమాయెను. అప్పటివరకును కృష్ణానదికి దక్షిణమునందలి తీరాంధ్రదేశము అంతయు కాంచీపురాధినాథులైన పల్లవరాజుల అధికారమునకు లోబడి యుండెను. క్రీ. శ. 630 వ సంవత్సరమున పల్లవ నృపాలుడు మొదటి మహేంద్రవర్మ దివంగతుడాయెను. అతని పుత్రుడైన ప్రథమ నరసింహవర్మ సింహాసనమును అధిష్ఠించెనో, లేదో పల్లవ రాజ్యమును జయించుటకు అదియే



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



యదనుగ ఎంచి పులకేశివల్లభుడు దండెత్తివచ్చి కృష్ణానదిని ఉత్తరించి కర్మ రాష్ట్రమును ప్రవేశించి దానిని వశపరచుకొనెను. ఈ దండయాత్రయందు యువరాజై ఉండిన కుబ్జవిష్ణువర్ధనుడు ఖడ్గ సహాయుడై శత్రు నిషూదనమునను, దుర్గసాధనమునను నిర్వక్ర పరాక్రమ ప్రకటనవలన వినుతి కెక్కెను. పులకేశివల్లభుడు తమ్ముని ఘనసాహాయ్యమునకు మెచ్చి అతనికిని, అతని సంతతివారికిని వంశపారంపర్యముగ వేంగీ రాజ్యాధిపత్యము నొసంగెను. తనకు లభించిన నూతన రాజ్యపద చిహ్నముగ కుబ్జవిష్ణువర్ధనుడు మహారాజ పదమును వహించెను. అది మొదలు క్రీ. శ. 641 వరకును అతడు నూతన రాజ్యమును నిష్కంటకముగ పాలించి కాలగతిచెందెను.

ఈ సందర్భమున స్మరింపదగిన విషయము ఒక్కటి కలదు. ఇమ్మడి పులకేశి వల్లభుడు క్రీ. శ. 681 తరువాత రెండు మూడు పర్యాయములు పల్లవ రాజ్యముపై ఎత్తిపోయి విపరీతమగు ప్రజా సంక్షోభమునకు కారణభూతుడు ఆయెను. చిట్టచివరకు పల్లవాధిపతియైన ప్రథమ నరసింహవర్మ క్రీ. శ. 641 లో బాదామి ముట్టడివేసి ఆ సందర్భమున జరిగిన యుద్ధములో ఇమ్మడి పులకేశివల్లభుని వధించెను. ఇందువలన ఇమ్మడి పులకేశివల్లభుడును, అతని యనుజుడైన కుబ్జ విష్ణువర్ధనుడును ఏకవర్షమున మృతి చెందిరని తెలుచున్నది. ఆ యన్నదమ్ములకు గల సౌహార్దమును తలపోసి చూడగా కుబ్జవిష్ణువర్ధనుడు నరసింహవర్మ పల్లవుడు బాదామిని ముట్టడించినప్పుడు అన్నకు సహాయుడై చని యాముట్టడియందే అన్నతోగూడ వీరస్వర్గమును చూరగొనినట్లు ఉన్నది.

కుబ్జవిష్ణువర్ధనుడు పేర్పరియైన దళనాయకుడు; అసమాన పరాక్రమశాలి; ధైర్యశౌర్యములకు ఆటపట్టు; ఎంత విషమములైనను స్థల, జల, వన, గిరి దుర్గములను భేదించి కైవసము చేసికొనగల సమర్థుడగుటవలన 'విషమసిద్ధి' అనియు, మావరి· అగుట వలన 'మకరధ్వజు' డనియు అతనికి బిరుదులు కలిగెను. అతని సంతతివారిలో విష్ణువర్ధన నామధేయముగల రాజులు కొందరు కూడ ఈ బిరుదములను వహించినట్లు వారి శాసనముల వలన దెలియుచున్నది.

కుబ్జవిష్ణువర్ధనునకు కార్యఖడ్గములందు తోడ్పడిన ప్రముఖులు కొందరు శాసనములలో పేర్కొనబడియున్నారు. వీరిలో మత్స్యవంశజుడైన అటవీ దుర్జయుడు ఒక్కడు. కళింగాటవి ప్రాంతమును జయించుట వలన అతనికి ఈ పేరు కలిగియుండును. కుబ్జవిష్ణువర్ధనుడు ఇచ్చిన చీపురుపల్లి దాన శాసనమునకు ఇతడు ఆజ్ఞప్తి, అనగా ఆ శాసనమును అమలులోనికి తెచ్చిన అధికారి. కొండపడమటి వంశమునకు చెందిన బుద్ధవర్మ మరియొకడు. విష్ణువును గరుడుని వలెను, రావణాంతకుని హనుమంతుని వలెను కుబ్జవిష్ణువర్ధనుని ఇతడు సేవించి అతని అనుగ్రహము వలన డెబ్బది గ్రామముల గిరిపశ్చిమ దేశమును పడసెనట. కాలకంపుడను బ్రాహ్మణ వీరుడు ఒక్కడు విష్ణువర్ధనుని కొలువున నియోగాధికృతుడై ఉండెను. ఇతడు బహుపరాక్రమశాలి. తన ప్రభువుయొక్క ఆజ్ఞను అనుసరించి దుర్ధరబలసంపన్నుడైన దద్దరుడను వానిని జయించి అతని బిరుదావళిని కొనెనట.

కుబ్జవిష్ణువు పట్టమహిషి అయ్యణ మహాదేవి అని అతని సంతతివారి శాసనముల వలన తెలియుచున్నది. ఇతనికి జయసింహవల్లభుడు, ఇంద్రభట్టారకుడు అను పుత్రులు ఇర్వురు కలిగిరి. వారు ఇరువురును తండ్రి యనంతరము ఒకరి తర్వాత ఒకరు సింహాసనమును అధిష్ఠించిరి. కుబ్జవిష్ణువర్ధనుడు విష్ణుభక్తుడుగా కన్పట్టుచున్నాడు. ఇతడు పరమభాగవతుడని ఇతని తిమ్మాపుర తామ్రశాసనము తెల్పుచున్నది. కుబ్జవిష్ణువు అనగా వామనుడు; ఆ పేరును, త్రివిక్రమ సముడు అను ఉపమానమును పై యభిప్రాయమునకు అనుగుణముగనే యున్నవి. విష్ణుభక్తుడైనను కుబ్జవిష్ణువర్ధనుడు ఇతర దేవతలను ఆరాధింపక పోలేదు. కౌశికి (దుర్గ), కార్తికేయాది కులదేవతలను అతడు త్యజింపలేదు. అతని పట్టమహిషి అయ్యణ మహాదేవి జైనమతమునందు అభిమానము కలదయి బెజవాడలో కవురూరు గణమునకు చెందిన సన్యాసులకొరకు నడుంబి వసతి యను జైన మందిరమును కట్టించెను. తత్కారణమున ఆమె జైన సమయమును అవలంబించెనని దృఢముగ చెప్పుటకు వీలు లేదు. ఏలన, పూర్వము హిందూరాజులు స్వయముగ తామే మతమును స్వీకరించినను, తమరాజ్యములోని సర్వసమయముల వారిని సమానదృష్టితో చూచుచు వారి మత సంస్థలను నిష్పక్షపాత బుద్ధితో ఆదరించి పెంపొందించువారు. కావున, రాజ్ఞి అయ్యణమహాదేవి జైనుల కొక దేవాలయమును కట్టించినంత మాత్రమున ఆమె జైనమతస్థురాలని నిశ్చయించి చెప్పుటకు వలనుగాదు.

**మొదటి జయసింహ వల్లభుడు (క్రీ. శ. 641 - క్రీ. శ 678)** : కుబ్జవిష్ణువర్ధనుని మరణానంతరము అతని జ్యేష్ఠ పుత్రుడైన జయసింహ వల్లభుడు రాజ్యాధిపత్యము వహించెను. జయసింహ నామధారులైన పూర్వ చాళుక్య రాజులలో ఇతడు ప్రథముడగుట వలన చరిత్రకారులు ఇతనిని మొదటి జయసింహవల్లభుడు అందురు. ఇతడు ముప్పది మూడేండ్ల కాలము రాజ్యమొనర్చినట్లు పూర్వ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చాళుక్య శాసనముల వలన తెలియుచున్నది. ఇంత దీర్ఘ కాలము ఇతడు రాజ్యము నేలినను ఇతని యేలుబడిలో జరిగిన విశేషాంశములు ఎవ్వియు తెలియరావు. కాని ఇతని శాసనములందు ఒకదానిలో ఇతడు విజయస్కంధావారమున ఉండగా ఆ శాసనోక్త దానమును చేసినట్లు చెప్పియుండుట వలన ఇతని రాజ్యకాలమున కొన్ని యుద్ధములు నడచె ననియు, దేశమున శాంతి అవిచ్ఛిన్నముగ కడలుకొనలే దనియు విదితమగుచున్నది. కాని, ఇతడు జయించిన శత్రువులు ఎవ్వరో వారితో ఇతడు ఏల పోరాడవలసి వచ్చెనో తెలియదు. ఇతని రాజ్యారంభ దశయందు పల్లవుల ఆటోపము అతిశయించి యుండెను. బాదామి పతనానంతరము పశ్చిమ చాళుక్యరాజ్యమందు అరాజకము ప్రబలెను. ఆ సంక్షోభకాలమున పల్లవ నరసింహవర్మ తత్పూర్వము తాను కోల్పోయిన తీరాంధ్ర భూభాగమును మరల స్వాధీన పరచుకొనుటకు ప్రయత్నము చేయగా అతనితో జయసింహవల్లభుడు పోరాడి యుండవచ్చును. ఇది వట్టి యూహయే; దృఢముగ సత్యముగ నడచిన చరిత్రాంశమని చెప్పుటకు వీలులేదు.

జయసింహ వల్లభుని దానశాసనములందు పేర్కొనబడి యుండు దానోద్దిష్ట స్థలములనుబట్టి చూడగా అతని పాలన క్రింది రాష్ట్రము విశాఖపట్టణ ప్రాంతమునుండి గుంటూరు మండలములోని ఒంగోలు పరిసరముల వరకును వ్యాపించి యుండెనని తోచుచున్నది. ఒకానొక శాసనమును అతడు ఉదయపురము నుండి ఇచ్చినట్లు చెప్పియున్నది. ఈ యుదయపురము ఎచ్చట నుండెనో తెలియదు. కొందరు పరిశోధకులు అది నెల్లూరు మండలములోని ఉదయగిరియే అని అభిప్రాయ పడుచున్నారు. కావచ్చును; అగునేని, జయసింహ వల్లభుని అధికారము కళింగమునుండి పాకనాటి వరకును చెల్లుచుండెనని చెప్పవలసి యుండును.

జయసింహ వల్లభునికిని పశ్చిమ చాళుక్యులకును గల పరస్పర సంబంధము ఎట్టిదో తెలియదు. బాదామి పతనానంతరము పశ్చిమ చాళుక్యరాజ్యము కొంతకాలము విచ్ఛిన్నమై ఉండిన కారణమున అతడు స్వతంత్రుడాయెను. ఇమ్మడి పులకేశి వల్లభుని పుత్రులలో నొక్కడైన మొదటి విక్రమాదిత్యుడు క్రీ. శ. 655 ప్రాంతమున పల్లవులను ఓడించి పారద్రోలి పితృపైతామహమైన రాజ్యమును పునరుజ్జీవింపజేసి, అది మొదలు పల్లవ రాజ్యముపై మాటిమాటికి దండెత్తిపోయి సంక్షోభము కల్గించుచుండెను. పల్లవులతో పోరాటమందు విక్రమాదిత్యునికి జయసింహుడు సాయపడెనేమో తెలియదు. జయసింహవల్లభునికి సంతానము కలుగలేదు; తమ్ముడైన ఇంద్రభట్టారకుని, అతని సంతతి వారిని చేరదీసి రాజ్యపాలనమున భాగస్వాములను కావించుకొనెను. ఇంద్రభట్టారకుని కుమారుడైన విష్ణువర్ధనుడు పెదతండ్రికి సర్వకార్యములందును కుడిభుజమై ఉండెను. అతని పుత్రుడైన మంగిరాజు యౌవరాజ్యపదమున నియుక్తుడై ఉండెను. వీరి సాహాయ్యమున జయసింహ వల్లభుడు మహావైభవముతో రాజ్యపాలనము కావించి క్రీ. శ. 678 ప్రాంతమున దేహము చాలించెను.

**జయసింహవల్లభుని తరువాతి రాజులు** (క్రీ. శ. 678 - క్రీ. శ. 758): జయసింహవల్లభుని మరణానంతరము ఇంద్రభట్టారకుడు సింహాసనమును అధిష్ఠించి ఏడు దినములు రాజ్యమేలెను. ఆతని తరువాత, అతని తనయుడు రెండవ విష్ణువర్ధనుడు రాజై క్రీ. శ. 681 వరకు తొమ్మిది వర్షముల కాలము ప్రజాపాలనము కావించెను. కుబ్జవిష్ణువవలె ఇతనికిని 'విషమసిద్ధి', 'మకరధ్వజ' బిరుదములే కాక 'సర్వలోకాశ్రయ', 'ప్రలయాదిత్య' బిరుదులు మరి రెండు కలవు. ఇతని వెనుక ఇతని కొడుకైన మంగి యువరాజు సింహాసనాసీనుడై, క్రీ. శ. 705 వరకు ఇరువది యైదేండ్లు పాలించెను. చిరకాలము యువరాజై ఉండిన కారణముననేమో రాజ్యాధిపత్యము వహించినపిమ్మటకూడ ఇతనికి యువరాజనామము స్థిరముగ నిలిచిపోయినది. మంగి యువరాజునకు జయసింహుడు, కొక్కిలి లేక కొక్కిలి విక్రమాదిత్యుడు, విష్ణువర్ధనుడు అను మువ్వురు కొడుకులు పుట్టిరి. తండ్రితరువాత వారు ఒకరివెనుక నొకరు రాజ్యాధిపత్యము వహించిరి. జయసింహుడు: ఈ పేరుగల పూర్వ చాళుక్య నృపాలురలో ఇతడు రెండవవాడు కావున ఇతనిని చరిత్రకారులు ఇమ్మడి జయసింహుడని అందురు క్రీ. శ. 705 మొదలు 717 వరకు ప్రజాపాలనమొనర్చెను ఇతనికి 'సకలలోకాశ్రయుడు', 'సర్వసిద్ధి', 'నిరవద్యుడు' మున్నగు బిరుదనామములు కలవు. క్రీ. శ. 696 నుండి 733-34 దాక బాదామిచాళుక్య సామ్రాజ్యమును పాలించిన పశ్చిమ చాళుక్య విజయాదిత్య సత్యాశ్రయునికికూడ 'నిరవద్య' బిరుదు కలదు; ఇది కేవలము కాకతాళీయమో లేక, ఎద్దియేని రాజకీయ సంబంధమును సూచించునో చెప్ప సాధ్యము కాదు. రెండవ జయసింహుని మరణానంతరము కొక్కిలి రాజ్యాభిషిక్తుడయ్యెను. కాని, సింహాసనము నెక్కిన ఆరు మాసములకు తమ్ముడైన ముమ్మడి విష్ణువర్ధనునిచే పదచ్యుతుడై మధ్య కళింగమునకు పారిపోయి అచట పాదుకొనెను. అచటనే అతని సంతతి వారైన మంగివర్మ మహారాజ, వినయాదిత్యవర్మ మహారాజ, సర్వలోకాశ్రయ శ్రీ ద్వితీయ కొక్కిలివర్మ మహారాజ ప్రభృతులు మూడు తరములవారు పాలించిరి.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కొక్కిలిని తరుమగొట్టి దేశమును ఆక్రమించుకొని పట్టభద్రుడై ముమ్మడి విష్ణువర్ధనుడు క్రీ. శ. 718 మొదలు 753 పర్యంతము ముప్పది మైదేండ్లకాలము రాజ్యపాలనము చేసెను. అతని శాసనములలో కాని అర్వాచీన పూర్వచాళుక్యరాజుల శాసనములలో కాని అతనికాలమందు నడచిన చరిత్రాంశము లేవియు సూక్తముకాకపోయినను సమకాలిక పల్లవరాజుల శాసనములవలన అతని చరిత్ర కేవలము నిర్విశేషము కాదని తెలియవచ్చుచున్నది. క్రీ. శ. 731 - 32 ప్రాంతమున రెండవ పరమేశ్వరవర్మ రణ నిహతుడగుటవలన దేశమున అరాజకము ప్రబలెను. అది సందు చూచుకొని ముమ్మడి విష్ణువర్ధనుడును, అతని బంధువు బాదామి చాళుక్య విజయాదిత్యుడును పల్లవరాజ్యమునకు చెందిన గడిప్రాంత సీమలను ఆక్రమించుకొనిరి. ఇంతలో పల్లవ జనపద ప్రజలు నందివర్మ పల్లవమల్లుని తమకు రాజుగ ఎన్నుకొనిరి. ఇతనికే రెండవ నందివర్మ అని పేరు. ఇతడు అద్వితీయశక్తి సామర్థ్య సంపన్నుడు. ఇతని అశ్వమేధ యాగసందర్భమున యాగాశ్వము ఉత్తర దిగ్భాగమున పర్యటనము చేయుచుండగా దానిని నెల్లూరు మండలములోని కోయకొట్టమునకు అధిపతియైన పృథ్వీ వ్యాఘ్రుడు అను నిషాదరాజు పట్టి బంధించెను. అతడు ముమ్మడి విష్ణువర్ధనుని మిత్రుడు; ఒకవేళ సామంతుడై ఉండినను ఉండవచ్చును. గుఱ్ఱము వెంటనంటి దాని కంగరక్షగా వచ్చుచుండిన ఉదయచంద్రుడు నిజరాజ్యమును ప్రవేశింపగనే యుద్ధమున ఓడియో లేక, శత్రుసైన్యమును తారసిలజాలకయో పృథ్వీవ్యాఘ్రుడు విష్ణువర్ధనుని రాజ్యమునకు పారిపోయెను. ఉదయచంద్రుడు అతని వెన్నంటి తరుముచుపోయి పూర్వచాళుక్య రాజ్యమును జొచ్చెను. ఈకారణమున ఇతనితో విష్ణువర్ధనునకు పోరు కలిగినది. ఈ పోరాటము ఎట్లు నడచెనో తెలియదు. కాని ఉదయచంద్రుడు విష్ణురాజు దేశమును పల్లవ రాజ్యమును కావించితి ననియు, నిరవద్య ప్రముఖులను ఆజ్ఞాబద్ధులను చేసి వారి కడనుండి అంకుహారములను, సువర్ణమును, కుంజరములను గ్రహించితి ననియు చెప్పికొనియుండుటవలన జయము అతనికే చేకూరినట్లు తోచుచున్నది. ఇచట ఒక్కించుక వితర్కింపదగిన విషయము ఒక్కటి కలదు. ఉదయచంద్రునికి ఆజ్ఞాబద్ధుడై అంకుహార, సువర్ణ కుంజరాదులను సమర్పించిన నిరవద్యుడెవ్వడు? మనకు ఎరుక గలిగినంతవరకు అప్పటి వారిలో ఈ బిరుదు ఇద్దరికి కలదు. వారియందు పూర్వచాళుక్య వంశజుడైన రెండవ జయసింహుడు ఒక్కడు; రెండవవాడు, పశ్చిమ చాళుక్య విజయాదిత్య సత్యాశ్రయుడు. ఉదయచంద్రుని దండయాత్రకు పూర్వమే రెండవ జయసింహుడు మృతిచెంది యుండెను. విజయాదిత్య సత్యాశ్రయుడు ఇంకను రాజ్యమును చేయుచుండెను. కావున, ఉదయ చంద్రునిచే పరాజితుడయిన నిరవద్యుడు ఇతడే కావలయును. అగుచేని, విష్ణువర్ధనునిపై పల్లవులు దండు పెట్టగా అతనికి విజయాదిత్యుడు సహాయుడై వచ్చెనని చెప్పవలసి యున్నది. ఇందలి సత్యాసత్యములు ఎట్లుండినను ఉదయచంద్రుని దండయాత్రకు ఫలితముగ విష్ణువర్ధనుడు తనరాజ్యములోని దక్షిణ సీమలను కోల్పోవుట నిశ్చయము.

**ప్రథమ విజయాదిత్యుడు** (క్రీ. శ. 753 - క్రీ. శ. 770): ముమ్మడి విష్ణువర్ధనుని మరణానంతరము అతనికి పట్టమహిషి విజయమహాదేవియందు జన్మించిన పుత్రుడు విజయాదిత్యుడు రాజ్యాభిషిక్తుడు అయెను. ఇతడు పదునెనిమిదేండ్లు ప్రజాపాలనము చేసెను. ఇతని రాజ్యకాలమున జరిగిన చరిత్ర విశేషము లెవ్వియో సునిశ్చయముగ తెలియవు. విజయాదిత్యునికి 'సమస్త భువనాశ్రయ', 'త్రిభువనాంకుశ' అను సామాన్య పూర్వ చాళుక్య బిరుదులు మాత్రము కాక అధిరాజ పదవీ సూచకములయిన 'మహారాజాధిరాజ', 'పరమేశ్వర', 'భట్టార'కాది బిరుద విశేషములు ఉండినట్లు అతని శాసనములవలన తెలియవచ్చుచున్నది. అధిరాజ్య పదవీసూచక బిరుదావళిని వహించిన పూర్వ చాళుక్యులలో ప్రథముడు ఇతడే. ఇందువలన విజయాదిత్యుడు తనకు ముందు రాజ్యము చేసిచనిన స్వవంశజులగు పూర్వ చాళుక్య రాజులకంటె ఉన్నత స్థానమును అధిష్ఠించెనని తెలియవచ్చుచున్నది. ఇందులకు కారణము ఏదియో తెలియదు కాని, దురూహము కాదు. విజయాదిత్యుని రాజ్యారంభ దశయందు బాదామి చాళుక్య రాజ్యము ఉత్సన్నమై పోయినది. క్రీ. శ. 753 ప్రాంతమున బాదామి చాళుక్య ప్రభువైన రెండవ కీర్తివర్మను తొలగద్రోసి అతని సామంతులలో ఒక్కడైన రాష్ట్రకూట దంతిదుర్గుడు చాళుక్యులదైన సామ్రాజ్య పదమును ఆక్రమించుకొనెను. కావున, విజయాదిత్యుడు బాదామి వంశము అంతరించిపోయినను వారిదైన సామ్రాజ్యపదవి వారి శత్రువులకు చెందజాలదనియు, వారసత్వపు హక్కువలన తనకు సంక్రమించె ననియు ప్రకటించుట కొరకు పై బిరుదులను వహించియుండవచ్చును. ఇట్లు రాష్ట్రకూటులకు ప్రతిస్పర్ధియై సామ్రాజ్య పదము తనదని చాటించుకొనినను దంతిదుర్గుడు కాంచీ, కోసల, కళింగ, శ్రీశైలాది రాజ్యములను జయించెనే కాని అతని జోలికి పోలేదు. కావున అతని పలుబడి చాలకాలము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



శాంతముగ సాగెను. దంతిదుర్గుని మరణానంతరము రాష్ట్రకూటుల యధికారము నిరాటంకముగ చెల్లుబడి కాలేదు. అతని వెనుక అతని పినతండ్రి మొదటి అకాలవర్ష కృష్ణుని కాలమున రాహప్ప అను చాళుక్య వీరుడు చాళుక్య సామ్రాజ్యమును పునరుద్ధరించుటకు కంకణము కట్టుకొని దేశమున పెద్ద యల్లరిని రెచ్చగొట్టెను. విజయాదిత్యుడు రాహప్పకు సహాయుడై రాష్ట్రకూటుల యధికారమును కూలద్రోయుటకు తోడ్పడి యుండవచ్చును. మరియు ఈ యల్లరివలన కలిగిన దేశ సంక్షోభమును సందర్భ పరచుకొని రాష్ట్రకూటుల యేలుబడిలోని రాష్ట్రమును ఆక్రమించుకొని ఉండవచ్చును. కారణము ఏదియైనను విజయాదిత్యునికి రాష్ట్రకూటులతో వైరము పొసగినది. కావున మొదటి అకాలవర్ష కృష్ణభూపతి రాహప్ప హావడిని అణగగొట్టి తన యధికారమును దేశమున సుస్థిరముగ నెలకొల్పిన పిమ్మట క్రీ. శ. 769 ప్రాంతమున తన కుమారుడైన యువరాజ గోవిందరాజును గొప్ప సైన్యముతో కూడ వేంగిదేశముపై దండయాత్ర పంపెను. ఇట్లు దేశముపై వచ్చిన రాష్ట్రకూటులను ఎదుర్కొన విజయాదిత్యుడు ఎట్టి ప్రయత్నము కావించెనో తెలియదు. రాష్ట్రకూట శాసన సాక్ష్యమును బట్టి చూడగా అతడు యుద్ధమునందోడి తన సర్వస్వమును శత్రువులకు సమర్పించినట్లు తెలియవచ్చుచున్నది. క్రీ. శ. 769 వ సంవత్సరమున వ్రాయించిన రాష్ట్రకూట ఇమ్మడి గోవిందరాజు యొక్క అలాస తామ్రపట్టిక యందు వేంగీశ్వరుడు శరణాగతుడై 'నిజకోశమును, సైన్యమును, దేశమును' సమర్పించెనని చెప్పియున్నది. పరాజయము కలిగిన పిమ్మట విజయాదిత్యుడు చాలకాలము రాజ్యము చేయలేదు. క్రీ. శ. 770-71 లో అతడు దేహము చాలించినట్లు ఉన్నది.

**నాల్గవ విష్ణువర్ధనుడు (క్రీ. శ. 771-క్రీ. శ. 808):** విజయాదిత్యుని మరణానంతరము అతని పుత్రుడైన నాల్గవ విష్ణువర్ధనుడు రాజై ముప్పదియైదేండ్లు ప్రజాపాలనము చేసెను. ఇంతకాలము రాజ్యము చేసినను పూర్వ చాళుక్య శాసనములనుబట్టి చూడ అతని కాలమున విశేష చరిత్రాంశములు ఏవియు నడచినట్లు తెలియరాదు. కాని సమకాలిక రాష్ట్రకూట శాసనములలోను అర్వాచీన కర్ణాటక వాఙ్మయమునందును అతని కాలమందు నడచిన వేంగీ దేశ చరిత్ర కొంత వివరింపబడి యున్నది.

రాష్ట్రకూట చక్రవర్తి మొదటి అకాలవర్ష కృష్ణుడు క్రీ. శ. [illegible] లో కాలగతి చెందెను. అతనికి వెనుక అతని కుమారులలో ఒక్కడైన ఇమ్మడి గోవిందరాజు రాష్ట్రకూట సామ్రాజ్యాధిపత్యమును వహించెను; కాని, అతని సోదరుడైన ధారావర్ష ధ్రువరాజు అతని ఆధిపత్యమును అంగీకరింపక చక్రవర్తి పదమును ఆక్రమించు కొనుటకు ప్రయత్నముచేయ మొదలుపెట్టెను. రాజ్యాధిపత్యమునకై ఆ యన్నదమ్ములకు పోరు పొసగినది. ధ్రువుని నిస్సహాయుడై ఎదుర్కొనుటకు శక్తి చాలకపోవుట వలన ఇమ్మడి గోవిందరాజు తనకు కప్పము కట్టుచుండిన మాళవ, ద్రావిడ, వేంగి, గంగవాడి ప్రభువులను తనకు సహాయము రమ్మని కోరెను. రాష్ట్రకూట సామ్రాజ్యమునందు అంతఃకలహము పుట్టుట వారికి ముదావహ మగుటచేత వారు గోవిందరాజునకు సహాయముచేయ నియ్యకొనిరి. నాల్గవ విష్ణువర్ధనుడు తక్కినవారివలె గోవిందరాజునకు తోడై ధ్రువునిపై యుద్ధమునకు నడచెను. ప్రబలమిత్ర బలము కలవాడైనను గోవిందరాజు యుద్ధమున పరాజయము పొందెను. అతనిని తొలగద్రోసి ధ్రువుడు క్రీ. శ. 780 ప్రాంతమున సింహాసనమును అధిష్ఠించెను. రాజ్యమున సుస్థిరుడై కుదురుకొనిన పిమ్మట గోవిందరాజునకు సహాయము వచ్చి తనతో పోట్లాడిన వేంగి రాజాదులను శిక్షింప నిశ్చయించి ధ్రువుడు తనకు సామంతుడును, లేములవాడ చాళుక్య వంశజుడును నైన ప్రథమ అరికేసరికి గొప్ప సైన్యము నిచ్చి అతనిని పూర్వచాళుక్య రాజ్యముపై దండయాత్ర పంపెను. ఇతడు వేంగి త్రికళింగములను రెంటిని జయించి స్వామి ఆజ్ఞను నిర్వహించెను. అంతట విష్ణువర్ధనుడు చేయునది లేక తన కుమార్తె యగు శీలమహాదేవిని ధ్రువున కిచ్చి వివాహమొనర్చి సంధి కావించుకొనెను. ఈ వివాహము వలన పూర్వచాళుక్య, రాష్ట్రకూట రాజ కుటుంబములకు సంబంధ బాంధవ్యములు ఏర్పడినవి.

**నరేంద్ర మృగరాజ విజయాదిత్యుడు (క్రీ. శ. 808-క్రీ. శ. 848):** నాల్గవ విష్ణువర్ధనునకు విజయాదిత్యుడు, భీమసలుక్కి అను పుత్రు లిరువు రుండిరి. తండ్రి మరణానంతరము వారిలో పెద్దవాడైన విజయాదిత్యుడు రాజ్యాధిపత్యమును వహించెను. విజయాదిత్య నామధారులైన పూర్వచాళుక్య రాజులలో ఇతడు రెండవవా డగుట వలన ఇతనిని చరిత్రకారులు ఇమ్మడి విజయాదిత్యుడని పేర్కొనెదరు. ఇతడు అద్వితీయ పరాక్రమశాలి; శత్రుజన భయంకరుడు; విద్వేషి నృపాలురను అనేకులను భంజించుటవలన ఇతనికి నరేంద్ర మృగరాజను బిరుదనామము కల్గినది. ఈ పేరనే ఇతడు ప్రసిద్ధికెక్కెను. అన్న యభ్యుదయము రాజ్యకాంక్షచే పీడితుడైన తమ్ముడు భీమసలుక్కికి గిట్టలేదు. స్వయముగ అన్నను తొలగద్రోసి రాజ్యమును



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఆక్రమించుకొనుటకు అతనికి శక్తి సామర్థ్యములు చాలవు. కావున, అతడు వేంగీ రాజ్యమును కబళింప తరుణము నెదురు చూచుచుండిన రాష్ట్రకూట చక్రవర్తియగు ముమ్మడి గోవిందరాజును ఆశ్రయించెను. గోవిందరాజు శీలమహాదేవి భర్తయైన ధ్రువరాజు పుత్రులలో ఒక్కడు. క్రీ. శ. 794 ప్రాంతమున ధ్రువరాజు దివంగతుడైన పిమ్మట రాజ్యాధిపత్యము కొరకు అతని పుత్రులగు కంభ, గోవిందులు ఒండొరులతో పెనగులాడిరి. ఈ యన్నదమ్ముల కలహము నాస్పదము చేసికొని నాల్గవ విష్ణువర్ధనుడు రాష్ట్రకూటుల అధిపత్యమును తొలగద్రోసి నిజ స్వాతంత్ర్యమును ప్రకటించిన ట్లున్నది. తత్కారణమున గోవిందరాజు కంభుని ఓడించి రాజ్యమున సుస్థిరుడై నెలకొనిన పిమ్మట వేంగిని తనయేలుబడి క్రిందికి తెచ్చుకొనుటకు ఉద్యమించు చుండెను. అన్నపై తిరుగబాటు చేసి తనకడకు సాహాయ్యార్థము భీమసలికి అరుదెంచుట గోవింద రాజునకు అత్యంతము ముదావహమైనది. కావున, అతడు భీమసలికిని చేరదీసి యాదరించి గొప్ప సైన్యమును తోడిచ్చి విజయాదిత్యుని పదచ్యుతుని కావించి వేంగీ రాజ్యమును ఆక్రమించుటకు పుత్తెంచెను. రట్టబలగముతో ఎత్తివచ్చిన భీమసల్కిని మార్కొని సరిపోరుటకు విజయాదిత్యునికి తలమునుక లాయెను. కాని, ధీరోత్తముడైన విజయాదిత్యుడు పరాజయమును అంగీకరింపక పండ్రెండేండ్ల కాలము తమ్మునితోడను, అతనికి బాసటయై వచ్చిన రట్ట, గాంగ బలములతోడను ఎడతెగక యుద్ధముచేసి యష్టోత్తరశత రణక్షేత్రములలో శత్రుసంహారము కావించి జయము గొనెను. ఈ ద్వాదశ వర్ష సంగ్రామము ముగియక మునుపే రాష్ట్రకూట ముమ్మడి గోవిందరాజు స్వర్గస్థు డాయెను. అతని మరణానంతరము అతని పుత్రుడు నృపతుంగాపరనామధేయుడైన మొదటి అమోఘవర్షుడు రాష్ట్రకూట సామ్రాజ్యమునకు పట్టభద్రుడాయెను. రాజ్యాభిషేక సమయమున ఈ యమోఘవర్షుడు ఆరేండ్ల నిసుగు. రాజ్యభార మంతయు అతని పినతండ్రియైన ఇంద్రరాజ పుత్రుడగు కరక సువర్ణ వర్షుని మూపుపై బడినది. చక్రవర్తి యర్భకత్వమును సందర్భము చేసికొని తత్పూర్వము అరిగాపులై యుండిన సామంత రాజులు తిరుగబాటు కావించిరి. సామ్రాజ్యమున గొప్ప సంక్షోభము కలిగినది; అరాజకము ప్రబల జొచ్చినది. భీమసల్కిని ఉచ్చాటనము చేయుటకు అదియే మంచి తరుణమని గ్రహించి విజయాదిత్యుడు సేనలను కూర్చుకొని యుద్ధమును భీకరముగ సల్పగడగెను. హైహయవంశజుడైన నృపరుద్రుడు ఈ యుద్ధమునందు అతనికి ఖడ్గసహాయుడై నిలువగా విజయలక్ష్మిని సుప్రసన్నురాలిని కావించుకొనెను. రాష్ట్రకూటుల తోడ్పాటు సన్నగిల్లుటవలన భీమసలికికి విజయాదిత్యుని ఎదుర్కొన శక్తి లేకపోయినది. విజయాదిత్యుడు అతని పరాఙ్ముఖుని కావించి యావద్వేంగీ భూమండలమును మరల తన యేలుబడి క్రిందికి తెచ్చుకొనెను. ఇట్లు రణవిజయుడైన విజయాదిత్యుడు భీమసలికికి తోడ్పడినందుకు తమపై కుపితుడై ఎత్తివచ్చునేమో అన్న భయము రాష్ట్రకూటుల హృదయమును కలతపెట్ట సాగినది. సామ్రాజ్య సంరక్షకుడైన కరక సువర్ణవర్షుడు నేర్పరియైన రాజ్యతంత్ర మర్మజ్ఞుడు. విజయాదిత్యునితో ఎట్లైన సంధి కావించుకొనుట సామ్రాజ్యమునకు శ్రేయస్కరమని ఎంచి తన తోబుట్టువైన శీలమహాదేవిని అతని కుమారుడైన కలివిష్ణువర్ధనునకు ఇచ్చి ఉద్వాహ మొనర్చి సంధి చేసికొనెను. అది మొదలు విజయాదిత్యుడు నిర్బాధకముగ వేంగీరాజ్యమును పాలించి క్రీ. శ. 846 లో దేహమును చాలించెను.

ఇమ్మడి విజయాదిత్యుడు భూతదయా పశ్చాత్తాపములు కలరాజు; పాపభీతిగల ప్రభువు; మహేశ్వర భక్తుడు; యుద్ధమున తా నొనర్చిన జీవహింస వలన కలిగిన పాపమును బాపుకొనుటకై అతడు తాను పోరాడిన నూట యెనిమిది రణక్షేత్రములలో ఒక్కొక్కదానియందును నరేంద్రేశ్వర నామాంకిత శివాలయము నొక్కొక్కదానిని కట్టించెను. ఇందువలన ఇతనికి గల్గిన పాపక్షయము మాట అటుండనిచ్చి దేశమునందు దేవాలయ వాస్తు నిర్మాణము విపులముగ సాగినది. శిల్పము అభివృద్ధి చెందినది; శైవము రాజ్యమం దెల్లయెడల విస్తరించినది.

**కలివిష్ణువర్ధనుడు** (క్రీ. శ. 846 - క్రీ. శ. 848): నరేంద్రమృగరాజ విజయాదిత్యుని తరువాత ఇతని పుత్రుడైన కలివిష్ణువర్ధనుడు రాజ్యాధిపతియై పదునెనిమిది మాసములు ప్రజాపాలనము చేసెను. ఇతనిని ఐదవ విష్ణువర్ధనుడని చరిత్రకారులు పేర్కొందురు. ఇతని రాజ్యకాలమున జరగిన విశేషములు ఎవ్వియు తెలియవు. ఇతనికి నల్గురు పుత్రులు పుట్టినట్లు ఇతని సంతతివారి శాసనముల వలన తెలియుచున్నది. వీరిలో జ్యేష్ఠుడు విజయాదిత్యుడు; రాష్ట్రకూట ఇంద్రరాజ పుత్రికయైన శీలమహాదేవీ గర్భ సంజాతుడు; గుణగాంకు డనియు, గుణకెనల్లాటడనియు ఇతనికి బిరుదనామములు గలవు. రెండవ వాడు విక్రమాదిత్యుడు. ఇతడును శీలమహాదేవి పుత్రుడు అగునేమో? నృపకాముడను మరియొక పుత్రుడు ఉండినట్లు గుణగవిజయాదిత్యుని సాతలూరు శాసనమువలన తెలియు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చున్నది. వీరు కాక యుద్ధమల్లుడను ఇంకొక కొడుకు ఉండెనని అర్వాచీన పూర్వచాళుక్య శాసనములవలన విదితమగుచున్నది.

**గుణగ విజయాదిత్యుడు** (క్రీ. శ. 848 - క్రీ. శ. 892): విష్ణువర్ధనుడు స్వర్గస్థుడైన పిమ్మట అతని పుత్రులలో శ్రేష్ఠుడైన విజయాదిత్యుడు రాజ్యాధిపత్యమును వహించెను. ఈ పేరిటి తూర్పు చాళుక్యులలో ఇతడు మూడవవాడగుటవలన శాసన పరిశోధకులు ఇతనిని ముమ్మడి లేక, మూడవ విజయాదిత్యుడు అని పేర్కొందురు; కాని, గుణగ లేక, గుణగాంక విజయాదిత్యుడు అను పేర ఇతడు వాసికెక్కెను. వేంగిని పాలించిన తూర్పు చాళుక్య రాజులలో వెల్ల ఇతడు కడు దొడ్డవాడు. అద్వితీయ పరాక్రమశాలి; రణప్రియుడు; శౌర్యధైర్య సాహసాది గుణములచేత ఇతడు సమకాలిక రాజన్యులను అధఃకరించెను.

గుణగవిజయాదిత్యుని కాలమున నడచిన ముఖ్య చరిత్రాంశము లన్నియు అతని యొక్కయు, అతని సంతతివారి యొక్కయు, శాసనములందు అభివర్ణింపబడి యున్నవి. సమకాలిక రాష్ట్రకూట శాసనముల వల్లను కొన్ని యంశములు తెలియవచ్చు చున్నవి. గుణగుడు సింహాసనమును అధిష్ఠించినపుడు వేంగిరాజ్యము యొక్క దక్షిణపు పొలిమేర గుండ్లకమ్మను దాటియుండ లేదు; గుండ్లకమ్మకు దక్షిణమందలి తీరాంధ్రము అప్పుడు ఎవ్వరి యేలుబడి క్రింద ఉండెనో నిశ్చయించి చెప్పుటకు వీలు లేదు; ఒకవేళ కాంచీపుర పల్లవరాజుల ఆధిపత్యము అప్పటి కింకను చెల్లుచుండిన నుండవచ్చును. ఎవ్వరి యాధిపత్యము చెల్లుచువచ్చినను దేశమును ప్రత్యక్షముగ పాలించు చుండినవారు బోయలు. వారి యధికారముక్రింది రాష్ట్ర మంతయు పండ్రెండు కొట్టములుగ విభజింపబడి యుండెను. కందుకూరు, నెల్లూరు అందలి ముఖ్యపట్టణములు; కట్టెంపు దుర్గము అను ప్రబలమైనకోట దానికి ఆయువుపట్టు. పూర్వము మూడవ విష్ణువర్ధనుని కాలమున ఈ బోయ రాష్ట్ర మంతయు పూర్వ చాళుక్యులకు లోబడి యుండినది. అప్పుడు పృథ్వీ వ్యాఘ్రుడను బోయదొర ఆ రాజ్యమును పాలించు చుండె ననియు, వానిని జయించి నందివర్మ పల్లవమల్లుని సేనాధిపతియైన ఉదయచంద్రుడు దానిని పల్లవ రాజ్యములో కలుపుకొనె ననియు ఇంతకుముందు చెప్పి యున్నది. ఈ రాజ్యము మరల స్వాధీనపరచు కొనుటకు ఉద్యమించి గుణగవిజయాదిత్యుడు తాను పట్టాభిషిక్తుడైన ప్రథమ వర్షమందే తన సేనాధిపతియైన పండరంగని సామంత పదవతోకూడ దండయాత్ర పంపెను. పండరంగడు ప్రభువుయొక్క ఆజ్ఞ చొప్పున దండు నడపుకొని బోయ కొట్టములపై కూచిచేసి పోయి కట్టెంపు దుర్గమును స్వాధీనపరచుకొనెను; బోయ దొరలను నిర్జించి వారి పండ్రెండు కొట్టముల రాష్ట్రమును ఆక్రమించెను; ఇట్లు తాను ఆక్రమించిన దేశమునకు కందుకూరును కేంద్రస్థానముగ చేసి దానిని బెజవాడవంటి పట్టణమును కావించెను. బోయ రాజ్యాక్రమణతో పండరంగడు తృప్తి నందలేదు; సైన్యముతో దక్షిణముగ సాగిపోయి నెల్లూరిని తగులబెట్టెను; పులికాటు పర్యంతముగల రాజ్యమును జయించి వశపరచు కొనెను. ఈ దండయాత్రకు ఫలితముగ వేంగీ చాళుక్యరాజ్యము దక్షిణమున తొండమండలము సరిహద్దు వరకును విస్తరించినది.

తరువాత గుణగ విజయాదిత్యుడు రాహణుడను వానితో యుద్ధము చేసి పరాజితుని కావించినట్లు శాసనములు చెప్పుచున్నవి. ఈ రాహణుడు ఎవ్వడో, అతడు ఏలిన రాజ్యము ఏదియో తెలియదు. పిమ్మట ఇతనికి రాష్ట్రకూటులతో ఘర్షణ కలిగినది. అప్పుడు ఆంధ్రదేశమునందు చాలభాగము రాష్ట్రకూట సామ్రాజ్యమునందు ఇమిడి యుండినది. ఇప్పటి రాయలసీమలోని అనంతపురము, కడప, కర్నూలు బళ్ళారి మండలములును, తెలంగాణా అశేషమును వారి యేలుబడిక్రింద ఉండినవి. సంకుచితమైన సాగరతీర రాష్ట్రమునందుమాత్రమే పూర్వ చాళుక్యాధికారము చెల్లుచుండెను. ఉభయ రాజ్యములకును ఘర్షణ ఏల కలిగెనో చెప్పుటకు సాధ్యము కాదు. తన యేలుబడిక్రింది రాష్ట్రమును విస్తరింప దలపెట్టి గుణగుడు రాష్ట్రకూట రాజ్యముపై ఎత్తిపోయిన పోయియుండ వచ్చును; కాదేని, అశేషాంధ్రావనిని కబళింప నుద్యుక్తుడై రాష్ట్రకూట చక్రవర్తి అమోఘవర్షుడు పూర్వచాళుక్య రాజ్యముపై దండుపెట్టినను పెట్టియుండవచ్చును. ఎట్లైన నేమి, ఉభయ రాజ్యములకును యుద్ధము పొసగినది. గుణగుని సైన్యము విజృంభించి 'స్తంభమును' నిర్మూలము కావించెను. 'స్తంభ' మనునది తెనుగు 'కంబము' నకు సంస్కృతీకరణము. ఈ కంబము కర్నూలు జిల్లాలోని కంభము కావచ్చును; లేక, తెలంగాణాలోని కంభము మెట్టు అయినను కావచ్చును. రెండును పూర్వచాళుక్య, రాష్ట్రకూటరాజ్యముల గడి ప్రాంతమందలి పట్టణములే. కంభమును గుణగ విజయాదిత్యుడు నిర్మూలించెనని తెలియ వచ్చినంతనే అమోఘవర్షుడు వేంగిమీదికి దండు పంపెను. వింగవల్లి అను గ్రామముచెంత రాష్ట్రకూట పూర్వచాళుక్య బలములు తారసిల్లినవి. ఉభయపక్షములకు భీకర యుద్ధము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



నడచెను. పూర్వచాళుక్యులకు పరాజయము కలిగెను; ఈ పరాజయమునకు ఫలితముగ గుణగ విజయాదిత్యుడు స్వాతంత్ర్యమును కోలుపోయి రాష్ట్రకూటులకు అరిగాపు కావలసివచ్చెను.

తరువాత కొంతకాలమునకు గుణగవిజయాదిత్యుడు అమోఘవర్షుని ఆదేశము చొప్పున గంగవాడిపై దండు వెడలెను. పశ్చిమ గాంగవంశజుడైన నీతిమార్గ రణవిక్రముడు దాక్షిణాత్య ప్రభువులను కొందరిని కూర్చుకొని అమోఘవర్షునిపై తిరుగబాటు చేసెను. విప్లవకారులను అణగగొట్టి గంగవాడిపై తన యాధిపత్యమును యథాపూర్వము నెలకొల్పుటకు అమోఘవర్షుడు ముకుళవంశజుడైన బంకెయ సల్లకేతనుని నిజమూలబలమునకు అధిపతిని కావించి పంపెను. బంకెయ సల్లకేతనుడు పరాక్రమవంతుడు; బంటుతనమందును, రణరంగమున వ్యూహరచనా కౌశల్యమునను అద్వితీయుడు. కావున, అతడు విద్వేషులను నేలకు గోలకు తెచ్చి కావేరిని దాటిపోయి వారి అటవట్టులను తన ప్రతాపాగ్నికి ఇంధనము కావింపగడగెను. అతడు విప్లవకారులను పూర్ణాహుతి చేయక ముందే రాష్ట్రకూట సామ్రాజ్యపు టుత్తరప్రాంతములలో మరియొక యల్లరి రేగినది. ఆ యల్లరిని అణచుటకొరకు అమోఘవర్షుడు బంకెయ సల్లకేతనుని సైన్యముతో పిలువనంపి, గంగవాడిలోని యుద్ధకార్యమును నెరవేర్చుటకు గుణగ విజయాదిత్యుని నియోగించెను. చక్రవర్తి యాజ్ఞానుసారము గుణగుడు దళములను కూర్చుకొని దండు వెడలెను. కాని, అతని పయనము నిర్నిరోధముగ సాగలేదు. గంగవాడిని చేరుటకు గుణక్కెవల్లాతడు నోలంబవాడిని దాటిపోవలసి యుండెను. ఆకాలమున నోలంబవాడిని పల్లవ వంశజుడైన మంగి నోలంబాధిరాజు పాలించుచుండెను. ఇతడు నీతిమార్గ రణవిక్రమునికి మిత్రుడు. మరియు వా రిరువురకును బంధుత్వము కలదు; కావున మంగి గుణగవిజయాదిత్యుని సేనలకు మార్గమీయక అడ్డగించెను. గొప్ప యుద్ధము జరగినది. మంగిని ఓడించుట దుర్ఘటమని తోచెను. కాని వినయదిశర్మ యను బ్రాహ్మణయోధుడు గుణగ విజయాదిత్యునికి మంగిని కూల్చుటకు తగిన మార్గము చూపెను. ఆ మార్గమును అనుసరించి గుణగాంకుడు మంగిపై గవిసి అతనిని సంహరించెను. వినయది శర్మయొక్క సహాయమును స్మరణయం దుంచుకొని గుణగ విజయాదిత్యుడు దండయాత్రను కొనసాగించి విజయముతో వేంగికి మరలి వచ్చినపిమ్మట అతనికి ఒక గ్రామమును అగ్రహారీకరించి ఇచ్చెను. మంగి నిహతుడైన పిమ్మట గుణగవిజయాదిత్యుడు గంగవాడిని ప్రవేశించి గంగకూటమును ఆశ్రయించి యుండిన గాంగ సైన్యమును ఓడించెను. ఈ విజయమువలన విప్లవకారుల వెన్నువిరిగెను. నీతిమార్గ రణవిక్రముడు అమోఘవర్షుని ఆధిపత్యమును అంగీకరించి సంధి చేసికొనెను.

గంగవాడి దండయాత్రనుండి మరలివచ్చిన పిమ్మట గుణగవిజయాదిత్యుడు ఏమి చేసెనో తెలియదు. శాసనము లనుబట్టి చూడగా అతడు అటుతరువాత కొన్నేండ్లవరకును యుద్ధకార్యములను తలపెట్టక శాంతముగ రాజ్యపాలనము నొనర్చినట్లు ఉన్నది. కాని అతని అంతిమ వర్షములలో రాష్ట్రకూటులతో అతనికి మరల పోరాటము కల్గినది. రాష్ట్రకూట చక్రవర్తి అమోఘవర్షుడు క్రీ. శ. 880 ప్రాంతమున లోకాంతరగతుడాయెను. అంతట అతని జ్యేష్ఠపుత్రుడగు ఇమ్మడి అకాలవర్ష కృష్ణభూపతి సింహాసనము అధిష్ఠించెను. ఇమ్మడి కృష్ణరాజుయొక్క రాజ్యాభిషేకముతో అంతకు పూర్వము కొన్నేండ్లనుండియు ప్రవర్తిలుచుండిన రాష్ట్రకూట, పూర్వచాళుక్య ప్రభువుల యొక్క మైత్రి చెడి వైమనస్యము ఏర్పడినది. ఈ మార్పునకు కారణము ఇదియని సునిశ్చయముగ చెప్పుటకు వీలులేదు. కాని, ఊహించుట అసాధ్యము కాదు. అమోఘవర్షుని మరణానంతరము గుణగ విజయాదిత్యుడు రాష్ట్రకూటుల ఆధిపత్యమును ఒప్పుకొనక నిజస్వాతంత్ర్యమును ప్రకటించియుండవచ్చును. అతనిని శిక్షించుటకై కృష్ణరాజు అతనిపై దండువెడలి యుండవచ్చును. ఈ దండయాత్రను గురించి తెలియవచ్చు విషయము అత్యల్పము. ఇమ్మడి కృష్ణరాజునకు తోడుగ సంకిలుడను నతడు యుద్ధమునకు నడచె ననియును, వారు ఇరువురు రణపరాజితులై పారిపోయి రనియును మాత్రము తెలియవచ్చుచున్నది. పైపేర్కొనిన సంకిలుడు డాహలాధిపతి; చేది హైహయ వంశజుడైన ప్రథమ కొక్కల్ల భూపాలుని అష్టాదశ పుత్రులలో జ్యేష్ఠుడు; మరియు కృష్ణరాజుయొక్క మరది. శంకరగణుడని ఇతని నామాంతరము; రణవిగ్రహుడనునది బిరుదు; ఇట్టి బల సంపన్నుని సాయమును పొందియు కృష్ణరాజు చాళుక్య బలములముందు నిలువజాలక పోయెను.

దక్షిణ దండయాత్ర: గుణగ విజయాదిత్యుడు రాష్ట్రకూట కృష్ణరాజుతో యుద్ధము చేయుచుండగా దక్షిణదేశ రాజకీయ పరిస్థితులు తారుమారు కావొచ్చినవి. అజ్ఞాత శత్రువు ఎవ్వడో మెండుకొని పై నెత్తిరాగా చోళుడు తెండువడి గుణగ విజయాదిత్యుని సహాయము అర్థించెను. గుణగుడు అతని వేడికోలును అంగీకరించి అతనిని శత్రువు కారినిఁపడనీయక కాపాడెనట. ఇట్లు గుణగుని సహాయము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చేదిన చోళుడు ఎవ్వడో, అతనిపై ఎత్తివచ్చిన శత్రువు ఎవ్వడో తెలియదు. ఆనాడు తెలుగు చోళవంశజులగు రాజులు ఆంధ్రదేశమునందు పలుతావుల రాజ్యము చేయు చుండిరి. వీరిలో నెల్ల రేనాడు పాలించుచుండిన చోళ రాజులు ముఖ్యులు. వారు వారికి ఇరుగు పొరుగు రాష్ట్రముల నేలుచుండిన వైదుంబ, నోలంబ, పశ్చిమ గాంగవంశ ప్రభువులతో అనవరతము యుద్ధము సేయుచు వచ్చిరి. శత్రువులకు ఓహటించి గుణగుని ఆశ్రయించిన చోళుడు ఈ రేనాటి తెలుగుచోళుడు కావచ్చును. కాని, అతడు ఒకవేళ ద్రావిడ చోళుడు అగునేమో అను సంశయము కలుగుచున్నది. తంజావూరి విజయాలయ చోళుని వంశము అప్పుడే దాక్షిణాత్య రాజకీయరంగ ములో ప్రాముఖ్యము వహించి తలచూపగడగినది. క్రీ. శ. 9వ శతాబ్ది తురీయపాదమున వర్ధిలిన మొదటి ఆదిత్య చోళుడు స్వాతంత్ర్య స్థాపనకు నడుముకట్టి, ఒకప్రక్క తమ యాధిపత్యమును నిలబెట్టుకొన ప్రయత్నము సల్పుచుండిన పల్లవులతోడను, మరియొకప్రక్క పరరాష్ట్రములను ఆక్ర మించి నిజరాజ్య విస్తారమును పెంపొందించు నుద్దేశ ముతో పైనెత్తుదెంచుచుండిన పాండ్యులతోడను పోరాడ వలసి యుండెను. పల్లవ, పాండ్య బలములను ఎదుర్కొన జాలక ఆదిత్యచోళుడు గుణగ విజయాదిత్యుని సహాయము రమ్మని వేడుకొని ఉండవచ్చును. గుణగు డతని కోరిక మేరకు దండు నడపుకొనిపోయి అతనిని శత్రువులబారిని పడనీయక రక్షించియుండవచ్చును. ఈయూహకు ఒక్కింత ఆస్పదము కలదు. మొదటి చాళుక్యభీముని అత్తిలి తామ్ర శాసనములో గుణగ విజయాదిత్యుడు పాండ్యులకడనుండి హేమమును, పల్లవులకడనుండి రజతమును హరించెనని చెప్పియున్నది. కావున గుణగుడు పాండ్యులకును, పల్లవుల కును ప్రతిపక్షి అగుట నిక్కము. అట్లగుటచే, వారికి విరోధి యైన ఆదిత్య చోళునకు ఈతడు తోడ్పడి యుండినను ఉండవచ్చును.

డాహల దండయాత్ర : గుణగ విజయాదిత్యుని యుద్ధ యాత్రలలో నెల్ల ఇది కడుప్రసిద్ధమైనది. నిజమునకు ఇమ్మడి కృష్ణ, సంకిలులతో అత డొనర్చిన యుద్ధమునకు ఇది తరువాయి. ఈ దండయాత్ర యందును గుణగుని ప్రతి పక్షులు ఆ కృష్ణ, సంకిలులే. కాని రణరంగము మాత్రము భిన్నమైనది. దీనికి సంబంధించిన యుద్ధకార్య మంతయు పూర్వ చాళుక్య, రాష్ట్రకూట ప్రభువుల యేలుబడిలో ఉండిన ఆంధ్ర కర్ణాట మహారాష్ట్రాది దక్షిణ దేశము లందు నడవక, నర్మదా భాగీరథుల మధ్య ఉండు డాహలదేశమునందు జరగినది. డాహల దేశము చేది హైహయ వంశజుల కాణయాచి. కొక్కల్లుని ప్రథమ పుత్రుడును, రాష్ట్రకూట ఇమ్మడి కృష్ణరాజు మరది యును, శంకరగణావరనామధేయుడును అగు సంకిలుడు అప్పుడు ఆ దేశమును ఏలుచుండెనని ఇంతకుముందు వివరింపబడి యున్నది. తనకు పొరుగున ఉండు ప్రధాన శత్రుడగు రాష్ట్రకూట కృష్ణుని రాజ్యముపై ఎత్తిపోక గుణగవిజయాదిత్యుడు సుదూరమున నుండిన కృష్ణుని మిత్రుడైన సంకిలుని రాజ్యముపై ఏల దండువెళ్లెనో నిశ్చయముగ తెలియదు. కాన్యకుబ్జ సామ్రాజ్యాధిపతు లైన గూర్జర ప్రతీహారులును, పూర్వ చాళుక్యులును ఏకమై యా రెండిండ్ల వారికిని సామాన్య శత్రువులైన రాష్ట్రకూటులపై ఒక్కుమ్మడి ఉరవడించిన ట్లున్నది. గుణగ విజయాదిత్యుని డాహలదండయాత్ర కాలముననే గూర్జరప్రతీహార వంశజుడును, కాన్యకుబ్జ సామ్రాజ్యాధి పతియు నైన మిహిరభోజుడు రాష్ట్రకూటుల ఏలుబడి క్రింద ఉండిన లాట, మాళవ దేశములపై దండెత్తివచ్చి ఇమ్మడి కృష్ణరాజును నర్మదాతీరమున ఓడించి పై రెండు దేశములను ఆక్రమించు కొనెను. ఇట్లు ఏకకాలమున రాష్ట్రకూట సామ్రాజ్యముపై నడచిన ఈ రెండు దండ యాత్రలకు ఒండొంటితో నెద్దియో సంబంధము ఉండి యుండవలయును. నీతిశాస్త్ర సమ్మతమైన మండల న్యాయముబడి రాష్ట్రకూటులకు గడి రాజ్యపాలకు లగుట వలన గూర్జర ప్రతీహార, పూర్వచాళుక్యులు ఒండొరులతో సఖ్యము కావించుకొని తమకు సామాన్య శత్రువులైన రాష్ట్రకూటులపై ఏకకాలమున దండు వెడలి యుండురని తోచుచున్నది. ఇందలి సత్యాసత్యములు ఎట్లుండినను రణ రంగమున ఇమ్మడి కృష్ణరాజునకు సర్వత్ర పరాజయమే కలిగెను.

గుణగ విజయాదిత్యుని డాహలదండయాత్రకు సంబంధిం చిన చరిత్రాంశములు పెక్కు పూర్వచాళుక్య శాసనము లందు వర్ణింపబడియున్నవి. వాని పూర్వోత్తర క్రమము అందువలన తేటపడకున్నను వాని నెల్ల క్రోడీకరించి ఆ దండయాత్ర నడకను సంగ్రహముగా ఇట్లు వివరింప వచ్చును. దండయాత్రను నడపిన సేనాధిపతి పండరంగడు; బోయ కొట్టములను జయించి వేంగీ చాళుక్య రాజ్యమును తొండ మండల పర్యంతమును వ్యాప్తినందించిన శూరాగ్రేసరుడు. అతని నాయకత్వము క్రింద పూర్వ చాళుక్యదళములు ప్రస్థాన భేరి చరచి తూర్పుకనుమలందలి లోయలగుండ చైత్రయాత్రకు వెడలినవి. మొట్టమొదట వారికి కళింగ గాంగులు అడ్డుపడిరి. కాని పండరంగడు వారిని పరాభూతు లను కావించి వారికడనుండి గజ రూప్యాదులను కానుకలుగ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తై కొని ముందునకు సాగిపోయి కనుమల యవ్వలి దేశమును ప్రవేశించి చక్రకూట దుర్గమును ముట్టడించెను. ఈ పట్టుననే కాబోలు వేములవాడ చాళుక్యుడు సోలదగండ బద్దెగడు గుణగవిజయాదిత్యుని ఎదుర్చవచ్చి పరాజితుడై శరణు చొచ్చినది. వేములవాడ చాళుక్యులు రాష్ట్రకూట చక్రవర్తులకు కులక్రమాగతులైన సామంతులు. వారి రాజ్యము తెలంగాణాలోని కరీంనగర మండలమునుండి మధ్యప్రదేశములోని బస్తరు పర్యంతము వ్యాపించి యుండినది. చక్రకూటముగూడ వారియేలుబడి క్రింద నుండెనేమో. ఎట్లైన నేమి, బద్దెగడు పూర్వ చాళుక్య వాహినిని అపజాలక పోయెను; చక్రకూట దుర్గము వారికి హస్తగత మాయెను. చక్రకూటము వశమైన పిమ్మట పూర్వ చాళుక్య సైన్యములు బయలు వెడలి దక్షిణ కోసలదేశమును ప్రవేశించెను. కోసలేంద్రుడు మార్గమును అరికట్టి వారిని మరల్ప తలపెట్టెను; కాని, అతని కడక సిద్ధింపదాయెను; రణరంగమున పరాభూతుడై మత్తేభములను సమర్పించి సంధి కావించుకొనవలసి వచ్చెను. మార్గమున కారసిల్లుచు వచ్చిన శత్రువులనెల్ల నిర్జించుచు పోయి పోయి చిట్టచివరకు చాళుక్యబలములు కిరణపురమును సమీపించెను. కిరణపురము డాహలాధిపుడగు సంకిలుని ముఖ్యపట్టణము. అప్పుడు అచట సంకిలుడు ఒక్కడే కాక రాష్ట్రకూట చక్రవర్తియగు ఇమ్మడి కృష్ణభూపతియు అతనితోకూడ నధివసించు చుండెను. చాళుక్య సేన వచ్చె ననువార్త చెవిసోకినంతనే వారి హృదయములు కలతచెందినవి. చాళుక్యసేనాధిపతియైన పండరంగని వారు ఎరుగుదురు. అతని కత్తిపోటును వారు ఇంతకు ముందు ఒక పర్యాయము రుచి చూచియుండిరి. కావున అతడు వచ్చిన పిమ్మట అచట తడయుట శ్రేయస్కరము కాదని గ్రహించి పట్టణమును త్యజించి పారిపోయిరి. వారు ఇట్లు దిశాపట్టులై పరువిడిన పిమ్మట పండరంగడు కిరణపురమును వశము చేసికొని పరశురామప్రీతి కావించెను. తరువాత డాహల, దళవాడు, విరుతము అను జనపదములను ప్రవేశించి పాడుచేసెను; అచటినుండి వరాటదేశమును చొచ్చి అచలపురమును తగులబెట్టెను. ఈ దండయాత్రయందు పండరంగడు శత్రువులను యుద్ధరంగమున ఓటుపరచి కొన్ని విజయములను పొందుటయే కాక కిరణపుర, అచలపురములను గాల్చుటవల్లను, ఇంతకు ముందు బోయకొట్టములపై దండయాత్ర నడపినప్పుడు నెల్లూరిని ఇష్టకరగులు కాల్పుటవల్లను ఇతని ఏలికయైన గుణగ విజయాదిత్యుడు త్రిపురమర్త్య మహేశ్వరుడను బిరుదము వహించెను.

డాహల దండయాత్రయందు గుణగ విజయాదిత్యునికి కృష్ణ, సంకిలులపై సంపూర్ణ విజయము చేకూడినది. తత్సూచకముగ అతడు రాష్ట్రకూట చక్రవర్తులవయిన పృథ్వీవల్లభ, దక్షిణాపథాధిపతి యను బిరుదులను వహించుటయే కాక సూర్య చంద్ర గంగా యమునా పాలిధ్వజాది సామ్రాజ్య చిహ్నములను గ్రహించి తానే యావద్దక్షిణ భారత భూమికిని అధినాథుడనని ప్రకటించెను. ఇమ్మడి కృష్ణరాజునకు వెన్నెముక విరిగినట్లయినది. చేయునది లేక గుణగ విజయాదిత్యునికి నమ్రుడై అతని విజయభుజ యుగ్మమును అర్చించి అతని మన్ననకు పాత్రుడాయెను. గుణగుడు అత్యంతముదితుడై రాష్ట్రకూట చక్రవర్తికి అతని రాజ్యమును బిరుదులను మరల నిచ్చి సత్కరించెను. ఇది కేవలము ఔదార్యము వలన నిచ్చిన ఈవి యనుకొన రాదు. రాష్ట్రకూట కృష్ణరాజు విజయాదిత్యునిచే పరాజితుడైనను అది తాత్కాలిక కారణములవలన కలిగిన ఓటమియే కాని సంపూర్ణ సత్వ వినాశమువలన కలిగినది కాదు; మిత్రులు అతనిని విడనాడలేదు; సామంతులు స్వామిభక్తిని విస్మరించి ద్రోహచింత తలపెట్టలేదు. కావున రాష్ట్రకూట చక్రవర్తికి బదులు తాను సామ్రాజ్యాధిపత్యము వహించి అధికారమును నిర్వహించుట దుర్ఘటమని గ్రహించి గుణగవిజయాదిత్యుడు అతని సామ్రాజ్యాధికారము అతనికే ఇచ్చివేసెను.

డాహలదండయాత్ర ముగిసిన పిమ్మట గుణగ విజయాదిత్యుడు చిరకాలము జీవించియుండలేదు. నలువది నాలుగేండ్ల కాలము రాజ్యము వహించి జరాభార పీడితుడై శకాబ్దము 814 (క్రీ. శ. 892) వ సంవత్సరమున అతడు దేహము చాలించిన ట్లున్నది. గుణగవిజయాదిత్యుడు పూర్వ చాళుక్యరాజులలో నెల్ల దొడ్డవాడు. అతని యేలుబడియందు వేంగీ చాళుక్య రాజ్య వైశాల్యము పరమావధులను తాకినది. అమోఘవర్ష చక్రవర్తిచే పరాజితుడై కొంతకాలము అతనికి లోబడి యుండవలసి వచ్చినను అతని మరణానంతరము నిజస్వాతంత్ర్యమును పునరుద్ధరించి అత్యంత దర్పముతో పృథ్వీపాలనము నొనర్చెను. బల పరాక్రమములచే రాష్ట్రకూట చక్రవర్తిని అథఃకరించి తనకు అరిగాపుగ చేసికొనెను; పూర్వ చాళుక్య సైనికుల రణశౌండత్వము వలన చండ చాళుక్యనామము భారతావనియంతటను మారు మ్రోగిపోయినది.

గుణగ విజయాదిత్యుని కార్యమునకును, ఖడ్గమునకును కర్తలై రాజకార్యములను, యుద్ధకార్యములను విజయవంతముగ నొనసాగించిన శూరులు కొందరు శాసనములందు పేర్కొనబడియున్నారు. వీరిలో కడియరాజును, అతని



http://sanskritcentral.com/

http://teluguthesis.com/




http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పుత్రుడైన పండరంగును మొట్టమొదట ఎన్నదగినవారు. పుట్టుకచే బ్రాహ్మణులయినను వేదాధ్యయనముతో పాటు ధనుర్వేదమును అభ్యసించి ఆయుధోపజీవులై రాజ సేవయందువలె దేశ సంరక్షణయందును పాటుపడి యసువులు ధారపోసి కీర్తి గడించిరి. కడియరాజు భట్టకాలుని యన్వయమున పుట్టెను. కడియరాజు అనునది వ్యక్త్యాత్మక మైన పేరు కాదు. కటకరాజను సంస్కృత శబ్దమునకు భ్రష్టరూపము. కటక మనగా సేన యని అర్థము; కటకరాజనగా సేనాధిపతి. కావున, ఇది ఉద్యోగ నామముకాని పురుష నామము కాదు. అతని వాస్తవమైనపేరు ఎద్దియో తెలియదు. అతడు గుణగుని సైన్యాధిపతియై పెక్కు యుద్ధములందు పోరాడెను. అసమాన ధైర్యశాలియైన ఆ బ్రాహ్మణ సేనాపతి తన ఏలిక ప్రక్కన నిలిచి యుద్ధము చేయుచు ఒకానొక రణరంగమున శత్రువులచే నిహతుడాయెను. తండ్రిని మించిన కొడుకు పండరంగు. ఇతడు సాటిలేని యోధుడు; మేటి దళనాయకుడు; సమకాలికులలో ఇతనితో జతకూర్చి చెప్పగల దండనాయకుడు లేడు. దక్షిణభారతదేశ మంతయు ఈతని ప్రతాప భానుమూర్తిచే దేదీవ్యమానమై వెలిగిపోయినది. ఆంధ్ర ద్రోణాశ్వత్థాములు అనదగిన ఈ యిద్దరేకాక మరికొందరు బ్రాహ్మణ వీరులుకూడ గుణగ విజయాదిత్యుని కొలువునందు ఉండిరి. వీరిలో వినయడిశర్మ ఒకడు. గంగవాడిపై దండయాత్రలో ఇతడు పాల్గొనెను. నోలంబాధిపతియగు మంగితో అయిన యుద్ధములో ఈతడు గుణగుని పక్షినుండి అతనికి మంగిని ఎట్లు వధింపనగునో తెలియజెప్పి అతని మన్ననకు పాత్రుడాయెను. మరియొక్క బ్రాహ్మణ యోధుడు రాజాదిత్యుడు. ఇతడు ద్రావిడదేశమందలి తొండమండల వాస్తవ్యుడు; తొండమండల ప్రభువైన కాడువెట్టికి సేనాధిపతియైన కుమారమూర్తి వంశమున జనించెను; గుణగవిజయాదిత్యుని శత్రువులను ఓడించి అపరిమితమైన ధనరాసులను తెచ్చి తన ప్రభువునకు సమర్పించెను.

గుణగ విజయాదిత్యుని రాజ్యకాలము ఆంధ్రవాఙ్మయ చరిత్రయందు ప్రథమ ఘట్టము. ఆంధ్రభాషా లతామతల్లిక అప్పుడె పుష్పింపదొడగినది. శాలంకాయనుల నాటి నుండియు శాసనములందు ఆంధ్రభాష అచట నచట పొడ కట్టుచు వచ్చినను క్రి. శ. 6వ శతాబ్దము వరకును దాని స్వరూపము విస్పష్టముగ తెలియరాకుండినది. రేనాటి తెలుగు చోళులయొక్కయు, వారి సమకాలికులైన మొదటి పూర్వ, పశ్చిమ చాళుక్య రాజులయొక్కయు శాసనము లందు దాని స్వరూపము ప్రథమమున చక్కగ వ్యక్తమైనది. పూర్వ చాళుక్యరాజులు కర్ణాటకులే యైనను కాల క్రమమున ః ॰రు మాతృభాషను విస్మరించి దేశభాషయైన తెలుగును ఆదరించి పోషించిరి. గుణగ విజయాదిత్యుని నాటికి పద్యరచన ప్రారంభమైనది. అతని సేనాధిపతియు, సచివోత్తముడునునైన పండరంగుని శాసనములందే తెనుగు పద్యములు మొట్టమొదట కన్పట్టుటవలన అతడే ఆంధ్రభాషాపోషకులలో ఆద్యుడని చెప్పవచ్చును. అతని అద్దంకి, కందుకూరు శాసనములను రచించిన అజ్ఞాత నామధేయులే ప్రథమాంధ్ర కవులు. నన్నెచోడ కవిరాజు 'చాళుక్యరాజు మొదలగు పలువురు' దేశికవితను పుట్టించి తెనుంగును అంధ్ర విషయంబున నిలిపిరని చెప్పియుండుట వలన పండరంగునితోపాటు గుణగ విజయాదిత్యుడును తెనుగున కవితోత్పత్తికి కారణభూతుడని చెప్పుట ఒప్పును. వారు నాటిన మొక్కనే తరువాతివారు పెంచి పెద్దదానిని చేసి క్రమక్రమముగ కావ్యోత్పత్తికి దారి చూపిరి.

**మొదటి చాళుక్యభీముడు** (క్రి. శ. 892 - క్రి. శ. 921): గుణగవిజయాదిత్యునికి సంతు లేదు. కావున, అతడు తన తమ్ముడైన విక్రమాదిత్యుని యౌవరాజ్య పదమునకు అభిషిక్తుని కావించి తనకు వారసునిగ అంగీకరించెను; కాని యువరాజ విక్రమాదిత్యుడు తన అన్న సజీవుడై ఉండగనే స్వర్గస్థుడాయెను. కాన, గుణగవిజయాదిత్యుడు అస్తంగతుడైనపిమ్మట యువరాజ విక్రమాదిత్యుని పుత్రుడైన మొదటి చాళుక్యభీముడు రాజ్యాధిపత్యమును వహించెను. కాని, పట్టాభిషేకము కాకమునుపే అతనికి కడగండ్లు సంప్రాప్తమైనవి. అతని అభ్యుదయమును సహింపని దాయాదులు కొందరు అతనిపై ద్వేషము వహించి రాష్ట్రకూట చక్రవర్తియైన ఇమ్మడి కృష్ణరాజును తమకు సహాయము రమ్మని వేడిరి. కృష్ణరాజునకు ఈ యాహ్వానము కరము ముదావహమైనది. గుణగ విజయాదిత్యునిచే తనకు కలిగిన పరాభవమును అతడు మరువ లేదు. అతడు గతించినను అతని వారసునిపై మూడు తీర్పు కొన 'ఉవ్విళులూరుచుండెను. కావున, అతడు గొప్ప సైన్యముతోకూడ వేంగిదేశముపై దండెత్తివచ్చి మంచికొండనాడు మొదలగు పశ్చిమ సీమలను ఆక్రమించెను. ప్రప్రథమమున రాష్ట్రకూటసైన్యము అడ్డమా॰లులేక విజృంభించినది. ఈ దండయాత్రయందు ॰॰ష్ట్రకూట కృష్ణరాజు సామంతుడైన లే(వే)ములవాడ చాళుక్య బద్దెగడు ప్రాముఖ్యము వహించి సమరాంగణమున తన పరాక్రమమును ప్రకటించి సోలదగండడను బిరుదనామమును అన్వర్థము కావించుకొనెను. కర్ణాటక కవిశిఖామణియైన ఆదిపంపడు భీముని 'నీటిలోని మొసలి పట్టినట్లు' పట్టివాడు అని బద్దెగని



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఉగ్గడించియున్నాడు. ఈ విషయమే ముమ్మడి అరికేసరి పర్భణి శాసనమునందును వచింపబడినది. సోలదగండనిచే పట్టుపడిన భీముడు మొదటి చాళుక్య భీముడనుటకు సంశయము లేదు. కాని, రాజు చేజిక్కినను రాజ్యమేమియు స్వాధీనము కాలేదు. కృష్ణరాజు ఆక్రమించుకొనిన మంచికొండ మున్నగు సీమలు ముదిగొండ చాళుక్యవంశజుడును, స్వామిభక్తి పరాయణుడును నైన కుసుమాయుధుడను సామంతరాజు పాలనక్రింద నుండెను. ఇతడు దళములను కూర్చుకొని చాళుక్య భీమునికి హితులగు మరికొందరు

ఇట్లు తై దండయాత్రయందు శృంగభంగమైనను ఇమ్మడి కృష్ణరాజు వేంగి విజయోద్యోగమును ఉజ్జగింపక మరియొకమారు దండెత్తి వచ్చెను. ఇది యతని మొదటి దండయాత్రకంటె కడు భీకరమైనది. ఈమారు రాష్ట్రకూట బలములు వేంగిరాజ్యము యొక్క గర్భమును చీల్చుకొని లోనికి ప్రవేశించినవి. కాని, చాళుక్య భీముడు సంచలింపక మొండిధైర్యముతో వారితో కయ్యము సాగించెను. ఉభయ పార్శ్వములకును పెక్కు తావుల పోరు జరగెను. అందు నిరవద్యపుర, పెరువంగూరుగ్రామ సంగ్రామములు



చిత్రము 81. భీమేశ్వరాలయము, చాళుక్యభీమవరము

దొరలతోగూడ రాష్ట్రకూటులకు మార్కొడ్డి హోరాహోరిగా పోరి విజయము పొందెను. ఈ సంగ్రామము జరగుచుండగా చాళుక్య భీముడు శత్రువుల బారినుండి తప్పించుకొనివచ్చి తన యనుచరులను కూడెను. తరువాత అతడు బలము గట్టి రాష్ట్రకూట దండయాత్రికులపై బడి వారిని పటాపంచలుచేసి శకాబ్దము 814 వ సంవత్సర చైత్ర బ. 2 సోమవారమునాడు పట్టాభిషేకము కావించుకొనెను; శత్రునిషూదనమునకు తోడ్పడిన కుసుమాయుధునికి అర్ధరాజ్యమిచ్చి సత్కరించెను.

ముఖ్యమైనవి. చాళుక్యభీముని పుత్రుడు, షోడశవర్షవయస్కుడైన ఇఱిమర్తి గండడు దివిజబలములకు తోడైన స్కందుని బోలి చాళుక్య సేనలకు తోడై శత్రువును తారపిల్లి నిరవద్యపుర రణక్షేత్రమున గజాశ్వధమర్ధరసంయుక్తమైన రాష్ట్రకూట సైన్యమును చీకాకు చేసి బారిసమరెను. పెరువంగూరుకడ మరల వారిని ఎదిర్చి వారి నాయకుడైన గుండ్యన దండనాయకుని వధించెను; లాటబలగమును రూపుమాపెను; శత్రువులతో ఏకీభవించి దేశద్రోహమునకు ఒడిగట్టిన దాయాదుల నేపడచెను. కాని, అభిమన్యుతుల్య



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పరాక్రముడైన ఈ రాకుమారుడు తండ్రి కిట్లు విజయమును చేకూర్చియు రణహతులైన శత్రువీరులను వెన్నడించిపోయి వీరస్వర్గము చూరగొనెను. విద్వేషులు పరాభూతులై చన్నవెనుక చాళుక్యభీముడు పుత్రునికి అంత్యక్రియలు చేసి అతని ఆత్మశాంతికై దానధర్మముల నొనర్చెను.

ఈ యవాంతరము గడచిపోయిన పిమ్మట దేశమున శాంతి నెలకొనెను. శత్రుబాధ లేకపోవుటవలన చాళుక్య భీముడు స్వస్థచిత్తుడై తన యావత్కాలమును రాష్ట్ర పాలనయందును, వాస్తు నిర్మాణ కార్యమునందును వినియోగించుటకు అవకాశము కల్గెను. ఇతని కాలమున జరగిన వాస్తు నిర్మాణములలో ముఖ్యమై గణుతి కెక్కినవి రెండు శివాలయములు. వానిలో చామర్లకోట సమీపమునుండు చాళుక్య భీమవరములోని భీమేశ్వరాలయము ఒకటి; దీనికంటె కడు ప్రసిద్ధమైన దాక్షారామ భీమేశ్వరాలయము ఇంకొకటి. ప్రభువు మార్గమును అనుసరించి సామంతులు కొందరు దేవాలయ నిర్మాణమునకు పూనుకొనిరి. వారిలో ప్రముఖుడు చట్టప అనునతడు. ఇతడు చాళుక్య భీముని 19 వ రాజ్యవర్షమున (క్రీ. శ. 910) బెజవాడయందలి ఇంద్రకీలాద్రిమీద శివాలయమును కట్టించి పార్థివేశ్వరస్వామిని అందు ప్రతిష్ఠించెను. చాళుక్య భీమునకు వాస్తునిర్మాణమునందే కాక లలిత కళలయందును అభిరుచి కలదు. గాంధర్వ, నాట్య విద్యలందు అతనికి అభిమానము మెండు. సమస్త గాంధర్వ విద్యావిశారదయగు చల్లవ అనువారవిలాసిని ఒకతె అతని యాస్థానమునందు వర్ధిలెను. చల్లవయొక్క తండ్రియైన మల్లప్పయు సంగీతమునందు ఆరితేరిన విద్వాంసుడే. ఆనాటి గాయన ప్రపంచమునందు అతడు తుంబురుడను ఖ్యాతి పొందెను.

చాళుక్యభీముని కాలమున సంగీతముతోపాటు సాహిత్యమును పెంపందెను. భట్టవామనుడను కవి ఒక్కడు చాళుక్య భీముని యాస్థానమును అలంకరించి యుండెను. ఇతడే సంస్కృతమున కావ్యాలంకార సూత్రము అను అలంకార గ్రంథమును రచించిన కవి అని కొందరు చరిత్రకారుల అభిప్రాయము. ఇతనికి కవి వృషభుడను బిరుదు కలదు.

చాళుక్య భీముని పుత్రులు ముగ్గురు శాసనములందు పేర్కొనబడియున్నారు. శూరశిఖామణియైన ఇఱిమర్తిగండడు ఒక్కడు. రాష్ట్రకూటులతో ఇతడు పెరువంగూరు రణరంగమున పోరి స్వర్గసీమ చేరెనని ఇంతకుముందే వివరింపబడినది. రెండవవాడు కొల్లభిగండ విజయాదిత్యుడు. మూడవవాడు విక్రమాదిత్యుడు. వీరి చరిత్రము ముందు వివరింపబడును.

చాళుక్య భీమునకు నాగిపోతి అను పెంపుడుతల్లి ఉండెను. ఆమె కూతురు గామకాంబ గర్భమున మహాకాలుడను పుత్రుడు పుట్టెను. శూరాగ్రగణ్యుడై ఇతడు చాళుక్య భీముని సేనలపై ఆధిపత్యము వహించి పలుతావుల అతని శత్రువులను సంహరించెను. మహాకాలునితోపాటు అతనికి ఖడ్గ సహాయులైన శూరులు మరికొందరు కలరు. వీరిలో ముదిగొండ చాళుక్యవంశోద్భవుడైన మొదట కుసుమాయుధుడు ప్రముఖుడు. ఇతడు మొదటి రాష్ట్రకూట దండయాత్ర సందర్భమున చాళుక్య భీమునకు ఎట్లు తోడ్పడినదియు ఇంతకు ముందే వివరింపబడియున్నది. మరియు ఇంద్రకీలాద్రిపై పార్థివేశ్వరుని ప్రతిష్ఠించిన చట్టప్పయు, నన్నినల్లాత బిరుదాంకితుడైన అయ్యపరాజును, అతని యనుజన్ముడగు బెజయరాజును, పండరంగని మనుమడును చాళుక్య భీముని సైన్యాధిపతియునైన కడియరాజును శాసనములందు పేర్కొనబడియున్నారు. కాని వారినిగూర్చి చెప్పదగిన విశేష చరిత్రాంశములు ఎవ్వియు లేవు. వీరుకాక రంగాధికక్కురుడను బ్రహ్మచారి కొకనికి చాళుక్య భీముడు తనకు ఖడ్గసహాయుడుగ నుండినందుకు పండిపాక యను గ్రామమును, దానికి సంబంధించిన యష్టాదశోపగ్రామములతోగూడ అగ్రహారీకరించి ఇచ్చెను. ఈ రంగాధికక్కురుడు ఏ సందర్భమున చాళుక్య భీమునకు ఖడ్గ సహాయ మొనర్చెనో తెలియదు.

ఇట్లు శత్రు నిబర్హణము కావించి ముప్పదియేండ్ల కాలము ప్రజాపాలనము నొనర్చి చాళుక్య భీముడు క్రీ. శ. 921 లో దేహము చాలించెను.

**మొదటి చాళుక్యభీముని తరువాతిరాజులు** (క్రీ.శ. 921 - క్రీ. శ. 945): మొదటి చాళుక్య భీముడు స్వర్గస్థుడైన పిమ్మట సజీవులై యుండిన ఇతని పుత్రులలో పెద్దవాడైన నాల్గవ విజయాదిత్యుడు సింహాసనమును అధిష్ఠించెను. ఇతడు శూరుడు. కొల్లభిగండ, కలియర్త్యంక, కలియర్తిగండ అనునవి ఇతని బిరుదులు. ఆరు మాసముల కాలము మాత్రము ఇతడు రాజ్యమును పాలించెను. అంతట కళింగదేశముపై దండువెడలిపోయి విరజకడ జయస్తంభమును ప్రతిష్ఠించి ఆ దండయాత్రయందే రణనిహతుడాయెను.

నాల్గవ విజయాదిత్యుని మరణానంతరము రాజ్యాధిపత్యము కొరకు వేంగిరాజ్యమున దాయాదుల పోరు ప్రారంభమై పండ్రెండు పదుమూడేండ్ల కాలము భీకరముగ సాగినది. నాల్గవ విజయాదిత్యునికి అమ్మరాజు, భీముడు అను ఇద్దరు పుత్రులు ఉండిరి. తండ్రి నిహతుడైన పిమ్మట అమ్మరాజు సింహాసనమును ఎక్కెను. ఆ పేరిటి రాజులలో



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఇతడు మొదటివాడు అగుట వలన ఇతనిని మొదటి అమ్మ రాజని చరిత్రకారులు పేర్కొనెదరు. విష్ణువర్ధన, రాజ మహేంద్ర అనునవి ఇతని బిరుదనామములు. రాజ్యమునకు వచ్చినంతటనె దాయాదులు ఇతనిని ధిక్కరించి విప్లవ పతాకమును ఎగయించిరి. వీరిలో ముఖ్యుడు అమ్మరాజ విష్ణువర్ధనుని పినతండ్రియైన రెండవ విక్రమాదిత్యుడు. మరియు ప్రకృతులు కొందరును, దళనాయకులును అమ్మ రాజునెడ విముఖులై విక్రమాదిత్యునితో ఏకీభవించిరి; కాని అమ్మరాజు వీరితో ఘోరముగ పోరాడి చిట్ట చివరకు విజయుడై రాజ్యమును అంతటిని తన అధికారము క్రిందికి తెచ్చుకొనెను. ఈ యుద్ధమున మొదటి చాళుక్యభీముని పెంపుడు చెల్లెలు గామకాంబ కుమారుడైన మహాకాలుడును, ఖండనాదిత్య నామాంకితుడైన కుంతాదిత్యుడును అమ్మరాజునకు ఖడ్గసహాయులై విజయమును చేకూర్చిరి. మహాకాలుని వృత్తాంతము ఇంతకు పూర్వమే ప్రస్తావింపబడినది. కుంతాదిత్యుడు కొల్లభిగండ విజయాదిత్యుని కొలువున నియోగాధికృతుడై ఉండెను. వీరి తోడ్పాటు వలన అమ్మరాజ విష్ణువర్ధనుడు దాయాదులను అణగగొట్టి ఏడేండ్ల కాలము ప్రజాపాలనము చేసి క్రీ. శ. 927-28 సంవత్సరమున మృతినొందెను. అతని అనంతరము బాలుడగు అతని కుమారుడు బేతలేక కంఠిక విజయాదిత్యుడు పట్టాభిషిక్తుడై యొక పక్షము దినములు ప్రభుత్వము సలిపెను. అతనిని పారద్రోలి గుణగవిజయాదిత్యుని తమ్ముడగు ప్రథమ యుద్ధమల్లుని పుత్రుడైన మొదటి తాళరాజు సింహాసనమును ఆక్రమించుకొని ఒక నెల దినములపాటు రాజ్యముచేసెను. ఇంతటనే రెండవ విక్రమాదిత్యుడు విజృంభించి యుద్ధమున తాళరాజును వధించి రాజ్యాధిపత్యము వహించి పదునొకండు మాసముల కాలము దేశమును ఏలెను. ఈ రెండవ విక్రమాదిత్యుని తామ్రశాసనము ఇటీవల ఒక్కటి వెలువడినది. ఇతడు శత్రువులతో ఎనిమిదేండ్ల కాలము నూరు రణరంగములందు పోరాడి తుదకు విజయుడాయె ననియు, సకలింగ వేంగీమండలము ఇతని ఏలుబడియందు ఉండె ననియు అందు చెప్పబడి యున్నది. ఇంతలో అమ్మరాజ విష్ణువర్ధనుని పుత్రుడైన భీముడు ఇతనిని చంపి ఎనిమిది నెలలు రాజ్యపదవిని అనుభవించెను. ఇట్లు వేంగి యందు దాయాదుల కలహము అవిచ్ఛిన్నముగ సాగుచుండగా మొదటి తాళరాజు పుత్రుడైన రెండవ యుద్ధమల్లుడు రాష్ట్రకూట రాజధానియైన మాన్యఖేటమునకు పోయి నాల్గవ గోవింద చక్రవర్తిని సాహాయ్యము అర్థించెను. వేంగి చాళుక్య రాజ్యమును హరింప తరివేచి యుండిన రాష్ట్రకూట చక్రవర్తికి అంతకంటె ముదావహకార్యము ఏమి కలదు? కావున అతడు యుద్ధమల్లునికి ధైర్యము చెప్పి సైన్యమును తోడిచ్చి వేంగి రాజ్యమును ఆక్రమించుకొమ్మని ఆదేశించి సాగనంపెను. యుద్ధమల్లుడు ఆ బలముతోకూడ వచ్చి పైని పేర్కొనిన భీముని కూలద్రోసి వేంగిపై తన ఆధిపత్యమును ప్రకటించెను. కాని, దేశ మంతయు అతనికి వశము కాలేదు. అతనికి ప్రాపై వచ్చిన రాష్ట్రకూట దళనాయకులును, శబర సామంతులును అతనికి లోబడి యుండక ఎవ్వరికి హస్తగతమైన రాష్ట్రమును వారే స్వతంత్రుల వలె పాలింపగడగిరి. వారిని దండించి తన యధికారమును నిరాఘాటముగ సాగింప గల శక్తి యుద్ధ మల్లునికి లేక పోయెను. దీనికితోడు దాయాదుల యాటోప మధికము కాజొచ్చెను. రాజమార్తాండ, కంఠిక విజయాదిత్య, రాజభీమాదులు అహమహమికతో విజృంభించి పెనగులాడ గడగిరి. కావున రాజ్యమున అంతటను అతని



చిత్రము 32. మల్లేశ్వరస్వామి ఆలయము, బెజవాడ

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అధికారమునకు చెల్లుబడి లేకపోయినది. శాసనసాక్ష్యమును బట్టి చూడగా రాజధానియైన బెజవాడయు, తత్పరిసర ప్రదేశము మాత్రము అతని పాలనక్రింద ఉండెనని తోచుచున్నది. ఏడేండ్ల కాలము ఇతడు వేంగిని పాలించినట్లు కొన్ని శాసనములందు కలదు. ఈ యేడేండ్ల కాలమును దాయాద సంగ్రామము అవిచ్ఛిన్నముగ సాగుచు వచ్చినది. ఈ సంగ్రామమున చిట్టచివరకు రాజభీముడు విజయుడై క్రి. శ. 934 వ సంవత్సరమున వేంగిరాజ్యమునకు అధిపతి యాయెను. ఇతడు రాజమార్తాండుని సంహరించెను; యుద్ధమల్ల, కంఠిక విజయాదిత్యులను ఓడించి దేశమునుండి పారద్రోలి క్రి. శ. 945 వరకు పండ్రెండు వర్షములు రాజ్యమును పాలించెను. చాళుక్య భీమాభిధులగు రాజులలో ఇతడు ద్వితీయుడైన కారణమున చరిత్రకారులు ఇతనిని రెండవ చాళుక్యభీముడు అను పేర వ్యవహరింతురు. దాయాదులను నిర్జించి రాజ్యమును సంపాదించుకొనినను, ఇమ్మడి చాళుక్యభీముని ప్రభుత్వము నిర్బాధకముగ సాగలేదు. యుద్ధమల్లుడు దేశత్యాగము చేసి పోయినను వేంగిపైని ఆశను విడువలేదు. రాష్ట్రకూటులు యథాపూర్వము అతనికి బాసటయై నిలిచి వేంగి సింహాసనముపై అతనిని పునఃప్రతిష్ఠితుని గావించుటకు ఘనప్రయత్నములు చేయగడగిరి. నాల్మడి గోవింద చక్రవర్తి క్రి. శ. 935 వ సంవత్సరమున రాజమయ్య అను దండాధిపతి నాయకత్వము క్రింద మత్తమాతంగములతో కూడిన ప్రచండ సైన్యమును పుత్తెంచెను. రాజమయ్యతో కూడ యుద్ధమల్లుడును, ధలిగ బిజ్జ, వటుది, తాతబిక్కి, లోవబిక్కి, అయ్యప మున్నగు రాష్ట్రకూట సామంతులు యుద్ధమునకు తరలి వచ్చిరి, కాని పరాజితులై మరలి పోయిరి. ఈ సమయమందే రాష్ట్రకూట సామ్రాజ్యమున సంభవించిన విప్లవము వలన తాత్కాలికముగా వేంగిపై వారి దండయాత్రలు ఆగిపోయినవి. అవల ఇమ్మడి చాళుక్య భీముడు నిర్బాధకముగ పృథ్వీపాలనము నొనర్చి క్రి. శ. 945 లో అస్తంగతుడాయెను. ఇమ్మడి చాళుక్య భీమునకు గండమహేంద్ర, రాజమార్తాండాది బిరుదులు కలవు. తరువాతివారు ఇతనిని తమశాసనములలో బృహద్భీముడని ప్రశంసించి యున్నారు. ఇమ్మడి చాళుక్య భీమునికి ఇరువురు భార్య లుండిరి. వారిలో ఊర్జవ అను నామాంతరము కల అంకిదేవి యొక్కతె. ఈమె కళింగ గాంగ వంశజ. ఈమెకు దానార్ణవుడను పుత్రుడు కల్గెను. లోకాంబిక మరియొకతె. ఈమె తెలుగు చోళుల యింటి యాడుపడుచు. ఈమె గర్భమున అమ్మరాజను కుమారుడు పుట్టెను. రెండవ చాళుక్య భీముని పుత్రులలో దానార్ణవుడు జ్యేష్ఠుడు; అమ్మరాజు కనిష్ఠుడు.

**అమ్మరాజ విజయాదిత్యుడు** (క్రి.శ. 945 - క్రి.శ. 970) : రెండవ చాళుక్య భీముడు గతించినపిమ్మట అతని ద్వితీయ పుత్రుడైన రెండవ అమ్మరాజు రాజ్యభారము వహించెను. ఇతడు విజయాదిత్యుడు అను అభిషేకనామమును స్వీకరించెను. పెద్దవాడైన దానార్ణవు డుండ కొండికయైన అమ్మనికి ఏల రాజ్యము సంక్రమించెనో తెలియదు. ఏదో యజ్ఞాతమైన కుటుంబ రహస్యము ఇందు నిగూఢమైనట్లు తోచుచున్నది. పట్టాభిషేక కాలమునందు అమ్మరాజ విజయాదిత్యుడు పండ్రెండేండ్ల యువకుడు. ఇరువదియైదేండ్ల కాలము ఇతడు రాజ్యమును పరిపాలించెను. ఈ యిరువది యైదేండ్లకాలమును మూడు ఘట్టములుగ విభజింపవచ్చును.

ప్రథమ ఘట్టము (క్రి. శ. 945 - క్రి. శ. 955): ఈ ఘట్టము యుద్ధమల్లునితోడి పోరాటముతో ప్రారంభమగుచున్నది. ఇమ్మడి చాళుక్య భీమునిచే నోడి పారిపోయిన యుద్ధమల్లు డతని మరణానంతరము అతని పుత్రుడు బాలుడగుట వలన, అతనిని సులభముగ నిర్జించి రాజ్యమును ఆక్రమించుకొనవచ్చునని ఎంచి దండెత్తివచ్చెను. కాని, అతడు అమ్మరాజుచే యుద్ధమున నిహతుడాయెను. అయినను అంతటితో అమ్మడు రాజ్యమున సుస్థిరుడు కాజాలక పోయెను. అమ్మరాజు పట్టాభిషేక మహోత్సవము జరిగిన వెంటనే యుద్ధమల్లుని కుమారులైన బాడప, ద్వితీయ తాళపులు రాష్ట్రకూట ముమ్మడి కృష్ణరాజును ఆశ్రయించి సైన్యసహాయమును పొంది వేంగిపై ఎత్తి వచ్చిరి; పెక్కురు సామంతులును, కులక్రమాగతులైన అధికారులును అమ్మరాజ విజయాదిత్యునిపై పగబూని రాజద్రోహమునకు ఒడిగట్టి వారిని కూడిరి. ఇట్లు శత్రుపక్షమును చేరిన రాజభృత్యులలో కటకరాజైన రెండవ పండరంగడును, కొలను పాలకుడైన గండనారాయణ బిరుదాంకితుడు నృపకాముడును ముఖ్యులు. ప్రధాన రాజభృత్యులు ఇట్లు రాజద్రోహమునకు పాల్పడి విముఖులైనను, అమ్మరాజు ధైర్యమును కోల్పోక శత్రువును ఎదిర్చెను. ఉభయపక్షములవారికి కొంత పోరాటము సాగినది. ఈ సందర్భమున నే కాబోలును పల్లవమల్లుని సంతతివాడును, మహాసామంతామాత్యుడును నైన మాకియరాజు బాడపరాజపక్షమున పోరుచు రణనిహతుడైనది. కాని, అమ్మరాజు ప్రతిపక్షులను ఎదుర్కొనజాలక పారిపోవలసి వచ్చెను. అమ్మరాజు దేశమును త్యజించి చనినపిమ్మట బాడపరాజు పట్టాభిషేకమును చేసికొని తమ్ముడైన తాళపరాజును



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సహాయ ముంచుకొని రాజ్యము చేయగడగెను. కౌండిన్య గోత్రోద్భవుడును, యశునకును కాంతమకును పుత్రుడును నైన మాధవశర్మ అను బ్రాహ్మణుడు బాదపరాజాస్థానమందు అమాత్యపదమును పొంది రాజ్యకార్యములను నిర్వహించుచుండెను. బాదపరాజు చిరకాలము రాజ్యము చేయలేదు. వేంగీ సింహాసనమును ఆక్రమించుకొనిన తరువాత స్వల్పకాలము ప్రజాపాలనము చేసి ఇతడు గతించినట్లు ఉన్నది. ఇతని అనంతరము ఇతని తమ్ముడైన తాళపరాజు సింహాసనము నెక్కి రాజ్యము చేయగడగెను. ఇంతలోనే రాజకీయ వాతావరణము మారెను. అమ్మరాజ విజయాదిత్యుడు విపక్షసామంతులను సమాధానపరచి, కొలని ప్రభువైన నృపకామ గండనారాయణుని కుమార్తె యగు నాయమాంబను పెండ్లాడి అతనిని తనకు సహాయునిగ చేసికొని దళములను కూర్చుకొని తాళపరాజుపై యుద్ధమునకు బయలు వెడలెను. యుద్ధమున తాళపరాజు నిహతుడు కాగా అమ్మరాజు వేంగీరాజ్యమును మరల స్వాధీనపరచుకొని యథాపూర్వము రాజ్యము చేయదొడగెను.

రెండవ ఘట్టము (క్రీ. శ. 955-56): రెండవ తాళపరాజు మరణముతో దాయాదులపోరు సమాప్తమాయెను. కాని, అంతటితో అమ్మరాజునకు శత్రుబాధ తొలగలేదు. అతని పండ్రెండవ రాజ్యవర్షమున రాష్ట్రకూట ముమ్మడి కృష్ణచక్రవర్తి వేంగీరాజ్యముపై ఎత్తి వచ్చెను. ఈ దండయాత్రకు కృష్ణభూపతియొక్క రాజ్యతృష్ణ తప్ప అన్యకారణము ఎద్దియు కానరాదు. అతని ప్రతాపము అప్పుడు మధ్యందిన మార్తాండుని ఉగ్రతేజమువలె దుస్సహమై వెలుగొందు చుండెను. మరియు అతడు దండమునకు తోడు భేదమును కూడ అవలంబించి అమ్మని వైమాత్రేయుడైన దానార్ణవుని హృదయమున మన్మానసరెక్కొలిపి తనకు వశవర్తిని కావించుకొనెను. అమ్మరాజు కృష్ణుని ఎదుర్కొనజాలక కళింగమునకు పారిపోయెను. కృష్ణరాజు అంతట కృష్ణానదికి దక్షిణమున ఉండు కమ్మనాటిని తన సామ్రాజ్యమున కలుపుకొని కౌండిన్యగోత్రోద్భవులైన నాగమయ్య అను జైనబ్రాహ్మణుని పుత్రులు మల్లపయ్య, పొన్నమయ్య అను వారలను దానికి అధిపతులుగ నియమించి తక్కిన వేంగీ రాజ్యమును దానార్ణవునికి ప్రసాదించి చనియెను. కృష్ణరాజు సైన్యములను మరల్చుకొని పోయినపిమ్మట అమ్మరాజు కళింగమునుండి మరలి వచ్చి వేంగిని స్వాధీనము చేసికొనెను.

**మూడవఘట్టము** (క్రీ. శ. 970): అమ్మరాజు కళింగమునుండి ఎప్పుడు మరలి వచ్చి వేంగిని వశపరచుకొనెనో నిశ్చయించి చెప్పుటకు వీలులేదు; కాని కడపటిరోజులలో అతడు స్వాధికార నిర్వాహార్థము కత్తిని దూయవలసి వచ్చెను. నల్ల రుచిగన్న పెద్దపులివలె అతని సవతి అన్నయైన దానార్ణవుడు రాజ్యమును ఆక్రమించుటకు ఉద్యమించి, అతనిపై తిరుగబాటుచేసి పోరాడగడగెను. ఈ పోరాటమును గూర్చిన విశేషాంశములు ఎవ్వియు తెలియరావు. మొదటిశక్తివర్మయొక్క పెన్నేరు శాసనమందు దానార్ణవుడు అమ్మరాజును వధించి, రాజ్యమును ఆక్రమించినట్లు చెప్పియుండుటవలన పైజెప్పిన యుద్ధమున అమ్మరాజు నిహతుడాయె ననియు, అంతట దానార్ణవుడు రాజ్యాధిపత్యమును వహించె ననియు ఎంచదగియున్నది.

అమ్మరాజు రాజ్యమును పాలించిన ఇరువదియైదేండ్లలోను అతని అధికారము నిరవధికముగ సాగలేదు. రెండు పర్యాయములు రాజ్యభ్రష్టుడాయెను. రెండుమారులును పోయినరాజ్యమును తనశక్తిసామర్థ్యములవలన మరల సంపాదించుకొనెను; కాని చిట్టచివర రాజ్యమునకై సవతి సోదరునితో పెనగులాడుచు అసువులు కోల్పోయెను. రాజ్యాభిషేక కాలమునకు అతని వయస్సు పండ్రెండేండ్లు. రాష్ట్రకూట దండయాత్రయపుడు అతడు ఇరువదిమూడేండ్లయువకుడు. నిండుయౌవనమున ముప్పదియేడవ వర్షమున అతడు వీరస్వర్గమును చూరగొనెను. అమ్మరాజు భయమెరుగని జోదు; రణలాలసుడు; గజశాస్త్రపారగుడు; ఏనుగులను యుద్ధమునకు తర్ఫీదుచేయుటయందును, వానిని రణరంగమున నడపి పోరుటయందును నేర్పరి. కార్యఖడ్గములందు ఇతనికి తోడ్పడిన అధికారులు కొందరు ఇతని శాసనములలో పేర్కొనబడియున్నారు. కొలని యధిపతియగు నృపకాముడు ఒక్కడు; కటకరాజు విజయాదిత్యుని కుమారుడైన దుర్గరాజు మరియొకడు. మిత్రాయువంశజుడును సామంతామాత్యుడును ఐన కుప్పన ఇం కొకడు; వీరు కాక సువర్ణ భాండాగార శ్రీకరణ ముఖ్యుడైన కోరిమియయు, యువరాజ బల్లాలదేవుడును స్మరింపదగినవారు. మతవిషయములందు అమ్మరాజు విశాలహృదయుడు. శైవ, జైన సమయములు రెంటిని సమానముగ ఆదరించి దేవాలయాదులను కట్టించి వానియందు పూజా పురస్కారములు నడపుటకు తగిన ఏర్పాటులు కావించెను.

**దానార్ణవుడు, చోళభీముడు** (క్రీ. శ. 970 - క్రీ. శ. 1002): అమ్మరాజును చంపి రాజ్యమును ఆక్రమించుకొన్నను దానార్ణవుడు మూడేండ్లకంటె ఎక్కువ కాలము రాజ్యము చేయజాలక పోయెను. రావణప్రతిమ పరాక్రముడని పేరందిన జటాచోడ భీముడు విజృంభించి రణరంగమున దానార్ణవుని పరిమార్చి అతని పుత్రులను దేశమునుండి

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తరుమగొట్టి వేంగి కళింగములను రెంటిని ఇరువదియేడేండ్లు అవక్రపరాక్రమముతో పాలించెను. చాళుక్యుల యధికారము ఈ కాలమున రాహుగ్రస్తమగుటవలన అర్వాచీన పూర్వచాళుక్యశాసనములందు ఇది అరాజక, లేక అనాయక సమయముగ పరిగణింప బడెను. ఈ జటాచోడ భీముడు ఎవ్వడు, అతడు దానార్ణవుని చంపి పూర్వచాళుక్య రాజ్యమును ఎట్లు స్వాధీనపరచు కొన గల్గెను అను ప్రశ్నలు ప్రథమమున సమాధానమును కోరుచున్నవి. ఈ జటాచోడ భీముడు కాంచీపుర కైలాసనాథ స్వామి ఆలయమున తన విజయాంక మాలికను శిలాక్షరముల చెక్కించి శాసనమును నిల్పియున్నాడు. శాసనము శిథిలావస్థయం దున్నను అందు మూలమున ఇతని వృత్తాంతము కొంత తెలియవచ్చు చున్నది. భీముడు తెలుగు చోళవంశజుడు; ఇప్పటి కర్నూలు మండలమందలి పెదకల్లు వాస్తవ్యుడు; జటాచోడు డనురాజునకు ఇతడు కొడుకైనను, మనుమడైనను కావచ్చును. ఇతని తల్లి పూర్వచాళుక్యుల ఇంటి ఆడుపడుచు: గుణగాంక విజయాదిత్యుని తమ్ముని కొడుకగు మొదటి చాళుక్య భీముని పుత్రుడైన కొల్లభిగండ విజయాదిత్యుని యొక్క కుమారిత. భీమునికి ఒక భగిని కలదు; ఆమె వృత్తాంతమును వివరించి చెప్పు సందర్భమున అతడు ఆంధ్రదేశము 'న్వభగినీపథము' అని చెప్పియున్నాడు. కావున ఆమె ఆంధ్రదేశ పాలకుడైన అమ్మరాజ విజయాదిత్యుని రాణియై ఉండనోపు. అగునేని, చెలియలి భర్తను వధించి అతని రాజ్యమును సంహరించిన దానార్ణవుని దండించుటకై అతడు ఎత్తివచ్చెనని అనుకొన వచ్చును. ఏ కారణమువలననైననేమి అతడు ఎత్తివచ్చి దానార్ణవుని రాజ్యచ్యుతుని చేయ కంకణము కట్టుకొని యుద్ధమును ప్రారంభించెను. దాదాపు మూడేండ్లపర్యంతము పోరు ఘోరముగ సాగినది. యుద్ధవివరములు నిశ్చయముగ తెలియవు. కాని, యీ పట్టున చింతింపదగిన యంశము ఒక్కటి కలదు. దానార్ణవుని జ్యేష్ఠపుత్రుడైన మొదటి శక్తివర్మ తాను శైశవమున చౌళిక, లేక ద్రామిళ యుద్ధమునందు పరాక్రమ ప్రదర్శనముచేత కీర్తిని గడించితినని చెప్పకొని యున్నాడు. ఈ చౌళిక లేక ద్రామిళ యుద్ధమునుగూర్చి పలువురు పలువిధముల వ్యాఖ్యానములు వ్రాసియున్నారు. ఒకవేళ శక్తివర్మ విక్రమించిన చౌళిక లేక ద్రామిళ యుద్ధము చోడభీమునితో చేసిన యుద్ధమయి యుండినను ఉండవచ్చును. శక్తివర్మ ఎంత శౌర్యము చూపి పోరాడినను లాభము లేకపోయెను. చిట్టచివరకు దానార్ణవుడు పరాజయమును పొంది రణభూమిని అసువులను కోల్పోయెను. శక్తివర్మయును, అతని యనుజుడగు విమలాదిత్యుడును దేశమున నిలువలేక దేశాంతరగతులైరి.

దానార్ణవుడు వధింపబడినను వెంటనే వేంగిరాజ్యము సమస్తమును చోడభీమునకు హస్తగతము కాలేదు. సామంతులును, సామాన్య ప్రభువులును అతని యధికారమును అంగీకరింపక మారొడ్డిరి. సామంతులలో ముఖ్యుడు వైదుంబాధిపుడైన భువన త్రినేత్రుడు. ఇతడు నిజకులక్రమానుగతమైన రాష్ట్రమునేకాక తెలుగు చోళులదైన రేనాడుదేశమును కూడ జయించి క్రీ. శ. 972 వ సంవత్సరమున రాజ్యాభిషేకము కావించుకొనెను. వైదుంబ, తెలుగు చోళవంశములకు గల సహజవైరమువలన అతడు చోడభీముని అభ్యుదయమును సహింపక ధిక్కరించినట్లు ఉన్నది. అతనిని శిక్షించుటకై చోడభీముడు దండు వెడలగా ఇరుపక్షములకును సంగ్రామము సంప్రాప్తమాయెను. యుద్ధ వివరములు తెలియవు; కాని, కైలాసనాథస్వామి యాలయ శాసనమున చోడభీముడు వైదుంబ ప్రభృతిరాజ రాజన్యరాజిత పీఠస్థుడని చెప్పియుండుటవలన అతడు భువనత్రినేత్రుని జయించి ఆజ్ఞాబద్ధుని కావించుకొనెనని నిష్కర్ష అగుచున్నది. మరియు మధ్య కళింగమందలి పర్వత ప్రాంతము దుర్గమారణ్య సంఛన్నమై స్వాతంత్ర్య ప్రియులైన దొరలకును, వన్యజాతులకును ఆటపట్టయి ఉండెను. ఈ పర్వతారణ్యదేశమున కప్పుడు 'మాన్యము' అనిపేరు. 'మాన్య' జనులను అధికారబద్ధులను చేసికొనుట కొరకు పూర్వచాళుక్య రాజులు ప్రత్యేక పాలన విధానమును అవలంబించవలసివచ్చెను. రాజభక్తి గల తమ క్రింది నాయకులకును దొరలకును 'మాన్య' ప్రాంత దేశములందు భూములను ఇచ్చి అచ్చట నెలకొలుపువారు. మరియు రాజ కుటుంబమునకు చెందిన శాఖ ఒక్కటి 'మాన్య' ప్రదేశమును నెలవీడు కావించుకొని అధికారము నెరపుచుండెను. కావున, 'మాన్య' జనులు చాళుక్య పక్షమువారై పోటు చూపిరి. కాని, భీముడు పట్టుదలతో పోరాడి వారిని లోబరచుకొనెను. 'మాన్యదేశ' విజయము ఉత్తర కళింగ దండయాత్రకు దారితీసినది. అప్పుడు అచట రాజ్యము చేయుచుండిన పూర్వగాంగవంశమునకును, వేంగి పూర్వ చాళుక్య రాజవంశమునకును సంబంధ బాంధవ్యములు చెల్లుచుండినవి. రెండవ చాళుక్యభీముని రాణులలో ఒక్కతెయు, దానార్ణవుని తల్లియు అగు ఊర్జప అను నామాంతరము కల అంకిదేవి పూర్వ గాంగుల యింటి ఆడుపడుచని ఇతఃపూర్వము వచింపబడియున్నది. కావున, పూర్వగాంగ వంశాధిపతియైన కామార్ణవుడు దానార్ణవుని మరణానంతరము అతని పుత్రులైన ప్రథమ శక్తివర్మ,



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



విమలాదిత్యులను చేరదీసి వారిని వంశక్రమాగతమైన వారి రాజ్యమున పునఃప్రతిష్ఠితులను చేయుటకు సంసిద్ధుడాయెను. కావున, వేంగియందు తన యధికారమును స్థిరపరచుకొనుటకొరకు చోడభీముడు కళింగ గాంగులపై దండు వెట్టవలసి వచ్చెను.

కళింగ దండయాత్ర సత్వరముగ ముగియలేదు. పర్వతమయమగుటవలన దేశము చోడునికి సులభసాధ్యము కాదాయెను; మరియు కామార్ణవుడు బలముకట్టి ప్రకృతిజన్య శైల వన పాషాణాది దేశసంరక్షణ వర్గమును ఆశ్రయము చేసికొని పట్టుదలతో యుద్ధము సాగించెను. ఆరేండ్ల పర్యంతము పోరి క్రీ. శ. 977 లో కామార్ణవుడు నిహతుడాయెను. అతని వెనుక అతని తమ్ముడయిన వినయాదిత్యుడు రాజ్యభారము వహించి మరి మూడేండ్లదాక యుద్ధముచేసి అన్నను పోలి తానును వీరస్వర్గమును చూరగొనెను. అంతట పూర్వగాంగులకు వెన్ను విరిగిపోయెను. వారు చోడభీమునికి పాదాక్రాంతులై అతని ఆధిపత్యమును అంగీకరించిరి. ఈ విజయములవలన అతడు సకళింగ తీరాంధ్రధారుణికి అంతటికిని ఒడయడాయెను. వేంగీ రాజ్యము మహేంద్రగిరినుండి కాంచీపురము వరకును, తూర్పు సముద్రమునుండి కర్ణాటరాజ్యపు గడిప్రాంతముల వరకును వ్యాపించెను. సువిశాలమైన ఈ రాజ్యమును అతడు ఇరువది యేడేండ్లకాలము దర్పముతో పాలించెను. కాని, అంత్య దశయందు శత్రువులు విజృంభించి పైకవియగా ఆత్మ సంరక్షణార్థము అతడు మరల కత్తిని చేబట్టి యుద్ధకార్య నిమగ్నుడు కావలసివచ్చెను.

దానార్ణవుని మరణానంతరము అతని పుత్రులయిన శక్తివర్మయు, విమలాదిత్యుడును దేశమునుండి పారిపోయి పరరాష్ట్రములలో తల దాచుకొనిరి. వీరి ప్రవాస చరిత్ర విశదముగ తెలియరాదు. కళింగమున కొంతకాలము అధివసించుచుండిరేమో. చోడభీముడు ఆదేశమును జయించిన పిమ్మట అచట నుండుటకు వలను కాకపోవుటవలన అచటినుండి చోళ మండలమునకేగి తద్దేశ పాలకుడైన చోళరాజును ఆశ్రయించి అతని రాజధానియైన తంజావూరికి సమీపమున ఉండు తిరువైయ్యారు గ్రామమున నివాసము ఏర్పరచుకొని యుండిరి. ఇట్లుండగా చోళమండలమునకు అరమొళివర్మ నామాంతరుడైన మొదటి రాజరాజు పట్టాభిషిక్తుడాయెను. రాజరాజు ప్రభుమంత్రోత్సాహశక్తులు గల దొడ్డరాజు; బలపరాక్రమసంపన్నుడు; రణప్రియుడు; ఉదారాశయుడే కాని, ఘనరాజ్య తృష్ణాపరిపీడితుడు; దక్షిణ భారతమును అంతటిని జయించి ఏకచ్ఛత్రాధిపతియై ఏల నిచ్ఛ గలవాడు. ప్రథమముమండియు అతని దృష్టి వేంగిపై బర్విసది. కాని, దానిని తన పలుబడిక్రిందికి తెచ్చుకొనుట సులభసాధ్యము కాదు; జయింప సమకట్టిన అందలి ప్రజలును, పాలకులును ఏకమైన యత్నమును కొనసాగనీయక భంగపెట్టవచ్చును. మరియు వేంగీదేశాధిపతియైన చోడభీముడు సామాన్యుడు కాడు; పెక్కు రణరంగములందు ఆరితేరిన యోధుడు; సుప్రసిద్ధ దళనాయకుడు. ఇంతియ కాదు; వేంగీ పరిసర ప్రాంతభూములను ఏలు ప్రభువులు చోళాభ్యుదయమును సహింపరు. రాష్ట్రకూటుల సామ్రాజ్యము విచ్ఛిన్నమైపోయినను, వారి స్థానమును ఆక్రమించుకొనిన కల్యాణి చాళుక్య నృపాలురు తమకు బద్ధశత్రులైన చోళులు తమ పొరుగున ఉండు వేంగీదేశమును ప్రవేశించుటకు ఒప్పుకొనరు. కావున వేంగిని సాధించుటకు బాహుబలముకంటె తంత్ర ప్రయోగమే అధికతర ప్రయోజనకారి యని అతడు నిశ్చయించెను. కావున అతడు వేంగీరాజ్యమునకు వారసులైన దానార్ణవుని పుత్రులను చేరదీసి వారిలో జ్యేష్ఠుడైన శక్తివర్మకు సైన్యము ఇచ్చి వేంగిపై ఎత్తిపోయి పిత్ర్యమైన రాజ్యమును జయించి స్వాధీనము చేసికొమ్మని పంపెను. కనిష్ఠుడైన విమలాదిత్యునికి తన ప్రియ పుత్రికయగు కుందవ్వ నిచ్చి ఉద్వాహము చేసి, మైత్రితో బంధుత్వమును పెనవెట్టి ఉభయ కుటుంబముల బంధమును బలవత్తరము కావించెను.

రాజరాజచోళుడు ప్రయోగించిన రాజనీతి విఫలము కాలేదు. చాళుక్య రాజకుటుంబముపైన అభిమానము గల స్వామిభక్తిపరాయణులైన ఆంధ్రులు పెక్కురు శక్తివర్మ యొక్క రాకకు సంతసించి అతనికి ప్రత్యక్షముగనో, పరోక్షముగనో తోడ్పడుటకు సంసిద్ధులైరి. ఇందువలన చోడభీముని బలము కొంత డిందువడినది. పూర్వచాళుక్య శాసనములనుబట్టి చూడగా శక్తివర్మ చోడభీముని, అతని యనుచరులను ఏకఘాటియందు వధించి, క్రీ.శ. 999 - 1000 నుండి పంద్రెండేండ్లు రాజ్యమును పాలించినట్లు తెలియుచున్నది. కాని, శక్తివర్మకు అంతసులభముగను, సత్వరముగను విజయము సిద్ధింపలేదు. చోళసైన్యములు బాసటయై నడవగా శక్తివర్మ వేంగిపై దండువెడలి ఒకటి రెండు పర్యాయములు చోడభీముని యుద్ధమున ఓడించి అతని అనుచరులను కొందరిని వధించి క్రీ. శ. 999 - 1002 లో వేంగిని ఆక్రమించుకొనెను. భీముడు చోళసైన్యముల కోహటించి పర్వతారణ్యమయమైన కళింగ ప్రాంతమును చేరి మరల బలమును సమకూర్చుకొని పురోగమించి శక్తివర్మపై కవిసెను. సంగరాంగణమున శక్తివర్మను, అతనికి ప్రాపైన చోళ బలములను నిర్జించి వారిని వెన్నడించి తరుముచు

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కంచి పర్యంతము పోయి, అచట క్రీ. శ. 1002-8 లో జయస్తంభమును ఎత్తించెను. ఈ పరాజయవార్త చెవికి సోకినంతటనే కుపితుడై రాజరాజు తన పుత్రుడును, పంచవన్మారాయ బిరుదాంకితుడును అయిన రాజేంద్ర చోళుని యొక్క నాయకత్వముక్రింద మరియొక సేనను చోడభీముని మీదికి పంపెను. ఈ దండయాత్ర విజయవంతముగ కొనసాగినది. యుద్ధవృత్తాంతమును విశదముగ వివరింపక పోయినను జటాచోడ వృక్షమును సమూలముగా పెకలించివైచితినని శక్తివర్మయు, రంధ్రరహితుడైన ఆంధ్రభీముని దండముచే వధించితినని చోళచక్రవర్తి యగు రాజరాజచోళుడును తమ శాసనములలో చెప్పుకొనియున్నారు. ఇందువలన ఈ దండయాత్రయందు చోడభీముడు నిహతుడాయెనని వ్యక్తపడుచున్నది.

జటాచోడభీముడు వేంగిని పాలించిన రాజులలో అగ్రశ్రేణికి చెందినవాడు. గుణగవిజయాదిత్యుని తరువాత ఇంతటి దొడ్డరాజు మరియొక్కడు వేంగీ సింహాసనమును అధిష్ఠించి యుండలేదు. అతని పరాక్రమాతిశయమునకు అతనిచే పరాజితులైన రాజులే సాక్షులు. అతని కాలమున వేంగీ రాజ్యవైశాల్యము అతిశయించి దాని మేరలు పరమావధులను దాకినవి. పాలనసామర్థ్యమును అతని దీర్ఘరాజ్యకాలమే రుజువుచేయుచున్నది. చోడభీముడు శైవుడు; పరమమాహేశ్వరుడు. దాక్షారామాది శివాలయములకు ఇతడు చేసిన దానములు కైలాసనాథస్వామి యాలయమున వర్ణింపబడి యున్నవి. అరవలిపియందు విలిఖింపబడి యున్నను తెనుగు సీసపద్యము ఒకటి ఆ శాసనాంతమున కానవచ్చుచున్నది; ఇందువలన జటాచోడ భీముడు గుణగవిజయాదిత్య, యుద్ధమల్లాది పూర్వచాళుక్య రాజులవలెనే ఆంధ్రభాషయందు అభిమానము కలిగి తెలుగు కవితను పోషించెనని తెలియవచ్చుచున్నది.



చిత్రము 88. భీమేశ్వరాలయము, దాక్షారామము, లోపలి భాగము.

**మొదటి శక్తివర్మ (క్రీ. శ. 999-1000 - క్రీ. శ. 1011):** శక్తివర్మ మీద వివరించినట్లు చోళసహాయము వలన మరల వేంగియందు అడుగిడి పితృపైతామహమైన సింహాసనమును అధిష్ఠింపగల్గెను; కాని; అతడు ఏలవచ్చిన వేంగి మునుపటివలె స్వతంత్రరాజ్యము కాదు. జటాచోడ భీముని నిర్యాణముతోడనే దాని స్వాతంత్ర్యము ఎడసిపోయినది. దేశస్వాతంత్ర్యమును వెలగా ఇచ్చి శక్తివర్మ చోళసాహాయ్యమును పిలిచెను. అది మొదలుకొని వేంగి చోళచక్రవర్తుల ఆధిపత్యము క్రింది సామంతరాజ్యములలో ఒక్కటిగ పరిగణింపబడుచు వచ్చెను. అన్యసామంతులకంటె వేంగీశ్వరుడు స్వరాష్ట్రపాలన విషయమున ఎక్కుడు స్వేచ్ఛను అనుభవించుచుండినను, రాష్ట్రేతర వ్యవహారములలో అతడు చోళచక్రవర్తి ఆజ్ఞను ఔదల ధరించి అతనికి వశవర్తియై మెలగవలసినవాడాయెను. ఇతఃపరము అతడు పరాయత్తుడే కాని స్వాయత్తుడు కాజాలడాయెను. ఈ యంశము స్మరణయందు ఉంచుకొనదగినది.

చోళచక్రవర్తి ప్రాపు కల్గినను శక్తివర్మయొక్క ప్రభుత్వము నిర్బాధకముగ జరగలేదు. రాజ్యములోని కంటకముల మాటఏ అటుండనిచ్చి వైదేశిక దండయాత్రను అతడు ఎదుర్కొనవలసి వచ్చెను; అతడు రాజ్యమునందు ఇంకను చక్కగ కుదురుకొనెనో లేదో కర్ణాటక చాళుక్య భూపాలుడు సత్తిగ నామాంతరుడైన సత్యాశ్రయుడు క్రీ. శ. 1006 వ సంవత్సరమున బయలునంబి అను సేనాధిపతి నాయకత్వము క్రింద వేంగిపై ఒక దండయాత్ర పంపెను. వేంగి ప్రవేశించి బయలునంబి ధరణికోట, ఎనమదల అను దుర్గములను కాల్చి చేబ్రోలునందు విడిసెను. చోళ, కర్ణాట చాళుక్యవంశముల ప్రతిస్పర్ధయే ఈ దండయాత్రకు కారణము. కర్ణాట చాళుక్య రాజ్యస్థాపకుడైన రెండవ తైలపుడు క్రీ. శ. 973 వ సంవత్సరమున, జటాచోడ భీముడు దానార్ణవుని చంపి వేంగీ సింహాసనమును ఆక్రమించుకొన్నప్పుడే, రాష్ట్రకూట సామ్రాజ్యమును కూలద్రోసి చాళుక్యుల ప్రభుత్వమును మరల కర్ణాటకమున ప్రతిష్ఠ కావించెను. అది మొదలు పూర్వము బాదామి చాళుక్యులును, అటు వెనుక రాష్ట్రకూటులును ఏలిన రాజ్యము నంతటిని తనయధికారము క్రిందికి తెచ్చుకొనవలయునని అతడు ప్రయత్నపడసాగెను. కొంతవరకును అతని కోరిక సిద్ధించినది. ఇరుగు పొరుగుల



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఉండిన సంస్థానములను పెక్కింటిని అతడు జయించి స్వాధీనము చేసికొనెను; తరువాత తుంగభద్రానదికి అవ్వలి తటమున నుండు నోలంబవాడి, గంగవాడులను జయింప సమకట్టెను. కాని, అప్పుడే నిజసామ్రాజ్యమును విస్తరింపదలపెట్టి చోళచక్రవర్తి అగు రాజరాజు ఆ దేశమును ఆక్రమింప గడగుట వలన చోళులకును, చాళుక్యులకును ఘర్షణ కలిగి వైరము పొసగెను. తత్కారణమున చోళులకును, కర్ణాట చాళుక్యులకును ద్వంద్వయుద్ధము ప్రారంభమాయెను. సమానస్కంధులగుట వలన ఆ యుభయ వంశములవారును ప్రభుత్వము చేయుచున్నంతకాలమును ఆ ద్వంద్వ యుద్ధము ముగియక తరములబడి సాగుచువచ్చెను. తైలపునికాలమున దక్షిణ కర్ణాటమున ప్రారంభమైన యుద్ధము అతని మరణానంతరము వేంగికి వ్యాపించినది. క్రమక్రమముగ వేంగి చోళ, కర్ణాటసైన్యముల యుద్ధమునకు ప్రధానరంగమాయెను. చోళ, కర్ణాటములు ఇరుగు పొరుగు రాజ్యములు. శక్తివర్మకు సహాయముచేయు నెపమున చోళులు వేంగిని ప్రవేశించి అచట నెలకొని కర్ణాటులను ప్రక్కలోని బల్లెమువలె బాధింపగడగిరి. మరియు వేంగి చాళుక్యవంశజుల కాణాచి అనియు, అందు శక్తివర్మ చోళులను ప్రవేశపెట్టి కులద్రోహమునకు ఒడిగట్టెననియు వారి భావము; కావున సత్యాశ్రయుడు శక్తివర్మను, అతనికి ఆశ్రయులయిన చోళులను తరుమగొట్టి వేంగిని ఆక్రమించుకొను నుద్దేశముతో పైని పేర్కొనిన దండయాత్రను పంపెను.

ఈ దండయాత్రను ఎదుర్కొన శక్తివర్మ ఎట్టి ప్రయత్నము చేసెనో తెలియదు. కాని, చోళచక్రవర్తి రాజరాజు సత్యాశ్రయుని బలములను వేంగినుండి మరల్చుటకు ఒక మార్గమును కనిపెట్టెను. తనకుమారుడైన రాజేంద్ర చోళుని నవలక్ష సంఖ్యాకమైన ప్రచండ సైన్యమునకు అధిపతిని కావించి సత్యాశ్రయుని రాజ్యమునకు మూలకంద మనదగిన రట్టవాడి సార్ధసప్తలక్ష దేశము మీదికి దండంపెను. రాజేంద్రచోళుడు దయాదాక్షిణ్యములు విడనాడి కర్ణాట రాజ్యము నంతటిని బారిసమరెను. స్త్రీలు, పురుషులు, బాలురు, బ్రాహ్మణులు అను వివేచన లేక అతడు ప్రజలను ఎల్లరను చంపించెను. స్త్రీలను బలాత్కారముగ పట్టి మానభంగము చేయించి కులధర్మములను పాడుచేసెను. ఈ యుపద్రవమునుండి దేశమును, ప్రజలను రక్షించుకొరకు సత్యాశ్రయుడు వేంగియందు దండయాత్ర నడపుచుండిన బయలునంబిని సైన్యములను మరల్చుకొని స్వదేశమునకు రా నాజ్ఞాపించెను.

కర్ణాట చాళుక్యసైన్యము వెనుకకు తిరిగి పోయిన పిదప శక్తివర్మ నిశ్చింతతో రాజ్యమును పాలించి క్రీ. శ. 1011 సంవత్సరమున కాలగతినందెను. ఇతని రాజ్యకాలమున తరచుగ యుద్ధములు నడచుచుండినను ఆర్థికముగ దేశము అభివృద్ధిచెందెను. ద్వీపాంతరవర్తక మవిచ్ఛిన్నమై సాగుచుండెను. శక్తివర్మకు 'చాళుక్య చంద్రుడు' అను బిరుదు గలదు. ఈ బిరుదుతో ముద్రితమైన బంగారు నాణెములు కొన్ని అరకాను తీరప్రాంతముల కానవచ్చినవి. ఇందువలన బేహారులు ఆ కాలమున ఆంధ్రమునుండి వర్తకమునకై ద్వీపాంతరములకు పోవుచుండిరని తెల్లమగుచున్నది.

**విమలాదిత్యుడు** (క్రీ. శ. 1011 - క్రీ. శ. 1018) : మొదటి శక్తివర్మ గతించిన పిమ్మట అతని తమ్ముడు విమలాదిత్యుడు రాజ్యాధిపతి యాయెను. అతని పట్టాభిషేక మహోత్సవము క్రీ. శ. 1011 మే నెలలో జరగెను. రాజమార్తాండ, ముమ్మడి భీమ అనునవి అతని బిరుదులు. విమలాదిత్యుడు ఎనిమిది సంవత్సరకాలము పృథ్వీపాలన మొనర్చెనను అతనినిగూర్చి చెప్పదగిన విశేష చరిత్రాంశములు ఎవ్వియు లేవు. అతని కాలమున వేంగిపై మరల కర్ణాటకులు ఎత్తివచ్చి రనియు, వారిని ఎదుర్కొనజాలక అతడు చోళమండలమునకు పారిపోయి మామగారి సాయముతో మరలివచ్చి రాజ్యమును స్వాధీనము చేసికొనె ననియు కొందరు పరిశోధకులు అభిప్రాయపడుచున్నారు. ఇది సత్యమే కావచ్చును; కాని, దానిని నిశ్చయించి చెప్పుటకు తగిన సాక్ష్యము ఇంకను లభ్యపడలేదు.

విమలాదిత్యునకు భార్యలు ఇరువురు కలరు. వారిలో చోళ చక్రవర్తియగు రాజరాజు దుహితయైన కుందవ ఒకతెయని ముందు చెప్పియున్నది. విమలాదిత్యునికి కుందవయందు ఒక పుత్రుడు పుట్టెను. ఈ కుమారునికి రాజరాజని మాతామహునియొక్క పేరు పెట్టిరి. అతని యెడల గల అభిమానము పెంపునసేమొ విమలాదిత్యుడు అతనిని పసితనమందే యౌవరాజ్య పట్టమునకు అభిషేకము కావించెను. విమలాదిత్యునికి మేళవ మరియొక ధర్మపత్ని. ఆమె తెలుగుచోళుల యింటి ఆడుపడుచు. ఈమె జటాచోడ భీముని పుత్రిక యని ఎంచుటకు అవకాశము కలదు. ఈమె గర్భమునందు విమలాదిత్యునికి విజయాదిత్యుడను పుత్రు డుద్భవించెను.

మొదట శైవుడైనను విమలాదిత్యుడు అపర వయసున జైన ధర్మము స్వీకరించెను. దేశిగణాచార్యుడైన త్రికాలయోగి సిద్ధాంతదేవు డితనికి దీక్షాగురువు. అతని కొరకు విమలాదిత్యుడు విశాఖపట్టణ మండలమందలి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



రామతీర్థములో 'రామకొండ' అను గుహాలయము నొక దానిని నిర్మించి ఇచ్చెను.

**రాజరాజు** (క్రీ.శ. 1019 - క్రీ.శ. 1061): ప్రథమ ఘట్టము : విమలాదిత్యుని అనంతరము అతని పుత్రుడు రాజరాజు రాజ్య భారమును వహించెను. కాని, రాజ్యము అతనికి వశము కాకపోవుటవలన మరి నాలుగేండ్లు కడచినపిమ్మట కాని అతనికి పట్టాభిషేకము చేసికొనుటకు వీలులేకపోయినది. ఇతడు రాజగుట ఇతని సవతి తమ్ముడైన విజయాదిత్యునకు ఇష్టము లేదు. కావున అతడు కర్ణాటక చాళుక్య చక్రవర్తియైన రెండవ జయసింహునితోడను, కళింగ గాంగరాజైన మధుకామార్ణవునితోడను సఖ్యము చేసికొని వేంగిని ఆక్రమించుకొనెను; రాజరాజునకు విజయాదిత్యుని అతని సహాయులతో గూడ ప్రతిఘటించి పోరి తన యధికారమును నిలబెట్టుకొనుటకు తగిన శక్తి సామర్థ్యములు లేకపోవుటవలన అతడు తన పూర్వీకుల మార్గముబడి చోళ మండలమునకు పోయి చోళచక్రవర్తి సాహాయ్యమును అర్థించెను. అప్పటికి రాజరాజుయొక్క మాతామహుడైన రాజరాజచోళుడు అస్తంగతుడగుటవలన అతని మేనమామయైన మొదటి రాజేంద్ర చోళచక్రవర్తి సామ్రాజ్యపాలనము సల్పుచుండెను. వేంగి తన చేతినుండి దుసికిలి పరహస్తగతమగుట కంటక ప్రాయమై అతనిని బాధింపగడగినది. మేనల్లుని దుస్థితి అతని హృదయమున జాలిగొల్పెను. కావున, వేంగిని మరల జయించుటకు నిశ్చయించి తత్కార్య సాధనమునకు తగిన ప్రణాళికను సిద్ధము చేసెను. తాను తార్కొనవలసిన శత్రువులలో ప్రధానుడు వేంగీ సింహాసనమును అక్రమముగ తిగిచికొన్న విజయాదిత్యుడు కాడు; కర్ణాటాధిపతియైన చాళుక్య జయసింహుడు. అతడు సామాన్య శత్రుడు కాడు; కోశ బల సంపత్తిగల దొడ్డ రాజు; వేంగిని ఎట్లయిన తన యధికారము క్రిందికి తెచ్చుకొని చోళులపై గల పెద్దలనాటి పగను తీర్చుకొనవలయునను దృఢ సంకల్పము కలవాడు. కావున, జయసింహుని విజయాదిత్యునికి సహాయపడనీయక అడ్డుపెట్టి, అతనిపై గవిసినగాని వేంగిని సాధించుట సులభము కాదని గుర్తించి రాజేంద్రచోళుడు వేంగి, రట్టవాడులపై ఏక కాలమున దండువెట్ట సమకట్టెను. తన సైన్యమును రెండు పాయలుగ చీలదీసి ఒకదానిని రట్టవాడిమీదికిని, మరియొక దానిని అరయన్ విక్రమచోఱ చోటియవరైయన్ అను దండనాథుని యాధిపత్యముక్రింద వేంగీ దేశము మీదికిని జైత్రయాత్ర యంపెను. రట్టవాడిమీదికి చోళ సైన్యము వచ్చుచున్నదని తెలియవచ్చినంతటనే జయసింహుడు తన బలములను సమకూర్చుకొని వారిని ఎదుర్చుటకు సంసిద్ధుడాయెను. ఉభయ సైన్యములును రాయచూరు మండలములోని ముశంగి (మాస్కి) గ్రామము కడ తారసిల్లినవి. అప్పుడు జరగిన ఘోర సంగ్రామములో జయసింహుడు ఓడి పారిపోయెను. రట్టవాడి సార్ధసప్త లక్షదేశమును రాజేంద్రుడు హస్తగతము చేసికొంటినని తన శాసనములలో ప్రకటించుకొనెను. కాని, ఇది కేవలము అతిశయోక్తి; సత్యము కాదు; ఏలన, ముశంగి సంగ్రామమునకు తరువాతకూడ రట్టవాడి యంతయు జయసింహుని పాలన క్రిందనే ఉండెనని అతని శాసనములు రుజువు చేయుచున్నవి. రాజ్యనష్టము కలుగకపోయినను సైన్య నాశము సంభవించి దేశమున సంక్షోభము పుట్టుటవలన జయసింహుడు మిత్రుడైన విజయాదిత్యునికి ప్రాపుగ దళములను పంపజాలక పోయెను. స్వరాష్ట్ర సంరక్షణోద్యోగమున జయసింహుడు నిమగ్నుడై ఉండగా విక్రమచోటి చోటియవరైయను దండును కదల్చుకొనిపోయి వేంగిని తాకెను. జయసింహుని పంపులు రాకపోవుటచేత విజయాదిత్యుడు చోళులతో సరిపోరజాలకపోయెను. కావున, అతడు వేంగిని విసర్జించి కళింగమునకు పోయి అచట మధుకామార్ణవుని దళములను బాసట చేసికొని మార్కొడ్డి నిలిచెను. చోటియవరైయను వేంగి నాక్రమించుకొని, అచటినుండి కళింగము ప్రవేశించి యుద్ధమున 'కళింగులను ఒడ్డెలను తెలుంగులను' కదిసి పరాభూతులను కావించి, అచటినుండి బయలు వెడలి గంగాతీరము వరకు దాడి చేసెను. చోటియవరైయను కళింగాంధ్రోత్కలులపై విజయము పొందినను వేంగీ ప్రాంతములో శాంతి భద్రతలు సమకూడను లేదు; రాజరాజునకు రాజ్యము చేకూడనులేదు.

జయసింహుడు విజయాదిత్యునికి తోడంపజాలకపోయినను చోళ సైన్యమునకు పింగలి ప్రదేశములందు శత్రువులను రెచ్చగొట్టి వలసినట్లుగ ఉపద్రవము సేయగడగెను. అతని నియోగమున తత్పూర్వము చోళులచే పరాభూతుడైన ఉత్కళ భూపతి చోళులకు అనతుడై తిరుగబాటు చేసెను. గంగాతీరమున దండు చేయుచుండిన చోటియవరైయను యొక్క పశ్చాద్గమనమునకు అతడు అడ్డుపడునట్లు తోచినది. కావున, అతని పశ్చాద్గమన మార్గమును నిర్ణిబద్ధము సేయదలచి రాజేంద్ర చోళుడు గొప్పసైన్యముతో కూచి చేసి వేంగిని దాటి గోదావరీ తీరమున విడిసెను. ఇంతలో ఉత్తర దిగ్విజయమును పూర్తి చేసికొని గంగానది పవిత్రోదకములను కొని చోటియవరైయను మరలి వచ్చి రాజేంద్రుని కలసికొనెను. తరువాత, అనతుడైన ఉత్కళాధిపతిని దండించుటకు సైన్యముతోగూడ తరలి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పోయి యుద్ధమునందు అతనిని అనుజ సహితముగ వధించి వారి గజయూథమును హరించెను. తరువాత రాజేంద్ర చోళుడు వేంగియందు శాంతిభద్రతలను నెలకొల్పి తన కుమారిత యగు అమ్మంగదేవిని రాజరాజున కిచ్చి వివాహము చేసి అతనికి క్రీ. శ. 1022 ఆగస్టు 22 వ తారీఖున పట్టాభిషేకము చేసెను.

ద్వితీయఘట్టము; పట్టాభిషేకము అయినతరువాత ఎనిమిది తొమ్మిదేండ్ల కాలము రాజరాజు పరిపాలన శాంతియుతమై సాగినది. కాని, తరువాత మరల అతనికి దుర్దశ ప్రారంభమైనది. చోటియవర్మెయనుచే నిర్జితుడైన విజయాదిత్యుడు అల్లే పోలేదు; కర్ణాటకమును చేరి మిత్రుడయిన జయసింహుని ఆశ్రయించి వేంగిని మరల సాధించుకొనుటకు అనుకూల సమయమును ఎదురు చూచుచుండెను. క్రీస్తుశకము 1031 లో గొప్ప కర్ణాటక సైన్యముతోడు నడవ వేంగిపై ఎత్తివచ్చి రాజధానియైన బెజవాడను స్వాధీనపరచుకొని పట్టాభిషేకమును చేసికొని విష్ణువర్ధన విజయాదిత్యుడను అభిషేక నామమును వహించి ప్రజాపాలన చేయదొడగెను. రాజరాజు మరల రాజ్యభ్రష్టుడై మాతులుడైన రాజేంద్రచోళచక్రవర్తి యండ చేరి అతని సాహాయ్యము వేడెను. కర్ణాటకులు దండెత్తి వచ్చి తన యల్లుని తరుమగొట్టి వేంగిని ఆక్రమించుకొనిరని రాజేంద్రచోళుడు విని కుపితుడై విశ్వాసపాత్రుడయిన రాజరాజ బ్రహ్మమహారాయడను బ్రాహ్మణ సేనాధ్యక్షునికి గొప్ప సైన్యము నిచ్చి ఉత్తమచోడ చోడకోన, ఉత్తమ చోడమిలాడుడయాను అను దళనాయకులను సాహాయ్యమిచ్చి వేంగిపై దండువెట్టి కర్ణాటకులను వెడలనడిచి దేశమును కైవసము చేసికొమ్మని ఆజ్ఞాపించి పంపెను. రాజరాజ బ్రహ్మ మహారాయడు దండు తరలి వేంగిదేశమునకు ప్రయాణము సాగించి కృష్ణామండలమందలి కలిదిండి గ్రామముచెంత, అగ్నిత్రయమువలె విరాజిల్లుచుండు దండనాథత్రయముచే నధిష్ఠితమై యుద్ధమునకు సంసిద్ధముగ ఉన్న కర్ణాటక సైన్యమును కవిసెను. అప్పుడు సంప్రాప్తమైన తుముల సంగ్రామమునందు ఉభయ పక్షముల దండనాయకులును నిహతులై వీర స్వర్గమును చూరగొనిరి. ఈ రణక్షేత్రమున జయము ఎవ్వరికి చేకూడెనో నిష్కర్షించి చెప్పుటకు వీలులేదు. కాని, రణ నిహతులైన చోళ దండనాయకులు ముప్వురిపేర స్మారక చిహ్నముగ రాజరాజు కలిదిండియందు మూడు శివాలయములను నిర్మించుటనుబట్టి చూడగా ఈ యుద్ధ యాత్రలో చిట్టచివర చోళులకు జయము కలిగినట్లు తోచుచున్నది. ఈ సందర్భమున స్మరింపదగిన విషయము ఒక్కటి కలదు. రాజేంద్ర చోళుని పుత్రుడగు మొదటి రాజాధిరాజు శాసనములు కొన్నింటిలో అతడు అతని తండ్రి ఇంకను రాజ్యమును ఏలుచుండగనే విక్రమనారణు డను కర్ణాట చాళుక్య సేనాధిపతిని జయించినట్లు చెప్పియున్నది. విక్రమనారణు డనునది ఆ దండనాయకుని బిరుదే కాని వాస్తవ నామధేయము కాదు. కొన్ని యెడల ఇతడు 'చక్రవర్తి విక్రమ నారణు' డనియు పేర్కొనబడియున్నాడు. ప్రస్తుత చరిత్రజ్ఞానమూలమున ఇతనిని గుర్తింప సాధ్యముకాక యున్నది. ఈ విక్రమ నారణు డొకవేళ జయసింహుని పుత్రుడును, అతని వెనుక సింహాసనమును అధిష్ఠించిన వాడును అగు ఆహవమల్ల, త్రైలోక్యమల్ల బిరుదాంకితుడైన ప్రథమ సోమేశ్వరుడై యుండినను ఉండవచ్చును. కాని, నిశ్చయించి చెప్పుటకు వలనుపడదు. విక్రమ నారణుడు ఎవ్వడైనను అతడు రాజాధిరాజుయొక్క చాళుక్య ప్రతిపక్షియగుట నిశ్చయము. రాజరాజ బ్రహ్మమహారాయని దండయాత్ర కలిదిండి రణక్షేత్రమున భగ్నమైపోగా రాజేంద్రుడు కర్ణాటులమీదికి మరియొక సేనతో రాజాధిరాజును పంపినట్లు ఉన్నది. తత్ఫలితముగ విష్ణువర్ధన విజయాదిత్యుడు నిజకర్ణాటమిత్రులతోకూడ వేంగికి వీడుకోలీవలసివచ్చెను. రాజరాజు తన రాజ్యమును మరల వశపరచుకొని యథాపూర్వము పాలింపదొడగెనని చాళుక్య భీమవరమున అతని 16 వ రాజ్యవర్షమున (క్రీ. శ. 1035) వ్రాయించిన శాసనము వలన తెలియవచ్చుచున్నది.

తృతీయఘట్టము: రాజ్యమునందు ఇట్లు పునఃప్రతిష్ఠితుడైనను రాజరాజు కష్టములు తొలగి సుఖియై ప్రజాపరిపాలన నేయజాలకపోయెను. దక్షిణ భారత రాజకీయ పరిస్థితులు సత్వరముగా మారగడగినవి. చాళుక్య జయసింహుడు క్రీ. శ. 1042 లో కీర్తిశేషుడాయెను. మరి రెండేండ్లకు అతని ప్రత్యర్థియైన రాజేంద్ర చోళుడు అనుగమించి స్వర్గమునకు జనెను. వారి యనంతరము ఆహవమల్ల ప్రథమ సోమేశ్వరుడు కర్ణాట సామ్రాజ్యమునకును, ప్రథమ రాజాధిరాజు చోళ సామ్రాజ్యమునకును అధిపతులైరి. ఇద్దరును ఆహవ దోహలులు; బిరుదు మగలు. పౌరుషమునందు ఒకరికి ఒకరు తీసిపోవువారు కారు. కావున వారికాలమున చోళ, కర్ణాటక ప్రతిస్పర్థ మిక్కుటమై యుద్ధమే ప్రజాజీవనముయొక్క సామాన్య స్థితి యాయెను. వేంగి ఉభయ పక్షముల వారికి సంగ్రామరంగ మాయెను. రాజేంద్ర చోళుడు నిర్యాణమొందిన వెంటనే ఆహవమల్ల సోమేశ్వరుడు వేంగీ రాజ్యమును జయించెనని అతని శాసనములవలన తెలియవచ్చుచున్నది. క్రీ. శ. 1044 నాటి ఒక శాసనములో



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అతని యనుచరులలో ఒక్కడైన శోభనరసుడు తాను వేంగీపురవరేశ్వరుడ నని ప్రకటించుకొని యున్నాడు. ఇది శోభనరసుని కులక్రమాగతమైన బిరుదు కాదు; మరియు క్రీస్తు శకము 1044 కు తరువాత ఆహవమల్ల సోమేశ్వరుని పుత్రులలో జ్యేష్ఠుడైన భువనైకమల్ల ద్వితీయ సోమేశ్వరునికి ఈ బిరుదు చెల్లుచు వచ్చినది. కావున, వేంగీ విజయమువల్లనే పైవారికి ఈ బిరుదము కల్గెనని ఎంచవలసియున్నది. కాని, వేంగీరాజ్యము సమస్తమును కర్ణాట చాళుక్యులకు కైవసము కాలేదు. క్రీ. శ. 1047 నాటి ఒక దాక్షారామ శాసనమున ఇంకను రాజరాజు వేంగిని పాలించుచుండినట్లు చెప్పియున్నది. కర్ణాటకుల వేంగి యాక్రమణమును సహించి, చోళులు ఊరకుండలేదు. అది తమ కాణయాచి అని వారి దృఢ విశ్వాసము అగుటవలన దానిని మరల స్వాధీనపరచుకొనుటకొరకు తమ శక్తి సామర్థ్యముల నెల్ల వినియోగించి పోరాడగడగిరి. రాజాధిరాజు సామ్రాజ్యమును ఏలిన తొమ్మిది పదియేండ్ల కాలములోపల ఇతడు ఐదుమారులు కర్ణాట చాళుక్యులపై దండయాత్ర చేసెను; చివరకు ఈ దండయాత్రలందే క్రీ.శ. 1054 వ సంవత్సరమున 'కొప్పం' రణక్షేత్రమున నిహతుడాయెను. పైని పేర్కొనిన దండయాత్ర లైదింటిలో రెండు వేంగియందు నడచినవి. ఇందు మొదటిది క్రీస్తుశకము 1044-45 సంవత్సరములో రాజాధిరాజు తండ్రి మరణానంతరము చోళ సామ్రాజ్యమునకు ఏకైకాధినాథుడైన వెంటనే జరిగెను. చోళవాహిని రాజాధిరాజు ఆధిపత్యము క్రింద ఉత్తరముఖమై పయనించి కృష్ణాతీరమును చేరెను. దన్నాడ (ధరణికోట) కడ విక్రమాదిత్య, విజయాదిత్యాది సుప్రసిద్ధ దండనాథుల నాయకత్వము క్రింద కర్ణాటక చాళుక్యుల బలము వారి మార్గమును అరికట్టెను. ఇచ్చట జరగిన ఘోర సంగ్రామములో కర్ణాటబలములు ఓడె ననియు, కర్ణాట గజ యోధములకు అధిపతులయిన గండపయ్య, గంగాధరులు మడిసి రనియు, విక్రమాదిత్య విజయాదిత్య సంగమయ్యలు రణభీరువులై జుట్లు విరియబార పలాయన మొనర్చి రనియు, అటు పిమ్మట చోళ సైన్యములు వారిని వెన్నంటి తరుముచు నలగొండ మండలములోని కొల్లిపాక పర్యంతము పోయి ఆ కోటను కాల్చె ననియు రాజాధిరాజు శాసనములలో వక్కాణింపబడియున్నది. ఇంత ఘనవిజయము చేకూరినను రాజాధిరాజునకు వేంగిదేశము స్వాధీనము కాకపోవుట చూడగా పై చోళశాసనముల లోని యుద్ధవర్ణనయందు అంతయు కాకపోయినను కొంతయైనను అతిశయోక్తి యున్నదని తోచుచున్నది.

రాజాధిరాజుయొక్క రెండవ వేంగీ దండయాత్ర క్రీస్తు శకము 1050 లో జరగెను. కాని, దాని వృత్తాంతము ఏమియు తెలియరాదు. దండయాత్ర సందర్భమున రాజాధిరాజు దన్నాడకడ దండు దిగియుండగా అచట అతడు తన విజయ ప్రశంసాత్మకమైన 'పరణి' కావ్యమును అంకితము గొనెను; కాని ఏకారణము వల్లనో వేంగిపై దండు సేయక, అచటినుండి పాళెమును లేపుకొని పశ్చిమాభిముఖుడై కృష్ణా దక్షిణ తటముననే కూచిచేసి పోయి రట్టవాడి సార్ధసప్తలక్షరాజ్యమును ప్రవేశించి సిరుతుర (తుంగభద్ర), పెరున్దుర (కృష్ణ), తయ్యిభీవరసి (భీమరథి) నదులను కడచి ఏతగిరిని చేరి అచ్చట జయస్తంభమును ప్రతిష్ఠించెను. రాజాధిరాజు దండువెడలునప్పుడు అతనికి రట్టవాడిపై దాడిపోవ సుద్దేశము లేదు; అట్టి యుద్దేశమే యుండిన అతడు సూటిదారిని పోక దన్నాడ మీదుగా పెడత్రోవల పోయియుండడు; కర్ణాటక బలసంరక్షితమైన వేంగి దుస్సాధము కాగా, రక్షణ తక్కువయైయుండిన కర్ణాటకరాజ్యముపై అకస్మికముగ పడి చాళుక్యులపై కసితీర్చుకొన నిశ్చయించి రట్టవాడిపై నడచెను. కావున వేంగిని స్వాధీన పరచుకొనుటకు రాజాధిరాజు చేసిన ద్వితీయ ప్రయత్నము కూడ వితథమై పోయెను.

ఈయవాంతరమున రాజరాజు స్థితిగతులు ఎట్లుండెనో విస్పష్టముగ తెలియరాదు. క్రీ. శ. 1044-45 లో కర్ణాటకులకు వేంగి సంపూర్ణముగ కైవసము కాలే దనియు, క్రీస్తుశకము 1047 వరకును అందు కొంతభాగముపై రాజరాజుయొక్క అధికారము చెల్లుచుండె ననియు మీద వ్రాసియున్నది. తంజావూరు సమీపమందున్న తిరువైయ్యారు గ్రామమున చోళ రాజాధిరాజు 32 వ రాజ్యవర్షము (క్రీ. శ. 1050) లో వ్రాయించిన ఒకానొక శాసనము నందు అయ్యారి శివాలయమునకు పిళ్లయార్ విష్ణువర్ధనుడు (అనగా రాజరాజు) 300 రాజరాజమాడలను దానము చేసినట్లు చెప్పియున్నది. దీనినిబట్టి చూడగా స్వరాష్ట్రమును ఆక్రమించుకొనియుండు కర్ణాట చాళుక్యులను పారదోలుటకు రాజరాజు తన మరదియైన రాజాధిరాజును సహాయము వేడబోయినట్లు తోచుచున్నది. అందు మీదట రాజరాజు మీద వివరించినట్లు రెండవ పర్యాయము వేంగిపై ఎత్తివచ్చి భంగపడిపోయెను. అటుపిమ్మట రాజరాజునకు చోళులు కర్ణాటకులను జయింపగలుగుదురను నమ్మకము చెడినది. ఇక కర్ణాటకులతో పోరాడుట వ్యర్థమనియు, నష్టకర మనియు తలచి రాజరాజు ఆహవమల్ల సోమేశ్వరునితో సంధిచేసికొనెను. అదిమొదలు అతడు తన మరణకాలము వరకును కర్ణాటక చాళుక్యులయెడ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మైత్రిగలిగి వర్తించుచుండెను. వారియందు తనకు గల గౌరవమును, బాంధవ్యమును ప్రకటించుటకు వారి వగు సత్యాశ్రయకులశేఖర, సమస్త భువనాశ్రయ మున్నగు బిరుదములను తాల్చెను. ఆహవమల్ల సోమేశ్వరుడు వేంగి యందు తన సామ్రాజ్య వ్యవహారములను నిర్వహించుట కొరకు తన ప్రధానులలో ఒక్కడైన నారాయణ భట్టును రాజరాజు ఆస్థానమందు స్థానపతిగ నియమించెను. ఈ నారాయణభట్టు రాజరాజనరేంద్రుని కులబ్రాహ్మణుడైన నన్నయభట్టునకు సహాధ్యాయి ; అష్టభాషలలో కవిత్వము చెప్పగల మేటి విద్వాంసుడు. ఇతడు నన్నయభట్టునకు ఆంధ్రమహాభారత రచనయందు తోడ్పడెను. ఈ సంధి మూలమున భారతరచన రాజరాజు యొక్క పాలన కడపటి యేండ్లలో శాంతియుతముగ సాగినది. కావున అతడు విద్యావ్యాసంగముచే తనకాలమును పండితుల గోష్ఠియందు కడపుచు భాషాపోషణ చేయుచు క్రీస్తుశకము 1061 - 62 వరకు రాజ్యపాలనము చేసి కాలగతి నందెను.

రాజరాజు కాలమున, జరగిన రెండు ముఖ్యవిషయము లను ఇచట ప్రస్తావించుట యుక్తము. రాజరాజు శివ భక్తుడు ; వైదిక ధర్మ నిష్ఠానిరతుడు. అతనికి వేదము లందును, శాస్త్రములందును అత్యంతాభిమానము కలదు ; వర్ణాశ్రమ ధర్మములందు శ్రద్ధాభక్తులు కలవాడై వానిని పోషించుటకు తన యావచ్ఛక్తిని వినియోగించెను. మరియు, తాను పాండవుల సంతతిలోనివాడనని అతని గట్టి నమ్మకము. అప్పటివరకు ఆంధ్రమునందు మహా భారతాఖ్యానము విరచింపబడి ఉండలేదు. జైన సంప్రదా యానుసారము రచింపబడిన గాథలే ప్రచారమందు ఉండి నవి. కావున రాజరాజు పంచమవేదమని సుప్రసిద్ధమైన కృష్ణద్వైపాయన వ్యాస విరచిత సంస్కృత మహాభారత మును తెనుగుసేయుమని తన కులబ్రాహ్మణుడైన నన్నయ భట్ట మహాకవిని నియోగించెను. కాని నన్నయ భట్టు ఆంధ్ర భారతము అరణ్యపర్వమధ్యమందే ఆగిపోయినది. దీనికి నిజమైన కారణము ఏదియో తెలియదు. రాజరాజో, నన్నయభట్టో, లేక వా రిద్దరో మృతిచెందుటవలన అది అరగొరయై నిలిచిపోయి యుండును. రాజరాజు కాలము వరకును వేంగిదేశమునకు బెజవాడ రాజధానియై యుండి నది. కర్ణాట సామ్రాజ్యముయొక్క సరిహద్దునకు అది అత్యంతము సమీపస్థమై ఉండిన కారణమున మాటిమాటికి అది శత్రువుల తాకునకు లోనగుచు వచ్చినది. కావున, రాజరాజు శత్రువులకు సులువుగ అందుపాటుకాని స్థలమున రాజ్యమధ్యమున గోదావరిఉత్తరతటమున తనపేర రాజమహేంద్రవరమను క్రొత్తరాజధానిని నిర్మించుకొనెను.

**రెండవ శక్తివర్మ ; ఏడవ విజయాదిత్యుడు** (క్రీ. శ. 1061 - క్రీ. శ. 1076) : రాజరాజుయొక్క మరణానంత రము జరిగిన చరిత్ర అప్పటి చోళ, పూర్వ చాళుక్య, పూర్వగాంగ శాసనములందు వివరింపబడియున్నది. వాని సారాంశము ఇది. రాజరాజునకు అమ్మంగదేవియందు రాజేంద్రుడను ఒక కుమారుడు కలిగెను. కాని అతడు తండ్రివెనుక రాజ్యాధిపతి కాలేదు. రాజరాజు మృతినందిన పిమ్మట అతని వైమాత్రేయుడైన విష్ణువర్ధన విజయా దిత్యుడు వేంగిరాజ్యమును ఆక్రమించుకొనెను. కాని, తాను స్వయముగ రాజ్యాధిపత్యమును వహింపక తన పుత్రుడైన రెండవ శక్తివర్మకు పట్టాభిషేకము చేసి అతనికి రాజ్యమును అప్పగించెను. అతడు ఒక యేడాదికాలము ప్రజాపాలనము చేసిన పిమ్మట శత్రులతో పోరు పొసగి, అభిమన్యుకుమారునివలె రణరంగమున నిహతుడాయెను ; కుమారుడు ఇట్లు గతించినవెనుక విష్ణువర్ధన విజయా దిత్యుడు క్షత్రియధర్మమును అనుసరించి స్వయముగ రాజ్యపాలనము సేయగడగెను ; ఇందు వివరింపబడిన చరిత్రాంశములలో వితర్కింపదగిన విషయములు కొన్ని కలవు. రాజరాజు మరణకాలమప్పుడు వేంగి కర్ణాటక చాళుక్యుల ఆధిపత్యముక్రింద నుండెను ; విష్ణువర్ధన విజయాదిత్యుడు కర్ణాటక చాళుక్యులకు చిరమిత్రుడు ; ఆశ్రితుడు. సందర్భము ఇట్లుండ, రాజరాజు మృతినందిన పిమ్మట విష్ణువర్ధన విజయాదిత్యుడు వేంగిని ఏల ఆక్ర మించుకొనవలసి వచ్చెను, ఆక్రమించుకొనిన పిమ్మట తాను స్వయముగ రాజ్యభారము వహింపక కొడుకునకు ఏల పట్టాభిషేకము చేసెను, ఆకొడుకుపై ఎత్తివచ్చి యుద్ధమున అతనిని వధించిన శత్రువులు ఎవ్వరు అను నీ ప్రశ్నలు సమాధానమును కోరుచున్నవి.

రాజరాజునకు విజయాదిత్యుడు సన్నిహిత వారసుడు కాడు ; అతనికి చోళచక్రవర్తి ప్రథమ రాజేంద్రుని పుత్రికయగు అమ్మంగ దేవియందు పుట్టిన రాజేంద్రుడను పుత్రు డొక డుండెను ; అతడు చోళ రాజధానియందు మాతామహుని యింట మాతులులైన రాజాధిరాజు, ఇమ్మడి రాజేంద్ర, వీర రాజేంద్రుల పోషణయందు వర్ధిలు చుండెను. క్రీస్తుశకము 1054 లో 'కొప్పం' సంగ్రామ రంగమున కర్ణాటకులతో పోరుచు మొదటి రాజాధిరాజు స్వర్గాతిథియై చనినపిమ్మట అతని తమ్ముడు ఇమ్మడి రాజేంద్రుడు చోళసామ్రాజ్యమునకు పట్టాభిషిక్తుడై క్రీస్తు శకము 1063 జూను పర్యంతము పండ్రెండేండ్లు ప్రభు త్వము చేసెను. ఇమ్మడి రాజేంద్రుడు తన కుమార్తెను మధురాంతకీదేవిని మేనల్లుడు రాజేంద్రుని కిచ్చి పెండ్లిచేసి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చెంత నుంచుకొనెను. రాజరాజు స్వర్గస్థు డయిన పిదప ఇమ్మడి రాజేంద్రుడు తనయల్లుని అతని పిత్ర్యమైన వేంగి రాజ్యమున ప్రతిష్ఠించుటకు నిశ్చయించి తత్కార్యనిర్వహణార్థము కుమారుడైన రాజమహేంద్రుని తమ్ముడైన వీరరాజేంద్రుని నియమించెను.

రాజరాజు మృతిచెందిన పిమ్మట చోళులు అతని పుత్రుడైన రాజేంద్రుని వేంగీ సింహపీఠమును ఎక్కింప ప్రయత్నము చేయుదు రనియు, వేంగియం దుండు రాజరాజు పక్షమువారు అతని పుత్రునికి తోడ్పడుదు రనియు విజయాదిత్యుడు ఎరుగును. కావున చోళులకంటె ముందంజ వేసి అతడు వేంగికి వచ్చి రాజ్యమును ఆక్రమించుకొనెను. కాని, వేంగియందు నెలకొని రాజ్యము చేయుటకు వలనుగాకపోయెను. ఏలన, అతడు చాళుక్య ఆహవమల్ల సోమేశ్వరునికి ఆంతరంగిక హితుడు; కుమారవర్గములో ప్రధానుడు; మరియు అంకకాడు; కర్ణాటక చాళుక్య సేనాధిపతులలో అగ్రశ్రేణికి చెందినవాడు. వేంగిపై ఎత్తిపోవుటకు ముందు కర్ణాట సామ్రాజ్యముమీద ఒక దెబ్బ తీయుట చోళుల యాచారము. తత్కారణమున బిరుదుమగలని ప్రఖ్యాతిచెందిన విక్రమాదిత్య, విజయాదిత్యులను చోళ కర్ణాట సామ్రాజ్యములమధ్య గడి ప్రాంతములైన గంగవాడి, నోలంబవాడులకు పాలకులనుగ నియమించి గడిసంరక్షణము వారికి అప్పగించి యుండెను. కర్ణాటసామ్రాజ్య సంరక్షణమందు తాను ఆహవమల్లుని పుత్రునితో సమాన భాగస్వామి అగుటవల్లను, స్వపుత్రుడైన రెండవ శక్తివర్మయెడ గల ప్రేమపెంపునను తాను రాజ్యభారము వహింపక, కొడుకును రాజ్యాభిషిక్తుని చేసి రాజ్యమును, రాజును మంత్రివర్గమునకు అప్పగించి విజయాదిత్యుడు కర్ణాటకమునకు పోయెను.

ఇమ్మడి రాజేంద్రచోళుని ఆదేశము చొప్పున చోళ సైన్యములు రాజమహేంద్ర, వీరరాజేంద్రుల నాయకత్వముక్రింద దండువెడలి గంగవాడిని ప్రవేశించెను; వారు ముడుక్కారు తీరమును చేరునప్పటికి చాళుక్య దళములు విక్రమాదిత్యుని ఆధిపత్యముక్రింద వారి మార్గమును అరికట్టెను. ఉభయ పక్షములకును పోరు ఘోరమై నడచినది; తుదకు చోళులే విజయమునందిరి. కర్ణాటక దళములు పరాభూతములై వెన్నుచూపినవి; విక్రమాదిత్యుడును, అతనికి సహాయులై ఉండిన కర్ణాట చాళుక్య సామంతులును చోళుల ఆటోపమును సహింపజాలక తుంగభద్రను దాటి పారిపోయిరి. చోళులు గంగవాడిని స్వాధీనము చేసికొనిరి. ఇట్లు పరాజయమును పొంది గంగవాడిని కోలుపోయినను చాళుక్యుల పోటుతనము డిందుపడి పోలేదు. గంగవాడి దుసికిలిపోయినను వేంగిలో చోళులు మరల చొరనీకుండుటకు వారు తగుప్రయత్నములు చేయ గడగిరి. ఆహవమల్ల సోమేశ్వరుడు విజయాదిత్యుని ఒక గొప్ప సేనతో కూడ నోలంబవాడినుండి ద్రావిడదేశము మీదికి దండయాత్ర చేయబంపెను. విక్రమాదిత్యుడు తన యనుచరులలో ఒక్కడైన కదంబ చాముండరాజును మరియొక సేనతో చోళులు వేంగిపై ఎత్తుదెంచిన శక్తివర్మకు తోడ్పడుటకు అచటికి పంపెను.

గంగవాడిని స్వాధీనపరచుకొని వెంటనే సేనను పురికొల్పుకొని వీరరాజేంద్రుడు వేంగిపై నడచెను. చాముండరాజును, శక్తివర్మయు దళములనెల్ల కూర్చుకొని అతనిని వేంగియం దెచ్చటనో మార్కొనిరి. భయంకరమైనయుద్ధము జరగినది. ఇచ్చటను చోళులే మరల విజయము పొందిరి. అభిమన్యుకుమారునివలె పరాక్రమమును ప్రకటించి పోరాడి శక్తివర్మ రణశయ్యను అలంకరించెను. చాముండరాజు హస్తగతుడుకాగా వీరరాజేంద్రుడు అతనిని శిరచ్ఛేదనమొనర్చెను. అతని పుత్రికయు, ఇరుగదండనాథుని ధర్మపత్నియునైన నంగలను ముక్కు కోయించి విరూపను గావించెను. శత్రువులను ఇట్లు నాశనముగావించి జయము గొన్నను వీరరాజేంద్రుడు వేంగిని స్వాధీనపరచుకొనజాలక పోయెను. దీనికి కారణమేమో స్పష్టముగ తెలియదు; కాని ఊహింపవచ్చును. సోమేశ్వరుని యాజ్ఞచొప్పున విజయాదిత్యుడు ద్రావిడదేశమున దండుచేసి అచ్చట కలవరము కల్గించెను. ఈ దండయాత్ర వృత్తాంతము ఏమియు తెలియరాకపోయినను విజయాదిత్యుడు దానిని విజయవంతముగ కొనసాగించి మరలి వచ్చినట్లు క్రీ. శ. 1063 నాటి ఒకానొక మైసూరు శాసనమునందు వచింపబడి యున్నది. మరియు ఆహవమల్ల సోమేశ్వరుడు కృష్ణా, తుంగభద్రల కూడలిచెంత సైన్యముల నెల్ల సమకూర్చి యుద్ధప్రయత్నములు చేయుచుండెను. ఇంతియకాక చోళ రాజధానియందు చోళచక్రవర్తి ఇమ్మడి రాజేంద్రుడు స్వర్గస్థుడాయెనని వార్త వచ్చెను. ముడుక్కారు యుద్ధమైనపిమ్మట అతని కుమారుడైన రాజమహేంద్రుడు అతనికంటె ముందే లోకాంతరగతుడగుటవలన చోళ సింహాసనాధిపత్యము వారసత్వపు హక్కునుబట్టి వీర రాజేంద్రునికి సంక్రమించెను. కావున, అతడు వేంగిని వశపరచుకొనుటకు ప్రయత్నము చేయక యుద్ధోద్యోగమును చాలించి తన రాజధానియైన గంగైకొండ చోళపురమునకు మరలిపోయి అచట క్రీ. శ. 1062 వ సంవత్సరము తుదనో, 1063 ప్రారంభముననో పట్టాభిషేకము చేసికొనెను.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పట్టాభిషేక మహోత్సవము జరిగినదినముననే వీర రాజేంద్రుడు మరల దండువెడలి కూడలిసంగమునకు కూచిచేసి పోయి యచ్చట సమావేశమై యుండిన కర్ణాటక దళములను తారసిల్లి యుద్ధముచేసి వానిని చీకాకుపెట్టి పారద్రోలెను. ఆహవమల్ల సోమేశ్వరుడును, అతని పుత్రులైన విక్రమాదిత్య జయసింహులును రణరంగమున నిలువజాలక పలాయనము చేసిరి. ఇట్లు కర్ణాటకసైన్యము పంచబంగాళమై పారిపోయినను వీరరాజేంద్రుడు వేంగిని స్వాధీనము చేసికొనుటకు ప్రయత్నము చేయలేదు. దీనికి కారణము ఏమయి యుండునో? వీరరాజేంద్రునికి కూడలి సంగమ రణక్షేత్రమున అతని శాసనములలో చెప్పబడినంత సంపూర్ణవిజయము చేకూడినట్లు అగపడదు. శాసనములందలి యుద్ధవర్ణన కొంతకు కొంతయైన ప్రగల్భోక్తులై ఉండవలెను. ఈ సందర్భమున గమనింపవలసిన అంశములు రెండు కలవు. ఆహవమల్ల సోమేశ్వరుడు నోలంబవాడి నుండి విజయాదిత్యుని నాయకత్వముక్రింద ద్రావిడదేశము మీదికి మరల ఒక దండయాత్ర పంపెను; మరియు ధారాపుర పరమారవంశీయుడైన జననాథుని వేంగీ సంరక్షణార్థము నియోగించెను. కూడలిసంగము యుద్ధమున జయము ఉపలబ్ధమయినను వీరరాజేంద్రుడు వేంగి జోలికి పోక నిజదేశమునకు మరలిపోవుటకు ఇవి కారణములై ఉండనోపును.

వీరరాజేంద్రుడు క్రీ. శ. 1064 లో మరల ఒకమారు వేంగిపై దండు వెడలినట్లు ఉన్నది. అతని తృతీయరాజ్యవర్ష (క్రీ. శ. 1065) శాసనములలో అతడు పొత్తపిదేశ ప్రభువుయొక్కయు, జననాథుని అనుజునియొక్కయు తలలను రణరంగమున తెగవేసెనని వచింపబడియున్నది. పొత్తపిదేశ మనునది ఇప్పటి చిత్తూరు కడప మండలముల లోని చంద్రగిరి రాజంపేట తాలూకాలలో చాలభాగమునకు ప్రాచీన నామము. రాజంపేట తాలూకాలోని పొత్తపి నగరము దానికి రాజధాని; తెలుగుచోళవంశములో ఒక్కశాఖవారికి అది నెలవీడు. ధారాపుర జననాథుని తమ్ముడు అగస్త్యభ్రాత. అతని పే రెద్దియో, ఏసీమను అతడు పాలించుచుండెనో తెలియదు. ప్రాయశః అతడు అన్నతోపాటు వేంగీరాజ్యమునందు ఒక భాగముపై ప్రభుత్వము చేయుచుండినను ఉండవచ్చును. వీ రిరువురును ఆహవమల్ల సోమేశ్వరుని అనుచరులే, తీరాంధ్రమును పాలించుచుండిన దొరలే. వీర రాజేంద్రుడు వేంగిపై ఎత్తి రాగా వీరు అతనిని డీకొని మడిసి యుందురు.

ఆహవ మల్లుడు పై చోళ చండయాత్రకు ప్రతీకారము చేయ నిశ్చయించి మరల విజయాదిత్యుని ద్రావిడదేశము మీదికి దండయాత్ర పంపెను. విజయాదిత్యుడు దక్షిణాశా దిగ్విజయార్థము దండయాత్ర వెడలి సమస్తయుద్ధ సామగ్రిని కూర్చుకొని అరసికెరెయందు దండు విడిసి క్రీ. శ. 1065 డిసెంబరు 7 వ తేదీనాడు నిజపరిజనపరివృతుడై యొడ్డోలగమందుండెనని ఒక శాసనమందు కలదు. కాని తరువాత ఈ దండయాత్ర వృత్తాంతము ఏమియు తెలియరాదు. కాని, పర్యవసానము ఎట్లున్నను అడుగడుగునకు నిజదేశముపై వచ్చు విజయాదిత్యుని దండయాత్రలు కంటక ప్రాయములై వీరరాజేంద్రుని బాధపెట్టదొడగినవి. కావున, ఎట్లైన కర్ణాటకులను ఏపుమాపవలయునని నిశ్చయించి సైన్యము నంతటిని సమకూర్చుకొని యుద్ధపరికరములను, వస్తువాహన సంచయమును సేకరించుకొని కర్ణాటకులపై దండయాత్రను ప్రకటించి క్రీ. శ. 1066 మధ్య యుద్ధమునకు బయలువెడలెను. ఈ దండయాత్రను రెండు భాగములుగ విభజింపవచ్చును. మొదటిది రట్టవాడిమీద దాడి. ఇది తుంగభద్ర పర్యంతము సాగినది. ఆ నదీతటమున జరిగిన భీమ సంగ్రామములో కర్ణాటకులు ఓడిపోయిరి. పెక్కురు చాళుక్య సామంత దండనాయక ప్రముఖులు రణశయ్యను అలంకరించిరి. వీరరాజేంద్రుడు వారి తలలను కోయించి వానిని తన రాజధాని కంపించి కోటకొమ్మలకు మేకుబంది చేయించెనట. ఈ యవమానమును సహింపజాలక ఆహవమల్ల సోమేశ్వరుడు కూడలిసంగమును పొలికలనుగ చెప్పి వీరరాజేంద్రుని యుద్ధమునకు రమ్మని జంకించెను. అతని ఆహ్వానమును అంగీకరించి వీరరాజేంద్రుడు నిర్ణీత రణరంగమునకు నడచెను; కాని, ఆహవమల్లుడు మాట యొప్పున యుద్ధమునకు రాడాయెను. కాని, దేవనాథ సిద్ధి, కేశి అను దండనాయకుల యాధిపత్యముక్రింద ఒక సేనను అతనిని ఎదుర్కొన బంపెను. వీరరాజేంద్రుడు వారిని ఓడించి పారదోలి రట్టవాడి సార్ధసప్తలక్షరాజ్యమును ధ్వంసము గావించి, తుంగభద్రా తటమున జయస్తంభమును ఎత్తించెను.

కల్లరి యనియు, రణభీరువై పారిపోయి పశ్చిమ సముద్రమున డాగె ననియు ఆహవమల్ల సోమేశ్వరుడు చోళ శాసనములలో గర్హింపబడియున్నాడు. నిష్పక్షపాత దృష్టితో చూచిన అతడు అడి తప్పలే దనియే చెప్పవలయును. చెప్పిపంచినట్లు నియమిత కాలమునకు అతని సేనలు రణరంగమున వచ్చి నిలిచి పోటుచూపినవి. అతని సైన్యము వచ్చిన అతడు వచ్చినట్లే కదా! పశ్చిమ సముద్ర ప్రాంతమునకు అతడు పోవుట రణభీరుత్వమువలన కాదు; కూడలిసంగము యుద్ధవ్యాజమున వీరరాజేంద్రుని కృష్ణాతీరమునకు ఎలయించి అతడు ఆ యుద్ధకార్యమున నిమగ్నుడై ఉండ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఒక ప్రచండ సైన్యముతో చోళ సామ్రాజ్యముపై పెడతల నుండి దండుసేయ విక్రమాదిత్యుని పంపుటకొరకు అతడు అచటి కేగెను. ఈ రహస్యమును వీరరాజేంద్రుడు ఎరుగడు. కావున, అతడు నిశ్చింతగ దండు నడపుకొని వేంగిపై కూచిచేసి పోయెను.

వేంగిని సంరక్షించుటకు ఆహవమల్లుడు తగిన ఏర్పాటు చేయకపోలేదు. ధారాపుర జననాథుని, రాజమయ్యను గొప్ప సైన్యముతో కూడ చోళులను కృష్ణను దాటి వేంగిని చొరనీయక అడ్డపెట్టుటకై కాపుంచెను. మరియు, విజయాదిత్యునికి నోలంబవాడిని విసర్జించి స్వరాజ్యమునకు పోవ అనుజ్ఞ ఇచ్చెను. కాని పై ఏర్పాటులవలన అతడు అనుకొనినట్లు వేంగికి రక్షణకలుగలేదు. కృష్ణా తీరమును చేరగనే చోళ సైన్యములకు బెజవాడ సమీపమున కర్ణాటకులతో ఘర్షణ జరిగి యుద్ధము సాగెను. యథాపూర్వము కర్ణాటకులకే పరాజయము కలిగెను. జననాథుడును, రాజమయ్యాయు బ్రతుకు జీవుడా అని పరారి చిత్తగించిరి. విజయాదిత్యుడు ఏమి చేయుచుండెనో తెలియదు. మార్గము ఇట్లు నిర్నిరోధము కాగా వీరరాజేంద్రుడు గోదావరి పర్యంతము దండు చేసి అచటినుండి పూర్వాభిముఖుడై పురోగమించి సప్త కళింగములను దాటి మహేంద్రగిరిని చేరి దాని సానువులపై తన విజయాంకములను చెక్కించెను. అచ్చటినుండి కనమల గుండ కొండలను దాటి అవ్వలి దేశమును ప్రవేశించి చక్రకూట దుర్గమును ఆక్రమించెను.

వీరరాజేంద్రుడు ఇట్లు అప్రతిహత పరాక్రముడై విజయ పరంపరలను పొందుచు కీర్తిని ఆర్జించుచుండగా దక్షిణమునందు అతని ఆత్మ సామ్రాజ్యమున గొప్ప యుపద్రవము తలచూపినది. విక్రమాదిత్యుడు కొంకణము మీదుగ దండు నడపుకొని పోయి కేరళమును ప్రవేశించి అచటి ప్రభువును నిర్జించి కప్పమును గొనెను. తరువాత సింహళులను, పాండ్యులను ఓడించి వారు ఇచ్చిన కానుకలను గ్రహించి ఉత్తరాభిముఖుడై చోళ రాజ్యమును చొచ్చి గంగైకొండ చోళపురమునకు ముట్టడి వేసెను. ఈ వర్తమానము తెలియగా వచ్చినంతనే వీరరాజేంద్రుడు తన యుత్తర దండయాత్రను అపి స్వదేశమునకు వేగిరించి మరలి పోవలసివచ్చెను. కావున, బస్తరు ప్రాంతమును తన చేతిక్రింద ఉంచుకొనుటకొరకు చక్రకూట దుర్గమున తన మేనల్లుడైన రాజేంద్రుని యాధిపత్యముక్రింద కొంత దండును కాణ్యముంచెను; వేంగిని విజయాదిత్యునికి ఇచ్చి అతనితో మైత్రి చేసికొని నిజరాజ్యమునకు తరలి పోయెను.




ఇచ్చట పరామర్శింపదగిన విషయము ఒక్కటి కలదు. వీర రాజేంద్రుడు వేంగిరాజ్యమును దానికి హక్కుదారుడైన తన మేనల్లుడు రాజేంద్రునకు ఈయక అంతదనుక



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తనతో యుద్ధము చేయుచుండిన విజయాదిత్యునికి ఇచ్చుటకు కారణమేమి? వీరరాజేంద్రునకు రాజేంద్రుని యెడ వైరము కల దనియు, తత్కారణమున అతడు వేంగిని రాజేంద్రునకు ఈయక అతని పినతండ్రియు, విద్వేషియును అయిన విజయాదిత్యునికి ఇచ్చె ననియు కొందరు చరిత్రకారులు పై ప్రశ్నకు సమాధానము చెప్పుదురు. కాని, ఉపలబ్ధమైన శాసన సాక్ష్యమునుబట్టి చూడ ఇది సరి యని ఎంచుటకు వీలులేదు. అప్పటి స్థితి గతులను పరిశీలించి చూడ వీరరాజేంద్రుని ఈవికి ముఖ్యకారణము ఇది యని తోచుచున్నది: వీర రాజేంద్రుడు కర్ణాటక బలములను నిర్జించి మహేంద్ర పర్వతము వరకు తీరదేశము పొడుగునను విజయయాత్ర నిర్నిరోధముగ సాగించినను వేంగి, కళింగములు అతనికి వశపడినట్లు అగపడదు. ప్రాయశః విజయాదిత్యుని అధికారమే అచట చెల్లుబడి అగుచుండియుండును. తాను వెనుదిరిగి పోయినంతటనె కర్ణాటకులు విజయాదిత్యునికి సహాయులై వచ్చి వేంగిపై తమ అధికారమును నెలకొల్పుటకు తప్పక ప్రయత్నము చేయుదురు. కావున, విజయాదిత్యునికి వేంగిరాజ్యము ఇచ్చి అతనితో మైత్రి నెరపి తన వానినిగ చేసికొనినచో కర్ణాటకులకు మరల వేంగిని ప్రవేశించుటకు అవకాశము ఉండదని ఎంచి వీరరాజేంద్రుడు అట్లు చేసియుండును.

వీరరాజేంద్రుడు నిష్క్రమించిన వెంటనే విక్రమాదిత్యుడు తన దక్షిణ దిగ్విజయమును పూర్తిచేసికొని వచ్చి వేంగిని ప్రవేశించెను. వీరరాజేంద్రుని పోకయు, విక్రమాదిత్యుని రాకయు కొంచె మించుమించుగ ఏకకాలమున సంభవించినను, భిన్నమార్గముల ననుసరించుట వలననేమొ వారి సైన్యము లొండొంటిని తారసించిన ట్లగపడదు. వీరరాజేంద్రుని యనుగ్రహమునకు పాత్రుడై విజయాదిత్యుడు వేంగిని పడసి అతనితో మైత్రి నెరపినను విక్రమాదిత్యునెడ నతడు ద్వేషము చూపలేదు. కావున విక్రమాదిత్యుడు సూటిగ చక్రకూటముపై దండు నడపుకొని పోయి యా కోటను ముట్టడించెను. కాకతీయులు, హొయిసలులు మున్నగు కర్ణాటక సామంతు లతనికి తోడ్పడిరి. రాజేంద్రుని యాధిపత్యము క్రింద అచట తాణ్యముండిన చోళబలములు దుర్గసంరక్షణమును నిర్వహింప జాలక దానిని త్యజించి వెడలిపోయెను. అంతట విక్రమాదిత్యుడు ఆ కోట నాక్రమించుకొని నాగవంశజుడైన ధారావర్షుని దానికి పాలకునిగ నియమించెను. ఇట్లు చోళులపై దండయాత్రను విజయవంతముగ కొనసాగించి నిజదేశమునకు మరలివచ్చి కృష్ణాతటమున పాళెము దిగియుండగా ఈతని తండ్రియైన ఆహవమల్ల సోమేశ్వరుడు తీవ్రజ్వర పీడితుడై బాధను సహింపజాలక క్రీ. శ. 1068 మార్చి 30 వ తేదీనాడు తుంగభద్రా నదీజలములలో శివనామ స్మరణ చేయుచు మునిగి దేహమును చాలించెను.

ఆహవమల్ల సోమేశ్వరుని మరణము వలన దక్షిణదేశ రాజకీయములలో కొన్ని మార్పులు సంభవించినవి. ఆహవమల్లుని మరణానంతరము, అతని జ్యేష్ఠపుత్రుడు భువనైకమల్ల బిరుదాంకితుడైన రెండవ సోమేశ్వరుడు పట్టాభిషిక్తుడై సామ్రాజ్య భారమును వహించెను. పట్టాభిషేక సమయమున విక్రమాదిత్యుడు అన్న యెడ స్నేహము కలవాడై కల్యాణకటకమునకు పోయియుండెనని బిల్హణుడు తన 'విక్రమాంకదేవచరిత్ర'యందు నొక్కి చెప్పియున్నను ఆ యన్నదమ్ము లెప్పుడును సౌహార్దముతో మెలగినట్టు కన్పట్టదు. విక్రమాదిత్యుడు ఆద్యమునుండియు సింహాసనముపై దృష్టి నిగుడించుచు గోడమీది పిల్లివలె తరుణము వేచియుండెను. వీరరాజేంద్రు డీ రహస్యమును గ్రహించి చక్రకూటమును సాధించుటకును, ఆ ప్రాంతమందు తాణ్యముండిన రాజేంద్రునకు తోడ్పడుటకును దండు వెడలెను. మరియు నీతి విద్యావిశారదుడైన వీరరాజేంద్రుడు ఆ యన్నదమ్ములకు గల వైమనస్యమును పెంపొందించినయెడ తనకు లాభకరమని తెలిసి విజయాదిత్యుని మూలమున విక్రమాదిత్యునితో సంధి సంప్రదింపులు సాగింప నారంభించి యుండినను ఉండవచ్చును. ఈ కారణము వలననేమో విక్రమాదిత్యుడు కృష్ణాతీరమున విడిసియుండినను వీరరాజేంద్రుని ద్వితీయ చక్రకూట దండయాత్ర సందర్భమునం దెచ్చటను చోళులను ప్రతిఘటింపడాయెను. కాని చోళదండయాత్ర మాత్రము నిరాఘాటముగ సాగలేదు. వీరరాజేంద్రుడు సైన్యమును నడపుకొని శబరి, సీలేరు నదుల సంగమ సమీపమున నుండు 'కొండ' యను స్థలమును చేరునప్పటికి కర్ణాటక చాళుక్యబలము లడ్డుపడెను. ఇరువాగులకును అచట జరిగిన ఘోరసంగ్రామములో కర్ణాటకు లోడి పోయిరి. చాళుక్య సామంత, దండనాథ ప్రముఖులు పెక్కండ్రు వీరస్వర్గమును చూరగొనిరి. 'కొండ'యందు జయస్తంభమును నెలకొల్పి వీరరాజేంద్రుడు కళింగమును ప్రవేశించెను. రాజేంద్రుడు కళింగప్రాంతమున చోళసైన్యములను కలసికొనిన ట్లున్నది. అతని శాసనములలో అతడు రాజ్యాభిషిక్తుడు కాకముందు తాను పూర్వదేశము(కళింగము)నందు ద్రోహులైన శాత్రవులను పెక్కండ్రను కూలద్రోసితి ననియు, వైరాగరము కడ చక్రకూట ప్రభువైన ధారావర్షుని నిర్జించి యతని గజయూథములను హరించితి ననియు, స్వబాహుపరాక్రమమువలన కుంతలేశ్వరుని సేనను యుద్ధమున నోడించి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/

నిజ విజయసూచకముగ పుష్పదామమును ధరించితి ననియు ప్రకటించుకొని యున్నాడు. ఈ విజయముల నన్నిటిని అతడు స్వబాహుబలైకమాత్ర సహాయుడై పొందియుండ లేదు. ఈ సమయముననే వీరరాజేంద్రుడు చక్రకూటము కడ కర్ణాట చాళుక్య భూపాలు డంపిన మదగజయూధమును కాల్చి నాశనము కావించితి ననియు, కోణయనగరు సోమయ్య, ఎఱియమయ, ఆదిత్యవర్మ మున్నగువారిని చంపితి ననియు, మల్లిసోమయ, వైదుంబ, దేవనాథాదులను పారదోలితి ననియు, 'కావి' రణరంగమున కాలి యప్పెయాదులను పట్టుకొంటి ననియు క్రీ. శ. 1068 వ సంవత్సరమున వ్రాయించిన తిరుముక్కూడల్ శాసనములో చెప్పుకొని యున్నాడు. కావున వీరరాజేంద్రుడును, రాజేంద్రుడును చక్రకూట ప్రాంతమున పొందిన విజయము లన్నియు ఒక్కదండయాత్రయందే చేకూడెనని చెప్పుట యొప్పును. అట్లయినచో వీర రాజేంద్రుడును, రాజేంద్రుడును ఏకమై కర్ణాటకుల నోడించి తరుమగొట్టి వారికడనుండి చక్రకూటప్రాంతమును మరల స్వాధీన పరచుకొని రని యెంచవలసి యున్నది.

ఈ దండయాత్ర జయవంతముగ కొనసాగించి రాజేంద్రుని చక్రకూట ప్రాంతమున నిలిపి వీరరాజేంద్రుడు నిజరాజధానియైన గంగాపురికి వచ్చి చేరెను. కాని యతడచట చిరకాల ముండ లేదు. విక్రమాదిత్యునితో సఖ్యము కుదుర్చుకొని అతనికి తన కుమార్తె నిచ్చి వివాహము కావించి యతని పక్షమున భువనైకమల్ల సోమేశ్వరునితో యుద్ధము చేయుటకు పోయెను; తుంగభద్ర వరకును దండు నడపుకొనుచుపోయి కంపిలిని తగులబెట్టెను; భువనైకమల్ల సోమేశ్వరుని కర్ణాటకమునుండి తరుమగొట్టి కృష్ణా తుంగభద్రా నదుల యంతర్వేదియందలి కరడికల్లు గ్రామమువద్ద జయస్తంభమును ప్రతిష్ఠించెను; విక్రమాదిత్యునికి కర్ణాటక దేశ మిచ్చి అతనికి పట్టము కట్టి మరల తన రాజధానికి పోయి చేరెను. కాని, అవ్వల చిరకాల మతడు జీవించియుండలేదు. ఎనిమిదేండ్ల కాలము పటుదర్పముతో సామ్రాజ్యపాలనము సాగించి క్రీ. శ. 1070 వ సంవత్సరము ప్రారంభమున కీర్తిశేషుడాయెను.

వీర రాజేంద్రుడు మృతినందిన పిమ్మట దాక్షిణాత్య రాజకీయ పరిస్థితులు సత్వరముగ మారజొచ్చెను. అతని కుమారుడైన అధిరాజేంద్రుడు చోళసామ్రాజ్యాధిపతియై స్వల్పకాలము ప్రభుత్వము సల్పెను. ఇతని సింహాసనారోహణము ప్రజాసమ్మతమైనట్లు తోచదు; ఏలనగా, ఇతని బావయైన చాళుక్య విక్రమాదిత్యుడు వచ్చి యితనిని సింహాసనము నెక్కించ వలసి వచ్చెను. చోళచక్రవర్తులతో పరుల సాహాయ్యముచే గద్దె యెక్కినవా డితడొక్కడే. దీనికి కారణ మేది యైనను, ఇతని పట్టబంధమునకు ప్రతికూలురైనవారు ప్రబలులు పెక్కండ్రు చోళ సామ్రాజ్యమునం దుండి రనియు, వారిమూలమున అతని పట్టబంధమునకు భంగము కలుగవచ్చు ననియు శంకించి విక్రమాదిత్యుడు గంగైకొండ చోళపురమునకు స్వయముగ సైన్యముతోకూడ చని పట్టాభిషేకము జరపెనని విదితమగుచున్నది.

అధిరాజేంద్రుని శత్రువులలోనెల్ల రాజేంద్రుడు ప్రధానుడు. అతని చాళుక్యు డనుటకంటె చోళుడని భావించుటయే యుక్తము. రెండు తరముల చోళరక్త మతని నాళములందు ప్రవహించుచుండినది. అతని తల్లియు, మాతామహియు చోళచక్రవర్తి పుత్రికలు. చేపట్టిన ఇల్లాలు సహితము చోళరాజదుహితయే. పుట్టి పెరిగి విద్యాబుద్ధులు నేర్చినది చోళరాజ ప్రాసాదముననే. కావున అతడు చోళ సింహాసనము నెక్కుటకు అధిరాజేంద్రుని కంటె తనకే యెక్కుడు బాధ్యత కలదని అనుకొనుట వింత కాదు. కాని తన మనోరథసిద్ధియగుట యెట్లు అనునదే ప్రశ్న.

వీరరాజేంద్రుని మరణకాలమున రాజేంద్రుడు చక్రకూట ప్రాంతమున శాణ్య ముండెను. పిత్ర్యమైన వేంగి రాజ్యము నయితము అతనికి లభ్యపడదాయెను. మేనమామయైన వీరరాజేంద్రుడు కర్ణాటక చాళుక్యులకడ నుండి జయించియు దానిని అతని కీయక అతని తండ్రికి బద్ధశత్రుడైన పినతండ్రి విజయాదిత్యుని కిచ్చెను. కావున అతడు తన యుద్దేశమును నెరవేర్చుకొనుటకు స్వశక్తి సామర్థ్యముమీదనే ఆధారపడవలసి యుండెను. మొట్టమొదట పిత్ర్యమైన వేంగి రాజ్యమును స్వాధీనపరచుకొని దానిని మూలస్థానముగ చేసికొని అచటినుండి చోళ సామ్రాజ్యమును సునాయాసముగ సాధింపవచ్చునని యతడు నిశ్చయించెను. కాని వేంగిని జయించుటకు అతనికి బలము చాలదు. మిత్రుల సాహాయ్యములేనిది ఆ కార్యము నెరవేరదు. అప్పటి పరిస్థితులలో అతనికి తోడ్పడదగినవాడు భువనైకమల్ల సోమేశ్వరు డొక్కడే. సోమేశ్వరుడు అధిరాజేంద్రుని బావయైన విక్రమాదిత్యునికి ప్రతిస్పర్థి. వేంగి, చోళసామ్రాజ్యములు విక్రమాదిత్యుని పరిపంథులకు హస్తగతమైనచో అతని బలము సన్నగిల్లును. తత్కారణమున సోమేశ్వరుడు తనకు తప్పక సహాయపడగలడని యెంచి యతని నాశ్రయించెను. సోమేశ్వరుడు రాజేంద్రునితో సఖ్యమున కొడబడి తన సేన నతనికి సహాయమంపెను. విజయాదిత్యుడు రాజేంద్రునికి ఓటుపడి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వేంగినుండి కళింగమునకు పారిపోయి పూర్వగాంగవంశజుడైన రాజరాజ దేవేంద్రవర్మ యాస్థానమున తలదాచుకొనెను. అంతట రాజేంద్రుడు క్రీ. శ. 1070 జూన్ నెల 9 వ తేదీనాడు పట్టాభిషేకము కావించుకొని చోళ సింహాసనము నాక్రమించు ఉద్దేశముతో ద్రావిడదేశముపై దండు వెడలిపోయెను. అదేసమయమున చోళరాజ్యమునం దంతఃకలహము లుద్భవమై అందు అధిరాజేంద్రుడు నిహతుడు కాగా చోళసామ్రాజ్యము సమస్తమును రాజేంద్రునికి సులభముగ హస్తగత మాయెను.

రాజేంద్రు డిట్లు సామ్రాజ్యాధిపతియైనను వేంగియందతని ప్రభుత్వము నిర్బాధకముగ సాగలేదు. కళింగగాంగ వంశజుడైన రాజరాజ దేవేంద్రవర్మయు, డాహలాధిపతియైన యశఃకర్ణదేవుడును విజయాదిత్యునిపక్షము వహించి వేంగిపై నెత్తివచ్చి రాజేంద్రునితో పోరాడగడగిరి. రాజరాజు చోళుల ఆధిపత్యమును త్రోసిపుచ్చి వేంగీ, కళింగముల సంబంధమును త్రెంపవలయునని ఇచ్చగించెను. వీర రాజేంద్రుడు చక్రకూటమును జయించి దానికి కాపుదలగ కొంతసైన్యమును నిలుపుట వలన చోళుల కాప్రాంతమున స్థిరముగ నెలకొనవలయునను ఇచ్చ యుండినట్లు యశఃకర్ణునికి విశదపడెను. చక్రకూటము డాహలరాజ్యమునకు పెరటివాకిలి వంటిది. చోళులవంటి ప్రబలు లాదుర్గమున నెలకొనుట తనకు శ్రేయస్కరము కాదని వారి నచటినుండి ఉద్వాసన చేయుటకు విజయాదిత్యునితోడి మైత్రి మంచిమార్గమని నిశ్చయించి యశఃకర్ణదేవుడు రాజరాజదేవేంద్ర వర్మతో నేకీభవించి విజయాదిత్యుని పక్షమును చేరి రాజేంద్రునిపై యుద్ధమునకు బయలు వెడలెను.

ఈ [illegible]మున విజయాదిత్యుని పక్షమునకు జయము చేకూడెను. అరంధ్రుడైన ఆంధ్రాధీశుని జయించితి ననియు, సప్త గోదావరీ సంగమ స్థానమునందు భగవంతుడైన భీమేశ్వర స్వామికి పెక్కు భూషణముల నిచ్చి యర్చించితి ననియు యశఃకర్ణదేవుడు ప్రకటించుకొని యున్నాడు. మరియు రాజరాజ దేవేంద్రవర్మయొక్క సేనాధిపతియైన బణపతి తాను పలుమారు వేంగీరాజు నోడించి యతని సర్వస్వము నపహరించితి ననియు, చోళ సైన్యమును నిర్మూలించి చోళచమూపతియైన దద్దార్ణవుని తన విజయవార్తను తెలుపుటకు కృతాంత నిలయమునకనిపితి ననియు తెలుపుకొని తన ప్రతాపము నుగ్గడించుకొని యున్నాడు. రాజరాజ దేవేంద్రవర్మయొక్క పుత్రుడైన అనంతవర్మ చోడ గంగదేవు తన తండ్రి ద్రామిళాహవమున మొదట విజయలక్ష్మిని వరించె ననియు, తరువాత రాజేంద్రచోళుని దుహితయైన రాజసుందరిని చేపట్టె ననియు, విజయాదిత్యుడు వార్ధక్యమున అస్తంగతుడగుచున్న భానునివలె చోడ మహార్ణవమున క్రుంకబోవుచుండగా అతని కాశ్రయ మిచ్చి మరల యభ్యుదయము కల్గించె ననియు వక్కాణించి యున్నాడు. దీని కనుగుణముగ రాజేంద్రుడు (మొదటి కులోత్తుంగ చోళదేవుడు) తన తండ్రియైన రాజరాజు గతించిన పిదప దేవసముడైన పినతండ్రి. విజయాదిత్యునికి వేంగీ రాజ్యము నిచ్చితినని వచించియున్నాడు. కావున విజయాదిత్యుని పక్షమువారిచే రాజేంద్రు డోడుట నిక్కము. ఇందుకు కారణ మాతడు వేంగీ సంరక్షణకొరకు రాజేంద్రుడు తన యావచ్ఛక్తిని వినియోగింపజాలక పోవుటయే. చోళసింహాసనముపై నధిష్ఠితుడైనను అతనికి ప్రబల శత్రుపీడ తొలగిపోలేదు. విక్రమాదిత్యుడు అతనిని పదభ్రష్టుని చేయ తరుణము వేచియుండెను. అతని నెదుర్కొనుటకు రాజేంద్రుడు తన బలమును, యుద్ధసామగ్రిని సమకూర్చుకొనవలసి వచ్చెను. ఈ స్థితిగతులలో వేంగీ సంరక్షణకు చాలినంత సేనను అచట నిలుపజాలక పోయెను; యుద్ధమున వారికి తోడ్పడజాలకపోయెను. కావున విజయాదిత్యుని పక్షము వారితో సంప్రతింపులు సాగించి రాజరాజదేవేంద్రవర్మకు తన కూతురు రాజసుందరి నిచ్చి వివాహముచేసి, వృద్ధుడును, సంతాన రహితుడునైన విజయాదిత్యునికి మరణపర్యంతము వేంగీరాజ్యాధిపత్య మిచ్చి సంధి కావించుకొనెను. కాని విజయాదిత్యుడు చిరకాలము జీవించి యుండలేదు; రెండుమూడేండ్ల కాలము రాజ్యముచేసి క్రీ. శ. 1076 లో స్వర్గస్థుడాయెను. అతని ఏకైక పుత్రుడైన శక్తివర్మ చిరకాలము క్రిందటనె కీర్తిశేషుడై యుండిన కారణమున అతని మరణానంతరము వేంగీ రాజ్యము మరల రాజేంద్రు (కులోత్తుంగు)నకే సంక్రమించినది.

విజయాదిత్యుని జీవితకాల మంతయు యుద్ధరంగముననె కడచిపోయినది. సింహాసనముకొరకు అన్నతో ప్రారంభించిన పోరాటము చోళ, కర్ణాటక సంగ్రామమున లీనమై వేంగిమండలము నొక యర్ధశతాబ్దకాలము రణరంగముగ మార్చివేసినది. చోళ, కర్ణాటక యుద్ధములలో అతని పాలు స్వల్పమైనది కాదు. ధైర్యశౌర్య సాహసాదిగుణములకు అత డాటపట్టు. కార్యసాధనయందు పట్టుదల, ప్రతికూల పరిస్థితులవల్ల డిల్లపడని డెందమును అతని యభ్యుదయమునకు ప్రధానకారణములు. నలువదియేండ్లన్నతో పోరాడి పిత్ర్యమైన సింహాసనమును జయించినను కర్ణాటక చాళుక్య ప్రవత్తమున నిమగ్నుడై యుండిన కారణమున దానిని స్వయముగ పాలించుట కవకాశము లేకపోయినది.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అహవమల్లుని యంత్యకాలమున స్వరాజ్యమునకు వచ్చి నెలకొన్నను మొదట చోళ దండయాత్రలవల్లను, తరువాత యన్నకుమారుడగు రాజేంద్రుని యాగమనమువల్లను శాంతముగ రాజ్యసుఖము ననుభవించుట కతని కవకాశము కలుగదాయెను. కావున విజయాదిత్యుడు రాజ్యపాలన మును భృత్యుల కొప్పజెప్పి వారి మూలముననే సర్వ కార్యములను సాగించుకొనవలసి వచ్చెను. ఇతనికి రాజ్య పాలనమున తోడుపడిన భృత్యులలో నాగకులవతంసుడును, భీమరాజ కుమారుడునగు చెమ్మరా జొక్కడు. మేఘగిరి నాథ మేల్పకందర్ప, మలయ భాస్కరాది బిరుదాంకితు డైన భీము డతని కమాత్యుడు. వీరు కాక అదప ఆదెప్ప, భీమన ప్రెగ్గడ మున్నగువారు మరికొందరు శాసనములందు పేర్కొనబడియున్నారు. విజయాదిత్యునకు రాణు లిద్దరు కలరు. హైహయుల ఇంటి యాడుపడుచైన మాదవ యొక్కత; సోమలదేవి తల్లియైన రేవల మరి యొక్కతె. సూర్యవంశజుడైన ముమ్మడి భీము డితని పెంపుడు కొడుకు.

విజయాదిత్యుని మరణముతో వేంగీ పూర్వచాళుక్య చరిత్ర సమాప్తమైనదని చెప్పవచ్చును. ఇతని యనంతర మితని యన్నకుమారుడైన రాజేంద్రునికి వేంగీరాజ్యము సంక్రమించినను అతడు చోళరాజ్యమునె జన్మదేశముగ తలచి స్వవంశమును, జాతిని విస్మరించి చోళుడనని ప్రకటించుకొని ద్రావిడదేశముననె నెలకొనుటవలన వేంగీదేశము తన పూర్వప్రాముఖ్యమును గోల్పోయి చోళ సామ్రాజ్యాంతర్గతమైన సామాన్య మండల మాయెను. నే. వేం. ర.

## పూర్వ గాంగులు

క్రీస్తుశకము అయిదవ శతాబ్దము చివరనుండి కళింగ దేశచరిత్ర అంతకు పూర్వము కంటెను స్పష్టముగ తెలియుచున్నది. ఈ శతాబ్దము కడపట గాంగరాజ వంశము ప్రారంభములో శ్రీకాకుళము జిల్లాలో రాజ్యము స్థాపించి క్రమముగా కళింగదేశమున రాజ్యము చేయుచుండిన వేరు వేరు రాజులను జయించి కళింగము నంతను తన యధికారములోనికి తీసికొని వచ్చెను. ఈ కాలములోనే మైసూరులోకూడ గాంగవంశజులు కొందరు పాలించుచుండుటచేత చరిత్రకారులు వారిని పశ్చిమ గాంగులని మైసూరు గాంగులని, వీరిని తూర్పు గాంగులని కళింగగాంగులని వ్యవహరించు చున్నారు. కళింగగాంగు లను మరల పూర్వగాంగులని, అర్వాచీన గాంగులని రెండు శాఖలుగ విభజించినారు. ఇందుకు కారణము లేక పోలేదు. క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దమునకు పూర్వము వర్ధిల్లిన దక్కను రాజవంశ చరిత్రములకు వలెనే కళింగ గాంగవంశ చరిత్రమునకును శాసనములే ప్రధా నాధారములు. ఈ శాసనములలో తామ్రశాసనములు మొద టివి. క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దమునుండియే తామ్రశాసనములలోపాటు గాంగుల శిలాశాసనములు కూడ దొరకినవి.

కళింగ గాంగ మహీపతులు క్రీస్తు శకము పదునొకండవ శతాబ్దము నుండియే తమ దానశాసనములందు శకవర్ష ములో తేదీలను ఇచ్చుచు తమ వంశానుక్రమమును తెలుపు కొనుచు వచ్చిరి. అందువల్ల కళింగ గాంగ చారిత్రమున క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దము ఒక ముఖ్యఘట్టము. గాంగభూవరులు పదునొకండవ శతాబ్దమునకు పూర్వము తమ శాసనములలో శకవర్షములను ఈయకుండుటకును, అప్పటినుండి మాత్రమే వానిని ఇచ్చుటకును ఇంత వరకు తెలియక పోయినను, ఏదో గొప్పకారణము ఉండియుండవలెను. మొదటివారి ప్రాతపంథను విడిచిపెట్టి తన శాసనములలో శకసంవత్సరములు ఇచ్చిన గాంగ భూపతులలో ప్రథముడు వజ్రహస్త మహారాజు. క్రీస్తు శకము పదునొకండవ శతాబ్దములో వజ్రహస్తుడు మొదలు కొని రాజ్యమేలిన గాంగవంశజులను అర్వాచీన గాంగులని, అంతకు పూర్వులను పూర్వ గాంగులని చరిత్రకారులు వ్యవహరించుచున్నారు. వజ్రహస్తుడు మొదలుకొని గాంగ రాజులు తమ పట్టాభిషేక కాలమునుగూడ తెలుపుకొనుట కలదు. శకవర్షము 960 కి సరియైన క్రీ. శ. 1038లో వజ్ర హస్తుడు కళింగరాజ్యమునకు అభిషిక్తుడయ్యెనని అతని శాసనములలో తెలుపబడినది. వజ్రహస్తుని నాటినుండి అతని సంతతివా రిచ్చిన దాన శాసనములకును, అతనికి పూర్వులైన పూర్వగాంగు లిచ్చిన దానశాసనములకును శాసనవిషయమున చాల వ్యత్యాసము కలదు.

(1) పూర్వగాంగ నృపతులుకూడ తమ దానశాసనము లలో దానకాలమును తెలిపియున్నారు. కాని, దానిని అర్వాచిన గాంగులవలె శకసంవత్సరములలో తెలుపలేదు. కళింగమున తమ గాంగరాజ్యస్థాపనము అయినప్పటినుండి తమ వంశము పేర శకము ప్రారంభించి గాంగేయవంశ (గాంగరాజవంశ) ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరము లలో తమ దానశాసన కాలమును తెలుపుచువచ్చిరి. ఈ సంవత్సరములకు గాంగశక సంవత్సరములనిపేరు: అనగా ఈవంశమువారి పరిపాలనము కళింగములో ఆరంభమై నప్పటినుండి గడచిన సంవత్సరము లనుమాట. ఇవి పూర్వ గాంగరాజుల మొదటి శాసనములలో ప్రవర్ధమాన



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సంవత్సరములని, తరువాత ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరములని, పిదప గాంగేయవంశ ప్రవర్ధమాన విజయ రాజ్యసంవత్సరములని పేర్కొనబడినవి. ఈ విధముగ గాంగశకవత్సరము లిచ్చిన పూర్వగాంగరాజ శాసనములు ఇప్పటికి డాదాపుగ ఏబది దొరకినవి; ఇంకను దొరకుటకు అవకాశ మున్నది. ఇంతవరకు దొరకిన పూర్వగాంగ శాసనములలో ఇంద్రవర్మ మహారాజు గాంగశకము 39 వ సంవత్సరమున ఇచ్చినదే మొదటిది. గాంగశక సంవత్సరములలో ఇంతవరకు దొరకిన కడపటి శాసనము 528 నాటిది. ఇది మధుకామార్ణవ మహారాజొసగిన దానశాసనము. గాంగశకము 39, 528 సంవత్సరములకు నడిమికాలమున వేరు వేరు గాంగవంశపు రాజులు ఇచ్చిన దానశాసనము లనేకము కలవు. ఇంకను గాంగశకవత్సరములు వరుస కలియుటకు చాల శాసనములు దొరకవలసియున్నవి.

ఇది యటుండ ఈ గాంగవంశజులు కళింగమున తమ రాజ్యమును ఎప్పుడు స్థాపించిరి, గాంగశకము తొలిసంవత్సరమునకు సరియైన క్రీస్తు శక సంవత్సరము ఏది, అనగా గాంగశకము ఎప్పటినుండి ప్రారంభమైనది అను విషయములు ఇప్పటికిని చిక్కు విడని సమస్యలే. ఇప్పటికిని చాల మంది చరిత్రకారులు గాంగశకము, అనగా కళింగములో గాంగరాజ్యము 498 లో ప్రారంభమైనదని భావించుచున్నారు. కాని ఈ సంవత్సరమునకు ముందు ప్రారంభమైనదని, తరువాత ప్రారంభమైనదని సంవత్సరములు నిర్ణయించిన వారు లేకపోలేదు. కాని, క్రీస్తుశకము 498 వ సంవత్సరమే తాత్కాలికముగా చరిత్రకారుల అమోదమును పొందినది. ఇంకను నిరూఢముగ దీనిని నిర్ణయించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి.

(2) పూర్వగాంగ శాసనములలో గాంగవంశ ప్రశస్తియు, దాత పేరుమాత్ర ముండును. గాంగరాజ్యము కళింగములో స్థాపితమైన తరువాత రమారమి నూరు సంవత్సరములకు శాసనదాతలు తమ తండ్రుల పేరులు తరచుగను, తాతల పేరులు అరుదుగను చెప్పుకొనుచు వచ్చిరి. ఈ విధముగా కాలము గడచిన కొలది గాంగశాసనములలో దాతలు మూడు తరములను ఇచ్చుచు వచ్చిరి. పూర్వగాంగ వంశజుల పేరు లన్నియు ఇంద్రవర్మ, దేవేంద్రవర్మ, రాజేంద్రవర్మ, భూపేంద్రవర్మ, నందవర్మ, అనంతవర్మ అని వర్మాంతములు. దానార్ణవుడు, గుణార్ణవుడు, వజ్రహస్తుడు మధుకామార్ణవుడు అను నాలుగు పేర్లు మాత్రమే పూర్వగాంగ శాసనము లన్నియు వెదకినచో వర్మాంతములు కానివి కనిపించును. ఇంద్రవర్మ తండ్రి దానార్ణవుడు: దేవేంద్రవర్మ తండ్రి గుణార్ణవుడు. అనంతవర్మ కుమారుడు మధుకామార్ణవుడు.

ఇక అర్వాచీన గాంగ శాసనములలో గాంగవంశ వృతము పూర్తిగ తెలుపబడుటయే కాక, ఈ వంశము వారి పౌరాణిక వంశానుకథనముకూడ ఈయబడినది. పౌరాణిక వంశాను కథనము తెలుపునవి ముఖ్యముగా శకవర్షము 960 కి సరియైన క్రీ. శ. 1038 లో పట్టాభిషిక్తుడైన వజ్రహస్తుని మనుమడును, శకవర్షము 999 (క్రీ. శ. 1078) లో పట్టాభిషిక్తుడైన వాడును అగు అనంతవర్మ చోడగంగదేవుని శాసనములు. చిత్ర మేమన, గాంగవంశ వృతము పూర్తిగ ఇచ్చిన ఈతని శాసనములలో వర్మాంత నామధేయులు ఒక్కరును కానరారు. సాధారణముగా కామార్ణవ, రణార్ణవ, గుణార్ణవ, దానార్ణవ, వినయాదిత్య, వజ్రహస్త నామధేయులే కాని. ఈ కారణమున చాలకాలము వరకు పూర్వ గాంగులు, అర్వాచీన గాంగులు ఒక్క వంశమువా రగుదురా; వేరు వంశములవారా యని చరిత్ర పరిశోధకులలో మొదట కొంతకాలము చర్చలు సాగినవి. కాని, దానార్ణవ, గుణార్ణవ, మధుకామార్ణవ, వజ్రహస్త నామములు పూర్వ గాంగులలోను అర్వాచీన గాంగులలోను కనిపించుటవలనను, క్రీ. శ. 1038 లో పట్టాభిషిక్తుడైన వజ్రహస్తుని తండ్రి మధుకామార్ణవుడు గాంగశకము 528 నాటి దానశాసనమును ఇచ్చిన మధుకామార్ణవుడే కావచ్చునను ఊహావలనను అర్వాచీన గాంగులు, పూర్వగాంగులు ఒక్కరే అనియు, అర్వాచీన గాంగులు పూర్వ గాంగుల సంతతి వారే అనియు చరిత్రకారులు నిర్ధారించియున్నారు.

ఈ విధముగా పూర్వగాంగ, అర్వాచీనగాంగ వంశములు ఒక్కటే అని నిర్ణయమైనది కనుక, అర్వాచీన గాంగ శాసనములలోని వీరి పౌరాణిక వంశ కథనమును అనుసరించి కళింగ గాంగవంశజుల పుట్టు పూర్వోత్తరములు ఇట్లు తెలియవచ్చుచున్నవి.

కళింగ గాంగులు బ్రహ్మ కుమారుడైన అత్రి సంతతివారు గనుక ఆత్రేయ గోత్రులు; అత్రి కుమారుడైన చంద్రుని వంశములోని వారు గనుక చంద్రవంశ క్షత్రియులు. చంద్రుని కొడుకైన బుధుని వంశములో పురూరవ, ఆయు, నహుష, యయాతి, తుర్వసు లుదయించిరి. తుర్వసునకు చాలకాలము సంతానము లేకపోవుటచేత అతడు గంగాదేవిని ఆరాధించి, గాంగేయుడను కుమారుని వడసెను. ఇతనివల్లనే ఈ వంశమునకు గంగాన్వయమని పేరు కలిగినది. గాంగేయుని కొడుకు విరోచనుడు. ఇతని సంతతివారిలో కోలాహలుడు పుట్టి కోలాహలపురమును



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



నిర్మించి రాజ్యమును పాలించెను. కోలాహలపురమును 80 తరములవారు పరిపాలించిన వెనుక వీరసింహుడను రాజు జనించెను. ఈతనికి కామార్ణవ, దానార్ణవ, గుణార్ణవ, మారసింహ, వజ్రహస్తులు అయిదుగురు తనయులు కలిగిరి. వీరిలో కామార్ణవుడు తన పినతండ్రి ఆక్రమించుకొన్న పైతృక రాజ్యమును మరల తీసికొనగల శక్తి సంపన్నుడయినను తన నలుగురు సోదరులతోను దేశమును విడిచి తూర్పు దిశకు ప్రయాణమై వచ్చి మహేంద్రగిరి నెక్కి అచట గోకర్ణస్వామిని ఆరాధించి అతని యనుగ్రహమున శ్వేతచ్ఛత్రము, చామరము, సామజ ధ్వజము, వృషభ లాంఛనము, పింఛాంచిత కుంత నికరము, మకర తోరణము, హుడుక్క, కాహళము, శంఖము మొదలయిన రాజ్య చిహ్నములు పొంది యుద్ధములో శబరాదిత్యుని చంపి కళింగ రాజ్యమును గ్రహించి, దంతాపురమను నగరమును రాజధాని కావించుకొని పాలించుచు, తమ్ముడు దానార్ణవునికి యౌవరాజ్య పట్టము కట్టి మిగిలిన ముగ్గురు సోదరులలో గుణార్ణవునికి అంబవాడి విషయమును, మారసింహునికి సోదామండలమును, వజ్రహస్తునికి కంటకవర్తనిని ఇచ్చెను. కామార్ణవుడు జయించిన శబరాదిత్యుడెవ్వరో ఇంతవరకు తెలియరాలేదు. [illegible]యన్నది సవరపదమునకు సంస్కృతీకరణమగుటచేత శబరాదిత్యుడు ప్రాయికముగా సవరనాయకుడై యుండవచ్చును. కోలాహలపురము మైసూరు రాజ్యములోని ఇప్పటి కోలారు. దీనికి కువలాలపురమని నామాంతరము. కామార్ణవునికి సంతానము లేనందున కావచ్చును అతని యనంతరము దానార్ణవుడును, అతని సంతతివారును కళింగమును పరిపాలించిరి. దానార్ణవునికి పిదప కళింగమును పరిపాలించిన పదునాలుగవ రాజు నాలుగవ కామార్ణవుని మనుమడును, నాలుగవ వజ్రహస్తుని కుమారుడును అయిన మధుకామార్ణవుడు. ఈతని కుమారుడైన వజ్రహస్తుడే శకము 960 (క్రీ. శ. 1088) లో పట్టాభిషిక్తుడై కళింగమునకు అధిపతియయ్యెను.

ఇన్ని విషయములు తెలిసినను పూర్వ గాంగులలోని ఏయే రాజులు అర్వాచీన గాంగ వంశానుక్రమణికలలోని ఏయేరాజు లగుదురో గుర్తించుటకుగాని, పూర్వగాంగుల శాసనములవల్ల వారి పేర్లు తప్ప వారి కాలమునాటి చారిత్రక విశేషములను తెలిసికొనుటకు గాని వీలగుటలేదు. కళింగమును జయించినట్లో, దానిని ఆక్రమించుకొన్నట్లో దానికి ఇరుగు పొరుగుల వర్ధిల్లిన సమకాలిక రాజ్యముల వారి శాసనములలో ప్రస్తావన వచ్చును కాని పూర్వ గాంగ శాసనములలో దాన విషయము ఒక్కటి తక్క మరి యేవిషయమును గురించిన ప్రస్తావమును ఉండదు. అర్వాచీన గాంగశాసనముల వల్ల మనకు ఎక్కువ చరిత్ర విషయములు తెలియవచ్చును.

పూర్వగాంగవంశజుల యిష్టదైవము శివుడు మహేంద్రగిరిమీద ఉన్న గోకర్ణస్వామి. మహేంద్రగిరి గంజాము జిల్లాలోని ఇప్పటి మహేంద్రగిరియే. పూర్వగాంగరాజులు శకల శశాంకశేఖరధరుడును, సకల భువన నిర్మాణైక సూత్రధారుడును, మహేంద్రాచలామలశిఖర ప్రతిష్ఠితుడును, పరమేశ్వరుడును అయిన భగవంతుడు గోకర్ణస్వామి చరణ యుగళమునకు ప్రణమిల్లుటచేత విగత కలికలంకులును, స్వఖడ్గ పరిస్పందముచేత సకల కళింగమునకు అధిరాజులును అయిరి. వీరు మాతాపితృ పాదానుధ్యాతులు; వీరిలో అనేకులు సాధారణముగా తాము పరమమాహేశ్వరులమని చెప్పుకొనిరి. అమరపురముతో దీటు వచ్చునదియు, సర్వర్తు సుఖరమణీయ మైనదియు, విజయవంతమైనదియు అగు కళింగ నగరము వీరి ప్రధాన రాజధాని. ఈ కళింగ నగరము శ్రీకాకుళము జిల్లాలో వంశధారా నదీతీరమున ఉన్న ముఖలింగమే యని చరిత్రకారులు నిర్ధారించినారు. ముఖలింగములోని శాసనముల వలన, ఇది పూర్వము నగర మనియు, నగరి కటక మనియు వ్యవహరింపబడినట్లు తెలియుచున్నది. కళింగనగరముతో సమానముగ కడు పురాతన కాలమునుండియు ప్రఖ్యాతి చెందిన మరియొక నగరము దంతపురము. బౌద్ధవాఙ్మయములో దంతపుర ప్రస్తావము అనేక గ్రంథములలో వచ్చును. దంతపురమును పురాతన కాలములో బ్రహ్మదత్తుడు పరిపాలించుచుండినపుడు 'ఖేమథేర' బౌద్ధాచార్యుడు బుద్ధుని ఎడమదవుడ మీదికోరపంటిని అతనికి ఇచ్చె ననియు, దంతకుమారుడు దానిని సింహళమునకు తీసికొని వెళ్ళువరకు అది కళింగములోనే ఉండె ననియు బౌద్ధగాథలు తెలుపుచున్నవి. దంతపుర మేది అనువిషయమున చరిత్రపరిశోధకులలో అభిప్రాయభేదము కలదు. కొందరు అది శ్రీకాకుళము జిల్లా శ్రీకాకుళము దగ్గరమున్న దంతవక్త్రుని కోటయే అని చెప్పుదురు. ఇది ఎంతవరకు నిజమో చెప్పలేము. గాంగవంశజులకు మొదట దంతపురమే రాజధానిగ ఉండెనని, తరువాత అది ద్వితీయ రాజధాని అయినదని కొందరు చెప్పుదురు. విశాఖపట్టణము జిల్లాలో దంతనదీతీరమున ఒక దంతపురము కలదు. పురాతన దంతపురమును, ఇదియు ఒక్కటి అగునో కాదో తెలియరాదు. దంతపురము శాసనములలో దంతాపురమనియు, వ్యవహృతమైనది.

ఇంతవరకు తెలియవచ్చిన మొదటి పూర్వ గాంగరాజు మొదటి ఇంద్రవర్మ (80 - ఇట్లిచ్చిన యంకెలు గాంగశక



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వత్సరములు; వీనికి క్రీస్తు శకము 498 కలిపిన క్రీస్తుశక సంవత్సరములు అగును; - క్రీ. శ. 587). ఇతడు 89 నాటి దానశాసనమును దంతపురమునుండి ఇచ్చెను. ఈ శాసనమున ఇతనికి త్రికళింగాధిపతి అను బిరుదము కలదు. త్రికళింగము అనునది కళింగములోని ఇప్పటి యే ప్రదేశమునకు వర్తించునో తెలియదు. దీనిని గురించి ఇదివరలో చాల చర్చలు జరిగినవి; కాని, ఇదమిత్థమని నిర్ణయము కాలేదు. వేరు వేరు కాలములలో త్రికళింగాధిపతి బిరుదమును గాంగ వంశజులే కాక వేంగీ పూర్వ చాళుక్యులును, దక్షిణ కోసలాధిపతులును, త్రిపురి కళచురి రాజులును కూడ వహించుటచేత ఈ రాజ్యములకు చేరియున్న కళింగములోని పర్వతారణ్య ప్రాంతము కావచ్చు ననియు, ప్రాయికముగా ఇది గాంగ రాజ్యమునకు పశ్చిమ, నైరృతి దిశలయందు ఉండవచ్చు ననియు ఊహించుచున్నారు. కళింగములో గాంగరాజ్యమును స్థాపించిన యతడు ఇంద్రవర్మయో, కాక, యెవ్వడైన అతని పూర్వుడో తెలియదు.

ఇంద్రవర్మకు తరువాత దానశాసనము ఇచ్చినట్లు తెలిసిన మహారాజు మహాసామంతవర్మ (64 - క్రీ. శ. 562). ఇతడు తన దాన శాసనమును జయశ్రీ నివాసమైన సౌమ్యవనమునుండి ఇచ్చెను. ఇతడును త్రికళింగాధిపతియే. ఇంద్రవర్మ, మహాసామంతవర్మలకు తరువాత త్రికళింగాధిపతి బిరుదమును వహించిన పూర్వగాంగవంశజులు లేరు. మహాసామంతవర్మకును, ఇంద్రవర్మకును గల సంబంధము ఎట్టిదో తెలియదు. పూర్వగాంగ శాసనములలో గాంగవంశవృక్షము లేనందున కళింగమును ఏలిన ఈ రాజుల అను పూర్విని వానిలో తెలిపిన దాతను అతని తండ్రి తాతలను లేఖ, కోత్కీర్ణకుల వారి తండ్రుల నామ సామ్యమును, గాంగశక సంవత్సరముల అంతరమును అనుసరించి నిర్ణయింపవలసి యుండును. ఒక్కొక్కప్పుడు లేఖకుడును, ఉత్కీర్ణకుడును ఒక్కరే యగుదురు; ఒక్కొక్కప్పుడు లేఖకుడు వేరు, ఉత్కీర్ణకుడు వేరు అగుచుందురు. పూర్వగాంగశాసనములలో లేఖ కోత్కీర్ణకులను గురించి చెప్పు మొదటి శాసనము మహాసామంతవర్మదే. ఈ శాసనమును లిఖించినవాడును, చెక్కినవాడును ఒక్కడే - ఖానుచంద్రనామమైన వినయ చంద్రుడు. సామంతవర్మ పిదప కళింగాధిపత్యము వహించిన వాడు రాజసింహ, రణభీత బిరుదాంచితుడైన హస్తివర్మ (79 - క్రీ.శ. 577; 80 - క్రీ.శ. 578). ఇతని శాసన లేఖకుడు కూడ వినయచంద్రుడే అగుటచేత మహాసామంతవర్మ, హస్తివర్మలకు కల బంధుత్వము తెలియగపోయినను సామంతవర్మకు హస్తివర్మ చాల సమీపస్థు డనియు, ఒకవేళ తండ్రియో సోదరుడో కావచ్చు ననియు ఊహింపవచ్చును.

హస్తివర్మకు తరువాత కళింగాధిపతులుగా తెలియ వచ్చిన శాసన దాతలు ఇంద్రవర్మ నామాంచితులు. వీరి శాసనములు ఇంతవరకు కానవచ్చినవి గాంగశకము 87, 87, 91, 128, 137, 138, 154 (క్రీ. శ. 585, 585, 589, 626, 635, 636, 652) సంవత్సరములనాటివి. ఇంద్రవర్మ అను పేరుగల ఈ శాసనదాతలు ఒకరో, ఇద్దరో, ముగ్గురో తెలియవచ్చుట లేదు; వారి పరస్పర బాంధవ్యము అంతకంటెను తెలియదు. కాని 87, 87, 91 సంవత్సరములనాటి శాసనములను లిఖించినవాడు పైనుడివిన వినయచంద్రుడే. అదియును గాక, హస్తివర్మకున్న రాజసింహ బిరుదము ఈ శాసనదాతకును గలదు. అందువలన ఈ మూడు శాసనములను ఇచ్చిన (రెండవ) ఇంద్రవర్మ ఒక్కడే యనియు, అతడు హస్తివర్మ తర్వాత సింహాసన మెక్కె ననియు ఊహింపవచ్చును. ఒకవేళ ఇతడు హస్తివర్మ కొడుకే అగునేమో. ఈతనికి తక్క ఇంద్రవర్మ నామాంచితులగు ఇతరులకు రాజసింహ బిరుదము లేదు. ఈ కారణముచేత 128 నుండి రాజ్యమేలిన ఇంద్రవర్మ నామధేయులు వేరని తోచుచున్నది.

పూర్వగాంగ నృపతుల వంశావతార క్రమము కాని, వారి రాజ్యపాలన కాలక్రమము కాని సరిగా నిర్ణయము కానందున వాతాపి చాళుక్యరాజయిన రెండవ పులకేశి సత్యాశ్రయ వల్లభుడు కళింగముపై దండెత్తివచ్చి యోడించిన పూర్వగాంగ భూవరుడు ఎవరో నిర్ధారణగా చెప్పలేము. కాని ప్రాయికముగా అతడు రాజసింహ బిరుదాంచితుడైన రెండవ ఇంద్రవర్మ తరువాత గాంగ సింహాసనమును అధిష్ఠించిన మూడవ ఇంద్రవర్మయై యుండవచ్చును. ఈతని కాలములోనే చీనా బౌద్ధయాత్రికుడు యువాన్ చ్వాంగ్ కళింగదేశమునకు వచ్చెను. ఈ దేశము అరణ్యాక్రాంతమైన దనియు, ఇక్కడ పండ్లు, పుష్పములు బాగుగా దొరకు ననియు, ఇరుగు పొరుగు దేశములలో శ్రేష్ఠమైనవని ఎన్నిక చేయబడు నల్లని అడవి ఏనుగులు ఇక్కడ చాల ఉన్న వనియు, మధ్యహిందూ దేశమువారికి, ఈ దేశీయులకు భాషలోను, మర్యాదలలోను చాల వ్యత్యాస మున్న దనియు, ఈ దేశీయులు మోటువా రనియు, పెడసరమైనవా రనియు అతడు చెప్పుచున్నాడు. అతడు కళింగమునకు వచ్చునాటికి బౌద్ధము క్షీణించినది. బౌద్ధులు తక్కువ యనియు, ఇతర మతావలంబకులే యెక్కువ యనియు అతడు వ్రాసియున్నాడు. ఇచట దాదాపు పది బౌద్ధ సంఘారామము లుండెను. మహాయాన, స్థవిర సంప్రదాయములకు చెందిన యధ్యయనపరులు 500 మంది బౌద్ధభిక్షువు లుండి రట. బౌద్ధేతర



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మతములకు చెందిన దేవాయతనములు వందకు పైగా నుండెను. ఇతర మత సంప్రదాయములకు చెందినవారు అసంఖ్యాకులు. వీరిలో నిర్గ్రంథులు, అనగా దిగంబరులైన సంప్రదాయమువారు అధికముగా నుండిరి. ఈ కళింగదేశ మొకప్పుడు బహుజనాకీర్ణముగ నుండెనట. కాని యొక కళింగదేశీయునిచేత అవమానితుడయిన ఒక ఋషిశాపము వలన ఇది నిర్మానుష్య మయినదట. ఇది జరిగిన చాల సంవత్సరములకు మరల జనాకీర్ణమయినది కాని ఇప్పటికిని దేశములో జనము చాల తక్కువయని అతడు వ్రాసి యున్నాడు. (కళింగ) నగరము దక్షిణ ప్రాకారమువద్ద అశోకవన ముండెనట. అక్కడ పూర్వపు బుద్ధులు నలుగురు కూర్చుండి యోగాభ్యాసము చేయువారట. ఈ దేశములో ఉత్తరమున పర్వతపు మిట్టమీద ఒక శిలామయ చైత్య ముండెను. దీనియెత్తు నూరడుగులకు పైని. ఇక్కడ వర్తమాన కల్పారంభమున ఒక ప్రత్యేక బుద్ధుడు నిర్వాణము నొందినట్లు యువాన్ చ్వాంగ్ వ్రాసియున్నాడు.

గాంగశకము 128 187, 154 సంవత్సరములనాటి మూడవ ఇంద్రవర్మ ఒక్కడే అనియు, ఇతడు రెండవ ఇంద్రవర్మవెనువెంటనే రాజ్యమునకు వచ్చె ననియు ఊహించుటకు అవకాశము కలదు; ఏలన, 128 నాటి శాసనమును చెక్కినవాడు వినయచంద్ర తనయుడైన ఆదిత్యమంచి. ఈ వినయచంద్రుడు 87, 87, 91. నాటి శాసనముల లేఖకుడే కావచ్చును. అట్లయినచో 91 నాటి ఇంద్రవర్మకు 128 నాటి ఇంద్రవర్మ సమీపస్థుడే కాదు; వెంటనే రాజ్యమునకు వచ్చినవాడును కావచ్చును. 187, 154 సంవత్సరములనాటి శాసనములు చెక్కినవాడు ఆదిత్య భోగిక తనయుడైన ఖండిచంద్రుడు; లేఖకుడు ధర్మచంద్రసూనుడయిన శాంబపురోపాధ్యాయుడు. ఆదిత్య భోగికుడు ఆదిత్యమంచి ఒక్కరే కావచ్చును. అట్లయినచో 128, 187, 154 నాటి శాసనములు ఇచ్చిన ఇంద్రవర్మ ఒక్కడే-మూడవ ఇంద్రవర్మ-యగుట నిశ్చయము. 128 వ సంవత్సరమునాటి ఇంద్రవర్మ తనతండ్రిపేరు చెప్పలేదు; కాని, మిగిలిన రెండు శాసనములను ఇచ్చిన ఇంద్రవర్మ దానార్ణవుని కుమారుడు. 187 నాటి శాసనము దంతపురము నుండియు, మిగిలినవి కళింగనగరము నుండియు ఈయబడినవి. 188 నాటి ఇంద్రవర్మ శాసనప్రశస్తికిని, 128, 187, 154 సంవత్సరములనాటి శాసనముల ప్రశస్తికిని చాల భేద మున్నది. ఇది యటుండ, 187, 154, 188 సంవత్సరములలో ఇచ్చిన శాసనముల లిపి ఒక్కతీరున ఉన్నది; కాని లేఖకోత్కీర్ణకులును ఒక్కరే. 188 నాటి ఇంద్రవర్మ శాసనము తద్విరుద్ధము. కావున ఈ యింద్రవర్మయు, 187, 154 సంవత్సరముల నాటి మూడవ ఇంద్రవర్మయు ఒక్కరగుదురా అని సందియము. దానార్ణవుడు అనుపేరు ఇంద్రవర్మ పూర్వునికి నామాంతరమని వేరుగా చెప్పవలసి నది లేదు.

గాంగశకము 154 (క్రీ. శ. 652) తరువాత, గుణార్ణవుని కొడుకైన (మొదటి) దేవేంద్రవర్మ శాసనములే (183 - క్రీ. శ. 681; 184 - క్రీ. శ. 682; 192 - క్రీ. శ. 690) దొరకినవి. ఇతని మొదటి శాసనమునకును, ఇతని పూర్వుడయిన ఇంద్రవర్మశాసనమునకును కల యంతరము 29 సంవత్సరములు. అయినను, ఇంద్రవర్మ 154 నాటి శాసనము చెక్కిన ఖండిచంద్రుని కొడుకు సర్వచంద్రుడే దేవేంద్రవర్మ శాసనోత్కీర్ణకుడు అగుటచేత ప్రాయికముగా ఇతడు మూడవ ఇంద్రవర్మ కొమారుడై ఉండు ననియు, మూడవ ఇంద్రవర్మకు గుణార్ణవ నామాంతరము ఉండె ననియు ఊహింపవలసి యున్నది. ఈ మొదటి దేవేంద్రవర్మ కడపటి శాసనము 195 (క్రీ. శ. 693) నాటిది.

మొదటి దేవేంద్రవర్మ తరువాత తెలియవచ్చిన పూర్వగాంగరాజు అతని కుమారుడయిన (మొదటి) అనంతవర్మ (204 - క్రీ. శ. 702). ఇతని అనంతరము ఇతని కుమారులైన నందవర్మ (221 - క్రీ. శ. 719), (రెండవ) దేవేంద్రవర్మలు (251 - క్రీ. శ. 749; 254 - క్రీ. శ. 752) కళింగ రాజ్యమును పరిపాలించిరి. వీరి తరువాత మరి యేబది సంవత్సరములవరకు గాంగనృపతులు ఇచ్చిన దానశాసనములు ఇంతవరకు కానరాలేదు. తరువాత మనకు తెలియవచ్చు కళింగ భూవరులు (మొదటి) రాజేంద్రవర్మ కుమారులయిన (రెండవ) అనంతవర్మ (804 - క్రీ. శ. 802), (మూడవ) దేవేంద్రవర్మలు (806 - క్రీ. శ. 804; 808 - క్రీ. శ. 806; 810 - క్రీ. శ. 808). గాంగశకకాలము ఈయని (మొదటి) వజ్రహస్తదేవుని శాసనమును, దేవేంద్రవర్మ కుమారుడు (రెండవ) అనంతవర్మ శాసనమును వాని లోని ప్రశస్తిని పట్టి చూడగా ఈకాలము (క్రీ. శ. 808) నాటివే అని తోచుచున్నది. పై నుడివిన మూడవ దేవేంద్రవర్మకు తరువాత కళింగరాజ్యమును ఏలినవాడు అతని అన్న (రెండవ) అనంతవర్మ కుమారుడు (రెండవ) రాజేంద్రవర్మ. ఇతడు తన పినతండ్రి (మూడవ) దేవేంద్రవర్మ రాజ్యకాలములోనే యువరాజుగ నుండి, 814 సంవత్సరమున ఒక దానశాసనమును ఇచ్చెను. ఈతడు ఎప్పుడు కళింగరాజ్యమునకు అభిషిక్తు డయ్యెనో తెలియదు కాని 814 (క్రీ. శ. 812)కు తరువాత 28 సంవత్సరములకు, అనగా 842 (క్రీ. శ. 840)లో మహారాజుగా ఉండినప్పుడు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అత డిచ్చిన దానశాసనము ఒకటి కలదు. అందువలన అతడు అంతవరకు కళింగమును పరిపాలించు చుండుట నిశ్చయము. రెండవ రాజేంద్రవర్మ యనంతరము కళింగ సింహాసనమును అధిష్ఠించినవాడు అతని పినతండ్రి దేవేంద్ర వర్మ కుమారుడు సత్యవర్మ (851 - క్రీ. శ. 849). ఇతనికి తరువాత ఇతని సోదరుడు (మూడవ) అనంతవర్మ (858 - క్రీ. శ, 856) రాజ్యమును ఏలెను. గాంగ శక సంవత్సర మును ఇచ్చిన తరువాతి శాసనము 897 (క్రీ. శ. 895) నాటిది. అది భూపేంద్రవర్మ కుమారుడు (నాలుగవ) దేవేంద్రవర్మది. భూపేంద్ర, రాజేంద్ర పదములు సమానార్థకములు అగుటచేత భూపేంద్రవర్మ, రాజేంద్రవర్మలు ఒక్కరే అని ఊహింప బుద్ధి పుట్టును. కాని, పురుష నామముల యర్థసామ్యమును బట్టి వారు ఒక్కరే అని నిర్ణయింప బూనుట సమంజసముగా తోచదు.

మొదట తెలుగు - కన్నడ లిపితో ప్రారంభమైన పూర్వగాంగ రాజశాసనములు గాంగ శకము 897 (క్రీ. శ. 895) నాటికి పూర్తిగా నాగరిలిపి శాసనములు అయినవి. పూర్వగాంగ శాసనములలో నాగరాక్షరములు కానవచ్చుటకు ఆరంభము గాంగశకము 195 (క్రీ. శ. 693) నుండి. అప్పటినుండి రెండు వందల సంవత్సరములలో క్రమముగా శాసనలిపి మారి, కడకు పూర్తిగా నాగరమైనది. ఇందుకు కళింగమునకు ఉత్తరదేశరాజ్య సంబంధమును, తద్రాజ్య ప్రభావమును కారణము కావచ్చును.

897 తరువాత గాంగశక కాలమును ఇచ్చు గాంగ శాసనములు మూడు మాత్రమే దొరకినవి: మొదటిది కామార్ణవుని కుమారుడైన (రెండవ) వజ్రహస్తదేవ మహారాజు 500 (క్రీ. శ. 998) నాటి శాసనము. ఇది దంతిపురమునుండి ఈయబడినది. ఇది దంతపురమే అగునేమో; రెండవది కళింగనగరమునుండి (నాలుగవ) అనంతవర్మ కుమారుడైన (నాలుగవ) దేవేంద్రవర్మ ఇచ్చిన గాంగ శకము 520 (క్రీ. శ. 1018) నాటి శాసనము; మూడవది ఇతని సోదరుడు మధుకామార్ణవుడు రాజధాని కళింగనగరమునుండి 528 (క్రీ. శ. 1026)లో ఇచ్చిన శాసనము. పైనుడివిన (రెండవ) వజ్రహస్తదేవ మహారాజు(500)నకును, (నాలుగవ) దేవేంద్రవర్మకును నడుమగల అంతరము ఇరువది సంవత్సరములు. అంతరము ఎంతయో లేదు కనుక వారు ఉభయులును ఒకవేళ తండ్రి కొడుకు అయినగావచ్చును. అట్లయినచో అనంతవర్మ అనునది (రెండవ) వజ్రహస్తదేవుని నామాంతరమై ఉండవలయును. ఇట్లయినచో కామార్ణవుని కొమారుడు వజ్రహస్తదేవ మహారాజని, ఇతనికి దేవేంద్రవర్మ (క్రీ.శ. 1018), మధుకామార్ణవుడు (క్రీ. శ. 1026) అని ఇద్దరు కుమారులని నిశ్చయింప గుదురును.

ఇట్లయిన ఈ సందర్భమున గమనింప దగిన మరొక విషయము కలదు. పౌరాణిక వంశాను కథన సహితమైన సంపూర్ణ గాంగ వంశవృక్షమును అనుసరించి చూచినచో క్రీ. శ. 1038 (శకము 960)లో కళింగ రాజ్యమునకు అభిషిక్తుడయిన వజ్రహస్తదేవునికి పూర్వపు మూడు తరములు శాసనములవల్ల తెలియవచ్చు పూర్వగాంగ రాజుల కడపటి మూడు తరములతోను సరిగా సరిపోవుచున్నవి; ఎట్లన వజ్రహస్తదేవుని (క్రీ. శ. 1038) ప్రపితామహుడు కామార్ణవుడు; పితామహుడు కామార్ణవతనూభవుడు నాలుగవ అనంతవర్మ అను (రెండవ) వజ్రహస్తదేవుడు; తండ్రి మధుకామార్ణవుడు. సంపూర్ణవంశ వృక్షమును అనుసరించి కామార్ణవతనయుడైన వజ్రహస్తునికి కామార్ణవ, గుండమ రాజ, మధుకామార్ణవులు కుమారులు. మధుకామార్ణవ (గాంగశకము 528) సోదరుడైన నాలుగవ దేవేంద్రవర్మ (గాంగశకము 520) కామార్ణవ, గుండమ రాజులలో ఎవడో యొకడు కావలెను. ఈ రీతిని పూర్వగాంగరాజ, అర్వాచీన గాంగరాజ వంశావళి తరము లిచట కలియుచున్నవి.

ఈ విధమున పూర్వగాంగ భూవరులకును, అర్వాచీన గాంగ నృపతులకును పరస్పరము సంబంధము కలియు చుండుటచేత క్రీ. శ. 1038 (శకము 960) నాటి వజ్రహస్తుని శాసనములలో అతని కూటస్థుడుగ తెలుపబడిన గుణమహార్ణవుని కుమారుడు (మొదటి) వజ్రహస్తుని వద్దనుండి అతని వరకు అందరును పూర్వగాంగ వంశములోని కడపటి రాజులే అని నిశ్చయింప వచ్చును. ఈ (మొదటి) వజ్రహస్తుడు 44 సంవత్సరములు (క్రీ, శ. 896 - క్రీ. శ. 940) పరిపాలించినట్లు చెప్పబడినది. ఇతనికి (మొదటి) గుండమరాజు, (మొదటి) కామార్ణవుడు, వినయాదిత్యుడు అని మువ్వురు కొమారులు. వీరిలో గుండమరాజు 8 సంవత్సరములును (క్రీ. శ. 940 - క్రీ. శ. 948), (మొదటి) కామార్ణవుడు 35 సంవత్సరములును (క్రీ. శ. 943 - క్రీ. శ. 978), ఇతని తరువాత వినయాదిత్యుడు మూడేండ్లును (క్రీ. శ. 978 - క్రీ. శ. 981) వరుసగా రాజ్యమేలిన తరువాత మొదటి కామార్ణవుని కుమారుడు (రెండవ) వజ్రహస్తుడు 35 ఏండ్లు (క్రీ. శ. 981 - క్రీ. శ. 1016) భూపరిపాలనము చేసెను. ఇతనికి రెండవ కామార్ణవుడు (క్రీ. శ. 1016), (రెండవ) గుండమరాజు (క్రీ. శ. 1016 - క్రీ. శ. 1019), మధుకామార్ణవుడు (క్రీ. శ. 1019 - క్రీ. శ. 1038) అని ముగ్గురు తనయులు. వీరు ఒకరి తరువాత ఒకరు వరుసగా 6 నెలలును, 3 సంవత్సరములును, 19 సంవత్సరములును



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



రాజ్యమేలిరి. వీరిలో (రెండవ) కామార్ణవుని కుమారుడైన (మూడవ) వజ్రహస్తుడు క్రీ. శ. 1038లో గాంగ సింహాసనము ఎక్కెను. ఇతడే అర్వాచీన గాంగవంశపు రాజులలో మొదటివాడు.

పైని తెలిపిన వారిలో మొదటి వజ్రహస్తుడే గాంగ శక కాలము లేని శాసనము ఇచ్చిన మొదటి వజ్రహస్తుడు కావచ్చును. ఇతడు మూడవ వజ్రహస్తుని శాసనమున పూర్వము అయిదుగురు భూవరులవలన అయిదు విభాగములుగ విభజింపబడి అనుభవింపబడిన భూమిని తాను ఒక్కడే స్వయముగా భుజబలమువల్ల శత్రునివహములను జయించి ఏకముచేసి పరిపాలించినట్లు తెలుపబడినది. కళింగ భూమిని ఇతని కాలమునకు పూర్వపు రాజులు అయిదు ఖండములుగ చేసి పంచుకొని పరిపాలించు చుండగా ఈ మొదటి వజ్రహస్తుడు మరల ఆయైదు ఖండములను ఏకము చేసి అఖండ గాంగరాజ్యమును నెలకొల్పి ప్రతిష్ఠావహుడైన కారణమున కావచ్చును మూడవ వజ్రహస్తదేవుని శాసనములలోని వంశానుక్రమము ప్రధానముగా ఈతని వద్ద నుండియే తెలుపబడినది. ఈతని కాలమునుండి కళింగమునకును, దీనికి పశ్చిమమునందు ఉండిన పూర్వ చాళుక్యాది రాజ్యములకును గల సంబంధము కొంత విశదమగుచున్నది.

మొదటి వజ్రహస్తునికి పూర్వము ఈ కళింగదేశమును జయించినట్లు ఇరుగు పొరుగు రాజ్యములను పాలించిన రాజులు కొందరు తమ శాసనములలో చెప్పుకొని యున్నారు. మాన్యఖేటము రాజధానిగా పాలించిన రాష్ట్రకూటులును, వేంగిదేశమును పరిపాలించిన పూర్వ చాళుక్యులును తమ కళింగదేశ విజయమును తమ శాసనములలో ప్రస్తావించిరి.

పూర్వ చాళుక్య రాజులలో మూడవ విష్ణువర్ధనుని (క్రీ. శ. 718 - క్రీ. శ. 752) చేత దేశబహిష్కృతుడు కావింపబడిన అతని సహోదరుడు కొక్కిలి విక్రమాదిత్య భట్టారకుడును, అతని సంతతివారును మధ్యమ కళింగమునకు వెళ్ళి ఆ ప్రాంతమును వశపరచుకొని అచట రాజ్యము పాలించినట్లు తెలుపుచాళుక్య శాసనములు ఉన్నవి. గుణగ విజయాదిత్యుడు (క్రీ. శ. 844 - క్రీ. శ. 892) అను మరియొక పూర్వ చాళుక్య నృపుడు కళింగముపై దండెత్తి వెళ్లి కాళింగులవద్దనుండి రజతమును, ఏనుగులను కప్పముగా గైకొనినట్లు అతని సంతతివారి శాసనముల వలన తెలియుచున్నది. కాని ఈ విజయములు నిజమో అబద్ధమో తెలిసికొనుటకు గాంగరాజ శాసనములలో ఎట్టి ఆధారములును లేవు.

మొదటి వజ్రహస్తుని కాలమునుండి కళింగ గాంగ, వేంగీ చాళుక్య వంశములకు సంబంధ బాంధవ్యములు కలసినవి. పూర్వచాళుక్య వంశజుడగు కొల్లభిగండ విజయాదిత్యుని రెండవ కుమారుడైన రెండవ చాళుక్య భీమరాజు (క్రీ. శ. 934 - క్రీ.శ. 945) ఇద్దరు భార్యలలో ఒకతెయైన ఊర్జప అను అంకిదేవి కళింగరాజదుహిత. ఈ యంకిదేవికిని, రెండవ చాళుక్య భీమరాజునకును జనించిన దానార్ణవభూపతి (క్రీ. శ. 970 - క్రీ. శ. 973) రెండవ అమ్మరాజ విజయాదిత్యుని సవతి యన్న. జ్యేష్ఠుడు దానార్ణవుడు ఉండగా పూర్వ చాళుక్య సింహాసనమును అతని సవతి సోదరుడు ఎట్లు అధిష్ఠించెనో తెలియదు. రెండవ అమ్మరాజవిజయాదిత్యుని అనంతరము దానార్ణవుడు వేంగికి పట్టాభిషిక్తుడై మూడేండ్లు పరిపాలనము చేసెను. ఇంతలో రెండవ అమ్మరాజ విజయాదిత్యుని బంధువును, కొల్లభిగండ విజయాదిత్యుని దౌహిత్రుడును అయిన తెనుగుచోడ వంశజుడు జటాచోడ భీమ నృపాలుడు వేంగిపై దండెత్తి, దానార్ణవుని వధించి ఆ దేశమును వశపరచుకొనుటయే కాక, గాంగభూపతులు దానార్ణవునికి సాయముచేసిన కారణమున కాబోలు కళింగముపై రెండు తడవలు దండెత్తి వెళ్లి మొదటిమారు మొదటి వజ్రహస్తుని కుమారుడైన మొదటి కామార్ణవుని, రెండవమారు అతని సోదరుడైన వినయాదిత్యుని యుద్ధమున వధించి కళింగమును తన సామంతరాజ్యముగ చేసికొనెను. వినయాదిత్యునికి పిదప అతని యన్నకుమారుడు రెండవ వజ్రహస్తుడు (క్రీ. శ. 981 - క్రీ. శ. 1016) గాంగసింహాసనము నెక్కెను. రాజ్యభ్రష్టులైన దానార్ణవ తనూజులు (మొదటి) శక్తివర్మ, విమలాదిత్యులు తంజాపూరు చోళుల సాయము వేడిరి. అప్పుడు ద్రవిడ దేశమును ఏలుచుండిన చోళవంశజుడు మొదటి రాజరాజచోళుడు (క్రీ. శ. 985 - క్రీ. శ. 1014). రెండవ వజ్రహస్తుని కాలముననే క్రీస్తుశకము పదవ శతాబ్దము కడపటి పాదమున రాష్ట్రకూట రాజ్యమును కూల్చివేసి రెండవ తైలపనృపతి పశ్చిమ చాళుక్యాధికారమును పునఃప్రతిష్ఠాపించెను. ఇతని సంతతివారు క్రమముగా తమ రాజ్యమును బలపరచుకొను చుండిరి. పశ్చిమ చాళుక్యులతో వైరము సంభవించిన సందర్భమున వేంగిరాజ్యము తన పక్షమున ఉండుట మేలని తలంచి మొదటి రాజరాజ చోళుడు తన కూతురు కుందవాంబను దానార్ణవుని రెండవ కుమారుడయిన విమలాదిత్యుని కిచ్చి పూర్వ చాళుక్యులతో వియ్యమంది, ఆ రాజకుమారులు శక్తివర్మ విమలాదిత్యుల పక్షము వహించి వేంగిపై దండెత్తివెళ్లి జటాచోడ భీముని వేంగినుండి తరిమివేసి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



క్రీ. శ. 1000 లో శక్తివర్మను వేంగిరాజ్యమున ప్రతిష్ఠించెను. జటాచోడ భీముడు యుద్ధమున పరాజితుడై కళింగమున తలదాచుకొన్నందున కాబోలు మొదటి రాజరాజ చోళుడు అతని పదునారవ రాజ్యవర్షమున కళింగదేశముపై దండెత్తి దానిని వశపరచుకొనెను. ఈ సంఘటనలన్నియు రెండవ వజ్రహస్తుని కాలముననే జరిగి యుండవలెను. అనతికాలముననే జటాచోడ భీముడు రాజరాజ చోళ, చాళుక్య శక్తివర్మలచేత హతుడయ్యెను.

రెండవ వజ్రహస్తునికి తరువాత అతని కుమారులు (రెండవ) కామార్ణవ, (రెండవ) గుండమరాజులు కళింగమునకు అధిపతులైరి. ఈ గుండమరాజు కాలములోనే వేంగీ చాళుక్య భూవరుడును, మొదటి రాజరాజ చోళుని అల్లుడును అయిన విమలాదిత్య నృపతి కాలధర్మము నొందెను. ఇతనికి కుందవాంబయందు పూర్వచాళుక్య రాజరాజ నరేంద్రుడును, తెలుగు చోళ వంశజయైన మరొక భార్యయందు విజయాదిత్య భూపతియు జనించిరి. వీరు ఉభయులును వేంగీ సింహాసనమునకై కలహించిరి. వీరిలో విజయాదిత్య భూవరుడు పశ్చిమ చాళుక్యులయొక్క, కళింగగాంగ నృపతులయొక్క సాయముతో విమలాదిత్యుని తరువాత (క్రీ. శ. 1018) వేంగీ సింహాసనమును ఎక్కెను. విజయాదిత్యునికి సాయపడిన కళింగాధిపతి (రెండవ) గుండమరాజో, అతని సోదరుడు మధుకామార్ణవుడో కావలెను.

మొదటి రాజరాజచోళుని కుమారుడైన మొదటి రాజేంద్రచోళ భూపతి అరయన్ రాజరాజన్ అను నామాంతరముగల విక్రమ చోళియవరయన్ సేనానాయకత్వమున వేంగి దేశముపై దండెత్త బంపినట్లు అనంతపురము జిల్లాలోని అతని పదవరాజ్య సంవత్సరమునాటి శాసనములవలన తెలియుచున్నది. కావున అప్పటికి వేంగి అతని శత్రువయిన విజయాదిత్యుని క్రింద ఉండెననియు, అతనిని జయించుటకే ఈ సైన్యము పంపబడెననియు ఊహించుట సమంజసము కాకపోదు. విక్రమ చోళియవరయన్ వేంగిపై దండెత్తి కాళింగులను, తెలింగులను, ఒడ్డె (ఓఢ్ర) దేశము వారిని మహా సంగ్రామమునందు ఓడించెను. అతని ఈదండయాత్ర సరిగా క్రీ. శ. 1021-1022 లో జరిగి యుండుటచేత విక్రమచోళియ వరయన్ విజయాదిత్యుని, అతని పక్షము వహించిన కళింగాదులను ఓడించి తరుమగొట్టి పూర్వ చాళుక్య రాజరాజును (రాజరాజ నరేంద్రుని) వేంగీ రాజ్యమునకు అభిషిక్తుని చేసినట్లు ఊహింప దగియున్నది. విజయాదిత్యుని పక్షము వహించిన కళింగాధిపతి మధుకామార్ణవు డగుట నిశ్చయము. రాజేంద్ర చోళుని గంగాతీర దండయాత్ర అన్నది కళింగ, ఒడ్డె దేశములపై దండెత్తి వెళ్ళిన చోళియవరయన్ దండయాత్రలోని భాగమే కావచ్చును. చోళియవరయన్ కళింగ, ఒడ్డె దేశములను జయించి ఇంకను ఉత్తరమున గంగాతీరమునకు వెళ్ళిన వెంటనే మధుకామార్ణవుడు మరల తిరుగబాటు చేసినట్లు కన్పట్టును. దండయాత్రనుండి తిరిగివచ్చు తన సేనాధిపతిని రక్షించుటకై రాజేంద్ర చోళుడు వేంగికి ప్రయాణమై వచ్చెను. మొత్తముమీద విజయాదిత్యుని వేంగీ సింహాసనముపై నిలుపుటకు కళింగాధిపతియైన మధుకామార్ణవ భూవరుడు చేసిన ప్రయత్నములు ఏవియు కలిసివచ్చినవి కావు. కళింగము చోళరాజ పరిరక్షితమైన వేంగికి సామంతరాజ్యముగా ఉండియు ఉండనట్లయినది. కళింగాధిపతులు పూర్వ చాళుక్య రాజరాజనరేంద్రుని సవతి సోదరుడైన విజయాదిత్య భూవరుని ప్రయత్నములకు ఎప్పుడును తోడ్పడుచునే వచ్చిరి. విజయాదిత్యుడు మరల రాజరాజనరేంద్రుని పదభ్రష్టుని కావించి క్రీ. శ. 1035 లో వేంగీ సింహాసనమును అధిష్ఠించి రాజ్యమేలుచుండిన కాలమున అతడు కాళింగులు తనకు చేయుచు వచ్చిన సాయమునకు కృతజ్ఞతను ప్రకటించుటకు వారికి స్వాతంత్ర్యము నొసగెనేమో, మధుకామార్ణవుని అనంతరము మూడవ వజ్రహస్తుడు క్రీ. శ. 1038 లో గాంగ సింహాసనమునెక్కి స్వతంత్రుడై పరిపాలించెను.

పూర్వగాంగ వంశములోని ప్రధానశాఖవారు కళింగనగర, దంతపురములు రాజధానులుగా పాలించుచుండగా మరొక శాఖవారు శ్వేతకాధిష్ఠానమునుండి రాజ్యము పాలించుచుండిరి. శ్వేతకకు శ్వేతయని కూడ నామాంతరము కలదు. ఒక శాసనమున పొరపాటుననేమో శ్వేతక యని పేర్కొనబడినది. శ్వేతక ఏది అను విషయమున కూడ చరిత్ర పరిశోధకులలో అభిప్రాయభేదము కలదు. ఇది గంజాముజిల్లా సోంపేట తాలూకాలోని చీకటియే అని చాలమంది యభిప్రాయము. శ్వేతకరాజ్యము పూర్వగాంగ వంశజులకు ఎప్పటినుండి వశమైనదో మనకు తెలియదు కాని పూర్వగాంగ వంశజులలోని ఎవరో ఒక సామంతవర్మ దీనిని సంపాదించి యుండునేమో అని తోచుచున్నది. శ్వేతకాధిపతు లందరిలోను ఈతడే మొదటివాడుగ కన్పట్టును. ఈతడు సంవత్సర మేదియు తెలుపని తన దానశాసనములో స్వభుజ బలపరాక్ర మాక్రాంత సకల కలింగాధి రాజ్యుడనని చెప్పుకొనెను. ఈతడు శ్వేతకను జయించినపిదపనే అది గాంగ కళింగరాజ్యములోని భాగ మయ్యెనేమో. శ్వేతక రాజ్యాధిపతులు మిగిలినవా రందరు కళింగనగరపు పూర్వగాంగ నృపతులవలెనే



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తామును స్వభుజబల పరాక్రమాక్రాంత సకల కళింగాధి రాజ్యులమని చెప్పుకొన్నవారే. ఈ శ్వేతకాధిపతుల దానశాసనములు ఇంతవరకు పండ్రెండు దొరకినవి. వీనిలో నాలుగు 4, 19, 50, 185 'సంవత్'లలో ఈయబడినవి. ఒకటిమాత్రము ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరము 100 లో ఈయబడినది. ఈ 'సంవత్'లు, 'ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరము' ఏ శకమునకు సంబంధించినవో తెలియదు; ఇవి గాంగ శక సంవత్సరములు అనుటకు అవకాశము లేదు. మిగిలిన యేడు శాసనములలోను ఏసంవత్సరములును లేవు. మహేంద్రవర్మ కొడుకు పృథివీవర్మ, పృథివీవర్మ కుమారుడు ఇంద్రవర్మ, పృథివీ వర్మ కొడుకు రాణకశ్రీ దానార్ణవదేవుడు, రాణక గంగ విలాస సుతుడు భూపేంద్రవర్మ - వీరల శాసనములు మాత్రమే రెండు తరములను ఇచ్చునవి; మిగిలినవి అన్నియు దాత పేరును మాత్రమే చెప్పును. సామంత వర్మ, ఇంద్రవర్మ, అనంతవర్మదేవ, జయవర్మ దేవులని మిగిలిన శ్వేతకాధిపతుల పేరులు. వీరిలో ఎవరు ముందో, ఎవరు వెనుకో - వీరి ఆనుపూర్విని నిర్ణయించుటకు కళింగ నగర, దంతపుర గాంగశాసనములలో వలె మనకు ఆధారములు దొరకవు. శ్వేతకాధిష్ఠానమునుండి ఇచ్చిన ఈశాసనములలో తేదులు ఈయనివి కొన్ని. వానిలోని లిపినిబట్టి అవి క్రీస్తు శకము పది పండ్రెండు శతాబ్దులనాటివి కావచ్చునని తత్ శాసనపరిష్కర్తలు ఊహించియున్నారు. ఇందువల్ల శ్వేతకాధిపతు లందరు కళింగ నగర గాంగ భూవరులకు సమకాలికులు కా రనియు, వారిలో కొందరైనను అర్వాచీన గాంగుల కాలమునాటివారై యుందు రనియు తెలియుచున్నది. శ్వేతక రాజ్యాధిపతులను గురించి ఇంతకంటె విశేషములు ఏవియు తెలియరావు.

కళింగదేశమున పురాతన కాలమున బౌద్ధ, జైన మతములు బాగుగ వ్యాపించినను పూర్వగాంగరాజులు వైదిక మతాభిమానులై వేదశాస్త్ర విదులను పోషించి వారికి అగ్రహారము లిచ్చుటచేత కళింగమున క్రమముగా వైదిక మతము అభివృద్ధి చెంది పూర్వ మతములు రాజాదరము లేక క్షీణించినవి. పూర్వ గాంగుల వేదవిద్యాభిమానము వలన ఉత్తర రాఢామండలమునుండి, దూరస్థమైన కామరూపమునుండి, ఓడ్రదేశమునుండి కూడ బ్రాహ్మణులు రాజాశ్రయమును కోరి కళింగమునకు వచ్చి అచ్చట స్థిరపడిరి. పూర్వగాంగరాజులు బ్రాహ్మణులకు ఇచ్చిన అగ్రహారములు చాల కలవు. వీనిలో ఋగ్వేదులకంటెను శుక్ల యజుర్వేదులకు ఇచ్చినవి ఎక్కువ. ఇప్పటికిని కళింగమున శుక్లయజుర్వేదులు అధికము. కళింగదేశమునందలి బ్రాహ్మణులకు ఇచ్చిన దానశాసనములు పెక్కింటిలో ప్రతిగ్రహీతల ప్రవరకూడ తెలుపుట ఒక విశేషము. ఇది అటుండ, సాధారణముగా తెలుగు దేశమునందలి తామ్రశాసనములు బ్రాహ్మణులకు చేసిన దానములను తెలుపును. కాని కళింగమున నాయకులకు గ్రామములను దానము చేసి యిచ్చిన తామ్రశాసనములును, వైశ్యులకు చేసిన అగ్రహార దానశాసనములును కలవు. ప్రాచీన కాలమున వైశ్యులకు సర్వకర పరిహారముగ అగ్రహారము చేసి దాన మిచ్చుట కళింగదేశముననే కన్పట్టుచున్నది. ప్రత్యేకముగ ఒక్కొక్క రాజు కొలువులో లేఖకులును, శాసనోత్కీర్ణకులును ఉండువారు. లేఖకులు శాసనములు రచించువారు; ఉత్కీర్ణకులు శాసనమును రాగిరేకులమీద చెక్కువారు. సాధారణముగా వీరు అక్షశాలులు. అక్షశాలి అన్నది అగ్గసాలి పదమునకు సంస్కృతరూపముగా కన్పట్టును. సాధారణముగా ఈ లేఖక, ఉత్కీర్ణక పదవులు తండ్రినుండి కొడుకునకు వంశపారంపర్యముగ వచ్చుట కలదు. వీరు కాక, రాజు కొలువులో ఇప్పటి 'రికార్డు కీపరు'ల వంటి ఉద్యోగులు అక్షపటలకులు ఉండువారు.

గాంగరాజుల పరిపాలనపద్ధతి ఉత్తరదేశ రాజపరిపాలన పద్ధతిని పోలియుండెను. అమాత్యులు, కుమారామాత్యులు, రాజపుత్రులు, రాజానకులు, మహాసామంతులు, సామంతులు, ఉపరికులు, దండనాయకులు, విషయపతులు, గ్రామపతులు, తలవరులు, రహస్యకులు, సంధివిగ్రహులు, దండపాశిక, చాటభటవల్లభ జాతీయులు, భోగికులు - వీ రందరు రాజభృత్య వర్గములోనివారే. పూర్వగాంగ పరిపాలనలో దేశము పరిపాలన సౌకర్యము నిమిత్తము భోగములుగ, విషయములుగ, వర్తనులుగ, రాష్ట్రములుగ, పంచాలులుగ, ఖేదములుగ విభక్తమయినది. వీనిలో వర్తని, రాష్ట్రము, విషయము సమానదేశ విభాగములేమో తెలియదు. కూరక రాష్ట్రము, క్రోష్టుకవర్తని, వరాహవర్తని, కంటకవర్తని కోలువర్తని, తిరికటు విషయము, గలెల విషయము, దాఘ పంచాలి, దేవన్నపంచాలి, కొరోసోటక పంచాలి, పుష్యగిరి పంచాలి, చిఖలి పంచాలి, వోంఖాదభోగము, దంతయవాగు భోగము, మహేంద్రభోగము, ఖుక్కుఖురచ్ఛేదము మొదలైన దేశవిభాగములు పూర్వగాంగరాజ శాసనములలో ఉదాహృతములైనవి. పంచాలులు అను పేరుగల దేశవిభాగములు అయిదు. ఇవి ఒకదానికి ఒకటి ఇరుగు పొరుగుననే ఉండవలెను. పర్లాకిమిడికి దక్షిణమున ఉన్న కొరసవాడ ప్రాంతమే కొరాసోడక పంచాలి కావచ్చును. పర్లాకిమిడికి ఈశాన్య దిశను పదునొక లేక ఇప్పటి అడబ గ్రామ సహితమైనది పుష్యగిరి పంచాలి. పర్లాకిమిడి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తాలూకాలోని పడ్డ, హద్దివాడ ప్రాంతము చిఖలీ పంచాలియై యుండుననుట కవకాశముకలదు. దేవన్న పంచాలి, చాఘపంచాలు లెక్కడివో తెలియుటలేదు. ఇవికూడ పైనుడివిన మొదటి మూడు పంచాలులవద్దనే యుండవలెను. ఈ యైదు పంచాలులును కలసినది పంచవిషయము లేక పంచపాత్ర విషయమనుపేర కళింగములో ఒక ప్రత్యేక ఖండముగ ఏర్పడుచున్నది. ఈ దేశవిభాగముల సీమావధులను, విస్తీర్ణమును నిర్ణయించుట కష్టము. ఈ దేశ విభాగములలో ఉండినట్లు తెలుపబడిన గ్రామములను గుర్తించుటే మరియు కష్టముగ ఉన్నది. కళింగదేశ గ్రామములు పూర్వగాంగులనాటికిని ఇప్పటికిని చాల మారిపోయినవి.

పూర్వగాంగ నృపతులలో అనేకులు పరమ మాహేశ్వరులు. వీరిలో కొందరు విష్ణ్వారాధకులు. శైవ మవలంబించినను, వైష్ణవ మవలంబించినను పక్షపాతము లేక వీరు ఉభయ మతములను సమానముగ ఆదరించిరి. వీరిలో హస్తివర్మ భగవంతుడును, సప్తార్ణవశాయియు, సప్త పాషోప గీతుడును, సప్త లోకైకనాథుడును, రణభీతో దయాభిధానుడును అయిన నారాయణునికి బలి చరు సత్ర ప్రవర్తనము నిమిత్తమును, ఖండ స్ఫుటిత సంస్కారము నిమిత్తమును గాంగ శకము 79 వ సంవత్సరమున వరాహ వర్తనీ విషయములోని రోహణకి (రోణంకి) గ్రామమునందు ఆరు హలముల భూమిని విడదీసి సర్వకరపరిహారముగ దేవాగ్రహారము చేసి ఇచ్చెను. కళింగములో విష్ణువునకు ఆలయ ముండినట్లు తెలుపు మొదటి శాసనము ఇదియే. ఈవిధముగానే పూర్వగాంగ మహారాజు ఇంద్రవర్మ గాంగ శకము 87 వ సంవత్సరమున భగవంతుడైన రామేశ్వర భట్టారకునికి బలి చరు సత్ర ప్రవర్తనము నిమిత్తమును, ఖండస్ఫుటిత సంస్కారము నిమిత్తమును క్రోష్టుక వర్తనిలోని పారిఖట గ్రామమునందు హలము భూమి విడదీసి దేవాగ్రహారము చేసి ఇచ్చెను. గాంగశకము 184 వ సంవత్సరమున మొదటి దేవేంద్రవర్మ తనగురువైన భగవంతుడు పతంగశివాచార్యునికి దీక్షోత్తరకాలమున గురుపూజగా పుష్యగిరి పంచాలిలోని పాడువక గ్రామమును అగ్రహారము చేసి ఇయ్యగా ఆయన దానిని యోగేశ్వర భట్టారకునికి సమర్పించెను. ఈ యోగేశ్వర భట్టారకుడు శివుడే. దేవేంద్రవర్మ గురువైన పతంగశివాచార్యుడు 'వేదవేదాంగేతిహాస పురాణ న్యాయ విద్యా స్వసిద్ధాంతాధిగతు'డని శాసనమున అభివర్ణితుడైనాడు. రెండవ దేవేంద్రవర్మ గాంగశకము 254 వ సంవత్సరములో ధర్మేశ్వర భట్టారకునికి (దేవునికి) ఒక గ్రామమును దానము చేసెను. ఈ ధర్మేశ్వర భట్టారక స్థానాధికారి శ్రీమద్విప్రసోమాచార్యుడు. ఇట్లే శైవస్థానకమైన గ్రామదేవత నూంకవపోసె స్వామినికి (నూంకమ దేవికి) సత్యవర్మ గాంగశకము 351 లో ఒక గ్రామమును దాన మిచ్చెను. దేవాలయ నిర్మాణమున పూర్వగాంగు లొక విశిష్ట పద్ధతిని అవలంబించిరి. ఆలయనిర్మాణ కళలో దీనికి కళింగరీతి అని పేరు కలిగెను. ఈవిధముగా పూర్వగాంగ భూమీశులు కళింగ దేశమును రమారమి 500 సంవత్సరములు పరిపాలించి వైదికసంస్కృతిని, కళలను పోషించి కళింగదేశమును అభ్యున్నతికి తెచ్చిరి. మ. సో. శ.

# పూర్వ మధ్యయుగము

## కల్యాణి చాళుక్యులు

దక్షిణాపథమును నిరంకుశముగా పాలించుచు ఆంధ్ర దేశముపై తమ ప్రభావ ప్రాభవములను నెరపిన గొప్ప రాజవంశములలో వీరి దొకటి. వీరి శాసన భాష కన్నడమై, పాలించిన సామ్రాజ్యము కర్ణాటకులదైనను వీరు తెలంగాణావారనియే మేరుతుంగాచార్యులవారి ప్రబంధ చింతామణియు, గుజరాతు రాసమాలా ప్రబంధమును తెలుపుచున్నవి. ఇందుల కనుగుణముగా వీరి తొలి రాజధాని మాన్యఖేటము, తర్వాతిది సుప్రసిద్ధ కల్యాణకటకము; రెండును తెలంగాణాలోనివే. వీరు పాలించిన కాలము ఏకైక సాంస్కృతిక పరంపరతో భాషలో మాత్రము భేదించుచు, ఆంధ్ర కర్ణాటకులు ఏకైక లిపిని వాడుచుండిన కాలము.

క్రీస్తుశకము పదియవ శతాబ్దము చివర భాగమున దక్షిణాపథ ద్రావిడ దేశములలో విప్లవములు జరగినవి. కడపటి రాష్ట్రకూట చక్రవర్తి మూడవ కృష్ణరాజు క్రీస్తుశకము 968 లో గతించెను. రాజ్య విచ్ఛిత్తి ప్రారంభమాయెను. కృష్ణరాజు తర్వాత ఖొట్టిగుడు రాజైన వెంటనే పరమారులు మాళవమున స్వతంత్రులైరి. సీయక హర్షుడును, అతని కుమారుడు వాక్పతి ముంజుడును క్రీస్తుశకము 972-73 లో దండయాత్ర వెళ్లి మాన్యఖేటమునే తగులబెట్టి పోయిరి. ఆ సంవత్సరమే ఖొట్టిగుడు మరణించి కక్కలుడు రాజాయెను. కాని క్రీస్తు శకము 973 లోనే



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చాళుక్య తైలపుడు అతనిని యుద్ధమున చంపి సామ్రాజ్యమును గ్రహించెను. ఇతడు ఈ తైలపుని వంశములో ఈ పేరుగలరాజు ఇతనికి ముం దొకడుండుటవలన ఇతనిని రెండవ తైలపు డందురు. ఇతడు పూర్వపు బాదామి చాళుక్యుల సంతతివాడు. ఈచాళుక్యులు తమ సామ్రాజ్యము రాష్ట్రకూటులకు వశముకాగా మాటు మణగి యుండి మరల తలయెత్తిరి. రాష్ట్రకూటుల బంధువులైన చేదిరాజులు వారిని వదలి వీరికి బంధువులైరి. చేదిరాజు లక్ష్మణుని కొమార్తె బొంతాదేవి తైలపుని తల్లి. పైగా వీరి యభ్యున్నతికి సేవుణ యాదవులును, నోళంబ పల్లవులును, రాష్ట్రకూటులలోనే మరియొక శాఖవారును తోడ్పడిరి. బమ్మహుడను రాష్ట్రకూట ప్రభువు తన కొమార్తెయగు జాకవ్వె(జాకమ్మ)ను తైలపుని కిచ్చి పెండ్లి చేసెను.

**తైలపుడు** (క్రీ. శ. 973 - క్రీ. శ. 997): ఇతడు క్రీ. శ. 957 నాటికి రాష్ట్రకూట సామంతుడు. నాటి కితనికి బిరుదు లేవియు లేవు. క్రీ. శ. 965 నాటికి మహాసామంతాధిప, చాళుక్యరామ, సత్యాశ్రయకులతిలక, ఆహవమల్ల బిరుదులను ధరించి ఇతడు కృష్ణరాజునకు లెంకగా నుండెను; శతధా పడిపోవుచున్న సామ్రాజ్యమును ఇతరులు హరించుట చూచి తానే చక్రవర్తి యాయెను; పృథ్వీవల్లభాది బిరుదములను తాల్చెను. ఈతవి మంత్రి వాజివంశ నియోగి బ్రాహ్మణుడు ధల్లయ్య తన బంధువర్గముతో ఈతనికి 'కార్యమునకు, ఖడ్గమునకు తగువాడై' తోడ్పడెను.

రాజ్యమందు స్థిరమైన వెనుక తైలపుడు రాష్ట్రకూట సామ్రాజ్యమును కైవస మొనర్చుకొనెను. కొంకణ శిలాహారులు పరమారులతో చేరి ఈతనిని చాల శ్రమపెట్టిరి. ఇతని కొమారుడు సత్యాశ్రయుడు కొంకణ ప్రభువగు అపరాదిత్యుని జయించి పశ్చిమ సముద్రమువరకు చాళుక్య రాజ్యమును విస్తరింపజేసెను; ఇతనికి సొంతశ్తిని పాలించుచుండిన రట్టరాజులు కూడ త్వరలో లొంగిపోయిరి. అది మొదలు మిత్రులుగా నుండిన సేవుణ యాదవులు ఉత్తరమున పరమారులను గోదావరీనదిని దాటి రానీయక రక్షించుచుండిరి. నోళంబ పల్లవులు చోళులను బళ్ళారి, అనంతపురము, చిత్రదుర్గము జిల్లాలమీదుగా రానీయక కాపాడుచుండిరి. గంగవాడి (మైసూరు ప్రాంతము) తప్ప మిగిలిన రట్టరాజ్యము అంతయు తైలపునికి స్వాధీనమాయెను. పాంచాల దేవ, ముదురాచయ్యలను ఇరువురు క్రమముగా రాష్ట్రకూట, గంగరాజ్యములపై ఎత్తిరాగా తైలపుడును, గంగమంత్రి చాముండరాయడును కలసి వారి నెదుర్కొని చంపిరి.

ఉత్తరమున తైలపునికి పరమార ముంజ మహీపతి శత్రువు. ఇతడు రాష్ట్రకూటుల సామ్రాజ్యమును కోరి వారి 'పృథ్వీవల్లభ' బిరుదును వహించి తైలపునికి ప్రతిద్వంద్విగా యుద్ధములు చేయసాగెను. పదునారు పర్యాయములు తైలపునిమీదికి ఎత్తివచ్చెను; ఒక పర్యాయము ఖైదుచేయబడి తప్పించుకొనిపోయెను. ఆఖరు పర్యాయము ముంజుడు గోదావరి దాటగానే తైలప సామంతుడు యాదవ భిల్లముడు అతనిని ఢీకొని రణరంగమున చంపెను. తైలపుడు ముంజుని చెరబెట్టినది వాస్తవమే; కాని, 'అతని వితంతు సోదరి మృణాలవతి ముంజుని వలచి అతడు పారిపోవుటకు సాయపడగా అతడు పట్టువడి ఘోరముగా వధింపబడె'నను కథ కల్పితము. తైలపునికి సోదరియే కానరాదు.

దక్షిణమున తైలపునికి చోళులబాధ తప్పలేదు. తైలపుడు కక్కలుని జయించిన క్రీ. శ. 973 వ సంవత్సరమే పెదకల్లు చోళుడు జటాచోడ భీముడు రాష్ట్రకూటుల మిత్రుని దానార్ణవుని రణరంగమున కూల్చి వేంగిని హరించెను. దానార్ణవుని కుమారులు శక్తివర్మ, విమలాదిత్యులు మొదట కళింగమునకు పోయిరేమో; కాని, తర్వాత చోళరాజుల నాశ్రయించిరి. క్రీ. శ. 985 నాటికి వీరి బంధువు రాజరాజచోళుడు చోళరాజాయెను. ఈతడు ఉదారాశయుడు; విజిగీషువు; తన కుమార్తెయైన కుందవాంబను విమలాదిత్యున కిచ్చి వివాహము చేసి వేంగిని విమలాదిత్య, శక్తివర్మలకొరకు సాధింప సమకట్టెను. వేంగి యందలి జటాచోడభీమునికి పశ్చిమ చాళుక్యులు మిత్రులో ఏమోకాని తైలపుని అరికట్టి అతని మరణానంతరము చోళులు వేంగిమీదికి దాడియెత్తిరి. ఇట్లు ప్రారంభమైన వేంగీ సాధనము చోళ, పశ్చిమ చాళుక్య సంఘర్షణగా దాదాపు ఒకశతాబ్దము జరగెను.

క్రీ.శ. 991 నాటికి చోళులు మైసూరు నాక్రమించిరి. అటు వెనుక నోళంబవాడిలో రొద్దమనుచోట (అనంతపురము జిల్లా, పెనుగొండ తాలూకాలోనిది) చోళులకు, చాళుక్యులకు యుద్ధమాయెను. చోళుల పురోగమనము నిలిచిపోయెను. ఇంతవరకు చోళులను తైలపుడు రానిచ్చినందులకు కారణము అతనికి వెనుకవైపున పరమార ముంజుని వలన ఏర్పడిన ఒత్తిడియే. క్రీ. శ. 994 వరకును తైలపునికి ముంజుని బాధ ఉండెను. రాజరాజు పశ్చిమ చాళుక్యులను వెనుకకు నెట్టుట వారి సాయము చోడ భీమునికి అందనీకుండుటకు మాత్రమే కాదు, తుంగభద్రాతీరమును స్వాధీనము చేసికొని కర్నూలు మార్గముగా వేంగికి పోవుటకును అని తర్వాతి చరిత్ర రుజువు చేయుచున్నది.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



క్రీ. శ. 997 నాటికి తైలపుడు గతించెను. ఈతడు దాదాపు ఇరువది యైదేండ్లు పాలించెను; పరమారులను, చోళులను మాత్రమే కాక లాట ఘూర్జరులను, పల్లికోట, భద్రక, క్రాకశకాది దేశములను జయించెను. వనవాసి దేశము ఈతని సామ్రాజ్యములో చేరెను. తైలపుడు మహాయోధుడే కాక చక్కని పరిపాలకుడు కూడ. ఇతడు రాజ్యములోని పూర్వపరిపాలన వ్యవస్థలను మన్నించి అమలు జరపెను. ఈతని సామంతరాజ కుటుంబములలో రట్టలు, నోళంబులు, యాదవులు, కదంబులు, శిలాహారులు ప్రధానులు. కన్నడ కవిరత్న త్రయములో నొకడైన రన్నకవి ఇతని మంత్రియగు ధల్లయ్య కోడలు అత్తిమబ్బెను ఆశ్రయించి తన్మూలముగా నీతని ఆస్థానిని చేరెను.

సత్యాశ్రయుడు (క్రీ. శ. 997 - క్రీ. శ. 1008): ఇతడు తైలపుని పెద్దకుమారుడు; ఇతడు 'ఇరివ - బెడంగ, అకలంక చరిత' బిరుదములు ధరించెను. ఈతడు యువరాజుగా నున్నప్పుడే తండ్రికి కుడిభుజముగా నుండి శిలాహారులను, ఘూర్జరులను సాధించిన యోధుడు. ఈతనికి సామ్రాజ్యములో ఇబ్బంది లేదు. కాని చోళులతో యుద్ధమేర్పడినది. క్రీ. శ. 991 నాటికి నోళంబవాడిలో ప్రవేశించిన చోళులు తైలపుని మరణానంతరము విజృంభించి క్రీ. శ. 1000 నాటికి వేంగి ప్రవేశించి శక్తివర్మను అట సింహాసన మెక్కించిరి. కాని జటాచోడ భీముడు శక్తివర్మను, అతని చోళ బంధువులను కంచివరకు తరిమి క్రీ. శ. 1002 లో కంచి కడ జరిగిన యుద్ధమున శక్తివర్మచే చంపబడెను. క్రీ. శ. 1002 కు తర్వాత గాని వేంగి శక్తివర్మ, విమలాదిత్యులకు పూర్తిగా స్వాధీనము కాలేదు.

శక్తివర్మ, విమలాదిత్యులు మరల వేంగి చేరుట సత్యాశ్రయునికి ఇష్టములేనందుననో, సత్యాశ్రయుడు జటాచోడ భీమునికి సాయపడినందుననో, పశ్చిమ చాళుక్యులకును తెలుగు చోళులకును స్నేహమును, ఒడంబడికలును ఉండినందుననో రాజరాజచోళుడు వేంగియందు శక్తివర్మను ప్రతిష్ఠించి, జటాచోడ భీముడును, అతని వారును గతించినప్పుడో తరువాతనో సత్యాశ్రయునిమీదికి దండయాత్ర వెడలెను. క్రీ. శ. 1003 నాటికి చోళుల రట్టవాడి దండయాత్ర పూర్తియైనది. క్రీ. శ. 1004 నాటికి చోళులు తలకాడు పట్టుకొని గంగవాడిని స్వాధీనము చేసికొని గంగరాజ కుటుంబమును అంతరింపజేసిరి. సత్యాశ్రయుడు వెంటనే వేంగి మీదికి దండెత్తి క్రీ. శ. 1005 నాటికి వేంగిని కలవరపరచి, క్రీ. శ. 1006 లో ధన్నాడ, యనమదల కోటలను కాల్పించి చేబ్రోలుకడ తన సైన్యములను విడియించెను. కర్ణాటకులను వెనుకకు తరుముటకై శక్తివర్మకు సాయపడిన చోళులు సత్యాశ్రయుని రట్టవాడిమీదికి మరల దండెత్తి తొమ్మిదిలక్షల సైన్యముతో దేశవిధ్వంసము చేయుచు బిజాపురము జిల్లాలోని దోనూరు వరకును పోయిరి. ఆ దెబ్బతో చాళుక్యులు వేంగిని వదలి వెనుకకు మరలిరి. ఆ మరుసంవత్సరమే క్రీ. శ. 1007-8 లో సత్యాశ్రయుడు మరణించెను. క్రీ. శ. 1007 మొదలు శక్తివర్మ నిరంతరాయముగా వేంగిని క్రీ. శ. 1010 వరకు పాలించెను.

సత్యాశ్రయుని కాల మంతయు యుద్ధములతోనే కడచినను సామ్రాజ్యము బలిష్ఠమాయెనే కాని తగ్గలేదు. తండ్రి సామ్రాజ్యమే కాక తెలంగాణాయును, శ్రీశైలము వరకును ఈతని స్వాధీనమందుండెను. తైలపునితో ఆరంభమైన నోళంబులతోడి మైత్రి ఈతని కాలమునకు బాంధవ్యముగా మారినది. సత్యాశ్రయుని కొమార్తె వృద్ధిమబ్బరసి నోళంబరాజును వివాహమాడినది. నోళంబులు చోళులను ప్రతిఘటించుటకు ఇది ప్రబలకారణమైనది. సత్యాశ్రయుడు జైనుడు; ఈతని జైనగురువు కుందకుందాన్వయ పుస్తకగచ్ఛమునకు చేరిన త్రికాలముని భట్టారకుడు; మహాకవి రన్నడు ఈతని నామాంకితముగా 'సాహసభీమ విజయ' మను నామాంతరముగల గదాయుద్ధ కావ్యమును రచించెను.

విక్రమాదిత్యుడు (క్రీ. శ. 1008 - క్రీ. శ. 1014): సత్యాశ్రయునికి కొమారులు లేనందునను, అతని సోదరుడు దశవర్మ ముందే చనిపోవుటవలనను, ఈ తమ్ముని కొమారుడు విక్రమాదిత్యుడు రాజాయెను. ఇతడు త్రిభువనమల్ల బిరుదము వహించెను. ఇతడు శక్తివర్మ చివరకాలమున వేంగిని కొంత బాధించెను. విమలాదిత్యుడు క్రీ. శ. 1011 లో పట్టాభిషిక్తుడాయెను. కాని త్వరలో వేంగిని వదలి చోళరాజ్యమున తిరువయ్యారు చేరవలసినవాడయ్యెను.

రాజరాజచోళుడు క్రీ. శ. 1012 లో గతించెను. రాజేంద్రచోళుడు చోళసింహాసన మధిష్ఠించి వెంటనే దండయాత్ర ప్రారంభించెను. క్రీ. శ. 1014 లో విమలాదిత్యుడు తిరువయ్యారులో నుండెను. అతనిని మరల వేంగికి చేర్పవలసిన పని రాజేంద్రచోళుని కేర్పడినది. సరిగా ఈ సమయమునకే చేదిరాజు గాంగేయ దేవుడును, కోసలులును చాళుక్యుల మీదికి ఎత్తివచ్చిరి. విక్రమాదిత్యుడు గాంగేయదేవుని ఎదిరించెను కాని త్వరలోనే క్రీ. శ. 1014 లో గతించెను. ఈ కోసల చేదికులు చోళులకు మిత్రులేమో!

అయ్యన (క్రీ. శ. 1014 - క్రీ. శ. 1015): విక్రమాదిత్యుని తమ్ముడు అయ్యన రాజయ్యెను; కాని పట్టాభిషేకము జరుగులోపలనే అతడు గతించెను. చోళులు వెనుకనుండి ఈయదను చూచుకొని వేంగికి వచ్చిరి. రాజేంద్రచోళుని



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సైన్యము కొంత వేంగియం దుండగా కొంత చీలి రట్టవాడి మీదికి వచ్చినది. ఇది మాన్యఖేటమును కొల్లగొట్టి, కొల్లిపాక (నేటి కుల్పక్ - హైదరాబాదులో ఆలేరు రైల్వే స్టేషనుకు సమీపము) వరకు వచ్చినది. పశ్చిమ చాళుక్యులు ఏకకాలమున రెండు వైపుల యుద్ధము చేయవలసి వచ్చినది. ఈ నడిమి కాలమున అయ్యన గతించి యుండును.

జయసింహుడు (క్రీ. శ: 1015 - క్రీ. శ. 1042): అయ్యన తమ్ముడు జయసింహుడు సామంతులయు సేనాపతులయు, మంత్రులయు సాయమున అతిప్రయాసతో కోసలులను జయించి, చోళు●ను తరిమి క్రీ. శ. 1015 లో సింహాసన మెక్కెను. వేంగిమీదికి కర్ణాటకులు రానందున విమలాదిత్యుడు సుప్రతిష్ఠితుడై క్రీ. శ. 1019 వరకు సుఖముగా నుండెను.

విక్రమాదిత్యుడు కొద్దికాలమే పాలించినను సామ్రాజ్యము సురక్షితమై జయసింహుడు తర్వాత విజృంభించుటకు తగియుండెను.

జయసింహుడు 'జగదేకమల్ల, మల్లికామోద' బిరుదములను ధరించెను. క్రీ. శ. 1019 నాటికి విమలాదిత్యుడు మరణించెను ఈతనికి ఇరువురు కుమారులు - రాజరాజనరేంద్ర, విజయాదిత్యులు. పెద్దవాడు తమిళ చోళుల దౌహిత్రుడు; రెండవవాడు తెలుగు జటాచోడ భీముని దౌహిత్రుడు. సవతిబిడ్డలైన వీరు వేంగికొరకు నలువది యేండ్లకు పైగనే పోరాడిరి.

విజయాదిత్యుడు తండ్రి గతించిన వెంటనే పశ్చిమ చాళుక్యుల నాశ్రయించెను. బహుశః, వెనుకటి కర్ణాటక, తెలుగు చోళస్నేహము ఇందులకు ప్రోద్బలమై యుండును. ఈతడు తాను వేంగీ మండలాధిపతియని సూచించుటకై 'విష్ణువర్ధన' బిరుదమును తాల్చెను. ఈ కాలమున జయసింహుడు 'చోళ ఖండనా పేక్షి'. రాజరాజనరేంద్రుని పట్టాభిషేకమును జరుగనీయక విజయాదిత్యుడు పశ్చిమ చాళుక్య సైన్యముతో వేంగి మీదికి వచ్చిన ట్లున్నది. మాళవరాజు భోజుడు చోళమిత్రుడు. ఈ సమయమునకు సరిగా అతడు చాళుక్యుల మీదికి ఎత్తివచ్చుటచేత జయసింహుడు రెండు వైపుల యుద్ధము చేయవలసి వచ్చినది. చోళుల సైన్యము దక్షిణమునుండి వచ్చి రెండుగా చీలి వెనుకటి వలెనే రట్టవాడి కొకటియు, వేంగి కొకటియు పోయినది. వేంగికిని, రట్టవాడికిని నడుమ రెండు గోడల వలె రెండు సైన్యము లుండి వెనుక ముందుల యుద్ధమయినందున జయసింహుడు వేంగిని సాధింపలేక పోయెను. క్రీ. శ. 1021 లో రట్టవాడిలోని ముసంగికడ చోళులు ఇతని నోడించి అక్కడనే ఆపివేసిరి. పశ్చిమచాళుక్యుల బలమెట్టిదో కాని వేంగిని కాపాడుకొనుటకు చోళులు అఖిలభారతాంతర్జాతీయమైన మహాసన్నాహము చేయవలసి వచ్చినది. ఉత్తర హిందూస్థానమందలి తమ మిత్రులను హెచ్చరించుటకును, చాళుక్య మిత్రులను దండించుటకును రాజేంద్రచోళుడు వేంగి మీదుగా గంగానదివరకును పోయి మరల చక్రకూటము మీదుగా తిరిగి వచ్చి వేంగియందు గోదావరి తీరమున తన సేనాపతిని కలసికొనెను. తర్వాత క్రీ. శ. 1022 లో రాజరాజనరేంద్రుని పట్టాభిషేకము జరగినది. అటుపిమ్మట చోళరాజేంద్రుడు చోళదేశమేగి గంగైకొండ చోళపురమును రాజధానిగా నిర్మించుకొనెను.

జయసింహుడు చోళులకు సాయమొనర్చిన రాజులను వెంటనే దండింప నారంభించెను. కొంకణమును దండించి, భోజుని కొట్టి, తర్వాత చేది గాంగేయదేవుని జయించి క్రీ. శ. 1028 నాటికి మరల ముసంగికడకు వచ్చి చేరెను. క్రీ. శ. 1030 నాటికి విజయాదిత్యుడు కర్ణాటకుల సాయముతో మరల వేంగిమీదికి ఎత్తివచ్చి జయించి క్రీ. శ. 1031 లో వేంగీ ప్రభువుగా పట్టాభిషిక్తుడాయెను. పదచ్యుతుడైన రాజరాజనరేంద్రుడు చోళదేశమునకు పోవలసి వచ్చెను.

చోళు లూరకుండలేదు. వారు క్రీ. శ. 1035 లో గొప్ప సైన్యముతో వచ్చి కలిదిండికడ యుద్ధముచేసి వేంగిని వశపరచుకొనిరి. చాళుక్యులు బెజవాడవద్ద దెబ్బతిని మరలిరి. విజయాదిత్యుడు మరల కర్ణాటకమునకు పోవలసి వచ్చెను. చాళుక్యచోళ సమరము లిప్పుడు ఉగ్రరూపమును పొందసాగినవి. క్రీ. శ. 1038కు ముందుగనే జయసింహుని కుమారుడు సోమేశ్వరుడు రంగమున ప్రవేశించెను; కల్యాణకటకమును కట్టుదిట్టము చేసెను. రాజరాజనరేంద్రుడు క్రీ. శ. 1039 నాటికి మరల తిరువయ్యారుకు పోవలసి వచ్చెను. వేంగి కర్ణాటక సైన్యమునకు విహారస్థలమయ్యెను. క్రీ. శ. 1042 వరకును జయసింహుడును, రాజేంద్రుడును సజీవులై యుండినను వారి కుమారులు రంగమున ప్రవేశించిరి.

తైలపుని తరువాత అంతటివాడైన జయసింహుడు సామ్రాజ్యమును కట్టుదిట్ట మొనర్చెను; అతనికి నోళంబులతోడి బాంధవ్యము దృఢపడెను. వనవాసి మండలమంతయు పూర్తిగా అతని స్వాధీనమం దుండెను. జయసింహుని సామంతులలో కుందమరసు ప్రధానుడు. ఈతని యక్క అక్కాదేవి 'సమర భైరవి', 'గుణద బెడంగి', 'ఏకవాక్యె' బిరుదములు దాల్చి కొంకణ ప్రాంతమును కాపాడుచుండెను. చివర దినములలో ఈతడు తన



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



రాణులు సుగ్గలదేవి, లక్ష్మీదేవి, దేవల దేవుల ప్రోద్బలమున శైవమత దీక్ష వహించెను; క్రీ. శ. 1034 నుండియు బళ్లారి జిల్లాలోని పొట్లచెరువు కడనే శివధ్యానమున కాలము గడవుచుండి క్రీ. శ. 1042లో మరణించెను. ఇది మొదలు శైవము కర్ణాటక దేశమున రాజమత మాయెను. జైన ప్రాబల్యము తగ్గి శైవ, వైష్ణవ దేవాలయములు వెలయసాగినవి. కన్నడ కవులు వర్ధిల్లిరి. ఈతని తంత్ర పాలుడు మాచిరాజు కవిపోషకుడు; చంద్రరాజ కవిచే 'మదన తిలక' కావ్యమును అంకితము పొందెను.

మొదటి సోమేశ్వరుడు (క్రీ. శ. 1042 - క్రీ. శ. 1068): ఇతడు క్రీ. శ. 1042 లో రాజయ్యెను; ముందే నిర్మించుకొనియుండిన కల్యాణకటకమును రాజధానిగా చేసికొని, 'త్రైలోక్యమల్ల, ఆహవమల్ల' బిరుదములు ధరించెను. ప్రభు మంత్రోత్సాహశక్తులు కలిగిన ఈతడు తండ్రికన్న నెక్కుడుగా విజృంభించెను. క్రీ. శ. 1042 లో రాజేంద్రచోళుడు గతించి రాజాధిరాజు చోళరాజాయెను. వెంటనే చాళుక్యులతో యుద్ధములు ప్రారంభమైనవి. దన్నాడకడ పెద్ద యుద్ధము జరగెను. చాళుక్య సైన్యమందలి ఒకపాయ వెనుకకు విరుగగా చోళులు దానిని కొల్లిపాక వరకు తరుముకొనిపోయి ఆ యూరిని తగులబెట్టిరి. ఈ యుద్ధమున సోమేశ్వరుని రెండవ కుమారుడు విక్రమాదిత్యుడును, వేంగి విజయాదిత్యుడును పోరాడి చోళులకు వేంగిలో ప్రవేశము కలుగకుండ జేసిరి.

ఇదంతయు క్రీ. శ. 1044 వరకును జరగిన ట్లున్నది. చోళుల పరాజయమునకు కారణము సింహళీయులు చాళుక్యమిత్రులై చోళులపై తిరుగబడుటయే. అందుచే చోళసైన్యములు దక్షిణమునకు పోవలసివచ్చెను. మరల క్రీ. శ. 1047 నాటికి రట్టవాడి మీదికి చోళులు రాగలిగిరి. రాజాధిరాజు తుంగభద్రను దాటి కంపిలిని తగులబెట్టి, రాజరాజనరేంద్రుని వేంగియందు చేర్చి, చోళదేశము చేరి అశ్వమేధయాగము చేసెను.

వెనువెంటనే పశ్చిమ చాళుక్యులు ఎత్తివచ్చిరి. పూండూరు అను నగరముకడ(హైదరాబాదు, మహబూబు నగరు జిల్లా) 'హిరెహాళ్ల' నదీతీరమున చోళ, చాళుక్యులకు యుద్ధమయ్యెను. మరల వేంగి కర్ణాటకులకు స్వాధీన మాయెను. ఇందులకు ప్రతిగా చోళులు కర్ణాటకమును అటనట పాడుపెట్టి నొళంబవాడిని స్వాధీనము చేసికొనిరి.

వేంగిని మరల సంపాదించుటకు చోళులు రాజనీతిని ప్రయోగించిరి. భోజుని కర్ణాటకము మీదికి ఎసకొల్పి, కొంకణమున పితూరీలు లేవదీసిరి. పశ్చిమ చాళుక్యులు కొంకణమును జయించి, అచట పులకేశియను దండనాయకుని ఉంచి, భోజుని మీదికి పోయిరి. చాళుక్యసైన్యములో దక్షిణాపథమందలి గొప్పసామంతులైన హొయిసలులు, యాదవులు, కొందరు తెలుగు చోళులు మొదలైనవారుండిరి. కాకతీయ బేతని కాలముననే పైకి వచ్చిరి; చోళులతో యుద్ధము చేసిరి. చేదిరాజు కర్ణుడును, అణహిల పురాధీశ్వరుడైన చాళుక్య భీమదేవుడును కర్ణాటకులతో చేరి భోజుని ఎదిరించిరి. నూటముప్పదిమంది రాజులు కలసి భోజుని కూల్చిరని మేరుతుంగాచార్యుడు వ్రాసినాడు. ఆహవమల్ల సోమేశ్వరుని సామంతుడు హొయిసల ఎరెయంగనృపుడు, ధారా, మండవ, ఉదయపురములను తన చక్రవర్తికంటియెదుట తగులబెట్టెను.

ఈలోపల చోళులు రట్టవాడిమీదికి బయలుదేరి అటనుండి వేంగికి పోలేక పూండూరువరకు పోయి ఆ నగరమును కాల్చివేసిరి; అటనుండి, చాళుక్య సైన్యములు దూరదేశమందు మాళవములో నున్నందున, కల్యాణ కటకముమీదికి పోయి రాజధానినే కాల్చివైచి చక్కని ద్వారపాలక విగ్రహములను విజయసూచకముగా కొనిపోయిరి. ఈలోపల క్రీ. శ. 1050 కి సరిగా భోజుని మట్టువెట్టిన చాళుక్యులు ఈ వార్త విని వెంటనే గృహోన్ముఖులైరి. కొంకణమం దుండిన పులకేశి త్వరితగతిని పోయి కాంచీనగరమును తగులబెట్టెను. ఇంతలో ఆహవమల్ల సోమేశ్వరుడు రాగా చాళుక్య, చోళసైన్యములు తుంగభద్రానదీ ప్రాంతముల డీకొన సంసిద్ధములైనవి.

ఈ పరిస్థితులను చూచిన రాజరాజ నరేంద్రుడును, అతని కులబ్రాహ్మణుడు నన్నయభట్టును రాజనీతిని ప్రయోగించిరి. పశ్చిమ చాళుక్యులకు ప్రధానామాత్యుడైన వాణస మధుసూదనయ్యకు బంధువైన వాణస నారాయణభట్టు నన్నయభట్టుకు బాల్యమున సహాధ్యాయి. ఆ కారణమును పురస్కరించుకొని నన్నయ రాజరాజ నరేంద్రునికి పశ్చిమ చాళుక్యులతో మైత్రి కుదిర్చి నారాయణభట్టును, తమ యాస్థానమందు చాళుక్యుల రాయబారిగా నుంచుకొని, రాజమహేంద్రవరమునకు మార్పించి రాజరాజనరేంద్రునికి శాంతి చేకూర్చెను. ఇది క్రీ. శ. 1051 లో జరగెను. ఇదిమొదలు రాజరాజ నరేంద్రుడు పదేండ్లు నెమ్మదిగా రాజ్య మేలగల్గెను.

చోళులకు క్రోధము ఇనుమడించెను. వెంటనే వారు రట్టవాడి మీదికి దాడి వెడలి కొల్లాపురమున జయస్తంభము నాటి క్రీ. శ. 1054 నాటికి కొప్పం అనుచోట ఆంధ్ర కర్ణాటక రాజ్యముల ఎల్లలకడ చాళుక్యులను ఎదిరించిరి. అచట మహాఘోర సంగ్రామ మాయెను. చాళుక్యులు ఒక్క మోహరమున రాజాధిరాజు ఏనుగుమీదికి పోయి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఏనుగుమీదనున్న యతనిని బల్లెముతో పొడిచి చంపిరి. వెంటనే అతని తమ్ముడు రాజేంద్రచోళుడు చెల్లాచెదరై పోవుచున్న సైన్యములను మరల గుమిగూర్చి యుద్ధ మారంభించి ఆహవమల్లుని తమ్ముడగు జయసింహుని చంపి రణరంగమందే పట్టాభిషేకము చేసికొని చాళుక్యులు ఓడింపగా వెనుకకు మరలిపోయి వేంగిని పూర్తిగా ఉపేక్షించెను. గంగవాడి ఈ పరిస్థితులలో చాళుక్యులకు వశమాయెను.

క్రీ. శ. 1054 తర్వాత నాలుగేండ్లు చోళులవలన గాని, ఉత్తరదేశీయులవలనగాని కర్ణాటకులకు బాధ కలుగలేదు. క్రీ. శ. 1059 కి కొంత ముందు ఆహవమల్లునికి చేది రాజుతో యుద్ధ మేర్పడెను. సరిగా ఈ కాలముననే రెండవ రాజేంద్రచోళుని పెద్దకుమారుడు రాజకేసరి రాజమహేంద్రుడు గంగవాడి ప్రవేశించెను. కాని చాళుక్యు లాతని వెన్నంటి కంచివరకు తరిమివేసిరి. ఈ చేది, చోళ యుద్ధములు రెండును అకారణములు కావు. వేంగియందు రాజనరేంద్రునికి అవసానకాలము సమీపించుచుండెను. అతని కుమారుడు రాజేంద్రుడు చోళులకడ నుండెను. రాజనరేంద్రుడు గతింపగనే విజయాదిత్యుడు వేంగియందు క్రీ. శ. 1061 లో తన కుమారుడగు రెండవ శక్తివర్మను వేంగికి పట్టాభిషిక్తుని చేసి తాను దక్షిణమున నోళంబవాడిలోనుండి చోళుల నెదుర్కొనుచుండెను. గంగవాడిలో కొంతభాగము మైసూరు ప్రాంతము చోళులకు స్వాధీనమాయెను. కాని చోళకుమారుడు క్రీ. శ. 1061లో గంగవాడి రణమందు గతించెను. అతని పినతండ్రి వీరరాజేంద్రుడు యువరాజై (క్రీ. శ. 1062) ఈ యుద్ధమును కొనసాగించుచు వేంగిమీదికి దండెత్తి చాళుక్య విక్రమాదిత్యుని సైన్యమును జయించెను. ఈ యుద్ధమున రెండవ శక్తివర్మ అభిమన్యుని వలె గతించెను. విజయాదిత్యుడు అప్పుడు వేంగియందు లేడు. చోళుల నెదుర్కొనుటకు వనవాసి మండలాధిపతి చాముండరాయడు వేంగి ఎల్లకు పోయి వీరరాజేంద్రుని వేంగీ ప్రవేశమును అరికట్టెను. కాని తుంగభద్రకడ జరిగిన యుద్ధములో మరణించెను.

ఈ లోపల (క్రీ. శ. 1063) చోళరాజధానియందు రెండవ రాజేంద్రుడు గతింపగా, వీరరాజేంద్రుడు హుటాహుటిగా చోళరాజ్యమునకు తరలి పట్టాభిషేకము చేసికొని, ఆ ముహూర్తమే విజయ ప్రస్థాన ముహూర్తముగా మరల వేంగిమీదికి ఎత్తివచ్చెను. కూడలి సంగమను ప్రదేశమందు చోళ, చాళుక్యులకు మహాయుద్ధమాయెను. ఇరువాగులందును మహాయోధులు మరణించినను, చోళులకు వేంగి స్వాధీనము కాలేదు. విజయాదిత్యుడు ఇంతకన్నను ముఖ్యమని నోళంబవాడి యందే యుండెను; పైగా, గంగవాడినేకాక, దక్షిణమున కాళహస్తివరకు గల దేశమును జయించెను. ఈ సందర్భము చూచుకొని కర్ణాటకుల మిత్రులు చేర, చోళ, పాండ్యులు తిరుగబడిరి. వీరరాజేంద్రుడు రాజ్యరక్షణకై వెంటనే చోళదేశమునకు పోవలసి వచ్చెను.

క్రీ. శ. 1067లో వీరరాజేంద్రుడు మరల వేంగి మీదికి ఎత్తివచ్చెను. ఇరు కక్షలును కూడలి సంగమక్షేత్రమందే మరల యుద్ధమున కేర్పాటు చేసికొనినవి. చోళులు ఒక నెలరోజులు కర్నూలుకడ వేచియుండియు చాళుక్యులు రానందున రట్టవాడికి వచ్చి ముసంగిలో జయస్తంభము నాటి వేంగిమీదికి పోయిరి. ఆహవమల్ల సోమేశ్వరుడు రాకపోవుటకు కారణములు రెండు : ఒకటి, అతని పీడించుచుండిన యొక యనివార్యమైన వ్యాధి; రెండవది, రాజ్యతంత్రము. చాళుక్య సైన్యములు రెండుగా చీలి ఒకటి చక్రకూటమునకును, రెండవది అతని కుమారుడు విక్రమాదిత్యుని అధీనమున దక్షిణదేశమునకును పోయినవి. వీరరాజేంద్రుడు బెజవాడ మీదుగా పోయి వేంగీ, కళింగాదులను జయించి చక్రకూటమున చాళుక్యులను ఎదుర్కొనెను. ఇప్పుడు మరల పాండ్యులును, సింహళీయులును తిరుగబడిరి. వీరితో విక్రమాదిత్యుడు మైత్రి నెరపి కేరళమును జయించి, చోళరాజధానియైన 'గంగైకొండ' పట్టణమును కొల్లగొట్టి కాంచీపురమున ప్రవేశించి అటనుండి వేంగికి బయలుదేరెను.

విక్రమాదిత్యుని దక్షిణ జైత్రయాత్ర వినిన వీరరాజేంద్రుడు వెంటనే తనరాజ్యమునకు మరలి పోవలసిన పరిస్థితి యేర్పడినది. అంతట కొంత చోళ సైన్యమును చక్రకూటమున నిలిపి అతడు విధిలేక విజయాదిత్యునితో సంధి చేసికొని వేంగిని అతనికి వదలి చోళ దేశమునకు మరలి పోయెను. ఇది యొక రాజనీతి. విజయాదిత్యుడు వృద్ధుడు. ఆదినుండియు వేంగికొరకే అతని పోరాటము. పైగా, రాజనరేంద్రుని కొమారుడే అతనికి వారసు. రెండవ శక్తివర్మ ముందే గతించెను. ఇది ఒకవిధముగా వీరరాజేంద్రునికి ప్రతిష్ఠతో కూడిన శ్రమనివారణము. రాజనరేంద్రుని కొమారుడు రాజేంద్రుడు చక్రకూటమున కొంత చోళ సైన్యముతో నుండెను. ఈలోపల కాంచీ నగరమును వదలి విక్రమాదిత్యుడు వేంగిమీదుగా చక్రకూటమునకు పోయెను. విజయాదిత్యుడును మరల చాళుక్యులతో చేరెను. చక్రకూటమున రాజేంద్రుడు విక్రమాదిత్యుని ఎదుర్కొనెను. ఇంతలో వీరరాజేంద్రుడు మరల వేంగిమీదికి దండెత్తి గోదావరిని దాటి కొండ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



యనుచోట పశ్చిమ చాళుక్యులను తాకెను. అచటినుండి కళింగము మీదుగా చక్రకూటమునకు పోయి విక్రమాదిత్యుని ఎదుర్కొనెను (క్రీ. శ. 1068).

ఈలోగా పశ్చిమ చాళుక్య సైన్యములు గృహోన్ముఖము లైనవి. వీరరాజేంద్రుడు వేంగియందే కొంతకాల ముండెను. ఈలోపల పశ్చిమచాళుక్య చక్రవర్తి సోమేశ్వరుడు అనివార్యమైన రోగముచే బాధపడుచుండి శివనామ స్మరణముచేయుచు తుంగభద్రలో జలప్రవేశమొనర్చి కురువర్తియను -చోట క్రీ. శ. 1068 మార్చి 29 తారీఖున ప్రాణములు వదలెను. సోమేశ్వరుడు మరణించిన తర్వాత పదునైదవదినమున అతని పెద్ద కుమారుడు రెండవ సోమేశ్వరుడు భువనైకమల్ల బిరుదముతో పట్టాభిషిక్తుడాయెను. ఇంతలో వీరరాజేంద్రుడు పెద్ద సైన్యముతో చాళుక్యుల మీదికి దండెత్తి వెళ్లెను. కాని గుత్తి దగ్గర చాళుక్యసైన్యములు ఇతని నోడించినవి. ఆ సైన్యములు అచటినుండి కంపిలిని తగులబెట్టి చక్రకూటమునకు పోయినవి. కాని అక్కడి చాళుక్యసైన్యములు అప్పటికే ఇంటికి దారితీసినవి.

మొదటి సోమేశ్వరుడు పశ్చిమ చాళుక్యులలో చాల గొప్పవాడు. ఈతని రాజ్యకాలమంతయు, దాదాపు 25 సంవత్సరములు యుద్ధములలోనే గడచినది. ఈతని కుమారులు, సామంతులు, దండనాథులు, మంత్రులు చాల బలవంతులై స్వామిభక్తిపరాయణులై యుండి, ఈతని యుద్ధ విజయములకు కారకులైరి. ఈతని సైన్యములు కాన్యకుబ్జమునుండి కన్యాకుమారి వరకు విహరించినవి. కాకతీయు లితని కాలమున అనుమకొండ విషయమును పడసి సామంత పదవి నందిరి. తెలుగుచోళ రాజకుటుంబములును వృద్ధికి వచ్చినవి. ఇతని సామంతుడు కదంబకీర్తివర్మ గోవైద్య మను కన్నడ కావ్యమును రచించెను.

రెండవ సోమేశ్వరుడు (క్రీ. శ. 1068 - క్రీ. శ. 1076): భువనైకమల్ల బిరుదాంచితుడు. వేంగియు, గంగవాడిలో కొంతయు పోయినను ఉత్తరమున శత్రుబాధలేని అఖండ కర్ణాటక సామ్రాజ్యము తెలంగాణాతో ఈతని స్వాధీనమం దుండెను. ఇతని పట్టాభిషేక సమయమున ఇతని పెద్ద తమ్ముడు విక్రమాదిత్యుడు దగ్గర లేడు. చిన్న తమ్ముడు జయసింహుడు మాత్ర ముండెను. విక్రమాదిత్యుడు తుంగభద్రా తీరమునకు వచ్చి తండ్రి మరణవార్త విని వడిగా ఊరికి పోయి చేరి అన్నచే ఆదరింప బడెను.

రెండవ సోమేశ్వరుడు తమ్ములకు లోపము రానీయక మాండలిక పదవు లిచ్చి తనతో సమానముగా గౌరవించినను విక్రమాదిత్యుడు ఒక సంవత్సరము దాటువరకు అన్నకెదురు తిరిగెను. ఇదియంతయు వేంగీ ప్రాంతమందే యుండిన వీరరాజేంద్రుని భేద తంత్రమై యుండును. అతడు తన కొమార్తెను విక్రమాదిత్యుని కిచ్చి పెండ్లిచేసి అతనిపక్ష మవలంబించెను. ఇంతలో విక్రమాదిత్యుడు తమ్ముడు జయసింహుని తన పక్షమునకు త్రిప్పుకొనెను. మరికొందరు సామంతులును ఇతని పక్షమున చేరిరి. ఇట్లుండగా వీరరాజేంద్రుడు అకస్మాత్తుగా చనిపోయెను (క్రీ. శ. 1069 - 70). వెంటనే విక్రమాదిత్యుడు చోళదేశమునకుపోయి తన బావమరదిని అధిరాజేంద్రుని రాజ్యమున ప్రతిష్ఠించి కొంతకాల మచట నుండి తుంగభద్రాతీరమునకు మరలి వచ్చెను. ఈ లోపల క్రీ. శ. 1070 జూనులో రాజనరేంద్రుని కుమారుడు రాజేంద్రుడు విజయాదిత్యుని తరిమివైచి వేంగిని గ్రహించి పట్టాభిషేకము చేసికొని రాజాయెను. విక్రమాదిత్యుడు చోళదేశమును వదలి రాగానే అచట అల్లకల్లోలములు రేగినవి. అంతవరకు కళింగమందు తన యాస్థానమునకు వచ్చి తలదాచుకొనుచుండిన విజయాదిత్యుని పక్ష మవలంబించి గాంగ రాజరాజ దేవేంద్రవర్మ రాజేంద్రునితో యుద్ధముచేసి యతని నోడించెను. రాజేంద్రు డతనితో సంధి చేసికొనెను. ఆ సంధి ననుసరించి రాజేంద్రుడు చిన్నాయన యని గౌరవించి అతనికి ఆయుఃపర్యంతము వేంగిని వదలి తాను చోళ రాజ్యమును గ్రహించి ఉభయ కులోత్తుంగ చోళుడను నామము వహించి దక్షిణ సమ్రాట్టాయెను. ఈ సమయమునకు సరిగా చేదిరాజు యశఃకర్ణుడు వేంగి మీదికి దండెత్తి వచ్చెను. అట్టితరి రాజేంద్రుడు రాజనీతిని ప్రయోగించి ఆంధ్రద్రావిడ దేశములను కాపాడుకొనెను.

రాజేంద్రుడు భువనైకమల్ల సోమేశ్వరునితో మైత్రి నెరపెను; విక్రమాదిత్యుని దండించుటకు ఒడంబడెను. విక్రమాదిత్యుడు త్రిభువనమల్ల బిరుదము దాల్చినను క్రీ. శ. 1074 వరకు అన్నతో యుద్ధము చేయలేదు; సమయము నెదురు చూచి క్రీ. శ. 1075 లో అతనిపై దండెత్తెను; మొదట చోళుల నెదిరించి గంగవాడిని స్వాధీనము చేసికొనెను; తర్వాత సోమేశ్వరుని యుద్ధమున ఓడించి క్రీ. శ. 1076 లో చాళుక్య చక్రవర్తిగా పట్టాభిషేకము చేసికొనెను. ఈ సమయమున చోళులు వెనుక నుండి వచ్చి వనవాసిని, గంగవాడిని స్వాధీనము చేసికొనిరి.

భువనైకమల్ల సోమేశ్వరుడు ఆడంబరములేని రాజు; తమ్మునివంటి యోధుడు కాకపోయినను చక్కని పరిపాలకుడు. అతడు పరిపాలించిన కొలదికాలములో కొన్ని



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



దేవాలయములు జీర్ణోద్ధారమొందినవి; మతములు పోషింప బడినవి. ఈతడు 'శృంగార వీర రసికు' డనియు, 'కవి లోక కాంతు'డనియు పొగడ్తనందెను. బిల్హణుడు విక్రమాదిత్యుని నడవడిని ఎంత సమర్థించినను అతడు అన్న రాజ్యమును బలాత్కారముగా గ్రహించినట్లే శాసనములు చెప్పుచున్నవి. క్రీ. శ. 1076 తర్వాత ఈత డేమాయెనో తెలియదు.

త్రిభువనమల్ల విక్రమాదిత్యుడు (క్రీ. శ. 1076 - క్రీ. శ. 1126) : త్రిభువనమల్ల బిరుదముతో చక్రవర్తియై ఇతడు తన పేరిట చాళుక్య విక్రమశక మనుపేర ఒక నూతన శకమును ప్రారంభించెను. ఈతని రాజ్యము క్రీ. శ. 1080 వరకు ఎట్టి యుపద్రవము లేక నడచెను. కాని ఆ సంవత్సరమే ఇతని తమ్ముడు జయసింహుడు ఎదురు తిరిగెను. అతనికి చోళులు తోడ్పడిరి. ఆతనిని దండించి క్రీ. శ. 1084 లోను, 1088 లోను విక్రమాదిత్యుడు వేంగిమీదికి రెండు దండయాత్రలు చేసెను; గంగవాడినుండి చోళులను తరిమివైచెను. ఈతని కాలమున ఎక్కువ యుద్ధముల సందడి లేదు. నడిమి కాలమున హొయిసల బిట్టిగ దేవుడు క్రీ. శ. 1116 లో చోళులను పూర్తిగా గంగవాడినుండి తరిమివేసి తలకాడును ఆక్రమించెను; రామానుజాచార్యుల వారికి ఆశ్రయ మిచ్చెను; ఉచ్చంగి పాండ్యులతోను, గోవా కదంబులతోను చేరి విక్రమాదిత్యునిపై తిరుగబడెను గాని యలబరిగి సిందరాజు, అచుగి నృపతి ఆతనిని ఓడించి, గోవాను తగులబెట్టి మరల త్రిభువనమల్లునికి క్రీ. శ. 1123 లో విధేయునిగా చేసిరి. కాకతీయులు చాళుక్యుల నాశ్రయించి తెలంగాణాలో బలపడసాగిరి. క్రీ. శ. 1118 లో త్రిభువనమల్ల విక్రమాదిత్యుని దండనాయకుడు అనంతపాలయ్య వేంగిపై దండెత్తిపోయి దానిని స్వాధీనమొనర్చుకొనెను.

విక్రమాదిత్యుడు క్రీ. శ. 1126 లో గతించెను. ఈతడు కవులను పండితులను పోషించెను. 'విక్రమాంకదేవ చరిత' కర్త మహాకవి బిల్హణుడును, ధర్మశాస్త్ర వ్యాఖ్యాత విజ్ఞానేశ్వరుడును ఈతని యాస్థానమువారే.

మూడవ సోమేశ్వరుడు (క్రీ.శ. 1126 - క్రీ.శ. 1139): విక్రమాదిత్యుని కుమారుడు భూలోకమల్ల బిరుదుతో సింహాసనమెక్కి పదుమూడేండ్లు పాలించెను. ఈతడు పండితుడు, కవియునయి సర్వజ్ఞ చక్రవర్తి బిరుదము వహించి 'మానసోల్లాస'మను నామాంతరము గల 'అభిలషితార్థ చింతామణి' యను సకల భారత విజ్ఞాన పేటికయగు గ్రంథమును రచించెను. ఎక్కువ శాంతియుతమైనను ఈతని కాలమున కొన్ని యుద్ధములు జరగినవి. రాజైన వెంటనే వనవాసిని జయించి ఇతడు గంగవాడిలో కొంత మరల గ్రహించిన ట్లున్నాడు. ఈతని కాలములో వేంగి కల్యాణి చాళుక్యుల చేతినుండి జారిపోయినది. క్రీ. శ. 1138 నాటికి చాళుక్యచోళ సామంతులైన వెలనాటి చోళులు చాళుక్య దండనాయకులను జయించి వేంగిని పాలింపసాగిరి.

తరువాతి రాజులు : పేర్మ జగదేకమల్లుడు (మూడవ) సోమేశ్వరుని కుమారుడు క్రీ. శ. 1139 లో రాజాయెను. ఇతడు పేర్మ, పెర్మానడి, ప్రతాప చక్రవర్తి, త్రిభువనమల్ల, హెమ్మాడిరాయ బిరుదాంచితుడు. ఇతని కాలమున క్రీ. శ. 1143 లో హొయిసలులు స్వతంత్రులైరి. తర్దవాడిలో కాలచుర్యులు ప్రబలులైరి. వేంగి పూర్తిగా పోయినది.

తైలప చక్రవర్తి : క్రీ. శ. 1149 లో జగదేకమల్లుని తమ్ముడు (మూడవ) తైలపుడు త్రైలోక్యమల్ల బిరుదుతో రాజ్యమునకు వచ్చెను. స్వతంత్రులైనను హొయిసలులు నామకార్థము ఇతని సామంతులుగా నుండిరి. బిజ్జల కాలచుర్యుడు క్రీ. శ. 1151 నాటికి తిరుగబడి క్రీ. శ. 1156 నాటికి కల్యాణ కటకమునే హరించెను. కాకతీయ (రెండవ) ప్రోలరాజు తైలపుని యుద్ధమున పట్టుకొని కరుణించి చంపక విడిచి పెట్టెను. క్రీ. శ. 1163 లో తైలపుడు అతిసార వ్యాధిచే మరణించెను.

పేర్మ జగదేకమల్లుడు (క్రీ. శ. 1163 - క్రీ. శ. 1179): ఇతడు (మూడవ) తైలపుని కుమారుడు; మరల కల్యాణ కటకమును సంపాదించెను. కాని నిలుపుకొనలేక పోయెను. క్రీ.శ. 1179 లో ఇతని తమ్ముడు (నాలుగవ) వీరసోమేశ్వరుడు రాజాయెను. కాలచుర్యుల సేనాపతి కొమారుడు బమ్మ చమూపతియే సాయపడగా ఇతడు కాలచుర్యులను పూర్తిగా అణగ ద్రొక్కెను. కాలచుర్యపతనమునకు వీరశైవమే కారణమని బసవపురాణమున నున్నది. క్రీ. శ. 1189 - 90 ప్రాంతమున హొయిసలులు చాళుక్యరాజ్యము నంతరింపజేసిరి.

కల్యాణి చాళుక్యుల కాలమున రాజ్యాంగవిధానము మామూలు, రాచరికమే. రాజే ప్రథముడు. అతని శక్తి సామర్థ్యములమీదనే రాజ్యభారమును, సామ్రాజ్య స్థైర్యమును ఆధారపడియుండినవి; సప్తాంగములు, స్వామ్యమాత్యాదులు ఉండినవి. అన్నిటికన్న మిన్నగా చెప్పదగి రెండు నియోగముల పద్ధతి యొకటి కనబడుచున్నది. ప్రధానామాత్యునికి రాజనియోగ రాజాధ్యక్షు డనియు, ధ్యానపతినియోగ యౌగంధరాయణు డనియు బిరుదులు కలవు. రాజు ధనాగారమునకు అక్షపటలమని పేరు. ప్రధానామాత్యుడే తదధిపతి. సకలాయ వ్యయములును అయవ యధీనములు. ప్రధానామాత్యునిక్రింద అమాత్యులును,



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అధ్యక్షులును ఉండెడివారు. వీరికే ప్రెగ్గడలని కూడ నామాంతరము. ఈ మంత్రు లందరకు దండనాయక, మహా ప్రచండ దండనాయక పదవులును, పంచమహాశబ్ద మహా సామంతాధికారములును, యువరాజపదమును ప్రభు సంతోషాధీనములుగా వచ్చుచుండెడివి. వీ రందరును బ్రాహ్మణులు. వీరిలో కొందరు జైనులు, కొందరు వైదికులు, కొందరు తర్వాత కాలాముఖ మతస్వీకారము నందినవారు. చాళుక్యులకై ఈ మంత్రులలో పలువురు రణరంగమున సేనాధిపతులై ప్రాణము లిచ్చి యున్నారు.

రాష్ట్ర మంతయు గంగవాడి, నోళంబవాడి, రట్టవాడి, సిందవాడి మొదలగు ప్రసిద్ధ మండలములుగా విభక్తము. వీనికి ఒక్కొక్కదానికి గంగవాడి 96000, నోళంబవాడి 82000 అని సంఖ్యలను చేర్చియే వ్యవహారము. బహుశః అవి గ్రామములో, లేక గ్రామమను నొక గరిష్ఠ భూప్రమాణమో తెలియదు. ఈ మండలములు నాడులుగాను, అవి ఊళ్లుగాను, ఊళ్లు గ్రామములుగాను విభక్తములై యుండినవి. మండలములే విషయములు. వీని పాలకులకు మండలేశ్వరులు, లేక మహామండలేశ్వరులు అని పేర్లు. వీరు సామంతరాజులు. వీరిక్రింద వరుసగా నాడుప్రభువులు, నాడుగాముండులు, గాముండులు, వారిక్రింద ఊరుగాముండులు, వారి క్రింద ఊరొడయలు - ఇట్లుండిరి. ఒక్క గ్రామాధికారికికూడ ప్రభువు, గ్రామణి లేక గాముండుడని పేరు. గాముండపదమే జన వ్యవహారమున చివరకు గౌడ యైనది. గాముండనికి పై యధికారి పది గ్రామాల యధికారి. వానికి పైవాడు ఇరువది గ్రామముల ప్రభువు. వానికి పైవాడు నూరు గ్రామాల ప్రభువు. ఇట్లే మండలేశ్వరుని వరకు. గ్రామమందు దోష మేర్పడి గ్రామాధిపతి అశక్తుడైనచో దశ గ్రామాధిపతి తీర్పు చెప్పవలసినది. అతడు చెప్పలేకపోయిన వింశతి గ్రామప్రభువు చెప్పవలసినది. ఇట్లు చక్రవర్తివరకు పోవచ్చును.

చాళుక్య పరిపాలనలో స్త్రీలకుకూడ మహోన్నత స్థాన ముండెను. చాళుక్య చక్రవర్తుల తోబుట్టువులును, రాణులును కూడ రాజ్య వ్యవహారములను చూచుచు మండలములను పాలించుచుండిరి. సమర భైరవియైన అక్కాదేవి వంటివారు సేనాసమూహములకు అధిపురాండ్రై ప్రసిద్ధినందియుండిరి.

లెక్కలేని పన్నులును, సుంకములును ద్రవ్యరూపముగా గాక ఆయావస్తువులలో భాగముగానే గ్రహింపబడి ఆయా దేవాలయాదికార్యములకు వినియోగింపబడు చుండెడివి. రాజులయు, మండలేశ్వరులయు ధనాగారములకు వేరు ఆదాయమార్గము లుండెడివి.

వర్తకులు సంఘములుగా చేరి తమలో కట్టుబాట్లేర్పరచుకొని వ్యాపారములు చేయుచుండిరి. వీరిలో దేశీయులు వేరు; విదేశీయులు వేరు. నానాదేశి సంఘము లని దేశ మంతయు తిరిగి వ్యాపారములు చేయుచుండిరి.

రాజుల మతము లేవైనను ఇతర మతములయెడ వారికి సహన ముండెడిది. చాళుక్యులది మొదట జైనమతము. తైలప, సత్యాశ్రయ, విక్రమాదిత్య, జయసింహులు క్రి. శ. 978 నుండి క్రి. శ. 1088 వరకు జైనులు. జయసింహుడు రాణులైన సుగ్గలదేవి లక్ష్మీదేవుల ప్రోద్బలమున కాలాముఖ శైవమార్గము నంగీకరించినాడు. ఈతని కుమారుడే సోమేశ్వరుడు. అదిమొదలు కర్ణాటకము బహుళభంగుల వెలిగి బసవేశ్వరుని యవతారమునకు దారితీసినది.

కన్నడ వాఙ్మయము కూడ చాల వృద్ధికి వచ్చినది. కన్నడ కవిత్రయములోనివాడైన రన్నడు తైలప సత్యాశ్రయుని యాస్థానివాడు; అజితపురాణ, గదాయుద్ధాది కావ్యకర్త. గుణవర్మ, గజాంకుశుడు, కవిమల్లుడు మొదలగువారు ఈ కాలమువారే. ఉదయాదిత్యుని సంధివిగ్రహి నాగవర్మ చంద్రచూడామణి శతకకర్త. వాజివంశజాతుడు, అమాత్యచూడామణి, బ్రాహ్మణుడు చంద్రరాజు మదనతిలక గ్రంథకర్త. ఈ గ్రంథమందు రెండవ జయసింహుని ప్రశస్తియు కలదు. కాళిదాస దండనాథుని అల్లుడు కర్పరను శాసనపద్యకవి. పంపరామాయణ కవి నాగచంద్రుడును, గోవైద్యకర్త కదంబ కీర్తివర్మయు, ఇంక ననేకులు కన్నడ కావ్యకర్తలు కనబడుచున్నారు. వీరి కవిత్వము నన్నయాదుల ధోరణిని చాలవరకు పోలి యున్నది.

రాజులును, మాండలికులును కవులే కాక, కవిపోషకులే కాక సకల కళలను పోషించిరి. చాళుక్య చక్రవర్తి మూడవ సోమేశ్వరుడు స్వయము నాట్యాచార్యుడు; నట్టువు. గొండ్లియను నృత్యములోని దోషమును ఎవరో అడగా దిద్ది ఆడి చూపినవాడు. రాణులు సంగీత నృత్త వాద్యాది విద్య లెరింగినవారు. పశ్చిమ చాళుక్యుల ఆలయ నిర్మాణమును, శిల్పకళయు ఎంతో అభివృద్ధినందినవి. చాళుక్యులు ఆలయ నిర్మాణ కళ కిచ్చిన ప్రోత్సాహము కతన వారినాటి యా కళలో చాళుక్యరీతియను ఒక విశిష్ట సంప్రదాయ మేర్పడినది.

సాంఘిక జీవనము వర్ణాశ్రమ ధర్మమేయైనను కొందరు శర్మలు వర్మవాచ్యులుగా కనబడుచున్నారు. అన్ని వర్ణములవారును యుద్ధాదికములలో పాల్గొనుచుండిరి. ధర్మశాస్త్ర నిర్ణయము విజ్ఞానేశ్వరీయముంబట్టి. విజ్ఞానేశ్వరుడు

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అరవ విక్రమాదిత్యుని యాస్థాన పండితుడు. పురుషులతో పాటు స్త్రీలును వైదుష్యార్జనము చేయుటయేకాక ఆయా మతములలో సన్న్యాసినీవృత్తి అవలంబించుటయు సహజమే. మత ప్రచారక మఠములును, దేవాలయములును విద్యాస్థానములుగా నుండుటయే కాక ప్రత్యేక ఘటికా స్థానములలో వందలకొలది విద్యార్థులు నానా విద్యలను నేర్చుచుండిరి. వారికి రాజులే పోషకులు. ఆయుర్వేద శిక్షణకు ప్రత్యేక ప్రాధాన్య ముండెడిది. **వే. వెం. శా.**

## చాళుక్య చోళులు

**మొదటి కులోత్తుంగ చోడచక్రవర్తి :** (క్రీ. శ. 1070 - క్రీ. శ. 1120): క్రీస్తు శకము 1076 వ సంవత్సరములో పూర్వ చాళుక్య రాజరాజనరేంద్రుని సవతిసోదరుడు విజయాదిత్య భూపతి కాలధర్మము నొందెను. ఈతని మరణముతో వేంగీ రాజకీయములలో గొప్ప మార్పు సంభవించినది. అప్పటికే రాజరాజ నరేంద్రుని కుమారుడు రాజేంద్ర చోడుడు కులోత్తుంగ బిరుదనామమును వహించి మాతృ మాతామహ రాజ్యమైన చోళ సామ్రాజ్యమును వశపరచుకొని దానిని గంగైకొండ చోళపురము రాజధానిగా పరిపాలించుచుండెను. పినతండ్రియైన విజయాదిత్యుడు గతించిన వెనుక పితృపైతామహ రాజ్యమైన వేంగీదేశముకూడ అతని అధికారము క్రిందికి వచ్చినది. కాని, అతడు చోళ దేశమున నుండుటకే ఇచ్ఛయించెను కాని రాజధానిని వేంగీ దేశమునకు మార్చలేదు. అతడు తన కుమారులను రాజ ప్రతినిధులుగ నియమించి వేంగిదేశమును పరిపాలింప బంపెను. ఈవిధముగా కులోత్తుంగ రాజేంద్ర చోడచక్రవర్తి చోళ సామ్రాజ్యములో వేంగి యంతర్భాగమై తన రాజకీయ ప్రాధాన్యమును కోల్పోయెను. కులోత్తుంగ చోడ నామమును ధరించినవారిలో ఈతడు ప్రథము డగుటచేత ఇతనిని చరిత్రకారులు మొదటి కులోత్తుంగచోడుడని వ్యవహరింతురు. ఈతడును, ఈతని సంతతివారును ఇటు చాళుక్య రాజ్యమును, అటు చోళ సామ్రాజ్యమును పరిపాలించినందువలన వీరికి చరిత్రలో చాళుక్యచోళులని, చాళుక్య చోడ చక్రవర్తులని పేరు కలిగినది. ఈ కులోత్తుంగ చోడుని సంతతివా రందరు చోళులు పరిపాలించిన ద్రావిడ దేశముననే ఉండిపోవుటవలన వీరు క్రమముగా తమిళులై తమిళ కవులను ఆదరించిరి. వీరి సామ్రాజ్య సైన్యములోని గొప్ప గొప్ప సేనానాయకు లెల్లరు ద్రావిడ దేశీయులే. ఉన్నత రాజకీయోద్యోగు లందరు ద్రావిడులే. కులోత్తుంగ రాజేంద్రచోడుని కుమారులు ద్రావిడ దేశముననే పుట్టి, పెరిగి అచ్చటనే సంబంధ బాంధవ్యములు కలవారగుట వలనను, వారే వేంగీ దేశమునకు రాజప్రతినిధులుగా వచ్చుటవలనను, వారి యాశ్రితులగు ద్రావిడులు నాలుగు వర్ణములవారు, ముఖ్యముగా బ్రాహ్మణులు, తెలుగు దేశమునకు రాదొడగిరి. ఈరీతిని ఆంధ్ర, ద్రావిడ దేశములకు సంబంధ మెక్కువయినది; రాకపోకలు తరచయినవి. ద్రావిడదేశ మత సంస్కృతి ప్రభావము తెలుగు దేశముమీద ఎక్కువగా కనబడినది ఈకాలములోనే. మతమునకు సంబంధించిన ద్రావిడాచారములు, ధర్మ సంస్థలు, శైవ, వైష్ణవ పరిభాష మొదలయినవి తెలుగు దేశములోను కొన్ని నాటుకొని పోయినవి.

కులోత్తుంగ రాజేంద్ర చోడభూపతి సూర్యవంశజుడయిన రాజేంద్ర దేవుని, అనగా రెండవ రాజేంద్రచోడ దేవుని కొమార్తెయైన మధురాంతకిని పెండ్లాడెను. వీ రిరువురికి ఈ వివాహము కులోత్తుంగచోడుడు సింహాసన మెక్కుటకు చాలకాలము పూర్వమే జరగియుండవలెను. ఈమెకాక త్యాగవల్లి, ఏటిశైవల్లభి, త్రైలోక్య మహాదేవి, కాడవన్ మహాదేవి, త్రిభువన మహాదేవిఅను కంపమాదేవి మొదలైన భార్యలు ఇంకను కలరు. వీరిలో మధురాంతకియే పట్టపురాణి యనియు, ఈమె మరణానంతరము ఏటిశైవల్లభి ఆమె స్థానమును ఆక్రమించె ననియు చో. చరిత్రకారు లందురు. మధురాంతకికి సమస్త భువనమునకు యజమానురాలను నర్థమిచ్చు 'పువనముఖుదుడైయాళ్', 'అవనిముఖుదుడైయాళ్' అను బిరుదులు కలవు. కులోత్తుంగ చోడ రాజేంద్రునికి చోడ సింహాసన మెక్కునాటికే మధురాంతకి వలన ఏడుగురు తనయులు కలిగిరి. ఈ యేడుగురు మాత్రమే కాక కులోత్తుంగునికి ఇంకను మరికొందరు కొడుకులును, కూతుండ్రును కలరు. కులోత్తుంగుడు తన కొమార్తెలలో నొకతెయైన రాజసుందరిని కళింగదేశాధీశ్వరుడైన గాంగవంశ భూపతి రాజరాజ దేవేంద్రవర్మకిచ్చి పెండ్లిచేసెను. ఈ దంపతులకు జనించినవాడే అనంతవర్మ చోడగంగదేవుడు. ఇతడు కళింగ గాంగ మహీపతు లందరిలోను చాల గొప్పవాడు.

వేంగీ దేశమునకు రాజప్రతినిధులుగ పంపబడిన రాజకుమారులు మధురాంతకి తనయులు. వీరిలో రాజరాజ చోడగంగు, రాజరాజ ముమ్మడి చోడుడు, వీర చోడుడు, విక్రమ చోడుడు అనువారు మాత్రమే శాసనములవలన మనకు తెలియవచ్చినవారు. వీరిలో రాజరాజ చోడగంగు జ్యేష్ఠుడు. విక్రమచోడ నృపాలుడు మధురాంతకి కుమారుడని చాలమంది చెప్పుచున్నను ఆమె తనయుడు అగునో కాదో యని సంశయించుటకు అవకాశము కలదు.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



రాజరాజ ముమ్మడిచోడుడు (క్రీ. శ. 1076 - క్రీ. శ. 1079) : విజయాదిత్యుడు మృతి నొందగనే వేంగిదేశ పరిపాలనమునకు మొదటి రాజ ప్రతినిధిగా పంపబడిన రాజకుమారుడు రాజరాజ ముమ్మడిచోడుడు. ఇతడు శకము 998 లో జననాథనగరిలో పట్టాభిషిక్తుడయ్యెను. జననాథ నగరి యన్నది ఇప్పటి దాక్షారామముగా చరిత్రకారులు గుర్తించియున్నారు. ఈతని పట్టాభిషేకము క్రీస్తుశకము 1076 లో జూలై 27 వ తేదీని జరిగినట్లు చెప్పుటకు అవకాశము కలదు. వేంగిదేశ పరిపాలనమునకు రాజప్రతినిధులుగా వచ్చిన రాజకుమారు లందరును కులోత్తుంగునివలెనే పూర్వ చాళుక్యులకు పరంపరాగతముగా వచ్చుచుండిన 'సర్వలోకాశ్రయ', 'విష్ణువర్ధన' బిరుదములు వహించిరి. ఒక్కొక్కప్పుడు ఈ రాజ ప్రతినిధులు తమ శాసనములలో పూర్వోక్త చాళుక్య బిరుదములనే కాని నిజనామములను తెలుపుకొనువారు కారు. వీ రందరును సర్వలోకాశ్రయులే, విష్ణువర్ధనులే. ఈకారణము చేత వీరిలో ఎవరు ఎవరో గుర్తించుటయు, ఆయా శిలాశాసనములు ఏయే రాజప్రతినిధులవో తెలిసికొనుటయు కష్టమగుచున్నది. జ్యేష్ఠ పుత్రుడు రాజరాజచోడ గంగు ఉండగా కులోత్తుంగ చోడుడు ఎందువలన రాజరాజ ముమ్మడి చోడుని ముందు వేంగీ రాజప్రతినిధిగ పంపెనో తెలియరాదు. రాజరాజ ముమ్మడిచోడుని సోదరుడును, అతని యనంతరము వేంగికి రాజప్రతినిధిగా వచ్చినవాడును అయిన వీరచోడ నృపతి తన చెల్లూరు తామ్ర శాసనమున ఎట్లు ఏల తెలిపెనో కాని, ఒక్క సంవత్సరము మాత్రమే రాజరాజ ముమ్మడిచోడుడు వేంగిని పరిపాలించెనని చెప్పియున్నాడు. కాని, ఇది సరికాదు. గురువుల శ్రీపాదసేవయే సుఖము కాని రాజ్యము సుఖము కాదని వేంగీ భువనమును ఒక్క సంవత్సరము మాత్రమే పరిపాలించి రాజరాజ ముమ్మడి చోడుడు తండ్రిదగ్గరకు వెళ్ళినట్లు వీరచోడుడు చెప్పెను కాని, రాజరాజ ముమ్మడి చోడుడు వేంగిదేశమును రెండు సంవత్సరములకుపైనే పరిపాలించినట్లు అతని శాసనములవలన తెలియుచున్నది. అతడు తన దాన శాసనములను తన రాజ్యకాల సంవత్సరములలోనే తెలుపుకొనెను. కాని, మిగిలిన వేంగిరాజ ప్రతినిధులు అట్లు కాదు. వారు తమ శాసనములందు చక్రవర్తియు, తమ తండ్రియు అయిన కులోత్తుంగ చోడుని విజయరాజ్య సంవత్సరములనే ఇచ్చియున్నారు. రాజరాజ ముమ్మడి చోడుని పలూరు తామ్రశాసనము అతని ద్వితీయ రాజ్య వత్సరమున ఇచ్చినది. ఈ తామ్ర శాసనము రాజరాజ ముమ్మడి చోడునికి కదుంగడు మిత్రుడును, సామంతుడును అయిన సూర్యవంశజుడగు ముమ్మడి భీమనృపునికి వేంగి విషయములోని పండ్రెండు గ్రామములను సర్వకరపరిహారము చేసి 'మన్నియనిబద్ధ మాధిపత్యము' ఇచ్చెను. ఈ ముమ్మడి భీముడు కన్నరదేవ వంశజుడైన భీముని పౌత్రుడు; సంకియకు కామిదేవికి జనించిన తనయుడు. విజయాదిత్యు డీతనిని శైశవమునుండియు పెంచి పెద్దవానిని చేసెననియు, ఇతడు రాజరాజ ముమ్మడిచోడునికి కుంతల చాళుక్యులతోను, కళింగ గాంగులతోను కలిగిన యుద్ధములలో చేసిన గొప్ప సేవకు సంప్రీతుడై యీ ద్వాదశ గ్రామములను ఇచ్చె ననియు శాసనము తెలుపు చుండుటచేత విజయాదిత్యుడు మృతి నొందిన వెంటనే వేంగీ దేశమును వశపరచుకొను తలంపుతో పశ్చిమ చాళుక్యులును, కళింగ గాంగ భూవరులును కలసి దండెత్తివచ్చి నట్లును, ముమ్మడి భీమరాజు సాహాయ్యముతో రాజప్రతి నిధియైన రాజరాజ ముమ్మడి చోడుడు వారిని ఎదుర్కొని పారద్రోలినట్లును ఊహింపవలసియున్నది. ఇది యటుండ కళింగ దేశాధీశ్వరుడయిన పూర్వగాంగ నృపతి రాజరాజ దేవేంద్రవర్మ శకవర్షము 992 మొదలు ఏడేండ్లు రాజ్య పరిపాలము చేసి శకవర్షము 999 లో కాలధర్మము నొందెను. అతనికిని కులోత్తుంగ చోడరాజ దుహితయైన రాజసుందరికిని జనించిన అనంతవర్మ చోడగంగదేవుడు బాలుడయినందున అతని దాయాదులు కుంతలేశ్వరుల సాయముతో గాంగ సింహాసనము నాక్రమించుకొను ప్రయత్నమున నుండినప్పుడే రాజరాజ ముమ్మడిచోడ రాజకుమారుడును, ముమ్మడి భీముడును కళింగమున కరిగి శత్రువుల నణచి బాలుడైన అనంతవర్మ చోడగంగదేవునికి పట్టముకట్టి అతని సంరక్షకులుగ కళింగరాజ్యమును



చిత్రము 84. భీమేశ్వరాలయము, దాక్షారామము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తమ యధికారము క్రిందికి తీసికొని యుండవచ్చును. ముమ్మడి భీమనృపతి రాజరాజ ముమ్మడి చోడునికి దక్షిణ హస్తమై నిలిచి ఈ యుద్ధములందు కుంతలేశ్వరులైన పశ్చిమ చాళుక్యులను, అనంతవర్మ చోడగంగదేవుని దాయాదులైన కళింగ గాంగ భూవరులను ఓడించి తన ప్రభువునకు విజయము చేకూర్చెనని తలపవచ్చును. ఈ కారణమున ముమ్మడి భీమున కిచ్చిన ద్వాదశ గ్రామములు ఒక జాగీరువంటివి; 'జీవితము' వంటిదని నుడువ వచ్చును. అది యటుండ, సహస్ర గ్రామ సంఖ్యాకమయిన వేంగి విషయమునకు పై ముమ్మడి భీముని రాజరాజ ముమ్మడి చోడుడు అధిపతిని కావించెను. ఏలూరు సమీప మున నున్న పెదవేగి చుట్టుపట్ల ప్రాంతమునకే వేంగివిషయ మని పేరు కలుగుటచేత ముమ్మడి భీముని రాజధాని ప్రాయికముగా కొలనిపురమను నామాంతరముగల కొలనువీడై ఉండవచ్చును.

రాజరాజ ముమ్మడి చోడుని తరువాత, వేంగిదేశము నకు రాజప్రతినిధిగా వచ్చిన వీరచోడుని పట్టాభిషేకము శకము 1001 వ సంవత్సరములో జరగుటచేత రాజరాజ ముమ్మడి చోడుడు అంతవరకు వేంగిరాజ ప్రతినిధిగా ఉండి నట్లు ఎంచవలసియున్నది. ఇతని కాలములో ఇతని సమస్త సేనాధిపతిగా ఉండినవాడు దుర్జయ వంశ్యుడయిన వెల నాటి గొంకయ. ఇతడు శకవర్షము 998 కి సరియైన నల సంవత్సర మాఘ పూర్ణిమా శుక్రవారమునాడు చంద్ర గ్రహణ నిమిత్తమున చేబ్రోలి మూలస్థాన మహాదేవరకును, కుమారస్వామి దేవరకును అఖండవర్తి దివియల నిమిత్తము వెల్లెడ్లను పెట్టెను. ఈ శాసనమున గొంకయ 'క్రీడా దలితాఖిలారినిచయు' డని, 'శిష్టేష్ట రక్షామణి' యని, 'శంకర కింకరు' డని, 'గుండాంబికా నందను' డని ప్రస్తుతు డయినాడు. రెండేండ్ల యనంతరమున రాజరాజ ముమ్మడిచోడ రాజకుమారుడు తండ్రికడ కరిగెను. కాని, అందుకు ఇతని సోదరుడు వీరచోడ నృపతి చెప్పినది మాత్రము కారణమై యుండదని తోచుచున్నది. ప్రాయిక ముగ ఇతనికిని, ఇతని తండ్రికిని రాజకీయముగ పొరపులు కలిగియుండవచ్చును. ఎట్లయిననేమి, రాజరాజ ముమ్మడి చోడునికి పిదప అతని సోదరుడు వీరచోడుడు వేంగిరాజ ప్రతినిధిగా నియమితుడయ్యెను.

వీరచోడుడు (క్రీ. శ. 1079 - క్రీ. శ. 1084): తన సోద రుడు రాజరాజ ముమ్మడి చోడునివలెనే ఇతడును సర్వ లోకాశ్రయ, విష్ణువర్ధన బిరుదములు వహించి జననాథ నగరమున వేంగి చాళుక్య రాజ్యమునకు పట్టాభిషిక్తుడై అయిదేండ్లపాటు దానిని పరిపాలించెను. తనసోదరునివలె కాక ఇతడు తన శాసనము లన్నిటి కాలమును తన ప్రభువును, తండ్రియు నైన కులోత్తుంగ చోడుని రాజ్యపాలన వత్సరములలోనే తెలిపెను.

వీరచోడుని పరిపాలన కాలములో వేంగిపై పశ్చిమ చాళుక్య దండయాత్ర యుండినట్లు ఊహింప నవకాశము కలదు. వేంగియందలి ఈ కాలపు శాసనములలో పశ్చిమ చాళుక్య భూవరుల పేరులు కాని, వారి సామంత దండ నాయకుల పేరులు కాని కానరావు. అయినను దాక్షా రామములోని శకము 1003, 1004 సంవత్సరములనాటి శాసనములలో పశ్చిమ చాళుక్య త్రిభువనమల్ల విక్రమా దిత్యుని చాళుక్య విక్రమ శకవర్షములు 5, 6 ఉదాహృత మయినవి. సరిగా శకము 1004 నాటిదే త్రికళింగాధిపతియైన గాంగ రాజరాజదేవుని ప్రధానియైన రాజేంద్ర బ్రహ్మ చక్రవర్తి బణపతి శాసనము కలదు. ఇది సర్వలోకాశ్రయ విష్ణువర్ధనుని రాజ్యకాలము లోనిది. విష్ణువర్ధనుని రాజ్య వత్సరము శాసనములో పోయినది. కళింగము వేంగి సామంతరాజ్య మగుటవలన, ఒకవేళ పశ్చిమ చాళుక్యులు వేంగిపై దండెత్తి వచ్చినపుడు బణపతి వీరచోడుని సాహా య్యార్థము వచ్చినట్లు ఊహింపవలసియుండును. చాళుక్య విక్రమవర్షమును ఉదాహరించు శాసనములు శకవర్షము 1005 (క్రీ.శ. 1083) నుండి కానరానందున పశ్చిమ చాళుక్య దండయాత్ర కేవలము తాత్కాలికమైనదని, దానివలన పశ్చిమ చాళుక్యులకు శాశ్వతలాభ మేమియు కలుగలేదని చెప్పవచ్చును. 18 వ విజయరాజ్య సంవత్సరమునకు సరి యగు శకవర్షము 1005 నాటి కులోత్తుంగుని శాసనము దాక్షారామములో ఉండుటచేత అప్పటికి పూర్వచాళు క్యాధికారము మరల వేంగిలో సుస్థాపితమయిన దన వచ్చును. వెలనాటి గొంకయ అన్నయైన గ[illegible]కుమా రుడు వెదురయ సామంత సహితుడయిన పాండ్యరాజును యుద్ధమున ఓడించి చేసిన సాహాయ్యమునకు సంతసించి వీరచోడ నరేంద్రుడు అతనిని తన యర్ధ సింహాసనమున గూర్చుండ బెట్టుకొని సింధుయుగ్మాంతర దేశమును అతనికి ఒసగినట్లు వెలనాటి పృథ్వీశ్వర మహీపతి పిఠా పురము శాసనమున చెప్పబడినది. కొందరి యభిప్రాయము ప్రకారము సింధుయుగ్మాంతరదేశ మన్నది గోదావరి కృష్ణానదుల మధ్యదేశము. కాని ఇది సరియైన యభిప్రాయ ముగ తప్పట్టదు. సింధు యుగ్మాంతరదేశ మన్నను, రాజ రాజ నరేంద్రుని శాసనములలో వచ్చు రెండేరుల నడిమి విషయ మన్నను ఒక్కటే. ఇది వృద్ధగౌతమీ వసిష్ఠలకు మధ్యనుండు ప్రదేశము. వెలనాటి వెదురయ యుద్ధములో ఓడించిన పాండ్య రాజులు మధుర పాండ్యులు కారు. వీరు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఉచ్ఛంగి పాండ్యులు ; చంద్రవంశపు యాదవులు. ఉచ్ఛంగి బళ్ళారి జిల్లా నైరృతి దిశనున్న గిరిదుర్గము. ఇది నోలంబ వాడి ముప్పది రెండువేల దేశమునకు రాజధాని. ఈ పాండ్యులు పశ్చిమ చాళుక్య సామంతులు. ఇరుక్కవేల వామాంతరము గల త్రిభువనమల్ల పాండ్యదేవుడు పశ్చిమ చాళుక్య చక్రవర్తి త్రిభువనమల్ల విక్రమాదిత్యునికి సామంతుడై నోలంబవాడి రాష్ట్రమును ఈ కాలమున పాలించుచుండెను. ఇతని శాసనములు శకవర్షము 1046 (క్రీ. శ. 1124) వరకు కలవు. పశ్చిమ చాళుక్య దండయాత్రా సందర్భమున వెలనాటి వెదురయ ప్రాయికముగా ఈ త్రిభువన మల్ల పాండ్యదేవునో, ఇతని వెనుకటి పాండ్యునో ఓడించి యుండును. వీరచోడ రాజకుమారుడు మొదటి తడవ వేంగిని పరిపాలించిననాటి విశేషములు ఇంతకంటె తెలియవు.

రాజరాజ చోడగంగు (క్రీ. శ. 1084 - క్రీ. శ. 1089) : వీరచోడునికి పిదప వేంగిరాజ్య పరిపాలనమునకు నియుక్తుడయినవాడు అతని జ్యేష్ఠ సోదరుడయిన రాజరాజ చోడగంగు. ఇతడు శకవర్షము 1006 లో (క్రీ. శ. 1084, మే 22 వ తేది) వేంగీ రాజ్యమునకు జననాథపురమున పట్టాభిషిక్తుడయ్యెను. ఈ రాజ ప్రతినిధులను కులోత్తుంగ చోడ చక్రవర్తి ఎందువలన కొద్దికాలము మాత్రమే వేంగియందు ఉంచుచువచ్చెనో తెలియదు. రాజరాజ చోడగంగు మొదటి శాసనము అతని తండ్రియు, అధిపతియు అయిన కులోత్తుంగ చోడుని 17 వ రాజ్యవర్షమున (క్రీ. శ. 1086 - 87) ఈయబడినది. రాజరాజ చోడగంగు ఈ శాసనమును మన్నేరు మహేంద్రగిరుల మధ్య నివసించుచుండిన జనులను సంబోధించి ఇచ్చెను. కావున వేంగిరాజ్యము ఇతనికాలమున ఉత్తరమున గంజాముజిల్లాలోని మహేంద్రగిరినుండి దక్షిణమున నెల్లూరు జిల్లాలోని మన్నేటివరకు వ్యాపించెననియు, మహేంద్రగిరివద్దనుండి దానికి దక్షిణ దిక్కున గల కళింగ మంతయు ఇతని కాలమువరకు వేంగిచాళుక్య చోళుల పర్యవేక్షణలో నుండె ననియు స్పష్టమగుచున్నది. శకవర్షము 1008 నాటి రాజరాజ దేవేంద్రవర్మ ప్రధాని బణపతి దాక్షారామ శాసనము వేంగిరాజ్య ప్రతినిధియైన సర్వలోకాశ్రయ విష్ణువర్ధమని రాజ్యకాలమున వ్రాయబడిన దగుటచేత కళింగదేశీయులు అప్పటికి చాళుక్య చోడులకు విధేయ సామంతులుగ ఉండిరని తలంపవచ్చును. కులోత్తుంగ చోడచక్రవర్తి సింహాచల శాసనమే విశాఖపట్టణము జిల్లాలో కానవచ్చు ప్రథమ శాసనము. ఈ శాసన కాలము 'శాకాబ్దే నిధి ఖేందు గణితే' (శకము 109) అని శ్లోకభాగము తప్పుగా పడినది. ఇందు కులోత్తుంగుని పదునొకండవ రాజ్యవర్షము ఉదాహృతమయినది. అందువలన శాసనములోని శకవర్షము తప్పుగ పడినదన్నది నిజము. శకవర్షము 109 కాక 1009 అని యుండవలసినచో కులోత్తుంగుని రాజ్య సంవత్సరము 17 కావలసియుండును. రాజ్య సంవత్సరము శాసనములో ఉన్నట్లు పదునొకండే యైనచో శకవర్షము 1008 కావలెను. వీనిలో ఏది యె ట్లుండవలసినను కళింగదేశ విజయము రాజరాజ ముమ్మడిచోడుని కాలముననే జరగియుండును. మొత్తము మీద రాజరాజచోడగంగు నాటికి కళింగము కులోత్తుంగ చోడుని అధికారము క్రిందనే ఉండెను. రాజ రాజ చోడగంగు 'తెలికివేయి' సంఘమునకు కొన్ని కుల మర్యాదలను ఇచ్చిన విషయమును తెలుపుటకే ఒక తామ్ర శాసనము పుట్టినది. రాజరాజ చోడగంగు శిలా శాసనము లింకను ఉన్నవి కాని వానివలన మనకు తెలియవచ్చు విశేషము లేవియు లేవు.

వీరచోడుడు (క్రీ. శ. 1089 - క్రీ. శ. 1094) : రాజ రాజ చోడగంగు వేంగిరాజ ప్రతినిధిగా వచ్చి అయిదవ యేడు పూర్తి కాకమునుపే కులోత్తుంగ చోడుడు అతనిని రాజధానికి పిలిపించి వీరచోడుని మరల రెండవ తడవ వేంగిరాజ ప్రతినిధిగ నియమించి పంపెను. అప్పటికే ఉత్తర దేశము యుద్ధ మేఘావృతమైనదని తోచుటచేతనేమో కులోత్తుంగుడు వీరచోడుని మరల ఉత్తరదేశ విజయమునకు పంపించినట్లు ('ప్రస్థాపయ త్పున రుదీచ్య జయాయ') వీరచోడుని పిఠాపురపు తామ్రశాసనమునందు చెప్పబడినది. కులోత్తుంగుని యూహ సరియైనదే యని అనతికాలముననే రుజువైనది. వీరచోడుని రెండవ తడవ పరిపాలన కాలముకూడ యుద్ధములతోనే సరిపోయినది.

వీరచోడుడు వేంగి పరిపాలనము చేయుచుండిన కాలమున బస్తరులోని చక్రకూట ధరావరుడును, కాశ్యప గోత్రుడును, వ్యాఘ్ర లాంఛనుడును, నాగకేతనుడును, నాగ వంశ్యుడును అయిన రాజభూషణ మహారాజాధి రాజ సోమేశ్వరదేవుడు (శకము 992 - శకము 1088) వేంగి రాజ్యముపై దండెత్తి వచ్చెను. సోమేశ్వర దేవుని తండ్రి చక్రకూట (చక్రకోట్య) మండలాధిపతియైన జగ దేకభూషణ ధారావర్ష మహారాజు. కులోత్తుంగచోడుడు రాజేంద్ర చోడుడను పేరుతో యువరాజుగా ఉండి నప్పుడు ధారావర్షుని ఓడించి అతనివద్దనుండి కప్పమును గైకొనెను, తన తండ్రిని ఓడించినందుకు ప్రతీకారముగ వచ్చెనో, లేక ఇతరుల ప్రోత్సాహముననో, ఇతరులతో కలిసియే వచ్చెనో సోమేశ్వరుడు వేంగిరాజ్యముపై దండెత్తి వచ్చి దేశమును తగులబెట్టి వీరచోడ రాజకుమారుని,

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ప్రాయికముగా అతనికి తోడుగా వచ్చిన ఒడ్డరాయని యుద్ధములో ఓడించి తరుమ గొట్టెను. ఈవిషయము ఈతని కురుస్పాలు శాసనమువలన తెలియుచున్నది. ప్రాయికముగా ఈ దండయాత్రలో పరమార వంశజుడైన ఉదయాదిత్య తనూజుడును, పశ్చిమ చాళుక్య విక్రమాదిత్య సామంతుడును అయిన జగద్దేవుడుకూడ సోమేశ్వరునికి తోడ్పడి యుండవచ్చును. జగద్దేవుడు అంధ్రాధిపతి రాజ్యము మీదికి దాడి వెడలి అతనిని ఓడించినట్లు ఆతని జైనది శాసనము తెలుపుచున్నది. ఇది నాగవంశ్యుడైన సోమేశ్వరుని దండయాత్రకు భిన్నమైనది కాకపోవచ్చును. ఒకవేళ ఈ దండయాత్ర పశ్చిమ చాళుక్యుల ప్రోత్సాహము వలన జరగినదేమో తెలియదు. సోమేశ్వరుని కురుస్పాలు శాసనమునందును, జగద్దేవుని జైనది శాసనమునందును శాసన కాలము తెలుపబడకపోవుటవలన వేంగిపై ఈ దండయాత్రలు సరిగా ఎప్పుడు జరగినవో తెలుపుటకు వీలు లేకపోయినను, అవి వీరచోడుని రెండవ తడవ పరిపాలన కాలముననే జరగినవని తెలుపుటకు అవకాశము కలదు.

వీరచోడుడు తన పరిపాలన కాలములో ఇచ్చిన తామ్ర దాన శాసనములు ముఖ్యమైనవి రెండు కలవు. వీనిలో ఒకటి కులోత్తుంగ చోడుని 21 వ విజయరాజ్య సంవత్సరము (శకము 1018) నాటిది. ఈ సంవత్సరమున చెల్లూరను అగ్రహారములో గుణరత్న భూషణుడను అతని బ్రాహ్మణ సేనాపతి మేడమార్యుడు కట్టించిన విష్ణ్వాలయమునకు బలి చరు పూజార్థమును, ఖండస్ఫుటిత నవకర్మార్థమును గుద్దవాది విషయములోని కాలేరు (తూర్పుగోదావరి జిల్లా రామచంద్రపురము తాలూకా) గ్రామమును దానము చేసెను. వైష్ణవాగ్రేసరుడయిన ఈమేడమార్యుడు ముద్గలగోత్రుడు. ఇతడు చెల్లూరు గ్రామమున ఒక తటాకమును త్రవ్వించి బ్రాహ్మణులకు దాక్షారామములో ఒక అన్న సత్రమును, పిఠాపురములో మరొక అన్నసత్రమును పెట్టించెను. ఇక రెండవది వీరచోడుని పిఠాపురము శాసనము. ఈ దాన శాసనమును వీరచోడ నృపతి కులోత్తుంగ చోడుని 28 వ విజయరాజ్య సంవత్సరమున (శకవర్షము 1015) ఇచ్చెను. వీరచోడ రాజకుమారుడు ఆ సంవత్సరమున ఉత్తరాయణ సంక్రాంతి నిమిత్తమున ప్రోలునాడు విషయములోని ద్వాదశవూండి సహితమైన మూలవెల్లి, పొన్నతొర్ర గ్రామములను, ఉత్తర వరున విషయములోని అలమి గ్రామమును ఒకటిగా చేర్చి వీరచోడ చతుర్వేది మంగల మనుపేర సుప్రతిష్ఠాగ్రహారమును చేసి 586 గురు బ్రాహ్మణులకు దానము చేసెను. ఈ ప్రతి గ్రహీతల పేర్లకు చివర సహస్ర, షడంగవిత్, భట్ట, దశపురిభట్ట, లేదా దశపురీయభట్ట, త్రివేది లేదా త్రివేదిభట్ట, బ్రహ్మ మహారాజ, భట్టసోమయాజి అను బిరుదములు కలవు (ఉదా : నారాయణ సహస్రః, విద్దయ షడంగవిత్, ఆదిత్య భట్టః, శ్రీరామ దశపురిభట్టః, గరుడ దశపురీయ భట్టః, కామయ త్రివేది, దత్త త్రివేదిభట్టః, కుమారనారాయణ బ్రహ్మ మహారాజః, పెరుంబుఅక్కడల్భట్ట సోమయాజీ). ప్రతిగ్రహీతల పేర్లనుబట్టి చూచినచో వారిలో ఎక్కువ మంది ద్రావిడులు. దీనివలన మొదటి కులోత్తుంగ చోడుని పరిపాలన కాలములో రాజప్రతినిధులమ ఆశ్రయించుకొని తమిళ బ్రాహ్మణులు పెక్కండ్రు ఉత్తరమున మధ్యాంధ్ర దేశము (సముద్ర తీరస్థాంధ్రము) నకు పెద్దపెట్టున వలస వచ్చినట్లు విశదమగుచున్నది. ఈ ప్రతిగ్రహీతల పేర్లలో ఎక్కువ సంఖ్య వైష్ణవ నామములు అగుటవలన రామానుజ మతము ఈకాలమున తమిళదేశమున జనాదరము పొందిన దనియు, అందువలననే వైష్ణవ నామములు గలవారు అధికముగ నుండి రనియు ఊహింపవచ్చును. ఈ వైష్ణవ నామములు సంస్కృతనామ సమములైన అరవపేరులే. మాధ్వ వైష్ణవులకు కన్నడము వలె రామానుజ వైష్ణవులలో తెంగల శాఖవారికి సంస్కృతముకంటెను వారి ద్రావిడవేదభాషయైన తమిళమన్న అభిమాన మెక్కువ. బ్రహ్మ మహారాజ బిరుదము సైనికముగానో, తదితరముగనో గొప్ప సేవ చేసి మహారాజుమ మెప్పించిన బ్రాహ్మణ రాజసేవా ధురంధరులకు మొదటి చోళ రాజరాజ చక్రవర్తి ఇచ్చిన బిరుదము. ఇది తరువాతి రాజుల కాలములో పరిపాటి యైనది. వీరచోడ చతుర్వేది మంగలము ప్రతిగ్రహీతలలో కులోత్తుంగచోడ బ్రహ్మ మహారా జన్నది కులోత్తుంగ చోడచక్రవర్తి పేర పుట్టినది. రెండవది ప్రాయికముగా వీరచోడదేవుని పేరు ననుసరించి వచ్చియుండును, ప్రాయికముగా కుమార నారాయణు డన్నది వీరచోడుని నామాంతరము. దశపురి, దశపురీయ భట్ట అన్న బిరుదములు దశపురమువలన వచ్చినవి. దశపురము పడమటి మాళవదేశములోని ఇప్పటి మందసోర్. ప్రాయికముగా ఈబిరుదము కలవారు పురాతన కాలములో పడుమటి మాళవమునుండి తమిళ దేశమునకు వెళ్ళియుందురు. సహస్ర బిరుదాంచితులు తమిళ బ్రాహ్మణులలోని అష్ట సహస్రమువారై యుండవచ్చును. త్రివేది, షడంగవిత్ అన్నవి మూడు వేదములను, ఆరు వేదాంగములను అధ్యయనము చేసినందువలన వచ్చిన విద్యాసూచక బిరుదములు. ఈరీతిని వీరచోడ రాజకుమారుని రెండవ తడవ రాజ్యపరిపాలన కాలములో అరవ బ్రాహ్మణులు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అసంఖ్యాకముగా మొదటిమారు మధ్యాంధ్ర దేశమునకు వచ్చినట్లు ఈ వీరచోడ చతుర్వేది మంగళ శాసనమువలన తెలియుచున్నది. బ్రాహ్మణులే కాక ఇతర వర్ణములవారు కూడ ఈ కాలములో తెలుగు దేశమునకు వలస వచ్చి రనుటకు కులోత్తుంగ చోడచక్రవర్తి తెలుగుదేశపు శాసనములే ప్రమాణము.

వీరచోడదేవుడు ఎంతకాలము వేంగి రాజప్రతినిధిగా పరిపాలించెనో తెలియదు. కాని చోళ చరిత్రకారు లతడు వేంగిని క్రీ. శ. 1088-89 మొదలు అధమము క్రీ. శ. 1092-93 వరకు పరిపాలించియుండు ననియు, ఇతని అనంతరము ఇతని సోదరుడు విక్రమ చోడుడు శకవర్షము 1014-1015 (క్రీ. శ. 1092-93) నుండి శకవర్షము 1040 (క్రీ. శ. 1118) లో రాజ్యమునకు అభిషిక్తు డగుటకు చోళరాజ్యమునకు పోవునంతవరకు వేంగిదేశమును పరిపాలించుచుండె ననియు వ్రాసియున్నారు. ఇంత వరకు వీరచోడదేవుడు రెండవ తడవ వేంగిని పాలించిన వెనుక అతని సోదరుడు విక్రమచోడుడే వేంగి రాజప్రతినిధియై పరిపాలించెనని విశ్వసింపబడుచున్నది. ఇందుకు శకవర్షము 1124 నాటి చాళుక్య మల్లపదేవుని పిఠాపుర స్తంభ శాసనము తక్క వేరు ప్రమాణము ఏదియు లేదు. ఆ శాసనమున పూర్వ చాళుక్య రాజరాజు తనయుడైన రాజేంద్ర చోడుడు పంచ ద్రావిడములతో కూడిన ఆంధ్ర విషయమును ఏబదేండ్లపాటు పరిపాలించిన వెనుక అతని తనయుడు త్యాగ సముద్ర బిరుదాంచితుడైన విక్రమ చోడుడు చోళ మండలమును రక్షించుటకు వెళ్ళినంతనే వేంగిభూమి అనాయక మయినదని చెప్పబడినది. ఇందు చోళమండలమునకు ఎక్కడినుండి వెళ్ళినదియు చెప్పబడక పోయినను విక్రమ చోళుడు వేంగినుండియే వెళ్ళియుండ వచ్చుననుటకు అతడు సింహాసన మెక్కిన పిదప వ్రాయించిన శాసనములలోని అతని ప్రశస్తియే కొంతవరకు ఆధారమైనది. విక్రమచోడుడు తన శాసన ప్రశస్తిలో తాను పసివాడుగ నుండినపుడు క్రూరములైన యుద్ధాయుధములను ధరించినంతనే కుళము (కొలనిపురము)లోని తెలింగ భీముడు పర్వత ప్రదేశమునకు పారిపోయి అచట తల దాచుకొనె ననియు, అంతట ప్రచండాగ్నిహోత్రము కళింగభూమిని దహించివేసె ననియు, ఈ ప్రకారము అతడు సంతోషముతో వేంగి మండలములో ఆగి ఉత్తర దేశమును వశపరచుకొనె ననియు తెలిపియున్నాడు. కొలనిపురపు తెలింగ భీము డెవడో, అతని వంశ మేదో సరిగా తెలియదు. ఇతడు ఒకవేళ రాజరాజ ముమ్మడి చోడనిచే వేంగివిషయాధిపతిగ నియమితుడైన ముమ్మడి భీముడే కావచ్చును. తెలింగ భీముడు తిరుగబాటు చేసి స్వతంత్రుడైన వెనుక విక్రమ చోడుడు అతనిమీదికి ఎత్తిరాగా యుద్ధమున ఓడిపోయి కళింగ భూమికి పారి పోయి యుండును. అప్పుడు విక్రమ చోడుడు కళింగముపై దండెత్తి అతనికి ఆశ్రయ మిచ్చిన వారిని శిక్షించి, కళింగమును తగులబెట్టియుండును. కులోత్తుంగ రాజేంద్ర చోడచక్రవర్తి సామంతుడయిన పరాంతక పాండ్యుడు తన శాసనములలోకూడ కుళము (కొలనిపురము) తెలింగ భీముని పట్టుకొనినట్లును, కళింగమును సాధించినట్లును చెప్పుకొని యున్నాడు. కులోత్తుంగ చోడచక్రవర్తి ప్రాయికముగ సైన్యములను తోడిచ్చి పరాంతక పాండ్యుని విక్రమచోడ రాజకుమారునికి బాసటగా పంపి యుండును. విక్రమ చోడుడు కొలని భీముని ఓడించి పారదోలి కళింగమును సాధించినట్లు చెప్పుకొని యున్నను, అతడు పసివా డగుటవలన విజయము చేకూర్చినది నిజముగ పరాంతక పాండ్యుడే అయి యుండు ననుటకు సందేహము లేదు. విక్రమచోడుని ప్రశస్తిలో అతడు వేంగిదేశమున ఆగి ఈ విజయమును సాధించినట్లు చెప్పినంత మాత్రమున అతడు వీరచోడుని అనంతరము వేంగిరాజ ప్రతినిధిగ ఉండినట్లు తలంచుటకు అవకాశము లేదు. అందువలన వీరచోడునికి తరువాత విక్రమ చోడుడే వేంగిరాజప్రతినిధి యని గట్టిగా చెప్ప లేము. వేంగిలో అతని శాసనములును లేవు. కాని కళింగ దండయాత్ర మాత్రము నిశ్చయము. ఇది వీరచోడుని రెండవ తడవ పరిపాలన కాలము చివర జరిగియుండ వచ్చును. సోమేశ్వర, జగద్దేవ భూపతుల దండయాత్రల వలన వేంగిదేశము అల్లకల్లోలమైన సందర్భమును అవకాశముగ తీసికొని కొలని భీమరాజు చాళుక్యచోళుల అధికారమును ధిక్కరించి వారిపై తిరుగబాటు చేసి స్వాతంత్ర్యమును ప్రకటించి యుండును. ఇతనికి పశ్చిమ చాళుక్య చక్రవర్తులును, కళింగ దేశాధిపతులును పూర్తిగా సాయము చేసి యుందు రనుటకు అవకాశము కలదు.

కులోత్తుంగ చోడుడు ఉత్తరదేశమును మరల జయించుటకై ('ప్రస్థాపయ త్పున రుదీచ్య జయాయ') వీరచోడుని రెండవతడవ వేంగికి రాజప్రతినిధిగా పంపెను. కాని అది సమకూరలేదు. అప్పటికే కళింగ రాజకీయ వ్యవహారములు చాల విషమస్థితిలో పడినవి. మొదట వేంగి రాజప్రతినిధియైన రాజరాజ ముమ్మడి చోడుడు అనంతవర్మ చోడగంగ దేవునికి పట్టము కట్టి వచ్చినను అతని దాయాదియైన గాంగరాజు దేవేంద్రవర్మ పిన్నవయసున నుండిన అనంతవర్మ చోడగంగదేవుని లక్ష్యపెట్టక కళింగ

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వంశజులైన మండలేశ్వరులను వశపరచుకొని కళింగ రాజధానియైన కళింగనగరమునుండి రాజ్యముసేయ దొడగెను. ఇతడు స్వతంత్రుడై పరిపాలించుచుండిన కాలమున ఇచ్చిన శాసనము లింతవరకు రెండు మాత్రమే దొరకినవి. అం దొకటి దేవేంద్రవర్మ కంబకాయ తామ్రశాసనము. శాసనకాల మిందు తప్పుగా పడినను తుద కది శకవర్షము 1008 నాటిదని నిర్ణయమయినది. రెండవది దేవేంద్రవర్మ దేవుని 7 వ విజయరాజ్య సంవత్సరమునకు సరియైన శక వర్షము 1005 ('శర సూర్యరశ్మి') నాటి గారగ్రామ శిలా శాసనము. ఈ శాసనము ననుసరించి దేవేంద్రవర్మదేవుడు కూడ ఇంచుమించుగా అనంతవర్మచోడ గంగదేవుడు పట్టాభిషిక్తుడయిన నాటినుండియే తన విజయరాజ్య సంవత్సరములను లెక్కించుకొనుచు సర్వస్వతంత్రుడుగా వ్యవహరించు చుండినట్లు తెలియుచున్నది. ప్రాయికముగా కులోత్తుంగుడు వీరచోడుని ఈ దేవేంద్రవర్మను జయించుటకే రెండవ తడవ వేంగికి పంపియుండును. కాని, అత డీపనిని నెరవేర్పలేక పోయెను. అందువలన కులోత్తుంగ చోడుడు తనసామంతుడయిన పరాంతక పాండ్యుని తన కుమారుడు విక్రమ చోడునికి తోడిచ్చి కొంత సైన్యముతో వేంగిదేశమున కంపెను. మొత్తముమీద ఈ కళింగ దండయాత్ర విజయవంతముగా సాగినది. ఇది కులోత్తుంగచోడుని ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరము 26 వ (శకము 1018) సంవత్సరపు శాసనములలో ప్రస్తావింప బడినది. బాలుడుగా ఉండినపుడు విక్రమచోడ రాజకుమారుడు పాల్గొని పేరు తెచ్చుకొన్న యుద్ధము ఇదే కావచ్చును. విక్రమచోడుని శాసనములలో వలెనే కులోత్తుంగచోడ సామంతుడైన పరాంతక పాండ్యుని శాసనములలో అతడు దక్షిణకళింగమును సాధించినట్లు చెప్పబడి యున్నది. మహేంద్రగిరికి దక్షిణమునందు గల దేశమే దక్షిణ కళింగము. ఇది కులోత్తుంగ చోడచక్రవర్తి యధికారముక్రింద ఉండె ననుటకు సింహాచలములోని అతని ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరము 29 కి సరియైన శకవర్షము 1021 నాటి శాసనమే తార్కాణము. ఈ శాసనములో కులోత్తుంగ చోడుని సంధివిగ్రహి మధురాంతక బ్రహ్మమారాయరును, కరుణాకరాఛారియు పేర్కొన బడినారు.

కులోత్తుంగ చోడుని పరిపాలన కాలమున జరిగిన కళింగయుద్ధ వృత్తాంతమును గైకొని అతని యాస్థానకవియైన జయంగొండాన్ కళింగత్తుప్పరణియను కావ్యమును రచించెను. ఈ పరణి ప్రకారము ఈ కళింగ దండయాత్రను నడపించినవాడు కులోత్తుంగచోడుడు కాక అతని మంత్రియు, దండనాథుడును అయిన కరుణాకర తొండమాను. ఉత్తర కళింగాధిపతి ఏటేట చెల్లింపవలసిన కప్పమును చెల్లింపలే దనియు, ఇట్లు చెల్లింపక పోవుట రెండవ తడవ యనియు మంత్రులు విన్నవింపగా కులోత్తుంగుడు కళింగములోని గిరిదుర్గములను ముట్టడించి పట్టుకొని, తద్దేశాధిపతిని బందిగా గొనివచ్చుటకు కళింగముపై దాడిసేయ నియమించెనని పరణి తెలుపుచున్నది. చక్రవర్తి యాజ్ఞను శిరసావహించి నెరవేర్చుటకు తాంబూలము పుచ్చుకొన్నవాడు పండువరాజను కరుణాకర తొండమాను. ఇతనికి పల్లవరాజని నామాంతరము. ఇతడు దండును గూర్చుకొని కాంచీపురమునుండి బయలుదేరి కతిపయ ప్రయాణముల దారిలో పాలేరు, పొన్ముఖరి (స్వర్ణముఖి), పెన్న, మన్నేరు కృష్ణ, గోదావరి, పంప, గౌతమి నదులను దాటి కళింగమును చేరెను. అంతట చోళసైన్యములు గ్రామములను తగులబెట్టి దేశమును విధ్వంసము చేయుచుండగా బాధితులైన ప్రజలు అంతవరకు అపజయమెరుగని తమయేలిక అనంతవర్మకు ఈ విషయమును విన్నవింపగా, వచ్చినది కులోత్తుంగ సైన్యమేకాని కులోత్తుంగ చోడచక్రవర్తి కాదని ఆసైన్యమును లక్ష్యముచేయక మిన్నకుండెను. అప్పు డతని ప్రధానులలో ఒకడైన ఎంగరాయడు చోళ సైన్యము సాధించిన విజయముల నభివర్ణించి చెప్పగా అనంతవర్మ యుద్ధసంసిద్ధుడయ్యెనట. అప్పుడు జరగిన యుద్ధమున అనంతవర్మ ఓడి పారిపోయెను. జాడలు తీసి అతనిని పట్టుకొనుటకు చోళసైన్యాధిపతి చాల ప్రయత్నించెను. కాని విఫల మనోరథుడై అమితముగా దొరకిన కొల్లతో దండును తీసికొని వెనుకకు మరలిపోవలసినవాడయ్యెను. ఇది పరణి కథావృత్తాంతము. పరణిలో సప్తకళింగమని, ఉత్తరకళింగమని వ్యవహరింప బడిన దేశము మీద జరగిన దండయాత్ర, ఆ దండయాత్రలో కరుణాకర తొండమానుచూపిన శౌర్యపరాక్రమాదులు చక్కగా అభివర్ణితములైనవి. ఈ యనంతవర్మ అర్వాచీన గాంగభూపరు డయిన రాజరాజదేవేంద్రవర్మ కొడుకు అనంతవర్మ చోడగంగదేవు డయియుండవచ్చునని చరిత్రకారుల అభిప్రాయము. కాని ఇది సరియైనది కాదు. అనంతవర్మ చోడగంగదేవుని పరిపాలనమున కళింగము ఏటేట చోళసమ్రాట్టులకు కప్పము చెల్లించునంతటి సామంతరాజ్యముగ నుండినట్లు కాన్పింపదు. యుద్ధకారణము కప్పము చెల్లింపకపోవుట యని పరణి చెప్పుచున్నను అది సరియైన కారణముగ తోచదు. ఇంత గొప్ప సేనతో కళింగముపై బోయి భయంకరయుద్ధము సాగించినను చివరకు దీనివలన కులోత్తుంగునికి శాశ్వతముగ కలిగిన లాభము ఏమియు కనబడదు. విజయము చోళసైన్యముదే



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కాని ఫలితము మాత్రము శూన్యము. కళింగము అటు తరువాతకూడ అనంతవర్మ చోడగంగదేవుని అధికారము క్రిందనే యుండెను.

కులోత్తుంగచోడుని రాజ్యపరిపాలనములో కళింగముపై రెండు దండయాత్రలు కలవనియు, మొదటి దండయాత్ర అతని 26 వ విజయరాజ్య సంవత్సరపు 'శాసనములలోను అటుతరువాతివానిలోను, రెండవది అతని 40 వ విజయ రాజ్య సంవత్సరపు శాసనములలోను అటు తర్వాతివాని లోను పేర్కొనబడె ననియు, విక్రమచోడుడు పాల్గొన్న దండయాత్రయే మొదటి కళింగదండయాత్ర యనియు, జయంగొండాన్ అను కులోత్తుంగుని ఆస్థానకవి రచిత మైన 'కళింగత్తుప్పరణి' అను గ్రంథమున అభివర్ణిత మైనది రెండవ కళింగదండయాత్ర యనియు, పైనుడివిన గ్రంథమున కులోత్తుంగచోడ చక్రవర్తియే రెండవకళింగ దండయాత్రను నడపుకొని పోయిన ట్లున్నను, నిజముగా ఈ దండయాత్రకు నాయకత్వము వహించినవాడు కరుణాకర తొండమానను పల్లవరాజనియు, ఈత డీ రెండవ కళింగయుద్ధమున సాధించిన విజయములు శాసనముల వలనకూడ రుజువగుచున్న వనియు చోళచరిత్ర కారులు వ్రాసి, దానికి దాక్షారామములోని సీరలంగో తనయుడును, సచ్ఛూద్రుడును, వైష్ణవుడును అయిన తిరువరంగాభిధానుని శాసనము నుదాహరణముగ నిచ్చుచున్నారు. ఇతడు చోళమండలములోని తిరువరైయూరు నాడులోని మండలంజేరి నివాసి; ధర్మవత్సలుడు; రాజేంద్రచోడ చరణాశ్రయలబ్ధ లక్ష్మీవిభవుడు; 'శ్రీ ద్వారచామర ఘనాతపవార తైక శంఖ ధ్వజ ప్రముఖ రాజిత రాజ్యభావుడు'. ఈ తిరువరంగాభిధానునికి పల్లవ రాజని, పండువరాజని నామాంతరములు. కళింగత్తుప్పరణిలో నుడివిన పల్లవరాజు కరుణాకర తొండమానును, పూర్వోక్తశాసనములోని పండువరాజును పల్లవరాజును ఒక్కరేయని చెప్పదగును. శాసనములో ఈతడు కళింగ దేశము నంతను భస్మీపటలము చేసి, దేవేంద్రవర్మాదులైన భూపతులను కోసలఖండపాల నివహములతో కూడ యుద్ధమున భంజించి, రాజేంద్రచోడ ప్రభువు కీర్త్యుత్తంభము వలె ఓఢ్రదేశ సీమాసంధివద్ద జయస్తంభమును ప్రతిష్ఠాపించినట్లు చెప్పబడి యున్నది. కోసల ఖండపాలు రనగా దక్షిణకోసలము నందలి పరిమిత భూఖండములను పరిపాలించుచుండిన సామంతరాజన్యులు. ఈ శాసనము కులోత్తుంగ చోడుని విజయరాజ్య సంవత్సరము 33 (శకవర్షము 1024-25) నాటి దగుటచేత ఈ పల్లవరాజ విజయములు మొదటి కళింగదండయాత్రకు సంబంధించినవే యగుచున్నవి. ఇందువలన చోళచరిత్రకారులు చెప్పిన రెండు దండయాత్రలును ఒక్కటే యగుచున్నవి. అదియును గాక, విక్రమచోడుడు వేంగికి రాజప్రతినిధిగా రానేలేదు. కులోత్తుంగుని 40వ విజయరాజ్య సంవత్సరము నుండి వేంగీ రాజ్యము పశ్చిమచాళుక్యుల హస్తగతమగుటకు ఆరంభ మయ్యెను. అందువల్ల కులోత్తుంగుని 40 వ (శకము 1032) సంవత్సరమునుండి అతని మరణకాలము వరకు (శకము 1042) అతనికి పశ్చిమ చాళుక్యులతోడి పోరాటముతోనే సరిపోయినది. తుదకు వేంగి శకవర్షము 1042-43 నాటికి చాళుక్యచక్రేశ్వరుల వశమైనది. ఇట్టి సందర్భములలో కులోత్తుంగ చోడుడు కాని, అతని ప్రధాన దండనాయకుడు కాని కళింగముమీదికి దండు వెడలుటకు అవకాశమే లేదు. కులోత్తుంగచోడుని 26 వ విజయరాజ్య సంవత్సరమునకు పూర్వము రాజరాజ ముమ్మడి చోడుని కాలమున జరగిన దనుట కవకాశమున్న కళింగదండయాత్రను మినహాయించినచో, కళింగదండయాత్ర ఒక్కటే కలదు. దానిలోనే కరుణాకర తొండమాను (పల్లవరాజు) పాల్గొనెను. ఈ యుద్ధమున అతడు సాధించిన విజయములే కులోత్తుంగుని 33 వ విజయరాజ్య సంవత్సరమునాటి దాక్షారామ శాసనమున అభివర్ణితములైనవి. ఈ కళింగ దండయాత్రయే 'కళింగత్తుప్పరణి' యందు వర్ణితమైనది. విక్రమచోడ, పరాంతకపాండ్యులు పాల్గొన్న కళింగదండయాత్ర ఇదియే. విక్రమచోడుడు పసివాడగుట వలన అతడు 'కళింగత్తుప్పరణి'లో చెప్పబడలేదు. పరాంతకుని ప్రస్తావమందు లేకపోవుటకు కారణము ఆ కావ్యము చోళవిజయ ప్రశస్తిని గురించినది కాని పాండ్య విజయ ప్రశస్తిని గురించినది కాకపోవుటయే. పశ్చిమ చాళుక్య ప్రోద్బలమును, సాహాయ్యమును ప్రాయికముగా దేవేంద్ర వర్మాదులకు అధికముగ లభించియుండును. అందువలన ఈ కళింగ యుద్ధము సామాన్యమైనదిగ కన్పట్టదు. చోళదేశవాహినీ పతులును, తెలుగు దేశమండలి సేనానులును అనేకులు ఈ యుద్ధమున పాల్గొనినట్లు దాక్షారామ భీమేశ్వరాలయములోని శాసనముల వలన తెలియుచున్నది.

ఈ కాలములోనే సేనాపతి రాజరాజ బ్రహ్మమారాయడు, వలవన్ మార్తాండ మూవెంద వేలారు, గంజాట్టం పంచనది ముడిగొండ వత్సరాయరు, మరుత్తువకుడి మరుత్తుక్కుడయా మాళిలామణియైన మాలవరాయరు మొదలైన తమిళ దేశాగతు లెందరివో శాసనములు దాక్షారామమున కాన్పించుచున్నవి. వీరిలో కొందరు శైవులు, మరి కొందరు వైష్ణవులు. వీరిలో అనేకులు దాక్షారామమునకు వచ్చి భీమనాథునికి దీపదాన, భూదానాదులను చేసి,

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తిరువీథిని పనిచేయు వారికి, శివయోగులకు, తపస్వులకు, బ్రాహ్మణులకు భోజనము పెట్టుటకు సత్రములును, మఠములను పెట్టి అవి కలకాలము సాగునట్లు రొక్కమునో, భూమినో, గ్రామములనో దానముచేసి యున్నారు. భీమేశ్వర క్షేత్రము అత్యధిక వైభవోపేతమై ప్రశస్తి వహించినది ఈ కాలములోనే.

తెలుగుదేశములోని కొండపడుమటి, కోనకన్నడవాడి, కోట మొదలయిన సామంతవంశములవారు ఈ కళింగ యుద్ధములో పాల్గొనిరి. కాళింగ గంగ కటకమును భేదించి అరివీరులను చించి చెండాడి, శత్రుసైన్యమును దిగంతములకు పారద్రోలి, యుద్ధరంగమున తీసికొన్న మదగజేంద్రములను రాజేంద్రచోడునికి ఇచ్చెనని కొండపడుమటి మండభూపతియు, త్రికలింగవల్లభుని జయించి తీసికొన్న కాళింగ గంధద్విపములను రాజేంద్రచోడునికి ఇచ్చెనని కోన పోత భూవరుడును శాసనములలో ప్రస్తుతులయినారు. కోన పోత నృపతికి కళింగయుద్ధమున చేసిన సేవకు ఫలితముగ కావచ్చును కులోత్తుంగ చోడకారుణ్యమున వేంగీంద్ర నామధేయమును, వేంగీగ్రామ సహస్రకమును లభించినవి. ఈ విధముగానే కోట భీమరాజు 'భద్రగజాశ్వములను (అని)మొనలం బల్కిన భంగి' చేసి కళింగాధిపతినే కావచ్చును చోడనికి (రాజేంద్రచోడనికి) భృత్యుని కావించినట్లు ఒక శాసనములో చెప్పబడినది. ఈ శాసనము కొన్ని కొన్ని చోట్ల చెడిపోవుట వలన ఇందలి విషయము ఇంతకంటె స్పష్టముగ తెలియవచ్చుటలేదు.

మొత్తముమీద విక్రమ చోడుడు కళింగ యుద్ధములో పాల్గొనె ననుటకు అవకాశ మున్నది. కాని వేంగిని రాజప్రతినిధిగ పాలించె ననుటకు ఆధార మేదియు లేదు. మధ్యాంధ్రదేశములోని శాసనములు ఇంతవరకు చక్కగ పరిశీలింప బడకపోవుటయే విక్రమ చోడుడు రాజ ప్రతినిధియై వేంగిని పరిపాలించెనను భ్రమకు మూలకారణము.

శకము 1015-16 (క్రీ. శ. 1093-94) తరువాతి కాలమున వేంగీ పరిపాలకుడుగ శాసనములవలన తెలియవచ్చువాడు సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధనుడయిన వీరపెర్మాడిదేవుడు. ఇతని శాసనములు కులోత్తుంగుని విజయరాజ్య సంవత్సరములు 23 (శకము 1015) నుండి 37 (శకము 1029)వరకు కనబడుచున్నవి. పూర్వ చాళుక్య బిరుదములు ఉండుటచేత ఇతడు చాళుక్యచోళ రాజకుమారు డగుట నిశ్చయము. ఆడ్వారు వల్లవంగ్రానల్లు, అండారు చెంబియంగ్రానల్లు, చోడమహాదేవి, మీనవన్మహాదేవి అనువారు వీరపెర్మాడిదేవుని మహాదేవులు. వీరచోడదేవునికే వీరపెర్మాడిదేవుడను నామాంతరము కలదో, లేక, ఈతడు కులోత్తుంగచోడుని మరియొక కుమారుడో ఇది భావిపరిశోధనవలన తేలవలసిన విషయము.

వరాంతకదేవుడు (క్రీ. శ. 1107 - క్రీ. శ. 1118-19): వీరపెర్మాడి యనంతరము వేంగీ రాజ్యమును రాజప్రతినిధిగా పరిపాలించినవాడు సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజులు వరాంతకదేవరు. ఒకటి తక్క మిగిలిన ఈతని శాసనము లన్నియు తూర్పుగోదావరిజిల్లా దాక్షారామములోనే కనబడుచున్నవి. ఇదివరలో వేంగిని పరిపాలించిన రాజప్రతినిధుల శాసనములవలె కాక ఇతని శాసనములు కొన్ని కులోత్తుంగ చోడ ప్రశస్తితోనే ఆరంభమగుచున్నవి. ఇతర రాజప్రతినిధులకువలెనే ఇతనికిని జననాథపురము రాజధాని. ఇతడు శాసనములలో చాళుక్య సింహాసన శ్రీనాథు డనియు, చాళుక్యవంశ తిలకు డనియు, రాజేంద్రచోడదేవ తనూజు డనియు చెప్పబడియున్నాడు. చక్రవర్తి యనియు, త్రిభువన చక్రవర్తి యనియు, రాజసర్వజ్ఞు డనియు ఈతని బిరుదములు. ఈతడు కులోత్తుంగ చోడ తనూజుడని తెలిసినను ఇతని తల్లి ఎవరో తెలియదు. ఇతనికి చక్రవర్తి, త్రిభువన చక్రవర్తి బిరుదములుండుటవలన కులోత్తుంగ చోడ చక్రవర్తి తన జీవితకాలములోనే ఈతనిని తన యనంతరము చాళుక్య చోళసింహాసనమున కధికారిగా నియమించి యౌవరాజ్య పట్టము కట్టినట్లు ఊహింపదగియున్నది. లేనిచో కడు పరాక్రమవంతుడైన కులోత్తుంగుని కాలముననే అతడు చక్రవర్తి, త్రిభువన చక్రవర్తి బిరుదములను వహించుట పొసగదు. వేరు వేరు అపర ధాన్యములకు ఈతడు జననాథపురమున ప్రధాన ప్రాసాదాంతర్వర్తియైన అభిషేక మంటపమున సుఖాసీనుడై కులోత్తుంగ చోడుని 47 వ విజయరాజ్య సంవత్సరమున సింహామాసమున శుద్ధ పంచమీ శనివారము స్వాతీనక్షత్రమున (క్రీ. శ. 1117 ఆగష్టు 4) కర నిర్ణయము చేసి వ్రాయించిన శాసనము కలదు. ఈకారణములచేత వరాంతకుడు వేంగీ రాజప్రతినిధిగా కొంతకాలము పరిపాలించెనని సుస్పష్టమగుచున్నది. కాని, ఈతని పరిపాలనము వేంగిలో ఎప్పటినుండి యారంభమో సరిగా తెలియదు. దాక్షారామములో సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజులు కోనేరిన్మయిుంగొండార్ శ్రీ వరాంతక దేవరు పక్షము వహించి, ఇతరుడు తమ ఏలికగా ఉండరాదని, అతనివేకాని ఒరులను తాము కొలువమని కొందరు శపథము చేయుచు వ్రాయించిన శాసనములు దాక్షారామములో కొన్ని కలవు. ఈ శాసనములలోని వరాంతక దేవరు రాజేంద్రచోడ తనయుడయిన వరాంతకుడేకాని యన్యుడై యుండడు. వరాంతకుడు త్రిభువన చక్రవర్తి



http://sanskritcentral.com/

బిరుదము వహించి వేంగి పరిపాలనము చేయుచుండిన సమయమున విక్రమచోడుడు తానే తన తండ్రి యనంతరము సింహాసనమునకు అధికారినని ప్రకటించుకొనినట్లు తోచుచున్నది. విక్రమచోళ పరిపాలనారంభ కాలమును గురించి అభిప్రాయభేదమునకు అవకాశము కలదు. ఇది ఎందువల్ల వచ్చినదో తెలియదు. ఒకవేళ సింహాసనమును గురించి కులోత్తుంగ చోడ కుమారులైన పరాంతక, విక్రమచోడులకు కలహము కలిగెనేమో నిశ్చయముగ చెప్పలేము. అది యటుండ హొయిసల విష్ణువర్ధనునికి (క్రీ. శ. 1111-క్రీ. శ. 1141) అతని కుమారుడయిన మొదటి నరసింహ నృపతి శాసనములో 'నిజ సేనానాథ నిర్దళిత జననాథపుర' బిరుద మున్నది. శకవర్షము 1039 (క్రీ. శ. 1117) ప్రాంతపు హళెబీడులోని ఒక శాసనములో విష్ణువర్ధనుడు ఆంధ్రాధిపతియైన మగయేనుగకు సింహము వంటివాడని అభివర్ణితుడయ్యెను. జననాథపురము దాక్షారామమని ఇదివరకు తెలిసిన విషయమే. అందువలన హొయిసల విష్ణువర్ధనుడు శకము 1039 కి పూర్వమే వేంగి దేశముపై దండెత్తి వచ్చి జననాథపురమును విధ్వంసము కావించి యుండును. ఇతడు వేంగిపై దండెత్తివచ్చుటక్కు కారణ మేదియో తెలియదు. కులోత్తుంగ చోడుడు పరాంతకుని యౌవరాజ్యమునకు పట్టము కట్టి వేంగి పరిపాలనమునకు పంపుటతో సోదరులైన పరాంతక, విక్రమ చోడులకు కలహము సంభవించిన దనియు, విక్రమచోడుడు హొయిసల రాజకుమారికా తనూభవు డనియు, అందువలన హొయిసల విష్ణువర్ధను డతనిపక్షము వహించి చాళుక్య చోళ వశమునం దుండిన ఇప్పటి రాయలసీమ మీదను, వేంగి దేశముమీదను దండెత్తి వచ్చె ననియు తమిళ చరిత్ర పరిశోధకులయిన శ్రీ. టి. యన్. సుబ్రహ్మణ్యన్ గారు చెప్పుచున్నారు. ఇందలి సత్యాసత్యములు భావి పరిశోధన వలన తేలవలసియున్నవి.

మొత్తముమీద వేంగిదేశములో వీర పెర్మాడి పరిపాలనకాలమునకు తరువాతను, పరాంతకుని పరిపాలన కాలమునకు పూర్వమును రాజకీయముగ ఏదో కొంత కల్లోలము జరగియుండునని తోచుచున్నది. నీతి యుగంధరుడును, సాహస శూద్రకుడును, విక్రమ ధనంజయుడును, భరత వీరావతారుడును, నిఖిల దిశాసాధకుడును అయిన మహామండలేశ్వర పరాంతక మగధరాయడైన మడపల్లి మూంకయ చాళుక్య సింహాసన శ్రీవాతుడైన పరాంతక క్షితిపతి దిగ్జైత్రయాత్రా సఖుడని శాసనములలో అభివర్ణితు డయ్యెను. పరాంతకుని ఈ జైత్రయాత్ర ఎవరి మీదికో, ఏదిశకో మాత్రము తెలియవచ్చుట లేదు. వేంగి రాజకీయములలోని కల్లోలము కారణముగ కావచ్చును కులోత్తుంగ చోడుడు తన 36 వ విజయరాజ్య సంవత్సరమునకు (శకము 1028) పూర్వమే పూర్వకాలమునుండి పూర్వ చాళుక్య రాజన్యులను భక్తి విశ్వాసములతో సేవించిన కులక్రమాగత సేవక కుటుంబములలోని సమర్థులను, సేనానులను కూడగట్టుకొని వచ్చుటకును, వారు వేంగి రాజ ప్రతినిధులకు కానటగ నుండుటకును వారికి రాజ లాంఛనములు ఇచ్చి మండలేశ్వరులను కావించెను. ఇటువంటివారిలో వెలనాటి దుర్జయవంశజులు ప్రథమగణ్యులు. శకవర్షము 998 లో సమస్త సేనాధిపతిగ నుండిన వెలనాటి దుర్జయవంశజుడు గొంకయ శకవర్షము 1028 నాటికి సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వరుడై చాళుక్య రాజ్యభవన మూలస్తంభమై వాసికెక్కెను. ఇంతటినుండి ఈ వెలనాటి దుర్జయవంశ్యులు కృష్ణానదీ దక్షిణతీరస్థమైన ఆరువేల వెలనాటిని పరిపాలించిరి. వీరిలో చోడ, గొంక నామధేయు లుండుటవలన వీరిని వెలనాటి చోడులని, వెలనాటి గొంకరాజులని కొందరు వ్యవహరింతురు. వీరు చతుర్థకులులు కాని చోడవంశజులును కారు; సూర్యవంశ క్షత్రియులును కారు. మహామండలేశ్వరు డయినవెనుక వెలనాటి గొంకరాజు త్రిపురాంతక దేవరకు అంగభోగ, రంగభోగముల నిమిత్తము కమ్మనాటిలోని గుండేటి (గుండ్లకమ్మ)దరి చెటలపాడను గ్రామమును దానము చేసి తన ప్రాభవౌదార్యములను చాటుకొనెను. ఇతడు తన కుమారునికి తన ప్రభువయిన కులోత్తుంగ రాజేంద్రచోడ చక్రవర్తి పేర కృతజ్ఞతా సూచకముగ కులోత్తుంగ రాజేంద్ర చోడయ అని పేరు పెట్టెను. అతని అనంతరము కులోత్తుంగ చోడచక్రవర్తి వెలనాటి గొంక భూపతిని వలెనే ఈ రాజేంద్రచోడ ధరాధిపతినికూడ వాత్సల్యముతో స్వకుమారునివలె ఆదరించి 'స్వతనయ జన చిహ్నము'లతో అతనికి పట్టము కట్టెనట. వెలనాటి కులోత్తుంగ రాజేంద్ర చోడుని సంతతివాడయిన పృథ్వీశ్వర మహీపతి తన పిఠాపురము శాసనమున కులోత్తుంగచోడ చక్రవర్తి వెలనాటి రాజేంద్రచోడ నృపుని సుతునిగా పరిగ్రహించి, సామంత రాజ చిహ్నములు ప్రసాదించి, వేంగి పదునారువేల రాజ్యమునకు పాలకునిగా నియమించినట్లు తెలుపుచున్నాడు. కాని, అది సత్యముగా కనిపింపదు. అఖిల వేంగి దేశమునకును వెలనాటివారు అధిపతులైనది ఈ కులోత్తుంగ రాజేంద్రచోడుని కుమారుడయిన రెండవ కులోత్తుంగ చోడ గొంకరాజు కాలముననే.

కళింగ యుద్ధానంతరము కులోత్తుంగ చోడ చక్రవర్తి ఒక్క వెలనాటి దుర్జయులకే కాక కోన హైహయులకు,

మరికొందరికి కూడ సామంతరాజ చిహ్నములను ప్రసాదించి మండలికులను కావించి తన స్థితిని కట్టుదిట్టము చేసికొనెను. గౌతమీ నదియొక్క రెండు పాయలైన వసిష్ఠ, వృద్ధ గౌతముల మధ్యనుండు ప్రదేశమునకే రెండేరుల నడిమి విషయమని, కోనరాష్ట్రమని పేరు. దీనిని క్రీస్తు శకము పదునొకండవ శతాబ్దము కడపటి పాదమునుండి కార్తవీర్యార్జునుని సంతతివారమని చెప్పుకొను హైహయ వంశ క్షత్రియులు పరిపాలించుచుండిరి. వీరిలో మన కింత వరకు తెలిసిన మొదటి కోన హైహయ వంశజుడు ముమ్మడి భీమమహిపతి. ఇతనికి కులోత్తుంగ రాజేంద్ర చోడుడు సామంత రాజచిహ్నముల నొసంగి మండలేశ్వరుని కావించెను. సింధు యుగ్మాంతర దేశమును, రెండేరుల నడిమి విషయమును, కోనరాష్ట్రమును ఒక్కటియే యగుచో దీనిని వీరచోడుని పరిపాలన కాలములో వెలనాటి దుర్జయ వంశ్యుడు వెదురయ పరిపాలించుచుండి యుండవలెను. వెదురయకు సంతతి లేని కారణముననేమో కులోత్తుంగ రాజేంద్రచోడ చక్రవర్తి రాజచిహ్నముల నిచ్చి హైహయ వంశజుని దాని కధిపతిని కావించెను. అప్పటినుండి కోన రాష్ట్రము హైహయ వంశ క్షత్రియుల పరిపాలన క్రింద నుండెను. కోనరాష్ట్రమునకు కోన విషయమని, కోనమండల మని, దీని పరిపాలకులకు కోన హైహయులని పేరు కలిగినది. కోనరాష్ట్రమును పరిపాలించిన మొదటి మండలేశ్వరుడు ముమ్మడి భీమరాజునకు వెన్నభూవిభుడు, రాజపరేడు అని ఇరువురు తనయులు కలిగిరి. రాజపరేనికి కోన రాజపరేడని నామాంతరము కలదు.

వేంగిదేశములో మండలిక వంశములు ఎన్ని యుండినను అన్నిటిలోనికి ప్రప్రథమమున రాజ్యాధికారమును వడసినదియు, అధికార రాజ్య విస్తృతుల ననుసరించి ప్రథమ గణ్యమైనదియు, అన్ని మండలిక వంశములకు తలమానిక మైనదియు వెలనాటి దుర్జయ వంశము. మహామండలేశ్వరుడయిన వెలనాటి గొంక భూవరుని శాసనములు శకవర్షము 1030 (క్రి. శ. 1108) వరకు కనిపించుచున్నవి. అంతటనుండి అతని కుమారుడు మహామండలేశ్వర కులోత్తుంగ రాజేంద్ర చోడరాజు పైతృకమైన రాజ్యమును పరిపాలించెను. ఈ వెలనాటి దుర్జయుల రాజధాని సనదప్రోలను నామాంతరముగల ధనదుప్రోలు. ఇది గుంటూరుజిల్లా రేపల్లె తాలూకాలోని ఇప్పటి చందవోలు.

వేంగిరాజ్యములో పరాంతకుని శాసనములు కులోత్తుంగచోడుని విజయరాజ్య సంవత్సరము 48 (శకవర్షము 1034 - 35) నుండి 49 (శకవర్షము 1040 - 41) వరకు కనబడుచున్నవి. కావున అతడు అంతవరకు వేంగిని పరిపాలించె ననుట నిశ్చయము. కులోత్తుంగ చోడునికి కళింగముతో యుద్ధము సంభవించిన సందర్భముననో, అంతకు ఇంచుక తరువాతనో కావచ్చును పశ్చిమ చాళుక్య విక్రమాదిత్య మహీధవుడు వేంగిరాజ్యముపై దండెత్తి వచ్చెను. త్రిభువనమల్ల విక్రమాదిత్యుడు కళ్యాణి చాళుక్య సింహాసనమును అధిష్ఠించినప్పటినుండి కులోత్తుంగ చోడునిపై గట్టి పగ బట్టెను. చోళరాజ్యమును చేజిక్కించుకొనుటకును, లేదా స్వవశంవదము కావించుకొనుటకును అతడు చేసిన ప్రయత్నము వ్యర్థమైనది. కులోత్తుంగ చోడుడు తన మీద కత్తి కట్టి తన యన్న భువనైకమల్ల సోమేశ్వరునికి సాయపడెను; వేంగిరాజ్యముపై తాను చేసిన మొదటి దండయాత్ర విఫలమయినది; ఈ కారణములవలన త్రిభువన మల్ల విక్రమాదిత్యునకు కులోత్తుంగునిపై పగ అతిశయించినది. సమయము చిక్కినప్పుడెల్ల వేంగిలో రాజకీయముగ కల్లోలము కలిగించుటకే అతడు ప్రయత్నించి తంత్రములు పన్నుచు వచ్చెను. వేంగిలో జరగిన తిరుగబాటులకును, కళింగ రాజకీయ పరిస్థితులు విషమించుటకునుకూడ ఒకవేళ ఇతడే కారణమైన కావచ్చును. విక్రమాంకదేవుడను త్రిభువనమల్ల విక్రమాదిత్యుడు రాజ్యతంత్రమున కడు కుశలుడు. అతని దండాధినాథులు సమర తంత్ర ప్రవీణులు, ప్రచండ దండనాయకులు. చాళుక్య భూవరుల కాణాచియైన వేంగిదేశము చోళుల హస్తగతమైనదని విక్రమాదిత్యుని విచారము. చాళుక్య చోళు లన్న పేరే కాని కులోత్తుంగ చోడుడును, అతని తనయులును అన్నివిధముల చోళులే యైరి. ఈ కారణమున వేంగిని మరల చాళుక్యాధికారము క్రిందికి తీసికొని రావలెనని విక్రమాదిత్యుని యత్నము. కళింగ యుద్ధసందర్భమును అవకాశముగ తీసికొని అతడు భీమ దండనాయకుని పౌత్రుడును, మహేశ్వర దండనాయకుని కుమారుడును అయిన బ్రాహ్మణుడు మహాప్రధాని ఖాణసవెర్గడ, మనెవెర్గడ దండనాయక అనంతపాళరసును కొంత సైన్యముతో వేంగిపై దండెత్త బంపెను. వేంగి రాజ్యముపై ఈ పశ్చిమ చాళుక్య దండయాత్ర శకవర్షము 1037 మన్మథ సంవత్సరముననో, అంతకు ఇంచుక పూర్వమో జరగినది. అనంత పాలయ్య నాయకత్వమున పశ్చిమ చాళుక్య సైన్యము పశ్చిమ చాళుక్యాధికారముక్రింద నుండిన రాయలసీమ నుండి కృష్ణా దక్షిణ పట్టసహస్రావనిపై అకస్మికముగ వచ్చి పడినది. ఈ పట్టసహస్రదేశమును పరిపాలించుచుండిన వెలనాటి కులోత్తుంగ రాజేంద్ర చోడ భూవరుడు తన సైన్యము నాయత్తపరచుకొని పశ్చిమ చాళుక్య దండయాత్రను ఎదుర్కొనెను. ఇతనికి కొండపడుమటి దేశమును

http://teluguthesis.com/



పరిపాలించుచుండిన ఎఱ్ఱమండ నృపుడు తన సైన్యముతో సాయపడెను. ఇంతకు కొద్దికాలమునకు పూర్వమే వేంగీ రాజ్య సైన్యము కళింగ దండయాత్రలో పాల్గొన్నది. ఆ సైన్యనష్టమును, ధనవ్యయమును కూడదీసికొనుటకైనను వ్యవధి లేకుండనే పశ్చిమ చాళుక్యసైన్య మెత్తివచ్చినది. షట్సహస్ర దేశములోని దుర్గములు ఒక్కటొక్కటిగ పశ్చిమ చాళుక్యుల వశమైనవి. మొత్తముమీద చాళుక్య-చోళ సామంతులు అనంతపాల దండనాయకుని ధాటికి ఆగలేక పరాజితులై కృష్ణను దాటి వచ్చి బెజవాడ దుర్గమును కట్టుదిట్టము చేసికొని మరల బలములను కూర్చుకొని శత్రువును ప్రతిఘటించుటకు సంసిద్ధులైరి.

అనంతపాల దండనాయకుడు కృష్ణా దక్షిణ తీరదేశమును వశపరచుకొని విజయము లభించినందుకు చాళుక్య విక్రమ వర్షము 40 కి సరియైన మన్మథ (శకము 1037) నామసంవత్సరమున గుంటూరు జిల్లా తెనాలి తాలూకా కొల్లూరులోని అనంత భోగేశ్వరస్వామికి ఏదో దానము చేసినట్లున్నది. అచ్చటి భోగేశ్వరాలయములో అతని శాసనము కలదు. ఈ శాసనము మొదలు, చివర చాల అరిగి శిథిలమగుట వలన వివరములు తెలియవచ్చుట లేదు. అనంతపాల దండనాయకుని శాసనము చేబ్రోలు (గుంటూరు జిల్లా)లో మరొకటి కలదు. ఇదికూడ కొంత భాగము శిథిలమగుట వలన దీనికాలము తెలియవచ్చుట లేదు. ఇదియు ప్రాయికముగ ఈనాటిదే కావచ్చును. తరువాత అనంతపాల దండనాయకుడు కృష్ణానదిని దాటి సైన్యసమేతముగ బెజవాడకు వచ్చెను. అక్కడ జరగిన సమరమున కొండపడుమటి మండరాజు విక్రమించి విజయము చేకొనెను. అంతటితో శత్రువులు పరాంతకునితో సంధి చేసికొనినట్లు కన్పించును. దాక్షారామములో అనంతపాల దండనాయకుని ప్రెగ్గడ చింతలూరి భీమరసు భీమేశ్వర స్వామికి దీపదానము చేసి కులోత్తుంగ చోడ చక్రవర్తి 48 వ విజయరాజ్య సంవత్సరము నుదాహరించుచు వ్రాయించిన శాసనమే ఇందుకు ప్రమాణము. అదియునుగాక, అనంత పాలదండనాయకుని సంధి విగ్రహి పార్శ్వనాథ తనయుడయిన శాంతినాథుడుకూడ ఈ దండయాత్రయందు అనంత పాలునితోకూడ నుండెను.

అనంతపాలదండనాయకుడు పరాంతకునితో చేసికొన్న సంధిని ఎంత కాలమో పాటింపలేదు. కొద్దికాలములోనే అతడు బలములను గూర్చుకొని వేంగిని జయించెను. వేంగి పదునాలుగువేల దేశమును అతడు పరిపాలించుచుండినట్లు చాళుక్య విక్రమవర్షము 48 కు సరియైన విళంబి (శకము 1040) సంవత్సరమునాటి అతని కొమ్మూరు శాసనము తెలుపుచున్నది. కులోత్తుంగ చోడచక్రవర్తి యొక్కయు, అతని కుమారుడు పరాంతకదేవుని యొక్కయు శాసనములు శకవర్షము 1040 - 41 వరకు, అనగా కులోత్తుంగ చోడచక్రవర్తి 49 వ విజయరాజ్య సంవత్సరమువరకు మాత్రమే వేంగీరాజ్యమున కానవచ్చుచున్నవి. ఇందుకు అనుగుణముగా అనంతపాల దండనాయకుని పట్టమహాదేవి మహాదేవిదండనాయకురాలు చాళుక్య విక్రమవర్షము 45 (శకము 1042 - 43)లో దాక్షారామమున భీమేశ్వరస్వామికి చేసిన దానమును తెలుపు శాసన ముండుటచేత అప్పటికి వేంగీ రాజ్యము పూర్తిగా పశ్చిమ చాళుక్యుల అధికారము క్రిందికి వచ్చినట్లు చెప్పవచ్చును. చాళుక్యచోళ సామంతులు పశ్చిమ చాళుక్య త్రిభువనమల్ల విక్రమాదిత్యునికి పాదాక్రాంతులై అతనిని సేవించిరి. తన ప్రభువైన త్రిభువనమల్ల విక్రమాదిత్యుని, అతని చాళుక్య విక్రమవర్షము 45 ను పేర్కొనుచు వెలనాటి కులోత్తుంగి రాజేంద్రచోడుని మంత్రి (ముదిసెలి) నారాయణ ప్రెగ్గడ తన తల్లికి ధర్మువుగా దాక్షారామ భీమేశ్వరునికి పెట్టిన దీపదానమును తెలుపు శకము 1042 (క్రీ. శ. 1120)నాటి శాసనముకూడ పై విషయమును ధ్రువపరచుచున్నది. కులోత్తుంగచోడచక్రవర్తి విజయరాజ్య సంవత్సరము 52, అనగా శకవర్షము 1043 - 44 నాటి ఒక శాసనము పుదుక్కోట రాజ్యమున కానవచ్చినను ప్రాయికముగా అతడు శకము 1042 లోనే దివంగతుడయ్యెనని చరిత్రకారుల యూహ.

విక్రమచోళుడు (క్రీ. శ. 1118 - క్రీ. శ. 1135) : ఇదివరలో నుడివినట్లు పరాంతక భూపతి శాసనములు కులోత్తుంగ రాజేంద్రచోడ చక్రవర్తి 49 వ (శ. 1040 - 41) విజయరాజ్య సంవత్సరము వరకు కనబడుచున్నవి. అటు తరువాత, ఇతని శాసనములు కనబడకపోవుటవలన ఇతడు అనంతపాల దండనాయకుని నాయకత్వమున జననాథపురముపై వచ్చిన పశ్చిమ చాళుక్య దండయాత్రలో మడిసెనో, మరేమయ్యెనో తెలియుటలేదు. 'పూర్వ దిగ్వార్ధి వేలావన రాజరాజ హంస'యు, కొండపల్లి మున్నూరు నాటి కధిపతియు నైన గోవిందరాజ దండనాయకుని చాళుక్య విక్రమ శకము 51 (శకవర్షము 1048) పరాభవ సంవత్సరమునాటి త్రిపురాంతకము శాసనములో అతడు జననాథపుర దండయాత్రలో దోచెయను, గొంకని పట్టుకొని, వేంగీపురమును చుట్టుముట్టి 'కుమారు'ని సర్వస్వము చూరగొని, చోళోర్వీశుని పట్టుకొని విజయాంకితుడయ్యెనని చెప్పబడి యున్నది. శాసనములో చెప్పబడిన 'కుమారు'డు కులోత్తుంగచోడుని కుమారుడు పరాంతకు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



డగునేమో. ఈ శాసన విషయమే తెలంగాణాలోని కొన్ని పశ్చిమ చాళుక్య శాసనములవల్ల కూడ తెలియవచ్చుచున్నది. గొంకయ అనునతడు దుర్జయ వంశజుడైన వెలనాటి గొంకయ. వెలనాటి మొదటి గొంకరాజు శాసనములు శకవర్షము 1080 వరకే కనిపించుచుండుటవలనను, అటుతరువాతనుండి అతని కుమారుడు వెలనాటి చోడయ శాసనము లుండుటవలనను త్రిపురాంతకము శాసనమున చెప్పబడిన గొంకయ వెలనాటి మొదటి చోడరాజు కుమారుడైన రెండవ గొంకయయై యుండును. దోచయ ఎవరో తెలియదు. మొత్తముమీద ఈ దండయాత్రలో చోళ సైన్యములు దక్షిణమున కాంచీపురము వరకును పోయినవి.

కులోత్తుంగచోడచక్రవర్తి అనంతరము చోళ సింహాసనమును అధిష్ఠించినవాడు అతని కుమారుడును, పరాంతకుని సోదరుడును అయిన విక్రమచోడ భూపతి. రాజకేసరి, పరకేసరి బిరుదములను చోళ చక్రవర్తులును, వారి ననుసరించి చాళుక్య చోళ చక్రవర్తులును పూర్వకాలమునుండి ఒకరిని విడిచి యొకరు వహించుచు వచ్చిరి. కులోత్తుంగచోడచక్రవర్తి రాజకేసరివర్మ బిరుదాంచితుడు అగుటచేత అతని తరువాత సింహాసన మెక్కిన రాజు పరకేసరి కావలెను. కాని, విక్రమచోళుని శాసనములు కొన్నిటిలో అతనికి రాజకేసరి యని, మరికొన్నిటిలో పరకేసరి యని బిరుదము వ్యత్యస్తముగా పడుటకు కులోత్తుంగుడు పరాంతకునే యువరాజును కావించి తన యనంతరము ఆతనిని రాజ్యమునకు ఉత్తరాధికారిని కావించుటయే కారణముగ తోచుచున్నది.

కులోత్తుంగచోడుడు గతించి విక్రమచోళుడు రాజ్యమునకు వచ్చునాటికి వేంగీ రాజ్యము ఇదివరలో చెప్పినట్లు పూర్తిగా పశ్చిమ చాళుక్య చక్రవర్తుల హస్తగత మయినది. వేంగీ రాజ్యమును మరల తన యధికారము క్రిందికి తెచ్చుకొనుటకు సింహాసనము ఎక్కినప్పటినుండియు విక్రమచోడుడు ప్రయత్నించుచునే యుండెను. ఇందుకు పొత్తపినాటిని పరిపాలించుచుండిన తెలుగు చోళరాజులు - మహామండలేశ్వరుడైన బేతరసును, సిద్ధరసు కుమారుడైన మహామండలేశ్వర విమలాదిత్యుడును విక్రమచోడుని 8 వ, 8 వ విజయరాజ్య సంవత్సరములందు శకవర్షములు 1044, 1049 లలో తమ ప్రభువు బాహువులకు విజయము కలుగుటకై దానములు చేసి వ్రాయించిన శాసనములే తార్కాణము. వెలనాటి దుర్జయులు, మలయావని సూర్యవంశ్యులు, కొండపడుమటి దుర్జయులు మొదలైనవారు విక్రమచోడునికి బాసటలైరి. వారు ధరించిన 'చాళుక్య రాజ్యభవన మూలస్తంభ', 'చాళుక్య రాజ్య సముద్ధరణ దక్ష', 'చౌళిక చక్రవర్తి కటక ప్రాకా'రాది బిరుదములే వారి స్వామిభక్తి పరాయణతను చాటుచున్నవి. విక్రమాదిత్యుడు జీవించియున్నంత కాలము వేంగీ రాజ్యమునకై చాళుక్యచోళులకును, పశ్చిమ చాళుక్యులకును యుద్ధము జరుగుచునే యుండెను.

పశ్చిమ చాళుక్య చక్రవర్తి విక్రమాదిత్యుడు శకవర్షము 1048-49 లో కాలధర్మము నొందెను. అంతట వేంగిలో పశ్చిమ చాళుక్య చక్రేశ్వరులపై తిరుగబాటులు జరగినవి. పశ్చిమ చాళుక్యాధికారమునుండి వేంగిని విడిపించుటకు ప్రయత్నము ఏకముఖముగ జరగలేదు. కొందరు చాళుక్యచోళ సామంతులు విజృంభించి పశ్చిమ చాళుక్యులను తరిమివేసి కృష్ణకు దక్షిణమునం దుండిన కొంత ప్రాంతమును వశపరచుకొనిరి. విక్రమచోళుని సామంతుడు మహామండలేశ్వర నంబయయొక్క శాసన నకరటి గుంటూరుజిల్లా చేబ్రోలులో ఉన్నది. ఇది శకవర్షము 1049 (క్రీ. శ. 1127 మే 27) నాటిది.

ఇక కృష్ణా, గోదావరీ నదుల మధ్య ప్రదేశమునుండి పశ్చిమ చాళుక్యులను పారద్రోలినవారు పూర్వచాళుక్య యుద్ధమల్లుని సంతతివారు. వీరిది బెజవాడ. వీరు మానవ్యస గోత్రులు; హారితీ పుత్రులు. శ్రీ మన్మల్లేశ్వర దేవదివ్య శ్రీపాద పద్మారాధకులు; సోమ వంశార్ణవ చంద్రులు. వీరిలో మల్లభూపతి పశ్చిమ చాళుక్య సైన్యములను ఓడించి తరుమగొట్టి వేంగిని శత్రునిశ్శేషము చేయుటయే కాక గోదావరిని దాటి జననాథపుర ప్రాంతమును కూడ వశపరచుకొని సమధిగత పంచమహాశబ్ద, యుద్ధమల్ల వంశ సముద్ధరణ, మహామండలేశ్వర బిరుదములను ధరించి శకవర్షము 1048-49 నుండి పరిపాలనము చేయదొడగెను. ఇతని కొన్ని శాసనములలో మల్లభూపతి అని పేరున్నను చాల శాసనములలో ఇతనికి సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధనుడు అను పూర్వచాళుక్య బిరుదములు మాత్రమే కలవు. ఇతడు పూర్వ చాళుక్యులలో అర్వాచీనుడైన వేంగీశ్వర రాజు తనయుడు; అయ్యప దేవుడు ఇతని సోదరుడు. ప్రాయికముగా సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మల్లపరాజు శత్రువులను వేంగినుండి తరుమగొట్టుటలోను, రాజ్యము సంపాదించుటలోను కళింగాధిపుడయిన అనంతవర్మ చోడ గంగదేవుడు తోడ్పడి యుండవచ్చును. సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధనుడు రాజ్యము పరిపాలించుచుండగా అనంతవర్మ చోడగంగదేవుని రాణులు దాక్షారామ భీమేశ్వరునికి దానములు చేసి వ్రాయించిన శిలాశాసనము లున్నవి. మల్లపరాజు తన శాసనములలో విక్రమచోడుని



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పేర్కొనకుండుటవలన ఇతడు స్వతంత్రుడుగనే రాజ్యమును పరిపాలించుచుండినట్లు తలంపవలసి యున్నది. ఈ విధముగా వేంగిలో పశ్చిమ చాళుక్యాధిపత్యము అంతరించినది. పశ్చిమ చాళుక్య సైన్యములు మధ్యాంధ్ర దేశము నుండి నిర్గమించినవి. శక సంవత్సరములు 1049 (క్రీ. శ. 1127) నుండి 1051 (క్రీ. శ. 1029) వరకు ఒక్క రెండేండ్ల పాటు పశ్చిమ చాళుక్య దండనాయకుల శాసనములుకాని, చాళుక్య విక్రమ వర్షము నుదాహరించు శాసనములు కాని కానరావు.

త్రిభువనమల్ల విక్రమాదిత్యుని తరువాత అతని తనయుడు భూలోకమల్ల సోమేశ్వరుడు సింహాసనమెక్కెను. ఇతనికి సర్వజ్ఞ బిరుదము కలదు. ఇతడు శకవర్షములు 1048-49 (క్రీ. శ. 1126 - 27) నుండి 1059-60 (క్రీ. శ. 1137 - 38) వరకు రాజ్యము చేసెను. ఇతడును తండ్రి వలెనే కడు పరాక్రమవంతుడు; రాజనీతి చతురుడు. సమర్థులైన మహాదండనాయకులను, తెలుగు చోళ సామంతులను గూర్చుకొని వేంగిని మరల తన అధికారము క్రిందికి తెచ్చుకొనుటకు పూనుకొనెను. మునుముందు అతడు తెలుగుదేశములో ఒక మూలగానున్న పలనాటిని అక్రమముగ వశముచేసికొనెను. పలనాటి (పల్లినాటి) హైహయ రాజులు అతనికి సామంతులై అతని ప్రయత్నమునకు తోడ్పడిరి. పలనాటి హైహయులు మొట్టమొదట తెలుగు దేశమునకు పశ్చిమ చాళుక్యులతోడనే వచ్చి రనుటకు అవకాశము కలదు. వీరిది ఛాగి వంశము. ఋగ్వేదము పదపాఠమును అధ్యయనము చేసిన కామనూరి బ్రాహ్మణు డొకడు మాధవీపట్టణము (గురిజాల)లో కట్టించిన త్రిమూర్త్యాలయమునకు బిరుదంకరుద్ర బిరుదాంచితుడయిన మహామండలేశ్వర చాగి బేతరాజు కొంత భూమి దానము చేసి సౌమ్య సంవత్సరమునకు సరియైన శకవర్షము 1051 (క్రీ. శ. 1129) లో వ్రాయించిన శాసనమున భూలోకమల్ల సోమేశ్వర చక్రవర్తిని తన యధిపతిగా పేర్కొన్నాడు.



చిత్రము 85. భావనారాయణస్వామి ఆలయము, బాపట్ల.

చాళుక్య విక్రమ వర్షము 52 కు సరియైన ప్లవంగ సంవత్సర భాద్రపద శుద్ధ దశమీ గురువారము (18 ఆగస్టు, 1127) నాటి పశ్చిమ చాళుక్య శాసనము గుంటూరుజిల్లా నాదెండ్లలో కనిపించుచున్నది. ఎట్లయినను, భూలోకమల్లునికి మరి రెండు సంవత్సరములకు, అనగా శకము 1053 (క్రీ.శ. 1131) నాటికి కాని వేంగిదేశము మరల వశము కాలేదు. వెలనాటి దుర్జయులు మరల చాళుక్య చక్రేశ్వరులకు సామంతులైరి. వెలనాటి చోడయ రాజు భార్య సూరమదేవులు భూలోకమల్లుడు పరిపాలించుచుండగా శకవర్షము 105[3] లో 55 వ చాళుక్య విక్రమ వర్షమున, చైత్రబహుళ తదియ శనివారము వ్యతీపాతనిమిత్తమున బాపట్ల భావనారాయణ దేవరకు దీపదానము చేసినది. శకము 1053-54 నుండి భూలోకమల్లుని శాసనములు వేంగి ప్రధాన పుణ్యక్షేత్రమైన దాక్షారామములోనే కాక విశాఖపట్టణము జిల్లా విశాఖపట్టణము తాలూకా అప్పికొండలో గూడ కనబడుటచేత పశ్చిమ చాళుక్య సైన్యములు గోదావరికి ఉత్తరమున సింహాచలము పర్యంతముగల దేశమును సైతము సాధించినట్లు చెప్పవచ్చును. అప్పికొండలోని పశ్చిమ చాళుక్య శాసనము శకము 1053, చాళుక్య విక్రమ శకము 55 నాటిది.* వేంగి మరల ఈ విధమున శకవర్షము 1053-54 నాటికి పశ్చిమ చాళుక్యుల అధికారము క్రిందికి వచ్చినది. పూర్వచాళుక్య వంశజుడైన మల్లభూవరుని శాసనములు దాక్షారామములో అతని నాలుగవ విజయ రాజ్య సంవత్సరము వరకు కనిపించుచున్నవి; తరువాత కొంతకాలము అవి అక్కడ కనిపించక పోవుటకు అటుతరువాత వచ్చిన పశ్చిమ చాళుక్య దండయాత్రయే కారణము కావచ్చును; ఇది ఇట్లుండగా, పడుమటి గోదావరి జిల్లా

---

* పై నుడివిన బాపట్ల, అప్పికొండ శాసనములలోని శకవర్షములు వర్తమానాబ్దములుగ గ్రహింపవలెను. బాపట్ల, అప్పికొండ శాసనములకు సరియైన ఇంగ్లీషు తేదీలు వరుసగా ఇవి: శనివారము 29 వ మార్చి 1130; బుధవారము 25 వ ఫిబ్రవరి 1131.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



జుత్తిగలోను, తూర్పుగోదావరిజిల్లా రాజమహేంద్రవరములోను, దాక్షారామములోను ఒక సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధనుని శాసనములు వరుసగా శకవర్షములు 1063, 1067, 1070 నాటివి కనిపించుచున్నవి. జుత్తిగ, రాజమహేంద్రవరములలోనివి వరుసగా అతని 15 వ, 21 వ విజయరాజ్య సంవత్సరములనాటి శాసనములు. దాక్షారామ శాసనములో విజయరాజ్య సంవత్సరము పోయినది. శాసనములందు ఇచ్చిన విజయరాజ్య సంవత్సరములను అనుసరించి చూచినచో ఈ విష్ణువర్ధనుడు కూడ చాళుక్యుడే; శకవర్షము 1048 ప్రాంతమునందు రాజ్యమునకు వచ్చినవాడే. ఇతడు మల్లరాజనుటకు సందేహము లేదు. ఈ వేంగీశ్వర నందనుడయిన మల్లమహీపతి శాసనము ఇంకొకటి శకము 1071 నాటిది దాక్షారామములో ఉన్నది. కాని, శాసనము చాల శిథిలమైనందున విజయరాజ్య సంవత్సరము పోయినది. ఈ శాసనములవలన మల్లమహీపతి మొదట స్వతంత్రుడుగా పరిపాలించి, పశ్చిమ చాళుక్యులు వేంగిపై దండెత్తి వచ్చి దానిని ఆక్రమించిన మీదట ఇతరులతో సహకరించి వారిని ఓడించి తరుమగొట్టి, కృష్ణానదికి ఉత్తరమున ఉన్న వేంగిదేశమును వశమొనర్చుకొని మరల స్వతంత్రుడై పరిపాలించినట్లు ఊహింపవలసి యున్నది.

విక్రమచోళుని రాజ్యకాలము చివర అతని సామంత మండలికులలో ముఖ్యులైన వెలనాటివారు అతని సాయముతో పశ్చిమ చాళుక్యులను వేంగినుండి తరిమివేయు నుద్దేశముతో రహస్యముగ ప్రయత్నింప గడగిరి. గోవింద దండాధిపునికి బందిగా చిక్కిన తరుణవయస్కుడు వెలనాటి గొంకయ ఎట్టెట్లో తప్పించుకొని వేంగిని పారతంత్ర్యమునుండి విడిపించు ప్రయత్నమున నాయకత్వమును వహించెను. అతని తండ్రి వెలనాటి రాజేంద్ర చోడయ పశ్చిమ చాళుక్య సామంతుడుగనే యుండి, రహస్యముగ కొడుకుతో సహకరించి పారతంత్ర్య విమోచనమునకు పనిచేయవచ్చును. ఒకవేళ వీరు రహస్యముగ సామ్రాజ్యసైన్యములను పంపవలసినదని విక్రమచోడుని సాయ మర్థించుటకేమో అతని పంద్రెండవ విజయరాజ్య సంవత్సరమున (శకము 1051-52) వెలనాటి రాజేంద్ర చోడ గాంగేయ రాయలను చోడయయు, అతని కొడుకు గొంకయయు, రాజేంద్రచోడయ ప్రధాని నిరవద్యయ్య కొడుకు వాశనయ్యయు, రాజేంద్రచోడ గాంగేయ రాయల బావమరది, నందిమారాయల కుమారుడు గొంకయ దండనాయకుడును అతనిని కలసికొని కాళహస్తిలో స్వామికి దీపదానములు చేసిరి. విక్రమచోడుడు తాను జీవించియుండగనే శకవర్షము 1054-55 లో కులోత్తుంగచోడునికి యౌవరాజ్య పట్టము కట్టి యుద్ధమునకు సంసిద్ధుడయ్యెను. కులోత్తుంగ చోడనామము ధరించినవారిలో ఇతడు రెండవవాడగుటచేత ఇతనిని చరిత్రకారులు ఇమ్మడి (రెండవ) కులోత్తుంగ చోడుడందురు. ఇతడు తమ పక్షమునున్న సామంతులసైన్యములకు తమ సైన్యమునుకూడ తోడు తీసికొని కుంతల సేనలను మార్కొన వేంగికి పయనమయ్యెను. ఇమ్మడి కులోత్తుంగుని నాయకత్వమున కొంత సైన్యము వచ్చుచుండెనని తెలియగనే సామంత మండలికులకు మరింత ధైర్యము కలిగినది. కోటవారు, ఈపని కంద్రవాటివారు, కొండపడుమటివారు అతిహోత్సాహ ధైర్యములతో శత్రువుల నెదుర్కొనిరి. 'సిద్ధి బేత చీడ్పులి హరిణమృగేంద్రు'డని వెలనాటి గొంక భూపతికి బిరుదము. సిద్ధి బేత చీడ్పులి అను హరిణములకు సింహము వంటివాడని ఆ బిరుదమున కర్థము. సిద్ధి బేత చీడ్పులి వంశాన్వయము విషయమున కొంచెము చిక్కు కలదు. సిద్ధి బేత చీడ్పులి అన్నవి మూడును మూడు విడి పేర్లుగ తీసికొనవలెనా లేక, సిద్ధికుమారుడైన బేతడును చీడ్పులియునా అనునది సమస్య. వెలనాటి గొంక నృపతికి ఈ బిరుదము పశ్చిమ చాళుక్యులతోడి ఈ సంగ్రామము సందర్భమున సంభవించిన దనుటకు సందియము లేదు. సిద్ధిరాజు తెలుగు చోళులలోనివా డనుటకు సందియము లేదు. తెలుగు చోళులలో సిద్ధి, ఎరసిద్ధి, నల్లసిద్ధి యని సిద్ధినామమును ధరించినవారు చాలమంది ఉన్నారు. త్రిభువనమల్ల విక్రమాదిత్యునికి సామంతుడుగ శకవర్షము 1046 ప్రాంతమున కడపజిల్లా పెద్దముడియము ప్రాంతమును పరిపాలించిన చిద్దిణ (సిద్ధన) చోడు డొకడున్నాడు. గొంకరాజుచేత పరాజితు డయిన సిద్ధిరాజు ఈతడో మరొకడో తెలియదు. బేతరాజనామము ఈ కాలమున ఒక తెలుగు చోళవంశమునందే కాక హైహయాది ఇతర మాండలిక వంశములందు కూడ కనబడును. గొంకరాజు చేత ఓటువడిన బేతరాజు తెలుగుచోళుడో, హైహయ వంశజుడో తెలియదు. చీడ్పులి అన్నది ఒక రాజు పేరేమో తెలియదు. ఒక రాజు పేరైనచో అది వింతయైనదే. ఇటువంటివాడు ఉండవచ్చుననుటకు క్రీ. శ. పదవ శతాబ్దమునాటి తమిళ పరాంతక చోళుని శాసనము తార్కాణము. ఈ శాసనమున పరాంతకుని సేనాని యొకడు శీత్పులిని ఓడించి నెల్లూరిని విధ్వంసము కావించినట్లు చెప్పబడినది. ఇక్కడ చోళ చక్రవర్తియగు మొదటి రాజరాజ రాజకేసరివర్మ శిప్పులి(శిత్పులి)నాడును, పాకనాడును జయించినట్లు అతని శాసనములవలన తెలియుచున్నది. పాకనాడు నెల్లూరు మండలములోనిదే.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



శీత్పులిని నెల్లూరితోను, పాకనాటితోను జోడించి చెప్పుట వలన శీత్పులి (శిప్పులి) నాడుకూడ నెల్లూరు మండలము లోనిదే యని యెంచవచ్చును. శీత్పులి యేలిన దేశమునకే శీత్పులినాడు అని పేరు కలిగియుండును. అయిన ఒక యేలికనుబట్టి ఒకనాటికి పేరు వచ్చుట కని విని యెరుగని విషయము. గవర్నమెంటు శాసన శాఖవారు శీత్పులి యన్నది ఒక రాజు పేరుగ గణించి యుండుటవలన అతని రాజ్యమునకు శీత్పులినాడని పేరు వచ్చెనేమో యని ఊహించిరి. శీత్పులినాడే చీడ్పులినాడు. క్రీ. శ. 18 వ శతాబ్దమునాటి నెల్లూరు మండల శాసనములలో చెడుపులి నాడని ఒకనాడు పేర్కొనబడినది. ప్రాయికముగా చెడు పులి యన్నది శీత్పులి, చీడ్పులి పదముల వికృతియే కాద గును. చెడుపులి నాటిలోనిదిగ చెప్పబడిన పాలచెలమ గ్రామము నెల్లూరు మండలమునందలి రాపూరు తాలూ కాలో ఆ శాసనమున్న పాలచెర్లపాడు గ్రామమే. అందు వలన పాలచెర్లపాడు పరిసర ప్రాంతమే ప్రాచీన కాలపు చెడుపులి (చీడ్పులి - శీత్పులి) నాడని చెప్పవచ్చును. చీడ్పులి ఒకరాజు పేరైనను కాకపోయినను గొంకరాజు చీడ్పులి నాటిని జయించె ననుటకు సందియము లేదు. కోట దొడ్డ భీమరాజునకు సిద్ధిచోడ మృగశార్దూల, యూరియ బేత మత్తమాతంగసింహ, చీడ్పులి వధూ మంగళసూత్ర హరణ యను బిరుదములు కలవు. ఈ బిరుదములలో సిద్ధి, బేత, చీడ్పులు లుండుటవలన వీరిని కోట దొడ్డ భీమరాజు జయించె ననుట యొప్పును. కోట దొడ్డ భీమరాజు వెలనాటి రెండవ గొంకరాజు బంధువుడును, సామంతుడును కూడను. అయినను ఈ యుద్ధోద్యోగమున నాయకత్వము వహించిన వాడు వెలనాటి రెండవ గొంక నరేంద్రుడు గనుక నిజ ముగా ఈ విజయములను సంపాదించినవారు అతని బంధు సహచర సామంత మండలికులైనను అతడు సంపాదించి నట్లే చెప్పబడినది. కోట దొడ్డ భీమరాజు బిరుదులవలన సిద్ధి, బేత, చీడ్పులులు వేరువేరు వ్యక్తులని స్పష్టమైనది. సిద్ధిరాజు తెలుగుచోడ వంశజుడయని నిర్ధారణ మైనది. బేతరాజు ఊరియ బేతడని చెప్పబడినను అత దేవంశజుడో తెలియ వచ్చుట లేదు. ఊరియ అన్నది ఊరేవద రూపాంతరము. ఇది యొక గ్రామ నామము కావచ్చును. ఈ యూరియ బేతయ కూడ నెల్లూరు మండలములలోనివా డగునేమో. చీడ్పులి వధూమంగళ సూత్రహరణ యనుదానికి చీడ్పులిని జయించినవాడని యర్థము. ఇదివరలో నుడివినట్లు చీడ్పులి యన్నది ఒక రాజు పేరు కావచ్చును; లేదా, ఒక నాడు పేరు కావచ్చును. కాని, విజితులైన సిద్ధి, బేత బిరువురును రాజులగుటవలన చీడ్పులి కూడ రాజే కావచ్చును. కోట దొడ్డ భీమరాజునకువలెనే రాచూరి దారపరాజునకు కూడ సిద్ధిచోడ మస్తకశూల, చీడ్పులి వధూ మంగళసూత్ర హరణ యను బిరుదములు కలవు. దారపరాజు కోట వంశజుడేమో ఇతని శాసనము కూడ శ్రీ ధాన్యకటకపు రవరాధీశ్వర, అమరేశ్వర దేవ దివ్య శ్రీపాద పద్మారా ధక అను కోటవంశ ప్రశస్తితో ఆరంభమగును. కోటవంశ జులు ధాన్యకటకపురవరాధీశ్వరులు, అమరేశ్వర దేవ దివ్య శ్రీపాద పద్మారాధకులు. పూర్వోక్త బిరుదములు దారపరాజు కూడ కోట దొడ్డ భీమరాజుతో కలసి చాళుక్య-చోళ శత్రువులతో పోరాడుటవలన లభించినవో, లేక కోట వంశజు డగుట చేత అతనికి వంశ పరంపరాగత ముగ సంక్రమించినవో చెప్పలేము.

మొత్తముమీద కులోత్తుంగచోడ రెండవ గొంకరాజు సిద్ధి, బేత, చీడ్పులి హారిణ మృగేంద్రుడని శకవర్షము 1062 నాటి శాసనమునందు ప్రస్తుతింపబడుటవలన ఈ విజ యములు ఆ సంవత్సరమునకు పూర్వమే, ప్రాయికముగా పశ్చిమ చాళుక్యులను కృష్ణకు దక్షిణమున సున్న దేశము నుండి తరుమగొట్టిన సందర్భమున అతనికి లభించియుండ వలెను.

కృష్ణానదికి దక్షిణదేశమునుండి పశ్చిమ చాళుక్యులను తరిమివేసిన సందర్భమున జరగినట్లు తెలిసిన ఒక సంగ్రామము మన్నేటి యుద్ధము. కొండపడుమటి దుర్జయ వంశజుడైన మండభూవరుడు కొంత సైన్యమిచ్చి అతని భృత్యుడైన కాపెనాయకుని పంపగా అతడు మన్నేటికడ శత్రువులను మార్కొని భయంకర యుద్ధమున వారి నోడించి పార దోలెను. ఈ విధమున కుంతలసైన్యములు పరాజయము పొంది కృష్ణకు దక్షిణదేశమునుండి నిర్గమించినను వేంగీవిష యమునుండి వెడలిపోలేదు. విజయోత్సాహముతో ఇమ్మడి కులోత్తుంగ చోడుని సేనలును, సామంత మండలిక సైన్య ములును కృష్ణ దాటి వారిని తరుముకొనుచు పోగా మరల శత్రువులు గోదావరీ తీరమున ఓహటింపక నిలిచిరి. పూర్వ చాళుక్య వంశజుడు మల్లరాజుకూడ తన సైన్యములతో చాళుక్యచోళ సామంత మండలికులలో సహకరించెను. చాళుక్య చోళ సామంత మండలిక మిత్ర సైన్యములును, పశ్చిమ చాళుక్య సైన్యములును గోదావరీ తీరమున స్కంధావారముల నేర్పరచుకొని యుద్ధమునకు సంసిద్ధము లయినవి. కుంతల చాళుక్యులకు పలనాటి హైహయ భూమీశులును, కోనసీమ హైహయ నృపులును, పల్లవ సామంత మండలికులును మాత్రమే కాక గౌడ, లాట, మరాటపతులయొక్క సైన్యములును బాసటయైనవి. మిత్రమండలి సైన్యములకు వెలనాటి రాజేంద్రచోడుని



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



శావమరదియు, వెలనాటి గొంకయ మేనమామయు అయిన మారయపండ దండాధినాథుడును, వెలనాటి గొంకభూపతియు నాయకత్వమును వహించిరి. ఇమ్మడి కులోత్తుంగ చోడుడు సర్వసైన్యాధిపతి. పశ్చిమ చాళుక్యుల పక్షమున మహాప్రధాన గోవింద దండాధిపుడును, మహాప్రధాన బాణసవెర్గడ మనెవెర్గడ శ్రీవత్సరాజ దండనాయకుడును, వేంగీ మహీవల్లభుడు దండాధిప లక్ష్మరాజును, ఇతని మహా ప్రధాని సిద్ధమయ్యా నాయకులును నాయకత్వము వహించి మొగ్గరము పన్నిరి. ఈ గోవింద దండాధిప, లక్ష్మణ దండనాయకులు పశ్చిమ చాళుక్య చక్రవర్తి విక్రమాదిత్యుని శ్రీ మన్మహాప్రధాన బాణసవెర్గడ మనెవెర్గడ అనంతపాల దండాధినాథుల మేనల్లురు కారు; వీరు వేరు. ఇట్టగె అగ్రహారికుడు బాగిమాదిమయ్యా నాయకుల కుమారుడు గోవిందరాజు అను గోవింద దండాధిపుడు. వీ రందరు బ్రాహ్మణ సేనానులు. ఈ యుద్ధము జరుగు నాటికి దండాధిప లక్ష్మరాజు వేంగీ మహీవల్లభుడుగా నుండెను. మొత్తముమీద ఉభయ బలములును యుద్ధమునకు ఆయత్తము లయినవి. ఉభయబలములకును గోదావరి తీరమున మహాభయంకర సంగ్రామము జరగినది. దీనికి గోదావరి సంగరమని పేరు. ఈ యుద్ధమున కుంతల, మరాట, లాట, గౌడ సైన్యములు పూర్తిగ పరాజయము పొంది పలాయన మైనవి. శత్రువులు తమ వస్తు సామగ్రిని, హాటక, ఘోటక, ఉష్ట్రములను యుద్ధరంగమున దిగవిడిచి పారిపోయిరి. తుదకు వారికి బంగారము(ధనము)ను, అశ్వములను, ఒంటెలను తీసికొనిపోవుటకైనను అవకాశము లేకపోయినది. వెలనాటి గొంకయయు, చాళుక్య చోళ సామంత మండలికులును శత్రు స్కంధావారమును చూరగొని ఆ ధనమును, గుర్రములను, ఒంటెలను విక్రమచోడ దేవ తనయుడయిన ఇమ్మడి కులోత్తుంగ చోడునికి సమర్పించినట్లు దాక్షారామ శాసన మొకటి తెలుపుచున్నది. వేంగిమహి శత్రు నిశ్శేషమయినది. ఇమ్మడి కులోత్తుంగ చోడుడు వేంగిదేశ మంతటికి వెలనాటి గొంకయను అధిపతిని కావించి స్వనగరమునకు వెడలిపోయెను. నాటి నుండి వెలనాటి మొదటి చోడరాజు తనయుడయిన వెలనాటి రెండవ గొంకభూపతి కులోత్తుంగునియెడ కృతజ్ఞత కలిగి వెలనాటి కులోత్తుంగచోడ గొంకరాజను పేరు వహించి రాజ్యమేలెను.

ఇక గోదావరి సంగర మెప్పుడు జరగినది, పశ్చిమ చాళుక్యులు తమ సైన్యములతో గూడ తెలుగుదేశమును వీడి ఎప్పుడు పోయిరి అను విషయములు ఇంకను విచారణీయములు. పశ్చిమ చాళుక్యుల శాసనములు గుంటూరు, గోదావరి మండలములలో శకవర్షము 1057, అనగా చాళుక్య విక్రమ వర్షములు 59, 60 వరకు కనబడుచున్నవి. ఇంతవరకు చరిత్రకారులు ఈ గోదావరి సంగ్రామము శకము 1054 లో జరగిన దనియు, అంతటితో పశ్చిమ చాళుక్యులు వేంగిని వదలిపోయి రనియు తలంచుచున్నారు. మరికొందరు గోదావరి సంగ్రామ మైనవెనుకకూడ పశ్చిమ చాళుక్య శాసనములు కానవచ్చుటచేత అటు తరువాత కొంతకాలము వరకు పశ్చిమ చాళుక్యులు వేంగిలో ఉండినట్లు చెప్పుచున్నారు. ఇందుకు పశ్చిమ చాళుక్య శాసనములు పైనుడివిన రీతిని వేంగీ దేశములో చాళుక్య విక్రమ వర్షములు 59, 60 వరకు కనబడుటయే కారణము. ఇక మొదటి ఊహకు కారణము విక్రమచోడుని నిడుద్రోలు శాసనము. ఇది విక్రమచోడ చక్రవర్తి పదునేడవ విజయరాజ్య సంవత్సరము నాటిది. ఇది దండనాయకుడైన పండయ వెలనాటిలోని అతని ఏకభోగమైన చెరకుంబల్లి (చెరకుమిల్లి) గోకేశ్వర దేవరకు సపరివారముగా గుళ్లు కట్టించి దేవరకు నివేద్య భోగార్థము శకము 1054 లో వైశాఖశుద్ధ తదియ గురువారమునాడు ముప్పదేనుపుట్ల అళ్లపట్టు భూమిని దానము ఇచ్చినట్లు తెలుపుటకు పుట్టినది. ఇందే మొదటిమారు పండదండాధీశుడు కర్ణాట, మరాట, లాట కటకములను జయించి వాని లక్ష్మిని వెలనాటి గొంక నృపతికి ఇచ్చినట్లు తెలుపబడినది. ఇది గోదావరి సంగ్రామమున జరగిన విషయము. అందువలన ఆ సంగ్రామము శకవర్షము 1054 లో జరగినట్లు కొందరు చరిత్రకారులు నిర్ణయించియున్నారు. 'గౌడ కుంతల కుథృత్సేన 'లను గొంకభూపతి జయించినట్లు తెలుపు తరువాతి శాసనము నాదెండ్లలోనిది; ఇందు సంస్కృత భాగమున శాసనకాలము 'శాకాబ్దే మణిబాణఖేందు గణితే దాక్షిణ్య పుణ్యాయనే' యనియు, తెలుగు భాగమున 'శకవర్షములు 1055 గు నేంటి దక్షిణాయన' మనియు తెలుపబడినది. శకము 1054 లోనే గోదావరి సంగరము జరగిన దనుటకు ఈ శాసనము ప్రమాణముగా చూపబడుచున్నది. తరువాత ఇదే విషయమును తెలుపు శకము 1057 నాటి శాసనములు బాపట్ల, సాతులూరులలోనివి. బాపట్ల శాసనమున తిథి చెప్పబడలేదు. సాతులూరు శాసనములోని దానము సూర్యగ్రహణ నిమిత్తమున చేయబడిన దని మాత్రమేకాని ఆ గ్రహణము ఏ మాసములోనిదో చెప్పబడలేదు. కావున ఈ సంగ్రామము జరగిన సంవత్సరమును నిర్ణయించుటకు నిడుద్రోలు, నాదెండ్ల శాసనములే ఉపకరించును; మిగిలినవి ఉపకరింపవు. ఎఫ్. కీల్ హార్న్ పండితుడు నిడుద్రోలు శాసనములోని తేదీ వివరములు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పరీక్షించి అంకెలలో ఇచ్చిన శకవర్షము తప్పనియు, దానికి సరియైన ఇంగ్లీషు తేదీ క్రీ.శ. 1135 (శకము 1057) ఏప్రిల్ 18 గురువారము అగుననియు నిర్ణయించి యున్నాడు. అందువలన ఈ గోదావరి సంగ్రామము శకవర్షము 1057 లో వైశాఖమాసముననో, అంత కించుక పూర్వమో జరిగియుండవలెను. దీనికి నాదెండ్ల శాసనము విరుద్ధమయినది కాదు. ఇందు శాసన కాలమును సంస్కృతములో తెలుపు సందర్భమున 'మణి' యన్న పదమునకు తెలుగు భాగమున '5' అని ఈయబడినది. సాధారణముగా శాసనకాల పరిభాషలో మణి, రత్నశబ్దములు నవ సంఖ్యకు (తొమ్మిదికి) సంకేతముగ వాడుట ఆచారము. అందువలన అది శకవర్షము 1059 అని ఉండవలయును కాని 1055 అనుట కూడదు. ఇందువలననే ఇది నిడుబ్రోలు శాసనమునకు విరుద్ధము కాదనుట. చాళుక్య భీమవరములో భూలోకమల్ల సోమేశ్వరుని భుజములు వర్ధింపను రాక్షస సంవత్సర పుష్యబహుళ అమావాస్య సూర్యగ్రహణము నిమిత్తముగ 'బ్రిహ'(బుధ) వారమునాడు చేసిన దానమును తెలుపు శాసనము ఒకటి కలదు. ఇందు శకవర్షము లేదు. కాని, చళుక్య విక్రమవర్షము 9 అని తప్పుగ ఈయబడినది. రాక్షస సంవత్సరమునకు సరియైన శకవర్షము 1057 అగుటచేత చాళుక్య విక్రమ శకము 59 కావలెను. ఆనంద గత వత్సరముగను, రాక్షసను వర్తమానాబ్దముగను తీసికొనిననో ఆ శాసన కాలమునకు సరియైన ఇంగ్లీషు తేది క్రీ. శ. 1135 (శకము 1056) జనవరి, 16 బుధవారము (సూర్యగ్రహణము). ప్రాయికముగా శకవర్షము 1057 పుష్యమాసములోనే ఈ గోదావరి సంగరము జరిగినదని నిశ్చయముగా చెప్పవచ్చును. ఆ సంవత్సరమునకు తరువాత పశ్చిమ చాళుక్య శాసనము ఒక్కటియైనను మధ్యాంధ్ర దేశమున కనబడదు. అంతటితో పశ్చిమ చాళుక్యాధికారము వేంగిపై అంతరించినది. 1057 వ శకవర్షము విక్రమచోళ చక్రవర్తి కడపటి రాజ్య పరిపాలన సంవత్సరము. మొత్తముమీద ఈ విజయవార్తను వినియే విక్రమచోళ చక్రవర్తి పరమపదించినట్లు ఊహింపవచ్చును.

**ఇమ్మడి కులోత్తుంగచోడుడు** (క్రీ. శ. 1133 - క్రీ. శ. 1150) : విక్రమచోడుని అనంతరము చోళ సింహాసనము అధిష్ఠించినవాడు ఇమ్మడి కులోత్తుంగ చోడుడు. ఇతడు విక్రమ చోడుని కుమారుడని ఇతని చెల్లూరు శాసనమునందును, శకవర్షము 1072 నాటి దాక్షారామ శాసనమునందును తెలుపబడినది. కాని, నిజముగా ఈతడు విక్రమ చోడుని ఔరసపుత్రుడు అయినట్లు కనబడదు. ఇతనికి ముప్పది నలువదేండ్లకు తరువాత చోళసామ్రాజ్యమునకు పట్టాభిషిక్తుడైన ఇమ్మడి రాజాధిరాజు పల్లవరాయర్ పేట శాసనమువలన ఈ ఇమ్మడి కులోత్తుంగ చోళమహీపతి విక్రమచోడుని కూతురి కొడుకని తెలియుచున్న దనియు, అతనిని విక్రమచోడుడు సంతానము లేని కారణమున కాబోలును పుత్రునిగ స్వీకరించి తాను జీవించియుండగనే అతనికి యౌవరాజ్య పట్టము కట్టెననియు శ్రీ టి. యన్. సుబ్రహ్మణ్యర్‌గారు వ్రాయుచున్నారు. ఇది సత్యమే కావచ్చును. చిదంబరేశ్వరుడు (చిదంబరము నటరాజ స్వామి) ఈ కులోత్తుంగ చోడుని ఇష్టదైవము. ఈతని పట్టపురాణి త్యాగవల్లి. ఈమెకు భువనముఱుదుడైయాళ్ అని నామాంతరము. ఈమెకాక, కులోత్తుంగునికి ముక్కోకిలాన్ అని మరియొక భార్యకలదు. కులోత్తుంగుడు అనపాయ బిరుదాంకితుడు.

- కులోత్తుంగ చోడుని రాజ్యపరిపాలన ప్రథమ వర్షము శకము 1054 - 55. ఇతడు రాజ్యమేలిన పదునేడేండ్ల కాలమును చోళుల (చాళుక్య చోళుల) అధికారము సముద్ర తీరస్థ వేంగి భూమిమీద నిర్నిరోధముగా సాగినది. ఈతని శాసనములు అనేకము వేంగిదేశమున కానవచ్చినవి. ఇవి అన్నియు ఇతని సామంత మండలికులవే. వీరందరు రాజ భక్తితత్పరులై తమ దానశాసనములలో తమ ప్రభువును, తరచుగా తమ ప్రభుని విజయరాజ్య సంవత్సరములను కూడ పేర్కొనుచు వచ్చిరి. గోదావరి సంగ్రామ విజయముతో ఈ మండలికుల అధికార ప్రతిష్ఠలు హెచ్చినవి. చాళుక్యచోళులు కూడ తమకు ఏటేట చెల్లవలసిన కప్పమును, ఇతర మర్యాదలును సరిగా చెల్లించుచుండినంత కాలము మండలికుల ఆంతరంగిక పరిపాలనలో ఎట్టి జోక్యమును కలిగించుకొనెడి వారు కారు. మండలికులు ఇరుగుపొరుగు మండలములపై దండెత్తకుండ అదుపులో ఉంచుటకు చోళ సమ్రాట్టులు ఎప్పుడును ప్రయత్నించెడు వారును కారు. మండలికులు పేరుకు మాత్రమే సామంతులు. అన్ని విధముల వారు స్వతంత్రులే. మండలిక ప్రతిపత్తిలో వారు అందరును సమానులే. అయినను ఇమ్మడి కులోత్తుంగ చోడుడు పశ్చిమ చాళుక్యాధికారమునుండి వేంగిని విడిపించుటలో వెలనాటి రెండవ కులోత్తుంగ చోడ గొంకభూవరుడు నాయకత్వము వహించి గోదావరి సంగ్రామములో విజయము చేకొన్నందుకు సంతుష్టుడై 'మేఘాడంబరయుగ్మ చామర వియచ్చంద్రోదయాదులగు 'సామంత సల్లక్షణ'ములతో కూడ 'మహేంద్రగిరి శ్రీశైల'ముల మధ్యగల దేశమునకు అధిపతిని కావించి, అతనికి అధికారములోను, ప్రాభవములోను, పదవిలోను



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఆధిక్యమును చేకూర్చెను. ఈ కారణమున ఇంతటినుండి వెలనాటి దుర్జయులు కళింగ సహితమైన సముద్రతీరస్థ ఆంధ్రదేశమునకు అంతకు అధిపతులైరి. చాళుక్యచోళులకు (చోళులకు) చోళరాజ్య రాజకీయ విషయములతోనే సరిపోయెడిది. పరరాజు ఎవ్వడైన వేంగి దేశముపై దండెత్తి వచ్చినప్పుడు మాత్రమే ఒకవేళ వారు ఐక్యము కలిగించుకొనుచుండినట్లు కన్పట్టును.

వెలనాటి దుర్జయులను సముద్రతీరస్థ దేశమునకు అంతకు చోళ చక్రవర్తులు తమ ప్రతినిధి పాలకులుగ నియమించుట మధ్యాంధ్రదేశ మండలికులకు కష్టము కలిగించినది. వారు చోళ చక్రవర్తుల అధికారమును శిరసా వహించి వారిని తమ దానశాసనములలో పేర్కొనుచు వారికి విధేయ సామంతులై సరాసరిగ వారికి కప్పము కట్టుచు వచ్చిరి. కాని, వెలనాటి చోళులను మాత్రము తమ యధిపతులుగ అంగీకరింపరైరి. వెలనాటి చోళులు వారిపై అధికారము నెరప ప్రయత్నించినపుడెల్ల వారి రాజకీయ సంబంధములు మితి తప్పి తిరుగబాటులుగనే పరిణమించుచుండెడివి. వెలనాటి చోడులు ఇది ఊహించియో ఊహింపకయో తమ యిరుగుపొరుగుల నున్న కోటవారితోను, పలనాటి హైహయులతోను, కొండపడుమటివారితోను సంబంధ బాంధవ్యములు నెరపి తమ స్థితిని మరింత కట్టుదిట్టము చేసికొనిరి.

ఈ కాలమున వెలనాటి చోళులకు తరువాత పేర్కొనవలసినవారు గుంటూరు జిల్లా నర్సారావుపేట తాలూకా కొణిదెన (పూర్వపు కొట్యదొన) రాజధానిగా పరిపాలించిన తెలుగు చోడులు. వీరు పశ్చిమ చాళుక్యచక్రవర్తులకు సామంతులుగా ఉండినను, వారు వేంగినుండి తరుమగొట్టబడిన పిదప మొదట చోళచక్రవర్తులకు సామంతులై, తరువాత స్వతంత్రులై రాజ్యమేలిరి. వీరిలో వెలనాటి కులోత్తుంగ చోడ గొంకరాజునకు సమకాలికుడైన కొట్యదొన తెలుగుచోళ భూపతి త్రిభువన మల్లదేవ చోడమహారాజు (శకము 1059 - శకము 1075). పన్నిచోడ, కన్నరదేవులు ఇతని కుమారులు. త్రిభువన మల్లదేవ చోడుడు కమ్మనాడు, గుండికర్తి (గుండ్లకమ్మ నదికి రెండు తీరములను ఉండుదేశము), మొట్టవాడి (మోటాటి-కర్నూలులోనిది) దేశములను ఏలుచుండెను. కులోత్తుంగచోడ గొంకరాజు కమ్మనాటిపై దండెత్తి తెలుగు చోళులను సాధించెననుటకు అవకాశము కలదు. త్రిభువనమల్లదేవ చోడరాజును, కులోత్తుంగచోడ గొంకరాజును కలసి త్రిభువన చక్రవర్తి కులోత్తుంగ చోడదేవర 15 వ విజయరాజ్య సంవత్సరమున (శకము 1089) కమ్మనాటిలోని కొట్యదొన త్రిభువనమల్ల కేశవదేవరకు పెదగంజాము, కొండిక గంజాము, కర కుదురు, ఉప్పుటట్ల, కూరవాడ, పెరలి, వాయుందొట్ర మొదలైన ఉప్పళముల ఉప్పు అమ్మిన పహిండిలో మాడకు రెండు వీసములు పావిర్భలి అర్చనలకు, 'పాత్ర సాగుడములకు' దానము చేసిరి. సరిగా ఈ యుప్పళముల సుంకమునందు గద్యాణమునకు పెట్టిక చొప్పున త్రిభువన మల్లదేవ చోడరాజు తండ్రి కామదేవ చోడరాజు (శకవర్షములు 1028 నుండి 1059 వరకు) ఇంతకు పూర్వము కొట్యదొన (కొణిదెన) శ్రీబల్లీశ్వర మహాదేవరకు దానము చేసియున్నాడు. వెలనాటి కులోత్తుంగ చోడ గొంక, త్రిభువనమల్లదేవచోడు తిరువురును కలసి ఆ యుప్పళముల మీద వచ్చుచుండిన ఆయములో కొంత కొట్యదొన కేశవదేవరకు దాన మిచ్చుటయే వెలనాటి రెండవ గొంక భూపతి కమ్మనాటిని సాధించె ననుటకు కారణము. వెలనాటి చోళుల శాసనములు ఈ కాలము నాటివి కొట్యదొన (కొణిదెన)లో ఇంకను కలవు.

ఈ సందర్భమున ఆలోచింపవలసిన మఱొక విషయము కొలనివీడును గురించి. సరసీపురము, కొలనిపురము అను నామాంతరములు గల కొలనివీడు గొప్ప జల దుర్గము. కుంతల చాళుక్యులు వేంగిని ఆక్రమించుకొన్న కాలమున ఈ కొలనిపుర ప్రాంతమును (కొలనినాటిని) ఒక్కెత్తుగంత బిరుదాంచితుడయిన రాజేంద్రచోడుడు పరిపాలించుచుండెను. రాజేంద్ర చోడనామమును అనుసరించిచూడగా అతడు మొదట చాళుక్యచోళులకు విధేయ సామంతుడనియే చెప్పవచ్చును. ఇతని శాసనములు శకవర్షములు 1047, 1054 నాటివి కనిపించినవి. శకము 1054 నాటి ఇతని శాసనములో చాళుక్య విక్రమవర్షము 57 ఉదాహృతమై ఉండుటవలన అతడుకూడ ఇతర తెలుగు సామంతులవలెనే పశ్చిమ చాళుక్య సామంతుడయ్యెనని చెప్పవచ్చును. శకము 1054 తరువాత ఇతడు ఏమయ్యెనో తెలియదు.

ఇమ్మడి కులోత్తుంగుని కాలమున కొలనిప్రాంత పరిపాలకుడు కాటమనాయకుడు. ఇతడు శకవర్షములు 1062 (క్రీ. శ. 1140) నుండి 1078 (క్రీ. శ. 1151) వరకు రాజ్యమేలెను. ఇమ్మడి కులోత్తుంగ చోడుని చెల్లూరు తామ్ర శాసనమున 'తద్వంశ్య రాజ్యప్రసాదలబ్ధ' యైనట్టియు, 'పరంపరాగత మండలేశాధిష్ఠిత' మైనట్టియు వేంగి మండలమునందు సరసీపురము (కొలనువీడు) రాజధానిగా పాలించుచుండినట్లు చెప్పబడినను ఈ కాటమనాయకునికి, ఒక్కెత్తు గండనికి గల సంబంధ మెట్టిదో తెలియరాదు. కాటమనాయకుని సంతతివారికి కొలని



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



నాయకులని, కొలని మండలికులని వ్యవహారము. వీరికి నాయకులని వ్యవహారముండుటచేత కొందరు చరిత్రకారులు వీరు తెలుగు నాయకులని ఊహించుచున్నారు. ఇది సరియైన ఊహగా కనబడదు. నాయకు డన్నది కొంత దండుకు అధిపతియైనవానికి చెల్లు పైనిక బిరుదము. కాటమ దండనాయకుని శాసనములలో కాని, ఇతని సంతతివారి శాసనములలోకాని వీరు ఏవర్ణమునకు చెందినవారో చెప్పియుండలేదు. కాని, ఈ కొలనినాయకుల పేరులు కేశవ దేవరాజు, సోమయ దేవరాజు, ఎఱగయ దేవరాజు, మంగయ దేవరాజు అని దేవరాజ పదాంతము లగుటచేత ప్రాయికముగా వీరు క్షత్రియులై యుందురని తోచుచున్నది. వీరి శాసనములు పశ్చిమ గోదావరి జిల్లాలోని ఇప్పటి ఏలూరు, తణుకు, అత్తిలి, భీమవరము తాలూకాలలో కానవచ్చుటవలన ఈ ప్రాంత మంతయు కొలని మండలికుల అధికారముక్రింద ఉండినట్లు నిస్సంశయముగా చెప్పవచ్చును. వీరి శాసనములు వేనిలోను వీరి వంశానుక్రమము కాని, సంతతి క్రమము కాని, వర్ణితము కాకపోవుటవలన ఈ కొలని నాయకులకు పరస్పరము కల సంబంధము తెలియవచ్చుట లేదు. వీరి శాసనములలో శకవర్షములు ఉదాహృతమై ఉండుటవలన ఎవరి తరువాత ఎవరు ఈ ప్రాంతమును ఏలిరో మాత్రము తెలిసికొనుటకు వీలగుచున్నది. కాట దండాధినాథుడు నిజస్వామియైన కులోత్తుంగ చోడదేవుని అనుగ్రహమున పొందిన అత్తిలి దేశస్థ పొందువ గ్రామయుక్తమయిన మండద్రోణ్రుము అగ్రహారముచేసి శకవర్షము 1068 లో ఆర్ద్రా నక్షత్రమున శుక్లపక్షమున విషువద్దినమున కొంతమంది బ్రాహ్మణుల కిచ్చెను. లెక్కకట్టి చూచి కీల్‌హార్న పండితుడు శకము 1068 తప్పనియు, ఇది శకము 1065 కు సరిపోవు ననియు చెప్పి, దీనికి సరియైన ఇంగ్లీషుతేది క్రీ. శ. 1148 మార్చి 24 వ తేదీ అగునని తెలిపియున్నాడు. కాని, నూయెల్ పండితుని ప్రకారము ఈ శాసనము క్రీ. శ. 1140 నాటిది. ఎట్లయినను ఇది శకము 1060 కి తరువాతిదే యనుటకు సందియములేదు. క్రీ. శ. 1141 - 1142 సంవత్సరములనాటి సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధనుని శాసనము తణుకు తాలూకా జుత్తిగ గ్రామములో ఉన్నది. ఈ విష్ణువర్ధనుడు పూర్వచాళుక్య వంశజు డనుటకు సందియము లేదు. ప్రాయికముగా ఇతడు ఇదివరలో చెప్పిన యుద్ధమల్ల సంతతివాడయిన మల్ల నృపతియే కావచ్చును. ఒకచో ప్రాంతమును ఇరువురు పాలించుట అసంభవము. కనుక, ఒకవేళ కాటమనాయకుడు మల్లమహీపతిని తరిమివేసి ఆ ప్రాంతమును ఆక్రమించుకొని ఉండవచ్చును.

ఇమ్మడి కులోత్తుంగుని కడపటి రాజ్యసంవత్సరములలో కోన హైహయులు తమ రాజ్యమును విస్తరింప జేసికొనుటకు ప్రయత్నించిరి. వీరు మొదటినుండియు పశ్చిమ చాళుక్యులకు సానిటగా ఉండి, వారు వేంగిదేశమును విడిచిపెట్టిపోయిన వెనుక, తమ రాష్ట్రమును స్వతంత్రముగ పాలించుటకే ప్రయత్నించుచు వచ్చిరి. (మొదటి) రాజేంద్ర చోడుడు గతించినపిదప, అతని అన్న (రెండవ) ముమ్మడి భీముడును, అతని పసతి తమ్ముడు సత్యాశ్రయ, సత్యరాజాదిత్య చోడగంగు అను పేర్లుగల సత్యరాజును తమ రాజ్యమును పంచుకొని దానిని ఉమ్మడిగ పాలించిరి. ముమ్మడి భీమరాజు మృతిచెందిన వెనుక అతని కుమారుడు కోన రాజేంద్రలోక భూవల్లభుడును, సత్యరాజు అనంతరము భీమ, రాజపరేడులను అతని ఇరువురి తనయులలో భీమరాజును కలసి కోనమండలమును ఉమ్మడిగ పరిపాలించిరి. లోకరాజ, సత్యరాజుల శాసనములు శకవర్షములు 1067, 1072 నాటివి కానవచ్చుటచేత లోకరాజ, సత్యభూవరులు కూడ కొంతకాలము కలసి పాలించినట్లు విశదమగుచున్నది.

ఈ కోనరాజులు గోదావరి సంగ్రామమైన తరువాత స్వతంత్రులై తమ రాజ్యమును పాలించినట్లు కన్పట్టును. కోన రాజేంద్ర లోక భూపాలుడు తన మండలమును స్వతంత్రుడుగా పరిపాలించుటయే కాక తన రాజ్యమును విస్తరింపజేసికొనుటకై పొరుగున ఉన్న పూర్వచాళుక్య వంశజుడైన మల్లరాజు రాజ్యముపై దండెత్తెను. మల్లరాజు ఈ దండయాత్ర సందర్భమున మడిసెనేమో, అతని శాసనములు శకవర్షము 1071 తరువాత కనిపింపవు. కోన లోకరాజు అంతటితో ఆగక తీరస్థాంధ్రముపై దాడి సాగించి ఇప్పటి గుంటూరు మండలములోని బాపట్లవరకు వచ్చెను. శకవర్షము 1072 నాటి ఇతని శాసనము ఒకటి బాపట్లలో ఉన్నది. వెలనాటి కులోత్తుంగచోడ గొంకరాజు సేనాని దామన నాయకుని కుమారుడైన ప్రోలన నాయకుడు ఇతనిని ఎదుర్కొని మహాభయంకర యుద్ధమున వధించి ('సంగ్రామోద్యత కోన లోక నృపతేర్హుంకార మప్యగ్రతః') కోనరాష్ట్రముపై తిరిగి దండెత్తి వెళ్లి కోన హైహయులను సామంతులను కావించుకొనెను. ఇందుకు కారణముగా త్రిభువన చక్రవర్తి కులోత్తుంగ చోడదేవర 17 వ విజయరాజ్య సంవత్సరమునకు సరియైన శకవర్షము 1072 నాటి కోన లోకరాజు పినతండ్రియైన సత్యరాజాదిత్య చోడగంగు యొక్కయు, అతని ప్రెగ్గడ దండనాయకుల యొక్కయు శాసనములు దాక్షారామములో ఉన్నవి.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మొత్తముమీద ఇమ్మడి కులోత్తుంగచోడ రాజేంద్రుని రాజ్యకాలము విజయ పరంపరలతో కడచిపోయినది. వేంగిదేశము మరల సంపూర్తిగ చోళ చక్రవర్తుల యధికారము క్రిందికి వచ్చినది. కులోత్తుంగచోడుడు పదునేడు సంవత్సరములు రాజ్యముచేసి శకవర్షము 1072 లో కాలధర్మము నొందెను. మధ్యాంధ్రదేశములోని ఈతని కడపటి శాసనము ఇతని 17 వ విజయరాజ్య సంవత్సరమునకు సరియైన శకవర్షము 1072 లో బహుళ దశమీ శుక్రవారము, మేష సంక్రాంతి (క్రీ. శ. 1150 మార్చి 24 వ తేదీ) నాటిది దాక్షారామములో కలదు. అక్కడనే ఆ సంవత్సరములోనే కులోత్తుంగ చోడచక్రవర్తి కుమారుడు రెండవ రాజరాజ చోడచక్రవర్తి నాలుగవ విజయ రాజ్య సంవత్సరమున పేర్కొను శుద్ధ పంచమీ బుధ వారము తులా సంక్రాంతి (క్రీ. శ. 1150 సెప్టెంబరు 27 వ తేదీ) నాటి శాసనము కలదు. ఈ రెండు శాసనములను అనుసరించి చూచినచో ఇమ్మడి కులోత్తుంగ చోడ చక్రవర్తి శకవర్షము 1072 లో చైత్ర, భాద్రపద మాసముల నడుమ పరలోకగతుడైనట్లు నిశ్చయింప వచ్చును.

**రెండవ రాజరాజ చోళుడు** (క్రీ. శ. 1145-46—క్రీ. శ. 1178): ఇతడు ఇమ్మడి కులోత్తుంగ చోడుని కుమారుడు. కులోత్తుంగుడు ఇతనిని శకవర్షము 1067-68 లో యౌవ రాజ్యమునకు పట్టము కట్టి రాజ్యపరిపాలనలో తర్ఫీదు చేసెను. తెలుగు దేశములో ఇమ్మడి రాజరాజచోడుని అధికారము ఇంచుమించుగా ఆతనిరాజ్యము కడవరకు సాగుచుండె ననుటకు మధ్యాంధ్రదేశమున కానవచ్చు దాన శాసనములలో అతని రాజ్యపరిపాలన వర్షములును, అతని పేరును ఉదాహృతమగుటయే తార్కాణము. ఈతని కాలము నాటికి ద్వారసముద్రపు హొయిసలులు ప్రబలు లగుటవలన చోళ సామ్రాజ్యపరిమితి నైరృతిదిశను కొంత తగ్గినది. చోళ చక్రవర్తుల అధికారము కడప, చిత్తూరు మండలములలో తూర్పున ఉన్న ఇప్పటి రాజంపేట, కాళహస్తి తాలూకాల వరకు మాత్రమే పరిమితమయి నది. ఇమ్మడి రాజరాజచోళుడు చోళేంద్రసింహ బిరుదాంకితుడు. ఒక్క తెలుగుదేశములోనేకాక తమిళ దేశములో కూడ స్థానికులైన మండలేశ్వరులు ప్రబలులైరి. పొత్తపి తెలుగు చోళులకు సంబంధించిన వేరు వేరు శాఖలవారు నెల్లూరు మండలమున రాజ్యములు నిర్మించుకొని స్వతంత్రులుగా వ్యవహరించుచు వీలయినప్పుడు కంచిపై దండెత్తి అచటినుండి కప్పమును గైకొనుచుండిరి. ఈ సముద్రతీరస్థ ఆంధ్రదేశములోని మండలికులను అదుపులో ఉంచి శాంతి భద్రతలను కాపాడవలసిన భారము చాళుక్య-చోళ చక్రవర్తుల ప్రతినిధులైన వెలనాటి చోళులపై బడెను.

ఇమ్మడి రాజరాజ చోడచక్రవర్తి రాజ్య కాలములో వెలనాటి రెండవ గొంక రాజేంద్రుడు దక్షిణ కళింగమును జయించు నిమిత్తము దానిపై దాడి వెడలెను. గొంక నృపతి ఎందువలన ఈ కళింగ దండయాత్రకు పూనుకొనెనో తెలియదు. ప్రాయికముగా కళింగాధిపతులు కోన రాజేంద్ర లోకవిభుని తిరుగబాటులో అతనికి తోడ్పడి ఉండవచ్చును. ఈ కాలమున కళింగమును ఏలుచుండిన గంగ వంశజుడు అనంతవర్మ చోడగంగదేవుని తనూజుడయిన జటేశ్వర దేవ నామాంతరమునం బరగు కామార్ణవ దేవుడు. ఇతని కడపటి రాజ్య పరిపాలన సంవత్సరముననే కళింగముపై వెలనాటివారి దండయాత్ర జరగినది. ఈ దండయాత్రలో వెలనాటి గొంకరాజు విజయము గాంచినట్లు సింహాచలములోని చాళుక్యచోళ రాజరాజ దేవర విజయరాజ్య సంవత్సరము ౯కు సరియైన శకవర్షము 1178 నాటి అతని శాసనమే తార్కాణము.

కళింగమును జయించినను వెలనాటి రెండవ గొంక భూవరుని రాజ్యము తూర్పు సరిహద్దు ప్రశాంతముగను, భద్రముగను ఉండలేదు. పూర్వ చాళుక్య కంతిక బేత విజయాదిత్యుని సంతతివారు ఈ ప్రాంతమున పర్వతారణ్య ప్రదేశమునకు సమీపమున స్థిర నివాసములు ఏర్పరచుకొని సమయము చిక్కినపుడు తిరుగబాటులలో పాల్గొని విప్లవ ధ్వజమును ఎత్తుచు, పూర్వ చాళుక్య రాజ్యమును మరల స్థాపించుటకు ప్రయత్నించుచు వచ్చిరి; వీలు చిక్కనపుడు స్థానిక ప్రభువులను సేవించుచు వచ్చిరి. వీరిలో కంతిక బేత విజయాదిత్యుని పౌత్రుడైన రెండవ విజయాదిత్యుని కుమారుడు రెండవ మల్లపదేవుని కాలమునుండి ప్రత్యేక రాజ్య స్థాపనమునకు తీవ్ర కృషి జరగినది. (మధ్యప్రదేశ్‌లోని) సాగర విషయాధీశ్వరుడగు హైహయ కులతిలకుడు బ్రహ్మరాజు తనకొమార్తె చందలదేవిని రెండవ మల్లపదేవునకు ఇచ్చి అతని ఉద్యమమునకు తోడ్పడెను. కాని, రెండవ మల్లపదేవుని కుమారుడయిన మూడవ విజయాదిత్య నృపుని కాలమున గాని అది ఫలింపలేదు. రెండవ మల్లపదేవరాజు తన తనయుడు మూడవ విజయాదిత్యునికి మార్గవాడి అధిపతియైన పులకేశి భూవిభుని కూతురు గంగాదేవిని పెండ్లి చేసి అతని సాహాయ్యమును కూడ బడసెను. పొరుగున నున్న హైహయ నరపతులయొక్కయు, దూరముననున్న పులకేశి రాజేంద్రునియొక్కయు తోడ్పాటుతో మూడవ విజయాదిత్య భూపతి పూర్వ చాళుక్య రాజ్యమును పునరుద్ధరించి శకవర్షము 1079 (క్రీ. శ. 1158, జనవరి 11) లో



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పట్టాభిషిక్తుడయ్యెను. ఇతనికిని, ఇతని సంతతివారికిని పిఠాపురము రాజధాని. అందువలన వీరిని పిఠాపురము చాళుక్యు లందురు. మూడవ విజయాదిత్యుని శాసన మొక్కటియు ఇంతవరకు కానరాలేదు. విజయాదిత్యుడు పట్టాభిషిక్తుడయిన మరుసటి సంవత్సరమే, అనగా శక వర్షము 1080 లో రాజరాజదేవుని 18 వ విజయరాజ్య సంవత్సరమున కాకతీయ రుద్రదేవుని ప్రెగ్గడ ఇనంగల బ్రహ్మిరెడ్డి శాసనము ఒకటి దాక్షారామమున కనబడు చున్నది. ఈ శాసనములో రాజరాజ చోళుని పేరును, అతని విజయరాజ్య సంవత్సరమును పేర్కొనబడుటవలన కాకతి కులజుడైన అనుమకొండ రుద్రదేవుడు రాజరాజ చోళుని మిత్రుడని ఊహింప నవకాశము కలదు; లేదా శాసనమును చెక్కించిన దాత దేశాధిపతికి మిత్రుడయినను కాకపోయినను అతనిని శాసనమున పేర్కొనుట స్థానిక శాసన లేఖకుల ఆచారమై ఉండవలెను. రుద్రదేవుని మొదటి శాసన మిదియే. ఇతడు ఏ కారణమున దాక్షా రామమునకు వచ్చెనో తెలియదు. ఒకవేళ ఇతడు విజయా దిత్యునికి తోడ్పడుటకే వచ్చెనేమో. కాని, వెలనాటి ఇమ్మడి గొంకరాజు శాసనములు శకము 1079 కి తరువాత చాళుక్య చోళ రాజప్రతినిధుల రాజధానియైన జననాథ పురము (దాక్షారామము)న అతడు కాలధర్మము పొందు వరకు ఇక కానరావు. దీనివలన ఈ ప్రాంతము పూర్వ చాళుక్య (మూడవ) విజయాదిత్యుని యధికారము క్రిందికి వచ్చియుండునని తోచుచున్నది.

వెలనాటి రెండవ గొంకరాజు కమ్మనాటిని జయించినను కొట్యదొన తెలుగు చోళులు అతనికి పూర్తిగా సామంతు లైరని చెప్పుటకు వీలులేదు. త్రిభువన మల్లదేవచోడుని అనంతరము అతని కుమారులు నన్నిచోడ, కన్నరదేవ చోడులు వెలనాటి చోడరాజుల అధికారమును ధిక్కరించి స్వతంత్రులై తమ రాజ్యమును పాలింప దొడగిరి. అందు వలన శకవర్షము 1082 - 83 (క్రి. శ. 1160 - 61) ప్రాంత మున వెలనాటి రెండవ గొంకరాజు తనవిజయరాజ్యము కడపటి సంవత్సరమున మరల తెలుగు చోళుల కమ్మనాటి రాజ్యముపై దండెత్తెను. నన్నెచోడ, కన్నరదేవ చోళులు బలములను కూర్చుకొని వెలనాటి రెండవ గొంకరాజు యొక్కయు, అతని కుమారుడు రెండవ రాజేంద్ర చోడుని యొక్కయు సైన్యములను కంచెర్వుల కోటవద్ద ఎదుర్కొనిరి. అక్కడ ఉభయ పక్షములవారికి గొప్ప యుద్ధము జరగెను. కంచెర్వుల కోట అన్నది గుంటూరు జిల్లా వినుకొండ తాలూకాలోని ఇప్పటి పెద్ద కంచెర్ల కావచ్చును. ఇక్కడ శకవర్షము 1081 నాటి కన్నరదేవ చోడుని శాసనము కలదు. ఈ యుద్ధమున ధనదప్రోలి పండీశ్వరదేవర నర్తకియు, మహేశ్వర పరివార స్త్రీలలో నొకతెయు అయిన చొక్కమ యొక్క కుమారుడు కామయ గొంకరాజు మెచ్చుకొనునట్లు శౌర్యప్రతాప ములు చూపి విక్రమించి గణపతి సైన్యమును ఓడించి తుదకు వీరశయనము పొందినట్లును, అతని సోదరుడు సరణయ చోడ మహీరాజేంద్రుడు మెచ్చుకొనునట్లు చందవరాయని సముద్రతీరము వరకు తరుముకొనివెళ్ళి వైరివర్గమును చంపినట్లును గుంటూరు జిల్లా నర్సారావు పేట తాలూకా తిమ్మాపురములోని శకము 1088 నాటి వెలనాటి వారి శాసనము చెప్పుచున్నది. ఈ సోదరులచేత ఓటు వడిన గణపతి, చందవరాయలు ఎవరో తెలియుట లేదు. ప్రాయికముగా వీరు కన్నరదేవ చోడుని సేనా నులు కాని, అతనికి సాయముగ వచ్చిన మిత్రులు కాని కావచ్చును. సరణయ పరాక్రమమునకు మెచ్చి వెలనాటి రెండవ గొంక మహీపతి కొండపడుమటి దేశములోని జేవరమను గ్రామమును ఇచ్చెను. సరణయ ఆగ్రామములో దేవాలయమును కట్టించి తన ప్రభువైన గొంకనిపేర అతనికి ధర్మువుగా గొంకేశ్వరుడను శివుని ప్రతిష్ఠించి, తటా కములు నిర్మించి ఆ దేవుని అంగ రంగ భోగములకై భూదానాదులను కావించెను. ఈ మహాయుద్ధమున తుదకు కన్నరదేవ చోడుడు కూడ అయ్యవంశ సంజాతుడును వెలనాటి దేశములోని క్రొయ్యూరు నివాసియు అయిన భీమనాయకుని కుమారుడును, వెలనాటి చోడుని భృత్యు డును అయిన జిల్లబోయనిచేత పరాజితుడయ్యెను. నన్ని చోడ, కన్నరదేవ చోడుల పరాజయముతో కమ్మనాడు, గుండికర్త, మెట్టవాడి దేశములు పూర్తిగా వెలనాటి చోళుల అధికారముక్రిందికి వచ్చెను. తెలుగు చోళ భూనాథులు వెలనాటిచోడ సామంతులైరి. జిల్లబోయని పరాక్రమ కృత్యమునకు సంతసించి వెలనాటి మహీవరుడు అతనికి దండనాయక పట్టము కట్టి గౌరవించెను. జిల్ల బోయని సోదరుడైన నారప (నారాయణ) నాయకుని కూడ వెలనాటి చోడ రాజేంద్రుడు సేనాపతిని కావించి కృష్ణానది సాగరగామి అగుచోట ఏర్పడియున్న ద్వీప మునకు (దివికి) ఆతనిని అధిపతిని కావించెను. నారపనాయ కుడు అచట తోటలు వేయించి తటాకములు త్రవ్వించి, దేవాలయ ప్రాసాదాది దివ్యభవనములను, గొప్పకోట (జలదుర్గము)ను కట్టించి దానిని నేత్రపర్వ మగునట్లు చేసెను. వెలనాటి చోళుల రాచరికమున నారపనాయ కుడును, ఇతని కుమారులు చోడినాయకుడు, భీమనాయ కుడు, పిన్నచోడి నాయకుడు, బ్రహ్మనాయకుడును



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఆ ద్వీపమును సంరక్షించుకొనుచు వెలనాటిరాజ్య మూల స్తంభములై కీర్తి గడించిరి.

ప్రాయికముగా ఈ కమ్మనాటిని జయించిన సందర్భముననే కావచ్చును వెలనాటి రెండవ గొంకరాజు పాకనాటిపై కూడ దాడివెడలెను. ఇదివరలో నుడివినట్లు పాకనాటినికూడ తెలుగు చోళులే పాలించుచుండిరి. వీరు అటు చాళుక్య చోళ చక్రవర్తుల యొక్క కాని, ఇటు వెలనాటి చోళుల యొక్క కాని ఆధిపత్యమును అంగీకరింపక వీలునుబట్టి నడచుకొనుచు స్వతంత్రులైనట్లును కానట్లును వ్యవహరించు చుండిరి. ఇటువంటి తెలుగు చోళుల మీదికి రెండవ గొంకరాజు ఈవని కంద్రవాటి కంటభూపతి మొదలైన వారిని పంపెను. ఈ కంటభూపతి ఒక శాసనమునందు 'శ్రీవాసికృత్త బలవత్కడియాళ వీరు' డనియు, 'నెల్లూరి సిద్ధినృప భీషణ కుంభి కుంభ ప్రోన్ముక్త మౌక్తిక విరాజిత వీరభూమి'యనియు వర్ణితుడయినాడు. ఈ సిద్ధరసు (సిద్ధినృపుడు) నెల్లూరు రాజధానిగా పరిపాలించుచుండిన తెలుగు చోళుడు. ఇతని పూర్తియైన పేరు నల్లసిద్ధి. ఈతని శాసనము ఒకటి ప్రమాది సంవత్సరమునకు సరియైన శకవర్షము 1081 నాటిది కడపజిల్లా కురుగుంటపల్లి శివారు గ్రామమయిన దొంగలసానిలో కలదు. ఈవని కంద్రవాటి వారితోపాటు కోటవారుకూడ ఈ దండయాత్రలో పాల్గొనినట్లు కనబడును. కోట దొడ్డ భీమరాజునకు మల్లచోడ మస్తకశూల అను బిరుదము కలదు. ఈ మల్లచోడుడు కూడ తెలుగు చోళుడే. నెల్లూరి నల్లసిద్ధచోళుడు తాను పొత్తపిదేశముపై దండెత్తివెళ్లి తద్దేశాధిపతులగు మల్లదేవచోడ, సోమేశ్వరదేవ చోడులతో యుద్ధము చేసి వారిని ఓడించినట్లు చెప్పుకొనియున్నాడు. కోట దొడ్డభీమరాజు చంపినది ఈ మల్లదేవచోడునినేమో విచారింపవలసి యున్నది. రాచూరి దారపరాజునకు కూడ సిద్ధిచోడ మస్తకశూల, మల్లచోడ మస్తకశూల, యూరియ శేత మత్త మాతంగ సింహ, సిద్ధిచోడ మృగశార్దూల, చీడ్పులి వధూ మంగళ సూత్రహరణ మొదలైన బిరుదములు కలవు. ఇతడుకూడ కోట వంశజుడేమో. కోటవారి వలెనే ఈతడును ధాన్యకటక పురవరాధీశ్వరుడు; అమరేశ్వరదేవ దివ్యశ్రీపాదపద్మారాధకుడు. ఇతనికి పూర్వోక్త బిరుదములు వంశ పరంపరాగతముగ వచ్చినవో, ఈ యుద్ధములందు, దండయాత్రలయందు పాల్గొనుటవలన వచ్చినవో తెలియదు. మొత్తముమీద వెలనాటి రెండవ గొంకభూపతియొక్క పాకనాటి దండయాత్ర విజయవంతముగ ముగిసినది. అందువలననే శకవర్షము 1082 నాటి ఒక శాసనము వెలనాటి రెండవ గొంక ధరాధిపతి నకరము, (కళింగములోని ముఖలింగము) నెల్లూరులకు మధ్య గల దేశమును ఏలినట్లు చెప్పుచున్నది. రెండవ గొంకభూవరుని శాసనములు శకము 1088 కు తరువాత కానరావు. ప్రాయశః ఇతడు ఆ ప్రాంతముననే కాలధర్మము పొంది యుండును. వెలనాటి ఇమ్మడి గొంకరాజునకు తరువాత, మధ్యాంధ్రదేశమును పరిపాలించినవాడు అతని కుమారుడు వెలనాటి రెండవ కులోత్తుంగ రాజేంద్రచోడరాజు. ఈతడు తన తండ్రివద్ద రాజ్యపాలనలో తర్ఫీదు పొందుటయే కాక కంచెర్వుల కోట మొదలైన యుద్ధములలో పాల్గొని తండ్రికి సాయపడెను. ఇతని శాసనములు శకవర్షము 1085 నుండి కానవచ్చుచున్నవి.

వెలనాటి రెండవ కులోత్తుంగ చోడరాజు రాజ్యమునకు వచ్చిన వెంటనే కౌశిక గోత్రుడైన గోవిందన ప్రెగ్గడ కుమారుని కొమ్మనామాత్యుని పాకనాటికి పరిపాలకునిగా నియమించెను ('వెలనాటి చోడ మనుజేంద్రాజ్ఞావనం బూని.... యేక వింశతి సహస్రగ్రామ సంఖ్యాకమై ధరణిం జేర్చిన పాకనాడు నిజదోర్దర్పైక లగ్నంబుగాఁ బరిపాలించె నమాత్య కొమ్మన'). వెలనాటి రెండవ కులోత్తుంగ చోడుడు రాజ్యమునకు వచ్చునాటికి గోదావరి ప్రాంతదేశ రాజకీయ పరిస్థితి విషమముగా నుండెను. పూర్వచాళుక్య వంశజుడైన మూడవ విజయాదిత్యుడు పిఠాపురము రాజధానిగా తత్పరిసర ప్రాంతమును పాలించుచు పర్వతారణ్యభూయిష్ఠమైన మలయ మండలమును తన అధికారము క్రిందికి తెచ్చుకొనుటకు ప్రయత్నించుచుండెను. ఇప్పటి తూర్పు, పడమటి గోదావరి జిల్లాలలోని పాపికొండల ప్రాంతమునకు పూర్వము మలయ మండలమని, మలయావనియని పేరు. పాపికొండకు మాల్యవంతమని పేరు. ఈ మలయావనిని తాము సూర్యవంశ్యులమని చెప్పుకొనిన రాజులు పరిపాలించిరి. వీరు చాళుక్య రాజ్య సౌధమునకు మూలస్తంభములవంటి వారు.

పూర్వచాళుక్య వంశజులకును, కోనమండలాధిపతులైన హైహయ వంశ్యులకును సంబంధ బాంధవ్యములు కలవు. వెలనాటి రెండవ గొంకరాజు మృతినొందుటను, పూర్వచాళుక్యులు పిఠాపురమున స్వతంత్ర రాజ్యము నెలకొల్పుటను చూచి ధైర్యము వహించి కోన హైహయ భూమీశులు స్వాతంత్ర్య పతాక నెత్తిరి. కోన హైహయ రాజన్యులతో పాటు సరసీపురము రాజధానిగా పరిపాలించుచుండిన కొలని నాయకులును, కోన హైహయులకు బంధువులయి ఉండిపురము రాజధానిగా పాలించుచుండిన క్షత్రియులును కూడ వెలనాటి చోడరాజులపై తిరుగబాటుచేసిరి. ఉండిరాజులు సముద్రతీరప్రాంతమును పాలించుచుండిన ఇతర



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



నాయకులను సాధించుటకు అమృతలూరి మంచెన ప్రెగ్గడ కుమారుడు దేవన ప్రెగ్గడను నియోగించి, వెలనాటి రెండవ కులోత్తుంగచోడ ధరావరుడు తాను స్వయముగ కొలని పురముపై దండెత్తెను. అమృతలూరి దేవనప్రెగ్గడ సముద్రము మొలనూలుగా గల దేశమును జయించి తన ప్రభువు ఆజ్ఞను నిర్వహించి దాక్షారామమునకు వెళ్లి భీమనాథస్వామి దర్శనముచేసికొని స్వామికి శకవర్షము 1085 లో దీపదానము కావించెను.

కొలని ప్రాంతమును త్రిభువన చక్రవర్తి ఇమ్మడి కులోత్తుంగ చోడుని రాజ్యకాలమున అతని అనుగ్రహమున కొలని కాటమనాయకుడు పరిపాలించుచుండినట్లు ఇది వరలో చెప్పబడినది. ఈ కాటమనాయకుని శాసనములు శకవర్షము 1078, అనగా కులోత్తుంగ చోడచక్రవర్తి పరిపాలన కాలము చివరవరకు కనిపించుచున్నవి. అటుతరువాత కొలని నాయకుల శాసనములు శకవర్షము 1116 వరకు కానరావు. వెలనాటి రెండవ కులోత్తుంగ చోడుడు కొలని నాయక రాజ్యముపై దండెత్తి వచ్చునాటికి భీమనామాంకితుడు అక్కడ రాజ్యము చేయుచుండెను. ఈ భీము డెవడో, ఇతనికిని కొలని కాటమ నాయకునికిని ఏదైన సంబంధ మున్నదో లేదో తెలియదు. ఈ భీమనృపతి వెలనాటి చోళశాసనములలో దేవబ్రాహ్మణ కంటకుడని, ఖలుడని, భయంకర శరీరము కలవాడని, రావణ సన్నిభుడని వర్ణితుడయినాడు. అతనిది జలదుర్గము. అంభోరాశి వంటి కొల్లేటికి మధ్యనున్న దుర్గమును ఆవాసము చేసికొని అది దుస్సాధమను ధైర్యముతో వెలనాటివారి అధికారమును ధిక్కరించి వారిపై తిరుగబాటు కావించెను. ఇటువంటి సాధింప శక్యముకాని సరసీపురముపై దండెత్తివెళ్లి ముట్టడివేసి కుంభయోనియైన అగస్త్యుడు తరింప శక్యముకాని సముద్రమును శోషింపజేసినట్లు రెండవ కులోత్తుంగచోడ రాజేంద్రుడుకూడ ఆ సరస్సులోని జలములను శోషింపజేసి, శ్రీరాముడు రావణుని వలెనే భీముని పుత్రమిత్రులతోకూడ వధించి ఆ దుర్గమును వశపరచుకొనెను. కొలని విజయముతో వెలనాటి రెండవ కులోత్తుంగ చోడ జననాథునికి ఆంధ్ర భూతలమను శ్యామాంతరముగల వేంగి పదారువేల దేశమును శకవర్షము 1087 నాటికి అతని అధికారము క్రిందికి వచ్చెను.

వెలనాటి కులోత్తుంగ చోడుడు కొలను జయించి స్వరాజధానియైన ధనదపురమున కరిగెను.

కోన రాజేంద్ర లోకరాజును వధించినను కోన హైహయులు వెలనాటి చోళులకు పాదాక్రాంతులు కాలేదు. కోన సత్యరాజునకు సవతియన్నయైన రాజేంద్ర చోడునికి బేతరాజు, దేవదేవుడు, పురాంతకుడు, వెన్నరాజు, మల్లిదేవుడు అని అయిదుగురు తనయులు. వారిలో కోన రాజేంద్ర లోకరాజునకు సంతానము లేనందున కావచ్చును కోనరాజ్యమును ఇంతటినుండి రాజేంద్రచోడుని సంతతివారును, సత్యరాజు సంతతివారును పంచుకొని ఉమ్మడిగా పాలింప దొడగిరి. వీరు కోన లోకరాజును వధించినందుకును, కోనరాష్ట్రమును సాధించినందుకును వెలనాటి రెండవ కులోత్తుంగ రాజేంద్ర చోడునిపై పగ వూని మరల వెలనాటి రాజ్యముపై దండెత్తిరి కాలోలును, త్రిపురాంతకమువద్ద గొప్ప సంగ్రామము జరగినది. ఈ దండయాత్ర నడపించుకొని వెళ్లిన హైహయనృపులు భీమరాజును, రాజేంద్రచోడుని కుమారులు బేతరాజాదులును. త్రిపురాంతకమువద్ద జరగిన యుద్ధమున వెలనాటివారి పక్షమున నాయకత్వము వహించినవాడు కులోత్తుంగ రాజేంద్ర చోడుని ప్రధాని అమృతలూరి దేవనప్రెగ్గడయే. ఇతడు హైహయనాయకులను పూర్తిగా ఓడించి తరుమగొట్టి కృష్ణా గోదావరులు దాటి, కోనమండలము ప్రవేశించి, శత్రుదేశమును తగులబెట్టి దానిని స్వాధీనము చేసికొనెను. దేవన ప్రెగ్గడ కోన సాధించి మరల దాక్షారామమునకు వచ్చి స్వామిదర్శనము చేసికొని శకవర్షము 1087 లో ఆ భీమేశ్వరదేవరకు కర్పూరవర్తిగ అఖండదీపము వెలుగుటకు తగిన ఏర్పాటు కావించెను.

కోన హైహయ వంశజుల శాసనములలో కోన రాజేంద్ర చోడుని కుమారులలో అగ్రజుడైన బేతరాజు కాని, ఇతని సోదరులు దేవదేవ, పురాంతక, వెన్ననృపతులు కాని రాజ్యమేలినట్లు చెప్పబడకపోవుటచేత వారు వై సంగ్రామమున హతులై యుండవచ్చును. ఆ సోదర పంచకములో మిగిలినవాడు ఒక్క కోన మల్లిదేవుడే. ఇతడు కూడ వెలనాటి రెండవ కులోత్తుంగ రాజేంద్ర చోడునికి పాదాక్రాంతుడై అతనికి విధేయ సామంతు డయ్యెను. భీమరాజునకు పిదప అతని కుమారుడు వల్లభ మహీపతియు, మల్లరాజును ఉమ్మడిగా కోనమండలమును పాలించిరి. కోన వల్లభరాజు పదునాలుగేండ్లు రాజ్యమును పరిపాలించిన వెనుక మన్మ సత్యభూపతి, మహీపాలదేడు అను అతని ఇరువురు తనయులలో మన్మ సత్యభూపాలుడు అతని యర్ధరాజ్యమునకు అధిపతియై కోన మల్లిదేవునితో కలసి కోన మండలమును పరిపాలించెను.

కాని కోనభూవరులు వెలనాటివారితో చేసిన సంగ్రామమువలన వారికి ధనము పోయినది; బలము క్షీణించినది; వారి పరమాకాంక్ష నెరవేరలేదు. వారి అధికార ప్రాభవములు చితికిపోయినవి. ఇంతటినుండి వారు పేరుకు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మాత్రము కోన మండలాధిపతులు కాని రాజ్యము శిథిలమే యైనది ; వారు ఇక కొంత కాలము వరకు తల ఎత్తుకొనలేకపోయిరి.

కోనదేశమును సాధించిన సందర్భముననే కావచ్చును, వెలనాటి రెండవ కులోత్తుంగ చోడవసుధేశుని సేనాని ప్రోలన నాయకుడు పిఠాపుర ప్రాంతమును పరిపాలించుచుండిన పూర్వ చాళుక్య వంశజుడు మూడవ విజయాదిత్య భూపతి రాజ్యముపైనే కాక దక్షిణ కళింగముపై కూడ దండెత్తి వెళ్ళెను. చాళుక్య రాజ్యము వెలనాటి రాజాక్రాంత మయినది. ప్రోలనచమూపతి పిఠాపుర చాళుక్య రాజ్యమునే కాక, దక్షిణ కళింగము నందలి చాళుక్య వంశజులను కూడ లోబరచుకొని విశాఖపట్టణము జిల్లాలోని ఇప్పటి సర్వసిద్ధి దాటి వెళ్ళి పూర్వదేశమును జయించెను. ఇందుకు కార్యాణముగా సర్వసిద్ధి తాలూకాలోని శ్రీరామపుర గ్రామములో వెలనాటి కులోత్తుంగ రాజేంద్ర చోడుని శాసనము శకవర్షము 1091 (క్రీ. శ. 1169) నాటిది కలదు.

ఇంచుమించుగ ఈ ప్రాంతముననే శకవర్షము 1080 నాటి దాక్షారామ శాసనమువలన మరల కాకతి రుద్రదేవరాజు తీరస్థ ఆంధ్ర దేశమునకు వచ్చినట్లు తెలియుచున్నది. ఇతని శాసనమున, శకవర్షము 1080 నాటి శాసనములో వలెనే, త్రిభువన చక్రవర్తి రాజరాజ దేవరయు, అతని 28వ విజయరాజ్య సంవత్సరమును పేర్కొనబడెను. అతడు చోళ చక్రవర్తిని తన శాసనమున పేర్కొనినను నిజముగా అతడు వేంగి దేశముపై దండెత్తియే వచ్చియుండును. శకవర్షము 1084 నాటి అనుమకొండ శాసనములో కాకతి రుద్రదేవుడు తన రాజ్యమునకు సముద్రమే తూర్పు సరిహద్దని చెప్పుకొనుటవలన అతడు తన రాజ్యమును తూర్పు దిక్కునకు విస్తరింపజేసికొనుటకే, తూర్పు దేశమును సాధించుటకే దండెత్తివచ్చినట్లు ఊహించుట యుక్తము. కాని ఈ దండయాత్రలవలన కూడ కాకతి రుద్రదేవునికి శాశ్వత లాభము ఏదియు కలుగలేదు. అయినను అతడు ప్రాక్సముద్ర తీరస్థ దేశమును తన అధికారము క్రిందికి తెచ్చుకొనుటకు తన ప్రయత్నమును మానలేదు. ఇంత వరకు అతడు చేసిన ప్రయత్నములు విఫలమైనను అతడు కృష్ణానదికి ఉత్తర తీరమున పరిపాలనము నెరపుచుండిన పతనాటి రాజులతో సంబంధ బాంధవ్యములు నెరపి భవిష్యద్విజయమునకు రాచబాట వేసికొనెను.

వెలనాటి రెండవ కులోత్తుంగ రాజేంద్ర చోడయ తన రాజ్యమును కృష్ణానదికి ఉత్తర దిక్కున ఉన్న దేశము నందలి తిరుగబాటులను అణచివైచి, స్వతంత్రముగా రాజ్యము ఏలుచుండిన మండలికులను అదిమి కప్పము గొనుచుండిన కాలమున కర్ణాట దేశమున గొప్ప రాజకీయ విప్లవము జరగినది. పశ్చిమ చాళుక్య చక్రవర్తి భూలోకమల్ల సోమేశ్వరుని రెండవ కుమారుడైన త్రైలోక్యమల్లనుర్మడి తైలప రాజును కీలుబొమ్మను చేసి ఇంచుమించుగా నిర్బంధములో ఉంచి అతని సామంత మండలేశ్వరుడును, దండనాయకుడును అయిన కళచురి బిజ్జలరాయడు కొందరు బలవంతులైన మాండలికులను, సామంతులను, ఇతర నాయకులను కూడగట్టుకొని శకవర్షము 1077 - 78 నుండి తానే సర్వ స్వతంత్రుడై రాజ్యమును పరిపాలింప నారంభించెను. తైలప భూవరుడు ఎట్టకేలో అతని నిర్బంధమునుండి తప్పించుకొని కల్యాణ కటకమును విడిచిపెట్టి మొదట అణ్ణిగెరెకును, తరువాత వనవాసికిని పారిపోయెను. పశ్చిమ చాళుక్య రాజ్యములో చాల భాగము అంతటితో వీరబిజ్జలరాయని వశమయ్యెను. అతడు కల్యాణ కటకమునే రాజధాని చేసికొని బసవేశ్వరుని ప్రధానిగను, దండనాయకునిగను నియమించి పంద్రెండేండ్లు, అనగా శకవర్షము 1089 - 90 వరకు కళచురి రాజ్యప్రతిష్ఠాతయై రాజ్యమేలెను. ఈతని మంత్రి బసవ దండనాథుడు వీరబిజ్జలుని మంత్రిగా ఉండి వీరశైవ సమయమును ఉద్ధరించెను. బిజ్జలుని అనంతరము అతని తనయుడు సోమేశ్వర నామాంతరుడయిన సోవిదేవ నృపతి రమారమి పది సంవత్సరములు రాజ్యము చేసెను. సోవిదేవరాజు రాజ్యమునకు వచ్చిన కొద్ది కాలమునకే అతని దండనాథులకు కొంత సైన్య మిచ్చి వెలనాటి రాజ్యముపై దండెత్త బంపెను. వెలనాటి రెండవ కులోత్తుంగ చోళరాజు తన సంధి విగ్రహియు, ప్రధానియు అయిన కొమ్మనామాత్యుని శత్రు సైన్యములను ఎదుర్కొన బంపెను. పడవాలు చోడయయు, అతని కుమారుడు గొంకయయు, కోట నాయకులు మొదలయినవారు కొమ్మన దండనాయకుని అనుసరించిరి. ఉభయ బలములకును క్రొచ్చెర్ల్వులపురమువద్ద మహాభయంకర యుద్ధము జరగినది. ఈ క్రొచ్చెర్ల్వుల పురమే మంచెనకవి విరచితమైన కేయూరబాహు చరిత్రములో క్రొత్తచెర్ల యని పేర్కొనబడినది. చలముమెయి కటక సామంతులు కరి హయ బహుళ సేనతో రాగా కొమ్మన మంత్రి క్రొత్తచెర్ల పరిసరభూమిని వారితో తలపడెనని అందు చెప్పబడినది. ఈ క్రొత్తచెర్ల నెల్లూరు మండలము నందలి దర్శి తాలూకాలోని ఇప్పటి కొచ్చెర్లకోట. ఈ యుద్ధవివరములు శాసనములవలన కొన్నియు, కేయూరబాహు చరిత్రమువలన కొన్నియు తెలియుచున్నవి. దండెత్తివచ్చిన కర్ణాటకుల అశ్వబలమే



http://www.sanskritcentral.com/

http://teluguthesis.com/



ముప్పదివేల వరకు ఉండెను. ఈ కొచ్చెర్లకోట వద్ద కర్ణాట సేనలతో జరగిన యుద్ధమున

సెలకట్టె వాటునఁ జెలఁగి రెంటిని మూఁటఁ
గూడ గుఱ్ఱంబుల గుదులు గ్రుచ్చుఁ
బ్రతి మొగంబైన రావుతులఁ గత్తళమునఁ
గడిమిమై వీఁపులు వెడలఁ బొడుచు
బంధంపు గొరియల పగిది నేనుంగుల
ధార శుద్ధిగ నసిధారఁ దునుముఁ
జిదియించుఁ బగిలించుఁ జేతుల తీఁటవో
వడిఁ గాండ మేసి మావఁతులతలలు
రాజ శిరములు ద్రొక్కించు రాఁగెఁదిరుగ
వాగె నుబ్బెడు తన వారువంబు చేత
మహిత శౌర్యుండు కొమ్మనామాత్యవరుడు
ఁటక సామంత సేనతోఁ (లో) గసిమసంగి

ఈ మహాయుద్ధమున పడవాలు చోడయ కుమారుడు పడవాలు గొంకయ. అతని వీరశ్రీకి క్రొచ్చెర్వ్వల పురము ఒరగల్లయినది. తుదకు ఈ మహా సంగ్రామమునందు పడవాలు గొంకయ రణ వ్యాపారమున గొప్ప శౌర్య ప్రతాపములు చూపి తుతాంకు డయ్యెను. అతని శౌర్య సాహసములకు సంతోషించి వెలనాటి రెండవ కులోత్తుంగ రాజేంద్ర చోడరాజు గుంటూరుజిల్లా మోపర్రు గ్రామమున కొంత 'నెత్తురు పట్టు'ను ఇచ్చెను. శౌర్య సాహసములు చూపి యుద్ధములో పోరాడి తుతాంకులైన వారికి రాజు ఇచ్చు మాన్యమునకు 'నెత్తురు పట్టని పేరు. దీనినే కన్నడములో నెత్తురు కొడగె, రక్త కొడగె అందురు. ఈ పడవాలు గొంకని శాసనములో నెత్తురు పట్టుకే [నెత్తురు విర్థ] అని వాడబడినది.

క్రొచ్చెర్వ్వల యుద్ధములో విజయము లభించిన పిదప వెలనాటి సేనానులు కర్ణాటక సేనానులను తరుముకొనుచు మార్జవాడి (ప్రాచీన శాసనములలోని మహారాజవాడి) లోనికి కూడ పోయి ఆ దేశములోని గ్రామములను తగులబెట్టిరి. ఈ పరాక్రమ కృత్యము వలననే కోట చోడయరాజు మరదమాడి (మార్జవాడి) దవదావానల బిరుదాంకితుడు అయ్యెను. ఇట్లే మహామండలేశ్వర రాచూరి ధారవరాజునకు పొమ్మన దండనాయక కులచ్ఛేదక, చౌండరాయ చాణూర మురాంతక, ముప్పచోడ మస్తక శూల బిరుదములు కలవు. పొమ్మన దండనాయక, చౌండరాయ లెవ్వరో తెలియదు. ప్రాయికముగా ఈ ధారవరాజు వీరిని, ముప్పచోడుని ఈ కొచ్చెర్లకోట యుద్ధములోను, మార్జవాడి దండయాత్ర సందర్భమునను వధించియుండ వచ్చును. దండెత్తివచ్చిన కర్ణాటకులు కళచురి సోవిదేవ భూపతి పక్షమువా రనుటకు సందియము లేదు. ఎందువల్ల ననగా, ఈ కాలమున కళచురి రాయమురారి సోవిదేవుని రాజ్యము కర్నూలు మండలమునకు కూడ వ్యాపించినది. నందనవర్షమునాటి ఈ సోవిదేవుని శాసనము ఒకటి కర్నూలుజిల్లా నందికొట్కూరు తాలూకా సంగమేశ్వరములో ఉన్నది. నందన సంవత్సరమునకు సరియైన శకవర్షము 1094. నందికొట్కూరు, మార్కాపురము తాలూకాలకు తూర్పున నెల్లూరు జిల్లా దర్శి తాలూకాలోనే యుద్ధము జరగిన కొచ్చెర్లకోట ఉన్నది. నందికొట్కూరు తాలూకా శ్రీశైలములో శకవర్షము 1089 నాటి ఒక వీరరాజేంద్రచోడుని శాసనము కలదు. ఈ వీరరాజేంద్ర చోడుడు చోడరాజేమో తెలియదు. ఆ శాసనము వెలనాటి రెండవ కులోత్తుంగ రాజేంద్ర చోడునిదని సందియము కలుగును. కాని, ఇతనికి వీరరాజేంద్ర చోడుడని వ్యవహారములేనందున అతడు చోడులలోని వాడే కావచ్చును. మొత్తముమీద ఈకొచ్చెర్లకోట యుద్ధ విజయముతో వెలనాటి రెండవ కులోత్తుంగ రాజేంద్రచోడుని రాజ్యము పడుమట కర్నూలు మండలము వరకు వ్యాపించినది. పూర్వాంధ్ర దేశమునకు అంతకు అతడు నిరంకుశాధిపతి అయ్యెను. వెలనాటి దుర్జయరాజ్యమునకు ఈ రెండవ కులోత్తుంగ రాజేంద్ర చోడుని రాజ్యకాలము ఉచ్చదశ. ఈ కారణము చేతనే శకము 1091 నాటి ఈ కులోత్తుంగ చోడుని శాసనము ఒకటి 'పూర్వాంభోనిధి కాళహస్తిశిఖరి శ్రీమన్మహేంద్రాచల శ్రీశైలైర్వ్వలయీకృతాంధ్ర విషయమ్మని తూర్పు సముద్రమును, కాళహస్తిశైలమును, మహేంద్రాచలమును హద్దులుగాగల అంధ్రవిషయమునకు అంతటికిని అతడు అధిపతియని తెలుపుచున్నది. వెలనాటి రెండవ కులోత్తుంగ రాజేంద్రచోడుని శాసనము శకవర్షము 1095 నాటిది త్రిపురాంతకములో ఉండుటవల్ల పూర్వోక్త విషయము చాలవరకు సత్య మనియే తలంపవచ్చును.

త్రిభువన చక్రవర్తి ఇమ్మడి రాజరాజదేవుని శాసనములు ప్రాగాంధ్ర దేశమున శ. 1092 (క్రీ. శ. 1170) వరకు కనిపించు చున్నవి. శకము 1092 నాటి శాసనమున రాజరాజదేవుని విజయరాజ్య సంవత్సరము పోయినది. కాని, కొణిదెనలోని ఒక శాసనమున శకవర్షము పోయినను రాజరాజదేవుని 28 వ విజయరాజ్య సంవత్సరము మాత్రము ఉన్నది. దీనిని అనుసరించి అతని శాసనములు సముద్ర తీరస్థ ఆంధ్రదేశములో అతని కడపటి రాజ్యవర్షము వరకు ఉన్నట్లే తలంపవచ్చును. అతడు శకవర్షము 1095 లో కాలధర్మమును పొందెను. అతని కాలములో



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మధ్యాంధ్రదేశము నేలిన వెలనాటి దుర్జయులు చాల ప్రబలులైరి. రాజరాజదేవునికి పిదప చోళ సింహాసనమును అధిష్ఠించినవాడు త్రిభువన చక్రవర్తి రెండవ రాజాధిరాజు.

**రెండవ రాజాధిరాజు (క్రీ.శ. 1163 - క్రీ.శ. 1178-79):** ఇమ్మడి రాజరాజదేవునికి సంతానము లేనందుననో, నష్టమయినందుననో కావచ్చును అతడు తన పరిపాలనము కడపటి సంవత్సరములలో విక్రమ చోడుని దౌహిత్రుని చేరదీసి తన యనంతరము చోళ సామ్రాజ్యమునకు వారసునిగా ప్రకటించి అతనికి శకవర్షము 1085 లో యౌవరాజ్యపట్టము కట్టెను. ఈ విధముగా ఇమ్మడి రాజాధిరాజు రెండవ రాజరాజదేవునితో పదేండ్లపాటు కలిసి రాజ్యమేలెను.

ఇమ్మడి రాజరాజదేవుని కాలములోనే చోళ సింహాసనమునకు కొంత కలహము సంభవించినట్లు ఊహించుటకు అవకాశము కలదు. రెండవ రాజాధిరాజు అనంతరము చోళ సింహాసనమును ఆక్రమించిన త్రిభువన చక్రవర్తి మూడవ కులోత్తుంగుని వ్యయ సంవత్సరమునకు సరియైన రెండవ విజయరాజ్య సంవత్సరము అవణి (ఆగస్టు) నాటి శాసనము ఒకటి అనంతపురము జిల్లా హేమావతిలో ఉన్నది. వ్యయకు సరియైన శకవర్షము 1088 (క్రీ. శ. 1166). ఈ శాసనము ననుసరించి రెండవ రాజాధిరాజు పట్టాభిషిక్తుడయిన కొలది కాలమునకే మూడవ కులోత్తుంగుడు కూడ తానే చక్రవర్తినని ప్రకటించుకొనినట్లు కన్పట్టును. అయినను, ఏ కారణముననో ఇతడు చోళ సింహాసనమునకు రాజాధిరాజునకు గల హక్కును గురించి అతనితో ఏ విధమైన పోరాటమును పెట్టుకొనక సింహాసనమును ఆక్రమించుటకు తగిన తోడ్పాటును వెదకికొనుచు తగిన తరుణమునకు ఎదురు చూచుచుండెను. చోళ సింహాసనమును ఆక్రమించుకొనుటకు ఇతనికి గల హక్కు ఎట్టిదో కూడ ఇంతవరకు స్పష్టముగా తెలియదు.

త్రిభువన చక్రవర్తి ఇమ్మడి రాజరాజదేవుడు గతించిన వెంటనే మధ్యాంధ్రదేశములో రాజకీయముగ సంక్షోభము కలిగినది. వెలనాటి దుర్జయుల ఆధిపత్యమును సహింపని మండలికులు వారి అధికారమును ధిక్కరించి స్వతంత్రులై పరిపాలింప మొదలిడిరి. మరికొందరు స్వతంత్రరాజ్యములను స్థాపించి రాజ్యమేల మొదలిడిరి. వీరిలో విజయాదిత్యుని కుమారులు ముఖ్యులు.

**వెలనాటి దుర్జయులు:** వెలనాటి రెండవ కులోత్తుంగ రాజేంద్ర చోడయ కృష్ణానదికి తూర్పున ఉన్న దేశములోని రాజకీయ వ్యవహారములను చక్కబెట్టుకొనుటకు అతని రాజ్యకాలము చివర సంవత్సరములలో వ్యాధిగ్రస్తుడు అగుటవలన వీలులేక పోయినది. అతనికి రొమ్ముమీద ఏదో వ్రణము కలిగి దానితో బాధపడెను. ఇది అటుండ, ఇతనికి కుమారులో, చాలమంది జ్ఞాతులో ఉండి ఇతని యనంతరము ధనదప్రోలు సింహాసనమునకై వారిలో వారికి అంతఃకలహము సంభవించినది. తుదకు, కులోత్తుంగ రాజేంద్రచోడుడు అనతి కాలముననే మృత్యువు వాతపడెను. ఈతని శాసనములు శకవర్షము 1108 వరకును కనిపించుచుండుటవలన ప్రాయికముగ అతడు అంతవరకు జీవించి ఉండినట్లు చెప్పవచ్చును.

వెలనాటి రెండవ కులోత్తుంగ రాజేంద్రచోడుడే వెలనాటి దుర్జయ రాజన్యులలో సర్వతంత్ర స్వతంత్రుడై చోళ చక్రవర్తి ఇమ్మడి రాజాధిరాజునకు కప్పము కట్టుట మాని తన రాజ్యము - వేంగి మండలమును - పరిపాలించినవాడు. త్రిభువన చక్రవర్తి ఇమ్మడి రాజాధిరాజునకు చోళ, పాండ్యదేశ వ్యవహారములతోనే సరిపోయెను. ఈతని శాసనములు తమిళదేశముననేకాని తెలుగు' దేశమున కానరావు. ఇతడు అంతకు పూర్వపు చక్రవర్తులంత బలపరాక్రమశాలియు కాడు; సమర్థుడును కాడు. మొదటి కులోత్తుంగ చోడచక్రవర్తికి తరువాత చోడ సింహాసనమును అధిష్ఠించిన వారు ఒకరికంటె ఒకరు బలహీనులైరి. ఈ కారణమున మధ్యాంధ్రదేశములో వలెనే తమిళదేశమునందును పల్లవ పాండ్యాది సామంతులును క్రమముగా బలవంతులైరి. ఈ రీతిని చోళ (చాళుక్యచోళ) సామ్రాజ్యము క్షీణదశకు వచ్చినది. వెలనాటి రెండవ కులోత్తుంగ గొంక రాజేంద్రుని నాటినుండియే వెలనాటి వారికి స్వాతంత్ర్యాధికారములు ఎక్కువైనను, పూర్తిగా చోళచక్రవర్తులతో సంబంధము తెగిపోవుట, వెలనాటి రాజ్యమునకు సామంత ప్రతిపత్తి పోయి సంపూర్ణ స్వాతంత్ర్య ప్రతిపత్తి కలుగుట ఈ వెలనాటి రెండవ కులోత్తుంగ రాజేంద్రచోడుని కాలములోనే. వెలనాటి మండలిక రాజ్యమునకు ఈ రెండవ చోడ భూవిభుని కాలమే ఉచ్చదశ.

వెలనాటి ఇమ్మడి కులోత్తుంగ చోడుని తరువాత వెలనాటి రాజ్యాధిపతియైనవాడు అతని కుమారుడు మూడవ గొంక నరేంద్రుడు. ఈతని శాసనము లింతవరకు ఏవియు కానరాలేదు. ఒకవేళ, ఇతడు పరిపాలించి ఉండినచో, శకవర్షము 1103 (క్రీ. శ. 1181) నుండి శకవర్షము 1108 (క్రీ. శ. 1186) వరకు పరిపాలించియుండవలెను. ఈతడు వెలనాటి కులోత్తుంగ చోడునికి కొండపడుమటి బుద్ధరాజు సోదరియైన అక్కమదేవియందు జనించిన తనయుడు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



జయాంబికయను కొండపడుమటి రాజవంశమువారి యాడుబిడ్డనే ఇతడు వివాహమాడెను. ఈ దంపతులకు పృథ్వీశ్వరుడు జనించెను. వెలనాటి చోడరాజన్యులలో ఈపృథ్వీశ్వరుడే కడపటివాడు.

ఇమ్మడి రాజాధిరాజు పదునారేండ్లు చోళ సామ్రాజ్యమును పరిపాలించెను. కాని, తమిళ దేశములోనే ఇతడన్నజనులకు భక్తి తాత్పర్యములు తగ్గినవి. త్రిభువన చక్రవర్తి బిరుదము తాల్చి అధికారము నెరపుచు వచ్చిన మూడవ కులోత్తుంగ చోడుని ప్రజలు అభిమానించి అతని పక్షము వహించుచు వచ్చిరి. ఇతడు ఇమ్మడి రాజాధిరాజు జీవించి యుండగనే క్రమక్రమముగా తన పక్షమైన సామంత మండలికుల తోడ్పాటులో చోళ సామ్రాజ్యమును కైవసము చేసికొని పరిపాలింప దొడగెను.

ఈ వెలనాటి రెండవ కులోత్తుంగ రాజేంద్ర చోడరాజు పరిపాలనమున కడపటి సంవత్సరములలోనే కృష్ణానదికి దక్షిణ తీరదేశమున పరిపాలించుచుండిన మండలిక వంశము లన్నిటికి యాదవ వంశమునకు ముసలమువలె పలనాటి యుద్ధము సంభవించినది. పలనాటి సీమను కార్తవీర్యార్జునుని సంతతివారైన హైహయ వంశజులు పరిపాలించుచుండినట్లును, వీరు కుంతలేశ్వరులైన త్రిభువనమల్ల విక్రమాదిత్య, భూలోకమల్ల సోమేశ్వర చక్రవర్తులకు సామంతులుగా ఉండి వారి వేంగీ దండయాత్రలో తోడ్పడినట్లును, 'బిరుదంక రుద్ర' బిరుదమును ధరించిన సాగి బేతరాజు భూలోకమల్లుని సామంతుడై శకవర్షము 1051 ప్రాంతమున రాజ్యము పాలించుచుండినట్లును మన కిదివరకు తెలియును. బిరుదంకరుద్ర బేతభూపతి అనంతరము ఈ. పలనాటి సీమను పాలించిన హైహయులు ఎవ్వరో స్పష్టముగా తెలియరాదు. వీరి శాసనములు ఏవో కొన్ని కనిపించుచున్నను ఈ హైహయుల మొదటి రెండు మూడు తరములే తెలియును. కాని, సంపూర్ణపాలక క్రమము కాని, వానిని బట్టి వంశావతార క్రమము కాని తెలియుట లేదు. శకవర్షము 1069 ప్రాంతమున కామరాజను హైహయ రాజేంద్రుడు పరిపాలించుచుండెను. ఇతనికే అనుంగు కామరాజని, మైలలదేవి కామరాజని నామాంతరములు. ఇతడు శకము 1051 నాటి బిరుదంకరుద్ర రెండవ బేత భూమీశ్వరునకు సమీపస్థు డగుటచేత ఒకవేళ ఇతని కుమారు డగునేమో తెలియదు. ఇతని శాసనములు శకవర్షము 1065 వరకు కాన్పించుచున్నవి. ఈ విధముగా ఇతడు వెలనాటి రెండవ కులోత్తుంగ గొంక, రెండవ కులోత్తుంగ రాజేంద్ర చోడులకు సమకాలికుడని స్పష్టమగుచున్నది. విజయలదేవి కుమారుడు మహామండలేశ్వర హైహయ మల్లిదేవరాజు ఒకడు. ఇతడు సిద్ధేశ్వరాలయమునకు తేరాల గ్రామమును సమర్పించెను. ఈ విషయమును తెలుపు శాసనమున సంవత్సరము లేకపోవుట చేత ఇతడు ఎప్పటివాడో తెలియుటలేదు. పైనుదివిన అనుగుంగామ భూపతి అనుగురాజు కుమారుడని, మైలలదేవి కామరాజనుట వలన ఇతని తల్లి మైలలదేవి అని విస్పష్టమగుచున్నది. అనుంగు భూవరుడు సోమవంశ క్షత్రియుడగు హైహయ కులజుడైనను రాజకీయ పరిస్థితిని అనుసరించి కావచ్చును చతుర్థ కులజుడైన వెలనాటి రెండవ కులోత్తుంగ గొంకభూవరుని కూతురు మైలమదేవిని వివాహము చేసికొనెను. ఈమెకు మైలలదేవి అని నామాంతరము కలదు. ఈ వివాహ సందర్భమున వెలనాటి రెండవ గొంకరాజు అల్లుడైన అనుగుం గామభూపతికి పలనాడు అరణముగా నిచ్చెనట. ఒకవేళ పశ్చిమ చాళుక్యులకు తోడ్పడిన కారణమున ఈ హైహయులకు రాజ్యము లేకుండ పోయి యుండవచ్చును. రెండవ గొంకరాజు రాజనీతిని పాటించి అనుంగురాజునకు తన కూతును ఇచ్చి అతనిని మరల పలనాటికి అధిపతిని కావించి యుండును. అనుగు (అలుగు) భూపతికి మైలాంబ(మైలలదేవి)యే కాక వీర విద్యాదేవి, భూరమాదేవి అను మరి ఇరువురు భార్య లుండిరి. అనుగురాజునకు మైలలదేవియందు కామ భూపతియు, వీరవిద్యాదేవియందు పెదమల్లి దేవ, పినమల్లి దేవ, బాలమల్లి దేవులును, భూరమాదేవియందు యెరకామ, నరసింహ పెరుమాళ్ళరాజ, ఝుట్టి పెరుమాళ్ళ రాజులును కలిగిరి. పలనాటి హైహయ శాసనములవలన మైలలదేవి కుమారుడు కామభూపతియు, విజయలదేవి కొడుకు మల్లిదేవరాజును తెలియవచ్చుచున్నారు. కామరాజునకే అనుగుంగామ భూపతియని, మైలలదేవి కామభూపతియని, నలగామ భూపతియని నామాంతరములు. విజయలదేవియే వీరవిద్యా దేవియు, మల్లిదేవరాజే ఆమె జ్యేష్ఠ కుమారుడైన పెదమల్లి దేవరాజును కావచ్చును. మల్లిదేవరాజు సిద్ధేశ్వర స్వామికి తేరాల గ్రామమును ధూప దీప నైవేద్యముల నిమిత్త మిచ్చెను. ఈ విషయమును తెలుపు శాసనమున శకవర్షముకాని, బార్హస్పత్యమానాబ్దము కాని లేకపోవుటచేత ఇతని కాలము సరిగ తెలియవచ్చుట లేదు. భూ రమాదేవిని పేర్కొను శాసనములు ఏవియు ఇంత వరకు దొరకలేదు. అనుగురాజునకు ధవళ శంఖుడు తన కూతురు మైలాంబను ఇచ్చి పరిణయము చేయుట, ఆ వివాహ సందర్భమున అతనికి పలనాడు అరణ మిచ్చుట. మైలాంబకాక అతనికి వీరవిద్యాదేవి, భూరమాదేవియను భార్యలు ఉండుట, వారికి ఇతఃపూర్వము చెప్పిన రీతిని



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కొడుకులు కలుగుట ఈ మొదలగు విషయములు అన్నియు పలనాటి వీరచరిత్ర యను ద్విపద కావ్యము వలన తెలియుచున్నవి. పలనాటి వీరచరిత్ర మహాభారత మంతటి గ్రంథము. అనుగురాజునకు కలిగిన కొడుకులు రాజ్యభాగమునకై కలహించి తుదకు కార్యమపూడి (కారెంపూడి) వద్ద యుద్ధము చేయుట ఇందలి ఇతివృత్తము. ఈ పలనాటి వీరచరిత్రలో చరిత్ర, కల్పన రెండును పెనవేసికొనిపోయి యున్నవి. ఇందలి విషయములకు శాసన ప్రామాణ్యము దొరకదు. అందువలన ఈ పలనాటి వీరచరిత్ర పూర్తిగా సత్యచరిత్రమని పూర్తిగా విశ్వసింపను, పూర్తిగా కొట్టివేయను వీలుకాదు. ఈ గ్రంథములో వచ్చు వ్యక్తులు అందరును కాకపోయినను కొందరుమాత్రము చారిత్రక వ్యక్తులు అనక తీరదు. ఇవన్నియు ఎట్లున్నను అనుగురాజు మొదలుకొని పలనాటి హైహాయుల చరిత్ర తెలిసికొనుటకు ఇది ముఖ్యాధారముగా ఎంచబడుచున్నది. రాజ్యమునకై అనుగురాజు కొడుకులు పోరాడుకొన్న విషయమును, పలనాటి యుద్ధము జరగిన మాటయు వాస్తవమనవచ్చును. ఈ యుద్ధములో వెలనాటి దుర్జయుల తోను, పలనాటి హైహాయులతోను బంధుత్వ మిత్రత్వములు కారణముగా కల్యాణమును ఏలుచుండిన కళచురి రాజులు, కోటవారు, వెలనాటివారు, కాడవ (పల్లవ) రాజులు, హొయిసల బల్లాళులు, గుడిమెట్ట చాగివారు, కాకతీయులు పాల్గొనినట్లు తెలుపబడినది. కోటవారిలో కోట రెండవ భీమరాజు, కాకతీయులలో కాకతి మొదటి రుద్రదేవుడు, వెలనాటివారిలో ప్రాయికముగా మూడవ గొంకరాజు నలగామరాజు పక్షము వహించిరి. కల్యాణ కటకమును పాలించుచుండిన వీరసోమిదేవుడు అనగా కళచురి బిజ్జలరాజు కుమారుడు. వీరసోవిదేవుడు తన కూతురిని వీర విద్యాదేవి కుమారుడైన పెదమల్లిదేవునకిచ్చి వివాహము చేసినందున అతని పక్షమున చేరియుండును. హొయిసల బల్లాళులు ఈ కారెంపూడి యుద్ధములో ఐక్యము కలిగించుకొనవలసిన ఆవశ్యకము కనిపింపదు. పలనాటి వీర చరిత్రమున నలగామరాజు పక్షము వహించిన అతని మంత్రిణి నాగమ అను నాయకురాలికిని, పెదమల్లి దేవాదుల పక్షము వహించి మంత్రిత్వము నెరపిన బ్రహ్మనాయకునికిని ఇందు అధిక ప్రాముఖ్యము ఈయబడినది. ఇది అటుండ, పల్నాటి వీరచరిత్ర కృతికర్త బ్రహ్మనాయనిమీద ఎక్కువ అభిమానము చూపి అతనిని పలనాటి వీరయుద్ధపు కృష్ణునిగను, నాగమ నాయకురాలిని కపటిగను, దుస్తంత్ర పరాయణగను, దుష్టురాలుగను చిత్రించి చూపుటవలన బ్రహ్మనాయక పక్షమే విజయము పొందెనని చెప్పబడినట్లు వేర నుడువ నక్కర లేదు. కాని, పరంపరగా వచ్చు గాథలను అనుసరించి నలగామ భూపతి విజయుడయ్యె ననియు, పెద్దమల్లిదేవాదులు అతనితో సంధికి రాక తప్పలే దనియు తెలియుచున్నది.

పలనాటివీర చరిత్రలో ఉదాహృతులైన చారిత్రక వ్యక్తులను అనుసరించి ఈ యుద్ధము శకవర్షములు 1098 - 1104 లకు మధ్య జరగినట్లు విశదమగును. ఈ కారెంపూడి యుద్ధముతో పల్నాటి హైహాయ రాజ్యము పూర్తిగా చితికి పోవుటయే కాక హైహాయ రాజ్యమునకు ఇరుగు పొరుగులనుండిన మండలిక వంశములకును జననష్టము, ధననష్టము కలిగి అవి చాల బలహీనములయినవి.

నలగామ రాజునకు సాయముగ కాకతి రుద్రదేవరాజు కారెంపూడికి కొంత సైన్యముతో వచ్చెనని పలనాటి వీర చరిత్ర తెలుపుచున్నది. కళచురి సైన్యముకూడ పెదమల్లి దేవునికి సాహాయ్యముగ వచ్చెనేమో. ఈ సందర్భమున కావచ్చును వెలనాటి రాజ్యముపై కల్యాణము రాజధానిగ పరిపాలించు చుండిన కళచురి సైన్యము కావణయ్య దండనాయకుని ఆధిపత్యమున సంకమదేవుని రాజ్యకాలములో వెలనాటి రెండవ కులోత్తుంగ చోడరాజ్యముపై దండెత్తి వచ్చినది. సంకమదేవుడు వీర బిజ్జలరాయని కుమారుడు. వీరసోమేశ్వరునికి తరువాత కల్యాణకటకము రాజధానిగా శకము 1099 - 1100 లనుండి పరిపాలించిన అతని సోదరుడు పెదమల్లి దేవరాజునకు సాయముగనే వచ్చినచో ఈ కారెంపూడి యుద్ధము సంకమదేవుడు రాజ్యమునకు వచ్చిన తరువాత శకవర్షము 1099 - 1100 లకును, 1104 కు మధ్య జరగియుండ వలెను. మొత్తముమీద అతడు సాయముగ వచ్చినను యుద్ధమున పెదమల్లి దేవునకు విజయము లభింప లేదు. మల్లిదేవునకు సాయముగ వచ్చె ననువిషయము ఎంతవరకు సత్యమో తెలియదు. కాని, ఇతని దండయాత్రతో వెలనాటి రెండవ కులోత్తుంగ చోడుని రాజ్యవైభవము చాల వరకు అంతరించెనని చెప్పవచ్చును. ఈ కళచుర్య నిశ్శంకమల్ల సంకమదేవుని ప్రధాని దండనాయకుడైన కావణయ్యకు 'వెలనాడు చోడెయరాజ్య నిర్మూలన' బిరుద ముండుట వలన అతని యీ దండయాత్ర విజయవంతముగ సాగినదని చెప్పవచ్చును.

కాకతి రుద్రదేవరాజు కూడ నలగామ భూపతికి సాయముగ వచ్చినట్లు పలనాటి వీరచరిత్రలో చెప్పబడినను చిరకాలమునుండి సముద్రతీరస్థ ఆంధ్రదేశమును జయించు ఆకాంక్షతో ఉండుటచేత ఈ యవకాశమును ఉపయోగించుకొని అతడు తనకోర్కె నెరవేర్చుకొనుటకు దండెత్తి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వచ్చెను. నలగామ భూపతికి సాయపడెనో లేదో చెప్ప లేముకాని అతడు కోట రాజ్యముపై దండెత్తెను. కోట రాజ్యమన్నది ధాన్యాంకపురము, ధాన్యవాటి యనబరగు ధరణికోట రాజధానిగాగల కృష్ణానదీ దక్షిణ పట్సహస్ర వని. ఇప్పటి సత్తెనపల్లి తాలూకాలో కొంతభాగము కోట భూమిలోనిదే. దీనిని పరిపాలించిన మండలికులకు కోట వంశమువారని పేరు. వీరు తాము హరిసీమకృష్ణుని సంతతివారమని చెప్పుకొందురు. వీరిలో మొదటి భీము రాజు కుమారుడు కోట మొదటి కేతరాజు శక వర్షము 1075 వరకు జీవించి యుండెను. ఇతని తనయుడు రెండవ భీమనృపతి వెలనాటి కులోత్తుంగ గొంకరాజు సోదరి సబ్బాంబికను వివాహమాడెను. ఈతడు వెలనాటి వారికి విధేయమిత్రుడై, సామంతుడై, ఇదివరలో నుడివినట్లు వారి రాజ్యమును సంరక్షించుచు వచ్చెను; కారెంపూడి యుద్ధములో కూడ నలగామ రాజు పక్షమున పోరాడినట్లు పల్నాటి వీర చరిత్రలో చెప్పబడినది. ధాన్యవాటి దుస్సాధమైన మహాదుర్గము. కోట ఇమ్మడి దొడ్డభీమభూపాలుడు రాజ్యముచేయుచుండిన కాలముననే బహుళమైన సేన సమకూర్చుకొని బంధువులైన నతవాటివారితోను, పరాక్రమోపేతులైన మల్యాల, రేచర్ల, విప్పర్ల, కొమరవల్లి మొదలైన సామంత వంశముల వారితోను, రాచూరివారితోను రుద్రదేవరాజు కోటరాజ్యముపై దండెత్తి వచ్చెను. కాకతి రుద్రదేవరాజు సేనానులలో ఒకడైన మల్యాల కాట చమూపతి ధరణికోట సంగ్రామమున సాహస పరాక్రమములతో పోరాడి తుదకు కోటరాజ్యమును సాధించెను. నాటినుండి మల్యాల కాట చమూపతి 'పెద ముట్టుగండ 'డని, 'కోట. గెల్పాత 'యని ప్రసిద్ధి గాంచెను. దొడ్డభీముడు హతుడయ్యెను. ఈ యుద్ధములో మల్యాల వారితో సమానముగ సాహస పరాక్రమములు చూపి పోరాడినందున విప్పర్లవారికి 'దొడ్డభీముని దుర్గర్వహరణ' అని, కొమర వెల్లివారికి 'దొడ్డభీమదేవ శిరచ్ఛేదక' అని బిరుదములు కలిగినవి. కోట రాజ్యమును జయించిన పిదప రుద్రదేవ మహారాజు కోట దొడ్డ భీమరాజు కుమారుడైన కోట రెండవ కేత వసుధాధిపతికి పట్టము కట్టి అతని సామంతుని కావించుకొనెను. ఇంతటినుండి కోట వంశజులు కాకతి రాజన్యులకు విశ్వాసపాత్రులును, విధేయులును అయిన సామంత మండలేశ్వరులై విఖ్యాతి చెందిరి.

కోటరాజ్య పతనము కొండపడుమటి రాజ్యమును సాధించుటకు సహాయకారి యయ్యెను. రాచూరి చాళవ రాజునకు 'బుద్ధకులకుద్దాల'యను బిరుదము కలదు. కొండపడుమటి మండలికులు చతుర్థవంశజులైన బుద్ధవర్మవంశజులగుటచేత ఈ వంశమువారి కొండపడుమటి రాజ్యమును సాధించినది రాచూరి చాళవరాజై యుండవచ్చును. విప్పర్లవారుకూడ అతనికి తోడ్పడి 'బుద్ధవర్మవంశ నిస్తారక' బిరుదాంచితులైరి. అనతికాలముననే కాకతి రుద్రదేవ మహారాజునకు వెలనాటి రాజ్యములోని చాలభాగము వశమై కాకతీయ రాజ్యమున కలసి పోయెను. కాకతి రుద్రదేవరాజు ఈ దిగ్విజయ యాత్రలో శకవర్షము 1107 కు సరియైన విశ్వావసు నామసంవత్సరమున పుష్య శుద్ధ పాడ్యమి మకర సంక్రమణమునాడు కుమారగిరిమీది త్రిపురాంతకేశ్వరుని దర్శనముచేసి ఆ స్వామి అంగ రంగ భోగముల నిమిత్తము కొండపల్లి నాటిలోని రేవూరును దానముచేసెను.

వెలనాటి మూడవ కులోత్తుంగ గొంకనృపతి అనంతరము చందవోలు సింహాసనము నధిష్ఠించినవాడు ఇదివరలో చెప్పినట్లు అతని సుతుడు వెలనాటి పృథ్వీశ్వరుడు. ఈతడు రాజ్యమునకు వచ్చునాటికి కోటవారు ప్రబలులై కాకతీయ సామంతులైరి. కొండపడుమటి మండలికుల అధికార మంతరించినది. కొణిదెన తెలుగు చోళుల ప్రభ అడగినది. అయినను కమ్మనాటిలోను, పాకనాటిలోను కొన్ని తెలుగు చోళ కుటుంబములు తమకు చేజిక్కిన భూమిని వశపరచుకొని స్వతంత్రములై రాజ్యమేలుచుండెను. కృష్ణానదికి తూర్పుదేశమున వేంగీ విషయములో చాళుక్యులు మొదలైనవారు నిరవద్యప్రోలు (నిడుదవోలు), ఉండి మొదలైనచోట్ల చిన్న రాజ్యములు నిర్మించుకొని వానిని పాలించుచుండిరి. కొలని ప్రాంతము ఈ కాలమున ఎవరి క్రింద ఉండెనో తెలియదు. గోదావరి నదికి తూర్పున కోనరాష్ట్రము హైహయుల స్వతంత్ర పరిపాలనక్రింద ఉండెను. పిఠాపురము రాజధానిగా ఇదివరలో నుడివినట్లు మూడవ విజయాదిత్యుని కుమారులు పాలించుచుండిరి. ఈ విజయాదిత్యుని సంతతిని గురించి తెలుపు శాసనములు రెండు కలవు: (1) ఎరరుపల్లి తామ్ర శాసనము; (2) పిఠాపుర స్తంభశాసనము. వీనిని అనుసరించి విజయాదిత్యునికి లక్ష్మీదేవి, గంగాదేవి అని ఇరువురు భార్యలు. వీరు ఉభయులును మార్జవాడ దేశాధిపతియైన పులకేశి కూతుండ్రే. విజయాదిత్యుని అగ్రమహిషి లక్ష్మీదేవి అనియు, ఈమెయందు అతనికి కరవాలభైరవ, రాజనారాయణ బిరుదాంచితుడైన విష్ణువర్ధనుడు జనించెననియు ఎరరుపల్లి తామ్రశాసనము తెలుపుచున్నది. ఈ శాసనమును శకవర్షము 1101 లో ఈ విష్ణువర్ధనుడే ఇచ్చెను. పిఠాపుర స్తంభశాసనము ప్రకారము విజయాదిత్యునికి గంగాదేవియందు మల్లపదేవ భూపతి జనించెను. ఈతనికి

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పూర్వులలో మల్లపదేవ నామధారులు ఇద్ద రుండుటచేత ఇతనికి మూడవ మల్లపదేవరాజని పేరు కలిగినది. ఇతడు ఎరరుపల్లిశాసనకాలమునకు ఇరువదిమూడు సంవత్సరములకు తరువాతగాని రాజ్యమునకు రాలేదు. వెలనాటి రెండవ కులోత్తుంగ రాజేంద్రచోడుని కడపటి పరిపాలన వత్సరములలో పిఠాపురమున పట్టాభిషిక్తుడై పూర్వ చాళుక్య రాజ్యమును ఉద్ధరించినవాడు మూడవ విజయాదిత్యుని కుమారుడు విష్ణువర్ధను డన్నది నిశ్చయము. అందుకు శకము 1102 నాటి ఎరరుపల్లి శాసనమే ప్రమాణము. ఈతని శాసనములు కాకినాడ తాలూకా సర్పవరము చాళుక్య భీమవరములలోను, రాజోలు తాలూకా పలివెలలోను కనిపించుచున్నవి. శకము 1098 నాటి చాళుక్య భీమవరము శాసనము వలన ఇతనికి వీరనరేంద్రుడని కూడ వ్యవహారము కలదు. అక్కడనే శ్రీ సర్వలోకాశ్రయ విష్ణువర్ధనుని మూడవ విజయరాజ్య సంవత్సరము నాటి శాసనమును, మల్లపదేవ చక్రవర్తి మూడవ విజయరాజ్య సంవత్సరమునాటి శాసనమును కలవు. మొదటిదానిలో ఇచ్చిన శకవర్షము 1098; రెండవదానిలోనిది 1099. ఇవి కాక, శకము 1099 నాటిదే మల్లుభూపతి శాసనము ఇంకొకటి ఉన్నది. పలివెలలో సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధన బల్లహదేవ చక్రవర్తి కొడుకు భీమదేవ చక్రవర్తిది శకము 1099 నాటి శాసనము కలదు. ఎరరుపల్లి శాసనపు విష్ణువర్ధనునికి వీరనరేంద్రుడనియే కాక మల్లపదేవ చక్రవర్తి అను పేరు కూడ గలదో, లేక మల్లపదేవ చక్రవర్తి (బల్లహదేవ చక్రవర్తి) వేరో తెలియదు. చాళుక్య భీమవరము శాసనములవలన మల్లపదేవ చక్రవర్తి ఒకడు శకవర్షము 1095-96 లో పట్టాభిషిక్తుడై రాజ్యమేలినట్లు తెలియును. ఇతడు తొమ్మిదేండ్లకు పైగానే రాజ్యము చేసెను. వీరనరేంద్ర నామాంతరముగల విష్ణువర్ధనుడును, శకము 1095-96 లలో రాజ్యమునకు వచ్చిన సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మల్లపదేవుడును వేరని ఎంచినచో, వీరు ఒకకాలమున వేరు వేరు ప్రాంతములను ఏలుచుండిరని భావించవలెను. వీరు వేరు కాదు, ఒక్కరే అనుకొన్నచో విజయాదిత్యునికి లక్ష్మీ, గంగాదేవులకు జనించిన తనయులు ఉభయులకును మల్లపదేవనామము ఉండెనని అయినను చెప్పవలెను. ఈ విషయము భావి పరిశోధన వలన తేలవలెను. కాని దగ్గర దగ్గరగ ఉన్న పిఠాపురము, చాళుక్య భీమవరము ప్రాంతములు వేరు వేరు నృపాలుర ఏలుబడిక్రింద ఉండినట్లు ఊహించుటయు అసమంజసమేమో. ఎట్లయిన నేమి, గోదావరినదికి తూర్పున ఉండిన పిఠాపుర ప్రాంతము పూర్వచాళుక్య వంశజుల పాలన క్రింద ఉండెను. శకవర్షములు 1108 మొదలు 1108 వరకు దాక్షారామప్రాంతమున వెలనాటి దుర్జయ శాసనములు ఏవియు కానరావు. ఈ దేశమును మరల స్వాధీనముచేసికొనుటకై వెలనాటి కులోత్తుంగ రాజేంద్రచోడ పృథ్వీశ్వరుడు పిఠాపుర చాళుక్యరాజ్యముపై దండెత్తి వచ్చి అక్కడి చాళుక్య నరేంద్రులను జయించి, తద్దేశమును మరల శకము 1108 నాటికి తన అధికారము క్రిందికి తెచ్చుకొనెను. కోన హైహయులు అదివరకే వెలనాటి రాజన్యులకు విధేయసామంతులయిరి. ఒకవేళ పృథ్వీశ్వరునికి శత్రువులైన పూర్వచాళుక్యులకు తోడ్పడుటకై వచ్చెనేమో శకము 1108 లో కాకతి రుద్రదేవమహారాజు శాసనము ఒకటి దాక్షారామములో ఉన్నది. కాని అతడు ఆలస్యముగ వచ్చుటచేతనో, మరి ఏ కారణముననో ఆతనిరాకవలన ప్రయోజనము లేకపోయినది. అప్పటినుండి వెలనాటి పృథ్వీశ్వరుని శాసనములు కృష్ణకు దక్షిణమున గల వారి మొదలిరాజ్యము షట్సహస్రావనిలో కానరావు. అయినను, వెలనాటివారిని తరతరములనుండి విశ్వాసముతో సేవించుచుండిన దుర్గాధిపతులు మాత్రము కొందరు అప్పటికిని పృథ్వీశ్వరునిపేర దుర్గములను పాలించుచు అతనిని భక్తితో కొలుచుచునే యుండిరి. ఇటువంటి వారిలో వెలనాడులోని ద్వీపమును (దివిని) ఏలుచుండిన చమూపతి నారపనాయకుడు ముఖ్యుడు. పృథ్వీశ్వరునికి మిగిలిన వెలనాటి రాజ్యము ఏది యున్నను, ఏది పోయినను నారపనాయకుడు తమ ప్రభువుపేర ద్వీపమును సమర్థతతో కాపాడుచు వచ్చెను.

పృథ్వీశ్వరుడు పిఠాపురము చాళుక్యులను జయించిన పిదప దక్షిణ కళింగముపై దాడి వెడలెను. ఈ దండయాత్రలో సింహాసన ద్వాత్రింశతిక కర్తయైన కొరవి గణపతిదేవుని పూర్వులలో ఒకడగు కొరవి వెన్నయామాత్యుడు ప్రధాన దండ నాయకుడై ఈ యుద్ధములలోను, ప్రధాన పాత్ర నిర్వహించి పృథ్వీశ్వరునికి విజయము చేకూర్చి 'వెలనాటి పృథ్వీశ్వర రాజ్య సముద్ధరణ', 'వీరఘోట్ట విభాళ', 'రాయగజ గంధవారణ', 'వైరి మండలిక భేకఫణీంద్ర', 'కళింగదేశ నిర్ధూమధామ'మాది బిరుదములు వహించెను. పృథ్వీశ్వరుని కళింగదేశ దండయాత్ర విజయవంతముగ సాగినది. కళింగ దేశములోని రాజ్యములలో వీరఘోట్ట రాజ్యము ఒకటి. దీని పరిపాలకులు పల్లవులు. పృథ్వీశ్వరుడు ఓడించిన పల్లవరాజు జయ్యరాజు అయియుండును. అతడు కళింగరాజ్యమును జయించెనన్న తద్రాజ్యమును ఏలుచుండిన గాంగవంశజులను ఓడించి మరల వారిని తన సామంతులను చేసి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కొనెనని ఊహింపవచ్చును. వెలనాటి పృథ్వీశ్వరునికి గాంగ వంశజుడైన అనంతవర్మ చోడగంగదేవ తృతీయ తనూభవుడు రెండవ రాజరాజదేవుడు (శకము - 1091 - 92 శకము 1112) సమకాలికుడు అగుటచేత అతడు ఈతనినే జయించి ఉండవలెను. వెలనాటి పృథ్వీశ్వరుని శాసనము శ్రీకూర్మములో శకవర్షము 1110 నాటిది ఒకటి ఉండుట వలన అతని కళింగదేశ దండయాత్ర 1108 - 1110 శక సంవత్సరములకు మధ్య జరగి యుండవలెను.

కాకతి రుద్రదేవుని అసాధారణ కృషివలన కాకతీయ రాజ్యము వేంగీమండలములోనికి విస్తరిల్లినది. రుద్రదేవుని రాజధాని అనుమకొండ. ఇతడే ఓరుగల్లు అను ఏక శిలా నగరమును నిర్మించి దానిని తరువాత రాజధాని కావించుకొనెను. ఇంతటినుండి కాకతిరాజ పరమేశ్వరులకు అదియే రాజధానియైనది.

రుద్రదేవ మహారాజు కడపటి రాజ్యపరిపాలన వత్సరములలో తన రాజ్యము వాయవ్యదిక్కునకు వ్యాపింపజేయ ప్రయత్నించిన సందర్భమున కావచ్చును అతనికి దేవగిరి రాజధానిగా పరిపాలించుచుండిన యాదవాన్వయ భూవిభులతో యుద్ధము సంభవించినది. ఆ యుద్ధమున అతడు హతుడయ్యెను. ఈతని శాసనములు శకవర్షము 1117 (క్రీ.శ. 1195 - 96) వరకు కనబడుచుండుటచేత అదియే అతని కడపటి రాజ్య సంవత్సరమని చెప్పవచ్చును. ఇతని వెనుక ఇతని సోదరుడు మహాదేవరాజు రాజ్యమునకు వచ్చి మూడేండ్లు మాత్రమే పాలించి ఇతడుకూడ దేవగిరి యాదవరాజులతో జరగిన సంగ్రామముననే వీరశయనమునొందెను.

మూడవ కులోత్తుంగ చోడచక్రవర్తి తన 19 వ విజయ రాజ్య సంవత్సరమునాటి శ్రీరంగము శాసనమునందు అతడు సాటిలేని గజములను పంపి, పరాక్రమ కృత్యములు ఆచరించి, ఉత్తర దేశాధిపతులను పాదాక్రాంతులను కావించుకొని కాంచీనగరము ప్రవేశించిన మీదట అతని కోపము అడగెననియు, అక్కడి రాజులు అందరివద్దనుండి కప్పము గైకొనెననియు, దానికి పదేండ్లకు తరువాతి అతని వుదుకోట్కట శాసనములో యుద్ధములో భయంకరులైన వడుగరును (తెలుగువారిని) సాధించి వేంగీమండలమును తన అధికారముక్రిందికి తీసికొనివచ్చిన పిదప అతడు స్వర్ణవర్షమును కురియించి బంగారు నగరమైన ఉరంగైలో ప్రవేశించెననియు చెప్పబడినది. ఈ విషయములు ఎంతవరకు సత్యమైనవో తెలియదు. ఉరంగై నగరము ఓరుగల్లు (ఒరుంగల్లు - వరంగల్లు) నగరమే. వేంగీ మండలములో మూడవ కులోత్తుంగ చోడ చక్రవర్తి శాసనము ఒక్కటియు కానరాగు. ఒకవేళ సత్యమే అయినచో, వేంగీ మండలమును మరల వశము చేసికొనుటకై ప్రయత్నించిన చోళచక్రవర్తి ఇమ్మడి రాజరాజు తరువాత ఇతడే. ఒకవేళ వేంగీ మండలముపై దండెత్తుట నిజమే అయినచో అట్టి దండయాత్రలు కాకతి రుద్రదేవ, మహాదేవరాజుల రాజ్యాంతిమసంవత్సరములలో జరగియుండవలెను. ఈతడు స్వర్ణవృష్టి కురియించి ఉరంగై నగరమును ప్రవేశించినట్లు చెప్పుటవలన ఈతడు యుద్ధమున జయించి కాక బంగారు నాణెములను కాకతీయోద్యోగి వర్గమునకు లంచముగా వెదచల్లి ఉరంగైనగరమును ప్రవేశించినట్లు ఊహింపవలసియున్నది. ఒకవేళ మూడవ కులోత్తుంగ చోడుడు ఓరుగల్లు నగరమున ప్రవేశించినను దానిని వశపరచుకొనుటకు అతనికి సాధ్యము కాలేదు. మూడవ కులోత్తుంగ చోడ చక్రవర్తి వేంగీ దండయాత్రలు వట్టి ప్రగల్భోక్తులుకానిచో అవి ప్రయోజన రహితములైన దాడులుగా మాత్రమే భావింపవలసి యుండును.

మహాదేవరాజు మరణానంతరము అతని కుమారుడు గణపతిదేవ మహారాజు శకవర్షము 1120-21 (క్రీ. శ. 1198-99) లో ఓరుగంటి సింహాసనమును అధిష్ఠించెను. ఇతడు శకవర్షము 1125 (క్రీ. శ. 1203) నాటికే ప్రాగ్దేశము వెలనాటిపై దండెత్తి వెళ్లి ద్వీపమను నామాంతరముగల దివిదుర్గమును సాధించెను. ఈ దుర్గమును సాధించిన పరాక్రమశాలి మల్యాల వంశజుడైన చౌండచమూపతి. చౌండ చమూపతి అంతటినుండి 'ద్వీపీలుంటాక' బిరుద విఖ్యాతుడయ్యెను. దీనిని జయించిన పిదప తద్దుర్గాధిపతులై పరాక్రమోపేతులైన అయ్యవంశజులతో మైత్రి పాటింపదలచి పిన్నచోడనాయకుని కూతుండ్రయిన నారాంబ, పేరాంబలను భార్యలనుగా స్వీకరించి గణపతిదేవుడు తమ్ముడయిన జాయనను తన కొలువులోనికి తీసికొనెను. అటుతరువాత అతడు కమ్మనాడు, పాకనాడులపై దండెత్తి వెళ్లి అక్కడ పాలించుచుండిన తెలుగు చోళులను నిర్జించి తనకు పాదాక్రాంతులుగ చేసికొనెను. కాకతి గణపతిదేవుని శాసనము ఒకటి శుక్ల సంవత్సరమునకు సరియైన శకవర్షము 1181 నాటిది త్రిపురాంతకమున ఉండుటచేత పూర్వోక్త దేశ విజయము అంతకు పూర్వమే జరగి యుండవలెను.

వెలనాటి కులోత్తుంగ రాజేంద్రచోడ పృథ్వీశ్వరుడు ద్వీపము చేయిజారి పోయినందుకు చింతించి దానిని సాధించుటకై మరల కృష్ణాతీరప్రాంతమునకు వచ్చెను. కాకతి గణపతిదేవుడు మరల మల్యాల, రేచెర్ల మొదలైన సామంత వంశపు సేనానులతోను, క్రొత్తగా సామంతులైన పాకనాటి తెలుగుచోళ చమూపతులతోను దివిపై దండెత్తి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పృథ్వీశ్వరునితో భయంకర యుద్ధము చేసెను. ఇప్పుడు పృథ్వీశ్వరునికి సాయపడుటకు అయ్యవంశజులు కూడ లేకపోయిరి. ఈ సంగ్రామమున కాకతి గణపతిదేవ మహారాజు విజయలక్ష్మిని చేపట్టెను. అతనికి విధేయ సామంతుడైన మల్యాల కాట చమూపతి 'పృథ్వీశ మహీ హరణము' వలన 'దీవి చూరకార' బిరుదముచే కీర్తనీయుడయ్యెను. కాకతి గణపతిదేవుని అనుసరించి వచ్చిన పాకనాటి తెలుగు చోళులలో పిన్నవయస్సువాడైన నెల్లూరి మనుమసిద్ధి కుమారుడు చోడతిక్కరాజు శౌర్య సాహసములు చూపి సంగ్రామరంగమున పృథ్వీశ్వరుని శిరస్సును ఛేదించి 'పృథ్వీశ్వర శిరఃకందుక క్రీడావినోద' బిరుద ప్రసిద్ధుడయ్యెను. గణపతిదేవ మహారాజు కూడ 'రాయ గజేంద్ర కేసరి' 'రాయచేకోలుగండ', 'పృథ్వీశ్వర శిరఃకందుక క్రీడా వినో'దాది బిరుదాంచితుడై శత్రురాజ భయంకరుడయ్యెను. పృథ్వీశ్వరుడు హతుడగుటతో వెలనాటి దుర్జయ రాజ్యము కూలిపోయినది. మధ్యాంధ్ర దేశమున చాల భాగము ఓరుగంటి కాకతి మహారాజుల అధికారము క్రిందికి వచ్చెను.

త్రిభువన చక్రవర్తి మూడవ రాజాధిరాజను చోళ చక్రవర్తి పేరును, అతని విజయరాజ్య సంవత్సరములును దాక్షారామమున గల శాసనములలో మాత్రమే పేర్కొనబడినవి. ఇతని పేరు ఉదాహరించు మొదటి శాసనము శక వర్షము 1174 నాటిది. ఈ శాసనములో ఇచ్చిన విజయ రాజ్య సంవత్సరము 86. దీనిని అనుసరించి ఇతని పరిపాలనము శకవర్షము 1188 లో ఆరంభమైనట్లు తెలియుచున్నది. ఇతడు ఇతని 86 వ విజయరాజ్య సంవత్సరము వరకు దాక్షారామ శాసనములలో ఎందుకు పేర్కొనబడ లేదో, అప్పటినుండియే ఇతనిని ఉదాహరించుటకు కారణమేదియో, అతని మొదటి 85 విజయరాజ్య సంవత్సరములు ఎక్కడ గడచెనో, అతని పుట్టు పూర్వోత్తరములు ఏవియో తెలియరావు. ఇతని సొంతశాసనము ఒక్కటియు కనబడదు. ఇతడు కూడ త్రిభువన చక్రవర్తి రెండవ రాజాధిరాజు వలెనే ఒక ఛాయాగ్రహము వంటి విచిత్ర వ్యక్తి. శాసనములలో ఇతని విజయరాజ్య సంవత్సరములు 86 నుండి 76 వరకు ఉదాహృతములైనవి. ఇతని శాసనములు 41 సంవత్సరములపాటు కనిపించుచున్నవి. మధ్యాంధ్రదేశ శాసనములలో నామ మాత్రోదితుడైన ఈ ఛాయా వ్యక్తియే కడపటి చాళుక్య చోళ చక్రవర్తి.

చాళుక్యచోళ యుగము తెలుగుదేశ చరిత్రలో అనేక విధముల ప్రాముఖ్యమైన కాలము. ప్రాచీన కాలము మధ్య యుగముగ పరిణమించుచుండిన సంధి యుగ మిది. మధ్యాంధ్రదేశ చరిత్రలో ఇది ఒక విధముగ మండలిక యుగము అనవచ్చును. ఈ మండలికులు వేరువేరు ప్రాంతముల చిన్న చిన్న రాజ్యములను నిర్మించుకొని తత్ప్రాంత జనులలో ధర్మానురక్తి, దైవభక్తి, పాపభీతి, రాజాధికార భయము పెంపొందించుటకును, సంస్కృతి సభ్యతలను పోషించుటకును చాల పాటుపడిరి. ఈకాలము లోని మండలికులలో అధిక సంఖ్యాకులు చతుర్థ కులజులు; తక్కినవారు క్షత్రియులు. సాధారణముగ వీరికి మంత్రిత్వము నెరపినవారును, దండనాయకాది ఉన్నత రాజకీయ పదవులు అలంకరించినవారును బ్రాహ్మణులు. విశ్వబ్రాహ్మణులు, వైశ్యులు, చతుర్థ కులజులును కూడ సేవానులుగా ఉండిరి. దేశాధిపతులకు దేశములోని ముఖ్య వైశ్యుడు ఎవడో ఒకడు ఋణప్రదాతగా ఉండువాడు. బ్రాహ్మణులు ఎక్కువగా రాజకార్య నియుక్తులై ప్రభు సేవా పరతంత్రులైరి. ఇదియే ఇటు తరువాత నియోగి (రాజకార్య నియోగమునందు ఉండినవాడు), వైదిక భేదమునకు కారణమైనది. రాజకీయ ప్రయోజనములను అనుసరించి మండలికులలో క్షత్రియులు చతుర్థ కులజలను, చతుర్థకులులు క్షత్రియ కులజలను పరిణయమాడుట రాజనీతి యైనది. మండలిక యుగములో చతుర్థాన్వయులు పెక్కు కుటుంబములవారు రణ వ్యాపార పారీణులై విజయములు చేకొని బిరుదావళులు గడించి రాజసత్కార సమ్మానములు అందుకొని అధికార ధూర్వహులై రాజ వైభవాస్పదులై ప్రఖ్యాతి వహించిరి.

పూర్వచాళుక్య రాజరాజ నరేంద్రుని అనంతరము నిరాలంబయు, నిరాశ్రయయు అయిన తెలుగు కవితకు ఆశ్రయ మిచ్చి మండలికులు అనేకులు సుకవికీరసహకార ములని వాసి గాంచిరి. కుమారసంభవమును రచించిన వాడును, పాకనాటి తెలుగుచోళులలో ఒకడును అయిన నన్నెచోడ నృపతి ఈ కాలమువాడే. చాళుక్యచోళ యుగమున జరగిన దండయాత్రల వలనను, సంగ్రామముల వలనను నాశనమయ్యెనో ఏమో ఈ కాలమునాటి తెలుగు గ్రంథములు కానవచ్చుటలేదు; తెలుగు కవుల పేర్లును ఎక్కువగా తెలియవచ్చుట లేదు. అయినను మండలికులు దేవాలయాదులకు చేసిన దానధర్మాదికములను తెలుపునట్టియు, వారి పౌరుషవిక్రమాదులను వర్ణించునట్టియు శాసనములు ప్రౌఢమైన తెలుగు పద్యములలో ఉన్నవి. వీనిలో కొన్ని రసవత్కావ్యములే. ఈ కాలము నాటి తెలుగు కృతులు లేని లోపమును ఈ శాసన కృతులు తీర్చుచున్నవి. తెలుగు కృతులు కానరాకపోయినను మండలిక యుగము తెలుగు కవితకు పూలకారు. శాసన కృతులు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కూడ పద్యములలో రచించుటకు కుతూహలము కల్పించిన ఇది ఆంధ్ర కవితోజ్జ్వలనకాల మనుటలో అతిశయోక్తి లేదు.

ఈ కాలమునాటికి క్రతు కర్మాదికమునకు ప్రాధాన్యము తగ్గి పౌరాణిక ధర్మవ్యవస్థకు ఆదరము హెచ్చినది. ధర్మ సంప్రదాయములు ద్విజసంఘావరణమును దాటి చతుర్థ వర్ణములోనికిని ప్రాకినవి. సప్తసంతానములకు ప్రాముఖ్యము కలిగిన కాల మిది. పౌరాణిక ధర్మజ్ఞానము, పౌరాణిక దేవతారాధనము, పురాణోక్త దానాదివిషయ పరిజ్ఞానము హెచ్చి దేశము మొదటిమారు నవచైతన్యముతో తాండవించినది. శివ కేశవు లుభయులును సరిసమానముగ ఆరాధ్యులయినను మండలికయుగమున ప్రజాహృదయమును చూరగొన్న ధర్మ సంప్రదాయము శైవము. సాధారణముగ దేవాలయ ప్రతిష్ఠలు అధికములయినవి. యుద్ధములో విజయము చేకూరి ప్రభు సన్మానము పొందినప్పుడు ప్రభువుపేరను, స్వజనము వీరశయనము పొందినప్పుడు వారిపేరను నాయకులు శివ, విష్ణు ప్రతిష్ఠలుచేసి ఆలయములు నిర్మించి స్వామి ధూప దీప నైవేద్యాది అంగభోగ, రంగభోగముల నిమిత్తము 'సాని, మాని నిబంధకారులను, దాసరినాయకములను' ఏర్పాటుచేసి వృత్తులిచ్చి క్షేత్ర వైభవము నతిశయింప జేయుచు వచ్చిరి. ఈ రీతిని ఈ కాలములో దేవాలయము సంగీతము, నాట్యము, శిల్పము, చిత్రలేఖనము, సాహిత్యములను పోషించి అది ఒకప్రదర్శనశాలయు, విద్యాస్థానమును అయినది. ఈనాటి ప్రసిద్ధ దేవాలయములలో మూడు వందల సానులు, మూడువందల 'మాను'లు కలసి దేవాలయ కార్యములను నిర్వహించుచుండువారు. కరణ, కమ్మి, కంగాములని కూడ వారిని వ్యవహరించుచుండిరి. చాళుక్యచోళ యుగము ప్రారంభకాలమున దేవాలయములో స్వామిసన్నిధిని పర్వదినములందు అఖండ దీపదానము చేయుట అనంత పుణ్యప్రదకార్య మయినది. తరువాత సంపన్నులు, రాజభృత్యులు, గుత్తకాండ్రు మొదలైనవారు స్వామి అంగభోగ, రంగభోగముల నిమిత్తము భూదాన, గోదాన, ఆరామదానములను చేయుచు వచ్చిరి. జనుల ఆచారములు, వ్యవహారములు పూర్వపు యుగములోకంటె మారినవి. దేశములోని ఆర్థిక వ్యవస్థలోనే మార్పు వచ్చినది. తుదకు ప్రాచీన కాలమునుండి వాడుకలో ఉండిన లిపికూడ మారినది. తెలుగు లిపికి ఇది మార్పుకాలము. అది ఆధునిక లిపిగా పరిణమించుటకు అయిన మొదటి మార్పులకు ఆరంభకాలము ఇదే. జనసామాన్యము తెలుగుదేశ చరిత్రలో మొదటిమారు జీవితము అన్ని రంగములలోను యథాశక్తిని పాల్గొని తెలివి మీరినది. మ. సో. శ.

# కాకతీయులు

ఆంధ్రదేశ చరిత్రయందు కాకతీయ సామ్రాజ్యము వర్ధిల్లిన కాలము ఒక మహోజ్జ్వల ఘట్టము. కాకతీయ వంశజులగు రాజులు అనేక విషమపరిస్థితులను తట్టుకొని యావదాంధ్రదేశ వ్యాప్తమగు విశాల సామ్రాజ్యమును నిర్మించి ఆంధ్రదేశమునకు, ఆంధ్రప్రజలకు ఒక వ్యక్తిత్వమును, వైశిష్ట్యమును సమకూర్చిరి. మహమ్మదీయుల దండయాత్రలు గట్లు తెగిన వెల్లువవలె విజృంభించిన క్లిష్ట సమయమున లోకోత్తరములగు ధైర్యసాహసములతో వానిని ఎదుర్కొని యథాశక్తిగ నిలువరించి తాము కళలలో సమకూర్చిన విశిష్టతను తరువాత వర్ధిల్లిన విజయనగర పాలకులకు అందజేసిరి. సారస్వతమును, లలితకళలను, సాదరముగ పోషించి వానికి నూతన వికాసమును కల్పించిరి.

**పుట్టు పూర్వోత్తరములు:** కాకతిరాజ వంశముయొక్క పుట్టుపూర్వోత్తరములు ఇంకను వివాదాస్పదములుగనే ఉన్నవి. కొన్ని శాసనములలో వీరి క్షత్రియత్వ ప్రశంస కనిపించినను, బహుళముగ వీరు చతుర్థాన్వయులుగనే పేర్కొనబడినారు. వీరి సంబంధ బాంధవ్యములును వీరు చతుర్థాన్వయులనియే సూచించుచున్నవి. చతుర్థాన్వయమున వీరు ఏ ప్రత్యేక శాఖకు చెందిరో నిర్ధారణ చేయుటకు తగిన ఆధారములు లేవు. పూర్వము కాకతులను నొకతెగవారు ఆంధ్రదేశమున పలుతావుల నివసించి, కాకతి యను ఒక దేవతను ఆరాధించి, తుదకు వారిలో కొందరు నతవాడి విషయమున స్థిరపడిరి. వీరిలో గుండయ్య అను నతడు 'రాష్ట్రకూట' అను గ్రామాధికారి పదవిని పొందెను. అతని పౌత్రుడు కాకర్త్య గుండ్యన వేంగిచాళుక్య రాజులకు సామంతుడై మంచి అధికార గౌరవములను పొందెను. తరువాతి పురుషాంతరమునకు చెందిన మొదటి బేతరాజు నాటి రాజకీయ పరిస్థితులను అనుసరించి చిన్న రాజ్యమును ఒకదానిని నిర్మించుకొని దానికి పాలకుడై కాకతీయ రాజవంశస్థాపకు డయ్యెను.

**అధికారలాభము:** ఈ కాకతీయ రాజులు మొదట పశ్చిమచాళుక్యులకు సామంతులుగ ఉండి, వారి యధికారము క్షీణించుచుండిన కాలమున స్వతంత్రులు అయిరని కొందరియూహ. ఈ వంశీయులలో మొదటి ప్రోలరాజు, రెండవ బేతరాజు, రెండవ ప్రోలరాజు అను ముగ్గురు రాజులు చాళుక్య సామంతులుగనే ఉండిరి. కాని, వారు ముగ్గురికిని ముందు మొదటి బేతరాజు అను మరియొక్క పూర్వికుడు ఉండెనని ఇటీవల దొరకిన ఒక



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



శాసనము తెలుపుచున్నది. ఈ బేతరాజు స్వతంత్రుడుగనే పరిపాలించెను. అందువలన పైయూహ సరియైనది కాదని తెలియుచున్నది. ఈ కాకతీయులు చాళుక్యచోళరాజగు మొదటి కులోత్తుంగునికి సామంతులుగ ఉండి, పశ్చిమ చాళుక్యులు ఆంధ్రదేశముపై దండెత్తి వచ్చిన దినములలో స్వతంత్రులైరని మరియొక యూహ కలదు. కాకతీయ

ఒడిసి కాకర్త్య గుండ్యన వంగి చాళుక్యరాజగు రెండవ అమ్మరాజునకు సామంతుడుగ ఉండెను. అమ్మరాజు రాజ్యమునకు కొంతపూర్వము క్రీ. శ. 927-945 మధ్య యుద్ధమల్ల, చాళుక్య భీములు అనువారు సింహాసనమును పోరాడుచుండిరి. ఈ పోరాటములలో రాష్ట్రకూట రాజులును జోక్యము కలిగించుకొనిరి. ఈ పరిస్థితులలో చాళుక్య



చిత్రము 38. వరంగల్లు కోటమధ్యనున్న తోరణద్వారము

రాజులలో ఎవరును కులోత్తుంగునికి సామంతులుగ ఉండిరని చెప్పుటకు ఎట్టి యాధారమును లేదు. పశ్చిమచాళుక్యులు ఆంధ్రదేశముపై దండెత్తివచ్చి అందు కొంతభాగమును ఆక్రమించునాటికి, మూడు పురుషాంతరముల కాకతీయులు తెలంగాణాలో పశ్చిమచాళుక్య సామంతులుగ పాలించుచుండిరి. అందువలన ఈ రెండవ యూహయు సరియైనది కాదని తెలియనగుచున్నది. పైని పేర్కొన

సామంతులును, రాష్ట్రకూట సేనానాయకులును వేంగీదేశమున ఎవరికి దొరకిన భాగమును వారు ఆక్రమించుకొనిరి. ఈ యవకాశమును పురస్కరించుకొని కాకర్త్య గుండ్యన వేంగీరాజ్యసీమయందు ఉండిన నతవాడి విషయమును ఆక్రమించుకొని ప్రబలుడై ఉండును. అమ్మరాజు మరణానంతరము తిరిగి వేంగిలో అల్లకల్లోలములు జరగెను. ఈ సమయమున గుండ్యన వంశీయుడగు కాకతి బేతరాజు నేటి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వరంగల్లు జిల్లాలోని కొరవిదేశము అను చిన్నభూభాగమును ఆక్రమించుకొని దానికి స్వతంత్ర పాలకు డయ్యెను. ఇట్లు కాకతీయరాజ్యము వేంగీ చాళుక్య పాలకుల సామంతులు స్థాపించిన రాజ్యము కాని మరియొకటి కాదు.

**వంశక్రమము :** కాకతీయులు కొన్ని శాసనములలో తాము సూర్యవంశీయుల మనియు, మను ఇక్ష్వాకు కరికాలచోడ దుర్జయాదులు తమ పూర్వికు లనియు చెప్పుకొనిరి. వాస్తవముగ ఈ కాకతి రాజవంశము మొదటి బేతరాజుతోనే ప్రారంభమగును. అతని వెనుక మొదటి ప్రోలరాజును, రెండవ బేతరాజును, రెండవ ప్రోలరాజును, రుద్రదేవుడును తండ్రికొడుకుల వరుసను రాజ్య మేలిరి. రుద్రదేవునికి పిమ్మట అతని తమ్ముడు మహాదేవరాజును, అటుపై మహాదేవరాజు కుమారుడు గణపతిదేవుడును రాజులైరి. గణపతి దేవునికి రుద్రాంబ, గణపాంబలను ఇద్దరు కుమార్తెలు మాత్రము కలిగిరి. అందువలన గణపతి దేవుని తరువాత అతని పెద్దకూతురు రుద్రాంబ రాజ్యమునకు వచ్చెను. ఈమెకును ముమ్మడంబ, రుయ్యాంబ అను కుమార్తెలే కలిగిరి. వీరిలో ముమ్మడంబకు ప్రతాపరుద్ర దేవుడు అను కుమారుడు కలిగెను. రుద్రాంబ తన తండ్రి గణపతి దేవుని యాజ్ఞను అనుసరించి దౌహిత్రుని పుత్రునిగ స్వీకరించి తన యనంతరము కాకతీయరాజ్యమును అతనికి సంక్రమింప జేసెను. ప్రతాపరుద్రదేవునికి సంతానము ఉండినట్లు కనిపింపదు. అతనికి అన్నమదేవుడను తమ్ముడు ఉండె ననియు, అతడు కాకతీయ రాజ్యము పడిపోయిన పిమ్మట నేటి బస్తరు ప్రాంతమునకు పోయి అచ్చట ఒక చిన్నరాజ్యమును స్థాపించె ననియు బస్తరులోని శాసనములవలన తెలియుచున్నది.

**రాజ్యకాలములు :** కాకతీయ రాజుల రాజ్యకాల పరిమితులను వారి శాసనముల సాహాయ్యముతో నిర్ణయింపవచ్చును. త్రిపురాంతకమునందలి మూడు శాసనములు శకము 1181 గణపతిదేవుని 61వ రాజ్యసంవత్సరమని తెలుపుచున్నవి. శకము 1184 నాటిది ఒక దాక్షారామ శాసనమున ఈతని ప్రశంస కలదు. దీనినిబట్టి ఇతడు శా. శ. 1120-1184 లకు సరియగు క్రీ. శ. 1198-క్రీ. శ. 1262 ల నడుమ పరిపాలించెనని తెలియుచున్నది. ఇతని తండ్రి మహాదేవరాజు మూడేండ్లు రాజ్యము చేసెనని స్థానిక చరిత్రములు తెలుపుచున్నవి. దీనినిబట్టి క్రీ. శ. 1195 నుండి క్రీ. శ. 1198 వరకు ఈ రాజు రాజ్యకాలము అగును. అంతకు ముందు రాజ్యము చేసిన రుద్రదేవుని దాక్షారామ శాసనము ఒకటి శకము 1080 నాటిది. దీనినిబట్టి ఈ రుద్రదేవుడు క్రీ. శ. 1158-క్రీ. శ. 1195 నడుమ పరిపాలించెనని తెలియనగుచున్నది. రుద్రదేవుని తండ్రి రెండవ ప్రోలరాజునాటి శాసనము ఒకటి క్రీ. శ. 1117 నాటిది. అందువలన ఈ రాజు క్రీ. శ. 1110-క్రీ. శ. 1158 నడుమ రాజ్యము పాలించినట్లు చెప్పవచ్చును. ఈ ప్రోలరాజు తండ్రి రెండవ బేతరాజు పశ్చిమచాళుక్యుడగు త్రిభువనమల్ల విక్రమాదిత్యుని సామంతుడు. ఇతని శాసన మొకటి శకము 1101 నాటిది. ఈ యంశములను బట్టి ఇతడు క్రీ. శ. 1075-క్రీ. శ. 1110 నడుమ రాజ్యము చేసెనని చెప్పనగును. బేతరాజు తండ్రి మొదటి ప్రోలరాజు చాళుక్య సోమేశ్వరుని (క్రీ. శ. 1042-క్రీ. శ. 1068) సామంతుడు అగుటవలన ఇతడు క్రీ. శ. 1030-క్రీ. శ. 1075 నడుమ ఉండియుండును. ఇతని తండ్రి మొదటి బేతరాజు క్రీ. శ. 1000-క్రీ. శ. 1030 నాటివాడు కావచ్చును. గణపతిదేవుని కుమార్తె రుద్రాంబ శాసనములు క్రీ. శ. 1260 నుండియు కనిపించుచున్నవి. గణపతి రాజ్యము క్రీ.శ. 1262 వరకును సాగెను. దీనినిబట్టి గణపతిదేవ, రుద్రాంబికలు క్రీ. శ. 1260-క్రీ. శ. 1262 ల నడుమ సంయుక్తపాలనమును సాగించిరని తెలియుచున్నది. రుద్రాంబ శాసనములు క్రీ. శ. 1296 వరకు నుండుటవలన అది యామె కడపటి రాజ్యసంవత్సరము అగుచున్నది. ఆమె దౌహిత్రుడగు ప్రతాపరుద్రదేవుని శాసనములు క్రీ. శ. 1290-96 నడుమ కనిపించుచున్నవి. దీనినిబట్టి ఈ కాలమున రుద్రాంబా ప్రతాపరుద్రులు సంయుక్త పరిపాలనమును సాగించిరని స్పష్టమగుచున్నది. ప్రతాపరుద్ర దేవుని కడపటి శాసనము క్రీ. శ. 1323 నాటిది. ఆ సంవత్సరమున తురుష్కు లతనిని బందీచేయుటతో అతని పరిపాలన మంతమయ్యెను. ఢిల్లీకి బందీగా తీసుకొని పోబడుచు మార్గమధ్యముననే యీరాజు మరణించెను. క్రీ. శ. 1326 నాటి శాసన మొకటి ఇతనిని నాటి పరిపాలకునిగ పేర్కొనుచున్నది. కాని అది విశ్వసనీయముగాదు.

**మొదటి బేతరాజు** (క్రీ. శ. 1000-క్రీ. శ. 1030): వేంగీ చాళుక్యరాజగు రెండవ అమ్మరాజు కాలమున కాకతీయుల వలెనే దుర్జయాన్వయులగు విరియాల వంశీయులును నేటి వరంగల్లు జిల్లాలోని గూడూరు ప్రాంతమును సామంతులుగ పలుచుండిరి. అమ్మరాజు మరణానంతరము వేంగిలో పెద్ద సంక్షోభము బయలుదేరెను. అతని దాయాదులు రాజ్యమును ఆక్రమించిరి. రాష్ట్రకూటులు దండెత్తి వచ్చిరి. దక్షిణమునుండి చోళులును వేంగిపై యుద్ధయాత్ర సాగించిరి. ఈ కల్లోలములలో కాకతి, విరియాల వంశీయులు బహుకష్టములకు లోనైరి. ఈ సమయమున విరియాల ఎర్రన కాకతి బేతరాజు శత్రువులను నిర్మూలించి అతనిని కొరవిదేశమునకు పలికగ ప్రతిష్ఠించెను.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఈ యెఱ్ఱనభార్య కామసానిగూడ ఇతనికి సాయముచేసి కాకతి వంశమును సుప్రతిష్ఠితము చేసెను. క్రీ. శ. 1008 లో దాక్షిణాత్యచోళులు పశ్చిమ చాళుక్యరాజ్యముపై దండెత్తి కొల్లిపాకవరకును చొచ్చుకొని వచ్చిరి. కొరవి దేశము వారి మార్గమునందు ఉండుటచే కాకతి బేతరాజు ఆత్మరక్షణార్థము ఈ చోళులతో పోరవలసి వచ్చెను. ఇట్లు ఈ రాజు ఎన్నియో ఉపద్రవములను తట్టుకొనవలసి వచ్చెను.

**మొదటి ప్రోలరాజు** (క్రీ. శ. 1030 - క్రీ. శ. 1075): ఈ రాజు రాజ్యమునకు వచ్చిననాటికి కాకతీయరాజ్యమునకు మరియొక ప్రమాదము సంభవించెను. అప్పటికి దాక్షిణాత్య చోళులును, పశ్చిమ చాళుక్యులును నిరంతరమును పోరాడు చుండిరి. చోళులు వేంగీ చాళుక్యులతో బాంధవ్యమును ఏర్పరచుకొని వేంగిలో ప్రాభవమును సంపాదించిరి. దీనికి ప్రతీకారముగ చాళుక్యులు వేంగిని ఆక్రమించు ఉద్దేశముతో తూర్పుగ విజృంభించి వరంగల్లు వరకును చొచ్చుకొని వచ్చిరి. కాకతీయరాజ్యము ఈ రెండు రాజ్యములకును నడుమనుండి ప్రమాదమునకు లోనయ్యెను. ప్రోలరాజు ప్రక్క నుండిన పురకూటదేశమును జయించి ఇతర మాండలికులతో పోరి తన రాజ్యమును విస్తరింపజేసెను. దూరదర్శియగు ఇతడు చాళుక్యరాజగు త్రైలోక్యమల్లునికి సామంతుడై, తన స్థితిని బలపరచుకొని అతనినుండి అన్మకొండ విషయమును సంపాదించెను. ఆమీదట ఇతడు భద్రంగపురముపై దండెత్తిపోయి అచట రాజవంశీయులను వశపరచుకొనెను. క్రీ. శ. 1052 లో చోళులకును, చాళుక్యులకును కొప్పం అనుచోట పెద్ద యుద్ధము జరగెను. అందు చోళరాజగు రాజాధిరాజు మరణించెను. చోళసైన్యములు పలాయనమొనర్చెను. కాకతి ప్రోల రాజును, అతని సేనానియగు బమ్మనయు ఈ సైన్యమును కంచి వరకును తరిమి ఆ నగరమును పట్టుకొనిరి. క్రీ. శ. 1061లో చక్రకూట రాజ్యపాలకుడయిన ధారావర్షుడు విజృంభించి వేంగీచాళుక్య రాజ్యముపై దండెత్తెను. వేంగీ చాళుక్య రాజరాజును, అతని కుమారుడును చక్రకూటముపై దండెత్తిరి. ఈ యలజడులలో తన రాజ్యమునకు ముప్పు రాకుండుటకై ప్రోలరాజు తన యేలికయగు త్రైలోక్యమల్లుని ప్రేరణపై చక్రకూటముపైబడి ధారావర్షుని ఓడించెను.

**రెండవ బేతరాజు** (క్రీ.శ. 1075 - క్రీ.శ. 1110): ఈరాజు కాలమున చాళుక్యరాజగు భువనైకమల్ల సోమేశ్వరునికిని, అతని తమ్ముడగు విక్రమాదిత్యునికిని పోరాటములు జరగెను. దీనిని పురస్కరించుకొని బేతరాజు స్వతంత్రుడగుటకు ప్రయత్నించెను. ఇంతలో విక్రమాదిత్యుడు 'త్రిభువనమల్ల' అను బిరుదు వహించి చాళుక్య చక్రవర్తి అయ్యెను. బేతరాజు మంత్రియగు వైజదండాధినాథుడు చక్రవర్తిని ప్రసన్నునిజేసి, తన యేలికకు ఎట్టి యుపద్రవమును కలుగకుండజేసి, చక్రవర్తిచే అతనికి సబ్బి 1000 మండలమును ఇప్పించెను. అంతటినుండియు బేతరాజు త్రిభువనమల్ల, మహామండలేశ్వర, చలమర్తిగండ మున్నగు బిరుదములను వహించి విక్రమాదిత్యునికి విశ్వసనీయుడగు సామంతుడై పరిపాలించెను. చక్రవర్తియు మాండలిక రాజ్యము తన శత్రువులగు చోళుల ప్రాబల్యమునకు లోనైన వేంగిని చేరియుండుట వలన ఈ బేతరాజును ఆదరముతో చూచుచుండెను. ఈ బేతరాజు పరమమాహేశ్వరుడు; రామేశ్వర దీక్షితుడను మహాశైవునికి శిష్యుడు.

**రెండవ ప్రోలరాజు** (క్రీ. శ. 1110 - క్రీ. శ. 1158): ఈ రాజు మహాశూరుడు. విక్రమాదిత్యుని మరణానంతరము నిర్వీర్యులగు రాజులు చాళుక్య సింహాసనమును అధిరోహించిరి. ఇందువలన చాళుక్య మాండలికులు తమ తమ మండలములను విస్తరింపజేసికొనసాగిరి. అటు వేంగీ రాజ్యము వేంగీ చాళుక్య రాజరాజ కుమారుడగు మొదటి కులోత్తుంగుని చాళుక్యచోళ సామ్రాజ్యమున చేర్పబడి ప్రతినిధులైన అతని పుత్రుల పరిపాలనయందు ఉండెను. ఇచటను మాండలికులు అన్యోన్య కలహములలో మునిగి యుండిరి. ఈ పరిస్థితులలో రెండవ ప్రోలరాజు తన రాజ్యమును విస్తరింపజేసికొనుటకు చక్కని అవకాశమును కనిపెట్టి విజృంభించెను. అప్పుడు కాకతీయ రాజ్యమును అంటియుండిన మహబూబునగరు, నలగొండ జిల్లాలను తైలపదేవుడను చాళుక్య రాజపుత్రుడు ఏలుచుండెను. ఇతడు ప్రోలుని విజృంభణమును అరికట్ట ప్రయత్నించెను. కాని ప్రోలరాజు అతనిని ఓడించి బందీచేసియు విడిచిపెట్టెను. ఈ ప్రథమ విజయముతో ప్రోలుని ఉత్సాహము ద్విగుణీకృతమయ్యెను. ఆ మీదట ఇతడు ఇతర మండలికులపై దండెత్తెను. దక్షిణమున కొండపల్లి ప్రాంతమును పాలించుచుండిన దండనాయక గోవిందరమను, ఉత్తరమున గోదావరీ తీరమునందున్న మంత్రకూట నగరపాలకుడగు గుండరాజును ప్రోలరాజు జయించెను. ఈ మాండలికుని విజృంభణము నరికట్టుటకై కరింనగరమండలము నందలి లే(వే)ములవాడ పాలకుడగు మహామండలేశ్వర జగద్దేవుడు దండెత్తివచ్చి ప్రోలుని రాజధానియగు అన్మకొండ నగరమును ముట్టడించెను. కాని, ప్రోలరాజు అతనిని ఓడించి తరిమివేసెను. పిమ్మట ఈ కాకతీయరాజు దక్షిణమున వెలనాడుపై దండెత్తెను కాని, ఆ ప్రాంతపు పాలకుడగు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/




http://sanskritcentral.com/

http://teluguthesis.com/



రెండవ గొంకరాజు కుమారుడగు చోడరాజు అతనిని యుద్ధమున సంహరించెను. మహాశూరుడగు ఈ రెండవ ప్రోలరాజు పెక్కు యుద్ధములు చేసి కాకతీయ రాజ్యమును బహుముఖముల విస్తరింప జేసెను. మూడవ తైలపుడు చాళుక్య సింహాసనమును అధిష్ఠించిన వెనుక ఎందరో సామంతులు ప్రబలులైరి. ఈ యదనున ప్రోలరాజు చాళుక్యుల సామంతత్వమును త్రోసిపుచ్చి స్వతంత్రుడయ్యెను.

రుద్రదేవ మహారాజు (క్రీ. శ. 1158 - క్రీ. శ. 1195): ఈ మహారాజు తండ్రిని మించిన శూరుడు ప్రతిభాశాలి. తండ్రి ప్రారంభించిన రాజ్య విస్తరణ కార్యమును పూనికతో సాగించి, ఇతడు బహుభూములను జయించెను. మొట్టమొదట ఇతడు తన తండ్రిని చంపినందులకై వెలనాటి రాజులపై పగ తీర్చుకొనగోరి ఇనంగల బ్రహ్మిరెడ్డి అను సేవానిని దాక్షారామ ప్రాంతముపై పంపి తాను శ్రీశైల ప్రాంతముపై దండెత్తెను. ఈ రెండు యాత్రలకును ఫలితముగ నా రెండు ప్రాంతములును కాకతీయ రాజ్యమున కలుపబడెను. ఆమీదట ఇతడు పలువురు మండలికులను జయించి, వారి భూములను ఆక్రమించెను. ఈ మాండలికులలో నేటి భద్రాచల ప్రాంతమునకు పలికగానుండిన దొమ్మరాజు ఒకడు; నేటి వరంగల్లు జిల్లాలోని పాఖాల ప్రాంతమును పలుచుండిన మేడరాజు మరియొకడు; నేటి కరీంనగరు జిల్లాలోని పొలవాస దేశమును పాలించుచుండిన మైలగి చేపుడు ఇం కొకడు. పిమ్మట, రుద్రదేవ మహారాజు నేటి మహబూబు నగరు జిల్లాలోని వర్ధమాన పురము కేంద్రముగ పాలించుచుండిన వెలుగు చోళుల బైపు దండెత్తవలసివచ్చెను. రెండవ ప్రోలరాజుచే ప్రతిష్ఠింపబడిన ఈ సామంతులు ఆ రాజు మరణానంతరము కాకతీయుల అధికారమును ధిక్కరించిరి. వీరిపై దండెత్తిపోయి రుద్రదేవ మహారాజు వీరి నగరములను ధ్వంసము చేసి, గోన వంశీయులను ఈ ప్రాంతమునకు సామంత పాలకులను ఒనర్చెను. ఆమీద పశ్చిమముగ దండెత్తిపోయి, ఈ మహారాజు చాళుక్యులకును, కళచురి వంశజులకును రాజధానిగ ఉండిన కల్యాణి నగరమును జయించెను. ఈ విజయములకు ఫలితముగ కాకతీయ రాజ్యము తూర్పున సముద్రము వరకును, పడుమట కల్యాణి వరకును, ఉత్తరమున మాల్యవంత (పర్వత)ము వరకును, దక్షిణమున శ్రీశైలమువరకును వ్యాపించెను. ఈదండయాత్రలు ముగిసిన వెనుక రుద్రదేవ మహారాజు తన రాజధానియగు అనుమకొండ నగరమునందు



చిత్రము 87. రుద్రేశ్వరాలయములోని స్తంభము, అనుమకొండ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



రుద్రేశ్వరాలయమును నిర్మించెను. ఓరుగల్లు నగరమును నిర్మించి దానిని రెండవ రాజధానిని చేసెను. ఈ మహారాజు విజయ యాత్రలలో ఉండిన కాలమున వెలనాటి రాజులు దాక్షారామ ప్రాంతమును వశపరచుకొనిరి. అందువలన క్రీ. శ. 1186 లో రుద్రదేవుడు ఆ ప్రాంతముపై దండెత్తిపోయి, మూడవ గొంకరాజును యుద్ధమున చంపి, ఇతని కుమారుడగు పృథ్వీశ్వరుని తరిమివేసి దాక్షారామ ప్రాంతమును మరల వశపరచుకొనెను. ఈ కాలమున కాకతీయులవలెనే పశ్చిమ చాళుక్యుల అధికారమును ధిక్కరించి దేవగిరి కేంద్రముగ సామంతపాలకులుగ ఉండిన యాదవులును విజృంభింపసాగిరి. ఆవంశపు రాజగు జైత్రపాలుడు యాదవ రాజ్యమును దీక్షతో విస్తరింపజేయ సాగెను. ఆ సందర్భమున ఈ యాదవులకు ప్రక్కనున్న కాకతీయులతో సంఘర్షణ పర్పడెను. క్రీ. శ. 1195 లో రుద్రదేవునికిని, జైత్రపాలునికిని తీవ్రమగు యుద్ధము జరిగి అందు రుద్రదేవ మహారాజు మరణించెను.

**మహాదేవరాజు** (క్రీ. శ. 1195 - క్రీ. శ. 1198): రుద్రదేవ మహారాజు నిస్సంతుగ మరణించెను. అందువలన అతని యనంతరమతని తమ్ముడు మహాదేవరాజు సింహాసనమునకు వచ్చెను. ఇతనికి గణపతిదేవుడను కుమారుడును, కుందాంబిక అను కుమార్తెయు ఉండిరి. ఈ కుందాంబిక నతవాడి రుద్రరాజునకు వివాహము చేయబడెను. ఇందుమూలమున కాకతీయులకు తీరాంధ్ర దేశము సుగమమయ్యెను. మహాదేవరాజు గజయుద్ధమునందు నేర్పరి. ఈ రాజు యాదవులు తన యన్న రుద్రదేవుని చంపినందులకు ప్రతీకార మొనర్పుటకై వారిపై దండెత్తిపోయి, వారి రాజధానియగు దేవగిరిని ముట్టడించెను. ఇతని పుత్రుడును, యువరాజు నగు గణపతి దేవుడు కూడ తండ్రిని అనుసరించెను. యాదవ రాజగు జైత్రపాలునకును, మహాదేవరాజునకును యుద్ధము జరిగెను. అందు మహాదేవరాజు మరణించెను. యాదవులు గణపతిదేవుని బందీ చేసిరి.

**గణపతిదేవుడు** (క్రీ. శ. 1198 - క్రీ. శ. 1262): ఇతడు రెండు మూడు సంవత్సరముల కాలము దేవగిరిలో బందీగ ఉండి ఆమీదట జైత్రపాలునిచే విడిచిపెట్టబడెను. ఈ కాలమున కాకతీయ సామంతులును, శత్రువులును ఉపద్రవములను కల్పించిరి. రేచెర్ల రుద్రుడను సేనాని వీని నన్నిటిని అణచివేసి కాకతీయ రాజ్యమును రక్షించి తన యేలికకు ఒప్పగించెను. ఈ మహారాజు కాకతీయరాజు లందరిలో అగ్రగణ్యుడు. మహాశూరుడును, విజేతయు, పరిపాలన దక్షుడును అగు ఇతడు రాజ్యమును బహు ముఖముల విస్తరింపజేసి దానిని ఒక మహాసామ్రాజ్యముగ మార్చెను. గణపతిదేవుడు స్వదేశమునకు వచ్చునప్పటికి పరిస్థితులు ఆశాజనకములుగ ఉండెను. తూర్పు తీరమున కళింగపాలకులగు గంగరాజులును ఉత్తరమున మహమ్మదీయులు అనేక విధముల బాధించుచుండిరి. గోదావరి దక్షిణ భాగము అనేక చిన్న చిన్న మండలములుగ విభజింపబడి అనేక రాజవంశములచే పరిపాలింపబడుచుండెను. ఈపరిస్థితులలో గణపతిదేవుడు తన రాజ్యమును విస్తరింప జేసికొనవలెనని సంకల్పించెను. ఈ మహారాజు మొట్టమొదట నేటి గుంటూరు మండలముపై దండయాత్ర సాగించెను. అప్పటికి వెలనాటి రాజులు అంతరించుటవలన ఈ ప్రాంతము బలహీనముగ ఉండెను. అందువలన క్రీస్తుశకము 1209 నాటికి వెలనాడు కాకతీయులకు సులభముగనే వశమయ్యెను. ఇచ్చట కోటవంశీయులను తనకు సామంతులుగ చేసికొని గణపతిదేవుడు పల్నాడును గూడ జయించెను. ఈ ప్రాంతము పూర్వము చాళుక్య-చోళరాజ్యమున చేరియుండెను. అందువలన చోళులు దీనిని తిరిగి జయించుటకై కొంత సైన్యమును పంపిరి. గణపతిదేవుడు ఈసైన్యమును తరిమివేసి, దీనికి ప్రతీకారముగ అప్పటికి చోళ సామంతులుగా ఉండిన నెల్లూరు తెలుగు చోళులతో మైత్రి చేసికొని, వారికి తన సైన్యమును సాయముగ ఇచ్చి, వారిచే కాంచీనగరమును ఆక్రమింపజేసెను. ఈవిధమున ఇచ్చటి కార్యములను చక్కబెట్టుకొని గణపతిదేవుడు నేటి కృష్ణా మండలమునకు వచ్చి క్రీ. శ. 1212 లో కళింగదేశముపైకి దండయాత్రను సాగించెను. రాజనాయకుడు అను నొకసేనాని గంజాం జిల్లాలోని బొబ్బిర వరకును చొచ్చుకొనిపోయి అనేక విజయములను ఆర్జించెను. సోమయనాయకుడను మరియొక బ్రాహ్మణసేనాని కాడి, గోగులవాడు, కొలని, మాడియములు, మన్యము మొదలగు ప్రాంతములను పట్టుకొనెను. ఈ విధమున నీయాత్ర నిరాటంకముగ సాగెను. గణపతిదేవుడు రాజనీతిని ఉపయోగించి కృష్ణా ముఖద్వారమున ప్రబలులుగ ఉండిన అయ్యవంశీయులలో ముఖ్యుడగు జాయనను వశపరచుకొని సేనాపతిత్వము నొసగెను. ఆమీదట గణపతిదేవుడు కమ్మనాటిని, పొత్తపి శాఖకు చెందిన తెలుగు చోడులను జయించెను. క్రీ. శ. 1230 ప్రాంతమున ఈ మహారాజు దేవగిరిపై దండెత్తిపోయి యాదవరాజగు సింహణను ఓడించెను. ఇదే సమయమున కళింగ గాంగులు దాక్షారామ ప్రాంతముపై కొంత సైన్యమును పంపిరి. దేవగిరినుండి మరలి వచ్చిన పిమ్మట గణపతి దేవుడు హేమాద్రిరెడ్డిని, నెల్లూరు రాజగు చోడ తిక్కన కుమారుడు మనుమసిద్ధిని కళింగముపైకి పంపి, దక్షిణ కళింగమును మరల జయించెను. క్రీ. శ. 1239 ప్రాంతమున

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఈ మహారాజు అద్దంకి పాలకులగు సేవుణ వంశీయులను, గండికోటప్రాంత పాలకులగు గంగయ సాహిణి మున్నగు కాయస్థ వంశీయులను వశపరచుకొనెను. క్రీ. శ. 1258 లో కాకతీయ సామ్రాజ్యపు దక్షిణసీమ ప్రమాదములకు లోనయ్యెను. ద్రవిడ దేశమున పాండ్యరాజగు సుందర పాండ్యుడు అసమర్థుడగు మూడవ కులోత్తుంగచోడుని ధిక్కరించి, ఉత్తరముగ విజృంభించి, కాంచీనగరమును జయించి, తెలుగుచోళుల నెల్లూరు మండలమును ప్రవేశించెను. ఈ ప్రాంతపు పాలకుడగు చోడ తిక్కరాజు కాకతీయ సైన్యముల సాహాయ్యముతో చిత్తూరు జిల్లాలోని ముదుగూరువద్ద పాండ్య రాజును ఎదుర్కొనెను. సుందర పాండ్యుడే శత్రువులను అచట జరగిన యుద్ధమునందు ఓడించి కాంచికి తరిమెను. అచట జరగిన రెండవ యుద్ధమున మరల ఓడిపోయి, తిక్కరాజు నెల్లూరు చేరెను. ఇచట జరగిన మూడవ యుద్ధమున సుందర పాండ్యుడు తిక్కరాజును చంపి ఆ నగరమునందు వీరాభిషేకము చేసికొనెను. ఇతడు కాకతీయ గణపతిదేవుని కూడ జయించినట్లు చెప్పుకొనియున్నాడు. తిక్కరాజునకు పిదప నెల్లూరు, కాంచీనగరములను పాలించినవాడు అతని కుమారుడగు మనుమసిద్ధ దేవచోడుడు. క్రీ. శ. 1254 లో గణపతిదేవుని కుమార్తె రుద్రాంబ పెద్దకూతురు ముమ్మడంబకు ప్రతాపరుద్రదేవుడను పుత్రుడు జన్మించెను. కాకతీయ సామ్రాజ్యముయొక్క భావినిగూర్చి విచారించుచుండిన గణపతిదేవునికి ఇది మిక్కిలి ముదావహమయ్యెను. అతడు ప్రతాప రుద్రునికి ఆరేడేండ్ల ప్రాయము వచ్చిన వెంటనే అతనిని రుద్రాంబకు దత్తస్వీకారము చేయించి ఆమె అనంతరము అతనికి కాకతీయ సామ్రాజ్యము సంక్రమింపవలెనని కట్టడ చేసెను. అంతవరకును అన్మకొండ నగరమును, రుద్రదేవ మహారాజు నిర్మించిన ఏకశిలానగరము - ఓరుగల్లు నగరమును కూడ రాజధానులుగ వర్తిల్లుచుండినవి. గణపతిదేవుడు ఆ సమయమున తన రాజధానిని ఓరుగల్లునకు మార్చివేసెను. క్రీ. శ. 1280 లో సామ్రాజ్య దక్షిణ భాగమున తిరిగి కల్లోలము లేదవెను. పాండ్యులు మరియొకసారి విజృంభించి మనుమసిద్ధిని తరిమివేసి నెల్లూరిని ఆక్రమించిరి. వారు మరలిన వెంటనే పల్లవరాజగు కొప్పెరుంజింగడు కాంచిని ఆక్రమించి, తూర్పుతీరమున దాక్షారామము వరకును చొచ్చుకొనివచ్చెను. కాని కాకతీయ సైన్యములు ఇతనిని ఓడించి గణపతిదేవుని ఆధిక్యము నంగీకరింపజేసినవి. ఇట్లు కాకతి గణపతిదేవుడు అనేక దేశములను జయించి, చక్రవర్తియై యావదాంధ్ర దేశమును ఏకచ్ఛత్రాధిపత్యమున పాలించి కృతకృత్యుడై క్రీ.శ. 1262 వ సంవత్సరమున మరణించెను.



చిత్రము 88. కోటలోని ఏకశిల, వరంగల్లు

## రుద్రమ దేవి

(క్రీ. శ. 1262 - క్రీ.శ. 1296): ఈ మహారాణి మిక్కిలి ప్రతిభావంతురాలు. స్త్రీ అయినను గొప్ప ధైర్యసాహసములతో అనేక కష్టములను ఎదుర్కొని ఈమె తండ్రి తన చేత బెట్టిన విశాల సామ్రాజ్యమును రక్షించి సమర్థతతో పరిపాలించెను. ఈమె పరిపాలనము ఆరంభమైన మొదటి పది సంవత్సరములలోను సామ్రాజ్యము పెక్కు కష్టములకు లోనయ్యెను. చోళరాజగు రాజేంద్రచోళుడును, పల్లవరాజగు కొప్పెరుంజింగడును, ఏరువ మల్లిదేవుడను మరియొక రాజును, మరికొందరు శత్రువులును దక్షిణమున త్రిపురాంతక ప్రాంతముపై దాడులు చేసిరి. సామ్రాజ్యము లోపల నెందరో సామంతులు తిరుగబాట్లు చేసిరి. అంబదేవుడను కాయస్థ సామంతుడు త్రిపురాంతకముపై దండెత్తి వచ్చిన శత్రువులను పారదోలెను. కోన గన్నయరెడ్డియను సేనాని రాజ్యము లోపలి శత్రువులను ఎల్లరను అణచివేసెను. ఇంతలో ఉత్తరదిశనుండి యాదవ మహారాజు దండెత్తి వచ్చి ఓరుగల్లు నగరమును ముట్టడించెను. రుద్రాంబ ఈ శత్రువును బహుపరాక్రమముతో ఎదుర్కొని ఓడించి, గోదావరి వరకును తరిమెను. అంతటినుండి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/











చిత్రము 89. కాకతీయాంధ్ర శిల్పుల కళా చాతుర్యము

http://sanskritcentral.com/

http://teluguthesis.com/





రామప్ప దేవాలయము, పాలంపేట

http://sanskritcentral.com/

http://teluguthesis.com/





రామప్ప దేవాలయ అంతరాళ దృశ్యము, పాలంపేట

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పదునైదు సంవత్సరముల కాలము ప్రశాంతముగ నడచెను. క్రీ. శ. 1280 లో ఈ మహారాణి తన దౌహిత్రుని యావ రాజ్యాభిషిక్తుని చేసి కొంత పరిపాలన భారమును అతనిపై బెట్టెను. క్రీ. శ. 1290 ప్రాంతమున దక్షిణదిశను పాండ్యులు విజృంభించి కాంచీ, నెల్లూరులను వశపరచు కొని, కాకతీయ సామంతుడగు మనుమసిద్ధిని తరిమివేసిరి. అంబదేవు డీపాండ్యులను వెడలించి తిరిగి మనుమసిద్ధిని నెల్లూరున ప్రతిష్ఠించెను. కాని, ఈ యంబదేవుడే ఏకార ణమువలననో పాండ్యులతోడను, యాదవులతోడను చేరి మనుమసిద్ధితోకూడ రుద్రాంబపై తిరుగబాటు చేసెను. ఈ ప్రమాదమును ఎదుర్కొనుటకై యువరాజగు ప్రతాప రుద్రదేవుడు ససైన్యముగ దక్షిణదిశకు ఏగెను. గోన విఠల నాథుడను సేనాని బళ్ళారి మండలమును ప్రవేశించి యాద వులను ఓడించి పెక్కు దుర్గములను జయించెను. అడిదమ్మ యను మరియొక సేనాని మనుమసిద్ధిని చంపి అంబదేవుని ఓడించెను. ప్రతాపరుద్రదేవుడు స్వయముగ పాండ్యులపై బడి వారిని పారద్రోలెను. ఈ యుపద్రవములు అణగిన పిమ్మట సామ్రాజ్యమున తిరిగి శాంతి పర్వెడెను. కాకతి రుద్రాంబ క్రీ. శ. 1296 లో కాలధర్మము నొందెను.

**ప్రతాపరుద్రదేవుడు** (క్రీ. శ. 1296 - క్రీ. శ. 1323): కాక తీయవంశపు రాజులలో ఇతడు కడపటివాడు. ఇతని కాల మున కాకతీయాంధ్ర సామ్రాజ్యము పరమావధి నందెను. ఈ మహారాజు రాజ్యమునకు వచ్చిన వెంటనే పరిపాలన విధానమును సంస్కరించి, సామ్రాజ్యము నంతటిని 77 నాయంకరములుగ విభజించెను. క్రీ. శ. 1303 లో మొదటి సారి మహమ్మదీయులు ఆంధ్రదేశముపై దండెత్తి వచ్చిరి. అంతకు పూర్వమే యాదవ రామచంద్రదేవుని ఓడించి, బహు ధనమును సంపాదించిన అలా ఉద్దీన్ ఖిల్జీ ఢిల్లీ సుల్తాను అయిన పిమ్మట ఇంకను ధనము సంపాదించవలె నను ఉద్దేశముతో ఈ దండయాత్రను పంపెను. కరీంనగరము జిల్లాలోని ఉప్పరపల్లివద్ద పోతుగంటి మైలి, వెలుగోటి వెన్నమనాయకుడు మున్నగు కాకతీయ సేనానులు ఈ తురుష్క సైన్యమును ఎదుర్కొని ఓడించి తరిమివే సిరి. ఆరు సంవత్సరములకు పిమ్మట అలా ఉద్దీన్ ప్రతిభా శాలిఅయిన మలిక్ కాఫర్ అను సేనానిని తిరిగి కాకతీయ సామ్రాజ్యముపై దండు పంపెను. క్రీ. శ. 1310 లో ఈ శత్రుసైన్యములు ఓరుగల్లు నగరమును ముట్టడించినవి. ప్రతాపరుద్రదేవుడు ధైర్యముతో పోరాడెను. కాని, విజ యము పొందలేక పోయి తురుష్క సేనానితో సంధిచేసి కొనెను. ఈ యుపద్రవము గడచినవెంటనే దక్షిణమున అలజడులు ఉద్భవిల్లెను. కేరళ రాజగు రవివర్మ పాండ్యుల నోడించి, కాకతీయ సామంతుడగు మనుమగండ గోపాలుని పారద్రోలి, క్రీ. శ. 1313 లో కంచిని ఆక్రమించుకొనెను. ఈ యవకాశమును పురస్కరించుకొని కాయస్థ సామంతు డగు త్రిపురాంతకుడును, ములికినాటిలోని ఒడ్డెరాజులును తిరుగబాటు చేసిరి. సోమయ నాయకుడు, గొంకారెడ్డి అను సేనానులు ఈ విద్రోహులను అణచివేసిరి. ఇంతలో పాండ్యులు ఉత్తరముగ దండెత్తి వచ్చి కంచిని పట్టుకొనిరి. నెల్లూరు, చిత్తూరు మండలములలో మరికొందరు నాయ కులు తిరుగబాటు చేసిరి. ప్రతాపరుద్రదేవుడు స్వయముగ ఈ ప్రాంతమున కేగెను. ముప్పిడి నాయకు డను సేనాని కాంచీనగరముపైకి ఏగెను. అతని కుమారుడు పెద్దరుద్రుడు విద్రోహి మండలికులను అణచివేసెను. మహారాజును, ముప్పిడి నాయకుడును పాండ్యులను ఓడించి కంచిని వశ పరచుకొనిరి. దేవరి నాయనింగారు, కొఱని అన్నమదేవుడు మున్నగు సేనానులు పాండ్యులను జంబుకేశ్వరము వర కును తరిమిరి. నెల్లూరు నగరమున మానవీరుడను సామం తుడు ప్రతిష్ఠింపబడెను. పరిస్థితులు ఇట్లు చక్కబడునప్పటికి కంపిలి రాజపుత్రుడగు కుమారరాముడు కాకతీయ సామ్రాజ్య దక్షిణభాగమును అలజడిపరుపసాగెను. రేచెర సింగమనాయకుడు, బెండపూడి అన్నయ అను సేనాను(లు) ఈతనిని కుమ్మటవద్ద ఓడించిరి. క్రీ. శ. 1316 నాటికి అలా ఉద్దీన్ ఖిల్జీ మరణించెను. గినిని పురస్కరించుకొని ప్రతాప రుద్రదేవుడు ఢిల్లీకి సాలీనా పంపు ధనమును పంపుట మానెను. ముబారక్ అనునతడు ఢిల్లీ సింహాసనమును అధిష్ఠించి ఖుస్రూ ఖాన్ అను సేనానిని ఓరుగల్లుపైకి పంపెను. ప్రతాపరుద్రదేవుడు ఈయవలసిన ధనమును ఇచ్చి ఇతనితో సంధి చేసికొనెను. మరిరెండు సంవత్సరములకు ఖిల్జీ వంశజుల పరిపాలన మంతమై తుఘ్లుకు వంశీయుడగు ఘియాజుద్దీన్ ఢిల్లీ సుల్తా నయ్యెను. ఇతడు ప్రబలమగు సైన్యమును సమకూర్చి, దానిని క్రీ. శ. 1321 లో తన కుమారుడగు ఉలుఘ్ ఖాన్ నాయకత్వమున ఓరుగల్లుపైకి పంపెను. ఈ తురుష్క సైన్యములు ఓరుగల్లు నగరమును ముట్టడించినవి. కొలని రుద్రదేవుడు, అన్నయదేవుడు మున్నగు సేనానులు నగరమును అప్రమత్తులై కాపాడిరి. ఏదోకారణమున తురుష్క సైన్యాధిపతులలో అంతఃకల హము పొడచెను. గత్యంతరము లేక ఉలుఘ్ ఖాన్ ముట్ట డిని ఎత్తివేసి దేవగిరికి పోయెను. సుల్తాన్ ఘియాజుద్దీన్ మరికొంత సైన్యమును పంపి మరియొకసారి ఓరుగల్లుపై దాడి వెడలుమని తన కుమారునికి ఆజ్ఞ ఇచ్చెను. నాలుగు నెలలలోనే ఉలుఘ్ ఖాన్ తిరిగి కాకతీయ సామ్రాజ్యమున ప్రవేశించి, ఓరుగల్లును ముట్టడించెను. ప్రతాపరుద్రదేవుడు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఆకస్మికముగ వచ్చిన ఈ సైన్యమును చేతనయినట్లు ఎదిరించెను. కాకతీయ సైనికు లైదుమాసముల కాలము శత్రువులతో పోరాడిరి. నగరములో ఆహారపదార్థములు కొరతపడెను. అధికముగ బలములను రప్పించుటకు వీలు లేకపోయెను. గత్యంతరములేక ప్రతాపరుద్రదేవుడు ప్రజారక్షణార్థమై తురుష్క సేనానికి వశుడయ్యెను. ఉలుఘ్ ఖాన్ ఖ్వాజా హాజీ, మలిక్ బేదర్ అనువారితో ఈమహారాజును ఢిల్లీకి పంపెను. దారిలో నర్మదాతీరమున ప్రతాపరుద్రదేవుడు భగ్నహృదయుడై మరణించెను. ఇంతటితో కాకతీయ సామ్రాజ్య మస్తమించెను.

కాకతీయ యుగములోనే తెలుగుదేశమంతయు ఇంచుమించుగా ఏకచ్ఛత్రాధిపత్యము క్రిందికి వచ్చినది. ఈ కాలములో తెలుగు దేశములోని ప్రధానమతము పాశుపత శైవము. గోళకీమఠమునకు సంబంధించిన పాశుపత శివాచార్యులు గుంటూరు మండలములోని మందడము నందును, కర్నూలు మండలములోని త్రిపురాంతకము, శ్రీశైలములందును, కడప మండలములోని పుష్పగిరి యందును, ఇంక ననేక స్థలములందును శైవమఠములను స్థాపించిరి. ఈ మఠములు విద్యాపీఠములుగా నుండెడివి. మందడములోని గోళకీ మఠములో ప్రసూత్యారోగ్యశాల (పురుళ్లుపోయు ఆస్పత్రి) కూడ నుండెడిది. కాకతీయులు శిల్పమును, దేవభవన నిర్మాణవాస్తువును పోషించిరి. నాట్యకళకూడ వర్ధిల్లినది. కాకతి గణపతిదేవ చక్రవర్తి గజసాధనికుడైన జాయపసేనాని సంగీత, నాట్యములను గురించి రెండు గ్రంథములను రచియించినట్లు తెలియుచున్నది. వీనిలో నాట్యమును గురించిన 'నృత్తరత్నావళి' మాత్రమే దొరకినది. ఈ గ్రంథమున జాయపనాయకుడు మార్గికి సంబంధించినవే కాక దేశి నాట్యసంప్రదాయములను గురించికూడ వ్రాసియున్నాడు. శ్రీశైలములో అరువదినాలుగు నాట్యకూటము లుండెడివని ప్రసిద్ధి. పాశుపతశైవ సంప్రదాయము నాట్యకళాభివృద్ధికి ఎక్కువగ తోడ్పడినట్లు కనబడును. కాకతీయ యుగములో సంస్కృతాంధ్ర భాషలును వర్ధిల్లినవి. ప్రతాపరుద్రదేవుని ఆస్థానకవి విద్యానాథుడు ప్రతాపరుద్రీయమను అలంకారగ్రంథమును విరచించెను. భాస్కరుడు రామాయణమును, పాల్కురికి సోమనాథుడు బసవపురాణ, పండితారాధ్య చరిత్రలను, మారన మార్కండేయ పురాణమును ఈ యుగముననే రచియించిరి. బాలభారత కర్త అగస్త్యుడును ఈ కాలమువాడే. విద్యానాథుడే అగస్త్యుడని కొందరందురు. విజయనగర రాజకుమారుడైన కుమార కంపరాయల భార్య గంగాదేవి తన కంపరాయ విజయమున అగస్త్యుని తన గురువుగా నుతించినది. మా. రా.

# అర్వాచీన గాంగ వంశము

ఇదివరలో చెప్పినట్లు అర్వాచీన గాంగులలో మొదటివాడు శకవర్షము 960 (క్రీ. శ. 1038) లో పట్టాభిషిక్తుడైన అనంతవర్మ వజ్రహస్తదేవుడు. ఇతని శాసనముల ప్రకారము తెలియవచ్చిన మొదటి గాంగభూపతి గుణమహార్ణవుడు. ఇతని కుమారుడు (మొదటి) వజ్రహస్తదేవుడు. ఇతనికి ముగ్గురు కుమారులు. రెండవ కుమారుని పేరు తెలియదు. జ్యేష్ఠుడు గుండమరాజు. కనిష్ఠుడు వినయాదిత్యుడు. రెండవ కుమారుని తనయుడు (రెండవ) వజ్రహస్తుడు. ఇతనికి అనియంక భీముడని నామాంతరము. ఇతనికి మరల (రెండవ) కామార్ణవ, (రెండవ) గుండమరాజ, మధుకామార్ణవులని ముగ్గురు తనయులు కలిగిరి. వీరిలో (రెండవ) కామార్ణవభూపతికి వైదుంబ వంశజయైన వినయ మహాదేవియందు (మూడవ) వజ్రహస్తదేవుడు కలిగెను. ఈ గాంగవంశానుక్రమమే ఇతని కుమారుడైన దేవేంద్రవర్మ రాజరాజదేవుని తామ్రశాసనమునందును ఈయబడినది. రాజరాజదేవుని కుమారుడు అనంతవర్మ చోడ గంగదేవుడు. ఇతని మొదటి తామ్రశాసనములలో అనంతవర్మ వజ్రహస్తదేవుని తామ్రశాసనములలోని వంశానుక్రమమే కానవచ్చును; కాని, అటు తరువాతి శాసనములలో, ప్రాయికముగా అర్వాచీన గాంగరాజ్యము బలపడి విస్తరించిన తరువాతినుండి పౌరాణిక వంశానుకథనమును, సంపూర్ణ గాంగవంశవృక్షమును కానవచ్చును.

వజ్రహస్తదేవుని శాసనములలోని వంశవృక్షమునకును, చోడ గంగదేవుని శాసనములలోని సంపూర్ణ వంశ వృక్షమునకును గల పోలికలును, వ్యత్యాసములును ఇవి: వజ్రహస్తదేవుని శాసనముల ప్రకారము గాంగవంశజుల కూటస్థుడు గుణమహార్ణవుడు; చోడ గంగదేవుని శాసనముల ప్రకారము వీరసింహుడు. వీరసింహుని తనయుడైన దానార్ణవుని పౌత్రుడు రణార్ణవుడు. ఇతని పౌత్రుడు గుణార్ణవుడు; అనగా సంపూర్ణ వంశవృక్షము గుణార్ణవునికి పూర్వ మయిదు తరములను తెలుపుచున్నది. దానార్ణవుని కుమారుడు (రెండవ) కామార్ణవుడు. ఇతని కుమారుడే రణార్ణవుడు. రణార్ణవుని (రెండవ) వజ్రహస్త, (మూడవ) కామార్ణవు లను ఇద్దరు కుమారులలో రెండవవాని కుమారుడే (రెండవ) గుణార్ణవుడు. ఈ గుణార్ణవుడును, అనంతవర్మ వజ్రహస్తదేవుడు ఇచ్చిన వంశవృక్షములోని గుణమహార్ణవుడును ఒక్కరే. గుణార్ణవుని వద్దనుంచి రెండు వంశవృక్షములును ఇంచుమించుగా

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చివర భాగమున సమానమే, కాని అనంతవర్మ వజ్రహస్త దేవుని శాసనములందలి వంశవృక్షములోని (మొదటి) గుండమరాజును, (మొదటి) కామార్ణవ, వినయాదిత్యులును గుణమహార్ణవుని పౌత్రులును, (మొదటి) వజ్రహస్తుని పుత్రులును కాగా అనంతవర్మ చోడగంగదేవుని శాసనములందలి సంపూర్ణ వంశవృక్షములో వారు గుణార్ణవ సుతులే యగుచున్నారు. పైనుడివిన (మొదటి) వజ్రహస్తుని గురించి అతడు పూర్వమయిదుగురు భూపతుల వలన అయిదు విభాగములుగ విభజింపబడి అనుభవింపబడిన భూమిని భూరి పరాక్రముడును, ఉదార చరితుడును అయిన వజ్రహస్తుడు తానొక్కడే స్వయముగా భుజబలమువల్ల శత్రు నివహములను జయించి ఏకము చేసి పాలించెనని అనంతవర్మ వజ్రహస్తదేవుని శాసనము తెలుపుచున్నది. కళింగభూమిని ఇతని కాలమునకు పూర్వపు రాజులైదు ఖండములుగ జేసి పంచుకొని పరిపాలించుచుండ ఇతడు మరల ఆ యైదుఖండములను ఏకము చేసి అఖండ గాంగ రాజ్యమును నెలకొల్పి ప్రతిష్ఠాపకుడయిన కారణమున కావచ్చును అనంతవర్మ వజ్రహస్తదేవుని శాసనములందలి వంశావతారక్రమము ప్రధానముగ ఈతనివద్ద నుండియే తెలుపబడినది. ఇంకను అసంపూర్ణ, సంపూర్ణ వంశవృక్షములకు గల వ్యత్యాసము లివి: సంపూర్ణ వంశవృక్షములోని గుణార్ణవుని యైదుగురు కొడుకులలోను మొదటి కొమారుడు పోతాంకుశుడును, (పేరు తెలుపబడని) రెండవ కుమారుని తనయుడు కలింగలాంకుశుడును ఏకారణముచేతనో అసంపూర్ణ వంశ వృక్షములో తెలుపబడలేదు. సంపూర్ణ వంశవృక్షములోని గుణార్ణవుని రెండవ కొడుకు పేరు తెలుపబడకపోయినను వానిని బాగుగ పరిశీలించిన మీదట అతడు మూడవ వజ్రహస్తుడని తెలియగలదు. ఈ మూడవ వజ్రహస్తుడు అసంపూర్ణ వంశవృక్షములోని మొదటి వజ్రహస్తుడే. ఇట్లే సంపూర్ణ వంశవృక్షమునందలి నాలుగవ వజ్రహస్తుడును, అయిదవ కామార్ణవుడును వజ్రహస్తదేవుని అసంపూర్ణ వంశవృక్షములో రెండవ వజ్రహస్తుడును, రెండవ కామార్ణవుడును అగుచున్నారు. ఇదేవిధమున సంపూర్ణ వంశ వృక్షమువందలి అయిదవ వజ్రహస్తుడు అసంపూర్ణ వంశానుక్రమణిక ప్రకారము మూడవ వజ్రహస్తు డగుచున్నాడు. ఈ కారణముచేత శకవర్షము 960 (క్రీ. శ. 1038)లో పట్టాభిషిక్తుడయిన అనంతవర్మ వజ్రహస్తదేవుని చరిత్రకారులు అయిదవ వజ్రహస్తు డనియు, మూడవ వజ్రహస్తు డనియు వ్యవహరించుట కలదు. ఈ గాంగవంశ చరిత్రమున అతడు మూడవ వజ్రహస్తు డనియే వ్యవహృతుడయినాడు. మరి యొక్క విచిత్రమయిన వ్యత్యాసమేమన, ఈ మూడవ వజ్రహస్తుడు అతని శాసనములందలి వంశవృక్షము ప్రకారము వజ్రహస్తుని ప్రథమ తనయుడైన (రెండవ) కామార్ణవునికి (వైదుంబ వంశజయైన వినయ మహాదేవియందు జనించిన) పుత్రుడు. ఇతని పౌత్రుడగు చోడగంగదేవుని శాసనములందలి సంపూర్ణ వంశవృక్షము వమసరించి చూడ వజ్రహస్తుని తృతీయ తనయుడైన మధుకామార్ణవునికి పుత్రుడు. తాత మనుమల కాలములోనే గాంగ వంశవృక్షమున, అందునను ప్రపితామహుని విషయమున ఇట్టి వ్యత్యాసము ఎందువల్ల కలిగెనో ఊహింప శక్యము కాకున్నది. మూడవ అనంతవర్మ వజ్రహస్తదేవునినుండి అటుతరువాతి గాంగ వంశ వృక్షములో ఏతికమకలును లేవు.

**మూడవ వజ్రహస్తదేవుడు** (క్రీ. శ. 1038 - క్రీ. శ. 1070): అర్వాచీన గాంగ వంశజులలో ఇతడు మొదటివాడు. ఇతని నుండి గాంగ దానశాసన రచనావిధానములో ఎన్నో మార్పులు వచ్చినవి. గాంగవంశ ప్రశస్తి మారినది. శాసనములలో గాంగవంశ వృక్షము పొందుపరుప బడినది. ఈతడు శకవర్షము 960 (క్రీ. శ. 1038) లో సూర్యుడు వృషభరాశియం దుండగా, అనగా సౌర వృషభమాసమున, శుక్లపక్ష తృతీయా భానువారమునాడు ధనుర్లగ్నమందు చంద్రుడు రోహిణితో నుండగా, కళింగరాజ్యమునకు పట్టాభిషిక్తుడై అనంతవర్మ, పరమ మాహేశ్వర, పరమ భట్టారక, రాజాధిరాజ బిరుదములను వహించెను. ఈ వజ్రహస్తదేవుని శాసనములు ఇంతవరకు తొమ్మిది దొరకినవి. వీనిలో ఒకటి పరమ మాహేశ్వర, పరమ భట్టారక, పరమేశ్వర బిరుదాంచితుడైన అనంతవర్మ యొక్క 15-వ రాజ్యసంవత్సరమగు 976 వ శకము నాటిది; మహేంద్ర భాగములోని మధిపథరఖండ గ్రామమును కదంబ వంశజుడును, పరమమాహేశ్వర పంచ విషయాధిపతి మహామండలేశ్వర, రాణక శ్రీభీమఖేడి కొమారుడునైన రాణక శ్రీధర్మఖేడి 'ఉజణకు'డు అనునతనికి ఇచ్చిన దానమును తెలుపును. వజ్రహస్తదేవునికి అనంతవర్మ బిరుదము ఉండుట వలనను, ఈ శాసనము అతని రాజ్యకాలములో పడుట వలనను ఇదికూడ మూడవ వజ్రహస్త దేవునిదే కావచ్చునని చరిత్రకారుల అభిప్రాయము. ఇది వజ్రహస్తదేవుని శాసనముగా పరిగణింప బడినను నిజమునకు దాత కదంబ కులజుడైన ధర్మఖేడి కాని వజ్రహస్తుడు కాదు. ఈ శాసనము ముద్రికమీది మత్స్యలాంఛనము కళింగ కదంబులది.

పై నుడివిన భీమఖేడి, ధర్మఖేడులే కాక మరికొందరు కదంబ వంశజులు కళింగ గాంగ శాసనములలో కానవత్తురు. తేది లేని దానశాసనము ఇచ్చిన పూర్వగాంగ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వంశజుడైన వజ్రహస్తదేవుడు దాన మిచ్చిన హొన్నంది గ్రామమునకు పాలకుడు రాణక ఉగ్రఖేడి. ఇతడు నిడు సంతికులమునకు చెందిన కదంబ వంశజు డని చెప్పబడినది. ఈ విధముగానే అర్వాచీన గాంగుల రాజ్యకాలములో తెలియవచ్చిన మరియొక కదంబ వంశజుడు దేవేంద్రవర్మ కంబకాయ శాసనములో వచ్చు రాణక శ్రీఉదయాదిత్యదేవుడు. ఇతడే కంబకాయ శాసనములోని దాత. ఇతని తండ్రి మహామండలేశ్వర రాణక శ్రీధర్మఖేడి. ఇతడును, పైనుడివిన రాణక శ్రీభీమఖేడి కుమారుడు ధర్మఖేడియు ఒక్కరే కావచ్చుననుటకు అవకాశము కలదు. ఉదయాదిత్య దేవుడును పంచవిషయాధిపతియే. ఈ కదంబులు గాంగ వంశజులతోగూడ హానుగల్లు (బొంబాయి రాజధాని) ప్రాంతమునుండి కళింగమునకు వచ్చియుందురు. హానుగల్లు కదంబుల కులదైవము జయంతి మధుకేశ్వరుడు (విష్ణువు). కళింగనగరములో మధుకేశ్వర స్వామి ఆలయము కలదు. వజ్రహస్తదేవుని మనుమడయిన అనంతవర్మచోడ గంగదేవుని పూర్వులలో ఒకడగు రెండవ కామార్ణవుడు నగరము (కళింగనగరము)లో ఈ మధుకేశ్వరస్వామికి దేవాలయమును కట్టించెను. కదంబులు గాంగులతో కళింగమునకు వచ్చినపుడు వారు తమ యిలవేల్పగు మధుకేశ్వరునికూడ తమతో తీసికొనివచ్చియుందురు. పైని చెప్పినట్లు కదంబులు ఖేడి పదాంచితులు. బొంబాయి రాజధాని యందలి రత్నపూరు జిల్లాలోని ఖేడ్ (ఖేటాహారము) ఈ కళింగ కదంబుల జన్మదేశమేమో, ఖేడి పదము తత్స్థల సూచకమేమో విచారింప వలసి యున్నది. వీరి దానశాసన ముద్రికలమీది మత్స్యలాంఛనముకూడ వీరు పశ్చిమ దిశనుండి కళింగమునకు వచ్చినట్లు ఊహించుటకు అవకాశమిచ్చుచున్నది. వీరు కళింగమునకు వచ్చినప్పటినుండియు గాంగవంజులకు కుడిభుజముగా ఉండి వారి రాజ్యమును ప్రతిష్ఠించుటకును, ప్రతిష్ఠించి సుస్థిరము చేయుటకును తోడ్పడినందువలన కావచ్చును కళింగాధీశ్వరులైన గాంగభూపతులు వారిని గ్రామాధిపతులుగను, విషయాధిపతులుగమ నియమించి గౌరవించి ఆదరించిరి. గాంగవంశజులు కదంబకులజులతో సంబంధ బాంధవ్యములుకూడ గలుపుకొని రాజబంధువులను కావించిరి.

శకవర్షము 976నాటి శాసనములో తక్క మిగిలిన తామ్రశాసనములు ఎనిమిదింటిలోను వజ్రహస్త దేవునికి త్రికంళిగాధిపతి బిరుదము కలదు. పైనుడివిన శాసనమున వజ్రహస్తదేవుడను పేరు లేదు. పైగా, దాత ఇదివరలో నుడివినట్లు కదంబకులజుడు. అందువల్ల త్రికళింగాధిపతి బిరుదము అందు కానరాక పోవుట యుక్తమే. ఉత్కల, కొంగోద (గంజాము జిల్లాలోని ఉత్తరపు సరిహద్దు ప్రాంతము), కళింగములు మూడును కలసిన ప్రదేశము త్రికళింగమనియు, వజ్రహస్తుడు ఈ మూడు విభాగములను తన యధికారముక్రిందికి తీసికొని వచ్చుటచేతనే త్రికళింగాధిపతి బిరుదమును వహించెననియు శ్రీ ఆర్. డి. బెనర్జి పండితుని అభిప్రాయము. కళింగ గాంగులకు ఇరుగుపొరుగులనుండు రాజ్యముల అధిపతులు కొందరుకూడ త్రికళింగాధిపతి బిరుదమును వహించిరి. ఈ బిరుదమును అనుసరించి వీరి దేశమును వారు, వారి దేశమును వీరు జయించి ఈ బిరుదమును ధరించుచు వచ్చిరని చెప్పుటకు వీలులేదేమో అని తోచుచున్నది. ఏలయన, ఈ బిరుదము శకవర్షము 967 (క్రీ. శ. 1045)నాటి వజ్రహస్తదేవుని నరిసీపట్టణము శాసనములోనే మొదటిమారు కానవచ్చును. అంతకు పూర్వము ఇది కళచురి మహారాజాధిరాజు కర్ణదేవుని క్రీ. శ. 1042 నాటి బెనారెస్ తామ్ర శాసనములో ఉన్నది. ఇందువలన కళచురి కర్ణదేవుని ఓడించి గాంగ వజ్రహస్తదేవుడు ఈ బిరుదమును, కొంత రాజ్యమును సంపాదించినట్లు చెప్పుటకు వీలున్నది. కాని, క్రీ.శ. 1058 నాటి కళచురి కర్ణదేవుని సార్నాథు శాసనమునందును, క్రీ. శ. 1058 నాటి గాంగ వజ్రహస్తుని నడగాం శాసనమునందును - ఒకటే సంవత్సరమున - ఈ యుభయ భూవరులకు, ఈ త్రికళింగాధిపతి బిరుదము కానవచ్చుట వలన, ఒకరిరాజ్యమును ఒకరు జయించినందువలన ఈ బిరుదము వారికి లభించియుండదనియు, త్రికళింగమను పేరుగల ప్రదేశమున ఉభయులకు కొంత హక్కు ఉండుట వల్లను, కొంత కొంత ఉభయులకును చెందుటవల్లనే ఏకకాలమున ఈ బిరుదమును ఉభయులును ధరించుట జరగిన దనియు ఊహించుట సమంజసమని తోచును. అయినను దీనిని గురించి ఇంకను పరిశోధన జరగవలసి యున్నది.

పూర్వగాంగులకు వలెనే వజ్రహస్తునికిని, అతని సంతతివారికిని కూడ కళింగ నగరము ప్రధానరాజధాని. ద్వితీయ రాజధాని దంతిపురము. దంతిపురమునుండి వజ్రహస్తదేవుడిచ్చిన తామ్ర శాసనమే ఒకటి కలదు. ప్రాయికముగ, ఈ దంతిపురము దంతపురమే అగునేమో. పొరపాటున దంతిపురమని వ్రాయబడి యుండవచ్చును. శ్రీకాకుళము జిల్లాలోని ఇప్పటి ముఖలింగమే పూర్వపు కళింగవగరముగ చరిత్రకారులు గుర్తించియున్నారు. ఇదివరలో నుడివినట్లు తామ్రశాసనములతోపాటు గాంగ వంశజుల శిలా శాసనములు దొరకుట కూడ ఈ వజ్రహస్తదేవుని నాటినుండియే ఆరంభము. ఈతని శిలాశాసనములలో



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఒక వింత కనబడును. ఈతని కుమారుడైన దేవేంద్రవర్మ రాజరాజ దేవుని శాసనముల ప్రకారము ఈతడు ముప్పది మూడు సంవత్సరములు రాజ్య మేలెను. కాని, సంపూర్ణ వంశావళిని ఇచ్చిన ఇతని పౌత్రుడైన అనంతవర్మ చోడ గంగ దేవుని శాసనముల ప్రకారము ఇతడు రాజ్య మేలినది 30 సంవత్సరములే. ఉభయుల శాసనములలోను ఈ వ్యత్యాసము కలుగుటకు కారణము తెలియదు. ఎట్లయినను కొడుకు రాజరాజ దేవుడు చెప్పినదే సరియైనదిగ గ్రహించి ఈతడు 33 సంవత్సరములు రాజ్యమేలినట్లే చరిత్రకారులు నిర్ణయించినారు. ఇది అట్లుండ ముఖలింగములోని వజ్రహస్త శిలాశాసనములు 35, 39 రాజ్యసంవత్సరముల నాటివి కూడ గలవు. అన్నేండ్లు వజ్రహస్త దేవుడు రాజ్యము చేసియుండ లేదని అతని సంతతి వారు చెప్పుచున్న విషయము సత్యమే అయిన ఈ 35, 39 సంవత్సరములకు అర్థమేమి? వీనిని సమన్వయించుట ఎట్లు?



చిత్రము 40. శ్రీమేశ్వరాలయము : ముఖలింగము

పాలించిన కటకము గజపతులయొక్క శాసనములవలన తెలియుచున్నది. ఇది యొక విధమైన సంవత్సర చక్రము. ఇందు చాంద్ర-సౌరమాన సంవత్సరములు పది తొమ్మిది మాత్రమే ఉండును. ఇందలి మాసములు ఇప్పటి మన మాసములవలె అమాంతములు కాక పూర్ణిమాంతములు. ఈ పద్ధతిలో భాద్రపద శుద్ధ 12 తో సంవత్సరము ఆరంభమగును. కాని ఇందలి విచిత్రము ఏమన, భాద్రపద శు 12 దినమును సంవత్సరమున మొదటి దినముగ కాక పండ్రెండవ దినముగ లెక్కింతురు. ప్రతి భాద్రపద శుద్ధ ద్వాదశికిని క్రొత్త సంవత్సరము వచ్చును. ఈ రీతి పరిగణన పద్ధతికి అంకచక్రమని పేరు. ఈ పద్ధతిలో ఒకటవ, ఆరవ సంవత్సరములను, ఆరుతోను (పది తప్ప) సున్నతోను అంతమగు సంవత్సరములను లెక్కింపక వదలివేసెదరు; అనగా అయిదుకు పిదప లెక్కకు వచ్చునది ఏడు; పదునైదుకు పిదప పదునేడు, పందొమ్మిదికి తరువాత ఇరువది యొకటి - ఇది పరిగణన విధము. ఆ యంకెలను ఇట్లు లెక్కలో వదలివేయుటకు కారణము ఏదో తెలియదు. పైని చెప్పిన 35, 39 లు వజ్రహస్త దేవుని అంక సంవత్సరములు; అతని రాజ్యపాలన సంవత్సరములు కావు. వానిలోనుండి వదలివేయవలసిన అంకెలను తీసివేసినచో వచ్చునవి రాజ్య సంవత్సరములు. ఈ రీతిని 35 వ అంక వత్సరము 29 వ రాజ్య సంవత్సరమును, 39 వ అంకవత్సరము సరిగా 32 వ రాజ్య

**అంకచక్రము** : ఇది పూర్వము గంజాము మండలమున రాజుల రాజ్యపరిపాలన కాల పరిగణనము చేయుటలో ఉపయోగింపబడుచు వచ్చిన ఒక విధమయిన గణనపద్ధతి. ఈ పద్ధతి ఎప్పటినుండి వాడుకలో ఉండెనో తెలియదు. కాని, క్రీస్తు శకము పదునొకండవ శతాబ్దమునుండి కళింగోత్కల దేశములయందు వాడుకలో ఉండినట్లు కళింగమును పాలించిన గాంగవంశజుల యొక్క, ఉత్కలమును



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సంవత్సరమును అగుచున్నవి. కావున వజ్రహస్తదేవుడు 33 సంవత్సరములు రాజ్యమేలెననుటలో విప్రతిపత్తి ఏదియు లేదు. ఈ పరిగణన పద్ధతిలో గమనింపవలసిన మరియొక విషయము కలదు. ఏరాజయినను ఒక యంక సంవత్సరము మధ్యనే గతించిన యెడలను, అటు తరువాత రాజ్యమునకు వచ్చినవాని మొదటి అంక సంవత్సరము పండ్రెండు మాసములు పూర్తికాక మునుపే భాద్రపద శుద్ధ 12 వచ్చినయెడలను ఆ యంక సంవత్సరము అంతటితోనే అంతమగును. ఈ రీతిని గతించిన రాజు చివరి అంక సంవత్సరమును, తరువాత వచ్చినవాని మొదటి అంక సంవత్సరమును ఒక్కమారే అంతమగును.

వజ్రహస్తదేవుని శాసనములవలన గాని, అతని సంతతివారి శాసనముల వలన గాని అతని రాజ్య పరిపాలనమునకు సంబంధించిన విశేషములు ఏవియు తెలియవు. ఇంతవరకు దొరకిన అతని తామ్ర శాసనములును, శిలాశాసనములును అతడు చేసిన దానములను మాత్రమే తెలుపును గాని అంతకు మించి చారిత్రక విశేషములను వేనిని తెలుపవు. దీనిని అనుసరించి చూడగా అతని పరిపాలన మొదుదొడుకులు లేకుండ సాగిపోయినట్లు అనిపించును గాని అతని చివరి సంవత్సరములు అంత శాంతముగ గడచినట్లు కనబడదు. ఇదివరలో చోళులును, పూర్వ చాళుక్యులును కళింగముపై దండెత్తి వచ్చినట్లును, కళింగ గాంగ నృపతులను వారు ఓడించినట్లును తెలిసికొంటిమి. కాని విజయము పొందిన సైన్యములు కళింగమునుండి వెళ్ళిపోయినంతనే గాంగ భూపతులు ఎప్పటివలెనే స్వతంత్రులై రాజ్యమును పాలించుచు వచ్చిరి. మొత్తము మీద చోళ, పశ్చిమ చాళుక్య, పూర్వ చాళుక్య యుద్ధ రంగములలో అప్పటి పరిస్థితులను అనుసరించి కళింగాధిపతులు జోక్యము కలిగించుకొనక తప్పినదికాదు. చోళ పశ్చిమ చాళుక్య యుద్ధము సందర్భమున వీరరాజేంద్ర చోడచక్రవర్తి (క్రి. శ. 1063 - క్రి. శ. 1069) కళింగముపై వజ్రహస్తదేవుని కడపటి సంవత్సరములలో దండెత్తి వచ్చి అతని నోడించెను. వీరరాజేంద్ర చోడుని కళింగ దండయాత్రలకు పూర్వ చాళుక్య వంశజుడు, రాజరాజ నరేంద్రుని సవతి తమ్ముడు అయిన ఏడవ విజయాదిత్య భూపతి కారణము.

విజయాదిత్యుడు పూర్వచాళుక్య రాజరాజ నరేంద్రుని మరణానంతరమున పశ్చిమ చాళుక్య భూవరుల సాయముతో ఆక్రమించుకొన్న వేంగిరాజ్యమునకు తన కుమారుడైన రెండవ శక్తివర్మను పట్టము కట్టెను (క్రి. శ. 1061). కాని, దురదృష్టవశమున అతడు ఒక్క సంవత్సరము మాత్రమే రాజ్యము చేసి దివంగతుడు అయ్యెను. ఈ తడవకూడ విజయాదిత్యుడు రాజరాజనరేంద్రుని తనయుడైన రాజేంద్రచోడ కుమారునికి అతని పైతృకమైన వేంగి రాజ్యమును వశము కానీయక పశ్చిమ చాళుక్య సాహాయ్యముతోనే వేంగి చాళుక్య సింహాసనమును అధిష్ఠించెను. అప్పటినుండి వేంగిదేశములో చోళచక్రవర్తుల పలుకుబడి, ప్రభావము తగ్గిపోయెను. వీరరాజేంద్ర చోడుడు పశ్చిమ చాళుక్యులను ఓడించి విజయాదిత్యునికి తగిన శాస్తి చేసి వేంగిదేశమున చోళుల ఆధిక్య ప్రభావములను మరల ప్రతిష్ఠించుటకు వేంగిపై పలుమారులు దండెత్తి వెళ్లెను. కళింగాధిపతులు కూడ పశ్చిమ చాళుక్యులతో కలిసి చోళసైన్యములను ఎదిరించుటచేతనో, పశ్చిమ చాళుక్యులు అదివరకు జయించిన చక్రకూటము మొదలగు కళింగ పరిసరప్రాంతమును మరల వశపరుచుకొను ప్రయత్నమునందో వీరరాజేంద్రచోడుడు కళింగమునుకూడ జయించుట కలిగినది. వీరరాజేంద్ర చోడచక్రవర్తి క్రి. శ. 1069 - 70 వరకే జీవించి యుండుటచేత ఈ దండయాత్రలు వజ్రహస్త దేవుని కడపటి రాజ్యసంవత్సరములలోనే జరగి యుండవలయును. వజ్రహస్తుడు శకవర్షము 992 లో కాలధర్మము నొందెను.



చిత్రము 41. శ్రీమేశ్వరాలయముయొక్క ఉత్తరపు వైపు గోడపై శిల్పము, ముఖలింగము

వజ్రహస్తదేవుని గురించి ఇతని పుత్ర పౌత్రులు రాజరాజ, చోడగంగదేవుల శాసనములలోను, గాంగుల ఇతర



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తామ్రశాసనములలోను అతడు పడుచున్న పిడుగును అతి వేగముగా వచ్చి కడువిక్రమముతో అవలీలగా తన శస్త్రముచేతను నివారించినట్లు తెలుపబడినది. దీనిని ఆతడు ఎక్కడ ఎప్పుడు నివారించెనో తెలిసికొనుట కాధారములు లేవు కాని ఇది వట్టి అబద్ధమని త్రోసిపుచ్చుటకు వీలులేదని కొందరి అభిప్రాయము. ముఖలింగాలయము నందును, పార్వతీపురము తాలూకాలోని నీలకంఠేశ్వరాలయము నందును, అరసవిల్లి సూర్యాలయమునందును ఈ యనంతవర్మ వజ్రహస్తదేవుని శిలాప్రతిమలు కలవని చెప్పుదురు. ఈ విషయమును గురించి శ్రీ కర్రి సాంబమూర్తి శాస్త్రిగారు వ్రాసిన ఈ క్రింది పంక్తులు విచారణీయములు·

'ఈ యశనిపాతము, తదభిఘాతము నెక్కడ జరగిన వనుటకు శాసనాధారములు కాని, గ్రంథాధారములు కాని కానరాలేదు. ఐనను ప్రబలమగు జనశ్రుతి యొకటి మహేంద్రగిరి ప్రాంతమున గలదు. కలవుగదా మందసా కొండ (మహేంద్రము) పైని గోకర్ణేశ్వరాలయము మొదలగు దేవాయతనములు. అక్కడ పంచపాండవులచేతను, కుంతీ ద్రౌపదులచేతను నిర్మింపబడిన ఆలయములును, ప్రతిష్ఠింపబడిన శివలింగములును గలవు. అవి పాండవులచే నిర్మింపబడిన యాలయము లగునో కావో కాని ఇటికలు, సున్నము, కలప, లోహము ఏవియు లేక మలచిన పెద్ద పెద్ద రాతిపలక లొకదానిపై నొకటిగా పేర్చబడిన కేవల శిలామయములు. వానిలో నొకదానిపై నొకప్పుడు పిడుగు పడగా నొక మహారాజు దానిని వారించెనట. అంతట నాలయము భగ్నముకాక యథాపూర్వస్థితిలోనే నేటికిని నిలిచియున్నది. ఆయాలయోపరిభాగమున నా పిడుగు పాటును సూచించు-సూర్యకాంతి ప్రసరించు-చిన్నపగులు మాత్రము కలదు. ఇది ఇక్కడి కింవదంతి. మునిమార్గగామియగు నారాజన్యుడు · తపఃప్రభావము వలననో, శస్త్రాభిఘాతముననో యశనిని నివారించుట మాత్రము నిక్కమే యైయుండును. ఆ రాజన్యుడు సుప్రసిద్ధ యశోవిభూషితుడగు మన వజ్రహస్తదేవుడే యని వేరుగ దెలుప నక్కరలేదు కదా.'

వజ్రహస్త దేవునికి విజయమహాదేవి, ధర్మసత్తి (? శక్తి) రాజతనయ మారజయ మహాదేవి, అనంగమహాదేవి, రాజసుందరి, పృథివీ మహాదేవి యని యైదుగురు భార్యలు కలరు. వీరిలో విజయమహాదేవి హైహయ వంశజ యని తెలియుచున్నది. రాజసుందరి చోళరాజతనయ. మిగిలిన వారు ఏ వంశమువారో తెలియరాలేదు. వజ్రహస్తదేవుని భార్యలలో పృథివీ మహాదేవి అగ్రమహిషి అని శాసనములు తెలుపుచున్నవి. ఈ గాంగరాజులు హైహయులతోను, కదంబులతోను, వైదుంబులతోను, పూర్వచాళుక్యులతోను, చోళులతోను సంబంధ బాంధవ్యములు చేసి తమ రాజ్యమును బలపరచుకొనిరి.

**దేవేంద్రవర్మ రాజరాజదేవుడు** (క్రి. శ. 1070 - క్రి. శ. 1078): వజ్రహస్తదేవుని తరువాత గాంగ సింహాసనము ఎక్కినవాడు అతని కొమారుడు రాజరాజదేవుడు. ఇతనికి దేవేంద్రవర్మ అనియు, త్రికళింగాధిపతి అనియు బిరుదములు కలవు. ఇతడుకూడ శైవుడు, పరమ మాహేశ్వరుడు; పరమ భట్టారకుడు; మహారాజాధిరాజు. ఇతని తల్లి అనంగ మహాదేవి. ఈమెకు నంగమ అని నామాంతరము. రాజరాజదేవుడు శకము 992 వ సంవత్సరమున జ్యేష్ఠశుద్ధ అష్టమీ గురువారమునాడు ఉత్తర ఫల్గునీ నక్షత్రమున సింహలగ్నమునందు (క్రి. శ. 1070 మే 20 వ తేదీ) కళింగ రాజ్యమునకు పట్టాభిషిక్తుడై ఎనిమిదేండ్లు రాజ్యమేలెను. ఇతని రాజ్యకాలమునాటి విశేషములు ఇతని కొమారుని శాసనములవలనను, ఇతని సంతతివారి శాసనములవలనను తెలియుచున్నవి. వీనిలో మొదట చెప్పవలసిన విషయము ఇతడు రాజేంద్ర చోడదేవుని ద్రమిళాహవమునందు జయించి అతని కూతురు రాజసుందరిని వివాహ మాడుట.

రాజరాజదేవుడు సింహాసన మెక్కిన క్రొత్తలోనే అతడు అనుసరించిన రాజకీయనీతివలన కళింగముమీదికి శత్రువులు దండెత్తి వచ్చిరి. ఈ కళింగదండయాత్రకుకూడ పూర్వ చాళుక్య వంశజుడును, రాజరాజనరేంద్రుని సవతి తమ్ముడును అయిన (సప్తమ) విజయాదిత్యభూపతి కారణము.

వీరరాజేంద్రచోడుడు మృతినొందిన వెంటనే రాజేంద్ర చోడుడు కొంత సైన్యమును కూర్చుకొని వేంగిపై దండెత్తి వచ్చి పినతండ్రియైన విజయాదిత్యుని తరుమగొట్టి క్రి. శ. 1070 (శకము 992) లో గాంగ రాజరాజ దేవుడు కళింగ సింహాసన మెక్కిన సంవత్సరమునందే వేంగీ సింహాసనము నధిష్ఠించెను.

వేంగిలో రాజేంద్రచోడునితోడి యుద్ధమున పరాజితుడైన విజయాదిత్యుడు కళింగమునకు పారిపోయి గాంగ రాజరాజదేవుని శరణుచొచ్చెను. రాజేంద్రచోడుడు విజయాదిత్యుని, అతనికి శరణమిచ్చిన రాజరాజదేవుని శిక్షించుటకై కళింగముపై దండెత్తి వెళ్ళెను. రాజరాజ దేవునికి రాజేంద్రచోడునికి భయంకర యుద్ధము జరగెను. ఇది క్రి. శ. 1070-71 లో జరగియుండునని ఊహించుటకు అవకాశము కలదు. ఈ యుద్ధములో రాజేంద్రచోడుడు పరాజయమునొంది తన కూతురు రాజసుందరిని రాజరాజ దేవునికి ఇచ్చి అతనితో సంధి చేసికొనెను. ఈ సంధి ననుసరించి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



విజయాదిత్యుడు జీవించియున్నంతకాలము వేంగీ దేశాధిపతిగా ఉండుటకు నిర్ణయమయ్యెను.

రాజసుందరి తండ్రియు, రాజరాజదేవునిచేత ఓటువడిన వాడును అగు చోళ పృథ్వీపతి రాజేంద్రచోడుడు ఎవ్వరు, ఈ యుద్ధము ఎప్పుడు జరగినది అను విషయమున చరిత్రకారులలో భేదాభిప్రాయము కలదు. కొందరు రాజేంద్రచోడుడు క్రీ. శ. 1068 నుండి 1069-70 వరకు పరిపాలించిన వీరరాజేంద్రచోడు డనియు, ఈ యుద్ధము రాజరాజదేవుని రాజ్యకాలమున గాక అతని తండ్రి అనంతవర్మ



చిత్రము 42. భీమేశ్వరాలయముయొక్క దక్షిణపువైపు గోడపై శిల్పము, ముఖలింగము.

వజ్రహస్తదేవుని పరిపాలన కాలము కడపటి సంవత్సరములలో జరగినది అనియు చెప్పుదురు. కాని, అప్పటి రాజకీయ పరిస్థితిని గమనించినచో ఈ యుద్ధము రాజరాజదేవుని రాజ్యప్రారంభ సంవత్సరములలోనే జరగి యుండు ననియు, రాజసుందరి తండ్రి రాజరాజనరేంద్రుని కుమారుడు రాజేంద్రచోడుడే అగు ననియు నిశ్చయింప వీలున్నది.

రాజరాజదేవుడు కడు పరాక్రమ వంతుడు. ఇతని వంశానుగత ప్రతీహారి ముఖ్యుడు బణపతి అను బ్రాహ్మణుడు - ఆత్రేయ గోత్రుడు, గోకర్ణసుతుడు. బణపతికి చలమర్తి గండడు, గండ గోపాలుడు అని బిరుదములు కలవు. రాజరాజదేవుని సామంత మండలికుడైన ఇతడు తన బాహుబల పరాక్రమములతో ఇరుగు పొరుగు రాజ్యములను జయించి గాంగరాజుల అధికారమును విస్తరింప జేసెను. వేంగీ భూవరుని పలుమారులు జయించి అతని యఖిలవస్తు రాశిని చూరగొనెను. ప్రాయికముగా మొదటినుండియు కళింగ గాంగరాజులు విజయాదిత్యుని పక్షము అవలంబించి అతనికి సాయము చేయుచు వచ్చిరేమో, విజయాదిత్యునికి రాజేంద్రచోడునికి వేంగిని గూర్చి జరగిన యుద్ధములలో ఈతడు అప్పటి వేంగిరాజును జయించి యుండవచ్చును. ఈతడు చోళులను ఓడించినట్లు చెప్పుకొని యున్నాడు. బహుశః తన ప్రభువైన రాజరాజదేవునికి రాజేంద్రచోడునికి జరగిన ద్రమిళాహవములోనే చోళ సైన్యమును ఓడించి యుండును. ఇతడు కళింగ పరిసరములలో ఉన్న కోసల, ఉత్కల దేశములపై దండెత్తి కోసలాధిపతిని నిర్జించి ఉత్కల గజాశ్వసైన్యాధీశులను ఓడించెను. ఈ కోసలము దక్షిణ కోసలము (ఒరిస్సాలోని శోణపుర, సంబలపుర,

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ప్రాంతమును, మధ్యప్రదేశ్‌లోని రాయపూరు, దుర్గ్, బిలాస్‌పూరు జిల్లాలతోకూడిన ఛత్తీస్‌గఢ్ డివిజను ప్రాంతమును కలిసిన ప్రదేశము). ఉత్కలము ఓఢ్ర (ఒడ్డె) దేశము; ఒరిస్సాలోని దక్షిణ భాగము. ఉత్కల, కోసలములందు రాజరాజదేవుని కాలమున పరిపాలించుచుండిన సమకాలికులు ఎవ్వరో తెలియదు కాని సోమవంశపురాజులు మొదలైనవారు అనేకులు కలరు. వీరి శాసనములును అనేకము దొరకినవి. కాని వానిలో విజయరాజ్య సంవత్సరములనో, ఇంతవరకు తెలియరాని ఒక శకమునకు చెందిన వత్సరములనో ఇచ్చుటచేత రాజరాజదేవుని సమకాలికులు ఎవ్వరో నిరూఢముగ తెలిసికొనుటకు వీలగుట లేదు. అదియునుగాక ఈ సోమవంశ, శర, భంజాది వంశముల రాజ్యములలో ఏ దేది ఎంతవరకు వ్యాపించెనో కూడ తెలియదు. బణపతి ఉత్కల, కోసలులను మాత్రమే కాక గంజాము జిల్లాలోని కిమిడి, గిడ్రిసింగి దేశాధిపతులను, దద్దార్ణవుని కూడ యుద్ధములో ఓడించెను. ఈ దద్దార్ణవుడు ఎవ్వడో ఇంతవరకు తెలియరాలేదు. ఈ విధముగా రాజరాజదేవుని సామంత మండలికుడైన బణపతి కోసల, ఉత్కలాదులను జయించినట్లు తెలుపు శాసనము శకవర్షము 997 (క్రీ. శ. 1075)నాటి దగుటచేత ఈ విజయములన్నియు అంతకు పూర్వమే జరగి యుండవలెనని తెలుచున్నది. సామంత మండలికుడైన బణపతి భార్య పద్మావతి. బణపతి దీర్ఘాసి భగవతి దేవాలయమున ముందటి మండపము ఎత్తించిన విషయమును, అతని భార్య పద్మావతి ఆ దేవికి దీపదానము చేసిన విషయమును తెలుపు శాసనముననే పై విషయము లన్నియు తెలుపబడినవి. రాజరాజదేవుడే ఉత్కల, కోసలాదులను జయించి గాంగరాజ్యమును విస్తరింప చేయుటకు తలపెట్టిన మొదటి అర్వాచీన గాంగనృపతి. రాజరాజదేవుని ప్రధాని బ్రహ్మచక్రవర్తి బణపతి శాసనము ఒకటి దాక్షారామములో ఉన్నది. బణపతి భార్య పద్మావతి శకవర్షము 1008 (క్రీ. శ. 1081)లో ఉత్తరాయణ సంక్రాంతినాడు భీమేశ్వర మహాదేవరకు చేసిన దీపదానమును అది తెలుపును. శకవర్షము 1008 నాటికి దేవేంద్రవర్మ రాజరాజదేవుడు లేడు. అతని కొడుకు అనంతవర్మ చోడగంగదేవుడు రాజ్యము చేయుచుండెను. అయినను బణపతి ఇదివరలో రాజరాజదేవుని ప్రధానిగ ఉండుటచేత ప్రభువు గతించిన తరువాతకూడ తాను అతని ప్రధాని నని చెప్పుకొనుచుండినట్లు తలపవలెను. ఈ బణపతియు, పూర్వోక్త విజయములు సాధించిన బణపతియు ఒక్కడే. ఇతడు ఈ తడవ వేంగిరాజ ప్రతినిధి సాహాయ్యార్థము వేంగికి వచ్చియుండును.

దేవేంద్రవర్మ రాజరాజదేవుడు రాజసుందరిని పరిణయమాడి నప్పటినుండి ఆమెయే అగ్రమహిషి అయ్యెను. రాజరాజ దేవునికి ఆమెయందు అనంతవర్మ చోడగంగదేవుడను కుమారుడు కలిగెను. ఇతనికి 'ఉశగియ వంద పెర్మనడి' అని ఒక సోదరుడు కలడు. ఇతడు చోడగంగ దేవుని ప్రియబాంధవుడట.

**అనంతవర్మ చోడగంగదేవుడు** (క్రీ. శ. 1078—క్రీ. శ. 1152): ఇతడు బాలుడగుటచేత ఇతని దాయాదులు కుంతల చాళుక్యులతో కలసి ఇతనిని సింహాసన మెక్కకుండ నిరోధించి కలహము రేపిరి. అనంతవర్మ చోడగంగు దాయాది దేవేంద్రవర్మగా తెలియవచ్చుచున్నాడు. మొదటి వేంగీ రాజ ప్రతినిధిగా వచ్చిన వెంటనే రాజరాజ ముమ్మడి చోడుడు తన మేనల్లుడైన అనంతవర్మ చోడగంగును రక్షింపవలసిన బాధ్యత వహింపవలసి వచ్చినది. అతడు గొప్ప సైన్యమును తీసికొని అతనికి విశ్వాసపాత్రుడైన సేనాని ముమ్మడి భీమునితోను, ఇతర సామంతులతోను కలసి వెంటనే కళింగముపై దండెత్తెను. దేవేంద్ర వర్మాదులు వేంగీ చాళుక్య సైన్యములను మార్కొని గొప్ప యుద్ధము చేసిరి. ఆ యుద్ధమున దేవేంద్ర వర్మయు, అతని మిత్రులును, సామంతులును పూర్తిగ పరాజితులై పారిపోయిరి. విజయము నొందిన రాజరాజ ముమ్మడి చోడుడు అనంతవర్మ చోడగంగ దేవుని గాంగ సింహాసనమున ప్రతిష్ఠించి వేంగికి మరలిపోయెను. అంతటినుండి కళింగము వేంగికి రక్షిత రాజ్య మయ్యెను. వేంగీ రాజ్యమునకు మహేంద్రగిరి ఉత్తర సీమావధి యైనది. అనంతవర్మ చోడగంగదేవుడు యువరాజుగ తండ్రితో కలసి కొద్ది వత్సరములు రాజ్యము చేసిన ట్లూహింప అవకాశము కలదు. ఇతడు శకవర్షము 999 లో (క్రీ. శ. 1078, జనవరి 29 వ తేదీని) కళింగ రాజ్యమునకు పట్టాభిషిక్తు డయ్యెను. రాజ్యాభిషేకము జరగునాటికి ఇతడు ఎనిమిది తొమ్మిది ఏండ్ల బాలుడు. అయినను బణపతివంటి ప్రధానులును, ఇతర గాంగరాజ సామంత మండలిక దండనాయకులును అతనికి బాసటయై రాజ్యమును కాపాడుచు వచ్చిరి.

చాళుక్య రాజరాజ నరేంద్ర వైమాత్రేయ సోదరుడైన సప్తమ విజయాదిత్యుని పక్షమును అవలంబించి చోడగంగ దేవుని తండ్రియైన దేవేంద్రవర్మ రాజరాజదేవుడు రాజేంద్ర చోడునితో చేసిన యుద్ధమున విజయమునొంది అతనిని వేంగిలో నిలిపిననాటి నుండియు ఏవిధమైన పొరపులును లేక వేంగీ, కళింగములు చాల కాలము మైత్రి కలిగియుండెను. కాని ఈ మైత్రికి అనంతవర్మ చోడగంగ దేవుని దాయాదియగు దేవేంద్రవర్మ తలవనే మొదటి





http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కులోత్తుంగ చోడదేవ చక్రవర్తి పరిపాలన కాలము ప్రథమార్ధములో భంగము కలిగినది. దేవేంద్రవర్మ అనంతవర్మ చోడగంగదేవుని ప్రభువుగా అంగీకరించక స్వతంత్రుడై పరిపాలనము నెరప మొదలిడి, అతనికి ఏటేట చెల్లింపవలసిన కప్పము కట్టుట మానెను. అంతే కాక, స్వతంత్ర పరిపాలన సూచకముగ రాజ్యమునకు సంబంధించిన వ్యవహార పత్రము లందు తన విజయరాజ్య సంవత్సరములనే పేర్కొనుచు వచ్చెను. కొలని ప్రాంతమును పరిపాలించుచుండిన చాళుక్య చోళ శత్రువు కళింగ భీమునికి శరణ మిచ్చెను. కళింగము అనంతవర్మ చోడగంగ దేవుని బాల్య దశలో వేంగి సంరక్షితరాజ్య మగుటచేత ఈ విషయ మంతయు రాజప్రతినిధులకును, కులోత్తుంగ చోడ చక్రవర్తికిని తెలియచేయ బడినది. దేవేంద్రవర్మ ఉత్తర కళింగమును పాలించుచుండెనేమో అతనిని, అతని మిత్రులను, సామంత మండలికులను సాధించుటకు సేనా సమేతులైన పరాక్రమ పాండ్య, కరుణాకర తొండమానులను, వేంగీ మండలికులను తోడిచ్చి కులోత్తుంగుడు విక్రమచోడ రాజకుమారుని కళింగముపై పంపెను. చాళుక్య చోళ సైన్యములు ఉత్తర కళింగమును విధ్వంసము కావించినవి. దేవేంద్ర వర్మయు, అతని మిత్ర సామంత సైన్యమును చాళుక్యచోళ సైన్యములను యుద్ధ రంగమున ఎదుర్కొని ఘోర సంగ్రామమును కావించినవి. ఈ భయంకర యుద్ధమున దేవేంద్రవర్మయే కాక అతనికి తోడుగా వచ్చిన కోసలఖండపాల సామంతులును పరాజయము నొంది పిక్క బలమును చూపిరి. శత్రువుల ఏనుగులు మొదలయినవి పరాక్రమ పాండ్యాదులకు లభించినవి. వీనిని గొనిపోయి వారు తమ ప్రభువైన త్రిభువన చక్రవర్తి రాజేంద్రచోడ దేవుడను కులోత్తుంగ చోడ చక్రవర్తికి కానుకగా ఇచ్చిరి. మరల కళింగ దేశమున అనంతవర్మ చోడగంగదేవుని అధికారము సుప్రతిష్ఠితమయినది. ఈ యుద్ధ విషయమే 'కళింగత్తుప్పరణి' అను తమిళ కావ్యమున అభివర్ణితమయినది. ఈ యుద్ధము ప్రాయికముగా వీరచోడుడు వేంగిని రెండవ తడవ రాజప్రతినిధిగా పరిపాలించిన చివర కాలమునవో, కొంచెము అటు తరువాతనో జరగి యుండును. కులోత్తుంగ చోడుని పరిపాలన కాలమున కళింగముపై రెండు దండయాత్రలు ఉండినట్లు చోళ చరిత్రకారులు చెప్పుదురు కాని వారు రాజరాజ ముమ్మడి చోడుని పరిపాలన కాలమున జరగిన కళింగ దండయాత్రను పరిగణింపరు. విజయము లభించిన ఈ కళింగ దండయాత్ర కులోత్తుంగ చోడచక్రవర్తి 28వ విజయరాజ్య సంవత్సరము (శ. 1018) నాటి శాసనములలో ప్రస్తావిత మయినది. అంతేకాక ఆ చక్రవర్తి 29వ విజయరాజ్య సంవత్సరము (శ. 1021) నాటి శాసన మొకటి సింహాచలములో ఉన్నది. ఇది అతని కళింగ విజయమునకు తార్కాణము. ఈ కులోత్తుంగ చోడచక్రవర్తి పరిపాలన కాలములోనే మరియొక కళింగ దండయాత్ర ఉన్నట్లును, ఈ దండయాత్ర విషయము అతని 40వ విజయ రాజ్య సంవత్సరమునాటి, అటు తరువాతి శాసనములలో పేర్కొనబడినట్లును చోళ చరిత్రకారులు చెప్పుదురు కాని అట్టి దొకటి ఉన్నట్లు ఆధారము లేదు (చూడు; చాళుక్య చోళులు).

అనంతవర్మ చోడగంగు కాలమునుండి గాంగులు దక్షిణాపథ రాజన్యులలో ప్రముఖులైరి. ఇతని తండ్రి రాజరాజ దేవుడు గాంగ రాజ్యమును విస్తరింప జేయుటకు చేసిన ప్రయత్నము అనంతవర్మ చోడగంగదేవుని కాలములో ఫలించినది. ఇతని కాలమే గాంగ రాజ్యమునకు మహోన్నత దశ. ఇతడు శైవ, వైష్ణవ మతములను సమముగ ఆదరించి మొదట తాను పరమ మాహేశ్వరుడు అని చెప్పుకొన్నను తరువాత పరమ వైష్ణవుడయ్యెను; అయినను ఉభయ మత సమత్వమును కార్యరూపమున చూపెను. ఇతనివి దాదాపుగా ఎనిమిది తొమ్మిది తామ్రశాసనములును, అత్యధికముగా అనేక శిలాశాసనములును దొరకినవి. ఈ శిలాశాసనములలో కానవచ్చు ఇతని కడపటి విజయరాజ్య సంవత్సరము 75. ఇంత దీర్ఘకాలము గాంగ వంశజులలో మరెవ్వరును రాజ్యము చేయలేదు. ఇతని సంతతివారు ఇతడు 72 సంవత్సరములే రాజ్యము పాలించినట్లు చెప్పియున్నారు. ఇతడు తాను రాజ్యము చేయుచుండగనే తన కొమారునికి పట్టము కట్టెను. ఇతని శిలాశాసనములు అన్నియు దానములను తెలుపునవే కాని చరిత్రాంశములను తెలుపవు. అట్టివి ఒకవేళ ఉన్నచో చాలకొలది.

చాళుక్యులతోను, చోళులతోను ఇతనికి గల సంపర్గ సంబంధములు కారణములుగా చిన్ననాటినుండియు ఇతనికి గాంగరాజ్యమును పెంపొందించు కోరిక కలిగెను. పశ్చిమ చాళుక్యులు, చాళుక్య చోళులు, కళచురి రత్నపురాధీశ్వరులు ఎల్లరును ఆ కాలమున ఇట్టి ప్రయత్నమున ఉండిన వారే. ఆ కాలము అట్టిది. అట్టి ఆకాంక్షయే అనంతవర్మ చోడ గంగదేవునికిని కలిగినది. ఈ యుద్దేశముతో అతడు వయసు వచ్చినప్పటినుండి క్రమముగా రాజ్యవ్యవస్థను చక్కబరచుకొని సైన్యమును వృద్ధిచేసికొని దిగ్విజయమునకు పూనుకొనెను. ముందు అతడు పశ్చిమోత్తర దిశలను సాధింప దలపెట్టెను. గాంగరాజ్యమునకు పశ్చిమ దిశను వేంగియు, దక్షిణకోసలమును ఉండెను. అనంతవర్మ

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చోడగంగు రాజ్యాభిషిక్తుడు అగునాటికి వేంగిదేశమును కులోత్తుంగ చోడభూపతి కుమారులు రాజప్రతినిధులుగ పరిపాలించుచుండిరి. వీరికి వెలనాటి దుర్జయులు, కోనసీమ హైహయులు, కోట వంశజులు, కొలని నాయకులు మొదలైన మండలికులు సామంతులుగ ఉండిరి. ఇక దక్షిణ కోసలమున చేది హైహయులును, సోమవంశ్యులును పరిపాలించుచుండిరి. దక్షిణకోసలమునకు మహాకోసల మనియు పేరు. చేది రాజులకు హైహయులని, కళచురి రాజులని పేరు. వీరిలో మధ్యప్రదేశ్ లోని జబ్బల్పూరుకు పడుమరగా ఆరు మైళ్ల దూరమునం దున్న ఇప్పటి తేవార్ రాజధానిగా పాలించినవారు, తుమ్మాణము రాజధానిగా దక్షిణ కోసలములోని కొంత ప్రదేశము పరిపాలించినవారు అని రెండు శాఖలు కలవు. ఈ రెండవశాఖ వారిలో మొదటి రత్నదేవుడు తన పేర ఒక నగరము కట్టించిన పిదప అతని సంతతివారికి అది రాజధాని అగుటచేత ఈ రెండవశాఖ వారికి రత్నపుర హైహయులని వ్యవహారము కలిగినది. రత్నపురి హైహయ రాజ్యము కళింగ గాంగ రాజ్యమునకు పొరుగున ఉన్నది. అది ఇప్పటి రాయపూరు, దుర్గ్, బిలాసపూరు జిల్లాలతో కూడిన ఛత్తీస్‌గఢ ప్రాంతము. వీరిలో మొదటి రత్నదేవుడు, ఇతని కుమారుడు పృథ్వీదేవుడు, ఇతని కుమారుడు మొదటి జాజల్లదేవుడు (క్రీ. శ. 1114 - క్రీ. శ. 1136), ఇతని తనయుడు రెండవ రత్నదేవుడు (క్రీ. శ. 1136 - క్రీ. శ. 1140), ఇతని సుతుడు రెండవ పృథ్వీదేవుడు (క్రీ. శ. 1140 - క్రీ. శ. 1160), ఇతని కొమారుడు రెండవ జాజల్లదేవుడు (క్రీ. శ. 1160 - క్రీ. శ. 1168) - వీ రందరును అనంతవర్మ చోడగంగదేవునికి సమకాలికులు.

ఇక దక్షిణ కోసలములోని మిగిలిన భాగము, అనగా ఇప్పటి ఒరిస్సాలోని శోణపుర, సంబలపుర ప్రాంతాదులు కూడ గాంగ రాజ్యమునకు పొరుగున ఉన్నవే. వీనిని పాండుసంతతి వారమని చెప్పుకొనిన సోమవంశ్యులు పాలించుచుండిరి. సోమవంశ్యుడయిన జనమేజయుడు తన కుంతాగ్రమున ఓఢ్ర దేశనృపతిని హతము కావించి విజయలక్ష్మిని వరించెను. అప్పటినుండి ఇతని సంతతివారు దక్షిణ కోసలములోని కొంతభాగమును మాత్రమే కాక ఉత్తరమున ఉత్కళములోని (ఓఢ్రదేశములోని) కొంత ప్రదేశమునుగూడ పరిపాలించుచుండిరి. అనంతవర్మ చోడగంగు సమకాలికుడయిన సోమవంశ్యుడు ఉద్ద్యోతకేసరి అని చరిత్రకారుల యభిప్రాయము. ఇతని శాసనము ఒకటి భువనేశ్వరములో దొరకినది. దీనిలో శకవర్షము కాని, విక్రమ శకవర్షము కాని లేకపోవుటచే దానిలోని లిపి తీరునుబట్టి, ఇతర కారణములను బట్టి ఉద్ద్యోతకేసరి రాజరాజదేవ, అనంతవర్మ చోడగంగదేవుల కాలమువాడని నిర్ణయించుచున్నారు. ఉత్కళమునకు ఈశాన్యమున ఎగువమున్న తూర్పు బంగాళమున్నకు సేనవంశజులు పరిపాలకులు. వీరిలో విజయసేనుడు చోడగంగదేవునికి సమకాలికుడు. విజయసేనుడే స్వాతంత్ర్యమును స్థాపించి పైతృకమైన తనరాజ్యమును స్వతంత్రుడై పరిపాలించెను. అనంతవర్మ చోడగంగదేవుని దిగ్విజయ సందర్భమునను, రాజ్యవిస్తరణ సందర్భమునను వీ రందరితోను సంపర్గము కలిగినది.

రత్నపురపు కళచురి రాజులు మొదటి రత్నదేవుడు మొదలుకొని రెండవ జాజల్ల దేవుని వరకు, మొదటి పృథ్వీదేవుడు తక్క, అందరును చోడగంగదేవుని ఓడించినట్లు వారి శాసనములు చెప్పుచున్నవి. కాని వీరు ఎవ రెవరు ఎప్పు డెప్పుడు చోడగంగదేవుని ఓడించిరో మనకు తెలియదు. అదియును గాక, మొదటి పృథ్వీదేవుని శాసనములలో గాని, రెండవ రత్నదేవుని శాసనములలో గాని వారు చోడగంగదేవుని ఓడించిన విషయమే చెప్పబడలేదు. రెండవ రత్నదేవుని సంతతివారయిన కడపటి కళచురి రాజులు మాత్రమే ఈవిషయమును చెప్పుదురు. మొదటి పృథ్వీదేవుని శాసనము కళచురిశకము 831, అనగా క్రీస్తుశకము 1079 నాటిది కానవచ్చుటచేత అతని తండ్రి మొదటి రత్నదేవుడు అంతకు పూర్వము ఉండి యుండవలెను. ఒకవేళ మొదటి రత్నదేవుడు అనంతవర్మ చోడగంగ దేవుని ఓడించుట నిజమే అయినచో అది చోడగంగదేవుని పట్టాభిషేక సందర్భముననో, పట్టాభిషేకమునకు వెనువెంటనో కావలెను. రాజరాజదేవుడు కాలధర్మము పొంది చోడగంగదేవుడు రాజ్యమునకు వచ్చు సంధిసమయము అట్టి దండయాత్రకు అనువైనది. ఈ దండయాత్ర వలన రత్నదేవునికి ఏమియు లాభించినట్లు కానరాదు. ఇతని పౌత్రుడు మొదటి జాజల్లదేవుడు చోడగంగదేవుని ఓడించినట్లు తన శాసనములలో చెప్పలేదు కాని కోసల, ఆంధ్రకిమిడి రాజులను జయించి కప్పము కైకొన్నట్లు మాత్రము చెప్పియున్నాడు. ఈ యాంధ్రకిమిడి రాజరాజదేవుని రాజ్యకాలములో అతని సామంతమండలికుడు జణపతి జయించిన కిమిడియే అగుచో జాజల్లదేవుడు గాంగరాజ్యముమీదికి దండెత్తి వచ్చుట నిశ్చయము. ఈ దండయాత్ర శకము 1036, 1058 (క్రీ. శ. 1114, 1136) సంవత్సరముల నడుమ, అనగా జాజల్లదేవుని రాజ్యకాలములో జరిగినట్లు చెప్పవచ్చును; కాని అంతకంటె సూక్ష్మముగా నిర్ణయించలేము. మిగిలినవా రందరు ఎప్పుడు చోడగంగదేవుని ఓడించిరో తెలియరాదు. చోడగంగదేవుడు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పరాక్రమ ధురీణుడు; గాంగరాజు అందరిలోను సమర్థుడు. ఇతనిని సమకాలికుడయిన ప్రతి కళచురిరాజు ఓడించెననుట అంత విశ్వసనీయ విషయముగా తోచదు. తన పూర్వులలో ఒకడు చోడగంగును ఓడించిన విషయమును తరువాతివారు అనుసరించి ఉండవచ్చును. అయినను ఈ విషయము ఇంకను పరిశీలింపవలసి యున్నది. మొత్తము మీద కళచురిరాజులు గాంగరాజ్యముపై దండెత్తివచ్చుటయో, దానికి ప్రతిగా కాని, జిగీషతో కాని చోడగంగ దేవుడు దక్షిణకోసలపు హైహయులమీదికి దండెత్తుటయో జరగినది. రాయపూరుజిల్లాలో అనంతవర్మ చోడగంగు బంగారు నాణెము ఒకటి దొరకుటనుబట్టి అతడు జిగీషతో కాని, కళచురి దండయాత్రకు ప్రతి దండయాత్రగ కాని కళచురి రాజ్యముపై దండెత్తి వెళ్లుట నిశ్చయము. కళచురి రెండవ పృథ్వీదేవుడు చోడగంగదేవుని, జటేశ్వరుని జయించినట్లు చెప్పుచుండుటవలన జటేశ్వరుడుకూడ ఈ దండయాత్రలో పాల్గొనియుండెనని చెప్పవచ్చును. జటేశ్వరుడు అనంతవర్మ చోడగంగదేవుని కుమారుడు. ఇతనికి కామార్ణవుడు, మధుకామార్ణవుడు అను నామాంతరములు కలవు. మొత్తముమీద రత్నపుర హైహయ రాజులతో కలిగిన పోరాటములో అనంతవర్మ చోడగంగ దేవుడు ఒకమారయినను ఓడిపోయెనని చెప్పక తప్పదు.

రాజరాజదేవుడు ఉత్కళాధిపతిని జయించినట్లు ఇదివరకే తెలుపబడినది. అతడు ఓటువడిన ఉత్కళాధిపతినే తిరిగి రాజ్యమున ప్రతిష్ఠించెనో, లేక మరొకరిని తన ప్రతినిధిగ నియమించెనో తెలియదు. అనంతవర్మ చోడగంగ దేవుని సమకాలికుడయిన ఉత్కళాధిపతి ఉద్ద్యోతకేసరి అని ఊహింపబడుటచేత జనపతి జయించినదికూడ ఈతనినే అనియు, జయించిన పిదప అతనివద్దనుండి కప్పము గైకొని అతని రాజ్యమును అతనికే కొసగి అతనిని గాంగ సామంతునిగ చేసియుండు ననియు తలంచుటకు అవకాశము కలదు. శకవర్షము 1084 నాటి కోర్ని శాసనములో చోడగంగదేవుడు తాను తూర్పు దిశను పదచ్యుతుడైన ఉత్కళపతిని మరల రాజ్యమునందు ప్రతిష్ఠించి, పిదప పడమటి దిశను పదచ్యుతుడైన వేంగిపుని అతని రాజ్యమున నిలిపి వారిరువురి భాగ్యలక్ష్మిని సుస్థిరము చేసినట్లు చెప్పుకొని యున్నాడు. ఈ యుత్కళపతి ప్రాయికముగ ఉద్ద్యోతకేసరియే కావచ్చును; కాని, ఉత్కళపతిని పదభ్రష్టుని కావించిన రాజు పేరు మాత్రము చోడగంగ దేవుని శాసనములలో లేదు. ఈ రాజు బస్తరు ప్రాంతమును, అనగా చక్రకూట రాజ్యమును ఏలుచుండిన రాజభూషణ బిరుదాంచితుడయిన మొదటి సోమేశ్వర మహారాజు కావచ్చును. ఇతడు రాజభూషణ మహారాజ ధారావర్షుని తనయుడు; నాగవంశజుడు. ఇతని శాసనములు శకవర్షము 992 (క్రీ. శ. 1070 - 71) నుండి కాన్పించుచున్నవి. ఇతని అనంతరము ఇతని సుతుడు కన్నరదేవరాజు శకవర్షము 1033 (క్రీ. శ. 1111)లో సింహాసనము నెక్కుటచే మొదటి సోమేశ్వరరాజు అంతవరకు రాజ్యము చేసెననుట నిశ్చయము. ఇతడు తాను ఒడ్డరాయని జయించినట్లును, అర్జునునివలె వేంగిదేశమును ఖాండవ వనమును దహించి వీరచోడ నృపతిని ఓడించి, లంజి రత్నపుర తెమ్మములు అను దేశముల అధిపతులను నిర్జించినట్లును చెప్పుకొని యున్నాడు. ఈ విజయము లన్నియు అతనికి ఒకచే తడవ లభించినవని అనుకొనుటకు వీలులేదు. కాని ఒడ్డరాయని జయించుట మాత్రము అతని వేంగి దండయాత్రలో జరగినట్లు చెప్పవచ్చును. అనంతవర్మ చోడగంగదేవుడు సైన్యమిచ్చి తనకు సామంతుడైన ఒక 'యొడ్డరాయ'ని వీర చోడునికి సాయముగా పంపి యుండును. లంజి అన్నది మధ్యప్రదేశ్ బాలాఘాటు జిల్లాలోని ప్రసిద్ధ ప్రదేశమనియు, తెమ్మ మన్నది లమనము కావచ్చు ననియు, ఇది మధ్యప్రదేశ్‌లోని రాయపూరు జిల్లాయందలి ప్రాగ్భాగమునకు పేరనియు శ్రీరాయ్‌బహాద్దరు హీరాలాల్ గారు వ్రాయుచున్నారు. రత్నపురము తూర్పు హైహయుల రాజధాని అని తెలిసియే యున్నది. పూర్వోక్తస్థల నిర్దేశమును అనుసరించి చూడగా సోమేశ్వరరాజు కళచురి రాజ్యము మీదను, వేంగిదేశముమీదను దండెత్తినట్లు స్పష్టమగుచున్నది. ఇందువలన ఉత్కళాధీశ్వరుడయిన ఉద్ద్యోతకేసరిని ఓడించినవాడు సోమేశ్వరుడే కావచ్చును. అనంతవర్మ చోడగంగదేవుడు వేంగిరాజ్యమున నిలిపినది ప్రాయికముగా వీరచోడునే అని చెప్పవచ్చును. శకవర్షము 1034 నాటి కోర్ని శాసనమున చోడగంగదేవుడు ఉత్కళ, వేంగిదేశాధిపతులను రాజ్యమున నిలిపినట్లు చెప్పబడుట వలన ఈ విషయములు అంతకు (క్రీ. శ. 1112) పూర్వమే జరగి యుండవలెను.

పూరీ జగన్నాథాలయములో ఓఢ్రదేశమును ఏలిన రాజుల చరితమును గురించి చెప్పు ఒక పురాతన చరిత్ర గ్రంథము కలదు. దీనిపేరు మాదలాపాంజి. ఈ గ్రంథము కలియుగములో ఉత్కళమును పరిపాలించిన రాజవంశములు, ఆయావంశములలోని రాజులు పరిపాలించిన కాల పరిమితి మొదలగు విషయము లన్నియు చెప్పును. కాని శాసనముల వలన తెలియవచ్చిన విషయములు ఏవియు సాధారణముగా దీనివలన ఋజువు కావు. అయినను, చరిత్రకారులు ఈ మాదలాపాంజిని ఉదాహరించు చుందురు.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఈ మాదలాపాంజి ప్రకారము కేసరి వంశము తర్వాత ఉత్కలమును ఏలిన వంశము గాంగవంశము. చోడగంగ దేవుడు కేసరివంశమును అంతమొందించి ఉత్కలమును ఆక్రమించుకొనె ననియు, కేసరి వంశములోని చివరరాజు సువర్ణకేసరి అనియు తెలియుచున్నది. ఉద్ద్యోత కేసరి శాసనములు తక్క మిగిలిన కేసరి వంశజుల శాసనములు ఏవియు దొరకలేదు. ఈ సువర్ణకేసరి ఒకడు ఉండెనో లేదో కూడ తెలియదు. ఉద్ద్యోత కేసరి తరువాత వచ్చిన రాజులు బలహీనులు అగుట వలననో, సంతానము లేక పోవుట వలననో, లేక, రాజ్యము కొరకు వారిలో వారు తగవులాడుకొను చుండుటవల్లనో అనంతవర్మచోడ గంగ దేవుడు ఉత్కలముపై దండెత్తి వారిని జయించి దానిని ఆక్రమించుకొని యుండును. ఉత్కలమున ఒక్క కేసరి వంశజులు మాత్రమే కాక చిన్న వంశములు ఇతరములు అనేకము ఉండెను వానిని అన్నిటినికూడ జయించి సకలోత్కల దేశమునకును ఇతడు అధిపతి అయ్యెను. ఉత్కలవిజయము ఉత్తరదేశ విజయమునకు దారి చక్క జేసెను. దీనితో కీర్తి, భూమి, వేలకొలది ఏనుగులు, గుర్రములు, అసంఖ్య రత్నములు లభించినవి.

కులోత్తుంగ చోడుని పరిపాలనము కడపటి సంవత్సరములలో మరల కుంతల (పశ్చిమ) చాళుక్యులు వేంగిదేశముపై దండెత్తివచ్చిరి. అనంతవర్మ చోడ గంగదేవునికిని, వేంగి దేశాధిపతులకును ఏకారణమువనో అదివరకున్న మైత్రి చెడినది. రాజ్య విస్తరణ కాంక్షయే ఇందుకు కారణమేమో తెలియదు. అతడు కుంతల చాళుక్యులతో మైత్రి నెరపి వారి సాయముతో సింహాచలమునకు దిగువ గల దక్షిణ కళింగ ప్రాంతమును మరల తన అధికారము క్రిందికి తెచ్చుకొనెను కాబోలు, చోడ గంగదేవుని రాణుల దాన శాసనములును, కళింగములోని వీరగోట్టము పల్లవ వంశజుల శాసనములును దాక్షారామములో శకవర్షము 1050 (క్రీ. శ. 1128) ప్రాంతవుని కనబడుచున్నవి.

మొదటి కులోత్తుంగ చోడుని కుమారుడు విక్రమ చోడుడు (శకవర్షములు 1040-1057) కుంతల చాళుక్యులను తరుమగొట్టి మరల వేంగిని తన చరమ రాజ్యవర్షమున వశపరచుకొనెను. ఈ తడవ ఈ పారతంత్ర్య విమోచనోద్యమమున అతని సామంత మండలికుడయిన వెలనాటి దుర్జయ కులజుడగు, రెండవ గొంకరాజు నాయకత్వమును వహించి గోదావరి తీరమున జరిగిన సంగ్రామములో కుంతల, గౌడ సేనలను ఓడించి వేంగిదేశమును కుంతల చాళుక్య పారతంత్ర్యమునుండి విడిపించి చోళులకు సమర్పించి వారి సామంత మండలికుడై దేశమును పరిపాలించెను. అనంతవర్మ చోడగంగదేవుడు తాను గౌతమీ భాగీరథీ గంగలలో దేవర్షి పితృతర్పణములు విడిచి బ్రాహ్మణులను సంతృప్తిపరచినట్లు తెలుపు శాసనము శకము 1057 (క్రీ. శ. 1135) నాటిదే. అప్పటికి ఇంకను గౌతమీతట ప్రాంతము అతని వశముననే ఉండెను. మొత్తముమీద సింహాచలమునుండి గౌతమీతీరము వరకు గల దేశము కళింగ గాంగభూపతులకును, వేంగిదేశాధీశులకును సమరాంగణమైనది. ఈ కారణమున కళింగ గాంగ రాజుల దక్షిణ కళింగ సీమావధి ఒకప్పుడు తగ్గుచు, ఒకప్పుడు పెరుగుచు అనియతముగా ఉండెడిది. ఈ విజయములు అన్నియు చోడగంగదేవమహారాజు శకవర్షము 1057 (క్రీ. శ. 1135)కు పూర్వమే సాధించినట్లు శ్రీకూర్మములోని ఒక శాసనమువలన తెలియుచున్నది. ఆ శాసనములో శ్రీ చోడగంగదేవ చక్రవర్తి 'పశ్చిమోత్తర పూర్వదేశములనెల్ల అని మొన సాధించి గౌతమీ భాగీరథీ గంగలలో' కత్తులు 'కడిగి దేవర్షి పితృబ్రాహ్మణులను తృప్తిపరచి' నట్లు కలదు.

అనంతవర్మ చోడగంగదేవుని సంతతివారి శాసనముల వల్ల ఇతనికి సంబంధించిన మరికొన్ని విషయములు తెలియుచున్నవి. ఇతడు ప్రాకారముతోను, ఆయతములైన తోరణములు మొదలైనవానితోను కూడి గంగాతటమున ఉండిన ఆరమ్యనగరమును భగ్నము కావించి, మందారాధిపతిని గంగాతీరమున జరిగిన రణమందు ఓడించి అతనిని తరుమగొట్టెను. 'ఐని అక్బరి' అను గ్రంథములో ఈ మందారము 'మందారన్' అని వ్యవహరింపబడినది. ఇది బంగాళమున హుగ్లీ జిల్లాలోని ఆరామ్‌బాగ్‌కు పడుమటగా ఎనిమిదిమైళ్ల దూరముననున్న ఇప్పటి 'భీతర్గఢ్' అని చరిత్రకారులు గుర్తించినారు. భీతర్గఢ్‌కు గంగానదికి ఇప్పుడు 50 మైళ్లకంటె ఎక్కువ దూరమున నున్నది. గంగానది త్రోవ అప్పటికి ఇప్పటికి మారినది. ఉత్కలము వశమైన పిదప చోడగంగదేవుడు గంగాతీరమువరకును గల భూవరులను అందరిని జయించి తన రాజ్యమునకు గంగానదిని ఉత్తర సీమావధి కావించెను. అతని రాజ్యమునకు తూర్పు సరిహద్దు సముద్రము. పడుమటి సరిహద్దు మాత్రము సరిగా నిర్ణయింపగుదురదు. అది పడుమట రత్నపురి హైహయ రాజ్యమువరకు వ్యాపించినట్లు నిస్సంశయముగా చెప్పవచ్చును. ఈ చోడగంగదేవుని ఒక శిలాశాసనము (శకవర్షము 1060) ఇతడు విహారవాడయొద్ద గంగానదిలో స్నానముచేసినట్లు తెలుపుచున్నది. గంగానది వరకు గల దేశమును జయించుటచేత విహారవాడ అన్నది ఇప్పటి బీహారుప్రాంతము అగునేమో అని తోచుచున్నది.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చోడగంగదేవుని ఈవిజయములతో గాంగ సామ్రాజ్యము భాగ్యభోగ్యములతో తులతూగెను. చోడగంగదేవుడు ఈ ద్రవ్యమును సత్కార్యములకు ఉపయోగించెను. పూరీలోని జగన్నాథాలయమును (విమానము), జగమోహన మండపమును కట్టించెను. ప్రాయికముగా అతడు దీనిని దిగ్విజయానంతరము క్రీ. శ. పదునొకండవ శతాబ్దము చివరనో, పన్రెండవ శతాబ్దము ప్రారంభముననో కట్టించి ఉండవచ్చును. పూరీ నగరములోని ఒక భాగమునకు నేటికిని 'చురంగ (చోడగంగ) సాహి' అని పేరు. కటకమునకు నైరృతిదిశను ఆరుమైళ్ల దూరమున ఇతడు తన పేర త్రవ్వించిన తటాకము 'చురంగపోఖ' ఇప్పటికి నున్నది. కటకముజిల్లా జాజపురములో ఇతడు కట్టించిన గంగేశ్వరాలయమును, బారంగ్ రైలుస్టేషనుకు దగ్గరగా మద్రాసు ట్రంకురోడ్డుమీదికి కానవచ్చు సారంగగఢ్ శిథిలములును అనంతవర్మ చోడగంగు పేరును ఇప్పటికిని జ్ఞాపకము చేయుచుండును. సారంగగఢ్ కూడ అతడు నిర్మించినదే.

అనంతవర్మ చోడగంగదేవునికి అంకిత మిచ్చిన గ్రంథములు ఇంత వరకు కానరాకపోయినను ఇతడు పండితులను, కవులను అదరించె ననుటకు అసంఖ్యాకములుగ దొరకిన ఇతని శాసనములే సాక్షి. సూర్య సిద్ధాంతమును అనుసరించి గ్రహముల స్థితిని నిర్ణయించుటకు పుట్టిన 'భాస్వతి' అను జ్యోతిష గ్రంథమును అనంతవర్మ చోడగంగదేవర కాలములో శంకర సరస్వతీ తనయుడైన శతానందుడు శకవర్షము 1021 లో పురుషోత్తమ పురము (పూరి)లో రచియించెను.

చోడగంగదేవునికి కస్తూరికామోదిని, ఇందిర, చంద్రలేఖ, సోమల మహాదేవి, లక్ష్మీదేవి, పృథ్వీమహాదేవి, చోళమహాదేవి మొదలైనవారు పెక్కురు రాణులు కలరు. వీరిలో కస్తూరికామోదినికి కామార్ణవుడు, ఇందిరాదేవికి రాఘవుడు, చంద్రలేఖకు (రెండవ) రాజరాజు, అనంగభీములు అను తనయులు గలిగిరి. పైనుడివిన వీరు మాత్రమే కాక పద్మలదేవి, రాజలదేవి, లీలావతి, శ్రియాదేవి, కల్యాణదేవి, దెన్నవ మహాదేవి — వీ రందరు తమతమ శాసనములలో తాము అనంతవర్మ చోడగంగదేవర దేవులమని చెప్పుకొన్నారు. వీ రందరిలో ప్రాయికముగా చోళమహాదేవియే పట్టమహిషియేమో. ఒకానొక శాసనమున ఈమె 'చోడగంగ అనంతవర్మదేవర పట్టాన మహాదేవి కళింగ మహాదేవియైన జయంగొండ చోడియంబా' అనీ పేర్కొనబడినది. ఈమెకు సంతానము లేని కారణమున కాబోలు అనంతవర్మ చోడగంగదేవర అనంతరము కస్తూరికామోదిని తనయుడు కామార్ణవదేవుడు రాజ్యమునకు వచ్చెను. ఇదివరలో నుడివినట్లు ఇతనికి జటేశ్వరదేవుడనియు, మధుకామార్ణవదేవుడనియు నామాంతరములు కలవు. చోడగంగదేవుడు ముప్పాతిక శతాబ్దముపాటు రాజ్యముచేసి యుండుటచే ఇతని తరువాత గాంగసింహాసనము నెక్కిన ఇతని కుమారులు రాజ్యమునకు వచ్చువాటికే వయస్సులో చాల పెద్దవారుగ ఉండవలెను. కళచురి గాంగయుద్ధములలో చోడగంగ దేవునితోపాటు అతని పెద్ద కుమారుడు జటేశ్వరుడు కూడ పాల్గొనినట్లు కళచురి శాసనములు తెలుపుచున్నవి.

అనంతవర్మ చోడగంగ దేవునికి విక్రమగంగు అనియు, ప్రతాపగంగు అనియు, నవనవతిసహస్ర కుంజరాధీశ్వరుడు అనియు, త్రికళింగాధిపతి అనియు బిరుదములు. ఇతడు మహారాజాధిరాజు, రాజపరమేశ్వరుడు; గంగాన్వయము యొక్క పేరు ప్రతిష్ఠలు దశదిశల వ్యాపింప జేసిన మహారాజు.

గంగాతీరము వరకు గల దేశమును జయించిన తరువాత అనంతవర్మ చోడగంగదేవుడు తన విస్తృత సామ్రాజ్యమునకు మధ్య నుండుట యుక్తమని తన రాజధానిని కళింగనగరమునుండి ఉత్కలములోని కటకమునకు మార్చెను. అప్పటినుండి కళింగోత్కల భూనాథులైన గంగవంశజులకు అదియే రాజధానియైనది.

కళింగము, సింహళము : ప్రాచీన కాలమునుండి కళింగమునకును, సింహళమునకును రాకపోకలును, వర్తకవ్యాపారమును బాగుగ సాగుచుండెను. తథాగతుని దంతధాతువును కళింగములోని దంతపురము నుండియే ఉజ్జయినీ రాజకుమారుడైన దంతకుమారుడును, అతని భార్య కళింగ రాజకుమారి హేమమాలయు సింహళమునకు తీసికొని వెళ్లిరి. ప్రాయికముగా బాదామి చాళుక్య భూవరుడయిన రెండవ పులకేశి కళింగదండయాత్రా సందర్భమున కావచ్చును క్రీస్తుశకము ఏడవ శతాబ్దిలో యుద్ధమువల్ల భయభ్రాంతులై కళింగ మహీపతి ఒకడు సింహళమునకు పారిపోయి బౌద్ధభిక్షువైనట్లు తెలియుచున్నది. పూర్వకాలమునుండియు సింహళదేశాధిపతులు కళింగరాజ తనూజలను పరిణయమాడుచు వచ్చిరి. ఈ యాచారము క్రీస్తు శకము 9, 10 శతాబ్దములవరకు సాగినది. ఈ రీతిని కళింగమునకును, సింహళమునకును గల సంబంధము దృఢమగుచు వచ్చినది. సింహళదేశ చరిత్రమును తెలుపు బౌద్ధగ్రంథము 'మహావంశము' ప్రకారము సింహళదేశాధిపతియైన మొదటి విజయ బాహువు (క్రీ.శ. 1054 - క్రీ.శ. 1109) రాణియైన త్రిలోకసుందరి యనునామె కళింగ రాజకుమార్తె.

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కళింగములోని సింహపురమునుండి సింహళమునకు వెళ్లిన యామె బంధువులలో ఒకని పేరు మధుకామార్ణవుడు. సింహళదేశాధిపతులకును, కళింగరాజ వంశజులకును వివాహసంబంధ బాంధవ్యములు ఉండినట్లు సింహళదేశ చరిత్ర వలన తెలియుచున్నది. ప్రాయికముగా త్రిలోకసుందరి గాంగ వంశమునకు చెందిన రాజకుమారియే కావచ్చును.

**కామార్ణవుడు** (క్రీ. శ. 1147 — క్రీ. శ. 1155-56): అనంతవర్మ చోడగంగు తరువాత కళింగ గాంగ సామ్రాజ్యమును ఏలినవాడు కస్తూరికామోదిని కుమారుడైన కామార్ణవుడు. పట్టమహిషికి సంతానము లేనందుననేమో ఈతడు గాంగ సింహాసనమును అధిష్ఠించెను. కామార్ణవునికి జటేశ్వరుడని, మధుకామార్ణవుడని నామాంతరములు. ఇతడు రాజ్యమునకు వచ్చునాటికి చాల పెద్దవాడయి యుండవలెను. చోడగంగదేవుడు జీవించి యుండగనే కామార్ణవుడు కళింగ గాంగ సామ్రాజ్యమునకు శకవర్షము 1069 లో పట్టాభిషిక్తుడయ్యెను: పట్టము కట్టి చోడగంగదేవుడు రాజ్య వ్యవహారములను కుమారునికి వదలి వేసినను అతడు పైనుండి సమీక్షించుచునే ఉండినట్లు ఊహింప అవకాశము కలదు. అనంతవర్మ చోడగంగదేవుని 76 వ విజయరాజ్య సంవత్సరపు శాసనము శకవర్షము 1072 నాటిది. ఇతని శాసనము శకవర్షము 107[8] నాటిదికూడ విశాఖపట్టణముజిల్లా నారాయణపురములో ఉన్నది. దీనికి సరియైన ఇంగ్లీషు తేదీ క్రీ. శ. 1152, ఫిబ్రవరి, 7 వ తేదీ గురువారము. అందువలన చోడగంగదేవుడు అంతవరకు జీవించి ఉండినట్లు చెప్పవచ్చును. కామార్ణవుడు తండ్రితోపాటు నాలుగేండ్లు ఆతని రాజ్య పాలనములోను, యుద్ధములలోను గూడ పాల్గొనుచు వచ్చెను.

కామార్ణవుని కాలమునుండియే గాంగరాజుల రాజ్యకాలనిర్ణయము ఒక సమస్యయైనది. కామార్ణవుడు పది సంవత్సరములు రాజ్యము చేసినట్లు తరువాతి గాంగమహీపతులు రెండవ నరసింహ, రెండవ భానుదేవ, నాలుగవ నరసింహ దేవుల తామ్రశాసనముల వలన తెలియుచున్నది. ఈ శాసనములు అనంతవర్మ చోడగంగదేవుని తండ్రి కాలనాటినుండి గాంగరాజ్యమును పరిపాలించిన రాజుల పరిపాలన కాలపరిమితినిగూడ తెలుపుచున్నవి. పూర్వోక్త శాసనములు మూడును తెలుపు రాజ్యకాల పరిమితిలో కూడ వ్యత్యాసములున్నవి. కామార్ణవుడు పది సంవత్సరములు రాజ్యము ఏలినట్లు రెండవ, నాలుగవ నరసింహదేవులు తెలుపుచుండ, రెండవ భానుదేవుడు ఇతడు తొమ్మిదేండ్లే పరిపాలించినట్లు చెప్పును. ఇట్లే చోడగంగదేవుని రాజ్యకాల పరిమితి నరసింహదేవుని శాసనము ప్రకారము 72 సంవత్సరములు, కాని భానుదేవుని శాసనము ప్రకారము 71. ఇటీవల దొరకిన మూడవ అనంగభీమదేవుని శాసనము ప్రకారము 70 సంవత్సరములే. ఈ విధముగా ఇచ్చిన రాజ్యకాల పరిమితిలో ఒక్క సంవత్సరము మాత్రమే వ్యత్యాస మున్న అంత ఇబ్బంది లేదు. కాని, కొందరు రాజుల విషయమున ఈ వ్యత్యాసము 2, 4, 5, 12, తుదకు 14 సంవత్సరముల వరకు కూడ ఉన్నది. ఇది అటుండ, గాంగరాజ శిలాశాసనములు రాజ్య సంవత్సరములను, శక సంవత్సరములను ఇచ్చునవికూడ అనేకము కలవు. ఈ శాసనములలో ఇచ్చిన విజయరాజ్య సంవత్సరములు నిజముగా విజయరాజ్య సంవత్సరములో, అంక సంవత్సరములో తెలియదు. అంక సంవత్సరములు కూడ కొన్ని శాసనములలో విజయరాజ్య సంవత్సరము అనియే పేర్కొనబడినవి. ఆయా రాజుల ప్రథమ పరిపాలన సంవత్సరములు శాసనములలో తెలుపబడిన గాంగరాజ పట్టాభిషేక సంవత్సరములనుండి అంక సంవత్సరములుగా పరిగణించినను, విజయరాజ్య సంవత్సరములుగా లెక్కించినను సరిగా కుదురుటలేదు. ఇది అటుండ, గాంగ సామ్రాజ్యమును ఏలిన కామార్ణవ, రాఘవ, (రెండవ) రాజరాజ, (రెండవ) అనియంకభీమ (అనంగభీమ), మూడవ రాజరాజులకు అందరికి అనంతవర్మ బిరుదము కలదు. కొన్ని కొన్ని శాసనములలో వీరు అనంతవర్మ అను పేరుతోనే పేర్కొనబడినారు. వీరు ఎవరు ఎవ్వరో, వీరి నిజమైన పేరులు ఏవియో తెలిసికొనుట కష్టము. ఈ విధమున రాజ్యకాల పరిమితి విషయమునను, రాజ్యారంభకాల విషయమునను ఎన్నో చిక్కులును, వ్యత్యాసములును కలవు. ఈ కారణమువలనే గాంగరాజ్యకాల నిర్ణయము ఒక సమస్యయైనది.

చోడగంగదేవుని 63 వ, 68 వ, 72 వ విజయరాజ్య సంవత్సరములకు సరియైన శకవర్షములు వరుసగా 1058, 1064, 1065, 1068, 1069 అగుచున్నవి. వీనినిబట్టి చోడగంగదేవుని పట్టాభిషేకము 999 వ శకవర్షమున జరిగినను; అతని యౌవరాజ్యాభిషేకము అతడు చాల బాలుడుగ ఉండినప్పుడే - శకము 996-97 లోనే - జరగియుండునని ఊహింపవలసి వచ్చుచున్నది. ఇతని కుమారుడు కామార్ణవదేవుడు పూర్వోక్త నరసింహదేవ, భానుదేవుల శాసనముల ప్రకారము శకము 1064 - (వేద (4), ఋతు (6), వ్యోమ (0), చంద్ర (1) )వ - సంవత్సరమున పట్టాభిషిక్తుడయ్యెను. కాని, ఇతని శిలాశాసనములలో విజయరాజ్య సంవత్సరములు, శక సంవత్సరములు ఇచ్చినవానిని బట్టి అతని



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



రాజ్యము 1068-1069 వ శకవర్షము నుండియే ఆరంభ మైనట్లు స్పష్టపడును. గాంగ శాసనములలో ఇచ్చిన ఈతని పట్టాభిషేక కాలమునకు, ఇతని శిలా శాసనములవలన తెలియవచ్చిన రాజ్యారంభకాలమునకు నాలు గయిదు సంవత్సరములు వ్యత్యాసము కనబడుటచేత ఈతని రాజ్య కాల పరిమితిని గురించియు, ఇతని తరువాత రాజ్యము చేసిన గాంగరాజుల రాజ్యారంభ కాలమును గురించియు చరిత్ర పరిశోధకులలో చాల చర్చలకు, అభిప్రాయ భేద ములకు అవకాశము కలిగినది. ఇటీవల ప్రకటితమైన మూడవ అనంగ భీముని నగరి తామ్ర శాసనము వలన ఈ బాధ తొలగిపోయినది. ఈ శాసనము ప్రకారము కామార్ణవ దేవుడు శకవర్షము 1069 ('నందర్తు వ్యోమ చంద్రప్రమిత శకసమావ్యాప్త కాలే')లో గాంగ సామ్రా జ్యమునకు మూర్ధాభిషిక్తుడు అయినాడు. మూడవ అనంగ భీముడు అనంతవర్మ చోడగంగదేవుని కుమారుడయిన రెండవ అనంగ భీముని మనుమడు. కామార్ణవ దేవునికి ఇతడు పూర్వోక్త నరసింహదేవ, భానుదేవుల కంటె సమీప కాలమువాడు. అందువలన ఇతడు ఇచ్చిన కామార్ణవదేవ రాజ్యాభిషేక కాలమే పరిగ్రాహ్యము. శాసనమున లేఖకులు పొరపాటున 'నంద' పదమును 'వేద' పద ముగా వ్రాసి యుందురు.

గాంగరాజ్య కాలమునకు సంబంధించిన చిక్కులను అన్నిటిని ఒక విధముగా పరిష్కరించి తేల్చిన గాంగరాజ్య కాలనిర్ణయమే ఇందు ఈయబడినది. దీని ప్రకారము కామార్ణవుడు శకవర్షము 1068-69 నుండి తొమ్మిదేండ్లు రాజ్యము చేసెను.

కామార్ణవ దేవుని కడపటి పరిపాలన సంవత్సరమున వెలనాటి దుర్జయ వంశజుడైన వెలనాటి రెండవ కులో త్తుంగ చోడ గొంక నరపతి కళింగముపై దండెత్తెను. ఈ దండయాత్రకు కారణము తెలియదు. ఒకవేళ కళింగ గాంగ భూవిభులు కోన హైహయ వంశజుడైన లోకరాజు తిరుగుబాటులో అతనికి తోడ్పడి ఉండవచ్చును. వెలనాటి రెండవ కులోత్తుంగచోడ గొంకరాజు ఆదేశము ప్రకా రము ఈ పూర్వ దిగ్విజయ యాత్ర కావించినవాడు కొమ్మనామాత్యుడును, అతని ఇతర సామంతనాయకు లును. ఈ దండయాత్రలో వెలనాటి రెండవ గొంక భూవి భునికి విజయము చేకూరినట్లు చాళుక్యచోళ చక్రవర్తి రాజరాజ దేవుని సింహాచల శాసనమువలన విశద మగు చున్నది. ఇది ఆ చాళుక్యచోళ చక్రవర్తి 6వ విజయ రాజ్య సంవత్సరమునకు సరియైన శకవర్షము 1078 నాటిది. ఇది రాజరాజ దేవుని రాజ్య కాలమున కళింగము లోని కాలంద నాగమునాయకుని కొడుకు ఎరపోతు సింహా మానమున బహుళ విదియ-ఉత్తరాభాద్రా నక్షత్రమున శనివారమునాడు నరసింహ నాథునికి చేసిన భూదాన మును తెలుపును. ఈ శాసనము అట్లుండగా, దాక్షారామ ములో శకవర్షము 1078 నాటి మరియొక శాసనము కలదు. అదికూడ విజయమును తెలుపునదియే. కాళింగులు వేంగీశ్వరులను జయించిరో, వేంగి మహీపతులు కాళింగు లను జయించిరో స్పష్టముగా తెలియవచ్చుట లేదు. ఈ శాస నము చాల శిథిలమైనది. ఇది కొంత భాగము సంస్కృత మునను, కొంత తెలుగునను ఉన్నది. సంస్కృత భాగమున '........[రజ] దేవిదావవహ్ని విభవః కాలింగ్గ కొ....ఙ్గ వరవాహినీ మదగజ ప్రోత్తుంగ........సేతు వర్మణా మధ్యం [యే] నాకాసి విజానినా' అని ఉండుటవలన ఇది కూడ విజయమును సూచించుచున్నదని ఊహింపబడినది. 'రజదేవి దావ వహ్ని విభవః' అని తప్పుగా పడియుండ వచ్చును. తెలుగు భాగమున ఈ శాసన సంవత్సరము శక వర్షము 1076 అని తెలుపబడినను అది నిజముగా 1078 ('వసు శైల భేందు') నాటిదని శాసనములోని సంస్కృత భాగమువలన తెలియుచున్నది. దీని మాట ఎట్లున్నను, వెల నాటి మండలికులు దక్షిణ కళింగమును జయించుట మాత్రము నిజము. కొంత కాలము వెలనాటి గొంకరాజు పక్షమున కొమ్మనామాత్యుడు యలమంచిలి రాజధాని కావించుకొని దక్షిణ కళింగమును పరిపాలించెను. ఈ కొమ్మన మంత్రి యలమంచిలిలో త్రవ్వించిన తటాకము కొమ్మయ గుండము అనుపేర నేటికిని వ్యవహరింపబడు చున్నది. కొమ్మన మంత్రి 'రమణీయమైన కూర్మ గ్రామము నందు....కళింగ రాష్ట్రంబులోని యలమంచి లోదిగా వెలయు ముప్పది రెండు విష్ణు ప్రతిష్ఠలు వెలయ జేసి నిచ్చ నేపుడు మేదినీసురవరులకు బంతి సద్భక్తితో పాయసంబు పంచదార తోడ వాటించి యిడుట అన్నప్రతంబుగా నడిపిన' సుకృతి.

ఇదివరలో నుడివినట్లు కామార్ణవునికి అనంతవర్మ బిరుదము కలదు. అనంతవర్మ చోడగంగ దేవుడు పూరీ జగ న్నాథాలయమును కట్టించినప్పటినుండి అతని సంతతివారు విష్ణు భక్తులై జగన్నాథ దేవుని గొలుచుచు వచ్చిరి. కామార్ణవునికి పురుష సంతానము లేనందువలననేమో అతని సవతి తమ్ముడైన రాఘవ భూపతి గాంగ సింహాసనమును అధిష్ఠించెను.

**రాఘవుడు** (క్రీ. శ. 1155-56 — క్రీ. శ. 1169-70): ఇతడు అనంతవర్మ చోడగంగదేవునివలన సూర్య వంశజ యైన ఇందిరాదేవికి కలిగిన తనూజుడు. ఇతని అన్నవలెనే ఇతడును అనంతవర్మ బిరుదాంచితుడు. ఇతడు పదునైదు

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సంవత్సరములు రాజ్యము పలినట్లు ఇతని సంతతిలోని రెండవ నరసింహదేవ, నాలుగవ నరసింహదేవుల తామ్ర శాసనములు తెలుపుచున్నను రెండవ భానుదేవుని తామ్ర శాసనము ప్రకారము ఇతడు పరిపాలించినది పదునాలుగేండ్లే.

**ఉత్కలమునకు** ఇంకను ఎగువనున్న దక్షిణ కోసలమును పరిపాలించుచుండిన సేన వంశజుడైన విజయసేనుడు అనంతవర్మ చోడగంగదేవునకును, అతని కుమారులు కామార్ణవ, రాఘవులకును సమకాలికుడు. విజయసేనుడు చోడగంగదేవునితో స్నేహము కలిగియే ఉండెను. కాని, రాఘవునితో అతనికి వైరము సంభవించినది. విజయసేనుడు రాఘవుని యుద్ధమున ఓడించినట్లు సేనవంశజులు తమ శాసనములలో చెప్పుకొని యున్నారు.

ఈ రాఘవుని కాలములో వెలనాటి రెండవ కులోత్తుంగ రాజేంద్రచోడుడు కళింగముపై మరియొక తడవ దండయాత్ర సల్పెను. కళింగాధిపతులైన గాంగభూవరులు దక్షిణ కళింగమును మరల వశపరచుకొనుటకు ప్రయత్నించుట కాని, ఉత్తరపు పూర్వచాళుక్య వంశజుడైన మూడవ విజయాదిత్యునిపైకి వెలనాటివారు ఎత్తివచ్చినప్పుడు సహాయపడుట కాని వెలనాటి మండలికుల ఈ రెండవ దండయాత్రకు కారణమై ఉండవచ్చును. మొత్తము మీద సింహాచలము వద్దనుండి గౌతమీనది ఉత్తర తటము వరకుగల దేశము కళింగదేశాధిపతులకును, వేంగీదేశాధీశ్వరులకును తరచుగా కలహ కారణము అగుచు వచ్చినది. ఎవరికి వారే దానిని తమ అధీనమున ఉంచుకొనుటకు ప్రయత్నించుచు వచ్చిరి. ఈ విజయమును గురించి తెలుపునదే దాక్షారామములోని శకవర్షము 1088 నాటి శాసనము. తూర్పునుండి పడమటికి దండెత్తి వచ్చువారు కాని, పడమటినుండి తూర్పునకు దండెత్తి వెళ్లువారు కాని ఆ మధ్యయుగములో జననాథపుర నామాంతరము గల దాక్షారామమునకు పోయి భీమనాథుని సేవించుకొనకుండ వెళ్లువారు కారు. అది వేంగీ రాజ్యమునకు ప్రప్రథమున రాజధాని. చాళుక్యచోళ రాజప్రతినిధుల పట్టాభిషేకములు అన్నియు అక్కడనే జరుగుచుండెను. వెలనాటి దుర్జయులు ప్రబలులైన పిదపకూడ దాని ప్రాధాన్యము పోలేదు. అది రెండవ రాజధానిగా ఉండెడిది. దాక్షారామమును పట్టుకొన్నగాని చేకొన్న విజయమునకు సంపూర్తి లేదు. అది మహానగరమే కాదు; మహాపుణ్యక్షేత్రము. భీమనాథుని సేవించుకొని ఏదివ దానమో చేసినగాని విజేతకు సంతృప్తి లేదు. అందువల్ల కళింగదేశీయులైననేమి, మధ్యాంధ్రదేశీయులైననేమి దాక్షారామమునకు పోయి దానధర్మములు చేసి, వానిని శిలాక్షరబద్ధములు చేయవలసినదే. శకము 1088 నాటి చోడగంగదేవ శాసనమున సంస్కృత భాగము చాల చెడినది. అది ఈ విధముగా నున్నది. '....కళింగక్ష్మా....పతిం జిత్వా యా....[న్వి]చఖాన సాము[స]ద్యాక స్తంభం జయస్యోచితం ప్రఖ్యాత....[సమ*] రైక భూమిప ఇతి ప్రోద్దామ గంగాన్వయే'. యుద్ధమున చోడమహాదేవి భర్తయైన చోడగంగదేవుడు విజయమునొంది యశస్తంభమును స్థాపించినట్లు తెలుపు శాసనము ఇది. ఈ చోడగంగదేవుడు ఎవ్వరో తెలియుటలేదు. ప్రాయికముగా ఇతడు కళింగ గంగ వంశ సంజాతుడు కావచ్చును. ఇతడు రాఘవుని పక్షమున దక్షిణ కళింగమును జయించినట్లు చెప్పదమన్న ఇతని శాసనమున చోళరాజరాజదేవుని విజయరాజ్య సంవత్సరములు ఉదాహరింపబడినవి. పవిజేతయు శత్రువు విజయరాజ్య సంవత్సరములు ఉదాహరించుట పరిపాటి కాదు. వెలనాటి మండలికుల పక్షమున ఒక చోడగంగదేవుడు ఉండినట్లు ఇంతవరకు తెలియరాలేదు. ఈ శాసన విషయము ఇంకను విచారణీయము.

ఈ శాసనము మాట ఎట్లున్నను వెలనాటి కులోత్తుంగ రాజేంద్రచోడుడు ఒకవేళ దక్షిణ కళింగము స్వహస్తచ్యుతమయినచో దానిని మరల జయించినట్లయినను చెప్పవలెను; లేదా, ఇతఃపూర్వము కళింగయుద్ధమున విజయము లభించిననాటి నుండియు అది వెలనాటి మండలికుల అధికారము క్రింద ఉండినట్లయినను భావింపవలెను. వెలనాటి రెండవ కులోత్తుంగ రాజేంద్రచోడుని సేనాని ప్రోలన నాయకుని శాసనము ఒకటి, శకవర్షము 1191 నాటిది, విశాఖపట్టణము జిల్లా సర్వసిద్ధి తాలూకా శ్రీరామపురములో ఉన్నది.

రాఘవుడు కళింగదేశ శాసనములలో అనంతవర్మదేవి దాస రణరంగ రాఘవుడని వ్యవహరింపబడినాడు. ఇతని 18-వ రాజ్యసంవత్సరము శకవర్షము 1092 (క్రి. శ. 1170) అగుచున్నది. ఇది అంక వత్సరమయినచో అతని 15వ విజయరాజ్య సంవత్సరమగును. ఇంతకంటె ఇతనిని గురించి మనకు ఎక్కువ విశేషములు ఏవియు తెలియవు.

**రెండవ రాజరాజదేవుడు** (క్రి. శ. 1069-70 — క్రి. శ. 1195): ఇతడు అనంతవర్మ చోడగంగదేవునికి చంద్రలేఖయందు కలిగిన ఇరువురు తనయులలో పెద్దవాడయిన రెండవ రాజరాజదేవుడు. రాఘవుని అనంతరము ఇతడు సింహాసనము ఎక్కెను. రాఘవునికి పురుష సంతానము లేక పోవుటయే అతని సవతితమ్ముడయిన ఇతడు రాజ్యమునకు వచ్చుటకు కారణము కావచ్చును. ఇతని అగ్రసోదరులకు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వలెనే ఇతనికి కూడ అనంతవర్మ అను నామాంతరము కలదు. అనంతవర్మదేవర నామముతో ఇతని మూడవ రాజ్యవర్షమును ఉదాహరించునట్టి శకవర్షము 1093 నాటిదే ఇతని మొదటి శాసనము. ఈ మూడవ రాజ్య సంవత్సరము అంకవర్షమయినచో ఇతడు శకవర్షము 1091 (క్రీ. శ. 1169 - 70) లో రాజ్యమునకు వచ్చినట్లు నిర్ణయింపవచ్చును. రెండవ నరసింహ, నాలుగవ నరసింహ దేవుల తామ్రశాసనములు ఇతడు 25 సంవత్సరములు రాజ్యము పలినట్లు చెప్పుచున్నవి. శాసనములలో కనబడు ఇతని చివర రాజ్యసంవత్సరము 27. దీనికి సరియైన శక వర్షము 1114 గ తేలుపబడినది. ఇందు తెలుపబడిన దాన సమయము ఉత్తరాయణ సంక్రాంతి గురువారమైనది. 27 వ రాజ్య సంవత్సరము అంకవత్సరమగుచో అది 22 వ విజయరాజ్య సంవత్సర మగును. దీనిని అనుసరించి చూచి నను అతడు శకవర్షము 1091 లో రాజ్యమునకు వచ్చి నట్లును, ఇరువదేండ్లకు పైబడి రాజ్య మేలినట్లును స్పష్ట మగుచున్నది. ఓఢ్రదేశమునందలి భువనేశ్వరములోని మేఘేశ్వరాలయ శాసనమువలన గౌతమగోత్రుడైన ద్వారదేవుని సంతతివారిలో స్వప్నేశ్వరుడు ఒకడనియు, ఇతని సోదరి సురమ అనియు, ఈమె రాజరాజదేవుని భార్య అనియు విశదమగుచున్నది.

రెండవ రాజరాజదేవుడు త్రిభువన చక్రవర్తి ఇమ్మడి రాజరాజచోడుని కట్టకడపటి రాజ్యసంవత్సరములలో సింహాచలమునకు దక్షిణమున గౌతమీతటమువరకు గల దేశముపై దండెత్తి దానిని మరల స్వాధీనము చేసి కొనుటయేకాక పూర్వచాళుక్య రాజ్యమును ఉద్ధరింప ప్రయత్నించుచుండిన పిఠాపురపు చాళుక్యభూపతులకు కూడ తోడ్పడెను. ఈ రీతిని ఒక్క దక్షిణ కళింగము మాత్రమే కాక గోదావరీ ప్రాంతము కూడ వెలనాటి రెండవ రాజేంద్రచోడుని కడపటి రాజ్యసంవత్సరములలో అతనిచేయి జారిపోయెను. వెలనాటి రెండవ రాజేంద్ర చోడుని కుమారుడు మూడవ కులోత్తుంగచోడ గొంక భూధవుడు కృష్ణా దక్షిణ పట్సహస్రావని రాజకీయ వ్యవ హారములలో చిక్కుకొని నష్టపోయిన రాజ్యమును మరల సంపాదింప లేకపోయెను. తుదకు అతని కుమారుడైన కులోత్తుంగ పృథ్వీశ్వర నృపతి బలములను కూర్చుకొని వినష్టరాజ్యమును మరల సంపాదించుటకు పూర్వదేశముపై దండెత్తి వెళ్లెను. కొరవి వెన్నయామాత్యుడును, కొమ్మనా మాత్య తనయుడైన కాశ్యపగోత్రుడు కేతన మంత్రియు, కొల్లూరి ఎరపదేసటి మొదలైన చమూపతులును తమ సైన్యములతో గోదావరిని దాటి కోన సాగించి శకవర్షము

1108లో పిఠాపుర దుర్గమును జయించి దానిని వశపరచు కొనిరి. అంతటితో పిఠాపురచాళుక్య రాజ్య సౌధము కూలి పోయినది. పిఠాపుర ప్రాంతమును జయించిన పిదప వెలనాటి సైన్యములు విజయ దర్పోత్సాహములతో కళింగమున ప్రవేశించి, అచటి మండలికులను అదిమి కప్పములు గొని, వీరగొట్టపు పల్లవ రాజ్యమును పాడొనరించి, కళింగనగరమును పట్టుకొని, రాజరాజదేవుని విధేయ సామంతుని కావించి శ్రీకూర్మమువరకు సాగిపోయినవి. వెలనాటి పృథ్వీశ్వరుని శాసనము ఒకటి శకవర్షము 1110 (క్రీ. శ. 1188) నాటిది శ్రీకూర్మములో కనబడుచున్నది. దీనినిబట్టి పిఠాపురప్రాంతము స్వాధీనమైన రెండేండ్లలో అతని కళింగ విజయము పూర్తియైనదని చెప్పవచ్చును. కళింగములోని వీరగొట్టము మొదలైన రాజ్యములు జయించి అతడు వీరగొట్ట విభాళాది బిరుదములను వహించి విఖ్యాతికెక్కెను. వీరగొట్టము వీరకూటమని, వీరఘట్టమని, వీరఘొట్టమని వ్యవహరింపబడుచున్నది. నేడు దీనిని వీరఘట్ట మందురు. ఇది విశాఖపట్టణముజిల్లా పాలకొండ తాలూకాలో ఉన్నది. ఈ కళింగ విజయముతో మరల గంగాన్వయులును, కోన హైహయ రాజన్యులును వెలనాటి కులోత్తుంగ పృథ్వీశ్వరునికి విధేయ సామంతులైరి.

రెండవ రాజరాజదేవుడు రాజ్యమునకు వచ్చునాటికే బాగుగా వయసువచ్చినవాడు. అతనికి సంతానము లేనం దున కావచ్చును వృద్ధుడైన అతడు తాను జీవించి ఉండ గనే తన అనుజుడు అనియంక భీమదేవుని గాంగరాజ్య మునకు అభిషిక్తుని కావించెను. అతనికి పట్టము కట్టిన పిదప రాజరాజు కొద్ది సంవత్సరములు మాత్రమే జీవించెను.

**రెండవ అనియంక భీమదేవుడు** (క్రీ. శ. 1190 - క్రీ. శ. 1197 - 98): అనియంక భీమనామమును వహించిన గంగ వంశజులలో ఇతడు రెండవవాడు అగుటచేత ఇతనిని రెండవ అనియంక భీముడని వ్యవహరింతురు. ఇతనికి అనంగభీముడని కూడ వ్యవహారము కలదు. ఇతడు శకవర్షము 1112 (క్రీ. శ. 1190) లో పట్టాభిషిక్తుడై శకవర్షము 1119 - 20 వరకు రాజ్యము చేసెను. ఇతనిని గురించి మనకు చరిత్రవిశేషములు ఏవియు తెలియవు. ఇతని అగ్రసోదరుడు - రాజరాజదేవుని బావమరది - మహా ప్రధాని స్వప్నేశ్వరదేవుడు దిగ్విజయ యాత్ర సందర్భ మున ఇతనికిని, ఇతని అన్నకును చతురంగబలముకంటెను ఎక్కువ సేవ కావించినట్లు తెలుపబడినది. అనియంకభీముని మంత్రి విప్రోత్తముడు గోవిందుడు. గాంగవంశపు రాజుల [illegible]

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఆదరించి తటాకాదులు త్రవ్వించి, లోకోపకార కార్యములు అనేకము కావించిరి; దేవాలయములను కట్టించిరి. ఈ రెండవ అనంగభీమదేవుని పరిపాలన కాలములోనే స్వప్నేశ్వరుడు కైలాసాధిపతియైన మేఘేశ్వరునికి మేఘేశ్వరాలయమును, గోవిందప్రధాని చాటేశ్వరాలయమును కట్టించిరి.

అనియంక భీమదేవుడు కవితాప్రియుడు. ఇతని పట్టమహిషి వాఘల్లదేవి. ఈ దంపతుల కుమారుడు రాజరాజదేవుడు. ఇప్పటి నుండియే అనంతవర్మ చోడగంగ దేవుని వంశము వారు తండ్రి కొడుకుల క్రమమున గాంగ రాజ్యమును పరిపాలించుట ఆరంభము. ఇప్పటి నుండి గాంగ సింహాసనమును సూర్యవంశజులైన కటకము గజపతులు ఆక్రమించుకొను వరకు రమారమి సార్ధ శతాబ్దద్వయము గంగాన్వయుల సంతతి క్రమము అవిచ్ఛిన్నముగ సాగినది.



చిత్రము 48. మేఘేశ్వరాలయము, పూరి

**మూడవ రాజరాజదేవుడు** (క్రీ. శ. 1197-98 — క్రీ. శ. 1211): తండ్రి మరణానంతరము ఇతడు రాజ్యమునకు వచ్చెను. ఇతని పూర్వులకు వలెనే ఇతనికిని అనంతవర్మదేవుడను నామాంతరము కలదు. ఇతని సంతతివారి శాసనములవలన ఇతని పట్టమహిషి చాళుక్య వంశజయుని తెలియుచున్నది. ఈమె పేరు సద్గుణదేవియని, మంకుణదేవియని, మల్హాణదేవియని వివిధముగ తెలుపబడినది. మంకుణదేవి లేక మల్హాణదేవి అనునదే నిజమైన పేరై యుండును. ఆమె సద్గుణములవలన ఆమెకు సద్గుణదేవి అను వ్యవహారము కలిగియుండును. మంకుణదేవి ప్రాయికముగ యలమంచిలి ప్రధాన నగరముగ వసించుచుండిన పూర్వచాళుక్యశాఖ భూవరుల ఆడుబిడ్డ కావచ్చును.

రాఘవుని సేనవంశజుడైన విజయసేనుడు జయించినట్లు ఇదివరలో తెలుపబడినది. విజయసేనుడు క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దము కడపటనో, పండ్రెండవ శతాబ్ది ప్రారంభముననో పాలవంశజుల రాజ్యముపై దండెత్తివెళ్లి జయించి బంగాళమున చాలభాగమును ఆక్రమించుకొనెను. దేవపాల, రామపాల, కుమారపాల అని పేరులు పాలాంతము లగుటచేత చరిత్రకారులు వీరిని పాలవంశజులని వ్యవహరించుచున్నారు; ఇదేవిధముగ సామంతసేన, హేమంతసేన, విజయసేన అని పేర్లు సేనాంతము లగుటచేత వీరికి చరిత్రకారులు సేనవంశజులని పేరిడిరి. సేనవంశజులు హిందూధర్మావలంబకులు; పాలవంశజులు బౌద్ధధర్మావలంబకులు; పాలరాజ్యము భగ్నమగువరకు ఉత్తర హిందూస్థానములో బౌద్ధము జీవన్మృతముగానే ఉండెను. పాలరాజ్యము పడుమటి బంగాళమును ఆక్రమింపగా, సేనరాజ్యము తూర్పు బంగాళమున వ్యాపించెను. తూర్పు బంగాళమునకు గౌడదేశమని పేరు. సేనరాజ్యమునకు గౌడనగరము రాజధాని. దీనిని విజయసేనుడు కట్టించినట్లు చెప్పుదురు. కాని, ఇది అంతకు పూర్వమునుండి ఉన్న ప్రాచీన నగరముగ కన్పట్టును. విజయసేనుని పౌత్రుడును, వల్లాలసేనుని పుత్రుడును



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అయిన లక్ష్మణసేనుడు (క్రీ. శ. 1179-క్రీ. శ. 1205) తన శాసనములు కొన్నిటిలో తన జీవితకాలములో తొలుతనే తాను పూరీ నగరమున జయస్తంభమును స్థాపించినట్లు చెప్పుకొనెను. ఇదే నిజమైనచో ఇందువలన ఇతడు రెండవ అనియంకభీమునో, ఇతని కుమారుడు మూడవ రాజరాజ దేవునో జయించినట్లు ఊహింపవలసి యున్నది. గౌడ నగరము బంగాళములో మాల్డా జిల్లాలో ఉన్నది. ఈ నగరము పొరుగుననే లక్ష్మణసేనుడు తనపేర లక్ష్మణావతీ నగరమును నిర్మించెను. గీత గోవిందమును రచించిన జయదేవుడును, పవనదూతమును రచించిన ధోయి కవియు లక్ష్మణసేనుని ఆస్థానకవులు. గంగానది ఎగువడెల్టాలో కలకత్తాకు ఉత్తరమున దాదాపు 60 మైళ్ల దూరములో భాగీరథీ తీరమున ఉన్న నవద్వీపము (నౌదీయ) సేన రాజుల కడపటి రాజధాని.

మూడవ రాజరాజదేవుడు ఇంచుమించుగా రాజ్యమునకు వచ్చిన కాలమున కుతుబ్బుద్దీన్ ఐబెక్ సేనానులలో ఒకడైన ముహమ్మద్ బిన్ బఖ్త్యార్ ఖల్జీ ఇప్పుడు బీహారు అనబడు రాజ్యముపై దండెత్తి దానిని అక్రమముగ జయించెను. ఇది పాలరాజ్యములోనిది. ఈముస్లిము దండయాత్రలో ఉత్తరహిందూస్థానములోని బౌద్ధవిహారములు, విశ్వవిద్యాలయములు అన్నియు విధ్వంస మయినవి. బౌద్ధము అంతటితో హిందూదేశమున అంతరించినది. బీహారు జయించిన పిదప బఖ్త్యార్ ఖల్జీ సేనరాజ్యముపై దండెత్తి దానిని కూడ జయించి గౌడనగరమును రాజధాని కావించుకొని తాను జయించిన దేశములను పరిపాలింప దొడగెను. లక్ష్మణసేనుడు ఢక్కావైపు పారిపోయెను. అక్కడ అతని సంతతివారు చాల సంవత్సరములు పాలించినట్లు చెప్పుదురు. ఈ రీతిని బంగాళములో మూడవ రాజరాజదేవుని కాలములో ముస్లిము పరిపాలనము ఏర్పడినది. అప్పటినుండి బంగాళమును పరిపాలించిన ముస్లిము సుల్తానులు గాంగవంశ్యుల ఉత్కల సామ్రాజ్యమునుకూడ వశపరచుకొనుటకు దానిపై దండయాత్రలు ఆరంభించిరి. బంగాళదేశపు సుల్తానుల మొదటి దండయాత్ర ఈ మూడవ రాజరాజదేవుని కాలముననే జరగినది. ఈ సుల్తానుల ఓఢ్రదేశ దండయాత్రలను గురించి, బంగాళ దేశపు సుల్తానుల పరిపాలననుగురించి తెలుపునట్టి ముఖ్యములగు ముస్లిం చరిత్ర గ్రంథములు రెండు: (1) మిన్హాజుద్దీన్ రచించిన తబకాత్-ఇ-నాసిరీ; (2) ఘులామ్ హుసేన్ సలీమ్ కృతమైన రియాజ్-ఉస్-సలాతీన్. ఈ చరిత్రకారులు ఓఢ్రదేశము(ఒరిస్సా)ను జాజ్‌నగర్ అని వ్యవహరించుచు వచ్చిరి. జాజ్‌నగర్ జాజపురమని, సజ్జనగరమని కొందరు చరిత్రకారుల అభిప్రాయము. ఇది ఎక్కడ ఉన్నది, ఇప్పుడు దాని పేరు ఏది అను విషయమున అభిప్రాయభేదము ఉన్నది. ప్రాయికముగా ఇది యయాతికేసరి రాజధానియైన యయాతి నగరము కావచ్చును. యయాతి నగరమే జాజపురము, జాజనగరము అయినది. ప్రాయశః, ఈ జాజపురమే ముస్లిం చరిత్రకారుల జాజ్‌నగర్ కావచ్చును. మొత్తముమీద ఇది ఉత్కలదేశములోనిది. ఇది గాంగ రాజుల ద్వితీయ రాజధానిగ ఉండనేమో. ఎట్లయిననేమి ముస్లిము చరిత్రకారులు ఒరిస్సాను జాజ్‌నగర్ అని వ్యవహరించి యున్నారు.

మొదటి బెంగాలు ముస్లిము సుల్తానైన ముహమ్మద్-ఇ-బఖ్త్యారు ఖల్జీ తిబెత్తుదేశముపై దండువెడలినప్పుడు అతడు తన సేనలో ఉండిన ముహమ్మద్-ఇ-షెరాన్, అహమ్మద్-ఇ-షెరాన్ అను ఇరువురు సోదరులైన ఖల్జీ అమీర్లకు కొంత సైన్యమును ఇచ్చి జాజ్‌నగరుపై దండెత్త బంపెను. తబకాత్-ఇ-నాసిరీ గ్రంథమును ఆంగ్లభాషలోనికి పరివర్తనము చేసిన మేజర్ రేవర్టి ప్రకారము ఈ దండయాత్ర హిజిరా 601 (క్రీ. శ. 1205 ప్రాంతము)లో జరగినది. ముస్లిము చరిత్రలు ఈ దండయాత్రనుగురించి ఏవియు వివరములు తెలుపవు. సాధారణముగా ముస్లిము చరిత్రలు ముస్లిములకు ఏ కొద్దిపాటి విజయము కలిగినను దానిని కొండంతలుగ జేసియు, ముస్లిములకు కలిగిన పరాజయము గొప్పదైనచో మిన్నకుండుటయు, ఒకపాటిదై విధిలేక చెప్పవలసి వచ్చినచో దానిని ముక్తసరుగ చెప్పుటయు పరిపాటి; ఒకప్పుడు విజయము లభింపకపోయినను లభించినట్లు చెప్పుటకూడ కలదు. కావున ఈ ముస్లిము చరిత్రలలోని విషయములు చెప్పినవి చెప్పినట్లు గ్రహింప వీలులేదు. తిబెత్తు దండయాత్రవిఫలమై బఖ్త్యారు ఖల్జీ తిరిగి రాజధానిని చేరుకొన్నపిదప ముహమ్మద్-ఇ-షెరాన్ జాజ్‌నగరు దండయాత్రనుండి మరలివచ్చినట్లు మాత్రము తబకాత్-ఇ-నాసిరి తెలుపుచున్నది. ఈ దండయాత్రను గురించిన వివరము లేవియు తెలుపక పైనుడివినట్లు రెండు ముక్కలు మాత్రమే చెప్పుటవలన ప్రాయికముగ అందు ముస్లిము అమీర్లకు అపజయము కలిగినట్లే భావింపవచ్చును. దక్కనుదేశముపై ఢిల్లీనుండి వచ్చిన ముస్లిము దండయాత్రలకు కాకతీయాంధ్రులు ఏవిధమున ఎదురొడ్డి హిందూధర్మసంస్కృతులను పరిరక్షించిరో అట్లే కళింగాంధ్రులు బంగాళమునుండి సముద్రతీరము వెంట వచ్చిన ముస్లిం దండయాత్రలను ప్రతిఘటించి నిలిచి ప్రాగాంధ్రదేశము మహమ్మదీయాధి కారమునకు లోబడకుండ జేసి కాపాడిరి.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/

రాజరాజదేవుని కాలమున రాజకీయముగ ఉత్తర హిందూస్థానమున పెక్కు మార్పులు సంభవించినట్లే మధ్యాంధ్రదేశమునను, దానికి పడుమటనున్న ప్రదేశమునను కూడ చాలమార్పులు వచ్చినవి. ఈ కాలమున కాకతీయాధికారము ఇప్పుడు తెలంగాణా అనబడు ప్రదేశమునమేకాక మధ్యాంధ్రదేశమునకూడ బలపడదొడగినది. కాకతి రుద్రదేవ రాజునకును, అతని సోదరుడు మహాదేవ రాజునకును తరువాత ఓరుగంటి సింహాసనమును అధిష్ఠించిన మహాదేవరాజ తనూజుడు గణపతిదేవమహారాజు ప్రబలముగ నుండిన వెలనాటి మండలికరాజ్యమును జయించి, స్వతంత్రులై పాలించుచుండిన ఇతర మండలికులను జయించి మధ్యాంధ్రదేశము నంతను తన అధికారము క్రిందికి తెచ్చుకొనుటకు తాను శకవర్షము 1121 నుండియు ప్రయత్నించుచునే యుండెను. నతవాడి సీమ (కృష్ణ ఉత్తర తటమున నందిగామ తాలూకాకు ఎగువ ప్రాంతము)ను పాలించుచుండిన రాజులతో కాకతీయులకు అదివరకే సంబంధబాంధవ్యములు ఉండుటచేతను, కోట వంశజులు విధేయ సామంతులు అగుటచేతను వా రందరు తమ తమ సామంతులతోను, సైన్యములతోను గణపతిదేవ మహారాజునకు తోడ్పడిరి. సింహాసన మెక్కిన నాలుగైదు సంవత్సరములలోనే గణపతిదేవుడు వెలనాటి కులోత్తుంగ పృథ్వీశ్వరుని ద్వీప ప్రాంతముపై దండెత్తి దానిని సాధించెను. అంతటితో ఊరకుండక ఆతనిని కళింగమునకంట తరిమివేసి పిఠాపురమున చాళుక్య మూడవ విజయాదిత్య తనూభవుడైన మూడవ మల్లప దేవరాజును దక్షిణ కళింగ సీమావధుల యందు నిలిపెను. ఇతడు మల్లపదేవ చక్రవర్తి అను పేరుతో శకవర్షము 1124 లో జ్యేష్ఠ బహుళ దశమీ ఆదివారమునాడు సింహ లగ్నమున అశ్వినీ నక్షత్రమునందు (క్రి. శ. 1202, జూను 16) పట్టాభిషిక్తు డయ్యెను. కాని, పృథ్వీశ్వరుడు మరల దానిని వశపరచుకొనుటకు ప్రయత్నించిన సందర్భమున గణపతిదేవ మహారాజు తనకు సామంతులుగ ఉండిన తెలుగు చోళ, కోట, నతవాడి భూపాలురతో ఎత్తివెళ్లి ఆతనిని యుద్ధ రంగమున మార్కొనెను. ప్రాయికముగ ఈ దండయాత్ర శకవర్షము 1129-30 ప్రాంతమున జరగి యుండవలయును. ఈ దండయాత్రయందు వెలనాటి పృథ్వీశ్వర మహీపతి నిహతుడయ్యెను. కళింగ గాంగ భూవరులు వెలనాటి కులోత్తుంగ పృథ్వీశ్వరుని సామంతులగుటచేత గాంగ చమూపతులు కూడ ఈ దండయాత్రలో అతనికి తోడ్పడిరి. పృథ్వీశ్వరుని వధించిన వెనుక కాకతిరాజ్య సమర్థుడని బిరుదందిన రేచెర్ల రుద్రిరెడ్డి సామంతుడు కాజనాయకుని సైన్యాధిపత్యమున కొంత కాకతీయ సేన కళింగ గాంగ చమూపతులను వెంబడించి కళింగదేశమున ప్రవేశించి విజయ పరంపరలను సంపాదించెను. రాజనాయకుడు బొక్కెరలోని వీరభటావలిని దునిమివైచి, గోదుమరాటి తలను ఉత్తరించి, ఉదగిరి సాధించి, పడిరాయని పారదోలెను. రాజనాయకునికి ఈ విజయములు అన్నియు కళింగ దండయాత్రలోనే చేకూరెను. బొక్కెర అనునది గంజాముజిల్లా అస్కా తాలూకాలోని బొక్కెర అని చరిత్రకారులు గుర్తించియున్నారు. ఉదగిరికూడ గంజాము, విశాఖపట్టణ మండలములలోనిదే కావచ్చును. గోదుమరాటిని, పడిరాయని గుర్తింప గుదురుట లేదు. మొత్తముమీద వెలనాటి కులోత్తుంగ పృథ్వీశ్వరుని అస్తమయముతో వెలనాటి రాజ్యము కథావశేషమయినది; గాంగ వంశ్యులకు అస్వతంత్రతా జీవనము అంతరించినది; మధ్యాంధ్ర దేశమున కాకతీయ పతాక సుప్రతిష్ఠితమయినది.

ఈ రాజరాజదేవుని కాలముననే ఉడిపిలో ఆనందతీర్థ శ్రీపాదులు బాదరాయణ సూత్రములకు భాష్యము రచించి శ్రీ వైష్ణవ విశిష్టాద్వైత సంప్రదాయమునకు భిన్నమైన ద్వైతము అను క్రొత్త సంప్రదాయమును వెలయించిరి. ఈ సంప్రదాయము ద్వైత మనుపేర ప్రసిద్ధికెక్కినట. ఏతన్నూతన సంప్రదాయావలంబకులకు ద్వైతులని పేరు. ఆనందతీర్థులవారికి మధ్వాచార్య శ్రీపాదులను పేరుండుట చేత ద్వైతులకు మాధ్వమతస్థు లనియు పేరు కలిగినది.

**మూడవ అనియంక భీమదేవుడు :** (క్రి. శ. 1211 - క్రి. శ. 1238): మూడవ రాజరాజ దేవుని అనంతరము గాంగ సింహాసనమును అధిష్ఠించినవాడు అతని కుమారుడయిన అనియంక భీమదేవుడు. ఈపేరు వహించిన గాంగ భూవరులలో ఇతడు మూడవవాడు; త్రికళింగనాథ బిరుదాంచితుడు. అనంతవర్మ చోడ గంగదేవునికి పిదప గాంగ సింహాసనము ఎక్కిన రాజులలో ఇతడు చాల గొప్పవాడు; పరాక్రమశాలి. ఇతని కాలమునాటికి గాంగ వంశజులకు ఉత్కల దేశాభిమానము హెచ్చినది. వారు జగన్నాథదేవ పాదారాధకులైరి. ఇతని కాలమునుండి ఉత్కలము మీద బంగాళ దేశపు సుల్తానుల దండయాత్రలు అధిక మయినవి. అనియంక భీమదేవుడు కాకతీయుల కళింగదండయాత్రకు ప్రతిగా 'వేంగీ భువనముపై' దండెత్తి వెళ్ళిన కాలములో బంగాళ దేశపు సుల్తాను జాజ్‌నగరుపై దండెత్తి వచ్చినట్లు కనబడును.

వెలనాటి పృథ్వీశ్వర భూపతి గతించినందున అనియంక భీమదేవుడు దక్షిణకళింగమునుమాత్రమేకాక త్రికళింగముతో కూడిన యావత్తు కళింగ దేశమును తన అధికారము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



క్రిందికి తీసికొని వచ్చుటకు పూనుకొనెను. కాకతీయ రాజ్యము గణపతి దేవుని నాయకత్వమున క్రమక్రమముగా విస్తరిల్లుచు కళింగమునకు కూడ అపాయకరముగ పరిణమించుచుండెను. అదివరకే కాకతీయుల కళింగదండయాత్ర విజయవంతముగను, నిర్నిరోధముగను సాగినది. అందువలన ముందు అనియంక భీముడు దక్షిణ కళింగముమ సాధింప దండు వెడలెను. అనియంక భీమదేవుని శాసనములు దాక్షారామములో నాలుగు కానవచ్చుచున్నవి. వీనిలో ఒకటి అనంగ భీమదేవుని ఎనిమిదవ సంవత్సరము నాటిది. ఇది అంక సంవత్సరమో, విజయ రాజ్య సంవత్సరమో తెలియదు. ఈ శాసనములలో అతడు అనియంక భీమరావుత దేవర అనియు, అనియంక భీమ వర నృప హారివదప్రియ రావుతాఖ్యుడనియు పేర్కొనబడెను. ఇతని దండాగ్రేసర వల్లభుడు ఖడ్గసింహాగ్రపుత్రుడైన 'త్రైసాజ'కుడు. ఇతడు శాసనమునందు 'ద్రుతజిత విలస ద్వేంగీ భూమండ'లుడు అని ప్రశంసింపబడినందున సింహాచలము మొదలు గోదావరీ తీరమువరకు గల దేశమంతయు అనియంక భీమనృపునికి స్వాధీనమయ్యె నను టకు సందియము లేదు. ఈ కారణముననే ఏమో అతడు 'త్రయీ వసుంధరా సముద్ధరణు'డని, 'త్రికళింగేశ్వరు'డని కీర్తింపబడెను. ఇతడు ఈ కాలమునందు గజిబిజిలో పడిపోయిన చోళ రాజకీయ వ్యవహారములలో కూడ జోక్యము కలిగించుకొనినట్లు కాన్పించును. ఈ కాలమున చోళ సామ్రాజ్యమును పరిపాలించుచుండిన చోళ చక్రవర్తి మూడవ రాజరాజ దేవుడు (క్రీ. శ. 1216 - క్రీ. శ. 1253). ఈతడు చాల బలహీనుడైనందున ఇతని సామంత దండనాయకులే ఇతనిపై తిరుగబాటును కావించిరి. వీరిలో ముఖ్యుడు పల్లవ రాజయిన కొప్పెరుంజింగ భూపతి. ఇతనిని కాడవరాయ డనియు, మహారాజసింహు డనియు వ్యవహరింతురు. మూడవ రాజరాజ చోడ చక్రవర్తిపై పాండ్య రాజులు, పల్లవరాజులు తిరుగబాటు చేసినపుడు హొయిసల బల్లాళులును, నెల్లూరు తెలుగు చోళులును కూడ అప్పటి రాజకీయములలో కలుగ జేసికొనిరి. ఈ సందర్భముననే మూడవ అనియంక భీమదేవుడు కూడ ఈ రాజకీయ కలహమున జోక్యము కలిగించుకొనెను. ఇతడు ఎవరి పక్షము అవలంబించి ఎవరిపై యుద్ధము చేసెనో తెలియదు కాని ఇతడు సైన్య సమేతుడై కాంచీపురము నకు మాత్రమే కాక శ్రీరంగము వరకు కూడ వెళ్ళెను. కాంచీపురములో అనియంక భీమదేవుని శాసనములు కలవు కలుగుచున్నవి. శ్రీరంగములోని శాసనములలో 'ఒడ్డెల గల ఖాకు సంబంధించిన ప్రస్తావము కలదు. అచ్చటినుండి జటావర్మ సుందర పాండ్యుడు ఒడ్డెవారిని తరిమివేయు వరకు (క్రీ. శ. 1225 - శకము 1147) వారక్కడనే ఉండిరి. అనియంక భీముని దక్షిణదేశ దండయాత్రను గురించి మనకు వివరములు తెలియవచ్చుటలేదు. దీనిని గురించి ఇంకను పరిశోధన జరగవలసి యున్నది. మొత్తముమీద గోదావరీ తీరము వరకు గల దేశము అనియంక భీముని అధికారము క్రిందికి వచ్చెను.

మూడవ అనంగ భీమదేవునికి సమకాలికుడైన బంగాళ దేశపు సుల్తాను ఘియాజుద్దీన్ ఖల్జీ. ఇతడు మువామ్మదు-ఇ-బఖ్త్యారు ఖల్జీ మరణానంతరము బంగాళ దేశమునకు హిజిరా 612 (క్రీ. శ. 1215 - శకము 1137) లో సుల్తానయ్యెను. ఇతడు అంతవరకు జయించిన ప్రాంతములను అన్నిటిని కలియజేర్చి కట్టుదిట్టమైన పరిపాలనను ఏర్పరచి జాజ్ నగరును కూడ తన అధికారము క్రిందికి తెచ్చుకొనెనని చెప్పుదురు. తన తబకాత్-ఇ-నాసిరిలో మిన్హాజుద్దీన్ జాజ్‌నగరు పరిపాలకుడు ఘియాజుద్దీన్ సుల్తానుకు కప్పము పంపినట్లు వ్రాసియున్నాడు. ఈ చిట్టి పొడిమాట తక్క అతడు ఘియాజుద్దీను యొక్క జాజ్‌నగరు దండయాత్ర ఏదియు వర్ణించియుండలేదు. ఒకవేళ ఘియాజుద్దీను జాజ్‌నగరుపై దండెత్తి దానిని జయించుటయే నిజమైనచో అది శకము 1147 (క్రీ. శ. 1225) కు పూర్వమే జరగి యుండవలెను; ఏలన, శకము 1147 నుండి అతనికి ఢిల్లీ సుల్తానైన షమ్సుద్దీన్-ఇల్-తుత్‌మిష్ తోను, అతని కుమారుడైన నాజిరుద్దీన్ సుల్తాన్‌తోను యుద్ధములతోనే సరిపోయినది. జాజ్‌నగరు రాజువద్దనుండి కప్పము తీసికొన్నట్లు గాదుకదా, తుదకు జాజ్‌నగరు దండయాత్రా ప్రస్తావమైనను రియాజ్-ఉస్-సలాతీన్ గ్రంథములో లేదు.

కాని, అనంగ భీమదేవుని చాటేశ్వరాలయ శాసనములో అతనికి యవనులతో యుద్ధము జరగినట్లు చెప్పియున్నది. ఈ యవనులు బంగాళ దేశపు సుల్తానులే కావచ్చును. ఈ శాసనములో యవనులతోడి సంగ్రామమున మూడవ అనియంక భీమదేవుని ప్రధాని, దండనాయకుడు అయిన విష్ణుని పరాక్రమము ఈ రీతిని ప్రశంసింపబడినది.

వింధ్యాద్రి అధసీమను భీమనదీ ప్రాంతమున అంభోనిధీ తీరమున పోరాడుచుండిన కాలమున అతి భయమువలన తుఘాణ పృథ్వీపతి విశ్వము విష్ణుమయమని తెలిసికొనగలిగినంతగా వైఖానసులైనను తమ గాఢ పరిశ్రమచేత తెలిసికొనలేకపోయిరి. విష్ణువు యవనావనీశ సమరములో అనేకులను తన నిశిత సాయకములతో వధించెను. అది అతనికి వీరవ్రతమయినది.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



విష్ణునితో పోరాడిన తుంఘాణ పృథ్వీపతి చేది హైహయ దేశమైన తుమ్మాణపు పాలకు డనియు, తుమ్మాణమునకు తుంఘాణమని పొరపాటున వ్రాయబడిన దనియు కొంద రందురు; కాని, వే రొక కొందరు అది తప్పుగా వ్రాయ బడలే దనియు, తుంఘాణ పృథ్వీశ్వరుడు లఖ్నోతి (లక్ష్మణావతి)కి అధిపతియైన మలిక్ ఇజ్జుద్దీన తుఘ్రిల్ - ఇ - తుఘాన్ ఖాన్ అనియు చెప్పుదురు. ఈ యభిప్రాయమే సరియైనదిగ కన్పట్టును. తుఘాన్ అన్నది శాసనములో తుంఘాణ అని ఛందస్సును సరిపుచ్చుకొనుటకు వ్రాసి యుండవచ్చును. ఈ తుఘాన్ ఖాను హిజిరా 631 (శకము 1155 - క్రీ. శ. 1233)లో రాజ్యమునకు వచ్చి పదునొకం డేండ్లు పరిపాలనము చేసెను. ఈవిధముగా అతడు అని యంక భీమదేవునికిని, అతని కుమారుడైన మొదటి నరసింహదేవునికిని సమకాలికుడు. అనంగభీముని చాటే శ్వర శాసనమువలన తెలియవచ్చు ఈ యవన సంగ్రామ మును గురించిన ప్రస్తావము ఏ ముస్లిము చరిత్రలలోను కాన్పింపదు. అనియంక భీముడు బంగాళదేశపు ముస్లిము సుల్తానుల దండయాత్రను అరికట్టి వారిని జయించె నను టకు అతని చాటేశ్వర శాసనమే ప్రమాణము.

కళింగము : సింహళము ; కళింగరాజవంశమునకు సంబంధించినవారే క్రీస్తుశకము పండ్రెండవ శతాబ్దములో సింహళమును కొంతకాలము పరిపాలించిరి. క్రీ. శ. 1072 - 78 లో లంకాధిపతిగా పట్టాభిషిక్తుడైన విజయబాహు నృపతి భార్యలలో కళింగరాజకుమారి త్రిలోకసుందరి ఒకతె. ఇంతటినుండి కళింగపక్ష మొకటి బలపడి సింహళ దేశ రాజకీయములలో జోక్యము కలిగించుకొనెను. క్రీస్తుశకము పండ్రెండవ శతాబ్దమునాటి పొలన్నారువ రాజులలో ఒకడైన నిశ్శంకమల్లుడు శకవర్షము 1079 - 80 (క్రీ. శ. 1157 - 58) లో కళింగములోని సింహపురమున జనించెను. ఇతడు సింహళదేశాధీశ్వరుడైన మొదటి పరా క్రమ బాహునకు అల్లుడో, మేనల్లుడో అగును. అతడే ఇతనిని కళింగమునుండి సింహళమునకు తీసికొనివచ్చెను. ఈ నిశ్శంకమల్లుడు పొలొన్నారువ రాజ్యమును శకము 1109 (క్రీ. శ. 1187) నుండి శకము 1118 (క్రీ. శ. 1196) వరకు పరిపాలించెను. ఇతని తరువాత ఈ కాళింగజాతికి చెందినవారే సింహాసనమును అధిష్ఠించిరి. వీరిలో కొంత ప్రాముఖ్యము కలవాడు నిశ్శంకమల్లుని సవతితల్లి కొడు కైన సాహసమల్లుడు. ఇతని పట్టాభిషేకము శకవర్షము 1122 (క్రీ. శ. 1200)లలో జరగినది. ఇతడు గాంగవంశపు మూడవ రాజరాజభూపతికి సమకాలికుడు. సింహళరాజ వంశముతో గల సంబంధబాంధవ్యముల వలనను, రాజ్య లోభము వలనను తరచుగా తంజావూరు చోళ భూమీశు లును, మధుర పాండ్య మహీపతులును సింహళ రాజకీయ వ్యవహారములలో జోక్యము కలిగించుకొని సింహళముపై దండెత్తుచువచ్చి అదివరకే భిన్నప్రాంతాధిపతుల పరస్పర కలహములతోను, దాయాదుల పోరాటములతోను రొంపిగ నుండిన సింహళ రాజకీయరంగమును మరింత రక్త పంకిలము చేయుచు వచ్చిరి. కాళింగజాతికి చెందిన మాఘ నృపతి శకవర్షము 1137 (క్రీ. శ. 1215) లో గొప్ప కేరళ సేనను గూర్చుకొని సింహళముపై దండెత్తి వెళ్లి అంత వరకు అక్కడ రాజ్యము చేయుచుండిన లంకాధిపతిని పదభ్రష్టుని కావించి తాను రాజ్యమేలెను. ఇతడు మూడవ అనంగభీమునికి సమకాలికుడు. ఈ యనియంక భీమదేవుడు దక్షిణమున కాంచీపురమునకును, అటనుండి శ్రీరంగమున కును దండెత్తి వెళ్లుటకును, సింహళ రాజకీయములకును ఏదయినను సంబంధము కలదేమో విచారింపవలసి యున్నది.

మూడవ అనియంక భీమదేవుడు గొప్ప దేవాలయ నిర్మాత. అతడు కటకము జిల్లా కృష్ణాపుర గ్రామములో కామాంతకుడైన శివునికి ఆలయమును నిర్మించి అందు ఆ దేవదేవుని చాటేశ్వరుడు అను పేర ప్రతిష్ఠించెను; శతా ధికముగ విలాసవసతులను కట్టించెను; పాంథులకొరకు శాటలు వేయించెను; వందలకొలది తటాకములు త్రవ్వించెను; పురుషోత్తమునికి ప్రియమైన సముద్రతీరమునందు అనేక హోమ తులాభారములు తూగెను. అతడు వేద విదుడు; అనంత భీమరావుతు అనియు, అనంతవర్మ రావుతదేవు డనియు శాసనములలో పేర్కొనబడినాడు. అతని భార్య కస్తూరాదేవి. ఈమెకు అనంగ భీమునివలన నరసింహదేవుడను కుమారుడు కలిగెను. అతనికి చంద్రికా దేవి అను నామాంతరము కల చంద్రాదేవి అను కూతురు కూడ కలదు. అనంగభీముడు ఆమెను హైహయ వంశ రాజకుమారుడైన పరమర్ది దేవునకు ఇచ్చి వివాహము కావించెను. పరమర్దిదేవునకే పరమాడి అను నామాం తరము కలదు.

ఇతని సేనాపతులలో 'త్రైసాజ'కుడు కాక మహానాద సేనాపతి మరియొకడు శాసనములవలన తెలియవచ్చును. శాసనములలో ఇతడు త్రికళింగ మండల మహాదండాధిపతి అనియు, శ్రీమతు దక్షిణ దండాధికారుడైన శ్రీకరణ మహానాద సేనాపతులు అనియు పేర్కొనబడినాడు. శాసనములవలన ఇతని యుద్యోగులు మొదలైనవారు చాల మంది తెలియవత్తురు. అనియంక భీముడు 88 అంక సంవత్సర ములు, అనగా 27 విజయరాజ్య సంవత్సరములు పాలించెను.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



**మొదటి నరసింహదేవుడు** (క్రీ. శ. 1237-38—క్రీ. శ. 1238): అనంగభీమదేవుని అనంతరము ఇతడు గాంగ సింహాసనము అధిష్ఠించెను. నరసింహదేవనామము ధరించిన వారిలో ఇతడు మొదటివాడగుటచేత ఇతనిని మొదటి నరసింహదేవు డందురు. ఇతని నాలుగవ అంక సంవత్సరము శకవర్షము 1163 అగుటచేత ఇతడు శకవర్షము 1159-60 లో రాజ్యమునకు వచ్చినట్లు నిర్ణయింపవచ్చును. ఇతనికి అనంతవర్మ వీర నారసింహదేవుడు అనియు, వీర శ్రీ నరసింహరావుతు దేవర అనియు నామాంతరములు కలవు. ఇతడు తన తండ్రికంటెను బలపరాక్రమశాలి; తన రాజ్యసీమావధులను తాను కాపాడుకొనుటయే కాక ముస్లిము రాజ్యము మీదికే దండెత్తివెళ్లి విజయము చేకొనెను.

నరసింహదేవుడు రాజ్యమునకు వచ్చిన తరువాత ముందు దానిని కట్టుదిట్టము చేసికొని లఖ్నోతి (లక్ష్మణావతి) రాజ్యముపై దండెత్తి వెళ్లెను. వచ్చుచున్న గాంగ సైన్యమును ఎదిరించుటకు తుఘాన్ ఖాన్ తన బలములను గూర్చుకొని హిజిరా 641 (శకము 1165 - క్రీ. శ. 1243)లో జాజ్‌నగరుపై వచ్చెను. ఈ దండయాత్రలో తబకాత్-ఇ-నాసిరి రచియించిన మిన్హాజుద్దీన్ కూడ ఉండెను. జాజ్‌నగరు సరిహద్దుల, మహానది ఉత్తర తటమున ఉన్న కటాసిన్ వద్ద ఉభయ బలములకును సంగ్రామము జరిగినది. ఈ యుద్ధములో హిందువులు పారిపోయి రనియు, వారి ఏనుగుల ముందు వేసిన దాణా తప్ప ఇస్లాము కాల్బలమునకు ఏ సామగ్రియు లభింపలే దనియు, అదియునుగాక, ఏనుగులను ఎవ్వరును హింసింపరాదని తుఘాన్ ఖాన్ ఆజ్ఞ ఇచ్చుటచేత భయంకర యుద్ధాగ్ని ఆరిపోయె ననియు మిన్హాజుద్దీన్ వ్రాయుచున్నాడు.

మట్టమధ్యాహ్నమువరకు యుద్ధము జరిగెను. అప్పుడు ముస్లిము కాల్బలములోని ప్రతి సైనికుడును భోజనము చేయుటకు మరలిపోగా హిందువులు పేప అడవిలోనుండి మెల్లగా వచ్చి అయిదేనుగులను తీసికొనిపోయిరి; ఇంతలో 200 కాల్బలమును, 50 మంది గుర్రపు రౌతులును వెనుక భాగమునుండి వచ్చి ముస్లిముసేనపై పడిరి. మహమ్మదీయులకు ఘోర పరాజయము కలిగినది. వందలకొలది ముస్లిములు హతులైరి. భగ్నమనోరథుడై తుఘాన్ ఖాన్ పిక్కబలము చూపి లఖ్నోతి చేరుకొనెను. అటు తరువాత, అతడు జాజ్‌నగరుపై దండయాత్రలో తనకు సాయపడ వలసినదని కోరుచు ఢిల్లీ సుల్తాను అలా ఉద్దీన్ మసూద్ షా వద్దకు షర్ఫ్-ఉల్-ముల్క్ అషారీని రాయబారము పంపెను.

ఇది ఇట్లుండగా, తబకాత్-ఇ-నాసిరి ప్రకారము జాజ్‌నగరు సైన్యములు హిజిరా 642 (క్రీ. శ. 1245)లో మరల లఖ్నోతిపై దండెత్తి వెళ్ళి ఆ కోటను ముట్టడించెను. ఈ ముట్టడిలో ముసల్మానులు అనేకులు హతులైరి. తుదకు లఖ్నోతి సైన్యాధిపతి ఫఖ్రుల్ ముల్క్ కరీముద్దీన్ లాఘ్రి కూడ చనిపోయెను. మిన్హాజుద్దీన్ చరిత్రను అనుసరించి జాజ్‌నగరు సేనలకు ఆధిపత్యము వహించినవాడు 'సాబంతర్'. ఇతడు ఒక సామంతరాజు అయి యుండవచ్చునని చరిత్రకారుల అభిప్రాయము. ఇతడు సాహస పరాక్రమములు చూపి ముస్లిము సేనను లక్ష్మణావతి వరకు తరిమికొట్టెను. ఇది తుఘాన్ ఖానుకును, నరసింహదేవునికిని రెండవ తడవ జరగిన యుద్ధము. ఈ యుద్ధములో హైహయ కులతిలకుడును, చంద్రికాదేవి భర్తయు, నరసింహదేవుని బావమరదియు అయిన పరమర్దిదేవుడు జయమును సంపాదించి వీరశయనమును పొందెను. ఈ సంగ్రామమునందు కూడ విజయలక్ష్మి వీరనరసింహదేవ రావుతునే వరించెను. క్రీ. శ. 1245 లోని ఈ విజయముతో రాఢా, వరేంద్ర మండలములు నరసింహదేవుని అధికారము క్రిందికి వచ్చినవి. అతని రాజ్యము ఉత్తరమున గంగానది వరకు వ్యాపించినది. మిన్హాజుద్దీన్ ప్రకారము లక్ష్మణావతీ రాజ్యములో గంగానదికి ఉభయ తటములందు రెండు మండలములు ఉన్నవి. పడుమటివైపుది రాఢా మండలము (తమ్లూక్, మిడ్నపూర్, హుగ్లీ, బర్ద్వాన్ జిల్లాలు చేరినది). దీనిలోనే లఖ్నోతి (లక్ష్మణావతి) నగరము ఉన్నది. గంగానదికి తూర్పువైపున ఉన్న మండలము వరేంద్ర. ఇది ప్రాచీన కాలపు పుండ్రదేశములోని భాగము. దీనిలో దీవికోట నగర మున్నది.

ముస్లిము చరిత్రకారులు ఈ విజయములు తాత్కాలికమైన వందురు. ఏలన, ఢిల్లీనుండి లఖ్నోతికి సైన్యము సహాయపడుటకు వచ్చుచుండెనని తెలిసిన వెంటనే లక్ష్మణావతి కోట గుమ్మములకడ నుండిన జాజ్‌నగర సైన్యములు భయభ్రాంతములై పారిపోయినట్లు మిన్హాజుద్దీన్ తెలుపుచున్నాడు. తుఘాన్ ఖానుకు ఢిల్లీనుంచి సాయము వచ్చిన మాట వాస్తవము. సేనలతోను, అమీరులతోను బయలుదేరి లఖ్నోతికి వెళ్ళవలసినదని ఢిల్లీ సుల్తాను అలా ఉద్దీన్ మసూద్ షా తమూర్ ఖాన్‌రు ఆజ్ఞాపించెను. అతని ఆదేశము ప్రకారము అతడు సేనలతో బయలుదేరి లఖ్నోతికి వచ్చెను. కాని, అక్కడ అతనికిని తుఘాన్ ఖానుకును సరిపడక చివరకు అనుకొన్న దొకటి, జరిగిన దొకటియైనది. తుదకు తమూర్ ఖానుకు లఖ్నోతి కోటను ఒప్పగించి తుఘాన్‌ఖాను బంగాళదేశమును విడిచి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



జగమోహన సూర్యాలయము, కోణార్కము పూరి జిల్లా.

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పోవలసి వచ్చినది. ఈ రీతిని ముస్లిము చరిత్రకారులు తమ సంతృప్తికొరకు విజయములు తాత్కాలికములయినవని వ్రాసికొన్నను, వాస్తవమునకు అవి వారు వ్రాసినంత తాత్కాలికములయినవి కావు. నరసింహ దేవుని ఈ రాఢా, వరేంద్ర మండల విజయము యథార్థమని మొదటి నరసింహ దేవుని పౌత్రుడయిన రెండవ నరసింహ దేవుని శాసనములవలన కూడ ధ్రువపడుచున్నది.

తుఘాన్ ఖానుకు తరువాత బంగాళదేశమునకు మలిక్ తుగ్రిల్ ఖాన్-ఇ-యూజ్ బక్ సుల్తాను అయ్యెను. మిన్హాజుద్దీన్ ప్రకారము ఈతని పరిపాలనకాలములో జాజ్ నగరు సైన్యములు లఖ్నోతిమీద మూడు తడవలు దండెత్తి వెళ్ళినవి. ఈ మూడు తడవలలో మొదటి రెండు తడవలు ముస్లిములకే విజయము కలిగిన దనియు, మూడవ తడవ మలిక్ యూజ్ బక్ కు కొద్ది అపజయము కలిగిన దనియు, అత్యంతానర్ఘమైన మదించిన తెల్ల ఏనుగు ఒకటి యుద్ధరంగములో అతని పక్షమునుండి తప్పించుకొనిపోయి జాజ్ నగరు సైనికులకు చేజిక్కిన దనియు మిన్హాజుద్దీన్ వ్రాయుచున్నాడు. ఈ మూడు దండయాత్రలును మొదటి నరసింహదేవుని కాలముననే జరగినవో, ఒకవేళ ఇతని కుమారుడు భానుదేవుని కాలమున జరగినవో, మిన్హాజుద్దీన్ వ్రాసినట్లు మొదటి రెండు తడవలు మహమ్మదీయులు జయించిరో లేదో - ఈ సంగతులను తెలిసికొనుటకు ఇతర ఆధారములు ఏవియు లేవు. మొత్తముమీద మొదటి నరసింహదేవుని కాలమున బంగాళదేశపు సుల్తానులకును, కళింగోత్కల దేశాధిపతియైన మొదటి నరసింహదేవునికిని పెక్కుయుద్ధములు జరగె ననియు, వీనిలో ఎక్కువవానిలో నరసింహదేవరావుతరాజే జయలక్ష్మి పరిగ్రహీతయై తన రాజ్యమును గంగానదివరకు విస్తరింపజేసికొనె ననియు విశ్వసింపవచ్చును.

వీర నరసింహదేవునికి యవనావనీవల్లభుడని బిరుదము కలదు. ముస్లిము రాజ్యమును జయించి కొంతకాలమైనను దానిని పరిపాలించినందువలన కలిగిన బిరుద మది. వీర నరసింహుని పేరు లఖ్నోతి సుల్తానులకు సింహస్వప్నమైనది.

వీర నరసింహదేవుడు రాజ్యమునకు వచ్చిన క్రొత్తలోనే కాకతి గణపతిదేవ మహారాజు అనియంక భీమదేవుని దండయాత్రవలన చేజారిపోయిన వేంగీ మండలమును మరల తన అధికారము క్రిందికి తెచ్చుకొనుటకే కాక మరల ఉత్కలాధీశ్వరులకు తగిన శాస్తి చేయవలెనని ఎంచి అతడు కళింగముపై దండు పంపెను. కాకతి గణపతిదేవ మహారాజు కాలములో అతని సైన్యములు పలుతడవలు కళింగముపై దండెత్తినట్లు శాసనములవలనను, వాఙ్మయమువలనను తెలియవచ్చును. కాని, ఈ దండయాత్రలు నికరముగా ఎప్పు డెప్పుడు జరగినవో రూఢిగా నిర్ణయించుటకు అవకాశము లేదు. క్రీస్తుశకము పదునైదవ శతాబ్ది నాటి వీరశైవగ్రంథమైన శివయోగ సారమును అనుసరించి కాకతి గణపతిదేవ మహారాజు మంత్రి ఇందులూరి సోమప్రధాని నాయకత్వమున కాకతీయ సేనలు ఒక్కఛాటిలో ఓరుగంటికి తూర్పుదిశనుగల శత్రుభూములన్నెల్ల జయించి గోగులనాడు, కొలనివీడు మొదలైన దుర్గములను సాధించి, గోదావరి నదిని దాటి పడుమాడెములను, పన్నెండు మన్నెములను, కళింగమును నిర్జించినవి. పరువ భీముడుకూడ వేంగి, ఒడ్డెదేశము, చక్రకూటము మొదలైన ప్రాంతములను జయించినట్లు చెప్పుకొనియున్నాడు. ఇన్ని దేశములను జయించుటకు - మండలికుడు అతడు - శక్తి ఎక్కడిది? ప్రాయికముగ ఈనాటి వాడే గనుక అతడుకూడ కాకతీయ సామంతుడుగ ఈ పూర్వ దిగ్విజయ యాత్రలో సోమప్రధానితో ఉండి ఈ విజయములను సాధించి యుండవచ్చును. కాకతీయుల ఈ దండయాత్ర విజయవంతముగ సాగినది. దీనితో కాకతీయుల బలప్రాభవ పరాక్రమములు ఇంచుమించుగ మధ్యప్రదేశ్ వరకు తెలిసివచ్చినవి.

వీరనరసింహదేవుడు కాకతీయ దండయాత్రకు ప్రతిగా మరల కాకతీయరాజ్యముపై దండు పంపక ఊరకుండునంతటి నిర్వీర్యుడు కాడు. శ్రీకాకుళము స్థలపురాణమైన సంస్కృత శ్రీకాకుళ మాహాత్మ్యమునకు ఆంధ్రీకరణమైన వల్లభాభ్యుదయము అను అర్వాచీన ఆంధ్ర ప్రబంధము వలన వీరనరసింహభూపతి అతని పెంపుడు సోదరుడు అనంతపాల దండనాథునికి కొంతసైన్యము ఇచ్చి కాంచీ నగరముపై దండెత్త బంపినట్లు తెలియుచున్నది. కాకతీయాంధ్ర రాజ్యముపై కాక, కాంచీపురముపై దండెత్త బంపినట్లు ఏల చెప్పబడినదో తెలియదు. దండెత్తి వెళ్లుచు, అనంతపాలుడు శ్రీకాకుళమువద్ద ఆగి అక్కడ తెలుగు వల్లభునికి (ఆంధ్ర విష్ణువునకు) ఒక ఆలయము కట్టించి అటనుండి కాంచీపురమునకు వెళ్లి, శత్రువులను యుద్ధమున ఓడించి జయస్తంభమును నిలిపి వారివద్ద కప్పము తీసికొని కళింగమునకు మరలివచ్చినట్లు వల్లభాభ్యుదయము తెలుపుచున్నది. కాకతి గణపతిదేవమహారాజును కాని, అతని సేనానులను ఎవ్వరిని కాని ఈ కావ్యము ఎందువలన పేర్కొనలేదో, శత్రు రాజ్యములో అనంతపాలుని దండయాత్ర అంతటి సుకరము ఎట్లయినదో తెలియదు. కాకతీయ సేనానులను, సామంతులను జయించియే అనంతపాలుడు శ్రీకాకుళము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వరకు వచ్చినట్లు చెప్పవలసియున్నది. ఈ వన్నియు అటు లుండ వీరనరసింహభూపతి పెంపుడు సోదరుడు అనంత పాలుడే తెలుగు వల్లభునికి ఆలయము కట్టించినట్లు వల్లభాభ్యుదయములో కలదు. శ్రీకాకుళములో వల్లభరాయనికి దేవళము శకవర్షము 1088 నుండి ఉన్నట్లు మనకు శాసన ప్రమాణము కలదు. అందువలన అది అంతకు చాల పూర్వ కాలమునుండి ఉండియుండవలెను. ఈ విషయములను అన్నిటిననుసరించి ఆలోచింపగా వల్లభాభ్యుదయములోని చరిత్రాంశముల ప్రామాణికతను శంకింపవలసి వచ్చు చున్నది. దాక్షారామములో నారసింగ నరాధిపుని శాసన మొకటి కలదు. అది శకవర్షము 1184 (క్రీ. శ. 1262) నాటిది. ఈ నారసింగనరాధిపుని వంశముకాని, అతని రాజబిరుదాదులు కాని శాసనమున పేర్కొనబడకపోవుట చేత ఈతడు ఎవ్వడో నిర్ధరించుటకు వీలగుట లేదు. కాని గాంగభూపతి మొదటి నరసింహదేవుని కాలమునాటి శాసనమే అగుటచేత ఇది ఆతనిదేమో యని తోచు చున్నది. ఇది అతని శాసనమైనను కాకపోయినను కాక తీయ రాజ్యముపై గాంగ వీరనారసింహుని దండయాత్ర లేకపోలే దనియు, కాకలు తేరిన కాకతీయ చమూపతులు ఊరకుండలే దనియు, వారు కాళింగులు దండెత్తిరాగా మరల వారిని ఓడించి తరుమగొట్టి రనియు చెప్పుటకు అవ కాశము కలదు. శకవర్షము 1188 నాటి ఒక త్రిపురాంతక శాసనమున కాకతీయ గణపతిదేవ మహారాజ దివ్యశ్రీపాద పద్మారాధకుడును, చాళుక్యవంశోద్భవుడును అయిన సకల సేనాధిపతిపట్టసాహిణి పడికము బొప్పదేవునికి గల 'పాంపరాయ సందర్శిత రిపుకబంధ తాండవ, గోదావరీ తీర సమరగాండీవ, కళింగ మండలిక ఘాటీ సమ్మర్ద' బిరుదములవలన కళింగ మండలికులు వేంగిపై దండెత్తి వచ్చినట్లును, గోదావరీ తీరమున కళింగ, కాకతీయ సైన్యములకు సంగ్రామము జరగినట్లును, అందు కళింగ సైన్యము పరాజయము నొందినట్లును విశదమగు చున్నది. ఈ విషయమును శకవర్షము 1179 - 80 నాటి తెలుగు చోడరాజయిన రెండవ మనుమసిద్ధి నందలూరు శాసనము ధ్రువపరచుచున్నది. ఈ శాసనమున అతడు కాకతి గణపతి దేవ నృపతికి సమరములో తనంతట తాను సహాయపడు టకై గోధావరి నదిని పుట్టిలో దాటి కాళింగులను కళిం గాభిముఖులై పరుగిడజేసినట్లు చెప్పుకొని యున్నాడు. వీనిని అనుసరించి చూడగా వల్లభాభ్యుదయములోని విషయము నిజమైనను కాకపోయినను మొదటి వీర నరసింహదేవుని కాలములో కాకతిరాజ్యముపై కాళింగుల దండయాత్ర ఒకటి జరగినట్లును, కళింగ సైన్యములు దక్షిణ కళింగమును జయించి గోదావరీ తీరమునకు వచ్చి నట్లును, అక్కడ కాకతీయులకును, కాళింగులకును యుద్ధము జరగినట్లును, అందు కళింగసైన్యము పరా జయము పొందినట్లును స్పష్టమగుచున్నది.

మొత్తముమీద వీర నరసింహదేవుని పరిపాలనకాలము చాల ముఖ్యమయినది. ఇతని కాలములో గాంగరాజ ప్రతిష్ఠావైభవములు అతిశయించినవి. వీర నరసింహదేవుడు విద్యాపోషకుడు. ఇతని ఆస్థానమున ఏకావళి అను అలం కార గ్రంథమును రచియించిన విద్యాధరుడు ఉండెడివాడు. విద్యలను పోషించినట్లే ఇతడు కళలను కూడ ఆదరించెను. ఇతని తండ్రివలెనే ఇతడును ధర్మకార్య నిరతుడు; పెక్కు తులాభారములను తూగెను. శ్రీకూర్మమునందలి కూర్మ నాథాలయమునకు ఈతడు చేసిన దానధర్మము లనేకము. సింహాచలమున నరసింహనాథదేవరకు నల్లరాతి శ్రీవిమా నము, ముఖమండపము, నాట్యమండపము, తిరుచుట్టు మాలె - ఇవి అన్నియు వీరనరసింహదేవుని ఆదేశమున ఆళ్వాయి సేనాపతి కట్టించెను. అనంతవర్మ చోడగంగ దేవుడు పూరీ జగన్నాథాలయమును కట్టించిన పిదప గంగ వంశ్యుల సేనాపతులు, ప్రధానులు మొదలైనవారు అతనిని అనుకరించి ఆలయములు నిర్మించుచు వచ్చిరి. ఓఢ్ర దేశమును శిల్పసుందరములైన దేవాలయములతో నేత్రానందము కావించినవారు కళింగ గాంగ వంశజులు. మొదటి వీర నరసింహదేవుడు కూడ కోణాకోణ గ్రామ మున కర్మసాక్షియైన సూర్యదేవునికి విశ్వవిఖ్యాతమైన మనోహరాలయమును కట్టించి ప్రసిద్ధి వహించెను. ఇప్పుడు అది కోణార్కమను పేర ప్రసిద్ధమై గొప్ప పుణ్యక్షేత్ర మయినది. నాటికి నేటికి నరసింహదేవ నిర్మితమైన ఈ యాలయము రమణీయ శిల్పకళా సంపన్నమై కళాభి మానుల దృష్టిని ఆకర్షించి వారి ప్రశంసలను అందుకొను చునే యున్నది.

వీరనరసింహదేవుని కాలమున వైష్ణవము కళింగములో బాగుగ వ్యాపించినది. ఈ కాలములో సింహాచల, శ్రీకూర్మ క్షేత్రములు మహావిభవాభిరామములై భక్తకోటిని ఆక ర్షించినవి. నరసింహపురి మహామునులు, వాసుదేవయతి మొదలైనవారు కూర్మనాథుని దర్శించి దానములు, ధర్మములు కావించిరి.

కళింగము : సింహళము : వీరనరసింహదేవుని 28 వ అంక సంవత్సరమునకు సరియైన శకవర్షము 1178 లో సింహళదేశమునందలి అజ్జకేశవదేవుని కూతురు గాయకి భాగలదేవి కళింగమునకు వచ్చి శ్రీ కూర్మనాథునికి అఖండ దీపదానమును కావించెను.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వీరనరసింహదేవుని భార్య మాలచంద్ర తనూజయైన మాళవ రాజపుత్రి సీతాదేవి. ఈ దంపతులకు భానుదేవుడు జనించెను.

**మొదటి భానుదేవుడు** (క్రీ.శ. 1263—క్రీ.శ. 1277-78): భానుదేవనామమును ధరించిన గాంగవంశజులలో ఇతడు ప్రథముడు. ఇంతటినుండి గాంగసింహాసనమును ఎక్కిన మహీపతులకు ఒకరిని విడిచి ఒకరికి భానుదేవ, నరసింహదేవ నామములు కలుగుచు వచ్చినవి (ఉదాహరణమునకు: మొదటి భానుదేవుని కుమారుడు రెండవ నరసింహదేవుడు; పౌత్రుడు రెండవ భానుదేవుడు; ప్రపౌత్రుడు మూడవ నరసింహదేవుడు). ఈ విధముగ ఇతని తరువాత కళింగమున ముగ్గురు నరసింహభూపులును, ముగ్గురు భానుదేవ నామాంకితులును పరిపాలించిరి.




భానుదేవుని రాజ్యకాలముననే కళింగదేశమున నరహరి తీర్థులను ద్వైతమతాచార్యులవారు ఉండిరి. వీరి శాసనములు శకవర్షము 1186 (క్రీ. శ. 1264) నుండి శకవర్షము 1215 (క్రీ. శ. 1293) వరకు కనబడుచున్నవి. ఈయన ఆనందతీర్థ శ్రీపాదుల శిష్యుడు. కళింగములో కానవచ్చు ఈయన శాసనములు ఈయన శ్రీకూర్మ, సింహాచలములలో చేసిన దానధర్మములను తెలుపును. శకవర్షము 1193 నాటి శ్రీకూర్మములోని శాసనములో ఈయన భానుదేవుని ఆశ్రితుడని (భానుదేవ శ్రితః), 'ముదుసలి సచివుడు నరహరి మునీశ్వరు'డని పేర్కొనబడి యున్నాడు. ఈయన శకవర్షము 1203 లో శ్రీకూర్మనాథుని ఆలయమునకు ఎదురుగా యోగానంద నరసింహాలయమును నిర్మించెను. శకవర్షము 1213 లో సింహాచలములోని నరసింహనాథునికి నరహరితీర్థ శ్రీపాదులు తమకు ఆరోగ్య యశః పుణ్యాభివృద్ధిగా అఖండదీపదానము చేసెను. శకవర్షము 1215 లో 'శ్రీమదానందతీర్థ పూజ్యపాదాచార్య శిష్యులైన శ్రీ నరహరితీర్థ శ్రీపాదులు కూర్మనాథుని నగరియందు శ్రీరామనాథుని, సీతాపరమేశ్వరిని, శ్రీలక్ష్మణదేవరను ప్రతిష్ఠించి వారికి పూజా పుష్ప శ్రీగంధ నైవేద్యాదులకు శ్రీకూర్మనాథ భండారమున 51 గండమాడలు పెట్టెను. ఆయన కళింగ పరిపాలకుడుగా ఉండి శబర దండయాత్ర నెదుర్కొని ఆదేశమును కాపాడెను. ఈ నరహరి తీర్థుల వారిని గురించిన వివరములు మధ్వవిజయకావ్య, నరహరి యతిస్తోత్రములవలన తెలియుచున్నవి. ఆనంద తీర్థులవారు బదరీనాథము వరకు వెళ్లి, అటనుండి వంగదేశము మీదుగా



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తిరిగి వచ్చుచు కళింగమునకు వచ్చిరి. అక్కడ శోభనభట్టను అద్వైతవాది ఒక డుండెను. అనందతీర్థులవారికిని, శోభన భట్టునకును వాదోపవాదములు జరిగినవి. వీనిలో శోభన భట్టు పరాజితుడై సన్న్యాసము నవలంబించి ఆనందతీర్థుల వారికి శిష్యుడయ్యెను. ఆశ్రమస్వీకారానంతరము ఆనంద తీర్థులవారు అయనకు పద్మనాభ తీర్థులని నామకరణము చేసిరి. శోభనభట్టు పరాజయమును చూచి ఉద్రిక్తుడై జయాకాంతుతో శామా శాస్త్రియను వేదవేదాంగవిదుడు ఆనంద తీర్థులవారితో వాదమునకు దొరకొనెను. శామాశాస్త్రియు, ఈయన తండ్రియు గాంగభూవరులకు ప్రధానులుగ ఉండిరి. శామాశాస్త్రికూడ ఆనందతీర్థులవారితో వాదించి తన ఓటమిని అంగీకరించి సన్న్యాసాశ్రమమును స్వీకరించి ఆనంద తీర్థ శ్రీపాదులకు శిష్యుడయ్యెను. ఆశ్రమ స్వీకారమునకు పిదప శామాశాస్త్రి నరహరి తీర్థులనుపేర వ్యవహృతుడయ్యెను. ఈయనయే శ్రీ కూర్మములోని యొక శాసనమున భానుదేవుని 'ముదునలి నచివు'లని పేర్కొనబడినాడు. మాధ్వ సంప్రదాయ గ్రంథములను అనుసరించి సన్న్యాసాశ్రమమును స్వీకరించిన పిదప పద్మనాభ తీర్థుల వారును, నరహరి తీర్థులవారును కూడ ఆనందతీర్థ శ్రీపాదులతో ఉడిపికి వెళ్లిరి. నరహరితీర్థులవారు ఉడిపికి వెళ్లిన కొద్దికాలమునకు కళింగాధీశ్వరుడు కాలధర్మము పొందెననియు, అంతట ఆనంద తీర్థులవారు అయనను కళింగమున కరిగి, బాలరాజ ప్రతినిధిగా రాజ్యమేలి, యుక్త వయస్కుడయిన పిదప అతనికి పట్టము కట్టి మహారాజ కోశాగారమునసున్న సుందరములైన సీతారామ విగ్రహములను కొనిరావలసినదని ఆజ్ఞాపించెననియు, గుర్వాదేశానుసారము నరహరి తీర్థులవారు మరల కళింగమునకు వచ్చి పండ్రెండేండ్లు బాలరాజప్రతినిధిగా గాంగ సామ్రాజ్యమును పరిపాలించి తదనంతరము ఉడిపికి వెళ్లిరనియు మాధ్వమత వృత్తాంతములు నుడువుచున్నవి. ఆనందతీర్థ శ్రీపాదుల తరువాత మధ్వాచార్య పీఠమును అధిష్ఠించిన వారు పద్మనాభతీర్థులవారు. వారి అనంతరము నరహరి తీర్థ శ్రీపాదులు గురుపీఠమును అధిష్ఠించిరి. మాధ్వగురు పరంపరలో ఈయన తృతీయుడు. మధ్వాచార్య చరిత్రమును గురించి విమర్శన పూర్వకమైన వ్యాసము వ్రాసిన శ్రీ జి. వెంకోబారావుగారి కాలనిర్ణయ క్రమమును అనురించి నరహరితీర్థులవారి పరిపాలనము కళింగములో శక వర్షము 1186 లో ఆరంభమై శకవర్షము 1197 లో అంతమగుచున్నది. మాధ్వమత చరిత్ర గ్రంథములను అనురించి మొదటి భానుదేవుడు రాజ్యమునకు వచ్చునాటికి బాలుడని చెప్పవలసి యున్నది. నరహరి తీర్థులవారు రాజప్రతినిధిగా పరిపాలించిన కాలమును గురించి భిన్నాభిప్రాయములు కలవా రున్నారు. నరహరి తీర్థులవారి రాజప్రతినిధి పరిపాలనమే లే దనియు కొంద రందురు. అయన ప్రతినిధి పరిపాలనము నిజమైనను కాకపోయినను అయన మొదటి భానుదేవునికి సమకాలికు డగుటయు, భానుదేవుని కాలమునను, ఇతని కుమారుడు రెండవ నరసింహదేవుని కాలమునను కళింగమునం దుండుటయు మాత్రము వాస్తవము. మాధ్వ సంప్రదాయము తెలుగుదేశములో అధికముగా వ్యాపించుటకు నరహరి తీర్థులవారే కారణము. సింహాచలములో ఒక నరహరి మఠము ఉండెను. ఆ మఠాధిపతి జగన్నాథతీర్థ శ్రీపాదులు. ఈయన నరహరి తీర్థ శ్రీపాదులకు చాలకాలము తరువాత ఉండుటవలన ఈయన వారి శిష్యులని నిర్ణయింపలేము. కాని మాధ్వ గురువు లనుటకు సందియము లేదు. నరహరితీర్థులవారి బోధలతో కళింగ దేశములో మతవిషయకముగా క్రొత్త ఉత్సాహము, క్రొత్త చైతన్యము కలిగినది. ఇంతటినుండి కళింగదేశాధీశ్వరులు వైష్ణవమును ఎక్కువ అభిమానించిరి; అందును కృష్ణభక్తి ప్రజలలో అతిశయించినది.

భానుదేవునికి సమకాలికుడై బంగాళదేశమును పరిపాలించిన సుల్తాను మలిక్ తుఘ్రిల్ ఖాన్-ఇ-యూజ్‌బక్. ఇతడే జాజ్‌నగరుపై మూడు దండయాత్రలు చేసెననియు, చివరి దండయాత్రలో ఇతనికి కొద్ది అపజయము కలిగినట్లు ముస్లిము చరిత్రకారులు చెప్పుదు రనియు ఇదివరలో చెప్పబడినది. ఈతడే మరికొంతకాలమైన తరువాత మరల జాజ్‌నగరుపై దండెత్తి వెళ్లినట్లు రియాజ్-ఉస్-సలాతీన అను గ్రంథమువల్ల తెలియుచున్నది. ఈ గ్రంథము ప్రకారము మలిక్ యూజ్‌బక్ ఢిల్లీ సుల్తాను సాయము కోరి లఖ్నోతి (లక్ష్మణావతి)నుండి కొంతసైన్యమును తీసికొని ఉమర్దన్ రాజ్యముపై దండెత్తివెళ్లి అకస్మికముగా తద్రాజధానియైన ఉమర్దన్ చేరుకొనెను. మలిక్ యూజ్‌బక్ సైన్యములధాటికి ఆగలేక తదధిపతి వెన్నుచూపెను. అంతట రాజకుటుంబము, ఆశ్రితులు, అనుచరులు, ధనము, ఏనుగులు అన్నియు ముస్లిము సైనికులకు చేజిక్కినవి. ఈ విజయమును సాధించిన అనంతరము స్వాతంత్ర్యమును ప్రకటించి, సుల్తాను ముఘీజుద్దీన్ అను బిరుదనామమును ధరించి, తన రాజ్యమున ఖుత్బా తన పేరుతోనే చదివించెను. ఖుత్బా ఎవరిపేరుతో చదివించిన వారు స్వతంత్ర రాజ్యాధిపతు లనుటకు గుర్తు. ఇది శకము 1201 (క్రీ. శ. 1279)లో జరగుటవలన జాజ్‌నగరు దండయాత్ర అంతకు పూర్వమే భానుదేవుని పరిపాలనకాలము చివరి వత్సరములలో జరగి ఉండవలెను.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఈ యూమర్దళ ఎక్కడిదో, దీనిని పరిపాలించుచుండిన రా రెవ్వరో తెలియదు. ఇది ప్రాయికముగా గాంగుల కళింగోత్కల సామ్రాజ్యములోని మండలిక రాజ్యమై ఉండవచ్చును. అందువలననే మలిక్ యూజ్‌బక్ జాజ్ నగరుపై దండెత్తినట్లు చెప్పబడినది. ఈ దండయాత్రలు జరగుటయు, అందు ముస్లిములకు తరచుగా విజయములు లభించుటయు వాస్తవమగునో కాదో తెలిసికొనుటకు ఇతరాధారములు లేవు. ఢిల్లీ సుల్తాను ఘియాజుద్దీన్ బల్బన్ ఇతనిని అణచివేసి మరల సామంతుని కావించుటకు బంగాళ దేశముపై దండుపంపెను. అందువలన క్రీ.శ. 1279 తరువాత మలిక్ యూజ్‌బక్‌కు ఈ యుద్ధములతోనే సరిపోయినది.

పై మడివిన వృత్తాంతమునకును, ఈ దండయాత్రలను గురించి ఇతర చరిత్రకారులు చెప్పిన వృత్తాంతములకును స్వల్ప వ్యత్యాసములు కలవు. హిజిరా 678 (క్రీ. శ. 1279) లో తుఘ్రిల్ తన సేనలతో జాజ్‌నగరుపై దండెత్తి తదధీశ్వరుని ఓడించి పెక్కు ఏనుగులను, ధనాదికములను చూరగొనెనని రియాజ్-ఉస్-సలాతీన్ చెప్పుచున్నది. తబకాత్-ఇ-నాసిరిలోవలె ఇందు ఇతర దండయాత్రలను గురించిన ప్రస్తావము లేదు. తన తారీఖ్-ఇ-ఫీరూజ్ షాహి గ్రంథములో జియా ఉద్దీన్ బరని కూడ జాజ్‌నగరుపై తుఘ్రిల్‌ఖాను జరపిన ఒక దండయాత్రను గురించి మాత్రమే తెలిపియున్నాడు. తుఘ్రిల్ జాజ్‌నగరుపై దండెత్తి అనర్ఘ ద్రవ్యాదులు, ఏనుగులు చూరగొనిపోయినట్లు అతడు చెప్పును. ఈ రీతిని మలిక్ తుఘ్రిల్ ఖాన్-ఇ-యూజ్‌బక్ పరిపాలనకాలమున జాజ్‌నగరు అధిపతి లఖ్నోతి రాజ్యముపై ముమ్మారు దండెత్తినట్లు చెప్పునది ఒక్క మిన్హాజుద్దీన్ మాత్రమే. అందువలన ఇతడు చెప్పిన విషయములు చాల జాగ్రత్తగా పరిశీలింపవలెను. మొత్తముమీద భానుదేవుని కాలమునకూడ కళింగోత్కల నాథులకును, లఖ్నణావతి సుల్తానులకును యుద్ధము జరగినట్లు అంగీకరింపవచ్చును. మలిక్ యూజ్‌బక్ అనంతరము లఖ్నోతిని పరిపాలించిన సుల్తానులకు వారి రాజకీయ వ్యవహారములతోనే సరిపోయినది కాబోలు, మహమ్మదీయ చరిత్రకారులు ఇంక జాజ్‌నగరుకు లఖ్నోతికి యుద్ధము జరగినట్లు చెప్పరు.

భానుదేవునికిని, కాకతీయులకును గల సంబంధము ఎట్టిదో తెలియదు. కాని, ఇతడు కాకతి గణపతిదేవుని అనంతరము ఓరుగంటి సింహాసనమును అధిష్ఠించిన రుద్రమదేవి పరిపాలనకాలమున సింహాచలమునకు దక్షిణమున ఉన్న దేశముపై మరల దండెత్తివెళ్లి మరల గోదావరీ తీరమువరకు గల ప్రదేశమును తన యధికారము క్రిందికి తెచ్చుకొనెను. మొదటి నరసింహదేవుని కుమారుడైన వీరభద్రనృపుడు ఒకడు శకవర్షము 1188 (క్రీ. శ. 1266) లో భీమేశ్వరస్వామికి దీపదానము చేసినట్లు తెలుపు శాసనము ఒకటి దాక్షారామములో ఉన్నది. శకము 1184 నాటి దాక్షారామములోని శాసనమునందలి నరనారసింగనృపతియు, వీరభద్రుని తండ్రియైన నరసింహుడును ఒక్కరే అయి యుండవచ్చుననియు, ఈ నరసింహదేవుడు శాసనోక్త సంవత్సరము ననుసరించి చూడగా ప్రాయికముగా మొదటి గాంగ నరసింహదేవ భూవరుడు కావచ్చుననియు తోచుచున్నది. అట్లయినచో మొదటి భానుదేవునికి ఈ వీరభద్రనృపతి సోదరుడగును. అట్లే అయినచో ప్రాయశః ఈ వీరభద్రుడుకూడ వీరభానుదేవుని దండయాత్రలో గౌతమీతట ప్రాంతమునకు వచ్చియుండవచ్చును. ఈ వీరభద్ర నృపతి గాంగవంశ్యుడయినను కాకపోయినను శకవర్షము 1198 నాటి వీరభానుదేవుని శాసన మొకటి దాక్షారామములో ఉన్నది. ఇది భానుదేవుని పట్టపురాణి దాక్షారామ భీమేశ్వరునికి చేసిన దానమును తెలుపును. శాసనములో ఆమె పేరున్న భాగము శిథిలమగుట వలన పేరు తెలియవచ్చుట లేదు. పార్వతి అనునామెకూడ పేర్కొనబడినది. ఈమె భానుదేవుని రాణియేమో తెలియదు.

భానుదేవుడు శాసనములలో అనంతవర్మ ప్రతాపవీర భానుదేవుడని, వీరభానుదేవుడని వ్యవహృతుడయినాడు. ఇతడు రాజ్యమును కట్టుదిట్టము చేయుటకు తన రాజ్య పరిపాలన విధానమును సంస్కరించెను; దేశమును పువరుజ్జీవింప జేయునట్టియు, నీతిశాస్త్రమును చక్కగా అభ్యసించినట్టియు, దృష్టములు అదృష్టములునైన ఫలముల నిచ్చునట్టి విధిచేత శత్రువులను జయించునట్టియు, విశుద్ధ చరిత్రులైనట్టియు, అమోఘమైన ప్రతిజ్ఞాధ్యులైనట్టియు పదునారుగురు పాత్ర సామంతులను నియోగించెను. సామ్రాజ్యమునందు మహితులైన అట్టి పాత్రసామంతుల మంత్ర సాహాయ్యముతో భానుదేవుడు భూమిని పరిపాలించెను. ఇతడు ఆ చంద్రార్కఫలోపభోగ మలభములు, సౌధావళీ శోభావిస్ఫురితములు, రసాలపూగ కదళీ తర్వాది అంగణ శోభితములు అయిన వంద శాసనములను (అగ్రహారములను) గ్రామ విశేషితములుచేసి సచ్ఛ్రోత్రియులకు విధ్యుక్తముగా దానముచేసిన క్షమాధీశ్వరుడు. ఇతడు చాళుక్య వంశమునందు జనించిన జాకల్లదేవిని పరిణయమాడెను. ఈ దంపతులకు నరసింహదేవుడు జనించెను.

భానుదేవుని కాలములో మూడవ అనంగభీమదేవుని కొమార్తెయు, మొదటి నరసింహదేవుని సోదరియు అయిన



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చంద్రికాదేవి ఏకామ్రక్షేత్రము(భువనేశ్వరము)నందు విష్ణువునకు దేవాలయమును నిర్మించి ఈ విషయమును తెలుపుటకు ఒక శాసనమును వ్రాయించెను. శాసన లేఖకుడు ఉమాపతికవి. చంద్రికాదేవి ఏకామ్రక్షేత్రము నందలి విష్ణ్వాలయమును సందర్శించి గొప్పవదాన్యతను చూపి బలభద్ర, కృష్ణ, సుభద్రలను పూజించెను. శాసనములో ఈయబడిన సంవత్సరము శకము 1100. కాని, ఇది పొరపాటని తోచుచున్నది. శకవర్షము 1100 నాటికి కళింగమును పరిపాలించుచుండిన గాంగ భూవరుడు రెండవ రాజరాజు; రెండవ అనంగభీముడు కూడ కాదు. అందువలన, శాసనములో శకవర్షము 1200 అనుటకు పొరపాటున 1100 అని చెక్కబడి యుండవచ్చును. విశాఖపట్టణము జిల్లా బోనిగ్రామములోని శకవర్షము 1198 నాటి యొక శాసనమునందలి దాత ఉమాపతి సేనాపతి; ఈతడును చంద్రికాదేవి శాసన లేఖకుడును ఒక్కరగుదురేమో దృఢముగ చెప్పలేము. కాని, రాజసేవాసక్తులైన సేనాపతులును, మంత్రులును కూడ కొందరు సంస్కృత భాషా పారంగతులుగా ఉండుటవలన బోనిశాసనదాతయు, చంద్రికాశాసన విలేఖకుడును ఒక్కరయిన కావచ్చును.

వీరభానుదేవుని నాటినుండి కళింగములో కొన్ని సామంతవంశములు ప్రబలినవి. అట్టివానిలో ఎలమంచిలి రాజధానిగా తత్పరిసరప్రాంతమును పరిపాలించిన చాళుక్య వంశమును, ఒడ్డాది రాజధానిగా ఆ చుట్టుప్రక్కల ప్రదేశమును పాలించిన మత్స్యవంశమును, ఇదివరలో నుడివిన వీర కూటము పల్లవ వంశమును ముఖ్యమయినవి.

అర్వాచీన వేంగీ చాళుక్యులలో ఒక శాఖవారు పిఠాపురమునుండి దక్షిణ కళింగములోని ఎలమంచిలి ప్రాంతమున రాజ్యమును స్థాపించుకొనిరి. వీరిలో మొదటి ఉపేంద్రదేవుడును (శకవర్షము 1175), అతనికి అతని భార్య గంగమాంబయందు జనించిన రెండవ మల్లపదేవుడును (శకవర్షము 1205) మొదటి నరసింహ, మొదటి భాను దేవుల కాలములో ఉండిరి.

ఒడ్డాది విశాఖపట్టణము జిల్లాలోని అనకాపల్లికి పంద్రెండుమైళ్ల దూరమునందున్న ఇప్పటి వడ్డాది. ఈ వంశములో కొంత చరిత్ర ప్రాముఖ్యము గలరాజు మంకాదిత్యుడు. ఇతని పౌత్రుడును, మొదటి జయంత నరేంద్రుని పుత్రుడును అయిన ప్రతాప అర్జునదేవుడు ఈ వంశజుల సంపూర్ణ వంశానుక్రమముతో కూడిన దిబ్బిడాగ్రహార తామ్రశాసనమును ఇచ్చినవాడు. ఇతడు నృసింహ భక్తుడు; నరసింహవర్ధన నామాంతరుడు; ఒడ్డాది మత్స్యరాజ్యమును శకవర్షము 1158 నుండి శకవర్షము 1214 వరకు పరిపాలించెను. ఇతనికి అన్నమదేవుడు, రెండవ మంకాదిత్యుడు అని ఇరువురు సోదరులు. అన్నమదేవునికి గోపాలవర్ధనుడని, మంకాదిత్యునికి శ్రీరంగవర్ధనుడని బిరుదనామములు. అన్నమదేవుని శాసనము శకము 1208 నాటిది, మంకాదిత్యుని శాసనము శకము 1210 నాటిది సింహాచలములో కనబడుచున్నవి.

వీరకూటము పల్లవరాజుల శాసనములు ఏకారణముననో శకవర్షము 1149 నుండి శకవర్షము 1280 వరకు కానవచ్చుట లేదు.

ఇటుతరువాత జంతుర్నాటి సురభివంశజులును, నందాపురపు శిలావంశమువారును కూడ ప్రబలులై రాజ్యములు స్థాపించుకొనిరి. వీరు కాక, అర్వాచీన చాళుక్య కులజులు కొందరు శ్రీకూర్మప్రాంతమున స్థిరనివాసము కుదుర్చుకొని గాంగవంశ్యులకు ప్రధానులుగను, దండనాథులుగను పనిచేసిరి. కోనసీమను పాలించిన హైహయవంశజులలో కొందరు దక్షిణ కళింగమునకు వలస వచ్చి విశాఖపట్టణము జిల్లాలోని పంచధారల ప్రాంతమున నివసించి గాంగ రాజసేవలో ప్రసిద్ధి వహించిరి.

**రెండవ వీరనరసింహదేవుడు** (క్రీ. శ. 1278 - క్రీ. శ. 1304 - 05) : భానుదేవునికి పిదప అతనికుమారుడు రెండవ వీరనరసింహదేవుడు సకల కళింగోత్కల సామ్రాజ్యమునకును అధిపతియయ్యెను. శకవర్షము 1201 ఈతని మూడవ అంక సంవత్సరమని శ్రీకూర్మము శిలాశాసనమువలనను, ఈతని 21 వ అంక సంవత్సరమునకు సరియైన శకవర్షము 1217 అని ఇతని కేందుపాట్నా తామ్రశాసనము వలనను తెలియుచుండుటచేత ఇతని రాజ్యము శకవర్షము 1200 - 01 లో ప్రారంభమైనట్లు నిశ్చయింపవచ్చును. ఇతని తండ్రి మొదటి భానుదేవుడు చేసిన రాజకీయపు ఏర్పాటులవలన గాంగ సామ్రాజ్యము శాంతి భద్రతలతో తులతూగినది.

శాసనములలో నరసింహదేవుడు ప్రతాపవీర నరసింహదేవుడని, ప్రతాపవీర శ్రీ నరసింహదేవుడని, అనంతవర్మ ప్రతాపవీర శ్రీ నారసింహదేవుడని, ప్రతాపవీర శ్రీ నరసింహరావుతుదేవర యని పేర్కొనబడెను. ఈతని రాజ్యకాలములో ఇతని సామంతులు, మహాసామంతులు, మాండలికులు, అమాత్యులు, దండనాథులు మొదలైన వారు సింహాచల, శ్రీకూర్మాది దేవాలయములకు దీపదానము నిమిత్తమును, అంగరంగభోగాది తిరుకైంకర్యము నిమిత్తమును నిష్క, గ్రామ, భూ, గోదానాదులను చేసి వ్రాయించిన శాసనములు అనేకము కలవు. సింహాచలములోని ఈ శాసనములవలన నాటి ధార్మిక



http://www.sanskritcentral.com/

http://teluguthesis.com/



విశ్వాసము లెట్టివో తెలియగలదు. విద్యా విలాసోన్నతుడును, సర్వజ్ఞుడును అయిన వీరనరసింహదేవ నృపతి యొక్క సమస్త రాజ్యభార దక్షుడును, భారద్వాజకులుడును, కలాకుశలుడును అయిన గోపాల సేనాపతి కుమారుడు నరసింహదాసుడయిన నారాయణ సేనాపతి రత్నఖచిత సువర్ణకంఠాభరణము, అఖండ దీపములు పెట్టి నరసింహస్వామికి ఇతర నిబంధములను చేసెను. వానిలో కాండవశాఖ, తైత్తిరీయ శాఖలు చదివించెడి ఘటశాసులైన బ్రాహ్మణులకు ఇరువురికిని, 'పురాణ వ్యాకరణ కావ్య నాటకాభిధానాలు' పఠింపించెడి విద్వద్బ్రాహ్మణులు మూవురకును, దేవరసన్నిధిని 'మంగళగీతములు పాడుటకు సానిసంప్రదాయములందు గాయకు లిద్దరకును, ఇంకను సత్రమునకును, నైవేద్యాదులకును చేసిన నిబంధములు కొన్ని. ఈ శాసనములవలన నాటి సాంఘిక, ఆర్థిక, మత సంబంధులగు విషయములు చాల తెలియవచ్చుచున్నవి.

ఈ రెండవ నరసింహదేవుని కాలమునగూడ నరహరితీర్థులవారు కొంతకాలము కళింగముననే ఉండిరి. ఒకవేళ ఆయన ఈ నరసింహదేవుని కాలముననే రాజప్రతినిధిగ వ్యవహరించెనేమో తెలియదు. నరహరి తీర్థశ్రీపాదులు గురుపాదుల ఆదేశము ప్రకారము సీతారామలక్ష్మణ విగ్రహములను మహారాజానుమతితో వారి భండారము నుండి తీసికొని తుదిమారు కళింగమును విడిచి ఉడిపికి వెళ్లినదియు ఈకాలముననే.

**రెండవ భానుదేవుడు** (క్రీ. శ. 1305 - 06 — క్రీ. శ. 1326 - 27): రెండవ నరసింహదేవుని అనంతరము అతని భార్య చోడమహాదేవియందు జనించిన భానుదేవుడు కళింగోత్కల సామ్రాజ్యాధిపతి అయ్యెను. నరసింహదేవుని 38 వ అంక సంవత్సరమునకు సరియైన శకవర్షము 1227. అతని కుమారుడు రెండవ భానుదేవుని మూడు శాసనములలో ఒకటి అతని మూడవ సంవత్సరము శకము 1228 గను, మిగిలిన రెండును శకము 1229 గను తెలుపుచున్నవి. దీని ననుసరించి చూడగా భానుదేవుడు శకవర్షము 1227 - 28 (క్రీ. శ. 1305 - 06) లో రాజ్యమునకు వచ్చినట్లు స్థిరపడుచున్నది. ఇంతవరకు కానవచ్చిన అతని కడపటి శాసనము శకము 1248 (క్రీ.శ. 1326) నాటిది; కాని, ఇతడు అంతకుమించి నాలుగైదు సంవత్సరములు పరిపాలించినట్లు ఇతని కుమారుడు మూడవ నరసింహదేవుని శాసనములవలన తెలియుచున్నది. శాసనములలో ఇతడు అనంతవర్మ ప్రతాప వీరభానుదేవుడని, వీరశ్రీమతు భానుదేవ రావుతువర్మ యని, వీరభానుదేవు డని పేర్కొనబడియున్నాడు. ఈతడు పరమ వైష్ణవుడు; పూరీజగన్నాథ శ్రీపాద భక్తుడు.

భానుదేవుని శాసనములలో పూరీ తామ్రశాసనము ముఖ్యముగా పేర్కొనదగినది. ఈ తామ్రశాసనము అతడు శకవర్షము 1234 లో శ్రీ పురుషోత్తమ కటక (పూరి) దక్షిణ మహోదధి తీరమున చేసిన రెండు గ్రామదానములను తెలుపు నిమిత్తము పుట్టినది. వీరభానుదేవుడు ఈగ్రామదానములను 'విశ్వంభరా భారవహన మహనీయేత్యాది ప్రశస్తిస్తోమ విరాజమా'నుడైన శ్రీ పురుషోత్తమదేవుని పదవ విజయరాజ్య సంవత్సరమున చేసెను. ఈ విషయమును పురస్కరించుకొని రెండవ నరసింహదేవునికిని రెండవ భానుదేవునికిని నడుమ పురుషోత్తమదేవుడు బలాత్కారముగ గాంగ సింహాసనమును ఆక్రమించుకొని పాలించెనని, భానుదేవుని అతని పూరీ రాజప్రాసాదము లోపలనే బందీగ ఉంచెనని, కాని ఈ పురుషోత్తమదేవుని పాలనము అతని పదవ విజయరాజ్య సంవత్సరమునకు మించి సాగలేదని, తరువాత భానుదేవుడే రాజ్యమును పాలించెనని ఉత్కలదేశ చరిత్రకారులు కొందరు ఏవేవో వ్రాసియున్నారు. వీరభానుదేవుని శాసనములను సరిగా పరిశీలింపక పోవుటవలనను, బోధపరచుకొనక పోవుటవలనను వచ్చిన అపసిద్ధాంతము లివి. పురుషోత్తము డనెడువాడు వేరె లేడనియు, పురుషోత్తమ, జగన్నాథాభిధలు వీరభానుదేవుని నామాంతరములే అనియు చెప్పి ఒకరు పూర్వోక్తములైన సిద్ధాంతములను ఖండించియున్నారు. ఇదికూడ సరిగా ఆలోచించి వ్రాసిన విషయముగా కనిపించదు. శ్రీకూర్మములోని ఒక శాసనము ఈ విషయమును సువ్యక్తము చేయుచున్నది. ఇందు 'శకవర్షంబులు 1231 గునేంటి శ్రీ జగన్నాథదేవర విజయరాజ్య సంవత్సరంబులు 8 గు శాహి కన్య శుక్ల ౫ యు గురువారమున శ్రీ వీరభానుదేవ తియ్యంగారి వెహారణమునందు' అని కలదు. వెహారణమునందు వ్యవహారణమునందు, రాజ్యవ్యవహారము చేయుచుండినప్పుడు అని అర్థము. ఇందువలన ఉభయులు ఒకేకాలమున రాజ్యపరిపాలనలో పాల్గొనుచుండినట్లు విశదమగుచున్నది; ఇంతేకాదు, జగన్నాథదేవుడు వేరు వీరభానుదేవుడు వేరనియు, జగన్నాథదేవుడన్నది వీరభానుదేవుని నామాంతరము కాదనియు కూడ తేటపడుచున్నది. ఈ జగన్నాథదేవుడు సింహాచలములోని ఒక శాసనములో పురుషోత్తమదేవుడని కూడ పేర్కొనబడియున్నాడు. పురుషోత్తమ లేక జగన్నాథదేవులను పేర్కొను శాసనములు శకవర్షములు 1231 నుండి 1241 వరకు కనబడుచున్నవి. పురుషోత్తమదేవుడును, ఈ జగ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



న్నాథదేవుడును వారణాసికటకము, పురుషోత్తమ కటకము అను నామాంతరములుగల పూరీలోని జగన్నాథస్వామియే కాని మానవుడు కాడు. మనకు ఇప్పుడు కారణము తెలియక పోవచ్చును: కాని తరువాతికాలమున విజయనగర రాజ్యమును శ్రీ విరూపాక్షస్వామి ప్రతినిధులుగా పాలించిన హరిహర, బుక్కరాయాదులవలెనే రెండవ వీరభానుదేవుడు కూడ తన సామ్రాజ్యమును దేవాదిదేవుడును, విశ్వంభరా భారవహనదక్షుడును అయిన శ్రీపురుషోత్తమ దేవునికి సమర్పించి ఆ స్వామి ప్రతినిధిగ దానిని పరిపాలించినట్లు తోచుచున్నది. పూర్వోక్తశాసనముల తాత్పర్యమిది యని తోచుచున్నది.

రెండవ వీరభానుదేవుని పరిపాలనకాలములోనే ఢిల్లీలో ఖల్జీవంశము అంతరించి తుఘ్లుక్ వంశము రాజ్యమునకు వచ్చుటయు, ఈ వంశములోని మొదటి సుల్తానైన ఘియాజుద్దీన్ తుఘ్లుక్ తన కుమారుడును, యువరాజును అయిన మలిక్ ఫక్రుద్దీన్ జూనా అను ఉలుఘ్‌ఖానును తెలంగాణా జయించుటకు ఓరుగంటిపై దండెత్త బంపుటయు, తుదకు శకవర్షము 1245 (క్రీ. శ. 1323) లో ఓరుగంటి కాకతీయాంధ్ర సామ్రాజ్యము భగ్నమై తెలంగాణాలో ముస్లిము పరిపాలనము ఏర్పడుటయు సంభవించినది. ఉలుఘ్ ఖాను తెలంగాణాను జయించిన పిదప తీరస్థాంధ్రముపై దండెత్తి వచ్చి రాజమహేంద్రవరమును పట్టుకొని అటనుండి జాజ్ నగరుపై నరిగెను. అక్కడ నలువది ఏనుగులను తీసికొని ఉలుఘ్ ఖాను తిలింగ్ (తెలంగాణా)కు తిరిగి వచ్చినట్లు తారీఖ్-ఇ-ఫీరూజ్ షాహి గ్రంథమువలన తెలియుచున్నది. ఈ రీతిని తెలంగాణాను జయించిన పిదప క్రీ. శ. 1324లో ఉలుఘ్ ఖాను జాజ్‌నగరుపై దండెత్తి వెళ్లినట్లు తెలియుచున్నను తారీఖ్ - ఇ - ఫీరూజ్ షాహి గ్రంథకర్త ఈ దండయాత్రను గురించిన వివరములు ఏవియు తెలుపలేదు. ఈ లోపమును తీర్చినవాడు ఈసామి. ఇతడు తన ఫుతూహ్-ఉస్ - సలాతీన్ అను గ్రంథమున మరికొన్ని విషయములను తెలుపుచున్నాడు. ఉలుఘ్ ఖాను సైన్యము తనదేశముపై దండెత్తివచ్చినట్లు తెలిసినవెంటనే రెండవ వీరభానుదేవుడు 40,000 ల కాల్బలమును, 500 ల గుర్రపు దళమును, గొప్ప ఏనుగుల బలమును చేర్చి తన సర్వసైన్యాధిపతి నాయకత్వమున తనరాజ్యము సరిహద్దులవద్ద ముస్లిములనెదుర్కొన



చిత్రము 45. లింగరాజ దేవాలయ విమానము, ఉత్తరపు దిగువభాగము, పూరి

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



బంధెను. ఉభయబలములకును ఘోరసంగ్రామము జరిగెను. ఉభయపక్షములందును అనేకులు హతులైరి. తుదకు విజయలక్ష్మి మహమ్మదీయులనే వరించినది. కళింగోత్కల సైన్యములో హతశేషులు పలాయితులైరి. ఉలుఘ్ ఖాను పరాజితులైన శత్రువుల స్కంధావారమును చూరగొనెను. అనేక యుద్ధగజములే కాక అమూల్యమైన కొల్లకూడ వానికి చేపడినది. ఉలుఘ్ ఖాను వెంటనే తాను తీసికొన్న ఏనుగులను ఢిల్లీకి తన తండ్రి కడకు పంపివేసెను. తారీఖ్-ఇ-ఫీరూజ్ షాహి గ్రంథకర్త బరనియును, ఇతర ముస్లిము చరిత్రకారులును జాజ్‌నగరు దండయాత్రలో విజయము లభించినవెంటనే అతడు ఓరుగంటికి తిరిగివచ్చినట్లు తెలుపుచున్నారు; జాజ్‌నగరును ఏకారణముచేత పూర్తిగా స్వాధీనము చేసికొనకుండ మరలి వచ్చెనో తెలియదు. ఉలుఘ్ ఖాను ఒకవేళ చివరకు యుద్ధములో ఓడిపోయి, మొదట పట్టుబడిన ఏనుగులను బహుకష్టముమీద సంరక్షించుకొని తీసికొనిపోయినట్లు తోచుచున్నది. అట్లుకాదేని, ముస్లిములు చెప్పునట్లు ఉలుఘ్ ఖాను విజయము చేకూరినను జాజ్‌నగరు రాజ్యమును స్వాధీనపరచుకొనకుండ వెంటనే తెలంగాణాకు తిరిగివచ్చుటకు కారణము కాన్పింపదు. ఉలుఘ్ ఖాను జాజ్‌నగరు దండయాత్రను గురించి తెలుపునది ఒక్క ముస్లిము చరిత్రలే.

వీరభానుదేవుని ప్రపౌత్రుడైన నాలుగవ వీరనరసింహదేవుని పూరీతామ్రశాసనములయందు ఒకదానిలో ఘియాజుద్దీనుతో జరిగిన యుద్ధములో ఇతడు విజయము పొందినట్లు తెలుపబడినది ('రాజ్ఞో యస్య గయాసదీన సమర ప్రారబ్ధ శౌర్యక్షత ప్రౌఢానేక నరేంద్ర కంధరగలత్కీలాల పూర్ణావనిః। తత్కాలక్షత వక్షసః కరికులాత్ స్ఫారోత్థితః శ్రోణితాసారో ద్యాపి దిగంతరేస్తి విలసత్ సంధ్యాను రాగచ్ఛలాత్'). ఈ శాసనములో పేర్కొనబడిన గయాసదీను ఢిల్లీ సుల్తాను ఘియాజుద్దీను తుఘ్లుకు అనుటకు సందియము లేదు. ఈ సమరము ఉలుఘ్ ఖాను జాజ్‌నగరుపై దండెత్తి వచ్చినపుడు జరగిన దానికి భిన్నమైనదో కాదో తెలియదు. లఖ్నోతి రాజకుమారులు షిహాబుద్దీన్, నాజిరుద్దీనులను వారి సోదరుడు బహదూరు బురా రాజ్యబహిష్కృతులను కావింపగా వారు ఢిల్లీకి వెళ్లి సుల్తాను సాయము కోరిరి. అప్పుడు సుల్తాను ఢిల్లీ రాజధానీ రక్షణమును ఓరుగంటి నుండి పిలిపించిన తన కుమారుడు ఉలుఘ్ ఖానుకు ఒప్పగించి లఖ్నోతిపై దండెత్తివెళ్లి యుద్ధములో పరాజితుడైన బహదూరుమెడకు తాడు పోసి ఢిల్లీకి తీసికొనివచ్చెననియు, నాజిరుద్దీన్ తన సామంత మండలేశ్వరులందరితోను ఘియాజుద్దీన్ సుల్తానుకు పాదాక్రాంతులై తామకలు కప్పములు చెల్లించి రాజ్యప్రతిష్ఠితుడయ్యెననియు ముస్లిము చరిత్రలు నుడువుచున్నవి. ఈ సందర్భముననే లఖ్నోతి రాజ్యమునకు చుట్టుప్రక్కలనున్న రాజ్యములపై సుల్తాను ఎత్తివెళ్లి, వానిని జయించినట్లు కూడ అవి చెప్పును. కాని, ఆ చరిత్రలు పేర్కొన్నవానిలో జాజ్‌నగరు రాజ్యము లేదు. ఒకవేళ ఘియాజుద్దీన్ దండెత్తి వచ్చినచో ఈ సందర్భమున వచ్చినపుడే వీరభానుదేవుడు ఘియాజుద్దీన్‌ను ఓడించియుండవలెను. జాజ్‌నగరుపై ఘియాజుద్దీన్ స్వయముగ దండెత్తియుండక పోయినచో పూరీశాసనమున తెలుపబడిన వీరభానుదేవుని పూర్వోక్త విజయము ఉలుఘ్ ఖాను జాజ్‌నగరు దండయాత్రా సందర్భమున పడసినదియే కావలెను. జాజ్‌నగరు దండయాత్ర నడపినది ఉలుఘ్ ఖానయినను అది ఘియాజుద్దీన్ రాజ్యకాలమున జరగినందున భానుదేవుడు ఢిల్లీ సుల్తానును జయించినట్లు చెప్పినను చెప్పియుండవచ్చును.

వీరభానుదేవుని భార్య లక్ష్మీదేవి. ఈ దంపతుల కుదయించిన మూడవ నరసింహదేవుడు వీరభానుదేవుని అనంతరము సింహాసన మెక్కెను.

# ఉత్తర మధ్యయుగము

## అర్వాచీన గాంగవంశము (పరిశేషము)

**మూడవ వీరనరసింహదేవుడు** (క్రీ.శ. 1326-27–క్రీ.శ. 1352-53): రాజ్యమునకు వచ్చునాటికే ఇతడు వయసులో పెద్దవాడుగ ఉండినట్లు కన్పట్టును. ఇతని అర్ధాంగలక్ష్మి గంగాదేవి. శ్రీకూర్మనాథునికి చేసిన దానధర్మములను తెలుపు మొదటి శాసనము శకవర్షము 1244 నాటిది. ఇందు రెండవ వీరభానుదేవుని పేరు లేదు; లేకపోయినను ఈ శాసనకాలము నాటికి వీరభానుదేవుడు ఇంకను రాజ్యము పాలించుచుండెను. శ్రీకూర్మములోని ఒక శాసనము ఈ వీరనారసింగదేవుని నాలుగవ రాజ్యసంవత్సరము శకవర్షము 1252 గ తెలుపుచుండుటవలన ఇతని పరిపాలనము శకవర్షము 1248-49 లో ఆరంభమైనట్లు తేల్పవచ్చును. ఈ విధముగనే 18 వ విజయరాజ్య సంవత్సరమునకు సరియైన శకవర్షము 1268 గ మరొక శాసనము తెలుపుచుండుటచేత అతని రాజ్యారంభకాలము శకవర్షము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



1248 - 49 అని ధ్రువపడుచున్నది. ఈతని రాజ్యకాలమునాటి శాసనములు అనేకము శ్రీకూర్మ, సింహాచలాది పుణ్యక్షేత్రములలో కలవు. వానివలన మూడవ నరసింహదేవుని సేనానులు, మాండలికులు మొదలైనవారు దేవాలయాదులకు చేసిన దానధర్మాదులు తెలియుచున్నవి. కాని, అతని పరిపాలనకాల విశేషములు ఏవియు తెలియరావు.

కాని, ఈ మూడవ నరసింహదేవుని రాజ్యకాలములో దక్షిణ హిందూదేశములో రాజకీయములైన మార్పులు అనేకము సంభవించినవి. ఉలుఘ్ ఖాన్ ఓరుగంటి విజయముతో కాకతీయాంధ్ర సామ్రాజ్యము భగ్నమై ఆంధ్రదేశమంతయు ఢిల్లీ తుఘ్లుకు సామ్రాజ్యమున చేరిపోయి ముస్లిం పరిపాలన క్రిందికి వచ్చినది. అప్పటినుండి ఆంధ్రులు, అందునను మధ్యాంధ్రదేశీయ నాయకులు, పారతంత్ర్యమునుండి తెలుగుదేశమును విడిపించుటకు కలసి కట్టుగ పనిచేసి నాలుగైదేండ్లలోనే ముసునూరి ప్రోలయనాయకుని నాయకత్వమున మరల స్వతంత్రమైన హిందూరాజ్యమును స్థాపించిరి. ప్రోలయనాయకుని పినతండ్రి కుమారుడు కాపయనాయకుడు కూడ తెలుగుదేశమునకు ఇరుగు పొరుగులనుండు దేశాధిపతుల సహకార, సాహాయ్యములతో తరివేచి, అదనుచూచి తెలంగాణానుండి కూడ మహమ్మదీయులను పారద్రోలి శకవర్షము 1258 - 59 ప్రాంతమున ఓరుగంటిని మరల వశపరచుకొని హిందూ రాజ్యమును స్థాపించి పరిపాలింపదొడగెను. ఈ ప్రాంతముననే విద్యారణ్య మునీంద్రులతోడ్పాటుతో హరిహర దేవరాయలును అతని సోదరులును తుంగభద్రానదీ తీరమున రాజ్యమును స్థాపించి విజయనగరము రాజధానిగ తత్పరిసర ప్రాంతమును పాలింపజొచ్చిరి. ముసునూరి కాపయ నాయకుడు ఓరుగల్లు రాజధానిగ తెలంగాణాను పాలించుచుండిన కాలమున అంతవరకు అతనితోను, అతనియన్న ప్రోలయనాయకునితోను సహకరించి ఆంధ్రదేశ పారతంత్ర్య విముక్తికై కృషిచేసిన రేచెర్ల పద్మవెలమ నాయకుడైన సింగమనేడును, ప్రోలయ వేమారెడ్డియు కాపయనాయకునికి ఒదిగి మెదిగి యుండక చిన్న స్వతంత్ర రాజ్యములను సంస్థాపించిరి. రేచెర్ల వెలమ వీరులకు రాజాచలమను రాచకొండ ప్రధాన నగరమై వారిది రాచకొండరాజ్యమని పేరువడినది. ప్రోలయ వేమారెడ్డికి మొదట కుండిప్రభా (గుండ్లకమ్మ) నదీతీరమున నున్న అద్దంకియు, అటువెనుక గుంటూరు మండలములోని కొండవీడును రాజధానులైనవి. కొండవీటి రెడ్డిరాజ్యమును ప్రోలయ వేమారెడ్డి అనంతరము అతని కుమారుడు అనవోతారెడ్డి పరిపాలించెను. ఈ కాలముననే గుల్బర్గ (కలుబరిగ) రాజధానిగ శకవర్షము 1269 (క్రీ.శ. 1347) లో ఇప్పటి తెలంగాణా పొరుగున బహ్మనీరాజ్యము స్థాపితమైనది. ఈ రీతిని ఆంధ్రదేశ చతురంగ ఫలకము మీది రాజ్యవ్యవస్థ అంతయు తారుమారయి పెక్కు చిన్న రాజ్యములు ఆయా ప్రాంతములందు ఏర్పడి రాజ్యాధికార విస్తరణ ప్రయత్నమున పరస్పరము కలహించుచు ఇరుగు పొరుగు రాజ్యములమీద దండెత్తుచు వచ్చిన కాలమది.

ఈ కాలములో రాజమహేంద్రవర ప్రాంతమును ముసునూరి కాపయ నాయకుని పక్షమున పరిపాలించుచుండిన తొయ్యేటి అనవోత భూపతి కాలధర్మమును పొందెను. తనరాజ్యమును దక్షిణదిశను విస్తరింపజేసికొనుటకు ఇదియే తగిన తరుణమని మూడవ నరసింహదేవ భూపతి తన విజయరాజ్యము కడపటి సంవత్సరమున మధ్యాంధ్ర దేశముపై దండెత్తెను. ఈతని సేనానులు కాళిదాస సేనాపతి, గోవింద సేనాపతులు నిరాఘాటముగ కృష్ణ జిల్లాలోని శ్రీకాకుళమువరకు దండు నడపించుకొని పోయిరి. వీరనరసింహదేవుని శాసనము శకవర్షము 1276 నాటిది ఒకటి శ్రీకాకుళములో ఉన్నది. వీరనరసింహదేవుని దేవులైన గంగా మహాదేవులు పూర్వోక్త సేనాపతులద్వారా శ్రీ కాకొలని శ్రీవల్లభరాయనికి పట్టుగొడుగులు, పచ్చపట్లు, వెండి దివ్వకోలలు, పహిండి కాయలతోడి వెంజామరలు, గంటలు మొదలైన వస్తువులను పంపించెను. కాని ఈ దండయాత్రవలన గాంగ వీరనరసింహ భూవరుని సైనిక బలప్రతాపములు వ్యక్తమయ్యెనే కాని ఇతర ప్రయోజనము ఏదియు లేకపోయెను. ప్రోలయ వేమారెడ్డి అనంతరము రాజ్యమునకు వచ్చిన అనవోతారెడ్డి వెంటనే సైన్యములను సమకూర్చుకొని వీరనరసింహదేవుని సేనలను మార్కొని ఓడించి రమారమి కళింగ సీమావధులవరకు తరుమగొట్టెను. కళింగ గాంగ భూవరులకును, కొండవీటి రెడ్డి మన్నీలకును జరగిన మొదటి సంగ్రామ మిదే. ఇంతటినుంచి మధ్యాంధ్రదేశ పరిపాలకులైన కొండవీటిరెడ్డి నృపులు కాకతీయులకు వారసులై తమ రాజ్యమును గోదావరీతీరమువరకు కాపాడుకొనుచు, వీలయినచో దక్షిణ కళింగమున సింహాచలము వరకు విస్తరింపజేసికొన ప్రయత్నించుచువచ్చిరి. ఇట్లు ప్రయత్నించుటలో సింహాచలము వద్దనుండి గౌతమీ తటము వరకు గల ప్రదేశము ఇదివరకు వలెనే గాంగ వంశ్యులకును, రెడ్డి నరేంద్రులకును కలహకారణసీమగా పరిణమించినది.

కోనహైహయ వంశజుడైన మూడవ చోడ ధరణీశ్వరుడు శకవర్షము 1325 (క్రీ. శ. 1403) నాటిదగు తన



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పంచధారల శాసనములో తన పితామహుడైన రెండవ చోడమహీపతి పండువ సుల్తానును రక్షించుటకొరకై వెళ్లి తన బాహువిభవముచేత ఢిల్లీపతిని నిర్జించి విజయలక్ష్మితో పాటు ఇరువదిరెండు గొప్ప ఏనుగులనుకూడ కొనివచ్చి ఉత్కలక్షోణీశునకు సమర్పించినట్లు చెప్పియున్నాడు. ఈ పండువ సుల్తాను ఎవ్వరో, ఢిల్లీపతి ఎవ్వరో, రెండవ చోడ భూభర్త ఢిల్లీపతిని ఎప్పుడు జయించెనో విచారింపవలసి యున్నది. మూడవ చోడ మహీపతి శకము 1325 లో ఉండుటచేత అతని పితామహుడు కూడ శకము 1275 ప్రాంతమున ఈ మూడవ వీరనరసింహ దేవరాయని కాలముననే ఉండవలెను. అందువలన ఉత్కల క్షోణీశుడు మూడవ వీరనరసింహ దేవరాయ జనుటకు సందియము లేదు.

మూడవ వీరనరసింహదేవుని కాలమున బంగాళదేశపు సుల్తానులకు పండువానగరము రాజధానిగా ఉండెను. ఇది బంగాళ రాష్ట్రములోని మాల్డా జిల్లాలో ఇంగ్లీషు బజారుకు ఉత్తరముగ దాని దగ్గరనే ఉన్నది. హిజిరా 743 (శకము 1264 - క్రీ. శ. 1342) మొదలుకొని హిజిరా 795 (శకము 1314 - క్రీ. శ. 1392) వరకు బంగాళదేశపు సుల్తానులు పండువా రాజ్యమును పరిపాలించిరి. అలీ ముబారిక్ అను సుల్తాను అలా ఉద్దీన్ మొదట పరిపాలించినప్పటికిని తరువాత రాజ్యము చేసిన హాజీ ఇల్యాస్ అను సుల్తానును ముస్లిము చరిత్రకారులు పండువా సుల్తానులలో మొదటివానిగ పరిగణించుచున్నారు. తన సామ్రాజ్యములో ఇతర ప్రదేశములందలి తిరుగబాటులను అణచుటలో నిమగ్నుడైనందున మహమ్మద్ బిన్ తుఘ్లుక్ దృష్టి స్వతంత్రుడుగ పరిపాలనము నెరపుచుండిన బంగాళ దేశపు సుల్తాను హాజీ ఇల్యాస్‌పై పడలేదు. మహమ్మద్ బిన్ తుఘ్లుక్ శకవర్షము 1273 (క్రీ. శ. 1351) లో చనిపోయెను. అతని యనంతరము ఢిల్లీ సింహాసనమును క్రీ. శ. 1351 లో అధిష్ఠించి ముప్పదియేండ్లు రాజ్యము పాలించినవాడు ఫీరూజ్ షా తుఘ్లుక్. ఇతడు హాజీ ఇల్యాస్ షా రాజ్యము చేయుచుండిన కాలమున హిజిరా 754 (శకము 1275 — క్రీ. శ. 1353) లో ఒకమారును, అతని కుమారుడు సికందర్ షా పాలించుచుండిన కాలమున హిజిరా 760 (శకము 1280 - 81 — క్రీ. శ. 1358 - 59) లో ఒకమారును బంగాళదేశముపై దండెత్తి వచ్చినట్లు ముస్లిము చరిత్రలు చెప్పుచున్నవి. అటువిదప ఢిల్లీ సుల్తానులెవ్వరును బంగాళదేశపు రాజకీయ వ్యవహారములలో జోక్యము కలిగించుకొనుట కాని, ఆ దేశముపై తమ అధిపత్యమును స్థాపింప జూచుటకాని, చేయలేదు. అందువలన కోన హైహయ ఇమ్మడి చోడ భూనాథుడు పండువా సురత్రాణునికి పైని చెప్పిన రెండు తడవలలో ఎదో ఒకమారు సాయము వెళ్లి ఢిల్లీ సుల్తాను ఫీరూజ్ షా తుఘ్లుక్‌ను ఓడించియుండవలెను. పండువా సుల్తానుకు తన సామంతుడైన హైహయకులజుడు ఇమ్మడి చోడ నరేంద్రుని సాయము పంపుటకు ఆ సుల్తాను మూడవ వీర నరసింహదేవునితో స్నేహముగా ఉండినట్లు కాక అతని సాహాయ్యమును కూడ కోరినట్లు భావింపవచ్చును.

ముస్లిము చరిత్రలు ఫీరూజ్ షా తుఘ్లుక్ సికందరుషాపై చేసిన రెండవ దండయాత్రలో విజయమును పొందెననియు, గత్యంతరము కానక సికందర్ షా ఫీరూజ్ షా తుఘ్లుక్‌తో సంధి చేసికొనెననియు చెప్పుచున్నవి. అయినను ఈ చరిత్రలను పరిశీలించిన ఆధునిక చరిత్రకారులు మొదటి దండయాత్రవలెనే ఇదియు విఫలమయినదనియు, సికందరు షా తనకు అనుకూలముగ ప్రతిపాదించిన సంధి షరతులకే ఫిరూజ్ షా అంగీకరింపవలసి వచ్చినదనియు వ్రాసియున్నారు. అయినను, ఆ సుల్తాను మొదటి దండయాత్ర రెండవ దానికంటెను పూర్తిగ విఫలమయినందున రెండవ చోడరాజు పండువా సురత్రాణునికి సాయముగ వెళ్లినది ఫీరూజ్ షా తుఘ్లుక్ మొదటి దండయాత్ర సందర్భముననే అని నిశ్చయింపవచ్చును. ఈ మొదటి దండయాత్రను గూర్చి జియా ఉద్దీన్ బరనీయును, షమ్స్-ఇ-సిరాజ్ అఫీఫ్ వ్రాసియున్నారు. షమ్స్-ఇ-సిరాజ్ అఫీఫ్ ప్రకారము ఈ దండయాత్రా వృత్తాంతము ఇది: సుల్తాన్ ఫీరూజ్ షా ఢిల్లీనుండి హిజిరా 754 షవాల్ 10 వ తేదీని (క్రీ.శ. 1353, నవంబరు 8) గొప్ప సైన్యముతో సుల్తాను దండెత్తివచ్చుచుండినట్లు తెలిసినవెంటనే హాజీ ఇల్యాస్ పండువాను విడిచిపెట్టి దాని సమీపమున ఉన్న ఇక్డల దుర్గమునకరిగి అచ్చట రక్షణకు తగిన కట్టుదిట్టములు చేసికొనెను. ఫీరూజ్ షా అక్కడికరిగి ఆ కోటను ఇరువది రెండు దినములు ముట్టడివేసెను. కాని, దానిని సాధించలేక పోయెను. అంతట, హాజీ ఇల్యాస్‌ను కోటలోనుండి ఈవలికి రప్పింపవలయునని అతడు తాను సైన్య సమేతముగ ఢిల్లీకి మరలిపోవు చుండినట్లు వెనుకమొగము పెట్టెను. అతడు వేసిన పాచిక పారినది. ఢిల్లీ సామ్రాజ్య సైన్యములు కోట సాధించలేక తిరుగు మొగము పట్టినవను సంతోషముతో హాజీ ఇల్యాస్ కోటలోనుండి వెలుపలికి వచ్చి ఢిల్లీ సైన్యములను వెన్నంటి తరిమెను. వెంటనే ఉభయపక్షములవారికిని భయంకర యుద్ధము జరగినది. చాలసేపు యుద్ధము జరగి చాలమంది హతులైన తరువాత ఇకశత్రుసైన్యములను జయించుట అసాధ్యమని ఎంచి హాజీ ఇల్యాస్ మరల ఇక్డలకోటలోనికి పోయి దాగుకొనెను.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఢిల్లీ సామ్రాజ్య సైన్యము అతనిని వెన్నంటి తరుముకొని పోయి మరల కోటను ముట్టడించెను. కాని, కోటలోని స్త్రీలు ఏడ్చుచు, పెడబొబ్బలు పెట్టుచు దుర్గాగ్రభాగమునకు వచ్చి ఫిరూజ్ షాకు తమ దుఃఖమును తెలియజేసినందున అతడు జాలిగొని ముట్టడి సాగింప మానుకొనినట్లు ముస్లిము చరిత్రకారులు తెలుపుచున్నారు. సామ్రాజ్య సైన్యాధినేతయైన తతార్ ఖాను బలవంతపెట్టినను సుల్తాను బంగాళదేశమును ఢిల్లీ సామ్రాజ్యమున చేర్పడయ్యెను. వర్షకాలము దగ్గరకు వచ్చుచున్నదని తెలిసి త్వరితగతిని కతిపయ ప్రయాణముల హిజిరా 755 లో షాబన 12 వ తేదీకి (క్రీ. శ. 1354 సెప్టెంబరు 1) ఫిరూజ్ షా ఢిల్లీ చేరుకొనెను. అనాయాసముగా లభింపనుండిన విజయమును కూడ వదలివేసి కోటలోని స్త్రీల ఆర్తనాదములకు మనసు కరగి ఫిరూజ్ షా ఢిల్లీకి మరలిపోయె నన్నది ముస్లిము చరిత్రకారులు కట్టిన కట్టుకథ. అపజయము తక్క అతనికి ఈ దండయాత్రలో లభించినది ఏదియు లేదు. ఈ బంగాళ దండయాత్రలో 1,80,000 ల మంది హతులైనట్లు ముస్లిము చరిత్రలు నుడువుచున్నవి. ఢిల్లీ సుల్తాను ఫిరూజ్ షాకు సంపూర్ణ పరాజయము కలిగినది. ముస్లిము చరిత్రకారులు మూడవ వీరనరసింహ దేవుడును, అతని సామంతుడు ఇమ్మడి చోడభూపతియు చేసిన సాయమును స్మరింపక పోయినను ఈ విజయమునకు కారణభూతుడయినవాడు ఇమ్మడి చోడ మహీవరుడే. ప్రాయికముగా ఇతడు ఢిల్లీ సుల్తాను సైన్యము రెండవ తడవ కోట ముట్టడించినపుడు ఈవలనుండి మార్కొని యుండును. ఇట్లు సుల్తానుసైన్యము కోటలోని సేనలకు, ఈవల చోడరాజు సేనలకు నడుమను ఇరికికొని ఘోర పరాజయము పొంది ఎట్లెట్లో ప్రాణము దక్కించుకొని ఢిల్లీ చేరియుండును. సామ్రాజ్యసైన్యము పారిపోవుచుండిన సందర్భమునవే ఇమ్మడి చోడ నరేంద్రుడు శత్రువుల యుద్ధగజములను పట్టుకొని తెచ్చి ఉత్కలాధీశ్వరుడైన మూడవ నరసింహదేవునికి సమర్పించి యుండవలెను.

మూడవ నరసింహదేవుని రాజ్యకాలమున ఇక చెప్పదగిన విశేషము లేవియు లేవు. ఇతనికి కమలాదేవి, గంగాదేవి, కొమ్మిదేవి అను భార్యలు కలరు. వీరిలో గంగాదేవి శ్రీకూర్మము, సింహాచలము, శ్రీకాకుళము దేవాలయములకు అనేక దానములు ధర్మములు కావించెను. ఈ నరసింహదేవుని పౌత్రుడు నాలుగవ నరసింహదేవుని యొక్క పూరీ శాసనములవలన అతని పితామహి కమలాదేవి యనియు, ఆమెయందు మూడవ నరసింహదేవునికి నాలుగవ నరసింహదేవుని తండ్రియైన మూడవ భానుదేవుడు జనించె ననియు తెలియుచున్నది. కాని శకవర్షము 1275 నాటి వీరభానుదేవరాజుయొక్క సింహాచలము శాసనము వలన అతని తండ్రి నరసింహదేవరాజనియు, తల్లి గంగామహాదేవియనియు బోధపడుచున్నది. వీరభానుదేవుని తల్లి పూరీ శాసనములలో కమలాదేవి యని ఏల చెప్ప[illegible]నదో తెలియదు. ఒకవేళ కమలాదేవికి గంగాదేవియని నామాంతరము కలదేమో. ఈ విషయ మింకను విచారణీయము.

**మూడవ భానుదేవుడు** (క్రీ.శ. 1353 — క్రీ.శ. 1377-78): మూడవ వీరనరసింహదేవుని కడపటి శాసనము శకవర్షము 1275 కార్తిక శుక్ల ఏకాదశి మంగళవారము నాటిది. ఇది సింహాచలములో ఉన్నది. మూడవ వీరభానుదేవుని మొదటి శాసనము కూడ సింహాచలములోనే ఉన్నది. ఇది శకవర్షము 1275 పుష్య పూర్ణిమా గురువారము నాటిది. మూడవ భానుదేవుడు శకము 1275 పుష్య పౌర్ణమాసి నాటికే రాజ్యారూఢుడై పరిపాలనము నెరపుచుండెను. ఇతని కుమారుడు నాలుగవ వీరనరసింహదేవుని 8 వ అంకసంవత్సరము శకము 1305 ను, 22 వ అంక సంవత్సరము శకము 1324 ను అయినందున మూడవ వీరభానుదేవుడు శకవర్షము 1299 - 1300 ల వరకు రాజ్యము చేసినట్లు నిశ్చయింపవచ్చును.

ఢిల్లీ సుల్తాను ఫిరూజ్‌షా తుఘ్లుకు తనకు గాంగ వీరనరసింహుని సామంతుడైన ఇమ్మడి చోడరాజువలన కలిగిన భంగపాటును మరచిపోలేదు. అతని హృదయములో ఇది మెరమెరలాడుచునే ఉండెను. అతడు రెండవ తడవ బంగాళదేశముపై దండెత్తివచ్చి సికందరు షాతో సంధి చేసికొని ఢిల్లీకి వెళ్లుచు జాన్పూరువద్ద ఆగి అటనుండి క్రీ. శ. 1360 లో జాజ్‌నగరు(ఉత్కలము)పై దండెత్తి వచ్చెను. గాంగవంశపు రాజుల పరిపాలనక్రింద కళింగోత్కలములు భాగ్య భోగ్యములతో తులతూగుచుండెను. 'జాజ్‌నగరులో ధరలు చాల తక్కువ. రెండు జీతలులకే ఒక గుర్రమును కొనవచ్చును (జీతల్ అన్నది తక్కువ రకము నాణెము: 50 జీతలులు తులమెత్తు వెండి టంకమునకు సమానము). పశువులన్న ఎవరికిని లక్ష్యములేదు. గొర్రెలు విస్తారముగా ఉండెను. రాజసైన్యమునకు అవి సమృద్ధిగా దొరకెడివి. ఆ దేశవాసులు అందమైన విశాల గృహములలో నివసించుచుండిరి. వారికి పూలతోటలు, ఫలవృక్షముల తోటలుకూడ ఉండెడివి.' జాజ్‌నగరు (ఉత్కల రాజ్యము) ఈ విధముగా ధనధాన్యములతోను, భాగ్యభోగ్యములతోను తులతూగుచుండినట్లు ఫిరూజ్‌షా తుఘ్లుక్ సమకాలికులైన ముస్లిము చరిత్రకారులే వ్రాసి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



యున్నారు. ఈ భాగ్యభోగ్యములు అన్నియు ఒక యెత్తు; కళింగ గజ సంపద ఒక యెత్తు. ఈ కారణముననే ఉత్కల దేశముపై తరచుగా ముస్లిములును, తదితరులును దండె త్తుచు వచ్చిరి. జాజ్‌నగరు రాజు బ్రాహ్మణుడని, అతని పేరు అడయ (అడెసర్) అని అఫీఫ్ చెప్పుచున్నాడు; కాని, ఇది నిజము కాదు. గంగవంశపు రాజులు చంద్ర వంశ క్షత్రియులు; ఆత్రేయ గోత్రులు. ప్రాయికముగా బ్రాహ్మణు లనబడినవారు వీరభానుదేవుని పాత్ర సామంతులో, అమాత్యులో అయియుండవచ్చును. అట్లు కాదేని, అఫీఫ్ బ్రాహ్మణుడని పొరపాటుగ వ్రాసినట్లయి నను భావించపలెను.

ఫీరూజ్ తుఘ్లుక్ కతిపయ ప్రయాణముల కళింగో త్కలాధీశ్వరుల ప్రాచీన నివాసస్థలమైన బనారసి (వార ణాసి కటకము) చేరుకొనెను. అడయరాజు సుల్తాను సైన్యము వచ్చుచున్న దనగనే భీతచిత్తుడై నగరమును విడిచి జలములలో తలదాచుకొనెను (రాజు ఒక ద్వీపము నందు తలదాచుకొనెనని దీనిభావము కావచ్చును). సుల్తాను సేనలు అతనిని ఇంకను వెంబడించినవి. ముస్లిము సేనలు పూరీ జగన్నాథాలయమును అపవిత్రము చేసినవి. ఫిరూజ్ షాకు సమకాలికుడైన సీరత్ - ఇ - ఫీరూజ్ షాహి గ్రంథ కర్త ఢిల్లీ సుల్తాను సముద్రమునకు తూర్పుదిశనున్న జగన్నాథాలయము వైపు వెళ్లి దానిని విధ్వంసము కావించి ఆలయములోపలి విగ్రహమును ఊడబెరికి సముద్ర ములో పారవేసినట్లు చెప్పుచున్నాడు. జగన్నాథాలయము సముద్రమునకు తూర్పుదిశను ఉన్నట్లు చూచి వ్రాసిన వ్రాతయో, చూడకుండ వ్రాసిన వ్రాతయో తెలియదు. జగన్నాథ దేవాలయమునకు తూర్పున సముద్ర మున్నది కాని సముద్రమునకు తూర్పున జగన్నాథాలయము లేదు. కొందరు ముస్లిము చరిత్రకారులు సుల్తాను జగన్నాథ విగ్రహమును ఊడబెరికి ఢిల్లీకి పంపి దానిని ఎంత అవమా నింపవలెనో అంత అవమానము చేసినట్లు వ్రాసియున్నారు. ఇం దేది నిజమైనను కాకపోయినను విగ్రహమును ఊడబెరికి వేయుట మాత్రము నిజము. జగన్నాథాలయము చాల భాగ్యవంతమైనది, దానికి గొప్ప ఆస్తి కలదు. ఆలయ మునకు సంబంధించిన మహానస గృహపు సిబ్బందికే 30 లక్షల వెండి దీనారములు వ్యయమగుచుండినట్లు ముస్లిము చరిత్రలు నుడువుచున్నవి. తుదకు అసంఖ్యాకముగా ఉన్న శత్రుసైన్యమును చూచి భయవిహ్వలుడై ఉత్కలాధీశ్వ రుడు సుల్తానుతో సంధిరాయబారములు నడపెను; ప్రతి సంవత్సరమును ఏదో కొంత నిర్ణీత సంఖ్యగల ఏను గులను కప్పముగా పంపుటకు ఒడంబడెను. సుల్తాను ఈ షరతులకు అంగీకరించి తిరుగు మొగము పట్టి త్రోవలో ఉన్న జమీన్‌దారులను, నాయకులను తనకు పాదాక్రాంతు లుగ చేసికొని ఢిల్లీకి మరలిపోయెను.

ఈ దండయాత్ర సందర్భములో జాజ్‌నగరు రాజు కూతురు సుల్తానుకు చేజిక్కిన దనియు, అత డామెను తన సొంత బిడ్డగా సాకికొనె ననియు, రాజా వీర్ భాన్ (వీర భానుడు) సుల్తానుకు పాదాక్రాంతుడై 37 ఏనుగులను, ఇతరములగు అమూల్యవస్తువులను సమర్పించె ననియు ఫెరిస్తా వ్రాయుచున్నాడు. ఇతని వృత్తాంతములో అఫీఫ్ సూచించిన సంధి షరతులు ఏవియు లేవు. ముస్లిము చరిత్ర కారులు వ్రాసిన ఈ వృత్తాంతములు ఎంతవరకు సత్య ములో తెలియదు. ఈ దండయాత్ర విషయమున ముస్లిము చరిత్రలు చెప్పుదానిలో పరస్పర వ్యత్యాసములు ఇంకను గలవు. వానిని అన్నింటిని ఇక్కడ పేర్కొనుట అనవస రము. ఈ చరిత్రలు చెప్పు విషయములు ఇంకను జాగ్రత్తగ పరిశీలించికాని అంగీకరింపరాదు.

ఈ మూడవ వీరభానుదేవుని కాలమునాటికి కొండవీటి రెడ్డి రాజ్యము మధ్యాంధ్రదేశమునంతను తన అధికారము క్రిందికి తెచ్చుకొని బలప్రాభవోపేతమైనది. ఆ రాజ్య మును పాలించిన అనవేమారెడ్డి (క్రీ. శ. 1364 - క్రీ. శ. 1386) గోదావరి నదిని దాటి తన రాజ్యమును ఉత్తర దిక్కునకు వ్యాపింపజేయ దలచి శకవర్షము 1297 లో దక్షిణ కళింగముపై దండెత్తి గాంగ సామంతులైన ఒడ్డాది మత్స్యరాజులను, యలమంచిలి చాళుక్యులను ఇంకను ఇతర మండలికులను జయించి సింహాచలమువరకు వెళ్లెను. అనవేముని ఈ దండయాత్రవలన అతని సైనిక బలప్రతాప ములే వ్యక్తమయినవి కాని అతనికి కలిగిన శాశ్వతలాభ మేదియు లేకపోయెను.

మూడవ వీరభానుదేవునికి హీరాదేవియందు నాలుగవ వీర నరసింహదేవుడు జనించెను. క్రమముగా ఈ గంగ వంశపు రాజుల సైన్యమున గజబలము ఎక్కువగా ఉండుటచేత వీరికి గజపతులని, గజనివహపతులని, గజఘటా పతులని బిరుదము కలిగినది.

**నాలుగవ వీరనరసింహదేవుడు** (క్రీ. శ. 1377 - 78—క్రీ. శ. 1409): మూడవ వీరభానుదేవుని అనంతరము అతని కుమారుడు నాలుగవ వీర నరసింహదేవుడు కళింగో త్కల సామ్రాజ్యమునకు అధిపతియయ్యెను. సింహాచలము లోని ఒక శాసనము ఇతని 31 వ అంకసంవత్సరమునకు సరియైన శకవర్షము 1324 తెలుపుచున్నందున ఇతడు శకవర్షము 1299 - 1300 లలో రాజ్యమునకు వచ్చినట్లు నిశ్చయింప వీలగుచున్నది. సాధారణముగా ఈ వీర



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



నరసింహదేవుని కాలమునుండి శాసనములలో గంగవంశపు రాజుల విజయరాజ్య సంవత్సరములు కాని, అంక సంవత్సరములు కాని ఉదాహరించు ఆచారము సన్నగిల్లినది. నాలుగవ వీరనరసింహదేవుని రాజ్యకాలమునందలి కడపటి శాసనము శకవర్షము 1328 నాటిది. ఇతని పూరీ తామ్ర శాసనములలో ఒకటి 8వ అంక సంవత్సరమునకు సరియైన శక సంవత్సరము 1805 నాటిది ; రెండవది 22వ అంకవర్షమునకు సరియైన శకసంవత్సరము 1316 నాటిది. దీని ననుసరించి పూరీ రెండవ తామ్రశాసనము ఇచ్చిన పిదప వీరనరసింహదేవుడు ఇంకను పండ్రెండేండ్లు పరిపాలించె ననుట స్పష్టము. నాలుగవ వీరభానుదేవుని శాసనములు ఇంతవరకు కానవచ్చిన వానిలో మొదటిది మూడవ అంక వత్సరమునకు సరియైన కలియుగవర్షము 4512 నాటిది. దీనికి సరియైన శకవర్షము 1333 (క్రీ. శ. 1411). అందువలన నాలుగవ వీరనరసింహదేవుని పరిపాలనము శకవత్సరము 1331 లో అంతమయినదని నిశ్చయింప వచ్చును.

నాలుగవ వీరనరసింహదేవుని కాలము నాటికి పాత్ర మహాసామంతులు, మహామండలేశ్వరులు మొదలైనవారు ఎక్కువయినారు. కేంద్రాధికారము దుర్బలమయినది. దీనికి తోడు కళింగమునకు దక్షిణమున కొండవీటి రెడ్డి మన్నీలును, తెలంగాణాలో రేచెర్ల పద్మవెలమ నాయకులును, గుల్బర్గలో బహ్మనీ సుల్తానులును ప్రబలులై ఎవరికి వారే తెలుగుదేశము నంతను ఏకైక రాజ్యాధికారము క్రిందికి తీసికొనివచ్చుటకు ప్రయత్నించుచు వచ్చిరి. ఇట్టి ప్రయత్నములో కళింగదేశముపై శత్రు దండయాత్రలు అధికమైనవి. వీరిలో రాజాచలాధీశ్వరులైన రేచెర్ల పద్మవెలమ నాయకులు ప్రథములు. వీరిలో అనపోతానాయకుడు వీరనరసింహదేవుని రాజ్యకాల ప్రారంభమున కళింగముపై దండెత్తివచ్చి ఆతనిని ఓడించెను. వీర నరసింహదేవరాజు తన కొమార్తెను అనపోతానేని పౌత్రుడైన కుమారాన్నపోతానేనికి ఇచ్చి అతనితో సంధి కావించుకొనెను. అనపోతానాయని మహాదేవి కనకలక్ష్మి ఈ విజయము లభించినపిదపనే యైయుండవచ్చును శకవర్షము 1302 లో సింహాచలము వచ్చి సింహాద్రినాథుని దర్శించి స్వామి సన్నిధిని మాపటి ధూపావసరమందు 'తిరువళిక కోల' వెలుగుటకు నిబంధము కావించెను.

అనవేమారెడ్డి మరణానంతరము కొండవీటి సింహాసనమునకై రెడ్డి రాజ్యములో కలిగిన అంతఃకలహ సందర్భమున కొమరగిరి రెడ్డి బావమరదియైన కాటయ వేమారెడ్డి దక్షిణ కళింగమునకు పారిపోయెనో లేక దానిని జయింప నరిగెనో నిశ్చయింప గుదురదు కాని అతని శాసనమొకటి శకవర్షము 1808 (క్రీ. శ. 1886) నాటిది సింహాచలములో కలదు. శకవర్షము 1809 లో రాచకొండ అధిపతియైన రేచెర్ల అనపోతానాయని కుమారుడు కుమార సింగమనాయడు మరల కళింగముపై దండెత్తి వచ్చి గౌతమీ తటమువరకు నిరాఘాటముగ జైత్రయాత్ర సాగించెను. రాజ్యమున సుప్రతిష్ఠితుడైన పిదప కొమరగిరి రెడ్డి శత్రువులవలన దక్షిణ కళింగమునుండి కొండవీటి రెడ్డి రాజ్యమునకు కలుగుచుండిన ఉపద్రవమును నివారించుటకును, కళింగోత్కలాధీశ్వరుని, అతని సామంత మండలేశ్వరులను శిక్షించుటకును తన ప్రధానియు, దండనాయకుడును అయిన కాటయ వేమారెడ్డిని గొప్ప సైన్యముతో కళింగముపై పంపెను. కాటయ వేమారెడ్డి గాంగసామంత మండలేశ్వరులను, పాత్ర మహాసామంతులను అందరిని జయించి వీర నరసింహదేవుని ఓడించి కానుకలు కప్పములు గైకొని కళింగోత్కల రాజధానియైన కటకమును చూరలాడి కొండవీటికి మరలి వచ్చెను. కొండవీటి రాజ్యరక్షణకై కొమరగిరిరెడ్డి దక్షిణ కళింగమున గోదావరీ తీరము వరకు గల చాల దేశమును తన రాజ్యమున కలుపుకొని దానిని పూర్వరాజ్యమను నామాంతరముగల రాజమహేంద్ర రాజ్యమను పేర ఒక ప్రత్యేక రాజ్యముగ ఏర్పాటు చేసి తన్పరిపాలనకు రాజప్రతినిధిని నియమించెను. తెలుగు చోడ నృపతియైన అన్నదేవచోడుని పక్ష మవలంబించి మధ్యాంధ్రదేశ రాజకీయ వ్యవహారములలో జోక్యము కలిగించుకొని రెడ్డిరాజులపై కత్తి కట్టిన వెలమవీరులు వారి రాజ్యముపై దక్షిణ కళింగముగుండనే దండెత్తి పోవుచు వచ్చిరి. వీరు ఒకతడవ ఇట్లు దండెత్తి వచ్చుచుండగా యలమంచిలి ప్రభువైన చాళుక్య విశ్వేశ్వర భూపతి చిత్రభాను సంవత్సరమునకు సరియైన శకవర్షము 1324 లో సర్వసిద్ధివద్ద వారిని ఎదుర్కొని యుద్ధమున ఓడించి తరుమగొట్టెను. కాని, వారు తమ పూన్కి విడనాడలేదు. వారు అన్నదేవచోడునికి సాయముగ శకవర్షములు 1327, 1329 లలో మరల దక్షిణ కళింగముగుండ దండెత్తివచ్చిరి. దేవరకొండ రేచెర్లగోత్రుడు, సూరానాయని తమ్ముడు, సింగమనాయని కుమారుడు అగు పినమాదానాయని శాసనములు పూర్వోక్త శకవర్షముల నాటివి సింహాచలములో ఉన్నవి. ఈరీతిని నాలుగవ వీర నరసింహదేవరాజు రాజ్యపరిపాలనకాలముననే కళింగోత్కల సామ్రాజ్యము భగ్నముగుటకు ఆరంభము. ముస్లిము సుల్తానుల, రాచకొండ పద్మ వెలమనాయకుల, కొండవీటిరెడ్డి రాజుల దండయాత్రలవలన దెబ్బతిని సైనికముగను, ఆర్థికముగను రాజ్యము దుర్బలమైనది.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఈ నాలుగవ నరసింహదేవుడు శాసనములలో గజపతి ప్రతాప వీరనరసింహదేవ మహారాజని, గజపతి పెద నరసింహదేవరాజని, గజనివహపతి వీరనరసింహదేవరాజని పేర్కొనబడెను. ఈతనికి బిరుజాదేవి, నీలాదేవి, తారాదేవి, ఉత్తమాదేవి అని పెక్కుమంది భార్యలు కలరు. వీరిలో తారాదేవి పట్టమహాదేవియని పేర్కొనబడినది.

**నాలుగవ వీరభానుదేవుడు** (క్రీ. శ. 1409-10 — క్రీ. శ. 1439) : నాలుగవ వీరనరసింహదేవుని అనంతరము అతని కుమారుడు నాలుగవ వీరభానుదేవుడు కళింగోత్కల సామ్రాజ్యమునకు పట్టాభిషిక్తుడయ్యెను. ఇదివరలో నుడివినట్లు ఇతని మూడవ అంక సంవత్సరము శకవర్షము 1333 కు సరిసమానమగుటచేత ఇతని పరిపాలనము 1331 - 32 వ శకవర్షమున ఆరంభమైనట్లు నిశ్చయింపవచ్చును. ప్రాయికముగా ఇతడు నాలుగవ వీరనరసింహదేవునికి అతని పట్టమహాదేవి తారాదేవియందు జనించియుండవచ్చును.

నాలుగవ వీరభానుదేవుని కాలమునాటికి విజయనగరము గొప్ప సామ్రాజ్యముగ వర్ధిల్లినది. కొండవీటి రెడ్డి రాజ్యము, రాజమహేంద్రవర రాజ్యము అని రెడ్డిరాజ్యము రెండు తునకలయినది. రాజమహేంద్రవర రాజ్యాధిపతి కాటయ వేమారెడ్డిపై కొండవీటి రాజ్యాధిపతి పెదకోమటి వేమారెడ్డి కక్ష వహించి అతని రాజ్యమును వశపరచుకొను పూన్కితో అతనితో కలహించుచు వచ్చెను; కాని, అతని కోర్కి నెరవేరలేదు. కాటయవేముని అనంతరము అతనికి కుడిభుజముగా నుండిన అల్లాడరెడ్డి పోరాటము సాగించి కాటయవేముని కుమారుడు కొమరగిరిరెడ్డిని రాజమహేంద్రవర సింహాసన మెక్కించెను. ఈ రెడ్డి రాజ్యాంతఃకలహమును అవకాశముగ తీసికొని కళింగోత్కలాధీశ్వరుడు నాలుగవ వీరభానుదేవుడును, కర్ణాటాధీశ్వరుడు మొదటి దేవరాయలును రాజమహేంద్రవర రాజ్యముపై దండెత్తి వచ్చిరి. వచ్చుచుండిన గజపతిని, కర్ణాటభూపతిని అల్లాడరెడ్డి తన నీతి చాతుర్యముచేత మిత్రులను చేసికొనినట్లు అతని కుమారుడు వేమారెడ్డి వేమవరము తామ్రశాసనము తెలుపుచున్నది. మరొక రెడ్లశాసనము అతడు పౌరస్త్య భూపతులను, అనగా గజపతి వీరభానుదేవుని, అతని సామంత మండలేశ్వరులను జయించినట్లు తెలుపుచున్నది. ప్రాయికముగా అల్లాడరెడ్డి కర్ణాట భూపతితో సంధి చేసికొని గజపతిని ఓడించి యుండును. అటుతరువాత గజపతి వీరభానుదేవుడును, అల్లాడరెడ్డియు మిత్రులుగా వ్యవహరించి యుందురు.

ఇంకను సాగిన ఈ రెడ్డి రాజ్యాంతఃకలహము సందర్భమున హిజిరా 820 (శకము 1339 — క్రీ. శ. 1417) లో బహ్మనీ సుల్తాను ఫీరూజ్ షా రాజమహేంద్రవరముపై దండెత్తి వచ్చెను కాని ఆ దుర్గము అసాధ్యమయినది. అంతట ఫీరూజ్ షా నాలుగవ వీరభానుదేవుని జాజ్‌నగరు (ఉత్కల సామ్రాజ్యము)పై దండెత్తి వెళ్లి కొన్ని యేనుగులను పట్టుకొని మరలిపోయినట్లు ముస్లిము చరిత్రలు నుడువుచున్నవి.

ఫీరూజ్ షా దండయాత్ర జరగిన కొద్ది సంవత్సరములకు మాళవ రాజ్యాధిపతి సుల్తాన్ హూషంగ్ ఘోరీ జాజ్‌నగరుపై దాడి చేసినట్లు చాల ముస్లిము చరిత్రలు నుడువుచున్నవి. ముస్లిము చరిత్రకారులు చెప్పినదానిని అనుసరించి చూచినచో ఈ దాడి విచిత్రమైనది. హూషంగ్ ఘోరీకి సైన్యములోనికి ఏనుగులు కావలసి వచ్చినవి. యుద్ధమునకు కాళింగ గజములు ప్రశస్తములైనవని విని అతడు తన రాజధాని ధారానగరమునుండి జాజ్‌నగరుకు ప్రత్యేక మెన్నుకొనిన మెరికలవంటి యోధులతో బయలుదేరెను. జాజ్‌నగరు (ఉత్కల) అధిపతిని జయించుట కష్టమనియో, మరేకారణముననో అతడును, అతని పరివారమును - ముస్లిం చరిత్రల ప్రకారము - గుర్రపు వర్తకుల వేషము వేసికొని జాజ్‌నగరు రాజుకు చాల ఇష్టమని విన్న పలు రకములైన రంగుల గుర్రములను తీసికొని గుర్రపు సాతువలె బయలుదేరి వెళ్లిరి. రంగురంగుల చిత్రములైన ప్రశస్తాశ్వములు తెచ్చిన సాతు వచ్చినదని విని జాజ్‌నగరు రాజు వీరభానుదేవుడు దానిని చూచుటకు వచ్చెనట. అంతట గుర్రములను చూపించుచుండినట్లు నటించి హూషంగ్ ఘోరీ రాజును బందిగ పట్టుకొని మరలిపోవుచు దారిలో తాను ఏనుగుల నిమిత్తము ఈ దండయాత్ర తలపెట్టితి ననియు, తనకు కావలసిన ఏనుగుల నిచ్చి అతని ప్రజలు అతనిని విడిపించుకొని పోవచ్చు ననియు రాజుతో చెప్పెనట. అంతట రాజయిన వీరభానుదేవుడు చాల ఏనుగులను తెప్పించి యిచ్చి కారాగార విముక్తుడయ్యెనని ముస్లిము చరిత్రకారుల కథనము. ఖ్వాజా నిజాముద్దీన్ అహ్మదు ప్రకారము ఈ దండయాత్ర హిజిరా 825 (శకము 1343 - క్రీ. శ. 1421) లో జరగినది. తాబర్దీఙ ఫీరూజ్ షా, హూషంగ్ ఘోరీల జాజ్‌నగరు దండయాత్రలను గురించి చెప్పునవి ఒక్క ముస్లిము చరిత్రలే. ఈ వృత్తాంతములందలి సత్యమును నిర్ణయించుటకు వేరు ఆధార మేదియు లేదు.

రాజమహేంద్రవర రెడ్డిరాజ్యమును కాటయవేముని కూతురు అనితల్లివరము కావించిన కొద్దికాలముననే అల్లాడరెడ్డి దివంగతుడయ్యెను. వెంటనే అతని కుమారులు వేమ, వీరభద్రారెడ్లను అతని అన్న అనప్రోలారెడ్డి కుమారులు కొమరగిరి, అనపోతారెడ్లు గజపతి వీరభాను



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



దేవుని సాయముతో ప్రతిఘటించి రాజమహేంద్రవర రాజ్యమును ఆక్రమించుకొనిరి. సముద్రతీరస్థాంధ్రదేశము వందలి గ్రామముల స్థానిక చరిత్రలు శకవర్షము 1841, 1842 లో కళింగాధిపతియైన లాంగూల గజపతి మధ్యాంధ్ర దేశముపై దండెత్తివచ్చి రెడ్లను జయించి దానిని మరల విజయనగరాధీశ్వరులు జయించువరకు పరిపాలించినట్లు చెప్పుచున్నవి. గజపతి రాజమహేంద్రవరము నాక్రమించు కొన్నది శకవర్షము 1842 లోనని వ్యాఖ్యానము లేకుండ చెప్పుచున్నను విజయనగరాధీశ్వర విజయమునకు అవి యిచ్చుతేదులు మాత్రము భిన్నములైనవి. మొత్తము మీద భానుదేవ గజపతి అల్లాడరెడ్డి మరణానంతరము శకము 1842 లో కొమరగిరి, అనపోతారెడ్లకు సాయముగనో, మరొక విధముననో రాజమహేంద్రవర రాజ్యముపై దండెత్తివెళ్లి దానిని జయించినది మాత్రము యథార్థము. కొన్ని స్థానిక చరిత్రములు ఈ లాంగూల గజపతి నరసింహదేవుడని చెప్పుచున్నవి కాని ఇది సత్యము కాదు. అప్పుడు కళింగోత్కలములను పరిపాలించు చుండినవాడు నాలుగవ వీరభాను దేవుడుకాని నరసింహదేవుడు కాడు. ఒకవేళ ఈ వీరభానుదేవునికి నరసింహదేవుడను కుమారు డుండెనేమో తెలియదు. కళింగమునకు పశ్చిమముననుండు మధ్యాంధ్రదేశముపై ఈ కాలమున గాంగ దండయాత్ర ఉండినట్లు గంగవంశాను చరితముకూడ చెప్పుచున్నది. కళింగములోని గాంగవంశజుడైన కజ్జలభానుడు పడుమటి దేశముపై దండెత్తి వెళ్లెననియు, అప్పుడు కళింగములో రాజకీయ విద్వరము జరిగినదనియు, దీని ఫలితముగా గాంగ వంశజుల కటక సింహాసనమును అతని మంత్రుల సాయముతో కపిలేశ్వరుడు ఆక్రమించుకొనె ననియు పూర్వోక్త చరితము వలన తెలియుచున్నది. ఈ రాజకీయ సంక్షోభము వార్త తెలియగనే కజ్జల భానుదేవుడు గుడారి కటకము వరకు గల దేశమును జయించి అక్కడనే స్థిరపడిపోయెనట. ఈ గంగ వంశాను చరితము పడుమటి దేశముపై దండెత్తి వచ్చిన యతడు కజ్జల భానుడని తెలుపుచున్నది కాని అతడు కజ్జల భానుడు కాడు. ఈ నాలుగవ వీరభాను దేవునికి నిశ్శంకభానుదేవుడని, ప్రతాప వీర నిశ్శంక భాను దేవుడని, గజపతి ప్రతాప వీర నిశ్శంక భానుదేవుడని నామాంతరము లున్నవి కాని కజ్జల భానుడను పేరు లేదు. కజ్జల భానుడే నిశ్శంక భానుదేవుడు కావచ్చును. స్థానిక చరిత్రల ప్రకారము ఇతడు ఈ దేశమును పండ్రెండేండ్లు పాలించెను. ఇంతకాలము మధ్యాంధ్రదేశము అతని అధికారము క్రింద ఉండెనో లేదో చెప్పలేము కాని, శాలివాహన శకము 1844 (క్రీ. శ. 1422) లో సింహాసనమెక్కిన విజయనగరాధీశ్వరుడైన రెండవ దేవరాయలు మధ్యాంధ్రదేశముపై దండెత్తివచ్చువరకు అతనికి అణకువయై యుండెననుట నిజము. శాలివాహన శకము 1851 నాటి రెండవ దేవరాయల ముదలిదిరె శాసనములో అతడు 'మాతంగరాజ సింధుర వరకోటి మర్దన మృగేశ్వరు'డని పరికీర్తితు డగుటనుబట్టి అతడు గజపతిని (నాలుగవ వీరభానుదేవుని) జయించినట్లు విశదమగుచున్నది. దీని కనుగుణముగ దేవరాయ మహారాయల సామంతమండలేశ్వరుడైన తెలుంగురాయల శాసనము శాలివాహనశకము 1850 నాటిది ఒకటి సింహాచలములో కలదు.

రెండవ దేవరాయలచేత పరాజితుడై మధ్యాంధ్రదేశ రాజ్యమును గోల్పోయిన తరువాత కూడ కొంతకాలము గజపతి నిశ్శంక భానుదేవుడు సింహాచల ప్రాంతమున ఉండినట్లు శకవర్షము 1852 (క్రీ. శ. 1430) నాటి అతని సింహాచల శాసనమే తార్కాణము. కాని ఇక్కడకూడ అతనిని రాజమహేంద్రవర రాజ్యాధిపతులు వేమ, వీరభద్రారెడ్లు ఉండనీయలేదు. సింహాచలములోని శకవర్షములు 1858 ఆనంద సంవత్సరమునాటి శాసనమువలన వేమారెడ్డి కలువలపల్లి, ఒడాది, పొట్నూరు మొదలైన దక్షిణ కళింగ ప్రాంతములను ('స్వభుజార్జిత') జయించినట్లు విశదమగుచున్నది. వేమారెడ్డి తమ్ముడును, రాజమహేంద్రవర రాజ్యాధిపతియు అయిన వీరభద్రారెడ్డి శాసనముకూడ సింహాచలములో కలదు. భానుదేవుడు ఈప్రాంతమును కూడ గోల్పోయిన పిదప కపిలేశ్వరుడు తన సింహాసనము నాక్రమించుకొనుటచేత రాజధానియైన కటకమునకు వెళ్ల వీలులేక గంగవంశాను చరితములో చెప్పినట్లు ప్రాయికముగ గుడారి కటకమునకు వెళ్లియుండును. ఇది పర్లాకిమిడి జమీన్దారిలోని వారణాసియేయని చెప్పుదురు. వీరభాను దేవుని తరువాతి జీవితమును గూర్చి మన కేమియు తెలియదు. కళింగోత్కల సామ్రాజ్యము ఇంతటినుండి సూర్య వంశజుడైన కపిలేశ్వర గజపతి వశమైనది. గాంగవంశజులకు కూడ గజపతి బిరుద మున్నను, రూఢముగ గజపతి వంశమన్నది కపిలేశ్వరునితోనే ఆరంభము.

నాలుగవ వీరభానుదేవునితో గాంగవంశ చరిత్రము పూర్తియగుచున్నది. గాంగవంశజులు - పూర్వగాంగులైననేమి, అర్వాచీనగాంగులైననేమి - కళింగమును రమారమి తొమ్మిదివందల ఏబది సంవత్సరములు పరిపాలించిరి. ఇంతటి సుదీర్ఘకాలము పరిపాలనము నెరపిన రాజవంశములు హిందూదేశము చరిత్రలోనే అరుదు; లే వన్నను అది అతిశయోక్తి కానేరదు. కళింగోత్కల దేశములను



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సర్వవిధముల అభివృద్ధిపరచి వైదిక ధర్మమును, సంస్కృతిని అచట పాదుకొల్పి కాపాడిన ప్రతిష్ఠ గాంగ భూధవులది. దక్కనులోని కాకతీయాంధ్రులవలెనే కళింగాంధ్రులుకూడ పదింబదిగ వచ్చుచుండిన ముస్లిము దండయాత్రలకు ఎదురొడ్డి హిందూ ధర్మమును, సంస్కృతిని పరిరక్షించిరి. కాకతీయ సామ్రాజ్యమువలె కాక గాంగుల కళింగోత్కల సామ్రాజ్యము తురుష్కోపద్రవమును గడచి బ్రతికినది. వారి కాలములో సింహళము, జావా మొదలైన ద్వీపములతో నౌకావర్తక వ్యాపారము బాగుగా సాగినది. గాంగ వంశ్యుల కాలములో కళింగోత్కల దేశములందు వైష్ణవము ముమ్మరముగా వ్యాపించినది. నరహరి తీర్థ శ్రీపాదులును, వారి శిష్యులును కళింగములో ఈ ధర్మము ప్రబలుటకు ఎక్కువగ కారణభూతులైరి. కళింగములోని సుప్రసిద్ధ విష్ణ్వాలయములు విద్యాస్థానములును, కళాపీఠములునై వాసి కెక్కినవి.

గాంగ భూవరులు గొప్ప దేవాలయ నిర్మాతలు. ఉత్కల దేశమున పూరీ, భువనేశ్వరము, కోణార్కము మొదలైనచోట్ల అత్యంత మనోహర శిల్ప విరాజితములైన గొప్ప దేవభవనములను నిర్మించి దానిని అందగింపజేసిన వారు గాంగ వంశజులే. వీరి దేవభవన నిర్మాణ కళాభిరతిచేత చతుర్విధ భవన నిర్మాణ రీతులలో కళింగరీతియని ఒకటి ఏర్పడినది (మిగిలినవి నాగర, ద్రావిడ, వేసర రీతులు). అదియే గాంగవంశ్యుల విశిష్టత. మ. సో. శ.

## ఓఢ్ర గజపతులు

గంగవంశజులలో చివరివాడగు నాల్గవ భానుదేవుడు రెడ్డిరాజ్యముపై దండెత్తి వెళ్లిన సమయమున అతని మంత్రులలో ముఖ్యుడగు కపిలేశ్వర గజపతి రాజకీయోద్యోగులతో కుట్రచేసి గాంగ సింహాసనమును ఆక్రమించుకొనినట్లు ఇదివరకే తెలుపబడినది. ఈ కపిలేశ్వరుడే గజపతి రాజ్య స్థాపకుడు.

**కపిలేశ్వరుడు** (క్రీ. శ. 1434 — క్రీ. శ. 1468): ఇతడు సూర్యవంశ క్షత్రియుడు. ఇతని సంతతివారు సూర్యవంశ గజపతులని పేర్కొనబడుచున్నారు. కపిలేశ్వరుని వంశక్రమాదులను, ముఖ్యముగా నాతని తాత తండ్రులను గూర్చి తెల్పు నాధారములు పెక్కు కానరావు. పూరీ జగన్నాథమునందలి ప్రాచీనములగు కవిలెలలో ముఖ్యమైన 'మాదలాపాంజి'యందు కపిలేశ్వరుడు 'హీన'కులజుడనియు, సంతానరహితుడైన భానుదేవునకు విమలాలయము వద్ద దొరకె ననియు, భానుదేవుని యనంతరము అతడు రాజాయె ననియు చెప్పియున్నది. కాని, కపిలేశ్వరుని మనుమడగు ప్రతాపరుద్రుని రచనగా బరగు 'సరస్వతీ విలాస'మను గ్రంథము నందును, గజపతుల శిలా, తామ్రశాసనములందును కపిలేశ్వరుడు సూర్యవంశస్థుడనియు, నీలశైలాధినాథ ప్రసాదలబ్ధ రాజ్యుడనియు చెప్పియున్నది. ఇటీవల రాజమహేంద్రవర ప్రాంతమున శకము 1378 (క్రీ. శ. 1456) సంవత్సరమున వ్రాయించినది సూర్యవంశగజపతుల తామ్రశాసన మొకటి లభించినది. అది కపిలేశ్వరగజపతి తమ్ముడగు పరశురామదేవుని పుత్రుడును, రాజమహేంద్ర రాజ్య పాలకుడును నైన రఘుదేవ నరేంద్రకుమారుడు చేసిన దానమును వర్ణించును*. ఇతడు రాజమహేంద్రవరము మొదలు సింహాచలమువరకు గల రాజ్యమును పాలించుచుండెను.

ఇంతవరకు నుపలబ్ధమైన వంశానుక్రమణిక లన్నిటిని క్రోడీకరింపగా సూర్యవంశగజపతుల వంశక్రమము ఇట్లు తెలియుచున్నది.

గజపతి రాజ్యస్థాపకుడైన కపిలేశ్వరుని తండ్రి జాగేశ్వరుడు, తాత కపిలేశ్వరుడు. కపిలేశ్వరునికి బలరాముడను అగ్రసోదరుడును, పరశురాముడను అనుజుడును కలరు. కపిలేశ్వర గజపతి భార్య పార్వతి. ఆమెయందతనికి పురుషోత్తమ గజపతి, హంవీర గజపతి అని ఇద్దరు బిడ్డలు కలిగిరి. పురుషోత్తమునికి ప్రతాపరుద్ర, లేక వీరరుద్ర గజపతియను కుమారుడు కలిగెను. ఇతనికి రామచంద్రగజపతి, వీరభద్రగజపతి యని ఇరువురు కుమారులును, భద్రాదేవి అని ఒక కుమార్తెయు గలిగిరి. కృష్ణదేవరాయలు వివాహము చేసికొన్నది ఈ భద్రదేవే. కపిలేశ్వరగజపతి అనుజుడైన పరశురామునికి రఘుదేవ నరేంద్ర కుమారుడని ఒక కొడుకు కలిగెను.

ఈ క్రొత్త శాసనమువలన కపిలేశ్వరగజపతి తాతయైన కపిలేశ్వరుడు ఉత్కలదేశమున సుప్రసిద్ధుడైన నాయకుడనియు, అతని తండ్రి జాగేశ్వరుడు మహాపరాక్రమవంతుడనియు, అన్న బలరాముడు అన్వర్థనాముడై వైరివీరుల నుహతమార్చి యుద్ధమున మడిసె ననియు, తమ్ముడైన పరశురాముని కుమారుడు రఘుదేవనరేంద్ర కుమారుడు కపిలేశ్వరునికి దిగ్విజయములు చేకూర్చె ననియు తెలియుచున్నది. ప్రాయశః తన బంధువర్గము సాహాయ్యముతో కపిలేశ్వరుడు గాంగ సింహాసనమును ఆక్రమించిన ట్లూహించవచ్చును.

*ఇంకను అది యప్రకటితమైనను తత్సంపాదకులు శ్రీ రాళ్లబండి సుబ్బారావుగారు నా కోరికను మన్నించి యందలి వంశానుక్రమణికను వ్రాసి పంపిరి. వారి కత్యంతము కృతజ్ఞుడను.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కపిలేశ్వరుని పట్టాభిషేకముతో కళింగోత్కలములకు మరల వైభవము చేకూడినది. అతడు మేధావి; శూరుడు; దేశమున శాంతి భద్రతలను నెలకొల్పి అన్యాక్రాంతమైన రాజ్యభాగములను మరల జయించి ఉత్కలదేశ సార్వభౌమత్వముకొరకు పాటుపడిన వ్యక్తి. తనపై పగబూని పదభ్రష్టుడైన భానుదేవుని మరల సింహాసనస్థుని చేయ దలపెట్టిన, స్వతంత్రులైన ఒడ్డాది మత్స్యవంశపు రాజులను, తూర్పు చాళుక్య వంశ్యులైన విష్ణువర్ధన భూమీశులను వశపరచుకొని, దాడి వెడలివచ్చిన వంగదేశపు సుల్తానులను ఓడించి ఇతడు తన యధికారమును సుస్థిరము చేసికొనెను. తదుపరి ససైన్యుడై దక్షిణ దిగ్విజయయాత్ర వెడలెను.

రెడ్డిరాజుల ప్రాభవమును అరికట్టుటకై కపిలేశ్వరుడు తొలుదొల్త దక్షిణదిశకు దండెత్తివెళ్లి శకము 1366 (క్రీ. శ. 1444) నాటికి విశాఖ మండలమునందలి కోరుకొండవరకు జయించి వశపరచుకొనెను. కాని రెడ్డిరాజుల సైన్యములు విజయనగరరాజుల సాహాయ్యముతో అతని నోడించి వెనుకకు తరిమివేసినవి.

పశ్చిమోత్తరమందు జాన్‌పూరు సుల్తాను కుమారుడైన మహమ్మదుషా షార్కీ ఉత్కలముపై దండెత్తుటచేత కపిలేశ్వరుడు స్వరాష్ట్ర రక్షణకై వెనుకకు మరలిపోవలసి వచ్చినది. విజయనగర రాజైన రెండవ దేవరాయల మరణముతో రెడ్డిరాజులకు విజయనగర రాజుల అండ పోయినది. కపిలేశ్వరుని సైన్యములు రఘుదేవకుమార, హంవీరుల నాయకత్వమున బయల్వెడలి రాజమహేంద్ర రాజ్యమును జయించినవి. ఈ విజయానంతరము కపిలేశ్వరుడు ఆ రాజ్యమునకు రఘుదేవకుమారుని పాలకునిగ నియమించెను. కాని మరికొన్ని యేండ్లదాక కపిలేశ్వరుడు దక్షిణ దిగ్విజయమునకు పూనుకొనలేదు. అతడు క్రీ. శ. 1455 లో కృష్ణానది నుత్తరించి విజయనగర సామ్రాజ్యమును ప్రవేశించి కొండవీటిని స్వాధీనము చేసికొని గాణదేవుని తత్పాలకునిగ నియమించెను. అతడు విజయనగర సామ్రాజ్య రాజధానియైన హంపీ విద్యానగరమును ముట్టడించినట్లు గంగాధరుని 'గంగాదాస ప్రతాపవిలాసము' వలన తెలియుచున్నది.

కపిలేంద్రుని వెలగలని తామ్రశాసనమును బట్టి క్రీ. శ. 1458 నాటికి అతడు బహ్మనీ సుల్తానుల నెదిరించి, ఓడించినట్లు తెలియుచున్నది. బహ్మనీ సుల్తానులు తమ రాజ్యమును స్థాపించినది మొదలుకొని తమ అధికారమును తీరస్థాంధ్రమున విస్తరింపజేయుటకు పెక్కు ప్రయత్నములు సల్పిరి. తత్సందర్భమున వారికి తెలంగాణాయందలి వెలమ నాయకులతోను, రెడ్డిరాజులతోను పోరు సంభవించినది. కపిలేశ్వరుడు రెడ్డిరాజ్యము నాక్రమించినందున అతనిని రెడ్లుకూడ ఢీకొనవలసి వచ్చినది.

కపిలేశ్వరుని సమకాలికులైన బహ్మనీ సుల్తానులు అలాఉద్దీన్, హుమాయూన్ షాలు ఇద్దరు. వీరిలో హుమాయూన్ క్రీ. శ. 1457 లో రాజ్యమునకు వచ్చెను. ఇతడు క్రూరుడు; అధికారమునకు రాగానే మాలిక్ షా యను సర్దారునకు 'ఖాన్ - ఇ - జహాన్' బిరుద మిచ్చి తెలంగాణాకు తన ప్రతినిధిని చేసెను. సుల్తాను తనపైని అభిమానమును చూపలేదని పగబూని ఇతర సర్దారులలో కొందరిని, వెలమ నాయకులను పురికొల్పి సికందరు ఖాను డనెడి మరొక సర్దారుడు తిరుగబాటు లేవదీసెను. కాని హుమాయూన్ షా సికందరు షా నోడించి వానికి అండగా నిల్చిన దేవరకొండ వెలమరాజుల మద మణచుటకై దేవరకొండ దుర్గమును ముట్టడించెను. నాటి వెలమనాయకుడైన లింగమనేడు కపిలేశ్వరుని సాహాయ్య మర్థింప రాజనీతి విశారదుడగు అతడు తన రాజ్య విస్తరణకు ఇదియే యదనని యెంచి తన కుమారుడైన హంవీరుని వెలమలకు సాయముగా పంపెను. హంవీరుడు బహ్మనీ సుల్తాను సేనలను చీకాకుపరచి తెలంగాణాకు ముఖ్య దుర్గమైన ఓరుగల్లును క్రీ.శ. 1460 లో కైవసము చేసికొనెను. హుమాయూన్ షా క్రీ.శ. 1461 లో మరణించెను. అతని కుమారుడైన నిజాంషా బాల్య వయస్కుడు. రాజ్యములోని సామంతు లందరు అదియే సమయమని స్వాతంత్ర్యమును ప్రకటించిరి. బహ్మనీ సుల్తానులను ఏ పడచుటకు అదియే సరియైన సమయమని కపిలేశ్వరుడు వారి రాజధానియగు బీదరు (బెడదకోట)పై దాడి చేసెను. అయినను రాజమాత మంత్రియైన మహమ్మద్ గావాన్ సలహా ప్రకారము శత్రుసైన్యము నెదిరించెను. బహ్మనీ రాజ్యమును కబళించుటకై ఏతెంచిన గజపతులకు దైవానుకూల్యము లేకపోయినది. మరల జాన్‌పూరు సుల్తానుడైన మహమ్మదుషా కపిలేశ్వరుని ఓఢ్రదేశముపై దండెత్తి వచ్చెను. కపిలేశ్వరుడు చేయునది లేక తన ప్రయత్నము నప్పటికి విరమించుకొని స్వరాష్ట్ర రక్షణకై మరలిపోవలసి వచ్చినది. అటుతరువాత కపిలేశ్వరుడు విజయనగరముపై దండు వెడలెను. అతని ధాటి నాపుటకు మల్లికార్జున రాయలు చేసిన ప్రయత్నము లన్నియు విఫలమయినవి. కుమార హంవీరుడు సైన్యముతో దక్షిణమునకు తరలి, ఉదయగిరి, చంద్రగిరి రాజ్యములను జయించి స్వాధీనపరచుకొని క్రీ.శ. 1464 లో శ్రీ రంగేశ్వరు నర్చించి, శత్రురక్తసిక్తమైన తన ఖడ్గమును దక్షిణ సముద్రమున కడిగి, తండ్రి కపిలేశ్వరుని మన్ననలకు పాత్రుడై అతనిచే దక్షిణ ప్రాంతమునకు

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పాలింప అతని ప్రతినిధిగ నియమింపబడినట్లు నాటి గజపతుల శాసనములవలన బూఢియగుచున్నది.

ఇట్లు అశ్వపతులను, నరపతులను జయించి తెలంగాణా, కొండవీడు, ఉదయగిరి, చంద్రగిరి, పడవీడు మున్నగు రాజ్యములను సాధించి కైవసము చేసికొని కపిలేశ్వరుడు 'గజపతి గౌడేశ్వర, నవకోటి కర్ణాట కలుబరిగేశ్వర' అను బిరుదములను ధరించి క్రీ. శ. 1464 నాటికి గంగానది మొదలు శ్రీరంగమువరకు గల తీరస్థదేశమును సాధించి తన సార్వభౌమత్వమును చిరస్థాయిగ స్థాపించెను.

తనకు వయసు మరలుటచేత కపిలేశ్వరుడు తన కుమారులలో ఒక్కనికి యౌవరాజ్యాభిషేకము చేసి తాను పరిపాలనావ్యాసంగములనుండి విరమింప దలచెను. కాని, ఎవరిని నియమించుటకును తోచక అవసానకాలమున అతనికి మనఃక్లేశము తప్పలేదు. తన కీవిషయమున సాయముచేయ అతడు పరమేశ్వరుని ప్రార్థింప జగన్నాథస్వామి కలలో కన్పించి కనిష్ఠపుత్రుడగు పురుషోత్తముని రాజును చేయుమని చెప్పెనట. ఆ సంవత్సరములో తన పెద్ద కుమారుడైన హంవీరుడు అతని పుత్రుడు దక్షిణ కపిలేశ్వర హంవీర మహాపాత్రునితోడను, కొంతమంది సామంతులతోడను కుట్ర పన్ని తండ్రి నెదిరించెను. వృద్ధుడైన కపిలేశ్వరుడు క్రుద్ధుడై జగన్నాథుని యాదేశానుసారము దక్షిణమునకు ససైన్యుడై తరలిపోయి కృష్ణాతీరమున విడిసెను. ఇది యిట్లుండ, చంద్రగిరి పాలకుడైన సాళువ నరసింహరాయలు స్వతంత్రుడై రాజ్యవిస్తరణ ప్రయత్నమును అపుడు సాగించెను. గజపతి రాజ్యమునకు కలుగనున్న ఆపద గ్రహించి కపిలేశ్వరుడు కృష్ణాతీరముననే తన కనిష్ఠ పుత్రుడైన పురుషోత్తముని తన వారసునిగ నియమించి, యౌవరాజ్యాభిషేకము చేసి తిరుగబాటుచేసిన వారితో పోరుచు పౌష్య బహుళ తృతీయా మంగళవారమునాడు (క్రీ. శ. 1468) దివంగతుడాయెను.

**పురుషోత్తమ గజపతి (క్రీ. శ. 1468— క్రీ. శ. 1497):** కపిలేశ్వరునికి పార్వతియను భార్యయందు పురుషోత్తముడు కల్గినట్లు సరస్వతీవిలాస గ్రంథమున చెప్పియున్నది. ఇతని భార్య రూపాంబిక. వీరి కుమారుడు వీరరుద్రుడను ప్రతాపరుద్ర గజపతి. పురుషోత్తముడు చక్కగ చదివిన విద్వాంసుడు; కవి. కపిలేశ్వరుని మరణానంతరము తదనుగ్రహమాత్రలబ్ధమైన రాజ్యమున తన అధికారమును సుస్థిర మొనరించుకొనుటకై అన్నయైన హంవీరునితోడను, అతనికి అండగ వచ్చిన సామంత రాజులతోడను సుమారు నాల్గుసంవత్సరములు పోరాడవలసి వచ్చినది. బహ్మనీ సుల్తానుల సాహాయ్యముతో హంవీరుడు విజృంభించి పురుషోత్తము నోడించి పదభ్రష్టుని చేసెను. ఈ కుటుంబ కలహము మూలమున గజపతిరాజ్యము అన్యాక్రాంతమైనది. తెలంగాణామాత్రమే కాక కృష్ణా, గోదావరి మధ్యస్థదేశ మంతయు యవనాక్రాంతము కాగా కృష్ణకు దక్షిణ ప్రాంత మంతటిని సాళువ నరసింహభూపతి కబళించి వైచెను.

పురుషోత్తమ గజపతికి త్వరలోనే దైవానుకూల్యము చేకూడినది. రాజ్యనష్టమువలన ప్రజలకు హంవీరునిపై అసంతృప్తి కలిగినది. వారు పురుషోత్తమగజపతి దైవాంశసంభూతు డనియు, జగన్నాథుని ఆదేశానుసారము రాజాయె ననియు నమ్మి యతని కండయై నిల్చిరి. బహ్మనీ రాజ్యమున సంభవించిన కరవు కాటకములుకూడ పురుషోత్తమునకు ఉపకారకములైనవి. సుల్తానులు సాయము రాకపోవుటచేత అన్నగారైన హంవీరుని నిస్సహాయతను గమనించి క్రీ. శ. 1467 లో అతనిని పాదాక్రాంతుని చేసికొని మరల సింహాసన మెక్కెను.

ఈ యెనిమిదిసంవత్సరముల కాలమున దక్షిణ రాజ్యములలో పెక్కుమార్పులు కలిగినవి. చంద్రగిరి పరిపాలకుడైన సాళువ నరసింహరాయలు తన శక్తి సామర్థ్యముల చేత గజపతి రాజ్యాంతర్గతములగు విజయనగర రాజ్యభాగము లన్నిటిని జయించుకొని క్రీ. శ. 1476 నాటికి ఉత్తరమున మచిలీపట్నము వరకు తన యధికారమును విస్తరింప జేసికొని కొండపల్లి, రాజమహేంద్రవర దుర్గముల పాలకులైన తురుష్క సర్దారులను స్వాతంత్ర్యము ప్రకటింప నుత్సాహపరచు చుండెను. వారి తిరుగబాటును ఆధారముగా చేసికొని కృష్ణా, గోదావరుల మధ్యదేశము నాక్రమించుట వాని యుద్దేశము. అట్టి తరి పురుషోత్తముడు మరల సింహాసన మెక్కుట సంభవించినది.

పురుషోత్తముని విజయమునుగూర్చి తెల్పు ఇతిహాసములు ఓఢ్రదేశమున చాల గలవు. ఈతడు కాంచీరాజైన నరసింహుని ఓడించి అతని కుమార్తెను బలాత్కారముగా గొనిపోయి వివాహమాడెనని 'కాంచి - కావేరిపోథి' అను ఉరియా గ్రంథమువలన తెలియుచున్నది. కాని, ఇది ఎంతవరకు విశ్వసనీయమో తెలియదు.

సయ్యద్ అలీ, ఫెరిస్తా మున్నగు ముస్లిము చరిత్రకారులు నాటి చరిత్రను విపులీకరించి యున్నారు. సయ్యద్ అలీచే వ్రాయబడిన 'బుర్హాన్ - ఇ - మ అసీర్' అను గ్రంథమువలన రాజమహేంద్రవరము మీద ఓఢ్రసైన్యములు దాడిచేయగా నిజామ్ - ఉల్ - ముల్క్ తన కర్తవ్యము మరచి వజీరాబాదుకు పారిపోయి ప్రాణములు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కాపాడుకొన్నట్లు తెలియుచున్నది. ఫెరిస్తా వ్రాతల ప్రకారము కొండపల్లి సైన్యములు తిరుగబడి కోటను స్వాధీన పరచుకొని హంవీరుడను ఒక ఓఢ్ర నాయకుని తమ నాయకునిగా ఎన్నుకొనినట్లును, అతడు గజపతిని దండెత్తి రమ్మని యాహ్వానించినట్లును తెలియుచున్నది. అవకాశమునకై ఎదురుచూచుచుండిన పురుషోత్తముడు క్రీ. శ. 1476 లో జూన్ 28 తేదిన దండెత్తివచ్చి ఆంధ్రదేశమును ప్రవేశించెను. రాజమహేంద్రవర పాలకుడైన నిజామ్ - ఉల్ - ముల్క్ అతని నెదుర్వజాలక రాజమహేంద్రవర దుర్గమును జొచ్చి తలుపులు మూయించి ముట్టడికి నిలిచినట్లును తెలియుచున్నది. అప్పుడు రాజమహేంద్రవరమును స్వాధీనపరచుకొనుటకై సాళువ నరసింహరాయలు కూడ తన సైన్యముతో గోదావరి తీరమునకు ఎత్తివచ్చెను. రాజమహేంద్రవరముపై గజపతి యెత్తివచ్చినాడని విని బహ్మనీ సుల్తానగు ముహమ్మదుషా సైన్యముతో కదలి వచ్చి పురుషోత్తమగజపతి నెదిరించెను. ఇదంతయు గమనించి సాళువ నరసింహరాయలు ఇద్దరు శత్రువులతో పోరుట సాధ్యమును, లాభదాయకమును కాదనియు, విజయనగర సింహాసన మధిష్ఠింప గోరియున్న తనకు ఇట ఓటమి కల్గెనేని తన ఆశయములు నెరవేరవనియు ఎంచి యుద్ధము చేయక తిరిగిపోయెను.

బహ్మనీ సుల్తానుతో పోరుటకు సాధ్యముకాదని యెంచి పురుషోత్తమ గజపతియు తన ప్రయత్నమును తాత్కాలికముగ విరమించుకొని స్వదేశమునకు మరలెను. కాని, ముహమ్మదుషా యతనిని వెన్నంటి తరుముచుపోయి పరాభూతుని గావించి కప్పమును పుచ్చుకొని సంధి కొడబరచెననియు, అటుతరువాత కొండవీటిని జయించి, అచటినుండి సాళువ నరసింహరాయలపై కాంచీపురము వరకు దండెత్తిపోయి దేశమును కొల్లగొట్టి వచ్చెననియు ఫెరిస్తా వ్రాసియున్నాడు. కాని, కాంచీపురమునుండి తన రాజధానికి మరలిపోవుచుండగా మార్గమధ్యమున కందుకూరికడ సాళువ నరసింహరాయని సేనాధిపతి తుళువ ఈశ్వర నాయకుడు అతనిని అడ్డగించి స్కంధావారమును చూరపట్టెను.

ముహమ్మదుషా మరణానంతరము బహ్మనీ సర్దారులలో క్రమేణ ఐకమత్యము నశించినది. ముహమ్మదు షా వెనుక రాజైన యతని కుమారుడు మహమ్మూదుషా బాలుడు; మరియు శక్తి సామర్థ్యములు లేని అంవేద. ఇదే అదనుగా నాయకత్వముకొరకు యూసఫ్ ఆదిల్ ఖాన్, నిజాము - ఉల్ - ముల్క్ బ్రహిలు వేరు వేరు కక్షలుగా చీలి తమలో [illegible] తగవులాడ నారంభించి బహ్మనీవంశ విచ్ఛిత్తికి కా[illegible]యిరి.

ఈ పరిస్థితులలో పురుషోత్తముడు మరల తన దిగ్విజయ యాత్ర సాగించుటకు అనుకూలమైనది. అతడు క్రీ. శ. 1484 నాటికి రాజమహేంద్రవరము నుండి కొండవీడు వరకు జయించి పెండ్లి సుంకము మొదలగునవి తొలగించి ప్రజల మెప్పుకు పాత్రుడై సాళువ నరసింహరాయలచే ఆక్రమింపబడిన ఉదయగిరి రాజ్యమునకై యుద్ధము చేసెను. ఈ యుద్ధములో కర్ణాటాధిపతియైన సాళువ నరసింహరాయలు పట్టువడి ఉదయగిరి సమర్పించుకొని తన ప్రాణములను కాపాడుకొనెను. ఈ విజయము పురుషోత్తమునకు క్రీ. శ. 1486 తరువాత లభించి యుండవలయును. ఎందుకన, సాళువ నరసింహుని శాసనముల వలన అతడు క్రీ. శ. 1486 లోనే విజయనగర సింహాసన మెక్కెనని తెలియుచున్నది. ఉదయగిరి విజయ లాభానంతరము పురుషోత్తముడు రాజ్యమును అన్ని విధముల చక్కగ పరిపాలించి క్రీ. శ. 1497 లో పరమపదించెను.

ప్రతాపరుద్రుడు (క్రీ. శ. 1497 — క్రీ. శ. 1538): పురుషోత్తముని తరువాత అతని పుత్రుడగు ప్రతాపరుద్రగజపతి రాజాయెను. ఇతనికి వైదికాచారములందును, సంస్కృతమునందును భక్తి ఆదరము కలవనియు, 'గౌడేంద్ర మాన మర్దను' డనియు, 'యమునా పురాధీశ్వర హుసేను షాయి సురత్రాణ శరణ రక్షణు' డనియు బిరుదములున్నట్లు 'సరస్వతీ విలాసము' వలన తెలియుచున్నది. ఈతని భార్య పద్మ. ఇతనికి వీరభద్ర, రామచంద్రులను కుమారులు ఇద్దరును, భద్రయను కొమార్తె ఒకతెయు గలరు.

క్రీ.శ. 1486 లో పురుషోత్తమునిచే పరాజితుడైన సాళువ నరసింహుడు ఉత్కలాధిపతులనుండి కొండవీడు, ఉదయగిరి దుర్గములను గెల్వలేకపోయెను. అతడు ఈ చింతతో కృశించి తన సేనాధిపతియైన తుళువ నరసానాయకునికి తన చిన్న కుమారులను, రాజ్యమును అప్పగించి క్రీ. శ. 1491 లో మరణించెను. సాళువ నరసింహుని మరణానంతరము విజయనగర రాజ్యమున అల్లకల్లోలములు ప్రారంభమైనవి. క్రీ. శ. 1500 లో ప్రతాపరుద్రుడు తన తండ్రి వలెనే విజయనగర సామ్రాజ్యముమీదికి దండెత్తినట్లు అనంతవర, రాజమ్రోలు, వెలిచర్ల శాసనములవలన తెలియుచున్నది. ఈ యరాజక సమయమున తురుష్క రాజులు విజయనగర రాజ్యమును కొల్లగొట్టసాగిరి. నరసా నాయకుడు తన తెలివితేటలవలన దేశమునందలి అల్లకల్లోలముల నణచి ప్రతాపరుద్రుని తన రాజ్యములోనికి రానీయక అడ్డపడెను. ఈ సమయముననే ప్రతాపరుద్ర గజపతి తెలంగాణాపై దండువెడలి బహ్మనీ సైన్యములను ఓడించి

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తరుమగొట్టి, అచటి దుర్గముల నన్నింటిని స్వాధీనము చేసికొని తన సామంతులను పాలకులుగ నియమించెను. ఈ దండయాత్రలో ఫణివంశజుడైన చిత్తాపఖానుడను కూరవ రేడ్యుడు ప్రతాపరుద్రునికి కుడిభుజమువలె తోడ్పడి ఓరుగల్లు, కంబముమెట్టు మున్నగు బలిష్ఠమైన దుర్గములను సాధించి అచట అతని యధికారమును నెలకొల్పెను.

తుళువ నరసానాయకుని మరణానంతరము అతని కుమారుడు వీరనరసింహరాయలు క్రీ. శ. 1503 - 04 లో సాళువ వంశ్యులను త్రోసిరాజని విజయనగర రాజ్యసింహాసన మాక్రమించుకొనెను. ఇతని పరిపాలన కాలములో కూడ విజయనగరమునందు ప్రబలియుండు అరాజక పరిస్థితులను ఆధారము చేసికొని ప్రతాపరుద్రుడు మరల విజయనగరముపై దండు వెడలెను. అదే సమయమున జమునాపుర రాజైన హుసేను షా షార్కి గౌడసేనకు నాయకుడై ఉత్కల రాజ్యము మీదికి దండెత్తి వచ్చెను. అప్పుడు ప్రతాపరుద్రుడు కొంత సైన్యమును విజయనగర రాజులతో పోరాడుటకు నిలిపి మిగలిన సైన్యముతో స్వయముగా కదలిపోయి హుసేను షా నెదుర్కొని యోడించి తరిమివేసెను. కాని, దక్షిణమున విజయనగర దండయాత్రలో పూర్తిగ ఓటమి సంభవించుటే కాక విజయనగర రాజులతో అతనికి బద్ధవైర మేర్పడినది. వీరనరసింహుని తమ్ముడు కృష్ణదేవరాయలు సేనాధిపతియై ప్రతాపరుద్రుని సైన్యమును చిందర వందర చేసి తరిమివేసెను. వీరనరసింహుని అనంతరము క్రీ. శ. 1509 లో కృష్ణదేవ మహారాయలు విజయనగర వజ్రసింహాసనారూఢుడాయెను. ఉదయగిరి, కొండవీడు దుర్గములను జయింపవలె ననియు, గజపతులను పూర్తిగా అణచివేసిన గాని విజయనగర సామ్రాజ్యమునకు శాంతి భద్రతలు కలుగ వనియు కృష్ణదేవరాయలు నిశ్చయించి తన సైన్యములతో క్రీ. శ. 1512 లో పూర్వ దిగ్విజయ యాత్ర సాగించి ఉదయగిరిని ముట్టడించెను. ప్రతాపరుద్రగజపతి శత్రువుల బారినుండి తన దుర్గమును రక్షింప జూచెను. కాని, కృష్ణదేవరాయలు గజపతి సైన్యములను ఓడించి ఆతనిని కొండవీటివరకు తరుమగొట్టి మరలి వచ్చి ఉదయగిరిని ముట్టడించి స్వాధీనపరచుకొనెను. ఆ దుర్గాధిపతి ప్రతాపరుద్ర గజపతియొక్క పినతండ్రి తిరుమలకాంత, లేక రాఘవదేవరాయలు కృష్ణదేవరాయలకు బందిగ చిక్కెను.

ఉదయగిరిని స్వాధీనము చేసికొని పిమ్మట విజయనగర సైన్యము సాళువ తిమ్మరసయ్యగారి నాయకత్వమున బయలుదేరి కొండవీటిపై నడచి ఆదుర్గమును ముట్టడించెను. ప్రతాపరుద్రదేవుడు తన కుమారుడైన వీరభద్రుని కొండవీటి దుర్గరక్షణకు నియమించి తాను స్వయముగా విజయనగర సైన్యమును మరల ఎదిరించెను; కాని, యుద్ధములో అపజయము నొంది కొండపల్లికి పారిపోయెను. క్రీ. శ. 1515 నాటికి కొండవీటి దుర్గము అతి కష్టముమీద వశమైనది. ప్రతాపరుద్రగజపతి కుమారుడు వీరభద్రుడు పెక్కండ్రు పాత్ర సామంతులతో గూడ బందీకృతుడాయెను.



చిత్రము 46. చిత్తాపఖాను (షితాబుఖాను)ని మందిరము

ఇట్టి పరిస్థితులలో ప్రతాపరుద్రుడు కృష్ణ కుత్తర ప్రదేశము చేరి కృష్ణదేవరాయలను మరల నెదుర్కొనుటకు ప్రయత్నములు సల్పుచుండెను. కొండవీటి దిగ్విజయానంతరము కృష్ణదేవరాయలు అమరేశ్వరుని సేవించి రత్న ధేను తులాపురుష సప్తసాగరాది దానముల నొసగి అపరిమిత ఉత్సాహముతో నిజరాజధాని చేరి కొంతకాలము గడపి, మరల కళింగ దండయాత్రకు వెడలెను. అతడు కొండపల్లి వద్ద ప్రతాపరుద్రుని ఓడించి ప్రహరేశ్వరాదులను బందీలు కావించెను. కొండపల్లిని సాధించిన పిమ్మట కృష్ణదేవరాయలు తెలంగాణాను ప్రవేశించి అచ్చట ప్రతాపరుద్ర



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



గజపతి యేలుబడిక్రింద నుండిన దుర్గముల నన్నిటిని తైవసము కావించుకొనెను. తెలంగాణా ప్రాంత సామంతులలో నెల్ల ప్రముఖుడైన చిత్తాపఖానుడు రాయసేనల నెదిర్చి పోటుచూపెను; కాని, పరాభూతుడై తన రాజ్యమును, దుర్గములను రాయల కప్పగించి పారిపోయెను. తెలంగాణానుండి జమ్మిలోయగుండ విజయనగర సైన్యము కృష్ణా, గౌతమీ మధ్యస్థమైన వేంగిని ప్రవేశించి రాజమహేంద్రవరమును వశపరచుకొని, కోనను సాధించి 1516 లో సింహాద్రిని చేరినది. కృష్ణదేవరాయ లంతట పొట్నూరికడ జయస్తంభమును నిల్పి సింహాద్రినాథుని సేవించి దానాదు లొసగెను.

కళింగ దిగ్విజయ యాత్రా సందర్భమున బందీకృతుడైన వీరభద్రుని తన ఖడ్గ యుద్ధ కౌశలము చూపుమని కృష్ణదేవరాయలు కోరగా తన ప్రత్యర్థి హీనకులజుడని, అతనికి తన కౌశలము చూపుట తన కగౌరవహేతువని యెంచి వీరభద్రుడు ఆత్మహత్య కావించుకొనెను. యుద్ధ పరాజయ పరంపరలతో విసిగియున్న ప్రతాపరుద్రునకు తన కుమారుని మరణవార్త పిడుగువలె తాకినది. సింహాద్రివరకు జయించినను తృప్తిపడక రాయల సైన్యములు రాయసము కొండమరసు ఆధిపత్యమున కటకము మీదికి దండెత్తి వెళ్లెను. విధిలేక ప్రతాపరుద్ర గజపతి కృష్ణదేవరాయలతో రాజీ కొడంబడెను. రాయలు గజపతి కూతు నుద్వాహము చేసికొని కృష్ణానదిని విజయనగర, గజపతి రాజ్యములకు సరిహద్దుగా నేర్పరచుకొని తిరిగి విజయనగరము చేరెను.

ప్రతాపరుద్రుడు మిగిలిన తన రాజ్యమునకు కొండపల్లిని రాజధానిగా చేసికొని కొండపల్లి, రాజమహేంద్రవరములను పరిపాలించుటకై తన సామంతు నొక్కని నియోగించి తాను విజయనగర రాజులమీద కసి తీర్చుకొనుటకు అవకాశము కొరకు ఎదురుచూచుచుండెను. ఇదే కాలమున బహ్మనీ రాజ్యమున రాజకీయముగ అల్లకల్లోలము బయలుదేరి అది యైదు చిన్న రాజ్యములుగ చీలిపోయినది. వానిలో కుతుబ్‌షాహు వంశ మూల పురుషుడైన సుల్తాను కుల్లీకుతుబ్-ఉల్-ముల్క్ గోల్కొండను రాజధానిగా చేసికొని తూర్పుతీరమువరకు తన రాజ్య విస్తరణకు ప్రయత్నించెను. కృష్ణదేవరాయలు గజపతులతో పోరాడుచున్నంతకాలము ఇతనికి అందుల కవకాశము కలుగలేదు. యుద్ధము పరిసమాప్తిమైన వెనుక క్రీ. శ. 1519 లో కొండపల్లి ప్రాంతము మరల గజపతుల ఆధిపత్యముక్రిందికి వచ్చినది. క్రీ. శ. 1523-1524 లో సుల్తాన్ కుల్లీ గజపతి రాజ్యముపై దండెత్తెను. ప్రతాపరుద్రు డతనిని ప్రతిఘటింపలేకపోయెను. క్రీ. శ. 1530 లో కొండపల్లి రాజ్యము తుదకు కుతుబ్ షాహుకు హస్తగతమైనది. క్రీ. శ. 1529-1530 లో కృష్ణదేవరాయల మరణానంతరము ప్రతాపరుద్రుడు విజయనగరము మీదికి ప్రాత కసి తీర్చుకొనుటకు దండెత్తి వెళ్లెను. కాని, అచ్యుతదేవరాయలు అతని నెదుర్కొని ఓడించినట్లు తెలియుచున్నది.

ఇట్లు ప్రయత్నము లన్నిటిలోను ఓటమి గాంచి, అనేక కష్టములకు పాలై ప్రతాపరుద్రుడు తుదకు గౌడదేశ చైతన్యదేవుని శిష్యుడై తన జీవితావశేషమును పారమార్థిక చింతలో గడపి క్రీ. శ. 1538 లో దివంగతుడయ్యెను.

కూరుడైన వీరభద్రగజపతి రాయల కళింగదండయాత్రలో హతుడైనందునను, రామచంద్రు డప్పటికి కాలగతినందుట వలనను ప్రతాపరుద్రుని అనంతరము గజపతి సింహాసనము నెక్కుటకు యోగ్యుడైన కుమారుడు లేకపోయెను. మిగిలిన సంతానములో మగపిల్లలు కడు చిరుతప్రాయమువారైనందున మంత్రులతో కుట్ర చేసి రాజకుమారులను చంపి ప్రతాపరుద్రుని మంత్రియైన గోవింద విద్యాధరుడు రాజాయెను. అంతటితో సూర్యవంశ గజపతుల ప్రభుత్వము సమాప్తి నందినది.

గజపతి వంశము తెలుగుదేశమును పాలించిన కాలము కొద్దియేయైనను వారి పరిపాలన చరిత్రలో చాల విశిష్టమైనది. యావద్భారతమును యవనుల దండయాత్రలకు లోనై హైందవ స్వాతంత్ర్యము అడుగంటనున్న తరుణమున కపిలేశ్వర, పురుషోత్తమ, వీరరుద్రులు తురుష్కుల నెదుర్కొని వారి ధాటి నాపి హిందూధర్మమును, మతమును ఉద్ధరించి వన్నెకెక్కిరి; తమ రాజ్యములో శాంతి భద్రతలను నెలకొల్పి చక్కని పరిపాలన విధానము నేర్పరచి ప్రజాహిత కార్యములు చేసి చిరస్మరణీయులైరి. వారి మతాభిమానమును, భక్తి ప్రపత్తులును, కళాసాహిత్య పోషణయు మరపునకు రానివి.

రాజ్యము సుస్థిర మొనరించుటలో జీవిత మంతయు గడపిన కపిలేశ్వరునకు కళా సాహిత్యములు పోషించుట కవకాశము లేకపోయినది. కాని, అతని కుమారుడు పురుషోత్తముడును, మనుమడైన ప్రతాపరుద్రుడును సాహిత్య ప్రియులై ఓఢ్ర, ఆంధ్ర, సంస్కృత వాఙ్మయాభివృద్ధికి దోహదమిచ్చిరి. నాటి వాఙ్మయము భక్తిభావపూరితమై యున్నది. వీరికి సంస్కృతమునందు ప్రత్యేకాభిమానము గలదు. పురుషోత్తమ గజపతి స్వయముగా పండితకవి, కవి పండిత పోషకుడు; అభినవ గీతగోవిందము, ఆగమ కల్పతరువు, నామమాలిక, గోపాలార్చనావిధి, హోరావళి, త్రికాండ శేషము, పద్యావళి మొదలగు గ్రంథములు

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



రచించినట్లు తెలియుచున్నది. ఈగ్రంథము లన్నియు నేటికి నముద్రితములు. ఇతని కుమారుడైన ప్రతాపరుద్రుడు విద్యలలో సాటిలేని కమలభవుడట. ఇతడు కౌతుక చింతామణి, నిర్ణయ సంగ్రహ, ప్రౌఢ ప్రతాప మార్తాండ, సరస్వతీ విలాసాద్యనేక గ్రంథములకు కర్త. కృష్ణదేవరాయల వలెనే విద్వత్సభల నేర్పరచి కవులను, పండితులను పోషించెడివాడట. ప్రతాపరుద్రుని యాస్థానమందలి విద్వాంసులలో నవ్యన్యాయ విశారదుడైన వాసుదేవ సార్వభౌమ భట్టాచార్యులవారు కడు సుప్రసిద్ధులు. వీరు తత్త్వచింతామణికి, లక్ష్మీధరుని అద్వైత మకరందమునకు రచించిన వ్యాఖ్యలు ప్రసిద్ధములు. సౌందర్యలహరీ వ్యాఖ్యాత లొల్ల లక్ష్మీధరుడును, న్యాయ విశారదుడైన వాహినీపతియు, భక్తి భాగవత మహాకావ్య రచయిత జీవ దేవాచార్యులును, ప్రతాపరుద్రుని సామంతుడై రాజమహేంద్రవర ప్రాంతమును పాలించి జగన్నాథవల్లభ నాటకమును పండితలోకమున కర్పించిన రామానందరాయలును గజపతి యాస్థానమును అలంకరించిన విద్వాంసులే.

గజపతులు సంస్కృతముతోపాటు ఓఢ్రము నాదరించి ఓఢ్రవాఙ్మయాభివృద్ధి కెంతయో సేవ యొనర్చినారు. గజపతి రాజులనాటి ఓఢ్ర వాఙ్మయము వైష్ణవమత ప్రాబల్యమున చాల ప్రసిద్ధికెక్కినది. భక్తిభావమును ప్రకటించు చైతన్యాది మతములు సంస్కృతమున కన్న దేశభాషలకే ఎక్కువ ప్రాధాన్య మిచ్చి దేశికవితకు పునాదు లేర్పరచినవి. గజపతులనాటి కళింగోత్కలములలో సంస్కృతమే రాజభాష. ఓఢ్రమునకు పండితలోకమున స్థానము లేదు. క్రీ. శ. 1450 కి పూర్వము కేశవకోయిలవంటి గ్రంథము ఒక్కటి తప్ప అన్యములు లేవు. గజపతుల పరిపాలన కాలములో చైతన్యదేవుడు వారి రాజ్యమునకు విచ్చేసి పూరీక్షేత్రమున నివసించుచు తన భక్తి మార్గమును దేశభాషలలో బోధించినందున ఓఢ్ర భాష కొక విశిష్టస్థాన మేర్పడినది. తక్కిన భాషలలోవలెనే ఓఢ్రమునగూడ ఆది గ్రంథములు సంస్కృత పురాణములు, అందును ముఖ్యముగ రామాయణ, మహాభారతములకు అనువాదములు. గజపతులనాటి ఓఢ్ర కవీశ్వరులలో ఓఢ్ర మహాభారత కర్తయైన సరళదాసు, అర్జునగీత, భేదపరిక్రమాది గ్రంథకర్త బలరామదాసు, జగన్నాథ చరితామృత కర్త జగన్నాథదాసు, సూర్య సంహితాకారుడైన అచ్యుతానందదాసు ప్రభృతులు ప్రసిద్ధులు.

గజపతులు సుమారు 120 సంవత్సరముల కాల మాంధ్ర దేశమును పాలించినారు; కాని, తెలుగుభాష నెక్కువగా పోషించినట్లు కనబడదు. వీరు రెడ్డిరాజ్యమును జయించిన కాలముననే కవిసార్వభౌముడైన శ్రీనాథుడు కొండవీటి దుర్గాధిపతులైన గజపతి సేనాధిపతుల కతిపయులకు గురియైనాడు. గజపతులు స్వయముగ ఆంధ్రభాష నాదరింపకపోయినను వారి సామంతులలో కొందరు విద్వత్సభలను నెలకొల్పి పండితులను, కవులను పోషించిరి. వీరిలో ఉదయగిరి దుర్గాధిపతియగు (పూసపాటి) బసవ భూపాలుడు కడు ప్రసిద్ధుడు. తెలుగు పంచతంత్రమును రచించిన దూబగుంట నారాయణకవి నాసికేతోపాఖ్యానకర్త దగ్గుపల్లి దుగ్గన, నంది మల్లయ్య, ఘంట సింగయ్య ప్రభృతులు వీరి రాజ్యమున విలసిల్లి ఆంధ్ర సరస్వతికి మెరుగులు దిద్దినవారే.

చైతన్యదేవుని ఆగమనమున పవిత్రమైనది గజపతి రాజ్యము. భక్తిప్రభావమును సంకీర్తనలద్వారా లోకమున కందించి ఆ మహనీయుడు ఉత్కలదేశమున నిల్పి ప్రతాపరుద్ర మహారాజునేకాక పెక్కు సామంతరాజులను, పండితులను భాగవతులను చేసి ఉద్ధరించెను. కులభేదమును నిరసించిన చైతన్యుని మతము దేశమున నలుమూలలకు వ్యాపించి ప్రజలలో ఒక నూతన చైతన్యమును గలిగించినది; ప్రజానీకమున భక్తిభావములను పెంపొందించినది. గజపతులు వైదికమత సంప్రదాయములను బద్ధకంకణులై కాపాడి పోషించిరి. రా. సు.

## ముసునూరి వంశపాలనము

క్రీ. శ. 1323 లో కాకతీయుల ఓరుగంటిదుర్గము ముస్లిము వాహిని ధాటికి కూలిపోయినది. ఓరుగల్లు పడిపోయిన తరువాత ముస్లిము సైన్యములు మిగిలిన తెలుగు దేశమును జయించుటకు మొదలిడినవి. ఆరునెలల ముట్టడి అనంతరము కొండపల్లిదుర్గము మహమ్మదీయులకు స్వాధీనమయినది. సముద్రతీరస్థాంధ్రమునందలి నెల్లూరు, కొండవీడు, కొలనువీడు, నిడదవోలు, రాజమహేంద్రవరము దుర్గములు అచిరకాలముననే ముస్లిము సేనలకు వశమయినవి. తెలుగుదేశమే కాక 'నిలావర్' (నెల్లూరు) మొదలుకొని 'కులమ్' (క్విలన్) వరకు వ్యాపించిన 'మబార్' దేశముకూడ క్రీ. శ. 1323 లోనే జయింపబడినట్లు క్రీస్తు శకము పదునాలుగవ శతాబ్దమునాటి వస్సాఫ్ అను ముస్లిము చరిత్రకారుడు తెలుపుచున్నాడు. తమిళదేశమునందలి మధుర ప్రాంతము ఆ సంవత్సరముననే ముస్లిముల చేత జయింపబడినట్లు పాండ్యదేశ వృత్తాంతమువలన గూడ తెలియుచున్నది. ఈరీతిని 'మబార్' ఢిల్లీ సామ్రాజ్యమునందలి రాష్ట్రములలో ఒకటియైనది. దీనిని ఢిల్లీ సామ్రాజ్యములో చేర్చినపిదప జలాలుద్దీన్ హసన్ షా దానికి అధిపతిగా నియమితుడయ్యెను. ఇతనికి మధుర రాజధాని.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



రాజమహేంద్రవరమును జయించిన అనంతరము ఉలుఫ్ ఖాను జాజ్‌నగరుపై దండెత్తివెళ్లి నలువది యేనుగులను గొనివచ్చినట్లు మహమ్మదీయ చరిత్రకారులు చెప్పుదురు. జాజ్‌నగరులో డెబ్బది గొప్పనగరము లుండె ననియు, అవి యన్నియు సముద్రతీరముననే యుండె ననియు, ముత్య ములవలన, వేరువేరు రకముల వస్త్రములవలన, సుగంధ ద్రవ్యములవలన, తైలములవలన జాజ్‌నగరు దేశాధిపతికి ఎక్కువ ఆదాయము వచ్చుచుండె ననియు వారు వ్రాసి యున్నారు. జాజ్‌నగరువేకాక తొమ్మండ్రు రాజులకు స్థానమైన లఖ్నోతి రాష్ట్రమునుకూడ ఉలుఫ్ ఖాను జయించినట్లు ముబారక్-అల్-అగ్‌బాతి అను ముస్లిము చరిత్రకారుడు తన మసాలిక్-ఉల్-అబ్సార్ అను గ్రంథములో వ్రాసినట్లు తెలియుచున్నది. షిరాజ్-అల్-దీన అబుల్ ఫట్ ఉమర్ అను మరియొక ముస్లిము చరిత్ర కారుని ప్రకారము ఢిల్లీ సామ్రాజ్యములోని 23 రాష్ట్రము లలో జాజ్‌నగరు ఒకటి. ఇందరు ఇన్ని విధముల వ్రాసి నను కళింగోత్కల (జాజ్‌నగరు) సామ్రాజ్యము ఢిల్లీ తుఘ్లుక్ సుల్తానుల అధికారమునకు లోబడియుండినట్లు కాని, ఉలుఫ్ ఖాను జాజ్‌నగరును పూర్తిగ జయించినట్లు కాని తెలుపు నికరమైన ప్రమాణ మేదియు లేదు. కళిం గము అర్వాచీన గాంగ నృపతుల స్వతంత్ర పరిపాలన క్రిందనే యుండెను (చూడుడు: అర్వాచీనగాంగవంశము). కళింగము తప్ప తెలుగుదేశమంతయు ఉలుఫ్ ఖాను అధి కారముక్రిందికి వచ్చెను. తెలుగుదేశము ఢిల్లీ తుఘ్లుక్ సామ్రాజ్యములోని భాగమయ్యెనది.

జయించిన దేశము నంతను ఒక క్రమపద్ధతిలోనికి తెచ్చి, పరిపాలన విధానమును కట్టుదిట్టము చేయుటకు ఉలుఫ్ ఖాను కొంతకాలము తెలుగుదేశముననే యుండెను. ఓరుగంటి నగరమునకు ఆ పేరు తీసివేసి సుల్తాన్‌పూరని మారుపేరు పెట్టెను. తెలుగుదేశములోని ముఖ్య నగర ములలోను, దుర్గములలోను ముస్లిము సైన్యముల నుంచి పరిపాలనము నిమిత్తము మలిఖులను, అమీరులను నియ మించెను. ఢిల్లీ సుల్తాను ఘియాజుద్దీన్ తుఘ్లుక్ బంగాళ దేశములోని లఖ్నోతిపై దండెత్తి వెళ్లునపుడు తన కుమా రుడు ఉలుఫ్ ఖానును ఢిల్లీకి రావలసినదని వర్తమాన మంపెను. ఢిల్లీకి ప్రయాణమై వెళ్లునపుడు ఉలుఫ్ ఖాను తెలుగుదేశము నంతను దేవగిరి అనబడు దౌలతాబాదులో నుండిన వజీరు మలిక్ బుర్హానుద్దీన్ అధికారముక్రింద ఉంచెను. ఈ వజీరుకు లోబడి తెలుగు పరిపాలనము సరి చూచుటకు ఓరుగంటిలో ఒక యధికారి నియమితు డయ్యెను. ఈ విధమున తెలుగుదేశ మంతయు ఢిల్లీ సుల్తా నుల సైనిక పరిపాలనము క్రిందికి వచ్చినది. తెలుగుదేశ మొక్కటే కాదు, తుదకు ద్వారసముద్రపు హొయిసల బల్లాళ రాజ్యము, కంపిలి రాజ్యముకూడ తుఘ్లుక్ సుల్తా నుల అధికారముక్రిందికి వచ్చినవి. వింధ్యకు దక్షిణమున ఉన్న దేశ మంతయు ఢిల్లీ సామ్రాజ్యమున చేరిపోయినది ఈ తుఘ్లుక్ సుల్తానుల పరిపాలనక్రిందనే; ఉలుఫ్ ఖాను తన తండ్రి యనంతరము మహమ్మద్ బిన్ తుఘ్లుక్ అను పేరుతో సింహాసన మెక్కిన తరువాతనే అతని యధికార మును మహారాజులుకూడ ధిక్కరింప లేకపోయిరి.

తెలుగుదేశము ముస్లిముల ఏలుబడి క్రిందికి వచ్చుటకు అదియే మొదటి తడవ. విజయగర్వోద్ధతులైన ముస్లిముల పరిపాలనలో తెలుగుదేశము అట్టుడికినట్లుడికి పోయినది. ముస్లిముల పరిపాలన మెంత దుష్టముగను, క్రూరముగను ఉండెనో ఆ కాలమునాటిదే యగు విలస తామ్రశాసన మిట్లు వర్ణించుచున్నది.

'ప్రతాపరుద్రుడను భానుడు అంతర్హితుడు కాగా లోక మున తురుష్కాంధకారము వ్యాపించినది. ప్రతాపరుద్ర భూధవునివలన నిరాకృతమైన అధర్మము శత్రువులైన యవనులను పొందియుండ వలయును. అట్లు కానిచో అది యవనులతోపాటుగా నిర్బాధముగా విజృంభించుట ఎట్లు పొసగును? దేశము యవనాక్రాంత మైనపిదప ధనికులు అనేక పాపోపాయములచేత ధనము నిమిత్తము పీడింప బడినారు. పారసీకులను (తురకలను) చూచీ చూచుట తోనే కొందరు తమ ప్రాణములను వదలినారు. ద్విజులు తమ యజ్ఞకర్మలను వదలుకొనవలసినవారైరి. దేవప్రతి మలు సమస్తము భగ్నము లైపోయినవి. చిరకాలముగ మహాపండిత భుక్తము లగుచున్న అగ్రహారము లన్నియు (ముస్లిములచేత) అపహృతము లైనవి. పాపులైన యవ నులు వ్యవసాయము చేసినందువలని పంట పర్యాయము లను బలాత్కారముగ లాగుకొనుటచేత దరిద్రులు, ధనికులు అను భేదములేక రైతుకుటుంబము లన్నియు నాశనమయిపోయినవి. ఆ మహావిపత్కాలమున విత్తము, భార్య మొదలగు వేనియందును ప్రజలకు స్వాయత్తతా భావము (ఇది నాది అనుభావము) పోయినది. కల్లు త్రాగవలెను; ఆవుమాంసము తినవలెను; బ్రాహ్మణులను చంపవలెను - ఇది యవనాధముల వృత్తి. వారి వ్యాపా రము ఇట్లుండినపుడు ఇంక భూమిమీద ప్రాణిలోకము బ్రతుకు టెట్లు? ఈ విధముగా రాక్షసులవంటి తురుష్కుల వలన పీడింపబడిన త్రిలింగదేశము రక్షించువా రెవరును మనస్సుకుకూడ తట్టక కార్చిచ్చు చుట్టుకొన్న అడవివలె సంతపించిపోయినది (పంక్తులు 28-30).'

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



'ఆంధ్రావనీచక్రము యవనులచేత అపహృతమైనపుడు సర్వజనులు అధర్మకర్మ నిరతులయినా'రని ఆకాలము నాటిదే మరొకశాసనము తెలుపుచున్నది. ఇట్లే గంగాదేవి విరచితమైన కంపరాయ విజయమను నామాంతరముగల మధురావిజయము కూడ ముస్లిము పరిపాలనలో దేశస్థితిని విస్తరించి వర్ణించి యున్నది.

మహమ్మదీయుల ప్రథమ పరిపాలనము ఆంధ్రదేశమున ఎట్లుండెనో తెలుపుటకు పైనిచ్చిన పంక్తులే చాలును. వారు దేవాలయములను విధ్వంసముచేసి దేవప్రతిమలను పగులగొట్టి ఆ దేవాలయస్థానములందు మసీదులు కట్టించిరి. సముద్రతీరస్థ ఆంధ్రదేశమునందలి ఇట్టి మసీదులలో రాజమహేంద్రవరములోని పెద్దమసీదు అతిప్రాచీనమైనది. ఇది మొదట పూర్వచాళుక్య రాజులకాలములో నిర్మితమైన వేణుగోపాలస్వామి ఆలయము. ఉలుఘ్ ఖాను రాజమహేంద్రవరమును జయించినపిదప ఆ హిందూ దేవాలయమును పడగొట్టి ఘియాజుద్దీన్ తుఘ్లుక్ రాజ్యము చేయుచుండగా ఉలుఘ్ ఖాను భటుడు....సాలార్ (?) ఉల్వీ హిజిరా 724 లో రమజాన్ మాసమున 20వ దినమునందు (సోమవారము, 10వ సెప్టెంబరు, క్రీ. శ. 1824) ఆ మసీదును కట్టించెను. ఈ విధముగానే ఏలూరు, కొండపల్లి మున్నగు చోట్ల కూడ హిందూదేవాలయములు కూలద్రోయబడి వానిస్థానమున మసీదులు నిర్మితమైనవి.

కాకతి ప్రతాపరుద్రుని సేనానులు, రాజకీయోద్యోగులు మొదలైనవారు ఓరుగంటియుద్ధములోను, ముస్లిము దండయాత్రలలోను చాలమంది - దాదాపుగా అందరును మరణించిరి. శాసనములవలనను, వాఙ్మయమువలనను ప్రతాపరుద్రుని కాలమునాటివారుగా తెలియవచ్చినవారు - ముఖ్యులు మువ్వురు మాత్రమే - బెండపూడి అన్న మంత్రి, కొలని రుద్రదేవుడను ప్రతాపరుద్రుడు, రేచెర్ల సింగమనేడను సింగమనాయకుడును. అన్నమంత్రి కాకతి ప్రతాపరుద్రుని గజసాహిణి. కొలని ప్రతాపరుద్రుని శాసనములు క్రీ. శ. 1828కు పూర్వము కానరాలేదు. కాని, శివయోగసారమను గ్రంథమువలన ఇతడు ఓరుగంటి ప్రతాపరుద్రుని కాలమున డెబ్బదిరెండు దుర్గములకు నాయకుడనియు, ప్రతాపరుద్రుని కాంచీపుర దండయాత్రలో పాల్గొని పంచపాండ్యులను ఓడించె ననియు, 'కాకతీశుడు మెచ్చ కలుకోట వెసగాచి యవనేశులను దునిమె'ననియు తెలియుచుండుటచేత ఇతడు కాకతి ప్రతాపరుద్రుని రాజ్యకాలమున ఉండినట్లేకాక, మహమ్మదీయులతోడి యుద్ధములలో కూడ పాల్గొనినట్లు ఊహింపవచ్చును. కాకతి ప్రతాపరుద్రునికి ధర్మముగా చేసిన దానమును తెలుపు ఇతని శాసన మొకటి క్షయ సంవత్సరమునాటిది సంతమాగులూరులో కానవచ్చినది. క్షయ సంవత్సరమునకు సరియైన శకవర్షము 1248 (క్రీ. శ. 1826). ఇందువలన ఇతడు ఓరుగంటి యుద్ధానంతరము జీవించియుండినట్లు స్పష్టమగుచున్నది. రేచెర్ల సింగమనేడు తన తండ్రి ఎరదాచానేనితో ప్రతాపరుద్రుని కాంచీపుర దండయాత్రలో పాల్గొన్నవాడే. ఇతడుకూడ ఓరుగంటి యుద్ధానంతరము జీవించియుండిన కాకతీయ సేనానులలో ఒకడు. ఇట్టివారింకను పదొర్దిమందియో ఉండిన నుండవచ్చును. వీరందరు దేశములోని మహాసామంత మండలిక వంశజులను కూడగట్టుకొని దుర్భరమైన ముస్లిము పరిపాలనలో క్రుంగిపోవుచుండిన దేశమును ఉద్ధరించుట ఎట్లని మంతనము లారంభించిరి. అందరికిని దేశమును పారతంత్ర్యమునుండి విడిపించుటయే ఏకైకలక్ష్య మైనది. ప్రాచీన రాజవంశములన్నియు ముస్లిమువాహినికి కొట్టుకొని పోయినవి; ప్రాచీనరాజ్యములు ముస్లిము దండయాత్రల ధాటికి పడిపోయినవి. ఇంక స్వాతంత్ర్యోద్యమమును నడపి హిందూ రాజ్యమును పునరుద్ధరింపవలసిన బాధ్యత దేశనాయకులపైబడినది. బెండపూడి అన్నమంత్రి, కొలని రుద్రదేవుడు మొదలైనవారు ప్రాయికముగా సలహాలు చెప్పి కార్యవిధానమును ఉపదేశింపగా స్వాతంత్ర్యోద్యమమునకు యువకులు నాయకత్వమును వహించిరి. పెద్దల సలహాచొప్పుననే కావచ్చును తెలుగు నాయకు లందరు ముసునూరి ప్రోలయనాయకుని తమ యధ్యక్షునిగ ఎన్నుకొని అతని చెప్పుచేతలలో పనిచేయుటకు అంగీకరించిరి. ఈ విధానమును పదేశించి బెండపూడి అన్నమంత్రి కృతకృత్యుడయ్యెను. మొత్తము మీద ముసునూరి ప్రోలయనాయకునికి తెలుగుదేశపు నాయకులే కాక బెండపూడి అన్నమంత్రియు, కొలని రుద్రదేవుడును, రేచెర్ల సింగమనేడును కూడ వశవర్తులై చరించి స్వాతంత్ర్యోద్యమమును ఉద్ధతితో కొనసాగించి హిందూధర్మమును, హిందూరాజ్యమును సముద్ధరించుటకు దీక్ష వహించిరి. ఈ విధముగా తెలుగు నాయకు లందరు ఏకైకలక్ష్యముతో ఒక్క త్రాటిమీద నిలబడిరి.

**ముసునూరి ప్రోలయనాయకుడు** (క్రీ. శ. 1825 - క్రీ. శ. 1888) : ఇతడు వేంగీ విషయ నివాసియైన పరాక్రమవంతుడగు పోచినాయకుని కుమారుడు, ధర్మరతుడు, వీరుడు, కడుసాహసికుడు. ఇతనికి దేవ, కామ, రాజనాయకులని మూవురు పినతండ్రు లుండిరి; ఎరపోతనాయకుడని ఒక అనుజు డుండెను. దేవనాయకునికి కాపానేడు, ముమ్మడినాయకుడు అని యిరువురు తనయులు. కామానాయకునికి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



దేవనాయకుడని ఒక కుమారుడు. రాజనాయకునికి అనపోతనాయకు డను పుత్రుడు కలడు. ఈ ప్రోలయనాయకునికి పినతండ్రికుమారు లందరును చేదోడు వాదోడుగా నుండి అతడు చెప్పినచొప్పున వర్తించిరి. వీ రందరిలో కాపానేడను కాపయనాయకుడు ప్రోలయ నాయకునికి కుడిభుజమే. కాకతి ప్రతాపరుద్రుని సేవించిన డెబ్బదియైదుగురు నాయకుల సంతతివారును ముసునూరి ప్రోలయ నాయకునితో సహకరించిరి. అందు ముఖ్యముగా అద్దంకి వేమారెడ్డి, కొప్పుల ప్రోలయ నాయకుడు, రేచెర్ల సింగమ నాయకుడు, మంచికొండ గణపతినాయకుడు, ఉండి వేంగభూపతి మనకు తెలిసినవారు. ఈ తెలుగునాయకు లందరును కలసి పారతంత్ర్య విమోచనమునకై నడుముకట్టి పనిచేసిరి. వీ రందరు ఏయేప్రయత్నములు చేసిరో, తమ లక్ష్యసాధనకు ఏవిధానము నవలంబించిరో తెలియదు. వీరు మందిని కూడగట్టుకొని ముస్లిముసేనలపై ఎక్కడికక్కడే తిరుగబాటు కావించియుండవలెను; వేరు వేరు స్థలము లందు ఎన్నియో యుద్ధములు జరగియుండవలెను; తెలుగు నాయకుల సాహస పరాక్రమములను వివరించు ఈ స్వాతంత్ర్య సమరవృత్తాంత మేదియు ఇంతవరకు లభింప లేదు. కాని, ప్రోలయ నాయకుడు వేంగభూపతితోకూడ యుద్ధమున తురుష్కుల తురగ సమూహమును సమస్తము హతము కావించి వేంగీ విషయమును వదలిపెట్టి పర్వత శతాక్రాంతమైన వనదుర్గమునకు వెళ్లినట్లును, అటుపిదప ఆదివరాహమువలెనే వారు మరల ప్రలయవారిధినుండి ఆంధ్రమండలమును తీసికొనినట్లును మాత్రము తెలియుచున్నది. ఈ సమరములో అఖిలయవన వాహినీ నాథులను హత మొనర్చి వేంగనృపతి దివంగతుడయ్యెను. మొత్తముమీద మధ్యాంధ్రదేశము (సముద్రతీరస్థాంధ్రము) మూడు నాలు గేండ్లలోపుననే పారతంత్ర్యమునుండి విముక్తి పొందినట్లు శాసనములవలన తెలియుచున్నది. ఈ విషయమును తెలుపు మొదటి శాసనము అద్దంకి వేమారెడ్డిది. ఇది గుంటూరు జిల్లా ఒంగోలు తాలూకా మల్లవరములో ఉన్నది. ప్రోలయరెడ్డి కుమారుడైన వేమారెడ్డి శకవర్షము 1247 ఆశ్వయుజ బహుళ అమావాస్య సూర్యగ్రహణ కాలమునందు (క్రీ. శ. 1325, అక్టోబరు 7వ తేదీ) మల్లవరములోని రాఘవదేవునికి కొంతభూమి దానముచేసెను. ఈ శాసనమున వేమారెడ్డి మ్లేచ్ఛాబ్ధి కుంభోద్భవుడని ప్రస్తుతుడైనాడు. స్వాతంత్ర్యయుద్ధమున తెలుగునాయకుల కప్పటికే విజయమారంభమైనట్లు నిస్సంశయముగా చెప్పవచ్చును. బంగాళదేశపు దండయాత్రనుండి తిరిగి వచ్చిన పిదప ఘియాజుద్దీన్ తుఘ్లుక్ హిజరా 725 లో రబీలవల్ మాసమున (క్రీ. శ. 1325, ఫిబ్రవరి - మార్చి) మృతినొందుటయు, అతని కుమారుడు ఉలుఘ్ ఖాను మహమ్మదు బిన్ తుఘ్లుక్ అనుపేరుతో ఢిల్లీ సింహాసనము నధిష్ఠించుటయు జరగినది. ప్రాయికముగా తెలుగు నాయకులు ఈ యవకాశమును దీసికొని ముసునూరి ప్రోలయ నాయకుని నాయకత్వమున విజృంభించియుందురు. ముస్లిము సేనానులు కొందరైనను ఢిల్లీ వెళ్లియుండవచ్చును. మిగిలినవారు మహమ్మదు బిన్ తుఘ్లుక్ పట్టాభిషేక మహోత్సవము వేడుకలలోను, వినోదములలోను నిమగ్నులైయుండ తెలుగు నాయకులు అదియే తగిన తరుణమని ముస్లిములపై విజృంభించి విజయము చేకొనియుందురు. స్వాతంత్ర్యోద్యమయుద్ధమునకును, హిందూరాజ్య పునరుద్ధరణమునకును సంబంధించిన వివరములు ఏవియు తెలియవు. హిందువుల విజయమునకు తార్కాణముగ చూపదగిన మరియొకశాసనము ఇదివరలో నుడివిన క్షయ (శకవర్షము 1248 - క్రీ. శ. 1326 ఏప్రిల్) సంవత్సరము నాటి కొలని రుద్రదేవుని సంతమాగులూరు శాసనము. ఈ శాసనకాలమునాటికి మధ్యాంధ్రదేశము పారతంత్ర్య విముక్త మయినదనవచ్చును. ఇంకను తేదీలు లేని మరి కొన్ని శాసనము లున్నవి; కాని, వానివలన ప్రయోజనము లేదు. మొత్తముమీద, సముద్రతీరస్థాంధ్రము చాలవరకు శకవర్షములు 1247, 1248 లలో (క్రీ. శ. 1325, ఫిబ్రవరి - మార్చి, క్రీ. శ. 1326 ఏప్రిల్ మాసముల మధ్య) మహమ్మదీయాధికార దాస్యశృంఖలములను ఛేదించుకొని పారతంత్ర్య విముక్తి పొందినదని చెప్పవచ్చును. ఈ విషయమునే తెలుగుదేశములో ఏలూరుప్రాంతమున దొరకిన తుఘ్లుకు నాణెములుకూడ ధ్రువపరచుచున్నవి. హిజిరా 726 (క్రీ. శ. 1326) కు తరువాత ముద్రితములైనవి తెలుగు దేశమున కానరాకపోవుటచేత ఈ సముద్రతీరప్రాంతము అంతవరకే మహమ్మదు బిన్ తుఘ్లుక్ పరిపాలనలో నుండినట్లు విశదమగుచున్నది. ఈ స్వాతంత్ర్యసమరములో ముసునూరి ప్రోలయనాయకునికి లోబడి ఎండపూడి అన్నమంత్రియు, కొలని రుద్రదేవుడునుకూడ పనిచేసి రనుటకు అవకాశ మున్నది. ఈ విజయములు లభించినపిదప కొలని ప్రతాపరుద్రుడు అన్నమంత్రికి పడుమటి గోదావరిజిల్లా ఏలూరు తాలూకాలోని ఆరేడు గ్రామమును అగ్రహారము చేసి సూర్యగ్రహణ సమయమున దానముచేసెను. ప్రాయికముగా ఇది సంతమాగులూరు శాసనములో ఉదాహృతమైన సూర్యగ్రహణసమయమే అగునేమో తెలియదు. మధ్యాంధ్రదేశమును పారతంత్ర్య విముక్తము కావించి దానికి ముసునూరి ప్రోలయ నాయకుని అధ్యక్షుని



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కావించుటచేతనే బెండపూడి అన్నమంత్రికి 'ఆంధ్ర భూమండలాధ్యక్ష సింహాసన సంప్రతిష్ఠాపనాచార్య' డన్న బిరుదము వచ్చినట్లు ఎంచవచ్చును. క్షయసంవత్సరాంతమునకు మధ్యాంధ్రభూమిని ముస్లిం అధికారము సంక్షయమై ప్రభవ (శకవర్షము 1249) లో హిందూధర్మము పారాడదొడగినది. అందువలననే హిందూధర్మమును పునరుద్ధరించి దేశమును సంరక్షించిన ముసునూరి ప్రోలయ నాయకుడు విలస తామ్రశాసనమున ఇట్లు పరికీర్తితుడయినాడు :

'యవనులు పెట్టుచున్న ఈవిధమైన (ఇదివరలో నుడివిన) బాధలను చూచి దయార్ద్రహృదయుడైన భగవంతుడు విష్ణువు తన అంశతో అవతరించినట్లు (ముసునూరి) ప్రోలమహీపతి అవతరించి భూభారమును వహించెను. పురాణపురుషుని పదములయందు కలికాలమున శ్రేష్ఠమైనదని ఎన్నికగాంచిన వర్ణము పుట్టినది. ఆ వర్ణమున ముసునూరి వంశము ప్రశస్తమయినది. ముసునూరి కులోజుడైన ఆ ప్రోలభూపతి విశృంఖలమును, విశ్వమునకు జీవనాధారమునైన తన బాహుబలముచేత ఆవిధమైన యవనుల యాధిపత్యమును నాశనముచేసెను. ఆ యవనాధములకు అతనిపేరు ఉచ్చాటన కర్మకారియైన మంత్రమా ఏమి? ఏలన, ఆపేరుచ్చరించిన మాత్రమున ఆదీనులు దుర్గములు విడిచిపెట్టి ఎక్కడికో పారిపోయెడివారు. యవనులచేత బాధితులైన ప్రజలు మనువువంటి ఆప్రోలభూపతినే నీటిమడుగులను నిదాఘార్తులవలెనే ఆశ్రయించినారు. తురుష్కులచేత భయంకరముగ పీడింపబడినవారే వారిని (తురుష్కులను) చంపివేసిరి. ఆశ్రయబలము గొప్పది కదా!'

ముసునూరి-ప్రోలయ నాయకునికి మధ్యాంధ్రదేశమును పారతంత్ర్యవిముక్తము కావించినంత మాత్రమున సంతృప్తి కలుగలేదు. యావదాంధ్రదేశమును అతని లక్ష్యము. తూర్పుకనుమలకు ఎగువనున్న తెలంగాణాకూడ పారతంత్ర్యవిముక్తము కావలెను. మహమ్మదు బిన్ తుఘ్లుకు చండశాసనుడు; వీరాధివీరుడు; క్రూరుడు. అతడు మరల బలములను కూర్చుకొని ఎప్పుడు దేశముమీద వచ్చిపడునో తెలియదు. అందువలన ప్రోలయ నాయకుడు తన్ను మధ్యాంధ్రదేశమును కాపాడుకొనుటకును, తెలంగాణాలో మహమ్మదీయులమీద తిరుగబాటు లేపి, దానిని పారతంత్ర్యమునుండి విముక్తము కావించుటకును గోదావరితీరమున మాల్యవంతమునకు సమీపమున ఉన్న రేకపల్లిని (తూర్పు గోదావరిజిల్లా భద్రాచలం తాలూకాలోనిది) రాజధాని కావించుకొనెను. మధ్యాంధ్రదేశము విముక్తమయినదనగనే తెలంగాణానుండి బ్రాహ్మణ విద్వత్కుటుంబములు అనేకము సముద్రతీరస్థాంధ్రమునకు వలస వచ్చి ఇచ్చటి తెలుగు నాయకులను ఆశ్రయించినవి. ఈకాలమున ప్రోలయ నాయకుడు చేసిన ఘనకార్యములును, అతని పరిపాలనమును విలస తామ్రశాసనము ఇట్లు అభివర్ణించుచున్నది :

'బలవంతుడైన ప్రోలభూపతి ఈవిధముగ ప్రబలులైన యవనులను జయించి, ఆపత్కాలమున నష్టమైన ధర్మమును మరల ఉద్ధరించెను. అతడు పూర్వము మనుజేంద్రవరులచేత నొసంగబడి, పాపచారులైన యవనులచేత అపహృతములైన అగ్రహారములను వానిని పూర్వ మనుభవించుచుండిన బ్రాహ్మణులకే ఇచ్చివేసెను; నిలిచిపోయిన యజ్ఞములను హవిర్ధూమ పరంపరలతో మరల ప్రవర్తింపజేసి తురుష్క సంచారముచేత పాపసంకలితములైన ఆంధ్రప్రదేశములను పుణ్యాపదములు కావించెను. ఋషీశ్వరులు తమ తపఃఫలములోని ఆరవభాగమును మహీధవునికి సమర్పించు విధమున వ్యవసాయకులు తమ కృషి ఫలములో ఆరవభాగమును సంతోషపూర్వకముగ ఈ ప్రోలమహీపతికి ఇచ్చుచుండిరి. పారసీకులు (తురుష్కులు) అంతకుపూర్వము పాడొనరించిపోయిన దానినెల్ల బలవంతుడైన ఆప్రోల భూవరుడు చక్కబరచెను. యవనేంద్రుల ఘోరదౌష్ట్యమునుండి విముక్తిచెంది బలవంతుడైన ప్రోలమహీపతిచేత ధరింపబడినదై భూమి (సర్వంసహా) అతడు చేసిన పుణ్యోపచార విధులచేత సంతుష్టినొంది పూర్వనృపతులను మరచిపోయి, ఇతరదృష్టి విడిచి అతనియందే సుస్థితిభావమును పొందెను.'

పై వాక్యములవలన ముసునూరి ప్రోలయ నాయకుని ఘనత ఎట్టిదో విశదమగుచున్నది. పాడయిపోయిన దేశమును చక్కదిద్ది, హిందూధర్మమును పునరుద్ధరింపవలసిన బాధ్యత అతనిపై బడినది. ఈబాధ్యతను నిర్వహించి అతడు శౌర్యవంతులు, నయోపపన్నులు అయిన తన తమ్ములు కాపయనాయకుడు మొదలైనవారి భుజములమీద రాజ్యభారమును మోపి ధర్మార్జనతత్పరుడయ్యెను. కలికాలమున దానము గొప్ప ధర్మమని తెలిసికొని అతడు మహీసురులకు అనేకాగ్రహారములను ఇచ్చెను; అనేక గొప్పదానములను చేసెను. సత్పాత్రు[illegible]న పండితులకు ఎక్కువ ధనమును తా నిచ్చి[illegible], ఇప్పి[illegible]యు ఎక్కువగా ఆదరించెను. విద్వద్వరులైన భూసురులకు విలసగ్రామమును అగ్రహారముచేసి యిచ్చిన విషయమును తెలుపునదే విలస తామ్రశాసనము. భారద్వాజగోత్రుడును, యజుర్వేదియు, అన్నయ కుమారుడును, గణపయ అగ్రజుడును అయిన



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వెన్నయకు మునునూరి ప్రోలయ నాయకుడు (ప్రోలా నేడు) గోదావరి ననుసరించియున్న కోనావనీ మండలమున (కోనసీమ) సారభూతమైన విలసయను గ్రామమును అగ్రహారముచేసి చంద్రగ్రహణ సమయమున ప్రోలవరమని పేరుపెట్టి ఈయగా వెన్నయ అనేక శాస్త్ర పారంగతులును, సంపూర్ణవేదాధ్యయన సంపన్నులును, సదాచార పరిపూర్ణులును, సద్వంశసంజాతులును అగు బ్రాహ్మణులకు కూడ అందు వృత్తులు కల్పించి యిచ్చెను. ప్రోలయ నాయకుడిచ్చిన అగ్రహారము ఓంకను ఉండవచ్చునుగాని ఇంతవరకు తెలియవచ్చినది ఇదియొక్కటే. ఈ దానశాసనమున సంవత్సరము తెలుపబడలేదు; కాని ఇది శకము 1250, 1254 ప్రాంతమున ఇచ్చినది కావచ్చును.

మునునూరి ప్రోలయనాయకుని శాసన మింతవరకు ఇది యొక్కటే కానవచ్చినది. ఇతడు చాల కొద్దికాలమే రాజ్యము చేసినట్లు కనబడును. ముస్లిము చరిత్రలవలన తెలంగాణాను పారతంత్ర్యమునుండి విముక్తము కావించినది కాపానేడని తెలియవచ్చుటచేత ప్రోలయ నాయకుడు తనమనోరథము సంపూర్ణముగ ఈడేరువరకు జీవించియుండలేదనియే తోచుచున్నది. ప్రోలానేనికి సంతానము లేకపోవుటచేతను, అతని తమ్ముడు ఎరపోతానేడుకూడ ప్రాయికముగా మహమ్మదీయులతోడి సంగ్రామములలో గతించుటచేతను కాపోలును అతని తరువాత అతని పినతండ్రి దేవ నాయకుని కుమారుడు కాపయ నాయకుడు రాజ్యమునకు వచ్చెను.

**మునునూరి కాపయనాయకుడు** (క్రీ.శ. 1332 — క్రీ.శ. 1367-68); ఇతడు శాసనములందు భావప్రభావోదయుడనియు, శ్లాఘ్య ప్రస్ఫుటధర్మకర్మచతురుడనియు, కాశీవిశ్వపతిప్రసాదమహిమా ప్రాప్తాఖిలప్రాభవుడనియు, ప్రతాపరుద్రప్రతిమప్రభావుడనియు వర్ణితుడైనాడు. ఇతడు తన యన్న ప్రోలయనాయకునికి కుడిభుజమై వర్తించి రాజ్యతంత్రమునను, సమరతంత్రమునను పాండిత్యమును గడించెను. తెలంగాణానుకూడ ముస్లిములబారినుండి విడిపించి అచట హిందూరాజ్యమును పునఃప్రతిష్ఠాపించుటే అతని ఏకైకలక్ష్యమయినది. ఇందునిమిత్త మీతడు ఇరుగుపొరుగులనుండిన హిందూరాజన్యులతో రాయబారములు నడపి సైన్యమును వృద్ధిచేసికొని తెలంగాణాలో రాజకియ విప్లవము రేపుటకయి తరుణమున కెదురుచూచుచుండెను.

ముహమ్మదు బిన్ తుఘ్లుక్ రాజ్యకాలములో అతని అధికారమును ధిక్కరించి ప్రజలును, అతని రాజకీయోద్యోగులును చేసిన తిరుగబాటులలో మునునూరి ప్రోలయ నాయకునిదే మొట్టమొదటిది. ఏ ముస్లిము చరిత్రకారుడును దీనిని చెప్పలేదు. ఈ తిరుగబాటు విజయవంతముగ సాగుటచూచి ధైర్యము కలిగి దక్కనులో సాగరుకు పరిపాలకుడుగను, సామ్రాజ్య సైన్యములకు అధిపతిగను ఉండిన మలిక్ బహా ఉద్దీన్ గుష్టాస్ప అనునతడు ముహమ్మద్ బిన్ తుఘ్లుక్ అధికారమును ధిక్కరించి అతనికి కప్పము పంపుట మాని, అదనుకు తగినట్లు ముందు ప్రయత్నములు తాను చేసికొని తన జాగ్రత్తలో తా నుండెను; తన రాష్ట్రములోని ఉన్నతోద్యోగులను తన పక్షమునకు త్రిప్పుకొనెను; సైన్యము నభివృద్ధి చేసికొనెను. పిదప, అతడు హిజరా 727 (క్రీ. శ. 1326-27) లో సుల్తాను ముహమ్మదు బిన్ తుఘ్లుకు సామంతులుగా ఇరుగుపొరుగుల నుండిన నాయకులపై ఎత్తివెళ్లెను. బహా ఉద్దీన్ గుష్టాస్ప రాజవిద్రోహవార్త తెలిసినవెంటనే ముహమ్మద్ బిన్ తుఘ్లుక్ గుజరాతు (ఘూర్జర) సైన్యముల నన్నిటిని ఇచ్చి ఖ్వాజా జహానును ఆ రాజద్రోహిపై పంపెను. ఖ్వాజా జహాను సైన్యములును, బహా ఉద్దీన్ గుష్టాస్ప సైన్యములును దేవగిరివద్ద సంధించినవి. అక్కడ జరగిన యుద్ధమున బహా ఉద్దీన్ పరాజయము పొంది సాగరుకు పారిపోయెను. సామ్రాజ్యబల మెక్కువగ నుండుటచేత అక్కడ నుండుటకూడ క్షేమము కాదని కంపిలి రాజ్యమునకు పారిపోయి తదధిపతి శరణుచొచ్చెను.

కంపిలి విజయనగర రాజ్యస్థాపనకు పూర్వము హంపీ ప్రాంతమున వర్ధిలిన చిన్నరాజ్యము; పర్వత పరివేష్టితమైనది. ఇందు కంపిలికాక కుమ్మట, హొసదుర్గములు కలవు. ముమ్మడి సింగణనాయకుడును, ఇతని కుమారుడు ఖండెయరాయ నామాంతరముగల కంపిలరాయలును, ఇతని తనయుడు రామనాథ ఒడయలును కంపిలిని పాలించినట్లు తెలియవచ్చిన నాయకులు. రామనాథ ఒడయనికి కుమార రాముడనిపేరు. ఈ కంపిలి పాలకులకు హొసమల నాయకులని వ్యవహారము. అలా ఉద్దీన్ ఖల్జీ సైన్యాధిపతియైన మలిక్ కాఫర్ కంపిలరాయనిపై దండెత్తి వెళ్లెను; కాని, దానిని సాధింపలేక మరలిపోయెను. అప్పటినుండి కంపిలి చిన్నదైనను స్వతంత్ర రాజ్యముగనే ఉండెను. కంపిల రాయలు ఆరంభము నుండియు ఢిల్లీ తుఘ్లుక్ సుల్తానులకు శత్రువుగనే యుండెను. కప్పము గొనుటకొరకు ఢిల్లీ సామ్రాజ్యపు ఉన్నతోద్యోగులు వెంబడించి వచ్చిన సామ్రాజ్య పల్యంకికను అతడు నాశనముచేసినట్లు చెప్పుదురు; ఓరుగల్లు పతనమైనపిదప త్రిలింగమునుండి పారిపోయివచ్చిన ఆర్తులకు శరణమిచ్చి తన యాస్థానమున నుంచుకొని రక్షించెను. కంపిలరాయడు (కంపిలదేవుడు) బహా ఉద్దీన్ గుష్టాస్పకు

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



శరణమిచ్చినప్పటినుండి కంపిలిరాజ్యమును సాధించి బహా ఉద్దీనును పట్టుకొనుటకై ఢిల్లీసామ్రాజ్యసైన్యములు ఆ రాజ్యముపై దండెత్తుచువచ్చినవి. ఈ దండయాత్రలలో కంపిలరాయని కుమారుడు రామనాథుడు చూపిన శౌర్య పరాక్రమములు అద్వితీయములు. కన్నడములోని పరదార సోదర రామన కథయు, తెలుగులోని కుమారరాముని కథయు ఈరామనాథుని శౌర్య పరాక్రమాదికృత్యముల నభివర్ణించునవే. చారిత్రకముగ చూచినచో కుమార రాముని కథకంటెను కన్నడమునందలి పరదారసోదర రామన కథ ఎక్కువ విశ్వాసపాత్రమైనది. ఈ గ్రంథము ప్రకారము కంపిలిని సాధించుటకు మహమ్మదీయులు మూడు తడవలు దండెత్తి వెళ్లిరి. కాని, మొదటి రెండు తడవలును పరాజితులై తిరిగిపోయిరి. ముహమ్మదు బిన్ తుఘ్లుక్ చిన్న హిందూరాజ్యముచేత ఓటుపడిన అవమానమును తుడిచివేసికొనుటకై మూడవ తడవ గొప్ప సేన నిచ్చి ఖ్వాజా-ఇ-జహాను కంపిలిపై పంపెను. ఈ తడవ క్రీ. శ. 1827-28 లో మహాఘోర సంగ్రామము జరగిన తరువాత కంపిలిరాజ్యము సుల్తానుసేనల వశమైనది. కంపిలి పతనమైన పిదప అక్కడికి వచ్చి రెండేండ్ల వరకు ముహమ్మదు బిన్ తుఘ్లుక్ ఆ రాజ్యమునందే యుండి ఢిల్లీకి మరలిపోవునపుడు మలిక్ నెబీని (మలిక్ నాయబ్ ముహమ్మదును) ఈ ప్రాంతమునకు అధిపతిగ నియమించిపోయెను.

ముహమ్మద్ బిన్ తుఘ్లుక్ దక్షిణదేశమునకు వచ్చుట చేత కాపయనాయకాదులు రహస్యముగ చేయు స్వరాజ్య సమర ప్రయత్నములకు కొంత ఆటంకము కలిగియుండుట సహజము. సుల్తాను ముహమ్మదు మరల ఢిల్లీకి మరలిపోవుటతో తెలుగునాయకులు మరల తమ ప్రయత్నములలో ప్రవృత్తులైరి. తెలుగుదేశమునందలి ఏప్రాంతమునందు ఉన్నను తెలుగునాయకులు ఒకరితో ఒకరు సహకరించుచు వచ్చినట్లే కాన్పించును. ఇట్టి యూహాకు కారణము అద్దంకి నివాసియైన వేమారెడ్డికిగల గుజ్జరఘట్టువిభాళ బిరుదము. ఈ బిరుదము అతనికి ఢిల్లీసుల్తాను ముహమ్మదు బిన్ తుఘ్లుక్ కంపిలిపై పంపిన సామ్రాజ్య ఘూర్జర (గుజ్జర) సైన్యములను కంపిలిరాయనికి సాహాయ్యముగ పోయి ఓడించినందువలన కలిగినదనియే ఊహింపదగి యున్నది. దేశములో సుల్తానులపై తిరుగబాటును రేపి రాజ్యవిద్వరము కలిగించుట, అతని శత్రువులతో సహకరించుట కాపానాయకుడును, అతని యనుచరులును ఆనాడు అవలంబించిన రాజనీతిగ తోచుచున్నది.

ముహమ్మదు బిన్ తుఘ్లుక్ దక్కనునుండి వెడలిపోయిన తరువాత అంతవరకు ఇండ్లు వాకిండ్లు విడిచిపెట్టి పర్వతారణ్య ప్రాంతములకు పారిపోయినవారు మరలి వచ్చి తమ గ్రామములను, పురములను మహమ్మదీయుల వశమునుండి విడిపించుటకు శపథములు చేసి తమపై మహమ్మదీయ పరిపాలకులు బలవంతముగ రుద్దిన పన్నులను చెల్లించుట మానిరి; తత్ప్రాంతాధిపతియైన ముహమ్మదుపై తిరుగబాటుచేసిరి. ఈ తిరుగబాటుకు నాయకుడు అరవీటివారి పూర్వుడైన చాళుక్యవంశజుడు సోమదేవరాజు. ఈతడు ముహమ్మదు పరిపాలనక్రింద నుండిన ప్రాంతమును జయించుటకు తలపెట్టెను. దోనూరి కోనేరునాథకవి రచించిన ద్విపదబాలభాగవతమును, అందుగుల వెంకయ్య రచించిన రామరాజీయమును ఈతని [illegible]యములను తెలుపుచున్నవి. ఈ సోమదేవరాజు 'వినుతధాటిమహావేశంబు నెరపి' ముసలిమడుగు, సాతానికోట, కందనవోలు (కర్నూలు), కల్వకొలను, రాచూరు, ఏతగిరి, గంగినేనికొండ అను ఏడు కోటలను ఒక్కదినముననే అగ్గలుపట్టి సాధించినట్లు గ్రంథములు తెలుపుచున్నవి. వీనిని పట్టుకొనుటయే కాక నాగులపాడు, ముదుగల్లు, ఆనెగొంది మొదలైనచోట్ల జరగిన యుద్ధములలో పౌరుష విక్రమములు నెరపి పోరాడి అతడు తన్నెదిరించిన వీరుల నెందరినో హతముకావించెను. ఈ కోటలు, యుద్ధము జరగిన స్థలములు అన్నియు ఇప్పటి బళ్లారి, కర్నూలు, రాయచూరు జిల్లాలలో ఉన్నవి. ఢిల్లీ సామంతులకు విధేయసామంతులుగ ఉండిన కొందరు నాయకులు సోమదేవరాజును ఎదిరించి పోరాడిరి. కాని, ప్రయోజనము లేకపోయినది. వారిలో అనేకులు హతులైరి. తుదకు, తత్ప్రాంతాధిపతి మలిక్ నాయబు ముహమ్మదుకూడ సోమదేవరాజు విజృంభణమును అరికట్టుటకు అతనిపై ఎత్తివచ్చి యుద్ధముచేసెను. కాని, తుద కతడు ఆరువేల గుర్రపుదళముతో సోమదేవరాజునకు బందిగ చిక్కెను. అతని యాధిపత్యము నంగీకరింతునని, తన బిడ్డకు అతని పేరు పెట్టుకొందును కావుమని ముహమ్మదు వేడుకొనగా తుదకు సోమదేవరాజు అతనిని విడిచిపెట్టెను. విడుదలయైనపిదప ముహమ్మదు తన కోటకు పారిపోయి ఎప్పటియట్ల సుల్తానుకు విధేయుడయ్యెను.

అరవీటి సోమదేవరాజు తిరుగబాటు చేసి విజయముల మీద విజయములు సాధించుచు కృష్ణా, తుంగభద్రానదుల అంతర్వేదిలో ఉండు కోటలను వశముచేసికొని వానికి పరిపాలకులుగ తనకు సంబంధులైన చంద్రవంశ క్షత్రియులను నియమించెను.

అరవీటి సోమదేవరాజు, కాపయ నాయకుల తిరుగబాటులకు, ఏదైన సంబంధము ఉండునో లేదో, కాపానేడి తిరుగబాటునకు ఎంతవరకు కారణభూతుడో



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తెలియదు. కాని, ఇదివరలో నుడివినట్లు ఏదో సంబంధము ఉండకపో దనుటకు అవకాశమున్నది. కాపయనాయకునికి విధేయులై అతనిని సేవించిన నాయకులలో ఒకడగు వేమారెడ్డి ఆరవీటి సోమదేవరాజునకు అతని తిరుగబాటులో తోడ్పడె ననుటకు అతడు వహించిన 'ఆనెయ మండలికరగండ,' 'రాచూరిదుర్గ విభాళ' బిరుదములే తార్కాణములు. రాచూరికోటను పట్టుకొనుటలోను, ఆనెగొంది సమరరంగమున తత్ప్రాంతపు సుల్తాను సామంతులగు మండలికులతో పోరి వారిని అణచుటలోను సోమ



చిత్రము 47. రాయచూరు (రాచూరు) కోట, రాయచూరు

దేవరాజునకు తోడ్పడిన కారణముననే వేమారెడ్డికి ఈ బిరుదములు లభించిన వనుటకు సందియము లేదు.

సుల్తాను ముహమ్మదు బిన్ తుఘ్లుక్ దక్కనునుండి వెడలిపోయిన తరువాత, అతనికి ఏటేట కప్పము కట్టుచు సామంతులుగ నుండిన ద్వారసముద్రపు హొయిసల బల్లాళ రాజులుకూడ కాపయ నాయకుని ప్రోత్సాహమున కావచ్చును, సుల్తాను అధికారమును ధిక్కరించి కర్ణాటకమున తిరుగబాటు కావించిరి. ఇది యంతయు చూచి కంపిలి ప్రాంతపాలకుడైన మలిక్ నాయబ్ ముహమ్మదు దేశము నందలి ప్రజలు తిరుగబాటు చేసి రనియు, ఈ తిరుగబాటును అణచుట తన కసాధ్యమైన దనియు, ఈ దేశీయుడే ఇక్కడికి అధిపతిగా వచ్చినచో దేశీయులలో కొంత అసంతృప్తి తగ్గి వాయి వాని కొదిగి యుండవచ్చు ననియు సుల్తానుకు వర్తమాన మంపెను. అందుమీదట సుల్తాను తన వజీర్లతో ఆలోచించి కంపిలి రాజ్యములోని హొసదుర్గమును సాధించి నపుడు బందీలుగా పట్టుకొని ఢిల్లీకి తీసికొనివచ్చిన కంపిల రాయోద్యోగులు హరిహరునికి, అతని సోదరులు బుక్క రాయాదులకు ఇస్లాముమత మిచ్చి వారిని బందినుండి విడిపించి విశ్వాసపాత్రులైన విధేయసామంతులుగ ఉండునట్లు వారిచేత ప్రమాణములు చేయించి, ఆదేశవాసులే కదా అని బల్లాళుని తిరుగబాటులను అణచి కంపిలి రాజ్యమును పరిపాలించుటకు గొప్ప సేనతో పంపెనని న్యూనిజ్ వృత్తాంత, బరని తారీఖ్-ఇ-ఫీరూజ్ షాహి, రాజకాలనిర్ణయ, విద్యారణ్యవృత్తాంత, విద్యారణ్యకాలజ్ఞాన గ్రంథములలోని విషయములను సమన్వయించి చూడగా తెలియుచున్నది. విద్యారణ్యకాలజ్ఞాన, విద్యారణ్యవృత్తాంతముల ప్రకారము ఈ హరిహరబుక్కరాయాదులు మొదట ఓరుగంటి కాకతి ప్రతాపరుద్రుని కొలువులో ఉండిరి. ఓరుగంటి కోట పతనమునకు తరువాత వారు తెలంగాణానుండి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/

పారిపోయి కంపిలరాయ, రామనాథ ఒడయల కొలువులో కుదురుకొనిరి. సుల్తాను వీరిని కర్ణాటకమున హొయిసల బల్లాళుని తిరుగబాటును అణచుటకై పంపెను. తెలుగు దేశములో ముస్లిముల అధికార మంతరింపజేయుటకును, హిందూరాజ్యసముద్ధరణమునకును జాతీయ స్వాతంత్ర్యోద్యమము తీవ్రముగ సాగుచుండిన కాల మది. హరిహరాదులు రాజ విద్రోహకారులను సంగ్రామరంగమున ఎదుర్కొనిరి కాని, వారిని నిగ్రహింపలేక పరాజితులైరి.

విజయవంతముగ సాగిన ఈ తిరుగబాటు వార్తలను ఆలకించి ఢిల్లీ సుల్తాను ప్రతినిధిగ 'మబారు' ప్రాంతమును మధుర రాజధానిగ పరిపాలించుచుండిన జలాలుద్దీన్ హసన్ కూడ సుల్తాను అధికారమును ధిక్కరించి సుల్తాను జలాలుద్దీన్ హసన్ షా అను పేరుతో క్రీ. శ. 1334-35 లో నాణెములను ముద్రించి స్వతంత్రుడై తన రాష్ట్రమును పాలింపదొడగెను. చరిత్రలో ఇతనిని, ఇతని తరువాతివారిని మధుర సుల్తానులని వ్యవహరింతురు.

జలాలుద్దీను తిరుగబాటు వార్త ముహమ్మద్ బిన్ తుఘ్లుక్ చెవిని పడినంతనే అతడు ఉగ్రుడై 'మబారు'లోని ఈ తిరుగబాటును అణచుటకు ఢిల్లీనుండి దక్కనుకు బయలుదేరి శకవర్షము 1257 (క్రీ. శ. 1335)లో ఓరుగంటికి వచ్చెను. కాని, అక్కడ మహామారి అను అంటుజాడ్యము ప్రబలముగ నుండెను. ఆ సుల్తాను స్కంధావారముననే గొప్పవారును, కొద్దివారును చాలమంది ఆ జాడ్యమువలన మరణించిరి. సుల్తానుకుకూడ ఈవ్యాధి సోకినది. కాని, అతడు ప్రాణములతో బయలుపడి, బీదరు (బెడదకోట) మార్గమున వెంటనే దౌలతాబాదుకు (దేవగిరి) పోయి చేరెను. ఓరుగంటినుండి ఎప్పుడు బయటికి పోదునా యని తహతహపడుచుండిన సుల్తానుకు సముద్రతీరస్థాంధ్రమును గురించికాని, కంపిలిని గురించికాని, మహారాష్ట్రమును గురించికాని ఆలోచించుటకే వ్యవధి లేకపోయెను. దీనికి తోడు, కాపయనాయకుని నిరంతర ప్రయత్నముల వలన తెలంగాణాలో రాజద్రోహమును, అశాంతియు ప్రబలినవి. రాజ్య విప్లవ పరిస్థితిలో త్రిలింగ మంతటి విశాలమైన దేశమును దౌలతాబాదువజీరు ఒక్కడు అదుపులో ఉంచుట అసాధ్యమని సుల్తానుకు తెలిసివచ్చినది. అందువలన, అతడు పరిపాలన సౌకర్యము నిమిత్తము ఓరుగల్లు (వరంగల్లు) రాజధానిగా తూర్పు తెలంగాణా అని, బీదరు రాజధానిగా పడుమటి తెలంగాణా అని తెలుగు దేశమును రాజకీయముగ రెండు విభాగములు కావించెను. తూర్పు తెలంగాణాకు ఇమాదుల్ ముల్క్ బిరుద మిచ్చి మలిక్ మక్బూలును అధిపతిగ నియమించెను. ఏటేట కోటి టంకములు ఆదాయము వచ్చుచుండిన బీదరు, దానికి అణకువరై యుండు దుర్గములు కూడిన పడుమటి తెలంగాణాకు నస్రత్ ఖాను అను బిరుదము నిచ్చి షిహాబ్-ఇ-సుల్తాని అధికారముక్రింద నుంచెను. తెలంగాణా పరిపాలకులు ఉభయులును కుత్లుగ్ ఖాను బిరుదాంచితుడైన కవాముద్దీన్ అను దౌలతాబాదు వజీరు ఆజ్ఞలకు లోబడి పనిచేయునట్లు అతడు కట్టడచేసెను. ఇట్టి యేర్పాటుచేసి దౌలతాబాదులో ఒకమాసము దినము లాగి ముహమ్మదు బిన్ తుఘ్లుక్ ఢిల్లీకి మరలిపోయెను.

కాపయ నాయకుడు తిరుగబాటు లేవదీయుటకు తనకు అదియే అనుకూలమైన తరుణమని భావించెను; కర్ణాటాధిపతి మూడవ బల్లాళదేవుని సాహాయ్యమును వేడెను. ముస్లిములు తెలంగాణాలోను, కర్ణాటకములోను ప్రవేశించి రనియు, వారు హిందువులను నాశనముచేయ కృతనిశ్చయులై యున్నారనియు, ఈ యుపద్రవమును తప్పించుటకు కలిసి పనిచేయవలయు ననియు అతనితో చెప్పెను. బల్లాళరాయడు కాపయనాయకునితో సహకరించి అతనికి గొప్ప అశ్వికదళమును, పదాతిసైన్యమును తోడంపెను. తెలుగుదేశములో అతిశయించుచుండిన జాతీయోద్రేకమును ఊతగా గొని కాపయనాయకుడు ఏ రహస్యపద్ధతులను అవలంబించెనో కాని తెలంగాణాలోని ప్రజలను కూడగట్టుకొని, సైన్యమును సమకూర్చుకొని ఆకస్మికముగ పోయి ఓరుగంటి దుర్గమును ముట్టడించెను; దుర్గములోనికి ఏవైపునుండియు ఆహారపదార్థములు పోకుండ దిగ్బంధము కావించెను. సైన్యములను ఆయత్తపరచుకొనుటకైనను కోటలోనివారికి అవకాశము లేకపోయినది. కాపయ నాయకుని సైన్యము ఆనాటి కానాడు వృద్ధియగుచుండెను. తెలంగాణాలో ఏప్రాంతమున చూచినను తిరుగబాటులే; ఎక్కడ చూచినను అరాజకమే. ఓరుగంటికోటవద్ద సమరము భయంకరమైనది. తుదకు ఆంధ్ర వీరులను ఎదిరించి నిలువలేక, కోట సంరక్షించుకొనలేక ఓరుగంటి దుర్గపాలకుడయిన నాయబ్ వజీరు మలిక్ మక్బూల్ అతికష్టముతో ఎట్టెట్లో తప్పించుకొని పారిపోయెను. ఓరుగల్లుకోట మరల తెలుగు జోదుల వశమయినది; ఓరుగంటి కోటకొత్తళములమీద శకవర్షము 1258 (హిజిరా 737) లో మరల ఆంధ్రపతాక యెగిరినది. ఆంధ్ర దేశాధీశ్వర, ఆంధ్ర సురత్రాణ బిరుదములను వహించి ముసునూరి కాపయ నాయకుడు తెలుగుదేశమునకు అధిపతి అయ్యెను. తెలంగాణాలోకూడ హిందూరాజ్యమును, హిందూధర్మమును సముద్ధరింపబడినవి. తెలుగుదేశమునకు ఓరుగల్లు మరల రాజధాని అయినది.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



హిందువులకు ఓరుగంటివద్ద విజయము లభించినట్లు తెలియగనే అదే సమయమున కంపిలి రాజ్యమును పరిపాలించుటకు పంపబడిన హరిహరరాయాదులుకూడ ఇస్లాము మతమును విడిచిపెట్టి శ్రీ విద్యారణ్య యతీంద్రుల అనుగ్రహమును పొంది మరల హిందూమతమును అవలంబించి తిరుగబాటును లేవదీసి సుల్తాను అధికారమును ధిక్కరించి స్వతంత్రులై పరిపాలనము చేయదొడగిరి. తుదకు ఈ విధమున - తెలుగుదేశమేకాక కంపిలికూడ ముహమ్మద్ బిన్ తుఘ్లుక్ యొక్క ఢిల్లీ సామ్రాజ్యములోనుండి జారి పోయినది.

ఆంధ్రదేశాధిపతి అయిన తరువాత కాపయనాయకుడు తనతో సహకరించిన బంధువులకును, తన వర్ణమువారికిని నాయకత్వము లిచ్చి తన స్థితిని కట్టుదిట్టము చేసికొనెను. అతడు పినతండ్రి రాజనాయకుని కుమారుడు అనపోత నాయకుని మధ్యాంధ్రదేశమునకు అధిపతిగా నియమించెను. ఇతనికి మొదట తూర్పుగోదావరిజిల్లా చోడవరము తాలూకాలోని తొయ్యేరును, తరువాత రాజమహేంద్రవరమును రాజధానులుగ నుండెను. చాలకాలము ఇతడు తొయ్యేటిలో ఉండుటచేత ఈతనికి తొయ్యేటి అనపోత భూపాలుడని వ్యవహారము. సముద్ర తీరస్థ ఆంధ్రదేశమున కాన్పించు కాపయనాయకుని కడపటి శాసనము శక వర్షము 1268 (క్రీ. శ. 1344-46) నాటిది గణపేశ్వరములో నున్నది. తొయ్యేటి అనపోతనాయకుని శాసనము ఈ ప్రాంతమున శకవర్షము 1269 (క్రీ. శ. 1347) నాటిది కనబడుచున్నది. ఇది దాక్షారామములో నున్నది. గోదావరి దక్షిణ తీరస్థ నల్గివాటి రాజ్యమునకు గురజాల తెలుంగు నృపాలుని కుమారుడును, మడికి సింగనకు ఆశ్రయుడును అయిన ముప్పభూపాలుని అధిపతిని కావించెను. ఇతనికి ఇప్పటి ఆదిలాబాదుజిల్లాలోని రామగిరి రాజధాని. సముద్రతీర ప్రాంతమును ఆటవిక జాతుల తళ్ళనుండి కాపాడుటకు కావచ్చును కాపయనాయకుని నియోగమున మంచికొండ కూనయ నాయకుడు రాజమహేంద్రవరమునకు ఈశాన్య దిశను పదునాకండుమైళ్ళ దూరమున కోరుకొండ దుర్గమును నిర్మించెను. శబరి, గౌతమీ నదుల సంగమస్థలమున ఉన్న కూనవరముకూడ ఇతడు తనపేర కట్టించిన గ్రామమే కానోపును. తరువాతి కాలమున గోదావరి నదికి తూర్పుతీరమునగల ప్రధాన దుర్గములలో కోరుకొండ ఒకటైనది. ఇది మంచికొండ నాయకుల ముఖ్యనగరము. కాపయనాయకుడు తన మేనగోడలిని (సోదరి కూతురు) కూనయ నాయకుని కుమారుడు ముమ్మడి నాయకునికి ఇచ్చి వివాహము కావించి వారితో వియ్యమందెను. ప్రోలయరెడ్డి కుమారుడయిన వేమారెడ్డి కాపయనాయకునికి విధేయ సామంతుడై గుండ్లకమ్మ నది యొడ్డున ఉన్న అద్దంకి రాజధానిగా తత్పరిసర ప్రాంతమును పరిపాలించెను. వీరసామంతులని పేరు వహించిన కొప్పుల నాయకులు గోదావరి తీరము మొదలుకొని తుని వరకు గల ప్రాంతమును పరిపాలించిరి. వీరి రాజధాని పిఠాపురము. ఈ కొప్పుల నాయకులు పాలించిన ప్రదేశమునకు ఆంధ్రఖండ మండలమని పేరు. వీరిలో కాపయ నాయకునికి సమకాలికుడై ఈ ప్రాంతమును ఏలినట్లు తెలియవచ్చినవాడు కొప్పుల కాపయనాయకుని పౌత్రుడును, ప్రోలయ నాయకుని కుమారుడును అయిన నామయ నాయకుడు. ఇతడు పగమెచ్చుగండ బిరుదాంకితుడు; తూర్పుగోదావరిజిల్లాలోని ఎల్లవరము, పిఠాపురము, పెద్దాపురము డివిజనుల గుండ ప్రవహించుచున్న ఇప్పటి ఏలేరను ఏలానదిచేత పోషింపబడిన ప్రోలునాటి దేశమున కేలిక. పూర్వోక్త నాయకు లందరు కాపయనాయకునికి విధేయ సామంతులే.

పూర్వము కాకతి భూవరులు పరిపాలించిన రాజ్యములో చాలభాగము, అనగా పడుమట కొలను, బీదరులు మొదలుకొని తూర్పున బంగాళఖాతము వరకు వ్యాపించిన దేశము కాపయ నాయకుని అధికారముక్రిందికి వచ్చినది. ఇంత దేశమునకు అధిపతి అయినను, ముస్లిములను జయించినను ఢిల్లీ సుల్తాను మరల ఎప్పుడు తెలంగాణాపై దండెత్తి వచ్చునో అన్న సందియము అతనికి పోలేదు. అందువలన ముందు ఓరుగల్లు మొదలయిన ముఖ్య దుర్గములను మరమ్మతు చేయించి అతడు వానిని కట్టుదిట్టము చేసెను. యుద్ధ తంత్రమున కీలక స్థలములందు కొన్నిచోట్ల సైన్యమును కాపుంచెను; సేనను వృద్ధిపరచి, దానికి తగిన తర్ఫీతిచ్చెను; సుల్తానువలని భయముననే దక్కనులో ముహమ్మద్ బిన్ తుఘ్లుక్‌పై తిరుగబాటు చేసిన అమీరాన్‌జాద పక్షము వహించి, వారి ముఖ్య నాయకులలో ఒకడై జాఫర్ ఖాన్ బిరుదాంచితుడగు హసనుకు అతడు సామ్రాజ్య సేనతో పోరాడుచు అత్యంత విషమ పరిస్థితిలో ఉండిన సమయమునందు పదునైదు వందల పదాతిసేనను సాహాయ్యముగ పంపెను. అమీరాన్‌జాద అను సైనిక శతాధిపతులయిన ఈ ముస్లిము నాయకులు తమవద్దనున్న సైన్యముతోను, కాపయ నాయకుడు సాయము చేసిన సైన్యముతోను విజృంభించి సుల్తాను సేనలను ఓడించి దక్కనులో అతని యధికారమును మట్టుపెట్టి జాఫర్ ఖానును తమ యధిపతిగ ఎన్నుకొని ఓరుగంటి రాజ్యమునకు పొరుగుననే పడుమటి దిశను ఒక క్రొత్త



http://sanskritcentral.com/

http://teluguthesis.com/

ముస్లిము రాజ్యమును స్థాపించిరి. జాఫర్ ఖాను అలా ఉద్దీన్ హసన్ గంగూ బహ్మన్ షా అను పేరుతో హిజిరా 748 (శకము 1269 - క్రీ. శ. 1347)లో సింహాసన మెక్కి బహ్మనీరాజ్య సంస్థాపకు డయ్యెను. గుల్బర్గ అతని రాజధాని.

ఇప్పుడు అలా ఉద్దీన్ హసన్ షా అను పేరు వహించిన జాఫర్ ఖానుపై విశ్వాస ముంచుటయు, అతనికి సైన్యమును పంపి తోడ్పడుటయు వట్టి వివేక రహితమైన పని యని కాపయనాయకునికి త్వరలోనే తెలియవచ్చినది. బహ్మనీ రాజ్యమును స్థాపించిన అనంతరము అలా ఉద్దీన్ తన రాజ్యమును విస్తరింపజేసికొను తలంపుతో ఇరుగు పొరుగుల నున్న హిందూ రాజ్యములపై దండెత్తివెళ్లెను. తన కత్యంత విషమ పరిస్థితిలో సహాయము చేసెనను కృతజ్ఞతయైనను లేకుండ అలా ఉద్దీన్ ఇతర హిందూ రాజ్యములమీదవలెనే ఓరుగంటి రాజ్యముపై దండెత్తి వచ్చి ఆతనిని యుద్ధమున ఓడించెను. కాపయనాయకుడు విధిలేక కౌలస దుర్గమును, దాని కనకువగ నుండిన ఇతర ప్రదేశములను అలా ఉద్దీనుకు సమర్పించి అతనితో సంధిచేసికొనవలసివచ్చెను. ఈ సంధి చేసికొన్నపిదపగూడ కాపయనాయకుని సార్వభౌమత్వము ఎప్పటి యట్లనే యుండెను. సంధిప్రకారము అతడు కౌలస మొదలగు ప్రదేశములను ఇచ్చుటకు ఒడంబడెనేకాని, బహ్మనీ సుల్తానుకు ఏటేట కప్పము చెల్లించి ఆతని యాధిపత్య మంగీకరింతునని వాగ్దానము చేయలేదు. ముస్లిము చరిత్రలుకూడ కాపయనాయకుడు కప్పము చెల్లించుటకు నిర్ణయమైనట్లు చెప్పవు.

ముహమ్మద్ బిన్ తుఘ్లుక్ క్రీ. శ. 1351 లో చనిపోయెను. అందువలన బహ్మనీ సుల్తాను అలా ఉద్దీనుకు ఏ భయమును లేకపోయినది. ఇప్పు డాతడు తన రాజ్యమును అన్నివైపుల పెంపుచేసికొనుటకు నిర్భయముగ తలపెట్టెను. కాపయ నాయకుని తనకు ఏటేట కప్పము చెల్లించు విధేయ సామంతునిగ జేసికొన్నంతవరకు అతనికి నిద్ర పట్టలేదు. అదియుగాక, పూర్వము ఢిల్లీ సుల్తాను అధికారము క్రింద నుండిన దేశమున కంతకు తాను వారసుడనని, దానినంతను మరల సంపాదింపవలె నని అతడు పూనుకొనెను. ఈ కోరికతో అలా ఉద్దీన్ క్రీ. శ. 1355 చివర భాగమున మరల ఓరుగంటి రాజ్యముపై దండెత్తి దేశము నంతను ధ్వంసము కావించెను. తెలంగాణాలో అతడు సంవత్సరముపాటు ఉండెను; భువనగిరి (భోనగిరి) దుర్గమును, దాని కనకువయైన కోటలను పట్టుకొనెను; దేవాలయములను కూలద్రోసి వాని స్థానమున మసీదులు కట్టించెను. తెలంగాణా విజయము పూర్తియైన పిదప అలా ఉద్దీన్ గుల్బర్గకు మరలిపోయెను. కాపయ నాయకుడు ఢిల్లీ సుల్తానుకు చెల్లించుచుండిన కప్పమును ఏటేట బహ్మనీ సుల్తానుకు చెల్లించుటకు ఇచ్ఛాపూర్వకముగ అంగీకరించి నట్లు ఫెరిస్తా చెప్పుచున్నాడు. కాని, అజీజుల్లా తన గ్రంథములో ఈ కప్పము ప్రస్తావమే లేదు. శకవర్షము 1279 (క్రీ. శ. 1357) నాటి కాపయనాయకుని పిల్లలమర్రి శాసనము అతని ఇష్టభృత్యుడైన ఎరపోతు లెంక 'పిల్లలమర్రిని రాజ్యము చేయుచుండి తత్కాల దేశవిధ్వరాలను అలావదీను సురతాణిచేతను ఎరకేశ్వరదేవర ఉపహతం అయితేను' తన్నేలిన కాపయ నాయకునికిని, తన తల్లిదండ్రులకును పుణ్యముగా పునఃప్రతిష్ఠచేసి భూదానము చేసినట్లు తెలుపుచుండుటచేత అలా ఉద్దీన్ దండయాత్ర అంతకు పూర్వమే జరగినట్లు విదితమగు చున్నది.

బహ్మనీ సుల్తాను అలా ఉద్దీన్ హసన్ షా హిజిరా 760 (క్రీ. శ. 1359)లో చనిపోయెను. అతని యనంతరము అతని కుమారుడు మొదటి ముహమ్మద్ షా సింహాసన మెక్కెను. ఈతడు రాజ్యమునకు రాగానే విజయనగరాధిపతియు, తెలంగాణా అధిపతియు కలసి తమ నాణెములు మాత్రమే దక్కనులో చలామణిలో ఉండుటకు దక్కనులోని హిందూ వర్తకులను వారి చేతిలో పడిన బహ్మనీ నాణెములను కరగించివేయ ప్రోత్సహించినట్లు ఫెరిస్తా వ్రాయుచున్నాడు. అంతే కాదు; వా రుభయులు అతని తండ్రి అలా ఉద్దీన్ తమవద్దనుండి లాగుకొనిన రాజ్యమును తిరిగి తమ కీయవలసిన దనియు, అట్లీయనిచో యుద్ధము తప్ప దనియు, ఆ సందర్భమున అవసరమైనచో ఢిల్లీ సుల్తాను సైన్యమునుకూడ రావింపగల మనియు చెప్పుటకు ముహమ్మదు షా ఆస్థానమునకు రాయబారులను పంపిరని కూడ ఫెరిస్తా చెప్పుచున్నాడు. ముహమ్మదు షా తన రాజ్యమును సంరక్షించు కొనుటకును, వీరిరైన ఆ రాజ్యములపై దండెత్తుటకును అవసరమైన ప్రయత్నములను చేసికొనుటకు ఆ రాయబారులకు ఏ జవాబును ఈయకుండ వారిని తన యాస్థానములో ఒక సంవత్సరమునర ఆపియుంచి, తనకు పంపవలసిన కప్పమును, అనర్ఘరత్న భూషణములతో ఉత్తములైన ఏనుగులను తెలంగాణా అధిపతి ఏల పంపలేదని ఆ రాయబారులను అడిగెనట. వారు పోయి తమ ప్రభువుకు ఈవిషయమును నివేదించిరి. దానితో కాపయనాయకుడు ఉగ్రుడై తన కుమారుడు వినాయకదేవుని గొప్పసేనతో కౌలసకోటను పట్టుకొన వలసినదని పంపెను. ఈతనికి సాహాయ్యముగ విజయనగరాధీశ్వరుడు మొదటి బుక్కరాయలు 20,000 గుర్రపు దళమును పంపెను. ముహమ్మదు షా విజయనగరసేన



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



నోడించి ఆ దేశమును కొల్లగొట్టి, భూషణములతోను, అరబ్బీ గుఱ్ఱములతోను తన రాజధాని గుల్బర్గకు (కలుబరగి) మరలి పోయెను. వినాయకదేవునికి మొదట విజయము కలిగిన ట్లున్నది. అలా ఉద్దీన్ తీసికొన్న భోనగిరి మరల కాపయనాయకుని అధికారము క్రిందికి వచ్చినది. ముస్లిము చరిత్రలు ఈ కోట ముహమ్మదు షా అధికారము క్రింద ఉండినట్లు చెప్పవు. ఇందుకు వినాయకదేవుడు ఈ దండయాత్రలో బహాదూర్ ఖానుచేత పరాజితుడై అతని రాజ్యములోని వెలంపట్టణమునకు పోయి దాగుకొనెను. బహాదూర్ ఖాను అతనిని ఏల వెంబడింపలేదో తెలియదు. ఈ పై విషయము లన్నియు ఫెరిస్తా వలన తెలియవచ్చినవే. తరువాత బహాదూర్ ఖాను ఓరుగల్లు పర్యంతము దండెత్తి వెళ్ళి దేశమును పాడుచేసెను. తుదకు కాపయ నాయకుడు అపారధనమును, అమూల్యాభరణములను, ఇరువదియై దేనుగులను సమర్పించి అతనితో సంధికావించుకొనెను.

కాపయనాయకునికి బహ్మనీరాజ్యము ప్రక్కలోని బల్లెమైనది. అటుతరువాత నైనను అతడు స్తిమితముగా నుండుటకు నోచుకొనలేదు. ముహమ్మదు షా కాపయనాయకుని కుమారుడు వినాయకదేవునిమీదికి మరల దండెత్తి వెళ్లెను. అందుకు ఫెరిస్తా చెప్పుచున్న కారణ మిది. వినాయకదేవుడు గుల్బర్గాలోని ముహమ్మదు షాకు తీసికొని పోవుచుండిన ఉత్తమాశ్వములను గుఱ్ఱపు వర్తకులవద్దనుండి వారు వలదని వారించినను వినక బలాత్కారముగ గైకొనెనట. వారు హిజిరా 763 (క్రీ. శ. 1362)లో గుల్బర్గా చేరి ముహమ్మదు షాతో తమవద్ద అతనికి తగిన గుఱ్ఱములు లేవనియు, అతనికొరకుంచిన ఉత్తమాశ్వములను వినాయకదేవుడు బలాత్కారముగ గైకొనెననియు మంచి గుఱ్ఱములను ఎందుకు తీసికొనిరాలేదని అత డడిగిన ప్రశ్నకు సమాధానముగ చెప్పిరట. అందుమీదట అతడు వినాయకదేవుని మీద తోక త్రొక్కిన త్రాచువలె లేచి అదొకసాకు చేసికొని వెంటనే వెలంపట్టణముపై దండయాత్ర కాజ్ఞయిచ్చెను.

నాలుగువేల గుఱ్ఱపుదళమును తీసికొని ముహమ్మదు షా సత్వర ప్రయాణముల బోయి అకస్మికముగ వెలంపట్టణముపై బడి అందలి హిందువుల నందరిని దారుణ క్రూర వధ పాలుచేసెను. ఈ దండయాత్ర జరగునని వినాయకదేవు డెప్పుడు అనుకొనలేదు. దళము కూర్చుకొనుటకు కూడ వ్యవధిలేక అతడు కోటలోనికి పోయి దాగుకొనెను. ముహమ్మదు షా కోటకు ముట్టడి వేసెను. ఆ ముట్టడిలో వినాయకదేవుడు తప్పించుకొని పారిపోవుటకు ప్రయత్నించుచుండగా బందీగా పట్టువడెను. ఎందువలన నాకొరకు తెచ్చు ఉత్తమాశ్వములను నీవు తీసికొంటివని ముహమ్మదు షా అతనిని ప్రశ్నింపగా అతనిని లక్ష్యపెట్టక ప్రాణముల మీద ఆశ విడచి వినాయకదేవుడు నిర్భయముగా, ధార్ష్ట్యముతో జవాబులు చెప్పెనట. దానిమీద ముహమ్మదు షా కోపావేశముతో మండిపోయి వినాయకదేవుని నాలుక కోయించి, క్రింద రగిల్చిన పెద్ద మంటలో పడునట్లు కోటబురుజులమీదనున్న ఫిరంగివాతనుండి అతనిని విసరి వేయించెను. తరువాత ముహమ్మదు షా ఆపట్టణ మంతయు దోచుకొని ప్రజలపై భరింపరాని పన్నులు వేసి, కొద్దికాల మక్కడ ఉండి వినాయకదేవుని కోశాగారము నందలి ధన సంచయమును తీసికొని గుల్బర్గాకు మరలి పోయెను.

సుల్తాను ముహమ్మదు షా చేసిన క్రూర దారుణ చర్యలకు కోపోద్రిక్తులై తెలుగు దేశీయులు అతనిపై పగ సాధించుటకు తలపెట్టిరి. వారు ముహమ్మదు షా మార్గమును కాచి, పగలంతయు దాగి యుండి, రాత్రివేళ రహస్య స్థలములనుండి బయటికి వచ్చి అతని సైన్యముమీద పడి పీడించిరి. దినదినము సాగుచుండిన ఈ పీడకు, ఉపద్రవమునకు తట్టుకొనలేక సులభముగా దోచికొని పోవదగిన అమూల్యాభరణములు, బంగారము మినహాగా మిగిలిన సామగ్రిని, కొల్లను అంతను తగులబెట్టవలసినదని తన సైనికులకు ఆజ్ఞ యిచ్చి వారి ఉపద్రవమును తప్పించుకొనుటకు అతివేగముగ ప్రయాణములు కావించెను. అట్లయినను తెలుగువారతనికి పెట్టిన పీడవలన అతడు కౌలసకోట చేరునప్పటికి అతని సేనలో మూడవవంతు మాత్రమే మిగిలినది. తక్కినది నాశనమయినది. ముహమ్మదు షాకు కూడ భుజముమీద బలమైన గాయము తగిలినది. కౌలస కోటవద్దకు అతనికి క్రొత్త సైన్యము సాయముగ వచ్చి చేరుటవలన అతడు బ్రతికిపోయెను. మిగిలిన అతని ప్రయాణము శాంతముగ సాగిపోయినది.

వినాయకదేవుని దారుణ మరణవార్త విని కాపయనాయకుడు విచారముతో క్రుంగిపోయెను. బహ్మనీ రాజ్యము కూల్చుట ఎట్లన్నదియే అతని ధ్యేయ మయినది. ముస్లిము చరిత్రలను అనుసరించి చూడగా తుదకు విజయనగరాధీశ్వరుల తోడ్పాటుతోకూడ బహ్మనీ సుల్తానును ఓడింపలేకపోవుట అటు లుండ తుద కతడు తన రాజ్యమునైనను రక్షించుకొనలేకపోయెను. అందువలన అతడును, విజయనగరాధిపతియు హిజిరా 764 (క్రీ. శ. 1363) లో ముహమ్మద్ బిన్ తుఘ్లుక్ అనంతరము ఢిల్లీ సింహాసన మెక్కిన ఫిరూజ్ షా తుఘ్లుక్‌కు బహ్మనీ రాజ్యముపై



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



దండెత్తి వచ్చుచో తా మాతనికి అరిగాపులై అతనికి ఆ రాజ్యము మరల సంపాదించిపెట్టగలమని వార్త నంపిరి. కాని ఢిల్లీ సుల్తాను దానిని పెడచెవిని పెట్టెను. కాపయ నాయకుని ఈ ప్రయత్నము ఫలింపకపోగా మరింత ఉప ద్రవకరమయినది.

సుల్తాను ముహమ్మదు షాకు ఈ విషయ మంతయు తెలియవచ్చినది. అతడు క్రోధావేశపరవశుడై తన రాజ ధాని గుల్బర్గాను మలిక్ సైఫుద్దీనుకు ఒప్పగించి సైన్య సమేతుడై నిరాతంక ప్రయాణముల కౌలసకు వచ్చి కొంత సైన్యముతో అజమ్ హుమాయూనును గోలకొండవైపు పంపి, బేరారు సైన్యముతో సఫ్దర్ ఖాన్ సీస్తానీని వరం గల్లుపై పంపి అతని వెంబడి బహాదూర్ ఖానుతో కూడ సావకాశముగా మెల్లమెల్లగా బయలు వెడలెను.

ఈ సమయమున విజయనగరాధీశ్వరుడు మృతినొంది యుండుటవలన అటు నుండి కాపయనాయకునికి ఎట్టి సాయము రాకపోవుట చేత అతడు అశోవహాతుడయ్యెను. అతడుమహమ్మదీయ సేన నెదిరించు సమర్థత లేక కొండలలోనికి, అడవులలోనికి పారిపోయెను.



చిత్రము 48. పిల్లలమర్రి దేవాలయము

సుల్తాను ముహమ్మదు షా తెలంగాణాలో రెండు సంవత్సరము లుండి గ్రామములను దోచుకొనెను; పంటపైరులను తగులబెట్టెను; దేశమును సర్వనాశము కావించెను. ఇక తన దేశమును- విధ్వంసమునుండి సంరక్షించుటకు గత్యంతరము కానక, కాపయ నాయకుడు సంధియొనర్చుకొన రాయబార మంపెను. అతనిని పూర్తిగా అణచి వేయునుద్దేశముతో సుల్తాను ముహమ్మదు షా ఆ సంధి ప్రయత్నమునకు విముఖుడయ్యెను. కాని, బహాదూరుఖాను మాధ్యస్థ్యము వహించుట వలన చిట్టచివరకు క్రీ. శ. 1864-65 లో ముహమ్మదు షాకును, కాపయనాయకునికిని సంధి జరగినది. ఈ సంధి ప్రకారము కాపయనాయకుడు సుల్తానుకు యుద్ధ నష్టపరిహారముగ 33 లక్షల రూపాయ లిచ్చుటయేకాక గోలకొండ శాశ్వతముగ అతనికి ఇచ్చివేయుటకును, పైగా మూడు వందల ఏనుగులను, ఏబది గుర్రములను ఇచ్చుటకును తీర్మానమైనది. అదే సమయమున కాపయ నాయకుని కోరికమీద ఓరుగంటి రాజ్యమునకును, బహ్మనీ రాజ్యమునకును గోలకొండ సరిహద్దుగ నుండునట్లు ముహమ్మదు షా స్థిరపరచి, తెలంగాణా అధిపతులు ఈ సంధిషరతులను అతిక్రమింపకుండ ఉండునంతకాలము తన యనంతరము బహ్మనీ రాజ్యము నేలుసుల్తాను లెవ్వరును తెలంగాణా అధిపతులకు ఉపద్రవము కలిగింపరాదని కట్టడ చేసెను. ఈ సంధి జరగిన అనంతరము కాపయనాయకుడు మొదట ఢిల్లీ చక్రవర్తి ముహమ్మద్ బిన్ తుఘ్లుక్‌కు సమర్పింప నెంచిన తఖ్త్-ఇ-ఫీరూజీ అనివ్యవహరింపబడిన వైడూర్య ఖచితమగు బంగారు సింహాసనము ముహమ్మదు షాకు ఉలఫాగా ఇచ్చెను. అటుతర్వాత అతడు తన మాటకు కట్టువడెను. ఈ విషయము లన్నియు ముస్లిము చరిత్రల వలన తెలిసినవి. తన పరిపాలనకాలములో ఇక నెప్పుడును ముహమ్మదుషా తెలంగాణాపై దండెత్తి పోవ లేదు. ఈ సంధి యనంతరము బహ్మనీ సుల్తానులకును, ముసునూరివారికిని గల సంబంధము సరళముగ సాగిపోయినది.

బహ్మనీ యుద్ధములో చిక్కుకొని యుండినపుడు రేచెర్ల సింగమనాయకుడు స్వాతంత్ర్యమును ప్రకటించి ప్రత్యేక రాజ్యము నిర్మించుకొను తలంపుతో అనుమనగల్లు, పిల్లలమర్రి నగరములకు చుట్టుపట్టులనుండు దేశమును జయించుటకు పూనుకొనెను. ఈ సందర్భమున కాపయ నాయకునితో అతనికి సంఘర్షణ జరగినది. 'వెలుగోటి వారి వంశావళి' ఇతడు కాపయనాయకుని ఓడించినట్లు తెలుపుచున్నది. ఇది నిజమే యని ఎంచినను కాపయ నాయకుని రాజ్యము దక్షిణమున నలగొండ జిల్లా, సూర్యాపేట తాలూకా, పిల్లలమర్రి, అనుమనగల్లు (అమనగల్లు)ల వరకు వ్యాపించియుండినట్లు పిల్లలమర్రిలోని



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



శకవర్షములు 1279నాటి అతని శాసనమువలననే తెలియుచున్నది.

కాపయ నాయకునికి బహ్మనీ సుల్తానుల బెడద తప్పినను రేచెర్లవారి వలన బాధ తప్పలేదు. శకవర్షము 1283 (క్రీ. శ. 1361)లో రేచెర్ల సింగమనాయకుడు జల్లిపల్లికోట ముట్టడిలో హతుడైనప్పటినుండి అతని తనయులు అనపోత (అనంత), మాదానాయకులు స్వతంత్రరాజ్య నిర్మాణ ప్రయత్నమును చురుకుగ సాగించిరి. వారు ఈ యుద్దేశముతో కాపయ నాయకుని ఓరుగంటి రాజ్యముపై దండెత్తి వెళ్లిరి. బహ్మనీ సుల్తానులతోడి సంగ్రామముల వలన కాపయ నాయకుని ధనకోశమును, సైన్యమునుకూడ సన్నగిలినవి. ఇంకను ఈ పరిస్థితినుండి కోలుకొనుటకు ప్రయత్నించుచుండగనే ఓరుగంటి రాజ్యముపై రేచెర్ల వెలమనాయకుల దండయాత్ర వచ్చిపడినది. ఇక చేయునది లేక కాపయనాయకుడు బలములను గూర్చుకొని రేచెర్ల వారిని ఎదిరించుట కరిగెను. ఉభయ బలములును వరంగల్లు జిల్లాలోని భీమవరమువద్ద సంధించినవి. అక్కడ జరగిన మహాసంగ్రామములో తెలంగాణాను పారతంత్ర్యమునుండి విడిపించిన మహాయోధుడు, ఆంధ్ర దేశాధీశ్వరుడు అగు ముసునూరి కాపయ నాయకుడు హతు డయ్యెను.

ఈ విషయము ఎప్పుడు జరగినదో తిరముగా చెప్పలేము. కాని, శకవర్షము 1291 (క్రీ. శ. 1369) నాటికి అనపోతా నాయకుడు ఓరుగల్లు, త్రిభువనగిరి (బోనగిరి), రాజాచలము మొదలైన కోటలను పరిపాలించుచుండినట్లు తెలియుటచేత అంత కించుక పూర్వమే, శకవర్షము 1289-90 ప్రాంతమున జరగిన భీమవరము యుద్ధమున కాపయ నాయకుడు హతుడై యుండునని ఊహింపవచ్చును.

ముసునూరివారు పూర్తిగా అర్ధశతాబ్దము కాలమైనను తెలుగుదేశమును పరిపాలింపలేదు. ఈ వంశములో పరిపాలనము నెరపినవారు ప్రోలయనాయక, కాపయ నాయకులు ఇద్దరు తప్ప మరెవ్వరును లేరు. అయినను, తెలుగుదేశ చరిత్రలో వారు వినిపించిన పాత్ర అనుపమానమైనది. వింధ్యకు దక్షిణమునం దుండిన గొప్ప హిందూ రాజ్యము లన్నియు ఢిల్లీ సుల్తాను ముహమ్మదు బిన్ తుఘ్లుకుకు పాదాక్రాంతములై ఆ చక్రవర్తి మగటిమిని, సామ్రాజ్యబలమును తలయెత్తి ఎదిరింపలేని కాలమున, పూర్వపు సూర్యవంశ, చంద్రవంశజులైన క్షత్రియుల రాజ్యము లన్నియు క్రుంగి కూలారిపోయిన కాలమున అంతటి మహాబలవంతుడైన ఢిల్లీ చక్రవర్తిపై కత్తి కట్టి అతని యధికారమును ధిక్కరించి స్వాతంత్ర్యోద్యమమును




http://sanskritcentral.com/

http://teluguthesis.com/



లేవదీసి దానిని విజయవంతముగ నడపిన కీర్తిప్రతిష్ఠలు తెలుగు ప్రజానీకమువి; తెలుగు నాయకులవి; అందును ముఖ్యముగా ముసునూరి ప్రోలయ, కాపయనాయకులవి. వీరు హిందూరాజ్య పునరుద్ధరణమునకు దీక్షాకంకణములు కట్టి యవనవారిధి నిమగ్నమైన తెలుగుభూమిని ఉద్ధరించిన పిదపనే దక్షిణ దేశమున నుండిన ఇతర రాజ్యములకు ధైర్యము కలిగి ఢిల్లీ సుల్తానుపై తిరుగబాటులు కావించి విజయలక్ష్మీసంపన్నములైనవి. హిందూదేశ చరిత్రలో తెలుగు నాయకుని ఆధిపత్యమున తమకు తామై ప్రజలే తమ శ్రేయోభాగ్యముల కొరకు అపూర్వ ధైర్యోత్సాహములతో విమత బలములను ఎదిరించి పోరాడి స్వరాజ్యమును స్థాపించుకొనిన అపూర్వ, అద్భుత ప్రకరణ మిది; ప్రాచీన చరిత్రలో అశ్రుతపూర్వమైనది. ముసునూరి నాయకులకు విజయమే లభించి యుండక పోయినచో మన తెలుగుదేశ చరిత్ర మరొక తెన్నున నడచియుండెడిది. అందువలన ముసునూరి నాయకుల పరిపాలనకాలము కొద్దిదైనను అది మహాసంఘటనాకలితమైనది. ముసునూరి వారి స్వాతంత్ర్య విజయముతో తెలుగుదేశములో నూతన యుగము ఆరంభమైనది. తెలుగుదేశ చరిత్ర ఉత్తర మధ్య యుగములో పడినది. కాని, స్వాతంత్ర్య విజయములు లభించువరకు తెలుగు నాయకులలో నుండిన సంఘీభావమును,ఐకమత్యమును తరువాత అంతరించినవి. ఎవరికి వారే స్వతంత్రులై, స్వతంత్ర రాజ్యములు నిర్మించుకొనిరి. **మ. సో. శ.**

## రాచకొండ, దేవరకొండ రాజ్యములు

పారతంత్ర్యమునుండి విముక్తమై స్వాతంత్ర్యమును పొందిన పిదప తెలుగుదేశములో వర్ధిల్లిన మరొక రాజ్యము రేచెర్ల వెలమ నాయకుల రాచకొండరాజ్యము. రాచకొండకు రాజాచలము, రాజగిరి అని నామాంతరములు. ఇది నలగొండ జిల్లాలో ఉన్నది. తెలంగాణాలోని చరిత్ర ప్రసిద్ధమైన దుర్గములలో ఇది ఒకటి. రేచెర్ల వంశజులు రాజకీయముగ పైకి వచ్చినది కాకతీయ యుగముననే అయినను స్వతంత్రముగ ఒక రాజ్యమును నిర్మించుకొని పరిపాలించినది హిందూరాజ్య పునఃప్రతిష్ఠాపన యుగముననే.

శాసనములు ఈ వంశమును ఎరదాచ నామాంతరము గల దాచానాయని వద్దనుండియే అభివర్ణించినను, వెలుగోటివారి వంశావళి అను చరిత్ర గ్రంథము అంతకు పూర్వము మూడు తరములను కూడ తెలిపి చెవిరెడ్డి అను నామాంతరముగల బేతాళ రెడ్డిని ఈ వంశమునకు మూలపురుషుని చేయుచున్నది. కాని, రాచకొండను పరిపాలించిన వెలమ దొరలకు ఎవరికిని రెడ్డియను ఉపపదము లేదు. వారు చతుర్థ వంశజులే యైనను, పద్మవెలమ నాయకులు గాని రెడ్లు కారు. ఇది రేచర్లవారి వంశావళిని కూర్చునాటికి వారి పుట్టుపూర్వోత్తరములు మరచిపోవుట వలన జరగిన పొరపాటుగా కనబడును. చెవి రెడ్డికాలము నాటికి పిల్లలమర్రిని పాలించుచుండిన రెడ్డి మన్నీలు రేచెర్ల గోత్రులే కలరు. వారిలో చెవిరెడ్డి ఆనాడు ప్రసిద్ధుడు. ఈ వెలమదొరల జన్మస్థలము కూడ మొదట పిల్లలమర్రి, అనుమనగల్లు (అమనగల్లు) ప్రాంతమే. ఈ కారణమున వంశావళిని కూర్చినవారు రేచెర్ల గోత్రులు రెడ్లు కలరని తెలియక వారిలోని చెవిరెడ్డిని తీసికొనివచ్చి బేతాళరెడ్డిగా మార్చి ఒకగాథ కల్పించి యుందురని తోచుచున్నది. ఈ కారణముననే రేచెర్లగోత్ర పద్మవెలమ నాయక వంశోత్పత్తి వివరములు తబ్బిబ్బుగా ఉన్నవి.

మూలపురుషుని విషయము వదలివేసినచో ఈ వంశమున మనకు తెలియవచ్చు మొదటి దొరలు దామ, ప్రసాదిత్య, రుద్రనాయకులు వీరందరును ఓరుగల్లు రాజధానిగ ఆంధ్రదేశమును పరిపాలించిన కాకతి గణపతిదేవ చక్రవర్తి కొలువు కొలిచిన వారు. వీరిలో ప్రసాదిత్య నాయకుడు ప్రసిద్ధుడు. కాకతి గణపతిదేవుని మరణానంతరము కొందరు కాకతీయ సేనానులును, సామంతులును అతని కూతురైన రుద్రమదేవిని రాజ్యమునకు రాకుండ జేయుటకై ప్రయత్నించినప్పుడు ప్రసాదిత్య నాయకుడు ఆమె పక్షము వహించి ఎదిరి పక్షమువారిని ఓడించి ఆమెను సింహాసనము ఎక్కించినట్లును, ఈ కారణమున అతడు రాజ్ఞియైన రుద్రమదేవి వలన 'కాకతిరాయ రాజ్యస్థాపనాచార్య', 'రాయపితామహాంక' బిరుదములను పడసినట్లును 'వెలుగోటివారి వంశావళి' తెలుపుచున్నది.

ప్రసాదిత్యుని సోదరులైన దామానాయక, రుద్రనాయకులను గురించి కాని, దామానాయని కుమారులైన వెన్నమనాయక, సబ్బినాయకులను గురించికాని ఏమియు తెలియదు. కాకతీయుల కాలమున తెలంగాణాపై వచ్చిన తురుష్క దండయాత్రలలో కావచ్చును వెన్నమ నాయకుడు యుద్ధమున తురుష్క సేనలను ఓడించినట్లు వంశావళి వల్ల తెలియుచున్నది.

వెన్నమనాయని కుమారుడు ఎరదాచ నామాంతరము గల దాచానేడు. ఈ దాచానాయనికి సింగమ, వెన్నమ, ఏచమ నాయకులను మువ్వురు కుమారులు కలరు. దాచానాయడును, అతని కుమారుడు సింగమనాయడును ప్రతాపరుద్ర దేవునికడ సేనానులుగ ఉండిరి. దాచానేని పరాక్రమ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కృత్యములలోనెల్ల ప్రధానమైనది పంచపాండ్యదళ విజయము. ప్రతాపరుద్రుడు శకవర్షము 1288 (క్రీ. శ. 1366) లో కాంచీ నగరముపై దండెత్తినపుడు లభించిన విజయ మిది. దాచానాయకుడు ముప్పిడి నాయకుని వెంబడించి కాంచికి పోయి తన శౌర్యపరాక్రమములను చూపి ఈవిజయమునకు కారకుడయ్యెను. ప్రతాపరుద్ర మహారాజు కాంచీపుర విజయములో దాచానేడు చూపిన పరాక్రమమునకు సంతసించి 'పంచపాండ్యదళ విభాళ' బిరుదము నొసగి అతనిని గౌరవించెను. దాచానేని కుమారుడు సింగమనేడు కూడ తన తండ్రితో కలసి కాంచికి పోయి ఆ నగరము ముట్టడియందు తన శౌర్య పరాక్రమములను చూపియుండుటచేతనో, లేక మహమ్మదీయ దండయాత్రలయందు గొప్ప సేవ చేసియుండుటచేతనో కాకతి ప్రతాపరుద్రుడు అతనికి అశీతి (80) వరములు ఇచ్చినట్లు ఐతిహ్యము కలదు. ఈ కారణముననే ఈతనికి అశీతివరాల సింగమనాయడని లోకప్రసిద్ధి. కాకతీయుల కాంచీపుర విజయము నాటినుండి రాచకొండ ప్రభువులకు 'పంచ పాండ్య దళ విభాళ' బిరుదము వంశపారంపర్యముగ వచ్చుచున్నది. రాచకొండ వెలమనాయకుల శాసనములందు వారి వంశవృక్షము దాచానేనితోనే మొదలు. క్రీ.శ. 1323 నాటి ఓరుగంటి మహా సంగ్రామములో వీర మరణము నొందెను కాబోలు, దాచానేని గురించిమన కింక తెలియదు.

దాచానాయని మువ్వురి తనయులలో అశీతి వరాల సింగమనాయడు ప్రసిద్ధుడు. ఓరుగల్లు మహమ్మదీయుల వశమైనపిదప ఆంధ్రనాయకులు ముసునూరి కాపానేని నాయకత్వమున క్రీ. శ. 1335 లో మహమ్మదీయులపై తిరుగబాటు చేసి స్వాతంత్ర్యమును స్థాపించినప్పుడు సింగమనేడుకూడ అతనికి అనుచరుడై అతనికి సహాకారము నెరపెను. కాని, తెలుగు నాయకుల నందరిని సమానముగ బాధించిన శత్రువు తొలగిపోయినప్పటినుండియు వారు ఒక్కొక్కరు స్వతంత్రులై ప్రత్యేక రాజ్యములను నిర్మించుకొని తమ యధికారమును విస్తరింపజేసికొన ప్రయత్నించిరి. స్వాతంత్ర్య యుద్ధమున విజయము చేకూరినపిదప కాపానేనికి లోబడియుండుట సింగమనేనికి ఇష్టములేకపోయినది. కాపానేనికిని, బహ్మనీ రాజ్యాధిపతి అల్లా ఉద్దీన్ హసన్ షాకును యుద్ధము సంభవించినకాలమున సింగమనేడు దక్షిణదిశనున్న నాయకులను జయించి తన రాజ్యమును కృష్ణానదీ తీరమువరకు విస్తరింపజేసికొనెను. కృష్ణా, తుంగభద్రా నదుల అంతర్వేదియందలి కొన్ని దుర్గములును, నలగొండ జిల్లాలోని పరశేశ్వరమును సింగమనేని వశమైనవి. ఉత్తరమునకూడ తన యధికారమును వ్యాపింపజేయ దలపెట్టినప్పుడు సింగమనేనికిని, కాపానేనికిని యుద్ధము సంభవించినది. సింగమనేడు కాపానాయకుని ఓడించినట్లు 'వెలుగోటివారి వంశావళి' చెప్పు విషయము ఒకవేళ సత్యమేయైనను విజయమువలన అతనికి అధిక రాజ్యలాభ మేదియు కలుగలేదు. ఏలయన, రేచెర్ల గోత్రులైన వెలమదొరల కాణాచియగు పిల్లలమర్రివరకు కాపానాయకుని రాజ్యము వ్యాపించియుండినట్లు శకవర్షములు 1279 (క్రీ. శ. 1357) నాటి అతని పిల్లలమర్రి శాసనమువలన తెలియుచున్నది. సింగమనేడు తుదకు ఈ రాజ్యవిస్తరణ ప్రయత్నముననే జల్లిపల్లి కోటను ముట్టడించినప్పుడు తదధిపతులైన సోమవంశక్షత్రియులచేత మాయోపాయమున వధింపబడెను.

సింగమనేనికి అనపోతానేడు, మాదానేడు అని ఇరువురు తనయులు. సింగమనేని మరణవార్త విన్నంతనే అనపోతానేడును, మాదానేడును బలములను గూర్చుకొనిపోయి జల్లిపల్లి దుర్గమును ముట్టడించి శకవర్షములు 1283 (క్రీ. శ. 1361) లో ఆ కోటలోని సోమవంశ క్షత్రియులను, వారికి తోడ్పడిన ఇతరులను కూడ కత్తికి ఎర చేసి ఆ క్షత్రియుల నెత్తుటితో తమ తండ్రికి తర్పణములు వదలి అనుమనగంటికి తిరిగి వచ్చిరి. అంతవరకు ఈ వంశజులకు అనుమనగల్లే రాజధానిగ ఉండినట్లు తోచును. జల్లిపల్లి విజయానంతరము వారు 'సోమకుల పరశురామ', 'జల్లిపల్లి రణక్షోణిభారతీకమల్ల' మొదలైన వీరబిరుదములను వహించి అడ్డులేని ప్రతాపముతో తేజరిల్లిరి.

**అనపోత, మాదానాయకులు** (క్రీ. శ. 1361 - క్రీ. శ. 1384)*: అనపోతానేడే రాజాచలరాజ్య సంస్థాత. ఇతడు తన తండ్రి సంపాదించిన రాజ్యమునకు ఒక రూప మిచ్చి అనుమనగంటినుండి రాచకొండకు మారి అచ్చట గొప్ప దుర్గమును నిర్మించెను. ఒకవేళ సింగమనేనికాలమునగూడ రాచకొండ ఒక కోటగ ఉండిన ఉండవచ్చును. కాని, దానిని దుస్సాధమైన దుర్గముగ చేసినవాడు అనపోతానేడు.

అనపోత, మాదానాయకులు సోమకుల క్షత్రియులను మారిమసంగుటతో తృప్తిచెందక వారికి సాయముగ వచ్చిన ఇరుగుపొరుగు రెడ్డిమన్నీలను, తెలుగు నాయకులను వెంబడించి వారితో పెక్కు యుద్ధములు చేసిరి. నిజమో అబద్ధమో నిర్ణయింప గుదురదు కాని 'వెలుగోటివారి వంశావళి' చేవెర్ల, మొగుళ్లూరు మొదలగు పెక్కుచోట్ల అనపోత, మాదానాయకులు పెక్కు విజయములను పడసి

---

* రేచెర్ల వెలమనాయకుల శాసనములు చాల కొలదిగ దొరకినవి. కాని ననుసరించియే అయానాయకుల పరిపాలన కాలపరిమితి తెలుపబడినది. ఈ కాలపరిమితియే తుదినిర్ణయము కాదు.

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



నట్లు తెలుపును. ఈ స్థలములలో అనేకము కృష్ణానదీ దక్షిణతీరమున గుంటూరు, కర్నూలు, నెల్లూరు మండలములలో నున్నవి. ఇన్నిచోట్లను వారికి విజయము సంభవించినను, సంభవింపక పోయినను వారు కృష్ణానదిని దాటి దక్షిణమునకు వచ్చి అచటి రాజన్యులతో జరగిన సంగ్రామమున విజయము పొంది శ్రీశైలప్రాంతమును ఆక్రమించుకొనిరనుటకు మాత్రము ఆధారము కలదు. రసార్ణవ సుధాకరమను గ్రంథమున అనపోతానేడు శ్రీపర్వతమునకు సోపానములు కట్టించినట్లును, వింధ్య శ్రీశైల మధ్యప్రదేశమును పరిపాలించినట్లును పరికీర్తితుడైనాడు.

శ్రీశైలప్రాంతమును ఆక్రమించిన సందర్భముననే ఈ రేచెర్లవారికిని, కొండవీటిరెడ్డి భూవరులకును పోరాటము సంభవించినది. శ్రీశైలము ఆనాడు రెడ్డిమన్నీల వశమునందున్న ప్రాంతము. దన్నాలకోట అను ధరణికోటవద్ద అనపోతానేని సోదరుడు మాదానేడును, అతని పినతండ్రి పుత్రుడు నాగానేడును అనపోతారెడ్డిని జయించినట్లు 'వెలుగోటివారి వంశావళి'యందు తెలిపిన విజయములు ఈ శ్రీశైలప్రాంతమును ఆక్రమించి రెడ్డిరాజ్యముపై దండెత్తిన కాలముననే లభించి యుండవచ్చును. ధరణికోట యుద్ధమున మాదానేడు విజయుడైనను ఆ ప్రాంతముమాత్రము అతనికి వశపడలేదు. రాచకొండ ప్రభువులకును, రెడ్డిరాజులకును జరగిన ప్రథమ సంఘర్షణ మిది. ఇంతటినుండి కొండవీటి రెడ్డిరాజ్యము అంతరించువరకు ఈ యుభయవంశములకు సంఘటిల్లిన వైరానలము చల్లారలేదు. ఈ దక్షిణదిగ్విజయానంతరము అనపోతానాయకుడు రాచకొండకు తిరిగి వచ్చి అచట తటాకములను నిర్మించి, బావులను కట్టించి, దుర్గప్రాకారాదులకు తగిన కట్టుదిట్టములను చేసికొని, ఓరుగంటి కాపయనాయకుని అధికారమును ధిక్కరించి తుదకు అతని రాజ్యముపై దండెత్తి వెళ్లెను. అంతకుపూర్వమే బహ్మనీ సుల్తాను అలా ఉద్దీన్ హసన్‌షాయును, అతని కుమారుడైన ముహమ్మదు షాయును ఓరుగంటి రాజ్యముపై చేసిన దండయాత్రలలోను, వారితోడి సంగ్రామములలోను కాపయనాయకుడు చాల డీలుపడి అర్థమును, బలమును కోలుపోయెను. ఈ విధమున సైన్యమును, ధన వస్తువాహనాదికములను కోలుపోయి కాపయనాయకుడు తన రాజ్యమును చక్కదిద్దుకొనుచుండిన తరి అనపోతానేని దండయాత్ర జరగినది. రాచకొండనుండి ఈ దండయాత్ర జరగునని కాపయనాయకుడు తలచి యుండలేదు. వరంగల్లు జిల్లాలోని భీమవరము కడ కాపయ, అనపోతనాయకుల బలములు ఒండొంటిని తారసిల్లినవి. భయంకరయుద్ధము జరగినది. అందు కాపయనాయకుడు హతుడయ్యెను. ఓరుగంటి రాజ్యము రేచెర్ల వెలమనాయకుల వశమైనది. ఈ విజయముతో తెలంగాణాకంతకు రాచకొండ ప్రభువులు అధిపతులైరి. ఈ భీమవరము యుద్ధము ఎప్పుడు జరగినదో తెలియదు. కాని శకవర్షము 1291 (క్రీ. శ. 1869) నాటి అయినవోలులోని అనపోతానేని శాసనమున అతడు త్రిభువనగిరి, ఓరుగల్లు, సింగవరము మొదలైన దుర్గములకు అధీశ్వరుడని చెప్పబడుటచేత, ఇంచుమించుగ ఆ కాలముననే అతడు కాపయనాయకుని సంహరించి ఓరుగంటి రాజ్యమును ఆక్రమించుకొనెననుట స్పష్టము. త్రిభువనగిరి ఆకాలమున జయింపదుస్సాధములైన గిరిదుర్గములలో ఒకటి. అట్టి దుర్గములను సాధించి అనపోతానాయకుడు 'త్రిభువనీ రాయరావు' బిరుదాంకితుడయ్యెను. ఈ త్రిభువనగిరినే భువనగిరి అందురు. దానికి ఇపుడు 'భోన్‌గిర్' (భోనగిరి) అని వ్యవహారము. ఈ విజయములతో అనపోతానాయకుని రాజ్యమునకు ఉత్తరమున గోదావరియు, దక్షిణమున శ్రీశైలమును, పశ్చిమమున బహ్మనీ రాజ్యమును, తూర్పున కొండవీటి రాజ్యమును సరిహద్దు సీమలైనవి. నాటినుండి రాచకొండ రాజన్యుల చరిత్రము ఇప్పటి తెలంగాణా - పశ్చిమాంధ్రదేశ - చారిత్రమైనది.

రాజగిరి దుర్గాధిపతులు కాపయనాయకుని రాజ్యమును అపహరించుటలో రహస్యముగ బహ్మనీ సుల్తానుల సహకారమును పడసి మైత్రి కలిగియుండుటచేతనో, లేక ఓరుగంటి రాజ్యము తమకు చేపడిన పిదప కాపయనాయకునికిని, బహ్మనీరాజ్యాధిపతులకును జరగిన ఒడంబడికను తాము కూడ పాటించి గౌరవించుటచేతనో కాపయనాయకుని అనంతరము రాజగిరిభూవరులకును, బహ్మనీ సుల్తానులకును పపొరపులును లేక రాజకీయ వ్యవహార సంబంధములు చదునుగ సాగిపోయినవి. రాజాచల భూమీశులు బహ్మనీ సుల్తానులతోడి వ్యవహారములందు మొదటినుండియు అవలంబించిన రాజనీతిని అనుసరించి చూడగా వారు ఓరుగంటి రాజ్యమును వశపరచుకొనుటలో వారికి బహ్మనీ సుల్తానుల సాయము ఉండినట్లు అనుమానింపదగియున్నది.

అనపోతానేడు తన రాజ్యమున ఆగ్నేయపు సరిహద్దులను శత్రువుల బారినుండి సంరక్షించుటకును, రాచకొండ రాజ్యమునందలి దక్షిణ భాగమును పరిపాలించుటకును తన సోదరుడు మాదానేని దేవరకొండయందు నిలిపి అతనికి ప్రతినిధి పట్టము కట్టెను. ఇంతటినుండి మాదానేని సంతతివారు దేవరకొండయందును, అనపోతానేని సంతతివారు రాచకొండయందును ఉండి రాజ్యము నేలదొడగిరి.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఉభయ సంతతులవారికి రాజధానులు వేరుగా ఉండినను ఉభయులును ఏకీభవించియే రాజ్యవ్యవహారములను దిద్దుకొనుచు వచ్చిరి. రాచకొండ, దేవరకొండ రాజ్యములలో రాచకొండయే ప్రధానమైనదిగను, దేవరకొండ దానికి అణకువయైన రాజ్యముగను ఉండెను. ఈ దేవరకొండ నేటి తెలంగాణాయందలి నలగొండ జిల్లాలో ఉన్నది. ఈ దేవరకొండకు దక్షిణ 'దిశను మాదానేడు తన పేర మాధవపురమను ఒక నగరమును కట్టించి దానియందు నివసించుచు వచ్చెను.

అనపోతానేడు శకవర్షములు 1378, 1380 (క్రీ. శ. 1456, 1458) ప్రాంతముల కళింగ దేశముపై దండెత్తి వెళ్లినట్లు అతని సింహాచలము శాసనమువలన తెలియుచున్నది. ఈ కళింగవిజయమును గురించి వంశావళి ఏమియు తెలుపదు.

అనపోతానేడు ఎంతకాలము రాజ్యమేలెనో తెలియదు. కాని, అతని తనయుడైన సింగభూపతి శాసనములు శకవర్షములు 1309 (క్రీ. శ. 1387) నాటినుండి కానవచ్చుటచేత అనపోతానేడు శకవర్షములు 1283 నుండి 1309 (క్రీ. శ. 1361 - క్రీ. శ. 1383 - 84) వరకు పాలించినట్లు ఊహింపవచ్చును.

**కుమార సింగభూపాలుడు** (క్రీ. శ. 1383 - 84 - క్రీ. శ. 1399): అనపోతానేనికి పిదప రాచకొండ సింహాసనము నెక్కినవాడు అతని కొడుకు రెండవ సింగమనేడు. ఇతనికి కుమార సింగభూపాలుడని నామాంతరము కలదు. రాజ్యమునకు రాకపూర్వము ఇతడు తన తండ్రితో కలసి రాజ్యవ్యవహారములను చక్కదిద్దుచు రాజ్యతంత్రమున గొప్ప యనుభవమును గడించెను. ఇతని ఆస్థాన కవీశ్వరులలో ఒకడయిన విశ్వేశ్వర కవిచంద్రుడు రచించిన చమత్కార చంద్రికను అనుసరించి ఈ సింగమనేడు రాజ్యమునకు రాకపూర్వము కల్యాణదుర్గమును జయించి, అచట కీర్తిస్తంభమును ప్రతిష్ఠించి కల్యాణభూపతి అను బిరుద నామమును వహించినట్లు తెలియుచున్నది. ఈ కల్యాణ నగరము హైదరాబాదు రాజ్యమునందలి గుల్బర్గజిల్లాలోని కల్యాణియని తోచుచున్నది. ఇది ప్రాచీనకాలమునుండి చరిత్ర ప్రసిద్ధమైన స్థలము. ఈ కల్యాణవిజయమును అనుసరించి చూడగా ఇతడు బహ్మనీ సుల్తానులలో ఎవరితో యుద్ధమున తోడ్పడ నరిగి ఈ విజయమును సాధించినట్లు కనబడును. ఇతడు బహ్మనీ సుల్తానులతో (పారసీకులతో) స్నేహముగ ఉండినట్లుకూడ చమత్కార చంద్రికవలననే తెలియుచుండుటచేతను, కల్యాణ నగరము గుల్బర్గ జిల్లాలోనిదిగ ఊహింపదగి యుండుటచేతను సింగభూపాలుడు బహ్మనీ రాజ్యాధిపతుల పనుపుననే కల్యాణమును జయించి యుండుననుటకు సందియములేదు.

కుమారసింగమనేడు రాజ్యమునకు వచ్చిన క్రొత్తలోనే శ్రీశైల రాజ్యమును జయించి విజయనగరాధీశ్వరులు తెలంగాణాపై దాడివెడలిరి. మైసూరునందలి తుంకూరు జిల్లాలోని శకవర్షము 1306 (క్రీ. శ. 1384) నాటి ఒక విజయనగర శాసనము విజయనగరాధీశ్వరుడయిన రెండవ హరిహర దేవరాయలు తన కుమారుడైన వీరబుక్కరాయలను ఓరుగంటి రాజ్యముపై దండెత్త బంపెననియు, ఆ సందర్భమున తమకు విధేయసామంతులైన వెలమదొరలకు సాయముగ తురకలు (బహ్మనీ సుల్తానులు) మహబూబునగరు జిల్లాలోని కొత్తకొండను-విజయనగరాధీశ్వరుల వశమునందు ఉండుటచేత కావలు - ముట్టడించి రనియు, ఈ ముట్టడియందు విజయనగర దండనాథులలో ఒకడైన సాళువ రామదేవరాయలు వీరశయనము పొందె ననియు తెలుపుచున్నది. ఈ దండయాత్రకు కారణము ఎచ్చటను తెలుపబడలేదు. కాని, అది ఊహింప సాధ్యము. మునునూరి కాపయనాయకుడును, విజయనగర రాజ్య సంస్థాపకుడును (హరిహరరాయలు) బంధువులని మహమ్మదీయ చరిత్రకారుడైన జియా ఉద్దీన్ బరని వ్రాసియున్నాడు. వారు ఉభయులును బంధువులని నిర్ధారణగా చెప్పుటకు అవకాశము లేకపోయినను, మిత్రులుగా ఉండి ఓరుగంటి, విజయనగరరాజ్యములు మహమ్మదీయ ప్రతాపోద్ధతికి సమసిపోకుండ పరస్పరము ఒకరి కొకరు తోడ్పడుచు వానిని సంరక్షించుకొనుచు వచ్చి రనుట నిజము. కాపయ నాయకుని సంహరించి అతని రాజ్యమును ఆక్రమించుటచేతను, ముస్లిములతో చెలిమి పాటించి హిందూరాజన్యులపై కత్తికట్టుటచేతను రాచకొండ దొరలు విజయనగ రాధిపతులకు శత్రువులే అయిరి. ఈ విధమైన శత్రుత్వమే విజయనగర దండయాత్రకు కారణము కావచ్చును. పైనుడివిన శాసనమునందలి విషయములను అనుసరించి చూడగా విజయనగరాధిపతులకు పరాజయము కలిగినట్లున్నది.

ఈ విజయము లభించిన కొద్దికాలమునకే కుమార సింగభూపతి కళింగము మీదుగా గౌతమీ తట ప్రాంతముపై దాడి వెడలెను. ఈ దండయాత్ర శకవర్షము 1309 (క్రీ.శ. 1387) లో జరగినట్లు సింగభూపాలుని ఆ సంవత్సరమునాటి సింహాచలము శాసనము ననుసరించి వ్యక్తమగుచున్నది. ఈదండయాత్రలో నతడు గౌతమీ పరిసర ప్రాంతము లందలి నాయకుల ననేకులను జయించెను, గౌతమీతట ప్రాంతము అప్పుడు కొండవీటి రాజ్యములో ఉండెను.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఈ దండయాత్రలో దక్షిణ కళింగమున రెడ్డిరాజుల అధికారము అంతరించినది. ఈ కళింగ దండయాత్రలో కుమారసింగభూవరుని పెదవేదగిరినేడు కూడ వెంబడించినట్లు కన్పట్టును. 'వెలుగోటి వారి వంశావళి'యందు పెదవేదగిరినేనికి ఆరోపితములైన బెండపూడి దుర్గాది విజయములు ఈ దక్షిణ కళింగ దండయాత్ర సందర్భమున లభించినవే కావచ్చును.

కుమార సింగమనాయని పరిపాలనాంతిమకాలముకూడ విజయనగరముతోడి యుద్ధములతో మరల రక్తపంకిలమయినది. విజయనగరాధీశ్వరుడైన రెండవ హరిహర దేవరాయలు రాచకొండరాజ్యమున తాను పొందిన అపజయమును మరువనులేదు; బహ్మనీ రాజ్యముపై పగ వీడనులేదు. బహ్మనీ సుల్తాను షంసుద్దీన్ షా కాలమున ఫిరూజ్ షా గుల్బర్గ రాజ్యమును ఆక్రమించుకొనుటకై ప్రయత్నించుచుండిన సమయమున హరిహరరాయలు బహ్మనీరాజ్యముపై యుద్ధము ప్రకటించి కృష్ణా, తుంగభద్రానదుల అంతర్వేదియందు తాను అదివరకు కోల్పోయిన ప్రాంతమును మరల సంపాదించుకొనుటకు ప్రయత్నించెను. శకవర్షములు 1319 (క్రీ. శ. 1397) లో ఫిరూజ్ షా గుల్బర్గ సింహాసనమును అధిష్ఠించెను. రాజ్యమునకు వచ్చిన వెంటనే ఇతడు విజయనగర సైన్యమును మార్కొనవలసి వచ్చెను. విజయనగర సేనానులలో ఒకడైన గుండ దండాధినాథుని పరాక్రమాగ్ని జ్వాలలలో యవన, తురుష్క, ఆంధ్ర భూవరులు శలభములవలె ప్రగ్గిరనియు, ఆ దండనాథుడు ఏనుగువంటి బలముగల సైప, పెత్తెయ ప్రముఖులైన తురుష్క వీరులను నిర్జించి తన అశ్వశాలలందు బంధించెననియు శకవర్షము 1319 (క్రీ. శ. 1397) నాటి విజయనగర శాసనము తెలుపుచున్నది. సైప, పెత్తెయ అనువారు సైఫ్ ఖాన్, ఫత్తే ఖానులు కావచ్చును. వీరిలో ఫత్తే ఖాన్ సుల్తాను ఫిరూజ్‌షాకు దగ్గర బంధువు; అలా ఉద్దీన్ హసన్ షాకు పౌత్రుడు. పూర్వోక్తశాసనమున తెలుపబడిన విజయములు బహ్మనీ సుల్తానులతోడి యుద్ధమున లభించినవే కాదగును. ఇట్లు గుండదండాధిపుడు బహ్మనీ సైన్యములను ఓడించుచుండిన కాలమున తమ ప్రభువైన ఫిరూజ్ సుల్తాను పక్షము వహించి బహ్మనీ సైన్యములకు విజయనగరాధీశ్వరుల ఒత్తిడి తగ్గించుటకై సింగమనేడు వేదగిరినాయని కుమారుడైన రామచంద్రనాయని కృష్ణా దక్షిణ తీరస్థమైన విజయనగర రాజ్యమును కొల్లగొట్ట బంపెను. రామచంద్రనాయడు కృష్ణానదిని దాటి కందనోలు (కర్నూలు) రాజ్యమున ప్రవేశించి కొల్లగొట్టుచుండ బండికనుమవద్ద కర్ణాటకము సైన్యములు అతనిని అడ్డగించినవి. ఆ సందర్భమున ఉభయపక్షముల వారికిని జరగిన పోరాటమున రామచంద్రానేడు గెలిచెననియు, కన్నడీలు పరాజితులైరనియు 'వెలుగోటివారి వంశావళి' తెలుపుచున్నది.

రామచంద్రనాయని రాజ్యమునుండి తరిమివైచి, ఓరుగంటి రాజ్యముపై దండువెడలుటకు విజయనగరాధిపతి రెండవ హరిహరరాయలు వెంటనే తన తనూజుడైన బుక్కరాయలను మరల నియోగించెను. అతడు సైన్యములను గూర్చుకొని రామచంద్రనాయని తమ రాజ్యమునుండి తరిమివేయుటయేకాక కృష్ణ దాటి రాచకొండ రాజ్యమున ప్రవేశించి దానిని విధ్వంసము కావించెను. బుక్కరాయల సైన్యములకు ఇరుగప దండనాథుడు అధిపతి. ఈ బుక్కభూపతికి ఆశ్రయుడైన లక్ష్మణాచార్యుడు తాను రచించిన సంస్కృత వైద్యగ్రంథమగు వైద్యరాజవల్లభమున తన పోషకుని ఈ ఓరుగంటి దండయాత్రను అభివర్ణించియున్నాడు: కుమార సింగభూపాలుని కుమారుడైన కుమారాన్నపోతానేడును, పెదవేదగిరినాయని తనయులైన రామచంద్ర, మాదానాయకులును పడసినట్లు 'వెలుగోటివారి వంశావళి'యందు అభివర్ణితములైన విజయములును, చేసినట్లు చెప్పబడిన శౌర్యకృత్యములును కూడ ఈ దండయాత్రకు సంబంధించినవే కావచ్చును. ఈరీతివి ఉభయవంశములవారును ఎవరికివారు తాము విజేతలమని డంబములు చెప్పుకొన్నను సత్య మరసిచూడ ఈ యుద్ధమునందు విజయము విజయనగరాధీశ్వరులదే అని తెలుచున్నది.

బుక్కరాయలు తన సైన్యములను తీసికొని కృష్ణను దాటి తాను దేవరకొండ రాజ్యమునందలి పానుగల్లు దుర్గమును ముట్టడించెను. ఎరకృష్ణరాయ, పందడాధీశులు అను వారు విజయనగర దండనాథులేమో. పెదవేదగిరినాయని కుమారుడు కుమారమాదానాయడు వారిరువురిని ఓడించినట్లు వంశావళి చెప్పుచున్నది. వీరిలో ఎరకృష్ణరాయడు దేవరకొండపై దాడివెడలెనట. అక్కడ అతనికి అపజయము కలిగినను బుక్కరాయలకు విజయమొనగూడినట్లు శాసనములే తెలుపుచున్నవి. విజయనగర సైన్యములు పానుగంటి దుర్గమును ఎప్పుడు ముట్టడించెనో అప్పుడే తురుష్క సైన్యములు రాచకొండ వెలమ దొరలకు సాయముగా వచ్చెను. బుక్క మహీపతి తనయుడైన అనంత భూపాలుడు పానుగంటి ముట్టడియందు అసమాన శౌర్య పరాక్రమములను చూపెను. తుదకు, ఈ పానుగంటి సంగ్రామమున విజయనగరాధీశ్వరులు విజయులైరి. పానుగంటి దుర్గము శకవర్షము 1319 (క్రీ. శ. 1397)లో, పుష్య



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



శుద్ధ ఏకాదశీ భానువారమునాడు బుక్కరాయల వశమైనది. ఈ విషయమును తెలుపు శాసనము పానుగంటి కోట గుమ్మముమీద చెక్కబడియున్నది. పానుగంటి విజయానంతరము బుక్కరాయలు ఇంకను ఉత్తరమున కరిగి రాచకొండ రాజ్యమును అల్లకల్లోలపరచినట్లు ఊహింపదగియున్నది.

పానుగంటి సంగ్రామమయిన కొద్దికాలమునకే కుమారసింగభూపాలుడు దివంగతుడయ్యెను. ఇతడు కవి, పండిత పోషకుడే కాక స్వయముగ గొప్ప కవియు విద్వద్వరేణ్యుడును; సర్వజ్ఞ డనియు, సర్వజ్ఞచూడామణి యనియు కవులచేత ప్రస్తుతుడయ్యెను. ఇతనికి ఆంధ్ర మండలాధీశ్వర, ప్రతిగండ భైరవ, ఖడ్గనారాయణ బిరుదములు కలవు. ఈతని ఆస్థాన కవులైన విశ్వేశ్వర కవియు, బొమ్మకంటి అప్పయార్యుడును తమ గ్రంథములలో ఈతనిని కుమారసింగభూపతి అని వ్యవహరించి యున్నారు. ఇతని తాత సింగభూపాలుడు ఒకడు ఉండుటచేత ఇతనికి కుమార సింగభూపతి అను వ్యవహారము న్యాయ్యమే. కాని శకవర్షము 1886 నాటి, ఈతని పౌత్రుడు ధర్మానాయకుని శాసనమున ఈతడు పెదసింగమ నాయకుడని వ్యవహృతుడైనాడు. ఈ శాసనము ధర్మానాయకునికి పూర్వము మూడు తరములను ఇచ్చుచున్నది. రావు ధర్మానాయకుని తండ్రి పినన్నమనాయకుడు (పిన అనంత, లేక పిన అనపోతానాయకుడు లేదా, కుమారాన్నపోతానాయకుడు); పితామహుడు పెదసింగమనాయకుడు; ప్రపితామహుడు పెదనపోతా నాయకుడు (అనపోతానాయకునికి అన్నమనే డనియు, అన్నమనాయ డనియు నామాంతరములు). గ్రంథములలో కుమారసింగమనేడని, శాసనములో పెదసింగమనేడని వ్యవహారములో ఈ వ్యత్యాసము ఎందువలన కలిగినదో తెలియుట లేదు. 'వెలుగోటి వారి వంశావళి'లోను, వెలుగోటివారి



చిత్రము 49. పంచేశ్వర శివాలయము, కొలను, పానుగల్లు

వంశచరిత్రలోను కూడ అనపోతానాయకునికి తరువాత తరములు తబ్బిబ్బుగా తెలుపబడినవి. ఇవి అనపోతానాయకునికి పెదసింగమనాయడు, ధర్మానాయడు అని పుత్రు లిరువురు కలిగిరని చెప్పుచున్నవి. వెలుగోటివారి వంశచరిత్ర ఈ పెదసింగమనాయడే రసార్ణవ సుధాకరము నామాంతరముగల సింగభూపాలీయమను అలంకార శాస్త్రమునకు కర్తయని చెప్పుచున్నది. అట్లయిన ఈ పెదసింగభూపాలుని కుమారసింగ భూపాలుడని ఈతని ఆస్థాన కవు లేల వ్యవహరించిరో విచారణీయము. సింగభూపతి అనపోత, దాచ, వల్లభ, వేదగిరి, మాదయ, దామయ అను ఆరుగురు పుత్రులను పడసెను. వీరిలో సింగభూపాలుని అనంతరము రాజ్యమునకు వచ్చినవాడు అనపోతానాయకుడు.

ఇమ్మడి అనపోతానాయకుడు (క్రీ. శ. 1899 - క్రీ.శ. 1421): సింగమనేని అనంతరము రాచకొండ సింహాసనము నెక్కినవాడు అతని కుమారుడు ఇమ్మడి అనపోతానేడు. ఇతనికి కుమారాన్నపోతానేడని, పినన్నమనాయకుడని నామాంతరములు. దాచ, వల్లభ, వేదగిరి, మాద, దామ నాయకులు ఇతని సోదరులు. 'వెలుగోటివారి వంశావళి'యందు తెలుపబడిన ఈతని పరాక్రమ కార్యములు బహ్మనీ సుల్తానులకును, విజయనగరాధీశ్వరులకును జరగిన సంగ్రామము సందర్భమునందలివని నిస్సంశయముగ చెప్పవచ్చును. ఈతడు బహ్మనీ సుల్తాను ఫిరూజ్ షాకు సమకాలికుడు. ఇమ్మడి బుక్కరాయల సైన్యములను ఎదిర్చి తన తండ్రి యనంతరము రాచకొండ రాజ్యమును కాపాడుకొనవలసిన భారము కుమారాన్నపోతానాయనిపై పడెను. ఇతడు మెతుకు (మెదకు) దుర్గమున పదివేల మందిని రక్షించెనని 'వెలుగోటివారి వంశావళి' తెల్పిన విషయము ఈ బుక్కరా ులు దండయాత్రా సందర్భమున జరగినదే యైనచో, బుక్కరాయలు మెదుకు దుర్గమువరకు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



జయించుచు పోయి ఆ దుర్గమునకు ముట్టడివైచె ననియు, అప్పుడు అనపోతానాయకుడు విక్రమించి ఆ దుర్గమును రక్షించి అందలి సైన్యమును కాపాడె ననియు ఊహింప దగును. వెలుగోటివారి వంశావళి తెలుపు ఈతని విజయములు అనేకము. ఇతడు సంబెట సోముని, సరెవల్లి తిమ్మని కొండవీటికడ గెలిచె ననియు, పానుగల్లాదిగా కోట రాజ్యమును కొల్లలాడె ననియు, రాజమహేంద్రము మేరగా రెడ్డిరాజ్యమును రేగగొట్టె ననియు, చెన్నపట్ణము మేరగా తిగుళ రాజ్యమును దెబ్బతీసె ననియు, బోయ రాజ్యమును పొడిచివైచె ననియు, రాయలను నిగ్రహించె ననియు, యుద్ధమున సంబెట్లను గెలిచె ననియు ప్రస్తుతింపబడినాడు. ఈ సందర్భమున 'వెలుగోటి వారి వంశావళి'ని గురించి ఇంచుక చెప్పవలసియున్నది. ఇందు రేచెర్ల వంశజులైన పద్మవెలమ వీరుల విజయ ప్రశస్తి అభివర్ణితమైనది. ఒక్కొక్క వెలమ వీరుడు జయించిన నాయకుల పేర్లు ఇది తెలుపును. కాని, విజితులైన నాయకులు ఏప్రాంతమును ఏలుచుండిరో, వారు ఎప్పుడు విజితులైరో ఇవేవియు వంశావళివలన తెలియవు. ఒక విజయమే ఇరువురు ముగ్గురు దొరలకు ఆరోపింపబడుటకూడ కలదు. అందువలన వంశావళియందు అభివర్ణితములైన ఈ విజయములు ఎప్పుడు చేకూరినవియు చెప్పుటయు, విజితులైన నాయకులలో చాలమందిని గుర్తించుటయు కష్టము. పూర్వోక్త విజయములను అనుసరించి చూడగా అనపోతానాయకునికి అవి బహ్మనీ సుల్తానుల పక్షము అవలంబించి కొండవీడు, రాజమహేంద్రవరము రెడ్డి రాజ్యాధిపతులతోను, విజయనగరాధీశ్వరులతోను జరపిన యుద్ధములలో లభించినట్లు కనబడును. సంబెట్ల నాయకులు విజయనగరాధీశ్వరులకు సామంతులు. తిగుళ, బోయ రాజ్యములును విజయనగరమునకు అణకువయైనవే. అనపోతానాయకుడు నిగ్రహించిన రాయలు విజయనగరాధీశ్వరుడు మొదటి దేవరాయలు కావచ్చును. సంబెట సోమదేవరాజు, సంబెట పిన్నమరాజు మొదలైనవారు శకవర్షము 1850 (క్రి. శ. 1428) ప్రాంతమున విజయనగర సామంతులుగా కర్నూలు మండలమునందు పరిపాలనము నెరపినవారు. సరివల్లె తిమ్మడు సర్వేపల్లి తిమ్మారెడ్డి. ఇతడు కటకము గజపతుల సామంతుడు. సంబెట సోమదేవరాజు, సర్వేపల్లి తిమ్మారెడ్డి అనపోతానేని కాలమునకు ఇంచుక తరువాత ఉండినట్లు శాసనములవలన తెలియుచున్నది. ఒకవేళ, వీరు అతని రాజ్యకాలము కడపట ఉండి, అతనికి కొద్దికాలము సమకాలీనులుగా కూడ ఉండిరేమో.



చిత్రము 60. స్త్రీ విగ్రహము, పానుగల్లు

అనపోతానాయకునికి సమకాలీనులై దేవరకొండ రాజ్యమును పాలించినవారు పెదవేదగిరినాయని తనయులు కుమార మాదానాయక, రామచంద్రనాయకులు. వీరి కాలమున మరల రెడ్డి రాజ్యాధిపతులతో పోరాటము సంభవించుటకు కారణము అన్నదేవచోడుని గాథ. రాజ్యబహిష్కృతుడైన అన్నదేవచోడుడు తన రాజ్యమును మరల సంపాదించుకొనుటలో తోడ్పాటును అర్థించి వేదగిరి నాయని ఆశ్రయించెను. కాని అతడు ఏకారణముననో అతనికి తగిన సాయము చేయలేక పోయెను. పెదవేదగిరి కొడుకు కుమార మాదానాయకుడు తగిన సైన్యములను ఇచ్చి కళింగము మీదుగ అన్నదేవచోడుని పంపెను. కాని ఈ సైన్యములు శకవర్షము 1824 (క్రి. శ. 1402) లో సర్వసిద్ధివద్ద గాంగ సామంతుడయిన చాళుక్య విశ్వేశ్వర భూపతిచేత ఓడింపబడి, మరలివచ్చినవి. ఈ తడవ సైన్యసమేతుడై కుమార



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మాదానేడు అన్నదేవచోడునికి సాయ మరిగెను. ఇతడు రాజమహేంద్ర రాజ్యమును రేగగొట్టెనన్నది ఈ సందర్భమున కావచ్చును.

అనవోతానాయకుడు పానుగల్లు రాజ్యమును కొల్లలాడుట శకవర్షము 1339 (క్రీ. శ. 1417) లో జరగిన విషయము. ఆ సందర్భమున తాజుద్దీన్ ఫీరూజ్ షా పానుగంటిని ముట్టడించెను. పానుగల్లు అప్పుడు విజయనగరాధీశ్వరులక్రింద ఉండెను. వెలమనాయకులు కూడ సైన్యములతో ఫీరూజ్ షాకు సాయ మరిగిరి. కాని, ఏకారణముననో ఫీరూజ్ షా సుల్తానుకును రాచకొండ వెలమ దొరలకును పూర్వముండిఉన్న మైత్ర్యనుబంధము చెడినది. ఇందుకు అనుగుణముగ నాటి విజయనగరాధీశ్వరుడు మొదటి దేవరాయలు ముట్టడి సాగుచుండిన కాలమున వెలమ దొరలతో రాయబారములు నడపి వారిని తమ పక్షమునకు త్రిప్పుకొనుటకై ప్రయత్నించెను. ఈ ప్రయత్నములు తుదకు ఫలించినవి. పానుగంటి కోటవద్ద భయంకర సంగ్రామము ప్రవర్తిల్లుచుండిన కాలమున అనవోతానేడు మొదలైన వెలమదొరలు తమ సైన్యములతో వచ్చి దేవరాయల పక్షమున చేరిరి. అంతటితో నిశ్చయ మనుకొన్న విజయము అపజయముగ మారగా సుల్తాను ఫీరూజ్ షా పారిపోయి అతికష్టముమీద తన రాజధాని గుల్బర్గా చేరుకొనెను. ఈ సంగ్రామము సాగుచుండిన కాలముననే కుమారాన్నవోతానాయకుడు కాలధర్మము చెందెను.





చిత్రము 51. మూషికవాహనుడైన వినాయకుడు, పానుగల్లు.

మాదానేడు (క్రీ. శ. 1421 — క్రీ. శ. 1480 (?)) : అనవోతానాయకునికి సింగమ నాయకుడు, వసంత భూపాలుడు, ధర్మానాయకుడు, కేశవనాయకుడు అని నలుగురు కుమారులు. వీరిలో అగ్రజుడైన (మూడవ) సింగమ నాయకుడు చిన్నవాడుగా ఉండిన కారణముచేతనేమో అనవోతానాయకుని అనంతరము రాచకొండ రాజ్యమును పరిపాలించినవాడు అతని యైదుగురు తమ్ములలో ఒకడైన మాదానాయకుడు. మొదటి సింగభూపాలుని కుమారుడైన అనవోతానాయని సంతతి వారిలో మాధవనాయక (మాదానాయక) నామాంచితుడు ఇతడే ప్రథముడు. ఇతని భార్య నాగాంబిక. ఇతడు శ్రీశైల వంశములో జనించిన రామానుజాచార్య తనూభవుడైన వెంకటాచార్యులవారి శిష్యుడు. ఇతడు శకవర్షము 1348 ప్లవ సంవత్సర శ్రావణ బహుళ విదియనాడు 'నిత్య నైవేద్యాంగరంగభోగ జీర్ణప్రాసాద గోపురోపవనాద్యనేక సముచిత కైంకర్యార్థము' శ్రీరంగనాథస్వామికి శ్రీరంగపురాగ్రహార మనుపేరు పెట్టి తొర్లూరను గ్రామమును దానము చేసెను. తండ్రి కుమారసింగ భూపాలుని వలెనే, ఇతడును గొప్ప విద్వాంసుడు. ఇతడు శకవర్షము 1349 ప్లవంగ సంవత్సరాశ్వయుజ మాసములో శ్రీమద్రామాయణమునకు 'సమీచీనముగ నర్థబోధకమగు రాఘవీయ మనువ్యాఖ్య నొనరించి' శ్రీరామచంద్రులవారి చరణకమలములందు ఉంచినాడు. ఇతని భార్య నాగాంబిక రాజాచల నికటమునందు శకవర్షము 1351 సౌమ్య సంవత్సరమున నాగసముద్రమను పేర ఒక తటాకమును నిర్మించి తటాక ప్రతిష్ఠ చేసెను.

పానుగంటి సంగ్రామ మయినతరువాతినుండి అనవోతానేని సోదరులు మాదానేడు మొదలైనవారును, అతని బంధువులును బహ్మనీ సుల్తానులతో శత్రుత్వము వహించి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వారి రాజ్య వినాశనమునకు ప్రయత్నింపజొచ్చిరి. విజయనగరాధీశ్వరుడు రెండవ దేవరాయలకును, శకవర్షము 1344 (క్రీ. శ. 1422)లో బహ్మనీ రాజ్యమునకు అధిపతియై బీదరు (బెదదకోట) రాజధానిగ దానిని పరిపాలించిన సుల్తాను అహ్మదు షాకును క్రీ. శ. 1424 లో సంభవించిన యుద్ధమున మాదానాయకుడు దేవరాయలకు పెక్కు విధముల తోడ్పడెను. ఈ కారణమున ఇమ్మడి దేవరాయలతో సంధి కావించుకొన్న అనంతరము సుల్తాను అహ్మదు షా హిజిరా 828 (క్రీ. శ. 1425) లో తెలంగాణాపై దండెత్తి ఓరుగంటి దుర్గమును సాధించుటకై అజీమ్ ఖానును పంపెను. అతడు ఓరుగంటి దుర్గమును ముట్టడించి పట్టుకొనెను. ఈ సందర్భమున ఓరుగంటి దుర్గపాలకుడైన రేచెర్ల వెలమనాయకుడు హతుడైనట్లు ఫెరిస్తా చెప్పుచున్నాడు. ఇది ఎంతవరకు నిజమో చెప్పలేము. ఒకవేళ హతుడగుటయే నిజమగుచో అనపోత, మాదానాయకుల సోదరుడు ఓరుగంటి దుర్గపాలకుడుగా ఉండినవాడు ఎవ్వడయినను హతుడై యుండవచ్చును. ఈ దండయాత్రలో పెక్కు హిందూ దేవాలయములు నాశనమయినవి; గ్రామములు దోచుకొనబడినవి; పంట పైరులు విధ్వంసము కావింపబడినవి. ఓరుగంటి దుర్గ పతనవార్త విని అహ్మదు షా ఓరుగంటికి వచ్చి దుర్గాధ్యక్షుని భాండాగారముననున్న ద్రవ్యము నంతను వశపరచుకొనెను. తరువాత, అహ్మదు షా యాజ్ఞచొప్పున అజీమ్ ఖాను రాచకొండ ప్రభువుల అధికారముక్రింద తెలంగాణాలో నున్న ఇతర దుర్గములను కూడ కొన్నిటిని జయించి నాలుగు మాసముల అనంతరము ఓరుగంటికి చేరెను. రాచకొండ, దేవరకొండ వెలమ దొరలు ఈ విజయములకు భయభ్రాంతులై రాయబారులను పంపి సుల్తాను అహ్మదుషాతో సంధి కావించుకొనినట్లు అలీ బిన్ అజీజుల్లా తబాతబా వ్రాయుచున్నాడు.

అజీమ్ ఖానును ఓరుగంటికి అధిపతిని కావించి సుల్తాను అహ్మదు షా తన రాజధాని బీదరుకు తిరిగిపోయిన తరువాత మరల వెలమ దొరలు విక్రమించిరి. అజీమ్ ఖాను వారి యధికారము క్రింద నుండిన దుర్గములను సాధింపలేక పోవుటయేకాక అంతకు పూర్వము అతడు జయించిన దుర్గములను కూడ ఒక్కొక్కటే కోల్పోవలసి వచ్చెను. అహ్మదుషా మాళవ గుజరాతు దేశముల సుల్తానులతో యుద్ధమున నిమగ్నుడై ఉండినతరి పోరాటము అవసరము లేకయే తెలంగాణాలోని అనేక దుర్గములను రాచకొండ, దేవరకొండ దుర్గాధిపతులు మరల వశపరచుకొనిరి.

**ముమ్మడి సింగమనాయకుడు** (క్రీ. శ. 1430 — క్రీ. శ. 1475): మాదానాయని అనంతరము, అతని యన్న అనపోతానాయకుని కొడుకు సింగమనాయకుడు రాజ్యమునకు వచ్చెను. ఈ శాఖలో సింగ భూపాలనామధేయము వహించినవారిలో ఇతడు మూడవవా డగుటచేత, ఇతనిని ముమ్మడి సింగమనాయకు డందురు. ఇతని పితామహునికి వలెనే ఇతనికిని సర్వజ్ఞ నామధేయము కలదు. ఇతని కాలమునుండి రాచకొండ, దేవరకొండ రాజ్యములు క్షీణదశలో పడినవి.

గుజరాతు, మాళవ సుల్తానులతో యుద్ధము ముగిసిన వెనుక బహ్మనీ సుల్తాను అహ్మదు షా శకవర్షము 1355 ప్రాంతమున మరల తెలంగాణాపై దండెత్తివచ్చెను. ఓరుగంటి దుర్గాధిపతియు, మరికొందరు నాయకులును సుల్తాను పరాక్రమ ధాటికి ఆగలేక అతనికి లొంగిపోయి ప్రతి సంవత్సరము అతనికి కప్పము కట్టుటకు అంగీకరించిరి. అట్టివారి రాజ్యములు వారికి నిలిచినవి. పాదాక్రాంతులు కాక అతనిని ఎదిరించి పోరాడినవారు హతులైరి. వారి దుర్గములు బహ్మనీ రాజ్యములో కలుపుకొనబడినవి. ఈ దండయాత్రా సందర్భముననే తెలంగాణాలోని బలిష్ఠ దుర్గములలో ఒకటియైన రామగిరిని అహ్మదు షా పట్టుకొనెను. చాలకాలము ఈ దుర్గములను జయించుచు అహ్మదు షా తెలంగాణాలోనే ఉండెను. అతడు ఇబ్రహీం సంజర్ ఖానును తన సైన్యమునకు అధిపతిని కావించి తెలంగాణాలో ఇంకను మహమ్మదీయాధికారము క్రిందికి రాని ప్రాంతమును జయించి, ప్రజలను అనునయించి సంతృప్తిపరచుటకు నియమించి అతనికి భువనగిరి (భోనగిరి) దుర్గమును, దానికి అణకువయై ఉండిన సీమలను జాగీరుగా ఇచ్చెను. మొత్తముమీద, సుల్తాను అహ్మదు షా కాలములో సంజర్ ఖాను తెలంగాణాలో చాల భాగమును జయించి బహ్మనీ సుల్తానులకు వశపరచినట్లు కనబడును; ఏలన, అహ్మదు షా కాలధర్మము పొందుటకు పూర్వము అతడు తన కుమారులలో మహమూద్ ఖానుకు బరారు (ఇప్పటి మధ్యప్రదేశ్‌లోని దక్షిణభాగము)లో కొంత భాగమును, మాహూరు, రామగిరి, కలం (?) దుర్గములను, దావూద్ ఖానుకు రాజాచల దుర్గమును, దానికి అణకువయై యుండిన మండలములను ఇచ్చినట్లు ముస్లిము చరిత్రలు చెప్పుచున్నవి. ఇదియే సత్యమయినచో, రాచకొండ దుర్గమును బహ్మనీ సుల్తానులు శకవర్షములు 1355, 1357 ల నడుమ జయించినట్లు విశదమగుచున్నది. సుల్తాను అహ్మదు షా క్రీ. శ. 1435 లో చనిపోయెను.

దేవరకొండలో ముమ్మడి సింగభూపాలునికి సమకాలికుడై పరిపాలించి అతనితో సహకరించినవాడు కుమార మాదానేని కుమారుడు లింగమనేడు. ఇతనికి కుమార



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వేదగిరినే డనుసోదరుడు కూడ కలడు. కుమార వేదగిరి నేడు కొండవీటిరెడ్డి ప్రభువైన పెదకోమటి వేమారెడ్డి సోదరుడు మాచారెడ్డిని కొట్ట తమ్మ పడిగమున పొది గింపగా ఆ పెదకోమటి వేముడు కుమార వేదగిరిని చంపి తమ్మపడిగమున పొదిగించి సింహతలాట బిరుదమును చైకొనెనట. కుమార వేదగిరి కంటెను అసహాయ శూరుడు లింగమనాయకుడు. ఇతడు తన పంద్రెండవ యేటనే బలములను గూర్చుకొని శత్రువులపై దండెత్తివెళ్లి విజయ పరంపరలను పడసినట్లు 'వెలుగోటివారి వంశావళి' తెలుపుచున్నది. ఇతని విజయములను తెలుపు చాటువులు వంశావళిలో అనేకము కలవు. వీనిలో ముఖ్యమైనది ఈతని శౌర్య పరాక్రమ కృత్యములను అభివర్ణించు ఒక చాటు సీసమాలిక. ఈతడు ఓడించిన రాజుల, నాయకుల పేర్లు ఆ సీసమాలికా చరణములలో తెలుపబడినవి. కాని, వారిలో ఇదివరలో నుడివినట్లు చాలమంది ఎచ్చటివారో గుర్తింప గుదురదు. ఈ సీసమాలికలో ఇతని పూర్వులు, ఇతని తరువాతివారు చేసిన విజయములు కూడ ఇతని కారోపితములైనవి. ఇతడు తన పంద్రెండవ యేటనుండియే యుద్ధవ్యాపార ప్రవృత్తుడైనందున, ఇతని పూర్వులు సాధించిన కొన్ని విజయములలో ఇతనికి కూడ కొంత పాలు ఉండవచ్చును. మొత్తముమీద ఈ సీసమాలికవలన కలుగవలసినంత లాభము కలుగుటలేదు. లింగను నేడు ఓడించినట్లు తెలుపబడినవారిలో కొద్దిమంది శాసనములు మాత్రమే దొరకినవి. వాని ననుసరించి చూడగా వారిలో కొందరైనను లింగమనేనికి తరువాతివారై యుందురనియు, అతనికి సమకాలీనులయియుండరనియు తోచుచున్నది. మొత్తముమీద వంశావళియందు ఈతనిని గురించిన చాటువులు ఈతడు బహుశౌర్య పరాక్రమవంతుడనియు, అహ్మదు షా కాలమునుండియు ఈతడు సమర వ్యాపార పరతంత్రుడయ్యెననియు, రాజమహేంద్రవర రెడ్డిరాజ్యము శిథిలమై అంతరించుటకు గల ముఖ్య కారణములలో ఈతని దండయాత్ర లొకటి యనియు, ఈ రాచకొండ దేవరకొండ రాజ్యాధిపతులు ఒకప్పుడు బహ్మనీ సుల్తానుల పక్షమునను, మరొకప్పుడు విజయనగరాధీశ్వరుల పక్షమునను, ఇంకొకప్పుడు కటకము గజపతుల పక్షమునను చేరి వారి వారి శత్రువులతో పోరాడుచు వచ్చిరనియు విశదము చేయుచున్నవి. మొత్తముమీద ఇంతటినుండి రాచకొండ, దేవరకొండ వెలమ దొరలకు సుస్థితి అంతరించినది. తమ రాజ్యమును మరల సంపాదించుకొనుటకు వీరు క్రీ. శ. 1484-85 లో కళింగోత్కల సామ్రాజ్యమునకు అధిపతియైన కపిలేశ్వర గజపతి సాహాయ్యమును వేడుకొనిరి. రాజ్యమునకు వచ్చిన కొద్ది సంవత్సరములలోనే, శకవర్షము 1866 (క్రీ. శ. 1444) నాటికి గౌతమీ తటము వరకు గల దేశమును జయించి కపిలేశ్వరుడు తెలంగాణా బహ్మనీ ప్రాంతముపై దండెత్తివెళ్లెను. అహ్మదుషా తరువాత బహ్మనీ రాజ్యమునకు అధిపతియైన అలా ఉద్దీన్ షా ఓఢ్ర సైన్యములను ఓడించి తరుమగొట్టుటకు సంజర్ ఖానును నియోగించెను. ఇంతలో, శకవర్షము 1857 (క్రీ. శ. 1435) లో అలా ఉద్దీన్ తమ్ముడైన మహమూద్ ఖాను అతనిపై తిరుగబాటు చేసెను. కాని, అతని విజయధాటికి ఆగలేక మహమూద్ ఖాను అతనిని శరణువేడెను. సుల్తాను అలా ఉద్దీను అతనిని క్షమించి రాజాచల (రాచకొండ) సీమ పాలకుడైన దావూదు ఖాను మృతినొందుటచేత ఆ సీమను సామంత మండలిక పద్ధతిని అతని కిచ్చెను. మొత్తముమీద రాచకొండ ప్రభువులు తమ దుర్గమును సాధించుకొనలేకపోయిరి.

అలా ఉద్దీన్ శకవర్షము 1379 (క్రీ. శ. 1457) లో లోకాంతరగతుడయ్యెను. అతని యనంతరము అతని కుమారుడు హుమాయూన్ షా రాజ్యమునకు వచ్చెను. ఈతడు కడు క్రూరుడు. ఇతనిని కాక, ఇతని సోదరుడు హసన్ ఖానును బహ్మనీ సింహాసన మెక్కింప రాజ్యములోని ప్రముఖులు కొందరు ప్రయత్నించిరి. ఎట్టకేలకు ఈ హసన్ ఖాను తిరుగబాటును సుల్తాను అణచివేసెను. ఇంతలో అలా ఉద్దీను సుల్తాను రాజ్యకాలములో తిరుగబాటుచేసి అది ఫలింపక చివరకు క్షమింపబడిన సికందరు ఖాను మరల తిరుగబాటు చేసెను. రాచకొండ, దేవరకొండల వెలమదొరలు అతనికి ప్రోత్సాహ మిచ్చి సహాయపడిరి. ఈ తిరుగబాటును అణచుటకు సుల్తాను హుమాయూన్ షా స్వయముగా దండు కూర్చుకొని పోయెను. ఉభయులకు జరగిన ఈ సంగ్రామములో సికందర్ ఖాను హతుడయ్యెను. విజయమును పొందిన సుల్తాను తన రాజధాని బీదరుకు పోయి కొలదికాలము అక్కడ ఉండి అటు పిదప సికందర్ ఖాను తిరుగబాటులో అతనికి తోడ్పడిన రేచెర్ల వెలమదొరలను, ఇతర ఆంధ్రనాయకులను శిక్షించుటకై తెలంగాణాపై దండెత్త ఖ్వాజా జహాన్, నిజాముల్ ముల్క్ లను నియమించెను. వారు 20,000 ల గుర్రపు దళముతోను, 40 ఏనుగులతోను అసంఖ్యాకమైన పదాతి సైన్యముతోను తెలంగాణాపై దండెత్తివచ్చి, తెలుగు వారికి నాయకులైన రేచెర్ల వెలమ వీరుల దేవరకొండ దుర్గమును ముట్టడించిరి. ఓరుగల్లు, రాచకొండ దుర్గములు బహ్మనీ సుల్తానులకు వశమైనను దేవరకొండ దుర్గము మాత్రము అంతవరకు వారికి వశము కాలేదు. తెలంగాణా

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



లోని అతి బలిష్ఠ దుర్గములలో ఇది ప్రముఖమైన దనియు, అంతవరకు ఏవిజేతయు దానిని పట్టుకొనలేకపోయె ననియు, ఇది చాల ఎత్తయిన దనియు అజీజుల్లా తబా తబా వ్రాయుచున్నాడు. ముట్టడి కొంతకాలము సాగినది. కోట లోనివారికి ఇంక దుర్గమును రక్షింపలేమను అధైర్యము కలిగి తమకు సాయపడవలసినదని ఓఢ్రదేశపు కపిలేశ్వర గజపతికి వారు వర్తమాన మంపిరి. తమ పరిస్థితి నంతయు వివరించి చెప్పి తమకు కొంత సైన్యసాహాయ్యమును పంపి తమ్ము ఆభయంకర విషమ పరిస్థితినుండి తప్పించి కాపాడి నచో వలసినంత ధనము నిచ్చుటకు వారు అంగీకరించిరి. హిందూధర్మమును, సంస్కృతిని కాపాడు ఉద్దేశముతోను, ధనలాభము కలుగునన్న ఆశతోను కపిలేశ్వర గజపతి వంద యేనుగులతో అసంఖ్యాకబలములను వెలమదొరల సాహాయ్యార్థము పంపినట్లు ముస్లిము చరిత్రకారులు వ్రాయుచున్నారు. కపిలేశ్వరగజపతి తన కుమారుడైన హంవీరదేవుని (ముస్లిము చరిత్రకారుల అంబర్ రాయ్) నాయకత్వమున దేవరకొండ దుర్గాధిపతులకు తోడ్పడి తెలంగాణాను బహ్మనీ సుల్తానుల ఆధిపత్యమునుండి విడిపించుటకై పైని చెప్పినట్లు గొప్పసేన నిచ్చి పంపెను. గజపతుల సైన్యము వచ్చుచున్నదని తెలిసియు ఖ్వాజా జహాను, నిజాముల్ ముల్కులలో అభిప్రాయభేదము కలిగి ఇతి కర్తవ్యతామూఢులై ఉభయులును సైన్యములతో అక్కడనే ఉండిపోయిరి. హంవీరదేవుడు సైన్యసమేతుడై దేవరకొండ వద్దకు వచ్చిన తరువాత సింగమనాయక, లింగమనాయకాదులు కోటలోనుండి బయటికి వచ్చి బహ్మనీ సైన్యమును మార్కొనిరి. ఇవతల హంవీరదేవుని సైన్యమునకును, అవతల సింగమనాయక లింగమనాయక సైన్యమునకును మధ్య చిక్కుకొని బహ్మనీ సుల్తానుల సైన్యములు చాల నాశనమైనవి. ఖ్వాజా జహాను, నిజాముల్ ముల్కులు ఎట్టెటో కష్టముతో తప్పించుకొని యుద్ధరంగమునుండి పారిపోయిరి.

దేవరకొండవద్ద ముస్లిములను జయించుటతో హిందూ సైన్యములు సంతృప్తిచెంది ఊరకుండలేదు. అవి తెలంగాణాలో మహమ్మదీయుల వశమునందున్న దుర్గములను ఒక్కటొక్కటిగ జయింప మొదలిడెను.

దేవరకొండవద్ద బహ్మనీ సైన్యములకు అపజయము కలిగినట్లు తెలిసినవెంటనే సుల్తాను హుమాయూన్ షా ప్రళయకాల రుద్రునివలె మండిపడెను. అతడు నిజాముల్ ముల్కును చంపించివేసి, ఖ్వాజా జహానును అవమానపరచి బందిఖానాలో ఉంచి, మిగిలిన సేనానులను చిత్రహింస పాలుచేసెను. తరువాత, అతడు స్వయముగానే ఈ యవమానమును తుడిచివేసికొనుటకై మరల దేవరకొండపై దండెత్త దలంచెను. కాని, ఇంతలో రాజధాని లోనే కొందరు తిరుగబాటు చేయుటకు సేనను కూర్చుకొనుచుండినట్లు వార్త తెలియుటచేత ఆ ప్రయత్నమును విరమించుకొని హిందూసేనలను పారదోలి తెలంగాణాను మరల సాధించు పనిని మహమూదు గవానుపై పెట్టెను. మహమూదు గవానుకు ఇది అలవికాని పనియైనది. హంవీరదేవునియొక్కయు, సింగమనాయక లింగమనాయకులయొక్కయు విజయధాటికి అడ్డమాకలు లేకపోయినవి. ఒక్కొక్క దుర్గమే వారికి వశమయినది. ముస్లిముసేనలు గచ్చువిచ్చై వెన్నిచ్చి పారిపోయినవి. రాజాచలము (రాచకొండ), భువనగిరి మొదలైన దుర్గములేకాక, తుదకు ఓరుగంటి దుర్గముకూడ హిందువులకు చేపడినది. ఓరుగంటిలో శకవర్షము 1382 (క్రీ. శ. 1461) నాటి హంవీరదేవుని శాసన ముండుటవలన ఈ దుర్గము ఆ ప్రాంతముననే జయింపబడినట్లు రూఢి యగుచున్నది. మరల రేచెర్ల వెలమ ప్రభువులు ఓరుగంటి రాజ్యమును ఆక్రమించుకొనిరి. కుమారాన్నపోతా నాయకు డను పినన్నమనాయకుని పుత్రులలో ఒకడును, ముమ్మడి సర్వజ్ఞ సింగమనాయకుని అనుజుడును అయిన రావు ధర్మానాయకుడు. ఓరుగంటి రాజ్యమునకు అధిపతి యయ్యెను. శకవర్షము 1386 తారణ నాటి ఇతని శాసన మొకటి శాయంపేటలో ఉన్నది. ఆ సంవత్సరమున వైశాఖ శుద్ధ 15 వడ్డవారము (శనివారము)నాడు సోమగ్రహణ పుణ్యకాలమందు రావు ధర్మానాయకుడు ఓరుగంటి సీమలోని క్రొత్తగట్టుస్థలము నందలి మచ్చెర్ల, మందపల్లెలు చతుస్సీమా సమేతముగాను, కృష్ణా పాండుర కేదార భూసమేతముగాను, నిధి నిక్షేపా దృష్ట భోగ తేజ స్స్వామ్య సమేతముగాను మచ్చెర్ల తిరువెంగళేశ్వరునికిని, అయ్యంగార్లు పంద్రెండుగురికిని, మహాజనాలు పంద్రెండుగురికిని ' వెరసి 84 వృత్తులుగా పరికల్పన చేసి కృషీవల సమేతముగా ధారవోసి ఇచ్చెను '. ఇందువలన ఓరుగంటి దుర్గము హంవీరదేవుడు జయించిన తరువాత నాలుగు సంవత్సరముల వరకు సుల్తాను రెండవ మహమ్మదు షా (క్రీ. శ. 1463 - క్రీ. శ. 1482) కాలము వరకు రేచెర్ల ప్రభువుల అధీనమునందే ఉండెనని విశదమగుచున్నది. సుల్తాను హుమాయూన్ షా తరువాత బహ్మనీ సింహాసన మెక్కి రెండేండ్లు మాత్రమే రాజ్యము చేసిన సుల్తాను నిజామ్ షా కాలమున మరల ముస్లిములు తెలంగాణాలోని దుర్గములను వశపరచుకొనుటకు ప్రయత్నించిన ట్లున్నది. అప్పుడుకూడ కపిలేశ్వరగజపతి చాల కాల్బలమును, గొప్ప గుర్రపు దళమును, ఏనుగులను



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తెలంగాణాకు పంపి తెలంగాణా నాయకులకు తోడ్పడెను. గజపతి సైన్యములు రాజమహేంద్రవరమునుండి కొలన వరకు దండెత్తివెళ్లి మహమ్మదీయాధికారము క్రింద ఉండిన ప్రదేశము నంతను విధ్వంసముకావించి రాజధాని యైన బీదరు సమీపమువరకు వచ్చినవి. అప్పుడు అమీర్ జాద ముహిబుల్లా మాట అరువదిమందితో పోయి పదివేల కాల్బలము, 400 ల గుర్రపు దళముతో కూడిన గజపతి సైన్యములోని ముందరి భాగమును ఓడించి తరుమగొట్టి నట్లు ఖ్వాజా నిజాముద్దీన్ అహ్మదు వ్రాయుచున్నాడు. గజపతి సైన్యము ఓడిపోయి ప్రధాన సైన్యముతో కలిసి నట్లు ముస్లిము చరిత్రకారులు చెప్పుచున్నను ఇది వారికి పరిపూర్ణ విజయము మాత్రము కాదు. బహ్మనీ రాజధాని బీదరుకు మాత్రము ముప్పు తప్పినది. ఓరుగంటి రాజ్యము రేచెర్లవారి అధీనముననే యుండెను.

రేచెర్ల వెలమ ప్రభువుల రాజ్యము బహ్మనీ సుల్తానులకు వశము కాకుండ రక్షింపబడినను వారు తమ స్వాతంత్ర్యమును మాత్రము కోల్పోయిరి. వారు బహ్మనీ సుల్తానులకు పాదాక్రాంతులగుటకు మారుగా కటకము గజపతి కపిలేశ్వరునికి సామంతులై అతనికి కప్పము కట్టుచు అతని దండయాత్రలలో పాల్గొని అతనికి సాయపడుచు వచ్చిరి. లింగమనాయకుడు పాడిచేటి కోట సంగ్రామమున బుక్కరాజును ఓడించి పట్టుకొని గజపతి మెచ్చగా కాపాడినట్లు వంశావళి చెప్పు విషయము ఒకవేళ గజపతులు విజయనగరముపై దండెత్తివెళ్లిన సందర్భమున జరిగిన సంఘటన కావచ్చును. ఈ బుక్కరాజు పోలేపల్లి బుక్కరాజగు నేమో. అట్లయిన ఈతని శాసన మొకటి శకవర్షము 1404 నాటిది కలదు. లింగమనేడు శకము 1404 వరకు జీవించి యుండినట్లు ఊహింపవచ్చును.

మొత్తముమీద తెలంగాణాలో రేచెర్లవారికి రాజ్యము లేకుండపోయినది రెండవ ముహమ్మదు షా కాలములోనే. అదియైనను కపిలేశ్వర గజపతి మరణానంతరమే. కపిలేశ్వరుడు జీవించి యున్నంతకాలము బహ్మనీ సుల్తానులకు తెలంగాణాను అంతను జయించుట అసాధ్యమయినది. శకవర్షము 1392 ప్రాంతమున వార్తాహరు డొకడు తెలంగాణానుండి వచ్చి తెలంగాణాకు ప్రధానాధిపతియైన ఓఢ్ర దేశపురాజు(కపిలేశ్వర గజపతి) మృతినొందినట్లు సుల్తానుకు చెప్పగా అతడు అమితానందమును పొంది అతని రాజ్యమును జయించుటకు నిశ్చయించుకొని యుద్ధవిషయమును గూర్చి విచారించుటకు ఉమ్రావులు, వజీర్లు మొదలైన వారిని ఆహ్వానించి సభ చేసె ననియు, అందు మలిక్ నిజాముల్ముల్క్ బహ్రీ ముందుకు వచ్చి తాను ఈ పని నెరవేర్పెదనని చెప్పి సుల్తాను అనుజ్ఞ గొనె ననియు, సుల్తాను అతనిని సత్కరించి పంపె ననియు అలీ బిన్ అజీజుల్లా తబా తబా వ్రాయుచున్నాడు. ఈతడు తెలంగాణాలోని దుర్గములనే కాక, కొండవీడు రాజమహేంద్రవర దుర్గములను గూడ బట్టుకొని తెలంగాణానంతను ఆక్రమించుకొనెను. అదియునుగాక, కపిలేశ్వర గజపతి మరణానంతరము కటకము గజపతి సింహాసనమునకై హంవీరదేవ, పురుషోత్తములు పోరాడుకొనుటయు, హంవీర దేవుడు సుల్తాను ముహమ్మదు షా సాహాయ్యము కోరుటయుకూడ తెలంగాణా బహ్మనీ సుల్తానులకు సులువుగా వశమగుటకు కారణమైనది. శకవర్షములు 1396 - 97 నాటికి తెలంగాణా పూర్తిగా సుల్తాను రెండవ ముహమ్మదుషా అధికారము క్రిందికి వచ్చినది. అతడు హిందూ సంస్థానాధిపతుల నందరిని తరుమగొట్టి వారి రాజ్యములను తన యుద్యోగుల కిచ్చెను. ఓరుగల్లును, దాని కణుపయైన మండలములును సుల్తాను అజీమ్ ఖానుకు ఇచ్చినట్లు ఫెరిస్తా చెప్పుచున్నాడు. ఈ రీతిని రేచెర్ల ప్రభువుల రాజ్య మంతరించినది. ఇంతటి నుండి వారు విజయనగరాధీశుల కొలువులో చేరి వారిని సేవించుచు వచ్చిరి.

ముమ్మడి సర్వజ్ఞ సింగమనాయకుడు శకము 1397 మన్మథ సంవత్సరమువరకు జీవించియున్నట్లు అతని తిరుపతి శాసనమువలన తెలియుచున్నది. ఈ శాసనమందు ఈతనికి పాండ్య భూపాల గుండాల ఖండనోద్దండ కేసరి, ఖడ్గ నారాయణ, ప్రాజ్య కాకతి రాజ్యశ్రీ ప్రతిష్ఠాపనదేశిక, గాయగోవాళ, సర్వజ్ఞ బిరుదము లీయబడినవి. శాసనము నందు ఈతడు నృసింహప్రభుడని పేర్కొనబడినను రావు పినన్న భూపాల (కుమారాన్నపోత భూపాల) రత్నాకర సుధాకరు డనియు, సంస్కృతమున నున్న ఈ శాసన ప్రతిలో పిన్నన్న (పిన్ననంత - కుమారాన్నపోత) సుతు డనియు చెప్పబడుటచేత ఇతడు ముమ్మడి సర్వజ్ఞ సింగమ నాయకు డనుటకు సంశయింప బనిలేదు. ఈ తేదీనాటిదే (శకము 1397 మన్మథ కన్యామాసము బహుళ దశమి భానువారము) రావు పిన్న (కుమారాన్నపోత) భూపాల రత్నాకర సుధాకరుడును, శ్రీ వేంకటాచార్య అసత్పద పంకజ షట్పదుడును అయిన కేసయ(? కేశవ) నాయకుని శాసనముకూడ అక్కడ కలదు. ప్రాయికముగా ఇతడు ముమ్మడి సర్వజ్ఞ సింగమనాయకుని సోదరుడే యగును. ఈ యిరువురి శాసనములును సాళువ గుండ నరసింహారాయల చంద్రగిరి రాజ్యములోని తిరుపతిలో ఉండుటవలన ఈ రేచెర్ల వెలమనాయకులు విజయనగరాధీశ్వరుల కొలువులో చేరి యుండవలెను; లేదా, ఈ ప్రాంతమున విజాగు

http://www.sanskritcentral.com/

http://teluguthesis.com/



నగర రాజ్యముపై గజపతి దండయాత్ర ఉండినయెడల వారి పక్షమున చేరినయైన ఇచ్చటికి వచ్చియుండవలెను. ఈ విషయము ఇంకను పరిశీలింపవలసియున్నది. త్రిభువనీ రాయాంక దీపితుడైన ఈ రేచెర్ల (ముమ్మడి) రావు సింగమనాయని కంఠమ రాజవంశ్యుడయిన తమ్మ భూపాలుడు పరాజితుని కావించెనని విష్ణుభక్తి సుధాకరమను గ్రంథమును, పెదవీటిచెంత సంగర రంగమందు దునిమెనని ఉషాభ్యుదయకావ్యమును తెలుపుచున్నవి. రెండును రెండు వేరు వేరు సంగరములో, లేక రెండును ఒక్కటియే అగునో తెలియదు. వేరు వేరు సంగ్రామములైనచో మొదటి రణమున ఓడించి, రెండవ సంగరమున దునిమి యుండ వచ్చును. అయినను, ఈ రెండు తెలుగు కావ్యములును చెప్పుదానిలో ఏది నిజమో తెలియదు. మొత్తముమీద తమ్మ భూపాలుడు మూడవ సింగమనేనిని నిర్జించె ననుట వాస్తవమేమో. ఈ తమ్మభూపాలుడు కటకము గజపతుల కొలువులోనివాడు; వారి సామంత సేనానులలో ఒకడు. ఈతడు సింగమనాయని నిర్జించుటకాని, సంహరించుటకాని యథార్థమయినచో అది పురుషోత్తమ గజపతి ఉదయగిరి దండయాత్రలో జరగియుండవలెను. అట్లయినచో సింగమనేడు విజయనగరాధీశ్వరుల కొలువులోనే చేరి గజపతుల నెదుర్కొని ఓడిపోయి యుండవలెను. సింగమనాయకుని అంతమును గురించి మన కేమియు తెలియదు. తరువాతి రేచెర్ల వంశ్యులు విజయనగరాధీశ్వరుల కొలువులో కుదిరియుండుట వలన ప్రాయశః ఈ ముమ్మడి సర్వజ్ఞ సింగమనాయడుకూడ విజయనగరాధీశ్వరులనే సేవించి యుండవచ్చును.

రాచకొండ నేలిన పద్మ నాయకులు వీరాధివీరులు, అమిత పరాక్రమవంతులు. ప్రచండ రణవ్యాపారము వారికి ఒక క్రీడావిశేషము. ఈ కాలములో వీరు వాడుకలోనికి తెచ్చిన భయానక, బీభత్సచర్య రణము కుడుపుట, అనగా 'శత్రువులు నిహతులైన చోట వారి రక్తముతో గలిపిన యన్నము వారి తల పునుకలలో పెట్టుకొని, యొడలికి భస్మ మలదికొని, జుట్టు విరియబోసికొని, యర్ధరాత్రికాలమున నొంటిగా దిగంబరులై భూతబలి మంత్రములు చదువుచు డాకిన్యాదులకు బలిపెట్టుట.' ఇది అగమోక్త విధానమని చెప్పుదురు. యుద్ధమున జయించినపుడెల్ల వీరు ఈ విధమున చేయుచువచ్చిరని 'వెలుగోటివారి వంశావళి' తెలుపుచున్నది. ఈ యాచారము తెలంగాణాలోనే రేచెర్ల వంశ్యులలోనే వాడుకలో నుండినట్లు కనిపించును.

రేచెర్ల వెలమ నాయకులు సమరతంత్రమున ఎంతటి కుశలులో సాహిత్య వ్యాపారమునను అంతటి ప్రవీణులు. వీరు కవి పండిత పోషకులు; దాన ధర్మ నిరతులు. వీరిలో కుమారసింగ భూపాలుడు సర్వజ్ఞ చూడామణి బిరుదాంకితుడు. ఇతడు రసార్ణవ సుధాకరమను అలంకారశాస్త్రమును, శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరమునకు సంగీత సుధాకరమను వ్యాఖ్యయును, కువలయావళీ నామాంతరముగల రత్నపాంచాలికయను నాటికను రచించెను. ఈతడు రచించిన గ్రంథములలో ఇంతవరకు దొరకినవి ఇవే. అమరకోశమునకు వ్యాఖ్య రచించిన బొమ్మకంటి అప్పయార్యుడును, చమత్కార చంద్రికాకర్త విశ్వేశ్వర కవియు ఈతని యాస్థానము నలంకరించిన కవులు. ఈ సింగభూపాలుని కుమారుడు మాధవనాయకుడు శ్రీమద్రామాయణమునకు రాఘవీయమను పేర ఒక వ్యాఖ్య రచించెను. కాని, అది ఇప్పుడు కానవచ్చుట లేదు. ముమ్మడి సింగభూపాలుడు కూడ గొప్ప విద్వాంసుడు. ప్రజ్ఞాబలార్జితాన్వర్థ సర్వజ్ఞ బిరుదోజ్జ్వలుడని, దేశాంతరాశ విక్రాంత యశస్కర పరాక్రముడని తిరుపతి శాసనములో ఇతడు కీర్తింపబడినాడు. శ్రీనాథ కవి సార్వభౌముడు సందర్శించినది ఈ ముమ్మడి సింగభూపాలునే. మొదటి అనపోతానాయని కాలమునాటి మరియొక కవి పశుపతి పండిత తనయుడైన నాగనాథకవి. ఇతడు మదన విలాసమను ఒక రూపక భేదమును రచించెను. మొదటి అనపోతానేని అనుజుడును, మొదటి మాదానాయనికి ఆశ్రితుడును, పెద్దన మంత్రి తనూభవుడునైన పోతరాజుకూడ గొప్ప పండితుడు. ఇట్టివారు ఇంకను కలరు.

పైనుడివిన సంస్కృత కవులను వలెనే రేచెర్ల వంశ్యులు తెలుగు కవులను కూడ ఆదరించిరి. పశుపతి పండిత తనూభవుడైన నాగనాథుడు తెలుగులో కూడ కవి. ఇతడు విష్ణుపురాణమును తెలుగులో రచించినట్లు 'ప్రబంధ రత్నావళి' వలన తెలియుచున్నది. మొదటి మాదానాయని కుమారుడు పెదవేదగిరి నాయనికి ఆశ్రితుడు అయ్యలార్యుడు. ఈతడు పెదవేదగిరి నాయనింగారి నియోగమున భాస్కర రామాయణమునందలి యుద్ధకాండ శేషమును పూర్తి కావించెను. ఇంకను ఈ కాలములో రాచకొండ రాజ్యములో వర్ధిల్లిన తెలుగు కవులు కలరు. వారిలో ముఖ్యుడు ఆంధ్ర మహాభాగవత కృతికర్తయును, పరమభక్తాగ్రేసరుడును అయిన బమ్మెర పోతరాజు. ఈతడు ముమ్మడి సింగభూపాలుని కాలమువాడు. గౌరన, కొరవి గోపరాజు, శైరవి కవి - వీరుకూడ ఈనాటివారే. రేచెర్ల వంశ్య రాజ్యావసానమయముతో తెలంగాణాలో కవి పండిత పోషణము మరల రమారమి రెండు శతాబ్దములవరకు మృగ్యమాయెనది.

మ. సో. శ.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/

# కొండవీటి రెడ్డిరాజ్యము

ముసునూరి ప్రోలయ నాయకునికిని, ముసునూరి కాపయ నాయకునికిని విధేయానుచరుడై వారి యధ్యక్షపదవిని, ఆధిపత్యమును అంగీకరించి స్వాతంత్ర్యోద్యమమున పాల్గొని తద్విజయమునకును, హిందూరాజ్య పునరుద్ధరణమునకును తోడ్పడిన వారలలో వేమారెడ్డి యొకడని ఈవరకే చెప్పబడినది. ఇతడు కామారెడ్డి పౌత్రుడు; ప్రోలయరెడ్డి అన్నమాంబల పుత్రుడు. ఈ కారణమున ఇతనిని ప్రోలయవేమారెడ్డి యనియు, అన్నయ వేమారెడ్డి యనియు వ్యవహరింతురు. ఇతడు ప్రోలయరెడ్డి యైదుగురు కుమారులలో రెండవవాడు; మాచారెడ్డి అనుజుడు; అన్నారెడ్డి, దొడ్డారెడ్డి, మల్లారెడ్డి ఇతనికి తమ్ములు. వేమారెడ్డి తల్లి అన్నమాంబ దొడ్డారెడ్డి కూతురు. వీరిది పంటవంశము. ఈ రెడ్లను పంట కాపు లనియు వ్యవహరింతురు. పంటరాష్ట్రమున ఉండినవారగుటచేత వీరికి పంటరెడ్లనియు, పంట కాపు లనియు వ్యవహారము కలిగినది. నెల్లూరు జిల్లా గూడూరు తాలూకాలోని ఇప్పటి ముట్టెంబాక గ్రామము పంటరాష్ట్రములోనిదిగ తెలియవచ్చుట వలన గూడూరు, ముట్టెంబాక ప్రాంత మంతయు పూర్వము పంట రాష్ట్రమని వ్యవహరింపబడుచుండెనని ఊహింప వచ్చును. ప్రాచీనాంధ్రదేశ విభాగములలో పూంగి రాష్ట్రము (పాకరాష్ట్రము - పాకనాడు) పంటిదే ఈ పంటరాష్ట్రము (పంట విషయము) కూడ. పంట పదునాల్గు కులాలని నానుడి. మోటాటి, పెన్నాటి, పాకనాటి, మున్నూటి, దేసటి, కురిచేటి మొదలైన వన్నియు పంట మహాన్వయములోని కులములే. నాడులనుబట్టియు, నగరములనుబట్టియు కులములకు కలిగిన పేర్లవి. పంట మహాన్వయములో వేమారెడ్డి మొదలైనవారిది దేసటి కులము. శ్రీనాథుడు వీరిది పంట దేసటి మహాన్వయమని పేర్కొని యున్నాడు. హరివంశములో వేమారెడ్డికి ఆశ్రితుడైన ఎఱ్ఱాప్రెగడ తన యాశ్రయదాతను దేసటి వంశగ్రామణి అని, పంట వంశోద్భవుడని సంబోధించి యున్నాడు. ఈ కొండవీటి రెడ్డిరాజులది వెల్లచేరిగోత్రము. ప్రోలయ వేమ, అనవేములు తమ శాసనముల చివర 'పల్లవ త్రినేత్ర' అని వ్రాలుచేసి యుండుటచేత వీరు పల్లవుల సంతతివారని అనుమానము కలుగుట సహజము. పల్లవులుకూడ ప్రాచీన కాలమున నెల్లూరు మండలమువం దుండిన వారే; అచ్చట పరిపాలనము నెరపిన వారే. కాని, ప్రాచీన రాజవంశములు క్రీస్తు శకము పదుమూడు పదునాలుగు శతాబ్దముల నాటికి తమ తొంటి వైభవౌన్నత్యములను గోల్పోయి, క్రమముగ ఆర్థికముగను, సాంఘికముగను పడిపోయి దిగువ వర్ణములవారితో సంబంధములు చేసికొని, వారితో కలసిపోయి యుండవచ్చును. పంటరెడ్లు వారితో సంబంధ బాంధవ్యములు చేసియుండుట చేతనో, పంటరాష్ట్రము పల్లవదేశమయిన తొండమండలములోని విభాగ మగుటచేతనో 'పల్లవ త్రినేత్ర' బిరుదమును దాల్చిరేమో చెప్పలేము. కాని, పంటరెడ్లు పల్లవులేయని దృఢముగ చెప్పుటకు తగిన యాధారము లింతవరకు కానరాలేదు.

వేమారెడ్డి పూర్వులను గురించి మన కేమియు తెలియదు. కాని ఈ రెడ్లలో అనుస్యూతముగా, వంశక్రమానుగతముగా వచ్చుచుండిన బిరుదములను బట్టి వీరి పూర్వచరిత్ర కొంత ఊహించుటకు అవకాశము ఉన్నది. అప్పయ గొప్పయ దిశాపట్ట, జగదొబ్బగండ, దండెనగోవ, పాండ్యరాయగజకేసరి, చెంచుమల చూరకార, గుజ్జరి ధట్టవిభాళ, రాచూరి దుర్గవిభాళ, ఆనెయ మండలికరగండ, అఱిగియ వరద శిరఃఖండన బిరుదములతో వీరు అంకితులైనట్లు వీరి శాసనముల వలనను, వీరంకితము గొన్న తెలుగు కావ్యముల వలనను తెలియవచ్చుచున్నది. చివరి బిరుదములోని అఱిగియ వరదుడు ఎవరో ఇప్పటికిని తెలియలేదు. మిగిలిన వానిలో మొదటి నాలుగు బిరుదములును వీరి పూర్వులనుండి వీరికి పరంపరగా వచ్చుచుండినవని ఊహింపవలసి యున్నది. అప్పయగొప్పయలు హొయిసల రెండవ వీరనరసింహదేవుని సైన్యాధిపతులు. మూడవ రాజరాజచోళ చక్రవర్తిపై కాడవ (పల్లవ) భూపతియైన కొప్పెరుంజింగదేవరాజు తిరుగబాటుచేసి అతనిని బందినుంచినపుడు అతనిని విడిపించి పల్లవరాజును శిక్షించుటకై వీరనరసింహదేవుడు వారిని పంపెను. శకము 1158 (క్రీ. శ. 1231) నాటి కాంచీపురములోని శాసనము వలన గొప్పయ దండనాయకునికి దండెన గోప(వ), జగదొబ్బగండ బిరుదములు కలవు. నెల్లూరికి అధిపతియైన తెలుగు చోడభూపతి మనుమసిద్ధి తండ్రి తిక్కరాజు కూడ ఈ చోళ పల్లవ హొయిసల యుద్ధములలో పాల్గొనెను. క్రీ.శ. 1231 ప్రాంతమున తిక్కరాజు కూడ కాంచీపురము నందుండెను. ఈతడు హొయిసల వీరనరసింహుని కుమారుడైన కర్ణాటసోమేశ్వరుని ఓడించెను. యుద్ధములందును, వాదములందును ఓడిపోయినవారు, తమ బిరుదములను విజేతలకు అప్పగించి తాము వానిని వదలుకొనుట ప్రాచీనాచారము. ప్రాయికముగా కొండవీటి రెడ్ల పూర్వికులు నెల్లూరి తెలుగుచోడ భూపతి తిక్కరాజు కొలువునం దుండి పూర్వోక్త యుద్ధములలో పాల్గొని కర్ణాట సేనానులగు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అప్పయ గోప్పయలను జయించుటచేత వారికి అప్పయ గోప్పయ దిశాపట్ట అను బిరుదమును, ఆ సేనాపుల దండెన గోప(వ), జగదొబ్బగండ బిరుదములును వారికి వచ్చి యుండును. ఇవి పూర్వులనుండి వేమారెడ్డికిని, అతని సంతతి వారికిని సంక్రమించినవి. పాండ్యరాయ గజకేసరి బిరుదము రెడ్లకు వారి పూర్వులు కాకతి ప్రతాపరుద్రుని కాంచీపుర దండయాత్రలో పాల్గొని పంచ పాండ్యరాజులను ఓడించినందువలన వచ్చియుండును. గుజ్జరి ధట్టు విభాళ, రాచూరి దుర్గవిభాళ, ఆనెయ మండలికరగండ బిరుదములు ఆరవీటి సోమదేవరాజు తిరుగబాటు కాలమున అతనితో సహకరించి అతని విజయమునకు కారణభూతుడై వేమారెడ్డి స్వయముగ సంపాదించినవి. ఇక రెడ్లకు కృతి యిచ్చిన కొన్ని తెలుగు కావ్యములలో చెంచుమల చూరకార యన్నది చెంజిమల చూరకారి యని కలదు. చెంజిమల యనగా జింజి (దక్షిణార్కాడులోని జింజి) దుర్గము. చెంచుమలయన్నది అపపాఠము కావచ్చును. చెంచుమల అపపాఠమైనచో వేమారెడ్డియే ఆరవీటి సోమదేవరాజు హావళిలో దానిని చూరగొని ఆ బిరుదమును వహించి యుండవచ్చును. చెంజిమల (జింజి దుర్గము) అయినచో వేమారెడ్డికి ఈ బిరుదము అతని పూర్వులనుండి సంక్రమించినట్లు తలంపవలసి యున్నది. అట్లయినచో అతని పూర్వులు ఈ బిరుదమును గూడ కాకతి ప్రతాపరుద్రుని కాంచీపుర దండయాత్రా సందర్భముననే గడించి యుండవలెనని తోచుచున్నది.

వేమారెడ్డి తండ్రికి కోమటి ప్రోలారెడ్డి అని కూడ వ్యవహారము కలదు. వేమారెడ్డికి కూడ కోమటి వేమారెడ్డి యని, కోమటేంద్రుడని నామాంతరములు కలవు; వేమారెడ్డి అన్నయైన మాచారెడ్డి ముప్పురు కుమారులలో ఒకనికి పెదకోమటిరెడ్డియని, వేమారెడ్డి కనిష్ఠ సోదరుడైన మల్లారెడ్డి ఇరువురు కుమారులలో ఒకనికి చినకోమటిరెడ్డి యని పేర్లు కలవు. కొండవీటిరెడ్లలో కోమటి యన్నది పేరుగను, ఉపనామముగను సాధారణముగ కనవచ్చును. ఇది వీరికి వచ్చుటకు సత్యమైనను కాకపోయినను, దానిని మనము నమ్మినను నమ్మకపోయినను పరంపరగ వచ్చుచున్న ఒక యైతిహ్యము కొండవీటి దండకవిలెలోను, కొండవీటి కైఫియ్యతులోను గ్రంథస్థమై ఉన్నది. ఒకానొకప్పుడు దొంతి అల్లాడరెడ్డి అని ఒక రెడ్డి ఉండువాడట. ఒకప్పుడు అతని యింటికి వేమన అను పేరుగల కోమటి చిరకాలము అడవులలో సిద్ధులతోను, యోగులతోను సంచరించి అష్ట కష్టములు పడి తుదకు వారి అనుగ్రహమున నీచలోహములను బంగారముగ మార్చు పరుసవేదిని సంపాదించి అతిథిగ వచ్చెనట. ఒరు తెరుగకుండ వేమన దాని నెంత ప్రాణపదముగ దాచికొన్నను ఆ రెడ్డికి దాని సంగతి తెలిసి, తరుణము వేచియుండ, కోమటియైన వేమన ఇంటలేని సమయము చూచి ఆ పరుసవేదిని సంగ్రహించి, తనమీద అనుమానము లేకుండుటకై తన యింటికి నిప్పంటించెనట. కోమటి వేమన ఇంటికి తిరిగి వచ్చునప్పటికి ఇల్లు తగులబడుచుండుట కాంచి మతిపోయినట్లయి ఆ రెడ్డిని తన పరుసవేదిని గురించి యడిగెనట. తనకేమియు తెలియదనియు, అటువంటి దొకటి నిజముగా ఉండినచో తన యింటి గతియే దానికిని పట్టియుండు ననియు అతడు బదులుచెప్పెనట. అష్టకష్టములుపడి సంపాదించిన ఆ నిధానము పోయినందుకు విచారము భరింపలేక కోమటి వేమన ఆ మంటలో దుమికి ప్రాణములు విడిచెను. కొన్నాళ్లయిన తరువాత కోమటి వేమన అల్లాడరెడ్డి కలలో కనబడి తనకు నిజ మంతయు తెలిసెనదనియు, తన పరుసవేదిద్వారా సంపాదించిన ధనమును ధర్మకార్యములకు వెచ్చపెట్టక పోయినయెడల అతని వంశము నాశమయిపోవు ననియు శాప మిచ్చి అతని వంశజులకు తనపేరు పెట్టుకొనవలసినదని చెప్పెనట. అల్లాడరెడ్డియు, అతని కుమారులును ఆధనముతో సేనలను సమకూర్చి చుట్టుపట్లనున్న స్థానికనాయకులను జయించి రాజ్యము నిర్మించిరని యైతిహ్యము. ఈ రెడ్డివంశములో కోమటి అనుపేరు వచ్చుటకు కారణ మిది. దొంతివంశము, దొంతి అల్లాడరెడ్డి ఉండినట్లు కాని, వీరికిని కొండవీటి వంశమునకును సంబంధము ఉండినట్లు కాని ఆధారములు ఏవియు లేవు. ఒకవేళ ప్రోల, దేసటి అనుటకు అల్లాడ, దొంతియని తప్పుగా చెప్పబడెనేమో తెలియదు. ప్రోలయ వేముని మంచాల్ల తామ్రశాసనము అతడు బంగారము చేయు ప్రసిద్ధిని పొందినవాడని (' స్వర్ణకర ప్రసిద్ధిం లబ్ధ్వా') చెప్పుచున్నది. అందువలన ఈ యైతిహ్యములో సత్యలేశమేమైన ఉన్నదేమో తెలియదు.

ఓరుగల్లు పడిపోయి, దేశమున అరాజకము ప్రబలిన కాలమున ప్రోలారెడ్డి రాజ్యమును నిర్మించుకొనుటకు ప్రయత్నించెనేమో తెలియదు. ఒకవేళ అట్టి ప్రయత్నమును చేసినను, అతని కుమారుడు వేమారెడ్డి కాలమున గాని ఫలింపలేదు.

**వేమారెడ్డి** (క్రీ. శ. 1325 — క్రీ. శ. 1353): తెలుగు దేశపు నాయకు లందరిని ఒక్క కట్టుగ కూడగట్టుకొని ముసునూరి ప్రోలయ నాయకుడు తెలుగుదేశమును ముస్లిముల అధికారమునుండి తప్పించి హిందూరాజ్యమును, హిందూధర్మమును పునరుద్ధరించుట కొకమహోద్యమమును- స్వాతంత్ర్యోద్యమము - తలపెట్టెను. అతని ఛత్రచ్ఛాయను

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఆశ్రయించి అతనిని విధేయతతో అనుసరించి ఆయుద్యమమున పాల్గొన్న తెలుగునాయకులలో వేమారెడ్డి యొకడు. ఆ యుద్యమములో తన యన్న మాచారెడ్డి కంచెను శౌర్యసాహసములతో పనిచేయుటచేత కావచ్చును రెడ్లు మొదలైన అతని అనుచరు లందరికి అతడే నాయకుడయ్యెను. మధ్యాంధ్రదేశము ముస్లిము అధికారమునుండి విముక్తమగుటకు ఆరంభము శకవర్షము 1247 (క్రీ. శ. 1325) నుండియే. ఈ విషయము శకవర్షము 1247 నాటి వేమారెడ్డి మల్లవరము శాసనమువలన తెలియుచున్నది. ఆ సంవత్సరమున అతడు ఆశ్వయుజ మాసమున సూర్యగ్రహణ సమయమున మల్లవరములోని రాఘవస్వామికి కొంతభూమిని దానముగా ఇచ్చెను. ఈ విషయమును అనుసరించియే ఆ ప్రాంతము మహమ్మదీయాధికారము క్రింద లేదని తేటతెల్లమగుచున్నది. ఈ శాసనములో వేమారెడ్డి గర్వించిన అంధ్రరాజ భూరుహములకు మహాస్రోతోవహ విస్తర మనియు, మదించిన మన్నె నృపాలు రను దూదికి పవన మనియు, మ్లేచ్ఛాబ్ధికి కుంభోద్భవు డనియు కీర్తింపబడినాడు. ఈతడు చేసిన భూదాన, అగ్రహార దానాదులు తెలుపు శాసనముల ననుసరించి పారతంత్ర్య విమోచనోద్యమ కాలమున గౌతమీనది మొదలుకొని దక్షిణమున బ్రహ్మకుండి నామాంతరమున బరగు కుండిప్రభ (గుండ్లకమ్మ) వరకు గల సముద్రతీరస్థాంధ్ర సీమ అతనియొక్కయు, అతని అనుచరులయొక్కయు, కార్యరంగముగ కన్పట్టుచున్నది. మహమ్మదీయులను ఈ సీమనుండి తరిమివేసిన పిదప, దేశము మహమ్మదీయాక్రాంతము కాకపూర్వము పూర్వపు రాజులచేత ఈయబడి బ్రాహ్మణులు అనుభవించుచుండిన పూర్వోక్త నదీతటాగ్రహారములను, భూములను మహమ్మదీయులు బలాత్కారముగ ఆక్రమించుకొన్నవానిని ఎన్నిటినో వేమారెడ్డి వాని యజమానులకు ఇచ్చివేసెనట. ఇందుకు ఒకటి రెండు వేమారెడ్డి శిలాశాసనములను తార్కాణముగ చూపవచ్చును.

ఇక వేమారెడ్డి స్వతంత్ర రాజ్య పరిపాలనారంభ మెప్పు డను విషయమును విచారింపవలసియున్నది. ముసునూరి ప్రోలయనాయకుని అనంతరము వచ్చిన కాపయ నాయకుని సేవించిన డెబ్బదిమైదుగురు నాయకులలో వేమారెడ్డి ఒక డనియు, కాపయ నాయకుడు దివంగతుడైనపిదప వెనుకటి విరోధ కథలను మరచిన ఆ నాయకు లందరు తమ తమ నగరములకు వెళ్లి తమ దేశములను రక్షించుకొని రనియు, అటువంటి భూవరులలో, ధర్మాత్ములలో అగ్రణియు, భారత దివ్యపూరుష కథాధౌతాంతరంగుడును, శివపద ద్వంద్వైక సేవాపరుడును, విప్రాశీర్వచనోన్నతుడును అయిన వేమ భూపాలుడు ఒక డనియు అనితల్లి కలువచేరు శాసనము చెప్పుచున్నది. దీనివలన వేమారెడ్డి కాపయ నాయకుని మరణానంతరము స్వతంత్రుడై తన రాజ్యమును పాలించినట్లు తెలియుచున్నది. కాపయ నాయకుడు శకము 1289-90 ప్రాంతమున మరణించెను. వేమనరేంద్రుని శాసనములు శకవర్షము 1272 వరకు కాన్పించుచున్నవి. శకవర్షము 1275 (క్రీ. శ. 1353) నాటి ఒక శాసనమున వేమారెడ్డియు, అతని కుమారుడు అనవోతారెడ్డియు ఉదాహృతులయినారు. అందువలన శకము 1275 (క్రీ. శ. 1353) తరువాత వేమారెడ్డి శాసనములేవియు కానరావు. దీనిని అనుసరించి చూడగా వేమారెడ్డి కాలధర్మము పొందిన తరువాతకూడ కాపయ నాయకుడు చాలకాలము జీవించి యుండినట్లు స్పష్టమగుచున్నది. అటువంటి సందర్భమున విరోధమున్నను అనితల్లి కలువచేరు శాసనమున ఆ విధముగా ఎందుకు చెప్పబడినదో తెలియుటలేదు. మొత్తముమీద ముసునూరి కాపయ నాయకుడు జీవించియుండగనే- ప్రోలయ నాయకుని అనంతరము - వేమారెడ్డి స్వతంత్ర పరిపాలన మారంభమయినది. ప్రోలయ వేమారెడ్డి స్వతంత్ర రెడ్డిరాజ్య స్థాపకు డయినాడు. అతని యన్నయు, సోదరులును, మేనబావలును అతని యాజ్ఞను పాలించి అతనితో సహకరించి రెడ్డిరాజ్యమునకు మూలస్తంభములై నిలిచి దానిని విస్తరింపజేయుటకు నడుముకట్టి పనిచేసిరి.

వేమారెడ్డికి ఈ స్వాతంత్ర్య సమరమున మొదటినుండియు అతని కనిష్ఠ సోదరుడయిన మల్లారెడ్డి కుడిభుజముగా పనిచేసెను. అతడు శత్రు రాజులను పారదోలి మోటుపల్లి ప్రాంతమును తీసికొనుటయే కాక అలావదీను మొదలయిన తురుష్క మల్లులను, వారి సేనను జయించినట్లు అతని సంతతిలోని కోమటిరెడ్డి పెదపూడి తామ్రశాసనము తెలుపుచున్నది. ఈ యలావదీను క్రీ. శ. 1347 లో బహ్మనీ రాజ్యమును స్థాపించిన అలా ఉద్దీన్ హసన్ గంగూ బహ్మన్ షాయే కాని అన్యుడు కాడు. ఇతడు కాపయ నాయకుని ఓరుగంటి రాజ్యముపై దండెత్తివచ్చిన సందర్భమున రెడ్డి రాజ్యముపై గూడ దాడిచేసినట్లున్నది. ఆ సమయమున రెడ్డిసైన్యాధినాథుడయిన మల్లారెడ్డి సైన్యమును గూర్చుకొనిపోయి తురుష్క సైన్యముల నెదుర్కొని పోరాడి జయించి వానిని తరుమగొట్టెను. మల్లారెడ్డి ఈ విజయమును ఎప్పుడు సాధించెనో సరిగా తెలియదు. కాని, అది క్రీ. శ. 1347 తరువాత అలా ఉద్దీన్ హసన్ షా రాజ్య కాలములో జరిగినట్లు మాత్రమే చెప్పవచ్చును.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కర్నూలు జిల్లా త్రిపురాంతక ప్రాంతమునందలి చోళ వంశజులు మొదలయిన వారిని వేమారెడ్డి కుమారుడు అనవోతారెడ్డియు అతని పినతండ్రియు వేమారెడ్డి సోదరుడును అయిన అన్నచమూపతియు జయించి ఈ శ్రీశైల, త్రిపురాంతక ప్రాంతమును రెడ్డి రాజ్యమునకు అణకువ యగునట్లు చేసిరి. త్రిపురాంతకమువద్ద వీరి శాసనములు శక సంవత్సరములు 1268, 1269 (క్రీ. శ. 1346, 1347) నాటివి కనబడుచున్నవి. యువరాజును, ముఖ్యులైన రెడ్డి చమూపతులలో ఒకడును అయిన అనవోతారెడ్డి ప్రాయికముగ ఈ ప్రాంతమునకు అధిపతియై యుండును.

అచిర కాలముననే రెడ్డి రాజ్యము ఈ రెడ్డిదొరల ప్రయత్నములవలన పడుమట అహోబలము వద్దనుండి తూర్పున బంగాళాఖాతము వరకును, ఉత్తరమున కృష్ణా నదివరకును వ్యాపించినది. స్వాతంత్ర్యోద్యమ కాలములో వేమారెడ్డి కార్యరంగము ఉత్తరముగ గోదావరివరకు ఉండినను అతని రాజ్యము అంతవరకు వ్యాపింపలేదు. కృష్ణా నదికి ఉత్తరమున అతని శాసనము లేవియు కానరాలేదు. అందువలన కృష్ణా నదినే రెడ్డిరాజ్యమునకు ఉత్తర సీమావధిగ గ్రహింపదగును. ఈ నదియే వాయవ్య దిశను తెలంగాణాలోని రాచకొండ వెలమరాజ్యమునకును, రెడ్డి రాజ్యమునకును కూడ పరిహద్దయినది.

నెల్లూరుజిల్లా కందుకూరు తాలూకాకు దక్షిణమున వేమారెడ్డి శాసనములు కానరాకపోవుటవలన అతని రాజ్యము దక్షిణమున ఎంతవరకు వ్యాపించెనో నిర్ణయించుట కష్టము. అయినను, అది మొదట పెన్న నదివరకు వ్యాపించెననుటకు అవకాశము కలదు. వేమారెడ్డి మాతామహుడు దొడ్డారెడ్డి విక్రమసింహపుర (నెల్లూరు) నివాసి. పాకనాడు రెడ్డిదొరలకు కాణాచి. వేమభూపాలుని కాలములో చిటపెద్దన విక్రమపురీసింహాసనాధ్యాసిగా నుండెను. ఈ విషయము లన్నిటి ననుసరించి చూడగా ప్రారంభములో వేమభూవరుని రాజ్యము నెల్లూరివరకు వ్యాపించినట్లు చెప్పవచ్చును.

వేమారెడ్డి ధాన్యవాటి, లేక ధరణికోట (అమరావతి దగ్గరది), ధనదుప్రోలు (చందవోలు), వినుకొండ, కొండవీడు, బెల్లంకొండ మొదలయిన ఎనుబది నాలుగు దుర్గములను నిర్మించి యుద్ధతంత్రమునకు అనుకూలములైన స్థలములందు సైన్యముల నుంచె నని ప్రాచీన కాలము నుండి పరంపరగ వచ్చుచుండిన గాథలవలన తెలియుచున్నది. అతడు తన అన్నయైన మాచారెడ్డిని ధనదప్రోలు ప్రాంతమును పరిపాలింప నియమించెను. అది మాచారెడ్డికి ప్రధాన స్థానమైనది.

ప్రధాన శైవ, వైష్ణవ క్షేత్రములయిన శ్రీశైల, అహోబలములు వేమ నృపాల రాజ్యాంతర్గతము లయినవి. అతని కాలము వరకు శ్రీశైలమును, అహోబలగిరిని ఎక్కుట యాత్రికులకు చాల కష్టసాధ్యముగ నుండెడిది. వేమ భూపాలుడు ఈ రెంటికిని మెట్లు కట్టించి యాత్రికుల మన్ననలను, దీవనలను పొందెను. అంతియే కాదు; శ్రీశైలమువద్ద పాతాళగంగకు పోవుట కూడ కష్టముగ నుండ దానికిని సోపానములు కట్టించి యాత్రికుల కృతజ్ఞతకు పాత్రుడయ్యెను. యాత్రిక సౌకర్యార్థము శ్రీశైలమునకు సోపానములు కట్టించినవారిలో ప్రోలయవేమ భూపాలుడే ప్రథముడు. ముస్లిము అధికారమును తుదముట్టించి దేశములో శాంతి భద్రతలను నెలకొల్పి శ్రీశైలాహోబల యాత్రలు కొంత సులభము కావించిన వేమ మహీపతిని దేశీయులు దైవాంశ సంభూతునిగ భావించి సంభావించిరి.

వేమనరేంద్రుడు అతివేగముగా వృద్ధిపొంది నలుదెసలకు విస్తరించుచుండిన విజయనగరపు సంగమ వంశ్యులైన హరిహర రాయాదులను అనతి కాలముననే యుద్ధరంగమున ఎదుర్కొనవలసివచ్చినది. ఈ పోరాటమునకు సంబంధించిన వివరము లేవియు తెలియవు. శకవర్షము 1261 (క్రీ. శ. 1339) నాటి అటకలగుండు, శకవర్షము 1262 (క్రీ. శ. 1340) నాటి అకుమళ్ళ శాసనములలో విజయనగర రాజ్య స్థాపకుడయిన మొదటి హరిహరరాయలకు పూర్వపశ్చిమ సముద్రాధీశ్వర బిరుద ముండుటచేత ఆ సంవత్సరముల నాటికే అతని రాజ్యము బంగాళాఖాతము వరకు వ్యాపించినట్లు చెప్పవలెను. నెల్లూరు జిల్లాలోని మొదటి విజయనగర శాసనము శాలివాహన శకవర్షము 1265 నాటిది. ఇది హరిహరరాయల సోదరుడయిన మొదటి బుక్కరాయల కుమారుడు మొదటి విరూపణ్ణఒడయలది. దీని తరువాతిది హరిహరరాయల సోదరుడయిన మొదటి కంపణ్ణ ఒడయల కొడవలూరు శాసనము. దీని తేది. శాలివాహన శకవర్షము 1268 (క్రీ. శ. 1346). ఈ శాసనముల వలన విజయనగర రాజ్యాధిపతులు శాలివాహన శకము 1265 (క్రీ. శ. 1343)కు పూర్వమే రెడ్డి దొరల రాజ్యములో కొంత భాగము నాక్రమించుకొనినట్లు విశదమగుచున్నది. నెల్లూరిజిల్లాలోని ఉదయగిరి వారి రాజ్య ప్రాగ్భాగమున బలిష్ఠమైన మహాగిరి దుర్గమై, వా రింకను ఉత్తర దక్షిణములకు తమ రాజ్యమును వ్యాపింప జేసి కొను ప్రయత్నములకు అది కీలక స్థానముగ ఉపకరించినది. ఈవిధముగ క్రమ ప్రవర్ధమానములగుచుండిన రెడ్డి, విజయనగర రాజ్యములకు రెంటికి ప్రాగ్దేశాధిపత్యమునకు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఆరంభమునుండియు పోరాటము సంభవించి అది శతాబ్దముపై వరకు సాగుచునే యుండెను.

వేమభూపతి తన రాజ్యమును సమర్థతతో ధర్మముగా పరిపాలించెను. బ్రాహ్మణులను, కర్షకులను దుర్భరస్థితి నుండి తప్పించి వారి అభ్యుదయమునకు పాటుపడెను. దేశమును సంరక్షించి హిందూ ధర్మమును పునరుద్ధరించి నందున అతడు ధర్మ ప్రతిష్ఠాగురుడని కీర్తనీయుడయ్యెను. ఆధ్యాత్మిక విజ్ఞాన ఘనులైన బ్రాహ్మణులకు వారు పోగొట్టుకొనిన అగ్రహారములను సంపాదించిపెట్టి, క్రొత్తగా వారికి అగ్రహారములను, భూములను ఇచ్చి ఆదరించెను. ఈ కారణమున వేమారెడ్డి నిస్సీమ భూదాన పరశురామ, అపరిమిత భూదాన పరశురామ బిరుదములను పొందెను. ఇది హిందూరాజ్య పునరుద్ధరణ కాలమునాటి భూమీశులకు విధి విహిత కార్యమైనది. దేవ ప్రతిమలు లేక పాడరిన దేవాలయములకు పునఃప్రతిష్ఠలు జరగినవి. భగ్నములయిన దేవాలయములు పునర్నిర్మితములైనవి. నిరాతంకముగను, నిర్బాధకముగను వేద విహిత కర్మలు అనుష్ఠితములైనవి. యజ్ఞయాగాదులు పునః ప్రవృత్తములైనవి. వేమభూపతియే భూసురులచేత అనేకక్రతువులు జరపించి అనవరత పురోహితకృత సోమపాన బిరుదాంకితుడయ్యెను. ఈ కాలమున, దేవగిరి యాదవవంశ్యులయిన మహాదేవరాజ, రామచంద్రరాజుల రాజ్యకాలములో శ్రీకరణాధిపుడుగ నుండిన (క్రీ. శ. 1260 — క్రీ. శ. 1270) హేమాద్రి రచియించిన చతుర్వర్గ చింతామణిలోని వ్రతఖండ, దానఖండములకు తెలుగుదేశమున ప్రచారము హెచ్చినది. హేమాద్రి తన దానఖండములో చెప్పిన దానము లనేకము చేసి వేమారెడ్డి విఖ్యాతుడయ్యెను.

ఇంత రాజ్యము నేలినను వేమారెడ్డి తాను మహామండలేశ్వరుడనని తన శాసనములలో వ్రాయించుకొనక పోవుట ఒక విశేషము. ఆంధ్రదేశాధీశ్వర, ఆంధ్ర సురత్రాణ బిరుములను వహించిరే కాని ముసునూరి నాయకులు - ప్రోలయ కాపయలు — కూడ మహామండలేశ్వరులమని చెప్పుకొనలేదు. చాల కాలమునకు తరువాత ఈ సంతతి వారిలో రాజ్యమునకు వచ్చిన పెదకోమటి వేమారెడ్డి పదో ఒక్క శాసనములో మాత్రము తాను మండలేశ్వరుడనని చెప్పుకొనెను. కొంచె మించుమించుగ మధ్యాంధ్ర దేశము నంతను పాలించిన రెడ్డి దొరలు మహామండలేశ్వర పదాంకితులు కాకపోవుటకు కారణము తెలియదు. ధర్మోద్ధరణమునకు నడుము కట్టిన తాము క్షత్రియులు కానిప్పుడు మహామండలేశ్వరులమని చెప్పుకొనకలేదేమో. అట్లగుచో అది వారి ధర్మబుద్ధిని చాటుచున్నది.

ప్రోలయ వేమారెడ్డికి అనవోత, అనమాచ, అనవేములని ముగ్గురు కొడుకులును, ఇరువురు కూతుండ్రును కలరు. ఈ యిరువురు కూతుండ్రలో ఒకతె దొడ్డాంబ; రెండవయామె పేరు తెలియదు. వేమారెడ్డి దొడ్డాంబికను కాటయ రెడ్డి పౌత్రుడును, మారయరెడ్డి పుత్రుడును అగు ఇమ్మడి కాటయరెడ్డికిని, రెండవ కూతురిని తెలుగు చోడవంశ్యుడయిన భక్తిరాజ (చోడభక్తిరాజు) కుమారుడగు భీమలింగచోడునికిని ఇచ్చి పరిణయము కావించెను. భీమలింగ చోడునికి భీమ చోడు డనియు, చోడ భీము డనియు నామాంతరములు కలవు. రెడ్లు చతుర్థకులజులు; తెలుగు చోడులు సూర్యవంశ క్షత్రియులు. క్షత్రియుడు చతుర్థకులజను వివాహామాడినచో అది అనులోమ వివాహామనబడును. ఆ కాలమున ఉన్నత వర్ణములలోని పురుషులు క్రింది వర్ణములలోని కన్యకలను వివాహాము చేసికొను ఆచారముండెనో లేదో గట్టిగా చెప్పలేము. కాని, రాజనీతి ననుసరించి అనులోమ వివాహాములు ఆ కాలమున జరగుచుండెననుటకు ఆధారము లున్నవి. భీమలింగ చోడునికి వేమభూపాల పుత్రియందు వేమాంబ యను కూతురు కలిగెను. ఈమెను దువ్వూరి పెరుమాండిరెడ్డి పౌత్రుడును, దొడ్డారెడ్డి కుమారుడును అగు అల్లాడరెడ్డి వివాహాము చేసికొనెను. ఇమ్మడి కాటయరెడ్డికి దొడ్డాంబయందు వేమారెడ్డియను పుత్రుడు కలిగెను. ఇతడు కాటయవేమారెడ్డి (కాటయ కుమారుడు వేమారెడ్డి) యని వ్యవహారింపబడుచు వచ్చెను. ప్రోలయవేమారెడ్డి సోదరులలో అన్నారెడ్డికి వేమాంబయను కూతురు కలదు. ఈమెను అన్నారెడ్డి తన మేనమామయైన చిట్టయకు మనుమడును నూంకా (నూకా) రెడ్డి కొడుకును అగు వల్ల మూంకయరెడ్డి కిచ్చి వివాహాము కావించెను.

ప్రోలయవేమారెడ్డి కుమారులు ముప్వురిలో అనవోతారెడ్డి జ్యేష్ఠుడు. అనమాచారెడ్డి అకాలమరణము నొందినట్లు కనబడును. తాను జీవించి యుండగనే ప్రోలయ వేమారెడ్డి తన కుమారుడు అనవోతారెడ్డిని యువరాజ పదమునం దుంచి పరిపాలనవిధానమున అతనికి గొప్ప శిక్షణము నిచ్చెను. అతడు ఉబ్బసపు వ్యాధితో పీడితుడై తాను స్వయముగా పరిపాలింపలేక రాజ్యభారమును తన పుత్రునిపై మోపి విశ్రాంతి గైకొనినట్లు మెకంజీ వృత్తాంతముల వలన తెలియుచున్నది. వేమారెడ్డి ఎప్పుడు మృతిపొంది నదియు తెలియదు. కాని, అతని శాసనములు శకవర్షము 1275కు పిదప కానరావు.

శంభుదాసుడను నామాంతరము కల ఎర్రాప్రెగడ ప్రోలయవేమారెడ్డి ఆస్థానము నలంకరించిన మహాకవి.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఈయన మహాశివభక్తుడు. ఈయన గురువు శంకరస్వామి. ఎఱ్ఱాప్రెగడ మొదట వేమారెడ్డి కనిష్ఠ సోదరుడైన మల్లారెడ్డికి ఆశ్రితుడుగ నుండెను. వేమారెడ్డి రెడ్డిరాజ్యమును స్థాపించిన పిదప మల్లారెడ్డి ఈ మహాకవిని వేమారెడ్డికి అప్పగించెను. అప్పటినుండియు ఎఱ్ఱాప్రెగడ వేమారెడ్డి యాశ్రయమున వర్ధిల్లెను.

**అనవోతారెడ్డి** (క్రీ. శ. 1353 — క్రీ. శ. 1364): శక వర్షము 1275 నుండి అనవోతారెడ్డి రెడ్డిరాజ్యమునకు ప్రభువై రాజ్యవ్యవహారములను స్వతంత్రుడై స్వయముగా చక్కబెట్ట జొచ్చెను. అప్పటికి కొంతకాలమునకు పూర్వమే రాజమహేంద్రవరములో తొయ్యేటి అనవోతా నాయకుడు కాలధర్మము పొందెను. అతని యన్న ముసునూరి కాపయనాయకుడు బహ్మనీ సుల్తాన్ అలా ఉద్దీన్ హసన్ షా దండయాత్రలవల్ల మధ్యాంధ్రదేశ రాజ్య వ్యవహారములను గూర్చి తగినంత శ్రద్ధ తీసికొనుటకు వీలు లేకపోయినది. ఇట్టి స్థితిలో అతని మేనకోడలి భర్తయైన మంచికొండ ముమ్మిడి నాయకుడు తండ్రి యానతిని రాజ్యభారము వహించి కోరుకొండ రాజధాని కావించుకొని అనవోతా నాయక పరిపాలితమైన ప్రదేశమును పాలింప దొడగెను.

ఇదియే తగిన తరుణమని కళింగ గాంగభూపతి మూడవ నరసింహదేవరాజు సింహాచలమునుండి గోదావరి తీరము వరకు గల దేశముపైనే గాక గోదావరి నదిని దాటి కృష్ణాతీరమున గల శ్రీకాకుళము పర్యంతము గల సముద్రతీర ప్రాంతముపై దండెత్తెను. క్రొత్తగా రాజ్యమునకు వచ్చిన ముమ్మడి నాయకుడు ఆకస్మికముగా పైని వచ్చి పడిన ఈ దండయాత్రను ప్రతిఘటింపలేక పోయెను. గాంగ సైన్యములు నిరాఘాటముగా శ్రీకాకుళము వరకు వచ్చినవి. అచ్చటి శకవర్షము 1275నాటి మూడవ నరసింహదేవుని శాసనము అతని విజయ ధాటికి తార్కాణముగ నున్నది. ఈ శాసనమున నరసింహదేవుని దండనాయకులు కాళిదాస సేనాపతి, గోవింద సేనాపతి పేర్కొనబడినారు. కృష్ణానదిని దాటి రాకుండ రెడ్డి చమూపతులు నరసింహదేవుని అడ్డగించి తరిమివేసిరి. మూడవ నరసింహదేవుని ఈ విజయము తాత్కాలిక మైనది. జయించిన దేశము అతనిచేతినుండి కొద్దికాలములోనే జారిపోయినది.

గోదావరినదికి ఉత్తర తటమునను, గోదావరీ కృష్ణా నదుల మధ్యను వేరు వేరు చిన్న రాజ్యము లుండినను, తద్రాజ్యాధిపతులు కళింగ గాంగ దండయాత్రను అరికట్టలేకపోవుటను అనవోతారెడ్డి గమనించెను. అందువలన దక్షిణకళింగము వరకుగల దేశమును తన యధికారము క్రిందికి తీసికొని వచ్చినగాని ఈ ప్రమాదము తీరదని అతడు పూర్వ దిగ్విజయయాత్రకు పూనుకొనెను. ఈ దండయాత్రలో అతడు జలదుర్గమయిన ద్వీపమును జయించి ద్వీపజేతయను బిరుదమును వహించెను. ఈ ద్వీప మనునది వెనుక కాకతి గణపతి దేవమహారాజు జయించిన దివియే. ఇది కృష్ణజిల్లా బందరు తాలూకాలోని ఇప్పటి తలగడ దీవి. దీనిని పెదదీవి పురమని కూడ వ్యవహరించు చుండిరి. అనవోతారెడ్డి పూర్వ దిగ్విజయ యాత్రకు సంబంధించిన వివరములను అతని శాసనములు కాని, అతని తరువాతి వారి శాసనములు కాని తెలుపవు. ఈపూర్వదేశ దండయాత్రలో జయింప దుస్సాధ్యము లనుకొన్న కోటలను పట్టుకొనుటవలననే కావచ్చును అనవోతారెడ్డికి 'వీరాన్నవోత భూపతి' యని బిరుదుపేరు కలిగినది.

ఇతడు ఈ దండయాత్రలో కళింగమునందలి శబరాధివాస ప్రాంతమువరకు వెళ్ళినట్లు అతని ఈప్పుగల్లు (ఈడుప్పుగల్లు) శాసనమువలనను, అతని సోదరుడు అనవేమారెడ్డి 'పచ్చని తాండిపత్రు' శాసనమువలనను తెలియుచున్నది. ఈప్పుగల్లు శాసనములో అనవోతనృపతి కీర్తిచేత తెల్లనై అడవిలో గుర్తింపరాకయున్న ఆయా చెట్లను శబరులు తమ పిల్లలకు పేర్పరచి చెప్పినట్లు వర్ణింపబడియున్నది. అనవోతభూపతి మేకల పర్వతమువరకు జయించినట్లు పచ్చని తాండిపత్రు శాసనములో చెప్పబడియున్నది. మేకల పర్వతము వింధ్యాద్రినుండి తూర్పుగ వచ్చిన శాఖ. కళింగమున కిది వాయవ్యదిశ నున్నది. అనవోతారెడ్డి మేకల పర్వతము వరకు వ్యాపించిన కళింగదేశమును జయించుట అతిశయోక్తియని త్రోసివేసినను, అతడు దక్షిణ కళింగము వరకైనను వెళ్లియుండవచ్చును. దక్షిణ కళింగమునకును, కృష్ణానదికిని మధ్య నుండిన మండలికులు అతనిచే జయింపబడినవారు అతని శాసనములలో తెలుపబడక పోయినను అతడు వారి నందరిని జయించియే యుండవలెను. ఈ ప్రదేశమున శాసనములవలన తెలియవచ్చిన వారు (1) వేంగీ విషయమును పాలించుచుండిన చంద్రవంశ క్షత్రియులు. వీరు ప్రాయికముగా పూర్వచాళుక్యుల కోవకు చెందినవారై యుందురు. వీరి రాజధాని నిడదవోలో మరేదియో తెలియదు; (2) పడుమటి గోదావరిజిల్లా భీమవరము తాలూకాలోని ఉండి రాజధానిగా తత్ప్రాంతమును పరిపాలించిన సూర్యవంశ క్షత్రియులు; (3) గోదావరినదికి ఉత్తర తటమున కోరుకొండ రాజధానిగా తత్ప్రాంత దేశమును పరిపాలించిన మంచికొండ నాయకులు; (4) ఇంకను ఎగువను పిఠాపురము రాజధానిగా పాలించిన వీరసామంత కొప్పుల వంశము. ఈ పై రాజ్యములలో వేంగీ విషయమును గురించి కొంత చెప్పవలసియున్నది.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



స్వాతంత్ర్య సమరములో ముసునూరి ప్రోలయ నాయకునితోపాటు పాటుపడిన వేంగీ విషయాధిపతి వేంగభూపతి. ఇతడు ఇదివరలో నుడివినట్లు చంద్రవంశ క్షత్రియుడు; ప్రాయికముగా చాళుక్య కులజుడు. ఇతనికి ఇరుగాంబిక అని ఒక సోదరి కలదు. ఈమె సూర్యవంశజుడైన తెలుగు చోడ నృపతి గంగభూవరుని భార్య. ఇరుగాంబికా గంగభూపతులకు కామరాజు జనించెను. శైశవమునుండియు ఇతడు శివుని పరమభక్తితో ఆరాధించుటచేత ఇతనికి భక్తిరాజని, చోడ భక్తిరాజని నామాంతరములు కలిగినవి. స్వాతంత్ర్య యుద్ధములో వేంగనృపాలుడు హతుడయ్యెను. వేంగభూపతికి మహాదేవి, అన్యమాంబ, చెన్నమాంబ అని ముగ్గురు భార్య లుండిరి. వేంగభూమీశునికి వీరెవ్వరియందును పురుష సంతానము కలుగక పోవుటచేతనో, కలిగిన వారు స్వాతంత్ర్య సమరమున హతులగుటచేతనో అతని రాజ్యమును పాలించుటకు ఎవ్వరును లేనందున స్వాతంత్ర్యోద్యమ నాయకుడును, ఆంధ్ర భూమండలాధ్యక్షుడును అయిన ముసునూరి ప్రోలయనాయకుడు కాలుడయినను భక్తిరాజును అతని మేనమామ వేంగభూపతియొక్క వేంగీ రాజ్యమున ప్రతిష్ఠాపించెను. ఇతని రాజధాని కామపురి. ఇది పడుమటి గోదావరి జిల్లా చింతలపూడి తాలూకాలోని ఇప్పటి కామవరపుకోట. అనవోతారెడ్డి తండ్రి ప్రోలయవేమారెడ్డి తన కూతురిని ఈ భక్తిరాజు కుమారుడు భీమలింగచోడుని కిచ్చి వివాహము చేసినట్లు ఇది వరకే తెలుపబడినది. అనవోతారెడ్డి పూర్వ దిగ్విజయ యాత్రనాటికి చోడ భక్తిరాజు వేంగీ విషయమును పరిపాలించుచుండెను. ప్రాయికముగ అనవోతారెడ్డి ఈతనిని కూడ జయించియుండునేమో తెలియదు. శకవర్షము 1278 నాటి అనవోతారెడ్డి శాసన మొకటి దాక్షారామములో ఉండుటవలన అతని కళింగ (పూర్వదేశ) దండయాత్ర ఆ సంవత్సర ప్రాంతముననే జరిగెననియు, అది విజయాంకితమయ్యెననియు దృఢముగ చెప్పవచ్చును. అనవేమారెడ్డి తన కొల్లూరు తామ్ర శాసనములో అతని యన్నయైన అనవోతారెడ్డి ప్రతి సంవత్సరమును శత్రుదేశములను జయించుచుండెనని చెప్పుటవలన విజితులైన సామంతులు, మండలికులు మరల స్వతంత్రులై తమ రాజ్యములను పాలించుచుండినట్లును, వారి నణచుటకు అనవోతారెడ్డి మరల దండెత్తి వెళ్ళుచుండినట్లును ఊహింపదగియున్నది. అతడు ప్రతి సంవత్సరము శత్రుదేశములను జయించుచుండె ('ప్రత్యబ్దమ్ ప్రతిపక్షదేశ జయినః')ననుట ఒకవేళ అతిశయోక్తి యని కొట్టివేసినను అతడు తరచుగా దండయాత్రలు సాగించుచుండె ననుటకు అవకాశము కలదు. ఇటువంటి దండయాత్రలలో ఎప్పుడో ఒకప్పుడు చోడభక్తిరాజు వీరాన్నపోత నృపతిని సూరవరమువద్ద జరగిన సంగ్రామమున ఓడించినట్లు అతని కుమారుడు అన్నదేవచోడుని రాజమహేంద్రవరము మ్యూజియము శాసనమువలన తెలియుచున్నది. సూరవరము కృష్ణజిల్లా నూజవీడు తాలూకాలో నున్నది. అనవోతా రెడ్డికిని, చోడ భక్తిరాజునకును ఎందువలన విరోధము కలిగినదో, భక్తిరాజు అనవోతారెడ్డిని ఎప్పుడు జయించెనో తెలియదు కాని, అనవోతారెడ్డి పూర్వదిగ్విజయ యాత్రలలోనే ఈ సూరవర సంగ్రామము జరగి, అందు అతడు పరాజయము పొంది యుండవలెను.

ఈ దండయాత్రల అనంతరము మున్ముందు అనవోతారెడ్డి తన రాజ్యమునందలి వర్తక వ్యాపారములను అభివృద్ధి పొందించుటకు పూనుకొనెను. మధ్యాంధ్ర దేశమునకు కాకతీయుల కాలమునుండి ముఖ్యమైన రేవుపట్టణముగ నుండిన మోటుపల్లి ప్రోలయవేమారెడ్డి కాలములోనే రెడ్డిమన్నీల అధికారము క్రిందికి వచ్చినను దానివలన దేశమునకును, ప్రభుత్వమునకును కలుగవలసినంత లాభము కలుగలేదు. ఈ విషయమును గురించి సావధానముగ విచారించుటకైనను వేమారెడ్డికి ఇతర కార్యముల తొందరలో అవకాశము లేకపోయినది. రెడ్డిరాజ్యము కొంత దృఢపడి దేశములో శాంతి భద్రతలు నెలకొన్న అనంతరము అనవోతారెడ్డి సముద్ర వర్తక వ్యాపారము క్షీణించిపోవుటకు గల కారణములను గురించి విచారించి ఓడ వర్తకము చేయు వ్యాపారులకు, ఇతర వర్తకులకు ఒక అభయ శాసనము నిచ్చెను. ఈ శాసనము ద్వారా వర్తకులకు పూర్వము అమలులో ఉండి, మధ్య రాజ్య విప్లవ కాలమున పోయిన మర్యాదలను మరల పునరుద్ధరించెను. బేహారులకు పీడాకరముగ నుండిన శాసనములను రద్దు చేసెను; పరదేశి వ్యవహారులపై విధింపబడిన 'అపుత్రిక దండము', 'కడ్డాయము' అను పన్నులను తీసివేసెను. బంగారము మీదను, వెండి మీదను పూర్తిగా సుంకము తొలగించెను. గంధముమీద పశుబడి (పరుబడి)సుంకము పూర్వ మర్యాదలో మూడింట ఒకవంతు తగ్గించెను. తక్కిన సరకుమీద మడి(ఎక్కుమడి, దిగుమడి) సుంకములు బేహారులు పూర్వ మిచ్చు క్రమాననే తీసికొనుటకు అంగీకరించెను. ఎగుమతి, దిగుమతియగు సరకులమీద, ముఖ్యముగా వస్త్రములమీదను, ముత్యములమీదను తీయవలసిన సుంక మింతయని నిర్ణయించెను. ఈవిధమయిన అభయ శాసనమును తెలుగులోను, అరవములోను వ్రాయించి మోటుపల్లి వీరభద్రేశ్వరస్వామి ఆలయ మంటప స్తంభముల



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మీద శకవర్షములు 1280 (క్రీ. శ. 1358) విళంబి సంవత్సరమున శ్రావణ శుద్ధ 4 మంగళవారమునాడు చెక్కించెను. ఈ శాసనములు సంస్కృతములోను, తెలుగులోను, అరవములోను కూడ ఉన్నందున తమిళ, ఆంధ్ర దేశముల నాకాలమున విరివిగా వర్తక వ్యాపారములు సాగుచుండెనని తలంపవచ్చును. నేటికిని ఈ శాసనములు అనవోతారెడ్డి ధర్మాభిరతికిని, ప్రజా శ్రేయోభిరక్తికిని మూక సాక్షులుగ మోటుపల్లి వీరభద్రేశ్వరాలయములో నిలిచి యున్నవి. శాసనముల ననుసరించి చూడ ప్రధానముగ ఎగుమతియగు సరకు వస్త్రములు. ఇవి పరదేశములకు సయితము ఎగుమతి యగుచుండినట్లు తెలియుచున్నది. ఉత్తర దిక్కునుండియు, దక్షిణ దిక్కునుండియు, తూర్పు దేశములనుండియు కూడ ఓడలు సరకులతో మోటుపల్లి రేవుకు వచ్చుచుండెడివి. అనవోతారెడ్డి యిచ్చిన అభయ శాసనము వలన మరల ఓడల వర్తకము పూర్వము కాకతి గణపతిదేవ మహారాజు కాలములో వలెనే ఎక్కువగ సాగినది. 'దేశి, పరదేశి, నానాదేశి అనబడు 'చాలు మూల సమస్త పెక్కండ్రు' బేహారులు మోటుపల్లికి వచ్చి వ్యాపారము విరివిగా సాగించుచుండిరి. ఈ వర్తక వ్యాపారము వలన దేశము భాగ్య భోగ్యములతో తులతూగినది.

బహ్మనీ సుల్తాను మొదటి ముహమ్మదు షా సింహాసన మెక్కిన తొలి సంవత్సరములలో ముసునూరి కాపయ నాయకుని ఓరుగంటి రాజ్యముపై దండెత్తి వచ్చెనని మన కిదివరకే తెలియును. ఈ దండయాత్ర తెలంగాణాలోని ఓరుగంటి రాజ్యముతో ఆగిపోలేదు. బహ్మనీ సైన్యము కృష్ణ దాటి తెలంగాణాకు ఆగ్నేయభాగమునం దున్న రెడ్డి రాజ్యముపైకి కూడ వచ్చినది. అప్పుడు ముస్లిము సేనలు దేశమును విధ్వంసము కావించి వెనుక తెలంగాణాలో పిల్లలమర్రి దేవాలయమును వలెనే అమరారామము (అమరావతి)లోని అమరేశ్వరాలయము నపవిత్రము కావించినవి. అప్పుడు అనవోతారెడ్డి ప్రధానియైన మల్లయ వేమ సేనాధిపతి (మల్లయమంత్రి కుమారుడైన వేమ సేనాధిపతి) పదుమటినుండి వచ్చిన మహమ్మదీయ అశ్వికదళము నెదుర్కొని భయంకరయుద్ధమున వారి నోడించి తరుమగొట్టి రెడ్డిరాజ్యమును రక్షించెను. పిదప, అతడు శకవర్షములు 1288 ప్లవ సంవత్సరమున శ్రావణ బహుళ 5 గురువారమునాడు 'అనవోతయరెడ్డింగారికి ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధిన్ని, ధనకనక వస్తువాహన సమృద్ధిన్ని, పుత్ర పౌత్రాభివృద్ధిన్ని అవునట్లుగా పంచారామంబులకుం బ్రథమారామం బైన అమరారామంబను శ్రీధాన్యవాటి పురంబునకు నధీశ్వరుండైన అమరేశ్వర శ్రీ మన్మహాదేవరను' పునః ప్రతిష్ఠచేసెను.

'వెలుగోటివారి వంశావళి' రేచెర్ల వెలమ నాయకులకుమ అనవోతారెడ్డికిని యుద్ధము జరగినట్లు తెలుపుచున్నది. ఈ గ్రంథమున మాదానాయకుడును, అతని సోదర తనయుడైన కతారి నాగానాయకుడును అనవోతారెడ్డిని దన్నాలకోట అను ధరణికోటవద్ద జరగిన యుద్ధమున ఓడించినట్లు చెప్పియున్నది. రాచకొండ వెలమ నాయకులకును, రెడ్డి రాజులకును జరగిన మొదటి యుద్ధమిదియే. ఇంతవరకు కానవచ్చిన వెలమనాయక శాసనములు ఈ విజయమును గురించి తెలుపవు. బహుశః ఈ యుద్ధము అనవోత, మాదానాయకులు తమ తండ్రిని వధించినవారిమీద పగ తీర్చుకొనుటకు జల్లిపల్లి కోటపై వెళ్లి దానిని ముట్టడించి పట్టుకొనినపుడు శకవర్షములు 1288 ప్రాంతమున జరగియుండును. ఆ కోటను సంరక్షించుటకు పూనుకొనిన వారిలో సోమవంశ క్షత్రియులకు తోడుగ రెడ్డి దొరలుకూడ ఉండినట్లు తెలియుచున్నది. జల్లిపల్లి కోటను సాధించిన సమయమున దానిలోనుండి పారిపోయిన సోమవంశ క్షత్రియులమీదను, రెడ్డిదొరల మీదను పగతీర్చుకొనుటకై వెలమనాయకులు కృష్ణానదిని దాటి వారిని వెన్నంటి తరిమిరి. ఈ సందర్భమున కర్నూలు జిల్లాలోని శ్రీశైల ప్రాంతము వారి వశమైనది. శ్రీశైల ప్రాంతమును జయించిన తరువాత మాదానాయక, నాగానాయకులు దన్నాలకోటవద్ద అనవోతారెడ్డి నెదుర్కొని ఓడించి విరాటునిపీట గోగ్రహణ సందర్భమున దుర్యోధనుని అర్జునుడువలె మాదానాయకుడు అనవోతారెడ్డిని పారదోలెనని 'వెలుగోటివారి వంశావళి' చెప్పుచున్నది. అనవోతారెడ్డి భ్రష్టసాధనుడై పారిపోవుచుండగా కతారి నాగానాయకుడు వెనుదరిమి పట్టుకొని 'డాగుపెట్టి' విడిచిపెట్టెనట. ఈ విజయము లభించిన పిదప రేచెర్ల వెలమవీరులు జగదొబ్బగండ, రాయవేశ్యాభుజంగ మొదలైన రెడ్డి మన్నీల బిరుదులను వహించిరి. ఈ యుద్ధము వలన రెడ్డి రాజ్యములోని శ్రీశైల ప్రాంతము వెలమ నాయకుల అధికారము క్రిందికి వచ్చినది. కాని, దన్నాలకోట ప్రాంతమును స్వాధీనము చేసికొనుటకు మాదానాయక, నాగానాయకులు చేసిన ప్రయత్నములు నిరర్థకములైనవి. 'వెలుగోటి వారి వంశచరిత్ర' ననుసరించి చూడగా వారు తమకు పట్టువడినవారి నెవ్వరిని వదలినట్లు కాని, రక్షించినట్లు కాని కానరాదు. వారికి దన్నాలకోట సంగ్రామమునందు విజయమే లభించినచో ఆ కోటను, తత్పరిసర ప్రాంతమును వా రేల వశపరచుకొనలేదో



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తెలియదు. ఈ ప్రాంతము రాజ్యారంభకాలము నుండియు రెడ్లక్రిందనే యుండెను. కాని, వెలమవీరుల అధికారమునం దుండె ననుటకు ఆధారములు లేవు. అందువలన, ఈ వెలమ నాయకులకు దన్నాలకోట యుద్ధమున విజయము చేకూరె నన్న విషయము ఎంతవరకు సత్యమో గట్టిగా చెప్ప లేము. వెన్నెలకంటి సూరన తన విష్ణుపురాణము నందలి అవతారికలో అమరావతివద్ద జరగిన యుద్ధములో అనవోతారెడ్డి రావుతు కేన భూపాలుని ఓడించి పట్టుకొని 'వెన్నడచి' రాజ్యము దక్షిణ, నైరృతి దిశలకు వ్యాపించి అత్యంత శీఘ్రకాలములో గొప్ప సామ్రాజ్య మయినది. అనవోతారెడ్డి శత్రువులతో పోరాడుచుండిన కాలమున విజయనగ రాధీశ్వరులు తమ యధికారమును ప్రాక్సముద్ర ప్రాంత ప్రదేశమున కట్టుదిట్టము చేసికొనుచుండిరి. వారి చూపు ఎప్పుడును రెడ్డి రాజ్యముమీదనే యుండెను. మొదటి బుక్కరాయలు రెడ్డిరాజ్యము పూర్వోక్త యుద్ధములవలన బలహీనమగుటను కనిపెట్టి కృష్ణానదికి దక్షిణమున నున్న



చిత్రము 62. కొండవీటి దుర్గము

కాచెనని చెప్పబడినది. ఈ రావుతు కేసభూవరు డెవ్వడో తెలియదు. అమరావతికి దన్నాలకోట, ధరణికోట అను నామాంతరము లుండుట చేతను, ఇదికూడ అమరావతి వద్దనే జరగిన యుద్ధ మగుటచేతను ఇదికూడ వెలమ నాయకుల దండయాత్రా సందర్భమున జరగినదే కావచ్చునేమో.

ఇటుతరువాతనైనను అనవోత భూపతి స్తిమితముగా రాజ్యము చేయుటకు వీలు లేకపోయినది. విజయనగర తూర్పు ప్రాంతముపై దండయాత్ర సాగించెను. కర్నూలు జిల్లాలోని పూర్వార్ధభాగమందును, నెల్లూరు జిల్లాలో కడు నుత్తరమందున్న పొదిలి, దర్శి డివిజనులయందును గాన వచ్చు విజయనగర శాసనములే ఇందుకు తార్కాణములు. ఈ శాసనములవలన బుక్కరాయలు పూర్వదేశ దండయాత్రను అనవోతారెడ్డి కడపటి రాజ్య సంవత్సరములలో, శకవర్షములు 1285-86 (క్రీ. శ. 1363-64) ప్రాంతమున జరపినట్లు తెలియుచున్నది. కర్నూలుజిల్లా మార్కా



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పురము తాలూకా దువ్వపాడు కైఫియ్యతు ఆనెగొంది నరపతి రాజులు ప్రబలులై దువ్వపాడు (దూపాడు) పరగణాను శకవర్షము 1288 క్రోధిలో జయించినట్లు చెప్పుచున్నది. విజయనగరాధీశ్వరులు ఈ ప్రాంతమును జయించిన తరువాత దానిని తమకు సామంతులయిన రావెళ వంశ్యుల పారుపత్తెమునం దుంచిరి. ఈ దండయాత్రలోనో, ఇంకను తరువాతనో కావచ్చును మొదటి బుక్కరాయలు రేచెర్ల వెలమనాయకుల నోడించి శ్రీశైల భూమిని వశము చేసికొనెను. అప్పటినుండి ఆ ప్రాంతము విజయనగర పరిపాలనము క్రిందికి వచ్చెను. అనవోతారెడ్డి విజయనగరాధీశ్వరులవలన తన రాజ్యమునకే కాక తన రాజధాని అద్దంకికిని అపాయము కలుగగలదని శంకించెను. అదియును గాక, అది మధ్యాంధ్రదేశమున ఒక కడగ నుండి పోయెను. ఈ కారణములవలన అతడు తన రాజధానిని అద్దంకికంటె బలిష్ఠమయిన గిరిదుర్గము కొండవీటికి మార్చెను. అంతకు పూర్వముకూడ కుండివపుర మనుపేర కొండవీడు రెడ్డిమన్నీల శాఖానగరములలో ఒకటిగ నుండెను. అది యెప్పుడు రెడ్డిరాజుల శాశ్వత రాజధాని యైనదో, అనవోతారెడ్డి తన రాజధానిని అద్దంకినుండి కొండవీటికి ఎప్పుడు మార్చెనో నిశ్చయముగ తెలియదు. కాని, శకవర్షములు 1288 నాటి అనవేమారెడ్డి (అనవోతారెడ్డి సోదరుడు) మన్యమాపురము శాసనములో ఈ ప్రస్తావము కలదు. అందువలన అనవోతారెడ్డి ప్రాయికముగా ఈ రాజధాని మార్పును తన రాజ్య కాలమున చివరి సంవత్సరములలో చేసి యుండవచ్చును.

అనవోతారెడ్డి గొప్ప యోధుడు; అనేక యుద్ధములను జయించినవాడు; ధర్మ సంస్థాపనమునకు దీక్షతో పాటుపడినవాడు. అతడు హేమాద్రి తన దాన ఖండమున చెప్పిన దానములలో అనేకము చేసెను; పుణ్యక్షేత్రములందును, పుణ్య తీర్థములందును సత్రములు పెట్టించెను; వేదవిదులయిన బ్రాహ్మణులు కోల్పోయిన అగ్రహారములను మరల సంపాదించి పెట్టియు, క్రొత్త అగ్రహారములను ఇచ్చియు వారిని ఆదరించినవాడు. అతడు తన తండ్రి సంపాదించిన రాజ్యమును కట్టుదిట్టపరచి దాని నింకను పెంపుచేయ ప్రయత్నించెను. అతని ప్రయత్నములు మొదట ఫలించి రాజ్యము విస్తరించినను ఆ విస్తృతరాజ్య సీమావధి అతడు మరణించునాటివరకు ఒక్కతీరున లేదు. విజయనగర రాజ విజృంభణముచేత అతడు కొంత రాజ్యమును నష్టపోయెను. అతని యొకశాసనము 'అతని రాజ్యము ఉత్తరమున మేకల పర్వతమువరకును, పడుమట శ్రీశైలము వరకును వ్యాపించినట్లు చెప్పుచున్నను అతడు గతించునాటికి రెడ్డిరాజ్య సీమావధు లివియని ఖండితముగ చెప్పుట కవకాశము లేదు.

అనవోతారెడ్డికి కుమారగిరిరెడ్డి యను కుమారుడును, దొడ్డాంబిక యను కూతురును కలరు. త్రిపురాంతకదేవుని అనుగ్రహమువ కలిగినవాడగుటచేత కాబోలు, అనవోతారెడ్డి తన తనయునికి త్రిపురాంతకదేవుడు వెలకొన్న కుమారగిరి పేరు పెట్టెను. కుమారగిరిరెడ్డికి కొమరగిరిరెడ్డి యనియు వ్యవహార ముండెను. అనవోతారెడ్డి తన కూతురయిన దొడ్డాంబికను తన బావయైన కాటయరెడ్డి కుమారుడును, తన మేనల్లుడును అగు వేమారెడ్డి (కాటయవేమారెడ్డి) కిచ్చి వివాహము కావించెను.

అనవోతారెడ్డి ఎప్పుడు కాలధర్మము పొందెనో తెలియదు. కాని, ఈతని తరువాత కొండవీటి సింహాసన మెక్కిన అనవేమారెడ్డి మొదటి శాసనము శకవర్షము 1288 క్రోధినాటి దగుటచేత అనవోతారెడ్డి అంతవరకు రాజ్యము చేసినట్లు ఊహింపవచ్చును.

**అనవేమారెడ్డి** (క్రీ. శ. 1364—క్రీ. శ. 1386): అనవోతారెడ్డి యనంతరము కొండవీటి సింహాసనము నధిష్ఠించినవాడు అతని యనుజుడైన అనవేమారెడ్డి. ఈతడు తన శాసనములలో తాను 'రాజ్యశ్రీ రమణీ స్వయంవరపతి' అనగా రాజ్యలక్ష్మిచేత పతిగా వరింపబడినవాడనని చెప్పుకొనెను. అనవోతారెడ్డికి కొమరగిరి యని కొమారుడుండగా అతడు తండ్రి యనంతరము సింహాసన మెక్కక పోవుటయు, అనవేమారెడ్డి తన శాసనములలో పై విధమున చెప్పుకొనుటయు చూడగా కొమరగిరిరెడ్డి సింహాసన మెక్కి రాజ్యభారము వహించుటకు తగిన యీడులేనివాడై యుండవలెను. అప్పుడు రెడ్డిరాజ్యములోని ప్రధాని, మంత్రి, దండనాయకులు, సామంత మండలేశ్వరులు మొదలయినవారు సమావేశమై రాజాచల, విజయనగర, కళింగ రాజ్యాధిపతుల విజృంభణమువలన రెడ్డిరాజ్యమునకు కలుగగల అపాయమును, అప్పటి రాజ్య పరిస్థితిని విచారించి చర్చించి సమర్థుడయిన బలప్రతాపాఢ్యుని ఎన్నుకొన్నచే కాని రాజ్యమునకు ముప్పు తప్పదని యోచించి తుదకు అనవేమ మహీపాలుని కొండవీటి రాజ్యాధిపతిగా ఎన్నుకొనినట్లు తోచుచున్నది. 'రాజ్యశ్రీ రమణీ స్వయంవరపతి' యను అనవేమారెడ్డికి గల వి[illegible]ణములోని పరమార్థ మిదే. అనవేమారెడ్డి అ[illegible]గారి రాజ్యకాలమున అతనికి కుడిభుజమై యుండి, కార్య ఖడ్గములందు తోడ్పడెను. కొమరగిరిని సింహాసన మెక్కించి అతని ప్రతినిధిగ రాజ్యకార్యములను నిర్వహించుట అతని కభిమతము కాలేదు. అప్పటి కాల స్వభావము ననుసరించి స్వతంత్రుడయిన



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



రాజే కొండవీటి సింహాసనమున కూర్చుండుట సముచిత మని అనవేమునికి తోచినది. మంత్రి, సామంత మండలేశ్వరు లకు కూడ అట్టి యభిప్రాయమే కలిగియుండును. తుదకు అనవేమారెడ్డి రెడ్డిరాజ్యాధిపతి యయ్యెను.

కుమారగిరి పక్షము వహించి అతని నిమిత్తము పోరా డిన వారు కొందరు తప్పక ఉండియుందురు. వారిలో అనపోతారెడ్డి కావయైన కాటారెడ్డియు, అనపోతారెడ్డి మేనల్లుడును, అల్లుడును అయిన వేమారెడ్డియు కుమార గిరి పక్షమున ప్రముఖులై యుందురు. కాని, రెడ్డిరాజ్య పరిస్థితిని గమనించి తాత్కాలికముగ మంత్రి, సామంత మండలేశ్వర నిర్ణయమునకు కట్టుపడి యుందురు.

అనవేమారెడ్డి రాజ్యమునకు వచ్చు నాటికి తన తండ్రి వేమారెడ్డి నిర్మించినట్టియు, తన యన్న అనపోతారెడ్డి పెంపొందించినట్టియు, రాజ్యములో చాల భాగము అన్య రాజాక్రాంత మయినది. రెడ్డిరాజ్య ప్రతిష్ఠ అడుగంటినది. నష్టమైన రాజ్యమును మరల సంపాదించి కొండవీటిరెడ్డి మన్నీల ప్రతిష్ఠను మరల సముద్ధరించుటకును, ప్రతిష్ఠాపించు టకును అతడు పూనుకొనెను. ఇందు నిమిత్తము అతడు పూర్వ దేశముపై దండువెడలెను.

అనవేమారెడ్డి పూర్వదిగ్విజయ యాత్ర కృష్ణానది ఉత్తర తటమునుండి ప్రారంభమైనది. ఈ యాత్రకు కళింగదేశములోని సింహాచలము కడపటి హద్దుగ కాన్పిం చును. ఈ హద్దులకు మధ్యనున్నవా రందరు పూర్వ మొ కప్పుడు అనపోతారెడ్డి చేత విజితులైనను మరల స్వతం త్రులై తమ మండలములను పాలించుచుండినవారే. ఈ పూర్వ దిగ్విజయయాత్రలో అతడు మొదట సాధించినది దీవి దుర్గము. అనపోతారెడ్డి దీనిని జయించిన పిదప తద్దుర్గ పాలకులు మరల ఆ కోటను మరమ్మతుచేసి మరింత కట్టు దిట్ట మొనర్చిరి. దీనిని అనవేమారెడ్డి తొలుదొల్త సాధిం చెను. అతని బిరుదములలో 'దీవిదుర్గ విభాళ' యనునది ఒకటి. ఇది అనపోతారెడ్డినుండి ఈతనికి సంక్రమించిన దేమో తెలియదు. అనపోతారెడ్డి జయించిన దేశ మంతయు అతని చేతినుండి జారిపోవుటచేత అనవేమ భూపాలుడు మరల ఈ దీవి దుర్గమును సాధించి ఆ బిరుదమును వహించెనని చెప్పుటయే యుక్తమని తోచును.

అనవేమారెడ్డి తరువాత కృష్ణాగోదావరీ నదులకు మధ్య వేంగీ విషయమునందు నాయకులను జయించెను. ఈ పూర్వదేశ దండయాత్రలో అనవేమ నృపతి ఏయే రాజ్యములను, ఏయే మండలములను జయించెనో, ఏయే నాయకులను జయించెనో అతని శాసనములు కాని, అతని తరువాతివారి శాసనములు కాని తెలుపవు. కాని శ్రీశైలము నందలి అతని శిలాశాసనములోని అతని బిరుదముల వలన అతడు చేకొన్న కొన్ని కొన్ని విజయములు తెలియ వచ్చుచున్నవి. శాసనములలో చెప్పబడక పోయినను ఈ దాడి విజయవంతముగ ముగియుటచేత కృష్ణా, గోదావరీ నదులకు మధ్యగల దేశమున ఉండిపురము రాజధానిగ నేలుచుండిన సూర్యవంశజులును, కామవరపుకోట రాజ ధానిగ పాలించుచుండిన భక్తిరాజ సంతతివారగు చోడ వంశజులును, నిరవద్యప్రోలు (నిడదవోలు) రాజధానిగా గల చంద్రవంశజులును అనవేమునికి పాదాక్రాంతులై అతని యధికారమునకు లోబడిరని చెప్పవచ్చును.

అనవేమారెడ్డి దండయాత్ర నాటికి చోడభక్తిరాజు గతించెను. అతనికి భీమలింగ చోడుడు, లేక భీమచోడు డను కుమారుడు ఉండెనని ఇదివరకే తెలుపబడినది. అతడు కాక, అన్నదేవచోడుడను మరియొక కుమారుడు కూడ కలడు. వీ రిరువురును సవతి బిడ్డలు కావచ్చును. వీరిలో భీమచోడుడు పెద్దవాడు. తండ్రి గతించిన వెంటనే భీమ చోడుని పిత్ర్యమైన సింహాసనమును ఎక్కనీయక అన్నదేవ చోడుడు దాని నాక్రమించుకొని శకవర్షములు 1289 (క్రీ. శ. 1367)లో పట్టాభిషేకము చేసికొనెను. భీమలింగ చోడుని కాదని అన్నదేవచోడ భూపతి తాను సింహాసన మాక్రమించు కొనుటకు కేవలము బలప్రతాపములే కారణమో, వేరు హేతువేదియైన కలదో తెలియదు. భీమలింగచోడుడు రెడ్డిరాజ్య ప్రతిష్ఠాపకుడైన వేమారెడ్డి కూతురిని, అనగా అనవేమారెడ్డి సోదరిని వివాహము చేసి కొనెను. ఈ కారణమున పూర్వదేశ దండయాత్రలో అన్నదేవచోడుని ఓడించి తరుమగొట్టి భీమలింగచోడుని పిత్ర్యమైన రాజ్యమున ప్రతిష్ఠాపించెను కాబోలును, అన్న దేవచోడ భూపతి రాజ్యబహిష్కృతుడై దేశాంతరమున ప్రవాస ముండవలసి వచ్చెను. అనవేమారెడ్డి రాజ్యకాల మున అన్నదేవచోడుడు వేంగీ విషయమున అడుగు పెట్ట లేదు.

అనవేమారెడ్డి ఉండిరాజులను, అన్నదేవచోడుని జయిం చిన పిదప నిరవద్యప్రోలి (నిడదవోలి) చాళుక్యులపై నరి గెను. నిరవద్యప్రోలు ఆ కాలము నందలి గొప్ప దుర్గము లలో ఒకటి. చంద్రవంశ క్షత్రియులైన పూర్వచాళుక్య వంశ్యులు దీనిని పాలించుచుండి యుందురు. వీరికి ఉండి సూర్యవంశపు రాజులతోను, సూర్యవంశజులైన తెలుగు చోళులతోను సంబంధ బాంధవ్యములు కలవు. ఆ కారణ మున వీరు కూడ తమ బంధువర్గమునకు బాసటయై అన వేముని పూర్వదేశ దండయాత్ర నడ్డగించి యుందురు. తుదకు వారిప్రయత్నము నిరర్థకము కాగా, నిరవద్యప్రోలు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



దుర్గమునకు వచ్చి దానిని సంరక్షించుకొనిరి. అనతి కాలముననే ఈ దుర్గము అనవేముని వశమైనది. తరువాత, అనవేమ నృపతి ఇంకను దిగువ గోదావరీ సాగర సంగమ ప్రదేశము వరకును వెళ్లి కోరుకొండ రాజధానిగ పాలించుచుండిన ముమ్మడి నాయకుని రాజ్యముపై దాడి వెడలెను. పానార, కోన, కురవాట దేశము లీరాజ్యములోనివి. పానార మన్నది పూర్వకాలపు పాగుణార దేశము. పూర్వము దీనిని పాగుణవార మని కూడ వ్యవహరించువారు. ఇది గోదావరీనది శాఖ యైన వసిష్ఠకును, పడుమటి గోదావరి జిల్లా తణుకు, భీమవరము తాలూకాల గుండ ప్రవహించు గోస్తనీ నదికిని మధ్యనుండు దేశము. తణుకు తాలూకా పూర్తిగ కాకపోయినను కొంతభాగమును, నరసాపురము, భీమవరము తాలూకాలును ఆక్రమించిన భాగమునే పూర్వము పానార దేశమని వ్యవహరించుచుండిరి. కోన దేశమన్న కోనరాష్ట్రమను ఇప్పటి కోన సీమ. తూర్పు గోదావరిజిల్లా కాకినాడ తాలూకాలోని కురవాట - ఇప్పటి కూరాడప్రాంతము - కురవాట దేశము. చెంగర యన్నది గోదావరీ ప్రాంత దేశమని తెలియవచ్చినను అది ఏ ప్రాంతమయి యుండునో స్పష్టముగ తెలియ వచ్చుటలేదు. ఈ దేశము లన్నియు కోరుకొండ ముమ్మడి నాయకుని రాజ్యములో గోదావరికి దిగువను. ఉభయ తటములను అనుకొని యున్నవి. ఈ గోదావరీతీరస్థ దుర్గములలో అనేకము



చిత్రము 58. ముమ్మడి నాయకుడు, అతని భార్య:
లక్ష్మీనరసింహాలయము, కోరుకొండ

జలదుర్గము లుండెను. అనవేమారెడ్డి గోదావరికి దక్షిణ తటముననుండు దుర్గముల నన్నింటిని జయించి, ఆనదిని దాటి దాని కావలితీరమున నుండిన దుర్గములను పట్టుకొని, కోనదేశమును సాధించి పిదప రాజమహేంద్రవరము మొదలైన కోటలను ముట్టడించి పట్టుకొని కొండవీటి రాజ్యమున కలుపుకొనెను. ఈ ప్రాంతమున కోరుకొండ ముమ్మడి నాయకుడును, అతని సోదరుడు సింగమనాయకుడును దండెత్తి వచ్చుచుండిన అనవేమారెడ్డి సైన్యములను పెక్కుచోట్ల నెదుర్కొని పోరాడి యుందు రనుటకు సందేహము లేదు. కాని, అనవేమారెడ్డి విజయవిక్రమ ధాటికి ఎదురొడ్డి నిలువలేక ఓడిపోయిన కోరుకొండ నాయకులు అతనికి వశవర్తులై కప్పము కట్టుటకు అంగీకరించిరి. శకవర్షములు 1293 (క్రీ. శ. 1374) నాటి అనవేమారెడ్డి నడుపూరు తామ్రశాసనమును, శకవర్షములు 1299 (క్రీ. శ. 1377), 1303 (క్రీ. శ. 1381) నాటి అతని పలివెల, దాక్షారామము శిలాశాసనములును, శకవర్షములు 1303 (క్రీ. శ. 1381)నాటిదే యగు అతని వానపల్లి తామ్రశాసనమును దిగువగోదావరీ ప్రాంత దేశమంతయు పూర్తిగ జయింపబడి అతని సంపూర్ణాధికారము క్రిందికి వచ్చె ననుటకు తార్కాణములు. రాజమహేంద్రవరాద్యనేక స్థల దుర్గములను జయించిన పిదప, అనవేమారెడ్డి, ఇంకను తూర్పుదిశకు పోయి పిఠాపురపు వీరసామంతులైన కొప్పుల వంశ్యులను జయించి, అటు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పిదప దక్షిణ కళింగముపై ఎత్తి వెళ్లెను. దక్షిణ కళింగము వరకు గల గోదావరీప్రాంతము నంతను సాధించి అన వేమారెడ్డి 'రాజమహేంద్ర నిరవద్య నగరాది బహువిధ స్థలదుర్గ వర్గ విదళన బలరామ', 'సాగర గౌతమీ సలిల సంగమ సకల జలదుర్గ సాధన రఘురామ' అను బిరుదము లను వహించెను. ఈ దండయాత్రలో అనవేమారెడ్డికి అతని బావమరదియగు కాటయరెడ్డియు, ఇతని సోదరుడు మార యరెడ్డియు, ఇతర బంధువులు నూంకయ, నల్ల నూంకయ లును, దువ్వూరి దొడ్డారెడ్డియు అతని సోదరులును బాసట యైరి. వీరిలో అనవేమారెడ్డి బావమరది కాటయరెడ్డి జలదుర్గములను సాధించుటలో నేర్పరియై జలదుర్గమల్ల బిరుదాంకితుడయ్యెను.

రాజమహేంద్రవరాది స్థలదుర్గముల పతనము అనవేమ భూపతికి దక్షిణ కళింగ దండయాత్రకు దారి చక్కబరచి నది. పిఠాపురమును జయించిన పిదప అనవేమభూపతి దక్షిణకళింగమున ప్రవేశించి యెలమంచిలి రాజధానిగా తత్ప్రాంతమును పాలించుచుండిన చాళుక్యులను జయించి, పిదప ఒడ్డాది మత్స్యవంశ్యులను పాదాక్రాంతులను గావించుకొనెను. అనవేముని శాసనములు వీరి నందరిని జయించినట్లు చెప్పకపోయినను అతడు సింహాచలమువరకు నిరాఘాట విజయధాటిని పోయి యుండుటచేత చాళుక్యు లను, మత్స్యవంశ్యులనుకూడ జయించి యుండుననుటకు సందియములేదు. ఎలమంచిలి చాళుక్యులలో శకవర్ష ములు 1294 (క్రీ. శ. 1372) నాటి నాలుగవ ఉపేంద్రదేవ చక్రవర్తియు, ఇతని పినతండ్రి అయిదవ ఉపేంద్రదేవ చక్ర వర్తియు ప్రాయికముగా అనవేమ భూపాలునికి సమకా లికులైయుందురు. ఒడ్డాది మత్స్యవంశపు రాజులలో జయంత భూపతి తనయుడు పీరార్జునదేవుడు అనవేమా రెడ్డికి సమకాలికుడై మత్స్యరాజ్యమును పాలించుచుండిన వాడు. ఇతని శాసనములు శకవర్షములు 1279 (క్రీ. శ. 1357) మొదలు శకవర్షములు 1303 (క్రీ. శ. 1381) వరకు శానవచ్చుచున్నవి. ఈ మహీపతుల నందరిని జయించి అతతదియనాటికి అనవేమారెడ్డి సింహాచలము చేరెను. అక్కడ 'అనవేమారెడ్డిగారు తమ అభీష్టార్థసిద్ధిగాను శ్రీ వరసింహనాథునికి' శకవర్షములు 1297 లో వైశాఖ విమల తృతీయా బుధవారమునాడు (క్రీ. శ. 1375, ఏప్రిల్ 4) కొన్ని కైంకర్యముల నిమిత్తము నిబంధములు చేసి శ్రీరామనాయనికి 75 గండమాండలు పెట్టిరి. ఆయన ప్రధాని వారణదాసుల కొడుకు చెన్నమనాయడు 'తన కభీష్టార్థసిద్ధిగా శ్రీవరసింహనాథుని ధూపకాలమందు నిత్య మున్ను కొలువను, తాను ఒడ్డాది అర్జునదేవరాజుచేత పడసిన ఊరు' 'గోటివాడను ఆరుపుట్లు జలక్షేత్రము శ్రీభండారానకుం పద్మనిధిగాం బెట్టి పడునిబంధాలు వృత్తిగాం బడసి పండుగురు బ్రాహ్మలకుం బెట్టెను'. పూర్వ దేశ దండయాత్రయైన పిదప అనవేమారెడ్డి సింహాచలము మొదలైన వింధ్యపాదములందు కీర్తిస్తంభములను ప్రతి ష్ఠించి, 'సింహాచలాది వింధ్యపాద ప్రతిష్ఠాపిత కీర్తి స్తంభ' బిరుదమును వహించెను. అతని పూర్వదేశ దండయాత్ర శకవర్షములు 1297 (క్రీ. శ. 1375)తో అంతమైనది. సింహా చలము పర్యంతముగల నాయకుల నందరిని జయించి అనవేమారెడ్డి వారిని కొండవీటి రెడ్డిసింహాసనమునకు విధేయసామంతు లగునట్లు చేసి వారివద్దనుండి కాను కలను, కప్పములను గైకొనెను. పూర్వదేశ దండయాత్ర పూర్తియైన తరువాత అనవేమారెడ్డి కొండవీటికి మరలి వచ్చెను.

తరువాత అనవేమ భూపాలుడు తన దృష్టిని పడుమటి దెసకు మరల్చెను. విజయనగరరాజ్యము క్రమక్రమముగా కొండవీటి రాజ్యమున అడుగుపెట్టి మెల్ల మెల్లగ దానిని కబళించుచుండెను. విజయనగరాధీశ్వరులు పడుమటి దెసను కొండవీటి రాజ్యమువైపు ఎంతవరకు చొచ్చుకుని వచ్చిరో పరువదేశములోని చాంగలవీడులోగల శకవర్ష ములు 1294 (క్రీ. శ. 1372) నాటి, మహానందిలోని శకము 1332 (క్రీ. శ. 1410) నాటి విజయనగర శాసనముల వలన తెలియగలదు. వీనిలో మొదటి శాసనము విజయ నగర దండనాయకులలో ఒకడు వినుకొండ సీమలోని వింజనంపాడు గ్రామమును (గుంటూరుజిల్లా నరసారావు పేట తాలూకాలోనిది) పాపవినాశన దేవునికి సమర్పించి నట్లు తెలుపుటకు పుట్టినది. రెండవ శాసనములోని దాత యైన తిప్పరాజు పితామహుడు వెలుగోటి గంగ్రాజు చెన్నరాజునకు కొచ్చెర్లకోట యుద్ధవీరుడను బిరుదము కలదు. ఈ కొచ్చెర్లకోట నెల్లూరుజిల్లా దర్శి డివిజనులో ఉన్నది. పూర్వోక్త శాసనములవలన విజయనగరాధీశ్వ రులైన మొదటి బుక్కరాయలు కొండవీటి రాజ్యము లోపలి కంటచొచ్చుకొనివచ్చినట్లు విదితమగుచున్నది. ఇది యిట్లుండ, రాచకొండ పద్మనాయకులు ఇప్పుడు తెలం గాణాకు అంతకు అధిపతులైరి. వారు ధరణికోటపై ఎత్తివచ్చిన సందర్భమున తన యన్న అనపోతారెడ్డిని పరచిన అవమానమును అనవేమారెడ్డి మరచిపోలేదు. కళింగమువరకు గల దేశము రెడ్డి మన్నీల అధికారము క్రింద సుస్థిరముగ నుండుటచేత అతడు పడుమటిదిశను నష్టమైన రాజ్యమును మరల సంపాదించుటకు పశ్చిమ దిగ్విజయ యాత్ర నారంభించెను.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఈ పశ్చిమ దిగ్విజయయాత్రలో అనవేమారెడ్డికి రాజాచల దుర్గాధిపతులతో సంగరము సంభవించినది. 'వెలుగోటివారి వంశావళి' అనవోతానాయకుని సోదరుడు మొదటి మాదానాయకుని చెనకి అనవేముడు తుదకు ఓడి పారిపోయినట్లు తెలుపుచున్నది. సాధారణముగా రేచెర్లవారికిట్టి విజయము లభించినపుడు ఒక్క పద్యమునగాక పెక్కుపద్యములలో దాని నభివర్ణించి చెప్పుట పరిపాటిగ కనబడును. అట్టిది పూర్తి పద్యముననైనను కాక సీసపద్యములోని ఒక్క ఒంటరి చరణమున దీనిని చెప్పుటవలన నిజముగా మాదానాయకునికి విజయము కలిగెనాయని సంశయింపవలసి వచ్చుచున్నది. ఇందుకు తార్కాణముగా రేచెర్ల వెలమరాజ్యమునందే నలగొండ జిల్లాలోని కృష్ణానది కుత్తరతటమున వజీరాబాదు వాడపల్లిలో అనవేమారెడ్డిశాసన ముండుట ఆ సంశయమునకు ప్రబల హేతువగుచున్నది. ఈ శాసనము శకవర్షములు 1299 పింగళ సంవత్సరమున అనవేమారెడ్డి సోదరుడైన అనమాచారెడ్డి భృత్యుడు కడియము పోతినాయకుడు తన ప్రభువునకు పుణ్యమగునట్లు అక్కడి అగస్త్యేశ్వర మహాదేవుని ఆలయ గోపురమును, ఆ యాలయమున చంద్రశాలను కట్టించి దేవాలయములోని దేవర సేవా నిబంధముల నిమిత్తము దానములను ధర్మములను చేసినట్లు తెలుపుచున్నది. ఈ శాసనమువలన అనవేమారెడ్డి రేచెర్ల వారిని ఓడించి వారిరాజ్యములో వాడపల్లి ప్రాంతమును కొండవీటి రాజ్యములో కలుపుకొని కృష్ణ కుత్తర తటమున కొంత సైన్యము నుంచి దానిని కట్టుదిట్టపరచెను. ఇట్లే నలగొండ జిల్లా బూరుగుగడ్డలో దేసట్ల గోత్రుడైన చిలుకూరి అనభీమానాయకుని కుమారుడైన అన్నమనాయకుని శాసనము పింగళ సంవత్సరమునాటిదే కలదు. ఇతడు దేసటి అనవేమారెడ్డికి సామంతుడే యైనచో నలగొండ జిల్లాలోని మరికొంత ప్రాంతముకూడ అనవేమునికి వశమైనట్లే తలపవలసియుండును. ఇందువలన వెలుగోటివారి వంశావళిలో అనవేమారెడ్డి ఓడిపోయినట్లు చెప్పబడిన విషయము పరియైనదికాదని తెలుచున్నది.

అనవేమ భూపాలుని పశ్చిమదిగ్విజయ యాత్ర అంతటితో ఆగిపోలేదు. అతడు ఆ ధాటిలో శ్రీశైలమువరకు గల ప్రాంతమునంతను జయించి శ్రీశైలములో తన విజయ యాత్రా సూచకముగ శాసనము వేయించెను. ఈతని శ్రీశైల శాసనము శకవర్షములు 1299 పింగళ సంవత్సర మాఘ శు 7 బుధవారము (క్రీ. శ. 1878 జనవరి 6వ తేదీ) నాటిది. ఈ శాసనాదుల వలన అనవేమభూవరుడు అన్యాక్రాంతమైన తమ రాజ్యము నంతను మరల సంపాదించుటయేకాక, సింహాచలమువరకు గల దేశమును కొండవీటి రెడ్డిరాజుల అధికారముక్రిందికి తెచ్చెను. శకవర్షములు 1804 దుందుభినాటి అతని మన్యమాపుర శాసనము సింహాచలమునుండి శ్రీశైలమువరకు గల దేశమును అనవేమారెడ్డి ధర్మోత్తరముగ పరిపాలించినట్లు తెలుపుచున్నది.

అనవేమ భూపాలుడు నిర్వక్ర పరాక్రమముతో ఇన్ని దేశములు జయింపగలుగుటలో గల కీలకమును అతని బిరుదములే తెలుపుచున్నవి. వానిలో 'పరిచితానేకగతి విశేషవారణ మారణోపాయ', 'ప్రజాపరిచిత చతుర్విధోపాయ' అను బిరుదులు చాల ముఖ్యమైనవి. పూర్వకాలమున యుద్ధములలో గజదళ ప్రాముఖ్య మధికముగ నుండెను. ఈ యేనుగుల గతివిశేషములచేత వానిని వధించు ఉపాయము తెలిసినవాడని మొదటి బిరుదమున కర్థము. ఈ గజయుద్ధతంత్ర పరిజ్ఞానమే పూర్వదేశ దండయాత్రలో అనవేమునికి ఎక్కువ ఉపకరించినది. దీనికి తోడు అతడు ప్రజలకు అపరిచితములైన సామదానభేద దండము లను చతుర్విధోపాయములు గలవాడు. ఈ ప్రజ్ఞలే ఈతనికి పూర్వదిగ్విజయమును సాధించి పెట్టినవి. ఇదియును గాక అతడు కత్తిసాములో కడు నేర్పరి. కత్తిపట్టిన అనవేమునిముందు నిలుచుట కష్టము. ఈ విషయమును అతని ఛురికాసహాయ, కరవాలమైనతేయ ఖండిత విమతవ్యాళ బిరుదములే చెప్పక చెప్పుచున్నవి. అతడు విక్రమ పంజర నిగృహీత రిపురాజసింహ, విజయ కుంజరాలాన నిజభుజస్తంభ సంభృత యశోమండన బిరుదాంకితుడు కూడను. ఈ విజయములు పూర్తియైన పిదప అనవేమారెడ్డి దేవదేవునికి భక్తితోను, కృతజ్ఞతతోను పంచారామములలో గజఘంటలను సమర్పించెను. పూర్వ పశ్చిమాశా విజయానంతరము అనవేమారెడ్డి 'మహనీయాంధ్ర దేశ పట్టాభిషేక సంవృత మహాభాగ్య' బిరుదమును దాల్చెను. అతని రాజ్యము కర్నూలు జిల్లాలోని శ్రీశైలమునుండి తూర్పు సముద్రము వరకును, విశాఖపట్టణము జిల్లాలోని సింహాచలమునుండి నెల్లూరు జిల్లాలోని కందుకూరు వరకును వ్యాపించినది.

అనవేమారెడ్డి అంతకుపూర్వ మెప్పుడో అంతరించిన మదన మహోత్సవ మనునామాంతరముగల వసంతోత్సవమును మరల మహావైభవముగ ప్రవర్తిల్ల జేసెను. ఆ కాలమునాటి జాతీయములయిన పండుగలలో ఇది చాల గొప్పది; కళాపోషణకు కారకమయినది. ఈ యుత్సవ సందర్భమున అనవేమారెడ్డి చందనమునకును, పన్నీటికిని, కస్తూరికిని తోడుగా ఉత్సవము చూడవచ్చిన జనానీకముపై కర్పూర ఖండములను వెదచల్లువాడట. వసంతోత్సవమును ఏటేట నిర్వహించుటచేత వసంతరాయడని,



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కర్పూరపు ముక్కలను ఉత్సవాగతులపై వెదచల్లుటచేత కర్పూర వసంతరాయడని ఇతని బిరుదనామములు.

అనవేమారెడ్డి హేమాద్రి దానఖండమున చెప్పిన బ్రహ్మాండదాన, కల్పతరుదాన, కనకధారాదాన, గోసహస్ర దానాదులను చేసి యశము నార్జించెను; సత్రములను పెట్టించెను; కవులను, పండితులను పోషించెను; బ్రాహ్మణుల కనేకాగ్రహారముల నొసంగెను. మహా కవీశ్వరులకు అనేకవేల సువర్ణములను దానముచేసి వారిని సంతోషపెట్టి 'బహుసహస్ర సువర్ణదాన సంతోషిత మహా కవీశ్వర' బిరుదమును గడించిన సుకృతి అతడు. ఇందరు కవులను ఆదరించినను అతనికి అంకితమీయబడిన కృతి యొకటైనను కానరాకపోవుట ఆశ్చర్యము. అనవేముడు అనేక ధర్మకార్యములు చేసెను. అందువలన ప్రజలు అతనిని ధర్మానవేము డని వ్యవహరించుచుండిరి. తన బ్రదుకు భూమిసురులకు, తన బిరుదులు పంటవంశ ధరణీశులకు, తన నయము భూమి ప్రజలకు ఇచ్చెనని విష్ణు పురాణకర్త అనవేమ భూపాలుని గురించి చక్కగ చెప్పెను.

కొమరగిరిరెడ్డి (క్రీ. శ. 1886 — క్రీ. శ. 1402): అనవేమారెడ్డి ఎప్పుడు మృతినొందెనో తెలియదు. ఇతని కడపటి శాసనము శకవర్షములు 1804 (క్రీ. శ. 1882) నాటిది. కొమరగిరి రెడ్డికి అతని రాజ్య ప్రారంభమునుండియు అతని బావమరదియైన కాటయ వేమారెడ్డి ప్రధానిగను, సర్వ సైన్యాధిపతిగను ఉండెను. శకము 1808 నాటి కాటయ వేముని సింహాచలము శాసనములో అతడు తాను కొమరగిరి భూవరుని ప్రధానినని తెలుపుకొనెను. కొమరగిరిరెడ్డి మొదటి శాసనము శకవర్షములు 1812 (క్రీ. శ. 1890) నాటి అనవర్తి శాసనము. ఈ శాసన కాలము నాటికి కొమరగిరిరెడ్డి కొండవీటి రాజ్యాధిపతిగ సుప్రతిష్ఠితు డయ్యెను. అందువలన ఇతని రాజ్యము క్రీ. శ. 1886 నుండి ఆరంభమయినట్లు నుడువవచ్చును.

కొమరగిరిరెడ్డి రాజ్యమునకు రాకుండ చేయుటకు అతని ప్రతిపక్షము బలముగ ప్రయత్నించె ననియు, ఈ కారణమున కొమరగిరి పక్షమునకు, అతని పక్షమునకు పోరాటము జరగె ననియు కాటయ వేమారెడ్డి శాసనముల లోని ఒక శ్లోకమువలన ఊహింప నవకాశము కలదు. ఆ శ్లోకమున కర్థ మిది. శ్రీకృష్ణుడు ధర్మజునివలెనే కుమారగిరి భూవరుని అమాత్యుడైన కాటయ వేమ ప్రభువు సింహాసనమున కూర్చుండబెట్టి ప్రకాశింపజేసెను. ఇందలి కృష్ణ ధర్మజుల ఉపమానములు సర్వవిధముల సార్థకములైనవి. ప్రతిపక్షమువారు కుమారగిరిని రాజ్యమునకు రాకుండజేయ బ్రయత్నించినపుడు పాండవుల పక్ష మవలంబించి మహా సంగ్రామమున కౌరవులను నిర్జించి ధర్మజుని సింహాసన మెక్కించిన కృష్ణునివలెనే కాటయవేమారెడ్డి కూడ శత్రువులను జయించి కొమరగిరిరెడ్డిని సింహాసనము మీద కూర్చుండబెట్టెను. ఇందువలన రెడ్డి రాజ్యాంతఃకలహమున కాటయవేముని సాయముతో శత్రువులను ఓడించి కొమరగిరిరెడ్డి సింహాసన మెక్కినట్లు స్పష్టమగుచున్నది. ఇక కొమరగిరి ప్రతిపక్షమువా రెవరై యుండిరో విచారింప వలసి యున్నది. అనవేమారెడ్డికి సంతానము లేనట్లు తోచును. అందువలన అతని బంధువు లెవరైన ఐక్యము కలిగించుకొనిరేమో తెలియదు. అనవేమారెడ్డి సోదరుడైన అనమాచారెడ్డి అన్న మరణానంతరము జీవించి యుండెనో, లేదో తెలియదు. ఇక కొమరగిరికి ప్రతికూల పక్షమువారు ప్రోలయవేముని అన్నయైన మాచారెడ్డి కొడుకులు రెడ్డిపోత, పెదకోమటి, నాగారెడ్లును, పెద కోమటి తనయులు వేమ, మాచారెడ్లును, వారి బంధువులును అయియుండవలెను. రెడ్డి రాజ్యమునకు మొదట వేమారెడ్డికాక అతని యన్న మాచారెడ్డి అధిపతి కావలసి యుండెను. కాని, ఆ కాలములో వేమారెడ్డి సాహసికుడు, ఉగ్రకార్యుడు, ప్రతాపసీమ, ఉదారుడు అయిన కారణముననేమో రెడ్డిరాజ్య నిర్మాతయు, అధిపతియు అయ్యెను. అప్పటికి రెడ్డిరాజ్యము చిన్నది. వేమారెడ్డి కాలమునను, అనపోతారెడ్డి కాలమునను రెడ్డిదొర లందరు కలిసికట్టుగ పనిచేసి రెడ్డిరాజ్యమును విస్తరింపజేయ బ్రయత్నించిరి. వేమారెడ్డి తన అగ్ర సోదరుని చందవోలులోను, తన కనిష్ఠ సోదరుని కందుకూరులోను ఉంచెను. సోదరు లుభయులును రెడ్డి రాజ్యమునకు సంబంధించిన కార్యముల నిర్వహణలో వేమారెడ్డికి తోడ్పడిరి. అనవేమారెడ్డి కార్య ప్రతాపములవలన రెడ్డిరాజ్యము సింహాచలము నుండి శ్రీశైలమువరకు విస్తరించినపుడు ఆ యగ్ర, కనిష్ఠ సోదర సంతతివారివి చిన్న సంస్థానములైనవి. మాచారెడ్డి పౌత్రుడును, పెదకోమటి పుత్రుడును అయిన వేమారెడ్డి— ఇతనికి పెదకోమటి వేమారెడ్డియని వ్యవహారము— వేమాగ్రజ సంతతివా డగుటవలన కొండవీటి సింహాసనమునకు తనకు ఎక్కువ హక్కు ఉండునని భావించియుండును. హక్కుమాట అట్లుండ, కొమరగిరివద్ద కాటయవేమునికి పలుకుబడి అధికమైనది. కాటయవేమ, పెదకోమటివేమ భూవరు లుభయులును విద్వాంసులే. అందువలన ఇరువురును ఒకరికొకరు ప్రతిస్పర్ధులు. ఉభయులును కార్య ప్రతాపవంతులే. కొమరగిరిరెడ్డి కంటెను కోమటి వేమారెడ్డికి కాటయవేముడే నిజముగా శత్రువు. కొమరగిరి రాజయినచో కొలువులో పెదకోమటి వేమాదులకు తావే



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఉండదు. ఈవిధమయిన భావములతో ప్రతిపక్ష వర్గమువారు యుద్ధమునకు సిద్ధమయిరి. కాటయ వేమారెడ్డి తన బావ మరది కొమరగిరిని సింహాసన మెక్కింప బూన్కి వహించెను. ఉభయ పక్షములవారికి యుద్ధమైనది. ఆ యుద్ధమున కొమరగిరి రెడ్డి పక్షము జయించెనో పెదకోమటి వేముని పక్షము జయించెనో తెలియదు కాని, ఉభయులు రాజీకి వచ్చినట్లు తోచును. దీని ప్రకారము పెదకోమటి వేమారెడ్డి కొమరగిరిని కొండవీటి రెడ్డిరాజ్యాధిపతిగా అంగీకరించి అతనికి విధేయ సామంతుడై అతని మండలము నేలుటకును, కొమరగిరిరెడ్డి యనంతరము పెదకోమటి వేమారెడ్డియే రెడ్డి రాజ్యాధిపతి యగుటకును ఉభయ పక్షములవారును అంగీకరించినట్లు కన్పట్టును. పెదకోమటి వేమారెడ్డి అమీనాబాదు శాసనములో అతనికి కులక్రమ పరిప్రాప్త సామ్రాజ్య సింహాసనాధ్యాసి యను విశేషణమున కిదియే యర్థమని తోచుచున్నది. ఎట్లయిన నేమి? తుదకు కుమారగిరిరెడ్డి కొండవీటి సింహాసనమును అధిష్ఠించెను. వయసున చిన్నవాడైన కుమారగిరి భూపాలుడు తన బావమరది కాటయవేముని తన ప్రధానిగను, సర్వ సైన్యాధిపతిగను నియమించెను.

రెడ్డి రాజ్యములో అంతఃకలహము జరుగుచుండిన కాలమున నాలుగు దిశలయందును కొండవీటి రెడ్డిరాజ్యమునకు అదివరలో అణకువరై యుండిన సామంత మండలేశ్వరులును, దుర్గాధిపతులును రెడ్డి రాజాధికారమును ధిక్కరించి స్వతంత్రులైరి. ఈ కాలములోనే విజయనగరాధీశ్వరులు మరల శ్రీశైల ప్రాంతమును ఆక్రమించుకొనుటయేకాక త్రిపురాంతక ప్రాంతము వరకు వచ్చిరి. కుమారగిరి నృపాలుడు తన ప్రధాని, దండనాయకుడు అయిన కాటయవేమారెడ్డిని గొప్ప సేనతో పడుమటి దెసకు పంపెను. అప్పటి కర్ణాటాధీశ్వరుడు రెండవ హరిహర దేవరాయలు. రెడ్డి, విజయనగర సైన్యములకు గొప్ప యుద్ధము జరగినది. అదివరకే విజయనగర సైన్యములు రేచెర్ల, బహ్మనీ సైన్యములవలన కొత్తకొండ (తెలంగాణా



చిత్రము 54. వెదుళ్ల చెరువు, కొండవీటి దుర్గము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



లోనిది) వద్ద పూర్తిగా అపజయము పొంది వచ్చినవి. యుద్ధము సాగుచుండగా రేచెర్లవారును, బహ్మనీ సుల్తానులును బల ప్రాభవములలో నాటికి నాడు అభివృద్ధిపొంది కర్ణాటరాజ్యోపద్రవకారులుగ పరిణమించు చుండుటచేత పొరుగుననున్న రెడ్డిరాజులతో మైత్రి కలిగియుండుట తన రాజ్యమునకు శ్రేయస్కరమును, బలవర్ధకమునని హరిహరరాయలు తలపోసి సంధికి ప్రయత్నించెను. కాటయవేమారెడ్డికూడ గొప్పదైన కర్ణాటరాజ్యముతో మైత్రి కొండవీటి రాజ్యపు అంతశ్శత్రువులను, బహిశ్శత్రువులను అణచుటకు ఉపకరింపగలదని తలంచి సంధికి సమ్మతించెను. ఈ సంధి ప్రకారము రెండవ హరిహరరాయలు కుమారగిరి భూవరునికి త్రిపురాంతక ప్రాంతమును ఇచ్చివేసెను. శకవర్షములు 1807 (క్రి. శ. 1385) తరువాత శ్రీశైల ప్రాంతమున విజయనగర శాసనములు కానవచ్చుటచేత శ్రీశైల భూమిలోని చాల భాగమును కొమరగిరిరెడ్డి హరిహరరాయల కిచ్చివేసినట్లు కనబడుచున్నది. ఈ సంధి ననుసరించి త్రిపురాంతక క్షేత్రమును, వినుకొండ దుర్గమును మరల కొండవీటి రెడ్డిరాజుల స్వాధీనములోనికి వచ్చినవి. రెండవ హరిహరరాయలు తన కూతురు హరిహరాంబను కాటయవేమారెడ్డి కిచ్చి వివాహముచేసి ఈ సంధి పూర్వక మైత్ర్యనుబంధమును దృఢతరము కావించెను. ఈ వివాహ విషయము అల్లయవేమారెడ్డి వేమవరము శాసనములో తెలుపబడినది.

'వెలుగోటి వారి వంశావళి'లో పెదకోమ టన్నవేమారెడ్డిని సంబోధించుచు చెప్పిన ఒకసీస పద్య పాదములో 'కొమరగిరి రెడ్డికి గోరి సింగయ మాదు తనర బెట్టిన బొమ్మ తలపవైరి' అని సింగయమాదానేడు (మొదటి సింగమనాయని తనయుడు, మొదటి అనపోతా నాయని సోదరుడు) కొమరగిరిని ఓడించి బొమ్మ పెట్టినట్లు చెప్పబడినది. ఆ కాలములో యుద్ధమున గెలిచినవారు పరాజితులైన, సంహరింపబడిన తమ శత్రువులను అవమానించి, అవహాస్యముచేసి ఆనందించుటలో 'బొమ్మపెట్టుట' అను వానుడి తెలుగుదేశమున వాడుకలోనికి వచ్చినది. ఓడిపోయిన, లేక సంహరింపబడినవారి బొమ్మ యథారీతిని కాని, అవమానకరముగ నుండు రీతిని కాని తయారుచేయించి విజేత తన తమ్మపడిగ మీదనో, డాకాలి పెండెరమునవో శావటము చేయించెడివాడు. కొమరగిరికి బొమ్మపెట్టివన అతనిని ఓడించెనని యర్థము. దాచభూపాలుడు కూడ కొమరగిరికి బొమ్మపెట్టినట్లు పూర్వోక్త గ్రంథమునందే కలదు. ఈ దాచ భూపాలుడు లింగమనేని పెదతండ్రియని చెప్పబడినది. లింగమనేని పెదతండ్రి దాచభూపాలుడను పేరు గలవాడు ఒకడు ఉండెనో లేదో తెలియదు. ఈ రెండు పద్యపాదములలోతక్క రేచెర్లవారు కొమరగిరి రెడ్డిని జయించినట్లు ఆ గ్రంథమున మరెక్కడను చెప్పబడలేదు. అందువలన రాచకొండ వెలమ నాయకులు కొమరగిరిని జయించుట ఎంత వరకు సత్యమో తెలియదు. ఒకవేళ ఇది నిజమేయైనచో మొదటి అనపోతా నాయకుని రాజ్యకాలము చివర జరగిన కళింగ దండ యాత్రలో శకవర్షములు 1802 (క్రి. శ 1880) తరువాత వేదగిరినేడు తూర్పు గోదావరిజిల్లా తుని డివిజనులోని బెండపూడి దుర్గమును సాధించిన సందర్భమున, రేచెర్ల సైన్యము గోదావరి ఉత్తరతటముపై దండెత్తి వచ్చినపుడు జరగియుండవలెను. 'వెలుగోటి వారి వంశావళి'లోని కాటయవేముని ప్రస్తావ మెక్కడను లేదను విషయమును గూడ మనము గుర్తుంచుకొనవలెను.

చోడ భక్తిరాజు కుమారుడు అన్నదేవ చోడుడు రాజ్యమునుండి వెడలగొట్టబడినట్లు ఈ వరకే తెలుపబడినది. శకవర్షములు 1810నాటి అతనిశాసన మొకటి త్రిపురాంతకములో నున్నది. అత డచ్చటికి శత్రువుగా వచ్చెనో, మిత్రుడుగా వచ్చెనో, అంతవరకు ఎచ్చట నుండెనో తెలియదు. అనవేమారెడ్డి రాజ్యకాలమునుండి దేశదేశములు తిరుగుచు రెడ్డిరాజ్యాంతఃకలహకాలమున కొమరగిరిరెడ్డి ప్రతిపక్షమువారితో సహకరించి అతడు ప్రాయికముగ తన రాజ్యమును మరల సంపాదించుకొనుటకు వచ్చినట్లు కాన్పించును. మొత్తము మీద కొమరగిరిరెడ్డియే జయించి రాజ్యమునకు వచ్చుటతో మరల అన్నదేవచోడ నరేంద్రునికి కొండవీటి రెడ్డిరాజ్యమున నిలుచుటకు అవకాశము లేక అతడు దేశాంతర గతుడయ్యెను.

ఈ విధముగా రెడ్డి రాజ్యాంతఃకలహము కాలమున దక్షిణ, పశ్చిమ, ఉత్తర దిశలయందు రెడ్డిరాజ్యాధికారమును ధిక్కరించి, స్వతంత్రులైన సామంత మండలికులను అణచివైచి, ఇతర శత్రువులను జయించి కొమరగిరిరెడ్డి తన దృష్టిని పూర్వదేశముపై ప్రసరింప జేసెను.

అనపోతారెడ్డి పూర్వదేశదండయాత్ర చేసిన నాటినుండి పంటరెడ్డి కుటుంబములు కొన్ని నెల్లూరు ప్రాంతము నుండి గోదావరీ తీరమున రాజమహేంద్రవరమునకు వలస వచ్చినవి. అనవేమారెడ్డి పూర్వదిగ్విజయమునకు పిదప, పారుపత్తెగాండ్రుగనో, సైన్యమున సేనానులుగనో, ఇతర రాజకీయోద్యోగులుగనో పంటరెడ్డి దొర లనేకులు రాజమహేంద్రవరమునకును, తత్పరిసర ప్రాంతమునకును వెళ్లి అచట స్థిరనివాసము కల్పించుకొనిరి. కుమారగిరి భూపాలుడు కొండవీటి సింహాసన మెక్కు నాటికి రాజమహేంద్ర

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వరపు పంటరెడ్డి ప్రముఖులకు అనేకులకు జిలవాలమైనది. ఇటువంటి రెడ్డి ప్రముఖ కుటుంబములలో దుప్పూరి దొడ్డా రెడ్డి సోదరుల కుటుంబములు, కాటయవేమారెడ్డి బంధువుల కుటుంబములు మొదలైనవి అనేకము కలవు. ఈ రెడ్డి వంశములలో దుప్పూరివారిది చాల పెద్దది. ఈ వంశమునకు మూల పురుషుడు కోటారెడ్డి. ఇతని కుమారుడు పెరుమాండి రెడ్డి, మనుమలు అల్లాడరెడ్డి, పెదకోటా రెడ్డి, అనప్రోలారెడ్డి, దొడ్డారెడ్డి, పినకోటారెడ్డి అని అయిదుగురు. వీరిలో దొడ్డారెడ్డికి (రెండవ) అనప్రోలా రెడ్డి, కోటారెడ్డి, (రెండవ) అల్లాడరెడ్డి అని ముప్పురు కుమారులు కలిగిరి. (రెండవ) అనప్రోలారెడ్డికి కొమరగిరి రెడ్డి, అనవోతారెడ్డి అనియు, (రెండవ) అనప్రోలారెడ్డి సోదరుడు (రెండవ) అల్లాడరెడ్డికి వేమారెడ్డి, వీరభద్రా రెడ్డి, దొడ్డారెడ్డి, అన్నారెడ్డి అనియు కొడుకులు పుట్టిరి. (రెండవ) అల్లాడరెడ్డినే అల్లాళరెడ్డియని, అళ్లయరెడ్డి అనియు వ్యవహరింతురు. ఇందువలన వేమ, వీర, దొడ్డా రెడ్లకు అల్లయవేమ, అల్లయవీరభద్ర, అల్లయదొడ్డారెడ్లనియు పేరు కలిగినది. రాజమహేంద్రవరమునను, తత్పరిసర ప్రాంతములను స్థిరపడిన ఈ రెడ్డి దొరలు పలుకు పంతములందు ప్రముఖులై కొండవీటి రెడ్డి రాజ్య మూలస్తంభములై నిలిచిరి. కాని, రెడ్డిరాజ్యాంతఃకలహ కాలమున వీరిలో కొందరైనను పెదకోమటివేముని పక్షము నవలంబించి రాజ్యసంక్షోభమునకు కారకులై యుండ వచ్చును. మొత్తముమీద ఆ యంతఃకలహమును అవకాశముగ తీసికొని సింహాచలమువరకు గల రెడ్డిసామంత మండలికులు మాత్రము రెడ్ల అధికారమును ధిక్కరించి స్వతంత్రులై ఏటేట కొండవీటికి చెల్లింపవలసిన కానుకలను, కప్పములను చెల్లించుట మానివేసిరి. అందువలన వీరి నందరిని అణచివేసి సింహాద్రి పర్యంతమును గలదేశమును సాధించి దానిని మరల రెడ్డిరాజాధికారము క్రిందికి తీసికొని రావలసినదని కొమరగిరి రెడ్డి తన ప్రధాని, దండనాయకుడు అయిన కాటయవేమారెడ్డికి ఆజ్ఞాపించెను. కాటయవేమా రెడ్డి తన ప్రభువు ఆదేశమును శిరసావహించి పూర్వదిగ్విజయమునకు బయలుదేరెను. కుమారగిరి భూవరుడు తన కుమారుడును, యువరాజును అయిన రెండవ అనవోతా రెడ్డిని కాటయవేమునితో గూడ పంపెను. అనవోతా రెడ్డిని వెంట బెట్టుకొని కాటయవేమారెడ్డి కొంత సైన్యముతో రాజమహేంద్రవరమునకు వచ్చి అక్కడ మరికొంత సైన్యమును సమకూర్చుకొని ఈ దండయాత్రయందు తనకు విజయము కలుగుటకై వేణుగోపాల స్వామిని సేవించుకొని, దిగ్విజయము కలిగినయెడల, తాను తిరిగి వచ్చిన యెడల పూజకై ఒకగ్రామము నిచ్చెదనని చెప్పి ప్రణమిల్లెను. తరువాత మౌహూర్తికులు పెట్టిన శుభలగ్నమున ప్రముఖులైన రాజమహేంద్రవరపు రెడ్డిదొరలతో కలసి పూర్వదేశముపై దండు వెడలెను. కాటయవేముని పూర్వదిగ్విజయయాత్ర శకవర్షములు 1804 (క్రీ. శ. 1882), 1812 (క్రీ. శ. 1890)లకు నడుమ జరగినది. కాటయవేమా రెడ్డి శాసనము తూర్పుగోదావరి జిల్లా సర్పవరములో శకవర్షములు 1810 (క్రీ. శ. 1888) నాటిది కనబడుచుండుటచేత ప్రాయికముగ ఈదండయాత్ర ఆ ప్రాంతమున జరగినట్లు ఊహింపవచ్చును. ఈ దండయాత్రలో దుప్పూరి (రెండవ) అల్లాడరెడ్డియు, అతని కుమారులు వేమ, వీరభద్ర, దొడ్డారెడ్లును కాటయవేమారెడ్డి ననుసరించి అతనికి కుడిభుజములవలె ప్రవర్తించిరి.

ఈ పూర్వదేశ దండయాత్రలోని విశేషములను కుమారగిరినృపతి అనపర్తి తామ్రశాసనముకాని, గోవవరపు తామ్రశాసనము కాని తెలుపవు. అనపర్తి శాసనము కాటయవేమ నరేంద్రుడు వింధ్యాద్రి, సింహాద్రి మధ్యవర్తులయిన మహీశ్వరులను జయించి వారి దుర్గములందు తమ అధికారులను నియోగించి గజపతి మొదలైన వారు అర్పించిన ఏనుగులను, గుర్రములను, మణి భూషాడంబరోపాయనములను తీసికొని మరల కొండవీటికి వచ్చి వానిని తన యేలికయైన కుమారగిరి మహీపతికి సమర్పించినట్లు మాత్రమే తెలుపును. గోపవరము శాసనములో కూడ ఇంతకంటె అధిక మేమియు లేదు. కాని, ఇందు కాటయవేమునికి కటకము-పురుషోత్తమును దోచుకొన్నవాడని యర్థమిచ్చు 'కటక చూరకార' బిరుదము కలదు. ఈ కటకము గాంగ వంశజులయిన గజపతి నృపతుల రాజధాని. ఈ బిరుదము ననుసరించి చూడగా కాటయవేమా రెడ్డి కటకమువరకు దండెత్తి వెళ్ళినట్లు విదితమగుచున్నది. కొండవీటి రెడ్డి మన్నీలు చేసిన పూర్వదేశ దండయాత్రలన్నిటిలోనికి ఇది కడు విస్తృత మయినది; చాల గొప్పది. ఈ దండయాత్రలో కాటయవేమ భూవిభుడు సాధించిన విజయములు రెడ్డిమన్నీలమీద చెప్పిన కొన్ని చాటువుల వలనను, కాళిదాస విరచితమైన అభిజ్ఞాన శాకుంతలమునకు కాటయవేమ భూవరుడు కుమారగిరిరాజీయ మను పేరుతో రచించిన వ్యాఖ్యానములోని ప్రారంభ శ్లోకముల వలనను మాత్రమే తెలియుచున్నవి. కాటయ వేమారెడ్డి గౌతమీ నదిని దాటి కాటమరేనికోట జయించి, ఆకోటలోని రాజకుమారులను, స్త్రీలను చెరపట్టి కొండవీటికి తీసికొనివచ్చినట్లు ఒక చాటు పద్యము తెలుపుచున్నది. కాటయవేముడు శాకుంతల వ్యాఖ్యానములో తాను



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మొల్లేటి దుర్గమును, కిమ్మూరు దుర్గమును, బెండపూడి, వజ్రకూటము, రామగిరి, వీరకూటములను జయించినట్లు చెప్పుకొని యున్నారు. ఇంతమాత్రముచేత కటకమువరకు సాగిన అంతటి గొప్ప దండయాత్రలో పూర్వోక్త దుర్గములను మాత్రమే జయించెనని, కటకము వరకు గల దేశమున నుండిన దుర్గము లవి మాత్రమే యని యెంచుట పొరపాటు. ఈ దండయాత్రలో కటకము వరకు గల దేశ మంతయు జయింపబడినది. కాటయవేమునికి తోడుగా రాజమహేంద్రవరము రెడ్డిదొరలు అల్లాడరెడ్డియు, అతని కుమారులు వేమ, వీరభద్ర, దొడ్డారెడ్లు కూడ వెళ్ళినారు. వారు సాధించిన విజయములను శ్రీనాథ కవి సార్వభౌముడు 'కాశీ ఖండము'నందును, 'భీమేశ్వర పురాణము'నందును, శివలెంక కొమ్మయ 'శివలీలా విలాసము' నందును వర్ణించియున్నారు. ఈ రెడ్డి దొరల విజయముల నభివర్ణించు కొన్ని తెలుగు చాటువులు కూడ గలవు. ఇవి యన్నియు గాక, అల్లయ వేమారెడ్డి వేమవరము శాసనము కూడ అతని విజయములను కొన్నిటిని తెలుపును. రాజమహేంద్రవరము రెడ్డిదొరలు ఈ విజయము లన్నిటిని సాధించినది కుమారగిరి భూనాథుని ఈ పూర్వదేశ దండయాత్రా సందర్భముననే. కుమారగిరికి తరువాత ఏ రెడ్డి రాజును ఇంతటి విస్తృత దేశముపై దండయాత్రను తలపెట్టను లేదు; కటకము వరకు వెళ్ళను లేదు. రెడ్డి రాజ్య పరిస్థితులు అందుకు అనుకూలముగను ఉండలేదు. అందువలన అల్లయ వేమాదుల విజయములు కుమారగిరిరెడ్డి పూర్వదేశ దండయాత్రలో లభించినవే. అల్లయవేమారెడ్డి తన వేమవరము శాసనములో తాను కళింగముపై దండెత్తినట్లును, సప్తమాడియరాజులను జయించినట్లును, సింహాచలము పురుషోత్తములవద్ద జయస్తంభములు స్థాపించినట్లును చెప్పుకొనెను. ఈ పురుషోత్తము కాటయ వేముడు చూరకొన్నట్లు చెప్పిన కటకమే, కళింగ గాంగ వంశజులయిన గజపతుల రాజధాని. అల్లయ దొడ్డారెడ్డి చిలుక సముద్ర తటమున జయస్తంభమును నిలిపినట్లు శివలెంక కొమ్మన తెలుపుచున్నాడు. ఇట్లే ఇంకను మరి కొన్ని విజయములు కాటయవేమునికిని, రాజమహేంద్రవరము రెడ్డిదొరలకును కూడ సమానముగ లభించినట్లు చెప్పబడుటకు కారణము ఉభయుల దండయాత్రయు ఒక్కటి యగుటయే. ఈ పద్ధతి ననుసరించి చూడగా ఇదివరలో చెప్పిన మొల్లేటి దుర్గము, కిమ్మూరు దుర్గము బెండపూడి, వజ్రకూటము, రామగిరి, వీరకూటము (వీరగోట్టము)లే కాక ఝూడేశ వనము, సప్తమాడియములు, జంతరునాడు, కారపాడొంతి, ఒడ్డాది, రంభ మొదలైనవి కూడ రెడ్డిదొరలు జయించినవే. పండువా సుల్తానుకూడ వారిచే ఓడింపబడెను. ఇక పూర్వోక్తస్థలములు, దుర్గములు, దేశములు ఎక్కడెక్కడ నున్నదియు తెలిసికొనవలసి యున్నది.

మొల్లేటి దుర్గము తూర్పుగోదావరిజిల్లా ఎల్లవరము డివిజనులో నున్నది. ఈ మొల్లేటిలో ప్రాయికముగ ఈ కోటను జయించిన పిదప కావచ్చును పువ్వుల హన్మయ అనునతడు కాటమరెడ్డి వేమారెడ్డికి పుణ్యముగ వేమ సముద్రమను పేర ఒక తటాకమును నిర్మించినట్లు తెలుపు శాసనము కలదు. దీనిలో బార్హస్పత్య మానాబ్దము కాని, శకవర్షము కాని లేదు. కిమ్మూరు దుర్గము తూర్పుగోదావరి జిల్లా పెద్దాపురము తాలూకాలో నున్నది. దీనికి చుట్టుప్రక్కలగల తమిరె (పెద్దాపురమునకు పూర్వపు పేరు), కట్టమూరు, కాట్రావుల పల్లి, గుడివాడ, ఉలిమేశ్వరము, కాంద్రకోట, జగ్గంపేట మొదలైన పదునాలుగు గ్రామములు ఈ కిమ్మూరు సీమలోనివని స్థానిక చరిత్రల వలన తెలియుచున్నది. బెండపూడి తూర్పుగోదావరిజిల్లా తుని డివిజనులోనిదని ఇదివరకే మనకు తెలియును. వజ్రకూటము విశాఖపట్టణముజిల్లా గొలుగొండ తాలూకాలో నరిసీపట్నానికి ఆరుమైళ్ల దూరమున నున్నది. దీని నిప్పుడు వజ్రఘడ (వజ్రగడ) మందురు. రామగిరి జయపురము సంస్థానము ఎగువ విభాగము నందలి తాణ్యములలో ఒకటి. వీరకూటము (వీరగోట్టము) విశాఖపట్టణము జిల్లా పాలకొండ తాలూకాలోని పల్లవరాజ్యము. ఈదండయాత్ర కాలమున ఈ రాజ్యమును పరిపాలించుచుండిన పల్లవరాజు పురుషోత్తమనృపుడు. ఝూడేశవన మన్నది ఝూడ్ ఖండము. జయపుర సంస్థానాధీశ్వరులకు ఝూడ్ఖండ్ పాదుషాలని బిరుదు. ఇది ప్రాచీన శిలావంశజులైన నందపురాధీశ్వరులవలన జయపురము వారికి సంక్రమించినది. అందువలన ఈ ఝూడేశవన మన్నది పూర్వపు శిలావంశ రాజ పరిపాలితమైన నందాపుర రాజ్యములోనిది. ఈ నందాపురము విశాఖపట్టణము జిల్లా పొత్తంగి తాలూకాలో నున్నది. ఈ ఝూడ్ ఖండములో పూర్వము విశాఖపట్టణముజిల్లాలోని పార్వతీపురము, బొబ్బిలి ప్రాంతముకూడ చేరియుండినట్లు కనబడును. సప్తమాడియములనే ఏడు మాడెము లందురు. గంజాము జిల్లాలో పశ్చిమమున గల పర్వతారణ్య ప్రాంతమునకు మాడయ - మాళియ అని పేరు. ఈ ప్రాంతము ఆటవిక జాతులైన కోదులకును (ఖోండులు), సవరలకును నివాసభూమి. ఈప్రాంతము ఏడు మాడియములుగ విభక్తమయినది. ఒక్కొక్క ప్రాంతము ఒక్కొక్క నృపతి ఏలుబడిక్రింద నుండెను. ఈ యేడు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మాడెములను, ఉత్తర మన్య ప్రాంతమునందలి రాజులను జయించినవారు అల్లాడ రెడ్డియు, అతని కుమారుడు వేమారెడ్డియును. వీ రంతటితో ఆగక గంజాము, విశాఖపట్టణము జిల్లాల పడుమటి సరిహద్దున నున్న కాళవెండి పురమును సైతము జయించిరి. ఈ కాళవెండిపురము (చాటువులో కళావెండి పురమని తప్పుగా వ్రాయబడినది) కాలహండి సంస్థానమునకు రాజధానియైన ఇప్పటి కాలహండియే. ఈ రాజ్యమునకు సమీపమున నున్నవే బారహదొంతి అను పేరుతో వరుసగా నున్న పండ్రెండు చిన్నరాజ్యములు. బారహ అనగా పండ్రెండు; దొంతి అనగా వరుస. ఇవి ఇప్పటి ఓఢ్రదేశములోని సామంతరాజ్యములు. వీనిలోనిదే ప్రాయికముగా కాళవెండిపుర రాజ్యము. రాజమహేంద్రవరరెడ్డి దొరలు బలవంతులైన బారహదొంతి మన్నెధరణీపతులను జయించి వారికి అభయ మిచ్చి కాపాడిరి. జంతరునా డన్నది విశాఖపట్టణము జిల్లా శృంగవరపుకోట తాలూకాప్రాంతము. ఈ దండయాత్ర కాలమున గార్త్స్యమదగోత్రులైన సురభివంశ నృపతులు ఈ జంతరునాటిని పాలించుచుండిరి. రఘురాముడు విభీషణునివలెనే అల్లయవేమారెడ్డి శృంగవరపు కోటలో సంగవ భూపతిని ఆదరించి రక్షించెను. పై నిచ్చిన ఉపమానము ననుసరించి చూడగా సంగవ భూపతికిని, అతని అన్నకును కలహము సంభవించె ననియు, అప్పుడు అల్లయవేమారెడ్డి అతని యన్నను యుద్ధమున సంహరించి తనయాశ్రయము వేడిన సంగవరాజును రక్షించి యతనిని రాజ్యమున కభిషిక్తుని కావించె ననియు తోచుచున్నది. జంతరునాటి సురభి వంశజుడైన సంగమరాజు శాసనములు సింహాచలములో శకవర్షములు 1320 (క్రీ. శ. 1398), 1321 (క్రీ. శ. 1399) నాటివి కానవచ్చుచున్నవి. ఈ సంగమరాజే ప్రాయికముగ అల్లయవేమారెడ్డి సురభి రాజ్యమున ప్రతిష్ఠించిన సంగవ భూపతి కావచ్చును. మత్స్య వంశజుల రాజ్యమునకు ఒడ్డాది రాజధాని. ఇది విశాఖపట్టణము జిల్లా వీరవల్లి తాలూకాలో నున్న ఇప్పటి వడ్డాది. ఇందువలన వీరవల్లి తాలూకా ప్రాంతము పూర్వపు మత్స్యరాజ్యమని చెప్పవచ్చును. శకవర్షములు 1272 (క్రీ. శ. 1350), 1347 (క్రీ.శ. 1425)లకు మధ్య వీరార్జునదేవుడును, అతని కుమారుడు ప్రతాపార్జునదేవుడును మత్స్యరాజ్యమును పరిపాలించిరి. వీరిలో వీరార్జునదేవుడు అనవేమారెడ్డికి సమకాలికుడు. కాటయవేముని దండయాత్రనాటికి రాజ్యమును పాలించుచుండిన వాడును, పరాజయమును పొందిన వాడును ప్రతాపార్జునదేవుడు కావలెను. ఇతనికి ఉదయార్జును డనియు పేరుండిన ట్లున్నది. ఈ దండయాత్రలో అల్లాడరెడ్డిని వెంబడించి వెళ్లిన అతని ప్రధాని లింగనామాత్యుడు మత్స్యనృపాలుడైన ఉదయార్జునుని వద్దనుండి కప్పము గైకొనినట్లు చెప్పబడినది. దండకారణ్య మధ్యమునందుండిన పుళిందరాజులగు నాగవంశజులకు రంభ రాజధానిగ నుండెను. వీరిని లింగనమంత్రి యుద్ధమున ఓడించి వారి కథయమొసగి రక్షించెను. శివలీలా విలాసమున అల్లయవేమారెడ్డి రంప ఇమ్మడి రాజును జయించినట్లు కలదు. ఇది అల్లయవేమారెడ్డి, అల్లాడరెడ్డి, లింగనమంత్రి అందరును కలసి వెళ్లిన దండయాత్రయే. అందువలన ఈ విజయములు భూవరులకును, వారి మంత్రులకును కూడ ఆరోపితములైనవి. రంభ యన్నది రంప యనుదాని సంస్కృతీకరణమే. ఇది తూర్పుగోదావరి జిల్లా చోడవరము డివిజనులో నున్నది. వేమారెడ్డి చేతను, లింగనమంత్రి చేతను ఓటువడిన అహివంశ నృపాలుడు ఇమ్మడిరాజే. ఈ కళింగదండయాత్రలో కాటయవేమారెడ్డియు, అల్లాడరెడ్డియు, అతని కుమారులును శిలావంశజులు, చాళుక్యాన్వయులు, పల్లవ కులజులు, మత్స్యసంతతివారు, నాగజాతివారు, గజపతి (గాంగ) వంశ్యులు అయిన భూమీశులను జయించిరి. చివరకు కళింగాధిపతియైన గాంగవంశజుడగు గజపతి కాటయవేమునితో సంధిచేసి కొనెను. ఈ కాలమున కళింగోత్కలములను పరిపాలించుచుండిన అర్వాచీన గాంగవంశజుడు నాలుగవ నరసింహదేవ గజపతి. అల్లయవేమారెడ్డి కళింగోత్కలములను జయించుటయే కాక బంగాళదేశమును పాలించుచుండిన పండువా సుల్తానునుకూడ ఓడించినట్లు అల్లయవేమారెడ్డి విజయముల నభివర్ణించు ఒక చాటుపద్యము తెలుపుచున్నది. ఈ పండువానగరము బంగాళదేశపు సుల్తానులకు హిజిరా 743 (క్రీ. శ. 1342) నుండి హిజిరా 795 (క్రీ. శ. 1392) వరకు అర్ధ శతాబ్దముపాటు రాజధానిగ నుండెను. దీని వలన కూడ కాటయవేమ భూపాలుని పూర్వదేశ దండయాత్ర శకవర్షములు 1314 (క్రీ. శ. 1392)కు పూర్వమే జరగినదని ధ్రువపడుచున్నది.

యువరాజయిన అనపోతారెడ్డితో కాటయ వేమారెడ్డి విజయోత్సవముతో కొండవీటికి వచ్చి గజపతి మొదలుగా గల తూర్పు దేశపు రాజులు కప్పముగాను, కానుకలుగాను చెల్లించిన మణిమయ స్వర్ణ భూషాంబరములను, గజములను, హయములను తన ప్రభువయిన కుమారగిరి మహీపతికి సమర్పించెను. ఆ మహారాజు అతనిని సముచిత రీతిని సన్మానించి గౌరవించెను. ఈ పూర్వదేశ దండయాత్ర విజయవంతముగ పరిసమాప్తమైన పిమ్మట కాటయ వేమారెడ్డి రాజమహేంద్రవరము వేణుగోపాల

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



స్వామికి శకవర్షములు 1312 (క్రీ. శ. 1390) లో అనపర్తి గ్రామమును దేవభోగముగ సమర్పించి చరితార్థుడయ్యెను. పూర్వదేశ దండయాత్ర విజయవంతముగ ముగిసిన వెనుక కుమారగిరి నరేంద్రుడు తనకుమారుడు అనవోతారెడ్డితోగూడ దాక్షారామమున కరిగి తులాపురుష మహాదానాదులు కావించెను.

కుమారగిరి నృపతి తన ప్రధాని కాటయవేమ నరేంద్రుడు సింహాద్రి పర్యంతమును జయించిన దేశము నంతను కొండవీటి రాజ్యమున గలుపుకొని దానిని పూర్వరాజ్యము, లేక రాజమహేంద్రవరరాజ్య మను పేరుతో ఒక ప్రత్యేకరాజ్య విభాగముగ ఏర్పాటు చేసి దానికి తన కుమారుడైన రెండవ అనవోతారెడ్డిని తనకు ప్రతినిధిగ పరిపాలింప నియమించెను. ఇంతటినుండి పూర్వరాజ్య మను రాజమహేంద్రవర రాజ్యము రెడ్డి రాజ్యములో కొండవీటికి అణకువయైన ఒక ప్రత్యేక రాజ్య మయినది. లింగన మంత్రి సోదరుడైన అరిమేటి అన్నమంత్రి బెండపూడి దుర్గాధిపతిగ నియమితు డయ్యెను. ఈ రాజ్యమును పెక్కు సీమలుగా విభాగించి ఒక్కొక్క సీమవలన వచ్చు పైకము సీమాధిపతుల సిబ్బందికి కొంత వ్యయపరచి, మిగిలిన దానిని నగరి కిచ్చునట్లు నిర్ణయము చేయబడినది. అల్లాడరెడ్డి, అతని కుమారుల, వారి మంత్రుల సాయముతో రాజమహేంద్రవరము రాజధానిగ రెండవ అనవోతారెడ్డి నూతన రాజ్యమును పరిపాలించెను. అల్లాడరెడ్డియు, అతని కుమారులును తనకు కుడిభుజముగ నుండి పూర్వదిగ్విజయయాత్ర విజయవంతము కావించుటచేతను, అనవోతారెడ్డికి విధేయులును, విశ్వాస పాత్రులును అయిన భటులుగ నుండి అతనికి కార్య ఖడ్గములందు బాసటగ నుండుటచేతను చాల ముదమంది కాటయవేమ ధరావరుడు వీరభద్రారెడ్డికి తన కొమార్తెయైన అనితల్లి నిచ్చి వివాహము కావించి అల్లాడ రెడ్డితో వియ్యమందెను.

రెడ్డి రాజ్యమున శాంతి భద్రతలు నెలకొనెను. ప్రధానియు, దండనాయకుడునై కాటయవేముడు రాజ్య వ్యవహారములను చక్కబెట్టుచు కంటికి రెప్పవలె రాజ్యమును కాపాడుచుండ కుమారగిరి భూపతి తన కధికాభిమానము కల సంగీత సాహిత్యములందు కృషిచేయ దొడగెను. తన తండ్రియైన అనవోత రాజేంద్రుడు చేసిన ఏర్పాటుల వలనను, ఓడల వర్తకుల కిచ్చిన అభయ శాసనము వలనను సకల దేశములనుండి వర్తకులు మోటుపల్లికి వచ్చుచుండిరి. మరల అది గొప్ప రేవుపట్టణముగ ప్రసిద్ధి కెక్కినది. తన పినతండ్రియైన అనవోతారెడ్డి వలెనే కొమరగిరిరెడ్డి వసంతోత్సవ ప్రియుడు. ఏటేట తప్పక కొండవీటి పురమున వసంతోత్సవమును మహా వైభవముతో నిర్వర్తించువాడు. ఇతనికికూడ వసంతరాయడని, కర్పూర వసంతరాయడని బిరుదుపేర్లు కలవు. వసంతోత్సవ సమయమున తన రాజ్యమునందలి కళాకుశలులను, కవులను, పండితులను సత్కరించి కళాపోషణ, సాహిత్య పోషణ చేయుచు వచ్చెను. ఇతడు సంగీత నాట్యకళా పారంగతుడు. లకుమాదేవి ఇతని ఆస్థానము నలంకరించిన నట్టువరాలు. ఈమె ఒక్క భావమును వేయి విధముల నభినయించి చూపిన నాట్యకళా చతుర. ఒక్క సంగీత నాట్యములందే కాక, ఇతర కళలందును కొమరగిరి భూపాలునికి అమితప్రీతి. అతడు కళాభిజ్ఞుడు; కళావంతుడు. వైరాజ, పుష్పక, కైలాస, మలిక, త్రివిష్టపము లను అయిదు విధములైన సమున్నత ప్రాసాద జాతులలో అతడు కొండవీటి నగరమున పుష్పక జాతికి చెందిన గృహరాజ సౌధమును నిర్మించెను; ప్రియలతో విహరించుటకు కేళీ రథములను, క్రీడించుటకు క్రీడా సరస్సులను నిర్మింపజేసెను.

ఈ విధముగా జరగుచుండగా, కుమారగిరి నృపతి ఏకైక పుత్రుడును, పూర్వరాజ్య రాజ ప్రతినిధియును అయిన అనవోతారెడ్డి అకాల మృత్యువు వాతబడెను. ఇత డెప్పుడు మృతినొందెనో సరిగా తెలియదు; కాని, శకము 1312 (క్రీ. శ. 1390), 1317 (క్రీ. శ. 1395) సంవత్సరముల మధ్య గతించె ననుటకు ఆధార మున్నది. కుమారుని అకాల మరణము వలన కొమరగిరిరెడ్డి విచారముతో క్రుంగిపోయెను. రాజమహేంద్రవర రాజ్యమునకు రాజ ప్రతినిధిగ ఎవరిని నియమింపవలె ననుసమస్య బయలుదేరినది. కొండవీటి రాజ్యపు తూర్పు సరిహద్దు కాపాడుటకు నీతి చతురుడు, శౌర్య పరాక్రమవంతుడు, సమర్థుడు కావలెను. ఈ బాధ్యతాయుత కార్యమును నిర్వహించుటకు కొమరగిరి నృపాలునికి కాటయవేమునికంటె అర్హుడు మరియొకడు కనబడలేదు. అదియును కాక, కాటయ వేమారెడ్డి తన కెన్ని విధములనో సాయము చేసెను. నిజముగా త న్నీరాజ్యమున నిలిపిన దతడు; తన రాజనీతి చతురతచేత రెడ్డి రాజ్యమునకు శత్రువులు లేకుండ చేసిన దతడు; తూర్పున కటకము వరకుగల దేశమును జయించి ఆ దేశమున గల భూవరులకు రెడ్డిరాజు లన్నను, రెడ్డి దొరలన్నను సింహస్వప్నముగ జేసిన దతడు. ఇందులకు తన కృతజ్ఞతను తెలుపుకొనుటకు తగిన తరుణ మదియే యని కాటయవేమునిమీద గల ప్రేమాతిశయముచేత ముందు వెనుక లాలోచింపక కొమరగిరిరెడ్డి అతనిని రాజమహేంద్రవర రాజ్యమున రాజప్రతినిధిగ నియమించుటకు బదులు ఆ రాజ్యమునే అతని కిచ్చివేసెను.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అది కాటయవేమునికిచ్చిన వీర జీవితము (జాగీరు) వంటిదైనచో ఈ విధముగా వీరులను గౌరవించుట ప్రాచీన కాలమునుండి వచ్చుచున్న ఆచారమే; కాని, దానికిని దీనికిని వ్యత్యాస మిది; వీరునికి ఏదో ఒక గ్రామమో, కొన్ని గ్రామములో ఇచ్చువారు కాని పూర్తిగా ఒక్క రాష్ట్రమునే, రాజ్య విభాగమునే ఇచ్చివేయుట లేదు. కుమారగిరి భూపతి దీనిని వీరజీవితముగ ఇచ్చెనో, మరే పద్ధతిని ఇచ్చెనో మనకు తెలియదు. కాని, కాటయవేముడు మాత్రము తన సేవకు సంతుష్టుడై తన ప్రభువు దానిని తనకు ఇచ్చివేసినట్లే శకవర్షములు 1817 (1895) నాటి తన గోపవరము శాసనములో తెలిపెను. రెడ్డి రాజ్యములో మేలైన కొంత భాగమును కాటయవేమునికి ఉపాయనముగ నిచ్చివేయుట అతనికి ప్రతిస్పర్థులైన పెదకోమటి వేమాదుల కాశ్చర్యమును కలిగించి వారిని కోపోద్రిక్తులను కావించినది. రాజ్యమునందలి రెడ్డిదొరలలోనే చాలమందికి రెడ్డిరాజ్యము ఈవిధమున రెండు చీలిక లగుట అసంతృప్తి కలిగించినది. కుమారగిరి యనిన అభిమానము కలవారు కూడ అతని యీ చర్యతో అతనికి ప్రతికూలులైరి. కొండవీటిలో కుమారగిరి యన్నను, కాటయవేము డన్నను గిట్టనివారు వారి ప్రతిపక్షమువారితో చేరి రహస్యముగ కుట్రలు పన్నుటకు అవకాశము కలిగినది. ఈ సమయముననే తెలంగాణాలోను, తీరస్థాంధ్ర దేశములోను భయంకరమైన క్షామము సంభవించినది. ఇది శకవర్షములు 1318 (క్రీ. శ. 1896)లో ప్రారంభమై పంద్రెండేండ్లు ప్రజలను బట్టి పీడించినది. దీనితో దేశములోని అశాంతి, అసంతృప్తి మరింత హెచ్చినవి. కుమారగిరి భూపతి ఈ కష్టకాలమున పన్నులు సరిగా వసూలుకాక, ప్రజలనుండి వానిని నిర్బంధముగ వసూలు చేయవలసి వచ్చెను. ఈ కాలముననే బహ్మనీ సుల్తాను ఫిరూజ్ షా విజయనగర రాజ్యముపై దండెత్తి వెళ్ళుచు కొంత సైన్యమును కొండవీటిపై పంపెను. రెడ్డి సామంతుడైన గజరావు తిప్పానాయకుడు కొంత సేనను గూర్చుకొనిపోయి కొండవీటిపై వచ్చుచుండిన తురుష్క సేనను కంబముమెట్టువద్ద ఎదుర్కొని భయంకర సంగ్రామమున వారి నోడించి తరుమగొట్టి తురుష్కోపద్రవమును నివారించెను. దేశములో అల్లరులు రేగినవి. ఈ పరిస్థితిని గమనించి కళింగాధిపతి సింహాచలమునకు దక్షిణమున నుండిన దేశమును జయించి తీసికొనుటకై రాజమహేంద్రవర రాజ్యముపై దండెత్తి వచ్చెను. కాటయ వేమారెడ్డి ఆ రాజ్య రక్షణకై రాజమహేంద్రవరమున కరిగి గొగ్గయదేవు డను సేనానిని గజపతిపై పంపెను. తూర్పుగోదావరి జిల్లా కాకినాడ తాలూకా సర్పవరములోని శకవర్షములు 1821 (క్రీ. శ. 1899) నాటి శాసనము వలన గొగ్గయదేవుడు విహారణగిరి (సింహాచలము) వద్ద గజపతిని మార్కొని అతని నోడించి తరుమగొట్టినట్లు తెలియుచున్నది. గజపతియైన కళింగోత్కలాధీశ్వరుడు పూర్వరాజ్యముపై దండెత్తి వచ్చుచుండిన కాలముననే మొదటినుండియు రెడ్డిరాజ్యముమీద కన్ను వేసియున్న విజయనగరాధీశ్వరులు అదియే సమయమని రెడ్డిరాజ్యమును కొంత ఆక్రమించుకొనిరి. శకవర్షములు 1322 (క్రీ. శ. 1400) నాటి కర్ణాటాధీశ్వరులైన రెండవ హరిహర రాయల యొక్కయు, అతని మనుమడును, మొదటి దేవరాయల కుమారుడును అయిన రామచంద్రరాయల యొక్కయు ఎనమదల, మార్కండోపాడు, పరచూరు శాసనముల వలన వారు రెడ్డిరాజ్యమున ఎంత దూరము లోపలికి చొచ్చుకొని వచ్చి దాని నాక్రమించుకొనిరో తెలియగలదు. ఈ సమయములోనే మల్లారెడ్డి సంతతివారైన కోమటిరెడ్డి కందుకూరునుండి గుంటూరుజిల్లా తెనాలి తాలూకా వరకు గల సముద్రతీర ప్రాంతము నాక్రమించుకొనినట్లు శకవర్షములు 1826 (క్రీ. శ. 1404) నాటి పెదపూడి తామ్రశాసనము వలన తెలియుచున్నది. ఈ పరిస్థితులలో కుమారగిరి భూపాలుని పరిపాలనము ప్రజలకు కంటకముగ నుండినట్లు స్థానిక చరిత్రలు చెప్పుటలో వింత లేదు. రెడ్డిదొరలు, గజరావు తిప్పానాయకుడు, మొదలయిన సామంత మండలేశ్వరులు అనేకులు పెదకోమటి వేమారెడ్డి పక్షము నవలంబించిరి. రాజ్యమున అల్లరులు ఎక్కువ యైనవి. కుమారగిరి పక్షమువారికి, పెదకోమటి వేమారెడ్డి పక్షమువారికి పోరాటములు హెచ్చినవి. ప్రతాపశాలియైన కాటయవేముడు కుమారగిరి పక్షమున పోరాడినను ప్రతిపక్ష బలము హెచ్చయినది. గుండుగొలను, కోనూరులవద్ద ఉభయపక్షముల వారికి గొప్ప యుద్ధములు జరగినవి. కాటయవేమారెడ్డి పరాజితుడయ్యెను. ఈ విధముగా కుమారగిరి భూపతి తన రాజ్యమును, అధికారమును నిలబెట్టుకొనుటకు ఎంత ప్రయత్నించినను కార్యము లేకపోయెను. తుదకు కాటయవేమారెడ్డితో గలసి అతడు రాజమహేంద్రవరమునకు పారిపోయెను. ఇంతవరకు కానవచ్చిన కుమారగిరిరెడ్డి శాసనములలో శకవర్షములు 1822 (క్రీ. శ. 1400) నాటి కొత్తూరు (కృష్ణాజిల్లా, బెజవాడ తాలూకా) శాసనమే చివరది. రాజమహేంద్రవరము వెళ్లిన తరువాత కూడ కుమారగిరి కొంత కాలము జీవించెను. శకవర్షములు 1824 చిత్రభాను సంవత్సర ప్రాంతమున అతనికి జబ్బు చేసినది. ప్రాయికముగా అతడు ఆ ప్రాంతముననే గతించియుండును.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



**పెదకోమటి వేమారెడ్డి (క్రీ.శ. 1402 — క్రీ.శ. 1420) :** కుమారగిరిరెడ్డి అనంతరము కొండవీటి సింహాసనమును అధిష్ఠించినవాడు పెదకోమటి వేమారెడ్డి (పెదకోమటిరెడ్డి కుమారుడు వేమారెడ్డి). ఈతనికి పెదకోమ టన్న వేమారెడ్డి అనియు వ్యవహారము కలదు. సింహాసన మెక్కినవెంటనే పెదకోమటి వేమారెడ్డి పరరాజాక్రాంతములయిన రాజ్య భాగములను మరల సంపాదించుకొనుటకు పూనుకొనెను. కానికి కాలముకూడ కలసి వచ్చినది. ఈతడు రాజ్యమునకు వచ్చిన క్రొత్తలో విజయనగరాధీశ్వరుడైన రెండవ హరిహరరాయలు కాలధర్మము నొందెను. అంతట విజయనగర సింహాసనము కొరకు అతని కొడుకులకు వివాదము సంభవించినది. తండ్రి రాజ్యకాలమున ఉదయగిరి దుర్గాధిపతిగ నుండిన హరిహరరాయల కుమారుడు మొదటిదేవరాయలుకూడ తన సైన్యమును కొంత తీసికొని విజయనగరమున కరిగెను. వెంటనే పెదకోమటివేమారెడ్డి విజయనగర రాజ్యాంతఃకలహ కాలమున కొంత సైన్యమును పంపి కర్ణాటాధిపతు లాక్రమించిన భాగమును మరల తీసికొనెను. ఇట్లే మల్లారెడ్డి సంతతివారు వశపరచుకొన్న సముద్రతీరస్థ దక్షిణ ప్రాంతమునుకూడ అతడు తిరిగి తన యధికారము క్రిందికి తెచ్చుకొనెను. అటుపిదప, అతని దృష్టి రాజమహేంద్రవరముపై బడినది.

కుమారగిరి భూపాలుని అనంతరము కూడ కాటయవేమ, పెదకోమటి వేమారెడ్లకు గల స్పర్థా విరోధములు అంతరించలేదు ; వ్యవహారము చక్కబడలేదు. పెదకోమటి వేమారెడ్డి సింహాసన మెక్కిన పిదప కాటయవేముడు అతనిని తన ప్రభువుగ అంగీకరించి సామంతమండలేశ్వరుడుగ తాను పాటింపవలసిన మర్యాదలను జరపలేదు. పెదకోమటి వేమభూపాలుని అధికారమును ధిక్కరించి అతడు సర్వతంత్ర స్వతంత్రుడై తన రాజమహేంద్రవర రాజ్యమును పాలింపదొడగెను. ఇది కాటయవేముని పక్షమువారికి తక్క పెదకోమటి వేమ మహీపతికే కాదు తదితర రెడ్డి ప్రముఖులకు కూడ అంగీకారము కాలేదు. కుమారగిరి భూనాథుడు కాటయవేమునికి రాజమహేంద్రవర రాజ్య మిచ్చివేయుట పొరపాటులలోని కెల్ల గొప్ప పొరపాటుగ పరిణమించినది. సింహాసన మెక్కినప్పటినుండియు పెదకోమటివేమ భూవరుడు రాజమహేంద్రవర రాజ్యమును సాధించి స్వాధీనము చేసికొనుటకును, కాటయవేముడు దాని నెట్లయినను నిలుపుకొనుటకును ప్రబల ప్రయత్నములు చేసిరి. ఇంతటినుండి అందునిమిత్త ముభయులకును బద్ధవైర మేర్పడి ఉభయరాజ్యములకును ఎడతెగని పోరు సంభవించినది. ఈ సంతత కలహమువలన ఉభయ రాజ్యములును దుర్బలము లయినవి. కాని పెదకోమటివేమ, కాటయవేములు కలహించు చుండినట్లు తెలుపు శాసనాధార మేదియు లేదు ; అయినను తరువాత జరగిన సంఘటనలను, ఆ కాలమున పుట్టిన తెలుగు వాఙ్మయమున వర్ణితములైన విషయములను సావధానముగా పరిశీలించినచో ఈ విషయము స్పష్టమగును.

పెదకోమటివేమ, కాటయ వేములకు గల కలహమును అవకాశముగ తీసికొని లాభము పొందదలచి కలహరంగమున కురికినవాడు భక్తిరాజ కుమారుడైన అన్నదేవ చోడుడు. రాజ్యబహిష్కృతుడైన ఇతడు రాచకొండ, దేవరకొండ వెలమనాయకులను ఆశ్రయించి వారియొక్కయు, వారి ప్రభువులైన బహ్మనీ సుల్తానులయొక్కయు ఆదరానురాగములను బడయ గలిగెను. తన రాజ్యమును మరల సంపాదించుకొనుటకు అతడు సరిగా ఈ సమయముననే వెలమ దొరల సాయముతో గోదావరీ ప్రాంతమునకు వచ్చి ప్రాయికముగ కొంత ప్రదేశమును శకవర్షములు 1330 (క్రీ. శ. 1408) నాటికే స్వాధీనము చేసికొనినట్లు పోలవరములోని అతని శాసనము వలన తెలియుచున్నది. పెదకోమటి వేమ నృపతితో అన్నదేవచోడుడు మైత్రి కలుపుకొని కాటయవేమునిపై దండయాత్రలలో అతనితో సహకరించెనని చెప్పుట కవకాశమున్నది. పెదకోమటివేమ, అన్నదేవ చోడులు కలసి నందువలన వచ్చు ఉపద్రవమును కాటయవేమారెడ్డి గుర్తింపక పోలేదు. అందువలన అతడు ముందుగానే జాగ్రత్తపడి కర్ణాట సామ్రాజ్యాధీశ్వరుని సాయ మర్థించుటకు తద్రాజ్యమున కరిగినట్లు కనిపించును. కాటయవేమ మహీపాలుని శాసనమొకటి శకవర్షములు 1332 (క్రీ. శ. 1410)నాటిది అహోబలములో కలదు. అప్పుడు కర్ణాట సామ్రాజ్యమును పాలించుచుండిన మహారాజు రెండవ హరిహరరాయల కుమారుడు మొదటి దేవరాయలు. వారుభయులు కలసికొనిరో లేదో, ఉభయులకు ఏమి సంధి షరతులు జరగినవో తెలిసికొనుటకు ఆధారములు లేవు. కాని, తరువాత జరగిన సంగతుల ననుసరించి చూడగా మొదటి దేవరాయలు కాటయవేమ భూవరునికి తోడ్పడుటకు అంగీకరించినట్లే ఊహింపవచ్చును.

పెదకోమటివేమ, అన్నదేవ చోడులు కలసి కాటయవేమారెడ్డి నెదుర్కొనుచుండిన సమయమున కావచ్చును, వారు తమ సైన్యమును తూర్పు రణరంగమునుండి మరలించి కొంత దక్షిణమునకు పంపునట్లు చేసి, కాటయవేమునికి ప్రత్యక్షముగ కాకపోయినను పరోక్షముగ సాయపడుటకు దేవరాయలు కొండవీటి రాజ్యముపై దాడిచేసి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



శకవర్షములు 1333 (క్రీ. శ. 1411) నాటికి గుంటూరు జిల్లా బాపట్ల తాలూకాలోని ఇంకొల్లు వరకు చొచ్చుకొని వచ్చెను. ఈ విషయము అక్కడి అతని శాసనము వలన తెలియుచున్నది. ఇంకను అతడు సముద్రతీరము వరకు పోయి మోటుపల్లిని పట్టుకొన ప్రయత్నించెను. కాని అది సాగలేదు. ఆక్రమించుకొన్న భాగమైనను అతని అధికారముక్రింద చాలకాల ముండినట్లు కాన్పింపదు.

కర్ణాటాధిపతి దేవరాయల తంత్రము వలన కొంత చిక్కు కలిగినను పెదకోమటి వేమ నృపతి రాజమహేంద్ర రాజ్యముమీద తన దాడి మానలేదు. తుదకు, ఈ పోరాటములలోనే కాటయవేమారెడ్డి హతుడయ్యెను. కొప్పునూళ్లవారి బిరుదులలో కాటయవేముని తలగుండు గొండ అను బిరుద మొకటి ఉండుటవలన వారిచేతనే పెదకోమటి వేమ, అన్నదేవ చోడులతోడి పోరాటములలో అతడు వధింపబడినట్లు తెలియుచున్నది. గజరావు తిప్పనాయకుడు కొప్పునూళ్ల వంశజుడు; పెదకోమటి వేమనరేంద్రుని పక్షమున ఈ యుద్ధములో పాల్గొన్నవాడే. ఇతని చేతిలోనే కాటయవేమారెడ్డి మృతినొందెనేమో తెలియదు. శకవర్షములు 1336 (క్రీ. శ. 1414) తరువాత కాటయవేముని శాసనములు కానరావు.

పెదకోమటి వేమారెడ్డికి కాటయవేముని అనంతరము కూడ రాజమహేంద్రవర రాజ్యము వశముకాలేదు. కాటయ వేముని అనంతరము అతని కుమారుడు రెండవ కుమారగిరి రెడ్డిని సింహాసన మెక్కించి అల్లాడరెడ్డి రాజమహేంద్రవర రాజ్యముపై ఈగ వాలకుండ కంటికి రెప్ప వలె దానిని కాపాడుచు వచ్చెను. కాటయవేముని మరణానంతరము కూడ పెదకోమటి వేమునికి శాంతియు, మనస్స్థిమితమును లేక పోయినది. అత డొకవైపున అల్లాడ రెడ్డితోను, మరొకవైపున కర్ణాట సామ్రాజ్యాధిపతుల తోను పోరాడవలసి వచ్చినది. కర్ణాటాధిపతులు అల్లాడ భూవరునికి మిత్రులు. ఈ సందిగ్ధ స్థితిలో పెదకోమటి వేముడు బహ్మనీ సుల్తాను ఫీరూజ్ షా సాయ మర్థించెను. ఫీరూజ్ షా సాయముతో పెదకోమటి వేమారెడ్డి రాజమహేంద్రవరముపై దండెత్తి ఆ కోటను ముట్టడించెను. కోట ముట్టడి ఈ విధమున సాగుచుండగా, విజయ నగరాధీశ్వరుడైన మొదటి దేవరాయలు కొంత శత్రుబలమును అక్కడినుండి చీలదీసి, అల్లాడరెడ్డికి తోడ్పడవలయునను తలంపుతో పానుగంటి కోట నాధారముగ చేసికొని తత్పరిసరముల తెలంగాణాలో బహ్మనీ సుల్తానుల వశము నందుండిన దుర్గములను ముట్టడించి పట్టుకొనుటకు కొంత సైన్యమును తెలంగాణాకును, మోటుపల్లిని పట్టుకొనుటకు మరికొంత సైన్యమును రెడ్డిరాజ్యము మీదికిని పంపెను. రాజమహేంద్రవరము కోట ఫీరూజ్ షాకును, పెదకోమటి వేమారెడ్డికిని వశము కాలేదు. గొప్ప పరాక్రమ వంతుడైన అల్లాడ రెడ్డియు, అతని కుమారులును వారిని సంగరమున ఓడించి పారదోలిరి. ఈ దండయాత్ర శకవర్షములు 1339 (క్రీ. శ. 1417) ప్రాంతమున జరగినది. ఇంతలో తెలంగాణాపై విజయనగర సైన్యము దండెత్తి వెళ్లినట్లు తెలిసి వెంటనే హతశేషమైన తన సైన్యమును తీసికొని పరాజితుడైన సుల్తాను అతివేగమున పోయి విజయనగరాధీశ్వరుల పానుగంటి దుర్గమునకు ముట్టడి వేసెను. అక్కడ విజయ నగరాధీశ్వరులకును, సుల్తాను బలములకును ఘోర సంగ్రామము జరగుచుండగా అంతవరకు బహ్మనీ సుల్తానులకు సామంతులై వారికి విధేయానుచరులుగ నుండిన రాచకొండ పద్మ వెలమనాయకులు వారిని విడిచిపెట్టి తమ సేనలతోపోయి కర్ణాట సామ్రాజ్యాధీశ్వరుల పక్షము చేరిరి. బహ్మనీ సుల్తాను ఫీరూజ్ షా ఇక్కడకూడ పరాజయమును పొంది తన రాజధాని నగరమయిన గుల్బర్గాకు పోయి చేరుకొనెను. మోటుపల్లిపై పంపిన మొదటి దేవరాయల సైన్యములకు తత్ప్రాంతము వశమై ఆ రేవు పట్టణము శకవర్షములు 1339 (క్రీ. శ. 1417) ప్రాంతమున విజయ నగరాధీశ్వరుల అధికారము క్రిందికి వచ్చెను.

రెండవ కుమారగిరి రెడ్డి చనిపోయిన తరువాత కూడ పెదకోమటి వేమారెడ్డికి స్వాధీనము కాకుండ అల్లాడ రెడ్డి రాజమహేంద్రవర రాజ్యమును కాపాడుచునే వచ్చెను. ఆతడు రెండవ కుమారగిరి రెడ్డి యనంతరము ఆ రాజ్యమును కాటయ వేమారెడ్డి కూతురైన అనితల్లికి వశపరచి తాను ఆమె ప్రతినిధిగ దానిని పాలింపజొచ్చెను. రాజమహేంద్రవర రాజ్యమును జయించి స్వాధీనము చేసికొనుటకు పెదకోమటి వేమనృపతి ఎన్ని ప్రయత్నములు చేసినను అవి యన్నియు వ్యర్థమైనవి. ఈ ప్రయత్నములలో అల్లాడరెడ్డికిని పెదకోమటి వేమారెడ్డికిని పెక్కు యుద్ధములు జరగినవి. ఇట్టివానిలో వారుభయులకును రామేశ్వరము వద్ద జరగిన యుద్ధ మొకటే మనకు తెలియ వచ్చినది. రామేశ్వర మనుపేరు గల గ్రామములు తూర్పు గోదావరి జిల్లా రాజోలు తాలూకాలో ఒకటియు, పడుమటి గోదావరి జిల్లా తణుకు తాలూకాలో ఒకటియు నున్నవి. ఈ రెంటిలో యుద్ధము జరగిన రామేశ్వర మేదియో చెప్పుటకు ఆధారములు లేవు. ఈ రామేశ్వర యుద్ధములో పెదకోమటివేమ వృథివీపతిని పూర్తిగా ఓడించి తరిమివేసి అతని సంపద యంతయు అల్లాడరెడ్డి హరించెను



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పెదకోమటి వేముడు రాజమహేంద్రవర రాజ్యమును గురించిన ఆశ వదలుకొనెను. పైగా అన్నదేవచోడుడు కూడ తన రాజ్యమునే కాక రాజమహేంద్రవర రాజ్యమును గూడ సాధింప బ్రయత్నించుచుండెను. అందువలన ఇక కార్యము లేదనుకొని తన రాజ్య వ్యవహారములను చక్కబెట్టుకొనుచు గ్రంథ రచనయందు కాలము గడపుచుండగా, అతనికి విజయనగరాధీశ్వరులతో చేరిన రాచకొండ వెలమ నాయకులతో కలహము సంభవించినది. ఇట్లనుటకు కారణము 'వెలుగోటివారి వంశావళియే'. పెదకోమటి వేమ మాచారెడ్లకును, కుమార మాదానాయకుని తనయులైన కుమార వేదగిరి లింగమనేడులకును యుద్ధము జరిగినట్లు తెలుపు చాటువులు పూర్వోక్త గ్రంథములో గలవు. ఈ కలహమునకు కారణ మేదియో తెలియుట లేదు. వెలమలు ప్రాయికముగా విజయనగరాధీశ్వరుల పంపున రెడ్డిరాజ్యముపై దండెత్తి వచ్చిరేమో. కుమార వేదగిరి నేడు యుద్ధమున మాచారెడ్డిని వధించి అతనికి బొమ్మ పెట్టెను. తన సోదరుని చంపిన పగ తీర్చుకొనకుండ పెదకోమటి వేమారెడ్డి ఊరకుండలేదు. అతడు కుమార వేదగిరినేనిపై దండెత్తివెళ్ళి యుద్ధమున అతనిని పరాజితుని గావించి అతని బొమ్మను తన తమ్ముపడిగమున బెట్టించెను. అప్పుడు లింగమనేడు ముమ్మడి సింగభూపతితో కలసి గొప్ప సైన్యముతో కొండవీటిపై ఎత్తివచ్చి అతని నోడించి అతనికి బొమ్మపెట్టుటయే కాక విజయాంకములుగా పెదకోమటివేముని సింహలాంఛనమును, నందికంత పోతురాజు కటారిని గొనిపోయెను. 'ఈ వెలుగోటివారి వంశావళి'లోని కొన్ని చాటువులలో లింగమనేడు పెదకోమటి వేమారెడ్డిని చెరవట్టి ఏ కారణముననో విడిచిపెట్టె ననియు, ముమ్మడి సింగభూపతి (సర్వజ్ఞ సింగభూపతి) వెన్నంటి తరుమగా పెదకోమటి వేముడు పారిపోయె ననియు, సింగయఅన్నమనాయకుడును, లింగమనేడును పెదకోమటి వేముని వధించి రనియు వివిధములుగ చెప్పబడినది. వీనికి గల పూర్వాపర సందర్భములు కాని, కారణములు కాని, ఇందలి సత్యాసత్యములు కాని తెలిసికొనుటకు ఏవిధమయిన ఆధారములును లేవు.

పెదకోమటి వేమారెడ్డి ఇచ్చిన అగ్రహార దానశాసనములలో ఇంతవరకు కట్టకడపటిదిగా తెలియవచ్చినది శకవర్షములు 1341 (క్రీ. శ. 1419) నాటి అతని రుద్రవరము శాసనము. అతని ఆస్థానములో విద్యాధికారి పదవియం దుండిన శ్రీనాథ మహాకవి రచించిన కడపటి శాసన కావ్య మిదియే. ఇతడు తన సోదరుడు మాచారెడ్డికి కృష్ణానది ఉత్తరతటమున గల కొండపల్లి సీమను ఇచ్చివేసి కుమారగిరి చేసిన తప్పిదమునే ఇతడును చేసెను. అయినను తన యన్న జీవించి యున్నంతకాలమును అతనికి విధేయుడై మాచారెడ్డి అతనికి కార్య ఖడ్గములందు తోడ్పడుచు వచ్చినందున రెడ్డిరాజ్య సంపూర్ణతకు భంగము కలుగ లేదు. కాని, పెదకోమటి వేముని ఈ కార్యము కొండవీటి రెడ్డి రాజ్యమును మరింత దుర్బలపరచి దానిని విజయనగరము నరపతులును, కళింగము గజపతులును, బీదరు అశ్వపతులును కబళించుటకు అవకాశము కల్పించినది.

పెదకోమటి వేమభూపాలుని పరిపాలనము శకవర్షములు 1342 (క్రీ. శ. 1420)లో అంతరించినట్లు చెప్పవచ్చును. అతడు ధర్మకార్య నిరతుడు; శౌర్య సాహసోపేతుడు; గొప్ప పరాక్రమశాలి. రాజమహేంద్రవర రాజ్యమును జయించి మరల రెడ్డిరాజ్యమును యథాపూర్వ స్థితికి తీసికొని రావలెనని అతడు సర్వశక్తుల ప్రయత్నించెను. కాని, కృతార్థుడు కాలేక పోయెను. రెడ్డి రాజ్యమును ఇంకను విస్తరింపజేయ లేక పోయినను కడు విషమ పరిస్థితులలో దాని నెట్టెట్లో కష్టముమీద నిలుపుకొన గలిగెను. అతడు స్వయముగా విద్వాంసుడు; కవి; బహుగ్రంథ రచయిత; సంగీత సాహిత్యములలో గొప్ప ప్రజ్ఞానిధి; సర్వజ్ఞ చక్రవర్తి బిరుదాంచితుడు. అతని దాతృతా గరిమ సాటిలేనిది; కవులను, పండితులను అనేకుల నతడు సత్కరించి పోషించెను. అతనియాస్థానము నలంకరించిన విద్వన్మణులలో వామనభట్టబాణ, శ్రీనాథులు ముఖ్యులు. వీరిలో శ్రీనాథ మహాకవి విద్యాధికారి. పెదకోమటి వేమారెడ్డి అగ్రహార దానశాసన కావ్యముల కన్నిటికి అతడే కర్త. పెదకోమటి వేమనృపుని కాలమున కూడ వసంతోత్సవము కొండవీటిలో మహావైభవముతో పూర్వమువలెనే సాగుచుండెను. ఇతనికి కూడ వసంతరాయ, కర్పూర వసంతరాయబిరుదములు కలవు.

**రాచవేమారెడ్డి** (క్రీ. శ. 1420 — క్రీ. శ. 1424) : పెదకోమటి భూవిభుని అనంతరము కొండవీటి సింహాసనము నెక్కినవాడు అతని కుమారుడు రాచవేమారెడ్డి. ఇతడు ధాన్యవాటీ పురాధిపతియైన గన్న భూపాలుని దౌహిత్రుడు; సూరాంబ తనయుడు; పెదకోమటి వేముని రాజ్యకాలములో తన తల్లి సూరాంబ కట్టించిన సంతానవారిధి అను తటాకమునకు నీరు వచ్చుటకై శకవర్షములు 1337 (క్రీ. 1415) జగదొబ్బగండ కాలువను త్రవ్వించినట్లు తెలుపు శాసనము తక్క ఇంతవరకు ఇతని శాసనము లేవియు కానరాలేదు. ఇతడు తండ్రియంత సమర్థుడును కాడు; పరాక్రమవంతుడును కాడు. ఇతడు నాలుగుసంవత్సరములు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మాత్రమే పరిపాలనచేసె ననియు, పురిటి మంచము పన్ను మొదలైన క్రొత్త పన్నులను ప్రజలపై విధించి నిర్బంధముగ వసూలు చేసి ప్రజాకంటకు డయ్యె ననియు కొండవీటి దండకవిలెయు, కైఫియ్యతును తెలుపుచున్నవి. రాచవేమారెడ్డి తన భృత్యుడగు నవరము ఎల్లయ అను బలిజనాయకునివద్దనుండి పురిటి పన్ను వసూలుచేయగా కోపావేశ పరవశుడై ఎల్లయ తన ప్రభువును ముత్యాలమ్మ గుడివద్ద కటారితో పొడిచి చంపెనని దండకవిలె తెలుపుచున్నది. ఇది నిజమో అబద్ధమో తెలిసికొనుటకు తగిన ప్రమాణ మేదియు లేదు. మొత్తముమీద అతని పరిపాలనము ప్రజా పీడాకరముగా నుండినట్లు పరంపరగ వచ్చుచుండిన గాథలు తెలుపుచున్నవి.

పశ్చిమమునుండి కర్ణాటాధీశ్వరులును, ఉత్తరమునుండి కళింగ గాంగ వంశజులును అనతి కాలముననే రెడ్డి రాజ్యముపై దండెత్తి వచ్చి దాని నాక్రమించుకొనిరి. రాచవేమారెడ్డికి అతని దుష్పరిపాలనము వలన అతని సామంత మండలికులయొక్క కాని, ప్రజలయొక్క కాని సాయము లేకపోయినది. వంద సంవత్సరములపాటు ఒక్క వెలుగు వెలిగి ఈ విధముగా కొండవీటిరెడ్డి రాజ్య మంతరించినది.

**రాజమహేంద్రవరరాజ్యము :** రాజమహేంద్రవర రాజ్యము ఎట్లేర్పడినదియు, దానికి కాటయవేము డెట్లు అధిపతియైనదియు, సరిగా అన్నదేవచోడుడు కూడ తన రాజ్యమును సంపాదించుకొనుటకు పెదకోమటివేమ, కాటయ వేమారెడ్ల పోరాటము కాలమున ఎట్లు వచ్చినదియు ఇదివరకే తెలుపబడినది. రాజమహేంద్రవరరాజ్య చరిత్ర చాలవరకు అననేల, ఇంచుమించుగా అంతయు కాటయ వేముడును, అతని వియ్యాల వారును, ఇతర బంధువులును ఆ రాజ్యమును నిలువుకొనుటకు చేసిన యుద్ధచరిత్రమే.

**కాటయవేమారెడ్డి (క్రీ. శ. 1395 — క్రీ. శ. 1414):** కొండవీటి ప్రభువు కుమారగిరి భూపతుని కుమారుడు రెండవ అనపోత భూపతి మరణానంతరము రాజమహేంద్రవర రాజ్యమునకు కాటయవేమారెడ్డి అధిపతియయ్యెను. అంతకు పూర్వ మెప్పటినుండి దాని నేలుచుండెనో తెలియదు కాని, శక వర్షములు 1317 నాటికి అతడు రాజమహేంద్రవర రాజ్యాధిపతిగా నుండెను. పెదకోమటి వేమనరేంద్రుడు ఈ రాజ్యమును మరల సంపాదించుట కెట్లు ప్రయత్నించినదియు ఇదివరకే కొంత వివరింపబడినది. ఈ యుద్ధములలో అన్నదేవ చోడుడును, కాటయవేముని అనంతరము అతని సంతతి పక్షము వహించి అల్లాడరెడ్డియు చేసిన కార్య విశేషములును, అన్నదేవ చోడ, అల్లాడరెడ్ల అనంతరము రాజమహేంద్రవరరాజ్య చరిత్రమును తెలుపుట ఇక మిగిలియున్నది.

అన్నదేవచోడ నృపతి శకవర్షములు 1326 (క్రీ.శ. 1404) నాటికే తన రాజ్యమున కొంత భాగమునే కాక, పూర్వ రాజ్యమును వశపరచుకొనె ననుటకు ఆ తేదినాటి అతని దాక్షారామ శాసనమే ఆధారము. ఆ శాసనములో అతడు తాను రాజాధిరాజపరమేశ్వరు డనియు, పూర్వ సింహాసనాధీశ్వరు డనియు చెప్పుకొని యున్నాడు. కాని, ఆక్రమించుకొన్న ఈ రాజ్యమును చాలకాలము నిలుపుకొనలేక పోయెను. మరల దీనిని కాటయవేమారెడ్డి తీసికొనినట్లు ఈ రాజ్యములోని అతని శాసనములే తెలుపగలవు. అన్నదేవ చోడుని రాజ్యము పట్టిసము (గోదావరి నదిలో పోలవరము సమీపమున నున్న లంక) వద్దనుండి మోతే అని వ్యవహరింపబడు మోతీగఢ్ (భద్రాచలమున కెగువను గోదావరి నదిలోనున్న లంక) వరకు వ్యాపించినట్లు అతని రాజమహేంద్రవరము మ్యూజియము శాసనము వలన తెలియుచున్నది. అన్నదేవ చోడుడు పెదకోమటి వేమునితో కలసినది కాటయవేముని పూర్వ రాజ్యమును కబళించుటకే. మొదటి దేవరాయలు పరోక్షముగ చేసిన సాయము వలన కాటయవేమారెడ్డి పూర్వ రాజ్యమును నిలువుకొని దానిని శకవర్షములు 1336 (క్రీ. శ. 1414) వరకు పరిపాలించెను. అన్నదేవ చోడుడు గోదావరి దక్షిణ తటమున నుండుట కాటయ వేమునికి ప్రక్కలో బల్లెమువలె నుండెను. అందువలన అచటినుండి అతనిని తరిమివేయుటకు కాటయవేమారెడ్డి గోదావరి నదిని దాటి అన్నదేవ చోడుని ఎదుర్కొనెను. శకవర్షములు 1334 తరువాత వీరుభయులకు అత్తిలి, కాకరపర్తి, జగ్గవాగుల వద్ద గొప్పయుద్ధములు జరగినవి. జగ్గవాగు ఎక్కడిదో తెలియదు. అత్తిలి, కాకరపర్రులు గోదావరి దక్షిణ తీరమున పడుమటి గోదావరి జిల్లాలో నున్నవి. పూర్వోక్త శాసనములో అన్నదేవ చోడుడు తనకు శత్రువులైన దక్షిణదిశ రాజు లందరిని అత్తిలి పరిసాద్దులలో జయించి ఆ నగర ప్రాకారములోపల దాగియుండిన శత్రుబలము పదివేలమందిని చంపక రక్షించినట్లు చెప్పుకొని యున్నాడు. దక్షిణదిశరాజు అన్నది కాటయవేమునికి సాహాయ్యార్థమై వచ్చిన విజయ నగరాధీశ్వరుడు, అతని సామంత మండలేశ్వరులు నైయుండురనుటకు సందియములేదు. కాటయవేమ, అన్నదేవ చోడులకు జరగిన యుద్ధములలో చాల ముఖ్యమైనది కాకరపర్తి యుద్ధము. తన మిత్రుని రక్షించునిమిత్తము, తన బంధువులాకోలు, పిన్నుంది రాజు అధ్వర్యుడుగను, కన్నడులు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మొదలైన శత్రువులు యజ్ఞపశువులుగను చేసి తా నొక వీరయజ్ఞము చేసినట్లు పూర్వోక్త శాసనమున అన్నదేవ చోడుడు తెలిపియున్నాడు. ఈ మిత్రునిపేరు శాసనమున లేదు. ఇతడు పెదకోమటి వేమునికి సాయముగ వచ్చిన బహ్మనీ సుల్తాను ఫీరూజ్ షా యైయుండవచ్చునని కొందరు తలంచిరి. కాని, అది సరికాదు. ఆ మిత్రుడు పెదకోమటి వేమ నరపతియే కాని అన్యుడు కాదు. ఈ కాకరపర్తి విజయముతో గోదావరి దక్షిణతీర మంతయు పూర్తిగా అన్నదేవచోడుని యధికారము క్రిందికి వచ్చినది. అతడు పాలకొల్లుకు వెళ్లి తన తలిదండ్రులకు పుణ్యముగా క్షీరారామేశ్వర శ్రీమన్మహాదేవునికి శకవర్షములు 1335లో భూదానము చేసెను. ఇదివరలో నుడివినట్లు అన్నదేవ చోడునితోడి ఈ యుద్ధములలోనే కాటయవేమారెడ్డి వీరస్వర్గము నలంకరించెను. యుద్ధములో కాటయవేమారెడ్డి హతుడైన పిదప అన్నదేవచోడుడు అతని వంశము వారిని చెరపట్టి వారు తనకు ప్రణమిల్లి శరణు వేడిన పిమ్మట కీర్త్యైకవత్సలతచేత వారిని రక్షించి శరణాగత భూపరక్షాదీక్షాగురు బిరుదము వహించెను.

కాటయ వేముడు మహా పరాక్రమశాలి; సమరతంత్ర ప్రవీణుడు; రాజనీతి చతురుడు; కటకము వరకు గల దేశమును జయించి రెడ్డిరాజ్య పౌరుష విక్రమములకు పేరు ప్రతిష్ఠలు తెచ్చెను. కాని, పెదకోమటివేమునితోడి శత్రుత్వము వలనను, కొండవీటికి శత్రువులైన విజయనగరాధీశ్వరులతోడి మైత్రివలనను రెడ్డిరాజ్య పతనమునకు ఎక్కువ అవకాశము కల్పించెను. మరియు నితడు గొప్ప విద్వాంసుడు; తన ప్రభువైన కుమారగిరి భూపతి రచించిన వసంతరాజీయము ననుసరించి కాళిదాస నాటక త్రయమునకు కుమారగిరిరాజీయ మనుపేరుతో ఒక గొప్ప వ్యాఖ్యానము రచించెను. కుమారగిరి రెడ్డియెడల అతనికి గల ప్రేమ, కృతజ్ఞత అనుపమానములు. అత డతనిని అత్యంత విశ్వాసముతో సేవించి అతని యాజ్ఞలను నెరవేర్చెను. అతడు తన ప్రభువుపేర కొమరగిరిపురమని పేరుపెట్టి ఎన్నో గ్రామములను దేవ బ్రాహ్మణులకు ధార వోసెను. తుద కతడు తాను రచించిన వ్యాఖ్యానమునకును, తన కుమారునికినిసైత మతనిపేరే పెట్టెను. అతనికి కుమారగిరి అని ఒక కొడుకును, అనితల్లి, హరిహరాంబ అను ఇరువురు కూతుండ్రును కలరు. అనితల్లిని అల్లాడరెడ్డి కుమారుడు వీరభద్రారెడ్డి కిచ్చినట్లు ఇదివరకే తెలుపబడినది. కాటయవేముడు తన రెండవ కూతురు హరిహరాంబను అల్లాడరెడ్డి జ్యేష్ఠకుమారుడును, వీరభద్రారెడ్డి అన్నయునైన వేమారెడ్డి కిచ్చి పెండ్లి చేసెను.

**కుమారగిరిరెడ్డి** (క్రీ.శ. 1414 — క్రీ. శ. 1416 - 17): కాటయ వేమారెడ్డి చనిపోవునాటికి - కాటయ వేముని తొర్రేడు శాసనము చెప్పునదే నిజమయినచో - అతని కుమారుడు కుమారగిరి పదేండ్ల బాలుడు. కాటయ వేముడు కుమార జననావసరమున శకవర్షములు 1327 (క్రీ. శ. 1405) లో చివుకుల మాధవార్యు డను విద్వాంసునికి తొర్రేడు గ్రామము నగ్రహారముచేసి దాన మిచ్చెను. రాజకీయ కారణములవలన నేమో కుమారగిరికి చిన్నతనములోనే వివాహమయినది. కొమరగిరిరెడ్డికిని, అతని భార్యకును పుణ్యముగా చేసిన దానములను తెలుపు రెండు శాసనములు శకవర్షములు 1336 (క్రీ. శ. 1414), 1338 (క్రీ. శ. 1416) నాటివి దాక్షారామములో నున్నవి. కాటయవేముని మరణానంతరము అతని వియ్యంకుడు అల్లాడరెడ్డి కొమరగిరిరెడ్డిని రాజమహేంద్రవర సింహాసన మెక్కించి తాను సంరక్షకుడుగ పరిపాలనము జరప మొదలిడెను.

కాటయ వేమారెడ్డి మరణించిన పిదప కూడ రాజమహేంద్రవరరాజ్యము అన్నదేవ చోడునికి దక్కలేదు. అయినను, అతడు తనపట్టు వీడలేదు. ఈ తడవ అల్లాడరెడ్డి అన్నదేవచోడ, పెదకోమటి వేములకు కొరకరాని కొయ్యయై వారిపాలిటి చిచ్చరపిడుగయ్యెను. రాజమహేంద్రవర రాజ్యమును జయించుటకు అతడు చేసిన ప్రయత్నము లన్నియు విఫలమైనవి. తుదకు అన్నదేవచోడుడు ఈ యుద్ధములోనే హతుడయ్యెను. అతనికి వీరభద్రచోడుడని ఒకతనయు డుండెను. తండ్రి మరణానంతరము అతడు ఎంతయో కాలము జీవించినటులు లేదు. అతడు కూడ అల్లాడరెడ్డితోడి యుద్ధములలోనే మరణించి యుండును.

అన్నదేవచోడ నరేంద్రుడు చనిపోయిన పిదపనైనను పెదకోమటివేమ భూవిభుడు రాజమహేంద్ర వరమును సాధింపవలెనను తన పట్టుదలను విడనాడలేదు. అతడు రాజమహేంద్రవరముపై దండెత్తి వెళ్లి దాన భేదోపాయములను ప్రయోగించెను.

దురదృష్ట వశమున ఇంచుమించుగా ఈ సమయముననే కుమారగిరిరెడ్డి మరణించెను. అతడు ఎప్పుడు, ఎందువలన చనిపోయెనో తెలిసికొనుట కాధారములు లేవు. కుమారగిరి మరణముతో రాజమహేంద్రవర రాజకీయ పరిస్థితి మరింత అధ్వాన్నమైనది. కుమారగిరి మరణానంతరము రాజమహేంద్రవర రాజ్యము స్వామిద్రోహ పరాయణులైన దుష్టభూపతు లనుసముద్రములో నిమగ్నమైనదని అల్లాడ రెడ్డి శాసన మొకటి తెలుపుచున్నది. దీని ననుసరించి చూడగా కొమరగిరి చనిపోయిన వెనుక కొందరు రెడ్డి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



దొరల స్వామి ద్రోహము వలన పెదకోమటి వేమ ధరాధిపతియు, అతని మిత్రులును రాజమహేంద్రవరరాజ్యమును ఆక్రమించుకొనినట్లు తోచుచున్నది. కాని ఇది యెంత కాలమో వారివశమునం దుండలేదు. తుదకు రణరంగ రాఘవుడును, నీతి చాణక్యుడును అయిన అల్లాడరెడ్డి ఆ భూపతుల నందరిని ఓడించి పారదోలి రాజమహేంద్రవర రాజ్యమును మరల కాటయవేముని కుమార్తెయైన అనితల్లి చేత బెట్టెను. ఇప్పటికిని అల్లాడరెడ్డికి స్తిమితము చిక్కలేదు. పౌరస్త్య భూపతులైన, కళింగ గజపతులును (గాంగ నృపులు), కర్ణాటాధీశ్వరుడును కూడ రాజమహేంద్రవరముపై దండెత్తిరాగా గజపతి నోడించి అతనితోను, కర్ణాటాధీశ్వరునితోను మైత్రి చేసికొనినట్లు అతని కుమారుడు వేమారెడ్డి పేమవరము శాసనము తెలుపుచున్నది. రాజమహేంద్రవరముపై ఈ దండయాత్ర ఎప్పుడు ఎందువల్ల జరిగినదో తెలియదు. ఈ యిరువురితోను మైత్రి చేసికొన్న పిదప పెదకోమటివేముని ఆట కట్టించుటకు ఎక్కువ అవకాశము కలిగినది.

పెదకోమటి వేమ నృపతికి అన్నదేవచోడుని మరణముతో పెద్ద ప్రాపు పోయినది. అందువలన, అతడు రాజమహేంద్రవరమును సాధించు ప్రయత్నమున బహ్మనీ సుల్తాను ఫీరూజ్ షా సాయము వేడెను. అతడు అందు కంగీకరించి రాజమహేంద్రవరముపై దండెత్తివచ్చెను. శకవర్షము 1339 నాటి ఫీరూజ్ షా శాసనములు కృష్ణా జిల్లాలో కానవచ్చు చుండుటచేత అతని దండయాత్ర తత్ప్రాంతమున జరిగినట్లు నిశ్చయింప వచ్చును. అల్లాడరెడ్డి సోదరుడైన అనప్రోలారెడ్డి కుమారుడు అనవోతారెడ్డి యొక్క కొమ్ముచిక్కాల శాసనము ఫలానా సంవత్సరమున నని చెప్పకపోయినను - అల్లాడరెడ్డి యవనులను (మహమ్మదీయులను) జయించినట్లు మాత్రము ('యవనాన్విజిత్య') చెప్పుచున్నది. అందువలన ఇదివరలో పెదకోమటి వేముని చరిత్రమున వివరించినట్లు మొదటిదేవరాయల యుద్ధతంత్రము వలన సుల్తాను ఫీరూజ్ షా అపజయము పొందుటయే కాక ముందు తన రాజ్యములోని కోటలను సంరక్షించుకొనుట కొరకు పోవలసివచ్చినది. ఫీరూజ్ షా ఓడిపోవుటతో అల్లాడరెడ్డి పెదకోమటి వేముని వెన్నంటి తరిమి రామేశ్వరము వద్ద జరిగిన యుద్ధములో ఓడించి అతని సంపద నంతయు హరించెను. మరల పెదకోమటివేమ పృథ్వీశుడు రాజమహేంద్రవరముపై దండెత్తిపోలేదు.

కాశీఖండ, శివలీలా విలాసముల ప్రకారము అల్లాడరెడ్డి ధారానగర సురత్రాణుని ఓడించెను. అల్లయవేమారెడ్డి పేమవరము శాసనములో ఇతడు అల్పఖానని వ్యవహరింపబడెను. ఇతడు మాళవదేశపు సుల్తాను; తన తండ్రి మరణానంతరము సుల్తాను హూషంగ్ అను పేరుతో హిజిరా 808 (క్రీ. శ. 1405)లో రాజ్యమునకు వచ్చెను. ధారానగర మితని రాజధాని. పూర్వోక్త పేమవర శాసనములో ఉదాహృతుడైన అల్పఖాను అను హూషంగ్ ఘోరీ జాజ్‌నగరు మీదికి దండెత్తి వెళ్లుచుండునప్పుడో, ఆ దండయాత్రనుండి తిరిగివచ్చుచుండి నప్పుడో అతని నెదుర్కొని యోడించి అతని గుర్రములను అల్లాడరెడ్డి చెరపట్టి యుండును. ఈ దండయాత్ర హిజిరా 825 (శకవర్షములు 1343)లో జరిగినట్లు చెప్పుదురు. కాని, అల్లాడరెడ్డి శాసనములు శకవర్షములు 1342 తరువాత కానరావు సరికదా, అతని భృత్యుడైన నరహరినేడు శకవర్షములు 1342లో అతనిపేర అల్లాడేశ్వరలింగ ప్రతిష్ఠ చేసినట్లు తెలుపు శాసన మొకటి పాలకొల్లులో కలదు. సాధారణముగా మృతినొందినవారి పేర ఇట్లు లింగప్రతిష్ఠ చేయుట మనదేశములో పూర్వమునుండి వచ్చుచుండిన ఆచారము. అందువలన అల్లాడరెడ్డి ధారాసురత్రాణుని ఎప్పు డోడించెను, అత డెప్పుడు చనిపోయెను అను విషయము వివాదగ్రస్తమైనది. మొత్తముమీద అతడు శకవర్షములు 1343 నాటికి మృతినొందియుండు ననుటకు సందియము లేదు.

కాటయవేముడు చనిపోయిన పిదపకూడ అల్లాడరెడ్డి రాజమహేంద్రవరరాజ్య స్వాతంత్ర్యమునకు భంగము కలుగకుండ కాపాడెను; మొదట కాటయవేమ తనయుని ప్రతినిధిగా రాజ్య వ్యవహారములను చక్కబెట్టి అతడు మరణించిన పిదప స్వతంత్రుడుగానే రాజ్యమును పాలించెను. కడవరకు శత్రువులతో పోరాడి ఆ రాజ్యమును కాటయవేముని సంతతికి నిలిపిన ప్రతాపశాలి. అతడు కుమారగిరి తర్వాత కాటయవేముని కూతురు అనితల్లియే రాజ్యమునకు వారసురాలైనందున దానిని చివర కతడు తన సంతతికే నిలబెట్టిన ట్లయినది.

**'కొమరగిరి, అనవోతారెడ్లు (క్రీ.శ. 1420-21 — క్రీ.శ. 1423):** అల్లాడరెడ్డి చనిపోయిన తరువాత రాజ్యమునకు రావలసినవాడు అతని రెండవ కుమారుడు, అనితల్లి భర్త వీరభద్రారెడ్డి. కాని, నిజముగా ఆ రాజ్యము నాక్రమించుకొన్నవారు అల్లాడరెడ్డి సోదరుడైన అనప్రోలారెడ్డి కుమారులు కొమరగిరి, అనవోతారెడ్లు. మన కింతవరకు దొరకిన వీరభద్రారెడ్డి శాసనములలో శకవర్షములు 1345 (క్రీ. శ. 1423)నాటిదే మొట్టమొదటిది. అట్లయినచో ఇంత స్వల్పకాలములో వీరు రాజ్యము నాక్రమించుకొని



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పరిపాలించుట సంగతమా అను సంశయము కలుగవచ్చును. సంగతమే అనుటకు అనవోతారెడ్డి యొక్క శకవర్షములు 1344 (క్రీ. శ. 1422) నాటి తామ్రశాసన, శిలాశాసనములే ప్రమాణము. రాజమహేంద్రనగరము అనవోతారెడ్డి వాసస్థానమైనట్లు ('ఆసీ ద్రాజమహేంద్రనామ నగరం యస్య ప్రభో ర్వాసభూః') అతని తామ్రశాసనము చెప్పుచున్నది. అంతకు పూర్వమే అతని సోదరుడు కొమరగిరిరెడ్డి లోకాంతరగతుడైన ట్లున్నది. అతనికి పుణ్యముగా అతనిపేరు పెట్టి అనవోతారెడ్డి యిచ్చిన మరొక అగ్రహారము కాబోలు అనవ్రోలారెడ్డి కొమరగిరిపురపు గ్రామగ్రాసవూరు అల్లాడవేమారెడ్డి పేమవరము శాసనమున సీమావధులలో పేర్కొనబడినది. శౌర్యప్రతాపాఢ్యులైన వేమ, వీరభద్రాదు లుండ వీ రెట్లు రాజ్యమునకు వచ్చియుందు రనుసంశయము కలుగుట సహజము. స్థానిక చరిత్రల ననుసరించి చూచినచో శకవర్షములు 1342 (క్రీ. శ. 1420)లో కొండవీటి పర్యంతము కళింగ గజపతి దండయాత్ర యుండినట్లు తెలియుచున్నది. ప్రాయికముగా అతనికి సామంతులై అతని సాయముతో వారు రాజమహేంద్రవర రాజ్యమును సంపాదించుకొని యుండవచ్చును. అనవోతారెడ్డి రాజ్యము చేసినది చాల స్వల్పకాలమే.

ఇంతలో వేమ వీరభద్రాదులు శకవర్షములు 1345 (క్రీ. శ. 1523) నాటికి రాజమహేంద్రవర రాజ్యమును మరల స్వాధీనము చేసికొనిరి. ఇందుకు సామంతులగుటకు అంగీకరించి గజపతి సాహాయ్యమునో, విజయనగరాధీశ్వరుల తోడ్పాటునో పొంది యుండవలెను. ప్రాయికముగా, వీరు దక్షిణ కళింగమున కొంత భాగ మిచ్చి గజపతికి సామంతులై యుందురేమో.

వీరభద్రారెడ్డి (క్రీ. శ. 1428 — క్రీ. శ. 1448) : రాజమహేంద్రవర రాజ్యము స్వాధీనము కాగానే అనితల్లి ద్వారా సంక్రమించిన రాజ్య మగుటచేత వేమారెడ్డి తన తమ్ముడు వీరభద్రారెడ్డిని సింహాసన మెక్కించి రాజ్యాభిషేకముచేసి తాను ప్రధానిడై రాజ్య వ్యవహారములను చక్కబెట్టజొచ్చెను. రాజ్యము వీరభద్రారెడ్డి దన్న పేరే కాని నిజముగా ప్రభువు వేమారెడ్డియే. రాజమహేంద్రవరరాజ్యము గజపతికి సామంతరాజ్య మయినను వీరభద్రనృపతి ఇంచుమించుగ స్వతంత్రుడుగనే రాజ్యమేలెను.

ఇట్లుండ కర్ణాటక సింహాసనము నెక్కిన ప్రౌఢదేవరాయ లను నామాంతరము గల రెండవ దేవరాయలు కళింగోత్కల రాజ్యాధిపతియైన గజపతి నాలుగవ వీరభానుదేవుని పై దండెత్తి వచ్చి సింహాచలము వరకుగల దేశమును జయించెను. అతని సామంత మండలేశ్వరుడయిన తెలుంగురాయని శాసన మొకటి శకవర్షములు 1350 (క్రీ.శ. 1428) నాటిది సింహాచలములో కలదు. శకవర్షములు 1351 (క్రీ. శ. 1429) నాటి రెండవ దేవరాయల ముదలిదురె శాసనములో 'మాతంగ రాజసింధుర వరకోటి మర్దన మృగేశ్వర, నంధ్ర నరేంద్ర సైన్య సాగర కలశోద్భవం, విజయరాయ తనూభవం, దేవభూవరం' అని రెండవ దేవరాయల ప్రశంస ఉండుటవలన అతడు గజపతిని జయించుట సత్యమని నిర్ధారణ యగుచున్నది. ప్రాయికముగ ఈ సందర్భముననే కావచ్చును 'వెలుగోటివారి వంశావళి'లో చెప్పినట్లు రేచెర్ల వెలమ నాయకుడు లింగమనేడు అల్లయ వేమ, వీరభద్ర, దొడ్డారెడ్లను యుద్ధమున ఓడించి బొమ్మశెట్టి రాజమహేంద్రవర రాజ్యమును రేగగొట్టి సింహాచలము సాధించినది. రేచెర్ల వెలమ నాయకులకును, కర్ణాటాధీశ్వరులకును పొత్తు కలసి వారు మిత్రు లగుటచేత వారుకూడ ఈ విజయనగర దండయాత్రలో పాల్గొని యుండ వచ్చును. తీరస్థాంధ్ర దేశములో లింగమనేడు నిర్వహించినట్లు చెప్పబడుకార్యము లన్నియు ఈనాటివే కావచ్చును. కళింగ గజపతిని జయించుటతో ప్రాగాంధ్ర దేశము మరల విజయనగరాధీశ్వరుల అధికారము క్రిందికి వచ్చినది. వీరభద్రారెడ్డి మరల విజయనగర సామంతుడయ్యెను. వేమ, వీరభద్రారెడ్లు శకవర్షములు 1352 (క్రీ. శ. 1430) తరువాత దక్షిణ కళింగముపై దండెత్తి వెళ్ళి దానిని జయించిరి. సింహాచలములో గల వారి శాసనములే ఇందుకు తార్కాణము. వీనిలో వీరభద్ర భూవిభుడు సింహాద్రినాథునికి ఒక గ్రామమును దాన మిచ్చినట్లు తెలుపు శాసనమున తేది లేదు. వేమారెడ్డి శాసనము శకవర్షములు 1356 (క్రీ. శ. 1434) నాటిది. ఇది 'స్వభుజార్జితమైన కళింగమందలి కలువలపల్లి, ఒడ్డాది, పొట్నూరు సైతమైన స్థలాలకు చెల్లునట్టి యూళ్ళలో' గల దేవ బ్రాహ్మణ సీమలకు, అగ్రహారములకు, ఖండికలకు 'పూర్వమర్యాద క్రమాన' పన్నులు చెల్లించినట్లు తెలుపుటకు పుట్టినది.

ఈ వేమ, వీరభద్రారెడ్ల శాసనములు శకవర్షములు 1356 (క్రీ. శ. 1434) వరకే కానవచ్చినవి. శకవర్షము 1359 (క్రీ. శ. 1437) నాటి దాక్షారామ శాసనములో వీరు చేసిన దానములకు సూచన కలదు. మొత్తముమీద వీరభద్రారెడ్డి శకవర్షములు 1366 (క్రీ. శ. 1444) వరకు రాజమహేంద్రవరమును పరిపాలించుచుండె ననుటకు అవకాశము కలదు. రాజమహేంద్రవర రాజ్యము ఎప్పుడు ఏవిధమున అంతరించెనో తెలియదు. ప్రాయికముగ ఇది



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



విజయనగరము నరపతులయొక్కయు, రేచెర్లవారి యొక్కయు, కటకము గజపతులయొక్కయు దండయాత్రలవల్ల నలిగి నాశనమయినట్లు తోచుచున్నది.

శకవర్షములు 1356 - 57 (క్రీ. శ. 1434 - 35)లో కడపటి కళింగ గాంగభూపతి వీరభానుదేవుని త్రోసిరాజని అతని మంత్రి సేనాపతుల, తన బంధు మిత్రుల సాయముతో కపిలేశ్వర గజపతి కటక సింహాసన మాక్రమించుకొని గజపతి వంశ స్థాపకు డయ్యెను. ఇతడు చాల బల పరాక్రమశాలి; శౌర్య సాహసోపేతుడు. రాజ్యమునకు వచ్చిన తరువాత ఇతడు దక్షిణ కళింగము విజయనగరాధీశుల, వారి సామంతుల అధికారము క్రింద నుండుటను సహింపలేకపోయెను. నష్టమయిన కళింగ భాగమునే కాక రాజమహేంద్రవర రాజ్యమునుకూడ జయించి కళింగోత్కల సామ్రాజ్యమున చేర్చుకొనవలెనని అతడు ప్రయత్నించి రాజ్యముపై దాడిచేసెను. కర్ణాటాధీశ్వరుడయిన రెండవ దేవరాయలు తన సామంతులు, మిత్రులు అయిన వేమ వీరభద్రారెడ్లకు కపిలేశ్వర గజపతిని తరిమివేయుటలో సాయపడుటకును, రాజమహేంద్రవర రాజ్యమును సంరక్షించుటకును వెంటనే తన ప్రధానియైన మల్లప్ప ఒడయరుకు కొంత సైన్యము నిచ్చి పంపెను. శకవర్షములు 1366 (క్రీ. శ. 1444) నాటి రెండవ దేవరాయల శాసన మొకటి దాక్షారామములో ఉన్నది. ఈ శాసనములోని దానము 'అల్లాడరెడ్డి వేమారెడ్డింగారి ఆజ్ఞను' చేసినట్లు తెలుపబడినది. దీని ననుసరించి అంతవరకు అల్లయ వేమారెడ్డి జీవించి యుండినట్లే తెలియుచున్నది. కపిలేశ్వర గజపతి కప్పుడు విజయము లభించెనో లేదో తెలియదు. కాని తరువాత కొద్ది సంవత్సరములకే, అనగా శకవర్షములు 1370 (క్రీ. శ. 1448) నాటికి ఈ రాజమహేంద్రవర ప్రాంత మంతయు అతని యధికారము క్రిందికి వచ్చినది. పడుమటి గోదావరి జిల్లా తణుకు తాలూకా పెనుగొండలో శకవర్షములు 1370 నాటి కపిలేశ్వర గజపతి శాసన మొకటి కలదు. అందువలన రాజమహేంద్రవర రెడ్డి రాజ్యము శకవర్షములు 1366, 1370 మధ్య ఎప్పుడో అంతరించి యుండవలెను.

కందుకూరు రాజ్యము : ప్రోలయ వేమారెడ్డి కనిష్ఠ సోదరుడైన మల్లారెడ్డి సంతతివారు కందుకూరు రాజధానిగా తత్పరిసర ప్రాంతమును పరిపాలించిరి. వీరు మొదటి నుండియు కొండవీటి అధిపతులకు విధేయ సామంతులుగ నుండి వారితో సహకరించుచు వచ్చిరి. కుమారగిరి రెడ్డి రాజ్యాంత్య కాలమున కొండవీటి కెదురు తిరిగి తీరస్థ ప్రాంతమును కొంత వశపరచుకొన్నను అనతికాలముననే పెదకోమటి వేమారెడ్డి వీరి నణచివేసి దానిని మరల తీసికొనెను. విజయనగర రాజ్యముపై బహ్మనీ సుల్తాను ఫీరూజ్ షా కావించిన దండయాత్రా సందర్భమున ముస్లిము సైన్యములు కందుకూరు రాజ్యముమీద కూడ దాడిచేసినవని కాబోలు, మల్లారెడ్డి పౌత్రులైన మాచారెడ్డియు, అతని సోదరుడు రాచవేమారెడ్డియు వానిని జయించినట్లు శాసనములు తెలుపుచున్నవి. రెండవ హరిహరరాయల మరణానంతరము విజయనగర సింహాసనము కొరకు జరిగిన అన్న దమ్ముల పోరాటమును అవకాశముగ తీసికొని కావచ్చును ఈ కందుకూరి శాఖ రెడ్డి దొరలు ఉదయగిరి రాజ్యమున కణకువయైన సిద్ధవటము, చంద్రగిరి సీమలకు చెందిన పొత్తపినాడు, పులుగులనాడులను ఆక్రమించుకొని రాచవీడుకోట(చిత్తూరు జిల్లాలోని రాయచోటి)ను పట్టుకొని కొంతకాలము పరిపాలించినట్లు స్థానిక చరిత్రలు తెలుపుచున్నవి. కడపజిల్లా లేపాక, తంగటూరులలో ఈ కందుకూరి శాఖవారి శాసనములు 1328 (క్రీ. శ. 1406), 1336 (క్రీ. శ. 1418)ల నాటివి కలవు. సోదర కలహములో విజయులైన మొదటి దేవరాయలు సింహాసన మెక్కి తన స్థితిని కట్టుదిట్టము చేసికొన్న పిదప సైన్య సమేతులై పోయి ఈ రెడ్డిదొరల నోడించి వారి రాజ్యము నాక్రమించుకొనెను. అప్పటినుండి ఈ కందుకూరిశాఖ రెడ్డిదొరలు విజయనగరాధీశ్వరులకు సామంతులైరి. కందుకూరి రాజ్యము కర్ణాటాధీశ్వరుల విజయనగర సామ్రాజ్యములో అంతర్భాగమైనది.

వర్ధిల్లిన వంద సంవత్సరములలోను రెడ్డి రాజ్యము మధ్యాంధ్ర దేశీయుల భాగ్య విధాతలై వారి అభ్యుదయమున కెక్కువ పాటుపడినది. కాకతీశ్వరుల నాదర్శముగ పెట్టుకొని రెడ్డి మహిపతులు తటాకములను నిర్మించి వ్యవసాయము నభివృద్ధి పరచిరి. వీనిలో సంతాన సాగర నిర్మాణము, జగనొబ్బగండ కాలువలు మాత్రమే మనకు తెలిసినవి. ఇంకను ఇట్టి వనేక ముండవలెను. మల్లారెడ్డి పౌత్రుడును, పినకోమటిరెడ్డి పుత్రుడును అయిన శ్రీగిరి రెడ్డి నవ్యతర ప్రశస్యములైన అనేకసహస్రాబ్ధి సమాన గాంభీర్య మహాతటాకములను నిర్మించినట్లు శాసనములు చెప్పుచున్నవి. రెడ్డి నృపులు దేశములో జరుగు వర్తకమునకు కూడ గొప్ప ప్రోత్సాహము నిచ్చియున్నారు. కొండవీటి పరిపాలకుడయిన అనవోతారెడ్డి మోటుపల్లికి వచ్చుచుండిన నౌకా వర్తక వ్యాపారులకు అభయ శాసన మిచ్చినప్పటినుండి సముద్రముమీద సాగుచుండిన వర్తక మభివృద్ధియై దేశము భాగ్యవంత మైనది. ఈ కాలములోని తెలుగు దేశపు నౌకావర్తక వ్యాపార కుటుంబములలో

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



శ్రీనాథుని ధర్మమాయని మనకు తెలియవచ్చినది. అవచి వారి కుటుంబము. ఈ కుటుంబములోని చామిశెట్టి, తిప్పయశెట్టి మొదలైనవారు చీని (చీనా), భోట (భూటాన్), హురుమంజి (పెర్షియా దేశములోనిది), రమన్న దేశము (బర్మా దిగువ భాగము), మలయా ద్వీపకల్పము, యాంప (యాల్పాణము - జాఫ్నా), పంజార (సుమత్ర ద్వీపములోనిది), సింహళము, లంక మొదలయిన దేశములతోను, ద్వీపములతోను వర్తక వ్యాపారము సాగించుచుండినట్లు తెలియుచున్నది. వారు ఈ దేశముల నుండి, ద్వీపములనుండి ఏనుగులు మొదలుకొని చందసాగరు కర్పూరాది సుగంధ ద్రవ్యములవరకు సమస్త వస్తువులను తెచ్చి దేశ సంపదను పెంపొందించిరి. అవచి తిప్పయశెట్టి కొండవీటి కుమారగిరి భూవిభునకు, విజయనగరపు రెండవ హరిహర రాయలకు, గుల్బర్గ బహ్మనీ సుల్తాను ఫీరూజ్ షాకును సుగంధ ద్రవ్యాదులు తెచ్చి యిచ్చుచుండువాడట. దీని ననుసరించి అవచివారు ఒక్క కొండవీటితోనే కాక బహ్మనీ, విజయనగర రాజ్యములతో గూడ విస్తారము వర్తక వ్యాపారములు జరపుచుండిరని చెప్పవచ్చును. కుమారగిరి భూపాలుడు జరపుచు వచ్చి వసంతోత్సవముల సందర్భమున ఏటేట అవచి సెట్లు కొండవీటిలో మంచిగంధము, పన్నీరు, కస్తూరి, కర్పూరము మొదలయిన సుగంధ ద్రవ్యముల అంగడి యొకటి ప్రత్యేకము పెట్టుచుండిరి. ఆనాడు అతివిస్తృతముగ జరగుచుండిన ఈ నౌకా వాణిజ్యమే కొండవీటి రెడ్డి క్షితీశ్వరులు ఏటేట జరపుచుండిన వసంతోత్సవములకు అఖండ శోభను, పరిమళమును చేకూర్చినది. దేశ మీ విధమున రెడ్డి వసుమతీశ్వరుల రాజ్య కాలమున సిరిసంపదలతో తులతూగినది. ఈ కారణముననే రెడ్డి మన్నీలలో చాలమంది హేమాద్రికల్పోక్త గోసహస్ర, కల్పతరు, బ్రహ్మాండ, తులా పురుషాది మహా దానములు కావించి యశస్వులైరి. వారు రాజ్య రక్షణ నిమిత్తము ఎనుబదినాలుగు కోటలు నిర్మించి బాహ్యాంతశ్శత్రు నివారణమునకు చక్కని రక్షణోపాయములను కావించిరి.

ఇంచుమించుగ రెడ్డి రాజన్యు లందరును గొప్ప విద్వాంసులు. వారిలో కొందరు సంగీత సాహిత్యములందు పారంగతులు; సకల కళాభిజ్ఞులు; కవి పండిత పోషకులు. వారు సంస్కృత పండితులను, తెలుగు కవులను సబహుమానముగ ఆదరించి పోషించిరి. కుమారగిరి, కాటయవేమ, పెదకోమటి వేమారెడ్లు గొప్పపండితులే కాక గ్రంథకర్తలు కూడను. కుమారగిరిరెడ్డి వసంతరాజీయమను నాట్యశాస్త్రమును రచించెను. అతని బావయు, ప్రధానియు అయిన కాటయవేమారెడ్డి కాళిదాస నాటక త్రయమునకు కుమారగిరిరాజీయ మనువ్యాఖ్యానమును రచించెను. విద్వత్తలో పెదకోమటి వేమారెడ్డి రెడ్డిరాజు లందరికిని తలమానికము. అతడు సర్వజ్ఞ చక్రవర్తియే. సంగీత చింతామణి, సాహిత్య చింతామణి అతడు రచించినవే. ఇవిగాక, ఆ భూవిభుడు అమరుక శతకమునకు శృంగార దీపిక అను పేరుతోను, హాల మహారాజు గాథాసప్తశతిలోని నూరు ఉత్తమగాథల నేరి వానికి సప్తశతీసార టీక అనుపేరుతోను ప్రశస్త వ్యాఖ్యానములు వ్రాసెను. సప్తశతీసారటీకకే భావదీపిక అనియు నామాంతరము కలదు. రాజమహేంద్రవరము నేలిన అల్లయ వీరభద్రారెడ్డి 'సాహిత్య కలా సంగీత లక్ష్య లక్షణ భంగీ సర్వజ్ఞుడు' కందుకూరిశాఖ రెడ్డిదొరలలో శివలింగారెడ్డి హరదత్తాచార్యులవారి 'గిరిశశ్రుతి సూక్తిమాల'కు తత్త్వ ప్రకాశిక అను పేరుతో ఒక వ్యాఖ్యానము రచించెను. ఈ శివలింగారెడ్డి నాట్యశాస్త్రమున గూడ పారంగతుడు; భరతమత పతంగ బిరుదాంచితుడు. మల్లారెడ్డి పౌత్రుడైన శ్రీగిరిరెడ్డి గొప్ప శా విమర్శకుడు; సంగీతసాహిత్యములందు ప్రవీణుడు. ఈ విధముగా రెడ్డి వసుధేశులు సంగీత సాహిత్య సంపన్నులును, కళాకోవిదులును అయియుండ రెడ్డిరాజ్య మొకవిధముగా సంస్కృతి రాజ్యమయినది. వామనభట్ట బాణుడును, శ్రీనాథమహాకవియు కొండవీడు రెడ్డిరాజ్య విభూషణములు. రెడ్డి మన్నీల ఆదర ప్రోత్సాహములవలన ఆయుర్వేదము, జ్యోతిషము ప్రత్యేకము వృద్ధి నొందినవి. శివలెంక, వెన్నెలకంటి వంటి తెలుగు కవి కుటుంబములు రెడ్డి రాజేంద్రుల ఆశ్రయచ్ఛాయను వర్ధిల్లినవి. వామనభట్ట బాణుడు వేమ భూపాలచరితమను పేర పెదకోమటి వేముని చరిత్రను భట్టబాణుని కాదంబరి పద్ధతిని గద్యకావ్యముగ రచించెను. ఈతడు రచించిన కావ్య నాటక నిఘంటువు లనేకము కలవు (చూడు : వామనభట్ట బాణుడు). శ్రీనాథుడ తెలుగులో మహాకవి; అఖలశాస్త్ర పారంగతుడు. ఇతడు తెలుగులో పెక్కు గ్రంథములు రచించెను (చూడు : శ్రీనాథుడు). ఈ మహాకవీశ్వరుడు పెదకోమటి వేమ నరేంద్రుని ఆస్థానమునకు వచ్చు పండితులను పరీక్షించు విద్యాధికారి; కొండవీడు రాజ్యము పతనమైన వెనుక ఆశ్రయమును వెదకికొనుచు రాజమహేంద్రవరమునకు వచ్చెను; అక్కడ బెండపూడి అన్నమంత్రి తోడ్పాటు వలన వేమ వీరభద్రారెడ్ల ఆశ్రయము సంపాదించుకొని వారి ఆస్థానకవిగా నుండెను. దేవరకొండ వెలమ నాయకుడైన లింగమనేడు కొండవీడునుండి విజయాంకముగా గొనిపోయిన నందికంత



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పోతురాజు కటారి ఆ వెలమ దొరల వద్దనే యుండిపోవుట వేమ, వీరభద్రారెడ్లకు తలవంపులుగను, వారి పౌరుషాధిక్యములకు కళంకముగను ఉండెను. అందువలన వారు వెలమరాజ్యమున కరిగి ఆ కటారి నెట్లయినను తీసికొని రావలసినదని శ్రీనాథు నభ్యర్థింపగా అతడు వారి యాస్థానమున కరిగినట్లు చెప్పుదురు. ఈ సందర్భముననే శ్రీనాథుడు సర్వజ్ఞ సింగభూపాలుని సందర్శించెను. శ్రీనాథుడు దర్శించిన సర్వజ్ఞసింగభూపతి ఎవ్వరను విషయము వాదోపవాదములకు కారణమైనది. అతడు కుమారాన్నపోతా నాయని కుమారుడును, వసంతానపోతా నాయని అగ్రజుడును అయిన ముమ్మడి సింగ భూపాలు డనుటకు సందియము లేదు. ఈ సందర్భమున శ్రీనాథుడు సింగ భూపాలుని, లింగమనేనిని సందర్శించి తన కవితా ప్రాగల్భ్యమునను, వాక్చాతుర్యమునను, లౌకిక ప్రజ్ఞవలనను వారిని మెప్పించి ఆ కటారిని తిరిగి తీసికొనివచ్చి వేమ, వీరభద్రారెడ్ల కిచ్చెనని ఐతిహ్యము. రెడ్లకు గర్భశత్రువులైన వెలమనాయకుల వద్దనుండి ఆ కటారిని గొని వచ్చుటలో శ్రీనాథుడు చూపిన నేర్పు అనుపమానమయినది. అతని నీతి చతురత కిది నికషోపలము. శ్రీనాథుని జీవితమున కంతకు మకుటాయమానమైన విషయము కర్ణాటాధీశ్వరులైన ప్రౌఢ దేవరాయ మహారాయల ముత్యాలశాలలో గౌడడిండిమభట్టు పరాజయానంతరము అతనికి జరిగిన స్వర్ణాభిషేకము.

శాస్త్రపారంగతులు, వేదవేదాంగ విదులు అయిన బ్రాహ్మణులకు అనేకాగ్రహారదానములు చేసి వేదవిద్యలను, వైదిక సంస్కృతిని పునరుద్ధరించి పోషించిన రెడ్డి రాజ్యము క్రీస్తుశకము పదునైదవ శతాబ్ది మధ్యభాగమున అంతరించినది. మ. సో. శ.

## బహ్మనీ రాజ్యము

క్రీ. శ. 14వ శతాబ్ది ద్వితీయ దశకమున ఢిల్లీ సుల్తాను మహమ్మద్ బిన్ తుఘ్లుక్ దక్షిణ హిందూ సంస్థానముల నన్నిటిని జయించి, ఆ సేతు శీతాచలపర్యంతము సమస్త భారతదేశమును మహమ్మదీయుల ఏలుబడిక్రిందికి తెచ్చెను; కాని అల్పకాలముననే దుష్పరిపాలన ఫలితముగ ఎల్ల యెడలను పోవల్లు చెలరేగి ఒక మహారాష్ట్రమున తప్ప తక్కిన దక్షిణమున మరి యెచ్చటను అతని యధికారము చెల్లుబడి కాకపోయెను.

మహారాష్ట్రమందు మాత్రము మహమ్మద్ బిన్ తుఘ్లుకు పరిపాలనము మరికొన్నేండ్లపాటు సాగినది. కాని, సుల్తానుదౌర్జన్యమును సహింపజాలక ఆ ప్రాంతమును పాలించుచుండిన శతకాధిపతులెల్లరును (అమీరాణ - ఇ - జద) ఏకమై సుల్తానుపై తిరుగబాటుచేసి తమలోన నెల్ల బలపరాక్రమాదులచే నధికుడైన హసన్ గంగును రాజుగ నెన్నుకొని దౌలతాబాదు రాజధానిగ ఒక క్రొత్త మహమ్మదీయ రాజ్యమును స్థాపించిరి. హసన్ గంగు తాను ప్రాచీన పారసీక ప్రభువైన బహ్మన్ షాహు వంశజుడనని చెప్పుకొనుటచే అతని సంతతివారికి బహ్మనీయు లనియు, వారి ఏలుబడిలోని రాజ్యమునకు బహ్మనీరాజ్య మనియు పేరులు కలిగెను.

అలా ఉద్దీన్ హసన్ గంగు (క్రీ. శ. 1347—క్రీ. శ. 1358): రాజ్యాభిషేక సమయమున హసన్ గంగు అలా ఉద్దీనను నూతన వ్యవహారనామమును స్వీకరించెను. కావున ఇతనిని అలా ఉద్దీ ననియు, అలా ఉద్దీన్ హసన్ గంగు అనియు చరిత్రకారులు పేర్కొనెదరు. ఆదియందు ఇతని ఏలుబడిక్రింది రాష్ట్రము విస్తారమైనది కాదు. సహ్యాద్రినుండి కోలసవరకును, పూనాప్రాంతము నుండి కృష్ణానదిదాకను వ్యాప్తమైన దేశము మాత్రము అతనికి లోబడి యుండినది. తుఘ్లుకు సుల్తానుల పాలనక్రింద దౌలతాబాదు దక్షిణదేశమును పాలించుచుండిన సుల్తాను ప్రతినిధులకు రాజధానియై యుండెను. సుల్తాను నోడించి ఆ దుర్గమును, తదుపాశ్రిత రాష్ట్రమును కైవసము చేసికొనుట వలన అతనికి చెల్లుచుండిన సామ్రాజ్యాధిపత్యము కూడ తనకు సంక్రమించినదని ఎంచి చుట్టుప్రక్కల రాజ్యములను తన అధికారము క్రిందికి తెచ్చుకొన అలా ఉద్దీను ప్రయత్నము చేయగడగెను. ఈ కారణమున, అతనికి తూర్పున తెలంగాణా అధిపతియైన ముసునూరి కాపయ నాయకుని తోడను (చూడు: ముసునూరివంశము). దక్షిణమున విజయనగర రాజ్యపాలకులైన హరిహర బుక్కరాయల తోడను యుద్ధములు సాగినవి. ఈ యుద్ధములలో మొత్తముమీద ఇతనికే జయము చేకూడిన ట్లున్నది. ఒకసారి తెలంగాణాపై దండు వెడలి గుంటూరు మండలములోని అమరావతి పర్యంతముగల దేశమును చూరపట్టి గుడిగోపురాదులను పాడుచేసెను. కౌలస సీమను సమర్పించి కాపయనాయకుడు అతనితో సంధి చేసికొనెను. క్రీ. శ. 1358లో అతడు విజయనగరముపై ఎత్తిపోయి తుంగభద్ర పర్యంతముగల రాయల రాష్ట్రమును ఆక్రమించుకొనెను; కనుమను దాటి పశ్చిమ తీరప్రదేశమును ప్రవేశించి కొంకణమును జయించెను. ఈ విజయముల వలన సుల్తాను ఏలుబడిక్రింద రాజ్యవిస్తీర్ణము బహుళముగా పెరిగినది. తత్కారణమున, రాష్ట్రపాలన సౌకర్యార్థము రాజధానిని దౌలతాబాదునుండి రాజ్యమధ్యమున నుండు గుల్బర్గకు

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మార్చుకొనవలసి వచ్చెను. అలా ఉద్దీన్ సైఫుద్దీన్ ఘోరి అను రాజ్యతంత్ర మర్మజ్ఞుని మంత్రిగ నియోగించి, అతని సాహాయ్యమున తన నూతన రాజ్యమును చక్కగ పాలించుటకు తగిన కట్టుదిట్టములను ఏర్పరచెను. పదునొకండేండ్లు ప్రజారంజకముగ రాజ్యపాలనమునొనర్చి క్రీ. శ. 1358లో అలా ఉద్దీన్ హసన్ గంగు దేహమును చాలించెను.

**మొదటి ముహమ్మదు శాహు** (క్రీ. శ. 1359—క్రీ. శ. 1375): అలా ఉద్దీన్ మృతుడైన పిమ్మట అతని పెద్దకొడుకగు మొదటి ముహమ్మదుశాహు సింహాసనము నెక్కెను. బహ్మనీ వంశజులలో ఇతడు సుప్రసిద్ధుడు. ఇతని రాజ్యకాల మంతయు ఇంచుమించుగ యుద్ధములందు గడచిపోయినది. ఇతని కాలమున జరిగిన చరిత్రాంశములలో ఈ క్రిందివి ముఖ్యమైనవి.

1. ముహమ్మదుశాహు తల్లియొక్క మక్కాతీర్థయాత్ర.
2. హిందూ రాజ్యములతో యుద్ధము.
3. దౌలతాబాదు పాలకుని తిరుగబాటు.

1. ముహమ్మదుశాహు పరిపాలనముయొక్క ప్రారంభదశయందు ఢిల్లీ పాదుశాహు అగు ఫీరూజ్ శాహు తుఘ్లుకు దక్కనుపై ఎత్తివచ్చి దేశమునంతటిని మరల జయించి, యథాపూర్వము దానిని ఢిల్లీ సామ్రాజ్యమున కలుపుకొనునను భయము అతనిని పీడింపగడగినది. ఆ సంఘటనను ఎట్లయినను జరగనీయక అడ్డుపెట్టవలయునని ముహమ్మదుశాహు ఘనప్రయత్నములు చేయగడగెను. ఫీరూజ్ శాహు తుఘ్లుకు ఇస్లామునందు గాఢభక్తిశ్రద్ధలుగల ముహమ్మదీయుడు. మరియు, అతనికి గతించిన సుల్తాను ముహమ్మద్ బిన్ తుఘ్లుకుపై గల ప్రేమ అపారమైనది. ఈ రెండు గుణములను ఆధారపరచుకొని ముహమ్మదుశాహు తన కడకను సాధింప దలపెట్టెను. సుల్తాను ముహమ్మద్ బిన్ తుఘ్లుకు ఒకప్పుడు ఈజిప్టుదేశములో ప్రవాసమునందు ఉండిన అబ్బాసియదు ఖలీఫాను ఢిల్లీకి రప్పించి తగురీతిని సత్కరించి అతని ఆధిపత్యమును అంగీకరించి తాను అతని ప్రతినిధిగ ఢిల్లీ సామ్రాజ్యమును పాలించుచున్నాడనని ప్రకటించి యుండెను. ఫీరూజ్ శాహువంటి సదాచార సంపన్నుడైన ముహమ్మదీయుడు తద్వ్యతిరిక్తముగ ప్రవర్తింపజాలడని ఎంచి ఖలీఫాను సుప్రసన్నుని జేసికొన నిశ్చయించి తన తల్లిచేతికి బొక్కసములోని ధనము నంతను పోగుచేసి ఇచ్చి మక్కాకు తీర్థయాత్రచేయ ప్రయాణము చేసి పంపెను. ఆ ధనము నామె మక్కాలో ధారాళముగ దానధర్మములు చేయుటకును, మతప్రముఖులకు కానుకలు పెట్టుటకును వినియోగపరచి వారి మూలమున ఖలీఫా యొక్క దయను సంపాదించి అతనిచే ఫీరూజ్ శాహు పేర స్వమతానుయాయులతోడి యుద్ధము తగదని వారించుచు శ్రీముఖము వ్రాయించి పంపునట్లు ఏర్పాటుచేయవలయునని చెప్పి పంపెను.

2. ముహమ్మదుశాహు తల్లి మక్కా యాత్రయందు ఇంకను నిమగ్నురాలై ఉండగనే అతనికి సరిహద్దు దేశము నేలుచుండిన హిందూ రాజులతో ఘర్షణ కలిగినది. పూర్వము అతని తండ్రియైన అలా ఉద్దీన్ హసన్ గంగు తూర్పున తెలంగాణా ప్రభువైన కాపయనాయకుని తోడను, దక్షిణమున విజయనగర పాలకులైన హరిహర, బుక్కరాయలతోడను యుద్ధముచేసి ఒకరికడనుండి కౌలసనును, మరియొకరికడనుండి తుంగభద్రాతటమువరకును వ్యాప్తమై యుండు రాష్ట్రమును ఆక్రమించుకొని యుండెను. వా రిరువురును ఏక కాలమున పూర్వము అలా ఉద్దీను తమకడనుండి అక్రమముగ ఆక్రమించుకొన్న రాజ్యమును మరల తమకు ఇచ్చివేయవలసిన దనియు, లేనియెడల తాము దండెత్తి వచ్చుచున్నా మనియు బెదరించుచు రాయబారము పంపిరి. అప్పుడే ఉత్తరదేశమునుండి వార్త వచ్చినది ఫీరూజ్ శాహు తుఘ్లుకు దక్కనుపై దండయాత్ర వెడలి వచ్చుచున్నాడని. ముహమ్మదుశాహు శత్రువులకు బిరుసు చూపుటకు అది అదను కాదని ఎరిగి వారి రాయబారులను సత్కరించి తన ఆస్థానమునందు ఒక యేడున్నర కాలము ఉంచుకొని మంచి మాటలతో కాలము గడపెను. ఇంతలోపలనె దండు వెడలిన ఢిల్లీ సుల్తాను ఏకారణము చేతనో తిలపట్టణముదాక వచ్చి దండయాత్రోద్యోగమును చాలించుకొని వెనుదిరిగి పోయెనని తెలియ వచ్చినది. మక్కా యాత్రను ముగించుకొని ముహమ్మదుశాహు తల్లియు గుల్బర్గకు వచ్చి చేరినది. అతడు కోరినట్లు ఖలీఫా ఢిల్లీ సుల్తానుపేర శ్రీముఖమును పంపెను. ఖలీఫా ఆజ్ఞ ప్రకారము ఫీరూజ్ శాహు దక్కనుపై దండయాత్రను మరల తలపెట్టలేదు.

ఢిల్లీనుండి దండయాత్ర రాజాలదని నిశ్చయమైన పిమ్మట ముహమ్మదుశాహు తెలంగాణ, విజయనగర రాజులను తగిన విధమున దండించుటకు తలపెట్టెను. ఒకనాడు నిండు సభయందు వారి రాయబారులవైపు తిరిగి అంతవరకు చూపుచుండిన సౌమ్య భావమును వదలి కడు పారుష్యముతో వారి ప్రభువులు తనకు చెల్లింపవలసిన కప్పము నేల చెల్లింపలేదని అడిగెనట. అందుమీదట ఆ రాయబారులు బెదరి తమ తమ రాజులకడకు పోయి వారితో ఆ వృత్తాంతము నివేదించిరట. కోపోద్రిక్తులై వారు ఏక కాలమున బహ్మనీ రాజ్యముపై దండెత్తివచ్చి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కౌలస సీమను తెలంగాణా ప్రభువును, కృష్ణా తుంగభద్రల యంతర్వేదిని విజయనగర రాయలును ఆక్రమించుకొనిరట. ఇట్లు యుద్ధమునకు ముందంజవేసి తన పలుబడిక్రింద ఉండిన రాష్ట్రమును ఆక్రమించుకొనిన హిందూరాజుల దౌర్జన్యమునకు కినిసి ముహమ్మదుశాహ దళములను సమకూర్చుకొని వారిపై దండుపెట్ట నిశ్చయించుకొనెను.

మొట్టమొదట అతని దృష్టి తెలంగాణాపై పర్వెను. కాని, తెలుగువారు సులభముగ లొంగలేదు. మూడు పర్యాయములు అతడు దండయాత్రలు నడపిన పిమ్మట గాని అతని మనోరథము సిద్ధింపదాయెను (చూడు: మునుమూరి వంశము).

ముహమ్మదుశాహ యొక్క విజయనగర దండయాత్ర విషయమున ఆధునిక చరిత్ర పరిశోధకుల రచనలలో కొంత అభిప్రాయ భేదము కానవచ్చుచున్నది. మహమ్మదీయ చరిత్రకారుల భిన్న రచనలే దీనికి ముఖ్యకారణము. కొందరు అతడు విజయనగరముపై ఎత్తిపోయినది ఒక్కతూరి అని చెప్పుదురు. మరికొందరు రెండు పర్యాయములని అభిప్రాయపడుచున్నారు. మనకు ఉపలబ్ధమైన సాక్ష్యమును సూక్ష్మముగ పరిశీలించి చూచిన రెండు పర్యాయము లనుటకంటె ఒక్కతూరియే (క్రీ. శ. 1367 - 68) దండు చేసెనని ఎంచుట సమంజసముగ కన్పట్టుచున్నది.

నిజాముద్దీను అహ్మదు, ఫెరిస్తా మున్నగు మహమ్మదీయ చరిత్రకారులు ఈ దండయాత్ర ప్రారంభమును గూర్చి అసంగతమైన గాథను ఒకదానిని చెప్పుదురు. తెలంగాణ విజయోత్సవ సందర్భమున తన ప్రమోల గానము చేసిన ఢిల్లీ సంగీత పాఠకులకు సన్మానముచేయ దలపెట్టి ఆ సన్మాన ధనమును వారి కీయవలసినదని ముహమ్మదుశాహ విజయనగర కృష్ణరాయల పేర బరాతము వ్రాసి పంపెనట. బరాతము తెచ్చిన సంగీత పాఠకులను కృష్ణదేవరాయలు తలలు రేవులువార గొరిగించి గాడిదలపై నెక్కించి విజయనగర వీథులలో నూరేగింపు చేయించి తరుమగొట్టుటయే కాక, సైన్యమును సమకూర్చుకొని దండువెడలి ఆదవానికడ పాళెము దిగి, అచటినుండి ముదుగల్లుపై దండుచేసి ఆ కోటను స్వాధీనము చేసికొని అచట కాపురముండిన మహమ్మదీయులను వారి ఆలుబిడ్డలతోకూడ వధించెనట! అంతట ముహమ్మదుశాహ దండుతో తరలివచ్చి రాయసైన్యము నోడించి ఆ కోటను మరల స్వాధీనము చేసికొని అచటినుండి బయలుదేరి ఆదవానికడ దిగియుండిన విజయనగర బలముపైబడి వారిని పటాపంచలు చేసి రాయల మేనల్లుడును, సేనాధ్యక్షుడును అయిన భోజమల్లుని సంహరించెనట. తరువాత కృష్ణరాయలు అరణ్యమునకు పారిపోయి అచట వెనువెంట దగిలి వచ్చుచుండిన ముహమ్మదుశాహువలని ఉపద్రవమును సహింపజాలక చిట్టచివరకు విజయనగరమును చొచ్చి కోటయందు డాగెనట. అంతట ముహమ్మదుశాహ తంత్రముచేసి కృష్ణరాయలను కోట నుండి వెలుపలికి ఎలయించి యుద్ధమునందు పరాభూతుని చేయగా అతడు వెరగుపడి పరచి మరల కోటలోనికి పోయి డాగెనట. అంతట ముహమ్మదుశాహ విజయనగర పరిసర ప్రదేశములను కారిసమరి వేనవేలు హిందూప్రజలను సంహరింప దొడగెనట. బ్రాహ్మణుల ప్రార్థనపై కృష్ణరాయ లా జనసంహారము నుడుపుట కొడబడి ముహమ్మదుశాహ యొక్క బరాతము చొప్పున సంగీత పాఠకులకు ధనము నిచ్చి సత్కరింపగా అతడు యుద్ధమును చాలించి నిజరాజ్యమునకు మరలిపోయెనట. ఇది ఫెరిస్తా వ్రాసిన యుద్ధ వృత్తాంతము. దీనిని సంపూర్ణముగ నమ్ముటకు వీలులేదు; ఏలనగా ఇందు అసంగతములయిన విషయములు పెక్కు కలవు. ముహమ్మదుశాహ సమకాలికుడయిన విజయనగరపాలకుడు కృష్ణరాయలు కాడు. అతడు ముహమ్మదుశాహ మరణానంతరము మూట ముప్పదియైదేండ్లు అయినపిమ్మటగాని విజయనగర సింహాసనమును అధిష్ఠింపలేదు. భోజమల్లుడను సేనాపతి కృష్ణరాయల కాలమునందేకాక మరియెన్నడును విజయనగర సంస్థానమున వర్ధిలెననుటకు ఆధార మేమియు లేదు. ఈ యుద్ధ వృత్తాంతమును వర్ణించిన ఇతర మహమ్మదీయ చరిత్రకారులు ఎవ్వరును ఫెరిస్తా చెప్పు కథ సమగ్రమైనదనికాని, సత్యాత్మకమైనదనికాని రుజువు చేయ దొడ్డరు. ఇంతేకాక, ఖాఫీ ఖానువంటి విశ్వాసపాత్రుడైన చరిత్రకారుడు ఫెరిస్తావలె సంగీత పాఠకులకు ధనము నిమ్మని వ్రాసిపంపిన బరాతమును నిరాకరించుటయే యుద్ధకారణమని వచించినను, ఫెరిస్తా చెప్పు యుద్ధ వివరములను అంగీకరింపక వేరువిధముగ వర్ణించియున్నాడు: యుద్ధము సత్వరముగ ముగియక కొంతకాలము నడచినది. వేనవేలు కాఫిరులు రణరంగమున మడిసిరి; వేలకొలది మహమ్మదీయులు కాఫిరుల ఖడ్గముల కెరయైరి. పెక్కు రణక్షేత్రములందు హిందువులు మహమ్మదీయులచే పరాభూతులైరి. ఎన్నో మారులు ఓటుపడినను అడుగడుగునకు హిందువులు అనిమొన తలచూపి పోటరులై మహమ్మదీయులతో యుద్ధముచేసి గెలుపుగొనుచు వచ్చిరి. చిట్టచివరకు ముహమ్మదు శాహ విజయుడై నిజరాజ్యమునకు మరలిపోయెను. అంతట రాయలు గుల్బర్గకు రాయబార మంపి సంధి చేసికొనెను. ఆ సంధి నియమముల ప్రకారము (1) ఉభయ రాజ్యముల మధ్య కృష్ణానది

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సరిహద్దుగ నుండవలయును. కాని, నదికి ఈవలి మహాలులు కొన్ని మాత్రము ఉభయుల సమష్టి ప్రభుత్వముక్రింద నుండవలయును; (2) ఉభయ పక్షములవారును యుద్ధమున శత్రువులచే జిక్కి బందీకృతులయినవారిని విడిచిపెట్టవలయును; (3) భావికాలమున రెండు రాజ్యముల నడుమ జరిగెడు యుద్ధములలో స్త్రీలను, శిశువులను వధింపక గౌరవముతో కాపాడవలెను. ఈ సంధి నియమములు ఫెరిస్తాకు తెలియకపోలేదు. కాని, అతడు వానిని ఈ యుద్ధ సందర్భమున వివరింపక మూడుమూలలలో ప్రకరణాంతరము లందు యాదృచ్ఛికముగ ప్రస్తావించి యున్నాడు. ఈసంధి నియమములలో మొట్టమొదటిది చక్కగ గమనింపదగినది. బహ్మనీ, విజయనగర రాజ్యముల మధ్య సరిహద్దు విషయమై కలిగిన వివాదమువలన ఈ యుద్ధము పొసగినది. ఉభయరాజ్యముల నడిమియెల్ల తుంగభద్ర యని బహ్మనీ సుల్తానులును, కృష్ణానదియని విజయనగర ప్రభువులును పంతగించి ఖడ్గమూలముగ నా వ్యవహారమును పరిష్కరించుకొన బూనుకొనిరి. ఫెరిస్తా చెప్పినట్లు వాస్తవముగ మహమ్మదుశాహుకు సర్వత్ర విజయమే చేకూడి యుండినయెడల అతడు ఉభయ రాజ్యములకును కృష్ణానదియే సరిహద్దనియు, సదరు నదీతటమందలి మహాలులు కొన్ని ఉభయుల ఉమ్మడి పాలనక్రింద ఉండవలెననియు ఒప్పుకొనియుండడు. అతడు అట్లు ఒప్పుకొనెనని మహమ్మదీయ చరిత్రకారులే చెప్పియుండుటవలన ఈ యుద్ధమున విజయనగరమువారు దెబ్బకు బదులుదెబ్బ కొట్టుచు మహమ్మదీయులతో సరిపోరి తమ పంతమును నెగ్గించుకొనిరని దృఢముగ చెప్పవచ్చును. రాయలసీమలోని కొన్ని గ్రామ కైఫియ్యతులలో సమకాలిక విజయనగరపాలకుడైన మొదటి బుక్కరాయలు శాలివాహన శకము 1288 లో ఉత్తరాది తురకలతో యుద్ధముచేసి జయమును పొందినట్లు చెప్పియున్నది.

8. **దౌలతాబాదు పాలకుని తిరుగబాటు:** బహ్మనీ సైన్యము లన్నియు విజయనగర దండయాత్రయందు పనిపడి యుండగా బహారాం ఖాను మాజిందరానీ అను దుర్గాధ్యక్షుడు మహమ్మదుశాహుపై తిరుగబాటు చేసి స్వాతంత్ర్యము స్థాపింప దలపెట్టెను. కాని, మహమ్మదుశాహు ఖాను మహమ్మదును కొంత సేనతో అతనిమీదికి పంపెను. యుద్ధమున పరాజితుడై మాజిందరానీ దేశత్యాగము చేసి పోయెను. అతని స్థానమున ఖాను మహమ్మదు దౌలతాబాదునకు దుర్గాధిపతిగ నియమితుడాయెను.

బహ్మనీ వంశజులయిన సుల్తాను లందరిలో ఈ మొదటి మహమ్మదుశాహు కడు దొడ్డవాడు. రణలాలసుడై నిరంతరము యుద్ధ కార్యములందు నిమగ్నుడై యుండినను రాష్ట్రపాలనయందు ఔదాసీన్యము చూపలేదు. ఇతని కాలముననే ఇతని ప్రధాన మంత్రియైన సైఫ్ ఉద్దీన్ ఘోరీ బహ్మనీ రాజ్యాంగ విధానమును నిర్మాణము గావించెను. ఇతనిచే నిర్మింపబడిన రాష్ట్రపాలన పద్ధతి మహమ్మదు గావానుని కాలమువరకును వ్యవహారమున నుండెను. మత విషయములందు ఇతడు మౌలవీల యాదేశము చొప్పున నడచుచు న్యాయము తప్పక రాజ్యపాలన మొనర్చెను; తప్పు చేసినవారిని నిర్దాక్షిణ్యముగ దండించినను అనుచరులను దయతో కాపాడెను. పదునేడేండ్లు రాజ్యము చేసి క్రీ. శ. 1375 వ సంవత్సరమునందు ఇతడు లోకాంతరగతుడాయెను.

**ముజాహిదు శాహు** (క్రీ. శ. 1375 — క్రీ. శ. 1378): మహమ్మదుశాహు గతించిన పిమ్మట అతని పుత్రుడు ముజాహిదుశాహు గుల్బర్గ సింహాసనమును అధిష్ఠించి క్రీ. శ. 1375 మొదలు 1378 వరకు మూడేండ్లకాలము రాజ్యమును పాలించెను. ఇతడు యువకుడు; యుక్తాయుక్తముల నెరుగడు. ముందు వెనుకలను అరసి కరణీయమును నిశ్చయించుకొనగల శక్తియు ఇతనికి చాలదు. కాని, శూరుడు; యుద్ధ లాలసుడు. తన కత్తి కేదియు నడ్డపడజాలదను నమ్మిక చిన్ననాటనుండియు అతని హృదయమున లోతుగ పాదుకొనియుండెను. కావున అతడు రాజ్యము చేసిన మూడేండ్లకాలమును యుద్ధముతోడనే సరిపోయినది.

రాజ్యాభిషేకము చేసికొనిన పిమ్మటనే ముజాహిదు శాహు విజయనగరరాయలపై కయ్యమునకు కాలు ద్రవ్వెను. పూర్వము మహమ్మదుశాహు రాయలతో చేసికొనిన ఒడంబడిక ప్రకారము కృష్ణకు ఈవలి మహాలులు కొన్ని యుభయుల సమష్టిపాలన క్రింద నుండుట వలన తద్విషయమై ఉభయరాజ్యములకును కలతలు కలుగుచుండె ననియు, కావున, నట్టి కలహములను రానీయకుండ వారించుటకొరకు తుంగభద్రా తటము పర్యంతము వ్యాప్తమైయుండు రాయచూరు అంతర్వేదిని సమస్తమును తనకు ఇచ్చివేయవలసిన దనియు అతడు రాయలపేర ఒక ఉత్తరమును వ్రాసి పంపెను. రాయలు అందుకు సమ్మతింపక అనాదినుండియు కృష్ణానదియే ఉభయ రాజ్యములకును సరిహద్దుగ నుండె ననియు, కృష్ణ కీవల తమ యుభయుల సమష్టిపాలనక్రింద నుండు మహాలులుకూడ తనకే చెందవలసి యున్న వనియు తెల్పుచు ముజాహిదు శాహునకు ప్రత్యుత్తరము వ్రాసి పంపెను. అందుమీదట, ముజాహిదుశాహు ఆగ్రహపరవశుడై విజయనగరముపై యుద్ధము ప్రకటించి దండు వెడలెను.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఈ యుద్ధచరిత్రను ఫెరిస్తా సుదీర్ఘముగ వర్ణించి యున్నాడు. అందలి సారాంశ మిది: దౌలతాబాదు, బీరారు, బీదరులనుండి సేనలను రప్పించి ధనమును మోసి కొని అయిదువందల యేనుగులు వెంట నడవ ముజాహిదు శాహు విజయనగరమువంక దండు నడపెను; కృష్ణా తుంగభద్రలను దాటి, ఆదివానికోటకు చేరి, ఆ దుర్గమును ముట్టడించెను; ఆ కోటను సాధించు కార్యమును ఒక సేనాధిపతికి అప్పగించి మరి ఇరువురను కొంత సైన్యముతో విజయనగరము మీదికి పంపెను; కృష్ణరాయలు వారిని ఎదుర్కొని యుద్ధముసేయ దలపెట్టెను; కాని, ముజాహిదు శాహు సైన్యము సమీపమునకు రాగానే భయభ్రాంతచిత్తుడై అడవులకు పారిపోయెను. అయినను ముజాహిదు శాహు అతనిని విడువలేదు; నిలిచినచోట నిలువనీయక వెన్నంటి తరుమ నారంభించెను. స్థలములు, నాడులు, సీమలు, రాజ్యములు, అడవులు, కొండలు తిరిగి తిరిగి దేహారోగ్యము చెడగా కృష్ణరాయలు తుదకు రాజధానికి మరలివచ్చి అందు ప్రవేశించెను. ముజాహిదుకూడ అతనివెంటనే వచ్చి కోటను ముట్టడించెను. మొట్టమొదట యుద్ధసరణి అనుకూలముగ నడచినను తుదకు అపజయము తప్పకపోయినది. దీనికి కారణములు రెండు: రాయల తమ్ముడు వెలుపలినుండి గొప్పదండుతో అతనికి సహాయము వచ్చుట ఒక్కటి; యుద్ధరంగమున నిర్ణీతస్థానమం దుండక ముజాహిదుశాహు పినతండ్రియైన దావూదు ఖానుడు ముజాహిదు శాహును రక్షించు నుద్దేశముతో అతడు పోరుచున్నచోటికి వచ్చుట మరియొకటి. ఈ కారణములవలన విజయనగరమును సాధించుటకు వలనుపడక పోగా ముజాహిదు ముట్టడిని లేవదీసి సైన్యమును మరల్చుకొని అదవానికి పోయెను. తొమ్మిదిమాసములు ఆకోట చుట్టును గిర్దాయించి కూర్చున్నను లాభము కలుగదాయెను. అది ఇక హస్తగతము కాదని నిరాశ చెంది, దండయాత్రను చాలించుకొని నిజరాజధానికి తరలి పోవుచుండగా మార్గమధ్యమున క్రీ. శ. 1878, ఏప్రిల్



చిత్రము 55. జామి మసీదు, గుల్బర్గ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



17వ తేదీ నాటిరాత్రి శిబిరమునందు అతనిని ఎవ్వరో వధించిరి.

ఫెరిస్తాకు సమకాలికుడైన సయ్యిద్ అలీ తబాతబా అను మరియొక చరిత్రకారుడు సయితము ఈ దండ యాత్రను వర్ణించియున్నాడు. ఒకానొక కోటయొక్క శీగముద్రలను తనకు వశము చేయవలయునని ముజాహిదు శాహు కోరగా విజయనగరపాలకుడైన కప్పా నిరాకరించెను. అంతట సుల్తాను సైన్యమును వెంటగొని విజయ నగరముపై దండు వెడలెను. కప్పా భీతుడై సుల్తానుకు గొప్ప ధనరాశిని నజరు సమర్పించి, పైజెప్పిన దుర్గపు శీగ ముద్రలను ఇచ్చి తన స్వామిభక్తి నిర్వక్రమైనదని విశదము చేసెను. ముజాహిదు శాహు మిక్కిలియు సంతసించి సంధికి ఒడబడెను. తదనంతరము అతడు నిజరాజధానికి మరలి పోవుచు కృష్ణాతటమున విడిసియుండగా క్రీ. శ. 1378 ఏప్రిల్ 16వ తేదినాడు అతని జ్ఞాతియైన దావూదు ఖానుని నియోగమున హంతకులచేత నిహతుడాయెను.

రఫీ ఉద్దీన్ షిరాజీ అను మరియొక చరిత్రకారుడు ముజాహిదు శాహు విజయనగరముపై జిహాదు ప్రకటించి దండుతోకూడ తరలిపోయి ఆదవాని దుర్గమును ముట్టడించె ననియు, జలాభావముచే దుర్గాధిపతి ముట్టడికి నిలువజాలక కోటను వశపరచుటకు సంసిద్ధుడై అతనికి వర్తమానము పంపె ననియు, అందుమీదట అతడు కోటను స్వాధీనము చేసికొనుట కొరకు తన సర్దారులలో నొక్కని పుత్తెంచె ననియు, అంతట నాకస్మిక వర్షపాతము వలన కోటయందు జలసమృద్ధి యొదగూడె ననియు, తదుపరి శాణ్యమున కధిపతి ఆతురక సర్దారుని తల గొట్టించి, ఫిరంగి వాతబెట్టి సుల్తాను శిబిరమునందు పడునట్లు వైపించె ననియు, తరువాత సుల్తాను యుద్ధమును చాలించుకొని గుల్బర్గకు వెడలి పోయె ననియు వ్రాసి యున్నాడు.

ఈ యుద్ధ వృత్తాంతములలో ఏది యెంతవరకు వాస్తవమో నిశ్చయించి చెప్పుటకు వలనుపడదు. అందలి పరస్పర-విభిన్న విరుద్ధ విషయములు కంటక ప్రాయములై సత్యాన్వేషణకు అడ్డపడుచున్నవి; మిథ్యాకల్పనలు వాని యథార్థతకు న్యూనత్వమును ఆపాదిలజేయుచు సర్వమును ఆకాశ పంచాంగ మనుశంకకు ఎడమిచ్చుచున్నవి. ముజాహిదు శాహుయొక్క సమకాలికుడైన విజయనగర పాలకుడు కృష్ణరాయలని ఫెరిస్తాయు, కప్పాయని తబాతబాయు వక్కాణించియున్నారుకదా! వాస్తవమును పరికించి చూడ అతడు వారిరువురిలో నెవ్వడును కాడు. ముజాహిదు సింహాసనము నధిష్ఠించినప్పుడు విజయనగరమున రాజ్యము చేయుచుండిన ప్రభువు మొదటి బుక్కరాయలు. అతడు క్రీ. శ. 1377 లో మృతినందగా అతని పుత్రుడైన ఇమ్మడి హరిహరరాయలు సామ్రాజ్యాధిపత్యము వహించి క్రీ. శ. 1404 వరకు ప్రజాపరిపాలన మొనర్చెను. కావున ముజాహిదు సమకాలికులైన విజయనగర భూపాలురు మొదటి బుక్క, ఇమ్మడి హరిహరరాయలు కావలయును గాని క్రీ. శ. 1509 - 1529ల మధ్య పాలించిన కృష్ణరాయ లెట్లు కాగలడు? ఊరు పేరు లేని కప్పా యెట్లు కాగలడు? మరియు ఫెరిస్తా చెప్పునట్లు ముజాహిదు శాహు రాయలను తరుముకొనుచు విజయనగర సామ్రాజ్యము పొడుగున పర్యటనము సల్పెననికాని, తరువాత విజయనగరమునకు ముట్టడివేసి దానిని సాధింపజాలక పరాఙ్ముఖుడై పోయె ననికాని రుజువుచేయగల ఆధార మెద్దియును గానరాదు. కాని, ముజాహిదు శాహు విజయనగర సామ్రాజ్యముపై దండెత్తిపోయినది నిజము; ఆదవాని దుర్గమును ముట్టడించినది నిజము. మొదటి బుక్కరాయలు అస్తంగతుడైన పిమ్మట సామ్రాజ్యాధిపత్యమునకై అతని పుత్రులొండొరులతో పెనగులాడి దేశమున కొంత సంక్షోభము పుట్టించిన ట్లున్నది. ఆ సంక్షోభమును సందర్భపరచుకొని ముజాహిదు రాయరాజ్యముపై నెత్తిపోయి ఆదవానిని ముట్టడించెను. కోట వశపడునట్లే కాన్పించెను. కాని, హరిహరరాయల సోదరుడగు మల్లప్ప ఒడయల పుత్రుడైన చెన్నప్ప ఒడయలు గొప్ప సైన్యముతోగూడ కోటలోని శాణ్యమునకు వత్తాసిగ వచ్చి లోపల ప్రవేశించి ముట్టడికారులను యుద్ధమున నోడించెను. ఇట్లు కోట దుర్గ్రహముకాగా ముజాహిదు శాహు దండయాత్రను చాలించి నిజరాజధానివైపు తరలెను. ఈ యపజయమువలన సుల్తాను ప్రతిష్ఠకు భంగము కలిగినది. సింహాసనముపై పీఠణము వేసి అతని దాయాది దావూదు ఖానుడు కుట్రలు సేయదొడగెను; కృష్ణాతటమును చేరునప్పటికి అతని పన్నాగము పరిపూర్తినందెను. అంతట ఫెరిస్తా చెప్పినట్లు క్రీ. శ. 1378 ఏప్రిల్ 17వ తేదీనాడు గాని, తబా తబా వచించినట్లు 16 వ తేదీనాడు గాని అతని యనుచరులెట్లో సుల్తాను శిబిరమును ప్రవేశించి అతనిని సంహరించిరి. ముజాహిదు తరువాత అతనియొక్క అకాలదుర్మరణము వలన బహ్మనీ రాజ్యమునకు గొప్ప విపత్తు సంభవించినది.

రెండవ మహమ్మదు శాహు (క్రీ. శ. 1378—క్రీ. శ. 1397): ముజాహిదును చంపించి దావూదు నెలదినములు రాజ్యము చేసెను. ముజాహిదు సోదరియగు అఘావర్వర్ అతనిని చంపించి అలా ఉద్దీన్ హసన్ గంగు మనుమడైన రెండవ ముహమ్మదును సింహాసన మెక్కించెను. ఫెరిస్తా మున్నగు చరిత్రకారులు ఇతని గుణగణములను స్తోత్రము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చేసియున్నారు; కాని ఇతడు వారు చెప్పునంతటి సమర్థుడు కాడు. అప్పటి స్థితిగతులను చక్కగ పరిశీలించి చూచిన ఇతని ప్రభుత్వకాలమున బహ్మనీయులకు రాజ్యనష్టమును, ప్రతిష్ఠాభంగమును కలిగెనని చెప్పకతప్పదు. ఇతని రాజ్యకాలమున జరిగిన ముఖ్యచరిత్రాంశము విజయనగరముతోడి సంగ్రామము. ఫెరిస్తా మొదలగు చరిత్రకారులు ఈ సంగ్రామ వృత్తాంతమును వివరింపక కప్పిపెట్టుటవలన అది సమగ్రముగ తెలియవచ్చుటలేదు. ముజాహిదు శాహు మరణానంతరము విజయనగర రాయలు రాయచూరు మీది కెత్తివచ్చి ముట్టడివేసె ననియు, రెండవ ముహమ్మదు శాహు సింహాసనము నెక్కెనని తెలియరాగనె అతడు భయకంపిత గాత్రుడై ముట్టడిని త్యజించుటయేకాక కప్పము కట్టుటకు సయితము ఒప్పుకొని సంధి చేసికొనె ననియు ఫెరిస్తా వ్రాసియున్నాడు. కాని, అది నమ్మదగిన వ్రాత కాదు. ఏలనగా, ముజాహిదు శాహు ఆదవాని యుద్ధరంగమున విజయనగర సైన్యాధిపుడైన చెన్నప్ప ఒడయనిచే ఓటువడి శిరము దక్కి నిజరాజధానివైపు పారిపోయెనేకాని విజయముతో మరలలేదు. రాజ్యాభిషేకమునకు ముందు రెండవ ముహమ్మదు శాహు వట్టి అనామధేయుడు. అతని పోలుపొందికలను ఎవ్వరును ఎరుగరు. కావున, రణపరాజితుడై పారిపోయి మృతుడైన శత్రువుయొక్క సింహాసనమును పేరు ప్రఖ్యాతిలేని దొర యొక్క అధిష్ఠించెనని విన్నంత మాత్రమున విజయనగరరాయలు రాయచూరు ముట్టడిని ఏల త్యజించును? సంధి ఏల కోరును? కప్పము గట్ట నేల యొడబడును? ఇది అంతయు కేవల మసంగతము. మరియు అప్పుడు రాయచూరు బహ్మనీ సుల్తానుల ఏలుబడిక్రింద నుండెననికాని, విజయనగరరాయలు దానిని ముట్టడించెనని కాని నిరూపింపగల సాధనాంతరము ఏదియు కానరాదు.

రెండవ ముహమ్మదు శాహుకాలమున జరిగిన బహ్మనీ, విజయనగర సంగ్రామ వృత్తాంతము అప్పటి విజయనగర శాసనములవల్లను, సంస్కృత గ్రంథములవల్లను కొంత తెలియవచ్చుచున్నది. ముజాహిదు శాహు మరణానంతరము విజయనగర పాలకుడైన రెండవ హరిహరరాయలు బహ్మనీ రాజ్యముపై రెండువైపుల ఏకకాలమున దండు పెట్టెను. క్రీ. శ. 1880 సంవత్సరమున హైవె, కొంకణ ప్రాంతముల పాలకుడైన హండవద వాగణ్ణ దండనాయకుడు నగరిరాజ్యమును జయించెను. బనవాసి ప్రాంతము నేలుచుండిన మాధవమంత్రి మహమ్మదీయబలములను ఓడించి, గోవా రేవుపట్టణమును స్వాధీనము చేసికొనెను; ఉత్తరకొంకణములను సాధించి చౌల్, దాభోల్ అను కర పట్టణములను వైవసము చేసికొనెను. ఈ దండయాత్ర సందర్భముననే మాధవమంత్రి కుమారుడైన బాచరసు ఓంధాకు దక్షిణమందుండు రంగిని (రంగాణ) యను దుర్గమును జయించి వశపరచుకొనెను. ఈ దండయాత్ర మూలమున ముహమ్మదుశాహు పశ్చిమ సముద్రతీర రాష్ట్రము నంతటిని గోలుపోయెను. కొంకణతీరమందలి రేవుపట్టణము లన్నియు నతని చేతినుండి దుసికిలి పరహస్తగతమగుటవలన పాశ్చాత్యదేశములతో జరుగుచుండిన వాణిజ్యమంతయు హిందువుల పాలబడెను.

మాధవమంత్రి కొంకణతీరమున దండయాత్ర చేయుచుండిన సమయముననే విజయనగర సేన మరియొకటి తెలంగాణాపై నడచినది. ఈ దండయాత్రకు కారణము ఎద్దియో తెలియదు. అప్పుడు తెలంగాణాను రేచెర్లవంశజులైన వెలమరాజులు పాలించుచుండిరి. మొదటి ముహమ్మదు శాహు కాలమునుండియు వారికి బహ్మనీ సుల్తానులతో మైత్రి చెల్లుచు వచ్చినది. శత్రుని మిత్రులు శత్రువు లను న్యాయమును అనుసరించి విజయనగర ప్రభువు వెలమలపై దండెత్తి చనెనేమో. వెలమరాజగు మొదటి అనపోతానాయకుడు ఆత్మ సంరక్షణార్థము ముహమ్మదు శాహుయొక్క సాయము వేడుకొనిన ట్లున్నది. అతని వేడికోలును అంగీకరించి సుల్తాను దళములను పంపెను. వారు వచ్చి ఓరుగంటికి సమీపమునందుండు కొత్తకొండ దుర్గము కడ విడిసి యుండిరి. ఇంతలో రాయరాణువ ఇమ్మడి బుక్క, గుండదండనాథ, సాళువ రామదేవాది సుప్రసిద్ధ దళనాయకుల యాధిపత్యముక్రింద తెలంగాణాను ప్రవేశించి ఓరుగంటిపై నడచెను. కొత్తకొండకడ రాయరాణువకు బహ్మనీ దళములతో పోరు సంప్రాప్తమాయెను. ఈ యుద్ధమున సాళువ రామదేవుడు వీరస్వర్గమును చూరగొనెను. యుద్ధము ఎట్లు పర్యవసాన మందెనో తెలియదు. విజయనగర సైన్యము ఓరుగంటిదాక నడవగల్గెనో, లేక కొత్తకొండనుండియే వెనుదిరిగెనో నిశ్చయముగ చెప్పుటకు వీలులేదు.

రెండవ ముహమ్మదుశాహు క్రీ. శ. 1890 లో విజయనగరముపై దండయాత్ర వెడలిన ట్లున్నది. దీనిని గూర్చి మనకు తెలియవచ్చు విషయము అత్యంత స్వల్పము. క్రీ. శ. 1890 లో వ్రాయించిన మొదటి దేవరాయల వరచూరు తామ్రపట్టికలో కానవచ్చు రెండు సూచనల ఆధారమున దీని వృత్తాంత మంతటిని ఊహించి కనుగొనవలసి యున్నది. ఒకటి ఇమ్మడి హరిహరరాయల ఆజ్ఞ చొప్పున అతని పుత్రుడైన మొదటి దేవరాయలు షడ్విధ బలములతో కూడిచేసి పోయి అలంపురమును చేరుకొనెను. రెండవది మొదటి

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



దేవరాయల పుత్రుడు, అతని పక్షమున ఉదయగిరి దుర్గమును పరిపాలించుచుండిన యువరాజ రామచంద్ర ఒడయలు తురుష్క ప్రభువును ఒక్కని నోడించి వెడలగొట్టెను. ఇందు పేర్కొనబడిన తురుష్క ప్రభువు రెండవ ముహమ్మదు శాహు అనుటకు సంశయింప బనిలేదు. ఉదయగిరి దుర్గాధీశుడైన రామచంద్ర ఒడయలచే అతడు పరాజితుడగుటవలన అతడు ఓటుపడిన యుద్ధము ఉదయగిరి రాజ్యపు పరిహద్దులలోపలనే జరిగియుండునని తలంచుట సమంజసము. అగునేని, ముహమ్మదు శాహు ఉదయగిరిపై ఎత్తి వచ్చెనని చెప్పవలసి యున్నది. ఉదయగిరి బహ్మనీ రాజ్యమునకు సుదూరమున తూర్పు సముద్ర తీరమునందుండెను. వాని యెల్లలు ఒండొంటిని తాకుచుండలేదు. వాని మధ్య వెలమ రాజ్యము కలదు. వెలమలకు విజయనగర రాయలయెడ కల వైరమును, బహ్మనీ సుల్తానులతో చెల్లుచుండిన మైత్రినిబట్టి చూడగా రెండవ ముహమ్మదు శాహు వెలమరాజు పక్షము అవలంబించి విజయనగర సామ్రాజ్యముపై దండు వెడలినట్లు తోచుచున్నది. హరిహరరాయలు దేవరాయలను పద్విధ బలములతో అలంపురమునకు కూచిచేసి పొమ్మని ఆజ్ఞాపించుట ముహమ్మదు శాహు బలములను ఎదుర్కుటకొరకే. వెలమవారికి సహాయము వచ్చిన బహ్మనీ సైన్యమును మరల్చుటయే దాని ముఖ్యోద్దేశము. కాని అది యెట్లు పర్యవసాన మందెనో తెలియదు. దేవరాయలు తన రాజ్యముపైకి వచ్చుచుండగా ముహమ్మదు శాహు వెలమ ఫౌజులతోగూడ ఉదయగిరి రాజ్యమును ప్రవేశించెను. అందువలన విశేషము లాభము చేకూడినట్లు అగపడదు. పరచూరు శాసనమున చెప్పినట్లు రామచంద్ర ఒడయలు తురుష్క ప్రభువును ఓడించుట వాస్తవమైన పక్షమున ముహమ్మదు శాహు పరాజితుడై వెనుకకు మరలెనని చెప్పవలసియున్నది.

రెండవ ముహమ్మదుశాహు సుగుణ సంపన్నుడైన భూమీశ్వరుడు. రాజ్యము తన సొంతసొత్తు కా దనియు, ప్రజల దనియు, తాను వారి పక్షమున దానిని సంరక్షింప భగవంతునిచే నియుక్తుడైన రక్షకు డనియు అతని భావము. రాజ్యమునకు అభిషిక్తుడగుటకు ముందు అతడు విలువగల చిత్రాంబరములు ధరించుటయందు ఆసక్తి గలిగి యుండినను సింహాసనము నెక్కిన పిమ్మట సామాన్యమైన తెల్లదుస్తులను తొడుగువాడు. అతని రాజ్యకాలమున ఒక గొప్ప క్షామము సంభవించినది. ప్రజలు ఆహార పదార్థములు లభింపకపోవుటవలన క్షుధార్తులై మడియజొచ్చిరి. దయార్ద్ర చిత్తుడైన ముహమ్మదు శాహు సొంత ధనమును వ్యయము చేసి పదివేల పెంతిక యెద్దులను మాళవ, గుజరాతు దేశముల కంపి అచటినుండి ధాన్యమును తెప్పించి చౌకగ ప్రజలకు అమ్మించెను. మరియు అతడు విద్యాప్రియుడు; పారశీక కవిత్వముపై అతనికి గాఢమైన అభిమానము కలదు. అప్పటి పారశీక కవులలో నెల్ల ఉత్తమోత్తముడని పేరొందిన హాఫిజు మహాశయుని తన రాజధానికి విచ్చేసి తన యాస్థానమును అలంకరింపవలయునని యాహ్వానించెను. కాని, సుల్తా నంపిన సత్కారమును కైకొని ఆ కవికుంజరుడు నిజ జన్మ దేశమును విడిచి రాజాలనందుకు చింతింపుచు అతనిపేర కొన్ని గీతములను వ్రాసి పంపెను. సుల్తాను వానిని విని ఆనందించి వేయి బంగారు టంకములను అతనికి బహుమాన మంపెను; తలి దండ్రులు లేని మహమ్మదీయ బాలురకు విద్య కరపుటకొరకు తనరాజధానియైన గుల్బర్గయందును, బీదరు, కంధారు (కంధారను), ఎలిచ్‌పూరు, దౌలతాబాదు మున్నగు పెద్ద పట్టణములందును పాఠశాలలు పెట్టించెను; కురాను బోధకులకు ఉపకారవేతనములను ఇచ్చుటకు తగు నేర్పాటులు కావించెను. విజయనగరముపై చేసిన రెండు దండయాత్రలు తప్ప యుద్ధకార్యమును అతడు మరి యెప్పుడును తలపెట్టలేదు. అతడు రాజ్యపాలన మొనర్చిన పందొమ్మిది సంవత్సరములును మొత్తము మీద ఏ క్షుద్రోపద్రవములు లేక కడచిపోయినవి. క్రి. శ. 1397 ఏప్రిలులో జ్వరపీడితుడై రెండవ ముహమ్మదు శాహు దేహము చాలించెను.

ఫీరూజ్ శాహు (క్రి.శ. 1397 — క్రి.శ. 1422): రెండవ ముహమ్మదుశాహు మరణానంతరము రాజ్యాధిపత్యము కొరకు బహ్మనీ రాజకుటుంబములో గొంతకాలము అంతఃకలహములు జరగినవి. తుదకు ముహమ్మదు శాహు సోదర పుత్రులును, అల్లుండ్రును నగు ఫీరూజ్ ఖాను, అహ్మదు ఖానులు ప్రబలులై రాజ్యాధికారమును హస్తగతము కావించుకొనిరి. వారిలో పెద్దవాడైన ఫీరూజ్ ఖాను క్రి. శ. 1397 ఫిబ్రవరి మాసములో పట్టాభిషేకము కావించుకొని, ఫీరూజ్ శాహు అను అభిషేకనామమును దాల్చి రాజ్యపాలనము చేయగడగెను.

ఫీరూజ్ శాహును బహ్మనీ చరిత్రకారు లందరు శూరు డనియు, ధీమంతు డనియు, బహుభాషాభిజ్ఞు డనియు, విద్యాధికు డనియు, గుణసంపన్ను డనియు, రసికోత్తము డనియు మిక్కిలి స్తోత్రముచేసి యున్నారు. ఈతని యేలుబడిక్రింద హిందూ, మహమ్మదీయ సంస్కృతులు సమ్మేళనము పంది నూతన రూపము పొందెనని ఆధునిక చరిత్రకారులలో కొందరు అభిప్రాయపడుచున్నారు.

ఫీరూజ్ శాహు రాజ్యపాలన మొనర్చిన ఇరువదియైదేండ్ల కాలమును చుట్టుపట్లనుండిన హిందూరాజ్యములతోడి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పోరాటములలో సరిపోయినది. ఇవి నాలుగు: ఉత్తరమున ఖర్లా, దక్షిణమున విజయనగరము, పూర్వదిశయందు వెలమ, రెడ్డిరాజ్యములు. 'కాని అందరును ఒక యెత్తు అగస్త్యుడొక యెత్తు' అన్నట్లు వైరి రాజ్యములలో నెల్ల విజయనగరమే ప్రధానమైనది. ఇతని రాజ్యకాలమున ఖేర్లాయందు నరసింగభూపతియు, విజయనగరమునందు ఇమ్మడి హరిహర, ప్రథమదేవరాయలును, వెలమరాజ్యమునందు సర్వజ్ఞసింగ, కుమారాన్నపోత, పెదవేదగిరి భూపతులును, కొండవీటియందు పెదకోమటి వేమారెడ్డియు, రాజమహేంద్రవరమందు కాటయవేమ, అల్లాడ రెడ్లును ప్రభుత్వము సల్పుచుండిరి.

సింహాసనము నధిష్ఠించిన వెంటనే ఫీరూజ్ షాహు విజయనగరముపై దండు వెడలవలసి వచ్చెను. ఇందుకు కారణము విజయనగర విజృంభణము. రెండవ మహమ్మదు షాహు మరణమునకును, ఫీరూజ్ షాహుయొక్క సింహాసనారోహణమునకును మధ్య గుల్బర్గ రాజ్యమున రాజకీయ పరిస్థితులు తారుమారై కొంత కళవళము పుట్టెనని ముందు చెప్పియున్నది. అటు పిమ్మట స్వల్పకాలమువరకు గూడ రాజ్యమున శాంతి కుదరక దేశము కలగుండు పడియుండెను. ఇదియే అనుకూల సమయమని తలచి విజయనగర రాయలు తనకుమారుడైన ఇమ్మడి బుక్కరాయలను గొప్పసైన్యముతో తెలంగాణా మీదికి దండం పెను. తెలంగాణా వెలమరాజులు యథాపూర్వము తమ మిత్రుడైన బహ్మనీ సుల్తాను నర్థించి సాయము రప్పించుకొనిరి. విజయనగర సేనలు రాచకొండ రాజ్యముయొక్క హృదయమును చీల్చుకొని, లోనికి ప్రవేశించి నలగొండ జిల్లాలోని పానుగల్లు దుర్గమును ముట్టడించి, అచ్చట కాపుండిన బహ్మనీ దళములను ఓడించి పారదోలి ఆ దుర్గమును కైవసము చేసికొనెను. తరువాత నడచిన రణమునందును తురక బలములును, వెలమ దళమును ఏకీభవించి ప్రతిఘటించినను దండయాత్రికులను ఓడించి తరుమగొట్ట లేకపోయినవి. కావున, వెలమవారు తాత్కాలికముగ సంధిచేసికొని వారిని నిజదేశమునకు సాగనంపిరి.

ఈ దండయాత్ర సాగుచుండిన సమయముననే విజయనగర సైన్య మొక్కటి రాయచూరంతర్వేది గుండ కూచి చేసిపోయి కృష్ణానది నుత్తరించి బహ్మనీ సుల్తానుల యేలుబడిక్రింద నుండిన సగర దుర్గమును ప్రవేశించినవి. ఫీరూజ్ షాహు దౌర్జన్యముచేసి బలాత్కారముగ సింహాసనము నాక్రమించుకొనెనని కినిసి సగర ప్రాంతమును పాలించుచుండిన హిందూరాజులు పెక్కండ్రు ఏకమై అతనిపై తిరుగబాటుచేసి రాయలను తమకు సహాయము రమ్మని వేడిరి. బహ్మనీ సుల్తానులకు బద్ధవైరి అగుటవలన, అతడు వారి వేడికోలును అంగీకరించి ప్రచండసైన్యమును వారలకు తోడంపెను. స్వామిద్రోహులైన ఆ హిందూ జమీందారులు శత్రువులతోగూడి సగర దుర్గమును దొమ్మిచేసి పట్టుకొనిరి. అందువలన ఫీరూజ్ షాహు మొట్టమొదట సగరదుర్గమును మరల గైకొనుటకును, తరువాత విజయనగర రాయలను శిక్షించుటకును దండువెడల వలసివచ్చెను.

ఈ దండయాత్ర చరిత్రను ఫెరిస్తా విపులముగ వర్ణించియున్నాడు. అతని కథయొక్క సారాంశ మిది: ఫీరూజ్ షాహు వెలమ దళము తనకు బాసటయై నడవ ప్రచండసైన్యముతో తరలిపోయి సగరు సమీపమున విజయనగర బలములను తారసిల్లి, యుద్ధమునందు ఓడించి పారదోలి ఆపట్టణమును దుర్గమును స్వాధీనపరచుకొనెను. అచటి నుండి రాయలపై పగ తీర్చుకొనుటకు విజయనగర సామ్రాజ్యముపై దండువెట్టు నుద్దేశముతో కృష్ణాతటమువైపు కూచిచేసి పోయెను. ఉభయ తటములను తాకి ప్రవహించుచుండినది కృష్ణ; దాటుట దుస్సాధ్యమై తోచెను; మరియు రాయ దళములు రేవులను జతనముతో కాపాడుచుండినవి. కాని, ఫీరూజ్ షాహు కొలువులోని కాజీ యొక్కడు నట్టువునివలె మారువేషము వేసికొని యేరు దాటి యచటి నర్తక, నర్తకీ జనములతో చెలిమి చేసికొని రాయల శిబిరమును ప్రవేశించెను. కరదీపికా సహస్రముల వెలుగున శిబిరాంతర్భాగము దేదీప్యమానముగ పట్టపగటివలె ప్రకాశించుచుండినది. దేవరాయల పుత్రుడు ఒడ్డోలగమున కూర్చుండి విలాసినీ జనులు చేయుచుండిన నాట్య ప్రదర్శనమును చూచుచుండెను. కాజీ నాట్య విద్యయందు ఆరితేరిన విద్వాంసుడు. ఆ రేయి తన కౌశల్య మంతయు ప్రకటితమగు తెరగున నాట్యము సేయగడగెను. సభవారి దృష్టి యంతయు అతనియందే కేంద్రీకృతమై యుండినది. అభినయము సల్పుచు తిన్నతిన్నగా రాజకుమారుని పజ్జ జేరి అకస్మాత్తుగా తన దుస్తులలో దాచి యుంచుకొనియుండిన ఖంజరును దూసి అతనిని బొడిచి చంపెను. రాయశిబిరమున హాహాకారములు రేగినవి. ఆరోదన ధ్వని విని ఫీరూజ్ షాహు కాజీ తాను పోయిన కార్యమును నెరవేర్చెనని గ్రహించి కృష్ణ నుత్తరించిపోయి రాయస్కంధావారముమీద పడెను. మృతుడైన పుత్రుని కళేబరము నెత్తుకొని దేవరాయలు విజయనగరమునకు పారిపోయెను. కోటను ప్రవేశించి గవనుల నన్నింటిని మూయించి బీగముద్రలు వేయించెను. జనరహితమైన రాయస్కంధావారమును ఫీరూజ్ షాహు నిరాటంకముగ జొచ్చి అందలి సర్వస్వమును కొల్లపెట్టెను.

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తరువాత ఫీరూజ్ శాహు విజయనగరముపై నడచి ఆ పట్టణమునకు ముట్టడి వేసెను. కాని, పట్టణమును పట్టుకొన జాలకపోయినను, పరిసర ప్రాంతములను పాడుగావించి దేవరాయలను సంధి కొడబడజేసెను. అపారధనము నిచ్చి దేవరాయలు ఫీరూజ్ శాహును సంతృప్తుని కావించి సంధిని విలిచెను. అంతట ఫీరూజ్ శాహు ఫొలాదు ఖానుడను సర్దారుని కృష్ణా తుంగభద్రల అంతర్వేదికి అధిపతిని చేసి తన రాజధానికి మరలిపోయెను.

ఇది ఫెరిస్తా వర్ణించిన యుద్ధ వృత్తాంతముయొక్క సారాంశము. ఇది అంతయు నిజమని నమ్ముటకు వీలులేదు. సందేహాస్పదములైన విషయములు ఇందు పెక్కు కలవు మొట్టమొదట పరామర్శింపదగినది ఈ దండయాత్ర కాలమున విజయనగరమును పాలించుచుండిన రాయల పేరు: దేవరాయలనికదా ఫెరిస్తా చెప్పుచున్నాడు. వాస్తవమును పరిశీలించి చూచిన అపుడు విజయనగరము నేలుచుండిన రాజు రెండవ హరిహరరాయలు కాని దేవరాయలు కాడు. తరువాత ఎనిమిదేండ్లకు గాని దేవరాయలు సింహాసనము నెక్కలేదు. అందువలన ఫెరిస్తాకు ఈదండయాత్రయప్పుడు విజయనగరమును పాలించుచుండినరాజు ఎవ్వరైనదికూడ తెలియదని తెల్లమగుచున్నదికదా! మరియు ఫెరిస్తా చెప్పునట్లు ఫీరూజ్ శాహు కృష్ణానది నుత్తరించి రాయచూరు అంతర్వేదిగుండ దండు నడపుకొనిపోయి విజయనగరము ముట్టడించెనని రుజువు చేయగల సాధనములు ఇతరమైనవి ఎవ్వియు కానరావు. ఇతర చరిత్రకారుల వ్రాతలు అతడు చెప్పు కథకు విరుద్ధముగ నున్నవి. ఫెరిస్తాకు ఒక్కింత ముందరివాడైన నిజామ్ ఉద్దీన్ అహ్మదు బక్షి యను నతడు తన తబకాత్-ఇ-అక్బరీ యందు ఫీరూజ్ శాహు కృష్ణాతటమున విడిసియుండిన విజయనగర స్కంధావారముపై బడి దోచుకొని అటుపిమ్మట వెనుదిరిగి నిజరాజధానికి పోయెనని వ్రాసి యున్నాడు. మరియు అతనికి సమకాలికుడైన సయ్యిద్ అలీ బిన్ అజీజ్ ఉల్లా తబాతబా అనునతడు తన బుర్హాన్-ఇ-మ'అసీర్ అను చరిత్రలో దేవరాయలు ఫీరూజ్ శాహుకు ఓడి అపార ధనము అర్పించుటయే కాక కప్పము గట్టుటకుగూడ నొప్పుకొని సంధి చేసికొనెనని వర్ణించి యున్నాడు. కాని, ఫీరూజ్ శాహు కృష్ణానదిని దాటి రాయచూరంతర్వేదిగుండ దండుచేసి పోయి విజయనగరమును ముట్టడించెనని చెప్పలేదు. సంధియైనపిమ్మట రాయచూరంతర్వేదికి ఫొలాదు ఖానును అధికారిగ నియమించి పోయినట్లు ఫెరిస్తా చెప్పియున్నాడు. ఇదియు సందేహాస్పదమే. ముజాహిదు శాహు మరణానంతరము రాయచూరంతర్వేది బహ్మనీ సుల్తానుల అధికారమునకు లోబడి యుండెనని నిరూపింపగల సాక్ష్యము విశ్వాసపాత్రమైనది ఏదియు లబ్ధము కాలేదు. అన్య చరిత్రకారులు ఈ యంశమును గూర్చి మౌన ముద్రను ధరించి యున్నారు. కావున ఫీరూజ్ శాహు యొక్క ప్రథమ విజయనగర దండయాత్రయందు సంభవించిన విశేషములు ఇట్టివని విస్పష్టముగ వివరించుటకు వీలు కాదు. కాని అతనికి జయము చేకూడెననియు, విజయనగర రాష్ట్రమున కొంత భాగమును అతడు కొల్లగొట్టెననియు దృఢముగ పలుకవచ్చును.

విజయనగర దండయాత్రను కొనసాగించి మరలి వచ్చిన పిమ్మట ఫీరూజ్ శాహు ఖేర్లా ప్రభువైన నరసింగరాజుపై దండు వెడలెను. నరసింగరాజు గొప్పయోధుడు; మాహూరు పాలకుడును, గోండ్వానా అధిపతియు అతనికి మిత్రులు. వారి సహాయమును నమ్మి అతడు సుల్తానుకు మారొడ్డెను. ఫీరూజ్ శాహు మాహూరుచెంత చేరగానే ఆ దుర్గాధిపతి భయవిహ్వలచిత్తుడై యుద్ధ ప్రయత్నములు మానుకొని శరణాగతుడై కప్పము కట్టుటకు ఒప్పుకొని సంధిచేసికొనెను. కావున గోండ్వానా అధిపతి సమయమునకు సహాయ మంపజాలక పోయెను. ఇట్లు మిత్రబలము లేకపోయినను నరసింగరాజు ధైర్యమును గోలుపోక బహ్మనీ దళములను దర్పముతో ఎదిర్చి హోరాహోరిగ పోరి పేరెక్కిన మహమ్మదీయ వీరులను పెక్కండ్రను హతమార్చెను. కాని జయలక్ష్మి అతనిని వరింపలేదు; సుల్తానునే చేపట్టినది. కావున, అతడు విస్తారము ధనమును, నలువది గంధగజములను, రూపయౌవనసంపన్నయగు పుత్రికను సమర్పించి సంధి చేసికొనవలసి వచ్చెను. ఫీరూజ్ శాహు ఖేర్లా దండయాత్రను ఇట్లు విజయవంతముగ పూర్తిచేసికొని మరల రాజధానికి వచ్చిచేరెను.

ఇట్లుండగా ఉత్తర హిందూస్థానమున గొప్పరాజకీయ విప్లవము సంభవించినది. క్రీ. శ. 1398లో మొగలాయి చక్రవర్తియైన తైమూర్ లంగ్ ప్రచండ సైన్యముతో హిందూస్థానముపై నెత్తివచ్చి ఢిల్లీ పట్టణమును దోచుకొని క్షీణదశయం దుండిన తుఘ్లుకు సామ్రాజ్యమును జీవచ్ఛవమును గావించెను. తుఘ్లుకు చక్రవర్తులపై తిరుగబాటు చేసి స్వతంత్రులైన రాజు లెల్లరును తమ మనికికి ఎక్కడ భంగము కలుగునోయని శంకించి తల్లడమంద జొచ్చిరి. ఫీరూజ్ శాహు సమయవేది. తైమూరు ఆగమనమును తన అభ్యుదయమునకు కారణభూతము కావించుకొన నిశ్చయించి ఢిల్లీపురమున అతని సన్నిధికి రాయబారము పంపెను. తైమూరు మిక్కిలియు ముదమంది ఫీరూజ్ శాహుకు దక్కను రాజ్యాధిపత్యమును స్థిరపరచుటయే



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కాక మాళవ, గుజరాతు దేశములపై ప్రభుత్వమునుకూడ అతనికి ప్రసాదించెను. తైమూరు యొక్క అనుగ్రహము వలన ఫీరూజ్ శాహుకు కలిగిన లాభ మేమియు లేకపోయి నను గుజరాతు, మాళవ, ఖాందేశ సుల్తానులతో వైరము మాత్రము పొడమినది.

క్రీ. శ. 1406వ సంవత్సరమున ఫీరూజ్ శాహు మరల విజయనగరముపై దండు వెడలెను. ఈ దండయాత్రకు ముఖ్యకారణ మొక పడుచు. చరిత్రకారు లీ వృత్తాంత మును పరిపరిగ వర్ణించినారు. కలము మార్పుతో ఆమె కులమును, కథయు మారుచువచ్చినవి. మొదట అది రూపా జీవ; తరువాత అగసాలె కన్యగా పరిణామమందినది. మొదట ఆమెను రంగమున కెక్కించిన చరిత్రకారుడు నిజామ్ ఉద్దీన్ అహ్మద్ బక్షి తన తబకాత్-ఇ-అక్బ రీలో ఆమె నిట్లు ప్రవేశపెట్టినాడు. ముధోలు ప్రాంతమున సౌందర్యవతియైన వేశ్యాంగన ఒక్కతె నివసించుచుండినది. దానిపై విజయనగర దేవరాయలు మరులుగొని దానిని బట్టి తెచ్చుటకు ఫౌజు నంపెను. ముధోలు బహ్మనీ రాజ్య మునకు చెందిన సీమ అగుటవలన దేవరాయలు తన రాజ్యములోనికి దం డంపినందుకు కోపించి ఫీరూజ్ శాహు అతనిని శిక్షించుటకొరకు గొప్ప దండును వెంటగొని విజయ నగరముపై నెత్తి చనెను. కథారచనయందు దంటయైన ఫెరిస్తా భోగకాంతను అగసాలెకన్యకగ మార్చినాడు. దానికి విజయనగరరాయలపై అకారణమైన వైరమును, ఫీరూజ్ శాహుమీద అపూర్వస్నేహమును కల్పించినాడు; కథను పెంచి శాఖోపశాఖలు నిర్మించి హృదయంగమముగ వాచకుల హృదయ సీమలను స్థిరముగ నాటుకొనునట్లు వర్ణించినాడు. అగసాలె కన్యక యుదంతముతోపాటు ఫెరిస్తా మరియొక యుద్ధకారణముకూడ వివరించినాడు. తైమూరు మాళవ, గుజరాతు దేశములకు ఫీరూజ్ శాహును పాలకునిగ నియమించెనుగదా! తత్కారణమున ఆ రెండు దేశముల సుల్తానులును ఫీరూజ్‌పై నీర్ష్య వహించి యతనికి పగవాడైన దేవరాయలతో చెలిమి పాటించిరట. వారి అండ కలిగెనని గర్వించి దేవరాయలు ఫీరూజ్ శాహును ల[illegible] పెట్టక పూర్వము చేసికొనియుండిన ఒడంబడిక ప్రకా రము కప్పమును చెల్లింపక నాలుగేండ్ల కాలము నిరాక రించెనట. అతనిని శిక్షించుటకై ఫీరూజ్ శాహు దండు చేసెనట. కాని బుర్హాన్-ఇ-మ'అసీరు రచయితయైన సయ్యిద్ అలీ బిన్ అజీజ్ ఉల్లా తబాతబా పై రెండు కారణములను ఎరుగడు. విజయనగర వాస్తవ్యులైన కాఫిరులపై జిహాద్ సేయుటయే ఫీరూజ్ శాహుయొక్క యేకైకోద్దేశమైయునట్లు అతడు తెల్పియున్నాడు. ఇట్లు కొంచెమించుమించు సమకాలికు లనదగిన చరిత్రకారులు మువ్వురును యుద్ధకారణమును చెరియొక విధముగ తెల్పి యుండుటవలన దానియొక్క వాస్తవకారణమును నిశ్చ యించి కనుగొనుట దుస్సాధ్యముగ నున్నది.

యుద్ధవృత్తాంతము నైనను ఫెరిస్తా మున్నగు చరిత్ర కారులు సమగ్రముగ వర్ణించి యుండలేదు. అన్య సహా యము లేక స్వబలముచేతనే ఫీరూజ్ శాహు ప్రబలుడైన విజయనగరాధిపుని డీకొని అతనిని దిశాపట్టుని కావించి జయము చేకొనెనని ప్రకటించుటయే వారి ముఖ్యోద్దే శము. కావున యుద్ధరంగమును కృష్ణా తుంగభద్రల మధ్య దేశమునకు సంకుచిత పరచిరి. ఫీరూజ్ శాహుకు ఖడ్గసహాయమై అతనికి విజయమును ఒడగూర్చిన మిత్ర రాజవర్గమును పేర్కొనరు. దండయాత్ర నడచినది ఒక కృష్ణా తుంగభద్రల మధ్యదేశము నందు మాత్రమే కాదు కొంచెమించు మించుగ ఆంధ్రదేశ మంతయు సమరాంగణ మని చెప్పవచ్చును. తెలంగాణా తీరదేశములకు సయితము అది వ్యాప్తమై ఎల్లయెడలను అత్యంత ప్రజా సంక్షోభ మునకు కారణభూతమైనది. రాయలు బలాధికు డనియు, మిత్రసాహాయ్యము లేక అతనితో పోరి జయించుట దుర్ఘట మనియు ఫీరూజ్ శాహు చక్కగ నెరుగును. కావున, అతడు రాయలకు ప్రతిపక్షులనెల్ల కూడదీసి బలముకట్టి యుద్ధ మునకు దిగెను. ఫీరూజ్ శాహుతోగూడి రాయలపై కయ్యముసేయ దొరకొనినవారిలో రాచకొండ, దేవర కొండలను పాలుచుండిన రేచెర్ల వంశజులైన వెలమరాజు లును, కొండవీటి పాలకుడైన పెదకోమటి వేమారెడ్డియు, వేంగిరాజ్యమునకు వారసుడైన అన్నదేవచోడుడును ప్రముఖులు. వీ రందరకును రాయలయెడ ద్వేషము కలదు. ఈ ద్వేషకారణమును సంగ్రహముగనైన ఇచట సూచిం చుట యుక్తము.

తమకు ప్రత్యర్థియైన సావయనాయకునికి తోడ్పడుట వలన రేచెర్లవారికి రాయలపై ఆదియందు వైరము పొడ మినది. ఈప్సితార్థసిద్ధికై రాయలకు సహజ శత్రువులైన బహ్మనీ సుల్తానులతో సఖ్యముచేయుట వలన అది అభివృద్ధి యైనది; రాయల దండయాత్రలవల్ల ప్రజ్వరిల్లినది. పెద కోమటి వేమారెడ్డికి రాజమహేంద్రవర రాజ్యాధిపతియైన కాటయవేమారెడ్డి ప్రతిద్వంద్వి. కాటయవేముని వధ్యు ని గావించి రెడ్డిరాజ్యమున కంతటికి తానే యధిపతిని కానలయునని పెదకోమటి వేమారెడ్డి యాశయము. కాని, కాటయవేమునికి విజయనగరరాయలు సహాయు డగుటవలన అతని కోరిక నెరవేరుట దుస్సాధ్యమాయెను. మరియు, విజయనగరమువారు కొండవీటి రాజ్యమును

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కబళింప నుద్యుక్తులై క్రమక్రమముగ పైకొని వచ్చు చుండిరి. కావున, రాయలపై నీర్ష్య వహించి అతనిపై కసి తీర్చుకొనుటకును, అఖిలషితార్థమును సాధించుట కొరకును అతడు సుల్తాను సాయమును కోరెను. అన్నదేవ చోడుడు వేంగీశ్వరుడైన చోళ భక్తిరాజునకు పుత్రుడు; తండ్రి మరణానంతరము కొండవీటిరెడ్డి రాజులచేత స్థాన భ్రష్టుడైనవాడు. ఈ కారణమువలన పై పేర్కొనినవారందరు ఫీరూజ్ శాహును గూడి విజయనగరరాయలతో యుద్ధముచేయ బూనుకొనిరి.

ఫీరూజ్ శాహు యుద్ధ విధానమును నేర్పుతో తీర్చెను. తమ బలములను రెండు పాయలుగ విడదీసి విజయనగర సామ్రాజ్యముపై ఏక కాలమున రెండు వైపులనుండి కవియ సమకట్టెను. స్వబలముతోకూడ తాను గుల్బర్గ నుండి బయలు వెడలి కృష్ణా తుంగభద్రల మధ్య దేశముపై దండు చేయునట్లును, ఆ సమయముననే తన పంపులతోకూడ మిత్రులైన వెలమ, రెడ్డిరాజులు ఉదయగిరి రాజ్యముపై ఎత్తిపోవునట్లును ఏర్పాటు గావించెను. కృష్ణా తుంగభద్రల మధ్య జరగిన యుద్ధ వృత్తాంతమును మహమ్మదీయ చరిత్రకారులు చక్కగ వర్ణించి యున్నారు. తక్కిన చరిత్రకారులకంటె ఫెరిష్తా విపులతరముగ వర్ణించి యున్నాడు. అతని కథయొక్క సారాంశ మిది: ఫీరూజ్ శాహు దండు నడపుకొనిపోయి విజయనగరము కడ విడిసి ఆ కోటను దొమ్మి చేసి లగ్గలు పట్ట ప్రయత్నము చేసెను. కాని అతని ప్రయత్నము నెరవేరదాయెను. పరాజయము కలిగెను. అయినను అతడు దండయాత్రను మానుకొనలేదు. పట్టణ పరిసరములను వెలవీడు చేసికొని ఆ చుట్టుప్రక్కల చూరగొనుచు, పట్టణ గ్రామాది జనావాసములను తగులబెట్టుచు, దేవాలయములను పాడుచేయుచు ప్రజలను పరిపరివిధముల బాధింప గడగెను. మహమ్మదీయులు పెట్టు హింసకు తాళుకొనలేక దేవరాయలు ఫీరూజ్ శాహు యొక్క స్కంధావారమునకు రాయబారుల నంపి విస్తారము ధనము నిచ్చుటకును, తన కూతునిచ్చి అతని కుద్వాహము సేయుటకును ఒప్పుకొని సంధి చేసికొనెను. ఆ యొడంబడిక ప్రకారము దేవరాయలు కూతును సుల్తానున కిచ్చి మహా వైభవముతో పెండ్లి చేసి బంకాపుర దుర్గము వరణ మిచ్చెను. అంతట ఫీరూజ్ శాహు మరలి రాజధానికి వచ్చి చేరెను.

కొంచె మించుమించుగ నిజామ్ ఉద్దీన్ అహ్మదు చెప్పు కథకూడ నిట్టిదే. కాని వా రిద్దరకును ఒక ముఖ్య భేదము కలదు. రాయల కూతురి వివాహ ప్రస్తావము అతని చరిత్రలో లేదు. రాయలు తనకు కూతు నిచ్చి పెండ్లి చేయవలయునని సుల్తాను కోరినట్లుకాని, ఆ కోరిక చొప్పున రాయలు తన కుమార్తెను సుల్తానున కిచ్చి వివాహము కావించినట్లుకాని అతడు చెప్పలేదు. ఇక బుర్హాన్-ఇ-మ' ఆసిర్ రచయితయైన సయ్యిదు అలీ వర్ణించిన యుద్ధ వృత్తాంత మన్ననో దాని తీరే వేరు. ఫీరూజ్ శాహు విజయనగర ప్రాంతమునకు వచ్చినట్లుకూడ అతడు చెప్పలేదు. కృష్ణానదిని దాటినంతటనె సుల్తాను విజయనగర రాష్ట్రమును కొల్లగొట్టనారంభించెను; గ్రామాది జన నివాస స్థానములను తగులబెట్టించెను. ధమారు, ముసలి కల్లు ప్రాంతములకు చెందిన సీమలను కొన్నింటిని శాహు పరాక్రమముచే సాధించి ఆక్రమించుకొనెను. అంతట ఫీరూజ్ శాహు చూరగొన్న ధనాదికమును ఎత్తికొని మరలి రాజధానికి వచ్చి చేరెను.

పైని పేర్కొనిన చరిత్రకారులు ముప్పురును వర్ణించిన యుద్ధ వృత్తాంతముల నొండొంటితో పోల్చి చూడగా రెండు విషయములందు తప్ప వానికి ఏకీభావ మెందును లేదని తెల్లమగుచున్నది. యుద్ధకారణముల విషయమై కాని, యుద్ధమునందు జరగిన విశేషాంశములయెడగాని, సంధి షరతులలోగాని వారికి పొందిక కుదురదు. కావున ఆ వృత్తాంతము లెంతవరకు సత్యాత్మకములో సిద్ధారించి చెప్పుటకు వీలుపడదు. కాని ఫీరూజ్ శాహు విజయనగర సామ్రాజ్యముపై దండెత్తెననియు, కొంత రాష్ట్రమును కొల్లగొట్టి ప్రజలను హింసించి కొల్లద్రవ్యముతో గూడ రాజధానికి మరలి వచ్చె ననియు నందరు చరిత్రకారులును ఏకగ్రీవముగ చెప్పుచుండుటవలన అంతమట్టుకును వాస్తవమని యంగీకరింపవచ్చును.

ఇక ఆంధ్రదేశమునందు యుద్ధ మెట్లు సాగెనో విచారింప వలసియున్నది. ఫీరూజ్ శాహు సహాయ మంపిన ఫౌజులతో కూడ వెలమ, రెడ్డి దళములు బయలువెడలి ఉదయగిరి రాజ్యముపై నడచి ములికినాడు ప్రవేశించినవి; బండి కనుమయొద్ద రాయరాణువ వారి మార్గమును అరికట్టగా ఉభయ పక్షములవారికిని అచట ఘోరమైన యుద్ధము నడచెను. దేవరకొండ ప్రభువగు పెదవేదగిరి నాయని పుత్రుడైన రామచంద్రనాయడు పరపక్షులతో హోరాహోరిగ పోరి వారిని చెల్లాచెదరు కావించి, కనుమమార్గమును నిర్నిరోధము చేసి ఫీరూజ్ శాహు మన్ననకు పాత్రుడాయెను. తరువాత రిగిషులు రాచవీటి కోటను ముట్టడించి వశపరచుకొనిరి. సుల్తాను బలములను అండచేసికొని రెడ్లు విజృంభించి చంద్రగిరి రాజ్యాంతర్గతములైన పొత్తపి, పులుగుల నాడులను రెంటిని జయించి ఆక్రమించుకొనిరి. ఈ రెండు నాడులను క్రి.శ. 1406 మొదలు క్రి.శ. 1418.14



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వరకును ఎనిమిదేండ్ల కాలము వారి యేలుబడిక్రింద నుండినవి. పొత్తపి, పులుగుల నాడులను రెడ్లాక్రమించిన పిమ్మట ఏమి జరగెనో, చివరకు ఈ దండయాత్ర ఎట్లు పరిసమాప్తి నందెనో తెలియదు. కాని, సుల్తాను పక్షమునకే సర్వత్ర విజయము చేకూరినట్లు అగపడదు; ఏలనగా, వెలమ రాజ్యమునకు బొడ్డనదగిన పానుగల్లు దుర్గము ఈ సంగ్రామము ముగిసిన పిమ్మటకూడ రాయల స్వాధీనమందే ఉండినది. దీనినిబట్టి చూడగా సుల్తాను ప్రాపు గలిగినను వెలమరాజులు రాయలను ఆ దుర్గమునుండి వెడలింపజాలకైరని తోచుచున్నది. రాయలకు సుల్తానుతో సంధి కుదిరిన వెంటనే అతడు తన పంపులను సమ్ముఖమునకు పిలిపించుకొని యుండవచ్చును. తరువాత మిత్ర బల సాహాయ్యము లేక, తా మొక్కరే రాయలమీద యుద్ధము నడపు శక్తి లేక వెలమవారును ఆ కోటను సాధించు నుద్యోగమును మానుకొని యుండవచ్చును.

తరువాత కొన్నియేండ్లదాక యుద్ధప్రసక్తి లేక ఫీరూజు శాహు రాజ్యమును శాంతముగ పరిపాలించినట్లున్నది; కాని క్రీ. శ. 1415 ప్రాంతమున అతడు మరల కత్తిని చేపట్టి పూర్వదేశముపై దండువెడలవలసి వచ్చెను. దానికి ముఖ్యకారణము వేంగీదేశ రాజకీయ వాతావరణమున పుట్టిన సంక్షోభము. వేంగీపాలకుడైన అన్నదేవ చోడుడు రెడ్లచే పదచ్యుతుడై వారికి సహజశత్రువులైన రాచకొండ, దేవరకొండ వెలమరాజులగు సర్వజ్ఞ సింగమ, పెదవేదగిరి నాయకులను ఆశ్రయించి వారిమూలమున ఫీరూజ్ శాహుతో మైత్రి నెరపి అతని యనుగ్రహమునకు పాత్రుడాయెను. క్రీ. శ. 1403లో కుమారగిరిరెడ్డి మరణానంతరము పెదకోమటివేమ, కాటయవేముల పరస్పర వైమనస్యకారణమున రెడ్డిరాజ్యమున కలిగిన కళవళమును సందర్భపరచుకొని ఫీరూజ్ శాహు ముదలను వెలమ రాజులు అన్నదేవచోడుని తోడ్కొని వేంగిపై దండువెట్టి, అతనిని ఎట్లో అచట సుప్రతిష్ఠితుని కావించిరి. కాని, రాజమహేంద్రవర రాజ్యాధిపతియైన కాటయవేమారెడ్డి విజయనగరప్రభువైన మొదటి దేవరాయల నర్థించి ప్రబల సైన్య సహాయమును పడసి అన్నదేవుని తరుమగొట్టుటకు ప్రయత్నము సేయదొడగెను. ఆశ్రితుడైన అన్నదేవుని సంరక్షించుటకు సుల్తాను దండును కదల్చుకొని వేంగీదేశమునకు రావలసివచ్చెను. ఇట్లు విజయనగర, బహ్మనీ సైన్యములు మరల గోదావరీతీరమున నొండొంటిని తారసిల్లినవి. సుల్తాను తెలంగాణాను జయించుటకు బయలువెడలి రాజమహేంద్రవర పర్యంతముగల రాష్ట్రమును, దుర్గములను సాధించి వానిని తన యధికారులకు ఒప్పజెప్పి మరల రాజధానికి తిరిగివచ్చినట్లు సయ్యిద్ అలీ తబా తబా బుర్హాన్-ఇ-మ' ఆసీరులో వ్రాసియున్నాడు. యుద్ధకార్యము విజయవంతముగ కొనసాగుటవలన సుల్తాను రాజమహేంద్రవరమునుండి వెనుదిరిగి పోలేదు. అతడు మరలిపోవుటకు ముఖ్య కారణములు రెండు కలవు: తెలంగాణా వెలమ, కొండవీటి రెడ్డిరాజ్యముల సందుకట్టునందు ఆయువుపట్టు స్థానమైన పానుగల్లు దుర్గము ఇమ్మడి హరిహర రాయల కాలమునుండియు రాయల యధీనమందు ఉండి యుండుట వలన దేవరాయలకు రాజమహేంద్రవర రెడ్డి రాజులకు బలసహాయ మంపుట కరమనుకూలముగ నుండెను. కావున రాజమహేంద్రవర రాజ్యమున మిత్రుడైన అన్నదేవచోళుని నిలబెట్టి తన యాధిపత్యమును స్థిరపరచుకొనవలయు ననిన ఫీరూజ్ శాహునకు పానుగల్లు దుర్గమును స్వాధీనము చేసికొని విజయనగర దళములకు పూర్వదేశమును చొచ్చుటకు అవకాశము కలుగకుండజేయుట అత్యంతావశ్యకముగ గన్పించెను; మరియు వెలమరాజులతో మైత్రి అవిచ్ఛిన్నముగ సాగుచుండినంతకాలమును సుల్తానునకు పానుగల్లు దుర్గము యొక్క విలువ స్పష్టముగ తెలియరాదాయెను. ఏకారణమువల్లనో ఈ దండయాత్ర సందర్భమున వారికి సుల్తానుపై ద్వేషము జనించెను. దాని కీ తెరిగి దేవరాయలు వెలమరాజులతో సఖ్యముచేసికొని రాజమహేంద్రవర ప్రాంతమునుండి సుల్తానుయొక్క పశ్చాత్‌గమనమార్గమును అరికట్టెను. అటుమీదట సుల్తాను పూర్వదేశమున దండు సేయుట విపత్కరమని గ్రహించి, హుటాహుటి దండు మరల్చుకొని పానుగల్లుదుర్గమునకు వచ్చి ముట్టడివేసెను. ముట్టడి క్రీ. శ. 1417 మొదలు 1419 వరకును రెండేండ్ల కాలము సాగినను కోట సుల్తానుకు స్వాధీనపడలేదు. ఈ రెండేండ్లలోపల సుల్తానుసైన్యము చాలకష్టము లనుభవింపవలసి వచ్చెను. అడుగడుగునకును హిందువులు పైగవయు చుండిరి. అన్నపానీయాదిపదార్థములు దుర్లభమాయెను. స్కంధావారమున దైనందిన జీవనము దుస్సహమాయెను; ఇది యిట్లుండ గోరుచుట్టుపై రోకటిపోటు పడినట్లు శిబిరమునందు మారి మసగెను; భీతచిత్తులైన సుల్తాను సైనికులును, సర్దారులును పెక్కండ్రు పరారి చిత్తగించిరి. ఆ సమయము కనిపెట్టి దేవరాయలు దళములను కూర్చుకొని పానుగల్లు ముట్టడిని లేవదీయుటకు వచ్చిన సుల్తాను ఫౌజులను కదిసెను. ఉభయపక్షములకును సంకుల సమరము సంప్రాప్తమాయెను. హిందువులు పట్టుదలతో పోరాడినందున సుల్తాను బలము వారితో సరిపోరజాలక పటాపంచలై పారిపోయెను. ఫీరూజ్ శాహు గాయపడి ఎట్లో



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ప్రాణము దక్కించుకొని పలాయన మొనర్చెను. హిందువులు విజయోన్మత్తులై ఖండిత మహమ్మదీయ వీర శిరములను ప్రోవుచేసి గుట్టవేసిరి; తరువాత, సుల్తాను రాజ్యముపై బడి పట్టణములను గ్రామములను కొల్లగొట్టి పరశురామ ప్రీతి గావించిరి. అసంఖ్యాక ప్రజలను బొరిగొనుటయేకాక మసీదులను నాశనము గావించి మహమ్మదీయులపై పగదీర్చుకొనిరి.

విజయనగర బలములధాటికి తాళజాలక ఫీరూజ్ శాహు గుజరాతు సుల్తానును తనకు సాయము రమ్మని వేడుము రాయబారము పంపెను; కాని వెలుపటి సహాయము లేకయే ఫీరూజ్ శాహు యొక్క తమ్ముడు అహ్మదు ఖాను ఖాన్ ఇ ఖానాను కడు ప్రయాసముమీద విజయనగరదళములను బహ్మనీరాష్ట్రమునుండి పారద్రోలి దేశమును మరల బందోబస్తుగావించెను. కాని అహ్మదు ఖాను తోడ్పాటు ఫీరూజ్‌కు కొరవితో తలగోకికొన్నట్లాయెను. మొట్టమొదట అహ్మదు ఖానుడు అన్నయెడ సౌభ్రాత్రము గలిగి కార్యఖడ్గములందు అతనికి దక్షిణహస్తమువలె వర్తించినను క్రమక్రమముగ అతని హృదయమందు రాజ్యకాంక్ష అంకురింప నతడు అంతరంగమున రాజద్రోహమును తలపెట్టెను; ఢిల్లీనుండి సయ్యిద్ మహమ్మద్ గీజూ దరాజ్ అను మహనీయుడు గుల్బర్గకు వచ్చి అచ్చట ఆశ్రమము ఏర్పరచుకొన్న పిమ్మట ఆ యన్నదమ్ముల వైషమ్యము అభివృద్ధిచెందెను. విద్యాగర్వితుడైన ఫీరూజ్ శాహు ఆ ఋషిసత్తముని తిరస్కరించుటవలన అతని కోపమునకు గురియాయెను. అహ్మదు ఖాను అతనిని భక్తి శ్రద్ధలతో సేవించి అతని యనుగ్రహమును పొందెను. క్రీ. శ. 1415-16లో ఫీరూజ్ శాహు తన కుమారుడైన హసను ఖానుని యౌవరాజ్యాధిపతిని గావించి అతని శ్రేయోభివృద్ధికొరకు భగవంతుని ప్రార్థించి అతని నాశీర్వదింపవలయునని కోరుచు అతనిని గీజూ దరాజ్ కడకు పంపెను. ఆ ఋషివర్యుడు సుల్తానుపై ఈర్ష్య వహించి యుండుటచేత హసను ఖాను విషయమై అతడు ప్రార్థింపకపోవుటయేకాక భగవంతునిచే అహ్మదు ఖానుడు రాజ్యపదమునకు నియమింపబడి యున్నాడని వాక్రుచ్చెను. అది మొదలు ఆ యన్నదమ్ములకు ఒండొరులపై ద్వేషము అధికమగుచు వచ్చెను. సుల్తానుకు హితులు, ముఖ్యమంత్రులునైన ఐన్ ఉల్ ముల్క్, నిజామ్ ఉల్ ముల్క్ అనువారలు అహ్మదు ఖానుని చంపించుట శ్రేయస్కరమని హితము చెప్పిరి. ఫీరూజ్ అందులకియ్యకొనక అతని కన్నులను పీకివేయుడని ఆజ్ఞాపించెను; ఆ రహస్యమును అహ్మదు ఖానుకు అంతరంగికులు తెల్పగా అతడు గీజూ దరాజ్ యొక్క ఆశ్రమమునకు పారుతెంచి ఆ మహనీయుని శరణువేడెను. సుల్తాను అహ్మదు ఖానుని బట్టి తెచ్చుటకు ఐన్ ఉల్ ముల్క్, నిజామ్ ఉల్ ముల్క్ అను కొంత ఫౌజుతో పంపెను, కాని వారలు అహ్మదు ఖానుచే పరాజితులైరి. కావున ఫీరూజ్ శాహు తమ్ముని తప్పును క్షమించి అతడు పట్టణము ప్రవేశించి యథేచ్ఛగ ప్రవర్తించుట కొప్పుకొనవలసినవా డాయెను. వారి పరస్పర సంబంధములు ఇట్లుండ ఫీరూజ్‌నకు పానుగంటికడ ఘన పరాజయము కల్గుటయే కాక, రాజ్యరక్షణమాట అటుండనిచ్చి, ఆత్మసంరక్షణమునకు సయితము బలము లేకపోయినది. సింహాసనమును ఆక్రమించుకొనుటకు అహ్మదు ఖానుడు విజృంభించునని యాతడెరుగును. అతని యత్నమును సాగనీయక భగ్నము సేయుటకొరకే ఫీరూజ్ శాహు గుజరాతు సుల్తానుయొక్క సహాయమును అర్థించినది. ఆ సహాయము రాకమునుపే అహ్మదు ఖానుడు విజయనగర దండయాత్రికులను పారదోలి పట్టణమును ప్రవేశించెను. ఫీరూజ్ శాహు అప్పటికి వ్యాధిగ్రస్తుడై మరణదశయందు ఉండెననియు, తన యనంతరము అతనిని రాజ్యాధిపతిగ నియమించి అసువులను విడిచె ననియు గొందరు చరిత్రకారులు చెప్పుదురు. మరికొందరు అహ్మదు ఖానుడు అతనిని నిర్బంధమునం దుంచి విషప్రయోగము చేసి చంపించి సింహాసనమును ఆక్రమించుకొనెనని వచింతురు. ఇందు ఏది సత్యమో?

**అహ్మదు శాహు** (క్రీ. శ. 1422 — క్రీ. శ. 1435): ఫీరూజ్ శాహు మృతినొందిన పిమ్మట అహ్మదు ఖానుడు సింహాసము నధిష్ఠించి అహ్మదు శాహు అను పేరు వహించి రాజ్యముచేయగడగెను. రాజ్యారంభదశయందు అతనిని అన్ని వైపులను శత్రువులు చుట్టుకొనియుండి నందున స్వరాజ్యసంరక్షణకొరకు అతడు పెక్కండ్రతో పోరవలసి వచ్చెను. ఉత్తరముననుండి గుజరాతు సుల్తాను అహ్మదు శాహు ఫీరూజ్ శాహు కోరిన మేరకు సహాయ మంపు వ్యాజమున దండెత్తి వచ్చుటకు ప్రయత్నము చేయుచుండెను. ఈశాన్య దిగ్భాగమున గాండ్వాన పాలకులు స్వతంత్రులై అతని యాధిపత్యమును అంగీకరింపక ధిక్కరించిరి. తూర్పున తెలంగాణా వెలమరాజులు కులక్రమాగతమైన మైత్రిని మరచి అతనికి సహజశత్రువైన విజయనగరాధిపతితో ఏకీభవించి కయ్యమునకు కాలు దువ్వుచుండిరి. దక్షిణమున విజయనగర ప్రభువుయొక్క దుండగములు దుస్సహములై యుద్ధమునకు ఉత్తలపెట్టుచుండెను. వీరి నందరిని నిగ్రహించి తన యధికారమును నిలబెట్టుకొనుట అవశ్యకమగుట వలన గద్దె యెక్కిన వెంటనే అహ్మదు శాహు కత్తిని దూయవలసి వచ్చెను.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అందరికంటె ముందు విజయనగరాధీశ్వరుని యాటోపమును స్తంభింపచేయుట అవశ్యకమని తోచెను. కావున, అహ్మదు శాహు తన రాజ్యాభిషేకమునకు పిమ్మట వచ్చిన మొదటి నౌరోజునాడు విజయనగరముపై యుద్ధము ప్రకటించి దండు వెడలెను. ఈ దండయాత్రయందు నడచిన వాస్తవ వృత్తాంత మేదియో నిశ్చయించి చెప్పుటకు వలను పడదు. దీని వివరములను చరిత్రకారులు పలు విధములుగ వర్ణించియున్నారు. నిజామ్ ఉద్దీన్ అహ్మదు, సయ్యిద్ అలీ తబా తబాలు అహ్మదుశాహు విజయనగరముపై దండెత్తి దేశమును కొల్లగొట్టి శారినమరెనని పైదండయాత్ర చరిత్రను ముక్తసరిగ మూడు మాటలతో ముగించినారు. దేవరాయలు పరాజితుడై సుల్తానుకు లోబడి సంధిచేసికొనెనని నిజామ్ ఉద్దీన్ వ్రాకుచ్చి యున్నను సయ్యిద్ అలీ సంధి మాటయే యెత్తలేదు. ఫెరిస్తా మాత్రము దండయాత్ర యందలి సంభవములను విపులముగ వర్ణించి యున్నాడు. గుజరాతుదేశపు సుల్తానగు అహ్మదు శాహు దేవరాయలకు బాసటయై రావచ్చునని యెంచి అహ్మదు శాహు బహ్మనీ తన రాజ్యపు టుత్తరపు సరిహద్దును సంరక్షించుటకొరకొక సైన్యమును కాపుంచి తక్కిన దండుతో కదలి తుంగభద్రాతీరమునకు వచ్చి చేరెను. అంతట దేవరాయలు దళములను గూర్చుకొని మిత్రుడైన తెలంగాణా అధీశ్వరుని సహాయుని చేసికొని వచ్చి తుంగభద్ర దక్షిణతటమున విడిసెను. కొన్ని దినముల పర్యంతము వారు నదిని దాటి వత్తురని వీరును, వీరు దాటి వత్తురని వారును నిరీక్షించుచు తమ తమ పాళెములందే మసలియుండిరి. తెలంగాణా ప్రభువు రాయలను దిగనాడి బలములతో తనదేశమునకు బయలు వెడలి పోయెను. అంతట అహ్మదు శాహు బలములతో నది దాటి పోయి విజయనగర శిబిరముపై బడి రాయ రాణువను చెల్లాచెదరుచేసి, అచట సేకరింపబడి యుండిన సకల పదార్థములను చూరగొనెను. అంతట దేవరాయలు అచటినుండి పారిపోయి విజయనగరమును ప్రవేశించి కోటదర్వాజాలను మూసికొనెను. అహ్మదుశాహు అతనిని వెన్నంటి తరుముచు పోయి కోటను ముట్టడించెను. పట్టణము స్వాధీనము పడలేదు ; అంతట తత్పరిసర ప్రాంతములను కొల్లగొట్టి దేవస్థానములను పాడుచేసి ప్రజలను బహువిధముల హింససేయ గడగెను. దేవరాయలు ప్రజలపై కనికరించి రాయబారులను అహ్మదు శాహు కడ కంపి, నిలువయున్న కప్పమును మేళతాళములతోకూడ తన కుమారునిచే నతని శిబిరమునకు పంపి సంధి చేసికొనెను. ఒప్పందము ప్రకారము సంధినియమము లన్నియు నెరవేరగా అహ్మదు శాహు నిజరాజధానియైన గుల్బర్గకు మరలి వచ్చెను.

ఇంత విపులముగ వ్రాసినను ఫెరిస్తా ఈ యుద్ధవృత్తాంతమును సంపూర్ణముగ వివరింపలేదు. అతని కథయం దెంత సత్యము కలదో చెప్పుటకు వీలు లేదు. ఏలనగా, విజయనగరమువారు బహ్మనీ సైన్యము తుంగభద్రకడకు వచ్చునందాక నిర్వీర్యులై తమ రాజధానియందు కూర్చుండి యుండలేదు. ఫెరిస్తా వచించినట్లు సర్వత్ర పరాఙ్ముఖులై యుద్ధమును చాలించుకొని అహ్మదు శాహుకు పాదాక్రాంతులైనట్లు తోచుటలేదు.

మొట్టమొదట అహ్మదు శాహు దండయాత్ర కాలమున విజయనగరమును పాలించుచుండిన రాయ లెవ్వరో కనుగొనవలసియున్నది. దేవరాయలని నిజామ్ ఉద్దీను, ఫెరిస్తాలు వ్రాసి యున్నారు. విజయబుక్క లేక కుమ్మడి బుక్కరాయలని యాధునిక చరిత్రకారులు అభిప్రాయపడుచున్నారు. మొదటిదేవరాయల పుత్రుడైన మొదటి విజయరాయలకు బుక్కరాయలను నామాంతర ముండినట్లు కొన్ని శాసనములలో కానవచ్చుచున్నది. ఇతనినే యాధునిక చరిత్రకారులు విజయ బుక్క లేక ఇమ్మడి బుక్క యని పేర్కొనెదరు. అహ్మదు శాహు దండయాత్రకాలమున విజయనగర సామ్రాజ్యమును మొదటి విజయరాయలు పాలించుచుండినను అతడు సత్వహీనుడగుటవలన నతని కుమారుడైన ఇమ్మడి దేవరాయలు క్రి. శ. 1422 సంవత్సరమున రాజ్యాభిషిక్తుడై ఇతనితోగూడ సామ్రాజ్య పాలనను సాగించుచు దక్షుడై యుండెను. కావున నిజామ్ ఉద్దీన్ ప్రభృతులు విజయనగరాధీశ్వరుడు దేవరాయలని చెప్పిరి. ఇం దసత్య మేమియు లేదు. కాని, దండయాత్ర వృత్తాంతమును అట్లంగీకరించుటకు వలను పడదు. గుల్బర్గ వరకును దేవరాయల ధాటి నిరాఘాటముగ సాగెనని ' వెలుగోటివారి వంశావళి 'వలన తెలియవచ్చుచున్నది. రాయలకు సహాయుడై వచ్చిన దేవరకొండ వెలమదొర రేచెర్ల లింగమనీడు బాదామి, కొరగల్లు దుర్గములను సాధించె ననియు, మలక పోలార్జునుని జయించి యాదవునికొండ(యాదగిరి)ను కైకొనె ననియు అందు చెప్పియున్నది. బాదామి విజాపుర మండలమునందును, కొరగల్లు, యాదవుని దుర్గము(యాదగిరి)లు గుల్బర్గ మండలమందును గలవు ; మరియు క్రి. శ. 1429-30 నాటి యొక ముడుబిదిరె శాసనమున ఇమ్మడి దేవరాయలు తత్పూర్వమెచ్చటనో తురకల యశ్వబలమును నిర్జించెనని చెప్పియున్నది. ఇందు పేర్కొనబడిన తురక బహ్మనీ సుల్తానే కాని యన్యుడు కాడు. క్రి. శ. 1422, 1430 సంవత్సరముల

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మధ్య విజయనగర, బహ్మనీ రాజ్యముల కొక్క పర్యాయము మాత్రమే యుద్ధము జరగియున్నందున ఇమ్మడి దేవరాయలు తురకల యశ్వ దళమును నిర్జించినది అహ్మదు శాహుయొక్క విజయనగర దండయాత్రయందే కావలయును. కాబట్టి ఫెరిస్తా ఈ యుద్ధ వృత్తాంతమును సంపూర్ణముగ వర్ణింపక రాయల జయములను జారవిడిచి సుల్తాను పరాక్రమమునే వర్ణించినాడు. అం దెంత సత్యము గలదో దేవునికే యెరుక. తెలంగాణ ప్రభువుయొక్క మిత్ర ద్రోహమువలన రాయలకు పరాజయము కలిగి యుండవచ్చును; కాని, అతడు వివరించిన సంధి షరతు లన్నియు నిజమని నమ్ముటకు వీలులేదు. ఫెరిస్తా వర్ణించి నంతటి యవమానకరమైన సంధి కతడు ఒడబడుటయే వాస్తవమైనచో తరువాత గుజరాతు సుల్తానుతోడి యుద్ధమునందు అహ్మదు శాహు పొందిన పరాభవ పరంపరలను ఆస్పదము చేసికొని బహ్మనీ రాజ్యముపై దండెత్తి యుండకపోడు.

విజయనగర దండయాత్రనుండి మరలి వచ్చినతరువాత ఆ దండయాత్రలో తెలంగాణా అధిపతి రాయలకుతోడై నతడే యుద్ధమొనర్చినందుకు కినిసి అహ్మదు శాహు అతనిపై క్రీ. శ. 1424లో దండువెడలెను. తెలంగాణాను చేరిన పిమ్మట, అహ్మదు శాహు గోలకొండదుర్గమున విడిచి ఖాన్ ఇ అజమ్ లతీఫ్ ఖాను అను సర్దారును కొంత సైన్యముతోగూడ ఓరుగల్లుమీది కంపెను. అతడు ఓరుగంటి నేగాక, ఆ దేశప్రధానదుర్గములలో ఒక్కటియైన మంగలును సాధించి స్వైవసము చేసికొని ఆ పరిసరప్రాంతమును పాడుచేసి దేవాలయములను ఇడియగొట్టి నేల చదరపు గావించి జనావాసములను చూరపట్టి ప్రజలను పలువిధముల హింసింపసాగెను. దేవరకొండ, రాచకొండ ప్రభువులు ఆతని నెదుర్కొనజాలక కానుకల నిచ్చి సుల్తాను కడకు రాయబారుల నంపి, కప్పము కట్ట నొప్పుకొని సంధి చేసికొనిరి. ఈ దండయాత్రయందు ఖాన్ ఇ అజమ్ లతీఫ్ ఖానుడు ఓరుగల్లు దుర్గమును సాధించినప్పుడు అచట జరగిన యుద్ధములో ఏడువేల హిందువులతోగూడ ఆ దేశపురాజును వధించె ననియు, అంతట అహ్మదు శాహు అచటికి విచ్చేసి అంతకుముం దెన్నడును చూరకారుల బారి బడనీయక సురక్షితముగ కాపాడబడుచువచ్చిన, తరతరములుగ సంచితము చేయబడిన ద్రవ్యమును సమస్తమును వశపరచుకొనె ననియు, దరువాత ఖాన్ ఇ అజమ్ లతీఫ్ ఖానుని ఓరుగంటికి పాలకుని జేసి తెలంగాణాను సర్వమును జయింపుమని ఆజ్ఞాపింపగా అత డాకార్యమును నాలుగు మాసములలో నెరవేర్చె ననియు ఫెరిస్తా వ్రాసియున్నాడు. ఫెరిస్తా వ్రాత యంతయు సత్యమని అంగీకరించుటకు వీలు కాదు. క్రీ. శ. 1810 మొదలు మహమ్మదీయులు ఓరుగంటిని పలుమారులు ఊచముట్టుగ చూరగొనియున్నారు. క్రీ.శ. 1368-9 లో వెలమవారు కాపయనాయకుని వధించి ఓరుగంటిని స్వైవసము చేసికొన్నప్పు డతని విత్తమును సర్వమును హరించిరి. వెలమవారి రాజధాని రాచకొండ, దేవరకొండలుగాని ఓరుగల్లు కాదు; కాబట్టి కాపయనాయకుని మరణమునకు వెనుక అందు లభించిన ద్రవ్యమును తమ రాజధానులకు కొంపోయి, అచట నిక్షిప్తము గావించి యుందు రనుటకు సంశయము లేదు. కాబట్టి అందు అంతకు ముందు ఎన్నడును చూరపోక ధనము అచట సంచితమై యుండుట యసంభవము. ఇది సర్వాబద్ధమని చెప్పవలసి యున్నది. తక్కిన కథయం దెంత సత్యముగలదో దేవునికే ఎరుక. ఫెరిస్తా కథ సత్యమని విశ్వసించు ఆధునిక చరిత్రకారులు కొందరు ఖాన్ ఇ అజమ్ లతీఫ్ ఖానునిచే ఓరుగంటి సమరమున వధింపబడిన రాజు ఇమ్మడి యనపోతానాయకుడని విశ్వసించుచున్నారు. ఇది సంశయాస్పదము. దండయాత్రలో తెలంగాణాలో హిందూప్రభుత్వము ముగిసిపోయెనని మరికొందరు చరిత్రకారు లభిప్రాయపడుచున్నారు. ఇదియు సరికాదు. అడుగడుగునకును బహ్మనీ సుల్తానులు తెలంగాణాను కబళించుటకు ప్రయత్నము చేయుచు వచ్చినను వారికి అది స్వాధీనపడలేదు. తెలంగాణాలో తురకాణ్యమును స్థిరముగ నెలకొల్పినవాడు గోలకొండ కుతుబ్శాహీ వంశస్థాపకుడైన సుల్తాన్ కులీ కుతుబ్శాహు. అంతవరకు హిందువుల ప్రభుత్వ మచట సాగుచునే వచ్చినది.

అహ్మదు శాహు సులభముగ తెలంగాణాను జయించి స్వాధీనము జేసికొనినను అది స్వల్పకాలముననే యతని హస్తమునుండి దుసికిలిపోయినది. రాచకొండ వెలమ రాజులు అతనికి కప్పముకట్ట నొప్పుకొని సంధి చేసికొనినను స్వాతంత్ర్యాభిలాషను వర్జింపలేదు. అనుకూల సమయము వచ్చినపుడు సుల్తానుయొక్క యాధిపత్యమును తొలగద్రోసి స్వాతంత్ర్య పునఃప్రతిష్ఠ గావింప నిశ్చయించి తరుణము వేచి యుండిరి. ఇట్లుండగా గుజరాతు, బహ్మనీ రాజ్యములకు మధ్య యుద్ధము పొసగినది. ఈ యుద్ధ సందర్భమున అహ్మదుశాహు బహ్మనీ పొందిన పరాభవమును అవకాశము చేసికొని ఇమ్మడి అనపోతనాయని తమ్ముడైన సింగమనాయని యాధిపత్యముక్రింద వెలమవారు విజృంభించి బహ్మనీ సేనల నోడించి పారద్రోలి యోరుగంటిని మరల నాక్రమించుకొనిరి. గుజరాతు యుద్ధము సమాప్తమగువరకును సుల్తానుకు తెలంగాణావైపు దృష్టిని



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మరల్పుటకు సైతము వీలు కలుగకపోయెను. ఆ యుద్ధము ముగిసి ఉభయ రాజ్యములకును సంధి కుదిరిన పిమ్మట క్రీ. శ. 1488 లో అహ్మదు శాహు తన యాధిపత్యమును పునఃప్రతిష్ఠ గావించుటకొరకు తెలంగాణాపై మరల దండువెళ్లెను. యుద్ధము ప్రారంభమయిన స్వల్పకాలము లోపలనే రామగిరి మొదలగు పెక్కు దుర్గములు సుల్తానుకు హస్తగతములాయెను. సుల్తానుకు ఉపలబ్ధమగుచుండిన విజయ పరంపరను గని ఓరుగంటి ప్రభువు సింగమనాయకుడు డిల్లపడి తన తప్పును క్షమించి అభయము ప్రసాదించినచో తాను సుల్తానుఆధిపత్యము నంగీకరించి కప్పము కట్టెదనని తెల్పుచు రాయబార మంపెను. దయార్ద్రచిత్తుడైన సుల్తాను అతని వేడికోలు నవధరించి అతడు కోరినమేరకు సంధి ననుగ్రహించి ఓరుగల్లు దుర్గాధివాసులకు అభయమిచ్చి ఆ దుర్గమును చూరగొనవలదని తన సైనికులకు ఆజ్ఞాపించెను. తరువాత సుల్తాను ఆ దేశములోని ప్రాంతములను జయించుచు దీర్ఘకాలము తెలంగాణాలో దండుచేయుచుండెను; తన యధికారమునకు లోబడి కప్పముకట్ట నొప్పుకొనినవారిని మన్నించి వారి రాజ్యములను వారికే స్థిరము చేసెను; మారొడ్డి పోటు చూపిన వారిని రూపుమాపి వారి భూములను ఆక్రమించి నిజరాజ్యమున కలుపుకొనెను; ఇబ్రాహీం సంజర్ ఖానుడను సర్దారుని తెలంగాణా సైన్యమునకు అధిపతిని కావించి గోనగిరి దుర్గమును మరి పెక్కు సీమలతో గూడ నతనికి జాగీరుగ పాలించి, దేశమును సర్వమును జయించి ప్రజలను సుముఖులను జేయవలయునని ఆజ్ఞాపించెను.

క్రీ. శ. 1428 లో అహ్మదు శాహు మాహూరు రాజ్యముపై దండు చేసెను. కాని అది సులభముగ స్వాధీనపడలేదు. మూడు దండయాత్రలు చేయవలసివచ్చెను; మూడవ పర్యాయము మాదేశ ప్రభువు సంధిని కోరగా నతని కభయమిచ్చి తన శిబిరమునకు రప్పించి ఆరువేల పరివారముతో గూడ నతనిని చంపించెను. అంతట మాహూరు రాజ్యము వజ్రపు గనులతోగూడ అతనికి హస్తగతమైనది. ఈ దండయాత్రను నడపుచు అహ్మదు శాహు ఒక్క సంవత్సరకాలము ఎల్లిచ్పూరునందు నివసించెను. అప్పు డతడు తన రాజ్యపు టుత్తరపు సరిహద్దున గావిల్గఢ్, నార్నాలు అను దుర్గములను చక్కజేసి బలపరచెను. తైమూరు లంగ్ తన యన్నయైన ఫీరూజ్ శాహు కనుగ్రహించి యిచ్చిన మాళవ, గుజరాతు దేశములమీది యాధిపత్యమును సార్థకపరచుకొనవలెనను అభిలాష యతనికి కలదు. ఆ విషయమును దృష్టియం దుంచుకొనియే పైని పేర్కొనిన దుర్గములను అతడు బలపరచినది. మరియు తాను చేయబోవు దండయాత్రలలో తన కుపయుక్తముగ నుండునని యెంచి గుజరాతు, మాళవరాజ్యముల మధ్య నుండిన ఖాన్దేశమను చిన్న సంస్థానమునకు ఒడయడయిన నసీర్ ఖాను ఫరూకీతో సఖ్యము చేసికొని అతని కుమారితను తన కుమారుడును, వారసుడును అగు అలా ఉద్దీన్ అహ్మదునకు భార్యగ గ్రహించి అతనితో సంబంధమొనర్చెను.

అప్పుడు మాళవదేశమును ధారాపట్టణము రాజధానిగ హూషంగ్ శాహ ఘోరీ యను ప్రభువు పాలించుచుండెను. అతడు శూరుడు, యుద్ధలాలసుడు; ప్రబలరాజ్యకాంక్షాపీడితుడు. కావున క్రీ.శ. 1422లో బహ్మనీ, మాళవ రాజ్యముల సరిహద్దునం దుండిన ఖేర్లా సంస్థానముపై నెత్తివచ్చి ఆ సంస్థానాధిపతియైన నరసింగరాయలను నిర్బంధించి కప్పము గొనెను. నరసింగరాయలకడ నుండి కప్పమును వసూలు సేయుటకు హూషంగ్ శాహు క్రీ. శ. 1428 లో మరల ఖేర్లాపై దండెత్తి వచ్చెను. నరసింగరాయలు బహ్మనీ సుల్తానుయొక్క సామంత వర్గమునం దొక్కడు. కావున అతడు అహ్మదు శాహు యొక్క సహాయము నర్థించెను. అతని ప్రార్థన నంగీకరించి అహ్మదు శాహు సైన్యముతో గూడ కూచిచేసి పోయి ఎల్లిచ్పూరునందు విడిసెను. కాని యొక కాఫిరుని రక్షించుట కొరకు సాటి మహమ్మదీయ ప్రభువుతో యుద్ధముచేయుట ధర్మవిరుద్ధమని యెంచి నరసింగరాయని శత్రువునకు బారిగొరియను గావించి నిజరాజ్యమునకు మరలిపోవ నారంభించెను. హూషంగ్ శాహు అహ్మదు శాహుయొక్క పశ్చాద్గమనమునకు అతని రణభీరుత్వము కారణమని యెంచి అతనిని వెనుకొని తరుమగడగెను. అహ్మదు శాహు తాను చేసినది పొరపాటని గ్రహించి తపతీతటమును జేరినంతటనే వెనుకొని వచ్చుచున్న మాళవ సైన్యమున కభిముఖుడై పోటు చూపెను. అప్పుడు జరగిన యుద్ధమునందు హూషంగ్ శాహు ఘనపరాజయమును పొంది పలాయనము చేసెను. అతని రాణివాసమును, శిబిరమునం దుండిన సమస్త సామగ్రియు రెండు వందల యేనుగులతోగూడ అహ్మదు శాహునకు హస్తగతమాయెను. నరసింగరాయలు చెల్లాచెదరై పారిపోవుచుండిన మాళవ దళములను వెన్నడచి తరిమెను. తరువాత అహ్మదు శాహు ఖేర్లా దుర్గమునకు రాగా నరసింగరాయ లతనిని గౌరవించి సేవించెను. అంతట అహ్మదు శాహు ధారాసురత్రాణుని రాణివాసము నతని కడ కనిచి నిజరాజ్యమునకు మరలివచ్చెను. ఇది బహ్మనీ, మాళవ సుల్తానుల మధ్య నడచిన తొలిసంగ్రామ కథ. కాని, హూషంగ్ శాహు తనకు గలిగిన ఘనపరాభవమును మరచిపోలేదు. అహ్మదు శాహు మీదను, అతని కాశ్రితుడైన



http://sanskritcentral.com/

ఖేర్లా అధిపతిమీదను పగబట్టి తీర్చుకొనుటకు అనుకూల సమయమును నిరీక్షించుచుండెను. స్వల్పకాలమందే అతనికి అదను చిక్కినది. గుజరాతు సుల్తానుతోడి యుద్ధమునందు పొందిన పరాజయముల కారణమున అహ్మదు శాహు విగత సత్వుడగుట చూచి తన పగ తీర్చుకొనుటకది మంచి తరుణమని నిశ్చయించి ఖేర్లాపై దండెత్తి వచ్చి నరసింగ రాయని వధించి యా దుర్గమును, దానిక్రింది రాష్ట్రమును స్వాధీనము చేసికొనెను. ఆ వర్తమానము తెలియవచ్చి నంతనే అహ్మదు శాహు క్రుద్ధుడై మాళవ సురత్రాణుని శిక్షించునుద్దేశముతో అందు నడచెను. కాని ఖాన్ దేశ ప్రభువైన నసీర్ ఖానుడు మాధ్యస్థ్యముచేసి ఆ సుల్తానుల కిరువురకును రాజీ కుదిర్చెను. ఈ రాజీ ప్రకారము ఖేర్లా దుర్గముమాత్రము మాళవ రాజ్యమున కణకువయైనది. తక్కిన వరాట (బీరారు) దేశము సమస్తమును బహ్మనీ సుల్తాను ఏలుబడిక్రిందికి వచ్చినది.

అహ్మదు శాహుయొక్క గుజరాతు యుద్ధము ఇంతకు ముందు రెండు పర్యాయములు ప్రస్తావమునకు వచ్చినది. ఈ యుద్ధమునకు కారణము కొంకణాధిపత్యము కొరకు ఉభయరాజ్యములమధ్య పొడమిన ప్రతిస్పర్ధ. క్రీ. శ. 1430 సంవత్సరమున అహ్మదు శాహు గుజరాతు రాజ్యముమీదకి దండయాత్ర పంపెను. అప్పుడు గుజరాతును పాలించుచుండిన మొదటి అహ్మదు శాహు శక్తి సామర్థ్యములు గల రాజు. బహ్మనీ సుల్తానుసేనలు ముంబయి ద్వీపమునందు మొహిమును స్వాధీనపరచుకొనుటకు తలపెట్టగా గుజరాతు సుల్తాను బలములు వారిని రెండు పర్యాయములు ఓడించి వారి యత్నమును భగ్నము గావించినవి. కాని అహ్మదు శాహు అంతటితో యుద్ధమును చాలింపక మరల దళములను సమకూర్చుకొని గుజరాతురాజ్యముయొక్క దక్షిణపు సరిహద్దు ప్రాంతమునానుండు [illegible]ల్ మీదికి నడచెను. సరిహద్దు సంరక్షణ కొరకు గుజరాతు బలములుకూడ అచ్చటికి వచ్చినవి. తపతీనది యుభయతటములందును ప్రతిపక్షులు ఒండొరులకు అభిముఖులై కొంతకాలము విడిసి యుండిరి. కాని యుద్ధము జరుగలేదు; పెద్దలు చెప్పిన హితవును విని యుద్ధోద్యోగమును మానుకొని సమాధాన పడిరి.

పైన వివరింపబడిన దండయాత్రలును, యుద్ధములును గాక అహ్మదు శాహు రాజ్యకాలమున సంభవించిన విశేష చరిత్రాంశములు పేర్కొనదగినవి మరికొన్ని కలవు. అందొకటి రాజధాని మారుపు. అలా ఉద్దీన్ హసన్ గంగు బహ్మనీ రాజ్యమును స్థాపించినప్పటినుండియు గుల్బర్గ రాజధానిగ నుండినది. అహ్మదు శాహు అచట నుండుట కిష్టపడలేదు. కావున అతడు సింహాసనము నాక్రమించుకొనిన పిమ్మట బెడదకోటయను నామాంతరముగల బీదరు పట్టణమును రాజధాని జేసికొని అచ్చటినుండి రాజ్యముసేయగడగెను. అదిమొదలు తుదవరకును బహ్మనీ సుల్తానుల కదియే అధివాసస్థానమైనది. అహ్మదు శాహు రాజధానిని బీదరు కెప్పుడు ఏ కారణములవలన మార్చె ననునవి విచారణీయాంశములు; ఏలనగా, చరిత్రకారులు ఈ విషయములనుగూర్చి భిన్నాభిప్రాయములను వెలువరించియున్నారు. లభ్యమైన సాక్ష్యమును పరిశీలించి చూడగా ఈ మారుపు అహ్మదు శాహు సింహాసనము నధిష్ఠించిన వెంటనే జరిగెనని తోచుచున్నది. ఈ మారుపునకు పూర్వచరిత్రకారులు వక్కాణించినట్లు కేవలము బీదరుపురముయొక్క మనోజ్ఞతర వాతావరణ స్థితియు, ప్రకృతిజన్య పరిసర సహజ సౌందర్యములు మాత్రమే కారణము కాదు; అహ్మదు శాహు సింహాసనమును ఫీరూజ్ శాహు పుత్రునికి చెందనీయక అక్రమముగా నాక్రమించుకొనెను. గుల్బర్గయందు ఫీరూజ్ శాహు పక్షమువారు బహుళముగ నుండిరి. అచ్చటనుండియే తాను రాజ్యపాలనము సేయగడగిన వారివలన తన కేమైనను ముప్పు కలుగ వచ్చునని శంకించి రాజధానిని అతడు గుల్బర్గనుండి బీదరునకు మార్చుకొనెనని కొందరు ఆధునిక చరిత్రకారులు అభిప్రాయ పడుచున్నారు. ఈ పట్టున స్మరింపదగిన యంశము మరియొకటి కలదు. అహ్మదు శాహు రాజధానిని మార్చుటకు నిశ్చయించినది విజయనగర దండయాత్ర సాగుచుండిన కాలమునందు. రాయరాణువ గుల్బర్గ పర్యంతము దాడి చేసెనని మీద చెప్పియున్నది. విజయనగరము సరిహద్దునకు సమీపమందుండుటచే గుల్బర్గ భద్రము కాదని దూరముననుండు బీదరునకు అహ్మదు శాహు రాజధానిని మార్చియుండిన నుండవచ్చును.

దక్కనీ గరీబు కక్షల యుత్పత్తి రెండవది: బహ్మనీ రాజ్యము స్థాపితమైనప్పటినుండియు దక్కను దేశమున మహమ్మదీయుల సంఖ్య అభివృద్ధి గాంచొచ్చినది. మహమ్మదీయ మతాచార్యుల బోధవల్లను, సుల్తానుల బలాత్కారమువల్లను హిందువు లనేకులు మహమ్మదీయ మతమును స్వీకరించిరి; మరియు సుల్తానులు పెక్కండ్రు అరబీ, పారసీ, ఖురాసాని, తురుష్క, హబిషి దేశ వాస్తవ్యులైన మహమ్మదీయులను తమ యాస్థానమునకు రప్పించుకొని తమ కొలువునందు చేర్చుకొనుచు వచ్చిరి. కాలక్రమమున వర్ణవిభేదకారణమున దక్కను మహమ్మదీయ సంఘము రెండు కక్షలై చీలినది. మహమ్మదీయ మతమును స్వీకరించిన హిందువులును, వారి సంతతివారును దక్కనీ లన

http://teluguthesis.com/



బరగిరి. వీరితో శ్యామాంగులైన హాబిషీలు ఏకీభవించిరి. తక్కినవారికి గరీబు లనగా వైదేశికులను పేరు గలిగినది. గరీబులు దక్కనీలకంటె తా మధికులమని ఎంచి వారిని ముట్టకస చేయుటయే కాక ప్రభుత్వోద్యోగమునందు వారిని ఉన్నతస్థితికి రానీయక ఆటంకపెట్టుచు వచ్చిరి. కావున నీ యుభయ కక్షలకు వైర మేర్పడి యొండొరులతో పోట్లాడుకొనుటయే కాక నిరంతర మొండొరులపై కుట్రలు పన్నుచు రాజకార్యములందు సయితము కలిసిమెలిసి పని చేయక భంగపెట్టుచు తుద్రోపద్రవములకు కారణభూతులైరి. దక్కనీ, గరీబు కక్షల ప్రతిస్పర్ధ మొట్టమొదట అహ్మదుశాహు కాలమున తలచూపినది; క్రమక్రమముగ అభివృద్ధియై చిట్టచివరకు బహ్మనీ రాజ్యపతనమునకు హేతుభూతమైనది.

రాజ్యవిభజనము మూడవది : సుల్తాను అహ్మదు శాహునకు అలా ఉద్దీన్ అహ్మదు, ముహమ్మద్ ఖాను, దావూద్ ఖాను, ముహమ్మదు ఖానులను పుత్రులు నలుగు రుద్భవించిరి. వీరిలో ప్రథమునకు జఫర్ ఖానుడను బిరుదు గలదు. ఇతడు సింహాసనమునకు వారసుదారుడు. అహ్మదు శాహు తన రాజ్యాంతిమవర్షమున తన పుత్రులు తన యనంతరము రాజ్యమునకై కలహింప కుండుటకొరకు వారికి తన రాజ్యమును పంచిపెట్టెను. పెద్దవాడైన అలా ఉద్దీన్ జఫర్ ఖానుడు తన యనంతరము రాజ్యమున కంతటికిని అధిపతి; కడగొట్టువాడైన ముహమ్మదు ఖానుడు తరుణ వయస్కుడైనందున నతడు తన పెద్దయన్న పోషణ క్రిందనుండి రాజ్యపరిపాలనయందు పాల్గొనున ట్లేర్పాటు గావించెను. రెండవకుమారుడైన ముహమ్మదు ఖానునకు మాహూరు రాజ్యమును, కుల్లుమ్ రామగిరి దుర్గములను, వరాట (బేరారు) రాష్ట్రమును, మూడవ కుమారుడైన దావూదుఖానునకు తెలంగాణాను విభజించి యిచ్చి ఆ యన్నదమ్ములను దన సముఖమునకు రావించి ఒండొరులతో కలహింపక ఐకమత్యముతో ప్రవర్తింతుమని ప్రమాణపూర్వకముగ వారిచే వాగ్దానము చేయించుకొనెను. తరువాత అహ్మదు శాహు దీర్ఘకాలము జీవించి యుండ లేదు; వ్యాధిగ్రస్తుడై 1436 జూలై 14వ తారీఖున దేహము చాలించెను.

అహ్మదు శాహు గొప్పరాజు. గుజరాతు సుల్తానుతోడి యుద్ధమున పరాజయము నందినను తక్కినయెడల నెల్ల అతనికి విజయమే చేకూరుచు వచ్చినది. తూర్పున బహ్మనీ రాజ్యము విస్తరించి తెలంగాణా అంతటిపై వర్వినది. వీరాగ్రేసరులని పేరందిన రాచకొండ, దేవరకొండ వెలమ రాజులతోగూడ తెలంగాణా హిందూప్రభువులెల్ల అతనికి అరిగాపులైరి. అహమదు శాహు తన యన్నయగు ఫీరూజు శాహువలె విద్యావంతుడును, విశాలహృదయుడును కాడు. మతవిషయములందు అతనిది బహుసంకుచితమైన దృష్టి. స్వమతముపై నతని భక్తిశ్రద్ధలు అత్యంతము గాఢమైనవి. మౌలవీలప్రాబల్య మధిక మాయెను. ఒకానొకప్పుడు దేశమున కాటకము సంభవించి యాహారపదార్థము లరుదుకాగా జనులు తుద్బాధా పీడితులై నవయుట చూచి అహ్మదు శాహు పురపరిసరములనుండు కొండమీదికి ఎక్కి భగవంతుని ప్రార్థించె ననియు, వెంటనే జడివాన కురిసి క్షామబాధ తొలగె ననియు, తత్కారణమున నతనికి 'వలీ' (అనగా ఋషి) యను పేరు కల్గె ననియు చెప్పుదురు. అహ్మదు శాహు కాలమున వాస్తునిర్మాణము ధారాళముగ పెంపందినది. బీదరు పట్టణమున నతని యాజ్ఞానుసారము ప్రాసాదములు, సభాభవనములు, మసీదులు మున్నగునవి కట్టబడెను. ఈ వాస్తు నిర్మాణములందు హిందూ మహమ్మదీయ వాస్తుసంప్రదాయములు మేళగించినవని శిల్పవిద్యా విశారదుల యభిప్రాయము. మరియు, అహ్మదు శాహునకు పారసీభాషయందు అభిమానము కలదు. ఖురాసానిదేశ వాస్తవ్యుడైన అజరీ యను కవీశ్వరుని తన ఆస్థానమునకు రప్పించి, ఉచితరీతిని సత్కరించి అతనిని 'బహ్మన్ నామా' అను పేరుగల నిజవంశ చరిత్రమును పద్యకావ్యముగ రచియింప అతడు పురికొల్పెను. ఆ గ్రంథ మిప్పుడు నశించిపోయినను అన్యత్ర అందుండి ఉటంకింపబడియుండు శకలములను పరిశీలించి పారసీ వాఙ్మయ విమర్శకులు అది ఫెర్డూసీ షా నామాను మేలుబంతిగ నుంచుకొని వ్రాయబడిన సామాన్యరచనయని అభిప్రాయమును వెలిపుచ్చి యున్నారు.

రెండవ అలా ఉద్దీన్ (క్రీ. శ. 1435 - క్రీ. శ. 1458) : అహ్మదు శాహు కాలగతినందిన పిమ్మట అతడు చేసిన యేర్పాటు ప్రకారము అతని పెద్దకొడుకైన అలా ఉద్దీన్ అహ్మదు సింహాసనము నధిష్ఠించి క్రీ. శ. 1458 వరకు ఇరువదిమూడేండ్ల కాలము ప్రజాపాలనము జేసెను. ఇతని రాజ్యకాలమున జరిగిన చరిత్రాంశములలో ఈ క్రింద పేర్కొనబడినవి ముఖ్యమైనవి : (1) విజయనగర దండయాత్రలు ; (2) కొంకణ విజయము ; (3) ఖాన్ దేశముతోడి యుద్ధము ; (4) తెలంగాణా హోవడి.

1. విజయనగర దండయాత్రలు : ఇవి మూడు. మొదటి రెండును ఇమ్మడి దేవరాయలు రాజ్యము చేయుచుండగను, మూడవది అతని కుమారుడు మల్లికార్జున దేవరాయలు సింహాసనము నధిష్ఠించిన తోడను జరగినవి. మొదటి రెండు దండయాత్రలును ఫెరిస్తా మున్నగు చరిత్ర

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కారులచే విపులముగ వర్ణింపబడి యున్నవి. మూడవ దండయాత్ర ప్రస్తావము వారి గ్రంథములందు కానరాదు. చరిత్రకారుల వృత్తాంతము లొక్కతీరున నుండక పరస్పర విరుద్ధములై వాస్తవ యుద్ధ చరిత్రను నిశ్చయించి కను గొనుటకు అనుకూలపడక యున్నవి. కావున వారు చెప్పెడి యుద్ధవృత్తాంతము సంగ్రహముగనైన పరిశీలిం చుట యావశ్యకము. నిజాముద్దీన్ అహ్మదు ఇట్లు చెప్పు చున్నాడు: సుల్తాను అలా ఉద్దీను తన తమ్ముడగు ముహమ్మదు ఖాను నొక గొప్పసైన్యముతో విజయనగర మును జయించుట కంపెను. అతడు కృష్ణాతీరమును చేరగనే అంతకు పూర్వమే అచ్చటకు పోయియుండిన ఇమాద్ ఉద్దీన్ ప్రత్యుత్థానము చేయ నెదురు రాగా అతని వధించి సుల్తానుపై తిరుగబాటు చేసెను. ఆతని దండించుటకొరకు అలా ఉద్దీన్ సైన్యముతో అతనిమీద నడచి అతనిని యుద్ధ మున నోడించెను. ముహమ్మదు ఖానుడు భయచేతస్కుడై పారి పోయెను. భ్రాతృవత్సలుడైన సుల్తాను అతని తప్పును క్షమించి తెలంగాణాలోని రాయాచలము (రాజా చలము)న కధిపతిని గావించి యచటి కంపెను.

సయ్యిద్ అలీ తబా తబా చెప్పు కథ కొంచెము వ్యత్యాస ముగ నున్నది. హిజిరా 839 (క్రీ. శ. 1435) లో సుల్తాను తమ్ముడగు ముహమ్మదు ఖానుడు స్వామి ద్రోహము తల పెట్టి కృష్ణానదీ తీరమున ఇమాద్ ఉల్ ముల్క్ ఘోరీని వధించి సుల్తానుపై తిరుగబాటు చేసెను. సుల్తాను గొప్ప సైన్యమును కూర్చుకొని తమ్మునిపై దండుచేసి యుద్ధ మునం దతని నోడించెను. అతడు పారిపోగా సుల్తాను అతని తప్పును క్షమించి రప్పించి తెలంగాణాలోని రాయాచలమును జాగీరుగ నిచ్చి అచటి కంపించెను. అంతట ముహమ్మదు ఖానుని హోవడివల్ల కలిగిన సంక్షోభ మును సందుచేసికొని విజయనగరరాయలు మహమ్మదీయ రాష్ట్రముపై ఎత్తివచ్చి ముదుగల్లు దుర్గమును సాధించి హస్తగతము చేసికొని దేశమును చూరగొనెను. సుల్తాను అలా ఉద్దీన్ సైన్యమును కూర్చుకొని వచ్చి ముదు గల్లుకు ముట్టడి వేసెను. కొంతకాలము పోరు సాగినది. హిందువు లంతట సుల్తానుకు కప్పము కట్టుటకును, యుద్ధపు ఖర్చులను కట్టి యిచ్చుటకును సమ్మతించి సంధి చేసికొనిరి.

ఫెరిస్తా కథనము విపులమైనది. సింహాసనము నెక్కిన వెంటనే సుల్తాను అలా ఉద్దీన్ విజయనగరముపై దండు వెడల నిశ్చయించి తమ్ముడు ముహమ్మదు ఖానునకు గొప్ప సైన్య మిచ్చి వజీరు ఖ్వాజా ఇ జహాన్ అస్త్రబాదీ, అమీర్ ఉల్ ఉమ్రా, ఇమాద్ ఉల్ ముల్క్ ఘోరీలను సహాయులను జేసి రాయరాజ్యము మీదికి యుద్ధమున కంపెను. దండయాత్ర విజయవంతముగ కొనసాగినది. విస్తారము ధనమును, ఇరువది మదగజములను, సంగీత నాట్య విద్యా విశారదలగు విలాసినుల నిన్నూర్గురిని సుల్తానునకును, విలువగల ఉలుపాలను పెక్కింటిని ముహ మ్మదు ఖానునకును సమర్పించి రాయలు సంధిచేసికొనెను. అంతట ముహమ్మదు ఖాను సైన్యముతోకూడ మరలి స్వదే శాభిముఖుడై పోవుచు ముదుగల్లు సమీపమును చేరగనే స్వామిద్రోహము తలపెట్టి తనకు సహాయులై వచ్చిన ఖ్వాజా ఇ జహాన్, ఇమాద్ ఉల్ ముల్క్‌లను దనకు దోడ్పడి తన యుద్యమమును నెరవేర్పుడని ప్రార్థించెను. వారు నిరాకరింపగా వారిని వధించి విజయనగర రాయ లతో సఖ్యము చేసికొని, అతడు సహాయమంపిన దళముల తోడుపాటున ముదుగల్లు, రాయచూరు, షోలాపూరు, బిజాపూరు, నల్దుర్గ మొదలగు దుర్గముల నాక్రమించు కొనెను. అలా ఉద్దీన్ గొప్ప సైన్యముతో వచ్చి విప్లవ కారులను మార్కొనెను. పెక్కు భీకర యుద్ధములు నడచినవి. తుదకు అలా ఉద్దీనే విజయి యయ్యెను. ముహమ్మదు ఖానుడు భీతిచెంది పారిపోగా సుల్తాను తమ్ముని కభయ మిచ్చి తెలంగాణా మండలాధిపతియైన దావూదు ఖానుని మరణమువల్ల ఖాళీపడియుండిన పదవి నతని కొసగి యంపెను.

ఫెరిస్తా చెప్పు కథనము తక్కినవారిదానికంటె విపుల తరమైనదైనను అందు అసంగతములు పెక్కు గలవు. నిజాముద్దీన్ అహమ్మదు, తబా తబాలు చెప్పు వృత్తాంత మింతకంటె ఎక్కువ విశ్వాసపాత్రముగ కన్పట్టుచున్నది. ముహమ్మదు ఖానునకు స్వామిద్రోహచింత అది మొదటి నుండియు కలదని తబా తబా చెప్పుచున్నాడు. ఇది సహజమే. ఏలనగా, దన తండ్రియైన అహ్మదు శాహు తన యన్నలవలె తనకును రాజ్య భాగమేను పంచి యీయక జ్యేష్ఠసోదరుని పోషణయం దుంచి గతించెను. ఇది యతని మనస్సునందు అసంతృప్తి కలిగించినది. కావున అతడు పరాధీనతను కాపుకొని రాజ్యమున దనకు చెందవలసిన భాగమును కైవసము చేసికొనుటకు సమయము నెదురు చూచుచుండెను. ఈ స్థితియందు అతడు విజయనగరముపై దండయాత్రను నడప నియోగింపబడినపుడు సుల్తానుకు ప్రబల శత్రుడైన రాయలతో సఖ్యము నర్థింపక, అతనితో యుద్ధముచేసి ఓడించి సుల్తానున కరిగాపు చేసి యావల సుల్తానుపై తిరుగబాటు చేసి రాయల సహాయమును పొందె ననుట అంత విశ్వాసపాత్రముగ కన్పించదు. నిజా ముద్దీన్ అహ్మదు ముహమ్మదు ఖాను విజయనగరముతో యుద్ధము చేసినట్లే చెప్పడు. సయ్యిద్ అలీ తబా తబా



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ముహమ్మదు ఖానుని పోవడివలన కలిగిన దేశ సంక్షోభము నాస్పదము చేసికొని విజయనగరరాయలు బహ్మనీ రాజ్యముపై ఎత్తివచ్చినట్లు చెప్పుచున్నాడేకాని ముహమ్మదు ఖానుడు విజయనగరముపై దండు చేసినట్లుగాని, రాయల నోడించి సుల్తానున కరిగాపును జేసి తరువాత సుల్తానుపై తిరుగబాటు చేసి రాయలతో చెలిమి పాటించి అతనికడనుండి సహాయము పడసెననికాని చెప్పడు. ఈ యంశములనెల్ల సమవలోకనము చేసి చూడగా అలా ఉద్దీను శాహు విజయనగరముమీదికి ఖ్వాజా ఇ జహాన్, ఇమాద్ ఉల్ ముల్క్, ముహమ్మద్ ఖానుల నొక్కట దండయాత్ర కంపలేదనియు, మొదట ఇమాద్ ఉల్ ముల్క్ నంపెననియు, నతనికి జయము కలుగకపోగా నతనికి తోడ్పడుటకు ముహమ్మదు ఖానుని సైన్యముతో నంపెననియు, దనకు సహాయుడై వచ్చుచుండిన ముహమ్మదుఖాను నెదుర్కొనుటకు ఇమాద్ ఉల్ ముల్క్ కృష్ణా తీరమునకు రాగా ముహమ్మదు ఖాను దతనిని వధించి రాయలతో సఖ్యము చేసి యతని సహాయమును బొంది సుల్తానుపై తిరుగబాటు చేసెననియు తోచుచున్నది.

మొట్టమొదట ముహమ్మదు ఖానుని ఉద్యమము నిరాతంకముగ సాగినది. రాజ్యమందు చాల భాగము అతనికి స్వాధీనపడెను; ముదుగల్లు, రాయచూరు, షోలాపూరు, విజాపూరు, నల్దుర్గ మున్నగు ప్రసిద్ధ దుర్గము లతనికి హస్తగతము లాయెను; కాని సుల్తాను అలా ఉద్దీన్ అంతట సేనలు కూర్చుకొని వచ్చి యతనిని సంపూర్ణముగ నోడించెననియు, తరువాత కరుణించి యతనికి రాయాచల దుర్గము జాగీరుగ నిచ్చి యంపెననియు ఫెరిస్తా తెలుపుచున్నాడు. ఇదియే వాస్తవమైనచో సుల్తాను ప్రవర్తన దురవగాహమై యున్నది. ఏలనగా, తన యధికారమును కూలద్రోసి రాజ్యము నాక్రమించుకొనిన తమ్ముని, ఆ తమ్మునికి బాసటయై వచ్చిన నిజకుల క్రమాగత శత్రుడగు రాయలను రణాంగణమున పరాజితులను గావించియు, వారియందొకని కతని ద్రోహమును విస్మరించి రాజాచల రాజ్యమును జాగీ రిచ్చుటయు, మరియొకని నమయఘాతుకత్వమును సైరించి వానిమీద ఎట్టి చర్యను తలపెట్టక మిన్నకుండుటయు చిత్రము. వాస్తవముగ సుల్తాను విజయము నందియే యుండిన ద్రోహియైన తమ్ముని నగు రీతిని దండింపక రాజాచలరాజ్యము నేల యిచ్చి యుండును? ఫెరిస్తా ప్రభృతులు చెప్పునట్లు భ్రాతృ వాత్సల్యముచే ముహమ్మదు ఖానుని క్షమించెనని యొప్పుకొనెద మన్నను ద్రోహియైన తమ్మునికి తోడ్పడిన శత్రువగు రాయలకు తగిన శాస్తి చేయక యేల విడిచిపెట్టి యుండును? ఈ యంశముల నన్నిటిని పరిశీలించి చూడగా అలా ఉద్దీన్ శాహు విజయనగరముమీద మొదటి పర్యాయము పంపిన ధాటి జయవంతముకాక భంగపడెననియు, రెండవ ధాటికి నాయకుడైన ముహమ్మదు ఖానుడు సుల్తానుపై తిరుగబడి రాయలతో మైత్రి గావించుకొనుటవలన యుద్ధ మాగిపోయెననియు, వారిని శిక్షించుటకు సుల్తాను స్వయముగ దండు నడపుకొని వచ్చియు నది సాధ్యపడకపోగా ముహమ్మదు ఖానునకు రాచకొండ రాజ్యము నిచ్చి రాజీపడెననియు దోచుచున్నది.

రెండవ దండయాత్ర: క్రి. శ. 1443-44 సంవత్సరమున నడచినది. దీని కారణమును ఫెరిస్తా యిట్లు చెప్పుచున్నాడు: ఇమ్మడి దేవరాయలు తనకు సైన్యబలము గలిగినను బహ్మనీ సుల్తానులతోడి యుద్ధమునందు ప్రతిపర్యాయమును తన కపజయము కలుగుటకు కారణమును విచారించి తన యశ్వదళములోని గుర్రములకంటె బహ్మనీయుల గుర్రము లెక్కుడు దేహదార్ఢ్యము గలవనియు, పదాతులలో ధనుర్విద్యాకుశలులైన విలుకాండ్రు లేకపోవుటయునని తెలిసికొని యారెండు లోపములను తొలగించి నిజసైన్యము యొక్క పోటరితనమును పెంపొందింప నిశ్చయించి మంచి యుత్తమాశ్వములను విలుచుటయే కాక తురక రౌతులను తన కొలువున జేర్చికొని తన భటులను వారిచే శిక్షితులను గావించెను. ఇట్లు తన సైన్యముయొక్క యుద్ధనైపుణ్యము హెచ్చు కాగా, దేవరాయలు సుల్తానును సరకుసేయక నాలుగైదేండ్ల కాలము కట్టవలసిన కప్పమును కట్టక ధిక్కరించెను. కావున సుల్తాను అలా ఉద్దీను అతనిని శిక్షించుటకై అతనిమీద దండు వెడలెను. ఈ దండయాత్ర యథాపూర్వము కృష్ణా తుంగభద్రల యంతర్వేదియందు నడచినది. రాయచూరు, ముదుగల్లు, బంకాపుర దుర్గములు కేంద్రస్థానములు. భీకర యుద్ధములు మూడు జరిగినవి. మొదటిదేవ విజయము రాయలను వరించినది; తక్కిన రెండు మారులును సుల్తానును చెట్టపట్టినది. ముదుగల్లు సమీపమున జరిగిన మూడవ యుద్ధమున రాయల జ్యేష్ఠ పుత్రుడు మడిసెను. అంతట హిందువులు భయవిభ్రాంతులై పరువిడిపోయి ముదుగల్లు దుర్గమును ప్రవేశించిరి. వారిని వెన్నడచి తరుముచుపోయిన మహమ్మదీయ సర్దారు లిరువురు వారిచేజిక్కి కోటయందు బందీకృతులైరి. వారిని విడువక పోయిన రెండులక్షల హిందువులను వధింతునని బెదిరించుచు సుల్తాను వర్తమాన మంపెను. ఆ సందేశమును వినగానే జడిసి దేవరాయలు పైబేర్కొనిన సర్దారులను విడిచి

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పెట్టుటయేకాక, పిమ్మట సుల్తానురాష్ట్రముపై దండుపెడల ననియు, ప్రతివర్షమును నిర్ణీతమైన కప్పమును తప్పక చెల్లింతు ననియు వాగ్దత్త మొనరించి సంధిచేసికొనెను.

ఫెరిస్తా వర్ణించిన యుద్ధవృత్తాంత మసత్యమైనది. ఇది ఖడ్గ ప్రహారముచే గాకపోయినను కలముపోటుచే హిందువుల నవమానించుటకు విరచించిన కల్పనాకథ. ఈ దండయాత్ర జరుగుచుండిన కాలమున విజయనగరమందు వసించుచుండిన పారశీక రాయబారి అబ్దుర్ రజాకు అప్పుడు జరగిన సంగతుల నన్నిటిని తన ముత్ల-ఉస్-స-అదీన్ అను గ్రంథమున వివరించి యున్నాడు. అలా ఉద్దీన్ సుల్తాను అప్పుడు విజయనగరమున రాయల తమ్ముడొక్కడు మోసముమీద రాయలను, రాజకుమారులను సామంత మండలాధ్యక్షాది సకల నియోగివర్గమును, దొరలను ఒక్కపెట్టున వధించుటకు చేసిన కుట్రకు ఫలితముగ కలిగిన సంక్షోభమును సందర్భము చేసికొని రాయలను జయింప నదియే యదనని నిశ్చయించి, ఏడు లక్షల వరహాలు తనకు బంపవలసిన దనియు, అట్లు పంపక పోయిన దండువెడలి వచ్చుచున్నా ననియు దూతల నంపెను. దేవరాయలు అందు కీయకొనక సుల్తానునకు ఉచితరీతిని జవాబంపెను. అందుమీద యుద్ధము ప్రారంభమైనది. ఇది సుల్తాను అలా ఉద్దీన్ విజయనగరముపై నెత్తివచ్చుటకు వాస్తవమైన కారణము. యుద్ధవృత్తాంతమును గూడ అబ్దుర్ రజాకు సంగ్రహముగ వర్ణించి యున్నాడు. ఉభయసైన్యములును గడిప్రాంతమున తారసిల్లినవి; దేశమును పాడుచేసినవి. రాయలసేనాధిపతి లక్కణ దండనాయకుడు గుల్బర్గ ప్రాంతమునకు దండు నడపుకొనిపోయి పెక్కండ్రను ఖైదుచేసి తెచ్చెను. అబ్దుర్ రజాకు ధోరణినిబట్టి చూడగా సుల్తానున కీ దండయాత్రయందు విజయము చేకూడనట్లు తోచుచున్నది. ఈ పట్టున విచారింపదగిన ముఖ్యాంశములు రెండు కలవు. ఒకటి : ముదుగల్లు దుర్గము సుల్తాను సాధింపజాలక పోవుట. కృష్ణా తుంగభద్రల మధ్యదేశమందలి యాయపుపట్టు స్థానములలో ముదుగల్లు ముఖ్యమయినది : ఈ యుద్ధ ప్రారంభదశయందు రెండవ దేవరాయలు ఈ దుర్గమును సుల్తానుచేతినుండి నాచికొనెనని ఫెరిస్తా చెప్పి యున్నాడు. అలా ఉద్దీనుకు ఫెరిస్తా చెప్పునట్లు విజయము కలుగుట వాస్తవమైనచో అతడు ముదుగల్లును కైవసము చేసికొనక శత్రుని వశమున విడిచివేయుట చిత్రము. రెండవది : అలా ఉద్దీనుచే పరాజితుడయి దేవరాయలు సంధిచేసికొనెనని ఫెరిస్తా చెప్పు సమయమందే విజయనగర సైన్య మొకటి వేంగిదేశమున దండుచేయుచు ప్రబలుడైన కళింగ గజపతి కపిలేశ్వరు నోడించి రాజమహేంద్రవరము నాక్రమించుకొని యుండెను. జయోజ్జృంభితమైన సైన్య మొకటి తన పంపుచేయుటకు సంసిద్ధమైయుండ సుల్తాను బెదిరింపులకు జంకి దేవరాయలు సంధిని కాంక్షించుట అసంభవము. ఇది యెట్లుండినను సుల్తానుకు ఈ దండయాత్రవల్ల రాజ్యలాభమేమియు కలిగినట్లు కాన్పింపదు. విజాపురపు జిల్లా ఇండితాలూకా హల్సంగి గ్రామమున గానవచ్చు నాలుగు శాసన శిలలపై 'నాద్ ఏ అలా ఉద్ దౌలవత్ అహ్మదుషాః సుల్తాను' అను పార్శీ శాసనములు గలవు. ఇందువల్ల రెండవ అలా ఉద్దీన్ శాహు రాజ్యముయొక్క దక్షిణపు పొలిమేరయందు హల్సంగి గ్రామ ముండెనని నిశ్చయమగుచున్నది. కావున కృష్ణా తుంగభద్రల నడిమి దేశము రెండవ అలా ఉద్దీన్ శాహు కాలమున బహ్మనీ రాజ్యాంతర్గతము కాదని విదిత మగుచున్నది.

మూడవ దండయాత్ర : ఇది ఎప్పుడు జరిగెనో నిశ్చయించి చెప్పుటకు సాధ్యము కాదు. చరిత్రలయందు దీని ప్రస్తావము కానరాదు. గంగాధరుడను కవి స్వవిరచిత గంగాదాస ప్రతాప విలాసమను నాటక పీఠికయందు దేవరాయలు స్వర్గస్థుడయిన పిదప నతని కుమారుడగు మల్లికార్జునరాయలు రత్నసింహాసనము నధిష్ఠించిన క్రొత్తలో పూర్వము దేవరాయలచే పరాజితులయిన దక్షిణ సురత్రాణ, గజపతు లిరువురును ఎత్తివచ్చి విజయనగరమునకు ముట్టడివేసి రనియు, మల్లికార్జునరాయలు వారి నోడించి దిశాపట్టులను గావించె ననియు చెప్పి యున్నది. ఇందు పేర్కొనబడిన దక్షిణ సురత్రాణుడు రెండవ అలా ఉద్దీను అనుటకు సంశయము లేదు. మల్లికార్జునరాయలు సురత్రాణ, గజపతుల నోడించినట్లు గంగాదాస విలాసమునందు చెప్పియున్నను విజయము సురత్రాణ, గజపతులకే చేకూరె ననుటకు సాక్ష్యము కొంత కలదు. కాని, ఈ దండయాత్రను గూర్చి యింతకంటె విశేష మేమియు దెలియదు.

2. కొంకణ విజయము : మొట్టమొదటినుండి బహ్మనీ సుల్తానులు కొంకణమును తమ యేలుబడిక్రిందికి తెచ్చుకొనుటకు ప్రయత్నములు చేయుచు వచ్చిరి. అలా ఉద్దీను హసన్ గంగు ఖారేపట్టణము, గోవా, దాభోళ్ మున్నగు రేవుపట్టణములను జయించి స్వాధీనము చేసికొనెను. ముజాహిదు మరణానంతరము విజయనగర పాలకుడైన రెండవ హరిహరరాయలు బహ్మనీయులను పారదోలి తీరదేశమున చాల భాగము నాక్రమించుకొనెను. తరువాత అహ్మదు శాహు దినములలో ఆ ప్రాంతమును మరల జయించుటకు ప్రయత్నము కావింపబడెను; కాని గుజరాతు సుల్తానుతో ఘర్షణ కలుగుటవలన అతని పూనిక నెరవేరక పోయెను. తండ్రి తలపెట్టిన యత్నమును కొనసాగించుటకు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



క్రీ. శ. 1437 లో రెండవ అలా ఉద్దీను నిశ్చయించి దండు వెడలెను. అప్పుడు కొంకణము పెక్కు చిన్న రాజుల యేలుబడి క్రింద నుండెను. వారిలో సంగమేశ్వ రాధిపతి ప్రబలుడు. పర్వతారణ్యభూయిష్ఠ మగుటవలన అతని రాజ్యము శత్రుజనదుర్గమమై సాధింప నలవిగాక యుండెను. బహుప్రయాసపడి అడవులను నరకించి గండశిల లను నలియగొట్టి చదును చేయించి మార్గ మేర్పరుచుకొని అలా ఉద్దీను ఆ దేశమును, బొబ్బిలి సంగమేశ్వరాధిపతిని నేలకు గోలకు దెచ్చెను. అతడు రూప యౌవన సంపన్ను రాలయిన తన కుమారితను సుల్తానున కిచ్చి ఉద్వాహ మొనర్చి సంధి చేసికొనెను.

కొంకణ విజయ మంతటితో సంపూర్ణము కాలేదు. క్రీ. శ. 1446-47 లో అలా ఉద్దీను కొంకణ ప్రాంత మునకు మరల నొకదండయాత్ర నంపవలసి వచ్చెను. విదేశ సర్దారులలో ముఖ్యుడును, మల్లిక్ ఉత్ తుజ్జార్, అనగా వాణిజ్య వ్యవహారముల కధిపతియునైన ఖల్ఫ హసన్ అనునతడు సేనాధ్యక్షుడుగ నియమింప బడెను. సైన్యము కొంకణము చేరగనే దక్కనీ సర్దారులు వైదేశి కులమీది యీర్ష్యవలన స్థానిక సామంతులతో కుట్రలు చేసి దండయాత్ర యుద్దేశమును నెరవేరనీయక భగ్నము కావించిరి. వైదేశికులు బహుళముగ మడిసిరి; ఖల్ఫ హసన్ ప్రాణములు కోల్పోయెను. హతశేషులైన వైదేశి కులు పూనా సమీపమందుండు చాకన్ దుర్గమున తల దాచుకొనిరి. కాని వారి కచ్చటను సంరక్షణ చేకురలేదు. దక్కనీకక్షవారు సుల్తాను సముఖమున జేరి వైదేశికుల ద్రోహప్రవర్తనయే దండయాత్ర భగ్నమగుట కేకైక కారణ మని కొండెములు చెప్పి వారిని నిర్మూలము చేయుట కనుజ్ఞ పడసిరి. తరువాత దక్కనీలు వైదేశికులను విందు కాహ్వానించి వారి నందరను ద్రోహముచేసి చంపిరి. అట్లు అచ్చట నిహతులైన వారిసంఖ్య రెండువేలకు పైబడెను. వారిలో సయ్యిదులే 1200 ఉండిరి. చావక తప్పించుకొని పారివచ్చిన వైదేశిక సర్దారు లిద్దరు ముగ్గురు సుల్తాను నా స్థానము చేరి వాస్తవము నతనికి విన్నవించిరి. వాస్తవ మెరుకపడిన పిమ్మట సుల్తాను దుఃఖాక్రాంతుడై దక్కనీ సర్దారులలో ప్రముఖులకు మరణదండన విధించి నిహతులైన వైదేశికుల కుటుంబములను కాపాడుటకు తగిన పేర్పాటు లను కావించెను. వైదేశికులు సత్వరముగ రెక్కొని యథాపూర్వము రాజకీయ వ్యవహారములలో వ్యాప్తి నంది ప్రబలులైరి. సయ్యిదులు మహమ్మదీయులలో బ్రాహ్మణులవంటివారు. వారి సంఘాతహననము వలన సుల్తానుకు గొప్ప యపకీర్తి గలిగినది.

3. ఖాన్‌దేశ యుద్ధము : ఈ యుద్ధమునకు కారణము సుల్తాను తనరాణివాసములయెడ చూపిన వారచూపు. అలా ఉద్దీన్ దక్షిణ నాయకుడు కాడు. అతడు సంగమే శ్వరాధీశ్వరుని పుత్రిక సౌందర్యమును గాంచి మోహ విభ్రాంతుడయి సర్వదా ఆమె యంతఃపురమునందే నివసించుచు ఆమె సంగతినే కాలము గడపుచుండెను. ఇది అతని పట్టమహిషికి, ఖాన్‌దేశాధిపతియగు నసీరు ఖానుని కుమార్తెకు కనుకుట్టి నట్లాయెను. ఆమె తన తండ్రితో మొరపెట్టుకొనెను. నసీరు ఖాను అంతట కుపితుడైవరాట (బేరారు) ప్రాంతమునకు ఎత్తివచ్చి సుల్తానుయొక్క ప్రతి నిధియైన ఖాన్. జహానుని నార్నాలు దుర్గమునుండి వెలుప లికి రానీయక యరికట్టెను. ఆ వర్తమానము తెలియవచ్చి నంతటనే సుల్తాను క్రీ. శ. 1438లో మల్లిక్ ఉత్ తుజ్జార్ ఖల్ఫ హసన్ అధిపత్యము క్రింద ఒక సైన్యమును నాసిరు ఖానుని ప్రతిఘటించి పారదోలుట కొరకు వరాటదేశ మున కంపెను. ఖల్ఫ హసను దండయాత్రను విజయవంత ముగ కొనసాగించుకొనివచ్చి సుల్తానుయొక్క మన్ననకు పాత్రుడాయెను. అది మొదలు ఖల్ఫ హసన్‌ను అతనితోడి వైదేశిక సర్దారులు దర్బారునందు సింహాసనమునకు కుడి ప్రక్కను, దక్కనీలు ఎడమ ప్రక్కను గూర్చుండ వలసినట్లు పేర్పాటు గావింపబడెను. ఇది ఆ రెండు కక్షలకు మధ్య రవరవలు పెంపొందించెను.

4. తెలంగాణాలో హోవడి : సుల్తాను అలా ఉద్దీనుకు కాలిమీద గాయము తగిలి చీము పోసి క్రమక్రమముగ గొప్పవ్రణమై తేలినది ; నడయాడుటగూడ సాధ్యము కాకపోగా పడక యెక్కి రెండు సంవత్సరములు రాజమం దిరముననే నవయుచుండెను. సుల్తాను లోకాంతర గతు డాయెనను అవాజా రాజ్యమందు వ్యాపించినది. అది విని బాలకొండ దుర్గాధిపతియైన జలాల్ ఖాన్ బుఖారి యను వైదేశిక సర్దారుడును, అతని పుత్రుడు సికందరు ఖానుడును స్వతంత్ర పతాకము నెత్తి తిరుగబాటు చేసిరి. తెలంగాణాలోని హిందూసామంతులు కొందరు వారితో నేకీభవించిరి. సుల్తాను తమ్ముడును, మాహూరు కుల్లుం రామగిరి రాష్ట్రముల కధిపతియునైన మహమ్మదు ఖానుడు వారికి తోడ్పడెను. నల్లిరాష్ట్రము వారికి హస్తగత మాయెను. భోనగిరి దుర్గము కైవసపడెను. ఈ తిరుగ బాటు సంగతి అలా ఉద్దీన్‌కు తెలియవచ్చినంతటనె ఒక లక్ష యెనుబదివేల దండుతో బయలుదేరి తెలంగాణాపై నడచెను. బీదరునుండి దండు వచ్చుచున్నదని విని సికందరు ఖానుడు తన పినతండ్రిని, కుటుంబమును బాల కొండ దుర్గమున వదలిపెట్టి, మాహూరునకు పోయి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అచటినుండి మాళవదేశమును చేరి, అప్పుడచట పాలించు చుండిన ముహమ్మద్ ఖల్జీయను సుల్తానుయొక్క దర్శనము చేసికొని తన యేలికయైన అలా ఉద్దీను శాహు లోకాంతరగతుడాయె ననియు, తరువాత పాలన పటుత్వము చెడి దక్కనురాజ్యమునందు అరాజక పరిస్థితులు ప్రబలి మహమ్మదీయుల యధికారము నమసిపోవ సిద్ధముగ నున్నదనియు, కావున అతడు అచటికి విజయముచేసి ధర్మసంగతణము కావింపవలయు ననియు ప్రార్థించెను. ముహమ్మదు ఖల్జీ విశేషరాజ్యకాంక్షగల ప్రభువు కావున, అతడు సికిందరు ఖాను ప్రార్థన నంగీకరించి యేబదివేల గుర్రపు ఫౌజుతోగూడ దక్కనుపై దండెత్తి వచ్చెను. ఈ లోపల సుల్తాన్ అలా ఉద్దీను శాహు తెలంగాణాను ప్రవేశించి పితూరీఖోరులను శిక్షింప గడగెను. దేవరకొండ వెలమ ప్రభువు లింగమనేడు సుల్తాను సైన్యమునుగాంచి విప్లవకారులను నిర్జించి వారి వశమందుండిన రాష్ట్రములను, దుర్గములను సాధించుటయందమోఘమైన సాహాయ్యము నొసఱ్చెను. సుల్తాను అలా ఉద్దీను ముహమ్మదు వచ్చుచున్నాడని విని మహమ్మదు గావానను వైదేశిక సర్దారుని కొంత దండుతో గూడ బాలకొండ దుర్గమును ముట్టడింప నంపి తాను స్వయముగా మాళవ సురత్రాణు నెదుర్కొనబూనుకొనెను. ఉభయసురత్రాణుల వాహినులు నొండొరుల నను సమీపింపగనే ముహమ్మదు ఖల్జీకి అలా ఉద్దీను వ్యాధినొందలే దనియు, స్వయముగ దండునడపుకొని వచ్చుచున్నా డనియును దెలియవచ్చినది. అతని నెదిరింప ధైర్యము చాలక ముహమ్మదు ఖల్జీ సేనను మరల్చుకొని నిజదేశమునకు తరలిపోయెను. సికందరు ఖానుడు మాళవ సైన్యము నుండి తప్పించుకొని పారిపోయి బాలకొండ దుర్గమును ముట్టడించియుండిన మహమ్మదు గావానుని శరణుచొచ్చి తన తండ్రియైన జలాలు ఖానునికి హితము చెప్పి బాలకొండ దుర్గము నతనికి వశము కావించెను. గావానుడు అతనికి అభయమిచ్చి సుల్తాను కోపమునకు గురికాకుండ తప్పించెదనని వాగ్దానము చేసెను.

ముహమ్మద్ ఖల్జీ వెనుదిరిగి పోయినపిమ్మట సుల్తాను అలా ఉద్దీను శాహు తెలంగాణాను సాధింప సమకట్టెను; రేచెర్ల లింగమనాయని సహాయమున భోనగిరి దుర్గమును సాధించెను; సబ్బిరాష్ట్రమునుండి శత్రువులను పారదోలి స్వాధీనము చేసికొనెను. మాహూరును జయించి తమ్ముని మహమ్మదు ఖానుని ఆజన్మాంతము చెరసాలయందుంచెను. ఇట్లు జలాల్, సికిందరుల కైతవమువలన తెలంగాణాలో రేగిన హోవడి నణచివేసి జయజయధ్వానములతో సుల్తాను అలా ఉద్దీను నిజ రాజధానియైన బీదరుపురమునకు బోయి చేరెను.

సుల్తాను అలా ఉద్దీనుకు స్వమతమునందు దృఢ విశ్వాసము కలదు; దానితోపాటు పరమత ద్వేషమును దుస్సహమైనదే. హిందూ దేవాలయములను, పాడిగుళ్లను ధ్వంసముగావించి వాని స్థానమున మసీదులను పెక్కింటిని నిర్మించెను, వానియందు నమాజు మున్నగు కార్య కలాపములను నిర్వర్తించు మౌలవీలకు జీవనోపాయములను, ఖండస్ఫుటిత జీర్ణోద్ధరణాదులను నెరవేర్చుటకు తగు నేర్పాటులను కావించెను. మొట్టమొదట ఇతడు మద్యపాన విముఖుడై రాజ్యమునందు త్రాగుడును నిలుపుటకు కఠిన శాసనముల నేర్పరచి, నేరస్థులను తీక్ష్ణముగ దండించుచు వచ్చెను. తరువాత మద్యపానాసక్తుడై నిరంతరము వారుణీదేవత నుపాసింప గడగెను. 'యథా రాజా తథా ప్రజా' యను న్యాయము ననుసరించి అతని యనుచరులలో త్రాగుడు హెచ్చెను. ఇతడు చేసిన సత్కార్యములలో వ్యాధి పీడితుల బాధను బాపుటకు నిర్మించిన వైద్యశాల ముఖ్యముగ పేర్కొన దగినది. ఇతని వైదేశిక పక్షపాతమువలన వైదేశిక, దక్కనీ సేనల పరస్పర స్పర్ధ మిక్కుటమై శాంతి భద్రతలకు భంగము కలిగించినది: ఇరువది రెండేండ్లు రాజ్యము పాలించిన పిమ్మట అలా ఉద్దీను క్రీ. శ. 1458 లో దేహము చాలించెను.

హుమాయూన్ (క్రీ.శ. 1458 - క్రీ. శ. 1461). రెండవ అలా ఉద్దీను మరణానంతరము అతని కుమారుడు హుమాయూను బీదరు భద్రపీఠము నెక్కి క్రీ. శ. 1458 మొదలు 1461 వరకు మూడేండ్ల కాలము రాజ్యపాలనము చేసెను. స్వభావముచే కడు క్రూరుడగుటచే నతనికి జాలిమ్ అను దురభిమానము గల్గెను. తండ్రివలె హుమాయూనుకు కూడ వైదేశిక సర్దారులయెడ అభిమాన మధికము. తత్కారణమున వారిలో ప్రముఖుడైన మహమ్మదు గావానుని చేరదీసి, మలిక్ నాయిబ్ పదము నొసగి, విజాపురమున కధిపతిగ నియమించెను. దక్కనీలకు అది తల దన్నినట్లయినది.

ఈసుల్తాను రాజ్యకాలమున జరిగిన ముఖ్యాంశములు మూడు: మొదటిది: తెలంగాణాలో జలాల్, సికిందరు ఖానుల తిరుగబాటు. వీరు మనకు పరిచితులే. అలా ఉద్దీను మరణించినవెనుక వీరు తమ స్వభావమును మార్చుకొనక బాలకొండ దుర్గమున మరల స్వతంత్ర పతాకము నెగుర వేసిరి. అలా ఉద్దీనుతోడి యుద్ధమునందు వెలమలచే దాము పడ్డపాట్లను జ్ఞప్తికి దెచ్చుకొనివారితో చెలిమి పాటించి సుల్తానుతో యుద్ధమునకు కడగిరి. కొన్నాళ్ళపాటు పోరాటము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సాగినది. బాలకొండ కడ జరిగిన ఘోర యుద్ధమునందు సికిందరు ఖానుడు దైవ దుర్విపాకమువలన తన గుఱ్ఱము మీదనుండి క్రిందబడి గొరిజల త్రొక్కుడుచేత మృతినందెను. తరువాత సుల్తాను అతని సర్వస్వమును గొని, అతని తండ్రి జలాల్ ఖానుని చెరసాలయందు బంధించెను.

రెండవది : వెలమలపై జిహాదు. వెలమల రాజు రేచెర్ల లింగమనీడు సికిందరు ఖానునకు తోడ్పడినందుకు క్రుద్ధుడై సుల్తాను హుమాయూన్ ఖాను జిహాదు ప్రకటించి, శత్రు దుర్భేద్యమని ప్రసిద్ధికెక్కిన వారి రాజధాని దేవరకొండ మీదికి ఖ్వాజా ఇ జహాను, నిజామ్ ఉల్ ముల్క్‌ల నాయకత్వముక్రింద ఒక ప్రచండ సైన్యము నంపి, మరియొక సేనతో తాను స్వయముగ నోరుగంటిమీదికి నడచెను. ఖ్వాజా ఇ జహాను, నిజామ్ ఉల్ ముల్కుల ధాటి సులభముగ సాగలేదు. తెలుగువారేకమై అడుగడుగునకు బహ్మనీ సైన్య పురోగమనమును నిరోధింపగడగిరి. కాని మహమ్మదీయ వాహిని గమనము నాపజాలకపోయిరి. పెక్కు రణక్షేత్రములలో పోరాటము సల్పి బహ్మనీ సేనాధిపతులు కట్టచివరకు దేవరకొండను చేరి ఆ దుర్గమునకు ముట్టడి వేసిరి. దుర్గమును సంరక్షించుట సాధ్యము కాదనియు, వెలుపలి సాయము లేక శత్రువులను జయించుట శక్యము కాదనియు గ్రహించి లింగమనీడు ఒడ్డెరాజు కపిలేశ్వర గజపతికడకు రాయబారమంపి సాయమొనర్పవలయునని ప్రార్థించెను. అతని మొర నాలకించి కపిలేశ్వరుడు తన కుమారుడగు హంవీరుని ఆధిపత్యముక్రింద ప్రచండ సైన్యము నొకదానిని దేవరకొండ సంరక్షణార్థ మంపెను. హంవీరుడు దేవరకొండను సమీపింపగనే లింగమనీడు దుర్గద్వారములను తెరిపించి, ఆకొన్న సింగములవలె [illegible] చెండాడ నువ్విళులూరుచుండిన వెలమ వీరులతో మహమ్మదీయులపై బడెను. ఇట్లు హిందూ సేనల మధ్య చిక్కుకొనిన బహ్మనీ దళము అడకొత్తులోని పోకగతి చెంది ఛిద్రుపలై పోయినది. హతశేషులు ఓరుగంటి కడనుండి సుల్తాను స్కంధావారమును చేరునందాక తిరిగి చూడలేదు. హుమాయూను శాహు కోపోద్దీపితుడై దేవరకొండ రాజ్యము నెట్లయిన సాధింపవలయునని నిశ్చయించి మరల దళములను గూర్చుకొని దండు వెడలుటకు ప్రయత్నములు చేయగడగెను. ఇంతటనే బీదరునందు సుల్తాను తమ్ముడైన హసను ఖానుడును, మరి వేవురు సర్దారులును కారాగార విముక్తులై అతని యధికారమును కూలద్రోయ దలపెట్టుచున్నారని వార్త వచ్చినది. ఇక దండు వేయుచు రాజధానికి పోవక తడయుట మేలు గాదని తెలంగాణావ్యవహారములను మహమ్మదు గావానున కొప్పగించి బీదరు చేరబోయెను. సుల్తాను దుర్గమునుండి వెనుక తెలంగాణా స్థితిగతులు తీవ్రముగ మారినవి. హంవీరుడును, లింగమనీడును ఏకమై తెలంగాణానుండి మహమ్మదీయుల పారద్రోల నారంభించిరి. రాచకొండయు మున్నగు దుర్గములు వారికి సునాయాసముగ కైవసపడినవి. కట్టచివరకు క్రీ. శ. 1461 లో ఓరుగంటి నిందరు కూచిచేసి వచ్చి మహమ్మదు గావాను నోడించి పారద్రోలి యా దుర్గమును సయితము స్వాధీనము చేసికొనిరి. అంతట తెలంగాణా రాజ్యము బహ్మనీ సుల్తాను చేతినుండి దుసికిలిపోయినది.

మూడవది : హసను ఖానుని తిరుగబాటు. ఇది వైదేశిక, దక్కనీ కక్షల పరస్పర ప్రతిస్పర్ధకు ఫలితమని చెప్ప వచ్చును. ఆదినుండియు హుమాయూను శాహు పట్టున వైదేశికులు వైరమును చూపుచు వచ్చిరి. అతని పట్టబంధనము జరగనీయక భగ్నము చేయుటకు పన్నాగములు పన్నిరి. కాని వారి పథకము నెరవేరదాయెను; కొందరు మడిసిరి; పెక్కండ్రు హసన్ ఖాను మున్నగు సుల్తాను సోదరులతో కూడ కారాగారమున బంధితులైరి. సుల్తాను తెలంగాణాలో దండుచేయబోవుటవలన వారికి తమ యుద్యమమును నెగ్గించుకొనుటకు మరియొకమారు ప్రయత్నము చేయుట కవకాశము కలిగినది. యూసఫ్ తురక యను వైదేశిక సర్దారుడు కుట్రమును చేసి చెరయందుండిన తోడి వైదేశిక సర్దారులను, తమ కక్షపై ఆదరాభిమానములు గల సుల్తాను సోదరుని హసను ఖానుని బంధవిముక్తులను గావించి, హసను ఖానుని రాజును చేసి రాజ్యమును స్వాధీనపరచుకొనుటకు ప్రయత్నము సేయగడగెను. కాని సత్వరముగ విప్లవము భగ్నమైపోయినది. విప్లవకారు లనేకులు హతులయిరి. చావక చేజిక్కినవారిని సుల్తాను పలువిధముల హింసపెట్టి చంపించెను. ఈ తిరుగబాటు మూలమున సుల్తానుయొక్క నైజ క్రూర స్వభావము మరియు నుద్రిక్తమై యెల్లరకు ప్రాణగొడ్డమైనది. కాని, యావల నతడు చిరకాలము జీవింపలేదు. క్రీ. శ. 1461 వ సంవత్సరమున కడపట నతడు దైవికముగ లోకాంతరగతుడాయెను. నగరిదాసి యొక్కతె సుల్తాను నిద్రించుచుండగా హత్యచేసి చంపెనని చెప్పుదురు. సత్యమే కావచ్చును.

**నిజామ్ శాహు (క్రీ. శ. 1461 - క్రీ. శ. 1463) :** హుమాయూను శాహుకు ఇద్దరు కుమారులు కలరు. పెద్దవాడు నిజామ్ ఉద్దీను; రెండవవాడు షమ్సు ఉద్దీను మహమ్మదు. ఇద్దరును చిరుత ప్రాయపు పసుగులు. తండ్రి మరణించిన తరువాత పెద్దవాడు నిజామ్ శాహు అను అభిషేక



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



నామముతో సింహాసనము నధిష్ఠించెను. కాని, మఖ్దూమా ఇ జహాన్ బిరుదాంకితురాలైన అతని తల్లి నర్గిస్ బేగము ఖ్వాజా ఇ జహాన్ తురక, మల్లిక్ ఉత్ తుజ్జార్ ముహమ్మదు గావాను లను నిద్దరు వైదేశిక సర్దారులను మంత్రులను చేసికొని, వారి సలహా ప్రకారము రాజకార్యముల నన్నిటిని నిర్వహింపగడగినది. నిజాము శాహు పాలించినది మూడేండ్లకాలము మాత్రమే. ఈ మూడేండ్ల లోపలను బహ్మనీ రాజ్యము ఘోర విపత్తుల పాలయినది. సింహాసనమే కూలిపోవచ్చునను శంక కల్గినది. వైదేశిక దండయాత్రలు పైకొనినవి. ఒడ్డె గజపతియు, మాళవ సురతాణియు ఒక్కొక్కరు రెండేసి పర్యాయములు దండెత్తివచ్చి రాజ్యమును కబళింప నుద్యుక్తులైరి. ఈ దండయాత్రలను ఫెరిస్తా మున్నగు చరిత్రకారులు విపులముగ వర్ణించియున్నారు. వారు చెప్పు వృత్తాంతముల సారాంశ మిది.

ఒరిస్సా దేశపు రాజు గొప్ప సైన్యముతోగూడ రాజమహేంద్రవర మార్గముగుండ ఎత్తి వచ్చి తెలంగాణా జమీన్‌దారులను కూడగట్టుకొని కౌలసపర్యంతము దేశము చూరపట్టి బీదరు రాజధానికి అనుమైళ్ళ దూరమున పాళెము దిగ్గెను. నిజాము శాహు గజ హయ పదాతి బలములతో నాతని నెదిరింప బయలువెడలి వచ్చెను. గజపతి బలముల సమీపమునకు వచ్చినంతట, సుల్తాను సర్దారులలో ఒక్కడు నూటయేబది యాశ్వికులతో వారిపై గవిసెను. ఆ యాశ్వికుల తాకున కాగజాలక హిందువులు పటాపంచలై పారిపోయిరి. వెన్నడచి పయను మహమ్మదీయుల తాకకోర్వజాలక గజపతి సుల్తానున కారులక్షల ద్రవ్యమును యుద్ధపు ఖర్చులక్రింద కట్టి యిచ్చి నిజ రాజ్యమునకు వెడలిపోయెను. బ్రిగ్స్ వచించినట్లు ఈ కథ విశ్వాసపాత్రము కాదు. నూటయేబదిమంది యాశ్వికులచే దశసహస్ర సంఖ్యాకమైన గజపతి సైన్యము నిర్జింపబడెననుట వట్టి మాట. బహ్మనీ ఫౌజు ప్రతాపము గజపతిదళము ఎరుగనిది కాదు. దేవరకొండ, రాచకొండ, ఓరుగల్లు రణక్షేత్రములందు బహ్మనీయులను కండతుండెములు కావించి, తెలంగాణా రాజ్యమును వారికడనుండి నాచికొని, అప్పటికింకను ఆరు మాసములు కాలేదు. ఈలోపలనే గజపతి సైనికులు రణభీరువులై నూటయేబండ్రు తురక రౌతుల యాటోపము సైరింపజాలక పలాయితులైరనిన నమ్ముటకు వీలు లేకున్నది. ఈపట్టున గమనింపదగిన ముఖ్యాంశములు రెండు కలవు: ఒకటి : ఇంత గొప్ప విజయము చేకురినను సుల్తాను తన్ను జయించిన గజపతి కైకొనిన తెలంగాణాను మరల స్వాధీన పరచుకొనుటకు ప్రయత్నము చేయకుండుట; రెండవది : గజపతి కపిలేశ్వరుడు అప్పుడే బహ్మనీ రాజ్యముపై ఎత్తి వచ్చుచుండిన మాళవ సురతాణి ముహమ్మదు ఖల్జీతో చెలిమి పాటించి, అతని గూడి తన తెలింగ సామంతబలములతో బీదరుపై నడచి ఆపట్టణమును ముట్టడించి కైకొనుట. ఈ యంశములను దృష్టియందుంచుకొని చూడగా ఒడ్డె, మాళవ దండయాత్రలు ప్రత్యేకములు కావనియు, అవి యొక్క దండయాత్రలోని అవాంతర ఘట్టము లనియు తోచుచున్నది. మాళవ సురతాణియు, గజపతియు బహ్మనీ రాజ్యముపై ఏక కాలమున దండు వెడలున ట్లొడంబడిక చేసికొని అదే ప్రకారము తూర్పునుండి గజపతియు, ఉత్తరమునుండి మాళవాధిపతియు ఎత్తివచ్చి రనియు, ముందు వచ్చిన గజపతి మాళవసేనలు వచ్చుచున్నవని విని వారికి ప్రత్యుత్థానము సేయుటకొరకు పాళెము లేపుకొని పోయి వారిని కలసికొనెననియు నెంచదగియున్నది.

ఒడ్డె మాళవ బలములు మాహూరు ప్రాంతమున సంధించినవి, అచటినుండి ఏకమై బీదరువైపు నడచినవి. కంధార సమీపమునకు చేరునందాక వారి ప్రయాణము నిరాతంకముగ సాగినది. నిజామ్ శాహు దళములను కూర్చుకొని వచ్చి అచట వారి మార్గము నరికట్టెను. ఇరువాగులకును భయంకరమైన యుద్ధము సంప్రాప్తమైనది. రెండు పక్షములవారును జంకుకొంకులులేక పరాక్రమించి పోరాడిరి. తుదకు బహ్మనీ సైన్యము విరిగి వెన్ను చూపెను. ఇక అట తడయుట క్షేమకరము కాదని నిజామ్ శాహు పరుగిడివచ్చి రాజధాని చొచ్చెను. అచటి యునికికూడ భద్రకరము గాదని రాజమాత మఖ్దూమా ఇ జహాన్ అతనిని తీసికొని ఫీరూజాబాదునకు పోయి చేరెను. కంధారమునుండి బయలువెడలి ఒడ్డె, మాళవ బలములు రాజ్యమున చాల భాగమును జయించి స్వాధీనముచేసికొని బీదరు మీదికి నడచివచ్చి పట్టణమునకు ముట్టడివేసినవి. పట్టణము సునాయాసముగ హస్తగతమైనను కోట వశపడలేదు. రాణ్యము వారు తమ యావచ్ఛక్తిని వినియోగించి శత్రువుల యత్నము భగ్నముచేయుచు వచ్చిరి. కాని, యెట్టకేని దాని పతనము తప్పదని తెల్లమైనది. ఈ విషమ పరిస్థితులలో మహమ్మదు గావానుని రాజనీతి ఆపదను గడవబెట్టి సింహాసనము భగ్నమై పోకుండ కాపాడినది. గుజరాతు, మాళవ సుల్తానుల పరస్పర వైరము నతడు గుర్తించి గుజరాతు పాలకుని యాస్థానమునకు రాయబారమంపి సహాయ మర్థించెను. గావానుని ప్రార్థన నంగీకరించి గుజరాతు సుల్తానగు మహమ్మదు బేగరా సైన్యమును గదల్చుకొని మాళవ గడి దేశమువైపు కూచిచేసి వచ్చెను.



http://www.sanskritcentral.com/

http://teluguthesis.com/



గుజరాతు సుల్తాను తన రాజ్యముపై నెత్తివచ్చు చున్నాడను సంగతి తెలియగనే మహమ్మదు ఖిల్జీ బీదరు ముట్టడిని లేవదీసికొని యెకాయెకి నిజదేశమునకు మరలిపోవ నారంభించెను. బహ్మనీయులకు సందు చిక్కినది. మహమ్మదు గావానుడు చెదరియుండు వశములను సమకూర్చుకొని దక్కనునుండి మాళవమునకు పోవు మార్గముల నరికట్టెను. మహమ్మదు ఖిల్జీ గాండ్వానా అరణ్య మార్గము గుండ ప్రయాణముచేసి బహు ప్రయాసమీద స్వరాష్ట్రమునకు పోయి చేరెను. ఫెరిస్తా మొదలైన బహ్మనీ చరిత్రకారులు దక్కను నుండి మహమ్మదు ఖిల్జీ మరలి తన దేశమునకు పోవునపుడు పడినపాట్లును, పొందిన ధన జన నష్టమును విపులముగ వర్ణించియున్నారు. కాని వారి వ్రాత లతిశయోక్తి భూయిష్ఠములై యున్నవి. ఇంతటి యాపదలబడి చావు దప్పి కన్ను లొట్టబోయిన వానివలె స్వదేశమును జేరిన మహమ్మదు ఖిల్జీ మరల ఆ మరుసటియేటనే దక్కనుపై ఎత్తివచ్చుటయే కాక దౌలతాబాదు పర్యంతము బహ్మనీ రాష్ట్రమును ఎట్లు బారిసమర గల్గెనో తెలుపరు. అతనిని ప్రతిఘటింప శక్తి చాలక మహమ్మదు గావానుడు మరల గుజరాతు సుల్తానుని సాహాయ్య మర్థింప వలసి వచ్చెను. ఆతని వేడుకో లంగీకరించి మహమ్మదు బేగరా యథాపూర్వము మాళవ సరిహద్దు దేశముపై దండెత్తగా స్వరాష్ట్ర సంరక్షణ కొరకు మహమ్మదు ఖిల్జీ దక్కను దండయాత్రను చాలించి మరలిపోయెను. కాని నిజామ్ శాహు శత్రునిర్ముక్తమైన రాజ్యమును చిరకాలము పాలింపలేదు. ఉన్నటులుండి జబ్బుపడి అతడు క్రీ. శ. 1463 జూలై మాసాంతమున పరలోక గతుడాయెను.

**మున్మడి మహమ్మదు శాహు** (క్రీ. శ. 1463 - క్రీ. శ. 1482): అన్న మరణానంతరము హుమాయూన్ శాహు ద్వితీయపుత్రుడైన షమ్స్ ఉద్దీన్ మహమ్మదు సింహాసనమ నధిష్ఠించెను. ఈ పేరుగల బహ్మనీ సుల్తానులలో మూడవ వాడగుటవలన నితనిని ఆధునిక చరిత్రకారులు మున్మడి మహమ్మదు శాహు అని పేర్కొందురు. రాజ్యాభిషేక మప్పు డితని వయస్సు పదియేండ్లు; కావున, రాజ్యతంత్రమును మఖ్దూమా ఇ జహాన్ మునుపటివలెనే ఖ్వాజా ఇ జహాన్ తురక, మల్లిక్ ఉల్ తుజ్జార్ మహమ్మదు గావానులను మంత్రుల సాయమున నడపగడగినది.

మున్మడి మహమ్మదు శాహు రాజ్య కాలములో జరగిన మొట్టమొదటి ముఖ్య చరిత్రాంశము ఖ్వాజా ఇ జహాన్ తురక యొక్క హత్య. ఏకారణమువల్లనో అతడు మఖ్దూమా ఇ జహాన్ యొక్క కోపమునకు గురియాయెను. క్రీ. శ. 1466 నవంబరు మాసములో ఒక్కనాడతడు వాడుక ప్రకారము సుల్తాను దర్శనము చేసికొనుటకై రాజ మందిరమునకు పోగా నచ్చట సుల్తాను సముఖముననే మఖ్దూమా ఇ జహాన్ యొక్క ఆజ్ఞ ప్రకారము వధింపబడెను. అతని మరణానంతరము ఖ్వాజా ఇ జహాను పదమునకు మహమ్మదు గావానుడు నియుక్తుడాయెను. అది మొదలు అతడు బహ్మనీ సంస్థానమునకు సర్వాధికారియై సమస్త రాజకీయ వ్యవహారములను నిర్వహింప గడగెను. మున్మడి మహమ్మదు శాహు పెద్దవాడై రాజ్య భారమును తానే స్వయముగ వహించిన పిమ్మట గూడ మహమ్మదు గావానుని సహాయము లేక యే కార్యము చేయుటకును అతడు సాహసింపడాయెను.

మహమ్మదు గావాను ఖేర్లాను జయింప నుద్దేశించి క్రీ. శ. 1467 లో ఆ ప్రాంతమునకు దండయాత్ర నంపెను; కాని అందువలన ప్రయోజన మేమియు కలుగలేదు. యుద్ధమునందు బహ్మనీ సైన్యమునకు విజయము చేకూరినను ఖేర్లామాత్ర మతని వశము కాలేదు. తుట్ట చివర ఉభయ సంస్థానములకును సమాధానము కుదిరెను. పూర్వము అహ్మదు, హుమాయూను శాహులు చేసికొని యుండిన యొడంబడిక షరతులనె ఉభయ పక్షముల వారును అంగీకరించిరి. యథాపూర్వము వరాట దేశము బహ్మనీ సంస్థానమునకును, ఖేర్లా మాళవ రాజ్యమునకును చెందవలసినట్లు నిశ్చయింపబడెను.

ఖేర్లా దండయాత్ర ముగిసిన పిమ్మట మహమ్మదు గావానుని దృష్టి కొంకణమువైపు ప్రసరించెను. ఆ దేశమును పాలించుచుండిన హిందూ రాజులు కొందరు - ముఖ్యముగ ఖేల్నా సంగమేశ్వర పాలకులు - నావలను సమకూర్చుకొని పశ్చిమ సముద్రముపై ప్రయాణముచేయు మహమ్మదీయ వర్తకులను, మక్కా మదీనా మున్నగు పుణ్యక్షేత్రములను సందర్శింపబోవు యాత్రికులను దారి కొట్టి దోచుకొనుచుండిరి. వారి దుండగములను మాపి సముద్ర ప్రయాణమును నిర్బాధకముగ చేయ సమకట్టి కొంకణమును జయించు నుద్దేశముతో మహమ్మదు గావాను క్రీ. శ. 1468 లో దండు వెడలెను. దుర్గమ పర్వతారణ్య భూయిష్ఠమైన ఆ దేశమున దండు సేయుట సులభమయిన కార్యము కాదు; కొల్లాపురమును నెలవీడు చేసికొని గావాను శత్రుదేశముపై సేనల నంపెను; కాని అందువలన ప్రయోజనము కలుగదాయెను. ఈలోపల వర్షకాలము ప్రారంభమగుటచే దండు చేయుట యసాధ్యము కాగా బహ్మనీ బలములు కొల్లాపురమునకు మరలి పోవలసి వచ్చెను. వానలు వెలిసిన పిమ్మట గావానుడు మరల దండయాత్రను ప్రారంభించి సామ దాన భేద దండో



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పాయములను ప్రయోగించి బహుప్రయాసపడి ఆ రాజులను జయించి వశంవదులను చేసికొని కొంకణ ప్రాంతమునందు చాల భాగమును సుల్తాను యేలుబడి క్రిందికి దెచ్చెను. అదే సమయమున విజయనగరముపై దండు పెట్టవలసిన యావశ్యకత గల్గెను. గోవా రేవుపట్టణమున నివాస మేర్పరచుకొని ఉత్తమాశ్వములను దన కమ్మక బహ్మనీ సుల్తానునకు విక్రయించుచున్నారని కోపించి విజయనగర చక్రవర్తియైన ఇమ్మడి విరూపాక్షరాయలు గుఱ్ఱపు వేపారము సేయుచుండిన మహమ్మదీయవర్తకులను చంపించెను. ఆ యక్రమమునకు కినిసి గావాను గోవా రేవుపట్టణముపై నెత్తిపోయి దానిని స్వాధీనము చేసికొనెను. ఇమ్మడి విరూపాక్షరాయ లీ రేవుపట్టణమును మరల సాధింపవలయునని క్రీ. శ. 1472 లో ప్రయత్నము సల్పెను గాని అందువలన నేలాభమును కలుగలేదు. ఈ విజయము కడు ముఖ్యమైనది. ఆ కాలమున గోవాపట్టణము పశ్చిమ సముద్ర తీరపు రేవులలో కడు గొప్పది; దక్కను పాశ్చాత్య దేశముల మధ్య జరగు వ్యాపారమంతయు నీ రేవుమూలముననే సాగుచు వచ్చినది. ఈ రేవు స్వాధీనపడుటవలన నచట జరగు వ్యాపారమునుండి వచ్చు వరుంబడి యంతయు బహ్మనీ సుల్తానుకు హస్తగతమైనది. మరియు పశ్చిమ సముద్రముపై అతని యాజ్ఞ నిర్వక్రముగ సాగుటవలన అతనికి మహమ్మదీయ వర్తకులను కాపాడుట సుకరమైనది.

కొంకణ విజయమును సమాప్తము గావించి మహమ్మదు గావానుడు క్రీ. శ. 1472 లో బీదరు రాజధానికి వచ్చి చేరెను. ముమ్మడి మహమ్మదు శాహు అతనికి ప్రత్యుత్థానమొసగి విశేష గౌరవాదరములు చూపెను. అటుతరువాత, సుల్తాను ఆంధ్ర రాజకీయ వ్యవహారములలో ప్రవేశము కలిగించుకొనవలసివచ్చినది. గజపతి కపిలేశ్వరుడు క్రీ. శ. 1470 లో స్వర్గస్థు డాయెను. రాజ్యాధిపత్యమునకై అతని పుత్రులు హంవీర పురుషోత్తము లొండొరులతో పోరాడ దొడగిరి. యుద్ధమునందు పురుషోత్తముడు హంవీరుని నిర్జించి సింహాసనము నాక్రమించుకొనెను. హంవీరు డంతట ముమ్మడి మహమ్మదు శాహు సముఖమునకు రాయబారుల నంపి తనకు సాయపడవలసిన దనియు, దానికి ప్రత్యామ్నాయముగ ఆంధ్రదేశమునందు గజపతుల యేలుబడిక్రింద నుండు రాష్ట్రము నంతయు సుల్తానుకు సమర్పింతు ననియు విన్నవించుకొనెను. తన తండ్రి హుమాయూను శాహు నోడించి పూర్వము కపిలేశ్వరుడు వాచికొన్న తెలంగాణా ప్రాంతమును మాత్రమే కాక తీరస్థ ఆంధ్ర దేశమును సయితము తన యేలుబడి క్రిందికి తెచ్చుకొనుటకు ముమ్మడి మహమ్మదు శాహుకు మంచి యవకాశము చిక్కినది. కావున, అతడు నిజామ్ ఉల్ ముల్క్ భైరీయను దక్కనీ సర్దారుని యాధిపత్యముక్రింద కొంత సైన్యమును హంవీరునికి సాయ మంపి, పురుషోత్తము నోడించి యతనిని గద్దె నెక్కించెను. ఒడంబడిక ప్రకారము హంవీరుడు తెలంగాణా తీరస్థాంధ్ర ప్రాంతములను సుల్తానుకు వశము చేసెను; బహ్మనీ రాజ్యము యొక్క పొలిమేర లంతటితో పూర్వ పశ్చిమ సముద్రములను తాకినవి. ఇట్లు సంక్రమించిన నూతన రాష్ట్రమునకు సుల్తాను మలిక్ నిజామ్ ఉల్ ముల్క్ భైరీని సర్ లష్కర్ ఇ తిలింగ్ అను బిరుదుతో సేనాధిపతిని కావించి రాజమహేంద్రవర దుర్గమునకు అధ్యక్షుని చేసెను; మరియొక మహమ్మదీయుని కొండపల్లి దుర్గమునకు పాలకునిగ నియమించెను. మహమ్మదు శాహుచే కొండపల్లి దుర్గపాలకుడుగ నియుక్తుడైన మహమ్మదీయుడు క్రూర స్వభావుడు. వాని దుండగములను సహింపజాలక యచటి ప్రజ లతనిపై తిరుగబాటు చేసి తరుమగొట్టి హంవీరు డను నొక యొడ్డె సామంతునకు దుర్గమును అప్పజెప్పిరి. ఈ హంవీరుడు పురుషోత్తమునియెడ పక్షపాతము గలవాడు; కావున అతడు మహమ్మదీయుల నాంధ్రదేశమునుండి తోలివేయుటకు అనుకూల సమయము వచ్చె ననియు, అందు తాను తోడ్పడ సిద్ధముగ నున్నాడ ననియు పురుషోత్తమునికి జెప్పి యంపెను. పురుషోత్తము డంతట సేనతో బయలుదేరి రాజమహేంద్రవర పర్యంతము దాడి చేసెను. అచట హంవీరు డతనిని గలసికొనగా, ఆ యిరువురును ఏకమై రాజమహేంద్రవర దుర్గమునకు ముట్టడి వేసిరి. ఆ సమయముననే దక్షిణదేశమున చంద్రగిరి రాజ్య పాలకుడైన సాళువ నరసింగరాయలు కూడ ఏకారణమువల్లనో దండుతో కూచిచేసి వచ్చి గోదావరి యవ్వలి తటమున పాళెము డిగెను.

ఈ సంభవము లన్నియు ముమ్మడి మహమ్మదు శాహుకెరుకపడినంతటనే అతడు ఫౌజులను సమకూర్చుకొని ప్రధాన మంత్రియగు మహమ్మదు గావానును, తన కుమారుడైన మహమ్మదును, సమస్త వైదేశిక దక్కనీ సర్దారులను వెంటబెట్టుకొని హుటాహుటి ప్రయాణములమీద వచ్చి రాజమహేంద్రవరమును చేరెను. అతని రాకను కాంచి పురుషోత్తముడు పాళెము లేపుకొని స్వదేశాభిముఖుడై చనెను. మహమ్మదు శాహు వారి నూరక విడిచిపెట్టలేదు. మొట్టమొదట అతడు పురుషోత్తముని వెన్నంటి తరుముచు బోయి యుద్ధమునందు ఓడించి పెక్కు మదగజములను, విలువగల కానుకలను గొని మరల వచ్చి రాజమహేంద్రవరమును చేరెను. నూతనముగ జయించిన



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



రాజ్యమును చక్కగ పాలించుటకు తగిన కట్టుపాట్లను సేయుచు, అతడు క్రీ. శ. 1478 మొదలు 1480 వరకు రెండేండ్ల కాలము రాజమహేంద్రవరమును నెలవీడు కావించుకొని యుండెను. పాలన సౌకర్యార్థము తెలంగాణాను పూర్వ, పశ్చిమ తెలంగాణాలను రెండు ప్రాంతములుగ విడదీసి మొదటిదానికి రాజమహేంద్రవరమును, రెండవదానికి ఓరుగల్లును రాజధానులుగ నేర్పరచి నిజాముల్ ముల్క్ భైరీ నొకదానికిని, అజీమ్ ఖానుని మరియొకదానికిని పాలకులనుగ నియమించెను.

తెలంగాణా పరిపాలనకు వలసిన ఏర్పాటులను కావించి రాజ్యమును బందోబస్తు చేసికొనిన పిమ్మట సాళువ నరసింగ రాయలను శిక్షించుటకై ముహమ్మదుశాహు దండు వెడలి క్రీ. శ. 1480 వ సంవత్సరాంతమున కొండవీటి దుర్గమును ముట్టడిచేసి స్వాధీనము చేసికొనెను. కోటలోని గొప్ప దేవాలయమును ఇడియగొట్టించి దాని స్థానమున ఒక మసీదును గట్టించెను; దేవాలయపు పూజారిబ్రాహ్మణులను తన చేతితో నరకి చంపి గాజీ యను బిరుదు వహించెను. అచటి నుండి ఏకాయెకి ప్రయాణములమీద నరసింగరాయల రాజ్య మధ్యమున నుండు ధన సంపన్నమైన కాంచీనగరముపై దాడి చేసి పోయి దానిని చూరపట్టి అపారమగు ధన రాసులతో నిజరాజ్యమునకు మరలెను. కాని అతని ప్రయాణము నిరాటంకముగ సాగలేదు. నరసింగరాయల పంపున అతని సేనాధిపతియైన తుళువ ఈశ్వర నాయకుడు నెల్లూరు మండలములోని కందుకూరుకడ అతనిని అడ్డగించి, అతడు కొనిపోవుచుండిన చూర ధనమును, దండు గుఱ్ఱములను అపహరించెను. మహా సాహసముచేసి బహు ప్రయాసమీద ముహమ్మదు శాహు చేసిన కంచి దండయాత్ర వ్యర్థమై పోయినది. ఫలరహితమైనను ఈ దండయాత్ర సంస్మరణీయమైనదే. ఈ దండయాత్ర సందర్భముననే దక్కనీలు కుట్ర చేసి సుల్తానును వంచించి అతనిచే మహమ్మూదు గావానుని చంపించిరి. మహమ్మూదు గావానుని వధను చరిత్రకారులు పలు తెరగుల వర్ణించియున్నారు. అం దేది నిజమో నిశ్చయించి చెప్పుటకు వీలు లేదు. కాని వానియొక్క సారాంశ మిది: అతడు సుల్తానునకు కూర్చు హితునివలె వర్తించుచున్నను లోలోపల ద్రోహచింతతో అతని యధికారమును కూలద్రోయుటకొరకు అతని సహజశత్రువులైన గజపతి, నరసింగరాయలలో నొక్కరితో కుట్రలు సలుపుచున్నట్లు సుల్తానుతో చెప్పి అతడు మద్యపాన మత్తుడైయున్న సమయమున గావానుడు గజపతికో, నరసింగరాయలకో వ్రాసినట్లు రచింపబడిన యొక కల్పిత లేఖను చూపించి అతనిని నమ్మించిరి. సుల్తాను అంతట గావానుని తన సముఖమునకు రప్పించి నిండు సభయందు చంపించెను. ఈ కథ సత్యమైనను కాకపోయినను దక్కనీల కుట్రలకు లోనయి సుల్తాను ముహమ్మదు శాహు మహమ్మూదు గావానుని జంపించినది వాస్తవము.

గావానుడు గొప్ప విద్వాంసుడు; శాస్త్రవేత్త; అరబీ పారసీ భాషలలో చక్కని కవిత్వ మల్లగల నేర్పరి; బహుగ్రంథకర్త; లేఖారచయిత; వాగ్మి; వినయవిభూషణుడు. అతని రాజ్యతంత్ర మర్మజ్ఞత ప్రశంసనీయమైనది. భారత దేశచరిత్రలో ప్రసిద్ధికెక్కిన మహమ్మదీయ మంత్రి పుంగవులలో నతడు అగ్రశ్రేణికి చేరినవాడు. నీతిప్రయోగ నైపుణ్యముచే హుమాయూను కాలమునుండి స్వనిధన పర్యంతము పెక్కు తడవలు అతడు బహ్మనీ సంస్థానమునకు ఆపాదిల్లిన యాపదలను గడవబెట్టి సంరక్షించెను. కార్యమునం దెట్లో ఖడ్గమునందును నట్లే తన శక్తి సామర్థ్యములను చూపి మహమ్మూదు గావాను బహ్మనీ సుల్తానులకు సహజశత్రువైన విజయనగర చక్రవర్తిని, అతని సామంతులైన బెల్గాము బంకాపుర సంగమేశ్వరాధిపులను జయించి బహ్మనీ రాజ్యమునకు పశ్చిమమున సముద్రమును సరిహద్దు గావించెను. రాజ్యపాలన విధానమున పెక్కుమార్పులను ప్రవేశపెట్టి సర్దారుల ప్రాబల్యమును తగ్గించి సుల్తాను యొక్క అధికారమును బలపరచెను. గావానుని చరితము ఆదర్శ పాత్రమైనది; స్వార్థచింతన అత డెరుగడు. తా నార్జించిన విత్తమును పరోపకారార్థము వినియోగపెట్టెను; వదాన్యతచే బీదసాదలను సంరక్షించెను; వైద్యశాల నేర్పరచి వ్యాధిగ్రస్తుల బాధను తొలగించుటకు తగిన సదుపాయములను కల్పించెను. పాఠశాలను నిర్మించి అందు బాలురకు విద్యనేర్పుటకు వలసిన కట్టుపాట్లను కావించెను. అతనిది నిరాడంబరమైన నిష్కల్మష జీవనము. భోజనము మృణ్మయపాత్రలందు; శయనము భూమిమీద. ఇంతటి యుదాత్త చరిత్రుడైనను వైదేశికు డగుటవలన దక్కనీల క్రోధమునకు గురియై వివేకహీనుడైన సుల్తానుబారింబడి దుర్మరణము నందవలసి వచ్చెను.

మహమ్మూదు గావానుని వధించిన పిమ్మట ముమ్మడి ముహమ్మదుశాహు చాలకాలము రాజ్యముసేయలేదు. వైదేశిక సర్దారు లందరును తమ నాయకుడైన గావానుని అత డక్రమముగ చంపించినాడని క్రుద్ధులై యాజ్ఞాబద్ధులు కాక యథేష్టముగ ప్రవర్తింప గడగిరి. వారిని శిక్షించి తన యధికారమును నిర్వక్రముగ సాగించుట కాతనికి శక్తి చాలక పోయినది. మరియును ఋషికల్పుడైన మంత్రివర్యుని అక్రమముగ మరణదండన విధించి చంపించితి నను వెంతలి వ్యాధిగా పరిణమించి అతనిని అకాల

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మృత్యువున కెరగావించెను. క్రీ. శ. 1482 మార్చి 28వ తారీఖున సుల్తాను ముహమ్మదు శాహు పరలోకగతు డాయెను.

**మహమ్మూదు శాహు** (క్రీ. శ. 1482 - క్రీ. శ. 1518): ముమ్మడి ముహమ్మదు శాహు మృతినందిన పిమ్మట పండ్రెం డేండ్ల ప్రాయమువాడైన అతని పుత్రుడు మహమ్మూదు రాజ్యాధిపతి యాయెను. దక్కనీ, వైదేశిక కక్షల వైరము ప్రజ్వరిల్లుచుండినను పట్టాభిషేక మహోత్సవము శాంతము గనే నడచెను. కాని వైదేశికుల నాయకుడైన యూసఫ్ ఆదిల్ ఖానుడు దక్కనీ నాయకుడైన నిజామ్ ఉల్

ప్రయత్నము చేయ నారంభించిరి. దక్కనీ, వైదేశిక కలహ ములు హెచ్చుపెరుగుట వలన రాజధానియందు శాంతి భద్రతలు చెడి కళవళ మతిశయించెను. ఈ పరిస్థితులలో ఆంధ్రదేశమున రాజకీయ వాతావరణము మరల మారి నది. ముమ్మడి ముహమ్మదు శాహు మరణమందిన వెంటనే గజపతి పురుషోత్తముడు తీరస్థాంధ్రమును మరల జయించు టకు సమకట్టి దండుతో బయలువెడలి వచ్చి రాజమహేంద్ర వర దుర్గమును పాలించుచుండిన కివాన్ ఉల్ ముల్క్‌ను పారద్రోలి వేంగీ దేశమును స్వాధీనముచేసికొని కృష్ణా నదిని ఉత్తరించి కొండవీడు వినుకొండ, అద్దంకి మొదల




ముల్క్ భైరీతోకూడి రాజ్యకార్యములను నిర్వహింప నొల్లక నిజస్థానమైన బిజాపురమునకు వెడలిపోయెను. అంతట నిజామ్ ఉల్ ముల్క్ భైరీ ముఖ్యమంత్రిపదము వహించి మహమ్మూదు శాహు పేర రాజ్యమును చేయ గడగెను. మహమ్మూదు శాహు నిజామ్ ఉల్ ముల్క్‌ను చంపించి స్వతంత్రుడగుటకు ప్రయత్నముచేసెను. కాని, అతని పూనిక నెగ్గలేదు. తత్ఫలితముగ అతడు నిర్బంధము నకు లోబడవలసి వచ్చెను. సుల్తాను నిర్బంధమం దుండుటకు నుగ్రులై వైదేశిక సర్దారులు నిజామ్ ఉల్ ముల్క్ ఆజ్ఞ లను సరకు సేయక ఎచ్చటివా రచ్చట స్వతంత్రులగుటకు

యిన దుర్గములను సాధించెను. ఇట్లు ముమ్మడి ముహమ్మదు శాహు మృతినందిన రెండేండ్లలోపలనే అతడు జయించి కైకొన్న తీరాంధ్రదేశ మంతయు మరల గజపతుల పాలా యెనని శాసనములవల్ల విదితమగుచున్నది. గజపతి ఆగ మనము వలన పదభ్రష్టుడైన కివాన్ ఉల్ ముల్క్ క్రీ. శ. 1484 - 1486ల మధ్య నేమి చేయుచుండెనో తెలియదు. క్రీ. శ. 1486లో ఓరుగల్లు పాలకుడైన ఆదిల్ ఖాను దక్కనీ మృతినందగా అత డాపట్టణమును తెలంగాణా రాజ్యముతోగూడ నాక్రమించుకొనెను. ఈ వర్తమానము తెలియవచ్చినంతటనే నిజామ్ ఉల్ ముల్క్ సుల్తానును



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వెంటబెట్టుకొని సైన్యముతో గూడ తెలంగాణాకు బయలు వెడలెను. అతడు సమీపమునకు రాగానే కివాన్ ఉల్ ముల్క్ ఓరుగంటినుండి మరలి పోయెను. ఈ దండయాత్ర ఇంకను సాగుచుండగనే సుల్తాను తన్ను చంపించుటకు రహస్యముగ ఏర్పాటు సేయుచున్నాడని తెలిసికొని నిజామ్ ఉల్ ముల్క్ బీదరునకు పారుదెంచెను; కాని, యతనికి మరణము తప్పలేదు. రాజధానిని చేరినంతటనే పురపాలకుడైన దిల్ పసందు ఖాను అతనిని పట్టి చంపి హుటాహుటి నతని వెంబడించి వచ్చుచుండిన సుల్తానునకు అతని తలను కానుక చేసెను.

నిజామ్ ఉల్ ముల్కు హతుడైనను, మహమ్మదు శాహు స్వాతంత్ర్యమును పొందలేక పోయెను. అతడు హీనసత్వుడు; విషయలంపటుడు. ఆ క్లిష్ట పరిస్థితులలో బహ్మనీ రాజ్యాధిపత్యము వహించి స్వార్థపరాయణులైన వైదేశిక, దక్కనీ సుల్తానులను విభాళించి రాజ్యమును విచ్ఛిన్నము గానీయక నిలుపగల శక్తి సామర్థ్యములు గలవాడు కాడు; కావున, అతడు సింహాసనము నధిష్ఠించియుండిన ముప్పదియారేండ్ల కాలమును మంత్రి సామంతుల చేతి కీలుబొమ్మయై ఎవ్వరి స్వాధీనమం దుండిన నప్పుడు వారి యిష్టానుసారము వర్తించుచుండెను. క్రీ. శ. 1497లో దక్కనీలు సుల్తానుని పదభ్రష్టుని చేయ సమకట్టిరి; కాని, వారి కడక నెరవేరలేదు. ఆ సమయమున రాజధానిలో రేగిన దక్కనీ, వైదేశిక కలహముల నాస్పదము చేసికొని కాసిమ్ బరీద్ ఇ మమాలిక్ అను తురక సరదారుడు ముఖ్యమంత్రి పదము నాక్రమించుకొని సర్వాధికారియై సులానుపేర రాజ్యము చేయదొడగెను. కాని సామంత సర్దారు లెవ్వరును అతనిని సరకుసేయక యథేచ్ఛానువర్తులై వ్యవహరింప నారంభించిరి. క్రీ. శ. 1490 లో నిజామ్ ఉల్ ముల్క్ పుత్రుడైన మలిక్ అహ్మద్ నిజామ్ ఉల్ ముల్క్ భైరీ చెప్పిన సలహాప్రకారము బహ్మనీ సామంత ప్రముఖు లందరును తమ స్వాతంత్ర్యమును ప్రకటించిరి. తత్ఫలితముగ బహ్మనీ రాజ్యము వ్రయ్యలై ఒక రాజ్యము పట్టున ఐదు సంస్థానము లేర్పడెను. అహమద్ నగరమున నిజామ్ ఉల్ ముల్కును, విజాపురమునందు ఆదిల్ఖానుడును, వరాట దేశము నందు ఇమాద్ ఉల్ ముల్కును, గోలకొండలో కుత్బ్ ఉల్ ముల్కును స్వతంత్ర సింహాసనములను స్థాపించి రాజ్యము సేయ గడగిరి. వీరివలెనే బరీద్ ఇ మమాలిక్ బీదరులో సర్వ విధములను స్వతంత్రుడైనను సుల్తాను మహమ్మదు అతనికి వైష్ణవుని మెడలోని రుద్రాక్షపేరును బోలి ప్రతిబంధకమాయెను. తత్కారణమున అతనికి స్వార్థపరులైన తక్కినవారితో — అందును ముఖ్యముగ విజాపురాధిపతియైన ఆదిల్ ఖానుతో — పోరాటము కలుగుచు వచ్చెను; కాని, ఆ విషయము ఆదిల్శాహి బరీద్‌శాహి చరిత్రకు సంబంధించినది. దాని ప్రస్తావన ఇచ్చట సంగతము గాదు; కాని పై పేర్కొనిన బహ్మనీ సామంతులు స్వతంత్రులై ప్రత్యేక రాజ్యములను స్థాపించినను కొన్ని సందర్భములలో వా రందరును ఏకమై మహమ్మదు శాహును ముందుంచుకొని యతని పేర కార్యమును నడుపువారు. క్రీ. శ. 1498 వ సంవత్సరములో గోవా పాలకుడయిన బహదూర్ గిలానీ మీదికి వా రందరును ఏకమై సుల్తానును ముందుంచుకొని యుద్ధమునకు నడవవలసివచ్చెను. గిలానీ నావికాదళమును కూర్చుకొని సముద్రముమీద ప్రయాణము చేయుచుండు గుజరాతి వర్తకుల యోడలను దోచుకొనుచున్నాడనియు, గుజరాతు రాజ్యమునకు చెందిన మొహిమ్ (బొంబాయి) ద్వీపమునకు తన యుద్ధ నావల నంపి అచటి ప్రజను చెరపట్టి, మసీదులు మున్నగు కట్టడములను తగులబెట్టి దేశమును పాడుగావించె ననియు, సూరతుపై నెత్తి వచ్చుటకు ప్రయత్నములు సల్పుచున్నాడనియు, వానిని తాను స్వయముగ శిక్షింప దలపెట్టినయెడ సుల్తాను మహమ్మదు రాజ్యముగుండ దండు సేయక తప్ప దనియు, కావున సుల్తాను మహమ్మదే వానిని తగిన రీతిని శిక్షించుట యుక్త మనియు గుజరాతు సుల్తానగు మహమ్మద్ బెగరా వర్తమాన మంపెను. గుజరాతి దండయాత్ర వచ్చిన తమ స్థితిగతులు తలక్రిందులు కావచ్చునని శంకించి బహ్మనీ సామంతు లందరును కూడబలుకుకొని సుల్తాను మహమ్మదుతో కూడ దండు చేసి గిలానీని వధించిరి. ఇట్టి సామంత సమావేశములు సాధారణముగ విజయనగరముపై నడచు జిహాదు సమయములలో కూడుచుండెడివి. సుల్తాను మహమ్మదు అనతులయిన నిజమంత్రి సామంత దండనాయకాదులను ఆజ్ఞాబద్ధులను చేసికొన జాలక పోయినను మతవ్యాప్తికొరకు ఉత్కటోత్సాహముతో జిహాదులు సేయ బూనుకొనువాడు. క్రీ. శ. 1501 లో తన్ను బరీదుబారినుండి తప్పించుటకొరకు బీదరు మీద నెత్తివచ్చిన సకల బహ్మనీ సామంత బృందముతో ప్రతివర్షమును వా రప్పటియట్లే బీదరు పురమున నొక్కమారు మేడమై విజయనగర కాఫిరులమీద జిహాదు సేయుట యుక్తమని అతడు వాక్రుచ్చెను. అట్టి జిహాదువలన దమకు లాభమేకాని నష్టము కలుగకుండుటచే సుల్తానుయొక్క యభిప్రాయ మెల్లరకును నచ్చెను. కావున వా రందుకు సమ్మతించి సుల్తాను కోరికమేరకు ప్రతి సంవత్సరమును బీదరునందు సమావేశమై అతడు తల



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పెట్టిన జిహాదులలో పాల్గొన నొప్పుకొనిరి. దీనిని కొందరు చరిత్రకారులు బీదరు ఒడంబడికయని చెప్పుదురు. ఈ యొడంబడిక ప్రకారమును ఏటేట జిహాదులు నడచెనేమో తెలియదు. రెండుమాత్రము గ్రంథస్థమైనవి. క్రీ. శ.1502 లో నొక్కమారును, 1509 లో మరియొకమారును మహమ్మదు శాహు విజయనగరముపై జిహాదులను నడిపినట్లు తెలియవచ్చుచున్నది. మొదటిది విజయవంతముగ సాగినను రెండవది భగ్నమై పోయెను. బహ్మనీ సైన్యము ఘన పరాభవము నందుటయే కాక సుల్తానుకు ప్రాణోపద్రవకరమైన గాయములు తగిలెను. ఆరుమాసముల కాలము లేవను కూడ శక్తిలేక పడకయందే జీవచ్ఛవమువలె పడియుండెను. రెండవ జిహాదు నడచిన తరువాత సుల్తాను మహమ్మదు శాహు ఎనిమిది తొమ్మిదేండ్లకాలము జీవించియుండి క్రీ.శ 1518 లో మృతినందెను. కడపటి పండ్లలో ఇతనిని నిర్బంధమునం దుంచి బరీదే స్వయముగ రాజ్యము చేయదొడగెను. మహమ్మదు శాహుకు నలుగురు పుత్రు లుండిరి. వారొకరి వెనుక నొకరు క్రీ. శ. 1527 వరకు నామకార్థము రాజ్యపీఠమును అధిష్ఠించియుండిరి. కడపటివాడైన కలీమ్ ఉల్ లా బిదరునం దుండజాలక క్రీ. శ. 1527 లో మొదట విజాపురమునకును, తరువాత నచటినుండి అహ్మదు నగరమునకును పారిపోయెను. అంతతో బహ్మనీ రాజ వంశ మంతరించెను. నే. వెం. ర.

## విజయనగర సామ్రాజ్యము

### సంగమ వంశము

ఓరుగంటిలో కాపయ నాయకునికి విజయము లభించిన సమయముననే ఢిల్లీ సుల్తాను మహమ్మదు బిన్ తుఘ్లుక్ ప్రతినిధిగ కంపిలి రాజ్యమును పరిపాలించు చుండిన హరిహర రాయలు కూడ ఇస్లాము మతమును విడిచిపెట్టి శ్రీవిద్యారణ్య యతీంద్రుల కృపావిశేషమున మరల వైదికమతము నవలంబించి సుల్తానుపై తిరుగబాటు చేసి స్వాతంత్ర్యము ప్రకటించినట్లు ఇదివరకే తెలుపబడినది. స్వతంత్ర రాజ్యమును స్థాపించిన తరువాత హరిహరరాయలు తన రాజధానిని ఆనెగొంది (కుంజరకోన) పట్టణమునకు మార్చి, పిదప తన సోదరుల సాహాయ్యముతోను, శ్రీవిద్యారణ్యమునీంద్రుల ప్రోత్సాహముతోను ఆనెగొంది కెదురుగ కొంచెము దిగువను తుంగభద్రా నదీతీరమున విద్యా నగరమను నామాంతరము గల విజయనగరమును నిర్మించి దానిని తన స్థిర రాజధానిని కావించుకొని విజయనగర రాజ్యస్థాపకు డయ్యెను.

**మొదటి హరిహరరాయలు (క్రీ.శ. 1336 - 38 — క్రీ.శ. 1355):** విజయనగరరాజ్య సంస్థాపకుడైన హరిహర రాయలు 'యదువంశ క్షత్రియుడు; సంగమరాజ మాంబికల తనయుడు. విజయనగరమును పరిపాలించిన మొదటిరాజు లందరు సంగమ రాజ సంతతివా రగుటచేత హరిహరుని వంశమునకు సంగమవంశమని పేరు కలిగెను. హరిహరరాయలకు కంపరాయలు, బుక్కరాయలు, మారప, ముద్దప అని నలుగురు సోదరులు కలరు. ఈ హరిహర రాయాదులు కాకతి ప్రతాపరుద్రుని కొలువులో కోశాధ్యక్షాది పదవులలో నుండి రనియు, క్రీ. శ. 1323లో కాకతీయ సామ్రాజ్యము భగ్నమైన తరువాత కంపిలరాయని సంస్థానమున చేరి రనియు ఒక యైతిహ్యము కలదు. హరిహరరాయలు తన సోదరు లందరితోను కలసి విజయనగరరాజ్యమును క్రమముగా విస్తరింపజేసెను. ఉత్తర దిశను హరిహర రాయల రాజ్యము శక వర్షము 1261 (క్రీ. శ. 1339) నాటికే, అనగా స్వాతంత్ర్యము ప్రకటించిన మూడు నాలుగేండ్ల లోనే తుంగభద్రను దాటి బాదామి వరకు వ్యాపించె ననుటకు అక్కడ నున్న హరిహర రాయల శాసనమే ప్రమాణము. ఈ శాసనమున హరిహర రాయలకు మహామండ లేశ్వరుడని, భాషెగె తప్పువరాయర గండడని, పూర్వ పశ్చిమ సముద్రాధీశ్వరుడని బిరుదము లుండుటచేత ఈ శాసనకాలము నాటికే హరిహరుని రాజ్యము తూర్పుదిశను బంగాళాఖాతము వరకును, పడుమటి దిశను అరాబియా సముద్రమువరకును వ్యాప్తమయినట్లు కూడ విదితమగుచున్నది. ఇది యథార్థ మనుటకు ఇబన్ బతూతావృత్తాంతమే నిదర్శనము. క్రీ. శ. 1342లో అతడు పశ్చిమ సముద్ర తీరమునను్న హొనావరుకు వెళ్ళినప్పుడు అక్కడ విమతస్థుడైన హరియబ్ (హరియప్ప - హరిహర రాయలు) అధికారమునకు లోబడి ఒకసుల్తాను పరిపాలనము నెరపుచుండినట్లు వ్రాసియున్నాడు. హరిహరరాయలు పడుమటి తీరము వరకు గల దేశమును క్రీ. శ. 1342 కు పూర్వమే జయించియుండవలెను. క్రీ. శ. 1336లో హరిహరరాయలు బారకూరులో కోట కట్టించినట్లు పరంపరగ వచ్చు గాథలవలన తెలియుచున్నది. కాని, ఇది సరియైనదని చెప్పలేము. ఈ ప్రాంతమున ద్వారసముద్రపు హొయిసల మూడవ బల్లాళరాయని శాసనములు క్రీ. శ. 1340 - 41 వరకు కనబడుచున్నవి. కనుక ఈ ప్రాంతము క్రీ. శ. 1340 ప్రాంతమున విజయనగరాధిపతుల పరిపాలనక్రిందికి వచ్చియుండవలెను. హరిహరరాయల సోదరుడైన మారప కుంతలదేశమునకు మండనాయమానమైన వనవాసి పండ్రెండు వేల రాజ్యమును జయించి గోమంతశైలమును చంద్రగుప్తి(చంద్రగుత్తి)ని ప్రధాన రాజధానిని కావించుకొనెను. ఇతడు పశ్చిమ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సముద్రతీరము వరకుగల దేశమును జయించి సముద్రతీరమునగల గోకర్ణక్షేత్రమునకు వెళ్లి అచ్చటి స్వామి మహాబలుని పూజించెను. ఇతనితోపాటు వేదవేదాంగవిదులు, సకల విద్యా పారంగతులు అయిన ఆంధ్రదేశీయులు కొందరు వెళ్లిరి. తనకాశ్రితులును, ఆంధ్రదేశాగతులును అయిన బ్రాహ్మణులకు క్రీ. శ. 1347లో అక్కడ కాంత పురి అను గ్రామము నగ్రహారముచేసి వీరమారపురి అని పేరు పెట్టి ధారాదత్తము కావించెను. ఇతని రాజధాని చంద్రగుత్తి. మారప్ప ఒడయరు ప్రధానియైన మాధవ మంత్రి గురువు కాశీవిలాస క్రియాశక్తియను శివాచార్యుడు.

క్రీ. శ. 1343 నాటికే హరిహరరాయల రాజ్యము పూర్వ సముద్రము వరకు వ్యాపించినది. ఈ పూర్వదేశమును హరిహరరాయల సోదరుడు కంపరాయలు (కంపణ్ణ ఒడయరు) జయించెను. తూర్పు సముద్రతీరమున నున్న గిరిదుర్గములలో బలిష్ఠమైన ఉదయగిరి అచిరకాలముననే విజయనగరాధిపతుల అధికారము క్రిందికి వచ్చినది. బుక్కరాయల కుమారుడైన విరూపాక్షరాయలు (విరూపణ్ణ ఒడయరు) మొదట ఈ దుర్గమున కధిపతిగ నుండెను. ఈ కారణమున ఇతనికి ఉదయగిరి విరూపణ్ణయని పేరు వచ్చినది. తరువాత ఈ దుర్గమును పాలించిన వాడు కంప రాయలు. క్రీ. శ. 1348నాటి విరూపణ్ణ ఒడయరు శాసనము ఉదయగిరిలోను, అదే సంవత్సరమునాటి కంపరాయల శాసనము మోపూరిలోను కలవు. ప్రాగాంధ్రదేశస్థ దుర్గములను సాధించుటకు అనుకూలమైన కీలకస్థానములో నుండుటవలన ఉదయగిరి విజయనగరాధీశ్వరుల 'మొదలి దుర్గ' మయినది.

ద్వార సముద్రపు మూడవ బల్లాళరాయలు తొండ మండలములోను, దక్షిణమున మధుర సుల్తానులతోను పోరాడుచుండిన కాలములో హరిహరరాయల సోదరుడయిన బుక్కరాయలు హొయిసల రాజ్యమును జయింప దలపెట్టెను. మూడవ బల్లాళరాయలు గొప్ప పరాక్రమవంతుడు. ఇతడు కాపయ నాయకునికి ఓరుగంటిలో విజయము సంభవించిన సమయమున, అతని సాయముతోనే కావచ్చును, తొండమండలమునుండి మహమ్మదీయులను తరిమివేసి తత్ప్రాంతమును అదివరకు పరిపాలించుచుండిన సంబువ రాయలను మరల అచట ప్రతిష్ఠించెను. ఈ సంబువ రాయ రాజ్యమునకు కాంచీపురము రాజధాని. సంబువ రాయవంశజు లంతటినుండి హొయిసల మూడవ బల్లాళ రాయనికి సామంతులైరి. మూడవ బల్లాళరాయలు తొండ మండలమును జయించుటతో తృప్తి పొందక మధుర సుల్తానులను కూడ జయించి సేతువు పర్యంతము గల దక్షిణ దేశమును తన అధికారము క్రిందికి తెచ్చుకొనుటకు ప్రయత్నించెను. ఈ ప్రయత్నమున మధుర సుల్తానులతో పెక్కు యుద్ధములు కావించెను. కాని తిరుచిరాపల్లివద్ద జరగిన భయంకర సంగ్రామములో క్రీ. శ. 1342 లో పట్టువడి మూడవ బల్లాళరాయలు మధురచెరసాలలో మృతినొందెను. ఇతని యనంతరము ఇతని కుమారుడు విరూపాక్ష బల్లాళరాయలు సింహాసనమెక్కెను. కాని ఇతడు తండ్రి యంతటి పరాక్రమశాలి కాడు. అయినను, హొయిసల రాజ్యము బుక్కరాయల కంత సులువుగ స్వాధీనము కాలేదు. క్రీ. శ. 1346 నాటికి బుక్కరాయల హొయిసల రాజ్య విజయము పూర్తియైనది. హరిహరరాయలు స్వాతంత్ర్యము ప్రకటించిన పది పండ్రెండు సంవత్సరములలో మొదట చిన్న సంస్థానముగ నుండిన విజయనగరము ఇప్పుడు పూర్వ పశ్చిమ సముద్రములను తాకి ఉత్తరమున కాదామినుండి దక్షిణమున ద్వార సముద్రము వరకు వ్యాపించి గొప్ప రాజ్యమైనది. దీనిని విజయనగరరాజ్యమని కర్ణాటరాజ్యమని, దీని యధిపతులను విజయనగరాధీశ్వరులని కర్ణాటాధీశ్వరులని వ్యవహరించుచు వచ్చిరి. ఇస్లాము మతోపద్రవమున హిందూ ధర్మమును, హిందూ సంస్కృతియు నాశనము కాకుండ కాపాడుటకై దక్షిణ హిందూదేశమున కన్నడిగలు, ఆంధ్రులు అను భేదము లేకుండ ఉభయులును కలసి నిర్మించిన రాజ్యము విజయ నగరము. ఆనాడు వైదిక ధర్మావలంబులు, ముస్లిములు అన్నవిభేదమే ప్రధానముగ నుండెను. కాని వైదిక ధర్మావలంబకులలో దేశభాషల ననుసరించి వీరు ఆంధ్రులు, వారు కన్నడిగలు అను విభేదమే లేకుండెను.

గుల్బర్గ రాజధానిగ బహ్మనీ రాజ్యము స్థాపితమైన తరువాతను, అందును ముఖ్యముగ ఢిల్లీ సుల్తాను మహమ్మదు బిన్ తుఘ్లుకు కాలధర్మము నొందిన పిదప, బహ్మనీ సుల్తాను అలా ఉద్దీను హసన్ గంగు బహ్మన్ షా పూర్వము ఢిల్లీ సుల్తాను అధికారము క్రింద నుండిన హిందూ రాజ్యములను జయించి తన రాజ్యమును పెంపుచేసికొనజొచ్చెను. హరిహరరాయల రాజ్యము ఉత్తరపు సరిహద్దువద్ద పగరు ప్రాంతమున క్రీ. శ. 1347 లో హావళి రేగెను. అది అవకాశముగ తీసికొని అలా ఉద్దీన్ తన యుద్యోగులలో ఒకడైన ముబారక్ ఖానును కొంత సేనతో హరిహరరాయల రాజ్యముపై బంపెను. విజయనగరాధీశ్వరులకును బహ్మనీ సుల్తానులకును జరగిన మొదటి సంగ్రామ మిదియే. సుల్తాను సైన్యము రాయచూరు వరకు గల దేశమును జయించెను. కాని అచ్చట ఉభయ పక్షములవారును వెను దీయక దీకొని ఒండొరులతో ఘోరముగ పోరాడిరి.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/






చిత్రము 1 పంపా విరూపాక్షాలయ గోపురము, హంపి




చిత్రము 2 - అమ్మవారి దేవళములోని శిల్పము, హజారరామాలయము, హంపి.

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తుదకు విజయనగర సైన్యము సుల్తాను సేనల నోడించి తరుమగొట్టగా అవి రాయచూరువద్దనుండి వెనుకకు మరలి పోయినవి. హరిహరరాయలు రాయచూరు దుర్గమునకు పశ్చిమోత్తర దిశలందు బాదామివరకు గల దేశమును కోల్పోయినను దానికి దక్షిణ, పశ్చిమములందున్న ప్రాంతమును మాత్రము నిలబెట్టుకొనెను. ఇంతటినుండి కృష్ణా తుంగభద్రానదుల మధ్యసీమ (రాయచూరు అంతర్వేది) విజయనగర బహ్మనీ రాజ్యములకు వివాద కారణమై మహా భయంకర సంగ్రామరంగమైనది.

తన కడపటి రాజ్య సంవత్సరములలో తుండీర మండలము, తుండీర రాజ్యము అను నామాంతరములు గల తొండ మండలమును జయించుటకై హరిహరరాయలు తన సోదరుడు బుక్కరాయల కుమారుడయిన కుమార కంపరాయ లను గొప్ప సేనతో పంపెను. సాళువ మంగభూపతియు (మంగు), వైష్ణవ మతావలంబకుడైన గోపన్న మంత్రియును దండనాయకులై వెంట రాగా కుమార కంపరాయలు తొండమండలముపై దండెత్తి వెళ్ళెను. మూడవ బల్లాళరాయలు చనిపోయిననాటి నుండి తుండీర రాజ్యాధిపతి స్వతంత్రుడై పరిపాలనము నెరపుచుండెను. ఇతడు దక్షిణమున మధురయం దుండిన సుల్తాను సాయముతో తన రాజ్యమును విస్తరింప జేసికొనుటకు ప్రయత్నించిన సందర్భమున విజయనగర రాజ్యమున కుపద్రవము కలిగెనేమో, అతనిని సాధించుటకు హరిహరరాయలు కుమార కంపరాయలను పంపెను. రాజనారాయణ సంబువరాయనితో జరగిన ఈ సంగ్రామములో మంగరాజు విశేష శౌర్య ప్రతాపములు చూపి విక్రమించి సుల్తాను నోడించి చెరపట్టి తన ప్రభువైన కుమార కంపరాయల వశము చేసెను. పరాజయము నొందిన రాజనారాయణ సంబువరాయల పక్షము వహించి కంపరాయలను వేడుకొని మరల అతనిని అతని రాజ్యమున విజయనగర సామంత మండలేశ్వరుడుగ సంప్రతిష్ఠించి సంపరాయస్థాపనాచార్య బిరుదము వహించెను. ఈరీతిని కుమార కంపరాయల తుండీరమండల దండయాత్ర విజయవంతమైనది.

హరిహరరాయల సోదరు లందరు రాజ్యమునందలి వేరు వేరు ప్రాంతముల కధిపతులై అతనికి ప్రతినిధులుగ పరిపాలించుచుండిరి. కంపభూపతి ఉదయగిరి రాజ్యమునకును, బుక్కరాయలు హొయిసల రాజ్యమునకును, మారప్ప అరగ - మలెనాడు రాజ్యమునకును, ముద్దప్ప ముళువాయి రాజ్యమునకును మండలేశ్వరులైరి. ఈ సోదరు లందరి కృషివలన నీరాజ్య మేర్పడినను హరిహర, బుక్కరాయ సోదరులే ప్రధానముగ ఈ విజయనగరరాజ్య సంస్థాపకులు.

శ్రీ విద్యారణ్య యతీంద్రుల యాజ్ఞను జవదాటక హరిహరరాయలు రమారమి ఇరువది సంవత్సరములు రాజ్యమేలెను. సన్న్యాసాశ్రమమును స్వీకరించుటకు పూర్వము విద్యారణ్యస్వామికి మాధవాచార్యులని పేరు. తురీయాశ్రమమును స్వీకరించిన తరువాత ఆయన విద్యారణ్యస్వామి యయ్యెను. వీరు ఉదయగిరి కన్నడిగ శాఖకు జెందిన బ్రాహ్మణులు: బోధాయన సూత్రులు; భారద్వాజస గోత్రులు. వీరి తలిదండ్రులు శ్రీమతి మాయణులు. ఈ మాధవ విద్యారణ్యస్వామియే హరిహర రాయలను స్వరాజ్య సంస్థాపనమునకు పురికొల్పి తానే రాజ్యభారమును వహించి వర్ణాశ్రమ వైదిక ధర్మముల నుద్ధరించిన మహాత్ముడు. ఈయన హరిహర రాయ, బుక్కరాయల కాలములోను, బుక్కరాయల కుమారుడయిన రెండవ హరిహరరాయల కాలములోను వారికి మంత్రిగను, హితబోధకుడుగను ఉండెను. ఈయనకు సాయణుడు, భోగనాథుడు అని ఇద్దరు సోదరులు కలరు. వీరిలో సాయణుడు కంపరాయల కుమారుడైన రెండవ సంగమ భూపతికిని, తరువాత రెండవ హరిహర రాయలకును మహామంత్రిగా నుండెను. సాయణాచార్యుల సోదరుడైన భోగనాథుడు రెండవ సంగమరాయల నర్మసచివుడుగా నుండెను. మాధవ సాయణులు సంస్కృతములో అనేక గ్రంథములు రచించిరి; చతుర్వేదములకును భాష్యము వ్రాసిరి. వేద భాష్యమునకు సాయణ భాష్యమని పేరు. విద్యారణ్యకృత పరాశర మాధవీయము, పంచదశి, శంకర విజయము, జైమినీ న్యాయమాల, సర్వదర్శన



చిత్రము 56. విద్యారణ్యస్వామి విగ్రహము, హంపి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సంగ్రహము సుప్రసిద్ధ గ్రంథములు. శ్రీ విద్యారణ్య శ్రీపాదులు హిందూ సామ్రాజ్య స్థాపకుడే కాక హిందూ మతోద్ధారకుడై శృంగేరిలోని జగద్గురు శ్రీ శంకరాచార్య శ్రీపాదుల పీఠము నధిష్ఠించి పెక్కేండ్లు జీవించి క్రీ. శ. 1386 వ సంవత్సరములో కైవల్యము పొందెను.

విద్యారణ్యులవారిపేర హరిహరరాయలు, బుక్కరాయలు విజయనగరమును నిర్మించిరని శాసనములు చెప్పుచున్నవి. రాజకాలనిర్ణయ, రాయవాచకములలో విద్యారణ్యులవారే విద్యానగరమును (విజయనగరమును) కట్టించిరని కలదు. మొత్తముమీద విజయనగరము హరిహరరాయల పరిపాలన కాలమున, విద్యారణ్య శ్రీపాదుల యుపదేశమున బుక్కరాయల పర్యవేక్షణక్రింద నిర్మింపబడెనని చెప్పినచో పూర్వోక్త విషయముల నన్నిటిని సమన్వయపరచినట్లు కాగలదు.

**మొదటి బుక్కరాయలు (క్రీ.శ. 1355 — క్రీ.శ. 1377) :** హరిహరరాయలకు పురుష సంతతి లేకపోయినందువలననేమో అతని మరణానంతరము అతని సోదరుడు బుక్కరాయలు విజయనగర వజ్రసింహాసనము నధిష్ఠించెను. హరిహరరాయల పెద్ద తమ్ముడు కంపరాయలును, అతని కుమారులు సావణ్ణ ఒడయలును, సంగమరాయలును ఉండగా బుక్కరాయ లెట్లు రాజయ్యెనను సంశయము కలుగుట సహజము. హరిహరరాయల రాజ్యకాలములోనే కంపరాయలు కాలధర్మము నొందెను. ఇక అతని కుమారుల కంటె వయసులో పెద్దవాడును, రాజ్య సంస్థాపనమునందు మొట్టమొదటినుండియు కుడిభుజమువలె పనిచేసినవాడును అగు బుక్కరాయలనే యువరాజపదమునందుంచి హరిహరరాయలు ఆదరించెను. వాస్తవ మరసి చూడగా విజయనగరరాజ్యము సోదరు లందరిలో ఎక్కువగా హరిహర, బుక్క మహీపతు లుభయులును కలిసి చేసిన కృషి ఫలితమే. బుక్కరాయలు రాజగుటకు ఇంతకంటె వేరుకారణము కనిపింపదు. ఒకవేళ, అతడే రాజ్యమునకు రావలెనని గురువులైన శ్రీ విద్యారణ్య శ్రీపాదుల ఆదేశముకూడనేమో. ఎట్లయిన నేమి, బుక్కరాయలు విజయనగర రాజ్యమునకు పట్టాభిషిక్తుడయ్యెను. ఈతని కేడుగురు కుమారులు. వీరు వివిధరాష్ట్రముల కేలికలై రాజ్య కార్య నిర్వహణమునందు తండ్రికి సాయపడుచుండిరి.

బుక్కరాయల పరిపాలన కాలమున జరగిన ఘనకార్యములలో చాలప్రధానమైనది కుమార కంపరాయల దక్షిణ దిగ్విజయము. తుండీరరాజ్యాధిపతియైన రాజనారాయణ సంబువరాయలు విజయనగర సింహాసనమునకు సామంతుడయినను, మధుర సుల్తానులతో కలసి విజయనగరమును కూలద్రోయుటకు ఇంకను కుట్రలుచేయుచునే వచ్చెను. అది యటుండ, మూడవ బల్లాళ రాయలను యుద్ధములో నోడించి నప్పటినుండియు దక్షిణ మధుర సుల్తానుల దుండగము లతిశయించినవి. వారు హిందువులను పెట్టు హింస మేర మీరినది. అందువలన ఈ తడవ తుండీర, మధుర రాజ్యముల నంత మొందించుటకై తండ్రి బుక్కరాయల ఆదేశమున కుమార కంపరాయలు దక్షిణదేశముపై దాడి వెడలెను. ఈ తడవ కూడ ఈ దండయాత్రలో గోపన్న మంత్రియు, సాళువ మంగ నృపతియు దండనాయకులుగ సేనలను నడపించుకొని పోయి కుమార కంపరాయలకు తోడ్పడిరి.

తుండీర మండలాధిపతి రాజనారాయణ సంబువరాయలకును, కుమార కంపరాయలకును జరగిన ఘోర సంగ్రామమున సంబువరాయలు పరాజితు డయ్యెను. పిదప కుమార కంపరాయ లచటినుండి మధుర సుల్తానుల రాజ్యముపై దండెత్తి వెళ్లెను. ఈ యుద్ధమునకూడ సాళువ మంగరాజు అమితశౌర్య సాహసములతో పోరాడి మధుర సుల్తానును సంహరించి, పరపక్షిసాళువ బిరుదమును వహించెను. కుమార కంపరాయలు ఈ విజయానంతరము తుండీర మండలము మొదలుకొని రామేశ్వరము వరకుగల దక్షిణ రాజ్యము నంతను విజయనగరరాజ్యమునకు చేర్చివేసెను. మధురా విజయముతో విజయనగరము గొప్ప సామ్రాజ్యమై ఉత్తర దిశను తుంగభద్రానది వద్దనుండి దక్షిణమున సేతుబంధరామేశ్వరము వరకును వ్యాపించెను. కుమార కంపరాయల దక్షిణదేశ దండయాత్రకు సంబంధించిన వివరము లేవియు మనకు తెలియవచ్చుటలేదు. కాని, దీనిని గురించి కుమార కంపరాయల భార్యయైన గంగాదేవి కావ్యరూపమున రచియించిన మధురావిజయ మను గ్రంథము కలదు. ఇందులో కుమార కంపరాయలు సంబువ (సంప)రాయలను జయించిన పిదప కాంచీపురములో కొన్నాళ్ళుండినప్పుడు పాండ్యదేశాధిదేవత అతని కలలో కనబడి సుల్తాను పరిపాలననాటి ఆదేశపరిస్థితిని వివరించి చెప్పి పాండ్యరాజ ఖడ్గము నతనికి ప్రసాదించి మధురా విజయమునకు ప్రోత్సహించెనని చెప్పబడినది. మధురా విజయము క్రీ. శ. 1371 సంవత్సరమున జరగినది. మలిక్ కాఫూరు దండయాత్రల సందర్భమున శ్రీరంగమునుండి రక్షణనిమిత్తము తిరుమల - తిరుపతికి తీసికొని పోబడిన శ్రీ రంగనాథస్వామి మరల ఈ మధురావిజయానంతరము క్రీ. శ. 1371లో యథాస్థానమునకు చేర్పబడెను.

బుక్కరాయల రాజ్యకాలములో జరగిన మరియొక ముఖ్య విషయము విజయనగర, బహ్మనీ రాజ్యములకు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



జరగిన సంగ్రామము. బుక్కరాయలకు సమకాలికుడైన బహ్మనీ సుల్తాను అలా ఉద్దీన్ హసన్ షా కుమారుడైన మొదటి మహమ్మదు షా. ఇతడు క్రీ.శ. 1358 లో సింహాసన మెక్కి రమారమి ఇరువది సంవత్సరములు రాజ్యమేలెను. ఈతడు ముసునూరి కాపయ నాయకుని ఓరుగంటి రాజ్యము పైనను, మొదటి బుక్కరాయల విజయనగర రాజ్యము పైనను దండయాత్రలు చేసెను. మహమ్మదీయ చరిత్రకారు లీ దండయాత్రలను తమ చరిత్రలలో మాత్రము ఎక్కువగా అభివర్ణించి ప్రతియుద్ధమునను హిందువులే ఓడిపోయినట్లు వ్రాసియున్నారు. కాని, అది సత్యముని తోచదు. ఈ చరిత్రకారుల వ్రాతలలోని యాథార్థ్యమును తెలిసికొనుటకు తగిన ఆధారములు లేవు. ఈ యుద్ధముల ఫలితముగ ఉభయరాజ్యములకును సరిహద్దు కృష్ణానది యనియును, కృష్ణ కీవలనున్న మహాల్లు కొన్ని బహ్మనీ, విజయనగరాధిపతు లుభయుల సమష్టి పరిపాలన క్రిందను నుండవలె ననియును నిర్ణయమైనది. మహమ్మదు షా ఈ పద్ధతి కొడంబడి బుక్కరాయలతో రాజీ చేసికొనుట వలననే అతనికి సంపూర్ణ విజయము కలుగలేదని విదితమగు చున్నది (చూడు : బహ్మనీ రాజ్యము).

బుక్కరాయలు దక్షిణదిశను, ఉత్తర దిశను విజయము పొందుటతో తృప్తినొంది యూరకుండలేదు. అతడు కృష్ణకు దక్షిణమున నున్న ప్రాగ్దేశమును జయించు తలంపుతో దండువెడలెను; ఇప్పటి కర్నూలు జిల్లాలోను, నెల్లూరు జిల్లాలోని దర్శి, పొదిలి డివిజనులలోను కొండవీటి రెడ్డి రాజుల రాజ్యములోని కొంతభాగమును జయించి తన స్వాధీనములోనికి తెచ్చుకొనెను. బుక్కరాయల ఈ ప్రాగ్దేశదండయాత్ర క్రీ. శ. 1363 - 64 ప్రాంతమున అనవోతారెడ్డి కడపటి రాజ్య వత్సరములలో జరగినట్లు స్థానిక చరిత్రల వలనను, పూర్వోక్త ప్రాంతములలోని విజయనగర శాసనముల వలననును తెలియవచ్చు చున్నది.

బుక్కరాయలు తన యన్నయైన హరిహరరాయల అడుగుజాడలలో నడచి విజయనగరమును చాల గొప్ప రాజ్యముగా రూపొందించెను. అంత యల్పకాలములో విజయనగర మంతటి యౌన్నత్యమును బడయుటకును, అంత గొప్పసామ్రాజ్యముగ విస్తరిల్లుటకును కారకుడు ముఖ్యముగ మొదటి బుక్కరాయలే అనవచ్చును. ఇతని మహాప్రధాని అనంతరాయలు. ఇతడు పెనుగొండ దుర్గమును నిర్మించెను. ఇతనిపేరనే భాస్కరరాయలు కడప మండలములోని పోరుమామిళ్ల గ్రామమున పెద్ద తటాకమొకటి నిర్మించి దానికి అనంత సాగరమని పేరు పెట్టెను. బుక్కరాయని మంత్రులలో మాధవుడు ప్రసిద్ధుడు. ఈతడు పండిత కుంజరుడు; శూరాగ్రేసరుడు. ఇతనికి వీరవసంత మాధవుడను నామాంతరము కలదు. ఇతడు సూత సంహితకు తాత్పర్యదీపిక యను వ్యాఖ్యానమును, శైవామ్నాయ సారమను గ్రంథమును రచించి కీర్తి గాంచెను. ఈ బుక్కరాయల కాలముననే నాచన సోమనాథుడు ఉత్తర హరివంశ కావ్యమును రచించెను. బుక్కరాయ లతనికి పెంచుకల దిన్నెయను గ్రామము నగ్రహారీకరించి ఒక దానశాసనము వ్రాయించి యిచ్చెను.

బుక్కరాయలకు పేరు తెచ్చినది అతని సర్వమత సమదృష్టి. క్రీ. శ. 1368 లో విజయనగరములో జైనులకును, వైష్ణవులకును వివాదము వచ్చిన సందర్భమున ఉభయ మతాచార్యులను రావించి ఎవరివలన ఏమతమునకు కష్టము కలిగినను అది తమ మతమునకే కలిగిన ట్లెంచి అందరును సహనశీలురై పొంది పొసగి యుండవలెనని ఉపదేశించి యుభయ మతములవారికిని బుక్కరాయలు రాజీ చేసెను. ఇతడు తన సామ్రాజ్యమును ఉదయగిరి, పెనుగొండ, ములువాయి, అరగ, తులు మొదలయిన రాజ్యములుగ విభజించి వానిని పాలించుటకు రాజకుమారులను కాని, సమర్థులయిన మంత్రులను కాని నియమించుచు వచ్చెను. ఇతడు క్రీ. శ. 1377 వ సంవత్సరమున స్వర్గస్థుడు కాగా ఈతని కుమారుడైన రెండవ హరిహరరాయలు విజయనగరాధీశ్వరు డయ్యెను.

**రెండవ హరిహరరాయలు** (క్రీ. శ. 1377 — క్రీ. శ. 1404): ఇతడు విజయనగర వజ్ర సింహాసన మెక్కి ఇరువదేడు సంవత్సరములు రాజ్యమేలెను. బుక్కరాయల కాలములో విజయనగరాధీశ్వరులకు చేపడిన రాజ్యము నంతను రెండవ హరిహరరాయలు కట్టుదిట్టపరచి ఏకైక రాజాధిపత్యము క్రిందికి తీసికొని వచ్చెను; రాజాధిరాజ, రాజపరమేశ్వర బిరుదములను వహించెను; సామ్రాజ్యము నందలి వేరు వేరు రాజ్యములకు తన కుమారులను నియమించెను; మరికొన్నిటిని తన కత్యంత విశ్వాసపాత్రులును, సమర్థులు నైన దండనాయకుల అధీనమున నుంచెను; తన కుమారులలో ఒకడైన మొదటి దేవరాయలను ఉదయగిరి రాజ్యాధిపతిగ నియమించెను. రెండవ హరిహరరాయల మరియొక కుమారుడు విరూపాక్షరాయలు. ఈతడు తన తండ్రి రాజ్యకాలమున తుండీర, చోళ, పాండ్య రాజ్యములను జయించి ఆ ప్రాంతములను రాజప్రతినిధిగ పాలించుచుండెను. ఇతడు శూరశిఖామణి యగుటయేకాక పండిత సింహము నై యుండెను. ఇతడు విద్యారణ్య యతీంద్రుల శిష్యుడు. ఇతడు సంస్కృత భాషను నారాయణ విలాసము, ఉన్మత్త రాఘవములను రెండు నాటక



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ములను రచించెను. హరిహరరాయల దండనాయకులలో ఇరుగప దండనాయకుడు ప్రసిద్ధుడు. ఇతడు నానార్థ రత్న మాల యను నిఘంటువును రచించెను. హరిహరరాయల మహామంత్రి మాధవాచార్య సోదరుడైన సాయణా చార్యుడు. ఇతడు కాక ప్రశాపాధ్యులు, రాజనీతి చతురులు అయిన మాధవమంత్రి మొదలయినవా రింకను గలరు.

మొదటి మహమ్మదుషా అనంతరము బహ్మనీ సింహాసన మెక్కిన ముజాహిదుషా కృష్ణా, తుంగభద్రా నదుల అంతర్వేదిలోని కొన్ని మహాల్లు బహ్మనీ, విజయనగర రాజ్యముల సమష్టి పరిపాలనక్రింద ఉండుట వలన చిక్కులు కలుగుచున్న వనియు, కావున ఆ మహాల్లను మాత్రమే కాక, కృష్ణా తుంగభద్రల యంతర్వేది నంతటిని తన కిచ్చి వేయవలసిన దనియు ఇమ్మడి హరిహరరాయలను కోరెను. ఇందును గురించియే విజయనగర, బహ్మనీ రాజ్యములకు మరల యుద్ధము సంభవించినది. తుదకు ఈ యుద్ధమున ముజాహిదు షా ఓడిపోయి నిజరాజధానికి మరలిపోవు చుండగా మార్గ మధ్యమున క్రీ. శ. 1378 లో హతుడయ్యెను. ముజాహిదు షా తరువాతనైనను బహ్మనీ, విజయనగర కలహ మంతరించలేదు. రెండవ మహమ్మదు షా కాలములోను, ఫీరూజ్ షా కాలములోను ఉభయ రాజ్యములకును మరల యుద్ధములు జరిగినవి. ఈ యుద్ధములలోనే హరిహరరాయలు పానుగల్లు దుర్గమును జయించుటయు, బహ్మనీ సుల్తానుల విధేయ సామంతులైన రాచకొండ వెలమనాయకులు విజయనగర రాజ్యముపై దండెత్తుటయు జరిగినది.

ముజాహిదుషా మరణము నవకాశముగా గొని హరిహర రాయల కాలమున మాధవ మంత్రి గోవా రాజ్యమును జయించి, తురుష్కులను గోవానగరము నుండి తరిమివేసి భువనైకవీరుడను బిరుదమును వహించెను. గోవానుమాత్రమే కాక అతడు ముస్లిములవద్దనుండి వాయవ్య దిశను పశ్చిమ సముద్రతీరస్థములైన చౌల్, దాభోల్ మొదలైన రేవుపట్టణములనుకూడ తీసికొనెను. విజయనగర సామ్రాజ్యమునకు కృష్ణానది ఉత్తర సీమావధి యైనది.

ముసునూరి కాపయ నాయకుడును, విజయనగరాధీశ్వరులును మిత్రులుగ నుండి, బహ్మనీ సుల్తానులతో ఎవరికి కలహము సంభవించినను రెండవవారు వారితో సహకరించుచు వచ్చిరి. రాచకొండ రాజ్యాధిపతి అనపోతా నాయకుడు కాపయ నాయకుని సంహరించి ఓరుగంటి రాజ్యమున కధిపతియైనప్పటినుండి కృష్ణానది కుత్తరమున దక్కను పీఠభూమి ప్రాగ్భాగము నాక్రమించిన తెలుగుదేశ మంతయు ఆతని యధికారముక్రిందికి వచ్చెను. బహ్మనీ సుల్తానులకు రాచకొండ దేవరకొండ వెలమనాయకులు విధేయసామంతులు. హరిహరరాయలకు అందువలన రాచకొండ రాజ్యము విజయనగరమున కుపద్రవకరముగ తోచినది. అందువలన హరిహరరాయలు దానిని జయించుటకై కొంత సైన్యమును తోడిచ్చి తన కుమారుడు రెండవ బుక్కరాయలను ఆ రాజ్యముపై దండెత్త బంపెను. రెండవ బుక్కరాయలు కృష్ణ దాటి ఉత్తరముగ కొత్త కొండ వరకు పోయెను. కాని అక్కడ జరగిన యుద్ధమున విజయనగర సైన్యము పరాజయము నొందెను.

రెడ్డిరాజ్యమున పడుమటి దిశను వినుకొండవరకు గల దేశము విజయనగరాధీశ్వరుల అధికారము క్రిందికి వచ్చినది.

**రెండవ బుక్కరాయలు** (క్రీ.శ. 1404 — క్రీ.శ. 1406) : రెండవ హరిహరరాయలు క్రీ. శ. 1404 లో మృతి నొందెను. అతని మరణానంతరము విజయనగర రాజ్యాధిపత్యమునకై అతని కుమారులు పోరాడుకొనిరి. విరూపాక్షరాయలను జయించి రెండవ బుక్కరాయలు రెండేండ్లు రాజ్యమును పరిపాలించెను. కాని త్వరలోనే ఇతని సోదరుడైన మొదటి దేవరాయలు ఇతనిని జయించి విజయనగర వజ్రసింహాసనము నధిష్ఠించెను.

**మొదటి దేవరాయలు** (క్రీ. శ. 1406 — క్రీ. శ. 1422) : ఇతడు విజయనగర సామ్రాజ్యమును పరిపాలించిన పదునారు సంవత్సరములలోను బహ్మనీ సుల్తానులతోను, రాచకొండ వెలమనాయకులతోను, కొండవీటి రెడ్డిరాజులతోను ఎడతెగని యుద్ధములు కావించెను. మొదటి దేవరాయలకు సమకాలికుడైన బహ్మనీ సుల్తాను ఫీరూజ్ షా. ఇతడు దేవరాయల రాజ్యకాలము ప్రారంభ సంవత్సరములోనే విజయనగర రాజ్యముపై దండెత్తి వెళ్లెను. ఫీరూజ్ షా విజయధాటికి అడ్డమాకలు లేకపోయిన వనియు, అతడు సరాసరి విజయనగరమునకు వచ్చి దానిని ముట్టడించె ననియు, తుదకు దేవరాయలు అతనితో సంధి చేసికొని బంకాపుర దుర్గము నిచ్చివేయవలసి వచ్చె ననియు ఫెరిస్తా వ్రాయుచున్నాడు. ఫెరిస్తా అతిశయోక్తులతోను, కల్పనా కథలతోను ఈ దండయాత్ర నతివిస్తరముగ వర్ణించినను, ఇతర ముస్లిము చరిత్రకారుల వృత్తాంతములను కూడ పరికించినపుడు మొత్తము మీద దేవరాయలు అపజయము నొందినట్లే కనిపించుచున్నది. ఈ దండయాత్రలో రాయచూర్ జిల్లాలో వాయవ్యదిశయందున్న ఘనూరు (ఖానూరు), మునలికల్లు దుర్గములుకూడ ఫీరూజ్ షా వశమయినవి (చూడు : బహ్మనీరాజ్యము).

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



'వెలుగోటివారి వంశావళి' రేచెర్ల వెలమనాయకులు విజయనగరాధీశ్వరు నోడించినట్లు చెప్పుచున్నను వా రేసందర్భమున విజయనగరముపై దండెత్తి వచ్చిరో వారి కీవిజయ మెప్పుడు లభించెనో స్పష్టముగ తెలియదు.

దేవరాయలు కుమారగిరిరెడ్డి మరణానంతరము అన్న దేవచోడ, పెదకోమటి వేమారెడ్లకును కాటయ వేమా రెడ్డికిని జరగిన ఘోర సంగ్రామములలో కాటయ వేమా రెడ్డి పక్షమున పాల్గొనెను. ఈ సందర్భమున సుల్తాను ఫీరూజ్ షా అతని సామంతులైన రాచకొండ వెలమనాయ కులతో కలసి అన్నదేవచోడ, పెదకోమటి వేమారెడ్లకు సాయముగ వచ్చెను (చూడు : కొండవీటి రెడ్డి రాజ్యము). మొత్తముమీద మొదటి దేవరాయలు కొండవీటి రెడ్డి రాజ్యము నాపోశనము పట్టదలచి తుదకంట రెడ్డి రాజ్య వ్యవహారములలో జోక్యము కలిగించుకొనుచునే వచ్చెను.

దేవరాయలు మహమ్మదీయులతో పోరాడుచుండిన కాలముననే కావచ్చును కందుకూరిశాఖ రెడ్డి మన్నీలు రాయరాజ్యముపై దండెత్తి వెళ్లి కడపజిల్లాలోని పొత్తపి నాటిని, దాని కాగ్నేయదిశనున్న పులుగులనాటిని ఆక్ర మించుకొనిరి. క్రీ. శ. 1418 - 14 లో దేవరాయలు వారి నోడించి తరిమి వేయు వరకు ఆ ప్రాంతము రెడ్ల అధీన మునసే యుండెను.

ఈ దేవరాయల కాలములోనే క్రీ. శ. 1417 లో మరల బహ్మనీ, విజయనగర రాజ్యాధిపతులకు యుద్ధము సంభ వించినది. రెండవ బుక్కరాయలు పానుగల్లు దుర్గమును జయించినప్పటినుండి అది విజయనగరాధిపతుల యధి కారముక్రిందనే యుండెను. అది యుద్ధ తంత్రమున కను వైన స్థానమం దుండుటచేత దేవరాయలు కాటయవేమునికి సాయపడుట కెక్కువ వీలయినది. ఈ దుర్గము విజయ నగరాధీశుల అధికారముక్రింద నుండుట బహ్మనీ రాజ్య మున కెప్పటికైన ముప్పు తెచ్చునని సుల్తాను ఫీరూజ్ షా దీనిని క్రీ. శ. 1417 లో ముట్టడించెను. విజయనగర, బహ్మనీ సైన్యములకు అక్కడ భయంకర యుద్ధము జరగి నది. ఈ యుద్ధము జరగుచుండగా రాచకొండ వెలమ నాయకులు ఏకారణముననో చిరకాలమునుండి తమకు ప్రభువులైన బహ్మనీ రాజ్యాధిపతులను విడిచిపెట్టి విజయ నగరాధిపతుల పక్షము వచ్చి చేరిరి. అంతవరకు తమకే తప్పక విజయము లభించు ననుకొన్న బహ్మనీ సైన్యములకు పూర్తిగా పరాజయము కలిగినది. దేవరాయలకు అఖండ విజయము లభించెను. ఈ దండయాత్రలలోను, యుద్ధముల లోను మొదటి దేవరాయలకు అతని కుమారుడైన వీర విజయభూపతియు, అతని మహామంత్రి లక్ష్మీధరుడును ఎక్కువగా తోడ్పడిరి. ఈ మంత్రిశేఖరుడు మాధవ సాయ ణుల ఛాగినేయుడు.

ఈ మొదటి దేవరాయల రాజ్యకాలము చివరలో ఇటలీ దేశస్థుడైన నికోలో కోంటి విజయనగరమునకు వచ్చి ఆ పట్టణ వైభవము నభివర్ణించెను.

దేవరాయలు క్రీ. శ. 1422 లో కాలధర్మమును పొందెను. అతని తరువాత కొద్దికాలము అతని కుమా రుడు రామచంద్రరాయలు రాజ్యముచేసెను. ఇతడు తన తండ్రి రాజ్యకాలమున కొంతకాలము ఉదయగిరి రాజ్యాధి పతిగ నుండెను.

రామచంద్రరాయల తరువాత విజయనగర సింహా సనము నధిష్ఠించినవాడు అతని సోదరుడు వీరవిజయ భూపతి. ఇతనికి వీరవిజయ బుక్కభూపతియని, వీరబుక్క భూపతియని నామాంతరములు. ఇతడు ఎంతకాలము రాజ్య మేలెనో సరిగా చెప్పలేము. ఇతడు రాజ్యము చేయు చుండిన కాలముననే ఇతని కుమారుడు ఇమ్మడి ప్రౌఢదేవ రాయలను నామాంతరముగల రెండవ దేవరాయల శాసన ములును కనిపించుచున్నవి. ప్రాయికముగా రెండవ దేవ రాయలు తన తండ్రితో కలసి రాజ్య మేలుచుండినట్లు ఊహింపవలసి యున్నది.

ఇమ్మడి ప్రౌఢదేవరాయలు (క్రీ. శ. 1423 — క్రీ. శ. 1446): విజయనగర రాజ్యమును పలిన సంగమవంశరాజు లలో ప్రౌఢదేవరాయలు అగ్రగణ్యుడు. ఈ రాయల కాలముననే విజయనగర రాజ్యము మహోన్నత స్థితికి వచ్చెను. ఈ భూపతి కాలముననే పారసీకరాయబారి 'అబ్దుర్ రజాక్' విజయనగరమును చూడ వచ్చి ఆ పట్టణ వైభవమును, ప్రౌఢరాయల మహోన్నతస్థితిని వర్ణించి నాడు. ఈ భూపాలుని ఆస్థానమున శ్రీనాథమహాకవికి కనకాభిషేకము జరగినది.

ఓఢ్ర కళింగాధిపతియైన కపిలేశ్వరుడు రాజమహేంద్రవర రెడ్డిరాజ్యముపై దండెత్తి వచ్చినపుడు తళ్ళాలకులైన వేమ, వీరభద్రారెడ్లకు సాహాయ్యముగ ఈ యిమ్మడి ప్రౌఢ దేవరాయలు దండంపి యాతనిని తరుమగొట్టెను. దాక్షా రామ భీమేశ్వరాలయములోని ఒక శాసనములో ఇతని సేనాధిపతులలో నొక్కడు క్రీ. శ. 1444 లో రాజమహేం ద్రవర రాజ్యాధిపతిలని చెప్పబడినది. ఆ విధముననే కొండ వీడు, కందుకూరు రాజ్యములు విజయనగర రాజ్యములో కలసిపోయెను. రెడ్డిరాజ్యములు అంతరింపగా విజయనగర రాజ్యము బలిష్ఠమయ్యెను. ఈ ప్రౌఢదేవరాయలకు గజ బేంట (ఏనుగువేట)దేవరాయ లనియు, ప్రతాప దేవరాయ లనియు బిరుదులు కలవు. ఈతడు మహారాజాధిరాజ రాజ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/




http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పరమేశ్వర బిరుదాంచితుడై తురుష్కులతోడను, గజపతుల తోడను అనేక యుద్ధములను చేసి (చూడు: బహ్మనీ రాజ్యము, గజపతులు), శత్రు విజృంభణమును మాన్పి, సామ్రాజ్యమును విస్తరింపజేసి క్రీ.శ. 1446 సంవత్సరములో మృతినొందెను. న్యూనిజ్ అను చరిత్రకారుడు ఇతని భాండాగారమున 225 కోట్ల ధనము నిలువయుండెననియు, క్విలన్, సింహళము, పులికాటు, పెగు, తెన్నాసిరిమ్ మొదలగు దేశముల రాజులు ఇతనికి కప్పము కట్టుచుండిరనియు వ్రాసి యున్నాడు.

మల్లికార్జునరాయలు (క్రీ. శ. 1446 — క్రీ. శ. 1465): ఇతడు ప్రౌఢ దేవరాయలకు పొన్నలదేవియందు జనించిన కుమారుడు. శ్రీపర్వతవాసుడగు మల్లికార్జున స్వామి కృపాకటాక్షమున జనించుటచే నితనికి ఆ స్వామి నామధేయము లభించెనట! ఈతని కాలమున రాజ్యములోని వివిధ ప్రాంతములకు రాజప్రతినిధులు నియమింపబడి ఆయా రాజ్యములను పాలించుచుండిరి. ప్రౌఢదేవరాయలు మరణించిన తర్వాత పరరాజన్యులు విజయనగర రాజ్యమును వశపరచుకొనుటకు ఉద్యమించిరి. వీరిలో ముఖ్యులు గజపతులు. కళింగదేశమును ఈ కాలమున పాలించుచుండిన కపిలేశ్వర గజపతి విజృంభించి, తూర్పుతీరమున ఉన్న రాజమహేంద్రవరరాజ్యమును, నెల్లూరి మండలములోని ఉదయగిరి రాజ్యమును వశపరచుకొని కొండవీటిని ముట్టడించి, కర్ణాట రాజ్యలక్ష్మిని చూరకొని, కాంచీనగరముపై దండెత్తి, ఆ పట్టణమును స్వాధీనపరచుకొనెనట. గజపతి విజయనగరముపై దండెత్తిపోయెను కాని మల్లికార్జునరాయలు ఆతనిని ఎదుర్కొని రాజధానీ నగరమును సంరక్షించుకొనెనట.



చిత్రము 57. హజార రామస్వామి ఆలయము, హంపి

విరూపాక్షరాయలు (క్రీ. శ. 1465 — క్రీ. శ. 1478): మల్లికార్జునరాయల మరణానంతరము అతని పినతండ్రి పుత్రుడగు విరూపాక్షరాయలు క్రీ. శ. 1465 సంవత్సరమున విజయనగరరాజ్య సింహాసనము నధిష్ఠించెను. ఈతడు ప్రతాపదేవ రాయలకు సింహళదేవియందు జనించిన పుత్రుడు; విజయనగరరాజ్యమును పాలించిన సంగమరాజ వంశములోని కడపటివాడు; రాజ్యము మల్లికార్జునరాయల కుమారుడగు రాజశేఖర రాయలకు చెందకుండ తానే ఆక్రమించి పరిపాలనముచేయ మొదలుపెట్టెను. ఈతడు వారకామినీ జనలోలుడును, సురాపానప్రియుడును అయి దండనాయకులకు కాని, ప్రజలకు కాని దర్శనము ఈయక, రాజకార్యములందు విముఖత వహించెను. ఆ కారణమువల్ల రాజ్యము క్షీణదశకు వచ్చెను. గజపతులు ఒక వంకను, మహమ్మదీయులు ఇంకొక ప్రక్కను రాజ్యము నాక్రమింప బొచ్చిరి. విరూపాక్షరాయల కాలమున పశ్చిమ తీరమందలి గోవానగరము గొప్ప వర్తకస్థలముగ నుండెడిది. ఆ నగరములోని 'మూరు'లను వర్తకులు గుర్రములను కొని బహ్మనీ సుల్తానులకును, విజయనగర రాజులకును విక్రయించుచుండిరి. కొంతకాలమైన తర్వాత ఆ వర్తకులు గుర్రములను విజయనగర రాజులకు విక్రయింపక బహ్మనీ రాజులకే అమ్ముచుండిరి. ఆ కారణమున విరూపాక్షరాయలు కోపోద్దీపితుడై వెంటనే గోవానగర వాసులు పదివేల మూరులను సంహరింప ఆజ్ఞ ఇచ్చెనట. ఆఘోరకృత్యము జరిగిన పిమ్మట బహ్మనీ సుల్తాను మంత్రి మహమ్మదు గావాను విని వెంటనే గోవానగరమును ముట్టడించి, దానిని స్వాధీనము గావించుకొనెను. తరువాత విరూపాక్షరాయలు ఆ నగరమును మరల స్వాధీనము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కావించుకొన యత్నించెను; కాని విఫలమనోరథు డయ్యెను. ఇట్లు పశ్చిమతీరమందలి గోవానగరము అన్యాక్రాంతము అగుటచే విజయనగరరాజ్యమునందలి పశ్చిమ మండలములు కొన్ని శత్రుహస్తగతములయి రాజ్యము క్షీణదశకు రాజొచ్చెను. ఈతనికాలముననే చంద్రగిరి రాజ్యమును సాళువ నరసింహరాయలు సామంతుడుగ పరిపాలించుచుండెను. ఇతడు సంగమవంశావసానకాలమున విజయనగరరాజ్యమును స్వాధీనపరచుకొని తద్రాజ్యమును పాలించిన వీ వరేణ్యుడు. మల్లికార్జునరాయల కాలమునుండియు ఇతడు స్వతంత్రుడై రాయలకు భయము కలిగించుచుండెను. విరూపాక్షరాయల కాలములో ఇతడు విజయనగర. సామ్రాజ్యమునకు సహజశత్రువులైన గజపతుల తోడను, బహ్మనీ సుల్తానుల తోడను పోరాడుచుండెను.

సంగమవంశావసానము : విషయాసక్తుడయిన విరూపాక్షరాయలు ప్రజలకును, దండనాయకులకును అప్రియుడై పరిపాలనము సాగించుచుండ ఇతని పెద్దకుమారుడు తండ్రిని చంపించి సింహాసనముపై తన తమ్ముడైన ప్రౌఢ రాయలను గూర్చుండబెట్టెను; అతడు తనకు రాజ్యము నిచ్చిన అన్నవలన ముప్పు కలుగవచ్చునని భయపడి అతనిని చంపించెను. ఇట్టి పితృహంతకులు, భ్రాతృహంతకులు రాజ్యపాలనము సాగించుట సామంతనాయకుల విజృంభణమునకు కారణ మయ్యెను; అందువలన రాజవంశము నశించుటయు సంభవించెను. రాజ్యము వీరభోజ్యము కావున సాళువవంశ వీరవరేణ్యుడైన నరసింహరాయలు దేశకాల పరిస్థితులు పరికించి స్వాతంత్ర్యము నవలంబించి, తానే విద్యానగరము నాక్రమించి విజయనగర రాజ్యాధీశ్వరు డయ్యెను. ఈరీతిని సంగమవంశము తరువాత సాళువవంశము విజయనగర రాజ్యమును పాలించుట సంభవించెను.

కుం. ఈ. ద.

## సాళువ వంశము

రాయ సామ్రాజ్యమును పాలించిన నాలుగు రాజవంశములలో సాళువ వంశము ఒక్కటి. ఈ వంశమునకు ఆదిమ నివాసస్థానము చాళుక్య చక్రవర్తులకు రాజధానియైన కల్యాణకటకము. ఈ కారణమువలననేమో ఈవంశజులు తాము కల్యాణపురవరాధీశ్వరుల మని చెప్పికొనెడివారు; కాని వారు కల్యాణమున నెప్పుడు వర్ధిల్లిరో తెలియదు. దేవగిరియాదవుల కొలువున తిక్కమ మున్నగు సాళువ వంశజులు కొందరు దండనాయకులు నియోగింపబడియుండిరి. వీరికిని ఆంధ్రదేశమున ప్రసిద్ధిచెందిన సాళువ కుటుంబములకును నేమేనియు సంబంధము ఉండెనో తెలియదు. కాని విజయనగర సామ్రాజ్య స్థాపనకు ముందు వీరి అడపొడ ఆంధ్రదేశమున కానరాదు. కావున సంగమపుత్రులు విజయనగరమున హిందూ స్వాతంత్ర్యమును పునరుద్ధరించి ఆంధ్ర కర్ణాటదేశములందు రాయరాజ్యమును నెలకొల్పిన పిమ్మట వీరు కల్యాణప్రాంతమునుండి తెలుగు దేశమునకు వచ్చి యుందురని తోచుచున్నది.

సాళువ వంశజులు ఆంధ్ర దేశమునందు తామర తంపరగ అభ్యుదయమంది పెక్కు శాఖలై చీలి రాయరాజ్యమునందు అనేక స్థలములలో చిన్న చిన్న సంస్థానములను స్థాపించి రాయలకు సామంతులై పరిపాలించుచుండిరి; మరియు కొందరు రాయకుటుంబముతో సంబంధ బాంధవ్యములు నెరపి మాండలికులై వెలసిరి. సాళువ వంశమందు ప్రసిద్ధి కాంచినది చంద్రగిరి శాఖ. మొట్టమొదట ఈ శాఖవారు ములికినాటియందు అమరములను అనుభవించుచు ఉదయగిరి దుర్గాధ్యక్షుని పలుబడిక్రింద ఉండిరి. క్రీ. శ. 1352 ప్రాంతమున మొదటి బుక్కరాయల కుమారుడైన ఇమ్మడి కంపరాయలు ద్రావిడదేశ దిగ్విజయార్థము దండు వెడలి పోయినప్పుడు చంద్రగిరి సాళువ వంశమునకు మూలపురుషుడైన సాళువ మంగు అతనితో కూడ దక్షిణ దేశమునకు పోయెను; సాళువ మంగు శూరవతంసుడు. దక్షిణ దండయాత్రలందు అతడు కుమార కంపరాయల ఖడ్గమునకు కర్తయై పెక్కు రణరంగములలో పోటు చూపి ఖ్యాతిని గడించెను. ఇతడు దక్షిణ సురత్రాణుని యుద్ధరంగమున ఎదిరించి అతనిని కొనివచ్చి కంపరాయలకు ఇచ్చెను. సంబువరాయని అతని రాజ్యమున నిలిపి సంబువరాయ స్థాపనాచార్య యను సుప్రసిద్ధమైన బిరుదును వడసెను; శ్రీరంగనాథస్వామిని అతని యాలయమునందు ప్రతిష్ఠ చేసి ఆ దేవునికి అరువదివేల మాడలు ఉమ్మడిగ ఇచ్చెను; మధురా సురత్రాణుని మడియించి 'పరపక్షి సాళువ' బిరుదు వహించెను. మరియు మధురా నగరముయొక్క గవకులను విరుగద్రోసి కోటలోపలికి విసరిన గౌరును ఉద్దవిడి తెచ్చెను. సాళువ మంగు ధైర్య సాహసములకు మెచ్చి అతనికి కంపరాయలు చంద్రగిరి రాజ్యమునకు చెల్లుచుండిన నారాయణవన ప్రాంతదేశమును అమర మాగాణముగ ప్రసాదించినట్లు ఉన్నది. ఇచటనే ఇతని సంతతివారు అభివృద్ధి చెంది క్రమక్రమముగ తమ పాలనక్రింది రాష్ట్రమును పెంపొందించి తుదకు చంద్రగిరి దుర్గమును కైవసము చేసికొని రాజధాని కావించుకొనిరి.

సాళువమంగు పుత్రులలో ఇమ్మడి గౌతరాజు ఒకడు. ఇతనికి గుండరాజను పుత్రుడు ఒక్కడు పుట్టెను. అతనికి నరసింహరాజనియు, తిమ్మరాజనియు పేరులు కల

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కుమారులు ఇరువురు కలిగిరి. ఈ యిరువురిలో ప్రథముడగు నరసింహరాజు ధైర్య శౌర్య సాహస సంపన్నుడు; శక్తి సామర్థ్యములందు అద్వితీయుడు; రాజ్యకార్య మర్మజ్ఞుడు; నెరజోదు; గడిదేరిన దండనాయకుడు; కావున నతడు క్రమక్రమమున రాయ సామ్రాజ్యమును ఆక్రమించుకొని విజయనగరముననుండి రాయలను వెడలనడచి వజ్రసింహాసనమును అధిష్ఠించెను.

సాళువ నరసింహుని ఉద్యమమునకు దేశకాల పరిస్థితులు అనుకూలపడెను. దక్షిణ భారతమున కంతటికిని ఏకచ్ఛత్రాధిపతియై మహావైభవముతో ఇరువదినాల్గేండ్లకాలము సామ్రాజ్య పాలనము సాగించి ప్రౌఢ దేవరాయ నామాంకితుడైన ఇమ్మడి దేవరాయలు క్రీ. శ. 1446 వ సంవత్సరమునందు అస్తంగతు డయ్యెను. తరువాత సామ్రాజ్యాధిపత్యమునకై రాయ కుటుంబమున కొంత పెనకువ కలిగెను. ఇమ్మడి విజయరాయలు సింహాసనము నధిష్ఠించి క్రీ.శ. 1448 వరకు రెండేండ్ల కాలము పాలించెను. పిమ్మట ముమ్మడి ప్రౌఢదేవరాయాపరనామధేయుడైన మల్లికార్జున రాయలు రాజ్యాభిషిక్తుడై క్రీ. శ. 1468 వరకును ప్రజాపాలనము చేసెను. రాజ్యాభిషేకమప్పుడు మల్లికార్జునరాయలు పసివాడు; అదియె అనుకూల సమయమని ఎంచి రాయ సంస్థానమునకు సహజ శత్రువులైన యొడ్డె కళింగాధిపతియైన కపిలేశ్వర గజపతియు, బహ్మనీ సురత్రాణుడైన రెండవ అలా ఉద్దీను శాహును ఏకమై వచ్చి విజయనగర రాజధానిని ముట్టడించిరి. కాని ఈ ముట్టడియందు విజయము ఎవ్వరికి చేకూడినదో నిశ్చయించి చెప్పుటకు వీలులేదు; ఏలన గజపతుల శాసనములలో రాయలు కపిలేశ్వరునకు సమున్నత ధనరాశిని సమర్పించి సంధి చేసికొనినట్లు కలదు. కాని విజయనగర సంస్థానాశ్రితులు రచించిన గ్రంథములు కొన్నింటియందు మల్లికార్జునరాయలు తన రాజధానిని ముట్టడించిన శత్రుయూథముపై నాకలిగొన్న సింహము గుహ వెలువడి యేనుగు తండములను కసిమసగినట్లు ఖండించి పటాపంచలు కావించెనని చెప్పబడియున్నది. ఇందలి కల్ల నిజములు ఎట్లున్నను మల్లికార్జునరాయల రాజ్యాభిషేకముతో రాయ సామ్రాజ్యమునకు క్షీణదశ సంప్రాప్తమైనదని దృఢముగ చెప్పవచ్చును.

కపిలేశ్వరుడు సామాన్య శత్రువు కాడు. ఆకాలమున భరత ఖండము నేలుచుండిన రాజులలో మేటి; గౌడ మాళవ ఘూర్జర దేహళీ (ఢిల్లీ) సురత్రాణులను రణరంగమున నిర్జించిన శూరశిఖామణి. ఆంధ్ర దేశమును సర్వమును తన యేలుబడిక్రిందికి తెచ్చుకొనవలయునని నిశ్చయించి తత్కార్యసాధనకొరకు అతడు తన యావచ్ఛక్తిని వినియోగించి దండయాత్రలు చేసి కృతకృత్యుడయ్యెను; క్రీ. శ. 1448-50 ల మధ్య రాజమహేంద్రవరపు రెడ్డిరాజ్యమును కూలద్రోసి కృష్ణానది పర్యంతము వ్యాప్తమైన తీరాంధ్రదేశమును కైవసము కావించుకొనెను; తరువాత క్రీ. శ. 1455 వ సంవత్సరమున కృష్ణానదిని దాటి రాయ సామ్రాజ్యమును ప్రవేశించి కొండవీటి రాజ్యమును జయించెను; 1460-61 వ సంవత్సరమున బహ్మనీ సుల్తానును ఓడించి, అతని ఏలుబడిక్రింద నుండిన తెలంగాణాను సాధించుటకు ఘన ప్రయత్నము కావించెను; కేవల దండనీతివలన కార్యము సులభముగ కొనసాగదని గ్రహించి భేదోపాయ మవలంబించి కర్ణాటరాజ కుటుంబమున రాజద్రోహ బీజమును నాటి దురాశావృక్షము నందు పెంపందించెను. ఇమ్మడి ప్రౌఢదేవరాయలకు ప్రతాపదేవరాయ అను తమ్ముడు ఉండెను. ఇమ్మడి ప్రౌఢ దేవరాయలు అతనిని రాయ సామ్రాజ్యములో ముఖ్య దుర్గములలో నొక్కటియగు పెనుగొండకు దుర్గాధ్యక్షుని కావించి యా దుర్గమునకు చెందిన రాజ్యమునకు అధిపతిని కావించియుండెను. ఇతనికి విరూపాక్షుడను పుత్రు డొకడు గలిగెను. ఇమ్మడి ప్రౌఢదేవరాయలు లోకాంతరగతుడయినది మొదలు ఆ తండ్రి కొడుకు లిరువురి దృష్టియు వజ్రసింహాసనమున లగ్నమయ్యెను. కాని శక్తి చాలమిని వారు నిజాభీష్టమును నెరవేర్చుకొన జాలక యుండిరి. కపిలేశ్వరుడు ఆశ చూపి వారిని రాజద్రోహమునకు పురికొల్పెను; కర్ణాటక సామంతులను లోబరచుకొని వారికి ఆశ్రయ మిచ్చి ప్రతాపదేవరాయలకును, అతని పుత్రునకును తోడ్పడ వారిని ఒడబరచెను. ఇట్లు రాయ సామ్రాజ్యమున రాజద్రోహము ప్రబలిన పిమ్మట తన పుత్రుడగు కుమార హంవీరదేవునికి ఒక గొప్ప దండు నిచ్చి ద్రావిడ దేశమందు కర్ణాటక సామ్రాజ్యమునకు చెందిన రాష్ట్రములను అన్నింటిని సాధించి కైవసము కావించుకొన నాజ్ఞాపించి పంపెను. కుమార హంవీరుని దండయాత్ర క్రీ. శ. 1464-65 లో సాగినది. అతనిని అడ్డపెట్ట నెవ్వరును ప్రయత్నము చేసినట్లు అగపడదు. ఉదయగిరి, చంద్రగిరి, కంచి, పడవీడు, వలుదలంపట్టిఉసావడి, తిరువారూరు, తిరుచినాపల్లి మున్నగు ముఖ్య దుర్గములు అన్నియు హంవీరునికి సులభముగ హస్తగతము లయ్యెను. మన్నేరు, కావేరుల మధ్య నుండు తీరభూమి యంతయు కపిలేశ్వరుని ఏలుబడి క్రిందికి వచ్చెను. కాని ఉదయగిరి రాజ్యమునందు తప్ప తక్కిన స్థలములందు అతని అధికారము నెలకొనలేదు. క్రీ. శ. 1464-65 కు తరువాత గజపతుల శాసనములు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ద్రావిడదేశమున కానరావు. కావున హంవీరుడు కావేరీ తీరమును చేరిన వెంటనే దండును మరల్చుకొని నిజదేశమునకు తరలి పోయెనని ఎంచవలసియున్నది. కారణమేమియో తెలియదు. కుమార హంవీరుని దండయాత్ర సమయమున కావేరీపర్యంత తీరద్రావిడదేశమున చాల భాగము సాళువ నరసింహరాయల పాలనక్రింద ఉండినది. కావున హంవీరుడు అతనిని ఓడించియే పైని పేర్కొనిన చంద్రగిర్యాది దుర్గములను స్వాధీనము చేసికొని ఉండవలెను. ఏకారణమువల్లనో సాళువ నరసింహరాయలు మొదట గజపతికి ఓడి లొంగిపోయినను దండయాత్ర కావేరీ తటమును చేరులోపలనే తిరుగబాటు చేసి ఒడ్డె సైన్యములను ద్రావిడ దేశమునుండి తరిమివేసి నిజాధికారమును మరల స్థాపించి యుండునని తోచుచున్నది.

కుమారహంవీరుని దండయాత్రకు పిమ్మట స్వల్పకాలము లోపలనే మల్లికార్జునరాయలు మృతినొందెను. క్రీ. శ. 1465 జూనుకు తరువాత అతని శాసనములు కానరావు. అతనికి రాజశేఖరరాయలు అను పుత్రుడు ఒకడుండినను అతడు సింహాసనము నెక్కలేదు. మల్లికార్జునుని పితృవ్య పుత్రుడైన విరూపాక్షరాయలు సామ్రాజ్యాధిపత్యము వహించెను. మల్లికార్జునుని పుత్రుని తొలగద్రోసి ఇతడు సింహాసనము నెక్కుట చూడ రాజకుటుంబమున విప్లవ మేదియో సంభవించియుండునని తోచుచున్నది. మల్లికార్జునరాయలు సహజముగ మరణింపక బలాత్కారముగ మృతిచెందెనని ఎంచుటకు అవకాశము కలదు. ప్రపన్నామృతము అను వైష్ణవమత గ్రంథమున విరూపాక్షరాయలు విద్యానగరమున రాజ్యము చేయుచుండిన జ్ఞాతులను రాత్రియందు నిద్రితులైనవారిని వధించి సింహాసనమును ఆక్రమించుకొనెనని ఒక ఐతిహ్యము కలదు. మల్లికార్జునరాయల మరణానంతరము అతని పుత్రుడగు రాజశేఖరుడు సామ్రాజ్యాధిపతి కాకపోవుటయు, సింహాసనము నెక్క హక్కులేని విరూపాక్షరాయలు సింహాసనాధిపతి అగుటయు చూడ పై కథయందు కొంత సత్యము కలదని తోచుచున్నది.

విరూపాక్షరాయలు సింహాసనమును ఆక్రమించుకొనెనే కాని సామ్రాజ్యమును సంపూర్ణముగ స్వాధీనపరచుకొనలేకపోయెను. సామంతు లనేకులు విముఖులైరి. వారిలో ముఖ్యముగ పేర్కొనదగినవారు సాళువ వంశజులు. గుండ్లకమ్మ మొదలు కావేరీతట పర్యంతము వ్యాపించిన తీరదేశమున చాలభాగము వారి పాలనక్రింద ఉండెను. మరియు కన్నడదేశమందలి దక్షిణ మండలములు కొన్నిటియందుకూడ వారి యధికారము చెల్లుచుండెను. సాళువ సామంతులలో ప్రముఖుడు సాళువ నరసింహరాజు. ఇతడు విరూపాక్షరాయలకు బద్ధ శత్రువు. మల్లికార్జునరాయల మరణానంతరము అతని పుత్రుడు రాజశేఖరరాయలకు బాసటయై నిలిచి మధుర, తంజావూరు, తిరుచునాపల్లి, సేలము, కోయంబత్తూరు జిల్లాలలో కొన్ని సీమలను అతనికి స్వాధీనపరచెను. ఇతడును, ఇతని సంతతివారును స్వతంత్రులై ఈ ప్రాంతములను పాలించుచుండిరి. మరియు తుళువ, కొంకణ సామంతులును రాయలను సరకుసేయక పశ్చిమతీర రాష్ట్రములందు యథేచ్ఛగ ప్రవర్తింప గడగిరి. ఇక మిగిలియుండిన కర్ణాట, పశ్చిమాంధ్రములపై మాత్రము విరూపాక్షరాయల యధికారము చెల్లుచుండెను.

సాళువ నరసింహరాయలు సామంతమాత్రుడు కాడు; గొప్ప దేశభక్తుడు; స్వాతంత్ర్య ప్రియుడు; విరూపాక్షుని దుండగములవలన విచ్ఛిన్నమైపోవుచున్న కర్ణాట సామ్రాజ్యమును చెడనీయక కాపాడుటకు కంకణము కట్టుకొని సహజశత్రువులైన ఒడ్డె గజపతులతోడను, దేశద్రోహులైన కర్ణాట సామంతులతోడను పోరాడుటకు సంసిద్ధుడయ్యెను; కాని కపిలేశ్వర గజపతి జీవించియున్నంతకాలము తన సంకల్పమును నెరవేర్చుకొనుట అతనికి సాధ్యము కాకపోయినది. క్రీ. శ. 1470 వ సంవత్సరమున కపిలేశ్వరుడు మృతినొందగా గజపతి సామ్రాజ్యమునందు అంతఃకలహములు చెలరేగినవి. రాజ్యాధిపత్యమునకై అతని పుత్రులు హంవీర, పురుషోత్తములు ఒండొరులతో పోరాడ ప్రారంభించిరి. వారి పోరాటమును సందు చేసికొని సాళువ నరసింహరాజు గజపతిరాజ్యముపై దండయాత్ర ప్రకటించి ప్రచండసైన్యముతో పోయి ఉదయగిరి దుర్గమును ముట్టడించి స్వాధీనపరచుకొనెను. ఇంతలో పాండ్యరాజు సమరకోలాహలుడు ద్రావిడదేశముపై ఎత్తివచ్చి కాంచీపురమును ఆక్రమించుకొనుటవలన తన యుత్తర జైత్రయాత్రను చాలించుకొని వెనుదిరుగవలసి వచ్చెను.

సాళువ నరసింహరాజు వచ్చుచున్నాడని ఎరిగి సమరకోలాహలుడు కాంచీనగరమునుండి పారిపోయెను; కాని వానిని అంతటితో విడువక నరసింహరాయలు వెన్నంటి తరుముచు పోయి వాని రాజ్యమునే కాక రామేశ్వర కన్యాకుమారులవరకు గల దక్షిణదేశము నంతను జయించి అచటి రాజులచే కప్పము గొని వెనుదిరిగి నిజరాజధానికి వచ్చి చేరెను. ఇంతలో నుత్తరదేశమున రాజకీయ వాతావరణము మారినది. పెక్కు నూతన చరిత్ర సంఘటనలు సంభవించెను. ముఖ్యమైనవి రెండు: ఇందు గోవా కోలుపాటు మొదట పేర్కొనదగినది. ఇమ్మడి హరిహరరాయల కాలమునుండియు గోవాపట్టణము విజయనగరరాయల



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఏలుబడిక్రింద నుండినది. పశ్చిమ సముద్రతీరమందలి ఓరపట్టణములలో అది ముఖ్యమైనదగుటచేత ఆ కాలమున దక్షిణ హిందూస్థానమునకును, పాశ్చాత్య దేశములకును మధ్య నడచుచుండిన వర్తక మంతయు గోవా రేవుపట్టణము గుండనే సాగుచుండెను. ఆ కాలమందు అచట దిగుమతి యగుచు వచ్చిన సరకు లన్నింటిలో అరబీ, పారసీక భూములనుండి వచ్చు గుఱ్ఱములు ముఖ్యమైనవి. అప్పటి యుద్ధములలో జయాపజయములు గుఱ్ఱపు ఫౌజుపై నాధారపడి యుండెను. దక్షిణభారత మశ్వోత్పత్తి అభివృద్ధులకు అనుకూలపడక పోవుటచేత అప్పటి దాక్షిణాత్య ప్రభువు లందరును పైని పేర్కొనిన దేశములనుండియే తమకు వలసిన గుఱ్ఱములను అన్నింటిని రప్పించుకొనువారు. కావున అశ్వవ్యాపార మంతయు పై దేశములనుండి వచ్చు మహమ్మదీయ వర్తకుల మూలమున సాగుచుండినది. కాని ఈ వర్తకులు మతపక్షపాతమువలన తాము దిగుమతి చేయుచుండిన ఉత్తమాశ్వముల నెల్ల బహ్మనీ సుల్తానులకును, వారి ఆశ్రితులకును మాత్రమే విక్రయించువారు. ఈ కారణమువలన విరూపాక్షరాయలకు మహమ్మదీయ వర్తకులపై ద్వేషము కలిగి, నిజరాజ్యమున వ్యాపారముచేయు చుండినవారిలో అనేకులను నిర్మూలము కావించెను. తప్పించుకొని పారిపోయినవారు మాత్రము గోవాప్రాంతమును చేరి కుట్రలు చేయుచు గోవాను జయించి స్వాధీన పరచుకొమ్మని బహ్మనీ సుల్తానును పురికొల్పసాగిరి. చిర కాలమునుండియు బహ్మనీ సుల్తానులు గోవాపై కన్నువేసి యుండిరి. ధనసంపన్నమైన ఆ కరపట్టణముపై ఎత్తిపోవుటకు వారి కప్పుడు మంచి సాకు దొరకినది; కావున క్రి.శ. 1470 వ సంవత్సరమున బహ్మనీ సుల్తాను తన వజీరుడైన ఖ్వాజా మహ్మూదు గావానుని నాయకత్వమున ఒక గొప్ప సైన్యమును పంపి గోవాపట్టణమును మాత్రమేకాక తత్ప్రాంత కొంకణతీర దేశమునుకూడ ఆక్రమించుకొనెను. ఇట్లు గోవా శత్రువులకు హస్తగతమగుటవలన విజయనగరసంస్థానమునకు చెప్పరాని నష్టము కలిగినది. ఎగుమతి దిగుమతి వ్యాపారములవలన జమ యగుచువచ్చిన ధన మంతయు రాయభండారమునకు రాక నిలిచిపోయినది. సంస్థానపు రాబడి తరుగుటయే కాక రాయరాణువకు వలసిన గుఱ్ఱములుకూడ లభ్యపడకపోయినవి; తత్కారణమున విజయనగర సైన్యబలము సన్నగిల్లినది.

రెండవది బహ్మనీరాజ్య పూర్వదిగ్వ్యాప్తి: కపిలేశ్వరుడు క్రీ. శ. 1460-61 ప్రాంతమున బహ్మనీ సుల్తానును ఓడించి కొంచెము ఇంచుమించుగ బీదరు పరిసరములవరకును వ్యాపించియుండు తెలంగాణా దేశమును ఆక్రమించుకొనెను. కపిలేశ్వరుడు జీవించియుండినంతకాలము బహ్మనీ సుల్తానులకు తూరుపుదిశవైపు ముఖము త్రిప్పుటకుకూడ అవకాశము లేకపోయినది; కాని క్రీ. శ. 1470 లో కపిలేశ్వరుడు దివంగతు డయినపిమ్మట అతని పుత్రులు హంవీరుడును, పురుషోత్తముడును రాజ్యాధిపత్యమునకై యొండొరులతో కలహించి పోరాడ గడగిరి. ఈ యుద్ధమున హంవీరుడు పరాజితు డగుటవలన గజపతి సామ్రాజ్యమున కంతటికిని పురుషోత్తముడు అధిపతి అయ్యెను. స్వశక్తిసామర్థ్యములవలన హంవీరునికి సోదరుని జయించుటకు వలనుపడకపోవుటచే హంవీరుడు బహ్మనీ సుల్తాను మూడవ మహమ్మదు శాహు సముఖమునకు రాయబారము పంపి అతని సాయమును వేడెను. తన్ను మహమ్మదు శాహు గజపతిపీఠముపై సుప్రతిష్ఠితుని కావించిన దానికి ప్రత్యామ్నాయముగ తెలంగాణాను సర్వమును అతనికి సమర్పించెదనని వాగ్దానము చేసెను. నష్టమైపోయిన రాజ్యభాగము మరల సునాయాసముగ కైవసమగునని సంతసించి, మహమ్మదు శాహు పెద్ద దండును అతనికి సాయము పంపి అతడు కోరిన మేరకు గజపతి సామ్రాజ్యపదమున అతనిని ప్రతిష్ఠించెను. హంవీరుడును ఒడంబడిక ప్రకారము తెలంగాణాదుర్గములను, రాష్ట్రములనే కాక పూర్వసముద్రపర్యంతము గల తీరదేశమును గూడ మహమ్మదు శాహునకు కప్పగించెను.

ఈ పరిస్థితులను అవకాశపరచుకొని సాళువ నరసింహరాజు మరల ఉత్తర దిగ్విజయయాత్రను సాగించుటకు తలపెట్టెను. హంవీరుని త్యాగమువలన తెలంగాణాయు, తీరాంధ్రమును బహ్మనీ సుల్తానుకు హస్తగతమగుటవలన బహ్మనీ సామ్రాజ్యము అతని ఉత్తరపుటెల్లను తాకినది. సుల్తాను ప్రబలు డగుటవలన అతని రాజ్యముపై ఎత్తిపోవుటకు ముందు అతని బలమును తగ్గించుట యుక్తమని ఎంచి, అతనికి అరిగాపులైన కొండవీడు, కొండపల్లి తరపులందలి హిందూ జమీందారులతో నెయ్యము చేసి సుల్తానుపై తిరుగబాటు చేయ వారిని పురికొల్పి తీరాంధ్రమున హావళ్లను రేపెను; మిత్రుడైన కొండపల్లి దుర్గాధిపతిని ప్రేరేపించి అతనిమూలమున గజపతిని రాజమహేంద్రవర దుర్గమును ముట్టడివేయ రమ్మని ఆహ్వానము పంపి అతనికి కాపటగ హావడికారుల బలములతోకూడ కూచి చేసి పోయి గోదావరికి ఈవలి గట్టున దండు విడిసెను.

ఈ వర్తమానము మహమ్మదు శాహుకు తెలియవచ్చినది. అంతట అతడు సేనలను కూర్చుకొని ముఖ్యప్రధాని యగు మహ్మూదు గావానుడును, యువరాజు మహ్మూదు రాకుమారుడును వెంటరా క్రీ. శ. 1477 లో బీదరునుండి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



బయలుదేరి కతిపయ ప్రయాణములమీద రాజమహేంద్రవరమునకు వచ్చి చేరెను. సుల్తాను రాకను కనినంతటనే గజపతి ముట్టడిని చాలించి పాళెమును లేవదీసికొని నిజదేశమునకు తరలిపోయెను. గజపతి లేచిపోయినపిమ్మట అచ్చట తడయుట యుక్తము కాదని ఎంచి సాళువ నరసింహరాజును తన రాష్ట్రమునకు మరలిపోయెను. ఇట్లు శత్రువులు తమంతట తామే విరిసిపోయిన పిమ్మట మహమ్మదు శాహు రాజమహేంద్రవరదుర్గమును మరల స్వాధీన పరచుకొని కళింగముపై దండు వెడలెను. దండయాత్రను విజయవంతముగ కొనసాగించి గజపతిచే కప్పము గొని మహమ్మదు శాహు మరల రాజమహేంద్రవరమునకు వచ్చి యాప్రాంతదేశములను చక్కగ పరిపాలన చేయుటకు తగిన ఏర్పాటులను గావించుచు అచటనే క్రీ. శ. 1480 వరకు మూడేండ్లకాలము నివసించియుండెను.

రాజమహేంద్రవరమునుండి మరలి వచ్చిన పిమ్మట సాళువ నరసింహరాజు కొండవీటి రాజ్యమును సాధింప సమకట్టెను. సమయము అనుకూలముగ చూపట్టినది. దేశమునకు నాథుడు ఎవ్వడును లేడు. ఒడంబడిక ప్రకారము హంవీరుడు బహ్మనీ సుల్తానునకు దేశమును స్వాధీన పరచినను సామంతులు గజపతిపక్షమువారై యతనిపై తిరుగబాటు చేసిరి. వారి యాహ్వానమును అంగీకరించి దేశమును వశము చేసికొనుటకు విచ్చేసిన గజపతి సుల్తాను నెదుర్కొనజాలక పరాఙ్ముఖుడై నిజరాజ్యమునకు పారిపోవుటవలన వారి గతి నక్కేట పుట్టి మునిగిన ట్లయినది: కాని సుల్తాను వెంటనే స్వామిద్రోహపరాయణులైన సామంతుల జోలికి పోక గజపతిని శిక్షించుటయే తన ప్రథమ కర్తవ్యమని ఎంచి, కళింగముపై ఎత్తిపోయెను. ఆ తరుణమున తాను కొండవీటిని జయింపబూనిన తనకు అడ్డపడజాలినవారు ఎవ్వరును ఉండరని గ్రహించి సాళువ నరసింహరాజు తత్కార్యమున కుపక్రమించెను. సుల్తాను కోపమునకు వెరచి ప్రబలు డొక్కడు ప్రాపుగ ఉండుట శ్రేయస్కరమని యెంచి కొండవీటి సామంతులును, దొరలును పెక్కండ్రు నరసింహరాజు నాశ్రయించి అతని ప్రయత్నమునకు తోడ్పడిరి; ఈ కారణములచేత అతడు తలపెట్టిన కార్యము సులభముగ నెరవేరెను. మరల విజయనగర సామ్రాజ్యముయొక్క ఈశాన్యపు సరిహద్దు కృష్ణాతటమును తాకినది.

కాని నరసింహరాయల అధికారము కొండవీటి రాజ్యమునందు స్థిరముగ నెలకొనలేదు. మహమ్మదు శాహు పూర్వాంధ్రదేశమున తన అధికారమును స్థాపించి రాజమహేంద్రవరమునుండి బయలుదేరి క్రీ. శ. 1480 లో కృష్ణాతీరమును చేరి ఆప్రాంతమందలి సామంతులను వశవదులను కావించుకొని కొండవీటి దుర్గమును ముట్టడించి స్వాధీనము చేసికొనెను. సాళువ నరసింహరాయలు కాని, అతని పక్షమువారు కాని సుల్తాను నెదుర్కొనలేరైరి. సుల్తానుకు ధైర్యము హెచ్చినది. సాళువ నరసింహరాయలు తనకు జడిసి పారిపోయెనని ఎంచి అతని రాజ్యములోని ముఖ్యపట్టణమైన కాంచీనగరమును కొల్లగొట్టుటకు నిశ్చయించెను. క్రీ. శ. 1481 సంవత్సరము మార్చినెల ప్రారంభమున మహమ్మదు శాహు కొండవీటినుండి బయలుదేరి కూచిమీద కూచి చేసి పది దినములలో కాంచీపురము చేరి హఠాత్తుగా ఆ పట్టణముపై బడెను. తలవని తలపుగ వచ్చి పైకొన్న శత్రువునకు అడ్డపడి కాంచీపురవాసులు తమ పట్టణమును కాపాడుకొనజాలకపోయిరి. మహమ్మదు శాహు నిర్భయముగ దేవాలయములను, నగరమును చూరలాడి ఎంత త్వరగ కంచిపై కూచిచేసి వచ్చెనో అంత త్వరగ తన రాజ్యమునకు మరలి చనెను. కాంచీపురమున మహమ్మదు శాహుకు దోపుడు ధనము విస్తారము లభించెను; కాని, దాని నంతయు అతడు భద్రముగా కొనిపోజాలక పోయెను. అతడు కంచిని కొల్లగొనునప్పుడు సాళువ నరసింహరాయ లెచ్చట నుండెనో తెలియదు. ఈ వర్తమానము అతనికి తెలియవచ్చినంతటనే తన ముఖ్య సేనాధిపతియగు తుళువ ఈశ్వరనాయకుని సైన్యముతో పోయి బహ్మనీ సుల్తాను మార్గమును అరికట్టి అతడు కొనిపోవుచున్న చూరధనమును ఒడిచి కొని తెమ్మని ఆజ్ఞాపించెను. ఈశ్వర నాయకుడు హుటాహుటి సైన్యము నడపుకొని పోయి నెల్లూరి మండలములోని కందుకూరికడ మహమ్మదు శాహును అడ్డగించెను. ఇరువాగులవారికిని యుద్ధము తీవ్రముగ నడచెను. తుదకు జయలక్ష్మి ఈశ్వరనాయకుని వరించినది. అతడు మహమ్మదీయ స్కంధావారమును చూరగొని కంచినుండి మహమ్మదు శాహు కొనిపోవుచున్న ధనసంచయమునే కాక అతని గుఱ్ఱపు ఫౌజు నంతను పట్టుకొనిపోయి తన స్వామికి ఉపాయనముగ సమర్పించెను. తరువాతి వృత్తాంతమును విస్పష్టముగ విశదీకరించుటకు వీలుకాదు. వరాహపురాణ పీఠికయందు ఈశ్వరనాయకుడు పెక్కు స్థలములను జయించినట్లు చెప్పియున్నది. అందు ఉదయాద్రి, నెల్లూరు, అమూరు, కోవెల, కుందాణి, శ్రీరంగపట్టణము, నాగమంగలము, పెనుకొండ, గండికోట ముఖ్యమైనవి. ఇవిగాక భోనగిరి, చెంజి, కొంగు, ధారాపురములను సాళువ నరసింహరాజు స్వయముగ జయించి కైవసము కావించుకొనెనని జైమినీ భారతమున కలదు. ఈశ్వర నాయకుడును, సాళువ నరసింహరాయలును, పైని

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పేర్కొన్న స్థలములను ఎప్పుడు ఏయే సందర్భములందు జయించిరో తెలియదు. నెల్లూరిని, ఉదయగిరిని క్రీ. శ. 1469-70 లో నరసింహరాయలు కపిలేశ్వరునిపై దాడి వెడలినప్పుడు సాధించి ఉండవచ్చును. అమూరు (చెంగల్పట్టు జిల్లా), నగిరి, చెంజి (దక్షిణ ఆర్కాడు జిల్లా), కోవెల (శ్రీరంగము - తిరుచునాపల్లి జిల్లా)లు క్రీ. శ. 1470 లో సాగించిన దక్షిణ దిగ్విజయయాత్రయందు దక్కనికి వశపడి యుండవచ్చును. కొంగు ధారాపురము (కోయంబత్తూరు జిల్లా), కుందాణి (సేలము జిల్లా), నాగమంగలము, బెంగుళూరు, శ్రీరంగపట్టణములు (మైసూరు సంస్థానము), పెనుగొండ (అనంతపురము జిల్లా), గండికోట (కడపజిల్లా)లు క్రీ. శ. 1481-85 ల మధ్య స్వాధీనపడి యుండవచ్చును. బాగూరు పంచమునీశ్వర నాయకుడు పాడుచేసినది ఈ సందర్భముననే కావచ్చును.

పైని పేర్కొనిన స్థలములందు సాళువ నరసింహరాయల చేతను, ఈశ్వరనాయకుని చేతను ఓటుపడిన శత్రువులు అనేకులు సన్నగాండ్రు. వారిలో ముఖ్యులు ఉమ్మత్తూరు పాళెగాండ్రు. రాయల బలము సన్నగిలినకొలది వీరి యుద్ధతి హెచ్చి క్రమక్రమముగ వీరు దక్షిణ కర్ణాటదేశమున చాల భాగమును ఆక్రమించుకొనిరి. ఉమ్మత్తూరు, శివనసముద్రము, శ్రీరంగపట్టణము మున్నగు ప్రబల జల, స్థల దుర్గములు వీరి యధికారముక్రింద ఉండినవి. విజయనగర సామ్రాజ్యమును విచ్ఛిన్నము కానీక సంరక్షింప నుద్యమము పట్టుకొన్న సాళువ నరసింహరాయనకు వారితో పోరాటము తప్పకపోయెను. కొంగు ధారాపురము, కుందాణి, నాగమంగలము, బెంగుళూరు, శ్రీరంగపట్టణములను వీరిని ఓడించియే సాళువ నరసింహరాజు ఆక్రమించి ఉండవలయును. అతడు జయించిన ప్రబల శత్రువులలో తురుష్కుడు ఒక్కడు. ఇతడు పిక్కిళ్ళను బోయదొరతో ఏకమై వచ్చి పెనుగొండను ముట్టడించెను. ఈ తురుష్కుడు బహ్మనీ సుల్తానుచే సాళువ నరసింహుని రాజ్యమును జయించుటకు నియుక్తుడైన ఫక్రుల్ ముల్క్ అను సర్దారనుటకు సందియము లేదు. పిక్కిళ్లు ఎచటివాడో, వాడు ఏల మహమ్మదీయులతో నేకీభవించి వచ్చి పెనుగొండకు ముట్టడివేసెనో తెలియదు. కాని యుద్ధమందు పరాజితుడై తురుష్కుడు పారిపోయెను. పిక్కిళ్లు హతుడయ్యెను.

పై విజయములవలన కొంచెము ఇంచుమించుగ రాయ సామ్రాజ్యమునకు అంతటికిని సాళువ నరసింహరాజు ఒడయడయ్యెను. ఇక రాయ సింహాసనమును, రాజధానిని స్వాధీనము చేసికొని తానే మూర్ధాభిషిక్తుడగుట యుక్తమని తోచినది. రాయ సింహాసనము నప్పుడు అధిష్ఠించి యుండిన విరూపాక్షరాయలు సత్వహీనుడు. నిరంతరము విషయాసక్తుడై మద్యమును గ్రోలుచు కాంతాజన పరివేష్టితుడై రాజకార్యములయందు ఏమంత యేని అసక్తి చూపక రాణివాసమున కాలము గడపుచుండెను. తండ్రి దుశ్చరితకు రోసి అతని జ్యేష్ఠ పుత్రుడు అతనిని వధించి, పితృఘాంతకుడగు తనకు రాయపీఠము నెక్క నర్హత లేదని యెంచి, తమ్ముని ప్రౌఢరాయని రాజ్యాభిషిక్తుని గావించెను; కాని ప్రౌఢదేవరాయలు తండ్రిని మరపించు కొడుకు. రాజ్యాధిపత్యము నొసగిన అన్నను చంపుట అతని ప్రథమ ఘనకార్యము. పెక్కింటి విషయములందు అతడు తండ్రిని మేలుబంతిగా గ్రహించి ప్రవర్తింపగడగెను. అతని యవగుణములవలన సామ్రాజ్యాధిపత్యమును ఆక్రమించుటకు సాళువ నరసింహరాజునకు మంచి సాకు దొరకినది. మొట్టమొదట అతడు విలువగల కానుకలను ఇచ్చి సామ్రాజ్యములోని ప్రముఖులను వశంవదులను కావించుకొనెను. తరువాత తన ముఖ్య సేనాధిపతియు, ఈశ్వరనాయకుని పుత్రుడును అయిన నరసానాయకుని గొప్ప దండుతో విజయనగరముపై పంపి అందుండి ప్రౌఢరాయని వెడలనడపించి రాజధానిని స్వాధీనము చేసికొని క్రీ. శ. 1485 అంతమున స్వయముగ నచటికి వెళ్లి సామ్రాజ్య పట్టాభిషేకము కావించుకొనెను.

**సాళువ నరసింహదేవరాయలు** (క్రీ. శ. 1485 - క్రీ. శ. 1490): పట్టాభిషేకమైన పిమ్మట ఇతడారేండ్లకాలము సామ్రాజ్యమును పాలించెను. ఈ కాలమున శాంతి లేక సామ్రాజ్యము అలజడిపడి యుండినది. దీనికి ముఖ్యకారణములు రెండు; సామంతులు అనేకులు సాళువ నరసింహరాయల యాధిపత్యము నంగీకరింపక వారైరి. కడపటి సంగమవంశ ప్రభువుల ఏలుబడియందు పేరు నామకార్థము రాయల యధికారమునకు లోబడినట్లు ప్రవర్తించుచు వచ్చినను వాస్తవముగ ఎవ్వరి సీమలకు వారే స్వతంత్రాధికారులై ఉండిరి. సాళువ నరసింహరాయలు ప్రబలుడు. అతని పాలన క్రింద తమ పూర్వపు పోకడలు సాగవని ఎరిగి అతనిపై తిరుగబాటు చేసిరి. అంతశ్ఛిద్రములమూలమున సామ్రాజ్యము ఇట్లు కలతపడి ఉండగా మరల తీరాంధ్రమును జయించుటకొరకు గజపతి దండెత్తి వచ్చెను. రాజ్యాధిపత్యమునకై కలిగిన అన్నదమ్ముల పోరాటములో హంవీరుడు ఓటుపడగా అతని సోదరుడు పురుషోత్తముడు కళింగోత్కళములపై ఏకాధిపత్యము వహించి ఆంధ్రదేశమున తమ పాలన క్రింద ఉండిన రాష్ట్రమును అంతటిని మరల స్వాధీనపరచుకొన మొదలు పెట్టెను. క్రీ. శ. 1481 లో బహ్మనీ సుల్తాను మహమ్మదు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



శాపులు కాలగతి చెందెను. అతని మరణానంతరము బాలుడైన అతని కుమారుడు బీదర్ సింహాసనమును అధిష్ఠించెను. అతనిపేర రాజ్యపాలన చేయగడగిన మంత్రులును, సర్దారులును స్వార్థపరులై ఒండొరులతో పోరుటకు ఆరంభించిరి. తత్కారణమున రాజ్యపాలనము పటుత్వమును కోలుపోయినది; సైన్య బలము తగ్గి క్షీణదశకు వచ్చినది. హంవీరుడు ముహమ్మదు శాహుకు ఇచ్చివేసిన రాజ్యమును సంపాదించుకొనుటకు అదియే అదనుగా తలచి పురుషోత్తమ గజపతి దండెత్తి వచ్చి క్రీ. శ. 1482 - 88 లో కృష్ణవరకు గల తీరాంధ్రమును, ఆ మరుసటి యేట కొండవీటి రాజ్యమును స్వాధీనము చేసికొనెను. అది మొదలు అతడు ఉదయగిరిపై కన్నువేసి దానిని ఎట్లయిన కబళింపవలయునని సమయము వేచియుండెను. రాయ సామంతుల తిరుగబాటు అతనికి అనుకూలించెను. కావున క్రీ. శ. 1485 - 90 ల మధ్య సైన్యముతోకూడ కదలివచ్చి అతడు ఉదయగిరి దుర్గమును ముట్టడించెను. సాళువ నరసింహదేవరాయలు అప్పుడు ఉదయగిరి యందు ఉండెననియు, అచటనుండి తప్పించుకొని పోజాలక పురుషోత్తమ గజపతికా దుర్గమును దానిక్రింది రాష్ట్రమును సమర్పించి విడుమరపొందెననియు గజపతుల శాసనాదికములవలన తెలియవచ్చుచున్నది. ఇందలి సత్యమును నిర్ధారించి చెప్పుటకువీలులేదు; కాని సాళువ నరసింహరాయలు ఉదయగిరిని కోల్పోవుటమాత్రము వాస్తవము; క్రీ. శ. 1518 లో కృష్ణదేవరాయలు దానిని మరల జయించునంతవరకు అది గజపతుల ఏలుబడిక్రిందనే ఉండినది.



చిత్రము 58. ఉదయగిరి దుర్గము

ఉదయగిరి దుర్గమును కోల్పోయినపిమ్మట సాళువ నరసింహరాయలు చిరకాలము జీవించలేదు; క్రీ. శ. 1490 లో జాడ్యగ్రస్తుడై పరమపదమును పొందెను. సామాన్య మాండలికుడై జీవితమును ప్రారంభించినను తన శక్తిసామర్థ్యములపెంపున దక్షిణదేశము నంతను జయించి తుదకు విజయనగర వజ్రసింహాసనమును ఆక్రమించుకొనెను కాని యవసాన కాలమునందతడు మనశ్శాంతిని గోలుపోయి కించతో మరణించెను; ఏలన, అతని సంకల్పము సంపూర్ణముగ నెరవేరినది కాదు. కేవల సామ్రాజ్యాధిపత్యమును అపేక్షించి అతడు కార్యమునకు పూనుకొనలేదు. కర్ణాట సామ్రాజ్యపునరుద్ధరణమును, హిందూధర్మ సంరక్షణమును నిజజీవితపరమావధులుగ ఎంచి తత్కార్యసాధన కొరకు దేశమును ఆక్రమించుకొని ఉండిన ఒడ్డెలతోడను, ధర్మద్రోహులైన మహమ్మదీయులతోడను యుద్ధముచేయ సమకట్టెను. ఈ కార్యము విజయవంతముగ సాగినను తుదకు అతడు శత్రువులను కర్ణాటకమునుండి సంపూర్ణముగ తరుమగొట్ట లేకపోయెను. కొండవీడు, ఉదయగిరి రాజ్యములు యథాపూర్వము గజపతుల ఆధిపత్యము క్రిందనే నిలిచిపోయెను. రాయచూరు దుర్గమును, కృష్ణాతుంగభద్రల నడిమి అంతర్వేదియు బహ్మనీయులకు లోబడియుండెను. ఈ మూడు దుర్గములును మొదటినుండి విజయ

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



నగరమునకు చెల్లుచుండెనని. అవి స్వాధీనపడకపోయిన విజయనగరసామ్రాజ్యమునకు భద్రము చేకూడదు. మరియు తన తరువాత తాను తలపెట్టిన కార్యమును నెరవేర్పగల పుత్రులుకూడ లేరు. తన కుమారు లిరువురును యువకులు. వారికి నిర్వాహకత చాలదు; కావున అతడు మరణ కాలము ఆసన్నము కాగా అప్పటి విద్యానగర రాజ్య పరిస్థితులను చక్కగ విచారించి తన యనంతరము జరుగ వలసిన విధానమును మరణశాసనమున వివరించి కార్యమును నెరవుటకు తగిన ఏర్పాటులను గావించెను. తన మరణానంతరము సర్వసేనాపతియైన సాళువ నరసానాయకుడు తన పుత్రులలో ఒక్కని పట్టాభిషిక్తుని చేసి అతనికి యుక్తవయస్సు వచ్చునందాక రాయలకును, రాజ్యమునకును పోషకుడై సామ్రాజ్య భారమును నిర్వహింపవలసిన దనియు, శత్రువశమున ఉన్న రాయచూరు, పెనుగొండ, ఉదయగిరి దుర్గములను మూడిని మృత్యువు సమీపించుట వలన తనకు సాధింప నలవికాకపోయె ననియు, తన తరువాత వజ్ర సింహాసనము నధిష్ఠించెడి ప్రభువులు వానిని జయించి రాయ సామ్రాజ్యము క్రిందికి తెచ్చుట ఆవశ్యకమనియు శాసించెను.

సాళువ నరసింహరాయలు విజయనగర రాయలలో అగ్రశ్రేణికి జేరినవాడు; ఉన్ననమైపోవుచుండిన రాయ సామ్రాజ్యమును పునరుద్ధరించుటయే కాక, దాక్షిణాత్య హిందువుల హృదయములందు యుద్ధ లాలసను పాదుకొల్పెను. ఆ కాలమున దక్షిణ దేశమందు సంచారము చేసిన పాశ్చాత్య యాత్రికులు ఆతడు రాయ సామ్రాజ్యమంతటను గరిడీలను స్థాపించి జనులకు సాము నేర్పించి ఆయుధ ప్రయోగములందు నిపుణులను కావించె ననియు, వారు లక్షలకొలది రాయరాణువయందు చేరి మహమ్మదీయులతోడి పోరాటమునకు ముందంజ వేసి ప్రాణములకు ఆశపడక మహోత్సాహముతో పోరువా రనియు వ్రాసి యున్నారు. ఇందువలన పదునారవ శతాబ్దమున శత్రువులను ఎల్లయెడల దించి తుంగభద్రా నర్మదా సింహళముల మధ్య నున్న యావద్దక్షిణ భారతమునను వరాహధ్వజమును నిరాఘాటముగ ఎగయించిన రాయరాణువను నిర్మించినవాడు సాళువ నరసింహరాయ లని తెల్లమగు చున్నది. దక్షిణ హిందూ దేశమున కతడు ఒనరించిన మహోపకారములలో ఇదియే ప్రధానమైనది.

**సాళువ నరసింహుని సంతతి** (క్రీ. శ. 1490 — క్రీ.శ. 1506) : సాళువ నరసింహరాయల ఆదేశప్రకారము అతని మరణానంతరము నరసానాయకుడు అతని కొడుకులలో పెద్దవాడైన తిమ్మభూపాలుని రాజ్యాభిషిక్తుని కావించెను. కాని ఆ తిమ్మరాజు అల్పకాలమునసే అకాల మృత్యువు వాత పడుటవలన నరసానాయకుడు అతని తమ్ముడు దమ్మ రాయలు అను నామాంతరము గల ఇమ్మడి నరసింహ రాయలను సింహాసనము నెక్కించి అతనిపేర రాజ్యము చేయ నడగెను. ఈ నరసింహరాయలు పదునారేండ్ల కాలము (క్రీ. శ. 1490 - క్రీ. శ. 1506) రాజ్యపాలనము చేసినట్లు శాసనములవలన తెలియవచ్చుచున్నను అది వట్టి బూటకమే. పేరు పెరుమాళ్ళది, అనుభవము నంబివానిది అను న్యాయము చొప్పున, సామ్రాజ్యమునందు సర్వాధికారమును రాయలపేర నరసానాయకుడే చలాయించు చుండెను. తాను పెద్దవాడైన పిమ్మట ఇమ్మడి నరసింహ రాయలు సామ్రాజ్య పాలనమును స్వయముగ నిర్వహింప దలపెట్టెను; కాని నరసానాయకుడు అందులకు ఈయకొనక అతనిపై తిరుగబడి ఓడించి పెనుగొండ దుర్గమున బందీకృతుని కావించి యథాపూర్వము అతనిపేర సామ్రాజ్యమును పాలింపగడగెను. కాని అతని దౌర్జన్యమునకు కినిసి సామ్రాజ్యమందలి సామంతులును, అమరనాయకులును అతనిపై తిరుగబాటు చేసిరి. సామ్రాజ్యము ఇట్లు కలగుండుపడి యుండుటను గని పరరాజులును ఎత్తివచ్చి దేశమున మరియు అధికముగ అలజడి పుట్టించిరి. కావున తన అధికారమును నిలుపుకొనుటకొరకు నరసానాయకుడు ఏకకాలమున బాహ్యాభ్యంతర శత్రువులతో పోరాడ వలసివచ్చెను.

నరసానాయకునికి మారొడ్డి అతనిచే పరాజితులయిన శత్రువులు అతని సంతతివారి శాసనములలో పేర్కొనబడి యున్నారు. వారియందు ప్రముఖులు శ్రీరంగపట్టణ ప్రభువు హోయ్సణేంద్రుడు, చోళుడు, పాండ్యుడు, మధురావల్లభుడైన మానభూషుడు, శౌర్యోదగ్రుడైన తురుష్కుడు, గజపతినృపతి. మొదటి నలుగురును రాయ సామంతులు; నరసానాయకుని అధికారమును అంగీకరింపక ప్రతిఘటించినవారు. తక్కిన ఇద్దరును రాయ సామ్రాజ్యముపై ఎత్తివచ్చిన పరదేశ ప్రభువులు. ఈ యార్గురు శత్రువులను నరసానాయకుడు ఎట్లు మార్కొని నిర్జించెనో చూతము.

మొదట అనతులైన రాయ సామంతులను గూర్చి చెప్పుట యుక్తము. నరసానాయకుడు శ. 1496 లోనో, అంతకు ఇంచుక పూర్వమో విద్యానగరమునుండి దండు వెడలి తూర్పు సముద్ర తీరమువరకును పోయి అచట దక్షిణాభిముఖుడై తిరిగి తొండ మండలముగుండ కూచి చేసి పోయి చోళ మండలమును ప్రవేశించెను. తిరుచినాపల్లి సీమను ఏలుచుండిన కోనేటిరాజు అతనిని అడ్డగించెను.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అతనిని సులభముగ ఓడించి నరసానాయకుడు కావేరిని దాటి చోళ మండలమున ప్రవేశించెను. చోళమండల పాలకుడు నరసానాయకుని రాకను విని దళములను కూర్చుకొని వచ్చి అతనిని ఎదిర్చెను. కాని యుద్ధమున నిహతుడయ్యెను. తరువాత మధురపై కూచి చేసి పోయి నరసానాయకుడు మానభూషుని ఓడించి ఆ పట్టణమును స్వాధీనపరచుకొనెను; అటువెనుక చేర, పాండ్య రాజులను ఓడించి వారిని తన యాజ్ఞా నిబద్ధులను కావించుకొనెను. ఈవిజయముల మూలమున నరసానాయకునికి దక్షిణదేశము సర్వమును సంపూర్ణముగ స్వాధీనపడెను.

దక్షిణ దిగ్విజయమును జయవంతముగ కొనసాగించి నరసానాయకుడు వెనుదిరిగి దక్షిణ కర్ణాటముపై దండు పెట్టెను. బలగర్వితులైన ఉమ్మత్తూరు పాళెగాండ్రు కావేరీ తీర దేశమును స్వాధీనపరచుకొని తామే కర్ణాటకమునకు అధిపతులమని ప్రకటించుకొని యుండిరి. వారి బలమంతయు శ్రీరంగపట్టణము, శివనసముద్రము లను రెండు జలదుర్గములపై ఆధారపడి యుండినది. వీనిలో బలవత్తరమైన శ్రీరంగపట్టణముపై నరసానాయకుడు దండు నడపుకొని పోయెను. కావేరి యుభయ తటములను తన్ని పారుచుండినది. ఆ నదిని ఉత్తరించుట అసాధ్యమని తోచెను. కాని నరసానాయకుడు సాహసము గల దళనాయకుడు. కావున నది కడ్డముగ సేతువును నిర్మించి సైన్యములను దాటించుకొనిపోయి శ్రీరంగపట్టణమును ముట్టడించెను. పెద్ద యుద్ధము జరగెను. దుర్గ సంరక్షకుడైన హొయ్సణేంద్రుడు నరసానాయకుని చేతికి చిక్కెను. అంతట దుర్గము కైవసమాయెను. శ్రీరంగపట్టణ పతనముతో ఉమ్మత్తూరు నాయకుల వెన్ను విరిగినది. దక్షిణదేశమువలె కర్ణాటకమును నరసానాయకునికి లోబడి అతని పారుపత్తెమును అంగీకరించినది. విజయనగర సామ్రాజ్యమునందు అంతటను అతని అధికారము నిర్వక్రముగ సాగుటకు ఆరంభించెను.



చిత్రము 69. కృష్ణాలయము, ఉదయగిరి

ఇక విజయనగరముపై ఎత్తివచ్చిన పరదేశ ప్రభువుల సంగతి పరిశీలింపదగియున్నది. శౌర్యోదగ్రుడైన తురుష్కుడు విజాపురపాలకుడైన యూసుఫ్ ఆదిల్ ఖానుడు. ఇతనిని ఏదులఖాను దనియు, సవాదుడు అనియు సమకాలికులు పేర్కొనువారు. ఇతడశక్తుడయిన బహ్మనీ సుల్తాను మహమ్మదు షాహు సర్దారులలో నొక్కడు; అద్వితీయ పరాక్రమశాలి; మేధావి; యుక్తిపరుడు; సుల్తాను అధికారమును తొలగద్రోసి విజాపురమున స్వతంత్ర రాజ్యస్థాపన చేయుటకు ప్రయత్నించుచుండెను. కృష్ణా తుంగభద్రల అంతర్వేదిలో ఇతడు విజయనగర పాలకులతో చేసిన యుద్ధములు మహమ్మదీయ చరిత్రకారులు వర్ణించియున్నారు. కాని వారి వర్ణనలు పరస్పర విరుద్ధములు; అసంగతములు. కావున వాని మూలమున సత్యము నిర్ణయించుట సులభము కాదు. కాని యొకప్పుడు అతని దండయాత్ర తుంగభద్ర పర్యంతము వ్యాపించెననుట నిశ్చయము: ఏలయనగా అతడు ఆదోనికి ఎగువ తుంగభద్ర ఉత్తర తటమున నుండు మానువ దుర్గమును ఆక్రమించుకొనెననియు, నరసానాయకుడు ఆ దుర్గమును ముట్టడించి అతనిని జీవగ్రాహముగ పట్టుకొని కరుణించి విడిచెననియు సమకాలిక హిందూ గ్రంథములు తెల్పుచున్నవి.

నరసానాయకునిచే నిర్జితుడైన గజపతి నృపతి ప్రతాపరుద్రుడు. ఇతడు క్రీ. శ. 1496 లో తండ్రి పురుషోత్తమ గజపతి మరణానంతరము రాజ్యాభిషిక్తుడయ్యెను. క్రీ.శ. 1500 లో దక్షిణ దిగ్విజయార్థము దండు వెడలి వచ్చి కృష్ణాతీరమున విడిసి ఉండినట్లు అతని శాసనములు తెల్పుచున్నవి. ఈ దిగ్విజయమును గూర్చిన అంశములు ఎవ్వియు తెలియరావు. ప్రతాపరుద్రుడు ఈ దిగ్విజయ యాత్రా సందర్భమున విజయనగర సామ్రాజ్యముపై ఎత్తి వచ్చి యుండవచ్చును. నరసానాయకుడు అతనిని నిర్జించి పారదోలియుండవచ్చును.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పదుమూడు సంవత్సరములు రాజ్యపాలనము చేసిన పిమ్మట క్రీ. శ. 1503 లో నరసానాయకుడు శివసాయుజ్యము నందెను. ఇమ్మడి నరసింహరాయలు రాజ్యాధిపతియై ఉండినను నరసానాయకుడు తన యజమానుని నరకుచేయక రాయబిరుదులను వహించి వజ్ర సింహాసనమును అధిష్ఠించెను; రాయలను బోలి ప్రజలచే స్వామి అనిపించుకొనెను. కాని రాయలను తొలగించి అతని పదమును అక్రమించుకొనలేదు. అప్పటి దేశ కాల స్థితులనుబట్టి సాళువ నరసింహుని బోలి నరసానాయకుడును రాజ్యాధికారమును హస్తగతముచేసికొనుట ఆవశ్యకమైనది. సాళువ నరసింహరాజు అసంపూర్తిగ చేసి చనిన కార్యమును నరసానాయకుడు కొంచెము ఇంచుమించుగ కొనసాగించెను; సాధ్యమైనంతవరకు విజయనగర సామ్రాజ్యపు పూర్వ సరిహద్దులవరకు గల రాష్ట్రమును మరల జయించెను. సంగమ వంశము అంతరించినపిమ్మట రాయలను తిరస్కరించిన సామంతులను, నాయకులను జయించి యాజ్ఞాబద్ధులను కావించుకొనెను.

ఇమ్మడి నరసింహరాయలు (క్రీ. శ. 1503 — క్రీ. శ. 1506): నరసానాయకుని మరణమువలన ఇమ్మడి నరసింహరాయలకు విముక్తి కలుగలేదు; ఏలన నరసానాయకుని స్థానమునందు అతని పెద్ద కుమారుడు ఇమ్మడి నరసానాయకుడు రాజ్యమునకును, రాయలకును సంరక్షకుడయ్యెను. ఇమ్మడి నరసానాయకుడు తండ్రివంటివాడు కాడు. అతడు కేవల రాజ్యాధికారముతో తృప్తి చెందక రాజపదమునుకూడ అభిలషించెను. తండ్రి మరణానంతరము రెండు మూడేండ్లదాక పూర్వపద్ధతిని అనుసరించి రాజకార్యములను నిర్వహించుచు వచ్చినను తుదకు 1506 లో పెనుగొండ దుర్గమున చెరలో నుండిన ఇమ్మడి నరసింహరాయలను చంపించి విజయనగర వజ్రసింహాసనము నెక్కి రాజ్యాభిషేకము చేసికొని వీర నరసింహరాయలను నామమును వహించెను.

ఇమ్మడి నరసింహరాయలు అదృష్టహీనుడు. రాజ్యాధిపిక్తుడైనది మొదలు అతనికి దుర్దశ సంప్రాప్తమైనది. తండ్రిచేత నియుక్తుడైన సంరక్షకుడు మ్రింగరాని కడియయ్యెను. అతని బారినుండి తప్పించుకొన చేసిన ప్రయత్నము విఫలమగుటయే కాక కారాగారమునకు ఈడ్చినది. దైవ దుర్విపాకముచే తుదకు దుర్మరణమును సంఘటిల్లినది.

## తుళువ వంశము

**వీర నరసింహరాయలు** (క్రీ. శ. 1506 — క్రీ. శ. 1509): రాయలను చంపించి అతని సింహాసనము నధిష్ఠించెనేకాని వీరనరసింహరాయలు రాజ్యమును నిరాతంకముగ పాలింపలేక పోయెను. రాజ్యములో సామంతు లెల్ల అతనిపై తిరుగబడిరనియు, వారిని జయించి మరల దేశమును స్వాధీనపరచుకొనుటకే అతని రాజ్యకాల మెల్ల సరిపోయె ననియు అప్పటి చరిత్రకారుడు ఒక్కడు వక్కాణించినాడు. వీర నరసింహరాయల రాజ్యకాలమున నడచిన ముఖ్య చరిత్రాంశములు గమనింపదగినవి రెండు కలవు: మొదట ఎన్నదగినది ఆదోని దుర్గాధిపుడగు కాచప్ప ఒడయని తిరుగబాటు. ఇతడు విజాపురాధిపతియైన యూసుఫ్ ఆదిల్ ఖానునితోడను, ఉమ్మత్తూరు నాయకులతోడను సఖ్యము కుదుర్చుకొని రాయలపై ధ్వజమెత్తెను. ఉమ్మత్తూరు నాయకులు నిజ స్వాతంత్ర్యమును ప్రకటించి రాయ పీఠమునకు తామే అధిపతులమని ఉద్ఘోషింపగడగిరి. యూసుఫ్ ఆదిల్ ఖానుడు సైన్యముతోకూడ తుంగభద్రను దాటి వచ్చి కందనవోలు దుర్గమును ముట్టడించెను. ఇట్లు విజృంభించిన శత్రువర్గమును ఎదుర్కొనుటకు వీర నరసింహరాయలు ఆరెవీటి రామరాజును, అతని పుత్రుడైన తిమ్మరాజును నియోగించెను. రామరాజు ప్రచండ సైన్యముతో బయలు వెడలి పోయి కందనవోలుకడ విడిసియుండిన ఆదిల్ ఖాను నోడించి ఆ దుర్గము నాక్రమించెను. నిర్జితుడైన పఠాను ఖానుడు స్వరాజ్యమునకు తిరిగిపోక మిత్రుడైన కాచప్ప ఒడయని గలిసికొను నుద్దేశముతో ఆదవాని దుర్గమువంక కూచిచేసి పోగడగెను. తిమ్మరాజు అతని వెన్నంటి తరుముచు పోయి ఆదోని సమీపమున యుద్ధము చేసి పరాజితుని కావించి పారదోలెను. తరువాత ఆదోని దుర్గమునకు ముట్టడి వేసి కాచప్ప ఒడయలను సంహరించి దానిని స్వాధీనము చేసికొనెను. వీరనరసింహరాయలు ఆరెవీటి వారు చేసిన సేవకు మెచ్చుకొని వారిని తగురీతిని సత్కరించెను.

రెండవది కర్ణాట దండయాత్ర: ఇది రెండు రంగములందు నడచినది. పశ్చిమ సముద్రతీరమందు కరకళ మొదలగు తుళువ సంస్థానముల అధిపతులు గర్వితులై రాయలకు కప్పము మీయక స్వతంత్రులవలె ప్రవర్తించుచుండిరి. వారిని లోబరచుకొనుటకు వీర నరసింహరాయలు దండు వెడలి కనుమలను దాటి తుళువ రాజ్యమును ప్రవేశించి మంగళపురమున గొంతకాలము అధివసించెను. రాయ రాణువ ధాటికి ఓర్వజాలక తుళువ ప్రభువులు వశ్యులై కప్పమును, కానుకలను సమర్పించి సమాధానపడిరి. ఇట్లు తుళువదేశమున విజయము చేకూడినను, కనుమల కివ్వలి కర్ణాటకమున వీరనరసింహరాయల కడక సఫలము కాలేదు. ఉమ్మత్తూరు, శ్రీరంగపట్టణములు రెండును



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



దుస్సాధ్యము లయ్యెను. మొట్టమొదట అతడు ఉమ్మత్తూరును ముట్టడించెను; మూడు మాసములు ముడచినను కోట లొంగునట్లు అగపడలేదు. అంతట ముట్టడిని విసర్జించి సైన్యముతో కదలిపోయి శ్రీరంగపట్టణముపై గవిసెను. శ్రీరంగ పట్టణాధిపతి ఉమ్మత్తూరు తలకాడులనుండి బలములను రప్పించుకొని రాయరాణువపై బడి ఓడించెను. ఈ యపజయమువలన వీర నరసింహరాయలకు అత్యంతము మనోవ్యథ కలిగెను. ఎట్లయినను ఆ దుర్గములను రెంటిని సాధింప నిశ్చయించి మరల దండు వెడలు తలపుతో ప్రబల ప్రయత్నములు చేయగడగెను; కాని, యుద్ధ ప్రయత్నములు సంపూర్ణము కాకమునుపే అతడు వ్యాధిగ్రస్తుడై కాలధర్మము పొందెను.

వీర నరసింహరాయల కాలమున జరగిన విశేష చరిత్రాంశము ఇంకొకటి కలదు: అది పోర్చుగీసువారితోడి సఖ్యము. చిరకాలమునుండి హిందూ దేశమునకును పాశ్చాత్య దేశములకును మధ్య నడచు సముద్ర వ్యాపార మంతయు అరబీ, పార్శీ వర్తకుల మూలమున సాగుచు వచ్చినది. వీరు దిగుమతి చేయు సరకులలో గుర్రములు ప్రధానమైనవి. అప్పటి యుద్ధములలో జయాపజయములు అశ్వదళములపై ఆధారపడియుండిన కారణమున హిందూస్థాన ప్రభువు లందరును గుర్రములను ఎంత వెలయిచ్చియైన కొనువారు. అశ్వ వ్యాపారము చేయు అరబీ, పార్శీ వర్తకు లెల్ల మతముచే మహమ్మదీయు లగుటవలన తాము దిగుమతి చేయు ఉత్తమాశ్వముల నెల్ల మహమ్మదీయ రాజులకే విక్రయించువారు. ఇందుమూలమున హిందూ రాజుల అశ్వదళములు మహమ్మదీయుల గుర్రపు ఫౌజుతో తులదూగలేక యుద్ధభూమిలో పరాజయము పొందుచుండినవి. తమ అశ్వదళములను బలపరచుటకు విజయనగర ప్రభువులు ఎట్టి ప్రయత్నములు చేసినను మహమ్మదీయ వర్తకుల పక్షపాతమువలన ఫలవంతము కాక, వ్యర్థమగుచు వచ్చినవి. క్రీ. శ. 15 శతాబ్ది తుది దశకమున పోర్చుగీసువారు వర్తకము కొరకు హిందూదేశమునకు వచ్చిరి. వీరు మహమ్మదీయులకు గాఢ శత్రువులు. ఓడ యుద్ధమున వీరిదే పైచేయి. కావున పోర్చుగీసువారి ఆగమనము మహమ్మదీయ వర్తకులకు చుక్కవాలైనది. అచిరకాలములోనే ఇరువురు వర్తకులకును సముద్రాధిపత్యమునకై పోరు పొసగినది. క్రమక్రమముగ మహమ్మదీయ వర్తకుల బలము సన్నగిలుచుండెను. పోర్చుగీసువారి యాధిక్యమును గ్రహించి వీర నరసింహరాయలు వారిగవర్నరగు అల్మెడాకు రాయబారులనుపంపి, వారితో ఒక ఒడంబడికను చేసికొనెను. దాని షరతుల ప్రకారము పోర్చుగీసువారు దిగుమతి చేయు గుర్రము లన్నింటిని రాయ సంస్థానమునకే విక్రయించుటకు అల్మెడా ఒప్పుకొనెను. ఇట్లు సైన్యమునకు వలయు గుర్రములను సమకూర్చు అడితిదారులు రాయలకు కుదిరిరి. ఆ గుర్రములను తగు రీతిని శిక్షించి స్వారి చేయుటకు జాతి మత భేదములను పరిగణింపక అర్హులైనవారి నెల్ల రౌతుపడయందు చేర్చుకొని అశ్వ దళమును సంపాదించుటకు తగు ప్రయత్నములు కావించెను. విజయనగర సామ్రాజ్యమునకు వీర నరసింహరాయ లొనర్చిన అమూల్య సేవ ఇదియే.



చిత్రము 60. హజార రామాలయములోని గజాశ్వ చిత్రములు, హంపి

**కృష్ణదేవరాయలు** (క్రీ. శ. 1509 — క్రీ. శ. 1530): వీర నరసింహరాయల అనంతరము అతని సవతితల్లి నాగలాంబ కుమారుడు కృష్ణదేవరాయలు సామ్రాజ్యపీఠమును అధిష్ఠించెను. పట్టాభిషేకపు తడి మేనిపై ఆరియు ఆరక

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మునుపే అతడు సామ్రాజ్య రక్షణకై కత్తి దూయవలసి వచ్చెను. బహ్మనీ సుల్తాను మహమ్మదు శాహు విజయనగర సామ్రాజ్యముపై జిహాదు ప్రకటించి ప్రచండ సైన్యముతో విదుల ఖాన, నిజాము, కుతుబనమలిక, ఎకీదు ప్రభృతులైన సకల సామంతవర్గమును వెంటరా ఎత్తి వచ్చెను. విజయనగరపు సరిహద్దు ప్రదేశమున ఉండు దోని అనుస్థలము వారు చేరునప్పటికి కృష్ణదేవరాయలు వారికి అడ్డుపడి మార్గమును అరికట్టెను. ఘోరయుద్ధము సంఘటిల్లినది. మహమ్మదీయుల ఫౌజు విరిగిపోవ నారంభించెను. కృష్ణదేవరాయలు వెన్నంటి వారిని తరుముచు పోయి కోవెలకొండ సమీపమున విజాపుర ప్రభువైన యూసుఫ్ ఆదిల్ ఖానుని వధించి, ఆ దుర్గమును ఆక్రమించుకొని తిరిగి విజయనగరము చేరెను. కాని మహమ్మదీయులతో సంగ్రామము అంతటితో ముగియలేదు. యూసుఫ్ ఆదిల్ ఖానుడు మృతినందిన పిమ్మట అతని పుత్రుడు ఇస్మాయీల్ ఆదిల్ ఖానుడు విజాపుర సింహాసనము నధిష్ఠించెను. అతడు బాలుడగుటవలన సర్వసేనాధిపతియైన కమాల్ ఖానుడు రాజ్యమునకు సంరక్షకుడయ్యెను. రాష్ట్రమును విస్తరింపగోరి అతడు కలుబరిగె(గుల్బర్గ)ను జయించెను. తరువాత బీదరుపై ఎత్తిపోయి బరీదును ఓడించి పారదోలి ఆ పట్టణమును స్వాధీనము చేసికొని సుల్తాను మహమ్మదు శాహును బందీకృతుని కావించెను. విజాపుర రాజ్యవ్యాప్తిని సహింపక నిజాము, కుతుబనమలిక మున్నగు బహ్మనీ సామంతులు బరీదునకు తోడై వచ్చి విజాపుర సైన్యములను ఓడించి బీదరు మొదలయిన దుర్గములను మరల స్వాధీనపరచుకొనిరి. అంతట విజాపుర రాజ్యమున సంక్షోభము కల్గి అల్లరులు పెక్కుతావుల చెలరేగినవి. బెల్గాము పురవాసులు సర్కారుపై తిరుగబాటు చేసి కృష్ణదేవరాయలను వచ్చి తమ పట్టణమును ఆక్రమించుకొనవలసినదని ఆహ్వానించిరి. అంతట కృష్ణదేవరాయలు విజాపురముపై దండయాత్ర ప్రకటించి కృష్ణాతుంగభద్రల అంతర్వేదిని జొచ్చి రాయచూరు మున్నగు సుప్రసిద్ధ దుర్గములను ఆక్రమించుకొనెను. అచటినుండి ఉత్తర ముఖముగ ముందునకు సాగి గుల్బర్గవంత అడ్డపడిన మహమ్మదీయులను ఓడించి ఆదుర్గమును కైవసము కావించుకొనెను. తరువాత బీదరుపై నడచి ఆ కోటను స్వాధీనపరచుకొని అచట బందీకృతుడై యుండిన బహ్మనీ సుల్తాను మహమ్మదు శాహును విడుదల చేసి అతనిని సింహాసనముపై పునఃప్రతిష్ఠితుని చేసెను. ఈ కారణమున కృష్ణదేవరాయలకు యవనరాజ్య స్థాపనాచార్య బిరుదు కలిగినది.



చిత్రము 61. కృష్ణాలయము, హంపి

మహమ్మదీయులపై దండయాత్ర నడపుచున్నప్పుడే కృష్ణదేవరాయలు ఉమ్మత్తూరు పాళెగాండ్ర ఆటోపము నడుపుటకొరకు సైన్యము పంపవలసియుండుటచేత ఏమియు తోచక త్రొక్కటపడుచుండగా సర్వ శిరఃప్రధాని సాళువ తిమ్మరసయ్య యుక్తిచే ప్రచండబలమును చేకూర్చి రాయలవారి యుద్యమము నిరాటంకముగ కొనసాగుటకు తగిన యేర్పాటులను కావించెను. కృష్ణదేవరాయల రాజ్యాభిషేకమునకు ముందు కొంతకాలము నుండి కేంద్ర ప్రభుత్వముయొక్క పాటవము తగ్గుటవలన అమరనాయకులు పేటల రాయల భండారమున కీయవలసిన కప్పమును చెల్లింపక జాగు చేయుచు వచ్చిరి. తిమ్మరసయ్య అమరనాయకుల నెల్ల రప్పించి రాయల భండారమునకు వారు బాకీ పడియుండిన మొత్తమును తత్క్షణమే కట్టవలసినదనియు, అట్లు చేయజాలనివారు దానికి ప్రత్యామ్నాయముగ తమ క్రింది అమర నాయక బలము — ఏనుగు, గుఱ్ఱము, ఒంటె, కాల్బల — లకు వెల కట్టి రాయలవారికి మేడోలు చేయవలసిన దనియు నిక్కచ్చి చేసెను. అమరనాయకులకడ వలసిన ధనము లేకపోవుటచేత తిమ్మరసయ్య ఇష్టానుసారము తమ క్రింది బలములను రాయలవారికి స్వాధీనము చేసిరి. ఈ యుపాయమువలన ధనము వెచ్చపెట్టకయే రాయలవారి 'స్వకీయ కైజీతపు సేన' అభివృద్ధి చెందెను. అమరనాయకుల యొక్కబలము సన్నగిలెను.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తరువాత కృష్ణదేవరాయలు నిశ్చింతగ ఉమ్మత్తూరి పాళె గానిపై దండు వెడలెను.

ఉమ్మత్తూ రప్పుడు గంగరాజను పాళెగాని యేలుబడి క్రింద నుండినది. అతని బల మంతయు ఉమ్మత్తూరు శివన సముద్రములను రెండు ప్రబల దుర్గములపై నాధారపడి యుండినది. కృష్ణదేవరాయలు తనమీద నెత్తి రాగలడని యూహించి గంగరాజు పైపేర్కొనిన దుర్గములను బల పరచి ఫిరంగులు మొదలగు నాగ్నేయాయుధములను బురుజులపై నమర్చి యుద్ధసన్నద్ధుడై రాయరాణువ రాక నెదురుచూచుచుండెను. ఉమ్మత్తూరిపై కృష్ణదేవ రాయలు రెండేండ్ల కాలము దండుచేసి గంగరాజును యుద్ధ మున నోడించి యతని దుర్గములను రెంటిని నేలమట్టము గావించెను. శివనసముద్రమునుండి పారిపోవుచు కావేరి యందలి మడుగులోపడి గంగరాజు మృతినొందెను.

తరువాత కృష్ణదేవరాయలు ఉమ్మత్తూరు రాజ్యమును స్వాధీనము చేసికొని యచటినుండి శ్రీరంగ పట్టణముపై నడచి యా దుర్గమునుకూడ వశము చేసికొని యా దండయాత్రయందు జయించిన రాష్ట్రము నంతటిని ఒక రాజ్యముగ నేర్పరచి దాని పరిపాలనకు తగిన కట్టుదిట్ట ములను గావించెను.

కృష్ణదేవరాయలు వజ్రసింహాసనము నెక్కిన రెండేండ్ల లోపలనే బహ్మనీ సుల్తానుని భంగపరచెను; ఉమ్మత్తూరు పాళెగాండ్రను నిర్మూలము గావించి దక్షిణ కర్ణాటకమును హస్తగతము చేసికొనెను. ఇక సాధించవలసిన శత్రువు లలో ఒడ్డె గజపతి యొక్కడే మిగిలియుండెను. విజయ నగర సామ్రాజ్యమునకు జెందిన తీరాంధ్రభూమి యం తయు రెండు శతముల నుండి గజపతుల స్వాధీనమం దుండి నది. దానిని సాధించుట యావశ్యక మాయెను; కావున ఉమ్మత్తూరు దండయాత్రయందు విజయము చేకొని వచ్చిన వెంటనే కృష్ణదేవరాయలు కళింగ దిగ్విజయార్థము బయలు వెడలెను.

**కళింగ జైత్రయాత్ర:** కృష్ణదేవరాయల కళింగ జైత్రయాత్రయందు ఐదు ఘట్టములు కలవు: మొదటి ఘట్టము ఉదయగిరి విజయముతో ముగిసినది. క్రీ. శ. 1518 సంవత్సరమున జనవరి మాసమున దండు వెడలి పోయి కృష్ణదేవరాయలు ఉదయగిరిని ముట్టడించెను. బలిష్ఠమైన గిరిదుర్గముగుటచేత అది సులభసాధ్యము కాక పోవుటవలన ముట్టడి ఒకటిన్నర సంవత్సరము పర్యం తము సాగినది. ఈ లోపల కృష్ణదేవరాయలు దుర్గము చుట్టునుండు గుట్టలను, బండలను ఇడియగొట్టించి కోట గోడల సమీపమునకు సైనికులు సునాయాసముగ పోవు టకు దగిన విశాల మార్గములను ఏర్పరచెను. అతనిని తరుమగొట్టుటకొరకు ప్రతాపరుద్ర గజపతి సైన్యయుక్తుడై వచ్చెను. కాని కృష్ణదేవరాయలు అతనిని ఓడించి కొండ వీటివరకు పారదోలి మరలి వచ్చి ఉదయగిరి దుర్గము చుట్టును మెరత వేయించి చిట్టచివరకు దానిని సాధిం చెను. దుర్గాధిపతియగు తిరుమలరాహుత్తరాయడు బందీ కృతుడయ్యెను. ఉదయగిరి విజయానంతరము కొండవీటి దండయాత్ర. ఇది కళింగ జైత్రయాత్రలో ద్వితీయ ఘట్టము. కందుకూరు, అద్దంకి, వినుకొండ, బెల్లముకొండ, నాగార్జునుని కొండ, తంగెడ, కేతవరము మున్నగు చిల్లర దుర్గములను సాధించుచు తరలిపోయి రాయువాహిని కొండవీడు చేరినది. సాళువ తిమ్మరసయ్యగారి నాయ కత్వముక్రింద ముట్టడి కార్యము ఆరంభమైనది; కోటలో జనము క్రిక్కిరిసి యుండిరి. రాయసైన్యము ధాటికి తాళ జాలక తత్పరిసర దుర్గములకు కాపుండిన పాత్ర సామం తులు నిజ పరివారములతో అచటికి వచ్చి మూగయుండిరి. తిమ్మరసయ్య మూడు నెలల పర్యంతము కోటకు అష్ట దిగ్బంధనము కావించి కోటలోనికి ఆహారపదార్థములను కూడ పోనీయక అరికట్టెను. కాని అది స్వాధీనపడలేదు. అంతట కృష్ణదేవరాయలు కోటకు నడచప్పరములు పెట్టి లగ్గలు పట్టించెను. కోట రాయలకు హస్తగత మయ్యెను. ప్రతాపరుద్ర గజపతియొక్క రాణి ఒక్కతెయు, అతని పుత్రుడును కొండవీడుదండపాటి పాలకుడును అగు వీరభద్ర గజపతియు, మరియు పెక్కండ్రు పాత్ర సామం తులును జీవగ్రాహముగ పట్టుపడిరి. కృష్ణానదికి దక్షిణ మున నుండు తీరాంధ్రదేశము సర్వమును రాయలకు స్వాధీన పడెను. తృతీయ ఘట్టము: కొండవీడు స్వాధీనము చేసి కొనిన పిమ్మట రాయరాణువ కృష్ణానదిని దాటి బెజవా డను వశపరచుకొనెను. తరువాత తెలంగాణాకు బోరు తలుపనదగు కొండపల్లిని ముట్టడించెను. ఈ ముట్టడి సాగు చుండగా ప్రతాపరుద్ర గజపతి దళమును కూర్చుకొని కృష్ణానదిని ఉత్తరించి దాని దక్షిణ తటముననే కూడిచేసి విజయనగర స్కంధావారముపై పిరిదినుండి కవియు సుద్దే శముతో వచ్చెను. కాని కృష్ణదేవరాయలు కోటచుట్టును కొంత దండును కాపుంచి తక్కినదానితో ప్రతాపరుద్రుని ఎదిర్చి యుద్ధమున ఓడించి తరుమగొట్టెను. తరువాత స్వల్ప కాలముననే కొండపల్లి కృష్ణదేవరాయలకు హస్తగత మయ్యెను. చతుర్థ ఘట్టము: కొండపల్లి పతనముతో కళింగ దిగ్విజయమునందు చతుర్థ ఘట్టము ఆరంభ మయ్యెను. రాయరాణువ అచట రెండు పాయలుగ చీలి నట్లు కానవచ్చుచున్నది. ఒక్క పాయతో కృష్ణదేవ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



రాయలు తెలంగాణాపై నడచెను. అప్పుడు తెలంగాణా యందు చాల భాగము పాత్ర సామంతుల ఏలుబడిక్రింద ఉండినది. దానిని వశపరచుకొనక కళింగమును ప్రవేశించుట అపాయకరమని రాయలు ఎరుగును. కావున మొదట తెలంగాణా దుర్గములను సాధించుట కర్తవ్యమని ఎంచి, కంబము మెట్టుపై నడచెను. ఇది తెలంగాణా పాత్ర సామంతుడైన 'చిత్తాపఖాను' డను షణివంశ ప్రభువునకు ఉనికిపట్టు. అతడు పరాక్రమశాలి: కుతుపనమలకను ఓడించి అతనికడ నుండి పూర్వము కాకతీయుల రాజధానియైన ఓరుగంటిని స్వాధీనపరచుకొన్న ప్రోడ. కాని కర్ణాటక సైన్యము ముందు అతని పోటరితనము దీటుగాకపోయినది. రాజధానియైన కంబముమెట్టును రాయరాణువపాలు చేసి అత డచ్చటనో తలదాచుకొనెను. ఓరుగల్లుకూడ రాయల పరమయ్యెనని స్థానిక చరిత్రయందు చెప్పియున్నది. చిత్తాపఖానుని నిర్జించిన తరువాత కృష్ణదేవరాయలు ఏకధాటితో అనంతగిరి, ఉండ్రకొండ, ఉర్లకొండ, అరువపల్లి, జల్లిపల్లి, కందికొండ, నలగొండ, రాచకొండ, దేవరకొండ, కనకగిరి, శంకరగిరి మున్నగు దుర్గములను సాధించి జమ్మిలోయగుండ సింహాద్రివైపు కూచిచేయ సమకట్టెను. కనుమగుండ రాయల సైన్యము పోవుచుండగా ప్రతాపరుద్ర గజపతి ఆజ్ఞానుసారము చిత్తాపఖానుడు అరువదివేల విలుకాండ్రతో వచ్చి మార్గము నరికట్టెను. కాని కృష్ణదేవరాయలు కర్ణాట కాల్బలమును చిత్తాపఖానుని విలుకాండ్ర పింగలితట్టు కొండల పైకి ఎక్కించి వారిని చెల్లాచెదరు కావించి జమ్మిలోయను పరశురామప్రీతి గావించి కనుమకు అవ్వలి రాష్ట్రమును ప్రవేశించెను. అంతట కొండపల్లెనుండి బయలుదేరిన రాయ రాణువ రెండవ పాయ కృష్ణా గౌతమీ మధ్యదేశమును జయించి రాజమహేంద్రవరమును స్వాధీనము చేసికొని వచ్చి కృష్ణదేవరాయలను కలసికొనెను. ఉభయవాహినులును ఏకమై కోనసీమను చీర్చి కొట్టాముమీదుగ పోయి సింహాద్రికడ విడిసెను. ఆరు మాసముల పర్యంతము గజపతి యుద్ధమునకు వచ్చునని కృష్ణరాయలు ఎదురుచూచుచుండి రాకపోగా పొట్నూరుకడ జయస్తంభమును పాదుకొల్పి, సైన్యమును అచట నిల్పి స్వయముగ విజయనగరమునకు తరలిపోయెను. పొట్నూరుకడ జయస్తంభ ప్రతిష్ఠతో చతుర్థఘట్టము ముగిసెను. ఇక పంచమ ఘట్టము: దండయాత్ర ప్రారంభమైనప్పటి నుండియు గజపతికి ఒక యుద్ధమందైనను జయము లభింపలేదు. అయినను అతడు సంధికి ఈయకొనక ఇంకను యుద్ధముచేయ ప్రయత్నములు చేయుచుండెను. కావున కృష్ణదేవరాయలు అతని రాజధానియగు కటకముపై ఎత్తిపోవ నిశ్చయించి దండు తరలెను. మార్గమున ఎచ్చటనైన గజపతి దళములతో ఘర్షణ జరగెనేమో తెలియదు. తుదకు కృష్ణదేవరాయలు కటకము చేరి తత్పరిసరములందు విడిసెను. ఇక కటకమున నుండుట క్షేమకరము కాదని ప్రతాపరుద్ర గజపతి పారిపోయెను. రాయల సైనికులు అంతట కటకమును గాల్చిరి. అటు తరువాత తనకు జయము కలుగదని ప్రతాపరుద్ర గజపతి నిశ్చయించి రాయలకు తన కొమారిత నిచ్చి ఉద్వాహమొనర్చి సంధిచేసికొనెను. కృష్ణదేవరాయలు కృష్ణానదికి ఉత్తరమున తాను జయించిన దుర్గములను, రాష్ట్రములను మరల గజపతికి ఇచ్చివేసెను. ఇట్లు క్రీ. శ. 1518 వ సంవత్సరమున ప్రారంభమైన కళింగ దండయాత్ర ఐదేండ్ల పర్యంతము జయవంతముగ సాగి 1518 లో సమాప్తమైనది.



చిత్రము 62. కృష్ణదేవరాయలు, రాణులు చిన్నాదేవి, తిరుమలదేవి

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కళింగ దిగ్విజయయాత్ర యింకను సాగుచుండగనే కృష్ణదేవరాయలు ఒక పర్యాయము తిరకి రాజ్యముల పై దాడి వెడలవలసివచ్చెను. రాయలు కళింగ దండయాత్ర యందు నిమగ్నుడై ఉండుటను కని అదియే యతని పై దండు వెట్టుటకు మంచి తరుణమని తలచి పదుల ఖాన, కుతుబ మ...కలు రాయరాజ్యముపై దండు వెడలి పూర్వము తమకడనుండి అతడు కొనియుంచిన కోవెలకొండ, పానుగల్లు, దేవరకొండ, గణపురము దుర్గములను స్వాధీనపరచుకొనిరి. వారికి నిజామనమలక తోడ్పడెను. వారి దుండగమునకు తగిన శాస్తి తత్క్షణము చేయుట అవశ్యకమని గ్రహించి కృష్ణదేవరాయలు సింహాద్రి పొట్నూరులో జయస్తంభమును స్థాపించి వచ్చి క్రీ. శ. 1516 లో దండయాత్ర వెడలెను. తురకలు తీసికొన్న కోటలను మరల స్వాధీనపరచుకొను ఉద్దేశముతో రాయలు దండు వెడలలేదు. ఆ కార్యమునకు పూనుకొనుటకప్పుడు వ్యవధి చాలదు. ప్రతాపరుద్ర గజపతితో వారు చేసికొని యుండిన ఒడంబడిక ప్రకారము వారిని అతనికి తోడ్పడనీయక వారి సేనాబలమును భగ్నము కావించి కీడ్పరచుటయే అతని దండయాత్ర యొక్క ప్రధానోద్దేశము. కావున కృష్ణదేవరాయలు కోవెలకొండ మున్నగు దుర్గముల మీదికి ఒక సేనను పంపి మరియొక సేనతో విజాపుర రాజ్యము పై ఎత్తిపోయెను. తన గడిదుర్గములను రక్షించుకొనవలసి వచ్చినందున కుతుపనమలక తక్కిన తురక రాజులతో ఏకీభవించి రాయలను ఎదుర్కొనలేకపోయెను. కావున అతని నెదుర్చు భారమంతయు విజాపుర, అహ్మదు నగరముల ప్రభువుల పై బడెను. ఈ దండయాత్రయందు నడచిన యుద్ధ వివరములు చక్కగ తెలియవు. రెంటిని మాత్రము కృష్ణదేవరాయలు పేర్కొనెను. అందు మొదటిది కెంబావికయ్యము. కెంబావి విజాపుర అహ్మదునగర బీదరు రాజ్యముల ముయ్యేలగుట్టయందుండిన గ్రామము. ఈ యుద్ధమున రాయలు మహమ్మదీయ సైన్యమును చించి చెండాడి రణరంగమును రక్తసిక్తము కావించి కెంబావి నామమును సార్థకము చేసెను. రెండవది: అహ్మదు నగర వినాశము. ఇది నిజామనమలక యొక్క నూతన రాజధాని. అప్పటికింకను కోట నిర్మింపబడి ఉండలేదు. కావున అది విశేష ప్రయాస లేక రాయరాణువ వారిని పడి నాశనమందెను. మహమ్మదీయ ప్రభువులను ఇట్లు భంగపరచి కృష్ణదేవరాయలు కటకమునకు పోవుటకయి కళింగమునకు తరలిపోయెను.

**కాటూరు, సింహళ దండయాత్రలు**: గజపతితో సంధి చేసికొనినపిమ్మట కృష్ణదేవరాయలు కాటూరిపై దండెత్తిపోయి అచటి ప్రభువును ఓడించి ఆరాజ్యమును స్వాధీనపరచుకొనెనని న్యూనిజు వ్రాసియున్నాడు. ఈ కాటూరు ఎచ్చట ఉండెనో తెలియదు. న్యూనిజు చెప్పిన చరిత్రాంశములను పట్టి చూడగా ఇది దక్షిణమున తిరునెల్వేలి ప్రాంతములందు ఉండిన రాజ్యమని తోచుచున్నది. ఈ సమయముననే కృష్ణదేవరాయలు సింహళద్వీపముపై దండయాత్ర సాగించి సింహళాధిపతి యొద్ద కప్పము కొన్నట్లున్నది. క్రీ. శ. 1518 వ సంవత్సరము జూన్ 8 నాడు వ్రాయించిన పిరాన్మల శాసనములో రాయల సామంతులలో ఒక్కడును, అరతంగి పాలకుడునైన పొన్నంబలనాథ తొండమానారు అనునతడు ఏడుదినములలోపల సింహళమునుండి కప్పము కొనివచ్చినట్లు చెప్పియున్నది. ఈ సందర్భముననే కృష్ణదేవరాయలు ద్రావిడదేశములోని పుణ్యస్థలములకు యాత్రచేసి అచటి దేవస్థానములకు దానము లొసగెను.

**రాయచూరు దండయాత్ర**: దక్షిణ దిగ్విజయమును జయవంతముగ కొనసాగించి కృష్ణదేవరాయలు క్రీ. శ. 1519 వ సంవత్సరమున విజయనగరమునకు మరలి వచ్చి చేరెను. వెంటనే విజాపురముపై దండయాత్రను నడపుటకు ప్రయత్నము చేయసాగెను. తన్ను మోసగించి పారిపోయి విజాపుర రాజ్యమున దాగియుండిన పయ్యేదు మర్కారను మహమ్మదీయ అశ్వవ్యాపారిని ఆ దేశపాలకుడు పట్టి తన కప్పగింపకపోయెనని క్రుద్ధుడై కృష్ణదేవరాయలు యుద్ధమునకు వెడలెను. కాని అది వట్టి సాకు. వాస్తవ కారణము కృష్ణా తుంగభద్రల అంతర్వేదిని, అందును ముఖ్యముగ రాయచూరు దుర్గమును మరల జయించి స్వాధీనపరచుకొనవలయునను అతనికిగల ఇచ్ఛయే. క్రీ. శ. 1520 వ సంవత్సరారంభమున గొప్ప సైన్యముతో తరలిపోయి కృష్ణదేవరాయలు రాయచూరు దుర్గమును ముట్టడించెను. ఆ వర్తమానమును విని విజాపురాధిపుడగు ఇస్మాయీల్ ఆదిల్ ఖానుడు దళమును గూర్చుకొని రాయలను తరుమగొట్టి కోటను కాపాడుటకొరకు బయలుదేరి వచ్చి కృష్ణకు అవ్వలియొడ్డున స్కంధావారము నేర్పరచికొని రాయలకొరకు వేచియుండెను. ఆదిల్ ఖానుడు వచ్చుచున్నాడని విని కృష్ణదేవరాయలు రాయచూరు చుట్టును కొంత దండును కాపుంచి తక్కిన బలములను వెంటగొని ఆదిల్ ఖాను నెదుర్చుటకు బయలువెడలి పోయి కృష్ణానదికి ఈవలిదరిని గొబ్బూరు గ్రామమునకు కొంతదూరమున విడిసెను. అంతట ఆదిల్ ఖానుడు రాయల విడిదల పై కవియు ఉద్దేశమున సైన్యముతో కృష్ణను దాటెను. ఉభయ పక్షములకు గొబ్బూరివద్ద ఘోరసంగ్రామము జరగెను.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



యుద్ధమునందు ఆదిల్ ఖానునికి ఘనపరాజయము కలిగెను. అతని సైన్యము సమస్తమును నాశనమైనది. సలాబత్ ఖానుడు మున్నగు విజాపురపు సర్దారులు అనే కులు రాయల చేజిక్కి బందీకృతులైరి. ఇస్మాయీలు ఆదిల్ ఖానుడు ప్రాణములు దక్కిన చాలునని అసద్ ఖాను లారీతోగూడ పారిపోయెను. కృష్ణదేవరాయలు అంతట విజాపురస్కంధావారమును చూరగొని వెనుదిరిగి రాయచూరికి పోయి ముట్టడి కార్యమును మునుపటికంటె ఎక్కువ ఔద్ధత్యముతో జరప నారంభించెను. అచిరకాలము ననే కోట రాయల హస్తగతమైనది. కృష్ణా తుంగభద్రల అంతర్వేది యంతయు మరల అతని పలుబడిక్రిందికి వచ్చినది. ఈ ఘనవిజయమువలన రాయల యశస్సు భరత ఖండ మంతటను పర్విసది. పాశ్చాత్యులగు పోర్చుగీసులు సయితము అతని పరాక్రమాదులను ఉగ్గడించిరి. హిందూ ప్రపంచము అతనిని మహమ్మదీయ రాక్షసులను సంహరింప నవతరించిన శ్రీకృష్ణపరమాత్మ అని ప్రశంసించినది.

**విజాపుర కలుబరిగె దండయాత్రలు :** రాయచూరు దండయాత్రకు ఇవి అనుబంధములని చెప్పవచ్చును. రాయ చూరు పతనానంతరము ఇస్మాయీలు ఆదిల్ ఖానుడు కృష్ణదేవరాయలతో సంధి చేసికొనగోరెను. కాని సంధి షరతులను అతడు నెరవేర్పక పోగా కృష్ణదేవరాయలు కోపించి దండెత్తిపోయి విజాపురమును ప్రవేశించెను. అది సర్వసంపదలకు ఆకరమైన పట్టణమే. కాని నీటివసతి తక్కువ. వంటచెరకును సంపాద్యము కాదు. కావున కృష్ణ దేవరాయలు తాను అనుకొనినంతకాలము అచట నుండ వీలుపడక పోవుటచేత దండును మరల్చుకొని ముదుగల్లు దుర్గమునకు వచ్చి చేరెను. ఆదిల్ ఖానుడు సంధికొరకు మంత్రియైన అసద్ ఖాను లారీని రాయలకడకు మరల రాయబార మంపెను : కాని అసద్ ఖానుని దుర్మంత్రము వలన సంధి ఒనగూడలేదు. కృష్ణదేవరాయలు క్రోధపర వశుడై విజాపుర రాజ్యముపై మరల ఎత్తిపోయి కలుబరిగె కోటను ముట్టడించి స్వాధీనపరచుకొనెను. ఆ కోటయందు ఆదిల్ ఖానునిచే బందీకృతులు కావింపబడియుండిన బహ్మనీ సుల్తానుని పుత్రులు రాయలకు చిక్కిరి. వారిని విడుదలచేసి వారిలో జ్యేష్ఠుని తండ్రిపదమున ప్రతిష్ఠితుని కావించి అతని తమ్ములను ఇరువురను తనతోగూడ విజయ నగరము తోడ్కొనిపోయి రాజపుత్రుల యంతస్తునకు తగిన రీతిని సత్కరించి వారికి దినవెచ్చమునకై సాలుకు పదిదివేల బంగారు వర్హావులు వేతనమును వీర్పరచెను.

కలుబరిగెదాడి రాయలతైత్రయాత్రలయందు కడప టిది. తరువాత అతడు పరరాజ్యముపై దండువెడలినట్లు అగపడదు. సామ్రాజ్యమున కలిగిన సంక్షోభమే దానికి ముఖ్యకారణము కావచ్చును. కృష్ణదేవరాయలకు తిరు మలదేవరాయ లను నొకపుత్రుడు కలడు. తన యనంత రము అతనిని సామ్రాజ్యాధిపత్యమున సుస్థిరముగ స్థాపించు నుద్దేశముతో తన జీవితకాలముననే అతనికి పట్టాభిషేకమొనర్చి అతనిపేర తిమ్మరసయ్య సాయముతో రాజకార్యములను తాను నిర్వహించుచుండెను. ఆ కుమా రుడు ఉన్నటు లుండి జబ్బుపడి క్రీ. శ. 1524 లో పరలోక గతుడాయెను. ఆ బాలుని తిమ్మరసయ్య విషప్రయో గము చేయించి చంపించినట్లు కృష్ణదేవరాయలకు అను మానము కల్గెను. అనుమానమునకు కారణము తెలియదు. కాని కృష్ణదేవరాయలు తిమ్మరసయ్యను పదభ్రష్టుని కావించి కుటుంబసహితముగ కారాగృహమున బందీ కృతుని గావించెను. తిమ్మరసయ్య కుమారుడైన తిమ్మదండ నాయకుడు చెరసాలనుండి తప్పించుకొని దుర్గమపర్వత ప్రాంతములకు పారిపోయి అల్లరిని రెచ్చగొట్టి రాయలను ధిక్కరించెను. కోపోద్రిక్తుడై కృష్ణదేవరాయలు చెరసాల యందున్న తిమ్మరసయ్య కన్నులను పొడిపించి తన యల్లు డైన అళియ రామరాజును గొప్ప సైన్యముతోగూడ తిమ్మదండనాయకుని పట్టి తే నంపెను. రాయసామ్రాజ్య మున కలిగిన యలజడిని సందు చేసికొని పదుల ఖానుడును, కుతుబనమలకయు దండెత్తి వచ్చిరి. రెండు మూడేండ్ల పాటు యుద్ధము నడచెను. తుదకు కృష్ణదేవరాయలకే విజయము చేకూడెను. మరల సామ్రాజ్యమున శాంతి కుదిరెను. కాని అతనికి చిత్తశాంతి కల్గదాయెను. రాజ్యము యొక్క వారసత్వసమస్య అతని మనస్సును కలతపెట్టు చుండెను. తన యనంతరము సామ్రాజ్యపీఠమును అధిష్ఠిం చుటకు అర్హు డెవడో నిర్ణయింపవలసిన యావశ్యకము కల్గెను. సామ్రాజ్యమునకు వారసులుగ పరిగణింపదగిన వారు నల్వురు : మొదటివాడు కృష్ణదేవరాయల పుత్రు డగు పదునెనిమిది మాసముల నిసుగు. రెండవవాడు : కృష్ణ దేవరాయలయన్న వీరనరసింహరాయల కొడుకు. మూడవ వాడు : కృష్ణదేవరాయల కనిష్ఠవైమాత్రేయు డగు అచ్యుతదేవరాయలు ; నాల్గవవాడు : అచ్యుతదేవరాయల యన్న శ్రీరంగదేవరాయల కుమారుడగు సదాశివదేవ రాయలు. వీ రందరి గుణములను, శక్తిసామర్థ్యములను కృష్ణదేవరాయలు చక్కగ ఎరుగును. పెక్కునాళ్లు చింతించి చింతించి తన పిమ్మట వజ్రసింహాసనము నెక్కదగినవాడు అచ్యుతదేవరాయలే అని నిశ్చయించి కారాగారమునుండి యతనిని విముక్తుని గావించి విజయనగరమునకు రా నాజ్ఞా పించెను. ఇంతలోపలనే రాయల ఆరోగ్యము చెడినది.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సాళువ నరసింగరాయ దండనాయకుడను నామాంతరము గల చెల్లప్పయను బ్రాహ్మణుని సర్వశిరఃప్రధాని పదమున నియమించి అచ్యుతదేవరాయలు వచ్చునందాక రాజధానిని అన్యుల వశము కానీక కాపాడి అతనికి అప్పగించవలయునని ముదలయిడి రాయలు లోకాంతరగతు డాయెను.

విజయనగర సామ్రాజ్యమును పాలించిన చక్రవర్తులు అందరిలో కృష్ణదేవరాయలు అధికుడు. అతడు నిర్వక్ర పరాక్రమమునకల దళనాయకుడు. సేనలు కూర్చుటయందును, విచ్చుటయందును, వ్యూహారచనయందును, సంగ్రామ రంగమున శత్రువులపై దళములను నడపుటయందును అతనితో సరియగువాడు ఆకాలమునందు ఎవ్వడును లేడు: కావుననే అతని దండయాత్ర లన్నియు విజయవంతములై కొనసాగినవి; అతనిని ఎదిరించి జయము గొన్న శత్రువు లేడు. అతడు తొక్కిచూడని రిపురాష్ట్రము కాని, చొరని శత్రు రాజధాని కాని లేదు. అతని ప్రతిభా విశేషము సమరాంగణమునందు ఎట్లో సామ్రాజ్యపాలనమునందును అట్లే అద్వితీయమై విలసిల్లినది. అతడు రాజనీతిమర్మజ్ఞుడు; ప్రజాపాలనదక్షుడు; ప్రభుమంత్రోత్సాహశక్తిసంపన్నుడు; సకలకళావిశారదుడు; ఆంధ్రగీర్వాణములందు సమాన ప్రతిభతో కవిత్వము చెప్పనేర్పుగల కవివతంసుడు; కవిజన కల్పభూజము; అష్టదిగ్గజకవులకు ఆశ్రయ మొసగి వారిని కావ్యరచనకు పురికొల్పి ఆంధ్రభోజుడని విఖ్యాతి గడించిన భాషాపోషకుడు. కావ్యరచనమువలె వాస్తునిర్మాణమును కృష్ణరాయలకు కరము ప్రియమైనది. రాజధానియందును, స్థలాంతరములందును అతడు కట్టించిన సౌధములును, దేవతాయతన గోపురమండపాదులును అతని వాస్తునిర్మాణపరాయణతకు ప్రబలనిదర్శనములు.



చిత్రము 68. అచ్యుతరాయాలయము, హం°

**అచ్యుతదేవరాయలు** (క్రీ. శ. 1530 — క్రీ. శ. 1542): కృష్ణదేవరాయల తరువాత అతని నియామకమును అనుసరించి అతని సవతి తమ్ముడు అచ్యుతదేవరాయలు వజ్రసింహాసనమును అధిష్ఠించి పండ్రెండేండ్లకాలము సామ్రాజ్యపాలనము గావించెను. ఇతని కాలమున పెక్కుకారణముల వల్ల రాయసంస్థాన ప్రతిష్ఠ కొంత తగ్గినది. ఇందు ముఖ్యముగ కుటుంబకలహము గమనింపదగినది. కృష్ణదేవరాయల మరణకాలమున అతనికి తిరుమలాంబవలన యౌవనవతియగు పుత్రికయు, పదునెనిమిది మాసముల ప్రాయపు చిన్నకొమారుడును కలరు. క్రీ. శ. 1515-16 ప్రాంతమున కృష్ణదేవరాయలు తిరుమలాంబను ఆరవీటి బుక్కరాజు మనిమనుమడగు రామరాజున కిచ్చి వివాహము గావించి దగ్గర నుంచుకొని సంస్థానమునం దతనికి ఉన్నతోద్యోగము నిచ్చి సామ్రాజ్యకార్యములందు చొరవ కలిగించెను. క్రమక్రమముగ అతడు ప్రముఖుడై అళియ (అల్లుడు) రామరాజు అనుపేర సుప్రసిద్ధు డాయెను. కృష్ణదేవరాయలు నిజమరణానంతరము సామ్రాజ్యపాలనకొరకు చేసిన యేర్పాట్లు అతనికి నచ్చలేదు. రాయలు అర్భకుడైన తన పుత్రుని సామ్రాజ్యాధిపతిని గావించి తన్ను అతనికి సంరక్షకునిగ నియమించునని యతడు తలచెను. కాని కృష్ణదేవరాయల నిర్ణయము తద్విరుద్ధముగ నుండుటవలన ఎట్లయిన దానిని నమలులోనికి రానీయక తొలగద్రోయ వలయునని నిశ్చయించెను. ప్రప్రథమమున అతని ప్రయత్నము సాగలేదు. అతని చిత్తవృత్తిని చక్కగ నెరిగినవా డగుటవలన కృష్ణదేవరాయలు తన పూనిక నిర్విఘ్నముగ కొనసాగుటకు తగునేర్పాటులను గావించెను. ముఖ్య ప్రధానియైన సాళువ నరసింగరాయనాయక బిరుదాంకితుడగు చెల్లప్పను



http://sanskritcentral.com/

http://teluguthesis.com/





చిత్రము 1.
విట్ఠల రాయాలయము, ముందరి మంటప భాగము.




చిత్రము 2.
అచ్యుతరాయాలయము, రెండవ అంగణ ద్వారగోపురము, హంపి.

http://sanskritcentral.com/

http://teluguthesis.com/






చిత్రము 1. జైనదేవాలయములు, హంపి.




చిత్రము 2. విఠ్ఠలరాయాలయము, (సాధారణదృశ్యము), హంపి.

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



రాయలు తన మరణశయ్యకడకు రావించి అచ్యుతదేవ రాయలు చంద్రగిరినుండి విజయనగరమునకు వచ్చి చేరు నందాక, రాజధానిని ప్రతిపక్షులచేతిలో బడనీయక సంర క్షించి యతని యాగమనానంతరము అతనికి అప్పగింప వలయునని ఆజ్ఞాపించెను. కృష్ణదేవరాయల ఆజ్ఞాను సారము ప్రధాని చెల్లప్ప దిట్టమైన కట్టుపాట్లు చేయుట వలన అళియ రామరాజు తన యుద్దేశమును నెరవేర్పు కొనలేకపోయెను. అచ్యుతదేవరాయలు తన పట్టాభి షేకము రాజధానియందు నిర్విఘ్నముగ జరుగనేరదని శంకించి తిరుపతిలో తన యిష్టదైవమగు వేంకటాచలపతి సన్నిధియందు అభిషేకమహోత్సవమును ముగించుకొని పరిజనముతోకూడ విజయనగరమునకు బయలుదేరెను. ఇంతలోనే వార్త వచ్చినది గడి దాటి ప్రతాపరుద్ర గజ పతియు, గోలకొండ సుల్తాను కులీ కుతుబ్ శాహును రాయ సామ్రాజ్యముపై ఎత్తివచ్చుచున్నారని. అచ్యుతదేవ రాయలు అంతట విజయనగర ప్రయాణమును మానుకొని, ఎత్తివచ్చు శత్రువుల కభిముఖుడై కొండవీడు గడిప్రాంత మునకు నడచెను. గడిసీమయందు దండయాత్రికులు తార సిల్లగా వారితో భీకరరణము సంప్రాప్తించెను. యుద్ధము నందు గజపతి యోడి కృష్ణను దాటి నిజరాజ్యమునకు మరలిపోయెను; అట్లే కులీ కుతుబ్ శాహు సయితము గోలకొండదారిని పట్టెను. శత్రువుల నిట్లు ఓడించి జయము చేకొని అచట తన నధికారమును నెలకొల్పి అచ్యుతదేవరాయలు తుదకు విజయనగరమునకు పోయి చేరెను.

రాజధాని చేరిన పిమ్మట అచ్యుతదేవరాయలు రాయ సామ్రాజ్యములో కుటుంబ వైరస్యకారణమున సంక్షోభము గల్గుట శ్రేయస్కరము కాదని భావించి రామరాజుతో సమాధానపడెను. అచ్యుతదేవరాయలతోపాటు కృష్ణదేవ రాయల పుత్రుడును సామ్రాజ్యాధిపత్యమందు భాగస్వామి కావలయు ననియు, ఆనిసుగునకు ప్రాపుగ అతని బావ యగు రామరాజు కార్యకర్తయై రాజకీయకార్యములను నిర్వహింపవలయు ననియు తీర్మానమైనది. పిమ్మట అచ్యుత దేవరాయలు మరల విజయనగరమున రాజ్యాభిషేకము గావించుకొనెను. కాని రామరాజుతోటి సంధివలన అచ్యుత దేవరాయలకు 'ముల్లు పుచ్చి కొఱ్ఱడచుకొన్నట్లు' అయి నది. ఆ సంధిమూలమున కృష్ణదేవరాయల యంత్యకాల మున సామ్రాజ్యమునకు సర్వాధికారియై అతని యాదే శము చొప్పున అచ్యుతదేవరాయలకొరకు సింహాసనమును శత్రుహస్తగతము కానీయక సంరక్షించిన సాళువ నరసింగ రాయనాయక బిరుదాంకితుడైన చెల్లప్ప ద్రోహవడెను. పితత్కారణమున అతడు క్రుద్ధుడై ద్రావిడదేశమునకు పోయి యచట గొప్ప హావడిని రేపెను. సాళువ నరసింహ రాయ నాయకుడు తాళువ కొండైన్దర భట్టరు అను కాంచీ పుర బ్రాహ్మణుని పుత్రుడు. అకాలపు బ్రాహ్మణకుమారులు పెక్కండ్రవలె అత డాయుధోపజీవియై రాయరాణువ యందు చేరి తన పరాక్రమాతిశయమువల్లను, శక్తిసామ ర్థ్యములవల్లను దండనాయక పదమును అధిష్ఠించి వీరనర సింహరాయల కాలమునుండియు ద్రావిడదేశపాలనమున రాయలకు కుడిభుజమై వర్తిల్లుచుండెను. ద్రావిడదేశము నందు అతనికి గల పలుకుబడి రాయలకుకూడ లేదన్న అతిశయోక్తి కాదు. కావున అతడు అచ్యుతదేవరాయలచే నిరస్తుడైన పిమ్మట స్వదేశమునకు పోయి తిరువడి తుంబిచ్చి నాయకాది ద్రావిడ కేరళ ప్రముఖులను కూర్చుకొని రాయలను ధిక్కరించెను. సమయము అనుకూలమగుటను గమనించి ఉమ్మత్తూరు పాళెగాండ్రు స్వతంత్రపతాకము నెగయించిరి. ఇస్మాయీలు ఆదిల్ ఖాను కృష్ణా తుంగ భద్రల యంతర్వేదిపై నెత్తివచ్చి రాయచూరు దుర్గమును స్వాధీనపరచుకొనెను.

అచ్యుతదేవరాయలు మొట్టమొదట సాళువ నరసింగ రాయ నాయకుని తిరుగబాటును అణచి ద్రావిడదేశమున తన అధికారమును పాదుకొల్పుటకు సైన్యముతో బయలు వెడలెను. యుద్ధ వివరములు తెలియరావు. కాని రాయల బావమరదియైన సలకరాజు చిన తిరుమలరాజు నాయ కత్వముక్రింద రాయసైన్యము నరసింగరాయనాయకుని పైకొని యోడించినది. అంత నతడు కేరళమునకు పారి పోయి మిత్రుడైన తిరువడిని కూడుటయేకాక, తెంకాసి ప్రాంతమును పాలించుచుండిన పాండ్యరాజును రాజ్య భ్రష్టుని కావించెను. అచ్యుతదేవరాయలు సకుటుంబముగ కంచి, తిరువణ్ణామలల మీదుగ పోయి శ్రీరంగమున విడిసి సాళువ నరసింగరాయ నాయకుని, అతని మిత్రులను శిక్షిం చుటకు సలకరాజు చిన తిరుమలరాజును సైన్యముతోకూడ కేరళదేశమునకు పంపెను. తామ్రపర్ణీతటమును చేరునం దాక అతనికి ఎవ్వరును అడ్డపడరైరి. అత డచట జయ స్తంభమును ప్రతిష్ఠించి ముందునకు సాగెను. తిరువడి సైన్యములు అతనిని తారసిల్లి యుద్ధముచేసి పరాజయము పొందెను. తిరువడి అంతట పాదాక్రాంతుడై ఏనుగులను కానుక సమర్పించి సాళువ నరసింగరాయ నాయకుని పట్టి యిచ్చెను. సలకరాజు చిన తిరుమలరాజు విజయుడై వెను దిరిగి శ్రీరంగమునకు వచ్చి యచట రంగనాథుని సేవించు చుండిన రాయలవారికి దండయాత్ర వృత్తాంతము సర్వ మును నివేదించెను. పాండ్యరాజు తన పుత్రికను అచ్యుత



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



దేవరాయల కిచ్చి ఉద్వాహము గావించి నిజరాజ్యమున పునఃప్రతిష్ఠితు డాయెను.

ద్రావిడ దేశమందలి అల్లరుల నణగగొట్టి ఎప్పటియట్ల సామ్రాజ్యాధికారము నచట పాదుకొల్పి అచ్యుతరాయలు శ్రీరంగమునుండి బయలుదేరి పశ్చిమాభిముఖుడై కావేరీ తీరమున నుండు నడపుకొని ఉమ్మత్తూరు చేరి అచట అనతుడుగ నుండిన పాళెగాండ్రను చిదుకగొట్టి విప్పము గొని విజయనగరమునకు పోయి చేరెను. తరువాత స్వల్ప కాలములోపల తరువాతి సామ్రాజ్యచరిత్రను మారుదారికి త్రిప్పినట్టి చరిత్రాంశమొకటి సంభవించినది. కృష్ణదేవ రాయల కుమారుడు కాలగతి పొందెను. ఆ దుర్ఘటని నాశ్రయము చేసికొని సామ్రాజ్య భాగస్వామ్యము సంపాదించి అచ్యుతదేవరాయలతో సమానుడై ప్రభుత్వము చేయుచుండిన రామరాజుయొక్క సత్త అతని చావువలన చాల సన్నగిలినది. అటుతరువాత అచ్యుతరాయ లతని ననుకూలుడై వర్తింపవలసిన యావశ్యకము లేకపోయెను. కావున రాయలు ఆతనిని ముందువలె నాదరింపక తన బావమరదులైన సలకరాజు పుత్రులు పెద, చిన తిరుమల రాజులకు ప్రాముఖ్యము నొసగ గడగెను. కాని అధికారము సంపూర్ణముగ చేతినుండి దుసికిలిపోకముందే బిగియబట్టుటకు రామరాజునకు అల్పకాలములోపలనే మంచి యవకాశము లభించినది. క్రీ. శ. 1534లో విజాపుర పాలకుడయిన ఇస్మాయీల్ ఆదిల్ శాహు లోకాంతర గతుడాయెను. తదనంతరము అతని జ్యేష్ఠ పుత్రుడైన మల్లు ఆదిల్ శాహు సింహాసనము నధిష్ఠించెను. కాని తమ్ముడగు ఇబ్రాహీముయొక్క వైరస్యమువలన అతని యధికారము కుదుటబడక ఊటాడుచుండినది. అదియే చక్కని అదనని అచ్యుతదేవరాయలు కృష్ణదేవరాయల మరణానంతరము ఇస్మాయీల్ ఆదిల్ శాహు నాచికొని యుండిన రాయచూరు దుర్గమును మరల సాధించుటకు దండెత్తిపోయెను. ఆ వార్తను విని మల్లూ అతనిని ప్రతిఘటించుటకు నిజసైన్యముతో తరలి వచ్చి కృష్ణాతటమున తారసిల్లెను. కాని యుద్ధమున పరాజయము నందెను. తమ్ముని కుట్రలవలన తనకు ముప్పు పాటిల్లునని యాశంకించి యుద్ధమును దీర్ఘీకరింప నిష్టపడక అచ్యుతదేవరాయలకు రాయచూరు దుర్గమును స్వాధీనపరచి మల్లు సంధి చేసికొనెను. ఇట్లు విజయుడై రాజధానికి వచ్చినను సత్వరము మరల యుద్ధ యాత్రకు బయలుదేరవలసి వచ్చినది. క్రీ. శ. 1536 లో గుత్తి దుర్గాధిపతి రాయలపై తిరుగబాటు చేసెను. అతనిని శిక్షించుటకై అచ్యుతదేవరాయలు సకల సామంత, అమరనాయక సేనాధిపతులను వెంటబెట్టుకొని గుత్తి దుర్గముపై నడచెను. యుద్ధమునందు పరాజితుడై యా దుర్గాధిపతి పాదాక్రాంతుడాయెను. అచటినుండి బయలు వెడలి అచ్యుతదేవరాయలు తన యిష్టదైవమగు శ్రీ వేంకటేశ్వరుని సేవింపదలచి క్రీ. శ. 1537 లో తిరుపతికి పోయి చేరెను.

అచ్యుతదేవరాయలు ఇట్లు దండయాత్రలందును, పుణ్యక్షేత్ర సందర్శనమందును నిమగ్నుడై యుండగా విజయనగరమున రామరాజు అతనిని పదచ్యుతుని గావించుటకు ప్రబల ప్రయత్నములు చేయగడగెను. అతడు మొట్టమొదట తన పరివారమును అభివృద్ధి గావించుకొనెను. క్రీ. శ. 1535 వ సంవత్సరమునందు ఇబ్రాహీమ్ ఆదిల్ శాహు తన అన్నయైన మల్లు ఆదిల్ శాహును తొలగద్రోసి విజాపుర సింహాసనమును ఆక్రమించుకొనెను; రాజ్యాధిపత్యము వహించిన పిమ్మట వంశపారంపర్యముగ తన పూర్వులు అవలంబించుచు వచ్చిన షియా ధర్మమునకు స్వస్తి చెప్పి, సున్నీసమయమును అంగీకరించుటయేకాక షియాధర్మపరాయణులైన లాతి మహమ్మదీయులను వేనవేలను తన కొలువునుండి తొలగించి రాజ్యమునుండి తరుమగొట్టెను. వారిలో మూడువేలమందిని రామరాజు తన కొలువునందు చేర్చుకొని వారి గ్రాస వాసములకు వలసిన యేర్పాటులను చేసి యాదరించెను. మరియు రాయ సంస్థానమునందు కీలక స్థానములలో ఉద్యోగములం దున్న అచ్యుతదేవరాయల యాశ్రితుల నందరిని తీసివేసి వారికి బదులుగ తనవారిని నియమించెను. అచ్యుతదేవరాయలు విజయనగరమునకు వచ్చినవెనుక తంత్రము చేసి అతనిని పట్టుకొని కారాగారమున బంధించి తాను రాజ్యాభిషేకము చేసికొన సమకట్టెను. కాని సామ్రాజ్య ప్రముఖు లనేకులు ప్రతిఘటించుటవలన అతని యభీష్టము ఈడేరదయ్యెను. అంతట రామరాజు సామ్రాజ్యాధికారమును తన చేత నిలుపుకొనుటకు ఒక నూతన మార్గమును గనిపెట్టెను. అచ్యుతదేవరాయలకు రంగప్ప యను అన్న యొకడు కలడు. అచ్యుతదేవరాయల రాజ్యాభిషేకమునకు ముందే అతడు పరమపదించియుండినను అతని పుత్రుడైన సదాశివదేవరాయలు రామరాజు పన్నాగమునకు ఉపయుక్తుడాయెను. రామరాజు అతనిని చేరదీసి వజ్రసింహాసనమును ఆరోహించుటకు అచ్యుతదేవరాయలకంటె అతనికే హెచ్చు హక్కు గలదని ప్రకటించి యతనిని సామ్రాజ్యాధిపతిని కావించి అతనికి కార్యకర్తయై రాజకార్యమును నిర్వహింపగడగెను. కాని అతని యధికారము సామ్రాజ్యమందు సర్వత్ర చెల్లుబడి కాలేదు. ద్రావిడ రాజ్యములలోని అమరనాయకులు అనేకులు అతని యధికారము నంగీకరింపక తిరుగబాటు చేసి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కప్పము చెల్లింప నిరాకరించిరి. వారిని శిక్షించి లోబరచు కొనుటకొరకు దళములను కూర్చుకొని రామరాజు దండు వెడలవలసివచ్చెను. తన పరోక్షమునందు ఎట్టి వైపరీత్యమును జరగనీయక రాజధానిని కాపాడుటకును, అచ్యుత దేవరాయలను బంధనమునుండి విడివడి పోనీయక కాపుదల చేయుటకును విశ్వాసపాత్రుడైన భృత్యుని ఒకనిని పట్టణ పాలకునిగ నియమించి సేనను తరల్చుకొని బయలువెడలి పోయెను. అనతులైన సామంతులు సత్వరముగ లొంగక పట్టుదలతో పోట్లాడుచుండుటవలన తలచినంత శీఘ్రముగ మరలి వచ్చుటకు రామరాజునకు సాధ్యపడదాయెను. మరియు వెంట గొనిపోయిన ధన మంతయు వ్యయమై పోవుటవలన యుద్ధ సంబళిక ఖాళీపడెను. సైనికులకు జీత నాతముల నిచ్చుటకుకాని, వస్తుసామగ్రిని సేకరించుటకు కాని రొక్కము అభావ మగుటవలన యుద్ధకార్యము నిర్ణిబంధముగ సాగదాయెను. కావున రామరాజు విజయ నగరమందలి తన భృత్యునికి రాయభండారమును తెరచి వలసిన ధనమును పంపవలసినదని శ్రీముఖము పంపెను. ఆ యాజ్ఞను అనుసరించి యా భృత్యుడు రాయభండార మును తెరచి యందు నిక్షిప్తమై యుండిన రత్నరాసులను, ధనసంచయమును, అమూల్య వస్తువితానమును గాంచి దురాశా సంచలిత హృదయుడై స్వామిద్రోహమునకు పాల్పడి రామరాజునకు ధనమును పంపకపోవుటయేకాక, అచ్యుతరాయలను కారాగార విముక్తుని జేసి అతనికి మంత్రియై ప్రభుత్వము చేయగడగెను. కాని అతని అధి కారము చిరకాలము సాగలేదు. అచ్యుతరాయల మరది యైన సలకరాజు తిరుమలరాజు అతనిని చంపి యధికార మును కైవసము గావించుకొని బావగారిపేర రాజకార్య ములను నడపుటకు ఆరంభించెను.

ఈ వృత్తాంతము అంతయు రామరాజునకు తెలియ వచ్చినది. అహితసామంతులతో సంధిచేసికొని దండును మరల్చుకొని ఏకాయెకి ప్రయాణములమీద నతడు విజయ నగరమునకు బయలుదేరెను. కాని మార్గమందు అతని యనుచరులు ఒక్కరొక్కరుగ మునిగిపోవు పడవలోని ఎలు కలవలె అతనిని దిగనాడి పోవ నారంభించుటవలన ప్రయా ణము సత్వరముగ సాగినదికాదు. ఇంతలో ఇబ్రాహిం ఆదిల్ శాహు రాయిరాజ్యముపై నెత్తిపోవుటకు అదియే మంచి తరుణమని నిశ్చయించి దండుతో తరలి వచ్చి విద్యా నగరమును ముట్టడివేసెను. అతనిని తరుమగొట్టుటకు చాలి నంత బలము తన క్రింద నున్నను అచ్యుతదేవరాయ లా కార్యమును దలపెట్టలేదు. ఇబ్రాహీముతో పోరునకు గడగిన అతడు రామరాజుతో నేకము కావచ్చు ననియు, అ శ్లోకమైనపక్షమున ఏన కవజయమును కారాగార ప్రాప్తియు గలుగవచ్చు ననియు గ్రహించి అచ్యుతదేవ రాయలు మిన్నకుండెను. రామరాజునకుకూడ అట్టి సంశ యమే కలిగినది. ఆదిల్ శాహును దార్కొని యుద్ధమున కుపక్రమించిన అతడు డచ్యుతదేవరాయలనుగూడి, తన్ను విభాళించి దిశాపట్టుని గావింపవచ్చునని యెంచి రామరాజు తటస్థుడై ముట్టడి నడకను నిరీక్షించుచుండెను. ఇట్లుండగా ఆదిల్ శాహు ప్రధానియగు అసద్ ఖాన్ లారీయొక్క పతంత్రమువలన ముట్టడి కొనసాగకపోయినది. అతని ప్రోత్సాహముమీద అహ్మదునగర పాలకుడైన బుర్హాన్ నిజామ్ శాహు విజాపురముపై దండెత్తి వచ్చెను; మరియు ఆదిల్ శాహుపై రామరాజును యుద్ధము సేయ బురి కొల్పెను. ఈ కుట్రలు ఆదిల్ శాహుకు ఎరుకపడినవి. ఇక తాను అచట తామసించిన ముప్పు వాటిలగలదని గ్రహించి అతడు అచ్యుతరాయలకును, రామరాజునకును సంధి కుదిర్చి, ముట్టడిని విరమించి నిజరాజ్యమునకు మరలి పోయెను. ఈ సంధి నియమముల ప్రకారము రామరాజు పాలనక్రింద నుండు రాష్ట్రమునకు తప్ప తక్కిన సామ్రాజ్య మున కంతటికిని అచ్యుతదేవరాయలే యధిపతి; రామరాజు తన క్రింది రాష్ట్రమును స్వతంత్రుడై యేలుకొనవచ్చును, అచ్యుతదేవరాయలు ఆరాష్ట్ర విషయములలో నెట్టి జోక్యమును కలిగించుకొనరాదు. ఈ నియమములను ఇరు తెగలవారును పాటించుటవలన తరువాత దేశమునందు శాంతి కుదిరినది. తరువాత కొంతకాలమునకు అచ్యుత దేవరాయలు వ్యాధిగ్రస్తుడై క్రీ. శ. 1542 లో దేహమును త్యజించెను.

అచ్యుతదేవరాయల రాజ్య మంతయు తిరుగబాట్లతోను, దండయాత్రలతోను గడచిపోయెను. అతడు కృష్ణరాయల వలె సమరాంగణ సార్వభౌముడును కాడు; రామరాజు వలె శక్తిసామర్థ్యసంపన్నుడును కాడు. కాని కొందరు చరిత్రకారులు చెప్పునట్లు రణభీరుడుమాత్రము కాడు. అతడు తన రాజ్యకాల పూర్వార్ధమున నడపిన దండ యాత్రలు అతని రణలాలసను వెల్లడించుచున్నవి. కాని ప్రభుశక్తిన్యూనతవలన రాజ్యకార్యనిర్వహణమునందు పరాయత్తుడై మంత్రుల దుస్తంత్రములకు లోబడి యుడు ములబడెను. శత్రులయెడ గాఢావిత్యముగ క్రౌర్యము చూపినను స్వభావసిద్ధముగ అతడు దుష్టుడని యెంచదగదు. అతని దైవభక్తి యపారమైనది. పూర్వికులవలె అతడు సామ్రాజ్యమందలి పుణ్యక్షేత్రములకు దానధర్మములు కావించెను. వైష్ణవాభిమానియైనను యన్యమతములను గౌరవించి ఆదరించెను. తుళువవంశ భూపాలు రందరివలె



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అచ్యుతదేవరాయలును ఆంధ్రభాషా పోషకుడు. తెనుగు కవులకు ఆశ్రయ మిచ్చి వారిచే చక్కని కావ్యములను రచియింపించెను.

**వెంకటపతిదేవ మహారాయలు, సలకము తిరుమలరాజు (1542):** అచ్యుతదేవరాయల మరణానంతరము అతని కుమారుడు వెంకటాద్రియను వెంకటపతిదేవమహారాయలు సామ్రాజ్యాధిపతి యాయెను. వెంకటపతిదేవ నామధేయులైన విజయనగరపాలకులలో ఇతడు మొదటివాడగుటచేత చరిత్రకారు లితనిని ప్రథమ వేంకటపతిదేవరాయలని పేర్కొనెదరు. ఇతడు బాల్యావయస్కుడగుటచే ఇతని మేన మామలలో నొక్కడైన సలకరాజు చిన తిరుమలరాజు ఇతనికి ప్రాపుగా నిలిచి రాజకీయ వ్యవహారములను నిర్వహింపదొడగెను. కాని యల్పకాలముననే యితని హృదయమున ద్రోహచింత పొడమినది. వజ్రసింహాసనమును స్వయము అధిష్ఠింపవలయునను దురాశచే పీడితుడై స్వామి ద్రోహమును తలపెట్టెను. అతని చర్యలవలన రాయమాత వరదాదేవికి అతనిపై అనుమానము కలిగినది. ఎట్లయినను అతనిని పదభ్రష్టుని గావింపక పోయినచో కుమారునికి క్షేమము లేదని యెంచి యామె విజాపురపు సుల్తానగు ఇబ్రాహీం ఆదిల్ శాహుయొక్క సహాయమును అర్థించినది. ఆమె కోరికమేరకు ఆదిల్ శాహు సైన్యముతో గూడ విజయనగరముపై నెత్తివచ్చెను. రాజధానిలో కలవలము పుట్టినది. ప్రజలు తత్తరపడి చిన తిరుమలరాజును రాయపదమునకు అభిషిక్తుని గావించిరి. అంతట అతడు దళములను కూర్చుకొని బయలువెడలి ఆదిల్ శాహును యుద్ధమునందు ఓడించి తరుమగొట్టి విజయము చేకొని మరల పట్టణమును బ్రవేశించెను. తరువాత చిన తిరుమల రాజుయొక్క అధికారము దౌర్జన్యముగ పరిణమించినది. రాజ్యకాంక్షచేత అతడు రాక్షసకృత్యములు చేయుట కారంభించెను. మొట్టమొదట వెంకటాద్రిరాయలను మేనల్లుడనియైన బంధుత్వమును పరిగణింపక హంతకులచే కుత్తుకనులిమించి చంపించెను. తరువాత రాజధానియం దుండిన ముఖ్యసామంతులను, నాయకులను ఎద్దియేని నెపము కల్పించి వధింపగడగెను. అతని క్రౌర్యమునకు ఓర్వజాలక ప్రముఖు లనేకులు రాజధానినుండి పారిపోయిరి. జను లెల్లరు అతనిని రోసిరి. చిన తిరుమలరాజుపోకడ లన్నియు రామరాజునకు తెలియవచ్చినవి. రాయపదమును అధిష్ఠించుటకు అతనికి తనకంటె అతిశయమైన హక్కులేదు. కావున సామ్రాజ్యాధికారమును నాదికొనుటకు యుక్తసమయము వచ్చినదని గ్రహించి తత్కార్యసాధనకు దగుప్రయత్నము లాతడు చేయగడగెను; చినతిరుమలరాజును పదభ్రష్టుని చేయుటకు కేవలము దండుబలముపై నాధారపడుట మేలు కాదని తలచెను; కావున సామ్రాజ్యపీఠము నెక్కుటకు హక్కుగలవాడగు సదాశివరాయలు గుత్తిదుర్గమున బందీకృతుడై యుండగా అతని చెర వదల్చి అతని సామ్రాజ్యాధిపత్యమును ప్రకటించి, యాతనిని ముం దుంచుకొని ప్రచండసైన్యముతోకూడ విజయనగరముపై నడచెను. సలకరాజు చిన తిరుమలరాజునకు ఆ వృత్తాంత మెరుకపడినది. ఒంటరిగ రామరాజు నెదుర్చుటకు అతనికి శక్తి లేదు. కావున నతడా యాపదను గడవబెట్టుటకు ఇబ్రాహీమ్ ఆదిల్ శాహు సమర్థుడని యెంచి అతనిని తోడు పిలిచెను. ఆదిల్ శాహు తిరుమలరాజునకు సాయపడుటకు నిజబలముతో కదలి అక్షణమే విజయనగరమువైపు నడచెను. కాని అతని గర్వాతిశయమువలన రాయరాజ్య ప్రజలకు అతనిపై నీసడింపును, ద్వేషమును గల్గినవి. కావున అతడు చిన తిరుమలరాజునకు ఎట్టి సహాయమును చేయజాలక వెనుకకు తిరిగి పోవలసి వచ్చెను. ఈ లోపల రామరాజు పెనుగొండ, గుత్తి, గండికోట మున్నగు ప్రబల గిరి దుర్గములను సాధించి తదాశ్రయ భూములను కైవసము కావించుకొనెను. అతని సంరంభమును అపు తలంపుతో సలకరాజు చినతిరుమలరాజు రాణువతో బయలువెడలి, అతని నెదుర్కొని కోమలి, శేతంచెర్ల, జూటూరు, ఎదకల్లు, ఆదవాని మున్నగు స్థలములందు ఘోరముగ పోరెను. అన్ని రణక్షేత్రములందును చిన తిరుమలరాజునకు పరాజయము కలుగుటవలన అతని పక్షము సత్వహీనము కాజొచ్చెను. కాని అతడు డిల్లవడి ధైర్యమును కోలుపోలేదు. మరల సైన్యమును గూర్చుకొని తుంగభద్ర దరిని విడిసియుండగా రామరాజు అతనిపైబడి యోడించి చంపెను. ఇట్లు సలకరాజు చినతిరుమలరాజు నిహతుడుకాగా రామరాజు విజయుడై విజయనగరమును ప్రవేశించి అచట సదాశివదేవరాయలకు పట్టాభిషేకము గావించెను.

**సదాశివదేవ మహారాయలు** (క్రీ. శ. 1543 — క్రీ. శ. 1576): రామరాజు తాను పట్టిన పద్దును ఎట్లో సాధించి సదాశివరాయలను చిట్టచివరకు వజ్రసింహాసనము నెక్కించెను. ఈ సదాశివరాయలు ఉత్త అంబేద. నామకార్థమతడు మహారాయలైనను సామ్రాజ్యముపై సర్వాధికారములకును రామరాజే కర్త యయ్యెను. కాని యతనికి అంతటితో తృప్తి కలుగలేదు. కావున కొంతకాలము అట్లు జరగిన పిమ్మట నధికారముతోపాటు రాయనామబిరుదావళులనుగూడ స్వీకరించి రాయలతో సమానస్కంధుడై ప్రభుత్వముచేయ గడగెను. సదాశివరాయల కాలమున సామ్రాజ్యపరిపాలనయందు కొన్ని మార్పులు కల్గినవి.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వానిని మొదట పేర్కొనుట యుక్తము. రాయసామ్రాజ్యమును స్థాపించినప్పటినుండియు దేశ పరిపాలనయందేమి, యుద్ధకార్యములందేమి బ్రాహ్మణాధికారులు ప్రముఖులై రాయల కార్య ఖడ్గములకు కర్తలైరి. కృష్ణదేవరాయల నిర్యాణానంతరము రామరాజు సామ్రాజ్యాధిపత్యమును ఆక్రమింప తలపెట్టినప్పుడు బ్రాహ్మణ దండనాయకులును దుర్గాధ్యక్షులును ప్రతిఘటించి అతని యత్నమును కొనసాగనీయక భగ్నము కావించిరి. బ్రాహ్మణులు అధికారమునందున్నంత కాలమును తన కోర్కె ఈడేరజాలదని గ్రహించి, అచ్యుతదేవరాయలతోకూడ భాగస్వామియై సామ్రాజ్యమును పాలించుచుండిన కాలమునందు అవకాశము కలిగినపుడెల్ల వారిని తొలగించి వారి స్థానమున తన పక్షమువారైన క్షత్రియులను, కమ్మ వెలమ నాయకులను రాజకీయోద్యోగములందు నిల్పుచు వచ్చెను. క్రమక్రమముగ బ్రాహ్మణాధికారుల సంఖ్య సన్నగిలి తుదకు సదాశివదేవరాయల కాలమున సంపూర్ణముగ సమసిపోయినది. ఆరవీటి వంశజులును, తత్సంబంధులునగు తెలుగుచోళ కుటుంబములవారును ప్రబలిరి. వారితోపాటు ఆయుధోపజీవులైన వెలుగోటి, పెమ్మసాని, రావెల, కటికము మున్నగు చతుర్థకులజ ప్రభువులును అభివృద్ధినంది సామ్రాజ్యమునందు ఎల్లెడల వ్యాపించిరి. మరియును రామరాజు తన పక్షమును బలపరచుకొనుటకు మహమ్మదీయులను రాణువయందు త్రవ్వితండములుగ చేర్చుకొనెను. ఇది రామరాజు నూతనముగ తెచ్చిపెట్టిన మార్పుగా నెంచుటకు వీలులేదు. మొదటి దేవరాయల హయామునుండియు మహమ్మదీయులకు రాయరాణువయందు ప్రవేశము గలదు. కాని వారి సంఖ్య యల్పిష్టము. రామరాజు యుక్తాయుక్తములను వివేకింపక తురకలను వేనవేలుగ సైన్యమున చేర్చుకొనుటయేకాక, వారిలో ప్రముఖులకు గొప్ప యుద్యోగముల నిచ్చి, సామ్రాజ్యాంతరంగ మర్మములను సైతము కనుగొనుట కవకాశము కలిగించి, వారిని బాధ్యతాయత్త కార్యములందు నియోగించి పనిగొనుటకు ఆరంభించెను. క్రమక్రమముగ రాయసంస్థాన వ్యవహారములందు మహమ్మదీయుల పలుకుబడి హెచ్చెను. దీనితోపాటు రామరాజునకు దక్కను మహమ్మదీయ రాజ్యములతో తగులాట మతిశయించినది. మహమ్మదీయ వ్యాప్తిని ప్రతిష్టంభించి హిందూ స్వాతంత్ర్య ధర్మ పునరుద్ధరణకొరకే రాయ సంస్థాన ముత్పత్తి యగుటవలన ఆద్యమునుండియు విద్యానగర ప్రభువులకు తురకల సంపర్కము తప్పినది కాదు. కాని వారెన్నడును తురకలతో చెలిమిచేసి వారి రాజకీయ వ్యవహారములలో జోక్యము కలిగించుకొనలేదు. కృష్ణదేవరాయల కూతును పెండ్లాడి విద్యానగరమును ప్రవేశించుటకు పూర్వము రామరాజు గోలకొండ కుత్బ్‌శాహు కొలువునందు ఉండిన కారణమున అతనికి దక్కను మహమ్మదీయ రాజ్యవ్యవహారములలో నభిరుచి పుట్టెను. మరియు కృష్ణదేవరాయల మరణానంతరము ఆదిల్‌శాహు ప్రబలుడై రాయరాష్ట్రమును కొంత ఆక్రమించుకొనుటయేకాక యెడప దడప విద్యానగరముపై ఎత్తివచ్చుటకు ఆరంభించెను. ఆతని యాటోపము నడిపి అతనిచే నాక్రమింపబడియుండిన రాయరాష్ట్రమును కైవసము గావించుకొనుటకై రామరాజు అహ్మదు నగర నిజామమలకతో మైత్రి నెరపి తన యభీష్టమును నెరవేర్చుకొనెను. అది మొదలు రామరాజు నిరంతరము ఒండొరులతో గలహించి పోరాడుచుండిన దక్కను పాదుశాహులలో గొందరితో సఖ్యము చేసికొని, మరికొందరితో యుద్ధములు చేయుచు, తుదకు వారికెల్ల మేటి అయ్యెను. రామరాజు యొక్క అభ్యుదయము కనుకుట్టగా తుదకు తురకరాజులెల్ల స్వభావసిద్ధమైన పరస్పర వైరమును తాత్కాలికముగ విస్మరించి యేకమై రక్షసతంగడి సంగ్రామరంగమున అతనిని వంచించి కూల్చిరి.

**దక్షిణ జైత్రయాత్ర:** సదాశివరాయలకు పట్టాభిషేక మహోత్సవము జరపినవెంటనే రామరాజు ద్రావిడరాజ్యములపై నొక దండయాత్రను పంపవలసివచ్చెను. మొదటినుండియు రామరాజునకు లొంగక ప్రతిఘటించుచుండిన దాక్షిణాత్య సామంతులును, నాయకులును అతని అధికారము సామ్రాజ్య పీఠముపై పాదుకొనుటకు ఒప్పుకొనక అతనిమీద తిరుగబాటు చేసిరి. ఇంతియకాక తిరువాన్కూరు పాలకుడు ప్రబలుడై తిరునెల్వేలి మండలాంతర్గతములగు రాయ సామ్రాజ్య సీమలను కొన్నిటిని ఆక్రమించెను. మరియు మధుర రాజ్యములోని తీరభూములందు వసించుచుండు పరవలను దమ మతమున గల్పుకొని రోమన్ క్యాథలిక్ ఫాదరీలు వారిపై పోర్చుగీసు రాజ్యాధికారమును నెలకొలుపుటకు ఉద్యమించి తీవ్ర ప్రయత్నములు చేయుచుండిరి. 'మార్టిన్ అఫోన్సో డ సూజా' అను పోర్చుగీసు గోవా గవర్నరు ఒకడు నావలను కూర్చుకొని తూర్పు సముద్ర తీరమునందలి హిందూ దేవస్థానములను దోచుకొనుటకు ప్రయత్నములు చేయుచుండెను. కావున రామరాజు నిజజ్ఞాతులయిన అవుకు చినతిమ్మ, విట్ఠలరాజులను గొప్ప సేనతోకూడ అనకులైన సామంతులను అణచివేసి రాయల అధికారమును సుప్రతిష్ఠితము గావింప నంపెను. ఈ దండయాత్ర చరిత్రను దోనేరు కోనేరునాథుడు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/




http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అను కవి తాను విరచించిన ద్విపద బాలభాగవతమునందు సంగ్రహముగ వర్ణించియున్నాడు. చిన తిమ్మరాజును, విట్ఠలరాజును దండు నడపుకొనిపోయి మొట్టమొదట చంద్రగిరి దుర్గమునకు ముట్టడి వేసి దానిని స్వాధీనము చేసికొనిరి. తరువాత తొండమండలమును ప్రవేశించి అచటి దుర్గములను సాధించి చోళమండలము జొచ్చిరి. అచట శ్రీరంగనాథునికి ద్రోహము తలపెట్టిన అఖల శత్రురాజ మృగశ్రేణిని వెంటనంటి వేటాడి యాదేవుని సిరి నిల్పి తూర్పు మొగముగ సముద్రతీరమందలి నాగూరుపై నడచి ఆ పట్టణమును కొల్లగొట్టి అందు ఉపలబ్ధమైన నవ మౌక్తికములను అర్థులకు పంచిపెట్టిరి; తరువాత భోనగిరి దుర్గమును ముట్టడించి కైవసము గావించుకొనిరి. అంతట తొండ, చోళ మండలముల విజయము సమాప్తమైనది. పిమ్మట వారు కావేరిని దాటి తన్నరసునాటిపై దండువెట్టి అచటి మహీపతులచే కప్పము గొనిరి. పాండ్య వంశజులగు రాజులు తెంకాశి రాజధానిగ తిరునెల్వేలి మండలమును పాలించుచుండిరి. అప్పుడు తూర్పు తిరువాన్కూరు దేశమునందు ఐదు చిన్న స్వతంత్ర రాజ్యము లుండినవి. ఈ రాజ్య పాలకులకు తిరువడు లను బిరుదుపేరు చెల్లుచు వచ్చెను. సమష్టిని వీ రందరిని కలిపి పంచ తిరువడులని చెప్పుటయు కలదు. పంచ తిరువడులలో నొక్కడైన తిరువాన్కూరు ప్రభువు ప్రబలుడై తక్కినవారిని తన యధికారము క్రిందికి తెచ్చుకొనుటకు ప్రయత్నము చేయుటయేకాక తూత్తుక్కుడి ప్రాంతమును పాలించుచుండిన బెట్టుపెరుమాళ్లు అను రాజుతో సఖ్యము చేసికొని తెంకాశిపై నెత్తిపోయి అచట పాండ్యరాజును ఓడించి, పారగోలి యతని పుడమిని ఆక్రమించుకొనెను. అతడు చిన తిమ్మ, విట్ఠలరాజులను ఆశ్రయించగా వారు దండును కదల్చుకొని తిరువాన్కూరు రాజ్యముపై నడచిరి. వారి మార్గమును అరికట్టిన బెట్టు పెరుమాళ్ళు యుద్ధమున పరాజితుడై కప్పము కట్టి సమాధానపడెను. పిమ్మట వారు త మ్మెదిర్చిన పంచ తిరువడులను భంగపరచి వారి సేనలను పంచబంగాళము గావించిరి; అంతట తిరువాన్కూరు తిరువడి శరణు వేడగా నతనిని యథాపూర్వము నిజరాజ్యమున పునఃప్రతిష్ఠితుని జేసి తోవాళఘట్ట మార్గమున తిరువాన్కూరు రాజ్యమును ప్రవేశించి అనంతశయనమునకు పోయి అనంతపద్మనాభుని సేవించిరి ; అచటినుండి కన్యాకుమారికి పోయి అచట దక్షిణాశాజయస్తంభమును నిలిపి రాజశార్దూలగణ కంఠ నవరక్తసిక్తమైన అడిదమును అంభోధిలో కడిగి వెనుదిరిగిరి.

ఇట్లు రామరాజు పంపిన దక్షిణ దండయాత్ర విజయవంతముగ కొనసాగినది. రాయల యధికారము దక్షిణదేశమం దెల్లెడలను ఎప్పటివలెనే చెల్లుబడి కాసాగినది. అంతట రామరాజు పై దండయాత్రయందు నిర్వక్ర పరాక్రమమును చూపి శత్రు మర్దనము కావించిన విట్ఠలరాజు శౌర్యమును మెచ్చి అతనిని ద్రావిడ, కేరళ రాజ్యములపై రాజప్రతినిధిగ నియమించెను. అతడు క్రీ. శ. 1558 పర్యంతము అధికారము వహించి రాయలపేర దక్షిణ రాజ్యములను పాలించెను. అతని కాలమున క్షుద్రోపద్రవములు లేక ద్రావిడ, కేరళ దేశములలో శాంతి భద్రతలు నెలకొనెను.

రామరాజు - పోర్చుగీసులు : అఫోన్ సో డ సూజా గోవా పాలకుడుగ నున్నంతకాలమును పోర్చుగీసులు చేసిన దుండగములు ఇంతకు ముందే వివరింపబడినవి. చిన తిమ్మ, విట్ఠలరాజుల జైత్రయాత్రలవలన వారి యాటోపము కొంత తగ్గినది. ఇంతలోపల డ సూజా పరిపాలన సమాప్తి చెందెను. అతని తరువాత గోవా పాలకుడుగ నియుక్తుడై వచ్చిన జాన్ డ కాస్ట్రో అను నతడు శాంత స్వభావుడు. అతడు విద్యానగర రాయలతోటి వైరము శ్రేయస్కరము కాదని నిశ్చయించి సంధిచేసికొని వర్తకమును అభివృద్ధి పరచు ఏర్పాటులను కావించుకొనెను.

రామరాజు - మహమ్మదీయ ప్రభువులు : రామరాజు దక్కను మహమ్మదీయ రాజ్యములతో గాఢసంబంధములను గల్గించుకొని యారాజ్యాధిపతులతో తరచుగ యుద్ధములు చేయుచుండెనని ఇంతకు ముందు తెలిసియున్నది. ఈ సందర్భమున ముఖ్యముగ ఎన్నదగిన మహమ్మదీయ రాజ్యములు నాలుగు : (1) విజాపురము, (2) అహ్మద్ నగరము, (3) బీదరు, (4) గోలకొండ.

(1) విజాపురము : రామరాజు కాలమున విజాపుర సంస్థానమును ఇరువురు సుల్తానులు ఒకరి యనంతరము ఇంకొకరు పాలించిరి. ఇబ్రాహీమ్ ఆదిల్ శాహు క్రీ. శ. 1557 వరకును ప్రభుత్వముచేసి మృతినందెను. తరువాత అతని పుత్రుడైన అలీ ఆదిల్ శాహు సింహాసనము నెక్కెను. వీ రిరువురిలో అలీ ఆదిల్ శాహు రాక్షసి-తంగడి రణక్షేత్రమునందు తప్ప మరియెప్పుడును రామరాజుతో యుద్ధము చేయలేదు. ఇబ్రాహీమ్ ఆదిల్ శాహు రామరాజునకు మొట్టమొదట శత్రువు. అతడు విజయనగరముపై నప్పుడప్పుడు దండెత్తివచ్చుచుండువాడు. కాని కడపటి రోజులలో రాజకీయ వ్యవహారముల యొత్తిడివలన అతనికి రామరాజుయొక్క సహాయము ఆవశ్యక మగుటవలన అతని చెలిమిని కోరి సంధిచేసికొనవలసి వచ్చెను.

సదాశివదేవ రాయల పట్టాభిషేక కాలమున విజాపుర, అహ్మద్ నగర సుల్తానులకు ఒండొరులతో యుద్ధము నడచు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చుండినది; తరువాత సమాధానపడి సంధి చేసికొనిరి. ఈసంధి షరతులమేరకు అహ్మదు నగరపు సుల్తాను బీదరురాజ్యమును జయించి స్వాధీనపరచుకొనుటకు విజాపురపు సుల్తాను సమ్మతించెను. దీనికి ప్రత్యామ్నాయముగ విజాపురపు సుల్తాను విజయనగర రాజ్యమును జయించి వశపరచుకొనుటకు అహ్మద్ నగరపు సుల్తాను ఒప్పుకొనెను. ఈ యొడంబడిక చొప్పున ఇబ్రాహీమ్ ఆదిల్ శాహు విద్యానగర సామ్రాజ్యముపై దండువెడలెను. ఈ దండయాత్ర విజయవంతముగ కొనసాగె ననియు, ఇబ్రాహీమ్ ఆదిల్ శాహు విజయనగర రాష్ట్రమును జయించి తన రాజ్య విస్తీర్ణమును ఘనముగ పెంపొందించె ననియు మహమ్మదీయ చరిత్రకారులు వ్రాసియున్నారు. కాని ఇది సంశయ గ్రస్తము; ఏలనగా ఈ యుద్ధానంతరము కూడ విద్యానగర, విజాపురరాజ్యములయొక్క సరిహద్దులు మారక ఎప్పటి వలెనే యుండినవి. ఇంతియ కాక రామరాజు నానతి చొప్పున కెళది సదాశివనాయకుడు విజయనగర రాజ్యముపై నెత్తి వచ్చిన విజాపురపు సర్దారుడైన శాఇయ ఖానును ఓడించి పారదోలెనని కెళదినృపవిజయము అను కన్నడ చరిత్ర గ్రంథమునందు చెప్పియున్నది. కావున ఇబ్రాహీమ్ ఆదిల్ శాహు పంపిన దండయాత్ర మహమ్మదీయ చరిత్రకారులు చెప్పినట్లు విజయవంతమై సాగలేదని తోచుచున్నది.

(2) అహ్మద్ నగరము : కెళది నృపవిజయములో సదాశివనాయకుడు అహ్మద్ నగరము పాదుశాహు అయిన సుల్తాన్ ఖైరీ నిజామ్ శాహుయొక్క సైన్యములను ఓడించి, రెండు పర్యాయములు జయము గాంచినట్లు చెప్పియున్నది: కల్యాణి కలుబరిగె కోటలను రామరాజు సాధింప దలపెట్టుటవలన మొదటి తడవ యుద్ధము పొసగెనట. రాయరాణువను నడపుకొని కెళది సదాశివనాయకుడు పోవుచుండగా జంబుఖండి సమీపమున నిజామ్ శాహి సైన్యము మార్గమును అరికట్టెను. ఇరువాగులకును యుద్ధము జరగెను. సదాశివనాయకుని బలపరాక్రమాతిశయము వలన రాయరాణువకే జయము చేకూరినది.

ఈ దండయాత్ర చరిత్ర మహమ్మదీయ చరిత్రకారులచే విపులముగ వర్ణింపబడి యున్నది. రామరాజు కెళదినృప విజయమున చెప్పినట్లు కల్యాణి కలుబరిగెలను జయింప దలపెట్టినది వాస్తవమే. కాని అది స్వార్థము నపేక్షించి కాదు, తన సాయమును వేడిన విజాపురపు సుల్తాను కొరకు. ఆద్యమున కల్యాణి కలుబరిగెలు రెండును బీదరు సంస్థానమునకు చెల్లుచుండినవి. క్రీ. శ. 1548వ సంవత్సరమున అహ్మద్ నగర పాలకుడైన బుర్హాన్ నిజామ్ శాహు కల్యాణి కోటను జయించి స్వాధీనము చేసికొను నుద్దేశముతో నెత్తివచ్చి దానిచుట్టు ముట్టడివేసెను. బీదరు ప్రభువైన అలీ బరీదుకు అతని మార్కొని కోటను రక్షించుకొను శక్తి లేకపోవుటవలన అతడు విజాపురపు సుల్తానగు ఇబ్రాహీమ్ ఆదిల్ శాహును ఆశ్రయించి నిజామ్ శాహును ఓడించి తరుమగొట్టుటకు తనకు తోడ్పడిన యెడల సదరు కోటను అతనికే యిచ్చివేయుదు నని వాగ్దత్తము చేసెను. ఇబ్రాహీమ్ ఆదిల్ శాహునకు తాను ఒంటరిగ నిజామ్ శాహును ఢీకొని యోడింపజాలుదు నను ధైర్యము లేకపోవుటవలన రామరాజుతో సఖ్యము చేసికొని అతనితో కూడ కల్యాణిపై నడచి నిజామును పారదోలి కోటను కైవసము కావించుకొనెను. అదిమొదలుకొని క్రీ. శ. 1553 వరకును కల్యాణి ఆదిల్ శాహు ఏలుబడిక్రింద నుండినది.

బుర్హాన్ నిజాము శాహు క్రీ. శ. 1553 సంవత్సరమున పరలోకగతుడయ్యెను. అనంతరము అహ్మద్ నగర సింహాసనమును అధిష్ఠించిన అతని జ్యేష్ఠపుత్రుడు హుసేన్ నిజాము శాహు తండ్రి పూనికను నెరవేర్చుట కుద్యమించి గోలకొండ రాజ్యాధిపతియైన ఇబ్రాహీమ్ కుత్బ్ శాహునకు చెలిమి చేసి యతడు తోడునడవగా క్రీ.శ. 1557లో విజాపుర రాజ్యముపై నెత్తివచ్చి కలుబరిగెకోటను ముట్టడించెను. ఇబ్రాహీమ్ ఆదిల్ శాహు మరల రామరాజు సహాయము కోరెను. కాని రామరాజు యుద్ధమునకు గడగి జననాశనము నొనర్చుటకు ఇష్టపడలేదు. కావున తనయొ[illegible] ఇబ్రాహీమ్ కుత్బ్ శాహు సౌహార్దము కలవాడగుటవలన అతనిపేర నొక ఉత్తరము వ్రాసి పంపి, యతని మూలమున యుద్ధోద్యుక్తులైన రాజుల నందరిని కృష్ణా భీమరథీ సంగమస్థానమున సమావేశము చేసి యొక యొడంబడికను కుదిర్చెను. దాని ప్రకారము ఆ నలుగురు రాజులలో నెవ్వడైన మరియొకనిపై నక్రమముగ కయ్యమునకు కాలు దువ్విన తక్కినవారు అందరును ఏకమై ఆ యక్రమ ప్రవర్తకునితో యుద్ధముచేయవలయునను నియమమును ఏర్పరచుకొనిరి. పిమ్మట అల్పకాలముననే క్రీ. శ. 1557లో ఇబ్రాహీమ్ ఆదిల్ శాహు మృతిచెందగా అతని కుమారుడగు అలీ ఆదిల్ శాహు రాజ్యాధిపతి యాయెను.

తండ్రి మరణకాలమప్పుడు అలీ ఆదిల్ శాహు పసివాడు. రాజకార్యములను సామర్థ్యముతో సాగించుటకు అతని కప్పటి కింకను నిర్వాహము చాలదు. అదియే మంచి యదనుగ నెంచి పూర్వము నలుగురు రాజులతో జేసికొనిన నియమమును సరకుచేయక హుసేన్ నిజామ్ శాహు విజాపురముపై దండువెడలి వచ్చెను. అతనిని ఎదిర్చి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



యుద్ధము చేసి తన రాజ్యమును సంరక్షించుకొనగల శక్తి అలీ అదిల్ శాహుకు లేదు. కావున నతడు విజయనగరమున రామరాజు కడకు పారిపోయి వచ్చి శరణు వేడెను. రామరాజు అతనియెడ కనికరము చూపి పుత్ర వాత్సల్యముతో నాదరించి అభయము నొసగి యతని పక్షమున హుసేన్ నిజామ్ శాహుతో పోరాడ నిశ్చయించి సైన్యమును వెంట బెట్టుకొని యుద్ధమునకు బయలుదేరెను. మరియు ఇబ్రాహీమ్ కుతుబ్ శాహు ముందు పేర్కొనిన నలుగురు రాజుల యొడంబడికకు సమ్మతించి యుండినందున నితనిని ఆ యొడంబడిక నియమముల ప్రకారము నియమోల్లంఘనము చేసిన హుసేన్ నిజామ్ శాహుపై యుద్ధము నడపుటకు దండుతో కదలి వచ్చి తమ్ము గలిసికొనవలయునని సందేశము నంపెను. ఇబ్రాహీము కుతుబ్ శాహునకు హుసేన్ నిజామ్ శాహుపై అభిమానము కలదు; కావున ఆదిల్ శాహు, రామరాజులతో నేకీభవించి హుసేన్ శాహుపై కత్తి కట్టుటకు ఇష్టము లేదు. కాని వారికి వ్యతిరేకముగ వర్తించుటకు ధైర్యము లేదు. కావున లోలోపల నాతనియెడ సానుభూతి యుండినను ఇబ్రాహీము కుతుబ్ శాహు విధిలేక ఆదిల్ శాహు రామరాజులతో గూడి యతనిపై దండు వెడలవలసివచ్చినది.

హుసేన్ నిజామ్ శాహు తనకు ఈ యుద్ధమున జయము కలుగజాలదని గ్రహించి కల్యాణికోటయందు ఒక శాణ్యము నుంచి తక్కిన దళములను మరల్చుకొని నిజ రాజ్యమునకు పోయి చేరెను. మిత్రవర్గమునకు చెందిన ముగ్గురు రాజుల సేనలును యుద్ధకార్యమునకు ఉపక్రమించినవి. కొన్ని దినములు ముట్టడిసాగిన పిమ్మట వారికి కల్యాణి స్వాధీనపడినది. తరువాత వారి బలములు ముందునకు పోయి నిజామ్ శాహు రాజ్యమును ప్రవేశించి యతని రాజధానియైన అహ్మద్ నగరము చుట్టును ముట్టడించెను. రాజధానియందు ఉండుట శ్రేయస్కరము కాదని యెంచి దాని సంరక్షణ కార్యమును మంత్రులకును, సేనాధిపతులకును అప్పగించి హుసేన్ నిజామ్ శాహు గోదావరీ తటమునందుండు పైఠాను నగరమునకు పోయి చేరెను. మిత్ర వర్గమువారు అహ్మద్ నగరమునకు రాకపోకలను సాగనీయక అరికట్టిరి. ఇబ్రాహీమ్ కుతుబ్ శాహు మిత్ర వర్గమునకు ద్రోహము తలపెట్టి రహస్యముగ పురజనులకు సాహాయ్యము చేయుచు వచ్చినను, వారికి అచట జీవనము దుర్భరమయ్యెను. రేపో మాపో కోట పతనము తప్పనిసరి యని తెల్లమాయెను. ఇబ్రాహీమ్ కుతుబ్ శాహు ద్రోహము రామరాజునకు ఎరుకపడినది. ఇక అచట నుండిన తనకు ముప్పు వాటిల్లునని యెంచి కుతుబ్ శాహు రాత్రికి రాత్రే తన ఫౌజును లేవదీసికొని యెకాయెకి కూచిచేసి తన రాజ్యమునకు పోయి చేరెను.

ఇబ్రాహీమ్ కుతుబ్ శాహు వైదొలగిపోవుట వలన యుద్ధ పరిస్థితులు మారలేదు. అహ్మద్ నగరము ముట్టడి ఇంకను కఠినతర మయినది. మరియు రామరాజు తన సైన్యము నుండి కొంత భాగమును వేర్పరచి కెళది సదాశివనాయకునకు అప్పగించి నిజాం శాహి రాజ్యమును కొల్లగొట్టి దేశమునందు అలజడి పుట్టింపుమని ఆజ్ఞాపించి పంపెను. రామరాజు ఆజ్ఞప్రకారము సదాశివనాయకుడు అహ్మద్ నగర రాష్ట్రమును చూరగొనుచుండగా తత్సమీపమున నుండు జంబుఖండి (ఇప్పటి జామ్‌ఖేడ్) అను గ్రామము చెంత నిజాం శాహి ఫౌజులతో ఘర్షణ కలిగి ఘోర యుద్ధము నడచినది. ఇదియే కెళదినృపవిజయమున వర్ణింపబడిన జంబుఖండి సమరము. ఈ సమరమున సదాశివ నాయకునికే విజయము కలిగినట్లు కెళదినృపవిజయము నందు చెప్పియున్నను, బుర్హాన్-ఇ-మ'అసిర్ అను అహ్మదు నగర సంస్థాన చరిత్రమున నిజామ్ శాహు వారికే విజయము చేకూరినట్లు వ్రాసి యున్నది. కాని బుర్హాన్-ఇ-మ'అసిర్ సాక్ష్యము విశ్వాసపాత్రము గాదు; ఏలన ఇతర మహమ్మదీయ చరిత్రకారులు ఎవ్వరును నిజామ్ శాహువారి కీదండయాత్ర సందర్భమున ఎచ్చటను విజయము కలిగినట్లు వ్రాయలేదు. ఇంతటి విజయమును నిజాం శాహి లష్కరు పొందియుండిన హుసేన్ నిజాం శాహు అంత సత్వరముగ రామరాజును వేడుకొని సంధి చేసికొని యుండడు. కావున కెళదినృప విజయమున చెప్పినట్లు సదాశివనాయకునికే జయమబ్బెనని యెంచుట సమంజసము.

జంబుఖండియందు ఒక్కచోటనే కాదు నిజాం శాహి వారికి రాయరాణువతో ఘర్షణ కలిగినది. రామరాజు కడపటి తమ్ముడు వెంకటాద్రి మరియొక సేనతో బయలు వెడలి, గోదావరిని దాటి తన్ను ఎదిర్చిన హుసేను నిజామ్ శాహును పరాభూతుని గావించి దౌలతాబాదు పర్యంతమును తోలి కొప్పరలాడి తత్పరిసర ప్రదేశములను నిర్ధూమధామము గావించి కోటను ముట్టడించెను. దౌలతాబాదు దుర్గము బలిష్ఠమైనదే. కాని సంరక్షణకు తగిన పరికరములు లేకపోవుటవలననో, రాయరాణువయొక్క బలపరాక్రమములవలననో అది యల్పకాలముననే పట్టుపడినది. ఈ పరాజయములు దొంతరలై ఒకదానిమీద మరియొకటి కలుగుటవలన హుసేన్ నిజామ్ శాహుకు ధైర్యము చెడినది. అటుపై యుద్ధమును ఇంకను సాగింప తలపెట్టుటవలన ప్రయోజనము కలుగదని నిశ్చయించి

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అతడు కల్యాణి దుర్గమును ఆదిల్ శాహునకు ఇచ్చివేయుటకు ఒప్పుకొని రామరాజుతో సంధి గావించుకొనెను.

బీదరు : రామరాజుయొక్క బీదరు దండయాత్ర కెళదినృప విజయమందును, శివతత్వ రత్నాకరమునందును వర్ణింపబడినది. ఒక్క కెళది సదాశివనాయకుని మహత్త్వమువలననే యుద్ధయాత్ర జయపరంపరతో కొనసాగినట్లు ఈ గ్రంథములందు చెప్పబడియున్నను, వాస్తవముగ అతనికి అంతటి ప్రాధాన్యము లేదు. వెంకటాద్రి నాయకత్వముక్రింద ఈ దండయాత్ర నడచినది. కార్య సహాయులైన అమరనాయకులలో సదాశివనాయకుడు ఒక్కడు. తొరగంటి నరసరాజు మరియొకడు. ఇటువంటివారు మరి యెక్కందరో.

రామరాజు బీదరు బరీదు శాహుపై దండెత్తిపోవుటకు కారణమేమో, అది ఎప్పుడు నడచెనో నిశ్చయముగ తెలియదు. నిజాం శాహుతోడను, తరువాత కుతుబ్ శాహుతోడను రామరాజు యుద్ధమునకు పోయినప్పుడు బరీదు శాహు అతనికి సహాయుడై నడచినట్లు మహమ్మదీయ చరిత్రలందు కలదు. కావున రామరాజు పై దండయాత్రలకు పూర్వమే బరీదును ఓడించి వశపరచుకొనినట్లు తోచుచున్నది.

విజయనగరమువారు దండెత్తి వచ్చుచున్నారని తెలియవచ్చినంతనే కోపోద్దీపితుడై బరీదు శాహు బలములను గూర్చుకొని వారి నెదుర్చుటకు ముందుకు సాగి వచ్చెను. ఉభయ బలములును ఒండొంటిని తారసిల్లిన పిమ్మట భీకర సంగ్రామము సంప్రాప్తమాయెను. బరీదు శాహు గజారూఢుడై స్వయముగ ఫౌజులను నడపుకొనుచు యుద్ధము చేయ గడగెను; కాని యోటువడి మంత్రులతోకూడ పట్టుపడెను. ఈ పరాజయమునకు ఫలితముగ బరీదు శాహు రామరాజునకు వశంవదుడై అతనికి యుద్ధములందు తోడ్పడవలసినవాడాయెను.

గోలకొండ : రామరాజునకు గోలకొండతో తక్కిన మహమ్మదీయ సంస్థానము లన్నిటికంటెను గాఢతరమైన సంబంధము కలదు. మొట్టమొదట అతడు గోలకొండ రాజ్యస్థాపకుడైన కులీ కుతుబ్ శాహు కొలువున నుండెనని ఇంతకు ముందు చెప్పబడినది. కులీ కుతుబ్ శాహు మరణానంతరము అతని కుమారుడు జంషీదు రాజ్యాధిపత్యము వహించిన పిమ్మట తన పదమును సుస్థిరము గావించుకొనుటకు తమ్ముడైన ఇబ్రాహీం ఖానును చంప బ్రయత్నము చేయగా నతడు తప్పించుకొని విద్యానగరమునకు పారిపోయి రామరాజును ఆశ్రయించెను. రామరాజు అతని కభయ మిచ్చి యతని యంతస్తుకు తగినట్లు గౌరవించి సంరక్షించెను. జంషీదు గతించిన వెనుక ఇబ్రాహీము రాజ్యాధిపత్యము వహించి రామరాజుతో కొంతకాలము మైత్రి గలిగి వర్తించుచుండెను. తరువాత వారిరువురి మధ్య వైరము పొడమినది. దీనికి కారణ మెద్దియో విశ్వయించి చెప్పుటకు వీలు కాకున్నది. మహమ్మదీయ చరిత్రకారులు భిన్నాభిప్రాయములను వెలిపుచ్చియున్నారు. అహ్మదు నగరము ముట్టడి సందర్భమున ఇబ్రాహీమ్ కుతుబ్ శాహు మిత్రవర్గమునకు ద్రోహము తలపెట్టి రహస్యముగ కోటలోని నిజాం శాహు పక్షమువారికి సాహాయ్యపడినందులకై కినిసి అతనిని శిక్షించుటకొరకు రామరాజు అతని రాజ్యముపై దండు వెడలెనని ఫెరిస్తా చెప్పియున్నాడు. కాని గోలకొండ చరిత్ర రచయితయైన యజ్ఞాత చరిత్రకారుడు వేరు విధముగ కారణమును వివరించియున్నాడు. రామరాజు అహ్మదు నగరమును ముట్టడించి యున్నప్పుడు సదరు ముట్టడిని విసర్జించి దండును లేవదీసికొని వెనుకకు మరలిన కొండపల్లి రాజ్యమును అతనికి ఇచ్చివేయుదునని ఇబ్రాహీమ్ కుతుబ్ శాహు వాగ్దానము చేసెననియు, ముట్టడిని లేపుకొని పోయిన పిమ్మట ఇబ్రాహీమ్ కుతుబ్ శాహు తన వాగ్దానము ప్రకారము నడచుకొనకపోవుటయే కాక, రామరాజుమీద ద్వేష మగపరచుచు బహిరంగముగ హుసేన్ నిజామ్ శాహుతో సఖ్యము చేసికొనె ననియు, ఈ సఖ్యమును బలపరచుకొనుటకు హుసేన్ నిజామ్ శాహు కూతును పెండ్లియాడ నిశ్చయించి, యా పెండ్లిని అప్పుడు ఆదిల్ శాహునకు చెల్లుచుండిన కల్యాణి దుర్గమున నడపుటకు సమకట్టి యుభయ సంబంధులును దళములతో అచటికి తరలి రనియు, అంతట ఆదిల్ శాహు రామరాజుతో మొర పెట్టుకొనగా అత డతనికి సహాయుడై యుద్ధమునకు నడుముకట్టె ననియు వ్రాసియున్నాడు. ఇందు ఏది నిజమైనను రామరాజు గోలకొండపై దండయాత్రకు నిష్కారణముగ వెడలలే దనియు, ఇబ్రాహీమ్ కుతుబ్ శాహుయొక్క కుతంత్రములే అందుకు మూలకారణ మనియు వెల్లమగుచున్నది.

అలీ ఆదిల్ శాహు విజయనగరమునకు వచ్చి కుతుబ్ శాహు, నిజామ్ శాహుల ఎత్తుగడలను రామరాజునకు వివరింపగనే కోపోద్రిక్తుడై అతడు వెంకటాద్రి, జగదేవరాయ, అయ్యనమలక మున్నగు సేనాపతులను కుతుబ్ శాహి రాజ్యముపై దండు పెట్టుడని ఆజ్ఞాపించెను. వారు మూకలను గదల్చుకొని కుతుబ్ శాహి రాజ్యములోని దక్షిణప్రాంతములను పాడుకావించిరి. ఆదిల్ శాహు వెంట రాగా, మరియొక సైన్యముతో రామరాజు విజయనగరమునుండి

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



బయలుదేరి కల్యాణివైపు కూచి చేసెను. రామరాజు బయలుదేరి వచ్చుచున్నాడను వార్త తెలియవచ్చినంతనే కుత్బ్ శాహు, నిజాం శాహులు తమ పాళెము లేపుకొని, కల్యాణినుండి తమ తమ రాజ్యములకు తరలిపోయిరి. అట్లు పోవుచున్న వారిని రామరాజు ఊరక విడిచిపెట్టలేదు. రాయరాణువతోకూడ తాను స్వయముగ నిజామ్ శాహును వెన్నడించి చన నిశ్చయించి, కుత్బు శాహును తోలి తొవ్వరవెట్ట ఆదిల్ శాహును నియోగించెను. విజయనగర సైన్యము నిజామ్ శాహి రాష్ట్రమునకు చొచ్చుకొనిపోయి అహ్మదునగరమును రెండవ పర్యాయము ముట్టడించెను. ఈ దండయాత్ర యందును రామరాజు సేనాధిపతియైన సదాశివనాయకునికే విజయము చేకూడినట్లు కెళది నృపవిజయమునందు చెప్పియున్నను ఫెరిస్తా వాక్యములు విశ్వాస పాత్రములని యంగీకరించినచో ఆ విజయము సంపూర్ణమైనది కాదని యొప్పుకొనవలసి యున్నది. సేనా నదియందు హఠాత్తుగ వచ్చిన ప్రవాహములో రామరాజు సైన్యమున చాలభాగము హతమయ్యెననియు, తక్కిన దళములను మరల్చుకొని అహ్మదునగరపు ముట్టడిని త్యజించి అతడు తరలిపోయె ననియు ఫెరిస్తా చెప్పుచున్నాడు. కాని సేనా నదీప్రవాహమున విజయనగర సైన్యమునకు కలిగిన చేటు ఫెరిస్తా చెప్పినంత ఘనముగ తోచదు. అహ్మదు నగరమునుండి వెనుదిరిగి వచ్చు రాయసైన్యము మార్గమధ్యమున కుత్బ్ శాహి రాజ్యమును ప్రవేశించి ఇబ్రాహీమ్ కుత్బ్ శాహు రాజధానికి సమీపమునందలి తరపల్లికడ విడిసి అతనితో యుద్ధము చేయ మొదలుపెట్టెను. ఇబ్రాహీము అతనిని పారదోల నెంత గట్టి ప్రయత్నము చేసినను ప్రయోజనము కలుగలేదు. ఫెరిస్తా వచించినటులు సేనా నదీప్రవాహమునందు విజయనగర సైన్యము నశించియుండిన యెడల రామరాజునకు గోలకొండపై నెత్తిపోయి కుత్బ్ శాహునకు అజేయుడై యుద్ధము నడపుటకు సాధ్యమయి యుండదు. కావున .అతని మాట లతిశయోక్తులని తోచుచున్నది. ఇందలి నిజము ఎట్టిదయినను కుత్బ్ శాహుయొక్క స్థితి దుర్భరమగుట నిశ్చయము. ఒకప్రక్క తరపల్లికడ రామరాజు తస్సావేసి కూర్చుండి యుండెను; మరియొకప్రక్క వేంకటాద్రి, అయ్యనమలక, జగదేవరాయల సేనలు గోలకొండ పరిసర ప్రదేశములను కొల్లగొట్టి పాడుకావించుచుండెను. రామరాజు నియోగమున అతని మేనల్లుడును, కొండవీటి దుర్గాధ్యక్షుడును అయిన సిద్ధిరాజు తిమ్మరాజు ఏబదివేల ఫౌజుతో కొండపల్లి, మచిలీపట్టణముపై దండు వెడలెను. సీకాకుళి (చిక్కాప ఖావ), విదియాద్రులు ఏలూరు, రాజమహేంద్రవరము సర్కారులను జయించుట కేగిరి.

శత్రుసైన్యములు ఇట్లు చుట్టుముట్టుకొని ఉన్నను ఇబ్రాహీమ్ కుత్బ్ శాహునకు రామరాజుపై దెబ్బతీయుటకు ఒక మంచి అవకాశము చిక్కినది. సిద్ధిరాజుతిమ్మరాజు రామరాజు ఆజ్ఞానుసారము కొండవీటినుండి దండును అంతటిని కదల్చుకొని యుద్ధయాత్రకు బయలుదేరినందున దుర్గసంరక్షణమునకు తగిన భటవర్గము లేకపోవుటవలన దుర్బలస్థితియందుండెను. హఠాత్తుగ తాను ఆదుర్గముపై నడచి ముట్టడివేసిన తనరాజ్యముపై దండువెట్టియుండు శత్రువులు తమ మూకలతోగూడ దానిని సంరక్షింపనచటికి రాగలరని యెంచి, ముస్తఫా ఆజీమ్ యాకూబ్ ఖానులును, చింతగుంట ధర్మారావును వెంట రాగా ఇబ్రాహీమ్ కుత్బ్ శాహు కొండవీటిపై నడచెను. అతని యెలగోలుబలములు తమ గమ్యస్థానమగు కోటకడ ముట్టడి దిగెను. కాని ఇబ్రాహీమ్ శాహు మనోరథము సిద్ధింపలేదు. ఏలన, రామరాజు కొండవీటిదుర్గమును సంరక్షించుటకు తగిన యేర్పాటులను చేయుటకు తమ్ముడు ఎరతిమ్మరాజును నియోగించెను. అతడు కొండవీటిని శత్రుల హస్తగతము కానీయక కాపాడవలసినదని నిజభృత్యులలో ఒకడైన వెలుగోటి చిన తిమ్మానాయకుని కాజ్ఞాపించెను. చిన తిమ్మానాయకుడు తన దళములను వెంటబెట్టుకొని పోయి కొండవీటికడ ముట్టడిదిగియుండు కుత్బ్ శాహి లష్కరును ఓడించి పారదోలుటయేకాక, శ్రీశైలరాజ్యమున ప్రవేశించి అచటి కంపణములలో అలజడి పుట్టించుచుండిన ముస్తఫా ఖానుని దిశాపట్టుని కావించి అతని ఏనుగులను పట్టుకొని బోయల హృదయమున శాంతి నెలకొల్పెను. తరువాత కృష్ణానదిలోని లంకను ఆక్రమించుకొని రాయల సైన్యమును నది దాటనీయక అడ్డము వచ్చిన కుత్బ్ శాహి దళముతో ఘోరముగ పోరాడి ఆ నదీప్రవాహమునకు మహమ్మదీయ రక్తముతో కుసుంభవర్ణము వేసి జయము కొనెను. ఇబ్రాహీమ్ కుత్బ్ శాహు ప్రయత్నము ఇట్లు వితథమై పోగా అతడు చేయునది లేక వెనుదిరిగిపోయెను. అంతట ఎరతిమ్మరాజును, చిన తిమ్మానాయకుడును కృష్ణను మూకలతో దాటి కుత్బ్ శాహి రాజ్యముయొక్క దక్షిణ సీమలకు ఆయువు పట్టులు అనదగిన ప్రధాన దుర్గములను అన్నిటిని జయించి వశపరచుకొనిరి. దేవరకొండయందు తాణ్యముండిన పఠానులుమాత్రము కొంత పోటుచూపిరి. కాని చిట్టేల, పేరూరు, దేవులపల్లి, నాగులపాడు, ఓడపల్లి, నలగొండ, అదవపల్లి, ఇంద్రకొండ మున్నగు దుర్గము లన్నియు కత్తి దూయకయే లోబడినవి. మరియొక దిక్కున

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కూడ విజయనగరసైన్యమును జయలక్ష్మి వరించినది. పూర్వము రామరాజువలె జగదేవరాయలుకూడ కుత్బ్ శాహును కొలిచినవా డగుటచేత అతనికి గోల్కొండ నాయకవారి సామంతులయందు విశేషమైన పలుకుబడి గలదు. కావున అతని మాటలకు చెవి యొగ్గి కోవెలకొండ, పానుగల్లు, గణపురదుర్గములు రామరాజునకు లొంగిపోయినవి. సర్వత్ర తనకు ఇట్లపజయము కలుగుటయేకాక, నమ్మిన నాయకులును, దుర్భేద్యములైన దుర్గములును శత్రువులకు వశపడిపోవుటను జూచి ఇబ్రాహీము కుత్బ్ శాహు జయముపై ఆస విడిచి రామరాజును సంధి అనుగ్రహింపవేడెను. గణపుర, పానుగల్లు దుర్గములను రెంటిని తనకు ఇచ్చివేసిన సంధికి ఒడబడెదనని అతడు పల్కగా గత్యంతరమును గానక ఆతని కోరికమేరకు ఆ రెండు కోటలను సమర్పించి సమాధానము చేసికొనెను.

మహమ్మదీయ రాజులపై రామరాజు పొందుచు వచ్చిన విజయములమూలమున విజయనగర చక్రవర్తి ప్రాబల్యము నానాటికి అభివృద్ధి కాజొచ్చెను. గోదావరీ, సింహళముల నడుమ యావద్దక్షిణ భారతభూమి యందును అతని యాజ్ఞ నిర్వక్రమై సాగుటకు ఆరంభించెను. ఇది యతనిచే అడుగడుగునకు పరాజితు లగుచుండిన దాక్షిణాత్య తురుష్క రాజులకు కనుకుట్టినట్లాయెను. ఎట్లయిననను అతనికి శృంగభంగము కావించి నష్టమైపోయిన తమ పరువును, ప్రతిష్ఠను మరల నెలకొల్పుకొనవలయునని వారు పట్టుపట్టిరి. ఇబ్రాహీమ్ కుత్బ్ శాహును, హుసేన్ నిజామ్ శాహును వీరియందు ప్రముఖులు. వీ రిద్దరు ఏకమై రామరాజుతో మరల యుద్ధముచేయ నిశ్చయించిరి. తక్కిన దక్కను తురక రాజులయొక్క, అందును ముఖ్యముగ విజాపురపాలకుడు అలీ ఆదిల్ శాహుయొక్క సహకారము లభించినగాని తమకు జయము చేకూరదని గ్రహించి, నయ భయములను చూపి, వారిని లోబరచుకొనిరి. అలీ ఆదిల్ శాహు లోలోపల తోడి తురకరాజులకు సుముఖుడై వారికి రహస్యముగ సహాయపడుటకు ఒడంబడినను, తనకు పరమోపకారియైన రామరాజును బహిరంగముగ నెదుర్కొన వెరచి యుదాసీనునివలె ప్రవర్తింప గడగెను. కుత్బ్ శాహు, నిజామ్ శాహులు తాము చేసికొనిన సమయము ప్రకారము తమ సైన్యములను ఏకము చేసికొని, క్రీ. శ. 1564-65 లో విజయనగర సామ్రాజ్యముపై దండెత్తి వచ్చి రాక్షసి-తంగడి (దీనినే మహమ్మదీయ చరిత్రకారులు తాలికోట యందురు) సంగ్రామరంగమున రామరాజును తారసిల్లిరి. పోరు ఘోరముగ సాగినది. కుత్బ్ శాహు, నిజామ్ శాహులకే మరల పరాజయము కలిగినది. కాని వారు నయవంచన చేయగడగిరి; పరాజయమును ఒప్పుకొని సంధిని కోరువారివలె రామరాజుతో సంప్రదించుటకు రాయబారము పంపిరి; కాని రహస్యముగ రామరాజు కొలువునందలి తురక సేనాధిపతులతో కుట్ర చేసి వారిని స్వామిద్రోహమునకు పురికొల్పిరి. ఓటుపడి సంధిప్రయత్నములు చేయుచుండు కుత్బ్ శాహు, నిజామ్ శాహులవలన తన కేమియు ముప్పు కలుగజాలదని తలచినవాడు కావున రామరాజు ఆత్మసైన్య రక్షణకు తగిన యేర్పాటులను చేయక, జతనము వీడి ప్రమత్తుడై ఉండెను. తమ యెత్తుగడలు ఇట్లు చక్కగ సాగుచుండుటకు సంతసించి ఇంకను ఉదాసీనునివలె ప్రవర్తించుచుండిన ఆదిల్ శాహును అదలించి బెదరించి మతదురభిమానమును రెక్కొలిపి, అతనిని యుద్ధమునకు సంసిద్ధుని జేసిరి. అంతట ద్రోహమునకు ఒడిగట్టి ఆదిల్ శాహు హఠాత్తుగ రామరాజుపై గవిసెను. కుత్బ్ శాహు, నిజామ్ శాహులును అతనితో నేకీభవించిరి. యుద్ధమునకు సిద్ధమైయుండకపోవుటవలన విజయనగర సైన్యములకు వారి నెదుర్కొని పరిపోరుట దుర్ఘటముగ తోచెను. శిబిరమునుండి పారిపోయి ఆత్మరక్షణము గావించుకొనుట యుక్తమని మిత్రులు రామరాజునకు హితము చెప్పిరి. క్షత్రియజన్మ మెత్తి శత్రువులకు వెన్నిచ్చి పారుట పందతనము. ఈ తురక లనగా ఎంత? అని అతడు తన మూకలను పురికొలుపుకొని పైకొని వచ్చు తురకదండును ఎదుర్కొనెను. తుములయుద్ధము నడచినది. జయము రామరాజు వంక మ్రొగ్గువల్లే కాన్పించినది. ఆ సమయమునందు అతని కొలువులోని తురకలు ద్రోహమును తలపెట్టి ఎదురు తిరిగిరి. కాని రామరాజు అప్పటికిని ధైర్యమును వీడక పోరాడుచుండెను. అప్పుడు ఆతని యుప్పు తినుచుండిన



రాక్షసి - తంగడి యుద్ధము: వ్యూహ రచన

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తురక సర్దారు ఒకడు వెనుకనుండి అతనిని బల్లెముతో పొడిచి చంపినట్లు కొందరు చెప్పుదురు. ఏనుగునుండి దిగి గుర్రము నెక్కబోవుచుండగా నిజాం శాహి సైనికులకు చిక్కెననియు, హుసేను నిజామ్ శాహు వెంటనే అతని తలను గొట్టించి వేసెననియు మరికొందరు చెప్పుదురు. కాని సమకాలిక ఢిల్లీ చరిత్రకారుడైన నిజాముద్దీన్ అహ్మదు బక్షి యీ యుద్ధమున జయము రామరాజువైపు ముఖుచూపుచుండగా దైవదుర్విపాకమువలన హుసేన్ నిజామ్ శాహు సైనికులు కాల్చిన ఫిరంగిగుండు ఒకటి అతని తలను దాకి దానిని ఛిన్న భిన్నములు గావించిన దనియు, అంతట విజయనగర సైనికులు భయభ్రాంతులై పారిపోవ మొదలు పెట్టి రనియు, తురకదండు వారిని పోనీయక చుట్టుముట్టి నిశ్శేషముగ సంహరించిన దనియు వ్రాసెను. రాక్షసి-తంగడి సంగ్రామము ఇట్లు పరిసమాప్తిచెందినది.

దక్షిణ భారతావనికి అంతటికి గన్నాకయి ఆసేతు నర్మదాపర్యంత పరివ్యాప్త భూమండలమును ఆజ్ఞాబద్ధము గావించుకొని దక్కనీ పంచ పాదుశాహులకు నియంతయై ఇరువది రెండేండ్ల కాలము విజయనగర సామ్రాజ్యమును మహావైభవముతో పాలించి రామరాజు తుదకు తురకరాజుల నయవంచనచే బెలుపోయి రాక్షసి-తంగడి సంగ్రామ రంగమున రణశయ్య నలంకరించెను. ఒక దృష్టిని జూచిన రాయసామ్రాజ్యమును పాలించిన చక్రవర్తులలో నెల్ల ఇతడు అగ్రేసరు డని చెప్పవలసియున్నది. దక్కను మహమ్మదీయ ప్రభువుల నెల్ల వశవర్తులను జేసికొని యంతటి విస్తారమైన సామ్రాజ్యమును పాలించిన రాయలు మరి యొక్కడు లేడు. కాని ఇతని ప్రవర్తన చరిత్రకారుల తీవ్ర విమర్శనకు గురియై యున్నది. ఇతడు సామ్రాజ్యాధిపత్యమును అక్రమముగ దిగిచికొనిన స్వార్థపరాయణు డనియు, కుతంత్ర నిష్ణాతు డనియు, దక్కను తురకరాజుల కొండొరులతో తగవులు పెట్టి వారిలో దుర్బలుల పక్షము నవలంబించి బలవంతులతో పోట్లాడి విజయమును బొందుచు వారి రాజ్యభాగముల నాక్రమించె ననియు, మహమ్మదీయ మతమువందు గల ద్వేషముచే వారి రాజ్యములపై నెత్తి పోయినపుడు అందలి మసీదులను పాడుచేసి కురానును గర్హించుటయేకాక మహమ్మదీయ స్త్రీలను జెరపట్టి మాన భంగము సేయించె ననియు, అతని దుండగములకు శాలు కొనజాలక తుదకు మహమ్మదీయసుల్తానులెల్ల తమ పరస్పర వైరమును విస్మరించి యేకమై రాక్షసి-తంగడి రణక్షేత్రమున అతనిని వధించి, విజయనగర రాజధానిని నాశము గావించి రనియు, అతని కుతంత్రములమూలమున రాయ సామ్రాజ్యము విచ్ఛిన్నమై పోయె ననియు చరిత్రకారులు ఉగ్గడించు యతని ప్రవర్తనమును ఖండించుచున్నారు. సామ్రాజ్యాధికారమును అతడు నాచికొనినమాట నిజమే; కాని యాతడు సాళువ నరసింగరాయలు, నరసానాయకుడు, వీరనరసింహరాయలు, సలకరాజు తిరుమలరాజు మున్నగు ప్రముఖులు చూపిన మార్గము ననుసరించెను; కాని కడపటి యిరువురివలెను సామ్రాజ్యాధిపతిని హత్యచేయించి సింహాసనము నధిష్ఠింపలేదు. నరసానాయకునివలె అతడును రాయ బిరుదావళిని వహించి రాజ్యాధికారమును నెరపినను సామ్రాజ్యాధిపతిని ముందుంచుకొనియే సర్వకార్యములను అతనిపేరనే నిర్వహించెను. మరియు అతడు కేవలము నిజాభ్యుదయమునే యభిలషించి రాజ్యాధికారమును ఆక్రమించుకొనలేదు. ప్రతిపక్షుల సంఘట్టనచే కూలిపోవ సంసిద్ధమై యుండిన హిందూ సామ్రాజ్యమును సంరక్షించుటకొరకుకూడ అతడు నడుము కట్టవలసివచ్చెను. ఈ దృష్టితో చూచినయెడల నతనిచే జేయబడిన రాజ్యాక్రమణము అంత హేయముగ కన్పించదు.

తురకరాజులతో రామరాజునకు గల రాజకీయ సంబంధమును ఎరుకపరచు ముఖ్యాధార గ్రంథములు మహమ్మదీయ చరిత్రకారుల రచనలు. జాతిస్వభావ వైరముమాటను అటుండనిచ్చి, రామరాజునకు బద్ధశత్రువులగు దక్కను సుల్తానుల కాశ్రితు లగుటవలన వారు తమ ప్రభువుల యాధిక్యమును, న్యాయదృష్టిని నిరూపించు కొరకు రామరాజునుగూర్చి యెన్నియో యసత్యములను వ్రాసి యున్నారు. రామరాజు తన దండయాత్రలలో మసీదుల నపవిత్రీకరించి పాడుచేసె ననియు, కురానును తిరస్కరించె ననియు, బిబ్బీలను భంగపరచె ననియు వ్రాసినవాడు ఫెరిస్తా. ఈ యంశములను ఇతర మహమ్మదీయ చరిత్రకారు లెవ్వరును చెప్పరు; కావున అతని వ్రాత సత్యాత్మకమని నమ్ముటకు వీలు లేదు. ఇంతియ కాదు. రామరాజు సైన్యమున వేలకొలది మహమ్మదీయ సిపాయీలు కొలువునకు కుదిరియుండిరి. తురక సర్దారులు పెక్కండ్రాతని కాంతరంగికహితులై కార్య ఖడ్గములందు పనిగొని యుండిరి; వీరి యుపయోగార్థము రాజధానియం దొక మసీదును నిర్మించి యుచ్చుటయే కాక వారు స్వమతాచారములను నిర్నిబంధముగ ననుష్ఠింప దగిన యేర్పాటులను గావించెను. మరియు విజాపురాధినాథుడైన అలీ ఆదిల్ శాహు అతని కాప్త మిత్రుడు; ఇతని పక్షముననే రామరాజు తక్కిన దక్కనీ సుల్తానులతో పోరాడినది. ఈ దండయాత్రలలో విజయనగర, విజాపుర సైన్యములు రెండును కలసి మెలసియే పనిగొనుచుండెను. ఈ పరిస్థితులలో



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



రామరాజు మహమ్మదీయ మతమును కొంచెపరచి తన కొలువునందలి మహమ్మదీయ సైనికులను, సర్దారులను మిత్రుడైన అలీ ఆదిల్ శాహును చిన్నపుచ్చుట యసంగతము; కావున విశ్వాసఘాతుకుడైన అలీ ఆదిల్ శాహు ద్రోహమును మాపుచేయుటకొరకు ఫెరిస్తా పై యంశములను గల్పించెనని ఎంచవలసి యున్నది. మరియు రామరాజు దక్కనీ సుల్తానుల కొండొరులకు తగవులుపెట్టి తన్మూలమున నభ్యుదయమందెనని చెప్పుట సరికాదు. దక్కనీ సుల్తానులు ప్రకృతిచే కలహశీలురు; ఈర్ష్య, స్పర్ధ, దురాశ మున్నగునవి వారు ఉగ్గుపాలతో ద్రావి యలవరచుకొనిన గుణములు. దక్కను మహమ్మదీయులు ఒండొరులను చించి చెండాడుకొందురు అని పోర్చుగీసు చరిత్రకారుడు న్యూనిజు ఉగ్గడించి యున్నాడు. వారొండొరులతో పోరాడుచు తన్ను సహాయమర్థించిన వారికి రామరాజుతోడ్పడెనే కాని వారికి తగవులు పెట్టి తన్మూలమున లాభము పొందలేదు; దక్కనీ సుల్తానుల తగవులను మాన్పి సమాధానపెట్టి దేశమున శాంతి నెలకొల్పుటకు రామరాజు ఘనప్రయత్నములను గావించెను; కాని హుసేన్ నిజాం శాహు, ఇబ్రాహీమ్ కుత్బ్ శాహులు సహకరింపక ప్రతిఘటించుట వలన అతని మనోరథ మీడేరక పోయినది.



చిత్రము 64. అళియ రామరాయలు

ఉపలబ్ధమైన చరిత్రాధారము లన్నిటిని సమ దృష్టితో పరిశీలించి చూచినచో చరిత్రకారులు రామరాజునెడ గొప్ప యపచారము చేసిరని చెప్పవలసియున్నది. ఈ యపచారమునకు మూలకారకులు మహమ్మదీయ చరిత్రకారులు.

వాస్తవమును పరిశీలించినచో ముందు వక్కాణించినట్లు రామరాజు అప్పుడు భరతఖండమును పరిపాలించిన హిందూరాజులలో నెల్ల కడు దొడ్డ ప్రభువని చెప్పవలయును. సమకాలిక ఆంధ్రప్రపంచ మతనిని బడే రామరాజనియు, బడే రామప్పయ్య అనియు ప్రశంసించినది. తొంబదియేండ్ల వృద్ధయినను రామరాజు రంగప్పరాజు చెప్పినట్లు ఇతడు 'అద్రిధైర్యు' డనుటకు సంశయము లేదు. రాక్షసి-తంగడి సంగరాంగణమున వీరము దక్కి వెన్నుచూపక పై బొరలి వచ్చుచుండిన మహమ్మదీయ వాహినీ తరంగములకు చెలియలికట్టవలె నడ్డపడుటయే దీనికి సాక్షి. గుణగ్రహణ పారీణుడైన శ్రీకృష్ణదేవరాయ లితనిని జేరదీసి తనప్రియ తనయను తిరుమలదేవి నిచ్చి యుద్వాహము గావించెను. నీతి విద్యా విచక్షణు డగుట వలన కార్యసాధనమునకు దండమునకంటె సామ దాన భేదములే పరమోపయుక్తములని అతని భావము. ఎత్తులు వేయుటయం దతనిది అందె వేసిన చేయి. జయాపజయములందు సంభ్రమము నందనిది అతని చిత్తము. చదరంగమునందు వలె రాజకీయరంగమందును మహా తగిలిన నిరుత్సాహపడక మరియొకతరి జయ మందవచ్చునని నిమ్మళముతోనుండు స్వభావ మతనిది. అతడు రాజసమూర్తియైనను జనాను రంజకుడు; శత్రుదుర్నిరీక్ష్యుడైనను మిత్రాహ్లాదనకరుడు; బంధుప్రియుడు; ఆశ్రిత



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కల్ప భూజము. కావుననే నానాజాతి జనులును ప్రేముడి నతనిని సేవించి యతని కొలువున తమ ప్రాణములను ధార పోయుటకు సంసిద్ధులై యుండిరి.

రామరాజు భాషాభిమాని; విద్వాంసులను చేరదీసి గ్రాస వాసములకు దగిన వసతులు కల్పించి వారిని గ్రంథ రచనకు బురికొల్పెను. స్వరమేళకళానిధి కర్తయైన రామయామాత్యు డితని నాశ్రయించి యుండిన విద్వాంసులలో నొక్కడు. ఆంధ్రమందు ప్రబంధ రచయితలలో ప్రఖ్యాతుడైన బట్టుమూర్తి రామరాజు ప్రోత్సాహము మీదనే గ్రంథరచనకు బూనుకొనెను. రామరాజ భూషణుడను అతని బిరుదనామమే దీనికి తార్కాణము. రామరాజు తాతాచార్యులవారి శిష్యుడు; వీరవైష్ణవుడు; గురువుమీద అతనికిగల భక్తి యపారమైనది; తత్కారణమున తాతాచార్యులవారి పలుకుబడి యధికమై వారి యాశ్రయము లేక రాజదర్శనము కలుగుట దుస్సాధ్య మాయెను. ఆరవీటి రాజుల యాశ్రయమున నె రామానుజ వైష్ణవమతము ఆంధ్రదేశమున బహుళముగ వ్యాపించెను.

నే. వెం. ర.

## ఆరవీటి వంశము

రాక్షసి - తంగడి యుద్ధములో హిందువులు సామ్రాజ్యముతోపాటు స్వాభిమానముకూడ కోల్పోయినారు. రామరాజు మరణింపగనే అతని తమ్ముడు తిరుమలరాయలకు రాజు సదాశివరాయలను తన యధీను నొనరించుకొనుట ఎట్లు, విజయనగరములోని ధనరాసులను దక్కించుకొనుట ఎట్లు అను ఆలోచనయేకాని రాజధాని రక్షణము, ప్రజల మాన ప్రాణ ధనముల గతి యేమి అన్న విచారమే కలుగలేదు. సామ్రాజ్యమున అధికార పదవులం దున్నవా రందరును రాజ బంధువులే. రామరాజుతో ఉమ్మడిగా సదాశివదేవరాయల రాజ్యచక్రము త్రిప్పరై రనుటయేకాని వారికిని రాజ్యమున తిరుమలరాయలపాటి స్వత్వములు, ఆశలు లేకపోలేదు. వారిని త్రోసిరాజని తాను రాజ్యమును శాసించుటకు సదాశివదేవరాయలు తన చేతిలో ఉండుట తప్పనిసరి అయ్యెను. యుద్ధమున ఓటమి తెలగనే తిరుమలరాయలు పరుగున పోయి, తన సతీ సుతులను, సదాశివదేవరాయలను, పదునైదువందల యేనుగులపై కనక రత్నములను తరలించుకొని పెనుగొండ చేరుకొనెను. విజాపుర సేనలు ఆదోని నణచి, విజయనగరము నాక్రమించి ఖజీర్ నాయకత్వమున పెనుగొండనే చుట్టుముట్టినవి. కాని వానిని సవరము చెన్నప్ప ప్రతిఘటించి నిలువరించెను. ఇంతలో ముస్లిము సుల్తానులలో పరస్పరము కలహములు పూర్వ మున్నవే మరల పొడచూపి నిజాం ముర్తజా విజాపురముపై ఎత్తివచ్చెను. ఇందు తిరుమలరాయల మంత్రబలము సైతము కొంత కొంత కారణమైనదని తజ్జ్ఞుల యూహ. ఎట్లయిననేమి; పెనుగొండ ఆపద గడచి గట్టెక్కినది. కాని నిజామోన్మాదులగు ముసల్మానులకు, దోపిడికాండ్రకు అగ్గమై విజయనగర రాజధాని రాక్షసుడు పట్టి విడిచిన రంభ అయ్యెను. దుస్సహ హింసలపాలై ప్రజలు గుట్ట కొకడు, పుట్ట కొకడుగా వలసలు కోరుచుండగా రాజధాని ప్రతిపదము దగ్ధవేశ్మము, భగ్నశిల్పము అయి చెన్ను తరిగెను.

విజయనగరమున హింసాకాండ ఆరు నెలలు సాగించి ముస్లిములు తమ తమ నెలవులకు మరలి పోవుటతో తిరుమలరాయలు మరల విజయనగరమున అడుగిడెను. అతడు ఎంత ప్రయత్నించినను రాజధానీ నగరమున తొంటి సౌభాగ్యము, సిరి సంపదలు, వాణి జ్యైశ్వర్యములు తల సూపనేలేదు. సంగమరాజవంశ్యుల కాలమునను విజయనగరము ముస్లిముల ముట్టడికి అగ్గమైనదే; కాని వారిలో ఎవ్వరును రాజధానిని, ప్రజలను, తమ పరువు ప్రతిష్ఠలను తిరుమలరాయనివలె కోల్పోవలేదే ? ఆపదలనాడు తమకు కాని తిరుమలరాయల యెడల ప్రజల విశ్వాసాభిమానములు మరలుట ఎట్లు ? హతాశుడై తిరుమలరాయలు మరల పెనుగొండనే చేరి క్రి. శ. 1571 లో వజ్రసింహాసనాసీనుడై ఇమ్మడి జగదేవరాయాది పరిసేవితుడై రాజ్యమును సాగింపసాగెను.

**తిరుమలదేవరాయలు** (క్రి. శ. 1571 - క్రి. శ. 1572): క్రి. శ. 1565 మొదలు క్రి. శ. 1571 వరకు ఆరేండ్లు దేశమున 'అరాచకమే' ప్రబలెను. రామరాజు కొడుకు పెద తిరుమలరాజాదిగా గల రాజబంధువులు తమ తమ నెలవులలో తమ తమ అధికారమునే విస్తరింపజేసిరి. ఆదోనిలో కోనేటి కొండ్రాజు, బంకాపూరులో వేలప రాయలు స్వతంత్రులైరి. నిరంకుశులగు పాళెగాండ్ర దుండగములకు ప్రజలు కటకట లాడిరి. దేశమున తిరుమలరాజు శాసనముగతి ఇట్టిది. అమరనాయకు లన్నవో మధురలో విశ్వనాథనాయకుని కృష్ణప్ప నాయకుడు, తంజావురమున అచ్యుతప్పనాయకుడు, చెంజిలో కృష్ణప్ప క్రమముగా పాండ్య, చోళ, తుండీర మండలములలో ప్రబలులైరి. మరి ఇట్టి వీ రందరును తిరుమలదేవరాయల ఆధిక్యమును గుర్తించి మన్నింతురా ?

తిరుమలదేవరాయలు సైన్యములను సమకూర్చుటకు ఆరంభించెను. క్రియాసిద్ధినే అభిలషించిన తిరుమలదేవరాయలు ఉపకరణముల సాధుత్వా సాధుత్వములను మరచి బుడతకీచుల నుండి మోసముననూ, బలిమిని అశ్వములను సంపాదించెను. విజాపురపు సుల్తాను ఆదిల్ షాతో పోరు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చున్న నిజాము షా, కుతుబ్ షాలతో కలసి తానును యుద్ధము చేసెను. కాని యీ మైత్రిచే అతని కొరగిన లాభము లేదు. మీదుమిక్కిలి అది కొరవితో తలగోకికొనినట్లయి అలీ ఆదిల్ షాతో వైరమును రెచ్చగొట్టెను

ఇది యదనుగ క్రీ.శ. 1568 లో ఎత్తివచ్చిన అలీ ఆదిల్ షా రాణువ హిందూ సేనలను తరిమికొట్టి కోనేటి కొండ్రాజును ఆదోనిలోనుండి వెలికి రాకుండ ముట్టడించెను. ముస్లిము సర్దారు మాలిఖానుడు పెనుగొండనే చేరజారెను. సవరము చెన్నప్ప ఆదుకొనుటతో పెనుగొండ దుర్గము ముస్లిముల బారినుండి రక్షితమయ్యెను. కాని ఆదోనియు, సరిహద్దుల లోని ఇతర దుర్గములును ముస్లిముల అధీనమున చిక్కినవి.

తిరుమలదేవరాయలు ఇక ఉన్నంతలో రాజ్యము చక్కబెట్టుకొనుటకు ఆరంభించెను. సవరము చెన్నప్ప, ఇమ్మడి జగదేవరాయలు మొదలగు వారు ఇందు ఇతనికి తోడ్పడిరి. నాయకులను తాను కదపజాలడు. కావున వారి అధికారము ఆయా తావుల అనువంశికమైనను తనకు ఏటేట కప్పము నిచ్చినచో చాలును; వారి యధికారమును అదేమి అనడు. వారును ఈ పద్ధతిని అంగీకరించి తిరుమలదేవరాయల ఆధిక్యమునకు ఇయ్యకొనిరి. అమర నాయకుల రాయిడిని ఇట్లు తప్పించుకొన్న తిరుమలదేవరాయలు తన రాజ్యమును మూడు విధములుగా విభజించి తన ముప్వురు సుతులను అందందు పాలకులుగా ప్రతిష్ఠించెను. ఈ విభాగము భాషా భేదమును ఆశ్రయించి యుండుట ఒక విశేషము. పెద్దకొడుకు శ్రీరంగదేవరాయలు పెనుగొండ రాజధానిగా తెలుగు దేశమును, అతని రెండవ కొడుకు శ్రీరామరాజు శ్రీరంగపట్టణము రాజధానిగా కన్నడదేశమును, మూడవవాడు వెంకటపతి దేవరాయలు చంద్రగిరి ముఖ్యపట్టణముగా తమిళదేశమును నిర్వహించుచుండగా తిరుమలదేవరాయలు శీర్ణకర్ణాటక రాజ్యోద్ధరణ కీర్తి వహించి మించెను.



చిత్రము 65. రాజా మహల్, చంద్రగిరి

పండు ముదుసలి తిరుమలదేవరాయలు ఎక్కువకాలము పాలింపలేదు. పదునొకండు నెలలపాటి యితని శాసనము క్రీ. శ. 1572 ఏప్రిల్ ప్రాంతములో ముగిసిపోయెను.

మొదటి శ్రీరంగదేవరాయలు (క్రీ. శ. 1572 - క్రీ. శ. 1585): తిరుమలరాయలతో తొల్లిటి విజయనగర రాజ్యమున ఆరవీటి వంశ్యుల పాలనము పొటమరించినది; కాని అది స్థిరముగ వేరూని పాదుకొను లక్షణములు అగపడలేదు. తిరుమలరాయల పట్టాభిషేకమునకు కొంచెము పూర్వము శా. శ. 1490 విభవలో తెలుగుమండల రాజప్రతినిధిగ పెనుగొండలో అభిషిక్తుడైన శ్రీరంగరాయలు అతని అనంతరము శా.శ. 1494 అంగీరస వైశాఖ బహుళ 15 (మే నెల 11, క్రీ.శ. 1572)నాడు సింహాసన మధిష్ఠించి పాలన మొదలిడెను. ఇంతలో సదాశివదేవరాయల మృతి వార్తలు దేశమంతట అలమికొనినవి. తిరుమలరాయలే రాజును పొతమార్చెనని కొందరు; కాదు అతడు కారకుడు అని మరికొందరు. ఎటులైననేమి అతని శాసనములు క్రీ. శ. 1576 వరకు కనిపించుచున్నవి. తిరుమలరాయల, శ్రీరంగరాయల అధికారమును అంగీకరింపక సదాశివదేవరాయలనే రాజుగ పేర్కొనుట క్రీ. శ. (1576 వరకును) పరిపాటి అయిపోయెను.

శ్రీరంగదేవరాయలు వహించినది త్వరలోనే ముండ్లకిరీటమై విజయనగరరాజ్య గౌరవము మరింతగా దిగజారి. తిరుమలరాయల కాలమునే మేలనిపించినది. సామంతులు ఎవరికి వారే అన్నట్లు వ్యవహరించి రాజునకు తోడ్పడరైరి. శ్రీరంగదేవరాయల నాటికి ఈ రాజవిరోధులు రాజ్యవిరోధులగు తురకలతో చేతులు కలుపు నైచ్యమునకును పాల్పడిరి. క్రీ. శ. 1576లో హండే తిమ్మప్ప తోడుచూపగా అలీ ఆదిల్ షా సైన్యములు ఆదోనికడ కూడి వెడలి పెనుగొండకు తరలినవి. శ్రీరంగరాయలు దుర్గరక్షణమును అతివిశ్వాసపాత్రుడగు సవరము చెన్నప్పకు అప్పగించి, ధనరాసులతో చంద్రగిరిలో తలదాచుకొని మాత్న మిత్రులై



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఎదురు చూచుచుండెను. ఆదిల్ షా సేనలకు పెనుగొండ చెలియలికట్ట అయినది. కాని నానాటికి పోరు ఖరమై రాజ్యముతోపాటు రాజుకూడ శత్రువులచే చిక్కు చెడు కాలము దాపురించెను. కాని అంతలో రాయల ప్రార్థన మేరకు కుతుబ్ షా పంపిన ఫౌజులు షా ముహమ్మద్ అంజు నాయకత్వమున రాయలకు సాయపడుటకునై దక్షిణాభి ముఖముగ రాసాగినవి. గోల్కొండదూత ఫజల్ ఖాన్ నేర్పు చూపి శ్రీరంగదేవరాయలను కుతుబ్ షా భేటికి కొని పోయి వారి మైత్రిని అధికము కావించెను. స్వలాభమువే కోరిన హండె తిమ్మప్ప నాయకుడు శ్రీరంగదేవరాయలు కొలిపిన ప్రలోభమునకు వశుడై ఆదిల్ షా పక్షమును విడ నాడగా సమయముచూచి సవరము చెన్నప్ప కోట తలు పులు తెరచి శత్రువులను చిచ్చరపిడుగై చెండాడెను. తన దండయాత్ర ఇట్లు విఫలము కాగా అలీ ఆదిల్ షా భగ్నా శుడై విజాపురము దారిని పట్టను.

అలీ ఆదిల్ షాను పరిత్యజించుటలో హండే తిమ్మప్ప నాయుని యోచనలే వేరు. విజాపుర సైన్యముల బలము తరుగుట పెనుగొండకడనే తెలియవచ్చెను. శత్రుబలములు ఎక్కుడగుట విజయనగర, గోలకొండల మైత్రిచే సాధ్య మయ్యెను. ఎట్లును ఓటమి తప్పని విజాపురమును అంటి పెట్టు కొనుట వెర్రి కాదా? విజయనగర, గోలకొండలలో పైచేయి గోలకొండదే. కావున తిమ్మప్పనాయకుడు గోల కొండపైననే తన ఆశ లన్నింటిని ఉంచెను. తాను ఎదురు చూడని ఈ సహకారము దొరకగా ఇబ్రాహిమ్ కుతుబ్ షా ఎక్కుడగు రాజ్యకాంక్షతో విజయనగరమువైపు దృష్టి సారించెను.

క్రీ. శ. 1578 - 79 లో కుతుబ్ షా సైన్యాధిపతి మహా రాష్ట్రుడు మురహరిరావు ముస్లిములను నడపగా ఆ సైన్య ములు కృష్ణ దాటి హండే మలకప్ప, కదంబరాయలతో కలసి తాము నడచిన త్రోవు ఎల్ల ఎడారులు కాగా తూర్పు కర్నూలును ఆక్రమించినవి. హిందువులయెడల, వారి దేవ గృహములయెడల అత్యాచారములు జరపుటలో ముర హరిరావును మించిన చేయి అన్ని ముస్లిము సేనలలోను అరుదయ్యెను. అతడు కర్నూలు మండలమును హండే వారికి అప్పగించి వైచెను. కాని వారు ఎంతో కాలము దానిని అనుభవింపలేదు. శ్రీరంగదేవరాయల పంపున తెలుగు చోడుడు కొండ్రాజు వెంకటరాజు దండు వెడలి హండే వారిని నురుమాడి వారి రాష్ట్రమును ఆక్రమించు కొనెను (క్రీ. శ. 1579).

క్రుద్ధుడగు ఇబ్రాహీం కుతుబ్ షాకు కసి తీర్చుకొను అవ కాశము త్వరలో లభించెను. విజయగర్వి కొండ్రాజు వెంకటరాజు తనసోదరులతో వెడలి 'సారి' కుటుంబము వాడగు ఓబళ నాయకుని ఓడించి అతని భూములను కైకొనెను. ఓబన శరణు చొరగా అభయ మిచ్చిన వెలు గోటి రంగప్ప బావ దామెర్ల వెంకటపతిద్వితీయుడై రెండువేల సైన్యమును తరల్చెను. కొండ్రాజు సోదరులు, మట్లి తిమ్మరాజు కలసి కడప మండలములో కోడూరివద్ద వారిని ప్రతిఘటించిరి. క్రీ. శ. 1579 వ సంవత్సరము సెప్టంబరు 27 తేదిని సంకుల సమరము జరగెను. రంగప్ప శూలాఘాతమున మట్లి తిమ్మరాజు మడిసెను. కొండ్రాజు సోదరుల బలము పటాపంచలయ్యెను. 'సారి' ఓబళనాయ కుడు తన భూములలో మరల నిలుకడ గనెను.

విజయనగర శత్రువులకు కన్నులపండువుగా ఈ యంతః కలహములు సాగిపోయెను. గృహకల్లోలములలో మునిగిన నాయకులు ఇబ్రాహీం కుతుబ్ షా సేనలు క్రీ. శ. 1579 లో మార్చి 29 తేదినాడు విజయనగరముపై దాడివెడలుటను గుర్తింపరైరి. ముస్లిము నాయకుడు హైదర్ ఉల్ ముల్క్ బెల్లంకొండ, వినుకొండ, నాగార్జునుని కొండలను జయించి కొచ్చెర్లకోటకడ వెలుగోటి కస్తూరి రంగప్ప సేనలు విడిసియున్నవని విని వానికి అభిముఖముగ నడ చెను. కాని వెలుగోటి సేనలు ముస్లిములకు పోరు చూపక వెనుదీయగా వారు విజయోత్సాహమున కదలి ఉదయ గిరిని ముట్టడించి దుర్గాధిపతియగు వెంకటరాజును పార దోలి దానిని ఆక్రమించిరి. ఇట్లు కృష్ణ మొదలు ఉదయగిరి పర్యంతము తురకల రాజ్యము విస్తరిల్లినది. కస్తూరి రంగప్ప తన బల మంతయు వినియోగించి ముప్పదివేల సేనతో ఈ ప్రళయమును అవుటకు ప్రయత్నించెను. కాని వానికి కాని కాల మాసన్నమైనది. రంగప్ప బలముతోపాటు హిందువుల పాటు తప్పదయ్యెను. కొండవీటిలో రామ రాజు అల్లుడు గొబ్బూరి తిమ్మరాజు వెలుగోటి తిమ్మా నాయకుని సాయముతో ముస్లిములను ఆగెను. దాని ప్రతి ఘటనము బలవత్తరము కాగా విధిలేక హైదర్ ఉల్ ముల్క్ గోలకొండనుండి అధిక సైన్యములను అర్థించెను. వానితోపాటు వచ్చిన నూత్న సైన్యాధిపతియు అశక్తతనే చూపగా కడకు స్వయముగ మురహరిరావే నాయ కత్వము వహించెను. పౌరుషమును మించిన మంత్రబలము కల మురహరిరావు మిక్కుటముగు సొమ్మును ఆస చూపి వెలుగోటి తిమ్మానాయకుని లోగొనగా ద్రోహి అతడు దుర్గరక్షణమును ఒప్పరికించెను. క్రీ. శ. 1580 ఏప్రిలు 29 తేది నాడు కొండవీడు ముస్లిముల చేజిక్కెను.

తలవని తలంపుగా విజయనగర రాజ్యమునకు ఊపిరి త్రిప్పుకొను అవకాశము కల్గెను. కొంచెము ముందు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వెనుకగ విజయనగర రాజ్యమునకు విషమమగు ఆ 1580లో ననే బద్ధశత్రువులగు అదిల్ షా, కుత్బ్ షాలు మరణించిరి. అలీ ఆదిల్ షాను ఎవరో హత్య గావించిరి. ఇబ్రహీం కుత్బ్ షా మరణింపగా అతని కుమారుడు ముహమ్మద్ కులీ కుత్బ్ షా రాజ్యమునకు వచ్చెను. రెండవ ఇబ్రాహీం ఆదిల్ షా చిన్నవాడగుటచే తల్లి చాంద్ బీబీ రాజ్యమును నిర్వహింపసాగెను. అట్లే కానినాడు గోల్కొండ, విజాపురముల వలన శ్రీరంగ దేవరాయలు ఎన్ని యిడుమల బడియుండునో !

జాతినైతికబల మంతగా క్షీణించినది. పాపము శ్రీరంగ దేవరాయలు తన యసహాయతకై వగచెను. ఈ క్లిష్ట సమయమున అతనికి సోదరులు సైతము తోడు చూపకుండుటకన్న విషాదకర విషయము ఏ ముండును ? పాలనసౌష్ఠవమునకై తిరుమల రాయ లొనర్చిన రాజ్యవ్యవస్థ యీ విధముగ రాజ్య విభజనకు దారి చూపినది. ఇట్లు తనకు తనవారే పగవారు కాగా రాజ్యము నానాటికి క్షీణించుచుండగా క్రీ. శ. 1585 వ సంవత్సరము నవంబరు 29 తేదీ పార్థివ ధనుస్సంక్రమణానంతరము అపుత్రకుడు శ్రీరంగ దేవరాయలు తనువు చాలించెను.



చిత్రము 66. రాణి మహలు, చంద్రగిరి

రెండవ వెంకటపతిదేవ మహారాయలు (క్రీ.శ. 1586 - క్రీ. శ. 1614) : శ్రీరంగరాయలు గతించెను. తరువాత రాజు ఎవ్వరు ? శ్రీరంగరాయల తరువాతివాడును, శ్రీరంగ పట్టణమున రాజప్రతినిధియు అగు శ్రీరామరాజు అప్పటికే చనిపోయెను. తిరుమల, శ్రీరంగ చిక్కరాయలు ఇంకను పసివారు. స్వలాభపరులగు సామంతులు బలహీనుడగు రాజునే కోరుదురు. కాని అప్పటి ముస్లిముల ఉద్ధతి విజయనగర సింహాసనమున బలహీనులకు తావిచ్చినది కాదు. చంద్రగిరి రాష్ట్రనేత వెంకటపతిరాయలొకడే అందరికి అభిగమ్యుడయ్యెను. మైసూరులోని చెన్నపట్టణమును జగదేవ రాయలు పాలించుచుండెను. ఆ జగదేవుని ఉత్సాహ మంత్రశక్తులచే ఎల్లరును వెంకటపతినే రాజుగ వరించిరి. ఇట్లు అన్నబిడ్డల యధికారమును వీటిపుచ్చి వెంకటపతిదేవ మహారాయలు పార్థివ ఫాల్గుణ శుద్ధ 1 (9-2-1586) నాటికి పెనుగొండలో కుదురుకొని పాలింప నారంభించెను.

గోలకొండ చేతులలో చిక్కిన విజయనగర భూములను మరల కైకొనుట వెంకటపతిదేవ రాయల ప్రథమ కర్తవ్యమయ్యెను. వెంకటపతిదేవరాయలు తన ముఖ్యపట్టణమును చంద్రగిరినుండి పెనుగొండకు మార్చుటయే తనతో చేసికొన్న ఒడంబడికకు విరుద్ధమని గోలకొండ సుల్తాను తప్పు వట్టెను. ఇది చిత్రము. ఆ యొడంబడిక యెట్టిదో ! శ్రీరంగ రాయలకు విరుద్ధముగ గోలకొండవారి యాక్రమణ కాలమున పెనుగొంఢ విషయమున తన జోక్యము ఉండదని వెంకటపతి హామీ ఇచ్చెనేమి ? కుత్బ్ షా ఆగ్రహమునకు వేరు కారణము సైతము ఉండెను. కొంతకాలముగ కొండవీడు రాజ్యమున పరిస్థితులు విషమముగ నున్నవి. అచటి పాలకుడగు రాయరావును గోలకొండ ముస్లిము సర్దార్ అలీఖాన్ లూర్ ఎదిర్చెను. రాయల అల్లుడగు మేకూరు తిమ్మయ అలీఖానుకు తోడై తన దండును కంబమువరకును నడపెను. అచట జరగిన యుద్ధమున రాయలసేనలు పరాజితములైనవి. కాని అలీ ఖానుమాత్రము కొండవీడు ప్రాంతములలో తన విద్రోహ చర్యలు విరమింప డాయెను. క్రీ.శ. 1589 వ సంవత్సరము ముగియక మునుపే ఉదయగిరి రాయల యధీనమై అచట కౌలానందుడు పాలకుడయ్యెను. ఇన్ని కారణములుగ కులీ కుత్బ్ షా విజయనగరముతో యుద్ధము నిశ్చయించెను.

గోలకొండ ప్రధాని అమీర్ ఉల్ ముల్క నాయకుడుగా ముస్లిము సేనలు కృష్ణ దాటి మువలిమడుగు దుర్గమును ఆక్రమించి గండికోటవైపు నడచినవి. నంద్యాలలో అళియ రామరాయల అల్లుడైన బసవంతరాజు కలగూరు ప్రభువును, తనకు అల్లుడును అయిన నరసింహరాజును సాయముగా కొని పైకొనివచ్చుచున్న తురకల దళములకు అడ్డు తగిలి పోరునిచ్చెను.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కాని తురకలశక్తి వారికి వెక్కసమై వారు ముస్లిము లకు వశులై ఏటేట కప్పము కట్టుటకు అంగీకరించిరి. వారి ఓటమితో పరిసరములనున్న జమ్మలమడుగు, జూటూరు, సిరివెళ్ళ, నందవరం, ఆని ప్రభువులు ముస్లిము లకు సామంతులైరి. ఇట్లు కర్నూలు మండల మంతయును, అనంతపురము, కడపలలో నధిక భాగమును నమ యధీనము కాగా ఉప్పి అమీర్ ఉల్ ముల్క్ ముందుకు సాగి గండి కోటను ముట్టడించెను. దుర్గాధిపతి నంద్యాల నరసింహా రాజు వెంకటపతిదేవరాయలకు దూరపు చుట్టమే. చేత సైన మేరకు అతడు పోరి పోరి తుదకు తానును ముస్లిములకు దాసోహ మనెను. ఇన్ని విజయసంపదలతో ఘూర్ణిల్లు చున్న ముస్లిము సేనార్ణవము సుల్తాన్ కులీ కుతుబ్ షా రాకతో మరింత పొంగి పెనుగొండపై పొరలెను.

వెంకటపతిదేవరాయలు మహారాజై రాజధాని పెనుగొం డకు మార్చుకొని కొంత కాలమైనను కాలేదు. అంతకట్లు సీమ సామంతులు ముస్లిములకు వశులైరి. ఇతర రాజ్యభాగ ములనుండి తాను అర్థించిన రాణువలతో ఆయాసామం తులు ఇంకను తడవు చేయుచుండిరి. అదాటున వచ్చిన ఈ ముట్టడికై పెనుగొండ ఆయత్తము కాదు. ఇన్నింటిని సరి చూచి, నిలువద్రొక్కుకొనుటకు కావలసినది కాల వ్యవధి. అందుచే వెంకటపతిరాయలు గోపరాజు తిమ్మ మంత్రిని, సేనాపతి పాపయశ్రేష్ఠిని సంధి కూర్చు నెపమున కాలయాపనము చేయ దూతలుగ నియోగించెను. వీరి మాయలలో చిక్కిన సుల్తాన్ కులీ హిందువులు నేడో రేపో తన వశులే అని నమ్మి కోటకు అనతిదూరమున విడిసి ఏమరుపాటున ఉండెను.

అది అపకాశముగా వెంకటపతి యుద్ధమునకు సన్న ద్ధుడాయెను. నెలల తరబడి తరుగని వస్తు సంభారములు కోటలో కూర్చబడినవి. నాల్గవ నాటికి ముప్పదివేల పదా తులు, నాల్గువేల తుపాకి ఫౌజుతో జగదేవరావు, గుఱ్ఱంగ. శ్రేష్ఠి, మానువరాజు, పాపయసామివారు, తంజావూరు రఘునాథనాయకుడు, మట్లి అనంతరాజు, వెలుగోటి కస్తూరి రంగయ, వెలుగోటి చెన్నయ, అతని కొడుకు వెంకటపతి అందరును కోటలో ప్రవేశింపగల్గిరి.

సుల్తాను ఈ మోసము గ్రహించునంతలో అంతయును చేయి మించిపోయెను. ముట్టడి సాగు ఉపాయము లేదు; ప్రయోజనమును కానరాదు. వర్షకాలము ఆసన్న మాయెను. కృష్ణ వరద పారినచో కోటలోని శత్రువుల కును, కృష్ణావాహినికిని నడుమ అతనికి అధోగతి తప్పదు. శాత్రవుల ధాటి అప్పటికి అప్పుడే అధికాధిక మయ్యెను. మట్లి అనంతరాజుతో పోరులో అతని విజయగర్వము అప్ప

ఢీకొడించెను. తంజావూరు రాజసుతుడు రఘునాథనాయని పరాక్రమమున ఎందరో ముస్లిములు ఆహుతి అయిపోయి నారు. ఒకనాటి యుద్ధమున జగదేవరాయలు సుల్తాన్ విడిదిపై సరభసముగా దుముకగా ముర్తజా, నూరి ఖానుల సేనలు విరిగినవి. చిత్తా ఖాన్, సొజాత్ ఖానులు మడిసిరి. చౌరన్ ముల్క్ శరణు వేడెను. బ్రతికిన చాలునని పలా యితుడైన సుల్తాను తన జయించిన గండికోట, నంద్యాల, ముసలి మడుగుల రక్షణమునకు క్రమముగ సంజర్ ఖాన్, జగిలరావు, అశ్వారావులను నియమించి ఆక్రాంత భూము లలో సర్వస్వాధికారిగ ముర్తజా ఖానును ప్రతి ష్ఠించెను.

ఇ వన్నియు హనుమంతుని ముందు కుప్పిగంతులయి నవి. పెనుగొండ సేనలు గుత్తిని కైకొని గండికోటను తాకినవి. దుర్గమును కాపాడుకొనుటకు కొండవీటినుండి బయలుదేరిన తురకల సేనలను ఉదయగిరి కోలానందుడు చెల్లచెదరుగ కొట్టి గోలకొండ భూములను వెంపర లాడెను. కొండవీటి పాలకుడు ఎట్టకేలకు ఉదయగిరి సీమ లోనే అల్లరులను రేపగల్గెను. ముస్లిములు రాపెళ్ళవారు నడపిన ఒరియా మన్నెదొరలతో బయలుదేరి పడవ సిద్ధవటములోని కలమకూరువద్ద దండు విడిసిరి. ఈ సైన్య ములో కొందరను నడపుచు రావెళ్ల నాయకుడు ఒకడు దక్షిణముగా సాగి గుఱ్ఱంకొండ దుర్గమును పట్టెను. రాయల సేనాముఖమున మట్లి అనంతరాజు, కస్తూరి రంగ ప్పలు నడచినారు. కలమకూరులోని ఘోరాజిలో విరిగిన శత్రువులను రంగప్ప కొచ్చెర్లకోటవరకు తరిమికొట్టెను. అనంతరాజు గుఱ్ఱంకొండను బ్రహ్మ ప్రయత్నముపై ఎట్ట కేని సాధించెను. ఒక లక్ష విజయనగర సైన్యము ఎఱ్ఱ తిమ్మరాజు, యాచప్రభృతుల నాయకత్వమున గండి కోటపై నడచినది. వీరిని ఆ ప్రయత్నమునుండి మరల్చు టకై ముర్తజా ఖాన్ చేసిన యత్నము లన్నియు భగ్నము లయిపోయెను. సుల్తాన్ కులీ పంపున రుస్తుం ఖానుడు ఐదువేల గుఱ్ఱములతో వెడలి ముర్తజా ఖానునకు పైదళవాయిగ యుద్ధము సాగించెను. పినాకినీ తీరమున జరగిన యుద్ధమున అసంఖ్యాకముగ ముస్లిం సేనలు మడిసి నవి. వెలుగోటి చెన్నప్ప, యాచమనాయకుడు గండికోటను వశమొనర్చుకొనిరి. పరిసరములలోని ఇతర దుర్గములును హిందువులకు చిక్కినవి. ఇన్ని దినములుగ ఆత్మరక్షా యత్నములందే సర్వ శక్తులు వినియోగించుకొనుచు వచ్చిన హిందువులు ఇప్పటికి శాత్రవ మండలములనే రణరంగము లుగ జేయ సమర్థులైరి. కాని బహిశ్శత్రువులకన్న అంత శ్శత్రువులనుండి రానున్న ప్రబలమైన ఆపదను గుర్తించిన



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చిన వెంకటపతి అంతతో తృప్తుడై కులీ కుత్బ్ షాతో సంధి ఒనర్చెను. కొండవీడుమాత్రము ఇంకను సుల్తాను వశమువనే నిల్చెను. ఇతరప్రాంతములలో కృష్ణానది ఎల్లగ ఇరువురును అంగీకరించిరి.

వెంకటపతిదేవరాయల రాజ్యాధికారము ద్రావిడ మండలములో వలె కన్నడమునందలి సామంతు లొప్పుకొన్నదికాదు. ఆరవీటి తిరుమలరాయల పాలనమునే కాదన్నవారు వెంకటపతిరాయలను సహింతురా? అన్నయగు శ్రీరంగరాయలకు ఆపదలో సాయపడుట మాని అతడు మీదు మిక్కిలి ఎగ్గునే తలపెట్టినాడు. అన్న శ్రీరామరాయల పుత్రులగు తిరుమలరాయ, శ్రీరంగ చిక్కరాయలదికదా రాజ్యము? వారికి ప్రాపుగనుండుట మాని వారు అటు శ్రీరంగపట్టణమున ఉండగనే తాను రాజుగ అభిషిక్తుడయ్యెనే? ఇన్ని కారణములచే ముస్లిముల దాడియదనుగా కోలారు ప్రాంతములలోని తమ్మనగౌడుడాదిగా పలువురు వెంకటపతిరాయల కెదురుతిరిగి కప్పము కట్టుట మానిరి. గోలకొండవారి ఆగడము అరడిపోయినంతనే వెంకటపతిదేవరాయలీ విద్రోహులను అణపబూనెను. తంజావూరు రఘునాథనాయకుడు, వెలుగోటి కస్తూరి రంగప్ప, మట్లి అనంతభూపాలుడు తోడుగా రాయ రాణువలు కోలారును ముట్టడించినవి. కోటపై నడచుటకై అనంతరాజును నియమించి, వెంకటపతిదేవరాయలు ముందు సాగి క్రొత్త కనుమ వద్ద విరోధిసేనలను ఎదురు తాకెను. కస్తూరి రంగప్ప విజృంభించి శత్రు వ్యూహములు చెండాడి తమ్మయ్యగౌడుని బందీగా కొని రాయలకు అప్పగించెను. కోలారు అవంతుని వశమై తాను రాయల బందీ అగుటచే తమ్మయ్యగౌడుడు ఈయవలసినపైక మెల్ల చెల్లించి వెంకటపతిదేవరాయలకు సామంతుడయ్యెను.



చిత్రము 67. రెండవ వెంకటపతిదేవరాయలు

తమ్మయ్యగౌడునివలెనే వెంకటపతిరాయలను అలయించిన ఇంకొకాతడు నందేల కృష్ణమరాజు; వెంకటపతిదేవరాయలకు దూర సంబంధి. తన తండ్రి నరసింహరాజు తురకలతో పోరి విధిలేక వారికి సామంతుడయ్యెను. నాడు ఆతనికి వెంకటపతిదేవరాయలు ఏమియు సాయము చేయలేదే? అట్టిచో తనపై అధికారము సలుపుటకు రాయలెవడు? ఎదురు తిరిగిన కృష్ణమరాజునకు పొత్తపి, సిద్ధవటసీమాధిపతియగు కొండ్రాజు తిరుపతిరాజు సహాయుడై మట్లివారి అమరము భూములను ఆక్రమించెను. కందనవోలు పురాధీశుడును, వెంకటాద్రి మనుమడును అగు గోపాలరాజు వారిరువురికి బాసటయై నిలచెను. వారలకు ఎదిరి రాయల పక్షమున నిల్చినవారు మట్లి అనంతనృపుని తండ్రి ఎల్లమరాజు, హండే దేవప్పనాయకుడు, పెమ్మసాని తిమ్మనాయకుడును. ఇరువాగులవారిని చూడగా పూర్వమున్న కుటుంబ కలహములు క్రొంగ్రొత్త రూపములతో తిరిగి అవతరించిన చందమాయెను. కొండ్రాజు తిరుపతిరాజు రాయ భూముల పొలిమేరలోని ఊటుకూరి గవను కాచుకొనగా నందేల కృష్ణమరాజు తరలి జంబలమడుగులో రాయలను తలపడెను. విజయము వెంకటపతిదేవరాయలనే వరించినది. విరిగి పారిన కృష్ణమరాజు నందేలకోటలో దూరి తలుపులు గడియవైచి నిలిచెను. అతనిని తరిమి నడచిన రాయలు కోటను చుట్టుముట్టివైచెను. ఈ ముట్టడి మూడు నెలలు సాగినది. కృష్ణమరాజు విసివి రాయలతో సంధి కూర్పుమని ఎల్లమరాజును వేడెను. అతడు ఇయ్యకొని నెరపిన రాయబారముల ఫలితముగా కృష్ణమరాజునకు దక్కినది అతని ప్రాణములు మాత్రమే. అతని భూము లెల్ల హండేవారికిని, పెమ్మసాని వారికిని రాయలు పంచిపెట్టెను. పెమ్మసాని వంశ్యులకు నాటినుండియు గండికోట రాజధాని అయ్యెను. చంద్రగిరి చెరసాలలో చివికి చివికి నందేల కృష్ణమరాజు మరణించెను.

కొండ్రాజు తిరుపతిరాజు భూములను అమరముగా వాసచూపి వానిపైకి మట్లి యెల్లమరాజును రాయలు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఉసికొల్పెను. ఊటుకూరికడ జరగిన యుద్ధమున తిరుపతి రాజు ఉసురులను కోల్పోయెను. దిక్కు దిక్కులకు పారిన వాని దళములను ఎల్లమరాజు ఫౌజులు కసిమసంగినవి. పులుగులనాడును, సిద్ధవటము సీమయును, చెన్నూరు, దువ్వూరు, కామలాపురము, పోరు మామిళ్ల, బద్వేలు మున్నగు విస్తృత భూములును మట్లివారికి అమరముగా లభించినవి.

క్రీ. శ. 16వ శతాబ్దము ఇట్లు గడచిపోయినది. రాచరికమువారి విధులును, కార్యాచరణములును అమరనాయకుల కుటుంబవ్యవహారములతో, కలతలతో పెనవైచుకొన్నవి. తరతరములుగ తమ హక్కు భుక్తములుగ ఉన్న భూములు ఇట్లు రాజుజోక్యముచే తమ వైరివర్గము పాలయినపుడు ఏ అమరనాయకుడు మాత్రము ఏమని తృప్తుడగును? విజయాహ్లాది వెంకటపతిదేవరాయల అనుగ్రహము వెలుగోటి కస్తూరి రంగప్ప కొడుకు యాచమనాయకుని పెరుంబేడు సీమకు అధిపతిని చేసినది. నేటి చెంగల్పట్టు మధురాంతకములగు ఆసీమ వేలూరు నాయకుని అధీనమునకు చెందినది. వేలూరికి అధిపతియగు లింగమనాయకుని ఖండించుటకే కాకున్న యాచమనాయకునకు జాగీ రేల? జాగీరు అందెనేపో, మధురాంతకము రాజధానిగా తా నింకను కుదురు కొనెనో లేదో ఇంతలో యాచమనాయకుడు హుటాహుటిగ దండెత్తి ఉత్తర మల్లూరును ఆక్రమింప నేల? ఉత్తరమల్లూరిని కోల్పడిన నాగన తన నమ్మినబంటు సాయము వేడగా వానికి అభయమిచ్చుట లింగమ నాయకునికి తప్పరానిది. యాచమ నాయకుడు పారి పారి పోవువాడు కాడు. వాని ప్రాపు స్వయము వెంకటపతిదేవ మహారాయలు. లింగమనాయకుడు బహుళ యత్నము లొనర్చెను. తన బంధుమిత్రులగు అమరనాయకులను ఎల్లరిని రావించుకొనుటేకాక మధుర, తంజావుర, చెంజినాయకులకు ఆహ్వానములు పంపెను. వారు పంపిన దళములును, లింగమనాయకుని యర్థనవలన వచ్చిన తిరువడి, వలదాపురము, వందవాసి, పెంగోటూరు, తిరువత్తూరు, అనమందూరు, వత్తలై, ఆర్కాటుల ఫౌజులును, చిరకాలముగ తమ్ము సేవించుకొనుచుండిన పడవీడు పాళెగాండ్ర పలుమూకలును చేరగా లింగమనాయకుని ఉత్సాహ శక్తులు అధికాధికము లయ్యెను. నాగన సూచన మేరకు అతని బావను దావుల పాపానాయకుని సర్వసైన్యాధిపతిగ అభిషేకించిరి. ముప్పది వేల పదాతులును, పండ్రెండు వేల తుపాకులవారును, పది వేల ఈటెలవారును, అయిదు వేల బందూకులును, వేయి గుర్రములును, మూకేనుగులతో ఒక వేయి మంది నాయకులు పల్లకిలలో కదలి రాగా పాపయ నాయకుడు బలము మెరసి క్రీ. శ. 1601 మే 31 ఆదివారమునాడు ఉత్తర మల్లూరు తూర్పుగవనుకడ తన శిబిరము విడియించెను.

ధైర్య హేమాచలుడగు యాచమనాయకుని శౌర్యపారమున కొక కొలకుండ ఇట్లు ప్రాప్తించెను. వీరోచితముగ అతడు యుద్ధ సన్నద్ధుడై వారువము నెక్కి తమ్ముడు సింగననాయకుడు మదగజముపై వెంట రాగా మెరికలగు మూడువేల వెలమ ఒంటరులతో శత్రువులపై చిచ్చరపిడుగై దూకెను. వెక్కసమగు వారి ప్రతాపమునకు ఎందరో అరివీరులు బలియైరి. పాపానాయకుడు హతుడాయెను. ఖడ్గాహతులై పిక్కబలము చూపలేని దామెర్ల కరిచెన్నమ నాయ డాదిగాగల కొందరు బందీలయిరి. యాచమనాయకుడు ప్రతాప కీర్తులు ఇట్లు దిగంతములకు పర్వగా అద్భుత విజయియు, వినీతుడు అయిన ఆతనిని రాయలు ఆస్థానమునందు అతివేలముగ సంభావించెను.

ఉత్తరమల్లూరు యుద్ధమున యాచమనాయకు నెదిరిన వారిని ఎల్లరను వేర్వేరుగ తన యధీనుల నొనర్చుకొనుటకై వెంకటపతిదేవ మహారాయలు విజయయాత్ర నెరపెను. మట్లి అనంతరాజు నాయకత్వమున కదలిన ఆ సేనతో అనంతుని కొడుకు తిరువెంగళనాథుడు, రెండవ ముకుందాగలు చిక్కరాజు, దామెర్ల కరిచెన్నమనాయడు ముఖ్యులు. దారిలో వారిని ఆగిన లింగమనాయని సేనలు మిన్నలి బయలున జరగిన సమరమున పరాభూతములు కాగా రాజవరూధిని కావేరి దాటి చోళ రాజ్యమున ప్రవేశించినది. గూడలాత్తూరు యుద్ధమున చోళులు ఓటమిని అంగీకరించిరి. ఆ తరువాత పాండ్య భూములను రాపాడుచు సాగిన మట్లి అనంతరాజును పాండ్య దేశాధీశు డెదుర్కొనెను. నాటి తుముల యుద్ధమున నతడోడెను. వాని మీన కేతనము రాజసైన్యముల చే జిక్కెను.

ఈ విజయపరంపరల ఫలితముగ వెంకటపతిరాయల అధికారము ఎల్లెడల విస్తరించెను. దేశము నిశ్శాత్రవమగుట కింక ఒక్క లింగమనాయడే అడ్డు. దుర్భేద్యమగు వేలూరు దుర్గము పరిరక్షించుచుండగా లింగమనాయకుడు రాయల చక్రవర్తిత్వమును తృణీకరించుట ఏమి వింత! వేలూరును పట్టుటకు వెంకటపతికి శౌర్యము అక్కరకు రాలేదు. దామెర్ల కరిచెన్నమనాయని ఉపదేశమున తంత్రముచే ఆత డాదుర్గమును సాధించి లింగమనాయకుని చెరగొనెను. వేలూరు నగర ప్రాశస్త్యము పెరిగిన రాయలకు నాటినుండి పెనుగొండ, చంద్రగిరులవలెనే వేలూరు గూడ రాజధానీపట్టమహిత మాయెను.

అంతశ్శత్రువులతో నింతగా తలమున్క లగుచున్న వెంకటపతిదేవరాయలను సహజ శత్రువులగు మునల్మానులు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఆయుధమున వెనకకుండుట ఒక విశేషము. క్రీ.శ. 1526 లో ఢిల్లీలో మొగలాయి సామ్రాజ్యమును బాబరు నెలకొల్పెను. బాబరుని మనుమడు అక్బరు. వాని బల ప్రతాపములకు క్రీ. శ. 1600 లలో అహ్మదు నగర రాజ్యము లొంగి పోయెను. ఖాందేశములోని అసిర్ గఢ మతని వశమగు టకు ఎంతో కాలము పట్టదు. దక్కనులోని ముస్లిము సుల్తానులు ఆత్మరక్షణకే తమ సర్వశక్తులను వినియోగించుట విధియయ్యెను. వెంకటపతిదేవరాయలను వారు ఎట్లును ధర్షింప జాలరు. నాటికే అక్బరు రాయబారులు రహస్యముగ చంద్రగిరి చేరి రాయలతో సంప్రతించిన వార్త వెలికి పొక్కినది. ఇది దక్కను సుల్తానులకు భయకారణమేకదా! కాని వెంకటపతిదేవరాయలకు సయితము ఈ పరిస్థితులు చిత్తశాంతి కూర్పవయ్యెను. సాటి ముస్లిము రాజ్యములను కబళించు అక్బరు హిందూసామ్రాజ్యమును మన్నించునేమి? ఇట్టి యోచనలతో వెంకటపతిదేవరాయలు సర్వ సన్నాహములు కావించి జాగరూకుడయినాడు. మొగలు రాయబారులు చంద్రగిరి దరియు నాటికే విజాపురము సుల్తాను ఇబ్రాహీం ఆదిల్ షా దూతలుకూడ అచటనే రాయలను ప్రసన్ను నొనర్చు ప్రయత్నమున నుండుట కానవచ్చెను. ఆయారాయబారముల ఫలితములు తేలకుండగనే క్రీ. శ. 1605 లో అక్బరు మరణించెను.

విజయనగర రాజకీయములలో పోర్చుగీసుల, ఒలాందుల ప్రతిస్పర్ధ వెంకటపతిదేవరాయల నీతిజ్ఞతను వెలికి తెచ్చినది. వారి యూరోపీయ వైరములకు రాయభూమి సమరరంగమయ్యెను. రాజు ఇర్వురి మైత్రిని ఆకాంక్షించెను. పరస్పర విజిగీషువులు వారు రాయశాసనమును మన్నించుట ఎట్లు ? గోవా చంద్రగిరి మార్గము రాయబారి ప్రతిరాయబారి వర్గములతో ఆకీర్ణమాయెను. జెసూయిట్ మిషన్‌వారికి ఆశ్రయ మిచ్చినందులకు తన కృతజ్ఞతను తెల్పుచు స్పెయిన్ పోర్చుగలుల ప్రభువు మూడవ ఫిలిప్ క్రీ. శ. 1607 లో వెంకటపతిదేవరాయలకు లేఖ పంపెను. ఎరుక చేతను, తాను నెరపు నధికారమునను, ఉచితా నుచితములరసి మెలగుటందును వెంకటపతిదేవరాయలసాటి యరిది అని నాటి యూరోపులో తజ్ఞు లనిరి. ఫిలిప్ నృపాలునంతటి వాడు తన్ను అభినందించుట కుబ్బి రాయలు బుడత కీచులకు అభ్యుదయము కూర్ప యోచించెను. చెంజీనాయకుని అనుమతి పడసి వాని యధీనములోని దేవన పట్టణమున ఒలాందులు తమ కర్మాగారములను నిర్మించుకొని యుండిరి. ఇపుడు వెంకటపతి ఒత్తిడికి వారు ఆ తావులు వీడిపోవయ్యెను. ఒలాందుల కర్మాగారములు పోర్చుగీసులకు ఇరవయ్యెను.

కాని రాయల ఈ మైత్రిని బుడతకీచులు చిరము నిల్పుకొనలేదు. క్రీ. శ. 1610 లో వారి జెసూయిట్ మిషన్ హిందూరాజున కనువర్తులయిరను కారణమున స్పెయిన్‌కు తిరిగి పోవలసివచ్చెను. వెంకటపతిదేవ రాయలకు ఇది సహింపరానిది. తత్ఫలితముగ పోర్చుగీసుల తరుగుట ఒలాందుల పెరుగుట కయ్యెను. ఆ వత్సరముననే వారి రాతి కట్టడములును, వర్తకశాలలును పులికాటులో ప్రబలినవి. వారి వైరుల నెవ్వరిని ఇందు రానీయనన్న రాజు వాగ్దానమున వారి యుత్సాహము ఇతోధిక మయ్యెను.

బుడతకీచులు ఈ పరిభవమునకు కనలి, బలములు కూర్చుకొని పులికాటుపై దాడిచేసిరి. కాలము కాదని ఒలాందులు అప్పటికి ఆ స్థలము వీడిపోయిరి. కాని అచిరకాలముననే వెంకటపతిదేవరాయలు వారికి తోడ్పడుటతో బుడతకీచులు పులికాట్ నుండి వికావికలై పారిపోయిరి. నాడు అందు ఒలాందులు నిర్మించిన కోటనే తరువాత గెల్ద్రియా నామముతో వ్యవహరించినారు. క్రీ.శ. 1614లో వెంకటపతిదేవరాయలు చనిపోవుటతో ఒలాందుల ఈ ప్రాభవము కొంత కొంత మందగించెను.

వెంకటపతిదేవమహారాయల పరిపాలనము ఈ రీతిగ ముప్పదేండ్లు గడచినది. విజయనగర సామ్రాజ్యము మరియొకమారు తొల్లిటి రూపరేఖల నలవరచు కొన్నది. రాక్షసి - తంగడి ఒక పీడకల. నాడు కర్ణాటక సామ్రాజ్యము నష్టము కాలేదు ; కేవలము ఊగిసలాడినది. ఇపుడు అది చేవ మిగులగా యవనపదదళనాకులములగు ఉత్తర భూములలోని పాడువడ్డ గ్రామములు మరల విజయనగర జనపదము లయినవి. నిజ, పర శత్రుదారితమైన ఆ భూమి అప్పటికి నిశ్శాత్రవమై నిలుకడగని, నిడుదయై ఉత్తరమున కృష్ణవేణి పొలకలు పోయినది. ప్రబలశత్రువులు ఇట్లు చెదరి, రూపరి, అడగారగా దక్కను సుల్తానులకే కాక ఢిల్లీ, స్పెయిన్ రాజులకును వెంకటపతిదేవరాయల మైత్రి యభ్యర్థనీయమైనది. అది ఆ రాయల ప్రభావము ; విజయనగరరాజ్య ప్రాభవమును.

**రెండవ శ్రీరంగదేవరాయలు** (క్రీ. శ. 1614 - క్రీ. శ. 1619) : వెంకటపతి రాయలనాటి ఆ పొంగులు, అనిగ్గులు చిరము నిలుచు నాశ అగపడదు. అతని రాణు లార్గురికిని సంతతి లేదు. అందు ఒకర్తె గొబ్బూరి ఓబరాజదుహిత బాయమ్మ ; అళియ రామరాజు దౌహిత్రి. పుత్రవతిగా నోచక విసివి, తెంపరియై ఆమె చూలాలితనము నటించి అదనైన తరి ఒక బ్రాహ్మణ శిశువును రహస్యముగ సంతికమునకు రావించి తన కాన్పేయని పురుడు పోసికొనెను. మోస మెరిగియు రాజు ఇంటి గుట్టు కాచుకొనువాడై



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తత్కాలోచితముగ మెలగెను. వానికి పదునాలుగేడులు రాగానే బాయమ్మ సోదరుడగు జగ్గారాయని కూతు నిచ్చి పెండ్లి సైతము కావించెను. కాని తన అవసానకాల మాసన్నము కాగా రాజు తన యన్న శ్రీరంగపట్టణసేత రామదేవరాయల రెండవ కొడుకు శ్రీరంగ చిక్కరాయ లను తన తరువాతి రాజుగ నియోగించెను.

క్రీ. శ. 1614 ఆగస్టులో వేంకటపతిదేవరాయల మరణా నంతరము శ్రీరంగదేవరాయలు రాజయ్యెను. గొబ్బూరి జగ్గరాజును, అతని అనుయాయులగు మాకరాజు తిమ్మా నాయకులును రాజవిరోధులై అదను వేచిరి. పాలనదక్షత లేని శ్రీరంగదేవరాయలకు త్వరలో శత్రువులు ఎక్కువైరి. రాజు తంజాపురము పోయినతరి అతని మెప్పు గన్న వెల్లా లులు ఎందరో అధికారపదవు లలంకరించిరి. రాజసేవలో పండి సంపన్నులైన వారినుండి భూధనాభరణములను రాజు అభిలషించెను. ఇక జగ్గరాయల పక్షము సకల ప్రభు సమా శ్రితము కాకేమి ? భక్తి నెరపు మిషతో రాజదర్శనమునకు నెల వందిన గొబ్బూరి జగ్గరాజు మాకరాజు, తిమ్మా నాయకులతో సమరధూర్వహులును, విశ్వాస పాత్రులును అగు భటులతో కోటలో జొచ్చి రాచనగరు చుట్టివైచి శ్రీరంగదేవరాయలను దారాపుత్రముగ చెరవెట్టెను. జగ్గ రాజు అల్లుడు రాజ్యప్రతిష్ఠితు డాయెను. అచట చేరిన ప్రభువు లెల్లరు అతనికి ప్రణమిల్లి తమ భక్తి విశ్వాసములను ప్రకటించిరి.

దైవోపహతుని శ్రీరంగదేవరాయలను తక్కిన నాయకు లెల్ల విడనాడగా ఒంటరియును, పోటరియునగు వెలుగోటి యాచమ నాయకుడు జగ్గరాయల చర్య గర్హించి అతని నెదిర్చెను. అంతట ప్రవర్తిల్లిన సంఘర్షణచే విజయనగర రాజ్య మెల్ల ఒక సమరాంగణమయినది. ఎవరికై తన యత్నములో ఆ శ్రీరంగదేవరాయాదులు వేలూరులో ఉండగా యాచమనాయకునికి తోడు చూపినారో వారు ఎందును కానరారు. అందుచే యాచమనాయకుడు యుక్తిచే వారిని విముక్తులను కావింప తలచెను. కాని ప్రథమయత్న మున శ్రీరంగదేవరాయల పుత్రులలో ఒకడు రామదేవుడు మాత్రము విడివడెను. వానిని సాదరముగ, సంభావనా పూర్వకముగ యాచమనాయకుడు తన శిబిరమున నిల్పు కొని రాజకుటుంబము నెల్ల వెలికెచ్చు నుపాయములను వెదుకసాగెను. రామదేవుని పలాయనము నాటినుండి శ్రీరంగరాయాదులకు నరకము కఠినమై వారి కాపుదలకై కట్టుదిట్టము లెక్కువైనవి. యాచమనాయకుని మంత్రము మేరకు ఇరువదిమంది కారాగారాధిపతియగు దళవాయి కడ కొలువు కుదిరిరి. కొన్నాళ్లకు ఎవ్వరో చెరలోనుండి వెలికి సొరంగము త్రవ్వి రనియు, శ్రీరంగదేవరాయలు అందు ప్రవేశించు సమయముననే భటు డొకడు చూడ కున్న వా రెల్ల వెలికి నిర్గమించెడివారే యనియు వార్త వ్యాపించెను. ఇక నిటు కాదని శ్రీరంగరాయాదులను ఇం కొక చెరలో ఉంచి జగ్గరాజే కారాగార రక్షణభార మును వహించెను. అంతతో నిరుత్సాహి కాక వెలుగోటి యాచమనాయకుడు వేలూరులో ఐదువందల దళవాయి ఈతె ఓబళేశునికి సొమ్ము ఆశ చూపి తన పక్షమునకు త్రిప్పుకొనెను. ఓబళేశుడును సమయము వేచియుండెను.

గొబ్బూరి వారి బలక్షయమునకై యాచమనాయకుడు తన సైన్యములతో వారి భూములపై పడెను. నెల్లూరికి నైరృతిదిశయందలి గొబ్బూరి రామరాజునకు చెందిన పొదలకూరు, కుల్లూరులు అతని పాల పడినవి. పలాయితు డైన గొబ్బూరి రామరాజు ఓగూరులో తలదాచుకొనగా యాచమనాయకునిసేనలు అతని వెనుదవిలినవి. మట్లి తిరు వెంగళనాథుడే అడ్డు రాకున్న వాని గతి దుర్గతి అయ్యేడిది. తిరువెంగళనాథరాజు నెదిరింపజాలక యాచమసేనలు మరలి పోవలసి వచ్చెను. కాని నానాటికి యాచమ నాయకుడు కొన్న విజయములు, భూములు, రామదేవ రాయలకు అతడు ప్రాపగుటయు చూచి నాయక ప్రభు వులు క్రమముగా యాచమనాయని పక్షమునకు రాసాగిరి.

అచట వేలూరులో ఈతె ఓబళేశుడు సప్రయత్నుడుగ నుండెను. జగ్గరాజాదులు వేలూరులో లేని సమయము చూచి అతడు తన సైనికులతో కారాగార రక్షక భటుల నెల్ల హతమార్చి కోటవాకిండ్లను మూటిని పట్టి యాచమను తత్క్షణము వచ్చి శ్రీరంగరాయాదులను విడిపింపుమని వార్త నంపెను. కాని దైవము వే రెంచెను. ముందుగనే యావార్త తెలిసి జగ్గరాజు ఓబళేశు డేమరిన దిడ్డివాకిలి నుండి కోటను ప్రవేశించెను. ఓబళేశుడును, అతని యనుచరు లును అతని చేతుల కూలిరి. యాచమనాయకుని విజయ ములకును, శ్రీరంగదేవరాయాదులకై ఆత డొనర్చు బహు యత్నములకును, క్రుద్ధుడై జగ్గరాజు శ్రీరంగదేవరాయలను సతీసుతముగ క్రూరముగ పరిమార్చెను.

ఈ ఘోరకర్మమునకు విజయనగరరాజ్య శరీరము జలదరించినది. రామదేవరాయలయెడ సానుభూతి బలసి, గొబ్బూరి జగ్గరాజు మిత్రమండలి సన్నవారినది. తమ్ములు సింగప, రాయప, అయ్యపలచే సుశిక్షితమగు ఇరువదివేల పేరాశి కదలిరాగా దారిలో అందందు జగ్గ రాజును వీడిన దామెర్ల చెన్నమనాయకుడు మొదలయిన ప్రముఖులు తమ తమ సేనలతో తోడుమూపగా తరిమి పడచిన వెలుగోటి యాచమనాయకుని ధాటికి తల్లడిల్లి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అరిమొగ్గరము విచ్చి చెదరినది. రావెళ్ల వెంకన, మాక రాజుల మాట యేమి, జగ్గరాయడే ఆత్మరక్షకై అడవులు పట్టెను. గొబ్బూరివారి యమరము భూములు కర్నూలి, పాళెంకోటలు వెలుగోటివారి అధీనములయినవి.

జగ్గరాయడు ఇది సహించునా? అతని క్రోధము దాగువునందు అగ్నివలె రాజి మధుర, చెంజి నాయకుల కలయికతో ప్రజ్వరిల్లినది. ఒంటిమై దాని నోర్వనోపని యాచమనాయకుడు తంజాపురమునకు తానే పోయి నిండుకొలువునఉన్న రఘునాథ భూపాలుని దర్శించి రామ దేవరాయలను వాని తండ్రి తాతల గద్దియుపై నిలుప నభ్యర్థించెను. రఘునాథనాయకు డిందుల కుత్సహించెను. పార్థునకు కృష్ణుడు తోడాయెను.

వేలూరు, తంజావూరులనుండి వెడలిన యాచమ, రఘు నాథనాయకుల సేనావాహినులు తిరుచినాపల్లివైపయి పారలినవి. తమ్ములు సింగవ, రాయవ, అయ్యవలే కాక దామెర్ల కరిచెన్నయ, చెరకు వెంగళుడు, కేతిరెడ్డి, రఘు నాథుడు, పావాడ కృష్ణుడు మొదలుగా పలువురు యాచమ నాయకుని సేనాముఖమున నడచినారు. దారిలో రఘు నాథనాయకుడు చేరుటతో వారి బలము నిండు పున్నమ నాటి సంద్రమయినది. వారు పళమానేరి దరిసినంతలో జగ్గరాజు తన దళవాయులతో తోపూరుకడ విడిసినట్లు తెలియవచ్చినది.

మరునాడు ఉదయమున తోపూరుకడ కురుక్షేత్ర సంగ్రామము మరియొకమారయినది. చెంజి కృష్ణప్ప, మధుర వీరప్ప, మాకరాజు, రావెళ్ల వెంకన, శాకమూరు నాయకులు ఎంద రెందరో అద్భుతశౌర్యము చూపిరి; కాని అది యెల్ల అక్కరకు రాలేదు. ఆకొన్న పులి రఘు నాథనాయకుడు జగ్గరాజుపై లంఘించి ఆక్రమింపగా వా రిరువురి పోరు భరమై చూపరకు వెరగైనది. జగ్గరాజు హతుడయ్యెను. జగ్గరాయని చావుతో వాని మొనలెల్ల విరిగి యథాయథలై పరచినవి. మాకరా జెక్కిన గుర్రము గాలికిని మున్నై దౌడు తీసినది. రావెళ్ల వెంకన పలాయన మంత్రము జపించినాడు. దళవాయులు పను గెక్కుట పైతము మరచి అం దందు దాగుటకు ఉంకించి నారు. వీరప్ప తిరుచినాపల్లికోట చేరి తిరిగి చూచినాడు. కృష్ణప్ప చెంజి చొచ్చి వైచిన కోటతలుపు గడియలు వీడనే లేదు. ఇట్లు యోధానుయోధులెల్ల పూరి కరవగా ఒంటరియై జగ్గరాజు అల్లుడగు నృపతి శత్రుహస్తముల జిక్కెను. రామదేవరాయలు సింహాసనాసీను డాయెను.

**రామదేవరాయలు (క్రి. శ. 1619 - క్రి. శ. 1629)**: రామ దేవరాయాభ్యుదయ మిట్లు సిద్ధించినది. కాని అనాయకమయ్యును వాని యరివర్గము ఇంకను ఒక్కెత్రాట నడచు చుండెను. కారణము: వెలమల వలని భీతి. వెలుగోటి యాచమనాయకాదులు గొబ్బూరి వారిని సబంధుమిత్ర ముగ వంచిత సర్వస్వులను చేయ దలపెట్టిరి. మాకరాజు ఓడెను. చెంగాడు జగ్గడు అసువులను కోల్పోయెను. గొబ్బూరివారి అమరములు, దుర్గములు కొల్లపోయినవి. చెంజి కృష్ణప్ప చెంజి మాత్రావశిష్టుడై తన భూములు తిరిగి కైకొను యత్నముల విజితుడును, కారాగార బద్ధుడును ఆయెను. పాళెముకోటకడ యాచమనాయకుని డీకొని డీలువడి గొబ్బూరి జగ్గరాజు తమ్ముడు యతిరాజు పలాయితుడాయెను.

ఎన్ని విజయములు కొన్ననేమి? యాచమనాయకునికి పోరాట తప్పలేదు. యతిరాజు దోర్పుట ఆపలేదు. క్రి. శ. 1619లో జగ్గరాజు అల్లుడగు నృపతి మరణించెను. అవసరము చూచి యతిరాజు రామదేవరాయలను తన యల్లు నొనర్చు కొనెను. ఎంతకును రాజ్యమున శాంతి నెలకొనదు. రామ దేవరాజ్య మూల స్తంభము తంజాపుర రఘునాథనాయకుని భక్తిని శంకింప బనిలేదు. కాని పలువురు రామదేవరాయల నొక చీరికికైకొనక స్వతంత్రులుగ వ్యవహరించిరి. చెంజి, మధురాపతులు కోరినది గొబ్బూరివారి మైత్రి కాదు; రాచరికమువారి దౌర్బల్యము. అందుచే వా రెల్లును రామదేవరాయలకు ప్రతికూలురే. రాజును మున్నిడుకొని గొబ్బూరి యతిరాజు క్రి. శ. 1625లో శత్రువులపై దళమెత్తిపోయెను. మునుపటి మధురానాయకుడు తంజ పురపు పేటపై కవిసినాడు; కాని శక్తి చాలమిచే అతడు అంతలో వెనుదివియ నయ్యెను. రామదేవరాయ, యతి రాజు లంత వైరిభూములు ప్రవేశించి తిరుచినాపల్లి దుర్గమును ముట్టడించిరి.

ఈ ముట్టడి కొలది దినములు సాగనైన లేదు. ఇంతలో రాజధాని పరిసరములలో విద్రోహము ప్రబలిన వార్తలు నలుగడల వ్యాపించినవి. రామదేవరాయ, యతిరాజులు అందుచే తిరుచినాపల్లి హుటాహుటి వెడలిపోవలసివచ్చెను.

వెలుగోటి యాచమనాయకు డింతదనుక పెంచి పెద్ద చేసి తన సర్వస్వమును అర్పించి విజయనగర సింహాసనమున కుదురు కొల్పిన రామదేవునకు నేటికి యతిరాజా శాసనమైనది! యాచమనాయకుడు లేనిచో రామదేవరాయలు, అతని కుటుంబము యతిరాజుల అన్న జగ్గరాజు చేతుల విసుమానవు చావు చచ్చియుండునే! ఇంతకును గొబ్బూరి వారి యల్లుడు వినా వేరొకడు విజయనగర సింహాసనమును ఎక్కరాదేమి? యతిరాజునెడల యాచమనాయని ద్వేషానలము చెలగి మండినది. కాని రేవుపట్టణము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పులికాటు నాక్రమించినచో యతిరాజును, అతని ఒలాందు మిత్రులును రెక్కలు తెగిన పులుగు లగుదురు. అందుకు తగిన సమయము దొరకినది. రామదేవునితో యతిరాజు దూరమున తిరుచినాపల్లి కాపుకాచి యున్నాడు. వెలుగోటి యాచమనాయని సోదరుడును, చెంగల్పట్టు పాలకుడును అగు సింగమనాయకుడు తన బంధుగు ఆరుముగాధిపుడు తిమ్మానాయకుని చేరి పులికాటు సాధింపగోరి తన పదివేవురు రాణువతో సాన్‌థోమె వరకు కదలి వచ్చెను. కాని మార్గముననున్న భూములు తిరువెంగళనాథరాజునకు చెందినవి. అతడు అడ్డుకొనుటకు తోడు, రాజు వచ్చు వార్తలును రాగా హతాశుడై సింగము వెనుదిరిగి పోయెను.

రామదేవ, యతిరాజులు తిరువీరు ప్రాంతముల సేనలను పెన్కొలిపిరి. అచట విక్రమించుచుండగా వారికి మధుర, చెంజినాయకుల దాపు అధికమయ్యెను. దాపున నున్న పుదుచ్చేరి యధిపతి కస్తూరి రంగప్ప యాచమ పుత్రుడు. వాని సాయము ఎట్లును లభింపదు. పులిమీద పుట్రగా కాళహస్తీశుడు దామెర్ల వెంకటపతియు రాజ విరోధియై పరాక్రమించెను. మధుర వీరప్ప, చెంజి కృష్ణప్ప, మాధవుడు తుదకు ఓటమిపాలైరి. కాని రామదేవరాయల భూములెన్నియో వారిచే జిక్కినవి వారి యధీనముననే నిల్చిపోయినవి. కస్తూరి రంగప్ప, సింగపులు విజితులై రాజునకు చెంగల్పట్టు, కరుంగుళిపాళెములను సమర్పించుకొన్నారు. పులికాటు ప్రాంతమున ఉన్న విద్రోహుల సెల్ల అదుపునకు తెచ్చి, యతిరాజు కొడుకు తిరువత్తూరు, నందియంబాక్కం, కల్లూరు మొదలగు స్థలములు వశ్టెను. రాయరాణువ దిన దిన మధిక మగుచు అప్పటికి లక్ష సంఖ్యను సమీపించెను. దామెర్ల వెంకటపతి యంతట పోరు విరమించి రామదేవ రాయుల నాశ్రయించెను.

ఇట్లు పదునేను వర్షములు అంతర్యుద్ధముల కలగుండు వడినది విజయనగర రాజ్యము. అది యెరిగి విజాపురము సుల్తాను ఇబ్రాహీం పశ్చిమాంధ్రమును కబళించుటకు ఉంకించినాడు. క్రీ. శ. 1619-20 లో తన నిలుకడనే సమర్థించు వెరవు తోపని రాజు కర్నూలులోని గోపాల రాయాదులకు ఏటి సాయము పంపగలడు? ఎంతకును ఈడబోక పెనగిన గోపాలరాజు గోలకొండవారి ప్రాపుతో విజాపురము సేనాని అబ్దుల్ వాహబ్‌ను ఎదిర్చి నిలువరించెను. కాని ఎన్నాళ్ళని ఆగగలడు? క్రీ. శ. 1624 లో అబ్దుల్ వాహబ్ కర్నూలు ముట్టడించినాడు. శక్త్యుత్సాహములు సర్వము వెచ్చించి కోట కాపాడుకొనుచు గోపాలరాజు తోడిసామంతుల సాయము వేడెను. హండే, పెమ్మసానివారల రౌతులును, మట్లి తిరువెంగళనాథరాజును అబ్దుల్ వాహబ్‌ను కదల్పజాలరైరి. యుద్ధమున హండే, పెమ్మసానివారలు పలాయితులయిరి. పిరుతివియని తిరువెంగళరాజు హతుడాయెను. కర్నూలు రక్షణము తలకు మించినదని యెరిగి గోపాలరాజు దుర్గమును విడనాడి పరెందో తలదాచుకొనెను. కర్నూలు దుర్గమునను, తత్పరిసరములందును ముస్లిములు పాలకులు, ప్రాతకాపులు నైపోయిరి.

రామదేవరాయల పాలనము ఎన్నో గండములు గడచి గట్టెక్కినది. విజయనగర శాసనము పశ్చిమాంధ్రమున నాశనమయినది. క్రీ. శ. 24-5-1630 లో అపుత్రకుడగు రామదేవుడు మరణించినాడు.

**మూడవ వెంకటపతిదేవరాయలు** (క్రీ.శ. 1630 - క్రీ.శ. 1642): రామదేవరాయలు మృతినందిన పిదప అతని నియోగము చొప్పున అళియ రామరాయల మనుమడగు, పెదవెంకటపతిదేవరాయలు రాజు కావలసి యుండెను. కాని అది జరగుటకు ఐదేండ్లు తిరిగినవి. రామరాయల పినతండ్రి తిమ్మరాజు తా నుండగా పెదవెంకటపతిరాయ లెట్లేలునో చూతునని పరవళ్లు త్రొక్కినాడు. రామదేవుని పాలనారంభమునాటి యరాజకము పదునేనేండ్ల తరువాత మరల క్రొత్త పుట్టువుగా దోచెను. క్రీ. శ. 1632 లో మునుకొని రంగమున దూకిన తిమ్మరాజు వందవాసి సమీపమగు కరుంగుళి పాళెమును, పులికాటు దాపుననున్న కాటూరులను వశమొనర్చుకొనగలిగెను. ఇంతలో పెదవెంకటపతిదేవరాయల తమ్ముని కొడుకు శ్రీరంగదేవరాయలు ప్రోలు వెడలి పులికాటులోని ఒలాందు లొసగిన మందుగుండు బలముతో తిమ్మరాజును తలపడెను. కాటూరు పొలిమేరలోని [illegible]రు (కోటూరు) వద్ద యుద్ధము జరగినది. 15 ఏప్రిల్ క్రీ. శ. 1635 లో కాటూరు శ్రీరంగరాయల వశమయ్యెను. [illegible]లూరు, చోళవరములు మరల తిరుగక ముందే అతని చేజిక్కినవి. అప్పటికి కంచి చేరిన తిమ్మరాజును కర్ణాటక సేన చుట్టును పొదువగా అతడు చోళవరము, తొరిపతూర్చు, సత్తపూరులను వెంకటపతిదేవరాయల కొసగి యాగండము తప్పుకొనెను. కాని వాని యాశాపాశము మిక్కిలియు నిడుదయగుటచే అతడు ఊరకుండ లేకపోయెను. మరల రాజును విరోధించిన తిమ్మరాజును [illegible] నాయక ప్రభువు క్రీ. శ. 1635 లో హతమార్చినాడు. పెద వెంకటపతిదేవరాయల సమ్మతిన పళవాయి చంద్రగిరి కోనేటినాయకుడు పెనుగొండను అమరముగా పడసి యందు చేరి విజాపురము వారి అశా ప్రాబల్యమును అరికట్టెను. పెద వెంకటపతిదేవరాయలు అంత వేలూరు చేరి రాజ్యపాలనము సాగించెను.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మొదటి నుండియు రాజవిరోధి చెంజి నాయకుడు రాజమిత్రుడై వెలయుట తంజాపుర నాయకులకు అబ్బురమును, మధుర నాయకులకు అమాయము గొల్పెను. వా రిరువురును చెంజి దళవాయి తుపాకి కృష్ణప్పనాయకునితో మంతనము సల్పిరి. ముప్వురును కూడి రాజును పట్టవలెనని వారి యోచన. అది అంతతో విఫలమై అట్టి యా దక్షిణ రాజ్యాధిపతులగు నాయకులతో పోరు వెంకటపతిదేవ రాయలకు తప్పదాయెను.

ఈ బెడద చాల దన్నట్లు, ఈ యదమననే విజాపురము సుల్తానుదాడియు విజయనగరము వైపయి సాగెను. తరితెరె, బసవాపట్టణ పాలకుడు కెంగె హనుమయ ప్రోత్సహింపగా విజాపుర సేనాని రణదౌలా ఖాన్ ఇక్కేరి వీరభద్ర నాయకుని జయింప ఉద్యమించెను. అందులకై అతడు శౌర్యము కాక మంత్రము నాశ్రయించెను. కర్ణాటమందలి నాయకులలో వెంకటపతి దేవరాయలను మన్నించువారే కానరారు. వారి కోటలన్నింటిని పట్టి వెంకటపతి దేవరాయలకు అప్పగించిన చో కృతజ్ఞుడా రాయలు ఆ యా కావులయందలి చరాస్తులను రణదౌలా ఖానునకు ఈయజాలడా? రాజునకును, రణదౌలా ఖానునకును ఒప్పందము కుదిరెను. కాని త్వరలోనే ఖాను గుట్టు ఎరిగిన రాయలు ఆ యొప్పందమును త్రోసిపుచ్చి ఆయా కన్నడ సామంతులతో కలసి ఖానును ఎదిర్చెను.



చిత్రము 68. రాయవేలూరు కోట, తూర్పు వైపు

గోరుచుట్టుపై రోకటి పెట్టుగ ఆ యవసరముననే రాయల తమ్ముని కొడుకును, కందనవోలు గోపాల రాజునకు దత్తసూనుడును అగు శ్రీరంగదేవరాయలు వెంకటపతి దేవరాయలను ప్రతిఘటించి నిలిచెను. క్రీ. శ. 1635లో తిమ్మరాజును ఓర్చి వెంకటపతిదేవరాయలకు రాజ్యము సమకూర్చిన శ్రీరంగదేవరాయలకును, అతని పెదతండ్రి రాయలకును క్రీ. శ. 1638 లో ఈ విధముగా వైమనస్యము, విరోధము ప్రబలుట విజాపుర సేనాని రణదౌలా ఖాన్ అదృష్టము కాక మరేమి?

కెంగె హనుమ సహాయుడై, రణదౌలా ఖాన్ తరమెత్తి ఇక్కేరిదాయ నడచెను. వీరభద్రనాయకుడు శక్తిచాలమిచే కోటను శత్రువులకు వదలి భువనగిరికై పయనించెను. కాని రణదౌలా ఖాన్ అచటకూడ ప్రత్యక్షమైనాడు. తుదకు విధిలేక వీరభద్రుడు ఇక్కేరి భువనగిరులను రిపులకు అప్పగించి, సుల్తానుకు సామంతుడాయెను. ఇక్కేరి విజయి రణదౌలా ఖాన్ మల్నాడు నంతయు వొక్కి కొలికి దెచ్చెను. అటనుండి పూర్వాభిముఖుడై అతడు తుంగభద్ర దాటి గండికోట పెమ్మసాని వారికోటలపై నురవడించు నంతలో బెంగుళూరు కెంపగౌడని దర్పోద్ధతులతనిని ఆ వైపు మరల్చినవి. ఇంతకును పెమ్మసానివారి భూములలోని మన్నెవారు హనుమయకు కావలసినవారు. ఇక బెంగుళూరు ముస్లిములను మురిపించుటలో వింతయేమి? ఇరువదియైదు వేల సైన్యముతో శ్రీరంగ రాయలను దండింప వేలూరు వెడలిన పెదవెంకటపతిదేవ రాయలకు రణదౌలా ఖాముని బెంగుళూరుదాడి భయావహమయ్యెను. కర్ణాటమందలి ముస్లిము దళము తొంబది వేలకు మించి ఉన్నది. ఎదుర్కొనుట ఎట్లు? తిరిగి వేలూరు చేరి రాయలు నాయకరాజు లందరకు సైన్యార్థియై పత్రములను పంపెను.

దారిలోనున్న దుర్గములు కొనుచు ముందుకు సాగిన ముస్లిము సేనానికి బెంగుళూరు నాతిసులభముగ చేజిక్కెను. తన దళవాయులలో ఒకడగు శాహాజీని బెంగుళూరు పాలింప నియోగించి రణదౌలా ఖాము శ్రీరంగపట్టణమును చుట్టువైచెను. ఇంతవరకు ముస్లిము మిత్రులుగనున్న కెంగె హనుమయకును, ఖానునకును పొరపొచ్చెములు కలిగినవి. తదాదిగ మల్నాడులో అందరును ముస్లిములను ఎదురుకొనువారే. కెంగె హనుమయ బసవాపట్టణమును అతి దుర్భేద్యమొనర్చి యుద్ధమునకు ఆయితుడాయెను.

శ్రీరంగపట్టణము ముట్టడి నెలదినములు సాగినది. ఈ దండయాత్రలో రణదౌలా ఖానునకు బడు లక్షల కధికముగ ధనము చిక్కినది. అంతతో తృప్తి దగుటా, ముట్టడి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సాగించుటా ? నిర్ణయము కష్టసాధ్య మయ్యెను. శ్రీరంగ పట్టణాధిపుడు కంఠీరవ నరసరాజు శౌర్యము దినదినము వర్ధిల్లగా తుదకు ముసల్మానులు వెనుదిరిగి పోయిరి.

తుంగభద్రాతీరస్థము హరిహరగ్రామ ప్రాంతమున విజాపురము సుల్తాను పంపిన క్రొత్త దళములు పరివేష్టింపగా యుద్ధార్థి రణదౌలా ఖాన్ శాత్రవుల రణయత్నములను పరికించెను. మల్నాడు దొరలు కెంగె హనుమని వెన్నుదట్టి నిలిపినారు. బసవాపట్టణము వారి బలమునకు అంతకు ఆయువుపట్టు. దానిని పట్టుట యరివర్గ భంజకమును, తన రణకౌశలమునకు ఒక కొలతబద్దయు. వేలూరులో రాయలుకోరిన సైన్యములు అపుడపుడే కూడుచున్నవి. పెదవెంకటపతి కదనమున ప్రవేశించుటకు ఇంకను వ్యవధి ఉన్నది. బసవాపట్టణము ఇంకెట్లును తనదే. ఇట్లు నిశ్చయించిన రణదౌలా ఖానునకు ఇక్కేరి వీరభద్రనాయకుని సాయ మప్రయత్నముగ లభించినది. ముస్లిముల యండ చేరికదా హనుమయ తన్ను పరాభవించినది. వారి ప్రాపును అందియే వీరభద్రనాయకుడు కెంగెవారిని పీచమడప ఉత్సహించెను.

తరికెరె - బసవాపట్టణ మంతటి శాత్రవుల రాకచే కలగుండు వడినది. కెంగె హనుమయ వీరావేశముతో పోరినాడు. నాడు నాటికి తరుగుచున్నవాని దళములు హనుమ యుత్సాహశౌర్యములు ఎరుగుట చూచి విస్మయచకితము లగుచుండినవి. పెద వెంకటపతిదేవరాయలు లక్ష ముప్పదివేల భటాళితో కదలి రిపు విదారణకై వచ్చుచున్నాడట. బసవాపట్టణములోని వీరులు ఈ వార్తచే పొంగి ముస్లిములను లెక్కగొనరైరి. క్రీ. శ. 1639 లో జూలైకి పెద వెంకటపతిరాయలు ఓడి ముస్లిములను ఎదిరిన పాపమునకు స్వర్ణపరిహారము అర్పించి తిరిగి వేలూరు చేరెను.

బసవాపట్టణము పడుటకు ఇంక నెంతో కాలము పట్టదు. అయినను రణదౌలా ఖానునకు కోటలో ప్రవేశము దుష్కరమయి పోవుచుండెను. ఆ నవంబరులో రాజు బెంగుళూరులోని ముస్లిము సేనలు చెదరుటకై ఇరువదివేల రాణువతో కదలిపోయెను. మధ్యేమార్గముననే బసవాపట్టణము పడినవార్త వినవయ్యెను. తన సోదరు లెల్ల బందీలై ముస్లిం అఫ్జల్ ఖాను లోన ప్రవేశము కనుటచే ఏకాకియు, నిరుత్సాహియు నయి కెంగె హనుమయ రణదౌలా ఖానుకడ ప్రణతు డయినాడట. నిరాశాహతుడై పెద వెంకటపతి దేవరాయలు వేలూరునకు మరలిపోయెను.

బసవాపట్టణమున రణదౌలా ఖాను కొంతకాలము విశ్రమించెను. తుముకూరు జిల్లా చిక్కనాయకనహళ్లి ప్రభువు ముస్లిములను ఎదిర్చెను. అలసించినచో గోట బోవు దానికి గొడ్డలి కావలసి వచ్చును. రణదౌలా ఖాన్, అఫ్జల్ ఖానులు ససైన్యముగ కదలి రాగా చిక్కనాయకనహళ్లి ప్రభువు ధైర్య మెడలి శరణు గోరెను. ఆ సమయముననే బళ్లాపూరు, కుణిగలు దుర్గములు తురకలపాలయ్యెను. ఉన్నధనము లెల్ల చూరలాడి రణదౌలా ఖాన్ ఆ దుర్గములను శ్రీరంగదేవరాయలకు అప్పగించి విజాపురమునకు మరలిపోయెను.

క్రీ. శ. 1641లో విజాపురమువారు మరియొకమారు విజయనగరముపై దండెత్తిరి. వారిని అడ్డుటకు బయలుదేరినాడు వెంకటపతిదేవరాయలు: ఇంతలో వర్షాకాలము రాకయు, రాయల వేలూరు పోకయు నెరవేరినవి. శ్రీరంగదేవరాయలు శత్రువులతో చేరి వెంకటపతిదేవరాయల దుర్గములను రెంటిని ఆక్రమించెను. అంతట వేలూరు మార్గము సుగమమై శ్రీరంగరాయద్వితీయుడు రణదౌలా ఖాన్ వేలూరునకు పంద్రెండుమైళ్ల దూరమున తన శిబిరమును పన్నించెను. మధుర, చెంజి, తంజాపుర నాయకరాజులు సమయమునకు తోడు రాకున్నచో వేలూరు వెంకటపతి దేవరాయలకు నిష్కృతి లేకపోయెడిది.

విజయనగర రాజ్య భూములు ఇంతగా విజాపురము వారి పాలగుచుండుట చూచి అసూయచే గోలకొండ సుల్తాను తానును భూలాభము పొందగోరెను. నాల్గువేల గుర్రములును, పదునాల్గువేల పదాతులును గల్గిన ఆ గోలకొండసేన తూర్పుమార్గమున కదలి ఏప్రిల్ 1642 లో వెంకటపతిదేవరాయల రాజ్యమున ప్రవేశించినది. అడ్డులేక సాగిన యా రాణువ అరుముగము చేరునంతకు వారు ఎనిమిది దుర్గములను సాధించిరి. అరుముగము ప్రజలు భీతులై పులికాటునకు పరచిరి. వెంకటపతిరాయల కితరుణమున అరుముగము పాలకుడు వెలుగోటి తిమ్మానాయకుడును, నలువదివేలభటులతో పూనమల్లి మదరాసు పట్టణ ప్రభువు దామెర్ల వేంకటపతియు తోడుసూపిరి. కాని గోలకొండ ధాటికి వారు అగజాలరైరి. శ్రీహరికోట మొదలగు ఎన్నియో తన స్థలములు శత్రుహస్తగతములు కాగా చీకటిచాటున వెలుగోటి తిమ్మయ కొండ లెక్కి తల కాచుకొనెను. ఉత్తూరు మండలములోని కొండకోనలే వెంకటపతికిని శరణ్యములయి, తుదకు క్రీ. శ. 10వ అక్టోబరు 1642 లో అదృష్టహీనుడు ఆ వెంకటపతి తనువు చాలించెను.

**మూడవ శ్రీరంగదేవరాయలు** (క్రీ.శ. 1642 — క్రీ. శ. 1678 ?) : ఆరవీటి వంశ్యులలో పలువురు రాజులవలెనే మూడవ వెంకటపతిదేవరాయలు తన వెనుక సింహాసనము ఎక్కదగిన పుత్రుని బడసియుండలేదు. వారాయణవనపు కొండ గుహలలో వెంకటపతిరాయలు మృత్యుముఖమున



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మండగా అన్నాళ్లను పెదతండ్రి రాయలకు ద్రోహియై శత్రువర్ధనుడైన శ్రీరంగదేవరాయలు విజాపుర పక్షమును వీడి విజయనగర రాజ్య త్రాతగా బయలుదేరినాడు.

క్రీ. శ. 1642లో అక్టోబరు 29వ తేదిని శ్రీరంగరాయలు రాజాయెను. ప్రప్రథమమున గోలకొండవారి ఆక్రమణను ఆపవలయును గదా! తన బలములతో తిరుపతికడ శిబిరము నిలిపి చేతనైనంత మేరకు హంగు నెరపి తనవారిని నమ్మ జాలకయో, శత్రువుల ఆయుధబలము మిన్నయని తెలియుట చేతనో గోలకొండవారి ఫౌజులు అల్లంత పొడ సూపగనే శ్రీరంగరాయలు నారాయణవనము వేలూరుల మార్గము పట్టెను. తురకల రాణువలు మరలి నెల్లూరి మండలమందలి ఉదయగిరి దుర్గమును చుట్టుముట్టినవి.

కాళహస్తీశుడు దామెర్ల వెంకటపతి శ్రీరంగరాయలకు ప్రతికూలురలో ఒకడు. తిరుపతిలో ఉండగా రాయలు వెంకటపతిని గోలకొండవారి నెయ్యుడని అనుమానించి చెర నుంచెను. తుదకు వాని భూములను కొన్ని కైకొని శ్రీరంగరాయలు వానిని విడిచిపుచ్చెను. రాజద్వేషి దామెర్ల వెంకటపతి చెంజి కృష్ణప్పతో కలసి రాయలపై కత్తిగట్టెను.

శ్రీరంగరాయలకు ఈ యాపదలో సాయపడదగిన విజాపురము సుల్తాను తిరుగబడిన మల్నాడు నణచుట యందు మగ్నుడై ఉన్నాడు. ఇక్కేరి వీరభద్రనాయకుడు తన భూములను ఎంతకాల మని శత్రువులకు అప్పగించి ఊరకుండగలడు? ఎదిరిన వీరభద్రుని తాకుటకు ఈ మారు కదలిన విజాపురపు రాణువ సముద్రమును అనుకరించెను. రణదౌలా ఖాన్ ప్రతివీర భయంకరముగ సేన నడపుచు మల్నాడు చేరి ఇక్కేరిని ఆక్రమించి ఖాన్ ఇ జహాన్‌ను అట హావల్దారుగా నిలిపెను. అట సాగి వాని ఫౌజులు షిమోగ(శివమొగ్గ)ను నలువైపుల పొదివినవి. కాని వీరభద్రుని మామ శివప్పనాయకుడు అపరరుద్రుడై వారిని కసిమసంగెను. వాని ప్రతాపమునకు వెరచరచి పరచు తురకలను తరుముచు పోయి శివప్ప ఇక్కేరిపైకి ఎగబడెను. ఖాన్ ఇ జహాన్ కాందిశీకుడాయెను. ఇక్కేరిలో మరల వీరభద్రనాయకుని పతాక ఎగురసాగెను.

ఈ యోటమి విజాపురపు సుల్తానునకు తలకొట్టినట్లాయెను. స్వయముగ సేనలు నడపుచు, సుల్తాను క్రీ. శ. 11-1-1644 నాటికి బంకాపూరు చేరెను. ముస్తఫా ఖాన్, ముజఫ్ఫర్ ఉద్దీనులు ఈ మారు సుల్తాను చమూపతులు. సాగరు, ఇక్కేరి దుర్గముల నణచి ముస్లిములు కళవూరు కడ విడిసిరి. తమకొలది నెరిగిన శివప్పనాయకుని యుపదేశము మేరకు వీరభద్రనాయకుడు ఆదిల్ షాతో సంధి కావించుకొనగా, ఆసుల్తాను క్రీ. శ. 25 మార్చి 1644 లో విజాపురమునకు మరలిపోయెను. ఇక్కేరితో పోరాటము పూర్వ భాగమున వీలుపడని విజాపురపు సాయము శ్రీరంగదేవరాయలకు ఆదిల్ షా కళవూరు చేరినంతనే దొరకెను.

పదునైదు ఏనుగులను పసదన మంపి పదునైదులక్షల సువర్ణముల నిత్తునని బాస చేసి రాయలు వేడగా ఖూటా, 1643 లో ఆదిల్ షా అతనికి ఆరువేల గుర్రములను, ఇరువదివేల పదాతులను తోడు పంపెను. శ్రీరంగదేవరాయలు అంత కదలి ఉదయగిరి లగ్గలకై ఉరవడింపగా గోలకొండ ఫౌజులు దుర్గమును రాయలకు వదలి వెనుతగ్గినవి. ఈ యవకాశమును జారవిడువక విజాపురమువారి దళము ఉండగనే రాయలు నాయక రాజులపై తన యధికారమును ప్రతిష్ఠించుటకు ఉద్యోగించెను. వారికడ అశేష ధనము గైకొన్న రాయలకు ఆదిల్ షాకు ఈయవలసిన ధనము భార మనిపించలేదు.

విజాపురపు సుల్తాను వెడలిపోవుట చూచి మధుర, చెంజి నాయకులు తమ తొల్లింటి వైరమునే సాగించిరి. రాయలు చెంజికి చెందిన ఆరణిపురము నాక్రమింప యత్నించెను. కాని ఇంతలో గోలకొండ ఫౌజుల పునరాక్రమణము కర్ణాటకము నంతటిని గగ్గోలొనరించెను. ముస్లిములు పులికాటు చేరువరకు వారిని ఆపువారే కానరారు. పులికాటు వారిపాల పడకున్న కారణము అందలి ఒలాందు సైన్యాధిపతి శౌర్యమే. తన భూమియగు ఆరణికై రాజు ఉవ్విళ్లూరగా చెంజి ప్రభువు గోలకొండతో మైత్రి నెరపుట ఆశ్చర్యము కాదు. రాయలిపుడు ఆ నాయక రాజుల సఖ్యము కోరుటయు సహజమే. తంజావూరు విజయరాఘవ నాయకుడు శ్రీరంగదేవరాయలను మరల చేరడన్న నమ్మకము కుదురదు. మధుర నాయకుడగు తిరుమలుని వాహినులు రణసన్నద్ధములైన జాడయు తెలియదు. అందుచే చెంజి ప్రభువు గోలకొండవారికి తన సేనల నంపుటలో జాగు చేసెను. ఆపాటి ఆలస్యమే మహాభాగ్యముగా శ్రీరంగదేవరాయలు శ్రీరంగపట్టణాధిపుడు కంఠీరవ నరసరాజును, వెలుగోటి సింగమనాయకుడును తోడురా వెడలి క్రీ. శ. 21-8-1644 నాడు వెంగల్లు చెరువుకడ శాత్రవులను ఢీకొనెను. సింగమనాయకుడు తన నామ సార్థక్యము సాధింపగా ముస్లిము చమూపతి కాసిం అలీ పుత్రునితో, ఇర్వురు ఇతరదళనాయకులతో గతాసు వయ్యెను. పరారిచిత్తగించిన తురకలు నెల్లూరు మండలము నందలి కందుకూరు దాటువరకు వెనుదిరిగి చూడనే లేదు.

గోలకొండవారు ఇట్లు వెనుదీయగా ఉత్సాహి శ్రీరంగరాయలు నాయకరాజదమనమునకై దక్షిణాభిముఖముగ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వదలిపోయెను. నూరు ఏనుగులు, పన్నెండు వందల గుర్రములు, మూడు లక్షల పదాతులు కల ఆ సేన తాకకు ఆగలేక చెంజి ప్రభువు రాయల క్షమను అర్థించెను. కాని మధుర తిరుమల నాయకుడు ఎంతకును లొంగక పెనగుచు రాయలను అత్యంతము అలయించెను. మధుర, చెంజి దూతలు విజాపురము, గోలకొండలలో చాల చురుకుగ వర్తించిరి. ఫలితముగ విజయనగరము పొలిమేరలలో గోలకొండ సైన్యములతో చేయి చేయి కలిపి విజాపురము దళములును పొడసూపెను. కర్నూలు మండలమందలి కంబము, ఎర్రగొండ పాలెము, దద్దనాల పొలములు గోలకొండవారికి చిక్కినవి. వాని పాలకుడు హతుడు కాగా వాని పుత్రుడు నందేల కొండలలో తలదాచుకొనెను. గోలకొండ సేనాని మీర్ జుమ్లా వానిని రావించి తండ్రి స్థానమున నిల్పగా కృతజ్ఞుడై ఆతడు గోలకొండ కా యవసరమున నైదు లక్షల సువర్ణముల నిచ్చి ఏటేట నొక లక్ష కప్పము చెల్లించుటకు ఇయ్యకొనెను. అట సాగి గోలకొండమూకలు వినుకొండకై పయనించినవి.

అటు విజాపురము ఖాన్ ఇ ఖానాన్ పరాక్రమమునకు కర్నూలునకు ఈశాన్య ప్రాంతములు నందేల, శిరివెళ్ళ, కనిగిరి దుర్గములు వశమైనవి. ముస్తఫా ఖాన్ మాల్నాడు నడచి బెంగుళూరు మండలాంతర్గతమగు శివగంగ చేరుసరికి నాయకరాజ దూతలు అచట ప్రత్యక్షమై వానిని వేలూరు కదియ వేగిరించిరి. రాయల దూత వెంకన్న సోమయాజి ముస్తఫా ఖానును ఆ యత్నమునుండి మరల్చుటకై శ్రమించి, శ్రమించి విఫలు డాయెను. ముస్తఫా ఖాను చిత్తూరు తాలూకా బుక్కపట్టణము చేరుసరికి ఖాన్ ఇ ఖానాన్ తన సేనలతో చిత్తూరు జిల్లా వాయల్పాడు తాలూకాలోని గుర్రంకొండను దరియవచ్చెను.

నిస్సహాయుడగు శ్రీరంగదేవరాయలను దైవము సైతము చెయివీడెనేమో! గత్యంతరములేక రాయలు తన ప్రజల జాత్యభిమానమును రేకెత్తించుటకు ఉద్యోగించెను. తనకై కాకున్నను తమ దేవాయతనములు, బ్రాహ్మణులు, మతములకొరకైనను వారు ముస్లిములను ప్రతిఘటింపరా? రాయల యుద్బోధ చెవిటికి ఊదిన శంఖము. ఆ జ్ఞానము నాయక ప్రభువులకు ఉన్నగదా? విసివి వేసారి రాయలు విజాపురము దళవాయుల మైత్రికై కైసాచెను. కాని ఆ మైత్రియు ధనమూలమే. రాయలకు ఆపాటి ధన మేది?

ఇంకను రాయలకు మంచిరోజులు ఉండినవి కాబోలు! ఈసమయమున విజాపురము శిబిరమున నున్న రాయల రాయబారి వెంకన్న సోమయాజి మంత్రము ఫలించెను. ముస్తఫా ఖాన్ రాయలతో సంధికి సుముఖు డాయెను. శాహజీ భాంస్లే సాయమున ముస్తఫాను ఒప్పించి వారి రాయబారితోకూడ వెంకన్నయు వేలూరుకు పయనించెను. ముస్తఫాలో కల్గిన ఆ మార్పునకు కారణము వేరు. తోడి దళవాయి ఖాన్ ఇ ఖానాన్‌తో వానికి పొత్తు కుదిరినది కాదు. సర్కారు సొమ్మును అపహరించినాడన్న నేరము పోగొట్టుకొనుటకై ఖాన్ ఇ ఖానాన్ విజాపురమునకు పగనయ్యెను. ఇట్లు విజాపుర బలము శకలిత మగుటను ఎరిగిన వెంకన్న యుక్తిమేరకు శ్రీరంగదేవరాయలు వేలూరు మార్గమున గల లోయల దారుల నెల్ల అడ్డి శత్రు దుర్గమములను చేసి అప్రమత్తుడై మెలగెను.

శ్రీరంగదేవరాయల ఆ యత్నము అన్నియు ముస్తఫాకు ఎరుకలేక కాదు. రాయల ఆస్థానీయులే ఇంటి గుట్టును ఎప్పటి కప్పుడు ముస్లిము శిబిరమునకు చేరవేయుచుండిరి. నాయకరాజులు అరువదివేలు తురుపులను వేలూరు పరిసరములయందు పన్నించి ఇంతతో దండయాత్రను విరమింప నీతికా దనియు, శ్రీరంగదేవరాయల రాజ్యాహరణమునకు ఇట్టి తరుణము వేరు లభింప దనియు ముస్తఫాకు మరి మరి వార్తలు పంపిరి. ముస్తఫా రాయ శత్రువుగనే యుండుటను సాధించినది ఈ వాదము అన్నింటికన్న బలవత్తరము నాయకులు ఆస చూపిన ఇరువది లక్షల సువర్ణములు. ముస్తఫా పెనుగొండకై యురవడించెను. అపుడపుడే విజాపురమునుండి మరలి వచ్చిన ఖాన్ ఇ ఖానాన్ కోలారుపై కవిసెను.

విపత్పరంపరలు ఇట్లు నల్వంకల నలమగా శ్రీరంగదేవరాయలు ఆరిపోనున్న దీపము ననుకరించెను. అతని దళవాయి రామరాజు చేతిపట్టు, మాలూరు, తిండివనము చాయల వీరవిహారము కావించి నాయకుల మూకలను కలంపగా, శ్రీరంగదేవరాయలు వేలూరు చక్కి గల కొండ చరియపై కుదురుకొని అరిసేనల నిల్వరింప బూనెను. క్రీ.శ. 1645 డిసెంబరులో నాయకదళముల చేతులలో ఓటమి నంది రాయలు పరువున వేలూరు చొచ్చి, ముస్తఫా సాయమునకై యర్థించి యర్థించి అర్రులు చాచెను. రాయలు పంపగా మిత్రుడు హోరె నారణప్ప నాయకులతో సమాధానము కోరెను. ముస్తఫాతో సంప్రతింపనిది వారలు ఔ గా దన రేరు. అందుచే ముస్తఫా వేలూరు చేరి తగవరియు, తీర్పరియునై వ్యవహరించెను. ఇది ఫలకారి కాదని రాయలకు స్పష్టమే.

ముస్తఫా కోరినది ఎనలేని ధనము. గోలకొండ సేనానాయకుడు మీర్ జుమ్లా విజాపురపు సుల్తాను తోడ్పాటుతో కర్ణాటకము నాక్రమింప నున్నా డనియు రాయలకు విదితమే. అట్లయ్యును రాయలు ముస్తఫాను అంటిపెట్టు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కొనియే ఉదయగిరి రక్షణమును నిర్వహింప బూనెను. కాని పర్యాప్తమగు ధనము లేక అంతలేసి పనులు నెర వేరునవి కావు. నిర్ధనుడగు శ్రీరంగదేవరాయలకు ముస్తఫా మైత్రి నిలువలేదు. ఉదయగిరియు చెయిదాటినది. సమయమునకు నీలివార్తయైనను విజాపురపు సుల్తాను మహమ్మదు షా మృతివార్త ముస్తఫా, ఖాన్ ఇ ఖానాన్‌లను ఇర్వురను తమ రాజధానివంకకు తరలింపనిచో శ్రీరంగదేవరాయలకు ఊపిరి సలిపెడిదే కాదు.

కాని ఇంతలో మీర్ జుమ్లా ఉదయగిరిని సమీపించెను. దుర్గాధిపతి కోనేరిశెట్టికి సాయముగా వీని మామ చిన్నన్న శెట్టిని ఏబదివేలు సైన్యముతో రాయ లంపెను. కాని ద్రోహి ఆతడు యుద్ధమునే తలపెట్టక దుర్గమును మీర్ జుమ్లాకు అప్పగించి ప్రాణములు కాపాడుకొనెను. అంత పశ్చిమాభిముఖముగ కదలిన మీర్ జుమ్లాకు క్రమముగ చిట్టివేలి, కలితూరు, దువ్వూరు, చెన్నూరు, బద్వేలు, పోరుమామిళ్ళ, కామలాపురములు సులభముగ చేజిక్కినవి. ఆ సీమకు అధిపతి మట్లి వంశ్యుడు కుమార అనంతరాజు చేయునది లేక భూరిధనము నొసగి శత్రువులతో సఖ్య మలవరించుకొనెను.

అగ్నికి గాలి తోడైనట్లు విజాపురమునుండి మరలి వచ్చి ముస్తఫా కర్ణాటకము చొచ్చి వేలూరిపై నురవడించెను. ఇన్నాళ్ళును ముస్లిములు హిందూ భూములను గాసిపెట్టుచున్నను విజాపురము, గోలకొండల పరస్పర వైషమ్యములు కారణముగ విజయనగరరాజ్యమే అడగారునన్న భీతి జనింపనే లేదు. నేడు ఆ వైషమ్యములు ఎటో పోయినవి. విజాపురము, గోలకొండల ప్రణయము విజయనగరమునకు ప్రళయము కాగా స్వార్థాంధులు నాయక సామంతులకు ఎట్టకేని జ్ఞానోదయమైనది. మధురనాయకుడు ఇంకను మత్సరించుచునే యున్నను మైసూరు, కంగుంది, తంజావూరు, చెంజి సామంతులు పదివేలు గుర్రములను, లక్షయు నలువదివేలు కాల్బలమును రాయలకు తోడంపిరి. ఇతర నాయకులు నారణప, వెంగన, జగదేవాదులు ధన కనకము లర్పించిరి. వేలూరు పురంధ్రీజనము తమ తమ భూషణాలిని దేశార్థమై నిలువు దోపిచ్చిరి. తిరుపతిస్వామి బొక్కసము సైతము ఎనలేని ధనము కురిసినది. ఇం దందు ఇన్ని విధముల నాదుకొనగా శ్రీరంగదేవరాయలు ముస్తఫా ఖాను నెదుర్కొన సంరంభించెను.

కర్ణాటకమునుండి వేలూరు చేరు మార్గము కొండ కోనలతోను, చిట్టడవులతోను బలిసి దుర్గమముగ నుండును. అందును శ్రీరంగదేవరాయలు అసంఖ్యాక బలములతో అప్రమత్తుడుగను, సయత్నుడుగను ఉన్నాడట. ముందునకు ఉరుకుచున్న ముస్తఫా మూకలు వెనుదిరిగినవి. తన ప్రతాపమునకు వెరచియే అనుకొన్నాడు శ్రీరంగదేవరాయలు. ఇంతలో దారుణ వార్తలు వినవైనవి. ముస్తఫా మైసూరు చొచ్చి, చెన్నపట్టణము పాలించెడి జగదేవుని భూములు మెట్టి, బెంగుళూరికి తూర్పున ముప్పది మైళ్ళ దూరమున మాస్తికడ విడిసియున్నాడట. సంభ్రమాకులుడగు శ్రీరంగ రాయలు అంతట తరిమి నడచి ఉత్తరార్కాటులోని గుడియాతము గడచి సేలములో కృష్ణగిరిని సమీపించెను. ఆ ప్రాంతములోని విజాపుర ప్రతినిధులు శాహజీ ఖాంస్లే, అన దుల్ ఖవానీన్ అనువారలు. వారికి సాయముగా వచ్చుచున్న ముస్తఫా సైన్యములను దారిలో రాయలు ఎదుర్కొనెను. ఎదుట శ్రీరంగదేవరాయలును, వెనుక మైసూర్లు, కంగుంది సామంతులును పొదివి పొడువగా వేయి గుర్రములును, బలములో అత్యధికమును సమసి ముస్లిము దళపతి సర్ ఖయుల్ క్రోసుమేర వెనుకకు ఒదిగెను. ఇంతలో ఖాన్ ఇ ఖానాన్ ఎనిమిదివేల అశ్వములతో ముస్తఫాను కలియ వచ్చి దాపుననే ఉన్నట్లు తెలియవచ్చినది. అంత కంగుంది మైసూరు పాలకులు తమ తమ భూములు కాపాడుకొనబోయిరి. తన బలము ఈవిధముగా పన్నగిల్లగా శ్రీరంగరాయల సిరి డిల్లపోయినది. శ్రీరంగ రాయలు వేలూరునకు మరలిపోయెను. జగదేవరాయల రాజ్యమున తురకలు విచ్చలవిడి విహరించిరి. భార్యా పుత్రులను వీరభద్ర దుర్గమున కనిపి జగదేవరాయలు కృష్ణగిరిలో తలదాచుకొనెను. కాని ముఖ్యపట్టణమును, కోటలును విజాపురము పాలబడినవి.

శ్రీరంగరాయలు ముస్తఫాతో సఖ్యము ఇచ్చగించెను. ఆతడును అందుల కియ్యకొనెడి వాడే. కాని దామెర్ల వెంకటపతియు, రాయల సేనాపతి బహ్లోల్ ఖానుడును రాయల మనసు విరిచిరి. విజాపురము, గోలకొండలు కలియనంతవరకు నాయక సామంతులు గోలకొండ మిత్రులై రాయల నెదిర్చిరి. రాయ లిపుడు విజాపురముతో సఖ్యము నెరపినచో నాయకరాజులు మరల గోలకొండతో సహకరింతురేమో. ముస్తఫాతో రాయల రాయబారములు అనిశ్చితముగ సాగినవి. విసివిసి ముస్తఫా గుడియాతమును పట్టి విరించిపురము నాక్రమించి వేలూరికి క్రోశమాత్ర దూరమున శిబిరము విడిసెను.

శ్రీరంగదేవరాయల యెడల సానుభూతి దేశమం దంతట బలిసినది. కాని నాయక సామంతు లంపెడి నలువదివేల పదాతులును, అరువది వేల సువర్ణములును చేరుటకుమున్నే 4 ఏప్రిల్ 1646 నాడు వేలూరికడ ఘోరయుద్ధములో రాయ చమూపతులు బహ్లోల్, దిలావర్ ఖానులను



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



శత్రువీరులు సీదీ రైహాన్, శాహజీ భాంస్లేలు గీటడగించిరి. గాయముల నెత్తురులు జొత్తిల్లగా దామెర్ల వెంకటపతియును, తక్కుగల హిందువులును వేలూరు చొచ్చిరి.

అటు తూర్పు తీరమున బడి చొచ్చుకొనిపోవు సర్దారు మీర్ జుమ్లా ధాటికి ఉదయగిరియే కాక తొండమునాడు, తిరుపతి, చంద్రగిరులును నిలువజాల వయ్యెను. వాని నెల్ల వశ మొనర్చుకొని యుద్ధతుడై మీర్ జుమ్లా సరిగా ఆ ఏప్రిల్ 1646 లోనే పులికాటు సమీపించెను.

ఇరువాగుల శాత్రవులు ఇట్లు ఉరవడింపగా వేలూరు రక్షణము శ్రీరంగదేవరాయలకు వలనగు కార్యము కాదు. రాయలు అందుచే వేలూరు విడనాడి అమరనాయకుల యానుకూల్యము సాధించువాడై పర్యటించెను. రాజధాని ఇట్లు శత్రు పరివేష్టిత మగుటయే కాక ఎడలేని యుద్ధములచేత క్షామబాధితము కూడ నయ్యెను. ముస్తఫా ఖాను అంత మైసూరు చొచ్చి జగదేవరాయల భూములగు కావేరి పట్టణము, హోసర్, రాయదుర్గ, వీరభద్ర దుర్గములను, కనకగిరి, రత్నగిరి, మేల్ గిరులను, అర్జునకోట, దళనాయకన కోటలను ఆక్రమించి వానిని శాహజీ భాంస్లే అసదుల్ ఖవానీనులకు అప్పగించి విజాపురమునకు మరలి పోయెను.

అటు పులికాటుకడ మీర్ జుమ్లా శిరము కొంత మొక్కవోయినది. అచటి ఒలాందులు గోలకొండ ఆధిపత్యము నంగీకరింపరైరి. మీర్ జుమ్లా పురోగమనము అందుచే ఎనిమిది దినము లాగిపోయినది. అదియే విశ్రాంతిగా ఎన్నిన మీర్ జుమ్లా అంత వదలి దక్షిణము చొరగా ఆయా ప్రాంతములకు అతడు ధూమకేతు వయ్యెను. తురకల కరకుదనమునకు అదలి చీకాకయి హిందూనాయక సామంతులు దిక్కుదిక్కునకు పరువెత్తిరి. అతడు మెట్టిన మేర అంతయు దగ్ధరాష్ట్రమే. దారిలోనున్న పొన్నేరి, పూనమల్లి, కాంచీపురములు వానిపాల బడినవి. చెంజివరకు అతనిని అడ్డువారే కానరారు. ఇంతలో ఆనన్నమగుటచే మీర్ జుమ్లా కాంచీపురమున వర్షాకాలము గడపుటకై తన సేనల నచట విడియించెను (క్రీ. శ. 1648 మార్చి). రాయలు తంజావూరిలో తలదాచుకొనెను.

ఇట్లు శతాబ్దములుగ విజయనగర రాజులు నిర్వహించిన హిందూ స్వాతంత్ర్య సంఘటనములు, ధర్మోద్ధరణములు ఇక సాగుట ఎట్లు? తంజావూరు, చెంజినాయకుల బలిమి అంతకు చాలినది కాదు. మైసూరు, మధురలకు ఇంకను మిగిలియున్న బలదర్పములు కొంత పిదప వందవాసి యుద్ధమున కొరమాలిన వయ్యెను. విజయనగర దళవాయులు ఎందరో, వెలుగోటి ప్రముఖు లాదిగా ముస్లిము లనే కలసి నాయక సామంతులను ఎదిరించిరి. మీర్ జుమ్లా చెంజిని చుట్టుముట్టెను.

కర్ణాటకమున నధికారాధికము అంత కంతకే గోలకొండ పాలైనది. చెంజికూడ వారి వాత పడినచో దక్షిణమున గోలకొండతో సరితూగగల యధికార ప్రాబల్యము, రాజ్యవైభవములు విజాపురమునకు ఎట్లును సమకూరవు. అందుచేత గోలకొండతో మత్సరించిన విజాపురము చెంజిని ఆక్రమింప సంరంభించెను. మీర్ జుమ్లా వారిని ఎదిర్చెడివాడే కాని విజాపుర చమూపతి ముస్తఫాకు ఖాన్ ఇ ఖానాన్, రుస్తుం ఇ జమాన్, అఫ్జల్ ఖానులు తోడైరి. శత్రువు బలాధికుడగుటచే మీర్ జుమ్లా వెనుతగ్గెను. ముస్తఫా వ్యాధిచే మరణింపగా ఖాన్ ఇ ఖానాన్ ఎట్టకేలకు చెంజిని వశపరచు కొనెను (క్రీ. శ. 1649).

చెంజికి విపర్యయమగుటతో శ్రీరంగరాయలు రాష్ట్రము లేని రాజాయెను. తంజనగరమున వాని నివాస మింక భద్రము కాదు. తంజావూరు విజయరాఘవనాయకుడు బలియులగు ఆ శత్రువులను ఎదుర్కొనుపాటి కాడు. కర్ణాటమున నిలువనీడ లేని శ్రీరంగదేవరాయలు మైసూరు ప్రభువుపంచ జేరెను.

విజయనగర సామ్రాజ్యము ఇట్లు తెరచిన ఇల్లు కాగా ఒకటిని తలగడచి మరియొకటిగ విజాపురము, గోలకొండలు కర్ణాటక భూములను ఆక్రమించినవి. అచటి హిందూ నాయక రాష్ట్రములు అస్వతంత్రములైనవి. మైసూరు, మధురలలో మాత్రము హిందూధర్మ, హిందూ స్వాతంత్ర్యములు ఇంకను సజీవములేమో కాని ఇతర భాగములలో నెల్ల పెమ్మసాని, మట్లి ప్రభృతి ప్రసిద్ధ మండలిక వంశములు ముస్లిములకు లొంగినవి. క్రీ. శ. 1652 నాటికి పెనుగొండ సైతము విజాపురముచేత చిక్కి ముస్లిము ప్రాబల్యము పినాకినీ పథగామి యయ్యెను.

మైసూరు చేరినపిదప నాలగెండు మూడేండ్లు శ్రీరంగరాయల పోలకువలు తెలియవు. క్రీ. శ. 1649 లో విజాపురము, గోలకొండలకు చెడిసినది. విజాపురము సమ్మతిపైన అబ్దుల్లా కుత్బ్ షా గండికోటను స్వాధీనపరచుకొనుటకై తన సర్దారు మీర్ జుమ్లాను పంపెను. తన సుల్తానును మన్నింపని మీర్ జుమ్లా గండికోట ద గుత్తిదుర్గము సైతము ఆక్రమించి విజాపుర పొలముల నాసించెను. కాని విజాపుర సేనాపతి ఖాన్ ముహమ్మదుకడ మీర్ జుమ్లా చాలమి తెలియుటకు ఎంతో కాలము పట్టలేదు. క్రీ. శ. 1652 ప్రారంభమున విజాపురముతో చెలిమికై గోలకొండ ఆరు లక్షల సువర్ణము లర్పించు కొనెను.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఆ మరువత్సరముననే ఖాన్ ముహమ్మదు పెనుగొండను కైకొని చెంజి కేగుచు దారిలో అనంతపుర మండలములోని రొద్దముకడ విడిసెను. మీర్ జుమ్లా కన్నులకు ఇది కంటగింపయినది. ఫలితముగ అతడు మైసూరు నాయకునితోను, శ్రీరంగరాయలతోను మంతనములు నెరపినాడు. విజాపురమునెడ ద్రోహులగు ముస్లిములను లోగొని మైసూరు నాయకప్రభువు పూర్వము ముస్తఫా కొన్న మైసూరు భూములను అన్నిటిని మరల నాక్రమించెను. వేలూరు చేరిన శ్రీరంగదేవరాయలు విజాపురము వారిని కర్ణాటకమునుండి వెడలనడచుటకై బలములను సేకరింపసాగెను.

కర్ణాటకమునుండి విజాపురమున కేగుచు దారిలో బద్కోటకడ ఉన్నాడు ఖాన్ ముహమ్మదు. ఈ వార్తలు విని హుటాహుటిగ వచ్చిన అతనిని చూచి మైసూరురాజు వెన్ను చూపెను. కృష్ణగిరి యొక్కయు, మరి నాలుగు కోటలయొక్కయు బురుజులపై తిరిగి ముస్లిము పతాకలు రెపరెపలాడినవి. సీదీ మస్ఊద్ నాయకుడుగ ఒక విజాపుర దళము ఇతర మైసూరు దుర్గములను కారింపగా ఖాన్ ముహమ్మద్ శ్రీరంగరాయని నెమకుచు వేలూరు మార్గము పట్టెను. శ్రీరంగరాయలు అచ్చట లేడన్నమాటే కాని వేలూరుకై జరగిన యుద్ధము గజకచ్ఛపముల పోరు. తుదకు క్రి. శ. 1654 లో ఖాన్ ముహమ్మద్ వేలూరు ప్రవేశించుటకై శ్రీరంగదేవరాయలకు చంద్రగిరి మండలమును ఈయవలసి వచ్చెను.



చిత్రము 69. గుత్తి దుర్గము

అంత కంతకే విధికి కన్నెర్ర యయ్యెను. అప్పటికి దక్కనులో మొగలాయి రాజప్రతినిధి ఔరంగజేబు విజాపురము, గోలకొండలకు ధూమకేతువు; అబ్దుల్లా కుత్బ్ షా కడ సర్దారుగ కర్ణాటకమును ఆక్రమించి అచట స్వతంత్రింప యత్నించు మీర్ జుమ్లాకు దోహద మయ్యెను. మిత్రుడగు శ్రీరంగరాయల వలన మీర్ జుమ్లా అవకాశము శంకింపక, తన సేనలతో ఔరంగజేబును కలియ వెడలిపోయెను. శ్రీరంగరాయలు సైతము మొగలు మిత్రు డాయెనా? అయినచో కర్ణాటకము ఎట్లును తన చేయి దాటుటయే. అందుచే అబ్దుల్లా కుత్బ్ షా శ్రీరంగరాయల మిత్రుడై అతని కర్ణాటకము నంతటిని ఆక్రమింప ప్రోత్సహించెను. హిందూనాయకులు పలువురు మీర్ జుమ్లా ఆధిపత్యమును ఒప్పరికించి రాయలతో చేతులు కలిపిరి. క్రి. శ. 1656 నవంబరులో ముహమ్మద్ ఆదిల్ షా మృతియు, మార్చి 1657లో ఔరంగజేబు విజాపురముపై దాడివెడలుటయు అదనుగా శ్రీరంగదేవ రాయలు తిరుపతిని వశము చేసికొని తత్పరిసర ప్రాంతముల నెల్ల తన యధికారమును మరల విస్తరిల్ల జేయు యత్నములలో ఉండెను. ఈ సందర్భమున రాయలకు శాహాజీ ప్రభృతి మహారాష్ట్రుల సాయము అప్రయత్నముగ లభించినది.

ఇంతకును శ్రీరంగరాయలది లాభజాతకము కాదు. మొగలాయి ఔరంగజేబు ఇంతలో ఉత్తరదిశ కేగవలసి వచ్చెను. వానితోపాటు మీర్ జుమ్లాకూడ దక్షిణమును వీడెను. ఇంక కర్ణాటకమును శ్రీరంగరాయలపరము పల కానీయవలెను? ఇట్లు ఆలోచించి అబ్దుల్లా కుత్బ్ షా తన సేనలను కర్ణాటకమునకు మరల్పెను. వారికి సాయపడిన వాడు మధుర తిరుమల నాయకుడు. మరల పెంపుగనెడి అరవీటి సామ్రాజ్యము అతని కన్ను కుట్టినది. చోళమండల తీరమున చేతి కందిన మేరను రాబట్టుచు గోలకొండ నాగపట్టణమువరకు తన యాధిపత్యము పరపెను. ఇట్లు మరల ఆ నాయకరాజుల ఈర్ష్యాసూయలకు బలియై శ్రీరంగదేవరాయలు రాజ్యమునకు వెలియై మాండలికుల పంచ చేరనయ్యెను. ఈ కాలమున ఇక్కేరి ప్రభువు శివప్పనాయకుడు శ్రీరంగదేవరాయలను ఎంతో ఉపచరించెను. ఇక్కేరికి చెందిన హాసన, బేలూరు జిల్లాలలో శ్రీరంగదేవరాయలు క్రి. శ. 1663 వరకు వసించినది నిజము. క్రి. శ. 1678 లో శ్రీరంగరాయలు రాజుగనే వ్యవహరించిన జాడయు కన్పట్టును. అటుపిదప వానిగతి ఏమైనదో! జీర్ణ కర్ణాటక రాజ్యమున జీర్ణ జీర్ణ మా శ్రీరంగపర్ణము ఏ తెలియని తావుల రాలిపోయినదో! క్రి. శ. 1336 మొదలుగ మూడువందల యేండ్లకు పైన నకలాశానిరవకాశముగ వెలిగిన ఆ విజయనగరాంధ్ర స్వాతంత్ర్య ప్రభలను ఏ స్వార్థాంధ తమస్సు చేవ మిగుల బలసి గ్రసించినదో!



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



స్వార్థ మొక్కటి చాలదా దేశనాశమునకు? రాక్షసితంగడి యుద్ధమున అన్న మరణింపగనే ప్రకోపించిన తిరుమలరాయల స్వార్థమునకు అసంఖ్యాక విజయనగర ప్రజలు బలియైనారు. వారి యుసురు కొట్టినదేమో తిరుమలరాయని ఆ తరువాతి తరతరములవారిని. అది కాకున్నను రాజసదాశివుడు ఏమి చేసినాడని వాని ప్రాణముల కెగ్గు తలపెట్టినారు? ఈపాప నిర్వాపణమునకు తిరుమలదేవరాయాదులు కొన్న వైష్ణవము, కొల్చిన దేవాయతనములు చాలునవి కావు. పులుగడిగిన తరళిమలు ముత్యమునకుగాని గాజు పూసకు కావే! అట్లే ఆరవీటి రాజుల విషయమునను. విజయనగర రాజ్యమున ఆరవీటి పాలన ప్రతిష్ఠాపకుడు తిరుమలదేవరాయని తరువాతివారిలో దైవోపహతుడును, కారాగార బద్ధుడును, గొబ్బూరి జగ్గరాజనిహతుడును అగు శ్రీరంగ చిక్కరాయ లొక్కడుగాక పుత్రవంతుడు రాజే లేడు. విధి విలసితము అట్లున్నది. విజయనగర సామ్రాజ్యము అస్తమించినది. ఓ. రా.

## గోలకొండ కుత్బ్ శాహి వంశము

కుత్బ్ శాహి రాజవంశము పదునారవ శతాబ్ది ఆరంభకాలము మొదలుకొని పదునేడవ శతాబ్ది అంతము వరకు రెండువందల యేండ్ల కాలము ఆంధ్రదేశమును పరిపాలించెను. వారి చరిత్ర మహోవైభవమైనది. సంస్కృతి దృష్టితో చూచినను అది సంపన్నమైనది. ఈ వంశమునకు మూలపురుషుడైన సుల్తాను కులీ కుత్బ్ షా అంతరించిపోయిన హందం రాజవంశమునకు అంకురము. అతని పూర్వికులు పర్షియా, ట్రాన్స్ ఆక్సేనియాల చరిత్రయందు ప్రఖ్యాతి చెందిన కారాకునేలు (నల్లగొర్రె) అను తుర్క్మన్ కుటుంబమునకు చెందినవారు. కారా యూసుఫ్, సికందర్, జహాన్ షా అనువారు ఈ తెగలో సుప్రసిద్ధులైన పురుషులు. వారు మధ్య ఆసియాలో చాల భాగమును తబ్రీజ్, హందం నగరములు రాజధానులుగా పరిపాలించిరి. కాని వారు ఆకునేలు (తెల్లగొర్రె) అను మరియొక శత్రుపక్షమువారిచే పరాజితులయి తమ యధికారమును, ప్రతిష్ఠను కోల్పోయిరి. సుల్తాన్ కులీ తాత పీర్ కులీయును, తండ్రి క్వియాన్ కులీయును పెక్కు ఇక్కట్లకు పాలయిరి. అందుచేత సుల్తాన్ కులీయును అతని పితృవ్యుడును తమ దేశమునకు వీడుకోలిచ్చి, తమ జీవనోపాధికై భారతదేశములో బహ్మనీ రాజ్యమునకు రాజధానియైన బీదరు పట్టణమునకు మహమ్మూద్ షా రాజ్యకాలమున వచ్చిరి.

గోలకొండ రాజ్యస్థాపనము క్రీస్తు శకము పదునైదవ శతాబ్ది అంతమున బహ్మనీ రాజ్యమును తుద ముట్టించిన అరాజక పరిస్థితుల ఫలితము. అయినను తుదకు రాజ్యమునే కూలార్చిన రాజకీయ కక్షల విరోధ తంత్రములతో సుల్తాన్ కులీ ఎన్నడును సంబంధము కలిగించు కొనలేదు. ఈ రాజకీయ కలహములకు ముఖ్య కారకులయిన ముహమ్మదు షా లష్కరియు, అతని ప్రధానియైన మహమ్మూద్ గావాన్‌ను గతించిపోయిన కొన్ని యేండ్లకు తరువాత అతడు క్రీ. శ. 1487 లో బీదరుకు వచ్చి బహ్మనీ రాజుల కొలువులో చేరెను. సుల్తాన్ కులీ క్రీ. శ. 1493 వ సంవత్సరములో బహ్మనీ సామ్రాజ్యాంతర్గతమైన తెలుగుదేశము మీద నధిపతిగ నియమింపబడుటకు కారణము అతనికి దక్కను గరీబు కక్షలతో గల సంబంధము కాదు; అతనికి సాహిత్యమునందును, పరిపాలనమునందును గల సామర్థ్యమే. ఇతనికి పూర్వము కుత్బ్ ఉల్ ముల్క్ దక్కనీ అనునతడు తెలుగుదేశమును పాలించుచుండెను. అతడు క్రీ. శ. 1492 లో పశ్చిమ దేశమున బహాదూర్ గిలానీతో జరగిన యుద్ధములో నిహతుడయినందున సుల్తాను ఇతనిని అతని స్థానమున నియమించి కుత్బ్ ఉల్ ముల్క్ అను బిరుదునిచ్చి పంపెను. తరువాత నితడు స్వతంత్రుడైన పిమ్మట ఆ బిరుదు కుత్బ్ షా అని మారినది. బహ్మనీ ప్రభువుల కేంద్ర ప్రభుత్వాధికారము నాడునాటికి క్షీణించి తరువాత బహ్మనీ సింహాసనము నాక్రమించుకొనిన బరీదుల హస్తగతమగుటచేత సుల్తాను కులీ అధికారమును వహించిన నాటి నుండియు పేరుకు సామంతుడైనను వాస్తవముగ స్వతంత్రుడుగనే వ్యవహరించుచుండెను. మహమ్మూద్ షా తుదకు నిస్సహాయస్థితికి వచ్చెను. కాని సుల్తాన్ కులీ తనకు ప్రాపకుడయిన ఆతనియెడ యథాపూర్వముగనే గౌరవాదరములతో వర్తించుచు మహమ్మూదు షా జీవించి యున్నంతవరకు అతనికి ధన, సైన్య సాహాయ్యము చేయుచుండెను. బీరారు, అహ్మద్ నగరు, విజాపుర పాలకులు మహమ్మూద్ షా జీవితకాలముననే తమ స్వాతంత్ర్యమును ప్రకటించినను సుల్తాను కులీ వీరి ననుసరింపక క్రీ.శ. 1518 లో తన పోషకుడైన మహమ్మూద్ షా మరణించిన తరువాత కాని స్వాతంత్ర్యమును ప్రకటింపలేదు.

సైన్యాధికారిగ నేమి, పాలకుడుగ నేమి, స్వతంత్ర ప్రభువుగ నేమి సుల్తాను కులీ తెలంగాణా రాష్ట్రమును ఇంచుమించుగ అరువదియేండ్లకాలము పరిపాలించెను. ఆ కాలమున, అనగా క్రీ. శ. 1543 నాటికి తన రాజ్యమును బందరు రేవుపట్టణమువరకు విస్తరింపజేసెను. తొలుత అతని పరమైనపుడు బహ్మనీ సంస్థానమునకు చెందిన తెలుగురాష్ట్రము వరంగల్లు పరిసరములవరకు మాత్రమే సంకీర్ణమై యుండినది. తూర్పు భాగములు చాలవరకు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



బహ్మనీ అధికారమునుండి జారిపోయి యుండినవి. సుల్తాన్ కులీ చెదరిపోయిన దేశభాగములను అన్నింటిని ఏకాధిపత్యముక్రిందికి కొనితెచ్చి, ఒక రాజ్యముగ నేర్పరచెను. కావున అతడు ఆంధ్రదేశము నంతటిని ఒక రాజ్యము క్రిందికి తెచ్చి జాత్యైక్యము కల్పించెనని చెప్పవచ్చును.

సుల్తాన్ కులీ తొంబదియేండ్ల వృద్ధు డగువరకు రాజ్యము చేయుచునే యుండెను. కావున సింహాసన మధిష్ఠించుటకు తహతహ పడుచుండిన అతని మూడవ కుమారుడు అతని సహజ మరణకాలమువరకు వేచియుండలేక అతనిని హత్య చేయించెను. ఆ సుల్తాను తన పెద్ద కుమారుడయిన హైదర్ కులీ తన జీవితకాలముననే మృతి నొందగా తక్కినవారిలో పెద్దవాడయిన కుత్బ్ ఉద్దీనును రాజ్యమునకు వారసుడుగ నియమించెను. కాని ఈ మూడవ కుమారుడైన జంషీదు తన హేయకృత్యముచే తండ్రి ఏర్పాటును తలక్రిందులు చేసి తానే రాజ్యాధిపతినని ప్రకటించుకొనెను. అతడు క్రీ. శ. 1550 వరకు ఏడు సంవత్సరములు రాజ్యమేలెను. కాని పితృ హంతకుడని అతనిని అందరును దూషించుచుండిరి. అతడు గొప్ప యోధుడు, పండితుడు; అయినను హేయ కార్యము, కఠిన ప్రవర్తనము కారణములుగా ప్రజాప్రేమమును పడయనేరకపోయెను. తండ్రి హత్యనాటికి పదుమూడేండ్లు నిండియు నిండని వయసున నుండిన అతని కడపటి తమ్ముడు ఇబ్రాహీం దిక్కులేనివాడయి దేవరకొండలో తలదాచుకొని యుండెను. రాజ్యాపహర్త యగు జంషీదు దుస్తంత్రమునుండి తప్పించుకొని యుండకపోయినచో ఇబ్రాహీముకు కూడ కుత్బ్ ఉద్దీనుకు పట్టిన దుర్గతియే పట్టియుండెడిది. అతడు బీదరు ప్రభువయిన అమీరు బరీదుతో కలసి గోలకొండను ముట్టడింప నుంకించె. అది వ్యర్థము కాగా, నమ్మిన అనుచరులు వెంటరా దక్షిణ సామ్రాజ్య రాజధానియగు విజయనగరమునకు పారిపోయి అచట తలదాచుకొని యుండెను. అప్పుడు సామ్రాజ్యాధికారమును నిర్వహించుచుండిన అళియ రామరాజు చేరదీసి ఆదరింపగా అచ్చట నతడు ఏడు సంవత్సరముల కాలము గడపెను. విజయనగరము ఇబ్రాహీంకు మంచి ఆశ్రయ మాత్రమే కాక రాజ్య తంత్రమున తర్ఫీదు నిచ్చినదియు నయ్యెను. అతడు అచ్చట విజ్ఞాన సంపదను, రాజ్యాంగ తంత్ర నైపుణ్యమును గడించెనని తలంపవచ్చును.

క్రీ. శ. 1550లో జంషీదు మరణించెను. రాజ్యపరిపాలనమున చిక్కు లేర్పడెను. భావికార్యక్రమ విషయమున రాజ్యమునందలి సర్దారులు రెండు కక్షలుగా చీలిరి. ఒక కక్షవారు విదేశీయుల నాయకత్వమున వితంతురాణియైన బిల్ కిస్ పక్షమును వహించి మృతుడయిన సుల్తాను కుమారుడు సుభాన్ కులీ అను బాలుని సింహాసన మెక్కించగా, ఇంకొక పక్షమువారు ఇబ్రాహీం కులీని అతని తండ్రి సింహాసనము నధిష్ఠించుటకై విజయనగరమునుండి రా నాహ్వానించిరి. సామ్రాజ్యమునందలి రాజకీయ వాతావరణము తన ప్రయత్నమున కనుకూలముగా నుండుట గాంచి వెంటనే అతడు గోలకొండకు ప్రయాణమయ్యెను. మార్గమున అనుపదము నాతనికి స్వాగతములు, అభినందనములు ఎదురొక్కనినవి. పానుగల్లు, ఘన(గణ)పురము, కోవెలకొండ దుర్గాధిపతు లతనికి సాయము చేయ గట్టి మాట యిచ్చిరి. అతని యభ్యుదయమును కోరుచుండిన జనులు సుముఖు గట్టి అతని సింహాసనారోహణమును వీక్షించుటకొరకు తమ యొక్క సహకారమును వెల్లడించుచు గోలకొండ పర్యంతము వెంటనంటి వచ్చిరి. రబి ఉల్ అవల్ 12 నాడు క్రీ. శ. 1550లో అతడు సింహాసనము నధిరోహించెను. అతని విరోధిపక్షమువా రందరు ఒకరివెంట నొకరుగా [illegible] లేక అదృశ్యమయి పోయిరి.

తెలుగుదేశమున మల్కిభరామ్ అను పేర ప్రసిద్ధిగన్న ఇబ్రాహీం కుత్బ్ షా గోలకొండ రాజ్యము యొక్క వాస్తవ నిర్మాత అని తలంపవచ్చును. అతడు క్రీ. శ. 1530వ సంవత్సరమున జన్మించి క్రీ. శ. 1550 మొదలు క్రీ. శ. 1580 వరకు ముప్పది యేండ్లు రాజ్యమును పాలించెను. ఇతడు తన రాజ్యమును ఏర్పాటులు చక్కగా చేసి పటుత్వముతో పాలించెను. గోలకొండ చరిత్రలో ఇతని పరిపాలనముననే రాజ్యము కుదురుపడినది. ఇబ్రాహీం పరిపాలనము ప్రారంభించునాటికి గోలకొండ రాజ్యము నిర్మాణదశయందే యుండినది; గట్టి పరిపాలనము కాని, సమర్థమైన ప్రభుత్వ వర్గముకాని లేకుండెను. ఇబ్రాహీం కేంద్ర, రాష్ట్రీయ ప్రభుత్వముల నేర్పాటు చేసి వానికి పరస్పర సన్నిహిత సంబంధములను కల్పించెను. స్థానిక వ్యవహారము లెప్పటి కప్పుడు కేంద్రప్రభుత్వమున కందుచుండుటకయి నిపుణమయిన చారవర్గమును అతడు ఏర్పాటు చేసెను. ఆంధ్రదేశమున కపకీర్తిని తెచ్చుచుండిన దొంగలను, దారి దోపిడికాండ్రను పట్టి శిక్షించి దేశములో వర్తకము, రాకపోకలు సురక్షితముగ సాగునట్లు ఏర్పాటు కావించెను. ప్రజలు దేశము నలుమూలలకును భయరహితులయి రాకపోకలు సలుపగలిగిరి. ప్రయాణికులును, వర్తకులును రాజ్యములో ఒక ప్రక్కనుండి మరియొక ప్రక్కకును, ఒకమండలమునుండి మరియొక మండలమునకును నిర్భయముగ సంచరింపగలిగిరి. ఆ కారణమున వర్తక, పరిశ్రమలకు మంచి అభివృద్ధి కలిగినది. ఇబ్రాహీం ప్రజోపకారక కార్యములను పెక్కింటి నొనరించి పేరు గాంచెను; అతడు చెరువులను



http://sanskritcentral.com/

http://teluguthesis.com/


*



*

చిత్రము 1. సుల్తాను కులీ కుత్బ్ షా.



చిత్రము 2. గోలకొండ కోట.

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వట్టి సోమరి; సుఖలాలసులైన ప్రభువు; ఎక్కువగా నిరర్థక కార్యములలోను, వినోద క్రీడలలోను ప్రొద్దులు పుచ్చుచుండెను. తత్కారణమున అసమర్థులు, స్వార్థపరులు తయిన రాజకీయోద్యోగులు తమ లాభముకొరకు తమ రాజ్యాధికారమును వినియోగించుకొనిరి. దీనికి తోడు గోరుచుట్టుమీద రోకటిపోటు పడ్డట్లు ఉత్తరమునుండి పొరలివచ్చుచుండిన మొగలాయి వాహినిని ఎదుర్కొన వలసి వచ్చినది. క్రీ. శ. 1633 లో అహ్మదు నగరము యొక్క పతనమును, క్రీ. శ. 1636 లో ఆ రాజ్యము యొక్క సంపూర్ణ విచ్ఛిత్తియు దక్కను ఐకమత్యమునకు మృత్యుఘంటానినాద మయినది. నిజాం షాహి రాజ్యము మరుగున సురక్షితములై యుండిన గోలకొండ, విజాపుర రాజ్యములు అటుతరువాత మొగలాయిల బారికి గురి అయినవి. ఈ విషమ సమయమున పూర్వోక్త రాజ్యాధిపతులైన అబ్దుల్లా కుతుబ్ షా, ముహమ్మద్ ఆదిల్ షాలు సత్వహీను లగుటవలన వచ్చిన విపత్తునకు తట్టుకొనజాలక పోయిరి. వారు మొగలాయిలకు విధేయులయి వారి యాధిపత్యము నంగీకరించుటకంటె మార్గాంతరము లేక పోవుటచేత క్రీ. శ. 1636 లో అవమానకరమయిన ఒడంబడికను చేసికొనిరి. ఈ పాడు ఒడంబడికవలన సుల్తానులు తమ స్వాతంత్ర్యమును గోలుపోయి మొగలాయిలకు సామంతులై వారి యాజ్ఞాబద్ధులు కావలసి వచ్చినది. తమ నాణెములపై వారు షాజహాను చక్రవర్తి పేరు ముద్రించుటకును, అతని స్థానాపతిని తమ యాస్థానమున నుంచుకొనుటకును అంగీకరించవలసినవారైరి. ఈ స్థానాపతులు అనుదిన రాజకీయ వ్యవహారములలో సైతము జోక్యము కలిగించుకొనుచు వచ్చిరి. ముహమ్మదు సయీదు మీర్ జుమ్లా యొక్క ద్రోహమువలన స్థితిగతులు మరియును శోచనీయమైనవి. ముహమ్మదు సయీదు క్రీ. శ. 1630 లో అర్దిస్తానునుండి వచ్చిన చిన్న వైదేశిక వర్తకుడు. తన ప్రజ్ఞాతిశయము వల్లను, రాజ్యతంత్ర పరిజ్ఞానముచేతను మీర్ జుమ్లా (అర్థిక మంత్రి) పదవిని పొందగల్గెను. తరువాత అతడు దక్షిణమున కర్ణాటకమును జయించ నియుక్తుడాయెను. క్రీ.శ. 1645 లో విజయయాత్రకు బయలుదేరి అతడు రెండేండ్లలోపలనే దక్షిణమున దండుసాగించి విజయనగర సామ్రాజ్యమున ఆగ్నేయభాగమందుండు కడప, సిద్ధవటము, గండికోట మండలములను సాధించెను. సత్వరముగా దక్షిణమున అతడు పొందిన విజయములవల్లను, అతనికి లభించిన ధనము, వజ్రములు మున్నగు అమూల్యమైన భాగ్యము వల్లను, అతని కొలువునం దుండిన సైన్యాధిక్యము వల్లను అతని తల తిరిగిపోయినది. అతడు కుతుబ్ శాహి అధికారమును తిరస్కరించి దక్షిణమున ఒక స్వతంత్ర రాజ్యమును నెలకొలుపుటకు ఆలోచించి ఒక పథకమును పన్నెను; కాని తాను వాంఛించిన యీ పథకము విదేశీయ సాహాయ్యము లేక కొనసాగునట్లు అతనికి తోచకపోయినది. కాబట్టి దక్కను ప్రభువయిన మొగలాయి చక్రవర్తి అండ జేరి తన కార్యమును నిర్వహించుకొన దలపెట్టెను. దీని ఫలితముగా గోలకొండకు ఒకవైపున మీర్ జుమ్లాతోను, ఇంకొకవైపున ఢిల్లీ చక్రవర్తితోను వైమనస్య మేర్పడినది. గోలకొండ ప్రభుత్వము మీర్ జుమ్లాను, అతని కుమారుడు ముహమ్మదు అమీనును వారి విద్రోహప్రవర్తనమునకై శిక్షింప ప్రయత్నింపగా మొగలాయి ప్రభుత్వము విద్రోహుల కనుకూలముగా క్రీ. శ. 1656 లో హైదరాబాదుపై నెత్తివచ్చెను దక్కనునందలి మొగలాయి రాష్ట్రములను ఢిల్లీ పాదుషా పక్షమున పాలించుచుండిన ఔరంగజేబు రాకొమారుడు క్రీ. శ. 1656 లో గోలకొండను ముట్టడించెను. కాని సుల్తాను అబ్దుల్లా ముట్టడికి చాలకాలము నిలువలేకపోయెను. అతడు ముట్టడిదారులు విధించిన అవమానకరములగు నియమములకు అంగీకరించి ఆయాపదను తప్పించుకొనెను. అతడు నష్టపరిహారముగా అధిక ధనమును చెల్లించుటయేకాక ఔరంగజేబు పెద్ద కొడుకగు ముహమ్మదు సుల్తానుకు తన కూతు నిచ్చి వివాహము చేయ నిచ్చగింపవలసి వచ్చెను. ఈ క్రొత్త సంధివలన కలిగిన అవమానము ముందర క్రీ. శ. 1636 లో జరగినది ఒక లెక్కలోనిది కాదు. సుల్తానుయొక్కయు, రాజ్యముయొక్కయు ప్రతిష్ఠ ఊచముట్టుగ నశించిపోయినది. ఈ కారణమున అబ్దుల్లా కలహశీలురైన సామంతులను, జనసామాన్యమును ఆజ్ఞాబద్ధులుగ చేసికొనుటకు సాధ్యముకాక పోయెను.

అబ్దుల్లా క్రీ. శ. 1672 లో లోకాంతర గతుడాయెను. అనంతరము, అతని మూడవ అల్లుడు అబుల్ హసన్ కుతుబ్ షా రాజ్యమునకు వచ్చెను. అబుల్ హసన్ గోలకొండ సుల్తాను పుత్రిని పెండ్లాడుటయు, కుతుబ్ శాహి సింహాసనమున కధిపతి యగుటయు ఒక నాటకీయ సంఘటనమువలె జరగిపోయినది. అది వాస్తవ చరిత్రకంటె కల్పిత గాథగా కనిపించును. అబుల్ హసన్ పెండ్లాడిన రాకుమారిని ముహమ్మద్ సుల్తాను అను నాతనికి ఇచ్చి పెండ్లిచేయుటకు అదివరకే ప్రధానము జరగియుండెను. అబుల్ హసన్ అరాబియాదేశములోని హెజాస్‌నుండి వచ్చిన ఆగంతుకుడు; ఆదేశములో ఒక పూజ్యమయిన కుటుంబమునకు చెందినవాడు. సుల్తానుయొక్క మొదటి అల్లుడైన సయ్యిద్ అహ్మద్ అనునాతని వైరభావము కారణమున



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అకస్మాత్తుగా స్థితిగతులు తలక్రిందులైనవి. అపుడు అబుల్ హసన్ రాజమందిరమున కాహూతుడయి రాజకుమారిని వివాహము చేసికొనెను. రాజ్యములో స్వప్రయోజనపరులైన సయ్యిద్ అహ్మద్ ముజఫరును, అతని అనుచరులును అబుల్ హసన్ పక్షము నవలంబించి అతనిని రాజమందిరమునకు తోడ్కొనిపోయి రాజకుమారిని వివాహముచేసి తన్మూలమున ఎక్కువ హక్కుగల పెద్ద తోడల్లుడగు సయ్యిద్ అహ్మదును సింహాసనమునకు రాకుండ జేసిరి. ఉన్నటు లుండి వారు పన్నిన రాజకీయ కుతంత్రమువలన ఈవిధముగా అబుల్ హసన్ సింహాసనము నధిష్ఠింపగల్గెను. లేనియెడల రాజ్యాధిపత్యము సయ్యిద్ అహ్మద్ పరమై యుండెడిది.

అబుల్ హసన్ దక్కనులోని జనసామాన్యమున తానాషా అను పేర ప్రసిద్ధి నందెను. అతడు అసాధారణ పురుషుడు; వివేక సంపన్నుడు; ఉదారాశయములు గలవాడు; రాచరికముతో నెట్టి సంబంధములేని నిరుకుటుంబమున పుట్టి పెరిగినను, తాను రాజగుదునని కలలోనైన అనుకొనకపోయినను, రాజపదమున కనుగుణముగ ప్రవర్తించి రాజ్యాంగ వ్యవహారముల నన్నిటిని సమర్థతతో నిర్వహించెను. అతని మనస్సు స్థిరమయినది; దృష్టి విశాలమయినది; పరిపాలనానుభవము ఉత్తమ శ్రేణికి చెందినది. మొగలాయి సామ్రాజ్య ప్రభుత్వమునకు మిగుల అచ్చెరుపాటు కలుగునట్లు స్వదేశ, విదేశ వ్యవహారములను మిక్కిలి మెలకువతో అతడు నిర్వర్తించుచుండెను. తన ప్రజల యోగక్షేమములను శ్రద్ధతో పరికించుటయేకాక దక్కను రాజ్య వ్యవహారముల నన్నిటిని సమదృష్టితో పరికించి మొగలాయిలు దక్కను మీదికి రాకుండుటకయి తగిన గట్టి పర్పాటులు గావించెను. పతనమునకు సంసిద్ధముగనున్న విజాపుర రాజ్య విషయములను బాగుపరచుటకయి తన శక్తి నంతటిని ధారపోసెను. దీనికి కారణము లేకపోలేదు. విజాపుర రాజ్య పతనము గోలకొండరాజ్య పతనమునకు దారితీయునని అత డెరుగును.

కాని అతడును, అతని రాజ్యమును కలహశీలురైన మొగలాయి చక్రవర్తుల దుస్తంత్రములకును, దుష్ప్రచారమునకును గురియయ్యెను. నిరపరాధియైన అబుల్ హసనును ఔరంగజేబును, అతని చరిత్రకారులును అధముడనియు, దేశద్రిమ్మరి యనియు నిందించిరి. దక్కనులోని మహమ్మదీయ రాజ్యముల నన్నింటిని కూలద్రోసి తమ సామ్రాజ్యములో కలుపుకొనుటకయి ఉద్దేశించియున్న మొగలాయి చక్రవర్తియొక్క ఆక్రమణకార్యమును సమర్థించుటకయి ఈ యపవాదు కల్పింపబడినది.

క్రీ. శ. 1682 లో మొగలాయి చక్రవర్తి దక్కనుకు వచ్చి దక్కను సుల్తానులమీదను, మహారాష్ట్రులమీదనుకూడ దండయాత్రలు సాగించెను. మహారాష్ట్రాధికారము నణచుటకే చక్రవర్తి మొదట తలపెట్టెను. కాని తరువాత ఆ ప్రయత్నములను కొంతవరకు ఆపిపెట్టి క్రీ.శ. 1685 లో తన కుమారులయిన ఆజము, ము ఆజములను సైన్యములతో విజాపురము, గోలకొండలమీదికి పంపెను. రెండు నెలలు ముట్టడి సాగినపిదప విజాపురము వారికి లోబడిపోయెను. కాని గోలకొండ ముట్టడి దీర్ఘముగ సాగినది. చక్రవర్తి స్వయముగ నడపినను చక్కని రక్షకపు టేర్పాటులు కలిగియుండిన కారణమున అది ఎనిమిదినెలల సుదీర్ఘకాలము కొనసాగినది. చక్రవర్తి విసుగెత్తి ఒకప్పుడు ముట్టడి మానివేయుటకును నిశ్చయించెను. కాని అబ్దుల్లా ఖాను పున్ని అను అఫ్గాను సేనాని విశ్వాసఘాతుకుడయి వడికిరేయిని కోట తలుపులు తెరచి లోనికి శత్రువులను రానిచ్చినందున కోట శత్రువులకు వశమగుట కవకాశము కలిగినది. అయినను శత్రు సమక్షమున తానాషా కనబరచిన చిత్తస్థైర్యమును, చివరవరకు విశ్వాసమును జూపిన అబ్దుర్ రజాక్ లారీయొక్క అద్వితీయ స్వామిభక్తియు ప్రపంచ చరిత్రలో ఆశ్చర్యకరమైన విషయములు.

క్రీ. శ. 1687లో జరగిన గోలకొండ పతనము వలన ఆ రాజ్యచరిత్రము తటాలున ముగిసిపోయినది. తత్ఫలితముగ మార్పు లనేకము వచ్చినవి. అవి విజ్ఞానాభ్యుదయమును ఏండ్ల పర్యంతము ఆపివేసినవి. మదరాసునను, మచిలీపట్టణమునను నెలకొనియున్న ఇంగ్లీషు కంపెనీ వారిపై పరిపాలనాధికారపు పటుత్వమును సడలిపోయినది. కావుననే ఇంగ్లీషు కంపెనీ (కుంఫిణీ) వారు తమ తొలి హద్దుల నతిక్రమించి తమ రాజ్యమును వ్యాప్తి నొందించి కాలక్రమమున యావద్భారత ఖండమునకును అధిపతులు కాగలిగిరి. గోలకొండ దక్షిణదేశముపై ఆధిపత్యము వహించి యున్నంతకాలము, ప్రభువు అబుల్ హసనును, మంత్రి మాదన్నయును ఆంగ్ల వర్తకులను నిరంతరము నొకకంటు కనిపెట్టియే యుండిరి.

కుత్బ్ శాహి రాజుల ఘనత వారు సాధించిన యుద్ధ విజయముల కంటెను కళా విజ్ఞాన రంగములయందు కావించిన అమూల్య కృషియందే కలదు. వారు నగరములను నిర్మించిరి; ఉద్యానములను వేయించిరి; సరస్సులను, తటాకములను త్రవ్వించిరి; ప్రాసాదములను కట్టించిరి. తిన్నని వీథులతోను, దాద్ మహల్, ఖుదా దాద్ మహల్, గగన్ మహల్, అమాన్ మహల్ వంటి దివ్యభవనములతోను ఒప్పునట్టి హైదరాబాదు నగరము మధ్యయుగము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



నాటి వైచిత్ర్యము. అరబ్బీ, పారశీలతోపాటు స్థానికమైన ఆంధ్రభాషా సాహిత్య పోషణ ప్రోత్సాహములు కుతుబ్ శాహీలనాటి సంస్కృతి అలంకారములు. కుతుబ్ శాహీలు తెలంగాణాలో ప్రోది చేయించిన లలిత విజ్ఞానసంపదలోని ప్రధానాంశములు హైదరాబాదులోని నేటి సంఘ వ్యవస్థ యందు కానవచ్చుచున్నవి. తెలుగు, పర్షియను భాషల యందు ఆ కాలమున అవతరించిన సాహిత్యగ్రంథములు ఆనాటి సారస్వతాభ్యుదయ వికాసములను చాటి చెప్పుచున్నవి.

చక్కని పరిపాలనము, ఆనాటి సాంఘిక రాజకీయ సరణుల కనువయిన సమర్థమగు రాజ్యాంగ నిర్వాహక బృందము కుతుబ్ శాహీలు సాధించిన వేరొక ఘనకార్యము. మధ్యయుగము నందలి అన్యరాజవంశములకంటె కుతుబ్ శాహీలు పరిపాలన కార్యదక్షులు. విదేశీయులే అయినను వారు విజ్ఞానమునందును, ఆచారవ్యవహారము లందును తమకంటె భిన్నులయిన ప్రజలను పరిపాలించుటకు తగిన రాజనీతి నైపుణ్యమును, సామర్థ్యమును సంపూర్ణముగా కలిగియుండిరి. తాము పరిపాలించు దేశమునందలి ప్రజలతో ఐకమత్యము, అనుకూల భావము కలిగి ప్రవర్తించుటచేతనే వారి పరిపాలనము విజయవంతముగా సాగినది. దేశమునకు క్రొత్తయైనను సుల్తాన్ కులీని ఆంధ్రప్రజలు 'బడా మలిక్' (గొప్ప ప్రభువు) అని గౌరవించిరి. అతని మృతికి దేశ మంతయు మిగుల సంతాపము నొందినది. ఇబ్రాహీం కుతుబ్ షాయును, అతని తరువాతి వారును, స్థానికాభిప్రాయముల ననుసరించి వారి సంప్రదాయముల యెడ, ఆచార వ్యవహారములయెడ ఆత్మీయభావముతో ప్రవర్తించిరి. ముహమ్మద్ కులీ కుతుబ్ షా ఆంధ్ర జాతి నిర్మాతలలో ఘనుడు. అతడు ఆంధ్రసాహిత్య విజ్ఞానమును మెచ్చుకొని తన భావములను దక్కని కావ్యములలో ప్రకటించెను. అతడు తురుష్క సంప్రదాయములను ఉజ్జగించి, స్థానిక సంప్రదాయములను, ఆచారములను అవలంబించెను. తరువాతి వారును, అతని అడుగుజాడలలోనే నడచిరి. వారు హైందవ దేవాలయముల సంరక్షణమునకై విస్తారముగ భూములను దాన మిచ్చిరి. గోదావరీ తీరమునందలి భద్రాచల దేవాలయమునకును, కృష్ణాతీరమునందలి భరమలస్వామి (?) దేవాలయమునకును అబుల్ హసన్ కుతుబ్ షా అపారముగా భూములను దానము చేసెను. ఆ. మ. సి.

# ఆధునిక యుగము

## ఆసఫ్ జాహి నిజాం రాజ్యము

క్రీ. శ. 1687 వ సంవత్సరమున గోల్కొండ రాజ్యము మొగలాయిల వశమయినది. ఈ సందర్భమున నడచిన ముట్టడిలో మొదటి ఆసఫ్ జా నిజాముల్ ముల్కు తాత యగు కిలిచ్ ఖాన్ ప్రధానపాత్ర వహించెను. క్రీ. శ. 1707వ సంవత్సరమున ఔరంగజేబు కాలవశము నందెను. క్రీ. శ. 1708-12 సంవత్సరముల నడుమ దక్కనులో అరాజకము బాహాటముగా ప్రబలెను. క్రీ. శ. 1713 లో ఫరుక్ సియర్ ఢిల్లీ పాదుషా అయ్యెను. అతడు మీర్ కమర్ ఉద్ దీన్ అను నామాంతరము గల చిన కిలిచ్ ఖాను మొదటి ఆసఫ్ జాకు నిజాముల్ ముల్కు అను బిరుదమును ఇచ్చి దక్కనుకు రాజప్రతినిధిగా పంపెను. కాని అతనిని క్రీ. శ. 1715 లో మరల ఢిల్లీకి రప్పించెను. ఇందువలన మహారాష్ట్రులకు దక్కనుపయి తమ కుండు అధికారమును బలపరచుకొనుటకు అవకాశము కలిగినది. క్రీ. శ. 1719 లో ఫరుక్ సియర్ మరణించిన తరువాత నిజాముల్ ముల్కు దక్కనుకు మరలి వచ్చుటకు నిశ్చయించుకొనెను. అతడు క్రీ. శ. 1724 లో తన ప్రత్యర్థి అయిన ముబారిజ్ ఖానుతో శక్కర్ ఖేడువద్ద పోరాడి విజయము పొందెను. ఈ విజయముతో దక్కనులో నిజాముల్ ముల్కు వంశము వారి కులక్రమాగత పరిపాలనము ప్రారంభమైనది. విజయానంతరము నిజాముల్ ముల్కు హైదరాబాదుకు తరలి పోయి, దానిని తన రాజధానిని చేసికొని, ఆసఫ్ జా బిరుదముతో దక్కను పరిపాలకుడుగ నుండుటకు చక్రవర్తి ముహమ్మదుషా యొక్క అంగీకారమును పొందెను.

మహారాష్ట్రులు దక్కనుపై దండయాత్రలు సాగించుచునే యుండిరి. పీష్వా బాజీరావు నిజాముల్ ముల్కుతో పాల్ ఖేడువద్ద జరగిన యుద్ధమున విజయము పొందెను. తత్ఫలితముగ జరగిన సంధియొక్క షరతులను అనుసరించి మహారాష్ట్రులకు సాహూ రాజని ఒప్పుకొనుటయే కాక ఆసఫ్ జా మహారాష్ట్రులకు దక్కనులోని ఆరు సుబాలలో చౌతు, సర్ దేశముఖ పన్నులను వసూలు చేసికొను హక్కును కూడ ఇచ్చెను. క్రీ. శ. 1731 లో నిజాముల్ ముల్కు పీష్వా బాజీరావుతో రహస్యముగా ఒక యొడంబడిక చేసికొనెను. దాని ప్రకారము మహారాష్ట్రులు దక్కనుకు తాము ఎట్టి యుపద్రవమును కలిగింపక వదలిపెట్టుదుమనియు, చౌతు, సర్ దేశ్ ముఖులు వేరు విధములైన



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పన్నుల నచటినుండి వసూలు చేయ మనియు వాగ్దానము చేసిరి. అప్పుడు మహారాష్ట్రులు తలపెట్టియున్న హిందూ స్థానము మీది దండయాత్రలలో నిజాముల్ ముల్కు తటస్థుడై యుండుట కొప్పుకొనెను. క్రీ. శ. 1786 - 87 లో బాజీరావు దండుతో ఢిల్లీపై బడినపుడు చక్రవర్తి మహమ్మదు షా సాహాయ్యము నర్థించుచు ఆసఫ్ జాకు పలుమారు ఉత్తరములు వ్రాసెను. ఆసఫ్ జా క్రీ. శ. 1787 వ సంవత్సరము (జూలై నెలలో) ఢిల్లీకి చేరుకొనెను. కాని బాజీరావు క్రీ. శ. 1788 వ సంవత్సరమున జనవరి నెలలో భోపాలువద్ద ఆసఫ్ జాను మార్కొని ఓడించెను. ఆసఫ్ జాకు అతడు పెట్టిన షరతుల ప్రకారము సంధిచేసి కొనక తప్పినదికాదు. క్రీ. శ. 1748 లో 77 సంవత్సరముల ప్రాయమున ఆసఫ్ జా లోకాంతరగతు డయ్యెను. అత డొక మరణ శాసనమును వ్రాసెను. దాని ప్రతి యొకటి హైదరాబాదు రికార్డు ఆఫీసులో ఉన్నది. దానిలో నీ క్రింది విషయములు కలవు: (1) మహారాష్ట్రులతో ఐకమత్యము కలిగి వారి సహకారముతో శాంతిని నెలకొల్పుట యుక్తము; (2) అపరాధులను దండించువట్టున వారియెడ పారుష్యములేక మిక్కిలి మెలకువతో ప్రవర్తించ వలయును; (3) జీవితకాలములో ఎక్కువపాలు గుడారములలో వాసము చేయుచు దేశసంచారము చేయవలెను; (4) ప్రజలయోగ క్షేమములను సంపాదించుటకు ఎక్కువగా పాటుపడవలెను.

ఔరంగజేబుకు తరువాత మొగలాయి సామ్రాజ్యములో ఈ మొదటి ఆసఫ్ జాను మించిన ప్రముఖుడు మరి యొకడు లేడు.

మొదటి ఆసఫ్ జాకు కుమారులు ఆరుగురు. వారిలో ఘాజి ఉద్దీన్ జ్యేష్ఠుడు. ఇతడు మొగలాయి ఆస్థానమున తండ్రికి ప్రతినిధియై ఢిల్లీనగరమున నివసించుచుండెను. రెండవ కుమారుడు నాసిర్ జంగు. ఇతడు దక్కను సుబా పాలకత్వము వహించుటకు మొగలాయి చక్రవర్తి ఆమోదించి అతనికి నిజాం ఉద్ దౌలా అను బిరుదము నిచ్చెను. ఆసఫ్ జా దౌహిత్రుడు ముజఫ్ఫర్ జంగు దక్కను రాజ ప్రతినిధి పదవికి తాను హక్కుదారుడనని వాదించి దానిని పడయుటకయి డూప్లే ఆధిపత్యములో ఉన్న ఫరాసు వారి సాయమును సంపాదించుకొనెను. నాసిర్ జంగు డెబ్బదివేలు అశ్వికులు, లక్ష పదాతులు గల గొప్పసైన్యమును వెంట తీసికొని క్రీ. శ. 1750లో ముజఫ్ఫర్ జంగు మీదికి ఎత్తివెళ్లెను. అతనికి బాసటగా ఆంగ్లేయులు ఒక సైనికదళమును పంపిరి. ముజఫ్ఫర్ జంగు నాసిర్ జంగుకు లొంగి పోయెను.

ఫరాసు గవర్నరు డూప్లే తన సైన్యములను సమకూర్చుకొని కడప, కర్నూలు, సవనూరు నవాబులతో కుట్రలు పన్నుటకు మొదలు పెట్టెను. క్రీ. శ. 1750 వ సంవత్సరము డిసెంబరు నెలలో పఠాను ప్రభువులలో ఒకడయిన కందనోలు (కర్నూలు) నవాబు హిమ్మత్ ఖాను నాసిర్ జంగును హత్యచేసెను. అంత డూప్లే ముజఫ్ఫర్ జంగును విడిపించి తనతోకూడ తన పల్లకిలో ఎక్కించుకొని పుదుచ్చేరికి కొనిపోయెను. అప్పుడు ముజఫ్ఫర్ జంగు డూప్లేకు పెక్కు బిరుదములను, గ్రామములను ఇచ్చి అతనిని కృష్ణానది మొదలు కన్యాకుమార్యగ్రము వరకుము గల యెల్ల దేశమునకును నవాబుగా నియమించెను. ముజఫ్ఫర్ జంగును మృతిచెందిన యతని మేనమామకు ఉత్తరాధికారిగా సింహాసనమున నెక్కించుటకొరకు బుస్సీ సేనాని నాయకత్వమున డూప్లే ఒక ఫరాసు దళమును సాయ మిచ్చి హైదరాబాదుకు పంపెను. కాని మధ్యే మార్గమున కడపకు దక్షిణమున 35 మైళ్ళ దూరమున నున్న లక్కారెడ్డిపల్లె వద్ద క్రీ. శ. 1751వ సంవత్సరము ఫిబ్రవరి నెలలో పఠాను నవాబులు అతనిని తెగటార్చిరి. పిమ్మట రెవిన్యూ మంత్రి శ్రీకాకుళపు రామదాసను నామాంతరముగల రాజా రఘునాథు ఫరాసు దళవాయి అగు బుస్సీకి లంచ మిచ్చి అతని మాధ్యస్థ్యమున మొదటి ఆసఫ్ జా మూడవ కుమారుడు సలాబత్ జంగును క్రొత్త నిజాముగా ప్రకటించెను. ఫ్రెంచివారు పెద్ద పెద్ద జాగీరులు గడించుకొనిరి. దక్కనులో సర్వాధికారములు వారివే అయిపోయినవి. ఫరాసు ప్రాబల్యమును వివరించుచు 'ఇచ్చట మనము పాడినదే పాట, ఆడినదే ఆట. లాభము లన్నియు మనమే పొందుచున్నాము' అని బుస్సీ ఒకమారు డూప్లేకు వ్రాసెను. బుస్సీ హైదరాబాదులో పదేండ్లకాల ముండెను. 'బుస్సీ, సంతుష్టాంతరంగుడవై యుండుము. నీవు గౌరవ మర్యాదలతో ప్రవర్తించుచున్నావు' అని డూప్లే బుస్సీకి బదులు వ్రాసెను.

సలాబత్ జంగు నిజా మగుటకు పీష్వా ఒప్పుకొనలేదు. క్రీ. శ. 1752 వ సంవత్సరము మేనెలలో ఘాజి ఉద్దీన్ ఒక మహారాష్ట్ర సైన్యరక్షణక్రింద ఢిల్లీనుండి బయలుదేరెను. సహజ రాజనీతిచాతుర్యముగల బుస్సీ మహారాష్ట్రులకు లంచ మిచ్చి పీష్వా బాజీరావుతో సలాబత్ జంగుకు సఖ్యము పొసగించి రక్షణసైనిక సహాయ సంధిని కుదిర్చెను. ఇంతలో ఘాజి ఉద్దీన్ విషప్రయోగముచే మరణించెను. ఇందువలన సలాబత్ జంగు పదవి స్థిరమయ్యెను. తరువాత ఆరోగ్యము నిమిత్తము బుస్సీ మచిలీపట్టణమునకు తిరిగి పోయెను. ఆయదనున సలాబత్ జంగు దివాను సయ్యద్



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



లష్కర్ ఖాను పరాసు తురుష్కులను దక్కనునుండి తరిమి వేయవలెనని సంకల్పించెను. అది పసి పట్టి బుస్సీ ఏకాయెకిని హైదరాబాదుకు పోయి, మచిలీపట్టణమునుండి చిలుక సముద్రమువరకుగల ఉత్తర సర్కారులను సొంత జాగీరుగా సలాబత్ జంగుచేత తన పేర మంజూరు చేయించుకొనెను. క్రీ. శ. 1754 వ సంవత్సరము డిసెంబరు నెలలో సలాబత్ జంగు శ్రీకాకుళము, ఏలూరు, రాజమహేంద్రవరము, ముస్తఫానగరము (కొండపల్లి) అను నాలుగు సర్కారులను పరాసువారి కిచ్చివేసెను. బుస్సీ ఆనాడారంభించిన రక్షణ సైనికసహాయపద్ధతిని తరువాత చాలకాలమునకు వెల్లస్లీ ప్రభు వవలంబించెను. ఈ సర్కారులలోనుండి వచ్చుచుండిన ఆదాయము ముప్పదియొక్క లక్ష; సైనిక వ్యయము ఇరువదియైదులక్షల ఏబదివేలు. పరాసువారు మూడు సంవత్సరముల కాలమునుండి పొందుచు వచ్చిన అభ్యుదయమునకు ఈ సర్కారుల లాభము తలమానికము. పరాసువారి ప్రాభవ ప్రశస్తులు మిన్నుముట్టినవి. బుస్సీ డచ్చివారితోను, ఆంగ్లేయులతోను ఒకానొక ప్రత్యేక కార్యనిర్వహణార్థము తనకు సర్కారు లీయబడియుండుట వలన పరాసు కంపెనీయొక్క స్థితిగతులలో ఎట్టిమార్పును కలుగలేదని చెప్పెను.

మార్టినో అను గ్రంథకర్త 'దక్కనులో బుస్సీ' అను తన గ్రంథములో బుస్సీనిగూర్చి యిట్లు వ్రాసియున్నాడు :

'బుస్సీ హిందూదేశములోని రాజులతో మెలగవలసిన పద్ధతులను చక్కగా గ్రహించినవాడు; వారి వారికి తగినట్లు మర్యాదతో ప్రవర్తించును; వారి యనుమతి చెందక ఏ కార్యమును చేయడు. అతని ప్రవర్తనలో అతని యధికారభావము లేశమయినను పొడకట్టదు; దుర్బలులను, పరాజితులను అతడు ఎన్నడును తృణీకరించినట్లు చూపట్టదు. తన వశమున యుద్ధమున కాయత్తమైన సైన్య ముండినను కాఠిన్యమునకంటె మార్దవము, పోరుకంటె పొందు, హింసాదూషితమైన విజయముకంటె అహింసాభూషితమైన మానవ ప్రాణరక్షణము ప్రశస్తము అని అతడు నిరంతరము భావించును. అతని సంకల్పములు దృఢములు; కార్యములు ధైర్యసాహసోపేతములు' అని తెలిపి యున్నాడు.

సలాబత్ జంగుయొక్క మంత్రి తన యేలికపై పరాసువారికి గల ఆధిపత్యమును తొలగించుటకయి క్రీ. శ. 1756 లో మరొకమారు ప్రయత్నము చేసెను. ఈ ప్రయత్నమతని పతనమునకు కారణమయినది. బుస్సీ హైదరాబాదును పట్టుకొని దానిలో నిజాము నివాసస్థానమయిన చౌమొహల్లా నగరులో స్థావర మేర్పరచుకొనెను. ఆ సమయమున 'లా' సేనాని నాయకత్వముక్రింద మూడు వందల యూరోపియనులును, రెండువేలు గర్దీబలమును పుదుచ్చేరినుండి బుస్సీకి సాయము వచ్చెను. అపుడు ఆంగ్లేయులు తమవద్దనుండి సిరాజ్ ఉద్ దౌలా పట్టుకొనియుండిన కలకత్తా నగరమును మరల స్వాధీనపరచుకొనుటకు ప్రయత్నపడుచుండుటవలన సలాబత్ జంగుకు సాయము వచ్చుటకు వీలు కాకపోయినది. సలాబత్ జంగును, అతని మంత్రియు బుస్సీ స్థావరమును రెండునెలల పర్యంతము ముట్టడించినను అతనిని అక్కడనుండి కదల్పజాలకపోయిరి. అందువలన వారికి బుస్సీతో తప్పని సరిగ సంధి చేసికొనవలసి వచ్చినది. తరువాత బుస్సీ క్రీ. శ. 1757 లో బొబ్బిలికోటను లగ్గలు పట్టి స్వాధీనము చేసికొనెను. ఈ ముట్టడి వృత్తాంతము బొబ్బిలిపాటలో వర్ణింపబడినది.

క్రీ. శ. 1756 వ సంవత్సరమునందే యూరోపులో సప్తవర్ష సంగ్రామము ప్రారంభమయినది. దాని నాస్పదము చేసికొని సర్కారులలో కోస్తాప్రాంతమున ఉన్న తమ శత్రువులగు ఆంగ్లేయుల కర్మాగారములను కొన్నింటిని బుస్సీ స్వాధీనము చేసికొనెను. క్రీ. శ. 1758 లో 'లాలీ' బుస్సీని పుదుచ్చేరికి రప్పించెను. ఆ సంవత్సరమే అక్టోబరు నెలలో కర్నల్ ఫోర్డు బంగాళమునుండి విశాఖపట్టణమునకు వచ్చి రాజమహేంద్రవరమునకు సమీపమునఉన్న కొండూరివద్ద జరగిన యుద్ధములో పరాసువారిని పరాజితులను జేసెను. అతడు ఆ మరుసటియేట (క్రీ. శ. 1759) మచిలీపట్టణమును స్వాధీనపరచుకొని అనంతరము సలాబత్ జంగుతో సంధి చేసికొనెను. ఆ సంధిమూలమున సలాబత్ జంగు గుంటూరుతప్ప తక్కిన ఉత్తర సర్కారు లన్నిటిని ఆంగ్లేయులకు ఇచ్చివేసెను. ఫోర్టు సెయింట్ జార్జ్ ప్రెసిడెంటు, కౌన్సిలుద్వారా తూర్పు ఇండియా కంపెనీవారి పక్షమున రాజమహేంద్రవరము సర్కారు వాస్తవ్యులైన శ్రీ రాజా కాంద్రేగుల జోగిపంతులు అను నామాంతరము గల శ్రీనివాస జగన్నాథరావు రాయబారము సాగించి నిజాముతో పై ఒడంబడికను కుదిర్చెను. క్రీ. శ. 1765 లో ఢిల్లీ ఫాదుషా షా అలమ్ ఖైవుతో చేసికొన్న ఒడంబడికలో ఉత్తర సర్కారులను ఆంగ్లేయులకు స్థిరపరచెను.

క్రీ. శ. 1761 లో ఆసఫ్ జాయొక్క నాలుగవ కుమారుడయిన నిజాం అలీ ఖాను రెండవ ఆసఫ్ జా బిరుదుతో నిజాము అయ్యెను. ఈ నిజాముతో ఆంగ్లేయులు క్రీ. శ. 1766 లో ఒక యొడంబడిక చేసికొనిరి. దీని ప్రకారము కంపెనీ(కుంఫిణీ)వారు క్రమమును, ఉచితమును అయిన సమస్త కార్యములందును కోరినపుడెల్ల నిజామునకు సాయపడి వానిని చక్కబెట్టుటకయి కొంత సైన్యమును



http://sanskritcentral.com/

http://teluguthesis.com/





చిత్రము. 2.
నిజాం అలీఖాన్

*



చిత్రము 3.
నవాబ్ మీర్, ఉస్మాన్ అలి ఖాన్

*



చిత్రము 1.
మొదటి ఆసఫ్ జా నిజాము

*



చిత్రము 4.
దివాన్ చందూలాల్

*



చిత్రము 5.
దివాన్ సర్ సాలార్ జంగ్

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఎల్లప్పుడును సిద్ధముగా ఉంచుటకును, సైన్యసహాయ మక్కరలేని సంవత్సరములలో పాలుకు తొమ్మిది లక్షలు నిజామునకు కప్పము చెల్లించుటకును అంగీకరించిరి. అక్కర పడినపు డెల్ల, నిజాము ఆంగ్లేయులకు తోడ్పడుటకు సమ్మతించెను. క్రీ. శ. 1768 లో మరియొక సంధి జరిగినది. ఈ సంధి ఉత్తర సర్కారులను ఇంగ్లీషువారికి స్థిరపరచి కప్పమును ఏడు లక్షలకు తగ్గించినది.

గుంటూరు సర్కారును నిజాము సోదరుడు బసాలత్ జంగు జీవితాంతమువరకు అనుభవించుచుండెను. క్రీ. శ. 1778 లో ఇంగ్లండు, ఫ్రాన్సులకు మరల పోరాట మారంభ మయ్యెను. గుంటూరు జిల్లాలో బసాలత్ జంగు పరాసు సైన్యమును పోగుచేయుచున్నాడని మదరాసు ప్రభుత్వము తెలిసికొని, ఆ సంగతిని కలకత్తాలో నున్న కేంద్ర ప్రభుత్వమువారికి తెలియజేసిరి. అందుమీదట కేంద్ర ప్రభుత్వమువారు వెంటనే పరాసు సేనను బర్తరఫు చేయవలెనని బసాలత్ జంగును గట్టిగా కోరుటకును, అత డట్లు చేయని యెడల గుంటూరు సరిహద్దులకు తమ సైన్యమును తరలించుకొని పోవుటకును అధికారము నొసగుచు మదరాసు ప్రభుత్వమునకు ప్రత్యుత్తరము పంపిరి. మదరాసు గవర్నరగు తామస్ రంబోల్డ్ బసాలత్ జంగుతో స్వయముగా సంప్రతింపులు జరపి గుంటూరిని వశపరచుకొనుటవలన నిజామునకు ఆగ్రహము కలిగినది. అంతట గవర్నరు జనరలైన వారన్ హేస్టింగ్సు ఈ సంప్రతింపులకు సమ్మతింపక గుంటూరిని మరల బసాలత్ జంగుకు ఇచ్చివేసెను. అయినప్పటికిని నిజాముసాయము ఇంగ్లీషువారికి అవసరమైన సమయమున అతనికి ఇంగ్లీషువారియెడ వైరస్యము కలిగినది.

క్రీ. శ. 1779 లో నిజామును, మైసూరు ప్రభువైన హైదరలీయు, మహారాష్ట్రులును ఇంగ్లీషువారిని హిందూదేశము నుండి తరిమివేయుటకు ఏకమైరి. కాని రాజనీతి నిపుణుడైన వారన్ హేస్టింగ్సు హైదరలీనుండి నిజామును, మహారాష్ట్రులను వేరుపరచెను; నిజాము ఆ స్థానములో ఒక బ్రిటిష్ రెసిడెంటును స్థాపించెను. క్రీ. శ. 1783 ఏప్రిలులో బస్సీ ఇండియాకు తిరిగి వచ్చెను. కాని కార్య మప్పటికే మించిపోయినది. ఆ సంవత్సరములోనే పారిస్ సంధి కుదురుటవలన దక్షిణ హిందూదేశము బ్రిటిషువారికి శాశ్వతముగా దక్కినది. క్రీ.శ. 1784 లో నిజామును, మహారాష్ట్రులును కలిసి మైసూరు ప్రభువగు టీపు(టిప్పు)సుల్తాను మీదికి ఎత్తిపోయిరి. ఈ యుద్ధమునకు ఫలితముగా క్రీ. శ. 1787 లో జరగిన సంధివలన నిజామునకు ఆదోని లభించినది. క్రీ. శ. 1788 లో పరస్పరము మైత్రిని కోరుచు నిజాము టీపు సుల్తాను కడకు రాయబార మంపెను; సుల్తానుతో వియ్యము కలుపుటకు కోరెను. కాని ఆతడు నిరాకరించెను.

సలాబత్ జంగు క్రీ. శ. 1782 లో మరణించెను. కాని క్రీ. శ. 1788 వరకు గుంటూరిని ఆంగ్లేయులకు అప్పగింపక నిజాము కాలము గడపివేసెను; తరువాత దానిని ఇచ్చివేయుట కంగీకరించెను. క్రీ. శ. 1790 జూలయిలో నిజాముతో ఆంగ్లేయులు ఒక క్రొత్త సంధి చేసికొనిరి. దాని ప్రకారము బ్రిటిష్ సేనానులక్రింద సిపాయి పటాలములను రెండింటిని కంపెనీ (కుంఫిణీ) ప్రభుత్వము నిజామునకు సాయపడుటకయి సిద్ధముగా ఉంచుటకును, ఆ పటాలములకు జీతబత్తెములను నిజాము భరించుటకును ఏర్పాటయ్యెను. కాని ఆ పటాలములను నిజాము కంపెనీవారి మిత్రులతో యుద్ధముచేయుట కుపయోగింపరాదని ఒక నిబంధన ఆ సంధిపత్రములో పొందుపరుపబడినది. కంపెనీవారి మిత్రుల పట్టికలో టీపు సుల్తాను పేరు లేదు. క్రీ. శ. 1792 లో జరగిన శ్రీరంగపట్టణపు సంధిని అనుసరించి టీపు సుల్తాను తన రాజ్యములో చాల భాగమును ఇంగ్లీషువారికిని, వారి మిత్రులకును ఇచ్చివేసెను. తుంగభద్రకు ఉత్తరమునను, దక్షిణమున కడప పర్యంతమును వ్యాప్తమైయుండిన అతని రాజ్యభాగము నిజామునకు సంక్రమించెను.

క్రీ. శ. 1794 లో పీష్వా తమకు బాకీపడియున్న చౌతు, సర్ దేశముఖ పన్నులను చెల్లింపవలసినదని నిజామును మరల ఒత్తిడిచేసెను. అపుడు నిజాము ఆంగ్లేయుల సాయమును అర్థించెను. ఆంగ్లేయులు నిజాము కప్పుడు సాయము చేయనందువలన అతడు క్రీ. శ. 1795 లో ఖాండా వద్ద జరగిన పోరాటమున ఓడిపోయెను. అంతట తనకు సాయపడుటకయి నియమింపబడిన ఇంగ్లీషు పటాలములను రెంటిని తొలగించి రేమండ్ అను పరాసు సేనాని సాయముతో తన సేనను నిజాము బలపరుచుకొనెను. ఈ రేమండ్ కొంతకాలము టీపు సుల్తాను కొలువులోను, క్రీ.శ. 1788 లో బుస్సీకి అంగరక్షకుడుగాను ఉండెను. తరువాత అతడు గుంటూరిలో బసాలత్ జంగు సైన్యములో ఉండెను. బసాలత్ జంగు సైన్యము నిజామునకు సంక్రమించినపుడు ఇతడును హైదరాబాదుకు వెళ్లి తన సైన్యమున సిపాయి పటాలము లిరువది వరకు పెంపొందించుకొని వానికి యూరోపియనులను నాయకులనుగా నియమించెను. అతడు తెలంగాణాలోని మెదకు జాగీరునుండి వచ్చెడు ఆదాయమును ఈ సేనల జీతబత్తెములకు వినియోగించుచుండెను. రేమండ్ నెలకొలిపిన తుపాకుల కర్మాగారముల యొక్క అవశేషములు హైదరాబాదులో నిజాము కళాశాలకు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సమీపమున నేటికిని కానవచ్చును. పూర్వము బుస్సీవలెనే ఈ రేమండ్ కూడ హైదరాబాదులో కొన్ని యేండ్లపాటు తన ప్రాభవమును నెరపెను. క్రీ. శ. 1798 లో ఇతడు కాలగతి చెందుటవలన ఇంగ్లీషువారికి ప్రమాదము తప్పిపోయినది. హైదరాబాదులో మలకపేటయందున్న రేమండ్ సమాధి వద్ద ప్రతి సంవత్సరమును జరగు ఉత్సవమువలన ఇతని స్మృతి నేటికిని మాసిపోక నిలిచి




యున్నది. 'మెయిసిరాం' అని ఇతని పేరు ఇప్పటికిని ప్రజల స్మరణయందున్నది.

క్రీ. శ. 1798 లో వెల్లస్లీ ఇండియాకు గవర్నరు జనరలుగా వచ్చెను. క్రీ. శ. 1780 లో మదరాసు సేనలో చేరి పనిచేయుచుండి క్రీ. శ. 1798 లో విజయనగరమున సేనాని అయియుండిన జే. ఏ. కిర్క్ ప్యాట్రిక్ ఆ సమయమున హైదరాబాదులో రెసిడెంటుగా ఉండెను. అతడు ముఖ్యములయిన మూడు సహాయ సైనిక సమాఖ్యలను ఏర్పాటు చేసెను. రేమండ్ ఏర్పాటుచేసిన పరాసు దళమును తొలగించి నిజాము బ్రిటిషు సహాయ సైనిక దళము నేర్పాటు చేసికొనవలసి వచ్చెను. ఆ సైన్యమును పోషించుట కయ్యెడు వ్యయమును భరించుటకుగాను నిజాము క్రీ. శ. 1792 లోను, 1799 లోను మైసూరు రాజ్యమునుండి తనకు వశమైన ప్రదేశముల నన్నిటిని ఆంగ్లేయుల కప్పగించెను. ఈ సంధి మూలమున నిజాము కొంత రాజ్యమును, ప్రతిష్ఠను, అధికారమును కోల్పోయెను. ఆ ప్రదేశము బ్రిటిషువారికి రూఢిగా స్థిరపడిపోయెను. నిజామాంధ్రమని బ్రిటిషాంధ్రమని తెలుగుదేశము రెండు తునకలైనది. ఈసహాయ సైనిక విధానమువలన ప్రజల యిక్కట్టులు వృద్ధిచెందినవి. వెల్లింగ్టను ప్రభువు, సర్ తామస్ మన్రోలవంటి మహామహులు ఈ విధానము వలని చెడుగును గ్రహించి స్పష్టముగా వెల్లడించిరి. విదేశీయుల దాడులను మార్కొనుటకుగాని, తిరుగబాట్లను రూపుమాపుటకుగాని ఉపయోగపడుటకు మారుగా స్థానికోద్యోగులు రైతులను త్రొక్కటపరచి పన్నులను రాబట్టుకొనుటకు ఆ సేనలు తోడ్పడుచుండెను.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



క్రీ. శ. 1808 వ సంవత్సరము ఆగస్టు 7 వ తేదినాడు రెండవ ఆసఫ్ జా అయిన నిజాం అలీ ఖాఁ మృతుడు కాగా, అతని కొమారుడు నవాబు సికందర్ జా బహద్దరు మూడవ ఆసఫ్ జా బిరుదుతో రాజ్యమునకు వచ్చెను. ఇతడు క్రీ. శ. 1803 మొదలుకొని క్రీ. శ. 1829 వరకు రాజ్యము చేసెను.

సికందర్ జా బహద్దరు ప్రధానమంత్రి అయిన మీర్ ఆలం క్రీ. శ. 1808 లో మరణించిన తరువాత రాజ్యములో ప్రధానాధికారము రాజా చందులాల్ హస్తగతమై యుండెను. అపుడు మధ్య హిందూస్తానమున అరాజకము మితిమీరి యుండెను. పిండారి మూకల హోవడుల మూలమున హైదరాబాదు రాజ్యముయొక్క సరిహద్దు గ్రామముల ప్రజలు అలమటించుచు గడగడలాడి పోవుచుండిరి. క్రీ. శ. 1811 లో హెన్రీ రస్సలు హైదరాబాదులో బ్రిటిషు రెసిడెంటు పదవియం దుండెను. ఈ పిండారీలు బ్రిటిషువారి మిత్రమండలి కొలువులోనివా రగుటచే వారి బాధల నణచివేయుటకు సహాయ సైనిక దళములను ఉపయోగింప వీలు లేకుండెను. అందుచేత హెన్రీ రస్సలు విశ్వాసపాత్రులును, ఆరితేరిన వారును అగు సైనికులతో 'రస్సల్ దళము' అను పేరున ఒక ప్రత్యేక దళమును సమకూర్చెను. ఈ దళమునకే తరువాత హైదరాబాదుసైన్య మను పేరు కలిగినది. ఉత్తర సర్కారులు బ్రిటిషువారు పుచ్చుకొన్నందుకుగాను వారు నిజామునకు చెల్లించు కప్పములోనుండి క్రమముగా ఈ సైన్యమునకు జీత బత్తెము లిచ్చుటకు ఏర్పాట్లు జరగినవి.

క్రీ. శ. 1814 వ సంవత్సరమున విలియం పామర్ అనునతడు ఒక పెద్ద బ్యాంకును స్థాపించెను. వడ్డీ వ్యాపారము చేయుట కతడు క్రీ. శ. 1816లో ఇండియా ప్రభుత్వము వారివద్దనుండి లైసెన్సు పొంది నూటికి సంవత్సరమునకు రు. 24 వడ్డీ చొప్పున నిజామునకు అప్పిచ్చెను. అప్పిచ్చిన సొమ్మునకు హామీగా నిజాము కొన్ని జిల్లాల ఆదాయమును అతని పరము చేసెను. మదరాసు గవర్నరుగా నుండిన తామస్. రంబోల్డ్ మనుమడు సర్ విలియం రంబోల్డ్ క్రీ.శ. 1817 సంవత్సరమున ఈ బ్యాంకులో భాగస్వామి అయ్యెను. ప్రధాని చందులాల్ ద్వారా బ్యాంకువారు నిజామునకు అప్పు ఇచ్చుచుండిరి. క్రమముగా ఈ ఋణము కోటి రూపాయల వరకు పెరిగినది. ఈ విలియం పామరును ప్రజలు 'రాజా పామరు' అని వ్యవహరించెడివారు. హైదరాబాదు రాజ్య వ్యవహారములలో పామరు పలుకుబడి క్రీ. శ. 1828 వరకు పదునాలుగు సంవత్సరములపాటు నిరాటంకముగ సాగినది. ఈ కంపెనీవారి వ్యవహారములు నిజామునకును, అతని రాజ్యములోని ప్రజలకును చాల నష్టము కలిగించెను. తుదకు కంపెనీ దివాలా తీసినది. పామరుకు చెల్లించవలసిన బాకీని తీర్చుటకుగాను గవర్నరు జనరలు హేస్టింగ్సు ప్రభువు నిజామునకు కోటి రూపాయలు పంపెను. ఉత్తర సర్కారులకోసము ఆంగ్లేయులు ప్రతి సంవత్సరమును చెల్లించుచుండిన కప్పము ఏడు లక్షల రూపాయలకుగాను తనకుగల హక్కును శాశ్వతముగా వదలుకొనినట్లు నిజాము ఒకపత్రమును వ్రాసి సంతకము చేసి దానిని చందులాలు ద్వారా రెసిడెంటుకు పంపెను. విలియం పామరు క్రీ. శ, 1867 వరకు జీవించి యుండెను.

సికందర్ జాకు తరువాత, అతని కుమారుడు నాసిర్ ఉద్ దౌలా అను నాలుగవ ఆసఫ్ జా క్రీ.శ. 1829 మొదలు క్రీ. శ. 1857 వరకు రాజ్యము చేసెను. రాజా చందులాల్ క్రీ. శ. 1843 వరకు మంత్రిపదవియం దుండి క్రీ.శ. 1845 లో మృతినొందెను. అపుడు నిజాము రాజ్యపరిపాలనము చాల అసంతృప్తికరముగ నుండెను. క్రీ. శ. 1853లో డల్హౌసీ ప్రభువు నిజాముతో ఒక యొడంబడిక చేసికొనెను. దాని ప్రకారము నిజాము తన రాజ్యములోని బ్రిటిషు సైన్యపోషణమునకై బేరారును, దానితోపాటు రాయచూరంతర్వేదిని, షోలాపూరు అహ్మదు నగరము జిల్లాల సరిహద్దు ప్రాంతములను బ్రిటిషువారి కిచ్చివేసెను. ఈ నిజాము క్రీ. శ. 1858 వ సంవత్సరము మార్చి 11వ తేది నాడు చనిపోయెను. అతని పెద్దకుమారుడు నవాబ్ అఫ్ జూల్ ఉద్ దౌలా అను అయిదవ ఆసఫ్ జా రాజ్యాధిపత్యము వహించి క్రీ. శ. 1857 మొదలు క్రీ. శ. 1869 వరకు పరిపాలనము చేసెను. క్రీ. శ. 1857వ సంవత్సరమున ఇండియాలో గొప్ప సిపాయి తిరుగబాటు సంభవించినది. ఆ సంవత్సరమే జూను నెలలో హైదరాబాదు నగరము నందును తిరుగబాటు జరగినది. నిజాము కూడ ఫితూరీదారులతో కూడిన యెడల బ్రిటిషువారు సమస్తము కోలుపోవుదురని బొంబాయి గవర్నరు హైదరాబాదులో రెసిడెంటుకు తంతివార్త పంపెను కాని సాలార్ జంగు ఆంగ్లేయులకు అండయై తన ప్రాణములకు తెగించి నగరములో చెలరేగిన తిరుగబాటు నణచివేసెను. ఈ సిపాయిల తిరుగబాటులో హైదరాబాదు నిజాము చూపించిన రాజభక్తికి మెచ్చి విక్టోరియా మహారాణి అతనితో ఒక క్రొత్త ఒడంబడిక చేసికొనెను. దాని ప్రకార మాంగ్లేయులు క్రీ. శ. 1857లో తమ యధికారమును ధిక్కరించి యుండిన షోలాపూరును సంపూర్ణాధికారములతో నిజామునకు ఇచ్చివేసిరి; నిజాము తమకు చెల్లించవలసిన ఏబదిలక్షల రూపాయల అప్పును రద్దుచేసిరి; నిజాము తమ కిచ్చియుండిన



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



రాయచూరంతర్వేది జిల్లాలను, దానికి చేరికగా నుండిన షోలాపూరు, అహ్మదు నగరము జిల్లాలను తిరిగి నిజాముకు ఇచ్చివేసిరి. నిజాము గోదావరికి ఉత్తరమునకున్న తాలూకాలను భద్రాచలముతో కూడ ఆంగ్లేయుల కిచ్చివేసెను.

క్రీ. శ. 1869లో నిజాము గతించెను. తరువాత, అతని కొడుకు మీర్ మహబూబ్ అలీ ఖాను అను ఆరవ ఆసఫ్ జా రాజ్యమునకు వచ్చి అప్పటినుండి క్రీ. శ. 1911 వరకు పరిపాలనము సాగించెను. రాజ్యమునకు వచ్చినప్పుడు ఇతని వయస్సు మూడేండ్లు. సమర్థుడైన సర్ సాలార్ జంగు ఒడుదొడుకు లేవియు కలుగకుండ గట్టి కట్టుదిట్టములతో ప్రభుత్వమును సాగించెను. భూమిపన్ను పద్ధతులను అతడు మొదలంట మార్చివేసెను. వీనిలో ఎక్కువ భూమి శిస్తు రాబట్టుటకయి వేలములో ఎక్కువ పాట పాడినవారికి పన్ను వసూలు చేసికొను అధికారమును ఇచ్చు పద్ధతిని రద్దుచేయుట మిక్కిలి ముఖ్యమయినది. ఇతడు పొలములను కొలిపించి, వాని హద్దులను నిర్ణయించి, గుడికట్టు లెక్కలను తయారు చేయుటకు తగిన ఏర్పాటు చేసెను; శిస్తు విధించుటకు కొన్ని నియమములను ఏర్పరచెను. ఇట్లు చేయుటవలన రైతాంగము స్థితిగతులు బాగుపడినవి. న్యాయశాఖ నితడు సంస్కరించెను; అంగ విచ్ఛేదన శిక్షను రద్దుచేసెను; సహగమనమును నిషేధించెను; బందిపోటులు, దారి దోపిళ్లు అణచివేయుటకు అవశ్యకమైన చర్యలను అమలుపరచెను; ప్రాతకాలపు జలాశయములను, చెరువులను బాగుచేయించి నీటిపారుదలకు తగిన సౌకర్యములను కలిగించెను; సయ్యిద్ హుస్సేన్ బిల్‌గ్రామి సాయముతో విద్యావిధానమును సంస్కరించి క్రమపద్ధతిని జరుగునట్లు చేసెను; ఒక వైద్యపాఠశాల నెలకొలిపెను; హైదరాబాదునుండి వాడివరకు ఇనుపదారి వేయించెను.



చిత్రము 70. నిజాము సాగర్, హైదరాబాదు



చిత్రము 71. నిజాము సాగర్, పొర్లు కళింగలు

క్రీ. శ. 1876 వ సంవత్సరమున సాలార్ జంగు ఇంగ్లాండుకు పోయి విక్టోరియా రాణిని సందర్శించి ఆమెతో విందారగించెను. ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయమువారు ఇతనికి డి. సి. ఎల్., అను గౌరవ పట్టము నిచ్చి సత్కరించిరి. క్రీ. శ. 1883 లో ఇతడు దివంగతుడయ్యెను. క్రీ.శ. 1884 లో రిపను ప్రభువు హైదరాబాదుకు వచ్చి మీర్ మహబూబ్ అలీ ఖానును హైదరాబాదు నిజాము పదవి యందు ప్రతిష్ఠించెను. ఈ నిజాము ప్రజానురాగమునకు పాత్రుడై యుండెను. క్రీ. శ. 1911 లో ఇతడు మృతినొందినపుడు ప్రజ లందరు అధికముగ దుఃఖించిరి.

ఇతని తరువాత క్రీ. శ. 1911 లో నవాబ్ మీర్ ఉస్మాన్ అలీఖాను అను ఏడవ ఆసఫ్ జా నిజాము పదవికి వచ్చెను. క్రీ. శ. 1950 వ సంవత్సరము జనవరి 26వ తేదినుండి క్రీ. శ. 1956 సంవత్సరము నవంబరు మొదటి తేది వరకు ఈయన రాజప్రముఖ్ పదవిని వహించియుండెను. ఈయన కాలమున జరిగిన రెండు ప్రపంచ యుద్ధముల వల్లను ఈయన కపార ధన వ్యయము కలిగినను దేశము చక్కగా అభివృద్ధి చెందినది. హైదరాబాదు నగరమునందు ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైకోర్టు, ఉస్మానియా వైద్యశాల, నగర కళాశాల, ప్రభుత్వ పుస్తక భాండారము, మ్యూజియము, జూబిలీ హాలు వంటి గొప్ప భవనములను కట్టించి ఈయన నగరమునకు సౌందర్యమును సమకూర్చెను; హైదరాబాదు నగరమునకు నూరు మైళ్ల దూరమున ఏబది చదరపుమైళ్ల విస్తీర్ణము కలదియు, 2,70,000 ఎకరముల పొలమునకు నీటిని సరఫరా చేయునదియు అగు నిజాము సాగర్ అను గొప్ప జలాశయము నిర్మించెను. హైదరాబాదు రాజ్యములోని జలాశయము లన్నిటికంటె ఇదియే పెద్దది.

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మొదటి సాలార్ జంగుకు తరువాత ప్రధాన మంత్రు లందరికంటె శక్తిసామర్థ్యములలో అతనికి సమానుడైన సర్ అక్బర్ హైదరి మూలముననే అజంటా గుహల లోని సుందర వర్ణచిత్ర సంరక్షణకు తగిన యేర్పాటులు కావింపబడినవి. ప్రపంచములోని నానాదేశములనుండి హిందూదేశమును సందర్శించుటకు వచ్చు జనులకు నేడు అజంటా గుహాలయములు తీర్థప్రాయమై విలసిల్లుచున్నవి. తెలంగాణాలో వరంగల్లు, పాలంపేట, పిల్లలమర్రి, నాగులపాడు, కొల్లిపాక, అలంపురము, రాయచూరు మున్నగు ప్రదేశములందలి కాకతీయ రాజేంద్రులనాటి శిల్పావశేషముల నితడు శిథిలమై రూపు మాసిపోనీక భద్రపరపించెను. తెలంగాణాలోని శాసనములను చక్కంటిని పండితులచే పరిష్కరింపించి ప్రకటించెను.

క్రీ. శ. 1924 లో ఇంగ్లీషు వెస్లియన్ మిషనువారు మెదకుపట్టణమున ఒక క్రైస్తవ దేవాలయమును కట్టించిరి. ఇది హిందూదేశములోని క్రైస్తవ దేవాలయము లన్నింటిలోను మిక్కిలి సుందరమైనది. ఈ మిషనువారే దిచ్పల్లి (దాచేపల్లి ?)లో ఒక కుష్ఠరోగి శరణాలయమును నెలకొల్పి నడపుచున్నారు. హిందూదేశములో దీనికంటె గొప్పదైన శరణాలయము వే రొకటి లేదు.

ప్రాచీన, నవీన శిలాయుగములకును, ఇనుప యుగమునకును సంబంధించిన చరిత్ర పూర్వయుగ విశేషములు తెలంగాణా జిల్లాలలో పెక్కుచోట్ల కానవచ్చుచున్నవి. ఈ ప్రదేశములలో కానవచ్చు రాక్షసిగుళ్లు మొదలైన చరిత్ర పూర్వయుగ సమాధులు అప్పటి సంస్కృతి విజ్ఞాన పరిశీలనకు సాధనములుగ నున్నవి. చెంచులు, గోండులు, కోయలు, బంజారులు, కొండ రెడ్లు మొదలగు పెక్కు తెగల ఆదిమజాతులవారు ఈ ప్రాంతములందు నివసించుచున్నారు. క్రీ. శ. 1948 మొదలుకొని హైదరాబాదు ప్రభుత్వమువారు ఈ జాతులవారిని ఆర్థికముగను, సాంఘికముగను ఉద్ధరించుటకు పాటుపడుచున్నారు. క్రీ. శ. 1949 లో వీరి స్థితిగతులను బాగుపరచుటకయి ప్రత్యేకముగ ఒక సంఘసేవాభ్యుదయశాఖ నెలకొల్పబడినది.

క్రీ. శ. 1948 వ సంవత్సరము సెప్టెంబరులో జరగిన పోలీసుచర్యకు తరువాత సైనికశాఖ పక్షమున మేజర్ జనరల్ జే. యన్. చౌదరి ప్రభుత్వము నెరపుచుండిన కాలమున రాజ్యములో రెవిన్యూ పద్ధతియందు పెక్కు మార్పులు ప్రవేశపెట్టబడినవి. సర్ఫే ఖాస నబడు నిజాము సొంత జాగీరులును, ఇతర జాగీరులును రద్దుచేయబడినవి. మాజీ మైసూరు దివాను ప్రధాని శిరోమణి న్యాయపతి మాధవరావుగారి ఆధిపత్యమున నియమింపబడిన సంఘము యొక్క నివేదిక ప్రకారము వ్యవసాయ విషయమున ముఖ్యములయిన సంస్కరణములు ప్రవేశపెట్టబడినవి.

క్రీ. శ. 1950 వ సంవత్సరము జనవరి 26-వ తేదివాడు హైదరాబాదు సంస్థానము ఇండియన్ సమాఖ్యలో చేరిపోయినది. నాటినుండి నిజాము హైదరాబాదు రాజ్యమున రాజప్రముఖ పదవియందు నియుక్తుడయ్యెను. శ్రీ యం. కె. వెల్లోడి, ఐ. సి యస్. ప్రధానమంత్రి అయ్యెను. మంత్రిమండలిలో ఉద్యోగి వర్గమునకు చేరని సభ్యులు నలుగురుండిరి. వారిలో బూరుగుల రామకృష్ణరావుగారును, వల్లూరి బసవరాజుగారును ఇద్దరు. క్రీ. శ. 1952 వ సంవత్సరము మార్చి 6 వ తేది వరకు ఈ మంత్రిమండలి ప్రభుత్వము నెరపినది. తదనంతరము పదుముగ్గురు మంత్రులతో క్రొత్త మంత్రివర్గము ఏర్పడినది. దానికి బూరుగుల రామకృష్ణరావుగారు ముఖ్యమంత్రిగా నుండిరి. క్రీ. శ. 1928 లో ఉస్మానియా కళాశాల ప్రాత విద్యార్థులలో సుప్రసిద్ధుడైన శ్రీ డాక్టరు భగవంతముగారు ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు వైస్ చాన్సల రైరి.

క్రీ.శ. 1950 లో 'రైతాంగము, వ్యవసాయ భూములు - చట్టము' అమలులోనికి వచ్చినది. రైతుల స్థితిగతులను చక్కబరచి వారు సాగుచేయు పొలముల స్వామ్యము క్రమముగా వారికే సంక్రమించునట్లు చేయుట ఈ చట్టము యొక్క ఉద్దేశము. శాస్త్ర విజ్ఞానమున పరిశ్రమలకు సంబంధించిన పరిశోధనలను సాగించు నిమిత్తము క్రీ. శ. 1950-51 లో సెంట్రల్ లేబొరేటరీలు నెలకొలుపబడినవి. క్రీ. శ. 1950 సంవత్సరపు ప్రజాప్రాతినిధ్య శాసనమును బట్టి హైదరాబాదు శాసనసభలోని సభ్యుల సంఖ్య 175 వరకు పెరిగినది. క్రీ. శ. 1951 వ సంవత్సరము ఏప్రిలు, మే నెలలలో సమష్టి ఎన్నికలు జరగినవి. కాంగ్రెసు పక్షమువారికి 93 స్థానములును, మొత్తము ప్రతిపక్షమువారికి 77 స్థానములును లభించినవి. బూరుగుల రామకృష్ణరావుగారి నాయకత్వమున పదుముగ్గురు మంత్రులతో ప్రభుత్వము ఏర్పాటయినది. క్రీ. శ. 1953 లో మంత్రులు పదుగురికి తగ్గింపబడిరి.

హైదరాబాదులోని తెనుగు భాషా ప్రాంతముల క్షేమాభ్యుదయములకొరకు గడచిన నలువది సంవత్సరములకాలములో జరగిన కార్యకలాపములందు మాజీ హైదరాబాదు మేయరు మాడపాటి హనుమంతరావుగారు ప్రముఖాతిప్రముఖ పాత్ర వహించి ఎక్కువగ పాటుపడిరి. కీ. శే. కొమర్రాజు వెంకట లక్ష్మణరావుగారు, పోలీసు కమిషనరు కీ. శే. వెంకటరామ రెడ్డిగారు, మునగాల రాజా నాయని వెంకట రంగారావుగారు ఎడతెగక తమకు చేదోడు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వాదోద్దైయుండ హనుమంతరావుగారు సాంఘిక, సారస్వత, రాజకీయ రంగములలో కావించిన కృషి అమూల్యము. వెనుకబడిన జాతుల అభ్యున్నతి నిమిత్తము కీ. శే. ముత్యాల గోవిందరాజులు నాయడుగారు గుప్తముగా కృషి కావించిరి. సి. హ. రా.

## బ్రిటిష్ ప్రభుత్వము

ఆంధ్రదేశమున బ్రిటిషువారి అధికార సంస్థాపన చరిత్ర క్రీ. శ. 1748 నుండి ప్రారంభమయ్యెనని చెప్పవచ్చును. ఈ చరిత్రను వివరించుటకు పూర్వము, అప్పటికి ఆంధ్ర దేశమునందలి పరిస్థితులను గురించి కొంత వివరించవలసి యున్నది.

**18-వ శతాబ్దిలో తెలుగుదేశ స్థితి :** చట్టమురీత్యా క్రీ. శ. 1748 నాటికి ఆంధ్రదేశ మంతయు మొగలాయి సామ్రాజ్యములో చేరియుండెను. కాని అప్పటికి మొగలాయి సామ్రాజ్యము విచ్ఛిత్తి గాంచినది. చక్రవర్తి అధికారము నామమాత్రముగ నుండినది. అందుచేత ఆంధ్రదేశముపై నిజమైన అధికారము మొగలాయి రాష్ట్రములలో ఒకటియగు దక్కనును పాలించుచుండిన సుబేదారు చేతులలో ఉండెను. ఆంధ్ర ప్రాంతములు అన్నియు దక్కను రాష్ట్రములో చేరిన భాగములు. క్రీ. శ. 1724 నుండి ఈ రాష్ట్రమును ప్రముఖుడగు నిజాముల్ ముల్కు పాలించుచుండెను. ఇతడు పేరునకు మొగలాయి చక్రవర్తికి ప్రతినిధి. కాని వాస్తవముగ సర్వస్వతంత్రుడై తన రాష్ట్రమును ఏలగలవాడయ్యెను. తక్కిన రాష్ట్రములవలె దక్కనుకూడ కొన్ని ఉపరాష్ట్రములుగ విభజింపబడి యుండెను. వానిలో కొన్నిటిని నవాబులు, కొన్నిటిని ఫౌజుదారులు నైజామునకు లోబడి పాలించుచుండిరి. ఇప్పటి నెల్లూరు, చిత్తూరు జిల్లాలు అర్కాటు రాజధానిగ కర్ణాట రాష్ట్రమును పాలించుచుండిన నవాబు పాలనలో ఉండెను. రాయలసీమ జిల్లాలు కడప, కర్నూలు, ఆదోని నవాబుల వశమందు ఉండెను. గంజాము మొదలు నెల్లూరు పర్యంతము వ్యాప్తమైన కోస్తా జిల్లాలు గుంటూరు, కొండపల్లి, ఏలూరు, రాజమహేంద్రవరము, శ్రీకాకుళము సర్కారులలో చేరి ఫౌజుదార్ల పరిపాలనయందు ఉండెను. నవాబులు, ఫౌజుదారులతోపాటు దేశమందంతట పాళెగాండ్రు, జమీన్దారులు ఉండిరి. వీరిలో కొందరు వంశ పారంపర్యముగ అధికారమును వహించినవారు. మరికొందరు తాత్కాలికముగ అధికారములోనికి వచ్చినవారు. వారి వారి అధీనమందుండిన ప్రాంతములలోని రైతులనుండి భూమిశిస్తును వసూలుచేసి, అందులో కొంతభాగమును ఖర్చులనిమిత్తము మినహాయించుకొని తక్కిన మొత్తమును పై అధికారులకు చెల్లించుట వీరి ప్రధాన కార్యము. దీనితోపాటు వారివారి మండలములలో శాంతి భద్రతలను రక్షించు బాధ్యతను కూడ వీరు వహించియుండిరి; అనగా ప్రస్తుత కాలమున జిల్లా కలెక్టరులు, పోలీసు అధికారులు చేయుచుండిన పనిని క్రీ. శ. 1748 నాటికి పాళెగాండ్రు, జమీన్దార్లు చేయుచుండిరి. కాని ఇప్పటి అధికారులకును వీరికిని ఒక గొప్ప భేద ముండెను. వీరిలో ఒక్కొక్కరి వశమున కొన్ని సొంత సైన్యములు, సాయుధములగు సిబ్బందులు ఉండెను. వీరు సొంత కోటలలో నివసించుచుండువారు. రైతులపై కొంత బలప్రయోగము చేసినగాని శిస్తులు వసూలగుట సాధ్యముకాని కారణమున వీరికి సైన్యములు అవసరమయ్యెను. కాని ఈ సైన్యముల సాయముచేతనే వీరు అప్పుడప్పుడు పై అధికారులపై తిరుగబాటు చేయుట, తాము చెల్లించవలసిన మొత్తములను సకాలమునకు చెల్లించక బకాయి పెట్టుట కలదు. మొగలాయి చక్రవర్తిని అతని ప్రతినిధియైన నిజాము ధిక్కరించినట్లే నవాబులు, ఫౌజుదారులు నిజామును ధిక్కరించుటయు, వీరిని జమీన్దారులు ధిక్కరించుటయు పరిపాటిగా ఉండెను. అధికారము ఇప్పటివలె కేంద్రీకృతము కాక యుండిన కారణమున ఇట్టి చెట్టు తప్పిన పరిస్థితులు దేశమందు ఏర్పడియుండెను. ఇది ఆకాలపు పరిపాలన విధానమున ఒక ప్రధాన లక్షణము. విదేశీయులగు బ్రిటిషువారు దేశమును వశపరచుకొనుటలో ఈ విధానము వారికి ఎంతో తోడ్పడెను.

దీనితోపాటు క్రీ. శ. 1748 నాటికి ఇతర రాష్ట్రములందు వలెనే దక్కనురాష్ట్రమందుకూడ రాజకీయ పరిస్థితులు అస్థిరరూపమును ధరించియుండెను. దేశమును పరిపాలించు హక్కు ఎవరిదన్న విషయమై ఏర్పడిన సందేహమే దీనికి కారణము. న్యాయముగ ఇది మొగలాయి చక్రవర్తిదే. కాని వాస్తవముగ అతడా హక్కుననుసరించి దేశమును పాలించు స్థితిలో లేకుండెను. అట్టి సందిగ్ధ సమయములో ఎవరికి బల ముండిన వారే పరిపాలకులు కాగల పరిస్థితు లేర్పడెను. దక్కనులో ముఖ్యముగ నిజామునకు, మహారాష్ట్రులకు మధ్యను అధికారమునకై పోటీ బయలుదేరెను. నిజాము వశమందుండిన కర్ణాటకము మొదలయిన ప్రదేశములను వశపరచుకొనుటకు వీరు అప్పుడప్పుడు ప్రయత్నములు చేయుచుండిరి. నిజాముపై తిరుగబడిన ఫౌజుదారులకు అప్పుడప్పుడు సాయము చేయుటకై వచ్చి ప్రజలను దోచుకొనుచుండిరి. కొంతకాలమైన తర్వాత మైసూరు రాజ్యమున

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కాస్తగినదియు కేంద్రీయమైన శక్తి లేని ఈ పోటీ రంగమున ప్రవేశించి నిజాము పాలనలో ఉండిన ఆంధ్ర ప్రాంతము లను కొన్ని దాని తరతరములుగా జరిగెను. నవాబులు, ఫౌజదారులు స్వతంత్రులగుటకు ప్రయత్నించుచుండిరి. అందరికి సమ్మతమయిన రాజ్యాంగపు పట్టు మొకటి యుండుటయు, దాని ననుసరించి అధికారకాంక్ష గలవారు అధికారములోనికి వచ్చుటయు అప్పటి రాజకీయముల లక్షణము కాదయ్యెను. దీనిమూలమున ఏర్పడిన అస్థిరత బ్రిటిష్ వారి అధికారము దేశమందు స్థాపితము అగుటకు దారి చక్కబరచెను.

పరిస్థితు లీవిధముగ నుండిన ఆ కాలములో వర్తకమునకై మన దేశమునకు వచ్చిన ఫ్రెంచివారిలోను, బ్రిటిష్‌వారిలోను రాజకీయములందు ప్రవేశించు కాంక్ష జనించి క్రమక్రమముగ వృద్ధిగాంచెను. ఈ సందర్భమున వీరివిగురించి రెండుమూడు విశేషాంశములను గుర్తించుట అవసరము. క్రీ. శ. 17వ శతాబ్దమున మన దేశమును పాలించుచుండిన ప్రభువులు - మహమ్మదీయు లేమి, హిందువు లేమి - వర్తకమునకై విదేశములందుండి వచ్చినవారు వర్తకము చేసికొనుట కంగీకరించుటయే కాక, అందుకై ఏర్పరచుకొనిన వర్తకశాలలలోను, స్థావరములలోను, కోటలు కట్టుకొనుటకు, సైన్యములను చేర్చుకొనుటకు, ఒక్కొక్కప్పుడు నాణెములు ముద్రించుకొనుటకు వారికి అనుజ్ఞ నిచ్చుచు వచ్చిరి. ప్రభువు లిట్టి యనుజ్ఞ నిచ్చుటకు గల కారణములను వివరించుట కిచ్చట అవకాశములేదు. క్రీ. శ. 1748 నాటికి ఫ్రెంచివారి యొక్కయు, బ్రిటిషువారి యొక్కయు వశమున ఇట్టి కోటలు సైన్యములు కొన్ని యుండుటను గుర్తించ వలసియున్నది. ఇదిగాక, మరియొక విశేషాంశముకూడ గమనించవలెను. యుద్ధ విద్యయందు ఆ కాలపు యూరోపియనులు మనకంటె ఎక్కువ నైపుణ్యమును సంపాదించియుండిరి. మన ప్రభువులదగ్గర విశేషముగ లేనట్టి మందు గుండు సామానులు, రకరకపు తుపాకులు, ఫిరంగులు వారివద్ద నుండెను. సంఖ్యయందు మన సైన్యములు వారి సైన్యములకంటె చాల రెట్లు పెద్దవైనను శిక్షణయందును, నిర్మాణవిధానము నందును, ఆయుధ సామగ్రియందును వారికి ఎంతో ఆధిక్య మున్నకారణమున రాజకీయములలో వారు ప్రవేశించుట మిక్కిలి ప్రమాదకరమయ్యెను. క్రీ. శ. 1744 మొదలు క్రీ. శ. 1748 వరకు ఫ్రెంచివారికి, బ్రిటిష్‌వారికి జరిగిన మొదటి కర్ణాటక యుద్ధములో ఒకచిన్న ఫ్రెంచిసైన్యము కర్ణాటక నవాబు యొక్క పెద్ద సైన్యమును ఒకదానిని అడయారునద్ద జరిగిన యుద్ధములో ఓడించెను. దీని ఫలితముగ తమ ఆధిక్యమునందు ఫ్రెంచివారికిగల ఆత్మవిశ్వాసము మరింత దృఢపడి రాజకీయములలో ప్రవేశించు ఉత్సాహము ఇనుమడించెను. గమనించదగిన విశేషము మరియొకటి కూడ ఉన్నది: ఒక ప్రదేశమున వర్తకముచేయువారిలో పోటి ఏర్పడుట సర్వసాధారణము. ధరమాడుటయందు, ధరలు నిర్ణయించుటయందు ఎక్కువ చాకచక్యము చూపి తమతో పోటిచేయువారి వ్యాపారమును తగ్గించి తమ లాభమును వృద్ధిచేసికొన ప్రయత్నించుట వర్తకు లందరికి సహజము. కాని క్రీ. శ. 18 వ శతాబ్దమున మొగలాయి సామ్రాజ్య పతనకాలమందు మనదేశమున వర్తకము చేయుచుండిన యూరోపియనులు ఇట్టి శాంతియుతమైన పోటి పద్ధతితో తృప్తి గాంచక విరోధివర్తకుల పోటిని నిర్మూలము చేయుటకు వారి సైన్యములను ఉపయోగింప సాగిరి. ఫ్రెంచివారు బ్రిటిష్‌వారి స్థావరములపై దాడి చేయుట, బ్రిటిష్‌వారు ఫ్రెంచివారి స్థావరముల వశపరచుకొన జూచుట, దీనిమూలమున దేశములో యుద్ధములు చెలరేగి శాంతి భద్రతలకు భంగము కలుగుట - ఇదియంతయు వర్తకవిధానమునకు ఒక నాటి యూరోపియను లక్షణ మయ్యెను. ప్రస్తుత కాలమున విదేశముల నుండి వచ్చిన వర్తకులు మనదేశమందు ఎందరో ఉన్నారు. కాని ఎవరునుకూడ ఇట్టి విధానమును అనుసరించుటలేదు. అప్పటి పరిస్థితులకును ఇప్పటి వానికిని ఇదియే ఒకగొప్ప భేదము. తమ రాజ్యములలో వ్యాపారముచేయు విదేశ వర్తకులు ఈ విధముగ యుద్ధములు చేయరాదని శాసించగల ప్రభువులు ఆ కాలమున మన దేశమందు లేకుండిరి. శాసించదలచిన వారికి శాసనధిక్కారము చేయు వర్తకుల నణచుటకు కావలసిన బలము లేకుండెను. వర్తకులుగ వచ్చిన బ్రిటిష్‌వారు దేశపరిపాలకు లగుటకు కారణములలో ఇది యొకటి.

అధికారమునకై పోటి చేయువారికి సాయము చేసి, తమ వర్తక వ్యాపారములకు అనుకూల్యములను వృద్ధిచేసికొనుట అన్ని కాలములలోను వర్తకులకు ఒక లక్షణము. ధనికులగు వర్తకులలో కొందరు ఒక రాజకీయపక్షమునకును, మరికొందరు ఇంకొక రాజకీయ పక్షమునకును ఎన్నికలలో సాయముచేసి అందుమూలమున తమ వ్యాపారమును బలపరచుకొనుచుండుట ప్రజాస్వామిక విధానము ననుసరించిన ప్రస్తుతకాలపు దేశములలో సాధారణముగ జరుగుచున్నది. కాని ఈ సందర్భములో క్రీ. శ. 1748 నాటి స్థితిగతులకును, ఇప్పటివానికిని గల భేదము గమనింపవలసియున్నది. ఆ కాలమున ప్రధానాధికార స్థానములకు కాదలచిన వారికి విరోధులతో యుద్ధము చేయుటయే



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ముఖ్యసాధనము. దక్కనును పరిపాలించతగ్గవారు మహారాష్ట్రులా? నిజామా? నిజాము పదవికి, కర్ణాటకపు నవాబు పదవికి ఎవడు అర్హుడు? అను విషయములు ఎన్నికల మూలమునగాని ఇతర సామరస్య సాధనముల మూలమున గాని పరిష్కారముకాక బలప్రయోగమునను, యుద్ధము మూలమునను పరిష్కృత మగుచుండెను. అధికారమునకై పోటిచేయుచుండిన వారికి ధనసహాయము కంటె సౌష్ఠవమైన సైనికసాహాయ్యము ఎక్కువ అవసరమయ్యెను. ఈ యవసరమును తీర్పగల సామర్థ్యము ఫ్రెంచివారికిని, బ్రిటిష్‌వారికిని ఎక్కువగ నుండిన కారణమున సైనిక సాహాయ్యసాధనమున వారు రాజకీయములలో పాల్గొనుట జరగెను. అట్టి సాయమును విదేశీయులవద్ద నుండి సంపాదించుటకు అధికారమునకై పెనగులాడుచుండినవారు వెనుదీయరైరి. అట్టి వారికి సాయము చేసి, గెలిచినవారి అభిమానమును సంపాదించి దాని మూలమున తమ వర్తక వ్యాపారములను అభివృద్ధి పరచుకొనుటకు విదేశీయ వర్తకులు సిద్ధముగ నుండిరి. ఇది యంతయు బ్రిటిష్‌వారి అధికారము ఆంధ్రదేశములో స్థాపితమగుటకు దారితీసెను.

మంత్రుల పదవులు, సైన్యాధిపతుల పదవులు, జమీన్‌దారీ పదవులు మొదలగు అధికార పదవులలోనికి రాదలచినవారు కుట్రలు, మోసము, బలప్రయోగము మొదలైన సాధనము లుపయోగించుటలో ఆ కాలమందు వెనుదీయువారు కారు. అధికార వ్యామోహము, స్వలాభ పరాయణత్వము వారిలో మూర్తీభవించి యుండెను. ఒక రోజు అధికారములో నుండినవాడు మరుసటి రోజున అధికారములో నుండునను నమ్మకము లేకుండెను. ఈ కారణముచేత నవాబులను, రాజులను తొలగద్రోయ ప్రయత్నించిన విదేశవర్తకులు మంత్రులు మొదలైన వారికి లంచములు పోసి, తమ యుద్దేశములను నెరవేర్చుకొనుట సులభసాధ్య మయ్యెను.

ఆ కాలపు సామాన్య ప్రజలలో రాజకీయపరిజ్ఞానము కాని, రాజకీయములలో జోక్యము పుచ్చుకొనవలెననెడి అభిలాషకాని లేకుండెను. రాముడు పాలించినను, రావణుడు పాలించినను తమ పరిస్థితులలో ఎట్టి మార్పు కలుగ బోదను భావము వారియందు నాటుకొని యుండెను. కులాభిమానము, మతాభిమానము, ప్రాచీనాచారము లందు అభిమానము వారి కుండెడిది; కాని రాజకీయ భావము ధరించిన దేశాభిమానము వారి కుండినట్లు నిదర్శనములు లేవు. ' దేశము తమది; పరాయివారి హస్తగతము కాకుండ దానిని రక్షించుకొను బాధ్యత తాము వహింపవలసియున్న' దన్న భావము ఆ కాలమందలి వారిలో కనిపించలేదు. పరాయివారగు మహమ్మదీయుల ప్రభుత్వ మెటువంటిదో ఫ్రెంచివారి యొక్కయు, బ్రిటిష్ వారి యొక్కయు ప్రభుత్వ మట్టిదే యని వారనుకొనుచుండిరి. ఈ పరిస్థితులుకూడ బ్రిటిష్ అధికారము ఆంధ్రదేశములో స్థాపితమగుటకు ఎంతయో తోడ్పడెను.

బ్రిటిష్‌వారు ఆంధ్రదేశమును వశపరచుకొనుటకు చేసిన ప్రయత్నములలో ప్రథమ దశయందు — అనగా క్రీ. శ. 1748 మొదలు క్రీ. శ. 1768 వరకు — వారికి ప్రత్యర్థులై వారితో సరిసమానముగ నిలబడి యుద్ధముచేయ సాహసించినవారు ఫ్రెంచివారుకాని, దేశమును పాలించుచుండిన నిజాము, నవాబులు, ఫౌజుదారులు కారు. ఫ్రెంచివారి సాయములేక వారు స్వతంత్రించి బ్రిటిష్‌వారితో యుద్ధము చేయలేకపోయిరి. ఫ్రెంచివారిని ఓడించిన తరువాత నిజాము మొదలయినవారిని వశపరచుకొనుట బ్రిటిష్‌వారికి ఎంతో సులభ మయ్యెను. ఫ్రెంచివారి బ్రిటిష్‌వారికి జరగిన యుద్ధములమూలమున ఆంధ్రదేశములోని కోస్తాప్రాంతము లన్నియు బ్రిటిష్‌వారి పరిపాలనలోనికి వచ్చినవనియు, ఈ యుద్ధములలో దేశమును పాలించుచుండినవారు వహించిన పాత్ర అప్రధానమైనదనియు గుర్తించవలసియున్నది. క్రీ. శ. 1763 నాటికి ఫ్రెంచివారి అధికార మంతయు, నిర్మూలమగుటచేత, తర్వాత జరగిన యుద్ధములలో బ్రిటిష్‌వారు దేశపాలకులతో ప్రత్యక్షముగ యుద్ధము చేయవలసివచ్చెను. ఇవి ముఖ్యముగ వారికిని, మైసూరును పాలించుచుండిన హైదరలీ, టిపు సుల్తానులకును జరగెను. క్రీ. శ. 1765 తరువాత హైదరలీ మైసూరు రాజ్యమునకు పాలకుడై ఇప్పటి కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపుర మండలములను జయించి వశపరచుకొని, వానిపై నిజాముకు గల అధికారమును తొలగించెను. బ్రిటిష్‌వారు మైసూరు సుల్తానులతో యుద్ధములు గావించి వాని ఫలితముగ సీమండలములు తమ యధికారములోనికి రాదగిన పరిస్థితులు కల్పించిరి. దీనికి సంబంధించిన వివరములు సందర్భానుసారముగ తర్వాతి భాగములలో విశదీకరింపబడగలవు.

### రాజ్యాధికారమునకు ఫ్రెంచివారితో బ్రిటిష్‌వారి పోటి

కర్ణాటక యుద్ధములు : దక్కను, దక్షిణ హిందూదేశములలో క్రీ. శ. 1744 - 68 మధ్యను ఫ్రెంచివారికి, బ్రిటిష్‌వారికి మూడు యుద్ధములు జరగెను. వీనికి కర్ణాటక యుద్ధములని పేరు. వీనిలో మొదటి యుద్ధమందు (క్రీ. శ. 1744 - 48) దేశీయ పరిపాలకుల ప్రసక్తి అంతగా లేదు. ఆ కాలమున యూరపు ఖండమందు ఫ్రెంచివారికి బ్రిటిష్



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వారికి జరగుచుండిన యుద్ధమే మొదటి కర్ణాటక యుద్ధమునకు కారణము. కాని రెండువిధములుగ ఇది యూరోపియన్ వర్తకులు దేశీయ రాజకీయములలో పాల్గొనునట్లు చేసెను. అందుచేత ఈ యుద్ధమునకు ప్రాధాన్యము కలిగినది. ఇది జరగుచుండిన కాలములో అన్వరుద్దీన్ అనునతడు కర్ణాటకపు నవాబుగా ఉండెను. వర్తకులమధ్య తన రాజ్యములో యుద్ధములు జరగరాదని ఇతడు ఒక తాకీదును జారీ చేసి, దానిని తిరస్కరించిన ఫ్రెంచివారిని శిక్షించు నుద్దేశముతో ఒక గొప్ప సైన్యము వారిపైకి పంపెను. దానికిని, ఫ్రెంచివారి సైన్యమునకును మద్రాసుకు సమీపమున అడయార్ వద్ద జరిగిన యుద్ధములో ఫ్రెంచివారికి విజయము లభించెను. ఫ్రెంచి సైన్యము చాల చిన్నదైనను దాని వశములో అత్యుత్తమములైన తుపాకులు, ఫిరంగులు ఉండుటయే దీనికి కారణము. దీని ఫలితముగ ఫ్రెంచి గవర్నరగు డూప్లేయొక్క మనోభావములలోను, రాజ్యాంగ దృక్పథమందును ఒక గొప్ప మార్పు కలిగెను. సౌష్ఠవములగు ఆయుధముల సాయమున పెద్ద పెద్ద దేశీయ సైన్యములనుకూడ ఓడించుట సులభసాధ్యమను ఆత్మ విశ్వాస మతనిలో జనించి, అది మొదలు రాజకీయములలో పాల్గొనునట్లు అతనిని ప్రేరేపించెను. మొదటి కర్ణాటక యుద్ధమువలన కలిగిన ఫలితములలో ఇది ప్రధానమైనది. ఇది గాక, దీనిమూలమున మరొక ఫలితముకూడ కలిగెను. ఈ యుద్ధము జరగుచుండునపుడు ఫ్రెంచివారు, బ్రిటిష్‌వారు యూరపునుండి కొన్ని సైన్యములు తెప్పించుకొని, తమ సైనికబలమును వృద్ధిచేసికొనుటచేత క్రీ. శ. 1748 లో యుద్ధము ముగియునాటికి వారొక్కొక్కరివద్ద మామూలుకంటె ఎక్కువ సైన్యముండెను. నిరుద్యోగులైన యీ సైనికులను భరించుటకు కావలసిన ద్రవ్యమును సంపాదించుటకు వారు ఉపాయమును వెదకవలసి వచ్చెను. కర్ణాటకములోను, దక్కనులోను రాజ్యాధికారమునకై పోటీ చేయుచుండినవారికి సాయము చేసి దానిమూలమున సైనికుల ఖర్చులకు కావలసిన ద్రవ్యమును సంపాదించుట సులభ మార్గమని వారికి తోచి, దేశీయ రాజకీయములలో పాల్గొనునట్లు వారిని పురికొల్పెను. మొదటి కర్ణాటక యుద్ధముయొక్క రెండవ ఫలితము ఇదియే.

క్రీ. శ. 1748 లో రెండవ కర్ణాటక యుద్ధము ప్రారంభమయ్యెను. ఆ సంవత్సరమున నిజాముల్ ముల్కు మరణించుటయు, నిజాము పదవికై అతని కుమారులలో నొకడైన నాజిర్ జంగుకు, అతని మనుమడైన ముజఫ్ఫర్ జంగుకు వివాదము ఏర్పడుటయు, అదే సమయమున కర్ణాటక రాష్ట్రపు నవాబుపదవికి అన్వరుద్దీన్‌కు, చందాసాహెబులమధ్య మరియొక వివాద మేర్పడుటయు రెండవ కర్ణాటక యుద్ధమునకు కారణమయ్యెను. ఆదోనికి విజాపురమునకు నవాబుగ నుండిన ముజఫ్ఫర్ జంగును వెంటబెట్టుకొని చందాసాహెబు కర్ణాటకములో ప్రవేశించగనే డూప్లే వారి పక్షము వహించి క్రీ. శ. 1749 లో అంబూరు యుద్ధమున అన్వరుద్దీనును ఓడించి చంపెను. దీని ఫలితముగ చందాసాహెబు ఆర్కాటు రాజధానిగ కర్ణాటకమునకు నవాబయ్యెను. డూప్లే తన పక్షమునకు సాయము చేసినందుకు ముజఫ్ఫర్ జంగు కృతజ్ఞుడై, ఫ్రెంచివారికి మచిలీపట్టణమును, దివిప్రాంతమును మరికొన్ని ప్రదేశములను దానము చేసెను. దీనిమూలమున బ్రిటిష్ వారి వర్తక వ్యాపారములకు గొప్ప ఆటంకము కలిగినందున వారు అన్వరుద్దీన్ కుమారుడైన మహమ్మదలీ పక్షమును వహించి అతనిని కర్ణాటకమునకు నవాబుగా చేయుటకు సిద్ధపడిరి. అప్పటికి నాజిర్ జంగుకూడ కర్ణాటకమును చేరుకొనెను. బ్రిటిష్‌వారు అతనికి సాయము చేయుటకుకూడ అంగీకరించిరి. ఈ విధముగ రెండవ కర్ణాటకయుద్ధములో మహమ్మదలీ, నాజిర్‌జంగుల పక్షమునకు బ్రిటిష్‌వారును, చందాసాహెబు ముజఫ్ఫర్ జంగుల పక్షమునకు ఫ్రెంచివారును సాయము చేయుట సంభవించెను.

ప్రథమ దశలో నాజిర్ జంగుకు కొన్ని విజయములు చేకూరుటచేత ముజఫ్ఫర్‌జంగు అతని శరణుచొచ్చుట జరగెను. కాని నాజిర్ జంగు తన విజయములను స్థిరపరచుకొనుటకు కావలసిన చురుకుదనమును చూపకపోవుటచేత, అతనిపై కుట్రలు చేయుటకు డూప్లేకు అవకాశము కలిగెను. దీనికితోడు అతని శిబిరములో ముజఫ్ఫర్ జంగుపై అభిమానముగల ప్రముఖులు కొందరు ఉండిరి. వారిలో కడప, కర్నూలు నవాబులు ప్రధాన పాత్రలను వహించినవారు. వీరు డూప్లే కుట్రలకు సహాయభూతులై నాజిర్ జంగును చంపి, ముజఫ్ఫర్ జంగును నిజాముగా ప్రకటించిరి (క్రీ. శ. 1750). ముజఫ్ఫర్ జంగు ఫ్రెంచివారి ప్రధాన పట్టణమైన పుదుచ్చేరిని ప్రవేశించి డూప్లే యెడల తనకుగల కృతజ్ఞతను వ్యక్తపరచుటకై అతనిని కృష్ణకు దక్షిణమందున్న ప్రాంతమున కంతకు గవర్నరుగ నియమించి నిజాంపట్టణమునుకూడ ఫ్రెంచివారి కిచ్చివేసెను. మరి కర్ణాటకములో కాలయాపనము చేయుట నష్టమని భావించి హైదరాబాదుకు ప్రయాణము కట్ట నిశ్చయించుకొని, అచ్చట తన అధికారమును నిలబెట్టుకొనుటకు ఫ్రెంచి సైనికదళము నొక దాని నీయవలసినదిగా ముజఫ్ఫర్ జంగు డూప్లేను కోరెను. దక్కను ఫ్రెంచివారి పలుకుబడిలోనికి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వచ్చినమొదల వారి వర్తక వ్యాపారాభివృద్ధికి ఎంతో తోడ్పడగలదన్న భావముతో డూప్లే బుస్సీ నాయకత్వ మున ఒక ఫ్రెంచి సైన్యమును సమకూర్చి ముజఫ్ఫర్ జంగు వెంట హైదరాబాదుకు పంపెను. కాని అంతకుపూర్వము నాజీరు జంగుపై కుట్రలు కావించిన కడప, కర్నూలు నవాబులు ముజఫ్ఫర్ జంగు తమకు తగిన ప్రతిఫలమును ముట్టచెప్పలేదను కారణమున మార్గములో రాయచోటి వద్ద నతనిపై బడి అతనిని చంపి, నాజిర్ జంగు సోదరుడైన సలాబత్ జంగును నిజాముగా ప్రకటించిరి (క్రీ. శ. 1751). బుస్సీ ఈ మార్పునకు సమ్మతించి, సలాబత్ జంగును వెంట బెట్టుకొని హైదరాబాదు చేరి నిజాము పదవిలో అతనిని నెలకొలిపి తన పని పూర్తి యయ్యెనని వెనుకకు మరల దలచెను. కాని సలాబత్ జంగు దానికి సమ్మతింపక, ఫ్రెంచి సైన్యముల సాయములేక ఒక నిమిషముకూడ తన అధికారము నిలువజాలదని బుస్సీకి తగువిధమున నచ్చ జెప్పి అతనికి, అతని సైనికులకు బహుమానము లనేక మిచ్చి, ఫ్రెంచివారికి మచిలీపట్టణము సమీపమందలి గ్రామములను మరికొన్నిటిని దత్తముచేసి వారి సాయ ముతో దక్కను పాలించువా డయ్యెను. క్రీ. శ. 1751 మొదలు క్రీ. శ. 1758 వరకు ఫ్రెంచివారికి లోబడి సలాబత్ జంగు దక్కనును పరిపాలించుచుండెను.

దక్కనులో బుస్సీకి విజయములు చేకూరుచుండినను కర్ణాటకములో మాత్రము ఫ్రెంచి అధికారము కూలిపోవు పరిస్థితులు పర్పడెను. క్రీ. శ. 1750 తర్వాత బ్రిటిష్‌వారు క్లైవు నాయకత్వమున చందాసాహెబు రాజధానియైన ఆర్కాటును వశపరచుకొని, దానిని ముట్టడించిన చందా సాహెబు సైన్యములను ఓడించి మరికొన్ని యుద్ధములలో కూడ విజయము గాంచిరి. దీని ఫలితముగ మహమ్మదలీ కోటయగు తిరుచినాపల్లిని ముట్టడించిన ఫ్రెంచివారి యొక్కయు, చందాసాహెబు యొక్కయు సైన్యములు ఆ ముట్టడిని వదలిపెట్టవలసివచ్చెను. అదే సమయమున చందాసాహెబు తంజావూరివద్ద శత్రువుల చేతిలో పడి ప్రాణములను గోల్పోయెను. బ్రిటిష్‌వారికి మిత్రుడయిన మహమ్మదలీ కర్ణాటకమునకు నవాబు కాగలిగెను. దీని వంతను చూచి ఫ్రాన్సులోని ప్రభుత్వమువారు డూప్లేను ఉద్యోగమునుండి తొలగించి, గా డీ హో (Godeheu) అను వానిని అతనిస్థానమున గవర్నరుగ (క్రీ.శ. 1754) నియమిం చిరి. ఇతడు బ్రిటిష్‌వారితో తాత్కాలికపు సంధి కావించు కొని, మహమ్మదలీ కర్ణాటకమునకు నవాబుగా నుండుట కంగీకరించెను. దీనితో రెండవ కర్ణాటక యుద్ధము ముగిసెను. ఇప్పటికి కర్ణాటకమందు బ్రిటిష్‌వారి ప్రాబ ల్యము, దక్కనునందు ఫ్రెంచివారి ప్రాబల్యము స్థాపిత మయ్యెను. కాని ఇదంతయు తాత్కాలిక సంధియొక్క ఫలితములు. ఈవిధముగ స్థాపితమయిన ప్రాబల్యము స్థిరముగ ఉండగలదా అను సంశయము తప్ప దయ్యెను. బ్రిటిష్‌వారు హైదరాబాదునుండి ఫ్రెంచివారిని తొలగించు ప్రయత్నములను చేయుచునే యుండిరి. కర్ణాటకములో తమ పలుకుబడిని పునరుద్ధరణ చేసికొను ప్రయత్నములను ఫ్రెంచివారు మానినవారుకారు. ఈ ప్రయత్నములను వివ రించుటకు పూర్వము దక్కనులో బుస్సీ చర్యలనుగురించి కొంత వివరించవలసియున్నది.

### తెలుగు దేశములో ఫ్రెంచి పరిపాలనము

సలాబత్ జంగును అధికారమునుండి తొలగించి, అతని అన్నయైన గాజీ ఉద్దీనుని నిజాముగ చేయు నుద్దేశముతో మహారాష్ట్రులు రెండువైపులనుండి క్రీ. శ. 1752 లో దక్కనుపై దండెత్తి వచ్చిరి. ఆ దండయాత్రలో వారు బొంబాయి, మద్రాసులలోని బ్రిటిష్‌వారి సాయమును సంపాదింప బ్రయత్నించిరి. కాని వారి ప్రయత్నములు ఫలించలేదు. మహారాష్ట్రుల నెదుర్కొనుట దుస్సాధ్యమని భావించి సలాబత్ జంగును వెంటబెట్టుకొని మచిలీపట్టణ మునకో, పుదుచ్చేరికో పారిపోవుటకు బుస్సీ మొట్టమొదట తలపెట్టెను; కాని డూప్లే అతనికి ధైర్యము చెప్పి మరికొంత సైన్యమును అతనికి సాయముగ పంపి, మహారాష్ట్రులను ఎదుర్కొనునట్లు అతనిని ప్రోత్సహించెను. సలాబత్ జంగు తల్లి ఘాజీ ఉద్దీనుకు విషము పెట్టి చంపించగలిగెను. దండెత్తివచ్చిన మహారాష్ట్రులు దండయాత్రను సాగించుటకు బదులు బుస్సీతో సంధి చేసికొనుటకు సమ్మతించి, కొన్ని తాత్కాలిక లాభములను పొంది వెనుకకు మరలిపోయిరి. గొప్ప ప్రమాదములనుండి బుస్సీ సలాబత్ జంగును రక్షిం చినవాడయ్యెను. దానికి ప్రత్యామ్నాయముగ సలాబత్ జంగు ఫ్రెంచివారికి కొండవీడు సర్కారును దత్తము చేసెను. అంతకు పూర్వమే మచిలీపట్టణ సమీపప్రాంత మంతయు ఫ్రెంచివారి వశములో ఉండినందున దానిని అనుకొని యుండిన కొండవీడు సర్కారు లభించుటవలన ఆంధ్ర దేశములో ఒక ప్రధానమయిన మండలము ఫ్రెంచివారి పాలనలోనికి వచ్చెను. కొండవీడు సిరి సంపదలతో తుల తూగుచుండిన ప్రాంతము. యూరపు ఖండమునకు విదేశ వర్తకులు ఎక్కువగా ఎగుమతి చేయుచుండిన నూలుబట్ట లకు ఇది ప్రసిద్ధిగాంచినది. దీనిమూలమున ఫ్రెంచివారు విశేషముగ లాభము సంపాదించుటకు అవకాశమేర్ప డెను. మచిలీపట్టణమే కాక నిజాం పట్టణము, మోటుపల్లి రేవులు కూడ వారి వశ మయ్యెను.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కాని ఇంతటితో బుస్సీ చిక్కులు తీరినవి కావు. తమ సంస్థానములో ఫ్రెంచివారికి అంత అధికారము, పలుకుబడి కలుగుటను చూచి హైదరాబాదు ప్రముఖవర్గములో అనేకులు సహించరైరి. నెలనెలకు రెండు లక్షల రూపాయలకు పైగా ఫ్రెంచి సైన్యములకై ఖర్చగుచుండుటకు వారు ఇష్టపడినవారు కారు. దివానులు మొదలయినవారు బుస్సీపై కుట్రలు చేయుచు అతని సైన్యముల జీతములు బకాయిపెట్టసాగిరి. దీనికితోడు బుస్సీయొక్క ఆరోగ్యము చెడెను. అతడు కొంత విసుగు చెంది, హైదరాబాదులో తన ప్రతినిధిని ఒకని నుంచి తన ఆరోగ్యమును చక్కబరచుకొనుటకై మచిలీపట్టణమునకు వెళ్లెను. అతడు లేని సమయములో నిజాముయొక్క ఉద్యోగులు అతనిపై చాల నేరములు మోపి సలాబత్ జంగును వశపరచుకొనుటకు ప్రయత్నించిరి. జీతములు సకాలమునకు లభించనందున ఫ్రెంచి సైన్యములు తిరుగబాటు చేయ సిద్ధముగ నుండెను. దీని నంతను బుస్సీ గ్రహించి క్రీ. శ. 1753 మధ్యమ మరల హైదరాబాదుచేరి, నిజాముయొక్క జోక్యము లేక ఫ్రెంచి సైన్యములకు కావలసిన ద్రవ్యమును సంపాదించుటకు మార్గాంతరమును అన్వేషించి కోస్తా ప్రాంతములోని గుంటూరు, ఏలూరు, రాజమహేంద్రవరము, శ్రీకాకుళము సర్కారులను వశపరచుకొనుటయే అట్టి మార్గమని నిశ్చయించి, ఆ నిశ్చయము కొనసాగుటకు సలాబత్ జంగుతో సంప్రతింపులు జరపెను. మొట్టమొదట సలాబత్‌జంగు దీనికి ఇయ్యకొనలేదు. కాని కొసకు బుస్సీ సూచనను అంగీకరించి, ఆ నాలుగు సర్కారులను బుస్సీకిని - అతనిద్వారా ఫ్రెంచివారికిని - దత్తము చేసెను (క్రీ. శ. 1753). వీనినుండి ఏటేట 31 లక్షల రూపాయల ఆదాయము వచ్చుచుండెను. అంతకు పూర్వము దత్తము చేసిన ప్రాంతములనుండి 11 లక్షల ఆదాయము దొరకుచుండెను. సైనిక వ్యయము క్రింద సుమారు 29 లక్షలు పోగా 13 లక్షల నికరాదాయము ఫ్రెంచివారికి వచ్చు అవకాశ మేర్పడెను.

ఈ యవకాశమును పూర్తిగ వినియోగించుకొను ప్రయత్నములో బుస్సీకిని, ఫ్రెంచివారికిని మరికొన్ని చిక్కులు సంభవించెను. అదివరకు నిజాము ప్రతినిధిగ సర్కారులలో అధికారము వహించియుండిన జాఫర్ అలీ ఖానుడు ఫ్రెంచివారిపై తిరుగబడెను. జమీన్‌దారు లందరిలో నగ్రగణ్యుడుగ నుండిన విజయనగరమురాజు అతనికి సాయపడెను. విశాఖపట్టణములోని ఇంగ్లీషు వారతనితో కలసిరి. అట్టి సమయములో మచిలీపట్టణమందలి ఫ్రెంచి గవర్నరు ఎక్కువ చాకచక్యముతో భేదోపాయమును ప్రయోగించి రాజమహేంద్రవరము, శ్రీకాకుళము సర్కారులలో భూమిశిస్తును వసూలుచేయు అధికారమును విజయనగరరాజునకు ఇచ్చునట్లు ఒడబడి అతనిని జాఫర్ అలీ ఖానునుండి వేరుపరచెను. అప్పుడు జాఫర్ అలీ ఖాను మహారాష్ట్రుల సాయమును నర్థించగా వారు సర్కారులను ప్రవేశించి, విజయనగరరాజు నోడించి ప్రజలను దోచుకొనసాగిరి. అతికష్టముమీద ఫ్రెంచివారు కొంతసైన్యమును విజయనగరరాజు సాయముకొరకు పంపిరి. దానితో అతడు మహారాష్ట్రులను ఓడించి సర్కారులనుండి వారిని వెడలగొట్టెను. అప్పటికికూడ నచ్చటి పరిస్థితులు పూర్తిగ చక్కబడని కారణమున క్రీ. శ. 1754 లో బుస్సీ మరియొక పర్యాయము హైదరాబాదునుండి మచిలీ పట్టణమునకు వచ్చి సర్కారులలో కొన్ని ప్రాంతములందు సంచారముచేసి వ్యవహారములను కొంతవరకు పరిష్కరించి హైదరాబాదుకు వెళ్ళిపోయెను.

క్రీ. శ. 1754 లో కర్ణాటకమందు ఫ్రెంచివారికి అపజయము కలుగుటయు, దానిమూలమున డూప్లే అధికారమును వదలుకొనుటయు జరగెను. కాని దీనిమూలమున దక్కనులో బుస్సీ పలుకుబడికి ఎట్టి విఘాతము కలుగలేదు. ఆ సంవత్సరములోనే అతడు మైసూరుపై దండెత్తి, మైసూరురాజులు నిజాముకు చెల్లించవలసిన కప్పములో బకాయి తాలూకు 52 లక్షలు వసూలు చేసెను. ఈలాటి విజయములు చేకూరుచున్నందున బుస్సీ తన దృష్టిని ఢిల్లీవైపు మరల్చి, ఢిల్లీచక్రవర్తికి సాయము చేసి, అతనికి గర్భశత్రువులుగ నుండిన మహారాష్ట్రులను ఓడించి, ఫ్రెంచి ఆధిక్యమును ఉత్తరహిందూస్థానమందు స్థాపించు నూహలతో నుండెను. కాని ఇవి ఆచరణలోనికి రాకపూర్వమే హైదరాబాదులో నతడు మరికొన్ని చిక్కులను ఎదుర్కొనవలసి వచ్చెను. నిజాము దర్బారులోని ప్రముఖులు సలాబత్ జంగును వశపరచుకొన గలిగిరి. వీరు చేయుచుండిన కుట్రలలో మహారాష్ట్రులుకూడ కొంతవరకు చేరిరి. ఫ్రెంచివారి స్థానమున బ్రిటిషువారు నిజాముకు సాయము చేయ సిద్ధపడినట్లు కర్ణాటకమునుండి వార్తలు రాసాగెను. వీని ఫలితముగ క్రీ. శ. 1756 లో సలాబత్ జంగు బుస్సీని అధికారమునుండి తొలగించుచు ఒక ఉత్తరువును జారీచేసెను. కాని బుస్సీ సులభముగ దానికి లొంగిపోక తన అనుచరులతో హైదరాబాదులోని చార్‌మహల్‌లో చేరి శత్రువులను ఎదుర్కొనెను. కుట్రదారుల సైన్యములు అతనిని ముట్టడించినను అతడు జంకక కొన్ని దినములు గడపిన తర్వాత పుదుచ్చేరి, మచిలీపట్టణములనుండి కొంత సైన్యము అతనికి సాయముగ వచ్చెను. అంతటితో శత్రువులు ముట్టడిని చాలించి బుస్సీతో సంధిచేసికొనిరి. బుస్సీ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



యథాప్రకారము సలాబత్ జంగుపై అధికారమును వహించి మరికొన్ని బహుమానములను, ఇనాములను సంపాదించెను.

ఫ్రెంచివారి అధికారము ఈ విధముగ దక్కనులో అభివృద్ధి గాంచుచుండుట బ్రిటిష్‌వారు సహింపరైరి. దానిని నిర్మూలము చేయదలచి క్రీ. శ. 1756 నుండి వారు మహారాష్ట్రులతో సంప్రతింపులు సాగించి వారి సాయమును సంపాదింప ప్రయత్నించిరి. కాని ఈ ప్రయత్నము విఫలమగుటకు పూర్వమే బంగాళరాష్ట్రములో సిరాజ్ ఉద్ దౌలా మూలమున బ్రిటిష్‌వారికి అనేక కష్టములు, నష్టములు కలిగెను. అందుచేత బుస్సీపైకి వారు పంపదలచిన సైన్యములు క్లైవునాయకత్వమున బంగాళమునకు వెళ్లెను. ఇది కారణముగ దక్కనులోని ఫ్రెంచివారి అధికారమునకు క్రీ. శ. 1756-59 మధ్య ఎట్టి ప్రమాదమును సంభవించలేదు.

చార్ మహాల్ ముట్టడి అనంతరము బుస్సీ మరియొక పర్యాయము సర్కారులలో సంచారము చేయవలసిన అవసరము ఏర్పడెను. సలాబత్ జంగు బుస్సీని ఉద్యోగమునుండి తొలగించిన వార్త తెలియగనే రాజమహేంద్రవరము, శ్రీకాకుళము సర్కారులలోని జమీన్‌దారులలో విజయనగరము రాజు తప్ప తక్కినవారందరు ఫ్రెంచి వారిపై తిరుగబడి వారి కీయవలసిన శిస్తుల నిచ్చుట మానిరి. విజయనగరము రాజు మాత్రము చార్ మహాల్ ముట్టడికాలములో బుస్సీకి ఎంతో సాయపడెను. అందుచేతనే ఈ సంచారములో అతడు బుస్సీకి ముఖ్యుడగు సలహాదారుడయ్యెను. అతని ప్రోద్బలమున క్రీ. శ. 1757 లో బుస్సీ బొబ్బిలి కోటను ముట్టడించి వినాశము చేసెను. ఈ యుద్ధము ముగిసిన తర్వాత బొబ్బిలికి పట్టినగతియే తమ కందరికి పట్టునన్న భయముతో తక్కిన జమీన్‌దారు లందరు బుస్సీకి వశులైరి. అటు తర్వాత అతడు బ్రిటిష్ వారి అధీనమం దుండిన విశాఖపట్టణమును, తదితర స్థావరములను వశపరచుకొని, ఇప్పటి గంజాము జిల్లాలో ప్రవేశించి, తిరుగబాటు చేయుచుండిన గుంసూరు రాజును ఓడించి సర్కారులం దంతట ఫ్రెంచి అధికారమును స్థిరపరచి క్రీ. శ. 1758 ప్రారంభమున హైదరాబాదు చేరుకొనెను.

బుస్సీ సర్కారులలో ఉండినప్పుడు హైదరాబాదులో అతని విరోధులు కుట్రలుచేయుట మానినవారు కారు. వీరిలో సలాబత్ జంగు సహోదరులైన నిజాం అలీ బసాలత్ జంగులును, అతని దివానైన షా నవాజ్ ఖానుడును ప్రధాన పాత్ర వహించిరి. సలాబత్ జంగు వారి పన్నాగములలో చిక్కుకొని పోయెను. హైదరాబాదును చేరిన వెంటనే బుస్సీ తన సహజమైన రాజచక్యమును ఉపయోగించి కుట్రదారుల బలము నణచి, తన యధికారమును యథాప్రకారము నిజాం రాజ్యములో స్థాపించుకొనెను. క్రీ. శ. 1758 మధ్యభాగము నాటికి దక్కనులోని ఫ్రెంచివారి ప్రాబల్యము ఉచ్చస్థితికి వచ్చెను. గంజామునుండి గుంటూరు పర్యంతము ఆంధ్రదేశము వారివశమందు ఉండెను. దక్కను పాలకుడైన సలాబత్ జంగు వారిచేత కీలుబొమ్మగ తయారయ్యెను. ఇదంతయు క్రీ. శ. 1750 తరువాత బుస్సీ కావించిన ప్రయత్నముల ఫలితమే.

### బ్రిటిషు రాజ్యాధికార ప్రారంభములు

పెరుగుట విరుగుటకే అన్నట్లు ఎనిమిది సంవత్సరములుగ బుస్సీ నాయకత్వమున ఫ్రెంచివారు నిర్మించుకొనిన సామ్రాజ్య భవనము మరి మూడు సంవత్సరములలో కూలిపోయి బ్రిటిష్‌వారి వశమయ్యెను.

దీనికి ప్రధాన కారణములు రెండు: క్రీ. శ. 1756-58 మధ్య క్లైవు యాజమాన్యమున బంగాళ రాష్ట్రములో బ్రిటిష్‌వారు సాధించిన విజయము మొదటి కారణము; క్రీ. శ. 1758-61 మధ్య జరగిన మూడవ కర్ణాటక యుద్ధములో ఫ్రెంచివారిని ఓడించి బ్రిటిష్‌వారు సాధించిన విజయము రెండవకారణము.

క్రీ. శ. 1756 లో యూరపు, అమెరికా ఖండములందు బ్రిటిష్‌వారికి, ఫ్రెంచివారికి ప్రారంభమైన సప్తసంవత్సర యుద్ధము కాలక్రమమున మన దేశములోనికి వ్యాపించి మూడవ కర్ణాటక యుద్ధరూపమును ధరించెను. సప్తసంవత్సర యుద్ధవార్త తెలిసినప్పుడు క్లైవు బంగాళరాష్ట్రమం దుండెను. అచ్చట చంద్రనగరము ఫ్రెంచివారి స్థావరములలో ప్రధానమైనది. అది ఫ్రెంచివారి వశమం దుండిన యెడల వారు బంగాళరాష్ట్రము నవాబును, బ్రిటిష్‌వారి యెడల విరోధము వహించినవాడును అగు సిరాజ్ ఉద్ దౌలాతో కలిసి బ్రిటిష్‌వారికి ప్రమాదము కలిగించెదరను భావముతో క్లైవు దానిని వశపరచుకొనెను (క్రీ. శ. 1757 మార్చి). ఇది జరగిన తరువాత ప్లాసీయుద్ధములో క్లైవు సిరాజ్ ఉద్ దౌలాను ఓడించి మీర్ జాఫరును నవాబుగ చేసెను. క్రీ. శ. 1750-58 మధ్య హైదరాబాదులో సలాబత్ జంగు ఫ్రెంచివారికి లోబడినట్లే క్రీ. శ. 1759 తర్వాత మీర్ జాఫర్ బ్రిటిష్‌వారికి లోబడిపోయెను. హైదరాబాదులోని బుస్సీ అధికారమునకును, బంగాళములోని క్లైవు అధికారమునకును ఎంతో సామ్యము కలదు. ఈ సామ్యముతోపాటు ఒక గొప్ప భేదమునుగూడ గుర్తించవలసియున్నది. బంగాళరాష్ట్రము అప్పటి భరతఖండములోని



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



రాష్ట్రము లన్నిటిలో ధన ధాన్యములందు అగ్రస్థానము వహించియుండెను. క్లైవు అచ్చట సంపాదించిన ధనమును మద్రాసులోని బ్రిటిష్‌వారికి పంపి కర్ణాటక యుద్ధములో వారికి జయము లభించుటయందు తోడ్పడెను. ఎనిమిది సంవత్సరముల కాలము బుస్సీ దక్కనునం దుండినను ఒక చిల్లిగవ్వను కూడ అతడు పుదుచ్చేరికి పంపించినవాడు కాడు. సిరిసంపదలతో తులదూగుచున్న బంగాళము బ్రిటిష్‌వారి వశమగుటచేత ఫ్రెంచివారిని ఓడించుట వారికి సులభసాధ్య మయ్యెను.

క్రీ. శ. 1758 లో ప్రారంభమైన మూడవ కర్ణాటక యుద్ధమునకు రెండు ప్రధాన రంగము లేర్పడెను. వానిలో ఒకటి కర్ణాటకము; రెండవది సర్కారులు. కర్ణాటకములోని యుద్ధము నేలమీదనే కాక, సముద్రముమీద కూడ జరిగెను. అప్పటికి బ్రిటిష్‌వారి నౌకాబలము అద్వితీయముగ నుండిన కారణమున సముద్రయుద్ధములలో వారు సంపూర్ణ విజయము కాంచిరి. దానిమూలమున యూరపుఖండమునుండి పుదుచ్చేరికి రావలసిన సైన్యములకు, ఆయుధములకు గొప్ప ఆటంకము సంభవించెను. బ్రిటిష్‌వారికి అట్టి యాటంకము లేక యూరపునుండియు, బంగాళము నుండియు సాయము సకాలమున లభించుచుండెను. నౌకాయుద్ధములలో బ్రిటిష్‌వారు పొందిన విజయములకు ఇదియే ప్రధాన ఫలితము.

కర్ణాటక యుద్ధములో ఫ్రెంచివారికి లాలీ అను ప్రముఖుడు నాయకుడుగ ఉండెను. ఇతడు క్రీ. శ. 1758 లో పుదుచ్చేరి చేరుకొని, బ్రిటిష్‌వారి సెంటు డేవిడ్ కోటను ముట్టడించి వశపరచుకొని, సంవత్సరాంతమున మద్రాసును ముట్టడించెను. కాని బ్రిటిష్‌వారి నౌకల ప్రాబల్యము వలనను, మరికొన్ని కారణములవల్లను లాలీ మద్రాసు ముట్టడిని వదలుకొని క్రీ. శ. 1759 లో పారిపోవలసి వచ్చెను. ఈ ముట్టడికి పూర్వమే అతడు బుస్సీని హైదరాబాదు వదలి కర్ణాటకమునకు రావలసినదని ఉత్తరువు పంపెను. ఇది చాల ప్రమాదకరమని బుస్సీ భావించెను. కాని లాలీయొక్క ఉత్తరువు నుల్లంఘించుటకు వీలులేని కారణమున అతడు కర్ణాటకమునకు వచ్చుట తప్పినది కాదు. ఇందువలన లాలీకి గొప్ప లాభ మేమియు కలుగలేదు. క్రీ. శ. 1760 లో బ్రిటిష్ సైన్యము ఒకటి వందవాసివద్ద అతనితో యుద్ధముచేసి అతనిని ఓడించెను. మరు సంవత్సరమున పుదుచ్చేరి బ్రిటిష్‌వారి వశమయ్యెను. వెంటనే వా రచ్చటి కోటను నేలమట్టము గావించిరి. అటుతర్వాత దక్షిణ హిందూదేశములో ఫ్రెంచివారి అధీనమం దుండిన తక్కిన స్థావరముల నన్నిటిని వారు వశపరచుకొనిరి. క్రీ. శ. 1762 నాటికి కర్ణాటకములో ఫ్రెంచివారికి నిలువ నీడలేక పోయెను.

**సర్కారులు (గుంటూరు మినహా)** : సర్కారులలోని యుద్ధయాత్రలందు విజయనగరరాజైన ఆనందగజపతి రాజు బ్రిటిష్‌వారితో సమానమగు పాత్రను వహించెను. బొబ్బిలి యుద్ధకాలమున హత్య గావింపబడిన విజయరామ గజపతిరాజు తరువాత విజయనగరమునకు ఆనందగజపతి రాజు రాజయ్యెను. ఫ్రెంచివారికి చేసిన సాహాయ్యమునకు తగిన ప్రతిఫలము ముట్టకపోవుటచేత అతడు వారి పక్షమును వదలి బ్రిటిష్‌వారికి సాయపడ నిశ్చయించుకొని సప్తసంవత్సర యుద్ధవార్త తెలియగనే శ్రీకాకుళమును స్వాధీనపరచుకొని ఇతర స్థావరములనుండి ఫ్రెంచివారిని తరిమివేయుటకై మద్రాసులోని బ్రిటిషువారి సాయము నపేక్షించెను. కాని కర్ణాటక యుద్ధములో మునిగియుండుటచే వారు అతనికి సాయపడరైరి. అతడు నిరుత్సాహమును చెందక ఫ్రెంచివారినుండి విశాఖపట్టణమును వశపరచుకొని సాహాయ్యమునకై బంగాళమునులోని క్లైవుకు వార్త పంపెను. క్లైవు దూరదృష్టికలవా డగుటయేకాక క్రీ. శ. 1756 లో బంగాళమునకు వెళ్ళక పూర్వము దక్కనుపై దండెత్తి బుస్సీని తొలగద్రోయ దలచికొనినవాడు. ఆ యుద్దేశము కొనసాగుటకు తగిన అవకాశము లభించెనని తలచి వెంటనే కర్నల్ ఫోర్డు నాయకత్వమున ఒక బ్రిటిష్ సైన్యమును సర్కారులకు పంపెను. ఆనందగజపతిరాజు సైన్యములును, బ్రిటిషు సైన్యములును కలసి విశాఖపట్టణము నుండి రాజమహేంద్రవరమునకు ప్రయాణము చేయుచుండగా మార్గములో చెందుర్తివద్ద ఫ్రెంచివారితో యుద్ధము సంభవించెను (క్రీ. శ. 1758). అందు ఫ్రెంచివారు ఓడిపోయిరి. ఫోర్డు ప్రయాణము సాగించి, రాజమహేంద్రవరమును వశపరచుకొని, ఏవియో కొన్ని తాత్కాలికములైన మనస్పర్ధల మూలమున వెనుకకు తగ్గుచుండిన ఆనందరాజును సమాధానపరచి క్రీ. శ. 1759 మార్చిలో మచిలీపట్టణమును ముట్టడించెను. ఆకాలమున సర్కారులలో అదియే ఫ్రెంచివారి ప్రధానకేంద్రము. అందు బలిష్ఠమైన కోట ఉండెను. ఆ పట్టణమును, కోటను వశపరచుకొనినగాని ఫ్రెంచివారి అధికారము నిర్మూలము కాజాలదు. ఇదిగాక ఫ్రెంచివారికి సాయముచేయుటకు ఉద్దేశించి సలాబత్ జంగు గొప్ప సైన్యముతో మచిలీపట్టణమునకు ప్రయాణము చేయుచుండినట్లు తెలియవచ్చెను. అతడు చేరకపూర్వమే పట్టణమును వశపరచుకొనుట కర్తవ్యమని నిశ్చయించుకొని, విజయనగరము రాజు మనఃపూర్వకముగా సాయము చేయకపోయినను ఫోర్డు కడు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సాహసముతో ముట్టడిని సాగించి వెలరోజులలో పట్టణమును, కోటను వశపరచుకొనెను (ఏప్రిలు 8, క్రి. శ. 1759). అప్పటికి సలాబత్ జంగు మచిలీపట్టణమునకు పదునైదు మైళ్ల దూరమందుండెను. ఆ సమయమునందే హైదరాబాదులో అతని తమ్ముడు నిజాం అలీ తిరుగబాటు చేసినట్లు వార్తలు వచ్చెను. అట్టి సందర్భములలో బ్రిటిష్‌వారితో యుద్ధముచేయుట అసంగతమని భావించి సలాబత్ జంగు వారికి మచిలీపట్టణము, నిజాంపట్టణము సర్కారులను, కొండపల్లి సర్కారులో కొంతభాగమును దత్తము చేసెను. ఇదిగాక దక్కనునుండి ఫ్రెంచిసైన్యములను తొలగించుటకు కూడ నత డంగీకరించెను. దీని ఫలితముగ గుంటూరులో తప్ప తక్కిన సర్కారులలో ఫ్రెంచి యుపద్రవ ముదృశ్యమయ్యెను. ఆనందగజపతిరాజునకు దగ్గరి బంధువైన పెద్దాపురపు వత్సవాయి జగపతిరాజు ఫ్రెంచివారియందు కొంత అభిమానము చూపగా వారు రాజమహేంద్రవరము, కాకినాడలను వశపరచుకొన ప్రయత్నించిరి. గాని కొండూరిలో జరిగిన యుద్ధమందు ఆనందగజపతిరాజు జగపతిరాజును ఓడించినందున వారి ప్రయత్నములు భగ్నము లయ్యెను.

ఫ్రెంచివారు సర్కారులనుండి తొలగినను అవి యన్నియు బ్రిటిష్‌వారి పాలనలోనికి వచ్చుటకు ఎనిమిది సంవత్సరములు పట్టెను. క్రి. శ. 1759 లో జరగిన సంధివలన కొన్ని ప్రాంతములు మాత్రమే వారి వశములోనికి వచ్చెను. తక్కిన వన్నియు నిజాము పాలనలోనే ఉండెను. క్రి. శ. 1760 లో నిజాం అలీ అధికారమును హస్తగతము చేసికొని నిజాము పదవిని అధిష్ఠించెను. తనకు శత్రువులైన మహారాష్ట్రుల నదుపులో నుంచుటకు ఒక బ్రిటిష్ సైన్యమును హైదరాబాదుకు పంపినయెడల సర్కారుల నన్నిటిని వారి కిచ్చుటకు అత డిష్టపడెను. కాని అప్పటికి కర్ణాటకములో ఫ్రెంచివారితో యుద్ధము ముగియని కారణమున బ్రిటిష్‌వారు అట్లు చేయుటకు సమ్మతింపలేదు. అతనితో సఖ్యములేక సర్కారులను వశపరచుకొనుటకు క్రి. శ. 1761-63 మధ్యను వారు కొన్ని ప్రయత్నములు కావించిరి. కాని అవి ఫలించలేదు. క్రి. శ. 1763 నాటికి సప్తసంవత్సర సంగ్రామము ముగిసెను. ఫ్రెంచివారి అధికారము కూలిపోయెను. అనంతరము లండనులోని బ్రిటిష్ అధికారులు నిజాం అలీ షరతులకు అంగీకరించి సర్కారులను సంపాదింపవలసినదిగా మద్రాసు ప్రభుత్వము వారికి తెలియబరచిరి. కాని పరిస్థితులు కొన్ని మారుట వలన నిజాం అలీ తన మనస్సును మార్చుకొని బ్రిటిష్‌వారి రాయబారములను నిరాకరించెను. క్రి. శ. 1764 లో మరియొక పర్యాయము నిజామును కాదని సర్కారులను జయించుటకు బ్రిటిష్‌వారు ప్రయత్నము చేసిరి. అప్పుడు అతడు కర్ణాటకముపై దండెత్త సన్నాహములు కావించినందున వారు ఆ ప్రయత్నములను విరమించుకొనవలసి వచ్చెను. క్రి. శ. 1765 లో క్లైవు ఇంగ్లండునుండి బంగాళ రాష్ట్రమునకు గవర్నరుగా రెండవ పర్యాయము వచ్చెను. అందను అధికారుల సూచనను అనుసరించి, సర్కారులను బ్రిటిష్ పరిపాలనలోనికి తెచ్చుటకు ఉపాయాంతరము నాలోచించి, మొగలాయి చక్రవర్తితో అతడు సంప్రదింపులు ప్రారంభించెను. కొన్ని సందర్భముల ఫలితముగ చక్రవర్తి బ్రిటిష్‌వారితో క్రి. శ. 1765 లో సంధిచేసికొనవలసి వచ్చెను. ఆ సంధిలో అతడు సర్కారులను అన్నిటిని బ్రిటిష్‌వారికి ఇచ్చివేసెను. చట్టము ననుసరించి దేశమునకంతకు మొగలాయి చక్రవర్తి పరిపాలకు డనియు, నిజాం అలీ మొదలైనవారు అతని ప్రతినిధు లనియు, అతని ఆజ్ఞలను వారు శిరసావహించవలసినవా రనియు ప్రతీతి ఉండెను. సర్కారులను తమకు దత్తము చేయుచు మొగలు చక్రవర్తి జారిచేసిన ఆజ్ఞాపత్రమును ఆధారము చేసికొని నిజాం అలీ సమ్మతిని సంపాదించుటకు బ్రిటిష్‌వారు ప్రయత్నించిరి. కాని అధికార మంతయు ఎన్నడో కోల్పోయిన చక్రవర్తి యొక్క ఆజ్ఞాపత్రమును నిజాం అలీ అంగీకరించుటకు ఇష్టపడలేదు. దానిని తిరస్కరించుచు బ్రిటిష్‌వారిపై యుద్ధసన్నాహములు చేయసాగెను. అప్పుడు బ్రిటిషువారు అతనితో రాయబారములు జరపి సాలుకు తొమ్మిది లక్షల రూపాయలు కప్పము చెల్లించుట కియ్యకొనిరి. ఆ షరతుపైన 1766 లో నిజాం అలీ వారితో సంధి చేసికొని సర్కారులలో గుంటూరు మినహా తక్కిన ప్రాంతములను వారి కొచ్చెను. అప్పటినుండి సర్కారులపై బ్రిటిష్‌వారి అధికారము స్థిరపడినదికాదు. క్రి. శ. 1767లో సంధిషరతులకు విరుద్ధముగ నిజాం అలీ మైసూరు [illegible] హైదరలీతో కలిసి బ్రిటిష్‌వారిపై యుద్ధ[illegible]. అప్పుడు బ్రిటిష్ సైన్యములు కొన్ని [illegible] మున ప్రయాణముచేసి, కంబముమెట్టును [illegible] వశపరచుకొని హైదరాబాదు సమీపమున [illegible]. అంతటితో నిజాం అలీ భయపడి 1768 లో బ్రిటిష్ వారితో మరియొక సంధిని కావించికొని గుంటూరు [illegible] సర్కారుల నన్నిటిని వారి కిచ్చివేసెను. [illegible] గంజాము మొదలుకొని గుంటూరు పర్యంతము వ్యాపించిన ఆంధ్రదేశ[illegible] బ్రిటిష్‌వారి అధికారము స్థాపితమయ్యెనని చెప్పవచ్చును. క్రి. శ. 1788 తర్వాత బ్రిటిష్‌వారికి తమ అధికారము [illegible] చేరి లేనియు కలుగలేదు.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



**గుంటూరు సర్కారు:** గుంటూరుకూడ కోస్తా ఆంధ్రములోని సర్కారులలో ఒకటయినను క్రీ. శ. 1766, క్రీ. శ. 1768 లో జరగిన సంధులలో అది నిజాం అలీ సహోదరుడును, ఆదోనికి నవాబును అయిన బసాలత్ జంగుకు జీవితాంతమువరకు ననుభవించు హక్కుతో నీయబడెను. సర్కారులకై ఏటేట బ్రిటిష్‌వారు నిజాముకు చెల్లించవలసిన తొమ్మిది లక్షలనుండి రెండు లక్షలు ఈ కారణమున మినహాయింపబడెను. బసాలత్ జంగు ఫ్రెంచివారియెడ పక్షపాతము, బ్రిటిష్‌వారియెడ విరోధము వహించినవాడు. అందుచేత అతడు ఫ్రెంచి సైనికులు కొందరికి ఆశ్రయమిచ్చి ఫ్రెంచి దళమును ఒకదానిని సమకూర్చుకొనెను; ఇదికాక బ్రిటిష్ సైన్యములనుండి పరారియైన వారిని కూడ తన సైన్యములో చేర్చుకొనుచుండెను. బ్రిటిష్ ప్రభుత్వపు ఆక్షేపణలను అతడు లక్ష్యపెట్టక ఇష్టము వచ్చినట్లు ప్రవర్తించుచుండెను; మోటుపల్లి మొదలైన రేవుపట్టణములనుండి సైనిక పరికరములను చేరవేసికొనుచుండెను. కాని క్రీ. శ. 1776 లో మైసూరు సుల్తానైన హైదరలీ ఆదోనిపై దండెత్తి వచ్చెను. అప్పుడు బసాలత్ జంగు భయపడి కొంత ద్రవ్యము అతనికిచ్చి, గుంటూరికి పారిపోయి రాగా మచిలీ పట్టణములోని బ్రిటిష్ అధికారులు అది ప్రమాదకరమని భావించి పేటపాళెము మొదలైన రేవు పట్టణములను వశపరచుకొనిరి. అంతటితో అతడు లొంగి ఫ్రెంచి సైనికులను ఉద్యోగమునుండి తొలగించుటకును, బ్రిటిష్‌వారు చెల్లించుటకు అంగీకరించిన భరణమునకు బదులు గుంటూరిని వారి పరము చేయుటకును క్రీ. శ. 1778 లో సమ్మతించెను. కాని తనతో సంప్రతించక గుంటూరిని బ్రిటిష్‌వారు ఈ విధముగ గ్రహించుటకు నిజాము సమ్మతించలేదు. అందుచేత అతడు బసాలత్ జంగు తొలగించిన ఫ్రెంచి దళమునకు ఆశ్రయమిచ్చి తన సైన్యములో చేర్చుకొని హైదరలీతో కలసి బ్రిటిష్‌వారిపై యుద్ధముచేయ సిద్ధపడెను. అప్పుడు వారన్ హేస్టింగ్స్ బంగాళమునకు గవర్నరు జనరలుగ నుండి లెక్కలేని చిక్కులను ఎదుర్కొనవలసిన స్థితిలో నుండెను. ఏకకాలమున ఇన్ని చిక్కులను ఎదుర్కొనుట కష్టసాధ్యమని గుంటూరును యథాప్రకారము బసాలత్ జంగు కిచ్చి, నిజాముతో సంధిచేసికొనవలసినదని మద్రాసు ప్రభుత్వము వారికి ఆజ్ఞాపించెను. కొంత ఆలస్యము కావించినను తుదకు మద్రాసువారు హేస్టింగ్స్ ఆజ్ఞకు లోబడి నిజామును అనునయపరచిరి. క్రీ.శ. 1782 లో బసాలత్ జంగు చనిపోయెను. క్రీ.శ. 1766 లోను, క్రీ. శ. 1768 లోను జరగిన సంధి షరతుల ప్రకారము గుంటూరు సర్కారు వెంటనే బ్రిటిష్‌వారికి వశము కావలసియున్నను నిజాము ఏదో మిషమీద అడ్డుపెట్టి కాలవిలంబనము చేయుచుండెను. హైదరుకూడ గుంటూరుపై కన్నువేసియుండెను. ఇట్టి పరిస్థితులలో కొంత విసుగుచెంది క్రీ. శ. 1784 లో వారన్ హేస్టింగ్సు సర్కారులనన్నిటిని కొంత ద్రవ్యమునకు బదులుగా నిజాముకు ఇచ్చివేయు నుద్దేశమును కనబరచెను. ఎంతో కష్టముమీద మద్రాసు ప్రభుత్వమువారు ఆ యుద్దేశము కొనసాగకుండ చేయగలిగిరి. క్రీ.శ. 1788 లో గవర్నరు జనరలుగా వచ్చిన కారన్ వాలీసు లండను అధికారుల ఆదేశము ననుసరించి గుంటూరిని వశపరచుకొన తీర్మానించుకొని నిజాముతో సంప్రతింపులు జరపి, తుదకు అతనిని ఒప్పించి క్రీ. శ. 1788 లో గుంటూరిని వశపరచుకొనెను. ఈ విధముగ తక్కిన సర్కారులు బ్రిటిష్ పాలనలోనికి వచ్చిన ఇరువది సంవత్సరములకు తరువాత గుంటూరు బ్రిటిష్ సామ్రాజ్యములో కలసెను.

**నెల్లూరు, చిత్తూరు మండలములు:** నెల్లూరు చిత్తూరు మండలములతో కూడిన కర్ణాటకము రెండవ కర్ణాటక యుద్ధము మూలమున ముహమ్మదలీ వశమయ్యెను. ఇతడు బ్రిటిష్‌వారి సాయమున నవాబైనవాడు. అందుచేత ఇదిమొదలు వారి పలుకుబడి కర్ణాటకమందంతటను సాగుటకు అవకాశమేర్పడెను. ముహమ్మదలీ క్రీ. శ. 1795 వరకు రాజ్యము చేసెను. క్రీ. శ. 1763 లో మూడవ కర్ణాటక యుద్ధము పూర్తియగువరకు నితని ప్రభుత్వము స్థిరపడలేదు. ఆమధ్య కాలములో నెల్లూరికి గవర్నరుగ నుండిన యితని సహోదరుడు నజీబుల్లా ఫ్రెంచివారి సాయముతో ఒకటి రెండు పర్యాయములు తిరుగబాటు చేసెను. మహారాష్ట్రుల దండు ఒకటి కడపను జయించి నెల్లూరుపైకి దండెత్తి వచ్చెను. బసాలత్ జంగు కూడ గుంటూరునుండి కొంత సైన్యముతో బయలుదేరి నెల్లూరిని ఆక్రమింప ప్రయత్నించెను. కాని బ్రిటిష్ వారి సాయమున ముహమ్మదలీ ఈ గండములనుండి తప్పించుకొని క్రీ. శ. 1763 నాటికి చాలవరకు బయటపడగల్గెను. ఇట్లు కొంత కాలము గడచిన తర్వాత మైసూరు సుల్తాను హైదరలీ కర్ణాటకమును జయింప ప్రయత్నించగా బ్రిటిష్‌వారు అతనితో రెండు యుద్ధములు జరపి, ముహమ్మదలీ రాజ్యమును అతికష్టముమీద రక్షించగలిగిరి.

ముహమ్మదలీ రాజ్యకాలములో కర్ణాటకములోని ప్రజలు అనేక కష్టముల ననుభవింపవలసినవారైరి. అతడు పరిపాలనమందు ఎట్టి శ్రద్ధను వహింపక భోగపరాయణుడై కాలము నంతను విలాసములందు వ్యర్థపుచ్చు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చుండెను. ఆదాయమునకు మించి ఖర్చులు ఎన్నిరెట్లో పెరుగుటచేత అతడు అప్పులపా లయ్యెను. మద్రాసులోని బ్రిటిష్ ప్రభుత్వపు ఉద్యోగు లనేకులు అతనికి ఎక్కువ వడ్డీలక్రింద అప్పు లిచ్చి లక్షలకొలది లాభమును సంపాదింపసాగిరి. కొంతకాల మగునప్పటికి ఋణభారము మితిమీరి వడ్డీలనుకూడ చెల్లించుటకు వీలులేని పరిస్థితు లేర్పడెను. అప్పు లిచ్చిన సాహుకార్ల ఒత్తిడి ఎక్కువయ్యెను. ఈ చిక్కులను వదల్చుటకు మద్రాసు ప్రభుత్వమువారు, వారిపై యాజమాన్యము వహించిన బంగాళ ప్రభుత్వమువారు, వీ రందరిపై అధికారము వహించిన బ్రిటన్‌లోని ప్రభుత్వమువారు క్రీ. శ. 1781, 1787, 1790, 1792 లలో అనేక విధానముల ననుసరింప దలచిరి కాని, వీరిలో వీరికి సామరస్యము కుదురని కారణమున వేవిధానముకూడ స్థిరరూపమును పొందకపోయెను. క్రీ. శ. 1795 లో ముహమ్మదలీ కాలధర్మము చెందగా అతని కుమారుడు ఉందత్ ఉల్ ఉమ్‌రా నవా బయ్యెను. నవాబులు మారినను పరిస్థితులలో మార్పు లేవియు కలుగలేదు. క్రీ. శ. 1798 లో వెల్లస్లీ ప్రభువు బంగాళమునకు గవర్నరు జనర లయ్యెను. అసమర్థులయిన నవాబుల ప్రభుత్వమును తొలగించి, బ్రిటిష్‌వారి సామ్రాజ్యాధికారమును దేశమం దంతట స్థాపించుటయే ఇతని ఉద్దేశము. అందుకై ఇతడు క్రీ. శ. 1799 లో మైసూరు సుల్తానగు టిపుతో యుద్ధము చేసి అతనిని ఓడించిన సందర్భములో కర్ణాటకపు నవాబుకు, టిపుసుల్తానుకు జరిగిన కొన్ని ఉత్తర ప్రత్యుత్తరములు బ్రిటిష్‌వారికి లభించెను. వానిని ఆధారము చేసికొని కర్ణాటకపు నవాబు బ్రిటిష్‌వారిపై కుట్రలు చేసినట్లు వెల్లస్లీ అతనిపై నేరము మోపి అతని రాజ్యమును బ్రిటిష్ పాలనములోనికి తెచ్చుటకు నిశ్చయించెను. క్రీ. శ. 1801 లో ఉమ్‌రా చనిపోయెను. అటు తర్వాత వెల్లస్లీ అతని దగ్గరి బంధువులలో నొకడగు అజీమ్ ఉద్ దౌలాతో సంప్రతింపులు జరపి కర్ణాటక మంతటిపై బ్రిటిష్ అధికారమును స్థాపించెను. ఈవిధముగా నెల్లూరు, చిత్తూరు మండలములు క్రీ. శ. 1802 లో బ్రిటిష్ పాలనలోనికి వచ్చినవి.

**రాయలసీమ:** మొగలాయి సామ్రాజ్యము విచ్ఛిత్తిగాంచిన కారణమున దేశమం దంతట ఏర్పడిన ఆర్థిక పరిస్థితులు, అరాజకము రాయలసీమయందుకూడ ఏర్పడియుండెను. ఈప్రాంత మంతయు హైదరాబాదు సుబేదారుని [illegible] చేరియుండినను, మహారాష్ట్రులు సమయము దొరికినప్పు డెల్ల దానిపై దండయాత్రలు చేయుచుండిరి. వాని ఫలితముగ పొందూరు, పెనుగొండ, గుత్తి, గుర్రంకొండ మొదలయిన దుర్గములను, ఆ దుర్గముల సమీపమందలి ప్రదేశములను వారు వశపరచుకొని, తక్కిన ప్రాంతములనుండి 'చౌతు' అను పన్నును అప్పుడప్పుడు వసూలుచేయుచుండిరి. దీనితోపాటు కడప, కర్నూలు, ఆదోని నవాబులు నిజాముపై తిరుగబాటులు చేయుటకూడ అప్పు డప్పుడు జరుగుచుండెను. నవాబుల క్రింద అధికారమును వహించిన పాళెగాండ్రు ప్రజలనుండి అధికములయిన పన్నులను వసూలు చేయుచు, తాము పై అధికారులకు చెల్లించవలసిన పైకమును బకాయిపెట్టుచు స్వతంత్రులై మెలగుచుండిరి. వాస్తవమైన అధికారము అంతయు వారి దనియే చెప్పవలెను. పాళెగాండ్రను అదుపులో నుంచుటకు క్రీ. శ. 1750 తర్వాత నిజాము కొన్ని ప్రయత్నములు చేసెను. కాని వానిమూలమున ఫలితము మాత్రము లభింపదయ్యెను. అధికారమునకై నిజామును మహారాష్ట్రులును పెనగులాడుచుండిన రాయలసీమలోనికి క్రీ. శ. 1768 తరువాత మైసూరు సుల్తాన్ హైదరలీ ప్రవేశించెను. ఇతడు కడు సమర్థుడు; దూరదృష్టి కలవాడు; మహారాష్ట్ర నాయకులకంటె ఎక్కువ పట్టుదల, స్థిరచిత్తము కలిగి వ్యవహారములను జరపువాడు. క్రమక్రమముగ ఇతడు రాయదుర్గము, బళ్ళారి, గుర్రంకొండ, సిద్ధవటము మొదలయిన దుర్గములను వశపరచుకొని, క్రీ.శ. 1782 లో కాలధర్మము నొందునాటికి రాయలసీమలో చాలభాగమునకు పరిపాలకుడుగ ఉండెను. అటుతరువాత మైసూరు రాజ్యమునకు అధికారియైన టిపు సుల్తాను తండ్రి ప్రారంభించిన పనిని పూర్తిచేయు నుద్దేశముతో ఆదోని మొదలైన కోటలను నిర్మూలము కావించి రాయలసీమ కంతటికి అధిపతి అయ్యెను. హైదరలీ, టిపుసుల్తానులు ఇద్దరును పాళెగాండ్రపట్ల చండశాసనులై, వారి అధికారమును చాలవరకు కూలద్రోసి శాంతి భద్రతలను స్థాపించి ప్రజలను రక్షించిరి.

కాని మైసూరు సుల్తానుల ప్రాబల్యము వృద్ధిగాంచుట బ్రిటిష్‌వారికి ఎంతమాత్రము రుచించినదికాదు. ఇదికాక క్రీ. శ. 1780 ప్రాంతమందుండి ఈ సుల్తానులు ఇద్దరు ఫ్రెంచివారి సాయమును సంపాదించి దానిమూలమున దక్షిణ ఇండియాలోని బ్రిటిష్‌వారి రాజ్యాధికారమును, తుద ముట్టింప ప్రయత్నించుచుండిరి. క్రీ. శ. 1780 నుండి యూరపుఖండమున ఫ్రెంచివారికిని, బ్రిటిష్‌వారికిని యుద్ధము లనేకము జరుగుచుండెను. బ్రిటిష్‌వారికి చిక్కులు కలిగించు ఉద్దేశముతో ఫ్రెంచి నౌకాదళములు, కాల్బలములు దక్షిణ హిందూదేశమునకు రాసాగెను. ఇట్టి సందర్భములలో ఊరకుండుట రాజనీతి కాదని, బ్రిటిష్‌వారు

http://sanskritcentral.com/

http://teluguthesis.com/





చిత్రము 1. ఓడ యెక్కుట (కుంపినీకాలము - 1887). మదరాసు



చిత్రము 2. ఓడ దిగుట (కుంపినీకాలము - 1887). మదరాసు

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ముప్పదినాలుగు కోటలు, సుమారు 35,000 సైన్యము ఉండెను. వా రందరు ఎవరో ముగ్గురు నలుగురు తప్ప బ్రిటిష్‌వారిపై తిరుగబాటులు కావించిరి. కొందరు, ముఖ్యముగ పర్లాకిమిడి గుంసూరు మోహిరి విజయ నగరము ప్రతాపగిరి జమీన్‌దారులు అనేక పర్యాయ ములు తిరుగబడిరి. వారిలో కొందరికి కొండల కెగువగ నున్న మన్నెపు ప్రాంతములలో కోట లుండుట వలనను, చాలకాలము వరకు ఆ ప్రాంతములలోనికి వెళ్లుటకు బ్రిటిష్ సైన్యములు వెనుదీయు చుండినందునను, దిగువ ప్రదేశమున అపజయము కాంచిన జమీన్‌దారులు వారి మన్నెపు దుర్గములలో చేరి పితూరీలను సాగించు చుండిరి. క్రీ. శ. 1800 వరకు మద్రాసు ప్రభుత్వమువారు మైసూరు సుల్తానులతో యుద్ధములు చేయుచుండిన కారణమున సర్కారులలోని తిరుగబాటులను పూర్తిగ అణచుటకు కావలసిన సైన్యములను పంపలేక పోయిరి.

గంజాము మండలములో జరగినన్ని తిరుగబాటులు విశాఖపట్టణములో జరగకుండినను, అచ్చటకూడ కొన్ని సంవత్సరముల పర్యంతము ప్రమాదము తప్పదయ్యెను. ఈ ప్రమాదము చాలవరకు విజయనగర రాజుల ప్రాబల్యము మూలమున సంభవించెను. క్రీ. శ. 1759 - 68 మధ్య ఏర్పడిన అరాజక పరిస్థితులలో వీరు విశాఖమండలము లోని జమీన్‌దారుల ననేకులను, గంజాములోని వారిని కొందరిని జయించి వారి జమీనులను తమ ఏలుబడిలోనికి తెచ్చుకొని, నిరంకుశముగ ఆ ప్రాంతములను అన్నిటిని పాలింపగలవారైరి. ఓడిపోయిన జమీన్‌దారులు అనే కులు విజయనగరములో కారాగృహములం దుంచబడిరి. వారిని కాదని బ్రిటిష్‌వారు క్రీ. శ. 1768 తర్వాత నెమ్మ దిగ పరిపాలనము నిర్వహించుట కష్ట సాధ్యమయ్యెను. నయభయములచేత వారి ప్రాబల్యమును తొలగించుటకును, వారి సైనికులను సిబ్బందులను తగ్గించుటకును, వా రియ వలసిన పేష్కషును ఎక్కువ చేయుటకును బ్రిటిష్‌వారు అనేక ప్రయత్నములు కావించిరి. కాని అప్పటి విజయ నగరరాజునకు సహోదరుడును, దివానునైన సీతారామ రాజు వీని కన్నిటికి అడ్డు గలిగించుచుండెను. తుదకు క్రీ. శ. 1794 లో పద్మనాభ యుద్ధమందు విజయనగరరాజు అప జయము గాంచి ప్రాణములు కోల్పోయెను. అటు తర్వాత కూడ రెండు మూడు సంవత్సరములవరకు శాంతి పరి స్థితులు ఏర్పడలేదు. కాని బ్రిటిష్‌వారు కారాగృహ ములో ఉండిన జమీన్‌దారులకు విమోచనము కలిగించి వారి జమీన్‌లలో చాలభాగమును వారికి వశపరచి వారితో పేష్కషు విషయమై ప్రత్యేకమైన ఒడంబడికలు కావించుకొనిరి. క్రీ. శ. 1802 లో అమలులోనికి వచ్చిన 'శాశ్వత భూమిశిస్తు' విధానము వలన విజయనగర రాజు, తక్కిన జమీన్‌దారులు తృప్తిపడి బ్రిటిషువారిని ఎదిరించు ప్రయత్నములను మానెదరని భావింపబడినను, వారు పూర్తిగా ఆ ప్రయత్నములను మానరైరి. పేష్కషు భారము అధిక మగుటయు, జమీనులకై దాయాదులలో వివాదములు సంభవించుటయు, గ్రామములను దోచుకొను టకు అలవాటుపడిన సాయుధ భటు లనేకులు వారి వృత్తిని మానకపోవుటయు మండలములో అరాజక పరిస్థితులకు దోహదము కల్పించు చుండెను.

తుదకు క్రీ. శ. 1832 నాటి కీపరిస్థితులు మిక్కిలి విష మించినందున వాని నన్నిటిని సవరించి, శాంతి భద్రతలను స్థాపించుటకు మద్రాసు ప్రభుత్వమువారు, జార్జి రసెల్ అను ప్రముఖ ఉద్యోగిని, స్పెషల్ కమిషనర్ హోదాతో విశాఖపట్టణము, గంజాము మండలముల కంపిరి. ఇతడు చాల చాకచక్యముతో వ్యవహారములను అన్నిటిని పరి ష్కరించి, విరోధులుగ నుండిన జమీన్‌దారులను కఠినముగ శిక్షించి, కొందరిని అధికారమునుండి తొలగించి, మన్నె ప్రాంతములలోనికి కూడ సైన్యములను పంపి, అచటి పర్వత దుర్గములను వశపరచుకొని బ్రిటిషువారిని ఎదిరిం చుట వ్యర్థ మన్నపాఠమును అందరికి నేర్పెను. అతడు తీసికొనిన చర్యల మూలమున అల్లరు లన్నియు అణగి పోవుటయే గాక బ్రిటిషువారి అధికారము సర్కారులందు స్థిరపడెను. అంతకుపూర్వమే గోదావరి మండలములోని జమీన్‌దారులు, కొందరు — ముఖ్యముగా పిఠాపురము, పెద్దాపురము, మొగలితుర్రు, పోలవరము జమీన్‌దారులు లేవదీసిన పితూరీలను విస్తారముగు క్రమలేక అధికారులు అణచివేయగలిగిరి. కృష్ణామండలములో క్రీ. శ. 1769 నుండి కొంతకాలము వరకు అరాజక పరిస్థితులు వ్యాపించి యుండెను. దోపిడిగుంపుల ప్రాబల్యము అధికముగ ఉండెను. జమీన్‌దారులు కొందరు తిరుగబాటులు కావిం చిరి. ఆ తిరుగబాటులలో ఒంగోలు జమీన్‌దారు, అతని సహోదరుడు నూజివీడు జమీన్‌దారునికి చుట్టమైన పద్మ నాభరావు, నిజాము పట్టణమునకు సంబంధించిన సూరనేని వెంకట్రాయులు లేవదీసిన పితూరీలు ఎక్కువ ప్రాధాన్య మును వహించినవని చెప్పవచ్చును. కాని క్రీ. శ. 1816 నాటికి పితూరీల నన్నిటిని అణచివేసి బ్రిటిషువారు కృష్ణా మండలమం దంతటను తమ అధికారమును స్థిరపరచు కొనిరి. నెల్లూరు మండలములో మాత్రము బ్రిటిష్‌వారిపై పేర్కొనదగిన తిరుగబాటులు ఏవియు ఎవరును జరప నట్లు లేదు.



http://www.sanskritcentral.com/

http://teluguthesis.com/



క్రీ. శ. 1800లో బ్రిటిషువారి వశమైన రాయలసీమలో సుమారు ఎనుబదిమంది పాళెగాండ్రు వారి వారి కోటలతోను, సైన్యములతోను తిరుగబాటు చేయుటకు సిద్ధముగ ఉండిరి. కాని దానిని పాలించుటకై నియమింపబడిన థామస్ మన్రో కడు సమర్థుడు; అవసరమైనపుడు ఎంతటి కఠిన చర్యలనైన తీసికొనుటకు సిద్ధపడినవాడు. అతడు కావలసిన సైన్యములను జతపరచుకొని తిరుగబాటుచేసిన పాళెగాండ్రను దయాదాక్షిణ్యములు లేక పూర్తిగ శిక్షించి నాటికి రాయలసీమలో పాళెగాండ్ర ప్రమాదము పూర్తిగ తొలగి బ్రిటిషు ప్రభుత్వము సుస్థిర మయ్యెను.

### బ్రిటిష్ పరిపాలన ఫలితములు

బ్రిటిషు పరిపాలన సుస్థిరమైన తరువాత ఏ కాలము అది దేశమందు నిలబడి యుండెనో ఆ నూరు సంవత్సరములలో దేశమందలి రాజకీయ, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక పరిస్థితుల యందును, ప్రజల దృక్పథ మనోభావము లందును విప్లవాత్మకములయిన మార్పులు కలిగెను. ఇంతటి

తెలుగు దేశము
రాజ్యవిభాగములు
(క్రీ. శ. 1884-85)


వారి వశమం దుండిన కోటలను అన్నిటిని స్వాధీనపరచుకొని, వారి సిబ్బందులను నిరాయుధులనుజేసి, నాలుగైదు సంవత్సరములలో వారిని పూర్తిగ అణచివేసెను. అతడు సామాన్యపు రైతులయెడ పక్షపాతముగలవాడు; సన్నజనము పురోభివృద్ధికి ఎక్కువ పాటుపడినవాడు. పాళెగాండ్ర దోపిడి మూలమున తరతరములుగ కష్టముల ననుభవించుచుండిన రైతుజనము మన్రోయందు భక్తివిశ్వాసములు గలవారై పాళెగాండ్రను అణచుటలో అతనికి తోడ్పడిరి. క్రీ. శ. 1807లో మన్రో ఉద్యోగమునుండి విరమించుకొను

మార్పులు మరి యే పరిపాలన కాలమందును కలిగియుండలేదు. ఒక మహాయుగము అంతరించి మరియొక మహాయుగము ప్రారంభమయ్యెనని చెప్పవచ్చును.

**రాజకీయ భావ పరివర్తనము**: రాజకీయ రంగమున ప్రజలు క్రొత్త పరిపాలన విధానమునకు అలవాటుపడిరి. దాని ఫలితముగ వారిలో క్రొత్త రాజకీయ భావములు ఉద్భవించెను. బ్రిటిష్‌వారు ప్రవేశపెట్టిన పరిపాలన విధానము మరియొక శీర్షిక క్రింద వివరింపబడియున్నది. ఇచట ముఖ్యముగా గమనింపవలసినది అందులోని ప్రధాన



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



లక్షణములును, వానిమూలమున ప్రజలు నేర్చుకొన్న గుణ పాఠములును.

మొగలాయిసామ్రాజ్య పతనకాలమున ఏర్పడిన అరాజక పరిస్థితులు తొలగి బ్రిటిష్ పరిపాలనకాలమున శాంతి భద్రతలు ఏర్పడుటచేత ఇతర ప్రాంతములనుండి అదివరకు వచ్చుచుండిన దాడులవలనగాని, జమీన్‌దారులు, పాళెగాండ్రు మొదలయినవారి పితూరీలవలనగాని ఎట్టి భయము లేక ప్రజలు నెమ్మదిగ కాలము గడప గలిగిరి.

పరిపాలనాధికార మంతయు ఒక మూలస్థానమున కేంద్రీకృతమగుటచేత రాష్ట్రమును, జిల్లాలను పాలించు క్రింది అధికారులు స్వతంత్రులు కాక, పై అధికారుల ఆజ్ఞలను శిరసావహించవలసినవారైరి. క్రింది అధికారుల తిరుగ బాటులవలన ప్రాచీనకాలమందుండి దేశములోని సామ్రాజ్యము లనేకము విచ్ఛిత్తిగాంచెను. ఇట్టి ప్రమాదము బ్రిటిష్ సామ్రాజ్యమునకు సంభవించలేదు. ఈ సామ్రాజ్యము పతన మగుటకు కారణము వేరు. రాజకీయముగ దేశము బలవత్తరముగ ఉండుటకు కేంద్రీకృతమగు ప్రభుత్వము ప్రధానసాధన మన్నగుణపాఠమును నేర్చుకొనుటకు ప్రజలకు అవకాశము లభించెను.

పరిపాలన సౌష్ఠవమునకై సమర్థులును, విద్యావంతులును, లంచగొండితనము మొదలగు చెడ్డ అలవాటులకు లోబడనివారును, యోగ్యులును అగు ఉన్నతోద్యోగులు అవసరమని గ్రహించి బ్రిటిష్‌వారు అట్టివారిని సృజించి వారిద్వారా పరిపాలనము సాగించిరి. జిల్లా కలెక్టర్లు, అట్టి హోదాలో ఉండిన ఇతర ఉద్యోగులు ఆ వర్గమునకు చెందినవారు. ప్రభుత్వముయొక్క ఉద్దేశములు వీరిమూలముననే సాఫల్యము కాంచుచుండెను. నాలుగైదు తరముల కాలము ప్రజలు వీరి పరిపాలనమునకు అలవాటుపడి తమ శ్రేయస్సు వృద్ధిగాంచుటకు ఇట్టి వర్గము ఒకటి ఉండుట అవసరమన్న భావము కలవారయిరి.

న్యాయ పరిపాలనములో బ్రిటిష్‌వారు ఒక ప్రధాన సూత్రమును అనుసరించిరి. శాస్త్రపరిభాషలో దానికి 'చట్టపు స్వామ్య సూత్రము (Rule of Law)' అని పేరు. చట్టముననుసరించి రాజ్యములోని వ్యక్తు లందరు సమానులనియు, చట్టమును ధిక్కరించినవాడు ఏకులమువాడయినను, ఏమతమువాడయినను, ఎంతటి సామంతుడైనను, అధికారియైనను, సామాన్యుడైనను న్యాయ పరిపాలనమునకై ఏర్పడిన సాధారణ న్యాయస్థానములయొక్క విచారణకు బద్ధుడై అవి విధించు శిక్షను అనుభవించవలసినవా డనియు ఈ సూత్రముయొక్క అంతరార్థము. బ్రిటిషువారు దీనిని సాధారణముగ అనుసరించినందున అధికార పదవులందుండువారియొక్కయు, అగ్రకులములవారియొక్కయు, ధనికులయొక్కయు నిరంకుశత్వము చాలవరకు బలహీనత కాంచెను. మానవు లందరు ప్రభుత్వ దృష్టిలో సమాను లన్నభావము వ్యాపించుటకు ఇది ఒక సాధనమయ్యెను. క్రింది తరగతులవారు తలయెత్తుకొని సగౌరవముగ సంచరించుటకు అవకాశము ఏర్పడెను. ఈసూత్రము న్యాయ పరిపాలనమునకు మూలాధారమన్న భావము దేశమందు వ్యాపించెను.

ప్రథమ దశయందు బ్రిటిష్ పరిపాలనము నిరంకుశముగ నుండెను. కాని కాలక్రమమున ప్రజల సహకారము లేక దేశమును పాలించుట సాధ్యము కాదని వారు గ్రహించిరి. అప్పటినుండి వారు ప్రజలు ఎన్నుకొన్న ప్రతినిధులు కల శాసన సభలను నిర్మాణము కావించి, అట్టి సభల విశ్వాసమునకు పాత్రులైన మంత్రులను నియమించిరి. దీని ఫలితముగ ప్రజాస్వామ్య విధానము ఆచరణలోనికి రాగలిగెను. బ్రిటిష్ పరిపాలనకు పూర్వము గ్రామ పరిపాలనమందు తప్ప తక్కిన రంగములందు ప్రజాస్వామ్యము ఉండినదికాదు. బ్రిటిషువారు ప్రవేశపెట్టిన శాసన సభలు, జిల్లాబోర్డులు, మునిసిపల్ సభలు మొదలయినవానిమూలమున ప్రజలు ప్రజాస్వామ్యవిధానమునకు అలవాటుపడి, ఇతర విధానములకంటె ఇది ఉత్కృష్టమైనదను భావము కలవారయిరి. ఈ విధముగ బ్రిటిష్ పరిపాలన కాలమున క్రొత్త రాజకీయవిధానము లేర్పడుటయు, దానిమూలమున క్రొత్త రాజకీయ భావములు ప్రజలలో రేకెత్తుటయు జరగెను.

ఇంతకంటె ముఖ్యమైన మార్పు మరియొకటి గమనించవలసి యున్నది. బ్రిటిష్ పరిపాలనకు పూర్వము ప్రజలలో మొత్తము భరతఖండముపై అభిమానముకాని, జాతీయభావముకాని, రాజకీయ చైతన్యముకాని ఎక్కువగ ఉండినది కాదు. ఈ విషయములోకూడ వారి పరిపాలన కాలమందు గొప్ప మార్పు కలిగెను. తెలుగుదేశపు ప్రజలలో తాము భారతీయులన్న భావము వృద్ధిగాంచెను. భాషయందును, మరికొన్ని ఇతర అంశములందును తమకును, అరవలు ఉత్కళులు బంగాళీలు మొదలగువారికిని భేదమున్నను భరతఖండమునందు ఉన్నవారు ఒకే జాతికి చెందినవా రనియు, అందరికి అది మాతృభూమి అనియు, దాని స్వాతంత్ర్య సంపాదన సంరక్షణలకు అందరు కలసి కృషిచేయుట విధి అనియు వారు విశ్వసించిరి. తెలుగుదేశ చరిత్రలో ఇట్టి భావము ప్రథమమున బ్రిటిష్ పరిపాలన కాలమున కలిగెను. దేశ మంతటిపై ఒకే ప్రభుత్వము, ఒకే పరిపాలనవిధానము ఏర్పడుట, రోడ్లు రైళ్ళు మొదలైన



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ప్రయాణ సౌకర్యముల మూలమున తెలుగువారికి ఇతర రాష్ట్రములలోనివారితో ఎక్కువ సంబంధము ఏర్పడుట, ఒకేవిధమైన ఉన్నతవిద్య రాష్ట్రము లన్నిటిలో వ్యాపించుట, దాని ఫలితముగ విద్యావంతులు అందరు ఒకే భాషను మాటాడువారై ఒకేవిధమైన తత్వములను, సిద్ధాంతములను ప్రతిపాదించుట — ఇట్టి పరిస్థితులమూలమున జాతీయభావము పుట్టి పెరిగెను. రాజకీయవిషయములందు తెలుగువారి క్రీ. శ. 1750 నాటి మనోవైఖరికిని క్రీ. శ. 1950 నాటి మనోవైఖరికిని హస్తిమశకాంతర మున్నది. ఈ భేదము బ్రిటిష్‌పరిపాలన కాలమున ఏర్పడిన పరిస్థితుల ఫలితమే.

ఈ జాతీయభావముతోపాటు తెలుగువారిలో ఉపజాతీయభావము ఇంకొకటి ఇదేకాలమున వృద్ధిగాంచెను. భరతఖండములో తమకుగల ప్రత్యేక వ్యక్తిత్వమును నిలబెట్టుకొనవలెననెడి దృఢవాంఛ దీనికి ప్రధానలక్షణము. దీనిఫలితముగ తమ ప్రాచీనచరిత్రయందును, తమ భాషయందును, సారస్వతమందును వారు గాఢానురక్తి కలవారైరి. ఆంధ్రోద్యమము, ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణమందు ఆసక్తి దీనిఫలితములే.

ఆర్థిక వ్యవస్థా విపర్యయము : ఈ కాలమున రాజకీయ పరిస్థితులు మారినట్లే ఆర్థిక పరిస్థితులయందుకూడ గమనింపదగిన మార్పు లనేకము కలిగెను. వీనిలో మొట్టమొదట గమనింప తగ్గది జనసంఖ్యయొక్క పెరుగుదల. శాంతిభద్రతలు దేశమందు వ్యాపించుట, కాలక్రమమున క్షామముల ఉద్ధృతి తగ్గుట, ఆహార పదార్థముల ఉత్పత్తి పెరుగుట, ప్రజల ఆరోగ్యమునకు సంబంధించిన ఏర్పాటుల వ్యాప్తి మూలమున మశూచికము మొదలైన అంటు వ్యాధుల తీవ్రత తగ్గుట - ఇట్టి కారణముల వలన జనసంఖ్య వృద్ధిగాంచెను. క్రీ. శ. 1800, 1850 మధ్య జనసంఖ్య రెండింత లయ్యెనని నిపుణులు అంచనావేసి యున్నారు. సరియైన జనాభాలెక్కలను తయారుచేయుటకు క్రీ. శ. 1871 లో ప్రథమ ప్రయత్నము జరగెను. తెలంగాణా మినహాగా బళ్లారి, గంజాములతో కూడిన అప్పటి తెలుగు జిల్లాలోని జనసంఖ్య 1,20,80,251 (అనంతపురము, చిత్తూరు జిల్లా లప్పటికేర్పడలేదు). ఇది క్రమముగా వృద్ధి గాంచి క్రీ. శ. 1951 నాటికి 205 లక్షలయ్యెను.

బ్రిటిష్ పరిపాలనమునకు పూర్వము వ్యవసాయము ప్రజలకు ప్రధాన జీవనోపాయముగ ఉండెను. ఈ పరిపాలన కాలమున పరిశ్రమలు కొన్ని నశించుటవలన ప్రజలలో పూర్వముకంటె ఎక్కువభాగము వ్యవసాయముపై ఆధారపడవలసినవారయిరి. అదివరకు బీడుగా ఉండిన భూములలో చాల భాగము సాగులోనికి వచ్చెను.

గ్రామములలో వ్యవసాయయోగ్యములగు భూములు ఎక్కువగ సాగుచేయుటకు కావలసిన రైతుజనము తక్కువగ నుండిన పరిస్థితి మారి, వ్యవసాయము చేయదలచుకొనిన వారికి భూములు లభింపని పరిస్థితి ఏర్పడెను.

రైతులు పండించు పంటలలోకూడ గొప్పమార్పు కలిగెను. ఇతరరాష్ట్రములకును, విదేశములకును ఎగుమతి చేసి లాభము సంపాదించుటకు అవకాశము కల్పించు ప్రత్తి, పొగాకు, నూనెగింజలు, జనుము మొదలైన ఆహారయోగ్యేతరములయిన పంటల ప్రాధాన్యము పూర్వముకంటె ఎక్కువయ్యెను. ఇందుచేత రైతుల సౌభాగ్యము వాణిజ్యవ్యాపార స్థితిగతులపై ఎక్కువగా ఆధారపడవలసి వచ్చెను.

పూర్వము చెరువులు, బావులు వ్యవసాయమునకు ప్రధానాధారములుగా ఉండెను. నదీజలములు కాలువల ద్వారా పారుదలకు ఏర్పాట్లు కొంతవరకు చేయబడెను. కొన్ని ప్రదేశములందు రెండు మూడుసార్లు సాగుచేయుటకు అవకాశము కలిగెను. పంటల ఉత్పత్తి అధికమగుటకు ఈపారుదల ఏర్పాట్లు ప్రధానకారణములయ్యెను. సుమారు 25 లక్షల ఎకరములు ఈ విధముగ సాగులోనికి వచ్చెను.

అనాదిగ వ్యవసాయ విధానమునకు తరతరములుగ రైతులు గడించిన అనుభవ మొక్కటే మార్గదర్శిగ నుండెడిది. పరిశోధనాధారమైన శాస్త్రజ్ఞానము రైతులకు అందుబాటులో ఉండినదికాదు. ఇందులోకూడ ఈ కాలమున కొంత మార్పు వచ్చెను. రాష్ట్రమందు ప్రత్యేక వ్యవసాయశాఖను ఒకదానిని ప్రభుత్వమువారు ఏర్పాటుచేసిన కారణమున ఎరువులు, భూమిసారభేదములు, క్రొత్త రకపు పంటలు, విత్తనములు, పనిముట్లు మొదలగువానిని గురించిన పరిశోధనలు జరగసాగెను. దాని ఫలితముగ వ్యవసాయములో కొంత మార్పు కలిగి ఎక్కువ పంటలు పండుటకు అవకాశము ఏర్పడెను.

రైతుల సాహాయ్యమునకై రకరకములైన సహకార సంస్థలు స్థాపింపబడెను.

ప్రాచీనకాలమందుండి ప్రజలలో కొంతభాగము నేత, కమ్మరము, వడ్రంగము, మొదలైన పరిశ్రమల ద్వారా జీవించుచుండెడిది. వ్యవసాయదారులు కూడ నూలు వడకుట మొదలైన ఉపవృత్తుల మూలమున కొంత ఆదాయమును సంపాదించుచుండువారు. బ్రిటిషుపరిపాలన కాలమున ఇట్టి చేతిపను లనేకము నశించెను. కొన్ని గట్టి దెబ్బ తినవలసినవయ్యెను.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఇట్టి పరిశ్రమలలో ఇనుప పరిశ్రమ, నేత పరిశ్రమ ప్రధానము లైనవి. వ్యవసాయదారులు, వడ్రంగులు, కమ్మరులు మొదలైనవారు ఉపయోగించు పనిముట్లకును, సామాన్యజనుల వాడుకకును కావలసిన ఇనుము క్రీ. శ. 1800కు పూర్వము దేశమందే దొరకుచుండెను. ముడి ఇనుమును కరగించి, ఇనుమును ఉక్కుచేయగల కార్మికులు తెలుగుజిల్లా లన్నిటియందు ఉండిరి. కాని కాలక్రమమున ముడి ఇనుమును కరగించుటకు కావలసిన కట్టెలు బొగ్గు సమృద్ధిగ దొరకని కారణమునను, విదేశములలో యంత్ర సాహాయ్యమున తయారగు చౌక ఇనుము దిగుమతి అగుట చేతను, కంపెనీ ప్రభుత్వమువారు దేశీయ పరిశ్రమకు ఎట్టి సాయము చేయనికారణమునను ఇనుప పరిశ్రమ పూర్తిగ నశించెను.

నేత పరిశ్రమకు ఇంతటి దుర్గతి పట్టలేదు. కాని అది కూడ తొల్లింటి ప్రాధాన్యమును కోల్పోయెను. క్రీ. శ. 1800కు పూర్వము తెలుగు జిల్లాలనుండి సుమారు కోటి రూపాయల విలువగల సన్నని వస్త్రములు, అద్దకపు బట్టలు విదేశములకు ఎగుమతి అగుచుండెను. ఇదికాక ప్రజ లందరికి కావలసిన బట్ట దేశమందే తయారగు చుండెను. క్రీ. శ. 1850 నాటికి దేశవ్యాపార మంతయు నశించెను. దీనికితోడు యంత్రసాహాయ్యమున ఇంగ్లండులో చౌకగ తయారగుచున్న బట్టల దిగుమతి పెరుగుటయు, అట్టి విదేశపు బట్టలను ప్రజలు వాడుటయు జరగెను. విదేశములలోని మిల్లు బట్టల పోటికి నిలబడలేక చేనేత పరిశ్రమ కృశించి పోయెను.

క్రీ. శ. 18వ శతాబ్దమున ఇంగ్లండులో గొప్ప పారిశ్రామిక విప్లవము సంభవించెను. ఆవిరిశక్తి సాహాయ్యమున నడచుయంత్రముల ద్వారా ఫ్యాక్టరీలలో వస్తు సామగ్రిని తయారుచేయుటయే దాని ప్రధాన లక్షణము. ఇందుమూలమున ప్రతివస్తువు మిక్కిలి చౌకగా తయారు చేయుటకు సాధ్య మయ్యెను. పొగయోడలు వాడుకలోనికి వచ్చుట చేతను, సూయజ్ కాల్వ నిర్మాణమైనందునను ఇంగ్లండులో తయారైన చౌక వస్తువులు సులభముగ మన దేశములోనికి వచ్చుటకు వీలయ్యెను. ఇదే సమయమున ఇచటి బ్రిటిషు ప్రభుత్వమువారు రోడ్లు, రైళ్ళు మొదలైన ప్రయాణ సౌకర్యములను కల్పించుటయందు శ్రద్ధ వహించిరి. ఇన్నిటి ఫలితముగ చౌక విదేశవస్తువులు కుగ్రామములలోనికి కూడ రాగలిగెను. వీని పోటికి నిలబడలేక దేశములోని కంచర్లు, తోళ్ళపనిచేయువారు, కుమ్మర్లు, ఇతర కార్మికులు వంశ పారంపర్యముగ అనుసరించు చుండిన వృత్తులను మానుకొని వ్యవసాయపు కూలీల వర్గములో చేరవలసినవారైరి.

ఈకాలమున ప్రజల అభిరుచులలోకూడ గొప్ప మార్పులు కలిగి విదేశ వస్తువులకు గల గిరాకి వృద్ధి కాంచెను. ధనికవర్గములో చేరినవారు, జమీన్‌దారులు, బ్రిటిష్ అధికారుల పరిచయ ప్రాబల్యమున ఇంగ్లండు మొదలైన పాశ్చాత్య దేశములందుండి వచ్చు విలాస సామగ్రి యందు వ్యామోహము గలవారైరి. సామాన్య జనులలో కూడ విదేశీయములగు పింగాణీసామానులు, సబ్బులు, బొమ్మలు, ఆట వస్తువులు మొదలగువానియందు వ్యామోహము అధికమయ్యెను. ఇట్టి కారణముల మూలమున బ్రిటిషు పరిపాలన కాలమున తెలుగుదేశములోని పరిశ్రమలు వెనుకపడి పోయెను. భరతఖండములోని ప్రాచీన పరిశ్రమలు నశించినను వాని స్థానమున యంత్ర సాహాయ్యమున పనిచేయు ఫ్యాక్టరీ పరిశ్రమలు కొన్ని స్థాపింపబడెను. తెలుగుదేశమందు ఇట్టిమార్పు జరగలేదు.

బ్రిటిష్ పరిపాలన కాలములో ప్రయాణ సౌకర్యములు, రవాణా సౌకర్యములు, సమాచార సౌకర్యములు వృద్ధికాంచెను. క్రీ. శ. 1800 కు పూర్వము జనములో చాల భాగము కాలినడకనే ప్రయాణము చేయుచుండువారు. పెద్ద బండ్లు నడచుటకు అనుకూలమైన రోడ్లు చాల తక్కువగ నుండినందున వ్యాపారము కంచరగాడిదలు, గుర్రములు, ఎద్దులు మొదలయినవాని తోడ్పాటున జరగుచుండెను. వీనిపై బరువులు వేసికొని వర్తకులు ఒక ప్రదేశమునుండి మరియొక ప్రదేశమునకు వెళ్లుచుండిరి. కాలక్రమమున బ్రిటిషువారు కంకర రోడ్లను వేయసాగిరి. వారి పరిపాలన మంతరించునాటికి తెలుగు జిల్లాలయందు మొత్తముమీద సుమారు 13,000 మైళ్ళ పొడవుగల రోడ్లు నిర్మింపబడెను. వీనితోపాటు రైళ్ళ నిర్మాణముకూడ కొంతవరకు పెరిగి 1,600 మైళ్ళ పొడవుగల రైలుమార్గము ఏర్పడెను. ఇదికాక పడవలు నడచుటకు వీలగునట్లుగా సుమారు వేయిమైళ్ళ పొడవుగల కాలువలు త్రవ్వబడెను. తంతి తపాలామూలమున అదివరకు లేని వార్తాసౌకర్యములు ప్రజల అందుబాటులోనికి వచ్చెను. ఈ యన్నింటి ఫలితముగ వర్తక వ్యాపారములు వృద్ధి గాంచెను. పంటలను పండించువారికి, ఇతర వస్తుసామగ్రులను తయారుచేయు వారికి తమ సరకులను దూరప్రాంతములకు పంపి ఎక్కువ లాభము సంపాదించుటకు అవకాశము కలిగెను. పల్లెల ప్రాంతములలో నివసించువారుకూడ దూరప్రాంతములందు ఉత్పత్తియగు వస్తువులను ఉపయోగింపగలవారైరి. వర్తక వ్యాపారములు అభివృద్ధి కాను కాను బ్యాంకులు, ఇతర ప్రజాహిత సంస్థలు దేశమునం దంతట అచ్చటచ్చట స్థాపితము లగుచువచ్చినవి.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వ్యవసాయమందును, పరిశ్రమలయందును, రవాణా సౌకర్యములందును కలిగిన మార్పులవలన విదేశవ్యాపార స్వరూపముకూడ మార్పు కాంచెను. వస్త్రములవంటి తయారీ పదార్థముల (మాన్యుఫ్యాక్చర్డ్ గూడ్స్) ఎగుమతులు తగ్గిపోగాకు, నూనె గింజలు, ప్రత్తి, పసుపు, అభ్రకము, మాంగనీసు మొదలయిన ముడిపదార్థముల ఎగుమతులు హెచ్చయ్యెను. దిగుమతులలో తయారీ పదార్థముల దామాషా అధికమయ్యెను.

దేశమందు క్రొత్త వృత్తు లనేకము బయలుదేరెను. క్రొత్త వృత్తులు కొన్నింటిలో ఎక్కువమంది ప్రవేశించుటకు అవకాశమేర్పడెను. లాయర్లు, ప్రభుత్వోద్యోగులు, కంట్రాక్టర్లు, కమిషన్ ఏజంట్లు, వైద్యులు, గుమాస్తాలు, వార్తాపత్రికలను నడపువారు, చిల్లరబేరము చేయువారు, ఉపాధ్యాయులు — ఈ సందర్భమున పేర్కొనదగి యున్నారు.

రాజకీయరంగములో ప్రజలయందు నూతన భావములు ఉదయించినట్లు ఆర్థికరంగమందుకూడ నూతన భావములు పొడసూపెను. పాశ్చాత్యులవలె తాముకూడ ఆర్థిక సంపదను వృద్ధిచేసికొనుట అవసర మనియు, దానికి ప్రధాన సాధనము పరిశ్రమ లనియు వారు భావింపసాగిరి. దారిద్ర్యము కర్మఫలము కా దనియు, ఆర్థిక పునర్నిర్మాణము మూలమున దానిని తొలగించుట సాధ్య మనియు, అందుకైగట్టి ప్రయత్నములు కావింపవలసియున్న దనియు వారు నమ్మినవారైరి. బ్రిటిష్ పరిపాలన మంతరించునాటికి అన్నిరకముల వారిలో ఇట్టి నూతనోత్సాహము కనుపించెను.

సాంఘిక పరివర్తనము : సాంఘిక పరిస్థితులలో ఈ కాలమున గలిగిన మార్పులను అవగాహన చేసికొనుటలో ఒకటి రెండు సామాన్య విషయములను గుర్తించుట అవసరము.

మానవ జీవితము పరస్పరాశ్రితము. ఇతరుల సాహాయ్యము లేక ఎవడును జీవింపలేడు. సంఘ మనునది వ్యక్తివలె మన కంటి కగపడు ఒక పదార్థము కాదు; పరస్పర సాహాయ్య సహకారములకై మనము కల్పించుకొన్న ఏర్పాటుల సముదాయమే. ఈ యేర్పాటులు, వీనిమూలమున ప్రజలలో కలుగు పరస్పర సంబంధములు - ఇవియే సాంఘిక పరిస్థితులు.

ఈ సందర్భమున గమనింపదగిన విశేషము ఇంకొకటి ఉన్నది. ప్రతి సంఘమందును కొందరు ఎక్కువ గౌరవమునకును, కొందరు తక్కువ గౌరవమునకును అర్హులుగ ఎంచబడుచుందురు. ఇట్టి భేదములు లేని సంఘ ముండదు. కాని ఈ భేదములకు ఆధారము అన్ని సంఘములందును ఒక్కటే కాదు. కొన్నిటియందు కులము, కొన్నిటియందు ధనము, కొన్నిటియందు విద్య, కొన్నిటియందు అధికారము — వీనికి ఆధారముగ ఉండును. సాంఘిక పరిస్థితులనుగురించి ఆలోచించునపుడు ఈ రెండు విషయములను గురించి ఆలోచించుట అవసరము.

ఈ దృష్టితో బ్రిటిష్ పరిపాలనకు పూర్వకాలపు ఆంధ్రదేశ సాంఘిక పరిస్థితులను గమనించినయెడల వానికి మూడు ప్రధాన లక్షణము లుండెనని చెప్పవచ్చును. మొదటిది: వర్ణధర్మము (కులధర్మము); రెండవది: సమష్టికుటుంబ విధానము; మూడవది: స్వయం సమృద్ధమగు గ్రామజీవితము. ఇవి సామాన్యముగ అందరికి తెలిసిన విషయములు; కనుక వీనిని గురించి విపులముగ ఇచ్చట వివరించవలసినది లేదు.

వ్యక్తికి కావలసిన సాయములో చాలభాగము స్వకులమునుండియు, కొంత ఇతర కులములనుండియు లభించుచుండెను. ఏకులమువారు ఎట్టి వృత్తులను అనుసరించవలసినది, ఎట్టి వానిని త్యజించవలసినది, ఎట్టి సాయము ఇతర కులములవారికి చేయవలసినది కులధర్మమునుబట్టి నిర్ణయమగుచుండెను. వివాహములు, భోజనము, పండుగులు మొదలైనవాని విషయములో వ్యక్తులు తమ తమ ఇష్టానుసారముగ కాక కుల నియమములకు లోబడి ప్రవర్తించుట సంప్రదాయముగ నుండెను. దీనికితోడు వ్యక్తులకు గల గౌరవావమానములు వారి వారి కులములనుబట్టి లభించుచుండెను. ఈ సాంఘిక సంప్రదాయములు అతి ప్రాచీన కాలమునుండి వచ్చుచుండినట్టివి. మతసంస్కర్తలు కొందరు, భిన్నమతములను అనుసరించిన పరిపాలకులు కొందరు, వర్ణధర్మమునకు విరుద్ధమగు ప్రచారము కావించిరి. కాని బ్రిటిష్ పరిపాలనకు పూర్వము దానికి గల బలము తగ్గినది కాదు.

బ్రిటిష్ పరిపాలన కాలమున దీనికి ఒక గొప్ప దెబ్బ తగిలెను. క్రైస్తవ మత ప్రచారమునకై వచ్చిన మిషనరీల ఖండనము దీనికి ఒక కారణము; బ్రిటిష్‌వారు ప్రవేశపెట్టిన ఉన్నత విద్య మరియొక కారణము. ప్రాచీన కాలమునుండి ఉన్నతవిద్యలు నేర్చుకొనుటకు కొన్ని కులములవారే అర్హులని ఎంచబడుచుండెను. అట్టివారే ఎక్కువ గౌరవమునకు పాత్రులుగ నుండిరి. బ్రిటిష్‌వారి పరిపాలనములో ఉన్నతవిద్యయొక్క స్వరూపము పూర్తిగ మారిపోయెను. ఇంగ్లీషు విద్యయే ఉన్నత విద్యగా పరిగణింపబడెను. దీనిని నేర్చుకొనుటకు ఎట్టి వివక్ష లేక అన్ని కులములవారు అర్హులైరి. అట్టివారు ఏకులమునకు చెందినవారైనను అధికారపదవులకు రాగలిగిరి. ఇదికాక, ఇంగ్లీషు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



విద్య వ్యక్తి స్వాతంత్ర్యమును, సమత్వమును ప్రతిపాదించు నట్టిది. ఇట్టి విద్యను అభ్యసించినవారు కులధర్మమునుబట్టి ఏర్పడిన తర తమ భేదములను ఖండింపసాగిరి. దీనికితోడు రైళ్ళ ప్రయాణములలోను, విద్యా సంస్థలలోను, ఉద్యోగ పదవులలోను భోజనాది విషయములకు సంబంధించిన కుల నియమములను అనుసరించుట ఆచరణసాధ్యము కాక పోయెను. ఇట్టి అనేక కారణములమూలమున కొన్ని కులములవారు అధికులని, మరికొన్ని కులములవారు తక్కువవారని ప్రతిపాదించు వర్ణధర్మమందు విశ్వాసము క్షీణించెను. జనసంఖ్య వృద్ధి గాంచి జీవనోపాధిని సంపాదించుటకై తీవ్ర ప్రయత్నము చేయవలసివచ్చుటచేత కుల నియమములకు విరుద్ధముగ అనేకు లేదో యొక వృత్తిలో ప్రవేశించి జీవయాత్ర గడపుకొనవలసినవారైరి. క్రొత్తగ ఏర్పడిన వృత్తులలో అన్ని కులములవారు ప్రవేశింపసాగిరి. వీని ఫలితముగ 'కుల-కట్టుబాటుల' బిగువు సడలి పోయెను. సంఘ సంస్కర్తల ప్రచారము మూలమునను, బ్రిటిష్‌వారు అనుసరించిన భేదోపాయము మూలమునను కులములమధ్య ఇదివరకు ఉండిన సామరస్యము తగ్గి వర్ణ ధర్మ నిరసనము బలపడెను. వర్ణాంతర వివాహములుకూడ ఆచరణలోనికి వచ్చెను. పరిస్థితులలో కలిగిన ఇట్టి మార్పుల మూలమున కులధర్మమునకు గల ప్రాధాన్యము చాలవరకు క్షీణించెను. కులభేదములు తొలగలేదు. కాని కులమును బట్టి తర తమ భేదములను నిర్ణయించు సంప్రదాయము అదృశ్యమయ్యెను. హరిజనోద్యమము ఇట్టి వాతావరణ ఫలితమే.

ఈ కాలమున సమష్టి కుటుంబ విధానముకూడ చాల వరకు సన్నగిల్లెను. జనసంఖ్య వృద్ధి గాంచుటచేత అన్న దమ్ములను వదలి దూర ప్రాంతములకు వెళ్ళి జీవనోపాధిని సంపాదించుకొనుట అనేకుల కవసరమయ్యెను. ఉద్యోగ ములు చేయదలచుకొనినవారు అదేవిధముగ దూరప్రాంత ములకు వెళ్ళవలసివచ్చెను. నిరాడంబర జీవితమునకు బదులు పాశ్చాత్యులవలె దైనికావసరములను పెంచు కొనుటయందు అన్నివర్గములవారికి అభిలాష మెండగుట చేత కుటుంబ వ్యయము పెరుగుటయు, సమష్టి కుటుంబ నిర్వహణము కష్టసాధ్య మగుటయు సంభవించెను. ఈకాల మున స్త్రీజనోద్యమము ప్రబలి స్త్రీలు పురుషులతో సమాను లన్న సిద్ధాంతము వ్యాప్తి గాంచెను. దీని ఫలితముగ స్త్రీలు స్వతంత్రలైరి. బాల్య వివాహములకు బదులు ప్రౌఢా వివాహములు పరిపాటి అయ్యెను. వయసు వచ్చిన తర్వాత వివాహమాడు స్వాతంత్ర్యప్రియలగు స్త్రీలు సమష్టి కుటుం బములో కాలము గడపుటకు ఇష్టపడరైరి. పాశ్చాత్య సంస్కృతిసంపర్క కారణముగ పురుషులలోకూడ వ్యక్తి తత్త్వము దృఢముగ నాటుకొనెను. ఒకడు సంపాదించుట, సంపాదించలేని అన్నదమ్ములు, వారి పిల్లలు ఆ యొక్కని సంపాదనను అనుభవించుట అన్న సమష్టి కుటుంబ సూత్రముపట్ల అనేకులకు అనిష్టము కలిగెను. వర్ణాంతర వివాహములు, స్త్రీ పునర్వివాహములుకూడ సమష్టి కుటుంబవిధాన విచ్ఛిత్తికి తోడ్పడెను.

బ్రిటిష్ పరిపాలనకు పూర్వము గ్రామములు స్వయం సమృద్ధములుగ నుండెను. ప్రయాణ సౌకర్యములు, రవాణా సౌకర్యములు లేని కాలమున గ్రామములకు మార్గాంతరము లేక స్వయంసమృద్ధములుగ నుండుట తప్పనిసరి అయ్యెను. అట్టి స్థితిలో గ్రామములోనివారి అవసరములు, తినుటకు కావలసిన వస్తుసామగ్రి అంతయు - ఆహారపదార్థములు, ముడిపదార్థములు, వస్త్రములు, ఇండ్లు కట్టుకొనుటకు సామానులు, పనిముట్లు మొదలైన వన్నియు - గ్రామమందే ఉత్పత్తియగుచుండెను. వినోదకాల క్షేపమునకును, విలాస జీవితమునకును, ఆధ్యాత్మిక జిజ్ఞాస తీరుటకును కావలసిన నటులు, నర్తకులు, గాయకులు, పౌరాణికులు, పురోహితులు మొదలైనవారుకూడ ప్రతి గ్రామమందు ఉండిరి. సాముదాయిక వ్యవహారములను జరపుటకును, వివాదములను పరిష్కరించుటకును గ్రామ మందే పంచాయతీ యుండెను. ప్రభుత్వోద్యోగులు పన్నులు వసూలుచేయుటకు మాత్రమే గ్రామములకు వచ్చుచుండుట చేత వారు ఎంత దూరమం దుండిన అంత క్షేమకరమన్న భావముతో గ్రామస్థు లుండిరి. ప్రభుత్వముద్వారా వారు అపేక్షించు సాయము విస్తారము లేకుండెను.

క్రీ. శ. 1850 తర్వాత ఇదంతయు మారెను. అధి కారము కేంద్రీకృతమైనగాని దేశమందు తమ పరిపాల నము స్థిరముగ నాటుకొనజాలదన్న భావముతో బ్రిటిష్ వారు గ్రామ పంచాయతీలయందు విముఖులై గ్రామ ముపై అధికార మంతను హస్తగతము కావించుకొనిరి. వివాద పరిష్కారములకు కొన్ని ప్రదేశములందు కోర్టులను స్థాపించిరి. గ్రామాధికారులను సర్కారు ఉద్యోగులను నిర్ణ యించి గ్రామస్థులతో వారికి అదివరకుండిన సంబంధమును త్రుంచివేసిరి. శిస్తు వసూళ్ళ విషయములో వారు చేసిన మార్పులవలన కలెక్టరు మొదలగు రెవిన్యూ ఉద్యోగులు గ్రామములపై సర్వాధికారము వహించినవారైరి. చెరు వులు, కాలువలు మొదలగు జలాధారముల నిర్మాణము నకును, మరమ్మతునకును ఇంజనీయరింగు ఉద్యోగులతో కూడిన ప్రత్యేకశాఖను ఒకదానిని నిర్మించి సాముదాయిక వ్యవహారములందు అదివరకు గ్రామములోనివారికి ఉండిన



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



శ్రద్ధను తగ్గించిరి. రవాణా సౌకర్యములు వృద్ధిగాంచుటచేత రైతులు తాము పండించిన పంటలను ఇతర ప్రాంతములందు అమ్ముటకును, తమకు కావలసిన వస్తు సామగ్రిని అట్టి ప్రాంతములందు కొనుటకును అవకాశము కలిగెను. తమ స్థితిని బాగుచేసికొనదలచిన గ్రామస్థులు గ్రామమును వదలి మరియొకచోట పనిచేసి ఆదాయము సంపాదించుటకూడ సాధ్యమయ్యెను. ఇట్టి వాతావరణములో అదివరకు రైతులకును, గ్రామములో రైతులుకాక ఇతర వృత్తులను అనుసరించుచుండినవారికిని మధ్య ఉండిన అనుబంధము చాలవరకు సన్నగిల్లెను. వినోదములకు, విలాసములకు సమీపమందుండు పట్టణములకు వెళ్ళుటకుకూడ గ్రామస్థులు అలవాటుపడిరి. విద్య నేర్చుకొన్నవారందరు ఉద్యోగాపేక్షచే గ్రామములను వదలి పట్టణములకు వెళ్ళసాగిరి. ఇట్టి కారణములమూలమున గ్రామములు రాజకీయముగను, ఆర్థికముగను, సాంఘికముగను స్వయం సమృద్ధిని కోల్పోయి తమ సౌభాగ్యమునకు దేశమంతటిపై ఆధారపడవలసివచ్చెను.

సాంస్కృతిక పరివర్తనము: బ్రిటిష్ పరిపాలన కాలమున సాంస్కృతిక రంగమందుకూడ కొన్ని గొప్ప మార్పులు కలిగెను. వీని కన్నిటికి మూలము బ్రిటిష్‌వారు ప్రవేశపెట్టిన విద్యావిధానము. ఇందు ఇంగ్లీషుభాషకును, ఆధునిక పాశ్చాత్య విజ్ఞానమునకును ప్రాధాన్యము కల్పింపబడెను. ఇట్టి విద్యను నేర్చినవారే ప్రభుత్వోద్యోగములకు అర్హులన్న నిర్ణయము వలన ఈ విద్యా విధానమునకు మరింత ప్రాబల్యము కలిగెను. ఉన్నత విద్యను అభ్యసింపగోరిన వారిలో అధికభాగము ఇంగ్లీషు విద్యాలయములలో ప్రవేశింప సాగిరి. ఏ కొద్దిమంది మాత్రమో సంస్కృతమందును, తెలుగునందును, తర్కవ్యాకరణాది ప్రాచీన ప్రాచ్య శాస్త్రములందును పాండిత్యము సంపాదించువారైరి. కాలక్రమమున ఇట్టివారి సంఖ్య మరింత క్షీణించెను. ఈ రెండు పరిణామముల మూలమున దేశీయ సంస్కృతికి గొప్ప దెబ్బ తగిలెను. విద్యావంతులను బిరుదమును వహించినవారికి దేశీయ సంస్కృతికి సంబంధించిన మూలగ్రంథములను చదివి, ప్రాచీన సంప్రదాయములను, సిద్ధాంతములను సమర్థించుటకు శక్తిలేక పోయెను. ఇట్టి శక్తి ఉండినవారికి రాజపోషణముగాని, ప్రజల ఆదరముగాని లేకుండెను. ఇందుచేత క్రమక్రమముగ పాశ్చాత్య తత్త్వములకు దేశమందు ప్రాబల్యము కలిగెను.

దీనికితోడు క్రైస్తవ మతమును ప్రచారముచేయు మిషనరీలు దేశమందు ప్రవేశించి వారి కుండు ధనబలమును హిందూమత ఖండనమునకును, హిందువులుగ నున్నవారిని క్రైస్తవ మతములో చేర్చుకొనుటకును వినియోగించిరి. దీని మూలమున తెలుగు జిల్లాలలో క్రైస్తవ మతము కొంతవరకు వ్యాపింపగలిగెను. అంతకు పూర్వము తెలుగు దేశమందు హిందూమతము కాక, మహమ్మదీయ మతమొక్కటే అల్పసంఖ్యాకుల మతముగ ఉండెడిది. బ్రిటిష్ పరిపాలన మంతరించునాటికి మరియొక అల్పసంఖ్యాక మతముగ క్రైస్తవముకూడ వ్యాప్తిగాంచెను.

విద్యాధికులలో కొందరు హిందూమతములోని లోపములను సవరించి దానిని పరిశుద్ధమైనదిగ చేయుటకు ప్రయత్నించిరి. బహుదేవతారాధన, విగ్రహారాధన మొదలైనవి ఇట్టి లోపములని వారు భావించిరి. ఈ విధముగ హిందూమతమును సంస్కరింప బూనుకొన్నవారిలో బ్రహ్మసమాజమునకు సంబంధించిన వారు తెలుగు దేశములో కొంతకాలము ప్రాధాన్యము వహించిరి.

పాశ్చాత్య విజ్ఞాన సంపర్కప్రభావము వలన మరియొక మార్పుకూడ కలిగెను. ఈ విజ్ఞానమునకు ప్రత్యక్ష ప్రమాణము ప్రధాన లక్షణమైన 'సైన్సు' ఆధారము. శ్రుతి, ఋషి వాక్యము, ఆత్మానుభూతి మొదలైన వానిని ఈ విజ్ఞానవేత్తలు ప్రమాణముగ అంగీకరింపరు. అందుచేత పాశ్చాత్య విజ్ఞానమందు ఆరితేరిన విద్యాధికులలో కొందరు నాస్తికులుగ ఉన్నారు, మరికొందరు మూలతత్వము ఒకటి యున్నను దాని స్వభావమును గుర్తించుటకు మానవునికి శక్తిలేదని వాదించువారు (అగ్నాస్టిక్స్). ఈ రెండు పక్షములవారి దృష్టి మానవజీవితము నంతను లౌకికదృష్టితో సాగించుటయే (సెక్యులరిజమ్) ప్రాజ్ఞతకు లక్షణమని వీరి సిద్ధాంతము. రాజకీయములకును, మతమునకును ముడిపెట్టరాదను సూత్రము దీని ఫలితమే. మతము, మత సంస్థలు, దేవాలయములు, పూజాపురస్కారములు, ఉత్సవములు, ఊరేగింపులు, జాతరలు మొదలైనవానిని త్యజించుటయే మానవ విముక్తికి మార్గమని వీరి తత్వము. ఇట్టి సిద్ధాంతములను ప్రతిపాదించువారు తెలుగుదేశములో ఉండుటకు బ్రిటిష్‌పాలన కాలములో ఏర్పడిన పరిస్థితులు కారణము.

ఇట్టి మార్పులు జరగుచున్న కాలములో హిందూమతమును, దేశీయ సంస్కృతిని బలపరచుటకు విద్యాధికులలో కొందరు గట్టి ప్రయత్నములు చేయుటకూడ జరగెను. ఇందుకై కొన్ని జిల్లాలయందు ప్రత్యేకప్రచార సమాజములు, హిందూ సమాజములు స్థాపింపబడెను. ఈ యుద్దేశముతోనే దివ్యజ్ఞాన సమాజమువారు కూడ కొంత కృషిచేసిరి. కాని మొత్తముమీద ఈ సంస్కృతి రంగములో ఇటీవలి కాలమున భిన్నమతములకు, తత్త్వములకు,



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సిద్ధాంతములకు, గొప్పసంఘర్షణ సంభవించెననువిషయము గుర్తింపదగియున్నది. తక్కిన రంగములలో క్రొత్తకు, పాతకు సంఘర్షణ జరగుచుండినట్లు సాంస్కృతిక రంగమందు కూడ ఇట్టిది కనబడుచున్నది. దేశమందు నూతన చైతన్యము వ్యాపించుచున్న దనుట కిది ప్రబల నిదర్శనము. మా. వెం. రం.

## స్వాతంత్ర్యోద్యమము

బ్రిటిష్ పరిపాలనాధికారమును నిర్మూలము గావించి స్వరాజ్యమును స్థాపించుకొనుటకు భారతీయులు సాగించిన ఉద్యమమే స్వాతంత్ర్యోద్యమము. ఇట్టి ఉద్యమము బయలుదేరుటకు పెక్కు కారణము లుండెను. వానిలో కొన్ని ముఖ్యముగ గుర్తింప దగియున్నవి. బ్రిటిష్ ప్రభుత్వము మొదటినుండి తుదివరకు పరాయి ప్రభుత్వముగనే ఉండెను. దాని ప్రధానోద్దేశము బ్రిటిష్‌వారి లాభము. తాము ఉన్నతజాతివా రనియు, భారతీయులు హీనజాతివా రనియు భావించి వారు దేశమును పాలించిరి. భారతీయు డెంత విద్యావంతుడైనను, మేధావియైనను, వ్యవహారదక్షుడైనను ఉన్నత పదవుల కనర్హుడని వారు భావించిరి. ఇంతకంటె అవమానకరమైన విషయ మింకొకటి యుండజాలదు. దక్షిణ ఆఫ్రికా మొదలగు విదేశములకు వెళ్లిన భారతీయుల నచ్చటివారు చులకనగ జూచుట కిదియే ప్రధానకారణము. ప్రజాప్రతినిధులతో కూడిన శాసనసభలను స్థాపించినను ప్రధాన విషయములం దట్టి సభల కధికార మీయరైరి. బ్రిటిష్ పరిశ్రమల పోటికి నిలబడలేక దేశీయ పరిశ్రమ లనేక మదృశ్యము లయ్యెను. వానిని పునరుద్ధరించుటకు కావలసిన చర్యలను బ్రిటిష్ వారు సకాలమున తీసికొనరైరి. అందుచేత ప్రజ లందరు వ్యవసాయ మొక్కదానిమీదనే ఆధారపడవలసివచ్చెను. కాని రైతులకు కావలసిన సదుపాయము లన్నిటిని వారు చేయరైరి. గ్రామ సీమలలో పన్నులబాధ, ఋణబాధ అధికమయ్యెను. ఫ్యాక్టరీలలోను, గనులలోను పనిచేయు కార్మికులకు కావలసిన సదుపాయములను కల్పించుటలో కూడ వారు తగిన శ్రద్ధ వహింపరైరి. ఇటువంటి లోపము లనేక ముండుటచేత దేశమందు స్వాతంత్ర్యోద్యమము బయలుదేరి క్రమముగ వృద్ధిగాంచెను.

స్వాతంత్ర్యోద్యమ మొకవిధముగ క్రీ. శ. 1905 లో ప్రారంభమై క్రీ. శ. 1920 నుండి మహాత్మ గాంధిగారి నాయకత్వమున తీవ్రరూపము ధరించి క్రీ. శ. 1947 లో ఫలప్రాప్తి గాంచెను.

క్రీ. శ. 1905 కు పూర్వము క్రీ. శ. 1857-58 లో ప్రథమ స్వాతంత్ర్యసమరము జరగెను. కాని అది ఫలవంతము కాని కారణమునను, అందు ఆంధ్రులు ఏలాటి పాత్రను వహించని కారణమునను దానిని గురించి యిచ్చట ప్రస్తావించ వలసినది లేదు.

క్రీ. శ. 1858 తర్వాత దేశమందు రాజకీయ చైతన్యము బీజరూపమం దుండెను. ఇదే కాలమున పాశ్చాత్యవిద్య కొంతవరకు దేశమందు వ్యాపించెను. దాని ఫలితముగ విద్యాధికులలో ఈ చైతన్యము మొలకెత్తి క్రీ. శ. 1885 లో కాంగ్రెసు స్థాపనకు దారి తీసెను. క్రీ. శ. 1885 మొదలు క్రీ. శ. 1905 వరకు కాంగ్రెసు మూలమున రెండు విధము లగు లాభములు చేకూరెను. వానిలో ఒకటి దేశమందు ఐకమత్యము వృద్ధిగాంచుట. రెండవది పరిపాలన విధానమందు ప్రభుత్వమువారు కొన్ని సంస్కరణములను గావించుట. ఏటేట జరగుచుండిన కాంగ్రెసు సమావేశములలో అన్ని రాష్ట్రములలోనివారు, అన్ని కులములకు, మతములకు, భాషలకు చెందినవారు పాల్గొనుటచేత వీ రందరిలోను తాము భారతీయు లను జాతీయభావము ప్రబలెను. పాశ్చాత్య నాగరికతకు ఆ కాలమున ప్రధానలక్షణములుగ నుండిన వ్యక్తి స్వాతంత్ర్యము, ప్రజాస్వామ్యము మొదలైన వానియొక్క ప్రభావమునకు వీ రందరు గురియగుటచేత ఈ భావము లన్నియు క్రమక్రమముగ దేశమం దంతట వ్యాపించెను. కాంగ్రెసు సమావేశములలో పరిపాలన విధానములోని లోపములను విమర్శించుటయు, వానిని తొలగించుటకు మార్గములను సూచించుటయు పరిపాటి అయ్యెను. ప్రభుత్వ చర్యలను విమర్శించుట ప్రజల హక్కులలో ప్రధానమైనదను విశ్వాసము దీనిమూలమున పెంపొందెను. ఇ దంతయు రాజకీయ చైతన్యము వృద్ధిగాంచుటలో విశేషముగ తోడ్పడి, తర్వాతి కాలపు స్వాతంత్ర్యోద్యమమునకు పునాదులు వేసెను.

తక్కిన రాష్ట్రములతోపాటు ఆంధ్రప్రాంతములోని వారును కాంగ్రెసు ఉద్యమమందు పాల్గొనిరి. ఆంధ్రు లనేకులు — రంగయ్యనాయుడు, ఆనందాచార్యులు, న్యాపతి సుబ్బారావు, కేశవపిళ్లె, గంజాం వెంకటరత్నం, కృత్తివెంటి పేర్రాజు, వరాహగిరి చోగయ్యగార్ల వంటి ప్రముఖులు — కాంగ్రెసు సమావేశములకు వెళ్ళుచు ఆంధ్రులలో జాతీయభావము రేకెత్తించిరి. వారిలో ఒకరైన పనప్పాకం ఆనందాచార్యులుగారు నాగపూరులో జరగిన పదవ సమావేశమునకు అధ్యక్షులై ఒక ఆంగ్లో ఇండియనులేకాక భారతీయు లందరు సైనిక స్వచ్ఛంద దళములలో చేర్చుకొనుటకు తగినవా రన్న విషయమును గురించి గంభీరముగ ఉపన్యసించిరి. న్యాపతి సుబ్బారావు పంతులుగారు కాంగ్రెసు వేదికనుండి అనేకవిషయములను గురించి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఉపన్యాసములు గావించి పేరు ప్రఖ్యాతులను సంపాదించిరి. ఇది గాక, కాంగ్రెసు నమూనాను అనుసరించి ఆంధ్ర జిల్లాలలో జిల్లా సంఘములు స్థాపింపబడి, అప్పు డప్పుడు వాని యాజమాన్యమున జిల్లా సభలు, తాలూకా సభలు జరగుట ఆచారమయ్యెను. ఈ సభలలో కాంగ్రెసు చేసిన తీర్మానములను బలపరచుట, స్థానిక సమస్యల పరిష్కారమునకు సూచనలు చేయుట ప్రధాన విషయములుగ నుండెను. వీనిమూలమున రాజకీయ పరిజ్ఞానము కొంత వరకు ప్రజలలో వ్యాపించెను.

ఒక్కొక్కప్పుడు కాంగ్రెసుతోగాని, జిల్లాసంఘములతో గాని సంబంధము పెట్టుకొనక రైతులు, తదితర వర్గముల వారు స్వతంత్రించి వ్యవహరించు చుండిరి. అధికారులు అన్యాయముగ ప్రవర్తించినప్పుడు సత్యాగ్రహముద్వారా వారి నెదుర్కొని వారి మూలమున కలిగిన చిక్కులను తొలగించుకొనుట సనాతన సంప్రదాయము. ఇట్టి సత్యాగ్రహ మొకటి క్రీ. శ. 1894 - 95 లో కృష్ణజిల్లాయందు జరగెను. ఆ సంవత్సరమున అధికారులు నీటి తీరువను నాలుగు రూపాయలనుండి అయిదు రూపాయలకు పెంచిరి. దానిని నిరసించుటకు జిల్లారైతులు ఏలూరులో గొప్ప సమావేశము జరపి, నీటి తీరువను తగ్గించినగాని వ్యవసాయ మెవ్వరును చేయరాదని తీర్మానించిరి. ఆ సందర్భమున గుడివాడ తాలూకాలోని రైతుసాహుంతులు కొందరు జైళ్లకు పెళ్ళుటకూడ జరగెను.

కాని క్రీ.శ. 1885 - 1905లో కాంగ్రెసుగాని, ఇతర సంఘములుగాని దేశమందుండి బ్రిటిష్ అధికారమును తొలగించి స్వాతంత్ర్యమునకై కృషి చేయలేదు. అప్పటివారు బ్రిటన్ భారతదేశముల మధ్య ఏర్పడిన రాజకీయ సంబంధము శాశ్వతముగ నుండుట లాభదాయకమని భావించుచుండిరి. భగవదిచ్ఛకూడ ఇట్టి దనియే వారి అభిప్రాయముగ నుండెను.

క్రీ. శ. 1905 లో కర్జన్ ప్రభువు నిరంకుశముగ బంగాళ రాష్ట్రమును రెండు రాష్ట్రములుగ విభజించుటతో కొందరు నాయకుల భావములు మారిపోయెను. అంతటితో 'వందే మాతరం' ఉద్యమమని పేరు గాంచిన స్వరాజ్యోద్యమము బయలుదేరెను. బంకించంద్ర చటర్జి రచించిన వందేమాతర గీతమును జాతీయగీతముగ అప్పటినుండి పాడుట ఆచారమయ్యెను. అందుచేతనే ఉద్యమమునకు వందేమాతరం ఉద్యమమను పేరు వచ్చెను. చిల్లర సంస్కరణముల వలన లాభము లే దనియు, ప్రజ లనుభవించుచుండు బాధలకు స్వరాజ్య మొక్కటియే తరణోపాయ మనియు, కాంగ్రెసు సమావేశములలో గంభీరోపన్యాసములు గావించి చర్చలు జరపి యుక్తాయుక్తములగు తీర్మానములుచేసి ప్రాధేయపడినంత మాత్రమున బ్రిటిష్‌వారు తొలగిపోరనియు, వారికి ఆర్థిక నష్టము కలిగించు చర్యలను తీసికొన్నప్పుడే వారు లొంగుదు రనియు, విదేశవస్తు బహిష్కారము స్వదేశవస్తువులను వాడుట ఈ చర్యలలో ప్రధానములనియు, ఇందు విషయమై ప్రజలలో ప్రబోధ మవసరమనియు, దానికి జాతీయ విద్యాలయములు ముఖ్యసాధనము లనియు వంగరాష్ట్రములోని నాయకులు నిశ్చయించుకొనిరి. అదేకాలమున 'స్వరాజ్యము నా జన్మహక్కు' అన్న నినాదమును మహారాష్ట్రములో బాలగంగాధర తిలక్ లేవదీసెను. దీని ప్రభావము క్రమక్రమముగ దేశమందంతట వ్యాపించెను. బిపిన్ చంద్రపాల్, లాలా లజపతి రాయ్, బాలగంగాధర తిలక్, అరవింద ఘోష మొదలైన వారు ఈ స్వరాజ్యోద్యమమునకు నాయకులైరి.

వందేమాతరం ఉద్యమముయొక్క ప్రభావము ఆంధ్రమం దంతటను వ్యాపించెను. దీనికి ప్రధానకారణము క్రీ. శ. 1907 లో బిపిన్ చంద్రపాల్ ఆంధ్రదేశమందు గావించిన పర్యటనమే. అతడు రాజమండ్రి, విజయవాడ, బందరు మొదలైన పట్టణములకు వచ్చి గంభీరోపన్యాసములు గావించి స్వరాజ్యమందును, దాని సాధనములందును ప్రజలను గాఢాభిమానులను జేసెను. రాష్ట్రమందు అపూర్వమైన రాజకీయ సంచలనము బయలుదేరెను. అనేకులు అధికారధిక్కారమును గావించిరి. వారందరిలో గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారు సుప్రసిద్ధులు. వీరు రాజమండ్రి ట్రెయినింగు కాలేజినుండి వెళ్లగొట్టబడిరి; తరువాత స్వరాజ్య పత్రిక నొకదానిని స్థాపించి అందులో ప్రభుత్వ విధానమును ఖండించుచు కొన్ని వ్యాసములను వ్రాసిరను నేరమునకై మూడు సంవత్సరములు కఠిన కారాగార శిక్షకు పాత్రులైరి.

క్రొత్తగా దేశమందు కలిగిన సంచలనము ఫలితముగ విదేశవస్తు బహిష్కారము విరివిగ జరగసాగెను. యువకులు కొందరు రాష్ట్రాంతరములకును, విదేశములకును వెళ్లి అగ్గిపెట్టెలు, పెన్సిళ్లు, మైనపు వత్తులు మొదలగు వస్తువులను చేయు విధమును నేర్చుకొని స్వదేశమునకు వచ్చి చిన్న చిన్న పరిశ్రమలను కొన్నిటిని ప్రారంభించిరి. స్వదేశ దీక్షను పూనినవారికి వస్తువులు లభింపజేయుటకై ముఖ్యమైన పట్టణములలో స్వదేశీ సరకులను అమ్ముటకై ప్రత్యేకములైన దుకాణములు నెలకొల్పబడెను. జాతీయ విద్యా వ్యాప్తికి విద్యాధికులు కొందరు అవ్వ టచ్చట జాతీయ విద్యాలయములను స్థాపించిరి. వీనిలో బందరు పట్టణమున కోపల్లె హనుమంతరావుగారు స్థాపించిన ఆంధ్ర జాతీయ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కళాశాల అగ్రగణ్యము. వీరు తమ ప్లీడరు పట్టాను చింపి బందరు కాలువలో పారవేసి, న్యాయవాది వృత్తిని వదలుకొని, యావజ్జీవము దేశసేవకై పాటుపడ నిశ్చయించుకొన్నవారిలో మొదటివారు. ప్రజలలో ఆధునిక విజ్ఞానమును వ్యాపింపజేయుటకు ఇదేకాలమున తీవ్ర ప్రయత్నము లనేకము జరగెను. క్రీ. శ. 1902లో కొండా వెంకటప్పయ్య, దాసు నారాయణరావుగార్లచే స్థాపితమై, తర్వాత కొన్ని సంవత్సరములకు ముట్నూరి కృష్ణరావుగారి సంపాదకత్వములోనికి వచ్చిన కృష్ణా పత్రిక ఈ సందర్భములో గుర్తించదగి యున్నది. ఇదిగాక 'నవయుగ' 'కేసరి' పత్రికలు, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి దేశభక్తి పూరితములగు రచనలు ఈనాటివే. ఇదే కాలమున ఇట్టి యుద్దేశములతోడ విజ్ఞానచంద్రికా గ్రంథమాల, ఆంధ్రభాషాభివర్ధనీ గ్రంథమాల మొదలైనవి అనేక గ్రంథములను ప్రచురింపసాగినవి.

ఈ సందర్భమున మరియొక విశేషముకూడ గమనింపదగియున్నది. క్రీ.శ. 1908 నాటికి దేశమందు మితవాదులు, అతివాదులు అను రెండు పక్షములు బయలుదేరెను. ఆంధ్రరాష్ట్రమందుకూడ నాయకులలో కొందరు — న్యాపతి సుబ్బారావు, మోచర్ల రామచంద్రరావు, బి. యన్. శర్మ, ఆమంచర్ల కృష్ణరావు, భూపతిరాజు వెంకటపతిరాజు మొదలైనవారు మితవాదిపక్షమును వహించిరి. యువకులైన కొండా వెంకటప్పయ్య, పట్టాభి సీతారామయ్య, ఉన్నవ లక్ష్మీనారాయణ, పింగళి లక్ష్మీనారాయణ, అయ్యదేవర కాళేశ్వరరావు మొదలైనవారు అతివాద పక్షములో చేరిరి.

ఇదే సమయమున బంగాళరాష్ట్రమందు బాంబుల ద్వారా విప్లవమును లేవదీయువారు కొందరు బయలు దేరిరి. వారిలో ఒకరు క్రీ. శ. 1908 లో ఆంధ్రరాష్ట్రమునకు వచ్చి, అతివాదులు కొందరిని కలసికొని తమ ఉద్యమములో చేరవలసినదని కోరిరి. కాని వీ రెవ్వరు అందులో చేరుటకు సమ్మతింపరైరి. అయినను పోలీసువారు వీరియెడల అనుమానము కలవారై కొన్ని సంవత్సరములవరకు వీరిని 'బాంబు ముఠా'లో చేరినట్లు ఊహించి వీరి చర్యలను కడు జాగ్రత్తతో పరిశీలించుచుండిరి.

క్రీ.శ. 1914 లో తిలక్ మహారాష్ట్రమునను, అనిబిసెంటు మద్రాసునందును 'హోమ్ రూల్' ఉద్యమమును ప్రారంభించిరి. దీని ఆశయముకూడ స్వరాజ్య సంపాదనమే. వా రిద్దరు కలిసి, దేశమందంతట ఉద్యమమును సాగించిరి. ఆంధ్రరాష్ట్రమున అనిబిసెంటును అనుసరించిన దివ్యజ్ఞాన సామాజికు లనేకు లుండిరి. వారిలో చాలమంది ఈ యుద్యమములో చేరిరి. వారుకాక, రాజకీయరంగమందు పాల్గొనుచుండిన మితవాదులు, అతివాదులుకూడ దానిలో చేరి తీవ్రమైన ప్రచారమును సాగించిరి. ఆ సందర్భమున ఆంగ్లేయ పరిపాలకుల దుర్నయములను వివరించుచు మాజీ న్యాయాధీశుడు యస్. సుబ్రహ్మణ్యయ్యరు అమెరికా అధ్యక్షుడు విల్సన్‌కు వ్రాసిన సుప్రసిద్ధ లేఖలో వీరిలో కొందరు సంతకము చేసిరి. ఈ విధముగ క్రీ. శ. 1905 - క్రీ. శ. 1920ల మధ్య సాగిన స్వరాజ్యోద్యమ, హోమ్ రూల్ ఉద్యమములు రెండింటియందును ఆంధ్రులు ప్రముఖ పాత్రను వహించిరని చెప్పవలసి యున్నది.

ఇదే కాలములో ఆంధ్రోద్యమము ప్రారంభమై కొంత వరకు వృద్ధి గాంచెను.

క్రీ. శ. 1919లో మహాత్మ గాంధి కాంగ్రెసు నాయకత్వమును వహించుటతో స్వాతంత్ర్యోద్యమ చరిత్రయందు నూతన శక మారంభ మయ్యెను. ఇదియే సత్యాగ్రహశకము. సైన్యములను సమకూర్చి బ్రిటిష్‌వారిని ప్రతిఘటించుట సాధ్యముకాక పోవుటయేకాక హింసతోకూడిన బల ప్రయోగము భారత సంప్రదాయమునకు విరుద్ధమన్న కారణమున వారు ప్రప్రథమములో రౌలట్ శాసనము పట్ల భారతీయు లందరికి కలిగిన అసంతృప్తిని వెలిపుచ్చుటకును, తరువాత పంజాబు దురంతములను ఖండించుటకును, మహమ్మదీయుల కలజడి కలిగించుచుండిన ఖిలాఫత్ సమస్యను పరిష్కరించుటకును ఉద్దేశించి తుదకు స్వరాజ్య సంపాదనమునకు సత్యాగ్రహ మొక్కటే అమోఘమైన అస్త్రమను నిశ్చయమునకు వచ్చిరి. ఈ సత్యాగ్రహమునకు రెండు అంగము లున్నవి: ఒకటి సహాయనిరాకరణము; రెండు నిర్మాణకార్యక్రమము. బ్రిటిష్‌వారి అధికారము దేశములో నిలబడి యుండుటకు ప్రజలు ఉద్యోగముల మూలమునను, పన్నులమూలమునను ఇతరవిధములను వారికి చేయుచుండు సహకారమే ప్రధానకారణ మనియు, ఇట్టి సహకారమును మానినయెడల ఆరువేల మైళ్ళ దూరమందుండి వచ్చినవా రొకనిముసముకూడ దేశమందు నిలబడుట సాధ్యముకా దనియు, సహాయనిరాకరణము సమగ్రముగ జరగినయెడల వారు అధికారమును వదలుకొనుటయు, ప్రజలకు స్వరాజ్యము లభించుటయు తప్ప దనియు వారు భావించిరి. ఈ సూత్రము ననుసరించి వారు క్రీ. శ. 1920 లో కలకత్తాయందు జరగిన ప్రత్యేకమైన కాంగ్రెసు సమావేశములో విద్యాలయములయొక్కయు, న్యాయస్థానముల యొక్కయు, శాసనసభల యొక్కయు బహిష్కారమును ప్రతిపాదించి దానికి కాంగ్రెసు ఆమోదమును



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పొందిరి. క్రమక్రమముగ శాసనోల్లంఘనము మొదలైన అంశములు కూడ ఈ కార్యక్రమములో ప్రవేశపెట్టబడెను. సహాయ నిరాకరణమునకు వారు ఎంత ప్రాధాన్యము నొసంగిరో అంతకంటె ఎక్కువ ప్రాధాన్యమును నిర్మాణకార్యక్రమమునకు నొసంగిరి. ప్రజలలో అదివరకుండిన లోపములు తొలగి, సత్యాగ్రహ సమరము నిరపాయముగ సాగుటకు కావలసిన ఆత్మబలము అర్థబలము అంగబలము సమకూరుటకును, స్వాతంత్ర్య సంపాదనానంతరము ప్రజ అందరి శ్రేయస్సుకు అది వినియోగపడుటకును నిర్మాణ కార్యక్రమము ముఖ్యసాధనమని వారు విశ్వసించిరి. రాట్నము వడకుట, ఖద్దరు ధరించుట, మద్యపాన నిషేధము, హిందూ మహమ్మదీయ సఖ్యత, హరిజనోద్ధరణము మొదలైనవి ఇందులోని అంశములు. క్రీ. శ. 1920 నుండి ఈ రెండు అంగములతో కూడుకొనిన సత్యాగ్రహమును వారు ఆచరణలోనికి తెచ్చిరి.

సత్యాగ్రహ సమరమందు మొదటినుండి ఆంధ్రు లత్యుత్సాహముతో పాల్గొనిరి. కొన్ని అంశములలో వారు తక్కిన భారతీయులకు మార్గదర్శకులైరి. దీని కంతటికి అంకురార్పణ మన్నట్లు క్రీ. శ. 1921 మార్చిలో అఖిల భారత కాంగ్రెసు కార్యవర్గసమావేశము విజయవాడలో జరగెను. అందు సంవత్సరము లోపల కోటి సభ్యులను కాంగ్రెసులో చేర్చుటకును సత్యాగ్రహ కార్యకలాపము నెరవేరుటకును 'తిలక్ స్వరాజ్య' నిధి అను పేర కోటి రూపాయలు సమకూర్చవలె ననియు, ఇరువదివేల చరఖాలు తయారు కావలె ననియు తీర్మానింపబడెను. సమావేశ కాలమున వేలకొలది ఆంధ్రులు మహాత్మ గాంధిని, తక్కిన నాయకులను సందర్శించి, వారి సందేశములను విని ఉద్రేకపూరితులై తమ తమ ఇండ్లకు మరలి సత్యాగ్రహ సమరములో ప్రవేశించిరి.

బహిష్కారసూత్రము ననుసరించి విద్యార్థు లనేకులు విద్యాలయములను వదలిరి. న్యాయవాదు లనేకులు తమ వృత్తులను మాని న్యాయస్థానములను బహిష్కరించిరి. క్రీ.శ. 1921-22 ఉద్యమములోనే కాక, తర్వాతి ఉద్యమములలో నాయకత్వము వహించిన వారిలో అనేకులు వీరే. అనేకులు ప్రభుత్వోద్యోగములను మాని ఉద్యమములో ప్రవేశించిరి. వీరిలో గ్రామాధికారులు చాలమంది ఉండిరి. అనేకులు గ్రామ గ్రామములకు వెళ్లి గంభీరోపన్యాసములు కావించి ప్రజలలో దేశాభిమానము, స్వార్థత్యాగము రేకెత్తునట్లు ప్రబోధము కావించి, పోలీసువారి లాఠీదెబ్బలకును, సైనికుల కాల్పులకును గురియై కారాగారశిక్షల ననుభవించిరి. అట్టివారిలో పురుషులతోపాటు స్త్రీలును ఎందరో ఉండిరి. ఉద్యమమందు పాల్గొని సమస్త కష్టనష్టము లనుభవించిన వారిలో అధికభాగము సామాన్య ప్రజలే.

వీని యన్నిటికంటె ఆంధ్ర దేశములోని రెండు సంఘటనలు దేశమంతటి దృష్టిని ప్రత్యేకముగ ఆకర్షించగలిగెను. వానిలో ఒకటి ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి ఆధ్వర్యమున చీరాల పేరాలవారు సాగించిన సత్యాగ్రహము. యూనియన్‌గా ఉండిన ఈ రెండు గ్రామములను మునిసిపాలిటీగా ప్రభుత్వము మార్చుటను ప్రజ అందరు నిరసించి, దానిని ప్రతిఘటించుటకై ఇరువదివేల జనము ఇండ్లను, వాకిండ్లను వదలి ఒక సంవత్సరము ఊరి బయట పూరిపాకలు వేసికొని నివసించుచు సమస్త కష్టములను అనుభవించిరి. దేశమందు మరెక్కడనుకూడ ఇంతటి సమష్టిగ ప్రజలు స్వార్థత్యాగమును ప్రదర్శించి యుండలేదు. గోపాలకృష్ణయ్యగారు ఈ యుద్యమమును సాగించుటయే కాక రామదండునుగూడ నిర్మాణము గావించిరి.

ఆంధ్ర దేశములోని రెండవ సంఘటన పెదనందిపాడు, దాని పరిసరములలోని నూరు గ్రామములవారు సాగించిన పన్నుల నిరాకరణోద్యమము. ఇది ప్రారంభమగునాటికి జిల్లాలోని ప్రముఖ నాయకు లందరు కారాగారములలో బంధింపబడి యుండిరి. కాని అంతకు ముందు జరగిన ప్రచార ప్రభావమున ప్రజలు ధైర్య సాహసములతోడను, పట్టుదలతోడను పన్నులను చెల్లింప నిరాకరించిరి. ఈ యుద్యమమును గురించి కొండా వెంకటప్పయ్యగారు తమ స్వీయ చరిత్రలో ఈ విధముగ వివరించియున్నారు. '(రైతులు) జప్తు చేయుటకు వీలులేకుండ విలువగల వస్తువులను భద్రము చేసికొనిరి. ధాన్యముగాని, తలుపులు మంచములు మొదలగు సామానులుగాని జప్తు చేసినను వానిని వేలము వేయుటకై తాలూకా కచ్చేరికి మోసికొనిపోవువారు దొరకరైరి. (పోలీసులు) ప్రజలను భయపెట్టిరి. దౌర్జన్యము చేసి, పన్నులు వసూలుచేయవలెనని యుద్దేశించి, చెన్నపట్టణమునుండి సైనిక దళమును మందు గుండు సామానులతోను, మర ఫిరంగులతోను గుంటూరు పట్టణమునకు రప్పించిరి; కొంత సేన పెదనందిపాడుకు వెలుపల చింతల తోపులో విడిసియుండి, గ్రామములవెంట తిరుగుచుండెను. తాము వచ్చునప్పటికి ప్రతి గ్రామములోను వీథులవెంట శాంతి సైనికభటులు వరుసలు తీరి నిలిచియుండుట గాంచి సైనికులు వారిపై ఉమిసియు, తిట్టియు అవమానపరచుచుండిరి. కాని శాంతి సైనికులు శాంతము వీడక అంతయు భరించుచుండిరి. జిల్లా కలెక్టరు వచ్చి 'మునసబు ఇల్లు ఎచ్చట నున్న'దనిన ముందుకు పోయి విచారించుకొనుమని చెప్పువారలేకాని



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తగిరైన సమాధానము చెప్పెడువా రెవ్వరును లేరైరి. ఆ యూళ్లలో తిరుగుచుండిన సర్కారు ఉద్యోగులకు మంచి నీళ్ళు పుట్టవాయెను........'. ప్రజలపై సైనికులు, డిప్యూటి కలెక్టరు మొదలయిన అధికారులు చేసిన దౌర్జన్యము ఇంతంత కాదు. కాని ప్రజలు ఏమాత్రము చలింపక, కాంగ్రెసుయొక్కయు, మహాత్మా గాంధియొక్కయు ఆదేశము వచ్చునంతవరకు పన్నులను చెల్లింపకుండిరి. ఇచ్చటి నుండి జిల్లాలోని ఇతర ప్రాంతములకును, తక్కిన జిల్లాలకును ఈ యుద్యమము వ్యాపించు సూచనలుకూడ కనబడెను. ఇట్లుండగా ఉత్తర భారతములో కొన్ని విపరీత పరిస్థితు లేర్పడుటచేత మహాత్మా గాంధి సత్యాగ్రహోద్యమమును ఉపసంహరించెను. పెదనందిపాడు ప్రజలు నిరుత్సాహపడిరి. కాని నాయకుల నతిక్రమించుట కిష్టములేనివారై పన్నులను చెల్లించివేసిరి. ఆ కాలమున మద్రాసుకు గవర్నరుగ నుండిన విల్లింగ్డన్ ప్రభువు తర్వాత బ్రిటిష్ పార్లమెంటులో ఏదో ఒక సందర్భమున మాటలాడుచు గుంటూరు జిల్లా పన్నుల నిరాకరణోద్యమము భారతదేశమునందలి బ్రిటిష్ ప్రభుత్వపు పునాదులను కదలించివేసెనని చెప్పెను.

బహిష్కార ఉద్యమముతోపాటు నిర్మాణ కార్యక్రమముకూడ ఆంధ్రరాష్ట్రమందు చక్కగా జరగెను. రాట్నముపై నూలు వడకువారి సంఖ్యయు, ఖద్దరు ధరించువారి సంఖ్యయు పెరిగెను. తిలక్ నిధికి పట్టణములలోనివారు, పల్లెలలోనివారు అంచనాకంటె ఎక్కువగ విరాళముల నిచ్చిరి. స్త్రీలు సంతోషపూర్వముగ తమ ఆభరణములను కానుకలుగ నొసంగిరి. ఏలూరు మొదలైన పట్టణములలో జాతీయ విద్యాలయములు స్థాపింపబడినవి. సీతానగరము, చాగల్లు, పల్లిపాడు మొదలయిన ప్రదేశములలో సబర్మతి ఆశ్రమమువంటి ఆశ్రమములు నెలకొల్పబడినవి. గాంధితత్వ ప్రచారమున కివి ఎంతయు తోడ్పడినవి. అన్నిటికంటెను మద్యపాన నిషేధమును గురించిన ప్రబోధము ప్రశంసింపదగినదయ్యెను. ఇందుకుగాను ప్రచారకులు జట్లు జట్లుగ బయలుదేరి పాటలు పాడుచు, భజనలు చేయుచు, ఉపన్యాసముల నిచ్చుచు కల్లు దుకాణములను ఏలము వేయుచోట్ల కన్నిటికి వెళ్లి ఏలముపాటలు పాడదలచినవారిని పాడకుండునట్లు ప్రోత్సహించిరి. ఈ కారణమున ప్రభుత్వమువారి ఆదాయము చాలవరకు పడిపోయెను. ఒక జిల్లాలో ఏలములో పాట పాడేవారే లేక వంద్రెండు రూపాయల ఆదాయము మాత్రమే సర్కారువారికి లభించెను. ఆ జిల్లాయొక్క ప్రఖ్యాతి దేశమందంతట వ్యాపించెను. ఆంధ్రులలో ఒకరై బందరు జాతీయ కళాశాలలో పనిచేయుచుండిన పింగళి వెంకయ్యగారు తయారుచేసిన త్రివర్ణ పతాకము కొలది మార్పులతో కాంగ్రెసు పతాకముగ గ్రహింపబడెను. ఇదియే మరి కొన్ని మార్పులతో మన జాతీయపతాక మయ్యెను.

క్రీ. శ. 1922 లో సత్యాగ్రహోద్యమ ఉపసంహారణము జరగిన తరువాత తక్కిన రాష్ట్రములతోపాటు ఆంధ్ర రాష్ట్రమున కూడ రాజకీయ చైతన్యము స్తంభించియుండెను. కాని ఉద్యమ కాలములో ఆంధ్రులయందు జనించిన స్వరాజ్య తృష్ణయు, దానిని సాధించుటయందు వారిలో జనించిన ఉత్సాహమును తగ్గలేదు. నిర్మాణ కార్యక్రమమును, అందులో ముఖ్యముగ ఖద్దరు వ్యాప్తియు యథాప్రకారము సాగుచుండెను. ఖద్దరు ఉద్యమమునకై ధనము సేకరించుటకు క్రీ. శ. 1929 లో మహాత్మా గాంధి ఆంధ్ర దేశపు జిల్లాలలో పర్యటనము కావించినప్పుడు ప్రజలు భారి కొసంగిన సుమారు రెండున్నర లక్షల రూపాయల విరాళమే దీనికి తార్కాణము. క్రీ. శ. 1928 లో జరగిన నాగపూరు జెండా సత్యాగ్రహములోను, 1927 నాటి మద్రాసు నీల్ సత్యాగ్రహములోను ఆంధ్రులు ప్రధాన పాత్ర వహించిరి.

క్రీ. శ. 1927 లో బ్రిటిష్ ప్రభుత్వమువారు స్వరాజ్యమునకు భారతీయు లెంతవర కర్హులో పరీక్షించుటకు సైమన్ కమిషనును నియమించిరి. దానితో దేశమందు రాజకీయ సంచలనము తిరిగి ప్రారంభ మయ్యెను. భారతీయ ప్రతినిధి ఒక్కడుకూడ లేని కమిషనును బహిష్కరించుటకు అన్ని పార్టీలవారు తీర్మానించిరి. కమిషన్ మద్రాసుకు వచ్చినప్పుడు జరగిన బహిష్కరణ సంఘటనలో టంగుటూరి ప్రకాశంగారు నాయకత్వము వహించి, 'ఆంధ్ర కేసరి' బిరుదమునకు తగినవారైరి.

క్రీ. శ. 1929 లో కాంగ్రెసు లక్ష్యము సంపూర్ణ స్వాతంత్ర్యమని లాహోరు సమావేశములో తీర్మానింపబడెను. దానిని సాధించుటకు మహాత్మా గాంధి ఉప్పు సత్యాగ్రహమని జగత్ప్రసిద్ధి గాంచిన ఉద్యమమును ప్రారంభించెను. క్రీ. శ. 1930 మార్చి నెల 12 దీన ఉప్పు చట్టము నుల్లంఘించుటకై సబర్మతి ఆశ్రమమునుండి సముద్ర తీరములోని దండిగ్రామమునకు వారు బయలుదేరినపుడు వారి డెబ్బది మంది శిష్యులలో ఆంధ్రు లుండుట గమనింపదగినది.

గాంధి మహాత్ముని ఆదేశానుసారము వెంటనే తెలుగు జిల్లా లన్నిటియందు 'ఉప్పు సత్యాగ్రహ' సన్నాహములు జరగెను. కుగ్రామములలోకూడ కాంగ్రెసు సంఘములు స్థాపింపబడెను. వేలకొలది వాలంటీర్లు ఉద్యమములో చేరిరి. వారికి తగిన శిక్షణ నిచ్చుటకు శిబిరము లేర్పాటు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చేయబడెను. వారిని నడపుటకు దళాధిపతులు నియమింప బడిరి. ఏయే జిల్లాలలో ఏయే ప్రదేశములందు ఉప్పు చట్టము నుల్లంఘించి ఉప్పు చేయవలసినది నిర్ణయింప బడెను. సన్నాహము లన్నియు పూర్తియైన తరువాత నిర్ణీత ప్రదేశములకు జట్లు జట్లుగ స్త్రీలు, పురుషులు వెళ్లి చట్టమునకు విరుద్ధముగ ఉప్పును తయారుచేసి, దానిని పొట్లములుగ గట్టి బజారులలో అమ్మసాగిరి. ధనికులు, సామంతులు అట్టివారికి కావలసిన సాయమును చేసిరి. ఉద్యమములో ప్రవేశించినవారు కొందరు తాటి చెట్లను, ఈత చెట్లను నరికివేయుటయందును, విదేశ వస్త్రములను సేకరించి కుప్పలు కుప్పలుగ వీథులలో కాల్చివేయుట యందును శ్రద్ధవహించిరి. ప్రభుత్వమును లక్ష్యపెట్టువా రెవ్వరును లేరైరి. సమర మంతయు వీరావేశముతో సాగుచుండెను.

దీని నంతను చూచి అధికారులు నిర్ఘాంతపడి ఉద్యమము నణచుటకై రాక్షస కృత్యములలోనికి దిగిరి. నాయకులను, వారి అనుచరులను లాఠీలతో కొట్టి, నానాబాధలు పెట్టి వందలు వందలుగ జైళ్ళకు పంపిరి. జైళ్ళలో వారిని హింసించిన విధము వర్ణనాతీతము. ఆ కాలపు జైళ్ళు 'భూలోక నరకము'లని చెప్పదగిన వయ్యెను. జిల్లాలలో నొకదానియందు అధికారులు ప్రదర్శించిన రాక్షసత్వ మీ క్రింది విధముగ అనుభవజ్ఞులు వివరించియున్నారు : 'జిల్లాయం దంతటను అలముకొనిన ఈ యుద్యమము నణచుటకు గవర్నమెంటువారికి తమ అర్డినెన్సులు చాలలేదు. పోలీసు భటులు గ్రామముల వెంటబడి, ఖద్దరు కట్టుకొన్న వారిని, గాంధి టోపి పెట్టుకొన్నవారిని లాఠీలతో బాదియు, గాంధి పటములను, దేశనాయకుల పటములను, జెండాలను ఊడబెరికి చింపిపారవేసియు, తగులబెట్టియు, ఖద్దరు దుకాణములను బ్రద్దలుకొట్టియు, గ్రంథాలయములలోని పుస్తకములను విరజిమ్మి కొన్నిటిని మంటలో వేసియు, రాట్నములను విరుగగొట్టియు సామాన్య ప్రజలను దద్దరిల్ల జేసిరి'. కొన్ని జిల్లాలలో సత్యాగ్రహములో పాల్గొన్న రైతుల భూములకు రెవిన్యూ అధికారులు నీరుకూడ ఇచ్చుట మానిరి. దానిపై హెచ్చు పెనాల్టి శిస్తులు విధించుటకూడ జరగెను. పోలీసువారి ప్రవర్తన ఎంత ఘోరముగ నుండినను ప్రజలు కొంచెముకూడ చలింపరైరి.

క్రీ. శ. 1931 మార్చి 4 తేదిన గాంధీ - ఇర్విన్ సంధి జరగిన కారణమున ఉద్యమము నిలిపివేయబడెను. లండనులో రెండవ పర్యాయము సమావేశము కానున్న రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సులో ఎట్లయినను మహాత్మా గాంధి పాల్గొనునట్లు చేయుటకై ఈ సంధికి బ్రిటిషువారు పూను కొనిరి. వారు లండనుకు వెళ్ళిన తరువాత సంధి షరతులకు విరుద్ధముగ అధికారులు ప్రవర్తింపసాగిరి. సత్యాగ్రహమందు పాల్గొనినవారిపై క్రోధము దీర్చుకొను చర్యలలోనికి దిగిరి. దీని నంతను గమనించి, స్వాతంత్ర్య సమర పునరారంభము తప్పక జరగునన్న భావముతో ఆంధ్ర నాయకులు కాంగ్రెసు సంఘములను బలపరచి, ఎక్కువమంది సభ్యులను చేర్చి, కల్లుదుకాణములయొక్క, బట్టల దుకాణముల యొక్క 'పికెటింగు'ను సాగించుచు, స్వరాజ్య సందేశమును ప్రజలకు బోధించుచు అప్రమత్తులై ఉండిరి. డిసెంబరు 28 తేదిన మహాత్ముడు రిక్త హస్తములతో లండనునుండి బొంబాయి చేరెను. ఎట్టి సంప్రతింపులకు ప్రభుత్వమువా రంగీకరించ నందున క్రీ. శ. 1932 జనవరి 3వ తేదిన శాసనో ల్లంఘనముతో కూడిన స్వాతంత్ర్య సమరమును మూడవ పర్యాయము మహాత్ముడు మరింత ముమ్మరముగ ప్రారంభించి సాగించెను.

క్రీ.శ. 1932 - 34 లో ఆంధ్రులు పూర్వముకంటె ఎక్కువ ధైర్య సాహసములను, త్యాగశీలతను ప్రదర్శించిరి. శాసనోల్లంఘనము గావించి, సమావేశములలో పాల్గొని, లాఠీ దెబ్బలు తిని, జరిమానాలు పడి, ఆస్తులు పోగొట్టుకొని, జైళ్ళకు వెళ్ళి, దానిమూలమున దీర్ఘ వ్యాధిగ్రస్తులై బాధపడినవారి సంఖ్య క్రీ. శ. 1930 - 31 లోని సంఖ్య కంటె రెండు మూడింతలు ఎక్కువగ పెరిగెను. అధికారుల యొక్కయు, పోలీసులయొక్కయు అత్యాచారములు మితిమీరెను. అసంఖ్యాకులగు స్త్రీలు ఉద్యమములో ప్రవేశించుటచేత, వారి నణచుటకు ఆడుపోలీసులను పెట్టుటయే కాక, వారిని కొట్టుటకు కొన్నిచోట్ల రోజుకూలి నిచ్చి ప్రత్యేకముగ కొందరు స్త్రీలను నియమించిరి. స్త్రీలను పెట్టుటకు జైళ్ళు చాలకపోవుటచేత వారిని జైళ్ళకు పంపక, 'ఇతర ఉపాయములచే వెనుకకు నెట్టివేయ జూచిరి. కారపు నీళ్ళను, రంగునీళ్ళను, జలదారులలోని మురికి నీళ్ళను బక్కెట్లతోను, కొయ్య చిమ్మనగొట్టములతోను స్త్రీల ముఖములమీదను, కళ్ళలోను, ముక్కులలోను కొట్ట సాగిరి. కొందరిని 'లారీ'లలో నెక్కించి రాత్రిపూట దూరముగ ఎక్కడనో అడవులలో వదలి వచ్చుచుండిరి'. కాని బాధ లన్నిటిని సహించి, గుంపులు గుంపులుగ ప్రజలు ఉద్యమములో ప్రవేశించుట మానరైరి. జైలు భయము, లాఠీ దెబ్బల భయము, ఆస్తులు పోవునన్న భయము తీరిపోయెను.

కాంగ్రెసు అక్రమ సంఘమని ప్రకటించినను అధికారుల కండ్లలో దుమ్ము కొట్టి ఏ తీరుననో ఢిల్లీ పట్టణమందు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కాంగ్రెసు సమావేశము జరగినట్లే ఆంధ్రరాష్ట్ర మహాసభ పోలీసువారి ఎరుక లేక గుంటూరులో సమావేశ మయ్యెను.

ఈవిధముగ రెండు సంవత్సరముల కాలము జరగిన సంకుల సమరము క్రీ. శ. 1934 ఏప్రిలులో ఉపసంహరింప బడెను.

క్రీ. శ. 1934 మొదలు క్రీ. శ. 1941 వరకు స్వాతంత్ర్యోద్యమము సంగ్రామ రూపమును ధరించుట మానెను. కాంగ్రెసు నాయకులు ప్రభుత్వముతో సహకరించి, క్రీ. శ. 1935 వ సంవత్సరపు చట్టము ననుసరించి ఏర్పడిన పరిపాలన విధానములో మంత్రి పదవులను స్వీకరించి కొంతకాల మధికారములో నుండిరి. కాని క్రీ. శ. 1939 లో ప్రారంభమైన రెండవ ప్రపంచయుద్ధ ఫలితముగ విపరీతపరిస్థితు లేర్పడగా కాంగ్రెసువారు మంత్రిపదవులకు రాజీనామా లిచ్చి ప్రభుత్వ చర్యలను విమర్శింప సాగిరి. ఇట్లు కొంతకాలము జరగిన తర్వాత మహాత్ముడు మరి యొక పర్యాయము — ఇది అఖరు పర్యాయము — సత్యాగ్రహమును సాగించి స్వరాజ్యమును తప్పక సంపాదించుటకు నిశ్చయించెను. దీని ననుసరించి క్రీ. శ. 1941 లో ఆయన వ్యక్తి సత్యాగ్రహమును ప్రారంభింపగా, ఆయన అనుమతిని పొంది ఆంధ్రు లనేకు లందు పాల్గొనిరి. వ్యక్తి సత్యాగ్రహము వలన విస్తారలాభము లేదని క్రమక్రమముగ మహాత్ముడు గ్రహించి, భారీయెత్తున సమష్టి సత్యాగ్రహమును ప్రారంభింపదలచి క్రీ. శ. 1942 లో దానికి ప్రాతిపదికగా 'క్విట్ ఇండియా' నినాదమును లేవదీసెను. 'క్విట్ ఇండియా' అనగా 'ఇండియా దేశమును వదలిపెట్టి వెంటనే మీరు (బ్రిటిష్‌వారు) వెళ్లిపొండి' అని అర్థము. బ్రిటిష్‌వారు వెంటనే వెళ్ళిపోయిన యెడల దేశమందు అరాజక పరిస్థితు లేర్పడి ప్రమాదములు సంభవించునని కొందరు ఆక్షేపణ గావించిరి. కాని బ్రిటిష్ పరిపాలనముకంటె అరాజకమే దేశమునకు మేలు కలిగించునని మహాత్ముడు వాదించి ఆ విషయమై బలమైన ప్రచారము చేసెను. తుదకు, కాంగ్రెసు ప్రముఖులు వారితో ఏకీభవించిరి. క్రీ. శ. 1942 ఆగస్టు 8 వ తేదీన జరగిన అఖిల భారత కాంగ్రెసు కమిటీవారు 'క్విట్ ఇండియా' తీర్మానమును గావించి, బ్రిటిష్‌వారు అందుకు సమ్మతించని యెడల సత్యాగ్రహమును సాగించుటకు నిశ్చయించిరి.

బ్రిటిష్ ప్రభుత్వము కాంగ్రెసు ధోరణి నంతను అంతకు ముందే గ్రహించి, వెంటనే తమ అధికారమును వదలుకొనుటకు బదులు, మహాత్మా గాంధిని, ఇతర అఖిలభారత కాంగ్రెసు నాయకులను, రాష్ట్ర నాయకులను కారాగారములందు బంధించిరి. ఉద్యమము ప్రారంభము కాకముందే నాయకులను బంధించిన యెడల ఉద్యమము తలయెత్తక చల్లారి పోవునని వారు భ్రమపడిరి. కాని ప్రజ లట్లు చేయక మహత్తర విప్లవమును ప్రారంభించిరి. ఇదియే చరిత్రాత్మకమైన 'ఆగస్టు విప్లవము'. ఇది ఇంతకు ముందు జరగిన సత్యాగ్రహములవలె శాంతియుతము గాక, పాశ్చాత్య విప్లవ విధానములవలె విధ్వంసకచర్యలతో కూడిన దయ్యెను. ఈ విపరీత పరిణామము నాయకులను బంధించుట వలన కలిగెను.

ఈ పర్యాయము సత్యాగ్రహమును భారీ యెత్తునను, ముమ్మరముగను సాగింప నెంచి ఆంధ్రరాష్ట్ర నాయకులు సత్యాగ్రహు లనుసరింప దగిన కార్యక్రమ మొకదానిని జూలై నెలలో నిర్ణయించి యుండిరి. అందు అయిదు ప్రధానాంశము లుండెను. అవి (1) కల్లు దుకాణములను, బట్టల దుకాణములను పికెటింగు చేయుట; (2) తాటి చెట్లను, ఈత చెట్లను నరికివేయుట; (3) ప్రభుత్వమునకు ముందుగా తెలియపరచి టెలిగ్రాఫ్, టెలిఫోన్ తీగెలను త్రెంపివేయుట; (4) సైనికులను ఉద్యోగములు మానుడని పికెటింగు చేయుట; (5) పన్నులు చెల్లింపకుండుట. ఏ పరిస్థితులలో కూడ రైలు పట్టాలను ఊడబెరకరాదని వారు నిశ్చయించిరి. దీని నంతను స్పష్టపరచుచు రాష్ట్ర కాంగ్రెసు అధినేతలు ఒక లేఖను (దీనికే 'ఆంధ్రా సర్క్యులర్' అను పేరు ప్రచారములోనికి వచ్చెను) జిల్లా కాంగ్రెసువారికి పంపిరి. కాని దీని ప్రకారము ఉద్యమమును నడపుటకు నాయకులు లేని కారణమున ఉద్రేకపూరితులైన ప్రజలు విధ్వంసక చర్యలలోనికి దిగిన వారైరి.

నాయకులను నిర్బంధించిరను వార్త తెలియగనే ప్రజ లచ్చటచ్చట తిరుగబాటులు చేసి రైలుబండ్లను, రైలు స్టేషన్లను తగులబెట్టిరి. కొన్ని ప్రదేశములలో పోలీసు స్టేషనులమీదను, కచ్చేరిలమీదను ధాడిచేసిరి. కొన్ని పట్టణములలో బజారులు దోపిడి చేయబడెను. అచ్చటచ్చట టెలిగ్రాఫ్, టెలిఫోన్ తీగెలు త్రెంపబడెను. ఇవిగాక విద్యార్థుల సమ్మెలు, కార్మికుల సమ్మెలు, అధికారుల ఉత్తరువులకు విరుద్ధముగ సమావేశములు జరపుట, కల్లు దుకాణములయొక్కయు, బట్టల దుకాణములయొక్కయు పికెటింగు మొదలైనవి సర్వసాధారణ మయ్యెను. ఈ చర్యలలో చాలభాగము ఆగస్టు, సెప్టెంబరు నెలలలో జరగెను.

ఉద్రిక్తులైన ప్రజల నణచుటకు అధికారులు, పోలీసులు, సైనికులు క్రౌర్యముతో కూడిన అత్యాచారము లనేకము కావించిరి. గుంటూరు, తెనాలి, భీమవరము మొదలైన పట్టణములలో సమావేశములు చెదరగొట్టుటకు తుపాకులను



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కాల్చి ప్రాణ నష్టము కలిగించిరి. లాఠీదెబ్బలను గురించి ప్రత్యేకముగ చెప్పవలసినది లేదు. అనుమానాస్పదులన్న కారణమున అనేకుల ఇండ్లు సోదా చేయబడెను. అధ్యక్షులు అనుమానాస్పదు లగుటచేత కొన్ని జిల్లాబోర్డు ఆఫీసులకు కూడ ఇదే గతి పట్టెను. అనేక గ్రామములందు సమష్టి జరిమానాలు విధింపబడెను. నేరము చేయనివారనేకులు అనుమానముపై పట్టి బంధింపబడిరి. ప్రజలను భయభ్రాంతులను చేయుటయే ప్రధానోద్దేశముగ పెట్టుకొని అధికారు లందుకు కావలసిన చర్యల నన్నిటిని తీసికొనిరి.

తుదకు పశుబల మత్యధికముగ నుండిన ప్రభుత్వము విప్లవము నణచివేయ గలిగెను. కాని వారికి కలిగిన విజయము తాత్కాలికమే. విప్లవమునుండి వారు రెండు గుణపాఠములను నేర్చుకొనిరి. నాయకులు లేకున్నను ప్రజలు విప్లవమును సాగించుటకు సమర్థులని వారు గ్రహించిరి. ఈ విప్లవములు శాంతియుతములు గాక సర్వనాశకరములుగ పరిణమించునవి యనుసత్యమును గూడ వారు గ్రహించిరి. దీని ఫలితముగ భారతదేశ స్వాతంత్ర్యము పట్ల బ్రిటిష్‌వారి వైఖరి మారెను. తాము అధికారమును వదలుకొని ప్రభుత్వమును భారతీయుల పరముచేయుటయే ప్రాజ్ఞత అను నిశ్చయములోనికి వారు వచ్చిరి.

రెండవ ప్రపంచయుద్ధములో వారికి విజయము వచ్చునన్న నమ్మకము క్రీ.శ. 1943 లో పూర్తిగ కలిగెను. అటుపైన వారు క్రమక్రమముగా మహాత్ముని, ఇతర నాయకులను కారాగార విముక్తులను కావించిరి. తరువాత బ్రిటన్‌లో జరగిన ఎన్నికలందు సామ్రాజ్యవాదులైన కాన్‌సర్వేటివ్ పక్షమువారు ఓడి లేబరు పక్షమువారు విజయము గాంచిరి. క్రొత్తగ ఏర్పడిన లేబరుప్రభుత్వము భారతదేశ పరిస్థితులను పూర్తిగ అవగాహనము చేసికొని, బలప్రయోగముచే దాని పరిపాలనను నిర్వహించుట సాధ్యము కాదని గ్రహించి కాంగ్రెసు నాయకులతో సంప్రతింపులు జరపి అధికారమును వారి హస్తగతముచేసి వెళ్ళిపోవుట కంగీకరించెను. ఆ యంగీకారము ననుసరించి 1947 అగస్టు 15 తేదీన వారు వెళ్ళిపోయిరి. దేశము సర్వస్వాతంత్ర్యము కలది అయ్యెను. నలుబది సంవత్సరములుగ స్వాతంత్ర్యోద్యమమందు అత్యుత్సాహముతో పాల్గొనిన ఆంధ్రులు ఆనందభరితులైరి.

మా. వెం. రం.

## ఆంధ్రోద్యమము

**బ్రిటిష్ ఆంధ్రము:** స్వాతంత్ర్యోద్యమము బయలుదేరిన కాలముండే ఆంధ్రోద్యమముకూడ ప్రారంభమయ్యెనని ఇదివరకే చెప్పబడినది. ఆంధ్రుల ప్రత్యేక వ్యక్తిత్వమును నిలబెట్టుటయు, వారి సర్వతోముఖాభివృద్ధికి కావలసిన సాధన సామగ్రిని సంపూర్ణముగ సమకూర్చుకొని వినియోగించు కొనుటయు ఈ యుద్యమముయొక్క ప్రధానోద్దేశములు. వీనిని సాధించుటకు ప్రత్యేక ఆంధ్రరాష్ట్రము ముఖ్యసాధన మని ఉద్యమమును ప్రారంభించిన వారు మొదటినుండియు భావించియుండిరి. ప్రత్యేక రాష్ట్రము సిద్ధించిన మొదల తక్కిన ఆశయము లన్నియు సులభముగ సాధింపవచ్చునన్న గట్టి నమ్మకము కలిగినవారగుటచేత వారు తమ దృష్టిని ఎక్కువగ రాష్ట్రనిర్మాణ ప్రయత్నమందు కేంద్రీకరించిరి.

బ్రిటిష్‌వారు భారతదేశమును జయించుటకు మొదలిడినప్పుడు వారికి దేశమందు మద్రాసు, కలకత్తా, బొంబాయి నగరములు మూడు మాత్రమే ప్రధాన పరిపాలన కేంద్రములుగ నుండెను. ఆ కారణమున వారు జయించిన ప్రదేశములలో కొన్ని మద్రాసుయొక్కయు, కొన్ని కలకత్తాయొక్కయు, కొన్ని బొంబాయియొక్కయు పరిపాలనలోనికి వచ్చి మూడు ప్రముఖ రాష్ట్రము లేర్పడెను. ఈ యేర్పాటు ఒక సిద్ధాంతమునుగాని, సూత్రమునుగాని అనుసరించినదికాదు. అందుచేత ప్రతిరాష్ట్రమందు భిన్న భాషలు మాటాడువారు, భిన్న సంస్కృతులు కలవారు కలిసియుండిరి. మద్రాసురాష్ట్రములో ఆంధ్రులు, తమిళులు, కర్ణాటకులు, మలయాళీలు కలిసియుండుట కిదియే కారణము. ఈ విధానము వలన ప్రజలదృష్ట్యా చాల చిక్కులు, నష్టములు సంభవించెను. వానిని పోగొట్టుకొనుటకు భాషాప్రయుక్త రాష్ట్రములు ఉత్తమసాధనమన్న విషయమును మొట్టమొదటిమారు గ్రహించి ప్రచారము గావించినవారు ఆంధ్రోద్యమమును ప్రారంభించినవారే.

ఆంధ్రోద్యమమునకు గుంటూరు, కృష్ణామండలములు జన్మస్థానములు. క్రీ.శ. 1903-04 ప్రాంతమున గుంటూరులో యువజన సాహితీసమితి స్థాపింపబడెను. అందు సారస్వతవిషయములేకాక సాంఘిక, ఆర్థిక, రాజకీయ విషయములు కూడ చర్చింపబడుచుండెడివి. ఆ చర్చల సందర్భములో పరిపాలనమందు ఆంధ్రులకు అర్హస్థానము లభించుటకు ప్రత్యేక ఆంధ్రరాష్ట్రము అవసరమన్న విషయము ననేకులు వ్యక్తపరచిరి. ఇంగ్లీషువిద్యావ్యాప్తియు, రైలు రోడ్లు మొదలగు ప్రయాణసౌకర్యముల వ్యాప్తియు ముందుగ తమిళ ప్రాంతములందు జరగుట వలన మద్రాసురాష్ట్రమందు పరిపాలనమున తమిళులు సంపాదింపగలిగిన పలుకుబడి అత్యధికమయ్యెననియు, ఒక్క రాష్ట్రమున వారితో కలసి ఉన్నంత వరకు వారితో సమానముగ పోటీచేయుటకు కావలసిన పరిస్థితులు ఆంధ్రప్రాంతములం దేర్పడ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



జాల వనియు, ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర మొక్కటే ఆంధ్రులకు శరణ్యోపాయ మనియు క్రమక్రమముగ వారు నిశ్చయించుకొనిరి. క్రీ. శ. 1907 - 08 లో బందరు పట్టణమున నిజాం ఆంధ్రులతో కూడిన ఆంధ్రమహాసభ యొకటి జరగెను. అందు రాజకీయ విషయములు ఎక్కువగ చర్చలోనికి రాకుండినను ఆంధ్రుల పురోభివృద్ధికి బ్రిటిష్ ప్రాంతములోని ఆంధ్రులును, నిజాంలోని ఆంధ్రులును కలిసి పని చేయుట అవసరమన్న విషయము ప్రాధాన్యము వహించి విశాలాంధ్ర దృక్పథమునకు బీజములను నాటెను. గుంటూరు సమితి చర్చలలో ఎక్కువగ పాల్గొనుచుండిన ఉన్నవ లక్ష్మీనారాయణగారును, జొన్నవిత్తుల గురునాథం గారును క్రీ. శ. 1911 లో తయారుచేసిన ఆంధ్రదేశపటములో మద్రాసురాష్ట్రములోని ఆంధ్రమండలములే కాక హైదరాబాదు, మైసూరు, బేరారు, మధ్యరాష్ట్రములు, ఒరిస్సాలలోని తెలుగు జిల్లాలు కూడ చేర్చబడియుండుట ఈ సందర్భమున గమనించదగి యున్నది.

ఆంధ్రోద్యమము పుట్టుటకును, అది బలపడుటకును బంగాళరాష్ట్ర విభజనమును రద్దుచేయుటకై బంగాళీలు కావించిన ఆందోళనము కొంతవరకు కారణభూత మయ్యెనని చెప్పవచ్చును. ఒకటే భాషను మాటాడువారి జన్మభూమిని రెండు ముక్కలుగ చీల్చివేయుట ధర్మవిరుద్ధ మన్న సూత్రము నాధారముచేసికొని వారు తమ ఆందోళనను సాగించిరి. దాని ఫలితముగ భాషకును, రాష్ట్రమునకును సన్నిహిత సంబంధ ముండవలె ననియు, ఈ రెండును పరస్పరాశ్రయము లనియు ఒకగట్టి అభిప్రాయము దేశమందు వ్యాపించెను. ఇదిగాక బంగాళరాష్ట్ర విభజనను రద్దుచేయు సందర్భమున గవర్నరు జనరలు హార్డింజి ప్రభువు క్రీ. శ. 1911 లో ప్రకటించిన అధికారపత్ర మీ యభిప్రాయమును మరింత బలపరచెను. అం దతడు అదివరకు బంగాళరాష్ట్రమందు చేరియుండిన బీహారు ప్రాంతమును విడదీసి ప్రత్యేక రాష్ట్రముగ నిర్మాణము గావించ వలసిన ఆవశ్యకము నుద్ఘాటించుచు, దానికి కారణము బీహారీలు బంగాళీ భాషను గాక హిందీభాషను మాటలాడు వారగుటయేయని స్పష్టముచేసెను. అది మొదలు భాషాప్రయుక్త రాష్ట్రవాదుల కీ పత్ర మొక గొప్ప ఆధార మయ్యెను. అందులోని వాక్యముల ప్రభావము ఆంధ్రోద్యమ ప్రారంభకులైన కొండా వెంకటప్పయ్య పంతులు, న్యాపతి నారాయణరావు, చట్టి నరసింహారావుగార్లు మొదలైనవారిమీద హత్తుకొనినది. దానిని ఆధారము చేసికొని, బీహారు రాష్ట్రము వలెనే ప్రత్యేక ఆంధ్రరాష్ట్రము నిర్మాణము కావలసి యున్నదని క్రీ. శ. 1911 లో నారాయణరావుగారు ఆంగ్ల పత్రికలలో నొక లేఖను ప్రకటించిరి. ఆంధ్రరాష్ట్రావశ్యకతను గురించి గుంటూరునుండి వెలువడుచుండిన దర్బారు పత్రికకు క్రీ. శ. 1912 లో నరసింహారావుగారు వ్రాసిన లేఖయందు కూడ హార్డింజి ప్రభువు పత్రములోని వాక్యముల ప్రభావము కనిపించుచున్నది.

క్రీ. శ. 1912 నాటికి ఆంధ్రనాయకు లనేకులలో ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర నిర్మాణ మత్యావశ్యకమన్న అభిప్రాయము గట్టిగ నాటుకొనెను. దానిని గురించి కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు 1912 ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికయందు వ్రాసిన వాక్యములలో కొన్ని ఇవి: 'తరుణమాసన్నమైనప్పుడు చెన్నపురి రాష్ట్రములోని ఆంధ్రమండలంబులు ప్రత్యేకరాష్ట్రముగ నేర్పాటుచేయుట ముఖ్యమని తోచుచున్నది. ఈ రాష్ట్ర నిర్మాణము వలన నాంధ్రదేశములో నొక ముఖ్య పట్టణ మేర్పడ గలదు. అది భాషాభివృద్ధికిని, దేశాభివృద్ధికిని, వాణిజ్యాభివృద్ధికిని, నిలయము కాగలదు. తీక్ష్ణస్పర్ధవలన నింతవర కాంధ్రులు వెనుకబడి యుండుటకు గల కారణ మంతరించగలదు. జాతియైక్యము నభిలషించు నీ కాలములో ప్రత్యేక జాతీయ రాష్ట్ర నిర్మాణము హానికరమని కొంద రనవచ్చును. కాని, ఈ యూహలో సత్యములేదు.''

ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణావశ్యకతను గురించిన తీర్మానమును ఆంధ్రప్రముఖు లందరు కలిసి సమావేశమైన మహాసభలో ప్రవేశపెట్టుటకు క్రీ. శ. 1912లో ప్రథమప్రయత్నము జరగెను. ఆ సంవత్సరమున నిడదవోలులో గోదావరి, కృష్ణ, గుంటూరు మండలముల సమష్టి కాంగ్రెసు మహాసభ సమావేశ మయ్యెను. అప్పుడు యువకులు కొందరు రాష్ట్రనిర్మాణమును గురించిన తీర్మానము నొకదానిని ప్రవేశపెట్టదలచిరి గాని అది విషయనిర్ణయసభలో ముందుగ చర్చింపబడలేదన్న కారణమున దానిని మహాసభలో ప్రవేశపెట్టుటకు వీలులేదని అధ్యక్షు లభిప్రాయ పడిరి. అందుచేత అది చర్చలోనికి రాకపోయెను. కాని అంత మాత్రముచేత ఎవరును ఆశాభంగము చెందలేదు. అక్కడ సమావేశమైనవా రనేకులు ఆంధ్రోద్యమమును గురించి ఆలోచించి కార్యక్రమము నిర్ణయించుటకు ఏటేట ప్రత్యేక ఆంధ్రమహాసభ యొకటి జరగుట వాంఛనీయమన్న నిశ్చయమునకు వచ్చిరి. క్రీ. శ. 1913 లో బాపట్లలోను, అటు తరువాత ఇతర పట్టణములందును జరగుచువచ్చిన ఆంధ్ర మహాసభలకు ఈ నిశ్చయమే కారణము. ఇదిమొదలు ఆంధ్రోద్యమమున కొక రూప మేర్పడెను.

క్రీ.శ. 1913 లో బాపట్లయందు ఆంధ్రమహాసభ మొదటి పర్యాయము సమావేశమయ్యెను. దానికి బయ్యా



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



నరసింహేశ్వరశర్మగారు అధ్యక్షులుగను, కొండా వెంకటప్పయ్యపంతులుగారు సన్మాననంఘాధ్యక్షులుగను ఉండిరి. వేర్వేరు జిల్లాలనుండి ఆంధ్రప్రముఖు లనేకులు వచ్చిరి. శర్మగారు ఆంధ్రోద్యమముయొక్క ఆశయములు సర్వతోముఖము లన్నవిషయమును స్పష్టపరచుచు 'భారతవర్షమున నున్న జాతులలో ఆంధ్రసంఘ మెట్టి స్థానమలంకరించినదియు గ్రహించి ఆ సంఘముయొక్క ఆవశ్యకములను కోరికలను ఆశయములను పరిశోధించుటకును, ఆర్థిక నైతిక విద్యావిషయిక పరిస్థితుల నవలోకించి వాని పురోభివృద్ధికి తగు నేర్పాటులు చేయుటకును, ఆంధ్రులలో నైక్యాభివృద్ధికరములగు ప్రయత్నములు చేసి సంఘాభివృద్ధికి పాటుపడుటకును, వేయేల - మానవజీవిత సౌఖ్యమునకై చేయవలయు యత్నములు సలిపి ఆంధ్రు లున్నతపదవి పొందునట్టు పర్యాలోచనము చేయుటకును........ఆంధ్రుల మందర మిచట సమావేశమైనాము' అనియు, 'వివిధ శక్తుల నొకచోట కేంద్రీకరించి నిజకామ్యములను సాధించు కొరకు పాటుబడుట ఆంధ్రమహాసభకు విధి' అనియు, 'ఆంధ్రుల అభివృద్ధికి సహకారిగ నుండుటకు తగిన ఆంగ్లేయ దైనికపత్రికా ప్రకటనము, ఆంధ్ర దేశమున ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రతిష్ఠాపనము, కళాశాలలయందును పాఠశాలలయందును ఆంధ్ర భాషాభ్యాసము మొదలగు ముఖ్యాంశములు ఈ సభవారు బాగుగ చర్చించి తీర్మానించవలసినది' అనియు హెచ్చరించిరి. వెంకటప్పయ్య పంతులుగారు ఇదే ధోరణిని మాటలాడిరి.

తర్వాత ఆంధ్రరాష్ట్ర నిర్మాణావశ్యకతను సమర్థించుచు వేమవరపు రామదాసు పంతులుగారు ఒక తీర్మానమును ప్రవేశపెట్టిరి. అది సభలో గొప్ప కలకలము పుట్టించెను. దాని కనుకూలురు పలువు రుండినను ప్రతికూలురలో దేశమందలి ప్రముఖులగువా రుండిరి. ప్రజాభిప్రాయమును తెలిసికొనక అట్టి తీర్మానమును ప్రవేశపెట్టరాదని వా రభిప్రాయపడిరి. అందుచేత ప్రజలలో నొక సంవత్సరకాలము ప్రచారము గావించి, తరువాత మరుసటి సంవత్సరము జరగు మహాసభలో తీర్మానము చర్చించవలసినట్లుగ అందరును అంగీకరించిరి.

ఈ సూచన ననుసరించి కొండా వెంకటప్పయ్య పంతులు, పట్టాభి సీతారామయ్య, ముట్నూరి కృష్ణరావు, వల్లూరు సూర్యనారాయణరావుగార్లు ప్రచారక సంఘముగ నేర్పడి ప్రజలలో, అందులో ముఖ్యముగ రాయలసీమవారిలో రాష్ట్రనిర్మాణమును గురించి ప్రచారము గావించిరి. దాని ఫలితముగ క్రీ. శ. 1914 లో బెజవాడలో జరగిన మహాసభ రెండవ సమావేశమునకు వేలకొలది ప్రజలు వచ్చిరి. దానికి పురాణం వెంకటప్పయ్యగారు సన్మాన సంఘాధ్యక్షులుగను న్యాపతి సుబ్బారావు పంతులుగారు అధ్యక్షులుగను ఉండిరి. వెంకటప్పయ్య పంతులుగారు ఉద్యమమును గురించి, 'ఈ యుద్యమము న్యాయములగు నభిలాషల వలన నుద్భవించినది గాన, ఆంధ్రులయొక్క మతమేకాక యాంధ్రేతరులయొక్కయు, ప్రభుత్వమువారియొక్కయు సాదర పోషణములకు పాత్రమగుచున్నది....ప్రతి మనుష్యుడు స్వభాష సాహాయ్యముచేతనే (విషయములను) గ్రహించును, యోచించును....అన్యభాషయం దట్లు చేయజాలడు. కావున స్వభాషయందు విద్యాపరిశ్రమము కలుగనిచో మనుష్యులకు సాధారణముగ ప్రతిభ యుదయింపదు. అందువలన స్వదేశ వాఙ్మయాభివృద్ధి కానేరదు. దేశమునకు ముఖ్యముగా కావలసిన జ్ఞాన సంపత్తి జనసామాన్య మందరికి ఇంగ్లీషుభాష మూలముగ లభించుట కష్టతరము. ఆ భాష సులభసాధ్యము కాదు....ఇకముందు క్రమేణ సర్వకళాస్థానాలయందుకూడ సర్వత్ర స్వభాష మూలముగ విద్య నేర్పుటకు తగు నేర్పాటులు చేయబడునని నమ్మదగియున్నది. ఇట్టి కారణములచేత ఆయా భాషలు మాటలాడబడు ప్రదేశములను విద్యా పరిపాలన వ్యవహారములకు తగిన ప్రత్యేక ఖండములుగా నేర్పరచుట మిక్కిలి సహజమైన పద్ధతిగాని బహుభాషలు మాటలాడబడు ననేక ప్రదేశముల నేకైక ఖండములుగా చేయుట లాభకారి కాదు. ఇతర వ్యవహారములకును అట్టి ప్రదేశములే యోగ్యమైన ఖండములుగ నెంచుట శ్రేయస్కరము: ఈకారణముచేతనే యీ యుద్యమము 'తెలుగు జిల్లాల ప్రయత్నము' లేక 'ఆంధ్రోద్యమ'మను రూపమున వికాసమును పొందినదని తలచుచున్నాను' అని పల్కిరి.

అధ్యక్షులు న్యాపతి సుబ్బారావు పంతులుగారు రాష్ట్ర నిర్మాణ విషయమున నెక్కువ ఉత్సాహమును చూపకుండినను ఈ మార్పు ఇండియా దేశములోని పరగణాల మార్పులో చేరవలసినదిగా నున్నది. భాషల ప్రకారము పరగణాల నేర్పరచినందువలన లాభము కలుగు ననియు, ఆంధ్రరాష్ట్ర మేర్పడినచో ప్రతి తెలుగు జిల్లాలలోని ఆంధ్రులు అభివృద్ధిపొందుదు రనియు, ప్రజాభిప్రాయము నేకముఖమునకు తెచ్చుటకై ఆంధ్రరాష్ట్రమును కోరువారెల్లరును ఒక సమాజముగా నేర్పడి పనిచేసినయెడల బాగుండుననియు నా అభిప్రాయము. నవీనాభిప్రాయములను వెల్లడిచేసి, యెల్లరి చేతను ఒప్పింపవలసినప్పుడు ఇట్టి సమాజము లేర్పడుట ముఖ్యము. అట్లు చేసినయెడల ప్రభుత్వమువారు గూడ పరగణాలయొక్కయు, సాధ్యమైనంతవరకు స్వదేశీ సంస్థానములయొక్కయు హద్దులను భాష



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సమవరించి సాధ్యమగునంతవరకు మార్చుట యావశ్యకమని యెంచిగాని, తెనుగు జిల్లాల యభివృద్ధినిబట్టి ప్రస్తుతపు రాజధాని క్రిందనుండు రాజ్య పరిపాలనకు అనుకూలమని యెంచిగాని తెనుగుభాష మాటలాడువారిలో అందరికి గాని, పలువురకుగాని ప్రత్యేకరాష్ట్ర మీయవచ్చును. ఆంధ్రోద్యమము ఆంధ్రులలో ఐకమత్యమును పురికొల్పి తన్మూలముగ భారత జాతీయ గమ్యస్థానమును కాంక్షించుచున్నది....' అని చెప్పిరి.

సభలో ఆంధ్రప్రాంతమందు ఎక్కువ కళాశాలలు స్థాపింపబడవలె ననియు, ఆంధ్రులకు ప్రభుత్వోద్యోగములలో ఎక్కువ అవకాశము కల్పింపబడవలె ననియు కొన్ని తీర్మానములు చేయబడినతర్వాత ఆంధ్రరాష్ట్ర నిర్మాణావశ్యకతను గురించిన తీర్మానము చర్చకు వచ్చెను. కొందరు ప్రతికూలముగ మాటాడినను, తుదకు ఈ తీర్మానము అత్యుత్సాహముతో ఆమోదింపబడెను. (1) పరిపాలన సౌకర్యమునకును, ప్రజల పురోభివృద్ధికిని భారత దేశమును భాషలనుబట్టి రాష్ట్రములుగా విభజించుట అవసరమనియును; (2) కాంగ్రెసు మహాసభవారు వ్యక్తీకరించిన స్వపరిపాలన విధానమును, ఇండియా గవర్నమెంటువారు వారి అధికార పత్రమందు సూచించిన స్థానిక స్వాతంత్ర్య విధానమును సిద్ధించుటకు భాషాప్రయుక్త రాష్ట్రములే అనుకూలము లనియును; (3) ఈ రాజధానిలోని తెలుగు జిల్లాలను ప్రత్యేకరాష్ట్రముగ చేయుట వాంఛనీయమనియును; (4) సమితులను స్థాపించుట మొదలగు మార్గములచే ఈచర్య విషయమున జనాభిప్రాయమును ఏకముఖము గావించుట యావశ్యక మనియును ఈ తీర్మానమున గలదు.

ప్రచారము నిమిత్తమును, ఉద్యమమును గురించి ప్రభుత్వమువారితో ఉత్తర ప్రత్యుత్తరములు జరపుటకును ఒక స్థాయి సంఘము క్రమక్రమముగ నేర్పాటు కావింపబడెను. ప్రచారము సాగించుటలో క్రి. శ. 1911 లో కొండా వెంకటప్పయ్య పంతులుగారు ప్రచురించిన 'ఆంధ్రోద్యమము', క్రి. శ. 1913 లో భోగరాజు పట్టాభి సీతారామయ్య, కోపల్లె హనుమంతరావుగార్లు కలిసి వ్రాసిన 'ఆంధ్ర రాష్ట్రము' అను గ్రంథ మిక్కిలి తోడ్పడెను.

ఆంధ్రమహాసభ మూ- సమావేశము విశాఖపట్టణమందు జరగెను. దానికి భూపతిరాజు వెంకటపతిరాజుగారు సన్మాన సంఘాధ్యక్షులుగను, శ్రీ పానుగంటిరాజా రామారాయణంగారు అధ్యక్షులుగను ఉండిరి. బెజవాడలో జరగిన సభయందు ఆంధ్రరాష్ట్ర నిర్మాణావశ్యకత గ్రహింపబడెను. విశాఖపట్టణ సభలో ఆంధ్రరాష్ట్రమును నిర్మించవలసినదిగ ప్రభుత్వమును కోరుటకు తీర్మానింపబడెను.

క్రి. శ. 1915 తర్వాత ఏవో ఒకటిరెండు సంవత్సరములందుతప్ప తక్కిన వానిలో ఆంధ్రమహాసభా సమావేశములు జరగుటయు, రాష్ట్రనిర్మాణము చేయవలసినట్లుగ ప్రభుత్వమును కోరుచు తీర్మానము చేయుటయు పరిపాటి అయ్యెను. కాని ఫలప్రాప్తి మాత్రము క్రి. శ. 1953 వరకు కలుగలేదు.

మొదటినుండియు భాషాప్రయుక్త రాష్ట్ర సిద్ధాంతము పట్ల బ్రిటిష్ ప్రభుత్వమువా రెక్కువ ప్రాతికూల్యమును వహించియుండలేదు. క్రి. శ. 1917 లో ఇండియా కార్యదర్శి మాంటేగు, రాజప్రతినిధి చెమ్స్‌ఫర్డు రాజ్యాంగ సంస్కరణల విషయమై ప్రజాభిప్రాయమును కనుగొనుటకు మద్రాసుకు వచ్చినప్పుడు ఆంధ్రమహాసభ తరఫున ఆంధ్ర ప్రముఖులు కొందరు వారిని కలిసికొని ఆంధ్రరాష్ట్ర నిర్మాణావశ్యకతను గురించి వారి కొక నివేదికను సమర్పించిరి. అందులోని సత్యమును వారు గ్రహించి, వారి నివేదికలో భాషాప్రయుక్త రాష్ట్రములపట్ల సుముఖత్వమును వ్యక్తపరచి, ప్రజాభిప్రాయ మనుకూలమైనచో అట్టి రాష్ట్రముల నిర్మాణము చేయదగునని సూచించిరి. ఇందు కనుకూలముగా క్రి.శ. 1919 రాజ్యాంగ చట్టమం దొక సెక్షను ప్రవేశపెట్టబడెను. దానిమూలమున నూతనరాష్ట్ర నిర్మాణముతో సంబంధముగల రాష్ట్ర శాసన సభల సమ్మతిని పొంది గవర్నరు జనరలు, ఇండియా ప్రభుత్వకార్యదర్శి ఆమోదముతో నూతన రాష్ట్రములను ఏర్పాటుచేయుట కవకాశ మేర్పడెను. క్రి.శ. 1921 తర్వాత రెండు మూడు పర్యాయములు ఆంధ్రరాష్ట్రనిర్మాణమున కనుకూలముగ మద్రాసు శాసన సభలో తీర్మానములు చేయబడినను గవర్నరు జనరలు అందు విషయమై శ్రద్ధవహించని కారణమున కార్యసాఫల్యము కాకపోయెను. ప్రభుత్వముపై ఒత్తిడి కలిగించగల శక్తి సామర్థ్యములు ప్రజల కున్నప్పుడే వారి వాంఛలను సమవరించి ప్రభుత్వము నడచుటకు సిద్ధపడుట సామాన్య విషయము. వట్టి తీర్మానములు కార్యసాఫల్యమును కలిగించజాలవు. క్రి. శ. 1950 కి పూర్వము ఆంధ్రుల వలన ప్రభుత్వమునకు ఎట్టి ఒత్తిడియు కలుగనందున రాష్ట్ర నిర్మాణము వాయిదా వేయబడుచునే వచ్చెను.

కాని ఒకటి రెండు విషయములలో ఆంధ్రోద్యమము క్రి. శ. 1918 తర్వాత విజయము సాధించ గలిగెను. అప్పటి కాలమున రాజకీయాందోళనము సాగించుచుండిన సంస్థలన్నిటిలో కాంగ్రెసు ప్రధానమైనదిగ నుండెను. వివిధ ప్రదేశములలో కాంగ్రెసు వ్యవహారములు జరగుటకు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



రాష్ట్ర కాంగ్రెసు కమిటీలు ఏర్పడియుండెను. భాషా ప్రయుక్తముగ రాష్ట్రపునర్నిర్మాణము జరగవలెనని విశ్వసించిన ఆంధ్రనాయకులు కాంగ్రెసు వ్యవహారములకై ఏర్పరచ బడిన కమిటీలు భాషాప్రయుక్తములుగ నుండ వలె ననియు, ఆంధ్రప్రాంతమును మద్రాసునుండి విడదీసి ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర కమిటీని ఏర్పరచవలె ననియు వాదించిరి. ఈ విషయము క్రీ. శ. 1917లో కలకత్తాయందు జరగిన కాంగ్రెసు సమావేశములో చర్చకు వచ్చి ఆంధ్రనాయకులు చేసిన సూచన ఆమోదింపబడెను. దాని ఫలితముగ ప్రత్యేక 'ఆంధ్రరాష్ట్రకమిటీ' ఏర్పడుటయే కాక దేశమందంతట భాషాప్రయుక్తములుగ కాంగ్రెసు' రాష్ట్రకమిటీ 'లు ఏర్పడెను. క్రీ.శ. 1917కు పూర్వము ఆంధ్రులకు వ్యక్తిత్వమున్నదన్న విషయమును తక్కిన భారతీయులు గుర్తించియుండలేదు. వారు మద్రాసీయులనియే వ్యవహరింపబడుచుండిరి. ఇదిమొదలు వారి కొక ప్రత్యేకభాష, సంస్కృతి ఉన్న విషయమును భారతీయులందరు గ్రహించిరి. క్రీ. శ. 1921 తరువాత స్వాతంత్ర్య సమరమందును, నిర్మాణకార్యక్రమమందును ఆంధ్రులు ప్రదర్శించిన త్యాగము, ఉత్సాహము ఈ భావమును మరింత దృఢపరచెను.

ఆంధ్రోద్యమము సాధించిన రెండవ విజయము ఆంధ్ర విశ్వవిద్యాలయ సంస్థాపనము. ఇందుకుగాను మద్రాసు ప్రభుత్వమువారు శాసన మొక దానిని కావించి క్రీ. శ. 1926 లో అమలులో పెట్టిరి. కాని ఇది సంపూర్ణ విజయముగ పరిణమించలేదు. విశ్వవిద్యాలయ కేంద్రమును గురించి వాదోపవాదములు బయలుదేరి తుదకు కేంద్రము విజయవాడనుండి వాల్తేరుకు మారుటవలన రాయలసీమ కళాశాలలు ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు అనుబద్ధములు కాక మద్రాసు విశ్వ విద్యాలయ పర్యవేక్షణక్రింద నుండిపోయెను.

ఏటేట సమావేశములు జరగుటతప్ప ఆంధ్రోద్యమ చరిత్రయందు గుర్తించదగిన విశేషము లేవియు చాల కాలమువరకు కనిపించలేదు. ఉద్యమము ప్రతిపాదించిన భాషా ప్రయుక్త రాష్ట్ర సిద్ధాంతము అనేకుల ఆమోదమును పొందగలిగెను. కాంగ్రెసు దీనిని క్రీ.శ. 1917 లోనే ఆమోదించెను. క్రీ. శ. 1928 లో భారతీయదృక్పథము నుండి రాజ్యాంగ ప్రణాళిక నొకదానిని తయారుచేయుటకై సర్వపక్ష సమావేశము వారు మోతీలాల్ నెహ్రూగారి అధ్వర్యమున నియమించిన ఉపసంఘమువారు వారి ప్రణాళికలో ఈ సిద్ధాంతమును సమర్థించిరి. ఆదేకాలమున బ్రిటిష్ పార్లమెంటువారు నియమించిన సైమన్ కమిషన్‌వారు క్రీ. శ. 1930 లో వారు తయారుచేసిన నివేదికయందు ఆంధ్రోద్యమమును గురించి ప్రస్తావించుచు 'భారతదేశములోని వివిధరాష్ట్రములలో భాషాభేదములను పురస్కరించుకొని విడిపోవలెనను అభిలాష ప్రజలలో పుట్టుటచేత కొన్ని సంవత్సరములనుండి ఈ భాషాభేదములు ముఖ్యముగ నొక రాజకీయ సమస్యగ పరిణమించినవి.... పదునేడు సంవత్సరముల క్రిందట తెలుగు మాటలాడు జిల్లాల వారు కావించిన మహాసభలో ప్రత్యేక ఆంధ్రరాష్ట్రము కావలెనని కోరబడిన కోర్కె ఇన్ని సంవత్సరములనుండి ఎడతెగక కోరబడుచునేయుండి ఇప్పు డొక ప్రముఖమైన రాజకీయ సమస్యగా తేలినది. ఇది కొలది సంవత్సరముల క్రిందట రెండు పర్యాయములు శాసనసభలో చర్చింపబడి బహుసంఖ్యాకులగు సభ్యుల అంగీకారమును పొందె' నని చెప్పిరి. ఈ విధముగ వారు సిద్ధాంతమును సమర్థించి ఆంధ్రరాష్ట్రమునెడ సానుభూతిని గనబరచినను ఆంధ్రులు తక్కినవా రనేకులతోపాటు కమిషనును బహిష్కరించినందున ఆంధ్రరాష్ట్ర నిర్మాణము జరగవలసినట్లు వారు సిఫారసు చేయరైరి. అందుచేత ఒరిస్సాతోపాటు ఆంధ్ర రాష్ట్రము సిద్ధించకపోయెను. అటుతరువాత లండనులో జరగిన రౌండ్ టేబిలు సమావేశమునకు ఆంధ్రుల తరపున బొబ్బిలి రాజుగారు, దేశపాండ్య సుబ్బారావుగారు మొదలైనవారు నివేదికలను అందజేసిరి. సమావేశములో పాల్గొనుటకు వెళ్ళుచుండిన మహాత్మా గాంధిగారిని ఆంధ్ర ప్రముఖులు కలిసికొని రాష్ట్రనిర్మాణమును గురించి ప్రస్తావించవలసినదిగా కోరిరి. కాని వారలాగు చేయుటకు అవకాశము లభించదయ్యెను. అందుచేత క్రీ. శ. 1935 లో చేయబడిన రాజ్యాంగచట్టమందు ఆంధ్రరాష్ట్ర ప్రసక్తి లేకపోయెను.

క్రీ. శ. 1937 లో క్రొత్త రాజ్యాంగము అమలులోనికి వచ్చి మద్రాసురాష్ట్రములో కాంగ్రెసు మంత్రులు అధికారములోనికి వచ్చిరి. కాని అప్పటికే కాంగ్రెసు అధిష్ఠానవర్గమందు భాషాప్రయుక్త రాష్ట్రముల విషయమై కొంత ప్రాతికూల్య ముదయించెను. సంపూర్ణ స్వరాజ్యాధికారము కాంగ్రెసు హస్తగత మగువరకు నూతనరాష్ట్ర నిర్మాణమును వాయిదావేయుట మంచి దన్న అభిప్రాయమును వారు వెలిపుచ్చిరి. కాని ఆంధ్రనాయకులు నిరుత్సాహపడలేదు. క్రీ. శ. 1937 లోనే వారు 'శ్రీబాగ్ ఒడంబడిక' నొకదానిని చేసికొని రాయలసీమ, సర్కారుల మధ్య రాష్ట్రనిర్మాణ విషయమై ఏర్పడిన అభిప్రాయభేదములను కొంతవరకు పరిష్కారము చేసికొనిరి. క్రీ. శ. 1938 లో కొండా వెంకటప్పయ్య పంతులుగారు మద్రాసు శాసన సభలో ఆంధ్రరాష్ట్రనిర్మాణము జరగవలెనని ప్రవేశ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పెట్టిన తీర్మానము సభామోదమును పొందెను. అప్పటి మద్రాసు గవర్నరు దానికి అనుకూలుడుగ నుండెను. క్రీ. శ. 1935 రాజ్యాంగపు చట్టము ప్రకారము క్రొత్త రాష్ట్రమును నిర్మించు అధికారము ఇండియా ప్రభుత్వపు కార్యదర్శి చేతిలో నుండెను. శాసనసభయొక్క ఈ తీర్మానమ నను సరించి అతడు వెంటనే ఆంధ్ర రాష్ట్రమును నిర్మించగలడన్న ఆశ అందరికి కలిగెను. క్రీ. శ. 1938 లో మద్రాసునందు జరగిన ఆంధ్రమహాసభకు అధ్యక్షుడుగ నుండిన సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు లండనుకు వెళ్ళినప్పుడు రాష్ట్ర విషయమై ఇండియా ప్రభుత్వ కార్యదర్శితో సంప్రతించుట కంగీకరించిరి. సంప్రతింపులు జరగెనుకాని ఏ కారణముచేతనో ఆంధ్రరాష్ట్రనిర్మాణము జరగలేదు. క్రీ. శ. 1939 లో రెండవ ప్రపంచయుద్ధము ప్రారంభ మగుటయు, ఆ సందర్భమున మద్రాసులో కాంగ్రెసు మంత్రివర్గము రాజీనామా చేయుటయు సంభవించెను. యుద్ధము ముగిసి, అధికారము కాంగ్రెసు పరమగునంతవరకు రాష్ట్రనిర్మాణము సాధ్యముకాని పరిస్థితు లేర్పడెను.

ఇన్ని పర్యాయములు ఆశాభంగము కలుగుటచేతను, కాంగ్రెసు అధిష్ఠాన వర్గమువారుకూడ ప్రతికూలు రగుచున్నట్లు సంశయము పుట్టుటచేతను పట్టి తీర్మానములు చేయుటమూలమున కార్య సాఫల్యము కాజాల దనియు, సత్యాగ్రహమువంటి సాధనమును ప్రయోగించుట అవసరమనియు ఒక భావము ఆంధ్రమహాసభా నాయకులు కొందరిలో జనించెను. క్రీ. శ. 1941 లో విజయానంద గజపతివారి అధ్యక్షతను విశాఖపట్టణములో జరగిన సమావేశమందు దీనికి సూచనగ, 'తిరిగి రాష్ట్రములలో, అనగా మద్రాసులో ప్రజాప్రభుత్వ మేర్పరచుటకు తగిన అవకాశము కలిగినప్పుడు ప్రత్యేక ఆంధ్రరాష్ట్రము నేర్పరచు విషయములో కలిగెడు నిరోధముల నన్నిటిని తొలగించు విషయములో ఆంధ్ర ప్రతినిధులు తమ శక్తి సామర్థ్యాదుల నన్నిటిని వినియోగించవలెను. అతి శీఘ్రముగ ప్రత్యేకాంధ్రరాష్ట్ర మేర్పడుటకు వీరు గట్టి కృషి చేయవలెను. అలాగు చేసిననుకూడ ప్రత్యేక రాష్ట్ర మేర్పరచకపోయిన [illegible] దానినిమిత్తము ఆంధ్ర ప్రజలును, వారి ప్రతినిధులును సర్వవిధముల త్యాగము చేయవలెను' అను తీర్మానము కావింపబడెను. తరువాత జరగిన మరికొన్ని సభలలోకూడ ఉపన్యాసముల ధోరణి ఈవిధముగనే ఉండెను.

క్రీ. శ. 1946 లో మద్రాసురాష్ట్రమందు కాంగ్రెసు మంత్రివర్గము తిరిగి అధికారములోనికి వచ్చెను. స్వతంత్ర భారతమునకు రాజ్యాంగమును తయారుచేయుటకు రాజ్యాంగ పరిషత్తు సమావేశ మయ్యెను.

క్రీ.శ. 1947 ఆగస్టు 15వ తేదిన బ్రిటిష్‌వారి అధికారము అంతరించి స్వరాజ్యము స్థాపింపబడెను. దేశమును పాలించు అధికార మంతయు కాంగ్రెసు అధినేతల హస్తగత మయ్యెను. భాషాప్రయుక్త రాష్ట్రములు నిర్మాణము కాగల వనియు, వానితో ఆంధ్ర రాష్ట్ర మవతరించు ననియు ఆంధ్ర ప్రజలు విశ్వసించిరి. క్రీ. శ. 1947 నవంబరులో పండిత జవహర్‌లాల్ నెహ్రూ రాజ్యాంగ పరిషత్తులో చేసిన ప్రకటననుబట్టి ఈ నిశ్చయము బలపడెను. క్రొత్తగ నిర్మాణమగుచుండిన రాజ్యాంగపు చట్టములోని రాష్ట్రముల పట్టికలో ఆంధ్రరాష్ట్రముకూడ తప్పక చేర్చబడునని ప్రజలు భావించిరి.

కాని అది జరగుటకు పూర్వము క్రీ. శ. 1935 వ చట్టమురీత్యా ప్రభుత్వమువారు కొన్ని చర్యలు తీసికొనవలసియున్నదని రాజ్యాంగ శాసనపు ముసాయిదాను తయారుచేసిన ప్రముఖు లభిప్రాయపడిరి. భాషారాష్ట్రముల నిర్మాణమును గురించి అప్పు డప్పుడు పరిషత్తులో జరగిన చర్చల ఫలితముగ ఆంధ్ర, కర్ణాటక, కేరళ, మహారాష్ట్ర రాష్ట్రములలో ఏవి నిర్మాణ యోగ్యములో, వానిని నిర్మాణము చేయుటవలన కలుగు ఫలితము లేలాటివో మొదలైన విషయములను పరిశీలించి నివేదికను తయారు చేయుటకు పరిషదధ్యక్షులు 'థార్' కమిటీని నియమించిరి. ఈకమిటీవారు ఈ నాలుగు రాష్ట్రములను నిర్మాణము గావించుటలో ఎదుర్కొనవలసిన సమస్యలను పరిశీలించుటతోపాటు భాషాప్రయుక్తరాష్ట్ర సిద్ధాంతములోని గుణదోషములనుకూడ పరిశీలించి భారతదేశపు పరిస్థితులలో కొంతకాలమువరకు అట్టి నిర్మాణము శ్రేయస్కరము కాజాలదని తెలిపిరి. అప్పటికి కాంగ్రెసు నాయకు లనేకులలో భాషాప్రయుక్తరాష్ట్రముల విషయమై కొంత ప్రాతికూల్య మున్నందున థార్ కమిటీవారి అభిప్రాయములకు వా రెక్కువ ప్రాధాన్య మొసంగిరి. ఇ దంతయు ఆంధ్రులలో అత్యంత ఆశాభంగమును కలిగించి అలజడికి కారణమయ్యెను. పరిస్థితులు విషమించునట్లు కాంగ్రెసు నాయకులకు తోచెను.

అందుపై వారు పండిత నెహ్రూ, వల్లభాయి పటేల్, ఆ సంవత్సరపు కాంగ్రెసుకు అధ్యక్షుడైన పట్టాభి సీతారామయ్యగార్లతో కూడిన 'నాయకత్రయ' కమిటీని నియమించి, స్వాతంత్ర్య సంస్థాపనము తరువాత ఏర్పడిన క్లిష్ట పరిస్థితులలో భాషారాష్ట్రముల నిర్మాణమువలన కలుగు సాధక బాధకములను పరిశీలించి నివేదికను తయారుచేయ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వలసినదిగ కోరిరి. ఈ సంఘము క్రీ. శ. 1949 ఏప్రిలులో నివేదికను సమర్పించి, అప్పటి పరిస్థితులలో భాషారాష్ట్రముల నిర్మాణము శ్రేయస్కరము కాదని చెప్పుచు, ఆంధ్రులు మద్రాసు నగరమును వదలుకొనినయెడల మద్రాసురాష్ట్రములోని నిర్వివాదములగు ఆంధ్ర ప్రాంతములను కలిపి ఆంధ్రరాష్ట్ర నిర్మాణము గావించవచ్చునని సూచించిరి. మద్రాసు నగరమును వదలుకొను విషయములో ఆంధ్రులలో కొన్ని వాదోపవాదములు చెలరేగిన కారణమున ఆ సంవత్సరము నవంబరువరకు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటివారు నాయకత్రయ నివేదికలోని షరతులకు అంగీకారమును తెలుపరైరి. తరువాత వారు వాని కంగీకరించిరి. నూతన రాజ్యాంగము క్రీ. శ. 1950 జనవరి తే 26 దీన అమలులోకి వచ్చునట్లు నిర్ణయింపబడి యుండుటచేత రాష్ట్రముల పట్టికలో ఆంధ్రరాష్ట్రమును చేర్చుటకు వీలుగా వెంటనే చర్యలు తీసికొనవలసినట్లు కేంద్ర ప్రభుత్వము మద్రాసు ప్రభుత్వమును కోరెను. అందుపై మద్రాసుప్రభుత్వ మొక విభజన సంఘము నేర్పరిచెను. ఈ సంఘము విభజనకు సంబంధించిన విషయముల నన్నిటిని పరిశీలించి సమర్పించిన నివేదికలో రెండుమూడు అంశములను గురించి ఆంధ్ర ప్రతినిధులలో నభిప్రాయ భేదము లేర్పడెను. దానిని పురస్కరించుకొని కేంద్ర ప్రభుత్వము వారు ఆంధ్రరాష్ట్ర నిర్మాణమును తిరిగి వాయిదా వేసిరి. క్రీ. శ. 1950 జనవరి 26 తేదీన ఆంధ్ర రాష్ట్రము అవతరించుట తప్పదని భావించుచుండిన ఆంధ్రులకు ఇది నిర్వేదకారణ మయ్యెను.

ఇట్టి పరిస్థితులలో ఆంధ్రరాష్ట్రసిద్ధికి మార్గాంతరము లేదని క్రీ. శ. 1951 ఆగస్టులో స్వామి సీతారాం (శ్రీగొల్లపూడి సీతారామశాస్త్రిగారు) నిరశనవ్రతమును పూనిరి. కాని ముప్పదియెనిమిది రోజులు వ్రతము సాగినతరువాత శ్రీ వినోబా భావే సలహా ననుసరించి వారు వ్రతవిరమణను గావించిరి. సంవత్సరము గడచెను. మధ్యను క్రీ. శ. 1952 లో ఎన్నికలు జరగినవి. అప్పుడు అన్ని పార్టీలవారును ఆంధ్రరాష్ట్రనిర్మాణ విషయములో సుముఖత్వమును ప్రకటించిరి. ఎన్నికల తరువాత పార్లమెంటులోను, మద్రాసు శాసనసభలోను దీనిని గురించిన తీర్మానములు చర్చలలోనికి వచ్చెను. వీని కన్నిటికి సమాధానముగ మద్రాసు వదలుకొనిన పక్షమున ఆంధ్రరాష్ట్ర నిర్మాణము వెంటనే జరగగలదని కేంద్రప్రభుత్వము చెప్పుట జరుగుచు వచ్చెను. కాని ఫలిత మేమియు కనిపించలేదు.

అందుపై అమరజీవి పొట్టి శ్రీరాములుగారు క్రీ.శ. 1952 అక్టోబరు 19వ తేదీ నుంచి ప్రాయోపవేశమునకు పూనుకొనిరి. అప్పటికికూడ ఆంధ్రనాయకులలో అభిప్రాయభేదము లడుగంటలేదు. 58 రోజులు నిరాహారులై రాష్ట్రము నిమిత్తము శ్రీరాములుగారు తుదకు ప్రాణములు వదలిరి. ఆంధ్రదేశమం దంతట క్రీ. శ. 1942 ఆగష్టు విప్లవము వంటి విప్లవము చెలరేగెను. హర్తాలులు, సమ్మెలు, విధ్వంసక చర్యలు, లాటీ ఛార్జీలు, కాల్పులు, మరణములు — వీనితో కూడిన వాతావరణము వ్యాపించెను. దీని నంతను గమనించి నిర్వివాదప్రాంతాలతో ఆంధ్ర రాష్ట్రము వెంటనే నిర్మింపబడునని కేంద్రప్రభుత్వము ప్రకటించెను. నిర్మాణ సంబంధములో ఏర్పడు సమస్యల పరిష్కారమునకు ఆ ప్రభుత్వము మార్గములను సూచించుటకు న్యాయమూర్తి శ్రీ వాంఛూను, బళ్ళారి సమస్యను పరిష్కరించుటకు శ్రీ న్యాయమూర్తి మిశ్రాను నియమించెను; రాజధానిని గురించిన భేదాభిప్రాయముల పరిష్కారమును ఆంధ్ర శాసన సభ్యులకు వదలివేసినది. రాష్ట్రనిర్మాణమునకు సంబంధించిన నివేదిక లన్నిటిని పరిశీలించి క్రీ. శ. 1953 సెప్టెంబరులో ఆంధ్రరాష్ట్ర నిర్మాణశాసనము పార్లమెంటు యొక్కయు, రాష్ట్రపతి యొక్కయు ఆమోదమును పొందినది.

నలుబది సంవత్సరములుగ ఆంధ్రులు వాంఛించుచుండిన ఆంధ్రరాష్ట్రము పొట్టి శ్రీరాములుగారి ప్రాయోపవేశ ఫలితముగ క్రీ. శ. 1953 అక్టోబరు 1వ తేదీన అవతరించినది.

ఆంధ్రోద్యమమును ప్రారంభించినవారు ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధికై పాటుపడ దలచినను వారి దృష్టియు, వారి తరువాత నాయకత్వము వహించినవారి దృష్టియు ప్రధానముగ రాష్ట్ర నిర్మాణమందే కేంద్రీకృత మయ్యెను. క్రీ. శ. 1905 తరువాత సాంఘిక, ఆర్థిక, సాహిత్యాది రంగములందు ఆంధ్రులు గణనీయమైన అభివృద్ధిని గాంచిరి. కాని ఆంధ్రోద్యమమునకు వానితో ప్రత్యక్ష సంబంధ ముండినది కాదు. ఈ రంగములలోని అభివృద్ధి ఇతర సంస్థలద్వారా జరగెను. అందుచేత వానిని గురించి ఇచ్చట వివరించుట సందర్భోచితము కానేరదు.

మా. వెం. రం.

తెలంగాణా ఆంధ్రోద్యమము : మద్రాసు ప్రాంతములోని తెలుగు జిల్లాలలో నివసించే 'ఆంధ్రులు' నడపిన ఆంధ్రోద్యమానికి, పరిస్థితుల ఒత్తిడి వల్ల తలెత్తిన తెలంగాణాలోని ఆంధ్రోద్యమానికి ఎంతో వ్యత్యాసం ఉన్నది. ఈ రెండు ఉద్యమాలూ రెండు విభిన్నమార్గాలలో నడచినవి. తెలంగాణా ఆంధ్రోద్యమ ఆశయాలను ఆకళింపు చేసుకోడానికి పూర్వం, ఉద్యమానికి ముందు అక్కడ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తెలిసిన పరిస్థితులను ఒకమారు సుదీర్ఘంగా పరిశీలించడం చాల అవసరము. 'నిజాం రాష్ట్రము' (1) తెలంగాణా, (2) మరాట్వాడా (3) కర్ణాటకము అని మూడు భాషా ప్రయుక్త రాష్ట్రాలతో సమ్మిశ్రితమై ఉండేది. నిజాంరాష్ట్ర వైశాల్యం 82,698 చదరపు మైళ్లు. దీనిలో తెలంగాణా వైశాల్యం 41,502 చదరపు మైళ్లు. ఇది మొత్తం ఆంధ్ర ప్రదేశ్ వైశాల్యంలో మూడవవంతు. దీని జనాభాకూడ మూడవ వంతే. తెలంగాణా జనాభా దాదాపు ఒకకోటి అన్న మాట. క్రీ. శ. 1922 లో తెలంగాణాలో ఆంధ్రోద్యమం ప్రారంభమైనదని చెప్పవచ్చును. అంతకు పూర్వం ఆంధ్రులు హైదరాబాదు సంస్థానంలో రాజకీయంగా ఎట్టి ఉన్నతస్థితికి వచ్చినట్లు కనబడదు. క్రీ. శ. 1896 లో హైదరాబాదులో శాసనసభ స్థాపించబడినది కాని ఒక్క ఆంధ్రుడు కూడ శాసనసభా సభ్యత్వాన్ని పొందలేదు. తలవని తలంపుగా ఒక్క ఆంధ్రుడు మాత్రం హైకోర్టు జడ్జి పదవిని అలంకరిం చాడు. మఱ్ఱికైనా ఈ మహోన్నతపదవికి ఇంకొక ఆంధ్రుడు వచ్చిన పాపాన పోలేదు. వైద్యశాఖలో ఒక రిద్దరు తెలుగువారు తప్ప మిగిలినవా రంతా ఆంధ్రేతరులే. ఉన్నతోద్యోగాలలో తెలుగువారు అసలే లేరని నిక్కచ్చిగా చెప్పవచ్చును. కలెక్టరుగాగాని, సుబేదారుగాగాని ఆంధ్రు డెవడూ పనిచేయలేదు. సంస్థానంలో గజెటెడ్ ఉద్యోగులైన ఆంధ్రులను మనం వేళ్ళపైన లెక్కపెట్టవచ్చును. పేరు పొందిన న్యాయవాదులలో ఆంధ్రులు చాల తక్కువ. అసలే లేరని చెప్పవచ్చును. రాజకీయంగా, ఆర్థికంగా, సాంఘి కంగా ఆంధ్రుల కప్పట్లో సంస్థానంలో ఎట్టి ప్రాముఖ్యమూ లేకుండినది. అల్పసంఖ్యాకులైన ముస్లిములకూ, ఆ తరువాత మహారాష్ట్రులకూ ఆర్థిక, రాజకీయ రంగాలలో మహోన్నత స్థానం ఉండినది. ఆంధ్రులలో అక్షరాస్యుల సంఖ్య చాల తక్కువ. అందులోను విద్యాధికుల సంఖ్య మృగ్యమనే చెప్ప వచ్చును. బ్రిటిష్ ఇండియాలోని ఆంధ్రులు ఇంగ్లీషు, తెలుగు విధిగా నేర్చుకోవలసి వస్తే తెలంగాణా ఆంధ్రులు మాతృ భాష తెలుగు, రాజభాష ఇంగ్లీషు, స్థానికభాష ఉర్దూ నేర్చుకోవలసి వచ్చేది. మాతృభాష తెలుగు, రాజభాష ఇంగ్లీషు నేర్చుకొనక పోయినా అంత చిక్కు ఉండేది కాదు. కాని ఉర్దూ రాకపోతే ~ తం అసలుకే మోసం వచ్చేది. ముల్కీ (స్థానికుడు) అ నిపించుకోడానికి ఉర్దూ గీటు రాయిగా ఉపకరించేది. ఉర్దూ వస్తేనేకాని ముల్కీ సర్టిఫి కేటు లభించేది కాదు. ముల్కీ సర్టిఫికేటు లేకపోతే సంస్థానంలో ఉద్యోగం దొరకదు. అందువల్ల సంస్థానంలో పుట్టి, పెరిగి, చివరికి జీవిత మంతా గడిపినప్పటికీ, ఏ ఆంధ్రుడూ ఉర్దూ వస్తే తప్ప ముల్కీగా పరిగణింపబడే వాడు కాడు. ఈ ముల్కీ సర్టిఫికేట్లు ఇచ్చేవారుకూడ ముస్లిములే కావడం మూలాన వారితో ఉర్దూలో మాటాడి వారి ప్రశ్నలకు ధారాళంగా సమాధానా లిస్తే తప్ప ఏ ఆంధ్రుడూకూడ ముల్కీ అని అనిపించుకోడానికి వీలు ఉండేది కాదు. అతనికి ఇంగ్లీషు ఎంత బాగా వచ్చినా లాభం లేదు. ఇట్టి పరిస్థితులలో వెనుకటి తరంవారు తమ పిల్లలకు ఉర్దూ, ఫారశీ భాషలలో అక్షరాభ్యాసం చేయించక తప్పేది కాదు. ఉర్దూ, ఫారశీ భాషలతో విద్యార్థి దశను ప్రారం భించిన విద్యార్థులు సహజంగా మున్షి, దబీర్ పరీక్షలకు వెళ్ళేవారు. ఇవి విద్వాన్, ఉభయభాషాప్రవీణ వంటి పరీక్షలు. గత శతాబ్దాంతమువరకు ఉన్నత, మధ్యమ తరగతి కుటుంబాలలో ఇట్టి విద్యావిధానమే ఆచరణలో ఉండేది. ఈ శతాబ్దారంభంలో ఇంగ్లీషుకు ప్రాముఖ్యము హెచ్చింది. అందువల్ల సంస్థానంలోని హిందువులు, అందులో ముఖ్యంగా ఆంధ్రులు ఉర్దూ, ఫారశీ భాషలతోపాటు ఇంగ్లీషు నభ్యసించడం తప్పనిసరి అయినది. మాతృభాష తెలుగు రాకపోయినా ఏ ప్రమాదమూ ఉండేది కాదు. అందువల్ల తెలుగువారు తెలుగును తృణీకార భావంతో చూడడం జరిగినది. క్రమంగా సంస్థానంలో సంస్కృతాంధ్ర పండితుల సంఖ్య తగ్గిపోవడం సంభవించినది. దేశంలో వారికి ఎట్టి ఆదరణ లేకపోవడమే దీనికి ముఖ్యకారణము. వనపర్తి, గద్వాలవంటి సంస్థానములలో మఱ్ఱికు కొందరు సంస్కృతాంధ్ర పండితులు మిగిలిపోయినారు. నిజాం రాష్ట్ర మంతా ఉర్దూ ఫారశీక భాషల మయమయింది. భాషకూ, సంస్కృతికీ అవినాభావ సంబంధం ఉండక తప్పదు. తెలుగుభాష అడుగంటడంతో రాష్ట్రంలో 'తెలుగుతనం' క్షీణించింది. ఉర్దూ, ఫారశీక భాషలపైన జనసామాన్యానికి మోజు హెచ్చింది. అప్పట్లో అవే సభ్య భాషలుగా పరిగణింపబడేవి. బజార్లు, ఆఫీసులు దాటి ఉర్దూ హిందూ గృహాలలో ప్రవేశించింది. క్రమంగా అది తెలుగుభాషా స్థానాన్ని ఆక్రమించింది. తండ్రి కొడుకులు, అన్నదమ్ములు, చివరకి భార్యాభర్తలుకూడ ఉర్దూలో మాటాడుకోడం మొదలు పెట్టినారు. బాలికలకు కూడ ఉర్దూ చెప్పించడం ప్రారంభించారు. ఇట్టి పరిస్థితులలో 'నా మాతృభాష తెలుగు; నేను తెలుగువాడిని' అని సగర్వంగా చెప్పుకోడం మ్యానతగా పరిణమించింది. చివరికి తమ్ము తాము గుర్తించుకోలేని దీన స్థితికి దిగినారు తెలంగాణాలో ఆంధ్రులు. 'మీరు ఆంధ్రులు; మీకు ఒక మహోజ్జ్వల చరిత్ర ఉంది' అని చెప్పి నిద్రాణమైన జాతిని మేల్కొలుప వలసిన అవసరం ఏర్పడినది.

ఇట్టి పరిస్థితులలో క్రీ.శ. 1921 నవంబరు 11, 12 తేదీలలో హైదరాబాదు నగరంలో నిజాం రాష్ట్ర సంఘ సంస్కరణ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మహాసభ ఒకటి సమావేశమయినది. ఈమహాసభకు మహిళా విశ్వ విద్యాలయ స్థాపకులైన కార్వేగారు అధ్యక్షత వహించారు. అధ్యక్షోపన్యాసం కొంత మహారాష్ట్రంలోను, కొంత ఇంగ్లీషులోను సాగింది. రెండు రోజులు చాలా తీర్మానాలపైన ఉర్దూ, మహారాష్ట్రం, ఇంగ్లీషు భాషలలో చర్చలు కొనసాగినవి. మహాసభలో తెలుగుకు ఎట్టి స్థానం కూడ లభించక పోవడం ఆంధ్రులకు మనస్తాప కారణమైనది. అప్పుడు ఆలంపల్లి వెంకట రామారావుగారు ఒక తీర్మానంపైన తెలుగులో మాటాడడానికి ఉపక్రమించారు. ఇంతలోకే మహాసభలో చప్పట్లు ప్రారంభమైనవి. ఎవ్వరూ తెలుగులో ఉపన్యాసాన్ని వినడానికి సంసిద్ధంగా లేరు. అల్లరి జరపి చప్పట్లు చరచి ఉపన్యాసకుని ముందుకు సాగకుండా చేశారు. దానితో ఉపన్యాసం కట్టుపడి పోయింది. వెంకట రామారావుగారు చేసేదేమీ లేక ఉపన్యాసాన్ని ఆపి తమకూ, తమద్వారా ఆంధ్రజాతికీ కలిగిన అవమానాన్ని తలచుకొని ఆశ్చర్య చకితులైనారు. ఆంధ్రులు బహుళ సంఖ్యాకులుగా గల ఆంధ్ర నగరంలో తెలుగులో ఉపన్యాసం జరగడం అసంభవంగా తోచి ఆంధ్రులు ఉత్తేజితులైనారు. ఎంతటి దారుణ పరిస్థితులలో తాము జీవితాన్ని గడుపుతున్నదీ వారు గుర్తించారు; వెంటనే మహాసభను బహిష్కరించారు.

నాటి రాత్రే ఆంధ్రులు టేకుమాల రంగారావుగారి వసతి గృహంలో సమావేశమై పరిస్థితులను పరిశీలించారు. 1921 నవంబరు 12వ తేదీ రాత్రి 8 గంటలకు ఆంధ్రజనసంఘాన్ని స్థాపించారు. ఆనాడు ఆంధ్రోద్యమానికి అంకురార్పణ జరగింది. రెడ్డి వసతిగృహంలో కొండా వెంకట రంగారెడ్డి గారి అధ్యక్షతక్రింద 1922 ఫిబ్రవరి 24 వ తేదీన జరగిన మహాసభలో ఆంధ్రజనసంఘము చిత్తునియమావళి అంగీకరింపబడినది. ఆంధ్రజనసంఘ స్థాపకులలో ఆంధ్ర పితామహ, పద్మవిభూషణ మాడపాటి హనుమంతరావు పంతులు, బూర్గుల రామకృష్ణారావు, మందుముల నరసింగరావు, ఆదిరాజు వీరభద్రరావు ప్రభృతులు ముఖ్యులు. ఉద్యమ స్థాపకుల ఉద్దేశాలు ఈవిధంగా ఉన్నవి:

(1) 'నిజాంరాష్ట్రాంధ్రజనసంఘము'అని ఈసంఘము పేరు.

(2) నిజాం రాష్ట్రములోని ఆంధ్రులలో పరస్పరము సానుభూతి కలిగించి వారి అభివృద్ధికోసం ప్రయత్నించడము ఈ సంఘము ఆశయము.

(3) నిజాం రాష్ట్రములోని ఆంధ్రులకోసం సంఘాలను, సంస్థలను స్థాపించడము, ఉన్నవాటికి సహాయం చేయడము, ఉపన్యాస సభలను సమావేశపరచడము మొదలైన కార్యాలవల్ల పై ఆశయాలను సాధించడము.

(4) చదవడము, వ్రాయడము వచ్చి పద్దెనిమిది సంవత్సరాలకన్న ఎక్కువ వయస్సు గల ప్రతి ఆంధ్ర వ్యక్తి ఈ సంఘంలో సభ్యత్వాన్ని పొందవచ్చును.

ఆంధ్రోద్యమాన్ని సంస్థానంలోని మూలమూలలకు వ్యాపింపచేయడములో క్రీ. శ. 1901 లో ప్రారంభమైన గ్రంథాలయోద్యమం ఎంతో తోడ్పడినది. గ్రంథాలయోద్యమము ముఖ్యంగా ఆంధ్రభాషా ప్రచారానికి శక్తివంచన లేకుండ పాటుపడినది. దీనివల్ల నవీనాంధ్ర వాఙ్మయము పుస్తకాల, పత్రికల రూపంలో తెలుగులో విశాల ప్రచారం పొంది ఆంధ్ర ప్రజకు ప్రబోధప్రదంగా పరిణమించింది. క్రీ. శ. 1901 లో హైదరాబాదు నగరంలో శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషా నిలయము స్థాపింపబడినది. ఆ తరువాత తెలంగాణాలో మరికొన్ని గ్రంథాలయాలు స్థాపింపబడినవి. ఆంధ్రోద్యమం ప్రారంభమగువరకు నిజాం రాష్ట్రములో అథమం పది గ్రంథాలయాలైనా ఆంధ్రభాషా ప్రచారం చేస్తూ ఉండినవి. తెలంగాణాలో గ్రంథాలయోద్యమ వ్యాప్తికి కారణభూతులైనవారిలో కీర్తిశేషులైన కొమర్రాజు వెంకట లక్ష్మణరావుగారు ముఖ్యులు. వీరికి ఉద్యమంలో రాజా నాయని వెంకటరంగారావు, రావిచెట్టు రంగారావు, ఆదిపూడి సోమనాథరావు, మైలవరం నృసింహశాస్త్రి ప్రభృతుల సహాయ సానుభూతులు లభించినవి.

క్రీ. శ. 1918 లో ఉర్దూ బోధనభాషగా ఉస్మానియా విశ్వ విద్యాలయం స్థాపించబడినది. అప్పటివరకు ఇంగ్లీషు బోధనభాషగా వాడుకలో నుండిన ఉన్నత, మాధ్యమిక పాఠశాల లన్నీ నిజాం కళాశాలతో జతపడి ఉండినవి. నిజాం కళాశాల మద్రాసు విశ్వవిద్యాలయంతో జతపరుపబడినది. ఉస్మానియా విశ్వవిద్యాలయ స్థాపనతో నగరములోని, జిల్లాలలోని ఉన్నత పాఠశాల లన్నీ ఉస్మానియా విశ్వవిద్యాలయంతో జతపరుపబడినవి. బోధనభాష ఇంగ్లీషు నుండి ఉర్దూలోకి మారింది. నగరంలోని నాలుగైదు ఉన్నత పాఠశాలలు తప్ప మిగిలిన వన్నీ వివిధ విషయాలను ఉర్దూలో బోధించునట్టివే. నగరంలోని నాలుగైదు ఉన్నత పాఠశాలలలో విద్య నభ్యసించి మెట్రిక్యులేషన్‌లో ఉత్తీర్ణులైన విద్యార్థులు తప్ప మిగిలినవా రందరూ ఉస్మానియా విశ్వవిద్యాలయంలో విధిగా చేరవలసివచ్చేది. ఇంగ్లీషు బోధనభాషగా కలిగి మెట్రిక్యులేషన్‌లో ఉత్తీర్ణులైన విద్యార్థులనుకూడ విద్యార్థి వేతనా లిచ్చి, నిజాం కళాశాలలో సీట్ల సంఖ్య పరిమితపరచి ఉస్మానియా విశ్వవిద్యాలయానికి ఆకర్షించేవారు. ఇంగ్లీషు బోధనభాషగా ఉన్న ఉన్నతపాఠశాలలలో కూడ కొద్దిమంది తెలుగు విద్యార్థులో



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తెలుగును ద్వితీయభాషగా స్వీకరించేవారు. ఈ ఉన్నత పాఠశాలలను ఉర్దూ పాఠశాలలుగా మార్చడంతో వాటిలో ద్వితీయభాషా ప్రసక్తియే లేక పోవడంవల్ల ప్రాంతీయ భాషలకు గొప్ప విఘాతం కలిగినది. మద్రాసు విశ్వవిద్యాలయంతో జతపరుపబడిన నిజాం కళాశాలలో కూడా మాతృభాష ద్వితీయభాషగా ఉండేది. కొందరు విద్యార్థులు తెలుగుకు బదులుగా ఉర్దూ తీసుకొన్నప్పటికి కొందరైనా దానిని ద్వితీయభాషగా స్వీకరించేవారు. ఉస్మానియా విశ్వవిద్యాలయ స్థాపనతో ప్రాంతీయభాషల అభివృద్ధికి ఆ కాస్త అవకాశముకూడా పోయింది. ప్రైమరీ పాఠశాలలలో పేరుకు మాత్రం తెలుగు ఉండేది. ఈవిధంగా ఉస్మానియా విశ్వవిద్యాలయము ప్రాంతీయభాషల అభివృద్ధికీ, ఆంధ్ర మహారాష్ట్ర కర్ణాటకుల విభిన్న సంస్కృతుల వికాసానికీ అరిష్టదాయకంగా పరిణమించినది. సంస్థానంలో నూటికి పదిమందికి మాత్రమే మాతృభాషఅయినా ఉర్దూ జాతీయ భాష పేరట మిగిలిన తొంభయిమందిపైన రుద్దబడినది.

హైదరాబాదులో స్థాపించబడిన ఆంధ్ర జనసంఘం వంటి సంస్థలు తెలంగాణాలోని మరికొన్ని ప్రదేశాలలో ఏర్పడినవి. వీటి నన్నిటిని ఏకోన్ముఖం చేసి ఆంధ్రోద్యమాన్ని సువిశాలం చేయడానికి వీటిపై ఆధిపత్యం గల ఒకే కేంద్ర సంస్థను స్థాపించవలసిన అవసరం ఏర్పడినది. వివిధ ప్రాంతాల ప్రతినిధులు హనుమకొండలో సమావేశమై క్రీ. శ. 1923 ఏప్రిల్ ఒకటవ తేదీన ఆంధ్రజన కేంద్ర సంఘాన్ని స్థాపించి దాని నియమావళిని అంగీకరించారు. ఆ తరువాత నాలుగు మాసాలకు ఆంధ్రజన కేంద్ర సంఘం మొదటి సమావేశం హైదరాబాదులో జరిగింది. ఆ సమావేశంలో రాష్ట్రంలోని వివిధ ఆంధ్రజన సంఘాల భవిష్యత్కార్యక్రమం ఈవిధంగా నిర్ణయింపబడినది :

(1) పఠన మందిరములను, గ్రంథాలయములను, పాఠశాలలను స్థాపించడము.

(2) విద్యార్థులకు సహాయం చేయడము, వారిని ప్రోత్సహించడము.

(3) విద్వాంసులను గౌరవించడము.

(4) తాళపత్ర గ్రంథాలను, శాసనాల ప్రతులను సంపాదించడము, పరిశోధించడము.

(5) కరపత్రాల, లఘుపుస్తకాల, ఉపన్యాసాలద్వారా విజ్ఞానాన్ని వ్యాపింపచేయడము.

(6) ఆంధ్రభాషా ప్రచారంకోసం అవసరమైన ప్రయత్నాలు జరపడము.

(7) వ్యాయామ క్రీడలను, కళలను ప్రోత్సహించడము.

ఈ కార్యక్రమమును అనుసరించి కేంద్ర సంఘ సమావేశాలు నాలుగువరకూ రాష్ట్రంలో, వివిధ ప్రాంతాలలో జరిగినవి. ఆతరువాత ఆంధ్రజన కేంద్ర సంఘము ఆంధ్ర మహాసభలలో అంగీకరింపబడిన తీర్మానాలను ఆచరణలో పెట్టడమే తన ప్రధాన ఆశయంగా స్వీకరించి పని చేస్తూ వచ్చినది. ఒకవిధంగా ఇది అటుతరువాత ఆంధ్రమహాసభకు స్థాయి సంఘముగా వ్యవహరించినదని చెప్పవచ్చును. ఆతరువాత మరి నాలుగు సమావేశాలు మొదటి నాలుగు ఆంధ్ర మహాసభలతోపాటు జరగినా వాటికి ప్రత్యేకపు విలువ లేదు. అందువల్ల నాలుగు సమావేశాల తరువాత ఆంధ్రజన కేంద్ర సంఘము తన విధ్యుక్త ధర్మాన్ని విజయవంతంగా కొనసాగించి చివరకు అదృశ్యమైనదని చెప్పినా పొరపాటేమీ ఉండదు.

ఆంధ్రోద్యమం ప్రారంభమైన తరువాత రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో వందకు పైగా ఆంధ్ర గ్రంథాలయాలు స్థాపించబడినవి. ఈ వివిధ గ్రంథాలయాల అభివృద్ధికై పనిచేస్తూఉండిన కార్యకర్తలను ఒకచోట సమావేశపరచి వారిలో పరస్పర సానుభూతిని పెంపొందించి ఉద్యమాన్ని సక్రమపద్ధతిలో నడపే ఉద్దేశంతో ఒక గ్రంథాలయ మహాసభ క్రీ. శ. 1925 లో ఆంధ్రజన సంఘం మూడవ సమావేశముతోపాటు మధిరలో జరపబడింది. రాష్ట్రములోని వివిధ గ్రంథాలయాల ప్రతినిధులు ఈ మహాసభలో పాల్గొన్నారు. వివిధ ఉపన్యాసాలతో ఈ మహాసభ కడుజయప్రదంగా జరగింది. అప్పట్లో నిజాం ప్రభుత్వము ఈ ఉపన్యాస సభలు జరపడానికి ఎట్టి ఆటంకాన్ని తెలుపలేదు. క్రీ. శ. 1926 లో ఆంధ్రజన కేంద్ర సంఘము నాల్గవ సమావేశముతోపాటు సూర్యాపేటలో ద్వితీయ గ్రంథాలయ మహాసభ జరుపుటకు నిశ్చయించబడినది. ఆ సందర్భంలో స్త్రీలసభ, వ్యవసాయ సభ, వర్తకసంఘ వార్షికోత్సవము మొదలైన సభలను కూడ జరపడానికి సన్నాహాలు ప్రారంభమైనవి. ఒక ఆహ్వాన సంఘముకూడ ఏర్పడింది. కాని ఇంతలో సభలు జరపడానికి వీలులేదని ప్రభుత్వమువారు కార్యకర్తలకు నోటీసులు ఇవ్వడము మూలాన సభలను ఆపివేయవలసి వచ్చినది. అప్పటి కార్యవర్గసభ(మంత్రిమండలి)తో ఉత్తర ప్రత్యుత్తరములు నడపి రెండు సంవత్సరాల వరకు తదేక దీక్షగా కృషిచేయడము వల్ల సూర్యాపేట సభలకు ప్రభుత్వపు అనుమతి లభించినది. తత్ఫలితంగా ద్వితీయ గ్రంథాలయ మహాసభ క్రీ. శ. 1929 లో సూర్యాపేటలో వైభవోపేతంగా జరగినది. ఆ తరువాత గ్రంథాలయోద్యమము అవిరళంగా కొనసాగినా ఆంధ్రగ్రంథాలయ మహాసభలు తిరిగి జరగలేదు. నిజాం ప్రభుత్వం గ్రంథాలయోద్యమాన్ని



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కూడ అనుమానదృష్టితో చూస్తూవచ్చింది. అందువల్ల కలెక్టర్లవంటి ఉన్నతోద్యోగులు కూడ 'ఈ గ్రంథాలయాన్ని స్థాపించడానికి ప్రభుత్వానుమతి ఉన్నదా' అని కార్యకర్తలను ప్రశ్నించడము జరుగుతూ వచ్చినది. అక్కడక్కడ గ్రంథాలయాలను మూసివేయించడంకూడ జరిగినది. కొందరు ప్రభుత్వోద్యోగులు చందాల పట్టికలను చూడడం, చందా లిచ్చిన సభ్యులను బెదరించడం, ఈ యుద్యమము ప్రభుత్వ రాజనీతికి విరుద్ధమని ప్రచారం చేయడము కూడా జరగింది. ఈ అడ్డంకుల నన్నిటిని ఏమాత్రం లక్ష్యం చేయకుండా అవసరమైతే ప్రభుత్వాంతో ఉత్తర ప్రత్యుత్తరాలు కూడా నడపి కార్యకర్తలు ఉత్సాహంతో గ్రంథాలయోద్యమాన్ని ఆంధ్రోద్య మారంభ దశలో విజయవంతం చేసినారనే చెప్పవచ్చును.

ప్రభుత్వోద్యోగులు గ్రామాలలోను, తాలూకా కేంద్రాలలోను పర్యటన కావించినప్పుడు స్థానిక వర్తకులు వంతుల ప్రకారం వారికి వివిధ వస్తువులు సప్లై చేయవలసివచ్చేది. ఉద్యోగులు దయ దలచి అట్టి వస్తువులకు ధరలు కట్టి డబ్బు చెల్లిస్తే సరే; లేకపోతే వర్తకులు తాము సప్లై చేసిన వస్తువులకు ధనము చెల్లించవలసినదని ప్రభుత్వోద్యోగులను అడగడానికి వీలు లేదు. ధనము చెల్లించినా వారు బజారు ధరలకన్న ఎంతో చౌకగా వస్తువులకు ధరలు కట్టి నామమాత్రంగా వర్తకులకు డబ్బు ఇచ్చేవారు. దీనివల్ల వర్తకులు ఎంతో నష్టపడవలసివచ్చేది. ఈ దురన్యాయాన్ని అరికట్టడానికై ఆంధ్రోద్యమ కార్యకర్తల ప్రోత్సాహంతో వర్తకులు వర్తక సంఘాలను స్థాపించుకోడం మొదలుపెట్టినారు. ఆంధ్రజనకేంద్ర సంఘము ఇట్టి వర్తకులకు అండగా నిలిచి ప్రభుత్వోద్యోగుల అవినీతిని అరికట్టడానికై 'వర్తక స్వాతంత్ర్యం' అను పేరట ఒక లఘుపుస్తకాన్ని ప్రచురించింది. ఈ పుస్తకం వెంటనే వర్తకులలో బహుళ ప్రచారం పొందినది. వర్తక సంఘాలద్వారా వారు నడపిన ఉద్యమం ఫలితంగా ప్రభుత్వోద్యోగుల దౌర్జన్యం అనతి కాలంలోనే ఆగిపోయినది. అలయసిద్ధితో ఉద్యమారంభ దశలో వివిధ ప్రాంతాలలో తలయెత్తిన వర్తక సంఘాలు అంతరించిపోయినవి.

ప్రభుత్వోద్యోగులు తమ పర్యటన సందర్భంలో చాకలి, మంగలి, మాల, మాదిగ మొదలయిన కులాలవారిచేత మూటలూ, ముల్లెలూ మోయించడంద్వారా వెట్టి చాకిరి చేయించేవారు. ప్రతిఫల మేమీ ముట్టచెప్పకుండా ఈ వెట్టి చాకిరి చేయించుకోడము నిజాంరాష్ట్రములో మొన్న మొన్నటివరకు అమలులో ఉండేది. ఆంధ్రోద్యమ కార్యకర్తలు ఇది అన్యాయంగా తోచి వారు ఈ వెట్టి చాకిరికి వ్యతిరేకంగా గొప్ప ఉద్యమాన్ని లేవనెత్తారు. 'వెట్టి చాకిరి' అనే లఘుపుస్తకాన్ని ప్రకటించడంద్వారా గొప్ప ఆందోళనను బయలుదేరదీశారు. నిజాం ఒక ఫర్మానులో ఈ వెట్టి చాకిరికి వ్యతిరేకంగా తన అభిప్రాయాన్ని వెలిపుచ్చినప్పటికీ నిజాం రాష్ట్రంలో ఈ వెట్టి చాకిరి చేయించుకోడము తగ్గలేదు. బలోతాదారులకు (వెట్టి చాకిరీ చేసే వారికి) వారు పనులు చేయుటకు సంసిద్ధముగా ఉండడానికి ఇనాములు ఇవ్వబడినవనీ, ఇవి వారికి ప్రతిఫలమెన్నటికీ కావనీ ఆ ఫర్మానులో విస్పష్టంగా ఉన్నా ప్రభుత్వోద్యోగులు ప్రతిఫలం ఇవ్వకుండానే పైని చెప్పిన కులాలవారిచేత పనులు చేయించుకొంటూనే వచ్చారు. ఈ 20వ శతాబ్దంలో ఇది ఎంతటి దారుణమైన ఆచారమో పాఠకులకు వేరే చెప్పవలసిన పనిలేదు. కొన్ని జాగీర్లలో పద్మశాలీలపైన మగ్గపు పన్ను విధింపబడుతూ ఉండేది. దీనికి వ్యతిరేకంగా ఆంధ్ర కేంద్ర జనసంఘం పెద్దపెట్టున ఆందోళన జరపి, ఈ దురాచారాన్ని కూకటి వేళ్ళతో పెల్లగించివేసింది.

రాష్ట్రంలో విద్యావ్యాప్తికై ఆంధ్రోద్యమ కార్యకర్తలు పాఠశాలా స్థాపన కార్యక్రమాన్ని ప్రారంభించారు. ప్రజలలో విద్య వ్యాపించడంవల్ల అసలు ప్రభుత్వానికే ముప్పు వాటిల్లగలదని గ్రహించి నిజాం ప్రభుత్వము ఈ ఉద్యమాన్ని అరికట్టడానికై ప్రైవేటు పాఠశాలల నియమావళిని ప్రకటించింది. దీనినిబట్టి ప్రజ లెవ్వరూ ప్రైవేటుగా పాఠశాలలను పెట్టుకోడానికి వీలులేదు. ప్రజలు పాఠశాలలను నడపితే అవి ప్రజల మాతృభాషకు ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వడం తథ్యము. ఇది ప్రభుత్వపు ఉర్దూభాషా తత్వానికి విరుద్ధము. పాఠశాలలను స్థాపించకుండా ప్రజలను అరికట్టితే ఏచిక్కూ ఉండదు. ప్రభుత్వపు ఈ మనస్తత్వమే పాఠశాలల నియమావళిని ప్రచురించి అమలులో పెట్టించినది.

ఆంధ్రోద్యమము ప్రారంభం కాకముందే రాజకీయ సభలుకాని, రాజకీయ పరిణామాలు కలిగించగలవని అనుమానం కలిగించే సభలుకాని ఎవ్వరూ స్వయంగా తమ అనుమతి పొందనిదే సమావేశపరచగూడదనీ, ఇట్టి అనుమతి పొందడానికి పూర్వం కార్యవర్గసభ సభా కార్యక్రమాలను పరిశీలించి అంగీకరించవలసి ఉంటుందనీ నిజాము ఒక ఫర్మానుద్వారా ప్రకటించారు. ఏవి రాజకీయ పరిణామం కలిగించే సభలో, ఏవి అట్టివి కావో నిర్ణయించే అధికారం ప్రభుత్వానికే ఉండడంవల్ల చివరకు సాహిత్యసమావేశాలకు కూడ అనుజ్ఞ లభించకపోవడం అప్పట్లో నిజాం రాష్ట్రములో పరిపాటి అయిపోయింది. గ్రంథాలయ వార్షికోత్సవాలవంటి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సాధారణ సభలకుకూడ ప్రభుత్వానుమతి పొందడం దుర్ఘటమైపోయినది. ఆంధ్రోద్యమానికి సంబంధించిన ఏ సభలకయినా కార్యవర్గసభ అనుజ్ఞ పొందవలసిన పరిస్థితులు ఏర్పడినవి. ఆంధ్రజన కేంద్ర సంఘం నాల్గవ సమావేశ సందర్భంలో స్థానిక గ్రంథాలయ వార్షికోత్సవము, స్త్రీలసభ, వ్యవసాయ సభ, వర్తకసంఘ వార్షికోత్సవము మొదలయిన సభలు జరపడానికి ఏర్పాట్లు జరిగి ఆహ్వాన సంఘము స్థాపింపబడిన తరువాతకూడ ప్రభుత్వం ఈ సభలను సమావేశపరచడానికి అనుమతి నివ్వలేదన్నసంగతి ఇంతకు పూర్వమే తెలుపబడినది. సభలకు సంబంధించిన ఫర్మానుకు పోలీసువారు చేస్తున్న అన్వయం సరియైనదా లేదా అనే విషయాన్ని తేల్చుకోడానికి ఈ వ్యవహారాన్ని ఉన్నత న్యాయస్థానమువరకు తీసికొని వెళ్ళడం సముచితమని కొందరు ఆంధ్రోద్యమ కార్యకర్తలు సూర్యాపేట సభల నిషేధాజ్ఞనుగూర్చి అభిప్రాయపడినారు. జిల్లాకోర్టు ఈ విషయంపై 'ఫర్మానును అనుసరించి కార్యవర్గసభ అనుమతి పొందడము అవసరమని' తీర్పు చెప్పింది. ఈ తీర్పుపై కార్యకర్తలు ఉన్నత న్యాయస్థానంలో అప్పీలు చేశారు. కానిపైన ఉన్నత న్యాయస్థానం ఈ వ్యవహారమునుగూర్చి ఈవిధంగా అభిప్రాయపడింది: 'రాజకీయాలతో సంబంధం లేని విద్యావిషయిక సభలకు ఆటంకాలు కల్పించడం ఈ ఫర్మానును జారీ చెయ్యడంలో నిజాం ప్రభువు ఉద్దేశమై ఉండజాలదు. ఏసభ అయినా రాజకీయాలకు సంబంధించినదా కాదా అని ఆ సభ జరగకముందే నిర్ణయించడము చాలా కష్టము'. ఈ తీర్పు కార్యకర్తలకు ఎంతో అనుకూలంగా ఉంది. కాని పోలీసులు దీనినికూడ తమకు అనుకూలంగా వ్యాఖ్యానించుకొని చివరకు విద్యావిషయక, సాంఘిక సభలనుకూడ ఆ తరువాత నిషేధించడం ఆశ్చర్యాన్ని కలిగించకమానదు.

ఆంధ్రోద్యమము ప్రారంభమైన తొమ్మిదినెలలకు నలగొండనుండి 'నీలగిరి' అనే ఒక వారపత్రిక వెలువడింది. దీనికి సంపాదకులు సన్నిధీసు వెంకట రామ నరసింహారావు గారు. తరువాత మూడు రోజులకు వరంగలు జిల్లా మహబూబు బాదు తాలూకా ఇనుగుర్తి గ్రామమునుంచి ఇంకొక వారపత్రిక 'తెలుగు పత్రిక' అను పేరిట వెలువడ్డింది. దీనికి సంపాదకులు ఒద్దిరాజు సీతారామచంద్రరావుగారు. ఆ తరువాత మూడు సంవత్సరాల తొమ్మిది నెలలకు సురవరం ప్రతాపరెడ్డిగారి సంపాదకత్వంలో వారానికి రెండు పార్లు ప్రకటితమ్మయ్యే 'గోలకొండ' పత్రిక వెలువడింది. ఈ మూడు పత్రికలు ఆంధ్రోద్యమానికి చేసిన సేవ అపారము. గోలకొండ పత్రిక నేడు దినపత్రికగా వెలువడుతున్నది. ఈ పత్రిక ప్రజా ఉద్యమాలకు చేసిన, చేస్తున్న సేవ అద్వితీయము.

గడచిన ఎనిమిది సంవత్సరాలలో ప్రజలలో ఆంధ్రోద్యమము బాగా వ్యాప్తి పొందింది. పత్రికల, పుస్తకాలద్వారా ఆధునికాంధ్రవాఙ్మయ పఠనాసక్తి యువకులలో హెచ్చింది. విద్యార్థికులలో 'మేము ఆంధ్రులము; మాభాష తెలుగు; మా భాషా సంస్కృతుల వికాసానికి శక్తివంచన లేకుండ పాటు పడడము మా కనీస ధర్మము' అనే భావం అక్కడక్కడ తలెత్తినది. ఈ నవభావోదయానికి ఒక విశిష్ట స్వరూపాన్ని కల్పించవలసిన అవసరం ఏర్పడినది. బాగా ఆంధ్రుల కష్ట సుఖాలను ప్రభుత్వానికి నివేదించగలిగిన ఒక ప్రాతినిధ్య సంస్థ లేకపోవడం ప్రజాహిత జీవితానికి ఒక లోటుగా కనబడింది. ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధికై కృషిచేయగల ఒక మహత్తర సంస్థను స్థాపించడం ఎంతో అవసరమని తోచింది. ఈ మహదాశయంతో మొదటి ఆంధ్ర మహాసభను జోగిపేటలో జరపుటకు ప్రయత్నాలు ప్రారంభమైనవి. ఆహ్వాన సంఘము ఏర్పడింది. మహాసభను జరపడానికి అనుమతి నివ్వవలసిందని ప్రభుత్వాన్ని కోరడమైనది. ఈ అనుమతి ఈ క్రింది షరతుల పైన లంభించినది.

(1) అధ్యక్షుడు రాష్ట్రేతరుడు (గైర్ ముల్కీ) కాకూడదు.

(2) ఇతర మతములవారికి మనస్తాపాన్ని కలిగించే విషయాలు ఏవీ మాటాడకూడదు.

(3) మహాసభ రాజకీయాలనుగాని, రాజకీయపరిణామాలు కలిగించే విషయాలను గాని చర్చించగూడదు.

ఈ యవమానకరమైన షరతు లన్నిటికీ లోబడి మొదటి ఆంధ్రమహాసభ క్రి. శ. 1930 మార్చి 3, 4, 5 తేదీలలో సమావేశ పరచబడినది. ఈ మహాసభకు సురవరం ప్రతాప రెడ్డిగారు అధ్యక్షత వహించారు. వీరి అధ్యక్షోపన్యాసము సంఘ సంస్కారానికి ఎక్కువ ప్రాముఖ్యము నిచ్చింది. అంగీకరింపబడిన తీర్మానాలు గష్తి నిషాన్ 53 (సర్క్యులర్ నెం. 53) ఖండన (బహిరంగ సభల నిషేధాజ్ఞ ఖండన), నిర్బంధ ప్రాథమికవిద్య, ప్రైవేటు పాఠశాలల నియమావళి ఖండన, బాల్య వివాహాలు, స్త్రీ విద్య, పాత దేవాలయాల మరమ్మతు, గ్రామపంచాయితీల పునరుద్ధరణ మొదలైన సాంఘిక, విద్యావిషయిక సమస్యలకు సంబంధించినవి. ఈ మహాసభలో రాజకీయాల ప్రసక్తి ఎక్కడా రాలేదు. ఉద్యమ వ్యాప్తికై అప్పట్లో రాజకీయవిషయాలతోలికి పోకుండా ఉండడము శ్రేయోదాయకమని కార్యకర్తలు భావించి తదనుగుణంగా ఆంధ్రమహాసభలకు రాజకీయాలతో



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఎట్టి సంబంధమూ లేదనీ, ఇక ముందుకూడ ఉండజాలదనీ స్పష్టపరిచారు. రాజకీయాలతో సంబంధం పెట్టుకొంటే అసలుకే మోసము రావచ్చుననీ, ఈ కాస్త ప్రచారము కూడ జరగడము దుర్లభమనీ వారు భావించారు. మొదటి ఆంధ్రమహాసభతో పాటు మొదటి మహిళాసభ కూడ జరగింది. దీనికి నడింపల్లి సుందరమ్మగారు అధ్యక్షత వహించారు. అప్పటినుండి ఆంధ్రమహాసభతోపాటు మహిళా మహాసభకూడ జరగడము ఒక ఆచారమైనది.

మొదటి మహాసభ జరగిన తరువాత సరిగా ఒక సంవత్సరమునకు రెండవ ఆంధ్రమహాసభ క్రీ. శ. 1931 మార్చి 3, 4, 5 తేదీలలో బూర్గుల రామకృష్ణారావుగారి అధ్యక్షత క్రింద నలగొండ జిల్లాలోని దేవరకొండలో సమావేశపరచబడింది. ప్రభుత్వానుమతి కోసము ఈ మహాసభకుకూడ భగీరథ ప్రయత్నాలు చేయవలసి వచ్చింది. ఆంధ్రోద్యమము బలపడుతున్నకొద్దీ ప్రభుత్వానికి ఈ ఉద్యమముపట్ల అనుమానం హెచ్చుడమే దీనికి ప్రబల కారణం. ప్రభుత్వానుమతి ఇవ్వడానికి పూర్వము అప్పటి రెవిన్యూ, పోలీసుశాఖల మంత్రి టి. జె. టాస్కర్‌గారు మాడపాటి హనుమంతరావు పంతులుగారిని తమవద్దకు పిలిపించుకొని ప్రశ్నపరంపరను కురిపించి సభాసమావేశానికి అనుమతి నిచ్చెదమని తెలుపుతూ 'ఉద్యమం ముందు ముందు అపాయకరంగా పరిణమించవచ్చు' నన్నారు. అనుమతిపత్రంలో సభాచర్యలకు రాజకీయాలతో సంబంధం ఉండకూడదనీ, ఇవి ప్రభుత్వ రాజనీతికి విరుద్ధంగా ఉండడం జరగితే ముందు ముందు ఇట్టి సభలకు అనుమతి నివ్వడము జరగదనీ విస్పష్టపరిచారు. అనుమానగ్రస్తమైన ప్రభుత్వవైఖరికి తార్కాణముగా పై సంఘటనను ఉదాహరించ వలసి వచ్చినది. రెండవ ఆంధ్రమహాసభ జయప్రదంగా జరగినది. నిమ్నజాత్యుద్ధరణ, గస్తీ నిషాన్ 53 (సర్క్యులర్ నెంబరు 53), బాల్యవివాహ నిషేధము మొదలైన విషయాలపై మహాసభలో ఆవేశ పూరితమైన ఉపన్యాసాలు జరగినవి. మహాసభకు అనుబంధంగా జరగిన మహిళాసభకు టి. వరలక్ష్మమ్మగారు అధ్యక్షత వహించారు.

మూడవ ఆంధ్రమహాసభకు ప్రభుత్వానుమతికోసం నాలుగు భగీరథ ప్రయత్నాలు జరగినవి. ప్రభుత్వ రాజనీతికి విరుద్ధముగా వ్యవహరించకూడదనీ, ముందుగా రెండువేల రూపాయల నగదు జమానతు దాఖలు చేయవలెననీ, మహాసభానంతరము రాజనీతికి విరుద్ధంగా వ్యవహరించడము జరగినదో లేదో ప్రభుత్వం పరిశీలించి విరుద్ధంగా వ్యవహరించడము జరగినదని తోస్తే ఆ రెండు వేలరూపాయలు జప్తు చేసుకోవడం జరగగలదనే అవమానకరమైన షరతులను విధించడము, మొదట జటప్రోలు సంస్థానములో మహాసభను జరపుటకు కార్యకర్తలు ప్రయత్నాలు జరపడము మొదలైన విషయా లన్నీ కలసి త్వరగా ప్రభుత్వానుమతి లభించక పోవడానికి ముఖ్యకారణాలైనవి. నాల్గవ ప్రయత్నము సందర్భంలో అప్పటి హోం సెక్రెటరీ ఈ క్రింది విషయాలను గూర్చి మహాసభ కార్యదర్శి దగ్గర వ్రాత మూలకంగా హామీ తీసుకొన్న తరువాత గాని మహాసభను జరపుటకు అనుమతి లభించలేదు. హామీ ఇవ్వడంతో జమానతు ఇవ్వవలసిన అవసరం తీరిపోయినది. (1) ప్రభుత్వం భూమి పన్నులను తగ్గించవలెనని కోరకూడదు; (2) వెట్టి చాకిరీకి వ్యతిరేకంగా ప్రచారం చేయకూడదు; (3) ప్రభుత్వంతో కార్యకర్తలకు ఘర్షణ కలిగే విషయా లేవీ చర్చించకూడదు. ప్రభుత్వానుమతిలో ఎట్టి షరతులూ విధింపబడియుండలేదు. అనుజ్ఞ వివరాలు కలెక్టరు ద్వారా లభించగలవని తెలుపబడినది. మూడవ ఆంధ్రమహాసభ క్రీ. శ. 1934 డిసెంబరు మాసములో పులిజాల వెంకట రంగారావుగారి అధ్యక్షతక్రింద ఖంబములో జరగినది. మహిళా మహాసభకు యల్లాప్రగడ సీతాకుమారిగారు అధ్యక్షత వహించారు. ఈ ఆంధ్రమహాసభ దాదాపు కలెక్టరు పర్యవేక్షణక్రింద జరగినదని చెప్పవచ్చు. అతడు సభాచర్యలలో కలుగజేసుకోడంవల్ల కొన్ని తీర్మానాలను ఆ మహాసభలో ప్రవేశ పెట్టకుండా వదలివేయవలసి వచ్చినది. సంఘసంస్కారానికి సంబంధించిన తీర్మానాలను మహాసభలో ప్రవేశపెట్టకూడదని స్థానికులైన కొందరు సనాతనులు పట్టు పట్టడమే దీనికి ముఖ్యకారణం. కార్యకర్తలు ఎన్నో ఇబ్బందులకు లోనై ఈ మహాసభను జరపవలసి వచ్చింది.

నాల్గవ ఆంధ్రమహాసభ క్రీ.శ. 1935 డిసెంబరు 30, 31వ తేదీలలోను, క్రీ. శ. 1936 జనవరి 1 వ తేదీన మాడపాటి హనుమంతరావు పంతులుగారి అధ్యక్షతక్రిందను, మహిళాసభ వారి సతీమణి మాడపాటి మాణిక్యమ్మగారి అధ్యక్షత క్రిందను కరీంనగరు జిల్లాలోని సిరిసిళ్ళ తాలూకా కేంద్రంలో జరగినవి. యథాతథిగ ప్రభుత్వానుమతిని పొందడంలో కార్యకర్తలు అధికతరశ్రమకు లోనుగావలసి వచ్చింది. మహాసభ చర్యలలో కలెక్టరు కలుగజేసుకోడం ఈ సారి కూడ తప్పలేదు. మహాసభపైన అతని ప్రభావం ఈ సారి ఎక్కువగా పడినదనే చెప్పవచ్చును. వెనుకటి నిబంధనలే అవమానకరంగా ఉంటే ఈ సారి మరికొన్ని కొత్త నిర్బంధాలు వాటితో జతపరుప బడినవి. కొత్త నిర్బంధాలలో ముఖ్యంగా పేర్కొనదగ్గవి ఇవి: రాష్ట్రేతరులు సభాచర్యలతో పాల్గొనకుండా ఉండడము, చిత్తు తీర్మానాలను కలెక్టరుకు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



దాఖలు చేసుకోడము, సభాధ్యక్షుడు కలెక్టరు అజ్ఞాను వర్తియై ఉండడము, మహాసభలో ఉపన్యసించే వ్యక్తుల పేర్లు ముందుగా కలెక్టరుకు తెలుపడము మొదలైనవి. ఈ నాలుగు మహాసభలవల్ల ఆంధ్రులలో గొప్ప ప్రబోధం కలిగింది. ఉద్యమస్థాయి హెచ్చినది. వేల సంఖ్యలో ప్రజలు మహాసభలలో పాల్గొనడం ఆచారమైనది. సిరిసిల్ల మహాసభలో మహాసభ నియమావళి అంగీకరించ బడినది. తత్ఫలితంగా మహాసభకు ఒక స్థాయి సంఘము ఏర్పడినది. నిజాం రాష్ట్రాంధ్ర ప్రజాభిప్రాయానికి ఆంధ్రమహాసభ ప్రాతినిధ్య సంస్థగా మారింది.

అయిదవ ఆంధ్రమహాసభ షాద్‌నగరులో క్రి. శ. 1936 డిసెంబరు 15, 16, 17 తేదీలలో కొండా వెంకట రంగారెడ్డి గారి అధ్యక్షతను జరగినది. దాదాపు పది వేలమంది ప్రజలు ఈ మహాసభలో పాల్గొన్నారు. మహాసభ సందర్భంలో హైదరాబాదునుండి షాద్‌నగరుకు ప్రత్యేకంగా ఒక రైలు నడపబడినది. ఈ మహాసభ రైతుల సమస్యలకు ఎక్కువ ప్రాముఖ్యము నిచ్చినది. సభలో ఎన్నో అభ్యుదయకరమైన తీర్మానాలు అంగీకరింపబడినవి. ఈ సందర్భంలో మహిళా మహాసభకు బూర్గుల అనంతలక్ష్మిదేవిగారు అధ్యక్షత వహించారు. మహాసభ అనంతరము సభాధ్యక్షులు, ప్రముఖ కార్యకర్తలు రాష్ట్ర పర్యటనము జరపి ప్రజల కష్టసుఖాలను ముఖాముఖి తెలుసుకొన్నారు. దీనివల్ల ఉద్యమంపట్ల ప్రజలకుగల గౌరవాభిమానాలు హెచ్చినవి.

ఆరవ ఆంధ్రమహాసభకుకూడ ప్రభుత్వము పూర్వం విధించిన నిర్బంధాలనే విధించింది. కాని ఆంధ్రమహాసభ కార్యకర్తలు ఈ యవమానకరమైన నిర్బంధాలకు లోబడి మహాసభను జరపుటకు అంగీకరించలేదు. ఈ నిర్బంధాలను ఉల్లంఘించి మహాసభను జరపవలెనని నిశ్చయించుకొన్నారు: లేదా, రాష్ట్రేతర ప్రాంతంలో మహాసభను సమావేశపరచుటకు సంసిద్ధులైనారు. ఈ విషమపరిస్థితిని పరిశీలించి ప్రభుత్వం లోగడ విధించిన నిర్బంధాలను ఉపసంహరించు కొన్నది. మహాసభ జరగుటకు మూడుమాసాలకు పూర్వం ప్రభుత్వము తగిన రాజ్యాంగ సంస్కరణలను సూచించుటకు అయ్యంగార్ కమిటీని నియమించింది. దీనికి అధ్యక్షులు అరావముదు అయ్యంగారు. ఇది అదనుగా గొని ఆరవ ఆంధ్రమహాసభ నిజామాబాదులో మందుముల నర్సింగరావుగారి అధ్యక్షతను క్రి. శ. 1937 డిసెంబరు 6, 7, 8 తేదీలలో సమావేశమై బాధ్యతాయుత ప్రభుత్వము నిజాం రాష్ట్రాంధ్రుల ఆశయము అని అర్థము నిచ్చే తీర్మానాన్ని అంగీకరించింది. దీనితో ఆంధ్రమహాసభ పూర్తిగ రాజకీయ మహాసభగా మారింది. ఈ సందర్భంలో జరగిన మహిళా మహాసభకు నందగిరి ఇందిరాదేవిగారు అధ్యక్షత వహించారు.

అయ్యంగార్ కమిటీ నియామకానంతరము ప్రజలలో గొప్ప రాజకీయ ప్రబోధం కలిగింది. ఆంధ్రులు, మహారాష్ట్రులు, కర్ణాటకులు ఒక సమావేశాన్ని జరపి ప్రజల పక్షాన ఒక రాజ్యాంగ సంస్కరణల ప్రణాళికను సిద్ధము చేయడానికి హైదరాబాదు ప్రజాపరిషత్తు (హైదరాబాదు పీపిల్స్ కన్వెన్షన్) అనే ఒక సంస్థను స్థాపించారు. దీనికి అధ్యక్షులు మాడపాటి హనుమంతరావు పంతులుగారు. ఈ పరిషత్తువారు ఒక సుదీర్ఘ ప్రణాళికను సిద్ధముచేసి అయ్యంగార్ కమిటీకి పంపించారు.

ఈ సందర్భంలో హైదరాబాదులో యావద్రాష్ట్రానికి ప్రాతినిధ్యం వహించే ఒక రాజకీయ సంస్థను స్థాపించడానికై ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక అగ్రనాయకులమధ్య సమాలోచనలు జరగినవి. తాత్కాలిక కమిటీ నియమింపబడినది. జిల్లా, తాలూకా కమిటీల కార్యకర్తలను రాజధానీ నగరానికి రప్పించి స్టేటు కాంగ్రెసు సంస్థ నిర్మాణానికై అవసర చర్యలు తీసుకోడానికి ఈ తాత్కాలిక కమిటీకి అధికారమివ్వబడినది. ఆ వెంటనే ప్రభుత్వం స్టేట్ కాంగ్రెసును నిషేధించింది. ఈ నిషేధాజ్ఞకు అసమ్మతి సూచకంగా 1938 లో స్టేట్ కాంగ్రెసు సత్యాగ్రహోద్యమాన్ని ప్రారంభించింది. ఈ సత్యాగ్రహంలో ప్రముఖ ఆంధ్ర నాయకులు పాల్గొన్నారు. తెలంగాణా సత్యాగ్రహశాఖ దేశీయ సంస్థాన మహాసభాధ్యక్షులగు డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యగారి సలహాల ననుసరించి విజయవంతంగా సత్యాగ్రహోద్యమాన్ని నడపింది. స్టేట్ కాంగ్రెసును ప్రభుత్వం మతపాతిక సంస్థగా పరిగణించి నిషేధించడం హాస్యాస్పదమైన విషయం. గాంధీ మహాత్ముని జోక్యంవల్ల సత్యాగ్రహులు కొంతకాలానికి విడుదల చేయబడినారు. ఇదే సమయంలో అయ్యంగార్ కమిటీ సూచనలు ప్రభుత్వామోదాన్ని పొంది ప్రకటితమైనవి. ఈ సంస్కరణలు శాసన సభాధికారాలను పరిమితం చేసినవి. ఈ సంస్కరణల ప్రకారం మంత్రులు శాసనసభకు బదులు నిజాంప్రభువునకు బాధ్యత వహించవలసి ఉండెను. అల్పసంఖ్యాకులైన ముస్లిములను శాసనసభలో బహుళ సంఖ్యాకులుగ మార్చివేసే అవకాశాలు ఈ సంస్కరణలద్వారా కల్పించబడినవి.

సప్తమాంధ్ర మహాసభ బాగాత్ (ఇప్పటి హైదరాబాదు) జిల్లాలోని మల్కాపురములో క్రి. శ. 1940 ఏప్రిలు మాసములో మందుముల రామచంద్ర రావుగారి అధ్యక్షత క్రింద సమావేశమైంది. మహిళామహాసభకు యోగ్యశీలా



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



దేవిగారు అధ్యక్షత వహించారు. ప్రభుత్వం ప్రకటించిన రాజకీయ సంస్కరణలపైన తీవ్రమైన చర్చలు జరిగినవి. ఈ విషయానికి సంబంధించిన తీర్మానంలో 'రాజ్యాంగ సంస్కరణలను బహిష్కరించవలెను' అనే ప్రతిపాదనపైన అగ్రనాయకులకు, యువక నాయకులకు వాగ్వివాదాలు చెలరేగినవి. 'బహిష్కరించ వలెను' అనే పదాన్ని తొలగించమని అగ్రనాయకులు సవరణ ప్రతిపాదించారు. ఓటుకు పెట్టగా సవరణ వీగి పోయింది. యువక నాయకులకు విజయం చేకూరింది. ప్రభుత్వం ప్రకటించిన రాజ్యాంగ సంస్కరణలను బహిష్కరించవలసినదిగా సప్తమాంధ్ర మహాసభ ప్రజలను ఉద్బోధించింది. ఆ తరువాత మహారాష్ట్ర కర్ణాటక మహాసభలు కూడ ఆంధ్ర మహాసభ అనుసరించిన పంథానే అనుసరించినవి.

ఎనిమిదవ ఆంధ్రమహాసభ నలగొండ జిల్లాలోని చిలుకూరిలో క్రీ. శ. 1941 జూన్ 3, 4, 5 తేదీలలో రావి నారాయణరెడ్డిగారి అధ్యక్షతను జరిగింది. అధ్యక్షోపన్యాసములో సంస్థాన రాజకీయ ఆర్థిక సమస్యలపై నిశిత విమర్శలు గావించబడినవి. కొంతవరకు అధ్యక్షోపన్యాసం మార్క్సు సిద్ధాంతాల ననుసరించింది. రంగమ్మ ఓబలరెడ్డిగారు మహిళా మహాసభకు అధ్యక్షత వహించారు.

తొమ్మిదవ ఆంధ్ర మహాసభ క్రీ.శ. 1942 మే 22, 23, 24 తేదీలలో వరంగల్లు జిల్లాలోని ధర్మవరం గ్రామములో సమావేశమైనది. అప్పటికి అగ్రనాయకుల, యువకనాయకుల మధ్యగల విభేదాలు చాలవరకు సమసిపోవడంవల్ల, యువక నాయకుల సూచనపై మాదిరాజు రామకోటేశ్వరరావుగారు ఏకగ్రీవంగా అధ్యక్షులుగ ఎన్నుకోబడినారు. అధ్యక్షోపన్యాసం చాలా క్లుప్తముగా ఉండినది. సభా కార్యక్రమాలు నిరుత్సాహంగా నడచినవి. మధ్య మధ్య యువకనాయకుల కూడలినుండి 'ప్రజాయుద్ధం' అను నినాదాలు వెలువడినవి. ఈ నినాదాలవల్ల యువకనాయకుల 'ఐక్య సంఘటన' ఆశయం బయటపడినది. ఈ మహాసభ చర్చలు ప్రజలకు ఏమాత్రం ఉత్తేజకరంగా లేకుండినవి. ఈ సంవత్సరంకూడ తిరిగి రంగమ్మ ఓబలరెడ్డిగారే మహిళా మహాసభకు అధ్యక్షత వహించారు.

పదవ ఆంధ్రమహాసభ హైదరాబాదులో క్రీ. శ. 1943 మే 23, 24, 25 తేదీలలో కొండా వెంకట రంగారెడ్డిగారి అధ్యక్షతను సమావేశమైంది. మహాసభాధ్యక్షుని ఎన్నిక సందర్భంలో జాతీయవాదులకు, కమ్యూనిస్టులకు పోటీలు వచ్చినవి. జాతీయవాదుల అభ్యర్థులగు కొండా వెంకట రంగారెడ్డిగారికే విజయం చేకూరింది. కమ్యూనిస్టు అభ్యర్థి బద్దం ఎల్లారెడ్డిగారు ఓడిపోయినారు. ఈ మహాసభలో జరిగిన ఉపన్యాసాల, చర్చలవల్ల జాతీయవాదులకు, కమ్యూనిస్టులకు మధ్యగల వ్యత్యాసాలు అధికతరమైనవి. మహాసభాధ్యక్షులు తమ ఉపన్యాసములో జాతీయవాదులను స్టేట్ కాంగ్రెసులోను, కమ్యూనిస్టులను కమ్యూనిస్టుపార్టీలోను చేరవలసిందనీ, ఉభయులూ ఆంధ్ర మహాసభను వదలుకొనడం సముచితమనీ హెచ్చరిక చేశారు. అధ్యక్షులు కడు దక్షతతో సభా చర్యలను నడపినారు. అప్పుడప్పుడు కమ్యూనిస్టు కూటమినుండి వెలువడిన నినాదాలను, అల్లరులను ఎంతో చాకచక్యంతో అణచివేశారు. పదవ మహిళా మహాసభకు యల్లాప్రగడ సీతాకుమారిగారు అధ్యక్షత వహించారు.

పదకొండవ ఆంధ్రమహాసభ క్రీ.శ. 1944 సంవత్సరములో భువనగిరిలో జరిగింది. అప్పట్లో 'భారతదేశంనుండి వైదొలగండి' (క్విట్ ఇండియా) అనే ఉద్యమం ఆసేతు హిమాచల పర్యంతమున్నూ ముమ్మరంగా సాగుతున్నది. ప్రజలు బ్రిటిష్ ప్రభుత్వమువల్ల అనేక నిర్బంధాలకు గురి అవుతున్నారు. యుద్ధమువల్ల ఆహారధాన్యాల ధరలు విపరీతంగా పెరిగిపోతున్నవి. క్షుద్బాధతో ప్రజలు అలమటించి పోతున్నారు. ఇట్టి పరిస్థితులలో ఆంధ్రమహాసభను జరపడం సముచితం కాదని కార్యవర్గ సభ నిశ్చయించింది. ఈ నిర్ణయానికి అసమ్మతి సూచకంగా కమ్యూనిస్టులు అప్పుడు మహాసభను జరపవలెనని ఒక తీర్మానం స్థాయి సంఘములో ప్రవేశపెట్టినారు. అధిక సంఖ్యాకులైన జాతీయవాదులు ఈ తీర్మానంపైన తటస్థ విధానాన్ని అవలంబించారు. దీనివల్ల అల్ప సంఖ్యాకులైన కమ్యూనిస్టులకు విజయం చేకూరింది. జాతీయవాదులు మహాసభా చర్యలలో పాల్గొనలేదు. దీనివల్ల పదకొండవ మహాసభ పూర్తిగా కమ్యూనిస్టుల అధీనంలో జరిగింది. దీనికి అధ్యక్షులు రావి నారాయణరెడ్డిగారు.

పదకొండవ ఆంధ్ర మహాసభ అనంతరము జాతీయవాదులు తాము తటస్థవిధానాన్ని అవలంబించి మహాసభను కమ్యూనిస్టుల పరం చేయడం గొప్ప పొరపాటని గ్రహించారు; వెంటనే ఆంధ్రమహాసభ పునరుద్ధరణ కార్యక్రమానికి పూనుకొన్నారు. ఆంధ్రమహాసభ పునరుద్ధరణకై కృషి సల్పినవారిలో మందుముల నర్సింగరావు, కొండా వెంకట రంగారెడ్డి, బూర్గుల రామకృష్ణారావు, మందుముల రామచంద్రరావు ప్రభృతులు ముఖ్యులు. వీరి కృషి ఫలితంగా పన్నెండవ ఆంధ్రమహాసభ వరంగల్లు జిల్లాలోని మడికొండ గ్రామం వెలుపల ప్రత్యేకంగా నిర్మింపబడిన విశాల మంటపంలో క్రీ. శ. 1945 మార్చి 21, 22, 23 తేదీలలో మందుముల నర్సింగరావుగారి అధ్యక్షతను జరిగింది.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అధ్యక్షోపన్యాసంలో ఆంధ్రోద్యమము, కమ్యూనిస్టుల ఎత్తుగడలు, ఆంధ్రమహాసభ పునరుద్ధరణ, ప్రస్తుత రాజకీయ పరిస్థితులు, రాజకీయ సంస్కరణలు మొదలైన సమస్యలను గూర్చి చర్చించబడినది. మహాసభానంతరము అధ్యక్షులు అప్పటి ప్రధాన మంత్రిని కలుసుకొని బాధ్యతాయుత ప్రభుత్వము, సంయుక్త నియోజకపద్ధతి, ఓటింగు హక్కు, శాసనసభకు ఆయ వ్యయ పట్టికను అంగీకరించే హక్కు మొదలైన మూలసూత్రాలు ఆధారంగా సిద్ధం చేయబడిన రాజకీయ సంస్కరణలు ఆంధ్రమహాసభకు అంగీకార యోగ్యములని తెలిపారు; తరిభూములపై పన్ను తగ్గింపు, ఆహారేతరపదార్థాలపైన (వేరు సెనగ మొదలైనవి) వేయబడు పన్నునుగూర్చి ప్రభుత్వంతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరపి రైతుబాంధవులకు అపూర్వమైన సేవచేశారు.

పదమూడవ ఆంధ్రమహాసభ క్రీ. శ. 1946 మే 10, 11, 12 తేదీలలో మెదకుజిల్లాలోని కంది గ్రామంలో జమలాపురం కేశవరావుగారి అధ్యక్షతను అతివైభవంగా జరగింది. మొదటి ఆంధ్రమహాసభ ఇదే జిల్లాలోని జోగిపేటలో సమావేశమైంది. ఆంధ్రమహాసభ తుది సమావేశంకూడ అదే జిల్లాలో జరగడం అతి విచిత్రమైన విషయం. అధ్యక్షులు తమ అధ్యక్షోపన్యాసంలో భారత రాజకీయాలను, భారత సంస్థాన సమస్యలను, నిజాం రాష్ట్ర రాజకీయ సంస్కరణలను విపులంగా చర్చించారు. క్రీ. శ. 1946 లో హైదరాబాదు ప్రభుత్వం స్టేట్ కాంగ్రెసుపైన విధించిన నిషేధాజ్ఞను తొలగించింది. వెంటనే ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక ప్రాంతీయ మహాసభల స్థాయి సంఘాల సమష్టి సమావేశం ఒకటి ఏర్పాటుచేయబడినది. మూడు ప్రాంతీయ మహాసభల స్థాయి సంఘాల ప్రతినిధులతో కూడిన ఒక కమిటి స్టేట్ కాంగ్రెసు వ్యవస్థీకరణకై నియమింపబడినది. ప్రాంతీయ సభలు స్టేట్ కాంగ్రెసులో విలీనీకరణానికి అంగీకరిస్తూ తీర్మానాలు చేసినవి. విలీనీకరణ తీర్మానము అంగీకరింపబడడంతో ఆంధ్రమహాసభ ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుగా మారినది.

ఆంధ్రోద్యమ నాయకులు ఉద్యమ ప్రచారానికై ఇరువురు ప్రచారకులను నియమించారు. వారు ఉన్నవ వెంకట రామయ్యగారు, మంత్రి ప్రగడ వెంకటేశ్వరరావుగారు. వీరు ఆంధ్ర భాషాప్రచారానికి, ఆంధ్ర సాంస్కృతిక పునరుజ్జీవనానికి చేసిన సేవ అమూల్యమైనది.

ఆంధ్రజన సంఘము నిజాం రాష్ట్రములోని ఆంధ్ర చరిత్ర సాధనాలను సేకరించడానికి 'ఆంధ్ర పరిశోధక సంఘము' అను పేరట ఒక ఉపసంఘాన్ని స్థాపించింది. కొంతకాలానికి ఇది స్వతంత్ర సంస్థగా మారింది. 'శ్రీలక్ష్మణరాయ పరిశోధక మండలి' అనే పేరుతో వ్యవహరింప బడుతూ ఇది ఆంధ్ర సాంస్కృతిక పునరుజ్జీవనానికి అమూల్యమైన సేవ చేసింది; 'తెలంగాణా శాసనములు' అను పేరట ఒక గ్రంథం ప్రకటించినది. ఈ శాసనాలు ఆంధ్ర చరిత్ర పరిశోధనకు ఎంతో ఉపకరించినవి. ఈ సంస్థను సక్రమమైన పద్ధతిలో నడపించిన ఆదిరాజు వీరభద్రరావుగారున్ను, రాష్ట్రంలోని వివిధ గ్రామాలలో పర్యటనము సల్పి శాసన ప్రతిబింబాలను, తాళపత్ర గ్రంథాలను సేకరించిన శేషాద్రి రమణకవులున్ను వంద్యులు.

నిజాంరాష్ట్రాంధ్రులలో సాహిత్యాభినివేశమును కలుగజేసి పెక్కుమంది యువకులను విఖ్యాతరచయితలనుగ జేసిన గౌరవం సాధనసమితి, ఆంధ్రసారస్వత పరిషత్తు, వైతాళిక సమితి, తెలంగాణా రచయితల సంఘము, నవ్య సాహితీసమితి మొదలైన సాహితీసంస్థలకు దక్కినది.

నిజాం రాష్ట్రంలో సాహిత్యాభిరుచిని కలుగజేసి సాంస్కృతిక వికాసానికి తోడ్పడిన పత్రికలలో నీలగిరి, తెలుగుపత్రిక, గోల్కొండ పత్రిక, సుజాత, తెలంగాణా, మీజాన్, శోభ, ప్రగతి, కాకతీయ ముఖ్యంగా పేర్కొనదగినవి. ఆంధ్రోద్యమము నిజాం రాష్ట్ర ఆంధ్ర యువకులకు తెలుగుపట్ల అభిమానాన్ని కలిగించింది. ఆంధ్రదేశంలో వీచిన సాహిత్య సమీరణములు వీరిని ఉత్తేజపరిచినవి. తెలంగాణాలోని పత్రికలు సాహిత్య వ్యాసంగానికి సాధన రంగాలుగా ఉపకరించినవి. యావదాంధ్ర విఖ్యాతిని గడించడానికి ఇక్కడి పత్రికలు ప్రథమ సోపానాలుగా యువకుల కుపకరించినవి.

నిజాంరాష్ట్రములో ఆంధ్రోద్యమానికి అంకురార్పణ చేసిన వారిలో ఆంధ్రపితామహులగు మాడపాటి హనుమంత రావు పంతులుగారు ముఖ్యులు. వారే ఈ యుద్యమాన్ని పోషించి పెంపొందించినవారు; తుదివరకు మార్గదర్శకులై ఉద్యమాన్ని విజయవంతంగా నడపించారు. వారి ఈ అవిరళకృషికి ముక్కోటి ఆంధ్రులు కృతజ్ఞతాంజలులను ఘటించక తప్పదు. 'భార్గవ'

## ఆంధ్రప్రదేశావతరణము

క్రీ. శ. 1953 అక్టోబరు 1 వ తేదిని ఆంధ్రరాష్ట్రము వచ్చినను అది అసమగ్రమైనది. హైదరాబాదులోని తెలుగు జిల్లాలు ఇందులో చేరియుండలేదు. వానిని గూడ చేర్చి విశాలాంధ్రరాష్ట్రమును నిర్మించవలెనని ఆంధ్ర ప్రముఖులు కొన్ని సంవత్సరములనుండి చెప్పుచుండిరి. క్రీ.శ. 1953 తర్వాత విశాలాంధ్రోద్యమ మభివృద్ధిగాంచెను. దీనికితోడు కర్ణాటకులు, మహారాష్ట్రులు మొదలైనవారు భాషారాష్ట్రముల విషయమై తీవ్రమగు ఆందోళనచేయు

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సాగిరి. ఈ సందర్భమున హైదరాబాదు రాష్ట్రము విచ్ఛిన్న మగుట వాంఛనీయమా అన్న సమస్య ప్రాధాన్యము వహించెను. ఈ విషయము లన్నిటిని పరిశీలించి, దేశమందలి రాష్ట్రముల పునర్నిర్మాణ మెట్లుండవలెనో పరిశీలించుటకు కేంద్రప్రభుత్వము క్రీ. శ. 1953 డిసెంబరులో ముగ్గురు ప్రముఖులతో కూడిన కమిటీని నియమించెను. ఆ కమిటీ వారు క్రీ. శ. 1955 సెప్టెంబరులో సమగ్రమైన నివేదికను సమర్పించిరి.

ఈ నివేదికలో వారు హైదరాబాదు రాష్ట్రము విచ్ఛిన్నము కావలసియున్నదని అభిప్రాయమును తెలిపిరి. కాని అందులోని తెలుగు జిల్లాలతో కూడిన తెలంగాణా ప్రాంతము ఆంధ్రరాష్ట్రముతో కలిపి విశాలాంధ్ర మేర్పడుటకు అయిదు సంవత్సరములు వేచియుండుట యుక్తమని తెలిపిరి. ప్రత్యేక తాత్కాలిక తెలంగాణా రాష్ట్రమునకు సుముఖులైనవారు హైదరాబాదు ఆంధ్రులలో కొందరుండుటను బట్టి వారి అభిప్రాయమును వెలిపుచ్చిరి. కాని వారి నివేదిక ప్రకటితమైన తరువాత దీనిని గురించిన చర్చలు జరగి తుదకు ఆంధ్ర తెలంగాణాలు కలిసిన 'ఆంధ్ర ప్రదేశ్' ఏర్పరచుటే కర్తవ్యమన్న వాదము నెగ్గెను. దీని కనుగుణముగ క్రీ. శ. 1956 లో ఇండియా లో సభ (పార్లమెంటు) రాష్ట్రముల పునర్నిర్మాణశాసనమును గావించెను. తత్ఫలితముగ క్రీ. శ. 1956 నవంబరు 1 వ తేదీన 'ఆంధ్ర ప్రదేశ్' అను పేరుతో విశాలాంధ్ర మవతరించినది. ఇంతటితో ఆంధ్రోద్యమ ఆశయము లన్నిటిలో ప్రధానస్థానమలంకరించిన అఖండాంధ్రరాష్ట్ర నిర్మాణాశయము ఫలప్రాప్తి గాంచెను. హైదరాబాదు సంస్థానము విచ్ఛిన్నమయినది. 'ఆంధ్ర ప్రదేశ్'కు హైదరాబాదు నగరము రాజధానియైనది.

మా. వెం. రం.



చిత్రము 72. శివ, విష్ణు దేవాలయ దృశ్యము, పుష్పగిరి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/

# రాజ్య పరిపాలన విధానము

## హిందూ ప్రభుత్వము

మనదేశమును క్రీస్తుకు పూర్వము మూడవశతాబ్దము నుండి క్రీస్తుశకము 1947 వరకు ఎన్నియో రాజవంశములు పరిపాలించినవి. వీనిలో కొన్ని హిందూ వంశములు; మరికొన్ని ముస్లిము వంశములు. ఈ వంశములకు తరువాత మన దేశమును పరిపాలించినవారు యూరోపియనులు; అందు ప్రధానముగా బ్రిటిష్‌వారు. బ్రిటిష్‌వారు పరిపాలించినప్పటినుండి మనదేశ పరిపాలన వ్యవస్థ ఎట్లుండెనో సవిస్తరముగ తెలిసికొనుటకు తగినన్ని యాధారములు కలవు; కాని అంతకు పూర్వపు పరిపాలన పద్ధతిని గురించి తెలిసికొనుటకు హిందూ ధర్మశాస్త్ర గ్రంథములు, రాజనీతిశాస్త్రములు, మహమ్మదీయ చరిత్రకారులు వ్రాసిన వృత్తాంతములు, శిలా తామ్ర శాసనములు మాత్రమే ప్రధానాధారములు. ఇవి యప్పుడు వాడుకలో నుండిన రాజ్యపరిపాలన వ్యవస్థను తెలుపుటకు పుట్టినవి కావు. మహమ్మదీయ వృత్తాంతములు, శిలా తామ్రశాసనములు - వీనినుండి ప్రాచీన పరిపాలన పద్ధతికి సంబంధించిన విషయములను సేకరించుకొని యవి పుట్టిననాటి పరిపాలన వ్యవస్థ చరిత్రను పునర్నిర్మించుకొనవలసి యుండును. ఇక హిందువుల ప్రాచీన ధర్మసూత్రములు, ధర్మశాస్త్రములు, రాజనీతి శాస్త్రములు రాజు ఇట్లు చేయవలెను; ఇట్లు ప్రవర్తింప వలెను, ఇట్లుండవలెను అని విధ్యుక్త ధర్మములను సిద్ధాంత రూపమున బోధించునవి, శాసించునవే కాని ఆయాయి కాలముల వాడుకలోను, వ్యవహారములోను ఉండిన పరిపాలన పద్ధతిని తెలుపవు. కాని మన దేశమున హిందూనృపతు లవలంబించుచు వచ్చిన రాజనీతికిని, రాజ్య పరిపాలన నిర్వహణమునకును అవియే ప్రాతిపదికలు; కావున అవి సిద్ధాంతములు మాత్రమే యని వానిని సుతరాము నిరసించి కొట్టివేయలేము. అదియునుగాక పూర్వోక్త గ్రంథములలో సిద్ధాంతరూపముగను, విధులుగను చెప్పిన విషయముల ననుసరించి హిందూనృపాలుర కాలమున పరిపాలనము సాగుచుండిన ట్లూహించుట కనువుగా వానిలోని కొన్ని విషయములు శాసనముల వలన రుజువగుచున్నవి. ఈ కారణముచేత హిందూపరిపాలన పద్ధతి ధర్మసూత్రములు, ధర్మశాస్త్రముల మీదనే ప్రధానముగ నాధారపడినదని, వాని ప్రకారమే నిర్వహింపబడుచు వచ్చెనని నిస్సంశయముగ చెప్పవచ్చును. పరిపాలన నిర్వహణము నందలి ప్రధాన సూత్రములను ఏనాడో సూత్రకర్తలును, ధర్మశాస్త్ర కర్తలును ప్రవచించి యుండుటచేత హిందూ ధర్మశాస్త్రపద్ధతి ననుసరించి భూనాథుడు కార్యనిర్వాహక ప్రధానోద్యోగియే; తత్సూత్రములకు, విధులకు వ్యతిరేకముగ నడచుట కతని కధికారము లేదు. వానిలో తెలుపబడిన ప్రధాన సూత్రముల నతడు పాటించి తీరవలెను; కాని పరిపాలన వ్యవహార నిర్వహణములో సౌకర్య, సౌలభ్యముల నిమిత్తము తద్ధర్మశాస్త్రోక్త విధుల కనుగుణముగా ఎట్టి నూతన పద్ధతులనైన ప్రవేశపెట్టుకొన వచ్చును; కార్యనిర్వహణమునకు క్రొత్త యుద్యోగులను ఎందరినైన నియమించుకొన వచ్చును.

రాజకార్య నిర్వహణము నిమిత్తము నియమితులైన వారికి, నియోగింపబడిన వారికి సాధారణముగా నైయామికు లనియు, నైయోగికు లనియు, రాజపురుషు లనియు పేరు. మనదేశమున బయలుపడిన శాసనములలో ఇటువంటివారు వేరు వేరు పేర్లతో ఎందరో ఉదాహృతులయినారు. కాని వీరు నిర్వర్తింప వలసిన విధులుకాని, ప్రధాన రాజకీయోద్యోగి వర్గమున వీరి స్థానముకాని సరిగా తెలియరాలేదు. ఒక కాలములో వినవచ్చిన రాజోద్యోగుల పేరులు ఇంకొక కాలములో వినరాకపోవుటయు కలదు. ఒక రాజ్యములో నుండిన ఉద్యోగ పదవులు ఇంకొక్క రాజ్యములో కానరాకపోవుటకును, క్రొత్త పదవులు పరికల్పితము లగుటకును రాజ్యపరిమాణ, విస్తృతులును, కాలపరిణామమును కారణములు. రాజోద్యోగ పదవులందు నియుక్తులైన బ్రాహ్మణులు షట్కర్మాచరణమునందు కంటెను ఎక్కువగ రాజకార్యాచరణమునందు తత్పరు లగుచువచ్చిరి. వారి సంతతివారును తమ తండ్రి తాతల ననుసరించి రాజోద్యోగమునే చేపట్టుచు వచ్చిరి. కాలము గడచిన కొలది, క్రమక్రమముగా క్రీస్తు శకము పదుమూడవ శతాబ్ది చివరకు రాజోద్యోగ నియుక్తు లగుచువచ్చిన వీరు నియోగు లనుపేర బ్రాహ్మణులలో ఒక శాఖగా నేర్పడిరి. వైదికకర్మాచరణ పరాయణులైన మిగిలినవారు వైదికు లనబడిరి.

ఈ రీతిని రాజ్యతంత్ర నిర్వహణమునకు ఎందరెందరుద్యోగులు నియమితులగుచు వచ్చినను ప్రధానపరిపాలన సూత్రములు మాత్రము ధర్మసూత్ర, ధర్మశాస్త్ర



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



నియతములే. ప్రాచీన హిందూ రాజ్యతంత్రము ననుసరించి రాజు ధర్మరక్షకుడును, ధర్మ శాస్త్రానుసారియునే కాని ధర్మ శాస్త్ర కర్త కాడు. పురాతనకాలము నుండి వచ్చుచుండిన సాంఘికాచార నియమములను, సుప్రతిష్ఠితములైన ధర్మ సిద్ధాంతములను అనుసరించి పరిపాలనము నెరపి వర్ణాశ్రమ ధర్మములను కాపాడుట అతని విధి. ఈ కారణముననే మనదేశమును పరిపాలించిన సాతవాహన భూవరులు తాము వర్ణాశ్రమ ధర్మ పరిపాలకులమని, పల్లవ రాజులు తాము కలియుగ దోషావసన్న ధర్మోద్ధరణ నిత్య సన్నద్ధులమని చెప్పుకొని యున్నారు.

సూత్రకాలము నాటికే మనదేశమున రాజ్యవ్యవస్థ ఒకరూప మేర్పడినది. తరువాతి కాలమునాటి రాజ్యాంగ విధానమున కంతకు పునాదు లప్పటివే. బ్రాహ్మణులు షట్కర్మాచరణ పరాయణులు. క్షత్రియులు భూపరిపాలకులు. కృషి వాణిజ్య పాశుపాల్యములు వైశ్యులు చేయవలసిన పనులు. సూత్రకాలమునాటికే ఆంధ్ర జనపదములు గ్రామ, నగర సమాకీర్ణములైనవి. ప్రజ లందరిని సమానముగా రక్షించుట రాజధర్మము. శ్రోత్రియులైన బ్రాహ్మణుల నతడు పోషింపవలెను. నగరములను గ్రామములను రక్షించుటకు రాజు మొదటి మూడు వర్ణములలోని వారిని నియమింప వలెను. అతడు రథారూఢుడును, ధనుష్పాణియునై వర్తింపవలెను. తాను ప్రజలకు రక్షణ యిచ్చుచుండినందుకు అతడు కర్షకులు పండించిన పంటలో పదవ వంతునో, ఎనిమిదవ వంతునో, లేక ఆరవ వంతునో పన్నుగా గ్రహింప వలెను. ఆవులు, ఎద్దులు, బర్రెలు మొదలగు పశువులను, వెండి బంగారము మొదలగు వానిని పెట్టుకొని వానిమీద జీవించువారు తమకు వచ్చు ఆదాయములో ఏబదియవపాలు రాజునకు శుల్కముగ నీయవలసి యుండెను. రాజునకు పన్ను చెల్లించుటకు బదులుగా శిల్పులు మాసమున కొకదినము ఉచితముగ పనిచేయవలసి యుండెను. పనిచేయు దినములందు వారికి భోజనమును మాత్రము రాజే పెట్టవలెను. రాజు దొంగలను బట్టుకొని అపహృత ద్రవ్యమును యజమాని కీయవలయును. అట్లు చేయలేకపోయినచో రాజు యజమానికి అతడు కోలుపోయినంత ద్రవ్యమును తన కోశమునుండి తీసి యీయవలెనని ధర్మ శాస్త్ర నిర్ణయము. శత్రువులను జయించినపిదప ఏ సైనికులకు లభించిన విత్తము వారిదే కాని రాజు గైకొనగూడదు. కాని శత్రువులనుండి గైకొనిన వాహనాదికములు మాత్రము రాజువే. రాజభృత్యులు శాస్త్ర విహితములైన శుల్కములను ప్రజలనుండి వసూలుచేయవలెను.

సాక్ష్యములు చక్కగ విచారించి ధర్మశాస్త్ర ప్రమాణము ననుసరించి వేదవిదులు, ధర్మశాస్త్ర పారంగతులు, లోకానుభవ వృద్ధులునగు బ్రాహ్మణ సభాసదులు వివాదములను పరిష్కరింపవలెను. ధనోద్భవములు, హింసోద్భవములు అని అభియోగములు రెండు విధములు. వివాద పరిష్కారములో వేద విరుద్ధములుకాని దేశ, వర్ణ, కుల ధర్మములు ప్రమాణములుగా అంగీకరింపబడవలెను. ధనోద్భవములను పరిష్కరించుట సభాసదుల పని. సాక్ష్యము కాని, ఇతర ప్రమాణములు కాని లేని అభియోగములు దివ్యములను (ఆర్డియల్స్) పురస్కరించుకొని పరిష్కరింపవలెను. హింసోద్భవములను విచారించుపని దండవాధికారముగల ఇతరోద్యోగులది. మరణ దండనము విధింపవలసిన అభియోగములను రాజే స్వయముగ విచారింపవలెను. రాజద్రోహమునకు మరణదండనము విధింపబడుచుండెను.

ఈవిధమున సూత్రకాలమునాటి ధర్మ విధి, నిషేధములే, ధర్మసూత్రములే తరువాతికాలపు రాజ్యపద్ధతికి ప్రాతిపదికలైనవి.

ఆదిమకాలమున ప్రాచీన రాజ్యపద్ధతి అట్లే సాగుచుండి యుండవలెను. ఇట్టి యూహకు ధర్మసూత్రములే ఆధారము. మొత్తముమీద తరువాతి కాలమునాటి రాజ్యవ్యవస్థకాసూత్రములే ప్రాతిపదిక లనుటకు సంశయము లేదు.

మౌర్య యుగమునకు వచ్చువరకు ఆంధ్రదేశ పరిపాలనమును గురించి మన కంతకంటె తెలియదు. మొదటిమారు ఆంధ్రదేశము బిందుసార, అశోక చక్రవర్తుల నాటినుండి మౌర్య సామ్రాజ్యమున చేరిపోయిన తరువాత మౌర్య పరిపాలనపద్ధతి అమలులోనికి వచ్చినది. నాటి రాజ్యవ్యవస్థకు చంద్రగుప్త మౌర్యుని ప్రధానియైన చాణక్యుడను నామాంతరముగల కౌటిల్యుడు రచించిన అర్థశాస్త్రము ప్రధానాధారము. మౌర్య సామ్రాజ్యమునుండి విడివడి దక్షిణాపథమున స్వతంత్రరాజ్యము నెలకొల్పిన ఆంధ్ర సాతవాహన నృపులు స్థానికములైన కొద్ది మార్పులు చేసి మౌర్య పరిపాలన పద్ధతినే అనుసరించిరి.

హిందూమహాయుగమున భారతదేశములోని ఇతర రాష్ట్రములలోవలెనే తెలుగుదేశమునందుకూడ వాడుకలో నుండిన ప్రభుత్వ పద్ధతి రాచరికము. రాజ్యమున కంతకు అధిపతి రాజు. హిందూ నీతిశాస్త్రముల ప్రకారము స్వామి (నృపుడు), అమాత్యుడు, సుహృదుడు (మిత్రుడు), కోశము (బండారము), రాష్ట్రము (రాజ్యము), దుర్గము (కోట), బలము (సైన్యము) అని రాజ్యాంగములు ఏడు. సప్తాంగకమైన నృప పదమునందు ప్రభుత ప్రధానమయినది.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



## కేంద్ర పరిపాలన

సాతవాహన కాలమున భూపతికి స్వామి యనియు, రాజనియు, రాజరాజనియు వ్యవహార ముండెను. స్వతంత్ర రాజ్యమును సంస్థాపించి సాతవాహనరాజులు అశ్వమేధ యాగమును గావించిరి. నాటినుండి తెలుగుదేశమున రాజులకు స్వతంత్ర రాజ్యస్థాపనము చేసి అశ్వమేధయాగము నొనరించుట ఆచారమయినది. ఇక్ష్వాకులు, పల్లవులు, శాలంకాయనులు, విష్ణుకుండి భూవరులు, పూర్వచాళుక్యులు అందరును అశ్వమేధయాగము చేసి అవభృథ స్నానమున పవిత్రీకృతశరీరులైనవారే. రాజ్యాధిపతికి కాలక్రమమున రాజన్న వ్యవహారముపోయి మహారాజని పేరు కలిగినది. రాజ్యము విస్తరించి సామంతులచేత, మండలికులచేత సేవింపబడుచు వచ్చిన రాజ్యాధిపతి తెలుగుదేశ చరిత్ర మధ్యయుగమున పంచమహాశబ్ద గౌరవాంచితుడును, మహామండలేశ్వర బిరుదాంచితుడును అయ్యెను. ఇంకను కాలము గడచినకొలది మహామండలేశ్వరులైన మహారాజులు సామ్రాజ్యాధిపతులైరి. అప్పటినుండి అర్వాచీన మధ్యయుగము*న వారి పదవీ, గౌరవములను దెలుపుటకు ఆ బిరుదములు చాలినవి కావు. క్రమముగా వారి బిరుదావళి పెరిగె. వారు రాజాధిరాజులు, మహారాజాధిరాజ పరమేశ్వరులును అయిరి.



చిత్రము 73. [illegible]



చిత్రము 74. విజయనగర రాజలాంఛనము

రాజు : దేశాధిపతియైన రాజు సప్తాంగము లన్నిటిలోను చాల ముఖ్యుడు. రాచరికము తండ్రినుండి కుమారునికి వంశ పారంపర్యముగ వచ్చుచుండెను. తెలుగు దేశము నేలిన ఇట్టి రాజవంశము లనేకము. ఒక్కొక్క రాజవంశమున కొక్కొక్క లాంఛనము, ఒక్కొక్క ధ్వజము నుండెను. పూర్వగాంగ నృపతులది వృషభ లాంఛనము. పూర్వ చాళుక్యులది వరాహ లాంఛనము. ద్రావిడదేశము నేలిన చోళులది వ్యాఘ్ర లాంఛనము. ఒడ్డాది మత్స్య వంశము వారిది మత్స్య లాంఛనము. తెలుగు చోళులలో ఒకశాఖ వారిది గండభేరుండము. విజయనగరాధీశ్వరులది ఖడ్గము ముందుగా గల వరాహ లాంఛనము. లాంఛనములవలె మన దేశము నేలిన అన్ని రాజవంశముల ధ్వజములును తెలియవచ్చుట లేదు. పౌరాణిక వంశాను క్రమమును చెప్పుకొన్న పూర్వ చాళుక్యులు తమది పాళీ ధ్వజమని చెప్పుకొనిరి. పూర్వగాంగ నృపులది సామజ ధ్వజము. రాజ్యము పెంపొంది రాజులు మహారాజులు, సామ్రాజ్యాధిపతులు అగుటతో 'పూర్వ మధ్య యుగము'న వారు పౌరాణిక వంశములతో సంబంధము కలుపుకొని అన్వయ క్రమమును తమ దాన పత్రములలో నభివర్ణించుకొనుటయు, తమ ప్రాజ్య రాజ్య వైభవమునకు సూచకముగ సామ్రాజ్య చిహ్నములను వెలయించుకొనుటయు జరగినది. శ్వేతాతపత్రము, ఏకశంఖము, పంచమహాశబ్దములు, పాళికేతనము, ప్రతిఢక్క, పింఛము, కుంతము, సింహాసనము, మకర తోరణము, కనకదండము, గంగా యమునాధిష్ఠిత ద్వారము మొదలైనవి పూర్వచాళుక్యభూవరుల సామ్రాజ్య చిహ్నములు. ఇట్లే ధవళచ్ఛత్ర, చామర, సామజధ్వజ, వృషభ లాంఛన, పింఛాంచిత కుంతనికర, మకర తోరణ, పలుదుక్కా, కాహళ శైకశంఖాదులు పూర్వగాంగ భూపతులరాజ చిహ్నములు. ఇట్లే ఇతర రాజవంశములకు నుండెను. రాజు ఉత్సవముతో ఊరేగునపుడు ఈ రాజ్య చిహ్నము లన్నియు నుండెడివి. సాధారణ సమయములందుకూడ రాజు వెటకేని పోవునపుడు అతని రాజ ఖడ్గమును దీసికొని అతని యంగరక్షకుడు ముందరుగువాడు. మధ్య యుగమున అడపము, నందలముకూడ రాజ్య చిహ్నములైనవి.

రాజసేవలో గొప్ప పరాక్రమమును చూపి మెప్పించిన తన క్రింది యుద్యోగులకు, సేవకులకు అప్పుడప్పుడు మహాసామంత బిరుదమును, దానితో అతనికి జీవితముగ నొక గ్రామమును, ఇతర గౌరవములను మహారాజు ప్రసాదించుట 'పూర్వయుగము'న పూర్వచాళుక్యుల కాలమునందు కానవచ్చును; ఇట్లే దేశాధీశ్వరుడు తనకు మెప్పు గూర్చిన బ్రాహ్మణులకు అగ్రహార దానమును చేయుటయే

* పూర్వ మధ్య యుగము అన్నది తెలుగుదేశ చరిత్రలోని యుగములుగ గ్రహించునది.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కాక మహారాజ బిరుదము నొసంగుటయు కలదు. ఒక్కొక్క బిరుదమునకును గౌరవ మర్యాద లుండెడివి.

స్తంభములకు అరటిచెట్లను కట్టుకొను నధికారము 'పూర్వ యుగము'న రాజు ప్రసాదింపవలసిన మర్యాదలలో నొకటి. రాజ్యములోని యరణ్య మంతయు రాజుది. దానిలో వేటాడుట కొక్క రాజునకే హక్కు కలదు. ఎవరైనను అందు వేటాడుటకు హక్కుకూడ రాజు ప్రసాదింపవలసిన మర్యాదలలో ఒకటి. త్రైవర్ణికేతరులైన వధూవరులు గుర్రముమీద నూరేగుట, అందల మెక్కుట కూడ పూర్వము రాజు కాని, మంత్రి మహానాటివారు కాని ప్రసాదింపవలసిన మర్యాదలే.

రాజు వైదిక సంస్కృతిని, వర్ణాశ్రమ ధర్మములను పాలించి రక్షింపవలసి యుండుటచేత దేశ, కులాచార సంప్రదాయములను గుర్తెరిగి యుండవలెను; 'పూర్వ యుగము'న రాజు క్షత్రియుడే యగుటచేత వేదములను, రాజనీతి మొదలయిన శాస్త్రములను అభ్యసింపవలసి యుండెను. సింహాసనము నెక్కుటకు రాజునకు విద్యా పారంగతత్వ మొక యోగ్యతగ నుండెను. అందువలననే పూర్వము మన దేశమునందలి రాజులు తమ యాస్థానమున జరగు శాస్త్ర వాదములందలి గుణావగుణములను తెలిసికొని అందు కనుగుణముగ విద్వాంసులను సమ్మానించుచు వచ్చిరి; శాస్త్ర విద్యలను, కళలను పోషించుచు వచ్చిరి. క్షత్రియేతరులైన చతుర్థ కులజులగు రాజులుకూడ శాస్త్ర కావ్య నాటకాదులను చక్కగ నభ్యసించి విద్యాఢ్యులై వాసి కెక్కిరి. పూర్వపు రాజులు సాధారణముగా కీలుబొమ్మలవంటివారు కారు; పాండితీ వైభవోపేతులు. అందువలననే మన దేశమునందలి ప్రతి ప్రాచీన రాజ్యము సంస్కృతి రాజ్యమే.

రాజు లందరును వైదిక ధర్మనిరతులే. 'పూర్వ యుగము'న రాజకీయముగ ప్రాముఖ్యము వహించిన అశ్వమేధ యాగము నేకాక అగ్నిష్టోమము, వాజపేయము, అప్తోర్యామము మొదలైన ఇతర క్రతువులను చేసిన నరపాలురును కలరు. మధ్య యుగమున క్రతువులకంటెను షోడశ మహాదానములకును, వ్రతములకును ప్రాముఖ్యము హెచ్చినది. హేమాద్రి కల్పోక్త దానములను, వ్రతములను అనేకము చేసి పుణ్యమును, యశమును ఆర్జించిన రాజులు పెక్కురు.

రాజు ప్రాచీనాచార సంప్రదాయముల ననుసరించియు, స్మృతుల ననుసరించియు పాలింపవలసియుండుటచేత అతని అధికారము పరిమితమైనది. కాని అతడు ప్రజలను నిరంకుశముగను, క్రూరముగను పరిపాలించినను అతనిని వారించుటకు స్మృతులయం దేమియు చెప్పబడలేదు. నిరంకుశులుగను, క్రూరులుగను ప్రవర్తించిన రాజులు పూర్వ కాలమున చాల తక్కువ. రాజు తన చిత్తము వచ్చినట్లు నిరంకుశముగ ప్రవర్తింపకుండ ఇద్దరు రాటంకములుగ నుండిరి: ఒకరు మంత్రులు; రెండవవారు సామంత, మండలేశ్వరులు.

మంత్రి: నృపపదమునకు తరువాత తాదృశ ప్రాముఖ్యము కలిగినది అమాత్యపదవి. శాతవాహనుల కాలమున రాజసన్నిధినుండు మంత్రులకు రాజామాత్యులని వ్యవహారము. అమాత్య, మంత్రి, సచివ, ప్రధాని పదములు పర్యాయపదములు. అయినను పూర్వము ఒక్కొక్క రాజ్యమునందు, ఒక్కొక్క కాలమున మంత్రు లనేకు లుండిరి. వారి పదవులలోను, నిర్వహింపవలసిన విధులలోను వ్యత్యాసముండెను. నీతి శాస్త్రములును, అర్థశాస్త్రములును వీరు పదునెనమండ్రని చెప్పుచున్నవి. తీర్థము లన్నది వీరికి ప్రత్యేక సాంకేతిక వాచకము. 'సకలనీతి సమ్మతము'న వీ రిట్లు తెలుపబడిరి: (1) మంత్రి, (2) పురోహితుడు, (3) మంత్రిజనాధ్యక్షుడు, (4) సైన్యాధినాయకుడు, (5) సన్నిధాత, (6) ఆయోధనాయకుడు, (7) ప్రశాస్త, (8) వ్యావహారికుడు, (9) సమాహర్త, (10) దండపాలుడు, (11) ప్రదేష్ట, (12) కార్మాంతికుడు, (13) యువరాజు, (14) దౌవారికుడు, (15) దుర్గపాలుడు, (16) అంతర్వంశికాధికారి, (17) అంతపాలకుడు, (18) ఆటవికుడు. ఇవే కౌటిల్యుని అర్థశాస్త్రమునందును చెప్పబడినవి. కొన్ని నీతిశాస్త్రములలో తీర్థములు పదునెనిమిదనియే చెప్పబడినను మూడు నాలుగు తీర్థముల విషయమున పేర్లలో నించుక భేదము కలదు. పేర్లలో ఏ వ్యత్యాసము లున్నను తీర్థములు మాత్రము పదునెనిమిదే. ఈ తీర్థములు కేంద్ర ప్రభుత్వమునందలి పదునెనిమిది శాఖలకు నధిపతులని కొందరి మతము. పూర్వచాళుక్యుల కాలమున ఈ పదునెనమండ్రు నుండిరని వారి శాసనములవలననే తెలియవచ్చినది. వీ రందరు రాజ్యకార్య నిర్వహణమున స్వామికి తోడ్పడుచుండిరి. మంత్రు లందరిలోను ముఖ్యుడయిన వానిని ప్రధాని యందురు. శాసనములందతడు సర్వాధికారియని, మహామాత్యుడని, మహాప్రధాని యని వ్యవహృతుడయినాడు. ఒక్కొకప్పు డితడు ప్రధానిగను, సర్వసైన్యాధిపతిగను కూడ [illegible]హరించువాడు. కొమరగిరిరెడ్డి బావమరది కాటయవేమారెడ్డి అతని ప్రధానియు, దండనాయకుడును కూడను. పూర్వ దిగ్విజయ యాత్రా సందర్భమున సర్వసైన్యాధిపత్యమును వహించిన దతడే. విజయనగరమును పాలించిన తుళువ వంశజుల కాలమున మంత్రిముఖ్యుడు శిరఃప్రధాని యనియు, సర్వ శిరః



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ప్రధాని యనియు వ్యవహృతు డయ్యెను. 'పూర్వ యుగము'నందు అమాత్యుడను పేరనే మంత్రి ముఖ్యుడు వ్యవహరింపబడుచుండినట్లు తెలియుచున్నది. ప్రభుత్వమున చాల ముఖ్యపదవుల నలంకరించిన వారికి కూడ రాజునకు వలెనే తత్పద వ్యుచితములైన బిరుద లాంఛనము లుండెడివి. వీనిని 'విశేష మహిమ' లని వ్యవహరించు చుండిరి. శ్రీద్వార, పింఛ, కరక, ఆతపవారణములు పూర్వచాళుక్యుల కాలమున అమాత్యుని 'విశేష మహిమ'లు.

**యువరాజు :** ముఖ్యమంత్రి తరువాత యువరాజు ముఖ్యుడు. దేశాధిపతి సర్వనృపవిద్యా పారంగతుడై యుక్త వయస్సు వచ్చిన తన జ్యేష్ఠకుమారుని యౌవ రాజ్యమున కభిషేకించుట యాచారము. పూర్వ చాళుక్య నృపతుల కాలమున యౌవరాజ్యపట్టమునకు కంఠికదామము సూచకముగ నుండెడిది. 'పూర్వయుగము'న యువరాజు 'రాజశ్రీ' బిరుదాంచితుడైనట్లు శాసనముల వలన దెలియు చున్నది. యౌవరాజ్య పట్టము కట్టినపిదప కొన్ని పరిపాలనాధికారముల నిచ్చి దేశాధీశ్వరు డతనికి పరిపాలన పద్ధతిలో శిక్షణము నిచ్చుచుండెను. ఈ కారణమున మహారాజు, యువరాజు - ఉభయులును కొన్ని సంవత్సరములు కలసి పరిపాలించిన సందర్భములు తెలుగు దేశ చరిత్రలో తెలియవచ్చును. పూర్వచాళుక్యుల పరిపాలనము కడపటి కాలమునందును, కల్యాణి చాళుక్యుల పరిపాలనకాలము నందును యువజరా పదమునకు రాజానుగ్రహపాత్రులగు రాజసుతేతరులుకూడ నియమింప బడుచు వచ్చిరి. ఆ విధమున యువరాజ పదము అప్పుడు ఉన్నతోద్యోగ పదవులలో ఒకటియైనది.

పశ్చిమచాళుక్య పరిపాలనమున తక్క రాణులు కాని, యువరాజ్ఞులు కాని కొన్ని గ్రామములకో, విషయములకో అధినేతలై పాలించుట తెలుగుదేశమున కానరాదు. పల్లవ యువరాజ్ఞి (యువరాజు భార్య) చారుదేవి ఒక గ్రామమును బ్రాహ్మణులకు దానముచేసి తానే దానపత్రము నిచ్చుట గమనింపదగిన విషయము. ఈ దానశాసనమును ఆమె తన భర్తయొక్క కాని, తన మామగారి యొక్క కాని అనుమతిని తీసికొనకయే యిచ్చుట విశేషము.

దేశాధిపతికి పుత్రసంతతి లేనప్పుడు అతడు తన తమ్ముని యౌవరాజ్యమున కభిషిక్తుని చేయుచుండె ననుట కాధారము కలదు; పుత్రులును, తమ్ములును కూడ లేనప్పుడు తన కూతురినే 'పట్టోద్ధృతి'ని కావించి తన యనంతరము నృపపదమునకు నియమించిన సందర్భము కాకతీయ చరిత్రయందు గానవచ్చును.

ఇదివరలో నుడివినట్లు రాచరికము తండ్రినుండి కొడుకునకు వంశపారంపర్యముగ సంక్రమించుచుండెను. శాతవాహన భూధవుల కాలమున దేశాధిపతి (స్వామి) బాలకుడుగా నుండినప్పుడు తల్లియైన రాణి తన తండ్రి సాయముతో తన కుమారునికి ప్రతినిధిగ రాజ్యమేలిన సందర్భమొకటి కలదు. దేశాధిపతి బాలుడైనచో రాజ్యక్షేమము ననుసరించి ఒక్కొకప్పుడు మంత్రి సామంత దండనాయకులును, దొర లితరులును గతించిన మహారాజు సోదరుని రాజ్యమున కభిషిక్తుని చేసిన సందర్భమును తెనుగుదేశ చరిత్రలో కనిపించును. కాని యట్టి యుదాహరణములు చాల అరుదు. సాధారణముగ రాజ్యము రాజు జ్యేష్ఠ తనయునికి సంక్రమించుటే పరిపాటి.

**పురోహితుడు :** మంత్రి వర్గమున ప్రధానితో సరి సమానమైన ప్రాముఖ్యము కలవాడు పురోహితుడు. ఇతడు లౌకిక, పారలౌకిక విషయములను గురించి రాజునకు హిత ముపదేశించి రాజ్యక్షేమ, ప్రజాక్షేమముల నిమిత్తము వైశ్వదేవ బలి రుద్ర హోమాదులను, శాంతిక పౌష్టికాది క్రియలను ఆచరింపవలెనని నీతిశాస్త్రములు తెలుపుచున్నవి. శాసనములలో పురోహితుని ప్రస్తావ మున్నను అతని విధులను గురించి యేమియు కానరాదు. ఎట్లయినను తెలుగుదేశ చరిత్ర పూర్వయుగమునందు రాజ్యాంగమున పురోహితుని కుండిన ప్రాముఖ్యము తరువాతి యుగములలో నుండినట్లు కానరాదు. కాలము గడచిన కొలది పురోహితుడు మత విషయములందు సలహా చెప్పువాడును, గురువు నయ్యెను.

**సైన్యాధిపతి :** సర్వసైన్యమునకును అధిపతి సేనాపతి. ఇతనికి మహా బలాధికృతు డనియు, సర్వసైన్యాధిపతి యనియు పేరు. పూర్వగాంగ శాసనములం దితడు మహాసేనాపతి యనియు వ్యవహరింప బడెను. దళవాయి, దళనాయకుడు, పడవాలు, దండనాయకుడు - వీ రందరు సైన్యాధిపతి క్రింది యుద్యోగులు. అందరికంటె క్రిందివాడు నాయకుడు. నాయకు డన్నది మొదట సైనికముగ వచ్చిన పదమే. సైన్యశాఖకు విజయనగరాధీశ్వరుల కాలమున కందాచారమని పేరు. విజయనగర శాసనములలో కందాచార నాయకుడని యొక యధికారి పేర్కొనబడెను. ప్రాయికముగా ఇతడు సైనికశాఖ రస్తు సామగ్రి కంతకు అధికారి కావచ్చును.

భారతీయ సైన్యము రథ, గజ, తురగ, పదాతులను చతురంగములతో కూడినదని ప్రసిద్ధి. ప్రాచీనకాలము నుండియు రథము లంతగ యుద్ధమున వాడుకలో నుండినట్లు కనబడదు. అశ్వికులకు రాహుత్తులని, రౌతులని



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పేరు. విజయనగరాధీశ్వరులైన దేవరాయల శాసనమున విజయనగరము వారిది షడంగ బలమని చెప్పబడినది. భారతీయ రాజకీయ వాఙ్మయముకూడ హిందూ సైన్యము షడంగక మనియే చెప్పుచున్నది. మూలబలము, భృతక బలము, శ్రేణి బలము, మిత్రబలము, అమిత్రబలము, ఆటవికబలము - అని ఇవి యారును సైన్యములోని షడంగములు. మూలబలము (మౌలము) రాజువద్ద స్థిరముగ నుండుబలము. భృతక మన్నది విజయనగర సామ్రాజ్య కాలమునాటి కైజీతగాండ్ర సేన వంటిది కావచ్చును. యుద్ధావసరమునకు జీతమును గ్రహించి సేనలో చేరువారు కైజీతగాండ్రు. యుద్ధము తీరిన తరువాత ఈ సేనను విడగొట్టెదరు. ఇట్లే యుద్ధావసరమున కేర్పడు మరియొక సేన శ్రేణిబలము. శ్రేణి అనగా వర్తక వ్యాపార సంఘము. వీరబలంజసమయమువారు, అయ్యావళీ స్వాములు యుద్ధము సంభవించినప్పుడు సేనలో చేరి రాజునకు తోడ్పడుచుండెడివారు. విజయము చేకూరినప్పుడు ఈ వర్తకసంఘముల వారు రాజువలననుండి బిరుదావళులను, వ్యాపార సౌకర్య, మర్యాదలను పొందుచుండువారు. రాజున కిరుగు పొరుగుల నున్న మిత్రరాజ్యములవారు సాయముగా పంపిన సేన మిత్రబలము. శత్రుపక్షమునుండి ఏదో యొక కారణముచేత ఆగతులై స్వార్థమును సాధించుటకొరకు రాజు నాశ్రయించియుండు పరపక్ష బలము అమిత్ర బలము. రాజ్యమునందలి ఆటవికులను చేర్చి యేర్పరచునది ఆటవిక బలము. వాఙ్మయమున నిట్లు సైన్యము షడంగకమని చెప్పినను వ్యవహారమున ఇంకను వేరు తరగతు లుండెను. మధ్యయుగమునాటి ఎక్కట్లు మూల సైన్యమునకు చెందని యొక విడి భాగము. ఈ యెక్కట్లు ద్వంద్వయుద్ధమున ప్రవీణులు. వీరిని ప్రత్యేకము కొన్ని గ్రామములలో ఠాణ్యా ముంచువారు. రాను రాను మన సంఘములో ఒంటరులను పేర వీరు ఒక కులముగా ఏర్పడియున్నారు. వెలగోలు బలమని సేనలో మరియొక విభాగము కలదు. ఇది బల్లెపు దళము. వీని నన్నిటి ననుసరించి చూడగా సైనికు లుపయోగించు యాన సాధనములనుబట్టి, ఆయుధ విశేషములనుబట్టి, సైన్యములో చేరిన సైనికుల తరగతిని బట్టి పై పేర్లు కలిగినట్లు కనబడుచున్నది. సైనికు లుండు స్థానమునకు కటకమని పేరు. అది యిప్పటి కంటోన్మెంటు వంటిది. యుద్ధములో కాని, బందిపోటు దొంగలను వారించుటలోగాని గొప్ప పరాక్రమముతో పోరాడి ప్రాణము లర్పించినవాని కుటుంబము పోషణ కిచ్చు మాన్యమునకు నెత్తురుపట్టు, నెత్తురుగుడ్డ యని పేరు.

**ప్రతీహారి :** మరియొక ప్రధాన కేంద్రాధికారి ప్రతీహారి. ప్రతీహారి యన్నను, దౌవారికు డన్నను ఒక్కటే. ప్రతీహారు లందరికి పై అధికారి మహాప్రతీహారి. పూర్వ చాళుక్య శాసనములలో ఇతడు దౌవారికాధ్యక్షుడని వ్యవహృతు డయినాడు.

**మంత్రిమండలి :** రాజ్యమున మంత్రులు చాలమంది యుండినను అందరివి సమాన గౌరవ పదవులు కావు. రాజ్యమునకు సంబంధించిన ముఖ్యకార్యముల విషయమున రాజు కొలదిమంది ముఖ్య మంత్రులతో మాత్రమే ఆలోచన చేయువాడు. ఇట్టి ప్రధాను లయిదుగురని పూర్వ చాళుక్య శాసనములు తెలుపుచున్నవి. వీరి కూటమికి మంత్రిమండలమని, మంత్రి పరిషత్తని పేరు. పల్లవరాజ శాసనములలో మంత్రి మండలికి సూచన యుండుటచేత అది పల్లవుల కాలమునుండి యుండినట్లు విదితమగుచున్నది. మంత్రి, పురోహిత, సేనాపతి, యువరాజ, దౌవారికు లయిదుగురును పంచప్రధానులు. దౌవారికుడు పంచప్రధానులలో నొక్కడాయని సందియము కలుగవచ్చును. శాసనములనుబట్టి అతడును పంచ ప్రధానులలోనివాడే యనుటకవకాశము కలదు. తమిళ గ్రంథములైన శిలప్పదికారము, మణిమేఖలలో ఐమ్పెరుంగుళు, ఎణ్ పేరాయమని రెండు సమితులు పేర్కొనబడినవి. వీనిలో 'ఐమ్పెరుంగుళు' అను దానికి అయిదుగురు పెద్దల కూటమియని యర్థము. ఇది యొకవేళ పంచప్రధాన పరిషత్తువంటిదే యగునేమో. అట్లయినచో ద్రావిడాంధ్ర దేశములయందీ సంస్థ కడు ప్రాచీన కాలమునుండి యుండె ననియు, రాజకీయముగ నైనను సాంఘికముగ నైనను మతవిషయకముగ నైనను దక్షిణదేశ సంస్కృతి యొక్కటే యనియు చెప్పవచ్చును. పూర్వ చాళుక్యుల కాలమున రాజు వేదవిదునికి గాని, మరియొకరికి గాని గ్రామమును దానము చేయునపుడు తద్గ్రామేయకులను, విషయాధిపతులను పిలిచి మంత్రి పురోహిత సేనాపతి యువరాజ దౌవారికాధ్యక్ష సమక్షమున చేయుట యాచారము.

**ఇతరాధికారి వర్గము :** సాతవాహనుల కాలమున శ్రమణ మహామాత్రు లుండిరి. ఆ కాలమున బౌద్ధము ముమ్మరముగ వ్యాపించుటచేత బౌద్ధమునకు, బౌద్ధ శ్రమణులకు సంబంధించిన వ్యవహారములను పరిశీలించుచుండిన ప్రభుత్వోద్యోగులు శ్రమణ మహామాత్రులు. వీరు అశోకుని కాలమునాటి ధర్మమహామాత్రులవంటి వారు.

కళింగ శాసనములలోని ధర్మాధికరణులు ప్రాయికముగా అశోక శాసనములందలి ధర్మమహామాత్రులవంటివారు. పూర్వ చాళుక్య ప్రభుత్వమున వారికి ధర్మాధ్యక్షులని



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పేరు. ఒకవేళ వీరు మహాదండనాయక విధులనుకూడ నిర్వర్తించుచుండి యుండవచ్చును.

పరిపాలనశాఖ లన్నిటి పరిపాలనను సమీక్షించుచుండు వారికి సర్వాధికృతులని పేరు. వీరే పల్లవ శాసనములందు అధికృత సర్వనైయామికులని, సర్వాధ్యక్షులని వ్యవహరింపబడిరి.

కేంద్రాధికార పదవులలో సంధివిగ్రహి పదవి చాల ముఖ్యమైనది. ఈ పదవి నలంకరించువానికి సంధి విగ్రహి యని, సంధివిగ్రహికుడని పేరు. ఇత డిప్పటి యుద్ధ మంత్రివంటివాడు. పరరాజ్యములపై యుద్ధము ప్రకటించుట, వానితో సంధి చేసికొనుట, దానపత్రములు మొదలైన రాజ శాసనములను వ్రాయుట సంధి విగ్రహి ముఖ్య విధులు. ఇతడు 'సర్వకరణవినిశు'డని కళింగ గాంగ శాసనములందు వర్ణితుడైనాడు. ఈ పూర్వగాంగ శాసనములలో మహాసంధి విగ్రహి, శ్రీసామంత సంధివిగ్రహి, సంధివిగ్రహి అని మూడు తెరగులగు సంధి విగ్రహులు పేర్కొనబడి యున్నారు సంధి విగ్రహు లందరికి పై అధికారి మహాసంధి విగ్రహి. పూర్వయుగ అంత్యకాలమున దక్కను రాజ్యములలో పెక్కురు సంధివిగ్రహు లుండుచు వచ్చినట్లు తెలియుచున్నది. వాకాటకులలోను, గుప్తులలోను ఇట్టివారనేకు లుండిరి. కేంద్రమున దేశాధిపతివద్ద నుండువాడు మహాసంధివిగ్రహి. శ్రీసామంత సంధివిగ్రహి శ్రీ మహాసామంత బిరుదాంచితుడైన పూర్వగాంగ యువరాజ కార్యాలయమునకు చెందినవాడై యుండవచ్చును. ఇట్టి యూహకు శ్రీసామంత పదమే ఆధారము. కొన్ని రాజ్యములలో మహాసంధివిగ్రహియో, సంధివిగ్రహియో మాత్రమే యుండువాడు. పే రేదైనను అతడు నిర్వర్తింపవలసిన విధులు పైని చెప్పినవే.

'పూర్వయుగము' నాటి రహసినియుక్తులు, రహస్యులు, రహస్యాధికృతులు రాజునకు అంతరంగిక కార్యదర్శులవంటివారు. పూర్వగాంగ శాసనములలో పేర్కొనబడిన అంతరంగ కుమారామాత్యులు కుమారామాత్యులకు రహసి నియుక్తులవంటి వారు కావచ్చును.

సాతవాహనుల కాలమునాటి నిబంధకారులను ఉద్యోగులు తరువాతి కాలమున పూర్వ యుగమునందు అక్షపటలకు లనుపేర వ్యవహరింపబడిరి. కేంద్ర ప్రభుత్వమున సర్వ వ్యవహారములను పత్రములందు లిఖించి వానిని భద్రపరచుటకు అక్షపటలశాఖ యొక టుండెడిది. దీనిపై అధికారికే అక్షపటలికుడని పేరు. ఇట్టి అక్షపటలిక శాఖ ప్రతి చిన్న స్వతంత్ర రాజ్యమునందు నుండెను. సర్వేరు తెరగుల పత్రములను ఒక కట్టగ కట్టి పూర్వ[illegible] రాజముద్రికతో గూర్చిన సూత్రమున బంధించి యుంచువారు. ఇట్టి రాజలాంఛనాంచిత రాజ ముద్రికను మట్టితో తయారుచేయువారు ఇట్టి ముద్రిక యొకటి కళింగము నందలి మాఠర రాజవంశమునకు చెందినది ఇటీవలనే దొరకినది. ఇట్టి ముద్రిక లితర రాజ వంశములకు కూడ ఉండి యుండవచ్చును.

రాజ్య వ్యవహారమునకు సంబంధించిన పత్రము లన్నియు అక్షపటలిక వశమం దుండును. సర్వ వ్యవహారవిషయమును పత్రముల మీద వారు నమోదు చేయువారు.

కళింగదేశమున 'పూర్వయుగమునందు' దానపత్రములను దేశాక్షపటలాధి కృతులు వ్రాయుటయు కలదు. వారు దానపత్ర లేఖకులు. అక్షపటలకు లందరిపై నధికారి అక్షపటలాధి కృతుడు. ఇతనికి దేశాక్షపటలాధి కృతుడనియు నామాంతరము. కళింగమున 'పూర్వయుగము' దేశాక్షపటలాధి కృతుడుగ దండనాయకు డుండుటయు కలదు.

భాండాగారికులు రాజకోశాధిపతులు. భాండాగారమునకు సంబంధించిన లెక్కలను వ్రాయువానికి శ్రీకరణమని పేరు. కోశాధిపతిని మధ్య యుగమున బండారి యనియు వ్యవహరించువారు.

'పూర్వయుగము' నందలి శాసనములలో, ముఖ్యముగ కళింగదేశ శాసనములలో తలవరులు, ఉత్కీర్ణకులు, దూతకులు (దూతలు) పేర్కొనబడినారు వీరుకూడ కేంద్ర ప్రభుత్వమునకు సంబంధించిన అధికారివర్గములోని వారే. తలవరులు [illegible] వంశజులనాటి సామంతులై యుం[illegible] రాష్ట్రమునకు, విషయమునకు సంబంధించిన [illegible]లైనను కావచ్చును. రాజు ఒక గ్రామమును దానముచేయు సందర్భమున దానవి[illegible]యమును తెలుపుటకు సంబోధించు అధికారి వర్గములో వీ[illegible]కరు. దానపత్రమును ప్రతిగ్రహీతకు రాగిరేకులమీద చెక్కి యిచ్చువాడు ఉత్కీర్ణకులు. ఆ దానము నమలు జరపువారు దూతకులు (దూతలు). వీరు శాలంకాయన, విష్ణుకుండి, పల్లవ, పూర్వచాళుక్య వంశ శాసనములందు సాధారణముగా ఆజ్ఞప్తి యనుపేర వ్యవహరింపబడిరి. రాజు చేసిన దానము నమలు జరపు ఆజ్ఞప్తి మంత్రిగకాని, దండనాయకుడుగకాని, కటకాధిపతిగ కాని యుండవచ్చును. మాఠరవంశజుడైన అనంతశక్తివర్మ యను కళింగాధిపతి దానశాసనము నమలు జరిపిన దూతలు ఇరువురు : కుమారామాత్య మహాబలాధికృతుడు శివభోజకుడు; కుమారామాత్య దండనేత వసుదత్తుడు. మహాబలాధికృతుడు సర్వసైన్యాధిపతి. దండనేత ధర్మాధికారి[illegible]కళింగ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



శాసనములో పేర్కొనబడిన ధర్మాధికరణులను అధికారుల కందరికి అధినేత. వీ రొక్కొక్కప్పుడు రాజుచేత నియమితులైన రాష్ట్రాధిపతులుగ నుండుటయు కలదు.

**న్యాయము :** ఇప్పటి వలె పూర్వము అభియోగములను విచారించి తగవులను పరిష్కరించుటకు ప్రత్యేక పరిపాలనశాఖ ఒకటి కాని, న్యాయస్థాన పరంపర కాని లేవు. అయినను వివాదములను పరిష్కరించి న్యాయము దయచేయుటకు తగిన యేర్పాటులు నిర్ణీతములై యుండినవి. సాధారణముగా వివాదములను పరిష్కరించుటకు కేంద్రాధికారి యొకడుండినట్లూహింప నవకాశ మున్నది. ఇతనిని రాజే నియమించుచుండెను. ఇతనికి దండనాయకుడను పేరని కొందరందురు. సాధారణముగా దండనాయకు డన్నది సేనానికి పేరని కొందరు చెప్పుదురు. న్యాయాధిపతికి దండనేత, దండనాయకుడు అను పేర్లొకవేళ ఉండినచో అవి పూర్వయుగముననే, ముఖ్యముగ పల్లవ, పూర్వగాంగ రాజ్యకాలము వరకు కనబడును. మధ్యయుగము నందు దండనాయకుడను పదము దణ్ణాయకుడుగా మారి అది సేనానికే వర్తించుచు వచ్చెను. ధర్మాధికృతుడు, ధర్మాధ్యక్షుడు, ధర్మాధికరణుడు అను పేర్లతో పూర్వయుగ శాసనములం దుదాహృతులైన యధికారులు న్యాయాధిపతులుకూడ కావచ్చును.

పూర్వము అభియోగములను విచారించునట్టి, తగవులను పరిష్కరించునట్టి న్యాయస్థానములకు ధర్మాసనము అని పేరు. ఆ న్యాయస్థానములకును, ఇప్పటి వానికిని స్వభావము భిన్నమైనది. ఇప్పటి వానివలె అవి స్థిరప్రతిష్ఠితములు కావు; ప్రభుత్వాధికార్యధిష్ఠితములును కావు; తాత్కాలిక సన్నివిష్ట సభలు అవి యెప్పుడు వ్యవహారము కలిగిన అప్పుడు సమావేశపరుపబడి, వ్యవహారపరిష్కారమైనంతనే విసర్జితము లయ్యెడివి.

ధర్మాసనము లన్నియు ఒక్కతీరయినవి కావు. వ్యవహారస్వభావమును బట్టి ధర్మాసనమునందలి సభ్యులలో మార్పుండును. ఆటవికులు, సైనికులు, వర్తకులు, ఇతర వర్ణములు, కులములు మొదలగువారికి వివాదములు సంభవించినపుడు వారి వారి వృత్తుల, సంఘముల, కులముల నుండియే వాద పరిష్కారము నిమిత్తము సభలను సమకూర్చుకొనవలయుట ధర్మశాస్త్ర విహితము. నేటికిని కొన్ని కొన్ని కులములలో కులవ్యవహారములను కులము పెద్దలే ధర్మాసనముండి పరిష్కరించు కొనుట కలదు. ధనాభియోగములను, అనగా ఆస్తికి సంబంధించినవి కుల సభలలోను, వృత్తి సభలలోను పరిష్కారము కానప్పుడు ధర్మశాస్త్రవేత్తలైన బ్రాహ్మణులు వారి ప్రతివాదుల కోరికమీద ధర్మాసన ముండి పరిష్కరించు చుండువారు.

ఎట్టి యభియోగములు ధర్మాధికృతుని యొద్దకు వెళ్లెడివో, ఏవి యితర ధర్మాసనములందు పరిష్కృతము లయ్యెడివో నిశ్చయించి చెప్పుట కాధారములు లేవు.

సాక్ష్యములేని అభియోగములు దివ్యముల ద్వారా పరిష్కృతము లగుచుండెను. అగ్ని దివ్యము, జలదివ్యము అని మొదట రెండు దివ్యములు మాత్రమే యుండెను. క్రమముగా అవి తొమ్మిదివరకు పెరిగినవి. బ్రిటిష్ రాజ్యాంగపద్ధతి అమలులోనికి వచ్చిన తర్వాత కొంత కాలము వరకుకూడ క్రీస్తుశకము పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధమున — ఇవి వాడుకలో నుండినట్లు బ్రిటిష్ రికార్డుల వలన తెలియుచున్నవి.

మొత్తముమీద బ్రిటిష్ రాజ్యారంభ కాలము వరకును, అటు తరువాత కొంతకాలము వరకుకూడ ధర్మాసనములు వర్ధిలుచుండినట్లు దేశీయ వాఙ్మయము వలనను, స్థానిక చరిత్రల వలనను విశదమగు చున్నది.

**కావలి :** రాజ్యమునందు దొంగతనములు, పోరాటములు లేకుండ చూచి శాంతి భద్రతలను కాపాడు పని ఆరక్షకులది. వీరినే ఆరెకు లనియు, తలారు లనియు వ్యవహరించువారు. ఈ దేశరక్షణ శాఖ కంతకు అధికారి దండపాశికుడు. నేరములను కనిపెట్టుట, దొంగలను పట్టుకొనుట దొంగతనము జాడలు తీయుట - ఇవి యన్నియు ఆరెకుల విధులు. ఈ విధులను నిర్వర్తించు ప్రభుత్వశాఖకు రెడ్డి రాజుల, విజయనగర రాజుల కాలమున కావలియని పేరు కలిగినది. ఊరికి మాత్రమే సంబంధించిన సంస్థకు ఊరికావలి యని, నాడుకంతకు సంబంధించిన దానికి నాడుకావలియని, దేశమున కంతకు సంబంధించిన దానికి దేశకావలియని పేరు. పండిన పంటను వన్యమృగములు పాడుచేయకుండను, దొంగలు తీసికొని పోకుండను కాపాడువారి వెలికావలి వారని వ్యవహారము. పూర్వపు కావలి పద మిప్పటి పోలీసు పదమునకు సరిసమానమైనది. ప్రాచీనకాలమున నుండియు దొంగలను బట్టుకొనుటకును, దొంగతనము జాడలు తీయుటకును ముత్రాసువారు నియమింపబడుచు వచ్చిరి. వెలికావలితోడు అచ్చుకావలియని కావలిలో మరియొక విభేదము కలదు. ఇదికూడ ప్రాచీనకాలము నుండియు నున్నదే. దొంగను పట్టుకొని, సొత్తును పోగొట్టుకొన్న యజమాని కీయలేనప్పుడు ఆ సొత్తు విలువకు సమానమైన ద్రవ్యమును కావలికాడు యజమాని కచ్చుకొనవలెను. ఈ కారణమున దీనికి అచ్చుకావలియని పేరు కలిగినది. పూర్వకాలము నుండి బ్రిటిష్ యుగమువరకు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఈ యచ్చుకావలి మన దేశమున వాడుకలో నుండెను. వీరికి విజయనగరాధీశ్వరుల కాలమున మేరలు, మిరాసులు, మాన్యములు ఉండెడివి. కావలికాండ్ర కిచ్చు ధాన్య రూప వర్తనలకే ప్రాయికముగ మేరలని వ్యవహారము. వీనికే ప్రాయికముగ కావలి కట్నము లనియు. రుసుము లనియు నామాంతర ముండెను.

ప్రతి శాఖకు సంబంధించిన పత్రములు, లెక్కలు మొదలైనవి వ్రాయువారికి కరణములని పేరు. వీ రిప్పటి శాఖాకార్యదర్శులవంటివారు. సాతవాహనుల కాలము నాటి లేఖకు (లిపికరు) లిట్టివారే. ప్రభు సన్నిధానమునుండి ప్రభువు స్వముఖాజ్ఞలను, శ్రీముఖములను వ్రాసికొ క్రింది అధికారులకును, సామంత మండలికులకును బంపుట వారి విధి. వీరు విజయనగరాధీశ్వరుల కాలమున వ్రాయసములని వ్యవహరింపబడిరి. వ్రాయసపదము రాను రాను రాయసముగ మారినది. రాజసమతమున వలెనే రాష్ట్రపాలకుల, విషయాధిపతుల సన్నిధినికూడ ఇట్టి వ్రాయసము లుండెడివారు. కేంద్ర ప్రభుత్వమునందలి ఇట్టి కరణములకు విజయనగర సామ్రాజ్యకాలమున సంప్రతులని పేరు కలిగినది. కందాచారమునకు సంబంధించిన లెక్కలు వ్రాయువానికి కందాచార కరణమని పేరు.

కేంద్రపరిపాలన శాఖలు పూర్వ యుగమునకంటె మధ్య యుగమున చాల పెరిగినవి. ఈ శాఖలకు నియోగములని పేరు. ఇట్టివి డెబ్బదిరెం డుండినట్లు కాకతీయ శాసనముల వలన తెలియుచున్నది. వీనికి బాహత్తర (డెబ్బది రెండు) నియోగములని పేరు. ఈశాఖ లన్నిటిని పర్యవేక్షించు నధికారికి బాహత్తర నియోగాధిపతి యని పేరు. ఈ శాఖ లన్నిటిలోను ముఖ్యమయినది రెవిన్యూ శాఖ. విజయనగర సామ్రాజ్య కాలమున దీనికి అట్టవణమని, ఈ శాఖ వ్యవహార, వ్యాపారములకు అట్టవణ తంత్రమని పేరు.

**అవనాయములు :** హిందూ యుగమున రాజునకు ముఖ్యముగ ఎనిమిది విధముల ఆయము (అష్టాయము) వచ్చుచుండినట్లు తెలియు చున్నది. కానికెలని, కట్నములని, వర్తనలని, పన్నులని, సుంకములని శాసనములవలన పన్ను లెన్ని రకములైనవి తెలియవచ్చు చుండినను వాని నన్నిటిని ఈ క్రింది విధముగ వర్గీకరింపవచ్చును: (1) ముఖ్యమైనది భూమ్యాదాయము; (2) ఆస్తి పన్ను; (3) వృత్తి పన్ను; (4) వర్తకపు పన్ను; (5) పరిశ్రమల మీది పన్ను; (6) సైనికపు పన్ను; (7) అడవులు, పచ్చిక బయళ్ళమీది పన్ను; (8) కులముల, సంఘముల మీది పన్ను. బద్దెన తన నీతిశాస్త్రమున వీనిని ఈ విధమున పేర్కొని యున్నాడు: (1) కృషి ప్రపంచము అరి; (2) గనులు; (3) గోకులము; (4) సుంకము; (5) వణిక్క్రియ; (6) నందనవనము; (7) కప్పము; (8) దుర్గరక్షణము. వేరు వేగ రాజవంశముల కాలమున రాజ్య స్వభావమును బట్టియు, అప్పటి పరిస్థితులను బట్టియు వేరు వేరు తరగతుల పన్నులు విధింపబడుచు వచ్చినను అవి యన్నియు పై నుడివిన యేదియో యొక తరగతికి చెంది యుండినవే. ఈ పన్నులకు అవనాయములని పేరు. వీని యన్నిటిలోను భూమివలననుండి రాజునకు వచ్చు ఆదాయమే ముఖ్యమైనదియు, గొప్పదియును.

కడు ప్రాచీనకాలమునుండి వేరు వేరు రాజవంశముల వారు కొంత కొంత అడవిని ఛేదించి కృషియోగ్యము కావించుచు వచ్చిరి. ఆ విధమైన భూమిని రాజమానమున కొలిచి కొంత కొంత యొక్కొక రైతుకు ఇచ్చుచుండిరి. మొదటి మూడు సంవత్సరములలోను రైతు రాజునకు పన్ను చెల్లింపనక్కరలేదు. ఆ భూమి క్రమముగా చక్కబడి పంట పండుచు వచ్చుచున్నకొలది మొదటి రెండు సంవత్సరములు పన్ను లేకుండను, తరువాత కొద్ది పన్నును, పూర్తిగ పంట పండుటకు యోగ్యమైన పిదప పూర్తి పన్నును చెల్లింపవలసియుండెను. చెలికె కాపుల విషయమునందును ఇదే పద్ధతి యవలంబింపబడుచుండెను.

**భూమి కొలత :** భూమి స్వభావమునుబట్టి, సారాసారములనుబట్టి నీరునేల యని, వెలిచే నని, తోటభూమి యని మూడు తరగతులుగ విభజింపబడు చుండెను. ప్రాచీన కాలము నుండియు భూమిని కొలుచుటకు నిర్ణీతమయిన రాజమాన ముండెను. పల్లవ పూర్వ చాళుక్య, పూర్వ గాంగ నృప వంశము(...) మున రాజమాన ముండినట్లు తెలియు చున్నను దాని ప్రమాణము మాత్రము తెలియదు. 'మధ్య యుగమున' రాజ్యముల విస్తృతి అధికమైన కొలది వేరు వేరు ప్రాంతముల భూములను కొలుచుటకు వేరు వేరు ప్రమాణములుగల గడలు వాడుకలోనికి వచ్చినవి. కాకతీయుల కాలమున ప్రాగాంధ్రదేశమున వాడుకలో నుండిన ముప్పదిరెండు జేనల గడకు కేసరిపాటి గడయని పేరు. గణిత గ్రంథములలో పంద్రెండంగుళములు జేనయని తెలుప బడినది. పదునెనిమిది, ఇరువది, ఇరువది నాలుగు మూరల గడలుకూడ వేరు వేరు ప్రాంతములందు వాడుకలో నుండెను. ఈ గడ ప్రమాణమును రాజుకాని, రాజానుమతిని పొంది రాష్ట్రపాలకుడు కాని, నాయకుడు కాని, ఎవరైనను గొప్పదొర కాని నిర్ణయించుచుండెను. భూములను కొలుచు ఈ గడకు దండక మనిపేరు. గడ నష్టమైనను ఇబ్బంది లేకుండుటకుగాను గడ ప్రమాణమును కొంత — సాధారణముగా జేన కాని, మూర కాని — ఊరి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



దేవాలయ మంటప స్తంభముమీద గుర్తుగ చెక్కువారు. దానిని అనుసరించి మరల పూర్తిగడ నేర్పాటు చేసికొను వారు. ప్రామాణికముగ నంగీకరింప బడిన గడలోని జేననో, మూరనో సూచించు గీతలు గుంటూరుజిల్లా పెనుమూళి, ప్రత్తిపాడు, మోపర్రు, కొమ్మూరు, నందివెలుగు మొదలైన గ్రామములందలి దేవాలయ మంటప స్తంభముల మీద చెక్కబడినవి ఇప్పటికిని చూడవచ్చును. ఈ గడతో నూట పంద్రెండు నర కుంటలు కొలిచినచో అది కేసరిపాటి తూము. ఇరువది కేసరిపాటి తూము లొక పుట్టి. పుట్టికి సంస్కృతమున ఖండిక యనియు, ఖండుగ యనియు పేరు. నీరు నేలను, వెలి చేనిని ఒకటే లెక్కను కొలిచెడివారు కారు. నీరునేల అనగా మాగాణి భూమి పరిమితిని మర్తుల లెక్కను, వెలి చేను పరిమితిని కేసరిపాటి పుట్ల లెక్కను గొలుచుచుండిరి. మర్తు అన్నది సంస్కృతపు నివర్తనమునకు సమానము. ఒకానొక శాసనము వలన పది హస్తము(మూర)లు దండము (గడ) అని, ముప్పది దండములు నివర్తనము అని తెలియుచున్నది. ప్రాంతీయముగ ఈ లెక్కలో ఇంకను ఏదైన భేద ముండెనేమో తెలియదు. కొండవీటి రెడ్డిరాజ్య కాలమునాటికే ఈ మర్తుల లెక్క అంతరించినట్లు తోచుచున్నది. ఇది ప్రబలముగ వాడుకలో నుండినది 'పూర్వ మధ్యయుగము'ననే. 'అర్వాచీన మధ్యయుగము'న మాగాణిభూమి నొకవిధముగను, వెలిచేను తోటభూములను వేరొక విధముగను కొలుచుట యుండెనో లేదో తెలియదు. మహమ్మదీయ పరిపాలన కాలమున భూములను కొలుచుటకు గడ పోయి పగ్గము వచ్చినది. ఈవిధముగా భూములను కొలిచి పన్ను విధించుచుండిరి.

**తటాకనిర్మాణము - నీటిపారుదల :** పూర్వకాలమునుండియు వ్యవసాయము వర్షాధారముననే జరుగుచుండెను. అందువలననే పూర్వ చాళుక్య రాజుల కాలమునను, అంతకు పూర్వముననుగూడ రాజు బ్రాహ్మణులకు భూమిని దానము చేయునపుడు ఇన్ని పుట్ల వరి విత్తనములు, లేదా ఇన్ని ఖండికల కోద్రవ విత్తనములు, అళ్ళ విత్తనములు చల్లదగిన పట్టనియో, ఇన్ని నాగళ్ల భూమి యనియో చెప్పి దాన మిచ్చువాడు. పూర్వకాలమునుండి హిందూ పరిపాలనమున వ్యవసాయమునకు నీరు సరఫరా చేయుటకు, తటాకములు నిర్మించుటకు, కాలువలు త్రవ్వించుటకు ఇప్పటివలె ఒక పరిపాలనశాఖ యుండెడిది కాదు. తటాకాదులు పూర్వకాలమున ప్రజల ధర్మకార్య ప్రవృత్తిమీదనే ఆధారపడి నిర్మితములగుచు వచ్చినవి. సంపన్నులైనవారు తమ పితరులు సంతసించుటకును, అశేష జంతుజాలము సుఖించుటకును, తమ పేరు భూమిమీద శాశ్వతముగ నిలుచునట్లు చేయుటకును ఉపకరించునది తటాకనిర్మాణ మొకటి యని చెప్పబడినది. మనుష్యుని పేరు, వంశము చిరస్థాయిగ నుండునట్లు చేయు సప్త సంతానములలో తటాక నిర్మాణ మొకటి. 'సలిలాశయములు చేసిన నలఘుప్రియ మందు బితృచయము నూర్ధ్వగతుల్ గలుగు'నని భీష్ములవారు యుధిష్ఠిరుని కుపదేశించిరి. ఈ కారణమున పూర్వకాలమునుండియు తటాక నిర్మాణ మొక పుణ్యకార్యమైనది. అందువలన పూర్వకాలమున పుణ్యయశోభిలాషులు, ధర్మాభిరతులు అయిన సంపన్నులు తటాకములను నిర్మించుచు వచ్చిరి; బావులను త్రవ్వించుచు వచ్చిరి; ఏటినుండి, బుగ్గలనుండి కాలువలు త్రవ్వించుచుండిరి. రైతులుకూడ ఏళ్ళకు సేతువులు కట్టి నీటిని కాలువలద్వారా మళ్ళించి సేద్యము చేసికొనుచు వచ్చిన సందర్భములును కలవు. మొదటిమారు తెలుగుదేశములో సాగరములు, సముద్రములు అనుపేర గొప్ప జలాశయములను నిర్మించి నీటిపారుదలకు అనుకూల్యములు కల్పించి వ్యవసాయము నభివృద్ధిపరచినవారు కాకతీయులు. కాకతి మహారాజుల ననుసరించి వారి సేనానులు, ఇతరాధికారులు కూడ తమ తల్లిదండ్రులకు, ప్రభువులకు పుణ్యముగ తటాకములను నిర్మించుచు వచ్చిరి. తెలంగాణాలో అమితముగ నున్న ఈవిధమైన తటాకములవలన దానికి తటాకఖండమని పేరు కలిగినది. మూడువైపుల గోడవలె నుండు కొండలనుండి పల్లపు నేలలోనికి ప్రవహించు వాననీటిని కొంతదూరమున నాలుగవవైపున కొండ కొనలను కలుపుచు కట్టిన సేతువు మూలమున నిలవ చేసిన జలాశయములు తెలంగాణాలో చాల కలవు. కాకతీయుల ఈ విధానము ననుసరించి కొండవీటి రెడ్డిమన్నీలును, విజయనగరాధీశ్వరులునుగూడ అనేక తటాకములను నిర్మించిరి.

తటాక నిర్మాణముతో వాడుకలోనికి వచ్చినది దశబంధము పద్ధతి. తటాకములలో కాలక్రమమున నేర్పడు పూడికను ఏటేట తీసివేయు షరతుమీద తటాక జలము వలన సాగగు భూమి పరిమితిలో కొంత భాగమును మాన్యముగ నిచ్చు పద్ధతికే దశబంధము పద్ధతియని, యా మాన్యమునకు దశబంధము మాన్యమని పేరు. కాలువలలోను, నూతులలోను పూడిక తీయుటకుకూడ పూర్వ మిట్టి పద్ధతియే యవలంబింపబడుచు వచ్చెను. మాన్యము ననుభవించువాడు ఏయేడుగాని షరతు ప్రకారము పూడికను తీసివేసి చెరువును సుస్థితిలో నుంచనియెడల ఆ మాన్యమతనికి చెల్లెడిది కాదు. సాధారణముగా మాగాణి భూములు రెండు కారులు పండెడివి.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కాని, సామ్రాజ్యము కాని పెక్కు విభాగములుగ విభక్తమై యుండెను. వారి కాలమునను, పూర్వ యుగమున తెలుగు దేశమును పరిపాలించిన రాజవంశముల కాలమునను ప్రధాన దేశవిభాగము హారము. దీనికి ఆహారమనియు నామాంతరము కలదు. సాతవాహని హారము, కూదూరాహారము తెలుగుదేశములోనివిగ దెలియవచ్చిన అత్యంత ప్రాచీన దేశవిభాగములు. కూదూరాహారము తరువాతి కాలమున కుద్రాహారమని, గుద్రాహారమని వ్యవహృతమై తుదకు గుద్రవారమయినది. సాతవాహన నృపులకాలమున ఇంకను పెక్కుహారము లుండవచ్చును; కాని శాసనములవలన వారి కాలమునాటి తెలుగుదేశములోనివిగ దెలియవచ్చినవి అవి మాత్రమే. ఇక్ష్వాకు, పల్లవ వంశజుల కాలమున హారమువంటి దేశవిభాగము రాష్ట్రమనుపేర వ్యవహృతమైనది. కర్మరాష్ట్రము, పూగిరాష్ట్రము, హిరణ్యరాష్ట్రము, ముండరాష్ట్రము మొదలైనవి ఆకాలపువే. ఈ దేశవిభాగములే శాలంకాయన, విష్ణుకుండి, పూర్వ చాళుక్య వంశజులకాలమున విషయములని, నాడులని వ్యవహరింపబడినవి (ఉదా: కమ్మరాష్ట్రము - కమ్మనాడు; పూగిరాష్ట్రము - పాకనాడు; ముండరాష్ట్రము - ముండనాడు; వేంగి విషయము - వేగినాడు మొదలైనవి). జనసంఖ్యలోని యెక్కువ తక్కువలను బట్టియు, భూసారము ననుసరించి పండు పంటల హెచ్చుతగ్గులను బట్టియు, పరిపాలన సౌకర్యమును బట్టియు ఈ దేశవిభాగములు ఒకటే పరిమాణముగలవిగ కాక కొన్ని పెద్దవిగను, కొన్ని చిన్నవిగను ఉండుట కలదు. పరిమాణము విషయమున నెట్లున్నను ఆహారము, విషయము, రాష్ట్రము, నాడు, మార్గము, దేశము - ఇవి యన్నియు దేశవిభాగములే, దేశవాచకములే.

ద్రవిడదేశమును పరిపాలించిన చోళరాజులకును, వారితో సన్నిహిత సంబంధముగల చాళుక్యచోళులకును తెలుగుదేశముతోగల సంబంధమువలన తమిళదేశమునందు వలె మన తెలుగు దేశమునందును 'నాడు' మాత్రమేకాక వళనాడు, కోట్టము (కోట), మండలము అను విభాగములు కొన్ని పూర్వ మధ్యయుగమున నుండినవి. మండలము అన్నిటికంటె పెద్దదైన దేశవిభాగము. దీనికంటె చిన్నది వళనాడు. వళనాడులకును, మండలములకును అప్పుడు పాలించుచుండిన రాజులనుబట్టి పేర్లు కలుగుచు వచ్చినవి (ఉదా: జయంగొండ చోళ మండలము; రాజేంద్ర చోళ వళనాడు). కోట్టము నాడుకంటె పెద్దది; వళనాడుకంటె చిన్నది.

పూర్వగాంగ భూపతులకాలమున విషయము అను దేశవిభాగమే కాక కళింగమున భోగము, భుక్తి యను పేర్లు గలవి యుండినట్లు తెలియుచున్నది. అక్కడకూడ విషయము నా డనియు వ్యవహరింపబడుచు వచ్చినది. నాడు కంటె చిన్న దేశ విభాగము స్థలము. ఇది యిప్పటి తాలూకావంటి విభాగము.

✓ తెలుగుదేశములో నాడు అను దేశవిభాగము విజయనగర సామ్రాజ్యాంత్య కాలమువరకు వాడుకలో నుండెను. కాకతీయుల కాలమునకు తరువాతనుండి సీమ అను దేశ విభాగము వాడుకలోనికి వచ్చినట్లు కనబడును. కొన్ని నాడులు కలిసినది ఒక సీమ. విజయనగరాధీశ్వరుల కాలమున కొన్ని సీమలు కలిసి ఒక రాజ్యముగ నేర్పడుచుండెను. 'రాజ్యము'నకు అందలి ప్రధాన దుర్గము ననుసరించి పేరు వచ్చుచుండెను (ఉదా: ఉదయగిరి రాజ్యము; కొండవీటి రాజ్యము; పెనుగొండ రాజ్యము; చంద్రగిరి రాజ్యము మొదలైనవి). 'రాజ్య' మన్నది సామ్రాజ్యమునందలి గరిష్ఠదేశవిభాగము; చోళరాజుల 'మండలము' వంటిది. ఇది దుర్గాధిపతి పరిపాలన క్రింద నుండెను. పైనుడివిన దేశవిభాగములు కాక భూమి, కంపణము, వళితము, దావడి, హోబళి అను పేర్లు గలవియు కాకతీయ, విజయనగర శాసనములవలన తెలియవచ్చుచున్నవి. భూమి యను దేశవిభాగము కొన్ని కాకతీయ శాసనములలో పేర్కొనబడినది (ఉదా: అరెభూమి, కోటభూమి, శ్రీశైల భూమి).

శాసనములవలన తెలియవచ్చిన సాతవాహన నృపతుల కాలమునాటి రాజోద్యోగులు చాల కొద్దిమంది. వారిలో మహారథులు, మహాభోజులు సామ్రాజ్యమునందలి వివిధ రాష్ట్రములను పాలించుచుండిన సామంత భూనాథులు. ఇక్ష్వాకుల కాలమున వీరు మహాతలవరులను పేర వ్యవహరింపబడిరి. మహారథుని భార్యకు మహారథిని యని, మహాభోజుని భార్యకు మహాభోజి యనియు వ్యవహార ముండెను. ఈ మహారథులును, మహాభోజులు నయినను సాతవాహన సామ్రాజ్యమునందలి పశ్చిమ భాగమునందే కాని పూర్వపు తెలుగుదేశమునందు కానరారు. రాష్ట్ర పాలకులైన సామంత రాజచంద్రులకు మహారథి, మహాభోజ, మహాతలవర వ్యవహారము ఒక్క సాతవాహన, ఇక్ష్వాకు రాజవంశముల పరిపాలనమునందే యుండెను. సాతవాహనకాలమున సైన్యాధిపతులు ఆహారములను రాజ్య విభాగముల కధిపతులుగ నియమింపబడుటయు కలదు. వీరుకాక మహామాత్రులు, మహాతరకులు మొదలైన మరికొంద రుద్యోగు లుండిరి. ఒక తరగతి యుద్యోగులకు మహామాత్రు లన్నది సాధారణ వాచకము. పూర్వ చాళుక్య శాసనముల యందును మహామాత్రులు పేర్కొనబడి యున్నారు. ఇట్టి

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వారిలో అంతఃపుర మహామాత్రు లోకరు. రాష్ట్రపాలునికి సలహా చెప్పుట కొరకు రాష్ట్రసభ యుండెడి దనియు, అందలి సభ్యులకు మహామాత్రులను పేరనియు కొందరందురు. ఇది ఇంకను విచారణీయము. మహాతరకులు తరువాతికాలపు మహత్తరులు. వీరు రాష్ట్ర పరిపాలనాధికార వర్గములోని వారని తోచుచున్నది.

ఇక్ష్వాకు కాలమునాటి మహాతలవరులు మహాసేనాపతులుగను, మహాదండనాయకులుగను కూడ నుండిరి. మహాదండ నాయకుడు పూర్వగాంగ శాసనములయందును పేర్కొనబడి యున్నాడు. మహాదండనాయకుడు న్యాయాధీశుడు, న్యాయ శాఖాధిపతియని చరిత్ర పరిశోధకులు కొందరు నిర్ధరించి యున్నారు. మహాదండనాయకుని క్రింది యధికారి దండనాయకుడు. ఇతడు రాష్ట్ర ప్రభుత్వమునకు చెందినవాడు కావచ్చును. ఇక్ష్వాకు రాజానంతర కాలమున నుండి తలవరులవంటి రాజ్య పాలకులు సామంతులని వ్యవహరింపబడుచు వచ్చిరి. పూర్వగాంగ శాసనములవలన కళింగదేశ రాజ్య తంత్రమున శ్రీ మహాసామంతులు, శ్రీ సామంతులు, మహాసామంతులు, సామంతులు అని సామంతులు నాలుగు తరగతులవా రుండినట్లు తెలియుచున్నది. యువరాజు శ్రీ మహాసామంతుడు. శ్రీ మహాసామంతుడే శ్రీ సామంతుడో లేక శ్రీ సామంతుడు వేరో తెలియరాదు. శ్రీ సామంతుడు వే రుద్యోగి యైనచో అతడు తాను చేయు కార్యములకు శ్రీ మహాసామంతునికి జవాబుదారి వహింపవలసిన అతని క్రింది యుద్యోగియై యుండవలెను. మహాసామంత పదవికి క్రిందిది సామంత పదవి. మహాసామంతులు, సామంతులు మహారాజ నియమితులైన ఉన్నతాధికారులకు జవాబుదారులై యుండు పాలకులు.

పూర్వచాళుక్యరాజ్యమున మహాసామంత గౌరవ బిరుదాంచితులకు రాజ్య ప్రాభవ సూచకములైన శివద్వారము, మయూర పింఛము, వ్యజనము (తాళవృంతము), పీలి (పికిలిపిట్ట), కర్కరి, సువర్ణ కలాచిక అను గౌరవ లాంఛనములు ప్రసాదింపబడు చుండెను. ప్రాచీనకాలము నుండియు నివి ప్రాభవ సూచకములైన గౌరవములుగ పరిగణింపబడుచు వచ్చినవి. రా జొసంగిననే కాని ఈ గౌరవముల కెవ్వరికి నధికార ముండెడిది కాదు. రాజ ప్రదత్తములైన ఈ రాజలాంఛనముల ననుసరించి చూచినచో పూర్వచాళుక్యామాత్యులును, మహాసామంతులును సమాన గౌరవాంచితులని విశదమగుచున్నది.

**రాష్ట్రీయాధికారి వర్గము :** రాజ్యమునందలి వేరు వేరు విభాగములను పాలించు చుండినట్టియు, వేరు వేరు నియోగములం దుండినట్టియు రాజకీయోద్యోగులకు వేరు వేరు యుగములందు వేరు వేరు అధికారనామము లుండెడివి. ఇట్టి పేరు లనేకము శాసనములవలన తెలియవచ్చును. మహామహత్తరులు, మహత్తరులు, విషయ మహత్తరులు, ఉపరికులు, రాణకులు, విషయపతులు, విషయాధ్యక్షులు, వ్యాపృతులు, ఆయుక్తకులు, నియుక్తులు, అధికృతులు, వల్లభులు, రాజవల్లభులు, రాజ పురుషులు, రాజపుత్రులు, రాజనకులు, తలవరులు, అధికారులు, దూతకులు, సకరణులు (?), ఉత్కిర్ణకులు — ఈ మొదలైనవా రందరు పూర్వ యుగమునందలి కళింగ గాంగ, శాలంకాయన, బృహత్పలాయన, పల్లవ, విష్ణుకుండి వంశజుల శాసనముల వలన తెలియవచ్చిన వారే. ఒకటే యుద్యోగపదము ఒక వంశపాలనములో ఒక పేరుతోను, మరియొక వంశపాలనమునందు మరొక పేరుతోను ఉండిన నుండవచ్చును. అందువలన పై నుడివిన అధికారపద నామములు కొన్ని పర్యాయ వాచకములును కావచ్చును. అయినను ఈ విషయమును నిర్ధారణ చేయుట కింకను పరిశోధన కావలసి యున్నది; ఉన్న సాధన సామగ్రికూడ అందుకు చాలదు. మొత్తముమీద అందరు రాష్ట్రీయ పరిపాలనకు, విషయ పరిపాలనకు సంబంధించిన రాజ్యాదాయ శాఖాధికారి వర్గమే; గ్రామమును కేంద్రముతో అతుకు కలుపు అధికారులు వీరు. విషయపతులు, విషయాధ్యక్షులు ఒకరే. వీ రిప్పటి జిల్లా అధికారులవంటివారు. విషయమునకు సంబంధించిన రాజ కార్యములను నిర్వహించుటలో వీరికి హిత ముపదేశించి తోడ్పడుట కొరకు సభ యుండెడిది. ఆ సభలోని సభ్యులకు మహత్తరులని పేరు. విషయసభకు చెందినవారగుటచేత వీరిని విషయ మహత్తరు లనియు వ్యవహరించుట కలదు. విష్ణుకుండి, పూర్వ చాళుక్య శాసనములందు విషయ మహత్తరులు పేర్కొనబడియున్నారు. కళింగ దేశమున పూర్వయుగము నందు రాష్ట్రసభా సభ్యులును, విషయసభా సభ్యులును మహామహత్తరులని పేర్కొనబడిరి. రాష్ట్ర లేక విషయాధిపతులను రాజే స్వయముగా నియమించువాడు. ఆయుక్తకులు, నియుక్తులు, వల్లభులు విషయపతులకు క్రింది తరగతి యుద్యోగులు. వల్లభులు, రాజవల్లభులు ఒకటే విధమయిన అధికారపదవికి చెందినవారో, లేక భిన్నాధికార పదవులకు సంబంధించినవారో తెలియదు. రాజపుత్రులు మధ్య యుగమునకూడ రాచకొడుకు లను పేర ఉద్యోగి వర్గమున నుండిరి. రాజవల్లభులు, రాజపుత్రులు అధికార పదవులందు నియుక్తులైన రాజసంబంధులగు దొరలు. అధికృతులకు, అధ్యక్షులకు గల వ్యత్యాసము తెలియదు.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/


శాఖాధిపతులు అధికృతులు కావచ్చును. వేరు వేరు నాడులకు కూడ అధ్యక్షులుండిరి. రాజాధ్యక్షులను పేర మధ్య యుగమునందలి శాసనములవలన తెలియవచ్చు అధికారులు రాష్ట్రపరిపాలనమును పర్యవేక్షించుటకు రాజుచే నియమితులైనవారు కావచ్చును. కళింగమునందలి భుక్తి యను రాజ్య విభాగము ఉపరికులను అధికారుల యధీనమునం దుండెను. గుప్తయుగమున వీరు ప్రాయికముగా రాజుచే నియమింపబడుచుండిన రాష్ట్రాధిపతులని చెప్పవచ్చును. విషయపతులు వీరిచే నియమితు లగుచు వచ్చిన వీరి క్రింది యధికారులు. వ్యాపృతులు పల్లవరాజ్యము నందలి విషయాధిపతులు కావచ్చును. రాణకులు పూర్వ గాంగుల రాజ్యమునందు ఒక్కొక్క రాజ్యమును పాలించుచు వచ్చిన రాజ బంధువులగు కదంబ వంశపు అధికారులు. విషయాధిపతులకే విషయాధ్యక్షులని పేరో, లేక ఉద్యోగ పదవి యందును, వారు నిర్వహింపవలసిన విధులయందును వారుభయులకు ఏమైన వ్యత్యాసము లుండెనో తెలియదు. గజసైన్యమున కధిపతులైనవారికి హస్త్యధ్యక్షులని పేరు. సంచరంతకులు, శాసన సంచారులు రాజ శాసనములను ప్రజలకు తెలియజేయుటకు సంచారము చేయు నుద్యోగులు కావచ్చును. రజ్జుకులు మౌర్య పరిపాలనము నందలి రజ్జుకులవంటివారు. వీరు పల్లవరాజ పరిపాలనమునకూడ నుండిరి. పూర్వ చాళుక్య పరిపాలన మారంభమైన తరువాత కొద్దికాలము వరకే ఆయుక్తకులు, విషయపతులు, విషయ మహత్తరులు శాసనములలో పేర్కొనబడుచు వచ్చిరి. అటుతరువాత వీరి పేరులు మారిన మారవచ్చును కాని శాసనములలో పేర్కొనబడనంత మాత్రమున వీరు లేరని చెప్పలేము.

చాళుక్య చోళులను పేర రాజరాజనరేంద్రుని సంతతివారు ద్రవిడదేశమునుండి వేంగిదేశమును పరిపాలింప నారంభించినప్పటినుండి పూర్వాంధ్ర దేశమున మండలిక యుగ మారంభమైనది. చాళుక్య చోళులు తమ రాజ్యమును మండలములుగ విభాగించి, తమ వంశమును పూర్వకాలమునుండి భక్తివిశ్వాసములతో సేవించుచు వచ్చిన వంశములలోనివారికి రాజ లాంఛనము లిచ్చి వారికి మండలిక పట్టము కట్టెడివారు. మండలికునికి మండలములోని అతని క్రింది నాయకులు పరిపాలనయందు తోడ్పడువారు. రాజువలెనే మండలికుడు కూడ రాజకార్యములందును, గొప్ప పౌరుషప్రతాపములు చూపి యుద్ధములందును తన్ను సేవించిన నాయకునికి గ్రామాధిపత్యమును, అడపము, అందలము, వివిధాతపవారణములు, కాహళాదులు, పడియము మొదలైన నృపాంక చిహ్నములు నిచ్చి గౌరవించెడివారు. మండలము రాజ్యములోని చిన్న రాజ్యమగుటచేత ఇందుకూడ పరిపాలనశాఖ లన్నియుకూడ నుండెడివి.

**నాయంకర, అమరనాయంకరములు** : మధ్యయుగములో క్రమముగా ఒక్కొక్క నాయకుని యధీనమునందు కొంత కొంత ప్రదేశ ముంచబడుచు వచ్చెను. నాయకుని యధీనమునం దుండిన యా ప్రదేశమునకు నాయంకరమని పేరు కలిగినది. ఒక్కొక్క నాయంకరమున పెక్కు స్థలములతో గూడిన నాడు ఒకటికాని, అంతకెక్కువకాని యుండెడిది. నాయంకర పద్ధతి చాళుక్య చోళుల కాలములోనే మొదట అమలులోనికి వచ్చినది. నాయంకరమును పరిపాలించు చుండిన నాయకునికిని, మండలికునికిని రాజసేవా నిబంధములలో ఏమైన వ్యత్యాసము లుండెనో లేదో మనకు తెలియదు. మండలికులును, నాయకులునుకూడ తమ యధీనమునం దుండిన రాజ్య విభాగమునందు శాంతి భద్రతలను కాపాడుచు, ప్రజల యభివృద్ధికి పాటుపడుచు, అందుండి రాజునకు చెల్లవలసిన రాజాదాయమునకు బాధ్యత వహించి, తమ ప్రభువునకు యుద్ధావసరమున తోడ్పడుచుండెడివారు. మండలికు లందరికి ప్రభువైనవాడు మహామండలేశ్వరుడు. వెలనాటి దుర్జయవంశజులు మహామండలేశ్వర బిరుదమును వహించిన మొదటి మండలిక ప్రభువులు. వెలనాటి దుర్జయులను జయించిన కల్యాణి చాళుక్య, కాకతీయ రాజన్యులుకూడ మహామండలేశ్వర బిరుదాంచితులే. వారి యాధిక్యమును దెలుపుటకు సాధారణ రాజచిహ్నములకు తోడు పంచమహాశబ్ద గౌరవముకూడ నుండెడిది. ఉత్సవావసరముల యందును, ఇతర ముఖ్య సమయములందును వారు కొలువుకూటమునకు పోవునపుడును, తిరిగి వచ్చునపుడును పంచమహావాద్యములు మ్రోగుచుండెడివి. ఈ కాకతీయ రాజన్యుల కాలములో నాయంకరపద్ధతి బాగుగ వ్యాప్తిలోనికి వచ్చినది. వీరి కాలమునగూడ మండలిక వంశములు కొన్ని యుండెడివి. మండలికులు సామంతరాజులైరి; నాయంకరము నేలుచువచ్చిన నాయకులు రాజుచే నియమితులై అతనికి విధేయసేవకులుగ నుండిరి. రాజు ఒక్కొక్క నాయకుని కొంత కొంత కాలమున కొక నాయంకరము నుండి మరియొకదానికి మార్చుటయు జరగుచుండెను. మండల పరిపాలనము శాశ్వతముగ మండలిక వంశజుల చేతియందే యుండెను. మండలాధిపత్యము తండ్రివలన నుండి కుమారునికి వంశపారంపర్యముగ సంక్రమించుచుండెను. నగరి భండారమునకు చెల్లవలసిన కప్పమును, ఇతర రాజ సేవావిధులను చెల్లుచుండినంత కాలము


http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మండలికుని కుమారులు తమ మండలమును పంచుకొన్నను రాజు అభ్యంతరపరచినట్లు కానబడదు. కాకతీయ రాజ్యమునం దీ విధమున మండలికులకును, నాయంకరాధిపతులైన నాయకులకును కొంత వ్యత్యాస ముండెడిది. కాకతీయుల కాలములోకంటె విజయనగరాధీశ్వరుల కాలమునందు నాయంకరములను గురించి శాసనములవలన నెక్కువగ దెలియవచ్చుచున్నది.

విజయనగర సామ్రాజ్య కాలమునాటి అమరనాయంకర పద్ధతికి కాకతీయులనాటి నాయంకర పద్ధతియే మూలాధారము. అమరనాయంకర పద్ధతి నాయంకర పద్ధతియొక్క పరిణామము. అమర నాయంకర పద్ధతి ఒక విధమైన సైన్య సేవావిధాన నిబంధము. అమరనాయకుడు రాజునకు యుద్ధ సమయమున తోడ్పడుటకు కొంత సైన్యమును పోషింపవలసి యుండుటయేకాక ఏటేట ప్రభువునకు నిర్ణీతమైన కొంత కప్పమును చెల్లింపవలసి యుండెను. విజయనగర సామ్రాజ్యమునందు క్షత్రియులైన అమరనాయకు లందరును మహామండలేశ్వర బిరుద విరాజితులైరి. అమరనాయకులే మహామండలేశ్వర బిరుదాంచితులగుటవలన వీరి కందరికి అధిపతియైన విజయనగరాధీశ్వరుడు మహారాజాధిరాజ రాజపరమేశ్వరుడని వినుతికెక్కెను. మహామండలేశ్వరులైన అమరనాయకులుకూడ తమ్ము భక్తి విశ్వాసములతో పౌరుష విక్రమములు చూపి సేవించినవారిని నాయంకరమున కధిపతులు గావించి నాయక బిరుద గౌరవ లాంఛనముల నొసగుచు వచ్చిరి. విజయనగరాధీశ్వరుల కాలమున దేశకావలి పద్ధతి కధిపతియైనవానికి మహానాయంకాచార్యుడని పేరు.

విజయనగర సామ్రాజ్యకాలమున కేంద్ర ప్రభుత్వమునకు పిదప కట్టుదిట్టమై బలిష్ఠమైనది రాష్ట్ర ప్రభుత్వము. రాష్ట్రమునకు విజయనగరాధీశ్వరుల కాలములో రాజ్యమని పేరు. ఇదివరలో నుడివినట్లు అందలి ప్రధాన దుర్గము పేర దానికి పేరు కలుగుచుండెను. రాజ్యపాలకులైన దుర్గాధిపతిని రాయలే నియమించెడివాడు. అత డెప్పుడును దణ్ణాయకుడే. కొంత సైన్యమున కధిపతియైన సైనికోద్యోగి. రాయ లీదుర్గాధిపతులను ఒక రాజ్యమునుండి మరొక రాజ్యమునకు మార్చుటయు కలదు. ఒక్కొక్క దుర్గాధిపతికి అమరనాయకులకు, నాయకులకు వలెనే రాజకార్యములను చక్కబెట్టుటకు కార్యకర్త లుండెడివారు. వీరు కాక వారి సముఖమునుండి క్రింది యధికారులకు పంపవలసిన శ్రీముఖములు వ్రాయుటకును, దుర్గాధిపతుల స్వముఖాజ్ఞలను వ్రాయుటకును వ్రాయసము (రాయసము) లుండెడివారు. దుర్గాధిపతుల దర్శనమునకు వచ్చువారిని సమయము కనిపెట్టి నివేదించి లోపల ప్రవేశపెట్టుటకు రాజులదగ్గరవలెనే 'అవసరము' లను ఉద్యోగు లుండువారు. రాజ్యమునకు సంబంధించిన లెక్కలు వ్రాయుటకు రాజ సన్నిధినివలెనే కవిలెసంప్రతు లుండెడివారు. రాష్ట్రపరిపాలన వ్యవహారము హిందూయుగమున ఈ రీతిని సాగిపోయినది.

## స్థానిక పరిపాలనము

**గ్రామాధిపతి :** రాజ్య చక్రమునకు గ్రామమే వివర్తన కీలకము. చిన్న పల్లెలు కొన్ని కలిసి రాజునకు చెల్లవలసిన ఆదాయపులెక్కకు ప్రాతిపదికమైన గ్రామముగ పరిగణింపబడుచు వచ్చెను. ఇటువంటి కొన్ని గ్రామములు కలిసి యొక స్థల మగుచుండెను. కొన్ని స్థలములు కలిసి యొక విషయము లేక నాడుగ నేర్పడుచుండెను. మనుధర్మశాస్త్ర ప్రకారము గ్రామ పరిపాలనమునకు రాజు గ్రామికుని నియోగించువాడు. ఈ విధముగానే అయిదేసి, పదేసి, ఇరువదేసి, నూరేసి, వెయ్యేసి గ్రామములకుకూడ అధిపతులు నియమింపబడుచుండవలెనని మనువు చెప్పియున్నాడు. కౌటిల్యుని అర్థశాస్త్రముకూడ ఇట్లే నుడువుచున్నది. భూలోకమల్ల సోమేశ్వరుడుకూడ తన మానసోల్లాసమున ఇట్లే ఒక్కొక్క గ్రామమునకు, అయిదేసి, పదేసి, ఇరువదేసి గ్రామములకు అధిపతులను నియమింపవలెనని వచించియున్నాడు. ఈ పద్ధతి పూర్వకాలమునుండియు నాడుకలో నుండినట్లు ఊహింపవచ్చును. ఒక్కొక్క రాజ్యమున గ్రామాధిపతివద్దనుండి రాష్ట్రాధిపతివరకు పాలకులు ఒకరిపై నొకరు వరుసక్రమమున అంతరువులుగ నుండినను వారి పదవుల పేర్లు తెలియవు. మండలమును పాలించుచుండిన మండలికులు, నాయంకరమును పాలించుచుండిన నాయకులు ఆ పాలకక్రమములోనివారే. గ్రామమున కధిపతియై గ్రామ పరిపాలనమును చక్కదిద్దుచు గ్రామమునుండి రాజునకు చెల్లవలసిన పన్ను పర్యాయములను వసూలు చేయుచు రాజునకును, గ్రామములోని ప్రజలకును అతుకు కలుపు కొలికిగా నుండెడివాడు గ్రామికుడు. ఇతనిని గౌరవ లాంఛనము లిచ్చి రాజే నియమించుచుండెను. శాతవాహనుల కాలములో గ్రామాధిపతికి గ్రామణి యని పేరు. కొన్ని కొన్ని గ్రామముల కధికారులుగ పల్లవుల కాలమున, పూర్వచాళుక్యపాలనారంభ కాలమునందును భోజకు లుండెడివారు. గ్రామాధిపతులకు గ్రామకూటు లనియు వ్యవహార ముండెను. గ్రామకూట పదమే కాలక్రమమున గౌడగ మారినది. పూర్వ చాళుక్యుల కాలమున శాసనములవలన పట్టులకు దనుపేరుగల గ్రామాధికారికూడ

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తెలియవచ్చుచున్నాడు. పట్టలకుడు తెలంగాణాలోని ఇప్పటి పటేలువంటి యుద్యోగి యగునేమో. అట్లయిన గ్రామాధిపతికి పూర్వకాలమున గ్రామికు డనియు, భోజకు డనియు, పట్టలకు డనియు, గ్రామకూటు డనియు, గ్రామణి యనియు వ్యవహరింపబడుచుండినట్లు తలంపవలసియున్నది. పట్టలకునికి, భోజకునికి, గ్రామకూటునికి, గ్రామణికి పదవిలోను, నిర్వర్తింపవలసిన విధులలోను ఏమైన వ్యత్యాసము లుండెనో, ఏ పేరుతో వ్యవహృతమైనను పదవి యొక్కటగునో కాదో ముం దింకను పరిశోధనవలన తెలవలసియున్నది.

గ్రామభటులు: గ్రామ నిర్మాణము జరుగునప్పుడే పూర్వము గ్రామముయొక్క ఆర్థిక సౌష్ఠవమునకును, గ్రామ వ్యవహారము చక్కగ సాగుటకును కరణము, రెడ్డి, పురోహితుడు, కంసాలి, కమ్మరి, వడ్రంగి, కాసె, చాకలి, మంగలి, కుమ్మరి, మాల, మాదిగ అని సాధారణముగ పండ్రెండుగురు వృత్తిమంతులను ఏర్పాటుచేసి, వారికి మాన్యము లిచ్చుచుండిరి. ఈ మాన్యములకు భటవృత్తి మాన్యము లనియు, జాతికట్టు మాన్యము లనియు, ఆమాన్యము లనుభవించుచుండిన గ్రామ భటులకు అయగాండ్లనియు పేర్లు. ప్రతి గ్రామమునకు సాధారణముగా పూర్వము పండ్రెండుగురు భటు లుండుటవలన వీరికి మధ్యయుగమున 'బారా బలవంతులని', 'బారాబలూతిలని' ఈ పద్ధతికి బారాబలోతి పద్ధతియని పేరు కలిగినది. ఒక్కొక్క గ్రామములో ఆ గ్రామావసరములను బట్టి ఇంతకంటె ఎక్కువమందియు నుండవచ్చును; లేదా ఇంతకంటె తక్కువమందియు నుండవచ్చును. వివాదములు రాకుండ గ్రామస్థు లందరకు యుక్తకాలమున వ్యవసాయమునకు నీ రందునట్లు చూచుటకు కొన్ని గ్రామములలో నీర్గంటి యొక డుండువాడు. అతనికిని గ్రామములో మాన్య ముండెడిది. కొన్ని గ్రామములలో వైద్యునికిని, విషవైద్యునికిని మాన్యము లుండెడివి. వేరొక కొన్ని గ్రామములలో పౌరాణికునికి కూడ మాన్య ముండెను. ఆ మాన్యము ననుభవించుచు పౌరాణికుడు సాయంకాలము దేవాలయములో గ్రామస్థులకు పురాణము చదివి చెప్పువాడు. ఈవిధమున పూర్వము గ్రామీణులు తమ ఆర్థిక సౌష్ఠవమునకును, అభ్యున్నతికిని ఉపకరించు వృత్తిమంతుల నేర్పరచుకొని సుఖముగా జీవనము గడపుతారు.

గ్రామమునకు సంబంధించిన లెక్కలువ్రాయు పని గ్రామ కరణముది. గ్రామమునకు సంబంధించిన వివరములు వ్రాయు లెక్క పుస్తకమునకు గుడికట్టులెక్కయని పేరు. గ్రామ సీమావధులు, ఆయకట్టు పరిమితి, గ్రామములోని తోటభూమి, కాడారంబము (మెట్ట వ్యవసాయము), నీరారంబము (పల్లపు వ్యవసాయము) పరిమితులు, గ్రామములోని దేవదాయ బ్రహ్మదాయముల భటవృత్తి మాన్యముల ఇతరమాన్యముల వివరములు, గ్రామమునుండి రాజుకు చెల్లవలసిన ధాన్యరూపమైన, సువర్ణరూపమైన పన్ను పర్యాయములు మొదలైన సంపూర్ణ వివరము లన్నియు గుడికట్టు లెక్కలో నుండును.

గ్రామములో గ్రామస్థులు నివసించు ప్రదేశమునకు గ్రామనత్తమని పేరు. గ్రామనత్తమును చుట్టి యొక వీథి యుండెడిది. దీనికి మంగళవీథియని పేరు. ఈ మంగళవీథిని చుట్టి గ్రామ ప్రాకార ముండెడిది. పూర్వకాలమున చిన్నదైనను, పెద్దదైనను ప్రతి గ్రామమును ప్రాకారావృతమై యుండెడిది. పురోహితుడు గ్రామారోగ్య శ్రేయ స్సౌభాగ్యముల నిమిత్తము ప్రతి దినము నుదయముననే సుస్నాతుడై మంత్రములు చదువుచు మంగళవీథిని ప్రదక్షిణము చేయుచు, దేవతల నారాధించువాడు. గ్రామమునకు సంబంధించిన వ్యవసాయపు భూము లన్నియు గ్రామ ప్రాకారమునకు వెలుపలనే యుండెడివి. పండిన పంటను వన్య మృగములును, ఇతర జంతువులును పాడుచేయకుండను, దొంగ లపహరింపకుండను కాపాడుచుండు పని కావలివానిది. ఇతడు బారాబలవంతులలో ఒకడు. ఇతనికికూడ మాన్యముండెను. గ్రామము ఏర్పాటగునప్పుడే గ్రామస్థుల పసుల మందలు మేయుటకు కొంత క్షేత్రమును పచ్చిక బయలుగ (పచ్చిక బీడుగ) ప్రత్యేకించుచుండువారు. ఇది ఏయొక్కరిదియు కాదు; గ్రామేయకు లందరిదియును. అందువలన దీనికి సాముదాయిక క్షేత్రమని పేరు; ఇక్లే కుప్ప మార్పుటకు గ్రామస్థు లందరికి సమానముగా హక్కుగల సాముదాయికపు కళ్ళముకూడ నుండెడిది. కొన్ని కొన్ని గ్రామములలో గెలుపెద్దుల మాన్యమని యొక మాన్య ముండెడిది. గ్రామస్థులు మంచిరకము ఎడ్లను తయారుచేసికొనుటకేర్పాటు చేసికొన్న మాన్య మది. ప్రతి సంక్రాంతికిని ఎడ్ల పరుగు పందెములు పెట్టి ఏరైతు ఎద్దు గెలిచిన ఆమాన్యమా యేటికి ఆ రైతు భుక్తములో నుండెడిది. ఆమాన్యమీవిధమున తరచు చేతులు మారెడిది. ఈ విధమున మేలు రకము ఎడ్లను తయారుచేయుటకు రైతుకు ప్రోత్సాహము కలిగించుటయే ఆ మాన్యము ఏర్పాటులోని ఆశయము.

గ్రామ వ్యవహారములను చక్కబెట్టుకొనుటలో గ్రామస్థులకు రాజువలన నేయాటంకమును కలిగెడిదికాదు. గ్రామమునుండి తనకు చెల్లవలసిన పన్ను పర్యాయములు, ముక్తాదలు చెల్లుచుండినంతకాలము రాజు గ్రామపాలనమున

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సౌఖ్యము కలిగింపగోరెడివాడు కాడు. ప్రాచీనకాలమున గ్రామ మొకచిన్న ప్రజాస్వామిక రాజ్యమే.

**గ్రామభేదములు :** కరగ్రామములని, ఉంబళిక గ్రామములని, రాచ ఊళ్ళని, అగ్రహారములని పూర్వకాలమున నాలుగు రకములైన గ్రామము లుండెడివి. వీనిలో కర గ్రామము లన్నవి రాజునకు రొక్కము రూపమున, ధాన్యరూపమున కప్పము చెల్లింప వలసిన గ్రామములు. ఏదైన ప్రభుత్వ సేవచేయుటకై పన్నియ వక్కరలేకుండ అనుభవించుట కిచ్చిన గ్రామములు ఉంబళికలు. ఇవి మొఖాసాలవంటివి. రాచ ఊళ్ళనవి ప్రత్యేకము రాజునకు సంబంధించిన స్వంతగ్రామములు. విజయనగరాధీశ్వరుల కాలములో వీనికి భండార గ్రామములని పే రుండెను.

అగ్రహారము లన్నవి వేదవేదాంగవిదులు, శాస్త్రవేత్తలు అయిన బ్రాహ్మణులకు రాజు సర్వకర పరిహారముగ నిచ్చిన గ్రామములు. ఇవి విద్యా విషయకముగ చేయబడిన గ్రామదానములు. ప్రతిగ్రహీత వేదాధ్యయనాది కర్మానుష్ఠానములను కావించుకొనుచు విద్యార్థులకు విద్య నేర్పుచుండువాడు. పూర్వపు అగ్రహారము లన్నియు విద్యాపీఠములే. ఈ కారణముననే రాజు రాజపురుషులును, చాటులు భ(శిఖా)టులు అను నిత్యనైమిత్తిక భటవర్గమును అగ్రహారమున ప్రవేశింపరాదను కట్టడచేసి దానిని బ్రాహ్మణునికి ధారపోయువాడు. కాని యీ కట్టడ పూర్వయుగమున — అందు ముఖ్యముగ పల్లవుల కాలమున దాన మిచ్చిన అగ్రహారములకు మాత్రమే వర్తించుచు వచ్చినది. అగ్రహార ప్రతిగ్రహీత రాజున కే విధమైన పన్ను పర్యాయములు చెల్లింపనక్కర లేదు. కొన్ని యెడల కోడి మాత్రము చెల్లింపవలసి యుండెను. రాజు బ్రాహ్మణునికి గ్రామము నగ్రహారముచేసి యిచ్చినపుడే ఆ గ్రామమునుండి రాజునకు చెల్లుచుండిన రాజమర్యాదాచారము లన్నియు ప్రతిగ్రహీతకు సంక్రమించెడివి. బ్రాహ్మణునికి కృషి, పాశుపాల్యములు ధర్మశాస్త్రముల వలన నిషిద్ధ మగుట వలన అగ్రహారపు భూములను వ్యవసాయము చేయు రైతులు నివసించుటకై అగ్రహారముతోపాటు రాజు గ్రామటిక లను పేర గ్రామ గ్రాసపు పల్లెలనుకూడ ప్రతిగ్రహీత కిచ్చుచుండువాడు. ఇట్టి గ్రామటికకు పూడి యని పేరు. కాలము గడచినకొలది ఈ పద్ధతి మారినది. రాను రాను అగ్రహారములలోనే రైతులు వసించుటకు కొంతభాగము ప్రత్యేకింప బడుచు వచ్చినది. శివయోగులకు, శివాచార్యులకు సర్వకర పరిహారముగ దానము చేయబడిన గ్రామములకు శివపురములని పేరు. అగ్రహారములు కొన్ని ఏకభోగములు; మరికొన్ని బహుభోగములు. ఒక్కని యనుభవము నిమిత్తమే యిచ్చిన అగ్రహారము ఏకభోగము. ఒక యగ్రహారమున పెక్కుమందికి వృత్తులు (భాగములు) ఉండిన యెడల అది బహుభోగ మనబడును. బహు భోగమునకే గణభోగ మనియు పేరు.

గ్రామములలో మరికొన్ని రకములు కలవు. కొన్ని సాముదాయిక గ్రామములు, మరికొన్ని వారపట్టు గ్రామములు, వేరొక కొన్ని గుత్త గ్రామములు.

సాముదాయిక గ్రామమున భూమి ఏ యొక్కరిదియు కాదు. అందువలన కొలకరికి ముందు మొత్తముమీద వ్యవసాయోచితమైన భూమి నంతను ఆ గ్రామమునందలి రైతులకు వారి వారి యోగ్యతార్హతల ననుసరించి కయ్యలుగా విభాగించి యిచ్చి వాగళ్ళనుకూడ సరఫరా చేయువారు. పంట పండిన తరువాత దానిని రాశిగ పోసి మొత్తముమీద రాజభాగము తీసివేసి మిగిలిన భూమిని మొదట కయ్యలుగా విభాగించి ఏ పద్ధతిని రైతుల కిచ్చిరో అదే పద్ధతిని రైతులు తమలో తాము పంచుకొనువారు. వాగళ్ళన్నియు ఊరివారివి; మొత్తము పంటయు ఊరివారిదే. ఈ విధమైన సాముదాయిక గ్రామములు ప్రాచీన కాలమున నుండెనేమో శాసనముల వలన స్పష్టముగ తెలియదు. కాని ఇట్టి వుండినట్లు పదునెనిమిదవ శతాబ్దము నాటి విదేశీయుల వృత్తాంతముల వలనను, బ్రిటిష్ ఉద్యోగుల నివేదికల వలనను తెలియుచున్నది.

వారపట్టు గ్రామములు ఇప్పటి రైతువారి గ్రామముల వంటివి. ఏ రైతు కా రైతు గ్రామములోని తన పొలములను తాను దున్నుకొని సేద్యముచేసి పండించుకొని పండిన పంటలో రాజు పాలును గ్రామణి పరముగా నిచ్చి మిగిలినది తా ననుభవించు చుండెడివాడు.

మధ్యయుగమున ఒక్కొక్క గ్రామమును కాని, పెక్కు గ్రామములనుకాని ఒకరికి కాని, పెక్కుమందికి గాని, ధాన్యరూపమునను, రొక్కము రూపమునను ఇయ్యవలసిన కప్పమును నిర్ణయించి రాజు గుత్త కిచ్చుటయు నుండెడిది. ఇట్టి గ్రామములకు గుత్తగ్రామములని పేరు.

**పంచాయతి సభ :** గ్రామ పరిపాలనమున గ్రామణికి తోడ్పడుట కొక సంఘ ముండెడిది. ఈ సంఘమునందలి సభ్యులకు మహత్తరులని పేరు. పూర్వచాళుక్యుల కాలమున వీరిని రాష్ట్రకూట ప్రముఖు లనియు వ్యవహరించుచుండిరి. తరువాత ఈ సంఘము ఇటీవల పంచాయతి యనుపేర వ్యవహరింప బడుచు వచ్చెను. పంచపదమున ఐదని యర్థమగుటచేత పంచాయతి యనగా అయిదుగురు సభ్యులతోకూడిన సంఘ మన్నమాట. కాని వ్యవహారమున



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



'పంచాయతి'లో అయిదుగురి కంటె నెక్కువ సభ్యులుండుటయు కలదు; అయిదుగురి కంటె తక్కువ మాత్రము సభ్యు లుండకూడదు. గ్రామమునకు సంబంధించిన వ్యవహారము లన్నియు సక్రమముగ సాగుచున్నది లేనిది పరీక్షించుట, గ్రామాభివృద్ధికి తగిన పనుల నన్నిటిని చేయుట ఈ గ్రామ సంఘసభ్యుల విధి. గ్రామ పరిపాలనమునకు సంబంధించిన వ్యవహారములను చక్కబెట్టు ఈ సభవారిని ఊరివా రనియు వ్యవహరించుట కలదు. ఊరివారనగా కరగ్రామ పరిపాలనసంఘ సభ్యులని యర్థము.

అగ్రహారమునకు సంబంధించిన పరిపాలన వ్యవహారమంతయు ఆ యగ్రహార ప్రతిగ్రహీతలే ఒక సభగా నేర్పడి నిర్వహించుచుండెడివారు. ఈ సభాసభ్యులకు సభవారని, మహాజనులని వ్యవహార ముండెను. శాసనములలో సభవారని, మహాజనులని పేర్కొనబడినవారు అగ్రహార సభాసభ్యు లనియే గ్రహింపవలసి యుండును. అగ్రహారోపయోగకరములైన ఏయే కార్యములు చేయవలసి వచ్చినను, ఏవైన పనులనిమిత్తము ఎవ రెవరినైనను నియమింపవలసి వచ్చినను సభవారు సమావేశమై చర్చించి బహుజనాంగీకారముతో చేయుచుండెడివారు.

గ్రామములనుండి రాజునకు వచ్చు ధాన్యమును నిలవ చేయుటకు పెద్ద గ్రామములలో రాచగాదె లుండెడివి. కరువు కాటకములు సంభవించినపుడును, పంటలు పాడయినపుడును ప్రజలకు భోజనము పెట్టుటకును, విత్తనముల నిమిత్తమును రాజు వానినుండి ధాన్యమును కొలిచి యిచ్చువాడు. ఇతర స్థానిక ప్రభుత్వ వ్యయముల నిమిత్తమును ఆ ధాన్యము వినియోగింప బడుచుండెను. మ. సో. శ.

# మహమ్మదీయ ప్రభుత్వము

**బహ్మనీ రాజ్యపాలన విధానము :** బహ్మనీ రాజ్య స్థాపకుడైన అలా ఉద్దీన్ హసన్ గంగు తన రాజ్యమును పాలించుటకు నూతన పద్ధతుల నేర్పరచక తత్పూర్వము తుఘ్లుకు చక్రవర్తులనాడు వాడుకలో నుండిన పాలన పద్ధతుల ననుసరించియే ప్రభుత్వమును సాగించెను; అతని కుమారుడైన మొదటి ముహమ్మదు కాలమున అతని ప్రధానమంత్రియైన సైఫ్ ఉద్దీన్ ఘోరీయను నతడు పూర్వ పద్ధతులను మార్చి నూతన రాజ్యము యొక్క పాలనకు క్రొత్త యేర్పాటులను, కట్టుదిట్టములను గావించెను. అప్పటి రాజ్యాంగ వ్యవహార వ్యవస్థల ననుసరించి ప్రభుత్వోద్యోగులు ఆయుధోపజీవు లనియు, లేఖాజీవు లనియు ద్వివిధముగ విభజింపబడియుండిరి; కాని అక్కర కలిగినప్పుడు అందరు ఉద్యోగులును కత్తిని చేపట్టి యుద్ధ కార్యములందు పాల్గొనవలసియుండిన కారణమున పై వర్గీకరణ మంతగ పాటింపదగినది కాదు. ఎల్ల రాజ్యములందువలె బహ్మనీ రాజ్యమునందును పాలకవర్గము కేంద్రక మనియు, మాండలిక మనియు, స్థానిక మనియు మూడు తరగతులుగ విభక్తమై యుండినది. మొట్టమదట స్మరింపదగిన విషయ మొకటి కలదు. రాజ్యమున కంతటికిని ఒడయడు సుల్తాను. సర్వాధికారములును అతనియందే లగ్నమై యుండినవి. అతడు నిరంకుశుడు, విశృంఖలుడై ప్రవర్తించినను అతని యాజ్ఞ దురాధర్షము. కాని, సామాన్యముగ నతడు మంత్రులు చెప్పు హితము ననుసరించియే ప్రజా క్షేమమును దృష్టియం దుంచుకొని సమస్త రాజకార్యములను నిర్వహించువాడు. మంత్రాంగములో ప్రముఖుడు వకీలు; ఇతనిని వకీల్-ఉస్-సల్తనత్ అని పేర్కొనుట కలదు. ఇతడు ప్రధాన మంత్రి; మరియొక మంత్రి వజీరుడు; మరియొకడు దబీరు (అనగా రాయసాధిపతి). వీరుగాక సర్‌హద్‌దార్ (అనగా అంతపాలకుడు), కిలాదార్ (దుర్గాధిపతి), బక్షీ (కోశాధిపతి), కాజీ (న్యాయాధిపతి), ముఫ్తి (చట్ట వివరణకర్త), కొత్వాలు (ఆరక్షకాధిపతి), ముహ్తసిబ్ (నీతి పర్యవేక్షకుడు) మొదలగువారు మంత్రివర్గమున సభ్యులై తమ తమ నియోగములకు సంబంధించిన వ్యవహారములను చక్కదిద్దుటయందు సుల్తానునకు తోడ్పడుచుండిరి.

పాలన సౌకర్యార్థము బహ్మనీ సింహాసనమునకు చెల్లుచు వచ్చిన రాష్ట్ర మంతయు దౌలతాబాదు, గావుల్ ఘడు, బీదరు, గుల్బర్గలు ముఖ్య స్థానములుగ గల తరఫ్ లనబడు నాలుగు మండలములుగ విభజింపబడి, తరఫ్ దారు లను అధికారుల కొప్పగింపబడెను. ఈ తరఫ్ దారులకు నలుగురకును క్రమముగ మస్నద్-ఇ-అలీ, మజ్లిస్-ఇ-అలీ, అ'జమ్-ఇ-హుమాయూన్, మల్లిక్ నాయిబ్ అను ప్రత్యేక బిరుదు లొసగబడెను. అన్ని మండలములలోను రాజధాని గుల్బర్గ ప్రధాన స్థానముగ గల మండలమే ముఖ్యమైనది; ఇందు బిజాపురముకూడ ఇమిడియుండినది; సుల్తాను విశ్వాసమునకు విశేషము పాత్రుడయిన సర్దారుడేగాని యీ మండలాధిపత్యమున కన్యులు నియుక్తులయ్యెడివారు కారు; కావుననే ఆ మండలాధిపతి మల్లిక్

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



నాయిబ్ బిరుదున కర్తృడాయెను. ఈ మండలాధిపతులు తమ యేలుబడిక్రింది గ్రామములను తమ యనుచరులకును, ఆశ్రితులకును జాగీరులుగ బంచి యిచ్చువారు. ఒక్కొక జాగీరుదారుడు యుద్ధకార్యమునకు గొంత సిబ్బందిని భరించుటయేకాక, ఖజానాకు నిర్ణీతమైన కప్పమును చెల్లించవలసి యుండెను. అప్పటి స్థానిక పరిపాలన యెట్టిదో నిశ్చయించి చెప్పుటకు వీలులేదు; కాని, యనాదినుండి పారంపర్యముగ వచ్చు గ్రామసభల మూలముననే స్థానికపరిపాలన సాగుచువచ్చెనని యూహింపవచ్చును.

మొదటి మహమ్మదు తరువాతికాలములో బహ్మనీ రాజ్యముయొక్క విస్తీర్ణము విశేషముగ పెరిగినది. అత డేర్పరచిన రాజ్యతంత్రమునందు కొన్ని లోపములు పొడకట్టినవి; కాని మూడవ మహమ్మదు శాహు కాలము వరకును ఎవ్వరును రాజ్యాంగవిధానమును చక్కదిద్దు కార్యమునకు పూనుకొనరైరి. స్వామిభక్తిపరాయణుడైన మంత్రిసత్తముడు మహమ్మదు గావాను రాజ్యాదాయమును, సుల్తానుని యధికారమును పెంపొందింప నుద్యమించి రాజ్యాంగ పునర్నిర్మాణ కార్యమును తలపెట్టెను. అతని సంస్కరణలలో మొదట చెప్పదగినది రాష్ట్రవిభజన. సైఫ్ ఉద్దీన్ ఘోరీ నిర్మించిన నాలుగు తరఫ్‌లను రద్దుచేసి వానికి బదులు గావిల్, మాహూరు, దౌలతాబాదు, జున్నేరు, విజాపూరు, గుల్బర్గ, వరంగలు, రాజమహేంద్రవరములను ఎనిమిది సర్‌లష్కరులను ఏర్పరచెను. ఇవి విస్తీర్ణమున మునుపటి తరఫ్‌లంత పెద్దవి కావు; ఒకపాటి పరిమాణమును గలిగి సులువుగ పాలించుట కనుకూలముగ నుండెను. ప్రాత క్రొత్త పద్ధతులకు గల భేదము సంఖ్యా ద్విగుణీకరణ మొక్కటియే కాదు; అంతకంటె ముఖ్యమైనది తన్నిర్మాణోద్దేశము. ఇది పూర్వ నవీన పద్ధతుల నామ భేదము వలన వ్యక్తమగు చున్నది. సైఫ్ ఉద్దీన్ ఏర్పరచిన రాష్ట్రవిభాగములకు తరఫ్‌లని పేరు; ఈ విభజన కేవలం దేశపాలన దృష్టితో చేయబడినది. మహమ్మదు గావాను నిర్మించిన రాష్ట్రవిభాగములకు సర్‌లష్కరులని పేరు. సర్‌లష్కరనగా సేనాధిపతి. రాష్ట్రవిభాగముల కాపేరు పెట్టుటవలన రాష్ట్రముల కన్నిటికిని సేనాధిపతులనే పాలకులుగ నియమించుట మహమ్మదు గావానుని భావ మనియు, రాజ్యము యుద్ధదృష్టితో తత్కార్యనిర్వహణమున కనుకూలించునట్లు విభజింపబడె ననియు తెల్లమగుచున్నది. మరియు అతడు సర్‌లష్కరుల అధికారమును మట్టుపరచి కేంద్రప్రభుత్వము యొక్క బలమును పెంపొందించుటకు తగిన యేర్పాటులను కావించెను. మునుపటి పద్ధతి ననుసరించి తరఫ్‌లలోని దుర్గముల కన్నిటికిని అధిపతులను నియమించు అధికారము తరఫ్‌దారులకే చెల్లుచుండెను; తరఫ్‌లలోని దుర్గాధిపతులందరును తరఫ్‌దారుల పక్షమువారై కేంద్రప్రభుత్వముతో నెట్టి ప్రత్యక్ష సంబంధమును లేక యుండిరి. ఈ కారణమున తరఫ్‌దారులు బలముగొని సుల్తానును ప్రతిఘటించుట కవకాశము కలుగుచుండెను. మరియు తరఫ్‌దారుల శక్తిసామర్థ్యములను, స్వామిభక్తిపరాయణతను విచారింపక జాగీరుల నిచ్చుచు వచ్చుటవలన అనర్థములు పెక్కు సంభవించు చుండెను. మహమ్మదు గావాను ఈ పద్ధతిని విసర్జించి క్రొత్త యేర్పాటులను గావించెను. తరఫ్‌దారులు తమ తరఫ్‌లలోని దుర్గములకు పాలకులను నియమించు హక్కును రద్దుచేసి ఆ యధికారమును కేంద్రప్రభుత్వమందే విలగ్నము గావించెను. మరియు జాగీరులను మునుపటివలె గాక యోగ్యతానుసారముగ ఇచ్చువ ట్లేర్పాటు చేసెను. ఒక్కొక్క తరఫ్‌దారునకును ఏ నూర్గురు భటులకు లక్షమొదలు లక్షయిరువదియైదు వేల హోన్నుల పైకమునుగాని, యంతటి రాబడిగల జాగీరును గాని ఇచ్చున ట్లేర్పరిచెను. ఏ తరఫ్‌దారుడుగాని, జాగీరుదారుడుగాని నిర్ణీత సంఖ్యగల భటులను భరింపనిచో అతడు దామాషాప్రకారము కొరతపడిన భటుల సంఖ్య కగు ఖర్చులను సుల్తాను భండారమునకు గట్టి యీవలసి యుండెను. మహమ్మదు గవాను కావించిన సంస్కారములను పరిశీలించి చూడగా అవి యన్నియు ప్రజాభివృద్ధి నుద్దేశించికాక, కందాచారమును బలపరచుటకే ప్రవేశపెట్టబడెనని తోచుచున్నది. నే. వెం. ర.

**కుత్బ్ షాహి పరిపాలన విధానము :** కుత్బ్ షాహి పరిపాలన విధానము బహ్మనీ విధానమునకు ప్రతికృతియే అయినను దానిలో దేశకాల పరిస్థితుల ననుసరించి ఆవశ్యకములగు మార్పులు కలుగుచు వచ్చినవి. కుత్బ్ షాహి పరిపాలన మంతయు దయా దాక్షిణ్యములతోను, సహన భావముతోను జరిగినది. హిందువులు, ముస్లిములు అను భేదములేక ప్రజల స్వామ్య ప్రయోజనములు సమానముగ సంరక్షింపబడుచు వచ్చినవి. వారి ధన ప్రాణములకు సంపూర్ణమైన భద్రతయే కాక వారికి భావ స్వాతంత్ర్యము కూడ నుండెను. మతవిశ్వాసములందును, ఆచార వ్యవహారములందును వారు సర్వ స్వతంత్రులై యుండిరి. ఈ దృష్టితో చూచినచో హిందూదేశ మధ్యయుగ చరిత్రలో కుత్బ్ షాహి ప్రభువుల స్థానము అద్వితీయమైనదని చెప్ప వలసియున్నది. రాజ్యమును సక్రమపరిచి న్యాయ్య పరిపాలనమును ప్రథమమున నెలకొల్పిన ప్రతిష్ఠ ఇబ్రాహీం కుత్బ్ షాకు చెందవలసియున్నది. అత డేర్పాటు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చేసిన విధానమే ఇంచుక మార్పులతో కడవరకు సాగుచుండెను.

రాజు: రాజకీయ వ్యవహారమును, పరిపాలన విధానమును సర్వము సుల్తానుమీదనే ఆధారపడియుండెడిది. రాజ్యతంత్ర మంతయు అతని మూలముననే నడచుచుండెననియు, రాజనీతి మార్గమును నిర్నిబంధముగ అతనిచేత తీర్చి దిద్దబడెడి దనియు లోకుల భావన. అయినను కుత్బ్ షాహీలు ఎల్లప్పుడు ఏవిషయమునందుగాని తమ రాజ్యములోని ప్రధానోద్యోగులతో ఆలోచింపక యే నిర్ణయమును చేయువారు కారు; మతాచార్యుల, విద్వాంసుల సలహాను సైతము పొందెడివారు. కావున వారి రాచరికము నిరంకుశమైనది కాక మంత్రాంగముపై నాధారపడిన రాజ్యాంగ సంస్థగా నుండెడిది. సుల్తాను కులీ మొదలుకొని తానాషావరకును గల ఏడుగురు కుత్బ్ షాహి సుల్తానులును గొప్ప విద్యావంతులు; సంస్కార సంపన్నులు; సంపూర్ణ రాజకీయ నిష్ణాతులు; ప్రజానురక్తులు.

మంత్రి: సుల్తానుకు తరువాతి అధికారి ప్రధాన మంత్రి. అతనికి పీష్వా యని పేరు. దేశీయ, విదేశీయ వ్యవహారములలో అవలంబింపవలసిన రాజ్యాంగ పద్ధతులను నిర్ణయించుటయందు అతడు ప్రభువునకు చేదోడు వాదోడుగా నుండెడివాడు. అతనితో నాలోచింపక సుల్తాను ఏపనియు చేసెడివాడు కాడు. రాజ్య మంతయు అతని యధికారముక్రింద నుండెను. రాజ్యాంగములోని వివిధ శాఖలను అతడు పర్యవేక్షించువాడు. ఇబ్రాహీం, ముహమ్మదు కులీ, అబ్దుల్లా, అబుల్ హసనుల పరిపాలనమునందు వరుసగా ముస్తఫా ఖాన్ అర్దిస్తాని, మీర్ మోమీన్, షేక్ ముహమ్మద్, ఇబ్న్ ఖతూన్, మాదన్న అనువారు ప్రధానమంత్రులై యుండిరి.

మీర్ జుమ్లా: పీష్వాకు తరువాతి అధికారి మీర్ జుమ్లా. ఇతడు నేటి ఆర్థిక మంత్రివంటివాడు. రాజ్యముయొక్క ఆయవ్యయముల కార్యక్రమము అతని యధీనమున నుండును. అధికారమునందును, పదవియందును అతడు పీష్వాకు తరువాతివాడు. కొన్ని విషయములలో అతడు పీష్వాకంటె ఎక్కువ పలుకుబడి కలిగియుండువాడు. ఈ పదవిని వహించినవారిలో ముహమ్మద్ అమీన్, ముహమ్మదు సయీద్ అనువా రిద్దరును తమ వ్యక్తిత్వముచేతను, తెలివితేటలచేతను మిక్కిలి వాసికెక్కిరి.

ఐనుల్ ముల్క్: ఐనుల్ ముల్క్ అనునది మరియొక మంత్రిపదవి. సైనికశాఖ ఈ పదవియందు నియుక్తుడైన మంత్రి యధికారముక్రింద నుండెడిది. ఇత డిప్పటి యుద్ధమంత్రివంటివాడు. ఐనుల్ ముల్క్ అనునది అధికారపదవికి పేరగుటచేత ఇతడు నిర్వహించు కార్యమునకు ఐనుల్ ముల్క్ అను పే రేర్పడినది. సేనాంగముపై నధికారము కలిగియుండుటచేత ఇతడుకూడ మీర్ జుమ్లా యంతటి పలుకుబడి కలిగియుండెడివాడు. జంషీదు కుత్బ్ షా కాలములో సైఫ్ ఖాన్ ఈ యుద్యోగమున నుండెను.

పైని పేర్కొనినవారు కాక రాజోద్యోగివర్గములో ముజుందార్, దాబీర్, కొత్వాల్ అను మరి ముగ్గురు ప్రధానోద్యోగు లుండిరి. ముజుందారు నేటి 'ఆడిటర్ జనరల్' వంటివాడు. ఇతడు రాజ్యముయొక్క ఆయవ్యయముల లెక్కలను పరిశీలించి ఆయ వ్యయ పట్టికలను సిద్ధము చేయుచుండెడివాడు. దాబీర్ పరిపాలన క్రమమును తనిఖీచేసి నివేదికలను కేంద్రప్రభుత్వమున కంద జేయును. కొత్వాలు రక్షకభటాధికారి (పోలీస్ కమిషనర్). రాజ్యమునందు శాంతి భద్రతలను సంరక్షించుట ఇతని పని. వీరికంటె తక్కువ తరగతి యుద్యోగులు దబీరు, ముహ్నవీసు, ముశ్రిఫ్ అనువారు మరి ముగ్గురుండిరి. వీరిలో దబీరు ఫర్మానాలు పంపించెడివాడు. ముహ్నవీసు ఉత్తరములు మొదలగువానికి ముసాయిదాలు, వివరములు వ్రాసెడి యుద్యోగి. ముశ్రిఫ్ రాజ్యాంగ సంప్రదాయములకు, మర్యాదలకు సంబంధించిన కార్యములను క్రమము తప్పక నిర్వహింప జేసెడివాడు. ఫర్మాను లన్నియు ఎల్ల జనులకు తెలియునట్లు పార్సీ, తెలుగు భాషలు రెంటను వ్రాయబడుచుండెడివి. ఫర్మానులను దేశభాషయైన తెలుగులోనికి అనువాదము చేయుటకై హిందు వొకడి యుద్యోగమున నియమింపబడుచుండెను.

రాజ్యతంత్రములో ప్రధానాంశమయిన న్యాయపరిపాలన విషయమునను కుత్బ్ షాహీలు ఎక్కువ శ్రద్ధవహించెడివారు. వివాదములను విచారించి న్యాయము నిర్ణయించుటకు ముస్లిములకు వారి మతాచార్యులును కాజీలును, హిందువులకు పండితులును నియుక్తులగుచుండిరి. గ్రామము మొదలుకొని రాజధాని వరకును న్యాయాధికారుల పరంపర యుండెడిది. క్రింది న్యాయస్థానముల తీర్పులలోని లోపములను పునర్విచారించి న్యాయము కలిగించుటకు రాజధానీ నగరమున పెద్ద కాజీ యుండిరి. న్యాయస్థానపు తీర్పులు నచ్చనివారు తమకు జరిగిన యన్యాయమును నివేదించుకొనుటకును వారి మొరలను విని, వారికి న్యాయము దయచేయుటకును సుల్తాను అవకాశ మిచ్చెడివాడు. వారమున కొకదినమున సుల్తాను తన సౌధోపరిభాగమున కొలువుతీరి, క్రింద ప్రాంగణమున నిలిచియుండు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



న్యాయార్థులకు దర్శన మిచ్చి వారి మొరల నాలకించి వివాదవిషయ మంతయు జాగ్రత్తతో పరిశీలించి న్యాయ నిర్ణయము చేయుచుండునని టవర్నియరు చెప్పుచున్నాడు. అనాదినుండియు వాడుకలో నుండిన పంచాయతీలుకూడ వీరి కాలములో వ్యవహారములో నుండెను.

కుతుబ్ షాహి ప్రభువులు ప్రజాపరిపాలనమునందువలెనే రాజ్య సంరక్షణమునందును శ్రద్ధ వహించెడివారు. సివిలు పరిపాలనమువలెనే సైనిక వ్యవస్థయు పటుత్వము కలిగి యుండెను. తగినవారిని సైన్యమున చేర్చుకొనుట, యుద్ధ పరికరములను సమకూర్చుట, సైన్యములను యుద్ధమునకు సంసిద్ధము చేయుట మొదలైన సైనికశాఖా కార్యములను ఐనుల్ ముల్క్ నిర్వర్తించుచుండెడివాడు. సైన్య మంతయు కేంద్ర సైన్య మనియు, రాష్ట్రీయ సైన్య మనియు రెండు భాగములుగ విభజింపబడి యుండెడిది. రాష్ట్రములయందును, రాష్ట్రాంతర్గత దుర్గముల యందును బలమైన పటాలములు శాశ్వతముండి అక్కర కలిగినప్పుడు సత్వరముగ పోవలసిన చోట్లకు పోవుచుండెడివి. సైనికులకు ఆయుధములను, ఒకే రకమైన దుస్తులను ఇచ్చుచుండెడి వారు. కుతుబ్ షాహి సుల్తానుల సైన్యములో ఎక్కువమంది తెలంగాణా ప్రజలే యుండిరి. కుతుబ్ షాహీలకు రాజ్య రక్షణ విషయమున ముస్లిము ప్రజలయెడల నెంతటి విశ్వాసము కలదో అంతటి విశ్వాసము హిందువుల యెడలను ఉండెను. దళములను నడపు చిన్న యుద్యోగులకు నాయకు లనియు, నాయక్‌వారీ లనియు పేరు. వా రందరును హిందువులే. అంగరక్షక సైన్యమునకు ఖాసా ఖైల్ అని పేరు. స్థాయి సైన్యము, పాళెముల సైన్యము కలసి కుతుబ్ షాహి సుల్తానుల రాణువ మొత్తము అయిదు లక్షలు. దేశ సంరక్షణమునకు దుర్గములు ప్రధానాంగములు. కావుననే దుర్గము లెల్లప్పుడును సాయుధ సైన్యముతో సన్నద్ధములై యుండెడివి. దేశములో అరువది యారు దుర్గము లుండెను. చిన్న కోటలలో మూడువేలు మొదలుకొని నాలుగువేలవరకు సైన్యము లాయత్తములై యుండెడివి. గోలకొండ, ఓరుగల్లు, కొండపల్లి, కొండవీడుల వంటి పెద్ద దుర్గములలో ఒక్కొకదానిలో పంద్రెండు వేల సాయుధ దళములు ఉండెడివి. ఈ కోటలలోని సైనికులు సుశిక్షితులై గట్టి కట్టుదిట్టములలో నుండువారు. సైనికుడుకాని, నాయకుడుకాని రాత్రివేళ కోట విడిచి పోగూడదు. రాజ్య ప్రాగ్భాగ సంరక్షకములైన కొండపల్లి, కొండవీడు దుర్గములు చాల ముఖ్యములైనవి. ఇవి మేరియలవంటి సైనికులతోడను, ఆయుధ శాలలతోడను, కోష్ఠాగారముల తోడను నిండి యుండెడివి. పైని చెప్పిన రెండు కోటలును, ఒకదాని కొకటి ముప్పదిమైళ్ళ దూరమున నుండుటవలన అవి రాత్రివేళ దివిటీల సంజ్ఞలచేత పరస్పరము వార్తా విశేషములను తెలుపు కొనుచుండెడివి. రాజధానీ దుర్గమైన గోలకొండ ఎనిమిది నెలల పర్యంతము ముట్టడికి నిలిచి మొగలాయి సేనలకు తల ప్రాణము తోకకు వచ్చునట్లు చేసినదన్న దాని సైన్య బలమును, జాగరూకతయు నెట్టివో తెలిసి కొనవచ్చును. అ. మ. సి.

**ఆసఫ్‌జాహి పరిపాలన విధానము :** గోలకొండ కుతుబ్ షాహి సుల్తానులలో కడపటివాడు తానాషా అను నామాంతరముగల అబుల్ హసన్. అతని కాలములో కుతుబ్ షాహి రాజ్యములో 355 పరగణాలుగా విభజింపబడిన ఇరువదియొక్క సర్కారు లుండెను. వానివలన వచ్చు ఆదాయము 55,26,845 హొన్నులు. హొన్నుకు మూడు రూపాయల చొప్పున లెక్కవేసి చూచినచో మొత్తము 1,65,79,035 రూపాయ లగుచున్నది.

ఔరంగజేబు పాదుషా గోలకొండను జయించిన తరువాత ఒక్కొక జిల్లాకు ఒక ఫౌజుదారును, ఒక ఖాల్సా - సర్కారు దివానును - నియమింపబడిరి. సైన్య సాహాయ్యముతో రాష్ట్రముయొక్క శాంతి, భద్రతలను కాపాడుపని ఫౌజుదారుకు అప్పగింపబడెను. సైనికులకు, ఇతర భృత్య వర్గమునకు జీత, బత్తెములు మొదలగు వ్యయములను భరించుటకు మొత్తము రాబడిలో నాలుగవవంతు వానికి విడిచి పెట్టబడెను. దివాను శిస్తును రాబట్టుట, సివిలు వ్యవహారములు పరిష్కరించుట మొదలగు పనులను చేయువాడు. అతడు భూములను దేశముఖులకు గుత్తకిచ్చెడివాడు. గోలకొండ విజయమువలన రెండు క్రొత్త సుబాలు మొగలాయి సామ్రాజ్యములో చేరినవి. తుంగభద్రకు దక్షిణమున నున్న రాష్ట్రమునకు సిరా సుబా యనియు, పరిసర ప్రాంతముతో గూడిన హైదరాబాదు రాష్ట్రమునకు హైదరాబాదు సుబా యనియు పేర్లు.

క్రి. శ. 1707 లో ఔరంగజేబు పాదుషా చనిపోయిన పిదప మహారాష్ట్రులు చౌతు, సర్ దేశముఖ అను పన్నులను విధించి వానిని వసూలుచేయుటకు దక్కను జిల్లాలు పెక్కింటిలో తమ కార్యకర్తలను నియమించిరి. చౌత్ అనగా రాజ్యాదాయములో నాలుగవ భాగము ; సర్ దేశముఖ అనగా మొత్తము భూమి శిస్తులో పదవవంతు.

మొదటి నిజాము మహారాష్ట్రులు విధించుచుండిన పైనుడివిన దండుగలను అవసరమునుబట్టి యొప్పుకొనుచుండెడివాడు. అతని రాజ్యములో మొత్తముమీద ఆరు సుబాలును, తొంబదిమూడుసర్కారులును, 1236 మహళ్లను



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఉండెడివి. వీనిలో ఎనిమిది మహాళ్లు మహారాష్ట్రుల వశమున నుండినవి.

జిల్లాలలోని భూమి పన్నును రాబట్టు పని జమీన్‌దారుల కొప్పగింపబడినది. వారు పెరుగుచుండిన పంట పైరులను కావలి కాయుటకై సిబ్బంది అనబడు సాయుధ భట వర్గమును ధరించువారు. జమీన్‌దారులు రైతులను పీడించు చుండుటవలన పన్నులు రాబట్టుటకై వారికి బదులుగా అమీనులు నియమింపబడిరి.

మొదటి నిజాము చనిపోయిన పిమ్మట హైదరాబాదులో పఠానువారి పలుకుబడి ప్రబలినది. శ్రీకాకుళ వాస్తవ్యుడయిన రాజా రఘునాథదాసు క్రీ. శ. 1750 మొదలు క్రీ. శ. 1752 వరకు మంత్రిగా నుండెను. బాకీ జీతమునకు తగాదా పెట్టవచ్చిన సైనికులు చెలరేగి అతనిని చంపివేసిరి. క్రీ. శ. 1753 లో నిజాము ఉత్తర సర్కారు లను బుస్సీ కిచ్చినపుడు పఠానువారు భూముల నన్నిటిని కొలిపించి, అన్ని జిల్లాలలోని భూములనుండి వచ్చు మొత్తము రాబడికి వివరముగా లెక్కలు వ్రాయించి ప్రతి సంవత్సరమును తప్పక జమాబంది చేసి, జమీన్‌దారుల దౌర్జన్యమునుండి రైతులను కాపాడుచు వచ్చిరి. ప్రతి సంవత్సరమును తనకు కప్పముకట్టు పర్పాటుమీద క్రీ. శ. 1766 లో నిజాము బ్రిటిష్‌వారికి ఉత్తర సర్కారుల నిచ్చివేసెను.

క్రీ. శ. 1763 నుండి క్రీ. శ. 1805 వరకు రాజ్యముచేసిన రెండవ నిజామ్ అలీ ఖాను కాలమునందు అబ్దుల్ ఫతే ఖాన్ తేగ్ జంగ్ బహద్దరుకు పైగా అను బిరుద మొసంగ బడెను. పైగా అమీరులు (నాయకులు) ఎల్లప్పుడును నిజాము సామంతవర్గమునం దగ్రస్థానము వహించెడివారు. వారికిని, నిజామునకును వివాహమూలకమైన సంబంధ బాంధవ్యములు కలవు. అవసరమైనపుడు తనకు యుద్ధ మున సాయము చేయుటకు వలసిన దళములను పోషించుటకొరకు వారికి నిజాము జాగీరుల నిచ్చువాడు. తెలంగాణాలో పదాదికి పబదిరెండు లక్షల రూపాయలు రాబడిగల నూట యిరువదేడు గ్రామములతో గూడిన ఇరువది మూడు తాలూకాలు ఈ పైగా జాగీరులక్రింద నుండినవి.

క్రీ. శ. 1792 - 93 సంవత్సరమున తెలంగాణా జిల్లాలలో ఒక మహాక్షామము సంభవించినది. కొత్వాలు లెక్కల వలన నాలుగు నెలల కాలములో హైదరాబాదు నగరము నుండియు, దాని పేటలనుండియు 90,900ల శవములు బయటికి కొనిపోబడినట్లు తెలియుచున్నది. ఇంతకంటెను దారుణమైన కరవు ఇంకొకటి క్రీ. శ. 1804 లో వచ్చినది. అప్పుడు రాయచూరు తాలూకాలో పేదసాదలు తిను రాగులు సాధారణముగా రూపాయకు 60 శేర్లు అమ్ము చుండినవి రెండున్నరశేర్లు అమ్మినవి. ఆకటి చిచ్చుకు ఓర్వజాలక జనులు నరమాంసమునుగూడ తినినట్లు చెప్పుదురు.

క్రీ. శ. 1803 - సంవత్సరము సెప్టెంబరు 23 వ తేదిని భారత దేశ చరిత్రయందు ప్రసిద్ధమైన అస్సేయి యుద్ధము జరిగి నది. క్రీ. శ. 1804 సంవత్సరము జూను నెలలో వెల్లింగ్టను ప్రభువు 'నిజాము రాజ్యము గోదావరి మొదలుకొని హైదరాబాదువరకును కలగుండువడి యున్నది. దేశస్థితి హృదయవిదారకముగా నున్నది. నూరార్లకొలది జనులు ఆకటి బాధచే మలమల మాడుచున్నారు. వారి కేమాత్ర మైనట్టి సాయమును చేయగల ప్రభుత్వ మేదియు లే'దని వ్రాసియున్నాడు. పిండారి మూకలు తెలంగాణాలోని పల్లెలపైబడి కొల్లగొట్టినవి.

హైదరాబాదులో క్రీ. శ. 1806 మొదలు 1810 వరకు బ్రిటిష్ రెసిడెంటుగా నుండిన కప్తాను సైడన్‌హామ్ 'నిజాము ప్రభుత్వమునందు విపర్యయస్థితి చాల లోతుగ పాదుకొనిపోయి సర్వత్ర వ్యాపించియుండుటవలన దానిని చక్కజేయుటకు పరిపాలనమును రెసిడెంటు తన యధి కారములోనికి తెచ్చుకొనుటకంటె వేరు మార్గ మేదియు లే'దని వ్రాసియున్నాడు.

క్రీ. శ. 1808 మొదలుకొని 1843 వరకు 35 పండ్లకాలము మహారాజా చందూలాలు ప్రధానిగా ఉండెను. దురాశా పీడితులును, దౌర్జన్యపరులును అయిన అధికారులు జరగించుచుండు నిర్బంధములవలనను, బాధలవలనను రాజ్యము చాల కాలము నిలుచునట్లుగా తోచదని క్రీ. శ. 1811 మొదలుకొని క్రీ. శ. 1820 వరకు హైదరాబాదులో బ్రిటిష్ రెసిడెంటుగా నుండిన సర్ హెన్రీ రస్సెల్ వ్రాసి యున్నాడు. అతడు పరిపాలనా విధానమును చక్క బరచుటకు కొన్ని సంస్కరణములను సూచించెను. ఈతని పధకమున జిల్లాలలో అధికారులుగా యూరోపియనులను నియమించుట, వారు పన్నులు విధించుటకొరకు గ్రామా దాయమును జాగ్రత్తగా పరిశీలించి న్యాయముగా మదింపు కట్టుట, అంతకు పూర్వము వాడుకయం దుండిన దోపిడి నిర్బంధవిధానమును సాధ్యమైనంతవరకు తొలగించుట, ప్రజల మొరల నాలకించి విచారించి వారికి న్యాయమును కలిగించుటకయి ఒక తీరు న్యాయశాఖా పరిపాలనమును జిల్లాలలో నెలకొల్పుట ప్రధానమైన సంస్కరణలు.

క్రీ. శ. 1820 మొదలుకొని క్రీ. శ. 1825 వరకు సర్ చార్లెస్ మెట్‌కాఫ్ హైదరాబాదులో బ్రిటిష్



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



రెసిడెంటుగా ఉండెను. అతడు పందొమ్మిదవ శతాబ్దము ప్రథమ పాదములో ప్రసిద్ధికెక్కిన ఎల్ఫిన్‌స్టను, మాల్కాము, మన్రో మున్నగు ఆంగ్లో ఇండియను పరిపాలకుల తరగతికి చెందినవాడు. క్రీ. శ. 1800 సంవత్సరములో నిజాము బ్రిటిష్‌వారి కిచ్చివేసిన జిల్లాలను మన్రో పరిపాలించెను. ఇతని పరిపాలనము ప్రజారంజకముగా నుండినందున ఇతనిని ప్రజ లందరు దివ్యపురుషుడని భావించిరి. ఇతడు మాండవ్య మహాముని యవతారమని కొనియాడిరి. ఇతనికి ఢిల్లీ పాదుషా ముంతాజ్ ఉద్ దౌలా, అనగా రాజ్యపరిపాలకుడు అను బిరుదము నొసంగెను. రస్సెల్ తలపెట్టిన రాజ్యాంగ సంస్కరణములు మెట్‌కాఫ్ కాలములో ఆచరణకు వచ్చినవి. వీని నాచరణలోనికి తెచ్చుటకు అతనికి తీవ్రప్రతిబంధము, ముఖ్యముగా నిజాముకు దారుణమైన వడ్డికి అప్పిచ్చుచు, స్థానిక వ్యవహారములలో ఎక్కువ పలుకుబడి సంపాదించి యుండిన పామరు కంపెనీవారి వలన కలిగినది. కంపెనీ భాగస్వాములలో ఒక్కడయిన సర్ విలియం రంబోల్డ్ అప్పుడు గవర్నరు జనరలుగా నుండిన హేస్టింగ్స్ ప్రభువునకు దగ్గర చుట్టమైయుండుట కంపెనీకి చాల లాభకరమయినది.

క్రీ. శ. 1829 మొదలుకొని క్రీ. శ. 1857 వరకు నిజాము పదవియం దుండిన నాసిర్ ఉద్ దౌలా యూరోపియను రెవిన్యూ అధికారులను తొలగించెను. దీని ఫలితము వెంటనే పొడకట్టినది. ఆ పన్నెండేండ్లపాటు కొంత నెమ్మదిగ నుండిన రైతుజనము మరల అధికారుల పీడికి, నిర్బంధములకు లోనుగావలసి వచ్చినది.

పందొమ్మిదవ శతాబ్దములోని క్షామములలో అత్యంతము దారుణమైనది క్రీ. శ. 1833 లో సంభవించినది. దానితోపాటు విషూచి జాడ్యము విజృంభించుట వలన చాలమంది నశించిరి.

క్రీ. శ. 1843 లో మహారాజా చందూలాల్ పేష్ మంత్రి పదవికి రాజీనామా నిచ్చిన తరువాత మూడేండ్లకాలము రాజారాం బక్షి మంత్రిగా నుండెను. రాజ్యపరిపాలనమును చక్కబరచుటకు పామరు ఒక సంస్కరణముల ప్రణాళికను తయారు చేసెను.

తొలగింప బడిన యూరోపియను రెవిన్యూ ఉద్యోగులలో ఒకడైన సైటనుదొర గుత్తదారు లందరిలో ముఖ్యుడై చందూలాలు కాలములో హనుమకొండ, ఓరుగల్లు, నలగొండ జిల్లాలను గుత్తకు తీసికొని యుండెను. చందూలాలు మంత్రిత్వము మానుకొనిన తరువాత నిజాము గుత్త కిచ్చి యుండిన జిల్లాలను స్వాధీనపరచుకొన్నప్పుడు సైటను తనకు పదుమూడు లక్షల రూపాయలు రావలసి యున్నదని తగాదా పెట్టగా క్రీ. శ. 1844 లో ఆ సొమ్ము అతనికి చెల్లింప బడెను. క్రీ. శ. 1847 మొదలు క్రీ. శ. 1858 వరకు పరిపాలనము చాల పాడుగా నుండెను. బొక్కసములో ధన మంతరించి పోయెను. హైదరాబాదు నగరమునందును, చుట్టుపట్ల జిల్లాలలోను దొమ్మి, దోపిడి హెచ్చినవి.

క్రీ. శ. 1851 నుండి క్రీ. శ. 1853 వరకు నవాబు సిరాజ్ ఉల్ ముల్క్ ప్రధానమంత్రి పదవి నధిష్ఠించి యుండెను. అప్పుడు ప్రభుత్వముయొక్క ఆర్థికస్థితి మిక్కిలి శోచనీయముగ నుండెను. నవాబుల నగలు తాకట్టుపెట్టుకొనవలసిన స్థితి సంప్రాప్తమయినది. వానిని గుత్తదారులలో ముఖ్యుడయిన సైటను ద్వారా అమ్మకమునకు ఇంగ్లాండునకు పంపవలసి వచ్చినది.

సిరాజ్ ఉల్ ముల్క్ క్రీ. శ. 1853 లో చనిపోయెను. అతని స్థానమున మేనల్లుడు నవాబు సాలార్ జంగ్ బహద్దరు నియుక్తుడై క్రీ. శ. 1883 లో మృతినొందు వరకు ముప్పదియేండ్లు [illegible] మంత్రిత్వమును నిర్వహించెను. ఆధునిక యుగమున భారతదేశ సంస్థానములలో ప్రధాని పదవిని వహించినవారిలో ఎల్ల మొదటి సాలార్ జంగ్ అగ్రగణ్యుడు. విలియం డిగ్బీ సి. ఐ. ఇ. చెప్పినట్లు సర్ సాలార్ జంగ్ నిజాము రాజ్యమును పునరుజ్జీవింప జేసెను. అతడు రాజ్యముయొక్క స్థితి గతులను అవగతము చేసికొనిన వెంటనే భూములనుండి ఆయమును పెంపొందించుటకు పూనుకొనెను. రాజ్యములో అన్యాయములు, అక్రమములు [illegible]ముగా సాగుచున్నవని గ్రహించెను. ప్రభుత్వమునకును, రైతులకును నడుమ నున్న గుత్తదారులు [illegible] రైతులను దారుణాతిదారుణముగ పీడించి పన్ను రాబట్టుచుండిరి; [illegible] సాకు పెట్టి అక్రమమగు పన్నులు విధించి వారిని [illegible] చేయుచుండిరి. సాలార్ జంగ్ గుత్తదారులతో పోరాడి వారి [illegible]ములను, దండెములను రూపుమాపెను; భూములను గుత్త కిచ్చు పద్ధతిని రద్దుచేసి, ప్రభుత్వమునకును, రైతులకును ప్రత్యక్ష సంబంధము నేర్పరచెను. అందువలన రైతులకు తాము [illegible] గెను. దీని ఫలితముగ [illegible] వస్తువ్యాపార సంపత్తి చక్కగా పెంపొందినది. రాజ్యాదాయము విశేషముగ పెరిగినది. పన్నులు ధాన్యరూపమున వసూలుచేయబడుటయు, [illegible] మట్టుపడినవి. ప్రజలలో ఒక కొంత సంతృప్తి కుదురుకొనినది. ధాన్యరూపమున పన్నులు రాబట్టు పద్ధతి రద్దుచేయబడి రొక్కము రూపమున రాబట్టుట ఆరంభము చేయబడినది.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



**నిజాం** రాజ్యమునందు పదునైదు రకముల నాణెములు చలామణియం దుండెడివి. వానిలో నెక్కువ భాగము కల్తీ నాణెములు. దొంగనాణెములు బాహాటముగ ముద్రింపబడుచుండెడివి. గద్వాల, వనపర్తి సంస్థానాధీశులు సొంతముగా తమ నాణెములు ముద్రించుటకు హక్కు కలిగి వానిని చలామణిలో నుంచిరి. క్రీ. శ. 1855 వరకును హైదరాబాదు టంకశాలలో ముద్రితములైన నాణెముల మీద ఢిల్లీ పాదుషా పేరుండెడిది. క్రీ. శ. 1857 లో జరగిన సిపాయిల తిరుగబాటుకు తరువాత ఆ పాదుషా పేరు తొలగింపబడినది. క్రీ. శ. 1855 లో ప్రభుత్వమువారు హైదరాబాదు నగరమున కేంద్ర కోశాగారమును, జిల్లాలలోను, తాలూకాలలోను స్థానిక కోశాగారములను నెలకొల్పిరి.

క్రీ. శ. 1864 లో రెవిన్యూ పరిపాలనమును నిర్వహించుటకై ముగ్గురు సభ్యులతో రెవిన్యూ బోర్డు పర్పాటు చేయబడినది.

**పోలీసు వ్యవస్థ** : నగరములోని పోలీసు శాఖకు అధికారి కొత్వాలు. న్యాయ విచారణాధికారమును, ప్రభుత్వ కార్యములను అమలుపరచు నధికారమును అతని చేతిలో నుండెడివి. ఆయా జిల్లాలలో తాత్కాలికముగా నియుక్తులైన యుద్ధ భటులు పోలీసు పనులను నిర్వహించెడివారు. కాని ఆ పద్ధతి అంత సంతృప్తికరమైనది కాకుండెను; ఏలనగా రోహిలాల బందిపోటులు, దొంగతనములు సాగుచునే వచ్చినవి. క్రీ. శ. 1865 లో పోలీసు పరిపాలన విధానము సంస్కరింపబడినది. రాజ్యమునందలి పదువారు జిల్లాలలో ఒక్కొకదానికి ఒకరు చొప్పున సూపరింటెండెంట్లు నియమింపబడిరి. మరల నిజామునకు స్వాధీనపడిన రాయచూరు, నలగొండ మొదలగు జిల్లాలలో అవి బ్రిటిష్ వారి పరిపాలనముక్రింద నుండినపుడు అచట నియుక్తులై యుండిన పోలీసువారిలోనుండియే క్రొత్త పోలీసుదళ మేర్పాటు చేయబడినది. తక్కిన రాజ్య భాగములలో అది వరకు పోలీసు పనులు చేయుచుండిన సహాయ దళములు మొదలగు సిబ్బందిలో నుండిన సమర్థులయినవారు నియమింపబడిరి. ఆయా జిల్లాలలోని ప్రధాన గ్రామములలో శాద్యా ముండిన అరక్షి. ఇలా సిబ్బంది తొలగింపబడినది. క్రీ. శ. 1867 లో పోలీసుశాఖ రెవిన్యూశాఖనుండి వేరుచేయబడెను. ప్రభుత్వపు పోలీసుశాఖ కార్యదర్శి పదవి న్యాయశాఖా కార్యదర్శి పదవితో కలిపివేయబడినది.

**న్యాయశాఖ** : క్రీ. శ. 1868 కు పూర్వము నగరములోని ప్రధాన న్యాయస్థానము లివి: (1) దారుల్ ఖాజా-ఇ-ఖిల్గా : ఇందు సనాతనమయిన హనాఫీ చట్టము ననుసరించి సివిలు, క్రిమినలు వ్యవహారముల పరిష్కారము జరగుచుండెడిది; (2) కొత్వాలి (పోలీసు న్యాయస్థానము): ఈ న్యాయస్థానములో చిన్న చిన్న సివిలు క్రిమినలు వ్యాజ్యములు పరిష్కరింపబడుచుండెడివి; (3) సద్ర్-ఉస్-సద్ర్ : ఇందు మత సంబంధములయిన వివాదములు తీరుమాన మగుచుండెడివి. ఈ న్యాయస్థానములోని తీర్పులు వాగ్రూపమున మాత్రమే యుండెడివి. ఆ తీర్పులమీద అప్పీలు చేసికొనుట కవకాశము లేదు. కక్షిదారులలో మంచి పలుకుబడి గలవారు తమ కనుకూలముగ వ్యవహారములను పరిష్కారము చేయించుకొనగలిగెడివారు. జాగీదారుగాని, నేరస్థుడుగాని బలవంతుని భవనమున తలదాచుకొని చట్టపు నిబంధనములనుండి తప్పించుకొనగలుగువాడు. ఇంతేకాక, ఈ న్యాయస్థానములు విచారింపవలసిన వ్యవహారములు తరుచుగా మంత్రి విచారణకు పోవుచుండెడివి. అతడు నిర్ణీతములై యుండిన న్యాయ పద్ధతులను కాని, పూర్వపు అభియోగపు తీర్పుల దృష్టాంతములను కాని పాటింపక ఇచ్ఛకు వచ్చినట్లు తీర్పు చెప్పువాడు.

జిల్లాలలో సివిలు, క్రిమినలు వ్యవహారములను తీర్మానించుటకు అనుగుణములయిన న్యాయస్థానములు కాని, నిర్దిష్టములయిన నిబంధనలు కాని లేకుండెడివి.

హిందువులకు సంబంధించిన వ్యవహారములను పంచాయతీదారులు పరిష్కరించెడివారు.

షావుకారులు, వ్యాపారులు రోహిలాలను, అరబ్బులను తమ కొలువునందు ఉంచుకొని వారిమూలమున బలాత్కారముగా అప్పులను రాబట్టుకొనుచుండెడివారు; అప్పు తీర్పజాలని జాగీదారుల తలలపై బండల నెత్తించెడివారు; వారికి వాతలుకూడ వేసెడివారు.

క్రీ. శ. 1821 లో హైదరాబాదు నగరమున సివిలు వ్యాజ్యములను విచారించి తీరుమానించుటకై అదాలత్-ఇ-దివాని అను పేరుగల ఒక క్రొత్త న్యాయస్థానము నెలకొల్పబడినది. క్రీ. శ. 1838 లో క్రిమినలు వ్యవహారములను పరిష్కరించుటకు న్యాయస్థాన మొకటి ఏర్పరుపబడినది. ఈ న్యాయస్థానముల తీర్పులపై ప్రధానికి అప్పీలు చేసికొనుట కవకాశము కలిగింపబడినది. క్రీ. శ. 1845 లో జిల్లాలయందుకూడ న్యాయస్థానములు స్థాపింపబడినవి. ప్రధానమంత్రి నగళ్ళలో అర్జీలు పుచ్చుకొనుటకై ఏర్పడిన కార్యాలయము స్మాల్ కాజు వ్యాజ్యముల న్యాయస్థానముగ మారినది.

సాలార్ జంగ్ కావించిన న్యాయశాఖా సంస్కరణములు: అదాలత్-ఇ-పాదుషాహి (పాదుషా యొక్క



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



న్యాయస్థానము) అను న్యాయస్థానమును సాలార్ జంగ్ హైదరాబాదులో స్థాపించెను. అందు ప్రధాన న్యాయమూర్తి ఒకడు, సహాయ న్యాయమూర్తులు నలుగురు నియమింపబడిరి. ఆ న్యాయస్థానమున విచారణకు వచ్చు వ్యవహారములలో మరణదండనయు, ఆమరణ కారాగార శిక్షయు విధించవలసిన అభియోగములు తప్ప తక్కిన క్రిమినలు, సివిలు వ్యవహారము లన్నింటిని విచారించి తీర్మానించుటకు అందలి న్యాయమూర్తులకు సంపూర్ణాధికార ముండెడిది.

దారి దోపిళ్లు, బందిపోటులు రూపుమాపి వేయుటకు కావలసిన కట్టుదిట్టములు చేయబడినవి.

క్రీ. శ. 1858 కు పూర్వము దారుల్-ఇణ-షా అను కేంద్ర ప్రభుత్వ కార్యాలయముద్వారా మంత్రి పదవియందుండువాడు పరిపాలన కార్యమును నిర్వహించెడివాడు. మాల్ దఫ్తారారు, దివానీ దఫ్తారారు అను పేర్లుగల ఉద్యోగు లుండెడివారు. ఈ యుద్యోగులు రాజ్యము యొక్క ఆయ వ్యయములకు లెక్కలు తయారుచేయువారు; జమాబందీచేసి అమీనుల లెక్కలను, రెవిన్యూ గుత్తదారుల లెక్కలను పరిశీలించెడివారు.

**పరిపాలన సంస్కారణములు :** సాలార్ జంగ్ ప్రభుత్వ నిర్వహణ విధానమును సంస్కరించెను. క్రీ. శ. 1870-1882 ల నడుమ దాని స్వరూప మిట్లుండెను: రాజ్యతంత్రమున కంతటికి ప్రధానమంత్రి అధిపతి. ఒక్కొక్క పరిపాలనశాఖ ఒక్కొక సద్ర్ ఉల్ మహాం అను అధికారియొక్క కాని, మంత్రియొక్కకాని అధీనమున నుండెడిది. (1) సద్ర్ ఉల్ మహాం అదాలత్, (2) సద్ర్ ఉల్ మహాం మాల్‌గుజారి, (3) సద్ర్ ఉల్ మహాం కొత్వాలి, (4) సద్ర్ ఉల్ మహాం ముస్తాఫరీకత్-ఈ సద్ర్ ఉల్ మహాములు ప్రధానమంత్రి అధికారమునకు లోబడిన ఉద్యోగులు. ప్రధానమంత్రికి ఒక అంతరంగిక కార్యదర్శియు, న్యాయశాఖ పోలీసుశాఖ రెవిన్యూ శాఖ పబ్లిక్స్ వర్క్స్ ఇతరములగు చిల్లర శాఖలకును ఒక్కొక కార్యదర్శియు ఉండెడివారు. ప్రభుత్వకార్యములను సరిగా నిర్వహించుటకు అంతరంగిక కార్యదర్శి క్రింద నుండిన ఒక యింగ్లీషు కార్యాలయముతో కలసి పదునాలుగు కార్యాలయములు ఏర్పాటు చేయబడినవి. క్రీ. శ. 1876 మొదలుకొని క్రీ. శ. 1883 వరకు సయ్యిద్ హుసేన్ బిల్‌గ్రామి (నవాబ్ ఇమాద్ ఉల్ ముల్క్) ప్రధానమంత్రికి అంతరంగిక కార్యదర్శిగా నుండెను. క్రీ. శ. 1883 ఫిబ్రవరి 8 వ తేదిన సర్ సాలార్ జంగ్ 56 సంవత్సరముల ప్రాయమున మృతినొందెను. పన్నెండేండ్లు

కన్న భారతదేశ మహాపురుషులలో అత డొకడుగా ఎన్నిక గాంచెను. క్రీ. శ. 1884 మొదలు క్రీ. శ. 1887 వరకు రెండవ నవాబు సాలార్ జంగ్ ప్రధానమంత్రి పదము నధిష్ఠించెను. ప్రధానమంత్రికి కొన్ని కార్యములలో సహాయ మంత్రులుకూడ పాల్గొని బాధ్యత వహింపవలసి యుండెను. ప్రధానమంత్రి, సహాయ మంత్రులు, పేష్కారు-వీరితో కూడిన మంత్రి పరిషత్తు రాజ్యాభ్యుదయమునకు సంబంధించిన విషయముల నన్నిటిని విచారించుచుండెను.

భారతదేశమునకు రాజప్రతినిధిగా వచ్చిన రిపన్ ప్రభువు క్రీ. శ. 1884 లో హైదరాబాదు సంస్థానమును సందర్శింప వచ్చెను. సంస్థానములను సందర్శింప వచ్చిన రాజప్రతినిధులలో ఈ రిపన్ ప్రభువు మొదటివాడు. అతడు మహబూబ్ అలీ ఖాన్ బహద్దరును సింహాసన మెక్కించి సంస్థానమున కధిపతిని కావించెను.

క్రీ. శ. 1890 లో లా కమిషన్ ఒకటి ఏర్పాటయినది. క్రీ. శ. 1893 లో శాసనసభ నెలకొల్పబడినది. అందు ప్రధాన న్యాయమూర్తి, ఉపన్యాయమూర్తి, రెవిన్యూ ఇన్‌స్పెక్టరు జనరలు, విద్యాశాఖ డైరెక్టరు, పోలీసు ఇన్‌స్పెక్టరు జనరలు, ఆర్థికశాఖా కార్యదర్శి సభ్యులుగా నుండిరి. క్రీ. శ. 1894 లో అనధికారిసభ్యుల నియామకము చేత సభ్యుల సంఖ్య పదునైదుకు పెంపుచేయబడినది. క్రీ. శ. 1900-1912 సంవత్సరముల నడుమ మరికొందరిని చేర్చుటచేత సభ్యులసంఖ్య ఇరువదిమూడు వరకు పెరిగినది. ఇందు ప్రజ లెన్నుకొనిన నలుగురు సభ్యులను చేర్చుకొనుటవలన కొంతవరకు ఎన్నికల పద్ధతియు ప్రవేశ పెట్ట బడినది.

క్రీ. శ. 1911వ సంవత్సరములో నవాబు మీర్ ఉస్మాన్ అలీ ఖాన్ బహద్దరు రాజ్యాధిపతి యయ్యెను.

క్రీ. శ. 1900 మొదలుకొని ప్రధానమంత్రి పదవియందుండిన మహారాజా సర్ కృష్ణ ప్రసాదు క్రీ. శ. 1912 లో తన యుద్యోగమునకు రాజీనామా యిచ్చెను. ఇతడు రాజా చందూలాలు కుమారుడయిన మహారాజా నరేంద్ర బహద్దరు పుత్రుడు. అనంతరము విఖ్యాతి వహించిన మంత్రి పుంగవుడు సాలార్ జంగ్ మనుమడు నవాబ్ సాలార్ జంగు బహద్దరు. ఇతడు ప్రధాన మంత్రిగా నియమితుడై రెండేండ్లకాలము అధికారము నెరపెను. క్రీ. శ. 1914 మొదలుకొని క్రీ. శ. 1919 వరకు నిజాము స్వయముగనే ప్రధానమంత్రికార్యములను నిర్వహించుకొనుచు వచ్చెను. అపుడు నవాబు సర్ అమీన్ జంగ్ బహద్దరు (అహ్మద్ హుసేన్, ఎమ్. ఏ., బి. ఎల్., మద్రాసు) నిజాముకు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ప్రధాన కార్యదర్శిగా నుండెను. అతడు క్రమముగా సద్ర్ ఉల్ మహాం పదవికి వచ్చి నిజాము స్వయముగా పరిపాలించిన నాలుగేండ్లలోను ప్రధానమంత్రి కాకపోయినను ఆ కార్యముల నన్నిటిని అతడే నిర్వహించుచు వచ్చెను.

క్రీ. శ. 1919 సంవత్సరములో సర్ అలీ ఇమామ్ ప్రభుత్వ కార్యనిర్వాహక సభకు (సద్ర్ - ఇ - అజామ్) అధ్యక్షుడుగ నియమింప బడెను. ఆ సభలో ఏడుగురు సాధారణ సభ్యులును, ఒక అసాధారణ సభ్యుడును కలరు. నవాబు సర్ ఫరీదూన్ ఉల్ ముల్క్ బహద్దరు ఆ యసాధారణ సభ్యుడు. ఇతడు పార్సీ ప్రముఖుడు; నలుబది యేండ్లకు పైగా నిజాము కొలువులో నుండినవాడు. క్రీ. శ. 1922 లో సర్ అలీ ఇమామ్ తన అధ్యక్ష పదవికి రాజీనామా నిచ్చిన తరువాత నవాబు సర్ ఫరీదూన్ ఉల్ ముల్క్ ఒక సంవత్సరముపాటు ఈ కార్య నిర్వాహక సభకు అధ్యక్షుడుగా నుండెను. ఇతని యనంతరము పైగా సామంతులలో ఒకడయిన నవాబు వలీ ఉద్ దౌలా బహద్దరు రెండేండ్లును, పిదప క్రీ. శ. 1925 వ సంవత్సరము నుండి క్రీ. శ. 1937 వరకు మహారాజా శ్రీకృష్ణ ప్రసాద బహద్దరు పదునైదేండ్లును అధ్యక్షపదవిని వహించి యుండిరి.

క్రీ. శ. 1922 వ సంవత్సరమున ప్రభుత్వకార్య నిర్వహణ శాఖనుండి న్యాయశాఖ విడదీయ బడినది. రెవిన్యూ ఉద్యోగుల కంతవరకు నుండిన న్యాయశాఖాధికారములు తీసి వేయబడినవి.

క్రీ. శ. 1937 సంవత్సరము మొదలు క్రీ. శ. 1941 వరకు కార్యనిర్వాహక సభకు రైట్ ఆనరబుల్ నవాబు సర్ అక్బర్ హైదరి నవాజ్ జంగ్ బహద్దరు అధ్యక్షత వహించి యుండెను. శాసనసభా సంస్కరణము విషయమున నివేదికను తయారుచేయుటకు దివాన్ బహద్దరు అరావముదు అయ్యంగారి అధ్యక్షతక్రింద ఒక కమిటీ ఏర్పాటయినది. ఆ కమిటీ క్రీ. శ. 1939 వ సంవత్సరము జూలై నెలలో సంస్కరణముల నివేదికను నిజాముకు అందజేసినది. కాని రెండవ ప్రపంచయుద్ధము కారణముగా సంస్కరణములు ఆపుదల చేయబడినవి. క్రీ. శ. 1941 లో సర్ అక్బర్ హైదరి హైదరాబాదును విడిచిపెట్టిపోయెను.

తరువాత కార్యనిర్వాహక సభకు ఛటారి నవాబు (నవాబు సయ్యిద్ ఉల్ ముల్క్) అధ్యక్షు డయ్యెను. అరావముదు అయ్యంగారి కమిటీ నివేదికలో ప్రతిపాదించిన సంస్కరణములు పునర్విమర్శింప బడినవి. క్రీ. శ. 1939 సంవత్సరపు ప్రణాళికను అనుసరించి శాసనసభలో 85 మంది సభ్యులకు అవకాశమేర్పడినది. సవరింపబడిన నివేదికనుబట్టి సభ్యుల సంఖ్య 132 కు పెంపు చెందినది. క్రీ. శ. 1939 వ సంవత్సరపు తొలి ప్రణాళిక ననుసరించి ఎన్నుకొనబడని సభ్యుల సంఖ్య అధికముగానుండెను. సవరింపబడిన ప్రణాళిక ప్రకారము 67 గురు ఎన్నుకొనబడిన సభ్యులకును, 56 గురు ఎన్నుకొనబడని సభ్యులకును తావు కలదు. క్రీ. శ. 1939 ప్రణాళిక వృత్తి ప్రాతినిధ్యముపై ఆధారపడి యుండినది. తత్కారణమున అది తీవ్రవిమర్శనకు గురియైనది. సవరింపబడిన ప్రణాళిక వృత్తిప్రాతినిధ్యము కన్న ప్రాంతీయ ప్రాతినిధ్యమునకు ప్రాముఖ్యము కలిగించినది. రెండు ప్రణాళికలందును వేర్వేరు జాతులకును, కులములకును ప్రత్యేక నియోజక వర్గములు పరిత్యజింప బడినవి.

పాతపద్ధతి (1939) ననుసరించి సభ్యులకు మంత్రులను ప్రశ్నలువేయుట కుండిన హక్కుతోపాటు క్రొత్త పద్ధతిలో అనుబంధ ప్రశ్నలు వేయుటకుకూడ హక్కు కలిగింప బడినది. ప్రభుత్వముయొక్క ఆయ, వ్యయ పట్టికను శాసన సభలో చర్చకు తేవలయునను నియమ మేర్పడినది. ఆయ, వ్యయ పట్టికయొక్క సాధారణచర్చతోపాటు ప్రత్యేక తీర్మానముల నుపపాదించుటకు కూడ శాసనసభ కధికారము కలిగినది.

ప్రజలలో అనేకులకు శాసనసభా సభ్యుల నెన్నుకొను స్వాతంత్ర్యము విస్తరింప జేయబడినది. జనసంఖ్యలో 1.4 శాతము జనము నియోజనాధికారమును పొందినది. ఈ నియోజనాధికారము క్రీ. శ. 1926 వ సంవత్సరములో బీహారు - ఒరిస్సాలయందు 1.1 శాతమును, బీరారు - మధ్య రాష్ట్రములయందు 1.3 శాతమును ఉండెను.

శాసనసభయొక్క ఉద్దేశములను, నిర్ణయములను గురించి తదనుసారముగ పరిపాలనమును జరపుచుండవలెనని ఆజ్ఞాపించుచు ప్రభుత్వ కార్యనిర్వాహక వర్గమునకు నిజాము ఒక శాసనపత్రమునుకూడ జారీచేసెను.

ప్రభుత్వ కార్య నిర్వాహకసభ సభ్యులలో హిందువుల పక్షమున ఒకడును, ముస్లిముల పక్షమున ఒకడును ప్రజలచే ఎన్నుకొనబడిన ప్రతినిధులు ఇరువురు చేర్పబడిరి. ఈ సభలో ఓరుగల్లు నివాసి పింగళి వెంకట రామరెడ్డిగారు హిందువులకు ప్రతినిధిగా నుండిరి.

1948 లో పోలీసుచర్య జరిగిన తరువాతనుండి హైదరాబాదు పరిపాలన విధానములో మార్పు లనేకము కలిగినవి (చూడు, వెనుక పుట, 489). తెలంగాణాతో కలసి ఆంధ్ర ప్రదేశ్ నిర్మాణ మయినపిదప రాజప్రముఖ పదవి రద్దు కావింపబడెను. రాజ ప్రముఖునికి బదులుగ నూతన రాష్ట్రమున కధిపతిగ గవర్నరు నియుక్తుడయ్యెను. సి. హ.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/

# బ్రిటిష్ ప్రభుత్వము

సర్కారులను జయించు నాటికి కోస్తాప్రాంతమందు మచిలీపట్టణము, విశాఖపట్టణము మొదలగు కేంద్రములలో బ్రిటిష్‌వారు గిడ్డంగులను స్థాపించుకొని యుండిరి. అందలి వ్యవహారములను చక్కబెట్టుటకు ఒక్కొక్క గిడ్డంగి యందు ఒక ముఖ్యాధికారి, ఒక చిన్నసభ ఉండెను. నిజాం వద్దనుండి క్రీ. శ. 1769 లో సంపాదించిన సర్కారులను కొన్ని ఖండములుగ విభాగము కావించి, ఒక ఖండమును మచిలీపట్టణము అధికారుల క్రిందను, ఇంకొకదానిని విశాఖపట్టణము అధికారుల క్రిందను ఉంచిరి. ఈ విధానము ఇరువదియైదు సంవత్సరములపాటు సాగెను. గిడ్డంగుల అధికారులు పరిపాలనమందు అనుభవము లేనివారగుటచేతను, సొంత లాభములను వృద్ధి చేసికొనుటలో ఉన్నంత శ్రద్ధ వారికి కంపెనీ యజమానుల లాభములను వృద్ధిచేయుటయందు గాని, ప్రజల యోగక్షేమములను చక్కబరచుటయందు గాని లేకపోవుటచేతను వారి పరిపాలనము తృప్తికరము కాకపోయెను. వారిని అదుపులో ఉంచుటకు క్రీ. శ. 1786 లో మద్రాసునందు బోర్డ్ ఆఫ్ రెవిన్యూ అను సంస్థను స్థాపించిరి. కాని దీనివలన కూడ విస్తార లాభము చేకూరదయ్యెను. అందుచేత క్రీ. శ. 1794 లో ఈ విధానమును రద్దు కావించి, సర్కారులను కొన్ని జిల్లాలుగ విభజించి ఒక్కొక్క జిల్లాపై ఒక కలెక్టరును అధికారిగా నియమించిరి. కలెక్టర్లు అధికారులైనప్పటినుండి పరిపాలన విధానము చక్కబడుటకు అవకాశ మేర్పడెను.

క్రీ. శ. 1794 తర్వాత కలెక్టర్లు చలాయించు అధికారములలో కొన్నిమార్పులు కలిగెను. కలెక్టర్లు సర్వాధికారము కలవారుగ ఉండవలెనా, లేక నియమితమైన అధికారము గలవారుగ ఉండవలెనా అను విషయములో పై అధికారుల అభిప్రాయములు అప్పు డప్పుడు మార్పు చెందుచుండెను. ప్రథమదశలో వారికి సర్వాధికారము ఉండవలెనను వాదమునకు బల ముండెను. అందుచేత అప్పటి కలెక్టరులకు పన్నులు వసూలుచేయు అధికారము కాక శాంతి, భద్రతలను కాపాడుటకు కావలసిన మాజిస్ట్రేటు అధికారము, పోలీసు అధికారము కూడ ఉండెను. ఇంతటి అధికార ముండినగాని భూమిశిస్తు మొదలగు పన్నులను వసూలుచేయుట సాధ్యము కాదని అప్పటివారు భావించిరి. కాని క్రీ. శ. 1800 ప్రాంతమున ఈ భావము మారెను. ఈ మార్పును గావించినవాడు గవర్నరు జనరలైన కారన్‌వాలీసు. పరిపాలనాధికార మంతయు ఒక కలెక్టరుకే ఉండుటవలన నిరంకుశత్వమునకు దారితీయునను కారణమున ఇతడు న్యాయపరిపాలనాధికారమును, మాజిస్ట్రేటు పోలీసు అధికారములను జిల్లా జడ్జి పరము కావించెను. ఇట్టి అధికార విభజన పద్ధతి క్రీ. శ. 1816 వరకు అమలులో ఉండెను. దీనికిని, కారన్‌వాలీసు ప్రవేశపెట్టిన శాశ్వత భూమిశిస్తు పద్ధతికిని దగ్గరి సంబంధ ముండెను. కాని ఈ మధ్యకాలమున మద్రాసు రాష్ట్రములోని అధికారులు రైతువారి భూమిశిస్తువిధానము ఉత్తమమైనదని భావించి దానిని కొన్ని ప్రదేశములలో ప్రవేశపెట్టిరి. అది చక్కగ పనిచేయుటకు కలెక్టర్ల యొక్కయు, వారికి లోబడిన రెవిన్యూ అధికారుల యొక్కయు అధికారములు ఎక్కువగ ఉండవలసిన యవసరము ఏర్పడెను. అందుచేత క్రీ. శ. 1816 తర్వాత మాజిస్ట్రేటు అధికారము, పోలీసు అధికారము తిరిగి కలెక్టర్లకు సంక్రమించెను. సివిల్ న్యాయపరిపాలనల విషయమందును, క్రిమినల్ వ్యవహారములలో కొన్నిటియందును జిల్లా జడ్జికి అధికారము లియ్యబడెను. ఇదిమొదలు బ్రిటిష్ పరిపాలనము అంతమొందువరకు జిల్లా అధికారియనుపేరు కలెక్టరుకు సార్థకమయ్యెను.

ఈ సందర్భమున గమనించవలసిన విశేషము ఇంకొకటి యున్నది. సర్కారులలోని కొండప్రాంతములందు ప్రభుత్వముపై తిరుగబాట్లు అప్పు డప్పుడు జరుగుచుండెను. వానిని అణచుటకును, ఇతర అసాధారణ పరిస్థితు లేర్పడినపుడు వానిని చక్కబెట్టుటకును కలెక్టరుకంటె ఉన్నతాధికారము గల స్పెషల్ కమిషనరులను నియమించుచు వచ్చిరి. తుదకు కొండప్రాంతముల పరిస్థితులకును, సమతల ప్రాంతములలోని వానికిని భేదము శాశ్వతమైనదని గ్రహించి, స్పెషల్ కమిషనరులను అప్పు డప్పుడు నియమించుటకు బదులు వానిని పరిపాలించు పద్ధతినే పూర్తిగ మార్చివేసిరి. దీని ఫలితముగ కొండ ప్రాంతములకు మన్య (ఏజెన్సీ) ప్రాంతములని పేరిడి వానిని పాలించు కలెక్టర్లకు ప్రత్యేకాధికారములను కొన్నిటిని కల్పించిరి. ఈ పద్ధతి ఇప్పటికికూడ అమలులో ఉన్నది.

న్యాయ పరిపాలన విషయములో అప్పు డప్పుడు కలిగిన మార్పులు కారణముగ క్రీ. శ. 1818 నాటికి ప్రతి జిల్లాయందు ఒక జడ్జి న్యాయాధీశు డయ్యెను. ఇతని తీర్పులపై అప్పీళ్ళను విని పరిష్కరించుటకు కొన్ని ప్రావిన్‌షియల్



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కోర్టులు, వానిపైన సివిల్ వ్యవహారములను పరిష్కరించుటకు 'సద్ర్ అదాలత్' అను కోర్టు, క్రిమినల్ వ్యవహారములను పరిష్కరించుటకు 'సద్ర్ ఫౌజుదారి అదాలత్' అను కోర్టు స్థాపింపబడెను. స్వల్పపు మొత్తములను గురించిన వివాదములను పరిష్కరించుటకు జిల్లాజడ్జి క్రింద 'సద్ర్ అమీన్' కోర్టులు, డిస్ట్రిక్టు మున్సిఫ్ కోర్టులు, గ్రామాధికారి కోర్టులు ఏర్పరుపబడెను. ఈ పద్ధతి క్రీ. శ. 1884 వరకు సాగెను. క్రీ. శ. 1884 లో ప్రావిన్షియల్ కోర్టులు రద్దయ్యెను. ప్రభుత్వమువారు సోపాన విధానమున తరగతివారిగా కోర్టులను స్థాపించుటయేకాక క్రీ. శ. 1800 తరువాత నీనిలోని కార్యక్రమము నంతను భారతీయ సంప్రదాయములకు భిన్నమయిన బ్రిటిష్ సంప్రదాయముల ననుసరించి నడపుచు వచ్చిరి. దీని మూలమున కొన్ని లాభములతోపాటు కొన్ని నష్టములు కూడ సంభవించెను.

దేశమును పాలించు బాధ్యతను వహించినవారు ప్రజల యోగక్షేమాభివృద్ధికై పాటుపడుట ధర్మము. కాని బ్రిటిష్‌వారు సుమారు అరువది డెబ్బది సంవత్సరముల వరకు దీనిని పాటించినవారు కారు. వర్తక వ్యాపారముల ద్వారా అధిక లాభములను సంపాదించు ఉద్దేశముతో వారు మొట్టమొదట మన దేశమునకు వచ్చిరి. పరిపాలకులైన తరువాతకూడ వారి ఉద్దేశమందు ఎట్టి మార్పును కలుగలేదు. పరిపాలనాధికారమును మరింత లాభమును సంపాదించుటకై వారు వినియోగించిరి. దీనికితోడు వారు తమ రాజ్యమును విస్తరింపజేసికొనుటయందును, అందుకై యుద్ధములు కావించుటయందును ఈ కాలములో ఎక్కువ శ్రద్ధ వహించి యుండిరి. అందుచేత క్రీ. శ. 1840 వ సంవత్సరమునకు పూర్వము వారి పరిపాలన మూలమున ప్రజలకు విస్తారము లాభము కలిగినది కాదు; కొన్ని రంగములలో నష్టముకూడ కలిగెనని చెప్పవలసియున్నది.

**భూమిశిస్తు విధానము - మొదటి ప్రయోగములు :** పరిపాలనాధికారము ద్వారా లాభమును సంపాదించుటకు ప్రజలపై పన్నులను విధించి వసూలుచేయుట ప్రధాన సాధనము. బ్రిటిష్‌వారి పరిపాలనము ప్రారంభమైన కాలములో మన దేశమందలి పన్ను లన్నిటిలో భూమిశిస్తు అగ్రస్థానము వహించియుండెను. దీనినుండి ఎంత లాభము సంపాదించుటకు సాధ్యమో అంత లాభమును సంపాదించుటకు వారు నిశ్చయించుకొని తదనుగుణముగ శిస్తు విధానములో పెక్కు మార్పులు కావించిరి.

ఆంధ్రదేశమందు బ్రిటిష్‌వారి పరిపాలనములోనికి మొట్టమొదట వచ్చిన ప్రాంతములు ఉత్తర సర్కారులు. ఇందలి భూములు హవేలి భూములని, జమీన్‌దారి భూములని రెండు రకములుగ ఉండెను. మొగలాయిల కాలమందు ప్రభుత్వమువారు తమ సొంతమునకై ఉంచుకొన్న భూములే హవేలి భూములు. వారి ఖర్చులకు, వారి సిబ్బందికి కావలసిన ధాన్యాదుల సంపాదనమునకు వారు ఈ భూములను ఉపయోగించుచుండిరి. ఇందలి రైతులు ప్రభుత్వముతో ప్రత్యక్ష సంబంధము కలవారై, ప్రభుత్వము నియమించిన ఉద్యోగస్థులకు శిస్తులను చెల్లించుచుండిరి. జమీన్‌దారి భూము లట్టివి కావు. జమీన్‌దారి భూములలో రైతులవద్ద నుండి శిస్తులు వసూలు చేయు అధికారము జమీన్‌దారులను పేరుగల మధ్యవర్తుల వశమం దుండెను. వారు వసూలు చేసిన శిస్తులో కొంత భాగమును వారి శ్రమకు ప్రతిఫలముగ మినహాయించుకొని తక్కిన దానిని వారు ప్రభుత్వమువారి కిచ్చుచుండిరి. వారు మినహాయించుకొను మొత్తము, ప్రభుత్వమునకు ఈయవలసిన మొత్తము లిఖితపూర్వకమైన ఒడంబడికలలో నిర్ణయింపబడు చుండెను. ఈ యొడంబడికలు (కౌల్లు) వాని కాలపరిమితినిబట్టి ఏక్‌సాలా, తీన్‌సాలా, పాంచ్‌సాలా అను పేరులు కలవిగ ఉండెను.

భూమిశిస్తు విధానమును గురించిన ఈలాటి వివరము లన్నియు బ్రిటిషువారికి మొట్టమొదట తెలిసియుండలేదు. శిస్తులను నిర్ణయించుటకు కావలసిన లెక్కలను గ్రామకరణములుకాని, జమీన్‌దారులుగాని వారి కిచ్చుటకు ఇష్టపడరైరి. అందుచేత వారు హవేలి భూములలోను, జమీన్‌దారి భూములలోను శిస్తును వసూలుచేయు హక్కును వేలము వేసి, హెచ్చు పాట పాడినవారికి వసూలు అధికారము నీయసాగిరి. క్రీ. శ. 1778 వరకు వారు ఏక్‌సాలా పద్ధతిని అనుసరించిరి. దీనిమూలమున వా రనుకొనినంత లాభము రాని కారణమున పూర్తి వివరములను తెలిసికొనుటకై క్రీ. శ. 1778 లో వా రొక 'సర్క్యూట్ కమిటీ'ని నియమించిరి. కాని కమిటీవారు వారి పనిని పూర్తిచేయుటకు ముందే మద్రాసు గవర్నరు 'రంబోల్డ్' అనువాతడు దానిని రద్దు చేసి సర్కారులలోని జమీన్‌దారులు మద్రాసుకు వచ్చి వా రీయవలసిన పేష్కస్తులను ఫైసలుచేసికొనవలసినట్లు తాకీదు పంపెను. దానిని అనుసరించి పందొమ్మిదిమంది జమీన్‌దారులు మాత్రమే మద్రాసుకు వెళ్ళి పాంచ్‌సాలా కౌళ్ళకు సమ్మతించిరి. ఈ వ్యవహారములో రంబోల్డ్ లంచములు తీసికొన్నట్లు కంపెనీ యజమానులు అనుమానపడి క్రీ. శ. 1781 లో అతనిని ఉద్యోగమునుండి తొలగించగా 'సర్క్యూట్ కమిటీ'వారు వారి పనిని తిరిగి ప్రారంభించి క్రీ. శ. 1788 లో దానిని పూర్తికావించి ఒక



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



నివేదికను సమర్పించిరి. ఏలముపద్ధతి మూలమున ప్రజలస్థితి దుర్భరమైనట్లును, కంపెనీకి రావలసిన ఆదాయము బకాయి పడుచుండినట్లును వారు స్పష్టపరచిరి. కాని వారి నివేదికపై వెంటనే పై అధికారులు చర్య తీసికొనరైరి. అందుచేత ఈ తాత్కాలికపు కౌళ్ళ పద్ధతి క్రీ.శ. 1802 వరకు సాగెను. అంతకు తొమ్మిది సంవత్సరములకు పూర్వము క్రీ. శ. 1793 లో కారన్‌వాలీసు బంగాళ రాష్ట్రమందు శాశ్వత భూమిశిస్తు విధానమును ప్రవేశపెట్టెను. అదివరకు మధ్యవర్తులుగ ఉండిన జమీన్‌దారులు వారి వారి వశమందుండిన భూములపై ఆస్తిహక్కుగలవా రనియు, వారు ప్రభుత్వమునకు చెల్లించవలసిన భూమిశిస్తు క్రీ. శ. 1793 లో నిర్ణయించిన మొత్తము కంటె ఎన్నడుకాని ఎక్కువగ ఉండ దనియు, శాశ్వతపు శిస్తును చెల్లించుచుండునంతవరకు వారి భూస్వామ్యమునకు ఎట్టి భంగమును ఉండ దనియు కారన్‌వాలీసు ఖరారు చేసెను. ఎంతో కొంత మొత్తము కచ్చితముగ ప్రతి సంవత్సరము లభించగలదన్న కారణమున కంపెనీవారు ఏలము పద్ధతికంటె శాశ్వత భూమిశిస్తు విధానము ఉత్తమమని భావించిరి. దీనిని మద్రాసు రాష్ట్రములోకూడ ప్రవేశపెట్టవలసినదని కంపెనీ యజమానులు మద్రాసు ప్రభుత్వమువారికి క్రీ. శ. 1794 నుండి సూచనలు చేయసాగిరి. కాని వీరు దీనికి ప్రథమమున అంగీకరించరైరి. తుదకు క్రీ. శ. 1798 లో యజమానులు గట్టి ఉత్తరువులు పంపినందున మార్గాంతరము లేక మద్రాసు ప్రభుత్వము వారు సర్కారు జిల్లాలలో జమీన్‌దారీ పద్ధతితో కూడిన శాశ్వత భూమిశిస్తు విధానమును ప్రవేశపెట్టుచు క్రీ. శ. 1802 లో దానికనుగుణమైన చట్టములను కావించిరి. వారి చట్టములను పూర్వకాలపు జమీన్‌దారీ భూములకే కాక, హవేలి భూములకుకూడ వర్తింపజేసిరి. హవేలి భూములలో వంశపారంపర్యపు హక్కుగల జమీన్‌దారులు లేకుండినను వానిని కొన్ని ఖండములుగ చేసి ఒక్కొక ఖండమును ఒక ప్రొప్రైటరు వశము కావించి, దానిపై అతనికి ఆస్తి హక్కును కల్పించి, అతడు చెల్లించవలసిన పేష్కషును నిర్ణయించిరి. ఈ విధముగ క్రీ. శ. 1802 నాటికి శాశ్వత భూమిశిస్తు విధానము సర్కారులందు అమలులోనికి వచ్చెను. గొప్ప రాజకీయ విప్లవములు సంభవించినప్పుడు కొన్ని వర్గములవారికి అపరిమితమైన లాభములును, మరి కొన్ని వర్గములవారికి నష్టములును కలుగుచుండును. బ్రిటిష్‌వారి అధికారస్థాపన మూలమున లాభము పొందిన వర్గములలో జమీన్‌దారు వర్గము ఒకటి. నష్టము పొందిన వారిలో భూములను సాగు చేయుచుండిన రైతులు ప్రాధాన్యము వహించుచున్నారు.

**రైతువారి పద్ధతి :** మొదటినుండియు మద్రాసు ప్రభుత్వమువారు జమీన్‌దారిపద్ధతి యెడల సుముఖులుగ ఉండలేదు. దీనికితోడు హవేలి భూములపై ప్రొప్రైటరీ హక్కులు సంపాదించిన వారిలో అనేకులు పేష్కషును సకాలమునకు చెల్లించక బకాయి పెట్టసాగిరి. పేష్కషు మొత్తములు అత్యధికములుగ ఉండుట దీనికి ఒక కారణము. దీని మూలమున వంశపారంపర్యముగ జమీన్‌దారులుగ నుండినవారు కూడ పేష్కషును సకాలములో చెల్లించలేని స్థితికి వచ్చిరి. పరిస్థితులు ఈ విధముగ మారుచుండిన కాలమున రాయలసీమ జిల్లాలలో మన్రో అను కలెక్టరు రైతువారి పద్ధతిని ప్రవేశపెట్టి అమలు జరపెను. ఆ ప్రాంతములలో జమీన్‌దారులు లేకపోవుట దీనికి ఒక కారణము. అదిగాక అచ్చటి రైతులు బ్రిటిష్ పాలనకు పూర్వము కూడ కొంత వరకు ఈ పద్ధతికి అలవాటు పడియుండిరి. గ్రామములోని ప్రతిరైతు యొక్క పొలమును కొలిచి, దాని సారాసారములను బట్టి అతడు ప్రభుత్వమునకు చెల్లించ వలసిన శిస్తును నిర్ణయించుట, ఈ నిర్ణయించిన శిస్తును రైతు ప్రత్యక్షముగ ప్రభుత్వమువారి ఉద్యోగస్థులకు చెల్లించుట - ఇవి రైతువారి పద్ధతికి ప్రధాన లక్షణములు. క్రీ. శ. 1802 మొదలు క్రీ. శ. 1805 వరకు మన్రో రాయలసీమ గ్రామములలోని పొలములను అన్నిటిని సర్వే చేయించి ఈ విధముగ శిస్తు నిర్ణయించెను. దీని మూలమున రైతునకు పొలముపై ఎక్కువ అభిమాన ముండు ననియు, వ్యవసాయము క్రమక్రమముగ వృద్ధికాంచు ననియు అతడు ఈ పద్ధతిని సమర్థించెను. జమీన్‌దారిపద్ధతి కంటె ఇది ఉత్తమమైనదను భావము పై అధికారులలో వ్యాపించెను. అందుచేత దీనిని తక్కిన ప్రాంతములలోకూడ అవకాశమున్నప్పుడు ప్రవేశపెట్టుటకు వారు నిశ్చయించుకొనిరి.

ఈ నిశ్చయము కొనసాగుటకును, రైతువారి పద్ధతి ఉత్తమమైనదను భావము స్థిరపడుటకును కొన్ని సంవత్సరములు పట్టెను. ఇట్టి కాలయాపనకు కొన్ని ప్రధాన కారణము లుండెను. క్రీ. శ. 1804 ప్రాంతమున మద్రాసు బోర్డ్ ఆఫ్ రెవిన్యూ సభ్యులు కొందరు గ్రామవారి పద్ధతి యను మరియొక పద్ధతిపై వ్యామోహము కలవారై దానిని ఆచరణలో పెట్టసాగిరి. ఒక్కొక రైతు చెల్లించ వలసిన శిస్తును నిర్ణయించుటకు బదులు గ్రామ మంతయు మొత్తముమీద ఎంత శిస్తు చెల్లించవలెనో నిర్ణయించి దానిని గ్రామము పెత్తనదారుల (రెడ్డి, మునసబు మొదలైన వారు) వద్దనుండి వసూలు చేయుటయే దీని లక్షణము. ఈ మొత్తములో ఎంతెంత ఏ యే రైతులు చెల్లించవలెనో నిర్ణయించు బాధ్యత పెత్తనదారులదే కాని ప్రభుత్వమువారిది



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కాదు. క్రీ. శ. 1804 మొదలు పది పదునైదు సంవత్సరములు ఈ పద్ధతి రాయలసీమ, నెల్లూరు, ఉత్తర సర్కారులలో అనేక ప్రాంతములందు వాడుకలో నుండెను. పేష్కషును బకాయి పెట్టిన జమీన్‌దార్ల యొక్కయు, ప్రొప్రైటర్ల యొక్కయు భూములను ప్రభుత్వమువారు స్వాధీనపరచుకొని అచ్చటి గ్రామములలో ఈ పద్ధతిని ప్రవేశపెట్టిరి. ఇందుచేత గూడ రైతువారి పద్ధతి వెనుకబడి పోయెను. ఇట్లు వెనుక బడుటకు మరియొక కారణముకూడ కలదు. రాయలసీమలో మన్రో నిర్ణయించిన రైతువారి శిస్తులు అత్యధికముగ ఉండినందున రైతులు వానిని చెల్లింపలేరైరి. దుర్భరమగు శిస్తులను విధించుట న్యాయవిరుద్ధమని మన్రో భావించినను, పై అధికారుల ఒత్తిడి వలన అతడు అట్లు చేయవలసివచ్చెను. ఈ కారణముచేత కొందరు ఈ పద్ధతికి విముఖులైరి. క్రీ. శ. 1818 నాటికి ఈ కారణము లన్నిటి యొక్క బలము తగ్గెను. గ్రామవారి పద్ధతి ప్రభుత్వము వారికిని, రైతులకును - ముఖ్యముగా సన్నరైతులకు నష్టదాయకమని రుజువయ్యెను. అందుచేత శాశ్వతభూమిశిస్తు విధానము అమలులో ఉండిన ప్రాంతములందు తప్ప




పక్కనవానియందు రైతువారి పద్ధతి అమలులోనికి వచ్చెను. ఈ పద్ధతిలో ప్రథమదశయందు అనేకలోపము లుండెను. శిస్తుల రేట్లు దుర్భరము లగుటయే కాక భూములను సర్వేచేయుటలోను, సారమునుబట్టి తరములుగ విభాగము చేయుటలోను ఈ లోపములు కనబడెను. ఇందు మూలమున రైతు లనేక నష్టములను, బాధలను అనుభవించిరి. క్రీ. శ. 1855 తర్వాత సర్వే సెటిల్మెంటు డిపార్ట్‌మెంటులు ఏర్పాటగుటచేతను, భూమిశిస్తు పండిన పంటలో ఖర్చులు పోను మిగిలిన నికరాదాయములో సగముకంటె ఎక్కువగ ఉండరాదను ఏర్పాటు జరగుటవలనను పై లోపములు క్రమక్రమముగ అదృశ్యములయ్యెను.

భూమిశిస్తు విధానమందు జరగిన సంస్కరణముల మూలమున బ్రిటిష్‌వారు ఉద్దేశించిన లాభములు వారికి చేకూరెను. క్రమక్రమముగ దీనినుండి వచ్చిన ఆదాయము వృద్ధి పొందెను. ఇదికాక శాశ్వతవిధానము వలన పరిపాలన విధానము మరింత కెట్టుగలదయ్యెను. అదివరకు పోలీసు అధికారములను, న్యాయపరిపాలనాధికారము లను వహించిన జమీన్‌దారులు ఈ యధికారములను



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కోల్పోయిరి. వారివశమం దుండిన సాయుధులగు సిబ్బందులు రద్దు కావింపబడిరి. బ్రిటిష్ ప్రభుత్వము స్థిరపడుటలోను, దేశమందు శాంతి భద్రతలు నెలకొనుటయందును ఇది ఎంతో ప్రయోజనకారి యయ్యెను.

**న్యాయపరిపాలనము :** క్రమపద్ధతి ననుసరించి న్యాయ పరిపాలనము కావించుటకు కోర్టులు స్థాపితమగుటచేత ప్రజలు శాంతియుతముగ కాలము గడపగలవారైరి.

క్రీ. శ. 1840 నాటికి ఏర్పడిన పరిపాలన విధానములో కాలక్రమమున కొన్ని మార్పులు కలిగెను. ఇవి దేశమునకంతటికిని సంబంధించినవి అగుటచేత ఆంధ్రదేశ పరిపాలన విధానమును వివరించుటలో వీనిని గురించి ప్రత్యేకముగ చెప్పవలసిన వివరములు అనేకము లేవు. ఈ మార్పులలో ముఖ్యముగ గమనించదగినవి నాలుగు కలవు: న్యాయపరిపాలన విధానములో ఆదివరకు అధికారము చెలాయించు చుండిన 'సదర్ కోర్టులు', 'సుప్రీం కోర్టు' క్రీ. శ. 1861లో రద్దు కావింపబడెను. వాని అన్నింటి స్థానమున మద్రాసులో ఒక హైకోర్టు స్థాపింపబడెను. ఆంధ్రదేశమునకంతకు ఇది అప్పీలు కోర్టుగ వర్తించెను. ఇదే సమయమున జిల్లా కోర్టుల అధికారము కొంతవృద్ధి చేయబడెను. జిల్లా మునసబుకోర్టుల అధికారముకూడ కొంత పెరుగుదల గాంచెను. ఈ న్యాయ పరిపాలన విధానము బ్రిటిష్ పరిపాలనము అంతమగు వరకు అమలులో ఉండెను.

**రాష్ట్రపరిపాలనము :** రాష్ట్ర పరిపాలన విధానమందు కొన్ని గొప్పమార్పులు కాలక్రమమున జరగెను. వీనికి మూలము క్రీ. శ. 1861, క్రీ. శ. 1892, క్రీ. శ. 1909 సంవత్సరములలో నిర్మాణమైన కౌన్సిల్ చట్టములు. ప్రజల అభిప్రాయమును తెలిసికొని పాలించుటయే క్షేమకరమనియు, ముఖ్యముగ ఇది చట్ట నిర్మాణమునందు అనుసరింపదగిన మార్గమనియు, ఈ యభిప్రాయమును తెలుపగలవారు ప్రజలచే ఏదేని ఒక విధమున ఎన్నుకొనబడిన వారుగ నుండవలె ననియు బ్రిటిష్ ప్రముఖులు భావించిరి. ఇట్టి భావమొకదినమున పుట్టినది కాదు. ఇది పుట్టుటకు, బలపడుటకు కొంతకాలము పట్టెను. తుదకు దీని ఫలితముగ ప్రజాప్రతినిధులతో కూడుకొనిన శాసనసభలు రాష్ట్రమందు స్థాపింపబడెను. క్రీ. శ. 1891, క్రీ. శ. 1909 చట్టములలో వారిని ఎన్నుకొను అధికారము రాష్ట్రములోని లోకల్ బోర్డులకు, మునిసిపల్ సంఘములకు ఈయబడెను. అందుచేత ఆంధ్రదేశములోని లోకల్ బోర్డులు, మునిసిపల్ సంఘములు శాసనసభలలోని ప్రతినిధులు కొందరిని ఎన్నుకొనుటకు అవకాశ మేర్పడెను. ఈ సభలకు ఆయ, వ్యయపట్టిక (బడ్జెటు) విషయములోను, తీర్మానములను ప్రవేశపెట్టి చర్చించుటలోను, ప్రశ్నలు వేసి సమాధానములను సంపాదించుటలోను అధికారములు వృద్ధియగుటచేత ఆంధ్రదేశమునుండి ఎన్నుకొనబడిన ప్రతినిధులకును తక్కిన ప్రతినిధులతోపాటు ఇట్టి అధికారముల నుపయోగించుకొనుట కవకాశము కలిగెను. క్రీ. శ. 1919, 1935 సంవత్సరములలో బ్రిటిష్ పార్లమెంటు కావించిన 'గవర్న్మెంటు ఆఫ్ ఇండియా' చట్టములవలన రాష్ట్రపరిపాలన స్వభావము పూర్తిగ మారిపోయెను. శాసన సభలలోని ప్రతినిధులను ప్రజలు ప్రత్యక్షముగ ఎన్నుకొను హక్కుగలవారైరి. శాసన సభల విశ్వాసమును సంపాదించినవారు మంత్రులగు పద్ధతి అమలులోనికి వచ్చెను. కేంద్ర ప్రభుత్వముయొక్క ప్రసక్తి లేక కొన్ని వ్యవహారములను రాష్ట్ర ప్రభుత్వమువారు స్వతంత్రించి పరిష్కరించుటకు అవకాశ మేర్పడెను. ఈ మార్పులు కారణముగ ఆంధ్రదేశములోని ప్రజలకు పరిపాలనమందు పాల్గొనుటకు సాధ్యమయ్యెను. వారి ప్రతినిధులు ప్రధాన మంత్రులుగను, సాధారణ మంత్రులుగను అధికార పదవులలో ప్రవేశించి ప్రఖ్యాతి గాంచిరి. ప్రజాప్రతినిధుల పరిపాలనము మూలమున ఆంధ్రజిల్లాల స్థితిగతులు క్రమక్రమముగ చక్కబడెను.

**స్థానిక పరిపాలనము :** గత నూరుసంవత్సరముల కాలమునందు కలిగిన మార్పులలో స్థానిక పరిపాలనమునకు సంబంధించినవి ముఖ్యముగ గమనింప దగియున్నవి. పట్టణములను, పల్లె ప్రాంతములను పరిపాలించుటకు ప్రత్యేకముగ ఏర్పడిన విధానమే స్థానిక పరిపాలన విధానము. మునిసిపల్ కౌన్సిళ్లు, జిల్లా బోర్డులు, తాలూకా బోర్డులు, గ్రామ పంచాయతీలు దానికి సంబంధించిన సంస్థలు. ఈ విధానము క్రీ. శ. 1861 తర్వాత క్రమక్రమముగా వ్యాప్తి గాంచెను.

పరిపూర్ణత గాంచిన స్థానిక పరిపాలన విధానమునకు కొన్ని ప్రధాన లక్షణములు గలవు.

1. స్థానికములని ప్రత్యేకింప దగిన వ్యవహారములను - ఆరోగ్యము, విద్య, రవాణా సౌకర్యములు మొదలైనవి - పరిష్కరించి పరిపాలించుటకు ప్రత్యేక రాజకీయ సంస్థ ఒకటి ఉండుట మొదటి లక్షణము. మునిసిపల్ కౌన్సిళ్లు, జిల్లా బోర్డులు, గ్రామ పంచాయతీలు ఇట్టివి.

2. ఈ సంస్థలలోని సభ్యులు స్థానిక ప్రజలు ఎన్నుకొన్న వారుగ నుండుట రెండవ లక్షణము. ఈ కారణముచేతనే స్థానిక పరిపాలనము స్థానిక స్వపరిపాలనము అన్న పేరునకు తగినది యగుచున్నది.

3. స్థానిక వ్యవహారములను పాలించుటకు కావలసిన ఖర్చులలో కొంత భాగమును పన్నుల మూలమునను,



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



క్రమదానము మూలమునను స్థానిక ప్రజలే భరించుట మూడవ లక్షణము. స్థానిక సంస్థలు విధించు ఇంటి పన్ను, వృత్తిపన్ను, సెస్సులు ఇటువంటివి. ఈమూడు లక్షణములతో కూడిన స్థానిక పరిపాలన విధానము రూపొందుటకు సుమారు ఎనుబది సంవత్సరములు పట్టెను. దీని చరిత్ర క్రీ. శ. 1881 తర్వాత ప్రారంభ మగుచున్నది.

మొదటి నుండియు పట్టణ పరిపాలన విధానమునకును, పల్లెప్రాంతముల పరిపాలన విధానమునకును కొంత భేదము కల్పింప బడెను. అందుచేత వీనికి సంబంధించిన చట్టములు వేరు వేరుగ నున్నవి. విద్య, ప్రపంచానుభవము, వ్యవహారదక్షత మొదలగు వానియందు పల్లెప్రాంతముల జనముకంటె పట్టణవాసులు అధికులన్న కారణమున పల్లె ప్రాంతములలోకంటె పట్టణములలో స్థానిక స్వపరిపాలనము కొంచెము ముందుగ ప్రవేశపెట్ట బడెను. ఇప్పటికికూడ కొన్ని విషయములలో ఈ భేదము కనిపించు చున్నది. స్థానిక సంస్థల చరిత్ర నంతను వివరించుటకు ఇచ్చట అవకాశము చాలదు. అందుచేత గమనింపదగిన విషయములలో కొన్ని మాత్రము ఇచ్చట సూచింపబడుచున్నవి.

పట్టణ వ్యవహారములను పరిపాలించుటకు మొదటి శాసనము క్రీ. శ. 1865 లో చేయబడెను. అటు తర్వాత క్రీ. శ. 1871, క్రీ. శ. 1878, క్రీ. శ. 1884, క్రీ. శ. 1920 లలో దీనికి సంబంధించిన శాసన నిర్మాణము జరగెను. ఈ పరిపాలనమునకై తొలుదొలుత ఏర్పడిన మునిసిపల్ కమిటీలలో ప్రభుత్వాధికారుల సంఖ్య ఎక్కువగ నుండెను. క్రమక్రమముగ దానిని తగ్గించి ప్రభుత్వాధికారులుకానివారి సంఖ్యను వృద్ధిచేసిరి. ఒకప్పుడు అట్టివారిని ప్రభుత్వమువారే నియమించుచుండిరి. కాలక్రమమున పట్టణములోని ప్రజలు వీరిని ఎన్నుకొను పద్ధతి ఆచరణలోనికి వచ్చెను. సభ్యులను ఎన్నుకొను హక్కు ఒకప్పుడు కొద్దిమందికి మాత్రమే ఉండెడిది. క్రమక్రమముగ అది వయోజనులలో చాల భాగమునకు సంక్రమించెను. ఇదే విధముగ అల్ప సంఖ్యాకుల ప్రాతినిధ్యము, స్త్రీల ప్రాతినిధ్యము మొదలగు విషయములలో కూడ మార్పు లనేకము జరగెను. తుదకు బ్రిటిష్ పరిపాలనము అంత మొందునాటికి పట్టణవాసులలో అధిక సంఖ్యాకులు మునిసిపల్ కౌన్సిలు సభ్యులను ఎన్నుకొను హక్కు గలవారైరి. ఒకప్పుడు జిల్లా కలెక్టరు మునిసిపల్ కౌన్సిలు అధ్యక్షుడుగ ఉండువాడు. క్రమక్రమముగ ప్రభుత్వమువారు నియమించిన అనధికారి అధ్యక్షు డగుటయు, తరువాత కౌన్సిలు సభ్యులు ఎన్నుకొన్న సభ్యుడు అధ్యక్షుడగుటయు జరగెను. ప్రస్తుతము మునిసిపాలిటీ లన్నిటిలోను కౌన్సిలు సభ్యులే తమ అధ్యక్షుని ఎన్నుకొనుచున్నారు.

మునిసిపల్ కౌన్సిళ్లు పరిపాలించవలసిన వ్యవహారములలో మొదటినుండియు ఆరోగ్యము, పట్టణ పారిశుద్ధ్యము, రోడ్లు, విద్య మొదలైన సౌకర్యములు ప్రధానములుగా నుండెను. వీనిలో తరువాతి కాలమున విస్తారములగు మార్పులు కలుగలేదు. కౌన్సిళ్ళు విధించు పన్నులలో మొదటి నుండియు ఇండ్లపై విధింపబడు ఆస్తి పన్ను ప్రధానమైనదిగా నుండెను. ఇదికాక మరికొన్ని పన్నులు కూడ ఉన్నవి. ఒకప్పుడు రాష్ట్రప్రభుత్వమువారు మునిసిపల్ వ్యవహారములపై పూర్తి అధికారమును చలాయించుచుండువారు. వారి యనుమతిలేక ఏ వ్యవహారమునుకూడ తుది పరిష్కారము కావించుటకు మునిసిపల్ కౌన్సిలువారి కధికార ముండెడిది కాదు. కాని, కాలక్రమమున ఇందులో కూడ గొప్ప మార్పులు జరగెను. ఇంగ్లండు, అమెరికా మొదలైన దేశములలోని స్థానిక సంస్థలకు కల అధికారము ఆంధ్రదేశములోని వానికి ఇప్పటికి కూడ లేకపోయినను క్రీ. శ. 1885 తర్వాత క్రమక్రమముగ ఈ యధికారము వృద్ధి కాంచెనని చెప్పవలసి యున్నది. సభ్యత్వము, అధ్యక్షపదవి, పరిపాలింపదగిన వ్యవహారములు, పన్నులు మొదలైన ఆదాయ సాధనములు, రాష్ట్ర ప్రభుత్వమువారి విచారణాధికారము మొదలగు వానికి సంబంధించిన విషయముల దృష్ట్యా క్రీ. శ. 1885 మొదలు ఇప్పటి వరకు నిర్మాణము కావింపబడిన మునిసిపల్ చట్టములను పరిశీలించిన యెడల ఈ మార్పుల వివరము లన్నియు స్పష్టము కాగలవు. ప్రప్రథమమున, అనగా క్రీ. శ. 1885 చట్టము క్రింద ఆంధ్రదేశములోని ప్రధాన పట్టణము లన్నిటియందును (బరంపురము, పర్లాకిమిడి, విశాఖపట్టణము, భీమునిపట్టణము, విజయనగరము, అనకాపల్లి, కాకినాడ, రాజమండ్రి, ఏలూరు, బందరు, గుంటూరు, నెల్లూరు, కడప, కర్నూలు, ఆదోని, బళ్ళారి, అనంతపురములు) మునిసిపల్ సంఘములు స్థాపితములైనవి. తరువాత జనసంఖ్య వృద్ధిపొందిన ఇతర పట్టణములలో కూడ నిట్టి సంఘములు స్థాపింప బడెను. క్రీ.శ. 1947 నాటికి ఆంధ్ర రాష్ట్రములో 85 మునిసిపాలిటీ లుండెను.

పల్లె ప్రాంతముల వ్యవహారములను స్థానిక సంస్థల ద్వారా పరిష్కరించి పాలించుటకు ప్రధానమైన మొదటి ప్రయత్నము క్రీ. శ. 1871 లో నిర్మింపబడిన 'లోకల్ ఫండ్స్ చట్టము'నందు చేయబడెను. తరువాత క్రీ. శ. 1884, క్రీ. శ. 1920, క్రీ. శ. 1930 లలో దీనికి సంబంధించిన శాసనములు మరికొన్ని కావింపబడెను. వీనిమూలమున కలిగిన మార్పులలో కొన్ని మాత్రము ముఖ్యముగ గమనింపదగియున్నవి.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



1. ఒకప్పుడు ప్రతిజిల్లాయందు ఒక జిల్లాబోర్డు మాత్రమే కాక కొన్ని తాలూకా బోర్డులు కూడ ఉండెను. క్రీ. శ. 1934 లో తాలూకా బోర్డులు రద్దు గావింపబడెను.

2. ప్రథమ దశలో మన గ్రామముల ప్రాధాన్యమును బ్రిటిష్‌వారు గుర్తింపరైరి. అందుచేత ప్రతిగ్రామమందును పంచాయతి నొకదానిని స్థాపించుటకు వా రెట్టి ప్రయత్నమును చేయలేదు. వారు కల్పించిన స్థానిక పరిపాలన విధానములోని గొప్ప లోప మిదియే. ఈ ప్రాధాన్యమును వారు గుర్తించుటకు చాల కాలము పట్టెను. అందుచేత వారు పంచాయతీలకు సంబంధించిన మొదటి చట్టమును క్రీ. శ. 1920 లో కావించిరి. అప్పటినుండి పంచాయతీల సంఖ్య వృద్ధిగాంచసాగెను. స్వరాజ్యము వచ్చిన తరువాత క్రీ. శ. 1950 లో మరియొక పంచాయతీ చట్టము చేయబడెను. దాని ననుసరించియే గ్రామ పంచాయతీ వ్యవహారములు ప్రస్తుతము జరగుచున్నవి.

3. మునిసిపల్ కౌన్సిళ్లలోని సభ్యుల విషయమునను, అధ్యక్షుని విషయమునను కాలక్రమమున ఎటువంటి మార్పులు జరగెనో అటువంటి మార్పులే జిల్లా బోర్డు సభ్యులయొక్కయు, అధ్యక్షునియొక్కయు విషయమున జరగెను. ఆదిలో ప్రభుత్వోద్యోగులు కానివారిని ప్రభుత్వమువారు నియమించుచుండిరి. తరువాత జిల్లాలోని ప్రజలలో కొందరు వారి నెన్నుకొను అధికారమును సంపాదించిరి. క్రమక్రమముగ జిల్లాలోని వయోజనులలో చాల భాగము సభ్యులను అందరిని ఎన్నుకొను పద్ధతి అమలులోనికి వచ్చెను. ఒకప్పుడు జిల్లా కలెక్టరు బోర్డు అధ్యక్షుడుగ నుండువాడు. తరువాత ప్రభుత్వమువారు ప్రభుత్వోద్యోగి కానివానిని అధ్యక్షునిగ నియమించుచుండిరి. తుది దశలో బోర్డు సభ్యులే తమలో నొకనిని అధ్యక్షునిగా ఎన్నుకొను పద్ధతి అమలులోనికి వచ్చెను.

4. జిల్లాబోర్డులు, గ్రామ పంచాయతీలు పరిష్కరింపదగిన వ్యవహారములలో ఆరోగ్యము, విద్య, రోడ్లు ప్రధాన స్థానమును వహించుచున్నవి. గ్రామ సౌకర్యమునకై చేయవలసిన పనుల నన్నిటిని గ్రామ పంచాయతీలు చేయవచ్చును.

5. బోర్డులు, పంచాయతీలు వాని ఆదాయములో చాల భాగమును భూమి సెస్సు ద్వారా సమకూర్చుకొనుచున్నవి. దీనితోపాటు మరికొన్ని పన్నులను విధించుటకుకూడ వాని కధికారము కలదు. గ్రామములోని ప్రజలచే వెట్టిపనిని నిర్బంధముగ చేయించి, సాముదాయికపు పనులను జరపించుటకు కూడ గ్రామపంచాయతీలకు అధికారము గలదు.

6. బోర్డులు, పంచాయతీలు వాని వ్యవహారములను రాష్ట్ర ప్రభుత్వమువారి పైవిచారణకు లోబడి జరపుకొనవలెను. ఈ విచారణకు సంబంధించిన వివరములన్నియు చట్టములలో నుదాహరింపబడి యున్నవి.

ఈ విధముగ బ్రిటిష్‌వారి పరిపాలన విధానములో స్థానిక పరిపాలన విధానము ఒక ప్రధానాంగ మయ్యెను. స్థానిక ప్రయోజనములను ఆయా ప్రదేశములను గురించిన అనుభవ జ్ఞానముగల పౌరుల సాయమున సమకూర్చుటకును, ప్రజలనుండి కొన్ని పన్నులను సులభముగ వసూలు చేయుటకును, ప్రజాపరిపాలన విధానమందు ప్రజలకు కొంత అనుభవము కలుగుటకును స్థానిక పరిపాలనము తోడ్పడెనని చెప్పవచ్చును.

దేశమును పాలించుటకు ప్రారంభించినప్పుడు ప్రజల సౌభాగ్యమునకై పనిచేయవలెననెడి ఉద్దేశముకాని, అవకాశము కాని బ్రిటిష్‌వారి కుండెడిది కాదు. క్రీ. శ. 1858 తరువాత వారి దృష్టిలో మార్పు వచ్చెను. అంతకు ముందే వారు రోడ్లు, రైళ్ళు, తంతి తపాలా ఏర్పాటులు, ఆనకట్టల నిర్మాణము మొదలగువానియందు కొంత శ్రద్ధను వహించిరి. ఇది క్రీ. శ. 1858 తర్వాత మరింత వృద్ధి గాంచెను. ఈ విధమైన పనులను నిర్వహించుటకు క్రొత్త పరిపాలన శాఖల నిర్మాణ మవసర మయ్యెను. అందుచేత రెవిన్యూ శాఖతోపాటు, పబ్లిక్ వర్క్సు శాఖ, పోలీసు శాఖ, విద్యా శాఖ, వ్యవసాయ శాఖ, అటవీ శాఖ, సహకార శాఖ, ఆరోగ్య శాఖ మొదలయిన పెక్కు శాఖలను వారు సృష్టించిరి. ప్రభుత్వోద్యోగుల సంఖ్య కాలక్రమమున వృద్ధిగాంచెను. ఒకప్పుడు జిల్లాయందు కలెక్టరొక్కడే ప్రధానోద్యోగిగ నుండువాడు. కాని క్రొత్త శాఖ లనేక మేర్పడుటచేత కలెక్టరుతోపాటు ప్రతి జిల్లాలో ఆయాశాఖలకు సంబంధించిన అధికారులు ప్రజాహిత కార్యములను చేయువారైరి. బ్రిటిష్ పరిపాలన విధానములో కాలక్రమమున కలిగిన మార్పులలో గమనింపదగినది ఇది యొకటి. దీని వలన కొన్ని సమస్యలేర్పడెను. ఈ యధికారుల నడుమ నుండదగిన పరస్పర సంబంధమెట్టిది, వారు వారు చేయు పనులలో ఇతరాధికారులతో వారు ఎంతవరకు సంప్రతించవలెను అను సమస్య ఒకటి. ఈ యధికారులకును, కలెక్టరుకును ఏలాటి సంబంధ ముండవలె నన్నది మరియొకటి. ఈ సమస్యల స్వభావ మెట్టిదైనను బ్రిటిష్‌వారు దేశమును వదలి వెళ్లునాటికి పరిపాలనము ద్వారా వారు సాధింప దలచిన ఉద్దేశములును, ప్రజల హితమునకై వారు తలపెట్టిన కార్యములును బాహుళ్యమును గాంచిన వనుటలో సందేహము లేదు.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/

# స్వాతంత్ర్య సంస్థాపనానంతరము

క్రీ. శ. 1947లో బ్రిటిష్ పరిపాలన మంతరించి దేశములో స్వాతంత్ర్య యుగము ప్రారంభమయ్యెను. దాని ఫలితముగ ప్రజాస్వామ్యము, ఫెడరల్ విధానము ఆధారములుగ క్రీ. శ. 1950లో క్రొత్త రాజ్యాంగము అమలులోనికి వచ్చెను. ఇది జరిగిన తర్వాత మూడు సంవత్సరములకు ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రము నిర్మాణము గావింపబడెను. తర్వాత క్రీ. శ. 1956లో హైదరాబాదు సంస్థానముయొక్క విచ్ఛిత్తి జరగి దేశములోని ఆంధ్ర ప్రాంతము లన్నియు కలసి, 'ఆంధ్ర ప్రదేశ్' అను పేర విశాలమయిన ఆంధ్రరాష్ట్ర మేర్పడెను. రాష్ట్రము యొక్క పరిపాలనము వయోజను లందరును ఎన్నుకొన్న శాసనసభయొక్కయు, ఆ సభకు బాధ్యతగల మంత్రివర్గము యొక్కయు అధీనములోనికి వచ్చెను. ఫెడరల్ విధానము ననుసరించి రాష్ట్ర ప్రభుత్వమునకు శాంతి భద్రతల రక్షణ, వ్యవసాయము, విద్య, పరిశ్రమలు, సహకారము మొదలయిన అనేక విషయములపై సర్వ స్వాతంత్ర్యము సంప్రాప్తించెను. ఇదియే స్వాతంత్ర్యయుగమున రాష్ట్రపరిపాలన విధానమందు కలిగిన విప్లవాత్మకమైన మార్పు.

ఈ విధముగ ఏర్పడిన ప్రజాప్రభుత్వము కడచిన ఏడెనిమిది సంవత్సరములలో రాజ్యాంగము ననుసరించి శ్రేయోరాజ్యమును స్థాపించుటకు కృషిచేయు చున్నది. అందు నిమిత్తమై భూసంస్కరణ లనేకము గావింపబడెను. జమీన్‌దారీలను రద్దుచేయుట, రైతువారి భూములను సాగుచేయు కౌలుదారుల సంరక్షణము మొదలైనవి — ఇట్టి సంస్కరణములలో ప్రధానములు. ఇదిగాక, దేశము యొక్క సర్వతోముఖ పురోభివృద్ధికై పంచవర్ష ప్రణాళికలు ఏర్పరుప బడుటచేత ఆంధ్రరాష్ట్రమందు ప్రాజెక్టు లనేకము నిర్మాణము గావింపబడినవి. నూతన పరిశ్రమలు కొన్ని స్థాపింపబడినవి. ప్రయాణ సౌకర్యములు, విద్యా సౌకర్యములు, సాంఘిక సంక్షేమకార్య క్రమములు వ్యాప్తిగాంచినవి. ఆర్థికరంగమందు ప్రజలు అనేక విధములుగ పురోగమించుటకు అవకాశము లేర్పడెను. బ్రిటిష్ ప్రభుత్వముయొక్క దృష్టికిని, స్వతంత్రముగ రాష్ట్రమును పాలించుచుండు ప్రస్తుత ప్రభుత్వముయొక్క దృష్టికిని గల ఈ భేదము గుర్తింపదగి యున్నది. (చూడు: వివరములకు ఆర్థికాది శాస్త్ర సంపుటము).

మా. వెం. రం.





http://sanskritcentral.com/

http://teluguthesis.com/

# ఆర్థిక చరిత్ర

సుఖముగ జీవించుటకు కావలసిన వస్తు సామగ్రిలో కష్టపడివగాని లభింపని వానికి అర్థమని పేరు. అర్థమును సంపాదించుటకై ప్రజలు అనుసరించు విధానము ఆర్థిక జీవితమని చెప్పదగియున్నది. ఈ జీవితమందు అప్పు డప్పుడు కలుగు మార్పుల వివరణము ఆర్థిక చరిత్ర.

తెలుగుదేశపు ఆర్థిక చరిత్రను వివరించుటకు ప్రత్యేకమైన ఆధారము లేవియు లేవు. దేశచరిత్రకు గల ఆధారముల సాయముననే దీనినికూడ వివరింపవలసి యున్నది. కాని ఇంతవరకు ఆర్థిక జీవితదృష్టితో ఈ చరిత్రాధారములను వ్యాఖ్యానించుటగాని, విమర్శించుటగాని ఎక్కువగ జరగని కారణమున ఆర్థిక చరిత్రను వ్రాయుట రాజవంశముల చరిత్రను వ్రాయుటకంటె ఎక్కువ కష్టమయిన పని. తెలుగువారి ఆర్థిక జీవితమందు, ఏయేకాలములలో ఏయే మార్పులు కలిగెనో, ఆ మార్పులకు కారణము లేవియో, వానిమూలమున కలిగిన ఫలితము లెట్టివో వివరించుట సులభసాధ్యము కాదు. దేశచరిత్రలో కొన్ని ప్రధాన యుగములందు ఆర్థిక పరిస్థితు లెట్లుండెనో సూచించుట మాత్రమే సాధ్యమగుచున్నది.

అతి ప్రాచీనకాలమందు తెలుగుదేశము దండకారణ్యములో ఒక భాగముగ నుండినందున ఆర్థికచరిత్ర ప్రథమ దశలో అడవులను ఛేదించి, భూములను చదునుపరచి వ్యవసాయ యోగ్యములుగ చేసికొనవలసిన అవసరము ఎక్కువగ నుండెను. అట్టి పని జరగుటలో సాయపడిన రాజులు ప్రసిద్ధి కాంచినవారైరి. శాతవాహనుల తర్వాత తెలుగు దేశములో కొంతభాగమును పరిపాలించిన ఇక్ష్వాకువంశ మూలపురుషుడైన చాంతమూలుడు భూమిని విస్తారముగ సేద్యములోనికి తెచ్చినవాడన్న ప్రఖ్యాతిని గాంచెను. తరువాతికాలమున కూడ 'కాడువెట్టి' (అడవిని ఛేదించిన వాడు) అను బిరుదమును కొందరు రాజులు వహించుటకు ఇదియే కారణము. ఈ సందర్భమున పేర్కొనదగిన ప్రాచీన రాజులలో త్రిలోచన పల్లవు డొకడు. కాకతీయుల యొక్కయు, విజయనగర చక్రవర్తులయొక్కయు ఘన కార్యములలో భూములను సేద్యములోనికి తెచ్చుట ఒక ప్రధాన కార్యముగ పరిగణింప బడుచున్నది.



చిత్రము 78. పురాతనకాలపు తెలుగు నాణెములు

తెలుగుదేశ చరిత్రలో శాతవాహనుల రాజ్యకాలము (క్రీ. పూ. 270 - క్రీ. శ. 178) మొదటి ప్రధానయుగము. అప్పటికి ఆర్థిక జీవితమునకు అంగములైన వ్యవసాయము, పరిశ్రమలు(శిల్పములు), వర్తక వ్యాపారములు దేశమందు వర్ధిల్లుచుండెను. క్రయవిక్రయములకు కావలసిన నాణెములు వాడుకలో నుండెను. వ్యవసాయము ప్రజలకు ప్రధాన వృత్తియైనను తక్కిన వృత్తులను అనుసరించి జీవితము గడపుకొనుచుండువారు అనేకు లుండిరి. వారిలో పేర్కొనబడినవారు 'మాలాకారు'లు, 'కోలిక'లు (సాలెవారు), 'తిలపిషకు'లు (తెలికవారు), 'ఒదయంత్రికు'లు (ఉదకయంత్ర నిర్మాతలు), 'కాసాకారు'లు (కంచు పనివారు), 'సెసకారు'లు (మెరుగుపెట్టువారు), 'కమారు'లు (కమ్మరులు), 'చంమకారు'లు, 'గధికు'లు, 'సువణకారు'లు, 'మణికారు'లు, 'మీథికులు' (రాయి మెరుగుపెట్టువారు), 'సేలవథకు'లు (శిల్పులు), 'వధకులు' (వడ్రంగులు), 'లోహవాణియు'లు, 'కులరికు'లు (కుమ్మరులు), 'లేఖకు'లు 'నాయకమిస'లు, 'కధిచకు'లు, 'మహాకటకు'లు. ఈ పట్టికలో సువర్ణకారులు, మణికారులు మొదలైనవారు చేరియుండుటచేత శాతవాహన కాలమునాటికి ప్రజలలో భోగ భాగ్యము లనుభవించు ధనికవర్గ ముండెనని స్పష్టమగుచున్నది. ఆ కాలపు విశేషములలో గమనించదగినది మరియొకటి కలదు. ఒక్కొక్క వృత్తిని అనుసరించినవారు ఒక్కొక్క ప్రత్యేక సంఘముగ ఏర్పడియుండిరి. అట్టి సంఘములకు 'నికాయసేణు'లనియు, 'సేణు' (శ్రేణు) లనియు పేర్లు. సంఘనాయకుడు శ్రేష్ఠియని పిలువబడుచుండెను.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సంఘసభ్యులు లోబడియుండ వలసిన కట్టుపాట్ల నన్నిటిని సంఘము వారే ఏర్పరచి అమలులో ఉంచుచుండిరి. ఈ విషయములలో ప్రభుత్వమువారు ఎట్టి జోక్యమును పుచ్చుకొనువారు కారు. ఇది ఒక విధమైన ఆర్థిక స్వారాజ్యము. ఈ సంఘములు వృత్తి సంఘములుగ మాత్రమే కాక ఈ కాలమున బ్యాంకిలు చేయు పనులలో కొన్నిటిని చేయుచుండెను. సాధారణముగ నూటికి పండ్రెండు వడ్డీ చొప్పున అప్పుల నిచ్చి పుచ్చుకొనుట మామూలుగ నుండెను.

దేశములోపలను, విదేశములతోడను వ్యాపారము చేయు వర్తకు లనేకు లుండిరి. వారికి సార్థవాహులని పేరు. వారిలో ధరినికులు - ధాన్యవ్యాపారము చేయువారు - ఒకరు. వర్తకులుకూడ శ్రేష్ఠి యనువాని నాయకత్వమున సంఘములుగ ఏర్పడి వర్తకమును సాగించుచుండిరి. దేశమందు ప్రఖ్యాతిగాంచిన వర్తకస్థానములు అనేక ముండెను. వానిలో ధాన్యకటకము, విజయపురము, గూడూరు, వినుకొండ, కంటకసేల, కొడ్డూర, అల్లొసైనె (?), ఎఫిటేరియన్ (కోరంగి) ప్రధానములైనవి. గూడూరు ప్రాంతమున సన్న బట్టలనేత, వినుకొండ ప్రాంతమున లోహ పరిశ్రమ, పల్నాటిలో వజ్రపరిశ్రమ ప్రసిద్ధిగాంచి యుండెను.

సాతవాహనుల తరువాత పల్లవులు, ఇక్ష్వాకులు, బృహత్ఫలాయనులు, శాలంకాయనులు, ఆనందగోత్రులు, విష్ణుకుండిరాజులు, చాళుక్యులు, చోళులు మొదలైనవారు అప్పుడప్పుడు తెలుగుదేశములోని వివిధప్రాంతములను పరిపాలించిరి. కాని వీరి కాలములో ఆర్థిక పరిస్థితు లెట్లుండెనో వివరించుటకు తగిన ఆధారములు చాల తక్కువ. సాతవాహనుల కాలమునాటి పరిస్థితులకును ఈ కాలములోని వానికిని విస్తారము భేద ముండినట్లు కనపించదు.

తెలుగుదేశ చరిత్రలో కాకతీయుల కాలము (క్రీ. శ. 1050 - క్రీ.శ. 1323) రెండవ ప్రధానయుగము. ఈ కాలమున కూడ వ్యవసాయము ప్రజలకు ప్రధాన వృత్తిగ నుండెను. దీని అభివృద్ధికై కాకతీయ చక్రవర్తులు మూడు విధములుగ పాటుపడిరి. కాడువెట్టి బిరుదమును వహించిన ప్రాచీన పరిపాలకులవలె వీరు అరణ్యము లనేకము - ముఖ్యముగ ఇప్పటి కర్నూలుమండలములోని వానిని - ఛేదించి, భూములను వ్యవసాయ యోగ్యములుగ జేసిరి. అట్టి ప్రదేశములలో వారు క్రొత్త గ్రామములను నిర్మాణము కావించి అచ్చట చేరిన రైతులకు కొన్ని సంవత్సరములపాటు పన్నులు లేకుండ వ్యవసాయము చేయుటకు అనుజ్ఞ నిచ్చి గ్రామజీవితము సంప్రదాయానుసారము సర్వాంగ సంపన్నముగను, స్వయం సమృద్ధముగను జరుగుటకు రెడ్డి, కరణము మొదలైన గ్రామాధికారులను,

పురోహితుని, తలారి, కుమ్మరి, చాకలి, మంగలి మొదలైన గ్రామ భటులను నియమించి వారి వారికి తగినట్లు మాన్యముల నొసగిరి (కొన్ని పాత గ్రామములలో వీరితో పాటు ఒక వైద్యుడు, రక్షణకు కొందరు వీరభద్రులు, వీరముష్టివారు ఉన్నట్లు తెలియుచున్నది). పొలములకు సకాలమున నీటి పారుదల జరగుటకు వీరు, వీరి సామంతులు గొప్ప చెరువులను త్రవ్వించిరి. వానిలో పాకాల చెరువు, జగతీకేసరి చెరువు, కాటసముద్రము, చౌడ సముద్రము, చింతల చెరువు, నామ సముద్రము, ఎరక సముద్రము ముఖ్యముగ పేర్కొనదగియున్నవి.

వ్యవసాయముకాక, ఇతర వృత్తులవలన జీవించువా రనేకులు ఉండిరి. సాతవాహనుల కాలము నాటికిని, కాకతీయుల కాలము నాటికిని ఈ విషయమున గుర్తించదగిన భేదము లనేకము లేవు. కాని ఈకాలపు గ్రంథములలోను, శాసనములలోను పూటకూళివృత్తి, వేశ్యావృత్తి, కుట్టుపని, మేదరపని ప్రత్యేకముగ పేర్కొనబడియున్నవి. ఇవి పూర్వకాలమున కూడ ఉండినవే. అయినప్పటికిని ఈ కాలమున పట్టణములు పెరుగుటవలన వీనిలో కొన్నిటికి ఎక్కువ ప్రాధాన్యము లభించియుండవచ్చును. వృత్తులను బట్టి ప్రజలు పదునెనిమిది కులములుగ విభజింపబడియుండిరి. వారిలో కోమట్లు, గొల్లవారు, అక్కసాలవారు (అగసాల), సాలెవారు, మంగలులు, కుమ్మరులు చేరియున్నారు. పరిశ్రమలలో పేరుగాంచినవి సన్నని వస్త్రముల పరిశ్రమ, పంచలోహముల పరిశ్రమలు, రత్నకంబళముల నేత, జముకాణముల పరిశ్రమ, అద్దకపు పరిశ్రమ.

క్రయ విక్రయములు చాలవరకు సంతలలో జరగుచుండెను. ఈ సంతలలో కొన్ని మడిసంతలు, కొన్ని మైలసంతలు. మైల సంతలు ఊరివెలుపల జరగుచుండెడివి. అందు మత్స్య మాంసాదులు విక్రయించుచుండువారు. సంతలలో రకరకములైన వస్తువులు అమ్మబడుచుండినను సుంకములు చెల్లింపవలసిన నీలి, పోకలు, కూరగాయలు, మామిడిపండ్లు, కొబ్బెర, నువ్వులు, గోదుమలు, పెసలు, వడ్లు, జొన్నలు, ఉప్పు, ఆవాలు, తగరము, సీసము, రాగి, చందనము, కర్పూరము, జవాది, పట్టునూలు ప్రధానముగ గుర్తింపదగియున్నవి. వీనితోపాటు పసుపు, ఉల్లి, కంద, చెండలము మొదలైన దుంపదినుసులు, చందనము, ముత్యము, రుద్రాక్ష మొదలగు సరకులయందుకూడ వ్యాపారము జరగుచుండెను. మోటుపల్లి మొదలైన రేవుల ద్వారా శ్రీగంధము, పచ్చకర్పూరము, ముత్యాలు, దంతము, పట్టునూలు, పవడములు, మిరియాలు దిగుమతియగుచుండెను. శ్రేణులుగ ఏర్పడి, బహుళముగ దేశమం దంతట



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వర్తక వ్యాపారములు చేయుచుండినవారిలో వీర బలంజలు (బలిజలు), గవరవారు, అయ్యావళీలు, నగర కోమట్లు ముఖ్యముగ పేర్కొనదగియున్నారు. వర్తక సామగ్రులను మోయుటకు బండ్లను కొద్దిగను, దున్నపోతులు, ఎద్దులు, గాడిదెలు మొదలైనవానిని ఎక్కువగను వాడుచుండిరి.

కాకతీయుల కాలమున సామాన్య ప్రజల జీవితస్థాయిని తెలిసికొనుటకు తగిన ఆధారములు లేవు. కాని చక్రవర్తులు మాత్రము విశేష ధనమును సమకూర్చుకలిగినట్లు చెప్ప వచ్చును. మహమ్మదీయులు ఓరుగంటిపై దండెత్తి వచ్చి నప్పుడు వారికి లభించిన ధనరాసులు వెండి, బంగారములు రత్నములు గలిగి తారార్కాణపు.

దేశ చరిత్రలో విజయనగర సామ్రాజ్య కాలము (క్రీ. శ. 1336 - క్రీ. శ. 1678) మూడవ ప్రధాన యుగము. ఈకాల మున విదేశీయులు కొందరిచ్చటికి వచ్చి దేశవైభవమును, భోగభాగ్యములను వివరించియున్నారు. వారి వ్రాతలను బట్టి మొత్తముపైన ప్రజల ఆర్థిక జీవిత విధానమందు గొప్ప మార్పు లేనియు సంభవించినట్లు కనిపించదు. పూర్వకాలపు విధానమే ఈ కాలమందును ప్రాబల్యము వహించియుండెను. ప్రజలు, పరిపాలకులు పూర్వకాలపు సంప్రదాయములనే యనుసరించుచుండిరి. కాని సామ్రాజ్యము విస్తరించినట్లే, ప్రతి ఆర్థికరంగముకూడ - వ్యవసాయము, పరిశ్రమలు, వర్తక వ్యాపారములు, పన్నులమూలమున ప్రభుత్వము సంపాదించిన ఆదాయము, ప్రభుత్వపు ఖర్చులు — పూర్వముకంటె బహుళతరము లయ్యెను. ముఖ్యముగ గుర్తింపదగిన మార్పు ఇదియే.

పూర్వకాలపు రాజులవలె విజయనగర చక్రవర్తులు అడవులను ఛేదించి వ్యవసాయ యోగ్యమగు భూమియొక్క విస్తీర్ణమును పెంచిరి. దీనితోపాటు క్రొత్త గ్రామములను నిర్మాణము గావించి, పాడుపడ్డ పాత గ్రామములను పెక్కింటిని పునరుద్ధరించిరి. ప్రజలలో ఇట్టి కార్యములకు పూనుకొనినవారికి అనేక విధముల ప్రోత్సాహము కల్పించిరి. క్రొత్తగ సాగుబడిలోనికి వచ్చిన భూములను సాగు చేయువారికి పన్నుల విషయములో కొన్ని ప్రత్యేక సౌకర్యములను కలిగించిరి. వీని ఫలితముగ దేశములోని గ్రామముల సంఖ్యయు, సాగుబడి పొలముల విస్తీర్ణమును పెరిగెను.

జలాధారముల నిర్మాణమందు చక్రవర్తులు, వారి సామంతులు ధర్మచింతగల ప్రజలలో అనేకులు ఎక్కువ శ్రద్ధను వహించిరి. తటాక నిర్మాణము సప్త సంతానములలో నొకటి యనియు, పుణ్యమును, యశస్సును చేకూర్చగలదనియు విశ్వాస ముండుటచేత చెరువులను త్రవ్వించిరి. వానిలో కొండవీడు ఉదయగిరి ప్రాంతములందును, ఇప్పటి కడప అనంతపురము మండలములలోను నిర్మింపబడిన చెరువులు మిక్కిలి ప్రధానములైనవి. వీనిని మంచి స్థితిలో నుంచుటకును, అవసరమైనప్పుడు మరమ్మతులు చేయించుటకును ప్రత్యేకమైన ఏర్పాటులు గావింపబడినవి. చెరువులుగాక నదీ జలములు వ్యవసాయమున ఉపయోగపడుటకై విజయనగర చక్రవర్తులు కొన్ని కాలువలనుకూడ త్రవ్వించిరి. కాని ఇట్టి పనులు జరిగినను మొత్తముమీద వ్యవసాయము ఎక్కువగ వర్షముపై ఆధారపడవలసిన స్థితియందే ఉండెను.

వ్యవసాయవిధానమందుగాని, రైతులు ఉపయోగించు పనిముట్లయందుగాని, వారు పండించిన పంటల స్వరూపమందుగాని ఎట్టి మార్పులు ఆ కాలమున కలిగినట్లు లేదు. ఎప్పటివలెనే వారు రకరకములైన వరిధాన్యములు (కలమ, శాలి, నీరాముఖ, షాష్టిక, పతంగ, హాయనాదులు), జొన్న, రాగి, వరగ, పప్పుదినుసులు, చెరకు, నువ్వులు, ఆముదాలు, నీలి, పోక, కొబ్బెర, అరటి, తమలపాకు, మామిడి, పనస, పసుపు, ఉల్లి మొదలైన వానిని పండించుచుండిరి. అప్పటికి ఇప్పటికి పంటల విషయములో ఎక్కువ భేద మేమియు లేదు. ఆ కాలమున లేని పంటలలో వేరుసెనగ, పొగాకు ముఖ్యములైనవి.

పూర్వ కాలమున వివిధకులములవారు అనుసరించుచుండిన వృత్తులనే విజయనగర సామ్రాజ్యకాలమందు కూడ అనుసరించు చుండిరి. కాని విశ్వకర్మకులజు లనియు పంచాణంవా రనియు పేర్కొనబడు కమ్మరులు,బంగారుపని చేయు కంసాలులు, ఇత్తడిపనిచేయువారు, కర్రపనిచేయు వడ్రంగులు, దేవాలయాదులను కట్టు శిల్పులు వీరి ప్రశంసయు, వీరి మధ్యను సంభవించిన వివాదముల ప్రస్తావమును ఈకాలమున కొంచె మెక్కువగ కనిపించుచున్నది. చక్రవర్తులే కాక రాష్ట్రములను పాలించు నాయకులు, సామంతులు, ఉన్నత పదవులలోని ఇతరులు, వ్యాపారముద్వారా ధనము నార్జించిన వర్తకులు ఎక్కువగ నుండినందునను, దేవాలయ నిర్మాణమునకును దేవతల ఉత్సవములకును ఎక్కువ ప్రాధాన్యము లభించినందునను బంగారముతోను రత్నములతోను ఆభరణములు తయారుచేయు కంసాలులకును దేవాలయాదులను నిర్మింపగల శిల్పులకును అక్కర ఎక్కువయ్యెను. మరియొక విశేషము కూడ ఈ సందర్భమున గమనింపదగియున్నది. సామ్రాజ్య చరిత్రలోని చివర భాగమందు యూరపు ఖండమందుండి వచ్చినవారు, ఇంగ్లీషువారు వచ్చి పులికాటు, నిజాంపట్టణము, మచిలీపట్టణము మొదలైన ప్రదేశములలో వర్తకస్థలముల నేర్పరచుకొని, మన దేశములోని నూలు బట్టలు, కలంకారీబట్టలు మొదలగు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వాని నెక్కువగ కొనసాగిరి. ఈకారణమున పాళీవాండ్ర స్థితి మరింత చక్కబడుటకు అవకాశము కలిగెను.

వర్తక వ్యాపార రంగములందు ప్రధానముగ గమనింప దగిన మార్పు యూరోపియను వర్తకుల రాకయే. తక్కిన విషయములలో వ్యాపార మంతయు పూర్వపద్ధతినే సాగు చుండెను. విదేశములనుండి మన దేశమునకు వచ్చుచుండిన వానిలో వెండి బంగారములు, పాదరసము, తగరము, సీసము, రాగి, ఇనుము, సుగంధద్రవ్యములు, పింగాణి, పట్టు వస్త్రములు, రత్నములు, ఏనుగులు, గుర్రములు ప్రధానములు. ఇచ్చటినుండి విదేశములకు పంపబడిన వానిలో రకరకములైన వస్త్రములు అగ్రస్థానమం దుండెను.

దేశము లోపల జరగు వర్తకవ్యాపారములకు అనుకూలించు రహదార్లు కొన్ని ఉండెను. వానిలో విజయనగరమునుండి చంద్రగిరి, తిరుపతి మీదుగ పులికాటుకు చేరునది, బందరునుండి కోవెలకొండ మీదుగ కంపిలికి వెళ్లునది, విజయనగరమునుండి ఉదయగిరి కొండవీడు కొండపల్లెల మీదుగ సింహాచల శ్రీకూర్మములకు వెళ్లునది ప్రధానములైనవి. బండ్లపై సరకులను వేసికొని వ్యాపారము చేయువారికి ఈ రహదారులు అనుకూలించి యుండెను. కాని వ్యాపారములో ఎక్కువభాగము పూర్వమువలె గాడిదలు, ఎడ్లు, గుర్రములు మొదలైన వాని మూలమున జరగుచుండెను. వ్యాపారము చేయుచుండిన వారిలో నానాదేశీయులు, వీర బలంజలు, అయ్యావళులు, శెట్లు ముఖ్యులుగ నుండిరి. వీరు సమయములుగ (సంఘములుగ) ఏర్పడి వ్యాపారము చక్కగ జరగుటకు కావలసిన కట్టుదిట్టములను చేయుచుండిరి. క్రయ విక్రయములు ఎక్కువగ సంతల ద్వారా జరగుచుండెను.

విదేశీయుల వ్రాతలనుబట్టి విజయనగర సామ్రాజ్యము సమస్త భోగ భాగ్యములతో తులతూగుచుండినట్లు చెప్పుటకు వీలున్నను ఈ భోగభాగ్యములను సామాన్య ప్రజలు ఎంతవరకు అనుభవించ గలిగి రనువిషయము సందేహాస్పదముగ నున్నది. బహుశః వారి ఆర్థికస్థితిలో గొప్ప మార్పు లేవియు కలుగలేదని చెప్పుటయే సమంజసముగ నున్నట్లు కనిపించుచున్నది. ఈ సందర్భమున మూడు విషయములను ముఖ్యముగ గమనించ వచ్చును. సామ్రాజ్యము విస్తీర్ణమందు పెద్దది యగుటచేత దానిని పరిపాలించుటకు కావలసిన ఉన్నతోద్యోగులసంఖ్య వృద్ధి గాంచెను. సైన్యాధిపతులు, రాష్ట్రములను పాలించు చుండిన నాయకులు, వారి ప్రతినిధులు, ఇతరోద్యోగులు ఈ వర్గమునకు చెందినవారు. ఉన్నత పదవులలోనివారి జీత బత్తెములు కూడ ఆ కాలమందు ఎక్కువగ నుండెను: వారిలో భోగలాలస మెండు. ఇందుచేత దేశాదాయములో చాలభాగము వారి సౌఖ్యముకొరకై వినియోగ మగుచుండెను.

ఆ కాలమున ప్రభుత్వమునకు ప్రజలు చెల్లింపవలసిన పన్నులుకూడ అత్యధికముగ నుండెను. పండిన పంటలో రైతునకు పదియవవంతు కూడ మిగులుట లేదన్న అభిప్రాయమును విదేశీయులు కొందరు వ్యక్తపరచి యున్నారు. ఇట్టి పన్నుల భారమును భరింపలేక కొన్ని సమయములందు రైతులు, వారి భూములను, గ్రామములను వదలి గ్రామాంతరములకు పారిపోవుట కూడ సంభవించు చుండెను. క్రయవిక్రయములకై సంతలకు తెచ్చిన సరకు లన్నిటిపై (ఏవో కొన్నిటిపై తప్ప) సుంకములు విధింప బడు చుండెను. ఇవిగాక, దారి సుంకములు, ఇతరములయిన సుంకములు ఎన్నియో ఉండెను. వృత్తి పన్ను లను పేరిట చాకళ్లు, మంగళ్లు, వడ్రంగులు, సాలెలు — అన్ని వృత్తుల వారు పన్నులు చెల్లింపవలసి యుండిరి. పన్నులను వసూలు చేయుటకై నియమింప బడిన అధికారులు ప్రజలను పీడించి చట్ట విరుద్ధముగ ద్రవ్యమును రాబట్టుట కవకాశము లుండెను. ఇదికాక అప్పు డప్పుడు క్షామములు సంభవించుట కలదు. క్షామపీడితులను రక్షించుటకు పరిపాలకులు కొన్ని చర్యలను తీసికొన్నను రవాణా సౌకర్యములు లేని కారణమున ప్రజలస్థితి దుర్భర మగుచుండెను.

ప్రజలవద్ద నుండి వసూలు చేసిన పన్నులలో చాల భాగమును సైన్యములకై ఖర్చుపెట్టవలసిన అవసరము ఆ కాలమునందు ఎక్కువగ నుండెను. ఇది కాక దేవాలయ నిర్మాణము, దేవతల ఉత్సవములు ముక్తిదాయకములను విశ్వాస కారణమున చక్రవర్తులు ఇట్టి కార్యములకై విశేష ధనమును ఖర్చుపెట్టు చుండిరి. ఏటేట తమకు వచ్చిన ఆదాయములో కొంతభాగమును ఖర్చుపెట్టక దాచియుంచు సంప్రదాయమును చక్రవర్తు లనుసరించుచుండిరి. దీని మూలమున ప్రజల సౌఖ్యమునకై ప్రభుత్వచేయు ఖర్చు అతి స్వల్పముగ నుండెను.

ఇన్ని పరిస్థితులు కారణముగ, ఆ కాలమున సామ్రాజ్య ప్రజలయొక్క ఆర్థికస్థితి సంతృప్తి కరముగ నుండలేదనియే చెప్పవలసి యున్నది.

దేశ చరిత్రలో బ్రిటిష్ పరిపాలనకాలము నాల్గవ ప్రధానయుగమని చెప్పదగి యున్నది. ఈ కాలమున ఆర్థిక జీవితమందు విప్లవాత్మకమైన మార్పులు అనేకము కలిగెను (చూడు: పుట 458, బ్రిటిషు పరిపాలన ఫలితములు).

మా. వెం. రం.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/

# వర్తక వ్యాపారములు

తెలుగుదేశములో పురాతన కాలమునుండి భూమి మీదను, ఓడలలో సముద్రముమీదను విరివిగా వర్తక వ్యాపారములు సాగుచు నుండె ననుటకు సందేహము లేదు. కాని తెలుగు దేశములోని వర్తకులు హిందూదేశములోని ఏయే ప్రదేశములతో వర్తకము చేయువారో, మన దేశమునుండి ఇతర దేశములకు ఏయే సరకులను గొనిపోవువారో, అచటినుండి మన దేశమునకు వేనిని తెచ్చువారో, అట్లే మన దేశమునుండి ఇతర దేశములకును అచటినుండి మనదేశమునకును ఎగుమతి దిగుమతు లగుచు వచ్చిన సరకుల విలువ ఎంత యుండెడిదో తెలిసికొనుటకు ఆధారము లేవియు లేవు. సరియైన రాచబాటలు కాని, నదులకు, ఏళ్ళకు వంతెనలు కాని లేకపోవుటవలన భూమార్గమున జరగు వర్తక వ్యాపారములు చాల వ్యయ ప్రయాసలతోను, కష్ట నష్టములతోను కూడి యుండెడి వనుట నిశ్చయము. అందువలన వర్ష కాలములో తక్క మిగిలిన కాలములోనే వ్యాపార మధికముగను, సత్వరముగను సాగుచుండి యుండవలెను. సాధారణముగా పూర్వకాలములో పుణ్యక్షేత్రములను, పుణ్య తీర్థములను సందర్శించుటకు యాత్రికులు వెళ్ళు మార్గములే వర్తకమార్గములుగను, వర్తకులు అనుసరించు మార్గములే యాత్రిక మార్గములుగను ఉండెడివి. దేశములో అడవి ఎక్కువగ నుండుటచేతను, దొంగల భయము అధికముగ నుండుటచేతను, రహదారులు సరియైనవి లేకపోవుటచేతను పురాతన కాలమునుండియు పరస్పర సహకారము కావలసివచ్చుటవలన వర్తకులు గుంపులు కట్టి జట్లు జట్లుగ పోవలసివచ్చెడిది. ఇట్టి వర్తక సమూహములకు సార్థవాహు లనియు, సాతు లనియు పేరులు చెల్లుచుండినవి. వర్తకులు గుంపులు కూడియే కాని ఒంటరిగ వెళ్ళువారు కారు.



చిత్రము 76. మచిలీపట్టణము ('మసూలా') పడవ

గ్రామాదులలో పండిన పంట ఆ చేరువనున్న సంతలకు వచ్చెడిది. మిక్కిలి చిన్న పల్లెలలో తప్ప ప్రతి పెద్ద గ్రామములోను వారములో ఏదో యొక దినమున సంత సాగుచుండెడిది. వర్తకులు సంతలకు వచ్చి సరకు బేరము చేసి కొని పోవువారు. ప్రాచీన కాలములో వర్తక వ్యాపారములు సాధారణముగ వినిమయ పద్ధతిని జరగుచుండెడివి. సరకునకు బదులు సరకును మార్చుకొనుటను వినిమయ పద్ధతి యందురు. పూర్వము ధాన్యమేకాని నాణెము ఎక్కువగ వాడుకలో ఉండెడిది కాదు. ఏ సరకు తమకు కావలసినను పండిన పంటను ధాన్యమునుగాని, మరొక దినుసునుగాని ఇచ్చి దానికి బదులుగ తమకు కావలసిన వస్తువును తీసికొనిపోవువారు. బ్రిటిష్ పరిపాలనలోనే నాణెముల చలామణి ఎక్కువయినది. పైక మిచ్చి సరకులను క్రయ విక్రయములు చేయు నాచారము ప్రబలినది. వర్తకులు తమ సరకులను గోనెసంచులలో వేసి ఒంటెల మీదను, ఎడ్లమీదను, దున్నపోతులమీదను, గుర్రముల మీదను, కంచర గాడిదలమీదను కొనిపోవువారు. ఈ జంతువుల వెన్ను కడ్డముగా ఎడ పెడ నుండు సరకు గోనెలకు పెరికె లనియు, ఇట్లు పెరికెలలో సరకులు కొనివచ్చు వర్తకులకు పెరికె సెట్లనియు పేరు. ఒక్కొక్క వర్తకుడు బేహారమునకు బయలుదేరునపుడు అతని సరకులు వేసికొని అతనితో దాదాపు వందమంది వెళ్ళుచుండువారు. ఇట్టి వర్తకు లనేకులు గుంపుకట్టి కలిసి బయలుదేరుచుండువారు. ఈ వర్తక జనము ఆత్మరక్షణకొరకు ఈటెలు, బల్లెములు మొదలయిన ఆయుధములు వెంట కొనిపోవువారు.

వంతెనలు లేకపోవుటవలన నదులను వర్తకులు ఒకరకమైన పడవలలో దాటెడివారు. ఈ విధమైన పడవలకు పుట్లు అని పేరు. నదులలో రేవులవద్ద ఇట్టి పుట్లు చాల ఉండెడివి. నాగార్జునుని కొండ సమీపమున కృష్ణానది ఒడ్డున పుట్లపాలెమని ఒక గ్రామము కలదు. పుట్లను నడపి కృష్ణను దాటించు జనము ఉండు గ్రామ మది. అందువలననే దానికి పుట్లపాలెమని పేరు వచ్చినది. చెరకు పెనము వలె గుండ్రముగ పేపబెత్తముతో అల్లి నీళ్ళను లోపలకు చొరనీకుండ దున్నపోతు చర్మముతోనో, ఎద్దు చర్మముతోనో దాని మీదను, క్రిందను, చుట్టును కప్పుదురు. దానికి పుట్టి అని పేరు. దీని నడిమి కొలత ఎనిమి దడుగులు మొదలు పండ్రెం డడుగుల వరకును ఉండును. పూర్వము గోదావరి, కృష్ణ, తుంగభద్ర దాటుటకు ఇవే పడవలు.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఒక్క తెలుగు దేశములోనే కాక, దక్షిణ దేశములోని నదులలోకూడ నిట్టివి ఉండెడివి. రెండువందల పండ్ల క్రిందటివరకును ఇట్టి పుట్లమీదనే గుర్రములతోకూడ బ్రిటిష్ సైన్యములు నదులను దాటెడివని పాశ్చాత్యులు వ్రాసిన వృత్తాంతములనుబట్టి తెలియుచున్నది. గోదావరి, కృష్ణానదులలో నదీ ముఖద్వారములనుండి ఎగువకు కొంత దూరము మాత్రమే దోనెలు తిరిగెడివి. సముద్ర తీరమువెంట నరకు వేసికొని తిరుగు తొట్టి పడవలవంటి మరొక రకము పడవ లుండెడివి. వానికి మచిలీపట్టణపు పడవలు ('మసూలా బోట్స్') అనిపేరు.

వేరు వేరు రాజవంశముల పరిపాలనలో దేశములోని అడవి నరకుడువడి గ్రామము లెక్కువగ నేర్పడి వర్తక వ్యాపారములు అభివృద్ధియై దేశము సంపన్నమైనకాలది వర్తకులు వేరు వేరు సంఘములుగ నేర్పడి వ్యాపారము సాగించుచు వచ్చిరి. వర్తక వ్యాపారములు చేయు వైశ్య శిఖామణులు శ్రేష్ఠులని పేరు. వీరు దేశీయ ప్రభువులకు అప్పిచ్చు బ్యాంకర్లుగ గూడ నుండి వారి వలన మన్ననలను, బిరుద గౌరవాదులను పొందుచుండెడివారు. పెనుగొండ పురవరాధీశ్వరులైన వైశ్యులను గురించియేకాక మరి కొన్ని వర్తక సంఘములను గురించికూడ మధ్యయుగము నాటి శాసనములవల్ల తెలియుచున్నది. ఇట్టి వర్తక వ్యాపార సంఘములలో ప్రధానమైనదియు, పెద్దదియు, బహు శాఖోపశాఖలు కలదియు అగునది వీరబలంజ సమయము. వీరబలంజ సమయమువారికి తెలుగు దేశములోనే కాక కన్నడదేశములోను, అరవ దేశములోనుకూడ శాఖలు కలవు. కన్నడదేశములో వీరిని బణజిగ లందురు. మన దేశములోని బలిజలు ఈ వీరబలంజ సమయములోని వారే.



చిత్రము 77. జావాకు పోయిన ఇండియా ఓడ, బోరోబదూరు శిల్పము

ఒక్క మనదేశములోనేకాక వీరు అన్యదేశములతోను, ద్వీపాంతరములతోను గూడ వ్యాపారము సాగించుచు వచ్చినారు. అవసరమైనప్పుడు వీరు రాజసైన్యములలో సైనికులుగ చేరి విజయములను చేకూర్చి ప్రభువులవలన బిరుదు నిశానులను, మర్యాదలను పొందువారు. వ్యాపారము చేయు ఈ వర్తకసంఘములు నాడు నాడున, నగర నగరమున దేశ మంతటను ఉండడివి. నగరముసంఘము వారికి 'నకర'మనియు, నాడు సంఘము వారికి 'నాడు వా'రనియు, 'స్వదేశ' వర్తక సంఘమునకు 'స్వదేశి' యనియు, పరదేశ వర్తక సంఘమువారికి 'పరదేశి' యనియు పేరులు వ్యవహారమున నుండెడివి. ఈ కారణముచేతనే ఈ వర్తక సంఘములు మధ్యయుగమునాటి శాసనములలో 'నగర', 'నాడు', 'స్వదేశి', 'పరదేశి', బేహారు లనియు, 'నాడు నానాదేశి' యనియు, 'పదునెయారు దేశాల చాలు మూల సమస్త పెక్కం' డ్రనియు, 'చాలు మూల పదునెన్మిది సమయాల సమస్త పెక్కం' డ్రనియు, 'అఖిల దేశాల పదునెన్మిది సమయాల సమస్తమైన పెక్కం' డ్రనియు వ్యవహరింపబడినవి. ఈ వర్తక సంఘములలో ఒక్కొక్కదానికి పెద్దపెద్ద వక్కణలు గలవు. శుభకార్యములందు, ముఖ్యముగ వివాహావసరములందు ఈ వక్కణలను పఠించుట ఆచారము.

**సముద్ర వర్తకము :** తెలుగు దేశమునకు దాదాపు అయిదువందల యేబది మొదలు అరువందల మైళ్ల పొడవుగల సముద్రతీరము గలదు. మోటుపల్లివద్ద నుండి చిలుకు సముద్రమువరకు గల ఉత్తర సర్కారుల సముద్రతీరపు నిడివియే నాలుగువందల డెబ్బది మైళ్లు. తెలుగుదేశమునంటి ఇంతటి సుదీర్ఘమైన సముద్రతీరము ఉండుటవలననే ఆంధ్రులు ప్రాచీనకాలములో సముద్రయానమున నిపుణులని పేరు పొందుట సంభవించినది. అందునను ఆంధ్రదేశాంతర్గతమైన కళింగదేశపు ప్రజలు క్రీస్తుశకము మొదటి శతాబ్దులనుండి మహాసాహసికులై అపరిచితములైన సముద్రములపై ఓడలలో తూర్పుదేశములకును,



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ద్వీపములకును ప్రయాణము చేయుచు వచ్చిరి. సువర్ణ భూమి యనియు, సువర్ణద్వీప మనియు, సుగంధ ద్రవ్య ద్వీపము లనియు పేరువడిన ప్రాగ్దేశ (బర్మా), ప్రాగ్ ద్వీపములలోనే మొదటిమారు చీనాదేశీయులు హిందూ దేశము తూర్పు తీరమునుండి వచ్చిన హిందూదేశీయులను కలిసికొనినట్లును, వారిని 'క్లింగు' అని వ్యవహరించినట్లును క్రీస్తుశకము తొలి శతాబ్దులనాటి చీనాదేశ వృత్తాంతముల వలన తెలియుచున్నది. హిందూదేశపు తూర్పుతీరమున నుండినవా రందరును, 'క్లింగు' లనియే చీనాదేశీయుల యభిప్రాయము. 'క్లింగు' పదము 'కళింగ 'మను పదమునకు వికృతి. ఈ కారణముచేతనే క్రీస్తుశకము మొదటి శతాబ్దు లకు తరువాత హిందూదేశ ద్వీపకల్పముయొక్క తూర్పు తీరముననుండి ప్రాగ్దేశములకును, ద్వీపములకును ఏజాతి వారు వెళ్లినను వా రందరిని చీనాదేశీయులు 'క్లింగు'లు (కళింగదేశీయులు) అనియే వ్యవహరించుచు వచ్చిరి.

హిందూదేశ మింతటిలో సముద్రముపై అధికారము వహించి సముద్ర వర్తక వ్యాపారములకు ప్రోత్సాహ మిచ్చి వాని నభివృద్ధిపొందించిన భారతీయ రాజన్యులలో క్రీస్తుపూర్వము 270 నుండి క్రీస్తుశకము రెండవ శతాబ్ది మధ్యకాలము వరకును రాజ్యముచేసిన ఆంధ్ర సాతవాహ నులు మొదటివారు. వీరి కాలములోనే ఆంధ్రదేశపు తూర్పు తీరమునుండి - ముఖ్యముగ కళింగదేశమునుండి - ఆంధ్రులు దూరస్థద్వీపములకును, దేశములకును వర్తకవ్యాపారముల నిమిత్తము వెళ్లి అక్కడ వలసలుకూడ స్థాపించి రనుటకు ఆధారము లున్నవి. ఆంధ్రసాతవాహనుల సముద్రాధి పత్యమునకు తార్కాణముగ వారు ముద్రించిన నాణెముల మీద రెండు తెరచాప స్రామానులుగల యోడచిహ్నములు గలవి అనేక మున్నవి. వారి పరిపాలన కాలములో బందరువద్దనున్న గూడూరును, కృష్ణానదీ ముఖద్వారమం దున్న ఘంటసాలయు ప్రసిద్ధములైన రేవుపట్టణములు. ఇటీవల ఘంటసాలలో బయటపడిన క్రీస్తుశకము రెండవ శతాబ్దమునాటి ఒక ప్రాకృతశాసనమున ఆనాటి ఆంధ్ర దేశ మహానావికు డొకడు పేర్కొనబడియున్నాడు. ఆంధ్రదేశమునుండి ప్రాగ్దేశములకును, ద్వీపములకును వర్తకవ్యాపారముల నిమిత్తముగాని, ఇతర కార్యముల నిమిత్తముగాని వెళ్లువారు పైన చెప్పిన రేవులలోనే ఓడ నెక్కువారు.

తూర్పుదేశములతోను, ద్వీపములతోను వ్యాపారము మనదేశములోని తూర్పు సముద్రతీరవాసుల చేతులలో నుండ, పశ్చిమఖండ దేశములతోడి వ్యాపారము విదేశీ యుల హస్తగతమై యుండెను. ఈ వ్యాపారమునుగురించి మనకు 'పెరిప్లస్ ఆఫ్ ది ఎరిత్రియన్ సి' అను గ్రంథము వలనను, 'ప్లినీ', 'టాలెమీ 'అను రోమను, యవన రచయి తల గ్రంథములవలనను తెలియవచ్చుచున్నది. ఈ వర్తకము మొదట ఈజిప్టు దేశీయులు, అరబ్బులు, గ్రీకులు మున్నగు పాశ్చాత్యుల చేతులలో నుండి తరువాత రోమనుల వశమై నది. రోమను చక్రవర్తులు హిందూదేశముతోడి వర్తక వ్యాపారములకు గొప్ప ప్రోత్సాహము నిచ్చి పెంపొందించి నారు. ఈ వర్తకములో హిందూదేశమునుండి రోముకు ఎగుమతి యగుచుండిన సరకులలో సుగంధ పరిమళద్రవ్య ములును, మణులును, ముత్యములును, పట్టుబట్టలును, సన్నని మల్లు సెల్లాలును ముఖ్యమయినవి. వీనిని విదేశీయ వర్తకులు వెండి, బంగారము లిచ్చి కొని విపరీతపు ధరలకు రోమనుల కమ్ముచు వచ్చిరి. ఈ వర్తకపు సరకులు పూర్తిగ కాకపోయినను చాలభాగము దక్షిణహిందూదేశమునకు సంబంధించినవే. 'పెరిప్లస్ ఆఫ్ ది ఎరిత్రియన్ సి' అను గ్రంథమువలన తూర్పు తీరమునుండి కూడ నేతబట్టలు, రవసెల్లాలు మొదలయినవి ఎగుమతియగుచు వచ్చినట్లు తెలియుచున్నది. ఎందువల్ల ననగా, ఆ గ్రంథములో తగర నగరమునకు (తూర్పు)తీరప్రదేశములనుండి వర్తకులు విస్తారముగ తీసికొనివచ్చు సామాన్యవస్త్రములును, అన్ని రకములైన రవసెల్లాలును, రంగుబట్టలును అక్కడినుండి ప్రతిష్ఠానమునకును, అక్కడినుండి పడుమటిసముద్రతీరమున నుండు భరుకచ్ఛ మను రేవుపట్టణమునకును రవాణా యగు చుండెనని చెప్పబడినది. ప్రతిష్ఠానము హైదరాబాదు రాజ్యమునందలి ఔరంగాబాదు జిల్లాలోని గోదావరీతీర మునునుండు నేటి పైఠానే. తగరనగరమనునది పైఠాను కాగ్నేయదిశను 95 మైళ్ల దూరముననుండు తేర్ అని ఫ్లీటు దొర గుర్తించినాడు. సముద్రతీర ప్రదేశములని పేర్కొన బడినవి తూర్పు సముద్రతీరముననున్నవియేయని పెరిప్లస్ గ్రంథమునకు వ్యాఖ్యానము వ్రాసిన స్కాఫ్ యొక్క యభి ప్రాయముతో చరిత్రకారు లేకీభవించినారు. ఈకారణము చేత ప్రాక్సముద్రతీర ప్రదేశములు కొన్నిఅయినను తెలుగు దేశములోనివి కావచ్చు ననియు, అవి మల్లు సెల్లాలకును, రంగుబట్టలకును అంతటి ప్రాచీనకాలముననే ప్రసిద్ధికెక్కిన వనియు ఊహించుట అసమంజసము కాదు. ఇది సరియైన యూహయే అనుటకు మన తెలుగుదేశములో దొరకిన రోమను చక్రవర్తుల బంగారు, వెండి నాణెములే ప్రమా ణము. అవి మన తెలుగు దేశములో శ్రీకాకుళము జిల్లా లోని సాలిహుండము, కృష్ణజిల్లాలోని విజయవాడ, గుంటూరు జిల్లాలోని వినుకొండ, నెల్లూరు జిల్లాలోని నెల్లూరు, కడప జిల్లాలోని అత్తిరాలలోను, తత్సమీపమునను



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



దొరికినవి. ఇవి క్రీస్తుశకము 14 నుండి క్రీస్తుశకము 217 వరకు రోమను సామ్రాజ్యమును పరిపాలించిన టైబీరియస్ వెస్పేషియన్, డొమీషియన్, ట్రాజన్, హేడ్రియన్ ఆంటోనైనస్ పయస్, ఫాస్టినా (పెద్ద), మార్కస్ అరీలియస్, కొమ్మోడస్, కరకల్లా చక్రవర్తులకు సంబంధించినవి. ఈ నాణెములు మన తెలుగుదేశమున చాల కొద్దిగ దొరకినను అవి దొరకిన ప్రదేశములు తరువాతికాలములో నేత బట్టల పరిశ్రమకు ప్రసిద్ధికెక్కినవే యగుటచేత, ఆనాడు గూడ అవి రంగు బట్టలకు, రవసెల్లాలకు పేరు పొందినవే యని ఊహించుట పొరపాటు కాదు.

ఆంధ్ర సాతవాహనులకు తరువాత ఆంధ్రదేశమును పరిపాలించిన ఇక్ష్వాకు వంశజుల కాలములోను, అటు తరువాత సముద్ర తీరస్థ ఆంధ్రదేశములో వెలసిన బృహత్పలాయన శాలంకాయన పల్లవ విష్ణుకుండి కందార పూర్వ చాళుక్య వంశజుల కాలములోను, ఆంధ్రదేశమునకు, పశ్చిమ దేశములకు మధ్య జరగుచు వచ్చిన వర్తకమును గురించి కాని, తూర్పుదేశములతోను ద్వీపములతోను జరగుచు వచ్చిన వర్తకమును గురించి కాని మన కేమియు తెలియదు. కాని మొదటినుండియు తూర్పుదేశములతోను, తూర్పు ద్వీపములతోను, వర్తక వ్యాపారములు జరపుచు వచ్చినవారు సముద్రతీరస్థ ఆంధ్రదేశీయులే — కళింగులే. కాబట్టి, ఈ యజ్ఞాతయుగములో కూడ మనదేశపు రేవులనుంచి ఓడలు తూర్పు దేశములకు ద్వీపములకు వెళ్లుచు వచ్చుచుండిన వనియు, వర్తకము అదివరకు వలెనే జరగుచు నుండెడి దనియు ఊహింప వచ్చును. నాగార్జునునికొండలోని ప్రాకృత శాసనములలో సింహళమునుంచి బౌద్ధులు శ్రీపర్వత బౌద్ధ సంఘారామమునకు వచ్చెడివా రనియు, కాశ్మీర, గాంధార, చీని, చిలాత, అపరాంత, వంగ యవనాది దేశములలో బుద్ధసందేశమును వ్యాపింప జేసినవారు ఆంధ్ర బౌద్ధు లనియు ఉండుటచేత యవన, చీనాది దేశములకు ఆంధ్ర దేశమునకు సముద్రము మీదుగ ఓడలలో రాకపోకలు జరగుచుండినట్లు విశదమగుచున్నది. ఇండో-చీనాలోని వోకన్ అను నగరమున కానవచ్చిన శాసన లిపి సరిగా ప్రాగాంధ్ర దేశములో కానవచ్చిన రెండవ శతాబ్దమునాటి బ్రాహ్మీ లిపిని పోలియుండుటచేత సముద్రతీరమున నివసించుచుండిన ఆంధ్రులే తమ లిపిని ఇండో-చీనావరకు కొనిపోయిరని చరిత్రకారులు ఊహించుచున్నారు. బర్మాదేశ చరిత్రకారుడు ఫెయిరు హిందూదేశీయులు చాల ప్రాచీన కాలములోనే గోదావరీ, కృష్ణా ముఖద్వార ప్రాంతదేశముల నుండి బంగాళా ఖాతమునకు ఉత్తరమునుండి వెళ్లి ఐరావతీనది ప్రవహించెడి పల్లపు ప్రదేశములలోను, తత్పరిసర ప్రాంతములలోను వలసలు ఏర్పరచుకొన్నట్లు వ్రాసియున్నాడు. ప్రాగాంధ్ర దేశమునకును, తూర్పు దేశములకును ద్వీపములకును రాకపోకలును, ప్రాయికముగ వర్తక వ్యాపారములును జరగుచుండె ననుటకు ఆధారము లున్నవి. పూర్వ చాళుక్యులలో చాళుక్యచంద్రుడను బిరుదుగల శక్తివర్మ యొక్కయు, అతని తమ్ముని కుమారుడైన రాజరాజనరేంద్రుని యొక్కయు బంగారు నాణెములు కొన్ని బర్మాదేశపు పశ్చిమతీరమున నున్న అరకాన్‌కు సమీపమునం దుండిన రామ్రి ద్వీపములో కానవచ్చినవి. ఇటువంటి నాణెములే అనేకము సియాము దేశమున గూడ కనబడినవి. సముద్రతీరస్థాంధ్ర దేశమును పాలించిన పూర్వచాళుక్య భూపతుల బంగారు వెండి నాణెములు తూర్పుననున్న పూర్వోక్త దేశములలో కానవచ్చుటచేత పూర్వమువలెనే వేంగీ చాళుక్య భూపతుల కాలములోగూడ ఆంధ్రదేశము ఇండో-చీనావరకు గల పూర్వదేశములతోను, ద్వీపములతోను వర్తక వ్యాపారములు జరపుచుండెనని నిశ్చయింప వచ్చును.



చిత్రము 78. రోమను చక్రవర్తుల నాణెములు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



రాజరాజ నరేంద్రుని తరువాత చాళుక్య నరేంద్రులు రాజధానిని ద్రవిడదేశమునకు మార్చిన యనంతరము మధ్యాంధ్ర (తీరస్థాంధ్ర) దేశ మంతయు సామంత మండలిక వంశజుల పరిపాలన క్రిందికి వచ్చినది. ఈ మండలిక వంశము లలో మొట్టమొదటిది శక్తి ప్రాభవములు గలదియు, చంద వోలు రాజధానిగ మధ్యాంధ్రదేశమును పాలించినదియు నగు వెలనాటి దుర్జయ వంశము. వెలనాటి దుర్జయ ప్రభృతి మండలికుల కాలములో సముద్ర వర్తక వ్యాపారము లు ఎట్లు సాగుచుండె డిదో తెలిసికొనుటకు మనకు ఆధారములు లేవు. కాని ఈ కాల మున ఘంటసాలలో కానవచ్చిన శాసన ములలో ఆ పట్ట ణము చోళపాండ్య పురమని పేర్కొన బడుటచేత అదిగొప్ప రేవుపట్టణముగా ఉండెననియు, ఇక్క డికి చోళపాండ్య దేశ ములనుండి వర్తక వ్యాపారస్థులు వర్త కము నిమిత్తము వచ్చెడివారనియు తెలియుచున్నది. ఈ రేవుపట్టణము నం దేమి, ఇతర రేవుపట్ట ణములందేమి మండ లికుల పరిపాలన కాలములో స్థానికాధికారుల ఒత్తిడివల్లను, నరకులపై ఎక్కువ సుంకము తీసి విదేశ వర్తకులను వారు బాధించుటవల్లను, సముద్రముమీద ఓడదొంగల భయమువల్లను సముద్రవర్తక మునకు దెబ్బ తగిలిన దనియు, విదేశవర్తకులు ఇక్కడి రేవు లకు వచ్చుట మానినారనియు చెప్పుటకు అవకాశ మున్నది.

ఓరుగల్లు రాజధానిగ పరిపాలనము నెరపిన కాకతి రాజన్యులకు మధ్యాంధ్రదేశము వశమయిన పిదపకాని, సముద్రవర్తక వ్యాపారములు మరల చక్కగ సాగలేదు. కాకతి గణపతిదేవ చక్రవర్తి మధ్యాంధ్రమును వశముచేసి కొన్న కాలమునకు ఘంటసాలప్రభ అడగిపోయి మోటు పల్లి గొప్ప రేవుపట్టణముగ పేరు పొందినది. కాని ఇతరము లైన రేవుపట్టణముల వలెనే ఈ రేవు పట్టణమును స్థానికాధి కారుల దుర్నయము వలనను, ఒత్తిడివలనను తుపాను సమయములలోను, ఇతర కాలముల లోను ఏ కారణ మునవైన ఓడలు ఈ ప్రాంతమున బద్దలు గుట తటస్థించినచో స్థానికాధికారులు వానిలోని సరకులను వశము చేసికొని సముద్రవర్తక వ్యా పారులకు అపారనష్ట ము కలుగజేయు చుండినందువలనను సముద్రవ్యాపారము నాశనమైనది. అప్పు డు కాకతి గణపతి దేవమహారాజు క్రీ.శ. 1244-45 వ సంవత్సర ములో సముద్రవర్త కముచేయు విదేశీయ సాంయాత్రికులకు పై నుడివినట్టి అక్రమ ములు, అన్యాయ ములు జరగవని ఒక అభయశాసనము వ్రాయించి యిచ్చె ను. ఈ శాసనములో ఎగుమతి దిగుమతి సరకులకు ఎంతెంత సుంకములు సుంకరులు వసూలు చేయ వలెనో కూడ మహారాజు నిర్ణయించెను. క్రీ. శ. 1245 లో కాకతి గణపతిదేవ మహారాజు ఇచ్చిన ఈ యభయశాసనము ఇప్పటికిని మోటుపల్లిలోని వీరభద్రేశ్వరాలయ స్తంభముల మీద చెక్కియున్నది. ఈ శాసనము వలన మోటుపల్లి రేవు మీదుగ తెలుగుదేశమునకు వచ్చుచుండినట్టియు, అచ్చటి నుండి అన్యదేశములకు కొనిపోబడుచుండినట్టియు వర్తకపు



చిత్రము 79. వీరభద్రేశ్వరాలయము, మోటుపల్లి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సరకు లేవో తెలిసికొనవచ్చును. మంచిగంధము, దేశీయ కర్పూరము, చీనా కర్పూరము, ముత్యములు, పన్నీరు, దంతము, పునుగు, కర్పూర తైలము, శాగి, తగరము, సీసము, పట్టునూలు, పగడములు, అత్తరులు, మిరియములు, పట్టుబట్టలు, పోకలు ఈ శాసనములో నుదాహృతమైన వర్తక ద్రవ్యములు. ఇవి మోటుపల్లి రేవులో దిగుమతి ఎగుమతి అగు వర్తకపు సరకులవి మనకు తెలియవచ్చు చున్నను అక్కడి వాని మొత్తము కాని, విలువ కాని మనకు తెలియదు. అంతే కాక ఈ రేవు పట్టణమునుండి విదేశములకు పోవు ఎగుమతి సరకు లేవో విదేశములనుండి తెలుగు దేశమునకు వచ్చెడి దిగుమతి సరకు లేవో కూడ వివరముగా తెలియదు.

ఈ కాకతి రాజన్యుల పరిపాలన కాలములోనే మార్కోపోలో అను వెనీషియను బాటసారి చీనాదేశమునుండి స్వదేశమునకు తిరిగి వెళ్లుచు క్రీ. శ. 1290 లో ఈ మోటుపల్లి రేవులో ఓడ దిగెను. ఆ నాటికికూడ తీరస్థాంధ్రదేశమున నూలుతో నేసిన సన్నని బట్టలు ప్రశస్తమైనవి తయారగుచునే యుండెను. ఇచట తయారైన రవసెల్లాలు చాల అందమైనవనియు, ప్రపంచమంతటిలోను శ్రేష్ఠమైన వనియు, సన్నవైనవనియు అయినను, చాల ఖరీదయిన వనియు మార్కోపోలో వ్రాసినాడు.



చిత్రము 80. జోంగు అను చీనా ఓడ

సాలీని దారముతో నేసినంత సన్నగ ఉల్లిపొరవలెనుండు వనియు, గొప్ప మహారాజులును, మహారాణులును వారి కీవికి అనుగుణముగ ధరించుటకు తగినవై చాల నాణెముగ నుండు ననియు అతడు చెప్పినాడు. అందువలన ప్రాయికముగ ఇక్కడినుండి ఎగుమతి యగుచుండిన ముఖ్యమైన సరకులలో మాలుబట్టలు, రవసెల్లాలు — ఒకటి యని నిర్ణయించ వచ్చును.

కాకతీయులకు పిదప సముద్రతీరస్థ ప్రాంతమున క్రీ. శ. 1324-25 లో అద్దంకి రాజధానిగా రెడ్డిరాజ్య మేర్పడు వరకును అరాజక కాలమని చెప్పవచ్చును. ఈ కాలములో మరల స్థానికాధికారుల, స్థానిక ప్రభువుల దుర్నయము వలనను, హింసవలనను మోటుపల్లి సముద్ర వర్తక వ్యాపారములకు భంగము కలిగినది. మోటుపల్లిని జయించి రెడ్డి రాజ్యస్థాపకుడైన ప్రోలయవేమారెడ్డి కిచ్చినవాడు అతని కనిష్ఠ సోదరుడైన మల్లారెడ్డి. ప్రోలయ వేమారెడ్డి కుమారుడైన అనవోతారెడ్డి రాజ్యమున శాంతి భద్రతలు నెలకొల్పిన తరువాత సముద్ర వర్తక వ్యాపారములను అభివృద్ధిచేయుటకు పూనుకొనెను. మోటుపల్లికి వచ్చుచుండిన సముద్ర వర్తకవ్యాపారుల యిబ్బందులను, కష్టములను, నష్టములను విచారించి వారి బాధలను తొలగించుచు అక్కడ ఒక శిలా శాసనమును తమిళ, ఆంధ్ర భాషలలో వ్రాయించెను. ఆ శాసనమువల్ల మోటుపల్లి రేవులో విదేశవర్తకులు పడుచుండిన కష్టములును, బాధలును తెలియగలవు. ఇదికూడ కాకతిగణపతి దేవ మహారాజు సాంయాత్రికులకు ఇచ్చిన అభయశాసనము వంటిదే. ఇందులో ఈ రేవునుండి ఉత్తరమునకు దక్షిణమునకు ఎగుమతి యగు సరకు మీదను, విదేశ ద్వీపములకు ఎగుమతి యగు సరకు మీదను తీయవలసిన సుంకములుగూడ నిర్ణీతమైనవి. ఇక్కడినుండి ఎగుమతి యగు సరకు దక్షిణమునకు గాని, ఉత్తరమునకుగాని ముఖ్యముగ బట్టలే. అంతే కాదు; ప్రాగ్ద్వీపములకు ఎగుమతి యగు సరకుకూడ బట్టలే. ప్రాగ్ద్వీపము లనునవి తూర్పున నుండెడు సుగంధ ద్రవ్యోత్పత్తికి పేరుపడిన జావా, సుమత్రా మొదలైన ద్వీపములు. దీని వలన మనదేశము క్రీస్తుశకారంభ శతాబ్దములనుండి పదునాలుగవ శతాబ్దమువరకు నూలుబట్టలకు ప్రసిద్ధికెక్కిన దనియు, అవియే మనదేశములో ఎక్కువగ తయారగుచుండెననియు తెలియుచున్నది. కాని కాకతీయుల కాలములో వలెనే రెడ్డిరాజుల కాలములోకూడ మోటుపల్లికి వచ్చునట్టి సరకుగాని, అచటినుండి వెళ్లెడు సరకుగాని, ఏదేది ఎంతెంత ఉండెడిదో, దాని విలువ ఎంతయోకూడ తెలియదు. రెడ్డి రాజ్యము చివరికాలము వరకు కూడ మోటుపల్లి గొప్ప వర్తకస్థలముగ నుండెడి దనియు ఇక్కడికి ఓడలు దూరస్థ దేశములనుండియు, ద్వీపముల నుండియు వచ్చెడి వనియు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తెలియుచున్నది. ఈ మోటుపల్లిలోనే విజయనగరాధీశ్వరులైన రెండవ హరిహర దేవరాయల కుమారుడు మొదటి దేవరాయల శాసన మున్నది. అదికూడ ఇక్కడ ఎగుమతి దిగుమతి సరకులకు సుంకములను నిర్ణయించుచు వ్రాయించినదే. ఇక్కడి ఎగుమతి సరకులలో తోపు వస్త్రములు, పొన్నూరి వెల్ల పచ్చడములు ప్రధానమైనవి. తోపు వస్త్రములు ఈప్రాంతమున నేసి రంగువేసినవే. క్రీ.శ. 1890 ప్రాంతమున గుంటూరు జిల్లాలోని పొన్నూరు వెల్లపచ్చడములకు ప్రసిద్ధి నంది యుండినట్లు ఈ శాసనమువల్ల తెలియుచున్నది.

కొండవీటి రెడ్డిరాజయిన అనవోతారెడ్డి ఓడ వ్యాపారము చేయు వర్తకులకు ఇబ్బందులను తొలగించి మోటుపల్లిలో అభయశాసనము వేయించినప్పటినుండియు సముద్ర వర్తకము మిక్కిలి విరివిగ సాగినది. తెలుగు దేశపు వర్తకులు సముద్రమునకు అవ్వలి తూర్పు దేశములకును, ద్వీపములకును సబురులు చేసి సరకులను తెచ్చువారు. రెడ్డి యుగములో కొండవీటి రెడ్డిమన్నీలు వసంతోత్సవమును అతివైభవముగ జరపువారు. ఈ వసంతోత్సవమునకు కావలసిన అగరు, చందనము, కర్పూరము మొదలైన సరకు లన్నియు ద్వీపాంతరములనుండియు, అన్యదేశములనుండియు తెలుగు దేశమునకు ఓడలలో వచ్చెడివి. క్రీ. శ. పదునైదవ శతాబ్దములో ఈ సముద్ర వర్తకవ్యాపారము లెంత బాగుగ సాగుచు వచ్చినవో శ్రీనాథుడు తన హరవిలాసములో అవచి కుటుంబమును వర్ణించిన వర్ణనవలన తెలిసికొనవచ్చును. ఆ హరవిలాసమను తెలుగు కావ్యము వలన మన దేశమునకు చీనానుండి చీనాంబరములును (పట్టు బట్టలు), సింహళమునుండి ఏనుగులును రత్నాంకురములును, పంజారనుండి కర్పూరపాదపములును, జలనోగినుండి బంగారు మొలకలును, హురుమంజినుండి తేజీ గుర్రములును, గోవానుండి సంకుమద ద్రవమును, యాపగనుండి కట్టాణి ముత్యములును, భోటదేశమునుండి కస్తూరియు, తరుణాసీరి (తెన్నస్సరి) తవాయి గోవరమచ్చా స్థానములనుండి చందనము, అగరు, కర్పూరము, హిమాంబువు, కస్తూరి, కుంకుమ రజములును వచ్చుచుండెనని తెలియుచున్నది. పై నుడివిన వానిలో భోటదేశము ఇప్పటి భూటాన్. పంజార సుమత్రాలోని పన్సారు పట్టణము. జలనోగి ఎక్కడిదో తెలియదు. హురుమంజి పెర్షియా సింధు శాఖమీద ఉన్న అ(హో)ర్మజ్; గోవా ఇప్పటి పోర్చుగీసు గోవాయే. యాపగ అన్నది యాల్పాణపు వికృతి. యాల్పాణము ఇప్పటి జాఫ్నా.

క్రీ. శ. పదునారవ శతాబ్దము మొదలుకొని విదేశములనుండి ఈ దేశమునకు వచ్చిన యూరోపియనుల వృత్తాంతములవలన మన రేవులను గురించి, వర్తకమును గురించి మరికొంచె మెక్కువగ తెలిసికొనుటకు వీలగుచున్నది. పదునారవ శతాబ్దము ప్రారంభకాలమునాటికి ఏ కారణముచేతనో మోటుపల్లి (గొప్ప వర్తక వ్యాపార స్థలముగ) క్షీణించినది. ఆనాటినుండియు తీరస్థ దేశములో గొప్ప వర్తక స్థలమని పేరువడినది పులికాటు. ఇది ఇప్పుడు చెంగల్పట్టు జిల్లా పొన్నేరి తాలూకాలో ఉన్నది. ఆకాలములో ఇది తెలుగు రాజ్యములోనే, తెలుగు రాజుల క్రిందనే యుండెను. ఇది యానాడు తూర్పు సముద్ర తీరమున విజయనగర రాజ్యపు టుత్తర భాగమునకు ముఖ్యమైన రేవు పట్టణము. విదేశములనుండి వచ్చు సరకులకు ఇది గొప్ప వర్తకస్థలము. విజయనగరము మహావైభవ మనుభవించుచుండిన కాలములో క్రిస్తుశకము పదునైదు, పదునారు శతాబ్దములనుండి యూరోపియను యాత్రికులు మన దేశమునకు ఎక్కువగ రా నారంభించినారు. వారు వచ్చునప్పటికి విజయనగర సామ్రాజ్యమును సాళువ నరసింగరాయలు పరిపాలించుచుండుటచేత వారు దానిని 'నరసింగరాజ్యము' - 'ది కింగ్ డమ్ అఫ్ నరసింగ' అని వ్యవహరించుచు వచ్చినారు. వారు దక్షిణ హిందూదేశమునకు వచ్చి ఇక్కడి సాంఘిక, రాజకీయ, వాణిజ్యాది విషయములను గురించి వ్రాయుచు వచ్చిరి. అట్టివారిలో క్రీ. శ. 1504 మొదలు క్రీ. శ. 1505 ప్రాంతముల తెలుగుదేశములో సంచరించుచుండిన 'వర్తిమా' అను ఇటాలియను యాత్రికుడు ఇక్కడ అపరిమితమైన వర్తక వ్యాపారము జరగుచుండె ననియు, ముఖ్యముగ సింహళమునుండియు, బర్మాదేశములోని పెగునుండియు ఆభరణము లచ్చటికి వచ్చుచుండిన వనియు వ్రాసియున్నాడు. ఈ రేవు పట్టణములో గొప్ప మూరు (తురక)వర్తకులు అన్ని తెగలకు చెందినవారును ఉండి రనియు, హిందూదేశములో దొరకు ప్రతి వస్తువును ఈ రాజ్యములో సమృద్ధిగ దొరకు ననియు కూడ అతడు వ్రాసినాడు.

ఈ శతాబ్దిలోనే ఈ తీరస్థాంధ్ర దేశమును గురించి వ్రాసిన మరొక యాత్రికుడు 'డ్వార్తి బర్బోస'. మలబారునుండి ఈ చోళ(కోర)మండల తీరమునకు ప్రతి సంవత్సరము చాల ఓడలు - వానిలో ననేకము - విశేష లాభము గడించుటకొరకు బియ్యమును కొని వచ్చుచుండె ననియు, అవి వచ్చునప్పుడు కంబాయనుండి అపరిమితమగు సరకులను - రాగి, పాదరసము, సిందూరము, మిరియములు ఇతరవిధమగు వస్తువులు-తెచ్చుచుండు ననియు బర్బోస వ్రాసినాడు. ఈరేవు పట్టణములలో చాలమంది మూరులు ఈదేశపువారే ఉండెడివారట. వారికి ఓడలు అనేక ముండెడివట.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



బర్బోస కాలములోకూడ పులికాటు మిక్కిలి గొప్ప వర్తకస్థలమై యుండెను. మోటుపల్లి పడిపోయినప్పటి నుండియు పులికాటు విజయనగరమునకు ముఖ్యమైన రేవుపట్టణ మయినది. ఈ రేవుపట్టణములో ఈకాలములో వెనుకటివలెనే హిందూ, మూరు వర్తకులు గొప్పవా రనేకులు నివసించుచుండిరి. రకరకములయిన సరకులు వేసికొని అసంఖ్యాకులైన మూరులు తమ ఓడలలో వచ్చెడివారు. విజయనగర సామ్రాజ్యములో భూమార్గమున వర్తకము సాగించెడి వర్తకులు ఇక్కడికి వచ్చి సరకులను కొనుగోలు చేసి కొనిపోయెడివారు. నగలు చేయుటకు ఉపయుక్తమైన మాణిక్యములు, మణులు మొదలయిన ఖనిజములును, విస్తారముగ కస్తూరియు బర్మాలోని పెగూనుండి వచ్చెడివి. మణుల పరీక్షయు, బేరము తెలిసినవారికి అవి ఇక్కడ చాల చౌకగ దొరకు ననియు బర్బోస వ్రాసినాడు.

ఇక్కడ అద్దకము వేసిన నూలు బట్టలు అతి విస్తారముగ దొరకెడివి. వీనికి మలాకాలోను, పెగులోను సుమత్రలోను, గుజరాతు రాజ్యములోను గిరాకి ఎక్కువ. వర్తకులు ఈ బట్టల నిక్కడ చౌకధరలకు కొని అక్కడ ఎక్కువ ధరలకు అమ్మెడివారు. రాగి పాదరసము సిందూరము, ఇతరములైన కంబాయ సరకులును, సూత్ర రంజక ద్రవ్యములును (డైస్-ఇన్-గ్రైన్), మెక్కా మొకముల్ (మెక్కా వెల్వెట్స్), ముఖ్యముగ పన్నీరు — మున్నగు వస్తువు లన్నియు ఇక్కడికి చేరెడివి. ఇక్కడినుండి పెగుకు పులికాటు బట్టలు — నూలువిగాని, పట్టువిగాని (పట్టువానిని పటోలాలు - పటోలాస్ అందురు) ఎగుమతి అయ్యెడివి.

ఈ కాలములోనే విజయనగర సామ్రాజ్యమును చూడ వచ్చిన మరొక యాత్రికుడు 'టామ్ పైరస్'. ఇతడు ఈ సముద్ర తీరస్థ ప్రాంతమునకు వచ్చినది క్రీ. శ. 1510 ప్రాంతములో. తనోర్ క్విలన్ ప్రాంతములకు, మలబారుకు కళింగ దేశమునుండి బియ్యము ఎగుమతి అయ్యెడి దనియు, మూరులును కళింగులును సాధారణముగ తలపాగల కుపయోగపడు తెల్లటి నూలుబట్ట, బీతిల్హాస్ అను పేరుగల రంగులబట్ట ఈ రెండు రకములయిన బట్టలును దక్కను దేశములో విస్తారముగ తయారయ్యెడి వనియు పైరస్ వ్రాసినాడు.

పోర్చుగీసువారిని మన పూర్వులు పురతకీసులు అని వ్యవహరించుచు వచ్చినారు. పురతకీసులను పదము జన వ్యవహారములో ఇంకను వికృతిపొంది బుడతకీచులయినది. పోర్చుగీసువారి తరువాత డచ్చివారును, ఫ్రెంచివారును, ఇంగ్లీషువారును ఈ దేశమునకు వర్తక వ్యాపారము నిమిత్తము వచ్చినారు. హాలండు దేశీయులను ఇతర దేశస్థులు డచ్చివారని వ్యవహరింతురు. మన పూర్వులు వారిని ఉలందులని పేర్కొనువారు. ఉలం దన్నది హాలండు శబ్దమునకు వికృతి. జన వ్యవహారములో ఉలందు వలందగ మారినది. పశ్చిమ గోదావరిజిల్లా నరసాపురములో వలందావారి గిడ్డంగి యొక్కటి యుండెడిది. ఆ గిడ్డంగి యిప్పుడు లేకపోయినను వలందావారి రేవన్న పేరు అక్కడి గోదావరిస్నాన ఘట్టములలో ఒకదానికి ఇప్పటికిని వాడుకలో ఉన్నది. ఫ్రాంసువారికి పరాంసులని వ్యవహారము. అదే జన వ్యవహారములో పరాసులని యైనది. ఇంగ్లీషువారిని మన పూర్వులు ఆంగ్లేయులని వ్యవహరించినారు. మొత్తముమీద విదేశాలనుండి వచ్చిన ఈ యూరోపియనులను సామాన్యముగ పరంగీలని వ్యవహరించువారు.

క్రమముగా మన దేశమునకు వర్తక వ్యాపారముల నిమిత్తము వచ్చుచుండిన యూరోపియనుల సంఖ్య బాగుగ పెరిగినది. ఈ యూరోపియనులవి వర్తకపు కంపెనీ లేర్పడినవి. అప్పటినుండి తూర్పు సముద్ర తీరమునను బంగాళాఖాతములో ఓడ ప్రయాణము చేసిన యాత్రికులుగాని, వర్తకులుగాని, వేరు వేరు యూరోపియను కంపెనీలకు చెందినవారు. కాని సాధారణముగ అందరును, అథవా కొంద రైనను అంతో ఇంతో తెలుగుదేశములోని రేవుపట్టణములను గురించియు అక్కడ సాగుచు వచ్చిన వర్తక వ్యాపారములను గురించియు వ్రాసినవారే. ఆ కాలములో యూరోపియను వర్తకులు మన దేశమునకు నూలుబట్టల వ్యాపారము నిమిత్తమును, రంగు దినుసుల వ్యాపారము నిమిత్తమును వచ్చి నూలుబట్టల పరిశ్రమకు ప్రసిద్ధికెక్కిన ప్రాంతములలో నున్న రేవు పట్టణములలో గిడ్డంగులు కట్టుకొన్నారు. అందువల్ల అంతకు పూర్వము వర్తక వ్యాపారములు బాగుగ సాగని అనామకపు రేవులుకూడ క్రీ. శ. పదునేడు పదునెనిమిది శతాబ్దములలో పేర్కొనదగిన రేవులుగ పరిగణింపబడినవి. ఈ కాలములో బాగుగ ప్రసిద్ధములైన రేవుపట్టణములు ఇవి: పులికాటు, పెద్దపల్లి (నిజాంపట్టణము), మచిలీపట్టణమను బందరు, మాధవాయపాలెము, నరసాపురము, కోరంగి, జగన్నాథపురము (కాకినాడ), విశాఖపట్టణము, భీముని పట్టణము, కళింగపట్టణము.

క్రీ.శ. 1616 ప్రాంతమున మన దేశపు తీరమునసే ప్రయాణముచేసిన స్కోరర్ అను హాలండు దేశీయుడు పులికాటు, నిజాంపట్టణము, మచిలీపట్టణములను గురించి వ్రాసిన వృత్తాంతములవల్ల అనేక విషయములు తెలియుచున్నవి. పులికాటులో రకరకముల నూలుబట్టలు నేతవి, కలంకారి అద్దకపు బట్టలు దొరకును. ఇవి ఈ సముద్రతీరమున ఉన్న ఇతర స్థలములలోని బట్టలకంటె, ముఖ్యముగ కలంకారి అద్దకపు బట్టలు చాల నాణెమైనవి. ఎరుపు రంగు వేయుట



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కవసరమైన శ్రేష్ఠమగు చిరువేరు ఈ రేవుపట్టణ ప్రాంతములోనే దొరుకును. పచ్చరంగు వేయుటలో ఉపయోగించెడు కొన్ని చెట్ల ఆకులు కూడ లభించునని అతడు వ్రాసినాడు.

పెద్దపల్లి రేవునకు అతని కాలములో డచ్చివారి ఓడలు, ఇంగ్లీషువారి ఓడలు తప్ప ఇతరుల నౌకలు ఏవియు వచ్చెడివి కావట. 'ఇక్కడకూడ అన్ని రకములైన బట్టలను నేయుదురు. కలంకారి అద్దకములుకూడ వేయుదురు. ఇక్కడ తయారుచేసెడు ఎరుపు రంగు చాల బాగుగ నుండును. నదిమధ్య ఒక లంక యున్నది. చోళమండల తీరమున దొరకు చాయరంగు అంతటిలోను ఇక్కడిది శ్రేష్ఠమైనది' అని అతడు వ్రాసినాడు.

ప్రాగాంధ్రతీర మంతటిలోను మచిలీపట్టణము వంటి సుప్రసిద్ధమైన వర్తకనగర మింకొకటి లేదు. ప్రతియేడును ఓడలు బెంగాలు తీరమునకు, ఆరకాను, పెగు, తెన్నెస్సరీలకు ఇక్కడినుండి నూలు (వెల్లగాని, తోపుగాని), అన్ని రకములయిన నూలు బట్టలు, గాజు, ఇనుము, పొగాకు, (బెంగాలు ఆరకాను దేశములలో ద్రవ్యముగా వాడుకొను) గవ్వలు తీసికొని వెళ్లునని స్కోరరు వ్రాసినాడు. ఇక్కడి ఓడలు అచిన్, ప్రియమన్ (సుమత్రలోనిది), క్వెడా (మలే ద్వీపకల్పములోనిది), ఫరే (మలే ద్వీపకల్పములోని పేరక్)లకు కూడ అన్ని రకములయిన కలంకారి అద్దకపు బట్టలును, బియ్యమును తీసికొనివెళ్ళి అక్కడినుండి గంధకము, కర్పూరము, పట్టు, తగరము, గుజరాతు బట్టలు, మిరియాలు, పింగాణి మున్నగువానిని తీసికొని వచ్చెడివి. మచిలీపట్టణమునుండి ఓడలు ఏ ప్రాంతములకు వెళ్ళినను ఇక్కడినుండి ఆ ప్రాంతములకు అవి తీసికొనిపోవు ముఖ్యమైన సరకు నూలు బట్టలే. ఇక్కడ ఉత్పత్తి అయ్యెడి, లేక తయారయ్యెడి సరకులు పలురకముల నూలు బట్టలు (అద్దకాలు, సాదా బట్టలు), నూలు, ఇనుము, ఉక్కు, నీలిమందు. శ్రేష్ఠమైన నీలిమందు అంతర్దేశములో ఉన్న నాగులవంచలో తయారగుచున్న దనియు, 12 మణుగుల ఖరీదు 28, 39 వరహాల (పెగోడాస్) వరకు ఉండు ననియు స్కోరరు వ్రాసినాడు. ఇన్ని విషయములు తెలిపినను ఈ రేవునుండి ఎగుమతియగు సరకుల మొత్తము గాని, దాని విలువగాని అతడు తెలుపలేదు.




క్రీ. శ. 1611 జనవరిలో ఈస్ట్ ఇండియా కంపెనీ డైరెక్టరులు చోళమండల తీరపు జనులతో వర్తకమును ప్రారంభించుటకు గ్లోబ్ అను ఓడలో కప్తాను 'హిప్పన్'ను పంపిరి. ఆ ఓడ పులికాటుకుపిదప, అక్కడినుండి మచిలీపట్టణమునకును వెళ్ళి అక్కడి నూలుబట్టలను, ఇతర విధములైన



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సన్నని వస్త్రములను ఎగుమతి చేసికొని అక్కడినుండి బంటం, సియాములకు వెళ్ళిపోయినది.

యూరోపియనుల ఓడలు యూరపుతో మాత్రమే వర్తకము సాగింపలేదు. మచిలీపట్టణపు సరకును సుమత్రలోను, సుగంధద్రవ్య ద్వీపములలోను అమ్ముటకూడ లాభకరమైన వ్యాపారముగ నుండెడిది. ఇది ఎంతటి లాభదాయకముగా ఉండెనో ఈ క్రింది విషయమునుబట్టి తెలిసికొనవచ్చును. క్రి. శ. 1627 లో బటేవియా కౌన్సిలువారు మచిలీపట్టణపు బట్ట కొని ప్రాగ్ద్వీపములలో దానిని బంగారము, కర్పూరము, సుగంధ ద్రవ్యములకు వినిమయము చేయుటకుగాను అక్కడికి ఏటేట 8,00,000 ల రియల్సు సొమ్ము పంపవలెనని సిఫార్సు చేసినారు (రియల్ అనునది ఆనాటి ఒక దచ్చి వెండినాణెము).

విలియం మిథోల్డ్ కూడ పదునేడవ శతాబ్దములో ఇక్కడికి వచ్చినవాడే. అతడు ఇట్లు వ్రాయు చున్నాడు: 'గోల్కొండ వర్తకులు మోకాతోను, సుమత్రాలోని అచిన్‌తోను, బర్మాలోని అరకాన్ పెగూలతోను, మలయా ద్వీపకల్పములోని తెన్నెస్సరీతోను ఓడవర్తకము చేయుచున్నారు. తెన్నెస్సరీకి వారు ఎరుపురంగు నూలు, ఎరుపు తెలుపు ఛీథిల్సు, (ఆ దేశమువారు ధరించుట కుచితమైన) రకరకముల అద్దకములు తీసికొని వెళ్లి అక్కడ ఖర్చయినవి పోను మిగిలిన వానిని అక్కడికి పదునాల్గు దినముల ప్రయాణములో నున్న సియాందేశమునకు భూమార్గమున గొనిపోవువారు. అక్కడినుండి వారు అన్ని రకములయిన చీనా సరకులను — పింగాణి, సేటిన్ (ఒక విధమైన పట్టుబట్ట), దమస్కులు (దమస్క్ అనునది నారతోను, పట్టుతోను, నూలు లేక ఉన్నితోను వేరు వేరు నమూనాలలో నేసిన ఉల్టా సీదాలు లేనిబట్ట), నాన్‌కినులు (నాన్‌కిన్ పట్టణములో నేయుచుండిన నూలు బట్టలు), పట్టు, అగరుచెక్క, తగరము, రక్తచందనము మొదలగు వానిని కొనివత్తురు'. మన దేశమునకు పదునేడవ శతాబ్దిలో వచ్చిన థామస్ బౌరీ, టెవర్నియర్ మొదలైన విదేశయాత్రికులు నూలుబట్టల పరిశ్రమకు సముద్రతీరస్థ ఆంధ్రము ప్రసిద్ధి కెక్కిన దనియు, నూలుబట్టలు అద్దకములు మల్లు సెల్లాలు ఎఱ్ఱరంగు నూలు మొదలైనవి ఇక్కడినుండి ఎగుమతి యగుచుండెడి వనియు, ఇక్కడినుండి రకరకములయిన కలంకారి అద్దకములు, నూలు బట్టలు తూర్పు ద్వీపములకు ఎగుమతి యగు ననియు వ్రాసియున్నారు.

పదునెనిమిదవ శతాబ్దిలో నరసాపురము ప్రఖ్యాతమైన రేవు. ఇక్కడ మచిలీపట్టణములో వేయు చీటి అద్దకములకు వలసిన తెల్లబట్ట తయారయ్యెడిది. ఇక్కడ గృహ, నౌకా నిర్మాణములకు అనుకూలమైన మంచి టేకు కలప దొరకెడిది.

నరసాపురము తరువాత కోరంగిఅఖాతము దాటిన వెంటనే వచ్చు మొదటిరేవు ఇంజరము. హిందూదేశములో తయారగు తెల్లబట్టల తానులలో చాల ప్రశస్తమైనవియు, శ్రేష్ఠమైనవియు ఇక్కడ తయారయ్యెడివి. వీనిని చవుక ధరలకు అమ్ముదురు. కాని ఈ ప్రాంతములను పాలించు రాజులు భూమార్గమున తమ సంస్థానములోనికి వచ్చునట్టి బట్టలమీద పన్ను వేసి బట్ట తెచ్చెడి వారివద్దనుండి ఏదో పేరు పెట్టి డబ్బు లాగి ఇంజరమునకు లాభకారిగనుండు ఈ వ్యాపారము చెడగొట్టుచున్నారని సముద్రముమీద తీరము వెంబడి నౌకాయానము చేసిన విదేశీయులు వ్రాయుచున్నారు.

మచిలీపట్టణమునకు, విశాఖ పట్టణమునకు నడుమ నరసాపురము, ఇంజరము మాత్రముకాక పెక్కు చిన్న రేవులు కలవు. వానిలో వాత్రా (వాతాద, వాడరేవు) పేరు కెక్కినది. ఇక్కడినుండి తెల్ల తానులు (లాంగ్ క్లాత్) మాత్రమే కాక బియ్యముకూడ ఎగుమతి యగుచుండెను. సాధారణముగ యూరోపియనులు ఈ రేవులో దిగెడువారు కారు.

విశాఖపట్టణము చుట్టుప్రక్కల నూలు బట్టలు ముతకవి, సన్నవియే కాక హిందూదేశమంతటిలోను ఉత్తమమైన డోరియాలు(చారలవి, గళ్ళవి). మల్లుసెల్లాలు తయారయ్యెడివి.

భీముని పట్టణము విశాఖపట్టణమునకు ఈశాన్య దిశయందు పదునారు మైళ్ళ (నాలుగు లీగుల) దూరమున ఉన్న మరొకరేవు. దీని చుట్టుపట్ల నూలుబట్ట ముతకది, సన్ననిది కూడ నేయువారు.

క్రి. శ. పదునెనిమిదవ శతాబ్దము చివరిపాదములో (క్రి. శ. 1784) ఉత్తర సర్కారులను సర్వే చేసిన జేమ్స్ గ్రాంట్ యొక్క నివేదికవలన మనకు ఈ క్రింది సంగతులు తెలియుచున్నవి:

'ఈ సర్కారులలో పండెడు ప్రత్తివల్ల రెండు రకముల బట్ట నాణెమైనది తయారగును. విదేశములలో అమూల్యమని గణుతికెక్కి యమ్ముడు పోయెడి తెల్ల తానులు (ప్లేన్, లాంగ్ క్లాత్) ముఖ్యముగ తూర్పు గోదావరి జిల్లా నగరములోను, తత్పరిసర ప్రాంతములోను తయారగును. ఇది యూరోపుఖండములో శ్రేష్ఠతమమని పరిగణింపబడు అద్దకపు బట్టను మచిలీపట్టణము జిల్లాలో పాలంపోరులని ప్రఖ్యాతినంది యనుకరణ దుస్సాధ్యమయిన కలంకారి యద్దకపు బట్టను తయారుచేయుటకు వినియుక్తమగుచున్నది. గోదావరి నదికి ఉత్తర, దక్షిణ తట ప్రాంతముల తయారగు ముతక బట్టలకును, రంగు వేసిన చాయబట్టలకును విదేశములలోను, దేశములోపలను



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అధికమైన గిరాకి కలదు. ఇవిగాక ఉత్తర సర్కారులలోని శ్రీకాకుళము మల్లుసెల్లాలకును, ఏలూరు తివాసీలకును, జెహాపురము (?) బరంపురపు పట్టుబట్టలకును ప్రసిద్ధికెక్కినవి. ఈ పట్టు బట్టలునేయుటకు వలసిన పట్టు బంగాళము నుండియు, చీనాదేశము నుండియు దిగుమతి యగుచున్నది. పై నుడివిన రకముల వస్త్రములు వాని నాణెమును, గుణమును చూచి మోజుపడి ప్రోత్సాహపెట్టి నేయింపవలసినవే కాని విస్తారము లాభకరము కాకపోవుటచే వ్యాపార సరళిలో తయారు చేయించుటకు దగినవికావు.

'గోదావరి ముఖద్వారమున ఉన్న కోరంగి నరసాపురములలో ఐదువందల టన్నులకు మించని బరువు మోయగల ఓడలను, యుద్ధపు టోడలను కట్టుదురు. సాధారణముగ కట్టుచున్న వానికంటెను ఇంకను చాల పెద్దవానిని గూడ కట్టుటకు అవకాశము గలదు. సముద్రతీర వర్తక వ్యాపారమున కుపయోగించెడు పడవలు, దోనెలు, ఓడలు మొత్తముమీద పదివేల టన్నుల భారమును మోయగలవి అక్కడ తయారగుచున్నవి.

'ఈ యుత్తర సర్కారులలో స్వతస్సిద్ధముగ ఉత్పత్తి యగు ముడిసరకునుండి తయారగు వివిధములయిన సరకులతో జరగెడి వ్యాపారమును మూడు రకములుగ విభజింపవచ్చును. ఇక్కడినుండి యూరోపుదేశములతో జరగెడు వ్యాపారము; ఇరుగుపొరుగుల నున్న హిందూదేశపు రేవులతో జరగెడు వ్యాపారము; దక్కనులో అంతర్భాగముననున్న రాజ్యములతోను, దేశములతోను జరగెడు వ్యాపారము. ఈ తీరమున గిడ్డంగులను కట్టుకొనియున్న యూరోపియను జాతులవారు ఎగుమతి చేయునటువంటి వర్తకవ్యాపారము యొక్క కిమ్మతు మొత్తముమీద ముప్పదిలక్షల రూపాయల వరకు నుండును. రెండవది దాదాపు పూర్తిగ మద్రాసుతోనే జరగెడు కోస్తా వ్యాపారము. ఇది ధాన్యవ్యాపారము. సాలీనా అయిదులక్షల బస్తాలు ఎగుమతి యగును. దీని విలువ ఇరువదియైదు లక్షల రూపాయలు. తూర్పుదేశములకు, ద్వీపములకు ఎగుమతి చేయు ముతకబట్ట వ్యాపారము యొక్క విలువ పదిలక్షలు. హిందూదేశమునందలి ఇతర ప్రాంతములతో జరగెడి ఉప్పు, బట్టల (తానులు) వర్తకవ్యాపారముల వెల పది లక్షలు.'

మొత్తముమీద ఈ సర్కారులలో ఏటేట జరగుచుండిన ఎగుమతి వర్తకవ్యాపారముల కిమ్మతు క్రీ.శ. 1784 ప్రాంతమున డెబ్బదియైదు లక్షల రూపాయలని తెలియుచున్నది.

సర్కారులకు కర్నాటక ధాన్యాగారమని పేరు వచ్చినది. కర్నాటకమనుపేరికాలమున పూర్వము విజయనగర సామ్రాజ్యాంతర్గతమై యుండి కృష్ణవరకుగల తూర్పు కోస్తాదేశమునకును చెల్లుచుండినది. ముందరివలెనే తెలుగు దేశము సముద్రలవణ, ధాన్యోత్పత్తులకే కాక పొగాకునకును (శ్రేష్ఠతమమయినది మచిలీపట్టణ ప్రాంతమున పండెడిది), టేకునకును (పెద్ద పరిమాణము గల ఉత్తమమైన కలప ఇక్కడ దొరకును), వజ్రములకును (గుంటూరు, కొండపల్లెలలో దొరకును) ప్రసిద్ధికెక్కినది. ఈ సర్కారులలో తాటిచెట్లు, కొబ్బరిచెట్లు విస్తారమగుట చేత కోస్తా వ్యాపారమున కవసరమైన దోనెలు కట్టుటకు కావలసిన ముఖ్యసామగ్రి యిచ్చట అవారిగ లభించెడిది. ఈ దోనెలు ఒక్కొక్కటి అరువది టన్నులనుండి వంద టన్నులవరకు బరువును మోయగలవి. ఈ విషయములు పై నుడివిన నివేదికవలన తెలియ వచ్చుచున్నవి.

క్రీ. శ. పదునెనిమిదవ శతాబ్దము కడపటి పాదములో వలెనే పందొమ్మిదవ శతాబ్ది ప్రథమ పాదమునగూడ సముద్ర వర్తక వ్యాపారములు సాగుచుండెడివి. క్రీ.శ. 1802 నుండి క్రీ. శ. 1806 వ సంవత్సరము వరకు (ఆ రెండు సంవత్సరములను గలుపుకొని) మద్రాసునుండి ఉత్తర సర్కారులకు దిగుమతి అగుచువచ్చిన వర్తకపు సరకును, నగదును (సిక్కారూపాయలలో) ఈ క్రింది పట్టికలో చూపబడినది.

| | వర్తక వ్యాపారములు (సిక్కా రూ॥లు) | నగదు (సిక్కా రూ॥లు) | మొత్తము (సిక్కా రూ॥లు) |
|---|---|---|---|
| 1802 | 7,07,482 | 13,74,087 | 20,81,469 |
| 1803 | 5,59,948 | 2,71,487 | 8,31,438 |
| 1804 | 5,38,926 | 62,278 | 6,01,204 |
| 1805 | 4,79,440 | 1,11,704 | 5,91,144 |
| 1806 | 4,70,798 | 21,281 | 4,92,079 |
| మొత్తము | 27,56,544 | 18,40,787 | 45,97,331 |

ఉత్తర సర్కారులనుండి మద్రాసుకు ఎగుమతి అగుచు వచ్చిన వర్తకపు సరకును, నగదును సిక్కా రూపాయలలో ఈక్రింది పట్టికలో జూపబడినవి.

| | వర్తక వ్యాపారములు (సిక్కా రూ॥లు) | నగదు (సిక్కా రూ॥లు) | మొత్తము (సిక్కా రూ॥లు) |
|---|---|---|---|
| 1802 | 22,65,183 | 9,526 | 22,74,659 |
| 1803 | 29,73,782 | 8,028 | 29,81,810 |
| 1804 | 18,87,150 | 6,942 | 18,94,092 |
| 1805 | 24,95,214 | 65,350 | 25,60,564 |
| 1806 | 14,90,359 | 12,412 | 15,02,771 |
| మొత్తము | 1,11,11,688 | 1,02,258 | 1,12,13,896 |

మ. సో. శ.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/

# మతసంప్రదాయములు

ఇప్పుడు మనము మతము అని వ్యవహరించుదానిని పూర్వులు ధర్మమని, సమయమని వ్యవహరించియుండిరి. తెలుగుదేశములో పూర్వము ఎన్నో ధర్మ సంప్రదాయములు, సమయములు వ్యాపించినవి. ఇప్పటికిని క్రొత్తగా ఎన్నో నూతన సంప్రదాయములు వచ్చుచున్నవి, వ్యాపించుచున్నవి. తెలుగు దేశపు సంఘముమీదను, ఆచారవ్యవహారములమీదను, కళలమీదను ఈ ధర్మ సంప్రదాయముల ప్రభావము అపారమయినది. వేరు వేరు కాలములలో వేరు వేరు యుగములలో వ్యాప్తిలోనుండిన ఈ సమయ సంప్రదాయములు తెలుగుదేశపు జనుల జీవితమున కొక లక్ష్యమును చూపి, తల్లక్ష్యసాధన కనుగుణముగ వారి జీవితవిధానమును తీర్చి దిద్ది, దానిని వివిధ, విభిన్న ఆచార కర్మ బహుళము కావించినవి. అంతకు పూర్వము వ్యాప్తిలో నుండిన ఒక్కొక్క సమయము, ఒక్కొక్క ధర్మ సంప్రదాయము దేశములో అంతరించి పోయినను దానికి సంబంధించిన ఉత్తమ తాత్త్విక సత్యములును, ఆచార వ్యవహారములును ఏ కొద్దిగనో సంఘ హృదయములోను, సంఘాచరణములోను నిలిచిపోయి, తరువాత వర్ధిల్లుచు వచ్చిన ధర్మ సంప్రదాయ తత్త్వసూత్రములతోను, ఆచార వ్యవహారములతోను మేళనమునొందుచు వచ్చినవి. అందువల్ల నేటి మన సంఘమునందలి ఆచార వ్యవహారములు, కర్మలు, మన జాతి విశ్వసించు తాత్త్విక సత్యములు ప్రధానముగా ఇప్పుడు వ్యాప్తిలోనున్న ధర్మ సంప్రదాయములకు చెందినవి మాత్రమేకాక పూర్వము తెలుగు దేశములో ఒకప్పుడు వ్యాప్తిలోనుండి అంతరించిపోయిన సమయములకు చెందినవి సైతము కొద్దిగనో గొప్పగనో విడదీసి చూపుటకు వీలులేనంతగ వానిలో కలిసిపోయి యున్నవి. పూర్వపు ప్రతి ధర్మ సంప్రదాయ ప్రభావము నేటి మన జాతిమీద నున్నది. ప్రతి ధర్మ సంప్రదాయమును జాతి ఆధ్యాత్మిక వికాసమునకు తోడ్పడుచు వచ్చినది. అంతేకాక ప్రతి ధర్మ సంప్రదాయము శిల్ప, చిత్రలేఖనాది లలిత కళల పరిపోషణమునకు సహకారియై వాని వికాసమునకు హేతుభూతమయినది. తెలుగుదేశ సంస్కృతికి ఒకరూపమిచ్చినవి ఈ ధర్మసంప్రదాయములే.

తెలుగుదేశమున తొలుదొలుత వ్యాప్తమయినది వైదిక ధర్మ సంప్రదాయము. ఇది ఉత్తర హిందూస్థానమునుండి దక్షిణమున కృష్ణా గోదావరీనదీ ప్రాంతములకు వచ్చిన ఆర్య సంఘీయులతో వచ్చినది. చతుర్వేదములు, వేదాంగములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులు, దర్శనములు మొదలైన వైదిక వాఙ్మయ మంతయు ఆర్యులు ఉత్తర హిందూస్థానమునం దుండిన కాలములోనే పరిపూర్ణ వికాసమును పొందినది. ఆర్యజాతులవారు ఈ వాఙ్మయము నంతను తమతో కృష్ణా గోదావరీ ప్రాంతములకు తీసికొని వచ్చి తమ వైదిక ధర్మ సంప్రదాయమును ఇచట పాదుకొల్పి, దానికి సంబంధించిన వైదిక కర్మలను ఆచరించుచు తదనుగుణములైన ఆచార వ్యవహారములను అవలంబించుచు వచ్చిరి. ధర్మసూత్రములు రచింపబడిన సూత్రయుగమున ఆపస్తంబ మహర్షి నాటికి ఆంధ్రదేశములో బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రు లను చతుర్వర్ణములవారును ఉండిరి. మొదటి మూడు వర్ణములవారును వేదవిహితములైన క్రతు కర్మాదికములను ఆచరించుచుండిరి. దక్షిణాపథమునందు అప్పు డుండిన పరిస్థితులకు అనుగుణముగా ఆపస్తంబమహర్షి తన ధర్మసూత్రములను రచించెను. సంఘములోని నాలుగు వర్ణములవారును అవలంబింపవలసిన జీవన విధానమును, ఆచరింపవలసిన కర్మలను, నడచుకొనవలసిన పద్ధతిని ఆ మహర్షి తన సూత్రములలో వివరించెను. కాని వైదికాచార ధర్మములను ఆ కాలములో అవలంబించుచు వచ్చినవారు పరిమిత సంఖ్యాకులయిన త్రైవర్ణికులే — మొదటి మూడు కులములవారును. మిగిలినవారు త్రైవర్ణికులతో సన్నిహిత సంబంధము, సాహచర్యము కలిగియుండుటవలన ఆచార వ్యవహారములలోను, జీవన విధానమునందును వారిని క్రమముగా అనుకరించుచు వచ్చిరి. ఈ విధమున ఆర్యధర్మ ప్రభావము క్రమముగా ఆర్యేతరులమీద పడి ఆర్యజీవన పద్ధతులు వాడుకలోనికి వచ్చినవి. వైదిక ధర్మ మా తొలికాలమున ఆర్య సంఘీయులకే పరిమితమై వారిలోనే వ్యాప్తినొందెను. ఆపస్తంబులవారు దక్షిణాపథ వాస్తవ్యులని, ఆంధ్రులేయని కొందరు పరిశోధక పండితుల అభిప్రాయము. తెలుగు దేశములోని బ్రాహ్మణులలో అసంఖ్యాకులు ఆపస్తంబ సూత్రులే. వీరు వేద మంత్రములను పఠించుచు, వేదోక్త దేవతాప్రీత్యర్థము యజ్ఞయాగాదులను చేయుచు, నియమనిష్ఠాగరిష్ఠులై జీవితము గడపుచువచ్చిరి. ఇన్ని విషయములు తెలియవచ్చుచున్నను బౌద్ధయుగమునకు పూర్వపు మతచరిత్రమును గురించి మనకు ఎక్కువగ తెలియదు.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



# బౌద్ధము

తెలుగుదేశములోని ధర్మ సంప్రదాయము లన్నిటిలో ఎక్కువ జనాదరము పొందినట్లు తెలియవచ్చిన తొలు దొల్తటి ధర్మసంప్రదాయము బౌద్ధము. తెలుగుదేశములో బౌద్ధ మెప్పటినుంచి వ్యాపించెనో తెలియదు. కాని మౌర్య వంశజుడైన అశోకచక్రవర్తి పరిపాలన కాలము నాటికే అది యిక్కడ వ్యాపించియుండిన ట్లూహించుటకు అవకాశము కలదు. ఆంధ్ర దేశములోని అశ్మక, ముళక ములను కోసలదేశరాజధానియైన 'సావత్థి' (శ్రావస్తి)తో కలుపు వర్తక మార్గములు బుద్ధునినాటికే ఉండినట్లు బౌద్ధ వాఙ్మయమువలన తెలియుచున్నది. ప్రాయికముగా వాణిజ్యము చేయు బేహారులవలన బుద్ధుని గురించిన కథలు తొలుదొల్త దక్కను - ఆంధ్ర దేశములో వ్యాపించి యుండును. బౌద్ధ గ్రంథముల వలన దక్కను దేశవాసియైన నటు డొకడు బుద్ధునికి సమకాలికుడయిన బిందుసార మహీపతి సమక్షమున మహాబోధివరకు బుద్ధజీవితమును నాటకముగా రచియించి ప్రదర్శించె ననియు, దక్షిణాపథమునుండి వెళ్ళిన మరికొందరు నటులు కోశావతి నగరాధిపతి సమక్షమున బుద్ధ నాటకమును ప్రదర్శించి రనియు, తదితరులు బౌద్ధ భిక్షుల పాత్రములను ధరించి రనియు బౌద్ధ గ్రంథములు తెలుపుచున్నవి. దీని ననుసరించి చూచినచో బుద్ధుని కాలముననే అతని బోధలు యాత్రికుల, వర్తక వ్యాపారుల మూలమున దక్కనులోగూడ వ్యాపించి దక్షిణాపథ వాసులను అధికముగ ఆకర్షించి నట్లు విదితమగును.

బుద్ధుని జీవితకాలములో బుద్ధుని ధర్మబోధలును, బౌద్ధాచారములును గ్రంథస్థము కాలేదు. ఇందునిమిత్తమై బుద్ధుని మహాపరినిర్వాణమునకు పిదప వెంటనే రాజగృహమున ఒకటియు, అటుతర్వాత వంద సంవత్సరములకు వైశాలిలో ఒకటియు, రెండు మహాసభలు జరగినవి. బౌద్ధ ధర్మ, ఆచార (శిక్షా) నిర్ణయము నిమిత్తము జరగిన ఈ సభలకు మహా సంగీతులని పేరు. ఈ సంగీతులతోనే బౌద్ధుల యాచార వ్యవహారములును, బుద్ధుడు చెప్పిన ధర్మ



చిత్రము 81: బుద్ధుని జననము. నాగార్జునుని కొండ శిల్పము

బోధయు నిశ్చితమై గ్రంథస్థము కావింపబడినది. బౌద్ధుల ఆచార వ్యవహారములను(శిక్ష) గురించి తెలుపు గ్రంథమునకు 'వినయ' మనియు, బుద్ధప్రోక్త ధర్మమునకు 'సుత్త' మనియు పేరు. అటుతరువాత కొంతకాలమునకు బౌద్ధ వేదాంతమును తెలుపు 'అభిధమ్మ'ము వచ్చినది. హిందువులకు వేదము లెట్టివో బౌద్ధులకు 'వినయ', 'సుత్త', 'అభిధమ్మము' లట్టివి. ఇవి బౌద్ధుల వేద గ్రంథములు. వీనిని బౌద్ధు లొక్కొక్కదానిని ఒక్కొక్క పిటకమున (పేటికలో) పెట్టి కాపాడుకొనుచు వచ్చిరి. అందువలన వీనికి 'పిటకములు' లేక 'పిటక గ్రంథము'లని పేరు కలిగినది. వీనిని త్రిపిటకము లందురు. 'వినయ పిటక' 'సుత్త పిటక' 'అభిధమ్మ పిటక'ములలోని భాష పాళీ. ప్రాకృత భాషా గ్రాంథిక రూపము పాళీ.

రెండవ సంగీతిలో మహాస్థవిరులకు(వృద్ధులకు)ను, యువకులకును ఆచారముల విషయమునను, ధార్మిక విశ్వాసముల విషయమునను అభిప్రాయ భేదములు కలిగి బౌద్ధ సంఘము రెండు తెగలుగ విడిపోయినది. మహాస్థవిరపక్షము వారికి వ్యతిరేకు లయినవారు ఆ సభలో అధిక సంఖ్యాకులుగ ఉన్నందువల్ల వారికి మహాసాంఘికు లని పేరు కలిగినది. బౌద్ధసంఘము ఈ విధముగా రెండు పక్షము లగుట 'వజ్జిపుత్తు'ల వల్లనే, వారు ఆచారము విషయములో ప్రతిపాదించిన 'దశవత్థూని' (దశ వస్తువులను) గురించిన భేదాభిప్రాయము వలననే కలిగినదని దక్షిణదేశ బౌద్ధు లందురు. మహాదేవుడు ప్రతిపాదించిన పంచ ధార్మిక విశ్వాస విషయములను గురించి కలిగిన అభిప్రాయ భేదమువలననే అని ఉత్తరదేశ బౌద్ధులు చెప్పుదురు. ఈ విషయమువల్లనే మహాదేవస్థవిరుడు దక్షిణదేశీయుడని తెలుచున్నది.

మహాస్థవిరులు శీలమునకు, వృద్ధాచారమునకు, నైతిక శిక్షణమునకు అధిక ప్రాధాన్యము నిచ్చెదరు. మహాసాంఘికులు నైతిక శిక్షణ, శీలములకు ప్రాధాన్య మీయనివారు కారు; ఆచారమును పాటింపని వారును కారు. కాని స్థవిరులకంటె వీరికి తత్త్వాభిరుచి మెండు. వీరు తాత్త్విక విషయములకును, లోకహితైషిక విషయములకును



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ప్రాధాన్య మిచ్చెదరు. కాలక్రమమున మహా సాంఘికులలో చాల తెగ లేర్పడినవి. వీరిలో 'చైత్యక' పంథ వారు 'అంధకు'లు (ఆంధ్రదేశీయులు). ఈ విధముగా ఆచారము విషయమున నైననేమి, ధార్మిక విశ్వాసముల విషయముననైననేమి బౌద్ధ సంఘీయులు 'థేరవాదు' లని, 'మహా సాంఘికు'లని రెండు తెరగులుగ విడిపోయిరి. బౌద్ధములోని వృద్ధపక్షమునకు 'మహాస్థవిర' పక్షమని, 'ఆచారియవాద' మని పేరు.

మౌర్య వంశజుడయిన అశోక చక్రవర్తి కాలమువరకు స్థవిర, మహాసాంఘిక పక్షములకు గల అభిప్రాయ భేదములు ఎక్కువగుచునే వచ్చెను. ఆ చక్రవర్తి బౌద్ధ ధర్మాభిమానియై ఈ రెండు పక్షములను ఏకము చేయుటకు ప్రయత్నించెను; ఇందునిమిత్తము తన రాజధానియగు పాటలీపుత్రములో మరల నొకసంగీతిని సమావేశపరచెను. దీనికి మౌద్గల్య పుత్రుడయిన తిష్య దధ్యక్షుడు. ఈ సంగీతిలో బౌద్ధధర్మ ప్రవచనానంతరమున శిక్షా సూత్రార్థ సమన్వయములో థేరవాదులకును, మహాసాంఘికులకును ఏకీభావము కుదురలేదు. 'థేరవాదు'లు(స్థవిరులు) సభ నుండి వెడలిపోయిరి. చక్రవర్తి మహాసాంఘికులను ఎక్కువగ అభిమానించి ఆదరించుటవలన 'థేరవాదులు' అపాయమును శంకించి పాటలీపుత్రమునేకాక మగధనుకూడ విడిచిపెట్టిపోయిరి. వీరిలో వినయమునకు (ఆచార, శిక్షా కాండ) ప్రాధాన్య మిచ్చినవారు సింహళమున కరిగిరి. 'సుత్త'ములకు (ధర్మ సూత్రములకు) ప్రాధాన్య మిచ్చినవారు కాశ్మీర, గాంధార దేశములకు వెళ్ళి అచ్చట తమ మతమును వ్యాపింపజేసిరి. వీరు చాలకాలము వరకు బుద్ధుని ఆదిమ సిద్ధాంతములనే అంటిపెట్టుకొని యుండిరి. కాని దేశములో క్రమముగా సంఖ్య హెచ్చుచు వచ్చిన మహాసాంఘికుల ప్రభావమువలన వారి అభిప్రాయ, సిద్ధాంతములలోను మార్పు వచ్చెను. వారిలో కొందరు సిద్ధాంతతత్వమును గూర్చియే చర్చలు జరపి దానికే అధిక ప్రాధాన్య మిచ్చిరి. ఈ తెగవారికి సర్వాస్తివాదు లని పేరు. రెండవ సంగీతి జరగిన తరువాత ఏర్పడిన బౌద్ధ సంప్రదాయములలో సర్వాస్తివాద, మహాసాంఘిక సంప్రదాయములు చాల ముఖ్యమయినవి. ఆదిమ బౌద్ధులకు పాలీ మతభాష యైనట్లే ఈ సంప్రదాయములకు చెందిన వారికి తుట్టతుదకు సంస్కృతము పవిత్రభాష యైనది. స్థవిరుల, సర్వాస్తివాదుల బోధలవలన విదేశాగతులు సైతము బౌద్ధ ధర్మావలంబకు లగుచుండిరి.

బౌద్ధము ఆంధ్రదేశములో నిశ్చయముగా వ్యాపించినట్లు తెలియవచ్చినది మౌర్య అశోక చక్రవర్తి కాలము నుండియే. అశోకుడు దేశ దేశములలో బుద్ధుని సందేశమును వినిపించి ప్రజలలో బౌద్ధమును వ్యాపింపజేయుటకై బౌద్ధ మతబోధకులను పంపెను. అట్టి మతబోధకులలో మహిష మండలము (కొందరి ఉద్దేశము ప్రకారము ఇది మైసూరు)నకు పంపబడిన మహాదేవ స్థవిరు డొకడు. ఇతడు మహిష మండలములో నలుబది వేల మందిని తన ధర్మ సంప్రదాయము పక్షమునకు త్రిప్పుకొని, మరి నలుబది వేల మందికి మత మిచ్చెనని బౌద్ధగ్రంథములలో కలదు. మహాదేవస్థవిరు డొకడు ఆంధ్రదేశమునకు వచ్చి కృష్ణానదీ తీరమున చైత్యకవాదమును నెలకొల్పెను. ఈ వాదమునకు చైత్య మనబరగు బుద్ధ సమాధిని పూజించుట మొదలగునవి యంగములు. చైత్యకవాదము ప్రధానముగా అంధకులది (ఆంధ్రులది); మహాసాంఘిక సంప్రదాయమునకు చెందినది. ఇం కొక మహాదేవస్థవిరుడు క్రీస్తుకు రెండు వందల సంవత్సరములకు పూర్వము 'తాంబపణ్ణి' (సింహళ) ద్వీపమునందు 'దుట్ఠగామణి' అను ప్రభువు నిర్మించిన మహా స్తూపపు ఉత్సవమునకు 'పల్లవభోగ్గ'ము (పల్లవ భోగము) నుండి నాలుగు లక్షల అరువది వేల 'భిక్షుసంఘ'ముతో వెళ్ళెనని 'మహావంశము' వలన తెలియుచున్నది. ప్రాచీన శాసనములలో దేశ విభాగమును సూచించు భోగ పదమునకు 'భోగ్గ'ము వికృతి అగుటవలన 'పల్లవ భోగ్గము' పలనాడై యుండవచ్చునని కొందరి యూహ. ఈ రీతిని మహాదేవ స్థవిరు లనువారు ముగ్గురు కనబడుచున్నారు. వీ రందరు ఒక్కరో, వేర్వేరు పురుషులో భావిపరిశోధన వల్ల తేలవలసి యున్నది. వీరిలో అశోక చక్రవర్తి ప్రేషితుడై కృష్ణానదీ తీరమున ధనకటకములో మహాచైత్యమును నిర్మించినవాడును, తెలుగు దేశములో చైత్యక సంప్రదాయమును నెలకొల్పిన వాడును ఒక్కడై యుండ వచ్చునని యూహింప నవకాశము కలదు. మహాచైత్యము నందలి తొలికాలపు శాసనములలోని లిపి ననుసరించి అది అశోకుని నాటిదని లిపిజ్ఞులు నిర్ణయించిరి. మహాచైత్యము ననుసరించి వచ్చినదే చైత్యకవాదము.

చైత్యకులు 'థేరవాద'మునుండి విడిపోయిన మహాసాంఘిక పక్షమునకు చెందినవారు. స్థల విభేదమునుబట్టి, ధార్మిక విశ్వాసములో గల కొద్దిపాటి విభేదమునుబట్టి 'పుబ్బసేలియ' (పూర్వశైలీయ), 'అపరసేలియ' అపర శైలీయ), 'రాజగిరిక', 'సిద్ధాత్థక' (సిద్ధార్థక) అని చైత్యవాదమున నాలుగు శాఖ లేర్పడినవి. అంధకులకును, ఇతర బౌద్ధశాఖలవారికిని సమానముగ నున్న సిద్ధాంతములు కొన్ని యున్నవి. అంధకులకు ప్రత్యేకముగనున్న సిద్ధాంతములు కొన్ని యున్నవి. ఇది యటుండ అంధకులలోనే



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కొన్ని శాఖలవారికి మాత్రమే ప్రత్యేకముగనున్న సిద్ధాంతములు కలవు. 'కథావత్థు' గ్రంథమున మహాదేవ ప్రతిపాదితములైన 'పంచవిషయ'ములును 'పుబ్బసేలియ', 'అపరసేలియ' శాఖల వారికి ఆరోపింపబడి యుండుట కనుగొనగలము.

పూర్వశైల, అపరశైల చైత్యకనికాయములకు ధాన్యకటకము ప్రధానకేంద్రము. మంజుశ్రీ మూలకల్ప మను గ్రంథములో ఇది బౌద్ధమత విషయకములైన సాధనాఖ్యానములను చేసికొనుటకు అనువైన స్థలములలో ఒకటని చెప్పబడినది. ఇక్కడి మహాచైత్యమునకు శ్రీధాన్య కటక చైత్యమని పేరు. ఈ చైత్యములో బుద్ధధాతువు నిక్షిప్తమై యుండినట్లుకూడ ('శ్రీధాన్యకటకే చైత్యే జినధాతుధరే') ఆ గ్రంథమే తెలుపుచున్నది. ఇందువలననే బౌద్ధులు దీనిని శ్రీధాన్యకటకమని వ్యవహరించిరేమో. చీనా బౌద్ధగ్రంథములు ఈ చైత్యమును శ్రీధాన్యకటక మనియే పేర్కొనును. ధాన్యకటక చైత్యమునే ఇప్పుడు అమరావతీ స్తూపమని వ్యవహరించుచున్నారు. అమరావతీ స్తూపశాసనములలో చైత్యకనికాయమును పేర్కొనున దొకటి కలదు. పూర్వశైలనికాయము ప్రాకృత శాసనములలో 'పువసేలియ నికాయ' మని వ్యవహృతమైనది. 'పువసేలియ', 'అపర సేలియ' నికాయముల పేరులుకూడ తెలుగుదేశపు ప్రాకృత శాసనములలో వచ్చును. కృష్ణ జిల్లా నందిగామ తాలూకా అల్లూరులో దొరకిన శాసనఖండములో పూర్వశైలనికాయము ('పువసేలియ నిగాయస') పేర్కొనబడినది. ఏయే శాసనములలో ఈ చైత్యక నికాయములు పేర్కొనబడినవో వాని నన్నిటిని ఇక్కడ ఉదాహరించుట అనవసరము.

పూర్వశైల, అపరశైలములను బట్టి ఈ బౌద్ధనికాయములకు పేరు వచ్చిన దనుట స్పష్టము. పూర్వశైల, అపరశైలము లేవి అను విషయమున బౌద్ధ వాఙ్మయ పరిశోధక పండితులలో అభిప్రాయభేదము కలదు. కొందరు నాగార్జునుని కొండ ధాన్యకటకములని, మరికొందరు ధాన్యకటకము విజయవాడలని ఇట్లు పలువిధముల తెలిపియున్నారు. కాని నిజ మరసిచూడ ఇవేవియు సరియైనవికావని తోచుచున్నది. భాషావేత్తలు 'సేలియ' పదమునకు సంస్కృత రూపము 'శైల'గను, 'శాల'గను నిర్వచించినారు. ఇం దేది సరియైన దైనను 'పూర్వ' యన్నది తూర్పున నున్నదానికిని, 'అపర' యన్నది పడుమటనున్న దానికిని వర్తించుననుట స్పష్టము. అట్లగుట నివి ఏదియో యొక ప్రముఖ స్థలమునకు తూర్పు, పడుమరల నుండిన సంప్రదాయము లనుట యుక్తము. వీనికి కేంద్రము ధాన్యకటకమని చెప్పుటవలన ధాన్యకటకమే ఆ ప్రముఖ స్థలమని యూహించుట అనసమంజసము కాదు. ఈ యూహ సరియైనదగుచో 'అపరసేలియ' నికాయము నాగార్జునుని కొండ (గుంటూరు జిల్లా) లోనిదని, 'పువసేలియ' నికాయము గంటసాల(కృష్ణ జిల్లా)లోనిదని నిశ్చయింప వచ్చును. గంటసాల కూడ ఆంధ్ర - సాతవాహనుల నాటి ప్రముఖ బౌద్ధక్షేత్రములలో ఒకటి. గంటసాలలోని ప్రాకృత శాసనములలో 'పువసేలియ నికాయ'ము పేర్కొనబడినది.

అశోకచక్రవర్తి అనంతరము మగధను పరిపాలించిన శుంగ, కాణ్వ వంశజులు వైదిక ధర్మాభిరతులు. వారి కాలములో బౌద్ధమునకు మగధలో నిలువ నీడ లేకపోయినది. అశోకుని కాలములో స్థవిర (థేర) వాదులు కాశ్మీర, గాంధారముల కరిగినట్లే వీరికాలములో మహాసాంఘికులు ఆంధ్రదేశమునకు వచ్చి ఇచ్చట తమ మతమును పరివ్యాప్తము చేసిరి. అశోకుని మరణానంతరము స్వాతంత్ర్యమును సంస్థాపించి ఆంధ్రరాజ్యమును వెలయింప జేసిన ఆంధ్రసాతవాహనులు తాము వైదిక ధర్మావలంబులైనప్పటికి తమ రాజ్యములో బౌద్ధము జనాదరము గాంచుట వలన దానిని అభిమానించి బౌద్ధాచార్యులను గౌరవించుచుండిరి. ధర్మపాల శిష్యుడయిన దేవక్రముడను బౌద్ధాచార్యుడు దక్షిణహిందూ దేశమున వాదములో కొందరు తైర్థికుల(వేదమతావలంబుల)ను ఓడించి 'సాలవాహన' (సాతవాహన)రాజును బౌద్ధధర్మావలంబుని కావించినట్లు చీనా బౌద్ధగ్రంథములు చెప్పుచున్నవి. ఈ 'సాలవాహన' రా జెవ్వరో తెలియవచ్చుట లేదు.

ఆంధ్రసాతవాహనుల కాలములో హిందూదేశ మంతటిలోను ఆంధ్రదేశము బౌద్ధమునకు ప్రధాన కేంద్రమయినది. మహాయాన సంప్రదాయ ప్రవర్తకుడయిన ఆచార్య నాగార్జునుడు ఒక సాతవాహన భూపతికి కడుంగడు మిత్రుడు. అత డాభూపతికి 'సుహృల్లేఖ' అను గ్రంథమును రచియించి యిచ్చినట్లు బౌద్ధగ్రంథముల వలన తెలియవచ్చుచున్నది. ఆచార్య నాగార్జునుడు ధనకటక మహాచైత్యమునకు నానాచిత్ర విచిత్రమైన గొప్ప ప్రాకారమునే కాక 'శ్రీపర్వత'మున శైలమంటపాలయములను కూడ కట్టించెను. 'శ్రీపర్వత'మన్నది నాగార్జునుని కొండయే యనుటకు సందియము లేదు (నాగార్జునుని కొండవద్దనుండి శ్రీశైలము వరకు గల పర్వత శాఖకు శ్రీపర్వత మన్న పేరు ఉండినను ఉండవచ్చును). నాగార్జునాచార్యుల వారు బౌద్ధములో బుద్ధుని తరువాత బుద్ధునియంతటి వాడు; రెండవ బుద్ధుడేయని ప్రసిద్ధి గాంచెను. ఆ యాచార్యుడు నివసించిన



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



స్థల మగుటవలన బౌద్ధు లాకొండను 'శ్రీపర్వత'మని గౌరవాభిధానముతో వ్యవహరించియుందురు. నాగార్జునుని కొండయన్న పేరు నాగార్జునాచార్యులవారి వలన వచ్చినదే. 'శ్రీపర్వత' మన్నది తమ జీవితము చరమ దశలో నాగార్జునాచార్యులవారి ధ్యాన ధారణాది వైశిష్ఠ్య యోగాభ్యాసములకు రంగస్థల మగుటవలన ఉత్తరదేశ బౌద్ధులకు పవిత్రమయిన కొండ పేరని చీనా గ్రంథములలో చెప్పబడినది.

మహాసాంఘికులలో తత్వవిచార మారంభమై నప్పటి నుండి హీనయాన బౌద్ధులలో కూడ కొందరు తత్వవిచారము చేయదొడగిరి. ఈ విధముగా తత్వవిచారమునకు ప్రాధాన్య మిచ్చినవారు స్థవిర (థేర) వాదులలోనే సర్వాస్తివాదు లను పేర ఒక తెగగా ఏర్పడిరి. మహాయానము రూపొందక పూర్వమే దానికి సంబంధించిన బీజభావములు అనేకము వారిలో వాడుకలో నుండెను. ఈ కారణమునచే మహాయాన సంప్రదాయము రూపొందుటకు హీనయాన సంప్రదాయమునకు చెందిన వారైనను సర్వాస్తివాదులు అధికముగా తోడ్పడిరని చెప్పబడుచున్నది. మహాయాన బౌద్ధులు త్రిపిటకముల నంగీకరించక పోరు. కాని వారు ఆపిటకముల ననుసరించియే తమ సిద్ధాంతములకు తగినట్లు క్రొత్త సూత్రముల నేర్పరచుకొనిరి. వీనికి వైపుల్య సూత్రములని పేరు.



చిత్రము 83. బుద్ధుని బోధ, నాగార్జునునికొండ శిల్పము

కాశ్మీర, గాంధారాది దేశముల నేలిన విదేశాధికులగు కుషాణ వంశజులలో చాల గొప్పవాడయిన కనిష్క చక్రవర్తి గొప్ప బౌద్ధమతాభిమాని. అతడు స్థవిర, సర్వాస్తివాదుల నాదరించెను. అశోకచక్రవర్తి మరణానంతరము ఆంధ్ర-శాతవాహనుల కాలములో ఆంధ్రదేశము వలెనే కనిష్క చక్రవర్తి కాలములో కాశ్మీర, గాంధారములు బౌద్ధమునకు కేంద్రములైనవి. బౌద్ధుల మరియొక సంగీతి కనిష్కుని రాజ్యకాలములో కాశ్మీరములో జరిగినది. ఈ సంగీతిలో బౌద్ధాచార్యులు బౌద్ధధర్మ సూత్రములకు క్రొత్త భాష్యములు రచించి వానికి 'మహావిభాష' అని పేరిడిరి. మహాయాన సంప్రదాయమునకు చెందిన అభిప్రాయములు ఈ నాలుగవ సంగీతికి పూర్వమే పొటమరించి క్రమముగా దేశ పరివ్యాప్తములైనవి. వానిని చక్కగా ఆకళించుకొని సిద్ధాంతీకరించి ఒక వాదముగా రూపొందించి క్షీణించిపోవుచుండిన బౌద్ధమునకు నూతన చైతన్యము నొసగినవాడు ఆచార్య నాగార్జునుడు. ఈ మహానుభావుడు రూపొందించిన బౌద్ధ సంప్రదాయమునకు మహాయానమని పేరు. మహాసాంఘిక పక్షమునకు చెందిన పూర్వశైల, అపరశైలాది నికాయములు వర్ధిల్లిన తెలుగుదేశములోనే ఒక సంప్రదాయ రూపముగా మహాయానము ఆవిర్భవించినదని బౌద్ధ పరిశోధక పండితులు నిశ్చయించియున్నారు. టిబెత్తు దేశపు ఐతిహ్యమును అనుసరించి పూర్వశైల, అపరశైల నికాయముల వారికి ప్రాకృత భాషలో రచించిన ప్రజ్ఞాపారమిత యను గ్రంథముండెననియు, ఈ పారమితలోనే మహాయాన బీజములుండెననియు, ఇదియే నాగార్జునాచార్యులవారికి మహాయాన సంప్రదాయమును రూపొందించుటలో చాల తోడ్పడినదనియు పరిశోధక పండితుల అభిప్రాయము. కాని యా పూర్వశైల, అపరశైల నికాయముల వారి ప్రజ్ఞాపారమిత ఇంతవరకు దొరకనులేదు; అది యెట్టిదో తెలియరానులేదు. నేడంతరించి పోయిన బౌద్ధ గ్రంథములు మన హిందూదేశములో ఒకప్పు డుండెనని టిబెత్తు, చీనా భాషలలోనికి పరివర్తితములైన గ్రంథముల ద్వారానే తెలియవచ్చుచున్నది.

మహాయానము క్రమముగా ఉత్తర దేశములకు వ్యాపించుటయేకాక దక్షిణమున తెలుగు దేశములోను బాగుగ వర్ధిల్లినది. మహాయానమున అసంఖ్యాకులుగ వెలసిన ప్రముఖ బోధిసత్వులలో నొకడయిన మంజుశ్రీ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



దక్షిణాపథమునకు పయనించుటకు (ఉత్తర హిందూస్తానములోని) జేతవనము నుండి బయలుదేరి ధన్యాకరమహానగరములోని ('దక్షిణాపథే ధన్యాకరం నామ మహానగరమ్') 'మాలధ్వజవ్యూహ చైత్యము' వరకు వచ్చెనని 'నవరత్నము'లను మహాయాన గ్రంథములలో నొకటియైన గండవ్యూహమున (మూడవ శతాబ్దము) చెప్పబడినది. ఈ ధన్యాకరము కృష్ణానదీతీరస్థమయిన ధాన్యకటకమే. మంజుశ్రీ ఆ నగరములోని గొప్ప భాగ్యవంతుడయిన ఒక శ్రేష్ఠి కుమారుడు సుధనుడను పేరుగలవానికి మనసులో బోధిచిత్త సంపాదనాశయము కలుగునట్లు ఉపన్యసించి 'సమంతభద్ర బోధిసత్వ చర్య' నేర్చుకొనుటకు దక్షిణాపథమందలి రామవర్త దేశములోని సుగ్రీవ పర్వతమునకు వెళ్ళవలసినదని ఆదేశించెను. 'మంజుశ్రీ మూలకల్ప'మను గ్రంథములోగూడ దక్షిణాపథములోని ధాన్యకటక, శ్రీపర్వతాదిస్థలములలో బౌద్ధము వ్యాపించినట్లు చెప్పబడినది. ఆ కాలములో తెలుగు దేశములోని శ్రీపర్వతము (నాగార్జునునికొండ) మహాయాన బౌద్ధ ప్రధాన కేంద్రము. అది బౌద్ధుల కందరికి యాత్ర చేసి దర్శింపవలసిన మహా పుణ్యక్షేత్ర మయినది.

హీనయాన, మహాయానములకు తూర్పు పడమరల కున్నంత అంతర మేర్పడినది. బౌద్ధ సంఘము హీనయానమని, మహాయానమని విస్పష్టమయిన రెండు పక్షములుగ చీలిపోయినది. అంతవరకు ఏసంప్రదాయములకు చెందినవారైనను మహాయానము రూపొందకపూర్వము బౌద్ధు లందరు ఒకచే సంఘారామములో కలిసి నివసించుచు, కలసిమెలసి యుండి స్నేహమును పాటించుకొనుచునే మత విషయకమైన వాద ప్రతివాదములు నెరపుచుండిరి. కాని మహాయానము రూపొందిన పిదప ఏపక్షమున కాపక్షమే ఒకదానినుండి యొకటి విడివడిపోయినది. మహాయాన మవతరించి ఆదిమ బౌద్ధము స్వరూప స్వభావములనే పూర్తిగ మార్చివేసెను. మానవ జన్మకు పరమావధి అర్హతపదమని, నిర్వాణ పదమని హీనయాన బౌద్ధుల సిద్ధాంతము. హీనయానవాది తన అర్హతపదమునకే కృషిచేయు స్వార్థపరుడు. తాను సంసార దుఃఖ విమోచనము పొందిన జాలును. సరిగా దీనికి భిన్నమైనది మహాయాన సిద్ధాంతము. తాను నిర్వాణపదమును సాధించియు, ఇతరులుకూడ నిర్వాణమును సాధించుటకు తోడ్పడుట మహాయాన బౌద్ధ లక్ష్యము. అంత కంతకు అభ్యున్నత స్థితికి పోవుచు ఎల్లరికి హిత మాచరించునట్టి మానసిక స్థితి బోధిచిత్తమును సంపాదించి, కేవలము ఎవనికి వానికే కాక విశ్వ ప్రేమతో సర్వప్రాణులకు తోడ్పడి వారి నిర్వాణోపలబ్ధికిని కృషిచేయుట మహాయానవాది ఉదార పరమాశయము.

మహాయానమున బుద్ధుడు మానవమాత్రుడు కాడు; దేవుడే, శాశ్వతుడు. కాని అతడు మార బాధితులైన జనులకు విమోచనము కలిగించి వారి నుద్ధరించుటకై భూలోకమున కవతరించుచుండును. హిందువులకు శని ఎట్లో బౌద్ధులకు మారు డటువంటివాడు. హీనయాన బౌద్ధునికి బుద్ధుడు మానవుడే కాని అతిలోక మహాశక్తి సంపన్నుడయిన మానవాతీతుడు. హీనయానములో బుద్ధుడు, ధర్మము, సంఘము బౌద్ధులకు శరణ్యములు. వీనికి బౌద్ధములో త్రిరత్నములని పేరు. మహాయాన బౌద్ధులును వీని నంగీకరింతురు. కాని వారికి ధర్మము శాశ్వతమైనది, బౌద్ధమతసార మది. బుద్ధునికంటె ధర్మమునకే ఆధిక్యము. అందువలన మహాయానమున ధర్మ, బుద్ధ, సంఘములు శరణ్యములు. మహాయానము బౌద్ధులకు బోధిసత్వాదర్శమును లక్ష్యముగా చేసినది. ఎంతటి యల్పుడయినను ప్రతి సాంఘికుడును తన ధార్మిక కృషి వలన తన అభ్యున్నతిని తాను సాధించుకొని బోధిసత్వుడగుట కవకాశము కలదని మహాయానము బోధించినది. నిర్వాణోపలబ్ధి కలిగినను లోకములోని ప్రతి జీవికి నిర్వాణము వచ్చిన గాని తనకు నిర్వాణ మక్కరలేదని చెప్పి, విశ్వప్రేమ గలిగి సర్వలోక హితైషియై ప్రవర్తించువాడు బోధిసత్వుడు. ఇటువంటి బోధిసత్వుల కందరికి శిరోభూషణము అవలోకితేశ్వర బోధిసత్వుడు. వేర్వేరు మనః పరిణామములు గల వేరు వేరు జనులకు నిర్వాణ సంసిద్ధికై తోడ్పడుటకు మహాయానమున బోధిసత్వు లనేకులు వెలసిరి. ఇందువలననే మహాయానమునకు బోధిసత్వయానమనియు పేరు కలిగినది. బోధిసత్వులు వెలయుటతో బౌద్ధము భక్తి సంప్రదాయమైనది. వేరు వేరు బోధిసత్వులకు వేరు వేరు లక్షణము లేర్పడి వారికి పూజా పురస్కారములు హెచ్చినవి. బోధిసత్వ ప్రతిమారచన ఒక కళగా వర్ధిల్లినది.

నాగార్జునాచార్యులవారి మహాయానావతరణముతో బౌద్ధము తత్వవిచార ప్రధానమైన ధర్మ సంప్రదాయమైనది. నాగార్జునాచార్యులవారు శూన్యవాదమని పేరు పడిన తత్వవాదమును వెలయించిరి. దీని నింకను బలపరచినవాడు ఆయన శిష్యుడు ఆర్యదేవ బౌద్ధాచార్యుడు. బుద్ధుడు ప్రపంచపు అస్తిత్వమునకును, అనస్తిత్వమునకును శాశ్వతత్వమునకును, అశాశ్వతత్వమునకును మధ్యే మార్గమును ప్రతిపాదించి తపోపవాస క్లేశములచేత శరీరమును శోషింప జేసికొనుటకును, సుఖభోగలాలస జీవితమును



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



గడపుటకును బదులు క్రమబద్ధమైన శిక్షణమును విధించెను. పూర్వోక్త అతివాదములకు పోకయే బుద్ధవచనము నంగీకరించుచునే మధ్యేమార్గ తత్త్వమును గురించి శోధించుటకు బౌద్ధులకు వలసినంత అవకాశము కలిగినది. ఈ మధ్యేమార్గ మేదో బుద్ధుడు నిర్వచింపలేదు. తన సమయము నవలంబించినవారికి జన్మ జరా మృత్యు బాధనుండి తప్పించుకొనుటకు అర్హతపదమునే లక్ష్యముగా పెట్టెను. అర్హత పదమునకు మించిన తత్త్వ విచారము నిరర్థకమని బుద్ధుడు దానిని నిరసించి నిరుత్సాహపరచెను. కాని బుద్ధుని పిదప వచ్చిన ఆచార్యులు మధ్యమమార్గమును గురించి విచారము చేయదొడగిరి. కాని ఈ తత్త్వ విచారమున వారి కేకీభావము కుదురలేదు. దానిని ఒక్కొక్కరు ఒక్కొక్క రీతిని నిర్వచించి సిద్ధాంతములు చేసిరి. ఈ తత్త్వ విచారమునకు ఫలితముగ బౌద్ధములో వైభాషిక సౌత్రాంతిక, మాధ్యమిక, యోగాచారము అను నాలుగు సంప్రదాయము లేర్పడినవి. వైభాషిక, సౌత్రాంతికము(లు) స్థవిరవాదమునకు చెందిన సర్వాస్తివాదశాఖలవారివి. పూర్వోక్తములైన నాలుగు సంప్రదాయములును శ్రావక, ప్రత్యేక, మహాయానము లను బడు మూడు పంథలలో అంతర్గతములై యున్నవి. శ్రావక, ప్రత్యేక యానములు హీన యానమునకును, మాధ్యమిక, యోగాచారములు మహాయానమునకును చెందినవి. వైభాషిక సంప్రదాయము శ్రావక ప్రత్యేకయానములను వివరించును. నాగార్జునాచార్యులవారు తత్త్వ విచారమున 'శూన్యవాద'మును ప్రతిపాదించిన మహామహులు. నిర్వాణసిద్ధి అయినపిదప బోధిచిత్తము స్థితిని గురించి వితర్కించి నాగార్జునాచార్యులవారు అది 'శూన్య'మని ప్రతిపాదించినారు. వారు ప్రతిపాదించిన 'శూన్య'మును ('అస్తి నాస్తి తదుభయానుభయ చతుష్కోటి వినిర్ముక్తం శూన్య రూపమ్') అవబోధము చేసికొనుట బహుకష్టము. అది 'వేదాంత' విచారము. బుద్ధుని కాలమునకు తరువాతనుండి బౌద్ధులు తత్త్వవిషయమును గురించి చేసిన తత్త్వ విచారణలు తుదకు నాగార్జునాచార్యులవారి నాటికి 'శూన్యవాద'ముతో పర్యవసించినవి.

నాగార్జునాచార్యుని మాధ్యమిక వాదమును చక్కగా వ్యాఖ్యానించి విశదపరచిన మహావ్యాఖ్యాత చంద్రకీర్త్యాచార్యుడు. ఈతడు దక్షిణదేశీయు డనియే గ్రంథములలో తెలుపబడినది కాని ఇతని జన్మస్థలము తెలియరాదు. ఈతడు రచించిన మాధ్యమికావతార సూత్ర వ్యాఖ్యానములో 'పూర్వశైలగాథ'లలోనివని కొన్ని శ్లోకములు ఉదాహృతములైనవి. ఈ మాధ్యమికావతార సూత్రగ్రంథమిపుడు చీనా భాషలోనే ఉన్నది. మన దేశీయులైన నాగార్జునాచార్యులవారి బౌద్ధ గ్రంథములును, ఈ దేశపు బౌద్ధాచార్యు లింకెవరో రచించిన గ్రంథములైన 'పూర్వశైల గాథ'లును మన దేశములో అంతరించిపోయినవి కాని అట్టి వొకప్పు డుండెడివని చీనా గ్రంథములవలన తెలియవచ్చుట ప్రమోదావహమైన విషయము.



చిత్రము 88. భూమిస్పర్శముద్రలో బుద్ధుడు, అమరావతి

నాగార్జునాచార్యునికి తరువాత శూన్యవాదమునకు విజ్ఞానమును చేర్చినవాడు మైత్రేయనాథుడు. నిర్వాణమన్న శూన్యము కా దనియు, అది విజ్ఞాన మనియు ఆయన సిద్ధాంతము. ఈయన వాదమే తరువాత యోగాచార సంప్రదాయముగా విఖ్యాతమయినది. యోగాచారవాదమునకు విజ్ఞానవాద మనియు నామాంతరము. నాగార్జునాచార్యులవారి కీర్తి ప్రతిష్ఠలవలనను, ఆయన ప్రతిపాదించిన శూన్యవాద తత్త్వ సంప్రదాయము వలనను మైత్రేయనాథుని యోగాచార వాదమునకు వ్యాప్తిలేకపోయినది. అసంగుడను ప్రతిభా మహితుడైన బౌద్ధాచార్యుడు వచ్చి యోగాచార సంప్రదాయమును గురించి గ్రంథములు రచించి దానిని విపులముగ వ్యాఖ్యానించిన యనంతరమే దానికి తాత్త్విక బౌద్ధ సంప్రదాయములలో గొప్ప కీర్తి ప్రతిష్ఠ లేర్పడినవి.

మరి మూడు నాలుగు శతాబ్దములు పోయినతరువాత బౌద్ధులు విజ్ఞానవాదముతోగూడ తృప్తి చెందలేదు. దానిలో మహాసుఖ మను మరొకయంశమును ప్రవేశపెట్టిరి. ఇందువలన సాధారణ నిర్వాణమునకు తరువాత



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



శూన్యము, విజ్ఞానము, మహాసుఖము అను మూడు మూల తత్త్వము లుండినవి. ఈ మహాసుఖవాదమునుండియే వజ్రయాన సంప్రదాయము రేకెత్తినది. మహాసుఖవాదములో మహాసుఖ మనబడు లక్ష్య తత్త్వము కరుణా స్వరూపమైన శక్తి సాహాయ్యముననే సాధ్యము. దీనం జేసి వజ్రయానము బౌద్ధములో మొట్టమొదటిమారు శక్త్యారాధనను ప్రవేశ పెట్టినది. ఇందువలన వజ్రయాన సంప్రదాయములో దేవతా విగ్రహములు, శక్తి విగ్రహములు అసంఖ్యాకములుగా వెలసినవి. ఇందు మంత్ర తంత్రములు, పూజా పురస్కారములు హెచ్చినవి. ఈ సంప్రదాయము యోగము కావలసినవారికి యోగమును, కామోపభోగములు కావలసినవారికి కామోపభోగములును, సిద్ధులు కావలసినవారికి సిద్ధులును మంత్ర జపములచేత నిర్వాణము నొందదలచినవారికి నిర్వాణమును ఇచ్చినది, ఈ వజ్రయానములో తాంత్రిక వాఙ్మయము విపరీతముగా వచ్చినది. ఈ సంప్రదాయములో వజ్రయాన గ్రంథోక్త పద్ధతిని ముద్రా, మండల, యోగ, మంత్ర, తంత్రాదికములను, తదనుగుణములయిన క్రియా కలాపాదికములను చేయువారికి అభిమతార్థసిద్ధి కలుగునని తన్మతానుయాయుల విశ్వాసము. స్తవములు, స్తోత్రములు, మంత్రములు, జపము, మండలార్చనము, ధారిణీలు మొదలయినవి అతిశయించినవి. ధారిణీ లన్నవి దేవీ మూర్తులు. వీని ఉపాసనకు, సాధనకు సంబంధించిన మంత్ర వాఙ్మయమునకును ధారిణీ లనియే పేరు. నాగార్జునాచార్యులవారు నాగలోకము నుండి ధారిణీలను తెచ్చి వానిని ధనకటక మహాచైత్యమువద్ద నిక్షేపించిరని బౌద్ధులలో ఒక ప్రవాదము కలదు. ధరణికోట అను పేరు ధనకటకమునకు 'ధారిణీల' కోట యైనందువలననే



చిత్రము 84. పద్మపాణి అవలోకితేశ్వరుడు, అమరావతి



చిత్రము 85. సింహనాద అవలోకితేశ్వరుడు, అమరావతి

కలిగినదేమో విచారింపవలసి యున్నది. ఇది యెట్లున్నను 'శ్రీధాన్యకటక'మునకు తంత్ర వాఙ్మయమునకు ఎక్కువ సంబంధ ముండినట్లు చీనా దేశ బౌద్ధ గ్రంథములవలన తెలియుచున్నది. వజ్రయానములో మంత్ర తంత్రముల వలన, సాధనలవలన ఇష్టకామ్యార్థసిద్ధి కలుగునన్న విశ్వాసమువలన ఇది మరింత ఎక్కువగ జనాకర్షకమును, జనాదర పాత్రమును అయినది. దీనితో బౌద్ధములో ఎంతటి ఉదాత్తములైన ఆదర్శతత్త్వము లుండెనో అంతటి హేయములును, జుగుప్సాకరములును అయిన ఆచార విధులును ప్రబలినవి. వజ్రయానము తెలుగు దేశములో కొంతకాలము వర్ధిల్లెననుటకు అమరావతిలో ఉత్తర కాలీన బౌద్ధమునకు చెందిన పద్మపాణి, సింహనాద విగ్రహములే తార్కాణము. కళింగదేశమునందలి సాలిహుండమువద్ద జరగిన ఖనన పరిశోధనలకు ఫలితముగ అక్కడ పంద్రెండు బౌద్ధ విగ్రహములు బయలుపడినవి. ఇవి యన్నియు మహాయానమునకు సంబంధించినవని, తొమ్మిదవ శతాబ్దమునకు చెందినవని చెప్పుదురు. వీనిలో చాల విగ్రహములు శిథిలములయినవి. వజ్రయానమునకు చెందిన మారీచి విగ్రహమును, బోధిసత్వ విగ్రహమును మాత్రమే సుస్థితిలో నున్నవి. కళింగదేశము కూడ వజ్రయాన బౌద్ధము నాదరించెననుటకు ఈ విగ్రహములే తార్కాణము.

క్రీస్తుశకము ఏడవ శతాబ్దమున పూర్వార్ధమునందు హిందూదేశమునకు వచ్చిన యువాన్‌చ్వాంగ్ కళింగమును సందర్శించునాటికే అచట బౌద్ధము క్షీణించినది. బౌద్ధ సంఘారామములు పది యుండెను. 'మహాయాన స్థవిర సంప్రదాయపద్ధతి'కి చెందిన బౌద్ధులు ఐదువందల మంది యుండిరి. ఇతర మతస్థులే ఎక్కువ మంది; యువాన్‌చ్వాంగ్ పేర్కొనిన స్తూప మొకవేళ సాలిహుండము స్తూపమగు నేమో. అచ్చట పురాతత్త్వ

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



శాఖవారు జరపిన ప్రవృత్తికి ఫలితముగా పెక్కు సంఘారామములు బయటపడినవి (చూడు : సాలిహుండము).

బౌద్ధ వాఙ్మయమున కళింగము చాల ప్రసిద్ధి కెక్కినది. ఇక్కడ బుద్ధుని నిర్వాణానంతర మాతని ధాతువులలో నుండి యాతని దంతమును తెచ్చి నిక్షిప్తముచేసి నిర్మించిన మహాచైత్య మొకటి యుండెనని ప్రసిద్ధి. ఈ దంత మహాచైత్యము ఉపాంతముననే దంతపురమను పేర ఒక నగరము వెలసి కళింగమునకు కొంతకాలము రాజధానిగా నుండెను. భారత ఖండమునందలి అత్యంత ప్రాచీన నగరములలో ఈ దంతపుర మొకటి. ఇదిమహాగోవిందుని చేత నిర్మితమైనట్లు 'మహాగోవింద సుత్తాంత' మువలన తెలియుచున్నది.



చిత్రము 86. తారావిగ్రహము, సాలిహుండము

యువాన్ చ్వాంగ్ ఆంధ్రదేశమును గురించి యిట్లు చెప్పియున్నాడు. 'దీనికి రాజధాని ' పింగ్-కి-లో' (వేంగి). ఇక్కడ బౌద్ధసంఘారామములు ఇరువదికి పైనున్నవి. వీనిలో మూడువేల మందికి పైగా బౌద్ధశ్రమణు లుండిరి. రాజధానికి సమీపముననే వరుసలుగానున్న చావడులతోను, గొప్పనైపుణ్యముతో కట్టిన మేడ మిద్దెలతోను కూడిన ఒక పెద్ద సంఘారామ మున్నది. ఇందులో ప్రశస్తమయిన బుద్ధవిగ్రహ ముండెను. ఈ సంఘారామమున కెదురుగా కొన్ని వందల అడుగుల యెత్తయిన శిలాస్తూప ముండెను. దీనిని 'అ-చె-లో' (అచలుడు) అను అర్హతుడు నిర్మించెనని చెప్పుదురు. ఈ సంఘారామమునకు నైర్‌ఋతి దిశను అశోకవన ముండెను. అక్కడ జనులకు తథాగతుడు తన ధర్మమును బోధించి, మహిమలు చూపి, వేలకొలది జనులను బౌద్ధ ధర్మావలంబకులుగ జేసెనని ప్రతీతి. ఇంకను నైర్‌ఋతి దిశగా ఇంకొక ఇరువది 'లీ'ల (నాలుగు మైళ్ళ) దూరమున విడిగానున్న కొండమీద శిలాస్తూపము కలదు. అక్కడ 'చెన్-నపుస'- దిన్న, దిన్నాగ, (దిఙ్నాగ) ఆచార్యుడు తర్కశాస్త్రమును రచించెను. బుద్ధుని నిర్వాణమునకు పిదప బుద్ధోపదేశ ప్రభావమున శ్రమణుడై అతడు బౌద్ధసంఘమున చేరెను'.

ఈ దిఙ్నాగాచార్యులవారికి, నాగార్జునాచార్యులవారికి సంబంధించి పరంపరగా వచ్చుచుండిన గాథలను తాను విన్నవాని నెన్నిటినో యువాన్ చ్వాంగ్ గ్రంథస్థము చేసెను.

ఇత డటు తరువాత 'తె-న-క-చె-క' (ధనకటక) ప్రాంతమున కరిగెను. ఈ దేశములో అతడు వచ్చునాటికి బౌద్ధ సంఘారామ సముదయ మెంతయో యుండెను. కాని 'ఈ సంఘారామములలో ఎక్కువభాగము నిర్జనములైనవి. దాదాపు ఇరువది సంఘారామములలో మాత్రమే శ్రమణులుండిరి. వీరి సంఖ్య వేయి. వీ రందరు మహాసాంఘిక సంప్రదాయమునకు చెందినవారు. రాజధాని తూర్పుదిశను కొండవద్ద పు-వా-షి-లో (పువసేలియ) సంఘారామమును, పడుమటి దెసను కొండవద్ద 'అ-ఫ-లో-షి-లో' (అపరసేలియ) సంఘారామమును ఉన్నవి. బుద్ధ ప్రీతిగ పూర్వపు రాజొకడు వీనిని నిర్మించెను. అతడు నది ప్రక్కగా రాక పోకల కనువైన త్రోవను చేసెను. నది ప్రక్కనున్న రాళ్ళను పెకలించి కోసుగానున్న కొండ ప్రక్కల నంటి పెట్టుకొని యుండు విశాల



చిత్రము 87. మరీచి, సాలిహుండము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మయిన వసారాలతో కూడిన ఎత్తయిన చావడులను కట్టించెను. మునులు, సిద్ధులు తరచుగా వచ్చునట్టి ఈ సంఘారామములను స్థానిక దేవతలు కాపాడుచుండెడివి. బుద్ధుడు నిర్వాణము చెందిన మొదటి వేయి సంవత్సరముల కాలములో వేయిమంది సాధారణ శ్రమణులు వర్ష కాలము గడపుట ఏటేట ఇచటికి వచ్చుచుండిరి. తిరిగి వెళ్లిపోవునాడు వా రందరు అర్హతులై, అసాధారణ శక్తుల వలన గాలిలో ఎగిరిపోవువారు. అటు తరువాత సాధారణ శ్రమణులును, అర్హతులును ఇక్కడ కలసి నివసించువారు. కాని వంద సంవత్సరములకు పైబడి, ఈ సంఘారామములో నివాసము చేయుచుండిన శ్రమణు డెవ్వడును లేడు. పర్వత దేవతలు అడవి జంతువుల రూపములు ధరించి సంచరించుటచేత వాని భయమున ఈ సంఘారామములను సందర్శించుటకు ప్రేక్షకులు రారు.'

యువాన్ చ్వాంగ్ ఈ ప్రాంతమున తాను విన్న భావవివేకుని గురించిన గాథను సవిస్తరముగ దెలిపెను. ఆ తెలిపినదాని ననుసరించి రాజధానికి (ధనకటకమునకు) దక్షిణముగా వజ్రపాణి దేవాయతన ముండె ననియు, 'ధారిణీ' మంత్ర పఠనము వజ్రయానము వ్యాపించిన కాలమున వాడుకలో నుండె ననియు తెలియుచున్నది. ధనకటకములో యువాన్ చ్వాంగ్ కొంతకాలముండి ఇరువురు బౌద్ధ శ్రమణుల తోడ్పాటుతో మహాసాంఘిక 'అభిధమ్మ'ము నధ్యయనము కావించెను.

ధనకటకమునుండి యువాన్ చ్వాంగ్ 'చు-లి-య' అను దేశమునకు వెళ్ళెను. పరిశోధక పండితు లిది తెలుగు చోళ రాజ్యమయిన కడప, కర్నూలు మండల ప్రాంతమని నిర్ధరించిరి. ఇక్కడి జనులు (తెలుగుదేశములోని ఇతర ప్రాంతములలో వలెనే) వైదిక మతమునందు విశ్వాసము గలవారు. ఈ దేశములోని బౌద్ధ సంఘారామములు శిథిలావస్థలో నుండెను. వీనిలో కొన్నిటిలోనే శ్రమణు లుండిరి. దేవ (పౌరాణిక దేవతల) ఆలయములును, దిగంబర జైనాలయములును ఎక్కువ. రాజధానికి ఆగ్నేయదిశను దాని దగ్గర అశోకస్తూపము కలదు. అక్కడ తథాగతుడు తనధర్మమును బోధించి, మహిమలు చూపి, వైదిక బ్రాహ్మణులను వాదమున నోడించి జనులను, దేవతలను బౌద్ధమతము స్వీకరింప జేసెను. రాజధానికి పడుమటిప్రక్క దగ్గర ఒక పురాతన సంఘారామ ముండెను.

చోళదేశమునుండి యువాన్ చ్వాంగ్ ద్రవిడదేశములోని కాంచీపురమునకు వెళ్లెను. యువాన్ చ్వాంగ్ వృత్తాంతము వలన క్రీస్తుశక మేడవ శతాబ్దినాటికి వైదిక మతము మరల విజృంభించుచుండె ననియు, బౌద్ధమతము చాల క్షీణదశలో నుండె ననియు, తెలుగుదేశములోని చాల ప్రాంతముల బౌద్ధ సంఘారామము లనేకము శిథిలావస్థలో నుండె ననియు తెలియుచున్నది.

తాంత్రిక బౌద్ధమున బౌద్ధ సంఘారామములు స్త్రీపురుష స్వైర విహారవర్తనములకు, అవినీతికి తావలములై దుర్యశము వార్జించుకొని జనాదరమును గోల్పోయినవి. క్రీస్తుశకము పదవశతాబ్దమునాటి వేంగీ చాళుక్య శాసన మొకదానిలో 'లంజియమేడ' యని సీమావధిగ సుదాహృతమైన భవనము బౌద్ధులదై యుండునేమో! ఒకప్పుడు బౌద్ధవిహారములుగ నుండిన దిబ్బలు ఇప్పుడు 'లంజెదిబ్బ'లను పేర వ్యవహారములో నుండుటయే అట్టి యూహకు కారణము. ఈ యూహ సరియైన దగుచో పదవ శతాబ్దమునాటికే తెలుగుదేశములోని బౌద్ధవిహారములకు 'లంజియ మేడ'లను చెడ్డపేరు వచ్చెనని తలంపవచ్చును. నాగార్జునాచార్యులవారే — ఈ పేరు గలవారు చాలమంది యున్నారు. వీరిలో ఎవరో — అపవిత్ర జీవనము గడపుచు బౌద్ధమునకు కళంకము తెచ్చుచుండిన ఎనిమిదివేలమంది బౌద్ధ 'భిక్షు'లను, 'భిక్షుణు'లను బౌద్ధ సంఘమునుండి తరిమివేసినట్లు గాథలు కలవు. ఎట్లయిననేమి, ఒకప్పుడు నీతి ప్రధానమైన ఆదిమ బౌద్ధము వజ్రయాన తాంత్రిక సంప్రదాయమున హేయములు, నీతిదూరములు అయిన యాచారముల వల్ల నైతికముగ పతనము చెందుట వలననే కావచ్చును అది రాజాదరణమునే కాక ప్రజాదరణమును గూడ గోల్పోయి క్రమముగా అంతరించినది.

బౌద్ధములోని మంచిని గ్రహించి పౌరాణిక వైదిక మతము పురికొన్న పిదప బుద్ధుడు విష్ణువు అవతారముగ పరిగణింపబడి పూజ్యు డయ్యెను. తన విశిష్టత గోల్పోయి బౌద్ధము నామ మాత్రావశిష్ట మయినది. బుద్ధుడు పౌరాణికదేవతామూర్తియైన పిదప బౌద్ధ స్తూపము బుద్ధదేవాలయమై హిందూదేవాలయములతో సరి సమానమైనది. తెలుగు దేశములో క్రీస్తుశకము పండ్రెండవ శతాబ్దము వరకు బౌద్ధము నామమాత్రావశిష్టమై నిలిచియుండె ననియు, ధాన్యకటక బౌద్ధ స్తూపము సుస్థితిలోనుండి హిందువులచే పూజ లందుచుండె ననియు చెప్పుటకు కృష్ణానది దక్షిణ షట్సహస్రావనీ మండలము నేలిన కోట వంశజుడు రెండవ కేతరాజు శాసనమే తార్కాణము. క్రీస్తుశకము 1182 వ సంవత్సరములో అతడు రాజ్యాభిషిక్తుడైన సందర్భమున దేవ బ్రాహ్మణులకు గ్రామదానము చేయుచు శ్రీమ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ద్బుద్ధ దేవరకు కూడ కొన్నియూళ్ళ నిచ్చెను. గుంటూరు మండలములో వెలనాటి రెండవ రాజేంద్ర చోడరాజు రాజ్యకాలము, అనగా దాదాపు క్రీస్తుశకము పండ్రెండవ శతాబ్దము చివరి వరకు బౌద్ధ ముండె ననుటకు పాల్కురికి సోమనాథ విరచితమయిన పండితారాధ్య చరిత్రమే తార్కాణము. వెలనాటి (రెండవ) రాజేంద్రచోడరాజు యాస్థానములో అతని గురువైన బౌద్ధాచార్యు డొక డుండెను. విమతవాదుల నోడించి తన శైవ సమయమును స్థాపించుటకై దేశసంచారము చేయుచు నొకప్పుడు మల్లికార్జున పండితారాధ్యుడు ఆ మహారాజు నా స్థానమునకు విచ్చేసెను. అప్పు డా యాస్థానము నందలి రాజగురువు బౌద్ధాచార్యునికిని, మల్లికార్జున పండితునికి మతవిషయకముగ గొప్పవాదము జరిగినది. ఆ వాదమున బౌద్ధాచార్యు డోడిపోయె నని పండితారాధ్య చరిత్రమున కలదు. ఇది చివరికి బౌద్ధ, శైవ కలహముగ పరిణమించినది. ఇటువంటి మతకలహము లంతకు పూర్వ ముండినట్లు చెప్పుట కాధారములు లేవు. కాని ఉండిన యెడల అటువంటివి కూడ బౌద్ధమతము క్రమముగా క్షీణించి అంతరించుటకు కారణము కావచ్చును. పూర్వ మేవిద్యయైనను, ఏమతమైనను రాజ పోషణమునను, రాజావలంబమునను వర్ధిల్లుచు వచ్చినది. తెలుగుదేశములోని రాజు లందరు పౌరాణిక హిందూ ధర్మావలంబులైనప్పటినుండి బౌద్ధమునకు అలంబమును, పోషణయు లేకపోయినవి. ఒకప్పుడు తెలుగుదేశమున ముమ్మరముగ వ్యాపించి జనులకు నూతనోత్సాహమును, కళలకు గొప్ప ప్రోత్సాహమును ఇచ్చి ధర్మాభ్యున్నతికి కారణమై, తెలుగుదేశమున కొక క్రొత్త వెలుగు నిచ్చిన బౌద్ధ సంప్రదాయము ఈ విధమున క్రమముగా అంతరించిపోయినది. ఇప్పుడు చూచుట కొక బౌద్ధ భిక్షువు కాని, ఒక బౌద్ధ గ్రంథముకాని కాన రాకుండ అంతరించుటే చాల విచిత్రము.

బౌద్ధము తెలుగు దేశమున వ్యాప్తమై అంతవరకు తెగలు తెగలుగ నుండినవారి నందరిని ఏకము చేసి ఏకైక జాతీయులనుగా నొనర్చినది. అంతవరకు అనాగరికులుగను, అసంస్కారులుగను ఉండిన తెలుగుదేశ జనసామాన్యమునకు మహాయాన బౌద్ధ సంప్రదాయము దశ పారమితల రూపమున వారిలో దయా దాన ధర్మాదులను లక్ష్యముగ బెట్టి ధార్మికతను పెంపొందించి, చిత్త సంస్కారమునకు తోడ్పడినది; అహింసకు ప్రాధాన్య మిచ్చినది. బౌద్ధము పేరు మీఁదుగ మనకు మిగిలిన దిప్పుడు బౌద్ధ కళా సంపదయే.

మ. సో. శ.

## జైనమతము

బౌద్ధమతముతో సమానముగ తెనుగుదేశమున వ్యాపించిన మరొక మతము జైనము: ఇదికూడ బౌద్ధమువలెనే వేదప్రామాణ్యమును, వైదిక కర్మాచరణమును అంగీకరింపక వైదికమతమును నిరసించి అహింసను ప్రధానముగా చేసికొని వర్ధిల్లినది. ఇదికూడ క్షత్రియోపజ్ఞమే. జైనమతస్థాపకుడు వర్ధమాన నామాంతరముగల మహావీరుడు. ఇతడు 'నాతపుత్తు'డు (జ్ఞాతృపుత్రుడు). వర్ధమానుని వంశమునకు జ్ఞాతృకులమని పేరు. త్రిశలా సిద్ధార్థులు అతని తల్లిదండ్రులు. వర్ధమాన మహావీరుడు క్రీ.పూ. 599 లో జన్మించి క్రీ. పూ. 527 లో బీహారులోని పావాపురి వద్ద నిర్యాణము నొందినట్లు జైనులు చెప్పుదురు. జైనులు తమ మతము చాల పురాతనమైన దనియు, మహావీరునకు పూర్వము ఇరువది ముగ్గురు తీర్థంకరు లుదయించి జిన ధర్మమును బోధించి రనియు చెప్పుదురు. ప్రజలు సంసార సాగరమును తరించుటకు తీర్థము(రేవు)లను నిర్మించి దారి చూపి పోయిన మహాత్ము లిరువదిమువ్వు రుండిరని విశ్వసించి, జైనులు వారిని తీర్థంకరు లను పేర ఆరాధింతురు. ఈ తీర్థంకరులలో మొదటివాడు ఋషభదేవుడు. ఇరువది మూడవవాడు పార్శ్వనాథుడు. ఇరువదినాల్గవ తీర్థంకరుడు మహావీరుడు. మహావీరునికి జినుడని, కేవలియని పేర్లు. జినుడు బోధించిన ధర్మము జైనము. కర్మ బంధమునుండి ఆత్మ విమోచనము నొందుట మోక్షము. ఇది సమ్యక్ దర్శనము, సమ్యక్, జ్ఞానము సమ్యక్ చరిత్రముల వలన సాధ్యము. ఈ మూటికి త్రిరత్నములని పేరు. జినునియందలి, జినతత్వము నందలి విశ్వాసమునకు సమ్యక్ దర్శనమని పేరు. ఇది మోక్షమునకు మొదటిమెట్టు. సంశయ, మోహ, విభ్రమ, దోషవివర్జితమును, స్వ, పర స్వరూప గ్రహణశీలమును అయినది సమ్యక్ జ్ఞానము. సమ్యక్ చరిత్రమున అహింస, సత్యము, అస్తేయము (దొంగతనము చేయకుండుట), బ్రహ్మచర్యము, అపరిగ్రహము అను పంచమహావ్రతములు ప్రధానములైనవి. మహావీరుని కాలములోనే స్త్రీలు, పురుషులు, వందలకొలదిగ అతని ధర్మము నవలంబించిరి. మహావీర నిర్యాణానంతరము రెండువందల సంవత్సరములకు మతాచార వ్యవహార విషయములలో అభిప్రాయ భేదములు కలిగి జినధర్మావలంబకులు దిగంబరులని, శ్వేతాంబరులని రెండు సంప్రదాయములుగ విడిపోయిరి. దిగంబరులలో పురుషులకు మాత్రమే సన్న్యాసము స్వీకరించుట కధికారము కలదు. శ్వేతాంబరులలో పురుషులే కాక, స్త్రీలు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కూడ సన్న్యాసము పుచ్చుకొనవచ్చును. దిగంబర జైనులు దిసమొలవారు; తెల్లని వస్త్రములను ధరించువారు శ్వేతాంబర జైనులు. మునులు (సన్న్యాసులు), సన్న్యాసినులు, శ్రావకులు, శ్రావికలు అని జైనులలో నేడు నాలుగు వర్గములు కలవు. సన్న్యాసము స్వీకరింపకుండ జినధర్మ బోధ ననుసరించి జీవితమును గడపు పురుషులకు శ్రావకు లని, స్త్రీలకు శ్రావికలని పేరు.

జైనులలో కర్మబంధ విముక్తి గలిగి నిర్వాణము నొందినవారు సిద్ధులు. తీర్థంకరులును సిద్ధులలోనివారే. జైనయతులలో అర్హతులు, ఆచార్యులు, ఉపాధ్యాయులు, సాధువులు లేక మునులు అని నాలుగు శాఖలవారు కలరు. వీరిలో కార్మణశరీరమును పరిత్యజించి నిర్వాణము నొంద సిద్ధముగా నున్న సర్వజ్ఞులు అర్హతులు. పురాతనకాలములో జైనులకు నిర్గ్రంథు అని వ్యవహార ముండెను. నిర్గ్రంథు లనగా బంధరహితులు. జైనములో దిగంబర సంప్రదాయమే మొదటిది; శ్వేతాంబర సంప్రదాయము తరువాతిది.

జైన, బౌద్ధములలో జైనమే మొదట పుట్టినది. తరువాతనే బౌద్ధము వచ్చినది. మహావీర జీవితము చరమదశలో బుద్ధుడు తన మతమును బోధించెనని చరిత్ర పరిశోధకులు చెప్పుదురు. జైన, బౌద్ధములకు చాల పోలికలు కలవు. బౌద్ధులవలెనే జైనులుకూడ అర్హతులకును, ప్రసిద్ధులైన మునులకును వారి ధాతువు లుంచి స్తూపములు నిర్మించిరి. కాని జైన చైత్యములు బౌద్ధచైత్యములంత ఎత్తయినవి కావు. బౌద్ధులకువలెనే జైనులకును కొండలలో తొలిచిన గుహాలయములు కలవు. జైన దేవాలయములకు 'బసదు' అనిపేరు. వసతి శబ్దభవము బసది. ఇదియే జన సామాన్యము ఉచ్చారణలో బస్తి యైనది (బస్తి యనగా జైనదేవాలయములతో శోభిల్లు పురము). ఇరువదినలుగురు తీర్థంకరులకును వేరు వేరు లాంఛనములు కలవు. శిల్పములో ఈలాంఛనములనుబట్టి ఆయా తీర్థంకర విగ్రహములను గుర్తింపవచ్చును. ఋషభదేవుని లాంఛనము వృషభము, రెండవ తీర్థంకరుడు అజితనాథునికి ఏనుగు, పార్శ్వనాథునికి శేషుడు (సర్పము), వర్ధమాన మహావీరునికి సింహము. ఇట్లు వేరు వేరు తీర్థంకరులకు వేరు వేరు లాంఛనములు కలవు.



చిత్రము 88. పార్శ్వనాథుడు, గోదావరిజిల్లా

జైన మెప్పటి నుండి తెనుగుదేశములో వ్యాపించినదో చెప్పుట చాల కష్టము. ఇందుకు సరియైన చారిత్రక ప్రమాణము లెవ్వియు లేవు. అసలు జైనము దక్షిణదేశములో వ్యాపించెనని చెప్పు మొదటి గాథ మౌర్య చంద్రగుప్త చక్రవర్తి యొక్క గురువని చెప్పబడు భద్రబాహు మునికి సంబంధించినది. చంద్రగుప్త చక్రవర్తి మగధ సామ్రాజ్యమును పాలించుచుండిన కాలములో ఒకప్పుడు ద్వాదశ వర్ష క్షామము సంభవించినదట. తన తపః ప్రభావముచేత ఈ విషయమును దెలిసికొని భద్రబాహుముని కొంతమంది జైనాచార్యులను వెంటబెట్టుకొని దక్షిణాపథమునకు వచ్చెనట. జిన ధర్మావలంబకులు దక్షిణాపథమునకు వచ్చుటకు అదియే మొదటిమారు. ఈ గాథనుబట్టి జైన ధర్మము మొదటిమారు దక్షిణదేశములో వ్యాపించినది మౌర్యచంద్రగుప్తుని కాలములో — క్రీస్తుపూర్వము నాల్గవ శతాబ్దిలో — అని చెప్పవలెను.

కాని భద్రబాహుముని దక్షిణదేశమునకు వచ్చునప్పటికే దక్షిణ హిందూదేశములో జైను లుండి నట్లు జిన మతావలంబకులు చెప్పుదురు. ఇరువదినాల్గవ తీర్థంకరుడైన మహావీరుడు కళింగదేశమునకు వచ్చి జైన మతమును బోధించినట్లు జైనులలో పరంపరగా వచ్చు గాథ ఒకటి ఉన్నది. హారిభద్రీయవృత్తి అను జైన మతగ్రంథములో కళింగ దేశమును మహావీరుని తండ్రికి మిత్రుడైన రాజు పాలించుచుండగా మహావీరుడు అక్కడికి వచ్చి తన ధర్మమును బోధించినట్లు చెప్పియున్నది. ఇది గాథయే కాని దీనిని రుజువు చేయదగిన చారిత్రక నిదర్శనము ఏమియును లేదు.

భద్రబాహు మునికి చాలకాలము పూర్వమే జైనము ఆంధ్రదేశములో వ్యాపించినట్లు తెలియజేయునట్టి పై గాథవంటిది మరొక గాథ క్రీస్తుశకము పండ్రెండవ శతాబ్దిలో నరేంద్రసేనముని శిష్యుడయిన నయసేన దేవు డను జైనకవి రచించిన 'ధర్మామృత'మను జైన మతకావ్యమున పదునొకండవ అశ్వాసములో కలదు.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఈ గాథవల్ల మహావీరునికి చాల పూర్వుడును, ఇరువది నలుగురు తీర్థంకరులలో పండ్రెండవ వాడును అయిన వాసుపూజ్య తీర్థంకరుని యొక్క కాలములోనే, అనగా మహావీరుని కంటెను చాలకాలమునకు పూర్వమే జైనధర్మము దక్షిణదేశములో - అందును ఆంధ్రదేశములో - వ్యాపించినట్లు తెలియుచున్నది. ఈ గాథవల్ల మనకు తెలియవచ్చు విషయ మిది :

వాసుపూజ్య తీర్థంకరుని కాలములో చంపాపురము రాజధానిగా అంగదేశమును పరిపాలించుచుండిన ఇక్ష్వాకు వంశజుడైన యశోధరు డనురాజు అనంతవీర్య, శ్రీధర, ప్రియబలు లను తన ముగ్గురు కొడుకులతోను, సైన్యముతోను బయలుదేరి దేశములు జయించుచు వేగి దేశమునకు వచ్చి ఆ దేశము సౌందర్యమును చూచి ముగ్ధుడై అక్కడనే నిలిచి ప్రతిపాలపురమును నిర్మించి, దానిని రాజధానిగ జేసికొని ఆ దేశమును పరిపాలించెను. యశోధరుడును, అతని కొడుకు లందరును జిన ధర్మావలంబకులు. వీరు జైనాచార్యులవద్ద జినదీక్ష తీసికొని తపస్సు చేసినట్లు చెప్పిన ప్రదేశము లన్నియు తెలుగు దేశములోనివిగనే గుర్తింపదగి యున్నవి. శ్రీపర్వతము, మల్లికార్జునము, సిద్ధవటము, అమరావతి మొదలైన వన్నియు వారి తపస్సుకు సంబంధించిన స్థలములు. యశోధరుని రాజధాని ప్రతిపాలపురమును గుంటూరు జిల్లాలోని ఇప్పటి భట్టిప్రోలుగా చరిత్ర పరిశోధకులు గుర్తించుచున్నారు. ఈ గాథకూడ మొదట చెప్పినదానివంటిదే. చరిత్ర విషయకముగ దాని కెంత ప్రామాణికత ఉన్నదో దీనికిని అంతే ఉన్నది. పట్టిగాథ లగుటచేత వీని నంత ప్రామాణికములుగ గ్రహించుటకు వీలు లేదు.

ఈ గాథలమాట ఎట్లున్నను మౌర్య వంశమువారి కాలములో జైనమతము తెలుగు దేశములో వ్యాపించిన దనుటకు సంశయము లేదు; ఎందుచేత అనగా జైన మతము బాగుగ వ్యాప్తి చెందినది మౌర్య వంశజుడగు అశోక చక్రవర్తి పౌత్రుడైన సంప్రతి అను రాజు కాలముననే; బౌద్ధ మతమునకు అశోక చక్రవర్తి ఎటువంటి ఆదర, ప్రోత్సాహము లిచ్చెనో సంప్రతికూడ జైనమున కటువంటి ఆదర ప్రోత్సాహముల నిచ్చెను.

సంప్రతి శ్వేతాంబర జైన సంప్రదాయమునకు చెందినవా డగుటచేత ఆ సంప్రదాయమున కెక్కువ ఆదరము చూపి దానిని దేశములో బాగుగ వ్యాపింపజేయు నిమిత్తము శ్వేతాంబర జైనాచార్యులను దేశ దేశములకు పంపెను. వీరి ప్రయత్నములవల్లనే, మొదటి పర్యాయము జైనము కళింగ దేశములో వ్యాపించినది. కాని కళింగ దేశమునకు సంప్రతి పంపిన జైనాచార్యు డెవ్వడో మనకు తెలియరాదు. క్రీస్తుశకమునకు పూర్వమే అవైదికము లైన జైన, బౌద్ధములు బాగుగ వ్యాపించుటచేతనే కావచ్చును కళింగమునకు పోయినవారు ప్రాయశ్చిత్తము చేసికొనవలయునని సూత్రకారుడైన బోధాయనుడు శాసించియున్నాడు (I.1.30, 31).

క్రీస్తుకు పూర్వము మొదటి రెండు శతాబ్దులనాటికి ఉత్తర కళింగములో జైన ధర్మము బాగుగా పాదుకొన్నది. దీనికి ఇంకను ప్రోత్సాహ మిచ్చి వ్యాపింపజేసిన వాడు కళింగాధిపతి 'చేతియ' వంశజుడయిన ఖారవేల మహారాజు. ఈ ఖారవేల మహారాజు, ఇతని పట్టమహిషి, ఇతని పుత్రులు అందరును జిన ధర్మము నవలంబించిన వారే. వీరు అర్హతుల నిమిత్తము అనేక దానములను, ధర్మములను జేసినారు; జైన మతమునకు ఆదర ప్రోత్సాహములు చూపినారు. ఖారవేల మహారాజు జినధర్మ నిరతుడు. ఇతడు కుమారగిరిమీద దివ్యమైన ఒక వసతిని నిర్మించెను. పూర్వ మేనాడో నందమహారాజు కళింగ దేశమునుండి తీసికొనిపోయిన జిన విగ్రహమును మరల కొనివచ్చి కళింగములో ప్రతిష్ఠించెను. సంప్రతి ప్రయత్నములవల్ల అదివరకే కళింగ దేశములో వేరుతన్నిన జైనము ఖారవేల మహారాజు చూపిన ఆదర ప్రోత్సాహములవల్ల మరింత బలపడినది. ఈ మహారాజు పట్టాభిషిక్తు డయిన పదుమూడవ సంవత్సరమున కుమార పర్వతము నందు అర్హతుల నిమిత్తము కొన్ని గుహలను, అతని పట్టమహిషి కళింగ దేశీయులైన అర్హత శ్రమణుల నిమిత్తము కొన్ని గుహలను తొలిపించి యిచ్చిరి. వీనిని ఇప్పటికిని ఓఢ్ర దేశములోని ఉదయగిరి, ఖండగిరులలో చూడ వచ్చును. గుహలు తొలిపించిన కాలములో ఈ కొండలకు కుమారీ, కుమార పర్వతములని పేరు. ఇవి రెండును ఇంచుమించుగ కలిసియే యున్నవి. ఈ రెంటికిని మధ్యనుండు పల్లపు ప్రదేశము ఎడము. నూరు గజములు మాత్రమే. ఖండగిరి భువనేశ్వరమునకు వాయవ్యముగ నాలుగైదు మైళ్ళ దూరమునను, కటకమునకు నైరృతి దిశను పందొమ్మిది మైళ్ళ దూరమునను ఉన్నది.

ఖారవేలుని కాలమున జైనము కళింగమున ఉచ్చదశలో ఉండినను, ఆ మహారాజునకు తరువాత రమారమి ఎనిమిది తొమ్మిది వందల సంవత్సరములవరకు జైనమతమునకు సంబంధించిన శాసనములుకాని, ఇతర నిదర్శనములుకాని కళింగములో కానరాకపోవుటవల్ల అది పూర్తిగ నశింపకపోయినను చాలవరకు క్షీణించినట్లు ఊహింపవలసియున్నది. ప్రాయికముగ జైనము క్షీణించిన



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కాలములోనే కళింగ దేశములో బౌద్ధ, వైదిక ధర్మములు వ్యాపించి యుండవచ్చును.

కళింగమును విడిచిపెట్టి ఇక ఇతరాంధ్ర దేశమునందలి జైన మత వ్యాప్తిని పరిశీలింతము. క్రీస్తుకు పూర్వమునుండి క్రీస్తు శకము ఆరంభ శతాబ్దములలో ఆంధ్రదేశమును పాలించిన సాతవాహన కులజులు వైదిక ధర్మ నిరతులై అనేకమైన క్రతువులు చేసినవారైనను వారిలో కూడ జిన ధర్మమును అవలంబించిన వారు లేకపోలేదని ప్రభావక చరితములోని కాలకసూరి ప్రబంధమను నాలుగవ అధ్యాయమువల్ల తెలియుచున్నది. సాతవాహనుడను రాజు ప్రతిష్ఠాన నగరము పాలించుచుండిన కాలములో కాలకసూరి అను జైనాచార్యుడు ఆ నగరమునకు వచ్చెనట. శ్రావకుడైన సాతవాహనుడు ఆ యాచార్యుని దర్శించి సగౌరవముగ అతనిని ఆదరించెను. ఇంతలో ఏటేట భాద్రపద మాసమున జైను లుపవాసము నారంభము చేయు పర్యుషణ సమయము వచ్చినది. ఈ పర్యుషణ వ్రతము హిందువుల చాతుర్మాస్య దీక్షవంటిది. భాద్రపద శుద్ధ పంచమినా డిది ఆరంభ మగును. సాధారణముగ ఈ పర్యుషణ కాలమున శ్రావికా శ్రావకులందరు జైన మఠమునకు వెళ్ళి అక్కడ ఆచార్యులు చేయు ధర్మ ప్రసంగములు వినుట ఆచారము. అందువల్ల కాలకాచార్యుడు పర్యుషణ వ్రతారంభ సందర్భములో తాను చేయబోవు ధర్మ ప్రసంగమును వినుటకు రావలసినదని సాతవాహనుని కోరెను. భాద్రపద శుద్ధ పంచమీ తిథిని ఐంద్ర మహోత్సవము జరపుట దేశాచార మనియు, అందువలన ఈ పర్యుషణ వ్రతమును పంచమినాడు గాక ఆ మరుసటి దినమున షష్ఠినాడో, మరొక తిథియందో జరపునట్లయిన తాను తప్పక రాగలవనియు, తాను వచ్చి ఆ ప్రసంగమును వినుటకు వీలుగనుండునట్లు ఆ తిథిని మార్పవలసిన దనియు సాతవాహనుడు కాలకాచార్యుని వేడుకొనెనట. అందుకు ఆయాచార్యుడు షష్ఠినాటికి కాని, అటుతరువాత మరియొక తిథికిగాని దానిని మార్చుటకు వీలులే దనియు, అంత అవసరమయినయెడల భాద్రపద శుద్ధ చతుర్థికి దానిని మార్పవచ్చు ననియు చెప్పి ఆవిధముగ చేసెనట. అప్పటినుండి యిప్పటివరకు ఈ పర్యుషణ వ్రతమును కొందరు భాద్రపద శుద్ధ చతుర్థినాడును, మరికొందరు భాద్రపద శుద్ధ పంచమినాడును ఆచరించు చున్నారు. ఈ పై వృత్తాంతమువలన సాతవాహనులలో కూడ కొందరు జైను లుండువారని విదిత మగుచున్నది. కాని ఈ సాతవాహను డెవడో మనకు తెలియదు.

జైనమతము చాల పురాతనకాలములోనే రాయలసీమలోకూడ వ్యాపించిన దనుటకు అవకాశము కలదు. రాయలసీమలోని కడపజిల్లాలో ఒంటిమెట్టకు మూడుమైళ్ల దూరములో గంగపేరూ రను గ్రామ మున్నది. ఇక్కడ సింహనంది అను జైనాచార్యు డుండువాడట. ఒకప్పుడు ఆ యాచార్యుని వద్దకు గంగాన్వయమునందు పుట్టిన దడిగ, మాధవులను రాజకుమారులను ఉత్తరదేశములోని అహిచ్ఛత్రపుర మను నామాంతరముగల విజయపురమును ఉజ్జయినీ పురాధిపతి అయిన మహీపాలుడు ముట్టడించుటచేత వారి తండ్రి పద్మనాభనృపతి కొంత పరివారమును తోడిచ్చి యచ్చటినుండి రహస్యముగ పంపగా వారు దక్షిణాపథమునకు వచ్చి సింహనంద్యాచార్యులవారి దర్శనము చేసికొని తమ దీనావస్థను వారి కెరిగించినారట. ఆ యాచార్యులవారి అనుగ్రహముచేత వారు గంగరాజ్య స్థాపకులైనారట. వారికి కువలాలపురము (ఇప్పటి కోలారు) రాజధానియు, నందిదుర్గము కోటయు ఆయెనట. ఈ వృత్తాంతమువల్ల దడిగ, మాధవులను రాజకుమారులు గంగరాజ్యమును స్థాపించునప్పటికే రాయలసీమలో జైనమతము వరలుచుండె నన్న విషయము స్పష్టమగుచున్నది. చరిత్రకారులు గంగరాజ్యము క్రీస్తుశకము నాలుగవ శతాబ్దిలో స్థాపితమయినట్లు చెప్పుదురు.

తెనుగుదేశములో జైనమతము క్రీస్తుశక ప్రారంభ శతాబ్దులనుండి వెలయుచున్నట్లు పై విషయములవలన తెలియుచున్నను అది బౌద్ధమువలె జనాదరమునుగాని, రాజాదరమునుగాని పొందినదని చెప్పుటకు అవకాశము లేదు. తెనుగు దేశములోకంటె కన్నడ దేశములో ఈ జైనమతము బాగుగ వ్యాపించినది. కన్నడ దేశములో ఈ మతము చాళుక్యవంశజుడైన రెండవ పులకేశి కింకను పూర్వము నుండి వర్ధిలుచుండినది. పులకేశి మహారాజు యొక్క అయ్యావళి శాసనమును రచియించినవాడు జైనకవి రవికీర్తి. వాతాపి రాజధానిగ ఆ పరిసర ప్రాంతమును పరిపాలించిన చాళుక్య వంశజులలోని మొదటి రాజులు జైనమతమును అభిమానింపక పోయినను చివరి రాజు లందరును జైనమతపోషకులే. చాళుక్య వినయాదిత్యుడు, విజయాదిత్యుడు, రెండవ విక్రమాదిత్యుడు వీ రందరును జైనాచార్యులకును, జినభవనములకును దాన మిచ్చిన గ్రామములు శాసనములవలన తెలియవచ్చుచున్నవి. వాతాపి చాళుక్యుల అనంతరము వారి రాజ్యమును పాలించిన రాష్ట్రకూట నృపతు లందరును జైన మతాభిమానులే; చాలమంది జైనమతావలంబకులే. వారు కన్నడదేశములో వేరు తన్నుకొని యున్న జైనధర్మమును



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఇంకను దేశ మంతటను శాఖోపశాఖలుగా విస్తరింపజేసిరి. వాతాపి చాళుక్యులును, రాష్ట్రకూటులును ఒక్క కన్నడ దేశమును మాత్రమే కాక తెలుగు దేశములో కొంత భాగమునుకూడ పరిపాలించి యుండుటచేత వారి కాలములో జైనము హైదరాబాదు రాజ్యములోని ఇప్పటి తెలంగాణాలోను, రాయలసీమలోను ఎక్కువగా వ్యాప్తి చెందినది. రాష్ట్రకూట మహారాజులు జైనమతాభిమానులును, జినధర్మావలంబకులును అగుటచేత వారి సామంతులును, మండలేశ్వరులును ఆ మతమునందు అభిమానముంచి పోషించుచు వచ్చిరి.

హైదరాబాదు రాజ్యమందలి తెలంగాణాలోని బోధన్ అని నేడు వ్యవహరింపబడుచుండు పురము జైన వాఙ్మయములో కడుప్రసిద్ధమైనది. ఇది రాష్ట్రకూట రాజయిన నిత్యవర్ష ఇంద్రవల్లభునికి (క్రీ. శ. 915-క్రీ. శ. 927) రాజధానియై యుండెను. ఇది దక్షిణ హిందూదేశ జైనుల ఆదిమ తీర్థములలో నొకటి. ఇది చాల పురాతనకాలము నుండియు గొమ్మటేశ్వరస్థానము. పురుదేవ తనూభవుడైన భరత చక్రవర్తి ఈ పురములో 525 ధనుస్సుల పొడుగుగల విజయబాహువు-బాహుబలకేవలిని బోలిన విగ్రహమును చేయించెననియు, కొంతకాలమైన తరువాత అవిగ్రహము చుట్టును విశ్వభయావహమైన 'కుక్కుట సర్ప సంచయము' పెరిగిన దనియు, అప్పటి నుండి ఆ విగ్రహమునకు కుక్కుటేశ్వరు డనుపేరు కలిగె ననియు, అటుపిమ్మట ఆ విగ్రహ మున్న స్థలము అగమ్యమయిన దనియు చెప్పుదురు. ఆ విగ్రహముకూడ ప్రజలకు కాలక్రమమున గానరాక పోయినదట. ఈ పురము ప్రాచీననామము పోదనపురము. ఇప్పటికిని ఇచ్చట జైన శిథిలావశేషములు కనబడుచుండును. ఈ పురము క్రీ. శ. పదవ శతాబ్దమునకు పూర్వమే విఖ్యాత జైనకేంద్రముగ నుండెడిది.



చిత్రము 89. 10వ శతాబ్ది ప్రాంతపు చౌముఖ, దానవులపాడు

కన్నడభాషలో త్రిరత్నములని పేరువడిన పొన్న, రన్న, పంప కవులలో పొన్నడు వేంగిదేశములోని కమ్మనాటియందు రాష్ట్రకూట చక్రవర్తికి సామంతుడయి పుంగనూరు ప్రాంతమును పాలించుచుండిన మల్లపయ్యయను బ్రాహ్మణ ప్రభుని యాస్థానములో నుండినవాడు. జైన మతమును అభిమానించి జైనకవులను పోషించిన రాష్ట్రకూట సామంతులలో వేములవాడ రాజధానిగ పాలించిన చాళుక్య వంశజులు ముఖ్యులు. వేములవాడ హైదరాబాదు రాజ్యములోని తెలంగాణాలో కరీంనగరము జిల్లాలో నున్న గ్రామము. పంపకవి వేములవాడ చాళుక్య రాజులకు ఆశ్రితుడు. పంపకవికి ఆదిపంపడని నామాంతరము కలదు. ఇతని జన్మస్థానము కమ్మనాటిలోని వేంగిపళు అను గ్రామము. పొన్న, పంప కవులు ఉభయులును కూడ వేంగిదేశవాసులే.

రాష్ట్రకూట ముమ్మడి కృష్ణ చక్రవర్తి కాలమున పైచెప్పిన వేములవాడలో సుప్రసిద్ధ జైనమతాచార్యుడును, బహుసంస్కృత గ్రంథకర్తయు నగు సోమదేవసూరి వెలసెను. ఇతడు వేములవాడ చాళుక్యభూపాలుడైన రెండవ బద్దెగరాజు గురువు. బద్దెగని యనంతరము రాజ్యమును పాలించిన మూడవ అరికేసరి నృపతి అతనియం దభిమానముంచి సబ్బినసహస్రాంతర్గత మగు రేపాకద్వాదశ గ్రామమధ్యమందలి కుత్తుంవృత్తి-వనికటుపలు గ్రామమును తన తండ్రి బద్దెగభూపతి నిర్మించిన శుభదానజినాలయ పూజా పురస్కారములకు దానము చేసెను. సోమదేవసూరి యొక్క మత ప్రచారమునకు ఫలితముగా జైనము తెలంగాణాలో విశేషముగ వ్యాప్తి నందెను.

రాష్ట్రకూట రాజులలో నొకడయిన ముమ్మడి ఇంద్ర నిత్యవర్ష మహారాజు జైనమతపోషకుడు. ఇతని కాలములో రాయలసీమలోని కడపజిల్లా దానవులపాడు ఒక జైనబస్తి. కనకకీర్తి దేవాచార్యులు మొదలైనవారి ప్రస్తావము ఇక్కడ బయటపడిన శాసనములలో నున్నది.

పదునారవ తీర్థంకరుడయిన శాంతినాథుని స్నానక్రియకుగాను నిత్యవర్ష మహారాజు ఒక పీఠము చేయించినట్లు తెలుపు శాసనముగూడ నిచట ఒకటి కలదు. దానవులపాడు పురాతనకాలములో గొప్ప జైన బస్తి యను విషయము అక్కడ ప్రభుత్వ పురాతత్వశాఖవారు జరపిన త్రవ్వటపు పనివల్ల బాగుగ రూఢి అయినది.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వాతాపి చాళుక్యులు పూర్వాంధ్ర దేశమును జయించి నప్పటినుండియు జైనము అక్కడ బాగుగ పాదుకొని వృద్ధిపొందినట్లు కనిపించుచున్నది. పూర్వ చాళుక్య రాజ్యమును స్థాపించిన కుబ్జవిష్ణువర్ధనుడు రెండవ పులకేశి మహారాజు తమ్ముడు. ఇతడు సముద్రతీరస్థమయిన ఆంధ్రదేశమును పరిపాలించునాటికి కృష్ణజిల్లా విజయవాడ జైన కేంద్రమై యుండెను. ఆ నగరములో 'నడుంబి వసతి' అను జైన దేవాలయ ముండెను. దేవాలయమును అంటి జైన మఠముకూడ ఉండెనని ఊహింపవచ్చును. ఈ 'నడుంబి వసతి'కి కుబ్జవిష్ణువర్ధన మహారాజు భార్య అయ్యణమహాదేవి 'తోంకనాతవాడి విషయము'లోని మునిసికుండ అను గ్రామమును దానము చేసినది. ఆ గ్రామము ఏకారణముచేతనో కొంతకాలమయిన తరువాత, ఆ జైనవసతి అధీనములోనుండి తప్పిపోవుటచేత కాబోలు - ఆ మహారాజు పౌత్రుని పౌత్రుడయిన మూడవ విష్ణువర్ధన మహారాజు ఆ గ్రామము నా వసతికి మరల ధారవోసి క్రీ. శ. 762 లో దానశాసనమును ఇచ్చెను. పూర్వచాళుక్య భూవరులు జైనమును ఆదరించినట్లు తెలుపు మొదటి దాన శాసనము ఈ మూడవ విష్ణువర్ధన మహారాజుదే.

చాళుక్యరాజులలో జైనధర్మమును ఆదరించినవారు ఇంకను కొందరు కలరు. వారిలో రెండవ అమ్మరాజ విజయాదిత్య భూపతి ముఖ్యుడు. ఈ మహారాజు వైదిక ధర్మ నిరతుడయినప్పటికిని ఇతర మతములనుకూడ తన మతమునువలెనే సహనబుద్ధి కలిగి ఆదరించినాడు. ఇతని సామంతులు కొంతమంది జైన మతావలంబకు లుండువారు. వారు జైన వసతులకుకాని, జైనాచార్యులకు కాని గ్రామ దానములు చేయ దలచినప్పుడు ఆకాలపు మర్యాద ననుసరించి - అట్టి దానము చేయుటకు గల హక్కు ఒక్క మహారాజునకే యుండుటచేత - వారు అతనిని ప్రార్థించి అతనిచేత ఆదానము చేయించువారు. భీమ, నరవాహనులు అను త్రినయన కులములో బుట్టిన ఇద్దరు సోదరులు రెండవ అమ్మరాజ విజయాదిత్యునికి సామంతులు. వా రుభయులును జినధర్మ పరాయణులు. వారి తల్లిదండ్రులు మేడాంబా, మేలపరాజులు; ఉభయులును జినవ్రత నిరతులు. భీమ, నరవాహనుల గురువు జయసేనాచార్యులవారు. ఆ సోదరులే యాచార్యుని కొరకు విజయవాటికలో రెండు జినభవనములను కట్టించి వాని నిమిత్తము రెండవ అమ్మరాజ విజయాదిత్య మహారాజు చేత పెదగాద్దిపర్రు గ్రామమును సర్వకర పరిహారము చేసి దేవభోగముగ దాన మిప్పించిరి. ఆ మహారాజు కాలములోనే జినాలయములకు చేసిన మరిరెండు దానము లున్నవి. వలహారిగణములోని అడ్డకలి గచ్ఛములో ప్రసిద్ధులైన జైనమును లుండువారు. వారిలో సకలచంద్ర సిద్ధాంతదేవముని జైన సిద్ధాంతము పారము చూచిన వాడు. అతని శిష్యుడు అయ్యపోటి మునీంద్రుడు. ఇతని శిష్యుడు అర్హనందిముని. ఇతడు సర్వలోకాశ్రయ జినభవన మను జినాలయమునకు అధిష్ఠాత. బహుశః ఈజినాలయము రెండవ అమ్మరాజు పేరనే వెలసి యుండవచ్చును. ఆ మహారాజునకు సర్వలోకాశ్రయు డని బిరుద మున్నది. ఈ సర్వలోకాశ్రయ జినభవనమునకు సంబంధించి ఒక సత్ర ముండెను. అర్హనంది మునీంద్రుని శిష్యురాలు పట్టవర్ధికాన్వయతిలక యగు చామెకాంబ గణిక. జిన ధర్మమును వృద్ధి పొందించుటలో ఆమె ఆసక్తి కలది. జినాలయమునకు చెందిన ఆ సత్రముకొరకు చామెకాంబ వేంగినాథుడైన రెండవ అమ్మరాజ విజయాదిత్యునిచేత అత్తిలి విషయములోని కలుచుంబఱ్ఱు - ఇప్పటి పశ్చిమ గోదావరి జిల్లాలోని కంచుమఱ్ఱు — గ్రామమును అర్హనంది మునీంద్రుని కిప్పించినది. గుంటూరు జిల్లాలో ధర్మవర మను గ్రామ మున్నది. దీనికి పూర్వపు పేరు ధర్మపురి. ఈ గ్రామములో దక్షిణదిశను చాళుక్య గుణగ విజయాదిత్య నృపతియొక్క సర్వసైన్యాధిపతియు, పాండురంగని సంతతివాడునైన దుర్గరాజు కట్టించిన జినాలయ మున్నది. పాండురంగని కుమారుని కాలమునుండి అతని సంతతివారు - కొడుకు నిరవద్య ధవళుడు, మనుమడు విజయాదిత్యుడు, మునిమనుమడు దుర్గరాజు - అందరును కటకాధిపతులే. దుర్గరాజు కటకాధిపతి గనుక అతడు తన పేర కటకాభరణ జినాలయమని ఆ జినభవనమునకు పేరు పెట్టెను. కటకాభరణ జినాలయమును ప్రతిపాలించిన జైనమును లందరు యాపనీయ సంఘమునకు చెందిన కోటిమడువ గణములోని నందిగచ్ఛమను సంప్రదాయమునకు సంబంధించిన వారు. వీరిలో జినసంది ముని సుప్రసిద్ధుడు. ఇతని శిష్యుడు దివాకరముని పుంగవుడు కేవలజ్ఞాననిధి; గుణసంపదచేత స్వయముగా జినసదృశుడు; మహాత్ముడు. ఇతని శిష్యుడు శ్రీమాందిర దేవముని. ఇతడు దుర్గరాజు కాలములో కటకాభరణ జినాలయమునకు పాలకుడు; అధిష్ఠాత. కటకాధిపతియైన దుర్గరాజు విజ్ఞప్తి చేయగా రెండవ అమ్మరాజ విజయాదిత్య మహారాజు ఈ జినభవనమునకు మరమ్మత్తుల నిమిత్తము, బలిహారణము, పూజాదులు, సత్రము మొదలైన వాని నిమిత్తము ఉత్తరాయణ పుణ్యకాలమందు పన్ను లేవియు లేకుండ చేసి ఉదకపూర్వముగ కమ్మనాటిలోని ముల్లియ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పూండి (ఇప్పటి మల్లిపూడి) గ్రామమును దానము చేసెను.

రెండవ అమ్మరాజ విజయాదిత్యుని తరువాత జైనము నాదరించిన చాళుక్య మహారాజు విమలాదిత్యుడు. ఇతడు జైనము నాదరించుటయే కాక తన రాజ్యకాలము చివరి సంవత్సరములలో తానును జినధర్మము నవలంబించినట్లు తెలియుచున్నది. విమలాదిత్యునికి సర్వలోకాశ్రయ విష్ణువర్ధను డనియు, రాజమార్తాండు డనియు, ముమ్మడి భీము డనియు బిరుదములు గలవు. ఇతని గురువు దేశిగణమునకు చెందిన త్రికాలయోగి సిద్ధాంతదేవ ఆచార్యుడు. ఇతనికి త్రికాలయోగి మునీంద్రు డని కూడ పేరు. ఈ విషయమును తెలుపు శాసనము విశాఖపట్టణము జిల్లాలోని రామతీర్థములో కన్నడభాషలో వ్రాయబడి యుండుటచేత ఈ త్రికాలయోగి మునీంద్రు డొకవేళ కర్ణాటకుడై యుండ వచ్చునని చరిత్రకారుల ఊహ. ఆ కాలములో జైనము కన్నడదేశములో బాగుగ వ్యాపించి యుండినది. సముద్ర తీరస్థమైన తెలుగు దేశములో కూడ జైనము రాజాదరణమున బాగుగ వ్యాపించినదని పైని చెప్పిన ఉదాహరణములవలననే తెలియుచున్నది. విశాఖపట్టణములోని రామతీర్థము బౌద్ధక్షేత్రమే కాక జైనులకుకూడ పుణ్యస్థలముగ నుండెడిది. తూర్పుగోదావరి జిల్లాలోని పెనుగొండ మొదలైన గ్రామములలో ఇదివరకు ఉండినవియే కాక ఇప్పటికిని క్రొత్తగ అప్పు డప్పుడు జైనవిగ్రహములు బయట పడుచునే యుండును. ఒక్క తూర్పు, పడుమటి గోదావరి జిల్లాలలోని గ్రామములలోనే కాదు, నెల్లూరు గుంటూరు కృష్ణ జిల్లాలలోని గ్రామములలో కూడ కొన్నింట జైనవిగ్రహము లున్నవి. వీనివల్ల జైనము పూర్వము తెలుగు దేశములో బాగుగ వ్యాపించినదని చెప్పవచ్చును. అది వేంగి చాళుక్యుల అధికారము అంతరించిన తరువాత కూడ చాల కాలము వరకు వర్ధిల్లినదనుటకు ఆధారములు గలవు.

రాజరాజ నరేంద్రుని కుమారుడు కులోత్తుంగచోళదేవుని కాలములో గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా ముసుగోడు గ్రామము జైనక్షేత్రముగ నుండెనని తెలియవచ్చుచున్నది. ఇక్కడ జైనమును గురించి తెలియజేయు శాసనములు మూడు కానవచ్చినవి. ఈ శాసనములవల్ల ఇక్కడి జైనవసతికి 'పృథివీతిలక జైన వసతి' అని పేరని తెలియుచున్నది. ఈ పృథివీతిలక జైనవసతి శ్వేతాంబర జైనములది. ఇక్కడి 'సితజినేశ్వరాలయము'నకు మొదటి కులోత్తుంగ చోడ భూపతి యొక్క ముప్పదియేడవ రాజ్యవర్షములో ఆ మహారాజునకు సామంతుడై చందవోలు (గుంటూరుజిల్లా రేపల్లె తాలూకా) రాజధానిగ ఆ ప్రాంతమును పాలించుచుండిన మహామండలేశ్వర వెలనాటి గొంకభూపతి అను దుర్జయకులజుడు కొంత భూదానమును చేసెను. ఇల్లే అగ్గోతి యను ధర్మతత్పరు డొకడు మునుగోడులో సువ్రత తీర్థమునుల వారి కాలములో జినాలయమును కట్టించె ననియు, ఆ జినాలయమునకు గొంకభూపతి భటు డొకడు మరమ్మత్తులు చేయించె ననియు అక్కడి శాసనములలో ఒకదానివల్ల తెలియుచున్నది. కులోత్తుంగ చోడ భూపతి క్రీస్తుశకము పదునొకండవ శతాబ్ది మొదటి పాదమున నుండుటచేత అప్పటికి కూడ గుంటూరు జిల్లాలో జైనము వర్ధిల్లుచుండెనని చెప్పవచ్చును.

చాళుక్య చోళరాజయిన మూడవ రాజరాజదేవుని ముప్పది యేడవ పరిపాలన వర్షమున — అనగా క్రీ. శ. 1258 లో - మతిసాగరదేవుని యాదేశమున ప్రమలదేవి నెల్లూరు జిల్లా కనువర్తిపాటిలో కరికాలచోళ జినాలయమునకు మెట్లు కట్టించెను. దీని ననుసరించి చూడగా నెల్లూరు జిల్లాలో పదుమూడవ శతాబ్దములోకూడ జినాలయములు, జినపూజ ఉండినట్లు స్పష్టమగుచున్నది.

క్రీస్తుశకము పదునొకండు, పండ్రెండు శతాబ్దములలో కళింగదేశమును పరిపాలించిన గంగవంశపు రాజు అనంతవర్మ రాజరాజదేవ భూపతి కాలములో క్రీ. శ. 1178 వ సంవత్సరమున కన్నమ నాయకుడను వర్తకుడు విశాఖపట్టము జిల్లా భోగాపురములో రాజరాజ జినాలయమను పేరుతో ఒక జినభవనమును కట్టించి దానికి రెండు పుట్ల భూమిని దానము చేసినట్లు తెలుపు శాసనమొకటి కలదు. ఇందువల్ల కళింగదేశములో క్రీ. శ. పండ్రెండవ శతాబ్ది చివరవరకు కూడ జైనము వర్ధిల్లుచుండినట్లు విదితమగు చున్నది.

క్రీ. శ. పండ్రెండవ, పదుమూడవ శతాబ్దములలో తెలుగు దేశములో శైవ మభివృద్ధి పొందినది. అందు ముఖ్యముగ తెలంగాణాయును, సముద్రతీరస్థ ఆంధ్రదేశమును శైవ మతమునకు పట్టుగొమ్మలైనవి. ఈ కాలములో తరచుగ జైనులకును, శైవులకును వాదప్రతివాదములు జరగుచు వచ్చుటయు, ఇట్టి వాగ్వాదములు ఏ మండలేశ్వరుని సభలో నైనను ఏ మహారాజు సభలో నైనను జరగినప్పుడు, ఏ పక్షమువారు జయించిన ఆ పక్షమువారు ప్రభువును లోబరచుకొని ఎదిరిపక్షము వారిని సంహరించుటయు, వారి మత సంస్థలను విధ్వంసము చేయుటయు తరచుగ జరగుచు వచ్చినది. పండ్రెండవ, పదుమూడవ శతాబ్దములలో ఇటువంటి వాద ప్రతివాదములు జరగినప్పుడు చాల సందర్భములలో శైవులే



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



గెలిచినట్లును, జైనులు జైనవసతులు విధ్వంసము గావింప బడినట్లును ఆనాటి తెలుగు గ్రంథములవల్ల తెలియ వచ్చుచున్నది. ఇట్టి గ్రంథములలో ప్రధానమయినది పాల్కురికి సోమనాథకవి రచించిన పండితారాధ్య చరిత్ర. ఇది పాశుపత శివాచార్యుడయిన మల్లికార్జున పండితుని చరిత్ర. మల్లికార్జున పండితుని కాలములో చందవోలు రాజధానిగా తత్ప్రాంత దేశమును పరిపాలించు చుండిన దుర్జయ వంశజుడు వెలనాటి రెండవ చోళరాజు బౌద్ధుడట. ఆ మండలేశ్వరుని ఆస్థానములో బౌద్ధులును, జైనులును కూడ నుండిరి. అక్కడి బౌద్ధాచార్యులను, జైనాచార్యులను జయించి తన శైవమతమును స్థాపింపవలెనను కోరికతో ఒకప్పుడు మల్లికార్జున పండితుడు చోళరాజాస్థానమునకు వెళ్లినాడు. వెలనాటి చోడరాజు ప్రపితామహుడయిన మొదటి వెలనాటి గొంకరాజు జైనమతాభిమాని. అందువల్ల జైనులను రాజు ఆదరించుచువచ్చెను. మల్లికార్జున పండితుడు వెలనాటి చోళ మండలేశ్వరుని ఆస్థానమునకు బోయి అక్కడి బౌద్ధాచార్యులతోడను, జైనాచార్యులతోడను వాదించి విజయము పొందినాడు. మల్లికార్జున పండితుడు జైనులతో వాదించిన వర్ణన సందర్భమును పురస్కరించుకొని పాల్కురికి సోమనాథుడు అంతకు పూర్వము శైవులకును జైనులకును ఎక్కడెక్కడ వాదప్రతివాదములు జరగెనో, ఆ వాదములలో శైవులు జయించి ఎక్కెడెక్కడి జైనవసతులను విధ్వంసము కావించి జైనులను సంహరించిరో వివరించియున్నాడు. ఈ చెప్పిన చోట్లయందే కాని ఇంకెక్కడను ఇతర స్థలములలో ఇట్లు జరగలేదని గట్టిగ మనము చెప్పలేకపోయినప్పటికిని ఆ కాలములో శైవులకు, జైనులకు గల విద్వేషమును, దానివల్ల కలిగిన దుష్ఫలితములను తెలియజేయుట కవి చాలును. పాల్కురికి సోమనాథుడు శైవుడగుటచేత శైవులు జయించి శత్రువిధ్వంసనము గావించిన సందర్భములను మాత్రమే వర్ణించియున్నాడు. ఆ కాలపు జైనగ్రంథములే దొరుకునెడల వానిని రచించిన జైనులు వానిలో తాము జయించిన సందర్భములనే వర్ణించియుందురని నిస్సంశయముగ చెప్పవచ్చును. ఇది సహజమే కదా.

దేశములో ప్రబలియుండిన గాథలనుబట్టి చూచినయెడల ఇటువంటి శైవ, జైన వివాదములు ఓరుగల్లు రాజధానిగ తెలుగుదేశమును పాలించిన కాకతిరాజన్యుల కాలములో ఎక్కువగను, తీవ్రముగను జరగుచుండెనని తెలియవచ్చుచున్నది. కాకతి భూవరుల వృత్తాంతమును తెలుపు ప్రతాప చరిత్రములో జైన సంహారమును గురించిన గాథలు చాల కలవు. కాని ఇవన్నియును సత్యమని దృష్టాంత పూర్వకముగ చెప్పుటకు అవకాశము లేదు. ఏ శాసనములలోను శైవులు జైనులను సంహరించినట్టు కాని, జైనవసతులను నాశనముచేసినట్టు కాని చెప్పియుండలేదు. అయినప్పటికిని శైవము ముమ్మరముగ వ్యాపించిన కాకతీయ యుగములో కొన్ని జినభవనములు నాశనమైనవనియు, కొన్ని కొన్ని చోట్ల అవి శివభవనములుగ మార్పుపొందినవనియు చెప్పుట కాధారము లున్నవి. కాకతిరాజన్యులలో మొదటివారు కొందరు జైనమతాభిమాను లయినప్పటికిని తరువాతి వారు చిన్మయదీక్ష పొందిన పరమమాహేశ్వరులు. దేవర దాసయ్య పొట్లచెరువులో నున్న అయిదు వందల వసదులను, కోవూరి బ్రహ్మయ్య కోవూరిలోనున్న జైన వసదులను, ఏకాంత రామయ్య అబ్బలూరిలోని వసదిని, నాదయ్య పులిగెరెలోని వసదులను ప్రచ్చివైపించె ననియు, ఈ స్థలములలోనే కాక ఇతర స్థలములలో జైనులను 'కొర్రు లెక్కించి' 'వసదుల రూపడగించె' ననియు పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో వ్రాసియున్నాడు. అబ్బలూరు, పులిగెరెలు కర్నాటకములోనివే కాని కోవూరు, పొట్లచెరువు గ్రామములు మాత్రము తెలుగు దేశములోనివే. ఇవి యెప్పుడు నాశనమైనవో, దేవర దాసయ్య నాదయ్య మొదలైనవారు ఎప్పటి వారో మనకు నిశ్చయముగ తెలియదు. కాని దక్కను దేశములో శైవము బాగుగ వ్యాపించిన పండ్రెండవ, పదుమూడవ శతాబ్దములలోనే పైన చెప్పిన సంగతులు జరగియుండ వలయుననుటకు సంశయింప బనిలేదు.

కాకతీయుల కాలములోనైనను జైనులు పూర్తిగ నాశనము కాలేదనియు, జినధర్మము తెలుగు దేశములో పూర్తిగా అంతరింపలేదనియు చెప్పుటకు ఆధారమున్నది. ఓరుగల్లు రాజధానిగ పాలించిన కాకతిభూనాథులలో కడపటివాడయిన ప్రతాపరుద్రదేవ మహారాజు (క్రీ. శ. 1295 - క్రీ. శ. 1323)కాలములో ఓరుగంటియందే జైను లుండినట్టు 'జినేంద్ర కళ్యాణాభ్యుదయ' మను గ్రంథమువల్ల విదితమగుచున్నది. ఈ గ్రంథమును రచించినవాడు అప్పయాచార్యుడను జైనుడు. జైనము ఎంతో పురాతన కాలమునుండి తెలుగుదేశములో బాగుగ వ్యాపించినట్లును, తెలుగుదేశములో ఎన్నియో జైన వసదులు ఉండినట్లును మనకు తెలిసినను పైని చెప్పిన జినేంద్ర కల్యాణాభ్యుదయ మొక్కటి తక్క తెలుగు దేశములోని జైనులు రచించిన ఇతర గ్రంథము లేవియు దొరకకపోవుటయే ఆశ్చర్యము. అప్పయార్య విరచితమైన జినేంద్ర



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



శల్యాణాభ్యుదయమునకు ప్రతిష్ఠాసారమని నామాంతరము. అవ్పయార్యుడు పుష్పసేనాచార్యుని శిష్యుడట. తాను ఈ గ్రంథమును శాలివాహన శకము 1241 వ సంవత్సరములో మాఘ శుద్ధ దశమీ ఆదివారము పుష్యమి నక్షత్రమందు ఏకశిలానగరములో (ఓరుగల్లు) రుద్రకుమారుడు భూపరిపాలనము చేయుచుండగ పూర్తి చేసినట్టు అప్పయార్యుడు తన గ్రంథములో వ్రాసికొనియున్నాడు. ఇందువల్ల పదునాలుగవ శతాబ్దములో కూడ జైనము తెలుగుదేశములో వెలయుచుండె ననవచ్చును.

పైని చెప్పిన సంగతులనుబట్టి చూడ కాకతి భూపరుల కాలములో వ్యాపించిన శైవమువల్ల జినధర్మము తెలుగు దేశములో అంతరించినదని చెప్పు గాథలు పూర్తిగ సత్యమయినవి కావని స్పష్టపడును.

కాకతిరాజ్యము పడిపోయిన తరువాత ఆంధ్రదేశములో వైదిక మతము మరల పునరుజ్జీవము పొందినది. ఈ కాలములో మొదట శైవమును, తరువాత వైష్ణవమును జనుల ఆదరమును చూరగొన్నవి. ఈ కాలములో వర్ధిల్లిన విజయనగర రాజ్యములో జైన మున్నప్పటికిని పూర్వకాలములోవలె అది మరల ఉచ్చదశ పొందలేదు. కాని విజయనగరాధీశ్వరులు జైనమును ఇతర మతములతో పాటు సమానముగా ఆదరించుటచేత అది పూర్వము కాకతీయ నృపతుల కాలములోకంటె సుస్థితిలో నుండెననుటకు సందేహింప నక్కర లేదు. విజయనగర రాజ్యమును మొదటి బుక్కరాయ మహారాయలు పాలించుచుండిన కాలములో ఒకప్పుడు వైష్ణవులకును, జైనులకును కలహము సంభవించినది. అపుడు ఆ మహారాజు ఉభయమతములవారిని రావించి జైన, వైష్ణవ దర్శనములు రెండును ఒక్కటేయని హితబోధచేసి కలహ ముడిపి వారి కుభయులకును రాజీ కుదిర్చెను. ఆనాటినుండి విజయనగరములో విజయనగరాధీశ్వరుల పరిపాలనములో వైష్ణవులును,



చిత్రము 90. గనిగిట్టి జైనదేవాలయము, హంపి

జైనులునుమాత్రమే కాక అన్ని మతములవారును ఒకరితో నొకరు పొందిపొసగి సుఖముగ నివసించుచు వచ్చిరి. మొదటి బుక్కరాయలకు తరువాత విజయనగర సింహాసనము నెక్కిన రెండవ హరిహర దేవరాయల సేనాపతులలో ఇరుగప్ప దండనాథు డొకడు. ఇతడు జినధర్మావలంబకుడు; రాజధానీ నగరమైన విజయనగరములో ఒక వసతిని కట్టించెను. హరిహరదేవరాయల రాణి బుక్కవ్వ ఆ వసతికి దానధర్మములు చేసినట్లు తెలుపు శాసనములు కూడ నున్నవి. రెండవ దేవరాయ మహారాయలు కూడ విజయనగరములో తములపాకుల అంగళ్లవీథిని పార్శ్వనాథునికొరకు ఒక జిన భవనమును కట్టించెను. ఈ రీతిని విజయనగర రాజ్యమును పరిపాలించిన మొదటి వంశపు రాజులలో అనేకులు జిన ధర్మమును అభిమానించిన వారే.

అయినప్పటికిని జైనులకును, ఇతర మతముల వారికిని అప్పుడప్పుడు కలహములు సంభవించుట, అవి ఎవరికో ఒకరికి ఉపద్రవకరములుగ పరిణమించుట లేక పోలేదు. ఈ విషయము శ్రీనాథకవి రచితమైన శివరాత్రి మాహాత్మ్యమువల్ల తెలియుచున్నది. శ్రీశైలములోని భిక్షావృత్తి మఠాధిపతి అయిన శ్రీ ముక్తిశాంతభిక్షావృత్తిరాయని ప్రేరణమున శ్రీనాథుడు తన శివరాత్రి మాహాత్మ్యము నంకిత మిచ్చిన ముమ్మడిదేవ శాంతయ్య 'చటుల జైన కోలాహల సమర బిరుద ఘను' డట. శ్రీశైలములో శాలివాహన శకము 1488 కు సరియైన ప్రజాపతి (మాఘ బ. 14 సోమవారము) నాటి ఒక శాసనములో శాంతయ్య కుమారుడయిన లింగయ్య అను ఒక శైవుడు శ్రీశైల మల్లికార్జునునికి చేసిన దానముల వివరము గలదు. ఈ శాసనములో లింగయ్య చేసిన ధర్మకార్యములలో శ్వేతాంబర జైనుల శిరశ్ఛేదము చేయించుట ఒకటియని చెప్పియున్నది. ఇందువల్ల అటుతరువాతి కాలములో కూడ శైవ, జైన కలహములు జరగుచు వచ్చిన ట్లూహింపవచ్చును.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



విజయ నగరమును పాలించిన తుళువ, అరవీటి వంశజు లయిన క్షత్రియుల కాలములో తెనుగు దేశములో వైష్ణవ మతము ముమ్మరముగ వ్యాపించినపుడు అదివరకే క్షీణించియుండిన జైనము అనాదరణమును, రాజాశ్రయము లేక మరింత క్షీణమయి పోయినది. మహారాజాధిరాజులైన విజయనగరాధీశ్వరులు వైష్ణవ ధర్మము నవలంబించి ఉభయవేదాంత మతప్రవర్తకులైన వైష్ణవాచార్యుల కాదర ప్రోత్సాహముల నిచ్చి పోషించుటచేత వారి సామంతులును, మండలేశ్వరులునుగూడ వైష్ణవము నవలంబించిరి. జైనము క్రమక్రమముగా క్షీణించి నామమాత్రావశిష్టమైనది. అంతమాత్రము చేత తెలుగుదేశములో జైనము పూర్తిగ నశించినదని చెప్పలేక పోయినను, తెలుగు దేశమున పరివ్యాప్తములై యుండిన మతములలో జైనము కూడ పరిగణనీయమైనదిగ నుండెనని మాత్రము చెప్పలేము. ఇప్పటికిని అనంతపురముజిల్లాలోని పెనుగొండయు, తెలంగాణా నలగొండ జిల్లాలోని కొల్లిపాకయు ప్రసిద్ధములైన జైన క్షేత్రములే.

పెనుగొండలో పూర్వము పార్శ్వనాథ బస్తి (వసతి) యుండినది. ఇక్కడి శిలాశాసనము లొకదానిలో జినభూషణ భట్టారకుని ప్రస్తావము గలదు. జైనుల చతుర్దశ మహావిద్యా స్థానములలో పెనుగొండ ఒకటి. కొల్లిపాకలో ఇప్పటికిని జినభవనము లున్నవి. శైవ, వైష్ణవములు బాగుగ వ్యాపించిన కాలములో హిందువుల ఒత్తిడికి తట్టుకొనలేక జైనులు హిందూదేవతల కెందరినో తమ దేవతలుగ స్వీకరించి జినాలయములలో నుంచి పూజించుచు వచ్చిరి. జైన, హిందూ ధర్మములకు భేద మంతగ లేదని ప్రత్యక్షముగ నిరూపించినందువల్లనే జైనము ఇంకను దక్షిణ హిందూదేశములో కొనయూపిరితో నైన జీవించి యున్నదని జైనమత చారిత్రమును పరిశోధించిన వారందురు.

ఒకప్పుడు తెలుగుదేశములో జైనము బాగుగ వ్యాపించినదని చెప్పుటకు ఇప్పటికిని గ్రామములలో గానవచ్చు జైన విగ్రహములును, జైన శిథిలములే తార్కాణము. తూర్పు గోదావరిజిల్లాలోని ఆర్యవటమునకు జైనపాడు అని పేరు. సాధారణముగా ఒకప్పుడు జైనగ్రామముగ నుండిన యూరి కిపుడు 'పాడు'అని పేరు. నెల్లూరు జిల్లాలో ఇటువంటి జైనపాడు లనేక మున్నవి. సాధారణముగ తెనుగు దేశపు గ్రామములలో చివర పాడు అని పేరుగల వానిలో అనేకము జైనపాడు లనియే చెప్పుదురు. మరియు నెల్లూరు జిల్లాలో ముఖ్యముగ నాగపట్టె గ్రామములందు గృహనిర్మాణార్థమును, బావులు కట్టుటకును త్రవ్వినపుడు భూగర్భమున మరుగుపడియుండిన చిన్న చిన్న ఒరబావులు వెలువడుచువచ్చినవి. వీనిని జైన బావులని చెప్పుదురు. ఈ బావులలో ఏ జీవజంతువులు పడి చావకుండుటకై నీళ్ళు చేదునప్పుడు తప్ప తక్కినప్పుడెల్ల వానిపై నాగర లను గప్పి యుంచెడి వారట. తత్కారణమునకే ఆదాగరలలోని కిముడగల చిన్న రొయురలు చేయించి వానితో బావులను గప్పెడి వారట. ఇట్టి బావులు తూర్పు గోదావరి జిల్లా అమలాపురము, నగరము తాలూకాలలోను గానవచ్చును. వాస్తవముగ నివి జైనులు నిర్మించుకొనినవో కావో దృఢముగ చెప్పుటకు వీలులేదు. కాని తరతరములుగ వానికి జైన బావులని వాడుకయుండుట మాత్రము సత్యము.

ఇక తెలుగుదేశములోని అనేక గ్రామములలో పద్మాసనము వేసికొని కూర్చుండి తపస్సుచేయుచున్నట్లు చెక్కిన జైన విగ్రహములు ఇప్పటికిగూడ కానవచ్చుచున్నవి. వీనిని కొన్ని కొన్ని చోట్ల సన్యాసిదేవుళ్ళని హిందువులు ఇప్పటికిని పూజించెదరు. ఇటువంటి విగ్రహములు తెలుగుదేశపు జిల్లాలలోని పెక్కు గ్రామములలో నున్నవి. ఇటువంటి విగ్రహములును, జైనశిథిలములును ఏయే జిల్లాలలోని ఏయే గ్రామములలో కనబడునో వివరింప దలపెట్టిన పెద్ద పట్టిక తయారు చేయవలసి వచ్చును. ముఖ్యముగ ఇటువంటి విగ్రహములును, శిథిలములును సముద్రతీరస్థము లయిన జిల్లాలలో ముఖ్యము. తూర్పు గోదావరి జిల్లా ఆర్యవటము, పిఠాపురము, వేదుమూరు, దాటిపాక, దాక్షారామములలోను, పశ్చిమ గోదావరిజిల్లా పెనుగొండ మొదలైన గ్రామములలోను నున్నవి. ఇప్పటికి ననేకగ్రామములలో భూమిని త్రవ్వునపుడు జైన విగ్రహములు బయటపడుటయు కలదు. రాయలసీమలో కూడ ఇట్టి విగ్రహములును, శిథిలములును లేకపోలేదు. కర్నూలుజిల్లా రామళ్లకోట తాలూకా జాయకల్లులోని శిథిలములును, ఆ చుట్టుప్రక్కల కానవచ్చిన శిథిలములును జైనులకు సంబంధించినవి. ఈ ప్రాంతము పూర్వకాలములో జైననివాసముగ ఉండినదని చెప్పుదురు. మ. సో. శ.

## శైవము

పురాతన భారతీయ ధర్మసంప్రదాయములలో శైవ మొకటి. పాశుపతమని, కాలముఖమని, కాపాలికమని శైవములో చాల సంప్రదాయము లున్నవి. శైవ సంప్రదాయము లన్నిటిలోను పాశుపత శైవ సంప్రదాయము చాల ప్రాచీనమైనది. కలియుగములో పాశుపత శైవమును వ్యాపింపజేసినవాడు లకులీశ శివాచార్యుడు. ఇతడు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చారిత్రక పురుషు డనియు, క్రీస్తుశకము మొదటి శతాబ్ది లో, అనగా ఇప్పటికి రమారమి రెండువేల సంవత్సరముల క్రిందట ఉండె ననియు చరిత్రకారు లందురు. ఒకవేళ ఇతడు దీని వ్యాప్తికి కారణభూతుడయిన కావచ్చునేమో; కాని ఇతనికి పూర్వమునుండి పాశుపత శైవ సంప్రదాయ ముండి నట్లు ఆధారములు కలవు. లకులీశ శివాచార్యులు లాట దేశములో నర్మదానదీ తీరమున నున్న కారోహణమను గ్రామములో జన్మించెనని చెప్పుదురు. కారోహణమున కిప్పుడు కార్వారు అని పేరు. ఇది లకులీశపాశుపత శైవు లకు ప్రధానపీఠము. లకులీశ శివాచార్యునికి కుశిక, గార్గ్య, కారుష, మైత్రేయులని నలుగురు శిష్యు లుండిరి. వీరు నలుగురు నాలుగు శైవమతములను స్థాపించి నాలుగు శైవశాఖలకు (సంప్రదాయములకు) కర్త లైరి. కారోహణము, అమర్దకము, తెరంబి, కదంబగుహ అను నవి పాశుపత శైవుల ఆదిమ పీఠములు - మఠములు. వింధ్యకు దక్షిణముననున్న హిందూదేశమున పాశుపత శైవమును వ్యాపింపజేసినవారు ఈ నాలుగు పీఠములకు - మఠములకు - చెందినవారే అని చెప్పుటకు ఆధారము లున్నవి. భాగవత సంప్రదాయము నవలంబించిన వారికి భాగవతులని, విష్ణుభాగవతులని ఉన్నట్లే పాశుపతశైవ సంప్రదాయమును అవలంబించిన వారికి శివభాగవతులని, మాహేశ్వరులని పేరు.

తెలుగు దేశములో పాశుపత శైవ సంప్రదాయము ఎప్పటినుండి వ్యాప్తిలోనికి వచ్చినదో సరిగా, చారిత్రక ముగా నిర్ణయించి చెప్పుట కష్టము. ఇందుకు తగిన ఆధార ములు లేవు. క్రీస్తు శకమునకు పూర్వము కాకపోయినను క్రీస్తుశకము మొదటి శతాబ్దమునుండి శైవ ధర్మము తెలుగు దేశములో వ్యాప్తిలో ఉండియుండవలె ననుటకు ఆ కాలములోని ప్రాకృత శాసనములలో కానవచ్చు శివ దాస, శివక, స్కంధ, శివల, శివస్కంద, శివశ్రీ మొదలైన మనుష్య నామములే ఆధారము. శైవమునకు సంబంధిం చిన ఈ పేరులు శైవధర్మము వ్యాపించిన కాలములో వాడుకలోనికి వచ్చియుండవలయుట నిస్సంశయము. క్రీస్తుశకము ఆరంభ శతాబ్దములలో శైవము వైదిక ధర్మసంప్రదాయముగ పరిగణిత మగుచువచ్చినను, సాత వాహన, ఇక్ష్వాకు భూపతులు వైదిక మతావలంబు లైనను తెనుగుదేశములో వారు నిర్మించిన శివాలయము లేవియు కానరావు. కాని సాతవాహన కులజుడయిన హాలమహా రాజు లీలావతియను సింహళరాజ పుత్రికను వివాహము మాడినట్లు తెలుపు లీలావతియను ప్రాకృతభాషాకావ్యము వల్ల సప్తగోదావర తీరము భీమేశ్వర స్వామికి సంబంధిం చిన శైవ తీర్థ మనియు, ఆ స్వామికి అక్కడ కనకదేవా లయ ముండె ననియు, ఆ దేవాలయమునకు దక్షిణదిశను గోదావరి వదన విశేషకమువలె రమ్యమైన పాశుపత మఠాయతన ముండెడి దనియు తెలియుచున్నది. ఈ ప్రాకృత కావ్యము ననుసరించి చూడగా సప్తగోదావర తీరమున పాశుపతవ్రతుల మఠముతోకూడ భీమేశ్వరస్వామికి ఆలయముండె ననియు విదితమగుచున్నది. కావ్యములో ఎచ్చటను దాక్షారామ మను పేరు లేకపోయినను సప్తగోదా వరమును, దాని తీరముననున్న భీమేశ్వరస్వామి ఆలయ మును అది పేర్కొనుట చేత ఆ మహాస్థలము దాక్షారామమే అని నిస్సందేహముగా నిశ్చయింప వచ్చును. కాని ఈ కావ్యము హాలసాతవాహనుని కాలములో విరచితమైనది కాదు; ఆ మహారాజు కాలమునకు ఆరేడు వందలసంవత్స రములకు తరువాతిది. అందువలన పాశుపత మఠములు సప్తగోదావరతీరమున హాలుని కాలములో ఉండెనా లేదా, భీమేశ్వరాలయము ఈ గ్రంథము విరచితమైన కాలమునకు ఉండినప్పటికి హాలమహారాజు కాలములో ఉండెనా యని సంశయింప వలసి వచ్చుచున్నది. ఒకవేళ హాలుని కాలముననే ఉండిన యెడల పాశుపత శైవ సంప్ర దాయమునకు చెందిన మఠములు, ఆలయములు తెలుగు దేశములో క్రీస్తుశకము మొదటి శతాబ్దములోనే ఉండి నట్లు చెప్పవలసి యుండును. హాలుని గాథాసప్తశతి ఈ యూహను బలపరచుచున్నది.

హాలమహారాజు స్వవిరచితములైన 'గాథ'లను కొన్ని టిని, ఇతరకవి విరచితములైన 'గాథ'లను కొన్నిటిని, మంచివానిని ఏడువంద లేరి ఒక గ్రంథమును సంతరించెను. వానికే 'గాథాసప్తశతి' అని పేరు. ఈ గ్రంథము వలన ఆంధ్రసాతవాహనుల కాలములో శివపార్వతులకు సంబం ధించిన కథలు వాడుకలో ఉండినట్లును, దేవళములుకూడ ఉండినట్లును తెలియుచున్నది.

హాలుడు సంకలితము చేసిన 'సప్తశతి'లోని మొదటి, చివరి పద్యములు శివస్తుతికి సంబంధించినవి. పశుపతిస్తుతి మొదటి 'గాథ' లోను, గౌరీస్తుతి చివరి 'గాథ'లోను ఉన్నది. ఇంకను మరి కొన్ని గాథలలో గణాధిపతికి, గౌరీ దేవళములకు సూచనలు కలవు. ప్రాయికముగా ఆ కాలపు దేవళములు దారువుతో నిర్మించుటవలన నేమో అవి నశించిపోయినవి. సాతవాహనుల కాలమునను, అంతకు పూర్వమునను దారు నిర్మితాలయము లుండుటవల్లనే కావచ్చును అమరావతీ స్తూపమును పెంపుచేసిన స్థపతులు దారు నిర్మాణకళను ఆధారము చేసికొని దానికి రాతిలో తీర్పుతీరులు కల్పించినారు. సాతవాహనులకు చాల



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కాలము తరువాత కాని ఇటికలతోను, రాతితోను కట్టిన దేవళములు కానరాలేదు.

సాతవాహన భూపతులకు తరువాత పూర్వాంధ్ర దేశమును పరిపాలించిన ఇక్ష్వాకు నృపతులు మహాసేన పాదానుధ్యాతులు, అనగా స్కందుని గొలిచినవారు. క్రీస్తుశకము ప్రారంభ శతాబ్దములలో స్కంద (కుమారస్వామి) పూజ ఈ దేశములో ఎక్కువగా ఉండినట్లు కనిపించును. ఇక్ష్వాకులనాటినుండి పూర్వాంధ్ర దేశమును పరిపాలించిన శాలంకాయన, పల్లవ రాజవంశములలో స్కందుని పేరు పెట్టుకొన్నవారు అనేకు లుండిరి.

శాలంకాయనులకు తరువాత తెలుగు దేశమును పరిపాలించిన విష్ణుకుండి నృపతులు వైదిక మతావలంబులగు స్మార్తులయినను శివభక్తులు. వారు తాము శ్రీపర్వతస్వామి పాదానుధ్యాతులమని చెప్పుకొన్నారు. శ్రీపర్వతస్వామి అనగా శ్రీశైలముమీద నెలకొన్న మల్లికార్జునస్వామి కావచ్చును. విష్ణుకుండి వంశజుల కాలమునాటికి తెలుగు దేశములో శివాలయము లుండినట్లు వారి కాలములోనే శాసన ప్రమాణము మొదటిమారు కనబడుచున్నది. విష్ణుకుండి ఇంద్ర భట్టారకవర్మ కుమారుడయిన విక్రమేంద్ర వర్మ కృష్ణ వేణ్ణానదీ తటమున ఉన్న 'రేగొన్ట' గ్రామమును 'సకల జగత్త్రియ నాథుడు'ను, 'శశికరావదాత శుభ్రీకృత జటామకుటుడు'ను, భగవంతుడగు త్ర్యంబకుడును అయిన సోమగిరీశ్వర నాథునికి దేవదానముగా సమర్పించినట్లు శాసనము కలదు. దీని ననుసరించి చూడగా తెలుగు దేశములో శివాలయములు క్రీస్తుశకము ఆరవ శతాబ్దికే ఉండినట్లు స్పష్ట మగుచున్నది. క్రీస్తుశకము పదవ శతాబ్దములో దక్కను దేశమునకు వచ్చిన చీనాయాత్రికుడు యువాన్ చ్వాంగు వ్రాసిన వృత్తాంతమువల్లకూడ అప్పటికే అనేక దేవాయతనములు కళింగములోను, ఇతర ఆంధ్రప్రాంతములోను ఉండె ననియు, బౌద్ధము క్షీణించుచుండె ననియు తెలియుచున్నది. ఆ యాత్రికుడు చెప్పిన ఈ దేవాయతనములు నిస్సందేహముగ శైవ, వైష్ణవ ఆలయములే అనవచ్చును. ఈ యేడవ శతాబ్దమునాటికి పాశుపత, కాలముఖ, కాపాలిక శైవ సంప్రదాయములు తెలుగు దేశములో వ్యాపించె ననుటకు ఆధారములు కలవు. విష్ణుకుండి వంశజులకు తర్వాత తెలుగు దేశమును పరిపాలించినవారు పూర్వచాళుక్యులు. వైదికమార్గ నిరతులు, క్రతుకర్మ పరాయణులు అయినప్పటికి ఈవంశమువారిలో చాలమంది శైవము నభిమానించిన పరమ మాహేశ్వరులు. వీరి కాలములో ఇతర ప్రాంతములనుండి పాశుపత శివాచార్యులు తెలుగు దేశమునకు వచ్చి పాశుపత శైవ సంప్రదాయమును వ్యాపింపజేసి శివాలయములలో స్థానపతులుగా ఉండిరి. అట్టివారిలో మొట్టమొదటి మారు తెనుగు దేశశాసనముల వలన తెలియవచ్చినవారు వామశివ, పురుషశివ అను పేర్లుగల శివాచార్యులు. వీరు చాళుక్య కులజుడును, మంగి యువరాజు పుత్రుడును అయిన విష్ణువర్ధనుని శాసనములో పేర్కొనబడినారు. వీరు ఏలూరి దగ్గరనున్న వసంతవాడ గ్రామములోని శివాలయ త్రయమునకు స్థానపతులు. విష్ణువర్ధన మహారాజు ఆ శివాలయ త్రయమున 'నిత్యపూజా బలిప్రదానము' నిమిత్తమును, 'ఘన సుషి రానద్ధ వాద్య వాదక గాయక నటకాచార్య విలాసినీ జనభృతి' నిమిత్తమును, 'తద్దేవాయతన ఖండ స్ఫుటిత నవకర్మాది కార్య కరణార్థ 'మును వసన్ భట్టారను ప్రాచీన వామముకల వసంతవాడలో కొంత భూమిని దానము చేసి దాన శాసనము వ్రాయించి ఆ శివాచార్యుల పరముగా ఇచ్చి యున్నాడు. ఈ వామశివ, పురుషశివలు తెరంబి బ్రహ్మశివాచార్యుని శిష్యులు. ఈ తెరంబి పాశుపత శైవుల ఆదిమ పీఠములలో ఒకటని ఇదివరకు తెలిసిన విషయమే. ఇది ప్రస్తుతము మధ్యభారత్‌లోని గ్వాలియరు సంస్థానమున సామాన్యముగా నారోద్ అని వ్యవహరింపబడు రానోద్‌కు తూర్పు దిక్కుగా అయిదు మైళ్ళ దూరమున ఉన్న తెరంబి గ్రామము. దీని నిప్పుడు తెరహి అని వ్యవహరించుచున్నారు. పాశుపత శివాచార్యుల పేరులు శివ, పండిత, ముని పదములతో అంతమగును.

చాళుక్య రాజేంద్రులలో రెండవ విజయాదిత్య భూపతి (క్రి. శ. 808 - క్రీ. శ. 846) పరమ మాహేశ్వరుడు. ఇతనికి నరేంద్ర మృగరాజను బిరుదము కలదు. ఇతడు శత్రువు లయిన రాష్ట్రకూట రాజులతో పండ్రెండేండ్లపాటు 108 యుద్ధములు చేసెను. విజయలక్ష్మిని పరిగ్రహించిన పిదప ఇతడు తోడి మానవులను చంపిన పాపమును పోగొట్టుకొనుటకై యుద్ధములు జరగిన చోట్ల తనపేర శివుని ప్రతిష్ఠించి నూటయెనిమిది శివాలయములు కట్టించినట్లు ఇతని తరువాతి చాళుక్యరాజుల శాసనములవలన తెలియుచున్నది. చాళుక్యులలో శివభక్తులయిన పరమమాహేశ్వరు లనేకు లుండినను ఇన్ని శివాలయములు కట్టించిన చాళుక్యరాజు మరియొకడు తెలియరాడు. ప్రాచీన ఆంధ్ర దేశ శాసనములు పరిశీలించుచో నరేంద్రేశ్వరాలయములు చాల తెలియవచ్చును. అందువలన నూటయెనిమిది సంఖ్య అతిశయోక్తి యని కొట్టివేసినను ఇతడు చాల శివాలయములు కట్టించె ననుటకు సందియములేదు.

ఒక్క పాశుపతమేకాక శైవములో కాలముఖ, కాపాలిక, తాంత్రికాది సంప్రదాయములును ఉన్నవి. ఇవి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కూడ చాళుక్యుల కాలములో తెలుగు దేశములో వ్యాపించెను. క్రీ. శ. ఏడవ శతాబ్దములో నుండిన పల్లవరాజు మహేంద్రవర్మ తన మత్తవిలాస ప్రహసనములో కాపాలిక, కాలముఖ, పాశుపతులను పేర్కొని యున్నాడు. చీనా బౌద్ధ యాత్రికుడు యువాన్ చ్వాంగ్ 'తల చుట్టును, మెడలోను ఎముకల దండలు ధరించి బిలములలోను, శైల వివరములలోను, సమాధులలోను నిత్యనివాసము చేయు యతులవంటివా'రని వర్ణించి చెప్పినవారు కాపాలిక శైవులనుటకు సందియము లేదు. నెల్లూరు జిల్లా భైరవుని కోనలోని ఆలయములు దుర్గా భైరవులవి. భైరవుని ఆలయమువల్లనే ఈ కొండకోనకు భైరవుని కోన అని పేరు వచ్చినట్లున్నది. కాపాలికులు భైరవపూజా పరాయణు లగుటచేత ఈ భైరవుని కోన పురాతన కాలములో కాపాలిక స్థానముగా ఉండి యుండ వచ్చును. కాలముఖ సంప్రదాయపు శివాచార్యులకు మహావ్రతులని పేరు. వీరు శంఖధ్వని విరాజితులు. వీరుకూడ పాశుపతులవలెనే చాల పూర్వకాలము నుండి యున్నప్పటికి చాళుక్య శాసనములలో ఈ సంప్రదాయమునకు చెందిన శివాచార్యుల ప్రస్తావము రెండవ అమ్మరాజ విజయాదిత్యుని నాటినుండి (క్రీ. శ. 945 - క్రీ. శ. 970) కనబడుచున్నది. ఈ రెండవ అమ్మరాజ చాళుక్యకుల తిలకుడును, సమస్త భువనాశ్రయుడును అయిన తన పూర్వుడు నరేంద్రమృగరాజును రెండవ విజయాదిత్య భూపతి కట్టించిన సమస్త భువనాశ్రయ మను దేవాలయమునకు అమ్మలపూడి, గొల్లపూడి అమువులపల్రు అను మూడు గ్రామములను ప్రభూతరాశి అను కాలముఖ శివాచార్యుని పరముగా దాన మిచ్చెను. ఈ దానశాసనములోనే చాళుక్య యుగమున మొదటిమారు కాలముఖ శైవుల ప్రస్తావము కానవచ్చుచున్నది. ఈ శాసనములో ప్రభూతరాశి గురువులకోవ అభివర్ణిత మైనది. ఈ కాలముఖులు సింహపర్షదమువా రనియు, వీరిలో లకుశివు పశుపత్యాచార్యునికి ప్రభూతరాశి పండిత, భువనరాశి మునులు శిష్యు లనియు, విద్యేశ్వర వామేశ్వరులు వారిలో ప్రభూతరాశి పండితుని యొక్కయు, (రెండవ) పశుపతి, (రెండవ) ప్రభూతరాశులు భువనరాశిముని యొక్కయు శిష్యు లనియు, (రెండవ)పశుపతికి(రెండవ)విద్యేశ్వరుడును, మూడవ ప్రభూతరాశియు శిష్యు లనియు, మహారాజు నుండి దానమును గ్రహించిన శివాచార్యుడు (మూడవ) ప్రభూతరాశి యనియు శాసనమువల్ల తెలియుచున్నది. కాలముఖ శివాచార్యుల పేర్లు ముని, రాశి, పండిత పదములతో అంతమగును. ఈ సంప్రదాయమునకు చెందిన శివాచార్యులుకూడ పాశుపత శివాచార్యులవలెనే ప్రాయికముగా దేవాలయములకు స్థానపతులుగా ఉండినవారు. కాలముఖ శైవ సంప్రదాయము తెలుగు దేశములోకంటె కుంతలదేశములో ఎక్కువగా వ్యాపించినది. దీనిని పూర్వ చాళుక్యులకంటెను ఎక్కువగా ఆదరించినవారు కుంతలేశ్వరులయిన పశ్చిమ చాళుక్యులు. పూర్వచాళుక్య యుగానంతరము తెలుగుదేశ మెక్కువగా ఆదరించినది పాశుపత శైవ సంప్రదాయమునే. అట్లని, కాలముఖ శైవులు తెలుగుదేశములో లేకపోలేదు. కాని అట్టి శివాచార్యుల సంఖ్య చాల తక్కువ; వారి పీఠములును తక్కువే.



చిత్రము 91. నటరాజమూర్తి, భైరవుని కోన

తెలుగుదేశములో కాలముఖ, పాశుపత శైవ సంప్రదాయములు వ్యాపించిన కాలములో ద్రవిడదేశములో శివభక్తు లనేకు లుదయించి భక్తిప్రధానమైన శైవ మతమును వ్యాపింప జేసిరి. వీరికి తమిళభాషలో నయనారులని పేరు. తెలుగులో వీరికి నైనారులని, నాయనారులని వ్యవహారము. వీరిలో తిరుజ్ఞానసంబంధర్, అప్పర్ స్వామిగళ్, సుందరమూర్తి నయనారు, మాణిక్కవాశగర్ అనువారు ముఖ్యులు. వీరికి శైవసమయాచార్యులని పేరు. వీరిలో మొదటి ముప్పురును చేసిన శివస్తవ సంచయమునకు 'తేవార' మని పేరు. తిరుజ్ఞాన సంబంధర్, అప్పర్ స్వామిగళ్, తిరుత్తొండర్ (చిరుతొండడు) - ఈ ముప్పురును సమకాలికులు. సుందరమూర్తి నాయనారుకు వంబినాయనారని, ఒడయనంబియని, అప్పరుకు తిరునావుక్కరసు అని నామాంతరములు. ఈ శైవ సమయాచార్యులు ద్రవిడ దేశములో అవైదికములైన బౌద్ధ, జైన ధర్మములను నిరసించి శైవమత సిద్ధాంతమును వ్యాపింప జేసిరి. ఈ శైవ సమయాచార్యుల ప్రచారమువల్లను, ఇతర శైవ భక్తుల బోధలవల్లను ద్రవిడ దేశములో బౌద్ధ, జైన మతములు జనాదరణమును గోల్పోయి క్రమముగా క్షీణించినవి. శివభక్తులు అసంఖ్యాకు లైరి.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మహిమలు చూపిన శివభక్తుల కథలు ఎన్నో వాడుకలోనికి వచ్చినవి. క్రీస్తుశకము పదునొకండవ, పండ్రెండవ శతాబ్దములనాటికి అపూర్వ మహత్తును చూపిన ద్రావిడదేశీయ మహాశివభక్తులు అరువది ముగ్గురకు సంబంధించిన కథలు ఎక్కువగా ప్రచారములోనికి వచ్చినవి. తమిళభాషలో ఈ శివభక్తులు అరువది ముగ్గురకు అరువత్తు మూవరని, నయనారు అని పేరు. వీరికి సంబంధించిన కథ లన్నిటిని శేక్కిళారను తమిళకవి పెరియపురాణ మను గ్రంథమున పొందుపరచెను. ఈ యరువత్తుమూవరు శివభక్తుల చరిత్రములు ఆంధ్రదేశమును పరిపాలించిన పూర్వ చాళుక్యులును, ద్రవిడదేశము నేలిన చోళరాజులును ఒకరితో ఒకరు వివాహ సంబంధములు కలుపుకొన్న నాటినుండి ఆంధ్ర, ద్రావిడ దేశములకు రాకపోక లెక్కువయై బాగుగ ఆంధ్రదేశములో తెలియవచ్చినవి. ఈ చోళ, పూర్వ చాళుక్య సంబంధములు రాజరాజ నరేంద్రుని తండ్రియైన విమలాదిత్యుని (క్రీ. శ. 1011 - క్రీ. శ. 1018) నాటినుండి మొదలు. అంతకుపూర్వమే పాతిక ముప్పది సంవత్సరములనుండి చోళ మహారాజులకు తెలుగు దేశముతో రాజకీయముగ సంబంధము కలిసినది. అప్పటినుండి శివభక్తుల కథలు తెలుగు దేశములో వ్యాపించి జనసామాన్యములో శివభక్తి నుద్దీపింపజేసి భక్తి ప్రధానమైన శైవము తెలుగుదేశములో ఎక్కువగా వ్యాపించుటకు తోడ్పడినవి. రాజరాజనరేంద్రుని కొడుకైన రాజేంద్రచోడ నామాంతరముగల కులోత్తుంగచోడ భూపతి ఆంధ్ర, ద్రావిడ దేశములు రెంటికిని అధిపతియై రాజధానిని ద్రావిడదేశమునకు మార్చుకొని అతడును, చాళుక్యచోళులని ప్రసిద్ధి వహించిన అతని సంతతివారును ఉభయరాజ్యములను అక్కడినుండియే పరిపాలించుటకు ఆరంభించిన నాటినుండి ఉభయ దేశములకు సన్నిహితసంబంధము కలిగి రాకపోకలు ఎక్కువయై సాంస్కృతిక సంబంధము దృఢతరమయినది. తెలుగుదేశములో శివభక్తుల కథలకు విపరీతప్రచారము కలిగినది. ఇవి ఎంత ఎక్కువగా ప్రజాహృదయము నాకర్షించిన వనగా పూసలనాయనారు మొదలైన కొందరు శివభక్తులు తెలుగు దేశమువారని నమ్మకము తోచునట్టుగా తెలుగుదేశములోని కొన్ని స్థలములకు వారి గాథలు ముడిపెట్టబడినవి. ఈ శైవభక్తుల గాథలు దేశములో వ్యాపించి ప్రజాహృదయమున అపూర్వోత్సాహమును రేకెత్తించి భక్తిప్రధానమైన శైవముమీద జనసామాన్యమునకు గాఢ విశ్వాసమును, అభిమానమును కలిగించి భక్తి ఉద్యమమునకు గట్టి పునాదులు వేసినవి. సగుణోపాసనము హెచ్చినది: శివారాధనము ప్రబలినది. శివాలయములకు వెనుకటికంటెను ప్రాధాన్యమతిశయించినది. శివాలయములలో అర్చనాదికములు జరుపువారు, పరిచర్యచేయు అండారు (అండవరు) అను శివభృత్యులు, శివయోగులు మొదలైనవారెందరో తమిళదేశము నుండి తెలుగు దేశమునకు వచ్చిరి. శైవము భక్తి సంప్రదాయముగ వ్యాపించుటతో శివలీలలు పాడుట అభినయించుట, శివకథలు ఆడుట వాడుకలోనికి వచ్చి నాట్య, సంగీత కళలు వృద్ధిచెందినవి. శివాలయములలో ఇతఃపూర్వము పెద్ద పెద్ద మండపము లేవియు ఉండెడివి కావు. ఇప్పుడు వానిలో నాట్య, సంగీత మండపము లేర్పడినవి. వానిలో స్వామి అర్చనావసరములందు శివలీలలు పాడి అభినయించుటకు పాత్రలు నియమితులైరి.



చిత్రము 92. గంగాధరమూర్తి, ముఖలింగము

ఇంతకు పూర్వము ఆలయములలో దీప దానమునకు ఎక్కువ ప్రాముఖ్య ముండెను. ఇప్పుడు దీపప్రదానాచారము తగ్గినది. దేవాలయములలో శివునికి పూజలు, అంగరంగభోగాదులు అతిశయించినవి. స్వామి అంగరంగ భోగాదుల నిమిత్తమును, ఇతరోపచారముల నిమిత్తమును శ్రీమంతులు, మహారాజులు, సామంతులు, మండలికులు మడిమాన్యములను దానముచేయుట ఆచారమయినది. దేవళము సంగీత నాట్యాది కళలకును, విద్యలకును ఆధారభూతమయినది ఈ కాలములోనే. శైవము భక్తిప్రధానమయిన ధర్మసంప్రదాయమైనప్పటి నుండి దేశములో



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఎంతో గొప్ప మార్పు వచ్చినది. అగ్రవర్ణులైన బ్రాహ్మణులకు యజ్ఞయాగాదుల వలెనే మిగిలిన వర్ణములవారికి భక్తిమార్గము దొరకి ఆధ్యాత్మికముగా పురోగమించుటకు వారికి అవకాశము కలిగినది. భక్తి సంప్రదాయము దేశములో ప్రబలుటతో అదివర కుండిన పాశుపత శైవమునకు క్రొత్తబలము చేకూరినది. ఆ కాలములో మండలికులు మహామండలేశ్వరులు శివభక్తి పరతంత్రులై, శంకరకింకరులై విశేషముగా శివాలయములకు మడిమాన్యము లిచ్చి దేవళమును ఒక మహాసంస్థగా రూపొందించినారు. క్రీస్తుశకము పదవశతాబ్దమునుండి పదునాల్గవ శతాబ్దము వరకు భక్తిప్రధానమైన శైవ సంప్రదాయము ఉచ్చదశలో నుండెను. ఈ కాలములో తెలుగు దేశములో నిర్మితములైన శివాలయములు, జరగిన శివలింగ ప్రతిష్ఠలు అనేకము. ఈ కాలములోనే బ్రాహ్మణులలో శ్రీపతి పండిత, మల్లికార్జున పండిత, మంచన పండితు లను మువ్వురు శివాచార్యు లుదయించి బ్రాహ్మణేతరోపజ్ఞమైన ద్రావిడాగమ శైవభక్తి సంప్రదాయమును వేదవిహితమైన ఆగమ సంప్రదాయముగ మార్చి శివుడే పరమదైవమని, శైవులు కానివారు భవులని వాదించి శివపారమ్యమును బోధించి శివధర్మమును ప్రచారము కావించిరి. వారి బోధలకు, చూపిన మహిమలకు ఫలితముగా బ్రాహ్మణులు కొందరు శైవులై శివార్చనా నిరతులైరి. ఏతత్పండిత పాశుపత సంప్రదాయావలంబకులకు ఇపుడు ఆరాధ్యులని పేరు. బ్రాహ్మణులలో ఈ విధమైన శైవము నవలంబించినవారు భారతదేశమునందలి ఇతర రాజ్యములలో ఎచ్చటను కానరారు. ఎక్కడనైన నున్నచో వా రెప్పుడో పూర్వకాలములో ఆంధ్రదేశమునుండి వెళ్లినవారుగనే భావింపవచ్చును. ఈ శైవులు క్రతుకర్మల కధిక ప్రాధాన్య మీయకున్నను వైదికాచార నిరతులు; యజ్ఞోపవీతమును పరిత్యజింపరు. కాళహస్తి ఆనాటి ప్రసిద్ధ శైవస్థలము.

భక్తి సంప్రదాయమైన శైవము వర్ధిల్లుచుండిన కాలముననే కాకతి రాజన్యులు త్రిలింగదేశమునకు అధిపతులయినారు. వారి రాజధాని ఇప్పటి తెలంగాణాలోని వరంగల్లు అనబడు ఓరుగల్లు. వీరు మొదట జైన ధర్మ సంప్రదాయమును అవలంబించి తరువాత శైవధర్మమును అవలంబించిరి. మొదట వీరు కుంతల చాళుక్య భూవరులకు సామంతులుగా ఉండి తరువాత స్వతంత్రులై ఒక్క ఇప్పటి తెలంగాణాకే కాక యావదాంధ్ర దేశమునకు అధిపతులైరి. వీరు పశ్చిమ చాళుక్యులకు సామంతులుగా ఉండిన కాలములో కుంతలదేశములో ఎక్కువగా పరివ్యాప్తమైన కాలాముఖ శైవ సంప్రదాయము కాకతి రాజ్యములోను కొంత వ్యాపించినది. కాకతి రెండవ బేతరాజు, రెండవ ప్రోలరాజు శైవ మవలంబించి కాలముఖ శివాచార్యులకు గ్రామములను శివపురములు చేసి దానము చేసిరి. బ్రాహ్మణుల కిచ్చిన గ్రామములు అగ్రహారము లని వ్యవహృతము లయినట్లు శివాచార్యుల కిచ్చిన గ్రామములు శివపురములని వ్యవహరింపబడినవి. కాని, తెలుగు దేశములో కాలముఖ శైవ సంప్రదాయము బాగుగా వేరు నన్ని వర్ధిల్లలేదు. పాశుపత శైవమే అధిక జనాదరము పొంది వర్ధిల్లినది. కాకతీయరాజన్యుల కాలములో పాశుపత మతమును ఎక్కువగా వ్యాపింపజేసినవారు గౌడ దేశములోని గోళకీ మతమునకు చెందిన శివాచార్యులు. వీరిలోని విశ్వేశ్వర శివాచార్యులు కాకతి గణపతిదేవ మహారాజునకు చిన్మయదీక్ష నిచ్చెను. అప్పటినుండి ఈ శివాచార్యులు కాకతీయులకు రాజగురువులుగ నుండిరి. మహారాజులు శైవ మవలంబించుటతో ప్రజలలో చాలమంది ఆ మతము నవలంబించిరి. కాకతి రాజన్యుల కాలములో పాశుపత శైవ సంప్రదాయము తెలుగు దేశములో ముమ్మరముగా వ్యాపించుటకు ఆ మహారాజుల ఆదరాభిమానములే కారణము. ఈ కాలములో గోదావరి తీరమున నున్న మంథెన కాళేశ్వరము (వరంగల్లు జిల్లా), శ్రీశైలము (కర్నూలు జిల్లా), దాక్షారామము (తూర్పుగోదావరి జిల్లా) - ఈ మూడును అత్యంత ప్రసిద్ధములైన శైవ మహాక్షేత్రములు. వీనివల్లనే ఈ కాలములో ఆంధ్ర దేశమునకు త్రిలింగదేశమని పేరు కల్గినది. పాశుపత శివాచార్యులు గుంటూరు జిల్లా మందడము, కర్నూలుజిల్లా త్రిపురాంతకము, కడప జిల్లా పుష్పగిరి మొదలయిన చోట్ల మఠములు స్థాపించిరి. వీరి మఠములు ఎక్కడ నున్నను వానికి గోళకీ మఠములని, తదధిపతులకు గోళకీమఠ శివాచార్యులని పేరు. ఈ శివాచార్యులు తెలుగుదేశములో చాల చోట్ల శివాలయములు కట్టించిరి. పెక్కు ధర్మ ప్రతిష్ఠలు కావించినారు.

పన్రెండవ శతాబ్దము ఉత్తరార్ధమున కన్నడ దేశములో కళచురి బిజ్జలుని ప్రధాని బసవన వ్యాపింపజేసిన వీరశైవ సంప్రదాయము తెలుగుదేశపు పడుమటి, నైరృతి, దక్షిణ దిశలలో కొంతమేర కర్ణాటాంధ్ర సీమావధుల వ్యాపించినప్పటికిని దేశము నడిబొడ్డులోమాత్ర మది అసంఖ్యాకాంధ్ర జనధర్మము కాలేదు.

క్రీస్తుశకము పదునాలుగవ శతాబ్దములో తెలుగుదేశముపై దండెత్తి వచ్చిన తురకల దండయాత్రలవలన కాకతీయ సామ్రాజ్యము భగ్నమయినది. దానితోపాటు పాశుపత శైవ వైభవోద్ధతులును హరించిపోయినవి. వారు నిర్మించిన ఆలయములే కాక ఇతర దేవాలయములను



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కూలిపోయినవి. ఇతర ధర్మ ప్రతిష్ఠలును నాశమయినవి; వైదికాచార కర్మ నిరతులయిన బ్రాహ్మణులు, పాశుపత శివాచార్యులు అనేకులు హతులైనవారు కాగా మిగిలిన వారు పలుకష్ట నష్టములకు లోనై ఆశ్రయ రక్షణములను వెదకుకొనవలసిన వారైరి.

శైవము తెలుగు దేశములో వ్యాపించి అదివరకుండిన జైన, బౌద్ధ ధర్మములను నిర్మూలించివేసినదని, తమ మతమును వ్యాపింపజేయుటలో శైవులు వేదప్రామాణ్య మంగీకరింపని జైనులను బౌద్ధులను సంహరించిరని, జైన వసదులను నాశనము చేసిరని చెప్పి కొందరు తెలుగు బసవపురాణ, పండితారాధ్య చరిత్రములలోని శైవ భక్తుల గాథల నుదాహరించుచుందురు. ఈ గాథలనుబట్టి అట్లు చెప్పుట యుక్తమని పించదు; ఎందుచేత ననగా ఈ గ్రంథములలో వర్ణితములైన గాథలలోని భక్తు లెక్కడివారో తెలియదు. వారిలో అనేకులు తమిళ దేశములోనివారును, కన్నడ దేశములోనివారును. అందువలన జైన సంహార కథలు తెలుగుదేశములోనివే అని చెప్పుటకు వీలు లేదు. కాని మల్లికార్జున పండితారాధ్యునికి, బౌద్ధ గురువునకు వెలనాటి చోడ భూపతి సమక్షమున అతని ఆస్థానమున జరగిన వివాదము కారణముగా బౌద్ధుడు హతుడయ్యె నన్నది సత్యమని అంగీకరింపక తీరదు. తెలుగు దేశములో ఇటువంటి సంఘటనలు ఒకటి రెండు జరగిన జరగియుండవచ్చును; కాని, ద్రావిడ కన్నడ దేశములలోవలె అంత ఎక్కువగ ఇటువంటి హత్యాకాండ తెలుగుదేశములో జరగెనని ఖండితముగా చెప్పుటకు ఆధారములు లేవు. బౌద్ధముకాని, జైనముకాని తెలుగు దేశములో ఎక్కడెక్కడ అంతరించినను దానికి కారణము శైవ మనుట ప్రమాణరహితమైన మాట. శైవము బాగుగ వ్యాపించిన కాకతీయ రాజన్యుల కాలములో శైవులకు జైనులకు వివాదములు సంభవించినట్లు, జైనులను శైవులు వధించినట్లు చెప్పబడు గాథలు వట్టి పుక్కిటి పురాణములే. కాకతీయుల కాలములోనే వారి సామంతులు జైనవసదులకు చేసిన దానము అను తెలుపు శాసనము లున్నవి. కాకతి ప్రతాపరుద్ర మహారాజు పరిపాలన కాలములో రాజధాని అయిన ఓరుగంటియందు జైను లుండినట్లు, గ్రంథములు రచించుచుండినట్లు ఆధారము లున్నవి. ఆ కాలములో శైవ, జైన వివాదము లుండవచ్చును; వారిని వీరు, వీరిని వారు వధించుకొన్న సందర్భములును ఉండవచ్చును. కాని అటువంటివి చాల తక్కువ.

క్రీస్తుశకము పదునాల్గవ శతాబ్దములో, అనగా ముస్లిం దండయాత్రలకు తరువాతకూడ తెలుగుదేశములో శైవ సంప్రదాయములు - అందు ముఖ్యముగా పాశుపత శైవ సంప్రదాయము - వర్ధిల్లినవి. ముస్లిము దండయాత్రల అనంతరము తెలుగుదేశమును స్వతంత్రులై పరిపాలించిన కొండవీటి రెడ్డిరాజులును, తుంగభద్రానదీ తీరస్థమయిన విజయనగరము రాజధానిగా పరిపాలించిన మొదటి యాదవ వంశజులును శైవులే; శివాచార్యుల శిష్యులే. కాని, వీరు గోళకీమఠమువారని చెప్పుటకు ఆధారములు లేవు. ఇతర ధర్మసంప్రదాయములతో శైవము సమరస భావముతో మెలగి గౌరవభాజన మైనది.

నవనాథ సిద్ధోపజ్ఞమైన రసశైవముకూడ తెలుగుదేశములో వ్యాపించె ననుటకు ఆధారములు కలవు. ఈ శైవ సంప్రదాయము తెలుగుదేశము నందలి ఆయుర్వేద వైద్యమునకు ప్రోత్సాహ మిచ్చినది.

తెలుగుదేశములో వ్యాపించిన ఈ సంప్రదాయముల వలన శైవాచార పూజా పరికల్పనములు బహుళములయినవి. భక్తి అతిశయించినది. భక్తులమహిమల మీద ప్రజలకు విశ్వాసము హెచ్చినది. ప్రభావము, మహిమలు చూపు శివయోగులు, సిద్ధులు ప్రజల గౌరవాదరములకు పాత్రులైరి. శివాచార్యులకు, శివయోగులకు ప్రజలమీద పలుకుబడి అధికమయినది. వారి మాటకు తిరుగులేకపోయినది.

ముస్లిం దండయాత్రల అనంతరము హిందూరాజ్య పునరుద్ధరణ కాలమున తెలుగుదేశములో ప్రబలిన క్రతుకర్మాచరణ ప్రధానమైన వైదికధర్మోద్ధరణము వలన వేదవిహితమయిన శైవమునకును బలము కలిగినది. శైవ మఠములు జైనవసదుల వలెను, బౌద్ధవిహారముల వలెను విద్యాపీఠములై శైవ మవలంబించిన వారికి విద్యాప్రదానము కావించుచు వచ్చినవి. శివాచార్యులు, శైవమఠాధిపతులు తెనుగుబాసను అభిమానించి తెనుగున కృతులు రచించుటకు ప్రోత్సాహ మిచ్చినారు. విజయనగర సామ్రాజ్యమును పరిపాలించిన రెండవ, మూడవ, నాల్గవ వంశములవారు వైష్ణవ మతావలంబకు లయినను వారు శైవ, వైష్ణవములను సమాదరముతో చూచినారు. రాను రాను దేశములో వైష్ణవమునకుండినట్లు శైవమునకు రాజాదరము లేకపోయినను అది నేటికిని దేశములోని ప్రధాన ధర్మసంప్రదాయములలో ఒకటిగానే యుండినది. తెలుగు దేశము పరరాజాక్రాంతమయిన ఇటీవలికాలములో మత వైషమ్యములు, పరస్పరమతనిందలు హెచ్చినవి. కాని అంతకు పూర్వ మెక్కువగ ఉండినట్లుకాన్పించదు. ఎట్లయినను రాజాశ్రయముగల ధర్మసంప్రదాయమునకున్న బల ప్రాభవములు, అవి లేనివాని కుండుట అశ్రుత పూర్వము.

మ. సో. శ.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/

# వైష్ణవము

క్రీస్తుకు పూర్వము సాత్వత మనియు, భాగవత మనియు, వ్యవహరింపబడుచు వచ్చిన వైష్ణవమతమునకు మొదట వాసుదేవుడు ప్రధాన దైవము. భాగవతమతావలంబులను వాసుదేవ భక్తులనియు, భాగవతు లనియు వ్యవహరించు వారు. భాగవతమతము వాసుదేవోపజ్ఞము. వాసుదేవుడు వృష్ణికుల సంభవుడు. ఇతనికి కృష్ణవాసుదేవు డనియు పేరు. కృష్ణబోధితమైన ఈ మతమును అవలంబించినవారు యాదవులు, అందునను ముఖ్యముగా సాత్వతశాఖవారు. కృష్ణు డీశాఖవాడే. క్రీస్తుకు పూర్వము నాలుగవ శతాబ్దిలో వాసుదేవసంప్రదాయావలంబులు మధుర ప్రాంతమున మాత్రమే ఉండినట్లును, శూరసేన దేశీయులే ఈ భాగవతమత మవలంబించినట్లును మెగాస్థనీస్ అను యవన రాయబారి వ్రాయుచున్నాడు. మధుర శూరసేనదేశములోనిది. భాగవతమతావలంబులను గురించి క్రీస్తుకు పూర్వము మూడవ శతాబ్దిలో మన కంతగా తెలియదు. కాని క్రీస్తుకు పూర్వము రెండవ శతాబ్దినాటికి ఈ సంప్రదాయము మధురా ప్రదేశమును దాటి ఇతర ప్రాంతములకు విస్తరిల్లినది:

మొట్టమొదటిమారు ఆంధ్ర సాతవాహనుల కాలములో ఈ భాగవతమతము ఉత్తర హిందుస్థానమునుండి దక్షిణాపథమునకు వచ్చినట్లు కనబడు చున్నది. సాతవాహన నృపతులలో చాలమంది వైదిక మతావలంబులైనప్పటికిని భాగవత సంప్రదాయమును కూడ ఆదరముతో చూచిన వారే. వారి కాలపు శాసనములలో సంకర్షణ, వాసుదేవ, కేశవ, వర్ధన, కృష్ణ, గోపాలనామములు కనబడుచున్నవి. సాతవాహనులు రాజ్యమేలిన నాటికే ఈ భాగవత సంప్రదాయము దక్షిణాపథములో వ్యాపించినట్లు ఆ పేర్లను బట్టియే చెప్పవచ్చును. సాతవాహన రాజులలో ఆనాటి కవులు చెప్పిన గాథలలో ఏడువందల మంచిగాథల చేర్చి గాథాసప్తశతిని సంకలనము చేసిన హాలమహారాజు నాటికి సాతవాహన రాజ్యములో కృష్ణపూజ మాత్రమే కాక కృష్ణునికి సంబంధించిన గాథలును బాగుగా వ్యాప్తిలోనికి వచ్చినవి. గాథాసప్తశతిలో కృష్ణుడు మధుమథనుడని, దామోదరుడని పేర్కొనబడినాడు. యశోద, గోపికల ప్రస్తావముకూడ నున్నది. వీనిలోని కొన్ని గాథలు చదివిన రాధమీద గోపికల కసూయ ఉన్నట్లుకూడ వ్యక్తమగు చున్నది.

దక్షిణాపథములో భాగవత సంప్రదాయము క్రీస్తు శకము ప్రారంభ శతాబ్దులనాటికి వ్యాపించినదని తెలిసినప్పటికిని సాతవాహన మహారాజులు వైదికధర్మ నిరతులై యజ్ఞయాగాది కర్మలు చేయుచుండిన వారేకాని ఈ భాగవత సంప్రదాయము నవలంబించినట్లు వారి శాసనములను బట్టి కానరాదు. అదియును గాక ఈ సంప్రదాయము ప్రజల ఆదరము నెంతగా చూరగొన్నదో, ఈ సంప్రదాయము నెంతమంది అవలంబించిరో తెలిసికొనుటకు కూడ అవకాశము లేదు. క్రీస్తుశకము ప్రారంభశతాబ్దులలో ఈ సంప్రదాయము తెలుగుదేశములో ఎక్కువగా వ్యాప్తిలో నుండినదని చెప్పుటకు నిదర్శనములు లేవు. క్రీస్తు శకము నాలుగవ, అయిదవ శతాబ్దములనుండి దీనికి మహారాజుల ప్రాపు దొరకినది.

సముద్ర తీరస్థమయిన ఆంధ్రదేశమును ఇక్ష్వాకువంశపు రాజులకు తరువాత పరిపాలించినవారు పల్లవ వంశజులు; భారద్వాజ గోత్రులు. కుదురు ఒక్కచోటైనను, వీరిలో చాల శాఖ లున్నవి. వీరిలో మొదటి రాజులకు కాంచీపురము రాజధాని. అక్కడినుండి వీరు కాంచీపుర ప్రాంతమునేకాక దాని కుత్తరమున నున్న తెలుగు దేశమును కూడ కృష్ణానదీ తటము వరకు పరిపాలించినవారు. తెలుగు దేశమును పాలించుచుండిన పల్లవ మహారాజ ప్రతినిధి యువరాజు ధనకటకములో నుండువాడు. ఈ మొదటి మహారాజుల దానశాసనములు ప్రాకృతభాషలో నున్నవి. స్కందవర్మ మహారాజు రాజ్యకాలములో యువ మహారాజయిన బుద్ధవర్మయొక్క భార్య చారుదేవి దాలూరులో కూళిమహాతరకుడు నిర్మించిన భగవంతుడగు నారాయణుని దేవకులమునకు కొంతభూమిని దానము చేసినది ('దాలూరే కూళిమహాతరక దేవకులస్య భగవన్నారాయణస్స'). దేవకులమను పదమే జనవ్యవహారములో భ్రష్టమయి దేవళమయినట్లు కనబడుచున్నది. దక్షిణ హిందూదేశములో భగవంతుడైన నారాయణునికి దేవాలయము నిర్మితమైనట్లు తెలుపు మొదటి శాసన దృష్టాంత మిదియే. ఈ దేవకులమును కూళిమహాతరకుడను రాజకీయోద్యోగి నిర్మించినది. కూళియన్నది నామనిర్దేశము కావచ్చును. కూళి మహాతరకుడు నారాయణ భక్తుడు, పరమ భాగవతుడు కావచ్చును. కూళి మహాతరకుని దేవకులములోని నారాయణునికి పల్లవ యువ మహారాజు దేవేరి చారుదేవి రాజతటాకముక్రింది నాలుగు నివర్తనముల భూమిని దేవభోగముచేసి దాన మిచ్చెను (దేవుని కిచ్చిన భూమిని దేవభోగ మందురు). దక్షిణ హిందూదేశములో ప్రాకృతభాషా శాసనములకు సముద్రగుప్తమహారాజు దక్షిణదేశ జైత్రయాత్రా కాలమే కడపటి హద్దనియు, అటుతరువాతనుండి సంస్కృతభాషా శాసన



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ముల కాలమని చరిత్ర పరిశోధకులు ఉజ్జాయింపుగా ఒక పరిమితిని ఏర్పరచినారు. అందువలన పల్లవ యువ మహారాజు రాణి చారుదేవి — ఈ దానశాసనము ప్రాకృత భాషలో ఉండుటవల్ల - క్రీస్తుశకము నాలుగవ శతాబ్ది నాటిదని నిర్ణయింప వచ్చును. దీనినిబట్టి క్రీస్తుశకము నాలుగవ శతాబ్దినాటికి భాగవత మతము తెలుగు దేశములో వ్యాపించినట్లే కాక భగవంతుడైన నారాయణునికి దేవకులములు కూడ నిర్మితమైనట్లు ఈ చారుదేవి శాసనమువల్ల తెలియు చున్నది.

ప్రాకృత భాషలో దాన శాసనములు వ్రాయించి యిచ్చిన మొదటి పల్లవ రాజుల యనంతరము వారిలో కొందరు అయిదవ, ఆరవ శతాబ్దులలో గుంటూరు, నెల్లూరు మండలములలో రాజ్యము చేసిరి. వీరి దాన శాసనము లన్నియు సంస్కృత భాషలో ఉన్నవి. వీరందరు భాగవత సంప్రదాయావలంబకులు; పరమ భాగవతులు. వీరి కాలమున వీరి రాజ్యములోకూడ విష్ణువునకు దేవాలయము లుండినట్లు వీరి శాసనములవల్ల తెలియవచ్చు చున్నది. ఈ పల్లవ రాజులలో స్కందవర్మ ప్రపౌత్రుడును, వీరవర్మ పౌత్రుడును, స్కందవర్మ పుత్రుడును అయిన యువమహారాజు విష్ణుగోపవర్మ సింహవర్మ యను మహారాజు రాజ్యకాలములో ఉరువుపల్లి గ్రామములోని రెండువందల నివర్తనముల భూమిని కందుకూరిలో విష్ణువర్మ సేనాపతి నిర్మించిన విష్ణుహార దేవకులమునకుగాను దేవభోగము చేసి దానము చేసెను. ఇదియును



చిత్రము 98. హరిహరమూర్తి. భైరవుని కోన

విష్ణ్వాలయమే. ఈరీతిని కృష్ణకు దక్షిణమున నున్న సముద్ర తీరస్థాంధ్ర దేశములో నాలుగైదు శతాబ్దులలో భాగవత మతము వ్యాపించిన దనియు, మహారాజులుకూడ ఆ సంప్రదాయము నవలంబించిన పరమ భాగవతు లనియు పూర్వోక్త విషయములవల్ల తెలియవచ్చుచున్నది.

మొదటి పల్లవ వంశపు రాజులకు సమకాలికులు శాలంకాయన గోత్రులయిన భూపరులు. వీరి మొదటి శాసనములు ప్రాకృతములోనే ఉన్నవి; తరువాతివి సంస్కృత భాషలో ఉన్నవి. వీరు కృష్ణా గోదావరీనదుల మధ్య ప్రదేశమున విజయ వేంగీపురము రాజధానిగా క్రీ. శ. నాలుగైదు శతాబ్దములలో రాజ్యము చేసినవారు. విజయ వేంగీపుర మిప్పటి పెదవేగి యని చరిత్రకారులు గుర్తించినారు. ఇది పశ్చిమ గోదావరి జిల్లాలో ఏలూరికి సమీపముగా నున్నది. ఈ శాలంకాయన గోత్రులైన రాజులు చిత్రరథస్వామి భక్తులు. చిత్రరథు డన్నది సూర్యునికి పేరు. అందువల్ల ఈ శాలంకాయనులు సూర్యారాధకులని తెలియుచున్నది. క్రీ. శ. ఆరంభ శతాబ్దులలో సూర్యారాధన తెలుగు దేశములో ఉండినట్లు నిదర్శనము లున్నవి. విజయ వేంగీపురములో పూర్వము సూర్యునికి దేవాలయ ముండినట్లు చెప్పుదురు. ఇప్పటికిని పెదవేగిలో ఆ యూరివారు చిత్రరథస్వామిదిబ్బ యని ఒక దిబ్బను చూపుదురట. ఈరాజులు సూర్యారాధకు లైనప్పటికిని వీరిలో కొందరు విష్ణుభక్తులు. వీరు తాము పరమ భాగవతులమని చెప్పుకొన్నారు. ఒక్క వంశము లోనివా రందరును ఒకచే ధర్మ సంప్రదాయము నవలంబింపవలెనను నియమము ఆ కాలములో లేనట్లు కనిపించుచున్నది. సంస్కృత భాషలో దాన శాసనము లిచ్చిన ఈ రాజుల కాలములో కృష్ణా గోదావరీ మధ్యస్థ దేశములో కూడ విష్ణుదేవున కాలయము లుండినట్లు తెలియుచున్నది. శాలంకాయన రాజ్య స్థాపకుడైన హస్తివర్మ ప్రపౌత్రుడును, నందివర్మ మహారాజు పౌత్రుడును, చండవర్మ మహారాజు పుత్రుడును అయిన నందివర్మ మహారాజు తన ధర్మ యశోభివృద్ధి కొరకు త్రిలోకనాథుడయిన విష్ణుగృహస్వామికి తన రాజ్యములోని వేరు వేరు గ్రామములలో కొన్ని హలముల భూమిని దేవహలము చేసి దానము చేసెను. హల మనగా నాగలి. పూర్వకాలములో భూమి విస్తీర్ణమును ఇన్ని నాగళ్ళ భూమి అని నాగళ్ళ లెక్కలో తెలుపువారు.

ఇక గోదావరీ నదికి ఉత్తరమున నున్న కళింగదేశ విషయము విచారింతము. క్రీ. శ. అయిదవ శతాబ్దికి పూర్వము కళింగదేశ చరిత్ర మన కంతగా తెలియదు. క్రీస్తు శకము అయిదవ శతాబ్దినుండి కొందరు రాజులీ ప్రాంతమును పాలించుచు వచ్చినట్లు వారి తామ్రశాసనములవల్ల తెలియుచున్నది. వీరి తరువాత కళింగమును పాలించినవారు గంగవంశపు రాజులు. వీరికిని, వీరికి పూర్వులుగా తెలియవచ్చు రాజులకును ఏదయినను సంబంధ మున్నదో లేదో మనకు తెలియదు. గంగవంశజుల పరిపాలనమునకు పూర్వము భాగవత సంప్రదాయము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కళింగములో వ్యాపించినదో లేదో తెలియదు కాని గంగ భూధవుల కాలములో మాత్రము వారి రాజ్యములో వ్యాపించినట్లు మనకు నిదర్శనము లున్నవి. కాని కళింగనగరము రాజధానిగా కళింగదేశమును పరిపాలించిన గంగ వంశజులు శకల శశాంక శేఖరధరుడును, మహేంద్రాచల శిఖరప్రతిష్ఠితుడును అయిన గోకర్ణేశ్వర స్వామిని ఆరాధించు పరమమాహేశ్వరులైనను మత సహనము కలిగి ఇతర సంప్రదాయములను కూడ సమానముగా ఆదరించిన వారు. వీరిలో హస్తివర్మ మహారాజు గాంగశకము 20 వ సంవత్సరమున భగవంతుడును, సప్తార్ణవశాయియు, సప్తసామోపగీతుడును, సప్తలోకైక నాథుడును అయిన నారాయణునికి బలి, చరు, సత్ర ప్రవర్తనము నిమిత్తమును, ఖండస్ఫుటిత సంస్కారము నిమిత్తమును రోహణకి గ్రామములో ఆరు హలముల భూమిని దానము చేసినాడు. హస్తివర్మ మహారాజునకు రణభీతుడని బిరుదాంకము. ప్రాయికముగా ఈ మహారాజు ప్రతిష్ఠయే కావచ్చునీనారాయణునిది. ఈ కారణముచేతనే ఈ దేవునికి రణభీతోదయుడని కూడ పేరు కలిగినది. కళింగములో గాంగ వంశపు రాజులు చేసిన విష్ణుప్రతిష్ఠలలో మనకు తెలియవచ్చిన దిదియే మొదటిది. కళింగములో విష్ణుదేవుని యాలయమునకు మనకు దొరకిన ఆకరములలో కూడ ఇదే మొదటిది. కట్టించిన విష్ణుదేవునియాలయము ఒకవేళ బీటలు తీసి శిథిలమైనప్పుడు దానిని మరమ్మతు చేయించుట కూడ ఈ భూదాన ప్రయోజనములలో ఒకటి. ఖండస్ఫుటిత సంస్కారమన్న పదముయొక్క అర్థ మిదే. గాంగశక ప్రారంభము మన కింకను నికరముగ తేలలేదు. హస్తివర్మ క్రీ. శ. ఆరవ శతాబ్ది పూర్వార్ధములో ఉండెనని చెప్పవచ్చును. ఆ మహారాజు రాజ్యము చేసిన కాలమునకు భాగవత సంప్రదాయము కళింగదేశములో వ్యాపించినదనుటకు సందేహింప బనిలేదు.

హస్తివర్మ మహారాజు విష్ణ్వాలయమునకు పైని చెప్పిన దానము చేసిన మరి తొమ్మిదేండ్లకు కళింగదేశమును పరిపాలించిన మరొక గాంగ మహారాజు ఇంద్రవర్మ అనువతడు భగవంతుడైన రామేశ్వరభట్టారకునికి, అనగా రామేశ్వరస్వామికి బలి చరు సత్ర ప్రవర్తనము నిమిత్తమును, ఖండస్ఫుటిత సంస్కారము(దేవాలయము మరమ్మతుల) నిమిత్తమును క్రోష్టుకవర్తనీ విషయములోని హరిభట గ్రామములో రెండు హలముల(నాగళ్ల) భూమిని దేవాగ్రహారముచేసి దాన మిచ్చినాడు. పైని చెప్పిన ఈ రెండు ఉదాహరణముల వలనను కళింగములోకూడ క్రీస్తుశకము ఏడవ శతాబ్దమునకు పూర్వమే భాగవత మతము వ్యాపించిన దనియు, గోదావరికి దక్షిణమున నుండు దేశములో వలెనే ఉత్తరమున నున్న కళింగములోకూడ విష్ణువునకు ఆలయము లుండిన వనియును తెలియుచున్నది. పల్లవమహారాజులు పెట్టుకొనుచువచ్చిన విష్ణువర్మ, విష్ణుగోప, కుమారవిష్ణు మొదలైన పేర్లుకూడ తెలుగు దేశములో క్రీస్తుశకము ఏడవశతాబ్దికి పూర్వము విష్ణువునకు సంబంధించిన సంప్రదాయము వేరుతన్నుకొని వర్ధిల్లుచుండె ననుటకు తార్కాణములు. ఒక్క మహారాజులే కాక బ్రాహ్మణు లనేకులు విష్ణుశర్మ, మాధవశర్మ మొదలైన పేర్లను పెట్టుకొనుచు వచ్చినట్లు ప్రాచీన దానపత్రములను పరిశీలింపగా తెలియవచ్చుచున్నది.

ఇక తెలుగు దేశమును పాలించిన తూర్పు చాళుక్యుల కాలములో ఈవైష్ణవ సంప్రదాయమున కంతకు పూర్వము కంటెను వ్యాప్తి అధికమైనట్లు కన్పించుచున్నది. తూర్పు చాళుక్య రాజ్యమును స్థాపించిన మహారాజు విష్ణువర్ధనుడు. ఇతని పేరునుబట్టి ఇతడు వైష్ణవ సంప్రదాయమునకు చెందినవాడని ఊహింప వచ్చును. కాని ఇతని సంతతి వారిలో చాలమంది విష్ణువర్ధన నామాంకితులైనను వారందరును వైష్ణవ సంప్రదాయమునకు చెందినవారు కారు. వీరిలో కొందరు శైవసమయము నవలంబించిన పరమ మాహేశ్వరులు. చాళుక్యరాజ్య స్థాపకుడైన విష్ణువర్ధనుడు వైష్ణవ ధర్మావలంబకుడే. అతడు తన శాసనములలో తాను పరమ భాగవతుడ నని చెప్పుకొనెను. ఇతని సంతతివారు ఇతనిని 'కారణ విష్ణు' వని, 'ఐదంయుగీన విష్ణు' (ఈ యుగమునకు విష్ణువువంటివాడు) వని ఇతనిని ప్రశంసించియున్నారు. కాని, చాళుక్య యుగము మొత్తముమీద చూచినచో చాళుక్య రాజ్యమున శైవ సంప్రదాయమే ఎక్కువగ వ్యాపించినట్లు కాన్పించును. తెలుగు దేశమును పాలించిన విష్ణువర్ధన నామము కల చాళుక్య మహారాజులలో కొందరైనను పరమ భాగవతు లున్నప్పటికిని విష్ణ్వాలయమునకుగాని, విష్ణు ప్రతిష్ఠకు గాని వారి శాసనములలో ఎక్కడను ఒక్క సూచనయు లేదు. ఇది చాల ఆశ్చర్యకరమైన విషయము; ఏమనగా, క్రీస్తు శకము ఆరంభమునుండి తెలుగు దేశములో తూర్పు చాళుక్యుల పరిపాలనము అంతమగువరకు గల కాలములో తెలుగు దేశమునకు పొరుగున నున్న ద్రవిడ దేశములో ఆళ్వారు లుదయించి, విష్ణునామ సంకీర్తనము కావించి వైష్ణవ భక్తి సంప్రదాయమును పరివ్యాప్తము కావించిరి. వారి ప్రభావముచేత వైష్ణవము భక్తిప్రధానమైన మతమై రాణ కెక్కినది. ఈ యాళ్వారులు పండ్రెండుగురు. వైష్ణవ గురు పరంపరలలో చెప్పిన ఈ యాళ్వారుల



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వరుసక్రమము సరియైనదని యంగీకరించుచున్నట్లయిన వీరిలోని కట్టకడపటి ఆళ్వారు తిరుమంగై ఆళ్వారు. ఈయన కాంచీపురము రాజధానిగా రాజ్య మేలిన పల్లవ వంశజుడైన మొదటి నరసింహవర్మ (క్రీ. శ. 625 - క్రీ.శ. 645)కు సమకాలికుడైన శైవసైనారు తిరుజ్ఞానసంబంధరుతో వాదము చేసినట్లు తెలియవచ్చుటచేత మిగిలిన ఆళ్వారు లందరును అంతకు పూర్వు లనియే నిర్ణయింపవలసి యుండును. ఈ యాళ్వారుల దివ్య సంకీర్తనముల మొత్తము గ్రంథమునకు దివ్య ప్రబంధమని, నాలాయిర ప్రబంధమని పేరు. ఈ యాళ్వారు లందరిలో ఎక్కువ ప్రబంధములు రచించిన వారు తిరుమంగై ఆళ్వారు. ఈయన రచించిన దివ్య సంకీర్తనములు వేయికి పైగా నున్నవి. నమ్మాళ్వారు రచించిన దివ్య ప్రబంధమునకు తిరువాయ్ మొళి అని పేరు. ఆళ్వారు లందరు నారాయణుడే ప్రధాన దైవమని చెప్పి విష్ణువు అవతారములను, అందులో ముఖ్యముగా త్రివిక్రమావతారమును వినుతించుచుందురు; కృష్ణ లీలల నభివర్ణింతురు. వేదములను వారు గౌరవించినప్పటికి నారాయణనామ సంకీర్తనము చేయవలెనని, విష్ణ్వాలయములలో నారాయణు నర్చింపవలెనని, వారి యవతార మహత్త్వమును తలచి నారాయణ ధ్యానము చేయవలెనని వారు బోధించిరి. ఈ యాళ్వారులకు తరువాత వైష్ణవ సంప్రదాయాభ్యున్నతికి కారకులైనవారు ఆచార్య పురుషులు· నాథముని, పుండరీకాక్షుడు, రామమిశ్రుడు, యామునాచార్యులను అళవందారు, రామానుజాచార్యులు మొదలయినవారు. వీరిలో నాథముని అను రంగనాథాచార్యులవారు పాంచరాత్ర తంత్రముల నాధారము చేసికొని ప్రపత్తి అను నూతన సిద్ధాంతమును ప్రతిపాదించి వైష్ణవమునకు ఒక క్రొత్త రూపమిచ్చినారు. ఈయన పౌత్రుడే యామునాచార్యులవారు. శ్రీ రామానుజాచార్యులవారి సిద్ధాంతములకు ప్రాతిపదిక లన్నియు ఈ యామునాచార్యులవారు వేసినవే అని చెప్పుదురు. ఈయన క్రీ.శ. 1040 లో వైకుంఠవాసుడైనట్లు చరిత్రకారులు నిర్ణయించుచున్నారు. ఈవిధముగా ద్రవిడ దేశములో ఆళ్వారులు, ఆచార్య పురుషులు ఈ వైష్ణవ సంప్రదాయమునకు క్రొత్త జీవము పోసి క్రొత్త రూపము నిచ్చుచున్నప్పటికిని దాని ప్రభావము ఈ కాలములో తెనుగు దేశములో ఎక్కువగ కనబడకపోవుటయే విచిత్రము. అయినను తెనుగు దేశములో విష్ణుదేవునియాలయములు లేవని కాని, విష్ణుపూజ లేదనికాని చెప్పలేము. విష్ణ్వాలయములు, విష్ణుపూజ తెలుగు దేశములో క్రీ. శ. నాలుగయిదు శతాబ్దులనుండి యుండినట్లు పల్లవ, శాలంకాయన శాసనములే చెప్పుచున్నవి. కాని ద్రవిడ దేశములోని ఆ భక్తి ఉద్యమము ఎంత బలమైనదో దానికి తగినంతగా దాని ప్రభావము తెలుగు దేశములో కనబడుట లేదు. వేదమార్గ ప్రతిష్ఠాచార్యులైన వైష్ణవ ఆచార్యోత్తములను గురించి పదుమూడవ శతాబ్దినాటి నెల్లూరు మండల శాసనములవలననే వింటుము. మొట్టమొదటిమారు మనకు తెలియవచ్చిన వైష్ణవాచార్యోత్తముడు శ్రీమతు మార్గము వహించి ముక్కల వీర తిరువేంగడ కుమారులు.



చిత్రము 94. కృష్ణుడు, సత్యభామ, రుక్మిణి – చీమకుర్తి

శ్రీవైష్ణవము ప్రజలలో మందమందముగా వ్యాపించుచుండినప్పటికిని దక్షిణ దేశములో వ్యాప్తమైన వైష్ణవ ప్రభావము తెలుగు దేశముమీద లేకపోలేదు. తెలుగు దేశములో పండ్రెండవ శతాబ్దినాటికే ప్రసిద్ధములైన విష్ణ్వాలయములు వెలసినవి. వీనిలో తెలుగు దేశము ఉత్తరపుకొనను శ్రీకాకుళము జిల్లాలోని శ్రీకూర్మము, విశాఖపట్టణము జిల్లాలోని సింహాచలము, గోదావరి జిల్లాలోని సర్పవరము, గుంటూరు జిల్లాలోని బాపట్ల మొదలయినవి ప్రముఖములైనవి. ఈ క్షేత్రములలోని దేవాలయములు పండ్రెండు, పదుమూడు శతాబ్దములలో మహావైభవము అనుభవించినవి. ఈ యాలయములలో స్వామి పూజా పురస్కార భోగాదుల నిమిత్తమును, స్వామికి ఊడిగము చేయు పరిచారక బృందమయిన 'సానుల మానుల' నిబంధముల నిమిత్తమును, దీపదానము నిమిత్తమును మహారాజులు మొదలయినవారు కొన్ని కొన్ని కట్టడలు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చేసి, కొన్ని మాన్యముల నిచ్చినారు. ఇట్టి కట్టడలకు సంబంధించిన శాసనములు పూర్వోక్త దేవాలయములలో పండ్రెండు, పదుమూడు శతాబ్దులనాటివి, ఆయా దేవాలయముల గోడలమీదనే చెక్కినవి, ఇప్పటికి అనేకము లున్నవి. విష్ణ్వాలయములకు విశేష ప్రాముఖ్యము వచ్చుటే కాక దక్షిణ దేశములోని వైష్ణవ మత ప్రాబల్యమువల్ల తిరువాయ్‌మొలి అను స్తోత్ర గ్రంథము పదునొకొండవ శతాబ్దమునుండి తెలుగుదేశమునందలి ప్రసిద్ధ విష్ణ్వాలయములలో పాడబడుచు వచ్చినది. ఇది పాడుటకుగాను ఆ దేవాలయములలో నిబంధములుకూడ చేయబడినవి.

పదునొకండవ శతాబ్దమునుండి దేవాలయ నిర్మాణములో పెంపు కలిగినది. అంతవరకు ఒక గర్భగృహము, అంతరాళికము, ముఖమండపములతో నున్న దేవాలయములలో ప్రధాన దైవతములకే కాక పరివార దైవతములకు సైతము గృహము లేర్పడినవి. పన్నిద్దరాళ్వారు అను విష్ణుభక్తులు కూడ పండ్రెండవ శతాబ్దము నుండి విష్ణ్వాలయములలో విగ్రహరూపమున ప్రవేశించినారు. దేవాలయ విన్యాసములో కళ్యాణమండపము, సభామండపము, నాట్యమండపము మొదలైన మండపము లనేక మంతర్భాగములైనవి. నాట్య, సంగీత, చిత్ర కళానిలయమై దేవాలయ మొకకళా పోషకసంస్థ యైనది. అది వేదవిద్యను, మత విద్యను నేర్పు విద్యానిలయ మయినది.

ఈ కాలము నాటికి దక్షిణదేశ వైష్ణవములో గొప్ప మార్పు సంభవించినది: అది యెట్లనగా, కులము, వర్ణము ఏదయినను ప్రపన్ను లందరును సమానులేయని, భక్తులలో కొందరెక్కువవారు కొందరు తక్కువవారు లేరని శ్రీవిశిష్టాద్వైత మత స్థాపకులైన శ్రీమద్రామానుజాచార్యులవారు ప్రపన్నులవిషయమునను, మోక్షము విషయమునను కులభేద రహితమైన విశాలదృష్టిని కనబరచిరి. ప్రపన్నుల విషయమునను, మోక్షము విషయమునను మాత్రమేకాక ప్రసాద, దయా, జ్ఞాన, ప్రపత్త్యాదు లను మరి పదునారు విషయముల సందర్భమున కూడ శ్రీమద్రామానుజాచార్యులవారి యభిప్రాయములతో మహాపండితులైన వైష్ణవాచార్యోత్తములు కొంద రేకీభవింపలేదు. మొత్తముమీద వైష్ణవులలో వైష్ణవులకు అభిప్రాయభేద కారణములైన అంశములు పదునెనిమిది. ప్రధాన ధర్మ విషయములను గురించి కొందరి కభిప్రాయ భేదము లున్నను అట్టి భిన్నాభిప్రాయములు గలవారి నందరి నేకము చేసి కూడగట్టుకొని రాగల ప్రజ్ఞావంతుడు ప్రతిభావంతుడు వైష్ణవులలో లేకపోయినను వైష్ణవ సంప్రదాయములో ఈ భిన్నాభిప్రాయపు పగులు పదునాలుగవ శతాబ్దము ప్రథమపాదాంతము వరకు పరిస్ఫుటము కాక లీలామాత్రముగా అట్లే ఉండిపోయినది.

పదునాలుగవ శతాబ్దము మొదటిపాద మంతమగు నాటికి దక్షిణ దేశములోని రాజ్యములు కూలిపోవుటయు, ముస్లిము ప్రభుత్వ మేర్పడుటయు, అటుతరువాత ముందు తెలుగు దేశములో హిందూ ధర్మ పునఃప్రతిష్ఠాపనము జరగుటయు కూడ సంభవించినది. తెలుగు దేశములో జరగిన హిందూ ధర్మపునఃప్రతిష్ఠాపనము దక్షిణ హిందూదేశములో ముస్లిము ప్రభుత్వవినాశనమునకును, ఇతరహిందూ రాజ్య సంస్థాపనమునకును నాంది యైనది. ఈ హిందూ రాజ్య పునస్సంస్థాపన యుగములో హిందూ రాజన్యులు యజ్ఞయాగాదులతో కూడిన వైదికధర్మమును పునరుద్ధరించి వేదవేదాంగ పారగుల కాశ్రయ మిచ్చి వారిని పోషించుచు వచ్చిరి. ఈ యుగములో తెలుగు దేశమును పరిపాలించిన రెడ్డిరాజన్యులును, కర్ణాటాధీశ్వరులును వేదమతోద్ధారకులై వైదికధర్మ ప్రోత్సాహకు లగుటవలన దక్షిణ దేశములోని వైష్ణవమతాచార్యులలో చాలమంది వేద సంప్రదాయము వైపు, వర్ణాశ్రమధర్మ భావములవైపు మొగ్గి నమ సంప్రదాయము నెక్కువగా నన్నివిధముల వైదికము చేయుటకు ప్రయత్నించిరి. ఈ కారణమున అంతవరకు సన్నని పగులుగా నున్నది ఇప్పుడు పెద్ద బీట యైనది. వైష్ణవమును సంపూర్ణముగా అన్ని విధముల పూర్వాచార పరాయణమును, వైదికమును చేయవలెనన్న పక్షమువారికి వెంకటనాథ నామాంతరముగల వేదాంత దేశికులవారు నాయకులైరి. తద్వ్యతిరేకపక్షమునకు పిళ్లె లోకాచార్యులవారును, ఆయన సోదరులు అళగియ మన వాళ పెరుమాళ్ నైనారాచార్యులవారును నాయకులైరి. ఈ యుభయపక్ష నాయకుల బోధలవలనను, ప్రయత్నముల వలనను అంతవరకు ఒక స్ఫుటరూపము లేని భిన్నాభిప్రాయ సంప్రదాయములకు ఒక విశదరూప మేర్పడి యవి వడగలై, తెంగలై సంప్రదాయములుగా రూపొందినవి. వేదాంతదేశికాచార్యులవారు వడగలై సంప్రదాయావలంబకులు. వడగలై పక్షమునకు భిన్నమై నదియు, వ్యతిరేకమైనదియు తెంగలై సంప్రదాయము. ఇదే ఈ కాలములో వైష్ణవములో వచ్చిన గొప్ప మార్పు. అప్పటి నుండి వైష్ణవులలో ఈ రెండు సంప్రదాయముల వారును ఉన్నారు.

వైదికమతము పునఃప్రతిష్ఠితమైన ఈ యుగములో ద్రవిడదేశమునుండి వైష్ణవాచార్యు లనేకులు తెలుగు దేశములో పర్యటనము చేసి వేరు వేరు సంస్థానములకు వెళ్ళి



http://www.sanskritcentral.com/

http://teluguthesis.com/



అక్కడి పండితులతో శాస్త్రవాదము చేసి వారిని జయించి ముందు మహారాజులకు మత మిచ్చి, తరువాత వారి సామంతులను వశపరచుకొని, తమ మతమును వ్యాపింపజేసిరి. అటువంటి ఆచార్యులలో వేదాంత దేశికులవారి శిష్యులును, కుమారులును అయిన నైనారాచార్యు లనునామాంతరము గల వరదాచార్యులవా రొకరు. వారు తెలంగాణాలోని రాచకొండ సంస్థానమునకు వెళ్లి రేచెర్ల మాధవనాయక తనూజుడైన సర్వజ్ఞ సింగమ నాయనికి మత మిచ్చినారు. ఈకాలములో తెలంగాణాలో వైష్ణవ మతమును వ్యాపింప జేసినవారిలో మొదటి ఆచార్యవర్యులు వీరే. ఇట్లే ఈ కాలములోని ఇతరాంధ్రదేశములో గూడ భట్టరువారు, కందాడవారు, తిరుమలవారు, నల్లాని చక్రవర్తులవారు మొదలైన సుప్రసిద్ధ వైష్ణవ వంశములవారు పర్యటనము చేసి వైష్ణవమత వ్యాపనమునకు పూనుకొన్నారు. హిందూ రాజ్య పునఃప్రతిష్ఠాపన యుగములో మొదట కొంత కాలము శైవము ప్రబలముగా ఉన్నను తరువాత క్రమక్రమముగా ఈ వైష్ణవాచార్యుల బోధలవలనను, ప్రయత్నములవలనను వైష్ణవము తెలుగు దేశములో బాగుగా వేరు తన్నుకొని వర్ధిల్లినది.

ఓరుగంటి కాకతీయసామ్రాజ్యము భగ్నమైన తరువాత ప్రాగాంధ్ర దేశములోను, పశ్చిమాంధ్ర దేశములోను వర్ధిల్లిన కొండవీడు, విజయనగర రాజ్యములలో కొండవీటి రాజ్యాధిపతి అయిన కుమారగిరి భూపతివరకు గల రెడ్డి రాజన్యులు శైవాచార సంపన్నులు. రాజమహేంద్రవరమును పాలించిన రెడ్డిరాజన్యులుకూడ షట్కాల శివ పూజా ధురంధరులు. కుమారగిరి భూపాలుని కాలము నుండి కొండవీటి రెడ్డిరాజ్యములో శైవముకూడ ఉండినను వైష్ణవము పూర్వాంధ్ర దేశములో రాజాదరణ పాత్రమై అంతకు పూర్వముకంటెను బలపడినది.

ఈవిధముగనే పశ్చిమాంధ్రదేశములోని విజయనగరము రాజధానిగా కర్ణాట సామ్రాజ్యమును బరిపాలించిన నాలుగు రాజవంశములలో మొదటిదైన సంగమ వంశపు రాజులు శైవ మతావలంబులై శైవధర్మ సంప్రదాయమును ఆదరించినారు. ఇట్లని వారు ఇతర ధర్మ సంప్రదాయముల నుపేక్షింపలేదు. వానినికూడ సమదృష్టితో ఆదరించియున్నారు. సంగమ వంశములోని కడపటి పాలకులలో మొదటి విరూపాక్ష మహారాయలే వైష్ణవమత మవలంబించిన మొదటి కర్ణాటాధీశ్వరుడు. సంగమ వంశజులను త్రోసి రాజని విజయనగర సింహాసన మెక్కిన సాళువ నరసింగ రాయలు పరమ వైష్ణవుడు. ఇతనికి శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామి ఇష్టదైవము. సాళువ నరసింగరాయలు సింహాసన మెక్కుటతో దక్షిణ హిందూ దేశములో వైష్ణవమత వ్యాపనమునకు గొప్ప ప్రోత్సాహము కలిగినది. సాళువ వంశజుల కాలమునుండి, అనగా క్రీస్తు శకము పదునైదు, పదునారు శతాబ్దములలో చిత్తూరు జిల్లాలోని తిరుపతి వైష్ణవమునకు ప్రధాన కేంద్రమైనది. సాళువ నరసింహరాయలు మొదలుకొని విజయనగర సింహాసన మధిష్ఠించిన కర్ణాటాధీశ్వరు లందరు వైష్ణవ మతావలంబకులే; వైష్ణవాచార నిరతులే. వారు శైవమునకు చూపిన ఆదరణముకంటెను, శివాలయములకు చేసిన దాన ధర్మములకంటెను వైష్ణవమునకు చూపిన ఆదరణమును, విష్ణ్వాలయములకు చేసిన దాన ధర్మములును అధికము. ఈ కర్ణాటాధీశ్వరులు కొందరు ప్రముఖులైన వైష్ణవాచార్య స్వాముల విషయములో వారికి శ్రీవైష్ణవ సంఘములోను, సమావేశములలోను ప్రథమ గౌరవాదికములు చూపవలెననియు, కర్ణాట సామ్రాజ్యములోని వైష్ణవాలయములు అన్నింటిలోనో, కొన్నింటిలోనో తీర్థ ప్రసాదములు వినియోగము చేయుటలో మొదటి గౌరవము వారికీయవలెననియు కట్టడ చేయుటయే కాక, శ్రీ రామానుజమత మవలంబించిన అన్ని కులములవారి ప్రవర్తన సరిగా ఉన్నది లేనిది విచారించుచుండుటకును, అట్టివారిలో మత, సాంఘిక విషయములలో ధర్మ విరుద్ధముగా ప్రవర్తించినవా రెవరైన నుండిన అట్టియపరాధులను దండించుటకును అధికారముకూడ నిచ్చియున్నారు. ఈ కారణముచేత కర్ణాట సామ్రాజ్యము వర్ధిల్లిన కాలములో — ముఖ్యముగా కడపటి అర్ధభాగములో, వైష్ణవాచార్యుల పలుకుబడి, ప్రభావము అధికమై, వైష్ణవ మతావలంబకులైన అన్ని వర్ణములవారిని శాసించి అదపులో ఉంచగల అధికారము వారికి లభించినది.

కర్ణాట సామ్రాజ్యములో వైష్ణవ ధర్మము ప్రవర్తింపజేయుటలోను, విద్య వ్యాపింపజేయుటలోను వైష్ణవ మతములు కూడ చాల తోడ్పడినవి. వడగలై, తెంగలై మతము లని విశిష్టాద్వైత మతములు రెండు రకములు. చిత్తూరు జిల్లాలోని తిరుపతి, కర్నూలు జిల్లాలోని అహోబలము మతములు తెలుగు దేశములోని సుప్రసిద్ధములైన వడగలై మతములు. తెంగలై మతములు అటువంటివి ప్రసిద్ధములైనవియు, పురాతనమైనవియు లేవు.

ఈకాలములో తెలుగు దేశమునందు శ్రీరామాలయమైనను లేని గ్రామము లేదు; శ్రీరామ భజన మందిరమైనను లేని పల్లెటూరు లేదు. తెలుగు దేశీయులలో అధిక సంఖ్యాకులకు శ్రీరామచంద్రమూర్తియే ఆరాధ్య దైవము. తెలుగు ప్రజలలో న సంఖ్యాకులు శ్రీరామోత్సవము అతి వైభవముతో నెల్ల నాడును జరపుచుందురు. మ. సో. శ.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/

## ఇస్లాము

ముస్లిముల మతము ఇస్లాము. ఈ మతమును మహమ్మదు ప్రవక్త క్రీ. శ. 610 లో స్థాపించెను. ఈయన క్రీ. శ. 571 లో మక్కా నగరమున బనూహాషిమ్ అను వంశపు యింట జన్మించెను. యూదుల మతము, క్రైస్తవ మతముల వలెనే యీ మతము గూడ 'దేవు డొక్కడే' యను సిద్ధాంతము ప్రధానముగ గలది. ఈ రెండు మతముల కును తర్వాతనే ఇస్లాము మతము స్థాపితమాయెను.

**ఇస్లాము ; దాని యర్థము - అందలి భిన్నమతములు :** ఇస్లా మనగా శాంతి యనియు, భగవదాజ్ఞను శిరసావహించుట యనియును అర్థము. మహమ్మదు ప్రవక్తకు దేవునిచే చెప్పబడిన గ్రంథమే ఖురాను. ఇమామ్, ఇబాదత్, ఇహసాన అను సిద్ధాంతములు ఖురానులో చెప్పబడినవి. ఈ సిద్ధాంత త్రయమునందు ఇస్లాముమత ప్రాథమిక విషయములు కలవు. 'దేవు డొక్కడే' యను సూత్రమునకు సంబంధించినది 'ఇమామ్'. (1) 'దేవు డొక్కడే' యని నమ్మి మహమ్మదు ప్రవక్తయందు నమ్మిక గలిగి యుండుట ; (2) ప్రతి దినమును ఐదుసారులు దైవ ప్రార్థన కావించుట ; (3) జకాత్ చేయుట - అనగా తన కున్న ధనమందు నూటికి రెండున్నర పాళ్ళ వంతున సంవత్సరమున కొకసారి రంజాన్ నెలలో దానము చేయుట ; (4) రంజాన్ మాసమున ఉపవాసము లుండుట ; (5) మక్కానగర యాత్ర గావించుట - ఈ పంచ సూత్రములకు సంబంధించినది 'ఇబాదత్'. వ్యక్తిగతముగను, సాంఘికముగను మానవు డవలంబింపవలసిన నైతిక విధానములకు సంబంధించినది, 'ఇహసాన'.

**మతవ్యాప్తి :** ఇస్లాము మత స్థాపనమునకు పూర్వమే, అరబ్బులు దక్షిణ భారత దేశముతో వ్యాపార సంబంధము లేర్పరచుకొని యుండిరి. మలబారుతీర ప్రదేశమున చాలమంది అరబ్బుల మతమును స్వీకరించి యుండిరి. మతాచార పరాయణులైన ఖలీఫాల కాలమందును, తర్వాత వచ్చిన ఉమయ్యాదుల కాలమందును అరబ్ దేశపు భగవద్భక్తులును, యాత్రికులును, వర్తకులును దక్షిణ భారతమందు ప్రవేశించిరి. ఇట్లు ప్రవేశించిన మహమ్మదీయులు ఇస్లాము మత ప్రచారమును సాగించిరి. వీరు తొలుత ఆంధ్ర దేశ పర్యటనము గావించి, తర్వాత తమిళ దేశమునకు పోయి యుండవలెను. 'ఉమర్' అను నతడు ఖలీఫాగా నున్నపుడు—క్రీ. శ. 636 లో మొట్టమొదటి సారిగ మహమ్మదీయు లనేకులు భారత దేశపు సముద్రములమీద పఋరులు చేసిరి.

క్రీ. శ. 900 లో షేక్ నుద్దీను అను నతడు తన శిష్య గణముతో సింహళమునకు ప్రయాణము చేయుచుండెను. సముద్రమందు ప్రతికూల వాయువులు వీచి, వారి యోడ కండంగలూరునకు సమీపమున దరిచేరెను. చేరమాను పెరుమాళ్ళలో కడపటివాడు ఇస్లాము మత సత్యములను నమ్మి యా మతమును స్వీకరించెను. తరువాత నత్రవలీ యను నతడు మధుర, తిరుచినాపల్లి మొదలగు ప్రాంతములను దర్శించెను. అందలి ప్రజలు అతడు బోధించిన ఆచారములను, సూత్రములను, సంఘ వ్యవస్థీకరణ సిద్ధాంతములను మెచ్చుకొనిరి.

పదునొకండవ శతాబ్దమున బాబా ఫక్రుద్దీన్ అను ముస్లిము భక్తుడు నత్రవలీకి శిష్యు డాయెను. దూదేకుల వారు ఈ వలీ భక్తులే. బాబా ఫక్రుద్దీన్ ఆంధ్ర దేశమందలి పెనుగొండ యను స్థలమున స్థిరపడెను. అప్పుడు పెనుగొండను పాలించుచుండిన రాజు ఇస్లామును స్వీకరించి, ఒక మసీదును కట్టించెను. బాబావలీ క్రీ. శ. 1186 లో స్వర్గస్థుడయ్యెను. అతని యనంతర మతని శిష్యులు తమ మత ప్రచారము గావించిరి. వీ రందరును ఇస్లాము మతము ననుసరించినవారే, మాటలలో చెప్పినది చేతల ద్వారా చూపినట్టి శిష్యులు వీరు. వీరు దినమున కైదుసారులు భగవంతుని ప్రార్థించుచుండిరి ; రంజాన్ మాసమున ఉపవాసములు చేయుచుండిరి ; మద్యసేవ చేయకుండిరి ; పరమత సహనము కలిగి యుండిరి ; జాతి మత విభేదము లేకుండ ఇతరులను సమానముగ గౌరవించుచుండిరి. వారి దైవ భక్తియు, నిరాడంబర జీవన విధానమును ఆంధ్రుల నతి సులభముగ నాకర్షింప గలిగినవి.

క్రీ. శ. 1298 లో ముస్లిములు దక్షిణ భారత దేశముపై మొట్టమొదటిసారి దండెత్తి వచ్చిరి. క్రీ. శ. 1310 లో మాలిక్కాఫర్ తెలంగాణ ప్రాంతముపై దండెత్తి వచ్చెను. తరువాత మహమ్మద్ బిన్ తుఘ్లుకు క్రీ. శ. 1323 లో ఓరుగల్లును స్వాధీన పరచుకొనెను. ముసల్మానుల యధికారమును తొలగ ద్రోయుటకై కర్ణాటక, తెలంగాణా రాజులు సంయుక్తులై పోరాటమును సాగించిరి. క్రీ. శ. 1336 లో స్థాపితమైన విజయనగర సామ్రాజ్యము ముస్లిములు తెలుగుగడ్డ లోపలికి చొరబడకుండ చేయుటే తన ప్రధాన లక్ష్యముగా గలిగి యుండెను. క్రీ. శ. 1347 లో బహ్మనీ రాజ్యము స్థాపిత మయ్యెను. బహ్మనీ పాలకుల కాలమందు, అచటి ప్రజ లనేకులు ఇస్లామును స్వీకరించిరి. తరువాత బహ్మనీరాజ్య మైదు విడి రాజ్యములుగ చీలిపోయినది. వీనిలో గోలకొండ కుతుబ్ షాహీలు, తరువాత నిజాములును తెలుగు దేశమును పాలించిరి. ఆంధ్ర



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



దేశము సుమారు 250 సంవత్సరముల కాలము ముస్లి ముల పరిపాలనలో నుండినట్లు తెలియగలదు.

ఇస్లాము మతము తన యుద్భవ స్థలమగు మక్కాను వదలి పర సీమలందు పర్విన తరువాత, ముస్లిముల సాంఘిక జీవనమందు కొన్ని పరిణామములు సంభవించి నవి. కాని వారు మాత్రము తమ మత మూల సూత్రము లకు కట్టువడి యుండిరి. సిరియాలోని ముస్లిములకు, ఇస్లాము మతమందలి దృఢ విశ్వాసము చలింపలేదు; కాని, క్రైస్తవ మత ప్రభావము వారిపై ప్రసరించి యుండెను. ఇరాక్‌లో అనేక ఇతర సిద్ధాంతములు ఇస్లామును సోకక వదలలేదు. ఏ ప్రదేశమందు ప్రవేశించినను, అచట స్థానిక పరిసర ప్రభావము ఇస్లాము మతముపై ప్రసరించెనని తెలియవచ్చును. ఆంధ్ర దేశమందును ముస్లిములు ఆంధ్ర ప్రజల అహార విహారములను, ఆచార వ్యవహారములను అనుకరింపక తప్పినది కాదు. కాని వారి మత విశ్వాసము మాత్ర మెట్టి మార్పునకు గురి కాలేదు.

ఆంధ్ర దేశమందు వసించు ముస్లిములను మూడు తెగ లుగ విభజింపవచ్చును. అన్య దేశీయులును, వారి సంతాన మును ఒక తెగవారు. ఈ ప్రాంతపు స్త్రీలను వివాహ మాడగా వారియందు జనించినవా రొక తెగవారు. ఇస్లా మును స్వీకరించిన స్వదేశజుల సంతానము మరొక తెగ వారు.

**సున్ని, షియా :** ముస్లిములు సున్నీవా రనియు, షియావా రనియు రెండు తెగలుగ నున్నారు. మత విష యములను బట్టి యేర్పడిన తెగలు కావివి. ఖలీఫాలైన వ్యక్తుల క్రమము నందలి న్యాయాన్యాయములను ప్రక టించుటలో ఈ రెండు వర్గములవారును భిన్నత్వమును పాటించిరి. సున్నీ వర్గమువారే అధిక సంఖ్యాకులు (చూడు : సున్నీ, షియా). ఆంధ్ర దేశమునందు షియా, సున్నీ వర్గములు రెండును గలవు.

**వహాబీలు :** ఆంధ్రదేశమున ముస్లిములలో వహాబీ లనువా రున్నారు. వీరు ఖురాను అంగీకరింపని యాచార ముల నంగీకరింపనివారు. ముస్లిములలో వీరు సనాతన వాదులు. వహాబీ మతస్థాపకుడు అబ్దుల్ వహాబ్ సాహెబు. పరమత ప్రభావములు ఇస్లాము మతమునందు ప్రసరించుట ఇతనికి నచ్చలేదు. మహమ్మదు ప్రవక్త నాటి పవిత్ర విధాన ములను పునఃస్థాపితము చేయవలెనని యాయన బోధించెను. మృతినొందినవారి కొరకు భగవదనుగ్రహ వాక్యములను పఠించుటయందుగాని, మానవునకు భగవంతునకు మధ్య సంబంధమును భగవద్భక్తులు కూర్తురను సిద్ధాంతమునందు గాని వహాబీలకు నమ్మకము లేదు.

**గైర్ మహదవీలు :** హజరత్ అలీగారి తర్వాత పండ్రెండవ తరమునకు చెందిన మహది అనునతడు బాల్య మందే అదృశ్యు డాయెను. ఆయన తిరిగి వచ్చి మరణించె నని యీ వర్గమువారి మతము. సున్నీ, షియా మతముల వారు మహదీ తిరిగి రాలే దనియు, తప్పక ముందు రానున్నా డనియు భావింతురు. ఈ మతమువారికిని, తక్కిన వారికిని ప్రధాన సిద్ధాంతములందు భేద మేమాత్రము లేదు. వారు పాటించిన భేదభావములకు కారణములు రాజకీయ పారమార్థికాద్యంశములకు సంబంధించినవి మాత్రమే.

**ముస్లిముల పండుగలు, పర్వములు :** ఆంధ్రదేశపు ముస్లిము లాచరించు పర్వదినములు సాంఘిక, మతవిషయ ములు రెంటికిని సంబంధించినవి. వీరి పండుగులకును, ఇతరుల పండుగలకును కొన్ని సామ్యము లున్నవి. (1) మొహర్రమ్ : మొహర్రమ్ అనునది ముస్లిముల నెలలలో మొదటిది. అంతయు తమదే అన్నట్లు షియావారు దీనిని చాల సంబరముగ చేయుదురు. మొహర్రంనెలలోని మొదటి పది దినములు షియావారు ఉపవాస ముందురు. ఈ పండు గలో తొలి యెనిమిది రోజులు వీరు వీథులలో పీర్లను మెరవణి చేయుచు తమరొమ్ములపై గ్రుద్దుకొనుచు 'యా- అలీ - షా - హుసేన్' అని కేకలు వేయుచు పోవుచుందురు. సున్నీవారు రొమ్ములపై బాదుకొనుచు పోరు, కాని పీర్లను నిలబెట్టి ఊరేగింపులు మాత్రము జరపుదురు. అగ్ని గుండములను త్రొక్కుచు పీర్లు పట్టుకొన్నవారు నడచి పోవుదురు. ముస్లిముసోదరులతోపాటు అగ్నిగుండము త్రొక్కి వినోదమును కలిగించు హైందవ సోదరు లెందరో కలరు. వీరు పీర్లనుకూడ పట్టుకొందురు. అనేకులు బెబ్బులి వేషము, నీగ్రోవేషము మొదలగు చిత్రాతిచిత్ర వేషములు ధరించి వినోద ప్రదర్శనములు గావింతురు. పదవ దినమున పీర్లను బావిదగ్గరకో, ఏటి దగ్గరకో తీసికొనిపోయి, అక్కడ వానిని దించి వేయుదురు. ఇట్టి ఆచారమునకే 'షహదత్' అని పేరు. దశరాపండుగ వలెనే మొహర్రం పది దినములు జరుగును. 'పోలీ' పండుగకు గుండము త్రవ్వి దానిలో నిప్పు తయారుచేయుదురు. ఆ గుండము చుట్టును తిరుగుదురు. ఇట్టి హైందవ సోదరుల ఆచారముల ప్రభావము ముస్లిములు మొహర్రము సందర్భమున చేయు ఆచారములందు ప్రతిఫలించినది (చూడు : మొహర్రమ్).

**బారా వఫాత్ :** రబ్బీఉలవల్ నెలలో పండ్రెండవ దినమున హజరత్ భశా మృతి నొందెను. ఆయన మృతి చిహ్నముగ ఈ బారా వఫాత్ అను పండుగ చేయుదురు. అదే నెలలో అదే దినమున హజరత్ భశాగారి జననమును, మరణ మును జరిగినవి. పండుగ దినము సాయంకాలమున



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సమావేశములుజరిగి, ఆయన జీవితాంశములను, లోకమునకాత డొసగిన సందేశములనుగూర్చి ముచ్చటింతురు. ఇట్టి సమావేశములను 'మిలా దున్ నబీ' అని వ్యవహరింతురు.

**పీరే దస్తగీర్ :** ఈ పండుగను రబ్బీసాని నెలలో పదునొకండవ దినమున చేయుదురు. ప్రసిద్ధ భగవద్భక్తుడు అబ్దుల్ కాదర్ జిలానీ గౌరవార్థమై యీ పండుగను సున్నీవారు మాత్రము చేయుదురు. ఆయన గోరీ బాగ్దాదునందు గలదు. సున్నీవా రచ్చటకు పోయి సందర్శించి వచ్చుచుందురు. షియా వర్గమువారు ఈ పండుగను చేయరు. కలరా మొదలగు అంటువ్యాధులవల్ల ప్రజలు దారుణముగ మరణించు సందర్భమున ఈ స్వామి పేరట ఆకుపచ్చ జెండాను పట్టుకొని ఊరేగింతురు. ఈ జెండా ఊరేగింపులో ఇతర మతస్థులు సైతము పాల్గొనుట కలదు.

**ఉరుస్ - ఏ - కాదర్ వలీ :** నాగూరు కాదర్ వలీ సాహెబ్ పేరట జమాదీసాని నెలలో ఈ పండుగ చేయుదురు.

**షబ్ - ఏ - బరాత్ :** షాబాన్ మాసమున పదునాల్గవరాత్రి ఈ పండుగ జరుగును. ఆ రాత్రి మానవుని చేష్ట లన్నియు లిఖింపబడును. రాత్రి యంతయు, దైవ ప్రార్థనచేయుటయందుగాని, ఖురాను గ్రంథమును పఠించుట యందుగాని నిమగ్ను లగుదురు. వినోదార్థమై దీపములు వెలిగింతురు. ప్రేలుడు పదార్థములను గూడ కాల్చెదరు. దీపావళి పండుగకు దీపములు వెలిగించుట, మతాబులు కాల్చుట ప్రధానముగా జరుగు ఆచారములు. ఈ పండుగయొక్క ప్రభావఫలితముగనే ముస్లిములు కూడ షబ్ - ఏ - బరాత్ పండుగకు దీపములు పెట్టుట మొదలగునవి ఆచరించుచున్నారు.

**రంజాన్ :** రంజాన్ నెలలో చంద్రుడు కనిపించిన దినమునుండి మరుసటి నెల చంద్రుడు కనబడు వరకు నెల పొడుగునను ఉపవాసము లుండుట ఇస్లాముమత మూల సూత్రములలో నొకటి. కష్టములే సుఖములను ప్రసాదించు ననియు, త్యాగములు విజయములకు సాధనము లనియు ఈ పవిత్రమాసము ప్రబోధించుచున్నది. ముస్లిములు ప్రార్థనలు గావించుచు, ఖురాను పఠించుచు కాలము గడపెదరు. సూర్యాస్తమయానంతరమే ఉపవాసము పూర్తియగును. వా రప్పుడు భుజింతురు (చూడు : రంజాన్).

**ఈద్-ఉల్-ఫితర్ :** ధర్మాచరణమును ప్రబోధించునట్టి యీ పండుగ షవాల్ నెల మొదటి దినమున చేయుదురు. ఉదయముననే స్నానముచేసి, శుభ్రమైన దుస్తులు ధరించి, రెండున్నర సేర్ల గోధుమలు దానము చేయుదురు. గోధుమలు లేనియెడల వానికి తుల్యమైన యితర ధాన్యము గాని, డబ్బుగాని బీదవారి కిత్తురు. తరువాత ప్రార్థించుటకై 'ఈద్గాహ్'-ప్రార్థన జరుపు స్థలమునకు పోయెదరు. ప్రార్థనానంతరము మతగురువు 'ఖుద్బా' పఠించును.

**బక్రీద్ :** ఇది బక్రీద్ నెలలో పదవ దినమున వచ్చు పండుగ. ఈ పండుగ దినమున మేకలు, ఒంటెలు దేవుని కర్పింప బడును. ఈ నెలలో ముస్లిములు అన్ని ప్రదేశములందుండియు మక్కాయాత్ర గావింతురు (చూడు : బక్రీద్).

**వివాహోత్సవములు :** పెండ్లి పెత్తనము జరిగిన తర్వాత తాంబూలము పంచెదరు. వధువు ఇంటినుండి మధుర పదార్థములు, తములపాకులు మొదలగునవి వరునింటికి గొని పోదురు. ఉంగరములు, వస్త్రములు పరస్పరము బహూకరించుకొందురు. ఆ దినమే ఇచ్చి పుచ్చుకొను వానిని గూర్చియు, వివాహదిన నిర్ణయమును గూర్చియు మాటలాడుదురు. ఇతరుల ప్రభావమువల్లనే ముస్లిములును వరకట్నములు కోరుట నేర్చుకొని యున్నారు. ఈ కార్యమును 'మంగ్ నా' అందురు.

తాంబూలము పంచిన తర్వాత వివాహము కొన్ని నెలలలోపల జరుగును. సాధారణముగ పెండ్లి ఐదారు దినములు జరుగును. 'నికా' దినమునకు ముందురోజు వరునియింటి నుండి విలువగల దుస్తులు, ఆభరణములు మొదలగువానిని వాద్యములతో తీసికొని పోదురు. వీనిని స్వీకరించిన వెంటనే వధువుపక్షమువారును వరునింటికి వస్త్రాదులు పంపెదరు.

'నికా' అనునది వివాహమందలి ప్రధానఘట్టము. పెండ్లికుమారుడు తన ఒప్పుదలను ప్రకటించుట, కాజీ (మతగురువు) ఒక న్యాయాధిపతిగ వ్యవహరించి ఇద్దరు సాక్షులతో వరుని ప్రకటనమును లిఖించిపెట్టుట మొదలగునవి జరుగును. ఇంతటితో పెండ్లి సంబరము పూర్తి యగుటలేదు. ఇతరులు పాటించు కొన్ని ఆచారములను ముస్లిములు స్వీకరించియున్నారు.

'నికా' దినమున ఉదయముననే పెండ్లికుమారుడు స్నానముచేసి నూతనవస్త్రములు ధరించి పుష్పహారములనలంకరించుకొని గుర్రముపై గాని, కారునందుగాని కూర్చుండి పెండ్లికూతు నింటికి పోవును. అక్కడ అతని బావ మరదలు లోనికి పోనీయకుండ అడ్డు పెట్టుదురు. అతడు వారికి సరియైన బహుమాన మిచ్చి లోనికి పోవును. చక్కగ అలంకరింప బడిన మధ్యమందిరమునం దందరును కూర్చుందురు. వరునకు ప్రత్యేకాసన మొసంగబడును. అట్టి సందర్భమున 'నికా' జరుగుటకై అందరును వేచి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



యుందురు. ఈ మధ్యకాలమున పెండ్లి కుమారుడు పెండ్లి కూతురు దగ్గరికి కొనిపోబడును. అక్కడ వా రిద్దరు ఒకరి తలపై నొకరు బియ్యము(తలంబ్రాలు)పోసికొందురు. ఇద్దరికి మధ్య తెర గట్టెదరు. ఈ యాచారము ఇతరులనుండి స్వీకరింపబడినదే. కాజీ వధూవరుల ఒప్పుదలను గైకొనును. అందుల కిద్దరు సాక్షులుగూడ నిలుతురు. తర్వాత కాజీ ఖురానులోని కొన్ని అధ్యాయములను పఠించి, వధూవరుల సుఖజీవనమునకై భగవదనుగ్రహమును కోరును. ఈ కార్యక్రమము ముగిసిన వెంటనే ఖర్జూరములు, కలకండ వెదచల్లుదురు. పెండ్లికొమార్తె వైపువారు పర్చాటు చేసిన విందు నారగించి అందరును వెళ్లిపోదురు. ఆ దినము రాత్రికి 'జల్వా' కార్యము జరుగును. పెండ్లికుమార్తె ముఖమును పెండ్లికుమారుడు అద్దములో చూచును. బంధుమిత్రాదులు వధూవరులకు బహుమతుల నర్పింతురు. అదే రేయి వధూవరుల నొక గదిలోనికి పంపెదరు. మరుసటి దినము 'వలీమా' జరుగును. పెండ్లికుమారుని యింటి వారు పెండ్లికూతురు వైపువారికి గొప్ప విందుచేయుదురు. పెండ్లి అయిన తరువాత ఐదు వారముల వరకు ప్రతి శుక్రవారము పండుగు చేయుదురు. కట్టకడపటి శుక్రవార మది వరుని యింట జరుగును. ఇప్పటికి వివాహోత్సవము లన్నియును అంతమైనట్లే. పెండ్లి కొమార్తె అత్తవారింటి కోడలై, గృహకార్యములు నిర్వహించుటకు సిద్ధపడును.

సత్వాస : ఈ కార్యమును 'సీమంతము' చేయుట లేక 'పూల ముడుపు' అని హిందువులు వ్యవహరింతురు. పెండ్లి కుమార్తె గర్భవతి యైనప్పుడు పుట్టింటినుండి పిండి వంటలు తెచ్చెదరు.

ఛట్టీ : ఆమె ప్రసవించిన తర్వాత ఆరవదినమున చేయు పండుగకు ఛట్టీ యని పేరు. శిశువు కుడిచెవిలో 'అజాఁ' (నమాజు ప్రారంభము కానున్నదని బైటి వారికి వినబడునట్లు అరచు వాక్కులు) పలుకుదురు. ఆరవనాడు శిశువునకు నామకరణము చేయుదురు. బంధుమిత్రులకు తీపి పదార్థములు పంచి పెట్టబడును.

ఛిల్లా : నలువదవ దినమున తల్లికి నీళ్ళు పోయుదురు. ఆమెకు పూల దండలు వేసి వినోదములు గావింతురు. కొన్ని మాసములు గడచిన పిమ్మట శిశువునకు పుట్టు వెంట్రుకలు తీయింతురు. కొందరు సంవత్సరమునకో, మూడు సంవత్సరములకో తీయింతురు. తీయించిన వెంట్రుకల బరువుకు సరియైన వెండిని గాని, రాగి నాణెములు కాని దానము చేయుదురు.

**అంత్య క్రియలు :** అంత్యావస్థలో నున్నపుడు ఖురాను గ్రంథము 'కలిమా'ను పఠింతురు. దేహము నుండి జీవు డెగిరిపోయిన వెంటనే కాలి బొటనవ్రేళ్ళు రెండును కట్టివేయుదురు; కండ్లు నోరు మూయుదురు. శవమును వదలి ఎవ్వరును వెళ్ళరు. బంధువులలో నొకరు గాని, ముల్లాగాని ఖురాను పఠింతురు. రావలసిన బంధువులు వచ్చిన తరువాత వేడి నీళ్ళతో ఆ దేహమును శుభ్రపరచి, ఒక చాపమీద పరుండ బెట్టెదరు. క్రొత్త గుడ్డతో శవమును జుట్టి చేతులకు, కాళ్ళకు, మోకాళ్ళకు, నుదుటను సువాసన ద్రవ్యములను పూయుదురు. కనులకు కనుబొమలకు సుర్మా పూయుదురు. 'దేవు డొక్కడే. దేవునిచే నిర్మింపబడిన ప్రవక్త హాజరత్ మహమ్మదు' అని 'కలిమా' రొమ్ముపైన, నొసట లిఖింపబడును. మసీదునుండి ఒక శవపేటిక గొని రాబడును. ఆ పెట్టెయందు శవము నుంచి పూలతో అలంకరింతురు. తరువాత నా పెట్టెను మసీదునకు తీసికొని పోవుదురు. ప్రార్థనానంతరము శవమును శ్మశానమునకు తీసికొని పోయెదరు. శవమును నిక్షిప్తముచేయు గృహము ఉత్తర దక్షిణములుగా త్రవ్వబడి యుండును. శవమును లోనికి దించి, దాని కుడి భాగము 'మక్కా' వైపు తిరిగి యుండున ట్లుంచెదరు. అక్కడికి చేరినవా రందరు పిడికిళ్ళతో మంటిని మంత్రము పఠించుచు త్రోయుదురు. ఇట్లు గోరీ యంతయు మంటితో కప్పివేయుదురు. గోరిపైన ఎత్తుగా మంటిని ప్రోగుచేయుదురు. ఖురానునుండి కొన్ని వాక్యములను పఠించుచు, జలమును మంత్రించి ఆ మంటిపైన చల్లుదురు. పూలతో ఆ స్థలము నలంకరింతురు. కొన్ని వాక్యములు చదివి, 'ఫాతిహా' గావింతురు. ఇ దంతయు జరిగిన తరువాత, ఇంటి దారిలో నలువది అడుగులు వచ్చి, అక్కడ నిల్చి మరియొకసారి 'ఫాతిహా', చదువుదురు. ఇల్లు చేరి, ఇంటి బయట మరియొకసారి 'ఫాతిహా' పఠింతురు (మృతినొందిన వానికి దైవానుగ్రహము కల్గుగాక యని ప్రార్థించుటే 'ఫాతిహా'). ఈ కార్యము లన్నియు ముగిసిన తర్వాత, ఆ యింటివారిని బంధువు లందరు ఓదార్తురు. ఆ దినమున ఇరుగు పొరుగువారే వారికి అన్న పానాదు లిత్తురు. మూడవ రోజున అందరును గోరీ దగ్గరకు పోయి దర్శించి 'ఫాతిహా' గావింతురు. ఇట్లు పదవ దినము, ఇరువదవ దినము, నలువదవ దినమును 'ఫాతిహా' చేయుదురు.

భాష : ఆంధ్రదేశపు ముస్లిము లందరు 'ఉర్దూ' భాషలో మాటాడుదురు. ఇంటియందు ఉర్దూ మాటాడినను బయట మాత్రము తెలుగు మాటాడుదురు. తెలుగు దేశపు పల్లెలలోని ముస్లిములకు ఉర్దుకన్నను తెలుగునందే పరిచయ మెక్కువయన్న అత్యుక్తి కాదు. అందును ముఖ్యముగ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



దూదేకుల వారి భాష ఉర్దు అనుటకంటె తెనుగనుటయే యుక్తము.

**వేషము :** మతాచారములందు వలెనే, దుస్తులు ధరించుటయందు ముస్లిములు నిరాడంబరులే. మగవారు 'లుంగీ', జుబ్బా (లాల్చి) ధరింతురు. తలకు పేటా చుట్టుట వీరికి అతి ప్రధానము. ఇటీవల పేటా చుట్టుకొనుట తగ్గిపోపుచున్నది. దుస్తుల విషయమున ఇతర జాతులను అనుకరించుటయు జరగినది. 'పేటా'కు బదులుగ తుర్కీ టోపి ధరించుచున్నారు. 'జుబ్బా' తొడుగుటకు బదులు 'షేర్వానీ'ని, 'లుంగీ' కట్టుటకు బదులు ప్రౌజరును వేయుచున్నారు. స్త్రీలు చీరలు, జాకెట్టులు ధరింతురు. చీరలకు బదులు పావడ, పైటయు వేసికొందురు. ఆభరణములు అలంకరించుకొనుట వారికి చాల ఇష్టము. కాళ్ళకు గొలుసులు, కడియములు ధరింతురు. చెవులలో బంగారు పోగులు ధరింతురు. ముక్కు పుడకలు ధరింతురు. విలువగల రాళ్ళు కూర్చిన బంగారు హారము వేసికొందురు.

పూర్వము గొంతునుండి మోకాళ్ళ వర కుండెడు 'చౌలీ'లు ధరించెడివారు. చేతులు పూర్తిగా దాగి యుండెడివి. ఈ 'చౌలీ'ల స్థానమున పొట్టి రవికెలు వచ్చినవి. నాగరికత బలసినవారి యిండ్లలో దుస్తులందు గొప్ప మార్పులు వచ్చినవి. కొన్ని యిండ్లలో పూర్వపు మర్యాదలు, ఆచారములు దుస్తుల విషయమున నట్లే యున్నవి. 'పర్దా' అను ఆచారము సాధారణముగ అందరును పాటింతురు.

పైన చెప్పబడిన దానిని బట్టి ముస్లిముల పండుగలందును, వివాహములందును హైందవ సోదరుల ఆచారములు తొంగి చూచుచున్నవని విశదమగును. వరుడు మెరవణి యగుట, వరకట్న మడుగుట, తలంబ్రాలు పోయుట, అద్దములో వధువు ముఖమును దర్శించుట మొదలైనవి ఇతరుల ఆచారములను చూచి స్వీకరింపబడినట్టివే.

మొహర్రము పండుగలో గుండము త్రవ్వుట, వేషములు వేయుట అట్టి ఆచారములే. పుట్టిన పండుగకును, వివాహలందును రంగునీళ్ళు చల్లుకొనుటయు ఇతరులనుండి గ్రహించిన ఆచారమే. ఈవిధముగ ఆంధ్ర దేశమందలి ముస్లిముల ఆచార వ్యవహారములందు సోదరాంధ్రుల సాంఘిక మతాచారములు కొంతవరకు ప్రతిఫలించినవి. ఇట్టి సామ్యగుణములు ఆంధ్రదేశమం దధికముగ నున్నవి. **వ.భా.శా.**

## క్రైస్తవము

క్రీ. శ. ఒకటి రెండు శతాబ్దములయందే, క్రైస్తవ మతము భారత దేశపు దక్షిణ భాగమున వ్యాపించెనని తెలియుచున్నది. నెస్టోరియన్ శాఖకు చెందిన క్రైస్తవ మతము కేరళ, ద్రవిడ రాష్ట్రములయందే ఆనాడు స్థిరముగ నిలిచిపోయినది. కాని తెలుగు సీమకు వ్యాపించలేదు. భారత దేశమున ప్రప్రథమమున క్రైస్తవ మత ప్రచారము చేసినవాడని చెప్పబడు థామస్ చెన్నపట్టణములోని మైలాపూరు ప్రాంతముననే చరించెనని చెప్పుదురు. అటనుండి ఉత్తరమున కాతడు వచ్చినట్లు తన్మతానుయాయులు సైతము చెప్పుటలేదు.

క్రీ. శ. 1291 లో చైనాకు మత ప్రచారమునకై పోవుచు, దక్షిణ భారతమున కొంతకాల ముండిన జాన్ ఆఫ్ మాంటికార్వినో అను నతడు మైలాపూరునకు ఎగువ మూరు మైళ్ళవరకు తాను తిరిగి మతబోధ చేసితి నని వ్రాసెను. కాని ఆనా డతని కృషివలన క్రైస్తవ మతము తెలుగు సీమలో పాదుకొనిన నిదర్శనము లేవియు కనబడుట లేదు.

క్రీ. శ. 1670 వ సంవత్సరమున మచిలీపట్టణమునందు పోర్చుగీసు వర్తక స్థానమున నొక చర్చి(పాదిరిగుడి) యుండెడి దనియు, అందువల్లవారు సైతము కొందరు ప్రార్థనలు చేయుచుండుట తాము చూచితి మనియు అప్పటి విదేశీయ వర్తకులు వ్రాసిరి. కాని ఆ చర్చిగాని, అందులో చెప్పబడిన భారత క్రైస్తవుల సంతతివారు గాని ఈనాడు మచిలీపట్టణ పరిసరములందు కన్పట్టుట లేదు. గోవాలో క్రీ. శ. 17 వ శతాబ్దినాటికే పోర్చుగీసు అధికారము కుదురుకొనుటచే, పోర్చుగీసు వర్తకులతోపాటు వారిని అనుసరించి మచిలీపట్టణమునకు వచ్చిన గోవా క్రైస్తవులే ఆ నల్లవారు కావచ్చునని మన మూహింప వచ్చును.

పోర్చుగీసువారు తమ రాజ్యముతోపాటు తమ మతమును కూడ వ్యాపింప జేయుటయే తమ ముఖ్యోద్దేశముగ నుంచుకొని వ్యవహరించిరి. అధికార బలముచే వారు గోవా ప్రాంతముల తమ మతమును వ్యాపింప జేసిరి. తక్కిన భారత దేశమున కూడ క్రైస్తవ మతమును వ్యాపింప జేయుటకై వారు వివిధ ప్రాంతముల రాజుల వద్దకు క్రైస్తవ మతగురువులను పంపిరి.

ఈ మత ప్రచారమునకై బయలుదేరినవారే ఆనాటి జెసూయిట్ పాదిరీలు. ఇట్టి పాదిరీలు ఇద్దరు ఆనాటి చంద్రగిరి పాలకుడగు వెంకటపతి రాయలవద్దకు క్రీ. శ. 1597 లో వచ్చిరి. వారు ఇతని ఆస్థానమున 18 సంవత్సరము లుండిరి. రాయలు వారిని మన్నించి, గౌరవించెనే కాని క్రైస్తవుడుగ మారలేదు. ప్రజలలో కూడ వారు క్రైస్తవ మతమును వ్యాపింప జేయలేకపోయిరి. విసుగెత్తి వారు క్రీ. శ. 1615 లో గోవాకు వెళ్ళిపోయిరి.

భారత దేశమున తక్కిన ప్రాంతములయందు జెసూయిట్ పాదిరీలను ఇట్టి పరిస్థితులే ఎదుర్కొనెను. హైందవ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మతాచారములయందు వారికి గల గౌరవమే ఇందులకు కారణము. పైగా మద్య సేవనము హిందూ మతమున నిషిద్ధము.

కావున భారతీయుల నాకర్షించుటకును, వారికి తమ యెడల గౌరవ భావము కల్గుటకును తాము తమ ఆచారములను మార్చుకొనవలసి యుండునని జెసూయిట్ ఫాదిరీలు గ్రహించి, ఒక నూతన విధాన మవలంబించిరి. దీనిని మొట్టమొదట అమలులో పెట్టినవాడు మధురలో మత ప్రచారకుడుగ నుండిన రాబర్టు డి నోబిలి అను జెసూయిట్ ఫాదిరి. క్రీ. శ. 1626 ప్రాంతమున ఇతడు మధుర చేరి, హిందూ సన్యాసి వేషమును ధరించి వారి ఆచార వ్యవహారములనే అవలంబించి, క్రైస్తవ మతమును బోధింపసాగెను. తాను రోముపురీ సన్యాసి మండలమునకు చెందినవాడ ననియు, తన పేరు తత్త్వబోధానంద స్వామియనియు ఆయన చెప్పుకొనెను.

మత ప్రచారమున నోబిలి కృతకృత్యు డగుటచేత, ఈ పంథనే తక్కిన ఫాదిరీలుకూడ అవలంబించిరి. పోర్చుగీసువారి మత ప్రచార యత్నము లట్లు సఫల మగుట విని అప్పటి ఫ్రెంచిదేశ పాలకుడగు పదునాల్గవ లూయీ మత ప్రచారమునకై ఆరుగురు క్రైస్తవ మత బోధకులను క్రీ. శ. 1700 వ సంవత్సరమున పుదుచ్చేరికి పంపెను. వీరు మత ప్రచారమునకై ఆ సంవత్సరమే 'కర్ణాటిక్ మిషను'ను స్థాపించిరి. తెలుగు దేశమున క్రైస్తవ మతమును వ్యాపింప జేయుటకు స్థాపితమైన మొదటి మిషను ఇదియే.

ఈ మిషనువారు రాబర్టు డి నోబిలి మార్గమును అవలంబించిరి. ఆ పద్ధతులను బాగుగా గ్రహించుటకై [illegible]వా మిషనుకు చెందిన ఫాదర్ బఛుచెట [illegible] గ్రహించిరి. హిందూ సన్యాసుల వేషములతో వీరు మత ప్రచారము చేయుచుండెడివారు. బ్రాహ్మణ గృహములలోనో, వైశ్య గృహములలోనో, దేవాలయములలోనో బస చేసెడివారు. చిత్తూరు జిల్లా పుంగనూరునందు ఈ మిషనుకు చెందిన ఫాదర్ మాండ్వీటు క్రీ. శ. 1701 లో ఒక వెలమ కుటుంబమునకు క్రైస్తవ మత దీక్ష నిచ్చెను. క్రమముగ పుంగనూరు ఒక క్రైస్తవ మత కేంద్ర మయ్యెను.

అటనుండి ఈ మతము ధనికులగు వెలమ కాపుల సాయముతో వెంకటగిరి, పేరకూరులకు వ్యాపించెను. వెంకటగిరి రాజ బంధువులలో కొందరుకూడ క్రైస్తవులుగ మారిరని చెప్పుదురు. కాని వా రెవ్వరో తెలియదు.

పుంగనూరుకు వాయవ్యముగ కోలారు జిల్లాలో నున్న చిక్కబళ్ళాపురమునకు ఈ మతము వ్యాపించి క్రీ. శ. 1709 లో అక్కడ ఒక చర్చి నిర్మింపబడెను. అప్పటికి సమీపమున ఉన్న దేవనపల్లి, కృష్ణాపురములకు కూడ ఈ మతము వ్యాపించి చర్చిలు కట్టబడినవి. ఆ కృష్ణాపురము నేడు ధర్మవరము తాలుకాలో ఉన్నది. తొగటవారు, సాలీలు, రెడ్లు, కమ్మవారు ఈ మతమును [illegible]నా ఎక్కువగ స్వీకరించిరి. ఇటనుండి కడపజిల్లాలోని సిద్ధవటమునకు, చిత్తూరుజిల్లా వాయల్పాడునకు ఈ మతము వ్యాపించెను.

అనంతపురం జిల్లాలోని మాదిగుబ్బ, ఆలమూరులలో కూడ క్రీ. శ. 1720 నాటికి క్రైస్తవ మతము బాగుగా వ్యాపించెను. ఇక్కడ మతమును స్వీకరించిన రెడ్లు కడు ధనికులు. వీరిలో మాదిగుబ్బ నివాసి యగు తుమ్మా రాయప రెడ్డి మొదటివాడు. ఇత డొక దుస్సాధ్యమగు రుగ్మతచే బాధపడుచు, అది ఏ వైద్యమునకును లొంగక పోవుటచే కృష్ణాపురమునకు వెళ్ళి, అక్కడ అప్పుడు మత బోధకుడుగా నున్న ఫాదరు లీగాక్ ప్రార్థనల సహాయముచే స్వస్థుడై క్రీ. 1715 లో క్రైస్తవ మతమును స్వీకరించెను. ఇతని ప్రోద్బలమున మాదిగుబ్బ, ఆలమూరులలోని రెడ్లందరు క్రైస్తవులైరి. ఆ గ్రామములలో చర్చిలు కట్టబడి క్రైస్తవ మతోత్సవములు ఆడంబరముగ జరుపబడుచుండెడివి.

ఇంతలో క్రీ. శ. 1725 వ సంవత్సరమున మహారాష్ట్ర బ్రాహ్మణ సర్దారొకడు ఈ గ్రామములను [illegible]టకై రాగా, ఈ రెండు గ్రామముల రెడ్లును ఆ గ్రామములను వదలి దూపాటి సీమయందు నేటి నెల్లూరు జిల్లా దరిశి తాలుకాయం దున్న బుక్కాపురమునకు వలస పోయిరి. వీరి మూలమున ఆ ప్రాంతమున క్రైస్తవ మతము వ్యాపించెను.

క్రీ.శ. 1738 నాటికి కర్ణాటిక్ మిషనుకు 16 కేంద్రము[illegible] ననియు, వానిలో ఉత్తరపు కొసను బుక్కాపుర మున్నదని ఆ మిషను [illegible] నాయుడు వ్రాసి యున్నాడు. క్రైస్తవ మత మింత వ్యాప్తి చెందినను ప్రజల సాంఘిక వ్యవహారములలో మాత్రము మార్పు రాలేదు. క్రైస్తవ మిషనరీలు కుల విభేదముల ప్రస్తావన తేరైరి. కుల మర్యాద లన్నియు హిందూ పద్ధతిని యథావిధిగా జరుగుచుండెను. ఉన్నత కులములకు మతబోధ చేయునపుడు వారు తమతోపాటు పద వర్ణములవారిని రానిచ్చెడివారు కారు.

కాని మొదటినుండియు క్రైస్తవ మిషనరీలు ప్రాంతీయ భాషలను ఆదరించిరి. క్రైస్తవ మత సందేశమును తెల్పు గ్రంథములను రచించుటకు దేశీయులను ఆనాటి రోమను



http://www.sanskritcentral.com/

http://teluguthesis.com/



క్యాథలిక్ ఫాదిరీలు ప్రోత్సాహ మిచ్చిరి. ఇట్టి గ్రంథములలో మొదట చెప్పదగినది పింగళి ఎల్లనార్య కృత 'తోభ్య చరిత్ర' మను నామాంతరము గల సర్వేశ్వర మాహాత్మ్యము. ఇది పైని చెప్పిన తుమ్మా రాయప రెడ్డికి అంకితము చేయబడినది. రాయపరెడ్డి పితృవ్య పుత్రుడైన కొండారెడ్డి మరాటీలను గొట్టెను; ఇతడు దామెర్ల వెంకటపతిచేత మన్ననలను పొంది పామూరిలో నివసించుచుండెను. ఈ దామెర్ల వెంకటపతి బహుళాశ్వ చరిత్ర రచయితయగు వెంకటపతి మనుమడు; క్రీ.శ. 18 వ శతాబ్ద పూర్వార్ధమున వర్ధిల్లెను. మరియొక గ్రంథము వేదాంత రసాయనము. దీనిని రచించినవాడు మంగళగిరి ఆనందకవి. అంకితమును పొందినవాడు దానప్ప యను క్రైస్తవుడయిన బ్రాహ్మణుడు. ఇతడు దక్షిణ భారత దేశమునందు పరాసువారికి ముఖ్య స్థానమైన పుల్చేరి (పుదుచ్చేరి) పట్టణాధ్యాసియు, కర్ణాటకపు నవాబగు మహమ్మదు అలీ ఖానునిచే సత్కృతుడును నైన రాజప మహామంత్రింద్రుని సోదరుడు; పరాసువారి పక్షమున క్రీ. శ. 1750 ప్రాంతమున బందరు పట్టణమును పాలించుచుండెను. ఈ మంగళగిరి ఆనందకవి యెచ్చటివాడో తెలియదు. ఇంటి పేరునుబట్టి యతని నివాస స్థానమును నిశ్చయించుటకు వీలు కాదు. ఈ గ్రంథము క్రీ. శ. 1750 ప్రాంతమున రచింపబడినది.

ఫ్రెంచివారి ఆధిపత్యము సర్కారులలో వ్యాపించుటతో క్రీ. శ. 1750 నాటికి గుంటూరు జిల్లా యందుకూడ కొన్ని ప్రాంతముల రోమన్ క్యాథలిక్ క్రైస్తవ సంప్రదాయము వ్యాపించెను. ఇందుకు కొంతవరకు బుక్కాపురపు రెడ్లు కారణము. వీరి వంశీయులు, బంధువులు గుంటూరు జిల్లా చేరి పలుప్రాంతములయందు ఈ మతమును వ్యాపింపజేసిరి. ఈ జిల్లాలో ఆనా డీ మతమును వ్యాపింపజేసిన ఇం కొక క్రైస్తవుడు పోలవరపు చిన్నయ్య. ఈయన పుదుచ్చేరిలో కొంతకాల ముద్యోగము చేసి క్రైస్తవుడై రెవిన్యూ ఉద్యోగిగ గుంటూరు జిల్లాకు వచ్చి క్రైస్తవ మత వ్యాప్తికి సాయపడెను. ఈతని వలననే నరసారావు పేట తాలూకా రావిపాడు నందలి కమ్మవారు అనేకులు క్రైస్తవు లైరి.

క్రీ. శ. 1750 నుండి క్రీ. శ. 1776 వరకు ఆంధ్రదేశమున ఈ మతవ్యాప్తిని గురించిన విశేషము లంతగ తెలియవచ్చుట లేదు. ఆ నాడు పశ్చిమాంధ్రమున అరాజక పరిస్థితు లేర్పడి యుండెను. పైగా, జెసూయిట్ ఫాదిరీ లనుసరించు విధానములకు ఫ్రెంచి ప్రజలు అసహ్యపడసాగిరి. క్రమముగా మిషనరీల సంఖ్యకూడ తగ్గెను.

క్రీ. శ. 1748 లో కడప జిల్లాలోని కంచాలదిన్నె యందలి చర్చిని నిజామ్ సైన్యములు పడగొట్టెను. మాదిగుబ్బ, కృష్ణాపురము చర్చిలను అచ్చటి పాలెగాండ్రు పడగొట్టించిరి. వెంకటగిరి ప్రాంతమునందలి చర్చిలకుకూడ ఇట్టి గతియే పట్టెను. నెల్లూరు జిల్లాలోని కొన్ని క్రైస్తవ కుటుంబములు గుంటూరు జిల్లాకు వలసపోయెను. ఈ విధముగా క్రీ. శ. 1770 నాటికి గుంటూరు జిల్లాలో తప్ప తక్కినచోట్ల క్రైస్తవ మతము క్షీణించెను.

గుంటూరు జిల్లాలో మాత్రము ఫ్రెంచివారికి పలుకుబడి యుండుటచే కర్నాటిక్ మిషనువారు తమ మతమును కొంతవరకు ఆనాడు వ్యాపింపజేసిరి. క్రీ. శ. 1770 లో బసాలతు జంగ్ ఈ మిషను వారికి గుంటూరు జిల్లా ముట్లూరునందు 71½ ఎకరముల భూమి ఈనా మిచ్చెను. ఈ నాటికిని ముట్లూరు ఒక క్రైస్తవ కేంద్రముగ నున్నది. క్రీ. శ. 1778 లో ఆనాటి పోప్ అగు పదునాల్గవ క్లెమెంటు ఈ జెసూయిట్ సంఘమును రద్దుచేసి ఆ మిషనరీలను పుదుచ్చేరి వికార్ అపొస్తలిక్ (మతప్రచార మండలాధికారి) అధికారముక్రింద పనిచేయవలసినదిగా శాసించెను. ఈ విధముగ ఆధిపత్యము మారినను గుంటూరుజిల్లాలో మత ప్రచారము పూర్వమువలెనే సాగిపోవుచుండెను. క్రీ. శ. 1782 నుండి క్రీ. శ. 1788 వరకు ఈ జిల్లా జమీన్‌దారులకు గుత్త కీయబడినను, ఆ జమీన్‌దారులు సైతము ఈ ఫాదిరీలయెడ సహనముతో వర్తించిరి. రేపల్లె జమీన్‌దారులు ఫిరంగిపుర ప్రాంతమును క్రీ. శ. 1782, క్రీ. శ. 1784 లలో అచ్చటి ఫాదిరీలకే కౌలు కిచ్చిరి. ఫిరంగిపుర కరణము చిలకా పోలంరాజుకు, ఫాదిరీకి తగాదా వచ్చిన సందర్భమున జమీన్‌దారు మాణిక్యారావు తిరుపతిరాయనింగారు ఫాదిరి పక్షమే వహించి, కరణమును మందలించిరి.

కాని, రేపల్లె దగ్గరనున్న ఓలేటిగ్రామ క్రైస్తవులు ఆ జమీన్‌దారు పెట్టు బాధలను భరించలేక, క్రీ. శ. 1787 లో చెంగల్పట్టు జిల్లాకు వలస పోయిరని బిషప్ కాల్‌గన్ వ్రాసియున్నాడు. ఫిరంగిపురము ఫాదిరి యెడల అంత గౌరవముతో వ్యవహరించిన జమీన్‌దారు తనకు దగ్గరలో నున్న క్రైస్తవుల యెడ క్రౌర్యము గలిగి యుండెనని యూహించుట సాధ్యము కాదు. క్రీ. శ. 1787 లో ఈ జిల్లాలో వచ్చిన కరవు వలన ఈ యోలేటి క్రైస్తవులు లేచిపోయి యుందురు. ఏది ఎట్లున్నను, ఈ యోలేటి క్రైస్తవులు ఫాదరు మానెంట్ నాయకత్వము క్రింద చెంగల్పట్టు జిల్లాకు వెళ్ళి, ఆనాటి మదరాసు గవర్నరు కాంప్‌బెల్ ఆదరణవలన కొంత ప్రదేశమును సంపాదించి క్రీ. శ. 1787 లో కాంప్‌బెల్ పేర ఒక గ్రామ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మును నిర్మించుకొనిరి. దానినే నేడు క్రైస్తవపేట అందురు. ఓలేటిలో నేడు క్రైస్తవు లెవ్వరును లేరు. ఫ్రెంచిభాష లోను, తెలుగుభాషలోను శాసనముగల ఒక క్రైస్తవ సమాధి మాత్రము ఆ ప్రాంతమున కలదు.

క్రీ.శ. 1788 లో గుంటూరు జిల్లా ఇంగ్లీషువారి అధీనము లోనికి వచ్చెను. ఫ్రెంచి విప్లవము వలననేమి, యూరోపు నందలి నాటి పరిస్థితులవలననేమి మిషనరీలకు తగు ప్రోత్సాహము లభింపక పోవుటచే క్యాథలిక్ క్రైస్తవ మత ప్రచారము ఆ తరువాత అంత తీవ్రతరముగ సాగలేదు.

పశ్చిమాంధ్రమున, నామమాత్రావశేషముగ నుండి పోయిన క్యాథలిక్ క్రైస్తవ మతమును పునరుద్ధరించుటకై గోవా మిషనరీ డి సోజా క్రీ. శ. 18 వ శతాబ్దాంతమందు ప్రయత్నించెను. ఈతడు 'ఆదికణాదస్వామి' అని పేరిడు కొనెను. ఈతడు కడప, అనంతపురము, బళ్ళారి జిల్లా లలో చాల ప్రాంతములందు క్రైస్తవ మతమును వ్యాపింపజేసెను. కాని క్రీ. శ. 1800 లో ఇంగ్లీషువారికి ఈ ప్రదేశములు దత్తమయిన తర్వాత ఈతని మత ప్రచారము చాలవరకు ఆగిపోయెను. ఈతని అనుయాయులు తూర్పు జిల్లాలకు వలస పోయిరి. కొందరు తమ గురువుతోపాటు బెంగుళూరికి పోయిరి. తుదకీ మిషనరీ బెంగుళూరిలో చనిపోయెను.

కృష్ణకు దక్షిణమున క్యాథలిక్కులు క్రైస్తవ మతమును ఇంత కాలము నుండియు ప్రచారము చేయుచున్నను తెలంగాణాలో మాత్రము వారు తమ ప్రచారమును అనన్యముగ మొదలిడిరి. క్రీ. శ. 1884 లో హైదరాబాదు నందు వీరు తమ మిషనును స్థాపించిరి. విశాఖపట్టణము నందు వీరు తమ మిషనును క్రీ. శ. 1845 లో స్థాపించి అప్పటినుండి మతప్రచారము చేయుచున్నారు.

గుంటూరు జిల్లాలో క్యాథలిక్ క్రైస్తవ జనసంఖ్య హెచ్చుగా కలదు. కావున క్రీ. శ. 1940 నుండి ఈ జిల్లాను ఒక మతమండలముగ విభజించిరి. దీనికి ప్రప్రథమాంధ్ర బిషప్‌గా రెవరెండ్ బాతకమూరి థామస్ నియమింప బడెను.

క్రీ. శ. 1805 వరకు రోమన్ క్యాథలిక్ శాఖవారు మాత్రమే ఆంధ్రదేశమున పై విధమున క్రైస్తవ మత ప్రచారమును సాగించుచుండిరి. రోమునగర మందలి 'పోప్' వీరికి మతాధిపతి. పోప్ అధికారము నంగీకరించని క్రైస్తవమత శాఖలవారిని ప్రొటెస్టెంటు లందురు. ఈ ప్రొటెస్టెంటు శాఖయులు ఆంధ్రదేశమున క్రైస్తవమత ప్రచారమును క్రీ. శ. 1805 నుండి సాగించిరి.

ఈ ప్రొటెస్టెంటు క్రైస్తవ మత ప్రచారము ఆంధ్రదేశమున వేరు వేరు 'మిషనుల' ఆధిపత్యమున సాగెను. తొలుతగా క్రీ. శ. 1805లో లండను మిషను ఆంధ్రదేశమున ప్రచారమునకు పూనుకొనెను. వీరు విశాఖపట్టణమున మొదట తమ స్థావరమేర్పరుచుకొని సుబ్బరాయడను క్రైస్తవుడగు తెలుగు బ్రాహ్మణుని సాయమున బైబిలును, తక్కిన క్రైస్తవ మత గ్రంథములను తెలుగులోని కనువదించి ప్రచురించిరి. క్రీ. శ. 1822 నుండి వీరు కడప జిల్లా యందు తమ ప్రచారమును సాగించిరి.

ఇంతలో మతప్రచారమున కలకత్తాలోని స్కాచ మిషనరీ అలెగ్జాండర్ డఫ్ ఒక నూతన విధానమును ప్రవేశపెట్టెను. దేశీయులకు ఉన్నత విద్య నింగ్లీషులో బోధించుటచే క్రమముగ వీరికి పాశ్చాత్య మతములయందు ఆసక్తి కలుగునని అత డా విధముగ నాచరింప నారంభించెను. క్రీ. శ. 1841 లో మచిలీపట్టణమునకు వచ్చిన చర్చి మిషనరీ నొసైటీ తాలుకు మతబోధకుడగు నోబిల్ ఈ పద్ధతి ననుసరించెను. అతడు స్థాపించిన విద్యాసంస్థయే తరువాత నోబిల్ కాలేజి అయినది. అగ్రకులముల వారికి మాత్రమే అం దాతడు విద్య బోధించెను. అత డీ విధముగ కుల భేదములను పాటించినందులకు అధికారు లితనిని మందలించిరి. కాని ఇతడు తన పట్టును నెగ్గించుకొనెను. అగ్రకులములవారు కొంద రితని బోధనల వలన క్రమముగ క్రైస్తవు లైరి. అందులో కొందరు బ్రాహ్మణులును గలరు.

క్రమముగ ఈమిషనువారు క్రింది కులములవారినికూడ క్రైస్తవులను జేయ మొదలిడిరి. వీరి కిందు పాగళ్ళ వెంకయ్య అను నత డెక్కువగ సాయపడెను. ఈతడు తాను క్రైస్తవుడై నిమ్నజాతీయుల కనేకులకు క్రైస్తవ మత మిప్పించెను.

ఈ మిషను వలెనే తక్కిన అన్ని మిషనులవారును అప్పటినుండి ఉన్నత విద్యాబోధన నాధారము చేసికొని మత ప్రచారము చేసిరి. క్రీ. శ. 1842 లో వచ్చిన లూథరన్ మిషనువారు గుంటూరులో విద్యాశాలను స్థాపించిరి. అదియే నేటి ఆంధ్ర క్రైస్తవ కళాశాల. ఈ మత ప్రచారకులు నిమ్నజాతివారి కనేకులకు క్రైస్తవమత దీక్ష నిచ్చిరి.

క్రీ. శ. 1840 లో ఆంధ్రదేశమున మత ప్రచారమునకు పూనుకొనిన అమెరికన్ బాప్టిస్ట్ మిషను వారు క్రీ. శ. 1866 నుండి ఒంగోలులో తమ కేంద్రమును స్థాపించుకొన్న తరువాత విరివిగ మతప్రచారము చేసిరి. వీ రచ్చట నొక ఉన్నత పాఠశాలను స్థాపించిరి. నిమ్నజాతీయులకు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ముఖ్యముగ మాదిగలలో ఎక్కువమందికి వీరు క్రైస్తవ మిప్పించిరి. ఇందులో వీరికి ఎర్రగుంట్ల పేరయ్య అను దేశీయబోధకుడు ఎక్కువగ సాయపడెను. క్రీ. శ. 1876 వ సంవత్సరమున కరువు వచ్చిన సందర్భమున వీరు విచక్షణ లేకుండ దినము ఒక్కటికి నూర్గురికి మతదీక్ష నిచ్చి వారికి భోజనము పెట్టి కాపాడిరి.

పైని చెప్పిన మిషనులు కాక 'సొసైటి ఫర్ ది ప్రాపగేషన్ ఆఫ్ గాస్పెల్,' 'కెనెడియన్ మిషన్' మొదలగు నవికూడ ఆంధ్రదేశమున మత ప్రచారము చేయుచున్నవి. ఇవి యన్నియు విదేశీయ మతసంస్థల ఆధిపత్యమునకు లోబడి పని చేయుచున్నవి. కాని క్రమముగ దేశీయమత సంస్థలనే పర్పరచుకొనవలెనను కోరిక ఆంధ్ర క్రైస్తవుల యందు బలపడుచున్నది. అట్టి కోరిక ఫలితముగ నెల్లూరు జిల్లాలో 'తెలుగు బాప్టిస్టు హోమ్ మిషన్ సొసైటి' పర్పడి పొదిలి ప్రాంతముల పనిచేయుచున్నది. ఇటువంటిదే యగు 'ఇండియన్ మిషనరీ సొసైటి' శాఖ ఒకటి తెలంగాణా యందలి దోర్నకల్లునందు పనిచేయుచున్నది. ఈ విధముగ క్రమముగ క్రైస్తవ మతప్రచారము ఆంధ్ర క్రైస్తవుల యాధిపత్యముననే జరగుకాలము సన్నిహితముగ నున్నదని మన మూహించుట కవకాశము కలదు.

క్రైస్తవ మతప్రచారమున మొదట రోమన్ క్యాథలిక్ క్రైస్తవ మతబోధకు లనుసరించిన విధానములును, ఆర్థిక దౌర్బల్యము నాధారముగ గ్రహించి జరపు మత ప్రచారమును విమర్శనీయములే యైనను క్రైస్తవ మతము సాంఘికముగ నిమ్న జాతుల ననేకుల నుద్ధరించి వారికి జీవిక కల్పించిన దనుట నిర్వివాదాంశము. వైద్య విషయమునను, విద్యా ప్రచారము విషయమునను ఈ మత సంస్థలు చేయు సేవ తక్కిన అన్ని మతముల వారు ననుకరింపదగినది. ఎడతెగని పట్టుదలతో ఈ మిషనరీలు చేయు నిస్స్వార్థ కృషివలన క్రీ. శ. 1700 నాటికి క్రైస్తవుడే లేని తెలుగు దేశమున క్రీ. శ. 1951 నాటికి 12,06,546 క్రైస్తవు లుండుట సంభవించి, క్రైస్తవ మతమున కీ దేశమున నొక స్థానము సిద్ధించినది. చీ. శే. రా.

## బ్రాహ్మ ధర్మము

బ్రాహ్మ సమాజము పరిశుద్ధమైన ఆస్తిక్యమును ప్రబోధించు మతము. ఈశ్వరుడు ఒక్కడే యనియు, ఈశ్వరుని మానసికముగనే ఆరాధించ వలయు ననియు ఈ ధర్మము నందలి మూలసూత్రములు. దీనిని వంగదేశములో పందొమ్మిదవ శతాబ్దమున నవభారత పితామహు డవదగిన రాజా రామమోహనరాయలు స్థాపించెను. తరువాత మహర్షి దేవేంద్రనాథ ఠాకూరు, కేశవచంద్ర సేనుడు మొదలైనవారు దీనిని సుస్థిరముగా నెలకొల్పి భారతదేశమునందు ప్రచారము చేసిరి.

దక్షిణభారత దేశములో దీని ప్రచారము ప్రారంభము చేసిన బ్రాహ్మసమాజ నాయకుడు బ్రహ్మానంద కేశవ చంద్ర సేనుడు. క్రీ. శ. 1864 లో ఆయన మదరాసుకు విచ్చేసి బ్రాహ్మ ధర్మమును గూర్చి గంభీరోపన్యాసములు చేసినప్పుడు వారి ప్రసంగములు రాజగోపాలాచార్యులు, సుబ్బరాయలుశెట్టి యను ఇరువురు న్యాయవాదుల నాకర్షించినవి. దాని ఫలితముగ మదరాసులో వేదసమాజ మను సంస్థ వెలసెను. వారి యనంతరము శ్రీధరులు నాయడను యువకుడు బ్రాహ్మ ధర్మ ప్రబోధితుడై వంగదేశమునకూడ పర్యటనము చేసి వచ్చి మదరాసులో క్రీ. శ. 1871 వ సంవత్సరమున దక్షిణభారత బ్రాహ్మసమాజము నెలకొనుటకు కారణభూతు డయ్యెను. ఈ సంస్థమూలమున నాటినుండి నేటివరకు తెలుగువారు అనేకులు బ్రాహ్మ సమాజాభివృద్ధికి పాటుపడియున్నారు.

క్రీ. శ. 1878 వ సంవత్సర ప్రాంతమున ఆంధ్రదేశము నుండి మన్నవ బుచ్చయ్య పంతు లను ఉపాధ్యాయుడు మదరాసులో ఒక బాలికాపాఠశాలలో పని చేయుచు, బ్రాహ్మసమాజమునం దభిమానము కలవాడై ఉత్సాహముతో చాలమందిని బ్రాహ్మసమాజమునందు సభ్యులుగ చేర్చెను. బుచ్చయ్య పంతుల దీక్షవలన 'అన్నాపిళ్ళై' వీథిని నిలిచియున్న దక్షిణ భారత బ్రాహ్మసమాజము నిర్మించుటకు ప్రయత్నములు ప్రారంభ మయ్యెను. ఉత్తర సర్కారులలోని ప్రసిద్ధ భూస్వామి ఒకడు, రాజా గజపతిరావను బ్రాహ్మ ధర్మాభిమాని ఈ భవన నిర్మాణమునకు భూరి విరాళము నిచ్చెను. బుచ్చయ్యపంతుల నిశ్చల విశ్వాసము, నిరాడంబర జీవితము, నిష్కపట స్వభావము ఎల్ల జనుల ప్రశంసలకు పాత్రము లైనవి. క్రీ. శ. 1881 లో మదరాసు విచ్చేసిన బ్రాహ్మధర్మ ప్రచారకుడు పండిత శివనాథశాస్త్రి ప్రబోధామృతమును గ్రోలి, విద్యార్థిదశలోనే బ్రాహ్మధర్మ దీక్షాపరుడైన తరుణవయస్కుడగు వెంకటరత్నము బుచ్చయ్యపంతులకు చేదోడు వాదోడై నిలిచి బ్రాహ్మసమాజసేవకు, సంఘ సంస్కరణమునకు పాటుపడుచుండెను. మదరాసు బ్రాహ్మసమాజ నిర్మాతయైన బుచ్చయ్యపంతులు యువకుడగు రఘుపతి వెంకట రత్నములో దక్షిణభారతము నందలి బ్రాహ్మసమాజోద్యమమునకు భావినాయకుని మూర్తిని గుర్తించగలిగెను. ఈ సమయముననే వెంకట రత్నమునకు తోడై వి. పి. రాజగోపాలాచార్యులు సమాజకార్యమునందు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



రీకతో పని చేయుచుండెను. బుచ్చయ్య పంతులు మదరాసులో నాటిన బీజము మొలకెత్తుటకు వెంకట రత్నము నాయునితో పాటు వీరేశలింగము పంతులు దోహదము చేసెను. క్రీ. శ. 1895 లో ఆయన మదరాసుకు కళాశాలాధ్యాపకులుగా వచ్చినపుడు తిరిగి బ్రాహ్మసమాజోద్యమము నూతనోత్సాహముతో విజృంభించెను. వీరేశలింగము పంతులు స్థాపించిన సంఘ సంస్కరణ సమాజము, వితంతు సంరక్షణాలయము బ్రాహ్మ సమాజోద్యమము విస్తరించుటకు తోడ్పడినవి.

మదరాసునుండి రాజమహేంద్రవరమునకు తన ఉద్యోగ స్థానము మారినపుడు వీరేశలింగము పంతులీ యుద్యమమును రాజమహేంద్రవరములో నెలకొల్పెను. మహా పండితుడును, మేధావియే కాక చక్కని రచనా కౌశలము కల వీరేశలింగము పంతులు సరళమైన తెలుగు భాషలో స్త్రీలకు, పామర జనులకు కూడ అందుబాటులో నుండునట్లు విజ్ఞానప్రదములైన గ్రంథముల నెన్నిటినో రచించి తెనుగు జాతికి ఘనమైన సేవ చేసి తనుగు బాసి కెనలేని వన్నె దెచ్చెను. వంగ దేశమున విద్యాసాగరుని వలె ఆంధ్రదేశ విద్యాసాగరులైన వీరేశలింగము పంతులు వితంతు రక్షణమునకును, పరిశుద్ధాస్తిక్య ప్రచారమునకును తన సర్వ శక్తులను ధారవోసి స్వార్జితమైన విత్తముతో హితకారిణీ సమాజము, వీరేశలింగ ఆస్తికోన్నత పాఠశాల మొదలగు సంస్థలు స్థాపించెను.

తెలుగు జిల్లాలలో క్రీ. శ. 1870 - క్రీ. శ. 1880 మధ్య ప్రధానమైన పట్టణములలో బ్రాహ్మ సమాజములు వెలసినవి. బరంపురములో తొలుదొల్త క్రీ. శ. 1870 లో బ్రాహ్మ సమాజము స్థాపింపబడెను. తరువాత క్రీ. శ. 1875 లో దామోదరయ్య తోడ్పాటుతో బందరులోను, క్రీ. శ. 1878 లో వారణాసి రామబ్రహ్మము పూనికవలన బాపట్లలోను, వీరేశలింగము పంతులు కృషివలన రాజమహేంద్రవరములోను సమాజములు ఏర్పడినవి. పండిత శివనాథశాస్త్రిగారు తమ బ్రాహ్మ సమాజ చరిత్రలో ఆంధ్ర దేశములోని ఉద్యమమును గూర్చి వ్రాయునపుడు ఈ శతాబ్దారంభమున రాజమహేంద్రవరము బ్రాహ్మకర్మ క్షేత్రముగను, బాపట్ల బ్రాహ్మ భక్త మండలముగను, బందరు బ్రాహ్మ విజ్ఞానాశయాలయముగను అభివర్ణించి యున్నారు.

బ్రాహ్మ ధర్మము భక్తి జ్ఞాన కర్మ మార్గములలో ఆంధ్ర దేశమున వ్యాపకము కాజొచ్చెను. భక్త రత్నమగు రఘుపతి వెంకట రత్నము నాయుడు ఈశ్వర కారుణ్యము, పవిత్ర మానవ జీవిత ప్రశస్త్యము చక్కగా వ్యక్తమగునట్లు వివరీకరించు తన యసాధారణ గంభీరోపన్యాసములతో దశ దిశలు ప్రతిధ్వనింపజేసి విద్యార్థి యువహృదయములందు నూతన చైతన్యమును కలుగ జేసెను. బాపట్లలో త్యాగ జీవియై అచంచల విశ్వాసియైన దేశిరాజు పెద బాపయ్య తన యాదర్శప్రాయ జీవితమువలన నెందరినో బ్రాహ్మ ధర్మానుష్ఠాన పరుల నొనర్చెను. ఈ మూడు కేంద్రములనుండి బయలుదేరి బ్రాహ్మ సమాజోద్యమలత తెలుగుదేశ మంతటను ప్రాకెను. రాజమహేంద్రవరము నుండి కాకినాడ, పర్లాకిమిడి, పాలకొల్లు, నర్సాపురము, విజయవాడ, తెనాలి మున్నగు ప్రదేశములకు సమాజోద్యమము వ్యాపించెను. కాకినాడలో దుగ్గిరాల సూర్యప్రకాశరావు, తాయి సూర్యనారాయణరావు ప్రభృతులు క్రీ. శ. 1888 లో బ్రాహ్మ సమాజమును స్థాపించిరి. రఘుపతి వెంకట రత్నము నాయుడు కాకినాడ పిఠాపుర రాజ కళాశాలాధ్యక్షుడు అగుటతో కాకినాడ నగరము ఆంధ్ర బ్రాహ్మసమాజోద్యమమునకు ప్రధాన కేంద్ర మయ్యెను. బందరునుండి ఈ యుద్యమము గుడివాడ, గుంటూరు, నరసారావుపేట, నెల్లూరులకు వ్యాపించినది. బాపట్లనుండి భక్తాగ్రేసరుడు పిళ్ళారిసెట్టి సీతారామయ్య ప్రబోధ ప్రభావమున చీరాల, ఈపూరుపాలెములందు సమాజము లేర్పడెను. క్రమముగా ఏలూరు, భీమవరము, పిఠాపురము, విశాఖపట్టణము, భీమునిపట్టణము, ఛత్రపురము, గోపాలపురము మొదలగు పట్టణములందు కూడ సమాజములు స్థాపితము లైనవి. ఈ సమాజము లేర్పడుటలో వంగదేశము నుండి వచ్చిన హేమచంద్ర సర్కారు బ్రాహ్మ ధర్మ ప్రచారకుడు చాల తోడ్పడెను.

ఆంధ్ర దేశములో బ్రాహ్మ సామాజికులు చేపట్టిన సాంఘికోద్యమముల కన్నిటికి తీవ్రమైన సాంఘిక ప్రతిఘటన కలిగినది. కాని బ్రాహ్మ సామాజికులు సంఘ బహిష్కారమునకు వెరవక యోధులై నిలిచి ప్రతికూలశక్తుల హింసల కోర్చి, తమ నైతిక బలముతో ఉద్యమములను నడపించి నేటి సంఘ సంస్కరణమునకు పునాదులు వేసిరి; బాల్య వివాహములకు ఎరయై దుస్సహ వితంతు జీవితమున కుమిలి కృశించిన నిరాశా జీవులకు సుమంగళీత్వ భాగ్యమును ప్రసాదించి సంఘములో ఆనందమయ జీవనమును కల్పించిరి; తర తరములనుండి పరంపరగా వచ్చు సాంఘికాచారములవలన గడపు అపవిత్ర జీవితమే తమ కుల వృత్తిగా భ్రమించి సంఘమునకు చేటు కలిగించు వేశ్యలను వడపువృత్తినుండి మరలి ఎన్నియో కుటుంబములకు గౌరవ పవిత్ర జీవితమును గడపు భాగ్యమును



http://www.sanskritcentral.com/

http://teluguthesis.com/



ప్రసాదించిరి; జాతీయ జీవనమునకు భంగకారియైన కుల తత్త్వమును ఖండించి, జందెమును విసర్జించు ధైర్యమును, కులముల కట్టుబాట్ల నెదిరించు సాహసమును ఎందరిలోనో పురికొల్పిరి; అగతికులకు, అనాథులకు శరణాలయములను నెలకొల్పిరి; అస్పృశ్యతను రూపు మాపి, నిమ్న జాతుల యభ్యున్నతికి పాటు పడిరి; పరమేశ్వరునికి మానవునికి మధ్య నే యంతరమును లేని విధమున ఆధ్యాత్మిక సాంఘికోపాసనలు జరపి నిత్య జీవితమునందు ఈశ్వర భక్తిభావము పెంపొందించుటకు పాటు పడిరి.

పందొమ్మిదవ శతాబ్దాంతమున ప్రారంభమైన బ్రాహ్మ సమాజోద్యమము క్రీ. శ. 20 వ శతాబ్ద ప్రారంభములో ఆంధ్ర దేశమున విరివిగా వ్యాపించినది. మదరాసు, బందరు పట్టణములలో బ్రాహ్మ సమాజోద్యమమునందు ప్రముఖ పాత్ర వహించిన బ్రహ్మర్షి రఘుపతి వెంకట రత్నము కాకినాడ పిఠాపుర రాజ కళాశాలకు ప్రధానాచార్యులుగా వచ్చినప్పటి నుండియు ఈ యుద్యమ చరిత్రలో ఆంధ్ర దేశములో నూతన శక మేర్పడెనని చెప్ప వచ్చును. పవిత్ర శీలము, పరమ భక్తి, ప్రేమౌదార్యములు మూర్తీభవించిన బ్రహ్మర్షి వేంకట రత్నము ఈశ్వర ప్రసాదితములైన సర్వ శక్తులను, సర్వ సంపదలను మానవ సేవకు, బ్రాహ్మ ధర్మ ప్రచారమునకు నర్పణము చేసెను. తన ప్రియతమ శిష్యుడగు పిఠాపురాధీశ్వరుని వితరణము నూతగా గొని ఎన్నియో సంస్థల నేర్పాటు చేసెను; కాకినాడ బ్రాహ్మ సమాజము ఉపాసనలు, సభలు జరుపుకొనుటకు బ్రాహ్మోపాసనా మందిరమను దివ్య సుందర భవనమును, అనాథ జనుల సంరక్షణమునకయి రావు గంగాధర రామారాయ శరణాలయమును, బ్రాహ్మ ధర్మ ప్రచారమునకు శాశ్వత నిధిగా ఆంధ్ర బ్రాహ్మ ధర్మ ప్రచార నిధిని లక్షలకొలది రూప్యముల వ్యయముతో పిఠాపురాధీశ్వరులచే నెలకొల్ప జేసెను. అశోకుడు బౌద్ధమత వ్యాప్తికి పాటుపడినటులే ఆంధ్ర దేశములో బ్రాహ్మ సమాజ వ్యాప్తికి పిఠాపురాధీశ్వరులు తోడ్పడిరని చెప్ప వచ్చును. బ్రహ్మర్షి శిష్యులు డాక్టరు వేమూరి రామకృష్ణరావు, దివాన్ కోకా వెంకట సుబ్బారావు ప్రభృతులు బ్రాహ్మ సమాజోద్యమమున కఖండ సేవ చేసి, బ్రాహ్మ బంధు నిధిని స్థాపించి ధన్యులైరి; పరిశుద్ధాస్తిక మత ప్రచారమునకై బ్రహ్మర్షికి చేదోడు వాదోడుగా నుండి ఆంధ్రాస్తిక మహాసభ నేర్పరచి ఏటేట సమావేశములు జరపించుచుండిరి. వంగ దేశమునుండి ప్రసిద్ధులగు ధర్మ ప్రచారకులు పండిత శివనాథశాస్త్రి, హేమచంద్ర సర్కారు, సతీశచంద్ర చక్రవర్తులు నవ విధాన ప్రచారకులు. అమృతలాల్ బోసు, నిర్భరప్రియ ఘోషు, రాజకీయ దురంధరుడు విపినచంద్ర పాలు, రవీంద్ర కవీంద్రుడు, బొంబాయినుండి షిండే మున్నగువారలు, అమెరికానుండి సౌత్‌వర్తు, డ్రమండు నెట్‌ఫీల్డ్ మున్నగువారు తెనుగు సీమకు విచ్చేసి బ్రాహ్మ ధర్మ ప్రబోధము కావించుటకు బ్రహ్మర్షి వెంకట రత్నము కారణభూతుడయ్యెను. బ్రహ్మర్షి వెంకటరత్నము నిర్యాణము తరువాత ఆంధ్ర దేశమున బ్రాహ్మ సమాజ సభ్యుల సంఖ్య కొంత తగ్గినది. కాని వారి కాలములో స్థాపితములైన సమాజము లన్నియు యథాక్రమముగా నడచుచునే యున్నవి. ఆంధ్రాస్తిక మహాసభలు ప్రతి సంవత్సరమును సక్రమముగా జరగుచున్నవి. సమాజము లన్నిటిని సంఘటిత పరచి ఒక విధానమున నడపుటకు ఆంధ్ర బ్రాహ్మ సభ యను సంస్థ క్రీ. శ. 1941 లో నేర్పడినది. దాని యాజమాన్యమున ఆంధ్ర దేశములో బ్రాహ్మ సమాజోద్యమము నూతనోత్సాహముతో సాగుచున్నది. ఆంధ్రుల నవ్య సాంఘిక జీవనమును దిద్ది తీర్చి, దానిని నైతిక మార్గమున నడపుటకు, సంస్కరణ పరాయణము చేయుటకు బ్రాహ్మ సమాజోద్యమము మహత్తర సేవ చేసినది. ఎం. వెం. ర.

**ఆధునిక మత పరిస్థితి :** పైని చెప్పినవి కాక ఆర్య సమాజము, దివ్యజ్ఞాన సమాజము అని బ్రాహ్మధర్మము వలెనే బ్రిటిషు ప్రభుత్వము మనదేశములో స్థిరముగా నెలకొన్న పిదప వచ్చిన ధర్మ సంప్రదాయములు. బ్రాహ్మ సమాజ, ఆర్య సమాజములు రెండును బ్రిటిష్ ప్రభుత్వము వారు మనదేశములో ప్రవేశపెట్టిన విద్యావిధానము వలన వ్యాపించిన హేతువాద భౌతికశాస్త్ర విజ్ఞానములను, ప్రాచీన హిందూమత విజ్ఞానమును సమన్వయ పరచి ఆధునిక యుగమున కనుగుణముగ మన మతమును తీర్చి దిద్దుకొనుటకై ఉద్దేశింపబడిన మత, సాంఘిక సంస్కరణోద్యమములు. ఈ రెండును ఏకేశ్వరోపాసనా బోధకములే. ఈ రెంటిలో బ్రాహ్మసమాజము మొదట స్థాపితమైనది. పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్థమునందును, ఇరువదవ శతాబ్ది ప్రథమపాదమునందును మన దేశములో సంస్కరణోద్యమములు నడపిన నాయకులమీద దాని ప్రభావ మెక్కువగా నుండెను.

బ్రాహ్మ సమాజమునకు తరువాత వచ్చినది ఆర్య సమాజము. దీనిని దయానంద సరస్వతులవారు స్థాపించిరి. ఇది కూడ బ్రాహ్మసమాజము వలెనే మత సంస్కరణమునకే కాక సంఘసంస్కరణమునకు కూడ ఎక్కువగ కృషి చేసెను. ఇస్లాము, క్రైస్తవ మత ప్రవిష్టులైన హిందువులను వైదికమంత్రములవలన పునీతులను కావించి మరల



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



హిందూమతమున చేర్చుకొనుట ఆర్యసమాజ సంఘ సంస్కరణ కృషిలో ప్రధానమైనది. దీనికి శుద్ధి ఉద్యమ మని పేరు. హిందువుల అన్యమత ప్రవేశ మెక్కువగ నుండిన ప్రదేశములలో ఈ యార్యసమాజ మెక్కువగ వర్ధిల్లినది. ఈ ధర్మసంప్రదాయమునకు 'సత్యార్థ ప్రకాశిక' వేదము వంటిది. దాని కది జీవము. బ్రాహ్మ సమాజము ప్రబలినట్లు ఆర్య సమాజము మన దేశములో ప్రబలలేదు. బ్రాహ్మ సమాజమున కుండిన పట్టు దీనికి లేదు. అట్లని అది మొదలే మనదేశమున వ్యాపింపలేదని చెప్పలేము. ఆంధ్ర రాష్ట్రములో కంటెను తెలంగాణాలో ఆర్య సమాజము నకు బలమెక్కువగ నుండెను.

బ్రాహ్మ సమాజ, ఆర్యసమాజములు రెండును హిందూ మతమును సంస్కరించి ఆ మతము పునాదులమీద స్థాపింప బడగా, దివ్యజ్ఞానము సర్వమత సారము సాధారణముగా గొని యేర్పడిన విశ్వమత సంప్రదాయము. సర్వమతము లకు సాధారణమైన సత్యమే దివ్యజ్ఞానము. దివ్యజ్ఞాన సమాజము సర్వమానవ సౌభ్రాత్రమునకై కృషి చేసినది. ఆనిబిసెంటు దివ్యజ్ఞాన సమాజమును చేపట్టి నడపినప్పటి నుండియు దానికి అఖిలభారత వ్యాప్తియు, ప్రశస్తియు కలిగినవి. ఇది హిందూమతములోని పూర్వాచారములను చాలవరకు సమర్థించుటచేతను, ఎవరి మతమును వారు విడువ నక్కరలేకయే యందు చేరుట కవకాశ ముండుట చేతను, సర్వమతసార మగుటచేతను దానియెడ మనదేశీ యులలో హిందువులైన ఆంగ్లవిద్యాధికుల కెక్కువ మక్కువ కలిగినది. ఆంధ్రరాష్ట్రములో, అందును ముఖ్యముగ సముద్ర తీరస్థ మండలములలో దీనికి వ్యాప్తియెక్కువ.

బ్రాహ్మసమాజ, దివ్యజ్ఞానసమాజ, ఆర్యసమాజములు పవిత్రజీవనమును గడుపుటకు చాల ప్రోత్సహించినవి. ఆస్తికభావమును పెంపొందించినవి; నైతిక ప్రవర్తన ముఖ్యమని ఉద్ఘాటించినవి; సంఘ సంస్కరణమునకును, కుల వర్ణ మత విభేదములు తొలగించి సాంఘికుల నందర నేకముచేయుటకును చాల తోడ్పడినవి.

మహాత్మ గాంధి స్వాతంత్ర్యోద్యమ సందర్భమున అస్పృశ్యతా నివారణమును దాని కొక యంగముగ జేసి గొప్ప యుద్యమముగ రూపొందించి ప్రాచీన హిందూ వర్ణ వ్యవస్థకు క్రొత్తదనమును చేకూర్చి, ఆధునికయుగమునకు తగినట్లు హిందూమతమునకు నూతన వ్యాఖ్యానమును కావించెను.

రామకృష్ణ పరమహంస, వివేకానందస్వామి, రామ తీర్థస్వామి మొదలగు మహాత్ముల ఉపదేశములును, ఉప న్యాసములును, బోధలును దేశీయ హృదయమునకు క్రొత్త బలము నిచ్చి దాని నుత్తేజ పరచినవి. రామకృష్ణ పరమహంస సందేశమును, హిందూమత ప్రశస్తిని వివేకా నందస్వామి జగద్వ్యాప్త మొనర్చెను. మానవ సేవయే మాధవసేవ యను విశ్వాసముతో ఆధునిక ధర్మ సంప్ర దాయము లన్నియు జన సామాన్యమునకేదియో యొక విధమున తోడ్పడి వారి నుద్ధరించుటకే కృషి చేయు చున్నవి. ఈ లక్ష్యముతోనే తెలుగు దేశములోని రామకృష్ణ మఠములును పాటుపడు చున్నవి.

అరవిందయోగి, రమణమహర్షి వంటి యోగీంద్రు లును, ఆత్మవేత్తలును తెలుగు దేశీయులలో అనేకుల హృదయము నాకర్షించి యున్నారు. వారి యాశ్రమ ముల కరిగి వారి బోధల నాకర్ణించి యోగ మహత్త్వ మును దెలిసికొని వారికి శిష్యులై ఆధ్యాత్మికముగ కృషి చేయుచున్న తెలుగువారు ఆంగ్ల విద్యాధికులలోను, సామాన్యులలోను కూడ నున్నారు.

రాధాస్వామి సత్సంగ్, హరనాథ బాబా, సాయి బాబా, మెహర్ బాబా వంటి మహాత్ముల, సిద్ధుల ప్రభావము తెలుగు దేశపు సామాన్య ప్రజమీద కూడ అధిక ముగా నున్నది. పై నుడివిన ధర్మ సంప్రదాయములును, యోగులును, సిద్ధులును, మహాత్ములును తెలుగు హృద యమునందు ధర్మాభిరతిని, ఆత్మ జ్ఞానమును, భక్తిభావ మును నేటికి నుజ్జీవింప జేయుచున్నారు.

మ. సో. శ.





http://sanskritcentral.com/

http://teluguthesis.com/

# తెలుగు వాఙ్మయము

## ప్రాఙ్నన్నయ యుగము (క్రీ. శ. 1030 పూర్వము)

ఆంధ్ర వాఙ్మయమున ఉపలభ్యమానము లగుచున్న గ్రంథములలో మొట్టమొదటిది నన్నయ భట్టారక విరచిత మగు 'ఆంధ్ర మహాభారత' భాగము. నన్నయకు పూర్వము ఆంధ్రవాఙ్మయ స్వరూప మె ట్లుండెనో నిర్ణయించుటకు తగినన్ని ఆధారములు లేవు. ఉన్నవానిలో ప్రధానమయినవి శాసనములు. అవియును నాటి భాషా దేశీయ చ్ఛంద స్వరూపనిరూపణమునకే ఎక్కువ యుపయోగించును కాని వాఙ్మయస్థితిని విపులముగా గ్రహించుటకు చాలవు. వాఙ్మయ విమర్శక మర్యాద ననుసరించి, ఆంధ్ర వాఙ్మయచరిత్ర రచనలో ఆదినుండి ఆంధ్రమహాభారతావతరణ కాలము వరకును ఒక ప్రకరణముగ విభజించి దానిని 'ప్రాఙ్నన్నయ యుగము' అనియు, 'అజ్ఞాత యుగము' అనియు పండితులు వ్యవహరించుచున్నారు.

ఆంధ్ర మహాభారతము వెలసినది వేంగీ చాళుక్యుల కాలమున, అనగా పదునొకండవ శతాబ్దియందు. చాళుక్యులకు పూర్వయుగములలో సాతవాహనులు, ఇక్ష్వాకులు, బృహత్పలాయనులు, పల్లవులు, శాలంకాయనులు, విష్ణుకుండినృపులు మన దేశమును పాలించిరి. ఈ రాజవంశముల పరిపాలనలో సంస్కృత ప్రాకృతభాషలే రాజాదరణ పాత్రము లైనవి. ఆ రాజులలోని, పల్లవ శాలంకాయనులీ యుభయ భాషలలోను శాసనములు వేయించిరి.

ఆంధ్ర దేశము నేలిన తొలిరాజవంశము సాతవాహన వంశము. వారు ప్రాకృతభాషనే రాజభాషగా స్వీకరించిరి. గుణాఢ్యుని 'బృహత్కథ', హాలుని 'గాథాసప్తశతి' సాతవాహన రాజుల కాలమున వెలసిన ప్రాకృత కావ్యములు. రాను రాను సంస్కృతమున కధికాదరమును, రాజభాషా గౌరవమును సిద్ధించినవి. అప్పటి శాసనములలో అగ్రహార ప్రతిగ్రహీతల పేర్లు, సీమానామములు మాత్రము తెలుగు భాషలో వ్రాయబడు చుండెడివి. క్రమక్రమమున తెలుగు వాక్యములు, పద్యములు చొప్పింపబడి తుదకు పూర్తిగా తెలుగుననే శాసన మంతయు వ్రాయబడుటయు జరిగినది. నన్నయకు పూర్వమున గల శాసనములను పరిశీలించినచో ఈ విషయము స్పష్ట మగును.

శాలంకాయనులనాటి శాసనములలో పేర్కొనబడియుండు గ్రామ, గ్రామసీమావధుల నామములనుబట్టి అప్పటికే తెలుగుభాష జనసామాన్యమునందు వాడుకలో నుండెనని కొందరు ఊహించుచున్నారు. ఇది యథార్థమే కావచ్చును; కాని దాని స్వరూప మెట్టిదో తెలిసికొనుటకు తగిన సామగ్రి మృగ్యము. క్రీ. శ. 7 వ శతాబ్దారంభదశయందు దక్షిణ, పశ్చిమాంధ్ర ప్రాంతమును పాలించిన పల్లవరాజు మొదటి మహేంద్రవర్మ బిరుదులలో కొన్ని తెలుగు పదములు కలవు. అప్పటికి దేశమునందు తెలుగు సర్వసామాన్యముగ వాడుకలో నుండెనని భాషాశాస్త్రవేత్తల యభిప్రాయము. ఆనాడు ఇప్పటి రాయలసీమను పాలించుచుండిన రేనాటి చోళ, బాదామి చాళుక్య రాజుల యొక్కయు, తూర్పున కళింగమునుండి సమస్త తీరాంధ్రభూమిని పాలించుచుండిన పూర్వచాళుక్య ప్రభువుల యొక్కయు శిలాశాసనము లనేకము తెలుగు భాషయందు వ్రాయబడి యుండుటవలన అప్పు డచ్చట జను లాడుచుండిన భాష తెలుగే యని విస్పష్ట మగు చున్నది.

కడపమండలములోని చిలమకూరు, ఎర్రగుడిపాడు గ్రామములలో కానవచ్చు రేనాటి చోళరాజులనాటి ప్రాచీన శిలాశాసనములు క్రీ. శ. 6 వ శతాబ్ది చతుర్థపాదమున వ్రాయించిన వనియు, ఉరటూరులోని చోళ మహారాజుల శిలాశాసనము క్రీ. శ. 7 వ శతాబ్ది ప్రథమపాదమున వ్రాయించిన దనియు కొందరు పరిశోధక పండితులు అభిప్రాయపడు చున్నారు. ఇది యె ట్లున్నను కడప జిల్లా రామేశ్వరమునందలి శివాలయములో భద్రపరపబడియుండు మహేంద్ర విక్రమ చోళమహారాజు పుత్రుడైన పుణ్యకుమారుని ధర్మపత్ని వసంతపోటి మహాదేవి నిల్పిన శిలాశాసనము క్రీ. శ. ఏడవ శతాబ్ది మధ్యకాలమున వ్రాయించినదని నిశ్చయముగ చెప్పవచ్చును. పూర్వ చాళుక్య ప్రథమ జయసింహవల్లభుడు (క్రీ.శ. 641 - క్రీ.శ. 678) గుంటూరు జిల్లా విప్పర్తిగ్రామమునందు నిల్పిన శిలాశాసనముకూడ అప్పటిదే. వీనికి తరువాత పేర్కొనదగినవానిలో మంగి యువరాజు (క్రీ. శ. 681 - క్రీ. శ. 705) యొక్క లక్ష్మిపుర శాసనమును, మూడవ విష్ణువర్ధనుని కాలము (క్రీ.శ. 718 - క్రీ.శ. 752) నాటిదని చరిత్రకారులు అభిప్రాయపడు అహదనకర శాసనమును ముఖ్యమైనవి. అహదనకర శాసనము తప్ప తక్కిన వన్నియు సంపూర్ణముగ తెలుగు భాషయందే లిఖింపబడి యున్నవి. అహదనకర శాసనమందు చాలభాగము సంస్కృతము; కాని



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



యందలి దాన వివరవర్ణన యంతయు తెలుగుననే యున్నది. ఈ శాసనముల భాషయందు సంస్కృత ప్రాకృత భాషా ప్రభావ మెక్కువ. ఇందలి తెలుగు పలుకుబడులలో ప్రాచీన ద్రావిడభాషా సముదాయము సంస్కృత ప్రాకృత భాషా సాహచర్యములచే మార్పు పొందుచున్నదశ కానవగును.

క్రీ. శ. 848 - 49 సంవత్సరమున పూర్వచాళుక్య గుణగ విజయాదిత్యుని రాజ్యాభిషేకముతో ఆంధ్రవాఙ్మయ చరిత్రయందు ఒక నూతన యుగము ప్రారంభమాయెను. శాసనములందు తెలుగు పద్యములు అప్పటినుండియే కాన వచ్చుచున్నవి. ఇందువల్ల నితని కాలముననో, ఇంచుక పూర్వమునుండియో తెలుగున పద్యరచన ప్రారంభమాయె నని తెల్లమగుచున్నది. ఇతని కాలపు శాసనములలో రెంటియందు పద్యములు కానవచ్చుచున్నవి. అం దొకటి అద్దంకి శిలా శాసనము (క్రీ. శ. 849 - 50). ఇది గుణగ విజయాదిత్యుని సేనానాయకు డగు పండరంగడు ఆదిత్య భట్టారకునకు 'ధర్మపురము'న కొంతభూమి దానము చేయుటను తెలుపు శాసనము; గద్య పద్యాత్మకమై యంతయు తెలుగున నున్నది. ఇందలి పద్యము తరువోజ. తెలుగు పద్యము కానవచ్చు మొదటి శాసన మిదియే.

మరియొకటి కందుకూరు శాసనము. ఈ శాసనమున సీసపద్యము కలదు. శాసనశిల పగిలి కొంత కానరాక పోవుటచేత సీసములోని మొదటి, చివరి చరణములు మాత్రమే లభ్యమగుచున్నవి.

మరియొకటి యుద్ధమల్లుని బెజవాడ శాసనము (క్రీ. శ. 950). ఈ శాసనమున మధ్యాక్కరలు గలవు. దీనికి పిమ్మట మనకు కానవచ్చు తెలుగురచన మహాభారతమే.

గుణగ విజయాదిత్యుని తరువాత వేంగి సింహాసనము నధిష్ఠించిన మొదటి చాళుక్య భీమ మహారాజు (క్రీ. శ. 892 - క్రీ. శ. 921) గుంటూరుజిల్లా ఒంగోలు తాలూకా లోని ధర్మవర గ్రామమున వేయించిన శాసనమునందు సీసపద్య మొకటి యున్నది. నన్నయ సీసములకును, దీనికిని చాల పోలికలు కలవు. కవి యెవ్వరో తెలియదు కాని ఇందు సర్వత్ర ప్రాసయతి పాటింపబడి యుండుట గమ నింప దగిన విషయము.

చాళుక్యుల కాలమునుండియే తెలుగునకు రాజాదర ణము మిక్కిలిగా లభించినది; భాష సంస్కరింప బడినది. నన్నయ్యకు పూర్వము కానవచ్చిన పద్యము లన్నియు దేశీయచ్ఛందో బద్ధములే. సంస్కృతచ్ఛందస్సులను తెలుగు నకు తెచ్చినవాడు నన్నయ. ఒక్కచ్ఛందస్సుల విషయ మునసే కాదు, భాషా విషయమునను అనేక సంస్కార ములు చేసి తెలుగున మహాభారతము వంటి యుద్గ్రంథ మును రచించుటకు చాలిన సర్వసంపన్న మయిన భాషగా తీర్చిన పరమేష్ఠి నన్నయ భట్టారకుడు.

నన్నయభట్టారకునికి చాల తరువాతి కాలమున నుండిన పాల్కురికి సోమనాథుడు తన పండితారాధ్య చరిత్రలో తుమ్మెద పదములు, ప్రభాత పదములు, పర్వత పదములు, ఆనంద పదములు, నివాళి పదములు, గొబ్బి పదములు, వెన్నెల పదములు మున్నగువానిని పేర్కొనియున్నాడు. ఈ పదము లనేకము నన్నయకు పూర్వమునుండియు తెలుగునాట ప్రచారములో నుండియుండవచ్చునని యూహించుట అసమంజసము కాదు. ఈ పదవాఙ్మయ మునకు రంగము పల్లెసీమలు. తీరికవేళలలో ఉత్సవము లలో, పనులలో నున్నపుడు అలసోకగా, ఉత్సాహముగా, శ్రమ తోచకుండ స్త్రీపురుషు లెల్లరు పాడుకొనుచు ఆనం దించుటయే దీనివలని ప్రయోజనము. అది స్త్రీల పాటల యందును, బాల బాలికల క్రీడాగీతములయందును, భక్తుల గేయములలోను, జానపద యువతీ యువకుల మానరాగ ములలోను - ఎన్నియో రీతుల తన యునికిని నిలుపుకొనుచు విద్వత్పరిషత్తులకు దూరదూరముగా నుండి బ్రతుకసాగి నది. ఇదియే దాని స్థిరమయిన వ్యవస్థితి లేమికి హేతువు. దీనికి సరియైన లక్షణ నిర్దేశముకూడ నుండదు. నిజమునకు ఒకదేశమున సర్వలక్షణ సంపన్నమై, పరిపుష్టమైన వాఙ్మ యము బయలుదేరుటకు ఎంతో కాలము ముందుగానే పద వాఙ్మయము బయలుదేరును. నేటికిని లిపికూడ లేనిభాష లెన్నో యున్నవి. కాని, ఆ భాషలు మాటాడువారికి పద వాఙ్మయము లే దనలేము. కాబట్టి నన్నయకు పూర్వము పదవాఙ్మయము చాల నుండవచ్చును. పాల్కురికి సోమ నాథుడు పేర్కొనిన పదములే కాకపోయినను ఇంచు మించుగ నట్టి పదములు ప్రచారములో నుండియుండ వచ్చును. కాని, దానికి పండితాదరణమును, లక్షణ వ్యవ స్థితియు లేక గ్రంథరూపమున మన కందలేదు.

పదచ్ఛందోలక్షణము తాళ్లపాక అన్నమాచార్యుని 'సంకీర్తన లక్షణము'న కొంత సూచింపబడినది. దరువులు మున్నగు కొన్ని పదకవితావిశేషములు దేశీయనాటకము లని చెప్పదగు యక్షగానములలో కొంత చోటు చేసి కొన్నవి. తెలుగునగల దేశీయచ్ఛందము లన్నియు ఇరుగు పొరుగు భాషల ఛందస్సుల ఒరయికవలనను, ఈ పద వాఙ్మయ రీతులవలనను మార్పు చేర్పులు పొంది యేర్పడి యుండు ననుటయు సమంజసము.

ఇక శాసనములు, పదకవితలు మాత్రమేకాక నన్నయకు పూర్వము గ్రంథరచనయు జరగియుండునని వాదించు వారు కొందరు కలరు. వా రి ట్లందురు :



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కన్నడమున క్రీ. శ. పదవ శతాబ్ది మధ్య కాలమున పొన్నడును, ఆదిపంపడును క్రమముగ 'శాంతిపురాణ', 'విక్రమార్జున విజయము'లను రచించిరి. పదునొకండవ శతాబ్దిలో నాగవర్మ 'ఛందోంబుధి'ని కూర్చెను. వీరిలో పొన్నని జన్మస్థానము ఉత్తర ఆర్కాటు జిల్లాలోని వాణియంబాడియైనను అతడు కమ్మనాటికి వచ్చి యచ్చట స్థిరనివాస మేర్పరచుకొని గ్రంథరచన సాగించెను. తక్కినవా రిద్దరును తాము వేంగీదేశీయులమని చెప్పుకొని యున్నారు. కాబట్టి కన్నడభాషలో కావ్యములు రచించుటకు పూర్వము తమ దేశభాషయగు తెలుగులో గ్రంథ రచన చేసియుందురు.

నన్నయకు పూర్వము తెలుగు దేశమున జైనమతము ప్రచారములో నుండెను. ఆ జైనమత బోధకులు తమ మత ప్రచారము కొరకు తెలుగులో గ్రంథములు రచించి యుందురు. వానిని వైదికమత పునరుద్ధరణకు బద్ధకంకణు లయిన చాళుక్యరాజులు తగులబెట్టించియుందురు.

ఈ వాదములందు బలములేదు. కన్నడ గ్రంథములు రచించిన ఆదిపంపాదులు తాము వేంగీ దేశీయులమని చెప్పిన మాట వాస్తవము; కాని, తెలుగున గ్రంథములు రచించినట్లు చెప్పుకొనలేదు. దేశాభిమానముతో పై విషయము చెప్పిన వీరు మాతృభాషాభిమానముతో తమ ఆంధ్ర గ్రంథకర్తృత్వము నేల చెప్పుకొనకుందురు? ఇట్టి ప్రశ్న లన్నిటిని పరాస్తము చేయగలసాక్ష్య మున్నగాని ఈ వాదము నంగీకరించుటకు వీలులేదు.

ఇక జైనకావ్యములు: లక్షణదీపికలో సర్వదేవుని 'ఆదిపురాణము' నుండి ఒక తెలుగు పద్య ముదాహరింపబడినది. సర్వదేవుడను కన్నడకవి యొకడు నన్నయకు పూర్వుడు కలడు. అతడే యీ ఆదిపురాణకర్తయనుట కాధారము లేదు. జైనమతాచార్యులలో సర్వదేవ నామధారులు పలువు రున్నారు. నన్నయకు తరువాతకూడ పెక్కురు కలరు. వీరిలో ఆదిపురాణకర్త ఏ సర్వదేవుడో తెలియదు. చాళుక్యులు వైదిక మతాభిమానులేయయ్యు పరమత సహనము లేనివారు కారు. చాళుక్యరాజులు జైన గ్రంథములను తగులబెట్టించి యుందు రనుట విశ్వసింపదగిన విషయము కాదు. వారు జైనవసతులకు, జైనాచార్యులకు గ్రామదానము చేసినట్లు తెలుపు శాసనములే యున్నవి. కావున జైనగ్రంథదాహము వారి కంటగట్టుట సమంజసము కాదు.

పై రెండు వాదములకంటె మిక్కిలిగా పండితుల చర్చలకు త్రోవ తీసినది మరియొకటి కలదు. అది కుమారసంభవ కర్తయగు నన్నెచోడుడు నన్నయకు పూర్వుడనుట. ఈ కుమార సంభవము 1910 వ సంవత్సరమున ప్రకటింపబడినది. అంతవరకు దీని యునికి పండిత లోకమునకు తెలియదు. నాటినుండియు నన్నయ, నన్నెచోడుల పౌర్వాపర్య విషయమున చర్చలు జరుగుచునే యున్నవి. శాసనాధారములను బట్టియు, రచనా రీతులను బట్టియు, పద ప్రయోగములను బట్టియు కొందరు నన్నెచోడుడు నన్నయకు పూర్వుడని వాదింపగా ఆ యాధారములను బట్టియే యాతడు తరువాతివాడని మరి కొందరు వాదించిరి. పలువురు విమర్శకులు నన్నెచోడుడు నన్నయకు తరువాతివాడను వాదమును అంగీకరించి యున్నారు.

నన్నయకు పూర్వము గ్రంథ రచన జరగెనో లేదో చెప్పలేము. మొత్తముమీద సుపరిష్కృతమై, వ్యవస్థితి యేర్పడిన తెలుగు భాషలో వెలువడిన ప్రథమ గ్రంథము మహాభారతమే యని చెప్పవలసి యున్నది. కాని ఏ భాషలో కాని తొలుదొలుతనే మహాభారతమువంటి ఉద్గ్రంథ ముదయించుట అసహజము. అంతకు పూర్వము దేశములో కవితా వ్యాసంగ మెక్కువగాను, చురుకుగాను జరగుచుండి యుండవలెను. ఏత ద్వ్యాసంగ పరిణామ ఫలములే పూర్వోక్త శాసనములలోని తెలుగు కవితా రీతులు. తెలుగులో అట్టి రచనలు సాగగా సాగగా తుద కాంధ్ర మహాభారత మవతరించినది. భాషా కవిత్వ వికాస సూత్రముల ననుసరించి చూడగా, మన కిప్పుడు లభింపక పోయినను నన్నయకు పూర్వము సుపరిణతము, సువ్యవస్థితము కానిదైనను ఏదో యొకరీతి వాఙ్మయ ముండెనని యంగీకరించుట సమంజసముగ దోచుచున్నది. దా. గో. కృ.

# కవిత్రయ యుగము (క్రీ. శ. 1030 - క్రీ. శ. 1400)

లభ్యములగు నాంధ్ర గ్రంథములలో నన్నయకృత భారత భాగము మొదటిది. కావున దీనితోడనే ఆంధ్ర సారస్వత చరిత్రారంభము. ఐనను తత్పూర్వ మాంధ్రమున కవితాంశమే శూన్య మనుట హేతువాదమునకును, సారస్వతపరిణామ సిద్ధాంతములకును విరుద్ధము. శబ్ద లాలిత్యము, ధారాశుద్ధి, రచనా గాంభీర్యము నన్నయ కవితయందలి ప్రధాన గుణములు. ఇట్టి పరిణత కవితాలక్షణము లొక్కసారిగా సృష్టికి వచ్చిన వన జాలము. తెలుగుననే కాదు, ఏజాతి సారస్వతమందును నిట్టి పరిణతమగు కవిత తొలి రచన కానేరదు. మరియు,



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కవితా పరిణామమున గేయమే ప్రథమ దశ యనుటయు మరవరానిది. గేయ సారస్వతము బాగుగ పరిణతిచెందిన తరువాతి కాలముననే ఛందోబద్ధమగు పద్యకవిత పర్పడుచున్నది. దక్షిణదేశ సారస్వతమందలి మాత్రా ఛందస్సులన్నియు నిట్లు గేయములనుండియే యేర్పడినవి. కావుననే అవి లయతో పాడుట కనువై యుండుట. నన్నయకు పూర్వమునను ఇట్టి దేశీయమగు గేయ సారస్వతము వ్యాప్తియం దుండినది. ఈ గేయములనుండి యేర్పడిన మధ్యాక్కర, తరువోజ, సీసము మున్నగు దేశీయ చ్ఛందస్సులు నన్నయనాటికే యేర్పడి, శాసనస్థములై యున్నవి. కనుక, భారత రచనారంభమునకు పూర్వమే తెలుగున కవితా స్వరూప మేర్పడిన దనియు. ఛందోభేదములుకూడ వ్యాప్తియం దుండిన వనియు స్థిరమగుచున్నది. అట్టివానిని ఉదాత్త కావ్య యోగ్యము లగునట్లు సంస్కరించుకొని కావ్యరచన గావించినవాడు నన్నయ. నన్నయ పద్యరచనా ప్రౌఢిమను, కవితా వైశిష్ట్యమును పరిశీలించుచో భారత రచన అతని ప్రథమ ప్రయత్నము కాదని తోపకపోదు. 'ఉభయభాషా కావ్యరచనా శోభితుడు' అను ప్రయోగమును ఈ యభిప్రాయమునకు పోషకమే. లలిత కళలలో విశిష్టమైనది కవిత. దైవదత్తమగు ప్రతిభయు, నిరంతర దీక్షతోడి సాధనయు కళాసృష్టి కాధారములు. కావున సాధన లేనిదే భావ ప్రధానమగు కవితాకళ సిద్ధింపదు. కావున, నన్నయ భారతభాగ రచన అతని తొలి కృతి కానేరదు. నన్నయకు పూర్వపు కావ్యములుగాని, అతని యితర రచనలు గాని మనకు లభింపకపోవుటయే తద్భారత మాదికావ్య మగుటకు హేతువులు.

భాషా వాఙ్మయములు సంఘ సంబంధు లగుటవలన వాని పరిణామముకూడ దేశకాల పరిస్థితుల ననుసరించుచుండును. ఆంధ్ర శాతవాహనుల కాలమునను, ఆంధ్ర భృత్యుల కాలమునను సంస్కృత, ప్రాకృతములే రాజభాష లగుటచే దేశభాష వ్యవహారముననే నిలిచిపోయినది. విద్యావంతులు తమ నిత్య వ్యవహారమునను తత్సమ భాషనే యెక్కువగ వాడుచు వచ్చినందున దేశభాష బలము కాజొచ్చినది. తూర్పు చాళుక్యుల కాలమువరకును తెలుగున కిట్టి అజ్ఞాతస్థితియే యేర్పడియుండినది. వీరి పరిపాలన కాలమునుండి, అందుము ముఖ్యముగా విమలాదిత్యుని నాటినుండియు దేశభాష కాలంబనము లభించినది. విమలాదిత్యుని సన్నిహిత బంధువులగు తమిళచోళుల రాజ్యమున దేశభాషకు గల ప్రాధాన్యముకూడ ఇందుల కొక కారణమై యుండవచ్చును. కారణ మేదియైనను నన్నయనాటికి దేశమున తెలుగునకు వ్యక్తిత్వ మేర్పడి యుండిన దనుటకు తత్సన్నిహిత కాలపు శాసనములే ప్రమాణములు. అట్టి దేశభాషను చేపట్టి, శిష్ట వ్యవహారస్థమగు తత్సమముతో దానిని మేళవించి ఉదాత్త కావ్య భాషగా దిద్ది తీర్చినవాడు నన్నయ కావుననే అతడు వాగనుశాసను డైనాడు.

భారత రచనకు అనువగు సాంఘిక పరిస్థితులుకూడ ఇతని కాలమున కేర్పడియుండినవి. అవి యేవియో ఇంచుక పరిశీలింతము.

శాతవాహనులనాటికే వ్యాప్తియం దుండిన జైన, బౌద్ధములు క్రమముగా దేశమున నెలకొన్నవి. శాతవాహన రాజులు జైన, బౌద్ధములను ఆర్యమతముతో సమానముగ నాదరించి పోషించినారు. వర్ణభేదములను పాటింపని జైన, బౌద్ధమతములు ప్రజానురాగ పాత్రము లగుటలో నాశ్చర్యము లేదు. కాని కాలక్రమమున ఈ మతములు తాత్విక దృష్టిని గోల్పోయి సామాన్యము లైనవి. కావుననే విష్ణుకుండినుల కాలమున వైదిక సంస్కృతిని పునరుద్ధరించు ప్రయత్నములు లారంభమైనవి. కర్ణాటప్రాంతము నందును ఇట్లే జైన ప్రాబల్యమునకు ప్రతిద్వంద్విగా వైదిక మతము తలయెత్తినది. తమిళదేశమున జైన, బౌద్ధములకు ప్రచారము చాల తక్కువ. ఐనను మత ప్రచారమును, విద్యావ్యాప్తియు ప్రధానాశయములుగా నిడికొన్న జైన, బౌద్ధుల సంస్థలకు ప్రజానీకముపై గల పలుకుబడి సామాన్యమైనది కాదు. కావుననే వైదిక మతానుయాయులు స్వమతోద్ధరణకై అసాధారణమగు ప్రయత్నము గావింపవలసి వచ్చినది.

పదవ శతాబ్దిలో కుమారిలభట్టును, తొమ్మిదవ శతాబ్దిలో శంకరులును వైదిక మతమును ప్రచారము గావించిరి. సంఘము ఇట్టి మతవిషయకావ్యవస్థకు లోనయి యున్న కాలమున చార్వాక, కాపాలిక సోమసిద్ధాంతాది క్షుద్ర మతము లెన్నియో దేశమున వ్యాపించి ప్రజల నైతిక పతనమునకు హేతువు లయినవి. ఈ మత ప్రచారకుల అవినీతి ప్రవర్తనను సహింపని ప్రజలలో అలజడి కలుగుటయు సహజమే. ఇట్లు ప్రజలలో ఈ భిన్న మతముల విషయమున అసంతృప్తియు, అశాంతియు కలుగుటవలన వైదిక మత ప్రచారమునకు అనుకూలపరిస్థితి యేర్పడినది. ఇట్టి సదవకాశము నుపయోగించుకొనినవారు నన్నయ, రాజనరేంద్రులు. వైదిక మతస్థులగు చోళులతో రాజనరేంద్రునకు గల సన్నిహిత సంబంధము గూడ దీనికి దోహదమొనర్చి యుండవచ్చును. ఆనాటికే తమిళదేశమున శైవ మత ప్రచారము ప్రజల భాషలో జరుగుచుండుటయే కాక ప్రజాదరణమునకును పాత్రమైనది. అంతియకాక పెరిందేవవారు తమిళ భారతముకూడ ఆనాటికి రచితమై



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



యున్నది. అట్లే కన్నడమునను భారత రచన గావింప బడినది. కనుక వైదిక మతౌత్కృష్ట్యమును సామాన్య ప్రజానీకమునకు సన్నిహితము చేయదలంచిన రాజరాజు తన ఆస్థాన పండిత పరిషత్తు సాహాయ్యమున ఆర్ష విజ్ఞాన ప్రచారము గావింప నిశ్చయించినాడు. భారత సంహితను గ్రహించుటకు ప్రబలకారణమును గలదు. మత విషయక కల్లోలము కారణముగా వైదికపథనమున కున్ముఖమై యున్న సంఘమును రక్షించుట అతని కర్తవ్యము. కాంతా సమ్మితములగు కావ్య నాటకాదులు ప్రజల మనస్సులలో పెట్టి పరిణామమును కలుగజేయునో యెవరికెరుక ? ఏదో ఒక కథ చెప్పినంతనే మనస్సు మార్చుకొను సంఘము కా దది. అసంఖ్యాకములగు నుదాహరణముల యాధారమున సన్మార్గప్రవర్తనముపై ప్రజల మనస్సులను మరలించుట ముఖ్యము. దీనికి పురాణమే ఉపాదేయము. అట్టివానిలో ప్రధానతమమైన గ్రంథము భారతము. సంస్కృత భారత పఠన మదివరకే దేశమున గలదు. కావున భారత సంహిత తెలుగున నున్నచో తమ ప్రయోజనము నెరవేరునను ఉద్దేశముతో తదాంధ్రీకరణమునకు నన్నయను ప్రోత్సహించినాడు రాజరాజు. ఇతివృత్తము తన వంశీయులదని రాజరాజు భావించియు నుండవచ్చును. ఏమైన నేమి, ఆంధ్రుల పుణ్యము పండి భారతము తెలుగున ప్రవేశించినది. దేశీయ చ్ఛందస్సును, మార్గచ్ఛందస్సునుకూడ చేపట్టి నన్నయ గ్రంథ రచనకు గడంగినాడు. వివిధభాషా పండితుడయిన నారాయణభట్టు ఇతనికి సహాయుడై భాషా విషయమునం దితనిని పండిత పరిషత్తులో సమర్థించియుండ వచ్చును. కావుననే నారాయణుని నన్నయ ప్రశంసించుట. తా నిదివరలో రచించిన నందంపూడి శాసనములో నన్నయ 'ఆంధ్ర' శబ్దమునే వాడియున్నను, భారతమున నతడు 'తెలుగు' అనుశబ్దము నాదరించి యుండుట గమనింప దగినది. కృత్యాదిని మాత్రము సంస్కృత శ్లోకము నుంచినాడు.

జయనామకమగు వ్యాసకృతభారతము 8,800 ల శ్లోకములతో గాథారూపమున నుండినది. ఈ తొలి యాకృతి కాలక్రమమున మారుచు, ప్రక్షిప్తములతో జేరి లక్షశ్లోక విస్తృతమైనది. దీనిని వ్యాస శిష్యపరంపర లోకమున ప్రచారము గావించినది. నన్నయ ఆంధ్రీకరించినది సౌతి భారతము. కుంభఘోణ ప్రతితో చాలవరకు నన్నయ భారతము సరిపోవుచున్నది. నన్నయది కావ్యదృష్టి. కనుక అతడు గావించినది స్వేచ్ఛానువాదము. కొన్ని ఘట్టములను వదలియు, కొన్నిటిని పెంచియు కావ్యరచన కనుకూలించు నట్లుగా ఇతివృత్తమును నన్నయ మార్చి యున్నాడు. అమ్మహాకావ్యంబు సర్గంబు నంగతంబు చేయుటయే ఇతని ఆశయము. ఇతని వలెనే తిక్కనయు భారతమును 'తెనుంగు బాస వినిర్మింప బూనుకొన్నాడు'. తక్కినకాలితియు కొంత దోవ ఎట్టిన గ్రంథరచన గావించినాడు. కావున భారతము అనూదిత గ్రంథమైనను ఏ స్వతంత్ర గ్రంథమునకును లేని గౌరవమున కర్హమైనది.

నన్నయ రాజనరేంద్రుని కులబ్రాహ్మణుడు, విపుల శబ్దశాసనుడు, ఉభయ భాషా కావ్యరచనాభి శోభితుడు, సత్రపతిభాభియోగ్యుడు, లోకజ్ఞుడు అగుట వలన ఇతని రచన ఉత్తమ కవిత కాదర్శమై వెలసినది. ధారాశుద్ధి ఇతని కవితయందలి ప్రధాన లక్షణము. బాల్యమాదిగ వేదమంత్ర పఠన కలవడినవా డగుట నందలి నాదసౌందర్య మితని కవితతో ప్రతిఫలించినది. గాంభీర్య మితని రచనకు జీవము. ఆ యారాజుల కథలను వివరించు భారత భాగమును మాత్రమే యిత డాంధ్రీకరించి యున్నాడు.

కావున నన్నయ భారతములో నెక్కువగ ఆఖ్యాయిక శైలి నెలకొన్నది. కొంత వర్ణనాత్మక శైలియు, నక్కుత్తుగా నాటకీయ శైలియుకూడ కాన నగును. వర్ణన లొనర్చుటలో సంయమన మితని లక్షణము. సంయమనము లేని శ్రీనాథాది కవుల వర్ణన లెట్లు ఔచితీభంగ హేతువులైనవియు గమనింప వచ్చును. సీస పద్య, గీతపద్యముల రచనలో నీకవి యతులనో లేక ప్రాసయతులనో మాత్రమే వేరు వేరుగా ప్రయోగించినాడు. శబ్దాలంకారముల కన్నను అర్థాలంకారముల పైననే ఇతని కాదరము. భాషా విషయమున సంస్కృతము నెక్కువగా వాడియున్నను ఇతని రచనలో అర్థకాఠిన్యముగాని, అన్వయకాఠిన్యముగాని కానము. కావుననే కథాకలితార్థయుక్తియందే కాక, అక్షర రమ్యతయందును తనది అందె వేసిన చేయియని అనిపించు కొన్నాడు నన్నయ. మూలము సంస్కృత గ్రంథ మగుటయు, పండితుల ప్రీతికై సంస్కృతమునకు ప్రాధాన్య మియ్యవలసి యుండుటయు కారణములుగ కాబోలు, తెలుగు పలుకుబడికి దూరములగు సంస్కృత భాషా సంప్రదాయము లితని రచనలో ప్రవేశించినవి. కర్మణి ప్రయోగము, బహువ్రీహి సమాసముల రచన మున్నగునవి యిందుల కుదాహరణములు.

1. చాముండి కావిలాసము, 2. ఆంధ్ర శబ్దచింతామణి, 3. ఇంద్రవిజయము, 4. లక్షణసారము అను నన్నయ కృతు లనబడు నితరగ్రంథములు లక్షణ గ్రంథములందు పేర్కొన బడియున్నవి.

నందవరీక బ్రాహ్మణులయు, దేవాంగులయు కథల నభివర్ణించు మూడాశ్వాసముల క్షుద్రకావ్యము చాముండికా



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



విలాసము. ఇట్టి వర్ణవిభేదములు నన్నయకాలమునందు లేవు. మైసూరు ప్రభువుల ఇష్టదైవమగు చాముండేశ్వరి సాళెల కులదైవము. ఈ యారాధన శాక్తేయము. కనుక ఈ రచనము నన్నయ కాపాదించుట తగదు. సీసపద్యముల రచనలో యతిసాంకర్య ముండుటయు, వస్తువు క్షుద్రమగుటయు ఈ రచన నన్నయది కా దనుటకు ప్రబల కారణములు.

రెండవది కర్తృత్వ విషయమున వివాదగ్రస్తమైన ఆంధ్ర శబ్దచింతామణి. బాలసరస్వతి (క్రి. శ. 1575 - క్రి. శ. 1625) చింతామణికి టీక వ్రాయువరకును ఈ గ్రంథము లోకమునకు తెలియదు. తెనుగునకు లక్షణమును వ్రాసిన కేతన తనకు పూర్వము తెలుగునకు లక్షణము నెవ్వరును చెప్పలేదని తెలిపి యున్నాడు. క్రి. శ. 1700 ల ప్రాంతమున అహోబల పండితు డీ చింతామణికి వ్యాఖ్యాన మొనర్చెను. బాలసరస్వతీయమున 88 ఆర్య లుండుటయు, వానిలో ఆరు లోపించి, అప్పకవీయమున 82 మాత్రమే యుండుటయు, బాలసరస్వతీయమునే తా నుపయోగించితి నని అప్పకవి చెప్పియుండుటయు కారణములుగ గ్రంథ స్వరూప విషయమున సందేహములు కలుగుచున్నవి. ఈ వ్యాకరణమునకు విరుద్ధములగు ప్రయోగములు నన్నయ భారతములో నుండుటవలన నావిషయమును పురస్కరించుకొని చిలుకూరి నారాయణరావుగారు ఆంధ్రశబ్ద చింతామణి నన్నయకృతము కా దనియు, నన్నయకు చాల తరువాతి దనియు సిద్ధాంతము గావించినారు.

ఇంద్రవిజయ గ్రంథ మలభ్యము. ఆనంద రంగరాట్ఛందమున నుదాహృతములైనవి రెండు పద్యములు మాత్రమే. అవియు దోషదుష్టములు. కనుక నిదియు నన్నయది కానేరదు.

లక్షణసారము : తంజావూరు గ్రంథాలయమున పేరును మూరును లేని లక్షణసార మొకటి గలదు. ఇది నన్నయ దనుట కాధారము లేదు. ఆనంద రంగరాట్ఛందమున, నన్నయ లక్షణసారములోని వని కొన్ని పద్యము లుదాహృతములై యున్నవి. కాని ఈ యుదాహృత పద్యములలో మొదటిది కవివాగ్బంధములోనిదని తెలియ వచ్చినది. కావున నిదియు నన్నయ కృతము కాదు. నందంపూడి శాసనము తప్ప భారతేతరమగు నన్నయ రచన యేదియు లభింపలేదు.

నన్నయ సమకాలికులు : అథర్వణుడు నన్నయకు సమకాలికుడని ప్రతీతి. ఇతడు తన త్రిలిఙ్గ శబ్దానుశాసనమున హేమచంద్రుని పేర్కొనియున్నాడు. పండ్రెండవ శతాబ్దిలో నుండిన ప్రాకృతభాషా లాక్షణికుడు హేమచంద్రుడు. కావున, అథర్వణుడు 12 వ శతాబ్దికి తర్వాతవా డగుచున్నాడు. మరియు పదుమూడవ శతాబ్ది మధ్యకాలమున నుండిన కేతన అథర్వణుని పేర్కొనలేదు; కనుక నితడు కేతనకును తరువాతివాడు కావచ్చును. భారతము, ఛందస్సు ఇతని కృతులని అప్పకవీయమును బట్టి తెలియుచున్నది. కాని త్రిలిఙ్గ శబ్దానుశాసనము, కారికావళి యనెడి వికృతి వివేకము అను రెండు వ్యాకరణ గ్రంథములు మాత్రమే మనకు లభ్యములు. త్రిలిఙ్గ శబ్దానుశాసనము అథర్వణుని కృతియే యని కందుకూరి వీరేశలింగముగారి యభిప్రాయము. వికృతి వివేకముమాత్ర మితనిది కా దనియు, అహోబలునిదే యనియు వారి యూహ. ఈ రెండును అథర్వణ కృతములు కావని ప్రభాకరశాస్త్రి గారును, కవితరంగిణీ కారులును చెప్పియున్నారు. గ్రంథ కర్తృత్వ విషయ మెట్లున్నను, అథర్వణుడు నన్నయకు సమకాలికుడు కా డనుట నిక్కము.

నన్నయ భారతాంధ్రీకరణ మారంభమైన తరువాత దేశమున తెనుగుపై గౌరవ మేర్పడినది. క్రమక్రమముగా వాఙ్మయ వికాసము జరిగినది. భారతేతివృత్త ప్రభావముననే కాబోలు వెనువెంటనే కొన్ని నీతిశాస్త్రగ్రంథములు రచితములైనట్లు తెలియుచున్నది. నీతి భూషణము, ముద్రామాత్యము మున్నగునవి యిట్టివని తరువాత వచ్చిన యితర గ్రంథములలో నుదాహృతములైనవి.

మనకు లభించిన యీ యుగపు గ్రంథములలో గణిత శాస్త్ర మొకటి. వీరాచార్యుడు సంస్కృతమున రచించిన గణితమును పావులూరి మల్లన తెనిగించినాడు. నందంపూడి శాసనమున గ్రామదాన గ్రహీతగా పేర్కొనబడిన మల్లనకు ఈ మల్లన మనుమడు. శాస్త్రగ్రంథములను గూడ ఛందోబద్ధము చేయుట భారతీయుల సంప్రదాయము. మల్లనయును ఆ సంప్రదాయమును పాటించినాడు. నన్నయ వలెనే ఇతడును గ్రంథమును సంస్కృతశ్లోకముతో నారంభించినాడు. విషయము శాస్త్రసంబంధియైనను శైలి సుబోధకమై యున్నది.

గ్రంథము లేవియు మనకు లభ్యములు కాకున్నను ప్రసిద్ధకవిగా పేరు వడసిన వేములవాడ భీమకవి ఈ కాలపువా డనియు, ఇతడు శాపానుగ్రహసమర్థు డనియు ప్రతీతి. జ్యోతిషము, రాఘవపాండవీయము, నృసింహపురాణము, శతకంధర రామాయణము, బసవపురాణము, సుమతి శతకము, కవిజనాశ్రయము, హరవిలాసము మున్నగు ననేక గ్రంథముల కితడు కర్తయని లోకమున వాడుక. కవిజనాశ్రయము తప్ప ఇతర గ్రంథము లేవియు కానరావు. కవిజనాశ్రయ కర్తృక విషయమునను అభిప్రాయ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



భేదము లేకపోలేరు. కన్నడ బసవపురాణకర్త యగు భీమన యొకడు కలడు. పాలకురికి సోమన బసవపురాణమునకు ఈ గ్రంథము కన్నడానువాదము. ఇది పదునాల్గవ శతాబ్దమునాటి రచనయని కన్నడిగుల నిర్ణయము. అట్లగుట వలన ఈ కన్నడ కవియు, వేములవాడ భీమనయు ఒక్కరు కారు. ఇట్లు కాలము విషయమునను, గ్రంథకర్తృత్వ విషయమునను ఇదమిత్థ మని నిష్కర్షగా నిర్ణయింప వీలులేని వ్యక్తి వేములవాడ భీమన. శ్రీనాథుడీ కవిని పేర్కొని యుండుటచే ఇతడు నన్నయకును, శ్రీనాథునకును మధ్యకాలపువాడై యుండవచ్చును. ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు ప్రకటించిన కవిజనాశ్రయమున గ్రంథాంత గద్యలో కవి కులగోత్రాదిక సూచన లేదు. ఇది భీమన కృతము కాదనియే విమర్శకుల నిర్ణయము. అప్పకవియు, తత్పూర్వులగు నితర లాక్షణికులును యతిప్రాస నియమముల నేర్పరచు విషయమున ఈ గ్రంథ మాధారమైనది.

ఇట్లు నన్నయ తరువాత సుమారు రెండు వందల సంవత్సరముల వరకును కొన్ని చిల్లర కృతులును, శాస్త్ర గ్రంథములును తెలుగున వెలసినవే కాని భారతము పూర్తి కాలేదు. భారతారణ్య పర్వరచన మధ్యభాగముననే నిలిచిపోయినది. దానికి గల కారణముల నరయుదము.

రాజరాజ నరేంద్రుని కుమారుడగు రాజేంద్రచోళుడు కులోత్తుంగ చోళుడను బిరుదనామముతో క్రి. శ. 1070 లో వేంగీ చాళుక్య, చోళరాజ్యముల కధిపతియై రాజధానిని తమిళ దేశమునకు మార్చుకొనెను. నాటినుండియు ఆంధ్రదేశము రాజప్రతినిధులచే పాలింపబడుచు వచ్చినది. అందువలన ఆంధ్రదేశమునకు రాజకీయ ప్రాముఖ్యము పోవుటయు, సామంతస్థితి యేర్పడుటయు జరిగినది. రాజప్రతినిధులైన రాజకుమారుల నాశ్రయించుకొన్న ద్రావిడ బ్రాహ్మణులును, వేగిదేశమందలి ఉన్నతోద్యోగులును అగ్రహారములు, అమాత్యపదవులు మున్నగు వానిని పొందుటతో ఆంధ్రదేశమున తమిళ ప్రాబల్యము నెలకొన్నది. కనుక రాజనరేంద్రునకు పిమ్మట ఆంధ్రసారస్వత పోషణ అడుగంటినది. కులోత్తుంగుని ప్రతినిధిగా వేగిని పాలించిన విక్రమచోళుడు వేగిపై అశ్రద్ధ చూపుటచే నా ప్రాంతము పశ్చిమ చాళుక్యుల వశ[illegible]ను. వెలనాటిచోళు లంతదనుకను పశ్చిమ చాళుక్య[illegible] ప్రతినిధులై యుండినవారు. ఈ పశ్చిమ చాళుక్యులు కన్నడిగులగుటచే వీరికాలమున గూడ తెలుగు సారస్వతాభివృద్ధికి అవకాశము లేకపోయినది. తెలుగు సారస్వతమునకు రాజాదరణ లేకపోవుట యటుండ అర్థవిజ్ఞాన వ్యాప్తికే భంగకరమగు సాంఘిక పరిస్థితి మరల తటస్థించినది.

భూలోక మల్లునితో పశ్చిమ చాళుక్య ప్రభావ మంతరించినది. ఆంధ్రదేశమునకు చోళరాజ్య సంబంధ బాంధవ్యములు తెగుటతో ఆంధ్రదేశమందలి వివిధ మండలములకును అధిపతులుగ నుండిన పాలకులు స్వతంత్రులైరి. దేశము మరల రాజకీయ కల్లోలమునకు లోనైనది. ఈ మండలాధిపతులలో శైవ, వైష్ణవ వైషమ్యములు పెరిగి దేశమున మరల మతవిషయక సంక్షోభము జనించినది. సుమారు పదకొండవ శతాబ్దపు కడపటి భాగమునుండియు పండ్రెండవ శతాబ్దాంతము వరకును ఇట్టి స్థితియే ప్రబలియున్న కారణమున సంఘమునం దైక్యము లేకపోయినది. వీరశైవము ఇట్టి సందుననే పొడసూపి శీఘ్రవ్యాప్తి నందినది.

భూలోకమల్లుని మంత్రియగు బిజ్జలుడు క్రీ.శ. 1162 లో చాళుక్యసామ్రాజ్యము నాక్రమించెను. ఇతని మంత్రియే వీరశైవమత ప్రతిపాదకుడగు బసవేశ్వరుడు. వీరశైవ మితని ప్రాపున వృద్ధి చెంది దేశము నుర్రూత లూపినది. ఈ వీరశైవ మతోద్ధతి యెదుట ఇతర మతములు తలయెత్తలేక పోయినవి. ఈ మతప్రభావము సారస్వత రంగముపై నెక్కువగా ప్రసరించి నూతన వాఙ్మయ శాఖా సృష్టికి కారణమైనది. ప్రజలకు వీరశైవముపై నాదరము హెచ్చుకొలది వైదికమతము వెనుకకు తగ్గసాగినది. సంస్కృత భాషకును, సంస్కృత ఛందస్సునకును కూడ నిట్టి గతియే పట్టినది. దేశీయమగు నితివృత్తము, దేశీయమగు ఛందము, దేశీయమగు భాష - ఇవి సాధనములుగా ప్రజలలో తమ మత ప్రబోధము కలిగించుట వీరశైవుల యుద్దేశము. జైనులు, బౌద్ధులు పూర్వ మనుసరించిన మార్గమునే వీరును అనుసరించినారు. వర్ణాశ్రమ భేదరహితము, భక్తి ప్రధానము, ఆవేశపూరితము నగు నీ మతము పొత్తున ఇతర మతములు నిలువజాలక పోయినవి. మానవులలో హెచ్చు తగ్గులు లేవని ప్రచారముచేయు వీరశైవులు శైవేతరులను హింసించుటకును వెనుదీయలేదు. క్రమక్రముగా ఈ మతావేశము తగ్గి, అన్ని మతములకును ధ్యేయ మొక్కటియే యను భావము ప్రజలలో పొడము వరకును ఆర్య సారస్వతమునకు పట్టు దొరకలేదు. మహోత్కృష్టమగు భారతాంధ్రీకరణోద్యమమును నయితము జరుగనీయక అణచియుంచిన యీ వీరశైవ సారస్వత మెట్టిదో పరిశీలింతము

కుమారసంభవ కర్తయగు నన్నెచోడుడు శైవ కవులలో మొదటివాడు. ఇతడు రాజకవి. కాళిదాస కుమారసంభవమున లేనివియు, దక్షిణదేశమున ప్రచారరూపమున నున్నవియు నగు కథలనుకూడ నితడు తాను రచించిన



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కుమార సంభవములో గ్రంథస్థము చేసియున్నాడు. చాళుక్య నృపులు నిలిపిన ఆంధ్రమునకు తాను దేశీయతా ముద్ర నధికముగ వైచి గ్రంథమును రచింతునని యితడు చెప్పికొన్నాడు. కాని తా నాదరింతునన్న జాను తెనుగు స్వరూప మెట్టిదో ఇతని రచనమబట్టి నిర్ణయింప లేము.

ఇత డందందు ప్రయోగించిన కర్ణాటాద్యన్య భాషా పదములును, కొన్ని ఛందోవ్యాకరణ ప్రయోగములును దప్ప, తక్కిన యితని రచన యంతయు నన్నయ మార్గమునే అనుసరించినది.

ఇతని కుమార సంభవము పండ్రెం డాశ్వాసముల గ్రంథము. ఉద్భటకావ్యమున కది అనువాదమని అతడే పేర్కొని యున్నాడు.

పదునారవ శతాబ్దపు తెలుగు వాఙ్మయమున వెలసిన మను చరిత్రాది కావ్యములనే మనము ప్రబంధనామమున వ్యవహరించు చున్నాము. కాని పరిణామ దృష్టితో చూడగా ఇట్టి కావ్యరచన ముందే ఆరంభమైనదని గోచరించును. తిక్కన విరాట పర్వమునందు అంశామాత్రముగ భాసితమై, ప్రబంధ పరమేశ్వరుని చేతిలో రూపరేఖా సంపన్నమై, శ్రీనాథాదులచే పోషితమై, పెద్దనాదుల కాలమున సర్వాంగ సంపూర్ణమై విలసిల్లిన ప్రబంధ కవితా స్వరూపము నన్నెచోడుని ఈ గ్రంథమున ప్రత్యక్షముగ గోచరించుట ఆశ్చర్యమును కలిగింపక పోదు.

కవితా స్వభావ విషయమున నన్నెచోడుని రచన రజోగుణ ప్రధానమైనదని చెప్పవలెను. రాజసమును, భక్త్యావేశమును సహజకవితాశక్తితోడై కావ్యమును నడపినవి. భావావేగ, భావతీవ్రతలు భాష నెన్నుకొని పద్యరూపమున ప్రవర్తిల్లినవి. దక్షకృతమగు ఈశ్వర స్తుతిని వర్ణించుపట్ల కవి రచించిన లయగ్రాహి, లయహారిణీ వృత్తములాంధ్ర సాహిత్యమునం దత్యుత్తమ రచనలు. అష్టాదశ వర్ణనలు, అలంకారములు మున్నగువానితోగూడి యున్న ఈ కావ్యచ్ఛాయలు తరువాతి గ్రంథములలో నధికముగ పోషితములైనవి. ఈ కవి నన్నయకు తరువాతివాడేయని సిద్ధాంతము. కాని కొందరు దీనిని అంగీకరింపరు.

శైవమత వ్యాప్తికి జీవితముల నంకితము చేసినవారిలో శ్రీపతి పండిత, మల్లికార్జున పండిత, మంచెన పండితులు ముఖ్యులు. వీరికి పండిత త్రయమని వ్యవహారము. శ్రీపతి పండితుడు బ్రహ్మసూత్రములకు శివపరముగ భాష్యమును సంస్కృతమున వ్రాసి, తద్రచనకు శ్రీకరభాష్య మని పేరిడెనని చెప్పుదురు. శ్రీకరభాష్యమునకే శివభక్తదీపిక యను పే రున్నదని కొందరును, శివభక్తదీపిక యను గ్రంథమితని తెలుగు కృతియని ఇతరులును చెప్పుదురు. కాని ఈ గ్రంథములు లభింపలేదు.

రెండవవాడగు మల్లికార్జునుడు బసవనకు సమకాలికుడు. వీరశైవ ప్రవక్త యనదగు బసవేశ్వరుని చరిత్రను రచించిన పాల్కురికి సోమన మల్లికార్జున పండితుని చరిత్రనుకూడ రచించినాడు. శైవమును సవైదికముగ సంస్కరించి, శైవమున ఆరాధ్య శాఖాభేదమును నెలకొల్పినవాడు మల్లికార్జున పండితుడు. చందవోలునం దితడు బౌద్ధుల నోడించి స్వమత స్థాపన మొనర్చినట్లు చందవోలు శైలీయతువలన తెలియుచున్నది. బసవగీతలు, ప్రభులింగ స్తోత్రము అను కన్నడ గ్రంథములను, పెక్కులు సంస్కృతాంధ్ర గ్రంథములను ఇతడు రచించినట్లు పండితారాధ్య చరిత్ర పేర్కొనుచున్నది. కాని ఇతనిది శివ తత్త్వసార మనెడు తెలుగుకావ్య మొక్కటియే మనకు లభించినది. పరమత నిరసన మిం దెక్కువగ గలదు. కావుననే దీనికి విశ్వవ్యాప్తి లేకపోయినదేమో? సంస్కృతాంధ్ర శబ్దజాలమును పిడికిట బట్టుకొని యథేచ్ఛగా రచన సాగించిన కవి ఇతడు. తెలుగున శతకరచన నారంభించినవా డితడే అనవచ్చును. కాని శతక లక్షణములు చాలవరకు ఈ కావ్యమున కన్వయించుటలేదు.

ఇక తృతీయుడగు మంచెన పండితుడు కావ్యకర్తగా ప్రసిద్ధికెక్కినవాడు కాడు.

తరువాతి ప్రముఖ వీరశైవకవి పాల్కురికి సోమన. మత ప్రతిపాదకగ్రంథములే యైనను ఇతని రచనలు కవితాంశతో నొప్పుచున్నవి. సంస్కృతాంధ్ర కర్ణాట భాషల మూడింటను ఇతని రచనలు ప్రవర్తిల్లి యుండుటవలన ఇతని కీర్తి కర్ణాటదేశమునను బాగుగ వ్యాపించినది. ఇతని కృతులలో బసవపురాణ, పండితారాధ్య చరిత్రలు ముఖ్యములు.

ద్విపద గ్రంథమగు బసవ పురాణము వీరశైవులకు వేదమువంటిది. వీరశైవమతప్రవక్తయగు బసవన పిన్న వయసుననే పూర్వజన్మ సంస్కార కారణముగా భక్త్యావేశముతో నొప్పి, ఉపనయనాదికమగు వైదిక ప్రవృత్తిని, వర్ణవ్యవస్థను నిరసించి భక్త్యైక ప్రధానము, వర్ణరహితము, సర్వజనసులభ ప్రాప్యము నగు నూతన మతమును ప్రతిపాదించెను. ఇతని మంత్రిపదవియు మత ప్రచారమున కెక్కువగ సహకరించినది. అనేకములగు గేయములను ప్రజల వ్యవహార భాషలో రచించి తద్ద్వారా మత ప్రచారము నితడు గావించినాడు. కాని, ఇతని జీవితకాలములోనే ఇతని మతానుయాయులందు ధర్మదీక్ష నశించుటచే ఈ మతము క్షుద్రరూపమును గైకొన్నది. బసవని ఈ జీవిత



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



విశేషములను, ఇతని శిష్యుల జీవితగాథలను సోమన తన బసవ పురాణమున ఆవేశముతో వర్ణించినాడు. అట్లే అవేల ప్రతిభాన్వితుడుగను, దైవాంశ సంభూతుడుగను శైవులచే పరిగణింపబడిన మల్లికార్జునుని జీవిత చరిత్రగాథలకును సోమన కావ్యరూప మొసంగినాడు. శతకలక్షణ మింతయో అంతయో పట్టు ప్రథమాంధ్రగ్రంథ మితని వృషాధిప శతకము.

భక్తిపూరితమైన వాఙ్మయమున కిది పట్టుగొమ్మ. అష్టభాషా విశారదుడగు సోమన ఆయాభాషలలో బసవననిందు స్తుతించినాడు. ఇందలి రచన అలంకారానుప్రాణితము. సోమనాథుని వేద వేదాంగ పారంగతకు అతని చతుర్వేదసారము ప్రమాణము. చెన్నమల్లు సీసములు, బసవోదాహరణము, బసవరగడలు, అనుభవసారము అనునవి ఇతని యితర కృతులు. ద్విపద రచనలో ప్రాసయతిని వాడినవా డితడు.

సోమన కాలము విషయమున అభిప్రాయభేదము కలదు. క్రీ. శ. 1185 - క్రీ. శ. 1199 ప్రాంతపు కాకతిరుద్రుని (ప్రథమ ప్రతాపరుద్రుడు) కాలమువాడని కొందరును, క్రీ. శ. 1290 - క్రీ. శ. 1326 ప్రాంతపు ద్వితీయ ప్రతాపరుద్రుని కాలమువాడని మరికొందరును వాదింతురు. ఇతడు ప్రథమ ప్రతాపరుద్రునికి సమకాలికుడని క్రీ. శ. 1222 ప్రాంతపు వాడగు పిడుపర్తి సోమన తన పద్య బసవ పురాణములో నుడివియున్నాడు. సోమన వర్ణనలో 'వృషభస్తవమును నెఱపిన' అను విశేషణ మిందు గలదు. కర్ణాటాంధ్ర భాషలలో వృషభస్తవమును నెరపినవాడు పాల్కురికి సోమనాథు డొక్కడే. కనుక పాల్కురికి సోమన ప్రథమ ప్రతాపరుద్రునకు సమకాలికు డగును. మరియు, బసవ పురాణమున వర్ణితమైన కల్యాణ కటక విచ్ఛిత్తి క్రీ. శ. 1188 లో జరిగినట్లు నిశ్చయించుట కాధారము లాగ్రంథముననే కలవు. అగుచో, తద్రచయితయగు సోమన పదుమూడవ శతాబ్దాంతమం దుండిన ద్వితీయ ప్రతాపరుద్రునకు సమకాలికుడు కాజాలడు. ద్వితీయ ప్రతాపరుద్రుని కాలమును నమ్మెడువారు పేర్కొనెడి దోకిపర్రు అగ్రహార దాన విషయము సరియగు నాధారము కాదు. ముమ్మడమ్మ భర్త పేరుగలవాడు ఈ వంశపూర్వులలో నుండియుండ వచ్చును. ఈ చారిత్రికాధారముల కంటెను ముఖ్యముగ గమనింపదగిన సాంఘిక విషయమొకటి కలదు. బసవపురాణ, పండితారాధ్య చరిత్రలలో కానవగు నంతటి వీరశైవ మతావేశము తిక్కనకు తర్వాత నుండ వీలులేదు. వీరశైవపు టుద్ధృతము తిక్కన్న నాటికే చాలవరకు చల్లబడినది. భవిదర్శన స్పర్శనాలాప దూరగులగు శైవులుగాని, బ్రాహ్మణ దూషణ శైవేతర హింసలుగాని తిక్కననాడు లేవు. తిక్కన ప్రతిపాదించిన హరిహరోపాసనమును, అద్వైతమత సిద్ధాంతమును దేశమున నల్లుకొని మతవిషయమున శాంతిని నెలకొల్పినవి. తిక్కన తరువాత వెలసిన శైవ గ్రంథములలో నెచ్చటను ఆవేశమే మాత్రమును గానవచ్చుట లేదు. మరియు భాషా విషయమున సోమనాథు డవలంబించిన దేశిమార్గమును తిక్కన అంగీకరించి, దేశీయతకు ప్రాధాన్య మిచ్చియుండుట ముఖ్యముగ గమనింపదగినది. కావున పాల్కురికి సోమన తిక్కనకు పూర్వుడే కాని అర్వాచీను డెన్నటికిని కాజాలడు.

ఆ కాలమున సోమనయంతటి పండితుడు, ప్రతిభావంతుడు లేడనుట కతని గ్రంథములు ప్రబల సాక్ష్యములు. సారస్వత విషయమునం దీతడు ప్రత్యేక స్వాతంత్ర్యము కలవాడు. శిష్టవ్యావహారిక భాషను, లోకమున నున్న శక్తిమంతములగు .పలుకుబళ్లను యథేచ్ఛగా వాడి తన రచనకు చైతన్యమును గూర్చుకొన్నాడు. భాషాస్వరూప, పరిణామములు తెలియక పోవుటయే ఇతనిని అలాక్షణికుడని విమర్శించుటకు హేతువు. జానుతెనుగు నవలంబింతునని ఇతడు చెప్పియున్నను ఇతని కావ్యములలో సమాసభూయిష్ఠమగు సంస్కృత రచనయు నధికముగనే యున్నది. శివతత్త్వమును మాత్రమే ప్రతిపాదించుట వలన ఇతనికి రావలసినంత ఖ్యాతి రాలేదు. ఇతని కావ్యములందలి యితివృత్తము సాధారణ మానవజీవితమునకు సన్నిహితమైనది కాదు. కావుననే ఈ రచనలకు విశ్వవ్యాప్తి లేదు. ఇతని కావ్య మార్గముననే సర్వజనాదరణ పాత్రమగునట్లు రచితమైన రంగనాథ రామాయణ ప్రాబల్యమువలన కూడ సోమనాథుని రచనలకు వ్యాప్తి తగ్గిన దనవచ్చును.

మొదట వైష్ణవు డయ్యును, అభిమానముతో శైవమును స్వీకరించినవాడు చక్రపాణి రంగన యనుకవి. ఇతడు శ్రీశైల మార్గమున బోవుచు, మల్లికార్జునుని దర్శింపక పోవుట వలన అంధు డయ్యెననియు, పిమ్మట మల్లికార్జున స్వామి ప్రసాదము వలనను, పాలకురికి సోమన దయవల్లను కన్నులను మరల బొందెననియు ప్రతీతి. శ్రీశైలస్వామి యెదుట ఇతడు చెప్పిన దనబడు నయన రగడలో ఈ విషయమున కాధారము లేదు. ఈ రగడ అముద్రితము. ఇతని పేర శివభక్తిదీపికయను నొక అముద్రిత గ్రంథ మున్నది. సోమనాథుని నిర్యాణముతో ప్రజలకు వీరశైవముపై నున్న మక్కువయు, ప్రత్యయమును తక్కువ కాజొచ్చినవి. మతావేశపు పొంగు చల్లబడినది. సోమనాథుని గ్రంథ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



రచనా విధానము మాత్రము తరువాతి కవుల కాదర్శమైనది. రంగనాథ రామాయణ రచనకు సోమన రచనా విధానమే ప్రాతిపదిక.

వైష్ణవమును ప్రచారము చేయదలచిన బుద్ధారెడ్డి మున్నగువారు సోమనాథుడు చూపిన మార్గమున నడచి కృతకృత్యులైనారు. మహోత్కృష్ట కావ్యమైన రామాయణము కొలది మార్పులతో ద్విపద రూపమున తెలుగున రచితమైనది. వైదికమత మెట్లు శైవమును సవైదికముగ సంస్కరించి సమన్వయించు కొన్నదో అట్లే దేశికవితా పద్ధతిని గూడ మార్గకవితా సంప్రదాయము తనతో నైక్యము చేసికొన్నది. తత్ఫలమే రంగనాథరామాయణము. దీని కర్తృత్వము వివాదగ్రస్తమైనది. పేరును బట్టి దీనిని రంగనాథుడను కవి యెవ్వడో రచించినాడను నభిప్రాయము కలదు. బుద్ధారెడ్డి బ్రాహ్మణేతరు డగుట ఇట్టి యపప్రచారమునకు కారణమని కట్టమంచి రామలింగారెడ్డిగారు. కృత్యాదిని గోనబుద్ధ భూపతి పేరున్నది. ప్రబలములగు నితర సాక్ష్యములు లేనప్పుడు గ్రంథస్థమగు ఈసాక్ష్యమును బట్టి గ్రంథకర్త బుద్ధారెడ్డియేయని నిర్ణయింప వలసియున్నది.

రామునకు వాల్మీకి మానవత్వము నాపాదింప బుద్ధరా రా జితనికి దివ్యత్వము నాపాదించినాడు. మానవ మాత్రుడగు బసవనను పూజింప నిష్టములేని ప్రజలు అదివరకే దైవముగా పరిగణింప బడుచున్న రాముని కథను శిరసావహించుటలో ఆశ్చర్యము లేదు. బుద్ధారెడ్డి సోమనకు సమకాలికుడైనను భాషా విషయమునం దతని ననుసరింపక, నన్నయనే యెక్కువగా అనుగమించినాడు. తండ్రి కోరికపై నితని కుమారులు కాచవిభుడును, విఠలరాజును ఈ రామాయణ రచనను పూర్తిగావించిరి. ఈ కావ్యమునకు పశ్చిమాంధ్ర దేశమునం దెక్కువ ప్రచారము. కావ్య మంతయు ద్విపదలో నుండుటచే గానయోగ్యమై యున్నది. అనువాదము తెలుగు కవుల మార్గము ననుసరించి స్వతంత్ర విధమున నడచినది. జంబుమాలి కథ, సులోచనా వృత్తాంతము, కాలనేమి కథ మున్నగునవి అవాల్మీకములు. లోకమున నెక్కువ ప్రచారములో నున్న మంచి కథలును గ్రంథమున చేరినవి. వాల్మీకి రచనలో రాముని దివ్యత్వము వ్యంగ్యమైయుండ, ఈ కావ్యమున నది ప్రస్ఫుటమై యున్నది. రచన ద్రాక్షాపాకమున బడినది. ఉత్తరభాగ మముద్రితము.

ఇట్లు రంగనాథుని కాలమున మరల వైదికమత సంబంధులగు గ్రంథములపై నాదరము కలుగజొచ్చినది. నన్నయతో ఆగిపోయిన భారత రచన కొనసాగుటకు తగిన పరిస్థితులును దేశమున నేర్పడినవి. కాకతీయ సామ్రాజ్యస్థాపన అట్టి అనుకూల పరిస్థితులలో ముఖ్యమైనది. ఆంధ్రదేశము నంతటిని నొక చేతిక్రిందికి తేవలెనని కాకతి గణపతి దేవుడు ప్రయత్నించినట్లు కన్పడుచున్నది. తిక్కనయు నిందుకు సహకరించినవాడే. కాకతీయులు బలపడినందున చిన్న చిన్న మాండలిక ప్రభువుల మూలమున కలుగు చుండిన కల్లోలములు నశించి దేశము ప్రశాంతమైనది. సారస్వత సృష్టికి, విద్యావిస్తృతికి తగిన అవకాశమేర్పడినది. ఈ యవకాశమును పురస్కరించుకొని భారతస్థమగు నార్ష విజ్ఞానమును దేశమున వ్యాపింప జేసినవాడు తిక్కన. ఇంతకు పూర్వమే ఇత డుత్తర రామాయణమును నిర్వచన కావ్యముగా రచించి, తనకు గల ప్రతిభావ్యుత్పత్తులను ప్రదర్శించినాడు. నిర్వచనోత్తర రామాయణమున తాను 'శైవుడ'నని చెప్పికొనిన తిక్కన భారత రచనా కాలము నాటికి శివకేశవుల కభేదమును దెల్పుచు హరిహరమూర్తిని దర్శించినాడు. అందులకు ప్రబల కారణమును గలదు. ఆనాటికి శైవ, వైష్ణవములు రెండును దేశమున వ్యాపించియుండినవి. తిక్కనకు పూర్వము రాయవిభాగము పేర జరిగిన పలనాటి యుద్ధమునకు మతభేదములు ప్రధాన కారణములు. పలనాటి యుద్ధము ఆ కాలపు సాంఘిక స్థితికి వ్యాఖ్యానము. కాకతీయ గణపతి యాస్థానమున గల జైనులను తిక్కన వాదమునం దోడించి, వైదికమతమును నెలకొల్పెనని సోమదేవ రాజీయకథను బట్టి వ్యక్త మగుచున్నది. ఆ కాలమున నిజాము రాష్ట్రమునందును జైనము వ్యాపించి యుండినది. ఇట్లు జైన, శైవ, వైష్ణవములు దేశమున వ్యాపించి అలజడి కలిగించుచుండుటకూడ తిక్కన ప్రయత్నమునకు ప్రధానకారణము కావచ్చును.

భారత రచనా కాలము నాటికి తిక్కన మనస్సు పరిణతి చెందినది. తా నొనర్చునది వాఙ్మయయాగ యజ్ఞమనియు, ఆంధ్రావళి మోదముం బొరయుట ఆ యజ్ఞఫలమనియు అతని నిశ్చయము. సాత్యవతేయ సంస్మృతి శ్రీవిభవాస్పదమైన చిత్తముతో లోకకళ్యాణమును ధ్యేయముగా నిడికొని భారత రచనకు గడంగినవాడు తిక్కన. కావ్యరచనా పరముగను, భాషా పరముగను తిక్కన తన నిర్వచనోత్తర రామాయణమున దెలిపిన అభిప్రాయములు గమనింప దగినవి. పొందు చెడని శబ్దప్రయోగ వైఖరి, ప్రాతబడ్డ మాటలను వాడకుండుట, అర్థస్ఫూర్తికి ప్రాధాన్యమొసంగుట, యతి ప్రాసలను గూర్చుటలో నైతము వ్యర్థ పదముల నంటకుండుట, గంధవహుడు పుష్పసౌరభము వెదచల్లునట్లు కావ్యమున రసావిష్కరణము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



గావించుట, ప్రజామోదమునకై కావ్యరచన — అను నివి తిక్కన నిర్దేశించిన కావ్య లక్షణములు. ఈ గుణము లన్నియు ఇతని రచనలలో సమగ్రముగ నిర్వహింపబడినవి. అందును ముఖ్యముగ భారతమున కవితాకళ పరాకాష్ఠ దశ నందినది. అందున కితని మనస్తత్త్వ పరిణామముకూడ హేతువు. 'అమలోదాత్త మనీష నే నుభయకావ్యప్రౌఢి మెప్పించు శిల్పమునన్ పారగుడ' నని నిర్వచనోత్తర రామాయణమున చెప్పికొనిన తిక్కన భారతాదిని 'నా నేర్చిన భంగి చెప్పి వరణీయుడ నయ్యెద భక్తకోటికిన్' అని వినయ భరమున భగవదున్ముఖమగు మనస్సుతో బలికినాడు.

అనువాద విషయమున నన్నయ, తిక్కన లెదుర్కొన వలసిన పరిస్థితులు భిన్నములు. నన్నయ భాగము కేవల కథామయము. పురాణమగు భారతమున వ్యాసు డీ కథలను అత్యంత గంభీరములుగ సంతరించినాడు. ఇది చెడగొట్టకుండ కథలను చెప్పి నన్నయ తన ప్రసన్న కథా కలితార్థ యుక్తికి మెప్పువడసినాడు. పాండవుల జీవిత కథా వృత్తము నారంభించిన నన్నయ వారి నరణ్యములో వదలి పరమపదించినాడు. తరువాతి భాగము జీవితమునకు సమగ్ర ప్రతిబింబము. ఆజీవితపు టొడుదుడుకులలో నుండి గట్టున బడు మార్గము మనకు జూపుటకై వ్యాసుడు పడిన శ్రమ యంతయు ఆంధ్రీకరణమున ప్రస్ఫుటముగ ప్రతిఫలించినది. సంఘము అవ్యవస్థకు లోనై చెడిపోవుచున్న కాలములో, అట్టి పరిస్థితులయందే యుండిన గ్రంథస్థ సంఘమును జూచి, అందలి ధర్మపక్షపాతు లాచరించు మార్గము ననుసరించుచో సత్స్థితి కలుగునని ప్రజలకు బోధించుటయే భారత పరమోద్దేశము. ఇందు నీతి బోధక ములగు విషయములను వివరించుట తప్పనిసరి. కాని, వేదాంత విషయమేమైనను, కవి స్వయముగా చెప్పుచో సామాన్య ప్రజానీకము దాని నాదరింపదు. ధర్మాధర్మ ములకు గలుగు సంగ్రామమును గూడ విపులముగ వర్ణించి ధర్మమే జయించునని చూపుట కవి కర్తవ్యము. ఇట్టి మార్గ మవలంబించిననే కాని సర్వవ్యాప్తమై యున్న అజ్ఞాన తమస్సు విరిసి పోదు. ఈ భారము తిక్కనపై బడినది. దీనికి నన్నయ కథాకథనాత్మక శైలి పనికిరాదు. వర్ణ నాత్మక శైలియు నంతగా ప్రయోజనకారి గాదు. కావున తిక్కనకు నాటకీయ శైలి ఉపాదేయమైనది. జీవిత సహజ ములగు సన్నివేశములను గల్పించి, ఆ యాపాత్రల సంభాషణ ప్రవర్తనల యాధారమున వారి మనస్తత్త్వ పరిణామమును, చిత్తప్రవృత్తిని ప్రదర్శించుచు రసపోషణ గావించుట నాటకీయ విధానము. రసానుభూతి మూల మున చిత్త సంస్కారమును గలిగించుట కిదియే యుత్తమ మార్గము. భారత కథాకథనమున తిక్కన యవలంబించిన విశిష్ట విధాన మిదియే.

తిక్కన కావ్యశైలి దేశ్యపద భూయిష్ఠము; అర్థ ప్రధానము; గంభీరము. తెలుగు భాషయందున్న జీవ మంతయు తిక్కన రచనలో భాసించుచున్నది. అర్థస్ఫూర్తి అర్థనిష్కర్ష, మితభాషిత, సమత యనునవి తిక్కన శైలి యందలి ప్రధానగుణములు. భాషా విషయమున తిక్కన చేసిన సేవ మరువరానిది. ఆనాడు శిష్టవ్యవహారమున నున్న దేశ్యశబ్దజాలము నంతను సంస్కరించి, కావ్యభాషను, విస్తృతము గావించిన మహనీయు డితడు. ఒకవైపున దేశికవితా పద్ధతిలో గూడిన శివకవుల సాహిత్య విప్లవ మును నుండినది. తిక్కన ఆ దేశ్య శబ్దజాలమును స్వీకరించి, శైవోద్యమ తీవ్రతను అంతరింప జేసినాడు. మత విషయమునం దెట్లో అట్లే సారస్వత విషయ మునను మార్గ, దేశి పద్ధతులను తిక్కన సమన్వయింప ప్రయత్నించినట్లు తోచుచున్నది. ఇట్లు నాటకీయ రచనా విధానమును, జాతీయమగు భాషను అవలంబించి భారత మందలి పదునేను పర్వములను రసవంతముగ, ఔచిత్య మును పాటించుచు నిర్మించినవాడు తిక్కన. భారతేతి వృత్త పరిణామము ననుసరించి ఇతని రచనయు క్రమ పరిణామమునకు లోనైనది. లౌకిక విషయ ప్రధాన ములగు విరాటోద్యోగ యుద్ధపంచక స్త్రీ మౌసల పర్వ ములలో నితని రచన వ్యంగ్యార్థస్ఫూర్తితో నొప్పుచు, రసవంతమై సర్వజన హృదయంగమమై యున్నది. శాం త్యానుశాసనిక పర్వముల రచన అర్థైక ప్రధానమై, అలంకారాది లౌకిక కావ్య లక్షణ దూరమై, ధీవిశేష విలసితమై, వేదాంతవిషయ ప్రతిపాదన కెంతయు తగి యున్నది. ఆశ్రమవాస మహాప్రస్థాన స్వర్గారోహణ పర్వ ములను పరిశీలించుచో తిక్కన శైలి యెట్లు ఇతివృత్తము ననుసరించి ఉదాత్తముగ, ఇతివృత్తోచితముగ ప్రవర్తిల్లి నదో గమనింపగలము.

ఆంధ్రీకరణము నన్నయ యేర్పరచిన స్వతంత్ర మార్గ ముననే నడచినది. కనుకనే మూలమున నున్న గీతను ఆమూలాగ్రముగ ననువదింపక, తత్సారము నంతను సమయానుకూలముగ, కథాభాగమున నందందు వెదచల్లి ప్రజల నందించినాడు తిక్కన. గీతవంటిదే సనత్సుజాతీ యము. అర్జునుడు గీత విని కార్యోన్ముఖుడైనాడు. సనత్సు జాతీయము నంతయు విన్న ధృతరాష్ట్రునం దేమార్పును కలిగినది కాదు. అట్టిచో తదనువాదము వలని ప్రయో జన మెట్టిది? కావున తదనువాద ప్రయత్నము స్వర్ధ

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మనియే తిక్కన నిశ్చయించినాడు. భాషా ప్రపంచ మంతయు నరచేతిలో నున్న తిక్కనకు దీని అనువాద మేపాటిది?

ఇంత యోచనతో భావగర్భితము, గంభీరము, లలితము, దేశ్యపదభూయిష్ఠము నగు రచన యొనర్చిన తిక్కన ఉచితములగు చోట్ల ప్రబంధ మార్గమున బోవుటకును వెనుదీయ లేదు. అంతకు నింతకును సమర్థు డితడు. ఇతడు గావించిన స్త్రీపాత్రపోషణ అత్యుదాత్తమైనది. ఎంతో కష్టపడి స్త్రీ రూప చిత్రణములో ఉదాత్తత సాధింప బ్రయత్నించిన నన్నయ ద్రౌపది పాత్రతో ఆగిపోవలసి వచ్చుట దురదృష్టము. స్త్రీత్వము పరాకాష్ఠదశ నందునట్లు, అతిమనోహర స్వరూపము సిద్ధించునట్లుత్తరను పెంచి పోషించు సదృష్టము తిక్కనకు చేకూరినది. ఇతని ద్రౌపదీ పాత్ర యొక నూతన సృష్టి. అన్ని విధముల నితడు కాంచన గర్భుతుల్యుడు. భారతీయ విజ్ఞానమున కంతకును భాండార మనదగిన భారతభాగరచన మహాపండితుడును, తత్త్వవేత్తయు, విజ్ఞానఖనియు నగు తిక్కన చేతిలో బడుట ఆంధ్రుల పుణ్యము.

తిక్కన సమకాలికులలో కేతన ముఖ్యుడు. సంస్కృత దశకుమారచరిత్ర గద్యకావ్యము నితడు చంపూ కావ్యముగ రచించి తిక్కన కంకిత మిచ్చినాడు. ఆంధ్రభాషా భూషణము, విజ్ఞానేశ్వరీయము ననునవి ఇతని యితర కృతులు. 'ఆసనార్ఘ్యపాద్యతాంబూలాదులచే నితనిని గౌరవించి, ఒక్క కావ్యంబు రచియించి తన్ను కృతిపతిం జేయు'మని తిక్కనయే తన్నర్థించిన ట్లితడు చెప్పికొనియున్నాడు. ఇతని గ్రంథపీఠికలో తిక్కన గ్రంథ ప్రస్తావన లేకుండుటచే, ఆనాటి కింకను తిక్కన కావ్యములను రచింపలేదని ఊహింపనగుచున్నది. ఇతడు అభినవ దండి బిరుదాంకితుడు. ఔచితిని దృష్టియం దుంచుకొని దశకుమార చరిత్రయందలి శృంగార వర్ణనలను సంక్షేపించి యుండుట ఇతని రచన యందలి యొక విశేషము. శృంగారరస పోషణ విషయమున ఇతడును, తిక్కనయు ఏకమార్గానుయాయులు. ప్రబంధకవుల వలె అంగాంగ వర్ణనకు దిగక ఈ కవి పాత్రల మానసిక ప్రవృత్తులనే వర్ణించి రచనకు గౌరవ మాపాదించినాడు. పరకాయ ప్రవేశమువంటి యీ విధాన మతిదుష్కరమైనది; అట్లు చేయగలిగినాడు కావుననే 'ఉభయకవిమిత్రుని' మెప్పించినాడు. అన్వయ కాఠిన్యము లేని రచన యితనిది. సంస్కృత గద్యకావ్యమును ఇత డాంధ్రమున పద్యకావ్యముగ నొనర్చుట చూడ, అప్పటి కింకను గద్యము నెడ ఆంధ్రుల కాదరము కలుగ లేదనియు తెలియు చున్నది. అప్పటికే యననేల? తర్వాత నాలుగైదు శతాబ్దముల వరకును గద్య రచనపై తెలుగువారికి గౌరవ మేర్పడ లేదు.

ఇతని రెండవ గ్రంథమగు ఆంధ్ర భాషాభూషణ మాంధ్రమున మొదటి వ్యాకరణ గ్రంథము. ఇతని మూడవ రచనయగు విజ్ఞానేశ్వరీయము తెలుగు భాషలో వెల్వడిన మొదటి ధర్మశాస్త్ర గ్రంథము. యాజ్ఞవల్క్య స్మృతిని తద్వ్యాఖ్యయగు మితాక్షరితో కూడ ననువదించి ఇతడు తన గ్రంథమునకు విజ్ఞానేశ్వరీయమని వ్యాఖ్యాతృ నామము నుంచినాడు. విజ్ఞానేశ్వరుని మితాక్షరికి నేడును న్యాయస్థానములలో అధికార మున్నది. తిక్కన కవిత యందువలెనే కేతన కవితయందును కందపద్యము లెక్కువ. సూత్రస్థ విషయములను, నీతులను వ్యక్తీకరించుటకు కందము మిక్కిలి యనుకూలించును కాబోలు.

తిక్కన శిష్యుడగు మారన మార్కండేయ పురాణకర్త. మార్కండేయ పురాణము ధర్మప్రతిపాదక గ్రంథము. ఐనను, దీనిలో కావ్యత్వమున కనుకూలించు నితివృత్తము లెన్నియో బీజప్రాయములుగ నణగియున్నవి. మనుచరిత్ర, హరిశ్చంద్ర కథ, నలకథ, కువలయాశ్వ చరిత్ర మున్నగువాని కిది మూలము. తిక్కన కవిత నాదర్శముగ నిడికొని రచించిన ఈ గ్రంథము ప్రౌఢమయ్యును హృదయంగమమై యున్నది.

కేయూరబాహు చరిత్ర కర్తయగు మంచననుగూర్చి అతని గ్రంథమువలన నేమియు తెలియుటలేదు. పూర్వకవులను స్తుతించుచో ఇతడు నన్నయ, తిక్కనలను మాత్రమే పేర్కొనియున్నాడు. ఈ గ్రంథము గుండనామాత్యుడను వెలనాటి చోళరాజుమంత్రి కంకితము. రాజశేఖర కవికృత సంస్కృత విద్ధసాలభంజికా నాటిక కిది అనుసరణము. మూలమునకును, దీనికిని ఇతివృత్తములో సారూప్య మున్నది. కాని, పాత్రల పేర్లు మున్నగునవి భిన్నములు. పంచతంత్రమందలి కథలును ఇందు జేరినవి. ఔచితీ శోభితములగు వర్ణనలతో నొప్పు ప్రసన్నమగు రచన యిది.

కృష్ణమాచార్యు డాంధ్రమున ప్రథమ వచన కావ్యకర్త. ఇతని వచనములకు సింహగిరి నరహరివచనము లని పేరు. ఇవి మార్గిక లనెడి వచన భేదము లని శాళ్వపాక అన్నమయ్య వివరించినాడు. ఈ వచన వాఙ్మయ మంతయు మధురభావ విలసితము. భగవంతుని ప్రియునిగా దలంచి నాయికా భావనతో భక్తుడు ఆత్మార్పణ గావించుట ఈ వచనాదులలోని ఇతివృత్తము. రవీంద్రుని గీతాంజలి, వెంకట పార్వతీశ్వరుల ఏకాంత సేవ మున్నగు నర్వాచీన కావ్యము లిట్టివే. కృష్ణమాచార్యులు ద్రావిడ వేదమును



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తెనిగించి యున్నట్లు తాళ్ళపాక చిన్నన్న తెలిపి యున్నాడు.

కమలాసన బిరుదాంకితుడై, నీతిసార ముక్తావళిని రచించిన బద్దెన తిక్కనకు సమకాలికు డని జయంతి రామయ్య పంతులుగా రన్నారు. సుమతిశతకకర్త అతడే యని మానవల్లి రామకృష్ణకవిగారు. వైద్యగ్రంథమగు చారుచర్య ఈ కాలమునాటిదే. అప్పనమంత్రి ఈ గ్రంథమునకు కర్త. యథావాక్కుల అన్నమయ్య సర్వేశ్వర శతకమును ఇప్పటిదే. శివకవుల కున్న పాక్షికబుద్ధి ఇతనికి లేదు. వస్తువు శివపరమైనదియే యైనను అన్యదేవతా దూషణ మిందు లేదు. తిక్కన బోధించిన హరిహర తత్త్వముయొక్కయు, అద్వైతముయొక్కయు ప్రభావ మిట్టి పరిణామమును కలిగించినది.

ఈ తిక్కన తర్వాత కొంతకాలముననే సాంఘికవ్యవస్థలో మార్పు లారంభమైనవి. తురుష్కుల దండయాత్రతో కాకతీయ సామ్రాజ్యము విచ్ఛిన్నమైనది. అంతవరకును కాకతీయులకు ప్రతినిధులుగ నున్న సామంతులు స్వాతంత్ర్యము వహించి వేర్వేరు రాజ్యముల నేర్పరచుకొనిరి. పద్మనాయకులును, రెడ్లును అట్టి వారిలో ముఖ్యులు. ఓరుగల్లునుండి పారిపోయిన హరిహరుడును, బుక్కడును తుంగభద్రాతీరమున చిన్న రాజ్యమును స్థాపించుకొన్నారు. ముసల్మానులును ఒకవైపు స్థిరపడి రాజ్యస్థాపన గావించినారు. కావున రాజ్యవిషయక కలహములు, కల్లోలములు దక్షిణ దేశమున మరల నారంభమైనవి. ఈ కాలమున బ్రాహ్మణులును యుద్ధాదులందు పాల్గొని యున్నారు. బ్రాహ్మణులు సేనానులై క్షాత్రమును నెరపుట తిక్కన నాడే కలదు. తిక్కన పెదతండ్రి కుమారుడగు ఖడ్గ తిక్కన శౌర్యసాహసములు కావ్యవస్తువు లైనవి. పురుషార్థసార మను తెలుగు గ్రంథమును రచించిన శివదేవయ్యయు నిట్టివాడే.

అద్దంకిని రాజధానిగా జేసికొని యున్న ప్రోలయ వేమారెడ్డి ఆస్థానకవి ఎఱ్ఱాప్రెగ్గడ. హరివంశ, భారతారణ్యప ర్వోత్తరభాగ, నృసింహ పురాణము లితని కృతులు. వీని కన్నను ముందే ఇతడు రామాయణమును కూడ రచించి యుండెనవి కూచిమంచి తిమ్మకవి తన సర్వలక్షణ సారసంగ్రహమున దెలిపియున్నాడు. గణపవరపు వెంకటకవియు, కస్తూరి రంగకవియు కూడ ఈ రామాయణమందలి పద్యముల నొకటి రెంటి నుదాహరించినారు. మైసూరు నందున్న సంక్షేపరామాయణ కావ్యము ఎఱ్ఱన తండ్రియగు సూరన కృత మనియు, దానినే ఎఱ్ఱన యనువదించె ననియు కొంద రందురు. కాని ఎఱ్ఱన రచించి యుండినది సంపూర్ణ రామాయణమే యని పండితుల నిర్ణయము. గ్రంథ మలభ్యము.

హరివంశము భారతమున కనుబంధ గ్రంథము. భారత పరాంశమని వర్ణితమగు హరివంశమును చేర్పనిచో భారతమునకు లక్షశ్లోక విస్తృతి కలుగదు. కౌరవ, పాండవ వంశేతివృత్త కథనముతో భారతము పదునెనిమిది పర్వముల గ్రంథ విస్తృతిని పొందినది. యాదవవంశకథ కిందు ప్రాధాన్యము లేదు. భారత కథానాయకుడగు శ్రీకృష్ణుని వంశవర్ణన లేనిచో భారతమునకు అసంపూర్ణతాదోషము పట్టును. కావున హరివంశరచన తప్పనిది. దీనిని రచించుచు ఎఱ్ఱన గ్రంథమును పూర్వోత్తరభాగములుగ విభజించినాడు. స్వతంత్రించి నూతన వర్ణనాంశములను చేర్చిన ఘట్టములును గలవు. ఐనను కథాప్రవృత్తి కేమాత్రము నివి యాటంకములు కావు. భారతరచనయే హరివంశ రచనకును ఒరవడి. ప్రబంధపు పోకడ లున్నను అవి ఔచితినే పోషించినవి. నన్నయ తిక్కనల భాషా ప్రవంతులు రెండును ఇందు మేళవించినవి. నాద సౌందర్యము, అర్థపుష్టి, ఈ రెండును ఎఱ్ఱన హరివంశ రచనలో నెలకొన్నవి. పాండితీప్రకర్ష అధికమగుచున్న ఆ రోజులలో ప్రజాబాహుళ్యమును మనసునం దుంచుకొని, సంయమనముతో నన్నయ, తిక్కనల మార్గము నవలంబించి హరివంశమును ఇతడు రచించినట్లు స్పష్టమగుచున్నది.

ఇక భారత రచన: అరణ్యపర్వ కర్తృత్వ విషయమున పండితలోకమునం దభిప్రాయ భేదము కలిగినది. ఇతని పేరు గ్రంథమున లేకుండుటయే ఇందులకు కారణము. 'నన్నయభట్టు నరస సారస్వతాంశ తన్ను జెందుటయు, తత్కవితారీతియు కొంత తోప, తద్రచనయకా నారణ్యపర్వశేషము' నొనరించినందున భారతములో నితడు తన పేరును జేర్చుకొనలేదు. ఐనను భారతారణ్య పర్వశేషమును తాను పూర్తి చేసినట్లు నృసింహ పురాణమునందు స్పష్టముగ జెప్పియున్నాడు. మరియు 'ధీరమతి నన్నపార్యుని, దిక్కయజ్వ, శంభుదాసుని గర మర్థి సన్నుతించి' అని శ్రీనాథు డెఱ్ఱనను నన్నయ తిక్కనలతో గలిపి స్తుతించి యుండుట గమనింపదగినది. శ్రీనాథుని సమకాలికుడగు జక్కనయు తన విక్రమార్క చరిత్రలో ఎఱ్ఱనను భారత కర్తగా పేర్కొనియున్నాడు. కవిత్రయ మనెడి ప్రసిద్ధి భారతకవుల కాదినుండియు కలదు. ఇవి మాత్రమే కాక, ఎఱ్ఱన భారత రచనను నిర్వివాదముగ నిర్ణయించు ప్రబలమగునంత సాక్ష్యమును గలదు. మధ్యాక్కరలు మొదటి పర్వములందే కలవు. నన్నయ రచించిన ముప్పది నాలుగు మధ్యాక్కరల యందును యతిస్థానము చతుర్థ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



గణాద్యక్షరమైయుండ, ఎర్రన దవబడు భాగమునందలి మధ్యాక్కరలో యతిస్థానము తృతీయ గణాద్యక్షరమై యున్నది. ఈ కారణములను బట్టి ఎర్రన భారతారణ్య పర్వశేషకర్త యని ధ్రువమైనది.

నన్నయ, తిక్కనలు తమ తమ కాలపరిస్థితులనుబట్టి తమ కావ్యభాషను, కవితారీతిని నడపుకొని యున్నారు. నన్నయ కవితారీతికిని, తిక్కన కవితారీతికిని భేద మున్నదని చెప్పబడినది. వారిమధ్య గ్రంథభాగమున బడిన ఎర్రనకు ప్రత్యేకమగు కష్టము తప్పదు. ఇం కొకరు వ్రాసినట్లు వ్రాయుట, అందును నన్నయ, తిక్కనలవంటి మహాకవుల విశిష్ట కవితాగుణములను సమ్మేళన మొనర్చి యొకశైలిని సృష్టించుకొనుట, తనకాలమున లేని పరిస్థితుల కనుగుణముగ రచనను దిద్దుకొనుట - అను విషయము లితని నెదుర్కొన్నవి. ఇత డిన్నిటను కృతార్థుడైనాడు. కావుననే ఎర్రన రచించిన భాగము చాల చిన్నదైనను నన్నయ తిక్కనలతో సమానమైన ప్రతిపత్తి యతనికి లభించి యున్నది. అతిలోక ప్రతిభాన్వితులగు ఈ కవిత్రయము వారిచే నాకృతి గైకొన్న ఆంధ్రభారతమునకు ప్రపంచ మహాకావ్యశ్రేణిలో ఉన్నతస్థానము లభించినది. భారత దేశమునందు ఏ యితర ప్రాంతమునను భారతమునకు కలుగని గౌరవము తెలుగునాట గలిగినది.

భారతము తర్వాత ఎర్రన యొనరించిన కృతి నృసింహపురాణము. బ్రహ్మాండ పురాణాంతర్గ తాహోబలక్షేత్ర మాహాత్మ్య మిందలి వస్తువు. పేరునకు పురాణమైనను, రచనా విధానమునుబట్టి ఇది రసవత్కావ్యము. ఆంధ్ర ప్రబంధరచన కిదియే పునాది. వర్ణన బాహుళ్యము, ఉక్తి వైచిత్రి, అలంకార ప్రాధాన్యము, అపరిపుష్ట కథాంశ — మున్నగునవి తర్వాత వచ్చిన ప్రబంధముల లక్షణములు. ఈ లక్షణములు నృసింహపురాణమున స్పష్టముగనే కన్పడుచున్నవి. దీనిని బట్టియే ఎర్రనకు ప్రబంధ పరమేశ్వరుడను పేరు సార్థకమైనది. ఈ ప్రబంధచ్ఛాయలు హరివంశమునందును కొంతవరకు లేకపోలేదు. నృసింహపురాణమునందవి పూర్తిగ రూపొంది, తరువాతి ప్రబంధములకు దారి చూపినవి. భారత, హరివంశ రచనల విషయమున ఎర్రన స్వతంత్రుడు కాడు. నన్నయ తిక్కనల రచనా విధానమునకును, భారతస్థ విషయగౌరవమునకును కట్టుబడిన ఎర్రన తద్రచనలో సంయమనమును వహించినాడు. నృసింహపురాణ రచనలో స్వేచ్ఛ యేర్పడుటచే తన కిష్టమగు స్వతంత్ర మార్గమున నడచి ఇతడు నూతన కవితాశాఖకు ప్రవర్తకుడైనాడు. నన్నయ కథాకథన శైలిని, తిక్కన నాటకీయ శైలిని కలిపి విశిష్టమగు నూతనశైలి నితడు నిర్మించినాడు. ఈ శైలికి ముగ్ధుడైన శ్రీనాథుడు 'పరిఢవింతు ప్రబంధ పరమేశ్వరుని శేవ సూక్తివైచిత్రి కొక్కొక్క మాటు' అని ఎర్రన శైలిని ప్రశంసించి యున్నాడు.

మహాపండితుడు, కవివతంసుడు నగు నాచన సోమన ఎర్రన కించుమించు సమకాలికుడు. కేవలము సమకాలికుడగుటయే కాక ఎర్రనకన్న మిన్న యనిపించు కొనుటకై హరివంశమునే మరియొక విధమున రచించి ప్రబంధ మార్గములో మరియొక మెట్టు పైకి పోయినవా డితడు. ఇతడు విజయనగర రాజగు బుక్కరాయని కాలమున, అతనిచే సమ్మానితుడైనట్లు (క్రీ. శ. 1344 ?) శాసనము కలదు. కావున నితడు పదునాల్గవ శతాబ్దివా డనియే నిర్ణయము. ఈ సోమన గ్రంథములలో వసంతవిలాస మలభ్యము. ఇందలి పద్యము లట నట నుదాహృతములై యున్నవి.

ప్రచారములో నున్న గ్రంథము ఉత్తర హరివంశము. ఇందు ఆరాశ్వాసము లున్నవి. సోముని ఈ కావ్యమును లక్షణకర్త లెల్లరును 'హరివంశ' మనియే వ్యవహరించి యున్న కారణమునను, సంస్కృత హరివంశమందలి విషయ సర్వస్వమును సోముని లభ్య గ్రంథములో లేకపోవుటవలనను హరివంశ పూర్వభాగమునుగూడ సోముడు రచించి యుండవచ్చు ననెడి యూహ కలిగినది. 'హరివంశ ప్రథమ కథాంతరమునఁ గల వింత లెల్లఁ దప్పక మదిలోఁ దిర మయ్యెఁగదా' యను నితని ప్రథమాశ్వాసాది భాగమందలి వాక్యమును ఈయూహ కవకాశ మొసంగుచున్నది. ఐనను 'సోముని పూర్వ హరివంశము' అను మాట నేటివర కెందును వినరాదు. రుక్మిణీ కల్యాణ, ప్రద్యుమ్న జననాదులు సోమన గ్రంథమునందు లేవు. కనుక అతని ననుసరించి యివి పూర్వభాగమునందలివై యుండవలెను. కాని, ఎర్రన హరివంశమునం దివి ఉత్తర భాగముననే కలవు. కావున వీరు గైకొన్న హరివంశ ప్రతులు భిన్నములేమో యనిపించుచున్నది. కొన్ని సంస్కృత హరివంశ ప్రతులలో ఊర్వశీ నరకాసుర సంవాదము లేదు. ఎర్రన ఈ ఘట్టమును స్పృశించి వదలియుండ సోమన సమగ్రముగ చిత్రించినాడు. మూలమందును, ఎర్రన గ్రంథమందును ఫలశ్రుతి యుండ సోమన గ్రంథమున నది లేదు. సర్వము సంపూర్ణ మనియైనను లేదు. ఇట్లు గ్రంథ సమాప్తికూడ సంప్రదాయము ననుసరింపలేదు. కనుక దొరకినంతవరకే ఈతని గ్రంథ మని మనము తృప్తి పడవలసియున్నది. తిక్కన వలె నీతడును హరిహరుల కభేదమును పాటించియుండుటను గమనింపదగినది. ఈతనికి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



తరువాతి కాలపు కొరవి గోపరాజును నీ విషయమున తిక్కన మార్గము ననుసరించినవాడే.

ఎఱ్ఱనపై స్పర్ధతో ఇత డుత్తర హరివంశమును రచించెనా యనునంతటి ప్రబంధధోరణిని సోమన తన గ్రంథమున ప్రదర్శించినాడు. కవితా విషయమునం దీతడు స్వైర విహారము చేయగల సమర్థుడు. ఒక్క క్షణములో భయంకర తాండవమును ప్రదర్శించి, మరుక్షణముననే సుందరతర లాస్య భంగిమములను చిత్రింపగలడు. సంస్కృతాంధ్రములు రెండును ఇతనికి స్వాధీనము లనుట ఇతని రచనలో ప్రస్ఫుట మగుచున్నది. ఇతడు వివిధశాస్త్ర పారంగతుడు; సకల భాషా భూషణుడు; సాహిత్య రసపోషణ సంవిధాన చక్రవర్తి. ప్రతి పద్యమునను ఏదో యొక విశిష్టత గోచరించును. కవితా విషయమున ఇతని స్వభావము రజోగుణ ప్రధానమైనది. భావ తీవ్రత, భావావేశములకు లోనయిన వర్ణనలు చాల గలవు. పాండితీ ప్రకర్ష ఇతనికి మిక్కుటము. వ్యవహారదూరములై యున్న ప్రయోగములను, ప్రాచీన నిఘంటువులలో మాత్రమే నిలిచియున్న ప్రాతవడ్డ మాటలను విచ్చలవిడిగ వాడి పండితులకుకూడ దురవగాహమగునట్లు ఇత డొనర్చిన పట్టు లనేకములు. పాండిత్యమునకు గౌరవ మేర్పడుచున్న కాల మది. అసాధారణ ప్రజ్ఞావంతుడగు ఈ కవి తత్కాల ప్రాబల్యమునకు లోనై, నన్నయ యేర్పరచిన లలిత సంస్కృతోద్యానమున విహరించుటకు మారుగా పాషాణమయములగు పర్వత ప్రాంతములలో బంతులాడినాడు. సామాన్యుల కితనితో విహారము కష్టము. ఐనను కావ్య మంతయు ఇట్టిదే కాదు; రసవత్తరములు, మనోహరములు నగు ఘట్టములును కలవు. కృష్ణుడు విప్రబాలకుని బ్రతికించు ఘట్టము అతిస్వాభావికమును, కరుణరసపూరితమును నై రమణీయముగ నున్నది. ఎంత కఠినప్రాసము నయినను నడపగలనన్న ప్రత్యయ మితనికి గలదు. ఇది చూచి రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారు 'కవితా కన్యకు నిజముగా ప్రాసములు ప్రాసములే' యని బాధతో నన్నారు. శబ్దార్థాలంకారముల యాడంబరముతోగూడిన రచనయు ఇతనితోనే ఆరంభమైనది. ధారాశుద్ధియందు ఎఱ్ఱన, సోమనలు ఒకరి కొకరు తీసిపోరు. ఐనను సోమనలో లేని సత్త్వగుణము ఎఱ్ఱనలో నధికముగా భాసించుచున్నది. ఎఱ్ఱన రచనలో మనము లీనము కాగలము గాని సోమనతో నట్లు తాదాత్మ్యమును బొందలేము. సోమన ప్రజ్ఞకు మనము ముగ్ధులము కాగలమే కాని ఎఱ్ఱనయందువలె సాత్త్వికరసామభూతిని బొందలేము. ఎఱ్ఱన శృంగారము సాత్త్విక ప్రణయాన్వితమైనది. యుద్ధాదిక వర్ణనములో సోమనదే పైచేయి. ఎఱ్ఱన యందుగల మానసిక ప్రశాంతత సోమనయందు లేకపోవుటయే ఇద్దరి రచనల విభిన్నతకును హేతువు. సోమన రచనయం దిట్లు తర్వాతి ప్రబంధ లక్షణము లనేకములు నెలకొనియున్నను రచన ఉదాత్తతను గోల్పోలేదు. వస్త్వైక్యము, సన్నివేశకల్పన, రసపోషణ, భావౌన్నత్యము, భాషాపాటవము అను మహాకావ్య లక్షణము లిందు ప్రస్ఫుటములు. కనుకనే ఈ కవిని కవిత్రయము వారితో సమానునిగ గౌరవించుట.

ఇతని తర్వాత రచితములైన ఈ యుగపు కావ్యములలో భాస్కర రామాయణము ముఖ్యమైనది.

భారతీయులకు ప్రీతిపాత్రములు, ఆదర్శములు నగు గ్రంథములు భారత, రామాయణ, భాగవతములు. భారత మిదివరకే రచితమైనది. కేవల భక్తిభావ బంధురమగు భాగవతమువంటి వైష్ణవ రచనపై దేశమున నప్పటి కాదర మింకను కలుగలేదు. మరియు, భాగవతము ప్రధానముగా నాధ్యాత్మిక విషయ సంబంధియగుటచే దైనందిన జీవితమునకు సన్నిహితము కాదు. భారత, రామాయణముల విషయము వేరు. రమణీయ కథాసంవిధానము చేతను, రససంపదచేతను, అతి హృదయంగమమై యున్న కావ్యము రామాయణము. వ్యాసుడు మొదటివాడైనను ఆదికవియను పేరు వాల్మీకికి గల్గుట కిదియే కారణము.

రంగనాథ రామాయణము ద్విపదకావ్య మగుటయు, తిక్కన రచించినది ఉత్తరకాండమాత్రమే యగుటయు, రంగనాథ రామాయణమున అవాల్మీకము లధికముగ నుండుటయు కారణములుగ భాస్కరాదులు రామాయణ రచనకు బూనుకొని యుండవచ్చునని యూహింపవచ్చును. ప్రభువులకును కాంతా సమ్మితములగు కావ్యములపై నభిమాన మేర్పడినది. ఈ గ్రంథ కర్తృత్వవిషయ మస్తవ్యస్తముగ నున్నది. భాస్కర రామాయణ మనెడి పేరు గ్రంథమం దెచ్చటను కానరాదు. భాస్కరు డనువాడు రచించిన గ్రంథభాగ మత్యల్పమే యైనను గ్రంథమున కతని పేరే వచ్చినది. తిక్కన తాతయగు మంత్రి భాస్కరుడే యిత డనెడి వాదమున కాధారములు చాలవు. అరణ్యకాండము సాహిణి మారు నుద్దేశించి రచితమైనది. మంత్రి భాస్కరుని కాలమున సాహిణి మారుడు లేడుగదా! మంత్రి భాస్కరు డొక రామాయణమును రచించియుండిన నుండవచ్చును. కాని ఈ గ్రంథముమాత్ర మది కాజాలదు. హుళక్కి భాస్కరుడే సాహిణి మారుని కాలమునం దుండినవాడు. కావున రామాయణ కర్తలలో నొకడగు భాస్కరు డితడే యని నిర్ధారణ.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఇతనితోబాటు మల్లికార్జునభట్టు, కుమార రుద్రదేవుడు, అయ్యలార్యుడు అను మువ్వురును ఈ రామాయణ వివిధ భాగములను రచించిన కవులు. వీ రందరును తాము గైకొన్న కథా భాగములను చక్కగ నిర్వహించి యుండుటవలన ఈ బహుకర్తృకత యనునది రచనా సౌందర్యమున కేమాత్రమును భంగము కలుగజేయలేదు. కొన్ని పట్టులలో ఈ కవులు ప్రతిభాయుతమగు స్వాతంత్ర్యమును ప్రదర్శించి నన్నయ, తిక్కనల సంప్రదాయమును నిలువబెట్టినారు.

భాస్కర రామాయణమునం దెక్కువ భాగమును రచించినవాడు మల్లికార్జునభట్టు. లలిత సంస్కృత పద ప్రయోగమున కితని రచన ఆకరము. ప్రబంధధోరణిలో బడి ఇతడు అయోధ్యాపురమును మూలము నతిక్రమించి వర్ణించినాడు. అట్లే శ్రీరామ జనన సందర్భమున మూల మందు లేని జ్యోతిశ్శాస్త్ర విషయముల నుపపాదించి యున్నాడు. నన్నయవలె నతి గంభీరముగ పద్యముల నడపింపగల యీ కవి సుందరకాండ నతి సుందరముగ చిత్రించినాడు.

ధారాశుద్ధిలో నితని కేమాత్రమును తీసిపోనివాడు కుమార రుద్రదేవుడు. ఇతనికిని సంస్కృతముపై నభిమానమే. శబ్దాలంకారములపై మక్కువయు నెక్కువ. రచనలో ఆవేశమును అమితముగనే కన్పడుచున్నది. మంథర కైకేయికి దుర్బోధలు చేయుట, కైకేయి వరద్వయమును గోరుట మున్నగు నవాల్మీకముల నితడు గ్రహించినాడు. ఇందువలన కథాగౌరవము దెబ్బ తిన్నది.

తన నామధేయమునే గ్రంథముపై ముద్రవైచిన భాస్కరుడీ కవులలో నగ్రగణ్యుడు. ఇతనికి భారతము నందే యెక్కువ గౌరవ మనుట ఇతని రచనను బట్టి వ్యక్తమగుచున్నది. అందునను తిక్కన భారత మితని యభిమాన గ్రంథమని యితని కవితాశైలిని బట్టి నిశ్చయింపవచ్చును. ఆ మార్గము ననుసరింప ప్రయత్నించినందుననే ఇతనికిని, ఇతని గ్రంథమునకును లోకమున ప్రఖ్యాతి కల్గినది.

ఆయా రామకథా నాటకములలో నున్న రమణీయము లగు శ్లోకములనుకూడ నీత డనువదించి తన గ్రంథములో నందందు చేర్చియున్నాడు. జయదేవుని ప్రసన్న రాఘవ నాటకమందలి రామవిరహ వర్ణనను ఇతని రచనతో పోల్చి చూచునది. భాషా విషయమున లాలిత్య మితని ప్రత్యేక గుణము. శృంగార వర్ణనలనుగూడ భయంకర సమాసములతో రచించు నా కాలమున ఈ భాస్కరుడు తేలికపలుకులతో రౌద్ర భయానకాదుల స్ఫూర్తిని సయితము సాధించి సెబా సనిపించుకొన్నాడు.

అయ్యలార్యుడు యుద్ధకాండము నందలి ఏ భాగమును రచించెనో నిర్ణయించుట కష్టము. సుమా రర్ధకాండమున కితడు కర్తయని అందురు. కవితా విషయమునం దీతడు భాస్కరున కుద్ది యనదగినవాడు.

ఇట్లు పూర్తియైన భాస్కర రామాయణము పండితుల యాదరమునకు పాత్రమైనది. దీని తర్వాత శ్రీనాథుని కాలమువరకును చెప్పుకొనదగిన కావ్యములుకాని, విశిష్టు లగు కవులుగాని కనిపింపరు.

పేర్కొనదగిన ఇతర కవులలో చిమ్మపూడి అమరేశ్వరు డొకడు. ఒకటి రెండు పద్యము లితనివి లక్షణ గ్రంథములలో నుదాహృతములై యున్నవి కాని గ్రంథము లేవియు లభింపలేదు. ఉదాహృత పద్యములనుబట్టి ఇతడు సంస్కృతభాషా పాండిత్యము కలవా డనియు, నన్నయ శైలిపై మక్కువ కలవా డనియు నూహింపవచ్చును.

దోనయామాత్యు డనెడి కవి సస్యానందము, సర్వలోకాశ్రయము అను గ్రంథములకు కర్త. సస్యానందము మాత్రమే లభించినది. పద్యరూపమున నున్న శాస్త్ర గ్రంథమది. కర్షకుల కుపయోగించు విషయము లిందు వర్ణితములై యున్నవి.

చాళుక్య వంశీయుడగు విశ్వేశ్వరభూపతి కంకితముగా కావ్యాలంకార చూడామణి యను లక్షణ గ్రంథమును రచించిన విన్నకోట పెద్దన ఈ కాలపువారిలో ప్రశంసార్హుడు. కావ్య, రస, భాషా, అలంకార, ఛందోవిషయము లిందు లక్ష్య లక్షణములతో వివరింపబడి యున్నవి. కావ్య రచనకు సంబంధించిన అన్ని విషయములను వివరించు తెలుగు లక్షణ గ్రంథములలో ఇదియే మొదటిది. తరువాతి లక్షణ గ్రంథకర్తల కిది యెంతయు సహకరించినది. ఇందలి లక్షణపద్యములు మాత్రమే కాక లక్ష్యములుకూడ పెద్దన రచించినవియే. ఇతని కవితాశైలి సరళము, సుబోధకమునై యున్నది. తెలుగు సంస్కృతభవ మని యభిప్రాయమును మొదట ప్రతిపాదించినవా డితడే.

దేవకీనందన శతకమును రచించిన కవి వెన్నెలకంటి జన్నమంత్రి. రచన యంతయు మత్తేభ, శార్దూల వృత్తములలో నడచినది. 'దేవకీనందనా' యను పద్యాంత సంబోధనయే యీవృత్తములను నిర్ణయించినది. ఇది తిక్కన కృత మనియు నొక వాదము కలదు. కాని హరిహరోపాసకుడగు తిక్కన యీ శతకమునకు కర్త యనుట పొసగదు. గ్రంథమందలి భాషాదోషములనుబట్టియు ఇది తిక్కన రచన కా దనియే నిశ్చయము.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఉదాహరణ కావ్యకర్తయగు రావిపాటి త్రిపురాంతకుడీ కాలపువాడు. త్రిపురాంతకోదాహరణము, అంబికా శతకము, చంద్రతారావళి, మదన విజయము అను తెనుగు గ్రంథములును, ప్రేమాభిరామ మను సంస్కృత గ్రంథమును ఇతని రచనలు. ఇతని ప్రేమాభిరామమే శ్రీనాథుని దనబడు వీథీ రూప క్రీడాభిరామమునకు మూలము. అంబికా శతక, మదన విజయములందలి కొన్ని పద్యములు మాత్రము లభించినవి.

గణపనారాధ్యు డనెడి మరియొక కవి స్వరశాస్త్ర మనెడి చిన్న ద్విపద గ్రంథమును రచించెను. ఇది యోగ శాస్త్ర గ్రంథము. కొరవి సత్యనారన, శ్రీగిరి కవి, పశుపతి నాగనాథుడు మున్నగు వారును ఈ కాలపు కవులని తెలియుచున్నది.

ఈ విధముగ నన్నయతో నారంభమైన ఆంధ్ర వాఙ్మయము కాలక్రమమున సంఘ పరిణామము ననుసరించి నడచుచు వికాసమును గాంచుచు, కేవల కథాకథనాత్మకము, నీతి బోధకమునగు తొలిరూపమును మార్చుకొని వర్ణనాత్మక మగు ప్రబంధశైలిగా నెట్లు పరిణతి నందినదియు తెలుపబడినది. సాధారణ కవులను లెక్కపెట్టనిచో ఈ కవిత్రయ యుగమున మనకు గోచరించు కవులు నన్నయ, నన్నెచోడుడు, పాల్కురికి సోమన, బుద్ధారెడ్డి, తిక్కన, ఎఱ్ఱాప్రెగడ, నాచన సోమన, భాస్కర రామాయణ కర్తలు మాత్రమే. బ్రాహ్మణమత పునరుద్ధరణకై నన్నయ యారంభించిన భారతాంధ్రీకరణము సుమారు రెండు వందల సంవత్సరముల కాలము వరకును అసంపూర్తిగ నిలిచిపోవుటకు ముఖ్యకారణము వీరశైవమత విజృంభణమని తెలిసినది. నన్నయ, తిక్కనల మధ్యకాలమందలి కవులలో పండితారాధ్యునకు కవిగా ప్రశస్తి తక్కువ. నన్నెచోడుడు నన్నయకు సన్నిహితకాలమువా డగుటచే నతని కవితారీతి నన్నయనే యెక్కువగ బోలినది. పాలకురికి సోమన తిక్కన కాలమునకు చాల దగ్గరివా డగుటచే నితనిప్రభావము తిక్కనపై ప్రసరించినది. వీరశైవుల కవితా విధానము నవలంబించిన మొదటి మార్గకవి రంగనాథరామాయణ కర్త. భాషావిషయమునను, మతవిషయమునను సమన్వయ మార్గమును నిర్మించినవాడు తిక్కన. ఎఱ్ఱాప్రెగడ నన్నయ తిక్కనలతో చేయి కలిపియు, ప్రబంధ కవిత్వమునకు మూలపురుషుడైనాడు. ప్రబంధ బీజములు నన్నెచోడుని కావ్యమునందే కలవని యిది వరకే సూచితము. ఇతడు శైవకవి యగుటయు, ఇతని తరువాతి కావ్యము లన్నియు పురాణమార్గముననే నడచి యుండుటయు కారణములుగా ఈ కవికి ప్రబంధ నిర్మాత యను కీర్తి కలుగక పోయినది. ఎఱ్ఱాప్రెగడ చూపిన మార్గము నవలంబించి, తరువాతి కవులగు శ్రీనాథాదు లెల్లరును ప్రబంధ పరిణామమునకు దోహదమొనర్చి యుండుటచే ప్రబంధపరమేశ్వరు డనెడు కీర్తి ఎఱ్ఱనకు దక్కినది. పాండిత్యమునకు గౌరవము కలుగుచున్న కాలమున నాచన సోముడు అప్రతిమానమగు తన పాండితిని, కవితాశక్తిని ప్రదర్శించి ప్రబంధ కవితామార్గమును స్థిరపరచి మహాకవి గౌరవమును బొందినాడు. ఇతని ధోరణిలో బడి పోక చాలవరకు సంయమనమును వహించి కవిత్రయము వారి మార్గమున రామాయణమును రచించినవారు భాస్కరాదులు. కావున నీ కవిత్రయ యుగపు కడపటి భాగము శ్రీనాథుని కావ్య ప్రబంధ కవిత్వమునకు పూర్వరంగమైనది.

భూ. ల.

## ప్రబంధ పూర్వ యుగము (క్రీ. శ. 1400 - క్రీ. శ. 1500)

ఆంధ్రవాఙ్మయ చరిత్రను స్థూలదృష్టితో యుగ విభజనము చేయువారు క్రీ.శ. 1080 మొదలు క్రీ.శ. 1400 వరకును గల రమారమి నాల్గు వందల సంవత్సరముల కాలపరిమితిని 'అనువాద యుగము'ని యందురు. మన వాఙ్మయమునకు మూలాధారమయిన మహాభారతమే కాక దానితో సమప్రభావము కల రామాయణము, భారతమునకు అనుబంధ గ్రంథమై భారతములో నంతర్భాగముగానే వ్యాసునిచే పరిగణింపబడి ఖిల పురాణ మనుపేర బరగు హరివంశమును దెనుగున అనువదింపబడి మన భాషకును, మన వాఙ్మయమునకును ఒక స్థిరరూపమును గల్గించుట యీ నాల్గు వందల సంవత్సరముల కాలములోనే జరిగినది. కనుక, దీనిని భాషాంతరీకరణయుగ మనుటలో కొంత సత్యము లేక పోలేదు. కాని, ఈ నిర్వచనము సూక్ష్మ పరిశీలనకు తాళదు; ఏమనగా నచ్చటచ్చట కాళిదాసుని శ్లోకములకు కొన్ని అనువాదములును, కొన్ని అనుసరణములును ఉన్నను నన్నెచోడుని కుమారసంభవము భాషాంతరీకరణము కాదు. అది శుద్ధ స్వతంత్ర గ్రంథముగానే పరిగణింప దగినది. అదియునుగాక, సంస్కృత వాఙ్మయమును, ఆ సంప్రదాయములను, అనువాదముల పోకడలను దిరస్కరించి శుద్ధదేశి కవిత్వ నిర్మాణమునకు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



బద్ధకంకణుడై శైవవాఙ్మయ పితామహుడైన పాలకురికి సోమనాథుడు కూడ ఈ యుగములో ద్రోసిపుచ్చరాని ఒక దశకు సర్వాధికారియై తన యేలుబడి నెగ్గించుకొని యుండుటబట్టి ఈ యుగ మంతయు భాషాంతరీకరణ యుగమే యను సిద్ధాంతమునకు ప్రబలమైన అపవాద మేర్పడును. అందుచేతనే కొందరు వాఙ్మయ చరిత్ర కారులు గ్రంథ స్వభావ పురస్కృతమయిన యుగవిభజన మునే అంగీకరింపక ఆయా కాలములలోని కవివర్గమునకు నేతృత్వము వహించి, తమ పేరుమీద గురుపీఠమును నెల కొల్పి, తమ ఆదేశములే వాఙ్మయమున శాసనములుగా చెల్లించి సరస్వతికి నూత్నాలంకార శోభను ఘటింప సమ ర్థులైన మహాకవుల పేరుమీద యుగవిభజనము చేయుటకు పూనుకొందురు. ఈ యర్థమున 'ప్రబంధ పూర్వయుగ' మనెడు ఈ కాలము 'శ్రీనాథయుగము' అను పేర వ్యవ హరింపబడును. అదృష్టవశమున ఈ 'శ్రీనాథయుగము' క్రియారూపములో పూర్వ ప్రబంధయుగమే అగును కాన ఈ పేరే ఇచట అంగీకృత మయినది.

ఇంచుమించు క్రీ. శ. 1350 వ సంవత్సరము వరకు భారత, రామాయణముల యనువాదములే ప్రధాన వాఙ్మయక్రియ లైనవి. క్రీ. శ. 1500 సంవత్సరముల నుండి స్వతంత్రములయిన ఆంధ్ర ప్రబంధము లవతరించి నవి. ఆ పురాణాదుల అనువాదములకు, ఈ ప్రబంధముల స్వతంత్రతకు నడిమి కాలమయిన శ్రీనాథుని యుగము ఆ ప్రబంధప్రచారమునకు దారి చూపినది. ఈ యుగములో కొంత వాఙ్మయభాగము అనువాదముగా, మరికొంత స్వతంత్రముగా, ఇంకొక కొంత యథోచితానుసరణముగా నానావిధముల ఆవిర్భవించి సంస్కృత సారస్వత కరావ లంబనమును వదలి పెట్టియు, వదలిపెట్టని రీతిగా చాల దూరము నడచి కాలు నిలువద్రొక్కుకొన గలిగినది. ఈ యుగములోని మహాకవుల కృషి యంతయు ఉత్తరకాల మున జరుగబోవు ప్రబంధ సరస్వతీ విహారమునకు మెత్తని పూలదారులు పరచుటయైనది. ఈ మహానుభావులే ప్రబంధ నాటక ప్రదర్శనమునకు పూర్వరంగ ప్రవర్తకులు. వీరు నెరవేర్చిన ప్రస్తావన కనుగుణముగానే ప్రబంధ నాటకము ప్రదర్శింప బడినది. అందుచేత ప్రబంధయుగ మున కవ్యవహిత మయిన ఈ కాలమును ప్రబంధ పూర్వయుగ మని పేర్కొనుటలో ఆక్షేపము ఏమియు నుండదు. దీనికి నాందీ శ్లోకమును పఠించి ఈ ప్రస్తావ నను నడపినవాడు శ్రీనాథుడు. అందుచే ప్రబంధ పూర్వ యుగ మన్నను, శ్రీనాథుని యుగ మన్నను అర్థము ఒక్కటియే.

క్రీ. శ. 1323వ సంవత్సరములో 'కాకతీయ సామ్రా జ్యము విచ్ఛిన్నమై పోయిన పిమ్మట, అద్దంకి రాజధానిగా పూర్వాంధ్రదేశమున రెడ్డి రాజ్య మొకటియు, విజయనగ రము రాజధానిగా పశ్చిమాంధ్రమున విజయనగర రాజ్య మొకటియు స్థాపింపబడినవి. ఈ రాజ్యములు రెంటికి మొదటి తరములో క్రమముగా ఎఱ్ఱాప్రెగడయు, నాచన సోముడును ఆస్థాన కవులై నూతన రాజ్యస్థాపనతో పాటు నూతన కావ్యనిర్మాణములును చేసిరి. రెండవ తరములో రెడ్డిరాజధాని అద్దంకి నుండి కొండవీటికి మారిన కొంత కాలమునకు పిమ్మట శ్రీనాథుడు రెడ్డిరాజులకు ఆస్థాన కవియు, విద్యాధికారియు అయి రాజసింహాసనము ప్రక్కనే తన కవిరాజ సింహాసనమును ప్రతిష్ఠించెను. ఆయన బాల్య కౌమార యౌవన దశలు కొండవీటిలోనే వైభవో పేతముగ గడచినవి. కొండవీటి రెడ్ల యాస్థాన కవి యను పదవియే తన యింటిపేరుగా ప్రౌఢదేవమహారాయల కాలములో విజయనగరమహారాజాస్థాన మండపమును ప్రవేశించి అచటి దిగ్దంతులవంటి పండితులతో విద్యావివాద ములు నడపి, మహారాజులతో వినోదగోష్ఠి సల్లాప సౌఖ్యము లను, గనకాభిషేక వైభవమును అనుభవించి కవిసార్వ భౌము డను సార్థక బిరుదముతో 'ఈ క్షోణిన్ నినుబోలు సత్కవులు లేరీ నాటి కాలమ్మునన్' అని రాజులచేతను, మంత్రులచేతను శ్లాఘింప బడుచు ఆంధ్రదేశమున నలు మూలల కవితా సౌరభములు వెదచల్లుచు బర్యటించెను. ప్రౌఢ నిర్భర వయఃపరిపాకమున అతడు గొండవీటి రెడ్డి రాజ్యమున కొక శాఖయైన రాజమహేంద్రవరపు కొలువు కూటము చేరెను. కనకాభిషేకమునాడే విజయనగర రాజు శ్రీనాథు నాస్థాన కవిగా స్వీకరించి యున్నచో, విజయనగర సారస్వతావతరణము అల్లసాని పెద్దనామా త్యుని జననము వరకును వేచియుండెడిది కాదు. ఆ భాగ్యము విజయనగరమునకు లేకపోయెను. అది మేలే యయ్యెను. శ్రీనాథుడు విజయనగరమున ఆస్థానకవిగానే కుదురుకొని యున్నచో ఆయన నిర్నిబంధ స్వేచ్ఛాసంచా రముగాని, బహుళగ్రంథ రచనగాని జరగియుండెడిది కాదు. రాజమహేంద్రవరముననైన ఆ మహాకవి చిర కాలము గడపలేదు. కొండవీడు విజయనగర రాజులకును, రాజమహేంద్రవరపు రెడ్డిరాజులకును వశమయిన పిమ్మట ఈ కవిసార్వభౌముని భరించు భాగ్యము గల రాజ్యము లేకపోవుటచే మరల స్వతంత్రుడై ఉత్తరమున సింహా చలమునుండి దక్షిణమున కాంచీపురి వరకు పర్యటించుచు ఆంధ్రదేశైక కవియై విపుల ధనమును, విపులతర యశ మును ఆర్జించెను.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



శ్రీనాథుని జననకాలమును గురించి చాల వాదోపవాదములు జరిగినవి. ప్రత్యక్ష నిదర్శనములు లేని చారిత్రక నిర్ణయము లన్నియు ఊహలమీదను, వాదబలము మీదను ఆధారపడి ఉండవలసినవే. కావున ఆ వాదములవలన సర్వ జనాంగీకృతమయిన సిద్ధాంతము తేలలేదు. కాని, ఈ మహాకవి క్రీ. శ. 1880 ప్రాంతమున జనించి క్రీ. శ. 1460 ప్రాంతమున జీవయాత్ర చాలించి యుండు నవెడు సిద్ధాంతము పెక్కుమందికి సమ్మత మయినది. ఈ యెనుబది యేండ్ల కాలములో బాల్యమని చెప్పదగిన మొదటి పది పండ్రెండు సంవత్సరములు కాక తక్కిన జీవిత శేష మంతయు ఈ మహానుభావుడు కవితా విహారము చేయుచునే యుండెను. అవసాన ఘటికలలోకూడ ఆయన జిహ్వాగ్రముపై ఆంధ్ర సరస్వతి తాండవించుచునే యుండెను.

శ్రీనాథుని గ్రంథరచనా కాలమును గురించి కొంత వరకు అక్కరకు వచ్చెడు నాధారముగల పద్య మొకటి ఆయన కాశీఖండములో కలదు. అందు మరుత్తరాట్చరిత్ర, శాలివాహన సప్తశతి, నైషధము, భీమఖండము, కాశీఖండము పేర్కొనబడినవి. వీనిలో మొదటి రెండును లభ్యము కాలేదు. ఇందు పేర్కొనబడని గ్రంథములు మరి మూడు కలవు. అవి హరవిలాసము, శివరాత్రి మాహాత్మ్యము, పలనాటి వీరచరిత్ర. వీనిలో పలనాటి వీరచరిత్రయే వయసున, నెక్కడ వ్రాయబడెనో చెప్పుట యూహకందని విషయము. ఒకవేళ అది కాశీఖండమునకు పూర్వమే రచింపబడి యున్నను, ఆ రచన తన యశమునకు గారణమైనదియు, వాఙ్మయము నలంకరింప దగినదియు కా దనెడు చిన్న చూపుతో దాని నీపద్యమున ఉదాహరించి యుండకపోవచ్చును. అదియును గాక ఆ పద్యములో తాను వ్రాసిన గ్రంథముల పేర్లన్నియు వరుసగా గుదిగ్రుచ్చవలెనన్న తలంపు ఆయన కున్నట్లు తోచదు. ఒక్క శ్రీనాథుడే కాదు — ఏ కవియైనను తన రచనలలో ప్రధానమైన వానినే ముచ్చటకై పేర్కొనును గాని గ్రంథప్రచురణ కర్తలవలె నొక పట్టికను తయారుచేసి పద్యమును వ్రాయడు. శివరాత్రి మాహాత్మ్యము కాశీఖండమునకు తరువాతి రచనయే అనియు, ప్రాయము కైవ్రాలిన పిమ్మటనే రచియింపబడిన దనియు ఆ గ్రంథము చదివిన యే సాహిత్యవేత్తకైనను స్పష్టముగా గోచరించును. ఆ గ్రంథ రచనయెడ శ్రీనాథునకు శ్రద్ధ లేదు. ధనమునకు ఆశించియో, మిత్రుడయిన కృతిపతి కోర్కె తీర్పనెంచియో మ్రొక్కు చెల్లించుకొనుటకై వ్రాసిన అల్ప రచన అది; అదియు అసమగ్రము. ఆయన పేరుమీద లభించిన దన్న గౌరవము తప్ప దానికి వేరు ఘనత లేదు. ఘనత కలిగియు కాశీఖండములోని పద్యమున బేర్కొనబడని గ్రంథము హరవిలాసము. ఆ గ్రంథముకూడ కాశీఖండ రచనానంతరమే పుట్టెనో లేదా తత్పూర్వమే పుట్టెనో చెప్పుటయు గష్టమే. ఉత్తరకాల రచనయైనచో గారణము నూహింపనక్కరలేదు. పూర్వ రచనయే యైనచో పై పద్యమున ఉదాహరింపబడకపోవుటకు గారణము పైని చెప్పినట్లు ఆ పద్యము గ్రంథ పట్టిక కాకపోవుటయే.

కాశీఖండమునకేకాక నైషధమునకును బూర్వమే రచింపబడిన పండితారాధ్య చరిత్రమును ఆ పద్యమున నుదాహరింపబడకపోవుటకు ఇదియే కారణము. ఉదాహరింపబడియు లభ్యములు కాని మరుత్తరాట్చరిత్ర, శాలివాహన సప్తశతులవలె పండితారాధ్య చరిత్రకూడ ఉదాహరింపబడకయు నలభ్య మయ్యెను. ఆ గ్రంథమును వ్రాసితినని మాత్రము శ్రీనాథుడు నైషధమున చెప్పుకొనెను. ఈ పండితారాధ్య చరిత్రము పాల్కురికి సోమనాథుని ద్విపద కావ్యమునకు పద్యరూపము.

శ్రీనాథునికి పూర్వము తెలుగులో పుట్టిన ప్రధాన ద్విపద కావ్యములు మూడు కలవు: రంగనాథ రామాయణము, బసవ పురాణము, పండితారాధ్య చరిత్ర. ఈ మూడును అర్వాచీన కాలమున పద్య ప్రబంధములుగా రూపాంతరము పొందినవి. రంగనాథ రామాయణమునకు భాస్కర రామాయణము ఈవిధమగు ననుకరణ సృష్టియే. పండితారాధ్య చరిత్రమును శ్రీనాథుడు ఆతీరుగనే పద్య ప్రబంధముగా రూపాంతరమును పొందించి యుండును. బసవ పురాణము పిడుపర్తివారిచే ఇట్లే పద్య ప్రబంధముగా మార్చబడినది. పద్య ప్రబంధమున కున్న గౌరవము ద్విపదలకు లేకపోవుట యీ మార్పునకు గల ముఖ్య కారణము. ఈ వింతమార్పు తమ కంటియెదుట జరుగుచున్నను ద్విపద కవులు తమ వాఙ్మయమును ఉత్తరోత్తరాభివృద్ధిగా కొనసాగించుచునే యుండిరి. అంతమాత్రమే కాదు. వారిలో కొందరు సమర్థులు పద్య వాఙ్మయ రాజ్యముపై దండెత్తి ఆ భూములను కొన్నిటిని తమ ద్విపద వాఙ్మయ రాజ్యమున కలుపుకొన జొచ్చిరి. వారి సొత్తును వీరు, వీరి సొత్తును వారు నాత్మాయత్తము నొనర్చుకొనుట ఒక పరిపాటి యైనది.

ద్విపద కావ్యమును ప్రబంధీకరించి ఆ కథను నవీన మార్గ కవితామండలమునకు (నియో క్లాసికల్ ఫీల్డ్) గొనిపోవలెనని ప్రబంధ కర్తలు ప్రయత్నింపగా ప్రబంధములను ద్విపదీకరించి ఆ యితివృత్తమును దేశికవితా భూమికి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



(పాప్యులర్ ఫీల్డ్) కొని తేవలయునని ద్విపద కర్తలు నుద్యమించిరి. ఈ వినిమయములో నొండొరులయెడ వారికి స్పర్ధమాత్రము లేదు. మాతృకను భక్తితో అనుసరించి తమ రచనలను తల్లిచాటు పిల్లలుగా కనుపరుపవలయు ననియే ఆ యనువాదకులు ముచ్చటపడిరి. ఈ జంటలో దేనిని పరిశీలించి చూచినను మాతృకలోని ఛాయలు ప్రతిఫలించుచునే యుండును. ఛాయలుమాత్రమే కాదు, ఆ పలుకులే వినబడుచుండును. ఒకరొకరికి నొండొరుల యెడగల అట్టి విధేయతకతముననే వారికి స్పర్ధ లేదనుట. స్పర్ధ లేకపోవుటయే కాదు, పరస్పర భక్తి గౌరవములును గలవు; లేనిచో ఇంత సంపూర్ణానుకరణమే పొసగదు.

కృతిపతియైన మామిడి ప్రెగ్గడయ్య కోర్కెను అనుసరించియో, లేక స్వబుద్ధిచేతనో పండితారాధ్య చరిత్రకు కూడ ప్రౌఢ పద్య వాఙ్మయమున ఉత్తమ స్థానము కల్పింపవలయునని శ్రీనాథుడు ఆ ద్విపదను పద్యప్రబంధముగా రచియించి యుండును.

ఇవి గాక, వల్లభామాత్యుని పేర శ్రీనాథుడు రచించిన ఇం కొక యపూర్వ గ్రంథము క్రీడాభిరామము. ఇది దశవిధ రూపకములలో ఒకటియగు 'వీథి' యనునది. గ్రంథముయొక్క అద్యంతముల వల్లభామాత్యుని పేరే యుండుట బట్టి అది శ్రీనాథ రచితము కాదనెడు మత మొకటి కలదు. కాని శైలినిబట్టి నూటికి నూరు పాళ్లు ఆ రచన శ్రీనాథునిదే అని సమర్థించు మత మిం కొకటి కలదు; అగుచో శ్రీనాథుడు వల్లభామాత్యుని పేరు ఏల పెట్టవలసి వచ్చిన దను ప్రశ్నకు సమాధాన మూహింపవలెను. నా యుద్దేశ మిది: దీనిని రచించు నాటికి శ్రీనాథుని వయసు చెల్లినది. చిన్ననాడు ముచ్చటకై చమత్కారమునకై పరిహాసమునకై చెప్పిన శృంగార పద్యములవంటివి ఆ యపర వయస్సున మరల వ్రాయుటకు ఆయనకు మనసు గొలిపి యుండదు. ఇతివృత్తమున నుదాత్తతయు, నైతిక నిష్ఠయు లేని యా గ్రంథమును తెనిగించుట కీర్తికి కారణము కాదని సందేహింపగా మూల గ్రంథమయిన 'ప్రేమాభిరామము'నెడ తనకు గల యాదరమునుబట్టి వల్లభామాత్యుడు అనువాదమువలన వచ్చు కీర్త్యపకీర్తులు వహించుటకు తానే తలపడి దానికి తన పేరు పెట్టించుకొని యుండును. కవి పండితులకు ఆశ్రయ మిచ్చు సంపన్నతయు, అధికారమును గల వానిని సామాన్య కవిని వలె నాక్షేపించుటకు పండితులు సాహసింపరు. వారు సాహసించినను ఆ యధికారి లెక్కచేయడు.

శ్రీనాథుని శృంగారనైషధముతో ఆంధ్ర వాఙ్మయమున నొక క్రొత్త శక మారంభ మయినది. సంస్కృతము నందలి పురాణేతిహాసములు, కావ్యములు, నాటకములు అనెడు ప్రధాన వాఙ్మయ శాఖలు మూడింటిలో పురాణేతిహాసముల ఆంధ్రీకరణ పద్ధతి భారత రూపమున కవిత్రయమువారే నిర్ధారణ చేసిరి. ఈ శాఖానువాదమునకు అంతకంటె మంచి మార్గము లేదు. భారతమును భాషాంతరీకరణ మనుకొనుటయే తగదు. నన్నయాదులు వ్యాస భారతమునుండి కథను మాత్రము ప్రధానముగా తీసికొని స్వతంత్రరచనయే సాగించిరి. ఎడనెడ కథాను సరణమును గూడ పాటింపక కొన్ని మార్పులు, చేర్పులు కూడ జేసిరి. శ్లోకము లన్నియు వరుసగా తెలిగింప వలెనని కాని, అనుకరించిన శ్లోకములలోని యర్థ మంతయు తెనుగున రావలయునని కాని వారు పాటుపడలేదు. తెలుగు భారతములో ఈ పద్యమునకు ఇది మూలశ్లోకమని భారతము నుండి సరిగా నిర్దేశించి చూపుట వృథా పరిశ్రమమే యగును కాని కడముట్టు ప్రయత్నము మాత్రము కాజాలదు. కొన్ని శ్లోకములు తెలిగింపబడినట్లు పొడకట్టినను అవి కథానువాద ప్రవాహమున దొరలు కొనుచు తమంత వచ్చినవే కాని ఆ కవులు వాని నేరి చేపట్టి తెలుగు చేసినవి కావు. కావుననే ఆంధ్ర భారతము కథానుసరణరూపమయిన అనువాదము. పురాణేతిహాసములకు అదియే ఉత్తమ పద్ధతి. ఎట్టి దీక్ష వహించినను ఆ సారస్వత శాఖను యథా మాతృకముగా భాషాంతరీకరించుట పొసగదు.

ఇక — శ్రీనాథుడు చేపట్టిన నైషధము భారతము వంటిది కాదు. అది సంస్కృత మహాకావ్య శాఖలో ఒక ప్రౌఢ మహాకావ్యము. కావ్యమున ప్రతి శ్లోకమును ప్రధానమే యగును. ప్రతి శబ్దార్థమును పరిగణనీయమే యగును. అందును చిత్ర విచిత్రములును, ఆశ్చర్యజనకములును, ఉదాత్తములును, అత్యుజ్జ్వలములును అయిన యర్థకల్పనలు, శబ్ద చిత్రములు గల శ్రీహర్షుని నైషధమును ఆంధ్రీకరించుటలో సామాన్యులకు ఏయొక్క శ్లోకమును గూడ పరిహరింప దగినదిగా పొడకట్టదు. పరిహరించుట అసమర్థత యగునేమోయని బెదరు పుట్టించును. ఇట్టి మహాగ్రంథమును శ్రీనాథుడు చేపట్టి సంస్కృతాంధ్రీకరణ ప్రక్రియలో పురాణేతిహాసానువాద భిన్నమయిన ఒక నూతన పద్ధతిని తీర్చెను. ఈ కవి మూలము ననుసరించుచున్నట్లే కనబడును కాని దానికి బద్ధుడుమాత్రము కాడు; శ్లోకార్థమును తన పద్య గర్భమున నిముడునట్లు చేయును కాని, పద్యార్థమును శ్లోకము గ్రసించునట్లు చేయడు; అనుచిత



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మని కాని, యనావశ్యకమని కాని తోచినచో ఎంత గొప్ప శ్లోకము నైనను త్యజించుటకు వెనుదీయడు; అవశ్యకమని తోచినచో యథాతథముగనే కాక యథాతథరముగాకూడ అనువదించి చూపగలడు. ఏ శ్లోకమున నేకావ్యగుణ ముండునో ఆ గుణమును అనువాదకుడును తన రచనలో గొనిరావలయును. ఈ కొనివచ్చుట శ్రీనాథునకు నల్లేరు పై బండి నడక. చిత్ర చిత్ర గతులలో ఆయన ఈ యనువాద మును నిర్వహించియున్నాడు. ఒక్కొక్కప్పుడు అయిదారు శ్లోకములలోని భావముల నొక సీస పద్యములో పొదిగి చూపును. ఒక్కొక్కప్పుడు ఒకటి రెండు పదముల లోని యర్థమును గ్రహించి దాని నొక పాదములో విరియించి గుబాళింపజేయును. మరియొకప్పుడు నాలుగు శ్లోకముల యర్థమును నాలుగు సీసపాదములలో నిమిడ్చి తదనుగుణమయిన భావకల్పన చేసి ఎత్తుగీతి ముగించును. దీనిమూలమున కావ్యానువాదకుడు దాస భావముతో మూలమునకు ఛాయగా తన కావ్యమును అనువదించి నప్పటికిని తన ప్రతిభా పాండిత్యములను వ్యక్తము చేసి కొనుటకు అవకాశము లేకపోలేదని ఈయన నిరూపించి యున్నాడు. మొత్తముమీద స్వతంత్రానువాదమా, అస్వతంత్రానువాదమా, కథా ప్రధానమా శ్లోక ప్రధానమా యన్నచో నిదమిత్థమని చెప్పలేని ఒక యపూర్వ రచనాక్రమమును సాగించి అర్వాచీన కవు లందరకు సంస్కృత శ్లోకానువాదమునకు పటిష్ఠమయిన వరవడి పెట్టెను. ఈ యనువాద నిర్వహణార్థము తాను కల్పించు కొనిన ప్రణాళికకు ఆయనయే గ్రంథాంతమున వివరణము వ్రాసెను. శ్రీనాథుడు కాక మరి యేకవియైనను తొలుతగా నిట్టి సంస్కృతానువాదమునకే పూనుకొనినచో అది యే వక్రమార్గము పట్టి పోయెడిదో యూహింప రానిది. కావ్యానువాదకర్త వివేచింప వలసిన ప్రధానాప్రధాన తలకు, పాటింపవలసిన శ్లోక సంస్కరణలకు శృంగార నైషధము లక్ష్యభూత మయినది. ఇదియే కాక ఆయన యే సంస్కృత శ్లోకమును తెలిగించినను అందు ఈ పద్ధతియే గోచరించుచుండును. పాషాణములవంటి మయూరుని సూర్యశతక శ్లోకములు ఈయన సీసపద్యపు మూసలలో మైనమువలె కరగిపోయిన[?] ...రవిలాసమున ననుసరించిన కాళిదాస శ్లోకములలోని భావముల కెడనెడ క్రొత్త ...ందములు దిద్దగలిగిన దిట్టతనము ఈ బ్రాహ్మీదత్త వర ప్రసాదునకే చెల్లినది. సంస్కృత కావ్యానువాదమునకు శ్రీనాథుని చేతిలో ఈ ప్రబంధ పూర్వయుగమున నపూర్వ మయిన, పటిష్ఠమయిన ఘంటాపథములు తీర్పబడినవని చెప్పుటకే ఈ వివరణ మంతయు.

కావ్యగౌరవమ్మున క్రీడాభిరామము ఈయన ఇతర కావ్యములతో సాటికి రాకపోయినను దాని కొక ప్రత్యేక స్థానము లభించినది. ఆంధ్ర వాఙ్మయములో వెలసిన మొట్టమొదటి హాస్యకావ్య మిది. నలక్షణమయిన మొదటి రూపకము కూడ నిదియే. శ్రీనాథుని సరస పరిహాస రసికతయే ఈ క్రీడాభిరామ రచనకు హేతువు. సంఘములో గల లోపములను, మనోదౌర్బల్యము గలవారి ధర్మవ్యతిక్రమమును కవి ఇందు పరిహాస పూర్వకముగా ఎత్తి చూపును. ఆ చూపుటలో నొక సన్నని మందలింపు గోచరించు చుండును. అంతేకాని, వాని పట్ల కవి యుగ్రుడై శపించి శిక్షించుచున్న ట్లుండదు. ఇందు రెండవ ప్రతాపరుద్రుని కాలమునాటి ఓరుగంటి ప్రజల జీవితము, ఆ నగర మందలి వీథులు, విపణులు, పూటకూటిండ్లు, వేశ్యావాటములు, దేవతలు, దేవరలు — మున్నగు సమస్త చరాచరములను వర్ణితములయినవి. ఓరుగల్లు పట్టణ మంతయు ఇందు స్పష్టముగా ప్రతిబింబితమై, ఈ రచనకు చక్కని సాంఘిక కావ్య మను పేరు తెచ్చినది. ఉత్తర కాలమున చంద్రరేఖా విలాపాదులు బయలుదేరినవి. కాని, అందు ఇట్టి యుదాత్తత లేదు. అవి కేవలము వ్యక్తిగత దూషణములతో నిండియున్న బూతుల బుంగలు. సంస్కృత పురాణేతిహాస కావ్య నాటకానువాదపరంపరలో కావ్య నాటకములను ప్రథమమున ననువదించినవాడు శ్రీనాథుడు. ఆయన చేపట్టిన కావ్యము నైషధము. రూపకవిశేషమగు ప్రేమాభిరామమునకు క్రీడాభిరామము అనువాదమని గ్రహించినచో శ్రీనాథుడు ప్రథమ రూపకానువాదకుడగును.

ఆంధ్రదేశపరములగు శ్రీనాథుని కృతులలో క్రీడాభిరామ మొకటి. ఇం కొకటి పలనాటి వీరచరిత్ర. ఇది యొక వీర గీతము. శ్రీనాథుని యుగమున ఇట్టి కవిత్వమునకు చెందిన గ్రంథము పలనాటి వీరచరిత్ర యొక్కటియే. పద కవిత్వముపై కొందరికి చిన్న చూపున్నను జాత్యభిమానమును, దేశభక్తిని ప్రజలలో పురికొల్పుటకే పదములను మించిన సాధనము వాఙ్మయ ప్రక్రియలలో వేరొకటి లేదని చెప్పవచ్చును.

సూక్ష్మముగా చూచినచో ఏ వాఙ్మయమునందయినను పద్యకవిత్వముకంటె పదకవిత్వమే ముందు పుట్టి పెరుగునని చెప్పవచ్చును. చిత్ర విచిత్ర కార్య కమనీయమగు ప్రకృతి చిద్విలాసమును చూచి యానందపరవశులైన ప్రాక్తన మానవుడు చిందులు త్రొక్కుచు పాడిన పాటయే మానవ లోక కవితావిర్భావమునకు శ్రీకారము. ఆడుచు పాడినది కావున, ఆ కవిత్వమునకు 'నృత్తగీతము' అని పేరు.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



'నృత్తగీతము' అనుటతోడనే ఇందు మూడు భిన్న కళాంశముల ప్రసక్తి గోచరించును. ఇందుగల క్రియా విశేషములు అడుగు వేయుట, రాగము తీయుట, మాట పలుకుట అనునవి. శాస్త్ర పరిభాషలో నీ మూడును నృత్తము, గీతము, శబ్దము అయినవి. వీనిలో శబ్దమే కవితాద్రవ్యము. తక్కిన రెండును ఉపస్కారకములు. కాలక్రమమున ఈ మూడంశలును మూడు భిన్న శాఖలై నాట్యము, సంగీతము, పద్యముగా పరిణమించినవి. తొలి నాటి కవిత్వమునకు సాహచర్యము నెరపిన నృత్త గీతములలో నృత్తమును పూర్తిగను, గీతమును కొంతవరకును తొలగించి, కవిత్వమునకు ప్రధానాంగమయిన శబ్దము తన రాజ్యమును తానే యేలుకొన జొచ్చినది. అదియే పద్య కవిత. ఈ రాజ్యములో నృత్తమునకు ప్రవేశమే లేదనుట యెల్లరకును విశదమే. గీతికి మాత్రము ప్రత్యక్షమయిన అధికారము కొంత కలదు. గీతి గతమయిన యే లయని బద్ధత కలదో అదే పద్యగత మయిన ఛందస్సు. ఈ ఛందస్సుకతముననే పద్యపఠనవేళ మధురమయిన యొక గీతి విశేషము వ్యక్తమగుచుండును. ఇది వచన పఠనముకంటె భిన్నమయినది. పాటగా పుట్టిన కవిత్వము పద్యముగా పరిణమించుటలో నృత్తమును వలె గీతమును కేవలము విసర్జింప లేకపోయినది. దానిని సయితము విసర్జింప వచ్చునని రుజువు చేయుటకు పుట్టినదే వచనము. ఛందస్సును వదలుటవలన గద్యము కవిత్వ మనిపించుకొనునా లేదా యన్న ప్రశ్న వేరు. తన రాజ్యమగు కవిత్వమున తానే సర్వాధికారమును నెరపుటకై శబ్దముచేయు కృషి యెంత దూరము పోయినదో చూపుటకు మాత్రమే ఇది ప్రస్తావింపబడినది.

గీతికి అప్రత్యక్ష సంబంధముకాక ప్రత్యక్షాధికారమే యొసగిన కవిత్వము పదకవిత్వము. పదజాతికిని పద్యజాతికిని ప్రధానమగు భేద మిదియే. ఈ పదజాతిలో నింకొక శాఖ కవిత్వాంశకంటె గానాంశకే యెక్కువ ప్రాధాన్య మిచ్చి గేయ కవిత్వ మనెడు వ్యపదేశమును తాల్చినది. గీతి నంగీకరించియు కవిత్వాంశకే యెక్కువ ప్రాధాన్య మిచ్చిన రెండవ శాఖ జాతివాచక మయిన పదకవిత్వము పేరనే నిలిచి యున్నది. వీనిలో మొదటిదాని సంచారము రాగ, తాళ ప్రధానమయిన సంగీత కళాజగత్తున; రెండవ దానిప్రవర్తన భావనా ప్రధానమయిన సారస్వత శిల్పలోకమున. ఈ రెండు శాఖలనుండియు మరల పెక్కు చిలవలు, పలవలు పుట్టినవి.

ఛందోవ్యాకరణాది నియమ నిష్కర్ష, శైలీ ప్రౌఢి, ఇతివృత్తోదారత, విజ్ఞానాధాయకత మున్నగు ఇతర కవితా మహాంగములను సంతరించుకొని, నాగరకమై పద్య కవిత్వము ప్రౌఢసాహిత్య మనుపేర విద్వల్లోకమున స్థిర ప్రతిష్ఠ సంపాదించును. పదకవిత్వము, ఎంత నిసర్గ మధురమును, నిరాడంబరమును అయినను ప్రౌఢ వాఙ్మయమున స్థాన మాసింపక, గాలిలోనే పుట్టి గాలిలోనే సంచరించుచు పుట్టుక దార్ఢ్యమును బట్టి కొంత కాలము సజీవమై యుండును. ఇదియే మనలో శుద్ధ దేశికవిత్వ మనిపించుకొన్న శాఖ. దీనికిని సారస్వత ప్రతిష్ఠ సంపాదించి స్థిరత్వము నెలకొల్పుటకై పలువిధముల పాటు పడిన సంస్కర్తలే ద్విపద కావ్యకర్తలు. పాడదగిన పద కవిత్వమునెడ నొక కంటిని, పఠన యోగ్యమయిన పద్య కవిత్వము నెడ రెండవ కంటిని పెట్టి యుభయగుణములను ఏకము చేసి వారు పచనము చేసిన రసాయనమే ద్విపద కవిత్వము. ఇది గేయమును అగును; పాఠ్యమును [illegible]పను. ఈ వాఙ్మయశాఖ నిసర్గ మాధుర్యము తోడి యుదాత్తతకు, నిరాడంబరత్వముతోపాటు విజ్ఞానాధాయకతకు, సౌలభ్య సహితమయిన శైలీ ప్రౌఢికి కూడలియై, దేశీయమయిన శుద్ధ పద కవిత్వమునకు, సాంస్కృతికమయిన ప్రౌఢ సాహిత్యమునకు సామరస్యము కలిగించి యుభయతారక మయిన కావ్యపథమును తీర్చి దిద్దినది.

వాఙ్మయము అనేక ప్రక్రియలు గలది. ఒక్కొక్క ప్రక్రియ యొక్కొక్క ప్రయోజనమును సాధించుటకు సమర్థమై యుండును. వీని గుణములను వేర్వేరుగా నిర్ణయింప వలసి యుండును. సాహిత్యోపాసకుడు వాఙ్మయమందలి భిన్నప్రక్రియలు తమ తమ ప్రయోజనములను నెరవేర్చుట చూచి ఆనందింపవలయును. వారి వారి విద్యాసంస్కారముల యంతరములను బట్టి ఆయా ప్రక్రియలు ఆనంద మొసగును. ఒక ప్రహసనము మహానాటకమునకు సాటి రాక పోవచ్చును. కాని యొక వర్గమున కది నాటకమును మించి యానంద మొసగు ననుట మరువకూడదు. మన ప్రాచీనులు పదకవిత్వమును పాడుకొనుట కుద్దేశించిరేకాని గ్రంథస్థముచేసి పారాయణచేయుటకు కాదు. సూక్ష్మ పరిశీలన వలన నీపద కవిత్వమున స్వచ్ఛమయిన జానపద సంప్రదాయములు, ఆచార వ్యవహారములు, నానుడులు, లోకోక్తులు మొదలగునవి అనేకములు గోచరించును. ఆంధ్ర సంస్కృతి చరిత్రకారునకు ఈ పదకవితా పఠన ముపేక్షింపరాని యుత్తమ సాధనము.

అఖండపాండితీసంపన్నుడయి, ప్రౌఢసాహిత్య నిర్మాతయైన శ్రీనాథకవి ఆ విద్వత్కవిపదమునుండి దిగివచ్చి, సామాన్యజనులకు చెలిమికాడై పదకవిత్వము నాదరించి పలనాటి వీర చరిత్ర రచియించియు, పిచ్చుకుంటులకు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పదములు, సుద్దులు వ్రాసి యిచ్చియు అచ్చమయిన దేశికవి యనిపించుకొనెను. ఆయనకు గల అతివేలమయిన ఆంధ్ర జాతీయాభిమానము పొంగులువారి ఆయనచే నిట్టి రచనలు చేయించినది. ఆంధ్ర కవిత్వ రథమును ప్రబంధ మార్గములకు త్రిప్పగలిగిన ప్రతిభ, అనువాద విధానమున క్రొత్తదారి తీర్పగలిగిన నేర్పు, ఒకచేట విద్వజ్జన రంజకముగు ప్రౌఢ కవితా నిర్మాణము చేసి, యొకచేట సామాన్యులకు ప్రీతిపాత్రమయిన పదరచనలు చేయగలిగిన బహుముఖ రచనాదక్షత మున్నగు ఈ మహాగుణములు శ్రీనాథుని సొమ్ములు.

ఈ మహాకవి యుత్తరకాల కవులకు పెట్టిన వరవడులలో శైలికి సంబంధించినది యొకటి. ఆంధ్ర వాఙ్మయమున సతుర రమ్యత సాధించిన కవివర్గ మొకటియు, అర్థగౌరవమును పాటించిన కవి వర్గ మొకటియు స్థూల విభాగమునకు గోచరించును. ఈ రెండు విధములయిన గుణములను సమముగా సమ్మేళన మొనర్చి — శబ్దార్థములు రెంటికిని ప్రాధాన్య మిచ్చిన శిల్పియు శ్రీనాథుడే. ఈ వరవడిని సరిగా ననుకరించినంత కాలము కావ్య ప్రక్రియ సరసముగనే నడచినది. పోను పోను అర్థ గౌరవము సన్నగిల్లిన కేవల శైలీ రమణీయతకే ప్రాధాన్యము నిచ్చిన ప్రక్రియలు వాఙ్మయమున వెనుకబడినవి.

మొత్తముమీద ఈ యుగమున సారస్వత సింహాసన మధిష్ఠించి, కవితా పరిపాలనము చేసి లోకజ్ఞుడు, వ్యవహార దక్షుడునై ఆంధ్ర వాఙ్మయమున నన్యకవి దుర్లభమయిన రాజభోగముల ననుభవించి, పదునైదవ శతాబ్దియందలి ఆంధ్రదేశ చరిత్రలో అత్యంత ప్రధాన పాత్రయై శాశ్వత యశస్సును దక్కించుకొన్న మహాపురుషుడు శ్రీనాథుడు.

శ్రీనాథుని సమకాలికులలో అగ్రగణ్యుడయిన మహాకవి పోతన. శ్రీనాథుడు కవిసార్వభౌముడు కాగా, ఈయన కవిప్రవక్త యైనాడు. ఆంధ్ర వాఙ్మయమున వెలసిన కవిప్రవక్తలలో ప్రథముడు తిక్కన; రెండవవాడు పోతన. మహాభక్తుడు, మహాకవియునై పోతన రసమూర్తియగు శ్రీకృష్ణ తత్త్వమును నాన్యతసాధ్యముగా గానముచేసి ఆంధ్రుల మనోలోకమున నద్భుతమగు పరివర్తనమును గలిగించెను. కృష్ణతత్త్వము వంగదేశమున కూడ చైతన్యస్వామిచే ప్రబోధింపబడినది. చైతన్యుని కంటె సుమారు ఏబదియేండ్లు పూర్వుడు పోతన. కావున వంగదేశముకంటె ముందే ఆంధ్రదేశమునకు కృష్ణతత్త్వ విషయమగు విజ్ఞాన మందినది.

పోతనామాత్యకృతమగు భాగవతమునకు బహుకర్తృకత ఘటిల్లినది. దీని కిదమిత్థమని చెప్పుటకు చాలిన హేతువులు లేవు. పలువురు పలుహేతువులు చెప్పిరి. కాని దేనిని నిశ్చయముగా నంగీకరించుటకు పొసగదు. ఆంధ్రులకు ఆమ్నాయకల్పములయిన భారత, భాగవత, రామాయణములు బహు కర్తృకములు కావలయునని విధి సంకల్పమేమో యనుకొనుటయే వివాదాస్పదము కాని హేతువుగా గ్రహించుట సుకర మనిపించును; అనగా, భాగవతమున నాయా కవులు రచించిన భాగములను నిష్కర్షగా నిర్ణయించి చెప్పుట కష్ట మన్నమాట. అందలి కొన్ని భాగము లుత్పన్నమయిన పిమ్మట వ్రాయబడినవి కాక, పోతన జీవితకాలములోనే ఆయన యనుజ్ఞపై ఆ కవులచే వ్రాయబడి యుండునని నా యుద్దేశము. కవి తన కభిమానము గలవారికి తన కావ్యములో గొన్ని భాగములను వ్రాయుడని పంచి యిచ్చి వారి నా కావ్య నిర్మాణ సుకృతమున భాగస్వాములుగా జేయుట మన వాఙ్మయమున క్రొత్త కాకపోవుటయే ఈ యూహకాధారము. పోతనకు పూర్వమే భారతము, రామాయణము, మార్కండేయ పురాణము, విష్ణుపురాణము, నృసింహ పురాణము తెనిగింపబడినవి. భాగవతమును పూర్వ కవు లనువదింపక విడిచియుండుట తన పురాకృత శుభాధిక్యమని పోతన భావించెను. 'పునర్జన్మము లేకుండ' దానిని తెనిగింతునని ఆయన ఆ పురాణమును చేపట్టెను. అనువాద విషయమున శ్రీధరవ్యాఖ్యను గూడ నాధారముగా దీసికొనెను. కొన్ని కొన్ని వేదాంత విషయములను వివరించునప్పుడు శ్రీధర వ్యాఖ్యాన పంక్తులు కూడ తెనిగింపబడినవి. భగవద్వర్ణన ఘట్టములలో పరవశుడై ఆయన మూలమును మించి వర్ణించును. అందుచే సంస్కృత భాగవతముకంటె తెనుగు భాగవతము పెంపు గాంచినది.

రామాయణముకంటె, మార్కండేయాది పురాణములకంటెను మాత్రమేకాక భారతముకంటె గూడ భాగవత మధికతరమగు ప్రచారమును దేశమున గడించు కొన్నది. భారతము కావ్య శిల్పగౌరవమున భాగవతమును మించినను సార్వజనీనమయిన యనురంజకత్వమున మాత్రము దానిని మించలేకపోయినది. దీనికి గారణము లివి :

1. సంసార తరణోపాయముగా భారతము నిర్దేశించిన నిష్కామ కర్మయోగము సర్వ జనులకు నాచరణ సాధ్యమయినది కాదు. అది పరిపూర్ణులకే తగినది. అది యుత్తమోత్తమ మార్గ మనుటకు సందియము లేదు. కాని లోక మంతయు దాని ననుసరింప గలదని చెప్పలేము. దానికి తగిన సంస్కారబల మున్ననే తప్ప ఆదారి త్రొక్కి ప్రయోజనము లేదు. భాగవత మట్లు కాదు; సర్వజన



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సుకరమగు భక్తియోగమునకు ప్రాధాన్య మిచ్చి దానిని స్పష్టముగా నాదేశించెను. జ్ఞాన విజ్ఞానములకై ప్రయాస పడనక్కరలేకుండ ఈ మార్గమును పట్టుకొని పోయినచో గమ్యమును చేరగలమను విశ్వాసముతో అందరును దీని నాశించుటలో ఆశ్చర్యము లేదు. కాగా సాధారణ ప్రజల సంస్కారమునకు, మనోగతికి అనుగుణమును, హితమును అయిన మార్గమును చూపించిన గ్రంథ మగుటచే భాగవతమునెడ లోకమున కిట్టి భక్తి తాత్పర్యములు కుదురుకొన్నవి. ఆపత్సమయములందు గజేంద్ర మోక్షము నాంధ్రులు పారాయణము చేయుటకు, భగవద్గీతవలె గోపికా గీతలను పఠించుకొనుటకు ఇదియే హేతువు.

2. భారత భాగవతముల నిర్మాణమునందు కూడ భేద మున్నది. భారతమునందలి కావ్యశిల్పము తెలియవలయు నన్న సర్వకళావేత్తృతయు, ప్రౌఢ రసికతయు కావలయును. భారతమూర్తి నిర్మాణ మట్టిది. అందు తిక్కన ఘట్టములకేకాక యొక్కొక్క పద్యమునకు నయిత మెంత ప్రాధాన్యము వలయునో యంతమాత్రమే యొసగి రచన సాగించినవాడు. సర్వాంగ సౌష్ఠవము గల అఖండ భారతమూర్తియెడ ఆయన తన దృష్టిని లగ్నము చేసెను. కాని కేవలము పద్యముల సొగసుకొరకు పద్యములు వ్రాయలేదు. అవయవముల కవయవితో పొత్తు చెడకుండ చూచుచు అంతటి బంధురమయిన కూర్పు చేయుటచేతనే, భారతమున సందర్భమునుండి వేరు చేసి తెచ్చి పాడుకొనుటకు పద్యములు దొరకవు. భాగవత పద్యములు మధురాతిమధురములై, అలవోకగా నే పద్యము నందు కొన్నను పాడుకొనుట కనువుగా నుండును. ఈ పద్యము లందలి శ్రుతిలయలు విస్పష్టముగా చదివినంతనే మనస్సునకు హత్తి యానంద మిచ్చును. భజన కీర్తనలు, పలపదములు మున్నగువానివలె ఇవి యెల్లరకు వినినంతనే పారవశ్యమును గొల్పుచుండును. భారత పద్యములలో గల శ్రుతి లయలతో శ్రవణము పరిచయ మగుటకు కొంత పరిశ్రమ కావలయును. ఉత్తమ మధుర కావ్యమునకు ప్రధానాంగములలో నొకటియగు గీతిగుణము భాగవతమున ఎచ్చట పట్టినను చేతి కందుచుండును. పుష్కలమయిన ఈ గీతిగుణముకూడ భాగవత వ్యాప్తికి చాలవరకు దోహదము చేసినది.

3. ఇక ఆంధ్రలోకమునకు పోతనయెడ గల పూజ్య భావము కూడ మరియొక కారణము. ఆయన యనుభవించిన దారిద్ర్యము, దానితో జీవితాంతము వరకును పోరాడ గలిగిన ఆయన చిత్తస్థైర్యము లోకమున కాశ్చర్యకరములై యట్టి భావమును కల్గించినవి. శ్రీరామచంద్రుని సాక్షాత్కరింప జేసికొన గలిగిన మహానుభావుడనియు, సరస్వతీదేవి నూరడించగలిగిన మహాభక్తుడనియు లోకమునకు ఈయనయెడ అతివేలమయిన గౌరవము. ఇట్టి కారణములవలన భాగవతమున కీ యనన్యమయిన వ్యాప్తి గలిగినది.

కవిబ్రహ్మ రచనయందు నాటకీయ విన్యాస మెంత పుష్కలముగా నడుగడుగునకు గోచరించు చుండునో, పోతన రచనయందు భావ కవితాస్ఫూర్తి యంత బంధురముగా పద పదమునను కన్పట్టుచుండును. భక్తిశృంగార నిర్వహణమున పోతన అతిమాత్రమునకు పాల్పడుచుండును. ఈ భావలోలతయే ఆంధ్ర భాగవతము సంస్కృత భాగవతము కంటె విరివి యగుటకు హేతువు. ఈ విషయమున పోతనను బోలినవాడు మన వాఙ్మయములో పాల్కురికి సోమనాథు డొకడే. కాని యాతని రచనయందు వీరశైవావేశస్ఫూర్తి పట్ట పగ్గములు లేక దూకుచుండును. పోతన శివ కేశవ భేదము లేని యద్వైతి యగుటచే నీ సంకుచితత్వము ఆయన రచనకు పట్టలేదు. కాగా ఆయన రచన సర్వజన సమ్మత మయినది. భాగవతమందలి శృంగారము విశిష్టమయినది. అది ప్రబంధశృంగారమువంటిది కాదు.

శ్రీనాథునితోపాటు శైలి విషయమున ఉత్తరాంధ్ర కవులకు వరవడి పెట్టిన గౌరవమును పోతనయు కొంత తక్కించుకొనెను. ఛందోబద్ధమగు శబ్దము శ్రుతిలయలను ఎంతవరకు సాధింపగలదో యుదాహరణ పూర్వముగా చూపినవాడు పోతన. అప్రయత్న సాధితము, అనన్యము నయిన ఈయన శబ్దాలంకార ప్రయోగము దానికి మెరుగులు దిద్దినది. భాగవత గానమునకు పోతన తరచు ప్రయోగించు అనుప్రాసాలంకారము మృదంగ వ్యాపారము నిర్వహించినది. భక్తి శృంగార భావగానమునకు మధురమయిన శబ్దము తాళముగా శబ్దఘటనలో సముచితమగు అంత్యప్రాసము మృదంగ ధ్వనిగా చేసి ఆంధ్రలోకమును రస పారవశ్యమున నోలలాడించిన అతిలోక వైణికుడీ మహాకవి. ఎడతెగని ధారగా, శ్రవణపేయమైన శబ్దసంధానముతో, ప్రసన్న మధురమయిన భావఫణితితో, రసస్యందిగా పద్యరచన చేయుటయే ప్రబంధ కవుల కీయన యిచ్చిన శిక్షణ. ఉక్తి చమత్కృతి, బహువిధ కారక విన్యాసము, నడకల తీవి, పరస్పరము తీసిపోని శబ్దార్థ గుంఫనము, గాంభీర్యము మున్నగు లక్షణములు శ్రీనాథుడు పెట్టిన భిక్ష. ఈ యుగమున పురాణేతిహాసోచితమయిన సాధుత్వము తగ్గి అలంకారిక శైలి నెలకొనుట యొక విశేషము. ఈ శైలిని దిద్దినవారు ఈ యిరువురు మహా



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కవులును. ప్రబంధములు తమ ప్రత్యేక లక్షణములుగా చెప్పుకొనగలిగిన వానిలో పురాణేతిహాస శైలీ భిన్నము, క్రమ పరిణతము నగు ఈ యాలంకారిక శైలి యొకటి. ప్రబంధ కవితా రాజ్యమేలిన శృంగార రసమునకీ శైలి మంత్రిత్వము నెరపినది. ఈ శైలి సాహాయ్యముతో ఆ రసము మరింత శోభిల్లినది.

ఆంధ్ర వాఙ్మయమునకు తిక్కన, పోతనలు సూర్యచంద్రులవంటివారు. ఆంధ్ర దేశమునకు వీ రిరువురును రెండు వెలుగులు. తెలుగు వేదము లనదగిన రెండు మహా గ్రంథములను ఆంధ్రులకు ప్రసాదించిన ఆచార్యమూర్తులు, ప్రవక్తలు నైన ఈ మహానుభావులలో ఒకడగు పోతనను వెలయించుకొనిన మహాభాగ్యము ఈ పూర్వ ప్రబంధ యుగమునకు దక్కినది. ఈ యుగమున కిదియు నొక విశిష్టతయే.

భాగవతము కాక పోతన పేర భోగినీ దండకము, వీరభద్ర విజయము, నారాయణ శతకము ప్రచారమున నున్నవి. వీని కర్తృత్వ విషయమునను వివాదము లున్నవి.

భోగినీ దండకమున సర్వజ్ఞ సింగభూపాలుని యెడ భోగిని యను నొక వేశ్య పొందిన విరహము వర్ణితమయినది. దండకమున పోతన పేరు లేదు. కాని గ్రంథాంతమున దీనిని పోతన రచియించినట్లు తెలిపెడు పద్యమొకటి యున్నది. ఈ దండకమునకు పోతన కర్తృత్వము కొందరంగీకరింపక పోవుటకు హేతు విది. జీవితములో అనేక కష్ట నష్టముల కోర్చి, తన కృతిని నరాంకితము చేయనని ప్రతిజ్ఞ పట్టిన పోతనవంటి మహాభక్తుడు సింగభూపాలుని వేశ్యపై దండకము రచించె ననుటకు మనస్సు ఒప్పక పోవుటయే. కాని దండకమున ప్రత్యక్షరమును పోతన కర్తృత్వమునే ఘోషించుచున్నది. పోతన రచనావాహినికి తరంగఘోష వంటి అనుప్రాసాలంకారము ఈ దండకమున గూడ పరిస్ఫుట మగుచున్నది. అంత యప్రయత్నముగ ఈ యలంకారము దొరలుట పోతన రచనయందు తక్క వేరొకచోట కానరాదు. ఇతర కవుల కిది ప్రయత్న సాధ్యము. ఈ దండకమున నిది ప్రయత్న పూర్వకమనుట పొసగదు. పరమ స్వల్పమయిన ఇతివృత్తము; ఏకైకావస్థా వర్ణనాత్మకత, ఏకగణబద్ధ రచన గల యీ దండకములో పోతన కవితాసంబంధులగు నితర లక్షణములను చూపి నిర్ణయించుట కవకాశము లేకపోవుటచే కేవల శబ్ద సంబంధియగు ఈ లక్షణమును ప్రబల ప్రమాణముగా గ్రహింపక తప్పదు. మరియు నింత చక్కని దండకమును రచించి యే కవియో తనకు దక్కవలసిన పేరును పోతనకు ధారవోసె ననుటయు నమ్మదగిన విషయము కాదు.

ఇంతకు - భోగినీ దండక రచనవలన పోతన కీర్తికి కళంకము కాని, ఆయన భక్తికి మాలిన్యము కాని అంటదు. చిన్న తనములో విద్వాంసుడును, ప్రభువు నగు సింగభూపాలుని కోరిక మన్నించి అతని ముచ్చటకై పోతన ఈ దండకమును రచియించె ననుటలో దోష మేమియు నుండదు. గ్రంథమును నరాంకితము చేయరాదను నియమము వయః పరిణామమును బట్టి కలుగు సంస్కారములలో నొకటి. కాబట్టి చిన్న వయసున పోతన నరాంకితముగా ఇట్టి దండకమును రచించుటలో వైపరీత్యము లేదు. ఆంధ్ర వాఙ్మయమున పెక్కురు కవులు రాజుల కోరికపై వారి ప్రియురాండ్రను గూర్చియో, దేవేరులను గూర్చియో శృంగార పరములగు దండకములను చెప్పుట వింత కాదు. ఆనాటి వేశ్యలకు రాజాస్థానములలో గౌరవ ముండెడిది. వారి విద్యాసంపత్తియే వారి కట్టి గౌరవస్థానమును సంపాదించి పెట్టినది.

పోతన వీరభద్ర విజయము రచియించె ననుట కాధార మొక పుక్కిటి పురాణము. దక్షాధ్వర కథా ప్రసంగమున భాగవతములో చేసిన శివనిందా పాపపరిహారార్థము వీరభద్ర విజయమును రచించినట్లు తెలిపెడు పద్యమొకటి గ్రంథాంతమున గలదు. అది విశ్వసింపరానిది. భాగవత రచనానంతరము పోతన ఈ గ్రంథమును రచించె ననుట నమ్మదగిన విషయము కాదు. గ్రంథావతారికలో ఇవటూరి సోమగురుడు 'పిన్నవాడనను వెరపు మానుము. నా ప్రసాదమహిమచే నెంతయైన గవిత చెప్పగలవు' అని పోతనతో చెప్పినట్లు గల పద్యమునకును, గ్రంథాంతము నందలి పద్యమునకును పొత్తు కుదురదు. భాగవతమున పోతన శివనింద చేసె ననుట కాధారము లేదు. అందలి శివనింద దక్షవాక్యమే కాని కవివాక్యము కాదు. ఈ గ్రంథము నిజముగా శివనిందా పాప పరిహారార్థమే వ్రాయబడినచో ఇందుకూడ దక్షుని నోట శివనింద చేయబడినదే! దీనికి పరిహార మేమి? భాగవత రచనానంతరము వీరభద్ర విజయము రచియింపబడిన దనుట పొసగదు. ఒకవేళ భాగవతమునకు ఇది పూర్వరచన కాగూడదా అను సందేహము కలుగవచ్చును. అట్లే అగుచో శివనిందా పరిహారార్థము వ్రాసినదన్న యుక్తియు, దానితోపాటు గ్రంథరచనా వాదమును నిల్వవు. అదియుగాక, శైలిని బట్టి, కవి ఆత్మీయతను వెలువరచు ఇతరములగు నంశములనుబట్టి చూచినచో ఇది పోతన కృతమే కాదని నిర్ణయింపవచ్చును. భాగవతములోవలె నిందు అనుప్రా



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సాదృశ్యాలంకారములు లేవు; రచనలో మాధురియు లేదు. పోతన శ్రీరామభక్తుడు. శ్రీరామ ప్రసాదలబ్ధ కవితావిలాసుడును. ఈ గ్రంథమున వీరభద్రప్రసాదమున కవిత్వమబ్బినట్లు చెప్పబడినది. ఇక శైలిలో ఈ రెండు గ్రంథములకును పోలికయే లేదు. వయఃపరిణతివలన గలుగు కొన్ని మెరుగులు కానరాకపోవచ్చును కాని, సూక్ష్మ పరిశీలనవలన, ఒక కవి వ్రాసిన రెండు గ్రంథములలో నుత్తర కాలమున వ్రాసిన గ్రంథమునందలి శైలిని బట్టి పూర్వకాలికమగు గ్రంథముయొక్క కర్తృత్వము నిర్ణయించుట కవకాశములు లేకపోలేదు. ఈ యంశము లన్నిటినిబట్టి చూచినచో వీరభద్ర విజయము పోతన రచన కాదని నిర్ధారింప నగుచున్నది.

ఇక, నారాయణునకు కర్తృత్వ[illegible] గ్రంథాంతమున పోతన కర్తృత్వమును [illegible] యున్నది [illegible] కాలమున [illegible] చెప్పబడు [illegible] లేదు.

[illegible] శ్రీనా[illegible] [illegible] పురాణములు, [illegible] [illegible] గ్రంథము[illegible] [illegible] కాలము మొదట [illegible] శృంగార శాకుంతలము "ప్రత్యక్షపద[illegible]" చెప్పబడినది. దీనినిబట్టి శృంగార శాకుంతలమునకు పిమ్మట జైమిని భారతము రచియింపబడినట్లు స్పష్టమగుచున్నది.

శృంగార శాకుంతలము నాటకాఖ్యానమున ప్రబంధము. మహాభారతమునందలి శకుంతలా వృత్తాంతమును కాళిదాసు గ్రహించి, అభిజ్ఞాన శాకుంతల మనుపేర నాటకముగా రచించెను. పినవీరన వ్యాస కాళిదాసుల రచనల నాధారము చేసికొని శృంగార శాకుంతలమును ప్రబంధముగా తీర్చెను. ఇందు ప్రధాన కథకు భిన్నమయిన కొన్ని కల్పనలు చేయబడినవి. మూలములో లేని హస్తినాపుర వర్ణనము, మృగయావర్ణనము ప్రబంధమయిన ఈ కృతి కుచితముగనే యున్నవి. భారతమున శకుంతలా జన్మ వృత్తాంతము వ్యాసుడు శకుంతలచేతనే చెప్పించెను. కాళిదాసు తన నాటకములో శకుంతల చెలికత్తెలచే సూచింప జేసెను. పినవీరభద్రుడు వ్యాస, కాళిదాసుల ననుసరింపక యీ కథ స్త్రీ జనోక్తి యగుట కంగీకరింపక కణ్వాశ్రమ్యుని నోట చెప్పించెను. ఇతని సంకల్పము సముచితమయినదే. కాని నిర్వహణ లోపభూయిష్ఠమయినది. ఏ వికారము నెరుగని ముగ్ధుడు, పటువు నగు ఆశ్రమ బాలకుడు మేనకా, విశ్వామిత్రుల శృంగారమును పచ్చిగా వర్ణించుట కావ్యమున అనౌచిత్యమునకు హేతువయినది. కాళిదాసు నాటకములో విప్రలంభాత్మకమయిన ఉత్తరార్ధ కథను వీరభద్రుడు తీసికొనలేదు. భారతమునందువలె పుత్రసహితయైన శకుంతలకు భర్తృ సమాగమము కలిగించెను. పూర్వార్ధమున ఋషుల ప్రార్థన, రాజు ఆశ్రమము ప్రవేశించుట, జలసేచన సమయమున శకుంతలాదర్శనము, అనసూయా ప్రియంవదల మాటకతంత ముఖ్యమగునవి అభిజ్ఞాన శాకుంతలమునుండి గైకొనెను. ఒక్క మాటలో చెప్పవలయునన్న ఇందలి యితివృత్తము కథాభాగమున కాళిదాసు నాటకమును, తత్పరిణామమున భారతమును అనుసరించెనని చెప్పవచ్చును. కథాప్రధానమగు భారతమునందలి కొన్ని సంగ్రహముగా నున్న ఘట్టములను, ప్రదర్శన ప్రధానమయిన నాటకమున ప్రవేశములేని కొన్ని సన్నివేశములను పినవీరన సందర్భానుగుణముగ విపులీకరించి తన కృతిని ప్రబంధముగా [illegible] జేసెను. కాళిదాసు నాటకమునందలి కొన్ని భావములను ఈ కవి పద్యముగ అనువదించెను. ప్రత్యక్షముగను, పరోక్షముగను వీరభద్రునికి గల శ్రీనాథుని [illegible] యనువాద ఘట్టములయందును, శైలియందును స్పష్టమగుచునే యుండును. శాకుంతలములోని 'ఏయం యాతి శకుంతలా పతిగృహం సర్వైరనుజ్ఞాయతామ్' అను వాక్యమును 'అత్తవారింటికి కదిలెను నా లతాంగి, అనుమతింతురుగాక కల్యాణయాత్ర' అని తెనిగించెను. ఇది శ్రీనాథుని రచనా విన్యాసమువంటిది. ఇట్టివి అనేకములు చూపవచ్చును.

ఆంధ్ర వాఙ్మయమున శ్రీనాథుడు సృష్టించిన ప్రబంధ శైలి భిక్షను తా నొక చేత నందుకొని, వేరొకచేత ప్రబంధ కవుల కిచ్చిన సచ్ఛిష్యుడును, శ్రీనాథుడు నాంది శ్లోకమును పఠించిన ప్రబంధ మహానాటకమునకు శృంగార శాకుంతల రూపమున ప్రస్తావన జరపిన సూత్రధారుడును అయినవాడీ పినవీరభద్రుడు.

జైమిని భారతము శృంగార శాకుంతలముకంటె ప్రౌఢమయిన గ్రంథము. సంస్కృత జైమిని భారతమున అశ్వమేధపర్వ మొక్కటియే ప్రచారములో నున్నది. ఈ పర్వమునే పినవీరన తెనిగించెను. వ్యాసప్రణీతమగు అశ్వమేధపర్వమునకంటె ఇందు పెక్కు కథలు అధికముగా నున్నవి. ముదిమి వయసున అనుభవ సంపత్తి కలిగి, రచియించిన దగుటచే ఈయన గ్రంథములలో ఇది మేలు తరముగా నున్నది.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



శ్రీనాథ యుగమున వెలసిన నంది మల్లయ, ఘంట సింగయ యను కవులు వరాహ పురాణము, ప్రబోధ చంద్రోదయము అను రెండు గ్రంథములు రచించిరి. వరాహ పురాణము పండ్రెండాశ్వాసముల కావ్యము. వీరి కావ్యములలో ప్రబోధ చంద్రోదయమునకు వచ్చిన ఖ్యాతి వరాహ పురాణమునకు రాలేదు. కొంత శబ్ద జటిలత్వము తక్క ప్రబోధ చంద్రోదయములోని శైలి, సౌందర్యము ఈ పురాణమున లేవు. శ్రీనాథుని యుగమున పురాణములపై ఆదరము తగ్గి ఖండపురాణములపై అభిరుచి హెచ్చినది. వరాహ పురాణమున నుత్తరార్ధ మంతయు స్థల మాహాత్మ్యముతో కూడియున్నది. ఈ కవులు ఆ భాగమును తెనిగింపలేదు.

ప్రబోధ చంద్రోదయ మైదాశ్వాసముల గ్రంథము. ఇది యొక యాధ్యాత్మిక కావ్యము. సంస్కృతమున కృష్ణమిశ్రుడను కవి రచించిన ప్రబోధ చంద్రోదయమే దీనికి మూలము. అద్వైత మత విషయములు సులభముగా బోధ పడుటకే కృష్ణమిశ్రుడు ఈ నాటకమును రచించెనట. ఇట్టి నాటకములు సంస్కృతమున మరికొన్ని కలవు. వేదాంత దేశికుడు విశిష్టాద్వైతపరముగ సంకల్ప సూర్యోదయ మను నాటకమును రచించెను. ప్రబోధ చంద్రోదయమున నాధ్యాత్మిక పాత్రలకు దక్క మానవ పాత్రలకు ప్రవేశము లేదు.

కృష్ణమిశ్రు డీ నాటకమును భారత కథా ప్రణాళికననుసరించి రచించి యున్నాడు. దుష్టులగు దుర్యోధనాదులను వెనుకవేసికొని వచ్చి పాండవులను వేరు చేసిన ధృతరాష్ట్రునివలె సహజ చంచలుడగు మనస్సు అనువాడు మోహాదులను నొక సంతానవర్గమును దరికి చేర్చుకొని వివేకాదులను మరియొక వర్గమును త్రోసి పుచ్చును. దుర్యోధనునికి దుష్టత్రయము వలె మహామోహునకు కామక్రోధాదులు మంత్రులు. కురురాజున కితర రాజులండయై నిలిచినట్లు మహామోహునకు చార్వాకాదులు సాహాయ్యము చేయుదురు. ధర్మరాజున కాతని తమ్ముల వలె వివేకమునకు యమ నియమాదులు మంత్రులును, కృష్ణునివలె విష్ణుభక్తియు బాసటగా నుందురు. రాజ్యము నకై కౌరవ, పాండవులకు జరగిన యుద్ధమువలె ఆత్మికసామ్రాజ్యాక్రమణమునకై ఈ యిరు తెరంగుల వారికిని ఘోర సంగ్రామము జరుగును. తుదకు పాండవుల వలె వివేకాదులే జయింతురు. భారత చరమభాగమున గల యుపనిషదర్థ ప్రతిపాదనము వలె ఈ నాటకమున తుది యంకములో ఉపనిషద్దేవి ప్రవేశించును. వివేక సంయోగమున ఆమెయందు జనించినవాడే ప్రబోధచంద్రుడు.

ఈ నాటకమును తెలిగించుటలో ఈ కవులు కథాసూత్రమును గాని, శ్లోకక్రమమును గాని ఎచ్చటను మార్చలేదు. ప్రబంధముల కావశ్యకములగు కొన్ని వర్ణనలు మాత్రము వీరు కల్పించిరి. వానిలో చిదానంద నగరవర్ణనము, యుద్ధఘట్టమున సూర్యాస్తమయాది వర్ణనలును ముఖ్యములు. సంవాదాత్మక మయిన నాటకమును వర్ణనాత్మకమును, కథనాత్మకమును నగు ప్రబంధముగా మార్చుట అనువాదములలో మిక్కిలి కష్టమయినది. ఈ దుర్ఘట కార్య నిర్వహణమున నీ జంట కవులు ప్రదర్శించిన నేర్పు వారికి చరితార్థతను, లోకమున కాశ్చర్యమును కలిగించినవి. మూలాతిక్రమము లేకుండ ఇట్టి యనువాదమును నిర్వహించుటచే వీరి గ్రంథమునకు శాశ్వతకీర్తి లభించినది.

రూప కానువాదము నొకపద్ధతిలో నారంభించి చూపినవాడు శ్రీనాథుడు. కథ భారతమునుండి గ్రహించి సన్నివేశ క్రమమున భావ సరణిని అభిజ్ఞాన శాకుంతలము ననుసరించి పిల్లలమర్రి పినవీరభద్రుడు రూపకానువాద పద్ధతిలో కొంత ముందునకు సాగెను. ఈ జంట కవులు కేవలము ఒక నాటకమును చేపట్టి యథాతథముగా ఇతివృత్తమును ప్రబంధముగా తీర్చి ఈ పద్ధతిని స్వతంత్రముగా చేసిరి. ఈ యనువాద శాఖను సమగ్రదశకు తేగలిగిన నేర్పు, ఆధ్యాత్మి కేతివృత్తమును స్వీకరించి యెచ్చటను విసువు కలుగకుండ రచన సాగింప గలిగిన నైపుణి ప్రదర్శించిన ఈ జంట కవులు శ్లాఘనీయులు.

ఇక, సంస్కృత నాటకములను స్వీకరించి మన కవులు వానిని నాటక రూపముననే తెలిగింపక ప్రబంధరూపములుగా రూపొందించుట యేల యని ఈ కావ్యప్రక్రియలను జూచినపు డొక ప్రశ్న కలుగక పోదు. దానికి సమాధానము ఇది.

మన దేశమున ప్రాచీన కాలమునుండియు నాటకములాడు నాచారము లే దనుకొనుటకు వీలు లేదు. పలస, యక్షగానములు దేశములో బహుళ వ్యాప్తిని పొందియుండిన వనుట విదితపూర్వమే. యక్షగానములు వీధులయందు, పందిరులలోను సులభముగ ప్రదర్శించుటకు తగినవి. ప్రబోధ చంద్రోదయాది మార్గనాటకములకు సర్వసాధన సంపన్నమగు రంగస్థలములు కావలయును. భరతశాస్త్ర సమ్మతమయిన రంగస్థల నిర్మాణము రాజపోషణము వలన గాని జరుగదు. రసజ్ఞుడగు రా జెవ్వడయిన నట్టి నిర్మాణమునకు ముచ్చటపడి పూనుకొనినను కొన్ని పట్టణములలో నిర్మింపగలడే కాని పల్లె పల్లెకు నిట్టి రంగస్థలములను గట్టింపలేడు. ఆ పట్టణములలో చెదరుగా నున్న రంగస్థలములవలన గ్రామీణ సమూహముల కెంతవరకు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ప్రయోజనము కలుగునో యూహించుకొన వచ్చును. నాటకమును నాటకముగా తెనిగించుట ప్రదర్శన సౌకర్యము లున్నపుడే చరితార్థమగును. లేనిచో నది వ్యర్థము. నాటకమును శ్రవ్యకావ్యముగా పఠించి ఆనందింపు మనుట కవికి న్యాయ్యము కాదు. వలసినన్ని శాస్త్ర సమ్మతము లగు రంగస్థలము లుండినచో నాటకము ప్రబంధముగా మారుట తటస్థింపదు. అవి లేకపోయినవి కావుననే మన పూర్వుల నాటకదర్శన కుతూహలమును జాలవరకు శ్రవ్య కావ్యములే తీర్పవలసి వచ్చెను.

తెలుగు ప్రబంధ నిర్మాణము ఒక వింత శిల్పము కలది. సంస్కృతమున నల్ప సంఖ్యాకములగు చంపువులు కొన్ని యున్నను గద్యకావ్యములు, పద్యకావ్యములు, శ్రవ్య కావ్యములు వేరు వేరుగా, పుష్కలముగా వెలసినవి. ఆంధ్ర ప్రబంధము గద్య పద్య కథన సంవాదాత్మకమై సమస్త కావ్యభేదములను ఏకత్ర సంతరించుకొనిన సంపూర్ణ శిల్పమూర్తి. వర్ణనాత్మకమయిన కవితారీతియు నిం దిమిడి యున్నది. ప్రాచీనాంధ్ర వాఙ్మయమున గద్య గ్రంథములు, నాటకములు లేని లోటు ప్రబంధములు తీర్చినవి. కావున ప్రబంధము సర్వ కవితా శక్తులకు కూడలి యని మనవారు భావించిరి. ఇట్టి ప్రబంధములు ప్రదర్శన సౌకర్యములు లేని నాటకముకంటె వాఙ్మయమున సుస్థిరముగా నుండగలవను తలంపుతో మన కవు లా నాటకములను ప్రబంధములుగా రూపొందించి యుందురు. సంస్కృత నాటకములు తెలుగున ప్రబంధములుగా మారుట కివియే ప్రధాన హేతువులు.

ఈ యుగమున కొంతవరకు చరిత్రాత్మకములైన చిత్ర కథా కావ్యములును బయలుదేరినవి. జక్కన విక్రమార్క చరిత్రము, అనంతామాత్యుని భోజరాజీయము నిట్టివి. విక్రమార్క చరిత్రలోని కథలు కథానాయకుని సాహస కృత్యములు తెలుపునవిగా నుండును. సంస్కృతమున విక్రమార్కచరిత్ర యను ఒక గ్రంథ మున్నది. కాని దీని కది మూలము కాదు. విక్రమార్కుని పేర లోకములో ప్రచారముననున్న కథలను గ్రహించి జక్కన ఈ కావ్యమును రచించెనేమో! దీనికి సరియగు మూలగ్రంథము దొరకునంతవరకు దీనిని అనువాదగ్రంథ మనరాదు. అనంతామాత్యుని భోజరాజీయముకూడ నిట్టిదే. భోజునకును, ఒక యోగసిద్ధునకును పొసగిన సమావేశము నాధారముగా చేసికొని చాల నుపాఖ్యానములతో అనంతామాత్యు డీ కావ్యమును నిర్మించెను.

పూర్వ భారత చక్రవర్తులలో బహువిధముల ఘనత కెక్కి తమ పేరుమీద లోకమున ననేకరీతుల చిత్రకథ లల్లుకొనునట్లు ప్రవర్తించిన ఈ యిరువురు చక్రవర్తులను నాయకులుగా జేసి సమకాలికులగు కవు లిరువురు కావ్యములు నిర్మించుట విశేషము. ఒకరిని జూచి యొకరు రచించిరో లేక ఈ కావ్యనిర్మాణములు యాదృచ్ఛికములో చెప్పలేము. ఏకకాలమున నుండుట, తీసికొనిన వస్తువున సామ్య ముండుట యను రెండు విషయములలో వీరు దగ్గరగా గన్పట్టినను కవితా విషయమున వీ రింత దగ్గర వారు కారు.

శబ్ద సంఘటనలో జక్కన చక్కని ప్రజ్ఞకలవాడు. పునరుక్తిలేని వర్ణనా విన్యాసమున ఈతడు నేర్పరి. ఉత్తరోత్తర రమణీయమగు శయ్యాసౌభాగ్యము జక్కన రచనలో కన్పట్టును. అతని రచన కూహా జీవము. శ్రీనాథ, పోతనలు తీర్చిన ఆలంకారిక శైలిని కొంతవర కందుకొనినవాడు జక్కన. ఇక అనంతామాత్యునిలో శిల్పప్రౌఢి ఎక్కువ. ఈతని వర్ణనలయందు భావనకంటె స్వాభావికత పైచేయిగా నుండును. ప్రజ్ఞావిలసితమయిన పాత్ర నిర్మాణమున ఈతనికి దృష్టి మెండు. చిన్న చిన్న యుపాఖ్యానములను దీసికొని, సుబోధమగు భాషలో ఇంత అర్థగాంభీర్యము, శిల్పవిన్యాసము, ప్రజ్ఞ ప్రకటింప గలిగిన కొద్దిమంది ఆంధ్ర కవులలో అనంతామాత్యు డొకడు. గోవ్యాఘ్ర సంవాద ఘట్టమున ఈ కవిచేసిన ధర్మ ప్రతిపాదన మీతని ధార్మిక పరిజ్ఞానమును వ్యక్తము చేయుచున్నది. కావ్యరచనావసరమున ఒక కన్ను నీతి వైపునను, ఒక కన్ను శిల్పము వైపునను నిలిపి వానిని సమ్మేళనము చేసి కావ్యమున శిల్ప సౌందర్యము, ధర్మ సౌందర్యము వీడరాని వను సిద్ధాంతమునకు ఇతడు తన కావ్యమును లక్ష్యముగా జేసి చూపెను. ఇతడు ఛందోదర్పణము, రసాభరణము అను ఛందోలంకార లక్షణ గ్రంథములు రెండు రచించెను.

శ్రీనాథ యుగమున ప్రసిద్ధులయిన కవులలో మరి యొకడు గౌరన. ఈ యుగమున ద్విపదకవిత్వమును బునరుద్ధరించిన మేటి యన్న ఘనత యీతనికి కలిగినది. విసుగుపుట్టని రీతిగా ద్విపదలను రచించుటలో గౌరన మేటి. ఔచిత్యము చెడకుండ వర్ణనలు చొప్పించి, ఆయా పాత్రల మనోభావములను విశదముగా చిత్రించి, భావనా ప్రౌఢియు, రచనా చాతురియు ద్విపదలలో (నింతగా) జూపగలిగినవారు రంగనాథరామాయణకర్తయు, గౌరనయు నిద్దరే యనుటలో నతిశయోక్తి లేదు. ఈతడు హరిశ్చంద్రోపాఖ్యానము, నవనాథచరిత్ర యను కావ్యములే కాక, లక్షణ దీపిక యను లక్షణగ్రంథ మొకటి సంస్కృతమున రచించినట్లు తెలియుచున్నది.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



జక్కన, అనంతామాత్యులవలె కథాసముచ్చయ రూపముగు కావ్యమును రచించిన ఇంకొక కవి క్రొంవి గోపరాజు. సింహాసనద్వాత్రింశిక యను పంద్రెం డాశ్వాసముల కావ్యము ఈతని కృతి. [illegible] లభించిన విక్రమార్క సింహాసన మెక్కుటకు వచ్చు భోజునకు ద్వాత్రింశత్సాలభంజికలు విక్రమార్కుని కథలను చెప్పుట ఇందలి కథావస్తువు. ఈ కావ్య మాంధ్రీకరణమని గ్రంథావతారికలో గలదు. ఇందు కథాకథనముతోపాటు పెక్కు విజ్ఞానదాయకములగు లౌకిక విషయములు తెలుపబడియున్నవి. స్త్రీ లక్షణములు, చిత్రకవితా రీతులు, ఛందశ్శాస్త్రమునకు సంబంధించిన యతివిచారము, శకునములు, వాని వివరణములు మున్నగునవి ఇందు నిరూపింపబడినవి. గోపరాజు శైలి విషయమున పూర్వకవులను, విశేషించి పోతన ననుసరించెను. [illegible] యా సందర్భములలోగల యనుసరణమును [illegible] ప్రత్యేక[illegible] భాషాప్రయోగము, [illegible] కావ్యమున గలవు.

పదకవిత్వజాతిలో [illegible] యుపాంగ[illegible] గేయకవిత్వము గానాంశ ప్రధానముగా సంగీతకళా జగత్తున ప్రవర్తిల్లెనని వెనుక చెప్పబడినది. ఈ కవితాశాఖనుకూడ వర్ధిల్లజేసిన గౌరవమును ఈ ప్రబంధ పూర్వయుగమునకే దక్కినది. పదకవితా పితామహుడు, సంకీర్తనాచార్యుడు అని కీర్తికెక్కిన తాళ్ళపాక అన్నమాచార్యుడు ఈ శాఖను ఆంధ్ర సాహిత్యములో సుస్థిరము చేసినవాడు. ఈ తాళ్ళపాక వారియింట ఈ శాఖ ఉత్తరోత్తరాభివృద్ధిగాంచినది. మార్గకవితా ప్రపంచమున పోతన ఎట్టివాడో [illegible] కవితాలోకమున అన్నమాచార్యు డట్టివాడు. ఈయన సంస్కృతాంధ్రములలో ఆధ్యాత్మిక సంకీర్తనలను ముప్పదిరెండువేలు రచించెను. ఆధ్యాత్మిక శృంగారమును పోతనవలె నిర్వహింపగలిగినవా డీయన. సంకీర్తనలక్షణ మను [illegible] గ్రంథమును సంస్కృతమున రచించెను. వాని కనుగుణముగ [illegible] కీర్తనలను రచియించెను.

[illegible] నుమీద ఈ ప్రబంధ పూర్వయుగము ఆంధ్ర వాఙ్మయమున విశిష్టమయినది. నూరు సంవత్సరముల కాలములో నింత కావ్యప్రక్రియా వైవిధ్యమును చూపిన యుగము ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో వేరొకటి లేదు. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర నెరిగినవారి కెల్లరకు నీ యుగము తలపునకు వచ్చిన క్షణములో కన్నుల యెదుట నిల్చునది యీ కావ్య ప్రక్రియా వైవిధ్యమే. తంజావూరు, మధుర రాజుల కాలములో వాఙ్మయమున కొంత ప్రక్రియా బాహుళ్యము కలదు. కాని, అది దీనివలె స్థిరమయినది కాదు. శ్రీనాథుని యుగమునగల ప్రక్రియలలో చెక్కింటికి నుత్తరోత్తరాభివృద్ధి గలిగినది. నాయక రాజులనాటి కావ్యప్రక్రియలలో దార్ఢ్యము లేకపోయినది. ఆ రాజుల రాజ్యములతో [illegible] చరిత్రలో మాత్రము మిగిలెను. శ్రీనాథ[illegible] చిన ఆ యా ప్రక్రియల [illegible] శిల్ప సంపన్నమయిన [illegible]

అనువాద పద్ధతిలో [illegible] కారికల, భాషములలో [illegible] నానేకములగు [illegible] ప్రబంధ యుగమునకు [illegible] [illegible] ఆంధ్ర ప్రబంధ [illegible] సాహిత్య[illegible] నేటి[illegible] [illegible] అంత రమణీయమయిన [illegible] [illegible] వైభవములలో [illegible] లోలోన మెచ్చుకొనుచు [illegible] చూపునదే యున్నది. పిం. ల.

# ప్రబంధయుగము (క్రీ. శ. 1500 - క్రీ. శ. 1875)

ఆంధ్ర వాఙ్మయములో ప్రబంధ శాఖ కున్న ప్రాధాన్యము మరి యే శాఖకును లేదు. ప్రాధాన్యములోనే కాక, ప్రాచుర్యములో కూడ ఈ శాఖయే అగ్రస్థానము వహించినది. నిజ మాలోచింపగా ప్రాచీనాంధ్ర వాఙ్మయము ప్రారంభము నుండియు ప్రబంధోన్ముఖముగానే నడచినదని చెప్పక తప్పదు. పురాణమార్గ మనియు, ప్రబంధమార్గ మనియు ఆంధ్ర సాహిత్యములో రెండు భిన్న రీతులు స్థూలముగా గోచరించినప్పటికిని ఆ రెండు రీతులును ఇంచుమించు ఒకమారే ఆవిర్భవించిన వనియు, ఆ రెంటికి చెప్పుకోదగినంత భిన్నత్వము లేదనియు అంగీకరింప వలసి యుండును.

భారత రచనా రూపములో పురాణ మార్గమునకు నన్నయ ప్రథమాచార్యుడైనట్లుగానే, ఆ తరువాత కొంత కాలములోనే కుమార సంభవకర్త నన్నెచోడుడు ప్రబంధ మార్గమునకు ఆచార్యుడైనాడు. భారతమును పురాణముగా, కుమార సంభవమును ప్రబంధముగా ఇతివృత్త



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



భేదమును బట్టి పరిగణింప దగునే కాని, రచనారీతిని బట్టి యథార్థమైన భిన్నత్వమును నిర్దేశించుట చాల కష్టము. పురాణమున కథాకథనమే ప్రాధాన్యమును వహించు ననియు, ప్రబంధమున వర్ణనాది కల్పనా చమత్కృతికి ప్రాధాన్య ముండు ననియు అనుకొనుట కలదు కాని, వర్ణనా సౌందర్యము, కల్పనా చమత్కృతి లేని కేవల కథాకథనము పేలవమై రసవిహీనముగా నుండును. అట్లే కథా పరిపుష్టి లేని కేవల కల్పనా చమత్కృతి సూత్రవిహీనమైన పుష్పమాలవలె కావ్యస్వరూపమునే కోల్పోవును. కాబట్టి భారతము పురాణమే అయినను, రచన యథోచితముగ ప్రబంధ లక్షణములతోనే నడచినది. అట్లే కుమారసంభవము పేరునకు ప్రబంధమే అయినను పురాణలక్షణములను పెక్కింటిని సంతరించుకొన్నది. అయినప్పటికి ఇతివృత్త స్వరూపమును బట్టి భారతము పురాణేతిహాస వర్గములోనే చేరును. కుమారసంభవము కించి దూనముగా ప్రబంధవర్గములోనే చేరును. మన భాషలో ప్రత్యేక ప్రబంధశాఖ అనునది పదునారవ శతాబ్ది మొదటి నుండియే యేర్పడినప్పటికి, దాని యుత్పత్తి హఠాత్సంభవము కా దనియు, ఆంధ్రకవుల దృష్టి మొదటినుండియు ప్రబంధోచిత రచనయందే లగ్నమైన దనియు, ఆ ప్రబంధ లక్షణములు మన పురాణేతిహాసములందును కానవచ్చు ననియు ఈ మీమాంసయొక్క సారాంశము.

ప్రబంధ మనగా నేమి? ఆంధ్ర భాష వాఙ్మయదశకు వచ్చుటకు బహు శతాబ్దులకు పూర్వమే ఈ శబ్దమునకు సంస్కృతభాషలో బహు వ్యాప్తి యున్నది. సంస్కృతాలంకారికులు, కవులు, వ్యాఖ్యాతలు — ఈ పదమును 'కావ్య సామాన్య వాచి'గా ప్రయోగించిరి. కాని ఒక సారస్వత ప్రక్రియా విశేషముగ మాత్ర ముపయోగింపలేదు. ఆలంకారికులలో సాహిత్య దర్పణ కర్త, విశ్వనాథుడు మహాభారతమును, రామాయణమును, మాలతీ మాధవాది నాటకములను ప్రబంధములుగానే పేర్కొనినాడు. కాళిదాసు తన మాళవికాగ్నిమిత్రములో తనకు పూర్వులైన భాస, సౌమిల్ల, కవిపుత్రాదుల నాటకములను ప్రబంధము లనియే నుడివినాడు. భోజుడు 'శృంగార ప్రకాశము' అనెడి తన అలంకార శాస్త్రములో ప్రబంధము ప్రేక్ష్యము, శ్రవ్యము అని రెండు విధములుగా చెప్పినాడు. మరొక చిత్ర మేమనగా సాహిత్య దర్పణకర్త 'ఏష ప్రబంధః ప్రథితోస్తు లోకే' అని తన అలంకార శాస్త్రమునకు ప్రబంధ మనియే నామకరణము చేసినాడు. ఇట్లు రామాయణాది మహాకావ్యములు, భారతాది ఇతిహాసములు, మాలతీ మాధవాది నాటకములు, సాహిత్య దర్పణాది లక్షణ గ్రంథములు ప్రబంధము లనియే సంస్కృత భాషలో వ్యవహరింపబడినవి. అయితే, సాహిత్య రచన లన్నియు ప్రబంధములేనా? దానికంటె భిన్నమైన రచనా విశేషములు లేనపుడు ఈ పేరు సార్థక మగుట ఎట్లు? అను ప్రశ్న రావచ్చును. సాహిత్య రచన లన్నియు ప్రబంధములు కావు. ప్రబంధము కంటె భిన్నమయిన సాహిత్య రచనలను 'ముక్తకములు' అని సంస్కృతాలంకారికులు అన్నారు; ఆ ముక్తకములకు అనిబద్ధ కావ్యము అనియు, తద్భిన్నములైన కావ్యములకు నిబద్ధ కావ్యము అనియు నామాంతరములు కల్పించినారు. నిబద్ధ కావ్యమే ప్రబంధము.

ముక్తక మనగా చమత్కారక్షమమైన ఒక శ్లోకము. ఇతర పద్యములతో సంబంధము లేకుండ ఏపద్యమున కా పద్యమే స్వయముగ అర్థబోధన క్షమమై రమణీయముగా నుండిన చాలును. ఈ ముక్తకములనే తెలుగులో 'చాటు పద్యము' లందురు. ఇక ప్రబంధ మనగా కావ్యములోని పద్యము లన్నిటికి ప్రకృష్టమైన బంధము కలది అని తాత్పర్యము. పద్యము లన్నియు పరస్పర సంబద్ధములు కావలె నన్నచో వాని నన్నిటిని పూసలను దారమువలె ఏకముగ కలిపి కూర్చెడి ఇతివృత్త మొకటి యుండవలెను. ఆ యితివృత్తములోని పూర్వ పూర్వ ఖండములు ఉత్తరోత్తర ఖండములకు పూర్వ పూర్వ పద్యములు. ఉత్తరోత్తర పద్యములకు త్రోవ తీయుచు కార్య కారణ సంబంధముతో సన్నివేశ నిబిడత్వమును, కథాకథన చమత్కృతిని కలిగి ఆ గ్రంథము మహోదారమైన సారస్వతమూర్తిగా గోచరింపవలెను. కావ్యావయవముల నన్నిటిని చక్కగా బంధించి కూర్చెడి ఆ యంశములకే 'సంధిసామగ్రి' అని పేరు. ఈ సంధి సామగ్రి లేని ముక్తకాది స్వల్పరచన లన్నిటికి ఖండకావ్యము అని పేరు.

ప్రాచీనాంధ్ర మహాకవు లందరు ఈ ప్రబంధ శబ్దమును ప్రాచీన సంస్కృతాలంకారికులు వాడిన అర్థములోనే వాడిరి. వారు దీనిని ఒక వాఙ్మయ ప్రక్రియా విశేషముగ భావించినట్లే కనుపడదు. తిక్కన, కేతన, ఎఱ్ఱన, సోమన, శ్రీనాథుడు మొదలయిన మహాకవు లందరు తమ గ్రంథముల నన్నిటిని ప్రబంధములుగానే పేర్కొన్నారు.

ఆంధ్ర లాక్షణికులు మాత్రము ప్రబంధమును ఒక ప్రత్యేక కావ్య విశేషముగా ఊహించి దాని కొక లక్షణ నిర్దేశము చేసిరి. సంస్కృతములో దండి సర్గబంధము అనెడి మహాకావ్యమునకు చెప్పిన లక్షణములనే ఆంధ్ర లాక్షణికులు ప్రబంధ లక్షణములుగా స్వీకరించిరి. ప్రబంధ మనెడిది అష్టాదశ వర్ణనాత్మకముగా నుండవలెనని,



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ధీరోదాత్తాది నాయకులలో నొకడు కథానాయకుడుగా నుండవలెనని వారి నిర్వచనముయొక్క సారము. ఆ లక్షణానుసారముగా మన భాషలో మను, వసుచరిత్రలనాటి నుండి వచ్చిన గ్రంథములు మాత్రమే ప్రబంధములుగా పరిగణింపబడినవి. ఈ పరిమితార్థమే ఆంధ్ర సారస్వత లోకములో రూఢమైనది. ఈ పరిమితార్థములోనే ప్రబంధ శబ్దము ఒక ప్రత్యేక కావ్య విశేషమునకు నామమైనది. అయినప్పటికిని, ఈ ప్రబంధమునకు ఆంధ్ర లాక్షణికు లెవ్వరును సమగ్రమైన లక్షణము చెప్పినవారు లేరు. సాకల్యముగా ఆ లక్షణములను తెలిసికోవలె నన్నచో ప్రబంధ నామముతో వెలువడిన గ్రంథముల నన్నిటిని పరిశీలించి, వానిలోని సామాన్య ధర్మముల నన్నిటిని క్రోడీకరించి, ఆ క్రోడీకరణమువలన తేలిన సాధారణ లక్షణములనే ప్రబంధ లక్షణములుగా అంగీకరించవలెను. అప్పట్ల ఈ క్రింది విధముగా ప్రబంధ లక్షణము లేర్పడును :

1. ప్రబంధమునకు ఏకనాయకాశ్రయత్వము. దానితో పాటు వస్త్వైక్యము ప్రధాన ధర్మములు ;

2. ప్రబంధము అష్టాదశ వర్ణనాత్మకమై యుండవలెను ;

3. అందు శృంగారము ప్రధాన రసము ; ఆవశ్యకతను బట్టి తక్కిన రసములు గౌణములు కావచ్చును.

4. ఆలంకారికమైన శైలి ప్రబంధమునకు జీవము ;

5. ప్రబంధము భాషాంతరీ కరణము కాకూడదు ; స్వతంత్ర రచనయై యుండవలెను.

పదునారవ శతాబ్ది ఆదినుండి వెలువడిన మనుచరిత్రాది కావ్యము లన్నిటికి పైన పేర్కొన్న లక్షణము లన్నియు సమగ్రముగా పట్టినను, పట్టకున్నను స్వతంత్ర రచన లగుటచేతను, ఆలంకారిక శైలీ శోభితము లగుటచేతను అ వన్నియు ప్రబంధములుగానే పరిగణింపబడినవి. ఈ ప్రబంధావతరణము అకస్మాత్తుగా పదునారవ శతాబ్దిలోనే జరుగలేదు. దీనికి చాల క్రమపరిణామ మున్నది. తెనుగు భారతము పుట్టినది మొదలు మనుచరిత్ర ఆవిర్భావము వరకు గల యైదు వందల సంవత్సరముల కాలములో ఈ ప్రబంధ వికాసమునకు వలసిన సారస్వత దోహద మంతయు నెడనెడ సాగుచునే యున్నది. భారతములో ప్రబంధచ్ఛాయలు గల ఘట్టము లనేకము కలవు. తిక్కన నిర్వచనోత్తర రామాయణము కరుణరస ప్రధానమైన ఒక ప్రబంధము. భారతములోని 'కీచక వధ' ఘట్టము నిజమునకు ప్రబంధము. అసలు తిక్కన తన భారతము నంతను 'ప్రబంధ మండలి' అని కొనియాడినాడు. అది ఒక ప్రబంధ మహాచక్ర మన్నమాట! ఆ మహా మండలిలో ఒక్కొక్క పర్వము ఒక్కొక్క ప్రబంధమగును ప్రతి పర్వములోను రసపోషణ, పాత్రచిత్రణము యథోచి వర్ణనాలంకారములు పాటింపబడినవి. ఎర్రన రచనలు ఈ ప్రబంధ ధోరణి మరికొన్ని నన లు వేసినది. వర్ణన విషయములో ఉత్తరకాల ప్రబంధములకు ఈ 'ప్రబంధ పరమేశ్వరుడే' మార్గదర్శి. హరివంశములోని ఉషాపరిణయ కథ ఒక చిన్న ఉపాఖ్యానమైనను ప్రబంధముగానే దిద్దబడినది. అది అటుండుగాక! ఎర్రన నృసింహ పురాణము సర్వథా ప్రబంధమే యని చెప్పదగిన క్షేత్ర మహత్త్వము. ఈ స్థల మాహాత్మ్య కథకు ఎర్రన వస్త్వైక్యమును కూడ సంపాదించి, దానిని ప్రబంధముగానే ప్రవర్తింపజేను.

ప్రబంధ కవులకు వక్రోక్తి చమత్కార భిక్షను పెట్టినవాడు నాచన సోముడు. ఈ గురువు లందరు ఇటుండగా, ప్రబంధ కవి కులమునకు మహాచార్యుడైనవాడు శ్రీనాథుడు. కవి సార్వభౌముని శృంగార నైషధము ఆంధ్ర ప్రబంధములకు మేలుబంతి అయినది. ప్రబంధోచితమైన ఆలంకారిక శైలికిని, సమాసగుణాలంకృతమైన సమపద సీసపద్యరచనకును, పద సంవిధాన నైపుణికిని, రసపోషణకును, స్త్రీ పాత్ర సౌందర్య వర్ణనకును నైషధమే ఆంధ్ర ప్రబంధకవులకు భిక్ష పెట్టినది. ఇతరుల మాటయెందుకు? ప్రథమ ప్రబంధకర్త అనిపించుకొన్న పెద్దనయే శ్రీనాథుని సాహిత్య ధనము నంతను స్వేచ్ఛగా పితృధనమువలె వాడుకొన్నాడు. ఒక వంక పురాణేతిహాస కవులైన నన్నయాదులకు ఒకచేతిని, రెండవ వంక ప్రబంధ కవులైన పెద్దనాదులకు మరొకచేతిని అందించి పురాణ కవులకు, ప్రబంధ కవులకు నెడమడుగు లేకుండ, వ్యవధానము కానరాకుండ సమ్మేళనము ఘటించిన సూత్రధారుడు శ్రీనాథుడు. అందుచేతనే శ్రీనాథుని యుగమును ప్రబంధ పూర్వయుగము అని పేర్కొను చున్నాము. దీని సారాంశమే మనగా భారతములో బీజప్రాయముగ, ఎర్రనలో అంకుర ప్రాయముగ, సోమన్నలో మొలకగ పొడ చూపిన ప్రబంధలత శ్రీనాథుని చేతిలో కొనలు సాగి, చిగిర్చి, మారాకు వేసినది. అది పుష్ప ఫల సమన్విత మగుట రాయల కాలములో. మనుచరిత్రయే ఆ లత పూచిన తొలి పూవు ; పండిన తొలి ఫలము. మరి ఈ యుగమునకు పూర్వము తిక్కన శ్రీనాథాదులు ప్రబంధ దోహద కుశలులు అంద రుండగా పెద్దనాదులనే ప్రబంధ కర్త లనుటకు కారణము మనుచరిత్రాదులు స్వతంత్ర రచన లగుట ఒకటియే!

పురాణాంతర్గతమైన ఏ యుపాఖ్యానమునో ఇతివృత్తముగా గైకొని, దానిని నానావిధ వర్ణనాలంకారములతో



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సింగారించి పాత్రచిత్రణ యందు, రసపోషణయందు దృష్టి నిలిపి, ప్రౌఢమైన అలంకారిక శైలిలో రీతి ప్రధానముగా రచింపబడిన స్వతంత్ర కావ్యములు ఈ పదునారవ శతాబ్ది ఆదినుండియే ప్రారంభమైనవి కనుక, ఆ శతాబ్దికే ప్రబంధ యుగమని ప్రత్యేకనామము ఏర్పడెను. ఇట్టి స్వతంత్ర రచనలే పూర్వయుగములలో కుమారసంభవము వంటివి అక్కడక్కడ నున్నను, అవి విరళ ప్రచారము కలవి కను కను, కొన్నింట ఇతివృత్తము పురాణ కథాచ్ఛాయలు కలిగి అతి మాత్ర మగుటచేతను రసప్రాధాన్యము, రీతి ప్రాధాన్యము మొదలైన కావ్యశిల్ప లక్షణములు అసమగ్రముగ నుండుటచేతను, మరికొన్ని యితర కారణముల చేతను ఆనాటి స్వతంత్ర రచనలకు శుద్ధ ప్రబంధ స్వరూపము సిద్ధిపొందలేదు.

ప్రబంధయుగము యథార్థముగా ప్రవర్తిల్లిన పిమ్మట కూడ ప్రబంధలక్షణము లన్నియు పట్టని కావ్యములు కొన్ని కలవు. ఉదాహరణార్థము: పాండురంగ మాహాత్మ్యము, శ్రీకాళహస్తి మాహాత్మ్యము గైకొన వగును. ఈ రెండును క్షేత్ర మాహాత్మ్యములు. వీనిలోను, వసు చరిత్రలలోవలె వస్త్వైక్యము లేదు. అయినను అట్టి క్షేత్ర మాహాత్మ్యములు స్వతంత్రరచన లగుట చేత ప్రాబంధికమైన ప్రౌఢశైలిలో రచింపబడుట చేత, యథోచితములైన వర్ణనలతో కథలు అలంకరింప బడుట చేత ఈ యుగము నందలి యథార్థ ప్రబంధములతోపాటు వీనిని కూడ ప్రబంధములుగానే పరిగణించిరి. కాబట్టి కృష్ణదేవరాయల శకమే ఆంధ్ర ప్రబంధయుగ ప్రథమదశ యని చెప్పుకొనుటలో సామంజస్య మున్నది. ఆంధ్ర వాఙ్మయమున కృష్ణరాయల యుగము ఆంగ్ల వాఙ్మయమున ఎలిజబత్ యుగము వంటిది. కాలమానము సరిగా నున్నప్పుడు భూమి సస్యసంపన్నమై ఫల భాండ సమృద్ధిని అనుగ్రహించినట్లు కృష్ణరాయని కాలము ఆంధ్ర సరస్వతీ లాస్యమునకు మిక్కిలి అనుకూలమై నానావిధ ప్రబంధ రత్నములను అనుగ్రహించినది. చిరకాంక్షితమైన దక్షిణభారత సామ్రాజ్యము ఆంధ్రులచే ఈ కాలమున నెలకొల్పబడినది. ఆ సామ్రాజ్య వైభవానుభవమున ఆంధ్రులు ఉత్సాహవంతులై, వీరులై, కార్యశూరులై, స్వతంత్రులై సంపదలతో తులతూగిరి. ఆ వైభవోత్సాహములే ఆనాటి సారస్వత సృష్టిలో ప్రతిఫలించెను. రాయల సారస్వత సేవాసక్తియు, సహృదయతయు ఆ సారస్వత సృష్టికి ప్రోద్బలక మయ్యెను. మహాపరాక్రమశాలియై, పెక్కు దేశములను జయించి, సామ్రాజ్యమును స్థాపించిన శూరుడయ్యు రాజ్యలక్ష్మికంటె సారస్వత లక్ష్మినే ముందు ఆరాధించిన మహారసికుడు కృష్ణదేవరాయలు. ఆయన చేసిన కవిపూజలు కవిలోకములో సారస్వత నిర్మాణోత్సాహమును పురికొల్పెను. రాయలను మెప్పించి పళ్ళాకరము పొందవలెనని కుతూహలపడి విజయనగరము చేరని ఆంధ్రకవి ఆనాడు లేడు. ఆయనచే అగ్రపూజ నందవలెనని నాటి కవులు ఒకరిని మించి ఒకరు కావ్యములు వ్రాయదొడగిరి. ఆ మహారాజువలె నానాదేశభాషా కవుల నాదరించి, ఆశ్రయ మొసగిన చక్రవర్తి మరొకడు లేడు. విజయనగరాస్థానమున ఆంధ్రకవులేకాక పెక్కురు తమిళ, కర్ణాటక కవులుకూడ కలరు. ఆ యాస్థానము నందలి మహాకవు లెనమండుగురిలో ఆంధ్ర కవులేకాక ఇతర భాషాకవులుకూడ కలరు. ఆయన ఏర్పరచిన అష్ట సారస్వత సింహాసనములపైనను ఆంధ్ర కవులనే కూర్చుండ బెట్టెననుట ఆయన రాజనీతికి అపచారము చేయుట. దక్షిణ హిందూస్థానము నంతయు ఏకచ్ఛత్రముగ పరిపాలించిన ఈ చక్రవర్తి ద్రవిడ, కర్ణాట దేశములు తనవే యని చెప్పుకొన్న ఈ మహారాజు తన ఆత్మతృప్తికి, లోకము మెప్పునకు, సర్వజన సమాదరత్వమునకు దృష్టాంతముగ ఆ యెనిమిదింట కొన్ని స్థానములను ఆంధ్రేతర కవులకు అర్పించి యుండును. ఎంత తరచి చూచినను అష్ట దిగ్గజములలో ఐదుగురుమాత్రమే ఆంధ్ర కవులు కానవత్తురు. వారు అల్లసాని పెద్దన, నంది తిమ్మన, అయ్యలరాజు రామభద్రుడు, మాదయగారి మల్లన, ధూర్జటి — తక్కిన ముప్పురును ఇతర భాషా కవు లనుకొనుటయె న్యాయము.

ఈ వర్గములో అగ్రగణ్యుడును, ఆంధ్ర కవితా పితామహు డను బిరుదమునకు తగినవాడును అయిన అల్లసాని పెద్దనచే రచింపబడిన మనుచరిత్రముతో ప్రథమాంధ్ర నవ్య కవితోద్యమము ప్రారంభ మయ్యెను. ఆంగ్ల వాఙ్మయ చరిత్రలో ఎలిజబత్ రాణి శకమును నాటకయుగ మనియు, అప్పటి నాటకములను నవ్యకవితా నాటకము ('రొమాంటిక్ డ్రామాస్') అనియు చెప్పుదురు. అంతకు మున్ను ఆంగ్లమున నాటకములు లేకపోలేదు. కాని షేక్స్పియర్ మున్నగు మహాకవులు గ్రీకు నాటకముల వరవడిని వదలిపెట్టి స్వతంత్ర నూతన నాటకములను తమ జాతి మనస్తత్వమునకు అనుగుణముగా దేశీయ పద్ధతిని రచించుటచే ఆ నాటకములకు 'రొమాంటిక్ డ్రామాస్' అని పేరు వచ్చినది. అట్లే మన సారస్వతమునందును పెద్దన ప్రభృతి కవులు సంస్కృతకావ్యములకంటె భిన్నములుగా దేశీయ పద్ధతులలో స్వతంత్ర నూతన కావ్యసృష్టి చేయుటచేత ఆనాడు ఒక నవ్య కవితోద్యమము ('రొమాంటిక్



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మూవ్మెంట్ *) ప్రవర్తిల్లెనని చెప్పదగును. ప్రబంధము అనునది ఆంధ్రులు సమగ్ర భారతీయ సరస్వతికి తమ కానుకగా సమర్పించిన ఒక నూత్నాలంకారము. దృశ్యము, శ్రవ్యము, మధురము అని ఒక ప్రమాణమునుబట్టి ఏర్పడిన మూడు కావ్య విశేషములను, గద్యము పద్యము అని ఇంకొక ప్రమాణమునుబట్టి ఏర్పడిన రెండు కావ్య విశేషములను తనయందే ఇముడ్చుకొని, సంపూర్ణ సుందర సారస్వతమూర్తిగా వెలుగొందునది ఆంధ్ర ప్రబంధము.

ఇట్టి శిల్పసృష్టి సంస్కృతమున లేదు. సంస్కృతమున కావ్యము లన్నియు శ్లోకమయములు. గద్య పద్యాత్మకమైన చంపువు లున్నను వానియందు పద్యభాగము కంటె గద్యభాగ మెక్కువ. ఒకవేళ పద్యభాగమే ఎక్కువ యున్న చంపువు లున్నను వానియందు రసపోషణ, పాత్రచిత్రణాది కావ్యశిల్ప ధర్మములు శుద్ధముగా పాటింపబడియుండవు. ఇక తెలుగు ప్రబంధమో నాటకము కాకున్నను నాటకీయ ధర్మముల నన్నిటిని పాటించుచునే యుండును. పారిజాతాపహరణము, ప్రభావతీ ప్రద్యుమ్నము మొదలైన కొన్ని ప్రబంధములు ఆశ్వాసము అనుపేర అంక విభాగములను సైతము పాటించినవి. ప్రబంధములలోని వచనము అందలి పద్యశైలితోనే మేళవింపబడి యుండును. నిజమునకు గద్యమునకు, వచనమునకు కొంత భేద మున్నది. పద్యమువలెనే శ్రుతి లయలు కలిగి, అవిచ్ఛిన్న పదగుంఫనతో అలరారునది గద్యము. దీనియందు శబ్దమునందేకాక, అర్థమునను కవితాలక్షణము నిండుకొని యుండును; అనగా ఛందోనియతి లేని కవిత్వమే గద్యము. దీనిని 'పొయెటిక్ ప్రోజ్' అనవచ్చును. కేవల వచనము అను దానికి ఈ లక్షణము లుండవు. వచనములో వ్రాసిన నవలలు కాని, కథలు కాని కావ్య విశేషము లగును గాని గద్యములు కావు. అట్లే కథాకథనార్థమును, పూర్వాపర పద్య సంఘటనార్థమును వ్రాయబడు పురాణేతిహాసములయందలి వచనములును గద్యములు కావు. కావున ప్రబంధములయందలి గద్యము తక్కిన వచనముల కంటె సర్వవిధముల భిన్నము.

ఏవంవిధ సర్వలక్షణోపేతమైన మొదటి ఆంధ్ర ప్రబంధమును సృష్టించినవాడు కనుకనే అల్లసాని పెద్దన ఆంధ్ర కవితా పితామహు డయ్యెను.

రాయల యుగములోని ప్రబంధ కవులను (క్రీ. శ. 1500–క్రీ. శ. 1600 మధ్యకాలములోని వారిని) రాయల ఆస్థాన కవులను, ఆస్థాన కవులు కాకపోయినను సమకాలము వారిని ఒక వర్గముగాను, తరువాతివారి నందరిని ఒక వర్గముగాను పరిగణించ వలెను. మొదటి వర్గములో అల్లసాని పెద్దన, నంది తిమ్మన ఆస్థానకవులుగానే కాక ఉత్తమ ప్రబంధ నిర్మాతలుగా ఖ్యాతిచెందినట్లు, రెండవ వర్గములో పింగళి సూరనయు, రామరాజ భూషణుడును విశేష ఖ్యాతికి పాత్రులైరి.

మనుచరిత్రము నాటికిని నేటికిని ప్రబంధశైలికిని, వర్ణనౌచిత్యమునకును, కథా కథనమునకును ప్రథమోదాహరణమై, తెలుగు ప్రబంధ శాఖలోనేకాక, ఆంధ్ర పంచ కావ్యములలో కూడ అగ్రస్థానము దక్కగొన్నది. మార్కండేయ పురాణములో ఒక యుపాఖ్యానముగా నున్న స్వారోచిష మనుసంభవ కథను గైకొని, ఈ శిల్పి కులావతంసము సర్వాంగసుందరమును, రసబంధురమును, సజీవ పాత్రశోభితమును అయిన నిర్దుష్ట కావ్యమూర్తిని సృష్టించి తన ఆంధ్రకవితాపితామహ బిరుదమును సార్థక మొనర్చుకొనెను. ఆ ప్రబంధములో మొదటి మూడు ఆశ్వాసములును అద్వితీయ శిల్పచాతుర్యముగల ప్రకరణములు. ఆ రంగమున తాండవించు వరూథిని, ప్రవరుడు అను రెండు పాత్రలు ఆంధ్రులు స్వప్నమునందైనను మరువరాని సన్నిహిత బంధువులు. ఈ పాత్ర నిర్మాణములో ఆ మహాకవి చూపిన సంభాషణ చాతుర్యము, శేముషీ విన్యాసము, విరోధిరస సంఘర్షణము, పాత్ర మనోధర్మ విజ్ఞానము మహానాటక కర్తలకే సాధ్యమై ఉత్తమ శిల్ప ధర్మములకు లక్ష్యభూతములుగా నున్నవి. ఈ రెండు పాత్ర లాలంబనముగా కేవల విరుద్ధములైన రెండు రస ప్రవాహములు వెల్లివిరిసినవి. శాంత, శృంగారము లనెడి ఆ రెండు రసములకు ఎప్పట్లను పొత్తు కుదురదు. అట్లే వరూథినీ ప్రవర పాత్రలకును పొత్తుకుదురదు. సమాన బలముగల ఈ రెండు పాత్రలను, రెండు రసములను ఆ మహాకవి తన రెండు నేత్రములతో సమదృష్టితోనే చూచి, తాను ఏ దెసకును మ్రొగ్గకుండ రెండింటిని సమముగా ఆదరించి పాఠకలోకమునకు కూడ ఆ రెండింటియందు సమానమైన ఆదరమునే కలిగించెను. వేశ్యయనిగాని, శ్రోత్రియునకు వ్రతభంగము చేయనెంచిన వలపుకత్తె యని గాని మనుచరిత్రను పఠించిన ఏ కఠోరవ్రతుడైనను, అతడు సహృదయుడే అగుచో, వరూథినిని గర్హింపలేడు. ఫీదు మిక్కిలి ఆమె ప్రణయము అస్థాన పతితమైనదని చింతిల్లు వారును ఉందురు. మరల వారే ఆ జగన్మోహిని వలలో పడక, ధీరుడై తప్పించుకొనిపోయిన ప్రవరునకు జోహారు లర్పింతురు.

ప్రబంధ కవిత్వమునకు వరవడి పెట్టిన శ్రీనాథుని అక్షరముల పొంకమును శతథా అనుకరించి కృతకృత్యుడైన శిష్యుడు పెద్దన. విశేషించి మనుచరిత్రలోని సీసపద్యములు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



శ్రీనాథుని సీసపద్యములకు సాక్షాత్తు ప్రతిబింబములుగా నుండును. తరువాతి ప్రబంధ కవులు ఎవ రెన్ని విధముల ప్రయత్నించినను శ్రీనాథ సీసపద్యానుకరణము పెద్దనవలె కైవసము చేసికొన్నవారు లేరు. మరికొందరు గురువుగారి పెద్దశిష్యునివద్ద పాఠము నేర్చుకొను చిన్నశిష్యునివలె శ్రీనాథునిదెసకు చేతులు మోడ్చి పెద్దననే అనుకరించిరి. ప్రబంధ శృంగారరసమునకు అంగభూతములైన వన విహార, జలకేళీ, చంద్రోదయాది వర్ణనలకు మనుచరిత్రమే తర్వాతి ప్రబంధకర్తలకు దారిచూపినది. మనుచరిత్ర ఉత్తరభాగము పూర్వభాగ మంత రసవంతముగా నుండదు. ఆ కథాభాగము పూర్వకథవలె సాగసైనది కాకపోవు టయే దానికి కారణము. శుద్ధ పేలవమైన ఇతివృత్తము గల ఆ భాగమును సైతము పెద్దన సౌందర్యబంధురముగా నొనర్చుట ఆయన శైలీరామణీయకమువలననే.

రాయల ఆస్థానముననే కాక ఆంధ్ర సారస్వతమందిర మున కూడ పెద్దన భద్రాసనము ప్రక్క నింకొక భద్రా సనము నధిష్ఠించిన కవి నంది తిమ్మన. గ్రంథ విస్తృతిలో మనుచరిత్రకంటె చిన్నదియయ్యును రచనాసౌష్ఠవము కలిమిని దానితో సమానఖ్యాతి కెక్కిన కావ్యము పారి జాతాపహరణము. మనుచరిత్రములోని వరూధిని పాత్ర యెట్టి జీవకళలతో చిత్రింపబడియెనో పారిజాతాపహర ణములోని సత్యభామ పాత్రయును అట్టి జీవకళతోనే ఒప్పారుచుండును. గాఢానురక్తయైన ఖండితనాయిక అసూయావమానక్రోధాది భావవశమున అవశయై అను క్షణ వివర్తనములతో పొందెడి చిత్తసంక్షోభముల నన్నిటిని ఒకదానివెంట ఒకటిగా ప్రదర్శించుచు ఆనాయికయొక్క అంతరమూర్తిని సువ్యక్తము చేయుటలో తిమ్మన చూపిన కళాకౌశలము పెక్కుమందికి అనుకరణసాధ్యము కూడ కాదు. దక్షిణాంధ్రయుగములోని కొందరు కవులు ఖండిత నాయికాప్రధానములైన ప్రబంధములను రచించినవారు ఈ పారిజాతాపహరణమునే వరవడిగా గైకొనిరి. లింగన మఖి, శ్రీ కామేశ్వరకవి, వెలిదండ్ల వెంకటకవి, ముద్దు పళని మొదలైనవారు తమ తమ శృంగారనాయికలకు పారిజాతాపహరణ సత్యభామ వేషమునే సింగారించి కొత్త మాటలతో కొత్త రంగమున నాట్యము చేయించిరి. మరియు ఒక ఖండితనాయికాపాత్ర సృష్టియందే కాక అనతి విస్తృత కథాప్రబంధమును రచించుటయందును దక్షి ణాంధ్రకవులు పారిజాతాపహరణ గురుత్వమునే అంగీక రించిరి. మరియు, తిమ్మన ఈ కథను హరివంశమునుండి గైకొనెను. మరికొన్నియేండ్లకు పింగళి సూరన కూడ ప్రయత్నించి ఆ హరివంశపు గనినుండియే ప్రభావతీ ప్రద్యుమ్న కథారత్నమును త్రవ్వియెత్తి సానబట్టి అమూల్యమైన రత్నాభరణముగా నొనరించెను. సూరనకు హరివంశపు గనికి చూచాయల దారి చూపిన తిమ్మన పారిజాతాపహరణ రచనవలన కంటె కూడ ఎక్కువ మహోపకారము చేసినవా డయ్యెనని నా తలంపు. రాయలయుగ మనదగిన నూరేండ్లలో ఈ రెండు కావ్య ములే (పారిజాతాపహరణము, ప్రభావతీ ప్రద్యుమ్నము) ప్రబంధరూపమును తాల్చిన నాటకములు. ఆశ్వాస విభాగము లనెడి అంకవిభాగములతో, పంచసంధులతో, పాత్రప్రవేశాది సూచనలతో సర్వాలంకృతమైన రంగమున కథ ప్రదర్శించబడుచున్నదా అనెడి భావములను కల్గించు ఆ కావ్యములు ప్రబంధాకారమును తాల్చిన నాటకము లనుకొనుటలో వింత యేమి ?

రామరాజభూషణుడు కూడ తన వసుచరిత్రను చాల వరకు నాటకీయముగానే దిద్దెను. కాని ఆ గ్రంథములో సజీవపాత్రలు లేవు. అతనికి రంగనిర్వహణలోను, పద్య రచనలోను నున్న నేర్పు పాత్రచిత్రణలో లేదు.

రాయల యానతిని సకలకథాసార సంగ్రహముమ ప్రారంభించియు గ్రంథము పూర్తి కాక మున్నే ఆ మహా రాజు పరలోకగతుడగుటచేత, అయ్యలరాజు రామభద్రుడు అష్టదిగ్గజములలో ఒక డయ్యును ఆయనకు ఆ గ్రంథము కృతి యిచ్చిన భాగ్యము ననుభవింపలేదు. అదియునుగాక ఆ కవీశ్వరుని యశమునకును ఆ గ్రంథము కారణము కాలేదు. అతనికి పేరు తెచ్చినది రామాభ్యుదయము. రామాయణమును ప్రబంధరూపమున రచించుటలో రామ భద్రుడు కథాసంగ్రహమునందును, ప్రాబంధిక శైలియం దును మంచి నైపుణి చూపెను. ఉత్తరకాల ప్రబంధ ములలో కానవచ్చు నొకవిధమైన కృత్రిమాలంకారములకు రామాభ్యుదయమే మార్గదర్శి.

ఈతనివలెనే ఆస్థానకవి యయ్యు కృష్ణరాయలకు గ్రంథ మంకితము చేయని ఇంకొక మేటికవి ధూర్జటి. రాయల సహృదయతను గురించి ఇయ్యెడ ఒక విశేషమును గ్రహింపవలెను. ఆ మహోదారుడు తన ఆస్థానకవులు తమ గ్రంథములను తనకే కృతి యీయవలెననెడి కోర్కె కలవాడు కాడు. ఒక్క పెద్దనను తప్ప మరెవ్వరిని అందుకై అడిగినవాడును కాడు. కృతజ్ఞతమై ఎవరేని కృతుల నర్పించిన వలదని నిరాకరించి వారిని చిన్నవుచ్చి యెసుగడు; మరియు తాను వైష్ణవమతావలంబియయ్యు శైవులకు సారస్వతపదవుల నీయక మత దురభిమానము చూపియెరుగడు. ఆయాకవులు మరెవ్వరికేని కృతుల నర్పించుకొన్నను ఆ కృతిపతులయెడ అసూయగాని, కృతి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కర్తలయెడ నిరసనముగాని కన్నరచి యెరుగడు. పరమ శైవుడైన ధూర్జటికవి పరమవైష్ణవుడైన పెద్దనతో సమానముగ రాయల ఆస్థానము నలంకరించుటయు, అష్టదిగ్గజములలో నొకడయ్యు మాదయగారి మల్లన, రాజశేఖర చరిత్రను తిమ్మరుసు మేనల్లుడైన నాదెండ్ల అప్పమంత్రికి కృతి యిచ్చుటయు రాయల మహౌదార్యమునకు పరమ నిదర్శనములు. ధూర్జటి శ్రీ కాళహస్తి మాహాత్మ్యము ప్రబంధశైలిలో రచింపబడిన స్థలపురాణము. అయినను అందలి ప్రతికథయు ఒకచిన్న ప్రబంధముగానే పొడకట్టును.

సారస్వతమున ప్రబంధశైలి యవతరించిన పిమ్మట వెలసిన పురాణములును శైలినిబట్టి ప్రబంధములుగానే పేర్కొనబడినవి. తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యము ఈ జాతిలో చేరిన స్థలపురాణమే.

రాయలు సజీవుడై యుండగా వెలసిన ఇంకొక అచ్చపు ప్రబంధము చింతలపూడి యెల్లనార్యుని రాధామాధవము. ఆ గ్రంథమును మెచ్చి రాయలు ఆ కవికి రాధామాధవ బిరుద మిచ్చెనట. ఆ బిరుదప్రదానమునాడు మరెన్ని సత్కారములు చేసెనో! ఆ సత్కారములు చేసి అంతతో మరచెనేకాని ఎల్లనార్యుని వలన ఒక గ్రంథమేని కృతిగా అపేక్షింపలేదు. నిజ మారసినచో కృతిస్వీకారమువలన లభించెడి దానికంటె కృతిరచనవలన లభించెడి సారస్వతకీర్తి అధికతరము. రాయలు స్వయముగా మహాకవియై ఒక మహాప్రబంధమును రచించి తన కవియశమునకు ధ్వజప్రాయముగా ప్రతిష్ఠించుకొనెను గనుక, ఆయనకు కృతిపతిత్వయశము తనంత లభించినను లాంఛనప్రాయమే.

రాధా మాధవము ప్రభావతీ ప్రద్యుమ్నమునకు మార్గదర్శకమని కొందరందురు గాని ఆ యభిప్రాయము విమర్శనసహము కాదు. పింగళి సూరన ప్రబంధకథకు ఉషాపరిణయ కథతో పోలిక యున్నది గాని రాధామాధవ కథతో ఎట్టి పోలికయు లేదు. ఈ కథ రుక్మిణీపరిణయ కథవంటిది. బ్రహ్మవైవర్తాది పురాణములలోను, లోకులు చెప్పుకొనెడి కట్టుకథలలోను రాధామాధవుల సంబంధము ఒ[illegible]సన నుండగా ఎల్లనార్యుడు వారి కిర్వురకు దాంపత్య [illegible]బంధమును కల్పించుటయు, రాధయు ఆమె తండ్రియు కృష్ణునే పెండ్లికొమరునిగా అపేక్షింపగా ఆమె అన్న భద్రుడు తండ్రిమాటను, చెల్లెలి కోర్కెని ధిక్కరించి, తిరస్కరించి ప్రతిపక్ష మాచరించుటయు లోనగు కథాంశములు సర్వథా రుక్మిణీ పరిణయ కథతో సంవదించుచుండును. ఈ యెల్లనార్యుడు ప్రౌఢ ప్రబంధకర్తలలో నెన్నదగినవాడయ్యు అష్టదిగ్గజఖ్యాతి నొందలేదు. అతనికి రాయల ఆదరసత్కారము మాత్రము లభించినది. అట్టి ప్రజ్ఞయే యుండియు ఆ సత్కారభాగ్యమైనను లభింపనివాడు సంకుసాల నృసింహకవి.

నృసింహకవి రాయల యాస్థానమున ప్రవేశింప యత్నించినట్లును, ఆ ప్రయత్నము సఫలము గాక విసిగి వెడలిపోయినట్లును కొన్ని వదంతులు కలవు. వానికి చారిత్రికాధారము లేవియు లేవు. అయినను ఈ కవి తన కవి కర్ణ రసాయనమను పేరుగల మాంధాతృ చరిత్రమును శ్రీరంగనాయకస్వామికి కృతి యిచ్చుచు అవతారికలో చేసిన రాజద్వార దూషణము రాజకృత తిరస్కారమునకు ప్రతి క్రియా సూచనమేమో అనిపించును.

కవికర్ణరసాయన కావ్యమున కథ చాల చిన్నది. అయినను గ్రంథము ఆరాశ్వాసములుగా పెరుగుటకు కారణము అతని వర్ణన మహత్త్వము. కథాప్రసక్తి తక్కువైనను అనావశ్యక వర్ణనలతో కావ్యమును పెంచుట శిల్పధర్మము కాకపోయినను కొంతమంది ప్రబంధకవులకు అది పరిపాటియైనది. ఈ కావ్యము పూర్వభాగము అతివేలమైన శృంగార వర్ణనలతోను, ఉత్తరభాగము ప్రశాంత వైరాగ్య వర్ణనలతోను, నిండి నిబిడీకృతమై సర్వమానవ జీవిత ధర్మములైన రక్తికి, విరక్తికి సమ ప్రాధాన్యమును ఉపదేశించుచుండును. తన శృంగార వర్ణనాకర్ణనమున యతియైనను విటుడు కాకపోడనియు, వైరాగ్య వర్ణనాకర్ణనమున విటుడైనను యతికాకపోడనియు నృసింహకవి చేసిన ప్రతిజ్ఞ. ఇందులో కొంత అత్యుక్తి యున్నను రచన మాత్రము ప్రతిజ్ఞా నిర్వాహణకు సాధకముగానే పొడకట్టును. వెతకి చూచిననే తప్ప ఈ గ్రంథములో పూర్వకవుల అనుకరణములు సాధారణముగా దొరకవు.

ఆస్థానకవీశ్వరులైనను కాకపోయినను కృష్ణరాయలకు సమకాలికులైన కవులలో ప్రముఖులు ఈపైన పేర్కొనబడినవారే. వీరందరును ఆ మహారాజు ప్రాపకమును ఆసించినవారే. తన మెప్పును గోరి దిగ్దంతులవంటి యింతమంది కవులు తన గొడుగు నీడను చేరుచుండగా వారికి చల్లని ఆశ్రయ మిచ్చియు తన కవిత్వమునకు వారి మెప్పు కోరిన సౌమ్యస్వభావుడు కృష్ణదేవరాయలు. ఆయన ఆముక్తమాల్యదా తేజముముందు తమ రచనలు వెలవెలపోవుచుండునని లోలోన సిగ్గిలిన కవులు ఆయన ఆశ్రితులలో కొందరుందురని నాయూహ. ఎవరు ఎట్టి యుక్తులు చెప్పినను ఆముక్తమాల్యద రాయలు స్వయముగా రచించినదే కాని వేరొకరు రచించి ఆయనపేరు పెట్టినది కాదు. ఆగ్రంథములో పెద్దనగారి పద్యములు కొన్ని కానవచ్చుటచేత



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అది పెద్దన కృతమే అనెడివారు కలరు. కాని సూక్ష్మ పరిశీలకులు ఆ వాదమును అంగీకరింపరు. విష్ణుచిత్తీయములో పెద్దనగారివే కాక అక్కడక్కడ నంది తిమ్మనాదులు రచించిన పద్యములును కొన్ని యుండవచ్చును. గ్రంథరచన సాగుచుండు కాలములో, ఎడనెడ తన కవి మిత్రులకు తన గ్రంథమును వినిపించుచు వారియొక్కయు, తనయొక్కయు సంతోషముకొరకు ఒక్కొక్క తావున ఒక్కొక్కరిచే ఏదో పద్యము వ్రాయించి, వారి అనుమతిచే తనదిగానే ఆయన స్వీకరించియుండునని నా నమ్మకము. సహజముగా క్లిష్టమైన రాయలశైలికంటె అత్యంత విభిన్నమైన ప్రసన్న సుకుమార శైలిలో కొన్నిపద్యములు కానవచ్చుటకు అదియే కారణము. వాని యునికి మాత్రము రాయల కర్తృత్వమును తుడిచివేయజాలదు. ఇతరుల మాట అటుండనిండు. ఈ గ్రంథము పెద్దన కృతము కా దనుటకు వారి యిరువురి కవితాగుణములలోని తారతమ్యమే ప్రబల నిదర్శనము. మనుచరిత్ర కవిత్వము శ్రావ్యతకు, ప్రసన్నతకు, మెరుగునకు, సవరదనమునకు, అక్లిష్ట సమాస ఘటనకు పేరువడసినది. మాధుర్య సంపాదనము పెద్దనగారి సొమ్ము. సందర్భశుద్ధి గల వర్ణనలు చేయుట ఆయన పద్ధతి. అప్రసిద్ధ ప్రయోగమువలన ప్రసన్నతాభంగము కలిగింపకుండుట ఆయన పూనిక. ఇక రాయల కవిత్వ గుణములు వీనికి సర్వథా విపరీతములు. ఇందు శ్రావ్యత లేదు; ప్రసన్నత లేదు; వర్ణనలకు సముచితస్థానము లేదు; అన్వయము క్లిష్టము; సమాసఘటన అంతకంటెను క్లిష్టతరము. అయినను భావనాపటిమలో పెద్దన రాయలకు ఈడు కాడు. స్థూలాకారదర్శనమాత్రమున తృప్తినొంది, దానిని యథాతథముగా ప్రదర్శింపగల నేర్పు పెద్దనది. అంతఃస్నాయువులను కూడ దర్శించి వానిని ప్రదర్శించు నేర్పు రాయలది. అతి తీక్ష్ణమైన భావనాప్రజ్ఞలో ఒక్కొక్కయెడ రాయలు తిక్కనను తలపించుచుండును. భావనావ్యాపారమే దర్శనమునకును, దాని పునఃప్రదర్శనమే కావ్యరచనమునకును మూలకారణ మను సిద్ధాంతమును అంగీకరింతుమేని తెలుగులో ఆ ప్రజ్ఞకల కవులు నల్గురే కలరు - తిక్కన, కృష్ణదేవరాయలు, సూరన, అనంతుడును. ఆముక్తమాల్యదలో కథైక్యమునకు భంగము కలిగించు కొన్ని ప్రాసంగికములు చొప్పింపబడినవి. ఆధికారిక వృత్తముతో సుసంఘటితము లైనను, కాకపోయినను ఆ ప్రాసంగికములు మాత్రము ప్రయోజన సంపాదకములే కాని నిరర్థకములు కావు. అవన్నియు కావ్య ప్రథమోపదేశమైన విష్ణుభక్తికి పోషకము లగుటయే కాక భగవదనుగ్రహ ప్రాప్తికి భక్తి జ్ఞానయోగములలో ఏదియు నొండొంటికి తీసిపోదని నిరూపించుటకు సాధనభూతములుగా నున్నవి. జ్ఞాననిరూఢమైన భక్తివలె జ్ఞానరహితమైన భక్తియు, దానివలెనే భక్తిసహితమగు సంకీర్తనయు ముక్తికి కారణము లని ఉపదేశించుటకు ఒక్కొక్క ప్రాసంగికము కల్పింపబడినది. యామునాచార్యుడు వేదాంత వివేక సంపన్నుడగు జ్ఞాని. ఆయన జ్ఞానము భక్తినిరూఢము. విష్ణుచిత్తుడు శుద్ధ ప్రపన్నుడు. 'నృహరీ వాదము లేల లేరె యితరుల్ నీ లీలకున్ బాత్రముల్' అని తన తృణప్రాయత్వమును నిరూపించుకొన్న ముగ్ధభక్తుడు. ఇక మాలదాసరియో మంగళకైశికీ గానవ్రత పరాయణుడైన నీచజన్ముడు. ఈ ముువ్వురకును శ్రీ మహావిష్ణువు తన అనుగ్రహమును సమానముగానే ప్రసాదించెను. మరికొంత తరిచి చూచినచో ఈ భక్తి విశేషము లన్నిటిలో కీర్తనప్రభావమే పరమతేజస్వి అని తోచును. ఆ ప్రభావమువలననే బ్రహ్మరాక్షసునకుకూడ పూర్వపాప విమోచనము కలిగి విష్ణుసారూప్యము లభించినది. మొత్తముమీద అద్వితీయమైన వైష్ణవ తేజము సర్వత్ర తానేయై వెలుగుచు ఉపాధివశమునను, అధికారివశమునను భిన్నభిన్నరూపముల వ్యక్తమగుచు, ఎల్లెడల ధ్వాంతనాశము చేయుచుండుట ఈ కావ్యమునందలి ధర్మధ్వని.

క్రీ. శ. 1580 వ సంవత్సరములో ఆంధ్రభోజు డస్తమించెను. ఆయనకు పూర్ణాయుష్యమే యుండి మరికొంత కాలము సరస్వతీపూజ చేయుచుండుచో మరి ముగ్గురు నల్గురు మహాకవులు ఆ పూజామందిరమున ఆసీనులై యుండెడివారు. పింగళి సూరన, రామరాజభూషణుడు, తెనాలి రామకృష్ణుడు, కందుకూరి రుద్రయ ఆ భాగ్యమునకు నోచుకొనరైరి.

పై వారిలో రామరాజభూషణుడు అళియ రామరాజు పరిపాలనలో విజయనగరాస్థానకవిగా నున్నను ఆ పదవి కృష్ణరాయని కాలములో పెద్దన అధిష్ఠించిన పదవి వంటిది కాదు. రామరాజభూషణుని నాటికి అష్టదిగ్గజ సింహాసన మండపమును లేదు; అతనికి అగ్రాసనాసీనతయు లేదు. రామరాజుచే ఎన్ని మన్ననలు పొందినను ఈ కవి ఆ రాజుమ్రోల ఆశ్రితునివలె విధేయుడై మెలగియుండువే కాని కృష్ణరాయలచే పెద్దనవలె సంభావనాపూజితుడై యుండడు. ఈ తారతమ్యము ఆతని హృదయమును బాధించి యుండునని యూహించుటలో ఇంచుకైనను సత్య ముండకపోదు. అతడు ఇంకొక ఆస్థానమున చేరి యున్నచో ఈ తారతమ్యబాధ ఉండెడిది కాదు. ఈ రహస్యమెరిగియుండియే కాబోలు పింగళి సూరన విజయనగరము వంక చూడలేదు. సామంతరాజులైన అకువీటివారు,



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



నంద్యాలవారు అతనిని చేరదీసి కృష్ణరాయలకు దక్క వలసిన యశమును తాము దక్కగొనిరి. కృష్ణరాయని కాలములోనే కళాపూర్ణోదయము పుట్టియున్నచో రాయలు స్వయముగా అర్థించి ఆ కృతికన్యను స్వీకరించి, తన భాషా సేవ చరితార్థమైనట్లు భావించుకొనెడి వాడు. ఈ పదునారవ శతాబ్దిని పూర్వార్ధము, ఉత్తరార్ధములుగా రెండు విభాగములు చేసితిమేని పూర్వార్ధమున పెద్దన గారును, ఉత్తరార్ధమున పింగళి సూరనయు ఆంధ్రసారస్వత సామ్రాజ్యమును ఏలిన చక్రవర్తులని నిష్పాక్షికముగా, పూర్వపక్షరహితముగా చెప్పవచ్చును.

పురాణాంతర్గతమైన యొక యుపాఖ్యానమును గైకొని దానిని నానావిధ కావ్యశిల్పాలంకృతులతో ప్రబంధీకరించి ఒక స్వతంత్రరచన చేయుట ఈ ప్రబంధ శాఖకు ముఖ్య లక్షణ మనియు, ఆ పదకమును తొలు దొల్త ఊహించి ప్రథమ ప్రబంధరచన చేసిన కవి ఆంధ్ర కవితాపితామహు డనియు మన మెరుగుదుము. ఆ పద్ధతియే క్వాచిత్కముగా ఇర్వురు ముప్వురకు తప్ప తక్కిన ప్రబంధకర్తల కెల్లరకును అనుసరణీయ మయ్యెను. ప్రబంధ కవులు ఉపాఖ్యానముల కొరకు పురాణములను వెదక దొడ్చిరి. ఎల్లరకును శృంగారప్రధానములైనట్టియు, నానావిధ వర్ణనావకాశములు గలట్టియు కథలే కావలసి వచ్చెను. లభించిన కథలలోనైనను కథాప్రవర్తనకు హేతుభూతములైన పాత్రలు వారి దృష్టిని ఆకర్షింపలేదు. కావుననే సజీవపాత్ర నిర్మాణ మనెడి శిల్పసంపద ఆప్రబంధ ములలో మృగ్య మయ్యెను. ఏ ప్రబంధములోనేని ఏదేని యొకపాత్ర ప్రాణవంతముగా కానవచ్చినను అది కథా రంగమున ఏ మూలనో, ఏ కొంచెముసేపో నర్తించి నిష్క్ర మించెడి పాత్రయే కాని సమగ్ర ప్రబంధకార్యముతో అవినాభావ సంబంధము కలిగి తనవశమున కథయు, కథావశమున తానును ఉన్మీలనము చెందినట్టి సంపూర్ణ పాత్ర కాదు. అదియును గాక పెక్కురు పాత్రలను వర్ణిం చుటే తప్ప, చిత్రించు టెరుగరు. పాత్రలను చిత్రించుట దృశ్యకావ్య ధర్మము; వర్ణించుట ఆఖ్యాన లక్షణము. ప్రబంధములు స్వభావముచే ఆఖ్యానములేయయ్యు నాటక ధర్మములైన కథైక్య, కార్యైక్య, పాత్రచిత్రణ, రంగ నిర్వహణాది నాటకధర్మములను స్వీకరించుటవలననే ఇతి హాసాదులైన యితరాఖ్యానములకంటె విశిష్టత కలవి యగును. నాటక లక్షణమే ప్రబంధలక్షణముగా నిర్దేశించిన ఆలంకారికులుకూడ గలరు.

ఇది యిటు లుండ వేత్తయు, జిజ్ఞాసువు నైన కవి, కేవల కథారచనతో తృప్తి నొందడు. అతడు ప్రత్యక్షలోక పరిశీలనమువలన, తాను దర్శించిన జీవిత రహస్యములను వ్యంగ్యముగా కావ్యమున ధ్వనింపజేయును. తన యను భవమునకును, తాను ప్రతిపాదింపదలచిన జీవిత ధర్మము లకును అనువైన ఉపాఖ్యానములు పురాణాదులలో లభింప నప్పుడు, తన కథాప్రపంచమును తానే సృష్టించు కొన వలసినవా డగును. పింగళి సూరన కళాపూర్ణోదయ కథను తానై సృష్టించుకొనుట తాను చెప్పదలచిన శృంగార జీవిత రహస్యములకు అనువైన ఉపాఖ్యాన ములు పురాణములలో లభింపక పోవుటవలన. ప్రభావతీ ప్రద్యుమ్నమును రచించుట ప్రబంధమునకు సంపూర్ణ నాటకత్వ మాపాదించుటకొరకు.

పై నుడివిన రెండు మహా కావ్యములను రచింపకముందు సూరన రాఘవ పాండవీయ మనెడి ద్వ్యర్థి ప్రబంధమును రచించి- శ్లేషకవితా కుతూహలముగల తరువాతి కవులకు మార్గదర్శకు డయ్యెను. ఆంధ్ర వాఙ్మయములో అంతకు మున్ను అచ్చటచ్చట కానవచ్చు శ్లేషపద్య రచనలకు ఈ రాఘవ పాండవీయము పరిణత రూపము. దీనితరువాత వెలసిన రెండర్థముల, మూడర్థముల కావ్యము లన్నియు రాఘవపాండవీయ సంతానమే. ఈ విచిత్ర కార్య ములో సూరనకు అనుసరణీయమైన ప్రాచీన గ్రంథము గాని, లక్షణముగాని లేదు. అదిగాక శ్లేషకవిత్వము సంస్కృత కవికి కొంతవరకు సుకరమేకాని తెలుగు కవికి అతిదుర్ఘటము. 'అందునుం దెనుగు కబ్బం బద్భుతం బండ్రు' అని సూరనయే అందలి క్లేశమును తెలియ జెప్పెను. తన లక్షణమును తానే కల్పించుకొని, పొత్తు కుదురని రెండు మహా కథలను జోడించి 'దక్షుం డెవ్వం డిల రామ భారత కథల్ జోడింప భాషాకృతిన్' అను ఆశ్చర్యార్థక ప్రశ్నకు సూరనయే దక్షు డని మెప్పుతో లోకము సమాధాన మిచ్చునట్లు చేసెను. ఈ ప్రబంధము కూలంకషమైన ఉభయభాషా పాండిత్యమునకును, నవ నవోన్మేషమైన బుద్ధి సంపదకును మాత్రము ఫలము. ఆయన ఉపజ్ఞకు, కావ్యసృష్టి కౌశలమునకు, అతీంద్రియ వస్తు దర్శనక్షమమైన భావనాతీక్ష్ణతకు తక్కిన రెండు ప్రబంధములును ఫలములు. కళాపూర్ణోదయము కృత్రిమ రత్నమని రామరాజభూషణు నంతటి పండితకవి యాక్షే పించినాడు. కథ వక్రముగా నుండుటకు, వేశ్య నాయిక యగుటకు, శృంగారవర్ణన సమయ సిద్ధముగా లేకపోవు టకు మరికొందరు రాక్షేపించి యుందురు. నాడే కాదు, నేడును అట్టి యాక్షేపణలు చేయు విమర్శకులు కలరు. వారికి తుణ్ణ మార్గములును, ఆలంకారిక నిర్దేశములును మాత్రమే శరణ్యములు. నూతన స్వతంత్ర వస్తు సృష్టిని



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



గాని, భావ గాంభీర్యమునుగాని వారు గ్రహింప నోల్లరు. సర్వప్రబంధ సాధారణమై శాస్త్రనిర్దిష్ట స్వరూపము గల దానిని మాత్రమే వారు శృంగార రసముగా అంగీకరింప గలరు కాని ప్రత్యక్ష లోకదృష్టమై, సహజమైన దానిని భావింపజాలరు; భావింపగలవారిని మెచ్చజాలరు. అసలు లోక ప్రవృత్తికి మూలభూతమైన తృతీయ పురుషార్థము కావ్యములయందు శృంగార నామము దాల్చినప్పుడు జీవులయొక్కయు, లోకములయొక్కయు వైవిధ్యమును బట్టి వివిధ రూపముల వెలుగొందునా లేదా ఒకే రూపమున వ్యక్తమగునా అను ప్రశ్న వారికి స్ఫురింపనే స్ఫురింపదు. ఆ స్ఫురణ గలవాని కావ్యమును శాస్త్ర విరుద్ధమని తిరస్కరించుటకుమాత్రము సమర్థు లగుదురు. నిజముగా ప్రాచీనాలంకార శాస్త్ర వాక్యములు అత్యంతము విపులమైన అర్థము కలిగి నానావిధ సారస్వత సృష్టులను సమర్థించుటకు ఏర్పడిన సూచనలు. రాను రాను వానికి సంకుచితార్థము లేర్పడి, మూలతత్వములే మరుగుపడి పోయెను. అట్టి సంకుచితార్థ శాస్త్ర వాక్యములను పరమ ప్రమాణముగా స్వీకరించి శిరసావహించువారికి, సహృదయతగాని, భావుకత్వముగాని ఉండునని ఆశించుట అవివేకమే యగును. పింగళి సూరన శృంగారరసముయొక్క ఉత్పత్తి స్థానమును బ్రహ్మలోకములో సరస్వతీ, చతుర్ముఖుల హృదయ లీలలో చూడగలిగెను. తద్రసామృత స్రవంతి ఆ దివ్యలోకమునుండి కదలి గంధర్వ లోకముగుండ, మానవ లోకముగుండ అధోలోకమువరకు ప్రవహించును. ఆయాలోక స్వభావములను బట్టి, ఆలంబనములను బట్టి దాని పవిత్రతయు, రుచియు మారుచు తుదకు కలుషితము గూడ నగును. శృంగార రసాధిదేవతయొక్క ఈ విచిత్ర నర్తనము ఏ యలంకార శాస్త్రములలో సూచింపబడినది? ఆ శాస్త్రములే శరణ్యమనుకొన్నవారికి ఆ నర్తన మెట్లు ఆమోదము గొల్పును? ఆంధ్ర వాఙ్మయములో ఇట్టి శృంగార ధర్మధ్వని గల మహా కావ్యము నాటికిని నేటికిని కళాపూర్ణోదయ మొక్కటియే. ఉత్కంఠాజనకమైన కథా కల్పనా చమత్కృతి, పాత్ర వశంవదమైన కథా వికాసము, కథా వికాస వశంవదమైన పాత్రోన్మీలనము, పాత్ర స్వభావానుగుణమైన భాషా రచన లోనగు సారస్వత శిల్పధర్మము లన్నిటికి ఏకనిలయ మగుటయేకాక పైని పేర్కొన్న శృంగారతత్వ ప్రతిపాదనమునకు క్షేత్రమై నెగడినది గనుకనే ఆ ప్రబంధము కావ్యకళా పరిపూర్ణావిర్భావమను నర్థము నిచ్చెడి కళాపూర్ణోదయ మనెడి సార్థక నామము దాల్చినది. మరి దాని సోదరియైన ప్రభావతీ ప్రద్యుమ్నము, సాక్షాత్తు శ్రవ్య కావ్యరూపము దాల్చిన దృశ్యకావ్యమే. తెలుగు ప్రబంధములలో ఎద్దాననైనను కథా విస్మృతియో, వర్ణనాధిక్యమో, అనావశ్యక ప్రాసంగిక కథనమో, కథైక్యరాహిత్యమో, పాత్ర నిర్జీవత్వమో — ఏదో ఒక లోపమును చూపవచ్చును. అట్టి యే లోపమును లేక ప్రతి విశేషము సముచితమై అన్నింటి కలయికచే అవయవి సుందరమై, కూర్పు నిబిడమై, నాటక లక్షణమంతకు లక్ష్యభూతముగా వెలసిన కావ్యము ప్రభావతీ ప్రద్యుమ్నము. తెలుగు భాషలో శుచిముఖివంటి ప్రజ్ఞాధురీణమైన స్త్రీపాత్ర లేదు. కలభాషిణి వంటి ప్రేమమయమైన స్త్రీ పాత్రయు లేదు.

కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నములని సూరనను ఆక్షేపించినను రామరాజభూషణుడు సూరనకు అనుకర్త యగుటకు జంకలేదు. హరిశ్చంద్ర నలోపాఖ్యానము రాఘవ పాండవీయమునకు ప్రతిద్వంద్విగా పుట్టిన ద్వ్యర్థి కావ్యమే. అదే కాదు, వసుచరిత్రయు మనుచరిత్రతోడి స్పర్ధమై రచింపబడినదే. ఆ కాలములో ఒక కవిమీద ఇంకొక కవికి స్పర్ధ మెండు. అది విద్యాస్పర్ధయని వారు సరిపెట్టుకొనిరి కాబోలు! కాని స్పర్ధ యున్నచోట అనుకరించుట తగదు. అది నిజావమానమునకు హేతువు. రామరాజ భూషణునకు అట్టి సంకోచము లేదు. ఎవరియెడ తాను మనసా ఈర్ష్య చూపునో వారినే అనుకరించి గుణాధికత చూపవలెనని పరిశ్రమించుట అతని లక్షణము. ప్రథమ స్థానము అనుకార్యునిదే కాని ఎంత పాటుపడినను అనుకారికి లభింపదు. అయ్యు, అనుకారి మహా ప్రతిభా సంపన్ను డగునేని రెండవస్థానమునకైనను అతనికి అర్హత కలుగును. రామరాజ భూషణుడు ద్వ్యర్థి రచనలో సూరనకును, ప్రౌఢ ప్రబంధ రచనలో పెద్దనకును ద్వితీయుడుగా స్థిర యశము నార్జించుకొనెను.

వసుచరిత్ర కథ చాల చిన్నది. స్వల్పమైన ఆ యితివృత్తము నంత విపులముగా పెంచి వ్రాయుట రామరాజ భూషణుని వర్ణనా సామర్థ్యమునకు నిదర్శనము. సర్వలక్షణ వేత్తృత గల మహా పండితుడు గనుక, సమస్తాలంకారిక సూత్రములకు లక్ష్యభూతములు కావలె ననెడి అభినివేశముతో పెక్కు పద్యములు రచించి గ్రంథమును చాలవరకు పెంచెను. ఆ పెంపంతయు అనావశ్యకమని పూర్వకాలముననే కొందరు బుద్ధిమంతులకు పొడకట్టినది. వారిలో ఒక సాహసికుడు ఆ గ్రంథములోని మూడు వందల పద్యములు ఏర్చి కూర్చి ఆ సంగ్రహమునకు పిల్లవసుచరిత్ర యని పేరు పెట్టెను. రామరాజభూషణుడు ఆవశ్యకములు, అనావశ్యకములు అనెడి చూపు లేక



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అద్భుతావహములయిన వర్ణనలలో చూపిన నేర్పు కథా నిర్వహణమున చూపలేదని ఈ పిల్ల వసుచరిత్రయే సాక్ష్య మిచ్చును. అగుగాక, ఈ గ్రంథము మన వాఙ్మయమున మహా ప్రభావము కలది. ఇంత ప్రౌఢ సాహిత్యము గల ప్రబంధము మరియొకటి లేదని బహుపండితాభిప్రాయము. పద్య రామణీయకము, సాహితీ పటిమయు దాని ప్రశస్తికి కారణములు. లయయు, గమకమును గలిగి కీర్తనవలె పాడదగిన పద్యములు, కమ్మచ్చు తీసిన రీతిని వంపులేక సాగివచ్చు పద్యపాదములు, అపేలవమును నీరంధ్రమును నైన పద గుంఫనము, అప్రయత్న సిద్ధములయిన వ్యంగ్య శ్లేషాదులు — ఇత్యాది కావ్య శరీరావయవ సౌష్ఠవము కలిగియుండుటనుబట్టి వసుచరిత్ర ఉత్తమ ప్రబంధకోటిలో చేర్పబడినది. తరువాత, ప్రౌఢకవు లనిపించుకొనదలచినవా రందరు దీని ననుకరించిరి. ఆ యనుకృతులకు పిల్ల వసు చరిత్ర లనెడి ఒక కృత్రిమ యశము లభించెను. ఆ యను కరణము ఆంధ్ర కవిత్వము నిర్జీవమైన క్షీణ యుగములో మరికొంత యెక్కువాయెను. పిల్ల వసుచరిత్రకారులలో అద్దంకి గంగాధరకవి రామరాజభూషణునకు సమకాలి కుడే. ఇతడే అతనికంటె పూర్వుడని రుజువు చేసినవారును కలరు.

వసుచరిత్రలోని శ్లేష రెండర్థములు కావలసినచోట సొంపుగానే యుండును గాని అక్కరలేని చోటున వెగటుగొల్పును. సందర్భోచితమై, సుబోధముగా నున్న శ్లేషచమత్కారము శుక్తిమతీ కోలాహల సంవాద ఘట్టమున కలదు. సంవాద చాతుర్యమునందును, కథన నైపుణియందును ఆ ఘట్టమే శోభావహము. ఆధికారిక మైన గిరికా, వసువుల కథకంటె ప్రాసంగికమైన శుక్తి మతి కథయే మేల్తరముగా నున్నదనుటలో సందే హము లేదు.

కృష్ణదేవరాయల అనంతరము వెలసిన ప్రౌఢ కావ్య ములలో పాండురంగ మాహాత్మ్యము ఆంధ్ర సారస్వత ప్రతిష్ఠకు నిధానములైన ఉత్తమ రచనలలో ఒకటి. ఆ గ్రంథము క్షేత్రమాహాత్మ్యమే యయ్యు ప్రౌఢాలంకారిక శైలినిబట్టి ప్రబంధజాతిలో చేరినదే. అందలి ప్రతికథయు ప్రాణవంతములైన పాత్రలతో, సుసంఘటితములైన కథా వయవములతో స్వయంసంపూర్ణమై తీర్చి దిద్దిన ఖండ కావ్యమువలె హృదయావర్జకముగా నుండును. రామ కృష్ణుని భావములు అతిస్వతంత్రములు, అతి గంభీరములు, అతి రమణీయములు. ఆ భావములను వ్యక్తముచేసిన పద గుంఫనయు అతిప్రౌఢము. ప్రౌఢభారతి యనదగిన నిగమ శర్మ అక్కగారు వరూధినీ, కలభాషిణీ, సుగాత్రీ, సత్య భామలతో సహపీఠ మలంకరించిన సారస్వతాంధ్ర మహిళా రత్నము. ఆమె ఆంధ్రజాతి కెల్లను అక్కగారు కావలెనని తలచి కాబోలు 'అక్క' యనియే తప్ప కవి ఆమెకు వేరొక పేరు పెట్టలేదు. నిగమశర్మయక్క తెలుగువారు విస్మరింపరాని ఆడుపడుచు. కాశీఖండములోని గుణనిధి, శివరాత్రి మాహాత్మ్యములోని సుకుమారుడు, ఉద్భటా రాధ్య చరిత్రలోని మదాలసుడు ఈ నిగమశర్మకు సతీ ర్థ్యులే. ఆ యక్కగారే లేనిచో నిగమశర్మ కథకు ఇంత ప్రఖ్యాతియే వచ్చెడిది కాదు.

క్షేత్రమాహాత్మ్యములలోని ఈ సాంఘిక కథలలో పరిణామ కృత్రిమత్వమును సవరింప నుద్దేశించి కందుకూరి రుద్రయ తన నిరంకుశోపాఖ్యానమున ఒక స్వతంత్ర జీవిత ధర్మమును ప్రతిపాదింపదలచి యితివృత్తమును కల్పించెను. దుష్కాముకులైన నిగమశర్మాదులకు జీవితాంతమున ఆయా క్షేత్రముల మహత్త్వమువలన కాకున్నచో ఉత్తమ గతులు ఉండునా, ఉండవా యని యాశంకించి ఆ ప్రశ్నకు సమాధానము చెప్పుటకే రుద్రయ ఈ ప్రబంధమును ఉపక్రమించెను. అనన్యధర్ముడై, తృతీయ పురుషార్థమునే ఆత్మవ్రతముగా సేవించినవానికి ఊర్ధ్వలోకప్రాప్తి సుక రమే యని ఈతని సిద్ధాంతముగా పొడకట్టును. గ్రంథాదిని ఈ పరమార్థమే ప్రతిపాదితమైనది. కాని కథ సహజముగా పరిణమింపక కృత్రిమమార్గముననే నడచినది. అందుచే రుద్రయ ప్రతిపాదనము సమ్యక్పరిష్కృతము కాలేదు.

ఈ శతాబ్ది యంతిమభాగములో రుద్రయకు సమకాలీను లైన పెద్ద కవులు మరి నల్వురు కలరు - సారంగు తమ్మయ్య, చదలవాడ మల్లయ్య, పొన్నిగంటి తెలగన్న, శంకరకవి. వీరిలో మొదటి యిర్వురును పరమభక్తుడగు విప్రనారాయ ణుని కథను వైజయంతీ విలాసము, విప్రనారాయణ చరిత్ర అను పేర్లతో వేర్వేరు కావ్యములు వ్రాసిన సాధు రచయితలు. వీరి రెండు ప్రబంధములును కొంచెము ఇంచుమించు ఒకేకాలమున పుట్టియుండును. ఇందలి యితి వృత్తము విప్రనారాయణు డనెడి ఒక వైష్ణవభక్తుని చరిత్ర. ఈ మహాత్ముని ద్రావిడభాషలో తొండరడిప్పొడి యాళ్వార్ అని అందురు. 'భక్తాంఘ్రిరేణు'వని దాని యర్థము. పేరునుబట్టియే ఆ కావ్యము ఒక మహాభక్తుని చరిత్రయని స్పష్ట మగును. ఆ చరిత్రలో వర్ణితమగునది అతని ప్రపత్తి. ఆ ప్రపన్నుడు కారణాంతరమున కాలు జారి పడినపుడు భక్తావన పరతంత్రుడైన భగవంతుడు స్వయముగా చేయూత యిచ్చి యుద్ధరింపగలడు. భక్తునకు కాలు జారుట సాధారణముగా స్త్రీ వశమున. ఆ ప్రలోభ మునకు సంబంధించినంత వరకే ఈ కథలో శృంగారము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కన్నట్టును గాని అతఃపూర్వముగాని, ఆ తరువాతగాని పొడగట్టదు. కావున ఈ రెండు కావ్యములును అచ్చపు శృంగార ప్రబంధములు కావు. మరియు ఆనాటి యితర ప్రబంధములలో లేని హాస్యమునకు వీనిలో కొంత అవకాశము కల్పింపబడినది. నిజమునకు శృంగారమునుండియే హాస్యము జనించును. ఆ రెండును సజాతీయములు. దక్షిణాంధ్ర యుగములో వీరిని అనుకరించి శృంగారములో హాస్యము జోడించిన కవులు కొంద రున్నారు. అదియును గాక ప్రౌఢసాహిత్య మనెడి కృత్రిమ శైలిని విసర్జించి, సాధుసుందరమైన సహజశైలిని ప్రబంధ రచనకు తొల్త ఉపక్రమించినవారు వీరే.

పొన్నిగంటి తెలగన్న ప్రత్యేకత అచ్చ తెనుగు కావ్య రచన. పూర్వ గ్రంథములలో అక్కడక్కడ కానవచ్చు శ్లేష పద్యములే ఉపశ్రుతిగా ప్రత్యేక శ్లేషకావ్య రచన చేసిన పింగళి సూరనవలె పూర్వ గ్రంథములలో అచ్చటచ్చట కానవచ్చు అచ్చతెనుగు పద్యములే ఉపశ్రుతిగా అచ్చతెనుగు కావ్య రచన చేసిన మహనీయుడు తెలగన్న. సూరన రాఘవ పాండవీయము తరువాతి శ్లేష కావ్యములకు మేలుబంతి యైనట్లే తెలగన్న యయాతి చరిత్రయు తరువాతి అచ్చతెనుగు కావ్యములకు మేలుబంతి యయ్యెను. అర్వాచీనులలో ఏమాత్రమో కూచిమంచి తిమ్మకవికి దప్ప తక్కినవారికి తెలగన్న సరళత అలవడ లేదు. ఈ యచ్చతెనుగు రచనలు శుద్ధ కృత్రిమములని నా తలంపు. దీనిలో అచ్చ తెనుగు లేదు సరిగదా తత్సమ తద్భవ దేశ్యాత్మకమైన ఆంధ్ర భాషలో తత్సమము పరిహరింప బడుటచే భాషాసౌష్ఠవముకూడ లోపించినది.

ప్రౌఢ ప్రబంధకర్తగా తనకును, ప్రౌఢ ప్రబంధ నాయకుడుగా హరిశ్చంద్రునకును యశము రావలె ననెడి కుతూహలముతో కాబోలు శంకరకవి గౌరన హరిశ్చంద్రోపాఖ్యానమునకు ప్రతిగా పద్య హరిశ్చంద్రోపాఖ్యానమును వ్రాసెను. ప్రౌఢ పద్య రచనయే కావ్యత్వ సిద్ధికిని, కవి యశమునకును పరమలక్ష్య మగుటచేతనే పెక్కు ద్విపద కావ్యములకు పద్య కావ్యములు ప్రతులుగా వెలసినవి. మూలములైన ఆ ద్విపద కావ్యములు ప్రతులైన పద్యకావ్యములవలన చిక్కు బొనుగువడిపోయినవి. పాలకుర్కి సోమనాథుని బసవపురాణ మొకటియు, గౌరన హరిశ్చంద్ర మొకటియు, అనుకృతులైన పద్య ప్రబంధములకు లొంగిపోక స్వశక్తిచే నిలబడి యుండగల్గెను. బసవపురాణమును ప్రబంధీకరించిన కవి అంతగా చెప్పదగిన సమర్థుడు కాడు. కావున ద్విపద కావ్యముయొక్క కీర్తికి చలనము రాదు. కాని హరిశ్చంద్రను ప్రబంధీకరించిన ఈ శంకరకవి మహా సమర్థుడు. ఈతని పద్యరచన ఎందరికో అనుకరణ యోగ్యమైనది. ఈతని కావ్యము ప్రౌఢ ప్రబంధములలో ఒకటిగా పేరెన్నిక గనెను. అయినను దీనివలన గౌరన ద్విపదకీర్తికి హాని కల్గలేదు; ఎందుచేత ననగా, రెండు మూడు మాటలతో పాత్రయొక్క ఆకార స్వభావములను చిత్రింపగల గౌరన భావనాపటిమ అతని యశోలక్ష్మికి వజ్రకవచము. దానిని భేదించుట ఏ పద్య ప్రబంధ కర్తకును సాధ్యము కాదు. కావుననే నేటికిని గౌరన హరిశ్చంద్రుడు తన రాజ్యమును తాను ఏలుచునే యుండెను.

ఇంతతో పదునారవ శతాబ్ది ముగిసినది. విజయనగర సింహాసనము, ఆత్మరక్షణార్థమై తొలుత పెనుగొండలోను, పిమ్మట చంద్రగిరిలోను తలదాచుకొనవలసిన యవస్థ యేర్పడినది. నామమాత్రముగా సింహాసన మధిష్ఠించినను రాజ్యరమనే కాపాడజాలని ఆ రాజుల యాశ్రయమున కవితారాజ్యము విస్తరిల్లుట అసంభవము. అందుచే, సామంతరాజయ్యును చక్రవర్తిగుణ శోభితుడైన తంజావూరు రఘునాథ నాయకుని ప్రాపు గోరి, ఆంధ్ర సరస్వతి దక్షిణ దిశకు తరలిపోయి వలసరాజ్య మేర్పరచుకొనెను. రఘునాథుడు అపర కృష్ణదేవరాయలు. ఈ మహనీయుల కిర్వురకును పెక్కింట సామ్యము కలదు. ఇర్వురును శత్రు భయంకరులైన మహాశూరులు. ఇర్వురును ప్రజారంజకులైన పరిపాలకులు. ఇర్వురును కవులు, కవి పోషకులు. కడ కిర్వురును నడివయస్సుననే మృత్యుగోచరులైన వారు.

తంజావూరు నాయకరాజుల రాజకీయ చరిత్ర క్రీ. శ. 1535 వ సంవత్సరములోనే ప్రారంభ మగును కాని సారస్వత చరిత్ర మాత్రము క్రీ. శ. 1620 వ సంవత్సరముతో మొదలిడును. నాటినుండి నూటయేబది సంవత్సరముల వాఙ్మయ చరిత్రకు దక్షిణాంధ్రమే కేంద్రస్థానము.

కృష్ణదేవరాయని ఆస్థానమున అల్లసాని పెద్దన యెట్టివాడో రఘునాథుని యాస్థానమున చేమకూర వెంకటకవి యట్టివాడు. ఈతని విజయ విలాసము తెలుగుభాషలోని మార్దవమునకును, అందును తంజావూరి తెలుగులోని లాలిత్యమునకును ప్రథమ దృష్టాంతముగా వెలుగొందు కావ్యరాజము. మరియు శ్రీ వేదము వెంకటరాయ శాస్త్రిగారు అన్నట్లు తమంత విచ్చెడి పూవులవలె సుబోధములైన శ్లేషలకు, వ్యంగ్యములకు విజయవిలాసము ఒక పూదోట. దీని మూలకథ భారతములోనిదే యైనను, వెంకటకవి శబ్దార్థములు రెండింటను ఎక్కువగా అనుకరించిన కావ్యము తాళ్ళపాక తిమ్మక్క వ్రాసిన సుభద్రా



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పరిణయము. వెంకటకవిని మిక్కిలి గౌరవముతో ఆదరించి మన్నించిన ఆ ప్రభువు రఘునాథుడు ఇంచుమించు అంత సరస రచనలు చేసిన సమర్థుడు. కృష్ణదేవరాయలు తిరుపతి వెంకటేశ్వరుని పరభక్తుడు. రఘునాథుడు రామభక్తుడు. ఆ రాముని కథను మొదట సంస్కృత భాషలో గానము చేసిన వాల్మీకి మహర్షి గాథను తన సారస్వత సృష్టికి మంగళాచరణముగా తొలుదొల్త వాల్మీకి చరిత్రమను పేర రచించి, ఆపైని తన కిష్టదైవమైన రాముని గాథను రామాయణ మను పేర గానము చేసెను. ఈభూపాలుని మూడవ కృతి శృంగార సావిత్రి. భారతములో శుద్ధ శాంతరస ప్రధానమైన ఆ కథ ప్రబంధీకరింపబడి శృంగార సావిత్రియనుపేరు దాల్చుటలో ఆనాటి రాజుల యొక్కయు, కవులయొక్కయు శృంగార ప్రియత్వము వ్యక్తమగును. శృంగారమునకు అంగముగా సావిత్రి యందును, రామాయణమునందును హాస్యముకూడ పోషింపబడినది. ఈ హాస్యము తపోనిష్ఠులైనవారిని ప్రలోభింపజేయు వేశ్యల హావ భావ విలాసాది ప్రయోగముల మీదను, వారి ప్రతిజ్ఞలమీదను ఆధారపడి యుండును. ఆ వేశ్యలు ఆనాడు తంజాపురాస్థానమును దేవేంద్రుని కొలువుగా మెరపించిన భూలోకవేశ్యలే కాని మరి కాలాంతర లోకాంతర వారకాంతలు కారు. ఆ కాలపు తంజావూరు రాజుల కొలువులోవలె మరియేకాలపు ఏ రాజు కొలువులోను వార వనితలకు అట్టి స్వేచ్ఛా విహారము, గౌరవ మర్యాదలు జరగలేదు. వారిలో కొందరు మధురవాణి, రామభద్రాంబ మొదలయినవారు సంగీతముతోపాటు, సాహిత్యమునందును నిష్ణాతులై ఆస్థాన గాయకులతో, ఆస్థాన కవులతో సమముగా గౌరవింపబడిరి. వారికే కాదు కవులకును, రాజులకును, రాజపురుషులకును, సంపన్న గృహస్థులకును సంగీత సాహిత్య విద్యా పరిశ్రమయు, వానియెడ ప్రియత్వమును మీరజాలని ఆచారము లయ్యెను. ఆ రెండు కళలు నేర్చినవారు శృంగార పురుషులుగా, సరసులుగా రాజ సభలలోను, నగర వీథులలోను చనవుమై నెగడుచుండిరి. వారికిని విద్యావతులైన వారకాంతలకును మిత్ర సంబంధము, గురు శిష్య సంబంధము, సతీర్థ్య సంబంధము బాహిరముగా చెల్లజొచ్చెను. అది యొక గంధర్వ లోకము. ఆ లోకవాసులకు కాముకత్వమే జన్మ చరితార్థతకు కారణ మయ్యెను. గీతి సాహితీ మోహనవాణులు చెవులు పట్టి యాడింపబడినవాడు కాముకుడు గాక తప్పదట. ఈ సిద్ధాంతము ఉలూచినోట చేమకూరి వెంకటకవి పలికించినది. ఈ వాతావరణము శాను రామ విజయరాఘవుని కాలములో మరింత కలుషితమై ఒక అర్ధ శతాబ్దిలో తంజావూరి ఆస్థానము మన్మథుని కొలువుకూటమైనది. అది మధురకుకూడ వ్యాపించినది. పరకీయా శృంగారమను పేర కాముక వ్యాపారమే కావ్యములకు ప్రధానేతివృత్త మయ్యెను.

'వినవేమొ వావి వరుసలు
తనువుల ధర్మంబో ఆత్మ ధర్మమె తలఁపన్'

అని సంఘమును సవాలుచేసిన స్వేచ్ఛా ప్రణయవిహార పరాయణులైన కవులు పెక్కు రుద్భవిల్లిరి. వారు స్వతంత్రులుగా, ఆ కవిత్వము నూత్న భావోదయముగా కొనియాడబడెను కాబోలు. కాని ఆ లజ్జావిహీనత, ఆ విశృంఖల విహారము జాతి పతనమునకు సూచకమని గ్రహించినవారు కాని, గ్రహించినను అరికట్టగలవారు కాని లేకపోయిరి. శేషము వెంకటపతి తారాశశాంకము, సముఖము వెంకట కృష్ణప్ప నాయకుని అహల్యా సంక్రందనము, రాధామాధవ సంవాదము, ముద్దుపళని రాధికా సాంత్వనము మొదలైన ప్రబంధాలలో కానవచ్చెడి మోహ పరాయణత్వ మంతయు అప్పటి సాంఘిక ప్రవృత్తికి ప్రతిబింబ మనుట తథ్యము. ఈ కవు లందరు పురాణకథా వ్యాజమున ఒక తెరను అడ్డము పెట్టుకొన్నను ఆ తెర ఉలిపిరిచింపి యగుటచే తెరచాటు నాటకమంతయు లోకమునకు విదిత మగుచునే యుండును. అసలు కావ్య వస్తువుగా కథను ఎన్నుకొనుటలోనే కవి యొక్క చిత్తవృత్తి కొంత వ్యక్త మగును. ఎన్ను కొన్న కథను నడపుటలో అతడు చేసెడి మార్పులు అతని చిత్తవృత్తిని మరికొంత వ్యక్తము చేయును. ఒక్క రాధామాధవ కథా వృత్తాంతమును ఉదాహరణగా గైకొని చూచెదముగాక. ఈ కథ సుప్రసిద్ధ వైష్ణవ పురాణములలో (భాగవతము, విష్ణుపురాణము, హరివంశము) లేదు. స్కాంద, బ్రహ్మ వైవర్త పురాణములలో ఈ కథాస్మరణ మించుక గలదు. స్కాందపురాణమును బట్టి రాధ, కృష్ణుని మనః ప్రీణనార్థము శతగోపునకు కుమార్తెగా బ్రహ్మచే సృజింపబడిన వ్యక్తి. అందు రాధా కృష్ణులకు నాయికా నాయక పరమైన శృంగార బాంధవ మున్నట్లు లేదు. తెనాలి రామకృష్ణుడు పాండురంగ మాహాత్మ్యమున ఈ కథను స్వీకరించినపుడు స్కాంద పురాణమునే యథాతథముగా అనుసరించెను. బ్రహ్మ వైవర్తపురాణమునుబట్టి ఊర్ధ్వలోకము లన్నిటికిని ఊర్ధ్వమున ఒక గోలోకము కలదు. ఆ లోకమునకు అధినేత కృష్ణుడు. అతడే పరముడు. ఆ పరముని ఆశ్రయించియుండు శక్తి స్వరూపిణియే రాధ. ఆ గోలోక రాధా కృష్ణులు సాంఖ్య సిద్ధాం



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



శానుసారముగా ప్రకృతి పురుషు లని చెప్పదగిన జంట. ఆర్యావర్తమునందలి యమునాతీర వందర్వజ, బృందావన ములు ఆ గోలోకమునకు ప్రతిబింబములు. కృష్ణుని అవ తారమునకు అనుగుణముగా ఆ గోలోకముకూడ భూమికి అవతరించిన దన్నమాట. గోలోక రాధా కృష్ణులే బృందా వన రాధా కృష్ణులుగా అవతరించి రనుకొన్నను, ఈ లోకమునందలి వీరి సంబంధము వేరుగా నున్నది. రాధను పరకీయగా, కృష్ణుని మేనత్తగా, వలపుకత్తెగా లోకము క్రొత్తబాంధవము కల్పించినది. ఈ సంబంధమునకు మూల మెక్కడను కానరాదు. రాధామాధవకర్త యెల్లనా ర్యుడు ఈ బాంధవమును అంగీకరింపలేదు. అతని గ్రంథ మున రాధాకృష్ణ ప్రణయమునకు దాంపత్యసిద్ధి యొసగ బడినది. కృష్ణునికి రాధ స్వయంవర లబ్ధయైన భార్య. ఆమె సహస్రగోపుని పుత్రిక. ఆమె స్వయంవరము సర్వథా రుక్మిణీ స్వయంవరమును పోలియుండును. ఇక దక్షిణాంధ్ర కవులకు రాధా కృష్ణుల - అత్తా యల్లుండ్ర చుట్టరికమునకు లోకములోని కట్టుకథలే యాధారమై యుండబోలు. వీరిలో రాధకు ఒక భర్తను కల్పించి పెండ్లి చేసినవారు కొందరు, పెండ్లి మాటయే ఎత్తనివారు కొందరు ఉన్నను ఆమె కృష్ణునకు తన జవ్వనము జన్నిగట్టిన వలపుకత్తెగా నిరూపించుట అందరికిని సమానధర్మమే. బహుశః, జయ దేవుని గీతగోవిందములోని రాధామాధవ ప్రణయము వీరికి ఉపశ్రుతి యైనదేమో! అట్లే యగుచో, వీరు జయ దేవుడు చూపిన మార్గమును గాక వేరొక వక్రమార్గ మున నడచి రనవలెను.

మహారాష్ట్ర ప్రతాపసింహుని ప్రియురాలైన ముద్దు పళని రచించిన రాధికాసాంత్వనమున ఈ కామశృంగా రము పరకోటి కెక్కినది. పుట్టుకచే వేశ్యయు, చదువుచే సంస్కారవతియు, కళలచే సరసురాలును అయిన ముద్దు పళని తానే స్వయముగా రాధికయై కామపూరితమైన తన హృదయమునే తన కావ్యమున చిత్రించుకొనెనా యని శంకింపదగి యుండును. ఆనాటి ప్రబంధములలో దుస్సహ మనిపించు ఈ కామలీలావర్ణన రాధికాసాంత్వన మున దుస్సహతరమైనది.

మొత్తముమీద ఈ దక్షిణాంధ్ర కవులకు విలాస తత్ప రత, శృంగార ప్రియత్వము, హాస్యచతురత సమాన ధర్మములు. వీరు రాజదత్తములైన భోగములను భగవ ద్దత్తమైన శరీరారోగ్యము కలిమి తనివితీర అనుభవించిరే కాని జీవితమునెడ ఔదాసీన్యమును, ప్రపంచమునెడ వైరా గ్యమును వహించినవారు కారు. పరము మాట యటుండ వారు 'రేపు' అనెడి మాటనే ఎరుగరు. వెల్లివిరియు నుత్సాహముతో పాడిన పాటకు, వ్రాసిన పద్యమునకు రసోద్దీప్తినే ఆసించిరి గాని వేరు ప్రయోజన మపేక్షింప లేదు. అనావశ్యక వేదాంతబోధను, కథాతివిస్తృతిని, అనవసర వర్ణనలను పరిహరించి కావ్యలక్ష్మికి ఆదరణీయ విగ్రహసౌష్ఠవమును కల్గించినవారు వీరే. కళాసౌందర్య మునకును, నీతిబోధకును సంబంధము లేదనెడి ఒక శిల్ప మతమునకు మనలో వీరే ప్రథమాచార్యులు. అయినను వీరికి నైతికనిష్ఠ లేకపోవుటచే వారి వాఙ్మయములో కళాసౌందర్య మున్నను ధర్మ సౌందర్యము లోపించినది. ప్రజలలోను, వారికి ప్రతినిధులైన కవులలోను ఇట్టి ధర్మ భ్రంశము కలిగిన రోజులలోనే ఆంధ్రులకు తంజావూరు, మధుర మొదలైన సామంతరాష్ట్రములైనను లేకుండ పాశ్చాత్యు లాక్రమించుకొనిరి. స్వాతంత్ర్య రహితము లును, ప్రాచీనైశ్వర్య శూన్యములును అయిన జమీనులు మిగిలినవి. జాతి ముఖకళ క్షీణించినట్లే సారస్వతకళలును క్షీణించినవి. జాతియొక్క దారిద్ర్యపరాధీనతలే కవితలోని భావదాస్య పరాధీనతలకు కారణమైనవి. మహోన్నత స్థితిలో నున్నపుడు జాతికి పరమ లక్ష్యములుగా వెలు గొందిన ఉన్నతాశయములు నశించి క్షుద్రభావములు పొడసూపెను. కవులలోను ఉదారాశయము లడుగంటి క్షుద్రత తలసూపెను. ఆంధ్రులతోపాటు ఆంధ్ర ప్రబంధ ములును జీవచ్ఛవము లయ్యెను. నిద్రాణమైన జాతిని మేలుకొల్పగల వీరుడుగాని, నిస్తేజమైన సారస్వతమును పునరుద్ధరింపగల కవివీరుడుగాని లేకపోయెను. ఈ కార ణముచేతనే క్రీ.శ. 1775 తర్వాత ఒక శతాబ్ది మన వాఙ్మయ చరిత్రలో క్షీణయుగ మని పిలువబడుచున్నది. కాని ఈ యుగములో తామరతంపరగా కావ్యరచన జరుగుచునే యున్నది. ఆ గ్రంథరాశి యంతయు ప్రాణరహితమైన పొల్లు. కవు లెల్లరును అస్వతంత్రులే అందరును అనుకరణ శీలురే. ఏ కవిలోను నూతనత్వము లేదు. కృష్ణరాయల యుగములోని ప్రబంధములను, అందును వసుచరిత్రను అనుకరించినవారు కొందరు, దక్షిణాంధ్ర ప్రబంధముల ప్రతిబింబములు తీసినవారు కొందరు, రాఘవ పాండవీయ పద్ధతిని రెండర్థములనేకాక, మూడర్థముల శ్లేషకావ్య ములను రచించినవారు కొందరు - చర్విత చర్వణముగా ప్రబంధముల సంఖ్యను పెంచిన కవులుమాత్రము పెక్కురు గలరు. వారిలో ఏమాత్రమేని గుణముగలవారు కంకంటి పాపరాజు మొదలైన ఐదార్గురు మాత్రమే.

పాపరాజు ఉత్తర రామాయణము వస్తుస్వభావమును బట్టి పురాణవర్గములో చేరదగినది. దానిని పురాణముగానే యుంచి ప్రబంధశైలిలో వ్రాసినవాడు పాపరాజు. ప్రబంధ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



యుగములో పుట్టిన పురాణములు ప్రబంధ శైలిలోను, పురాణయుగములో పుట్టిన ప్రబంధములు పురాణశైలిలోను ఉండుట కాలప్రభావమును బట్టి. పురాణశైలి ప్రసన్న గంభీరమైన శరన్నది వంటిది. ప్రబంధశైలి తరంగ ఘోషతో దరు లొరసికొనుచు పరుగెత్తు వర్షాకాల నది వంటిది. ఈ ప్రబంధశైలి రుచి మరగినవారికి పురాణశైలీ సాధుత్వము రుచింపదు.

కూచిమంచి తిమ్మకవి మన పూర్వకవులలో రెండవ కవిసార్వభౌముడు. ఇతడు బహుగ్రంథకర్త. అచ్చతెనుగు రచనలను పునరుద్ధరించిన కవి ఇతడే. ఇతని మిత్రుడును బంధువునునైన వక్కలంక వీరభద్రకవి వాసవదత్తా పరిణయకర్త. అడిదము సూరకవి యీ కాలమువాడే. ఇతని కవిజనరంజనము - చంద్రమతీ వివాహము - ఇం కొక పిల్లవసుచరిత్రగా పేరెన్నిక గన్నది. వసుచరిత్రకో, రాఘవపాండవీయమునకో అనుకరణమైనవే కాని గ్రంథము గణనకు రాకపోయిన ఆనాటి సారస్వతాభిరుచిని గురించి ఏమనవలెనో తోచదు.

చిత్రకవి సింగనార్యుని బిల్హణీయము, కృష్ణదాసు రాధాకృష్ణ విలాసము, సంగమేశ్వర కవి అహల్యా సంక్రందనము, చెళ్లపిళ్ల నరసకవి యామినీ పూర్ణతిలకావిలాసము మొదలైన ప్రబంధములు దక్షిణాంధ్ర ప్రబంధ చ్ఛాయలు గలవి యీ క్షీణశాబ్దిలో మరికొన్ని వెలసినవి.

శ్లేషకావ్యములలో పిండిప్రోలు లక్ష్మణకవి రావణదమ్మీయము ఆ జాతిలో కొంత పేరు గడించిన రచన. ఇందలి యితివృత్త మాత్మ విషయ మగుటచే దీని కొక క్రొత్తదనము వచ్చినది. శత్రుకృతాపకారము వలన కలిగిన క్రోధ దుఃఖమును స్ఫురింపచేయుచు రెండర్థములు సాధించిన లక్ష్మణకవి చమత్కారము మెచ్చదగి యుండును.

అంధకారావృతమై యున్న ఆ నూరు సంవత్సరముల (క్రీ. శ. 1775 - క్రీ. శ. 1875) కాలములో పైని పేర్కొన్న ప్రబంధములు మినుకు మినుకు వెలుగు లీనిన నక్షత్రములు.

ఆపై పందొమ్మిదవ శతాబ్ది చతుర్థ పాదారంభమున నూతనదినోదయమునకు వేగుజుక్క పొడిచినది. పాశ్చాత్యుల సంపర్కమువల్లనో, జాతీయతా భావోద్దీపనము వల్లనో, సంఘమున విస్తరించిన విద్యావ్యాప్తి వల్లనో సారస్వతమున పలుశాఖలు, పలురీతులు పొడసూపినవి. వీరేశలింగము పంతులును, తిరుపతి వెంకటకవులును వచన వాఙ్మయమునకు, పద్య వాఙ్మయమునకు క్రమముగా జగద్గురువులై క్రొత్త సారస్వతాభిరుచులను నెలకొల్పిరి. తిరుపతి వెంకటకవులకు సమకాలికులైన పెద్ద కవులు కొంతమంది ప్రబంధకర్తలు కలరు గాని ఆ ప్రబంధము లన్నియు క్షీణయుగ ప్రబంధములకు పుత్రికలుగానో, పుత్రికాపుత్రికలుగానో జన్మించినవి మాత్రమే. ప్రబంధమునకు నూతనత్వమును ఆపాదించి నవ్యకవిత్వమునకు నాంది పఠించిన కవులు తిరుపతి వెంకటేశ్వరులు. వీరి పాణిగృహీతా శ్రవణానందములు పరిణామ కృత్రిమత్వము లేని అచ్చపు సాంఘిక ప్రబంధములు. ప్రౌఢశైలి యను పేర ఉపజ్ఞారహితులైన కవులు ప్రబంధ సరస్వతిని బంధించిన సంకెళ్లను విడగొట్టి, ఆమెకు స్వేచ్ఛావిహార సౌలభ్యము నొసగిన స్వతంత్రులు తిరుపతి వెంకటకవులు. ఈ యిరువదవ శతాబ్దిలోని ప్రబంధ వికాస మంతయు ఆ గురుదేవులకు పరోక్ష, ప్రత్యక్ష శిష్యులైనవారి వల్లనే కల్గుచున్నది. పిం. ల.

'ముక్తకే కవయోఽనంతాః
సంఘాతే కవయ శ్శతమ్
మహా ప్రబంధేషు కవి
రేకో, ద్వౌ; దుర్లభా స్త్రయః'. - కా. మీ.

## ఆధునిక యుగము (క్రీ. శ. 1875 తరువాత)

శ్రీ తిరుపతి వెంకటేశ్వర కవులు అసమాన ప్రతిభా పాండితీసమానులై కవితాసామ్రాజ్య భద్రపీఠము నధిష్ఠించు నాటికి కాలపాంథుడు క్రీస్తుశకము ఇరువదవ శతాబ్దియందు కాలిడెనని చెప్పవచ్చును. ఇది యా మహాకవుల ప్రౌఢ నిర్భరవయః పరిపాక ముహూర్తము. నానా రాజ సందర్శనమునకై యా కవులు తెలుగు దేశము నాలుగు చెరగులును త్రొక్కి చూచుచుండిరి. కవి సార్వభౌముడు శ్రీనాథుని తరువాత ఆంధ్రదేశమున నలుమూలలను కవితా డిండిమము ప్రమోగించుకొనుచు విజయ సారస్వత యాత్ర సలిపిన ప్రజ్ఞాధురీణులు తిరుపతి కవులే వినవచ్చుచున్నారు. 'దర్శనీయంబు గోదావరీ తీరంబు వాసంబు' అని స్వర్గముకంటె గరీయసియైన జన్మభూమిని మాతృభక్తితో స్మరించుచు 'షడ్దర్శనీవేది చర్ల బ్రహ్మయ్య శాస్త్రి గురువరేణ్యుడు' అని గురుభక్తినత శిరస్కులై 'అష్టశతావధానాది సత్క్రియ లుంచినీళ్ల ప్రాయము' అని యాత్మవిశ్వాసముతో తలయెత్తికొనుచు, 'శబ్దశాస్త్ర ప్రశస్త ప్రభావం శాతపత్రమ్ము' అని సగర్వముగ మీసములు పురిపెట్టుచు నిండు విగ్రహములతో ప్రత్యక్షమగుచుండిన యీ సారస్వతమల్లురు ఇరువదియవ శతాబ్ది ఆంధ్రభాషా ప్రపంచమున కొక యపురూప దృశ్యము.

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఈ శతాబ్దారంభమున తెలుగు కవిత్వ మొకింత మందగించి యుండెను. వర్తమాన ఆంధ్ర సాహిత్య భీష్ములైన వీరేశలింగము పంతులు పద్య ధావమును విడచి గద్య శాఖాకమును చేపట్టి విజృంభించుచుండెను. ప్రజానీకమును కవిత్వముచే గిలిగింతలు పెట్టుట ప్రస్తుత కర్తవ్యము కాదనియు, వారికి విజ్ఞాన వీథులలో విహరించు శక్తిని కూర్పవలె ననియు, ఈ లక్ష్యప్రాప్తికి వచనమే యుచితమనియు వీరేశలింగము పంతులు తలపోసి గద్యరీతుల నెన్నిటినో పాదుపెట్టుచుండెను. ఆ మహావ్యవసాయి యడుగుజాడలను బట్టి పలువురు చిలకమర్తి లక్ష్మీనరసింహము, కొమర్రాజు వెంకట లక్ష్మణరావు, చిలుకూరి వీరభద్రరావు మొదలగువారు నిరుపమానమైన గద్య హృద్య రచన చేయుచుండిరి. కవిత్వము వైదుష్యారణ్యసీమలందు చిక్కువడి పండితు లమకొండలమీద మాత్రము కానవచ్చుచుండెను. ఆంగ్లభాష నభ్యసించిన విద్యార్థులు ఆ భాషయందలి సారస్వత పీయూషమును గ్రోలి ముగ్ధులై 'తెలుగు ఉప్పులేని చప్పిడి' యని యుపేక్షించుచుండిరి. ఇట్లు తెలుగు కవిత్వమునకు అజ్ఞాతవాసప్రాప్తి సంభవించిన దుర్దినములలో తిరుపతి వెంకటేశ్వరులు రంగమున కెక్కి మందగంభీర మందాకినీ నిష్యంద సుందర కవితాధారలచే ఆంధ్ర దేశమును ప్రోక్షించి తెలుగునాట కవిత్వ బీజములను తిరిగి మోసులెత్తించిరి. ఇదియే ఆధునికాంధ్ర వాఙ్మయ వికాసమునకు తిరుపతి కవులు చేసిన యమోఘ సేవ.

కానైతే వీరి కృతులందు నవ్యత్వము భవ్యత్వము నంద లేదు. వస్తువులా పురాతనములు; ఛందస్సులా శతధా పరిభుక్తములు; ధ్యేయమా 'కావ్యం యశసేఽర్థకృతే' యను నంతవరకే. వేములవాడ భీమకవి వలె తిట్టుటయందును, జయపెట్టుటయందును వీరు దిట్టలు. 'గిరతము', 'గుంటూరుసీమ' వంటి కావ్యములు శక్యాలవు. పారస్వత ప్రియుల కక్షిదారుమనస్తత్త్వమునే వెలార్చును. శ్రవణానందాదులు సద్యోనిర్వృతిని గల్గించుచున్నను ఉపదేశ మహనీయములు కావు. బుద్ధ చరిత్రయు, దేవీ భాగవతమును వీరి స్థిరకీర్తికి కావుటాలు కాగలవు. వీరి భారత రూపకములు స్వతంత్ర నాటకరచనా ప్రస్తావము నందును, మృచ్ఛకటికాదులు ఆంధ్రీకరణ పద్ధతియందును విస్మరింపరానివి.

ఐనచో, నిద్రాణమైన యాంధ్ర కవిత్వమును వినిద్రాణ మొనర్చుటకు తిరుపతి కవులు తెచ్చిన సంజీవని యెట్టిది? కవిత్వమును వీరు పాండిత్యాటవినుండి యుద్ధరించిరి. రెండు భాషలకు నేమె కవీంద్రుల మని చాటుటకై మీసములు పెంచినార మని, ధీమాతో వీరు చెప్పినను, ఆశుకవనమునం దేమి, ఆలోచనా వికసనీతమయిన రచనయం దేమి వీరు ద్రాక్షాపాకమైన శైలిని, సంభాషణ రీతిని, జాతీయములు, సామెతలు, నానుడులు, సభ్య హాస్యము కలిగిన పసందైన శైలిని మాత్రమే వినియోగించిరి. తిరుపతి కవులు శతావధాన నిరంకుశ ప్రజ్ఞచే సాహితీపరుల హృదయముల మర్రూత లూచి బాలురుసైతము కవితాలోలు రగునట్టి మంజుల సారస్వత వాతావరణమును సృష్టించి యుగకవు లను సముచిత ప్రశంసకు పాత్రులయిరి.

కడచిన యర్ధ శతాబ్దిలో ఆంధ్ర వాఙ్మయము విప్పుకొన్న రేకులను విడదీయునప్పుడు ప్రతి దశాబ్దమునందును సంఘమునందు గలిగిన మార్పులును, అవి కవి మనోంబుజాతములపై ప్రసరించిన యరుణ దీధితులును నిరీక్షించుట అవసరము. ఇరువదవ శతాబ్దముయొక్క ప్రథమ దశకము విక్టోరియా పరిపాలనము సమాప్తిని, ఎడ్వర్డు రాజ్యారోహణమును తిలకించినది. అప్పటికి భారతీయులలో రాజభక్తి నిశ్చలముగనే యుండెను. దీనికి తిరుపతి కవుల ఎడ్వర్డు పట్టాభిషేక నాటకము తార్కాణము. పాశ్చాత్యులు తమ ప్రకృతిశాస్త్ర ప్రావీణ్యముచేతను, స్వేచ్ఛా వాతావరణములో పెరిగిన కళావాఙ్మయ సౌరభముచేతను, కుబేర సంపదచేతను, వేషభాషలచేతను భారతీయులమీద చల్లిన చౌక్కుమందు వివేకానందాది మహాపురుషుల గంభీర ప్రబోధములచే గళితము కాజొచ్చెను. భారతీయులయం దాత్మ విశ్వాస బీజములు మెల్ల మెల్లగా మోసులెత్తుటకు దొరకొనెను. అట్లయ్యును ఆంగ్ల విద్యాధికులలో పెక్కురు పాశ్చాత్యులు ప్రాచ్యులకంటె ఉత్కృష్టు లను వ్యామోహమును వీడజాలకుండిరి.

రాజకీయ రంగమునందు ఆంగ్లప్రభుత్వ మను మహావటవృక్షము నిర్వాతదీపమువలె స్తిమితముగా నున్నట్లు తోచినను, దానిని కూకటి వ్రేళ్ళతో కదలించగల పెను గాడ్పులు రెక్కలు సవరించుకొనుచుండెను. దాదాభాయి నౌరోజీ భారతీయుల దుర్భర దారిద్ర్యమును లోకమునకు వెల్లడిచేసెను. వంగదేశ విభజనోద్యమము తీవ్రవాదములకు దారి తీసెను. ఆంధ్ర దేశమునందు స్వదేశీ అభిమానమును, స్వరాజ్య నినదమును పొడచూపెను. ఆంధ్రమహాసభలు ఏర్పడి తెలుగువారిలో నూత్న చైతన్యమును చిలుకజొచ్చెను.

ఇరువదవ శతాబ్దపు ప్రథమ, ద్వితీయ దశకములందు భారతీయ స్వాతంత్ర్య నాటకముయొక్క గర్భసంధి గోచరించును. భావములందును వైశాల్యము కాన్పించును.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఒక వంక ప్రాచీనత యను మందరనగము. మరియొక వంక ఆధునికత్వ మను హిమవన్నగము. ఈ రెండు కొండల నడిమి గంభీరమైన లోయలో చీమల బారువలె సామాన్య ప్రజలు నడచిపోవుచుండిరి. కవిత్వమునందును ఇదియే స్థితి. ఉద్దండ పండితులును, కవితార్ణవమునందు 'గజ ఈత గాండ్రు'ను అగు కొందరు ఆంధ్రమహాకవులు పురాతన ఫక్కికలో సంస్కృత గ్రంథముల నాంధ్రీకరించు చుండిరి. కవిత్రయమువారు కలిసి పూర్తిచేసిన మహాభారతము నేక లేఖినితో నిర్వహించిన శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు, బ్రహ్మాండ పురాణాదుల సంతరించిన జనమంచి శేషాద్రి శర్మగారు వంటివారు అసంఖ్యాకులు. ఈ కవిపుంగవుల రచనలు సలక్షణములై మృదుశైలీ విరాజితములై యొప్పెను. కాని, యువలోకము పూర్వపురాణములతో తనివి నొందుటలేదు. వారి సారస్వత పిపాస నవ్యతా ప్రసన్న సలిలముల గోరెను. అది పౌరాతన్య మను నేతితో చాపుకొను నట్టిది కాదని విశదమయ్యెను.

ఈ శతాబ్దపు టారంభముననే గురుజాడ అప్పారాయ కవి యువలోకము కనుచున్న కలలు రూపొందచేయుచు ఆధునిక కవిత్వపు ధ్వజమును ప్రతిష్ఠించెను. ముత్యాల సరములను గేయ సంపుటితో నవ్య కవితకు నాంది పఠించెను.

> 'క్రొత్త పాతల మేలు కలయిక
> క్రొమ్మెరుంగులు జిమ్మ'

నేతునని ఋషికల్పుడై ప్రతిజ్ఞ చేసెను. నవ్యకవిత్వపు రసాల మునకు ముత్యాల సరములు బీజారోపణము; వస్తువు నూతనము; ఛందస్సులు సరిక్రొత్త; భాష తెలుగువారి యింటిపడుచు వ్యావహారికము; రచనా ఫణితులు మధుర మధురములు. కాని గురుజాడ అప్పారాయకవికి పాశ్చాత్య సభ్యతమీద పరమవిశ్వాసము. మన యాచారములు మూఢ విశ్వాస భరితము లను భావము ఆతనియందు నిరూఢము. 'కల్లలాడరు ఇంగిరీజులు; వారి విద్యల గరచి సత్యము నరసితిన్' అని అతడు పాడుకొనెను. ఇరువదవ శతాబ్ద ప్రారంభమునుండియు భారతీయులకు తమ ప్రాచీనౌన్న త్యమునందు గల్గుచుండిన భక్తి విశ్వాసములను శ్రీ రాయ ప్రోలు సుబ్బారావు కవి తన కావ్య గీతికలయందు ప్రకటించెను. శాంతి నిలయమైన శాంతినికేతనమునందలి ఔపనిష దిక వాతావరణ మీ కవిపై చక్కని ప్రభావము కల్పించి

> 'వేద శాఖలు వెలసె నిచ్చట
> ఆదికావ్యం బలరె నిచ్చట'

యని పాడించెను. నూతనముగా పొటమరించి పొంగులు వారుచున్న ఆంధ్రుల ఆంధ్రాభిమానమునకు గూడ ఈ కవియే తొలిసారి గీతికాలంబన మొసగెను. మధ్య తరగతి సంసారుల జీవితవృత్తము కథావస్తువుగా ఆంగ్లభాషా పరి చితిచే సమాసన్నమైన ప్రకృతితత్త్వ కథన ప్రీతితో, హృద్యమైన స్వభావోక్తితో ఖండకావ్యమను క్రొత్త ప్రక్రి యను సుబ్బారావుకవి ప్రచారమునకు తెచ్చి 'తృణ కంక ణము' మొదలగు లఘు కావ్యములను సృష్టించెను.

ఇరువదవ శతాబ్దము ద్వితీయ దశకము పాదము పెట్టెను. భారతదేశమునందలి బ్రిటిష్ ప్రభుత్వమునకు కడసారి నీరాజనముగా ఢిల్లీ దర్బారు మిరుమిట్లు గొల్పెను. ఇది రాబోవు జగత్ప్రకంపనమునకు ముందు భ్రాంతి గొల్పుటకై వెలసిన శాంతిమాత్రమే. మొదటి ప్రపంచ సంగ్రామము భీకరముగా రేగెను. గాంధీమహాత్ము డింకను బ్రిటిష్‌వారియందు విశ్వాసమును పూర్తిగా విడువలేదు. వెన్న పెట్టినవానికి సున్నము పెట్టినట్లు బ్రిటిష్‌వారు రౌలటు చట్టమును కట్నము చదివించి, పంజాబు దురంతములను కానుక పెట్టిరి. ప్రజల వేదన దుర్భరముగా నుండెను. కాని, నోరు విప్పి పద్చుటకైన వీలులేదు.

> 'నూట నలుబదినాల్గు నోటికి తగిలించి
> మాట లాడవ ద్దంటాడు; మమ్ము
> పాట పాడవ ద్దంటాడు; టోపీ
> తీసి వీపున బాదుతాడు'

అని గరిమెళ్ళ సత్యనారాయణకవి నిక్కముగనే ఘోషించెను.

ఇటువంటి ఇనుపగుప్పిటి పరిపాలనలో సుకుమార కవి విహంగములు కలకలారావములు చేయుటకుగూడ వెర చెను. వారు తమ హృదయ శోకమును అన్యాపదేశముగ మాత్రమే వెళ్ళబోసికొనవలసినవారైరి. స్వాతంత్ర్య దేవతను ప్రియురాలిగ భావనచేసి, యామె సాన్నిధ్యము నకై పరిదేవించుట దేవులపల్లి కృష్ణశాస్త్రి, తల్లావఝుల శివశంకరశాస్త్రి, వేదుల సత్యనారాయణశాస్త్రివంటివారి రచనలలో భాసించును. ప్రియతమ వస్తువు అలబ్ధి నిశ్చయ మగుటచే శోకమే సుఖమను మృదు మానసిక ఛాయకు వీరి రచనలు ప్రతిబింబములు. ఆంగ్ల కవిత్వ సంప్రదాయ ముల ప్రకారము ఆత్మానుభూతినే ప్రధాన కావ్యవస్తు వుగా చేసికొన్న ఈరీతికి 'భావకవిత్వము' అను పేరు చెల్లు చుండెను. దీనియందు కొంత దివ్య వేదాంత సౌరభమును గుబాళించెను. కవి తాను ప్రియుడై, విశ్వాత్మరూపిణి యైన ప్రియురాలి 'పదముల గుసగుస'లకు చెవి యొగ్గి యాలకించుట కృష్ణపక్షము, ఊర్వశి, హృదయేశ్వరి, దీపావళి మున్నగు కావ్యములలో చూడనగును.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



స్వాతంత్ర్య దేవతను మాతృమూర్తిగ ప్రత్యక్షీకరించుకొన వాఙ్మయ తపస్సు చేసిన నాయని సుబ్బారావు కూడ ఈ కోవలోని వాడె.

గేయచ్ఛందములందలి నిరుపమానాదరము ఈ యుగ విశిష్ట లక్షణము. ఇంతవరకును ఇవి పామరజన వాఙ్మయమునందే తలదాచుకొనెను. నిష్కలంక శృంగారమును, ఉత్తమ నాయికా లక్షణములను పామరజనులయందు సందర్శించి 'యెంకి పాట'ల మూలమున ప్రకటించిన నండూరి సుబ్బారావు సాహిత్యమున క్రొకనూతన తేజస్సును ప్రసాదించెను. బసవరాజు అప్పారావు కవి కూడ గేయములందు వడి తిరిగిన హస్తము.

నగర కవులు స్త్రీప్రాయ చిత్తవృత్తులై, మహత్తర ధ్యేయమునకే అగిసు, ఏలిదిలి శోకముతో ఆత్మరంజనము చేసికొనుచుండ గ్రామీణ కవి పురుష కవితో సింహ గర్జనము చేయుచుండెను. 'మా కొద్దీ తెల్లదొరతనము', 'దండాలండోయి బాబు! మేము రామండోయ్' అని ఎలుగెత్తి చాటుచుండెను. బలిజేపల్లి లక్ష్మీకాంత కవి సత్యమైన ఆగ్రహముతో 'ఈ పాంచాలిని రచ్చకీడ్చిన దుర్యోగంబులకై' యని విదేశీయులను శపించెను. శుద్ధాంధ్ర వీరుడు, క్షత్రియ కులాలంకారము అల్లూరి సీతారామ రాజు పిడికెడు వీరులతో రవి యస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యమును ఎదిరింప బూనుకొనెను. ఈ నిర్మలకుటా ధీశుని యాస్థానమునందు గాంధీ వేదాంతమున కింకను అభ్యర్హత సమకూరలేదు.

'గాంధీ తత్త్వమెల్ల - గాజులు గలవారి
మోజూ నందుచునుండె రాజా! — వారికి
గాంధీయె దైవంబు రాజ! — వారు
తన్నారు, కొట్టారు రాజ! ఈ
తత్త్వాన దాస్యంబు తరలూ టెన్నడో రాజ!
అల్లూరి శ్రీ రామ రాజ!'

ఇది ఆతని వీరానుచరుల సంప్రశ్నము. నగర కవులందును తల యెత్తి చూచి ధీర కంఠముతో పలుకగల వారు లేకపోలేదు. విశ్వనాథ సత్యనారాయణ, కొడాలి సుబ్బారావు మున్నగువారు పూర్వాంధ్ర శౌర్యమును హిమశీతలమైన దానిని అగ్నిచ్ఛటా కలితమైన దానినిగా నొనర్ప యత్నించుచు వేగినాటిని, హంపీ క్షేత్రమును ఆవాహన చేయుచుండిరి. కాని, నగర కవు లెవరును వర్తమానమును వర్తమానముగా సాక్షాత్కరింపజేయ లేకుండిరి.

దీని కపవాదముగ దువ్వూరి రామిరెడ్డికవిని పేర్కొనవలెను. ఈ యచ్చపు కాపుబిడ్డ 'కృషీవలుఁడు' అను చక్కని కావ్యమునందు దేశపుటార్థిక జీవితమునకు వెన్నెముకయైన రైతు సోదరుని నిష్కైతవ జీవితమును అమృత వాక్కులలో గానముచేసెను.

వీరేశలింగము పుష్పాంజలి చల్లిన వచన వాఙ్మయోద్యమము ఉరకలు పరుగులు వైచుచు ముందునకు సాగిపోవుచుండెను. ప్రథమ దశకమునందే 'విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలి' వంటివి స్థాపింపబడి నవలలు, దేశచరిత్రలు, మహాపురుషుల జీవితములు, శాస్త్రగ్రంథములు పుంఖాను పుంఖములుగ వెలువడ దొడగెను. లక్ష్మణరావు పంతులు ప్రపంచ విజ్ఞానమును వడియబెట్టనెంచి 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ' నిర్మాణకర్తరు డయ్యెను. లలితహాస్యముతో కూడిన సాంఘిక విమర్శనమునకు పానుగంటి లక్ష్మీనరసింహారావు బాటలు వైచెను. సాక్షి ఉపన్యాసములు పట్టు కొరడాలై పాశ్చాత్య సభ్యతా వ్యామోహితులైన వారిని మెత్త మెత్తగా మోదుచుండెను. అచ్చమైన సారస్వత విమర్శనము ఇంకను రంగమున కవతరింపలేదు. వీరేశలింగము 'ఆంధ్ర కవుల చరిత్ర' — చరిత్ర మాత్రముగనే యుండెను. ఈ లోపమును పూరించుచు కట్టమంచి రామలింగారెడ్డి 'కవిత్వతత్త్వ విచారము'ను వ్రాసి, సాహిత్య సూత్రములతో సాహిత్యము నన్వయించుటకు త్రోవ తీసెను. కానైతే ఈతని దృష్టియందు భారతీయుల సారస్వత విచారమూలములైన యాలంకారిక గ్రంథములు చాలవరకు చెత్తమాత్రమే. ఇప్పు డిప్పుడే పత్రికా రచనము వ్రేళ్ళు పారి ఆంధ్రపత్రిక వంటివి రూపు కట్టుకొనుచుండెను. రాజకీయ వృత్తాంతములతోపాటు సారస్వత విషయములనుగూడ పత్రికలు ఆదరించుచుండెను. వేదము వెంకటరాయశాస్త్రి మహోదయులు అయఃపిండ సదృశములైన పూర్వాంధ్ర ప్రబంధములకు తేట తెనుగులో వ్యాఖ్యానములు నిర్మించుచుండిరి. వీరి శృంగార నైషధవ్యాఖ్య క్రీ. శ. 1913 లోను, ఆముక్తమాల్యదా వ్యాఖ్య క్రీ. శ. 1927 లోను వెలువడెను.

ప్రవర్తమాన రాజకీయ తుముల సమరమునందు కవి పండితులైనవారు ప్రత్యక్ష పాత్ర వహింపకున్నను భాషా, సాంఘిక విషయములందు మార్పు తెచ్చుటకై ప్రశంసనీయ కృషి చేయుచునే యుండిరి. భాషారంగమునందలి మార్పు రెండు రూపములు ధరించెను. పూర్వ సాహిత్య రీతులపై తిరుగబాటు, క్రొత్తబాటలను త్రొక్కుటకై ప్రీతి. కవితా సైన్యములం దీ రెండును గురజాడ అప్పారాయకవితో తలయెత్తెను. నవ్యకవితా వస్తువుల నాదరించుట, గేయ చ్ఛందములను ప్రయోగించుట దీని స్వరూపము. పూర్వపద్ధతులపై తిరుగబాటు వచనరంగమునందు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



శిష్ట వ్యావహారికమునకు దారి తీసెను. ఇదియు గురుజాడవారి ఉపజ్ఞాకమే. గ్రాంథికాంధ్రము అనబడు వచనరీతి కృతక మనియు, వ్యుత్పన్నులును, అనలసులును అగు శిష్టులు తమ శాస్త్రసాహిత్య చర్చలయందు సామాన్యముగ భాషించు భాషయే సజీవము, కావ్య ప్రయోజనోపయోగి యనియు ఈ వాద సారాంశము. గురుజాడ కవి తన కన్యాశుల్క నాటకమునందును, ఇతర రచనల యందును శిష్టవ్యావహారికమున కొక రూపు దిద్ద నడుము కట్టెను. వ్యావహారి కాంధ్రము గ్రంథరచనయందు ప్రయోగింప దగునా, తగదా యను నంశముపై ఇరువదవ శతాబ్ది ప్రారంభముననే పెద్ద దుమారము లేచెను. ఆరంభమున గురుజాడవారు అల్ప సంఖ్యాక వర్గములో నుండిరి. యువజనులయందు వ్యావహారిక భాషాప్రీతి సర్వసామాన్యము కాజొచ్చెను. దీనికి శాస్త్రీయమైన ప్రతిపత్తిని గల్గించుటకై 'గిడుగు పిడుగు' అనబడిన గిడుగు వెంకట రామమూర్తి పంతులు అపారకృషి సలిపి సాహిత్యమునందు, తత్రాపి వచనమునందు శిష్ట వ్యావహారికమునకు స్థిరమైన స్థానమును సాధించెను. ఏది ప్రామాణిక శిష్ట వ్యవహార మను నంశముపై సాహిత్యకులలో ఐకమత్యము కుదురకపోవుటచే దీనియం దింకను వ్యవస్థ యేర్పడలేదు.

నాటకము ఆధునిక వాఙ్మయముయొక్క నవ్యప్రక్రియలలో నొక్కటి. గీర్వాణరూపకముల యాంధ్రీకరణముతో ఇది మొలకెత్తి స్వతంత్రములైన పౌరాణిక నాటకములతో మ్రాను కట్టుకొని, చారిత్రిక నాటకములతో శాఖోపశాఖలై, సాంఘిక నాటకములతో పుష్పించి ఫలించినది. ఆంధ్ర నాటక కర్తలలో అగ్రేసరులైన ధర్మవరం రామకృష్ణమాచార్యులు, గురుజాడ అప్పారావు, వేదము వెంకటరాయశాస్త్రి, చిలకమర్తి లక్ష్మీనరసింహము మున్నగు వారి ప్రశస్త నాటకములు పందొమ్మిదవ శతాబ్ది చివరభాగమున వెలువడెను. అచ్చపు తెలుగు నాటక రూపమైన 'యక్షగానము' ఈ నాడు ఆదరణము నొందలేదు. ఇతివృత్తములందు వైవిధ్యము లేక నృత్య గేయ బహుళమై అప్రియ సంభాషణ కల్గిన దగుటచే యక్షగానము ఈ నాటి రుచికి సరిపడలేదు. సంస్కృత రూపక మర్యాదలను, ఆంగ్ల నాటక రీతులను సమన్వయించి వర్తమానాంధ్ర నాటకము వెలువడుటచే దీనికి అచిర కాలములోనే సముచితౌన్నత్యము లభించినది. సాంప్రదాయికులైనవారు సంస్కృతమునందువలె రస ప్రధానములైన నాటకములను దృష్టియం దిడుకొనిరి. నవ్యులు పాశ్చాత్య నాటకరీతులను లక్ష్యముగా నుంచుకొని క్రియాబహుళములు, పాత్రపోషణ, సంవిధాన చమత్కృతి, సమస్యాపరిష్కారము గలవియు నగు నాటకములు వ్రాయుచుండిరి. గురుజాడ కన్యాశుల్కము, వేదమువారి ప్రతాపరుద్రీయ నాటకము క్రీ. శ. 1897 సంవత్సర ప్రాంతముననే వెలువడెను. ఆంధ్రీకృత నాటకములందు తిరుపతి వెంకటేశ్వరకవుల మృచ్ఛకటిక ముద్రారాక్షసాదులును, వేదము వారి హర్ష నాటకత్రయమును, మల్లాది సూర్యనారాయణ శాస్త్రులవారి ఉత్తర రామచరిత నాటకమును ప్రశస్తములై యున్నవి. స్వతంత్రనాటక రచనయందు తిరుపతి కవుల భారతాధార రూపకములు సలక్షణములై పద్య బహుళములై ప్రాచీనాధునిక రీతులకు చక్కని సమన్వయము చేయుచున్నవి. దేశభక్తి ప్రబోధక నాటకములందు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి బొబ్బిలియుద్ధ నాటకము మిన్నగా నున్నది. మహాభారత నిర్మాణచణులగు వీరి నాటకమునందు కురు పాండవ వీరుల శౌర్యప్రతిస్వనములు వినవచ్చుచుండును.

బహునాటక నిర్మాతలైన పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి రచనలయందు ఒక్కొక్కమారు హిమవన్నగౌన్నత్యమును, ఒక్కొక్కమారు కేవల పృథ్వీలుంఠనమును గూడ కానవచ్చును. పాత్ర నిర్మాణము, మనస్తత్త్వోన్మీలనము మొట్టమొదటి సారిగా తెలుగున ప్రయత్నించి సాధించిన వారు పానుగంటివారు. భక్తిమధురములైన నాటకములందును వీరు సిద్ధహస్తులే. రాధాకృష్ణ, పాదుకాపట్టాభిషేకము, విప్రనారాయణ చరిత్ర వీరి ప్రశస్తరచనలు. నాటకమునకు ఉక్తి ప్రత్యుక్తి మూలకమైన సంభాషణమే జీవమనియు, సంగీత మూలకమైన పద్యరచనము అనావశ్యకమనియు వీరు గట్టిగా వాదించి యాచరించిరి. నాటకమునందు హాస్యరస ప్రయోజనమును పానుగంటివారు చక్కగా గుర్తించిరి. నాటకములందు పాత్రోచిత సంభాషణ యుండుట రసానుకూలమని వాదించి యాచరించినవారు వేదము వెంకటరాయశాస్త్రిగారు. నీచ పాత్రలకు వ్యావహారికాంధ్రమును ఒప్పుకొని వ్రాసి రక్తి తెచ్చిన వీరగ్రాంథికులు వేదమువారు. పౌరాణిక నాటకరచనయందు సావిత్రి, దివోదాసు మున్నగునవి వ్రాసిన శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారును, హరిశ్చంద్ర నాటకకర్త బలిజేపల్లి లక్ష్మీకాంతము గారును పేర్కొనదగినవారు. సాంఘిక రూపకములలో కాళ్ళకూరి నారాయణరావుగారు కొంత ప్రజ్ఞ సాధించిరి. వీరి చింతామణి, వరవిక్రయము జనాదరణ హెచ్చుగా నందెను. నాటక ప్రదర్శనమందు సమర్థమైన నట నటీ బృందము తెలుగుదేశమునకు వన్నె తెచ్చెను. సత్యవోలు గున్నేశ్వరరావు కంపెనీ,



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మైలవరము నాటక సమాజము, బళ్ళారి సరసవినోదసభ, బెల్లూరులో వేదమువారు స్థాపించిన ఆంధ్రభాషాభిమాని సమాజము వంటి చక్కని నాటక ప్రదర్శన పరిషత్తులు ఏర్పడి శాస్త్రీయమైన ప్రదర్శన పద్ధతుల నవలంబించి ఆంధ్రనాటక రంగమును దక్షిణదేశమున నిరుపమానము గావించెను.

ఇరువదవ శతాబ్దపు తృతీయ దశకము మిత్రమండలివారి శుష్కవిజయముతో పదమెత్తెను. సంగ్రామజ్వాలలు ఆర్పివేయబడెను. కాని యుద్ధమూలములైన ద్వేషపు టింగలములు నివురుగప్పుకొని జీవింపజొచ్చెను. భారత స్వాతంత్ర్యమునకై గాంధి మహాత్ముడు సహాయ నిరాకరణోద్యమమును నిర్వహించెను. దేశ మింకను ఇంత తీవ్ర తపస్సునకు సంసిద్ధము కాకుండుటచే సమయోచిత సహకార వాదముతో నిది పరిసమాప్తి చెందెను. సంగ్రామ ఫలితమైన అధిక ధరలు, దుర్భర జీవిత ప్రమాణము, తజ్జన్యములైన నిరాశా నిస్పృహలు ప్రపంచము నావరించెను. దేవులపల్లి మున్నగువారి కవితోద్యానమును గప్పిన శోకహిమము పై నిరాశా హేమంత ధర్మమే యని చెప్పనొప్పును. మరికొందరు 'వినాథులు' తత్త్వచింతనమునందు లౌకిక వ్యథలను మరువ దలచిరి. భగవత్ప్రేమరసాయనముచే లోకపు పగపు గంటులకు చికిత్స చేయ నుంకించిరి. శాంతినికేతనమునందు రవీంద్రుడు పత దుప్యము ప్రాతస్సంధ్యకు రవీంద్రుడయ్యెను. ఆంధ్రదేశమున వెంకట పార్వతీశ్వరకవులు భావచ్ఛాయకు రూపకల్పన చేయుచుండిరి. వీరి 'భావసంకీర్తనము', 'ఏకాంతసేవ' మున్నగు కావ్యములు హింసా, స్వార్థ మాత్సర్య గంధిలమైన లోకవాతావరణమునుండి పవియో దివ్యసీమలకు పాఠకుని అపహరించుకొని పోవుచున్నవి.

హింసయు, సంగ్రామమును ఎట్టి సమస్యలను పరిష్కరింప లేవని తెలిసినకొలదియు ప్రపంచదృష్టి అహింసాత్మకమైన మతమునకై ఎదురుచూడ జొచ్చెను. భారతీయ తత్త్వశాస్త్ర జలసేచనముచే హింసా గ్రీష్మతప్తలోకమును సుఖంప జేయుటకు రాధాకృష్ణ పండితుడు కృషి సేయుచుండెను. అహింసా ప్రధానమైన బౌద్ధమతము వంకకు లోకులు సతృష్ణానయనములతో వీక్షింప జొచ్చిరి. వాఙ్మయమునందును ఇది ప్రతిబింబించెను. తిరుపతి వెంకటేశ్వరకవుల బుద్ధచరిత్రము పేర్కొననైనది. వీరి శిష్యవరేణ్యులు పింగళి, కాటూరి కవులు మరికొంత కాలమునకు సౌందరనంద కావ్యమును వెలయించిరి. పానుగంటివారింతకు మున్నే బుద్ధబోధసుధను రూపకముగా నిర్మించిరి. తెలంగాణమునుండి సన్నిధానమువారు జాతకకథా గుచ్ఛమును కుసుమింపజేసిరి. ఇన్నిటిని మించి వెలిగినది దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారి 'బుద్ధ చరిత్రము'. ఈ యత్యుత్తమ వచన పురాణము ఆంధ్రభాషకు నిక్కపు టలంకారము. వీరి 'మానవ జీవితము' కూడ గంభీర విచారములు కలదియై వీరేశలింగము పంతులు తరువాత విషయగౌరవముగల వ్యాసరచనకు ముఖ్యోదాహరణమై నిల్చినది.

బ్రిటిష్‌వారి రాజనీతి ఫలితముగను రాజ్యాధికారమను ఎండమావులమీది యాశచేతను బ్రాహ్మణాబ్రాహ్మణ సంఘముల నడుమ రవరవలు పొడమి వాఙ్మయమునందును క్షణిక ప్రభలను మెరయించెను. త్రిపురనేని రామస్వామి చౌదరిగారి 'సూతపురాణము' ఈ భావపు పునాదిపై లేచిన మంచి కట్టడము. విషయ మెట్లున్నను లలిత గంభీర రచన యొకవర్గమువారి కాణాచి కాదని సూతపురాణము నిరూపించినది. వర్ణవైమనస్యములతో పాటు సనాతన ధర్మము, పూర్వగ్రంథములు, ప్రాచీనభావములు - వీనిపై దాడి చేయుట సదాచార మయ్యెను. పూర్వవిశ్వాసముల విలువలు పడిపోయెను. సాహిత్యములో ఈ తిరుగబాటును నడపినవారు తాపీ ధర్మారావు, గుడిపాటి వెంకటచలం, ముద్దుకృష్ణ మొదలగువారు. గుడిపాటివారు తమ సావిత్రీ చిత్రణము నందును, ముద్దుకృష్ణగారు అశోకము నందలి సీతా చిత్రణమునందును యుగయుగములనాటి విశ్వాస వ్రతములను పెకలించుటకు విఫలప్రయత్నము చేసిరి.

ఈ శతాబ్దపు చతుర్థ దశకము గొప్ప ఆర్థిక విప్లవముతో ప్రత్యక్షమయ్యెను. వస్తువుల ధరలు పర్వతాగ్రము నుండి పాతాళమునకు క్రుంగి మధ్యతరగతి కుటుంబములను అసంఖ్యాకముగా నేలమట్టము చేసెను. రైతు జీవితము పెనమునుండి పొయ్యిలో బడుటగా మారెను. భారత స్వాతంత్ర్య సమరము తీవ్రమై సంకులమై, దారుణమై చెల్లెను. ఉప్పు సత్యాగ్రహము అధికారుల హింసా విహారమునకు అనువైన సాకుగా సమకూడెను. వాఙ్మయమునందు అపూర్వహృదయ సంశోధనము తలయెత్తెను. రచన సేయుట ఆత్మవినోదమునకా? లోక సంగ్రహమునకా? అను మహత్తర జిజ్ఞాస తరుముకొని వచ్చెను. ఈ సంప్రశ్నము ఆంధ్ర వాఙ్మయమునందే కాక ప్రపంచ వాఙ్మయము లన్నిటను చేయబడెను. కవిత్వము జోలపాట కారాదనియు, అది యొక మేలుకొలుపు, భేరీరావమో కావలె ననియు యువకవులు నిశ్చయించిరి. భావకవిత్వము మృదు పదావకుంఠనపు ఝంకారముగాని దాని వెనుక వాస్తవ సుఖ దుఃఖాత్మక జాతి జీవనచైతన్యము శూన్య



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మని యువకులు తలపోసిరి. 'విశ్వశ్రేయః కావ్యమ్' అను ప్రాచీన లాక్షణిక సూత్రమునకు విపులార్థమును కల్పించి, సంఘక్షేమమునకు, ప్రబోధమునకు, పరపీడన నిర్మూలనకు వినియోగపడుటయే కావ్యముయొక్క మహత్తర ప్రయోజనమని అతినవ్యులు భావించిరి. దీనికి అభ్యుదయ కవిత్వమను పేరు చెల్లుచున్నది.

భావ కవిత్వము పూర్వకవితా రీతులపై తిరుగబాటుగా ఆవిర్భవించినట్లే అభ్యుదయ కవిత్వము భావకవిత్వపు తీరులపై వైముఖ్యమును ప్రకటించెను. సామ్యవాద ఆర్థిక సిద్ధాంతములు దీనికి జన్మ కారణములు. వాస్తవికత, అతి వాస్తవికత, భావాకార చిత్రణము(ఇమేజిజమ్) మొదలగు నవ్య నవ్యతర సాహిత్యరీతులు దీని మార్గములు. భావకవిత్వము ప్రాచీన, నవీన భావములతో దోబూచులాడెను. అభ్యుదయ కవిత్వము నిజముగ విప్లవాత్మకమైనది. గతము గతమే. వర్తమానమునే మానముగా గొని భవిష్యత్తున కుజ్జ్వలములైన బాటలను వైచుటయే మానవ ధర్మ మని యభ్యుదయ వాదులు విశ్వసింతురు. చరిత్ర యంతయు పరపీడన పరాయణత్వమునకును, వర్గముల కలహమునకును నిదర్శనమేకాని దానియందు ఘనతను శోధించుట, ఇసుకనుండి తైలమును తీయు యత్నము వంటిదని వీరు తలంతురు. శ్రీరంగం శ్రీనివాసరావు (శ్రీ. శ్రీ.), శిష్ట్లా ఉమామహేశ్వరరావు, ఆరుద్ర మొదలగువారు తెలుగునందు అభ్యుదయ కవిత్వమునకు ప్రతినిధులు. శ్రీ. శ్రీ. మహాప్రస్థానము దీనికి వాల్మీకము. 'కల్పన', 'ఉదయఘంటలు' అను ముక్తక సంపుటులలో అభ్యుదయ కవుల రచనలు పట్టు గూర్చుకొన్నవి. స్ఫుటములును, పౌరుష ప్రధానములును అగు భావరేఖలతో ఉదయించిన అభ్యుదయ కవిత్వము, శాబ్దిక వైచిత్రీ మృగయావ్యసనమున తగుల్కొని అయోమయమును కల్పించి తన ముఖ్యధ్యేయమును తానే మరచిపోవు ప్రమాదమున బడినది.

ఈ శతాబ్దమునందలి ఆంధ్ర వాఙ్మయమునకు వన్నె తెచ్చిన నూతన ప్రక్రియలలో నవల రచన ముఖ్యమైనది. వీరేశలింగము పంతులు 'రాజశేఖర చరిత్ర'తో బీజారోపణము జరిగి చిలకమర్తి లక్ష్మీనరసింహాకవి నవలల యందు నునుబోదెను కట్టుకొన్న ఈ ప్రక్రియ త్వరలోనే ప్రామా గట్టివడి శాఖలు వైచి విజృంభించినది.

విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి నవలలు, భోగరాజు నారాయణమూర్తి చారిత్రక నవలలు, కేతవరపు వెంకట శాస్త్రి సాంఘిక నవలలు క్రమముగా తెలుగువారి హృదయములను లోగొనెను. కాని ఇంకను నవల శైశవదశను వీడలేదు. ఇట్టి స్థితియందు ముగ్గురు సమర్థతరులైన రచయితల హస్తమున తెలుగు నవల కొక సమున్నత స్థాయి లభించి, దాని భవిష్యత్తు ఆరోహణ క్రమము నధిరోహించిన దని చెప్ప వీలగుచున్నది. ఉన్నవ లక్ష్మీనారాయణగారి 'మాలపల్లి' తెలుగునందలి మొదటి గొప్ప నవలగా లోకము స్వీకరించు చున్నది. స్వాతంత్ర్య సంపాదనకయి భారత ప్రజలు పడిన తపన, ధర్మయుద్ధము ఈ మహాగ్రంథమునందు మ్రిపాలవంటి చిక్కని వాడుక భాషలో చిత్రింపబడినది. భారత స్వాతంత్ర్య లక్ష్యము హింసా పాండితీ మండితుల పట్టికకు మరియొక జాతిని చేర్చుటకు కా దనియు, స్వదేశమునందును పరదేశములందును పరపీడన సిద్ధాంతమునకు భరతవాక్యము చెప్పుట యనియు ఈ సంకీర్ణ విస్తృత కథానకమునందు సూచితమైనది.

గతమే హితము — ఆర్ష విజ్ఞానమే విశ్వమూర్ధన్య మను పరమ విశ్వాసమును మనసార కల్గియుండి, ముక్తకంఠముతో ఘోషించువారు విశ్వనాథ సత్యనారాయణగారు. ఈ భావమునకు వీరు తమ బహువిధరచనల యందు పదింబదిగ రూపకల్పన చేయుచున్నారు. వీరి 'వేనరాజు' నాటకమునందును, 'వేయి పడగలు' అను అనన్యాదృశమైన నవలయందును ఈ భావములు కొట్ట వచ్చినట్లు చిత్రింపబడినవి. భారతీయ ప్రాచీన సంస్కృతి వైయాసికీ సంస్కృతి యనియు, ఇదియే లోకకల్యాణమునకు, ముఖ్యముగ భారతీయుల ఆత్మోద్ధరణమునకు తరణోపాయ మనియు విశ్వనాథ సత్యనారాయణగారు కథాచ్ఛలమున బోధించుటకు వేయిపడగలను నిర్మించినారు. దేవమాతృకా వ్యవసాయము, వర్ణాశ్రమ వ్యవస్థ, రాచరికము, జమీన్దారీ పరిపాలనము, దేవాలయ దేవదాసీత్వ విధానములు — ఇవి భారత సంస్కృతి గుండెకాయయని నిరంతరోద్బోధము చేయును వేయిపడగలు. ఏకవీర, బద్దన్న సేనాని, చెలియలికట్ట వంటి వివిధ రచనలుచేసి నవలారంగము నందును, 'రామాయణ కల్పవృక్షము' పేర వాల్మీకమును నూతనాదర్శములతో సాంప్రదాయిక నాగరికతకు మహా భాష్యముగా వ్రాయుచు కవితారంగమునందును ఒక విశిష్టపథమును, ఒక గౌరీశంకర శృంగమును - ప్రజలు దూరమునుండియే నమస్కరించి వైదొలగు పదమును — అధిరోహించినవాడీ మహాకవి. పాశ్చాత్య నవలలవలె క్రియా ప్రధానముగా గాక, భారతీయ దృక్పథముతో రస ప్రధానముగ నవలలు వ్రాసి భావన్మాత్రసిద్ధి నందినవారు అడవి బాపిరాజుగారు. వీరి ప్రశస్త రచనలు 'నారాయణరావు', 'హిమబిందు' మున్నగునవి. 'వేయిపడగలు'లోని నాయకుడు ధర్మారావు వలెనే నారాయణరావుకూడ భారతీయ పురా



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఘనత యందు విశ్వాసము గలవారైనను తదన్య న్యక్కృతికి పాల్పడు సాంగ్రామికుడు కాడు. 'నారాయణ భట్టు', 'రుద్రమదేవి' వంటి రచనలు చేసి నోరి నరసింహశాస్త్రిగారు తెలుగు చారిత్రకనవలకు వన్నెలు దిద్దుచున్నారు.

చతుర్థ దశకమునందు అభ్యుదయ కవిత్వముతోపాటు జాతీయభావప్రేరిత కవిత్వముకూడ ముందునకు వచ్చినది. దేశీయవీరుల వీరపురాణములను నిర్మించుటొక పవిత్ర కళగా అంగీకృత మాయెను. రాయలసీమ మహాకవులు గడియారము శేషశాస్త్రిగారు వ్రాసిన 'శివభారతము'ను దుర్భాక రాజశేఖర శతావధానిగారు వ్రాసిన 'రాణాప్రతాప చరిత్ర'యు జాతీయ కవితకు కర్ణావతంసములు. ఏటుకూరి వెంకట నరసయ్య పల్నాటి భారతముకూడ పేర్కొనదగి యున్నది. యువహృదయములందు సంప్రదాయము మీద అవిశ్వాసము, ప్రగతి భావములు నిరూఢమయ్యెనని ఇదివరకే చెప్పనైనది. ప్రశ్నార్థక చిత్తవృత్తి బలీయ మయ్యెను. పాశ్చాత్య నాటక కర్తయైన ఇబ్సన్ ధోరణిలో ప్రగతి భావములు గల నాటికలు ఆదరణపొందజొచ్చెను. నటశ్రేష్ఠుడు బళ్ళారి రాఘవాచారిగారు వ్రాసిన 'తప్పెవరిది', పాకాల రాజమన్నారుగారి 'విముక్తి' వంటి రచనలును ఈ రీతికి నుదాహరణములు. రసమహీయములైన గేయనాటికలను వాడుకలోనికి తెచ్చినవారు స్వామి శివశంకరశాస్త్రిగారు. 'పద్మావతీ చరణ చారణ చక్రవర్తి', 'దీక్షితదుహిత' వంటివి ఉత్తమములైన దృశ్య శ్రవ్యనాటికలు.

ఇప్పటినుండియే తెలుగు సారస్వతమునందు ఏకాంకికా రచనయు, కథానికా నిర్మాణమును ఇతర సాహిత్య ప్రక్రియలను ఛాయాగతములు చేసి వెలుగులోనికి వచ్చెను. కవిత్వమునందు ఖండకావ్యము, గేయమువలె వచనమునందివి ఈ యుగచిహ్నములు. పంచతంత్రాది నీతి కథలును, కథాసరిత్సాగరమువంటి నవరసభరితమైన కథలును పూర్వమం దుండెను. వానియందలి కథలు నులితీగలవలె ఒకదానితో నొకటి యల్లుకొని ఒకమహాకథ రూప మెత్తును. వర్తమాన కథానిక అనన్య సంబంధము కలిగి ఒక సన్నివేశమునో, ఒక భావావేశమునో, ఒకపాత్ర శీలైకదేశమునో, ఒక చారిత్రక ఘట్టమునో, సాంసారిక సుఖదుఃఖ తరంగమునో ఇతివృత్తముగ జేసికొని, పరిమిత విస్తృతితో స్వతంత్ర వికాసము గల్గి యొప్పును. గురుజాడ అప్పారావు మొదలుకొని పాలగుమ్మి పద్మరాజుగారి వరకును సమర్థులైన కథానికా రచయిత లెందరో పేరు మోసిరి. మాడపాటి హనుమంతరావుగారు చారిత్రక కథానికలతో దారి తీసెను. వీరి మల్లికాగుచ్ఛము కథానికా రచనకు శ్రీకారమని భావింపబడు చున్నది. కథానికా రచనలో సిద్ధహస్తులు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, మునిమాణిక్యం నరసింహారావు, 'కరుణకుమార' అను మారుపేరు గల కందుకూరి అనంతం, సురవరం ప్రతాపరెడ్డి మున్నగువారు. సంఘమునందలి దుర్నీతిని, కపటమును ప్రకటించుటకు గురుజాడయు, హిందూసమాజము నందలి దురాచార దుష్ఫలితములను కరుణాత్మకముగ చిత్రించుటకు శ్రీపాదవారును, సంసారము దుఃఖసాగరము కాదు అమృత సరస్సు — పుష్కలమైన హాస్యము, రవంత సానుభూతి యున్నచో ఇహమే స్వర్గము కాగల దని నిరూపించుటకు మునిమాణిక్యమువారును, సంఘములోని దీనానాథుల యొక్కయు, చిన్నయుద్యోగులయు, జీవితము నందలి కరుణ పయస్సుల నొలికించుటకు 'కరుణకుమార' గారును, ఆంధ్రుల యొక్కయు, భారతీయుల యొక్కయు శౌర్యాగ్నిని ప్రకటించుటకు ప్రతాపరెడ్డిగారును ప్రవృత్తులైరి. మానసిక చిత్తవృత్తుల యున్మీలనమును కథామాతృకలో పొదిగించుటకు పాలగుమ్మివారివంటి యువ రచయితలు యత్నించుచున్నారు. వీరి 'గాలివాన' యను కథ అంతర్జాతీయ ప్రశస్తిని చేపట్టినది.

కథానికా రచనమును యుగసాహిత్య ప్రక్రియాస్థానమున కెత్తిన పరిస్థితులే ఏకాంకి కావిర్భావమునకును మూలములైనవి. వెనుకటి నాటకములందువలె విపులమైన ఇతివృత్తము గల్గి, అంగాంగ సమ్మేళనము, ఆధికారిక ప్రాసంగిక వృత్తములు, సంధ్యంగములు, సంపూర్ణ రసస్వరూప చిత్రణము గల దీర్ఘ నాటకములను వ్రాయుటకు కవులకును, చదువుటకును దర్శించుటకును పఠితృ ప్రేక్షకులకును అవసరమగు విరామము, చిత్తస్థాయియు లేకుండుటయే అల్పవిస్తృత సారస్వత ప్రక్రియలకు మూలమని చెప్పుచున్నారు. అల్పమైనవైనను వీని నిర్మాణమునకు వలయు కౌశలము, ప్రజ్ఞయు అనల్పము అనుట వాస్తవము. అందును ప్రదర్శనమున కుద్దేశింపబడిన ఏకాంకికా కల్పనము ఇతివృత్తమును, సన్నివేశములను - వరణ వర్ణనము చేయుటయందు గొప్ప విజ్ఞానము నపేక్షించును. ఏకాంకికా రచనమునందు భమిడిపాటి కామేశ్వరరావు, విశ్వనాథ కవిరాజు, మల్లాది అవధాని, ముక్కపాటి నరసింహశాస్త్రి మున్నగువారు పెక్కురు జయశీలురై యున్నారు. భమిడిపాటివారి రచనయందు హాస్యము, వ్యంగ్యము సమవిభక్తములై ఏకాంకికను రంగస్థలముమీద కూడ మే లనిపించు చున్నవి. ముగ్ధ భక్తిని ముచ్చటగా చిత్రించుటలో మేలైన చేయి చింతా



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



దీక్షితులుగారు. వీరి 'శబరి' నాటికయందు సెలయేటి వంటి భక్తిభావము జాలు వారినది.

ఆంధ్ర వాఙ్మయమునందు హాస్యరసమునకు తొలి సారిగా సమున్నత స్థానము నొసగిన దీ యుగమే. తొల్లిటి మహాకవులు హాస్యమును అల్ప చిత్త వృత్తిగ పరిగణించి యుందురు. కాని హాస్య ప్రయోజనము సుమహత్తరమని ఈనాడు గుర్తింప బడినది. దుఃఖసాంత్వనమునకును, శ్రమాపనోదనమునకును, చిత్తవికాసమునకును, మృదు రీతిని చిత్తపరివర్తనమునకును హాస్య మెంతయో ఉపకరించును. గిరీశమునుండి బ్యారిష్టరు పార్వతీశము, కాంతం వరకు కొందరు ప్రసిద్ధ హాస్యమూర్తులు తెనుగు సారస్వతమున నేడు వెలసినారు. మునిమాణిక్యం, మొక్కపాటి, చింతాదీక్షితులు లలిత సుందర హాస్యపోషణమునందు నిష్ణాతులు.

స్వీయ చరిత్రరచన మీ యుగమున సముచిత గౌరవము నాపాదించుకొన్నది. స్వీయ కథనము ఆత్మస్తుతి - వికత్థనమువంటి దోషములకు దారితీయునని కాబోలు పూర్వ మహాపురుషు లెవరును చేయకుండిరి. ఆత్మస్తుతికొరకుగాక ఆత్మపరీక్షకును, నిర్లిప్త కథనమునకును, స్వీయానుభవ ప్రకటనముచే నితరులకు కర్మ ధర్మ మార్గ నిర్దేశమునకును దీనిలో గొప్ప అవకాశము లేకపోలేదు. కావున స్వీయ చరిత్ర రచన మొక సత్సంప్రదాయ మయినది. వీరేశలింగము స్వీయ చరిత్రలో సంఘ సంస్కార రణధ్వనులు ప్రతిధ్వనించుచున్నవి. చిలకమర్తి స్వీయ చరిత్ర యొక కరుణాత్మక కథానకము. కొండా వెంకటప్పయ్యగారి ఆత్మకథలో సమకాలిక రాజకీయ సంగ్రామ సంరంభమును జూతుము. టంగుటూరి ప్రకాశం గారి 'నా జీవితయాత్ర'లో 'దారిద్ర్యము, చిత్త స్థైర్యము అంతర్యుద్ధమునకు పాల్పడినను, సంకల్ప బలమే బల'మను చక్కని సందేశము వ్యంగ్యమయి యున్నది.

చతుర్థ దశకమునందు దేశవాతావరణమున గొప్ప మార్పు సంభవించెను. బ్రిటిష్‌వారు విధిలేక రాష్ట్రీయ వ్యవస్థాపాలనకు ఒప్పుకొనవలసినవారైరి. ఎన్నికల సంరంభము, దాని కుపాంగములైన సత్యాసత్య ప్రచారము, పార్టీలు, కక్షలు అవతరించెను. నిన్న మొన్నటి వరకును చిత్తుకాగితమువలె కూడ చెలామణీ కాని సామాన్య పౌరుడు వోటు హక్కు మూలమున విలువగల వ్యక్తియై గణనీయమైన మూర్తియై భాసించెను. జమీన్‌దారులును, పెట్టుబడిదారులును కర్షక కార్మికుల కుశల ప్రశ్నము చేయవలసినవారైరి. దీనితో వాఙ్మయము కూడ ఈ నూతన పోషక వర్గమువారి సంస్కారమునకును, చిత్తవృత్తికిని అనువుగ నర్తింప వలసిన యావశ్యక మేర్పడెను. సాహిత్యమునకు దీనివలన బలమును, దౌర్బల్యమును కూడ ప్రాప్తించెను. సాహిత్యము భావాంబర విశ్రుత వీథులనుండి క్రిందికి దిగి సంఘజీవిత మను కాసారమునందు తేలు పద్మముగా శోభిల్లెను. కాల్పనిక గీతమునుండి వాస్తవిక జీవితమునకు దిగుట బలముగ సంభావింప వలెను. వాస్తవిక మను మిషతో భావనా దారిద్ర్యము, క్షుద్రకల్పనము, భాషా ఛందోరీతులయందు విశృంఖలత్వము, అయోమయ పరిస్థితి - ఇవి సాహిత్యమునకు బట్టిన చీడగా భావింపవలెను. ఇంతట రెండవ ప్రపంచ సంగ్రామము దావాగ్నివలె లోకమును దహింప మొదలిడెను. మూలుగుచున్న నక్క మీద తాటిపండు పడినట్లు ఇదివరకే దారిద్ర్యముచే నలుగుచున్న భారతీయులకు ఇది మోయరాని బరువయ్యెను. వంగదేశమునందును, రాయలసీమయందును క్షామదేవత విలయతాండవ మొనర్చి తన కోరలకు పలువురను బలిగొనెను. సంఘ విద్రోహులు చీకటి బజారును సృష్టించి అన్నవస్త్రముల కాటకమును బలపరచిరి.

ప్రజానీక వ్యథాభారమునందు అభ్యుదయ కవి, కథకుడు, ఏకాంకికా రచయిత, దుర్బల హస్తములతోనే కావచ్చును, కుమతు దివ్వెను చేబూని ప్రజల దైన్య కంథకమునకు అతుకులు పెట్టుచు సంఘ ప్రతీప శక్తులతో పోరాడిన సన్నివేశము సాహిత్యమునకే వెలుగుబాట. నార్ల వెంకటేశ్వరరావు, ఆత్రేయ, అనిసెట్టి, బోయి భీమన్న వంటి రచయితలు తమ నాటికల, ఏకాంకికల మూలమున సంఘ ప్రబోధమును, సాహిత్యారాధనమును చేసిరి. యుద్ధాగ్నులెట్లో అర్పబడినవి. భారత స్వాతంత్ర్య భానుడు గునగున ఉదయించెను. ఆర్థిక సమత్వము, తుల్య శ్రమ, తుల్య ప్రతిఫలము — ఈ మున్నగు సమస్యలు రచయితల కెదుర్కొనుచున్నవి. వీని పరిష్కారము నరయుటకై సాహిత్య నిర్మాణము జరుగుచున్నది. అనిసెట్టివారి 'గాలి మేడలు', 'మావూరు', బోయి భీమన్నగారి 'పాలేరు' మొదలగు నాటికలు ఈ సమస్యలతో తలపడుచున్నవి. వీనియందు క్రొత్త క్రొత్త రంగ ప్రయోగ పద్ధతులు పొడసూపుచున్నవి. చలనచిత్ర ప్రభావముచేగాబోలు నాటికయందు పాటలు తిరిగి తల యెత్తుచున్నవి. ద్వితీయ సంగ్రామానంతర సాహిత్యము విశిష్టౌన్నత్యము సాధింప లేదు కాని విస్మృతియందు కొరవడి యుండలేదు.

స్వాతంత్ర్యానంతరము ఆంధ్ర దేశమునందు నూతన సాంఘిక జీవనము జాగృతి నందెను. సాహిత్యము పండితులకు మాత్రమే కాక కలిమియు, ఎల్లరకును సాహిత్య మాస్వా



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



లోకము మానసికారోగ్యమునకై అవసర మనియు గుర్తింపబడుచున్నది. బాలవాఙ్మయము, వయోజన గ్రంథావళి సృష్టించుటకు ప్రశంసనీయమైన కృషి జరుగుచున్నది. బాలసాహిత్యమునందు చింతా దీక్షితులు, గిడుగు వెంకట సీతాపతి, నాళం కృష్ణారావువంటి సమర్థులు కొంతకు కొంత బాటవైచిరి. వర్తమాన యుగమునందు అనుబంధ సారస్వతము విస్తారముగ పెరిగినది. సాహిత్య విమర్శనము, చారిత్రిక రచనలు, నిఘంటు నిర్మాణము, శాస్త్రవాఙ్మయ జాతము, పత్రికలు మొదలగు భిన్న భిన్న ప్రస్థానములలో విశేషకృషి జరిగినది. సాహిత్య విమర్శనమునందు వేటూరి ప్రభాకరశాస్త్రి, రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ, సురవరం ప్రతాపరెడ్డి మొదలగు ప్రముఖులు చక్కని బాట యేర్పరిచిరి. చారిత్రిక రచనలయందు మల్లంపల్లి సోమశేఖరశర్మ, నేలటూరి వెంకటరమణయ్య మున్నగు పలువురు ఆంధ్ర చరిత్ర వీథులలో నూతన ప్రభలను వెలుగజేసిరి. అసంపూర్ణమైనను సూర్యరాయాంధ్ర నిఘంటు నిర్మాణము గత అర్ధ శతాబ్ది సాహిత్యచరిత్రలో స్మరింపదగిన విశేషాంశము. ఆంధ్రభాషా చరిత్రను పరిశోధించుటలో చిలుకూరి నారాయణరావు, కోరాడ రామకృష్ణయ్య, గంటి జోగి సోమయాజిగారులు పదమెత్తి నడచిరి. గ్రంథాలయోద్యమము సార్వజనీన విద్యావ్యాప్తికిని, సాహిత్య రంగ విస్తృతికిని పరంపరయా తోడ్పడినది.

రెండు మూడు శతాబ్దములనుండి నిరంకుశ ప్రభుత్వము, జమీన్‌దారీ పద్ధతి అను తిరుగలిరాళ్ళ నడుమ నిర్దాక్షిణ్యముగ విసురబడిన తెలంగాణమునందు అభ్యుదయ సాహిత్యము కొని వచ్చిన తేజోవిప్లవము ఆశ్చర్యకరము. నదీ ప్రవాహమువలె సాహిత్య జలములు కొండలనుగూడ నిశ్శబ్దముగను, నిస్తంద్రముగను అరుగదీయగల సన్నివేశము ఇచ్చట గాంచనగును. దాశరథి, కాళోజి, పొట్లపల్లి, వానమామలై మొదలగు నిశిత రచయితలు ప్రజాభ్యుదయ దృష్టితో రచనలు చేయుచున్నారు. ఈ కవుల భావనా విహంగము తన చిన్న ప్రాంతముపై నెగురుటతో తృప్తిపడక విశాలాంధ్రముమీదను, విశ్వమానవ రంగముమీదను పక్షపాతము నెరపుచున్నది. ఈనాటి బాలకవులును, కథకులును గూడ విశ్వ కల్యాణమను మహోన్నతాదర్శమును - ఒక్కొకక్కప్పుడు శుకాలాపముగానే యైనను - తమ జిలిబిలి రచనలలో ముం దుంచుకొనుట నిక్కముగనే విశ్వశాంతికి ఆంధ్ర సాహిత్యపు కానుక గావచ్చును.

ఖం. ల.

# వచన రచనా పరిణామము

మనసులోని భావము ఇతరులకు తెలియజెప్పేటప్పుడు నోట సాధారణముగా పలికే వాక్యము వ్రాతలో పెట్టితే వచన మవుతుంది. పెద్దల వాగ్వ్యవహారమే వచన రచనకు మూలము. పద స్వరూపము, వాక్యములో పదముల క్రమము, వాక్య నిర్మాణము, ఉక్తి వైచిత్రి, జాతీయమైన పలుకుబడి మొదలైన వన్నీ వాగ్వ్యవహారానుగుణముగా సహజరీతిని ఉండడమే వచన రచనకు మర్యాద. పాట, పదము, పద్యము మొదలైన ఛందోబద్ధ రచనలవలె ప్రతిభా వ్యుత్పత్తులును ప్రత్యేకమైన నేర్పునుగల ఏ కొద్ది మందికి మాత్రమో రచించుటకు సాధ్యమైనదిన్ని, అభిరుచి సహృదయత అధికారము గల ఏ కొందరికి మాత్రమో ఆస్వాద యోగ్యమైనదిన్ని కాక వచనము సర్వసాధారణముగా ఎల్లవారికిన్ని సులభసాధ్యమూ, సుబోధమూ అయి, సమస్తవిధ రచనలకూ నిత్యమూ ఉపయోగపడేదిగా ఉంటుంది. పరిమిత ప్రయోజనము పాటకీ, పద్యానికీ ఉండగా వచనము అపరిమిత ప్రయోజనము సాధిస్తుంది. అది ఇది అనే భేదము లేక సమస్త రచనా వ్యాపారములకూ పనికివచ్చేది అనీ, సూటిగా తేటతెల్లముగా ఉండే నోటి మాటకు ప్రతిరూపమనీ వచనమును నిర్వచింపవచ్చును.

సాహిత్య సృష్టి సర్వసాధారణముగా ఏ భాషలో అయినా భావోద్వేగ జనితమై, ఛందోబద్ధమై హాయిగా పాడుకొని ఆనందించుటకు యోగ్యమై, పాట పదము పద్యము మొదలైన రూపములతో తొలుత ఆరంభ మవుతుంది. ఆలోచన, పరిశీలన, విమర్శన మొదలగు మానసిక వ్యాపారములలోని కుశలత ప్రధాన హేతువుగా తరువాతి కాలములో ఎన్నడో ఉత్పన్న మౌతుంది వచన సాహిత్యము. తెలుగు సాహిత్యములో వచన రచన ఆదిలో ఎట్లుండెనో, వాఙ్మయ శాఖగా వచనము ఎప్పుడెప్పుడు ఏయే రీతుల పరిణమించినదో పరిశీలించుట ప్రస్తుత విషయము.

నన్నయభట్టు భారత రచనకు పూర్వము వచనము ఎట్లుండెడిదో తెలిసికొనుటకు శాసనములు తప్ప వేరాధారము లేదు. ఇప్పటికి లభించిన తెలుగు శాసనములలో అతి ప్రాచీనములు క్రీ. శ. 6 వ శతాబ్దమువాటివి. అవి మొదలు నన్నయనాటివరకున్న గల శాసనములనుబట్టి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ప్రాఙ్నన్నయ యుగమునందలి భాషా స్వరూపమున్ను, వచన రచనా పరిణామమున్ను నిరూపించవచ్చును. క్రీ.శ. 6వ, 7వ శతాబ్దములలో వాక్య రచన కేవలము ప్రాథమికావస్థలో ఉన్నట్లు కనబడుతుంది. 'కొట్టంబున పాఱకు కుండి కాళ్లుళ ఇచ్చిన పన్నస ఇరవది యాడి నాల్కు మఱుతుల్లు నేల'; 'దీని కాచి కుడిపినవారు భూమి దాన ఫలంబు'; 'వక్ర వలికినవారు పంచమహా పాతకంబు పడు'; 'స్వస్తి శ్రీ చోళమహారాజుల్ శైళన్ ఎరిగ(ల్)దుగ రాజుళ్ యిచ్చిన పన్నస కొచ్చియపాఱ రేవ శర్మ్మార్ఱికిన్ తేని ఒచ్చినవాన్డు పంచమహాపాతకసంయుక్తున్డగున్ అసివైరువు లికితమ్'. ఈ శాసన వాక్యములనుబట్టి ప[illegible]ముల స్వరూపమున్ను, వాటి ఏకవచన బహువచనముల రూపములున్ను వాటి తమిళ, కన్నడ రూపములకు సన్నిహితముగా ఉండి తెలుగుభాష వాటినుండి ఇంకా బాగా వేరుపడలేదని గోచరిస్తున్నది. పదముల అన్యోన్య సంబంధము తెలిపే ప్రత్యయములు ఏ రెండు మూడు మాత్రమో కానవస్తున్నవి. క్రియలకు బదులు క్రియాజన్య విశేషణములే నిలిచి ఉన్నవి. క్రియాపదము తరుచు అధ్యాహారము అయినా, భావములు గ్రహించుటకు కావలసిన ప్రక్రియ నాటి వాక్యములలో లేకపోలేదు. క్రీ. శ. 9వ శతాబ్దికి వాక్యముల తీరు స్ఫుటము కావచ్చినది. దీర్ఘ వచనములే కాక పద్యముకూడా అన్వయ శుద్ధితో రచించుటకు యోగ్యముగా భాష రూపొందినది. తత్సమ తద్భవములతో తెలుగు పదములు పొత్తు కుదుర్చుకొని తెలుగుభాష స్వతంత్ర మార్గమున పురోగమిస్తున్నట్లు స్పష్టపడుతున్నది. ఈరీతిగా పెంపొందుటవల్లనే నన్నయభట్టునాటికి భాష కావ్య నిర్మాణ యోగ్యమైనది. తెలుగు దేశములో వివిధ ప్రాంతములలో కనబడిన నన్నయనాటి శాసనములు పరిశీలించి జయంతి రామయ్యపంతులు, గిడుగు వెంకటరామమూర్తి పంతులు మొదలగు శాసన పరిశోధకులు పలువురు తెలుగుభాష ఆనాడు సర్వత్ర ఏకరూపముతో ఉన్నదనీ, భారత భాషకున్ను, ఆ కాలపు శాసన భాషకున్ను వ్యత్యాసము లేదనిన్నీ పేర్కొన్నారు. నాటి శాసనములు వచన శైలిలో ఉండగా నన్నయ భారతములోని వచనము — వచన మనుటకంటె దానిని గద్య అనుట యుక్తముగా ఉంటుంది — పద్యకావ్య శైలిలో ఉన్నది. దీనికి ఒక కారణము కనబడుతున్నది.

సంస్కృతములో అదివరకు కావ్యములు పద్యమయములో, గద్యమయములో అయి ఉండగా గద్య పద్య మిశ్రితమై 'చంపువు' అనే క్రొత్త కావ్యభేదము క్రీ. శ. 10వ శతాబ్ది ప్రాంతమున అవతరించి నన్నయ నాటికి సంస్కృతములోనే కాక కొన్ని దేశ భాషలలోనున్ను వాడుకలోనికి వచ్చి 'గ్యాద్య రచన' అని ప్రసిద్ధి పొందుటవల్లనూ, ఈ విధమగు నూతన రచన తన భారతానువాదమునకు మిక్కిలి అనుకూలించుట చేతనూ నన్నయ గద్యపద్యాత్మకముగా భారతము రచించినాడు. ఇట్టి కృతులలో ఛందోబద్ధమై ఉండకపోవుట ఒక్కటే భేదముకాని, తక్కిన సర్వ విషయములలోనూ గద్యము పద్యశైలినే పోలి ఉంటుంది. నన్నయ రచనలో పద్యము వలెనే గద్యము కూడా అక్షర రమ్యత, ధారా చమత్కృతి, ప్రసాద గుణము మొదలైన లక్షణములు కలిగి, నాతిదీర్ఘమై ఇది గద్య, ఇది పద్యము అనే భేదము తెలియరానిదిగా ఉన్నది. కొన్ని చోట్ల గద్య ఎత్తుగడలో ఛందోబద్ధమై పద్యమువంటి నడకతో ప్రారంభమై వృత్తగంధి లక్షణానుసారిగా ఉన్నది; అంతమందు వాక్యము పూర్తిగాక పై పద్యముతో అన్వయిస్తున్నది. నన్నయాదులు ఈ గద్యను 'వ' వచనమని వ్యవహరించుటచేతనే అనంతామాత్యుడు ఛందోదర్పణములో 'గద్య మది దాఁ దెనుఁగుఁ గృతుల వచన మనఁగ దీపించుఁ గడున్' అని పేర్కొన్నాడు. వచనమని పేర్కొన్నా లక్షణమునుబట్టి అది 'గద్య' అని స్పష్టము. తెలుగులో పద్య విద్యకేకాక, గద్య విద్యకున్ను నన్నయభట్టే ఆద్యుడు. నిర్వచనముగా వ్రాసిన ఏ కొద్ది గ్రంథములో తప్ప సర్వ సాధారణముగా తెలుగు కావ్యము లన్నీ చంపువులై ఉండుటకు నన్నయ పెట్టిన వరవడి కారణము. పద్య కావ్యములో ఏయే సందర్భములో గద్య వ్రా[illegible] సముచితమో నన్నయభట్టు చక్కగా నిర్ణయించుకొని ఒక్క వ్యవస్థ ఏర్పరచుకొన్నట్లు కనబడుతుంది.

ఆశ్వాసారంభమున కథ ఉపక్రమించేటప్పుడు గద్య, వృత్తాంతము చెప్పేటప్పుడు, పూర్వ వృత్తాంతము సంగ్రహించి చెప్పవలసినప్పుడు, కొద్ది మాటలలో కథ ముగించవలసినప్పుడున్ను గద్య, సంభాషణ, వాదోపవాదము, ఉపన్యాసము, ఉపదేశము, యాత్ర, ప్రకృతి శాస్త్రాదికముల కథనము మొదలగు సందర్భములలో గద్య, వర్ణనము, పట్టికలుగా విషయనిర్ణయమున్ను అవసరమైనపుడు గద్య, ఒక విషయమునుండి మరొక విషయమునకు మారునపుడు సేతువుగా గద్య, ఆశ్వాసాంతమున ఆశ్వాసాంతగద్య - ఇన్ని రీతులుగా గద్య వ్రాసి దానిని నీరస విషయములకు మాత్రము పరిమితము చేయక రసవద్విషయములు చెప్పుటకున్ను వాడుక చేసి, పద్యముతో సమాన గౌరవము గద్యకు చేకూర్చి నన్నయభట్టు చంపూ ప్రబంధ నిర్మాణము సార్థకముచేసినాడు. భారత భాగ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ములో సగటున నూటికి 45 పంక్తులు గద్య ఉండుటగూడా గమనించదగిన విషయము.

తిక్కన గద్య జిలుగు బిగువులు గలిగి, ఎక్కడి కక్కడ చిన్న చిన్న విరుపులతో, సహజమైన తెలుగు నుడికారముతో ఆహ్లాదము గొలుపుతుంది. ఎఱ్ఱన గద్యరచన ప్రౌఢమై ఒకచోట సంస్కృత పదముల పాలు, ఒకచోట తెలుగుపదముల పాలున్ను అధికతరములై వర్ణనా ప్రధానమై ఉంటుంది. నృసింహ పురాణములో ఎఱ్ఱన 'స్తంభోద్భవ వచన' మను ఉత్కళికా ప్రాయమైన చిత్ర రచన చేసినాడు. ఇది తరువాతి ప్రబంధ కర్తలకు మార్గదర్శకమైనది. శ్రీనాథ, సోమనాథుల గద్యలు ఉద్ధతములు; చిత్రపద గుంఫితములు. ప్రౌఢ సంస్కృతపద ప్రయోగముతో, శ్లిష్టమయిన కూర్పుతో యమకానుప్రాసాది శబ్దాలంకారములతో కొంచెము దీర్ఘములై ఉంటవి. పోతన సుదీర్ఘ వర్ణనములకున్ను, ఆధ్యాత్మిక విషయము లుపన్యసించుటకున్ను పెద్ద పెద్ద గద్యలు ప్రవేశపెట్టినాడు. ప్రబంధములలోని గద్యలు బహుక్లిష్టములు, అనుప్రాస నిరంతరములు, దురవబోధములు. పాఠకులు సామాన్యముగా వాటిని దాటిపోయి పద్యములే అంతకంటె తేలికయని అవి చదువుతారు.

కాకతీయ యుగమునను, అంతకు పూర్వమును వచన రచన యె ట్లుండెనో తెలుసుకొనుటకు శాసనములే ఆధారము కాని వచనములో వ్రాసిన గ్రంథములు దొరకలేదు. ఇప్పటికి మన మెరిగినవాటిలో అతి ప్రాచీనమైన వచన గ్రంథము ఏకామ్రనాథుని ప్రతాప చరిత్ర 15 వ శతాబ్దము తొలి యర్థ భాగములో వ్రాసినదై యుండవచ్చును. కాకతీయుల వృత్తాంతమును తెలుపు చారిత్రిక గ్రంథమిది. ఇందులోని వచన రచన నాటి వచన శాసనముల భాషను పోలియున్నది.

'వచనము' లను పేర గద్యగా వ్రాసిన స్తోత్రములు క్రీ. శ. 15, 16 వ శతాబ్దములలో వెలువడ్డవి. లలితపద జాలముతో సుబోధకముగా ఉన్న ఈ వచనములు పాటల వలె రాగయుక్తముగా పాడుటకు అనుకూలమైనవి. 'సింహాగిరి నరహరి వచనములు', 'శఠగోప విన్నపములు', తాళ్ళపాక వెంకట తిరుమలయ్యగారి 'వేంకటేశ్వర వచనములు' మొదలైనవి ఈ తరగతివి. 'భవానీ మనోహర వచనము', 'కాళికాధీశ్వర వచనము', 'భారత సావిత్రి' అనేవి శైవవాఙ్మయములో ప్రసిద్ధిపొందిన రచనలు — బహువ్యాప్తి పొంది నేటికిన్ని పారాయణములో ఉన్నవి.

ఈ స్తోత్రములలోని 'వచనము', పురాణములు ప్రబంధములు మొదలైన చంపూకావ్యములలోని 'వచనము'న్ను మాత్రమే పద్యభాషను పోలిన గద్యలో ఉన్నవి. కాని ఇతర వచన గ్రంథములే కాక కావ్యేతరములైన పద్య కృతులలోని - అనగా ఛందోవ్యాకరణాలంకారాది గ్రంథములలోని - వివరణము, తెలివిడి, అవతారిక అనే పేర్లుగల వచన భాగములున్ను వచన లక్షణానుసారముగా వ్యావహారిక భాషలోనే ఉన్నవి. మరుగుపడి ఎవరికిన్ని ఎరుకలేని ఈవిషయము గిడుగు వెంకట రామమూర్తి పంతులుగారి అసాధారణ పరిశోధనలవల్ల బయలు పడినవి. అప్పకవీయము, రంగరాట్ ఛందము, లక్షణ శిరోమణి, సర్వలక్షణసార సంగ్రహము, కవి జనాంజనము మొదలైన అనేక గ్రంథముల తాళపత్రప్రతులున్ను, క్రీ. శ. 1800 వ సంవత్సరమునకు పూర్వము ముద్రించిన అచ్చుపుస్తకములున్ను పరిశీలించుట వల్ల ఇది స్పష్టపడినది. అప్పకవి తన గ్రంథమునకు ఆధారముగా పేర్కొన్న బాలసరస్వతీయము (ఆంధ్రశబ్ద చింతామణికి టీక)లో వివరణ మంతా వ్యావహారిక భాషలో ఉన్నది. శాస్త్రగ్రంథములు వచనములో వ్రాసేటప్పుడు అట్టి భాషలో వ్రాయుటే సంప్రదాయము. దానిని అనుసరించి అప్పకవి వచన మంతా వ్యావహారిక భాషలో వ్రాయగా పరిష్కర్తలు దానిని గ్రాంథికభాషలోనికి మార్చివేసినారు. గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారున్ను, వారి కుమారులు సీతాపతి పంతులుగారున్ను ఆ గ్రంథమును యథామాత్రకముగా ఉద్ధరించినారు (వావిళ్ళవారది క్రీ. శ. 1924 లో ప్రకటించినారు). దానికి వారు వ్రాసిన విపులమైన పీఠికలో ఈ విషయమంతా స్పష్టముచేసినారు. అప్పకవి వచన రచనకు ఉదాహరణము: 'మేరు చక్ర మనగాను ఇన్నవ ఛందమునందు ఎన్నేసి లఘువుల వృత్తములు ఎన్ని యని యడిగితేను సరిచెప్పేటి విధము: మొదల అడ్డ వీథిగా రెండిండ్లు వ్రాసి యా క్రిందను వెంబడిగాను రెండు పార్శ్వములయందున్ను ఒక్కొక్క యిల్లు మించియుండేటట్లుగాను మొదటి వీథితోగూడాను ఇరువైయారు అడ్డ వీథులుగాను గీటులు తివిచి ఉభయ పార్శ్వములయందున్ను మించియున్న కడపటి యిండ్లను మీది యిండ్లు మొదలుకొని అన్ని యిళ్ళను తప్పకుండాను ఒక్కట్లు పెట్టి మీది వీథినున్న లెక్కలక్రిందను దిగువవీథియందు నిడుపుగాను ఒక్కొక్క యింటను ఆ లెక్కలను క్రింద ఉండేటట్టుగాను వ్రాసేది. ఇటువలెనే వ్రాస్తేను మీది వీథి కంటె క్రిందివీథిని ఒక్కొక్కయిల్లు ఎక్కువ అవుచును వచ్చును' (అప్ప కవీయము — IV. 188). అప్పకవి కాలమందున్ను, అతనికి పూర్వమున్ను, పిమ్మటనున్ను సార్వత్రికమైన ఈ సంప్రదాయమునే పైని పేర్కొన్న



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఛందోవ్యాకరణాలంకారాది గ్రంథముల రచయితలు అవలంబించినారు.

రాయవాచకము (క్రీ. శ. 16 వ శతాబ్దము) మధురా పురాధిపతి విశ్వనాథనాయకుని స్థానాపతి విజయనగరమున ఉండి కృష్ణదేవరాయల పట్టాభిషేకము మొదలు కళింగ దండయాత్రవరకు జరిగిన విషయమును తన ప్రభువగు 'మహామండలేశ్వర కాశీవిశ్వనాథ నాయనయ్యవారి దివ్య శ్రీ పాదపద్మములకు' నివేదికగా సమర్పించిన గ్రంథము. దేశచరిత్రకు వలెనే తెలుగు వచన చరిత్రకున్ను ఇది మిక్కిలి ముఖ్యమైన గ్రంథము. ఇది కథా ప్రారంభములో ఉన్న పంక్తులు విద్యానగరమందు వీర నృసింహరాయ వారు........పేరోలగంబై కూర్చుండగాను మూటయెనిమిది తిరుపతులనుంచిన్ని తీర్థ ప్రసాదములున్ను దక్షిణ రెండు దేవస్థలాలనుంచి విభూతి గంధ ప్రసాదములున్ను రాగా యెదురుకొని ప్రత్యుత్థానము జేసి అంజలిచే నందుకొని శిరసావహించి స్థలాంతరాల నుంచిన్ని వచ్చిన అయ్యంగార్లనున్ను ఆరాధ్యపీఠం వారలనున్ను ఉచితాసనముల యందు కూర్చుండ నియమించి....'. ఈ వాక్యము 50 పంక్తులున్నది. మూటపదహారు పుటలున్న ఈ రాయవాచకము ఆంధ్రసాహిత్య పరిషత్తువారు తమ పత్రికలో ప్రకటించినారు. తలికోట (రాక్షసి-తంగడి) యుద్ధానంతర వృత్తాంతము చిత్రించిన 'కర్నాట రాజవృత్తాంతము'న్ను, 'తంజావూరి ఆంధ్రరాజుల చరిత్ర' అనే గ్రంథమున్ను నాటి భాషా స్వరూపము నిరూపించే చక్కని వచన గ్రంథములు..

తెలుగులో తత్త్వశాస్త్ర గ్రంథాలు విస్తారముగా ఉన్నవి. ఆ శాస్త్రములలో నిష్ణాతులైన ప్రసిద్ధ పండితులు సామాన్య పాఠకులకు కూడా అవి సుబోధములై ఉండవలెననే ఉదార సంకల్పముతో వాడుకభాషలో వ్రాసినారు. 'సాత్త్విక బ్రహ్మవిద్యా విలాసము', 'వేదాంత సారసంగ్రహము' 'అజ్ఞానధ్వాంత చండ భాస్కరము', 'సిద్ధాంతసారము', 'వాసుదేవ మననము' మొదలగు అనేక గ్రంథములు బాగా వాడుకలో ఉండేవి. ఈ గ్రంథములలోని రచనకు ఉదాహరణము: 'అసురాంశల బుట్టినవారి లక్షణములు చెప్పేము. శ్రుతులకు విపరీతార్థములు కల్పింతురు. విష్ణుదూషణ చేతురు. విష్ణుభక్తులను ద్వేషింతురు. వారితో వాదించవోవద్దు. వారు చెప్పే శ్రుతిస్మృతిలిహాస పురాణాలయొక్క విపరీతార్థాలు నీవు యెల్లకాలము దిద్దుకోనే సరిపొయ్యేని. నీవు దిద్ది చెప్పితి వాయనా వారు నమ్మితి పడనే పడరు. నమ్మితి పడిరా విశేష మార్గాన నడవనే నడవరు. ఎదిగాన ఓ శిష్యోత్తమా అసురా... వారికి బోధించవోక. నీ వ్నాశ్రయించిన భగవద్భ... న వారికి మేము నీకు చెప్పిన సాత్త్వికబ్రహ్మ విద్యా... ానము యొక్క రీతు లుపదేశించి కృతార్థుల జేయుము.' మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య గ్రంథమాలలో 88 వ గ్రంథముగా క్రీ. శ. 1952 లో ప్రకటించిన బ్రహ్మ విద్యా సుధార్ణవమనే తత్త్వగ్రంథము, పరమానందతీర్థయతి వ్రాసినది, వాటిని పోలియున్నది. ఈ సంప్రదాయమునే అనుసరించి వెంకటగిరి మహారాజావారు, శ్రీ వెలుగోటి సర్వజ్ఞ కుమార యాచేంద్ర భూపాలురు అనేక తత్త్వగ్రంథాలు వ్రాసినారు. మనస్సాక్ష్యమనే గ్రంథములో 'వ్యాకరణ శిక్షితముగా వ్రాసితే కొందరికి తాత్పర్యము భిన్న మగునని యెంచి ఈ గ్రంథాభిప్రాయము అందరికి చక్కగా తెలియవలెనని వాడుకగా నుండు మాటలలో వ్రాసినాడను' అని పేర్కొన్నారు.

తత్త్వ గ్రంథములకువలెనే వివిధ శాస్త్రములకు సంబంధించిన గ్రంథములున్ను గడచిన శతాబ్దాదిని వ్యవహార సిద్ధమైన భాషలో వ్రాయబడినవి. అల్లాడి రామచంద్ర శాస్త్రిగారి 'సిద్ధాంత శిరోమణి' (క్రీ. శ. 1837)-కర్త ఎవరో తెలియదు-, 'భూగోళ దీపిక' (క్రీ. శ. 1848), వఠ్యం వాసుదేవ పరబ్రహ్మ శాస్త్రులవారిచేత మిక్కిలి స్పష్టముగా తెలిసేటట్టు రచింపబడ్డ జాన్ ప్రైయ ర్థామ స్నూపాలీయ మనే 'వ్యవహార దర్పణము' (క్రీ. శ. 1851) మొదలైన ధర్మశాస్త్ర, జ్యోతిష, సిద్ధాంత, వైద్య, భరత శాస్త్రాది గ్రంథజాలము పఠన, పాఠనములకు విరివిగా ఉపయోగపడుత... ...డేవి. శాస్త్ర గ్రంథము లెట్టి భాషలో ఉన్నవో తెలుసుకొనుటకు 'భూగోళ స్వరూప లక్షణాది విషయము'నుండి యెత్తి వ్రాసిన పంక్తులు: 'సర్వజన సాధారణముగా దూరమునందు గల పర్వత గృహారామాదులను జూచేయెడల వాటి అగ్రభాగమును కనుచున్నాము కాని అదిభాగమును కనుట లేదు. పిమ్మట వాని సమీపమునకు పోవునెడల క్రమముగ ఆదిభాగమును కంటున్నాము. ఈ హేతువువలన భూమి సర్వతో వృత్తముగా నుండక పలకవలె సమముగా నుండిన పక్షమునందు మీద చెప్పిన దూరస్థమగు పర్వతాదుల యాద్యంత్య భాగములు ఏక కాలమునందు కనుపించును గాని అగ్రభాగము మాత్రము కనుబడదు'.

తెలుగు దేశములో ఇంగ్లీషు విద్య ప్రారంభమైన కాలమునందే కథావాఙ్మయము అవతరించినది. విశాఖపట్టణములో నివసించి ఉండే గోడే నారాయణ గజపతి రాయనింగారు క్రీ. శ. 1811 లో ఇంగ్లీషులో ప్రకటితమైన 'చార్ దర్వేషు' కథలు లోకోపకారముగ తెలుగు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



భాషలోనికి యెఱ్ఱమిల్లి మల్లికార్జునుడు అనే బ్రాహ్మణుని చేత అనువదింపజేసినారు. ఆ గ్రంథ పీఠికలో 'వ్యాకరణ పద్ధతిగా గ్రంథము చేసేయెడల సర్వజన సాధారణము కాకపోవడమే కాక దేశీయ భాషాచమత్కారము బోధ పడక, విరసమౌనని తోచి స్త్రీ పురుషులు వకరితో నొకరు మాటలాడునట్లు సులభముగా అర్థమయ్యేలాగున సంక్షేప ముగా జాతీయరసముతో ఈ గ్రంథము సేయ నిశ్చయిం చడమైనది. కనుక ఇందుకు సమస్తమైనవారు హర్షించవల సినది' అని గ్రంథకర్త తమ ఆశయమును స్పష్టముగా వెల్లడించిరి.

క్రీ. శ. 1819 లో 'విక్రమార్కుని కథలు'న్ను, క్రీ. శ. 1834 లో 'పంచతంత్ర కథలు'న్ను ఫోర్టు సెంటు జార్జి కళాశాలలో ప్రధానోపాధ్యాయులగు రావిపాటి గురు మూర్తి శాస్త్రిగారు వ్రాసినారు. అవి ఎన్నో పర్యాయ ములు పునర్ముద్రితము లైనవి. కాంభోజరాజు కథలు, తాతాచార్యుల కథలు, తెనాలి రాముని కథలు, శుక సప్తతి కథలు, బేతాళ పంచవింశతి, పలుకని పద్మాక్షి కథలు మొదలైన గ్రంథములతో కథా సాహిత్యము వర్ధిల్లి విస్తార వ్యాప్తిని పొందినది.

క్రీ. శ. 1820 లో చెన్నపట్టణములో ఉపయుక్త గ్రంథ కరణ దేశభాషా సభ (ది మద్రాస్ టెక్స్ట్ బుక్ వర్నా క్యులర్ సొసయిటీ) ఏర్పడి బడులలో పాఠ్య గ్రంథ ములుగా నిర్ణయించదగిన పుస్తకములు, అనేక విషయము లకు సంబంధించినవి, ప్రకటించినది. బాలబోధకు నాడు దేశమందంతటా వాడుకలో ఉన్న పుదూరి సీతారామ శాస్త్రిగారి పెద్దబాలశిక్ష మొదలుకొని పెద్ద తరగతులలో బోధించే 'మహాపురుషుల జీవితములు', 'ఇంగ్లాండు దేశ చరిత్ర' 'భూగోళము' వరకున్ను గల బడి పుస్తకములు క్రీ. శ. 1820 మొదలు క్రీ. శ. 1856 వరకూ వ్యావహారిక భాషలోనే సుప్రసిద్ధ పండితులచే వ్రాయించబడినవి. ఈ సభకు కొంత కాలము రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారు అధ్యక్షులు. పరవస్తు చిన్నయసూరిగారు ఆ పిమ్మట అధ్యక్షులుగా ఉన్న కాలములో అనేక గ్రంథములు మహమ్మదు చరిత్ర' (క్రీ. శ. 1856), 'జాను బన్యను చరిత్ర' (క్రీ. శ. 1856), 'అమెరికాను కనిపెట్టిన చరిత్ర' (క్రీ. శ. 1856) మొదలైనవి వాడుక భాషలో ప్రకటితము లైనవి. కాంచీపురము పచ్చయప్ప మొదలారిగారి విద్యా శాలయందు ఆంధ్ర గీర్వాణ ప్రధానోపాధ్యాయులైన వైయాకరణము రామానుజాచార్యుల వారితో కలిసి చిన్నయసూరి భారతములో ఆది పర్వము పరిష్కరించి క్రీ. శ. 1847 లో ప్రకటించినాడు. ఎడమవైపు పుటలో పద్యములున్ను కుడివైపు పుటలో ఆ పద్యములకు సరి యైన వచనమున్ను ముద్రింపబడినవి. వచన భాగము వ్యావహారిక భాషలో ఉన్నది. ఈ క్రింది వాక్యములు అందులోనివి. 'ఓ యయాతి మహారాజా నీవు సకల ధర్మార్థముల నెఱింగిన వాడవు. నీవు సమస్తులయిన లోకుల వ్యాపారముల నెఱింగిన వాడవు. గనుక మాకు పుణ్య లోకము లేమైనా గలవా చెప్పవయ్యా అని యడు గగా మీకు పుణ్య లోకములు గలవని చెప్పిన యయాతి మాటలు విని వారు ముగ్గురున్ను సంతోషించి మేము నీ కూతురు బిడ్డలైన మనుమల మని తమ్ము నెఱింగించి పుణ్య లోకముల నిచ్చిరి. ఆ యయాతి ఆ సత్పురుషుల సాంగత్యమువలన తానున్ను, తన మనుమలున్ను ఊర్ధ్వ లోకమునకు పోయిరి'.

ఇంచుమించు ఈ కాలములోనే సి. పి. బ్రౌను దొర వారు పెక్కుమంది పండితుల సాయముతో తెలుగు భాషా వాఙ్మయముల విషయమున ఎంతో పరిశోధన చేసి ప్రాచీన గ్రంథములను సేకరించుట, వాటిని ముద్రించుట, వాడుక భాషలో నిఘంటువు లచ్చొత్తించుట మొదలగు కార్య క్రమములు కొనసాగించి గొప్ప సంచలనము కలిగించి నారు. వ్యాసము, వార్తాపత్రిక, ఇంగ్లీషు భాషలోనుంచి విజ్ఞాన గ్రంథములు తెలుగులో ప్రవేశ పెట్టుట మొద లయిన రచనలకు వాడుకభాష తగిన సాధనముగా నాడు రూపొందినది. వచన రచన కీకిలిగా ఒక వ్యవస్థ చక్కగా ఏర్పడి, గ్రంథ రచన విరివిగా సాగుతూ ముద్రణ సౌక ర్యము కొత్తగా వచ్చుటవల్ల విద్యా విజ్ఞానముల ప్రచా రము వృద్ధిపొందే అవకాశము ఏర్పడగా ఈ పురోగతి కడ్డు తగిలి వచన రచన నవమార్గమున పెట్టిన పరి స్థితులు క్రీ. శ. 1856-57 లలో తటస్థించినవి.

క్రీ. శ. 1857 సంవత్సరములో మద్రాసు విశ్వ విద్యాలయ స్థాపనము జరిగినది. అప్పటికి ప్రభుత్వ కళా శాలలో ప్రధాన పండితుడుగాను, ఉపయుక్త గ్రంథకరణ దేశ భాషా సభకు అధ్యక్షుడుగాను పలుకుబడి, ప్రాబ ల్యము సంపాదించుకొని గొప్ప పండితుడనే ప్రఖ్యాతి వహించిన పరవస్తు చిన్నయసూరి పంచతంత్ర హితోపదేశ కథలు ఆధారముగా మిత్రలాభము, మిత్రభేదము అనే రెండు భాగాలు మాత్రము వ్రాసి 'నీతి చంద్రిక' అనే పేరుతో. కొత్త రకము వచన రచన చేసి దానిని ప్రకటించి నాడు. సమకాలికులు కొందరు ఈ కొత్త పద్ధతిలో వ్రాసిన వ్రాతపట్ల తమ వ్యతిరేక భావమును వ్యక్తము చేసినా పండితులు కొందరు దానిని మిక్కిలి కొనియాడి గౌర వించినారు. అదివరకు గొప్ప గొప్ప పండితులు వక్యాం





http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వాసుదేవ పరబ్రహ్మశాస్త్రి, జూలూరి అప్పయ్య పండితుడు, రావిపాటి గురుమూర్తి శాస్త్రి, వైయాకరణము రామానుజాచార్యులు మొదలైనవారు దురవగాహాము లైన శాస్త్ర విషయములూ, ఉత్కృష్ట భావములూ మిక్కిలి స్పష్టముగా తెలిసేటట్టు వాడుక భాషలో వ్రాయగా, ఆనాటి బాల బాలికలు ఎవరిమట్టుకు వారు తేలికగా చదువుకొని ఆనందించి విజ్ఞానవంతు లగుట కుద్దేశించి సులభ వచనముగా సంస్కృతములో వ్రాసిన హితోపదేశ పంచతంత్ర కథలు చిన్నయసూరి శబ్దాలంకార వైచిత్రితో, పదాడంబరముతో ప్రాచీన పద్య కావ్య భాషలో వ్రాసినాడు. చిరుమీల మాటలు, తిమి తిమింగిల ముల భాషణములుగా వ్రాసినాడనే నిందకు పాల్పడిన డాక్టర్ సామ్యుయల్ జాన్సన్ అవలంబించిన శైలిని మించుట మాత్రమే కాదు, చిన్నయసూరి కున్న గొప్పతనము సాటి పండితుల వాడుకలో నున్న జీవద్రూపము లను గ్రామ్యము అని నిరసించి, పద్య కావ్యములలో మాత్రమే కానవచ్చు వ్యవహార చ్యుతములయిన నామ క్రియా రూపములను, ఇతర వ్యాకరణ కార్యములను చేపట్టుట కూడాను. కళాశాలా తరగతులలో విద్యా ప్రమాణము వృద్ధి చేయవలెనని ప్రథమ శాస్త్ర పరీక్షకు, పట్ట పరీక్షకున్ను ఇది పాఠ్య గ్రంథముగా విశ్వ విద్యాలయము వారు నిర్ణయించుటవల్ల దీనికి మరింత ప్రాధాన్యము వచ్చినది. కొత్త ఒకవింత కనుక ఈ వింతపద్ధతి పలువురు అనుసరించినారు. క్రమంగా అదే పరిపాటిఅయి నిజమైన వచనరచనాసంప్రదాయము, పూర్వపు వచన వాఙ్మయమున్ను నానాటికి విస్మృతి పథాన పడి అడుగంటినవి.

చిన్నయసూరి సంప్రదాయమున కెదురు తిరిగి పద్య కావ్య భాషలో వచన మెందుకు వ్రాసినాడో కారణము తెలుసుకొనుటకు దక్షిణదేశ వాఙ్మయములోని వచనశాఖ తోడ్పడవచ్చును. మధుర, తంజావూరు, మైసూరు ప్రాంతములలో క్రీ.శ. 18 వ శతాబ్దమునందు కావ్యభాషలో వచన గ్రంథములు వ్రాసియున్నట్లు ఇటీవల సుమారు 40 సంవత్సరముల క్రిందట బయలు పడినది. తమిళ దేశములో నివసిస్తూ, తమిళము నిత్యవ్యవహార భాషగాగల ఈ రచయితలు తెలుగుదేశములో ప్రజావ్యవహారములోనూ, వచనరచనలోనూ ఆడ ఉన్న భాషకు దూరముగా తొలగి ఉండుటవల్లనూ, కావ్యభాషే ఎక్కువ పరిచితమై సులభసాధ్యమై ఉండుటవల్లనూ, తెలుగు పద్యకావ్యములు మాతృకలుగా పెట్టుకొని దండాన్వయ ప్రాయమైన వచనము వ్రాయుటవల్లనూ పద్యశైలిని పోలిన గద్యరచన చేయుట అవసరమైనది. మధురావతి విజయరంగ చొక్కనాథుడు (క్రీ. శ. 1706 - క్రీ. శ. 1784) స్వయముగా వచన గ్రంథములు వ్రాయుటే కాక వచన రచయితల నాదరించి దక్షిణదేశమున నివాస మేర్పరచుకొన్న వారికి కావ్య పురాణ ప్రబంధాదులు వచనరూపమున అందజేసినవాడు. సముఖము వెంకట కృష్ణప్పనాయకుడు, కుందుర్తి వెంకటాచలకవి, శ్యామరాయకవి, శ్రీపతి రామభద్రకవి మొదలైన పలువురు గ్రంథకర్తలు అక్కడివారే. వీరి గద్యరచనలు చూచి చిన్నయసూరి అట్టి వచనము వ్రాసినా డనుటకు ఇవి ఉన్నట్లు నా డెవ్వరికి తెలియనే తెలియ పోవుట నిశ్చయము. అయితే, చిన్నయసూరి తమిళ పరిసరములలో పుట్టి పెరిగి మద్రాసు తెలుగు తన కుటుంబములో సన్నిహిత బంధువర్గములో నిత్యవ్యవహారములో ఉండుటవల్ల, తనతో సమకాలికులైన ఇతర పండితులవలె సంప్రదాయ సిద్ధముగా వస్తూఉన్న వ్యావహారిక భాషలోకంటె గ్రాంథికభాషలో రచన చేయుటయే సులభతరమై యుండుటవల్లనో, లేక తన అసమానప్రజ్ఞ ప్రకటించుకొనుటకు 'గద్య' ఎక్కువ ప్రయోజనకారి అనో వచనరచన కావ్యభాషలో చేసి ఉండ వచ్చును. ఒక రోక చిన్నగ్రంథము తమకు నచ్చినభాషలో వ్రాయుటలో దోష మే మున్నది ? ఇతరులు దానిని ఆదర్శముగా పెట్టుకొనుట, అనుకరించుట, సంప్రదాయ సిద్ధముగా వస్తున్నపద్ధతికి వైదొలగుటేకాక దానిని గ్రామ్యమని నిరసించుట - వీనిలో నున్నది దోషము.

గ్రాంథికభాష వచనరచనకు ప్రవేశపెట్టుటవలన నోట పలికే మాటకూ, చేతివ్రాతకూ ఉండవలసిన సన్నిహిత సంబంధము విచ్ఛిన్నమయి పోయినది. భాషకు జీవ వికాసము చేకూర్చే పలుకుబడి సన్నగిలిపోయినది. పదాడంబరము, శబ్దచిత్రణము ఎక్కువై పోయినవి. రసభావముల కుండవలసిన ప్రాధాన్యము పైవేషమైన భాషకు వచ్చి భాషాజ్ఞానమే పాండిత్యమునకు, పరీక్ష చదువులకున్ను కొలతబద్ద అయినది. అయినా లోకము అదే శా గనుకొని, దానినే మెచ్చి వాడుకమాటలను గ్రామ్యమని నిందించినది.

చిన్నయసూరి వచనరచనము కఠినము చేస్తే, పదాడంబరము పరాకాష్ఠ పొందే రీతిని దీర్ఘ సమాస, యమకానుప్రాస భూయిష్ఠముగా చిన్నయసూరి విడిచిపెట్టిన సంధి, విగ్రహములు వ్రాసి కఠినతరము చేసినారు - కందుకూరి వీరేశలింగం పంతులుగారు, కొక్కొండ వెంకట రత్నం పంతులుగారున్ను. అయితే వీరేశలింగం పంతులుగారు సంధి, విగ్రహముల శైలి వచనరచనకు ఎంతమాత్రమున్ను యుక్తము కాదని వెనువెంటనే గ్రహించి రాజశేఖర చరిత్ర మొదలయిన ఇతర గ్రంథము లన్నీ తేలికగా ఉండే గ్రాంథిక



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



భాషలో వ్రాయడమేకాక హాస్యరస ప్రధానములైన ప్రహసనాదులలో వ్యావహారిక భాష పాత్రోచితముగా ప్రవేశపెట్టి ఆ రచనలు సార్థకము చేసినారు. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు, పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు మొదలైన గ్రంథకర్తలు వీరేశలింగము పంతులుగారి సులభ గ్రాంథిక రచననే అనుసరించినారు. అదే పరిపాటి అయి నాటకము, నవల, కథ, వచన సాహిత్యము, శాస్త్ర గ్రంథములు, చరిత్ర, వ్యాసములు, పత్రికా రచన మొదలయిన సమస్త రచనలూ గ్రాంథిక భాషలోనే రాసాగినవి. తెలుగు దేశములో అన్ని ప్రాంతాలలోనూ వ్యావహారిక రచన మచ్చుకైనా కానరాకుండా పోయినది. దాని స్థానములో గ్రాంథికాంధ్రము నెలకొన్నది.

ఎందువల్ల నంటే, పరవస్తు చిన్నయసూరిగారు, రేకము రామానుజసూరిగారు, కరాలపాటి రంగయ్యగారు, నిశ్చింత తేవప్పెరుమాళ్లయ్యగారు మొదలయిన దక్షిణ దేశపు తెలుగుపండితులు కొందరు వ్యావహారికభాష ఎట్టి గ్రంథములలోనైనా వాడకూడదని నియమము చేసుకొన్నట్టు వారు వ్రాసిన వ్రాతలను బట్టిన్నీ, వారు పరిష్కరించిన గ్రంథములనుబట్టిన్నీ ఊహించవచ్చును. వారు ఉపాధ్యాయులుగాను, అచ్చుకూటములలో పరిష్కర్తలుగాను కొంత అధికారము వహించి ఉండుటచేత వారి మతము వ్యాపించినది. భారతాది ప్రాచీన గ్రంథము లన్నీ వారి పరిష్కరణమువల్ల పాడయి ఉన్నవి. వారికి అనిష్టము లయిన ప్రాచీన నవీన రూపములు పూర్వ కవులు బుద్ధిపూర్వకముగా వాడినవే అయినా అచ్చులో మారిపోయినవి. నానావిధ ప్రయోజనములు గల వ్యావహారిక భాష అప్పకవీయాది లక్షణ గ్రంథములలోనిదీ, తత్త్వ గ్రంథములు, శాస్త్రములు, కథలు మొదలయిన రచనలలోనిదీ పునర్ముద్రణములలో గ్రాంథికీకరణము పొంది రూపుమాసిపోయినది. రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారు క్రి. శ. 1834 లో వ్యావహారిక భాషలో రచించి ముద్రించిన పంచతంత్రము క్రి. శ. 1870 వరకున్ను అనేక ముద్రణములలో అట్లే ఉండి ఆ పిమ్మట కావ్య భాషలోనికి మారిపోయి అచ్చుపడ్డది. వ్యావహారిక భాషా విషయమున పూర్వులకు గల గౌరవము, దానివల్ల వారు సాధింప దలచిన ప్రయోజనమున్ను గుర్తించక దానిని గ్రామ్య మని నిరసించి రూపు మాపి దాని స్థానమున గ్రాంథిక భాష నెలకొల్పి దేశభాషకు అపరిమితమైన నష్టము కలుగజేసినవారైనారు.

దేశములో సర్వవిధ రచనలూ గ్రాంథి కాంధ్రములో ప్రవర్తిల్లుతూ ఉండడమువల్ల పండితుల పోషణా పరిష్కారమూ అత్యంతావసరములై భాషా వ్యవసాయ మంతా వారి హస్తగత మయిపోయినది. భాషా పాండిత్యము ఇంతో అంతో సంపాదించిన పండితుడే కవి, పండితుడే పరిష్కర్త, పండితుడే గ్రంథ నిర్మాత; ఎంత విజ్ఞానము పురాతనమైనది గాని, పాశ్చాత్య భాషా పరిచయమువల్ల గడించినదిగాని సంపాదించినవాడయినా కొత్త చదువులు చదివినవాడు తనకు తెలిసిన విషయము ఇతరులకు తెలియ జెప్పుటకు, గ్రంథ రచన చేయుటకు వెనుదీసేవాడు. కొత్త కల్పనలు, ఊహాలు స్వతంత్ర రచనలుగా బయలుపడ వీలులేకుండా భాషకు సంబంధించిన కృత్రిమ ప్రమాణము, వ్యాకరణ శృంఖలములున్ను అడ్డుపడినవి. తెగించి వ్రాసినవా రయినా ప్రాచీన భాష బాగా అలవడక, దాని స్వరూపము మర్యాద చక్కగా ఎరుగక రచయితలు అటు ప్రాచీనమూ కాక, ఇటు నవీనమూ కాక, పాండిత్యము లేక, ప్రతిభ లేక కృత్రిమమైన, వెక్కిరింతకు వీ లిచ్చే రీతి రచనలు చేస్తూ వచ్చారు. లోకముకూడా ఇస్తే, తెస్తే, చేయడం, వ్రాయడం, నాలుగో, అయిదో, వాటి, వాణ్ణి మొదలైన రూపాలు లేని ఏ భాష అయినా గ్రాంథిక మనుకొని సంతోషపడుతున్నది. భాషకు కలిగిన ఈ దురవస్థను తప్పించి నిజమయిన వచన రచనా సంప్రదాయమును పునఃప్రతిష్ఠితము చేయవలెనని వ్యావహారిక భాషావాదులు 40 ఏండ్లనుండి పాటుపడుతున్నారు. వారి కృషిఫలితముగాను, స్వతంత్ర వాతావరణము సిద్ధించుట వల్లనూ సమస్త వచన రచనా వ్యాపారానికిన్నీ వ్యావహారిక భాష వాడుకలోనికి వచ్చినది. సరస రచనలతో ఉరుకులెత్తుచున్నది నవ్య సాహిత్యము. అది సముచిత ప్రమాణము, ప్రతిష్ఠ గడించుకొన్నది. పదులలో వందలలో ఉండే రచయితల సంఖ్య వేలు దాటి లక్షలకు పెరిగినది. వచన రచనకు చెప్పిన నిర్వచనము నేటికి సాధ్యమయినది. తె. వెం. ర.

## తెలుగు కన్నడముల పరస్పర సంబంధము

దాక్షిణాత్య భాషలగు తమిళము, తెలుగు, కన్నడము, మలయాళము, తుళు అనునవి పుట్టుకచేత ఒకే భాషావర్గమునకు, లేక, భాషా కుటుంబమునకు సంబంధించిన వయినను వానిలో సంస్కృతము నత్యధికముగా గ్రహించినవి తెలుగు, కన్నడము, మలయాళము. మలయాళము నవీనమగుటచే మనము ప్రస్తుత మా భాషను గ్రహింప నక్కరలేదు. తక్కిన రెండు భాషలును అనగా తెలుగు, కన్నడములు ఏకైక రీతిని ఒకే వాహినియం



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



దుద్భవించిన రెండు పాయలవలెను, ఒకే కొమ్మకు పూచిన రెండు పూవులవలెను, ఒకే గర్భమున బుట్టిన కవలవలెను, అవినాభావ సంబంధము గలిగి యున్నవి. దీనికి కారణములు: (1) తెలుగు, కన్నడములు మాటలాడు ప్రదేశములు నైసర్గికముగ నొకే భూభాగము నంటిపెట్టుకొని యున్నవి; (2) ఇవి భాషాతత్త్వము ననుసరించి దాక్షిణాత్య ద్రావిడభాషా కుటుంబమునకు చెందినవి; (3) భాషకు స్థిరత్వము కలుగజేయు లిపి రెండింటికి చాల కాలము వరకును నేక రీతిగ నున్నది; (4) సాహిత్య స్వరూపమును నిర్దిష్టముచేయు వ్యాకరణచ్ఛందో పద్ధతులు నొకే రీతిని సంపాదినవి; (5) రాజకీయముగ, నీదేశములను రెండింటిని ఒకే వంశము రాజులు - చాళుక్యులు (పూర్వ, పశ్చిమ వర్గములవారు) పరిపాలించిరి; (6) సాంఘికముగ మత విషయమున వీని సంబంధము మరియును దృఢతరమైనది.

ఈ యుభయ వాఙ్మయముల చారిత్రిక పరిణామము పరిశీలించిన, పై విషయములు మనకు స్పష్టము గాగలవు. కన్నడమున తెలుగు కన్న ముందే కావ్యరచన ప్రారంభమైనది. కన్నడ కవులు తమకుముందు శాసనములందు వెలసిన స్వతంత్రభాషామయ ప్రశస్తి కావ్యరచనల నుండి సంస్కృతపద బంధురమగు నొక ప్రత్యేక రీతిని గ్రహించి, దానిని దేశిపదములతో ననుసంధించి ప్రసన్నమును, గంభీరమును నగు కావ్యశైలి నిర్మాణమునకు కారణభూతులైరి. అత్యంత సన్నిహితత్వము చేతను, కన్నడము నందువలె తెలుగునను సంస్కృత పదము లధికముగా వెలయుచుండుటచేతను తెలుగు కవు లీ మార్గమును గ్రహించి తెలుగున కావ్యరచన సాగించిరి. నన్నయ నాటినుండియు నిది తెలుగువారికి వరవడియైనది.

ఇట్లు కావ్యోచితమగు భాషాశైలికే గాక జైనమత సంప్రదాయములు తెలుగులో నున్నవని తెలిసికొనుటకు కూడ మనకు కన్నడ వాఙ్మయమే యాధారము. తెలుగున నన్నయకన్న మున్ను వెలసినవి పద్మకవి (పంపమహాకవి) జినేంద్ర పురాణమును, సర్వదేవుని (పొన్నకవి) ఆదిపురాణమును. ఇవి జైనమత గ్రంథములు. ఇవి మన వాఙ్మయమున నున్నవని చెప్పుట కందలి పద్యములు కొన్ని నేటివరకు నిలిచియుండుటయే తార్కాణము.

ఆంధ్ర కవితావతార ప్రథమతీర్థమని పొగడ్తగన్న నన్నయ పంపమహాకవి రచిత విక్రమార్జున విజయమును, పంపభారతమును ఆ మూలాగ్రముగ చదివి దాని ననుకరించినట్లు పద్యముల యెత్తుగడలు పదబంధములు పట్టియిచ్చుచున్నవి (చూడు: తెలుగు కవుల చరిత్ర, పుట 145). ఇక నాతని సహాధ్యాయి నారాయణభట్టు కన్నడమున కవిత్వము చెప్పువాడనుట. నందంపూడి శాసనము ప్రమాణముగ నున్నది.

నన్నయ యుగమున క్రీ. శ. 1100 ప్రాంతమున నున్న కవిజనాశ్రయకర్త రేచన క్రీ. శ. 990 ప్రాంతము వాడగు నాగవర్మ ఛందోంబుధి ననుసరించెను (చూడు: కవిజనాశ్రయము, నూతన ముద్రణము 1951). ఆ వెనుక పావులూరి మల్లన తన సారసంగ్రహ గణితమున రాజాదిత్యుని కన్నడ గణితశాస్త్రములోని కొన్ని పట్టుల ననుసరించెను.

నన్నయ వెనుక శివకవి యుగమున కన్నడాంధ్రముల సంబంధము మరియును పెనగొన్నది. ఆరాధ్య సంప్రదాయప్రవర్తకుడైన మల్లికార్జున పండితారాధ్యులు బసవని వలన విభూతినంది కన్నడభాషానుభూతి నందుటయే గాక శివతత్త్వసారమును కన్నడ భాషలో కూడ వ్రాసినాడు. దీనివలన నాకాలమున తెలుగున నున్న గ్రంథములు కన్నడములో కూడ తప్పక యుండవలెనని స్పష్టము. కవిరాజ శిఖామణియు, శివభాష్య వాదియునగు నన్నెచోడకవిరాజు తెనుగున కన్నడ భాషా సంప్రదాయములు వెలకొల్పిన ట్లాతని కుమారసంభవ కావ్యము చదివిన వారికి తెల్లమగు చున్నది. ఇక, వీరశైవమున గల బసవ, పండిత సంప్రదాయములు రెండింటిని ప్రచారమునకు తెచ్చిన పాల్కురికి సోమనాథకవి కన్నడమున మహాకవిగా పూజ లందుచున్నాడు. కన్నడమున నీతని కృతులు రెండును మత విషయకములు; చాల చిన్నవి. అయిన నీతడు కన్నడులకు వీరశైవమత వాఙ్మయ భిక్ష పెట్టినాడు. ఆ నాటినుండి నేటివరకు నసంఖ్యాకులైన కవు లితని పేర్కొన్నారు. వృషాధిపశతకమున కన్నడభాషతో బసవని స్తుతియించుటయే కాక, పండితారాధ్య చరిత్రమున తన కాలమునాటి కన్నడభాషను అట్లనే యనువదించినాడు. తక్కిన భాషలలో చెప్పునప్పు డొకపుట, అరపుట మాత్రమే చెప్పి కన్నడభాషలో చెప్పునప్పుడు నాలుగు పుటలు రచియించి యున్నాడు. ఈ విషయ మానాటి కన్నడ భాషా ప్రాముఖ్యమును సూచించును.

పాల్కురికి సోమన తెలుగున వ్రాసిన బసవపురాణ, పండితారాధ్యచరిత్రములు కన్నడ భాషలోని కనూదితములై, ఆ వెనుక సంస్కృతమున కెక్కినవి. కన్నడానువాదకులు తమకు మూలము సోమనాథుని తెలుగు కృతులని చెప్పి తమ కృతజ్ఞతను సూచించిరి.

కవిత్రయమువారిలో నన్నయ వెనుక తిక్కనయు, ఎఱ్ఱనయు కొన్ని పట్టుల కన్నడ కవిత్రయము ననుసరించినవారే. తిక్కన కన్నడమున ఆదిపురాణము నుండి,



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పంపభారతమునుండి గ్రహించిన పద్య బంధములును - ('కరికర శీకర మదజల తురంగలాలాంబు' - ఆది. వు; 'కరికర శీకర తురగోత్కర లాలాజాల' - భీష్మ 1-348; 'బక కిమ్మీర జటాసురోద్ధత జరాసంధర్క్షకం సంధకీచ కరం నోర్వరుమం' - పం. భా. 3-25, 'బక విధ్వంసి జటాసురాంతకు హిడింబ ప్రాణ హారిణు కీచక నిర్మూలన కేళి లోలు' - ఉద్యోగ. 2-172 మొదలగునవి) ఇందుల కుదాహృతులు. ఎఱ్ఱన సైంధవ వధయందు ద్రౌపది వాక్యములుగా వ్రాసిన 'శాతనఖాగ్ర ఖండిత లసన్మద కుంజర కుంభముక్త ముక్తాతత' (అరణ్య. 6-172) అను పద్యమున పద బంధము పంప భారతములోనిదే. పరిశీలించుచు పోయిన నింక నెన్నియేని కనవచ్చుచుండును.

తిక్కన సమకాలికు డగు కేతన తన ఆంధ్ర భాషా భూషణమును రెండవ నాగవర్మ కర్ణాట భాషా భూషణము ననుసరించి వ్రాసినది. కన్నడమున నది సంస్కృత భాషామయము. కేతన మాత్రము తెనుగుననే వ్రాసినాడు. నామ సామ్యమేగాక ఉదాహరణ ప్రక్రియలనుండి కర్ణాట భాషాభూషణము ననుసరించి తెలుగున భాషా భూషణము వెలసినదని నిశ్చయముగ చెప్ప నొప్పును (చూడు: తెలుగు కవుల చరిత్ర - 2 వ భాగము). ఇంతియే కాక కేతన దశకుమార చరిత్రమును చౌండరసు అభినవ దశకుమార చరిత్ర కన్నడమున వ్రాసిన వెనుకనే వ్రాసినట్లు 'అభినవ' శబ్దసామ్యము వలన నెరుగ దగును. కేతన అభినవ దండిగదా! రెండవ నాగవర్మయు, చౌండరసును కేతన కన్న నొక శతాబ్ది ముందున్నవారు.

నాచన సోమన ఉత్తర హరివంశమున పెక్కు పదములు - తెలుగు వారల కర్థము కావని యనుకొనునవి, దిశాపట్టము జావంకము బిదలములు మొదలగునవి - అతని కన్నడ భాషా పాండిత్యమును తెలుపును.

'నా కవిత్వంబు నిజము కర్ణాట భాష' అను శ్రీనాథుని పలుకు నేడు సరిగా నర్థముకాని పలుకైనది. కాని యాతని కవితా తత్త్వమును పరిశీలించిన నందు ముఖ్యముగా దేశి పదజాలము, పలుకుబడి యాతని కన్నడ వాఙ్మయ పరిచయమును స్పష్టము చేయుచున్నది. శ్రీనాథుని రచనలలో కొన్ని పట్టులు కుమార వ్యాసుని కన్నడ భారతము నందలి రచనలను పుణికి పుచ్చుకొన్న ట్లుండునని కొంద రభిప్రాయ పడుచున్నారు. శ్రీనాథుని గ్రంథములు మనము కేవలము భాషా దృష్టితో చదివిన అతని కన్నడ భాషా పరిచయము మనకు వ్యక్తమగును.

కన్నడ రాయడగు శ్రీకృష్ణ రాయల యుగము మనకు స్వర్ణ యుగము. కన్నడ కవి సార్వభౌముడు తిమ్మణ్ణ ఆ యాస్థానమున అష్ట దిగ్గజములతోపాటు అభ్యర్చితుడై నాడు. అల్లసాని పెద్దన్న చెప్పిన 'నిరుప హతిస్థలంబు' అన్న పద్యమునకు మూల మంతకు ముందు కన్నడమున నదే యెత్తుగడతో మూడు శతాబ్దులకు ముందు వెలసినది (పూర్వ సాహిత్య వీథులు, భారతి, సం. 26). నంది తిమ్మన్న పారిజాతాపహరణము అంతకు చాల పూర్వుడగు రుద్రభట్టు జగన్నాథ విజయము యొక్క యనుకరణమని పరిశోధకులు స్పష్టము చేసి యున్నారు. శ్రీ కాళహస్తి మాహాత్మ్య కృతికర్త ధూర్జటి తన గ్రంథమున చేసిన చంద్రవర్ణన 'ఉదయ గ్రావము పానవట్టము' అను పద్యము జగన్నాథ విజయములోని 'వితత ప్రాచ్యాద్రి పీఠాగ్రిమదరుణ శిలావృత్తలింగం బొలిం బొల్చు........ సుధాసూతి బింబం' అను పద్యము ననుసరించినది.

ఈ యుగమున ప్రారంభ దశలో పిడుపర్తి కవులు బసవన సోమనాథులు కన్నడమున దీక్షాబోధను, ప్రభులింగ లీలలను తెనుగునకు తెచ్చిరి. మరియు నా కాలమున, ఆ వెనుకటి కాలమునను తెలుగును, కన్నడమును బాగుగా చదివి, ఒక భాషలోని చమత్కృతులను ఇంకొక భాషలోని కనువదించి రెండింటికిని బెంపు గూర్చెడివారు. పదునేడవ శతాబ్దిని ప్రసిద్ధుడగు లక్ష్మీశకవి తన కన్నడ జైమినీ భారతమున వసుచరిత్ర కారుని

'భావం బెక్కడ లేక వృత్త నియమాపాయంబు
జింతింప కెందే వర్తించి పదార్థ వంచనలచే దీపించి'

అను పద్యమును

పారదె పదార్థమం వరయతిగె భంగసం తారదె
నిజాన్వయ క్రియగగ్గె దూషణం'

అని కన్నడించి యున్నాడు.

దక్షిణాంధ్ర వాఙ్మయ చరిత్రమును బరిశీలించిన యెడల మైసూరి ప్రభువగు కంఠీరవ నరసరాజు తెలుగునను, కన్నడమునను యక్షగానములు రచియించినట్లు తెలియుచున్నది. మైసూరి సామంత రాజులలో సుగుటూరి తమ్మ భూపాలుడు సంస్కృతాంధ్ర కర్ణాట భాషా విశారదుడు మూడు భాషలలో కృతికర్త. ఇరువదేండ్లు సర్వాధికార పదవి వహించిన నంజరాజు కన్నడమున, తెలుగున కాశీ మహిమార్థ దర్పణము మున్నగు వచన కృతులు రచియించి యున్నాడు. ఇంకను, కర్ణాటకవి చరిత్రను పరిశీలించిన దైవజ్ఞ వల్లభుడు, నరసార్యుడు, రామాయణము తిరుమల కవి, బుక్కమ, సాంబయ్య మున్నగు తెలుగు కవు లెందరో కన్నడమున కృతులు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



రచియించి, యా కవి చరిత్ర కెక్కియున్నారని తెలియ గలదు. పందొమ్మిదవ శతాబ్దాంతమున సాధుపల్లి చంద్ర శేఖరశాస్త్రి యను కవీశ్వరుడు మనుచరిత్రను కన్నడించి నట్లుగా తన యాంధ్రామరుక కావ్యమున చెప్పుకొని యున్నాడు. నవీన కాలమున వేంకట పార్వతీశ్వరుల వంగభాషా నవలలు శ్రీ వెంకటాచార్యులవారి కన్నడ భాషానువాదముల నుండియే కావింపబడిన ట్లా నవలల పీఠికలయం దుండి తెలియుచున్నది.

ఇట్లు నన్నయనుండి నిన్న నేటివరకు కన్నడమునకు, తెలుగునకు ఇట్లు అవినాభావసంబంధము అనివార్య మగు చునే యున్నట్లు మన వాఙ్మయచరిత్ర తెలుపుచున్నది. తెలుగువారు కన్నడమునుండి యేది గ్రహించినను దానిని తెనుగు భాషకు, తెనుగు జాతికి నైసర్గికములగు సంప్రదాయములతోడను, సంస్కారముతోడను సమ్మేళనము చేసి గీతి సాహితీ కవితలలో తెలుగునకు దాక్షిణాత్యవాఙ్మయమున నొకప్రత్యేక శాశ్వత స్థానమును గడింపజేసిరి. వి.వెం.రా.

# మహారాష్ట్ర వాఙ్మయ ప్రభావము

ప్రాకృత భాషాభేదములలో 'మహారాష్ట్రి' యని యొకటి గలదు. అది శృంగార బహుళమైనదట. అమృత మయమట! దానిని జదువని వారికి 'బువువిల్తు శాస్త్ర మర్మము' వివరించుటకే యధికారము లేదని యా కవుల సవాలు. 'కవి వత్సలు'డైన హాల చక్రవర్తి ప్రాకృత గాథలను సేకరించి యొక స్వరూపము నొసగి పుణ్యము గట్టికొనెను. కేవలము సంకలన కర్త మాత్రమే కాక స్వయముగ నాతడును గాథలు వ్రాసినవాడు. హాలుడు [illegible]డన్నది అందరు ఎరిగిన విషయమే. కవి యౌట మాత్రమే కాదు, 'మహారాష్ట్రి'ని ఆతడు రాజభాషగను గౌరవించెను. సాహసాంకు డగు హాలుని కాలమున ప్రాకృతభాషా పాండిత్యము లేనివాడే అరుదట! పైశాచీ ప్రాకృతమున 'బృహత్కథను' వ్రాసిన గుణాఢ్యుడు అప్పటివాడే. ఆ గ్రంథము నశించుట భారత దేశముయొక్క, ముఖ్యముగ తెనుగువారి యొక్క, దురదృష్టము.

గాథాసప్తశతియందు నిండుగా పుంజుకొన్నది ఆంధ్ర జీవనమే. వారి దృష్టసింహాము లెక్కడివో కాదు. అవి గోదావరీ కచ్ఛ కుడుంగ వాసములు. మొగమునిండ పసుపు పూసికొని ఒయ్యారముగా నడచు వనితలు, నెమలి పింఛములు నెత్తిపై చెక్కికొని గర్వాలసముగ పోవు చెంచుకత్తెలు తెనుగు జాణలే. వాన లతిశయించి దంట్లు మిగిలిన నువ్వుచేలు, హరితాళ మండితముఖులైన నవీగణము వంటి శణవాటికలు, రస్సబండలు, రథ్యా వృతములు - అన్నియు తెనుగు దేశములోనివే. వింధ్య పర్వత శిఖరములపై విండ్లు నూని నిలిచి క్రిందినుండ ప్రాకివచ్చెడి మత్తగజముల వంటి క్రొత్త మేఘములను తిలకించెడి చెంచుమగలు మరెవ్వరో కాదు, మన భద్రాద్రి శ్రీశైలముల కొండలలో తిరిగెడివారే! ఇక నీ చిత్రముల రమణీయముగ జిత్రించిన కవులు ఆంధ్రులు కా దనువా

రెవ్వరు? ఈ రచయితలలో కవయిత్రులుకూడ నుండుట మనకు ఎంతయో గర్వకారణము.

నేటి మరాఠీకి 'మహారాష్ట్రి' ప్రాకృతమే మూలభాష. కనుక నా వాఙ్మయమునకు పురుడు తీర్చిన అదృష్టము పూర్తిగా కాకున్నను సగపాలునకు పైగా మనది.

ఆంధ్రమునకు వలెనే మరాఠీకిని పదునొకండవ శతాబ్దివరకు సరియైన స్వరూపమే లేదు. అదియు మన తెనుగువలె నానట చీనటగానే యుండినది. నాటివిగా మనకు కన్పించునవి కొన్ని పాటలు, సామెతలు మాత్రమే. జైన, బౌద్ధములు తెనుగు నేలపై వలెనే యచటను తాండవించెను. వీరశైవము కూడ ఆంధ్రదేశమందంత కాకున్నను, కొంత తన ప్రతిభ నచ్చటను వెలార్చెను. బసవేశ్వరునికి సమకాలికులు కొందరు శివపరాయణులు మహారాష్ట్ర దేశమున నుండిరి. బసవని చరిత్రలో నొక జగదేవుడు వచ్చును. వీడే రాజైన బిజ్జలుని చంపినది. ఇతడు మహారాష్ట్రుడని నా యనుమానము. పాలకురికి సోమనాథుడు కొన్ని మహారాష్ట్ర భక్తచరితములు వర్ణించెను. ఆనాడు ప్రాకృత మహారాష్ట్రములకు అంత భేదము లేదు కనుక అతని కా భాష వచ్చియుండును. జైన, బౌద్ధులవలెనే వీరశైవులును మత వ్యాప్తికి సామాన్య ప్రజల భాష నాకళించుటయే సులకమని నమ్మిన వారు గదా.

మహారాష్ట్ర దేశమున పాండురంగడు చాల ప్రథ కలిగిన దేవుడు. అచ్చట నింత పేరు ప్రఖ్యాతి గల్గిన శైవక్షేత్రము ఒక్కటియు కన్పింపదు. అందుచే తొలుతటి నుండియు వైష్ణవభక్తి ఆ దేశమున బాగుగా పేరూనుకొన్నది. మన మెరిగినంత వరకు అచ్చటి ప్రాచీన సాహిత్యము భాగవత మతమునకు చెందినది. ఆ మతము ఒక రీతిగా హరిహరో పాసనము. ఆ భాషయందు దొరకు ప్రాచీన గ్రంథములలో లీలాచరిత్ర ఒకటి. ఇది గద్యాత్మకము. రుక్మిణీ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



స్వయంవర, శిశుపాలవధలు పద్యమయ శరీరములు. భాగవతులు ద్వైతులు; జగత్సత్యవాదులు. ఈ సంప్రదాయమునకు మహానుభావమత మనియు మరియొక పేరు. దీని నిర్మాత చక్రధరస్వామి.

నాడు దేశమును పాలించినవారు దేవగిరి యాదవ రాజులు. వా రందరు వైదిక మతాభిమానులు. పైగా, అపుడు ఆ దేశమున ఆంధ్రమున వీరశైవముచేతవలె పర ధర్మములచే వైదిక మతమునకు దెబ్బ తగిలినది. అందుచే వైదికులైన కవులును ప్రజాసమాజ భాషనే మతవ్యాప్తికై చేపట్టిరి. కాని యాదవరాజులు మాత్రము స్వమతాభిమాన మంతగా స్వభాషాభిమానమును చూపినవారు కారు.

ప్రజా సముదాయమును కూడగట్టికొను నాశ ఒకవైపున్నను మరియొకవైపు దేశభాషా రచనమును అగ్రవర్ణులు ధిక్కరించిరి. తెనుగునందును ఈ విధమగు ధిక్కారము సాగినది. రెడ్డిరాజులు తా మెంతగా శ్రీనాథుని గౌరవించియుండినను అతని కావ్యమును మాత్రము కృతినందు సాహసమునకు పూనుకొనలేదు. అల్లసాని పెద్దనామాత్యుని కాలమువరకు 'ఆంధ్రభాషామయం కావ్యమధోమయ విభూషణమ్' అనెడు పక్షము ఒకటి ఉండనే యుండినది. మహారాష్ట్రమునందు ఈ ధిక్కారము తీవ్రపరిణామమును తాల్చెను. భక్త తుకారాముని వంటి పరమసాత్త్వికునకు కూడ 'నీ యాగడమునకు తలయొగ్గి' తన 'యభంగము'లను ఇంద్రాణి నదిలో పారవేయవలసి వచ్చెను. జ్ఞానదేవుడు, ఏకనాథుడు మహారాష్ట్రములోని మాధుర్యమును బ్రహ్మాండముగ పొగడవలసి వచ్చెను. ఈ 'తళ్లు' సమర్థుల కాలమువరకు నాగినది కాదు. వారు గూడ తమ ప్రాకృత భాషారచనమునకు క్షమాపణ చెప్పుకొన్నారు.

కృష్ణరాయల కాలమునకు పాండురంగడు విద్యానగరమును బాగుగ నాకర్షించినాడు. రాయలు పండరి యాత్ర కూడ చేసెనని ప్రతీతి. ఆయన విఠలాలయమునకు బునాది వేసినది చూడ ఈ విషయము నమ్మవలసి వచ్చును. రాయలకు విఠలునిపై కన్ను పడుటకు అనాటి ద్వైతభక్తులు కారణము. ద్వైతులకు మొదటినుండియు రంగనితో సంబంధము కద్దు. పూర్ణబోధులు విఠలభక్తులు. అక్షోభ్యతీర్థుల పూజాపేటికలోనే రంగడు చోటుచేసికొని యుండెను. దాసరకూటమును స్థాపించిన పురందరులు పాండురంగనిపై వేలకు పదము లల్లినవాడు. పురందరులు అన్నమయ్యను దర్శించి యుండిరి. అందుచే అన్నమయ్యకు పాండురంగడు పరిచితుడే. విశిష్టాద్వైతులు తమ దివ్యదేశములలో 'పండరి'ని చేర్చికొన్నను వారికి, పండరికి అంత రాకపోకలు లేవు. విజయనగరాధిపతులకు రంగనిపై భక్తి ఎంతవరకు వచ్చె ననగా అళియ రామరాజు తన భక్తితో పాండురంగనిని విద్యానగరమునకు తీసికొనివచ్చెనట! అప్పుడు భామదాసుడు వచ్చి విఠ్ఠలుని వెన్కకు తరలించికొని పోయెను.

ఈ వృత్తాంతమును కవి శిరోమణి ఏకనాథుడు తన భాగవతమున కంఠోక్తిగ చెప్పెను. ఏకనాథునకు భామదాసుడు ముత్తాత. ఈ భామదాసుడు తొలుత విజయనగరము వాడనట! ఈ యైతిహ్యమునకు సంబంధించిన వేడుక నేటికిని కార్తిక రథోత్సవమున పండరిలో జరగును. విద్యానగరమున కున్న ఈ యభిమానము వెంకటపతిరాయల కాలమున 'పాండురంగ మాహాత్మ్య' మైనది. తెనాలి రామకృష్ణుడు విఠలోపాసకుడుగ కన్పించును. పాండురంగడు రామకృష్ణ స్వరూపము. అందుచే రామాభిమానము కల తెన్గువారిని బాగుగా ఆకర్షించినాడు. భాషా ద్వేషము లేని విజయనగర సభలలో మహారాష్ట్ర గ్రంథ శ్రవణాదులు జరగి యుండును. అప్పటికే మన పోతనామాత్యుడు మహారాష్ట్రమునకు తెలియును. 'దాస విశ్రామధామ' మను మహాగ్రంథమునందు మహాకవి పోతన్న కథ కొంత వర్ణింపబడి యున్నది.

మహారాష్ట్రమున కితర దేశములతో బాగుగ సంబంధమును గల్పించినవాడు సమర్థ రామదాసు. ఈ మహనీయుడు జన్మించినది గోదావరీ తీరమందు; తపశ్చర్య కృష్ణా తీరమున నడచెను. సమర్థులు ఆంధ్రుడని కొంతమంది మహారాష్ట్ర పండితులే అభిప్రాయపడిరి. ఆయన తన తపశ్చర్య తరువాత తనకు తగిన రాజు ఎవ్వడని కాశీనుండి కన్యాకుమారి వరకు చుట్టెను. ఆయన స్థాపించిన మఠములు ఆంధ్ర దేశమునను ఉండినవి. వారి శిష్యులైన ఉద్ధవ గోస్వామి ఆంధ్రు డని ప్రతీతి. సమర్థులు తమ పర్యటనలో గండి, భద్రాచలము, మున్నగు ప్రదేశములకు దయచేసి యుండిరి. భద్రాచల రామదాసు కీర్తి వారి చెవులకు బాగుగ నంటినది. ఆ కాలమున కోనేరినాథుడు రచించిన పాటలు భద్రాద్రిలో వారు వినిరట! సమర్థులు ఆ పాటలు ఒకటి రెండు నేర్చికొని పోయి తమ దేశమున ప్రచారము చేసిరట! శ్రీ సమర్థుల కాలమునకు అళియ రామరాయలు బ్రతికి యుండెను. వారికి ఈ రామరాజు పై ఎందుకు చూపు పడలేదో! బహుశః ఆ తపస్వి దృష్టికి విద్యానగరము కాలసర్పదష్టమై పోవునని ముందే తోచెనో చెప్పలేము.

'తలికోట' యుద్ధానంతరము సమర్థులు బ్రతికి యుండిరి. వారు ఆ మహాసామ్రాజ్య పతనమును కన్ను



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



గూర చూచి ఎన్నియో గుణపాఠములు నేర్చికొన్నారు. ఈ విషయములు వారికిని శివాజీ మహారాజునకును నడచిన ఉత్తర ప్రత్యుత్తరములు చదివిన తెలియును. అందుకే పరధర్ముల దుర్మార్గములను వర్ణించునపుడు సమర్థులు ఎంతో ఆవేశముతో వర్ణింతురు. పైగా, ఆ సమయముననే తీవ్రమైన క్షామము ఏర్పడినది. అది దక్షిణ మంతయు వ్యాపించెను. దానిని మాన్పుట కధికారి ఎవడని సమర్థులెంతో వాపోయిరి. నాటి కింకను శివాజీ వారి చేతికి దొరకి యుండలేదు.

ఆంధ్ర దేశమున చిన్న చిన్న మహీపతులు పదవులు మాకు మాకని పోట్లాడుచుండిరి. ఆ యరాజక స్థితి, కవుల కెంతగా ప్రపంచముతో సంబంధము లేకపోయినను వారి ప్రబంధకవితలలోను ప్రతిఫలించినది. ప్రభావతీ ప్రద్యుమ్నములోని వజ్రనాభుని దుండగములు అనాటి సుల్తానుల దురాగతములే కాని వేరు కాదు. కాని మహారాష్ట్ర భాష కీ సమయమున ఒక యదృష్టము పట్టినది. ఆ కవులు చాల మట్టుకు విరక్తులు. అందుచే వారి యూహలు పాండురంగని చుట్టునే తిరిగినవి. సర్వాపదలకు వాడే రక్షకుడని వారు నమ్మిరి.

శివాజీ కాలమున ఆంధ్ర మహారాష్ట్రములకు బాగుగ సంబంధ మేర్పడెను. అనేకులు దేశస్థులు శివరాజువెంట యుద్ధములు చేయుచు వచ్చినవారు తెనుగు దేశమందే నిలిచిపోయిరి. దక్షిణమున కాపుర ముండిన మహారాష్ట్ర రాజులు తెనుగు కవులను పోషించి, కృతి నందుకొనువరకును వచ్చిరి. మన బుర్రకథలవంటి 'పవాడే'లు మహారాష్ట్రమున వ్యాపించినవి. ఈ వ్యాపనము శివాజీ కాలము నాటికే ఉండెను. మొన్న మొన్నటి తెలుగుదేశ మందలి హరికథకులకు 'ఓవీ', 'చౌపయీ', 'మోరోపంతుల' 'ఆర్యా' చెప్పనిది కథ ముగిసెడిది కాదు. తుకారాముని 'అభంగములు' కూడ పాడుట వాడుక. మహారాష్ట్ర దేశమున పోతన్న భాగవతమును చదువు డనియు భద్రాద్రి రామదాసు కీర్తనలు పాడు డనియు అడుగు రసికులు ఎందరో ఉన్నారు.

తెనుగు నందలి సీతారామాంజనేయ గ్రంథ కర్త 'అజాత వాదము'నకు చెందినవా డట! ఈ వాదమును బహుళ ప్రచారమునకు తెచ్చినది జ్ఞానదేవులు. ఏకవీరాదేవిని ఏకనాథులు బ్రహ్మాండముగ పొగడిరి. ఆమె కాకతుల యింటి దేవత యని యెయాంధ్రునకు తెలియదు? పు. నా.

# ఆంగ్ల వాఙ్మయ ప్రభావము

ఒక దేశములోని మేధావులయిన రచయితల ఉత్తమ రచనలే వాఙ్మయమయి ఆ దేశ భాషలో ప్రచారము నందుచుండును. అట్టి రచనలలోని విషయ మంతయు దేశీయ విజ్ఞానము పయిని, దేశీయ నాగరికత పయిని ఆధారపడి యుండును. ఆ నాగరికత యను మహావృక్షము యొక్క పత్ర పుష్పములవంటిదే ఆ దేశ వాఙ్మయము. ఒక దేశమున ఒక కాలమున బయలుదేరిన వాఙ్మయమున ఆదేశ కాలములయం దుండిన అభ్యాసములు, ఆశయములు, ఆచారములు ప్రతిబింబించు చుండును. ఒక్కొక్కప్పుడు అనాటి రాజకీయపరిస్థితులు, సాంఘిక జీవనము కూడ చిత్రింపబడుచునే యుండును. ఆ నాటి ప్రజలకు ఏర్పడిన నైతికములయిన అవసరములు, జాతీయతకు సంబంధించిన చర్యలు అందు సూచింపబడు చుండును. కాబట్టి మనదేశమున ఏర్పడిన ఆంగ్లేయుల పరిపాలన వలన ప్రవేశించిన ఆంగ్లవిద్యా ప్రభావమునను, ఆంగ్లేయ నాగరికత వలనను తెలుగు వాఙ్మయమున గొన్ని మార్పులు ఏర్పడినవి.

వర్తకమును నెలకొల్పుటకై తూర్పు ఇండియా వర్తక సంఘమను పేరుతో మన దేశమునకు వచ్చిన ఆంగ్లేయులు దేశముపై అధికారము పొంది స్థిరపడగా క్రీ. శ. 1858 వ సంవత్సరమున ఆ పరిపాలనాధికారమును ఆంగ్లేయ ప్రభుత్వము వశపరచుకొనుట వలన, చక్రవర్తియే భారతదేశమునకు పాలకు డయ్యెను. మనదేశములో ఆంగ్లేయ పాలనము స్థిరపడకముం దుండిన దేశీయవిద్యా సంస్థలను, అనగా అనాటికున్న తురకల పాఠశాలలు, హైందవుల గురుకులములు మొదలయినవి పూర్ణోపయోగకరములు కావని యెంచి వాని నాదరింపక భారతీయులందరికి నాంగ్లేయ భాషను నేర్పి పాశ్చాత్య విజ్ఞానము కలిగింపవలెనని నిశ్చయించి అంతకు ముందు కంపెనీ పాలనములో కంపెనీవారి యక్కరకు వచ్చు గుమాస్తాలను తయారుచేయు పాఠశాలలను వశపరచుకొని క్రీ. శ. 1854 - 54 సంవత్సరములలో విద్యాశాఖను తమ అధికారమున నెలకొల్పి కలకత్తా, మదరాసు, బొంబాయిలలో విశ్వవిద్యాలయములను ప్రభుత్వమువారు స్థాపించిరి. అనాటి నుండియు ఆంగ్లేయ విద్యను చదివి ఉన్నత పరీక్షలలో కృతార్థులయిన బుద్ధిమంతులు, సంఘములో పలుకుబడిగలవారు, విశిష్టులు, ఉన్నతోద్యోగులు ఆంగ్లేయ భాషకు ప్రాముఖ్యము నొసంగిరి. వా రాంగ్ల వాఙ్మయము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



నందలి కవుల రచనలను చిన్నతరగతుల నుండియు చదువుట కారంభించి, పట్టపరీక్షలలో వాఙ్మయచరిత్ర, విమర్శ మొదలయిన అనేక విషయములను చదివి తెలిసికొనుచుండిరి. ఇట్లు ఒక్కసారిగా భారతదేశము నందలి ఇతర భాగములతోపాటు తెలుగుదేశమునను ఆంగ్ల భాషా పాండిత్యము వెల్లివిరిసినది. దాని ప్రభావ మూరక పోలేదు. అట్లు చదివిన వారిలో చాలమంది తెలుగు వాఙ్మయమున రచయితలుగా నేర్పడిరి. స్వయము రచయితలు కానివారు, పెద్ద పలుకుబడిగల విశిష్టులు అందరును అట్టి రచయితలకు ప్రోత్సాహము నొసగుచుండిరి. దేశమున నెచ్చట చూచినను ఆంధ్ర వాఙ్మయములో లేని క్రొత్తపోకడలు, జాతీయరచనలు, కవులలో విశిష్టమైన భావవికాసము ఆంగ్ల వాఙ్మయములో నున్నవనియు, వాని ననుసరించుట యుక్తమనియు పెద్దలు పలుకుట సంభవించినది. ఇం కొక విశేష మేమనగా దేశములో నున్న బుద్ధిమంతులు మొదలైనవా రాంగ్లమునే చదువుటవలన వారికి తెలుగులో పాండిత్యము తగ్గుటయేకాక దేశీయాభ్యాసములయెడ ఉదాసీనత కలుగుటయు, పాశ్చాత్య విద్యావిధానమం దాదర మేర్పడుటయు, మనదేశము నందలి ప్రాతచదువు నేర్చుకొనువారి సంఖ్య తగ్గిపోవుటయు జరగినది. ఇట్టి పరిస్థితులలో ఆంధ్రవాఙ్మయమున గొప్ప మార్పు ఏర్పడక తప్పినది కాదు. ఆ మా ర్పెట్టిదో తెలిసికొనుటకు గాను, అంతకుముం దుండిన మన వాఙ్మయము యొక్క మూలాధారములను, వాని స్వభావము నెరుంగవలయును.

ఆంగ్ల భాష మన మెరుగక ముందు భారతీయ విజ్ఞానమునకు మూలకందమయిన సంస్కృత భాషయే మనకు ముఖ్యాధారము మన ఆచారములకు మూలములు, మన ధర్మములకు ప్రమాణములు, మనము ప్రతి దినము నేర్చుకొను శాస్త్రములకు ఆకరములు సంస్కృతమునందే ఉన్నవి. ఆంధ్రదేశ పండితులకును, రచయితలకును సంస్కృతమే శరణ్యము, పఠనీయము. భారతము పంచమ వేదమగుటయు, అయ్యది నీతి శాస్త్రము, వేదాంత నిధి, కావ్యమును గూడ అగుటవలన నన్నయ దానినే తెనిగించెను. నన్నయ చూపిన మార్గమును తరువాతివారు త్రొక్కక తప్పినది కాదు. పండితులకు పరిచితములైన సంస్కృత పురాణములు, కావ్యములు, నీతి గ్రంథములు తెనుగులోనికి అనువదింప బడినవి. ఆంగ్ల వాఙ్మయముతోడి సంబంధ మేర్పడు నప్పటికి తెలుగులో ఉన్న వాఙ్మయ జాతులు పురాణములు, శతకములు, ప్రబంధములు, చంపువులు, యక్షగానములు, ద్విపద కావ్యములు మొదలగునవి. ఇందలి కథలు పురాణ గాథలు; లేక చిన్న చిన్న మార్పులు చేసి రచించిన ప్రాచీనేతిహాసములు. ఉన్న కల్పిత కథలు కూడ సంస్కృత సారస్వతమునే అనుసరించుచుండినవి.

ఆంగ్లేయోద్యోగి సి. పి. బ్రౌను దొర తన రాబడిని చాలవరకు ఆంధ్ర భాషా వాఙ్మయాభి వృద్ధికిని, తెలుగు పండితుల వేతనములకును వెచ్చింప జొచ్చెను. వివిధములుగా ఉన్న తాటాకు ప్రతులను బట్టి కవి తొలుత తాను వ్రాసిన ప్రతిలో పాఠ మెట్లుండునని యూహించి దానిని స్థిరపరచు పద్ధతిని, తాను లాటిను భాషలో చాల వ్రాత ప్రతులనుండి యొక ప్రామాణికమైన ప్రతిని తయారు చేసి ముద్రించు విధానము ననుసరించి తెలుగులో కూడ ప్రవేశపెట్టెను. ఆ పద్ధతియే యిప్పటికి ననుసరింపబడుచున్నది; అనగా ఆంగ్లేయుల సాహచర్యమువలన మన వాఙ్మయమునకు కలిగిన మొదటి మేలు ప్రాచీనాంధ్ర వాఙ్మయమును సేకరించి ప్రామాణిక మైన ప్రతులను తయారు చేయించి వానిని ప్రచారములోనికి దెచ్చుట. దీనివలన కలిగిన మేలు పూర్వ కవుల రచనలు నిర్దుష్ట రూపమున ఆంధ్ర పాఠకులకు లభించుట. ఇట్లు ప్రాచీన వాఙ్మయమునకు భద్రత, ప్రచారము అనునవి యేర్పడిన తరువాత ఆంధ్ర వాఙ్మయములో క్రొత్త పోకడలు గల్గుట రెండవది. ఈ రెండు మార్గములను ఆంధ్ర వాఙ్మయము ఆంగ్లేయ నాగరికత వలన మార్పు నందినది.

పాశ్చాత్యుల పాలనమున క్రైస్తవ మత ప్రచారకుల వలన వారి మతము దేశములో వ్యాపించినది. ఆ మత గ్రంథములకు సంబంధించిన పద్య కావ్యములు బయలు వెడలుట మొదటి క్రొత్త సంగతి. మన శైవ, వైష్ణవ గ్రంథముల వలెనే వేదాంతరసాయన మను నాలుగాశ్వాసముల పద్య ప్రబంధ మగు క్రైస్తవ మత గ్రంథమును క్రీ. శ. 1750 లో మంగళగిరి ఆనందకవి వ్రాసెను. అట్లే తోభ్య చరిత్ర మనునట్టి క్రీస్తు చరిత్రము క్రీ. శ. 1780 లో పింగళి ఎల్లనార్యుడు వ్రాసెను. తెలుగు బైబిలు క్రీ. శ. 1857 - 60 లలో ప్రచురింప బడెను. తరువాత తక్కిన మతగ్రంథములు కాలక్రమమున రా జొచ్చినవి.

సి. పి. బ్రౌనుగారే కాక కాంబెల్, మోరిస్ మొదలయిన ఇతరులును తెలుగును చదివి ఈ భాషలో గ్రంథ రచనమును సాగించిరి. క్రీ. శ. 1888 లో ఆంధ్రవాఙ్మయముపై నొక వ్యాసమును బ్రౌనుగారు వ్రాసిరి. భిన్న కాలములలో వేర్వేరు ప్రదేశములలో తెనుగు కావ్యములను వ్రాసిన తెనుగు కవు లందరి చరిత్రను సంగ్రహించుటయు, వా రందరు ఒక కూటములోనివా రనియు వారి రచనలలో మొత్తముగా ఉన్న పరిణామములను పరిశీలింప



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వచ్చు ననియు వాఙ్మయమును చరిత్రాత్మకముగా పరిశీలింపవచ్చు ననియు నిరూపించుటయు దీని యుద్దేశము. ఆయన నాటిన ఈ బీజమువలననే నేడు వివిధమైన వాఙ్మయచరిత్రలు, కవుల చరిత్రలు మొదలైనవి అనేకులు వ్రాయు విధాన మేర్పడినది. క్రీ.శ. 1821 లో తెలుగు నిఘంటువు నొకదానిని కాంబెల్ దొరగారు ముద్రించిరి. మనకు ఆంధ్రనామ సంగ్రహము మొదలైన నిఘంటువులలో సమానార్థకములైన పదములను కూర్చి పద్యములలో వ్రాయు నాచార ముండెడిది. కొన్ని సంస్కృత నిఘంటువులలో శబ్దముల యంతమును బట్టి 'కాంతములు, చాంతములు' మొదలైన వర్గములుగా విభజించి వ్రాయబడు చుండినవి. ఈ నవీన కోశములో అకారాదిగా శబ్దమునకు 'గలిగిన యర్థము' లన్నియు నిచ్చు పద్ధతి ఆరంభింపబడి తెలుగున స్థిరపడి నేటి మన శబ్దరత్నాకర, సూర్యరాయాది నిఘంటువులకు దారి చూపినది. సి. పి. బ్రౌనుగారు క్రీ. శ. 1853 లో రచియించిన తెలుగు-ఇంగ్లీషు, ఇంగ్లీషు-తెలుగు కోశములు నేటికిని ఉపయోగకరములుగానే ఉన్నవి. తెలుగు వ్యాకరణము నొకదానిని ఆంగ్లభాషలో ఆంగ్లేయుల ఉపయోగముకొరకు క్రీ. శ. 1840 లో బ్రౌనుగారును, అంతకుముందు కాంబెల్ గారును వ్రాసిరి. ఇందలి క్రొత్త యేమనగా, మన భాషకు వ్రాసిన పూర్వ వ్యాకరణము లన్నియు సంస్కృత పద్ధతినే ఆ భాషలలో కలిగిన విభజనమునకే వ్రాయబడి యుండినవి. ఈ వ్యాకరణమున ఆంగ్ల వ్యాకరణ పద్ధతులను, ఆనియమములను అనుసరించి తెలుగు భాష నొక క్రొత్త దృష్టితో పరిశీలించు అభ్యాసము స్థిరపడినది. ఆ తరువాత ఈ మార్గమే పాదుకొని అరవము, తెలుగు, కన్నడము మొదలగు భాషల వ్యాకరణములను పరిపోల్చి ద్రావిడ భాషా సంబంధమైన వ్యాకరణములను వ్రాయు పద్ధతులను పోపు, గుండెర్టు, కాల్డ్వెల్లు మొదలగువారు కనిపెట్టుట సంభవించినది. ఇవి నేటి భాషా వ్యాకరణ పరిశోధన విధానములకు మూలస్తంభములు.

పయిని తెల్పినవి వ్యక్తులవలన నేర్పడిన తరువాత మనము వానిని చూచి నేర్చుకొని త్రొక్కిన మార్గము అనేకము. పూర్వోక్తమైన మార్పు సకలాంధ్ర దేశమున మాత్రమే కాక అఖిలభారతదేశములోను అన్ని వాఙ్మయములందును ఒక్కసారిగా పొడసూపినది. ఇది సాంఘికము, సార్వజనీనము. అన్ని మొదలను ఆంగ్లేయ వాఙ్మయము ఆకాశమునుండి పడువర్షమువలె చదువువారి మానసక్షేత్రములలో ఎడతెరపి లేక నాటినుండి నేటి వరకును కురియుచునే ఉండినది. ఆ వర్షమే రచయితల మానసక్షేత్రములలో నింక క్రొత్తరూపమున నవ్యకావ్యములు నూతన సాహిత్య ప్రక్రియలు అను చెలములు, బావులు, నదులు మొదలగువాని రూపమున తెనుగునాడంతయు నిండినది. ఈ మార్పు వాఙ్మయములోని గ్రంథ జాతుల యందును, ఆ గ్రంథముల విషయములోను, రచనా పద్ధతి యెడలను, గ్రంథ రచన యుద్దేశమునను, కవుల దృష్టియందును గనుపట్టును. వార్తా పత్రికలు ముద్రణ యంత్రములు నెలకొనుట వలన గ్రంథ విమర్శనలు, పండితుల వాగ్వాదములు, ఉపన్యాసములు మొదలైనవి ప్రచురించుట జరగినది. ఆంగ్లేయ విద్యా ప్రభావమున జరగిన సాంఘిక పరిణామమును వాఙ్మయమున పూర్తిగ ప్రతిబింబించినది.

ఇట్లన్ని విషయములలో నుదయించిన పరిణామమును తెనుగు వాఙ్మయమున స్థిరీకరింప జేయుటకు నడుము కట్టిన మహాపురుషుడు కందుకూరి వీరేశలింగముగారు. వివేకవర్ధని యను పేర నొక పత్రికను స్థాపించి నిజముగా ప్రజలకు వివేకము కలిగించు ననేక విషయముల నందు వెలయించుచు వచ్చిరి. క్రీ. శ. 1878 లో వీరు రాజశేఖర చరిత్రము అను పేర 'నవల' అను వచన గ్రంథమును ప్రచురించిరి. స్త్రీలును, సామాన్యులును తమంత చదువుకొని జ్ఞానమును సంపాదించుకొనగలుగునట్లు వీరేశలింగము గారు ఆంగ్ల గ్రంథముల ననుసరించియు, వరవడిగా బెట్టుకొనియు శారీరశాస్త్ర, జంతుశాస్త్రాది శాస్త్ర గ్రంథములు, దేశ చరిత్రలు, మహాపురుషుల చరిత్రలు, ఉత్తమ స్త్రీల చరిత్రములు, పిల్లలు చదువుకొను వాచకములు వ్రాసి ప్రచురించిరి. ఇంతియకాక ఆంగ్లములో నుండిన హాస్యకావ్యములు, కవుల జీవితములు, ప్రహసనములు, దేశాటన చరిత్రములు, నీతికథలు, ఉపన్యాసములు, వ్యాసములు, వ్యక్తుల జీవితచరిత్రములు, స్వీయచరిత్రము, వచన రూపముననున్న ఖండన గ్రంథములు, ఖండకావ్యములు మొదలైన వాఙ్మయ జాతులను అన్నిటిని పరివర్తన రూపముగాను, అనుకరణ రూపముగాను, స్వతంత్ర కల్పనలతోను వీరు తెనుగులోనికి ప్రవేశింపజేసిరి.

ఆంగ్ల వాఙ్మయమునకును, వీరేశలింగము గారికి ముందుండిన యాంధ్రవాఙ్మయమునకును కొన్ని ప్రధానములైన భేదములు గలవు. సంస్కృత వాఙ్మయములో ఉన్న మార్గములను మాత్రమే అనుసరించుట, గ్రంథ విషయము సామాన్య ప్రజాజీవితమునకు విశేషముగా సంబంధింపకుండుట, కేవలము ఉదాత్తములైన పౌరాణిక గాథలనే గ్రహించుట, పద్యరూపముననే విరివిగా వ్రాయుట అనునవి తదాంధ్రవాఙ్మయ లక్షణములు.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కవులకు కల్పనా స్వాతంత్ర్యము కలుగలేదు. ప్రాత మార్గమును విడిచి క్రొత్త మార్గమును అనుసరించుట యన్న భయము. ప్రబంధ ఫక్కిని వ్రాయకున్న ప్రతిష్ఠ రాదను సందేహము. ప్రాచీన ప్రబంధములలోని కవి సమయము లనే వాడి తీరవలె నను పట్టుదల. ఆంగ్ల వాఙ్మయ మట్టిది కాదు. ప్రజల నిత్య జీవిత విధానము, వారి ఆశలు వాఙ్మయములో ప్రతిబింబించు చుండినవి. జాతి చరిత్ర యంతయు కవుల కల్పనలలో కనుపట్టుచుండును. సామాన్యుల చరిత్రములు కావ్యములుగా వ్రాయుట వారికి స్వభావము. ఈ లక్షణములు తెలుగు వాఙ్మయమున ప్రవేశించి అది యనేక విధముల క్రొత్తదిగా మారుటకు ఆంధ్ర దేశములో విరివిగా జరగిన ఆంగ్ల వాఙ్మయ పఠనము హేతువు.

నవలలు వేలకు వేలు - చరిత్రాత్మకములు, అపరాధ పరిశోధకములు, సాంఘికములు, లేఖా రూపకములు - తెనుగున బయలుదేరినవి. ఆంగ్ల విద్యను అభ్యసించవలసిన యువకులు సర్ వాల్టర్ స్కాటు నవలలను పాఠ్యము లనుగా చదువుచుండిరి. షెర్లక్ హోమ్స్ అను అపరాధ పరిశోధకుని పేర ప్రచురించిన కానన్ డయల్ గారి నవలల ననుసరించి అపరాధ పరిశోధక నవలలను తెనుగు వారు వ్రాయజొచ్చిరి. నవలలకు అన్నిటికిని మొదటిది రాజశేఖర చరిత్రమే. సంఘములోని దురాచారములను మూఢుల అజ్ఞతలను హేళన చేసి ఇట్టివి మనలను విడుచు నట్లు చేయుటకు ప్రహసనములు ముఖ్య సాధనములు. 'గలివరు దేశయాత్రలు' అను పేరను ఆంగ్లమున స్విఫ్ట్ అను నతడు కల్పిత కథలను వ్రాసెను. అందు మానవుల యాశలను, తన కాలమునకుముందు ఫ్రాన్సు ఇంగ్లాండు లకు గల వైరమును, పార్లమెంటులోను రాజకీయము గను ఉండు పార్టీ విరోధములను, రాజుల జయకాంక్షను అన్యాపదేశముగా హేళన చేసెను. ఆ గ్రంథమును మూలముగా ఉంచుకొని వీరేశలింగముగారు సత్యరాజాచార్యుల వారి పూర్వదేశ యాత్రలు అను పేర భారతీయ దేశ పరిస్థితులకు అనువైన కల్పనలు చేసి మన దేశమున స్త్రీలకు విద్యలేకుండుట, వారికి స్వాతంత్ర్య ముండకపోవుట మొదలైన విషయములను అన్యాపదేశముగా హేళన చేసెను.

విమర్శన గ్రంథములను నేటి రూపమున వ్రాయుట కేవలము పాశ్చాత్య సంపర్కమున మనలో వెలసినది. మన గ్రంథములకు టీకలు వ్రాయుట, పద్యములకు అర్థ విచారణము చేయుచుండుట, సంస్కృతమునందలి అలంకార శాస్త్ర గ్రంథములను తెనుగులోనికి తెచ్చుట నాటి విమర్శన మనవచ్చును. గ్రంథమందు గల కథను, పాత్రపోషణను, కవి దేశకాలములను, ఇతర విషయములను గూర్చి విమర్శనలను రచించుట మనవారు ఆంగ్ల గ్రంథములను చదువుటవలన నేర్పడినదియే. గ్రంథములను గూర్చి పత్రికా వాదములు చేయుటయు, వార్తా పత్రికలు, పారస్వత పత్రికలు వెలయుట వలననే స్థిరపడినది. కవులు, విమర్శకులు ప్రమాణముల నొసంగునపుడు సంస్కృతాంధ్రముల నుండియే కాక ఆంగ్ల గ్రంథములనుండియు విరివిగా రచనల నెత్తి యుదాహరించుచు వచ్చిరి.

తెనుగు దేశమున నేటి నాటక వాఙ్మయము విరివిగా బయలుదేరుటకు ఆంగ్ల వాఙ్మయ సాహచర్యమే హేతువని చెప్పక తప్పదు. ఆంగ్ల వాఙ్మయములో దుఃఖాంతములు, సుఖాంతములు అయిన నాటకములు, చరిత్రాత్మకములు, సాంఘికములు, హాస్యరస ప్రధానములు నగు వాని ననేకులు చదివి ఇటులే వివిధములైన నాటకములను ఆంధ్రముననను రచించుచు వచ్చిరి. ఈ నాటకములను ప్రదర్శించుటకు కళాభిమానులు ప్రతి పట్టణమునను నాటక శాలలు నిర్మించి ప్రజలకు కళాభిమాన మేర్పడుటకు మార్గదర్శకు లయిరి. ఆంగ్ల దేశమున ఎలిజబెత్తురాణి పాలనమున నిట్లు నాటక శాల లేర్పడినట్లును, వానిలో షేక్స్పియర్ మొదలగు వారు నాటకములను రచించి ప్రదర్శించుచుండి నట్లును ఆంగ్ల వాఙ్మయ చరిత్రమును చదివిన ఆంధ్రులు తెలిసికొని ఆ మార్గముననే నాటక శాలలను పెంపొందించు చుండిరి. నేటికి నాంగ్లమునుండి ఇబ్సెను మొదలయిన అనేక నాటకకర్తల నాటకము లనువదింపబడుట, అనుకరింపబడుటయు జరగినది. ఆ శాఖలో నేటికి ఏకాంకికలు, వచన నాటకములు, కేవల పద్యమయ నాటకములు, రేడియోలలో గేయనాటికలు, సాంఘిక నాటకములు, మూడంకముల నాటకములు మొదలైన వెన్నిరకాలో కాలక్రమమున పాశ్చాత్య దేశములలో బయలుదేరుచున్న రచనల ననుసరించి తెలుగున ఆంధ్రులు ప్రచురించుచున్నారు.

శ్రీ కొమర్రాజు వెంకట లక్ష్మణరావుగారు, శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు సమకట్టి ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము మూడు సంపుటములను వెలయించుటకు ఆంగ్ల భాషలోని ఎన్సైక్లోపీడియా బ్రిటానికాయే కారణము.

తెలుగు కవిత్వమునందును ఆంగ్ల వాఙ్మయ ప్రాబల్యము లేక పోలేదు. కథయందును, పాత్రపోషణయందును, ఖండకావ్య రచనమునను స్వేచ్ఛావిహారము చేసిన ఆంగ్ల కవుల కావ్యములను తెనుగువారు చదివిరి. టెన్నిసను, పోపు, షెల్లీ, బైరను మొదలైన ఆంగ్లేయ మహాకవుల రచనల ఛాయలు లెక్కకు మిక్కిలిగా తెలుగుకవుల రచనలలో బయలుదేరినవి. గీతకావ్యములు, ఖండ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కావ్యములు, కేళన కావ్యములు (పద్యములు) ఆంగ్లేయ కావ్యముల మాదిరివి తెలుగున బయలుదేరినవి. భావ కవిత్వము అనబడు నేటి కవిత్వము నందలి యొకశాఖ ఆంగ్లకావ్య పఠనము వలన కలిగిన భావములతో నిండి యున్నది. దేశాభిమాన మనునట్టి భావన నవ్యాంధ్ర కవిత్వమున తలసూపి అనేకవిధముల వెలువడుటకు హేతువు ఆంగ్ల వాఙ్మయ ప్రభావమే. ఎలిజబెత్తు పాలన మున ఆంగ్ల దేశ ప్రతిష్ఠ సర్వంకషముగా వ్యాపించినది. వారి కందరకును గల స్వదేశాభిమానము నాటిమియు, తరువాతివియు నగు రచనలలో ప్రతిబింబించు చుండినది. ఆ రచనలను చదివిన తెనుగువారికి రెండు కారణములచే నయ్యది అనుకరణ విషయ మయినది. మొదటిది: తెనుగు వాఙ్మయమున నట్టి రచన నూతనమే కాక పాఠకులకు హృదయంగమ మగుట. ఆ కాలమున భారత దేశము స్వాతంత్ర్యములేక పాశ్చాత్య పాలనలో పడి యుండుటవలన జనుల కుత్తేజము కలిగించి దేశాభిమానము రేకెత్తించి భావిస్వాతంత్ర్య సమరమున పాల్గొను నట్లు ప్రజలను పురికొల్పవలసివచ్చుట రెండవది. ఈ రెండు హేతువుల వలనను నవ్యకవుల గీతములు దేశాభిమాన పూరితములై ప్రాచీనులైన ఆంధ్రవీరులయు, ఇతరులగు భారతీయులయు గొప్పదనమును గానము చేయదొడంగినవి. ఆ గానములు కొంతవరకు పాఠకులకు మైగగుర్పొడుచునట్లు చేయకపోలేదు.

మొత్తముమీద ఆంగ్లవాఙ్మయము యొక్క ప్రభావము ఆంధ్రవాఙ్మయములో ప్రతిఫలించుట వలన, నీ వాఙ్మయ ముత్తమస్థితికి వచ్చిన దనక తప్పదు. పూర్వ కాలమున సంస్కృతము మాత్రమే విజ్ఞాననిధి, అనుకార్యము ననుకొనుచుండిన తెనుగువారికి అనుకార్య వాఙ్మయము మరియొకటి ఆంగ్లవాఙ్మయ మనియు, అద్దాని వలన నితరములుకూడ ననుకార్య వాఙ్మయము లున్న వనియు బాగుగా బోధపడినది. కవులకు భావస్వాతంత్ర్య మేర్పడినది. నవ్యతయం దభిరుచి కల్గినది. ప్రాచీన కాలమున నుండినవని కవు లనుకొనుచుండిన ప్రతిబంధములు, నిషేధాభాసములు పూర్ణముగా రచయితల మనస్సుల నుండి పటాపంచలయి పోయినవి. స్వేచ్ఛతో పండితుల యొక్కయు, విమర్శకుల యొక్కయు భయములేక రచన లేర్పడినవి. వచన వాఙ్మయ మనేకవిధముల పెంపొందినది. ఆంధ్రము మహావాఙ్మయమై ప్రపంచమందలి ఇతర వాఙ్మయములలో నొక స్థానమును సంపాదించుకొనగలుగుటకు మార్గములు కుదురుకొనినవి. గం. జో. సో.

# ఆంధ్రులు: సంస్కృత వాఙ్మయము

సంస్కృత సరస్వతీ కల్యాణ మండపమున కలంకారములు దిద్దిన వాఙ్మయ శిల్పులలో ఆంధ్రులకును పరిగణనీయమైన స్థానము కలదు. ఆంధ్ర దేశమున సంస్కృత గ్రంథ రచన విరివిగా జరగుట కారంభించిన నాటికే సంస్కృత వాఙ్మయము శాఖోపశాఖా సమంచితముగా వర్ధిల్లి సర్వ సంపన్నమై యున్నది. వేదములు, వేదాంగములు, ఉపనిషత్తులు, స్మృతులు, పురాణములు, ఇతిహాసములు, శాస్త్రములు, శ్రవ్య కావ్యములు, దృశ్య కావ్యములు, కావ్య శాస్త్ర గ్రంథములకు వ్యాఖ్యానములు మున్నగు వాఙ్మయ ప్రక్రియలు బహుముఖములుగా వృద్ధిపొంది యున్నవి. బ్రహ్మ సూత్ర భాష్యము మొదలుగా చాటు శ్లోకము వరకును ఈ సర్వ ప్రక్రియలయందును కాలక్రమమున తెలుగువారు పాల్గొనిరని సంస్కృత వాఙ్మయ చరిత్రలు చాటుచున్నవి.

చారిత్రికముగా క్రి. శ. పదియవ శతాబ్దినుండి తెలుగు దేశమున సంస్కృత గ్రంథ రచన బహుళముగా జరగిన దనుటకు ఆధారము లున్నవి. తెలుగువారును నలుగురితో పాటుగా సంస్కృతమున కొంత సందడి చేసి రనుటమాత్రమే కాక, కొన్ని ప్రక్రియలయందు తమ గ్రంథములు సర్వ సంస్కృత వాఙ్మయ ప్రపంచమునకు శిరోధార్యములుగ జేసి పరమ ప్రామాణికులై ప్రజ్ఞానిధు లనిపించుకొన్నవారును కొందరు కలరు. వైదికవిజ్ఞానమున శ్రీ రామానుజాచార్యులు, శ్రీ విద్యారణ్యస్వామి, దార్శనిక వాఙ్మయమున కుమారిలభట్టు, వ్యాఖ్యాన రచనయందు మల్లినాథుడు, అలంకార శాస్త్రమున జగన్నాథ పండితుడును ఇట్టివారు.

బ్రాహ్మణములు రచింపబడిన కాలమునుండియు, ఆంధ్రుల పేరు వినబడుచున్నను, వారు రచించిన గ్రంథము లానాటివి ఏవియు కానరావు. ఆపస్తంబ కల్ప సూత్రమే తెలుగువారు 'మాది' అని చెప్పుకొనదగిన తొలి గ్రంథము. ఆపస్తంబుడు ఆంధ్రు డనియు క్రి. పూ. 5 వ శతాబ్దికి పూర్వమం దుండినవా డనియు సంస్కృత వాఙ్మయ చరిత్రకారుల యభిప్రాయము. క్రి. శ. తొలి శతాబ్దులలో శాతవాహన రాజులు ఆంధ్ర దేశమును పాలించుచుండిరి. వీరి కాలమున ప్రాకృతము రాజభాషగా నుండెను. ఇట్లని సంస్కృతమునకు రాజాదరణ లేక పోలేదు. హాలుని గాథా సప్తశతి అను ప్రాకృత



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కావ్యము, శర్వవర్మ విరచిత మగు కాతంత్ర వ్యాకరణము తప్ప వీరి కాలమున బయలుదేరిన ప్రాకృత, సంస్కృత కావ్యములు మనకు లభింపవు. నాటినుండి క్రీ. శ. 7, 8 శతాబ్దులవరకును వాఙ్మయము ఎట్టి స్థితియందుండెనో చెప్పుటకు ఆధారములు లేవు. ఆ కాలమునందలి సంస్కృత, ప్రాకృత భాషామయములగు శాసనముల తోడనే చరిత్రకారులు తృప్తిపడవలసి వచ్చినది.

ఆపస్తంబ కల్ప సూత్రము తరువాత మనకు ఉపలబ్ధమగునవి పూర్వ మీమాంసా దర్శనమున ప్రత్యేక ప్రస్థాన ప్రవర్తకుడగు కుమారిలభట్టు రచించిన శ్లోక వార్తికాది గ్రంథములు, దిఙ్నాగుని బౌద్ధ న్యాయగ్రంథములును. శ్రీ రామానుజాచార్యులు ఆంధ్రుడని పలువురి యభిప్రాయము. ఇది సత్య మగునెడ క్రీ. శ. పదునొకండవ శతాబ్దియందు ఆంధ్రుల వాఙ్మయ కృషిలో శిఖరాయమాణముగ పేర్కొనదగినవి ఈయన రచించిన గీతా భాష్యము, బ్రహ్మసూత్ర భాష్యము మున్నగు ఉద్గ్రంథములు. ఈమహానుభావుడు విశిష్టాద్వైత మత ప్రవర్తకుడు.

కాకతీయుల కాలమునుండి తెలుగునాట సంస్కృత గ్రంథ రచన కొంత విరివిగ సాగజొచ్చినది. అంతకు పూర్వము రచింపబడిన గ్రంథములు లెక్కకు తక్కువ యయ్యును గుణ ప్రామాణ్యాదులయందు సర్వజన శిరోధార్యములగు మహోత్కృష్ట గ్రంథము లనుటకు సందేహింపబని లేదు. ఆయా విజ్ఞాన శాఖలందు పలు ప్రోసి పువ్వరానివై జగద్విఖ్యాతి నందినవి. కాకతీయరాజుల పోషణలో నాట్యాలంకార శాస్త్ర గ్రంథములు, కావ్యములు, కొన్ని రూపక భేదములు వెలసినవి. కాకతీయ సామ్రాజ్య పతనానంతరము ఆంధ్ర దేశము కొలది కాలము తురుష్కుల యధీనములో నుండినది. దుస్స్వప్నము వంటి ఆ కాలమున ఆంధ్రదేశము సర్వథా దుర్భరమయిన స్థితిలో ఉన్నదన్నచో వాఙ్మయకృషి మాట వేరుగ చెప్ప నక్కరలేదు. నాటి మేధావులు, వీరులు చంద్ర ధ్వజమున కెదురొడ్డి దేశ స్వాతంత్ర్యము కొరకు నిర్విరామమయిన కృషి సల్పిరి. తత్ఫలితముగ తెలుగు దేశమున తురుష్కుల ప్రభుత్వము తొలగి మూడు స్వతంత్ర రాజ్యములు ఏర్పడినవి. పశ్చిమాంధ్రమున విజయనగరము రాజధానిగా హరిహరరాయ బుక్కరాయలును, రాచకొండ దేవరకొండలు రాజధానులుగా రేచెర్ల దొరలును, పూర్వాంధ్రమున అద్దంకి రాజధానిగా రెడ్డి ప్రభువులును రాజ్యములు స్థాపించిరి. ఈ రాజన్యుల గొడుగు నీడలలో తిరిగి తెలుగుజాతి నవనవోన్మేషము పొందినది. వారి ఆస్థాన మండపములలో సరస్వతీ నూపురములు గల్లుమన్నవి. ఎడనెడ స్వల్పములగు అంతరాయములు కలిగినను లెక్కింపక నాటినుండి మొన్న మొన్నటివరకు సంస్కృత వాఙ్మయ సరస్వతి యిచట దే[illegible]మున స్వేచ్ఛగా విహారము చేసిన దనుటయే చెప్పవచ్చును.

కాకతీయుల [illegible] స్థానము [illegible] [illegible] [illegible] దక్షిణ దేశ[illegible]రా[illegible] వింధ్య పర్వతమునకు [illegible] ఆనాటి ఆంధ్ర మహాపురుషులు పలువురు [illegible] పూనికతో కాకతీయ సామ్రాజ్యమును నిలిపిరి. కాని, విధివశమున వారి యాశలు [illegible] కాకతీయ రాజ్యము చితికిపోయినది. ఆ మహాపురుషుల యాశలు రూపుకట్టవలయు నని బద్ధకంకణుడైన శ్రీ విద్యారణ్య స్వామి వజ్ర సంకల్పమే విజయనగర సామ్రాజ్య స్థాపనకు దారితీసినది. దేశ రక్షణ భారము రాజుల భుజములపై పెట్టి, ఆ మహనీయుడు ఆర్ష సంస్కృతి పునరుద్ధరణకై తాను నడుము కట్టెను. ఈ కాలమున వేదములకు భాష్యములు, సర్వదర్శన సంగ్రహమను పేర పదారు దర్శనముల సారము, పరాశర స్మృతి వ్యాఖ్యానము మున్నగు వైదిక విజ్ఞానమున జగత్ప్రసిద్ధి గన్న గ్రంథములతో పాటు, శంకర విజయమను కావ్యము, వైద్య [illegible] శాస్త్ర గ్రంథములు పెక్కులు రచింపబడినవి. ఈ విధమున [illegible] జగద్విఖ్యాతి నార్జించిన యుద్గ్రంథము[illegible]బడిలో వెలసిన వన్నె యశస్సును ఆ విజయనగర మహారాజులు దక్కించుకొనిరి. వీరి కాలమున ఇంకను కావ్యములు, నిఘంటువులు, అలంకార గ్రంథములు రచింపబడినవి.

ఇక ఆంధ్ర దేశమున వాఙ్మయాభివృద్ధికి కృషి చేసిన రాజులలో ఎవరికిని రెడ్డి రాజన్యులు తీసిపోరు. రేచెర్ల వంశజులును ఈ విషయమున పరిగణనీయమైన పాత్రయే వహించిరి. ఈ యుభయుల ఆదరాభిమానములను పురస్కరించుకొని వీరి కాలమున అలంకార శాస్త్ర గ్రంథములు, కావ్య నాటకాలంకార శాస్త్ర గ్రంథములకు వ్యాఖ్యానములు, కావ్య నాటకములు, భాణ ప్రహసనములు శరపరంపరగా బయలుదేరినవి. వైద్య జ్యోతిష సంగీత శాస్త్ర గ్రంథములు, నిఘంటువులు కూడ వెలసినవి. ఆ రాజులలో పలువురు ఈ వాఙ్మయ వ్యవసాయమున స్వయముగా పాల్గొన్నవారు. పెదకోమటి వేమారెడ్డి, కుమారగిరిరెడ్డి, కాటయ వేముడు, సర్వజ్ఞ సింగ భూపాలుడు విద్వత్ప్రభువు లనిపించుకొన్నవారు. అప్పటి సంస్కృత విద్వాంసులలో కాటయవేముడు, (రేచెర్లవారి యాస్థానమున



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



మన్న) మల్లినాథుడు ఎన్నదగినవారు. కాటయ వేముడు కాళిదాస నాటకములకు వ్యాఖ్యానములు రచించెను. మల్లినాథుడు పంచకావ్యములకు, నైషధమునకు వ్యాఖ్యాత. కాళిదాస కావ్యములకు గల వ్యాఖ్యానములలో ఈ యిరువురి వ్యాఖ్యలే ప్రామాణికములై ఖండాంతర ఖ్యాతి నార్జించినవి. కాగా, కాళిదాస కవితా సరస్వతీ పల్యంకికకు ఈ యుభయులు ఇరువైపుల బుజము లొడ్డి ఆ మహాకవి వాణిని లోకమున మూరేగించి తెలుగు వారికి గర్వ కారకులైరి. బహు శాస్త్రములయందు కూలంకష వైదుష్యము గల గొప్ప విద్వాంసు లా కాలమున అనేకులు ఆంధ్ర దేశమున నుండిరని రెడ్డి రాజుల శాసనములవలన తెలియవచ్చుచున్నది. రాజాచలా స్థానము నలంకరించిన విశ్వేశ్వర కవి విరచితమగు చమత్కార చంద్రిక అను అలంకార గ్రంథము పేర్కొన దగినది. జగన్నాథ పండితుని కావ్య నిర్వచనమునకు దారి చూపినది ఈ గ్రంథమే యని కొందరు విద్వాంసుల యభిప్రాయము.

క్రీస్తుశకము పదునైదవ శతాబ్దిని రెడ్డిరాజ్యము విజయనగర సామ్రాజ్యమున లీనమైపోయినది. కృష్ణరాయల కాలము సర్వవిధముల ఆంధ్రదేశ చరిత్రలో స్వర్ణయుగమై విరాజిల్లినది. కృష్ణరాయలు సాహితీ సమరాంగణసార్వభౌముడు. ఈయన సంస్కృతమున పలుకృతులు రచించినవాడు. కాని, సంస్కృత కవితకంటె ఆంధ్ర కవితయే కృష్ణరాయలయెడ స్వాధీనపతి కాత్వము నెరపిన దని చెప్పక తప్పదు. విజయనగర రాజులకాలమున కావ్య నాటకములు, పూర్వకావ్య నాటకములకు వ్యాఖ్యానములు, సంగీతశాస్త్ర గ్రంథములు, నాట్యాలంకారజ్యోతిష గ్రంథములు వెలువడినవి. ప్రథమాంధ్ర వాగ్గేయ కారకుడగు అన్నమాచార్యుడు ఈ కాలపువాడే. ఈయన సంస్కృతమునను కీర్తనలు రచించెను. ద్వ్యర్థి, త్ర్యర్థి, పంచార్థి కావ్యము లీకాలమున బయలుదేరినవి. మొత్తముమీద ఈ కాలమున సంస్కృతాంధ్ర భాషలలో పుష్కలముగ గ్రంథ రచన జరిగినది.

రక్కసి తంగడి యుద్ధముతో విజయనగర సామ్రాజ్య వైభవము ఛిన్నభిన్నమై పోయినది. ఈ సంగ్రామమునకు పిమ్మట విజయనగరరాజ వంశజులు కొంతకాలము పరిపాలన చేయకపోలేదు; వాఙ్మయ పోషణము చేయక పోలేదు. కొంతకు కొంతయైన ఆ వైభవమును తలపించిన వారు తంజావూరు, మధుర నాయకరాజులు. వీరి పరిపాలనలో మరల వాఙ్మయమునకు తగిన ప్రోత్సాహములభించినది.

సంస్కృతవాఙ్మయ చరిత్రకారుడు విజయనగరమునుండి తంజావూరు, మధుర నాయకుల యాస్థానములకు పయనము కాకముందు ఆతనిదృష్టిని ఆకర్షించు ఒక తెలు[గు] జగన్నాథ పండితుడు. ఈయన వ్యాకరణాలంకార శాస్త్రములయందు నిధి; బహుకావ్య నిర్మాత. ఈయన రచించి[న] రసగంగాధరమను అలంకారశాస్త్ర గ్రంథము ఆశాస్త్రమునందలి ప్రామాణిక గ్రంథములలో నొకటి. విద్యానాథు[ని] కాలమునుండి జగన్నాథపండితుని కాలమువరకు తెలుగుదేశమున అలంకారశాస్త్ర గ్రంథ నిర్మాణము పుష్కలముగనే జరిగినది. పతచ్ఛాస్త్ర దృష్టితో ఆంధ్రదేశమును దక్షిణకాశ్మీర మను కొన్నను మనకు మమ[కార]దోష మంటదు. రసగంగాధరమునకు తరువాత విషయ[ము] వివేచనమునను, ఉపజ్ఞాగరిమ యందును, దాని[ని] మించిన గ్రంథము భారతదేశమున వెలువడలే దన్న[ది] సర్వవిద్వ దంగీకృతమయిన విషయము. కాగా — భారతీయాలంకారశాస్త్ర గోపురమునకు శిఖరారోపణము చేసి గౌరవము తెలుగువారికి దక్కించిన ప్రజ్ఞాశాలి జగన్నా[థ] పండితుడు (చూడు: జగన్నాథపండితరాయలు).

క్రీస్తుశకము పదునేడవ పదునెనిమిదవ శతాబ్దు[ల]యందు వెలువడిన వాఙ్మయమున ప్రక్రియావైవిధ్యము మిక్కుటముగా గానవచ్చును. మహాభాష్య వ్యాఖ్యా[న]మునకు వ్యాఖ్యానము ఈ కాలముననే రచింపబడిన[ది]. కావ్య నాటకములు, సంగీత జ్యోతిష వ్యాకరణ వేదాంతాలంకార శాస్త్ర గ్రంథములు ననేక మీ శతాబ్దులలో వెలువడినవి. మధుర, తంజావూరు నాయకరాజులు విద్వత్ప్రభు ఖ్యాతి పడసిన వారు. రఘునాథనాయకుడు సంస్కృతగ్రంథరచన చేసినవాడు.

క్రీస్తుశకము పందొమ్మిదవ శతాబ్ది నుండి, ఇరువదియవ శతాబ్ది తొలిపాదము వరకును వెనుకటి వలెనే ప్రక్రియ వైవిధ్యము గానవచ్చును. తర్క వ్యాకరణాలంకార శాస్త్రములయందు నిధులై విశేషఖ్యాతి నార్జించిన మహా విద్వాంసు లీ కాలమున బహు గ్రంథములు రచించి[రి]. కొన్ని ఆంగ్ల, పారశీక గ్రంథములు కూడ ఈ కాలము[న] సంస్కృతీకరింపబడినవి. పురుషులు చేయుచున్న బహు విధాలంకారములతోపాటు సంస్కృత సాహితీమండపమున ఆంధ్రమహిళలును పలువురు ముత్యాల రంగవల్లులు తీర్చి రనుమాట మనము మరువరాదు.

మొత్తముమీద క్రీస్తుపూర్వము 6 మొదలు క్రీ. శ. 20 శతాబ్ది తొలిపాదము వరకు నాంధ్రులు సంస్కృత వాఙ్మయమునకు చెప్పుకొనదగిన సేవ చేసిరి. అందుగల ప్రక్రియ[ల] న్నిటియందును వారు కృషి చేసి భారతీయ విజ్ఞాన రంగమున ప్రముఖ పాత్ర వహించి రనుట కేవలము స్వభావోక్తి.

డా. గో. కృ[...]



http://sanskritcentral.com/

http://teluguthesis.com/


త్రము 1. స్తూపప్రాకారము (వెలుపలవైపు).—అమరావతి



చిత్రము 2. స్తూపప్రాకారము (లోపలివైపు),—అమరావతి

http://sanskritcentral.com/

http://teluguthesis.com/

# ఆంధ్ర దేవాలయ వాస్తుకళా పరిణామము

చారిత్రిక కాలమునకు చెందిన అతి ప్రాచీన భవన వాస్తువునకుదాహరణములు అధికాంశము మతమునకు సంబంధించినవిగా నున్నవి. కాని సామాన్య లౌకికములు కావు. దక్షిణదేశమున కూడ పరిస్థితి యింతకన్న భిన్నము కాదు. దక్షిణ భారతమున మొదట మొదట కట్టబడిన దేవాలయములు భారత దేశమునందు ఇతరత్ర కట్టబడిన అట్టి నిర్మాణములకన్న స్పష్టముగా భిన్నరీతిని గాకపోయినను కొన్ని ప్రత్యేకాంశములలో మాత్రము విశిష్టతను చూపుచున్నవి. సాంచిలోని స్తూపముయొక్క తలవిన్యాసము భార్హూత్ స్తూపముయొక్క తల విన్యాసము కంటె కొన్ని విషయములలో భిన్నముగ నున్నది. ఇంకను దక్షిణమున అమరావతివంటి చోట్ల మరికొన్ని భేదములు కానవచ్చుచున్నవి. సాతవాహనుల కాలమున కృష్ణలోయలో నిర్మింపబడిన స్తూపములు తరువాతివానికి, అనగా ఇక్ష్వాకు రాజ కుటుంబములోని భక్తి తత్పరలైన రాకొమరితలు నాగార్జునుని కొండలో కట్టించిన స్తూపములకు మాతృకలైనవి.

మౌర్యుల యధికారము క్షీణించిన తరువాత దక్షిణాపథమున స్వతంత్రములైన రాజవంశములలో సాతవాహన వంశము చాల శక్తిమంతమైనది. వారి కాలపు నిర్మాణ వాస్తువునకు పశ్చిమ భారత మందలి వివిధ గుహాలయములును, తూర్పున అమరావతీ స్తూపమును చక్కని యుదాహరణములు. కార్లె, భాజ, కొంఢానా, విదిశ, నాసిక, అజంటా గుహాలయములవంటి పశ్చిమ భారత గుహాలయములయందు గజపృష్ఠాకారముగల (అప్సిడల్) గర్భాలయముతోడి చైత్యశాల, బౌద్ధ భిక్షువుల నివాసము కొరకైన గదులతో నిర్మితములైన సంఘారామముల వంటి కొన్ని ప్రత్యేక రీతులు స్పష్టముగ కనబడుచున్నవి. చైత్యశాలలో అవతలి చివర గర్భాలయమున ఉద్దేశిక స్తూప ముండును. ఊత కంబములతోను, ఏనుగుల సింహముల గుఱ్ఱముల — కొన్నియెడల రెక్కలు గలవి, రౌతులు స్వారి చేయునవి — వంటి జంతు చిత్రాలంకృత చూళికలు గల కుడ్య స్తంభములతోను, తోరణములు (కమానులు)గల జాలము లున్న కిటికీలతోను నుండు భూమికలు (అంతస్తులు) కలిగినట్టి, లేనట్టి గుహాలయము హిందూ దేశములోని వాస్తుకళయొక్క ప్రాథమిక దశను విదితము చేయుచున్నది.

బారాబరు కొండలలోని మౌర్య యుగమునాటి సంఘారామమునందలి సామాన్యపు గదియొక్క ముఖభాగముమీద నుండు కమానువంటి కప్పు ఆంధ్ర దేశము నందలి విజయవాడకు సమీపమున నుండు గుంటుపల్లిలో కానవచ్చుచున్నది. ఇది సాతవాహనులనాటి తొలి నిర్మాణము.

వాఙ్మయము ననుసరించియు, అమరావతిలోనివాని వంటి చెక్కడముల ననుసరించియు చూడగా, ఈ కాలమున అంతస్తులు గల మేడ లుండినట్లు తెలియవచ్చుచున్నది. అమరావతిలో ఆరంతస్తుల సౌధమును చూపు నొక శిల్ప చిత్రము గలదు.

అమరావతిలోని స్తూపము బుద్ధుని శరీరావశేషముల నిక్షేపమునకై కట్టబడిన సామాన్యమగు నర్ధగోళాకార నిర్మాణము. ఎత్తులేని గుండ్రని వేదిక, దానిపై యంచు చివరను తిన్నెయు, దానిమీది కెక్కుటకు మెట్లు, చుట్టు నాలుగు దిక్కులను ముందు కరుగువలె నుండు నాలుగు చతురస్రపు తిన్నెలు, వేదికమీద అండము, దానిమీద నొకటి రెండు ఛత్రములతోడి ఘనాకార నిర్మాణ మగు హర్మిక — ఇవి సామాన్య స్తూపముయొక్క అవయవములు. స్తూప గర్భమున పవిత్రములైన అవశేషములు నిక్షిప్తమైన స్థలమును మీది హర్మిక సూచించును. కృష్ణాతీర మందలి స్తూపనిర్మాణ వైఖరినిబట్టి చూడగా స్తూపమునకు చుట్టు రెండు - ఒకటి మధ్యస్థమైన నాభి చుట్టును, మరియొకటి వెలుపలి యంచునను - వలయాకార ప్రాకారము లుండినట్లు తెలియవచ్చుచున్నది. ఈ రెండు ప్రాకారములకు నడుమ నుండు స్థల మంతయు మట్టితో నింపబడినది. వేదికగోడయొక్క వెలుపలి భాగము చెక్కడపు పనులు గల చలువరాతి పలకలతో కప్పబడి యున్నది. అట్లే అర్ధగోళాకృతి నున్న అండముమీది కొంత భాగము గచ్చు బొమ్మలతో చిత్రింపబడినది. నాలుగు దిక్కులను ముందుకు పొడుచుకొని వచ్చిన చచ్చౌకపు తిన్నెలమీద 'ఆయక' కంబము లను పేరుగల అయిదు పెద్ద నిలువు స్తంభము లున్నవి. ఈ స్తంభములును, వాని కాధారములైన వేదికలును, సింహ సంరక్షితములగు సామాన్య ద్వారములును ఆంధ్ర దేశములోని స్తూపముల ప్రత్యేక లక్షణములు. ఇవి మరి యెచటను కానరావు. స్తూపమునకును, చుట్టునుండు ప్రాకార



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ములకును నడిమి ప్రదక్షిణ వీథిలోనికి ఎక్కి వచ్చుటకు ద్వారములకడ సోపానము లున్నవి. సోపానములలో మొదటిది అర్ధ చంద్రాకృతి గలిగి యుండుటవలన 'చంద్రశిల' యనుపేర ప్రసిద్ధిచెందినది. దాని యంచు నానావిధ మృగలతాది సుందరశిల్పములతో మనోహరముగా నలంకృతమై యున్నది. అమరావతి, నాగార్జునికొండ మొదలైన చోట్లలోని చంద్రశిలలు సింహళీయ స్తూప సింహద్వార సోపానముల కలంకారము లైన అట్టి శిలలను జ్ఞప్తికి తెచ్చుచున్నవి. నాగార్జునుని కొండలోని శాసనములవలన ఇందు సింహళ శిల్ప ప్రభావమునకు ఎక్కువ అవకాశము కలదని విదిత మగుచున్నది.



చిత్రము 96. మకరతోరణము, స్తంభములు, అమరావతి

అమరావతీ స్తూప ప్రాకారము త్తమోత్తమ శిల్పములలో నొకటి. సాంచిలో కానవచ్చు సామాన్య ప్రాకారరూపము ఇచ్చట విస్తరింపబడి సాధ్య మయినంతవరకు చెక్కడపు పనులతో సంపూర్ణముగా అలంకరింపబడినది. మధుర, బుద్ధగయ, భార్హుత్‌ల లోని పద్మశిలా ముద్రిక సాతవాహన నిర్మిత సాంచీ పూర్వ ద్వారము మీది పద్మశిలాముద్రికతో సాటి కాజాలదు. ఇంతేకాదు గాంధారము నందును, మధురయందును కానవచ్చు పుష్పదామమును, తద్వాహకులును కళా సౌకుమార్యమునగాని, తీర్పు తీరువులలోగాని, శిల్ప నైపుణ్యమునగాని అమరావతిలోని వానికి సమాత్రమును దీటురావు. అమరావతీ స్తూపవేదికకు పద్మభూషా విశిష్ట స్తంభములును, మకర ముఖ నిర్గతమైన పుష్పదామాలంకృతములగు ముష్టిష ములును (చిత్రము 96), అటుతరువాతి పల్లవ (చిత్రము 97), చాళుక్యకాలపు శిల్పులకు మార్గదర్శకము లైనవి.

స్తూపములతో గూడ చైత్యములును, విహారములును ఉండినవి. నాగార్జునునికొండలో చక్కని చైత్యావశేషోదాహరణములు కానవచ్చుచున్నవి. చైత్యముల విన్యాసము గజపృష్ఠ రూపమున నున్నది. చైత్యమునందలి అవ్వలి చివర వర్తులాంశ సమీపమున పూజార్థమైన ప్రముక్కుబడి స్తూపముండును. ఈ చైత్యములకు పెద్ద స్తూపములకు వలెనే అర్ధ వలయాకార 'చంద్ర శిల'లతో ప్రారంభమగు మెట్లవరుస యుండెడిది. కార్లె మున్నగు స్థలములలో కొండలలో తొలిచిన గుహాలయములలోని చైత్యములకును, అర్వాచీన చైత్యములకును విన్యాసమునను, రూపమునను ఎక్కువ భేదము కానరాదు. చైత్యముల స్వరూపమును, వక్రాకార పటలమును నిర్మాణములో నెట్లుండినవో గ్రహించవలెననిన తొలిచిన గుహాలలోని లోకప్పు వైఖరినిబట్టి గాని, చైత్యములను అనుకరించి నిర్మించిన తరువాతి కాలపు హిందూదేవాలయములను బట్టిగాని ఊహించుకొనవలయును.



చిత్రము 97. మకర తోరణము, స్తంభములు, దళవానూరు

దీర్ఘ చతురస్రాకారమున నున్న అంగణము చుట్టును బౌద్ధ భిక్షుకులు గదు లుండెడి చతుశ్శాలతో గూడినది విహారము. సాంచిలో చెక్కిన శిల్ప ప్రతిమలను బట్టి చూడగా విహారములకు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చిత్రము 98. చైత్యాలయ ఖండిక (సెక్షన్) కార్ల గుహాలయము



చిత్రము 99. చైత్యాలయ విన్యాసము, కార్ల గుహాలయము





చిత్రము 100. కపోతేశ్వరాలయము యొక్క ఖండిక, (సెక్షన్), ఉన్నది చేజెర్ల

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



పై యంతస్తులు కూడ నుండిన వనవచ్చును. నాగార్జునుని కొండలో త్రవ్వగా ఇట్టి విహారముల పునాదులు బయలు పడినవి. గదుల వాకిండ్లకును, కొన్ని ద్వారములకును 'చంద్రశిల'తో ప్రారంభమగు చిన్న మెట్లును, వాని కిరు పార్శ్వముల మకరాంచితములైన రాతి పిల్లగోడ లును గలవు.

నాగార్జునుని కొండలో పూర్వ మొక మంటప ముండిన చోట పడిపోయి వరుసలుగా నున్న స్తంభము లున్నవి. తరువాతి శతాబ్దులలో నిర్మితములైన దక్షిణదేశ దేవా లయములలో కొల్లలుగా కానవచ్చు బహుస్తంభ మంటప ములకును, సహస్రస్తంభ మంటపములకును ఈ మంటపము ప్రాచీనతమమైన యుదాహరణము.

ఆ కాలపు సామాన్యజన వేశ్మములు దైవదుర్విపాక మున శిథిలమై పోయినవి. అమరావతి, నాగార్జునునికొండ మొదలైన ప్రదేశములనుండు వాని శిల్ప ప్రతిబింబముల పరిశీలనచే ప్రాచీన రాజ గృహముల స్వరూపము కొంత మనము గ్రహింప గలిగినను వానికి సరియైన ప్రత్యక్ష నిదర్శనములు కానరావు. ఇవి పెక్కు అంతస్తులు కలిగిన దివ్యసౌధరాజములు. వీని కిటికీలు మూడు విధములైనవి. కొన్ని శిఖాంతములైన తోరణము (కమాను)లు గలవి; మరికొన్ని దీర్ఘచతురస్రాకారములు కలవి; వేరొకకొన్ని జాలకములు. వివిధములైన చేపట్టు గోడలు (బాలస్ట్రేడ్స్) కలవు. సొంపయిన చూళికలు(కాపిటల్స్) కల కుడ్య స్తంభములు(పైలాస్టర్స్)ను, బహుభుజ (పాలిగనల్) స్తంభములును గలవు. వానియందు కొన్ని ఘంటాకార కల శాధిష్ఠిత ప్రతిరూపములు. పైకప్పు కొన్ని యెడల బండి గూటివలెను, మరికొన్ని యెడల సామాన్య దీర్ఘచతురస్ర కుటీరపు కప్పువలెను, మరికొన్ని యెడల వర్తుల వక్ర రేఖాకార పటలమువలెను ఉండెడిది. ఇందు మొదటి దానికి శాల యనియు, రెండవదానికి కూటాగార మనియు పేరులు. ఇవి రెండును ఆద్య వాఙ్మయమునందు ప్రాసాద వర్ణన సందర్భమున వర్ణితమైనవి. డాబాలును (టెర్రేసెస్), ప్రగ్రీవములును(బాల్కనీలు)కూడ ఈ శిల్పములయందు కానవచ్చుచున్నవి. వీనిలో ఆచ్ఛాదనము (కానోపీ) ఉన్నవి కొన్ని; లేనివి కొన్ని. ఈ రెండవ రకమునకు వలభిలని పేరు. సాంచీస్తూప ద్వారమునందువలె చక్కని వక్ర తోరణాలంకృతములైన వేర్వేరు ప్రవేశ, నిర్గమన ద్వారము లుండెడివి. వీని వప్పు డప్పుడు నవ్య పుష్ప గామములతో నలంకరించుచుండు వారు. ఈ ద్వారములు ఇప్పటి యైశ్వర్యవంతుల గృహములందు వలెనే ఈ ప్రాకారమునందు నుండెడివి.

చేజెర్ల దేవాలయము ఆంధ్రదేశములో మన కళాభి రుచిని వెక్కొల్కొలుపు కట్టడములలో నొకటి. ఇది నాగా ర్జునుని కొండలోని బౌద్ధ చైత్యమువంటివాని ననుస రించి గజపృష్ఠాకార రూపమున నిర్మింపబడిన తొలుదొల్తటి హిందూ దేవాలయము. దీని విమాన ముఖము పెద్ద చైత్యాలయపు కమానువలె తీర్పబడియున్నది. వెనుకటి పై భాగము గజపృష్ఠము వలె వంపుగా నున్నది. ఇది కపోతేశ్వరుని దేవాలయము; క్రీ. శ. 4 శతాబ్దిలో పాలిం చిన ఆనందగోత్రజులగు రాజులు కట్టించినది. దీనికి తరు వాత గజపృష్ఠాకారమున నిర్మింపబడిన తొలుతటి హిందూ దేవాలయము మహాబలిపురమందలి రథవర్గమున గలదు. పల్లవ శిల్పులు చేజెర్ల దేవాలయ రూపము ననుకరించి యుండుట అసంభవము కాదు. ఏలన, విచిత్రచిత్తుడని ప్రసిద్ధిచెందిన పల్లవరాజు మొదటి మహేంద్రవర్మ కృష్ణా తట భూమిని పాలించుచుండిన విష్ణుకుండి విక్రమహేం ద్రుని దౌహిత్రుడగుటవలన అతడు కొండలను తొలిచి ఆలయములను నిర్మించు ఆంధ్ర సంప్రదాయమును తన కాంచీరాజ్యమున ప్రవేశపెట్టి యుండవచ్చును. ఇట్టి గజపృష్ఠాకారమున నిర్మింపబడిన తొలుతటి దేవతాయ తనములు మరిరెండు దక్కనునందు గలవు. అం దొకటి తేర్ అను ప్రదేశమున నున్నది. రెండవది అయ్యావళి లోని దుర్గదేవాలయము. ఈ రెండును చాల ప్రాచీనములే. రెండవది క్రీ. శ. ఆరవ శతాబ్దమునకు చెందినది. క్రీస్తు శకము ఏడవ శతాబ్దారంభ దశకములలో చాళుక్యుల కును, పల్లవులకును కలిగిన సంఘర్షణలుకూడ ఈ సంస్కృతి సంసర్గ, ప్రభావములకు కారణమై యుండవచ్చును. ఇట్లే అయ్యావళి దేవాలయ నిర్మాణపద్ధతిని పల్లవ శిల్పులు అనుకరించి యుండవచ్చును.

సాతవాహనుల శిల్పము అర్వాచీన కాలమున దక్కను పడమటి భాగమున నొక్కతీరునను, తూర్పున మరియొక తీరునను రెండు విధములుగ పరిణామము చెందినది. పుష్ప లతాకల్పనల శిల్పములతో కూడిన అజంటాయందలి వాకా టక రాజుల కాలమునాటి గుహలు తొలుతటి అర్వాచీన సాతవాహన పద్ధతి నుండి యుత్పన్నమైన యొకానొక కళా పద్ధతిపై గుప్తకళాప్రభావ ముండుటను విదితము చేయుచున్నవి. ఈ వాస్తు, శిల్ప కళాపద్ధతులు రెండును బాదామిలోను, అయ్యావళిలోను గల యందలి ప్రాచీన తమ చాళుక్య దేవాలయములలో ననుసరింపబడినవి. గౌతమీపుత్ర యజ్ఞశ్రీ సాతకర్ణి యొక్క నాసిక గుహాల యములలోని కుడ్య స్తంభములు కృష్ణలోయ యందలి బౌద్ధస్తూపముల యొక్క ప్రాకారములలోని నిలువు



http://sanskritcentral.com/



చిత్రము 101. 1. ప్రస్తరము 2. మంటపము (౧) కొడిగ, (౨) మంటపము, (౩) పద్మము 3. ఉపపీఠము (౧) కపోతము (౨) కంఠము (౩) కుముదము (౪) ఉపానము 4. 'పల్లవ గూడు' (గంధర్వ శిరస్సుతో) 5. పంజరతోరణాలంకారము (తూర్పు చాళుక్య యుగము) 6. (క) స్తూపి (చ) శిఖరము (ట) గ్రీవము (త) కపోతము (ప) 'కర్ణగూడు' (య) బోధిక (ర) పలక (ల) కుంభము (వ) కలశము (శ) పద్మబంధము (ష) కాలు (స) కంఠము (హ) కుముదము (ళ) పద్మము (క్ష) ఉపానము 7. పట్టెలు తీర్చిన స్తంభము 8. త్రిఖంధ స్తంభాధిష్ఠానము 9, 13. కుంభపంజర భేదములు 10. రెండతస్తుల విమానము 11. నేటి స్తంభము (౧) పుష్పబోధిక (౨) కట్టు (౩) నాగపాదము 12. పల్లవ బోధిక (పట్టెలతో అలంకృతమయినది) 14. ప్రతిఖంధ స్తంభాధిష్ఠానము 15. చుట్టలవ్యాళి

http://telugutheisis.com/
http://sanskritcentral.com/

http://teluguthesis.com/



స్తంభములను, ముఖ్యముగ శోభాయమానములగు అమరావతీ స్తూపప్రాకారములోని వానిని యథాతథముగ పోలియున్నవి (చిత్రము 102. అ). ఈ కుడ్య స్తంభముల మీది చెక్కడపు పని ఇంచుక మార్పులతో అలంకార సంపన్నములైన అజంటా గుహాలయ స్తంభములమీద పొడగాన వచ్చును.

చిత్రము 102. స్తంభ పరిణామము



(అ) నాసిక, అమరావతి



(ఆ) అజంటా



(ఇ) బాదామి

పూర్ణ పద్మ ముద్రిక కుభయ పార్శ్వములయందును వివవ కత్రవలె నున్న అర్థ వికసిత పద్మ ముద్రికలు మధ్యమున్న పెద్ద తోరణము (కమాను)న కిరుప్రక్కల నున్న చిన్న తోరణములవలె నున్నవి. ఈ పద్ధతి అజంటా స్తంభపు అలంకరణములో పునరావృతమై యున్నది (చిత్రము 102. ఆ). పద్మ ముద్రికలకు అనుబంధములై యుండు తోరణములు (కమానులు) ఎక్కువ వంపు గలిగి పరస్పరానురూపములై యున్నవి. సాతవాహనుల కాలపు స్తంభములలో తీర్చిన మూరేసి పట్టెలు అజంటా స్తంభములలో బహుళీకృతములైనవి. బాదామి యందలి వైష్ణవ గుహాలయములలో నలుచదరముగ నున్న ఆద్య చాళుక్య స్తంభములలో త్రిధావృతఖండమును, పట్టెల తీర్పును అనువృతములై యున్నవి (చిత్రము 102. ఇ). కాని స్తంభములమీది ముద్రికలలో అజంటాలోని వాకాటక శిల్పుల చిత్రకల్పనల ననుసరించి పుష్పాలంకార వృష్ఠభాగములతో మున్న మకర, వృషభ, మహిషములవంటి చిత్రకల్పనలు ప్రవేశ పెట్టబడినవి. ఆద్య సాతవాహన గుహాలయములలోని, ఇతర నిర్మాణములలోని చైత్య గవాక్షము (చిత్రము 108 అ) చాల సాదాగ (సామాన్యముగా) నుండగా అజంటాలోని గుప్త వాకాటక గుహాలయములలోని వానికి పార్శ్వములందు దిగువ భాగమున కోణములు గల చేర్పులును, పై భాగమున మలి తీగలవంటి ప్రక్షేప కల్పనలును కలవు (చిత్రము 108. ఆ). ఈ వాటి, ఈ తరువాతి కాలము నాటి చైత్య గవాక్షములోని అర్థవృత్తాకార శూన్యస్థలములో మనోజ్ఞమైన మానవ శిరస్సు కానవచ్చును. బాదామి గుహాలలో నీ చైత్య గవాక్ష మింకను ఎక్కువ పెంపందినది (చిత్రము 108. ఇ); కాని ఇది స్పష్టముగా అజంటాలోని వాని ననుసరించి వచ్చినదే. ఎట్లన, దిగువ భాగములోని కోణపు చేర్పులు స్వరూపము మారకయే మకర శిరస్సులుగా పరిణామ మందినవి కాని పై భాగమున ఉభయ పార్శ్వములందలి నులి తీగవంటి అలంకరణ మట్లే నిలిచి యున్నది. ఈ చైత్య గవాక్షపు తరువాతి పరిణామమును విష్ణుకుండినృపుల యొక్కయు (చిత్రము 108. ఈ), మొదటి పల్లవుల యొక్కయు గుహాలయములలో (చిత్ర 108. ఉ) గానవచ్చును. దాని పై భాగము చేటపా

చిత్రము 108. చైత్యగవాక్ష (గూడు) పరిణామము



(అ) సాతవాహన : కార్ల



(ఆ) గుప్త వాకాటక : అజంటా



(ఇ) బాదామి చాళుక్య : బాదామి



(ఈ) విష్ణుకుండి : మొగల్రాజపురము



(ఉ) పల్లవ : మహాబలిపురము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



రూపొంది ప్రక్కభాగములు పుష్పకల్పనలు కలిగి యున్నవి. ఈ యంశము పూర్వ చాళుక్యదేవాలయములలోని చైత్య గవాక్షముల విశిష్టలక్షణ మగుచున్నది; కాని చేటపార గల అగ్రభాగమునకు రెండు ప్రక్కల మకరమస్తక శిల్పము లుండుట విశేషము. దీనికి ముఖ్యముగా పల్లవ, కళింగ శిల్పాంశ సంకీర్ణమైన బాదామి చాళుక్య శిల్పము మాతృక. పాదమునుండి పైకి సగము భాగము వరకు నలుచదరముగాను, పైన వర్తులముగాను ఉన్న కాండము, దానిపైన నడుమ బంధముతోడి పట్టెలు తీర్చిన బోధికగల స్తంభము (చిత్రము 104. అ) మరియొక రకమైనది. ఈ (స్తంభములోని) వర్తుల భాగములో దీర్ఘవర్తుల కంకువు, గుమ్మడిపండు అను విభాగము లున్నవి. ఈ యంశములతో కూడిన కాండము, బోధికగల స్తంభములు కొద్దిమార్పులతో తొలికాలపు పల్లవ గుహాలయములలో పునరావృతము లైనవి (చిత్రము 104. ఆ. ఇ.). ఇంతకు ముందు వివరించినట్లు అయ్యావళిలోని గజపృష్ఠాకార దుర్గాదేవాలయము పశ్చిమ భారతదేశము నందు బౌద్ధచైత్యాలయముల మాదిరి నిర్మింపబడిన హిందూ దేవాలయములలో ప్రాచీనతమమైనది. దాక్షిణాత్యాలయ నిర్మాణ పద్ధతుల పరిణామములను పరిశీలించుటలో చేజెర్ల దేవాలయమువలె ఇదియు చాల ముఖ్యమైనది. వాకాటక రాజుల కాలపు వాస్తు నిర్మాణములను పరిశోధించునపుడు విష్ణుకుండినృపులకును, వారికిని వైవాహిక సంబంధ బాంధవ్యము లుండుటయు, ఇంకను తత్పూర్వమందు, అనగా రెండవ మూడవ శతాబ్దములందలి అమరావతీ శాసనములలో వారి పూర్వ నివాస స్థానము కృష్ణాతీరమని నిరూపించు వాకాటక శబ్దము వుండుటయు జ్ఞప్తియం దుంచుకొనవలసియుండును.

చిత్రము 104. స్తంభము, బోధికల పరిణామము



(అ) బాదామి



(ఆ) తిరుచిరాపల్లి



(ఇ) మహాబలిపురము

గుహాలయములలో నిర్దిష్ట పద్ధతి ప్రకారము స్తంభములతోను, కుడ్య స్తంభములతోను, గోడల మీద పార్శ్వముల చివరి భాగములందు మలచిన శిల్ప చిత్రములతోను నున్న మధ్య కూటము, దాని నానుకొని యుండు మూడేసి గదులు - ఇవి విష్ణుకుండిరాజుల తొలికాలపు గుహాలయముల యొక్కయు, తిరుచిరాపల్లి, మండగపట్టు, దళవానూరు మొదలైన చోట్లగల తొలుదొల్లిటి పల్లవ గుహాలయముల యొక్కయు సామాన్యలక్షణములు. తరువాతి కాలమున బాదామి చాళుక్య శైలీ ప్రభావముగల ఎల్లోరా గుహాలయములలోని రాష్ట్రకూట దేవాలయములలోను, కల్యాణి చాళుక్యుల నాటి కురువట్టి మున్నగు ప్రదేశములలోని దేవాలయములలోను, హొయిసలులనాటి హళెవీడు, బేలూరు మొదలగు స్థలములందలి దేవాలయములలోను, ఓరుగల్లు పాలంపేట మొదలగు స్థలములందు గల కాకతీయులనాటి దేవాలయములోను గల స్తంభములమీది నాసికా విగ్రహము (పుత్తళిక)లకు బాదామి గుహలలోని స్తంభముల మీద మలచిన నాసికా (ఊతకమ్మి) శిల్ప ప్రతిమలు వరవడులు. అయ్యావళిలోని గజపృష్ఠాకార దుర్గాలయము యొక్క సాలంకృతమైన ఉన్నతాధిష్ఠానము ఇంతకన్న ఉన్నతములు, నిర్దిష్టాకార బంధ సహితములు నగు తరువాతి కాలపు చాళుక్య శైలిని నిర్మితములైన దేవాలయాధిష్ఠానములకు గూడ మాతృక. అలంకరణములో ఈ విధమగు రచనా పద్ధతి కాకతీయాలయములలో నధికముగా నున్నది. కాకతీయ శిల్పులు ప్రతిమలను చెక్కుటయందు బాదామి చాళుక్య శిల్ప సంప్రదాయమును ఎక్కువగా అనుసరించిరి. అర్వాచీన చాళుక్య దేవాలయములకును, వాని పద్ధతిని నిర్మించిన యన్యదేవాలయములకును విశిష్ట లక్షణమైనట్టి దిక్పాలక విగ్రహములతోడను, పద్మాకార శిల్పములతోడను కూడిన సుందరమైన అంతఃపటలమునకు మూలము బాదామిలోని వైష్ణవ గుహాలయము యొక్క అంతఃపటలము మీద చెక్కిన చక్కని చెక్కడపు బొమ్మలే



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఆయ్యావళి ఔత్తరాహ, దాక్షిణాత్య శిల్పపద్ధతులకు కూడలి. గోడలలోని కోష్ఠపంజరము నమూనాలు, స్తంభము, స్తంభములమీది (బోధిక) బోదె, ఊర్ధ్వ రేఖాంచిత విమానాధిష్ఠిత మంటపము, ఆమలక శిఖరము - ఈ సహజ సిద్ధములైన ప్రతికృతులతో ఆదిమ చాళుక్యులు కట్టించిన దేవాలయములు దక్కనునందే కాక ఆంధ్ర దేశముయొక్క తూర్పు భాగమునందుకూడ దేవహర్మ్య వాస్తు పద్ధతి ఏ రూపమున పరిణామము నందెనో చక్కగా విశదీకరింపగలవు.

మొగల్రాజపురము, ఉండవల్లి మొదలగుచోట్ల కొండలలో తొలువబడిన గుహాలయములను బట్టి చూడగా విష్ణుకుండి రాజుల కట్టడపు పద్ధతి మిగిలినవాని కన్న చాల వరకు సాదాగా గన్పట్టుచున్నది. మొగల్రాజపుర మందలి గుహాలయ ముఖ భాగమునందు మధ్య రెండు స్తంభములు, రెండు వైపుల రెండు కుడ్య స్తంభములు, ఆ



చిత్రము 105. (అ) గుహాలయ ముఖభాగము, మొగల్రాజపురము

కుడ్య స్తంభముల నానుకొని చివర భాగముల రెండు ద్వారపాలక విగ్రహములును కలవు (చిత్రము 105. అ). స్తంభములును, కుడ్య స్తంభములును సాదాయైనవే కాని స్థూలములైనవి. ఇవి పాదభాగమునను, అగ్ర భాగమునను నలుచదరముగను, మధ్యభాగమున అష్టభుజాత్మకముగను నున్నవి. ప్రతి బోధికకు రెండు చివరలు గుండ్రనగా నున్నవి. ఎండ గాలి వానల తాకిడికి విశేషముగా అగ్గముకాని వానిని బట్టి చూడగా అవి పట్టెలుగా తీర్చి యుండినట్లు తోచుచున్నవి. సూటిగా స్తంభముల కెగువ తొంగిచూచుచున్నట్లు చెక్కకిన శిరస్సులు గల చైత్య గవాక్షములు గలవు. ఈ చైత్య గవాక్షములకు రెండు ప్రక్కల గల పుష్పమాలికా శిల్పములును, చైత్య గవాక్షములపై నున్న (చిత్రము 105. ఆ) చేటపార రూపములును తరువాతి పల్లవుల యొక్కయు, అర్వాచీన పూర్వ చాళుక్యుల యొక్కయు చైత్య గవాక్షముల ప్రతికృతులకు మాతృక లగుచున్నవి. వీని కెగువ కొన్ని యెడల జంతువుల వరుస యొక్కటి జీవకళ లుట్టిపడునట్లు చెక్కబడి యున్నది. గుహాలయము ప్రవేశింపగనే యొక వరాండిక కానవచ్చును. ఆ వరాండిక కొన్ని చోట్ల స్తంభముల వరుసతోను, కొన్ని చోట్ల స్తంభములు లేకయు నుండును. వరాండికకు వెనుక ఒకేచే గది కాని, మూడేసి గదులు గాని గలిగిన గర్భ గృహము కలదు.

ఉండవల్లి గుహాలయములు అంతస్తులు గలవి. ఈ గుహాలలోని స్తంభములు సమాన సంఖ్యగకాని, అంత కెక్కువగగాని యుండును. ఒక యంతస్తునుండి మరియొక యంతస్తుకు పోవుటకు సోపానములు కలవు. రెండవ యంతస్తులోని ప్రతి గుహా ప్రవేశమును సంరక్షించుచున్నట్లు పరుండిన విధమున చెక్కియున్న సింహ ప్రతిమలు కలవు. రెండవ అంతస్తు కప్పునకు ముందు భాగమున శిల్ప చిత్రములతోడి మేలుకట్టులు కలవు. మూడవ యంతస్తులో కొద్దిపాటి యుబ్బెత్తుగ చెక్కిన బక్కపలుచని కుడ్య స్తంభ



(ఆ) గుహాలయ ముఖభాగము, దళవానూరు

ములు కలవు. ఇవి మొదటి యంతస్తులోని స్థూలములైన స్తంభములకు భిన్నముగ నుండి మొగల్రాజపురములోని వానిని బోలియున్నవి. అడుగు అంతస్తులోని స్తంభములు ఇంకను స్థూలముగను, సాదాగను ఉన్నవి.

క్రీస్తుశక మేడవ శతాబ్దమునందు కుబ్జ విష్ణువర్ధనుడు తూర్పు చాళుక్యుల అధికారమును వేంగి రాజధానిగా గల ఆంధ్ర దేశమున స్థాపించెను. వారి ముఖ్య పట్టణములలో విజయవాడ ఒకటి. అందు ఆదిమ పూర్వ చాళుక్యుల నాటి నిర్మాణ వాస్తు అవశేషము లనేక మింకను కానవచ్చుచున్నవి. మదరాసు ప్రభుత్వ వస్తు ప్రదర్శన శాలలో భద్రపరుపబడియుండు బృహత్పరిమాణము గల ద్వారపాలక విగ్రహ ద్వయమును బట్టి చూడగా ప్రాచీనతమ పూర్వ చాళుక్య దేవాలయములు పరిమాణమున నెంత గొప్పవై యుండునో తెలియగలదు. పూర్వ చాళుక్యుల కాలమునాటి యీ విగ్రహములు వారి జన్మస్థానమగు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



బాదామియందలి శిల్పముల వైఖరిని చెక్కబడి యున్నవి. దీనినిబట్టి చూచిన వారి వాస్తు నిర్మాణములు ప్రథమ దశయందిట్టివే యై యుండునని తోచుచున్నది.

విజయవాడయందలి జమ్మిదొడ్డిలో చక్కని చెక్కడపు పనితో నున్న మంటప స్తంభ చూళికలనుబట్టి తూర్పు చాళుక్యుల పరిపాలనారంభ శతాబ్దములలో వాడుకయందుండిన వాస్తు పద్ధతి ఎట్టిదో చక్కగా నూహించుకొన వచ్చును. ఈ చూళికలలో ముందుకు పొడుచుకొని వచ్చిన మధ్య భాగమున కిరు ప్రక్కల మూలలకడ నుండు జీవ కళ నిండారిన ఆసీన సింహములు కావేరి పాకమున బాదామి చాళుక్య, రాష్ట్రకూట శిల్ప శైలీ చ్ఛాయలుగల సింహములనే పోలి యున్నవి. కావేరిపాకమునందు బోదె (బోధిక)ల మీద చైతన్య ముట్టిపడునట్లు చెక్కిన నర్తకీ, యోధ ప్రతిమ లతిమనోహరములైనవి.

ఈ స్తంభముల తరువాతి పరిణామదశ దాక్షారామము నందును, సామర్లకోట భీమవరము నందును గల భీమేశ్వరాలయములలో కోలాటము వేయుచుండు నర్తకీ ప్రతిమల వరుసలు గల స్తంభములయందు చూడ వచ్చును. సంగీతము, నృత్యము మున్నగు లలిత కళలమీద ఆ కాలమున జనుల కుండిన ఆదరమును సువ్యక్తము చేయునట్టి ఇట్టి శిల్ప కల్పనము తరువాతి శతాబ్దులలో ఇంత కంటె నధికమగు ప్రజాదరణకు పాత్రమై యుండుట విజయనగర శిల్ప చిత్ర రచనమువలన విదితమగుచున్నది.

దాక్షారామములోని మనోహరములైన సురసుందరీ ప్రతిమలు ప్రాచీన బాదామి చాళుక్య దేవాలయములలోని వానివలె నున్నను అంత ప్రస్ఫుటముగా లేవు. చాళుక్య శిల్పములోని ఆకర్షకమైన ఈ ప్రతిమల పరిణామము నందలి ప్రారంభదశ బాదామి గుహలలో చూడవచ్చును. ఆ సంప్రదాయము అవిచ్ఛిన్నముగా శతాబ్దుల తరబడి వచ్చుచుండినది. ఈ రకపు ప్రతిమలలో చాల చక్కనివి కొన్ని కురువట్టి మొదలైన స్థలములలోని అర్వాచీన చాళుక్య దేవాలయములలో నున్నవి. చాళుక్య సంప్రదాయము ననుసరించి బేలూరు, హళెబీడులందలి హొయిసల దేవాలయములలో చెక్కిన యీ ప్రతిమలు అచ్చటి వాస్తునిర్మాణ విధానమునకు వన్నె తెచ్చుచున్నవి. దాక్షారామములో ఈ లక్షణ మంత ప్రధానముగ లేకపోయినను తూర్పు చాళుక్య వాస్తు, శిల్ప విధానములు తమ జన్మస్థానమగు బాదామి చాళుక్య రాజ్యమందలి వానినుండి యుత్పన్నమయినవని చూపుటకు చాలియున్నది.

సామర్లకోటకును, రాజమహేంద్రవరమునకును నడుమ నున్న బిక్కవోలునందు చాలముఖ్యమైన ప్రాచీన చాళుక్య దేవాలయము లున్నవి. ఈ దేవాలయములు దాక్షారామ దేవాలయమున కంటె ఇంచుక ప్రాచీనములు. కొంచె మించుమించుగా సుస్థితియందున్న ఈ దేవాలయముల వలన తూర్పు చాళుక్య దేవహర్మ్య నిర్మాణ పద్ధతి చక్కగా విదితమగుచున్నది.

బిక్కవోలు దేవాలయములలో నొకటి గ్రామ సమీపపు పొలములో నున్నది. అది తక్కినవానికంటె పెద్దది. కాని మిగిలిన వానిలోని శిల్పపద్ధతు లన్నియు పూర్తిగా కాన వచ్చుచున్నను ఇందులో వానిలో నున్నంతగా అలంకరణము లేదు. ఇందు ప్రతిమాచిత్రణము పొత్తిగా లేదు. గోడలలోని కోష్ఠపంజరములు శుద్ధశూన్యములై యున్నవి. ద్వారబంధపు నిలువు కమ్ములమీది ద్వారపాలకుల విగ్రహములును, మనూరకము (లింటెల్ - గొడుగుబల్ల) నడుమ నుండు లక్ష్మీప్రతిమయు మాత్రమే ఇందు కాన వచ్చు ప్రతిమాశిల్పములు. కాని, ఆలయ నిర్మాణ విధాన దృష్టిని పరికించిన నిందు కొన్ని విశేషాంశములు కాన వచ్చు చున్నవి. పూర్వ చాళుక్య దేవాలయములు దాక్షిణాత్య సంప్రదాయ ప్రేరితములై ద్రావిడ పద్ధతి ననుసరించి కట్టబడినవని తెలియనగుచున్నది. ఇచ్చటి విమానములు పల్లవ, బాదామిచాళుక్య రాజ్యములు రెంటియందును కానవచ్చు దేవాలయ విమానములను స్మరణకు తెచ్చుచున్నవి. ఈ పల్లవ దేవాలయ వాస్తు రచనా పద్ధతియే పట్టదకల్లులోనివానికిని, ఎల్లోరాలోని రాష్ట్రకూట నిర్మాణములకును మూలప్రకృతి.

ఒక విశిష్ట పద్ధతిలో ఇచటి ద్వారపాలకులలో ఒకడు పృష్ఠస్వస్తిక రూపమున మెలిదిరిగియుండు తుంటితో నున్నాడు. రెండవవాడు పెద్ద గద నూనుకొని యున్న ఇతని తోడివానివలె సుఖముగా నిలుచుండి ఒక కాలిని రెండవదాని కడ్డముగా మడిచిపెట్టుకొని యున్నాడు. ప్రతివాని ప్రక్కను ఒక్కొక్క చేటిక కలదు. వారిలో నొకతె యొక ప్రక్కకు తిరిగియున్నది. ఈ సంప్రదాయము మహాబలిపురమునందు అనేక ప్రతిమలలో కాన వచ్చుచున్నది. ఇట్లు చిత్రించుట వలన అమోఘమైన కళా ప్రయోజన మేర్పడుచున్నది.

దీని కావల కొంతదూరమున, బహుళ గ్రామమునకు దగ్గరగా మిక్కిలి శిథిలావస్థయందుండు మరియొక దేవాలయము కలదు. ఎట్టి చెక్కడములు లేని పైని చెప్పిన దేవాలయమువలె కాక ఇందలి శిల్పము సంపన్నమైనది. ఇచటి చిత్రములు ఆ కాలపు వాస్తు, శిల్ప కల్పనల పరిశీలనమునకు మిక్కిలి యుపయుక్తములైన సాధనములుగా నున్నవి. పై భాగమున మకరతోరణ శిల్ప చిత్రములు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/





చిత్రము 1.
గుహాలయ ముఖభాగము, గుంటుపల్లి



చిత్రము 2.
గుహాలయ ముఖభా ము, మొగల్రాజపురము



చిత్రము 3.
నరసింహమూర్తి, ఉండవల్లి



చిత్రము 4.
త్రివిక్రమావతారము, ఉండవల్లి



చిత్రము 5.
గోవర్ధనధారి-కృష్ణుడు, ఉండవల్లి

http://sanskritcentral.com/

http://teluguthesis.com/





చిత్రము 1.
స్తూపశిలాఫలకము, అమరావతి



చిత్రము 2.
యక్షవిగ్రహము, అమరావతి



చిత్రము 3.
మాయాదేవిని శుద్ధోదనుడు
సందర్శింప వచ్చుట, అమరావతి



చిత్రము 4
వృత్తచైత్యము చుట్టునున్న విహారము.
అమరావతి



చిత్రము 5.
తూర్పుచాళుక్య దేవాలయము
(పొలములోనిది). బిక్కవోలు



చిత్రము 6.
దేవాలయద్వారము, బిక్కవోలు



చిత్రము 7.
నటరాజమూర్తి, కోష్ఠపంజరము.



చిత్రము 8
గోలింగేశ్వరాలయము, గోముఖము,

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కలిగిన మూడు కోష్ఠ పంజరము లుండుట పైని పేర్కొనిన దేవాలయములలో కానరాని విశేష లక్షణము. ఆ పంజరములలో దేవతా విగ్రహము లున్నవి. పై వరుసమీద పెక్కు ప్రత్యేక ప్రతిమా రూపములు, మిథున ప్రతిమలు కలవు. ఈ దేవాలయ ద్వారబంధము అప్రతిమ మైనది ; ఏలనగా — ఈ ద్వారబంధమునందువలె గంగా, యమునా నదీ దేవతా చిత్రములు గల ద్వారబంధములు ఈ ప్రాంతమునందలి యప్పటి దేవాలయములయం దెచటను కానరావు. ద్వార పాలికలుగా గంగా, యమునా నదీ దేవతల ప్రతిమ లుంచుట గుప్తరాజుల దేవాలయములలో సర్వ సాధారణమైన పద్ధతి. బాదామి పశ్చిమ చాళుక్యరాజు విక్రమాదిత్యుడు తన కుమారుడైన విజయాదిత్యుని ఉత్తర దేశముపై దండెత్తి పంపగా నతడు విజయము చేకొని తిరిగివచ్చుచు విజయసూచకముగా గంగా, యమునా అంతర్వేదినుండి సామ్రాజ్యచిహ్నమైన పాళీధ్వజముతో పాటు గంగా, యమునా చిహ్నములను తీసికొనివచ్చె ననుట ప్రసిద్ధమే. తరువాత ఇట్టి ప్రాచీన బాదామి చాళుక్యరాజుల రాజ్యము నాక్రమించిన రాష్ట్రకూటులకు సంక్రమించినవి. తూర్పు చాళుక్యులకును, రాష్ట్రకూటులకును నిరంతరము యుద్ధములు సాగుచుండినవి. రాష్ట్రకూట ప్రభువైన వల్లభుడు తూర్పు చాళుక్య వంశజుడైన గుణగవిజయాదిత్యునిచే పరాజితుడై అతని శరణు జొచ్చెను. తత్కారణమున గుణగ విజయాదిత్యుడు త్రికళింగముతోడి దక్షిణాపథ మంతటికిని అధిపతి యాయెననియు, పూర్వము బాదామి చాళుక్యులకడనుండి రాష్ట్రకూటు లపహరించి స్వీకరించిన గంగా, యమునా, పాళీధ్వజాది సామ్రాజ్య చిహ్నముల నతడు నాడికొనె ననియు అతని శాసనములందు చెప్పబడియున్నది. గుణగ విజయాదిత్యుని సాతలూరి శాసనమునందు వర్ణింపబడియుండు నీ విషయము ఈదేవాలయ వాస్తువునందు ప్రవేశపెట్టబడిన గంగా, యమునాది శిల్ప చిత్రములవలన రుజువగుచున్నది. కావున నీ దేవాలయ మా రాజుకాలము నాటి దని చెప్పవచ్చును. ఈ దేవాలయ విమానములమీద మీది శ్రేణులలో చెక్కబడియుండు వినాయక ప్రతిమలకు చేతులు రెండే కలవు. ఇట్లు వినాయక విగ్రహమునకు రెండు చేతు లుండుట పూర్వ, పశ్చిమ చాళుక్యరాజ్యము లందలి గణేశవిగ్రహములలో కానవచ్చుటయె కాక గుణగ విజయాదిత్యుని సాతలూరి శాసనముయొక్క ముద్రిక మీద కూడ కనబడుచున్నది. ఈ ముద్రికమీది మకర ప్రతిమలు సాక్షాత్తుగా ఈ దేవాలయపు తోరణముమీదను, గుర్రపు నాడాలవలె వంపుగానున్న పంజరముల కలంకారముగను చెక్కబడి యున్న వానిని పోలియున్నవి. పంజరములయొక్క వంపుమీద పారవంటి భాగమునకు (షొవెల్ హెడ్) రెండు ప్రక్కలను చెక్కియుండు మకర శిరములు ఈ కాలపు తూర్పు చాళుక్యుల దేవాలయముల లక్షణ మగుట గమనింప దగిన విషయము.

ఈ బిక్కవోలికి బయట కొంత దూరమున పైని వర్ణించిన లక్షణములకు సన్నిహితమైనట్టి యొక దేవాలయ మున్నది. దీనికి మూడు ప్రక్కలను నడిమి కోష్ఠపంజరములకు ఇటువంటి మకర చిత్రణ మున్నది. ఈ యాలయ శిఖరము విరిగి నష్టమై పోయినను తూర్పు చాళుక్యుల ఆలయ నిర్మాణ పద్ధతుల పరిశీలనకు కావలసిన వస్తు సామగ్రి యిందు పుష్కలముగా నున్నది. ప్రతిమ లుంచు పంజరములకు పైన చిత్రింపబడిన తోరణాలంకరణము కాంచీపుర కైలాసనాథాలయములో కానవచ్చు దాక్షిణాత్య రీతిని పోలియున్నది ; ఎట్లన రెండు పైపుల మకరము యొక్క పుచ్ఛము పూలతీగెవలె చిత్రింపబడినది. మకరము మీద కూర్చుండి యున్నట్లుగా దేవగణ ప్రతిమ లున్నవి. ఒక మకరము నోటినుండి మరియొక మకరము నోటివరకు పంజరమునకు ధనురాకారపు (కమాను) తీర్పు తీర్చబడి యున్నది. మకరముల మెలితిరిగిన నాసాగ్రము దగ్గర వెనుక కాళ్లమీద నిలుచున్నట్లున్న సింహ ప్రతిమ లున్నవి. ఈ పంజరములమీది మసూరకముల కెగువ మధ్య భాగమున ముందుకు పొడుచుకొని వచ్చిన తేపకముగూడ విశిష్ట లక్షణములలో నొకటి. ఈ వివరము లన్నియు కాంచీపురమునందలి రాజసింహుని దేవాలయములోని లక్షణములను, చాళుక్యుల తొలి ప్రదేశమైన పట్టదకల్లు దేవాలయములలోని లక్షణములను స్ఫురింప జేయుచున్నవి. కాని కన్నడ, తమిళ దేశములలోని ఇట్టివాని కన్న ఈ పంజరములలో మకరచిత్రణము చాల ఎక్కువ. అందువలన దీని కొక విశిష్టత యేర్పడు చున్నది.

ఆదిమ పల్లవులయొక్కయు, చాళుక్యులయొక్కయు దేవాలయములలోని గూండ్లయందువలె తొంగిచూచుచున్నట్లున్న మనుష్యుల తలలు మాత్రముగాక వీనియందు పూర్తి విగ్రహము లున్నవి. ఇచ్చటి వ్యాళరూపముల యూర్ధ్వ భాగముల వరుసయు దక్షిణదేశమందలి శిల్పకల్పనయొక్క విశిష్టలక్షణమే. ఇచ్చట ఒరిస్సా దేవాలయములలోని వానిని బోలిన మిథునశిల్పచిత్రము ఇచ్చటి విమానముయొక్క మీది వరుసలయం దుండుట ముఖ్యముగ జ్ఞప్తియం దుంచుకొనదగిన విషయము. ఇందులకు కారణము తూర్పు చాళుక్యులకును, కళింగులకును మండిన చారిత్రక సంబంధ మగుట మన మెరింగినదే. గుణగ విజయాదిత్యుడు కళింగమునకు



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కూడ అధిపతి యగుటయు, ఇచ్చటి విమానము మీది పరుపలలోని రెండు చేతుల గణేశవిగ్రహమునకును పాతబూరి కావన ముద్రికమీది గణేశ విగ్రహమునకును రెండే చేతు లుండుటయు ప్రధానముగ జ్ఞప్తిలో నుంచదగిన యంశము. మహాబలిపురమున గానవచ్చునట్లు ఈ కట్టడము యొక్క పంజరముల యెగువభాగమున కొండిగలమీద బాతులవరుస శిల్పకల్పనగా అనువర్తింపబడి యున్నది. ఇందు ఒరిస్సాతోడి సంసర్గమున సంప్రాప్తమయిన ఔత్తరాహ దేవాలయ శిల్ప లక్షణములు పెక్కు చోట్ల కానవచ్చుచున్నను దేవాలయము మాత్రము దాక్షిణాత్య పద్ధతి ననుసరించి కట్టబడియున్నది.

ఈ గ్రామమునందే గుమిగా మూడు శివాలయము లున్నవి. వీనిలో నడుమనున్న గోలింగేశ్వర దేవాలయము శ్రేష్ఠమయినది. తక్కినవి రాజరాజ, చంద్రశేఖర దేవాలయములు. ఈ మూడును ఏకకాలమునకు చెందినవి. బహుశః గుణగ విజయాదిత్యుని నాటివికావి, ఇంచుక తరువాతివి కాని కావచ్చును. నడిమి గోలింగేశ్వరుని దేవాలయములో శిలావిగ్రహములు సమృద్ధిగా నున్నవి. చుట్టును కోష్ఠపంజరములలోను, కుడ్య స్తంభముల నడుమను సూర్యుడు, విష్ణువు, వాయువు, అగ్ని మొదలగు దేవతల ప్రతిమ లనేకము కలవు. గోడలయందలి పంజరములలోను, గూండ్లలోను, కుడ్యస్తంభములు మొదలైన వానితోను కూడిన ఈ దేవాలయముల రచనా విధానము గోలింగేశ్వర దేవాలయము యొక్క ఒక పార్శ్వమును పరికించి చూచిన విదితము కాగలదు. గూండ్లలోని మిథునముల, సురసుందరుల కొన్ని ప్రతిమలు గోలింగేశ్వర దేవాలయ విమానముమీది ప్రతిమలలో ముప్పాతిక పాలు కనబడు దానిని పోలినవి కళింగ, ఖజురాహో శిల్ప చిత్రములను జ్ఞప్తికి తెచ్చుచుండును. పంజరముల మీది మకర తోరణపు వంపులు ఈ దేవాలయములలో నెల్ల యెడల చాల చక్కగా తీర్పబడియున్నవి. ఇవి కాంచీపురములోని కైలాస నాథాలయమువంటి ప్రాచీన పల్లవ దేవాలయములలోని ఇట్టి శిల్పములతో పోల్పదగియున్నవి. మకర తోరణము అమరావతీ స్తూపపు ప్రథమ దశనుండి ఎట్లు పరిణామము నందినదో ఇంతకు ముందే వివరింపబడినది. ఈ పల్లవులనాటి కోష్ఠపంజ రోపరిభాగమును తూర్పు చాళుక్యుల దేవాలయములలోని దానితో, ముఖ్యముగా మకరము యొక్క పుష్పలతా పుచ్ఛము, దాని తెరచు కొన్న నోరు, పైకి మెలితిరిగిన దానిముట్టె, దాని వీపుమీది మరగుజ్జు రౌతు, దాని నోటినుండి వెలువడు కమాను (వృత్త ఖండము); ముట్టెలకడ నురుకున ట్లుండు సింహములు, ముట్టె నడుమ గుబ్బవంటి క్షేపకము(ప్రొజెక్షన్)లు మొదలయిన వానితో పోల్చిచూచిన వీనికిని, వానికిని గల- సన్నిహితసామ్యము విదితము కాగలదు.

గోదావరీ తీరమునందలి దాక్షారామమున చాళుక్య భీమరాజు తన పేర భీమేశ్వరమను సుప్రసిద్ధ శివాలయమును నిర్మించెను. ఇచ్చటను, సామర్లకోట సమీపమందలి భీమవర మనుచోట నితడే కట్టించిన భీమేశ్వరమను శివాలయమునందును దేవాలయ సూక్ష్మప్రతిరూప మొకటి కలదు. నిర్మితమైన పిమ్మట దేవాలయ మెట్లుండునో రాజునకు చూపుటకు స్థపతి ఈ సూక్ష్మప్రతిరూపమును తయారు చేసియుండును. ఇది కుట్టనీ మతమునందలి

'త్రిభువన పురనిష్పాదన కౌశల మివ
పృచ్ఛతో విరించస్య;
దర్శయితుం నిజశిల్పం వర్ణక మివ
విశ్వకర్మణా రచితమ్'

అను శ్లోకములో చెప్పబడిన వర్ణక మను దానికి ఇంచు మించుగ సరిపోవుచున్నది. ఇది కట్టబోవు పెద్ద దేవాలయ్యమునకు ముందు తయారు చేసిన నమూనా.

చాళుక్యుల ఆదిమనివాస స్థానమున ప్రారంభమై బాదామి చాళుక్యుల కాలమునుండి దాదాపు మధ్య యుగము చాల గడచువరకు, అనగా కురువట్టి మొదలైన స్థలములందలి అర్వాచీన పశ్చిమ చాళుక్యుల దేవాలయములలోను, బేలూరు హాళెవీడు మొదలయిన స్థలములలోని హొయిసల దేవాలయములలోను, పాలంపేట వరంగల్లు మొదలైన స్థలములలోని కాకతీయాలయములలోను విస్తారముగా కానవచ్చు సురసుందరీ నాసికా (ఊత కమ్మి) ప్రతిమా శిల్పసంప్రదాయము తూర్పు చాళుక్య రాజ్యమున విస్మృతము కాలేదని దాక్షారామములోని ఇట్టి ప్రతిమలవలన విదితమగు చున్నది. ఈ దేవాలయములను ప్రవేశింపగనే కానవచ్చు చిన్న నాసికా ప్రతిమలు చాల అరిగిపోయి రూపు చెడియుండినను ఈ సంప్రదాయ మెట్లు ఆచరణయం దుండెనో తెలుపుచున్నవి. ఇచ్చట సర్వసామాన్యముగా దాక్షిణాత్య దేవాలయముల యందువలె వసంతోత్సవ సమయమునందు తెప్పతిరునాళ్లకై కోనేటి నడుమ నిర్మింప బడిన మండప ముండుటవలన ఈ దేవాలయముకూడ ఆ దేవాలయముల తరగతికి చెందు చున్నది.

సామర్లకోట భీమేశ్వరాలయములోని నంది, మండప స్తంభములమీద చెక్కబడిన గాయక నర్తకీ శిల్పప్రతిమలు ఆ కాలపు తూర్పు చాళుక్య శిల్పకళకు ముఖ్యలక్షణములు. ఇచట హల్లీసకమను దేశిలాస్యము (కోలాటము) చూపబడినది. ఇందు ఆటకత్తెల గుములు జతలు జతలుగా చీలి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/





చిత్రము సహస్రస్తంభ దేవాలయము. హనుమకొండ



చిత్రము 2. పద్మప్రాసాదము, హంపి



చిత్రము 3. శిలా రథము, హంపి



చిత్రము 4. శిలారథము, చింతలరాయాలయము, తాడిపత్రి

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ఆటయొక్క లయ కనుగుణముగా కోలాటపు కోలలతో తాళము వేయుదురు. ఈ సంప్రదాయ మప్పటినుండియు విజయనగరకాలము వరకును అవిచ్ఛిన్నముగను, పుష్కలముగను వాడుకయం దుండెను.

చాళుక్యులకు తరువాత ఆంధ్రదేశమందు రాజ్యము చేసిన కాకతీయులు పూర్వ సంప్రదాయముల నెట్లనుసరించినది తెలుపుటకు వారు నిర్మించిన పెక్కు దేవాలయములు కలవు. ఉన్నతాధిష్ఠానములు, చక్కగా నును పెక్కించిన శిల్పాలంకృత స్తంభములు, చక్కని చెక్కడములు గల లోకప్పులు, జాలకర్మాలంకృతములైన పిట్టగోడలతోడి మంటపములు వాని విశిష్టలక్షణములు. కాకతీయ దేవహర్మ్య వాస్తువందలి తోరణశిల్ప మెక్కువగా వాయవ్యదిశ యందలి చాళుక్య సంప్రదాయమును పోలి యున్నది. ఓరుగంటిలో దొరకిన తోరణములు బరోడాసంస్థానమందలి దభోయిలోని తోరణములను జ్ఞప్తికి దెచ్చును. సున్నితమైన అంగసౌష్ఠవము గల నర్తకీ గాయక నాయికా (ఊత కమ్మి) విగ్రహములు అర్వాచీన పశ్చిమ చాళుక్య, హొయిసల దేవాలయములలోని అట్టి ప్రతిమలను పోలి యున్నను విశిష్ట లక్షణములు గలిగి యున్నవి. హైదరాబాదు ప్రదర్శనశాలలో భద్రపరుపబడిన కొన్ని శిల్పచిత్ర శిలాఖండికలను బట్టి చూడగా కాకతీయ దేవాలయముల లోకప్పు కూడ అలంకార భూయిష్ఠమయినదని తెలియవచ్చుచున్నది. చతురస్రములగు స్తంభభాగముల నలుమొగములనున్న చెక్కడపు పనికి అమృతమథన, రామాయణ, మహాభారత గాథలు శిల్పకల్పనకభిమత వస్తువు లయినవి. పాలంపేట, ఓరుగల్లు, హనుమకొండ, త్రిపురాంతకము మొదలయినచోట్ల సుందరములైన కాకతీయ దేవాలయము లున్నవి. మాచెర్ల దేవాలయముకూడ ఈ కాలము నాటిదే.

విజయనగర చక్రవర్తులు సామ్రాజ్య ప్రారంభ దశకములలో చాళుక్య సంప్రదాయముల ననుసరించినను తరువాతికాలపు కట్టడములలో ఆంధ్ర, ద్రావిడ, కర్ణాటక శిల్ప సంప్రదాయములను గ్రహించుచు వచ్చిరి. వారి సామ్రాజ్యము బహుళముగ విస్తరించినందున ఇది తప్పనిసరియైనది. శృంగేరిలోని విద్యాశంకర దేవాలయమును, కడపజిల్లాలోని తాడిపత్రి దగ్గర నదీతీరమునందలి దేవాలయమునుకూడ చాళుక్యశైలీ ప్రభావము గల విజయనగర నిర్మాణముల ప్రారంభదశను తెలుపును. కాని కాలము గడచినకొలదిని విజయనగర నిర్మాణములలో ప్రధానముగ అధికాధికముగ ద్రావిడరీతి అనుసరింపబడుచు వచ్చినది. ఇందువల్ల చిదంబరము, తిరువణ్ణామలలలోవలె గొప్ప గోపురములు, మార్లకొలది స్తంభములుగల మండపములు ఎక్కువైనవి. విజయనగర రాజధానియైన హంపిలో కృష్ణదేవరాయలు కట్టిన వన్నియు ఈ రీతికి చెందినవే. విట్ఠల దేవాలయములోని స్తంభమంటపము చక్కగా నిర్మింపబడినది. అచ్చటి ఏ కాండపు రాతి రథము తాడిపత్రిలోని ఇట్టి రథమునే పోలియున్నది. ఈ కాలమునకే చెందిన వేలూరిలోని కల్యాణమండపము విజయనగరాధీశ్వరుల కాలపు నిర్మాణములలో చాల అందమైనది. దక్షిణదేశమందలి గొప్ప గొప్ప గోపురములలో ననేకములు విజయనగర చక్రవర్తులలో చాల ప్రసిద్ధుడైన కృష్ణదేవరాయలు నిర్మించినవే. వాని కిప్పటికిని రాయల గోపురము లనియే పేరు. ఈ కాలముననే యనేక ప్రాచీన దేవాలయములకు గొప్ప గోపురములతో కూడ బహు ప్రాంగణ, ప్రాకారములు చేర్పబడినవి. శ్రీరంగమునందు అసంపూర్ణ గోపురము ఏడవదగు బహిః ప్రాకారమున నున్నది.

అదృష్టవశమున విజయనగర చక్రవర్తుల యొక్కయు, నాయక రాజుల యొక్కయు రాచనగళ్లు హంపి, చంద్రగిరి, మధుర, తంజావూరు మొదలయిన చోట్ల నిలిచి యున్నవి. వీనివలన వాటి మహోన్నత రాజప్రాసాద నిర్మాణము మనకు కొంతకు గొంత తెలియు చున్నది. హంపిలో హిందూ మహమ్మదీయ శైలీ సమ్మేళనము రాణుల స్నానమందిర నిర్మాణములలో కనబడుచున్నది. 'లోటస్ మహల్' అను పద్మ మందిరము పూర్తిగా హిందూ భావకల్పనమే. తంజావూరులోని 'మహలు' దేవ ప్రాసాద విమాన వాస్తువు ననుసరించి కట్టబడినది. ప్రాసాద మనగా దేవాలయమునకును, రాచనగరికిని గూడ అర్థము. కావుననే చంద్రగిరి 'మహలు' విమానత్రికమును పోలియున్నది.

పి. శి.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/

# ఆంధ్ర శిల్ప కళా పరిణామము

శిల్ప సృష్టియందలి వివిధ సంప్రదాయముల విశిష్టతను వివరించుచు కళాతత్త్వ విదులు పాశ్చాత్య శిల్పము మానవునికి దైవత్వ మాపాదింప ప్రయత్నించు ననియు, ప్రాచ్య శిల్పము భగవంతునే భూలోకమునకు రావింప సంకల్పించు ననియు నందురు. యవన, భారతీయ శిల్పములు ఈ సిద్ధాంతమున కుదాహరణములు. యవన శిల్పి రచించిన జూస్ విగ్రహము కనులార గాంచిన సజీవుడు, దృఢగాత్రుడు, స్ఫురద్రూపి యైన యవన పురుషునికి దివ్యాలంకారము లమర్చి, ప్రతిగా పాలరాతితో చెక్కిన దేవతా స్వరూపము. త్రిమూర్తి విగ్రహము భారతీయ శిల్పి మనోనేత్రముతో కాంచిన సృష్టి, స్థితి, లయకారుల విభూతులకు ప్రతిగా గండశిలలో మలచిన దేవతా విగ్రహము. వీ రిరువురును పనితనములో తుల్యులే. దృక్పథములో మాత్రము వారికి గల భేదము అపారము.

వాస్తవిక జగత్తునందు బంధితుడైనవాడు పాశ్చాత్య శిల్పి; భావ ప్రపంచమందు విహరించునట్టి వాడు ప్రాచ్య శిల్పి. ప్రకృతియే యవన శిల్పికి ప్రమాణమును, పరమావధియు కూడ; ప్రకృతి కతీతుడైన భారతీయ శిల్పికి శిల్పశాస్త్ర సూత్రములు శాసనములు; దైవారాధన లక్ష్యము. యవనుడు సృష్టించిన ప్రేమస్వరూపిణి అఫ్రొడైట్ విగ్రహమునందు సహజత్వమును, సర్వాంగ సౌందర్యమును పరాకాష్ఠ నందినవి. భారతీయుడు తయారు చేసిన మహిషాసురమర్దని విగ్రహమునందు ఆదిశక్తియొక్క లీలయు, మహిమయు మూర్తీభవించినవి.

కనుక ఆధ్యాత్మికమును, శాస్త్ర సమ్మతమును అగుటయే భారతీయ శిల్పముయొక్క విశిష్టత యనుట స్పష్టము. ఈ విశిష్టతను పుణికి పుచ్చుకొన్న ఆంధ్ర శిల్పము భారతీయ శిల్పములో ఒక సరియైన అంతర్భాగము.

భారతీయ శిల్ప పరిణామములో మూడు దశ లుండెనని శిల్ప శాస్త్రజ్ఞుల అభిప్రాయము. వైదిక, పౌరాణిక యుగములలో విలసిల్లిన ప్రథమ దశను దైవికమని నిర్వచింపవచ్చును. అపుడు శిల్ప సృష్టి యంతయును స్వర్గ సంబంధి, అనగా దేవలోకమునకు సంబంధించినది. ముమ్మూర్తులు, ముగురమ్మలు, సురగణములు, దశావతారములు, కృష్ణ లీలలు - ఇవియే ప్రతిమాకారునికి వస్తువులు. బౌద్ధ యుగమున ప్రారంభమైనది పారమార్థిక మగు లౌకిక దశ. శిల్పి మర్త్యలోకమునకు దిగినను శిల్ప ప్రయోజనము ఇంకను దైవారాధనయే. అతడింకను బుద్ధ, మైత్రేయ, బోధిసత్త్వ, ప్రజ్ఞాపారమితాది విగ్రహములను మలచుటలోనే నిమగ్నుడై యుండెను. భౌతికమును బౌద్ధమును విశ్వమంతటను వ్యాపింపజేసిన అశోక చక్రవర్తి కొక్క శిలాప్రతిమయును ప్రతిష్ఠితము కాలేదు. ముసల్మాను, మొగలాయి యుగములలో సంభవించినది సామాజిక దశ. దేవళములను వదలి శిల్పము రాజ ప్రాసాదములను పట్టెను. అంతవరకును శిల్పము దేవాలయ వాస్తువున కాంగికముగాను, అలంకారికముగాను ఉండెను. ఆ నాటి నుండి ఈ రెండు కళలును విడిపడ నారంభించెను. ఇది శిల్పమునకు విమోచనమో, విచ్ఛిన్నమో తెలియ రాకున్నది. మతావేశముతోపాటు శిల్ప ప్రతిభయు అంతరించినదేమో! ఆధునిక యుగమున అనిర్వచనీయమగు మిశ్రమావస్థలో పడి సాగిపోవుచున్నదేమో భారతీయ శిల్పము!

ఈ త్రిదశా వాదమున కొంత యతిశయోక్తి యున్నను, అది సత్యదూరము కాదని చెప్పుట కాధార మున్నది. ఆంధ్ర శిల్పమునందు ప్రథమదశ అస్పష్టము; రెండు మూడు దశలును, ఈ నాటి మిశ్రమావస్థయు పరిస్ఫుటముగా కన్పించుచునే యున్నవి. స్థూలదృష్టికి ఆంధ్రమున బౌద్ధ మవతరించుటయును, శిల్పము తొలకరించుటయును ఒకేకాలమందు జరిగినట్లు కన్పించును. ఆంధ్ర కళా కృషిని బౌద్ధకళాచ్ఛాయలు ఈ నాటికిని ఆవరించియే యున్నవి.

శాతవాహన, ఇక్ష్వాకు, విష్ణుకుండి, పల్లవ, వేంగి చాళుక్య, కాకతీయ, విజయనగర యుగములలో తెలుగు దేశమున వెలసిన శిల్ప మంతయు ఆంధ్రశిల్పమని నిర్వచించినచో ప్రాజ్ఞుల కసమ్మతము కానేరదు. ఆయా స్వర్ణ యుగములలో ఆంధ్రుల చెక్కడపు పనులు విరియబూచెను. కాలవశమున పరమతస్థుల అసహనమువలన, మూర్ఖుల అజాగ్రత్తవలన వానిలో అధికభాగము నశింపగా రాలి, చెదిరి, శిథిలములై మిగిలియున్న ముచ్చు ముక్కలు పూర్వపు టాంధ్ర శిల్పము ఎంత సుందరముగా, ఎంత రసోజ్జ్వలముగా నుండెనో ఊహించుట కాధారమగుచున్నవి. వానిలో సాంచీ స్తూప తోరణములు, అమరావతిలోని చలువరాతి చెక్కడములు, మామల్లపురపు అర్జునుని తపస్సు, లేపాక్షి బసవయ్య, హంపీ ఉగ్రనరసింహమూర్తి మొదలైనవి స్మరణీయములు.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



భారతదేశమున వివిధములైన శిల్ప సంప్రదాయములు తక్షశిల, మధుర, సారనాథము, అమరావతి, మామల్ల పురము, భువనేశ్వరము, తంజావూరు, విజయనగరము, హాళెబీడు మొదలైన క్షేత్రములలో విలసిల్లెను. అమరావతి సంప్రదాయము ఆంధ్ర శిల్పమునకు నిదర్శనమును, ఆదర్శమునుగూడ ననుట నిర్వివాదాంశము. భారతీయ శిల్ప ప్రాభవము మిన్ను ముట్టినది - సాతవాహనుల కాలముననా, గుప్తయుగముననా అను విషయమున మాత్రము విన్సెంట్ స్మిత్, ఫెర్గూసన్‌ల వంటి పండితులలో భిన్నాభిప్రాయ మున్నది.

ఆంధ్ర శిల్పమునకు సమరసత ప్రాణము. ఆంధ్ర శిల్పి ఎంత పనివాడో అంత రసజ్ఞుడు. ఈ శిల్పి కృషిలో శాస్త్రమునకును, ప్రకృతికిని సరియైన పాళ్లలో మేలు కలయిక చేకూరినది. మనస్స్వాతంత్ర్యముకలవా డగుట చేత నితడు నియమములకు చిక్కి ఛాందసుడు కాలేదు. పైగా విశాలవ్యాసయముకలవా డగుటచేత దేశీయ, విదేశీయ రీతులలోని సద్గుణములను ధారాళముగా స్వీకరింప గలిగెను.

ఆంధ్ర శిల్పాకృతులలో సహజత్వము వర్ణనీయమును, అసామాన్యమును. తెలుగువాడు ప్రకృతినే ప్రధాన దైవముగా భావించెనేమో! అతడు మలచిన స్త్రీ, పురుష మూర్తుల ఆకారములును, కోమలములును మాత్రమే కాక అత్యంత సహజములు. అతడు ప్రదర్శించిన భంగిమలును, విన్యాసములు ననేకములైనను వానిలో నొక్కటి కూడ ప్రకృతివిరుద్ధముగా కనిపించదు. ప్రపంచ శిల్ప చరిత్రను పరిశీలించిన పశు పక్ష్యాదులను, తరు లతాదులను ఇంత సహజత్వముతో ఉబ్బెత్తు చిత్రములు చెక్కిన శిల్పులు చాల తక్కువ.

అంతేకాక, మూడవ విశేష మేమన, మాపరుల కాంధ్ర శిల్పమున చైతన్యము కొట్టవచ్చిన ట్లుండును. తెలుగు శిల్పాల చెక్కడములలో జడపదార్థములకు, నిర్జీవ ప్రతిమలకు తావు లేదు. అమరావతీ స్తూపమందు చెక్కిన జాతక కథల మనోహర దృశ్యము లిందుకు తార్కాణములు. సారనాథ బుద్ధుని విగ్రహము శాంతరస ప్రధానము. అందున ఆ దివ్య వ్యక్తపరచు శరీరము స్తంభించినది కాదు; నిశ్చల సమాధిలో నున్నది.

ఈ సిద్ధాంతములందలి సత్యము వివిధ సంప్రదాయములకు చెందిన ప్రతిమలను పరిశీలించిన మనకు తెలియ వచ్చును. సాంచీ స్తూప తోరణాగ్రమందలి ఒయ్యారి భామనుగాని, అమరావతీ స్తూపముపై బోధివృక్షమును పూజించు తక్షురాలినిగాని, లేపాక్షి గర్భగుడిలోని పద్మినీ స్త్రీ మూర్తిని గాని, మా మల్లపురములోని గజలక్ష్మిని గాని మధుర, భువనేశ్వర స్త్రీ స్వరూపములతో పోల్చి చూచిన తేలునట్టి సారాంశ మేమి? ఆంధ్ర శిల్పము నందు లావణ్యమును, ఒయ్యారమును హెచ్చు, వికృత శృంగారము తగ్గును - అని. ఈ విధముననే తంజావూరు, తిరువనంతపురములందలి స్త్రీ స్వరూపములతో పోల్చి చూచిన యెడల మనకు బోధపడున దేమి? తెలుగు ప్రతిమల యందలి ఆకృతులు విగ్రహ శిల్పసూత్రములకు దాసులై కొరడువారిపోక, జీవకళ ఉట్టిపడు చుండును - అని.

ఆంధ్రశిల్పి ఉనికి భారతదేశ మధ్యమున. అతడు పట్టి పోవుచున్నదికూడ మధ్యమార్గమే. అతని కళాకృషిలో నిమిడియున్న రహస్యమే యిది. మ. సూ. ప్ర.

అదృష్టవశమున ఆంధ్రదేశమునందు శిల్పసంపద ఎక్కువగా గలదు. అశోకుని కాలపు శిల్పములు భారత దేశమందు చాల ప్రాచీనము లగునేని అట్టి ప్రాచీన శిల్ప సామగ్రి ఆంధ్రదేశమం దంతటను లేక పోలేదు. వాస్తవ ముగా ఉత్తరదేశమందలి భార్హుత్, బుద్ధగయలయందు కానవచ్చు ప్రాథమికదశ నాటి ప్రాచీన శిల్పములవంటివి అమరావతి, జగ్గయ్యపేటలలోకూడ కనబడుచున్నవి. భార్హుత్ శిల్పములకును, అమరావతి జగ్గయ్యపేటలలోని శిల్పములకును గాఢమైన పోలిక లుండుట ఆశ్చర్యజనకము. కన్నులు, ముక్కులు, పెదవులు, ముఖ శారీరక లక్షణములు, తలపాగలు, ఆభరణములు, వస్త్రములు ధరించు విధము — ఇ వన్నియు చూడగా భారతదేశమందు సర్వత్ర వ్యాపించియుండిన దశయందు శిల్ప సంప్రదాయము ఎంతటి పరస్పర సన్నిహిత సంబంధము గలిగి యుండినదో స్పష్టమగు చున్నది. భారతదేశమునందు దక్షిణ దిక్కున చాలవరకు వ్యాపించియుండిన అశోకచక్రవర్తి మహాసామ్రాజ్యము వలన గలిగిన రాజకీయైక్య మొక్కటియే కాదు, తత్ఫలితముగ నేర్పడిన సాంస్కృతికైక్యము కూడ అంతటి సన్నిహిత సాదృశ్యమునకు కారణము. పూర్వ పశ్చిమ సముద్రములకుమధ్య వ్యాపించిన దక్షిణా పథమున కంతటికిని పాలకులైన మౌర్యచక్రవర్తులకు శుంగవంశజులు, కాళింగులువలెనే రాజకీయముగ సాత వాహన చక్రవర్తులు వారసులగుటచేత వీ రందరికి ఒక్క కళాసంప్రదాయమే సంక్రమించుటవలనగూడ ఈ గాఢ సాదృశ్య మేర్పడుటలో వింత లేదు. అంతే కాదు, సాత వాహన సామ్రాజ్యమందలి పూర్వ, పశ్చిమ భాగములలో గల శిల్ప, చిత్రలేఖనములు రెంటిలోను కొంచె మించు మించుగా ఒకటే విధముగా నున్న దృశ్యములలో కాన



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వచ్చు చిత్రముల యాకార, వస్త్రధారణ, అలంకార విధానములలోను మాత్రమే కాక వాని భంగిమలలోను, ప్రకృతులలోను కూడ ఈ సాదృశ్యము పొడకట్టుచున్నది. ఇందువలననే కృష్ణాతీరమందలి శిల్పములను, దక్కను లోని అజంటా చిత్రములను, పశ్చిమ భారతదేశమందలి గుహాశిల్పములను ఒండొంటితో సరిపోల్చి పరిశీలించుటకు కుతూహలము పొడమును.

అశోకచక్రవర్తి బౌద్ధమతవ్యాప్తి కొరకు పంపిన మత బోధకులలో ఆంధ్రదేశమున కొకడు నియమితు డయ్యెను. అందువల్లనే ఈ ప్రాంతమునందు విస్తారముగ గానవచ్చు స్తూపములను నిర్మించుటలో ఇచ్చటి యాకాలపు ప్రజలకు అంతటి యుత్సాహము కలిగినది. ఆంధ్రదేశములో, అందు లోను ముఖ్యముగ కృష్ణానది లోయ ప్రదేశములో కానవచ్చినన్ని బౌద్ధనిర్మాణావశేషములు దక్షిణదేశమునందు మరెచ్చటను కానరావు. ప్రతి మంటి దిబ్బయందును పూడిపోయియుండు మనోహరశిల్ప విరాజితములైన స్తూపములు పురాతత్త్వ పరిశోధకుని ఖనన పరిశీలనమున కెదురు చూచు చున్నవి. ఇట్టి స్తూపములు కాన వచ్చిన స్థలములు అమరావతి, నాగార్జునకొండ, గోలి, గుమ్మడిదుర్రు, జగ్గయ్యపేట, భట్టిప్రోలు, ఘంటసాల మొదలగు నవి కొన్ని మాత్రమే.

క్రిందికి దిగజారిన చూరులతో, బండి గూటివలె అర్ధవృత్తాకారమున (కమాను వలె) నున్న ద్వారోపరిభాగముతో శైలగర్భమును తొలిచి నిర్మించిన గుహాలయములు మన వాస్తు నిర్మాణములలోని ప్రాథమిక దశను సూచించును. గయ జిల్లాలో బారాబరను కొండలలో కానవచ్చు అశోకుని కాలమునాటి గుహ ఇట్టిది. సర్వవిధముల నిటువంటిదే యైనను అంతకన్న సాధారణమై సరిగా దానికి ప్రతివచ్చునది ఆంధ్ర దేశమందలి గుంటుపల్లిలో ఒకటి కలదు. ఇది గుహాలయ వాస్తువునకు తెలుగుదేశములో గల ప్రాచీన తమ దృష్టాంతము. ఉత్తరహిందూస్థానమునందువలె కృష్ణాలోయ యందును ఈ వాస్తు ప్రారంభదశ కాన్పించుచుండుటవలన భారత దేశమం దంతటను ఒకకాలమున, ఒకవిధమయిన వాస్తు శాస్త్ర సూత్రములు వాడుకలో నుండె ననియు, మౌర్యుల కళా ప్రభావము సర్వత్ర వ్యాపించియుండె ననియు సూచించుచుండుటవలన ఈ గుహాలయము కడుముఖ్యమైనది.



చిత్రము. 106–1. ఆరాధన, అమరావతి (శాతవాహనయుగము)

ధర్మాత్ముడైన అశోకచక్రవర్తి కాల మంతటను నిర్మించిన స్తూపములలో అమరావతీ స్తూప మొకటి కావచ్చును. ఇందు బుద్ధ శారీరకధాత్వవశేష లేశము నిక్షిప్తమై యుండెను. చలువరాతి చెక్కడపు పనులచే భవ్యముగ నలంకృతమైన యీ స్తూపము దాదాపు నూటయేబది యేండ్ల క్రిందటివరకు ఎక్కువ శైథిల్యము లేకయే ఉండినట్లున్నది. ఇందలి శిల్పములు నాలుగు భిన్నకాలములకు చెందినట్లు చెక్కబడిన శిల్పచిత్ర రీతినిబట్టి చెప్పవచ్చును. ఇందు ప్రాచీనతమమైనవి క్రీస్తు పూర్వము రెండవ శతాబ్ది మునకు చెందినవి. ఇవి భార్హుత్‌లోని శిల్పములను, అజంటాలోని పదవ సంఖ్యగల గుహాయందలి వర్ణచిత్రములను మిక్కిలి పోలియున్నవి. రెండవ దశయందలి శిల్పములు క్రీస్తుశకము మొదటి శతాబ్దమునకు చెందినవి. మూడవదశ యందలి శిల్పకళ బౌద్ధ నాగార్జునాచార్యులవారిచే నిర్మింపబడిన ప్రాకారమునందలి చిత్రములలో కానవచ్చుచున్నది. చివరి నాల్గవదశ క్రీస్తుశకము మూడవ శతాబ్దము నాటిది. అమరావతిలోని ఉత్తమ శిల్పము ఇందులోని మూడవ దశకు చెందినది. ఇది భారత దేశమునందు ఏకాలమున గాని, ఎచ్చటగాని రచింపబడిన ఉత్తమ శిల్పములతో సరితూగగలది; మీదు మిక్కిలి కుషాణ యుగమునాటి సమకాలిక మధుర శిల్పములవలె చాల మనోహరమైనది. రెండవదశలోని శిల్పములో ఒక ప్రత్యేకత కలదు. ఇచ్చట అదే కాలమున మధురయందువలె మొట్టమొదటి పర్యాయము బుద్ధుని విగ్రహము మానవాకృతిని రచింపబడియున్నది. అంతకు పూర్వపు శిల్పములలో ఏదో సాంకేతికముగనే తప్ప బుద్ధ ప్రతిమ మానవరూపమున రచించుట సర్వత్ర నిషిద్ధముగా నుండినది. మధ్య భారత, ఉత్తరాపథములలో పేర్లతో నాగ, యక్షప్రతిమలు దొరకినట్లే కృష్ణాలోయయందును అమరావతిలో ప్రాథమిక దశనాటి లోకోత్తరమగు యక్ష ప్రతిమ పేరుతో కనబడుటవలన అచ్చటవలెనే ఇచ్చటకూడ యక్షపూజ వాడుకలో నుండెనని స్పష్టముగా రుజువగుచున్నది. జగ్గయ్యపేటలో దొరకిన ఈ కాలమునాటి మాంధాత జాతక చిత్రము ఉత్తమోత్తమ శిల్పములలో నొకటి.

అమరావతిలో బుద్ధ జీవిత గాథలను, జాతక కథలను వర్ణించు చిత్రములు అధిక సంఖ్యాకములైనవి మూడవ

http://sanskritcentral.com/

http://teluguthesis.com/





చిత్రము 1. మాంధాత జాతకము, జగ్గయ్యపేట



చిత్రము 2. ఉదయన కథ, అమరావతి



చిత్రము 3.
అమరావతీ స్తూప శిల్పము, జాతీయ కళాశాల
బందరు



చిత్రము 4
ఈహామృగారోహ, స్తూప
శిల్పము, అమరావతి



చిత్రము 5.
చంద్రముఖ-యక్షుడు, స్తూప
శిల్పము, అమరావతి

http://sanskritcentral.com/

http://teluguthesis.com/




చిత్రము 1. బుద్ధ, రాహుల సమాగమము, గోలి



చిత్రము 2.
నలగిరి దమనము
అమరావతి



చిత్రము 8.
బుద్ధుని కంచు విగ్రహములు
అమరావతి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



దశనాటి కళకు చక్కని ఉదాహరణములు. మలచుటకై ఎన్నుకొన్న కథ లనేకము. ఇప్పుడున్న బుద్ధ జాతకములు మాత్రమే కాక ఇప్పుడు లభ్యము కాని గ్రంథముల లోనివియు, క్షేమేంద్ర విరచితమైన అవదాన కల్పలతవంటి వానిలో మాత్రమే కానవచ్చునట్టివియు కథలుకూడ చెక్కబడియున్నవి. బుద్ధుని జీవితమునకు చెందిన కొన్ని కథలును, ఉదయనుడు అజాతశత్రువు మొదలయిన బుద్ధుని సమకాలికుల చరిత్రలును అమరావతిలో చాల మనోహరముగా చిత్రింపబడినవి. సాతవాహనుల కాలమునాటి అత్యుత్తమ కళా చాతుర్యము ఈమూడవ దశనాటి మనోహర శిల్పములలో కానవచ్చును (చిత్రము 108-1).

. సాతవాహనుల కాలమునందు బౌద్ధ నిర్మాణములలో ఇంత విశేషముగ కళా సంపద కానవచ్చుచుండుటచేత హిందూ శిల్ప ముపేక్షింపబడినట్లు తలప రాదు. సాతవాహనులు క్రతువులు చేయుట యందాసక్తి కల వైదిక ధర్మావలంబకులైనను వారి యీ బౌద్ధ కళాభిరతి వారి విశాల భావములను, పరమత సహిష్ణుతను సూచించు చున్నది. క్రీ. పూ. రెండవ శతాబ్దినాటిది కాదగు గుడిమల్లములోని ప్రఖ్యాత శివలింగము సాతవాహన కళకు నిరుపమానోదాహరణము. ఇది ప్రాయికముగా శివ ప్రతిమలలో నెల్ల అత్యద్భుతమైనది. ఈ విగ్రహము వైదిక సంప్రదాయానుగుణమైన రుద్రాగ్నుల అంశలయొక్క ఐక్య భావమును సూచించుచున్నది. విగ్రహ నిర్మాణరీతి ఉత్తర హిందూస్థానములోని సమకాలిక శిల్పమునందలి యక్ష ప్రతిమను పోలి యున్నది. ఇదియును, 'భీట'లో దొరకిన శివలింగమును శైవమత ప్రారంభకాలపు శిల్పచరిత్రాన్వేషణకు చాల ముఖ్యములైన పరికరములు.



చిత్రము. 107-2.
శివలింగము, గుడిమల్లము.
(సాతవాహన యుగము)

సాతవాహనుల వలెనే ఇక్ష్వాకు రాజులుకూడ అనేక యజ్ఞయాగాదులు చేసిన వైదిక మతావలంబకులు. వారి వలెనే వీరును పరమత సహనము కలవారు. ఆంధ్ర దేశమందు చాల గొప్పదని ప్రసిద్ధి వహించిన నాగార్జునునికొండ బౌద్ధ విహారాదులను ఈ రాజవంశపు రాణులును, రాజకుటుంబములోనివారును నిర్మించిరి. నాగార్జునుని కొండలోని శిల్ప చిత్రములు అమరావతిలోని తృతీయ దశా కళా పరిణామ సూచకములే (చిత్రము 108-8). ఇవి అచ్చటి నాలుగవ దశనాటి శిల్పములకు సమకాలికము లనవచ్చును. జగ్గయ్యపేటలోవలెనే నాడుకలో నుండిన అలంకార శోభితమైన ఇచ్చటి లిపి, ఇచ్చటి శిల్పముకూడ అమరావతీ ప్రాకారనిర్మాణ శిల్పముయొక్క పరిణామ దశను సూచించుచున్నవి. ఇవి మనోహరములుగా నున్నను కళా దృష్టి ననుసరించి చూచినచో అమరావతిలోని తృతీయదశ నాటివే ఉత్తమమైనవి. నాగార్జుననికొండ, గోలి, గుమ్మడిదుర్రులలోని శిల్పశైలి ఒక్క తీరుననే యుండి ఒకటే కళా పరిణామదశను సూచించుచున్నది. ఈ చిత్రములు కడు రమ్యములైనవి. ఇందలి ఇతివృత్తములు అనేక జాతక కథలకును, బుద్ధ జీవిత గాథలకును సంబంధించినవి. విసుగు కలుగనీయక ఉత్సాహమును, కలిగించుటకై అమరావతిలో నున్నట్లే యిచ్చటకూడ అచ్చటి విదేశ శైలీ భేదములు చాల నేర్పుతో పొందింపబడి యున్నవి. ప్రాకారమును, ఆయక కంబములును, సింహద్వారములును మిక్కిలి చక్కగా శృంగారింపబడి యున్నవి. ఇది ఆంధ్రదేశ స్తూపముల ప్రత్యేక లక్షణము. మరియు గుమ్మములకడ తీగల యొక్కయు, పరువిడుచున్న జంతువులయొక్కయు శిల్పచిత్రములతో నలంకృతమై అర్ధ వలయాకారమున నుండు శిలా ఫలకములు (చంద్రశిలలు - మూన్ స్టోన్స్)



చిత్రము. 108-8.
ముస్తాబు : నాగార్జుననికొండ.
(ఇక్ష్వాకులకాలము)



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సింహళములోను కనబడుటచేత అప్పుడు కృష్ణలోయకును, సింహళమునకును గల సంబంధము విదితమగుచున్నది.

నాగార్జునుని కొండ చిత్రములలోని ఉష్ణీష విశేషములు, ఆభరణజాలము, స్త్రీ వేషభూషాదికము అమరావతీ చిత్ర శైలికే పోలియుండును (చిత్రము. 109 - 4 క, గ, చ, జ, ట, డ). ఇక్కడ విదేశ (రోమను, సిథియను) రూపు రేఖలు కూడ కానవచ్చుచున్నవి (చిత్రము. 109 - 4 ణ). మృత్ప్రతిమలు కూడ శిలావిగ్రహముల ననుసరించి యుండును. ఇట్టి సాతవాహన కాలపు మృత్ప్రతిమలు ముఖ్యముగా హైదరాబాదులోని కొండాపురములోను, మాస్కిలోను దొరకియున్నవి (చిత్రము. 109 - 5 త, ద, న, వ, బ, మ). ప్రొఫెసర్ డూబ్రేలుగారు ఇటువంటి మృత్తికా చిత్రములను పుదుచ్చేరి వద్దనున్న అరికమేడులో కూడ కనిపెట్టిరి.

అల్లే ఇంకను ఉత్తరమున అనకాపల్లి దగ్గరనున్న సంకారములో నుండు మరికొన్ని బౌద్ధనిర్మాణావశేషములందు ఒక శిలామయ బుద్ధ విగ్రహము కానవచ్చుచున్నది. దీనివలన సాతవాహన రాజ్యములో బౌద్ధధర్మ సంబంధి శిల్పము ఎంత లెక్క విశేష వ్యాప్తియం దుండెనో తెలియవచ్చు చున్నది.

కొంచె మించుమించుగ ఈ కాలమునాటిదే కాదగు అమరావతిలో దొరకిన కంచు బుద్ధ విగ్రహము మలయా, బోర్నియో మొదలగు దూరదేశ, ద్వీపములయందు దొరకిన దానిని గాఢముగ పోలియున్నది. ఉత్తరహిందూస్థానమునందలి మధురవలె అమరావతి(కృష్ణలోయ)యు గొప్ప కళానిర్మాణ కేంద్రస్థానమై యుండినట్లు తోచుచున్నది. ఇచ్చట తయారైన విగ్రహములు దూరదేశములకు పంపబడుచుండి యుండవచ్చును. భారతదేశమందలి నానా ప్రాంతముల నుండియు వచ్చు భక్తులు స్తూప ప్రాకారములోని యేదే నొకభాగమునుగాని, [illegible] స్తూపమునుగాని కట్టించుచుండి రనియు అమరావతిలోని శాసనముల వలన విదితమగుచున్నది. అదే విధముగ వారు తాము మరలిపోవునపుడు ఇచ్చటినుండి జ్ఞాపకార్థము విగ్రహాది శిల్పములను కొనిపోవుచు, తన్మూలమున కళానిర్మాణమునకు దోహద మిచ్చుచుండి యుందురు. నౌకా చిహ్నము గల యజ్ఞశ్రీ సాతకర్ణి నాణెములు ఆకాలమున ఆంధ్రదేశమునకును, పైని పేర్కొనబడిన దేశ, ద్వీపాంతరములకును సముద్రముమీద రాకపోకలు సాగుచుండెనని రుజువు చేయుచున్నవి. అందువలన అమరావతీ శిల్ప సంప్రదాయము ననుసరించి నిర్మింపబడిన కంచువిగ్రహములు ద్వీపములలో కానవచ్చుటయం దాశ్చర్యము లేదు. బోరోబుదూరులో అమరావతీ శిల్పలక్షణము లనేకము కానవచ్చుటవలన అది యాశిల్పసంప్రదాయమునకు వివరణ ప్రాయమని చెప్పవచ్చును. ఈ బోరోబుదూరులో తరువాతి కాలపు పల్లవ శిల్ప సంప్రదాయము ఎక్కువగ పాటింపబడినది. ఒకగొప్ప పల్లవ చక్రవర్తియొక్క నౌకాదళము ఒక సింహళరాజును సింహాసనమునందు పునఃప్రతిష్ఠితుని చేయుటయేకాక హిందూవిజ్ఞానమును జావా మొదలయిన ద్వీపాంతరములకును వ్యాపింపజేసినది. ఇట్లు విజ్ఞానమును కొనిపోయిన పల్లవ యానపాత్రములకు కృతజ్ఞతా సూచకముగనేమో నౌకల శిల్పములు అద్భుత ఫణితిని బహుళముగా నచట చెక్కబడి యున్నవి. ఈ సందర్భములో పల్లవ శిల్పముయొక్క ఆదిమదశ దక్షిణదేశముతోకంటె ఆంధ్రదేశముతో సన్నిహిత సంబంధము కలిగియుండెనను విషయమును విస్మరింప రాదు.

ఆంధ్ర శిల్పముయొక్క తరువాతిదశ క్రీ. శ. 5, 6 శతాబ్దములలో ఆంధ్ర దేశమును పాలించిన విష్ణుకుండినుల నాటిది. బెజవాడలోను, తత్పరిసరములందును కానవచ్చు ఉండవల్లి, మొగల్రాజపురము గుహాలయములు ఈ కాలమునకు చెందినవి. ఇవి చాళుక్య [illegible] రాక పూర్వ ముండిన యాంధ్ర శిల్పమునకు దృష్టాంతప్రాయమై యున్నవి. ఉండవల్లి గుహలలోని ప్రతిమలు [illegible]వారి యొక్కయు, ఆధునికుల యొక్కయు [illegible] పూతల వలన రూపు మాసి పాడైపోవుట [illegible]. పూర్తిగ చెడక కొలదిపాటిగ నిలిచియున్న [illegible] కానవచ్చు ప్రతిమలు - మనుజులవికాని, జంతువులవికాని - [illegible] చాతుర్యమును, పటుత్వమును కనబరచుచున్నవి. ఇంతకన్న మంచి స్థితిలో భద్రముగా నుండు మొగల్రాజపురమందలి గుహాలలో శిల్పముయొక్క ప్రతిభ చక్కగా వ్యక్తమగుచున్నది. గుహాలయ ముఖము యొక్క ఊర్ధ్వభాగమున నున్న అష్టభుజ నటరాజమూర్తి క్రింది [illegible] వరుసగ చెక్కబడియుండు గణ, [illegible] ప్రతిమలందు జీవకళ యుట్టిపడుచున్నది; ఈగుహా గవాక్షములలోనుండి తొంగి చూచుచుండునట్లగపడు మనుష్య ముఖములు కడు రమ్యముగా నున్నవి. ఈ బహుభుజాల నటరాజమూర్తి శిథిలావస్థయం దున్నను కళా దృష్టియందు నిరుపమానమయినదని నిస్సంశయముగా చెప్పవచ్చును. ఈ నటరాజమూర్తి నిర్మాణమునందు భారతదేశపు ఉత్తర పశ్చిమ మధ్యదేశ ప్రాగ్దేశములందువలె నటరాజ ప్రతిమలకు బహుభుజములు గలిగినట్టియు, తరువాతికాలపు దాక్షిణాత్య ప్రతిమలకువలె పాదముక్రింద అపస్మారుని విగ్రహమును గలిగినట్టియు ఉత్తర, దక్షిణదేశ శిల్ప సంప్రదాయముల కలయిక గోచరమగుచున్నది. కాబట్టి భిన్న శిల్ప సంప్రదాయముల



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కూడలి ప్రదేశములందలి కళావిధానమును తెలిసికొనుట కిది మిక్కిలి యుపయోగపడుచున్నది. పశ్చిమ చాళుక్య రాజ్యముయొక్క గర్భ సీమయందలి బాదామి, పట్టదకల్లు ప్రాంతముకూడ భిన్న సంప్రదాయముల కూడలి ప్రదేశములలో మరియొకటి. ఈ (మొగల్రాజపురమందలి) గుహాలయములలోని స్తంభములమీది చెక్కడములు ఆ కాలమునను, అటుతరువాతి శతాబ్దములలోను కూడ సర్వజనానురంజకములుగ నుండిన పౌరాణిక కథలను తెలుపునట్టివి. శ్రీకృష్ణుని గోవర్ధనోద్ధరణము, ఆదివరాహకృతభూమ్యుద్ధరణము, నరసింహకృత హిరణ్యకశిపు వధ, త్రివిక్రమావతారము, హంస, వరాహ రూపములతో బ్రహ్మ, విష్ణువులు శివలింగముయొక్క ఆద్యంతములను కనుగొన ప్రయత్నించిన గాథ మొదలయిన శిల్పేతివృత్తము లిచట చెక్కియున్నవి. క్రీ.శ. ఏడు, ఎనిమిది శతాబ్దులనాటి మహాబలిపురము, ఎల్లోరాలలో ఈ యితి వృత్తము లింకను విరివిగాను, రమ్యముగాను చిత్రింపబడినవి. ఇక్కడ (మొగల్రాజ పురములో) స్తంభముల ప్రక్కలందు గల కొలదిపాటి స్థలములో శిల్పి చిత్రములు చెక్కి తన నైపుణ్యము నంతయును చూపినాడు. ఇతడు తనకు పూర్వులగు శిల్పులను తా ననుకరించిన తీరును, తన దేశముననే కాక దూర దూరములందలి, ఇతర దేశములలోని తన తరువాతి శిల్పులకును శాశ్వతముగ మార్గదర్శకుడయిన తీరును అవగతము చేసికొనుటకీ శిల్ప చిత్రములు మిగుల నుపయుక్తము లగుచున్నవి. ఇదియే ఉదయగిరిలోని గుప్తరాజుల నాటి వరాహ శిల్ప చిత్రరచనలను బోలిన రచన లటుతరువాతి కాలమున బాదామి మొగల్రాజపురము మహాబలిపురము ఎల్లోరా మొదలగు దూర ప్రదేశములలో గూడ కానవచ్చుటకు కారణము. త్రివిక్రమ శిల్ప రచనయు నిట్టిదే. రాజపుటానాలో మండోర్ అనుచోట శ్రీకృష్ణ గోవర్ధనోద్ధరణ శిల్ప చిత్రము దొరకియున్నది. ఏతద్గాథా విషయము జనాదరణమున కత్యంతము పాత్రమైనది కావున చిన్నవియు, పెద్దవియు నగు ఈ కథా శిల్పచిత్రము లనేకము కలవు. భారత కళాభవనమున నిట్టిది పెద్దది యొకటి యున్నది. ఇది పరిమాణమున మహాబలిపురములోని చిత్రముతో తులదూగుచున్నది. ఆవులు, లేగలు ప్రధానముగా గల చిన్న శిల్ప రచనలు పాలు పిదుకు వైఖరియందు మహాబలిపురములోని వానితో పోల్పదగి యున్నవి. గుప్తులనాటివియు, మహాబలిపురము నందలివియు నగు నీ దృశ్యములందు శ్రీకృష్ణుని మానవమాత్రునిగానే చిత్రించినను మొగల్రాజపురముతోను, తరువాతి కాలపు ఎల్లోరా శిల్పములలోను, అతని భగవత్స్వరూపమునకు ప్రాధాన్యము నిచ్చుటకయి శిల్పులు నాలుగు చేతులను కల్పించినారు. మహాబలిపురమునందువలెనే ఇక్కడను కుండల దొంతిని శిరమున నిడుకొనిన గోపిక శిల్ప చిత్రము కానవచ్చుచున్నది. ఈ గుహాలయములలో ద్వారములకడ కాపుండు శృంగములు గల ద్వారపాలకులు తరువాతి పల్లవ ద్వారపాలకులకు (చిత్రము 109-8) పురోగాములు. వీని నాధారపరచుకొని రచించిన తరువాతి శిల్పములమీద వీని ప్రాభవ మెట్టిదో పరిశోధించుటకు ఇవి చాల అక్కరకు వచ్చుచున్నవి.

పల్లవరాజు మహేంద్రవర్మ విష్ణుకుండి విక్రమహేంద్రుని మనుమడను సిద్ధాంతము గ్రాహ్య మగునేని, పల్లవులు సముద్రగుప్తుని కాలమునుండియు కాంచీపురము రాజధానిగా పరిపాలించుచున్నను కృష్ణాతీర భూములుకూడ వారి రాజ్యములో చేరి యుండినవే యనుటను గుర్తించితిమేని, తన మాతామహుని రాజ్య మందలి గుహా నిర్మాణ పద్ధతులను మొట్టమొదటి పర్యాయము తమిళ దేశమున ప్రవేశపెట్టితినను మహేంద్రవర్మ కౌతుకమును గ్రహించితిమేని మొగల్రాజపురములోని గుహాలయములు తరువాతి శతాబ్దమునందలి గుహాలయ వాస్తు నిర్మాణాభివృద్ధియొక్క పరిశోధన కెంత ముఖ్యమైనవో విశదము కాగలదు.

మొగల్రాజపురము గుహాలయములకును, మహేంద్రవర్మ చెంగల్పట్టునుండి తిరుచిరాపల్లి వరకునుగల విశాలదేశమున మలిపించిన గుహాలయములకును మధ్యకాలమందలి పరిణామదశ నెల్లూరి జిల్లాలోని భైరవునికొండయందలి గుహాలయములలో కనబడుచున్నది. వీనిలోని విగ్రహశిల్ప రచనమునందు తమిళరీతి కన్న తెనుగురీతియే ద్యోతకమగుచున్నది. వీని కింకను దక్షిణ దేశమునందుండు వానిలో ఒక ప్రత్యేక విశిష్టత స్పష్టముగా కనబడుచున్నది. ఇచ్చటి కొమ్ములతోడి ద్వారపాలకులు కొంచెము స్థూలకాయులు; ఘనగదాధరులు. విష్ణువు మొదలయిన దేవతల ప్రతిమలు ఇక్కడి కింకను దూరమున దక్షిణదేశమున గల ప్రతిమలతో సాదృశ్యము గలిగియున్నవి. ముంగాళ్ళ మూని కూర్చుండి యుండు నిచ్చటి సింహములును, పరుండియున్న నందియును తమిళదేశములోని గుహాలయములందలి ప్రతిమలకన్న ఎక్కువ భిన్నములు కాకపోయినను వాని ఆకారరేఖలయందును, అంగసౌష్ఠవము నందును గల ప్రత్యేక లక్షణములు కొన్ని ఆంధ్రదేశపు పద్ధతికి సన్నిహితములై, తర్వాతి కాలపు ఆంధ్ర శిల్పములకు సంబంధము కలుపుచున్నవి.

పెద్ద ముడియములో ప్రాతపద్ధతిని కొద్దిపాటి యెత్తుగ చెక్కబడిన బ్రహ్మ, విష్ణువు, శివుడు, నరసింహుడు, మహిషాసురమర్దని, గణేశుడు — వీని వంటి సామాన్య దైవతప్రతిమలు ఈ కాలమునకు చెందవలసినవియే. ఈ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/





చిత్రము 1. శివమూర్తి, బిక్కవోలు



చిత్రము 2. కౌమారి, బిక్కవోలు



చిత్రము 3. గణాధిపతి. బిక్కవోలు



చిత్రము 4. గరుడవాహనారూఢ విష్ణుమూర్తి, సామర్లకోట.

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చిత్రము 1.
కుబేరమూర్తి (మ్యూజియము) విజయవాడ.



చిత్రము 2.
పరశుధారి శివమూర్తి (మ్యూజియము) విజయవాడ.



చిత్రము 3 శివాలయ (దక్షిణపు గోడ) శిల్పచిత్రములు, పెనుగొండ, (అనంతపురము జిల్లా)

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చిత్రములలో లక్ష్మీదేవియొక్క ఊర్ధ్వకాయ ప్రతిమారూపమున కల్పింపబడిన శ్రీవత్సము కమల పీఠము నధిష్ఠించినట్లు చెక్కబడి యున్నది. పల్లవ శిల్పముయొక్క ప్రథమ దశలో లక్ష్మీవిగ్రహము నింకను దక్షిణమున నిట్లే చెక్కియున్నా రను విషయమును దృష్టియం దుంచుకొనవలెను. అచ్చటి మూలరూపమున కాదర్శము బహుశః, ఇక్కడి చిత్రముగానే యుండును. విష్ణువిగ్రహముమీద కూడ కొన్ని చోట్ల శ్రీవత్సమునకు బదులు ఈ పైమాదిరి ప్రతిమ కనబడుచున్నది. ఈ చిత్రమే కొన్ని శతాబ్దములకు తరువాత తుదకు త్రికోణాకారపు గుర్తుగా మారినది. ఇది చాళుక్యుల కాలమునాటి తొలి చిత్రములలో కూడ కానవచ్చుచున్నది. ఇచ్చట గణేశుని ప్రతిమకు చేతులు రెండే యుండుట గమనింపదగినది. భూమరా అను ప్రదేశమున దొరకిన గణేశ విగ్రహమున గానవచ్చినట్లే గుప్తయుగపు గణేశ విగ్రహములకును చేతులు రెండే. ఆ పద్ధతియే ఇచ్చటకూడ అవలంబింప బడినది. గుప్త యుగమునాటి ఉత్తర హిందూస్థానపు మహిషాసురమర్దని విగ్రహములయందు కానవచ్చునట్లే యిచ్చటకూడ దేవి మహిషమును కాలితో త్రొక్కి చంపుచున్నది. మహిషమునుండి రాక్షసుడు మనుష్యరూపమున వెలువడుచున్నాడు. ఖండితమైన మహిష శిరస్సుమీద దేవి నిలచి యున్నట్లు చెక్కుట తమిళ దేశములో మాత్రమే కానవచ్చుచున్నది. మాడుగులలోని చక్కని శివవిగ్రహముల వరుసకూడ ఈ కాలమునకు చెందవలసినదే.

చేత గొడ్డలిని ధరించి నందిచెంత నిలిచియుండు ద్విబాహు శివమూర్తి విష్ణుకుండినృపుల నాటిదో, పూర్వ చాళుక్య యుగ ప్రారంభదశనాటిదో తెలియదు. చక్కని మకుటము గలిగి విచ్ఛిన్నమైయుండు కుబేరుని యూర్ధ్వకాయ ప్రతిమయు పైదానియట్లే యే కాలము నాటిదో నిశ్చయింప వీలులేనిది. అమరావతి యందును, బెజవాడ సమీపమందుండు అల్లూరు మొదలగు ఇతర ప్రదేశము లందును దొరకి మదరాసు బెజవాడ ప్రదర్శనాలయము లందును, అమరావతి యందును పదిల పరుపబడిన కొన్ని పురుష ప్రమాణ బుద్ధ విగ్రహములు కూడ ఇంచుమించుగ నీ కాలపువేయై యుండవచ్చును.

క్రీ. శ. ఏడవ శతాబ్ది పూర్వార్ధమున పల్లవులకు గర్వశత్రువైన సుప్రసిద్ధ బాదామి చాళుక్యరాజు రెండవ పులకేశి మహేంద్రవర్మయొక్క రాజ్యములోని ఉత్తరభాగమును జయించి దానిలో మరికొంత రాష్ట్రమును కలిపి దానికి తన తమ్ముడైన కుబ్జ విష్ణువర్ధనుని ప్రతినిధిగా నియమించెను. ఇట్లు ఆంధ్రదేశములో పూర్వచాళుక్య రాజవంశము స్థాపితమైనది. ఈ కుబ్జవిష్ణువర్ధనుని సంతతివారు చక్కని శిల్పములతో నలంకృతములైన సుందరదేవాలయములను నిర్మించి తమ రాజ్యమును సౌందర్యసహితముగా చేయుటయందు కావించిన కృషి యనల్పము.

బాదామిచాళుక్య శిల్పసంప్రదాయ ప్రేరితములై, బహుశముగా దాని ననుసరించిన వగుటచేత ప్రథమదశయందలి పూర్వచాళుక్య శిల్పములు బృహత్పరిమాణములు గలవి. ఈ యుగమునకు చెందిన యీ యేకాండపురాతి గండారపు బొమ్మలు - కొన్నిటిమీద అక్షరములు చెక్కినవి — మంగళేశరాజు మలిపించిన బాదామి గుహలయందుండు బృహత్ ప్రమాణ విగ్రహములతో పోల్చుటకు కుతూహలము గలుగును. ఇది గంభీరమైన బృహత్పరిమాణ విగ్రహములను నిర్మించు పద్ధతి. కొంతకాలమునకు పూర్వమే గుప్తులు వాడుకలోనికి తెచ్చిన పద్ధతి ఇది. మధ్యభారత మందలి ఉదయగిరి, ఏరణ (ఈరాణ) అను ప్రదేశములయందుండు వరాహమూర్తులును, దేవఘడ్‌లోని పెద్ద పెద్ద శిల్పఫలకములమీది విగ్రహములును ఈ శైలికి ఉదాహరణములు. మధ్యయుగ ప్రారంభకాలము నాటివగు రజిమ్‌లోని రాజీవలోచనుని దేవాలయమునందలి ఏకశిలాశిల్పఫలకములు, బొంబాయి సమీపమునందలి ఎలిఫెంటా గుహలలోని శివమూర్తులు మున్నగునవి రచింపబడుటకు ఈ బృహద్గంభీర గుప్తశైలియే కారణము. మధ్యయుగ ప్రాథమిక దశనాటి తొలి శిల్పుల హృదయముల నాకర్షించి పరవశులను చేసినది ఈ శిల్ప సంప్రదాయమే. అట్లే ఆంధ్రదేశమందుకూడ ఈ సంప్రదాయము పునరావర్తితమైనది. బెజవాడలోకూడ ఒక్కటే పెద్దరాతిలో మలచిన పెద్ద విగ్రహములు చాల దొరకినవి. అందు కొన్ని మదరాసు వస్తుప్రదర్శనశాలలో పదిలపరుపబడి యున్నవి. ఇవి యన్నియు చాళుక్యులనాటి ఆదిమశిల్ప రీతికి చెందినవి. వీనిలో ద్వారపాలక విగ్రహములు రెండు మిక్కిలి సొంపుగా నున్నవి (చిత్రము. 109 - 6, 7). అవి రెండును పరిమాణమున చాల పెద్దవి. వానిలో ఒకదానికి పద్మములతోను, కలువలతోను కూర్పబడిన యజ్ఞోపవీతము కలదు. రెండవ దానికి జందెములో చిరుగంట లెడనెడ కూర్పబడియున్నవి. రెండు విగ్రహముల చేతులకు సింహతలాటపు కటకాభరణములును, కేయూరములును, సహజరీతిని 'తర్జనీ', 'విస్మయ' ముద్రలలో నున్న చేతులలో వీరోచితములైన ఆయుధములు పాశములును, పెద్ద గదలు నున్నవి. ఇవి ఆదిమ చాళుక్యుల నాటి అత్యద్భుత శిల్పనిర్మాణమున కుదాహరణములు. బహుశః ఇవి యానాటి యొక శివాలయమున కలంకారములై యుండియుండును. వీనిలో నొకదాని (చిత్రము 109 - 6) వెనుక వైపున 'గుండయ వేంగినాథ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వేలందు' అను శాసనాక్షరము లున్నవి. అవి వానిపేరు గుండయ యనియు, అతడు వేంగి రాజైన తూర్పుచాళుక్య రాజు యొక్క సేవకు డనియు తెలుపు చున్నవి. ఈ ద్వారపాలక విగ్రహములు పల్లవుల ద్వారపాలక విగ్రహములతో పరిపోల్చి చూచుట చాల సమంజసముగ నుండును(చిత్రము. 109 - 8). ప్రాయశః ఈ ద్వారపాలకు లున్న దేవాలయమునకో, మరి ఏదే శిథిల దేవాలయమునకో సంబంధించినవగు అతిపరిమాణ గజశిల్పములు సౌందర్య, సౌకుమార్యములందు మహాబలిపురము నందలిదియు, పల్లవశిల్పములో నత్యుత్తమముగా పరిగణింప బడినదియు నగు అర్జున తపశ్చర్యా దృశ్యశిల్పమునందలి గజములతో తులదూగుచున్నవి. బెజవాడనుండి మదరాసు మ్యూజియమునకు తెచ్చిన యొక రెండు చేతుల గణేశవిగ్రహమును చాల పెద్దదే. ఇట్టివే మరికొన్ని ద్వారపాలక, గణేశవిగ్రహములు ఇంకను బెజవాడలో నున్నవి. అవి యన్నియు ప్రాచీన పూర్వచాళుక్య కాలమునాటి గంభీర శిల్పరచనకు నిదర్శనములు. వేంగిలోనే పగిలిపోయిన మహాగణేశ విగ్రహమొకటి నేలపై బడియున్నది. ఈ ప్రాచీన రీతికే చెందిన రెండు చేతుల గణేశవిగ్రహములలో మిక్కిలియు రమ్యమైనది రాజమహేంద్రవరము చెంగటి బిక్కవోలు పొలములో ఒంటిరాతితో మలువబడి యున్నది. దీనికిని మంగళేశుని బాదామి గుహలలో ఆద్య చాళుక్య శిల్పమునకు చెందిన గణేశుని విగ్రహమునకువలెనే కిరీటము లేదు.

బెజవాడలోనే మెడలో గంటల పట్టెడగల నందులు - పూర్వచాళుక్య శిల్పసంప్రదాయమునకు చెందినవి - అనేకము కానవచ్చు చున్నవి. ఇవి బాదామి చాళుక్యుల నాటి నందులను మిక్కిలి పోలియున్నవి. ఈ యలంకారము లేని ఇతర నందుల కంటె అవి చాల సొంపుగా నున్నవి. అక్కన్న మాదన్న గుహలకు కొంత దూరమున జమ్మిదొడ్డి యున్నది. ఇచట ఎనిమిది తొమ్మిది శతాబ్దముల నాటి పూర్వ చాళుక్య సంప్రదాయమునకు చెందిన చెక్కడములు ప్రాయికముగా మంటపస్తంభముల చూళికలతోపాటు భద్రపరుపబడి యున్నవి. బెజవాడకు సమీపమందలి ఇంద్రకీల పర్వతము మీది శాసనములును, కిరాతార్జునీయ కథాంశములు చెక్కిన ఫలకములు కల స్తంభములును చాల ముఖ్యమైనవి. శాసనముల వలన ఈ శిల్పము యొక్క కాలము చక్కగా తెలియుచున్నది. ఇందలి శిల్పముల శైలీ విశేషమును బట్టి ఇతర శిల్పముల కాలభేదములను గ్రహించుటకు వీలగుచున్నది.

రాజమహేంద్రవరము దగ్గర బిక్కవోలులో చాల వరకు మంచి స్థితిలోనే యున్న దేవాలయము లనేకము కలవు. వానియందు కోష్ఠపంజరములు శిల్పాలంకృతములు. ఈ కోష్ఠపంజరములమీద పూల తీగవలె చెక్కిన తోకలు గల మకరములతోడి తోరణ శిల్పములు పల్లవ దేవాలయములలో కానవచ్చు నిట్టి శిల్పములను స్మరణకు దెచ్చుచుండును. శిల్ప కర్మయందలి సారళ్యమును, అలంకారాడంబరము లేమియు పల్లవ శిల్పముతో గల పోలికను తెలుపుచున్నను మరికొన్ని లక్షణములు బాదామి చాళుక్య సంప్రదాయమును స్మరణకు తెచ్చుచున్నవి. పట్టదకల్లునందు వలెనే ఇచ్చటను కొంచె మించుమించుగా స్థానిక చాళుక్య సంప్రదాయమును మించి దాక్షిణాత్య సంప్రదాయ ప్రభావము అధికముగా కానవచ్చుచున్నది. నటరాజ విగ్రహము మొగల్రాజపురము నందు ఉత్తరదేశ సంప్రదాయము ననుసరించి పెక్కు చేతులతో చెక్కబడి యున్నను, ఇచ్చట దాక్షిణాత్య సంప్రదాయానుసారము నాలుగు చేతులతోనే చెక్కబడి యున్నది. ఒకానొక దేవాలయమునందలి సప్తమాతృకావర్గ శిల్ప శిథిలావశేషమగు కౌమారీ, చాముండా విగ్రహములతో కూర్చుండి యుండు శివుని వీరభద్రమూర్తి మేలి పనితనము గలది. కౌమారీ రూపము చాల అందముగా నున్నప్పటికిని చాముండాదేవి ప్రతిమ అర్వాచీన మధ్యయుగ శిల్పము నందువలె కొంత భయంకర రూపముతో నున్నది. స్కంద విగ్రహము ప్రక్క నెమలియు, బ్రహ్మ ప్రక్కను హంసమును చాల సహజరీతిని చెక్కబడి యున్నవి. మూర్తిమంతమైన గంగాదేవికూడ మనోహరముగా చెక్కబడినది. విమానము పైభాగమున చెక్కిన కొన్ని గణేశ విగ్రహములను బట్టి చూడగా అప్పటి కింకను అదివర కుండిన చేతులకు మరి రెండు చేతు లధికముగ గాని, సహజమైన ఏనుగుతలమీద కిరీటముగాని చేర్పబడలేదని విదితమగుచున్నది. ఈ కాలపు శాసన ముద్రికమీది ఒకానొక కంచు గణేశ ప్రతిమనుబట్టి ఈవిధముగానే గణేశ విగ్రహమును చెక్కుచుండిన పూర్వ సంప్రదాయము తొమ్మిది, పది శతాబ్దములవరకును వచ్చుచుండినదని తెలియుచున్నది. హృదయంగమములైన ఈ శిల్పములును, దేవాలయములును ఇంకను చక్కగా పరిశీలింపబడలేదు. ఈ దేవాలయములోని శిల్పములను పరిశోధించునపుడు ముఖ్యముగా జ్ఞాపక ముంచుకొనవలసిన విషయ మేమనగా: నరేంద్ర మృగరాజ విజయాదిత్యుడు తన శాసనములలో చెప్పికొనినట్లు రాష్ట్రకూటులను నూట యెనిమిది యుద్ధములలో జయించి, భక్తి సూచకముగా నూటయెనిమిది శివాలయములను కట్టించుటయే కాక అతని తర్వాతి రాజులలో సమర్థులగు గుణగ విజయా



http://sanskritcentral.com/

http://teluguthesis.com/







చిత్రము 1.



చిత్రము 2.



చిత్రము 3.



చిత్రము 4.

చిత్రములు 1, 4 సాలభంజికలు (వాసికా స్తంభ ప్రతిమలు). రామప్పగుళ్లు, పాలంపేట; చిత్రములు 2, 3 వితాన శిల్పశిలాఫలకములు. ఓరుగల్లు

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



దిత్యుడు, చాళుక్య భీముడు మొదలైనవారు కూడ విశేషముగా దేవాలయములను నిర్మింప మొదలు పెట్టి రనుట. తూర్పు చాళుక్యరాజు మూడవ గుణగ విజయాదిత్యుడు రాష్ట్రకూటులను జయించి వారి సార్వభౌమ చిహ్నములను గ్రహించుటయే కాక గంగా యమునా చిహ్నములను కూడ గ్రహించెనను విషయము జ్ఞప్తికి తెచ్చుకొంటిమేని ఉత్తర హిందూస్థానపు శిల్ప చిహ్నములు తూర్పు చాళుక్యుల శిల్పములో నెట్లు ప్రవేశించినవో గ్రహింపవచ్చును. బిక్కవోలు దేవాలయ ద్వారముమీద చెక్కబడి యుండు ఈ చిహ్నములు తొలుదొలుత బాదామి చాళుక్యులకు మొదటి విక్రమాదిత్యుని కాలమున అతని పుత్రుడగు వినయాదిత్యుని పరాక్రమముచేత గంగా యమునాంతర్వేది జయింపబడినప్పుడు సంప్రాప్తమైనవి. ఈ లాంఛనములు బాదామి చాళుక్యులకు తరువాత రాజ్య మేలిన రాష్ట్రకూటులకు సంక్రమించినవి. తూర్పు చాళుక్యులు రాష్ట్రకూటులను జయించి ఈ లాంఛనములను దీసికొని వానిని తమ కట్టడములలో చిత్రింపజేసిరి. చాళుక్య దేవాలయములందు కానవగు కళింగ శిల్ప ప్రభావమునకు దీర్ఘకాలము నుండియు సాగుచు వచ్చిన రాజకీయ, సాంస్కృతిక సంసర్గములు కారణము. కళింగ దేవాలయములందువలె తూర్పు చాళుక్య దేవాలయములందును మిథున ప్రతిమాదులు చెక్కుటయు, దక్షిణామూర్తి స్థానమున లకులీశ విగ్రహమును నిలుపుటయును జరగినది.

సామర్లకోటలో విష్ణుదేవాలయమునందు పాటలవర్ణ శిలలో చెక్కబడిన చక్కని శిల్ప ఫలకములు పైనుడివిన చిత్రములకు కొంత పూర్వపువి. బహుశః ఇవి క్రీ. శ. ఎనిమిదవ శతాబ్దమునాటివి కావచ్చును. ఇక్కడ మేలి పనితనము గల చిన్న గణేశ ప్రతిమ యొక్కటి కానవచ్చు చున్నది. గోడలలో స్థాపించిన అటు తరువాతికాలపు పెద్ద శిలాశిల్ప ఫలకములలో ఒకదానియందున్న గరుడారూఢుడైన విష్ణుప్రతిమ అచ్చెరువు గొలుపుచున్నది. ఇట్లే మంచి పనితనము గల చక్కని శిల్ప ఫలకములు ఇంకను సూక్ష్మపరిశోధనను ప్రతీక్షించుచున్నవి. ఈ దేవాలయము చూడగా ఇటీవల నిర్మితమైన దానివలె కానవచ్చుచున్నది. కాని తొలికాలమునాటి యీ శిల్ప చిత్రములు బహుశః శిథిలావస్థయం దుండిన యొక ప్రాత కట్టడమునుండి యుద్ధరింపబడి చాల నిటీవలి కాలము నాటివగు దేవాలయ కుడ్యములలో అదృష్టవశమున భద్రపరుపబడి యుండవచ్చును.

ఉత్తరకాలీన పూర్వ చాళుక్య సంప్రదాయము సామర్లకోట భీమవరము నందలి భీమేశ్వరాలయములోను, దాక్షారామము నందలి శివాలయములోను, రాజమహేంద్రవరము చుట్టుప్రక్కల నుండు దేవాలయములలోను గల శిల్పములను పరిశీలించి తెలిసికొనవచ్చును. ఇచట ప్రతివాస్తు అంశమును చక్కగా అలంకృతమై యున్నది. అర్వాచీన పశ్చిమ చాళుక్యుల శిల్పశైలియొక్క శోభయంతయు ఇచటి తరువాతి కాలపు శిల్పములలో పునరావృతమైనది. కాని పశ్చిమచాళుక్య ప్రాంతములో నున్నంత విరివిగా చిత్రపు పనులు తూర్పుప్రాంతములో జరగలేదు. దాక్షారామములోని స్తంభముల కాధారములై ముంగాళ్ల నూని కూర్చుండి యుండు సింహములను మహేంద్రవర్మ పల్లవుని కాలము నాటి నుండి నెల్లూరి సమీపమందలి భైరవుని కొండలోని తొలికాలపు గుహాలయము లందలి విడిస్తంభములను, కుడ్యస్తంభములను మోయుచున్నట్లు చెక్కబడిన సింహములతోను, నరసింహవర్మ నాటి వాని తోను, తరువాతి కాలమున కానవచ్చు చోళులనాటి ఇట్టి సింహోధృత స్తంభములతోను పోల్పదగును. ఇట్టి వాస్తు వ్యక్తీకరణ రీతులలో చోళ సంప్రదాయ ప్రభావముకూడ కాననగును. ఈ సందర్భమున రాజరాజ, రాజేంద్రుల వంటి చోళరాజులకును, చోళ చాళుక్య బాంధవ్యఫలమైన మొదటి కులోత్తుంగ చోళునకును చాళుక్యరాజ కుటుంబముతో వైవాహిక సంబంధ ముండెననియు, చాళుక్య చోళ సంస్కృతులు రెండును పరస్పరాభిముఖముగ వ్యాప్తమగుచుండెననియు జ్ఞప్తియం దుంచుకొనవలయును. చోళ రాజరాజును, రాజేంద్రుడును తమ కుమార్తెలను తూర్పు చాళుక్యుల కిచ్చి వివాహము చేసిరి. రాజేంద్రచోళుడు తన కొమార్తెను తూర్పు గాంగ రాజకుటుంబమున నిచ్చెను. ఈ చోళ, గాంగ వంశముల కలయికవలన జనించిన తరువాతి రాజొకడు ఉభయ సంప్రదాయములను మేళవింపజేసి కళింగమున తాను నిర్మించిన దేవాలయములలో చోళ శిల్పమునందలి వస్త్రాలంకార కల్పనలను ప్రవేశపెట్టినాడు. ఉదాహరణమునకు నాల్గవ నరసింహరాజు కోణార్క క్షేత్రమునందు దారాసురములోను, చిదంబరములోను నుండు వానివలె విమానమునకు గుర్రములను, చక్రములను చేర్చినాడు.

ఈ శిల్పకళలో తరువాతి పరిణామము కాకతీయుల కాలమునాటిది. ఇచట పూర్వశైలియే అనుసృతమైనను ప్రతిమలు కొంత ఎక్కువ అలంకారముతో నిండియున్నవి. కాని అవి మైసూరిలోని హొయిసల శిల్పములయంత విపరీతాలంకారములు కలవి కావు. ఈ హొయిసల శిల్పమునకూడ సంప్రదాయము చాళుక్యులదే. కాని అది పూర్వచాళుక్యుల దనుటకంటె పశ్చిమచాళుక్యుల దనుట యుక్తము. పూర్వ చాళుక్యుల శిల్పము అంతగా అలంకారాడంబరము లేనిది. పశ్చిమ చాళుక్యుల శిల్పములో



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అలంకారము బహుళముగా మన్నది. విస్తృతాలంకార భరితమైన హొయిసల శిల్పముతో పోల్చి చూచినపుడు సాదాగ కనుపట్టినను కాకతీయ శిల్పము కేవల మలంకార రహితము కాదని తెలియగలదు. ఇచ్చటి కాకతీయ శిల్పమునకూ తరిమెన పట్టి నునుపెక్కించిన కొమ్మువలె తళతళ మెరయు స్తంభములందు పొందయిన నానావిధనాట్య భంగిమలను విదితపరచు నాసికా విగ్రహములు (చిత్రము. 110 - 9) కలవు. అవి కురువట్టి చాళుక్య దేవాలయమందును, బేలూరు హాళెబీడులలోని హొయిసల దేవాలయములందును కానవచ్చు ఇట్టి నాసికా విగ్రహములను స్మరణకు తెచ్చుచుండును. హొయిసల ప్రాంతములోని నాసికా ప్రతిమల వలె ఈ నాసికా ప్రతిమలు హ్రస్వ స్థూలములుగాక ఒక్కింత నిడుదలుగ నున్నవి; వాని యంతటి అమితాలంకార భరితములు కావు. ఓరుగంటిలో లభ్యమై ప్రకృతము ఢిల్లీ వస్తు ప్రదర్శనశాలయందు భద్రపరుపబడి యుండు ద్వారబంధము మీది పొంపయిన పెద్ద అడ్డుపట్టె (లింటెల్) యొకటి కాకతీయ శిల్పకళ కాదర్శకమయిన యుదాహరణము. ఇందలి మకరతోరణపు చెక్కడపు పని గజిబిజిగా సంకులముగా మన్నది. ఇందు ఇతర ప్రతిమలమాట యటుండ నశేషప్రతిమ మాత్రము మిక్కిలి హృదయ రంజకముగా మన్నది. ఓరుగంటిలోనే దొరకిన నాణెమైన చెక్కడపు పనిగల ఇతర ద్వారబంధములు పనితనమున నిట్టివేయగు బరోడాలోని దభోయి యను ప్రదేశమందలి మధ్య యుగమునకు చెందిన ద్వారబంధములను స్మరణకు తెచ్చు చున్నవి. ఓరుగంటినుండి కొనిపోయి హైదరాబాదు ప్రదర్శనశాలలో ప్రతిష్ఠించిన మండపము కప్పుయొక్కలో భాగము ఇట్టి శిల్పరీతికి రమణీయోదాహరణము. ఓరుగంటిలో నున్నట్లే పాలంపేటలోను, హనుమకొండలోను కాకతీయులనాటి దేవాలయములు కలవు. వీని



చిత్రము. 110 - 9.

స్తంభవాసికమీద నర్తకి, కాకతీయ శిల్పరేఖాచిత్రము, పాలంపేట.

యందును కనులకు విందొనరించు చాళుక్యశైలి శిల్పము కలదు. తెలంగాణాలోని పిల్లలమఱ్ఱి, నాగులపాడు మొదలైన స్థలములలోను, పలనాడులోని మాచెర్ల, గురజాల మొదలైన చోట్లను కాకతీయ శిల్పము లింకను పరిశోధింప వలసినవి ఉన్నవి. కాకతీయ యుగమునకు చెందిన కొన్ని దేవాలయములు హొయిసల దేవాలయములందు ఉన్నతములును, విస్తారము చెక్కడపు పని గలిగినవి యునగు నధిష్ఠానము(ప్లిన్త్)లు గలిగి యున్నవి. అంతేకాక, వానితోపాటు చెక్కడపు పని గల శిలాజవనికలును, పటలములును కలిగి ఖజురాహో వద్దనున్న మహాదేవుని ఆలయమునందును, ఆచుట్టుపట్టులను గల ఇతర దేవాలయములందును నున్న అట్టివానినే స్మరణకు తెచ్చుచుండును. కర్నూలు జిల్లాలోని త్రిపురాంతకమున కొండమీద కాకతీయుల నాటి చక్కని చెక్కడముల తోడి శివాలయ మొకటి కలదు. కొండక్రింద దుర్గ దేవాలయము సమీపమున నున్న వీరశిలల సముదాయమునందు చెక్కడపు పని విస్తారముగ కలదు. వానిలో కొన్నిటియందు జీవకళ యుట్టిపడుచున్నది. త్రిపురాంతకము కొండమీది దేవాలయమునుండి తెచ్చి మద్రాసు వస్తు ప్రదర్శనశాలలో భద్రపరుపబడిన సున్నితమైన పనితనముగల మహిషాసురమర్దని రూపమునమున్న దుర్గావిగ్రహము కాకతీయ శిల్పమునకు మకుటాయమానమైనది.

శిల్పకళలో తరువాతిదశ రెడ్డిరాజులనాటిది. అప్పటి శిల్పులు కాకతీయ సంప్రదాయములనే పాటించుచు వచ్చుటచేత వీరి శిల్ప రచనలకును, కాకతీయ శిల్పములకును విశేష మెన్నదగిన వ్యత్యాసము కానరాదు. పలనాడులోను, గుంటూరు చుట్టుపట్లను పదునాల్గవశతాబ్ది నాటి దేవాలయము లీ దశకు చెందిన శిల్పములను ప్రదర్శించునవి కలవు. కర్నూలు జిల్లాలోని శ్రీశైల



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చిత్రము 1. శిల్పచిత్రాలంకృతమైన ద్వారబంధపు రాతికమ్మి, ఓరుగల్లు



చిత్రము 2
శిల్పచిత్ర ఫలకము, పెద్దముడియము



చిత్రము 3.
మహిషాసుర మర్దని, త్రిపురాంతకము



చిత్రము 4
నరసింహమూర్తి, హంపి

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



శిల్ప ఫలకములు గలవు. ఇచ్చట ఏకాండపు రాతిలో మలిచిన పెద్దనంది అట్టి శిల్పములలో చాల ముఖ్యమైనది. అందమైన రాయవేలూరు కోటలో మంచి పనితనపు దేవాలయ మొకటి యున్నది. అది - ముఖ్యముగా అందలి కల్యాణ మండపము - శిల్ప సంపత్సమృద్ధమై విజయనగర శిల్ప కళాసార సంగ్రహమన నొప్పి యున్నది. గంతులు వేయుచుండు సింహముల వలెను, గుర్రముల వలెను నిర్మింపబడిన సుందర మండప స్తంభములును, జీవకళ యుట్టిపడు నట్లు మంటపోపరిభాగమున చెక్కబడి యుండు కోతులును, పావురములును, లోహముతో చేయబడినవానివలె ధారాళముగా ఊగిసలాడుచున్న రాతి గొలుసులును నిక్కముగ విజయనగర శిల్పమునకు అమోఘమైన యుదాహరణములు. ఈ వేలూరికి సమీపమున నున్న విరించిపురము నందలి మార్గసహాయేశ్వర దేవాలయము సర్వ విధముల దీనిని పోలినదియే. ఇంకను తిరువణ్ణామలై, చిదంబరము, కాంచీపురము మొదలయిన ఇతర ప్రదేశములలో విజయనగర చక్రవర్తులు చక్కని శిల్పముతోడి గోపురములను, మండపములను మారార్లు నిర్మించి యున్నారు. ప్రాయశః దక్షిణదేశమం దంతటను విజయనగర శిల్పాలంకృతము కాని ప్రాచీన దేవాలయములు లేవు.

పెక్కు విజయనగర శిల్పములలో రాజులు, రాణులు, సామంతులు, రాజకుమారులు మొదలయిన దాతల విగ్రహములు కలవు. మధుర, తంజావూరులవంటి ప్రదేశములలో విజయనగర పాలకులకు రాజకీయముగ ఉత్తరాధికారులైన నాయక రాజులు ఈ సంప్రదాయమునే అనుసరించిరి. తిరుమల నాయకుని యొక్కయు, అతని రాణుల యొక్కయు ప్రతికృతులు మిక్కిలి మనోహరములైన గండరువులు. ఈ యర్వాచీన శిల్ప వికసనమును చక్కగా గ్రహింపవలెనన్న తత్పూర్వకాలము నందలివగు తిరుపతి కొండమీది వేంకటేశ్వర దేవాలయ ముఖమంటపమున నెలకొలుపబడి పేరులతోనున్న శ్రీకృష్ణదేవరాయల యొక్కయు, వారి రాణుల యొక్కయు, వేంకటపతి రాయల యొక్కయు కంచు పోతవిగ్రహములను పరిశీలింపవలసియుండును. ఈ విగ్రహములు తమ నాణెములమీద వేంకటేశ్వర ప్రతిమను ముద్రించి, తమ నాటి దారుశిల్ప వైభవమును కొంచెమైనను మనకు వేడు చూపునట్టి దేవాలయ ధ్వజస్తంభమును వరాహ లాంఛనముతో నిర్మించి, ఏభగవంతుని తాము యావజ్జీవము సేవించిరో ఆ యేడు కొండలవానికి భక్తి పూర్వకముగా నమస్కరించుచున్నట్లున్నవి. ఆంధ్ర దేశమందలి శిల్పకళా పరిణామమందు కడపటిదశ విజయనగర రాజులది. వారి తర్వాత కళలో క్షీణదశ ప్రారంభమైనది.

ఆధునికుల కళ చేతగాని పనియై పూర్వుల పనికి దిగదుడుపుగా నున్నది.

సి. శి.



చిత్రము 111. బుద్ధుని మహాభినిష్క్రమణము, నాగార్జునకొండ

http://sanskritcentral.com/

http://teluguthesis.com/

# ఆంధ్ర చిత్రకళ

ఆంధ్ర చిత్రకళ అనిన కళాభిజ్ఞునకు ఎంత యానందమో చరిత్రకారునకు అంత నిర్వేదము. సృష్ట్యాదినుండి కాలక్రమముగా నేటివరకు అది పొందుచు వచ్చిన పరిణామమును వర్ణింప బూనుకొన్న ఐతిహాసికునికి ఎదురయ్యెడి వన్నియు కష్టములే. దాని నిర్వచనమే ఒక సమస్య.

చిత్రలేఖన చరిత్రకు గల ఆధారములు మూడు: వ్యక్తి, స్థలము, శైలి. ఈ మూడింటిలో నే యొకదాని నైనను పురస్కరించుకొని ఆంధ్ర చిత్రకళ యొక్క ప్రకృతిని, స్వరూపమును నిర్ణయింప తలపెట్టవచ్చును. ఒకటి- వ్యక్తి పరముగా చూచిన ఆంధ్ర చరిత్రకారు లందరు సృజించిన చిత్ర సముదాయ మంతయు కలసి 'ఆంధ్ర చిత్ర కళ' అని మన మూహింపవచ్చును; రెండు-స్థల పరముగా చూచిన, దానిని ఆంధ్రావనిలో ఉత్పన్నమైన చిత్రకళాక్రియ యని నిర్వచింప వచ్చును; మూడు-శైలినే ప్రధానముగా తీసికొనినచో, ఒకానొక గుణ విశిష్టతను-'ఆంధ్రత్వము'ను-చేకూర్చు ప్రత్యేక లక్షణములుగల చిత్రకళా సంప్రదాయమని దాని కర్థము చెప్పవచ్చును.

ఇట్లు అన్ని విధముల తృప్తికరముగ తీర్చి దిద్దిన నిర్వచనమునకై అన్వేషించుట విమర్శకున కుత్సాహ జనకమే. కాని అది సాధారణముగా వ్యర్థ ప్రయత్నము. పై నుదాహరించిన ఆధార త్రయమును దృష్టియం దుంచుకొని చూచిన యెడల చరిత్రకారుని కృషి కొంతవరకు సులభసాధ్యమై, శిష్ట జనావళియొక్క ఆమోదమును పొందగలదేమో!

ఆంధ్రము కళలకు పుట్టినిల్లనియు, కళా ప్రపంచములో భారతీయ శిల్ప సంపద ఖ్యాతి గాంచుటకు ముఖ్య కారణము ఆంధ్ర శిల్పులు రచించిన కళారచనలే అనియు నోరు నొవ్వగా పొగడికొనుట మన దేశములో పరిపాటియైనది. చరిత్ర దృష్టితో సత్యాసత్యము లరయక, ఆంధ్ర కళా వైభవమును పేర్కొనిన వెంటనే అజంటాలోని అవలోకితేశ్వర చిత్రమును, అమరావతిలోని అపరూప శిల్పములను, ఎల్లోరాలోని కైలాసాలయమును, హంపిలోని ఉగ్ర నరసింహ విగ్రహమును, లేపాక్షి బసవయ్యను, నేటి కింకను మిగిలి యున్నట్టి వాస్తు, శిల్ప, చిత్రకళా ఖండము లనేకములను దండకముగా స్తుతించుట సామాన్యమైపోయినది.

కాని యథార్థమునకు ఆంధ్ర శిల్పు లెవరు? వారి యూరు పేరు లెట్టివి? వా రేనాటివారు? వారి ప్రతిభ ఎట్టిది? వారి శైలిలోను, పనితనములోను గల విశేషము లెట్టివి? అని ప్రశ్నించుట గాని, ఆ ప్రశ్నలకు సహేతుకముగా సమాధానము లిచ్చుట గాని సామాన్యము కాలేదు; పరిపాటియును కాలేదు. ఈ సందర్భమున పరిశోధన కెంతయో అవకాశమును, ఆవశ్యకమును కూడ కలవు.

అజంటా చిత్తరువులను రచించిన కళాకారులు చరిత్ర దృష్టితో చూచిన ఏ జాతివారో నిర్ణయించుటకై మీమాంసలు, సిద్ధాంతములు, పూర్వ పక్షములు ఎన్నియో జరిగి యున్నవి. వీనియొక్క సారాంశ మేమన, ఈ విషయమున నెట్టి నిశ్చితాభిప్రాయము నేర్పడక పోవుటయే. అజంటా గుహలు చిత్రకళా పేటిక అనుట యెంత సత్యమో అవి భారతీయుల సమష్టి శిల్ప సంపద యనుటయు నంత సత్యమే. సాతవాహనులు, వాకాటకులు, బాదామి చాళుక్యులు మొదలైన ప్రాచీన రాజ వంశీయు లందరు దానిలో భాగస్వాములే. [illegible] ఆంధ్రులు, కన్నడులు, మహారాష్ట్రులు, కొందరు కొత్తరాహులును ఈ శిల్పలక్ష్మి యంతయు తమ తమ ప్రత్యేక పిత్రార్జితమే యని చేయునట్టి వాదము అసహజము కాదేమో కాని, ఐతిహాసిక దృష్టితో ప్రత్యక్ష ప్రమాణములచే నిశ్చయింపబడిన హక్కు మాత్రము కానేరదు.

ప్రాచీనాంధ్ర చిత్రకళా సౌభాగ్యము కావ్య వస్తువై, కథయై, కలయై పోయినది. అప్పటి ఆంధ్రాలేఖ్యములు భారతీయ చిత్రకళా చరిత్రలో సువర్ణాక్షరములతో వర్ణింపబడి యుండుట నిర్వివాదాంశము. కాని ఈ స్తుతి పాత్రములైన చిత్రములు ఒకటి రెండు అజంటా గుహలలోను, లేపాక్షి సోంపల్లి కాంచీపురములలోని దేవాలయములలోను శిథిలములుగా, ఛాయలుగా సకృత్తుగా నున్నవనుట మాత్రము విస్మరింపరాదు.

తలపెట్టిన విమర్శ విషయము ఘనమైనది. కాని దాని కాధార భూతమైన శాస్త్రాంశము లతి స్వల్పములు. గతించిన స్వర్ణ యుగములలో ఆంధ్రమునం దెల్లెడల హృదయంగమములైన చిత్తరువులు కొల్లలుగా వెల్లివిరిసి యుండవలయును. కాలగర్భమున వానిలో ననేకము లీనమై పోయినవి. ఆనాటి చిత్రకళయే మరుగున పడినది.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



దొరకిన ఆధారములనుబట్టి చూచినచో తెలుగు నాడులో చిత్రకళాప్రవంతి నాటినుండి నేటివరకును నిత్య ప్రవంతియై, నిండుగా నిరంతరాయముగా ప్రవహించినదని చెప్పుట సత్య విరుద్ధము. సాతవాహన, విజయనగర వంశీయుల కాలమున నది వెల్లువయై పొంగి పొరలినదనుట నిశ్చయము. ఇక్ష్వాకు, విష్ణుకుండి, శాలంకాయన, పూర్వచాళుక్య, కాకతీయ, రెడ్డి రాజుల కాలమునం దది ఎట్లుండెనో వర్ణించుట కష్టము. అదియును గాక, ఈ చిత్రలేఖన క్రియ క్రీస్తు పూర్వము మూడవ శతాబ్దమునుండి క్రమముగా దిన దిన ప్రవర్ధమానమై ఈ యాధునిక యుగమున నూర్ధ్వ ముఖముగా పోయి పరాకాష్ఠను చేరబోవుచున్నదని చెప్పుట నిరాధారమైన వాద మగును. అజంటా గుహలలోనే అది లక్ష్యసిద్ధి పొంది, ఉచ్చ స్థితికి వచ్చినదేమో. అటు పిమ్మట సంభవించిన దంతయు క్షీణ దశ యగునేమో యని తలచుటకుమాత్రము అవకాశము, కారణములు కన్పించుచున్నవి. అయినను మన మొకటి జ్ఞప్తియం దుంచుకొనవలయును. మన కిపుడు కానరాకపోయినంత మాత్రమున ఆలేఖ్యము లభావము లని యెంచుట తగదు. కానరాకపోవుటయు, లేకపోవుటయు నొక్కటి కాజాలవు.

పూర్వ రాజ్య మస్తమించుటకును, నూతన రాజ్య ముదయించుటకును మధ్య గల దీర్ఘ సంధ్యలు చిత్రలేఖనమువట్ల గ్రహణ సమయము లయ్యెను. మరియు విజాతీయుల దండయాత్రల వలన దక్షిణ భారతీయుల సిరులు తొలగిపోయెను. కళాక్షేత్రములు నాశనము లయ్యెను. ఆయా కాలములకు చెందిన నిదర్శనములు లభింపకపోవుట చేత చిత్రలేఖనక్రియ జరగుచుండెనా లేదా యనుట విచారణీయ మయినది. కావున దానిని గూర్చి నిశ్చితాభిప్రాయ మిచ్చుట సమంజసము కాదు. క్రీస్తు శకము మూడవ శతాబ్దాంతము, నాలుగవ శతాబ్దపు మొదటి భాగము, పదునొకండవ శతాబ్దపు కడపటి పాదము, పదునెనిమిదవ శతాబ్దపు రెండవ భాగమును ఆంధ్రమున చిత్రలేఖన చరిత్రలో అంధకార యుగములేమో యని తోచుచున్నది.

దేవభవన వాస్తువు ప్రధానమైనదిగాను, దానికి శిల్ప చిత్రలేఖనము లాంగికములుగాను పరిగణించుట ప్రాచీన భారతీయ శిల్పసూత్రములలో నొకటి యనవచ్చును. కనుక దేవళములకు చిత్రము లలంకార ప్రాయము లయ్యెను. ప్రాచీన భారతమున ఐతిహాసికునకు ప్రథమమున గోచరము లైనవి భిత్తిచిత్రములు. వీనిలో చాల వరకు మత ప్రేరితములు; వాని యందలి వస్తువు ఆధ్యాత్మికము; వాని ప్రయోజనము దైవారాధనమే. మరికొన్ని సామాజిక చిత్రములు; వాని యందలి వస్తువు ఐహికము; ప్రయోజనము జన వినోదమే. ఏది యెట్లున్నను, ఈ చిత్రావళి రచనా పద్ధతిలోని ప్రధాన లక్షణ మలంకారము. అవి యన్నియు రంగుల రంగవల్లులే యని సూక్ష్మముగా తెల్పవచ్చును. రాను రాను వాస్తువు నుండి శిల్ప, చిత్రలేఖనములు విడివడి స్వాతంత్ర్యమును, వ్యక్తిత్వమును గడించినవి. ఆలేఖ్యములు దారు ఫలకముల మీదను, కాగితముల మీదను, కాన్వాసుల మీదను వ్రాయబడుచు వచ్చెను. వానియందలి వస్తువు అంతకంతకు ఐహికమును, సామాజికమును అయినది. ఈ మార్పులు మధ్యయుగముల నుండి సంభవించినట్లు కానవచ్చు చున్నవి.

పై నుదాహరించిన సూత్రమును, పరిణామమును తెలుగునాడులోని చిత్రలేఖనము పట్ల సంపూర్ణముగ వర్తించును.

ఆంధ్ర శిల్పమున మరొక్క విశేషము కానవచ్చును. శిల్పదృష్టితో కళాకారుడు పోయిన మార్గము మధ్య మార్గము. అతడు సర్వత్ర 'అతి' వర్జించినవాడు. తత్ఫలితముగా అతని కళా సృష్టిలో నొకానొక సమరసభావము చూపరులకు విస్పష్టమగును. అసహన మెరుగని అతని ప్రకృతియే దీనికి మొదటి కారణము. పారశీక, గాంధార, మధుర, సాంచి, పాటలి, కాంగ్రా, మొగలాయి, వంగ, పాశ్చాత్య సంప్రదాయముల యందలి సుగుణములను అతడు పుణికి పుచ్చుకొని యున్నాడు. రెండవ కారణము భరతవర్షమున భూగోళశాస్త్ర దృష్ట్యా ఆంధ్ర మాక్రమించినది మధ్యస్థానము. కల్యాణి, ప్రతిష్ఠానపురము, ధరణికోట, వేంగి, ఏకశిలానగరాది కేంద్రముల ద్వారా ఉత్తరదక్షిణముల నుండియు, భరుకచ్ఛ, సోపార, మచిలీపట్టణాది కరపట్టణము(రేవు)ల ద్వారా విదేశముల నుండియు వర్తకపు రహదారులతోపాటు విజ్ఞాన మార్గములును పడినవి. ఆంధ్ర సంస్కృతి ఇచ్చి పుచ్చుకొనుటలో గడితేరినది. మూడవ కారణము చరిత్ర. తెలుగు గడ్డలో వివిధ జాతులు, వివిధ నాగరికతలు ఒరసికొని, కలిసి మెలిసి పోయినవి. మొదట శక, యవన, పహ్లవులు, పిమ్మట అరబ్బీ, పారశీ, అఫ్గాను, మొగలాయిలు, తుదకు యూరోపియనులు వచ్చిరి. వారితోపాటు వారి భాషలు, వాఙ్మయములు, కళలును ఇచటికి వలస వచ్చినవి. అవి యన్నియు మథనము కాగా నుత్పత్తియైన అమృత సారమే ఆంధ్ర సంస్కృతి.

ఇచట మరొక సూక్ష్మవిషయమును విశదీకరింప వలసి యున్నది. చిత్రలేఖన దృష్టిలో 'భారతీయ సంప్రదాయ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/





చిత్రము 112.

శైలీ సాదృశ్యములు













అమరావతి



అజంటా



అమరావతి



అజంటా

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ముండిన నుండవచ్చును కాని 'ఆంధ్ర సంప్రదాయ' మున్నదా అని కొందరు విమర్శకుల సంశయము; లే దనియే వారి తాత్పర్యము. కాని శిల్పచరిత్రలో పూర్వము 'అమరావతి', 'పల్లవ', 'చోళ', 'హొయి సల', 'విజయనగర' ఇత్యాది సంప్రదాయము లున్నట్లు ఐతిహాసికు లుదాహరించు చున్నారు. వీని కన్నిటికిని సన్నిహిత సంబంధ మధికము. అయినను వేర్వేరుగా వీనిని గుర్తించుట కనువగు కాల, స్థానిక సందర్భ రచనా ప్రభావములచే కల్గిన లక్షణ విశేషము లున్నవి. అమరావతి, శ్రీపర్వతము (నాగార్జునకొండ) లందలి కళాకృతి 'ఆంధ్ర సంప్రదాయము'నకు సరియైన ముచ్చు తునక యని గుర్తింప వచ్చును. ఈ పరమావధిని చేరుటకే పెక్కండ్రు ఆంధ్ర శిల్పు లున్ముఖులై యున్నా రనియు గ్రహింపవచ్చును.

భారతదేశమున బౌద్ధ మవతరించుటయు, చిత్ర లేఖన మారంభ మగుటయు నేకకాలమందు సంభవించె ననుట సరికాదు. కాని, ఆంధ్రము పట్ల ఇది సంభవమని యూహించుట కవకాశ మున్నది. సాతవాహనుల యాదరణ ఫలితముగ బౌద్ధము తెలుగుదేశమున వ్యాపించెను. అప్పటినుండి బౌద్ధమును, ఆంధ్ర శిల్పమును ఒండొంటితో పెనవేసికొని పోయినవి. ఇప్పటికిని ఆంధ్రాలేఖ్యములలో స్ఫుటముగానో, ఛాయగానో బౌద్ధ సంప్రదాయము స్ఫురించుచునే యున్నది.

మనకు తెలియవచ్చిన ప్రాచీన వర్ణ చిత్రములలో అజంటాలోని 9, 10 సంఖ్యల గుహలలోనివి మొట్టమొదట వ్రాసినవి. పదవ సంఖ్యగుహ క్రీ. పూ. రెండవ శతాబ్దము నాటిదని అందు కానవచ్చు రెండు బ్రాహ్మీ శాసనముల లిపి నాధార పరచుకొని ఆచార్యుడు ల్యూడర్స్ అభిప్రాయ పడుచున్నారు. ఈ గుహలలోని యాలేఖ్యములను వ్రాసిన శిల్పులు సిద్ధహస్తులు. ఆ యాలేఖ్యములందు కానవచ్చు కళానైపుణ్య మప్పటి కళాభివృద్ధికి నిదర్శనము. కనుక భారతీయు లప్పటికి కొన్ని శతాబ్దములకు ముందు నుండియు కళాకృషిని నెరపుచుండుట వాస్తవమే.

క్రీ. శ. 1608 ప్రాంతమున 'భారతీయ బౌద్ధ చరిత్ర'ము వ్రాసిన తారానాథుడు పూర్వకాలమున పారంపర్యముగ చిత్రలేఖన క్రియ కొనసాగె ననియు, కళా సంప్రదాయము తత్పూర్వ మున్నదాని కనుబంధముగ వచ్చుచుండె ననియు తెలిపియున్నాడు. కాని క్రీ. శ. 8 వ శతాబ్దమున చిత్రకళ క్షీణదశలో నుండెనని సూచించియున్నాడు.

వేర్వేరు కాలములందు, వేర్వేరు ప్రదేశములందు వర్ధిల్లిన చిత్రకారులు ఒకరి కళాసూత్రములను, మర్మములను, మెలకువలను, రచనా పద్ధతులను, వర్ణములను ఇంకొకరు రమకరించుచుండిరి. కనుకనే విక్రమసింఘ్ వంటివా రన్నట్లు బాఘ్, అజంటా, సిత్తన్నవాశల్, సిగిరియా గుహలలోని చిత్రములలో పరస్పరము సన్నిహిత బాంధవ్యము గోచరించును. వానిలో నే రెండైనను కవలు కాకపోయినను ఏక సంప్రదాయ జనితముల ట్లగుపడును.

మరి రెండు విశేషముల నిచట గమనించుట అవసరము. తారానాథుడు చెప్పినట్లు పూర్వమున ఒక్క శిల్పియే విగ్రహకారుడును, చిత్రకారుడును అయి యుండుట సర్వసాధారణమై యుండెను. తన్మూలమున ఈ కళలు రెండింటి మధ్యను పరస్పర సంపర్కమును, సామరస్యమును ఏర్పడు చుండెడివి. కావున లభించిన శిల్పాకృతులనుబట్టి ఆనాటి వర్ణచిత్ర స్వరూపములను కొంతవరకు నూహింపవచ్చును. మరియును విక్రమసింఘ్ విమర్శకుడు నిరూపించినట్లు గోడలపై వ్రాసిన అప్పటి బొమ్మను ఫలకముల మీదగాని, గ్రంథములలో గాని వ్రాసిన బొమ్మతో పోల్చి చూచిన మొదల నొకదాని ప్రభావము రెండవ దానిపై నుండినట్లు తెలియవచ్చు చున్నది. ఆంధ్రభిత్తి చిత్రములు విస్తారముగ లభింపక పోవుట యొక తీరని కొరతయే యగును. అయినను పై నుదాహరించిన విశేషములను గ్రహించిన మొదల చిత్రలేఖన స్వరూపమునుగూర్చిన చరిత్రకారుని కృషి కొంతవరకు సఫలము కాగలదు.

అజంటా గుహల రాజపోషకులు సాతవాహనులు, వాకాటకులు, బాదామి చాళుక్యులును. వానిలో బౌద్ధ, వైదిక, జైనమత ప్రభావములు ప్రతిబింబించి యున్నవి. కనుక నిచటి శిల్పసంపదలో కొంత వైవిధ్యమును, విభిన్నతయు తప్పని సరియైనది. పైగా వీనిలోని వర్ణచిత్రముల కళానైపుణ్య మొకచే స్థాయికి చెందినది కాదు; భిన్నదశలు పొడకట్టుచున్నవి. కాని సుమారు తొమ్మిది వందల యేండ్లకాలములో జరగిన ఈ కళాకృషిలో కొంత క్రమాభివృద్ధియును, ఆదినుండి వరుసగ అంతిమ చిత్రముల వరకు రచనా సాంకేతి కాత్మకమగు సంబంధమును నున్న ట్లగుపడును. పదవ సంఖ్య గుహలోని 'బోధి వృక్షపూజ' చిత్రమును, మొదటి సంఖ్య గుహలోని 'బోధిసత్వ పద్మపాణి' చిత్రమును జాగ్రతగ పరిశీలించిన నీ విషయము స్పష్టము కాగలదు. ఇందు మొదటిది భారతీయ చిత్రకళలో వేగుచుక్కవంటిదయిన మొదల రెండవది ఆసియాఖండపు చిత్రసముదాయ మంతటికిని మకుటప్రాయ మనవచ్చును.

పదవ సంఖ్య గుహ అత్యంత ప్రాచీనమైనది. ఇది ఆంధ్ర సాతవాహన కాలములో నొకరిచేత నిర్మితమైన దగుట



http://sanskritcentral.com/

http://teluguthesis.com/





'షడ్దంత' జాతకము, అజంటా, పదవ గుహ. మృగయులు 'షడ్దంతు'ని (బోధిసత్త్వుని), అతని యూథమును పొంచిచూచుట.

http://sanskritcentral.com/

http://teluguthesis.com/

నిశ్చయమని ముకుళ చంద్రదేవుని యభిప్రాయము. దీనిని బలపరచు నొక యంశమును విమర్శకుడు వెంకటాచలము ప్రతిపాదించి యున్నాడు. క్రీస్తు పూర్వము మొదటి మూడు శతాబ్దములలో దక్షిణాపథముపై ఆంధ్రులు సామ్రాజ్యాధిపత్యమును వహించి యుండుటచేతను, అజంటా గుహలలోని ఒకదానియందు గౌతమీపుత్ర చక్రవర్తి నామము చెక్కబడి యుండుటచేతను ఇచటి కుడ్యవర్ణ చిత్రములను వ్రాయుటకు వినియోగింప బడిన శిల్పులు ఆంధ్రులే యగుదురు.

తొమ్మిది, పది సంఖ్యల గుహలలోని ఎడమ ప్రక్క గోడలపై వ్రాయబడియున్న చిత్రములు క్రీ. పూ. చివరి రెండు శతాబ్దములకు చెందినవని చెప్పుదురు. భారతీయ వర్ణచిత్రము లన్నిటిలోను ఇవి బహు పురాతనములైనను వీనిలో ప్రకటితమైన శిల్పము పరిణత స్థితిలో నుండుట ఆశ్చర్యకరము. పదవ గుహలోని చిత్రమునందలి వస్తువొక బౌద్ధ గాథ: ఎడమ ప్రక్కన ఒకానొక రాజు సపరివారుడై బోధివృక్షమును పూజించుచున్నాడు; కుడి ప్రక్కన పదునైదుగురు జనముతో కూడిన ఒక నాట్యమేళ మున్నది. ఇహపరములు రెండును ఇట ప్రదర్శితములైనవి. ఆవేశమును, సాధుత్వమును ఒకే సమయమున వ్యక్తపరచుచు ఈ యాంధ్ర చిత్రకారు దద్భుతమగు నైపుణ్యమును చూపియున్నాడు.

ఈ గుహలోనే కుడివైపు గోడమీద షడ్దంత (ఛద్దంత) జాతకము చిత్రింపబడి యున్నది. ఇది క్రీ. శ. రెండవ శతాబ్దమునకు చెందినదని కళావిదుల యభిప్రాయము.

ఇదియును ఆంధ్ర శిల్పులు వ్రాసినదే యనుటకు బలమగు నిదర్శనము లున్నవి. ఒకటి - 'బోధివృక్షపూజ' లోను, 'షడ్దంత జాతకము'లోను దర్శితమైనది హీనయాన బౌద్ధమే; రెండు - ఈ చిత్రములలోని వ్యక్తులు శక, ద్రావిడ ముఖాకృతులు, వైఖరులు కలవారు. మూడు ఆంధ్ర శిల్పులు క్రీస్తు పూర్వమునను, క్రీస్తుశకము రెండవ శతాబ్దములోను కూడ వాడిన వర్ణము లొకటే - హరితాళము, మంజిష్ఠము, నీలిమ, హారిద్రము, సున్నపు తెలుపు, లక్కరంగు, దీపపు మసి.

ఈ నాలుగు వందల ఏండ్లలో ఆంధ్ర చిత్రకారులు కనబరచిన మానసిక సాంకేతికాభ్యుదయ మెట్టిది? పదవ సంఖ్య గుహలోని ఎడమ, కుడి గోడలమీది బొమ్మల రెండింటితో పోల్చి చూచిన ప్రకృతి పరిశీలన మందును, పశుపక్ష్యాది చిత్ర రచన యందును, భావప్రకటనము నందును - ముఖ్యముగ భక్తి కరుణాది రసావిష్కరణము నందును, నాగరిక ముద్రగల భూషణములతో గైసేయుట యందును క్రీస్తు శకము రెండవ శతాబ్దము నాటికి ఆంధ్ర చిత్రరచనా నైపుణ్యము మిన్నుముట్టినదని చెప్పక తప్పదు.

ఆంధ్ర చిత్రకారు దర్వాచీన దక్షిణ భారతీయ చిత్రకారు లందరకును మార్గదర్శి. వా రందరును అతడు పెట్టిన యొరవడినే యనుసరించి దేశ కాల పరిస్థితులవలన సంప్రాప్తమగు మార్పులను తమ పద్ధతిలో నిముడ్చుకొనుచు పోయిరి. భారతీయ చిత్ర కళకు రేఖ ప్రాణము. షడ్దంత జాతక చిత్రములో ఏనుగుల గుంపును వ్రాసిన శిల్పి యొక్క రేఖా రచనా నైపుణ్యము తేటతెల్లమే కదా!

భారతీయ శిల్పమునకు చైతన్యము ప్రధానము; స్తంభిత జగత్తునకు దానిలో తావు లేదు. పైని చెప్పిన జాతక చిత్రములో ఆరు దంతముల యేనుగును చూచి మూర్ఛపోయిన రాకుమారి దృశ్యము ఒక రూపకమే అనవచ్చును. ఉచ్చస్థితిలో నున్నప్పటి భారతీయ శిల్పములో సహజత్వము ప్రస్ఫుటముగ కానవచ్చు సుగుణ సంపద. ప్రాచీనాంధ్రు డెన్నడును అసహజములు, నిర్జీవములునగు చిత్రములను వ్రాయలేదు. సౌకుమార్యము శిల్ప ప్రాభవమున కొక గుర్తు. అజంటాయందలి స్త్రీమూర్తులు పెక్కులు ఈ విషయమున మేలుబంతు లనవచ్చును. చైతన్యము, సహజత్వము, సౌకుమార్యము అను లక్షణత్రయ మధికముగ కానవచ్చుటచేతనే కాబోలు, ఫెర్గూసన్ అను కళా విమర్శకుడు అమరావతీ స్తూపమందలి చెక్కడములు భారతీయ శిల్పమునకు పరమావధి అని వచించెను.

వాస్తవముగ అజంటా శిల్పము — కనీసము దాని యందలి ప్రథమార్ధ భాగము — ఆంధ్ర శిల్పమని యాజ్దానీ మహాశయుని సిద్ధాంతము. షడ్దంత జాతక చిత్రమందలి శిల్పమునకును, అమరావతీ శిల్పమునకును సాదృశ్యము అద్భుతముగ ఉన్నట్లు ఆయన నిరూపించినాడు. ఇవి రెండును ఒకటే కాలమునకు చెందినవి కదా! దీని నంతయు బట్టి చూడ మనకు ఒక సారాంశము తేలుచున్నది. క్రీ. పూ. మొదటి రెండు శతాబ్దములనాటి, కొంధాన, కార్లె మున్నగు స్థలము లందలి చైత్యముల లోని వాస్తు, శిల్పము లెట్లు దిన దిన ప్రవర్ధమానములై మూడు నాలుగు వందల యేండ్లలో అమరావతీ స్తూపమున పరిపూర్ణతను పొందినవో అట్లే చిత్రలేఖనమును అభివృద్ధి చెంది యుండవలయును. కాని ఇది పట్టి యూహయే; సిద్ధాంతము కాదు.

అజంటా గుహలలో బాదామి చాళుక్య, వాకాటకాది రాజుల ప్రోత్సాహము వల్లను, సిత్తన్నవాశల్ గుహలో పల్లవ ప్రభువుల ఆదరణ మూలమునను, సింహళములో సింహగిరి పైనను రచింపబడి యుండు కుడ్యవర్ణ



http://sanskritcentral.com/

http://teluguthesis.com/

చిత్రములలోని రేఖారచన, మూర్తుల భంగిమ, గుంపుల కూర్పు, ముఖ్యముగ ప్రకృతి చిత్రణమును ఆంధ్ర శిల్పమును తప్పక జ్ఞప్తికి తెచ్చును. మొదటి సంఖ్య అజంటా గుహలోని 'పారసీక రాజు ఖుస్రూయొక్క రాయబారము' అను చిత్రముపైనను, ఒకటవ రెండవ సంఖ్యల గుహలలోని 'పద్మపాణి', 'అవలోకితేశ్వరుడు' చిత్రముల పైనను, సిత్తన్న వాశల్ లోని 'పద్మముల కొలను' అను చిత్రముపైనను, సింహగిరి ముఖమండలి 'కళ్యాణ మహారాజు రాణుల' చిత్రములపైనను ఆంధ్ర చిత్రకళా ప్రభావ ముండిన ట్లనిపించును. ఇట్టి భావము కల్గుట సహజమే. ఆనాటి విమర్శకుల రచనలు కాని, ఇతర చారిత్రికాధారములు గాని ఈ విషయమున సిద్ధాంతము చేయుటకు లభింపలేదు. అయినను పూర్వ మనుస్యూతముగ వచ్చు శిల్పాచారములను, శిల్ప సూత్రములను కళా కుశలులు పాటించుచు వచ్చుట చేతను, సిద్ధహస్తులగు శిల్పులను దేశదేశముల రాజులు రప్పించి గౌరవించుచు వచ్చుటచేతను పైని చేసిన యూహ కేవలము నిరాధారము కాదేమో.

అజంటా, అమరావతులయందలి ఆంధ్ర శిల్పము యొక్క ప్రభావము నలు దిక్కుల కెట్లు ప్రసరించెనో అట్లే ఉత్తర భారతమునుండియు, విదేశములనుండియు శిల్ప సంప్రదాయ ప్రవంతులు ఆంధ్ర దేశము మీదను ప్రవహించి యుండవచ్చును. పూర్వ కాలమున భారతీయ శిల్ప, చిత్ర కళలపై పారసీక, యవన సంప్రదాయముల ప్రభావము కానవచ్చుచున్నదని విన్సెంటు స్మిత్తు సిద్ధాంతము చేసియున్నాడు. సుగుణ మెచ్చట నుండినను గ్రహించి స్వీకరించుట సజీవమైన కళకు లక్షణము.

సుమారు క్రీ. శ. 2వ శతాబ్ది ఉత్తరార్ధములో శాతవాహనవంశ మస్తమించిన తరువాత తెలుగు దేశమును పరిపాలించిన రాజులు ఇక్ష్వాకు, బృహత్పలాయన, శాలంకాయన, విష్ణుకుండి, పల్లవ వంశీయులు. ఈ రాజ వంశములలో మొదటి నాలుగు వంశములు అంత మొందునాటికి క్రీ. శ. 7 వ శతాబ్దపు మొదటిపాద మయ్యెను. పల్లవులు పదవ శతాబ్ది ప్రారంభమున కొంతకాలము కృష్ణకు దక్షిణమునున్న ప్రదేశమును పాలించిరి. పిదప తూర్పు చాళుక్యులు, పశ్చిమ చాళుక్యులు, కాకతీయులు తెలుగు దేశమును పరిపాలించిరి. పశ్చిమ చాళుక్యులను ఆంధ్రేతరులని మినహాయించిన మొదల తక్కిన వంశములవారి రాజ్యకాలమున చిత్రకళా పరిస్థితి యెట్లుండెనో స్పష్టముగా వ్రాయుటకు వీలు కాకున్నది. ముఖ్యముగా కాకతీయ ప్రభువులు విశాల సామ్రాజ్యమును వైభవముతో పాలించుచు కళల నత్యాదరముతో పోషించిరి. వారి కాలపు దేవాలయ వాస్తు విద్య యందలి అసాధారణ ప్రజ్ఞను తెలుపు నిదర్శనము లనేక మున్నవి. అపు డాంధ్ర చిత్రకళ అనాదృతమై యుండునా?

క్రీ. శ. 7 వ శతాబ్దము నుండి 16 వ శతాబ్దము వరకును దక్షిణాపథమున చిత్రకళా చరిత్రలో అంధకార యుగమని ఒకప్పు డనుకొనుచుండిరి. కాని ఇటీవల సిత్తన్నవాశల్, కాంచీపురము, తిరువాంకుళము, తంజావూరు మొదలైన స్థలములలో కుడ్య వర్ణచిత్రములు వెలువడుటచేత పై అభిప్రాయము పొరపాటనియు, క్రీ. శ. 12 వ శతాబ్దము వరకు అవిచ్ఛిన్నముగ చిత్రకళా రచన సాగుచునే యుండెననియు కళాచరిత్రకారులు స్థిరపరచియున్నారు. క్రీ. శ. 12, 14 వ శతాబ్దముల మధ్య ఈ కళ యెట్టి స్థితియందుండెనో తెలియరాకున్నది.

విజయనగర చిత్రకళ కేవలము దేశీయము, స్వచ్ఛము. అచటి కళలో ఉత్తరమునుండి వచ్చిన మునల్మానుల యొక్కయు, విదేశములనుండి వచ్చిన పాశ్చాత్యుల యొక్కయు సంప్రదాయముల సంపర్కము లవలేశమైనను కానరాదు.

జినకంచిలోని వర్ధమాన గుడియందలి జైన చిత్రములు రెండవ హరిహరరాయల కాలమునకును (క్రీ. శ. 1877 - క్రీ. శ. 1404), ఆనెగొంది ఉచ్చయప్ప మఠములందలివి కొన్ని చిత్రములును, హంపి విరూపాక్షస్వామి దేవాలయములోని చిత్రములును క్రీ. శ. 15 వ శతాబ్దమునకును, కాంచీపుర వరదరాజస్వామి దేవళమునందలివి క్రీ. శ. 1509 - క్రీ. శ. 1529 నడిమి కాలమునకును, లేపాక్షి చిత్రములు సుమారు క్రీ. శ. 1585 నకును, సోంపల్లి చెన్నకేశవాలయ చిత్రములు క్రీస్తు శకము 16 వ శతాబ్ది మధ్య భాగమునకును చెందియున్నవి.

వీని యన్నింటిలోను ఆనెగొందిలోని చిత్రములును, విరూపాక్ష, వరదరాజ స్వాముల యాలయములలోని చిత్రములును అత్యుత్తమము లైనవి. ఆ కాలము చిత్రలేఖనమునకు అభ్యుదయదశ. లేపాక్షి, సోంపల్లెలలోని చిత్రసముదాయము పై వానికి ప్రావీణ్యమందును, శైలి యందును తీసిపోవుచున్నది. ఈ చిత్రములు చిత్రలేఖన పతనారంభ దశను సూచించును.

కృష్ణదేవరాయల కాలమున (క్రీ. శ. 1509 - క్రీ. శ. 1530) వచ్చియున్న డొమింగ్ పేయస్ అను పోర్చుగీసు యాత్రికుడు రాయలవారి యొక్కయు, వారి తండ్రి యొక్కయు పురుష పరిమాణము గల శిలాప్రతిమలను చూచియుంటినని వ్రాసియున్నాడు. వారి దేహచ్ఛాయను తెల్పుటకొరకనువగు వర్ణములను పై ప్రతిమలకు పూసి



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వానికి జీవకళ కల్గించినారట. రెండవ వెంకటపతి రాయల కాలమున (క్రీ. శ. 1586 - క్రీ. శ. 1614) ఆస్థాన చిత్రకారు లెందరో యుండి రనియు, కాని విదేశీయ జెసూయిట్ శిల్పులకన్న వారు కళానైపుణ్యములేనివా రనియు ఫాదరు హీరాస్ వ్రాయుచున్నాడు. విజయనగర రాజుల కాలములో సామాన్యగృహములు పౌరాణిక చిత్రపటములతోను, వేశ్యలయిండ్లు శృంగార చిత్రములతోను అలంకరింపబడి యుండుట సర్వసాధారణమని చరిత్రకారుడు యన్. వెంకటరమణయ్య యభిప్రాయము.

లేపాక్షిలోని బ్రహ్మాండమగు దేవాలయము విజయనగరాధీశు డచ్యుతదేవరాయల సామంతుడైన పెనుగొండ విరూపణ్ణనాయకుని చే నిర్మింపబడినది. ఈ దేవాలయము ఇంచుమించుగా నంతయు చిత్రములతో నింపి వేయబడి యున్నది. కాని ఇవి మొత్తము మీద విమర్శకుడు లాంగ్‌హర్స్ట్ దృష్టిలో హీనమైనవి, ఆకర్షణ శక్తిలేనివియును; అయినను అర్ధమండపమందు వ్రాసినవి మాత్రము నేర్పరులైన శిల్పుల కృతులే; అందమైనవే. గర్భగుడి లోకప్పుపై వీరభద్రదేవుని ప్రక్కన అంజలి బద్ధుడై నిలిచియున్న విరూపణ్ణను కలిపి వ్రాసిన ఒక విశాలమగు వర్ణచిత్ర మున్నది. ఇది ధూమ ధూళి ధూసరితమై యున్నది. దీనిని రసాయనముల ప్రక్రియతో శుద్ధముచేసి యుద్ధరించిన యెడల ఆంధ్ర చిత్రకళకు గొప్ప సేవ చేయుట యగును.



చిత్రము 118. శివుడు, పార్వతి—లేపాక్షి

అర్ధ మండపములో చిత్రించిన వానిలో వాల్గింటిని వర్ణించి తీరవలయును: 1. పరిణయమునకు పూర్వము పార్వతి అలంకరించుకొనుట; 2. శివ పార్వతులు చదరంగమాడుట; 3. రాక్షసునిపై శివుడు తాండవించుట; 4. గణ మొకడు పాత్ర నెత్తిపై నిడికొని రాగా భిక్షాటనమూర్తి భిక్షకై వెడలుట. ఇవి గాక, పశుల యాలేఖ్యములు ప్రత్యేకముగా ప్రశంసార్హములు.

లయ, లావణ్యములను ప్రదర్శించు చైతన్యమును, రసభరితములగు భంగిమములును, విన్యాసములును నుత్తాలములైన చిత్రములకు లక్షణములైనయెడల లేపాక్షి యర్ధమండప మందలి చిత్రము లుత్తమ శ్రేణిలో గణనీయములే. ఆంధ్ర శిల్పు లనాదినుండియు సన్నని, తిన్నని రేఖలను వ్రాయుట, మూర్తులను కూర్చుట, ఆకర్షణీయమగు వర్ణములను కలుపుట, ఆకారములను భంగిమములను అందముగా నమర్చుట మున్నగు ఉత్తమ శిల్ప విశేషములందు ప్రవీణులై యుండిరి. విజయనగర చిత్రకారులును ఈ విషయములందు వెనుకబడి యుండలేదనుటకు లేపాక్షి చిత్రములు నిదర్శనములు.

తంజావూరులో బృహదీశ్వరాలయములో క్రొత్తగా కనబడిన చిత్రములు క్రీ. శ. 1646 - 47 సంవత్సరమున విజయరాఘవ నాయకుని కాలమున వ్రాయబడినవి. వీని క్రింది పొరలలో చోళయుగమునకు చెందిన చిత్రములును కొన్ని యున్నవి. నాయక రాజుల కాలమునాటి కళపై



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



విజయనగర చిత్రకళా ప్రభావము ప్రబలముగా నున్న దనుటలో నెట్టి సందియము లేదని చరిత్రకారుడు ఫాదర్ హీరాస్ నమ్మకము. క్రీ. శ. పంద్రెండవ శతాబ్దము నుండి పదునేడవ శతాబ్దము వరకు, అచట నచట అల్ప ప్రావీణ్యముతో నైనను చిత్రలేఖన కర్మ సాగుచునే యుండెనని యూహింపవచ్చును. చోళ, విజయనగర యుగములకు మధ్యగల సంధ్యాసమయమునందు ఆలేఖ్యములు విరివిగా లభింపక పోవుటకు ముసల్మానుల దండయాత్రలును, తత్ఫలితముగా సంభవించిన వినాశనమును కారణములై యుండవచ్చును.

చెంగల్పట్టు జిల్లా తిరుప్పృత్తికున్నపు జైన దేవాలయములలోను, చిత్తూరు జిల్లా సోంపల్లిలోని చెన్నకేశవుని ఆలయములోను, అనంతపురము జిల్లా లేపాక్షిలోని దేవాలయములోను, కాంచీపురమందలి వరదరాజస్వామి యాలయములోను, హంపి ఆనెగొంది దేవళములలోను శైవ, హిందూమత పురాణములయందలి ఘట్టములను నిరూపించు చిత్రము లన్నియు విజయనగర కళకు నిదర్శనములు. క్రీ. శ. 16, 17 శతాబ్దములలో ఆంధ్రుల చిత్రకళ మరల నొక శుక్లపక్ష చంద్రికవలె వృద్ధిచెంది శోభాయమానముగా నుండెను.



చిత్రము 114. రాక్షసునిపై శివుని తాండవము—లేపాక్షి

క్రీ. శ. 17 వ శతాబ్దములో మరల ఆంధ్ర చిత్రలేఖనములో కృష్ణపక్ష మారంభ మగును. విజయనగర సామ్రాజ్యము శిలమై పోయిన పిమ్మట చంద్రగిరి ఆస్థానములోని చిత్రకారులు తమిళనాడులోనికి, అహ్మదు నగరము, విజాపురము, గోల్కొండ రాజ్యములలోనికి చెదరి పోయిరి. సామంతులును, జమీన్‌దారులును తెలుగు దేశమున చిత్రకళను కొంతవరకు పోషించుచుండిరి. అప్పటి నుండియు దానిలో ఒక్క గొప్ప మార్పు సంభవించెను. ఆధ్యాత్మిక చింతయు, మహోత్సాహమును అందుండి తొలగి పోయెను. అది కేవలము ఐహికమగు విలాసవస్తు వయ్యెను.

గోల్కొండ నవాబులది తెలుగు రాజ్యమే అని మన మొప్పుకొనిన యెడల అచట క్రీ. శ. 16, 17 వ శతాబ్దములలో వెలసిన చిత్రకళను పరిశీలింప వలసి యున్నది. పిమ్మట క్రీ. శ. 1724 నాటి హైదరాబాదు రాజ్యము చాలవరకు తెలుగుదేశము నాక్రమించుకొన్నది. కనుక అచట క్రీ. శ. 18 వ శతాబ్దమున జరగిన చిత్రలేఖనము కూడ తెలియదగినదే. అహ్మదు నగరము, విజాపురము, గోలకొండ, హైదరాబాదులు కళాకేంద్రములై వెలసెను. కాని యిచటి కళ యంతయు పారశీక, మొగలాయి సంప్రదాయములకు బొత్తిగా బానిసయై పోయినది. దక్కను చిత్రకారులలో మీర్ హాషిమ్ అగ్రగణ్యుడు. అతని శిల్పమునకు మెచ్చి జహంగీరు, షాజహాను పాదుషాలు అతనిని ఆగ్రాయందలి తమ దర్బారునకు గొనిపోయిరట.

గోలకొండ సుల్తానులగు అబ్దుల్లా కుత్బుషాయును (క్రీ.శ. 1626 - క్రీ.శ. 1672) అబుల్ హసన్ తానాషాయును (క్రీ. శ. 1672 - క్రీ. శ. 1687) దేదీప్యమానమైన దర్బారు నేర్పాటు చేయుచుండిరి. మీర్ హాషిమ్ శైలిలో అనేకములైన సుల్తానుల సామంతుల రూప పటములు వ్రాయబడెను. అర్ధముఖాకృతిలో మొగలాయి వా[illegible]నయు, రంగుల రేఖల సౌకుమార్యములో పారశీక ఛాయలును వీనిలో స్పష్టముగ వ్యక్తమగును. అబ్దుల్లా కుత్బుషా నడపించుచున్న యూరేగింపు ఒక బ్రహ్మాండమగు చిత్ర



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



ముగా వ్రాయబడి యున్నది. దీనిలో చిత్రకారుడు చమత్కారముగ మీర్ జుమ్లా, అక్కన్న మాదన్నల యొక్క ముఖాకృతులను అమర్చి యున్నాడు. పెద్ద కూర్పులుగల యిట్టి చిత్రములలో పలుప్రక్కల దిద్దియున్న అంచువంటి చిహ్నములు అజంటా చిత్రములను జ్ఞప్తికి తెచ్చుచున్నవని కళాభిజ్ఞురాలు స్టెల్లా క్రామెరిష్ అభిప్రాయము.

క్రీస్తుశకము 18, 19 శతాబ్దములలో ఆంధ్ర చిత్రకళ అధోగతి పాలైనది. పరరాజ్య పాలనమే దీనికి ముఖ్య కారణము. విదేశీయాభిరుచు లలవడుటయు, పాశ్చాత్య సంప్రదాయములం దభిమానము పెరుగుటయు దేశీయ కళ లడుగంటుటకు ముఖ్య కారణము. చిత్రకళ లలిత కళగా నుండక జానపద కళగా, చేతిపనిగా మారెను. బందరులోని కలంకారి పనులలోను, కాళీకావడి పటములలోను, దశావతారపు బిళ్ళలపై బొమ్మలలోను, తోలు బొమ్మల యలంకారములలోను, కొండపల్లి ఆట వస్తువులలోను అది తల దాచుకొనెను. అయినను చేతిపనులు జానపదకళ కాశ్రయముగా నుండుటచేతనే చిత్రకళ తెలుగు గడ్డపై సజీవముగా మిగిలి యున్నదేమో! లక్క పనులపై ముచ్చీలు రంగులు పూయక యుండినచో దానికి బొత్తిగా నిలువ నీడయైన లేకుండెడిదేమో!

నవ్యాంధ్ర చిత్రకళ యిరువదవ శతాబ్దములో తెలుగు దేశమున సంభవించిన 'సాంస్కృతిక పునరుద్ధరణము' యొక్క వర ప్రసాదము. జాతీయ జ్ఞానోదయములోను, నూతన చైతన్యములోను, భావావేశపు పొంగులోను ఇది బయల్వెడలినది. దీనికి కొంతవరకు రాజమహేంద్రవరములో ఆస్వాల్డ్ జేమ్స్ కూల్డ్రే దొరయును, మచిలీపట్టణములోని ప్రమోద కుమార ఛట్టోపాధ్యాయులును ప్రబోధకులు. కడచిన 30, 40 ఏండ్లనుండి ఉత్తరమున బ్రహ్మపురినుండి దక్షిణమున చెన్నపురి వరకును, తూర్పున భీమవరమునుండి పడుమట పెనుగొండ వరకును చిత్రకారు లనేకులు క్రొత్త మెరుగులు చిమ్ముచు పలుపోకడలతో, భిన్న రుచులతో చిత్రరచన సాగించుచున్నారు.

ఈ చిత్ర లేఖకులలో పేర్కొనదగిన ముఖ్యులు స్వర్గీయులు దామెర్ల రామారావు, అడవి బాపిరాజు, సి. యన్. వెంకటరావు, వి. వి. భగీరథిగారలు. దామెర్ల రామరాయని జీవితము ముగియని మధుర స్వప్నము వలె బొత్తిగా 28 ఏండ్లలోనే అకస్మికముగా అంతరించి పోయినది. ఆయన రాజమహేంద్రవరములో స్థిరపడి స్వీయ చిత్రాగారమును నెలకొల్పి అపారమగు కృషిచేసి స్వతంత్రముగా ఒక చిత్రకళా సంప్రదాయమును సృష్టింప సమకట్టెను. యవన, అజంటా ప్రభావములు ఈ శిల్పి చిత్రములలో సమ్మేళనము పొందినవి. పాశ్చాత్యుల వాస్తవికతను, ప్రాచ్యుల భావ ప్రాధాన్యమును మేళవించి సమరస దృష్టితో సృష్టి చేయుటకై ఆయన కావించిన విశ్వప్రయత్నమును కూల్డ్రే పండితు డెంతయో యుగ్గడించెను. రామరాయని చిత్రములలో పేర్కొనదగినవి 'బావి యొద్ద', 'పుష్పాలంకారము', 'వంది పూజ', 'సిద్ధార్థ రాగోదయము' అనునవి. వీనియన్నిటియందును తెలుగుతనము ఉట్టిపడుచుండును. అడవి బాపిరాజు సర్వతోముఖ ప్రతిభాశాలి; కవి; వక్త; నటుడు; చిత్రకారుడును; బందరులోని జాతీయ కళాశాలలో తయారయినవాడు; కంటికి కానరాని దృశ్యములను కలముతోను, మాటల కందని భావములను కుంచెతోను వర్ణింప గలిగిన సవ్యసాచి. ఈయన చిత్రములలో 'సముద్రగుప్తుడు', 'తిక్కన కవి' మొదలగునవి స్మరింపదగినవి. ఈయన రేఖాలేఖ్యము లలంకార ప్రధానములు. బాపిరాజు చిత్ర రచనలో నిగూఢమగు భావములతోపాటు అజంటా, అమరావతి, నాగార్జునుని కొండల యందలి మూర్తులు, సొగసులుకూడ ప్రతిఫలించినవి. పెనుగొండ, లేపాక్షి, తాడిపత్రి క్షేత్రములలో మిగిలియున్న విజయనగర శిల్ప సంపదకును, ప్రకృతి రామణీయకత్వమునకును సి. యన్. వెంకటరావు వారసుడు. సుకుమారులును, సుందరులును అగు స్త్రీమూర్తుల నెన్నింటినో ఈయన చిత్రించియున్నాడు. 'సుగాలిపడుచు', 'శ్రీరాముడు - ఉడుత', 'నాగకన్య' 'గౌతమి అవతరణము' మున్నగునవి ఈయన ముఖ్య చిత్రములు. మనోరంజకమగు రంగుల కూర్పును ప్రదర్శించుటలో వెంకటరా వద్వితీయుడు. ఆంధ్రమున ప్రకృతి చిత్ర రచనలో ఏకైక స్థానము నలంకరించుటయే వి.వి. భగీరథియొక్క ప్రత్యేకత. గండశిలల వాస్తు శిల్ప వైచిత్ర్యము, దూరపు కొండల నునుపు, పొగ మంచుతెరల లీలలు, తరుచ్ఛాయలు, నింగి నీలిమ, సంధ్యారుణిమ ఈయన చిత్రములలో పునః సృజింపబడినవి. ఈతని ఒక్కొక్క చిత్రము రంగులతో అల్లిన పద్య మనదగును. గాఢమగు మానసికావస్థలు వీనిలో ప్రతిబింబించుచుండుట గొప్ప విశేషము.

రాజమహేంద్రవరములోని 'రామరాయ కళాశాల', హైదరాబాదులోని 'గవర్నమెంట్ స్కూల్ ఆఫ్ ఆర్ట్స్ అండ్ క్రాఫ్ట్స్' పెనుగొండలోని 'రాయలసీమ ఆర్ట్సు అకాడెమీ', చెన్నపురిలోని 'అభ్యుదయ చిత్రకార సంఘము', మొదలైన సంస్థలయొక్కయు, ప్రత్యేక చిత్రకళాచార్యుల యొక్కయు యాజమాన్య, ప్రోత్సాహముల వలన ప్రస్తుతము తెలుగు దేశమున చిత్రకళాకృషి ధారా



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



శముగా జరగుచున్నది. కాని ఇంతవరకు చిత్ర రచన తృప్తికరముగా లేదు. దీక్షతోను, ఉత్కృష్ట లక్ష్యముల తోను, ప్రావీణ్యముతోను పని సాగింపవలసి యున్నది. చిత్రకళలో బంగారు పంట పండవలసి యున్నది.

ప్రాచీనాంధ్ర చిత్రములు కలలు. ఆధునిక ఆంధ్ర చిత్రములు ఆశలు. క్రీ. శ. 5, 7, 16 శతాబ్దములలో చిత్ర రచనలో సంభవించిన స్వర్ణ యుగములు కాల చక్రము తిరుగుటతో మరల రానున్నవేమో! ఆంధ్ర ప్రదేశావతరణమయినది కనుక రాజకీయముగ శుభసమయ మాసన్నమైనది. నేటి చిత్రకళా ప్రదర్శనములలో కానవగు ఉత్తమ చిత్రములు ప్రాత క్రొత్తల మేలు కలయిక లనదగును. కొన్నిటియందు అపూర్వపు, అలౌకికపు సందేశ మేదో చూపట్టుచుండును. సనాతనము లైనను, అభ్యుదయ రచన లైనను, సంప్రదాయ బద్ధము లైనను, వ్యక్తిగతము లైనను, అ వన్నియు మనకు సమానముగ నాదరణీయములే.

విస్మరింపబడిన భిత్తి చిత్ర రచనను పునరుద్ధరింపవలయుననియు, పోయిన ప్రభువుల పోషణకు బదులుగా ప్రజల యాదరణ శిల్పులకు కావలయు ననియు మన కోరికలు.

ఆంధ్రుడు స్వభావముచేత కళారాధకుడును, రసపిపాసియును. తెలుగు గడ్డ అంతయు అందాల 'పాలవెల్లి' కావలయు నని అతని సంకల్పము. తెలుగు తల్లికి అతని చిత్ర సంపుటి కంఠమాల అయితే అతని జన్మము సార్థకమే.

మ. సూ. ప్ర.



చిత్రము 115. నర్తకి, సిత్తన్నవాసల్ (వర్ణాలేఖ్యము)



చిత్రము 116. నర్తకి, విజయవాడ (చాళుక్య శిల్పము)



http://sanskritcentral.com/

http://teluguthesis.com/

# సంగీతము

భారత దేశమందు సంగీతకళ పరమ ప్రాచీనమైన వానిలో నొకటి. పదుమూడవ క్రీస్తు శతాబ్దము మొదటిలో నుండిన నిశ్శంక శార్ఙ్గదేవుడు ప్రాచీన సంగీత మత ప్రవర్తకులని పార్వతీ పరమేశ్వరు లాదిగా ముప్పది తొమ్మిది మందిని పేర్కొని 'అన్యేచ బహవః పూర్వే' అని చెప్పినాడు[1]. అతనికి తరువాతి సంగీత లాక్షణికులు లెక్క కందని వారు. ప్రాచీనులలో సదాశివుడు మొదలగు దివ్య వ్యక్తులు కొందరిని వదలినను అనేకు లితరులు గ్రంథ కర్తలుగానో, సంప్రదాయ ప్రవర్తకులుగానో ఉండిన వాస్తవ వ్యక్తులనుటకు సందేహింపబనిలేదు. కాని వారి రచనలు — లక్ష్య లక్షణములు — బహుళముగా కాల గర్భమున గలిసి పోయినవి. ఉన్నవానిలో ప్రాచీనతమమని చెప్పదగినది భరతుని నాట్యశాస్త్రము. దీని కాలము క్రీ. పూ. రెండవ శతాబ్దికి మీరదని చెప్పుదురు. ప్రక్షేప విక్షేపములు, రూపాంతరములు, పాఠాంతరములు ఎన్నో దీనికి కలవు. కాని భరతముని క్రీ. పూ. ప్రథమ శతకమందలివాడైన కాళిదాసుని కాలముననే నారద, తుంబురులవంటి దేవర్షిగా ప్రసిద్ధి కెక్కినాడు. కనుక ఇప్పటి నాట్యశాస్త్ర గ్రంథ మెప్పటిదైనా దాని మూలకారకుడైన భరతుడు అంత కెంతో పూర్వమం దుండినవా డనక తీరదు.

భరతాచార్యుడు చేసిన మహా ఘనకార్యమే మనగా శుద్ధస్వర సప్తకమం దొక్కొక్కటిని ప్రత్యేకముగా గ్రహము చేసి నడపినప్పుడు శాస్త్రీయముగా ఏర్పడు షాడ్జి, ఆర్షభి మొదలైన యేడు శుద్ధ జాతులకు తోడు, వీని పరస్పర సంకరముచే ఏర్పడి దేశమందు వ్యాప్తిలో నున్న మరి పదునొకండు వికృత జాతులను కూడ గ్రహించి మన్నించుట. భారతీయ సంగీత పద్ధతి ప్రపంచమున కనుగ్రహించిన మహా ప్రసాదమగు రాగ సంప్రదాయమునకు పై జాతులే మూల రూపములు[2]. ఆ వికృత జాతుల పేరు లివి: 1. షడ్జోదీచ్యవతి, 2. షడ్జకైశికి, 3. షడ్జ మధ్యమ, 4. రక్తగాంధారి, 5. గాంధారోదీచ్యవతి, 6. మధ్యమోదీచ్యవతి, 7. గాంధారపంచమి, 8. ఆంధ్రి, 9. నందయంతి, 10. కర్మారవి, 11. కైశికి. వీనిలో 1. 5, 6 సంఖ్యల జాతులు ఉదీచ్యము అను పేరుగలిగి ఉత్తర దేశీయములని చెప్పదగియున్నవి. తక్కిన వానిలో 'కర్మారవి' గూడ దేశ విశేష సంబంధమును తెల్పున ట్లున్నది గాని యే దేశమో చెప్పలేము. మరి 'ఆంధ్రి' ఆంధ్రదేశము దనుట వివరింప బనిలేదు. తక్కిన వేదేశ భాగములవో తెలియదు.

భరతుని కాలమున దక్షిణాపథములో ఆంధ్రదేశమునా రిచ్చిన ఒక రాగజాతి చాల ప్రబలముగా నున్నట్లు ఇందుచే మన మూహింపవచ్చును. కాని దాని స్వరూపము నేడు మనకు సుగ్రహము కాదు. తక్కిన పదునేడు జాతుల వలె ఇదియును నిత్య నూతన వికాసములతో విహరించు భారతీయ రాగ నిర్ఝర ప్రవాహములో కలిసి మరుగుపడి పోయినది. గాంధారి - షాడ్జి జాతులు రెంటి సంకరముచే ఆంధ్రి యేర్పడినదని భరతుడు వచింపగా మతంగుడు ఆర్షభి - గాంధారి వీని కలయికచే జనించిన దన్నాడు. మతంగుని కాలముననే, అనగా సుమారు పదవ శతకమునకే దాని స్వరూపము మారిన దన్నమాట. అతడు దీనికి ని-రి-గ-ప లు అంశస్వరములని, రి-గ లకు ని-ధ లకు సంగతి ముఖ్యమని, షడ్జమును వదలుటచే షాడవము — ఆరు స్వరములు గలది — గూడ అగునని చెప్పి, కొంత విరివిగా స్వర సంచార మిచ్చినాడు. కాని అంతమాత్రమున దాని స్వరూపము మనము తెలిసికొనలేము. 'ఆంధాళి' అను నొక రాగ మున్నది. అది 'ఆంధ్రి'కి ప్రాకృత రూపము కావచ్చును. దాని పునస్సంస్కారమైన రూపమే 'ఆందోళిక' కావచ్చును. నన్నిచోడని కుమార సంభవమున 'ఆందోలి' కలదు. 12 - 18 శతాబ్దులకు చేరిన పార్శ్వనాథుడు దీనిని 'ఆంధాళి' అనియే పేర్కొని లక్షించెను. ఆ కాలముననే ఇంచుమించు చేరిన పాల్కురికి సోముని పండితారాధ్య చరిత్రలో రాగాల పట్టికలో 'ఆందోళి' కలదు. రామామాత్యుడు 'ఆందోలి'ని 'అధమ' రాగములలో చేర్చి లక్షించెను[3]. నిషాద, గాంధారములు రెండును లేని ఔడవ రాగము - ఐదు స్వరములు గలది — ఇదని అతని లక్షణము. పోలూరి

1. సంగీత రత్నాకరము 1-1.15-20.

2. రాగ మను పేర వ్యవహారము భరతుని కాలమందు లేదని, అది మతంగుడు మొదలగు తరువాతి లాక్షణికుల కాలమందే వచ్చినదని కొందరు భావించినారు. కాని జాతికి గల పది లక్షణములలో రెండవది యగు 'అంశ' స్వరమును వివరించుచో 'యస్మిన్ వసతి రాగస్తు యస్మాద్దేవ ప్రవర్తతే...సో౽ంశః స్యాత్' (నాట్య శా., 28-72) అని భరతుని వాక్యము కలదు. ఇక్కడ రాగ మనగా నేటి పారిభాషికమైన అర్థముగాక వట్టి 'రక్తి' అని మాత్రమే చెప్పవచ్చునా అనునది విమర్శింపవలసిన విషయము.

3. స్వరమేళ కళానిధి, 5-10; 5-65. ఎమ్. ఎస్. రామస్వామయ్యర్ ప్రకటించిన ప్రతిలో సర్వత్ర 'ఆందోలి' అని యూన



http://sanskritcentral.com/

http://teluguthesis.com/

గోవిందకవి ఈ మాటనే అనువదించెను. వెంకటమఖి మతమును ఇదే. త్యాగరాజు 'అభిమానము లే దేమి' అను కృతిని ఆంధాళిలో రచించెను [4]. ఇప్పటికి వా దృష్టి కిదే ప్రాచీనతర లక్ష్యము. ముత్తుస్వామి దీక్షితులది 'బృహన్నాయకి' అనువది దీని తరువాతిది. అది 'ఆరోహేచాప రోహేచ ధవర్జ్యా' అని 'ఆంధాళికా' అను పేరుతో త్రిస్థాయి సంచారిగా షాడవముగా లక్షింపబడినది. త్యాగయ్యగారి యింకొక కృతి 'రాగసుధారస పానము' అను దానిని ఆందోళిక యనుపేర కొందరును, 'మయూర ధ్వని' అను పెద్దపేర మరికొందరును నేడు పాడుచున్నారు. ఇరుతెగలవారి స్వరరచన ఒకటే, 'సరిమపని సనిధమరి' అని షాడవముగా గాంధార వర్జితముగా నున్నది.

భరతుడు నిర్దేశించిన తక్కిన పదునేడు జాతుల పరిణామ క్రమమును ఇంతమాత్రమైనను తెలిసికొన వీలు లేదు. మతంగుడు మొదలగు తరువాతి లాక్షణికుల కాలమునకు ఆ జాతు లెన్నో క్రమిక పరిణామమును పొంది వావా రూపాలను మార్చుకొన్నవి. భరతుని యేకీకరణ మహోద్యమమును తరువాతివారు సర్వ విధముల కొనసాగించి ఆ జాతుల పరిణత రూప వైవిధ్యము నంతయు గ్రహించి, యేర్పరచి, గ్రామ రాగములు, ఉపరాగములు, శుద్ధరాగములు, భాషలు, విభాషలు, అంతర భాషలు, రాగాంగములు, ఉపాంగములు, భాషాంగములు, క్రియాంగములు - ఇట్లు పది తెగలుగా విభజించిరి. ఆ విభాగ శాస్త్రపు దృఢముష్టికిని సంగీతకళ అణగియుండ లేదు. లక్షణముల కంచెలను దాటి లక్ష్యములు పరువెత్తుచునే యుండెను, ఉన్నవి, ఉండగలవు. కాని నియమమే లేనిదే బ్రదుకును మనుష్యులు బ్రదుకలేరు. కనుక భూత - వర్తమానములందలి మార్పులను, కూర్పులను సమరస బుద్ధితో పేర్చి, చేర్చి, భావికి కొంత మార్గదర్శకముగా కట్టుబాటులను ఏర్పరుపవలసినది లోకకల్యాణ దృష్టిగల నియంతల భారము. సంగీత కళకు లాక్షణికు లందరును యథాశక్తిగా శ్రద్ధతో ఆ పని చేసినవారే. మరి ఈ శాస్త్రము లక్ష్య ప్రధానము గనుక లక్ష్యమునకు విరుద్ధముగా లక్షణ మున్నచో లక్షణమునే దిద్దుకొనవలసినదని శాసించువరకును వారి విశాల హృదయము వెలసినది [5]. వారు చేయని ప్రధాన కార్యము సంగీతమునందలి నాదలయ భాషకు తగిన లిపిని కల్పించుటయే. ఆ లోపముచే లక్షణములు సుగ్రహము కాక మనకు మసకుగా నిలిచినవి. ఇక లక్ష్యము లన్ననో తొంబది పాళ్లు నశించినవి. వానికాధారముగా నున్న వాగర్థముల పుణ్యాన ఆ పదిపాళ్ళు గూడ శుష్కముగానే యైనను నిలిచియున్నవి. మనలో లక్షణ వాఙ్మయము లక్ష్య వాఙ్మయమున కన్న ఎంతో పెద్ద రాశిగా నిలిచి యుండుట కిదే హేతువు.

ఇట్లు భరతఖండమునం దెల్ల భరతముని మూల సిద్ధాంతములనే ఆశ్రయించి యేక సంప్రదాయమును స్థాపించు ప్రయత్నమును అఖండముగా ఆసేతు హిమాచలముగా పండితులు చేసినను ఇక్కడ సంగీత కళ రెండుగా చీలి కర్ణాటకము, హిందూస్తాని అను పేళ్లతో నిలిచినది. ముస్లిములు మన దేశమును కొల్లగొనవచ్చి రాజ్యమును స్థాపించుకొన్నది మొదలు ఉత్తరాపథమున — సుమారు 12 - 18 శతాబ్దములయందు — ఆ సుల్తానులు ఈ దేశపు సంగీతకళా మాధుర్యమునకు పరవశులగుటయే కాక పార్సీ, అరబ్బు దేశములందలి జాతీయ రుచులను, పద్ధతులను ఇక్కడ ప్రవేశపెట్టి, పోషించి వ్యాప్తికి దెచ్చిరి. అలా ఉద్దీనుని ఆస్థానమందు కవి, గాయకుడు, యోధ, మంత్రియునై యుండిన అమీరు ఖుస్రూ అను మహామహుడు ఈ పద్ధతికి మూలపురుషుడని ఔత్తరాహుల నమ్మిక. అతని కాలము 1296 - 1315 క్రీస్తు శకాబ్దములు.

తక్కిన అన్ని విషయముల వలెనే సంగీతకళను గూర్చి కూడ హిందువుల దృష్టి ప్రాయికముగా ఆధ్యాత్మికమైనది. అందలి మరుగులను తోడి తోడి ఉత్తరోత్తరముగా పరతత్త్వలీలావిలాసళక్తులను హార్దముగా తెలిసికొని యనుభవించుట మన పరాయణము. మన పాలి కిది 'ధర్మార్థకామమోక్షాణాం ఇదమే వైకసాధనం' [6] అనిపించినది. కనుకనే స్వరములు, రాగములు, తాళములు మొదలగువానిని గూడ దేవతా బీజాక్షరమంత్ర పూర్వకముగా అప్రాకృతముగా ఉపాసించుట మన పద్ధతి. బహిరింద్రియ తృప్తికి భారతీయులు పరాఙ్ముఖులు కారు కాని అంతటితోనే తృప్తిపడువారును గారు. ఈ దృష్టి చాలనివారు గనుక మహమ్మదీయ రాజులును, రాజ్యాధికారులును ప్రాకృతదృష్టితోనే సంగీతకళను గొలిచిరి.

మున్నను మద్రాసు ప్రాచ్య పుస్తక భండారమందలి వ్రాతప్రతిలో 'ఆంధాళి' అనియే రూపము మూడుచోట్ల గలదు. అందలి లక్ష్య పాదములను సంగ్రహించి నా కిచ్చి యుపకరించినది మిత్రులు శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు.

4. లేర్ అండ్ ఆన్ పబ్లిష్డ్ కీర్తనాస్ ఆఫ్ త్యాగరాజ, పు. 165-6; ఈ కృతి తాళ విన్యాసము తప్పుల తడకగా ఇందున్నది. 50 సంవత్సరములక్రింద దీనిని పలుమారు విన్నాను. హరికాంభోజి మేళముతోనిదిగా 'సరిగమ పధనిస మరిగమరిస అను త్రిస్థాయి సంపూర్ణ సంచారముతో సాగిన దిది. ఈ ముద్రణములో ఆ వైశిష్ట్యము లేని షాడవము.

5. స్వరమేళ కళానిధి, స్వర ప్ర. 10-14.

6. సంగీత రత్నాకరము, 1-1-30



http://sanskritcentral.com/

http://teluguthesis.com/































1. మార్దంగికురాలు, కోణార్కము, 2 చిటితాళములు, 3. డమరువు. 4-5. తాళములు, 6. డోలు, 7. డంకా.
8 ఖంజరి, 9. మృదంగము. 10. 'తాళకర్తె' కోణార్కము

http://sanskritcentral.com/

http://teluguthesis.com/




జంత్ర వాద్యములు

1. బాకా, 2. బూర, 3. కొమ్ముబూర, 4. కిన్నెర, 5. విపంచి, 6 తంబుర. 7. వీణ, 8. పిల్లనగ్రోవి. 9, నాగసరము, 10. తితి, 11. శంఖము. 12 తుంబిణ. 13 ఒంటితీగ తంబుర

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



శ్రోత్రరంజనము వారికి చాలును. 'శ్రోతృచిత్తరంజనము' కావలెనని ప్రాచీన భారతీయు లన్నారు. శుద్ధమైన శ్రుతి లయముగల నాదము శ్రోత్రము నాకర్షించును. అందలి సూక్ష్మతర సూక్ష్మతమ భేదములు, వాని పరస్పర సంవాదములును శ్రోత్రమూలముగానే చిత్తము నాకర్షించును. మొదటిది ఆపాత మధురము, రెండవది ఆలోచనామృతము. 'సంగీత మపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయమ్ — ఏక మాపాత మధురం అన్య దాలోచనామృతమ్' అన్న సంస్కృత సూక్తి సాహిత్యాభిమాన మెక్కువగాను సంగీతానుభవము తక్కువగాను గలవారెవరో అన్న మాట. మహమ్మదీయుల శ్రోత్రరక్తి పిపాస ఉత్తరదేశమందు శుద్ధనాద ప్రధానమైన సంప్రదాయమును వ్యాపింపజేసినది. దక్షిణదేశమున సూక్ష్మనాదలయముల వ్యాప్తి గమకముల మూలముగా వేరు రూపములను కళ కిచ్చినది. నాదశుద్ధికంటె దాని సూక్ష్మత, దాని వలన స్ఫురించు భావ సూక్ష్మత, వీనికితోడుగా కాలలయమందలి గంభీర సుకుమార భేదములును కర్ణాటక సంగీతమును రూపుగొల్పినవి. దీనికంటె దానికి మనదేశమందు వ్యాప్తి యెక్కువగా నుండుటకు కారణము గూడ దాని శ్రోత్రరంజన శక్తియే కాని చిత్తరంజన శక్తి అంతగా కా దనుట సూక్ష్మేక్షికతో గమనింపవచ్చును.

భరత సంప్రదాయమున శ్రుతి - లయములు రెండును మాతాపితల వలె సమానగౌరవము గలవి కావున మొన్న మొన్నటిదాక లాక్షణికు లెవ్వరును ఈ కర్ణాటక— హిందూస్తానుల భేదమును గమనింపలేదు [7]. పదుమూడవ శతకాదిలో అమీరు ఖుస్రూ చేసిన యీ ప్రయత్నము ఒక నూరేండ్లలో రెంటికిని భిన్న స్వరూపమును స్పష్టముగా ఇయ్యగలుగుట అసాధ్య మేమియు కాదు. కాని తరువాతి లాక్షణికు లెవ్వరు గాని ఆ రెండు పేళ్ళను పేర్కొనకపోవుట మాత్రము మనము గమనింపదగిన వింత. మరి దాక్షిణాత్య పద్ధతికి కర్ణాటక మను పేరు కర్ణాట సామ్రాజ్యము మూలముననే వచ్చిన దనవలెను. క్రీ. శ. 15-16 శతకములందే ఆ సామ్రాజ్యము నెలకొన్నది కనుక 14వ శతకాది భాగమందే ఆ పేరు ఏర్పడుట దురూహమైన విషయము [8]. అభిమాన భేదము, అభిరుచి భేదమును శాస్త్రదృష్టికి అకించిత్కరములు. గౌడ, కర్ణాట, బంగాళ, మరాట, గుర్జర ప్రముఖ నానా దేశములందలి వరుసల నన్నిటిని సంగ్రహించి ఎరుకలు, గొల్లలు, చెంచులు మొదలగు ఆటవికుల పద్ధతులను గూడ వదలక కలుపుకొన్న ప్రాచీన లాక్షణికులకు ఈ రెండు పద్ధతులను విభిన్నములుగా భావించు మనఃప్రవృత్తి యుండదు. ఎన్నో రాగముల, గీతముల పద్ధతులను దాక్షిణాత్యులు ఉత్తరదేశమునుండి స్వీకరించినారు. హెజుజ్జీ, సహానా, అఠాణా, తిల్లానా మొదలగువాని పేళ్లు గూడ మార్పలేదు. కాని అక్కడి సామాన్య స్వరూపములను గ్రహించి తమ గంభీర మార్గమున వానిని సంస్కరించి తమవి చేసికొన్నారు. క్రీ. శ. 17 వ శతకమున కల్యాణి, పంతువరాళి మొదలగు రాగములు గీత - ప్రబంధ - గాయములకు యోగ్యములు కానివని వెంకటమఖి అన్నాడు. కాని తరువాతి గాయకుల ప్రతిభా బలముచే అవి యెట్లు సంస్కరింపబడి యెంతటి గౌరవము నందుకొన గల్గినవో నేడు మన మెరుగుదుము. రాగములలో ఉత్తమ మధ్య మాధమములను విభాగములుకూడ ప్రాచీనము కాదు. మరి ఆ విభాగమునకుకూడ కారణము వాని స్వరముల సంవాద వివాదాది ధర్మములే కాని జాతి దేశాది భేదముల వలన నేర్పడిన అసూయ కాదని దృఢముగా చెప్పవచ్చును. స్వచ్ఛంద ప్రవృత్తిగల నేటి సినిమా దాటులను గూర్చి విమర్శకులైన సంగీత రసికులకు గల అతృప్తియు అట్టిదే. వాని అందచందములు పట్టి యైంద్రియికములు, తాత్కాలికములు; ఎందును లోతుకు దిగనివి.

నిజము చూడబోయినచో పూర్వకాలమున సంగీత కళను గూర్చి శాస్త్రీయ వ్యాసంగము మన దేశమున తమిళులు కొంత శ్రద్ధతో జరిపినా రనవలయును. అసలు సప్తస్వరములు మొదలగు వానికే వారు సొంతముగు పేళ్లు పెట్టుకొన్నారు [9]. కాని రాగవ్యక్తి ప్రధానమైన పద్ధతినే వారుగూడ పరిశీలించి పెంపొందింప ప్రయత్నించుటచేత, స్వరముల సంవాద వివాదానువాద ధర్మములు ఈశ్వర సంకల్ప సిద్ధములై అందరకును సమానమే యగుటచేత

7. హరిపాలదేవుడు - క్రీ. శ. 14 వ శతకాదిలో సంగీత సుధాకరమున,

'తదపి ద్వివిధం ప్రోక్తం దక్షిణోత్తర భేదతః
కర్ణాటకం దక్షిణేస్యా ద్ధిందుస్థాని (చి ?) తథోత్తరే'

అని ప్రప్రథమముగా కర్ణాటక - హిందూస్తాని భేదమును పేర్కొన్నాడు. ఈ పద్యమును శ్రీ పి. సాంబమూర్తిగారు తమ 'సౌత్ ఇండియన్ మ్యూజిక్, బుక్ 1' - అను పుస్తకమునం దుదాహరించిరి, పుట 7.

8. అసలు హరిపాలుని కాలము నిస్సందేహముగా ఏర్పడవలె. మరి నేను చూడగల్గిన సంగీత సుధాకరము వ్రాత ప్రతిలో - అది యింకను అముద్రితము - పై శ్లోకము కానరాదు. శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనశాల పుస్తక భాండాగారము ప్రతి, సం. 7615, 7616.

9. తమిళ వాఙ్మయమందలి ప్రాచీన గ్రంథములను, టీకలను పరిశీలించి అందలి విచ్ఛిన్న విషయములను తీర్చి కూర్చి స్వామి విపులానందులు 'యాళ్ నూల్' అను అసాధారణ గ్రంథము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చిత్రము 117. నాట్య, యంత్రవాద్య చిత్రములు, శాతవాహన శిల్పము, అమరావతి.

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సర్వంకషమైన భరత సంప్రదాయ సాగరములో ఆ ద్రావిడ పద్ధతియు కలిసిపోయినది. ఇప్పటికి తమిళజాతిలో మిగిలినది ఆ ప్రాచీనుల గానకళా శ్రద్ధ, అభిరుచి మాత్రమే.

సంగీత కళకు లక్ష్య లక్షణముల నిర్మించి వ్యాప్తికి దెచ్చుటయందు ఆంధ్రుల పాలు గొప్పది. 11 వ శతాబ్దికి వెనుక తొల్లిటి ఆంధ్రుల చరిత్రమును సూచించునట్టి అమరావతి, నాగార్జునకొండ, గోలి మొదలగు స్థలములందలి స్తూప, విగ్రహ శిల్పములలో వివిధ వీణలు, వేణువు, మృదంగము మొదలగు వాద్యములు గలవు. ఇవి క్రీ. పూ. రెండవ శతకము మొదలు క్రీ.శ. మూడవ శతాబ్ది మధ్యము దాక నుండు కాలమునకు చేరినవని పరిశోధకుల యభిప్రాయము. హాల మహారాజు సంగ్రహించిన 'సప్తశతి' లోని యీ ప్రాకృతగాథ ఆంధ్రసామ్రాజ్యమందు గాన నాదములకున్న యసాధారణ గౌరవమును వెల్లడించును.

" గాహాణయ గేయాణయ
తంతీ సద్దాణ పోఢ మహిలాణ
తాణం సొచ్చియ దండో
జే తాణ రసం నయాణంతి "
.... .... ....

(" గాథలందు గేయ గతులందు వీణెల
పలుకులందుఁ బ్రౌఢ మెలఁతలందుఁ
గలుగు మేలి రసము గనుఁ గొనలేనివా
రవని నున్న వారి కదియె శిక్ష "[10]—నా తెనిగింపు).

క్రీ. శ. 11 వ శతకమునుండి తెలుగు సారస్వతమునందు ఆంధ్రుల సంగీత రసికతకు సాక్ష్య మెంతో కలదు. కాని కవిత్రయములో నన్నయ తిక్కన లిద్దరును ఎక్కువగా సంగీతమం దేమియు అభిరుచిని చూపలేదు. రాజరాజ నరేంద్రుని యాస్థాన సభలో తార్కిక, వైయాకరణాది పండితులు ఎంతెంతో పెద్దవారు నన్నయకంట బడిరి గాని సంగీతజ్ఞులు పడలేదు (ఆది. 1, 8). ఇందలి 'వైణిక గాయకులు నాదిగా' అను వావిళ్లవారిది అధిక పాఠము. నే జూచిన వ్రాతప్రతులలో ఇతర ముద్రణములలో లేదు. ఆ యున్న 'వైణిక గాయకులు' గూడ తక్కిన పండితులవలెకాక నిర్విశేషణముగా సభలో వాకమూల నొదిగినారు. నన్నయ రాజరాజును ఒకచోట మారి 'కావ్యగీతప్రియ' అని సంబోధించినాడు. 'కావ్యగీత' అనునది ద్వంద్వమో, షష్ఠీ తత్పురుషమో తెలియదు. ద్రౌపది పెండ్లి కోలాహలమందు, యాదవుల రైవతకోత్సవమందును వాద్యగానగోష్ఠి స్పర్శ కలదు. ఇంద్ర, యమ, వరుణ, కుబేర, బ్రహ్మ సభలలోగూడ సంగీత గంధము ఎక్కడను గొట్టదు. అప్సరసలు గంధర్వులును ఒకచోట గలరుగాని వా రెవ్వరును నోరెత్తరు. మరి వ్యాసమహర్షి ఆ సభలన్నిటిలోను ఆటపాటలకు తప్పక చోటు కల్పించినను నన్నయ అక్కర లేదన్నాడు.

తిక్కన ఉత్తర రామాయణమున గాని, భారత సంహిత యందు గాని సంగీతవిషయమున సవతితల్లిప్రేమనే చూపినాడు. అర్జునుడు ఉత్తరకు 'నృత్య గీత వాద్య నైపుణ్యము' నేర్పినాడు గాని దానిని తిక్కన్న యెక్కడను వర్ణింపలేదు. ఇష్టదేవతయగు హరిహరనాథుని ఎంతో విపులముగా, పునరుక్తముగా గూడ పొగడిన తిక్కన ఒక 'గానలోల' అను నంతటి విశేషణమైనను ఆ మూర్తికి వేయలేదు. ఎప్పుడును 'కావ్యరసమునే కొనియాడుచు' నున్న యతనికి ఇతర కళల రసానుభవమున కవకాశము కలుగలేదేమో!

ఎఱ్ఱాప్రెగ్గడ సంగీతరసికుడు; కనుకనే నన్నయపేరిటనే రచించిన అరణ్యపర్వశేషమున ఆయనచిత్తవృత్తినే యనుకరించినను స్వతంత్రమైన రచనలో ఆ కళయందు తనకుగల గొప్పరసికతనే కాదు, విజ్ఞానమునుకూడ విస్తరముగా చూపుకొనెను. దీనికితోడు ఎఱ్ఱన్న కాశ్రయమిచ్చినప్రభువు ప్రోలయవేమారెడ్డి 'నృత్తగీత కళావల్లిలో పేతోత్సవుడు.'

ఇట్లే నన్నిచోడడు, పాల్కురికి సోమనాథుడు, బమ్మెర పోతన, శ్రీనాథుడు మొదలగు సీమాపురుషుల రచనల యందు సంగీత రసికత ఆ కాలమం దెంత మహనీయముగా నుండినదో తెలియనగును. కాకతీయులు, రెడ్డి రాజులు, పద్మనాయక ప్రభువులు మొదలగు దొరలును, వారి యనుయాయులైన ఇతర రాజులును, అధికారులును ఈ కళయం దెంతో గౌరవాభినివేశములను చూపిరి. మరి విజయనగర సామ్రాజ్య కాలమందు ప్రజలు సంగీతానందమున మునిగి తేలినవా రనవలయును. కృష్ణదేవరాయల నాటి అష్ట దిగ్గజముల రచనలలో నెల్ల ఇది స్పష్టముగా నున్నది. తరువాతి తంజావూరు, పుదుక్కోట, మధుర మొదలగు సామంత - స్వతంత్ర - రాజుల కాలమందు ఈ కళ యక్షగానము, శృంగారపదము, కీర్తన, జావడి మొదలగు పలు త్రోవలలో ప్రజల జీవితమును చూరగొన్నది. రామరాజభూషణుడు 'సంగీత కళా రహస్య నిధి'గా నున్నవాడు. అతని రచనలలో గానవచ్చు నయ

---

తమిళభాషలో రచించినారు. ఇట్లే పి. కోదండరామన్‌గారు రచించిన 'తమిళర్ ఇశైక్కరువిగళ్' అను గ్రంథముకూడ (అణ్ణామలై యూనివర్సిటీవారి ప్రచురణము) పరిశీలనార్హము.

10. ఈ గాథ తెలుగుదేశపు సప్తశతి మూలపాఠమందలిదట. గాథాసప్తశతి - వీబరు 1811 లో జర్మనిలో ముద్రించినది : స. 815). పెదకోమటి వేమారెడ్డి సంగ్రహించి టీకించిన 'సప్తశతి సారము'న ఇది గలదు. ఆంధ్ర యూనివర్సిటీవారి ప్రచురణము, పు. 8. ఈ మేలి గ్రంథమును చక్కగా సవరించి మరల ముద్రింపవలసిన భార మాంధ్రుల కున్నది. ఇప్పటిది తప్పుల తడక.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



గారపు శిల్పమునకు అతని సంగీత కళానుభవమే మూల మని నమ్మవచ్చును. ఇదిగాక 'ఈతడు రచించిన కృతులు కొన్ని యక్కడక్కడ నేటివరకును పాడబడుచున్నవి' అని శ్రీ కందుకూరి వీరేశలింగముగా రన్నారు. కాని వానిని ఆయన సంగ్రహించి పెట్టిన పుణ్యాన బోలేదు. ఒకవేళ ప్రయత్నించి యుండినను పట్టి సాహిత్యమును మాత్రమే ఆయన సంగ్రహింపగలిగి యుండును. చతుర్విధ కవితలలో మధుర కవితను చేర్చి గౌరవించిరి కాని ప్రాచీనులు దాని మాధుర్యమునకు హేతువయిన గానశరీరమును సంరక్షించి పెట్టుకొను ప్రయత్నము చేసినట్లు తోపదు. పాల్కురికి సోమన పేర్కొన్న వివిధ గేయములు ఇట్లే నశించినవి. ఇట్టి వెన్నో. కాకతీయుల కాలపు కృష్ణమాచార్యుని సింహగిరి వచనాలు, వానివంటివగు శంకర వచనములు, శతకోప విన్నపములు మొదలగు గేయములును, పద కవితా పితామహుడగు మహామహుడు తాళ్ళపాక అన్నమయ్యగారి, ఆతని పుత్ర పౌత్రుల కొన్నివేల పదములును ఇట్లు గాన శరీరమును పోగొట్టుకొని మనకు మిగిలిన కొన్ని శబ్దపంజరములు. అన్నమయ్యగారి మనుమడు, ప్రఖ్యాత ద్విపదకవి చిన్నన్న - చినతిరువెంగళనాథుడు - రచించిన కృతులలో రెండుమాత్రము సుబ్బరామ దీక్షితులదయచే, సాంప్రదాయికమైన స్వర శరీరముతో మనకు లభించినవి. ఇట్లే వీరవెంకటపతిరాయని కంకితమైన 'గీతప్రబంధ' మొకటి మాత్రము సస్వరముగా పుస్తకములో నిలిచి యున్నది. పై దీక్షితులే రచించి మన కిచ్చినవని ఘనం సీనయామాత్యుని రచనలవంటి వొకటి రెండును లభించుచున్నవి. దక్షిణదేశమం దంతటను వ్యాపించిన క్షేత్రయ్య పదముల, తీర్థనారాయణస్వామి తరంగముల నేటి స్వర రాగమూర్తి కూడ అంతగా ప్రామాణికమైన మూల రచన యని నికరముగా చెప్పలేని వివిధ స్థితిలో నున్నది.

తెలుగుదేశ మందలి రసికులలో పండితులలో అగ్రగణ్యుడైన జగన్నాథ పండితరాయలు గొప్ప కవిమాత్రమే కాక గొప్ప గాయకుడై, బయకారుడై యుండెనన్నమాట ఎందరికో ఆశ్చర్యము గల్గింపవచ్చును. ఢిల్లీ సుల్తాను షహజహాను ఆస్థానమందలివా రతని గానమాధురికి చవి గొన్న పుణ్యాత్ములు. కాన పేమునికి తరువాత అతని రచనలే గొప్పవట. అతడు కర్ణాటక సంప్రదాయమున పాడగా విన్న అక్కడివారు భాష యర్థము తెలియకున్నను అతని గాత్ర - రాగముల రక్తిని గ్రహించిరట. అతని రచనలలో ఒకటైనను మనకు నేటికి మిగులలేదు. క్రీ. శ. 18వ శతక మందలి శ్రీ త్యాగరాజస్వామి మొదలగువారిని, వారి గురుపారంపరియు నగు రచనలే చాలవరకు అసలు

చెడకుండ మనలో నిలువగలిగినవి. అందుకు స్వర లయ లిపి యేర్పడుట ముఖ్య హేతువని చెప్పవచ్చును.

మరి లక్షణపథమందు ఆంధ్రుల శైవాదము ఇతరుల కెందును తీసిపోనిది. కొంత పైచేయిగానే యున్నదన్నను చెల్లును. పదుమూడవ క్రీస్తు శతకమునకు ముందున్న లాక్షణికులలో ఎవ రాంధ్రులో, ఎవరు కారో నిర్ణయించు సాధనములు లేవు. ఇప్పటికి తెలిసిన తెలుగు లాక్షణికులలో కాకతీయ గణపతిదేవుని మరదియు, గజసాధనికుడును అగు జాయపసేనాని ప్రాచీనుడు (క్రీ. శ. 1250); గీత రత్నావళి, నృత్తరత్నావళి అను రెండు గ్రంథములు రచించెను. గీతరత్నావళి ఇంకను మనకు లభింపలేదు గాని నృత్త రత్నావళిలోనే అందలి పద్యము లుదాహరింప బడుటచే దాని పేరు మన మెరుగుదుము. నృత్త రత్నావళియం దితడు చూపిన పాండిత్యమును గమనించినపుడు ఇతని గీత రత్నావళి లభింపకపోవుట సంగీతకళ కెంత నష్టమో ఊహింపవచ్చును[11]. నృత్తరత్నావళిని ప్రమాణ గ్రంథముగా క్రీ. శ. 15వ శతాబ్ది మధ్యమువాడు కుంభకర్ణ మహారాజు తన 'సంగీతరాజ'మున ఉల్లేఖించినాడు.

ఈ కాలపు పాల్కురికి సోముని బసవ పురాణమునను. పండితారాధ్య చరిత్రమునను సంగీతమునకు సంబంధించిన వివిధవిషయములు గలవు. కాని అవన్నియు లక్షణము, లక్ష్యము రెండును లేని పట్టి పట్టీలు. అప్పటి శైవసంప్రదాయమందు సంగీతకళ కుండిన విశిష్టవ్యాప్తిని అవి సూచించు నంతే.

క్రీ.శ. 14వ శతక మధ్యమందలి శ్రీ విద్యారణ్యస్వామి 'సంగీత సారము'ను రచించినాడని, దాని ననుసరించియే తాను రాగ లక్షణముల వివరించుచున్నాడనని గోవింద దీక్షితులు - క్రీ. శ. 17వ శతకమువాడు - వచించినాడు. ఆ గ్రంథము దుర్లభము[12].

విద్యారణ్యస్వామి ఆంధ్రుడే యని స్పష్టముగా చెప్ప లేము. కాని ఆంధ్ర కర్ణాటకుల కూడలిదైన ఆంధ్ర

---

11. నృత్త రత్నావళిని వైదగ్ధ్యముతో సంస్కరించి ప్రకటించిన డాక్టరు వి. రాఘవన్‌గారు ఉపోద్ఘాతమున దాని మహిమ వివరించినారు. అదియు, 'శెటర్ సంగీత లిటరేచర్' అను వారి ఆంగ్ల వ్యాసమును - జర్నల్ ఆఫ్ ది మ్యూజిక్ అకాడెమీ, నం. 8, 4-నాకి ప్రస్తావనముతం చెల్ల దాని ఉపకరించినవి.

12. మైసూరు రాజ్యమందలి మధుగిరి సంస్థానమునకు ప్రభువైన ముమ్మడి చిక్కభూపుడు రచించిన అభినవ భరత సార సంగ్రహము అను అముద్రిత గ్రంథమందు 'సంగీత సార'మునుండి కొన్ని శ్లోకము లుదాహరింపబడినవని, అవి విద్యారణ్య కృతములే కావచ్చునని శ్రీ ఆర్. సత్యనారాయణ బి. యస్. సి., అన్నారు. ఇది విమర్శనీయ విషయము.

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చిత్రము 118. ఆంధ్రవాద్యములు : విజయనగర శిల్పము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సాహిత్యమును పలువిధములుగా మొదటినుండి పోషించిన విజయనగర సామ్రాజ్యమును ప్రతిష్ఠ చేసిన ఆమహనీయునిని ఆంధ్రులు తమవానినిగా గౌరవించుట సహజము, ఆవశ్యకము. ఇప్పటి వాడుకలో నిలిచిన మేళ - రాగ పద్ధతిని ఈయనకంటె ముందు పేర్కొన్నవారు కానరారు. ఆయన మతము ప్రకారము 15 మేళములను, అందు జన్యములైన 50 రాగములను సంగీతసుధ తెల్పుచున్నది.

రాచకొండ సర్వజ్ఞ సింగమనాయని సంగీత రత్నాకర వ్యాఖ్య - సంగీత సుధాకరము ఈ శతాబ్దములోని గొప్ప ఆంధ్ర రచనలలో నొకటి. మరి ఇప్పటి కదే రత్నాకరమునకు ప్రాచీనతమ వ్యాఖ్య. క్రి. శ. 13 వ శతాబ్ది మొదటి భాగమందు దేవగిరి సింఘణ భూపాలుని యాస్థానమందు కరణికము వహించిన కాశ్మీర బ్రాహ్మణ పండితుడు శార్ఙ్గదేవుడు రచించిన సంగీత రత్నాకరము అప్పటి ప్రాచీనాధునిక సంగీత పద్ధతుల వివరణమున సీమాగ్రంథముగా ఏర్పడినది. సింగమనాయనికి తరువాత పదునైదవ శతాబ్దిలో విజయనగర సామ్రాజ్యమున ఇమ్మడి దేవరాయని యాస్థాన పండితుడు చతుర కల్లినాథుడు 'కలానిధి' యను పేర ఇం కొకవ్యాఖ్య రచించెను. ఇంకను రెండు మూడు టీకలు గలవట. ఇంతైనను నిత్య పరిణామినియైన సంగీతకళకు రత్నాకరము ఎక్కువ పనికిరాక పోయినది. కనుకనే విద్యారణ్యాదులు వేరు మార్గమును పట్టినట్లున్నది. రత్నాకర మందలి లక్షణములు లక్ష్యమునకు విరుద్ధములని, అందు చూపిన ప్రయోగములు అబోధకములై అత్యల్పతరములుగా నున్న వని, పేరుకొన్న రాగాల స్వరూపమును వివరింపలే దని, కనుకనే గాయకులును, వైణికులును ఆ గ్రంథమును వదిలిపెట్టి రని సంగీత సుధాకరకర్త నిర్దాక్షిణ్యముగా నన్నాడు. కాని అతడు ఆ విషయములను తానేమో 'నిపుణ'ముగా ఒకతూరి విన్న మాత్రాన పదావళీ జ్ఞానము కల జనుల కందరికిని సంగీత రహస్య బోధము గల్గునట్లు వివరించినానని చెప్పుకొన్నాడు గాని అదంతయు వట్టి వాగాడంబరము మాత్రమే. ఎట్లును సింగభూపతి వ్యాఖ్య కల్లినాథుని వ్యాఖ్యకంటె కొంత సంగ్రహముగా నున్నను, నేడు సంగీతరత్నాకరము నర్థముచేసికొనుట కెంతో సహాయముగా నున్నది[13].

క్రీ. శ. 14 - 15 శతకముల సంధికాలములో కొండవీటి కుమారగిరి రెడ్డి 'వసంతరాజీయ' మను నాట్య లక్షణ గ్రంథమును రచించినాడు. ఇదికూడ మల్లినాథ, కుమారస్వామి ప్రభృతులగు కావ్య నాటక వ్యాఖ్యాతలు ప్రమాణ గ్రంథముగా ఉదాహరించుట మూలమున మనకు తెలియును గాని అసలు గ్రంథము లభింపలేదు. నాట్యమునకు సంగీత మొక ప్రధానాంగము కనుక ప్రస్తావవశముననైనను వసంతరాజీయమందు దాని వివరణ ముండి యుండునని యూహింపవచ్చును.

కొమరగిరిభూపాలుని తర్వాత కొండవీ డేలిన పెదకోమటివేమభూపతి-శ్రీనాథ, వామనభట్టుల కాశ్రయదాత-'సంగీతచింతామణి'కి కర్త. అసంపూర్ణములైన దీని రెండు వ్రాతప్రతులు తిరువాన్కూరు పుస్తకభండారమున గలవు.

ఈ క్రీ.శ. 15 వ శతక మధ్యమందే విజయనగరపు ఇమ్మడి దేవరాయల సామంతుడైన సాళువ గోపేంద్ర తిప్పభూపాలుడు 'తాళదీపిక'ను రచించినాడు. తాళమునకే ప్రత్యేకముగా రచించిన గ్రంథములలో ఇదే మొదటిదేమో! ఇదిగాక తిప్పభూపతి శివస్తుతి పరముగా వేరు వేరు తాళములకు లక్ష్యములుగా కొన్ని 'ప్రబంధము'లనుగూడ రచించినాడని తోచుచున్నది. ఈ వంశము వాడేయైన నరసింగరాయలే తాళ్ళపాక అన్నమాచార్యుల కాశ్రయ మిచ్చి గౌరవించి ఆయన 32 వేల సంకీర్తనములు శ్రీవేంకటేశ్వరాంకితముగా రచించునట్లు చేసినది. సంకీర్తన లక్షణము అను చిన్న లక్షణగ్రంథమునుగూడ అన్నమయ్య సంస్కృతమున రచించెను. కాని అది దుర్లభము. దానిని అతని మనుమడు చిన్నతిరుమలయ్య తెలిగించినాడు.

క్రీ. శ. 16 వ శతకమున విజయనగర శ్రీకృష్ణదేవరాయల యాస్థాన కరణికుడు బండారు లక్ష్మీనారాయణ కవి రాయల యంతఃపురమువారికి నాట్య సంగీతాచార్యుడై యుండి 'సంగీత సూర్యోదయము' రచించినాడు. ఇది యింకను అముద్రితముగా మద్రాసు సర్కారు తాళపత్ర గ్రంథాలయమం దున్నది. ఇతనికి భానుకవి తెలిగించిన 'పంచతంత్రి' అంకిత మీయబడినది.

క్రీ. శ. 1550 వ సంవత్సరమున అళియ రామరాయల యాశ్రితుడును, కొండవీటి దుర్గాధీశుడును అగు రామామాత్యుడు 'స్వరమేల కలానిధి'ని రచించెను.[14] ఇందు ప్రాచీనగ్రంథములకంటె స్పష్టముగా, సంగీతమున ప్రధాన

13. ఈ టీక ముద్రణమున నుపయోగపడిన వానిలో ఒక వ్రాతప్రతిలో, అదియు 1-2 అధ్యాయముల తుదలో మాత్రమే గంగాధరుడను నొకడు దీనిని రచించినట్లు గద్యము గలదట—సం. రత్నా. అడయారు ముద్రణము సం. 2. పీఠిక, 5. మన దేశములో రాజుల పేరి రచనలలో నెల్ల ఇట్టి సందేహమున కవకాశము అంతో ఇంతో ఉండకపోదు. కాని ఇంతమాత్రము సాక్ష్యముచే సింగమనాయని కర్తృత్వము ఇప్పుడు సందేహించుట అయుక్తము.

14. ఇదిగాక ఎన్నో గీత ప్రబంధము లితడు రచించెనట (స్వర. క. 1-20, 21); కాని యందొక్కటియు మనకు మిగుల లేదు.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



వస్తువులైన స్వరముల, మేళముల స్వరూపము మాత్రము వివరింపబడినది. విద్యారణ్యుల 15 మేళములకు మరి యైదు చేర్చి 20 మేళములు వివరించి యందలి జన్యరాగములుగా 78 రాగములను పేర్కొని, అందు 48 రాగములకు లక్షణము చెప్పినాడు. ఇతడు తన మాతామహుడు కల్లపదేశికుడు విద్యానిధి యని, గంధర్వశాస్త్రమందు దత్తిలునివంటి గొప్పవా డనియు చెప్పుకొన్నాడు. సంగీత రత్నాకరమునకు 'కలానిధి'యను వ్యాఖ్య రచించిన గొప్ప మనీషి కల్లినాథు డతడు కావచ్చును. ఇరువురును రాయ బయకార, తోడరమల్ల, అభినవ భరతాచార్య బిరుదాంకితులే; విజయనగరమందలివారే; క్రీ. శ. 1435 లో ఇమ్మడి దేవరాయల కాలమున నున్నవాడు క్రీ. శ. 1550 లో నున్నవానికి మాతామహుడు కాగలడా యని సందేహింప వచ్చును. కాని అతని వయస్సు అప్పు డెంతో ఇతని వయ స్సిప్పు డెంతో తెలియనిది యీ సందేహము నివృత్తి కాదు. ఐనను అసంభవ మని మాత్రము చెప్పలేము. సంభావ్యమే యైనప్పుడు కల్లినాథుడును ఆంధ్రసంగీత లాక్షణికుల పంక్తి కలంకారభూతుడుకాగల డనుకోవచ్చును. అది యెట్లయినను రామామాత్యుని స్వరమేల కలానిధి కర్ణాటక సంగీత పరిణామములో ఒక ముఖ్య ఘట్టమును తెల్పుచున్నది. లక్షణమునుపేర వట్టి ప్రాచీన వాక్యములను అనువాదముచేయుట నిష్ఫలమని రామమంత్రి యెదురు తిరిగినాడు. సంగీతము గాంధర్వము గానము అని రెండు తెగలని, అనాది సంప్రదాయముగా గంధర్వులు పాడునది గాంధర్వమని, అందు లక్షణమే ముఖ్యమని, గానము అట్టిదిగాక దేశి రాగ సంప్రదాయము ననుసరించి బయకారులు జనరంజకముగా రచించినది గనుక దానియందు లక్ష్యమే ప్రధానమని, లక్ష్యవిరుద్ధమైన శాస్త్రమును మార్చుకోవలెనని రామమంత్రి ధైర్యముతో పలికినాడు. కనుకనే ఒక స్థాయిలో శుద్ధ స్వరములు ఏడును, వికృత స్వరములు పంద్రెండును గలిసి 19 స్వరములు శార్ఙ్గదేవుడు నిర్ణయింపగా, వికృత స్వరములలో ఐదింటికి ప్రత్యేక స్వరూపము లేదని స్పష్టపరచి మొత్తము పదునాలుగే స్వరాలని రామమంత్రి నిర్ణయించినాడు. అందును రెండు వికృత స్వరములను వదలి మొత్తము పంద్రెండు మాత్రమే ప్రకృతి స్వరములను గోవింద దీక్షితుడు, వెంకటముఖి మొదలగు తరువాతివారు గ్రహించి ఆ ప్రకారమే వీణలో మెట్ల నమర్చిరి. ఆ పద్ధతియే నేటికిని అనువర్తించి వచ్చుచున్నది. ఆ రెండు స్వరములను వదలుటగూడ రామామాత్యునకు సమ్మతము కాక పోలేదు.

వీణ మెట్లమీది తంతులను మేళగించు విషయమున రామమంత్రి కాలమున రెండు పద్ధతు లుండెడివి - శుద్ధ మేళము, మధ్యమేళము అని. వీణను మూపున కానించుకొని నిలువున వాయించునప్పుడు ఎడమచేతిప్రక్క మొదటి తీగ అనుమంద్ర షడ్జముగా, రెండవది అనుమంద్ర పంచమముగా, మూడవది మంద్రషడ్జముగా, నాల్గవది మంద్ర మధ్యమముగా శ్రుతిచేయుట శుద్ధమేళము. మొదటిది అనుమంద్ర పంచమము, రెండవది మంద్రషడ్జము, మూడవది మంద్రపంచమము, నాల్గవది మధ్యషడ్జముగా అమర్చుట మధ్యమేళము. శుద్ధ మేళమునకంటె మధ్యమేళమందు సంగీతమున రక్తి నెక్కువగా నిచ్చు మధ్య తార స్థాయి స్వరములకు స్ఫూర్తి యెక్కువ. వాయించు వేళ్ళకు సౌకర్యమును అధికమే. కనుకనే యిప్పటికి మధ్యమేళమే స్థిరముగా వైణికులలో నిలిచినది. రామామాత్యుడు, 1. అనుమంద్ర - స, 2. అను - ప, 3. మంద్ర - స, 4. మంద్ర - ప —ఇట్లు ఇంకొక మేళమును కల్పించి, దానికి అచ్యుతరాయ మేళమని పేరు పెట్టెను.[15] ఇందును అనుమంద్ర, మంద్ర, స్థాయుల కున్నంత ప్రాధాన్యము మధ్య, తారములకు లేకపోవుటచే వాడుకలో ఇదియు నెలకొనలేదు. అచ్యుత దేవరాయల రాజ్యకాలమందే యితడు విజయనగరాస్థాన మందలి సంగీత విద్వాంసులలో నొక్కడుగా నుండిన వాడని మన మిందుచే నెరుగగలము.

ఇతడు నిర్వచించిన రాగ లక్షణములను తరువాతి గోవిందదీక్షితుడు, అతని కుమారుడు వెంకటేశ్వర దీక్షితుడును తీవ్రముగా ఖండించిరి. తండ్రి 'సంగీత సుధ' లో 'కొందరు నవీను' లని పేరు చెప్పక యితని మతమును ఖండింపగా కొడుకు స్పష్టముగా రామామాత్యుని పేర్కొని 'చతుర్దండి ప్రకాశిక'లో నిస్సంకోచముగా, అవివేకముగా దూషించెను. వ్యక్తిగతముగానో, రాజకీయ కారణాల వల్లనో వారికి అతనిమీద కలిగిన ఆక్రోశము ఈ విమర్శకు హేతు వనుకొనవలసియున్నది. సంగీతకళ నిత్యపరిణామిని అనుతత్త్వమును గమనింపకున్నచో నేడు మనము ఆ తండ్రి, కొడుకులను అంతతీవ్రముగా ఖండించి విమర్శింప వచ్చును. తత్త్వదృష్టికన్న స్వపాండిత్యస్ఫోరణమందే వారికిగల యభినివేశము ఆ రెండు గ్రంథములందును స్పష్టముగా నున్నది.

'షడ్భాషాచంద్రిక' మొదలగు అనేక గ్రంథములు రచించిన మహామనీషి చెరుకూరి లక్ష్మీధరుడు 'భరతశాస్త్ర

15. స్వర. క., 3–13. ఇందలి 'మేళవీణా లక్షితా' అను ముద్రిత పాఠమునకు ప్రతిగా 'వీణా మయా కృతా' అని వ్రాత ప్రతి పాఠము. మరి 3–76 లో 'మయోదితా' అని ముద్రితాముద్రితములు రెంటను ఒక పాఠమే కలదు.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



గ్రంథము 'ను రచించినట్లు గీతగోవిందమునకు అతడు రచించిన శ్రుతిరంజనియను టీక[16] యందలి యుదాహరణముల వలన తెలియగలము. నాట్యము,సంగీతము దీని ప్రమేయము.

ఇదే సమయమందే రామరాజ భూషణుడు ఆ వరకును ఆ యా రాగములకు తగినట్లుగా వెనుక ముందులకు సర్దుకొనవలసి యుండిన వీణ యెదమీది చలసారికలను అచలసారికలుగా మైన మతికించు పద్ధతిని కనిపెట్టి ఆచరణలోనికి తెచ్చినట్లు ఆంధ్రదేశ సంప్రదాయపు మాట.[17] అల్లసాని పెద్దన్న చలసారికలనే పేర్కొన్నాడు. 'నీవీణ నిన్న 'నాట' రాగమునకు తగినట్లు స్వరముల సారికలను మేళముచేసి యుంచినావు. ఇప్పుడు 'దేశాక్షి' రాగమునకు మేళవింపుము' అని వరూధినిని చెలి బోధించినదట. ముక్కు తిమ్మన్న 'మేళవించినవి సుమ్మీ దీని మెట్లు' అని కృష్ణునికి హెచ్చరిక చెప్పు నారదుని మాటలో అజాగ్రత్తతో వీణను చేయాడినప్పుడు మేళము చెడునని సూచించి, ఆ వీణ మేళము చలమేళమే అని తోపజేసినాడు. తెనాలి రామకృష్ణుని 'వీణాపాణింధమపాణి, ప్లవకన్య', 'కిన్నెరవీణె మోపి శ్రుతి గీల్కొన సారెలు చక్కహొత్తి' వాయించునది గనుక అదియు చలమేళమే. కాని రాయల ఆముక్తమాల్యదలో చూడికుడుత్తమ్మ వీణ కప్పుడే 'మయినపుమెట్లు' గలవు. అవి విరహపు వేడికి కరగును, అనగా అచల మేళము అప్పటికే కొందరి వాడుకలోనికి వచ్చినదన్న మాట. ఈ మేళపు మార్పును తంజావూరి రఘునాథరాయలు తొలుదొల్త చేసినవాడని ఇంకొక యభిప్రాయము కలదని విన్నాను. ఎట్లును వీణావాద్యమున నాటినుండి నేటిదాక స్థిరముగా సర్వత్ర వ్యాపించిన యీ సంస్కరణము సుమారు క్రీ. శ. 16 వ శతాబ్దమున ఆంధ్రదేశమున జరగినదనిమాత్ర మూహించుట తప్పుగాదు.

క్రీ. శ. 17 వ శతకమందలి ఆంధ్రలక్షణ గ్రంథములలో అగ్రగణ్యమైనది సకలకల సోమనాథుని రాగవిబోధము. తన గ్రంథమునకు తానే విపులమైన టీకయు వ్రాసి గ్రంథము విలువ నెంతో హెచ్చించినాడు[18]. రామామాత్యునివలెనే ఇతడు శుద్ధ - వికృత స్వరాలు పదునాలుగే అని యంగీకరించి, రాగమేళములు మాత్రము అతనివలె ఇరువది యనక ఇరువది మూడని వివరించెను; రాగ స్వరముల సూక్ష్మ భేదములను వీణలో వాయించు పద్ధతులు ఇరువది రెండుగా వివరించి, వానికి వ్రాతలో సంజ్ఞల నేర్పరిచి, ఒక్కొక్క రాగమునకును స్వర సంచార వాదన పద్ధతులను లక్ష్యమార్గమున విపులముగా చూపి మహోపకృతి చేసినాడు. స్వర రాగముల స్వరూప మింత స్పష్టముగా వివరించు గ్రంథము ఇంకొకటి లేదన్నను చెల్లును. 1531 వ శాలివాహన శకవర్షమున ఈ గ్రంథము రచించినట్లు అతడే చెప్పినాడు.

గద్యపద్యమయముగా మొట్టమొదట తెలుగులో సంగీత లక్షణ గ్రంథము రచించిన కీర్తి పోలూరి గోవింద కవిది. 'రాగతాళ చింతామణి'లో

"సంగీత శాస్త్రంపు సర్వంకష ప్రజ్ఞ
గలిగియుఁ దొల్లిటి కవివరేణ్యు,
లిఖాతి నాంధ్రోక్తి శోభిత కావ్యంబు
పచరింపరు"

అని అతడే చెప్పుకొన్నాడు. ఇతడు రామామాత్యుని తరువాతివాడు. స్వర - మేళ - రాగ లక్షణములు అతనిచే తెలిగించి చెప్పినాడు[19] కాని ఎంత తరువాతివాడో తెలియదు; క్రీ.శ. 16-17 శతకముల నడిమివాడని యూహింపనగును. ఇదిగాక తాళమునే ప్రత్యేకముగా వివరించు 'తాళదశప్రాణ దీపిక' అనునదియు ఇతడు రచించెను.

క్రీ. శ. 17 వ శతాబ్దాదియందలి తంజావూరి ప్రభువు రఘునాథ నాయకుడు రచించినట్లుగా నున్న 'సంగీత సుధ' నిజమునకు కర్ణాటకుడైన గోవింద దీక్షితులు రచించి అతని పేరు పెట్టినదే యైనను[20] ఆంధ్ర రచనగానే పరిగణింప వచ్చును. విషయమును ఎంతో మించిన విస్తరము గల అబ్బురపు రచన యిది. రామామాత్యుడు కల్పించిన 'అచ్యుతరాయ మేళము' నకు ప్రతిగా 'అచ్యుతేంద్ర రఘునాథభూప మేళ' మొకటి వీణకు కల్పించినాడు

16. ఈ టీక కొన్ని వ్రాతప్రతులలో పెనుగొండ తిరుమల దేవరాయలు రచించిన ట్లున్నను మరికొన్నిట లక్ష్మీధర కర్తృకముగానే స్పష్టమై యున్నది.

17. గురుజాడ శ్రీరామమూర్తిగారి 'కవి జీవితములు', పుటలు. 373 – 74.

18. ఇతడు ఆంధ్రు డనుట పరప్రత్యయముచేత. నిశ్చయముగా అట్లు చెప్పు సాధనములు కానరావు. మీదుమిక్కిలి 'మేల' అను పదమునకు "ఖాట' ఇతి భాషాయా" అని (2. 1) హిందీ పదముతో తెలుగువాడు వివరణ మియ్యవలసిన పనియేమి? ఈ పద్య టీకయందే ఇట్టి శబ్దా లింకను గలవు. ఒకవేళ జాతితో ఆంధ్రుడై వృత్తితో ఉత్తర దేశమువాడై యుండెనా?

19. రాగ శా. 4 వ అశ్వాసమును, స్వర. క., మేళ – రాగ ప్రకరణములను పోల్చి చూడుడు. 'రాగ తాళ చింతామణి' మద్రాసు ప్రభుత్వము ప్రాచ్యగ్రంథమాలలో LXXXIX సంఖ్యతో ముద్రితము. దానిని మరల ప్రామాణికముగా పరిశుద్ధముగా ముద్రించుకోవలసిన భారము తెలుగువారిది.

20. ఈ విషయము అతని కుమారుడు వెంకటమఖి స్పష్టముగా చెప్పినాడు – చతుర్దండి ప్ర. : 154.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/




నాట్యచిత్రములు - చాళుక్యశిల్పము, విజయవాడ

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



చిత్రము 1.
నృత్యభంగిమ; శిల్పము, విజయవాడ



చిత్రము 2.
నాట్యభంగిమలు, చాళుక్యశిల్పము, విజయవాడ





చిత్రము 3. నాట్యచిత్రములు, మల్లికార్జునస్వామి ఆలయము, శ్రీశైలము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



కాని అదియును వాడుకలోనికి రాలేదు. 'జయంతసేన' మొదలగు రాగములను రఘునాథరాయలు కల్పించినట్లు ఇందు గలదు. తక్కిన రాగము లెట్టివో తెలియదు. జయంతసేన మాత్రము త్యాగయ్యగారి పుణ్యాన 'వినతాసుతవాహన శ్రీరమణ' అను నొక కీర్తనమూలముగా జీవించియున్నది. ఇతడు కల్పించెనన్న రామానందాది తాళములును అంతరించినవి.

'సంగీత పారిజాత' కర్త అహోబల కవి గూడ ఈ కాలమువాడే యని పండితుల యూహ; పేరునుబట్టి చూచితిమేని తెలుగువాడు గాబోలును. కాని యితని రాగ స్వరూపములు కర్ణాటకమునకు కంటె హిందూస్థానీ పద్ధతికి ఎక్కువగా నుపకరించును.

ఇంకను కాల దేశములు తెలియనివారిలో నాట్యచూడామణి, స్వర రాగ సుధారసము అను గ్రంథములు రచించిన అష్టావధాని సోమనార్యుడు, 'నాట్య సర్వస్వదీపిక'ను రచించిన కొటికలపూడి నారాయణశివయోగి మొదలగువారెందరో కలరు. వారి గ్రంథములు ఇంకను బైలుపడలేదు.

క్రీ. శ. 19 - 20 శతాబ్దములలో కర్ణాటక సంగీతమును గురించిన లక్షణ గ్రంథములు తెలుగులో పుట్టినన్ని తక్కిన యే భాషలోను పుట్టలేదు. ముఖ్యముగా తచ్చూరి శింగరాచార్య సోదరుల సంగీత పారిజాతాది గ్రంథములు, వీణ రామానుజయ్యాది సంగీత సర్వార్థసార సంగ్రహము, శ్రీనివాసయ్యంగారి గానభాస్కరము మొదలగు రచనలు, తిరువత్తూరు త్యాగయ్యగారి పల్లవి, స్వరకల్పవల్లి మొదలగునవియు ఈ సందర్భమున స్మరింపదగును. ఈ యన్నిటికంటె ప్రధానము ఎట్టియాపురపు సుబ్బరామ దీక్షితుల 'సంగీతసంప్రదాయప్రదర్శిని'. గ్రంథకర్త అచ్చపు తమిళజాతివాడైనను తెలుగుభాషను చక్కగా నేర్చుకొని అందులో వివిధలక్ష్యలక్షణములను విరివిగా, విస్పష్టముగా, గమక తాళాది చిహ్నములతోగూడ సంగ్రహించి, ప్రకటించి సంప్రదాయమును రక్షించుట కెంతో సహాయపడెను. అతనికి ముందుగాని, తరువాతగాని ఇంత గొప్ప ప్రామాణిక గ్రంథమును రచించినవా రిప్పటికి కానరారు.

కర్ణాటక సంగీతమునకు తెలుగువారి గొప్ప కానుక తెలుగు భాషయే. తెలుగు తక్కివ దాక్షిణాత్య భాషలన్నిటికంటె మొదలు అచ్చుల ప్రాధాన్యమును ఎక్కువగా సంపాదించుకొన్నది; సంయుక్తవర్ణములను వియుక్తము చేసికొన్నది. పదాంతమందు వచ్చు నకార లకారములు - ఎంతో మృదువైనవి కూడ - అజంతములుగా భాషా పరిణామమున మారినవి. సంగీత నాదమును వెలువరచు శక్తి అచ్చులకే కలదు కాని హల్లులకు లేదు - అనునాసికములకు తప్ప. కనుక అచ్చుప్రధానమైన తెలుగు భాష తక్కినే ద్రావిడ భాషలకన్న సంగీతమందు వ్యాప్తిని, వర్చస్సును సంపాదించుకొన్నందుకు వింతపడవలసిన పనిలేదు. మరి యే భాషవారైనను సంగీత రచనకు పూనుకొన్నప్పుడు తమ భాషయందలి హల్లుల ప్రాజాపత్యమును సాధ్యమైనంతవరకును తగ్గించుకొందురు. జయదేవుడు గీతగోవిందమునందలి అష్టపదులను రచించునప్పుడు హల్ప్రధానమైన సంస్కృత భాష నట్లే సంస్కరించి లొంగదీసెను. మరాటి, హింది, ఉర్దూ మొదలగు భాషల గీతరచనలందును మన మీ ప్రయత్నమును కనుగొనవచ్చును. ఇప్పుడు ద్రావిడ భాషలందును కన్నడము, తమిళమును ప్రాచీన హలంత రూపములను అజంతములుగా ఎంతో మార్చుకొన్నవి కాని తెలుగునకా లాలిత్యము వానికన్న మొదలే యేర్పడినది. దీనికితోడు మొదటినుండి సంగీత కళలో తెలుగువా రెక్కువగా పరిశ్రమించుట, కళా కేంద్రములగు విజయనగరము, తంజావూరు, మధుర, పుదుక్కోట మొదలగు రాజాస్థానములలో తెలుగు వాగ్గేయకారులు చొరవతో ప్రవేశించి నెలకొని తమ రచనలు వ్యాప్తికి తెచ్చుట కర్ణాటక సంగీత కళలో తెలుగు భాష కొక సాంప్రదాయికమైన ప్రబల స్థానము నిచ్చినవి. ఇందుచేత తమిళ, కన్నడ, మలయాళ భాషలవారును తెలుగు ప్రయత్నపూర్వకముగా నేర్చుకొని దానిలోనే కీర్తన, వర్ణాది రచనను సాగించవలసిన యవస్థకు పాల్పడినారు. అట్టి రచనలలో ఎన్నో తెలుగువారి పరిహాసమునకు గురియైనవి. పట్టణం సుబ్రహ్మణ్యయ్య, రామనాడు శ్రీనివాసయ్యంగారు మొదలగు తెలుగు బయకారు లెందరో తెలుగురాని తమిళులే. కాలక్రమమున ఈ సంప్రదాయము తెలుగువారికనావశ్యకమైన అహంకారమును, ఇతరులకు అనర్థకరమైన అసూయాభిమానములను గలిగించినది. తెలుగు పాటలు పాడరాదని మొండిపట్టు పట్టువరకును తమిళ, కర్ణాటకు లనేకులందు దాని ఫలము వ్యాపించినది. ఇంకను ఇతర భాషలనే వాడరాదని కూడ ఈ దృష్టి సుతి మించినది; కాని సంగీతము విశ్వజనీనమై భాషల యెల్లలను మీరి వ్యాపించు నాదకళ గనుక పై యల్ప భావములు ఎక్కువగా వ్యాపింపలేవు; త్వరలో నశించి విశ్వమంగళమును సాధింపగలవు.

రా. అ. కృ. శ.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/

# నాట్యకళ

జమిలి కళలగు నృత్త గీతములకు తానకమైన నాట్యశాస్త్రమును వివిధ విజ్ఞాన శాఖలతోపాటు ఆంధ్ర రాజన్యుల పోషణమున నభివృద్ధి పొందినది. ప్రాచీన కాలము నుండియు నీ రెండు కళలును ఆంధ్ర దేశమున ప్రజాదరణమునకు పాత్రములై విలసిల్లుచుండిన వనుటకు అమరావతి యందును, నాగార్జునుని కొండయందును కానవచ్చుచున్న శిల్ప చిత్రములే నిదర్శనము. గందారపు కళ (ప్లాస్టిక్ ఆర్ట్)ను మాత్రమే నిదర్శనముగా గ్రహించినచో నాట్య కళయందు ప్రజలకు గల యభిరుచి విజయనగర రాజుల కాలమువరకు ననలు సాగుచుండిన దనవచ్చును. ప్రకృత విషయము నాట్యకళ. కావున నీ కళ ఆ కాలమున ప్రచారములో నుండెనని రుజు వగుటయే కాక భరత ముని ప్రోక్తములయి అభినవ గుప్తాచార్యులచే విపులముగ వివరింపబడిన 'పిండి బంధము' లనుబృందనృత్యములును ప్రచారమున నుండినట్లు అమరావతీ శిల్పములవలన స్పష్టమగుచున్నది. మూల గ్రంథములయందు వాగ్రూపమున వర్ణింపబడిన నృత్య విశేషము లచట సుందర శిలామయ శిల్ప రూపమున రూపమును దాల్చినవి. ఇట్టి శిల్ప చిత్రమొకటి అమరావతియందు గలదు. అందు నలుగు రాటకత్తెలు కలిసి నృత్యము చేయుచున్నారు. అందలి రచన, తూగు, సౌకుమార్యము ప్రశస్తముగా నున్నవి. బ్రిటిష్ మ్యూజియమున భద్రపరుపబడిన అమరావతీ శిల్పములలో కూడ ఒక నృత్య దృశ్యము కలదు. అం దొక యువతి వల్లకిని మీటుచుండగా నిం కొక యువతి వేణుగానము చేయుచుండును. తదనుగుణముగా నొక నర్తకి నృత్యము చేయుచుండును. గుంటూరు జిల్లా యందలి గోలి శిల్పములలో నొక యువతి విపంచిని మీటుచున్న ట్లొక శిల్పమున్నది. నాగార్జునుని కొండయందు విపంచిని మీటుచున్న యువతి శిల్ప మిట్టి దొకటి యుండుటయే కాక ముగ్గురు స్త్రీలు బృందనృత్యము చేయుచున్నట్లు నొక శిల్ప దృశ్యము కలదు. మీద పేర్కొనిన అమరావతి యందలి బృంద నృత్య శిల్పమున కంటె నది యంద చందములలో కొంచెము కొరతవడినను, అంత హృదయాకర్షకము కాకపోయినను దానితో సరిసమానముగా గ్రహింపదగినదియే.

నాట్యము శాతవాహనుల, ఇక్ష్వాకుల కాలమున మహారాజుల, సంపన్నుల ఆశ్రయమున వర్ధిల్లి దనుటకు అమరావతి, నాగార్జునునికొండ శిల్పములలోని చిత్రములే సాక్ష్యము. వారి కాలమునకు తరువాత ఆ కళ యెట్లుండెనో తెలిసికొనుటకు శిల్పములోనైనను ఆధారములు కానరావు. కాని యది పౌరాణికమత విజృంభణ కాలమున రాజాదరణమువలన కంటెను ఎక్కువగా దేవాయతనాశ్రయమున వర్ధిల్లిన దనుట కవకాశము కలదు. పూర్వచాళుక్య పరిపాలనమున శివాలయమున కగ్రహారము దాన మిచ్చుటకు గల ప్రయోజనములలో తత ఘన సుషిర ఆనద్ధ వాద్య వాదక గాయక నటకాచార్య విలాసినీజనమును పోషించుట ఒకటి (తత ఘన సుషిర ఆనద్ధము లనునవి నాలుగు రకములైన వాద్యములు. వీణలోనగునవి తతములు; కంచుతాళములు లోనగునవి ఘనములు; మద్దెల లోనగు చర్మవాద్యములు ఆనద్ధములు; పిల్లంగ్రోవి మున్నగునవి సుషిర వాద్యములు).

బెజవాడలో అక్కన్న మాదన్న గుహలకు కొద్ది దూరములో నున్న జమ్మిదొడ్డిలోని మండపస్తంభ చూళికల మీదను, దూలములమీదను క్రీ. శ. 8, 9 శతాబ్దములనాటి పూర్వ చాళుక్య శిల్పసంప్రదాయమునకు చెందిన నాట్య చిత్రములు కొన్ని యున్నవి. వానివలన పూర్వచాళుక్య యుగమున నాట్యకళకుగల జనాదరము వ్యక్తమగుచున్నది. క్రమముగా శిల్ప, చిత్రలేఖనములకువలెనే సంగీత, నాట్య కళలకుకూడ పూర్వచాళుక్య పరిపాలనాంతిమ కాలమునాటికి ఈ యాశ్రయము మరింత బలపడినది. చాళుక్య చోళయుగమునందు అంతకు పూర్వమున కంటెను దేవాలయమునకు ప్రాధాన్యము హెచ్చి స్వామికి హవిర్బల్యర్చనాదులును, అంగరంగ భోగాదులును నిత్యవిధులైన కాలమున స్వామి సేవాపరిజనములో గాయక, మార్దంగిక, నర్తకీజనము ముఖ్యులై వారి జీవనభృతికి జీతములో, వృత్తి మాన్యములో ఏర్పడి నాట్యకళ కత్యంత ప్రాముఖ్యము కలిగినది. దేవాలయములో నాట్యమండపము ప్రముఖభాగమైనది. స్వామియొక్క అర్చాసేవా సమయములలో శివాలయములందు శివకథలను, విష్ణ్వాలయమున విష్ణుకథలను ఆడి పాడి అభినయించుట ఆచారమైనది. ఈ యాచారమువలననే పూర్వ మధ్యయుగమున తెలుగుదేశములో నర్తకులును, నాట్యమండపమును లేని దేవాలయ ముండెడిది కాదు.

కాకతీయుల కాలమున నాట్యకళ విపుల ప్రచారమున నుండెనని శాసనములవలనను, శిల్పరచనములవలనను,



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



సాహిత్యమువలనను విదిత మగుచున్నది. రేచెరువుల నామి రెడ్డి పిల్లలమర్రి శాసనములో దేవాలయ కైంకర్యము చేయు గాయక మార్దంగిక నర్తకీ జనమునకు గృహదాన ములును చేసినట్లు కలదు. మైలాంబ పానుగల్లు శాసనము లోను గాయకులకు, నర్తకులకు ఇట్టి దానములు చేసినట్లు చెప్పియున్నది. జలజకరండమను నపూర్వ వాద్య ప్రశంస గల ధర్మసాగర శాసనమున కొన్ని నివర్తనముల భూమిని గాయకులకు, పదుగురు నాట్యకత్తెలకు ఇచ్చినట్లు లిఖింప బడి యున్నది. కాకతి గణపతి దేవ, జాయపల చేబ్రోలు శాసనము పదునార్గురు ఆటకత్తెలకు గృహముల నిచ్చినట్లు పేర్కొనుచున్నది. శకవర్షము 1188 లో తనకు కాకతీయ మహారాజ్ఞి రుద్రమదేవి దానముగా నిచ్చిన మంథార (ఇప్పటి మందడ)మను గ్రామములో విశ్వేశ్వర శివా చార్యుడు స్థాపించిన గోళకీమఠ విద్యాస్థానమునను, దేవా లయమునను పదిమంది నర్తకులకు, మర్దలవాదకు లెనమం డ్రకు, కాశ్మీరదేశీయుడైన గాయకునికి, పదునాల్గురు గాయనులకు, కరడావాదనాదులలో చతురులైన ఆరుగురికి వృత్తిమాన్యము లిచ్చి నాట్య, సంగీతములకు పోషణ కల్పించెనని మల్కాపుర శాసనము తెలుపుచున్నది.

శాసనములతోపాటు కాకతీయ నరపతులు కట్టించిన దేవాలయములయందలి శిల్పముకూడ నాట్య సంప్ర దాయములు, వానికి దేవాలయములతో గల సంబంధము అవిచ్ఛిన్నముగా సాగుచుండినట్లు నిరూపించుచున్నవి. కాకతీయుల కాలమునందలి నృత్య, శిల్పములలో రామప్ప దేవాలయములోనివి ప్రశస్తములు. జాయపచే నృత్త రత్నావళిని రచింపజేసిన కాకతి గణపతిదేవుని కాలమున చెక్కబడిన శిల్పములగుట వీనికి గల మరియొక విశేష గుణము. ఆంధ్రదేశ మందలి నృత్య, సంగీత కళల చరిత్రను రచించిన ఆంధ్రరచయితలు కొందరు ఈ కాకతీయ నృత్య శిల్పములు జాయప నృత్తరత్నావళి యందలి నృత్యవర్ణనల కుదాహరణములుగ చెక్కబడినవని భావించిరి. కాని ఇది నిరూపింప వలను పడదు. లభించిన శిల్పములు చాల కొలదిగ నున్నవి. అవియు చిదంబరము లోని, తంజావూరులోని శిల్పములవలె నాట్య భంగిమముల కుదాహరణములుగా చెక్కబడినవి కావు. కొంత పోలి కలు కానవచ్చుచున్నను శాస్త్రీయములగు భంగిమముల విషయమున నవియు, నివియు నొక్క రూపువే అని చెప్పు టకు సాధ్యము కాదు. పాలంపేట యందలి పెద్ద దేవళము యొక్క ద్వారబంధములమీదను, స్తంభములమీదను నృత్యశిల్పము లున్నవి. పాలంపేటలోని రామప్ప చెరువు కట్ట తూర్పు చివర నున్న దేవాలయము యొక్క లోపలి భాగమున, స్త్రీలు మద్దెల వాయించుచుండ వివిధ భంగిమ ములతో నృత్యము చేయుచున్న ఆటకత్తెల శిల్పము లున్నవి. పడమటివైపు ద్వారబంధములమీదను అట్టివే మార్దంగికురాండ్రుగల నృత్య శిల్పములు గలవు. వరంగల్లు కోట ద్వారబంధముపై రాతి గొడుగువలకమీదను ఇట్టి నృత్య శిల్పచిత్రములు చెక్కబడి యున్నవి. ఆ వరంగల్లు కోటయందలి స్వయంభూ లింగేశ్వర దేవాలయమున ఒక చిన్న శివతాండవ శిల్ప మున్నది.

కాకతీయ యుగమున నాట్యకళ బహుళ ప్రచార మున నుండెనని అప్పటి సంస్కృతాంధ్ర గ్రంథములును తెలుపుచున్నవి. సంస్కృత గ్రంథమగు నృత్తరత్నావళి కాకతీయుల కాలమునందలిదే. కాకతీయ మహీపతియగు గణపతిదేవునికడ గజసేనాధ్యక్షుడుగ నుండిన జాయప 'నృత్తరత్నావళి' యను నాట్యశాస్త్ర గ్రంథమును రచించెను. తెలుగునాట వెలసిన నాట్యగ్రంథములలో నిది యుత్తమ మనదగియున్నది. దక్షిణమున తన 'సంగీత చింతామణి'యందు వేమ భూపాలుడే కాక తన 'సంగీత రాజము'న కుంభకర్ణుడును ఈ నృత్తరత్నావళిని విరివిగ నుపయోగించుకొనిరి. జాయప ఈ గ్రంథమును తాను కలియుగము 4355 వ సంవత్సరమున, అనగా క్రీ. శ. 1253 - 54 లో రచించితినని తన గ్రంథములో చెప్పికొనెను. భరత ప్రోక్తమై తద్వ్యాఖ్యాతలచే వివరింప బడిన నాట్య శాస్త్రమునకు ఇది చక్కని సంగ్రహరచన మగుటయేకాక జాయపకాలమున ప్రచారమం దుండిన దేశినృత్యము లెల్ల ఇందు చక్కగా వివరింపబడియుండుటచేత ఇది చాల అమూల్యమైనది. ఎనిమిది అధ్యాయములుగల ఈ గ్రంథ మున కడపటి మూడధ్యాయములు దేశినృత్య సంప్రదాయ ములను గూర్చి వివరించుచున్నవి. మార్గనృత్యములను వివరించు పట్టున మూలమగు భరతనాట్య శాస్త్రమున జాయపకు గల అపార పాండిత్యమేకాక అభినవగుప్త విరచితమగు తద్వ్యాఖ్యానమునందుగల నిరాఘాట ప్రజ్ఞయు ప్రకటిత మగుచున్నది. ఇంతే కాదు; కీర్తిధర, భట్టతండు విరచితములగు భరతనాట్యశాస్త్ర వ్యాఖ్యా ప్రకారములుకూడ ఇందు తరచు నుదాహృతములైనవి. ఇది యంతయు పరిశీలింప ఈ ప్రసిద్ధరచయితల యపూర్వ గ్రంథముల మాతృకలు దక్షిణ దేశమున లభ్యములగు చుండెడి వనియు, అవి నిత్యోపయోగమున నుండెడి వనియు స్పష్టమగు చున్నది. దేశినృత్యాధ్యాయములలో జాయప పేరణి, ప్రేంఖణము, రాసకము, చర్చరి, నాట్యరాసకము, దండరాసకము, శివప్రియము, చిందు, కందుకము, భాండి కము, ఘంటసరి, చరణము, బహురూపము, కోలాటము



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అను జానపదములు, ప్రాంతీయములు నైన నృత్యములను వివరించెను. ఆనాటి సాటి యాదవరాజుల యొక్క యాస్థానమున పుట్టువు గాంచిన సంగీతరత్నాకరమున కూడ గానరానివి వానిలో కొన్ని గలవు.

జాయప దీనితోపాటు గీతరత్నావళియను సంగీత గ్రంథమునుకూడ రచించెను. అందు తన నృత్తరత్నావళి యందలి నృత్యములకు సంగీత ముపాంగ మగునట్లు వర్ణించి యుండవలెను. ఈ గీతరత్నావళి అలభ్యమైపోయినది. నృత్తరత్నావళియం దుదాహృత మగుటవలన దీని యునికి తెలియవచ్చినది.

ఆనాటి తెలుగు రచనములలో కేవలము సూచనలే కాక నృత్య కళకు సంబంధించిన విశేష విషయము అధిక ముగ వర్ణితములైనవి. సోమనాథ కృతమగు పండితా రాధ్య చరిత్రయందలి పర్వత ప్రకరణములో నృత్య కళకు సంబంధించిన శాస్త్రీయ సాంకేతిక పదజాలమేకాక నృత్తరత్నావళిలో వర్ణింపబడిన జానపద నృత్యముల దృక్పథము ననుసరించి మిక్కిలి యమూల్య మనదగిన జానపద నృత్యవర్ణనము కూడ కావింపబడినది. ఈ గ్రంథము నృత్యములను శ్రీశైలము నందలి శివరాత్రి మహోత్సవ ములలో నేకదేశముగ వర్ణించి నృత్యకళకు, శైవమునకు పరస్పరసంబంధము గలదని రూఢిపరచుచున్నది. పండితా రాధ్యచరిత్రయం దాకాలమున ప్రజారంజకములుగా నుండిన దేశినృత్యము లీ క్రింద పేర్కొనబడినవి కొన్ని వర్ణింపబడి యున్నవి: పెడయాట (ఇదియే వికట నర్తనము), చిందు (దీనిని జాయపయు పేర్కొనెను), కోడ(ణ)ంగి ఆట (ఇది హాస్యకాని నృత్యము, జాయప వర్ణించిన భాండిక నృత్యమువంటిది కావచ్చును), పేరణి (ఇదియు జాయప రచనమున కలదు), ప్రమథ గణముల చేష్టితములను వర్ణించు బహునాటకములు, బహురూపులు (ఇదియు జాయప వర్ణితమే), పెద్దంగము (ఇది కరణములతో నెరసి వివిధ గతుల నొప్పుచుండును కాని, ఇది యవిజ్ఞాతము), అమర గంధర్వాంగనల నృత్యానుకరణములు, పశుల ఆటలు, గడాటలు (దొమ్మరాటలు), భారతాది కథల ఛాయాచిత్ర ప్రదర్శనములు, బొమ్మలాటలు, పగటివేషములు.

సోమనాథ ప్రోక్తము నాట్య విషయము కావున చర్చింపదగినది. పేరణిని పంచాంగి అని సోమనాథుడు పేర్కొనెను. నాట్యశాస్త్రములందు దీనికి పంచాంగములు (అయిదు భాగములు - పంచాంగములు) కలవని చెప్పబడి నది. ఆ యంగములు నృత్తము, కైవారము (కవిచరము), ఘర్ఘరము, వికటము, గీతము - అని జాయప చెప్పెను. దేవాలయముమెదుట ప్రవర్తిల్లు ఇతర నృత్యములను సోమనాథుడు తరువాత వర్ణించెను. అతడు నర్తకజనుల నగలతోను, వేషములతోను మొదలిడెను. నాట్యము చేయునపుడు నట్టువకత్తె లర్ధోరుకముల (చల్లడముల) నాకాలమున ధరించువారు. తెర లోపలి భాగమున రంగముమీదికి నర్తకులు ప్రవేశించిన వెంటనే నర్తన గాన ములు ప్రవర్తిల్లెడివి. దీనికి పూర్వరంగమని పేరు. తదనంత రము నర్తకులు తెరబయటికి వత్తురు. తరువాత కన్నులు, కనుబొమ్మలు మొదలగు నర్తకుల అంగ ప్రత్యంగ ఉపాంగ ముల చలనములు అభివర్ణితములు. ఆ వెంట జంత్ర సంగీ తము, గమకముల యొక్కయు, వివిధవాద్యముల యొక్కయు దేశినామములు వర్ణింపబడినవి. కొంతమేర పదఘట్టనము, ఉద్ఘట్టనము, ఉత్ప్లుతి మొదలగు పదగతు లను సంగ్రహముగా పేర్కొని తరువాత సోమనాథుడు వివిధవిధ నర్తకుల నర్తనముల తీరులను అత్యుత్సాహ ముతో కావ్యధోరణిని వర్ణించినాడు. ఈ వర్ణనములో మరగాళ్ళపై నడక, ఒంటికాలి నడక, మోకాటి నడక, కూర్చుండియే ముందుకు చనుట, రొమ్ముతో ప్రాకుట, గిరగిర తిరుగుచు పోవుట మున్నగునవి కలవు. సోమ నాథుడు బొంగరమువలె గిరగిర తిరుగుచు చేయు నృత్య మును పేర్కొని యున్నాడు. దీనికి భ్రమరి నృత్యమని పేరు. ఇట్టి నృత్య మీనాడు అంతరింప కున్నను చాల అరుదు. మరియు నీ గ్రంథమున నెమళ్ళు చిలుకలు హంసలు కోయిలలు మొదలగు పశులవలెను, కోతులు జింకలు ఎద్దులు ఏనుగులు పెద్దపులులు మొదలగు జంతు వులవలెను, తుమ్మెద చేప పాము మొదలగువాని వలెను నడచుచు ఆర్చుచు నృత్యము చేసినట్లు వర్ణింపబడెను.

వీనితోపాటు బహువిధములయిన ఇతర నృత్యభేదము లును, వేర్వేరు కథలను వివరించు నాటకప్రదర్శనము లును వర్ణింప బడినవి.

దేశిలాస్యమునకు అంగములు వివిధ గ్రంథములలో పేర్కొనబడినవి. జాయప తన నృత్తరత్నావళిలో ఆరవ యధ్యాయమున వానిలో నలువది యారింటిని నిర్వచించి నాడు. సోమనాథుడు ఈ యంగములను పెక్కింటిని వర్ణించియున్నాడు. వీనిలో చాల భాగము గుర్తింప దగినవే. కొన్ని జాయపరచనమునగాని, శార్ఙ్గదేవ, పార్శ్వదేవ, వేమభూపాలుర గ్రంథములలోగాని కాన రావు. కావున ఆ కాలమున వాడుకలో నుండిన నాట్య కళయొక్క చరిత్రను గ్రహించు విషయమున ఈ సోమ నాథుని వర్ణనలు అమూల్య సాధనము లగుచున్నవి.

దేశిలాస్యాంగములను వివరించిన వెనుక సోమనాథుడు వివిధాంగముల యొక్క అభినయముల పట్టిక నిచ్చెను.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/





చిత్రము 1. నాట్యభంగిమలు, విజయనగర శిల్పము, హంపి



చిత్రము 2.



చిత్రము 3. (2-3) కోలాటపు భంగిమలు, విజయనగరశిల్పము, హంపి

http://sanskritcentral.com/

http://teluguthesis.com/





ద్వాదశహస్త నటరాజమూర్తి, ముఖలింగము

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



అందు ముఖమువి 4, కనుబొమ్మలవి 7, కన్నులవి 36, నాసాపుటములవి 6, పెదవులవి 10, కుత్తుకవి 9, రొమ్మువి 8, పాదములవి 5, తొడలవి 5 అభినయములు పేర్కొనబడినవి. తరువాత 22 స్థానకములు (స్థానకములు), 34 దృష్టులు, 64 హస్తములు, 32 చారులు, 7 భ్రమరులు, 108 కరణములు, 100 అలంకారములు, 18 శిరోభినయములు, 32 దండనములు చెప్పబడినవి. ఈ పట్టికయందలి అభినయాదులు నాట్యగ్రంథములలో నే యొకదానియందు పేర్కొనబడిన వానితోగాని పూర్తిగా సరిపోవు. వీనిలో కొన్నిటి సంఖ్యలు చిత్రముగా నున్నవి. నేత్రాభినయములు రెండు మారులు రెండు విధములుగా చెప్పబడినవి. అలంకారములు 100, దండనములు 32 అజ్ఞాతములు. కట్టకడపట సోమనాథుడు హంస, నెమలి, పాము, ఏనుగు, ఎద్దు, కోతి, మేక మొదలగు వివిధములగు పక్షులయు, మృగములయు గతుల ననుకరించి చేయునృత్యముల పట్టిక నిచ్చినాడు.

కళాసంపదను, అందలి విభేదములను, దాని సంప్రదాయములను చక్కగా వివరించి పేర్కొనుటకు సారస్వతాధారములను నెక్కువగా సేకరించి వాని నొండొంటితో పోల్చి పరిశీలించవలసిన ఆవశ్యకము కలదని సోమనాథుడు తెలుపుచున్నాడు.

సోమనాథుని రచనాంతరమగు బసవపురాణమున నృత్యవర్ణన మెడనెడ కొలదిగా గలదు. బసవని వివాహ ఘట్టమున సోమనాథుడు కోలాటము, అనగా దండరాసకము, పాత్ర (ఇది యొకతీరు నృత్యము; దీని ప్రస్తావమింతే కాని మరెందును లేదు), గొండ్లి, పేరణి అను వానిని పేర్కొనెను. కొంత తరువాత, ఆనంద గీతములు, శంకర గీతములు, మనకు ముఖ్యముగ ప్రసక్తమయిన జక్కిగీతములు ప్రస్తావించెను. బసవని కల్యాణపురప్రవేశ సమయమున పేరణి ప్రస్తావ మున్నది. ఆ పేరణి సౌరాష్ట్రనర్తనాచార్యుల సంప్రదాయాను సారము నర్తింపబడినట్లున్నది. ఇందువలన శైవసంప్రదాయము ననుసరించిన పేరణి యొక్క చరిత్ర, దాని యానుపూర్వి స్పష్టమగుచున్నవి. పూర్వాంగ సంగీతము, తెరతీయుట, దేశిలాస్యాంగములు, ముఖరసము, సౌష్ఠవము, అలి, భావము, ధూకళి, ఝుంకళి, తేప, విభ్రమము, రేఖ అనువాని ప్రస్తావము న్నది. ఆ వెంటనే మరియొకచోట జక్కిగీతముల ప్రస్తావము కలదు. మరికొంత యాతల దేశి సంగీత సంబంధము అయిన సాంకేతిక పదముల పట్టిక యున్నది. ధూకళి తప్ప తక్కిన దేశిలాస్యాంగము లన్నియు జాయప నృత్తరత్నావళియందు గలవు. పార్శ్వదేవుడు ఆ ధూకళినే తూకళి అను పేరుతో పేర్కొనెను.

మాచలదేవి యను పేరు గల వేశ్య యొకతె ప్రతాపరుద్రుని చే సత్కృత యుండెననియు, ఆమె సుప్రసిద్ధ నర్తకి యనియు, ఆమె జీవితము నాటకముగా రచింపబడి ప్రదర్శింపబడె ననియు క్రీడాభిరామమునందు కలదు.

కొండవీటి రెడ్డి రాజులలో పలువురు నాట్యశాస్త్ర రచయిత లుండిరి. వారిలో మొదటివాడు కుమారగిరి రెడ్డి (క్రీ. శ. 1386 - క్రీ. శ. 1403). ఇతనికి వసంతరాజని నామాంతరము. ఇతడు తన పేర వసంతరాజీయ మను నాట్యశాస్త్ర గ్రంథమును వ్రాసెను. ఆ గ్రంథ మీనాటికిని కానరాదు. కాని ఇతర రచయితలు - అనగా కుమారగిరికి ప్రధానియు, తోబుట్టువు భర్తయు, కాళిదాస నాటక వ్యాఖ్యాతయునగు కాటయ వేమారెడ్డి, మాఘవ్యాఖ్యాత మల్లినాథుడు, అతని కుమారుడును ప్రతాపరుద్రీయ వ్యాఖ్యాతయు నగు కుమారస్వామి, ప్రబోధ చంద్రోదయ రూపక వ్యాఖ్యాతయగు నాదెండ్ల గోప ప్రధాని మొదలగు వారు వసంతరాజీయములోని భాగములను తమ రచనములలో నుదాహరించి యున్నారు. కుమారగిరిరెడ్డి తరువాత రాజ్యమునకు వచ్చిన వీరనారాయణుడను నామాంతరముగల పెదకోమటివేమ భూపతి సంగీత చింతామణిని రచియించిన విషయము పూర్వోక్తము.

ఆ కాలపు ఆంధ్ర కవిసార్వభౌముడు శ్రీనాథుడు రచియించిన కాశీఖండమునను నృత్యముల ప్రసక్తి గలదు. కర్పూరతిలక యనువేశ్య కాశీనగరమున రత్నేశ్వరుని సమ్ముఖమున నృత్యము చేసినట్లు అతడు వర్ణించి యున్నాడు. కుండలీనృత్యమును - కోహలుడు మొదలగు నాట్యాచార్యుల మతభేదములతో,- దేశి మార్గ నృత్యములను, చారిక కరణ అంగహార రేచక భ్రమరికా నృత్యములను కావించి యామె లాస్య తాండవ జననీ జనకులగు పార్వతీ పరమేశ్వరులను మెప్పించెనట.

రేచెర్ల వంశ్యులలో సర్వజ్ఞ బిరుదాంచితుడగు సింగ భూపాలుడు రస నాట్య విషయముల నభివర్ణించు రసార్ణవసుధాకరము నే కాక, కడపటి యధ్యాయమున నాట్య విషయము నభివర్ణించు సంగీతరత్నాకరమునకు సంగీత సుధార్ణవ మను టీకావ్యాఖ్యానమును రచించెను. ఈ కాలముననే యక్షగానమను నృత్య నాటక ముప్పతిల్లినది.

విజయనగర రాజుల కాలమునను నాట్య సంగీత కళలు వర్ధిల్లినవి. విద్యానగరరాజ్య ప్రతిష్ఠాపకుల యాచార్యులు విద్యారణ్యుల సంగీతసార మను గ్రంథము తంజావూరు రఘునాథనాయక విరచిత మనబడు సంగీత సుధయందుదాహృతమైనది. రెండవ దేవరాయల కాలములో అబ్దుర్ రజాక్ అను పార్సీ యాత్రికుడు విజయనగరమును



http://sanskritcentral.com/

http://teluguthesis.com/















చిత్రము 119. నాట్య భంగిమలు: ఆంధ్ర శిల్పము.

http://sanskritcentral.com/

http://teluguthesis.com/



దర్శింప వచ్చి యుండెను. విజయనగర రాజ భవనమున దశరా దినములలో మహానవమి మహోత్సవ మత్యంత వైభవముతో జరగినట్లు అతడు వర్ణించి యున్నాడు. అందు వైదేశికు డగు నతడు ఆ మహోత్సవ సమయమున నద్భుతావహము లగు నాట్య ప్రదర్శనములు జరగినట్లు పేర్కొని యున్నాడు. 'ఈ స్థలమునకును, మంటపములకును నడుమ చక్కగా తీర్చిన ఖాళీ స్థలము కలదు. అందు గాయకులు గానము చేసిరి; కథకులు కథలు చెప్పిరి. గాయకురాండ్రలో నధికాంశము లేబ్రాయపు కన్యలే. వారి బుగ్గలు చంద్రునివలెను, వారి మొగములు వసంతము నతిశయించిన శోభతోను ఒప్పుచుండినవి. వారు ధరించిన వస్త్రములు సొగసయినవి. క్రొత్తగా విచ్చిన గులాబి పూవులవలె వారి రూపములు మనసున కమితానందము కలిగించినవి. వారు రాయల కభిముఖముగ నున్న తెరకు మరుగున కూర్చుండి యుండిరి. అకస్మాత్తుగా రెండు వైపులనుండి తెర తొలగింపబడినది. అంత నా బాలికలు పూర్వాపర వివేకము దూరపోవునట్లును, ఆత్మ లానంద పరవశము లగునట్లును లలిత పద విన్యాసములతో నృత్యము చేయనారంభించిరి' అని యతడు వ్రాసెను.

క్రీ.శ. 1483 - 84లో మడమను గ్రామములోని అగ్నీశ్వర దేవాలయ దేవదాసి - అరంవళత్తనాచ్చియార్ అను అరవ దేవదాసి - రెండవ దేవరాయలను సందర్శించి, అతనివలన నొక దేవాలయముకొరకు దానము పడసెను. సాళువ తిరుమలరాయల సోదరుడును, రెండవ దేవరాయల కాలమున దుర్గపాలకుడునైన గోపేంద్ర తిప్పరాజు తాళ దీపిక యను ప్రత్యేక తాళ లక్షణ గ్రంథమును రచించెను. అతడు వామనుని కావ్యాలంకార సూత్ర వృత్తులకు తాను రచించిన లఘు టీక యొక్క ప్రస్తావన శ్లోకములందొక దానివలన తాను శివాంకితముగ నొక తాళ ప్రబంధమును రచించినట్లే కాక నాట్యమునకు సంబంధించిన యొక గ్రంథమును ('శివా క్లుప్తాకారా నటన కరణా నామపి భిదాః') వ్రాసినట్లును తెలియుచున్నది.

ఇమ్మడి ప్రౌఢ దేవరాయ లనబడు మల్లికార్జున దేవరాయల కాలము (క్రీ. శ. 1446 - క్రీ. శ. 1465) లో చతుర కల్లినాథుడు రచించిన కలానిధి నామకమగు సంగీతరత్నాకరవ్యాఖ్యానము విజయనగర యుగమున వెలువడిన ఉత్తమ సుప్రసిద్ధ గ్రంథము. సింగభూపాలుని వ్యాఖ్యానము కన్న ఈ కల్లినాథుని వ్యాఖ్యానము ప్రశస్తతరము. సంగీతరత్నాకరమునందలి కడపటి యధ్యాయమునకు చేసిన వ్యాఖ్యానమువలన కల్లినాథుని నాట్యకలా పాండిత్యము స్పష్టమగుచున్నది. శ్రీకృష్ణదేవరాయల కాలమున (క్రీ. శ. 1509 - క్రీ. శ. 1530) అంతఃపుర స్త్రీ జనమునకు నాట్యాచార్యత్వమును వహించి యుండిన బండారు లక్ష్మీనారాయణ పండితుడు సంగీత సూర్యోదయ మను నొక గ్రంథమును రచించెను. అందు నృత్యమును గురించిన అధ్యాయ మొకటి కలదు. అం దతడు శార్ఙ్గదేవ, కోలాహల విరచిత గ్రంథముల ననేకపర్యాయము లుదాహరించినాడు. ఓఢ్రరాజగు వీరరుద్ర గజపతియొక్కయు, విజయనగర ప్రభువగు కృష్ణదేవరాయలయొక్కయు పోషణమున వెలసిన లొల్ల లక్ష్మీధరుడు తన సౌందర్యలహరీ వ్యాఖ్యానాంతమున తాను రచించిన పెక్కు విషయములను వివరించు సుదీర్ఘ గద్యయందు తన పూర్వులలో తన కైదవ తరమువాడగు విరించిమిశ్రుడు భరతార్ణవపోత మనునాట్య గ్రంథము నొక దానిని రచించినట్లు చెప్పి యున్నాడు.

సాహిత్యమునకంటె నధికముగ హంపి శిల్పములును, విదేశ యాత్రికులగు బర్బోసా, పేయస్ మొదలగువారు రాయల యాస్థానమునుగురించి, రాజధాని యందలి ప్రజా జీవిత విధానమును గురించి వ్రాసిన వృత్తాంతములును విజయనగర రాజుల కాలమున నృత్యకళ పొందుచుండిన గౌరవాదరములను తెలుపుచున్నవి. ఈ విదేశ యాత్రిక వృత్తాంతములలో అప్పటి వేశ్యాంగనలయొక్క సంపత్సమృద్ధికిని, వారికి ఆస్థానికులతోడను, ఇతర ప్రముఖులతోడను గల సంబంధానుబంధములకును ప్రస్తావము కలదు. శుద్ధాంత కాంతాజనముకూడ నాట్యకళ నభ్యసించుచుండెను. పేయస్ రచియించిన వృత్తాంతములో నర్తకీ జనము నాట్యము నభ్యసించునట్టిదియు, ప్రదర్శించునట్టిదియు నగు నర్తనశాల వర్ణనము మిక్కిలి ముఖ్యమయినది. 'నర్తనశాల సుదీర్ఘమయినది, కాని అంత వెడల్పు గలది కాదు. దానియందు గోడనుండి సరిగా రెండు మూరల దూరమున శిల్ప రమణీయము లగు శిలా స్తంభములు గలవు. ఆ స్తంభ ఫలకములపై నాట్యాంతమున నుండవలసిన సరియైనతీరులతో నొప్పు నాట్యకత్తెల రూపములు చెక్కబడి యున్నవి. నృత్యము నభ్యసించువారు నృత్యాంతమున తా ముండవలసిన వైఖరిని మరచి పోయిన యెడల, అట్టివారు ఈ శిల్పచిత్రములను చూచి తా ముండవలసిన తీరును జ్ఞాపకము తెచ్చుకొందురు. ఈ నర్తనశాల తుదను ఎడమచేతివైపున చిత్రలేఖనములు గల యొక యేకాంతస్థలము కలదు. అచట నాట్యకత్తెలు తమ శరీరములను, కాళ్ళను చక్కగా జాపి సడలజేసికొనుటకై వ్రేలాడుదురు. వారి నృత్యము సుందరతరముగ నుండునట్లు చేయుటకుగాను శరీరము తేలికగా వంగునట్లు చేయుట కచ్చట నేర్చుకొందురు. నర్తనశాల



http://sanskritcentral.com/

http://teluguthesis.com/



యొక్క మరియొక తుదను కుడివైపున నాట్య ప్రదర్శన మును గాంచుటకై రాజు కూర్చుండు ప్రదేశమున నేలమీదను, గోడలమీదను బంగారు రేకులు తాపబడి యుండును. గోడ నడిమి భాగమున పండ్రెండేండ్ల బాలిక ప్రమాణమున నుండు సువర్ణ విగ్రహము కలదు. ఆ విగ్రహము యొక్క చేతులు నాట్యాంతమున నుండ వలసిన తీరున నుండును'. ఈ నాట్య మందిరము నాశముకాక యుండిన యెడల నాట్యకళా సంప్రదాయ పునర్నిర్మాణ మున కిది తంజావూరు దేవాలయముకన్న నెక్కువ సహాయకారి మరియొకటి యుండెడిది కాదు; తంజావూరు, చిదంబరములతోపాటు విజయ నగరముకూడ భరతనాట్య శాస్త్రమునకు మూడవ శిలా శిల్పమయ భాష్యమై యుండెడిది. విజయనగర శిథిల ములలో నేడు మిగిలి యుండునది నలువైపుల ప్రక్కల యందు నృత్య శిల్పచిత్రములు గల సింహాసన వేదిక మాత్రమే. ఆ కాలమునాటిదే యగు తాడిపత్రి దేవాలయ మునను నృత్య శిల్పఫలకములు గలవని తెలియుచున్నది.

కృష్ణదేవరాయల యుద్యోగులలో నొక్కడైన నాదెండ్ల గోపన్న మంత్రి ప్రబోధచంద్రోదయ మను నాధ్యాత్మిక రూపకమునకు వ్యాఖ్య రచియించెను. అతడు నాట్య శాస్త్ర గ్రంథ కర్తలలో శృంగనాచార్యుని నామమును రెండు మూడు మారు లుదాహరించెను. ఈ శృంగనా చార్యుడు పెదకోమటి వేమారెడ్డికాలమున నుండి, సంగీత రత్నాకరమునకు తెలుగు వ్యాఖ్యానము రచించి నట్లు తెలియవచ్చిన సింగనభట్టు కావచ్చును.

సంగీత దర్పణమును రచియించిన చతుర దామోదరు డును ఆంధ్రరచయితగా తోచుచున్నాడు. అందు ప్రబంధా ధ్యాయమున నితడు నృత్య విషయమును ప్రస్తావించుటయే కాక కడపటిదగు ఆరవయధ్యాయమున కేవలము నృత్త విషయమును వివరించినాడు. ఈ నృత్తాధ్యాయమున నితడు దాక్షిణాత్య నృత్య ప్రబంధములను వివరించెను.

మీద పేర్కొనిన గ్రంథములకంటె ముఖ్యమయినది దేవన (దేవేంద్ర) కృతమగు సంగీతముక్తావళి. ఇది మరియొక దాక్షిణాత్య నాట్యశాస్త్ర గ్రంథము; బహుశః ఆంధ్రకర్తృ కమే కావచ్చును. నృత్తాభినయ విషయములు రెంటింటిని బట్టిచూడ ఇది యమూల్యగ్రంథమని చెప్పదగియున్నది.

తరువాత దాక్షిణాత్య సంగీత, నాట్య కళలు తంజా వూరు నాయకరాజుల, విశేషించి రెండవ మూడవ ప్రభు వులైన రఘునాథ, విజయరాఘవ నాయకుల యుదార పోషణమున నాంధ్రులచే పునరుజ్జీవితములైనవి. శాస్త్రమ ములు సంస్కృత సంగీత, నాట్య శాస్త్రములను గూర్చిన గొప్ప గ్రంథములకు మారుగా ఆయా కళలయందు పేరు గన్న సంప్రదాయ వేత్తలును, ప్రయోగ నిపుణులును నగు నాట్యాచార్యులు రచించిన సంగ్రహరచనములు, ఖండ రచనములు, ప్రకీర్ణకములునైన గ్రంథములు బయలుదేరినవి. ఆ కాలములోనివారు గొప్ప గ్రంథములు వ్రాయగల పాండిత్యాతిశయము గలవారు కారు. అయినను అటుతరు వాతి కాలమున బయలుదేరిన వానిలో ముడుంబ నరసింహా చార్యులవారి భరతసర్వార్థసంగ్రహము, సోమనార్యుని నాట్యచూడామణి, శుద్ధసత్త్వ వెంకటాచార్యులవారి అర్జునాదిమతసారము అను మూడు గ్రంథములు పేర్కొన దగినవి. వ్రాతప్రతులలో తెలుగు వ్యాఖ్యానములేని ప్రామా ణికామూల్య నృత్త, సంగీత గ్రంథములేవియు కానరావు. వాస్తవమునకు నాట్య, సంగీత కళలపై తెలుగునకు మంచి ప్రాభవ ముండెను. నిన్నమొన్నటివరకును కర్ణాటక సంగీతము పాడువానికి తెలుగుభాషాజ్ఞాన మావశ్యకమై యుండెను.

ఆంధ్రదేశము నందలి బ్రాహ్మణ పండితులు భాగవత ధర్మములో నొక యంగముగా భగవన్మహిమాప్రకాశక ములగు కథలను గేయ సంకీర్తనములుగను, నృత్యరూపక ములుగను రచియించి ప్రదర్శించు సంప్రదాయమును ప్రచారమునకు దెచ్చిరి. జయదేవుని గీతగోవిందరచన కాలమున నారంభమైన యీ సంప్రదాయమును కూచి పూడిలోని ఆంధ్రబ్రాహ్మణ భక్తబృంద మవలంబించి యభివృద్ధి కావించెను. తంజావూరి సమీపమునందలి గ్రామ ములలో ఉద్భవించి తరువాత ప్రాముఖ్యమునకు వచ్చిన తెలుగు భాగవతనాట్య రూపక సంప్రదాయము కూచిపూడి సంప్రదాయమునకు శాఖారూపమే. దక్షిణదేశమందలి నాట్యకళయొక్క చరిత్రలో పై భాగవత రూపకములతో సమానముగ ప్రధానములైనవి, తెనుగువారు ఆ కళకు కానుకగా నిచ్చినవి క్షేత్రజ్ఞ (క్షేత్రయ) విరచితములై అభినయమున కుద్దిష్టములైన పదములు. పద మనగా రస మంజరి మొదలగు గ్రంథములలో పేర్కొనబడిన వివిధజాతి శృంగారనాయికా, నాయకులలో ఒకజాతి నాయికా నాయకుల శృంగార రసావస్థావిశేషము నభివర్ణించు గేయము. అమరుశతకము మున్నగు సంస్కృతరచనముల యందలి శృంగార ముక్తకములుసైతము క్షేత్రజ్ఞపదముల యుత్పత్తికి కారణములై యుండవచ్చును. రాగమాధు ర్యముచేతను, తెలుగుశయ్యాసౌలభ్యముచేతను, రస భావ సంపదచేతను ప్రసిద్ధిగాంచిన క్షేత్రజ్ఞపదములు అభినయ కల్పనకు మంచి అవకాశము కలిగినవి. గీతగోవింద, మేఘ దూతలవలె క్షేత్రజ్ఞపదములును పలువురు పదకవుల సరస రచనలకు కారణమైనవి. ఇవియు నభినేయములే. వి. రా.



http://sanskritcentral.com/

http://teluguthesis.com/

# సూచి


అ

అంకచక్రము 237
అంధకులు 586
అంధ్ర 1
అంబదేవుడు 281, 288
అకాలవర్షుడు 187
అక్బర్ హైదరీ నవాబ్ జంగ్ బహద్దరు వర్ 510
అగస్త్యుడు 284
అగ్రహారము 501
అచ్యుత(దేవ)రాయలు 394, 671
అచ్యుతానందదాసు 279
అజంటా (గుహలు) 489, 673, 676, 678
అడ్డకాలిగచ్చము 549
అత్తివర్మ 118
ఆదిచనల్లూరు 10
అధర్వణాచార్యులు 1141
అధిరాజేంద్రుడు 170
అనంగభీమ(దేవుడు) 250, 258
అనంతపాల దండనాథుడు 201, 207
అనంతవర్మ (పూర్వగాంగ) 177
అనంతవర్మ (దేవపుర) 103, 104
అనంతవర్మ చోడగంగదేవ 241
అనంతశక్తివర్మ (మాఠరకుల) 104, 105
అనంతామాత్యుడు 605
అనపోతనాయకుడు, రేచర్ల 294
అనవేమారెడ్డి 315
అనపోత, మాదానాయకులు 298
అనపోతారెడ్డి (కొండవీడు) 311
అనపోతారెడ్డి, దువ్వూరి 884
అనితల్లి 827, 880, 884
అనియంక భీమదేవ 250, 253
అన్నమదేవుడు, కాకతి 226
,, (మత్స్య) 262
అన్నమయ్య (అన్నమాచార్యుడు), తాళ్ల పాక 646, 690
అన్వరుద్దీన్ 443
అప్పకవి, కాకునూరి 1142
అప్పయాచార్యుడు 561
అప్పయార్యుడు, బొమ్మకంటి 296
అబుల్ హసన్ తానాషా 431, 680
అబ్దుర్ రజాక్ 66, 375
అబ్దుర్ రజాక్ లారి 431
అబ్దుల్లా కుతుబ్షా 429, 680
అభినవగుప్తాచార్యుడు 694
అమరావతి 69, 78, 814, 641, 647, 649, 651, 661, 662, 667, 677, 687, 694
అమరావతీస్తూపము 587
అమీర్ ఖుస్రూ 68, 684, 685
అమోఘవర్షుడు 189
అమ్మరాజ విజయాదిత్యుడు 157
అయ్యలార్యుడు 805, 598
అరికేసరి 548
అరువత్తుమూవర్ 557
అర్జునదేవరాజు 818
అర్వాచీన గాంగవంశము 234
అలాఉద్దీన్ 356
,, ఖిల్జీ 228
,, హసన్ గంగూ 338
,, హసన్ షా 811
అలీ ఆదిల్ షాహు 401, 402, 406, 408 410
అలీముబారక్ 267
అల్లాడరెడ్డి, దువ్వూరి 828, 880, 884
అహ్మదుషాహు 351
అళియ రామరాయలు 898

ఆ

ఆంధ్ర-తెలుగు 1
ఆంధ్రోద్యమము 467
,, (తెలంగాణా) 473
ఆంబూరుయుద్ధము 448
ఆజమ్ఖాను 866
ఆదిపంపడు 548
ఆదిల్ఖానుడు 868, 898
ఆదిల్షా (షాహు) 899, 404
ఆనందకవి, మంగళగిరి 572
ఆనందగోత్రులు 113
ఆమర్దకము 554
ఆముక్తమాల్యద 495, 612, 692
ఆరవీటివంశము 409
ఆర్థికచరిత్ర 519
ఆర్యదేవుడు 589
ఆర్యసమాజము 576
ఆల్పఖాన్ 384
ఆసఫ్జా 488
ఆసఫ్జాహి నిజాంరాజ్యము 432
ఆహవమల్ల (సోమేశ్వర) 164, 169, 186

ఇ

ఇంద్రభట్టారక 115-118, 148
ఇంద్రవర్మ 115, 174-182
ఇంద్రాధిరాజు 118
ఇక్ష్వాకు(లు) 105
ఇనుపయుగము 83
ఇబ్రాహీం ఆదిల్షా (షాహు) 896, 897 898, 401, 402, 412, 416
ఇబ్రాహీం కుతుబ్షా (షాహు) 402, 408, 412, 428
ఇరుగ(ప) దండనాథ 297, 374, 559
ఇస్లాము 566

ఈ

ఈశ్వరనాయకుడు, తుళువ 882, 888

ఉ

ఉండవల్లి గుహాలయములు 119, 655, 664
ఉత్తరసర్గ్గారులు 506, 514
ఉద్యోతకేసరి 248, 245
ఉపేంద్రదేవ 262, 818
ఉమవర్మ 103, 105
ఉమామహేశ్వరరావు, శిష్టా 626
ఉలుఘ్ఖాన్ 288, 266, 280, 281

ఎ

ఎర్రమండనృప 202
ఎర్రాప్రెగ్గడ 810, 590, 687
ఎల్లమరాజు, మల్లి 414, 415
ఎహువుల చాంతమూల 106, 108

ఏ

ఏదులఖాను 889, 892, 898
ఏనాదులు 10

ఒ

ఒక్కెత్తుగండ 209

ఓ

ఓఢ్రగజపతులు 273

ఔ

ఔరంగజేబు 426, 430, 433

క

'కంటకసేల' 72, 520
కంఠిక విజయాదిత్య 156, 157, 211
కంపట్టఉదయరు 809




http://sanskritcentral.com/

http://teluguthesis.com/


కంపరాయలు 369
కంపిలిరాయ 284
కడపటి పల్లవులు 130
కదంబగుహ 554
కన్నరదేవచోళ 212
కన్నరదేవరాజు (నాగవంశి) 244
కపిలేశ్వర (గజపతి) 273, 274, 275, 303, 304, 362, 368, 376, 377, 379, 381
కరకముపర్ణవర్ష 137, 147
కరికాల 123, 124
కర్ణుడు (చేదిరాజు) 136
కలివిష్ణువర్ధన 147
కల్యాణి చాళుక్యులు 182
కల్లిబాబుడు 690, 691
కళత్రదండయాత్ర 126
కళింగత్తుప్పరణి 197, 198
కళింగదేశము 98, 142, 144, 158, 580
కళింగము : సింహళము 246, 255
కలిత్రయయుగము 530
కాంబెల్ 572, 641, 642
కాకతీయులు 188, 224
కాటమనాయకుడు, కొలని 209, 210, 214
కాటయవేమారెడ్డి 310, 320, 322, 328-330, 332
కాపయనాయకుడు, ముసునూరి 281, 284, 293, 295, 306, 308
కామదేవచోడ 209
కామరాజు, హైహయ 212, 218, 312
కామార్ణవుడు 179, 180, 246, 247
కారోహణము 554
కావణయ్య దండనాయకుడు 219
కిమిడిదేశము 241
కుడిచేతి కులములు - ఎడమచేతి కులములు 16
కుడిమియామలై 127
కుతువనమలక 389, 391-393
కుత్బ్ ఉద్దీన్ ఐబెక్ 252
కుత్బ్‌శాహి వంశము 427
కుత్బ్‌షా (కాహు) 404, 405, 410, 411
కుబ్జవిష్ణువర్ధన 134, 142, 549, 667
కుమార అనంతరాజు, మట్ల 424
కుమార కంపరాయ 372
కుమారగిరి (రెడ్డి) 315, 320, 328, 329, 333, 336, 337, 690
కుమారమాదానాయకుడు 381
కుమారరాముడు (కంపిలి) 284, 285
కుమారవిష్ణువు 124
కుమారవేదగిరి 331
కుమారసింగభూపాల 270, 296
కుమారానపోత 270, 298, 300
కులికుత్బ్‌షా (కాహా) 395, 412, 427, 428
కులోత్తుంగ చోడచక్రవర్తి 191, 206, 550
కులోత్తుంగ చోడగొంక 200, 209, 248
కులోత్తుంగ రాజేంద్రచోడ 200, 213, 217, 221, 249
కుసుమాయుధుడు, ముదిగొండ 140, 154, 155
కూనయనాయకుడు 288
కృష్ణకంధారుడు 142
కృష్ణరాజు (రాష్ట్రకూట) 158, 548
కృష్ణదేవరాయలు 28, 61, 66, 137, 277, 278, 340, 342, 384, 388, 399, 403, 609, 611, 614, 617, 618, 632, 646, 659, 678
కృష్ణప్ప, చెంజి 409, 418, 423
కృష్ణప్పనాయకుడు, తుపాకి 420
కృష్ణప్పనాయకుడు, మధుర 409
కృష్ణప్రసాద్ మహారాజా సర్ 509
కృష్ణమరాజు, నందేల 414
కృష్ణరాజు (రాష్ట్రకూట), 149, 151, 157, 182
కృష్ణరావు, ముట్నూరి 462, 469
కెంపగౌడు, బెంగుళూరు 420
కేతనమంత్రి 250
కేతన, మూలఘుటిక 589, 687
కేతరాజు, కోట 220, 548
కేశవదేవరాజు 210
కేసరివంశము 245
కొండపడుమటి మండలికులు 199, 220
కొండపల్లి సర్కారు 448
కొండవీటిరాజ్యము 329
కొండవీడుసర్కారు 444
కొండాపురము (హైదరాబాదు) 77, 572
కొండూరు 434, 448
కొక్కిలి (విక్రమాదిత్య) 144, 145, 179
కొప్పం 165, 166, 227
కొమరగిరి అనపోతారెడ్లు 334
కొమరగిరిరెడ్డి 270, 271, 320, 321, 323, 334, 335, 437
కొమ్మనామాత్య 213, 215, 216, 248, 250
కొమ్మయ, శివతెంక 325
కోటరాజ్యము 220
కోటసామంతులు 199
కోణార్కము 278, 669
కోనరాజేంద్రలోక వల్లభుడు 210
కోన హైహయులు 201
కోమటి వేమారెడ్డి 323, 328
కోయవారు 10
కోరంగి 530-533
కౌరాళము 102
క్రైస్తవము 570
క్రొచ్చెర్వులపురము 215, 216

ఖ

ఖారవేల 91, 93, 99, 546
ఖుస్రూఖాన్ 283
ఖ్వాజా-ఇ-జహాన్ 358, 362
ఖ్వాజా మహమ్మద్ గావాన్ 381

గ

గంగయసాహిణి 281
గంగాధరకవి, అద్దంకి 615
గంటసాల 525, 527
గణపతిదేవుడు, కాకతి 222, 230, 257, 527, 558
గణపతినాయకుడు, మంచికొండ 282
గదబలు 10
గన్నభూపాలుడు 331
గన్నయరెడ్డి, గోన 231
గరీబులు 356
గాంధీ-ఇర్విన్‌సంధి 465
గాణదేవుడు 274
గామకాంబ 155, 156
గార్గ్యుడు 554
గుంటుపల్లి 73, 647
గుంటూరుసర్కారు 449
గుండదండనాథుడు 297, 344
గుడారికటకము 272
గుడిమల్లము 663
గుడివాడ 73
గుణగవిజయాదిత్య 148, 179, 657, 658, 668
గుణాఢ్యుడు 98, 578, 688
గుణార్ణవుడు 174, 175, 177
గుమ్మడిదుర్రు 75
గురుభక్తులకొండ 75
గురుమూర్తిశాస్త్రి, రావిపాటి 683, 685




http://sanskritcentral.com/

http://teluguthesis.com/


గొంకయ, వెలనాటి 198, 200, 220
గొంకరాజు, వెలనాటి 245, 250, 550
గోండులు 10
గోదావరి సంగరము 207, 245
గోపన్నమంత్రి 372
గోపరాజు, కొరవి 592, 606
గోపాలకృష్ణయ్య, దుగ్గిరాల 468
గోపేంద్ర తిప్పభూపాల, సాళువ 690
గోవింద దండాధిప 205, 207
గోవిందమంత్రి, పోలూరి 692
గోవిందరాజు 137–142, 146, 147
గోవిందవిద్యాధర 278
గోళకీమఠము 558, 695
గౌడడిండిమభట్టు 388
గౌతమీపుత్ర చక్రవర్తి 677
గౌతమీపుత్రయజ్ఞ శ్రీశాతకర్ణి 97, 651
గౌతమీపుత్ర శాతకర్ణి 95, 97
గౌరన 305, 605, 617
గ్రామభటులు 500
గ్రామభేదములు 501

ఘ

ఘియాజుద్దీన్ ఖిల్జీ 254, 265
ఘియాజుద్దీన్ తుఘ్లకు 233, 281, 282

చ

చందా సాహెబు 443, 444
చందూలాల్ రాజా 487, 506, 507
చంద్రకీర్త్యాచార్యుడు 540
చంద్రవల్లి 77
చక్రకూటము 161, 169–172, 187, 188, 227, 257
చక్రపాణి రంగన 586
చాంతమూల 106, 619
చామిశెట్టి, అవచి 387
చారుదేవి 560, 561
చాళుక్యచంద్రుడు 162
చాళుక్యచోళుడు 201
చాళుక్యభీమ 84, 141, 153, 155, 159
చాళుక్యులు, పూర్వ 142
చిత్తాపఖాను 277, 278, 391
చిత్రభూషణవల్లభ 180–182
చిలుక సముద్రము 524
చెంచువారు 10
చెంచుమర్తి 447
చేదివంశము 91, 100
చైత్యకవాదము 586
చోడగంగదేవ 234
చోడభక్తిరాజు 316
చోడతిక్కరాజు 228, 230
చౌండసమూపతి, మల్యాల 222

జ

జంషిద్ కుతుబ్షా 428
జగదేకమల్ల జయసింహ 185
జగన్నాథపండితరాయలు 688
జగ్గయ్యపేట 73, 661
జగ్గరాజు, గొబ్బూరి 417, 418
జటాచోడభీమ 158, 161, 179, 180
జటేశ్వరుడు 244
జయవర్మ, బృహత్పలాయన 109, 110
జయసింహ, కళ్యాణీచాళుక్య 163, 164, 168, 185, 187, 188, 190
జయసింహవల్లభుడు 143, 144, 518
జయసేనాచార్య (జైన) 549
జలాలుద్దీన్ హసన్షా 279, 287
జాగేశ్వరుడు (గణపతి) 278
జాజల్లదేవుడు 248
జాఫర్ అలీఖానుడు 445
జాఫర్ఖాను 283, 286
జినసందిముని 549
జూటూరు 398
జెసూయిట్ ఫాదరులు 570
జేమ్సుగ్రాంటు 582
జైత్రపాలుడు 286
జైనమతము 544
జోగివంశులు, శాంద్రేగుల 484
జౌగడ 58

ట

టాలెమీ 91, 97, 107, 110, 625
టిపు (సుల్తాను) 435, 442, 450

డ

డల్ హౌసీ 487
డూప్లే 433, 443, 444
డోమింగ్ పేయస్ 66, 678, 699
ద్వారకాబరోప్సా 28, 529

త

తమ్మయ్య, సారంగు 616
తత్త్వబోధానందస్వామి 571
తవాయి 529
తామస్ రంబోల్డు 485
తామస్ కారో 582
తారవరాజు 156–158
తిక్కన 585, 587–591, 681
తిక్కరాజు, తెలుగుచోళ 306
తిప్పయశెట్టి, అవచి 387
తిమ్మకవి, కూచిమంచి 620
తిమ్మక్క, తాళ్ళపాక 617
తిమ్మన్న, నంది 609–611
తిమ్మప్ప, హండే 410, 411
తిమ్మరాజు, గొబ్బూరి 411
తిరుమలరాజు, సలకరాజు 397
తిమ్మరసు, సాళ్వ 277, 389, 390, 392
తిరుజ్ఞానసంబందర్ 566, 568
తిరుత్తొండర్ 566
తిరునావుక్కరసు 128
తిరుపతి వేంకటకవులు 624, 625
తిరుమంగై ఆళ్వారు 568
తిరుమలకాంతరాయలు 277
తిరుమలదేవరాయలు, అరవీటి 409, 410
తిరుమలనాయకుడు, మధుర 423, 428, 426, 672
తిరుమలరాజు, సలకము 393, 407
తిరుమలరాహుత్తరాయడు 390
తిరుమలాంబ (కృష్ణరాయల కూతురు) 394
తీర్థనారాయణస్వామి 688
తీవరదేవ 118
తుంఘూణ పృథ్వీపతి 254
తుంబిచ్చినాయకుడు, తిరుపతి 395
తుఘాన్ఖాను 256
తుళువ వంశము 387
తెరంబి 554
తెంగన్న (ఆర్యుడు) 429, 616, 617
తెలింగభీమ 196
తెలుగుచోళులు 232
తెలుగుదేశములో ఫ్రెంచివారి పరిపాలనము 444
తెలుగుదేశములో బ్రిటిషువారి పరిపాలనము 451
తైలంగులు 26
తేవప్పెరుమాళ్ళయ్య, చిక్కుంత 685
తైలప 142, 161, 164, 169, 190, 227, 229
త్యాగరాజస్వామి (రాజు) 684
త్రికాలయోగి సిద్ధాంతదేవుడు 162
త్రిపురాంతకుడు, రావిపాటి 594
త్రిభువనమల్లచోడదేవ 212
త్రిభువనమల్ల విక్రమాదిత్య 196, 204, 218
త్రిలోచనపల్లవుడు 123

ద

దంతి 127, 130
దంతిదుర్గ 132, 136, 137, 145, 196




http://sanskritcentral.com/

http://teluguthesis.com/


దంతివర్మ 132, 133
దశబంధము 498
దాచానేడు (రేచర్ల), 293, 294, 328
దామార్ణవ 157, 158, 160
దామోదరవర్మ 113, 114
దివ్యజ్ఞాన సమాజము 576, 577
దివ్యములు 491
దివిదుర్గము 222, 312, 316
దుగ్గన, దగ్గుపల్లి 120, 279
దుర్జయులు, కొండపడుమటి 208
దుర్జయులు, వెలనాటి 208
దేవనప్రెగ్గడ 214
దేవనాయకుడు, ముసునూరి 281, 282
దేవప్పనాయకుడు, హంపె 414
దేవరాయలు 328–330, 335, 336, 346, 348, 373, 374, 377, 379 629, 690
దేవేంద్రవర్మ 177, 178, 182, 191, 196, 198, 239, 241, 242
దొడ్డభీమరాజు, కోట 206, 213
దొమ్మరాజు 229
దోనయామాత్యుడు 593

ధ

ధనదుప్రోలు 217, 309
ధర్మానాయకుడు, రేచెర్ల 298, 300
ధాన్యకటకయుద్ధము 118
ధార్ కమిటీ 472
ధారావర్ష (నాగవంశ) 170, 194, 227
ధూర్జటి 609, 611
ధ్రువరాజు (రాష్ట్రకూట), 137, 146

న

నందప్రభంజనవర్మ 103
నందికంత పోతరాజు, కటారి 331, 337
నందిగచ్చము 549
నందివర్మ, పల్లవ 126, 127, 130–132
నందివర్మ, (శాలంకాయన) 561
నక్ బుల్లా 449
నడుంబి వసతి 145, 549
నన్నయభట్టు 166, 186, 579, 581, 582, 588, 591, 629, 630
నన్ని (న్నె) చోడ 223, 585, 594
నమ్మాళ్వార్ 563
నయసేనదేవుడు 545
నరవారసింగనృపతి 261
నరసానాయకుడు 276, 277, 383, 385, 387, 407
నరసింగభూపతి, ఖేర్లా 346, 347
నరసింహదేవ (గాంగ) 258, 261, 262, 265, 268, 269
నరసింహరాయ, సాళువ 275, 276 304, 365, 378, 382, 383, 384, 395, 397
నరసింహవర్మ (పల్లవ) 128–130, 568, 669
నరహరితీర్థ, 259, 260, 263, 273
నరేంద్రమృగరాజ విజయాదిత్య 146, 660
నరేంద్రసేనముని 545
నహపానుడు 97
నాగనాథుడు, పశుపతి 594
నాగార్జునకొండ 76, 77, 105, 107, 109, 390, 411, 587, 649, 651, 663, 694
నాగార్జునాచార్య 537, 539, 540, 662
నాజిర్ జంగు 433, 443, 444
నాథముని 563
నామయనాయకుడు 288
నాయంకర, అమర నాయంకరము 498
నారాయణకవి, దూబగుంట 279
నాసిర్ ఉద్ దౌలా 437, 507
నిజాం అలీఖాన్ 434, 437, 446, 448, 449
నిజాం ఉల్ ముల్క్ 275, 276, 302, 303, 351, 362, 365, 368, 433, 440, 443
నిజాంశాహు 274, 362, 364, 403, 404, 405, 410
నిత్యవర్ష ఇంద్రవల్లభ 548
నివర్తనము 498
నీల్ సత్యాగ్రహము 464
నూతనశిలాయుగము 31
నృపతుంగవర్మ 138
నృసింహకవి, వంకుసాల 612
నోబిలి ది రాబర్టు 571
నోములు 19
న్యాయపరిపాలన 515
న్యాయశాఖ 506
న్యూనిజ్ 33, 66, 377, 392, 408

ప

పంచప్రధానులు 469
పంచాయతీ సభ 501
పండరంగడు 149–151, 153, 157, 579
పండరాజు 197, 198
పండువా 267, 325
పంపకవి 548
పద్మకవి 636
పద్మనాభతీర్థులు 260
పద్మనాభ యుద్ధము 452
పరణికావ్యము 165
పరమానంద తీర్థయతి 632
పరమేశ్వరవర్మ 129, 132, 135, 145
పరాంతక 200, 201, 203
పరాంతక (చోళ) 142
పరాంతక (పాండ్య) 198
పరాక్రమపాండ్య 242
పర్యుషణవ్రతము 547
పల్లవభోగ్గము 536
పల్లవమల్ల (పల్లవ) 130, 131
పల్లవులు 121
పశ్చిమగాంగులు 173
పాండురంగడు 140
పానారదేశము 317
పాపరాజు, కంకంటి 619
పామర్ కంపెనీ 507
పావాపురి 544
పినవీరభద్రకవి 603, 604
పిన్నమరాజు, వంకెట 299
పిమ్మండిరాజు 332
పిళ్ళయార్ విష్ణువర్ధనుడు 165
పిళ్ళైలోకాచార్యుడు 564
పీరేద స్త్రిగర్ 563
పుణ్యకుమారుడు 578
పురుషోత్తమగజపతి 263, 273, 276, 304, 305, 365, 380, 386
పులకేశిదండనాయక 186
పులోమావి 60, 91, 95
పుల్లలూరు 127
పుష్పసేనాచార్య 552
పూర్ణబోధులు 639
పూర్వగాంగ 60, 118, 123
పూర్వచాళుక్యులు 142, 179
పూర్వశైలగాథలు 540
పూసలనాయకుడు 557
పృథివీదేవ 243, 244
పృథివీమహాదేవి 239, 246
పృథివీమహారాజు 117, 142
పృథివీమూల 118
పృథ్వీవ్యాఘ్ర 131, 145, 149
పృథ్వీశ్వర 218, 230, 231, 239, 240, 250, 253
పెదకోమటివేమ 271, 302, 310, 320, 323, 329, 337, 346, 348, 350, 375, 645, 687, 690




http://sanskritcentral.com/

http://teluguthesis.com/

పెదకోమటి వేమ, దేవరాజు 575
పెదవెంకటపతిరాయలు 419, 421
పెదవేగి 849, 850
పెద్దన, అల్లసాని 585, 609–612, 615, 617, 687, 689, 692
పెద్దన, చిన్నకోట 598
పెద్దముడియము 205, 666
పెరిప్లస్ ఆఫ్ ది ఎరిత్రియన్ సీ 526
పెరియ పురాణము 557
పెరువంగూరు 154
పేరరాజు, కృత్తివెంటి 460
పైశాచి 77, 97, 408
పొడిచేటికోట 304
పొన్నంబలనాథ తొండమాను 892
పొన్నమయ్య 158
పోతన్న, బమ్మెర 805, 600, 601, 608, 687
పౌదనపురము 548
ప్రకాశం, టంగుటూరి 464, 628
ప్రజ్ఞాపారమిత 588
ప్రతాప అర్జునదేవుడు 262
ప్రతాపదేవరాయలు 877, 879
ప్రతాపరుద్ర (కాకతి) 226, 281, 288, 282, 286, 298, 294, 807, 869, 551, 559, 586, 598
ప్రతాపరుద్రగజపతి 267, 278, 276, 279, 886, 890, 891
ప్రతిపాలపురము 546
ప్రతిష్ఠానపురము 98, 525, 674
ప్రభంజనవర్మ (కళింగ) 108, 104
ప్రభాకరశాస్త్రి, వేటూరి 588, 629
ప్రభూతరాశి 556
ప్రభాదిత్యనాయకుడు 298
ప్రాఙ్నన్నయ యుగము 578
ప్రాచీన కళింగదేశ చరిత్ర 198
ప్రెగ్గడయ్య, మామిడి 597
ప్రోలయనాయక, కొప్పుల 282
ప్రోలయనాయక, ముసునూరి 266, 281, 288, 284, 806, 810, 812, 898,
ప్రోలయవేమారెడ్డి 886, 528, 590
ప్రోలరాజు, కాకతి 189, 224, 226, 227
ప్రౌఢదేవరాయలు 875, 878, 879, 888, 895
ప్లాసీయుద్ధము 446

ఫ

ఫాహియాను 65
ఫిరుజ్‌షా తుగ్లక్ 267, 269, 290, 889
ఫిరూజ్‌షా బహ్మనీ 800, 828, 880, 845, 874, 875
ఫెర్గూసన్ 71, 661, 677
ఫెర్డూసి 856
ఫోర్డు, కర్నల్ 484, 447
ఫౌలాద్‌ఖాన్ 857
ఫ్రయర్ ఓడోరిక్ 20
ఫ్రయర్ జోర్డానస్ 20

బ

బంగాళారాష్ట్ర విభజనము 468
బండికనుమ 297, 849
బట్టుమూర్తి 409
బణజిగలు 524
బణపతి 172, 194, 240, 241, 244
బద్దెన 492, 590
బయలునంబి 161, 162
బళ్లారి 286, 287, 869, 870, 872
బసవదండనాథుడు 215
బసవన, పిడుపర్తి 687
బసవభూపాలుడు, పూసపాటి 279
బసాలత్‌జంగ్ 485, 446, 449
బహ్‌లోల్‌ఖాన్ 424
బహదూర్‌ఖాన్ 290
బహదూర్ గిలాని 868, 427
బహరాంఖాన్ మాజిందరాని 841
బహాఉద్దీన్ గుష్టాస్ప్ 284
బహ్మనీరాజ్యము 338, 502
బహ్మనీరాజ్య పరిపాలనవిధానము 502
బాదప (చాళుక్య) 157, 158
బాదామిచాళుక్యులు 133
బాపిరాజు, అడివి 626, 681, 942
బారహమాంతి 825, 826
బారాబరు కొండలు 647, 662
బారాబలవంతులు 500
బారావఫాత్ 567
బార్హస్పత్యద్వాదశవత్సరమానము 104
బార్హ్టాక్ 649, 661
బిజ్జలదేవ 189, 215, 584
బీదరు ఒడంబడిక 869
బుక్కరాజు, అరెవీటి 894
బుక్కరాజు, పోలేపల్లి 804
బుక్కరాయలు 278, 286, 289, 296, 298, 809, 814, 815, 818, 888, 889, 841, 846, 852, 869, 870, 372, 374, 875, 552, 591
బుద్ధవర్మ, కొండపడుమటి 217
బుద్ధవర్మ (పల్లవ) 124
బుద్ధారెడ్డి 587
బుర్హాన్ నిజాంషాహు 65, 897, 402
బుస్సీ 488, 484, 444, 445, 447, 506, 586
బృహత్కథ 578, 688
బృహత్ఫలాయనులు 107
బెజదకోట 855
బేతరాజు, కాకతి 224–226, 227, 558
బేతరాజు, కోన 214
బేతరాజు, చాగి 204
బేతరాజు, పాగి 218
బొజ్జన్నకొండ 75
బోయకొట్టము(లు) 181, 145, 148, 150, 151
బోరోబదూరు 664
బ్రహ్మయ్యశాస్త్రి, చర్ల 620
బ్రాహ్మసమాజము 459, 577
బ్రిటిష్ ఆంధ్రము 467
బ్రిటిష్ పరిపాలన ఫలితములు 453
బ్రిటిష్ రాజ్యాధికార ప్రారంభములు 446

భ

భండనాదిత్య 156
భండారగ్రామము 501
భక్తిరాజు 812, 829
భట్టభానుడు 887
భద్రబాహుముని 545
భరుకచ్ఛము 95, 526, 674
భానుదేవ 259, 260, 268, 268
భాస్కరుడు 592
భీమ, చాళుక్య 140, 150, 157, 179
భీమ, జటాచోడ 184
భీమకవి, వేములవాడ 588, 584
భీమరాజు, కోట 199, 219, 220
భీమరాజు, చాళుక్య 658
భీమలింగచోడ 810, 816
భువన త్రినేత్ర 159
భూపేంద్రవర్మ 174, 178, 181
భూలోకమల్ల సోమేశ్వర 25, 204, 219
భైరవుని కొండ 129, 666, 669
భైరి నిజాంషాహు 402
భోగనాథుడు 871
భోజకులు 499

మ

మంగళేశ్వరుడు 184
మంగివర్మ 144
మంగు, సాళువ 871, 878



http://sanskritcentral.com/

